# తెనాలి రామకృష్ణ కవి

## శాస్త్రీయ పరిశీలన

ముత్తేవి రవీంద్రనాథ్





పీకాక్ బుక్స్ • హైదరాబాద్

**TENALI RAMAKRISHNA KAVI - SAASTREEYA PARISEELANA-**
A Scientific Analysis of the Complete Works of Poet Tenali Ramakrishna

Author : **MUTHEVI RAVINDRANATH**

Published by **PEACOCK BOOKS,** Publication wing of **People's Trust.**
Publication No : 01

Cover Design : **BAPU**


**768** Pages in 1/4 crown size Price : Rs. **500/-** US $ **25 ($ 25 postage extra)**

First Published in January, 2007. Copies : **1000**
Hyderabad, Andhra Pradesh, **INDIA.**

Printed at **IMAGE OFFSET PRINTERS,** HYDERABAD - 500 029



FOR COPIES:
**VISALAANDHRA, PRAJASAKTHI, NAVODAYA** and other **Major Book Shops.** You can also contact the **FOUNDATION MEMBERS** of the **TRUST**

or Contact : **M. RAVINDRANATH,**
D. No. 20-40-5, Mothad Lane, Chinaravur, **TENALI-522 201, A.P., INDIA.**
Phones: Cell - **98491 31029,** Residence - 08644-227569

PEOPLE'S TRUST REGD. OFFICE
G14, Pragathi Enclave, Bhagya Nagar Colony, Kukatpally,
Hyderabad-500 072. Ph : 040-23063729

EDITOR, PEACOCK BOOKS
Ph : 98499 40791, 65419522, 23530973

# మనవి

తెనాలి రామకృష్ణ కవి జీవితాన్నీ, రచనలనూ స్థూలంగా పరిచయం చేయడమే యీ గ్రంథ లక్ష్యం. సాధారణంగా కవులకూ, రచయితలకూ తమ రచనల ద్వారా కీర్తి వస్తుంది. కానీ రామకృష్ణ కవి సంగతి వేరు. ఆయన రచనలు ఏమిటో తెలియని అసంఖ్యాక పాఠకులకు కూడా ఆయన సుపరిచితుడు. అలా తన కావ్యాలకన్నా వ్యక్తిగా ఆయన ఎక్కువ ప్రసిద్ధుడు.

ఆయన పేరిట ప్రచారంలో వున్న అసంఖ్యాకమైన హాస్య కథల కారణంగా జన సామాన్యం రామకృష్ణుడిని ఓ హాస్య కవిగానో, వికట కవిగానో, సమస్యా పూరణంలో దిట్టయైన సమయోచిత ప్రజ్ఞావంతునిగానో మాత్రమే ఎరుగుదురు. విద్యావేత్తలకు తప్ప సామాన్య పాఠకులకు రామకృష్ణ కవి ఓ మహాకవిగా తెలియక పోవడం శోచనీయం.

తెలుగు సాహిత్యంతో అంతో - యింతో పరిచయమున్న చదువరులకు తప్ప 'పాండురంగ మాహాత్మ్యము' ఆయన వ్రాసిన కావ్యమని తెలియక పోవడం కూడా కద్దు. అదో మహా కావ్యం. ఆంధ్ర పంచ కావ్యాలలో అది ఒకటి. ఇతరుల సంగతెందుకు ? నా సంగతే తీసుకుంటే కీ.శే. యన్.టి.ఆర్. నిర్మించిన 'పాండురంగ మాహాత్మ్యం' చలన చిత్రం చూడడం మినహా 'ఎమెస్కో' వారు పాకెట్ బుక్‌గా ప్రచురించే వరకు ఆ కావ్యాన్ని నేను చదవడం జరగలేదు. విశేష ప్రాచుర్యాన్ని పొందిన మహా కావ్యమది. కొందరు పండితులు దానికి వ్యాఖ్యాన గ్రంథాలు, లఘుటీకలు వగైరాలు వ్రాశారు. అయినా అవన్నీ భాషా పండితుల మండళ్లకు మాత్రమే పరిమితమయ్యాయి. ఇదివరకెన్నడూ నేను

వాటి జోలికి పోలేదు. నాకు మాత్రం 1970 లో ఎమెస్కో ప్రచురణ మొదటగా చదివినప్పుడు ఏమీ తలకెక్కలేదు. అదేమో ఎటువంటి అర్థ తాత్పర్యాదులూ లేని శుద్ధ పారమాయె ! ముందు పదాలకు అర్థాలు తెలిస్తేనే కదా వాటి వెనుక నిక్షిప్తమైన కవి హృదయాన్ని తెలియగలగడం? కొందరు సాహితీ ప్రియులం అప్పట్లో అర్థ విచారణతో నిమిత్తం లేకుండా ఆ కావ్యంలోని పద్యాల్ని ఒక్క తప్పుకూడా పోకుండా - నత్తు లేకుండా - గడగడా చదవడంలో పోటీలుపడే వాళ్లం. అలానూ అవి కొరకరాని కొయ్యలే ! ఆ మహాకవి భావ గాంభీర్యమెంతటిదో - భాషా గాంభీర్యమూ అంతకేమాత్రం తీసిపోనిది. కొద్దిగా తంటాలు పడి అల్లసాని పెద్దన 'మనుచరిత్రము', ధూర్జటి 'శ్రీ కాళ హస్తి మాహాత్మ్యము' లోని పద్యాలైనా ప్రామాణిక నిఘంటువుల సహాయంతో అవగాహన చేసికోగలిగే వాళ్లం. కానీ, 'పాండురంగ మాహాత్మ్యము'లోని పద్యాలలా కాదు. భాష కఠిన శిలాసదృశం. భావం నారికేళ పాకం.

ఆ మహాకవి మా తెనాలికి సంబంధించిన వాడవడం వలన ఆయన పైనా, ముఖ్యంగా 'పాండురంగ మాహాత్మ్యము' పైనా నాకెప్పుడూ ప్రత్యేక అభిమానం వుండేది. చక్కెర వ్యాధి వున్నవాడికి తీపంటే ఎంత యిష్టం వుండి ఏం లాభం? అది కొరుకుడు పడని కావ్యం. అంచేత అది నా గృహ గ్రంధాలయంలో అలంకార ప్రాయంగా అలా వుండిపోయింది. నా ఉద్యోగ బాధ్యతలూ, రోజువారీ వ్యవహారాలలో నేను మునిగిపోయాను. ఆ మధ్య కొందరు సాహితీ మిత్రులం కలిసి 'మన తెనాలి' పేరుతో తెనాలికి చెందిన కవులు, కళాకారులు, శాస్త్రజ్ఞులు, విద్యావేత్తలు, సాహితీ మూర్తులు, రాజనీతి వేత్తలు వగైరా ప్రముఖుల జీవిత సంగ్రహాలతో సహా, వివిధ చారిత్రక దశలలో తెనాలి స్థితిగతులపై వ్యాసాలతో ఒక బృహద్గ్రంధాన్ని ప్రచురింప తలపెట్టాం. నేనూ దాని సంపాదక వర్గ సభ్యుడనే. ఆ గ్రంధం కొరకై నేను 'తెనాలి-పేరులోనే ప్రాచీనత', 'తెనాలి ప్రాంత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర', 'యజ్ఞస్థలి తెనాలి', 'తెనాలి ప్రాంత వృక్ష సంపద', 'తెనాలి ప్రాంత జంతు సంపద', 'తెనాలి ప్రాంత పక్షి సంపద', 'చేకూరు - శేకూరు', 'తెనాలికి చెందిన ధార్మికులు' అనే శీర్షికలతో ఎనిమిది పరిశోధనాత్మక వ్యాసాలు వ్రాయడం, చాల మంది ప్రముఖుల వివరాలను నాకు వీలు చిక్కినప్పుడల్లా ప్రత్యక్షంగా తిరిగి సేకరించి, వారి జీవిత సంగ్రహాలను కూడా వ్రాయడం జరిగింది. కొన్ని ప్రత్యేక కారణాల వల్ల ఆ గ్రంధం నేటికీ అముద్రితంగా వుండిపోయింది. తరువాత ఆ గ్రంధంలోని అనుపయుక్త అంశాలేవైనా వుంటే, వాటిని తొలగించి, విస్మృతాంశాల్ని చేర్చి, గ్రంధాన్ని కుదించి, దాన్ని పాఠకులకు మరింత పఠనయోగ్యంగా తయారు చేసే కృషి నిమిత్తం ఓ కమిటీ ఏర్పడింది. దానిలోనూ నేను సభ్యుడనే! ఆ గ్రంధంలో తెనాలి రామకృష్ణ కవి పైన వ్యాసం లేకపోవడం ఓ పెద్ద లోటని మా కమిటీ సభ్యులందరం అభిప్రాయ పడ్డాం. ఆయన పేరే తెనాలికి పర్యాయ పదమైందనీ, తెనాలికి ఆయనలా పేరు తెచ్చిన వ్యక్తి మరొకళ్లెవ్వరూ లేరనీ మా అందరి ఏకాభిప్రాయం. ఇక రామకృష్ణునిపై వున్న అవ్యాజమైన అనురాగం కారణంగా ఆ మహాకవిపై ఓ వ్యాసాన్ని వ్రాసే బాధ్యతను నేనే తలకెత్తుకున్నాను. ఈ విషయమై నాకు ఎట్టి సాధికారత లేకున్నా ఆ మహాకవిపై వున్న ప్రత్యేక అభిమానమే నన్నాపనికి పురికొల్పింది. అభిమానమైతే కొండంత - మరి అందుకు నాకున్న అర్హత యిసుమంతైనా లేదే ! ఒకప్పుడు బి.యస్. రంగా విక్రమ్ ప్రొడక్షన్స్ పేరిట నిర్మించిన, మహా నటులు ఎ.యన్.ఆర్., కీ.శే. యన్.టి.ఆర్. తదితరులు నటించిన 'తెనాలి రామకృష్ణ' చలన చిత్రం కథను, ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో రామకృష్ణ కవిపై వ్రాసిన వ్యాసాన్ని ఆధారం చేసుకొని, ఆయన కావ్యాలలో నాకర్థమైన పద్యాలకు అర్థ తాత్పర్యాదులు జోడించి రామకృష్ణ కవి బహుముఖ కృషిపై ఓ పాతిక పేజీల వ్యాసాన్ని తయారుచేసి యిచ్చాను. ఈ కృషిలో భాగంగానే రామకృష్ణ కవి రచనల మూల ప్రతులను సేకరించాను. 'పాండురంగ మాహాత్మ్యము' (శ్రీ బులుసు వేంకట రమణయ్య గారి లఘు టీకతో - వావిళ్ల

వారి ప్రచురణ - మూడవ కూర్పు - 1968) గ్రంథాన్ని ఓ మిత్రుని సహాయంతో ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయం, గుంటూరు నుండి సేకరించాను. గ్రంథంలోని పుటలన్నీ కాలదోషం పట్టి శిధిలావస్థకు చేరినా, గ్రంథంలో అక్కడక్కడా ముద్రణా స్ఖాలిత్యాలున్నా అదో అద్భుతమైన గ్రంథమని అంగీకరించక తప్పదు. అలాగే లోటస్ పబ్లిషర్స్, తెనాలి వారు 1974 లో ప్రచురించిన 'ఉద్భటారాధ్య చరిత్రము' (కళా ప్రపూర్ణ నిడదవోలు వేంకటరావు గారి విపుల పీఠికతో) గ్రంథాన్ని తెనాలిలోని జిల్లా గ్రంథాలయ సంస్థ లైబ్రేరియన్ కొడాలి చంద్రమౌళి గారి సహకారంతో ఫోటోస్టాట్ తీయించుకున్నాను. అదే విధంగా ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1968 లో ప్రచురించిన 'శ్రీ ఘటికాచల మాహాత్మ్యము' (డా। కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి గారి ఉపోద్ఘాతంతో) గ్రంథాన్ని సారస్వత నికేతన్, వేటపాలెం లైబ్రేరియన్ కొలిశెట్టి సుబ్రహ్మణ్యం గారి సహకారంతో ఫోటోస్టాట్ తీయించుకున్నాను. రామకృష్ణ కవి చరిత్రనూ, ఆయన సమకాలికుల చరిత్రనూ అధ్యయనం చేయడానికి నా వద్ద వున్న కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'ఆంధ్ర కవుల చరిత్ర', చాగంటి శేషయ్య గారి 'ఆంధ్ర కవి తరంగిణి', ఆరుద్ర గారి 'సమగ్రాంధ్ర సాహిత్యం' ఎంతగానో ఉపకరించాయి.

ఆ వ్యాస రచనానంతరం ఈ సారి ఎలాగైనా సరే రామకృష్ణ కవి కావ్యాల మూల ప్రతుల్ని ఆమూలాగ్రం చదివి, అర్థం చేసుకుని, ఆనందించాలనే తపనతో కృషి ప్రారంభించాను. నా దగ్గర వున్న ప్రామాణిక నిఘంటువులు అందుకెంతగానో తోడ్పడ్డాయి. వావిళ్ల వారి 'పాండురంగ మాహాత్మ్యము' లఘుటీకతో కూడుకున్నది. అదెంతో గొప్ప ప్రచురణ. నాకు చక్కని మార్గదర్శకాన్నిచ్చింది. తనకు పూర్వపు టీకలలోని తప్పిదాలను చాల మేరకు ఆ రచయిత సవరించి పాఠ పరిష్కారం చేశారు. ఆ రచనలోని గ్రంథ దోషాల్ని నేను కొన్నింటిని సవరించి వాడుకున్నాను. ఆయన వదలి వేసిన కొన్ని అంశాలను నేను వివరించి, అర్థ తాత్పర్యాదులనిచ్చాను. ఆయన వివరించిన విషయాలలో నా లక్ష్యానికి అనుపయుక్తమైన వాటిని నేను వదలి వేశాను. ఇలా పూర్తి అర్థ తాత్పర్యాలు లేకున్నా 'పాండురంగ మాహాత్మ్యము' లఘుటీక నాకు కొంత మేరకు చక్కని మార్గదర్శకాన్నివ్వగలిగింది. అయితే 'ఉద్భటారాధ్య చరిత్రము' మరియు 'ఘటికాచల మాహాత్మ్యము' లను - అవి కేవలం శుద్ధ పాఠాలైనందున - పూర్తిగా అర్థం చేసుకొనడానికి నేను స్వీయ విశ్లేషణా సామర్థ్యం పైనా, ప్రామాణిక నిఘంటువుల పైనా ఆధారపడాల్సి వచ్చింది. ఆయా కావ్యాలలోని అలంకారాలు, ఛందస్సు, వ్యాకరణ విశేషాల జోలికి నేను వెళ్లలేదు. భాషా పండితుడను కాను కనుక నేనందుకు సమర్థుడననీ భావించడం లేదు. ఓ సాధారణ పాఠకుడిలా ఆ కావ్యాలను అర్థం చేసుకుని, ఆస్వాదించి, ఆనందించిన తీరులోనే నేను వాటిని మీ ముందుంచాను. ఎందుకంటే కావ్య పఠనం నేను కేవలం నా మానసిక ఆనందం కోసమే చేశాను కానీ, నాకు యిలా వ్యాఖ్యాగ్రంథం వ్రాద్దామనే ఉద్దేశ్యం మొదట్లో లేదు. నేను రామకృష్ణ కవి కావ్యాలను అధ్యయనం చేసేటప్పుడు పొందిన మానసికానుభూతి ఉత్కటము - మితి యింత అని చెప్పలేనిది. నెలల తరబడి నేనా రసార్ణవంలో ఓలలాడాను. ఏదైనా నాకు క్షుణ్ణంగా అర్థమైతేనే ముందుకు సాగే వాడిని. ఎక్కడ నాకు కొరుకుడు పడలేదో అక్కడ నా అధ్యయనానికి 'బ్రేక్' పడేది. అలా చిన్న చిన్నగా ఆ కావ్యాలను సమగ్రంగా ఆకళింపు చేసుకుంటూ, కవి వైఖరి, ధోరణి అసమంజసంగానూ, అశాస్త్రీయంగానూ వున్నచోట్ల నిష్కర్షగా దానిని ఖండిస్తూ, యీ అధ్యయనంలో నేను పొందిన అద్భుత రసానుభూతిని అక్షరబద్ధం చేస్తూ ముందుకు సాగాను. మానవుడు వస్తుతః హేతు దృష్టి కలవాడు. ప్రతి దానినీ ప్రశ్నించే తత్త్వం మానవులకు మాత్రమే స్వంతం. ప్రతి కార్యానికీ కారణాన్ని తెలుసుకొనగోరతాడు మానవుడు. అంచేతనే నేను కూడా యీ అధ్యయన క్రమంలో కాల పరీక్షకు నిలువని, నిర్హేతుకమైన, అశాస్త్రీయమైన అంధ విశ్వాసాలను తునుమాడాను.

నేను యీ అధ్యయనాన్ని శాస్త్రీయ దృష్టితో చేయడం వలన ఎన్నో విజ్ఞాన శాస్త్ర సంబంధిత విషయాలను సందర్భోచితంగా నా వ్యాఖ్యలకు జోడించాను. ఎంతో సామాజిక, చారిత్రక సమాచారాన్నందించాను. కవి కాలం నాటి స్థితి గతులను, నేటి చదువరులను - ముఖ్యంగా యువతరాన్ని - దృష్టిలో పెట్టుకుని విశ్లేషించి వివరించాను. వివిధ భాషలతో నాకున్న కాస్తో కూస్తో పరిచయం, వివిధ శాస్త్రాలలో నాకున్న కొద్దిపాటి ప్రవేశం యీ గ్రంధాన్ని పరన యోగ్యంగా తయారు చేయడానికి తోడ్పడే వుంటాయని నా విశ్వాసం.

## పాఠ నిర్ణయం :-

కావ్య పరామర్శకు పూనుకున్న రచయితకు పాఠ పరిష్కారం ఓ అగ్ని పరీక్ష వంటిది. పాఠాంతరాలేవైనా వున్నట్లైతే వాటిలో ఏది వాస్తవానికి మరింత దగ్గరగా వుంటుందో, ఏది కవి హృదయాన్ని మరింతగా ప్రతిఫలింప జేస్తుందో దానినే మనం సవ్య పాఠంగా స్వీకరించాలి.

పాఠాంతరాలలో సవ్య పాఠాన్ని గుర్తించగలగడమెలా ? సంస్కృతంలో ప్రసిద్ధమైన 'విష్ణు స్తుతి' నే మనం ముందుగా చూద్దాం. చిన్నప్పుడెప్పుడో చదువుకున్న యీ శ్లోకం యొక్క రెండు పాఠాలలో సవ్యమైనదేది? - అనే ఆలోచన నా మెదడును తొలిచేసేది.

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం ।
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం ।
లక్ష్మీకాంతం కమల నయనం యోగిహృద్ధ్యాన గమ్యం ।
వందే విష్ణుం భవ భయ హరం సర్వలోకైక నాథం ॥

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం ।
విశ్వాధారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం ।
లక్ష్మీకాంతం కమల నయనం యోగిభిర్ధ్యాన గమ్యం ।
వందే విష్ణుం భవ భయ హరం సర్వలోకైక నాథం ॥

శ్లోకంలోని మొదటి పాదంలోనే విష్ణువుది 'శాంతాకారం' అని చెప్పిన కవి తిరిగి రెండవ పాదంలో ఆయనది 'విశ్వాకారం' అని చెప్పడం అంతగా నప్పేదిగా లేదు. 'విశ్వాధారం' అంటే 'విష్ణువు విశ్వానికి ఆధారభూతమైనవాడు' అన్నదే సరియైన భావన అని నా అభిప్రాయం. అలాగే 'యోగి హృత్ ధ్యాన గమ్యం' అనే కంటే 'యోగిభిః ధ్యాన గమ్యం' అంటేనే సబబుగా వుంటుందనీ నేను భావిస్తున్నాను. జన బాహుళ్యంలో విస్త ృత ప్రచారంలో వున్న యీ రెండు పాఠాలలో ఏది సవ్యమైనదో విద్వజ్జనులే నిర్ణయించాలి. ఇక పోతే ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన చాటువులలో ప్రసిద్ధమైనట్టి ఒక చాటువులో శ్రీకృష్ణ దేవరాయలకూ, తనకూ గల ఆత్మీయ సంబంధాల్ని నెమరు వేసుకుంటూ పెద్దన కవీంద్రుడు ఎలా చెబుతున్నాడో చూడండి-

సీ॥ ఎదురైనచోఁ దన మద కరీంద్రము నిల్పి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
కోకట గ్రామాద్యనేకాగ్రహారంబు ·
లడిగిన సీమల యందు నిచ్చె
మనుచరిత్రంబందుకొను వేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టి యెత్తె
బిరుదైన కవి గండపెండేరమునకీవె
తగుదని తానె పాదమునఁ దొడిగె

గీ. 'ఆంధ్ర కవితా పితామహ ! అల్లసాని
పెద్దన కవీంద్ర !' యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణ రాయలతో దివి కేఁగ లేక
బ్రతికి యున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

దీని భావం – కాలి నడకన వెళ్తున్న తనకు ఎప్పుడైనా రాయలవారు తన మద కరీంద్రము (భద్ర గజము) పై వెళ్తూ ఎదురైతే, తన ఏనుగును నిలిపి, ఊతగా చేయి యిచ్చి పెద్దనను కూడా తనతో పాటు అంబారీలో ఎక్కించుకు వెళ్లే వాడట. కోకట వగైరా అనేక గ్రామాలను తాను కోరుకున్న సీమలలో తనకు అగ్రహారాలుగా యిచ్చేవాడట రాయలవారు. (నేటి కడప జిల్లా) గండికోట సీమలో యీ 'కోకట' గ్రామం వుంది.

'మనుచరిత్ర' అనే ప్రబంధాన్ని పెద్దన వ్రాయగా శ్రీకృష్ణ దేవరాయలు కృతినందాడు. ఆ కృతి స్వీకరణ సందర్భంగా జరిగిన ఊరేగింపులో తాను ఎక్కిన పల్లకిని గౌరవ భావంతో బోయీలతో పాటు తాను కూడా ఎత్తి మోశాడట రాయలవారు. 'గండపెండేరము ధరించడానికి కవులలో నీవే తగిన వాడవు' అంటూ తన కాలికి రాయలవారే స్వయంగా దానిని తొడిగాడట. తనను ప్రేమతో 'ఆంధ్ర కవితా పితామహా !' 'అల్లసాని పెద్దన కవీంద్రా !' అని పిలిచే రాయలవారితో కలిసి స్వర్గానికి వెళ్లలేక ఏదో జీవచ్ఛవంలాగా బ్రతుకీడుస్తున్నాను– అని బాధ పడుతున్నాడు అల్లసాని పెద్దన.

ఈ సీస పద్యానికి కూడా ఓ పాఠాంతరం వుంది. ఆ పద్యం మొదటి పాదం యిలా వుంటుంది –

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె

ఈ పాఠాంతరం యొక్క రూపకల్పన చేసిన వారికి కృష్ణ రాయలు పెద్దనకిచ్చిన గౌరవం చాల లేదనిపించిందేమో మరి రాయల వారు తన మదపుటేనుగును నిలిపి పెద్దనకు చేయి ఆసరాగా యిచ్చి తన అంబారీలో ఎక్కించుకున్నాడంటే తృప్తి లేక – రాయలవారు అంబారీ దిగి వచ్చి కేలూఁత యిచ్చి పెద్దన గారిని ఎక్కించుకున్నాడంటున్నారు. క్రింద చతికిలబడిన ఏనుగు మడిచిన మోకాలిపైన తమ కాలు మోపి అంబారీలో ఎక్కి కూర్చుంటారు అనుభవం కలిగిన వారెవరైనా. అంబారీ ఎక్కే అనుభవం లేని పెద్దన వంటి వారికి అంబారీలో యిదివరకే వున్న రాయలవారు కేలూఁత యిచ్చి ఎక్కించుకున్నాడనడమే సబబుగా వుంటుంది. ఆయన అంబారీ దిగి వచ్చి 'ముందుగా పెద్దలు మీరు ఎక్కండి' అంటూ పెద్దనను గౌరవించినా, ఆయనకు అంతగా అనుభవం లేని కారణంగా అంబారీలో వుండి కేలూఁత యిచ్చే వారు లేకపోతే ఎక్కగలగడం అంత సులువేమీ కాదు. అదీ కాక 'ఎక్కించుకొనియె' అన్న పదం 'తాను ముందుగా ఎక్కి కూర్చుని, వేరొకరిని ఆ తరువాత తన ప్రక్కన కూర్చొనబెట్టుకొనడాన్నే సూచిస్తుంది. కనుక 'మద కరీంద్రము డిగ్గి' (దిగి) అనే పాఠం అపసవ్యమనీ, 'మద కరీంద్రము నిల్పి' అన్నదే సవ్య పాఠమనీ మనం గ్రహించాలి.

లోటస్ పబ్లిషర్స్, తెనాలి వారు 1974 లో ప్రచురించిన 'ఉద్భటారాధ్య చరిత్రము' గ్రంధానికి నిడదవోలు వేంకటరావు గారు విపుల పీఠిక వ్రాశారు. వారు చేసిన పాఠ పరిష్కారం కాక, శ్రీయుతులు ముదిగొండ వీరభద్ర మూర్తి, జంధ్యాల పాపయ్య శాస్త్రి గారలు కొన్ని శిధిల పూరణములు కుండలీకరణము ద్వారా (బ్రాకెట్లలో యివ్వడం ద్వారా) చేశారు. ఆ గ్రంధంలో ముద్రణా స్ఖాలిత్యాలు విపరీతంగా వున్నా తప్పొప్పుల పట్టికకు కేవలం 36 ముద్రణా

దోషాలు మాత్రమే ఎక్కాయి. పైపెచ్చు ఆ గ్రంథమేమో ఎటువంటి అర్థతాత్పర్యాదులు లేని కేవల శుద్ధ పాఠము (Pure Text). అదీ కాక రామకృష్ణ కవి స్వతంత్ర ప్రయోగాలకు పెట్టింది పేరు. దీంతో కొన్ని సందర్భాలలో పాఠ నిర్ణయానికి, భావాన్ని గ్రహించడానికి కొంచెం యిబ్బంది పడాల్సి వచ్చింది. నేను యీ కావ్యంలోని ఎన్నో దోషాలను సవరించుకుని సవ్య పాఠాలను గ్రహించాను. అయితే అలాంటి ఉదాహరణలు ఎక్కువగా చెప్పి మిమ్మల్ని యిబ్బంది పెట్టను. మచ్చుకు ఒక్కటి మాత్రం ప్రస్తావిస్తాను. ద్వితీయాశ్వాసం లోని 72వ పద్యం చూడండి. అది ఓ చక్కని ఉత్పలమాలిక.

ఉ. **గుబ్బల తేని కూఁతు చనుగుబ్బల కమ్మజవాది గంధముల్**
**బొబ్బిలఁ బూయఁ జూఁడ (నిల) చూపులు మూఁడగు వేల్పుఁ బెద్దకుం**
**గిబ్బల రాచతేజి నుటికింపుచు (లోకములేలు సామి కె**
**చ్చు)బ్బిన భక్తి మ్రొక్కులిడఁ జుబ్బన చూరఁగఁ గల్గు సౌఖ్యముల్. (ఉ. చ. 2-72)**

ఛందశ్శాస్త్ర నియమాల ప్రకారం ఉత్పలమాల వృత్తంలో నాలుగు పాదాలుంటాయి. ప్రతి పాదంలో 'భ, ర, న, భ, భ, ర, వ' అనే గణాలు వరుసగా వుంటాయి. ప్రతి పాదంలోనూ మొదటి అక్షరానికి, పదవ అక్షరానికి యతి మైత్రి వుండాలి. కనుక, చూడగానే మనకు యీ పద్యం రెండవ పాదంలో మొదటి అక్షరానికీ (బొ), పదవ అక్షరానికీ (చూ) యతి మైత్రి లేకపోవడం కనుపిస్తుంది. కనుక మొదటి అక్షరం కానీ, పదవ అక్షరం కానీ, మార్చుకుంటేనే మనకు సవ్య పాఠం లభిస్తుంది.

గుబ్బల తేడు అంటే పర్వత రాజు. ఆయన కుమార్తె పార్వతి చనుగుబ్బలకు శివుడు కమ్మనైన జవాది గంధములు పూయడం యిక్కడ విషయం. కనుక రెండవ పాదంలోని మొదటి పదం ఆ గంధం ఎలా పూయడం అనేది తెలిపే క్రియా విశేషణం అయి వుండవచ్చు. 'జొబ్బిలఁ పూయడం' అంటే 'స్రవించేట్లుగా పూయడం' అని అర్థం. కనుక రెండవ పాదంలోని మొదటి పదం 'బొబ్బిలఁ' కాదు 'జొబ్బిలఁ' అని గ్రహించాలి. రెండవ పాదంలోని మొదటి అక్షరమైన 'జొ' కు, పదవ అక్షరమైన 'చూ' కు (అవి పరస్పరము మిత్రములైనందున) యతిమైత్రి వుంటుంది. అలా సవ్య పాఠాన్ని మనం గ్రహించవచ్చు.

అయినా యీ పాదంలో 'జొబ్బిలఁ బూయఁ జూఁడ' కు బదులుగా 'జొబ్బిలఁ బూయఁ జూఁచు' అని వుండడం సబబుగా వుంటుందని నా అభిప్రాయం.

ఈ గ్రంథంతో పోల్చి చూస్తే ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు డా॥ కేతవరపు రామకోటి శాస్త్రి గారి సంపాదకత్వంలో 1968లో ప్రచురించిన 'ఘటికాచల మాహాత్మ్యము' మెరుగైన గ్రంథము. వారు గ్రంథ ముద్రణలో మరింత శ్రద్ధ కనబరచారు. అయినా ముద్రణా స్ఖాలిత్యాలు అక్కడక్కడా మామూలే. ఇది కూడా కేవల శుద్ధ పాఠమే అయినా, భావాన్ని గ్రహించడంలో పెద్దగా యిబ్బందులెదురు కాలేదు.

ఇక బులుసు వేంకట రమణయ్య గారు వ్రాసిన లఘు టీకతో వావిళ్ల వారు 1968లో (మూడవ కూర్పుగా) ప్రచురించిన 'పాండురంగ మాహాత్మ్యము' ఎన్నో రెట్లు మెరుగైన గ్రంథము. పూర్తి టీక, తాత్పర్యాలు లేకున్నా అది నాకెంతగానో ఉపకరించింది. దానిలోనూ ముద్రణా స్ఖాలిత్యాలు అక్కడక్కడా దర్శనమిచ్చాయి. తనకు పూర్వం శ్రీమాన్ తెన్మఠం శ్రీరంగాచార్యులు గారు ప్రచురించిన టీకకు తన శక్తి మేరకు మెరుగులు దిద్ది, ఎంతగానో పరిశ్రమించి ఆ మహత్తర ప్రౌఢ ప్రబంధాన్ని చదువరులకు వేంకట రమణయ్య గారు అందుబాటులోనికి తెచ్చారు. పీఠిక తొలికూర్పులో బులుసువారి మాటలలోనే ఆ గ్రంథం యొక్క లక్ష్యమేమిటో చూడండి. 'కొంత వరకును వాఙ్మయమునఁ బరిశ్రమ

చేసిన వారే యీ గ్రంధమును పఠింతురు. కావున అట్టి వారికుపయుక్తమగు రీతిని టీక సంగ్రహముగా గూర్చబడినది.' లఘు టీక అయినందున ఒక్కొక్క తావులో కవి హృదయాన్ని గ్రహించగలగడం కష్టమే అయింది. ప్రామాణిక నిఘంటువుల సాయంతో నేనీ పనికుపక్రమించాను. అలాగే రామకృష్ణ కవికి సంబంధించి ప్రాచుర్యంలో వున్న కొన్ని కథల భావాన్ని మాత్రం స్వీకరించి అవసరాన్ని బట్టి కల్పిత పాత్రలను సృష్టించి సందర్భోచితంగా సంభాషణలు అల్లాను. ఎక్కడికక్కడ అవసరమైన చారిత్రక, శాస్త్ర సంబంధిత సమాచారాన్ని అందజేశాను. అదే విధంగా రామకృష్ణ కవికి సంబంధించినవిగా జనం భావించే చాటువులను, యితర పద్యాలను వివిధ మార్గాలలో సేకరించి, వాటికి అర్థ తాత్పర్యాదులను సమకూర్చాను. ఈ కృషిలో నేను ఏ మేరకు సఫలీకృతుడనయ్యానో బుధజనులే నిర్ణయించాలి.

## నామ విజ్ఞానం :-

నాకు తెలిసిన కొందరికి – 'తమ యింటి పేరు ఎలా వచ్చింది ? దానికి మూలమైన వూరు ఎక్కడ వుంది ? ఆ ఊరు పేరు ఏ చెట్టు పేరు మీదుగా లేక ఏ జంతువు పేరు మీదుగా ఏర్పడింది ?' అన్న జిజ్ఞాస వుండడాన్ని నేను గమనించాను. అయితే తెలుసుకోవాలనే ఆసక్తి వున్నా తగినంత ధ్యాస, తీరుబాటు లేకనో, లేక ఎలా తెలుసుకోవాలో తెలియకనో ఆ విషయాన్ని వారు అంతగా పట్టించుకోక పోవడమూ నేనెరుగుదును. కాని నా దృష్టికి వచ్చిన యిటువంటి విషయాలు నన్నొక పట్టాన ప్రశాంతంగా వుండనీయవు. స్పష్టంగా దాని మూలాలు తెలుసుకునే వరకు నాకు అశాంతే.

ఉదాహరణకు 'పొణకల', 'పొనుకుమాటి' అనే యిండ్లపేర్లనే తీసుకుందాం. ఇండ్ల పేర్లున్నాయి కాబట్టి వాటికి కారకమైన ఊళ్లు వుండే వుంటాయని మనం భావించవచ్చు. ఎందుకంటే, నూటికి తొంభై యిళ్లపేర్లు గ్రామ నామాల మీదుగా ఏర్పడినవే. 'పొణకల' ను 'పొనకల' అని కూడా అంటారు. అలాగే 'పొనుకుమాడు'ను 'పొణుకుమాడు' అనీ అంటారు.

ఈ రెండు ఊళ్ల పేర్లు ఏర్పడడానికి మూలమైన చెట్టును పునికి, పొణుకు, పులికి, తెల్ల పులికి, పొలికి, పొనికి, పుమికి అనే పేర్లతో వివిధ ప్రాంతాల తెలుగు ప్రజలు పిలుస్తారు. తమిళులు దీనినే 'వెండలై' అంటారు. ఈ వృక్షం యొక్క సాంకేతిక నామం G vot a rott er form s . ఇది యూఫోర్బియేసీ (Euphorbıaceae) కుటుంబానికి చెందిన వృక్షం. నూగు కలిగి పది అంగుళాల వరకు పొడవు కలిగిన పెద్ద వెడల్పాటి ఆకులు, నున్నని గోధుమ రంగు కాండం కలిగిన యీ చెట్టును తేలికగానే గుర్తించవచ్చు. తెల్లని దీని కర్ర చాల తేలికగా, మెత్తగా వుంటుంది. తేలికగా ఎలా పడితే అలా మలచవచ్చు కనుకనే యీ కర్రను బొమ్మలు, లక్కపిడతలు వగైరాల తయారీలో వాడతారు. చిన్న పడవలు (Catamarans) తయారు చేయడానికి, ప్యాకింగుకు కూడా దీన్ని వాడతారు. కొండపల్లి బొమ్మలు యీ కర్రతోనే తయారు చేస్తారు. అలిపిరి నుండి తిరుమలకు వెళ్లే కాలి బాటలో యీ చెట్లను మనం చూడవచ్చు.

'పొణకల' లేక 'పొనకల' అనే గ్రామనామంలో 'ల' అనేది నీటి వనరుకు సంకేతం మునగాల, గార్ల (గార ల), జమ్ముల (పల్లి) వగైరా గ్రామ నామాలేర్పడినట్లే 'పొణుకుల' లేక 'పొనుకుల' అనే గ్రామ నామం ఏర్పడి అదే కాల క్రమంలో 'పొణకల' లేక 'పొనకల' గా రూపాంతరం చెందింది. 'పొణకల' అనే పేరు గల గ్రామం ఎక్కడుందో యింతవరకూ నాకూ అంతు చిక్కలేదు. కాని కర్నూలు జిల్లా ఆదోని తాలూకాలో 'పొణకల దిన్నె' అనే గ్రామం వుంది. అలాగే 'పొణుకు పాడు' అని గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో వున్న గ్రామం 'పొణుకు మాడు' అని కూడా పిలువబడుతున్నది. (వెల్ల పాడు ——> వెల్లబాడు —> వెల్లమాడు గా రూపాంతరం చెందినట్లే.)

ఇకపోతే 'నల్ల పొణుకు' లేక 'తణుకు' అని పిలువబడే యింకొంచెం పెద్ద వృక్షం యింకొకటి వుంది. దాని సాంకేతిక నామం Gyrocarpus amer canus Syn. Gyrocarpus jacquını. ( Syn. అనేది 'Synonymous' అనే పదానికి సంక్షిప్తీకరణ. ఆ సంకేతం వాడినప్పుడు ఆ వృక్షాన్ని ఆ రెండు పేర్లలో దేనితోనైనా పిలువవచ్చునని అర్థం చేసుకోవాలి.) ఇది హెర్నాండియేసీ ( Hernandiaceae ) కుటుంబానికి చెందిన వృక్షం. దీని కలపను కూడా బొమ్మలు, లక్కపిడతలు, దువ్వెనలు, ఫర్నిచర్, చిన్న పడవలు వగైరాల తయారీలో వాడతారు.

ఈ గ్రంథంలో యిండ్ల పేర్లు, గ్రామనామాలు తటస్థించిన సందర్భాలలో వీలైనంత మేరకు వాటిని విశ్లేషించి, వివరించడానికి నేను ప్రయత్నించాను. ఆ యా వృక్ష, జంతు, పక్షి, కీటక జాతుల సాంకేతిక నామాలు, ఆ యా కుటుంబ వివరాలు వగైరాలను శక్తిమేరకు పొందుపరచాను. ప్రకృతిపై ప్రేమ, ప్రకృతి శాస్త్ర పరిజ్ఞానంపై అభిరుచి, ఆసక్తి గల పాఠకులకు ఆ యా అంశాలపై మరింత విషయ సేకరణకు నేనిచ్చిన సమాచారం ఉపకరిస్తుందని భావిస్తాను. అలాగే నామ విజ్ఞాన శాస్త్రం (Onomast cs) లో అభిరుచి వున్న పాఠకులకు గ్రామ నామాల ఆవిర్భావం పై నేనిచ్చిన 'క్లూ' లు తప్పక ఉపయుక్తం కాగలవని కూడా నేను భావిస్తాను. వృక్షాల సాంకేతిక నామాల ఆధారంగా ఆ యా వృక్ష ఉత్పాదనల ఔషధ విలువలను ఔత్సాహిక పాఠకులు వస్తుగుణ దీపిక (Materıa Med ca) ద్వారా గ్రహించగలరు.

## భాషా పరిచ్ఛేదము :-

ఉత్తమ గ్రంథాలు కేవలం చదువరుల వినోదం కోసమో లేక విజ్ఞానాభివృద్ధి కోసమో మాత్రమే కాక వారి భాషా పాటవాన్ని పెంపొందించడానికి కూడా దోహదం చేయాలి. పాఠకులకు సందేశం యివ్వడంతో పాటు తమ గ్రంథాల ద్వారా వారి భాషాపటిమను కూడా పెంపొందింపజేయాలనే సత్సంకల్పం ఒకనాటి రచయితలలో ఎక్కువగా వుండేది. గతకాలంలో వినోదం కోసమో లేక కేవలం కాలక్షేపానికో సినిమాలకి వెళ్లినా ఆ చలన చిత్రాలలోని సంభాషణలు సైతం ప్రేక్షకుల భాషా పాటవానికి మెరుగులు దిద్దేవిగా వుండేవి. సంభాషణా రచయితలు ఎన్నో లోకోక్తులను ఆ యా సన్నివేశాలలో సమయోచితంగా వినియోగించుకొనే వారు. నా బాల్యంలో చలన చిత్రాల నుండే ఈ క్రింది సంస్కృత లోకోక్తులను, సంబోధనలను మొదటి సారిగా విని ఆ తరువాత వాటి భావాన్ని అవగతం చేసుకున్నాను.

| లోకోక్తి / సంబోధన | భావం | సంభాషణల రచయిత | చలనచిత్రం |
|---|---|---|---|
| 1. 'యతో ధర్మస్తతో జయః' | ఎక్కడ (ఎవరి నుండి) ధర్మముంటుందో వారు జయిస్తారు. ధర్మమే జయిస్తుంది. | కీ శే. పింగళి నాగేంద్రరావు | మాయా బజార్ |
| 2. 'జనవాక్యం తు కర్తవ్యమ్' | ప్రజాభిప్రాయం ప్రకారం పాలించడమే (రాజు) విధి | కీ.శే. సముద్రాల రాఘవాచార్య (జూనియర్) | గులేబకావళి కథ |
| 3. 'పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' | ఓటమి యొక్క ఓటమి పుత్రుడు జన్మించడంతోనే ఓటమి అనేదే వుండదని భావం. | " | గులేబకావళి కథ |

మొదలవుతుంది. అంటే పుత్రుడు కలిగిన వానికి

| లోకోక్తి / సంబోధన | భావం | సంభాషణల రచయిత | చలనచిత్రం |
|---|---|---|---|
| 4. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్' | ఇంద్రియాలన్నింటిలోకీ కన్ను ప్రధానమైనది. | కీ.శే. సముద్రాల రాఘవాచార్య (జూనియర్) | గులేబకావళి కథ |
| 5. 'కార్యాతురాణాం న సుఖమ్ న నిద్రా' | పని చేయాలనే ఉత్సాహం, తపన కల వానికి సుఖమూ లేదు; నిద్రా రాదు. 'ఆతుర' అనే సంస్కృత విశేషణానికి తపన గల (eager) అనీ అమితాసక్తి గల (over - anxious) అనీ కూడా అర్థాలున్నాయి. | కీ.శే. సముద్రాల రాఘవాచార్య (సీనియర్) | శ్రీకృష్ణ పాండవీయం |
| 6. 'స్వరాజ్యే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే' | రాజు తన రాజ్యంలో మాత్రమే పూజించబడితే విద్వాంసుడు అన్ని తావులలో పూజలందుకుంటాడు. | కీ.శే. సముద్రాల రాఘవాచార్య (సీనియర్) | తెనాలి రామకృష్ణ |
| 7. 'బుద్ధిః కర్మానుసారిణీ' | బుద్ధి కర్మను అనుసరిస్తుంది. అంటే కర్మ ప్రకారం జరుగవలసిన దాన్నే చేయమని మనిషిని బుద్ధి ప్రోత్సహిస్తుంది. | కీ.శే. పింగళి నాగేంద్రరావు | జగదేకవీరుని కథ |
| 8. 'వయస్యా! ' | వయస్యుడు అంటే సమవయస్కుడైన సహచరుడు. | కీ.శే. పింగళి నాగేంద్రరావు | సత్య హరిశ్చంద్ర |
| 9. 'వాచార్యా!' | సంస్కరింపబడిన వచస్సు కలిగిన వాడా! Refined (Noble) in speech. | కీ.శే. పింగళి నాగేంద్రరావు | సత్య హరిశ్చంద్ర |

కాలచక్ర గమనంలో రచయితల దృష్టిలో భాషకు ప్రాధాన్యత తగ్గి, కేవలం భావ వ్యక్తీకరణ మాత్రమే ప్రాధాన్యత సంతరించుకుంది. పాఠకుడి జీవితం కూడా క్రమక్రమంగా తీరికలేనిదైపోయి చదవడానికి అవకాశమున్న ఆ కాస్త వ్యవధిలో వార్తా పత్రిక పూర్తిగా చదవగలిగితే చాలు – అన్నట్లుంది పరిస్థితి. భాషను రక్షించుకుందామనే తపన చాలమందిలో క్రమక్రమంగా వెనుకపట్టు పట్టిన కారణంగా తెలుగు పేరుతో ఏది పడితే అది చలామణీ అవుతున్నది. మాతృభాషాభిమానులకు ఈ భాషా హననం తీవ్ర వేదన కలిగిస్తూంది. వీలైన మేరకు తెలుగులోనే మాట్లాడుతూండడం, తెలుగులోనే వ్రాస్తూండడం ద్వారా మన భాషను పరిరక్షించుకోవాలనే సదాశయంతో భాషోద్యమ సమాఖ్యలు యిటీవలనే కృషిని ప్రారంభించాయి. ఇదెంతో ముదావహం ! ఈ సందర్భంగానే నేటి తెలుగు భాష దయనీయ స్థితిని ఓ పర్యాయం సింహావలోకనం చేయడం ఉచితమని నేను భావిస్తాను. వార్తా పత్రికలు, టెలివిజన్ ఛానెళ్లు, చలన చిత్రాలు బలీయమైన ప్రచార మాధ్యమాలైనందున మనం వాటిలో తటస్థపడుతూన్న భాషాదోషాలనే ప్రధానంగా దృష్టిలో వుంచుకుందాం.

నా చిన్నతనంలో వార్తా పత్రికలలో "సారథీ స్టూడియోస్ వారి తదుపరి చిత్రం త్వరలో వస్తూంది", "పొన్నలూరి బ్రదర్స్ వారి ద్వితీయ చిత్రం శరవేగంతో వస్తూంది" వగైరా ప్రకటనలు వచ్చేవి. వస్తూ... వుంది అని చెప్పడానికి 'వస్తూంది' అని వ్రాయడమే సబబు. అయితే ఎలా ప్రవేశించిందో తెలియదు కానీ 'వస్తోంది' అనే ప్రయోగం వాడుకలోకి వచ్చింది. బహుశా యిది ప్రఖ్యాత రచయిత చెలం గారి ప్రభావం కారణంగా అయివుంటుందనిపిస్తున్నది. ఆయన "చూస్తో కూచున్నాను", "వింటో పడుకున్నాను", "రాస్తో రాస్తో నిదరోయాను" అని విలక్షణ శైలిలో వ్రాసేవారు. (ఆయన తన పేరును కూడా 'చలం' అని కాక విలక్షణంగా 'చెలం' అని వ్రాసేవారు). ఇంకా చెలం గారిలా 'చూస్తూ', 'వింటూ' కు బదులుగా 'చూస్తో', 'వింటో' అని వ్రాసే స్థాయికి చేరలేదు కానీ, దాదాపు అందరు పాత్రికేయులు, రచయితలు 'వస్తోంది', 'వెళుతోంది' అనే వ్రాస్తున్నారు. గర్భిణిని 'కడుపుతో వుంది' అంటాం. సినీ నటి కీ.శే. భానుమతి గారి వంటి కొందరు ఉచ్చారణలో దాన్ని 'కడుపుతోంది' గా మార్చేశారు. బహుశా 'తోంది' యిలా కూడా ప్రాచుర్యంలోకి వచ్చి వుండవచ్చు.

ఇక రాజకీయ నేతల భాష విలక్షణమైనది. ఆ పార్టీ – యీ పార్టీ అని కాకుండా అన్ని పార్టీల నేతలూ 'మనవి చేస్తా వున్నాం', 'ప్రత్యామ్నాయాలేవైనా వున్నాయేమో ఆలోచిస్తా వున్నాం' అంటూ సరికొత్త 'రాజకీయ తెలుగు' ను సృష్టించారు. "ఈ ప్రతిపాదన ఏదైతే వుందో....", "ఏదైతే ప్రజలకు చేసిన వాగ్దానముందో..." అంటూ ప్రతి పది పదాలకు ఒకసారి 'ఏదైతే' అని ప్రయోగించడం కూడా 'రాజకీయ తెలుగు' వ్యాకరణ సూత్రాలలో ఒకటి. ఒకరిని చూసి మరొకరు త్వరత్వరగా యీ వ్యాకరణం నేర్చేసుకుంటున్నారు. ఈ 'ఏదైతే' అనే పదం ఏదైతే వుందో దానిని విరివిగా వాడే రాజకీయ శైలిని దృష్టిలో వుంచుకునే కామోసు శ్రీ ధర్మవరపు సుబ్రహ్మణ్యం 'క్రేన్ వక్కపలుకులు' వ్యాపార ప్రకటనలో "నా బుర్ర ఏదైతే వుందో.... అది తినకయ్యా! క్రేన్ వక్కపలుకులు తినవయ్యా!" అంటారు.

'అక్షతలు' అనడం సవ్యమైనది. (న క్షణ్యంత ఇతి అక్షతాః – క్షతము లేనివి అక్షతలు) అయితే నూటికి తొంబది తొమ్మిది మందీ వీటిని అక్షింతలు అనే అంటున్నారు. అలాగే వ్రాస్తున్నారు. వివాహాలు జరిపించే పురోహితులు కూడా దీనికి అతీతంగా లేరు.

ముత్త + అయిదువ → ముత్తైదువ (సుమంగళి) అనే ప్రయోగంలో 'ముత్త' అనే పదానికి ముదుసలి అనే అర్థం వున్నా యిక్కడ 'పెద్దరికం కల' అనీ, 'అయిదువ' అంటే 'సుమంగళి' అనీ అర్థం. ఈ అయిదువ తనం క్రమేణా 'ఐదోతనం' అయింది. దాదాపు సినీ రచయితలంతా తాము వ్రాసిన సంభాషణలలో అయిదువ తనం అని కాకుండా ఐదోతనం అనే వాడారు.

సినీ నటులలో కీ॥శే॥ సి.యస్.ఆర్., ముక్కామల వంటి వారు మాత్రమే సవ్యంగా 'జాగ్రత' అని పలికేవారు. దాదాపు మిగిలిన అందరు నటులూ 'జాగ్రత్త' అంటూనూ, కొందరైతే 'జాగర్త' అంటూనూ తప్పుగా పలుకుతున్నారు.

'భూకైలాస్' చిత్రంలో నారద పాత్రధారి ఏ.యస్.ఆర్. మండోదరిని ఆశీర్వదిస్తూ 'శీఘ్రమే వివాహ ప్రాప్తిరస్తు' అంటారు. దీని సవ్య రూపం 'శీఘ్రమ్ ఏవ వివాహ ప్రాప్తిః అస్తు' (శీఘ్రమేవ వివాహ ప్రాప్తిరస్తు). ఇక్కడ 'వ' శబ్దం లుప్తమైతే అది తెలుగూ కాదు; సంస్కృతమూ కాదు. నేనిది కేవలం ఉదాహరణకు మాత్రమే పేర్కొన్నాను. కాని, యిదే తరహా ఉచ్చారణా దోషాలు చాలమంది యితర నటీనటులలో కూడా వుండడం మీరు గమనించే వుంటారు.

'తలక్రిందులు' సవ్యం. 'తల్లకిందులు' అపసవ్యం. 'శ్మశానం' సవ్యం. 'స్మశానం' అపసవ్యం. 'ఉద్దేశ్యం' సవ్యం. 'ఉద్దేశం' అపసవ్యం. 'చాల' సవ్యం. 'చాలా' అపసవ్యం. ఎక్కువ మంది చిత్రంగా అపసవ్య పదాలనే స్వీకరించి

వినియోగిస్తున్నారు.

ఇక వత్తుల పాటింపే లేకుండా పోయింది.

ఉత్ + జ్వల → ఉజ్జ్వల (దాదాపు నేడందరూ ఉజ్వల అనే వ్రాస్తున్నారు.)

తత్ + త్వం → తత్త్వం (దాదాపు నేడందరూ తత్వం అనే వ్రాస్తున్నారు.)

సత్ + న్యాసము → సన్న్యాసము (దాదాపు నేడందరూ సన్యాసము అనే వ్రాస్తున్నారు.)

పోనీ ఇటువంటి పదాలలోనైతే ఉచ్చారణలో భేదమేమీ లేనందున సౌలభ్యం కోసం వత్తులు తీసివేసి వ్రాస్తున్నారని భావిద్దాం.

ఇంకా యివి చూడండి.

'కథ'కు 'కధ' అనీ ; 'గోష్ఠి'కి 'గోష్టి' అనీ ; 'గ్రంథాలయము' నకు 'గ్రంధాలయము' అనీ; 'దధ్యోదనము' (దధి + ఓదనము)నకు 'దద్దోజనం' అనీ; 'అప్రతిష్ఠ'కు 'అప్రదిష్ట' అనీ; 'విరేచనము'నకు 'విరోచనము' అనీ (విరోచనము అంటే ప్రకాశించడం); 'సౌహార్ద'కు 'సౌహార్ద్ర' అనీ; 'గాయత్రి' కి 'గాయిత్రి' అనీ వ్రాయడం తప్పని కొందరు పాత్రికేయులకు కూడా తెలియకపోవడం శోచనీయం.

పత్రికలలో ఎక్కడన్నా 'మధుసూధన రావు' అనీ 'జనార్ధన్ రెడ్డి' అనీ చూస్తుంటే బాధగా వుంటుంది. 'సూదనము' అంటే చంపడం – మధు అనే రాక్షసుడిని చంపిన వాడు 'మధుసూదనుడు' (విష్ణువు). అలాగే 'అర్దనము' అంటే పీడించడం. 'సముద్ర మధ్యవర్తినో జననామ్నోఽసురా నర్దితవానితి జనార్దనః' – అమరకోశము. సముద్ర మధ్యంలో వుండే 'జనులు' అనే అసురులను పీడించినవాడు అనే అర్థంలో విష్ణువు. గొల్లపల్లె జనులను పీడించిన వాడు అనే అర్థంలో కృష్ణుడు. ఆ పేర్లు పెట్టబడిన వారికి కూడా యీ పదాల సవ్య రూపం గురించి పట్టక వారు కూడా వత్తులు తగిలించడం విచిత్రం !

కొందరు తేజస్వి, మనస్వి, యశస్వి వగైరా పురుషుల పేర్లు ఆడపిల్లలకు పెడుతున్నారు. స్త్రీలు తేజస్విని, మనస్విని, యశస్విని అన్న పేర్లే పెట్టుకోవాలి కదా ! (ఉదా :– మార్కండేయుని తల్లి, మృకండు మహర్షి భార్య అయినట్టి మనస్విని) అలాగే సుమిత్ర కుమారుడైన లక్ష్మణుడికి 'సౌమిత్రి' అని మరో పేరు. దీన్ని కూడా కొందరు తమ ఆడపిల్లలకు పెడుతున్నారు.

'భావి' అంటే 'భవిష్యత్తు'. 'నుయ్యి' ని 'బావి' అనే అనాలి కాని 'భావి' అనరాదు. 'దారము'ను 'ధారము' అనరాదు. 'కర్మ' అనే అనాలి కానీ, 'ఖర్మ' అనరాదు. అయితే కొందరు 'పండితుల' వాడుక భాషలో యివి సర్వసాధారణ దోషాలు. అవే గ్రందాలలోనికి కూడా ప్రవేశిస్తున్నాయి.

'సుభాస్ చంద్ర' అంటే 'బాగుగా భాసించే (వెలుగొందే) చంద్రుడు' అని అర్థం. మనం 'భాస', 'ప్రభాస' అనే పదాలు పలుకుతున్నట్లే దీనిని 'సుభాస్' అనే పలకాలి. అలానే వ్రాయాలి. అయితే యిప్పుడు దాదాపు అందరూ 'సుభాష్' అనే వాడుతున్నారు. దాన్నే విదేశాలలో చదువుకుని వచ్చిన మన సినీ హీరోలు, వత్తులు పలుకలేరు కనుక, మరింత సులభతరం చేసి 'సుబాష్' చేసేశారు.

'మల్లికార్జున' స్థానంలో 'మల్లిఖార్జున' ఎక్కడి నుంచి ఎలా వచ్చిపడిందో తెలియదు.

'సాధక బాధకాలు' అని వ్రాయడానికి 'సాధక బాధలు' అని వ్రాస్తున్నారు కొందరు. 'చర్విత చర్వణం' అంటే 'చెప్పబడిందే చెప్పబడడం'. దీన్ని కూడా కొందరు అపసవ్యంగా 'చర్విత చరణం' అని వ్రాస్తున్నారు. 'చర్విత చరణ'మంటే

చెప్పబడిన మాట అని మాత్రమే అర్థం. 'చెప్పిందే చెప్పడం' అనడానికి 'చర్విత చర్వణం' అని అనాల్సిందే.

ఇక జన సామాన్యంలోనైతే 'విద్య' ని 'విధ్య' అనీ, 'బాధ'ను 'భాద' అనీ, 'బాధ్యత'ను 'భాద్యత' అనీ, 'విద్యార్థి'ని 'విధ్యార్ది' అనీ, 'సంబంధించిన'కు 'సంభందించిన' అనీ, 'రవీంద్రనాథ్'ని 'రవీంద్రనాధ్' అని కొందరూ 'రవీంద్రనాద్' అని యింకొందరూ తప్పుగా వ్రాస్తున్నారు. ఇటీవల 'విధ్య మా జన్మ హక్కు' అంటూ కొన్ని 'విధ్యార్ది సంఘాలు' గోడలమీదికెక్కుతున్నాయి. వీధులకెక్కినా, గోడలమీదికెక్కినా అసలు వారికి కావలసింది విద్యో కాదో ముందు తేలాలి.

కొందరు టి.వి. న్యూస్ రీడర్లు కూడా యీ అపసవ్య పద ప్రయోగాలకు తమ వంతు సహకారాన్నందించడం విశేషం !

'వెనకాల' అనడానికి పల్లీయులు 'వెనక మాల' అని తప్పుగా అంటారు. బహుశా దీన్ని దృష్టిలో వుంచుకునే నేమో కీ.శే. నాగభూషణం 'మోసగాళ్లకు మోసగాడు' చిత్రంలో "అబ్బబ్బా! నేనంత తెలివి తక్కువ వాడిననుకున్నావా? ఎదురు మాలగా వస్తే నువ్వు పట్టుబడవని తెలిసే వెనక మాలగా వచ్చి పట్టుకున్నానబ్బాయీ !" అంటాడు హీరో కృష్ణతో. అలా 'వెనక మాల' అని అనడం తప్పని ప్రేక్షకులకు తెలియజేసే ఉద్దేశ్యంతో 'ఎదురు మాల' అనే ఓ కొత్త పదాన్ని సృష్టించారు నాగభూషణం (రచయిత వ్రాయని పదాలను కూడా అక్కడికక్కడ సందర్భోచితంగా సృష్టించడం ఆయనకు అలవాటు)

జన సామాన్యంలో ప్రాచుర్యంలో వున్న భాషా దోషాలను ఎత్తి చూపడానికి గ్రంథ కర్తలూ, సినీ, టి.వి., రచయితలు, పాత్రికేయులు, అవిరళ కృషి జరిపితేనే కాని, ఈ 'భాషా హననం' తగ్గుముఖం పట్టదు. వార్తా పత్రికలు, సినిమాలు, టి.వి. ఛానెళ్లు ప్రజాకర్షక మాధ్యమాలైనందున యీ బాధ్యత పాత్రికేయులు, సినీ, టి.వి. రచయితలపైనే ఎక్కువగా వుంది.

భాషను యింకా యీ మాత్రమైనా సజీవంగా వుంచుతున్నందుకు వారిని అభినందించి తీరాలి. అయితే వారిలో కొందరు యింకా ఎన్నో సాధారణ భాషా దోషాలను కూడా దిద్దుకొనకుండా ఉపేక్షిస్తున్నందుకు అభిశంసనకు కూడా వారు యోగ్యులే ! అలా 'పూలూ - రాలూ' (Bouquettes and Brickbats) రెంటికీ వారు పాత్రులు.

మనం యిందాక అనుకున్న 'అక్షతలు' అనే పదానికి - అది తప్పైనా ఒప్పైనా - 'అక్షింతలు' అనే ప్రయోగం కూడా ప్రౌఢకవి మల్లన వ్రాసిన 'రుక్మాంగద చరిత్రము' లో వుంది. ఆ కవి క్రీ. శ. 1550 ప్రాంతాల వాడు.

ఒక్కోసారి మన అవగాహనా లోపం కారణంగా కూడా కొన్ని పదాలలో మనకు దోషాలు ద్యోతకమవుతాయి. దీనికో ఉదాహరణ చెబుతాను. 'కుంచించుకు పోవడం' సరియైనదనీ 'కుచించుకు పోవడం' సరికాదనీ నేనొకప్పుడు అనుకొనేవాడిని.

అయితే 'కుంచ్', 'కుచ్' రెండు ధాతువులూ సమానార్థకాలే.
కుంచతి వక్రతయా అల్పీ భవతీతి కుంచితమ్
కుచ గతి కౌటిల్యాల్పీ భావయోః
వంకర దౌటచేత కొంచమై యుండునది - అమరకోశం
(కోచతి, కుంచతి, కుంచిత)

'కుచ్', 'కుంచ్' - రెండు ధాతువులకూ అర్థం - కొంచమై వుండు (to shrink or contract) అని

ప్రామాణిక నిఘంటువులలో యివ్వబడింది.

అయితే బాల్యంలో నేను నేర్చుకున్న పదం 'కుంచించుకు పోవడం' అని మాత్రమే. అప్పట్లో 'కుచించుకు పోవడం' అనే పదం వుందని కూడా నాకు తెలియదు. అంచేత మొదట్లో దాన్ని తప్పుగా భావించాను. దీనికి మరో కారణం కూడా వుంది. 'కుంచితము', 'కుంచనము', 'ఆకుంచనము', 'ఆకుంచితము' వగైరా పదాలనే నేను విని వున్నాను. 'కుత్సితము' అనే పదం తెలుసు గానీ, 'కుచితము' అనే పదం వున్నట్లు నేనెరుగను. అదీకాక 'కుచనము', 'ఆకుచనము', 'ఆకుచితము' అనే పదాలే భాషలో లేవు. ఈ కారణంగానే 'కుచించుకు పోవడం' అని వాడడం తప్పని నేను భావించాను. ఇప్పుడు మన పత్రికల వాళ్లంతా 'కుచించుకు పోవడం' అనే వాడుతున్నారు. అయితే అదీ సవ్యమైన ప్రయోగమేనని నేను ఆలస్యంగా తెలుసుకున్నాను.

"నేనింత వరకు తెల్ల కాకిని చూడలేదు కనుక ప్రపంచంలో తెల్ల కాకులుండవు" అనే నిర్ణయానికి రావడం తార్కికంగా ఎంత తప్పో, నేను బాల్యంలో నేర్చుకున్న ప్రయోగమే సరియైనది; వేరొకటి సరియైనది కాదు అనుకోవడం కూడా అంతే తప్పు.

ఒకప్పుడు మన పత్రికలలో 'కనుపించుట లేదు' అనే ప్రకటనలొచ్చేవి. ఇప్పుడు పత్రికల వాళ్లంతా 'కనిపించడం' అనే వాడుతున్నారు. నేనైతే యింకా ఆ వెనుకటి ప్రయోగమే చేస్తున్నాను.

అమితాభ (అమిత + అభ) అంటే 'గొప్ప కాంతి కలిగిన వాడు' అనీ, 'అంతులేని ప్రాభవం కలిగిన వాడు' అనీ అర్థాలు. విష్ణు పురాణంలో ఓ దేవతా గణం కూడా 'అమితాభు'లు అనబడ్డారు. శాక్య వంశంలో జన్మించిన గౌతముడు విరాగియై సంసారాన్ని త్యజించి మానవుని దుఃఖానికి హేతువును కనుగొనే ఉద్దేశ్యంతో ఆరేళ్ల పాటు తపస్సు చేసి బుద్ధగయ లోని బోధివృక్షం (రావిచెట్టు) క్రింద జ్ఞానోదయం పొంది బుద్ధుడైనప్పుడు ఆయన శరీరం వింత వింత కాంతులతో మెరిసి పోయిందట. ఆ కాంతి ప్రభావంతో ఆ వృక్షం కూడా కాంతులీన సాగిందట. అంచేత నాటి నుంచి బుద్ధుడికి 'అమితాభ' అనే పదం వచ్చింది. ప్రఖ్యాత సినీ నటుడు అమితాభ్ బచ్చన్ పేరు అలా పెట్టబడిందే. ఆంగ్ల భాషలో ఆయన పేరును Amitabh అని సక్రమంగానే వ్రాస్తున్నారు. కాని మన తెలుగు పత్రికలలో దాదాపు అందరూ 'అమితాబ్' అనే వత్తు లేకుండా వ్రాస్తున్నారు. అందుకే మరోసారి చెపుతున్నాను - భాషను హవణించి, హరువు చేకూర్చినా, హననం చేసినా - అది పత్రికల వారి చేతులలోనే వుంది.

ఇంకొకరి తప్పులు ఎంచడం అతి తేలికైన పని. అయితే మన దగ్గర తప్పులు దొర్లకుండా చూసుకోవడం మాత్రం ఎంతో కష్టం. ఈ విషయంలో ప్రజా కవి వేమన చెప్పిన పద్యం మనందరికీ నిత్య స్మరణీయమ్మూ శిరోధార్యం-

"తప్పులెన్ను వారు తండోప తండంబు
 లుర్వి జనుల కెల్ల నుండు తప్పు
 తప్పులెన్నువారు తమ తప్పు లెరుగరు
 విశ్వదాభిరామ వినుర వేమ."

కొందరి వైఖరి ఎలా వుంటుందంటే - "ఎవ్వరూ సర్వజ్ఞులు కాదు - భగవంతుడు తప్పితే. తప్పులు అందరి దగ్గరా వుంటాయి. మరొకరి భాషా దోషాలను విమర్శించడం మాని, ఎవరికి వారు తమ తప్పులు తాము దిద్దుకుంటుంటే మంచిది," అని. ఇది మంచిదే. అయితే దోష పరిహారం జరిగేదెలా ? తప్పులేవో ఒప్పులేవో తెలిస్తేనే కదా -

దిద్దుకోవడానికి. అందుకే విమర్శ వుండి తీరాలి. అయితే ఆత్మ విమర్శ లేని విమర్శ కూడదనుకోండి. 'స్పర్ధయా వర్ధతే విద్యా' అని ఊరకే అన్నారా పెద్దలు ? ఒకరి తప్పులు మనం ఎంచుతున్నామంటేనే మన తప్పులు వేరొకరిచే ఎంచబడడానికి కూడా మనం సిద్ధంగా వున్నామన్నమాటే ! ఒకరి తప్పులు మరొకరు విమర్శించుకొనకుండా అందరం రాజీ పడితే - భాషకు అంతకంటె దుర్దశ మరొకటి వుండదు. ఒకరిని చూచి మరొకరు నేర్చుకుంటూ, తప్పులు దిద్దుకుంటూ తమ భాషా సౌందర్యాన్ని యినుమడింపజేసుకుంటుంటేనే భాష మనుగడ, భాషాభివృద్ధి సాధ్యం.

భగవంతుడిని విశ్వసించే వారు భగవంతుడు మాత్రమే పరిపూర్ణుడని భావిస్తారు. ఆయన దిశగా ప్రయాణించడం, తామూ క్రమక్రమంగా పరిపూర్ణులవుతూ, అంతిమంగా ఆయనలో లయమవడం తమ జీవిత లక్ష్యంగా వారు తలుస్తారు. ఈ కృషిలో వారు సఫలీకృతులవడానికి తాము వున్నాడని నమ్ముతున్న భగవంతుని సహాయాన్ని కోరతారు. నేనైతే భగవంతుడిని విశ్వసించను. అయినా అన్నింటిలో సవ్యమైనవేవో తెలుసుకొనడానికి నిత్యమూ జిజ్ఞాసతో యత్నిస్తూనే వుంటాను. పరిపూర్ణత సాధించడానికి ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ చిత్తశుద్ధితో యథాశక్తిగా కృషి చేస్తుంటాను. అలా నా లక్ష్యం కూడా పరిపూర్ణతే. అయితే నేను యీ గమనంలో స్వయంకృషినే నమ్ముకుంటాను.

ఈ విషయంలో మీకు మరొక ఉదాహరణ కూడా చెప్పాలి. తెనాలి రామకృష్ణుని సమస్యాపూరణ కథ 'కుంజర యూథం - దోమ కుత్తుక' ద్వారానే నేను మొదటిసారి 'యూథము' అనే పదాన్ని తెలుసుకున్నాను. ప్రసిద్ధమైన యీ సమస్యా పూరణ కథ ఎరుగని వారుండరు. 'యూథము' అంటే గుంపు లేక సమూహము అని అర్థం. కుంజర యూథము అంటే ఏనుగుల మంద. 'కుంజర యూథంబు దోమ కుత్తుకఁ జొచ్చెన్' అన్నది దత్త పది. ఈ సమస్యను రామకృష్ణ కవి రెండు విధాలుగా పూరించాడు. ఈ గ్రంథంలోని 'భువన విజయము' అనే అధ్యాయంలో మనం దాన్ని గురించి ముచ్చటించుకుందాం. పోతే యిక్కడ నేనిది ప్రస్తావించింది ఎందుకంటే - 'యూథము' అనే శబ్దం 'శబ్ద రత్నాకరము'లోనూ, 'బ్రౌన్ నిఘంటువు' లోనూ 'యూధము' అని యివ్వబడింది. ఎంతో కాలం నేను కూడా 'యూధము' అనడమే సవ్యమని భావించి అలానే పలికేవాడిని. కాని 'అమరకోశము', యితర ప్రామాణిక సంస్కృత నిఘంటువులు కూడా పరిశీలించి 'యూధము' అనడం సరి కాదనీ, 'యూథము' అనడమే సరియైనదనీ తెలుసుకొన్నాను. 'శబ్ద రత్నాకరము'లో 'యూధము' అన్న పదం వద్ద సం. వి. అ. న. అని యివ్వబడింది. సం. అంటే సంస్కృత సమము; వి. - విశేష్యము; అ. - అకారాంతము; న. - నపుంసక లింగము. ఇది సంస్కృత సమమైనందున 'యూథము' అన్న సంస్కృత శబ్దం తెలుగులో 'యూధము' ఎలా అవుతుంది? 'శబ్ద రత్నాకరము', 'బ్రౌన్ నిఘంటువు' లలో యివ్వబడినదే వేదమని విశ్వసించినా, 'ఆ నిఘంటువులలో కూడా తప్పులుంటాయా?' అని సంకోచించినా 'పరిపూర్ణత' దిశగా మన ప్రయాణం ఆ మేరకు కుంటుపడినట్లే! ఇలా పొట్టలో చుక్క విషయంలో కూడా నేను అంత పట్టింపుగా వుండడానికి కారణం వుంది. నా చిన్నతనం నుంచీ నా పేరును ఎక్కువ మంది అపసవ్యంగా 'రవీంద్రనాథ్' అనీ, 'రవీంద్రనాద్' అనీ పలుకుతూ, వ్రాస్తూ వుండడం, నేను వారిని ఎప్పటికప్పుడు సరిదిద్దుతూ వుండడం కారణంగా యీ పట్టింపు నాలో ఏర్పడింది.

ఉచ్చారణ అనే పదాన్నే తప్పుగా 'ఉచ్ఛారణ' అని ఉచ్చరిస్తూ అదే సవ్యమైనదనుకుంటున్నారు కొందరు. ఆంగ్ల భాషలో కూడా 'ఉచ్చారణ'ను Pronunciation (ప్రొనన్సియేషన్) అనాలి. అయితే తప్పుగా 'ప్రొనౌన్సియేషన్' అంటున్నారు ఎక్కువమంది. ప్రొనౌన్స్ (Pronounce) అనే క్రియ నుండి ప్రొనన్సియేషన్ (Pronunciation) అనే నామవాచకం ఏర్పడింది. అలాగే రినౌన్స్ (Renounce) అనే క్రియ నుండి రినన్సియేషన్ (Renunciation) యింకా డినౌన్స్ (Denounce) అనే క్రియ నుండి డినన్సియేషన్ (Denunciation) ఏర్పడ్డాయి. ఇలా ఆంధ్రాంగ్ల భాషలు రెంటిలోనూ 'ఉచ్చారణ'ను తెలిపే

పదాలే తప్పుగా ఉచ్చరించబడడం ఓ వైచిత్రి!

ఏప్రిల్ (April) నెలను 'ఏప్రియల్' అని వ్రాస్తారెందుకో చాల మంది ! మెమెంటో (Memento) (జ్ఞాపిక) అన్న పదాన్ని 'మెమొంటో' అని కొందరూ, 'మొమెంటో' అని కొందరూ, 'మొమొంటో' అని యింకొందరూ వార్తా పత్రికలలో వ్రాస్తూ వుంటే చదవడానికి కొంచెం యిబ్బందిగానే వుంటున్నది.

సువో మోటు *(suo motu)* అనే లాటిన్ న్యాయశాస్త్ర పదాన్ని 'సు మోటు', 'సు మోటో' అంటూ వార్తా పత్రికలలో తప్పుగా వ్రాస్తున్నా చదవడానికి అంతే యిబ్బందిగా వుంటున్నది.

'టొమాటో' (Tomato) అన్న రోజువారీ వాడుక పదాన్ని కూడా 'టమాటా', 'టమాటో', 'టొమాటా' అంటూ ఎన్నెన్ని రకాలుగానో పత్రికల్లో చూస్తున్నాం. 'డిప్లొమా' (Diploma) అన్న పదాన్ని 'డిప్లమో', 'డిప్లొమో' అంటూ తప్పుగా వ్రాయడం కూడా కద్దు. పొక్లెయిన్ (Poclain) అనే పదాన్ని ప్రొక్లెయిన్, ప్రొక్లెయినర్, పొక్లెయినర్ అని తప్పుగానే ఎక్కువ మంది పాత్రికేయులు వ్రాస్తున్నారు. అలాగే కాస్మెటిక్స్ (Cosmetics) ను కాస్మాటిక్స్ అనో కాస్మోటిక్స్ అనో తప్పుగా వ్రాస్తున్నారు.

స్పెషల్ (Special), స్పేషల్ (Spatial) పదాలు ఎలాగో కాన్ఫిడెన్షల్ (Confidential), రెసిడెన్షల్ (Residential) కూడా అలాగే పలకబడాలి. వ్రాయబడాలి. అయితే అధిక శాతం పాత్రికేయులు, రచయితలు 'రెసిడెన్షియల్' అనీ 'కాన్ఫిడెన్షియల్' అనీ తప్పుగా వ్రాస్తున్నారు.

'క్రికిట్', 'మార్కిట్' అనాల్సింది 'క్రికెట్', 'మార్కెట్' అంటున్నారు. పోజు (Pose) , ప్యాంట్ (Pant. ఇది పాంటలూన్ – Pantaloon అనే పదానికి సంక్షిప్త రూపం.) అనాల్సింది మన పత్రికలలో వత్తులు తగిలించి 'విలేకరులకు ఫోజులిచ్చిన ప్రధాని' అనీ, 'ఫ్యాంటు వేసుకున్న ముఖ్యమంత్రి' అనీ వ్రాస్తున్నారు. ఏ ప్రముఖ వార్తా పత్రికా యీ తప్పులకు మినహాయింపు కాకపోవడం ఓ విచిత్రం!

'సీరియల్' (Serial) అని అన్ని పత్రికలూ సవ్యంగానే వ్రాస్తాయి. కానీ, 'సీరీస్' అని ఒక్క పత్రిక కూడా సవ్యంగా వ్రాయదు. అందరూ 'సిరీస్' అనే తప్పుగా వ్రాస్తున్నారు. వీరంతా నిఘంటువులు చూసి ఆ యా పదాలెలా ఉచ్చరించబడాలో తెలుసుకుంటే మేలు.

'షికాగో', 'మిషిగన్', 'ఇల్లినోయి' అని సవ్యంగా వ్రాస్తున్న వారు తక్కువగానూ 'చికాగో', 'మిచిగన్', 'ఇల్లినాయిస్' అని అపసవ్యంగా వ్రాస్తున్న వారు ఎక్కువగానూ వుంటున్నారు.

Entrepreneur అనే ఫ్రెంచ్ పదాన్ని 'ఆంత్రప్రెనర్' అని వ్రాయాలే కాని 'ఎంట్రెప్రెన్యూర్' అని కాదు. Detente (అంతర్జాతీయ ఉద్రిక్తతల సడలింపు; సౌమనస్యం) అన్న ఫ్రెంచ్ పదాన్ని 'దేటాంట్' అనే వ్రాయాలి కానీ 'డిటెంటే' అని వ్రాయకూడదు. చిలీ మాజీ అధ్యక్షుడు Salvador Allende హత్యకు గురైనప్పుడు మన పత్రికలన్నీ ఆయన పేరును 'అలెండీ' అంటూ తప్పుగా వ్రాశాయి. 'అయ్యాండే' అని ఆ పేరును వ్రాయాలి. కొన్ని ఆంగ్ల పత్రికలు మాత్రం ఆయన పేరు తరువాత బ్రాకెట్లలో 'to be pronounced Ayyande' అని వ్రాశాయి.

అలాగే Phoenix (ఒక పౌరాణిక పక్షి), Prix (ప్రైజు) అన్న ఫ్రెంచ్ పదాలను 'ఫీనీ', 'ప్రి' అనే వ్రాయాలి కానీ 'ఫోనిక్స్', 'ప్రిక్స్' అని వ్రాయకూడదు.

ఇప్పటికే చాల ప్రక్కకు వెళ్లాం. భాషను కాపాడుకోవడంలో పాత్రికేయులు, సినీ, టి.వి. రచయితల పాత్ర యొక్క ప్రాధాన్యత రీత్యా యిదంతా వ్రాయాల్సి వచ్చింది.

Early po s అనే పదానికి మన పాత్రికేయులు తెలుగులో 'ముందస్తు ఎన్నికలు' అని సృష్టించారు. చాల చక్కగా వున్న యీ పదం ప్రజలలో బాగా నాటుకు పోయింది. ఎవరో ఒకరు సృష్టిస్తేనే కాని పదాలు పుట్టవు. ఇలా కొత్త పదాలతో భాషను సంపద్వంతం చేసుకుంటూ ముందుకు సాగాలి. అప్పుడే భాష సజీవంగా వుంటుంది.

ప్రముఖ కళా విమర్శకులు, దార్శనికులు కీ.శే. సూర్యదేవర సంజీవ దేవ్ Imprint (to f x firmly on the m nd, memory etc.,) అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా ఓ సందర్భంలో 'మానస ముద్ర' అనే తెలుగు పదాన్ని వాడారు. ఈ పదం ఎంత భావస్ఫోరకంగా వుందో చూడండి.

నేను ఆంధ్ర ప్రదేశ్ సచివాలయంలో సహాయ విభాగాధికారిగా పని చేసేటప్పుడు 1983 లో ఓసారి అధికార భాషా సంఘం వారు ఉత్తర ప్రత్యుత్తరాలను విధిగా తెలుగులోనే నిర్వహించాలని ఉత్తర్వులిచ్చినప్పుడు Lake View Guest House కి 'హ్రద విలోకినీ అతిథి గృహము' అనీ, Renewable Energy Sources కి 'పునర్నవీకరించదగు ఇంధన వనరులు' అనీ, Reservat on కు 'ఆరక్షణ' అనీ, Thanking You (కృతజ్ఞతలతో) అనడానికి 'ఆభార భారంతో' అనీ వ్రాసేవాడిని. వాస్తవానికి 'ఆరక్షణ్' మరియు 'ఆభార్' పదాలు హిందీ లోనివి. వాటిని తుల్యార్థకాలుగా తెలుగులో వాడాను. అలాగే తెలుగు భాషా వినియోగాన్ని అభివృద్ధి పరచేందుకు ఏర్పడిన ఓ కమిటీకి వారు కోరిన మీదట రోజువారీ ఉత్తర ప్రత్యుత్తరాలలో తటస్థించే ఈ క్రింది పదాలను సూచించాను. Specific Remarks (సంబద్ధ వ్యాఖ్యలు); Pet t on' (మహజరు); Conf dent al' (గోపనీయము); Most Urgent (అతి జరూరు); Support ng Documents (ఆధార పత్రాలు); అలాగే Insubstantial or Baseless A legation కు 'నిరాధారమైన ఆరోపణ' అంటాం. దీనికి ప్రతిగా Substant al Allegation కి ఆధారసహితమైన ఆరోపణ అని వ్రాయడానికి బదులుగా నేను 'సాధార ఆరోపణ' (స + ఆధార) అనే పదాన్ని రూపొందించి వాడాను. అప్పట్లో యీ పదాల వినియోగానికి నా పై అధికారుల నుంచి మంచి స్పందనే వచ్చింది. ఎప్పటికప్పుడు పరభాషల నుంచి పదాలను స్వీకరిస్తూ, కొత్త పదాలను రూపొందించుకుంటూ, ప్రాచీన పద సంపదను భద్రంగా నిలుపుకుంటూ, మన తెలుగు భాషను సంపద్వంతం చేసుకుంటూ ముందుకు సాగాలని నా ఆకాంక్ష.

అయితే ఈ కృషిలో యింకొక విషయం కూడా మనం మరచిపోరాదు. మనం వ్రాసేది సామాన్యుడికి సైతం నేరుగా చేరాలంటే క్రమక్రమంగా మనం మాట్లాడే భాషకూ, వ్రాసే భాషకూ మధ్య దూరం తరిగి పోవాలి. ఏది ఎలా మాట్లాడతామో అది అలాగే వ్రాయడానికి కూడా ప్రయత్నించాలి. 'చేసారు'కు బదులు 'చేశారు' అనీ 'చూసారు'కు బదులు 'చూశారు' అనీ వాడుతున్నప్పటికీ వ్రాయడానికి బదులు 'రాయడం' అని నేనింకా వాడలేకపోతున్నాను. అది నా బలహీనతగా అంగీకరిస్తున్నాను. 'వ్రాయడం' అనడానికి – నేనెంతగానో అభిమానించే చెలం గారు ఎంతో కాలం క్రిందటే 'రాయడం' అని వాడినా నేటి వరకు నాకది అలవాటుకాలేదు. ప్రఖ్యాత సాహితీ విమర్శకులు ఆరుద్ర గారు కూడా తమ 'సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర' గ్రంథంలో మొత్తంగా 'వ్రాయడం' అనే ప్రయోగించారు. 'తెలిసికొనడం' అనడానికి బదులుగా అప్పుడప్పుడూ 'తెలుసుకొనడం' అని మనం పలికే విధంగా కూడా వ్రాస్తున్నాను. అయినా పూర్తిగా వ్యావహారిక భాషనే వ్రాయడానికి మరింత కాలం పట్టవచ్చు. భాషను సంపద్వంతం చేసుకునే కృషితో పాటు, వాడుక భాషలో వ్రాసే కృషి కూడా ద్విముఖంగా సాగాలి.

జిజ్ఞాసువులు తమ భాషా ప్రావీణ్యాన్ని నిలబెట్టుకొనడానికి, పద సంపదను మరింత పెంపొందించు కోనడానికి ప్రాచీన సాహిత్యంలోనికి వెళ్లక తప్పదు. కవులు వివిధ కావ్యాలలో వాడిన చక్కని పదాలు, వాటి ప్రయోగార్థాలు

తెలుసుకొనడం చాల ఆసక్తికరంగా వుంటుంది. తెనాలి రామకృష్ణ కవి తన కావ్యాలలో వాడిన, నాకు నచ్చిన కొన్ని పదాలు, స్వతంత్ర ప్రయోగాలు, సూక్తులు, లోకోక్తులు, వాటి ప్రయోగార్థాలు  పాఠకుల ఉపయోగార్థం యీ క్రింద పొందుపరచాను.

'అందని మ్రాని పండ్ల కఱ్ఱులు సాచినట్లు' : కాని పనికి పోవడం. అర్హతకు మించి పొందాలని ఆశించడం.

అధ్వ ప్రయాస విహ్వలుడు : అధ్వ శ్రమారూఢుడు : మార్గాయాసం చేత బడలిన వాడు (అధ్వము-త్రోవ)

'అపుత్రస్య గతిర్నాస్తి' : పుత్రులు లేని వారికి పుణ్య లోకాలు ప్రాప్తించవు (పున్నామ నరకం తప్పదు)

'అభ్యాగతః స్వయం విష్ణు' : అతిథి అభ్యాగతులు సాక్షాద్దైవ స్వరూపులు

'అభ్రంకష : మేఘములను తాకే ; అతి ఎత్తైన

అభ్రవాణి : ఆకాశవాణి

అరచేతిలోని సురరత్నము :- చేతిలో చింతామణి

అరవింద కోరక సహోదర చారు పయోధరాఢ్య ! : తామర మొగ్గలతో సమానమైన చక్కని స్తన సంపద
కలదానా! (అరవింద కోరకము : తామర మొగ్గ)

అలాబు శలాటు ఖండోదరము : సొరకాయ చిప్ప (అలాబువు-సొర; శలాటువు-కాయ)

అవగాహము : మునుక

అక్షికౌక్షేయుడు : (మూడవ) కన్ను ఆయుధముగా కలవాడు - శివుడు
(కౌక్షేయకము అంటే కత్తి)

'ఆరోగ్యం భాస్కరాత్ యిచ్ఛేత్ - శ్రియమిచ్ఛేత్ హుతాశనాత్' :
ఆరోగ్యమివ్వమని సూర్యుడిని కోరాలి - సంపదలివ్వమని హుతాశనుడిని (అగ్నిని) కోరాలి.

ఆశ్యాన శాదము : ఎండిన బురద

ఇరు మూడు (రెండు మూళ్లు) : ఆరు

ఈనునంతకున్ గాచి వృకాలికిచ్చిన ప్రకారము : ఈనే వరకు కాపాడి తోడేళ్ల మందకు అప్పగించినట్లు
('ఈనగాచి నక్కలపాల్జేసినట్లు' వలె)

ఈరేడు (ఈరు + ఏడు : రెండు ఏళ్లు - పద్నాలుగు)

ఈళ్ల గ్రుక్కి : ఈరులను కుక్కి : పేను గ్రుడ్లను కుక్కి

ఉక్షాధిపుడు : ఎద్దుకు అధిపతి - ఎద్దును వాహనముగా కలవాడు -శివుడు (ఉక్షము : ఎద్దు)

ఉత్పిబము : చాతకపక్షి (ఈ పక్షి వాననీటిని మాత్రమే తాగి జీవిస్తుందని విశ్వాసం)

ఉరుమని పిడుగు : హఠాత్తుగా వచ్చి పడిన కష్టము

ఊడిగపు తొయ్యలి : పరిచారిక (తొయ్యలి : స్త్రీ)

ఊర్మిక : ఉంగరము (ఊర్మి అంటే అల; అలలా మెరుస్తుంది కనుక ఉంగరాన్ని ఊర్మిక అనికూడా అంటారు.)

ఊష్మాగ్ని : వేసవి వేడి

ఎచ్చుకంటి వాడు : త్రినేత్రుడు

ఎడనీళ్లు : లేత కొబ్బరి బొండంలోని నీరు

ఎన్ను లేని సస్యము : నిష్ఫలము
ఏడుట : రక్షించుట
ఏనిక కొమ్ము - దాది రొమ్ము : దంతపు ఊయలలో దాది (Wet Mother) రొమ్ముపై ఆధారపడి పెరుగుట.
ఏరాలి పట్టి : తోడి కోడలు బిడ్డ (ఏరాలు: ఎరవు + ఆలు)
ఏరాళము : లెక్కకు మిక్కిలిగా
ఐదు పది చేయుట : నమస్కరించుట (ఒకచేతి ఐదు వ్రేళ్లతో మరొకచేతి ఐదు వ్రేళ్లు కలిపి పదిచేయుట)
ఒజ్జ బంతి : మేలు బంతి. అందరికీ ఆదర్శము (ఉపాధ్యాయుడు చూపిన పద్ధతి అని అర్థం ; ఒజ్జ - గురువు)
ఓడగట్టిన దూలంలా వుండడం : పరస్పరం అనుకూలముగా వుండడం
ఓఢ్యాణము : 1. ఒడ్డాణము 2. తపస్సు చేయడానికి కూర్చునే ఒక బంధము
'ఓ యన నో యను మాడ్కి' : తన కేక యొక్క ప్రతిధ్వనే (Echo) తప్ప పలికేవారెవ్వరూ లేని స్థితిలో (జన సంచారం లేని తావులో - వేళ కాని వేళలో)
ఔఘళము : (అవఘళము) - వ్యాపనము
ఔర్వ వహ్ని : బడబాగ్ని
అంచ వెలి మావు : తెల్లని హంస వాహనము
కతకా ఫలము : ఇందుప (చిల్ల) గింజ
కద్రూజ కటక కటకము : పాములను కడియములుగా ధరించే శివుని రాజధాని - కాశి (కద్రువ సంతానం-పాములు)
కద్రూజాంగదు తోఁడబుట్టువు : పాములు భుజ కీర్తులుగా కల శివునికి తోబుట్టువు (సరస్వతి)
కన్నువైచు : ఈ పద ప్రయోగంలో శ్లేషార్థాన్ని (ఉ.చ. 1-69) మీద వివరణ సంధర్భముగా చెప్పాను.
కన్గోకున్కి : చూడకుండా వుండడం చేత
కరక పాతము : వడగండ్ల వాన
కరువలి వారువములు : గాలికి వాహనములు (గుఱ్ఱములు)
కాలను బొమ్మగట్టు : తన విజయానికి సూచనగా శత్రువు బొమ్మను తన కాలికి కట్టుకొనడం (బహుశా తాయెత్తుగా)
కావ్యుఁడు : కావ్య కర్త - కవి
కాసూ ధరుడు : కుమార స్వామి (కాసువు అంటే కుమార స్వామి ఆయుధం)
కాళంజి : తమ్మ పడిగము - తాంబూలము ఉమిసే పాత్ర
కిల్బిషా క్రీడనములు : తప్పుడు ఆటలు
కుచ్ఛితోఛ్ఛిష్టము : నికృష్టమైన ఎంగిలి అన్నం
కుబేరాక్ష కేళి : గ్రచ్చకాయలాట
కుణప ధూపము : పీనుగు కాలుతుంటే వచ్చే పొగ (శవ ధూమము)
కుల్మాషము : పులియబెట్టిన కదుగు నీరు (మన ప్రాచీనులు వండే ముందు బియ్యం వగైరాలు కడిగిన

నీటిని వృథాగా పారబోయకుండా పులియబెట్టేవారు. దీనిని తెలుగులో 'కలి' అని అంటారు.)

గుగ్గిళ్లను కూడా కుల్మాషములు అంటారు.

కుశేశయ పౌత్రుడు : పద్మమునకు మనుమడు : బ్రహ్మ మానస పుత్రుడైన నారదుడు (కుశేశయము అంటే పద్మము. బ్రహ్మ పద్మ సంభవుడు.)

కుళీరము : ఎండ్రకాయ

'కూటిబీద తోడు తప్పెను' : తీర్థ యాత్రలు వగైరాలు చేసేటప్పుడు మూటలో ఆహార సమృద్ధి - అన్నం, చిరుతిండ్లు - దండిగా వున్న యాత్రికునితో ఎవ్వరైనా వచ్చి తోడు కలుస్తారు. అవి లేని కూటిబీద కలవాలన్నా కలుపుకోక కావాలని తోడు తప్పుకుంటారు.

కేకిరాడ్ధ్వజుడు : కుమారస్వామి (నెమలి రాజు ధ్వజముగా కలవాడు)

ఖంజనము : కాటుక పిట్ట (ఖంజరీటము)

గంధవాహము : గాలి (వాసనను మోసుకెళ్లేది)

గలంతి : గిండి చెంబు (గలంతియ)

'గురోరాజ్ఞాం న లంఘయేత్' : గురువు ఆజ్ఞ ఉల్లంఘించ రాదు

'గుల్ఫము బంటి : చీలమండల లోతు - 'భవాంబుధి (భవ సాగరము) నాకిక గుల్ఫము బంటియే' బంటి అనేది ఒక ప్రమాణము లేక పరిమితి. మొల బంటి, మోకాలి బంటి, ఈంత బంటి (ఈదగలిగిన మాత్రపు ప్రవాహం), పుక్కిటి బంటి (నోటిలో పుక్కిటి పట్టగలిగేటంతటి పరిమాణము) వగైరాలు మనమెరిగినవే. రామకృష్ణ కవి 'ఘటికాచల మాహాత్మ్యము'లో అప్సరసల జల క్రీడలు వర్ణించే సందర్భంలో 'గుబ్బ చనుంగవ బంటి లోతునన్' అనే ప్రయోగం కూడా చేశాడు. 'సిగబంటిగా భుజించడం' అనే ప్రయోగాన్ని కూడా రామకృష్ణ కవి చేశాడు.

గ్లౌ బింబము : చంద్ర బింబము

ఘోణి : పంది

చంద్రగోళి : వెన్నెల

చక్షుశ్శ్రోత్ర కన్యలు : కళ్లే చెవులుగా కలిగిన - కనువినికి - పాము కన్యకలు : నాగ కన్యలు

చలదాలోల కటాక్షాంచల దామ నిబద్ధ తరుణజన ఖంజన : చపలత్వంతో కూడిన కడకంటి చూపులనే ఉరిత్రాళ్లతో కట్టి వేయబడ్డ యువకులనే కాటుక పిట్టలు కలది. (కాటుక పిట్టలను వేటగాళ్లు వుచ్చులు వేసి పడతారు.)

చిక్రోడ దంష్ట్రలు : ఉడుత కోరలు

చిట్లు కన్ను : అనల నేత్రము - చిచ్చు కన్ను (శివుని మూడవ నేత్రము)

చేయిచ్చు : ఆసరా యిచ్చు

చేయోడుట : వెనుకకు జంకుట

చేర్వ : చేరువ - దగ్గర

చెక్కెర వింటి జోదు : చెరకు విల్లుగా కల యోధుడు - మన్మథుడు

చప్పరము : పందిరి

ఛత్రిత శేషుడు : శేష నాగును గొడుగుగా కలవాడు (విష్ణువు)

జాతిమాత్రోపజీవి : వేరే అర్హతలేవీ లేకున్నా పుట్టుకతో ఫలానా గొప్ప కులానికి చెందినవాడనని చెప్పుకుని జీవించేవాడు

జిర్రుమని చీదదు : ఆరోగ్యంగా వుంటాడు.

జేంగియ : జంగె : జంగు : ఒక రకమైన గజ్జెలు

జేక్కవ కవ : చక్రవాక పక్షుల జంట (జక్కవ పక్షులంటే చక్రవాకములు)

జేన్నియ : జన్నె : దేవతాదులనుద్దేశించి యథేచ్ఛముగా విడిచిన ఆవు (లేక) ఎద్దు

జేల్లి : జల్లి పెండెము : కాలికి వేసుకొనే ఆభరణము

జోంజేరు : చింపిరి (కఱకు జొంజెరు వెంద్రుకలు)

ఝంప : దూకుడు - ఉరవడి

ఝిల్లి : ఝిల్లిక : ఈల పురుగు (ఇలకోడి)

(Cricket, the male of which has stridulating organs to produce harsh, shrill or grating sound)

టక్కెము : టక్కియము : టెక్కెము : ధ్వజము

రవణించు : కావించు, ప్రవర్తిల్లజేయు (కావ్యములు వగైరా వ్రాయు)

రేవ : రీతిగా

డుంఠి : వినాయకుడు

తంగేటి జున్ను : అనాయాసముగా లభ్యమగునది.

తత్తడి : తట్టువ ; అశ్వము ; వాహనము

తారా కమనార్ధమౌళి : అర్ధేందు భూషణుడు - శివుడు (తారా కమనుడు లేక తారా ప్రియుడు అంటే చంద్రుడు)

తైర్థికులు : తీర్థ యాత్రికులు

తొండ ముక్కు పడడం : (పంటలు) విపరీతంగా పండడం

తొలుకారు కలఁక పులుఁగు : వర్షాకాలంలో కలత చెందే పక్షి - హంస

తోఁబుట్టిన పుట్టె గుణము తొలగునె ? : పుట్టుకతో వచ్చిన బుద్ధులు పుడకలతో గాని (చితిపైనే గాని) పోవు.

త్రిముఖాస్త్రము : త్రిశూలము

దంభోళి : ఇంద్రుని వజ్రాయుధము

దయ్యపు వెల్గు : దివ్య కాంతి

దొడ్డ గరిత : ఉత్తమ ఇల్లాలు

ధనదాప్తు దెస : ఈశాన్య మూల (ధనదుడు- కుబేరుడు; ధనదాప్తుడు - కుబేర సఖుడైన శివుడు)

ధరణిధర కార్ముకుడు : పర్వతం విల్లుగా కలవాడు - శివుడు (ధరణి ధరము అంటే పర్వతము. త్రిపురాసుర సంహారం సందర్భంగా శివునికి మేరు పర్వతమే విల్లు అయిందని ఐతిహ్యం.)

ధూళిః పరగృహాదపి : ఎదుటి వారింటి నుంచి దుమ్ము (మన్ను)నైనా సరే తేవాలి.

ధ్వాంక్షము : కాకి
నల్లిళ్లు : అగ్రహారాలు
నిర్వ్రీడ జఘనదేశుడు : సిగ్గులేని మొల వాడు - దిగంబరుడు
నిలింప నదీ కిరీటుడు : దేవనదియైన గంగను కిరీటముగా కలవాడు - శివుడు
నిశాంత రతాంత తాంతలు : తెల్లవారుజామున చేసుకున్న సంభోగం కారణంగా అలసిపోయిన వారు
నీరాళ్ల గొంది : ఈశాన్య మూల
నేల యీనినట్లు : తండోప తండాలుగా
పటు గభస్తి : వాడి కిరణములు కల సూర్యుడు
పతయాళువు : పడుటకు సిద్ధముగానున్నది
పన్నాగము : పన్నగము - పాము
పర్యుషితము : చద్ది అన్నము
పవి ఘోషాడంబరములు : ఉరుములు, పిడుగుల ఆర్భాటములు
పశ్యతోహర వృత్తి : చూస్తూ వుండగానే దొంగిలించే పద్ధతి (బందిపోటు పద్ధతి)
పశ్యత్ఫాలుడు : పశ్యల్లలాటుడు : ఫాల భాగంలో (లలాటములో - నుదుటిపై) కల కంటితో చూసేవాడు.
పసిదిండి వలువ : వ్యాఘ్రాజినము - పులి తోలు (పసితిండి అంటే పులి)
పాథేయము : దారి బత్తెముగా కట్టుకొను అన్నము
పానలుబ్ధాబ్ద ప్రపాకల్పనము : దప్పికగొన్న మేఘాలకు చలి పందిరి
పాఁప సొమ్ములు : (శివుడు ధరించే) నాగ భూషణములు
పారదము : పాదరసము
పిచ్చుక మీద బ్రహ్మాస్త్రము : బలహీనులపై అనవసర బలప్రయోగము
పిర్వీకులు : బాధలు (పీకు + పీకు : పిరువీకు)
పీలి నెట్టెము : పికిలి పిట్ట యీకలు గల తలపాగా
పురస్సరద్భార్యముగా : ముందు నడచుచున్న భార్యలు కలవారై
పులినము : సైకతము - ఇసుక తిన్నె
పూచిన తంగేడు కరణి : శోభాయమానంగా
పొన్నాకుపై తేనియ : త్వరగా జారిపోయేది. నున్నగా వుండే పొన్నాకు పైన తేనె బిందువు జారి పోక నిలుస్తుందా?
పోర్మహిషుడు : యుద్ధం చేసే మహిషాసురుడు
పౌలస్త్య పవనము : ఉత్తరపు దిక్కు నుండి వీచే గాలి - పులస్త్య బ్రహ్మ కుమారుడైన కుబేరుని మీదుగా (కుబేరుడు ఉత్తర దిక్పాలకుడు)
పౌలోమి : పులోముని కుమార్తెయైన శచీదేవి ; ఇంద్రాణి ; ఇంద్రుని భార్య
ప్రామినుకులు : వేదములు
'ప్రారబ్ధ కర్మాణాం భోగాత్ ఏవ క్షయ' : ప్రారబ్ధ కర్మ అనుభవించడం ద్వారానే నశిస్తుంది.

ప్రేంఖత్ ఖంజరీటాక్షి : తిరుగాడుచున్న కాటుక పిట్టల వంటి కళ్లు కలిగినది.
ఫేన కణము : నురుగు బిందువు
బయలాడిన మాట : ఆకాశవాణి
బయలు పందిరి : ఆకాశ హర్మ్యము
బాహులేయుడు : కుమార స్వామి
బిదుర ఘోషము : పిడుగు చప్పుడు
బుభుక్షము : తినాలనే ఆశ
'బ్రాహ్మణో న హంతవ్య' : బ్రాహ్మణుని వధించ రాదు
భక్తాపేక్ష : అన్నము మీది కోరిక
భర్మ స్తేయము : బంగారాన్ని దొంగిలించడం
భర్మ హర్మ్యములు : బంగారు మేడలు
భిస్సటము : మాడు అన్నము
మఘవ గోపములు : ఇంద్ర గోపములు - ఆరుద్ర పురుగులు
మరుత్ఫలము : ఇంద్ర ధనుస్సు - దేవతల బహుమానము (వాయు ఫలము)
మహాఘ చ్ఛటా దారణము : గొప్ప పాపముల శ్రేణిని చీల్చి వేసేది
మఱువ మావు : మూగ గుఱ్ఱము
మాణవకుడు : వటువు - బాలకుడు
మానని తలయేరు : (శ్లేష) 1. శివుని శిరస్సుపై నున్న నిరంతర గంగా ప్రవాహం 2. తగ్గని తలనొప్పి
మాయి : మోసగాడు
ముంగొంగు పసిడి : అరచేతిలో చింతామణి - కొంగు బంగారం
ముక్కారు పంట : సస్య సమృద్ధి
ముచ్చిచ్చులు : త్రేతాగ్నులు : 1. ఆహవనీయము 2. గార్హపత్యము 3. దక్షిణాగ్ని
ముప్వంక మురువు : త్రిభంగి. శ్రీకృష్ణుడు మూడు వంకరలుగా నిలిచే విధం
మొలకైన తటినిఁ జెట్టు వంప బడుగాక హెచ్చిన వంప నగునె ? : మొక్కై వంగనిది మానై వంగుతుందా?
రంభా పలాశము : అరటి ఆకు
రదనచ్ఛదభర్త్సిత విద్రుమద్రుమా ! : పగడపు చెట్లను కూడా తిరస్కరించేటంతటి మనోహరమైన పెదవుల కాంతి కలదానా! (విద్రుమ ద్రుమము అంటే పగడపు చెట్టు)
లేలిహానము : పాము
లేవడి : స్వల్పము
'లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు' : ఎల్లలోకాలూ సుఖంగా వుండాలి.
వచ్చు రాములు : రావడం - రాక పోవడం
వనితా మానస సూన సాయకుఁడు : స్త్రీల మనస్సులకు మన్మథుడు (సూన సాయకుడు-సుమ శరుడు)

వర్షవరుఁడు : వర్షధరుఁడు : అంతఃపురపు కావలివాడు (హెగ్గడి)
(నపుంసకుడు అనే అర్థంలో కవి యీ పదం వాడాడు)

వఱువాత : ప్రాతఃకాలమున - తెల్లవారు ఝామున

వల్పు : వలపు

వసుధా రథుడు : భూమిని రథముగా చేసుకున్నవాడు (శివుడు- త్రిపురాసుర సంహారం సందర్భంగా శివుడికి భూమే రథమయిందని ఐతిహ్యం)

వాఁడి ముమ్మొనల వేడియలుగు : వాడియైన మూడు మొనలు కల తీక్ష్ణమగు ఆయుధం - త్రిశూలం

వార్మణిధారి : కౌస్తుభమణిని ధరించిన వాడు - విష్ణువు (వార్మణి - నీటియందు పుట్టిన కౌస్తుభ మణి)

వారిరుహాసనుడు : పద్మాసనుడు (బ్రహ్మ)

వినిందిత కులుడు : అంత్యజుడు (చండాలుడు)

విన్మధ్వ శ్రమారూఢ ! : వినుము, ఓ అధ్వశ్రమారూఢా! (మార్గాయాసం చేత బడలిన వాడా!) (పాం.మా.4-176)

విప్లుష్ట కరీష పిండము : బాగుగా కాల్చబడిన పిడక (కచ్చిక)

వీటిబ్రోగు : వ్యర్థంగా జందెము ధరించిన వాడు (బ్రాహ్మణ బ్రువుఁడు)

వెచ్చకంటి వాడు : అనల నేత్రుడు

వేలిమి జన్నె : హోమ ధేనువు

శంపా ధరము : మేఘము (మెరుపును కలిగి వుండేది ; 'శంప' అంటే మెరుపు)

'శాకాయ లవణాయ వా' : ఊరికే వస్తే కాయగూర కానీ, కనీసం ఉప్పైనా తెచ్చుకోవాలి.

శాకినీ కాండము : పెరుగు తోటకూర కాడ

శైవాలము : శైవలము- పాచి

శ్రాణ మూకుడు : గంజి మూకుడు

షాణ్మాతురుడు : ఆరుగురు తల్లులు కలవాడు (కుమార స్వామి)

సంతతావిశ్వాస సస్య ప్రరోహుడు : ఎప్పుడూ అవిశ్వాసమనే పంట మొలకలెత్తేవాడు. సస్య ప్రరోహములు: పంటమొలకలు. Doubt ng Thomas. Skept c.

సమత్స్యండికాపూపములు : కండ చక్కెరతో చేసిన అప్పాలు. (మత్స్యండిక అంటే కండ చక్కెర; అపూపములు అంటే అప్పాలు)

సమ్మార్జనము : ఊడ్చడం

సరఘ : తేనెటీగ

సరమా జాని : సరమ ఎవరికి జాయ (భార్య)యో ఆ విభీషణుడు

సిగబంటిగా భుజించడం : మనం సాధారణంగా గొంతు దాకా మెక్కడం అంటాం. కాని ఇది రామకృష్ణ కవి ఉత్ప్రేక్ష. సిగ వరకు మెక్కడం ఎలా సాధ్యమౌతుంది ఎవరికైనా ?

సుర కర్మంది : నారదుడు

సురఁటి : వట్రువ విసనకర్ర

సెబ్ర చెంచేదము : సెబ్బర చెంచేదము; చెడ్డ దేగ; క్రూరమైన దేగ
సైరిక ప్రభుండు : కాపు పెద్ద (సీరము : నాగలి ; సైరికుడు : హాలికుడు)
హాటక కశిపుదు : హిరణ్య కశిపుదు
హాటక గర్భ సంభవుదు : హిరణ్య గర్భుడైన బ్రహ్మ కుమారుదు (నారదుదు)
హాలహలము : హాలాహలము
హిమానీ శుభ్రకీర్తి : మంచు వలె తెల్లనైన కీర్తి
హిమానీ శుభ్ర సౌధంబులో : మంచువలె శుభ్రమైన భవంతిలో
హృత్సరోజాబ్జము : హృదంతరాళంలోని అనాహత పద్మము. (మనలో వుంటాయని విశ్వసించే షట్చక్రాలలో అనాహతం ఒకటి.)
హైతుకులు : హేతువాదులు
క్షపణకుండు : బౌద్ధ మతస్థుదు
క్షుధాతురాణాం న రుచి ర్న చ కాల' : ఆకలి బాధకు అలమటించే వానికి రుచి గురించి, కాలాన్ని గురించి ఆలోచన వుండదు. ఆకలైతే ఏమైనా తింటాదు. ఎప్పుడైనా తింటాదు.

## ప్రాచీన కావ్యాల ప్రయోజనం :

కొందరు ప్రాచీన కవులు ఆ యా కావ్యాల కథా వస్తువులతో పాటు ప్రకృతికి సంబంధించిన వర్ణనలు, నాటి సామాజికార్థిక స్థితిగతులు, నాటి వివిధ వర్గాల తీరుతెన్నులు, వారి ఆచారాలు, ఆహార అలవాట్లు వగైరా ఎంతో ఉపయుక్తమైన సమాచారాన్ని కూడా మనకు అందజేశారు. దీంతో ఆ కాలపు చరిత్ర రచనకు అవసరమైన కొన్ని స్థూలమైన ఆధారాలు ఆ కావ్యాలలో మనకు లభిస్తున్నాయి. అలాగే ఆ కావ్యాలు చదవడం ద్వారా నాటికి వున్న వృక్ష, జంతు, పక్షి జాతుల గురించి నేటి పాఠకులు తెలుసుకొనగలిగే వీలుంది. (వీటిలో కొన్ని జాతులు నేడు అంతరించిపోయిన దృష్ట్యా యీ సమాచారం మరింత ఉపయుక్తమైనదైంది.) అంచేత కావ్యాలను శాస్త్రీయ దృష్టితో పరిశీలిస్తే ఎన్నో రాజకీయ, సామాజిక, ఆర్థిక, అంశాలే కాక, ప్రకృతి విజ్ఞానానికి సంబంధించిన విలువైన సమాచారం కూడా మనకు లభిస్తుంది.

శ్రీకృష్ణ దేవరాయలు రచించిన 'ఆముక్త మాల్యద' కావ్య పరనం ద్వారా రాజనీతికీ, ఆర్థిక శాస్త్రానికీ సంబంధించిన ఎన్నో విషయాలు మనకు తెలియడమే కాక, నాటి విజయనగర సామ్రాజ్య స్థితిగతులపై మనకొక స్థూల అవగాహన ఏర్పడుతుంది. శ్రీనాథ మహాకవి గొప్ప సామాజిక స్పృహ కల కవి. ఆయన కావ్యాలు తన కాలం నాటి సమాజానికి ఓ రకంగా నిలువుటద్దాలు. ఆయన తన కావ్యాలు, చాటువులలో దాదాపు తన కాలపు సమాజంలోని అన్ని కోణాలనూ స్పృశించాదు. తెనాలి రామకృష్ణ కవి కూడా తన కావ్యాలలో ఎన్నో అంశాలపై ఎంతో ఉపయుక్త సమాచారాన్ని అందించాదు. భిన్న విభిన్నమైన పలు విషయాలపై కవికున్న సర్వసమగ్రమైన పరిజ్ఞానం చదువరులకు ఆశ్చర్యం కలిగించక మానదు.

ఈ విశ్లేషణలో ఆ సమాచారాన్ని వీలైనంత మేరకు యధాతథంగానూ, సర్వ సమగ్రంగానూ అందించదానికి నేను ప్రయత్నించాను. ఒక వేళ ఎక్కడన్నా నేనిచ్చిన సమాచారంలో సమగ్రత లోపిస్తే అది కేవలం నాకున్న పరిమితుల

కారణంగానేనని పాఠకులు గ్రహించగోరతాను.

ఇదో సరిక్రొత్త ప్రయోగం. సాధారణంగా కావ్యాలకు భాషా పండితులే వ్యాఖ్యానాలు వ్రాస్తారు. వారెంత సేపటికీ అలంకార, ఛందో, వ్యాకరణాదులకే ప్రాధాన్యమిస్తారు. భాషా పండితుడు కాని వ్యక్తి, ఆ అంశాల జోలికి పోకుండా కేవలం ఆయా కావ్యాలలో కవి ప్రస్తావించిన వివిధ విషయాలపై శాస్త్రీయ దృష్టితో వివరణలిస్తూ, కథాక్రమం చెడకుండా కవి హృదయావిష్కరణం చేసే ప్రయత్నం చేస్తూ ఆ రచనలకు వ్యాఖ్యానం వ్రాయటం పూర్తిగా ఓ కొత్త ఒరవడి. ప్రాచీన కావ్యాల శాస్త్రీయ విశ్లేషణ ఎందుకంటే – భారత రాజ్యాంగంలో పొందుపరచబడిన పౌరుల ప్రాథమిక విధులలో 'ప్రతి వ్యక్తీ తాను శాస్త్రీయ దృక్పథం కలిగి వుండడం, యితరులలోని అంధ విశ్వాసాలను పోద్రోలి వారికి శాస్త్రీయ దృక్పథాన్ని కలిగించడానికి కృషి చేయడం' అనేది కూడా ఒకటి కనుక. నేను ముందే పేర్కొన్నట్లు యిదో సరికొత్త ప్రయోగం. గుణ గ్రహణ పారీణులైన పాఠకులు నా యీ ప్రయత్నాన్ని అనుమోదిస్తారని ఆశిస్తాను.

నేనిందాక పేర్కొన్న గ్రంథాలయాల సిబ్బందికి ఆ యా అరుదైన గ్రంథాల ఫోటోస్టాట్ కాపీలు తీసుకొనడంలో వారు నాకిచ్చిన అమూల్యమైన సహకారానికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథంలోని పలు అంశాలు లోతైన పరిశీలన, పరిశోధనల ఫలితాలు. సెలవు దినాలలో, తీరిక సమయాలలో వివిధ ప్రాంతాలకు వెళ్తూ, భిన్న విభిన్న వ్యక్తులను కలుస్తూ – వీలు చిక్కినప్పుడల్లా రచనను సాగిస్తూ అలా నత్తనడకన ముందుకు నెట్టుకొచ్చినా మూడేళ్లనాడు తలపెట్టిన యీ బృహత్కార్య సాఫల్యం మాత్రం నాకు కలగానే మిగిలిపోయింది. ఇటీవల ఆరోగ్య కారణాల రీత్యా నేను పెట్టిన సెలవు కారణంగా నేటికి నా స్వప్నం సాకారం కాగలిగింది. సెలవు సమయంలో ప్రూఫ్‌లన్నీ మరోమారు సరిచూసుకోగలిగాను. లోగడ వ్రాసినవి ఎన్నో తిరగ వ్రాశాను. కొన్ని చేర్పులు మార్పులు చేసినా, మూడేళ్లనాడు నాకున్న అవగాహనతో నేను వ్రాసుకున్న కొన్ని అంశాలను, వాటిపై నేటి మారిన నా అవగాహనకు అనుగుణంగా సవరించాల్సి వచ్చింది. అందుకే విపరీతమైన జాప్యం జరిగింది. ఇక కాలహరణం ఎంతమాత్రం తగదని భావించి యథాశక్తిగా యీ గ్రంథాన్ని ఆమూలాగ్రం సంస్కరించి పాఠకుల ముందుంచుతున్నాను.

ఇకపోతే కావ్యానుశీలనం, వ్యాఖ్యానం నాకు కొత్త. అదీకాక అందుకు నేనెంచుకున్న మార్గం శాస్త్రీయ విశ్లేషణ. ఇదీ సరికొత్త పంథానే ! పైపెచ్చు రచయితగానూ నేనో తమస్తురంగాన్ని *(Dark Horse - a little - known person)*. అంచేతనే నా కృషిని మూల్యాంకనం చేసి, గభీర పరామర్శతో కూడిన పీఠికలు వ్రాయాల్సిందిగా కోరుతూ ఉచ్చైఃశ్రవముల వంటి లబ్ధ ప్రతిష్ఠులైన పండితులనాశ్రయించాను. తమ రోజువారీ వ్యాసంగాలను వీలైన మేరకు పక్కనబెట్టి, నా రచనను ఆమూలాగ్రం చదివి తమ విలువైన సూచనలను తెలుపుతూ, పరిచయ వాక్యాలు వ్రాసి పెద్ద మనసుతో నా కృషిని వెన్నుతట్టి ప్రోత్సహించిన డా చేరా, డా। కె.కె.ఆర్., డా॥ బేతవోలు రామబ్రహ్మం గారలకు నా నమోవాకాలు. నా భాషలోనూ, శైలిలోనూ కొన్ని దోషాలను గమనించి వారు కొన్ని విలువైన సూచనలు చేశారు. వాటిలో కొన్ని పరిపాటి *(Convention)* కి సంబంధించిన విషయాలుగానూ వారు గుర్తించారు.వాటిలో కొన్ని ప్రస్తావనార్హమైనవి. ఇంగ్లిష్ భాషలో పెద్ద అచ్చు అక్షరాలు, పెద్ద వ్రాత అక్షరాలు *(Capital Letters)* వుంటాయి. తెలుగు లిపిలో అవి లేవు. నేను మొదట్నుంచీ *Proper Nouns* కీ, వాక్యారంభంలో వాడే అక్షరాలకూ తెలుగు అచ్చులను వాడడానికి అలవాటు పడ్డాను. అంచేతనే ఇంగ్లిష్ *Capital Letters* వలె 'ఇ', 'ఉ' అనే అచ్చులనే వాడతాను. మిగిలిన సందర్భాలలో ఆంగ్ల *Small Letters* వలె 'యి', 'వు' అనే హల్లుల్నే వాడతాను. ఇది పూర్తిగా నా పరిపాటికి సంబంధించినట్టిది. ఈ గ్రంథంలో ఎక్కడైనా యిందుకు భిన్నమైన దృష్టాంతాలు కనుపిస్తే అవి నా దృష్టికి

రాని ముద్రణా స్ఖాలిత్యాలుగా భావించగోరతాను. 'తలక్రిందులు' కు బదులుగా 'తల్లకిందులు' అని వాడడాన్ని మాత్రమే నేను తప్పుబట్టాను. 'తలకిందులు' తప్పని నేననలేదని గుర్తించ మనవి. ఇక వారు సూచించిన నా దోషాలు కొన్నింటిని దిద్దుకున్నాను. మిగిలిన వాటిని వీలైన మేరకు మున్ముందు దిద్దుకొనడానికి చిత్తశుద్ధితో కృషిచేయగలనని వారికి కృతజ్ఞతాపూర్వకంగా మనవి చేస్తున్నాను. 'స్వభావో దురతిక్రమః' అన్నట్లు యీసరికే స్వాభావికమైపోయిన కొన్ని దోషాల విషయంలో నిస్సంశయంగా నేను అశక్తుడనే ! కొన్ని వృక్షాల సాంకేతిక నామాలను గుర్తించడంలో నాకు తోడ్పడి, సవ్య దిశా నిర్దేశనం చేసిన సువిఖ్యాత వృక్షశాస్త్రవేత్త, బహుగ్రంధకర్త డా కొప్పుల హేమాద్రి గారికి నేను సదా కృతజ్ఞుడను.

ఈ గ్రంథం కోసం భావస్ఫోరకమైన ముఖచిత్రంతో పాటు మరికొన్ని చక్కని చిత్రాల్ని కూడా సకాలంలో చిత్రించి యిచ్చిన సువిఖ్యాత చిత్రకారులు 'బాపు' గారు యిటీవల విదేశీయానం, తాము తీయబోయే కొత్త చలనచిత్రానికి సంబంధించిన స్క్రిప్టు చర్చలతో నిర్విరామంగా వుండి కూడా యీ గ్రంథం మీది ప్రత్యేక అభిమానంతో 'పాండురంగని విగ్రహం ఎలా వుండాలి?' అనే విషయమై కల్పతరు రీసెర్చ్ అకాడెమీ వారు ప్రచురించిన 'ప్రతిమా కోశం' అన్న ఆంగ్ల గ్రంథంతో సహా ఎన్నో ఆధారాలు యిందు నిమిత్తం ప్రత్యేకంగా పరిశీలించి కూడా, చివరకు నా అభ్యర్థన మేరకు తెనాలి రామకృష్ణుని కావ్యంలో వర్ణించిన ప్రకారమే నగ్నంగా వున్న ఐదేళ్ల బాలకృష్ణునిగానే చిత్రించి యిచ్చారు. ఈ విషయమై వారితో పలుమార్లు ఫోన్లో సంప్రతించినా ఏ మాత్రం విసుగు చెందక మరింత లోతైన చర్చ చేశారు. పని పట్ల వారి అంకిత భావానికి, నా యెడల వారి అభిమానానికి వారికి నా నమోవాకాలు. 'బాపు' గారికి నా రచనను పరిచయం చేసిన 'నవోదయ' రామమోహన రావు గారికి, మిత్రులు, చిత్రకారులు గంధం కనకదుర్గా ప్రసాద్ గారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథం ప్రచురణ బాధ్యతలు స్వీకరించిన 'పీపుల్స్ ట్రస్ట్' వారు 'పీకాక్ క్లాసిక్స్' పేరిట అతి కొద్ది కాలంలోనే వివిధ ప్రపంచ భాషలలో ప్రసిద్ధిగాంచిన జనరంజకమైన 37 ఉత్తమ గ్రంథాలను ప్రచురించి సామాన్య పాఠకుడికి అందుబాటులోనికి తెచ్చారు. 2007 జనవరి నాటికి నా గ్రంథాన్ని కూడా అదే ట్రస్ట్ 'పీకాక్ బుక్స్' పేరిట మొదటి ప్రచురణగా చేపట్టే లక్ష్యంతో సదరు సంస్థ సంపాదకులు అన్నపనేని గాంధీ గారు నాకందించిన సహకారం, ప్రోత్సాహం మరువలేనివి. వారికీ, సకాలంలో యీ గ్రంథాన్ని అందంగా ముద్రించి యిచ్చిన 'ఇమేజ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్', హైదరాబాద్ అధినేత కొల్లి అప్పారావు గారికీ, వారి సిబ్బందికీ నా కృతజ్ఞతలు.

శ్రమకోర్చి యీ గ్రంథాన్ని వీలైనంత పరిశుద్ధంగా డి.టి.పి. చేసి యిచ్చిన శ్రీమతి పద్మజ (పవన్ టెక్నికల్స్, టి.బి.రోడ్, తెనాలి), శ్రీ షేక్ నూర్, లంకా జోసెఫ్ (శివ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, ఉప్పు బజార్, తెనాలి.) మరియు ఆ సంస్థల యాజమాన్యాలకు వారు నాకిచ్చిన సహకారానికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథం వ్రాస్తున్నట్లు తెలియగానే నన్ను అభినందించి ప్రోత్సహించిన మిత్రులెందరో వున్నారు. వారిలో సహృదయులు, తెనాలిలోని ప్రముఖ వైద్యులు డా॥ పాటిబండ్ల దక్షిణామూర్తి, M.D., F.I.C.A., గ్రంథాలయోద్యమ నేత డా। వెలగా వెంకటప్పయ్య, 'ప్రజా సాహితి' సంపాదకులు శ్రీ కొత్తపల్లి రవి బాబు, ప్రముఖ రచయిత శ్రీ కె.చిరంజీవి (ఆకాశవాణి మాజీ ఉద్యోగి, హైదరాబాద్) గారలు స్మరణీయులు. కలిసినప్పుడల్లా 'మీ గ్రంథ రచన ఎంత వరకు వచ్చింది?' అని వారు ప్రశ్నిస్తూ వుంటే నాకు ఒక్కోసారి సమాధానం ఏం చెప్పాలో కూడా అర్థమయ్యేది కాదు. నన్ను కనపడ్డప్పుడల్లా యీ గ్రంథ పరిపూర్తి గురించి అలాంటి వారు వెంట పడుతుండడం కారణంగానే నేనీ బృహత్ప్రయత్నాన్ని యిప్పటికైనా పూర్తి చేయగలిగానని గాఢంగా నమ్ముతున్నాను.

నాకు విలువైన గ్రంధాలు కొన్నింటిని యిచ్చి సహకరించిన విజ్ఞులు, ఆర్య సామాజికులు, గుంటూరు జిల్లా వట్టిచెరుకూరుకు చెందిన శ్రీ రావి వేంకట రావు గారు (వీరు మా పెద్ద అల్లుడి తాతగారు), యింకా ఎందరో సాహితీ మిత్రులు, పెద్దలు, స్ఫూర్తి ప్రదాతలకు నేను సదా కృతజ్ఞుడను.

ఇక నా శ్రీమతి రాజ్యలక్ష్మి , మా కుమార్తెలు చి। చైతన్య స్రవంతి, చి కారుణ్య ప్రకృతి, అల్లుళ్లు చి రావి బాలకృష్ణ, చి। జాస్తి శ్రీనివాస్ లు నాకిచ్చిన మనోబలం, ప్రోత్సాహం మరువలేనివి. అమ్మాయిలిద్దరూ అమెరికా నుండి ఫోన్ చేసినప్పుడల్లా యీ గ్రంధం త్వరగా పూర్తి చేయమని కోరేవారు. వారి ప్రోత్సాహం నాకు నూతనోత్తేజాన్నిచ్చింది.

ఇంకా నేనిక్కడ పేర్కొనని, నాకు సహకరించి, ప్రోత్సాహాన్నిచ్చిన సహృదయ సాహితీ మిత్రులందరికీ నేను సర్వదా కృతజ్ఞుడను.

ఈ గ్రంధం యొక్క కూర్పు, యిందు ప్రస్తావించిన వేర్వేరు సామాజిక, ఆర్ధిక, విజ్ఞాన శాస్త్ర సంబంధిత విషయాలపై తమ స్పందనను తెలియజేయాల్సిందిగా సదసద్వివేచనాపరులూ, గుణగ్రహణ పారీణులూనైన చదువరులను అభ్యర్ధిస్తున్నాను.

*అందరికీ నూతన సంవత్సర శుభాభినందనలు తెలుపుతూ...*

ఆభార భారంతో -

విద్వజ్జన విధేయుడు,

**ముత్తేవి రవీంద్రనాథ్**

**సెల్: 9849131029**


ఫోన్ : 08644 - 227569

ఇం. నెం. 20-40-5, మోతాదు వీధి,

చినరావూరు, తెనాలి - 522 201


తేది : 1-1-2007

# ముఖాముఖి

**డా॥ బేతవోలు రామబ్రహ్మం,**

**యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాద్,**

**(కేంద్రీయ విశ్వవిద్యాలయం),**

**గచ్చిబౌలి, హైదరాబాద్.**

తెలుగు పద్యాన్ని ప్రతిపదార్థ తాత్పర్యాల బాణీలో కాకుండా సంభాషణ శైలిలో ఆధునిక పాఠకుడి అభిరుచికి సరిపోయేటట్టు విశదపరచాలి, అవగాహన శక్తినీ, అభ్యాసాన్నీ పెంపొందించాలి అనే తపన విషయంలో ముత్తేవి రవీంద్రనాథ్ గారు నాతో ఏకీభవిస్తున్నందుకు ముందుగా నా సంతోషాన్ని ముబ్బడిగా ప్రకటిస్తున్నాను. నేను ఈ ప్రణాళిక చెప్పినప్పుడు ఆమోదించిన వారు చాలా మంది వున్నారు. ఆచరణలో పెట్టి పద్య కవితా పరిచయం-I ప్రకటించినప్పుడు (1991) చదివి ఆనందించిన వారూ చాలా మంది ఉన్నారు. కానీ అనుసరించి మరో గ్రంథం రచించిన వారు ఇంతవరకూ నాకు తారసపడలేదు. ఇదిగో ఇప్పటికి రవీంద్రనాథ్ గారు దొరికారు. తెనాలి రామకృష్ణుడి రచనలు మూడింటి నుంచీ మేలిమి పద్యాలను కథాశరీరంతో కలిపి పాఠకులకు సంభాషణ శైలిలో అందించడం, విడమర్చి చెప్పడం చాలా సమర్థంగా నిర్వహించారు. ఒక ఘట్టాన్ని తీసుకుని ప్రత్యక్షరమూ విశదీకరించడం నా బాణీ కాగా, మొత్తం కావ్యాన్ని తీసుకుని ఎంపిక చేసిన పద్యాలను వివరించడం వీరు ఎంచుకున్న బాణీ. ఏమైనా లక్ష్యంలోని ఏకవాక్యత నన్ను మురిపించింది.

వీరితో పరిచయం నాకు అలనాడే ఏర్పడి ఉంటే వీరి పరిజ్ఞాన వైవిధ్యాన్ని నేను కూడా కొంత సద్వినియోగం చేసుకుని ఉండేవాడిని. ఈ గ్రంథం చదువుతూంటే రవీంద్రనాథ్ గారి వివిధ విషయ వేత్తృత నన్ను అబ్బుర పరచింది. ఎన్ని శాస్త్రాలు, ఎన్ని కావ్యాలు, ఎన్ని భాషలు, ఎంత చరిత్ర - వీరి మేధా పేటికలో నిక్షిప్తమై ఉన్నాయో ! ఆశ్చర్యచకితుణ్ణి అయ్యాను.

ఉద్భటారాధ్య చరిత్ర - ఘటికాచల మాహాత్మ్యం - పాండురంగ మాహాత్మ్యం - ఇవి మూడూ రామకృష్ణుడి రచనలుగా ఇప్పటికి మనకు దొరికినవి. వీటిలో ఉద్భటారాధ్య చరిత్ర రామకృష్ణుడి రచన కాదు, అనంతర కాలంలో జరిగిన కూట సృష్టి అని నా ప్రగాఢ విశ్వాసం. విశ్వాసం మాత్రమే కాదు ఆధారాలతో సహా ఏర్పడిన అభిప్రాయం. దీని మీద చాలా కాలం క్రితమే నేనొక వ్యాసం ప్రచురించాను. దాన్ని ఇటీవలి నా వ్యాసగౌతమిలో సంపుటీకరించాను కూడా. అయితే, రవీంద్రనాథ్ గారి దృష్టిలో అది రామకృష్ణుని రచనయే. సరే, ఇది ఇప్పటి చర్చనీయాంశం కాదు.

మన వ్యాఖ్యాతలు పద్యంలో ఎదురుపడ్డ వస్తు వాహన జంతు వృక్ష దేవ గంధర్వాప్సరో దానవాది వాచకాలను సామాన్యార్థాలతో సరిపెట్టారే తప్ప వాటిని కచ్చితంగా నిర్ధారించడానికీ రూపుకట్టించడానికీ పెద్దగా పూనుకోలేదు. ఆ ప్రయత్నం నాకు తెలిసినంతవరకూ తొట్టతొలిగా రవీంద్రనాథ్‌గారే చేపట్టారు. ఒక మొక్క, ఒకతీగ, ఒక చెట్టు, ఒక పువ్వు - ఏ పదం కనిపించినా దానికి ప్రాంతీయ వ్యవహారమేమిటి, సంస్కృతంలో ఏమంటారు, బోటనీలో దాని సాంకేతికనామం ఏమిటి, దాని రూపరేఖా విలాసాలేమిటి, ఇంకా ఏఏ కవులు ఏఏ పర్యాయ పదాలతో దీన్ని వ్యవహరించారు- ఇత్యాది సమాచారమంతా వీరు కుప్పపోశారు. (ఉ.చ. 2-35) పద్య వ్యాఖ్యానంలో ప్రియాళ - కుసుమ (కుసుంభ) పుష్పాల భోగట్టా ఒక్కసారి తిలకించండి. మీరెంత మురిసిపోతారో ! అలాగే గంజాయి మొక్క గురించి వీరిచ్చిన సమాచారం (ఉ.చ. 2-273). దీనికి కవీశ్వర-కవిభుక్త- సదాభక్షణ అన్న పర్యాయ పదాలున్నాయంటూ వీరు విసిరిన చెణుకులు. మెచ్చుకుని తీరాల్సిందే.

గర్భవతుల చిట్టుములు వర్ణించడం తెలుగు కవులకు చాలా సరదా. కాళిదాసూ చేశారు. వీటిలో భావి కథా సూచనల సొగసులూ పొదిగారు. వీటిని సంస్కృతంలో దౌహృదాలు అంటారు. గర్భవతిని దౌహృదా - దౌహృదినీ ఇలా మత్వర్థీయాలతో వ్యవహరిస్తారు. ఈ పదానికి వ్యుత్పత్తిని చెబుతూ వీరొక సమన్వయం చేశారు. రెండు హృదయాలు (తనది - శిశువుది) ఉంటాయి కనక ఈ పదం అన్నారు. ఇది ఆలోచించదగ్గది (ఉ.చ. 3-40). పుట గుర్తించలేనుగానీ ఎక్కడో హస్తినీ జాతిని వీరు చాలా శాస్త్రీయంగా విశదీకరించారు.

ముత్యాల గురించి మన కవులకి కొన్ని నమ్మకాలున్నాయి. ఏనుగుల కుంభ స్థలాల్లో ముదురు వెదురుల్లో అవి దొరుకుతాయని. అలాగే స్వాతి చినుకులు ఆల్చిప్పలో పడి ముత్యాలవుతాయనీను. ఇవన్నీ అశాస్త్రీయాలు అని కరాఖండీగా వీరు తోసిరాజన్నారు. నిజమే. ఇక్కడే మనం ఒక్కమాట అనుకోవాలి చూత లతలు, తుమ్మెదలు, చకోరాలు, చాతకాలు - ఈ జాబితా చాలా ఉంది. ఇవన్నీ అశాస్త్రీయాలే కానీ కావ్యప్రపంచంలో స్థిరపడ్డాయి. వాస్తవాలకన్నా గట్టిగా స్థిరపడ్డాయి. ఇలాంటి వాటిని అన్నింటినీ పరిశీలించి కవిసమయాలు అన్నారు. వీటిని స్వర్గ్య-భౌమ - పాతాళీయాలుగా విభజించి సమగ్రంగా చూపించాడు రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో. వీటిని తొలగిస్తే చాలా కవితా చమత్కారాలు కనుమరుగవుతాయి. గట్టిగా మాట్లాడితే అసలు కవిత్వమంటేనే అశాస్త్రీయం. ఇంకా అందులో వెదుకులాటలెందుకుష !

తిరువారాధన వేళలో పుండరీకుడు గంట మోగించాడని రామకృష్ణుడు వర్ణించాడు (పాం.మా. 2-22). ఇక్కడ రవీంద్రనాథ్ గారు మాట్లాడుతూ అరటి ఆకులో భోజనం ఎలాంటి అదనపు శక్తుల్ని సమకూరుస్తుందో వివరించారు.

బహుశా దీనికి - తాను అరటి ఆకులు సమృద్ధిగా దొరికే తెనాలి వాడు కావడం ఒక్కటే కారణం కాదనుకుంటాను ; చెప్పలేదుగానీ ఆయుర్వేదంలో ఆధారమేదో ఉండే ఉంటుంది. అది అలా ఉంచుదాం - గంట మోగించడం ఈనాటి వైష్ణవుల ఆచారంలో కనిపించదు. బహుశ రామకృష్ణుడి నాటి వైఖానస సంప్రదాయమేమో అన్నారు. కావచ్చు. కానీ వీరి సూక్ష్మపరిశీలనా దృష్టికి ఇదొక చిరుగంట. ఇలాంటిదే వీరి కుతపవేళా నిర్ణయం. దీనిమీద ఎన్నో చర్చలు జరిగాయి. వీరు కచ్చితంగా గంటలూ నిమిషాలతో సహా తుది తీర్పు చెప్పేశారు (పుట-163). హాయిగా ఉంది.

కప్పకి రకరకాల పర్యాయపదాలు ప్రయోగించాడు రామకృష్ణుడు. వాటిలో వరుణదంతావళము ఒకటి. నిజానికి పురాణాలలో వరుణుడి వాహనం కప్ప కానే కాదు. దీని మీద వీరు మొగమోటమి లేకుండా ఒక మాట అన్నారు. బహుశా కప్ప వల్లనే వర్షం వస్తుందనే అంధ విశ్వాసం రామకృష్ణ కవికి కూడా ఉన్నందునే ఆయన కప్పను వరుణదంతావళము (వరుణుడు ఎక్కి వచ్చే వాహనం) అని పేర్కొని ఉంటాడు (పుట - 294). ఈ నిక్కచ్చితనం నాకు నచ్చింది. బహుశ మీకూ నచ్చుతుంది.

గొన్నన బండ్లు - గొల్లెన బండ్లు - కొల్లారు బండ్లు అంటే ఏమిటో వాటి రూపాలూ వాటి వినియోగాలూ (పుట-361) తొలిసారిగా తెలుసుకున్నాను వీరి పుణ్యమా అని. ధన్యవాదాలు చెప్పడం నా విధి.

ఈ గ్రంథంలో మొదటి నాలుగు అధ్యాయాలూ సాహిత్యాంశాలు. అయిదవ అధ్యాయం నుంచీ కథలూ-గాథలూ, సామాజికాలూ, సాంఘికాలు, చారిత్రికాలూ వగైరా వగైరా ఉన్నాయి. గ్రీకు గాథలతో పోలికలూ ఉన్నాయి. వైఖానసుల పుట్టుపూర్వోత్తరాలున్నాయి. రామకృష్ణుని నాటి కులాల వివరాలున్నాయి. రాయల వారి కులం ఏమిటో నిర్ధారణ ఉంది. కూర్మ వంశ క్షత్రియులైన కమ్మవారు వైదికాచారాలను ఎందుకు ఎలా వదిలేశారో వగైరా సామాజికాంశాల సశాస్త్రీయ విశ్లేషణ ఉంది. సామాజికాంశాలు అనేసరికి అభిప్రాయభేదాల బెడద తప్పదు. బహుశ ఈ కోణం నుంచి రవీంద్రనాథ్ గారు సన్నద్ధులు కావలసి ఉంటుందేమో ! ముందే జయోఽస్తు పలుకుతున్నాను - ఎందుకైనా మంచిది.

కాగా, భాష విషయంలో రవీంద్రనాథ్ గారి పట్టింపు నాకు బాగా నచ్చింది. మనవి లో వీరు చాలా విషయాలు ప్రస్తావించారు. ఆవేదన పడ్డారు. అయితే వీరి రచనలోనూ వైరి సమాసాలు చాలా దొర్లాయి. సాహిత్యేతర రంగానికి చెందిన వ్యక్తి కనక, వచన రచన కనక - వీటిని నేనైతే పట్టించుకోను. కానీ పట్టించుకునే ప్రత్యర్థులుంటారు. బహుపరాక్! అలాగే కొన్ని ముద్రారాక్షసాలూను. సంస్కృత మంత్ర - శ్లోకాల ఉట్టంకింపుల్లో చిట్టి చిట్టి ప్రమాదాలు జరిగాయి. ఉదాహరణకి - యదహ్నాత్ కురుతే పాపమ్ తదహ్నాత్ ప్రతిముచ్యతే (పుట-31) అని ఉండాల్సింది, రెండు చోట్లా తకారం తప్పుకుంది. వీటికేమి - "దిష్టి చుక్కలు". రవీంద్రనాథ్ గారి వివిధ విషయ వేదిత్వానికి అయిదు పది చేస్తున్నాను. మీరూ అంతే చేస్తారని నమ్ముతున్నాను. సెలవు.

ఇం.నెం. 226, డోయన్స్ టౌన్‌షిప్,
షేరీ లింగంపల్లి,
హైదరాబాద్ - 500 019
సెల్ :-98481 69769

భవదీయుడు
**బేతవోలు రామబ్రహ్మం**
07-10-06

# పరిషేచనం

**డా॥ కె.కె. రంగనాథాచార్యులు,**

**విశ్రాంత తెలుగు ఆచార్యులు,**

**పూర్వపు డీన్, మానవీయ విభాగం,**

**హైదరాబాద్ (కేంద్రీయ) విశ్వవిద్యాలయం, హైదరాబాద్.**

సుమారు రెండు నెలల క్రితం ఒక శుభోదయాన, ఆ రోజుటి జీవితంలో అప్పుడప్పుడే నేను నిలదొక్కుకుంటున్న సమయాన మా ఇంటి గంట మోగింది. తలుపు తెరిచాను. అంతకు ముందు పరిచయం లేని వ్యక్తి. పేరుతోపాటు తనను తాను పరిచయం చేసుకొని, తెనాలి ప్రాంతంలోని ప్రగతికాముకులైన మిత్రుల ద్వారా నా గురించి తెలుసుకొని వచ్చానని చెప్పారు. ముద్రణ పూర్వ రూపంలో వున్న ఒక గురు గ్రంధాన్ని నా ముందు ఉంచారు. అందులో ఉండే బహుళ విషయాలను అనర్గళంగా నా స్పందన కోసం ఎదురు చూడకుండానే ముప్పావుగంటకు పైగా మౌఖికంగా వివరించారాయన. అవాక్కై వినడం నా వంతయింది. శకలాలు, శకలాలుగా శక్తి కొద్దీ విద్యాసంబంధమైన పనులు చేసుకొనే నాకు వివిధ విషయాలను ఆయన వివరిస్తున్న తీరు, జ్ఞాపక శక్తి, కౌతూహలం ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఆయనే ముత్తేవి రవీంద్రనాధ్. నా ముందున్న గ్రంధం తెనాలి రామకృష్ణుణ్ణి గురించి, అతని సాహిత్యం గురించి విస్తృతంగా అధ్యయనం చేసి పొందుపరచిన గ్రంధం. విషయాలను వివరిస్తున్న ఊపులోనే తన గ్రంధాన్ని చదివి అభిప్రాయం రాయాలని అసలు విషయం చెప్పారు. చాలా ఇబ్బంది కలిగించే

పరిస్థితి. ముందు మాటలు రాయడం, అభిప్రాయాలు చెప్పడం నా ప్రవృత్తికి, స్వభావానికి పడదు. వృత్తిరీత్యా నా పరిశోధక విద్యార్థుల పరిశోధన ప్రచురణలకు కొన్నిటికి ముందుమాటలు రాశాను. గ్రంథస్థ విషయంతో మమేకం కాగలిగిన సందర్భాలలో కూడా కొన్ని ముందు మాటలు రాశాను. ఇష్టం లేకుండా ఒత్తిడి మీద రాసినప్పుడు రాసినవి ప్రతికూల రూపంలో తయారు కావడం, రాయించుకున్న వాళ్లతో పాటు నేనూ కొంతకాలం పాటు బాధ పడడం కొన్ని సందర్భాలలో జరిగింది. అందువల్ల ఇలాంటి విషయాలలో నేను చాలా కచ్చితంగానే ఉంటాను. ఇలాంటి విషయాలలోనే కాదు, నాకిష్టంలేని ఏ విషయంలోనైనా నేను కచ్చితంగానే ఉండగలుగుతున్నాను. ఈ కారణంగా తరచుగా కలిసేవాళ్లు కలవడం మానేయడం కూడా చాలా సందర్భాలలో జరిగింది. రవీంద్రనాథ్ గారు నాకు కొత్తగా పరిచయమవుతున్న వ్యక్తి . ఆయనకు, నాకు సమానంగా పరిచయం, సాన్నిహిత్యం గల మిత్రుల పేర్లతో పరిచయం అవుతున్న వ్యక్తి. ఒక మొహమాటపు పరిస్థితి. కాదనలేని స్థితి. గ్రంథం ఏడెనిమిది వందల పేజీలకు మించి ఉంది. ప్రాచీన సాహిత్యం గ్రంథస్థ విషయం. చాలా సమయం వెచ్చించి గాని చదవడం సాధ్యమయ్యే విషయం కాదు. పేజీలు తిరగేసి చూశాను. 'యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్' అన్నట్టు రచయిత తన వివరణలలో, వ్యాఖ్యానంలో రామకృష్ణుడి కావ్యాలలోని ఏ విషయాన్నీ వదలలేదని గ్రహించాను. సాహిత్యపరంగా, చారిత్రక, సామాజిక భూమిక పరంగా రామకృష్ణుడి రచనలను మరొకసారి జ్ఞాపకం చేసుకోవడంలో నాకు కొంత ఆసక్తి ఉండవచ్చు. కాని గ్రంథంలోని సర్వ విషయాలు నాకు తెలిసినవిగా కనిపించడం లేదు. 'న హి సర్వః సర్వం జానాతి'. ఈ మాట రచయితకు స్పష్టంగానే చెప్పాను. ఎక్కువగా ఆశించవద్దని కూడా చెప్పాను. ఇందులో ప్రస్తావించిన చాలా విషయాలు గ్రంథాన్ని చదివి తెలుసుకోవలసినవే కాని ముందు మాటలలో ప్రస్తావించగలిగిన అవకాశం లేదు. ఆయన చెప్పింది కాదనడానికి, అదనంగా చెప్పడానికి ఆయన చేసిన అధ్యయనానికి మించిన అధ్యయనం కావాలి. సాధారణంగా అభిప్రాయాలు ప్రకటించేవారు, ముందు మాటలు రాసేవారు సంతరించుకొనే సాధికార స్వరాన్ని రచయితకే వదిలేసి, తెలిసిన విషయాల పరిధిలో నా ఆలోచనలకు భిన్నం కాకుండా వుండేట్టు నాలుగు మాటలు సాధారణ అభిప్రాయంగా రాసే ప్రయత్నం చేస్తున్నాను.

వృత్తి రీత్యా ముత్తేవి రవీంద్రనాథ్ గారు (ఇకముందు రచయిత) వాణిజ్య పన్నుల శాఖలో అధికారి. ప్రవృత్తి సాహిత్యం. ఒక్క సాహిత్యమే ఏమిటి ? సామాజిక శాస్త్రాలు, ప్రకృతి శాస్త్రాలు, సంప్రదాయ జ్ఞానం కూడా. సాహిత్యంలో కూడా ప్రాచీన సాహిత్యం, చరిత్ర ఆయనకు ఆసక్తి రేకెత్తించే విషయాలుగా కనుపిస్తాయి. ప్రస్తుత ఉద్గ్రంథం 'తెనాలి రామకృష్ణ కవి - శాస్త్రీయ పరిశీలన'. రచయితే ఏర్పరచుకున్న మినహాయింపులతో ప్రస్తుత గ్రంథాన్ని రామకృష్ణ కవి సర్వస్వం అని చెప్పవచ్చు. తెనాలి రామకృష్ణుడు, అతని జీవితం, రచనలు మొదలైన వాటిని అన్ని కోణాల నుంచి విస్తృతంగా పరిశీలించడాన్ని గ్రంథం చదివిన వారెవరైనా గుర్తిస్తారు. శాస్త్రీయత అన్నది కొంత బరువైన పదమే. పదార్థ, వృక్ష శాస్త్రాది విషయాలలో లాగా, అంత నిష్కర్షగా సామాజిక, మానవీయ శాస్త్ర విషయాలలో నిర్ణయాలు సాధ్యం కాకపోవచ్చు. కొన్ని ఆధారాలు లిఖిత రూపంలో ఉంటాయి. వాటిని అన్వయించడంలో కొంత వ్యక్తిగత దృష్టి కూడా పనిచేస్తుంది. ఊహలు కూడా జతచేరుతాయి. భాష విషయానికి వచ్చినప్పుడు కాకతాళీయ సామ్యాలతో ఊహాజనిత నిర్ణయాలుచేస్తూ ఉండడం తరచుగా కనిపిస్తుంటుంది. కావ్య నిర్మాణానికి 'లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణం' కావాలన్నారు ఆలంకారికులు. ఈ గుణం కావ్య నిర్మాతలకే కాదు కావ్యవివేచన చేసే వారికి కూడా అవసరం అనుకుంటాను. ఈ గుణాన్ని రచయిత పట్టుదలతో ప్రయత్న పూర్వకంగా స్వయంగా సాధించారని అనిపిస్తుంది. రచయిత కమ్యూనిస్టు పార్టీ కుటుంబానికి సంబంధించిన వారు. తనకు భగవంతుడి మీద విశ్వాసం లేదని మనవి మాటలలో స్వయంగా

చెప్పుకున్నారు. విశ్వాసాలు లేని ఆయన రామకృష్ణుడి భక్తి ప్రధానమైన కావ్యాలను శ్రద్ధగా అధ్యయనం చేయడంలో వైరుధ్యం కనిపించవచ్చు. గ్రంథం చదివితే ఈ భావం చాలా వరకు తొలగిపోతుంది. విస్తృతంగానూ, లోతుగానూ విషయాలను తెలుసుకోవాలని, తెలియజేయాలనే ఆకాంక్షే చివరంటా కనిపిస్తుంది. విశ్వాసం కలవాళ్లు కూడా తెలుసుకోవడానికి ప్రయత్నించని మత సంప్రదాయాలను సాధ్యమైనంత వరకు తెలుసుకొని, ఆకరాలతో, ఆధారాలతో విశ్వాసం లేకపోవడమేమిటని అనిపించేట్టుగా మన ముందుంచారు రచయిత. తెనాలి ప్రాంత సాహిత్యాన్ని గురించిన పరిశీలనలు, సేకరణలు జరుగుతున్న సందర్భంలో ఈ గ్రంథానికి అంకురార్పణ జరిగింది. తెనాలి ఇంటిపేరుగా ప్రసిద్ధుడైన రామకృష్ణుడి సాహిత్యంపైన రచయితకు ఆసక్తి, కుతూహలం ఈ రూపంలో పెరిగింది. 'స్వస్థాన వేషా భాషాభిమతమే' ఈ గ్రంథ రచనకు ప్రేరణగా కనిపిస్తుంది. తెనాలి 'సమాజాభిమతం' కూడా.

ఉత్తర భారతంలో భక్తి ఉద్యమ సాహిత్యమే ప్రధాన స్రవంతి సాహిత్యంగా విస్తరించిన కాలంలో తెలుగులో స్థల, క్షేత్ర మాహాత్మ్య కావ్యాలు, భక్తుల చరిత్రలు వస్తువుగా కావ్యాలు వచ్చాయి. భక్తి సాహిత్యానికి, మాహాత్మ్య కావ్యాలకి ఉండే సంబంధాన్ని గురించి అంతగా అధ్యయనం జరగలేదు. తెనాలి రామకృష్ణుడి ప్రధాన కావ్యాలు ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగ మాహాత్మ్యము, శ్రీ ఘటికాచల మాహాత్మ్యము ఒకే కోవకు చెందినవి. మొదటిది శైవ మతానికి సంబంధించింది. మిగిలిన రెండూ వైష్ణవ మతానికి సంబంధించినవి. ఈ కావ్యాలను పరిశీలించడంలో భాగంగా కావ్య వస్తువులను పరిచయం చేయడంతో పాటు కావ్యాల లోపల, వెలుపల ఉన్న అనేకాంశాలను ప్రస్తుత గ్రంథంలో రచయిత వివరించారు. మనవి మాటలు కాకుండా ఆరు అధ్యాయాలు ఇందులో ఉన్నాయి. పది అనుబంధాలున్నాయి. మొదటి అధ్యాయంలో 'ఉద్భటారాధ్య చరిత్ర' సమగ్ర పరిశీలన ఉంది. రెండవ అధ్యాయంలో రామకృష్ణుడి వైష్ణవ మత పరివర్తన, విజయ నగరంలో భువన విజయ ప్రవేశం మొదలైన అంశాలున్నాయి. మూడవ అధ్యాయంలో 'పాండురంగ మాహాత్మ్యము' పరిశీలన వుంది. నాలుగవ అధ్యాయంలో 'శ్రీ ఘటికాచల మాహాత్మ్యము' పరిశీలన ఉంది. అయిదవ అధ్యాయంలో రామకృష్ణుడి పేర ప్రసిద్ధమైన కథలన్నిటినీ క్రోడీకరించడం జరిగింది. ఆరవ అధ్యాయంలో మూడు కావ్యాలలోని పద్యాలలోని పోలికల ఆధారంగా తెనాలి రామలింగడు, రామకృష్ణుడు ఒకడే అని నిరూపించే ప్రయత్నం జరిగింది. ఒక పరిశోధన గ్రంథానికి ఉండవలసిన నిర్మాణం, రూపం ప్రస్తుత గ్రంథానికి చక్కగా అమరాయి. "గ్రంథ విస్తరణ భీతితో సమగ్ర సాహిత్య విశ్లేషణ, అందలి ఛందో వ్యాకరణ విశేషాల జోలికి వెళ్లడం లేదం"టారు రచయిత. కాని పరిమితంగానే అయినా సాహిత్య అలంకారాది విశేషాలను స్పృశించారు. రామకృష్ణుడి పేర ప్రసిద్ధమైన కథలను, చాటువులను యథాతథంగా పరిచయం చేయడం కాక వాటికి గల సాహిత్య, సామాజిక భూమికను పరిశీలించ వలసిన అవసరం ఉందేమో అనిపిస్తుంది. గ్రంథ ముద్రణపూర్వ ప్రతిలో అనుబంధాలే నూట డెబ్బై పేజీల వరకు ఉన్నాయి. ఉన్న పది అనుబంధాలలో కొన్ని ప్రత్యేక గ్రంథాలుగా రావలసినవి. రామకృష్ణుడు తన కావ్యాలలో పేర్కొన్న నదులు, రత్నాలు, వైఖానస పాంచరాత్రాలు, దివ్య తిరుపతులు, యక్షులు-జక్కులు, చంద్ర చకోరాలు, తెనాలి నామ చరిత్ర, దానికి భూమిక అయిన నామ విజ్ఞాన సంగ్రహణం మొదలైన అంశాలున్నాయి. తెనాలి చరిత్ర, ప్రాచీనత అన్న అంశాల వివరణతో ఈ గ్రంథం ముగుస్తుంది. ఇది పదవ అనుబంధం. "తెనాలి నా జన్మ భూమి కనుక దాని ప్రాచీనత పట్ల నాకూ గర్వంగా ఉంది" అంటారు రచయిత. ఆ గర్వమే కదా రామకృష్ణుణ్ణి గురించి ఇంతగా రాయించింది. అంతకు ముందు తొమ్మిదవ అనుబంధం 'తెలుగుచోడులు-వారి బంధువర్గం' అన్నది. ఇందులో తెనాలి భాగమైన భౌగోళిక ప్రాంతం కమ్మనాదును గురించి, కమ్మవారి విశిష్టతను గురించి విస్తృతమైన వివరణలున్నాయి. కమ్మ, వెలమ, రెడ్డి,

కాపు కులాలు ఒకే కుదురు నుంచి వచ్చాయని, కమ్మవారు మౌలికంగా క్షత్రియులై, మధ్యకాలంలో బౌద్ధాన్ని ఆశ్రయించి వర్ణ భావనను వదిలేశారని, తరువాత బౌద్ధేతర స్రవంతిలో చేరినా వర్ణకర్మకాండలని ఆశ్రయించక పోవడం వలన చతుర్థ కులాలకు సంబంధించిన వారుగా మిగిలిపోయారని అంటారు రచయిత. ఆంధ్ర దేశాన్ని పరిపాలించిన ప్రధాన పాలకులు తెలుగు చోదులు, కాకతీయులు, శ్రీకృష్ణ దేవరాయలు, నాయక రాజులు కమ్మవారేనని రచయిత నిర్ధారణ చేశారు. ప్రయోజనం ఏమైనా చివరి విభాగాలు ప్రధాన గ్రంథం దృష్ట్యా నిష్పత్తిని మించి ఉన్నాయి. అనుబంధ విషయాలు ప్రధాన విషయం పైనుంచి దృష్టి మళ్లించి, అనవసర చర్చలలోకి దారితీయించే అవకాశం ఉంది. కావ్యాలలో ప్రసక్తమైనంత వరకు మాత్రమే సమకాలీన సామాజిక వ్యవస్థను విశ్లేషించడానికి పరిమితమై సమాజం, కులాలు, వృత్తులు మొదలైన అంశాలను వివరించడం సామాజిక దృక్పథం కలిగిన వారు చేయవలసిన పని అని నేను అనుకుంటున్నాను.

ఈ గ్రంథంలో ముఖ్య భాగం తెనాలి రామకృష్ణుడి కావ్యాల పరిచయం. కావ్యాలలోని ఇతివృత్త పరిచయం సమగ్రంగా, వివరంగా ఉండి ఎదుటి వారికి కథ చెప్తున్నట్టుగా ఉంటుంది. సందర్భానుసారంగా కొన్ని పద్యాలకు సమగ్ర వ్యాఖ్యలు ఉన్నాయి. తెలుగు సాహిత్యాన్ని ప్రత్యేక విషయంగా అధ్యయనం చేస్తున్న విద్యార్థులకు తరగతి గదిలో పాఠం చెప్తున్నట్టుగా ఉంటుంది మొత్తం రచనా శైలి. మౌఖిక పాఠ ప్రవచన పద్ధతిని లిఖిత రూపంలో ప్రవేశ పెట్టారు రచయిత. దీనికి వ్యాఖ్యాన పద్ధతి కూడా తోడయింది.కావ్య కథా గమనంలో వచ్చే ప్రతి విషయాన్నీ వివరించడం గ్రంథం నిండా కనిపిస్తుంది. ప్రకృతి, నదులు, పర్యావరణం, సహజ వనరులు, భూగర్భ జలాలు, వృక్షజాతులు, పుష్పజాతులు, రత్నాలు, వంటకాలు, విద్యలు, గాథలు, వైఖానస పాంచరాత్రాది మత సంప్రదాయాలు, వైష్ణవంలో వడగలై, తెంగలై భేదాలు, శాఖా భేదాలు, కులాలు, ఆచారాలు, వ్యవహారాలు, తదితర సాంస్కృతికాంశాలు మొదలుగా కావ్యాలలో ప్రసక్తమైన ప్రతి అంశానికి మూలాలు, చరిత్ర, వివరణలు గ్రంథమంతా వ్యాపించి ఉన్నాయి. ఇక వ్యుత్పత్తులు, పర్యాయ పదాలు, శాస్త్రాల నుంచి, స్మృతుల నుంచి శ్లోకాల ఉటంకింపులు చెప్పనవసరం లేదు. ఒక మొలక పేరు గాని, చెట్టు పేరు గాని వచ్చినప్పుడు వాటి పర్యాయ పదాలను, వృక్షశాస్త్ర పరంగా వాటికి సమాన సాంకేతిక పదాలను మన ముందుంచుతారు రచయిత. వాటికి గల రకరకాల ప్రయోజనాలను కూడా వివరిస్తారు. ఆరోగ్య సంబంధమైన విషయాలు, వివిధ స్నానాచరణలకు సంబంధించిన విషయాలను వివరిస్తున్నప్పుడు చరక సంహితను ఉదాహరిస్తారు. రత్నాలకు సంబంధించిన ప్రస్తావన వచ్చినప్పుడు రత్న శాస్త్రా *(Gemology)* న్ని ఆశ్రయిస్తారు. హస్తినీ జాత్యాది స్త్రీలను గురించి చెప్పడానికి, శృంగార విషయాలను వివరించడానికి రతిమంజరి ఆధారం అవుతుంది. మధ్యయుగీన తెలుగు కవులు చాలా మందికి కథా సందర్భాన్ని బట్టిగాని, సందర్భాన్ని కల్పించుకొని గాని విన్నవి, కన్నవి, జీవితానికి సంబంధించినవి అయిన ప్రతి విషయాన్నీ చెప్పాలనే ఆకాంక్ష ఉండినట్టు కనిపిస్తుంది. అలాగే రామకృష్ణుడి కావ్యాలలో కనిపించే ప్రతి అంశాన్నీ వివరించాలనే, వ్యాఖ్యానించాలనే ఆకాంక్ష, తపన ప్రస్తుత రచయితలో కనిపిస్తుంది. గ్రంథం ఈ అంశాన్నే ప్రతిఫలిస్తుంది.

రవీంద్రనాథ్ గారి విషయాభివ్యక్తీకరణ ధోరణి చైతన్య స్రవంతిలా ఉంటుంది. ఒక అంశాన్ని గురించి చెప్తున్నప్పుడు దానికి సంబంధించిన మరో అంశం, మరో అంశానికి సంబంధించిన ఇంకొక అంశం. ఒకదాని వెంట ఒకటి 'అనుధావంతి' అన్నట్టు పరిగెత్తుకొని వస్తుంటాయి. భాషకు సంబంధించిన విపర్యయాల్ని వివరిస్తూ వార్తా పత్రికల్లోకి, అక్కడి నుంచి టివి ఛానళ్లలోకి, టివిలో ధర్మవరపు సుబ్రహ్మణ్యం క్రేన్ వక్కపొడి ప్రకటనల్లోకి, సి.ఎస్.ఆర్. వంటి పాత

సినిమా నటుల ఉచ్చారణ స్పష్టతలోకి, సినీ రచయితల భాషా ప్రయోగాలలోకి, నాగభూషణం సంభాషణల్లోకి సాగిపోతుండడం చూస్తే సాహిత్యం, భాష, సాంస్కృతిక రంగాలను ఆయన ఎంత పరిశీలన దృష్టితో చూస్తుంటారో తెలుస్తుంది. రామకృష్ణ కవి కష్టాల్లో, బాధల్లో ఉంటూ కూడా 'ఉద్భటారాధ్య చరిత్ర' రచన ఎలా కొనసాగించాడో చెప్తూ శ్రీనాథుడి దగ్గిరికి వెళ్తారు. అక్కడి నుంచి శ్రీశ్రీ మహా ప్రస్థానానికి చెలం రాసిన 'యోగ్యతా పత్రం'లోకి వెళ్లి 'క్రిష్ణ శాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ' అన్న మాటలను జ్ఞాపకం చేస్తారు. కృష్ణ శాస్త్రి కవిత్వానికి, శ్రీశ్రీ కవిత్వానికి కూడా బాధ మూలం అన్న విషయాన్ని జ్ఞాపకం చేస్తారు. మాల శబ్ద ప్రయోగాన్ని గురించి చర్చిస్తున్నప్పుడు వేమన, గురజాడ అప్పారావు, ఉన్నవ లక్ష్మీనారాయణ ఒకరి వెంట ఒకరు జ్ఞాపకం వస్తారు. ఒక పదానికి వ్యుత్పత్తి, అర్థం, చరిత్ర చెప్పడానికి తోటి ద్రావిడ భాషలు కూయి, కువి, తొద భాషలు మొదలుకొని భారతీయ భాషలు దాటి ప్రపంచ భాషలదాకా వెళ్లిపోతారు. జక్కులే జెక్(స్లొవాకియా) దేశ నిర్మాతలుగా ప్రస్తావిస్తారు. 'ల'కారానికి నీళ్లు అని అర్థం చెపుతూ ప్రపంచ భాషలన్నిటిలోని 'ల'కార యుక్త గ్రామ నామాలను తీసుకొని అటువంటి గ్రామాలన్నీ జల వనరులు గల ప్రాంతంలో ఏర్పడ్డాయని అభిప్రాయ పడతారు. వీటిలో చర్చించవలసిన అంశాలు, పునఃపరిశీలించవలసిన అంశాలు ఉండవచ్చు కాని అవి రచయిత విస్తృత పఠనాన్ని మాత్రం సూచిస్తాయి. రచయితకు బి.యస్.రంగా 'తెనాలి రామకృష్ణ' సినిమా ఇష్టమూ, అభిమానపాత్రమూ కావడం సహజమే. గ్రంథంలోని ప్రధాన అధ్యాయాలు అన్నిటి ముందు ఆ సినిమాలోని కృష్ణదేవరాయల వేషంలో యన్‌టిఆర్ చిత్రాన్నీ, రామకృష్ణుడి వేషంలో ఏయన్నార్ చిత్రాన్నీ అమర్చారు.

భాష విషయంలో రచయితకు కొన్ని కచ్చితమైన అభిప్రాయాలున్నట్టు కనిపిస్తుంది. "ఉత్తమ గ్రంథాలు కేవలం చదువరుల వినోదం కోసమే కాక వారి భాషా పాటవాన్ని పెంపొందించడానికి కూడా దోహదం చేయాలి" అన్నది ఆయన విశ్వాసం. రచయిత 'కాలచక్ర గమనంలో భాషకి ప్రాధాన్యత తగ్గి, కేవలం భావ వ్యక్తీకరణ మాత్రమే ప్రాధాన్యత సంతరించుకుంది' అని బాధపడుతున్నారు. భాష భ్రష్టం అయిపోతున్నదనేది ఆయన బాధ. ఇది భాషా హననమనీ, మాతృభాషాభిమానులకు భాషా హననం తీవ్ర వేదనను కలిగిస్తుందనేది ఆయన విచారం. విధ్య, భాద, జనార్ధన, ఉచ్చారణ వంటి లేఖనాలు, ఉచ్చారణలు కొంచెం బాధ కలిగించే మాట నిజమే. భాషకు సంబంధించిన చర్చలోకి ప్రవేశించడం అంటే పద్మవ్యూహంలోకి ప్రవేశించడం. సంస్కృత విషయంలో మౌలిక పద స్వరూప దృష్టితోనూ, దేశ్య పదాలను పరిణామ దృష్టితోనూ చూడవలసి ఉంటుంది. సవ్య, అపసవ్యాల భావన ఈ అంశాల పైన ఆధారపడి ఉంటుంది. ఉద్దేశ్యం సవ్యమే. కాని ఉద్దేశం అపసవ్యం కాదు. రెండూ భిన్నార్థాలలో ప్రయోగాలలో ఉన్నాయి. సన్న్యాసం సత్ + న్యాసం కాదేమో. సం+ న్యాసం అనుకుంటాను. తలక్రిందులు తో పాటు ఆధునిక భాషలో తలకిందులు కూడా సవ్యమే. ప్రాత, క్రొత్తలు పాత, కొత్తలు, అయినట్టుగానే క్రింద కిందగా శతాబ్దాల కిందటే మారిపోయింది. తెలుగు దేశ్య విభాగంలో ఐ, అయ్ లకు, ఔ, అవ్ లకు భేదకత్వం లేదు. తెలుగులో ఐ, ఔ లు భిన్న వర్ణాలు కావన్నమాట. ఐదు/ అయిదు అని రెండు రకాలుగాను రాయడం లేఖన పర్యాయత మాత్రమే. అయిదు-వ లేక ఐదు-వ అన్న దానికి అయిదు వన్నెలు కలిగినది అని శబ్దరత్నాకరం అర్థం చెప్తున్నది. సువాసిని అని కూడా అర్థం. అయిదు-వ ను అయిదవ గా భావించి ఆ విధంగానే పలకడం అలవాటయి నాలుగవ, ఆరవ మొదలైన సంఖ్యావాచకాలలో పూరణార్థకమైన-అవ-ఓగా మారినట్టుగానే అయిదువతనం ఐదోతనంగా మారిపోయి ఉండాలి. ప్రస్తుతం మనం చేయగలిగిందేమీ లేదు. భావి(= బావి), ధారం (= దారం) కొన్ని మాండలికాలలో నాగరీకరణం (Hyper correction) చెందిన రూపాలు కావచ్చు. ఖర్మలోని మహా ప్రాణత కొన్ని సందర్భాలలో ఊనికకు సంబంధించిందిగా చెప్పవచ్చేమో

? రచయితకు తెలియని విషయాలుగా భావించి వీటినిక్కడ నేను పేర్కొనడం లేదు. బాధా నివారణ కోసం మరొక్కసారి జ్ఞాపకం చేయడమే నా ఉద్దేశం. వ్రాసే భాషకు, మాట్లాడే భాషకు దూరం తగ్గాలి అని రచయిత సవ్యంగానే భావిస్తున్నారు. కాని రాయడం అని నేను వ్రాయలేక పోతున్నానని కూడా అంటారు. గ్రంథంలో యిది, యిస్తే, యిచ్చి, వుండే, వుంది వంటి లేఖన క్రమాలు కనుపిస్తాయి. ప్రాచీన తెలుగులో గాని, ఆధునిక తెలుగులో గాని ఇ, ఈ, ఎ, ఏ లకు ముందు 'య'కారం, ఉ,ఊ, ఒ,ఓ లకు ముందు 'వ'కారం లేదు. ఉచ్చారణలో యశ్రుతి, వశ్రుతి వుంటాయి. అవి ప్రామాణిక లేఖనంలో ప్రవేశించవు. ఇవి తప్పొప్పులకు సంబంధించినవి కావు. పరిపాటి (Convention) కి సంబంధించిన విషయాలు. తాను సచివాలయంలో పని చేసేటప్పుడు తెలుగులోనే అధికార పత్రాలను తయారుచేసే సందర్భంలో 'ఆరక్షణ్', 'ఆభార్', 'గోపనీయ్' వంటి పదాలను ప్రవేశ పెట్టానని అంటారు రచయిత. వీటిని హిందీ పరిభాషల నుంచి స్వీకరించడం జరిగినదనడం స్పష్టం. ఒక దశలో అన్ని భాషలలోను సమానమైన అధికారిక పరిభాషలను ఉపయోగించాలనే ప్రయత్నం కేంద్ర ప్రభుత్వం ద్వారా హిందీ ఆధిక్యతా వాదులు చేశారు. దీన్ని భాషా శాస్త్రవేత్తలు వ్యతిరేకించారు. ప్రతి భాషకి ప్రత్యేక సంప్రదాయాలుంటాయిని, సంస్కృత పదాలే అయినా అర్థ పరిణామం వల్ల భిన్న భాషలలో భిన్నార్థాలు ఏర్పడి వుంటాయని హిందీలో వాడే పరిభాషను యథాతథంగా ప్రవేశపెట్టడం వల్ల భాషలు కృత్రిమంగా తయారవుతాయని వారు వాదించారు. ఆభార్ అనే దానికి 'కృతజ్ఞత' అని, గోపనీయం అనే దానికి 'రహస్యం' అని తెలుగులో వాడుకలో వుంది. ఆరక్షణ్ అనే దానికి సమానంగా 'ఆపుదల' అని ఉన్నవ లక్ష్మీనారాయణ ప్రయోగించాడు. రచయిత మనవి మాటల్ని 'ఆభారంతో' ముగించారు. మనవి మాటలు చదివిన తరువాత రచయిత రచనా శైలి, ధోరణి ప్రభావితం చేసి నన్ను ఇంతగా రాయించింది. ఈ విషయాలు గ్రంథం విలువను గాని, రచయిత కృషి ఫలితాన్ని గాని ఏమాత్రం తగ్గించవు.

చదువుకున్న మధ్యతరగతి, పై తరగతి జనం ప్రస్తుతం వినియోగదారీ సంస్కృతిలో జీవిస్తున్నారు. నడుస్తున్నది సాంకేతిక విజ్ఞాన యుగం. వేగం పెరిగి సహనం నశిస్తున్నది. సద్యః ఫలితాలనిచ్చే విద్యను, శిక్షణను చాలా మంది ఆశ్రయిస్తున్నారు. తక్కువ సమయంలో ఎక్కువ జీవికనిచ్చే జీవనోపాధి పొందడమే లక్ష్యంగా యువతరం సాగిపోతున్నది. మౌలిక విజ్ఞాన శాస్త్రాల అధ్యయనాలు, పరిశోధనలు మందగిస్తున్నాయి. భాషా, సాహిత్య అధ్యయన రంగంలో తగిన గ్రంథ పఠనం, ఓపికతో సామగ్రి సేకరణ చేసి చేసే పరిశోధనలు క్రమంగా తగ్గిపోతున్నాయి. ప్రాచీన సాహిత్య విషయం చెప్పనవసరం లేదు. తెలుగు అధ్యయన క్షేత్రంలో కాక వేరే వృత్తులలో ఉన్నవాళ్లు కొందరు తెలుగు సాహిత్యం, అందునా ప్రాచీన సాహిత్యం విషయంలో ఆసక్తి ఎక్కువగా చూపిస్తున్నట్టు కనిపిస్తుంది. వారిలో రవీంద్రనాథ్ గారు ఒకరు. ఆయన పట్టుదలతో, దీక్షతో చేసిన కృషి ఫలితమే ప్రస్తుత గ్రంథం. తన కృషికి తానే మురిసిపోతున్నట్టు రవీంద్రనాథ్ గారిలో ఉత్సాహం పరవళ్లు తొక్కుతూ ఉంటుంది. ఈ కృషి వృథా పోకూడదు. ముద్రణ పొంది తెలుగు అధ్యయన క్షేత్రానికి అందాలి. అధ్యేతృలోకం ప్రతిపాదిత అంశాలను, నిర్ణయాలను విస్తృతంగా చర్చించి అధ్యయనాన్ని మరింత ముందుకు తీసుకొని వెళ్లవలసి ఉంటుంది.

ఇం.నెం. 12-13-764,
కీమ్‌తీ గార్డెన్, స్ట్రీట్ నెం. 1,
తార్ నాకా, సికిందరాబాద్ - 500 017
ఫోన్ : 040-27007294

**-కె.కె.ఆర్.**
తేది 01-11-2006

# తెనాలి రామకృష్ణ కవిపై రవీంద్రనాథ్ గారి పరిశోధన

**డా॥ చేకూరి రామారావు,**

**పూర్వపు డీన్, ఉస్మానియా విశ్వవిద్యాలయం,**

**ప్రొఫెసర్ ఎమెరిటస్, భాషా శాస్త్రం (యు.జి.సి.)**

**హైదరాబాద్.**

తెనాలి రామకృష్ణ కవి గ్రంథాలు, చాటువులు, కథలు-తెలుగు సాహిత్యంతో పరిచయం ఉన్నవారందరికీ కాస్తో కూస్తో తెలిసినవే. వీటిలో కొన్ని మంచి పీఠికలతోనూ, వ్యాఖ్యానాలతోనూ పూర్వం వెలువడ్డవే. ఇప్పుడు మళ్ళీ తెనాలి రామకృష్ణుని గురించి చెప్పవలసిన విషయాలున్నాయా?

నేనూ ఈ పుస్తకం చదవకముందు అంతే అనుకున్నాను. అయితే ఈ పుస్తకం చేతపట్టుకొని ఒక రోజు ఈ రచయిత తెనాలి నుంచి హైదరాబాదులో మా ఇల్లు వెతుక్కుంటూ ఉదయం 9 గంటల ప్రాంతాలలో వచ్చారు. నేను ఎక్కడికో వెళదామని బట్టలు వేసుకొని కూర్చున్నాను. సుమారు రెండు గంటలసేపు తాను చేసిన పనుల గురించి ఈ రచయిత చెప్పారు. అప్పుడు కొంత అర్థమైనా పుస్తకం చదవటం ప్రారంభించిన తరవాత ఈయన పరిశోధన వెనక ఉన్న పట్టుదల, పరిశ్రమ,

శ్రద్ధ అర్థం అవుతూ వచ్చాయి. లోపలికి వెళుతున్నకొద్దీ నాకు సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. నిజం చెప్పొద్దూ. ఆయనో 'శ్రమ రాక్షసుడు' అనిపించాడు. ఏ విషయం మొదలు పెట్టినా ఒకచోట ఆగరు. భూప్రదక్షిణ చేసి వస్తారు. భూలోకంతో ఆగినా బాగుండు. విశ్వం అంతా చుట్టి వస్తారు. ఊరికే చుట్టిరావటం కాదు. ఒళ్లంతా కళ్ళుచేసుకొని పరిశీలిస్తారు.

నేను నాలుగున్నర దశాబ్దాలకిందట ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ (తెలుగు) చదువుకున్నాను. దిగ్గంతుల వద్ద చదువుకున్నానన్న కించిద్గర్వం కూడా ఉండేది. గంటి జోగి సోమయాజులు, కాకర్ల వేంకటరామ నరసింహం, దువ్వూరి వేంకటరమణ శాస్త్రి, భద్రిరాజు కృష్ణమూర్తి, యస్వీ జోగారావు, కొర్లపాటి శ్రీరామమూర్తి వంటి పండితులు మామూలు వాళ్లు కారు. ఆ రోజులు తల్చుకుంటే ఒళ్లు గగుర్పొడుస్తుంది. అంతకుముందే ప్రాచీనాధునిక తెలుగు సాహిత్యంపైనా, ఛందోవ్యాకరణాలపైనా ఆసక్తి ఉండేది. అది అక్కడ పరిపూర్ణంగా వికసించింది. తరవాత అమెరికా వెళ్లి భాషాశాస్త్రం చదువుకొని డాక్టరేటు పుచ్చుకొని తిరిగివచ్చాను - ఇంత నేపథ్యం ఉన్న నాకు రవీంద్రనాథ్ గారి పుస్తకం చూస్తే కళ్లు తిరిగిపోయాయి. మరీ ముఖ్యంగా ఏ నేపథ్యం లేకుండా తెనాలి రామకృష్ణుడి అభిమానిగా ఆయన పుస్తకాలు కొనుక్కొని సరిగా అర్థం కాక అప్పుడు ప్రాచీన గ్రంథాలు, నిఘంటువులు సంపాయించి శ్రమపడి భాషనేర్చుకొని అప్పుడు పరిశోధన ప్రారంభించారు. సుమారు అర్ధ శతాబ్దంపైగా భాషాసాహిత్యాలను పరిస్తూ ఉన్నా ఇంత పాండిత్యం నాకు అబ్బలేదు. అంతే కాదు. రామకృష్ణుని పద్యాలేకాక ఆయన ఎదుర్కొన్న సమస్యల పద్యాలను కూడా ఈయన వ్యాఖ్యానించారు. "రాజనందన రాజరాజాత్మజులు సాటి" అని సీసపద్య పాదాల్లోనూ, "భావభవభోగ సత్కళా భావములను" అని ఎత్తుగీతిలోనూ పునరుక్తమైనట్టు కనిపించే పద్య భాగాలకు ఇంతవరకు ఎవరూ అర్థాలు చెప్పినట్టు నాకు తెలీదు. అయితే రవీంద్రనాథ్ మొదటిసారి వీటికున్న అర్థభేదాలను వివరించారు.

విషయాల ప్రసక్తి వస్తే చాలు - వాటి వివరాలన్నీ ఇస్తారు. 'పాండురంగ మాహాత్మ్యం'లో (3-61) 'పంటది' అనే మాటకు 'ఆ కాపు స్త్రీ' అని అర్థం ఇచ్చి కాపులు అన్న పదం ఎవరెవరికి ఎట్లా వాడతారో వివరించారు. ఈ మాటను రెడ్లు, వెలమలు మొదలైన శూద్రులందరికీ సామాన్యార్థకంగానూ వాడతారని వివరించారు. చెట్లు, పూలు వంటి వాటి ప్రసక్తి వస్తే వాటి వృక్షశాస్త్ర సంబంధి సాంకేతిక పదాలు, జంతువుల పేర్లు వస్తే జంతుశాస్త్ర సంబంధి సాంకేతిక నామాలను సూచిస్తారు. పశువులకు వచ్చే గాలికుంటు వ్యాధి ప్రసక్తి వచ్చినప్పుడు దాని లక్షణాలు, ఈ రకమైన ఇతర వ్యాధులు, వాటి లక్షణాలు వివరిస్తారు. పసుపు, వేప చిగుళ్ల ప్రసక్తి వచ్చినప్పుడు వాటి వైద్యగుణాలన్నిటినీ వివరిస్తారు. పాల సముద్ర వర్ణన గురించిన పద్య (పాండు. 3-142) వర్ణనలో గృహనిర్మాణ సమాచారాన్ని లాగుతారు. ఋతువర్ణనలు వచ్చినప్పుడు ప్రతి ఋతువులోని విశేషాలను వివరాలను ఇస్తారు. అట్లాంటి విశేషాలను గురించి వేసవి వర్ణన వివరణలో ప్రత్యేకంగా చూడండి. ఇక్కడ పానకం ప్రసక్తి తెచ్చి ఇచ్చిన వివరణ ప్రకృతివైద్యం *(Naturopathy)* పద్ధతికి ఒక చేర్పు.

పాండురంగ మాహాత్మ్యానికి పూర్వవ్యాఖ్యలున్నాయి. వాటితో రవీంద్రనాథ్ గారి వ్యాఖ్యల్లో విశేషాన్ని పోల్చుకొని చూసుకోవచ్చు. ఇలాంటి విశేషాలే మిగతా అన్ని అధ్యాయాల్లోనూ గమనించవచ్చు.

రామకృష్ణుని గురించి ప్రచారంలో ఉన్న కథల లోతుల్లోకి ఐదో అధ్యాయంలో వెళ్లారు. ఆ కథల నిజానిజాలను సహేతుకంగా చర్చించారు. అందుకు పనికివచ్చే పోర్చుగీసు రచయితల రాతల్ని పరిశీలించారు. ఆ సందర్భంగా గ్రీకు పురాణ గాథల్ని కూడా ఉదాహరించారు.

రామకృష్ణుడి చారిత్రకాంశాల్లో కనిపించే వైరుధ్యాలను 'చరిత్ర చిక్కుముడి' పేరుతో ఆరో అధ్యాయంలో చర్చించారు.

ఆ సందర్భంగా విశ్వబ్రాహ్మణుల స్థితిగతుల గురించి వివరించారు. ఈ అధ్యాయంలో రవీంద్రనాథ్ గారు ఆంగ్ల గ్రంథాలతో సహా దొరికే అన్ని ఆధార గ్రంథాల నుంచి సమాచార సంగ్రహణ చేశారు. ఈ అధ్యాయాన్ని రామకృష్ణ కవి జీవితంగా వేరే ఒక పుస్తకమే వేయవచ్చు. అయితే ప్రతి అధ్యాయానికీ అదే స్థితి ఉంది. ఈ అధ్యాయాన్ని రాస్తున్నప్పుడు రచయిత భావోద్వేగాన్ని చెంది ఉంటారు. అధ్యాయాంతంలో అక్షర నీరాజనాలుగా ఏడు పద్యాలు రచించారు. ఆ పద్యాలన్నీ విశేష వృత్తాలు కావటం విశేషం. ఈ పద్యాలలో కొన్నింట ఆదిప్రాసం ఉంటే మరికొన్నింట అంత్యప్రాసం ఉంది.

పైవన్నీ ఒక ఎత్తు అయితే, ఈ గ్రంథానికి రచయిత కూర్చిన అనుబంధాలన్నీ మరో ఎత్తు. రామకృష్ణ కవి పేర్కొన్న నదుల గురించి మొదటి అనుబంధంలోనూ, వైఖానసుల గురించి రెండో అనుబంధంలోనూ సోపపత్తికంగా చర్చించారు. రామకృష్ణ కవి రచనలలో సారూప్యతలను గురించి మూడో అనుబంధంలో చర్చించారు. ఈ చర్చవల్ల ఈ రచనలన్నీ ఒకరివేనని గుర్తించగలుగుతాం. నాలుగో అనుబంధంలో ఆళ్వారుల గురించి, దివ్య తిరుపతుల గురించి సమాచారం ఉంది. అలకాపురి, యక్షులు, జక్కులు, కుబేరుడు అనే అయిదో అనుబంధం మరో పరిశోధక గ్రంథం లాంటిదే. ఆరో అనుబంధంలో చకోరపక్షిని గుర్తించటం విశేషం. ఇది చదివేవరకు నేను చకోర పక్షికూడా కవి కల్పితమనే అనుకునేవాడిని. పేరుపేరునా చెప్పటం ఎందుకు? ప్రతి అనుబంధంలోనూ ఏవో విశేషాంశాలు కనిపిస్తూనే ఉన్నాయి.

భాషాశాస్త్రంలో ఇట్లాంటి ఉదాహరణ ఒకటి ఉంది. నోఅమ్ ఛామ్‌స్కీ *(Noam Chomsky)* ప్రతిపాదించిన పరివర్తన వ్యాకరణ సిద్ధాంతాన్ని *(Transformational Theory)* విస్తృతపరుస్తూ జార్జి లేకాఫ్ *(George Lakoff)* అనే శాస్త్రవేత్త 1965లో 'వాక్యనిర్మాణ అపక్రమాలపై' *(On the Nature of Syntactic irregularity)* అనేసిద్ధాంత వ్యాసాన్ని ప్రకటించాడు. ఆ సిద్ధాంత వ్యాసంలోని అనుబంధాలకు సిద్ధాంత వ్యాసాన్ని మించిన పేరు వచ్చింది. చాలా మంది భాషాశాస్త్ర పరిశోధకులు తరచుగా ఈ అనుబంధాలను ఉదాహరిస్తూ వచ్చారు. రవీంద్రనాథ్ గారి అనుబంధాలు పై సంఘటనను గుర్తుచేస్తున్నాయి.

విశ్వవిద్యాలయాలలో పరిశోధన స్థాయి పడిపోతున్న ఈ సమయంలో రవీంద్రనాథ్ గారి ఉన్నత స్థాయి పరిశోధన రావటం పరిశోధకులకు మార్గదర్శకంగా ఉండబోతుందని ఆశ కలుగుతున్నది. ఒకనాటి వేటూరి ప్రభాకర శాస్త్రి, కోరాడ రామకృష్ణయ్య, జి.వి. కృష్ణారావు గార్ల స్థాయి పరిశోధకులుగా రవీంద్రనాథ్ గారు కనిపిస్తున్నారు.

అయితే రవీంద్రనాథ్ గారితో నేను పూర్తిగా అంగీకరించలేని కొన్ని విషయాలను కూడా చెప్పటం నా ధర్మం.

రవీంద్రనాథ్ గారు హేతువాది. అన్నిటినీ హేతువాద దృష్టితోనే వ్యాఖ్యానించాలనుకుంటారు హేతువాదులు. అందుకే చాలాచోట్ల "ఇది అంధ విశ్వాసం. ఇది అశాస్త్రీయం" అనే మాటలు చాలా తరచుగా వాడుతుంటారు. ప్రజల నమ్మకాలను శాస్త్రీయం, అశాస్త్రీయం అని చూస్తే వాటి తత్వం అర్థం కాదని నా నమ్మకం. విశ్వాసాలకు సాంఘిక జీవనంలో ప్రత్యేక ప్రయోజనాలున్నాయి. వాటికి ప్రత్యేక ప్రతిపత్తి ఉంది.

రచయిత కొన్ని చోట్ల చాలా అద్భుతమైన సమాచారం ఇచ్చారు. ఉదాహరణకు 'పాండురంగ మాహాత్మ్యం'లో 4-124 పద్యాన్ని వ్యాఖ్యానిస్తూ పాములను గురించి, పాముకాటు గురించి, మంత్రాల గురించి చాలాచాలా విషయాలు చెప్పారు. సాహిత్య పఠనానికి ఇవన్నీ అవసరమా?

ఆరో అధ్యాయంలో ధర్మవ్యాధుడు, కాళిదాసు, కబీర్, భట్టుమూర్తి వంటి కొన్ని ఉదాహరణలను పేర్కొని

రచయిత ఇలా అంటారు, 'ప్రసిద్ధి చెందిన పండితులనూ, కవులనూ తమ ఖాతాలో వేసేసుకొనడం అనే అలవాటు బ్రాహ్మణ పండితులలో అనాదిగా ఆచారంగా వస్తున్నది.' కొందరు కొన్ని సందర్భాలలో చేసిన పనులను సామాన్యీకరించటం *(Generalisation)* తగదు. ఇలాంటి వ్యాఖ్యలు ఈ స్థాయి పరిశోధన గ్రంథంలో ఉండదగినవి కావని నా అభిప్రాయం.

ఈ సన్నాయి నొక్కులకేం గాని, రవీంద్రనాథ్ గారి ఉత్తమ పరిశోధన గ్రంథాన్ని చదవటం ఒక మధురానుభవం. ఎంతో నేర్చుకున్నాను. కొత్త విషయాలు ఎన్నో తెలిశాయి. ఈ అనుభవాన్ని పాఠకులతో పంచుకోవటం కోసమే ఈ చిరుపీఠిక. ఇందుకు రవీంద్రనాథ్ గారికి కృతజ్ఞతలు

**- చేరా**

**2006 నవంబర్ 2.**

**ఇం.నెం. 1-4-24/1,**
**ప్లాట్ నెం. 22, స్ట్రీట్ నెం. 7,**
**హబ్సిగూడా, హైదరాబాద్.**
**ఫోన్: 040-27152440**

# అభినందన

**డా॥ కొప్పుల హేమాద్రి,**
B.Sc.,(Chemistry), B.Sc., (Botany) Hons., Ph.D. (Systematic Botany) (Bombay University)

రెండు నెలల క్రితం ఓ ఉదయాన రవీంద్రనాధ్ గారు మా యింటికి వచ్చారు. ఆయన చేతిలో 'తెనాలి రామకృష్ణ కవి - శాస్త్రీయ పరిశీలన' అనే గ్రంథం తాలూకు చిత్తు ప్రతి వుంది. "హేమాద్రి గారూ! మీతో ఒక గంటసేపు నా యీ రచన గురించి, ముఖ్యంగా ఇందులో తెనాలి రామకృష్ణ కవి ప్రస్తావించిన వృక్ష, లత, గుల్మాదుల గురించి, వాటికి నేను చేసిన శాస్త్రీయ విశ్లేషణల గురించి ముచ్చటించి నాకు వున్న కొన్ని అనుమానాలను నివృత్తి చేసుకోడానికి వచ్చాను" అన్నారు.

రవీంద్రనాధ్ గారు తెనాలి వాస్తవ్యులు. రామకృష్ణ కవి సరే సరి! రవీంద్రనాధ్ టూకీగా తాను యీ గ్రంధాన్ని వ్రాయడానికి గల కారణాలను,

---

డా॥ హేమాద్రి గారు వృక్ష వర్గీకరణ శాస్త్రంలో, ప్రత్యేకించి ఔషధ వృక్ష శాస్త్రం *(Medical Botany)* లో నిష్ణాతులు గిరిజన వైద్యంపై వీరెన్నో పరిశోధనలు చేశారు *'Medical Botany', 'Tribal Medicine'* వగైరా ఎన్నో ఆంగ్ల గ్రంధాలు, తెలుగులో 'ఆంధ్ర ప్రదేశ్‌లో మందుమొక్కలు', 'ఆంధ్ర ప్రదేశ్‌లో వనమూలికలు', 'వనౌషధీ సుభాషితాలు', 'ఔషధీ వృక్షశాస్త్రం' వగైరాలు వీరి రచనలు ఈ రంగంలో వీరు నిత్య కృషీవలులు. ప్రస్తుతం కూడా వీరి కొన్ని గ్రంధాలు ముద్రణ దశలో వున్నాయి

అనుసరించిన పద్ధతిని వివరించి అక్కడక్కడ చదివి వినిపించడం మొదలుపెట్టారు. ముఖ్యంగా నైమిశారణ్యం, శేషాచలం- వీటి వర్ణనల్లో రామకృష్ణుడు అనేక పూల మొక్కల గురించి పండ్ల జాతుల గురించి ఉటంకించాడు. వాటిలో సంస్కృతం, తెలుగు పేర్లతో ఉన్న కొన్ని మొక్కల సరియైన శాస్త్రీయ నామాలను రవీంద్రనాథ్ సేకరించగలిగారు. నాకు తెలిసినంత వరకు కొన్నిటి పేర్లపై ఆయనకున్న అనుమానాలను తీర్చగలిగాను. మరికొన్నిటిపై ఉన్న సందిగ్ధాలు సుదీర్ఘ చర్చల అనంతరమే ఒక కొలిక్కి వచ్చాయి. ఇలా, ఉదయం ఎనిమిదిన్నర ప్రాంతంలో వచ్చిన రవీంద్రనాథ్ ఏకధాటిగా మధ్యాహ్నం రెండున్నర గంటల వరకు కూర్చున్నారు. ఇది ఆయన కార్య దీక్షకు ప్రతీక !

ఈ రచయితతో నా పరిచయం కొద్దిదే అయినా ఇప్పటిది కాదు. పదేళ్ల క్రిందట అనుకుంటాను. ఓసారి మా యిల్లు కనుక్కుని వచ్చి, తనను తాను పరిచయం చేసుకుని, తనకు బాల్యం నుంచీ ప్రకృతి అంటే - ప్రత్యేకించి వృక్ష వర్గీకరణ శాస్త్రమంటే విపరీతమైన మక్కువ అనీ, తాను చూసిన కొన్ని వృక్షాల సాంకేతిక నామాలు, వర్గీకరణ విషయమై తనకున్న కొన్ని అనుమానాలు నివృత్తి చేయాలని కోరారు. పని వత్తిడిలో ఉన్న నేను కించిత్తు విసుగుదలను ప్రదర్శిస్తూ, "వాణిజ్య పన్నుల శాఖలో డి.సి.టి.ఓ గా పనిచేసే మీకు వృక్షాల సాంకేతిక నామాలతో పనేమిటి ?" అని ప్రశ్నించాను సాధికార స్వరంతో. దానికాయన అరుదైన వృక్ష జాతులు, అంతరించి పోతున్న వృక్ష జాతుల పట్ల తనకు మొదట్నుంచీ ఆసక్తి మెండని చెపుతూ కొండపల్లి అడవులలోని మయూర శిఖ *(Maiden Hair Fern - Adiantum venustum)* , తమ తెనాలి ప్రాంతంలో అరుదైన కేవు కిన్న లేక కేవు కంద *(Costus speciosus)* , పెద్దపాల లేక నూగుపాల *(Wrightia tomentosa)* వృక్షాలతో సహా డజన్లకొద్దీ వృక్షాల సాంకేతిక నామాలను చెపుతూండడంతో నేను అవాక్కయ్యాను. ఆయనలోని నిజాయితీ, అంకితభావం, తపన నాకు ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఎప్పుడో ఇంటర్ స్థాయిలో ప్రకృతి శాస్త్రాలు చదివినా, గణితం, భౌతిక, రసాయనిక శాస్త్రాలతో బీయస్సీ చదివిన ఆయన డిగ్రీ స్థాయిలో ఎటువంటి వృక్ష శాస్త్ర నేపథ్యం లేకున్నా కేవలం ప్రకృతి పట్ల మక్కువతో, స్వయం కృషితో, నిశిత పరిశీలనతో అంతటి విస్తారమైన వృక్ష జాతుల, వాటి శాస్త్రీయ నామాల పరిజ్ఞానం పొందగలగడం నాకు ఆశ్చర్యం కలిగించింది. నేను కొంచెం ఆసక్తి కనబరచి, "కేవు కిన్న, పెద్దపాల చెట్లు మీ తెనాలి ప్రాంతంలో వున్నాయా ? మీరు వేటిని చూసి ఏవనుకుంటున్నారో ?" అన్నాను సందిగ్ధంగా. తాను వాటిని చూడడమే కాదు - ఫోటోలు కూడా తీశానని ఘంటాపథంగా చెప్పారాయన.

రెండవ రోజు ఆయన తాను తీసిన వందలాది ఫోటోగ్రాఫుల ఆల్బమ్‌లతో ప్రత్యక్షమయ్యారు. తన ప్రాంతపు వృక్ష జాతులపై ఆయన వ్రాయ తలపెట్టిన గ్రంథం కొరకు ఆ ఫోటోలు తీసినట్లు చెప్పారు. వాటిలో నాణ్యత పరంగా కొన్ని ఫోటోలు ముద్రణకు పనికి రావని చెపుతూ, డిజిటల్ కెమెరా వాడమని సలహా యిచ్చాను. కేవు కిన్న, నూగుపాల చెట్లను ఆయన సరిగానే గుర్తించగలిగినట్లు ఆయన తీసిన ఫోటోలు చూస్తే అర్థమయింది. హస్తిశుండి *(Heliotropium indicum)* మొక్క సాంకేతిక నామం, మరికొన్ని మొక్కల సాంకేతిక నామాలు ఆయన తెచ్చిన ఫోటోల వెనుక పక్క వ్రాసి యిచ్చాను. ముందుగా మొక్క యొక్క ఖచ్చితమైన సాంకేతిక నామం నిర్ధారించుకుని ఆ తరువాత *Materia Medica* తదితర గ్రంథాల సాయంతో ఆ మొక్క యొక్క ఔషధ, ఉపయోగితా విలువలను గురించి తెలుసుకుంటున్నట్లు చెప్పారాయన. ఆయనది తపనతో, స్వయం కృషితో చేసే సుదీర్ఘ ప్రయాణమనిపించింది. తన రోజువారీ ఉద్యోగ బాధ్యతలు చూసుకుంటూనే, వృత్తి రీత్యా వృక్ష శాస్త్రజ్ఞులైన వారితో పోటీ పడే రీతిలో వివిధ వృక్ష జాతులను గుర్తించడానికి దృఢ దీక్షతో తాను స్వయంగా సముపార్జించిన పరిజ్ఞానం ఆధారంగా ఆయన చేస్తున్న కృషిని మనస్సులోనే

అభినందించకుండా ఉండలేక పోయాను.

ఉద్యోగ రీత్యా బదిలీ అయి పశ్చిమ గోదావరి, తూర్పుగోదావరి జిల్లాలలో పనిచేసి తిరిగి బదిలీపై ఉయ్యూరు సి.టి.ఓ.గా వచ్చిన ఆయన యిన్నేళ్ల తరవాత యీ ఉద్గ్రంధంతో ప్రత్యక్షమైతే అది అప్పుడాయన చెప్పిన 'తెనాలి ప్రాంత వృక్ష సంపద' పైని గ్రంధమేననుకున్నాను. తీరా చూస్తే - అది సాహిత్య విమర్శకు సంబంధించిన గ్రంథం. స్థూలంగా పరిశీలిస్తే రామకృష్ణ కవి తన కావ్యాలలో సందర్భవశాత్తూ ప్రస్తావించిన అనేక వృక్ష, జంతు, పక్షి జాతులను రచయిత శాస్త్రీయంగా విశ్లేషించి వాటి వివరాలను ఎక్కడికక్కడ సన్న ఫాంటులో యిచ్చారు. ఆయన కోరిక మేరకు వృక్ష శాస్త్ర సంబంధిత సమాచారం వరకు మాత్రం నేను ఆమూలాగ్రం నిశితంగానే పరిశీలించాను. కొన్ని సవరణలు ప్రతిపాదించాను వాటినాయన కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరించారు. సమయాభావం వలన నేనీ గ్రంథం పూర్తిగా చదువలేదు. నా గ్రంథాల ముద్రణ పర్యవేక్షణలో నిమగ్నమై వున్న కారణంగా కొన్ని అధ్యాయాలు మాత్రమే పూర్తిగా చదవగలిగాను. సాహిత్య రంగంలో ప్రసిద్ధులైన ముగ్గురు పండితులు యీ గ్రంథానికి వ్రాసిన పరిచయ వాక్యాలు చదవడం ద్వారా యీ గ్రంథం ప్రత్యేకత నాకు మరింతగా బోధ పడింది. ఏ రంగంలోనైనా ఔత్సాహికులు *(Amateurs)* తపనతో చేసే అత్యుత్తమ కృషికి చక్కటి ఉదాహరణగా ఈ గ్రంథం నాకు కనిపించింది.

రవీంద్రనాథ్ ఒక రచయిత మాత్రమే కాదు. చక్కగా చదివి వినిపించగల నేర్పరి ! ఆయన మా యింటికి వచ్చే సరికి నా శ్రీమతి కృష్ణవేణి పూజా కార్యక్రమంలో వుంది. రవీంద్రనాథ్ పరనా సరళికి ఆకర్షితురాలై ఆ కార్యక్రమాన్ని ప్రక్కనబెట్టి వీరి 'పురాణ శ్రవణం' పై మనసు మరల్చుకున్నది ! రచయితకున్న విశ్లేషణా పటిమ అటువంటిది మరి !

ఏతా వాతా, యీ రచన అపురూపమైన, అమూల్యమైన పరిశోధనా గ్రంథంగా నిలుస్తుంది. రవీంద్రనాథ్ గారు యిటువంటి సరికొత్త ప్రయోగాలతో మరిన్ని రచనలను మనకు అందిస్తారని ఆశిస్తూ... మనసారా అభినందిస్తున్నాను.

విజయవాడ-8

4-11-2006

**- కొప్పుల హేమాద్రి**

రెసిడెన్స్ : ☎ 0866-2541711

సెల్ : 98482 96865

# ఆకాంక్ష

**శ్రీ ముదిగొండ వీరభద్రయ్య** I.A.S.,

**మేనేజింగ్ డైరెక్టర్, ఎ.పి. రాష్ట్ర సహకార బాంక్ లి.**

(APCOB), **హైదరాబాద్.**

శ్రీ ముత్తేవి రవీంద్రనాథ్‌గారితో నా పరిచయం 1994 వ సంవత్సరంలో. అప్పుడు నేను విజయవాడలో వాణిజ్య పన్నుల డిప్యూటీ కమీషనర్‌గానూ, వారు కంచికచెర్లలో డి.సి.టి.ఓ.గానూ పనిచేయడం జరిగింది. ఈనాడు నాకు తెలిసిన ఆయనలో ఉన్న లక్షణాలు, ఈ సాహితీతృష్ణ అప్పట్లో నా దృష్టికి రాలేదు. ఆయనను కేవలం ఒక సమర్థుడైన అధికారిగా మాత్రమే ఆ రోజులలో నేనెరుగుదును. అనుకోని రీతిలో అక్టోబర్ 2005లో ఆయన ఒకరోజు ఫోన్‌చేసి 'నేను మీతో కలిసి మాట్లాడవలసిన విషయం ఒకటున్నదని చెప్పినప్పుడు, నేను అది సాహిత్యపరమైన విషయమని ఏమాత్రం ఊహించలేదు. అనంతరం ఆయన నన్ను కలిసి తాను చేసిన కృషి గురించి, అంటే తెనాలి రామకృష్ణుని కావ్యముల శాస్త్రీయ విశ్లేషణ గురించి వివరించి, నాతో కొన్ని విషయాలు చర్చించినప్పుడు నాకొక దివ్యానందానుభూతి కలిగింది. దీనికి ఆయన శైలి, విషయాలను ఆయన వివరిస్తున్న తీరు నచ్చడం మాత్రమే కాక ముఖ్య కారణం మరొకటి ఉంది. అది - రామకృష్ణ కవిచే రచింపబడిన మా వంశ మూలపురుషుడు ఉద్భటారాధ్యుని చరిత్రము యొక్క వ్యాఖ్య కూడా ఇందులో ఉందని ఆయన ముందుగానే చెప్పడం కొంతవరకు కారణం కావచ్చును.

ఆయన వ్రాసిన విశ్లేషణ ఆసాంతమూ ఆసక్తిగా చదివిన తరువాత ఒక

వాణిజ్య పన్నుల అధికారికి ఇంతటి సాహిత్య పిపాస ఉండడమేమిటని ఆశ్చర్యం కలిగింది. సాధారణంగా ఎవరైనా ఏదైనా శ్రమ లేక పరిశ్రమ చేసినా అది తాముచేసే ఉద్యోగంలో పదోన్నతికోసమో లేక తమ ఆదాయాన్ని పెంపుదల చేసుకొనడానికో ఉద్దేశింపబడి ఉంటుంది. చాలా తక్కువమంది మాత్రమే ఇటువంటి ఆలోచనలు లేకుండా కేవలం తమ అభిరుచి, ఆసక్తిమేరకు శ్రమించడం జరుగుతుంది. ప్రస్తుత రచన ఆయనకు సాహిత్యంపట్ల గల ఉత్తమాభిరుచికి తార్కాణం.

ఇక రచయిత చేసిన విశ్లేషణల విషయానికొస్తే, ఏ ప్రకారమైతే రామకృష్ణ కవి ఆలోచనా పటిమ పరిణతితో కూడిన మార్పు చెందుతూ వచ్చిందో కావ్యాలన్నింటినీ అదే క్రమంలో చేపట్టారు. రామకృష్ణునివంటి నాటి శివారాధక కవులు కొందరు వైష్ణవ కథావస్తువులు తీసుకొని సమగ్రమైన కావ్యరచన చేసి నాటి ప్రభువులను, ప్రజలను మెప్పించారు. ఇదే కోవలో శ్రీమదాంధ్ర మహా భాగవతమును వెలయించిన పోతన మహాకవి కూడా వస్తుతః శివారాధకుడై ఉండి కూడా తన రచనలో వైష్ణవ భక్తిని కురిపించాడు. (వాస్తవానికి నూనూగు మీసాల నూత్న యౌవనంలో అడుగిడే వరకు బమ్మెర పోతన వీర శైవుడే. వీరశైవుడైన ఇవటూరి సోమనాధుడనే తన గురువు ఆదేశం మేరకు పోతన 'వీరభద్ర విజయము' అనే కావ్యాన్ని తన యౌవన పూర్వ దశలోనే రచించి బాలకవిగా ప్రసిద్ధికెక్కాడు.) దీనికి కారణాలు ఏమై ఉంటాయని మనం ఈ రోజు ఊహించడం కష్టం. వారు ఎంచుకున్న కథా వస్తువును ఒక నిముషం పక్కనబెట్టి ఆ కావ్యాలలో వారు తెలిపిన ఇతర విషయాలు - అనగా ప్రకృతి వర్ణనలు, నాటి సామాజికార్థిక స్థితిగతులు, సామాజిక శ్రేయస్సును కోరి వారు చేసిన సూచనలు వగైరాలు పరిశీలిస్తే, ఈ విషయాలన్నీ కథావస్తువుకు అతీతంగా ఆ కవులు తమ రచనలలో ప్రస్ఫుటింపజేశారని అర్థమౌతుంది. ఆ విధంగా కథావస్తువు శివభక్తిపరమైనా, విష్ణుభక్తిపరమైనా కావ్యపరంగా కవి చెప్పే ప్రధాన విషయాలు కథావస్తువుకు అతీతమైనవి. కథావస్తువు కేవలం ఆనాటి పాలకులను మెప్పించడానికో లేక ఎక్కువమంది పాఠకులను ఆకర్షించడానికో ఎంచుకున్నా పాఠకులకు తాము తెలుపదలచిన, పైన పేర్కొన్న అంశాలపై ఎట్టి ప్రభావం పడకుండా ఆయా కవులు తమ అభిప్రాయాలను విస్పష్టంగా తెలియజేయడం విశేషం!

'ఉద్భటారాధ్య చరిత్రము'లో కవి ప్రమథేశ్వరుడనే రాజు ముంజభోజుని జననం సందర్భంగా పంజరాలలో బంధించబడిన పక్షులను, చెరసాలలలోని బందీలను, ఏనుగులను విడిపించిన ఉదంతాన్ని, భూరి దానధర్మాలు చేయడం, పగవారిని సైతం సమాదరంగా అనుగు చెలులలా తన నట్టింటికి పిలిచి సత్కరించడం వగైరాలు చేశాడని పేర్కొన్నాడు. అలాగే ఆ రాజు తన కుమారుడైన ముంజభోజునికి రాజనీతిని బోధిస్తూ 'గోపకుడు ఆవును మెల్లగా సవరిస్తూ, చల్లచల్లగా పాలు పిదుకుకున్నవిధంగా ప్రజల మనస్సులు నొచ్చుకొనని విధంగా పరిపాలిస్తూ ధర్మబద్ధంగా వ్యవహరిస్తూనే సంపదలు (పన్నులు వగైరాల ద్వారా) పొందమని' పరిపాలకులకు చక్కటి రాజనీతి సూత్రం తెలిపాడు కవి. అలాగే రాజు సతీసమేతంగా కాశీయాత్రకు బయలుదేరి వెళ్ళేముందు ఆయన తీసుకున్న ముందు జాగ్రత్త చర్యలను కూడా విపులంగా వివరించాడు కవి. ఈ సమాచారాన్ని ఈ రచయిత తన విశ్లేషణలలో చాలా చక్కగా వివరించారు (చూ. పేజీలు 25, 51, 56). 'ఉద్భటారాధ్య చరిత్రము' యొక్క వ్యాఖ్యలో రచయిత విశ్లేషించిన 'నైమిశారణ్య వర్ణన', 'పాండురంగ మాహాత్మ్యము'లో (పేజీ. 227) వర్ణించబడిన నాటి ఆహార విశేషాల వర్ణన ఈ కోవకే వస్తాయి. అలాగే 'శ్రీ ఘటికాచల మాహాత్మ్యము'లో 'శేషశైల వర్ణన' (పేజీ. 335)లో కూడా ఇదేతరహా ప్రకృతి వర్ణనలను కవి చేశాడు. వీటన్నిటినీ అతి నైపుణ్యంతో విశ్లేషించి, ఈ రచయిత వాటికి మరింత విలువనూ, వైశిష్ట్యాన్నీ జోడించారు. నాటి సామాజిక ఆర్థిక పరిస్థితుల

నేపథ్యంలో రచించబడిన ప్రాచీన కావ్యాలను నేటి ప్రమాణాలు, దృక్పథం ఆధారంగా అంచనా వేయడం, శాస్త్రీయ దృష్టితో విశ్లేషించబూనడం చాలా జటిలమైన పనే. ఈ రచయిత యొక్క ఈ ప్రయత్నమును అభినందించి తీరాలి.

ఈ గ్రంథం ముందుతరాల విశ్లేషకులకు మార్గదర్శకంగానే కాక సామాన్య పాఠకులకు సైతం హృదయరంజకంగానూ ఉండగలదని నా విశ్వాసం. ఈ విశ్లేషణాత్మక రచన చదివి ఆనందానుభూతి, ప్రయోజనం పొందిన ప్రతి ఒక్కరూ వారి వారి అభిప్రాయాలను రచయితకూ తెలిపి వారిని మరిన్ని ఈ తరహా రచనల దిశగా ప్రోత్సహించడం ఉచితమని నా భావన. ఈ రచయితకు రచనావ్యాసంగం ఈ రోజున అభిరుచే అయినా రేపటికి అదో పూర్తికాలపు వ్యాపకం కాగలదనిపిస్తున్నది.

కేవలం 1994 నాటి పరిచయాన్ని గుర్తుంచుకుని ఈ నాలుగు మాటలూ వ్రాసి ఈ గ్రంథంపై నా అభిప్రాయాన్ని తెలిపే అవకాశాన్నిచ్చిన శ్రీ ముత్తేవి రవీంద్రనాథ్‌గారికి నా కృతజ్ఞతలు. వారు భవిష్యత్తులో ఈ తరహా విశ్లేషణాత్మక గ్రంథాలు మరిన్ని రచించి సాహితీ సేవచేయాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

**- ముదిగొండ వీరభద్రయ్య**

**తే: 04-12-2006**

# తెనాలి రామకృష్ణ కవి - శాస్త్రీయ పరిశీలన

తెనాలి తన యింటిపేరు కాకున్నా అదే యింటిపేరన్నంతగా ప్రసిద్ధికెక్కి తన పేరుతో పాటు తెనాలి కీర్తినీ అజరామరం చేసిన గుంటూరుజిల్లా తెనాలికి చెందిన అనర్ఘ రత్నం, కవికుల శ్రేష్ఠుడు అయిన 'వికటకవి' తెనాలి రామకృష్ణుని జీవిత విశేషాల్నీ, వైదుష్యాన్నీ క్లుప్తంగానైనా స్మరించుకొనడం యీ పుస్తకం లక్ష్యం.

ఇక ఈ గ్రంథం కూర్పు విషయానికి వస్తే - సౌలభ్యం కోసం మొత్తం గ్రంథాన్ని ఆరు అధ్యాయాలుగా విభజించాను. అవి

**1. కుమారభారతి :** తెనాలి రామకృష్ణునిగా అనంతర కాలంలో సుప్రసిద్ధుడైన ఈ కవి తొలిదశలో శైవుడు. ఆయన అసలు పేరు గార్లపాటి రామలింగయ్య. శివ కవిగా ఆయన 'ఉద్భటారాధ్య చరిత్ర' వగైరా శైవ కావ్యాలు రచించాడు. అప్పట్లో ఆయనకు 'కుమార భారతి' అనే బిరుద నామం ఉండేది. అందుకే తొలి అధ్యాయానికి 'కుమార భారతి' అన్న పేరే సమంజసంగా ఉండగలదని భావించాను.

**2. భువన విజయము:** ఇది హంపి విజయనగరంలోని శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలోని సభామంటపం పేరు. ఆయన పాలనా కాలంలో ఈ భువన విజయం నిత్యమూ విద్వద్గోష్ఠులతోనూ, కవి పండితుల శాస్త్ర చర్చలతోనూ మార్మ్రోగేదట. బ్రతుకు తెరువు కోసం తెనాలి నుంచి ముందుగా కొండవీటి ఆస్థానానికీ, అక్కడి నుంచి హంపిలోని భువన విజయానికీ చేరుకున్న రామలింగ కవి, రామకృష్ణుడిగా ఎందుకు, ఎలా మారాడో, అక్కడ ఆయన ఏమేం చేశాడో వివరించే ఈ రెండవ అధ్యాయానికి 'భువన విజయం' అన్న పేరే సముచితమని

భావించాను.

**3. ప్రౌఢకవి - 1:** వైష్ణవం స్వీకరించి హంపిలో ప్రౌఢకవిగా రూపుదాల్చిన రామకృష్ణ కవి రాయల వారిచే అఖండ సత్కారాలనంది, 'కందర్పకేతు విలాసము', 'హరిలీలా విలాసము' మొదలైన కావ్యాల్ని రచించాడు. కొంతకాలం తెనాలి అగ్రహార నిర్ణేతగా వ్యవహరించి, కృష్ణరాయల మరణానంతరం ఆయన తమ్ముడు అచ్యుత రాయల పాలనా కాలంలో రాచనగరుకు దూరంగా హంపిలోని విట్ఠలరాజ ఆలయ సమీపంలో విట్ఠల భక్తి పారవశ్యంతోనూ, ఆముష్మిక చింతనతోనూ కూడిన ఋషితుల్యమైన జీవితాన్ని గడిపాడు. ఆ తరువాత హంపిని వదలి పొత్తపినాటి తెలుగు చోడ ప్రభువైన పెద్ద సంగభూపాలుని వద్ద వ్రాయసకాడైన విరూరి వేదాద్రి మంత్రి పరిపోషణలో 'పాండురంగ మాహాత్మ్యము' అనే బృహత్కావ్యాన్ని రచించాడు. ఈ మూడవ అధ్యాయంలో ఆ మహాకావ్యం యొక్క విశేషాలను స్థూలంగా పరామర్శించాను.

**4. ప్రౌఢకవి - 2 :** శ్రీ ఘటికాచల మాహాత్మ్యము : ఆ మహాకవి అవసాన దశలో రచించిన కావ్యమిది. ఆయన దీనికి 'అవతారిక' వ్రాయకుండానే - అంటే ఎవరికీ అంకితమీయకుండానే - మరణించాడు. ఆ కావ్య విశేషాలను ఈ నాల్గవ అధ్యాయంలో వివరించాను.

**5. కథలు - గాథలు :** దక్షిణ భారత కథా సాహిత్యంలో రామకృష్ణ కవికి సంబంధించిన కథలకు విశేష ప్రాచుర్యముంది. అలాంటి కథలలో ఆయన చరిత్రను, ఆయన జీవితపు వివిధ పార్శ్వాలను సక్రమంగా అవగాహన చేసుకొనడానికి మార్గదర్శకం కాగలవని నేను భావించిన ఓ పాతిక కథలను - తత్సంబంధిత వివిధ అంశాలపై వివరణలతో సంపద్వంతం చేసి ఈ అధ్యాయంలో పాఠకుల ముందుంచాను.

**6. చరిత్ర చిక్కుముడి :** రామకృష్ణ కవి చరిత్రపై కమ్ముకున్న కారుమేఘాలను తొలగించడానికి ఈ అధ్యాయంలో ప్రయత్నించాను. ఆయన చరిత్రతోబాటు కొందరు సమకాలీనుల చరిత్ర చిక్కుముడులను విప్పిన యీ అధ్యాయానికి 'చరిత్ర చిక్కుముడి' అన్న పేరే తగినదని భావించాను.

**అనుబంధములు :** తన కావ్యాలలో రామకృష్ణ కవి ప్రస్తావించిన వివిధ విషయాలపై క్లుప్తమైన వివరణలను అక్కడికక్కడే అందించాను. జిజ్ఞాసువుల ఉపయోగార్థం ఆ యా విషయాలపై మరింత స్పష్టత *(Clarity)*, సంబద్ధత *(Specificity)* మరియు సాధికారత *(Authenticity)* కోసం సంబంధిత సమాచారాన్నంతటినీ సర్వసమగ్రంగా అందించాలనే ఉద్దేశ్యంతో ఓ పది అంశాలను ప్రత్యేక అనుబంధాలుగా పాఠకుల ముందుంచడం జరిగింది. ఒకటో రెండో తప్ప యీ అంశాలన్నీ ఏళ్ల తరబడి చేసిన అధ్యయనం, శోధన ఫలితంగా నా మనోఫలకంపై రూపుదిద్దుకున్న భావనలే. సామాజిక, శాస్త్రీయ శోధనలో చివరి మాట అంటూ ఏదీ వుండదు. సత్య శోధనే లక్ష్యంగా, నిజాయితీతో గవేషణ సాగుతూనే వుండాలి. 'స్పర్ధయా వర్ధతే విద్యా' అన్న ఆర్యోక్తి ప్రకారం భిన్న దృక్పథాలు ఘర్షిస్తేనే సత్యాన్వేషణకు మార్గం సుగమమౌతుంది. నా దృక్కోణం నుండి వివిధ శాస్త్రీయ, సామాజిక అంశాలపై నా భావనలను, నా శోధనా ఫలాల *(Findings)* నూ నిష్కర్షగా మీ ముందుంచాను. ఈ విషయమై విద్వజ్జనుల నుండి ప్రతిస్పందననూ, చర్చనూ ఆహ్వానిస్తున్నాను.

కావ్యాల కథాక్రమం చెదరకుండా వుండే నిమిత్తం నా సంక్షిప్త వ్యాఖ్యలు, వివరణలను ఎక్కడికక్కడ సన్న టైపులో యిచ్చాను. నేను ముందుగా పేర్కొన్నట్లే యిది రామకృష్ణ కవి కావ్యాల శాస్త్రీయ పరిశీలన. అందుకే కవి తన కావ్యాలలో ప్రస్తావించిన వివిధ విషయాలను హేతు దృష్టితో విశ్లేషించడం జరిగింది. ఆ యా సందర్భాలలో పలు శాస్త్రీయ విషయాలను అదనపు సమాచారంగా అందించాను. శాస్త్రీయ దృష్టి గల ఆధునిక పాఠకులను దృష్టిలో వుంచుకొనే విజ్ఞానశాస్త్ర సంబంధమైన

అనేక వివరణలను, ఆంగ్ల భాషలో శాస్త్రీయ నామాలు వగైరాలను యిచ్చాను.

కావ్యాలలోని గద్య, పద్యాల తాత్పర్యాన్ని మాత్రమే యిస్తే పాఠకులు కథాంశాలను తేలికగా అర్థం చేసుకోగలరు. అయితే కవి వాడిన పదాలను పాఠకులకు పరిచయం చేసే ఉద్దేశ్యంతో నేను ఆ పదాలను యథాతథంగా యిచ్చి, వాటి అర్థాలను కుండలీకరణం చేశాను (బ్రాకెట్లలో యిచ్చాను). వ్రాయడానికి నాకూ, అర్థం చేసుకొనడానికి పాఠకులకూ యీ పద్ధతి కొంచెం శ్రమే అయినా, పాఠకులకు రామకృష్ణ కవి కావ్యాలు స్వయంగా చదువుతున్న అనుభూతి కలిగించడానికే యిలా చేయాల్సి వచ్చింది. ఇందుకోసమే వీలైనన్ని చక్కటి పద్యాల్ని పూర్తి అర్థ తాత్పర్యాలతో యిచ్చాను.

ఈ గ్రంథం యొక్క ఉద్దేశ్యం అందరికీ అర్థమయ్యే శైలిలో రామకృష్ణ కవి జీవిత విశేషాల్నీ, బహుముఖ కృషినీ, ఆయన చరిత్ర గురించి ప్రచలితమౌతూన్న వాద ప్రవాదములనూ స్థూలంగా స్పృశించడం. గ్రంథ విస్తరభీతితో ఆయన సమగ్ర సాహిత్య విశ్లేషణ, అందలి అలంకార, ఛందోవ్యాకరణాది విశేషాల జోలికి వెళ్ళలేదు. ఇది చదివిన నేటితరం పాఠకులకు తెనాలి రామకృష్ణుని సాహిత్యంపట్ల ఏ కాస్తయినా ఆసక్తి కలిగించ గలిగినట్లయితే యీ నా కృషి సఫలీకృతమైనట్లేనని భావిస్తాను.

**- రచయిత**

# కుమార భారతి

అది కృష్ణాతీరం. తెనాలి గ్రామం. ప్రస్తుతం కృష్ణానది గుంటూరు జిల్లా తెనాలి పట్టణానికి పది-పదిహేను కిలోమీటర్ల దూరంలో ప్రవహిస్తూన్నా ఒకప్పుడు నదిపై ఏ ఆనకట్టలూ లేని కారణంగా వర్షాకాలంలో తెనాలి వరకు వరదనీరు వచ్చేదట. అందుకనే తెనాలిని అప్పట్లో కృష్ణాతీర గ్రామంగానే వ్యవహరించేవారట.

15వ శతాబ్దిలో తెనాలి గ్రామంలో గార్లపాటి రామన్న, లక్ష్మన్న అనే యిద్దరు అన్నదమ్ములుండేవారు. వారు నియోగిబ్రాహ్మణులు, శివభక్తి పరాయణులు. తెనాలిలో ప్రస్తుతం పాత శివాలయంగా వ్యవహరించబడుతూన్న రామేశ్వరాలయం అప్పటికే ప్రసిద్ధమైనది. అక్కడి దైవాన్ని రామలింగేశ్వరుడనీ అంటారు. గార్లపాటి రామన్న గారు శుక్ల నామ సంవత్సర మాఘ శుద్ధ పంచమి గురువారం నాడు ఆ ఆలయంలోని రామేశ్వరుని ఉత్సవ విగ్రహాన్ని చేయించినట్లు విగ్రహపీఠం పై నేటికీ నిలిచివున్న శ్లోకం కారణంగా తెలుస్తూంది. రామన్నగారి భార్య లక్ష్మమ్మ. ఈమెనే లక్ష్మమాంబ అనీ, లక్కమాంబ అనీ కూడా వ్యవహరించేవారు. క్రీ శ। 1495 ప్రాంతంలో వీరికి కలిగిన మొదటి బిడ్డడికి ముద్దుగా రామలింగం అని తెనాలి రామలింగేశ్వరుని పేరే పెట్టుకున్నారు. రామలింగడు బాల్యంనుండీ చక్కని సాహితీ వాతావరణంలో పెరిగాడు. ఎందుకంటే రామన్న, లక్ష్మన్న లిరువురూ సంస్కృతాంధ్రాలలో మహాపండితులు. లక్ష్మన్నగారు వీరరస ప్రాధాన్యం గల 'వీరభద్ర విజయం' అనే కావ్యాన్ని రచించిన వారు కూడా. రామలింగడు పాలగుమ్మి ఏలేశ్వరుడనే గురువు వద్ద శుక్ల యజుర్వేదం చదువుకున్నాడు. దాంతోపాటు సంస్కృతాంధ్ర కావ్యాలు, నాటకాలు చదివి అలంకారాలూ, ఛందస్సూ వగైరాలలో దిట్టయై అతి చిన్న వయస్సులోనే కవిత్వం చెప్తూ 'కుమార భారతి' అనే బిరుదుకూడా

పొందాడు.

అప్పట్లో తెనాలి కొండవీటి సంస్థానం పాలన క్రింద వుండేది. వారి తరపున స్థానిక పాలకుడుగా వున్న రావూరి రంగారెడ్డి గారు దాత, కవి పండిత పోషకుడు అని విని ఆర్థికంగా ఇబ్బందులు పడుతూన్న మన రామలింగడు, తాను అప్పటికే వ్రాయ మొదలిడిన 'ఉద్భటారాధ్య చరిత్రము' అనే కావ్యంలోని కొన్ని భాగాలను ఆయనకు వినిపించి సహాయాన్నర్థించాడు. తన కావ్యంనుండి ఏదైనా రసవత్తరమైన ఘట్టాన్ని వినిపించమన్న రంగారెడ్డికి మన రామలింగడు వినిపించిన ఓ చక్కని పద్యమిది -

సీ॥ "తరుణ శశాంక శేఖర మరాళమునకు
సార గంభీర కాసార మగుచుఁ
గైలాస గిరినాథ కలకంఠ భర్తకుఁ
గొమరారు లేమావి కొమ్మ యగుచు
సురలోక వాహినీ ధర షట్పదమునకుఁ
బ్రాత రుద్బుద్ధ కంజాత మగుచు
రాజరాజప్రియ రాజకీరమునకు
మానిత పంజర స్థానమగుచు

గీ॥ ఉరగవల్లభహార మయూరమునకుఁ
జెన్నుమీరిన భూధర శిఖరమగుచు
లలిత సౌభాగ్య లక్షణ లక్షితాంగి
అద్రినందన పొల్చె విహారవేళ " (ఉద్భటారాధ్య చరిత్రము : 1-94)

వసంతకాలంలో పార్వతీపరమేశ్వరులు చేసిన విహారాన్ని వర్ణించే పద్యమిది.

పార్వతి (ప్రకృతి) ఆధారంగానూ, శివుడు (పురుషుడు) ఆధేయముగానూ వర్ణించబడడం యిందలి చమత్కృతి

అద్రినందన - అంటే పార్వతీదేవి ఆ విహార వేళలో శివునికి ఎలా కనుపిస్తుందో చెపుతున్నాడు

బాలేందుమౌళి అనే రాజహంసకు జలప్రపూర్ణమైన, లోతైన సరస్సుగానూ, కైలాసపతి అనే కోకిలకు లేత మావికొమ్మగానూ కనుపిస్తుందట. లేత మామిడి చిగుళ్లే కోకిలకు యిష్టమైన ఆహారమని ప్రసిద్ధి.

సురలోక వాహినీ ధరుడు - అంటే గంగాధరుడు - అనే షట్పదము అంటే ఆరు పాదములు కలదియైన కీటకము అనగా తుమ్మెదకు ఉదయాన్నే వికసించిన తామరపువ్వుగా కనుపిస్తుందట. ఉదయాన్నే వికసించిన తాజా తామరపుష్పంలోనే తుమ్మెదకు కావలసిన మకరందం ఉంటుంది.

రాజరాజు - అంటే కుబేరుని యొక్క ప్రియ అంటే మిత్రుడైన శివుడు అనే రాచిలుకకు మానిత పంజరములాగా కనుపిస్తుందట. మానిత పంజరము అంటే బందీయే ఇచ్ఛికంగా ఉండగోరిన పంజరము. మరి శివుడు కావాలనే పార్వతి కౌగిట బందీ అవుతాడు కదా ! (శివుడిని తెలుగులో 'జక్కులరేని చెలికాడు' అనీ యక్షరాజైన కుబేరుని సంస్కృతంలో 'త్ర్యంబక సఖః' అంటే 'శివుని మిత్రుడు' అనీ అంటారు.) ఇంకా ఉరగవల్లభుడిని (నాగరాజును) హారముగా ధరించిన మయూరమునకు అతిశయించిన అందముగల కైలాస శిఖరముగానూ పార్వతీ దేవి కనబడుతూ వున్నదట! మెడనల్లగా ఉండటం వలన నెమలిని సంస్కృతంలో 'నీలకంఠః' అని కూడా అంటారు; ఇక్కడ నీలకంఠుడైన శివుడిని కవి ఓ

మయూరంగా వర్ణిస్తున్నాడు.

ఇలాంటిదీ తొలినాళ్ళలోనే మన రామలింగని శైలి. రంగారెడ్డి గారు ఈ పదగుంఫనానికి అవాక్కయి, 'కవిత్వమంటే ఇలా సామాన్యులకు అందని మ్రానిపండులా ఉండరాదనీ, సరళమైన పదాలతో అందరినీ మెప్పించి పండిత పామరులందరినీ రంజింపజేయగలిగితేనే కవిత్వం సార్ధకమనీ' ఓ ఉచిత సలహా యిచ్చి రిక్తహస్తాలతో ఆయన్ని తిప్పి పంపారు. దీంతో మొదట్లో తన పాండిత్యమూ, కావ్య రచనా నిరర్ధకమేనా అని కొంత నిరాశ చెందినా మన రామలింగడు తర్వాత పట్టుదలతో కావ్య పరిపూర్తికి పూనుకున్నాడు.

ఈ కావ్యాన్ని పూర్తి చేయడానికి చాల సమయం పడుతుంది. ఈలోగా ఉదరపోషణం జరగాలి. కనుక కావ్య పరిపూర్తికి ముందే ఎవరికైనా అంకితమిచ్చి ఆర్థిక సహాయాన్ని పొందే ఉద్దేశ్యంతో రామలింగడు కొండవీడుకు వెళ్లాడు. అప్పుడు ఆ సంస్థానాన్ని అప్పాజీ తిమ్మరుసు మేనల్లుడు నాదెండ్ల గోపమంత్రి పాలించేవాడు. ఆయన కొలువులోని ఉద్యోగియైన ఊర దేచయ్య అనే రామలింగని దూరపు బంధువు అతడిని ఆదరించాడు. స్వయంగా వీరశైవుడైన దేచయ్య శివభక్తులలో అగ్రగణ్యుడైన ఉద్భటుని చరిత్రను శైవాచార పరాయణుడైన రామలింగని చేత వ్రాయించడం సమంజసమని భావించి రామలింగనికి కావ్యపరిపూర్తికి వలసిన సహాయ సహకారాలనందించాడు.

## ఉద్భటారాధ్య చరిత్రము

శైవాచార్య పరంపరలో ఆచార్యత్రయము, ఆరాధ్య త్రయము, సిద్ధ త్రయము, పండిత త్రయముగా ప్రసిద్ధి బడసిన వీర శైవులలోని ఆరాధ్యత్రయములోని ప్రప్రథముడు ఉద్భటారాధ్యుడు (మిగిలిన యిరువురు కోటిపల్యారాధ్యుడు మరియు వేమనారాధ్యుడు)

ముదిగొండ వారి వంశ మూలపురుషుడైన ఉద్భటుడు అనే యీ వీరశైవుని చిన్న కథను అప్పటికే పాల్కురికి సోమనాథుడు తన 'బసవపురాణం' లో 38 ద్విపదలలో - అంటే 76 పాదాలలో - చెప్పగా దానినే కావ్యవస్తువుగా స్వీకరించి, తొలి కావ్యం కనుక ఉబలాటంతో వర్ణనలు గుప్పించి 842 గద్యపద్యాలలో మూడాశ్వాసాల కావ్యంగా దానిని మలిచాడు మన రామలింగ కవి.

ఈ కావ్యం యొక్క కథావస్తువును సంక్షిప్తంగా చూద్దాం.

ఇది రోమహర్షణుడి కుమారుడైన సూతుడు శౌనకాది ఋషులకు చెపుతున్నట్లుగా వ్రాయబడింది.

## నైమిశారణ్య వర్ణన

నైమిశారణ్య వర్ణనతో కథ ప్రారంభమౌతుంది. ఈ కావ్యంలో మన కవి పదగుంఫనానికీ, వర్ణనా చమత్కృతికీ మచ్చు తునకగా నైమిశారణ్య వర్ణనను తీసుకొనవచ్చు.

ఈ చక్కని పద్యం చూడండి.

సీ॥ "అచలసుతాభర్త కర్పించి మరికాని
మృగములు లేఁబూరి మేయవచట
అసమలోచనునకు నర్పించి మరికాని
యళులు క్రొవ్విరి తేనె లానవచట

అంధకధ్వంసికి నర్పించి మరికాని
కోయిల లిగురాకుఁ గొరుకవచట
అంగజారాతికి నర్పించి మరికాని
చిలుకలు పండ్లు భుజింపవచట

గీ॥ తక్కుగల జంతువులు శంభుదలచి కాని
యుచిత వర్తనములఁ గోరి యుండవచట
వదనములు వేయిగల యంతవానికైన
నాయరణ్యంబుఁ గొనియాడ నలవియగునె ? " (ఉద్భటారాధ్య చరిత్రము : 1-54)

అచల సుతాభర్త - పర్వతుని కుమార్తె యైన పార్వతి భర్త - శివుడు
అసమలోచనుడు - బేసిసంఖ్య (3) కన్నుల వాడు - లేక ఎగుడుదిగుడు కన్నుల వాడు - శివుడు
అంధకధ్వంసి - అంధకుడనే రాక్షసుని సంహరించిన వాడు - శివుడు
(కశ్యప ప్రజాపతికీ దక్షుని కుమార్తె అయిన దనువుకూ పుట్టిన దానవులలో అంధకుడొకడు.)
అంగజారాతి - అంగజుని (మన్మథుని) అరాతి (శత్రువు) - శివుడు

(శివుడు తన మూడవకంటి చూపుతో మన్మథుని భస్మం చేశాడట. అందుకే సంస్కృతంలో శివుడిని 'స్మరహర' అనీ, 'స్మరాంతక' అనీ అంటారు. స్మరుడు, మరుడు, మదనుడు, అంగజుడు, మారుడు, కందర్పుడు, అనంగుడు, పంచశరుడు వగైరాలన్నీ మన్మథుని పేర్లు.)

దీని భావం నైమిశారణ్యంలో ముందుగా శివుని కర్పించనిదే మృగములు గడ్డి మేయవు. తుమ్మెదలు తేనెలు త్రాగవు. కోయిలలు చిగురాకులు తినవు. చిలుకలు పండ్లు భుజించవు. మిగిలిన జంతువులు కూడా శివుణ్ణి తలచే తమకు తగిన పనులేవైనా చేస్తాయి. వేయినోళ్ళు గలవానికైనా ఈ అరణ్యాన్ని పొగడతరమేనా? వేయినోళ్ళు కలవాడంటే ఆదిశేషుడు లేక శేషనాగు అని పిలువబడే సర్పం. ఆదిశేషుడు సర్వజ్ఞానియని ప్రసిద్ధి.

ఇదే కావ్యంలో నైమిశారణ్యాన్ని రమణీయంగా వర్ణిస్తూ రామలింగకవి చెప్పిన మరొక పద్యం చూడండి-

ఉ॥ పూచిన క్రోవులుం దొరుఁగు పుప్పొడిఁ జెల్వగు మావులుం దగన్
గాచిన మోవులున్ శుక నికాయ సమప్రభ మించు జోవులున్
వాచ్చవియైనఁ బంచజన వాంఛలు తీర్చుననంట్ల ప్రోవులున్
జూచి ముదంబునన్ నిలువఁ జూతురు తద్వనవీధి దేవతల్. (ఉద్భటారాధ్య చరిత్రము : 1-58)

క్రోవి లేక కోవి అంటే కురవకము లేక గలధూపము (*Galedupa arborea* syn. *Afzelia galedupa*) అనే అటవీ వృక్షము అని బ్రౌన్ నిఘంటువులో వుంది. ఇది లెగ్యుమినసీ (*Leguminosae*) కుటుంబానికి చెందిన వృక్షమట. దీని కాండం నుంచి స్రవించే సుగంధమైన జిగురు సాంబ్రాణిలా ధూపము (పొగ) వేసుకొనడానికి ఉపయోగిస్తారు. క్రోవినే 'పెద్ద గోరింట' అనీ అంటారు. దీని పూలు ఎర్రగా ఉంటాయి. మను చరిత్ర కావ్యం (ద్వితీయాశ్వాసం-22)లో కూడా క్రోవుల ప్రస్తావన వుంది. ఎకాంథేసీ (*Acanthaceae*) కుటుంబానికి చెందిన *Barleria prionitis* (ముళ్ల గోరింట), *Barleria cristata* (కోడికన్ను లేక నీరు గోరింట) చక్కటి పుష్ప వృక్షాలే. బ్రౌన్ నిఘంటువులో క్రోవి అంటే యింకా క్రానుగ చెట్టు, రేల చెట్టు అని కూడా యివ్వబడింది. రేల (*Cassia fistula*) పుష్పించే సమయంలో ఆకులన్నీ రాల్చేసి,

బంగారు పసుపు రంగు షాండ్‌లేర్ *(Chandelier)* లలా గుత్తులుగా విరగబూస్తుంది. కవి ప్రస్తావించినది మనోహరంగా విరగబూచి వున్న రేల చెట్లనైనా కావచ్చు.

క్రోవులు విరగబూచి వున్నాయట. ఇంకా విస్తారంగా పూచిన రకరకాల అడవి పూలు తమ పుప్పొడిని గాలిలోకి వదలుతున్నాయట!

ఆ అడవి అంతా అందమైన మామిడి చెట్లున్నాయట.

అంతేకాక మోవిచెట్లు విరగకాచి ఉన్నాయట. మోవి అంటే ఒక రకమైన అడవిజాతి పండ్ల చెట్టు దీనిని మోగి అని కూడా అంటారు ఇది నేరేడు జాతికి చెందినది దీని పండ్లు అత్యంత రుచిగా ఉంటాయి తిరుమల కాలిబాటలో యీ చెట్లు మనకు విస్తారంగా కనుపిస్తాయి దీని శాస్త్రీయ నామం *Syzygium alternifolium* ఈ చెట్టు పేరు మీదుగా కృష్ణాజిల్లా కంచికచెర్ల మండలంలో 'మోగులూరు' అనే గ్రామం పేరు ఏర్పడింది

'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' కావ్యంలో మహాకవి ధూర్జటి పేర్కొన్న 24 రకాల అడవి పండ్లలో 'మోవి పండ్లు' కూడా ఉన్నాయి.

ఆ కావ్యంలోని ఈ క్రింది పద్యంలో శివలింగాన్ని తనపల్లెయైన ఉడుమూరుకు రమ్మని తిన్నడు ప్రార్థిస్తున్నాడు. అక్కడ లభించే ఎన్నెన్నో రకాల పండ్లను చెంచెతలు తెస్తే నేను నీకిస్తానని ఆశ జూపుతున్నాడు. ఈ అడవి పండ్ల జాతుల్ని గురించి తెలుసుకొనడం ఆసక్తికరంగా ఉంటుంది. చూడండి -

సీ॥ నేరేడు పండులు నెలయుట్టి పండులుఁ
గొండ మామిడి పండ్లు దొండపండ్లుఁ
బాల పండులు నెమ్మి పండులు బరివంక
పండులుఁ జిటి ముటి పండ్లుఁ గలివి
పండులుఁ దొడివెంద పండ్లుఁ దుమ్మికి పండ్లు
జానపండులు గంగ రేఁగుఁబండ్లు
వెలగ పండులు పుల్ల వెలగ పండులు మోవి
పండ్లు నంకెన పండ్లు బలుసు పండ్లు

గీ॥ బీరపండ్లును బిచ్చుక బీర పండ్లుఁ
గొమ్మిపండ్లీతపండ్లును గొంజి పండ్లు
మేడి పండ్లును మోదలుగాఁ గూడిమాడి
చెంచెతలు దెత్తురిత్తు విచ్చేయుమయ్య (శ్రీ కాళహస్తి మాహాత్మ్యము 3-69)

ఇప్పుడీ అడవి పండ్ల జాతుల్ని ఒక్కటొక్కటిగా పరిశీలిద్దాం (1) నేరేడు (*Syzygium cumini*) (2) కొండమామిడి (*Spondias mangifera*) (3) దొండ (*Coccinia grandis*) (4) పాల (*Manilkara hexandra*) ఇది సపోటా జాతికి చెందినది దీని పండ్లు మధురంగా ఉంటాయి. పాల సపోటా కొరకు దీనిని సపోటాతో కలిపి అంటు కడతారు. (5) బరివంక (బ్రరింక) (*Streblus asper*) గరుకైన ఆకులు మరియు బటానీ గింజ పరిమాణంలో మధురమైన పండ్లు కలిగిన చెట్టు (6) కలివి (వీటిని కలేపండ్లు లేక వాకపండ్లు అనీ, హిందీలో 'కరోందా' అనీ అంటారు) (*Carissa carandas*). వంటలలో పచ్చి వాక కాయలను పప్పులో వేస్తారు పచ్చి కొబ్బరితో కలిపి వేయించి పచ్చడిగానూ చేస్తారు. ఈ కాయలనే పంచదార పాకంలో వూరవేసి ఎర్రని రంగు వేసి చెర్రీ పండ్ల పేరుతో

విక్రయిస్తున్నారు. అయితే యివి 'రెడ్ కరోందా'యేగాని చెర్రీ పండ్లు కావు. (7) తుమ్మికి లేక తుమికి లేక తునికి పండ్లు (సంస్కృతంలో తిందుక వృక్షము) (*Diospyros tomentosa*) ఎబెనెసీ (*Ebenaceae*) జాతికి చెందిన మధుర ఫలాలు. ఈ చెట్టు ఆకులను బీడీలు తయారు చేయడానికి వాడతారు. (8) గంగరేగు (*Zizyphus mauritiana*) (9) వెలగ (*Feronia elephantum*) (10) పుల్ల వెలగ (*Flacourtia sepiaria*) దీనినే కానరేగు లేక కాండ్రేగు అని కూడా అంటారు. (11) మోవి (*Syzygium alternifolium*) (12) బలుసు (*Canthium parviflorum*) (13) బీర (*Luffa acutangula*) మనం కూరకు వాడుకునేది. కాని బీరపండు (*Drypetes sepiaria*) పేరుతో వేరే అడవి పండున్నది. (14) పిచ్చుక బీర (*Carmona retusa*) కూడా అటవీ ఫలమే. వీటినే పిచ్చిబీర పండ్లనీ లేక బాపన బూరెలనీ కూడా అంటారు. (15) ఈత (*Phoenix sylvestris*) (16) గొంజి. దీనినే గొల్వి, గొలివి, గొలుగు, గొలగ, గుళిగ, గుడఫలము, గొనుగు అనే పేర్లతో కూడా పిలుస్తారు. (*Limonia pentaphylla Syn. Glycosmis pentaphylla*) గొల్వేపల్లి, గొలుగొండ, గొలగమూడి, గొనుగుపూడి వగైరా గ్రామ నామాలు ఈ చెట్టు పేరు మీదుగా ఏర్పడ్డవే. (17) మేడి (ఉదుంబర) (*Ficus glomerata*) వగైరాలు సుపరిచితములే. (18) కొమ్మి (*Tarenna asiatica*) పొడవుగా బల్లెం ఆకారంలో వుండే ఆకులు, తెల్లగా సువాసన గల పూలు, నల్లగా బటానీ గింజలంత పండ్లు కలిగి వుండి పొదలా పెరిగే వృక్షం కొమ్మి. ఇది రూబియేసీ (*Rubiaceae*) కుటుంబానికి చెందిన వృక్షం. దీని ఆకులను చర్మ వ్యాధుల నివారణకూ, పండ్ల గుజ్జును సెగగడ్డలు పక్వానికొచ్చి, పగలడానికి మలాంగానూ వాడతారు. (19) నెమ్మిపండును సంస్కృతములో 'త్రినిశ' లేక 'చిత్రకుశ' అంటారని తెలుస్తున్నది. నెమ్మి (*Manilkara kauki Syn. Mimusops kauki*) పొగడ, సపోటా మరియు పాలచెట్టు జాతి (*Sapotaceae*-సపోటేసీ) కి చెందిన వృక్షం. దీని మొదలు లోతుగా గాళ్లుపడి గోధుమ రంగులో వుంటుంది. కలప అతి దృఢంగా వుంటుంది. పెండ్లిండ్ల సందర్భంలో రాట వేయడానికి వాడే వృక్షాలలో నెమ్మి, ఇప్ప ప్రసిద్ధమైనవి. ఆకులు కోడిగ్రుడ్డు ఆకారంలో, పూలు తెల్లగా గుత్తులుగానూ వుంటాయి. పండ్లు రెండు నుంచి 4 సెం.మీ ల పొడవు కలిగి, కోడిగ్రుడ్డు ఆకారంలో నారింజ పండు రంగులో వుండి, తియ్యగా వుంటాయి. లోపల రెండు లేక నాలుగు గింజలుంటాయి. ఇది కూడా వైద్య పరంగా ఎంతో విలువైన వృక్షం. (20) నెలయుట్టి లేక నల్లుట్టి (*Diospyros chloroxylon-family Ebenaceae*-ఎబెనేసీ) పండ్లు మధురంగా వుంటాయి. భారత ద్వీపకల్పమంతటా యీ వృక్షాలు కనుపించినా, ప్రధానంగా ఒరిస్సాలో యివి ఎక్కువ. 21) చిటిముటి పండు. దీనిని గుర్తించడానికి కొంచెం శ్రమ పడాల్సి వచ్చింది. దీనిని మంచి బిక్కి అని కూడా పిలుస్తారనీ రూబియేసీ కుటుంబానికి చెందిన యీ చెట్టు శాస్త్రీయ నామం *Gardenia gummifera* అనీ తెలుస్తున్నది. దీని నుండి లభించే ఇంగువ వంటి ఘాటైన జిగురు దగ్గు, గ్యాస్, వగైరాలకూ, క్రిమి సంహారకంగానూ పని చేస్తుంది. (22) జాన లేక పూతిక పండ్లను ఉత్తర భారత దేశంలో 'ఫల్సా' అనీ, 'షుక్రీ' అనీ అంటారు. చిన్నవిగానూ, పండితే బచ్చలి పండు రంగులోనూ వుండే యీ పండ్లు పుల్లపుల్లగా, తీయతీయగా వుండి ఆరోగ్యానికి ఎంతో మేలు చేస్తాయి. ఈ పండ్లు నిలవ వుండవు కనుక స్థానికంగానే వీటిని అమ్ముతారు. నా చిన్నతనంలో తెనాలి చినరావూరు తోటలోని ఓ పూతిక చెట్టు పండ్లను అప్పుడప్పుడూ రుచి చూసేవాడిని. స్థానికులు వీటిని పుల్లజామపండ్లు అనేవారు. పల్నాడు ప్రాంతంలో యిటీవల కూడా నేను వీటిని తిన్నాను. అక్కడ యీ వృక్షం పేరుపై ఏర్పడిన జానపాడు అనే గ్రామం కూడా వుంది. జానచెట్టు (*Grewia subinaequalis - family Tiliaceae*- టిలియేసీ) అటవీ వృక్షమే అయినా, జనావాస ప్రాంతాలలో కూడా అక్కడక్కడా అరుదుగా ఖాళీ ప్రదేశాలలో యీ వృక్షాలు మనకు కనుపిస్తాయి. దీనిలో మరొక రకం *Grewia salvifolia* మన ప్రాంతంలో ఎక్కువగా కనుపించే వృక్షం. (23) ఇకపోతే నంకెన పండ్లు *Ribes orientale* అనే శాస్త్రీయ నామం కలిగి *Grossulariaceae* - గ్రాసులారియేసీ కుటుంబానికి చెందిన పొద మొక్కవై వుంటాయని నేను భావిస్తున్నాను. ఇదే కుటుంబానికి చెందిన *Black Currant* పాశ్చాత్య దేశాలలో చాల ప్రసిద్ధి చెందింది. ఈ జాతి పండ్లు అతి పుల్లగా వుండడాన నేరుగా తినడానికి జనం పెద్దగా యిష్టపడరుగానీ, జామ్‌లు, స్క్వాష్‌లు, జెల్లీలు, సాస్‌లు, వైన్ వగైరాల తయారీలో వీటిని వాడతారు. అలాగే నంకెన అంటే ఓలకేసీ (*Olacaceae*) కుటుంబానికి చెందిన *Ximenia americana* అనే వృక్షమైనా కావచ్చు. ఇక (24) తొడివెంద అంటే *Cucurbitaceae*-కుకుర్బిటేసీ- కుటుంబానికి చెందిన *Round Gourd (Citrullus lanatus var. fistulosus)* అయి వుంటుందని ఊహిస్తున్నాను. దీనిని హిందీలో 'తిందా' అంటారు.

ఈ చివరి రెండు రకాల గురించి ఎన్నో గ్రంథాలు పరిశీలించాను. ఎందరో ఆటవికులను ప్రశ్నించాను. అయినా ఫలితం శూన్యం. అందుకే కొన్ని ఆధారాలతో ఆ వృక్షాలేమై వుంటాయో ఊహించ సాహసించాను. ఈ పద్యం ద్వారా ఆ రెండు ఫలజాతులున్నాయని తెలిసికొనడమేగాని నేనింతవరకూ వాటిని చూడలేదు; కనీసం వాటి గురించి వినలేదు.

ఇక జూవులు అంటే – జువ్వి (*Ficus infectoria*) చెట్లు చిలుకల గుంపులా అన్నట్లు వెలుగొందు తున్నాయట! మనుష్యులకు నోరూరితే తిన్నన్ని అనంటి (అరటి) పండ్లు ప్రోవులుగా వున్నాయట. ఇంత అందమైన అడవిని చూసి ఆనందంతో అలాగే నిలబడి చూస్తూండి పోతారట దేవతలు కూడా!

అలాంటి నైమిశారణ్యంలో ఒకప్పుడు పన్నెండేళ్ళ దీర్ఘసత్ర యాగం చేస్తూన్న కొందరు మునుల వద్దకు సూతుడు వచ్చాడట. అప్పుడా మునులు సూతుడిని శైవధర్మ సదాచార సరణిని విశదంగా వివరించమని కోరగా సూతుడు 'ఆగమతత్త్వమునందు మీరెరుగనిది లేదు; నన్ను త్రిజగద్వినుతోదయుడిని చేయబూని నాచే చెప్పించ దలచి మీరిలా అడుగుతున్నారు. మీకు దీన్ని వివరించే భాగ్యం యిలా నాకు దక్కింది' అంటూ కథా ప్రారంభం చేశాడు.

## శివభక్తి విశిష్టత

ముందుగా శివభక్తి యొక్క గొప్పతనాన్ని వివరిస్తూ సూతుని పరంగా కవి చెప్పిన కొన్ని చక్కటి పద్యాల్ని చూద్దాం. శివుని భవ్య చరిత్రలు యిన్నీ అన్నీ కాదు అంటూ చెప్పిన యీ క్రింది పద్యం చూడండి –

ఉ॥ **వాలుక లెన్నవచ్చు నుడువర్గము లెన్నఁగ వచ్చు భూరజో**
**జాలము లెన్నవచ్చు నతిచంచలవార్ధి వికీర్ణ వీచికా**
**మాలికలెన్నవచ్చు బుధమండల కర్ణపుటామృతంబు తా**
**బాల శశాంక శేఖరుని భవ్య చరిత్రము లెన్నవచ్చునే!** **(ఉద్భటారాధ్య చరిత్రము:1-64)**

వాలుక (ఇసుక రేణువు) లను లెక్కించవచ్చు. (ఉడువు – నక్షత్రము) నక్షత్రాల్ని కూడా లెక్కించవచ్చు. అసంఖ్యాకములైన దుమ్ముకణాల్ని కూడా లెక్కించవచ్చు. అలాగే అత్యంత సంక్షుభిత సాగరంలోని చెల్లాచెదరైన అలల సముదాయాన్నైనా లెక్కించవచ్చునేమోగాని, విద్వాంసుల వీనులకు అమృతపు సోనల్ని వెలార్చే తరుణేందుమౌళి శుభచరితములు లెక్కింపతరమా ఎవరికైనా? అని ప్రశ్నిస్తున్నాడు రామలింగ కవి.

ఉ॥ **ఆకులఁ గందమూలముల నంబుఫలంబులఁ గూరగాయలం**
**జేకొని ప్రాణరక్షణముఁ జేసి మహాటవిలోనఁ దీవ్ర ని**
**ష్ఠాకలనన్ శరీరముఁ గృశంబుగ నుండిన ముక్తి గల్గునే**
**ప్రాకటమైన భక్తిఁ బురభంజనుఁ బూజ యొనర్పకుండినన్** **(ఉద్భటారాధ్య చరిత్రము : 1-66)**

ఆకులూ, కందమూలములూ, పండ్లూ, కూరగాయలూ వగైరా తిని ఎలాగో ప్రాణం కాపాడుకుంటూ అడవులలో తీవ్ర నిష్ఠతో శరీరాన్ని కృశింప జేసుకుంటూ వుంటే ముక్తి దొరకుతుందా? ప్రసిద్ధమైన భక్తి మార్గంలో పురభంజనుడికి (అంటే త్రిపురాసుర సంహారం చేసిన శివుడికి) పూజ చేయకుండా ముక్తి ఎలా సాధ్యమని ప్రశ్నిస్తున్నాడు కవి.

ఉ॥ **వాసనలేని పూవు రసవర్జన లేని కవిత్వరేఖ య**
**భ్యాసము లేని విద్య జలజాప్తుడు లేని దినంబు చంద్రికో**
**ల్లాసము లేని రాత్రి కమలస్థితి లేని కొలంకు చూవె కై**
**లాస నివాసు నాత్మలఁ దలంపని మూఢుల జన్మమారయన్** **(ఉద్భటారాధ్య చరిత్రము : 1-68)**

వాసనలేని పువ్వు, రసవర్ణన లేకుండా పదరాసిన కవిత్వమూ, అభ్యాసములేని విద్య, జలజాప్తుడు (జలజ+ఆప్తుడు) అంటే పద్మినీ వల్లభుడు అంటే తామర పువ్వుకు ప్రియుడైన సూర్యుడు లేని పగలు, వెన్నెలతో ఉల్లాసంగా లేని రాత్రి, తామరలు లేని కొలనుల వంటివే కైలాసపతిని ఆత్మలో తలంపని మూఢుల జన్మములు అంటున్నాడు.

'చంద్రరేఖా వతంసుడైన శివుడి చరణద్వయం ఎంత చక్కనిదో గదా! అందుకే ఒకప్పుడు రమాకాంతుడైన విష్ణువంతటివాడు ఆ పాదపద్మములపై తన కన్నువైచె' నంటాడు కవి. (1-69)

'కన్ను వైచుట' అంటే 'వలచుట' అనే అర్థం. స్థూలార్థంలో శివుని పాదద్వయంపై విష్ణువుకున్న అపారమైన ప్రేమానురాగాలను తెలపడమేకాక కవి సూక్ష్మార్థంలో 'కన్ను వైచుట' అనే పదాన్ని వాడడం ద్వారా ఒక ఐతిహ్యాన్ని చమత్కారంగా పాఠకులకు గుర్తుచేస్తున్నాడు.

ఒకప్పుడు విష్ణువు ప్రతినిత్యమూ వేయి కమలములతో శివుణ్ణి పూజించేవాడట. ఒకనాడు వేయి కమలములకూ ఒక కమలం తగ్గిందట. వెంటనే విష్ణువు ఆ కమలానికి బదులుగా తన కన్ను నొకదానిని పెరికి శివునికి సమర్పించాడట. శివుడు విష్ణువు యొక్క భక్తికి సంతసించి అతనికి చక్రాన్ని బహూకరించాడట. సుదర్శనమనే యీ చక్రాన్ని అంతకు ముందు సూర్యరేణువులతో విశ్వకర్మ తయారు చేశాడట.

ఇలా కథ చెప్పకుండానే 'కన్నువైచుట' అనే పద ప్రయోగంతో పై కథను పాఠకులకు స్ఫురింపజేయడం రామలింగ కవి చమత్కృతి.

'ఏ దేవుని పాద పద్మములకు ఇందిరావల్లభుడైన విష్ణువు కన్ను పుజాసుమమైందో, ఏ దేవుని నడుముకు ఇభదైత్య నాయకుని (గజాసురుని) చర్మము పట్టువస్త్రమైందో, ఏ వేల్పు శరీరానికి ఇక్షుబాణాసనుడి (మన్మథుడి) మేను విభూతి అయిందో (ఒకప్పుడు చెఱకువింటి వేలుపైన మన్మథుడిని తన మూడోకంటి చూపుతో భస్మంచేసి దానిని విభూతిలా తన మేనికి పూసుకున్నాడట శివుడు) అట్టి ఆదిదేవుడైన శివుడి మానస పుత్రుడైన ఉద్భట గురుని చరిత్రను మీకు తెలుపుతాను. అదే మీరడిగిన ప్రశ్నకు సదుత్తరము' అంటాడు సూతుడు ఆ మునులతో.

## కైలాసగిరి వర్ణన

ముందుగా కైలాసగిరి వద్ద శివపార్వతుల యధేచ్ఛావిహారంతో కథ ప్రారంభమౌతుంది.
రామలింగ కవి కైలాసగిరి వర్ణన ఎంత రసరమ్యంగా చేశాడో చూడండి.
అక్కడి పాదపముల (చెట్ల) ను వర్ణిస్తూ చెప్పిన రెండు పద్యాలు అతి మనోహరములు.

సీ॥ చిగురు జొంపంబుల నిగుడిన కెంజాయ
రుచిర జటాచ్ఛటారోచి గాఁగ
కలయంగఁ గప్పిన కమ్మపుప్పొడి దుమ్ము
పొలుపొందు భసితంపుఁ బూఁతగాఁగ
సోలుచుఁ బూఁదేనెఁ గ్రోలు రోలంబబా
లిక లంచితాక్ష మాలికలుగాఁగ
తఱచు కొమ్మల వెంటఁ దగిలి ప్రాఁకిన నవ్య
లత లహిభూషణ తతులుగాఁగ

గీ॥ ఇసుక చల్లిన రాలక పసరుదాలు
నాకు దళసరి హస్తి చర్మాంబరముగ
నలరి సాక్షాత్కరించిన హరునిఁబోలి
పాదుకొనియుండు నక్కొండఁ బాదపములు (ఉద్భటారాధ్య చరిత్రము : 1-80)

ఆ చెట్ల చిగురు జొంపముల (అంటే చిగురుటాకుల గుబురుల)లో వ్యాపించిన ఎఱ్ఱదనము (శివుని యొక్క) అందమైన జటాజూట సముదాయముల కాంతిని తలపిస్తుందట. చెట్ల చుట్టూ కమ్మిన పుప్పొడి ధూళి (శివుని) మేనిపైని భస్మపుపూత వలె ఉన్నదట. ఆ చెట్లపై సోలిపోతూ పూఁదేనెలు గ్రోలుతూన్న రోలంబ బాలికలు (అంటే పిల్ల తుమ్మెదలు) పూజనీయమైన రుద్రాక్షమాలల్ని తలపిస్తున్నాయట. ఆ చెట్ల కొమ్మలకు అల్లుకొని విస్తారంగా పెరిగిన లతలు (శివుడిని) పెనవేసుకున్న నాగభూషణములలా వున్నాయట. ఇసుక చల్లినా రాలనట్లున్న చెట్ల ఆకుపచ్చని కాంతితో కూడిన ఆ నాకువు (కొండ) శివుని మందపాటి కరిచర్మాంబరములా వుందట. ఇలా మొత్తం మీద కైలాసపర్వతంపై గల ప్రతి చెట్టూ ఏకంగా శివుడినే మనముందు సాక్షాత్కరింపజేస్తున్నదట.

ఇంకా చైత్రమాసంలో వసంతాగమన వేళలో అక్కడి చెట్లు ఎలా ఉన్నాయో చెప్తున్నాడు.

సీ॥ భవుఁగొల్చు వారల పాతకంబులరీతి
రమణఁగారాకులు రాలెఁ దరులఁ
బార్వతీపతి మీఁదఁ బ్రాజ్ఞుల కనురాగ
మునుబోలె నిగురెత్తె భూరుహములు
నీశాన భక్తుల యిండ్ల సంపదలీలఁ
గలయంగ ననుచుట గలిగెఁ జెట్ల
శశిమౌళిదాసుల సంకల్పముల భంగి
ఫలియించె నందంద పాదపములు

గీ॥ సకల పాదప వికసిత స్వచ్ఛ గుచ్ఛ
సాంద్ర మకరంద రస సమాస్వాద ముదిత
మత్త మధుకర జేగీయమానమగుచు
మించి మధుమాస మావిర్భవించెనపుడు (ఉద్భటారాధ్య చరిత్రము : 1-84)

ఆ తరుల (చెట్ల) కారాకులు (పండుటాకులు) భవుని (శివుడిని) పూజించేవారి పాతకములవలె రాలిపోయాయట. పండితులైన వారికి పార్వతీపతి (శివుని) మీద మొలకలెత్తే అనురాగమువలె ఆ భూరుహములు (వృక్షములు) చిగురించాయట. ఈశానుడి (శివుడి) భక్తుల ఇండ్లలో వెల్లివిరిసే సంపదల వలె ఆ చెట్లు విస్తారంగా పుష్పించాయట (ననుచుట అంటే పుష్పించుట). శశిమౌళి (శివుడి) దాసుల సంకల్పాలెలా సిద్ధిస్తాయో ఆ ప్రకారంగా ఆ పాదపములు (చెట్లు) అందంద (మరిమరి) ఫలించాయట. అన్ని రకముల చెట్లపైనా వికసించిన స్వచ్ఛమైన పుష్పగుచ్ఛములలోని చిక్కని మకరందం యొక్క రసాన్ని (అంటే రుచిని) ఆస్వాదించి ఆనందించి, మత్తిల్లిన మధుకరముల (తుమ్మెదల) సమూహములతో జేగీయమానంగా వెలుగొందుతూ అప్పుడే

మధుమాసము ఆవిర్భవించిందట. ఎంతటి కమనీయమైన వర్ణన యిది!

ఆ వసంత ఋతువులో శివపార్వతులు కైలాసగిరిపైన చేసిన స్వేచ్ఛావిహారాల్ని కూడా రామలింగ కవి అద్భుతంగా వర్ణించాడు. మనం లోగడనే చూసిన 'తరుణ శశాంక శేఖర మరాళమునకు' అని ప్రారంభమయ్యే పద్యం యీ వర్ణనకు సంబంధించినదే. ఇప్పుడు మరొక పద్యం చూద్దాం.

ఉ॥ అల్లన మావికొమ్మ చిగురాకు నిజాంచిత చంచుధారచేఁ
జిల్లులువుచ్చి తద్రస విశేషము నాలుక సోఁకఁ జొక్కుచున్
దుళ్ళు పికంబుఁ జూడుమని ధూర్జటి చూపినఁ జూచి పార్వతీ
హల్లకగంధి వంచె వదనాబ్జము కన్నుల నవ్వుదేరగాన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 1-93)

ఒక పికము (కోకిల) మెల్లగా ఓ మామిడి కొమ్మ చిగురాకును తన పదునైన ముక్కుతో చిల్లులు పొడిచి ఆ కోమల పల్లవ రస విశేషము దాని నాలుక సోకగా త్రుళ్ళుతూన్నదట. ఆ మత్తకోకిలను చూడమని ధూర్జటి (శివుడు) పార్వతికి చూపాడట. అది చూచిన హల్లకగంధి యైన (చెంగల్వ పూల సుగంధం కలిగిన) పార్వతీ దేవి కండ్లలో నవ్వులు విరియగా తామరపూవు వంటి తన వదనాన్ని వంచిందట.

# గంధర్వులు శాపగ్రస్తులవడం

అలా కైలాస శిఖరం వద్ద వసంతకాలంలో పార్వతీపరమేశ్వరులు విహారం చేస్తూండగా గంధర్వ ప్రముఖులు కొందరక్కడికి దంపతీయుక్తంగా వచ్చి కండకావరంతో నంది వారిస్తూన్నా వినకుండా - 'ఇది రజతాచలము; ఇక్కడ ఆదిదేవుడైన మదనారి (శివుడు) వసిస్తాడు కనుక యిది దేవతలకు కూడా పరమ పూజనీయమైన స్థలము' అని మదిలో తలంపక ఉచితానుచితాలు మరచి ఆదిదంపతుల ఏకాంతాన్ని భగ్నం చేయగా శివుడు కోపించి వారందరినీ పిశాచాలు కమ్మని శపించాడట. గంధర్వులయొక్క ఆ అందములు, ఆ చందములు, ఆ అద్భుత రూపురేఖలు, ఆ మంజు సుధా ప్రాయోక్తులు మిడివోయినాయట (అంటే మధ్యలోనే పోయాయట) కాయజ హరుడి (అంటే మన్మథుడిని నాశనం చేసిన శివుడి) కినుక కతన (కోపం కారణంగా).

రామలింగకవి ఆ పిశాచాలకు బలే చిత్రమైన పేర్లు పెట్టాడు. రక్తలోచనుడు (రక్తవర్ణపు కళ్ళు కలవాడు), ఘంటాకర్ణుడు (గంటల వంటి చెవులు కలవాడు), వ్యాఘ్రనఖుడు (పులి గోళ్ళు కలవాడు), వికటుడు (మిక్కిలి వంకరైన ఆకారం కలవాడు), సరీసృప రోముడు (రోమములు పాములుగా కలవాడు - గ్రీకు ఐతిహ్యాలలోని గార్గాన్ *(Gorgon)* లాగా), స్థూల నాసికుడు (బండ ముక్కు వాడు), కుంభ శిరస్కుడు (కుండ తలకాయ వాడు), వృకాశ్యుడు (తోడేలు ముఖం వాడు), విద్యుజ్జిహ్వుడు (మెఱపు వంటి నాలుక కలవాడు), ఆంత్రమేఖలుడు (ప్రేగుల్ని మొలత్రాడుగా కలవాడు), మహోదరుడు (పెద్ద పొట్ట వాడు), మృతాశి (శవాల్ని తినేవాడు), వజ్రదంష్ట్రుడు (వజ్రముల వంటి గట్టి కోరలు కలవాడు), విస్ఫులింగాక్షుడు (మండే అగ్నికణాల్లాంటి కళ్ళు కలవాడు), బాలఘాతుకుడు (పిల్లల్ని చంపేవాడు), విరూపుడు (విరుద్ధమైన - లేక - వంకరయైన రూపం కలవాడు) అనేవి వాటిలో కొన్ని.

ఇక్కడ రామలింగ కవి వరుసగా కొన్ని పద్యాలను కేవలం పిశాచముల వర్ణనకు కేటాయించాడు. నవరసాల లోనిదైన భయానక రస వర్ణనలో కూడా మన రామలింగ కవి అందెవేసిన చెయ్యి అని యీ పద్యాల్ని చదివితే మనకు తేలిగ్గా అర్థమవుతుంది.

ఎఱసంజ (ఎర్రని సంధ్య) కెంజాయ (కెంపు + చాయ - ఎర్రని రంగు) ను కూడా ఎకసక్కెం చేసేటటువంటి చికిచికి (చిన్న చిన్న) పల్ల (పాటల వర్ణం - అంటే ఎర్రని రంగుగల) వెంట్రుకలవారు; గమకంబులగు (మనోజ్ఞమైన) గ్రచ్చకాయలను తలపించే క్రూరమైన మిట్టగ్రుడ్లవారు; కనుబొమ్మలు ముడివడి, పెద్ద మిడిగ్రుడ్లు, వెడ (అంటే వికృతమైన) కోరలు, దౌడలు గల వక్త్రములు (నోళ్ళ) వారు; పెను బీఱనరములు (పెద్ద పెద్ద వైన నరాలు) ప్రాకిన పొంకమైన పొట్టలు కలవారు; పొట్టి పొట్టి చేతులు, కాళ్ళు, కుదియ బొడిచినట్లు (క్రుంగబొడిచినట్లు) బలిసిన మెడలు; ఊచలలాంటి ఊరువుల (తొడల) తో వికటాంగులై వున్నారట గంధర్వులు.

మ॥ చటులో దగ్రతరాట్టహాసములుఁ గేశచ్ఛన్న ఘోరాస్యముల్
కుటిల క్రూర విలోచనంబులు మెఱుంగుల్ ఫూత్కారముల్
పటుభీమోద్భట దంతపీడనము లస్పష్టాంగ సంధుల్ మహా
ఘట పీనోన్నత కుక్షి భస్త్రికలు వేగందాల్చిరాఖేచరుల్ (ఉద్భటారాధ్య చరిత్రము : 1-112)

ఉగ్రతరమైన వికటాట్టహాసాలు; శిరోజముల మాటున దాగిన ఘోరమైన ముఖములు; కుటిలమైన, క్రూరమైన కళ్లు; మెఱుఁగులు (మెరుపులు) క్రాయు (క్రక్కే) ఫూత్కారములు (ఏడుపులో వచ్చే ఎక్కిళ్ళు, ఉస్సురనడం లేక బుసలు గొట్టడం) - అంటే ఆ పిశాచాల బుసలు మెరుపుల్ని కక్కుతున్నాయట. పటు - సమర్థమైన, భీమ - భయానకమైన, ఉద్భట - అధికమైన, దంతపీడనములు - దంతములతో చేసే రాయిడి (అల్లరి), అస్పష్టమైన అంగ సంధులు (చంకలూ, గజ్జలూ), పెద్ద కుండల్లా బలిసిన ఉన్నతమైన పొట్టలు గల తోలుతిత్తులుగా వేగంగా మారిపోయారట ఆ ఖేచరులు (ఆకాశంలో విహరించే వారు - దేవతలు).

ఇంకా ఆ పిశాచాల్ని భయానకరసం ఉప్పతిల్లగా వర్ణించాడు రామలింగ కవి. భల్లూకవల్లభుల నుల్లసంబాడెదు నల్ల జుంజుఱు మేనులు, దప్పార కూటచ్ఛాయా దాయాదంబులగు పిశంగాంగంబులు, మంకెన క్రొవ్విరుల బింకంబు హుంకరించు కెంపు సంపాదించు పొదవుగల ఒడళ్ళు గలిగి కిలకల భాషణంబులు, కహకహాట్టహాసములు, ధళధళద్దంష్ట్రాంకురంబులు, ధగధగ త్త్రీక్షణములు కలిగిన వారై ఎక్కడ అసృక్పానము (రక్తం త్రాగడం), ఎక్కడ మాంసభక్షణము, ఎక్కడ మేదోలేపనము (శవాల మెదడు లోని కొవ్వును వంటికి రాసుకొనడం), ఎక్కడ కపాల ధారణము - అంటూ కోరిక లీరికలెత్తగా చిత్తంబులు మత్తిల్లి సందడింపుచూ క్రందుకొనుచున్నాయట ఆ పిశాచ బృందాలు.

చిత్రరథుడనే గంధర్వ రాజు నేతృత్వంలో వారంతా శివుడిని యిలా ప్రార్థించారు. 'ఓ పరమ ప్రభువా! పురుహూతాది (ఇంద్రుడు మొదలైన) అమరులచే పూజింపబడేవాడా! మేము నీ పాపల వంటివారము. మాపై కోపము మానుము. ఓ గోపతికేతనా! దైత్యశాసనా !' అంటూ యింకా -

సీ॥ తలఁప వైతివె కాలఁ దాఁచి పై నుమిసిన
యెఱుకమాలిన యట్టి యెఱుకువాని
ధృతిఁ జిత్తమున మానితివె బాలుగొని ఱువ్వు
సాంఖ్యతొండఁడు సేయు సాహసంబు
చింతింపవైతివె చేవవింటను బెట్టు
గొన్న కుంతీదేవి కొడుకుఁ గుట్టు
ఊహింపవైతివె యుగ్రఘాటీచల
చ్చేరమ క్షితిపతి చేతిగాసి

గీ॥ అకట నీ బంటు బంటులమైన మమ్ము
నొక్కతప్పును సైరింప కుఱక ఘోర
శాప దావానలంబున సగముచావు
చంపితివి చాలు నింకఁ బ్రోవు చంద్రజూట. (పండితారాధ్య చరిత్రము : 1-116)

ఈ చక్కటి పద్యంలో "పలువురు చేసిన శివాపచారాల్ని మన్నించిన నీవు మాపై మాత్రం కినుక వహిస్తున్నావు. ఇది న్యాయమేనా ?" అని ప్రశ్నిస్తున్నాయి పిశాచాలు.

ఆ శివాపచారుల్ని ఒక్కరొక్కర్నే చూద్దాం.

**తిన్నడు :** పొత్తపినాదులో ఉడుమూరనే అటవీ గ్రామముండేది. అక్కడి ఆటవికులకు రాజు నాథనాథుడు. అతని భార్య తండె. వారిరువురికీ కలిగిన బిడ్డడే 'తిన్నడు' అను నామాంతరం కలిగిన కన్నప్ప. అతడో అమాయక శివభక్తుడు. ఓ రోజు వేటకు వెళ్లి అడవిలో సువర్ణరేఖా నదీతటంలో ఓ శివలింగాన్ని కనుగొని దానిని తన పల్లెకు రమ్మంటాడు. "ఈ కొండజువ్విచెట్టు నీడలో ఇక్కడ ఒంటరిగా ఉన్నావు. ఇది చూడబోతే క్రూర నట్టడవి. పులులూ, సింహాలూ తిరుగాడే ఈ అడవిలో ఒంటరిగా ఉండడానికి నీకు భయం వేయడంలేదా? నాతో మా పల్లెకు వస్తే చెంచెతలు తెచ్చియిచ్చే ఎన్నో రకాల పండ్లనిస్తాను. మనం మా వూరి పిల్లలతో ఎన్నో ఆటలు ఆడుకోవచ్చు. మా చిన్నక్క, పెద్దక్క క్రొవ్విన లేళ్లనూ, దుప్పులనూ కారుకమ్మగా వండిపెడతారు. రావయ్యా !" అంటూ ప్రార్థిస్తాడు. శివలింగం మారాడక పోయేసరికి 'నీవు రాకపోతే నేనూ మా పల్లెకు వెళ్లను' అంటూ మొరాయించి అక్కడే భీష్మించుకు కూర్చుంటాడు. ఎన్నాళ్లనుంచి శివుడు ఒంటరిగా యీ అడవిలో వస్తులున్నాడోనని తిన్నడు ఒక అడవి పందిని వేటాడి తెచ్చి, దాని మాంస ఖండాల్ని చక్కగా కాల్చి ఆ కఱకుట్లను ఆకు దొప్పలలో ఉంచి ఆరగించమని శివుని కర్పించబోయాడు. మరి శివుడైనా సరే స్నానం చేయకుండా భోజనం చేయకూడదు కదా! అంచేత చంకన విల్లు, వీపున అంపపొది, రెండు చేతులలో కఱకుట్ల దొప్పలు గల తిన్నడు శివలింగానికి స్నానమెలా చేయించాడో తెలుసా? పుక్కిళ్లతో పవిత్ర కాంచనముఖీ జలాన్ని తెచ్చి శివలింగంపైన ఉమిసి అంబుమజ్జనం చేశాడట. తరువాత ఆ దొప్పలలోని నంజుడును అద్రిరాజల్లునికి (శివునికి) సమర్పించి ఆరగింపమనగా ఆ పరమేశ్వరుడు ఊరకున్నాడట. అప్పుడతడు 'ఈ కఱకుట్లు కమ్మగా లేవా? క్రొవ్వినవి కావా? సరిగా కాలలేదా? లేక ఎక్కువగా కాలి మాడినవా? మరి ఎందుకు తినవు?' అని ప్రశ్నించాడు. ఇలా శృతి వ్యవహారేతర మతమున మహాభక్తితో శివారాధన చేశాడు తిన్నడు. అప్పుడు తిన్నడి భక్తిని పరీక్షించ దలచిన శివుడు కన్నీరు కార్చటం ప్రారంభించాడు. లింగాన్నుండి అదేపనిగా కారుతూన్న కన్నీళ్లను ఆపేందుకు తనకు తెలిసిన మూలికా వైద్యాలన్నీ ప్రయోగించాడు తిన్నడు. అయినా కన్నీళ్లు ఆగకపోగా ఒక కంటి నుండి నెత్తురోడడం ప్రారంభమైంది. శివుని కోసం తన ప్రాణాలైన్నా సమర్పించగల తిన్నడు ఆ ముక్కంటికి ముందుగా తన ఒక కంటిని పెరికి ఆ నెత్తురోడుతూన్న కంటి స్థానంలో అమర్చాడు. అప్పుడు అక్కడ రక్తస్రావం ఆగిపోయి మరొక కంటినుండి మొదలయింది. అప్పుడు తిన్నడు ఏం చేశాడో తెలుసా? తన రెండవ కన్ను కూడా పెకలిస్తే తాను పూర్తిగా అంధుడై లింగంపై నెత్తురోడుతున్న శివుని రెండవ కన్ను ఉండే స్థానాన్ని గుర్తించలేడు కనుక, ముందుగా తన చెప్పుకాలితో గురుతుగా శివలింగంపై ఆ రెండవ కన్నున్న ప్రదేశంలో తన్నిపట్టి సునిశిత బాణంతో తన రెండవ కన్నును కూడా శివార్పణ కోసం పెరుకబోయాడు. అప్పుడు శివుడు ప్రత్యక్షమై తిన్ననికి సాయుజ్యాన్ని ప్రసాదించాడు.

ఇలా యెఱుకువాడైన తిన్నడు తన చెప్పుకాలితో లింగాన్ని తన్నడం, లింగాభిషేకం కొరకు తన పుక్కిటి నీళ్ళతో అంబుమజ్జనం చేయడం జరిగాయి. ఇవి అమాయకుడైన తిన్నడు తన భక్తి చూపుటకే చేసినా, లోకం దృష్ట్యా శివలింగాన్ని తన్నడం, దానిపై ఉమియడం ఘోరమైన శివాపచారాలు. అయినా శివుడాతడిని కరుణించాడు.

**సాంఖ్య తొండడు :** ఇతడిని సక్కి నాయనారు లేక శాక్య నాయనారు అనీ పిలుస్తారు. ఇతడు మొదట బౌద్ధుడు. తరువాత శైవుడైనాడు. ప్రతిరోజూ శివుడిని పూలతో పూజించే సాంఖ్యతొండడు ఒక రోజు పూలు లభించక చిన్న చిన్న రాళ్లను జడిగా శివునిపై విసరుతూ శివార్చన చేశాడట. రాళ్లు రువ్విన అతడినీ శివుడు కరుణించాడు.

**అర్జునుడు :** నన్నయ మహాభారతములోని 'కిరాతార్జునీయం' కథ ప్రకారం అర్జునుడు కిరాతుని రూపంలోనున్న శివునితో యుద్ధం చేసేటప్పుడు ఒక దశలో బాణములు అయిపోగా గాండీవమనే తన విల్లుతోనే శివుడిని మోదాడట. శివుడు అతడినీ కరుణించి పాశుపతాస్త్రం ప్రసాదించాడట. (గాండీవమనే ధనుస్సును బ్రహ్మ సృష్టించాడట దీనితో ఒకేసారి లక్షమందితో పోరాడవచ్చట దీనిని వరుణుడి నుండి అగ్ని పొంది, ఖాండవ వన దహనం సందర్భంగా అక్షయతూణీరం - తరగని బాణములు గల అమ్ముల పొది - తో సహా అర్జునునికిచ్చాడట. మరలాంటప్పుడు కేవలం శివునితో చేసిన యుద్ధంలో అర్జునిని అమ్ముల పొదిలో బాణములు ఐపోవడం వింతగానే వుంది )

**చేరమరాజు :** ఇతడు శివభక్తుడు. ద్రావిడ దేశములో ఒక చిన్న రాజు. తగినంత సైన్యం కూడా లేనివాడు. శివుడిది గమనించి తన భక్తుడిని పరీక్షించ గోరి చేరమరాజు రాజ్యంపైకి తను సృష్టించిన ఒక గొప్ప సైన్యాన్ని పంపాడట. అప్పుడు చేరమరాజు తన శివభక్తితో తన రాజ్యంలోని నక్కలన్నింటినీ గుఱ్ఱాలు, సైనికులుగా మార్చి యుద్ధానికి పంపాడట. శివుని సైన్యము వెనకడుగు వేసింది. శివుడు చేరమరాజు భక్తికి మెచ్చి అతనినీ కరుణించాడట.

"ఓ శివా! ఇలా నిన్ను కాల తాచి (తన్ని) పైన ఉమిసిన యెఱుకమాలిన (శివపూజా విధానము తెలియని) యెఱుకు వానిని (**తిన్నడు ఆటవికుడు. ధూర్జటి మహాకవి రచించిన 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' కావ్యాన్నిబట్టి ఆ కావ్య రచనా కాలమైన క్రీ।శ॥ 16వ శతాబ్ది నాటికి ఆటవికులను ఎఱుకువారు, చెంచులు, బోయలు, కిరాతులు, శబరులు, భిల్లులు, పుళిందులు, నిషాదులుగా వ్యవహరించే వారని తెలుస్తుంది. ధూర్జటి మహాకవి తిన్నడిని ఒకచోట ఎఱుకువానిగా, మరొకచోట చెంచువానిగా, మరొకచోట బోయకుమారునిగా ఇలా రకరకాలుగా చెప్పడాన్ని బట్టి ఇప్పుడు వేర్వేరు కులాలుగా చీలిన ఆటవికులందరూ అప్పట్లో వివిధ పేర్లతో ఒకే కులంగా వ్యవహరించబడేవారని అర్థం చేసుకోవచ్చు**); నీపై రాళ్ళు రువ్విన సాంఖ్యతొండడినీ, నిన్ను చేవగల వింటితో (గాండీవంతో) మోదిన అర్జునుడినీ, నిన్ను తన సైన్యంతో గాసి బెట్టిన (బాధ పెట్టిన) చేరమరాజును, వారు నీకు చేసిన ఎగ్గులన్నీ సహించి, క్షమించి, నీలో ఐక్యం చేసుకున్నావు మేము చేసిన ఒక్క చిన్నతప్పును క్షమించలేవా? ఇప్పటికే నీ ఘోర శాప దావానలంలో మమ్మల్ని సగము చావు చంపావు ఇక చాలు. మమ్మల్ని కరుణించి శాప విముక్తికి మార్గం చెప్పు. ఓ చంద్రజూటా!" అని ప్రార్థించారట.

ఇంకా "నీ చెలికాడైన కుబేరుడిని నిత్యమూ పూజించే మేము, నీ కారణంగా యిలా వికట రూపులమవడం నీకే అవమానకరం. కనుక మమ్మల్నందరినీ కరుణించి, మా తప్పుకాచి, మాకు శాప విముక్తి ప్రసాదించి, మా అందరి పరితాపాన్నీ పోగొట్టు. నీ కోపానికి మృత్యుదేవత, మిహిర తనయుడు (సూర్యుని కొడుకైన యముడు), ఇభదైత్య నాయకుడు (గజాసురుడు), త్రిపురాసురులు వగైరాలే తట్టుకొన లేకపోయారు. ఇక మేమెంత? పిచ్చుకపైనా బ్రహ్మాస్త్రం? మమ్మల్ని రక్షించు" అంటూ ప్రార్థించారు.

ఇలా తప్పుతెలుసుకున్న గంధర్వులు శాప విమోచన మార్గం చెప్పమని వేడగా వేడగా శివుడు నూరు దివ్య

సంవత్సరాల అనంతరం పల్లకీపురంలో ముంజభోజుడనే రాజు జన్మిస్తాడనీ, ఉద్భటారాధ్యుడు అతనికి గురువుగా ఉంటాడనీ, ఉద్భటుడు మరణించిన పిదప ఆయన చితాగ్ని ధూమాల నాఘ్రాణించగానే గంధర్వులకు వారి నిజరూపాలు తిరిగి వారికి వస్తాయనీ తెలిపాడట. మనకు ఒక 'హాయనము' లేక 'సంవత్సరము' అంటే దేవతలకు ఒక రోజట అంటే ఒక దివ్య సంవత్సరమంటే 365 సంవత్సరాలు ఆ లెక్కన నూరు దివ్య సంవత్సరాలంటే 36,500 సంవత్సరాలన్నమాట! శివుని సలహా మేరకు గంధర్వ రాజు చిత్రరథుడు, శాపగ్రస్తులైన మిగిలిన గంధర్వులు పల్లకీపుర శ్మశానవాటికకు వెళ్ళి అక్కడ మర్రి చెట్టుపై ఏళ్లూ పూళ్లూ ఎదురు చూశారట. 'ఎప్పుడెప్పుడు ముంజభోజుడు జన్మిస్తాడా, ఎప్పుడాతనికి ఉద్భటుడు గురువవుతాడా, ఎప్పుడు ఉద్భటుడు మరణిస్తాడా, ఎంత త్వరగా ఆయన ప్రేతధూమాన్ని ఆఘ్రాణిద్దామా' - అని

**ప్రేతధూమం పీల్చడం కారణంగా దినందినం ఆయుః క్షీణం జరుగుతుందని ఆర్యోక్తి**

**ఈ శ్లోకం చూడండి**

**శ్లో॥ బాలార్కో ప్రేతధూమశ్చ। వృద్ధా స్త్రీ పల్వలోదకమ్ ॥**
**రాత్రౌ దధ్యన్న భుక్తిశ్చ। ఆయుః క్షీణం దినే దినే ॥**

దీని భావం - లేత సూర్యుని కిరణాలు (అంటే ఉదయపుటెండ), చితాగ్నిధూమం, వృద్ధ స్త్రీ పొందు, కుంటనీరు త్రాగడం, రాత్రులందు పెరుగుతో భోజనం చేయడం - ఇవన్నీ ఆయుః క్షీణకరములు.

**బహుశా మనుష్యులకు వర్తించే ఈ ఆరోగ్య నియమం పిశాచాలకు వర్తించదేమో !**

చిత్ర రథుడనే గంధర్వరాజు వజ్రదంష్ట్రుడనే పేరుతో, వజ్రముఖుడనే మంత్రితో కలిసి తన పరివారముతో సహా పిశాచముగా మారి ఆ మర్రి చెట్టుపైనే నివశిస్తున్నాడట. కవి ఈ క్రింది పద్యంలో గంధర్వుల రాజధానిని అలకాపురంగా పేర్కొంటున్నాడు.

**క॥ ఆ మట్టియ యలకాపురి**
**గా మది నూహించి ఖచరగణము లొగి నిజ**
**స్వామియగు వజ్రదంష్ట్రుఁడు**
**దామును వర్తించు నివ్విధమున శివాజ్ఞన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 1-139)**

ఆ మట్టిచెట్టునే అలకాపురిగా మది నూహించుకొని శివాజ్ఞ ప్రకారం ఆ ఖచరగణములు అక్కడే తమ రాజగు వజ్రదంష్ట్రుడు, తాము కలసి జీవిస్తున్నాయి.

ఇంకా 'చిత్రరథ సమాఖ్య నలకాపురములోన సౌఖ్యలబ్ధిఁ దనరు గంధర్వపతి వజ్రదంష్ట్రుఁ దనఁగ' అని (1-138) పద్యంలోనూ, 'అలకా చైత్ర రథాంతిక స్థిత' అని (1-134) పద్యంలోనూ అదే విధంగా మరికొన్ని చోట్లనూ కవి గంధర్వుల నివాస స్థలము లేక వారి రాజధాని అలకాపురమనే భావంతో అలకాపురిని పేర్కొనడం జరిగింది.

కాని అలకాపురి యక్షులరాజైన కుబేరుని రాజధాని శాపగ్రస్తులై పిశాచాలుగా మారినవారు గంధర్వులు వారి రాజధాని గంధర్వపురం లేక గంధర్వనగరం వారి రాజు చిత్రరథుడు కాగా కవి గంధర్వుల నివాసం 'అలకాపురి' అని ఎందుకు పేర్కొన్నాడో ఆలోచించాలి వామన్ శివరామ్ ఆప్టే గారి 'The Practical Sanskrit - English Dictionary' లో పేర్కొన్నదానిని బట్టి 'గంధర్వ నగరమ్' లేక 'గంధర్వ పురమ్' అంటే 'The city of Gandharvas, an imaginary city in the sky, probably the result of some natural phenomenon, such as mirage'.

'గంధర్వ నగరాకారమ్ తథైవాంతర్హితమ్ పునః' (మహాభారతమ్ 1-126-35). ఇలా గంధర్వ నగరం ఒక ఎండమావిలా ఊహాజనితమైన

నగర మైనందున గంధర్వులు తమరాజైన చిత్రరథునితో సహా యక్షరాజైన కుబేరుని సేవిస్తూ అలకాపురిలోనే నివాసముంటారేమో (గంధర్వులను ఇదే కావ్యంలోని రెండవ ఆశ్వాసములోని తొమ్మిదవ పద్యంలో కవి కుబేరాప్తులు అని పేర్కొన్నాడు. కుబేరుడికి 'పిశాచకిన్' అనే మరో పేరు వుంది అంతేకాదు – కుబేరుడికి కిన్నరేశుడు, కింపురుషేశ్వరుడు వగైరా బిరుదులు కూడా ఉండడాన్ని బట్టి కుబేరుడు యక్షులకే కాక పిశాచ, కిన్నర, కింపురుషాది గణాలకు కూడా అధిపతి అని అర్థమవుతూంది ) ఈ విషయమై మరింత విషయ సేకరణ, విచారణ అవసరం

## వల్లకీపుర వైభవం

అదే సమయంలో అటు వల్లకీపుర వైభవమెలావుందో రామలింగ కవి అత్యద్భుతంగా వర్ణించాడు. అక్కడి సౌధాలు, చంద్రశాలలు, హర్మ్యాలు వర్ణిస్తూ ఆ నగరం 'శ్రీ కాశి' (భాగ్యవంతమైన కాశి) అన్నట్లు వెలసిందంటాడు కవి. విశ్వేశ్వరుడు కొలువైన వారణాసి ఒట్టి 'కాశి' అయితే అత్యంత సంపద్వంతమైన వల్లకీపురం 'శ్రీ కాశి' అట!

అక్కడి బ్రాహ్మణులు దీవించి అక్షతలు చల్లితే ఎండిన మ్రాకులు కూడా చిగురిస్తాయట. వారి వద్ద బ్రహ్మవర్చస్సు, శబ్ద పరిశుద్ధి, శివునకే అంకితమైన శాంతబుద్ధి, సభలలో వాక్సిద్ధి సమృద్ధిగా ఉన్నాయట. ఆ పురిలోని బ్రాహ్మణులకు సరిపోలడం వ్యాససంభవుని (వ్యాసుని కొడుకైన శుక మహర్షి) కైనా వశమేనా? అంటాడు కవి.

అక్కడి క్షత్రియులు ఆడిన మాట బొంకని మహామహులట. ఇక అక్కడి కిరాటులు (వైశ్యులు) ధన సమృద్ధిలో ధననాథుడి (కుబేరుడి) తాతలట. శూద్రులు అభ్రగంగకు తోబుట్టువులట. అభ్రగంగ, ఆకాశగంగ, గగనగంగ, స్వర్గంగ, నాకగంగ, నాకనది, గగన ధుని, నాకధుని, మందాకిని, జాహ్నవి, భాగీరథి వగైరా పేర్లన్నీ గంగానదివే. గంగకు విష్ణుపది అని మరొకపేరు. విష్ణువు పాదమున యిది పుట్టింది కనుక దీనికాపేరట. వామన (త్రివిక్రమ) అవతారంలో విష్ణువు తన మూడు పాదాలలో ఒకటి భూమిపైన, మరొకటి ఆకాశంపైన, యింకొకటి బలిచక్రవర్తి శిరస్సున పెట్టాడట. ఆకాశంపై విష్ణువు పాదం మోపినప్పుడు ఆకాశం పగిలి ఆయన పాదం ఆధారంగా ఆకాశగంగ క్రిందికి ప్రవహించిందట. ఇంకొక నమ్మకం ప్రకారం ఆకాశంలో బ్రహ్మ నివసించే సత్యలోకం వరకు చాచబడిన విష్ణుపాదాన్ని విష్ణువు కుమారుడైన బ్రహ్మ తన కమండల జలంతో కడుగగా ఆ ధారాప్రవాహమే గంగానది అయిందట. బ్రహ్మ తండ్రియైన విష్ణువు కాళ్లు కడగడానికి కమండలంతో నారము (నీరు) యిచ్చిన బ్రహ్మ మానసపుత్రుడు నారదుడని పిలువబడ్డాడు (నార – నీరు; ద – యిచ్చినవాడు) అలా విష్ణువు పాదం 'బ్రహ్మ కడిగిన పాదం'గా వ్యవహృతమవుతూంది. శూద్రులు కూడా విష్ణువు పాదాల నుంచి పుట్టుకొచ్చినవారేనట! అందుకని శూద్రులను అభ్రగంగకు తోబుట్టువులంటున్నాడు రామలింగ కవి చమత్కారంగా. శూద్రులు పాలమున్నీటికి మఱందులు (మరదులు) అని కూడా అంటున్నాడు. గంగ నది కనుకనూ, నదులన్నిటికీ సముద్రుడు భర్త కనుకనూ, పాలసముద్రం గంగకు భర్త కనుక, గంగకు తోబుట్టువులైన శూద్రులు పాల సముద్రానికి మరదులు అంటున్నాడు. ధనమునూ, కీర్తినీ ఆర్జించడంలో ప్రోడలు (నిపుణులు) ఆ పురిలో పొల్పారు (ఒప్పారు) శూద్రోత్తములు అని కీర్తిస్తున్నాడు రామలింగకవి.

## ప్రమథేశ్వరుని శివభక్తి

ఇక రాజ ప్రాసాదములో వల్లకీపుర ప్రభువైన ప్రమథేశ్వరుడు నిత్యమూ చేసే శివపూజను వర్ణిస్తూ చెప్పిన పద్యం చాల చక్కటిది. ఈ పద్యం శివపూజకు వాడిన నాటి పూజా ద్రవ్యాలు, పత్రి విశేషాలు నైవేద్యాల గురించి తెలుపుతూంది. గత కాలంలో యిలా పూజకోసం చేసే పత్రి సేకరణ కారణంగా ఔత్సాహికులలో వృక్ష విజ్ఞానం పెంపొందే అవకాశముండేది. నేటి తరానికి ఈ అవకాశమే లేకుండా పోయింది.

సీ॥ తిలయుతాక్షతల దూర్వలఁ దుమ్మిపువ్వులఁ
బిల్వదళంబుల బిసరుహములఁ
గలువల బొండుమల్లెల నాగకేసరం
బుల దవనంబునఁ దులసి మాచి
పత్త్రిరిఁ జేమంతి బంతి నారగ్వధం
బులఁ గాంచనంబులఁ బొన్నవిరుల
మరువంపు ననలఁ గన్నెరులఁ బలాశ ప్ర
సవముల జాజులఁ జంపకముల

గీ॥ సాంద్ర ఘనసారమయ గంధసార చర్చ
ధూపముల దీపముల ఫలాపూప పాయ
సాదులను దుష్టి గావించు నతఁడు మంత్ర
పూత జలధౌత మూర్తికి భూతపతికి. (ఉద్భటారాధ్య చరిత్రము : 1-176)

తిలయుతాక్షతల (నువ్వులతో కూడిన అక్షతలతోనూ) దూర్వల (గరికల తోనూ) తుమ్మి పువ్వుల (శివునికి అత్యంత ప్రీతిపాత్రమైన పూజా సుమాలైన తుమ్మి - *Leucas aspera* - పూవులతోనూ; **తుమ్మి తులసి జాతి** (*Labiatae*) కి చెందిన చిన్న మొక్కకు పూసే తెల్లని పుష్పం 'తుమ్మి పూవులు తెచ్చి నీకు తుష్టుగా పూజ్జేదమంటే కొమ్మ కొమ్మకు కోటి తుమ్మెద లెంగిలంటున్నాయి లింగా మహానుభావా మా లింగమూర్తే మహాదేవశంభో ఏమి చేతుర లింగా ఏమీ చేతూ ' అంటూ సాగే శివతత్త్వం మీరు వినే వుంటారు ), బిల్వ దళంబుల (శివుడికి అత్యంత ప్రీతిపాత్రమైన మారేడు - *Aegle marmelos* - ఆకులతోనూ; మారేడు *Rutaceae* కుటుంబానికి చెందిన వృక్షం ) బిసరుహముల (అంటే తామర పూలతోనూ; తామర - *Nelumbium speciosum* ను శతపత్రము, కంజము, నలినము, పద్మము, కమలము అని కూడా పిలుస్తారు ఇది *Nymphaceae* కుటుంబానికి చెందిన నీటి మొక్క), కలువల (కలువ పూలతోనూ; కలువలను ఉత్పలము, కుముదము, కైరవము అని కూడా అంటారు ఇది కూడా *Nymphaceae* కుటుంబానికే చెందినది కలువలలో మూడు రకాలు ఎర్ర కలువ (కుముదము) - *Nymphae rubra* , నీలి కలువ (ఉత్పలము) - *Nymphae stellata,* తెల్ల కలువ (కైరవము) - *Nymphae alba*); బొండు మల్లె (*Jasminum sambac - Oleaceae* కుటుంబం) పూలతోనూ, నాగకేసరంబుల (నాగకేసర పుష్పాలతోనూ - *Mesua ferrea - Guttiferae family*) దవనంబున (మధురమైన సువాసన గల దవనము - *Artemisia pallens* అనే చిన్న మొక్క *Compositae* కుటుంబానికి చెందినది) తులసి (*Ocimum sanctum - Labiatae family* దీనిలో కృష్ణతులసి (నల్లని ఆకు కాడలు) లక్ష్మీతులసి (తెల్లని ఆకు కాడలు) రామతులసి, భూతులసి, కుక్క తులసి వగైరా ఎన్నో రకాలు ఉన్నాయి లక్ష్మీతులసి, కృష్ణతులసిలను పూజలో పత్రిగా వాడతారు) ఆకులతోనూ, మాచి పత్త్రిరి (చక్కని సువాసన గల మాచిపత్రి మొక్క *Artemisia vulgaris - Compositae family* - చేమంతి మొక్కను పోలి వుంటుంది) చేమంతి (*Chrysanthemum indicum - Compositae family*); బంతి (*Tagetes erecta - French Marigold - Compositae family* - దీనిలో ముద్దబంతి, ఒంటి రెక్క, ఊకబంతి, కారపుబంతి వగైరా రకాలున్నాయి) ఆరగ్వధం (అంటే రేల - *Cassia fistula - Indian Laburnum* - ఈ చెట్టుకు పెద్ద షాండ్‌లేర్‌ల లాగా పసుపుపచ్చ రంగులో గుత్తులుగా పూలు పూస్తాయి ఇది *Caesalpiniaceae* కుటుంబానికి చెందిన వృక్షం) కాంచనంబుల (కాంచన పుష్పాలతో; కాంచన వృక్షము *Bauhinia purpurea.* ఇది దేవకాంచనము, ~~శ్వేత కాంచనము~~ రక్త





కాంచనము అని వివిధ రకాలుగా ఉంది ఈ వృక్షాలన్నీ *Leguminosae* కుటుంబానికి చెందినవి) పొన్నవిరుల (పొన్నపూలతో; పొన్న చెట్టు *Calophyllum inophyllum* ను పున్నాగచెట్టు అనీ అంటారు దీనిపూలు తెల్లగా సువాసనగా ఉంటాయి ఇది *Guttiferae* కుటుంబానికి చెందిన వృక్షము) మరువంపు నవల (మరువపు చిగుళ్ళతో - మరువము - *Common Marjoram* - *Origanum vulgare* ఇది తులసి కుటుంబము - *Labiatae family* కి చెందిన సుగంధ మొక్క మాచిపత్రి, దవనము వలెనే మరువాన్ని కూడా పూలదండల తయారీలో వాడతారు మరువంపు నవలు (చిగుళ్ళు) సుగంధభరితంగా ఉంటాయి ) గన్నేరుల (గన్నేరు పూవులతోనూ - గన్నేరులు పలు విధాలు గుడి గన్నేరు - *Thevetia peruviana* - దీనిలో పసుపుపచ్చ, కనకాంబరం రంగు మరియు తెలుపు పూల రకాలున్నాయి ఈ వృక్షాలను దేవస్థానాలలో ఎక్కువగా పెంచుతారు వీటి పూలను పూజకు వాడతారు. అయితే వీటి కాయలలోని పప్పుమాత్రం విషపదార్థం ఎర్ర గన్నేరు - *Nerium indicum* - వీటి పూలు ఎర్రగా, మరియు తెల్లగానూ మరియు ముద్దగానూ, ఒంటి రెక్కగానూ పూస్తాయి వీటినీ అక్కడక్కడా పూజలకు వినియోగిస్తారు ఇకపోతే సువర్ణగన్నేరు - *Tecoma stans* - యొక్క పసుపుపచ్చ గొట్టపు పూలు గుత్తులు గుత్తులుగా పూస్తాయి ఈ మూడు రకాల గన్నేరులూ నిత్యమూ పుష్పించేవే మొదటి రెండూ *Apocynaceae* కుటుంబానికి చెందినవి కాగా, మూడవది *Bignoniaceae* కుటుంబానికి చెందినది). పలాశ ప్రసవముల (మోదుగ పూలతోనూ. మోదుగ - *Butea monosperma* చెట్టుపూలు ఎర్రగా ఆకర్షణీయంగా ఉంటాయి ) జాజుల (జాజిపూలతోనూ. సన్నజాజి అని కూడా పిలువబడే జాజి *Jasminum officinale* - *Oleaceae* కుంటుంబానికి చెందిన తీగ మొక్క తెల్లని దీని పూలు సుగంధ భరితంగా ఉంటాయి). చంపకముల (చంపక పుష్పములతోనూ; చంపక లేక చెట్టు సంపెంగ - *Michelia champaca* పుష్పాలు పూజలలో విరివిగా వాడతారు).

దట్టమైన, శ్రేష్ఠమైన, గంధపు పూతలతోనూ, అగరు, సాంబ్రాణి, బోళము వగైరా సువాసన ద్రవ్యములతో వేసే ధూపముతోనూ, దీపారాధనతోనూ, ఫలములతోనూ, అపూపముతోనూ (పిండి, పంచదార, సుగంధ ద్రవ్యాలతో చేయబడిన చిన్న గుండ్రని మందపాటి వంటకం ఇది చాల ప్రాచీన కాలం నుండి వండబడుతూన్న పిండివంట. దీని ప్రస్తావన ఋగ్వేదంలో గూడా వున్నది దానా - వేయించిన ధాన్యం, కరంభ - పిండిసత్తు వగైరా ఆహార పదార్థాలతోపాటు ఋగ్వేదంలో 'అపూపము' ఎన్నోసార్లు పేర్కొనబడింది - ఋగ్వేదం 8-80-2 ఈ అపూపమే కాలక్రమేణా మన ప్రాంతంలో 'అప్పము'గా రూపాంతరం చెందింది. 'అప్పచ్చి' అనే పదం కూడా దీన్నుంచే వచ్చి ఉంటుంది అప్పములను దేవతలకు నైవేద్యంగా సమర్పించడం ఈ ప్రాంతపు ఆచారం ), పాయసములతోనూ (ఇప్పుడు చేసుకుంటున్న రకరకాల పాయసాలు వేదకాలం నుండీ మన మెరిగినవే ఋగ్వేదంలో పురోడాశము - యవల నూకలను పాలు, పంచదారలతో కలిపి వండినది, క్షీరపాకము - పాలు, పంచదారలతో ఉడికిన యవలు - ల ప్రస్తావన వుంది పురోడాశము, క్షీరపాకము దేవతలకు ప్రీతికరమైన భోజనమట క్షీరపాకము ఋగ్వేదం 8-77-10 లో ప్రస్తావించబడగా, పురోడాశము ఋగ్వేదంలో 4-24-5 లో ప్రస్తావించబడింది విశ్వామిత్రుడు పురోడాశము వండుతున్నట్లుగా ఋగ్వేదంలో 3-28-2 లోనూ వర్ణించబడింది నాటి పురోడాశము, క్షీరపాకములే అనంతరకాలపు పాయసాలకు మాతృకలు. పాయసం కూడా దేవతల ప్రీత్యర్థం నైవేద్యంగా సమర్పిస్తారు). తుష్టి గావించాడట (అంటే సంతృప్తి పరచాడట) ఆ రాజు భూతపతియైన శివుడిని.

ప్రమథేశ్వరుడు వల్లకీ పురాన్ని అత్యంత శివభక్తి తాత్పర్యాలతో పరిపాలిస్తూండగా అక్కడి వివిధ వర్గాల ప్రజలు కూడా శివ పారవశ్యంలో మునిగి తేలుతూన్నారట.

ఈ సమయంలో ఓసారి శివుడికి తన శాప కారణంగా పిశాచాలుగా మారిన గంధర్వుల సంగతీ, వారికి తానిచ్చిన శాప విమోచన మార్గం సంగతీ గుర్తొచ్చింది. వెంటనే కేవలం తన సంకల్పంతో దివ్యతేజస్సులతో వెలుగొందుతూన్న ఉద్భటుడనే వానిని సృష్టించాడు శివుడు. తరువాత అతనిని చేరబిలిచి పిశాచాలుగా మారిన గంధర్వుల దుస్థితికి కారణం వివరించి, ఉద్భటుని తక్షణం వల్లకీపురం వెళ్ళి ప్రమథేశ్వరుడిని ఆశ్రయించమనీ అనంతరకాలంలో తాను ఆ రాజుకు పుట్టే

ముంజభోజుడనే బాలునికి గురువుగా వ్యవహరించాలనీ ఆదేశించాడు.

ఉద్భటుడు శివుని ఆజ్ఞమేరకు వల్లకికి వెళ్ళగా ప్రమథులు ఆయనకు శిష్యులుగా వెలిశారు. పరుసము సోకిన లోహము బంగారముగా మారినట్లు ఆ సద్గురుని మహిమ కారణంగా వసుధలోని జనులంతా వరశుభ సంపన్నులయ్యారట!

రసవాదము *(Alchemy)* అనే ఉద్యమం మధ్యయుగాల (క్రీ శ 1000 నుండి క్రీ శ 1453 వరకు గల కాలం) లోని మేధావులలో వెల్లివిరిసింది పరుసవేది లేక సిద్ధరసము అనే పదార్థం యొక్క స్పర్శతో క్షుద్రలోహాలను బంగారం లేక వెండిగా మార్చవచ్చునే విశ్వాసమే ఈ ఉద్యమానికి పునాది ఒక్కసారిగా ధనవంతులైపోవాలనే దురాశ, రసాయనిక శాస్త్రం గురించి శాస్త్రీయ అవగాహన లేకపోవడం ఈ ఉద్యమానికి కారణాలు ఐరోపాలోని రసవాదుల *(Alchemists)* ప్రయోగాలు ముఖ్యంగా క్షుద్ర లోహాలను బంగారంగా మార్చే పరుసవేదిని కనుగొనడానికే ఉద్దేశించినా, అన్ని లోహాలనూ, తనలో కరగించుకొనే ద్రావణాన్నీ *(Universal Solvent)*, అన్ని వ్యాధులను నయం చేయగల సర్వరోగ నివారిణి *(Panacea;cure-all)* నీ, మరియు మానవ ఆయుర్దాయాన్ని పెంచగల అమృతము *(Elixir of Life; Nectar; Ambrosia)* నూ, కనుగొనడం కూడా వారి పరిశోధనల లక్ష్యంగా మారింది కొలంబస్ ఇండియాకు నౌకామార్గం కనుగొనడానికి బయలుదేరి క్రీ శ 1492లో తాను కనుగొన్న ప్రదేశం అమెరికా అయినా దానిని ఇండియా అనే పిల్చినట్లు, ఈ రకరకాల రసవాద వేత్తలు ఎవరికి వారు తాము తయారు చేసిన రసాయనిక పదార్థానికి ఈ శక్తులున్నట్లుగా ప్రచారం చేసుకున్నారు పరుసవేది అనే ఊహాజనిత పదార్థానికి యీ అద్భుత లక్షణాలన్నీ ఉన్నట్లు కూడా వారు భ్రమించేవారు ఐరోపా ఖండంలో యీ ఉద్యమం వలన రసాయనిక శాస్త్ర పరిశోధనలు ఊపందుకున్న కారణంగా ఓ రకంగా మేలే జరిగింది *Alchemistry* అలా ఐరోపాలో *Chemistry* కి తల్లి కాగలిగింది ప్రజా కవి వేమన కూడా బంగారంపై వ్యామోహంతో కొంత కాలం పాటు రసవాద ప్రయోగాలు చేశాడని ప్రతీతి

# పుత్రుని కొరకు ప్రమథేశ్వరుని పరితాపం

వల్లకీపుర రాజెంత శివపూజా తత్పరుడైనా సంతానలేమితో కుందుతున్నాడు. ఓనాడు రాజు ప్రమథేశ్వరుడు తన భార్య ప్రభావతితో యిలా అంటున్నాడు -

శా॥ గలుగల్లంచును గాల్లయందియలు వల్కం జెక్కులన్ మద్దికా
యల తక్కుల్ గరువంపుఁ జూపు నిటలవ్యాకీర్ణ లంబాలకం
బులతో ముద్దులు చిల్కుచుం గలవచః పూర్ణాస్యుఁడై తప్పు ట
డ్గులు వెట్టంగల పుత్త్రుఁ డబ్బునొకొ నాకు న్నీకు లోలేక్షణా! (ఉద్భటారాధ్య చరిత్రము : 2-20)

"కాళ్ల అందెలు ఘల్లు ఘల్లు మంటూ, ముద్దొచ్చే చెక్కిళ్లతో, (నడుముచుట్టూ మొలత్రాడుకుండే వెండి లేక బంగారు) మద్దికాయలు తళుకులీనుతుండగా, గర్వమైన చూపుతో, నుదుటి పైకి చెదిరి ముసురుతున్న పొడవాటి ముంగురులతో ముద్దులొలుకుతూ, అవ్యక్తమధురమైన మాటలు కురిపించే ముద్దుమోముతో, తప్పటడుగులు వేసే పుత్రుడు కలుగుతాడా? నాకూ - నీకూ? ఓ చంచలాక్షీ !"

ఇంకా ఇలా అంటున్నాడా రాజు -

క॥ వారణ వాజి వధూ వసు
వారాత్మకమైన రాజ్య వైభవమిది దా
నౌరసుఁడు లేని కతమునఁ
జారుముఖీ ! యెన్నులేని సస్యము కాదే (ఉద్భటారాధ్య చరిత్రము : 2-21)

" ఓ సుందరీ! ఏనుగులు, గుఱ్ఱములు, భార్య, (వసు - బంగారము) ధనసంపదలు, (కోరినంతమంది) వేశ్యలు వగైరాలతో కూడిన రాజ్యవైభవం అనుభవిస్తూ కూడా ఒక్క ఔరసుడు (వారసుడు) కూడా లేని కారణంగా యిదంతా యెన్నులేని సస్యము (నిష్ఫలమైనది) కాదా !"

అప్పుడు రాణి రాజుతో "నీకు చింత ఎందుకు? దేవతా సార్వభౌముడైన శివుడిని పూజించే శుద్ధాత్ములకు వారి యింటి పెరడులోనే కల్పవృక్షం మొలుస్తుంది. సురభి (కామధేనువు) నిత్యమూ వారి కనుసన్నలలోనే వుంటుంది సిద్ధరసము ఎప్పుడూ వారింటిలో సిద్ధంగా వుంటుంది. అణిమాది అష్టసిద్ధులు ఎప్పుడూ వారి ఆజ్ఞల్ని శిరసావహిస్తాయి. వారి యింట దినవెచ్చముల సంగతి ఇందిరా దేవత (లక్ష్మీదేవి) చూసుకుంటుంది. వాక్తోయజాక్షి (వాక్ + తోయజాక్షి ; తోయజాక్షి - తోయజ + అక్షి ; తోయజ అంటే నీటిలో జనించినదైన పద్మమువంటి కన్నులు కలది; వాక్తోయజాక్షి - సరస్వతి) వారి నాలుకపై నిలుస్తుంది. కోరిన కోరికలనిచ్చే దేవమణియైన చింతామణి వారి సందిట్లోనే వుండి వారి కొంగు బంగారమై వారి సంపదలు పెంచుతుంది", అని చెప్పగా అప్పటికప్పుడే వారిరువురూ సంతానార్థం కాశీ విశేశ్వరుణ్ణి పూజించే నిమిత్తం కాశికి వెళ్లాలని నిర్ణయించుకున్నారు.

## కాశికి బయలుదేరిన రాజదంపతులు

రాజధానిని వదలి కాశికి పోబోయేముందు ఆ రాజు ఎలాంటి జాగ్రతలు తీసుకొన్నాడో చూడండి -

మ॥ పరభూపాలుర దైన్యముం నిజబల ప్రాచుర్యమున్ నిశ్చయిం
చి రసామండలి ధాన్యముం ధనము లక్షీణంబులై యున్కికిన్
బరితోషంబు వహించి మూలనగరిన్ భవ్యాత్ములం రక్షణ
స్థిరులంజేసి మహీమహేంద్రుఁడు దలంచెన్ గాశికింబోవఁగన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2-27)

శత్రురాజుల నిస్సహాయస్థితినీ, తన ప్రాబల్యాన్నీ - అంటే వారిపై తన స్పష్టమైన ఆధిక్యాన్నీ - సరిగ్గా బేరీజు వేసి నిశ్చయించి, కోశాగారములో చాలినంత ధాన్యమూ, ధనమూ ఉండడాన్ని గమనించి సంతోషించి, అంతఃపురములోని తనవారల రక్షణ, సంక్షేమాలకు ఏర్పాట్లు చేసి - అప్పుడా రాజు కాశికి పోవాలని ఆలోచించాడట. ఈ జాగ్రతలన్నీ ఆధునిక పాలకులు కూడా తాము విదేశీ పర్యటనలకు బయలుదేరే ముందు తీసుకొనదగినవిగానే కనుపిస్తున్నాయి.

రాజు, రాణి కౌండిన్య మహర్షి ఆశ్రమం చేరేటప్పటికి సూర్యాస్తమయం అవుతూన్నదట.

ప్రకృతిలోని ఎర్రనైన వాటన్నింటినీ కలగలిపి ఆ పడమటి సంధ్యారాగాన్ని ఎంత రసరమ్యంగా వర్ణిస్తున్నాడో చూడండి మన రామలింగకవి.

సీ॥ పాటలంబులవన్నె తేటమంకెనల బిం
కము జపాప్రభ విద్రుమముల సొబగు
పద్మరాగంబుల పస ప్రియంగుచ్ఛాయ
కుసుమ మొప్పిదము కుంకుమము చెలువు

లత్తుకచెన్ను పల్లవ సముల్లాసంబు
కాశ్మీరజాంగ రాగంబు పూఁత
చక్కదనంబు హంసముల చంచు స్ఫూర్తి
పటు పలాశద్రుమ ప్రసవ కాంతి

గీ॥ బింబఫల విభవము చందిరంబు రీవి
యాదిగాఁగల రక్త పదార్థ సమితి
నలువ కేలికి నొకచోట నలమి కూర్చె
ననఁగఁ జెలువొందె నెఱ సంజ యపర దిశను. (ఉద్భటారాధ్య చరిత్రము : 2-35)

పాటలములు అంటే కలిగొట్టు చెట్టు (*Stereospermum suaveolens Syn. Bignonia suaveolens*) పూలు. ఇవి ఎర్రగా ఉంటాయి. ఈ చెట్టును Trumpet Flower Tree అనీ అంటారు.

మంకెన (*Pentapetes phoenicea*) పూలు తెలుగులో ఎర్రదనానికి మారుపేరుగా వాడుతూంటాం.

'గోరింటాకు' చలన చిత్రంలో "గోరింట పూచింది కొమ్మ లేకుండా . మురిపాల అరచేత మొగ్గ తొడిగింది" అనే పాటలో కీ శే దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు అన్నింటిలోనూ ఎర్రనైన వాటిని పేర్కొంటూ ఇలా అంటారు

"మామిడీ చిగురెరుపు . . . మంకెన పువ్వెరుపు
మణులన్నిటిలోనా . . . మాణిక్యం ఎరుపు"

జపా పుష్పమంటే మందార (*China Rose - Hibiscus rosa sinensis*) పుష్పం మందార పువ్వుయొక్క ప్రభ ఎర్రనిదే కదా!

విద్రుమము అంటే పగడము (*Coral*). ఇది నవరత్నాలలో ఒకటి. పగడాలు ఎర్రనివే కదా!

పద్మరాగము (*Ruby*) అంటే రక్తవర్ణము కల ఉత్తమజాతి రత్నము. ఇది సంధ్యారుణ కాంతిగల కెంపు ఇది కూడా నవరత్నాలలో ఒకటి. సింహళము దీని జన్మదేశమని ప్రసిద్ధి. మొత్తం నాలుగు రకముల మాణిక్యములలోనూ ఇది శ్రేష్ఠతమమైనది. మిగిలినవి – కురువిందము, సౌగంధికము మరియు నీలగంధి.

సంస్కృత భాషలో 'ప్రియంగు' అన్నా, 'ప్రియాళు' అన్నా లేక 'ప్రియాల' అన్నా తెలుగులో 'మొరలి' లేక 'సార' లేక 'చార' చెట్టు (*Buchanania lanzan Syn. Buchanania latifolia*). దీని పూలు ఎర్రగా, ఆకర్షణీయంగా వుంటాయి పండ్లు తియ్యగా వుంటాయి లోపల గింజ పగులగొడితే వచ్చే పప్పు రుచికరంగా వుంటుంది సారపప్పును హల్వాలు, వక్కపొడి వగైరాలలో వేస్తారు బహుశా అడవులలో తిరిగే తాపసులు దీని పండ్లనూ, పప్పునూ యిష్టంగా తినడంవల్లనో ఏమో ఈ చెట్టును సంస్కృతంలో 'తాపస ప్రియ' అని కూడా అంటారు ప్రియాల వృక్షపు మరొకరకం (*Buchanania axilaris Syn. Buchanania angustifolia*) వృక్షాన్ని కడపబాదం (*Cuddapah almond* లేక *Buchanan's mango*) అనీ పిలుస్తారు దీనిని తెలుగులో పెద్దసార అంటారు దీనిపప్పు ఇంకా రుచిగా వుంటుంది ఈ రెండు రకాల వృక్షాల పుష్పాలూ ఎర్రగా, ఆకర్షణీయంగా వుంటాయి అలిపిరి నుండి తిరుమలకు వెళ్లే కాలిబాటలో ఈ వృక్షాలను విస్తారంగా చూడవచ్చు ప్రేంఖణపు చెట్టు (*Aglaia roxburghiana*) ను కూడా కొందరు సంస్కృతంలో ప్రియంగు అంటున్నారు అయితే అత్తరు తయారీలో వాడే దీని సుగంధ భరితమైన పుష్పాలు పసుపుపచ్చగా వుంటాయి. ఎర్రగా వుండవు కొందరు కదంబ వృక్షాన్ని (*Anthocephalus cadamba*) కూడా ప్రియంగు అంటున్నారు అయితే

దాని పూలూ పసుపుపచ్చగా వుంటాయి తప్ప ఎఱ్ఱగా వుండవు 'కృశ' అని సంస్కృతంలో పిలువబడే పూలతీగను కూడా 'ప్రియంగు' అంటారు అయితే దాని పూలూ ఎఱ్ఱనివి కావు వేఱొక కంచె మొక్క (*Callicarpa macrophylla*) ను కూడా సంస్కృతంలో ప్రియంగు అంటారు కానీ దానిలో తెల్లపూవుల రకం కూడా వున్నందున ఇక్కడ రామలింగకవి 'ప్రియంగు' అని సారచెట్టు యొక్క ఎఱ్ఱని ఆకర్షణీయమైన పూలని ఉద్దేశించే పేర్కొని వుంటాడని నా అభిప్రాయం లేక ఎఱ్ఱపూల ప్రియంగు అనే కంచెమొక్కనే కవి దృష్టిలో పెట్టుకొని వుండొచ్చుకూడా !

చిన్న ముండ్ల మొక్కైన కుసుమ (పిచ్చికుసుమ లేక పచ్చ కుసుమ లేక బ్రహ్మదండి – *Argemone mexicana*) పూలు పసుపు పచ్చగా బంగారు వర్ణంతో మెరుస్తూంటాయి. మన ప్రాంతపు ఖాళీనేలల్లో యీ మొక్కలు విస్తారంగా పెరుగుతాయి. అన్నీ ఎఱ్ఱనివే చెబుతూ మరి దీనినెందుకు చెప్తాడు కవి? దీనిని పిచ్చికుసుమ అని పిలవడాన్ని బట్టి మంచి కుసుమ వేరే వుందనీ, దీనిని పచ్చ కుసుమ అని కూడా వ్యవహరించడాన్ని బట్టి ఎఱ్ఱపూల కుసుమ ఉండే వుంటుందనీ ఊహించవచ్చు. అదే కుసుమ (సంస్కృతంలో కుసుంభ లేక కమలోత్తర) అనే ఎఱ్ఱని పూల చెట్టు (Wild Saffron or Bastard Saffron - Carthamus tinctorius) దీనిని 'అగ్నిశిఖ' లేక 'వహ్నిశిఖ' అని కూడా అంటారు. దీని విత్తనాల నుండి తీసిన తైలాన్ని (Saf-flower oil) వంటనూనెగా వాడతారు. వైద్యపరంగా కుసుమ నూనె కెన్నో ప్రయోజనాలున్నాయి. దీని పూరేకుల నుండి ఎఱ్ఱని రంగు (red dye) ని తయారు చేస్తారు.

దీని పూలరంగును కుసుంభ వర్ణమంటారు.

శ్రీనాధ మహాకవి కూడా 'శృంగార నైషధం'లో అరుణ సంధ్యను వర్ణిస్తూ 'కుసుమ' శబ్దం ప్రయోగించాడు.

**క॥ కుసుమం బద్దిన విధమునఁ**
**బసుపున హత్తించినట్లు, బంగారమునన్**
**బసనిచ్చిన గతి సంధ్యా**
**వసరంబున నింగి యరుణ వర్ణంబయ్యెన్.** **(శృంగార నైషధము : 8-157)**

ఇక కుంకుమ ఎరుపే కదా! అయినా యిది కుంకుమ పొడినుద్దేశించి వ్రాసింది కాదు. ఎందుకంటే 'చందిరంబు రీవి' అంటూ సిందూరము లేక కుంకుమ పొడి యొక్క ప్రస్తావన యిదే పద్యంలో కవి వేరుగా చేశాడు. కుంకుమము అంటే జాఫరా చెట్టు (*Annatto*) (*Bixa orellana*) యొక్క పుష్పం. అదీ ఎఱ్ఱనిదే! ఈ చెట్టు కాక కుసుమ లేక బూసి చెట్టు (*Schleichera oleosa*) అనే శాపిండేసీ (*Sapindaceae*) కుటుంబానికి చెందిన మరో వృక్షముంది. ఇది లక్క పురుగులకు ఆశ్రయమిస్తుంది. దీని లేత ఆకులు కూడా ఎఱ్ఱగా ఉంటాయి. ఇది కాక సింధూర వృక్షము (*Mallotus philippensis*) అనే పేరుతో యూఫోర్బియేసీ (*Euphorbiaceae*) కుటుంబానికి చెందిన వృక్షాన్ని కూడా 'కుంకుమ చెట్టు' అంటారు.

లత్తుకము అంటే లక్కలోని ఎఱ్ఱని రంగు. దీనిని లాక్షారసము అని కూడా అంటారు.

పల్లవము – అంటే చిగురుటాకు ఎఱ్ఱనిదే కదా!

'కాశ్మీరజ' అన్నా 'కాశ్మీర జన్మము' అన్నా 'కాశ్మీరము' అన్నా కుంకుమ పువ్వు. ఇది కాశ్మీర్‌లోనే సాగవుతుంది గనుక దానికాపేరు. దీనినే కేసర్ లేక జఫ్రాన్ (*Saffron*)(*Crocus sativus*) అనీ అంటారు. ఈ చెట్టు పూల రేకులు వంగపండు రంగులో ఉంటాయి. అయితే దాని అంగములు ఎఱ్ఱగా వుంటాయి – ఆ పుష్పభాగములైన కేసరము (*Stamen*), కీలాగ్రము (*Stigma*) యొక్క రాగంపు పూంత అంటే ఎఱ్ఱని పూత కారణంగా.

ధవళకాంతులీనే రాజహంస యొక్క చంచువులు – అంటే ముక్కులు ధూమ్రవర్ణంలో – అంటే ముదురు ఎరుపు

రంగులో ఉంటాయట! మరాళము అని కూడా పిలువబడే ఈ రాజహంసల్ని గురించి మనకు కొన్ని విచిత్రమైన విశ్వాసాలున్నాయి. ఇవి పాలనీ నీళ్లనీ వేరుచేసి పాలను మాత్రమే త్రాగుతాయట! చనిపోయే వరకూ మూగగా ఉండి చనిపోయే సమయంలో మాత్రమే అరుస్తాయట! ఈ అరుపునే 'హంసగీతి' అంటారు. ఇవి తామర తూళ్ళు మాత్రమే ఆహారంగా తీసుకుంటాయట. మరి ఇవన్నీ ఎంత వరకూ నిజమో! హంసనడక చూడముచ్చటగా ఉండడాన్ని బట్టే చక్కని నడకగల స్త్రీని మదమరాళ గామిని, హంస గామిని, హంస గమన, హంస యాన అని అంటారు. హిమాలయ ప్రాంతాలలో కనుపించే మూగగా వుండే హంస (Mute Swan - Cygnus olor) ముక్కులూ, కాళ్లూ (కొందరి వర్ణన ప్రకారం రెక్కలు కూడా) నలుపు కలగలిసిన ముదురు ఎరుపు రంగులో వుండి మిగిలిన శరీరమంతా తెల్లగా మెరిసిపోతూ వుంటుంది. ఇదే మన కావ్యాలలో వర్ణించబడిన రాజహంస కావచ్చు !

పలాశ ద్రుమము అంటే మోదుగ చెట్టు (Butea monosperma). 'ప్రసవము' అన్నా 'ప్రసూతము' అన్నా 'ప్రసూనము' అన్నా పువ్వు అని అర్థం. మోదుగ పూలు ఎర్రగా ఆకర్షణీయంగా వుంటాయి. నిండుగా పూచిన మోదుగ చెట్టును దూరాన్నుంచి చూస్తే కార్చిచ్చుతో అడవి మండిపోతున్నట్లుగా భ్రమ కలుగుతుంది. అందుకే ఈ వృక్షాన్ని ఆంగ్లంలో Flame of the Forest (కార్చిచ్చు) అంటారు.

బింబఫలము అంటే దొండపండు (Momordica monadelpha syn. Coccinia grandis) ఎర్రగా వుంటుంది. అందుకనే దొండపండ్ల వంటి ఎర్రని పెదవులు కల స్త్రీని కవులు 'బింబాధర' అని వర్ణించారు.

చెందిరము అంటే సిందూరము. ఇదీ ఎర్రగా వుంటుంది.

పాటలముల వన్నె, తాజా మంకెన పూలబింకము, మందార పుష్ప ప్రభ, పగడాల సొగసు, పద్మరాగముల పస, ప్రియంగు పూల రంగు, కుసుమము యొక్క అందము, కుంకుమ పుష్పము యొక్క సౌందర్యము, లాక్షారసము యొక్క సొబగు, చిగురుటాకు చక్కదనము, కుంకుమ పువ్వు ఎర్రని కీలాగ్రముల చక్కదనము, రాయంచే ధూమ్రవర్ణపు ముక్కు యొక్క అతిశయము, మోదుగపూల అరుణకాంతి, దొండపండు వర్ణసంపద, సిందూరపు రీవి – వగైరా రక్తవర్ణపు పదార్థాల నన్నింటినీ ఒకచోట సమకూర్చి ఆ మిశ్రణాన్ని నలువ – అంటే బ్రహ్మ పులిమాడా అన్నట్లుగా ఉందట అపర దిశలో అంటే పడమటి దిక్కున పూర్తిగా వ్యాపించిన సూర్యాస్తమయ సుందర దృశ్యము.

బహుశా చాల కొద్దిమంది మహాకవులు మాత్రమే యింతటి సర్వసమగ్రమైన, మనోహరమైన వర్ణనలు చేయగలరేమో!

## కౌండిన్యుని ఆశ్రమంలో రాజదంపతులు

అటువంటి సుందర సూర్యాస్తమయ సమయంలో రాజు, రాణి కౌండిన్య ముని ఆశ్రమ ప్రాంగణంలో అడుగుపెట్టారు.

ఈ కథకూ, కౌండిన్య మునికీ వాస్తవానికి ఏ సంబంధమూ లేదు కాని, కౌండిన్యుడు రామలింగకవి గోత్రకర్త అవడమేకాక, కృతిపతి ఊర దేచమంత్రిది కూడా కౌండిన్య గోత్రమే కనుక – కృతిపతి వంశాన్ని లస్సగా పొగడదలచి రామలింగకవి తెలివిగా కౌండిన్యమునిని ఈ కథలో ప్రవేశపెట్టాడు

కౌండిన్యుడు రాజునూ, రాణినీ సాదరంగా ఆశ్రమంలోనికి ఆహ్వానించి రాజుకు కుశల ప్రశ్నలు వేశాడు. రాజు మునీశ్వరునితో ఇలా అన్నాడు. "పుత్రసంతానం కోసం పరితపిస్తున్న నాకు ఓ రోజు బయలాడిన మాటలు (అశరీరవాణి) శ్రోత్రపేయంగా వినిపించాయి.

క॥ ఏటికి బుత్త్రులు లేమికి
మాటికిఁ జింతింప నీకు మనుజేశ్వర ! నీ
వేటి సగమిందు శేఖరు
వాటంబుగఁ గొల్వుపోయి వారాణసిలోన్ " (ఉద్భటారాధ్య చరిత్రము : 2-62)

"ఓ నరేంద్రా ! పుత్రులు లేనందుకు పదేపదే విలపించడం దేనికి? నీవు వారణాసి వెళ్లి ఏటి ఒడ్డుననున్న (గంగానదీ తీరంలోనున్న) సగమిందుశేఖరుడిని – అర్ధేందు భూషణుడిని – శివుడిని – వాటముగా పూజించు (నీ కోరిక నెరవేరుతుంది) అనిన ఆ దివ్యవాణి విని ఆనందించి ఈ విషయం తమకు తెలిపి తమ ఆనతి తీసుకుని సతీసమేతంగా కాశికి వెళ్లదలిచాను" అన్నాడు ప్రమథేశ్వరుడు.

అప్పుడా మునీంద్రుడు శివుడికి మ్రొక్కుకుంటే కానిపని లేదంటూ యిలా అన్నాడు.

ఉ॥ గుబ్బల రేని కూఁతు చనుగుబ్బల కమ్మ జవాది గంధముల్
జొబ్బిలఁ బాయఁజూఁడ నిల చూపులు మూఁడగు వేల్పుఁబెద్దకుం
గిబ్బల రాచతేజి నుటికింపుచు లోకము లేలు సామి కె
చ్చుబ్బిన భక్తి మ్రొక్కులిడఁ జబ్బన చూరఁగఁ గల్గు సౌఖ్యముల్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2-72)

గుబ్బలరేడు – పర్వతరాజు; కూతురైన పార్వతి చనుగుబ్బలపైన కమ్మని జవాది, గంధము జొబ్బిలఁ (స్రవించునట్లుగా, కారునట్లుగా అంటే విస్తారంగా) పులమాలని చూసే మూడు చూపుల వేల్పు పెద్ద (ముక్కంటి అయిన ఆదిదేవుడు శివుని)కి గిబ్బ (ఎద్దు) ల రాచతేజి – అంటే వృషభరాజ వాహనమును (నందీశ్వరుడిని) ఎక్కి స్వారీచేస్తూ సకలలోకాల్నీ పరిపాలించే స్వామికి హెచ్చుగా అతిశయించిన భక్తితో మ్రొక్కులిడితే, ఇల – ఈ లోకంలో చుబ్బన చూరగా – కోకొల్లలుగా సౌఖ్యాలు కలుగుతాయి. (ఈ పద్యం రెండవ పాదంలో 'జొబ్బిలఁ బాయఁజూఁడ' కు బదులుగా 'జొబ్బిలఁ బూయఁ జూఁచు' అని వుండడం సబబుగా వుంటుంది.)

## కాశీ యాత్ర విశిష్టత

ఇక కాశీయాత్ర యొక్క విశిష్టత వివరిస్తూ –

గీ॥ యాగములు వేయి చేయంగనైన ఫలము
కోటి గోదానముల నొనగూడు ఫలము
పెక్కు నల్లిండ్లు నిలుపుటఁ బేర్చు ఫలము
కాశి నొక పూఁట వసియింపఁ గలుగు నధిప (ఉద్భటారాధ్య చరిత్రము : 2-85)

"ఓ రాజా ! వేయి యాగములు చేస్తే వచ్చే ఫలము, కోటి గోదానముల వలన లభించే పుణ్యమూ, పెక్కు నల్లిండ్లు (అగ్రహారములు) దానమిచ్చి నెలకొల్పడం కారణంగా వచ్చే ఫలమూ, కాశిలో ఒక్కపూట నివసిస్తేనే వస్తాయి" అన్నాడు కౌండిన్యుడు.

ఇంకా – "కాశిలో మరణించినవాడికి చావు మూడదు. చావునకే చావు మూడుతుంది. పైపెచ్చు కాశిలో మరణించినవాడు సాక్షాత్తూ శివుడే అవుతాడు. వారణాసి గంగాస్నాన కారణంగా రెండు కండ్లవాడైన మనుజుడు ముక్కంటి (శివుడు) అవుతాడు" (గంగాస్నానం సారూప్య మోక్షాన్నిస్తుంది కనుక అది చేసిన వాడు శివుడి రూపం ధరిస్తాడు.) అంటూ–

గీ॥ కాశిలోఁ బట్టతలవాఁడు గంగ మునిఁగి
జడముడి ధరించు దానిపై సవదరించు
ఫణిఫణా రత్నరుచి దానిపై వహించు
మొలకజాబిలి జాజిపూ మొగ్గవోలె. (ఉద్భటారాధ్య చరిత్రము : 2-94)

బట్టతలవాడు కాశిలో గంగనీట మునిగితే జటాజూటములు, వానిపై ఫణిఫణారత్నరుచి (ఫణి - సర్పము; ఫణము - దాని పడగ; రత్న రుచి - ఆ పడగపైనుండే మణులకాంతి) ని దానిపై జాజిపూవు మొగ్గలాంటి మొలకజాబిలినీ సవదరిస్తాడట (తాలుస్తాడట). అంటే సిగముడిని సర్పములతో చుట్టి ఆ మౌళిపై బాలచంద్రుణ్ని ధరించిన సాక్షాత్తు శివుడే అవుతాడట ఆ ఖలతి.

కౌండిన్యముని యింకా యిలా అంటున్నాడు -

చ॥ జ్వరము పయోవగాహమున వర్ధిలు మానఁగ నేరదందు రి
ద్ధరపయి వైద్యులెల్ల వసుధాతల నాయక ! కాశిలోన నం
బరతటినీ జలస్ఫురణఁ బాపమహాజ్వర మాఱుఁ గ్రొత్త శ్రీ
కర హర వైద్యపుంగప నికామ దయోదయ జృంభణంబునన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2-101)

"ఓ రాజా ! పయోవగాహము (పయః + అవగాహము - నీటిలో మునగడం) కారణంగా జ్వరము పెరుగుతుందే కానీ తగ్గదని లోకంలోని వైద్యులంతా చెపుతారు. కాని, కాశిలో అంబర తటినీ (తటిని - నది; అంబర తటిని - ఆకాశ గంగ) జలస్నానం వలన మాత్రం పాపమనే మహాజ్వరం - శుభకరుడైన శివుడనే వినూత్న వైద్య పుంగవుని అంతులేని యధేచ్ఛా దయా విజృంభణ కారణంగా - నశిస్తుంది" అంటూ -

"భక్తితో కాశికి వెళ్లిన నరుడు కాలముఁ ద్రోచి (విధి నెదిరించి) కాలునికిఁ గాదని కాలను బొమ్మగట్టఁడే? (అంటే యమునిపై - మృత్యువుపై - తన గెలుపుకు సంకేతంగా తన కాలికి యముని బొమ్మ కట్టడా? శత్రువుపై విజయానికి సంకేతంగా వారి బొమ్మను విజేతలు తమ కాలికి కట్టుకొనడం అనాదిగా వస్తూన్న ఆచారం). కాశికి వెళ్లిన స్థిర పుణ్యాత్ములు ముక్తి గైకొనుటయే మనం చిత్రమనుకొంటున్నాము. ఒకప్పుడు శూన్యుడూ, దుర్మార్గుడూ, విషయలోలుడూ అయిన మదాలసుడనే బ్రాహ్మణ కుమారుడు కాశిలో మృతినందిన కారణంగా శంభు స్వరూపాన్ని పొందాడు" అంటాడు కౌండిన్యముని

## మదాలసోపాఖ్యానము

అప్పుడా రాజు మదాలసుని చరిత్రను వివరించమని మునీశ్వరుని కోరతాడు. అప్పుడు కౌండిన్యుడు "సకల సంపదలతో తులతూగుతూన్న కుంతల దేశంలో రత్నగర్భపురి అనే నగరముంది. (కుంతల దేశమంటే ప్రస్తుత కర్ణాటక రాష్ట్రంలోని కళ్యాణి పట్టణాన్ని రాజధానిగా కలిగిన ప్రాచీన రాజ్యం.) ఒకానొకప్పుడు అక్కడ తమ్ముల చుట్టంబగు వేల్పు వంగడమున (తమ్ములు అంటే పద్మములు; బ్రహ్మ - తమ్మిచూలి - పద్మ సంభవుడు గనుక తమ్ముల చుట్టమైన వేల్పు. బ్రహ్మ వంగడమున అంటే బ్రాహ్మణ వంశంలో) ధీనిధి అనే ఆయన జన్మించాడు" అంటూ ధీనిధినీ అతని శివభక్తినీ తెలుపుతూ ఒక చక్కటి పద్యం చెప్పాడు -

ఉ॥ ఆదిమభిల్లు మంచుమలయల్లుఁ బయోరుహనాభ భల్లుఁగా
కోదర రాజకుండల సముజ్జ్వలగల్లు భజించి మించునా
భూదయితా వతంస మణిప్రోల మహీసురుఁడొక్కఁ డొప్పు వి
ద్యాది విషద్గురుండు మహిమాఢ్యుఁడు ధీనిధి నామధేయుడై. (ఉద్భటారాధ్య చరిత్రము : 2-113)

భిల్లులు ఆదిమ మానవజాతి (*aborigines*). భిల్లులలో కూడా శివుడు ఆదిమ భిల్లుడట. హిమవంతుని కుమార్తె అయిన పార్వతి భర్తయైనందున మంచుమల - అంటే హిమవత్పర్వతానికి శివుడు అల్లుడట.

ఇంకా శివుడిని వర్ణించడానికి కవి త్రిపురాసుర సంహార యితివృత్తాన్ని యీ పద్యంలో వాడుకుంటున్నాడు. ఒకప్పుడు తారకాసురుడి కొడుకులైన విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు అనే వాళ్లు ఘోర తపస్సు చేసి శివుడిని మెప్పించి ఇనుముతోనూ, బంగారుతోనూ, వెండితోనూ చేయబడిన కాలగమనం కలిగిన మూడు జంగమ (అంటే ఒకచోట స్థిరంగా వుండకుండా తిరుగాడే) పట్టణాలను వరంగా పొంది బలగర్వంతో విర్రవీగుతూ లోకాలన్నీ నాశనం చేస్తూ వుంటారట. అప్పుడు విష్ణువు ఒక పాషండునిగా మారి నారదుణ్ణి తనకు శిష్యునిగా చేసికొని ఈ త్రిపురాసురులను ఆశ్రయించి యుక్తిగా తన దుర్బోధలతో వారిని శివద్వేషులుగా మారుస్తాడట! అప్పుడు శివుడు వారిపై ఆగ్రహించి లోకకంటకులైన త్రిపురాసురులతో యుద్ధంచేసి వారిని చంపుతాడు. మరణానంతరం వారు ముగ్గురూ శివుడి ప్రమథ గణాలలో చేరారట.

త్రిపురాసురులతో జరిగిన ఆ యుద్ధంలో శివునికి రత్నగర్భ (భూమి) రథముగానూ, సూర్యచంద్రులు రథచక్రములుగానూ, నాలుగు వేదములు ఆ రథానికి గుఱ్ఱములుగానూ, బ్రహ్మ రథసారథిగానూ, మేరు పర్వతము విల్లుగానూ, సాగరము అమ్ములపొదిగానూ, విష్ణువు భల్లు (బాణము ములికి) గానూ, నాగరాజైన వాసుకి వింటినారి గానూ ఉపయోగపడ్డారట.

పయోరుహము, అంబురుహము, జలరుహము, సరసీరుహము - యివన్నీ పద్మానికి పేర్లు. విష్ణువు పద్మనాభుడు కదా అందుకని యిక్కడ కవి 'పయోరుహనాభ భల్లు' అనే ప్రయోగం చేశాడు. పయోరుహ నాభుడు - అంటే పద్మనాభుడైన విష్ణువును భల్లుగా అంటే బాణపు ములుకుగా కలిగిన వాడైన శివుడు. కాకోదరము అంటే పాము. కాకోదర రాజు అంటే నాగరాజైన వాసుకి. కుండలము అంటే త్రాడు. అనగా మేరు పర్వతాన్ని విల్లుగా చేసి వాసుకిని దానికి వింటి నారిగా సంధించినవాడైన శివుడు. ఆ శివుడిని భజించి (పూజించి) మించున్ (వెలుగొందును) ధీనిధి అనే ఆ మహీసురుడు (భూసురుడు - బ్రాహ్మణుడు).

ధీనిధికీ, అతని భార్య శుభకీర్తికీ లేక లేక పుట్టిన కొడుకే మదాలసుడు. మదాలసుడు చక్కని పాండిత్యం సంపాదించి యుక్తవయస్సులో చంద్రకళ అనే అమ్మాయిని వివాహం చేసుకుంటాడు. ఆ తరువాత అతను జూదరి, త్రాగుబోతు, స్త్రీలోలుడు, చోరుడుగా మారిపోతాడు.

మదాలసుడు క్రమక్రమంగా మంచి మార్గంనుంచి చెడుకు ఎలా పరివర్తనం చెందాడో తెలిపే ఈ పద్యం చూడండి.

చ॥ చతురామ్నాయ విహారముల్ మరచె శాస్త్రక్రీడ చాలించె మా
నిత పౌరాణిక వాక్య సంశ్రవణముస్ నిర్ధూతమున్ జేసె శ్రీ

సుత వాత్స్యాయన కూచిమారమతముల్ జూచెన్ గులాచారసం
గతికిన్ దూరముజేసె నెమ్మనము దుష్కర్ముండు పారుండొగిన్. (ఉద్భటారాధ్య చరిత్రము : 2-120)

నాలుగు వేదాల విహారం (అంటే వేదాధ్యయనం) మరచాడట. శాస్త్రక్రీడలు అంటే శాస్త్ర పఠనాలు మానేశాడట. పురాణ శ్రవణం వదలివేశాడట. మన్మధుడు, వాత్స్యాయనుడు, కూచిమారుడు వగైరాల మతము (కామ శాస్త్రము) పై శ్రద్ధ పెట్టాడట. మనస్సును కులాచారములకు క్రమక్రమంగా దూరం చేశాడట ఆ పాపిష్టి బ్రాహ్మణుడు.

గీ॥ సంధ్య వార్వఁడు వేల్వఁడు చర్చసేయఁ
దాగమంబులఁ దీర్థంబులాడఁ డుచిత
తిథుల నుపవాసముండఁడు తిప్పకాయ
చందములు దక్క భూసుర నందనుండు (ఉద్భటారాధ్య చరిత్రము : 2-129)

సంధ్య అంటే సూర్యోదయానికి ముందు అయిదు గడియల వరకునూ, సూర్యాస్తమయం అయిన తరువాత మూడు గడియల వరకునూ గల కాలము. గడియ అంటే 24 నిముషముల కాలము. అంటే ఉదయ సంధ్య (*Morning twilight*) సూర్యోదయానికి ముందు 5 గడియలు (5 × 24 = 120 నిముషములు) అంటే రెండు గంటలు; సాయం సంధ్య (*Evening twilight*) అంటే సూర్యాస్తమయం తరువాత మూడు గడియలు (3 × 24 = 72 నిముషములు) అంటే గంటా పన్నెండు నిముషాలన్నమాట.

ఈ సమయాలలో - పూర్వాహ్న, మధ్యాహ్న, అపరాహ్న కాలాలలో - చేసే ప్రార్థనలను సంధ్యా వందనము లేక సంధ్యోపాసనము అంటారు. దీనిని సంధ్యవార్చడం అనీ అంటారు. వార్చుట అంటే ఆచమించుట. అంటే చూపుడు వ్రేలు పొడవుగా నిలిపిన పుడిసిట జలము గ్రహించి మూడు మార్లు పుచ్చుకొనుట.

సంధ్య వార్చడంలో ఏ రోజు చేసిన పాపాలు ఆ రోజే తుడిచిపెట్టుకు పోతాయని ఓ నమ్మకం. గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం' నాటకం ఆధారంగా ప్రఖ్యాత సినీ దర్శకులు కీ॥ శే॥ పి. పుల్లయ్య నిర్మించిన 'కన్యాశుల్కం' చిత్రంలోని అగ్నిహోత్రావధానులు యిలా చెప్తాడు.

"యదహ్నాత్ కురుతే పాపమ్
తదహ్నాత్ ప్రతిముచ్యతే"

వేల్చుట అంటే హోమాగ్ని యందు ఘృతము (నెయ్యి), తిలలు (నువ్వులు), మాషా (మినుములు) వ్రీహి (ధాన్యము), యవలు (బార్లీ) వగైరాలను సమర్పించడం. నిత్యాగ్నిహోత్రుడైన గృహస్థు ప్రాతఃసవనము, మాధ్యందిన సవనము, సాయం సవనము అని నిత్యమూ మూడు యజ్ఞాలు నిర్వహించి ఆ సమయములో పై పదార్థములను అగ్నికి సమర్పిస్తాడు.

కొందరు వైదికులు ప్రాతః, సాయం సవనములను రెంటినే పాటిస్తారు. త్రిసవనములను రోమన్ కాథలిక్ క్రైస్తవులు చేసే త్రికాల జపములు (ఏంజెలస్)తో సరిపోల్చవచ్చు. పరిశుద్ధాత్మ ఏసు క్రీస్తు రూపంలో మనుష్య కుమారునిగా జన్మించడాన్ని స్మరణ చేసుకుంటూ ప్రతి ఉదయం, మధ్యాహ్నం మరియు సాయంత్రం వారు ఏంజెలస్ డామిని (Angelus Domini-Angel of the Lord-ప్రభువుకు చెందిన దేవదూత) పేరిట ప్రత్యేక ప్రార్థనలు జరుపుతారు.

పదార్థాలు మండేటప్పుడు ఉద్భవించే కార్బన్ మోనాక్సైడ్ (CO) మరియు కార్బన్ డై ఆక్సైడ్ ($CO_2$)లు గాలికన్న తేలికైనవి కనుక అగ్నికీలలెప్పుడూ పైకే ప్రజ్వరిల్లుతాయి. అగ్గిపుల్లను వెలిగించి మనము క్రిందికి తిప్పి పట్టుకున్నా అగ్ని పైకే మండడం కారణంగా మన చేయి కాలుతుంది. ఊర్ధ్వాభిముఖంగా సాగే అగ్ని శిఖలను చూచి అగ్ని ఊర్ధ్వలోకాలకు యజ్ఞంలో సమర్పించిన హవిస్సులను మోసుకుపోతాడనే ఒక నమ్మకం ప్రాచీనులలో ఏర్పడింది. హవిస్సులను మోసుకెళ్తాడు కనుకనే అగ్నిని వేదాల్లో 'హుత వహుడు' 'హవ్య వాహనుడు' అనే పేర్లతో సంబోధించారు. హవిస్సులను మోసుకువెళ్లి అందుకు ప్రతిగా అగ్ని సంపదలిస్తాడని వైదికుల విశ్వాసం.

ఋగ్వేదంలోని ప్రథమ మంత్రం చూడండి -

**అగ్నిమ్ యాళే పురోహితమ్**
**యజ్ఞస్య దేవమ్ ఋత్విజమ్ ।**
**హోతారమ్ రత్న ధాతమమ్ ।** **(ఋగ్వేదం 1-1-1)**

'పురోహితుడు, యజ్ఞ దైవతము, ఋత్విజుడు, హోత (యజ్ఞంలో హవిస్సులను సమర్పించేవాడు), రత్న ప్రదాత అయినట్టి అగ్నిని ప్రార్థిస్తాను

మదాలసుడు యితర బ్రాహ్మణ గృహస్థులకు వలె సంధ్య వార్చడట, వేల్చడట. ఆగమముల (వేదములను) చర్చించడట వేదములను వాది - ప్రతివాదులు చర్చించడం ద్వారా సత్యాన్ని నిగ్గుతేల్చడానికి ప్రయత్నించేవారట. ప్రాచీన కాలంలో శాస్త్రచర్చ అనేది అలా వేదానుష్ఠాతలైన వైదికుల దినచర్యలో ఒక ముఖ్యభాగం. మదాలసుడు శాస్త్రచర్చకు స్వస్తి చెప్పాడట.

మదాలసుడు ఉచిత తిదులలో తీర్థములాడడట. అంటే నిర్ణీత కాలములలో స్నానం చేయడట.

మన ప్రాచీనులు స్నానానికి ఎంతో ప్రాముఖ్యత నిచ్చారు ఏయే కాలాలలో ఏ విధంగా స్నానం చేయాలో కూడా నిర్ణయించారు ఈ విషయమై అనేక విధి నిషిద్ధాలనూ నిర్ణయించారు స్నానానికి ఆరోగ్య రీత్యా ఎంతో ప్రాముఖ్యత వుంది

**శ్లో॥ స్నానం సర్వాంగ శుద్ధిర్మలిన శుచికరం ।**
**దేహకాంతిం కరోతి ।**
**కండుఘ్నం స్వేదహారి శ్రమకరణ హరం ।**
**పైత్య దాహాది మేహాన్ ।**
**దీప్తాగ్నిర్ధాతువృద్ధి స్సుఖకర మపి ।**
**సంస్థంభకృ త్పావనం చ ।**
**నానా రోగోప శాంతి ర్ధితకరణకరం ।**
**చిత్తశుద్ధిం కరోతి ॥** **(చరక సంహిత)**

నిత్య స్నానము వలన అవయవములన్నీ పరిశుభ్రములై మాలిన్యములు తొలగుతాయి. దేహమునకు కాంతి కలుగుతుంది దురద, చెమట, శ్రమ వలన కలిగిన అలసట - వీటిని పోగొడుతుంది. పైత్యము, దాహము మొదలైన మేహములను అణస్తుంది అగ్ని దీప్తినీ, ధాతు వృద్ధినీ కలిగిస్తుంది ఇంకా, స్నానం సుఖకరంగా కూడా వుంటుంది స్నానం శరీరాన్ని దృఢంగానూ, పవిత్రంగానూ చేయడమేకాక ఎన్నో రోగాల్ని ఉపశమింపజేస్తుంది అది మనసు కెంతో మేలుచేసి చిత్తశుద్ధిని కలిగిస్తుంది.

స్నానమెప్పుడు చేయ కూడదు' - మనుస్మృతి'లో స్నానము ఎప్పుడు చేయ కూడదో చెప్పబడింది.

**శ్లో॥ న స్నాన మాచరేత్ భుక్త్వా । నా తురో న మహానిశి ।**
**న వాసోభి స్సహా జస్రం । నా విజ్ఞాతే జలాశయే ।** **(మనుస్మృతి 4-129)**

భోజనం చేసిన తరువాత స్నానం చేయరాదు జ్వరంగా వున్నప్పుడు, అర్ధరాత్రి సమయాలలోనూ, కట్టుబట్టలతోనూ, తెలియని జలాశయములలోనూ స్నానం చెయరాదు

స్నానమెప్పుడు చేయాలి? - ప్రార్థన, పూజలకు ముందు, చెడుకల వచ్చినప్పుడు, కుటుంబము కలుషితమైనప్పుడు, వమనానంతరము (డోకు తరువాత), క్షురకర్మానంతరము (క్షౌరము చేయించుకొనిన పిదప), భోజనము చేసే ముందు, సుఖనిద్రపోయి లేచిన తరువాత, కాలకృత్యములు తీర్చుకొనిన అనంతరము తప్పక స్నానం చేయాలని విధించారు

విహితములైన స్నాన కాలములు -

తెల్లవారుజామున 4 నుండి 5 గంటలలోపు స్నానం చేస్తే దానిని ఋషి స్నానం అంటారు

తెల్లవారుజామున 5 నుండి 6 గంటలలోపు స్నానం చేస్తే దానిని దైవ స్నానం అంటారు

ఉదయం 6 నుండి 7 గంటలలోపు స్నానం చేస్తే దానిని మానవ స్నానం అంటారు

ఇక జాప్యంగా ఉదయం 7 గంటల తరువాత స్నానం చేస్తే దానిని రాక్షస స్నానమంటారు

ఉపవాస విధి - కొందరు ఎప్పుడూ ఆహారాన్ని తీసుకుంటూ తిండిపోతులనిపించుకుంటారు బ్రతకడంకోసం తింటేనే ఆరోగ్యం తినడంకోసం బ్రతికితే అనారోగ్యం మంచి ఆరోగ్యం కోసం పాటించాల్సిన ఆరోగ్య నియమాలలో ఉపవాసం ఒకటి ఆహారము తీసుకొనకుండా ఉండడమే ఉపవాసం దీనిని 'నిరశనం' అనీ అంటారు (అశనము అంటే ఆహారము ఆహారము లేకుండా వుండడం నిరశనం) ఉపవాస కాలంలో కాలేయము, క్లోమగ్రంథి, జఠరగ్రంథి వగైరా జీర్ణగ్రంథులకు విశ్రాంతి లభించి అనంతరం అవి మరింత చురుగ్గా పనిచేయడానికి దోహదం కలుగుతుంది అందుకే ఉపవాసం కారణంగా జిహ్వాచాపల్యానికి కళ్ళెం పడడమే కాక జీర్ణావయవములకు తగు విశ్రాంతి లభించడం కారణంగా దీర్ఘాయుష్షుకు దోహదం కలుగుతుంది ఈ ఆరోగ్య నియమాన్ని మతవిశ్వాసాల్లోకి ప్రాచీనులు తెలివిగా జొప్పించారు గానీ, ఉపవాస దీక్ష మత విశ్వాసాల కతీతమైనట్టి కేవల ఆరోగ్య నియమము. హిందువులే కాక అన్య మతాలవారూ ఉపవాస దీక్షలు చేస్తారు జైనులు సల్లేఖనా పర్యూషన్ వగైరా వ్రతాల సందర్భంగానూ, ముస్లింలు రమదాన్ (రంజాన్) నెలలోనూ, క్రైస్తవులు ఏసుక్రీస్తు తన అంతిమ దశలో 40 రోజులపాటు అనుభవించిన శోధనకూ, పడిన బాధలకూ సానుభూతిగా ఈస్టర్ పండుగకు ముందర 40 రోజులపాటు లెంట్ (*Lent*) పేరుతో జరిపే ఉపవాసములు మనకందరికీ తెలిసినవే

మదాలసుడు ఉచిత తిథులలో ఉపవాసము చేయడట. ఈ పనులన్నీ తిప్పకాయ చందములు దక్క (అంటే ఆకతాయి వలె తప్ప) నిష్ఠతో ఆచరించడట ఆ భూసుర నందనుండు (అంటే ఆ బ్రాహ్మణ కుమారుడు)

లేకలేక కలిగిన సంతానం కనుక తల్లిదండ్రులు ఏ విషయంపైనా అతనిని గట్టిగా మందలించ లేకపోయారు చివరికి విసిగి వేసారిన తల్లిదండ్రులు ఓ రోజు అతన్ని యింటినుండి వెళ్ళగొట్టారు. అతడు ఆ రాత్రే ఆ పూరి శివాలయంలో నగలన్నీ దొంగిలించి ఎవరికంటా బడకుండా కన్యాకుబ్జం చేరుకున్నాడు. అక్కడ పరభావవేది అనే వానితో పరిచయమైంది

'తోఁబుట్టిన పుట్టె గుణము తొలఁగునె?' యన్నట్లు కన్యాకుబ్జములో కూడా అతని వేశ్యాలోలత్వములో మాత్రం ఏ మార్పూ రాలేదు.

ఆ పూరిలో ఓ ప్రసిద్ధి చెందిన జరభి (వృద్ధ వేశ్య) యొక్క ఇరువదేండ్ల కుమార్తె కనకలత అతి చక్కనిది పూర్ణేందుబింబాస్య (పున్నమి చంద్రుని ముఖము గలిగినది) గా పొదలుతూ (వర్ధిల్లుతూ) వున్న ఆ బాలిక రూపలావణ్యాలలోనే కాక, సంగీత - నాట్య శాస్త్రాలలోనూ, కామకళలోనూ ఆరితేరిందట.

**మ॥ చదివెం గామకళా రహస్యములు శిక్షంగాంచె వీణాదులన్**
**బదిలంబయ్యె సమస్త నాట్య కలనా పాండిత్య హేలన్ మదిన్**
**గదియించెన్ గరువంబు జాణతనమున్ గాంభీర్యమున్ సిగ్గునన్**
**బొదలెన్ బాలిక కేలికాజిత మరుత్పూర్ణేందు బింబాస్యయై (ఉద్భటారాధ్య చరిత్రము : 2-145)**

ఆమె ఓ సారి ఆ పట్టణంలోని నాగేశ్వరస్వామి దేవస్థానమునకు వెళ్ళి అక్కడ శితికంఠుణ్ణి (శితి అనే విశేషణానికి తెల్లనిది, నల్లనిది అనే రెండు అర్థాలు వున్నాయి. నల్లని కంఠముగల నీలకంఠుడ్ని శితికంఠుడు అనీ అంటారు) ప్రార్థిస్తూ

శ్రావ్యంగా గీతాలు పాడిందట. ఆ సమయంలో అక్కడికి వచ్చిన మదాలసుడు ఆమె అందచందాల్ని చూసి మోహపరవశుడయ్యాడు.

ఉ॥ తారలలోని చంద్రకళ తమ్ములలోని మరాళి మల్లికా
వారములోని గంధఫలి వట్రువ ముత్తెపుఁ బేరులోని వి
స్ఫార మణీశలాక యన వారలలోపల నున్న కన్నియన్
గోరి నుతించె భూసురుఁడు గొబ్బునఁ జిత్తము తత్తఱింపగన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2-157)

చుక్కల్లోని జాబిల్లిలా, తామరల లోని హంసలా, మల్లికావారము (మల్లెపూల గుచ్ఛము) లోని గంధఫలి (సంపెంగ పూవు)లా (లేక - సుగంధ పుష్పాల సముదాయము లోని సంపెంగ పూవులా), వట్రువ (వర్తులాకారములోనున్న) ముత్యాల పేరు మధ్యలోని మణులు పొదిగిన పతకములా వేశ్యలలో కెల్లా ప్రత్యేకమైనదిగా కనుపిస్తూ వున్న ఆ కన్యను పొందాలని కోరుకొని ఆ భూసురుడు గొబ్బున (శీఘ్రముగా) చిత్తము తత్తఱింపగా (మనసు చలించగా) నుతించె (పొగడాడు)

అతడు ప్రక్కనే ఉన్న తన మిత్రుడు పరభావవేదితో తన మనసులోని మాట తెలిపి 'ఈ జలరుహేక్షణ (పద్మము వంటి కన్నులు గలిగినది) ఎవరు? ఇటువంటి వనితా మణిని చూసినట్లయితే వారిజగర్భుడు (పద్మనాభుడైన విష్ణువు) అయినా సరే పూ విలుకాని (మన్మధుని) బారిన పడిపోడా? ఇటువంటి మదేభగామిని (మద + ఇభ - గామిని -- మదించిన ఏనుగు నడక గలిగినది)ని ఎక్కడన్నా చూచామా? కనీసం - విన్నామా?' అంటాడు.

అప్పుడు పరభావవేది 'అది సానిది కావటం చేత దానిని పొందడం అంత దుర్లభమేమీ కాదు. అంతా నేను చూసుకుంటాను. నీవేం దిగులు పడవద్దు' అంటూ హామీ యిచ్చాడు.

పరభావవేది మదాలసునికి కనకలతతో ఎలాగైనా సరే పొత్తుకుదురుస్తానని మాట యిచ్చి వెళ్లిపోయిన తరువాత మదాలసుని విరహతాపం వర్ణనాతీతం. అయినా సరే ఆ విరహాన్ని రామలింగకవి పాతిక పైచిలుకు పద్యాలలో కదు రమ్యంగా వర్ణించాడు.

సీ॥ వకుళ పున్నాగ చంపక పాటలావనీ
రుహవాటికలఁ గలవిహరణంబు
కలహంసకులపక్ష చలిత వీచీఘటా
కులసరోవరముల జలకమాట
అమృత నిష్యంద మోహన చంద్రికా ధౌత
మానిత హర్మ్యంబు లోని యునికి
కమలరాగోపల ఘటిత నూతన కేలి
శైలకూటములపై వ్రాలు కడఁక

గీ॥ విరులు సొమ్ములు పూఁత లంబరము లమిత
భక్ష్యభోజ్యాదు లొనరిన పనులనెల్ల
నింపు సమకొల్పు తనవల్పు నిందువదనఁ
గలసి వర్తింప లేకున్న నిలుపు సున్న. (ఉద్భటారాధ్య చరిత్రము : 2-175)

'వకుళ' అంటే పొగడ చెట్టు (*Mimusops elengi*). దీని పూలు అమిత సువాసనగా వుండడం కారణంగా ఈ పుష్పవృక్షం ఏ తోటకైనా వన్నె తెస్తుంది.

పున్నాగ చెట్టు (*Calophyllum inophyllum*) ను పొన్న చెట్టు అని కూడా అంటారు (పొన్నాయి చెట్టు వేరుగా ఉన్నది. దాని శాస్త్రీయ నామం - *Millingtonia hortensis* దాని పూలు తెల్లగా పొడవుగా సన్నాయిలను పోలి వుంటాయి. దానిని Indian Cork Tree అంటారు).

ఇక పున్నాగ లేక పొన్న చెట్టు పూలు తెల్లగా, సువాసనగా వుంటాయి. కాయలు గుండ్రంగా, గుత్తులుగా కాస్తాయి. గుండ్రంగా, లావుగా, ముద్దుగా ఉండే వాళ్లని పొన్నకాయలా వున్నారనడం అలవాటు. 'పొన్నకాయ వంటి పోలీసెంకటసామి నిన్ను నేను మరువలేనురా' అనే పాట సుప్రసిద్ధం.

చంపక వృక్షము (Michelia champaca) అంటే 'సంపంగి' *Magnoliaceae* కుటుంబానికి చెందిన పెద్ద వృక్షం. మన దొడ్లలో పెంచుకొనే సంపెంగ తీగ (Climbing ylang - ylang) వేరు. ఇది *Annonaceae* కుటుంబానికి చెందినది. దీని శాస్త్రీయనామం *Artabotrys odoratissimus.* దీని పూలు ఆకుపచ్చ - పసుపు రంగుల మిశ్రమంగా వుండి సువాసనగా వుంటాయి. దీని పూవుల రెక్కలు చంపక పుష్పాల రెక్కల వలె పలుచగా కాక దళసరిగా వుంటాయి.

పాటల వృక్షపు (Bignonia suaveolens) పూలు ఎర్రగా, ఆకర్షణీయంగా వుంటాయి.

అవనీరుహములు అన్నా భూరుహములు అన్నా వృక్షాలు.

పై వృక్షాలు గల వాటికలు అంటే తోటలలో 'కల విహరణలు' అంటే స్వేచ్ఛావిహారం - కలియదిరగడం. కలహంస = (శ్రేష్ఠమైన) రాజహంసల; కుల = సమూహము; పక్ష = రెక్కల; చలిత = టపటపా కొట్టుకొన్న కారణంగా ఏర్పడిన; వీచీ = అలల; ఘటా = సమూహము గల; కులసరోవరముల = ప్రసిద్ధ సరోవరములలో; జలకమాట = జలకాలాటలు;

అమృతనిష్యంద = అమృతం స్రవించే; మోహన = పంచశరుడని పిలువబడే మన్మధుని ఐదు పుష్పబాణాలలో యిది ఒకటి. ఇది మోహాన్ని ప్రేరేపిస్తుంది; చంద్రికా ధౌత = వెన్నెలచే మెరిపింపబడిన; మానిత హర్మ్యంబు లోని యునికి = ప్రసిద్ధ భవంతులలో నివాసము.

విరులు = పూవులు; సొమ్ములు = నగలు; పూంత = చందన చర్చలు వగైరా; అంబరములు = వస్త్రములు; అమిత భక్ష్య భోజ్యాదులు = అధికమైన తినుబండారములు వగైరా; ఒనరిన పనుల నెల్ల = యింపైన పనులన్నింటిలోనూ; ఇంపు సమకొల్పు = ఇష్టముతో నిండుతనం చేకూరుస్తుంది; తన వల్పు = తన వలపుతో; ఇందువదన = ఆ చంద్రముఖి;

కమల రాగోపల = కమలరాగ + ఉపల అంటే పద్మరాగ మణులతో; ఘటిత = కూర్చబడినట్లుండే ఎర్రని సూర్యుడు శైలకూటములపై - అంటే పర్వత శిఖరములపై; వ్రాలు కడంక = అస్తమించు లోపుగా; (ఆ ఇందువదనను) కలసి వర్తింపలేకున్న నిలువుసున్న.

ఇక నా జీవితము వ్యర్థం అని వాపోతున్నాడు మదాలసుడు.

పరభావవేది అటు వెళ్లగానే యిక విరహంతో మదాలసుడు ఒక మెత్తని, చల్లని శయ్యపై తన శరీరాన్ని పడవేసి అదే పలవరింతగా కనకలతను గూర్చి ఆలోచిస్తూ యిలా అనసాగాడు 'ఓ లలనా ! నీ కులుకులొలికే పాటను నేనెందుకు

విన్నాను? వింటిని పో, ఈ విధంగా నా ధైర్యగుణమంతా ప్రక్కలై మొక్కబోవాలా? యిక ఈ విధంగా ప్రసూన బాణ శిఖిన్ (మన్మధ బాణపు ములుకు యొక్క ఘాతంతో) నేను ప్రాణములనెట్లు నిల్పుకొనగలను? అటువంటి హృదయ దారుఢ్యం నాకేది? నేను పలు భంగులుగా భంగపడుటయే జరుగుతుందేమో చివరికి. గుడి దాటి పోకముందే కొనకొంగు పట్టుకొని లాగి గట్టిగా ముద్దుపెట్టుకొనక పోతిని. కనీసం ఎదురుపడి యిచ్చకంగా మాటలాడక పోతిని. పోనీ, చెలికత్తెనైనా ప్రక్కకు పిలిచి 'నీ దొరసాని సంగతేమిట'ని తెలుసుకొనకపోతిని. మందయానము (ఏనుగులలో భద్రము, మందము, మృగము అని మూడు జాతులున్నాయి. వీనిలో మందము యొక్క యానము - అంటే నడక గంభీరమైనది) తో ఆమె యింటికి మరలి పోయేటప్పుడు వెనక వెనకనే నేనూ పోకపోతిని. చేతికి చిక్కిన నిధిని తప్పుచేసి వదలివేసి మనస్సులో చింతిల్లుతూంటే తలచిన కార్యం సాధించడమెలా? అప్పటిదాకా యీ అసమశరుని (మన్మధుని) తూపుల (బాణముల) కు నలిగి సగమౌతున్నాను కదా !

"నాకెంతో ఆప్తుడని పరభావవేదిని నమ్మి మోసపోయాను. అతడే కనక ఆప్తుడైతే నన్ను ఈరోజుకు నీవు యింటికి వెళ్లు - నీ దిగులు మానుకో అంటూ నన్ను వీడి తానొక్కడే కనకలత యింటికి ఎందుకు వెళ్లాడు? నన్నూ తనతో రమ్మనేవాడు కదా? ఆహా, ఆ విమూఢుడికి ఎంతటి సౌఖ్యములు?

"నేను తెచ్చిన దొంగసొత్తంతా వృధా చేయకుండా ఆ మచ్చెకంటి పొందుకొరకే ఖర్చు చేస్తాను. వెచ్చపడితే (డబ్బు వెచ్చించితే) వారవనితలు ఎవరితోనైనా జతకడతారు" అంటూ యిలా పగటి కలలు కనడం ప్రారంభించాడు.

మన్మధుని చాపముల ధాటికి తట్టుకొనలేక ఆ సుదతీ తిలకం (స్త్రీ రత్నం) ఒక రోజు వేడుకగా ఆకుంచిత నేత్రకోణయయి (అంటే కన్ను కొడుతూ) తన గుబ్బ చనుంగవను నా ఛాతీ పై వేసి వత్తుతూ సుఖిస్తూంది.

ఉ॥ ఏనొక వేళ గాఢరతి నేద్పెల లోపల దస్సి దూలినన్
మానిత చూతపల్లవ సమాన గుణాధర సంభవామృతం
బానఁగ నిచ్చుచుం గలయ నప్పనియున్ మదినూలుకొల్పున
మ్మానవతీ లలామఁ దగు మచ్చిక నెన్నఁడు గారవించెదన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2-173)

ఒకవేళ నేను గాఢరతి విజృంభణలో అలసిపోయి నీరసంగా తూలిపోతూంటే (దాహమునకు నీటికి బదులుగా) శ్రేష్ఠమైన మామిడి చిగురుతో పోల్చదగిన తన పెదవుల నుండి ఊటలూరే అధరామృతాన్ని ఆనగ (త్రాగుటకు) నిచ్చుచూ మరల నన్ను రతికి నూలు కొల్పుతూ (అంగీకరింప జేసి ఆయత్త పరచే) ఆ మానవతీలలామ (స్త్రీ రత్నం) ను ఎంతో ప్రేమతో ఎప్పుడూ గౌరవిస్తాను.

అంతలో సూర్యాస్తమయమైందట. దాన్ని అత్యంత రమణీయంగా వర్ణించాడు రామలింగకవి. కమలాప్తుడు (సూర్యుడు) వననిధినాధుని (వరుణదేవుని) దిక్కుకు (అంటే పడమరకు. వరుణుడు పడమటి దిక్కుకు పాలకుడు) వాలాడట. ఆ వెలుగు యొక్క రక్తిమతో మిగిలిన దిశలన్నీ బంగారపు పూత పూసినట్లుగా కనుపించాయట. ఇక పగలల్లా కమలములకు శోభ చేకూర్చిన వనరుహలక్ష్మి (వనము అంటే నీరు; వనరుహము అంటే నీటినుంచి పుట్టే కమలము లేక కలువ. వనరుహ లక్ష్మి అంటే ఆ పద్మములకు, కలువలకు శోభ చేకూర్చేది) కలువలరేడు (చంద్రుడు) వచ్చి కలువల్ని వికసింపజేసే సమయం దగ్గర పడిందని తోడు తోడుతన్ (వెను వెంబడినే) కైరవ వనంబులకు (తెల్ల కలువలుండే నీటి మడుగులకు) తరలి పోయిందట.

(ఇలా సూర్యాస్తమయాన్ని ఏకధాటిగా 11 అత్యుత్తమమైన పద్యాలలో కడుంగడు రసరమ్యంగా వర్ణించాడు రామలింగ కవి. ప్రతి పద్యమూ లనర్ఘరత్నమే. గ్రంధవిస్తరభీతితో వాటినిక్కడ పేర్కొన జాలను.)

చంద్రోదయానంతరం మదాలసుడు ఇంకా విరహతాపంతో వేగిపోతూ యిలా అన్నాడు – 'ఓ యెలనాగ! (ఓ మహిళా!) ఓపలేని తాపాన్ని నాకు కలిగించి నీ వెక్కడ వున్నావు? ఈ నా దురవస్థను పోద్రోలి నన్ను తిరిగి చక్కగా చేయడంలో నీకేం బాధ్యతలేదా? అయ్యో! ఇగురాకు బోదులు (ఇంతులు) సుంతయు దయోదయము లేనివారలే?'

ఉ॥ ఈ పికరాజి యీశుకము లీ శశికాంతులు నీ సుధా పృధు
శ్రీ పరిపక్వ చంద్రికల చెల్వము లీయలిపోత ఝుంఘృతుల్
కోసవదంగజాత శరఘోరనిపాతముఁ గూడినాకు హృ
త్తాపముఁ జేయుచుండె నిఁకఁ దాఁళఁగఁజాలను గావుమీ యెడన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2 -189)

'ఈ కోకిల (గానము), ఈ చిలుక (పలుకులు), ఈ చంద్ర కాంతులు, ఈ విరివిగా సుధలు కురిపించే పండు వెన్నెలల సౌందర్యము, ఈ పిల్ల తుమ్మెద ఝుంకారములు, చివరకు కోసవదంగజాత (కః + సవః + అంగజాత – కః = మన్మధుడు; (ఎవని చేత ఇవన్నీ) సవః = రెచ్చగొట్టబడుతున్నాయో; ఆ అంగజాత – మన్మధుని) శర (బాణములు) ఘోర నిపాతము (దారుణంగా దిగబడడం) – ఇవన్నీ కలసి నాకు హృదయతాపము కలుగజేస్తున్నాయి. ఇక తట్టుకోలేను. ఈ దురవస్థలో నన్ను కరుణించి రక్షించు'

ఇలా విరహతాపంతో డ్రాగిపోతూన్న ఆ విప్రునికి సెగలై ఎగస్తూన్న ఆ వెన్నెలరాత్రి అజ కల్ప కల్పమగుచూ (బ్రహ్మకు ఒక దినము అంటే మానవులకు ఒక సంవత్సరము) అంటే ఒక సంవత్సరము అన్నట్లున్న ఆ దీర్ఘ రాత్రి భారంగా గడిచిందట. నిశాంతమున (రాత్రి యొక్క అంతములో) ఇనుడు (సూర్యుడు) పొడిచాడట

ప్రొద్దుటే పరభావవేది మిత్రునికడకు వచ్చి అతని అవస్థచూసి బాధపడి అతన్ని పరామర్శించి 'ఒక బాలిక కోసం యింత బాధపడాలా? ఇక నీవు ఆ యింతితో కదు వైభవములతో తూలునట్లు మీకిద్దరికీ నేను (పొందు) కూరుస్తాను' అన్నాడు.

అప్పుడు మదాలసుడు నీరసంగా మిత్రునివంక చూస్తూ 'నన్ను కాముని బారిన పడవేసి, కామినితో పొందు గూరుస్తానని ఎప్పుడనగా వెళ్లావు? నిన్నేమనేది? ఈ విప్రయోగ (విప్రయోగమన్నా – విప్రలంభమన్నా స్త్రీ పురుషుల యెడబాటు) దుఃఖము యొక్క అమిత తీవ్రవేదనలలో నా అవస్థ ఎవరికైనా ఏం తెలుస్తుంది? ఆత్మవిదుడైన విశ్వపతి ఈశ్వరునకుఁదప్ప. నా వెత పోగొట్టి యిక జాప్యం లేకుండా ఆ లలనకూ నాకూ పొందు చేకూర్చు' అన్నాడు.

అప్పుడు పరభావవేది మిత్రునితో 'మన కన్నిటికీ శివుడే వున్నాడు. నీ పని ఫలిస్తుంది. నీవు దిగులు పడకు' అంటూ శుభ శకునములు చూసుకొని మదిలో అమితానందంతో ఆ నగర వేశ్యావాటికకు బయలుదేరాడు.

కనకలత తల్లి పరభావవేదికి అతిథి సత్కారం చేసి యిలా అంది – 'ఓ బ్రాహ్మణ కుమారా ! నా మరదలైన మంజులవాణికి చుట్టమైన (సంబంధం కలిగిన) చిట్టి అన్నమభట్టు కుమారుడివి నీవు. కాబట్టి వరుసకు నాకు అల్లుడివపుతావు. అయినా మా యింటికి యింతకు మునుపు నీవెప్పుడూ రాలేదు. ఈ రావడం వింతగానే వుంది. వయస్సులో చిన్నవాడివి కావున నీకింకా ప్రేమల గొప్పతనం అర్థం కాలేదేమో! వానకో వరపుకో గాని రానివాడివి ఇప్పటికైనా వచ్చినందుకు సంతోషం. నీ మనస్సులో నాపై కొంత కూరిమి కలగడం మంచి విషయమే. దేవుని దయవల్ల ఆర్థికంగా నీకే లోటూ

లేదు. తరతరాల మీ పెద్దల వలెనే నీవు కూడా మాతో పొందును కొనసాగించు. మీకూ మాకూ మిత్రభావము ఓడఁ గట్టిన దూలమై యుండాలి. మా ఇంటికి అప్పుడప్పుడూ వస్తూ వుండడం మేలు. అయినా అన్నీ తెలిసిన మీకు నీతి తెలపడానికి మేమెంత వాళ్లం? చేయగా చేయగా పొందవుతుంది. పాయగా పాయగా బాంధవ్యం వికల మవుతుంది. (తప్పుకుని తొలగుతూ వుంటే క్రమంగా బంధుత్వం కూడా వికలమై పోతుంది.) మీ అన్నగారి లాగా మాతో పొందును కొనసాగించు, ఓ బ్రాహ్మణోత్తమా!'

దీనికి సమాధానంగా పరభావవేది 'ఇంటికి వస్తేనే చుట్టాలైనట్లూ, రాకపోతే కానట్లూనా?' అని 'నీ కుమార్తె కనకలత విలాస సంపదలతో ఉజ్జ్వలంగా విలసిల్లే రేఖని చూద్దామని వచ్చాను. ఆ తర్వాత నీకో రహస్యం చెప్పాలి. నీ కొరతలు తీరతాయి. శాతోదరి (శాతోదరి అంటే కృశించిన కడుపు గల ఆడది. కృశించిన కడుపు భాగ్యవతీ లక్షణమట!) అయిన నీ కూతురును చూద్దాం. రప్పించు' అన్నాడు.

అతనికి తన కూతురును చూపించి కనకలత తల్లి యిలా అంటుంది –

ఉ॥ చక్కని వానిఁగా వయసు చాలిన వానినిగా ప్రదాతగా
తక్కని వానిఁగా విటులధర్మ మెరింగిన వానిఁగా సిరిం
బెక్కువ వానిఁగా సొబగుఁ బేరును బెంపును గల్గువానిఁగా
నొక్కనిఁ జూడు మీ యరసి యుగ్మలి కన్నెటికంబు విద్వఁగన్. (ఉద్భటారాధ్య చరిత్రము : 2 -219)

'చక్కనివాడు, మంచి వయస్సులో వున్నవాడు, బాగా సొమ్ములిచ్చేవాడు, విడచి పెట్టనివాడు ('తక్కు' అంటే విడచిపెట్టు అని అర్థం), విటుల ధర్మం తెలిసినవాడు, సిరిసంపదలలో పెక్కువ (ఆధిక్యము) గలవాడు, సౌందర్యము, కీర్తి, సమృద్ధి పొందేవాడు – అయినటువంటి ఒకడ్ని వెదకి చూసిపెట్టు – నా కుమార్తె కన్నెటికం విడచి పెట్టడానికి' అన్నది.

ఇంకా 'నేపాళ, మాళవ, అవంతి దేశాల రాజులు మా అమ్మాయిని పొందగోరి వర్తమానాలు పంపుతున్నారు. అయినా వారిచ్చే డబ్బుమీద నాకు ఆశ లేకపోవడం వలన మా అమ్మాయిని మనసూ, మర్మం తెలిసిన తగిన వాడికిద్దామని వుంది' అన్నది.

అప్పుడు పరభావవేది ఆమెతో 'నా బాంధవు డొకడున్నాడు. అతడు సకల అనంగ (మన్మథ) కళా రహస్యము లెరిగినవాడు. నీ కుమార్తెకు తగినవాడు. అతనికి నీ కుమార్తె నిస్తే నీకు పేరూ, ఐశ్వర్యమూ సమకూర గలవు' అన్నాడు.

అప్పుడా యింతి యిందుకు తన సమ్మతిని తెలుపగా ఆ ధరానిలింపుడు (భూసురుడు) తన వయస్యుని (సమ వయస్కుడైన స్నేహితుడి) వద్దకు వెళ్లి విషయమంతా పూసగుచ్చినట్లు వివరింపగా మిత్రుని సహాయానికి మదాలసుడు అబ్బురపడి ఆనందంతో అతనిని కౌగిలించుకున్నాడు.

ఇక పరభావవేది తపనీయము (బంగారము), రత్నములు, వస్త్రములు అసంఖ్యాకముగా 'ఆ సా[illegible]జసనికి తలఁపు కోరిక కంటె నినుమడిగా నిచ్చి', (ఆభరణంలో) కనకమునకూ, రత్నమునకూ వుండే యెడబాయని బంధంలా తన మిత్రుడికీ, కనకలతకూ జతకూర్చాడట – సుగంధ పుష్ప గుచ్ఛానికీ, తేటి (తుమ్మెద)కీ సంబంధం కూర్చే మలయ పవనుడి లాగా! ఇక మదాలసుడు మన్మథాద్వైత సుఖవార్ధి లో మజ్జనం చేశాడట – అంటే శృంగార సుఖం తప్పితే వేరేమీ లేని సముద్రంలో మునిగి తేలుతున్నాడన్నమాట! ఆ మృగాక్షితో మదాలసుడీ విధంగా శృంగార సాగరంలో ఓలలాడుతూ వుంటే యిక సాని తల్లి అతని నుండి మాడలూ, మణిభూషణాలూ ఒకటేమిటి – కోరుకున్నవన్నీ పొందిందట. మదాలసుడికి తిండీ, త్రాగుడూ అంతా దానింట్లోనే.

ఇక అతని స్థితి చూడండి -

ఉ॥ పాటల భంగ శోభి మధుపాన వశుండయి చొక్కి మిక్కిలిం
బాటవమేది భూసురుఁడు పాటలగంధికిఁ జిక్కి శాటికల్
హాటకముల్ మణుల్ గల పదార్థములన్నియు నప్పగించె వే
యేటికి మోహవార్ధి వశమే తరియింపఁగ నెట్టి వారికిన్? (ఉద్భటారాధ్య చరిత్రము : 2 -232)

మదాలసుడావిధంగా మధుపానం మరిగి ఆ వేశ్యకు రత్నకంబళములు, బంగారము, మణులు గల పదార్థములు (నగలు) అన్నింటినీ అప్పగించాడట. వేయేల - మోహ సముద్రాన్ని దాటడం ఎంతటి వారికైనా సాధ్యమేనా?

ఉన్నదంతా దానికి ఊడ్చి పెట్టి ఏమీలేని వాడయ్యాడు మదాలసుడు. అయినవారూ, తెలిసినవారూ యీ పతితుడితో మనకెందుకు లెమ్మని దూరమయ్యారు. అప్పుపై దినవెచ్చాలు యిచ్చే బచ్చులు (వైశ్యులు) కూడా 'సత్యంబు చాలని చపలుడైన' యితన్ని నమ్మి అప్పు పెట్టడానికి దడిచారు. తనకు ప్రేమవున్నా తల్లికి దడిచి కనకలత కూడా అతడు వస్తూంటే తప్పుకుని మారుమొగం పెట్టేదట! ఇంతచెడ్డా అతనికి సంస్కారం మాత్రం కలుగలేదట.

గతంలో ముచ్చిలించి (దొంగతనము చేసి) తెచ్చిన ధనమంతా అయిపోయింది. కనకలత చూడబోతే తనకు యిదివరలో యిచ్చినట్లు ఆతిథ్యమివ్వడం లేదు. తన కష్టసుఖాల్ని విచారించే చుట్టములెవ్వరూ అక్కడ లేరు. అంత వైభవంతో వెలుగొంది బిట్టు (శీఘ్రముగా) ఒక్కసారే అవి అన్నీ కోల్పోయి, బికారిగా మారాడు. ప్రాణప్రదమైన స్త్రీ యెడబాటయింది. ఇక ఆ పురంలో పూర్వవైభవంతో ఉండడం అసాధ్యం కనుక వేరెక్కడికైనా వెళ్లిపోవాలని నిశ్చయించుకొని ఎటో తెలియని గమ్యంతో అడవి మార్గానబడి బయలుదేరాడు. వెళ్తూ ఈ విధంగా ఆలోచించాడు. 'లోకంలో డబ్బు లేని వాడూ, ప్రాణము లేని వాడూ (నిశ్చలమూ, నిర్జీవమూ నైన) భూమితో సమానులని పండితులంటారు. నాకిప్పుడు వెక్కసంగా ధనమెలా చేకూరుతుంది? అలా చేకూరిన మరుక్షణం నేను నా ప్రాణసమురాలైన ప్రియభామిని కనకలతను దక్కించుకోనా? ఏ మార్గాల ద్వారానైనా సరే బంగారాన్ని సంపాదిస్తాను. ఆ తరువాత కనకలతను చేకొంటాను. ఈసారి కనకలత నాకు దక్కితే, వేయేటికి - నేను ముల్లోకాలకూ అధిపతిని కానా? వింధ్య పర్వతాల సమీప పట్టణాలు అత్యంత ధన సంపన్నములైనవని ప్రజలు చెప్పుకుంటూంటే వింటాము. అందుచేత నేను ఆ రాజ్యములకు తక్షణం వెళ్ళి అక్కడి రాజుల ఆగారములకు (భవంతులకు) ప్రావీణ్యంతో కన్నంవేసి సమస్తం దోచుకొస్తాను'. ఇంకా యిలా ఆలోచించసాగాడు

క॥ కడియును గత్తియు నాచే
పడి యుండిన యేని పద్మ భవునిల్లైనన్
వడిఁ జొచ్చి కన్నమున వెస
వెడలింపనె మినుకకుండ వేదండంబున్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2 -239)

కడి (ఖనకుడు ఉపయోగించే త్రవ్వఁగోల వంటి ఇనుప కడ్డీ; లేక కన్నాలు వేసే సమయంలో దొంగలు మొరిగే కుక్కలకు వేసి మచ్చిక చేసుకొనడానికి తీసుకువెళ్ళే అన్నపు ముద్ద), కత్తి నా వద్ద వుండాలే గానీ, బ్రహ్మ యిల్లైనా సరే కన్నం వేసి, వెస (వేగముగా), వేదండము (ఏనుగు) నైనా, మినుకకుండా (నోరు మెదపకుండా - ఎటువంటి శబ్దమూ చేయకుండా), కన్నమున వెడలింపనె? (కన్నము నుండి బయటకు తీసుకురానా?)

అని ఆలోచన చేస్తూ కన్యాకుబ్జము నుండి దక్షిణ దిశగా అరణ్య మార్గంలో ధనకాంక్షతో సాగాడట (కన్యాకుబ్జమంటే

ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని నేటి కనోజ్ - Kannauj. దానికి దక్షిణంగా ప్రయాణిస్తే నేటి మధ్యప్రదేశ్‌లోని వింధ్య పర్వత ప్రాంతాలకు చేరవచ్చు).

ప్రేమ మూర్తి అయిన స్త్రీతో నీడ పట్టున యిన్నాళ్లు సుఖపడ్డవాడు కావటాన నడక శ్రమ ఓర్వలేక ఒంట్లో ఓపికలుడిగి మార్గాయాసంతోనూ, నిప్పులు చెరుగుతూన్న ఎండ, వడగాలి కారణంగానూ వింధ్య పర్వతాల సమీపంలోని ఒక అటవీ ప్రాంతంలో ఆ కనకలతా విటుడు కుప్పకూలాడు.

కII వడదాఁకి దప్పిగొని యా
చెడు పాఱుఁడు పెదవులెండఁ జెదరి పదంబుల్
వడవడ వడఁకఁగ వింధ్యపు
నడుతెరువునఁ బడియెనొక్క నగపతి నీడన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2 -242)

వడదెబ్బ తగిలి, దప్పిగొని ఆ దుష్ట బ్రాహ్మణుడు పెదవు లెండిపోయి, అడుగులు తడబడగా, వడవడ వణకుతూ వింధ్యకు వెళ్లే నడిబాటలో ఒక్క పెద్ద చెట్టు (నగము అంటే పర్వతము, చెట్టు అని రెండర్థాలు) నీడన పడిపోయాడు.

సరిగా అదే సమయంలో ఆ బాట వెంట విద్యాపాలుడనే ఒక పండితోత్తముడు తన కుమారుడితో సహా వెళ్తున్నాడు. ప్రక్క రాజ్యంలోని రాజు చేత సన్మానించబడి, తనకిచ్చిన వస్త్రాలూ, వజ్రాలూ, వెండి, బంగారు నాణెములూ తీసుకెళ్తూ ఆపన్నుడైన మదాలసుని చూచి అతని ముఖాన నీళ్లు చల్లి సేదదీర్చాడు. మదాలసుడికి ఆ పండితుడిని చూడగానే చటుక్కున అతన్ని దోచుకోవాలనే దురాలోచన కలిగింది. ఇక నాటకమాడాడు. తానూ విప్రుడననీ, శాస్త్ర పరీక్షలో ఓడి, అవమానితుడై, సకల శాస్త్రాలూ నేర్చుకొనే నిమిత్తం తగిన గురువుకొరకు వెదకుతూ వెళుతున్నాననీ నమ్మబలికాడు. తనది కంచి యంత పెద్ద కాపురమనీ, యిల్లేమో ధాన్యకటకమనీ, స్నేహితులు తల వెంట్రుకలంత మంది ఉన్నారనీ చెప్పాడు. తనని శిష్యునిగా స్వీకరించమని ఆ పండితుడ్ని ప్రార్థించాడు. ఈ కల్లబొల్లి కబుర్లునమ్మి ఆ పండితుడు 'నిన్ను నా కుమారుడిలా చూసుకుని, నీకు సకల శాస్త్రాలూ నేర్పుతాను. నాతో రా.' అన్నాడు. నాళీక బాంధవుడు (కమలాప్తుడైన సూర్యుడు) అస్త్రాద్రి శిఖరముపైనుండి క్రిందకు జారగానే విద్యాపాలుడు సంధ్యాది కృతంబులు అవంధ్య ప్రకారమున నొనరించాడట. (అంటే ఆ యా కర్మలు ఫలవంతమయ్యేట్లుగా ఆచరించాడట) ఆ రాత్రికి ఒకచోట విశ్రమించినప్పుడు మదాలసుడు అవకాశం చూసుకుని ఆ తండ్రీ కొడుకుల్నిద్దరినీ చంపి, వారి నుండి దోచుకున్న ధనంతో కాశికి చేరాడు.

మదాలసుడు కుంతలదేశవాసి కుంతల దేశమంటే ప్రస్తుత కర్ణాటక రాష్ట్రంలోని ఈశాన్య భాగంలోనున్న తుంగభద్రానదీ పరీవాహక ప్రాంతం హంపి విజయనగరం ఈ ప్రాంతం లోనిదే కవికి కుంతలదేశం అన్నా, తుంగభద్ర అన్నా ఎనలేని మక్కువ కనుక ఆయన తదుపరి కావ్యాలలో కూడా ఆ రెంటి ప్రస్తావన ఎక్కువగా ఉంటుంది. కుంతల దేశంలోని తన స్వగ్రామంలోని శివాలయంలోని నగలు చోరీ చేసినా మదాలసుడు రాత్రికి రాత్రే బయలు దేరి తరువాత కొంతకాలానికి ప్రస్తుత ఉత్తర ప్రదేశ్‌లోని కన్యాకుబ్జం (Kannauj) చేరతాడు అక్కడ విషయలోలుడై సర్వమూ కోల్పోయి వింధ్య పర్వత సమీప పట్టణాలు అత్యంత ధన సంపన్నములైనవని ప్రజలు చెప్పుకుంటుంటే విని కన్యాకుబ్జాన్నుంచి దక్షిణ దిక్కుగా బయలు దేరి ధన కాంక్షలో, దొంగతనాలు, దారిదోపిడీలు చేయడమే లక్ష్యంగా అరణ్య మార్గం గుండా ప్రయాణించి వింధ్య పర్వతాల సమీపంలోని ఒక అటవీ ప్రాంతానికి చేరుకుంటాడు అంత వరకు బాగానే ఉంది ఎందుకంటే కన్యాకుబ్జానికి సరిగ్గా దక్షిణ దిక్కునే ప్రస్తుత మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని వింధ్య పర్వత శ్రేణులున్నాయి కాని, విద్యాపాలుడినీ, అతడి కుమారుడినీ చంపి, వారినుండి దోచుకున్న సొమ్ముతో మదాలసుడు తిరిగి ఉత్తరంగా ప్రయాణించి కన్యాకుబ్జం వెళ్ళి కనకలతను తిరిగి కలుసుకోవలసి ఉంది. ఎందుకంటే ధనం చేకూరిన మరుక్షణం ప్రాణసమురాలైన కనకలతను దక్కించుకోవాలని అతను యోచించాడు ఈసారి మళ్ళీ కనకలత తనకు దక్కితే ముల్లోకాలకూ తాను

అధిపతినవుతానని తలచాడు ఎప్పుడెప్పుడు కనకలతను కలుసుకోవాలా - అని ఉవ్విళ్ళూరిన అటువంటి మదాలసుడు ఉత్తర దిశగా కన్యాకుబ్జం వైపుకు ప్రయాణించక వింధ్యకు తూర్పు దిక్కుగా ఉన్న వారణాసి కెలా చేరుకున్నాడు ? కాశి కన్యాకుబ్జం వెళ్ళే మార్గంలోనా లేదు కనుక కాశీక్షేత్ర మాహాత్మ్యాన్ని వివరించే నిమిత్తం ఎలాగైనా సరే మదాలసుడు కాశికి చేరి మరణించడం కథాపరంగా అవసరం కాబట్టి కవిగారే మదాలసుడిని కాశి వైపుకు నడిపించారని భావించాల్సి వస్తుంది

కాశిలో మదాలసుడు తలవని తలంపుగా ఒక పాముకాటుకు గురయ్యాడు. ప్రాణాలు పోతున్నాయి. కాశిలో చనిపోయే వారందరికీ శివుడే స్వయంగా వచ్చి కుడి చెవిలో తారకమంత్రం చెప్తాడట. మదాలసుని అంతిమ ఘడియలలో శివుడు ప్రత్యక్షమై అతడికి తారక మంత్రోపదేశం చేయబూనాడు.

సరిగా అదే సమయానికి చనిపోతూన్న మదాలసుని ప్రాణాల్ని తీసుకొని పోవడానికి పదుగురు యమ భటులు వచ్చారట.

వారెలా ఉన్నారంటే -

మ॥ అరుణాక్షుల్ గురుకుక్షులు న్వికట దంష్ట్రాభీల వక్త్రాంతరుల్
శరదాభుల్ కరవాలహస్తులు ఖరచ్ఛాయోర్ధ్వ కేశచ్ఛటుల్
భరితాహంకృతు లంతకానుచరు లాపాపాత్ముఁ బాఱు న్మహో
ద్ధుర వేగంబునఁ బట్టి తేరఁ జని రెంతో పంతముల్పల్కుచున్ (ఉద్భటారాధ్య చరిత్రము : 2 -263)

అరుణాక్షుల్ - ఎఱ్ఱని కళ్ళ గలవారు, గురుకుక్షులున్ - పెద్ద పొట్టలు గలవారు, వికట - మిక్కిలి వంకరయైన, దంష్ట్ర - పండ్లతో, అభీల - భయానకమైన, (వక్త్రము - నోరు) వక్త్రాంతరుల్ - నోటిలోపలి భాగం కలిగిన వారు (అంటే వారి నోళ్ల లోపలి భాగాలు భయానకమైన వంకర పళ్లు కలిగినవిగా వున్నాయట), శరదాభుల్ - శరః + ఆభ (శరః అంటే కసము, కాకి చెఱకు, కాకి వెదురు లేక గుంద్రము అనబడే గడ్డి - *Saccharum munja Syn. Saccharum ciliare* ఇది చెఱకు జాతి - *Graminae* కి చెందిన గడ్డి మొక్క ఆభ అంటే ఆకారము, అందము లేక రంగు కలవారు. శరదాభులు అంటే వారు కాకి చెఱకు రంగులో వున్నారన్నమాట), కరవాల హస్తులు - చేతులలో కత్తులు ధరించిన వారు, ఖరచ్ఛాయ - గాడిదరంగు గల ఊర్ధ్వకేశచ్ఛటుల్ - శిరోజాలు వగైరా వంటిపై రోమములు గుబురుగా పెరిగినవారు, భరిత - నిండిన, అహంకృతులు - అహంకారము కలవారు, అంతక - యముని యొక్క అనుచరులు - సేవకులు, భటులు, ఆ పాపాత్ముఁ బాఱున్ - పాపాత్ముడైన ఆ పారుడిని (బ్రాహ్మణుడిని), మహోద్ధుర వేగంబునఁ - మహోద్ధృతమైన వేగంతో, పట్టి తేరఁజనిరి - పట్టి తీసుకు రావడానికి బయలు దేరారు, ఎంతో పంతముల్ పల్కుచున్ - ఎన్నో పంతాలు పల్కుతూ.

సరిగా వారు వచ్చే సమయానికే శివుడు మదాలసునికి తారక మంత్రోపదేశం చేస్తున్నాడు. మదాలసుని ప్రాణాలు తీసుకుని పోదామని వచ్చిన యమభటులు శివుడిని చూసి విక్లబాస్యులై (భయము, బాధలతో కూడిన ముఖాలు కలవారై) పారిపోయారట. యమభటులు మదాలసుడు శివుని రక్షణలో ఉన్నట్లు యమునికి తెలిపారు. అప్పుడు యముడే స్వయంగా తన వాహనమైనట్టి సైరిభరాజము (కారెనుపోతు) నెక్కి బయలుదేరాడు. వస్తూ దారిలో యిలా ఆలోచించాడు. 'అలికాక్షుడు (ఫాలనేత్రుడైన శివుడు) మహానుభావుడు, ముల్లోకాలకూ ఆరాధనీయుడు. ఆయన ఈ విధంగా ఎందుకా దుష్టాత్ముడైన మదాలసుడిని అనుగ్రహిస్తున్నాడో? ఊహించడానికి కూడా ఆశ్చర్యంగా వుంది. దీని వల్ల ఎల్ల ధర్మములూ

చోటులు తప్పి జనులంతా ధర్మహీనులు కారా?'

అనంతరము తరణి సుతుడు (సూర్యుని కుమారుడైన యముడు) కాశికి చేరి లసమాక్షునికి (ఎగుడు దిగుడు కన్నులవాడైన శివునికి) తలవంచి విన్రమంగా నమస్కరించి ఒక ప్రక్కగా నిల్చున్నాడు. ఒదిగి అత్యంత దీనుడై అణగి మణగి సిగ్గుపడుతూన్న జముని (యముని) చూచి ముందే ఆతని రాకకు కారణాన్ని మనస్సులోనే ఊహించిన ఆ మహాదేవుడు యమునితో యిలా అన్నాడు. 'ఓ దండధరా ! నీవెందుకు వచ్చావు? వచ్చి, మూసిన ముత్యంలాంటి నోటితో ఒకింతకూడా మాట్లాడవేం? మనస్సులో శంక లేకుండా చెప్పు'. అప్పుడా కృతాంతుడు (యముడు) వెచ్చగా నిట్టూర్చి యిలా అన్నాడు. 'ఓ పరమేశ్వరా ! నీ కేమని విన్నవిస్తాను? నీవు విశ్వజనాంతరాత్ముడవై భ్రామక వృత్తితో (మాయాజాలంతో) వినోదంలా మమ్మల్నందరినీ పట్టి త్రిప్పుతూంటావు. భూమగుణ (సర్వులకూ ఆధారమైనట్టి) ప్రభావమున పొల్చిన (ఒప్పారే) మేటివి నీవు. మన్మనస్తామరసంబున (నా మనస్సు అనెడి తామర పూవులో) (నేను) వందురు (బాధపడు) విధంబును కానవు. ఇదేమి చిత్రమో! విధురేఖా (చంద్రరేఖతో) విలసత్ (వెలుగొందే) కపర్ద (జటాజూటధారీ ! ఓ శివుడా !) వినుము. ఈ విప్రుడు దుష్టాత్ముడై, విధి నిషేధములు పాటించక, విధికి దూరమై, నిషేధములను తవిలి, వేనకువేలు ఉగ్రపాపాలు విజ్ఞులచే పరిహసింప బడునట్లు చేసి పిదప మీ కృపాకటాక్ష వీక్షణాల కారణంగా మీ రూపం పొందాడు (సారూప్య మోక్షం పొందాడు). ధర్మాధర్మములే లేనట్లయితే యింకా ఈ అధికారం నాకు దేనికి?' అని ఇంకా -

**సీ॥ మొదల బ్రాహ్మణ కర్మముల పట్టు వదలించి**
**జారుఁడై కులటలఁ జంకఁ బెట్టి**
**తల్లిదండ్రుల మాట తల మీటి వర్తించి**
**కైదువ ధరియించి జూదమాడి**
**చోరుఁడై శంకరు సొమ్ములు దొంగిలి**
**హత్తి వారాంగన పొత్తు దొడఁగి**
**గంజాయి భక్షించి కలుద్రావి నంజుఁడు**
**నమలి కృతఘ్నుఁడై నట్టడవిని**

**గీ॥ శాంతు వేదాంత విద్యా విచార నిపుణు**
**నిరపరాధు మహీసురవరుని నతని**
**పుత్రకునిఁ జంపి తుదినిన్నుఁ బోలినాఁడు .**
**వీఁడు నేనేమి యనువాఁడ విశ్వనాథ ! (ఉద్భటారాధ్య చరిత్రము : 2-273)**

'ముందుగా బ్రాహ్మణోచిత విధులకీతడు దూరమై, జారుడై, కులటలతో కులికి, తల్లిదండ్రుల మాటలు పెడచెవిన పెట్టి, బ్రాహ్మణ ధర్మానికి విరుద్ధంగా కైదువ (కత్తి - ఆయుధము) ధరించి, జూదమాడి, చోరుడై ఆలయంలోని శంకరుని ఆభరణాలు దొంగిలించి, హత్తి వారాంగన పొత్తు దొడఁగి ('హస్తి' లేక 'హత్తి' అంటే ఏనుగు. అంటే హస్తినీ జాతి వేశ్యతో సాంగత్య మారంభించి - హస్తినీ జాతి స్త్రీ లక్షణాలు - స్థూలాధరా, స్థూలనితమ్బబిమ్బా, స్థూలాంగులిః, స్థూలకుచా, సుశీలా । కామోత్సుకా, గాఢ రతిప్రియా చ నితాంత భోక్త్రీ - నితంబ ఖర్వా, ఖలు హస్తినీ స్యాత్ । - రతి మంజరీ. Described as having thick lips, thick hips, thick fingers, large breasts, dark complexion and libidinous appetite. హస్తినీ జాతి స్త్రీ అంటే

లావుపాటి పెదాలు, బలమైన పిరుదులు, లావుపాటి వ్రేళ్లు, పెద్ద వక్షోజాలు, శరీరపు ఛాయ ముదురువన్నెగా గలిగినది. అంతేకాక కామోత్సుకత, గాఢమైన రతి ప్రియత్వం, అధిక భోజన ప్రియత్వం - నితంబ - ఎత్తైన పిరుదులతో, ఖర్వా - పొట్టి కురచగానూ వుంటుందని 'రతిమంజరి' వివరిస్తూంది హస్తిని పెద్ద పొట్టతో, తిండిపోతుగా వుంటుందనీ, పాదాలు మరీ పొట్టిగా వుండడం కారణంగా హస్తినీ జాతి స్త్రీకి తిన్నగా నడవడం చేతగాదనీ, ఆమె మామిడి చిగురు రంగును యిష్టపడుతుందనీ, 'వాత్స్యాయన కామ సూత్రముల' లోని సాంప్రయోగికాధికరణంలో పేర్కొనబడింది రామలింగ కవి కనకలతను ఎంతో గొప్పగా - ఎక్కడా ఆమె జాతిని పేర్కొనక పోయినా - పద్మినీ జాతి స్త్రీ అన్నట్లు వర్ణించాడు ఆమెను 'శాతోదరి' అన్నాడు 'కలికి బంగరు బొమ్మ'; 'కందర్పు (మన్మథుని) బాణంబు'; 'పగడపు తీగె'; 'వెన్నెలల నిగ్గు'; 'జాతి రత్న శలాక', 'సాకార మధులక్ష్మి'; 'కమనీయ మహిత మోహన విలాస భాసమానాంగి', 'విమోహన రుచిరాంగి'; 'మరుత్పూర్ణేందు బింబాస్య'; 'మరు శస్త్రియ' - మన్మథబాణం; 'కాంతామణి', 'రాయంచ నడవుల ప్రతిఘటించే' గతులు కలదనీ, చూపులలో కలువలూ, పలుకులలో వజ్రకళికలూ కల అలికుంతల అనీ, 'తారుణ్య - యౌవన - లక్ష్మి ', 'నళినాక్షి' ; 'ప్రేక్షణ సుధారాశి', 'తారలలోని చంద్రకళ'; 'మల్లికావారములోని గంధఫలి - సంపెంగ', 'ముత్తెపు పేరులోని విస్ఫార మణీశలాక' అని అంటూ యింకా ఎన్నెన్నో విధాల అద్భుతంగా ఆమె అందాల్ని వర్ణించాడు మరి యీ హత్తి వారాంగన ఎవరో ! 'హత్తి' అనే శబ్దం 'అత్తు' నకు మొదటి రూపమైన 'హత్తు' అనే క్రియయొక్క రూపం అయినా కావచ్చు కవి యిదే కావ్యంలో 'మత్తగజయాన! నీ మేను హత్తి యుండి' (2-191) అనే ప్రయోగం కూడా చేశాడు 'హత్తి' అంటే 'కూడి' అని అర్థం 'పొత్తు తొడఁగి' అన్నా అదే అర్థం కనుక, యిక్కడ 'హత్తి' పద ప్రయోగం చర్వితచర్వణ మనిపిస్తూంది సందర్భోచిత పద ప్రయోగంలో దిట్టయైన రామలింగకవి ఆ పదాన్ని ఆ అర్థంలో వాడి వుండక పోవచ్చుననీ, 'హత్తి వారాంగన' - అనే ప్రయోగం ఆ వారాంగన హస్తినీ జాతి స్త్రీ అని తెలపడానికి చేసినదేననీ అనిపిస్తూంది మరి కనకలత సౌందర్యాన్ని గూర్చి కవి చేసిన వర్ణనల మాటేమిటి? ఒకవేళ యమున భావన ప్రకారం 'తుచ్ఛమైన స్త్రీ సాంగత్యం మరిగి' అనే అర్థంలో యీసడింపుగా యీ పదం ప్రయోగించి వుంటాడేమో రామలింగకవి), గంజాయి భక్షించి (భక్షః అంటే తినబడేది food, eatables , గంజాయి పొగ పీల్చడమే తప్ప ఇప్పుడు గంజాయి తినడం లేదు. మరి అప్పట్లో భంగా భక్షణముండేదేమో! ఎందుకంటే ఈ క్రింది ప్రయోగం గౌరన రచించిన 'హరిశ్చంద్రోపాఖ్యానము' (ద్విపద) రెండవ భాగంలో చేయబడింది

"ద్వి ॥ గంజాయి తినినేమి కల్లు ద్రావినేమి
యంజక ధనమిచ్చు యతడె నా మెచ్చు"

రామలింగ కవి ప్రసిద్ధమైన తన సమస్యా పూరణంలో మాత్రం 'గంజాయి త్రాగి తురకల సంజాతము చేత కల్లు చవిగొన్నావా?' అనే వాడాడు సంస్కృతంలో యింకా గంజాయికి 'జయా', 'విజయా', 'జయపత్రా', 'మదనా', 'విలాసా', 'భారతీ', 'సిద్ధపత్రీ', 'కల్పవృక్ష', 'మాతులానీ', 'వాగ్వివృద్ధికర', 'బహువాదినీ' వగైరా అనేకమైన పేర్లే కాక 'కవీశ్వర', 'కవిభుక్త అనే పేర్లు కూడా వుండడాన్ని బట్టి కవులకిది ప్రీతి పాత్రమైనదని అర్థమౌతుంది. 'సదాభక్షణ' అనే పేరుండడాన్ని బట్టి గంజాయి 'ఎప్పుడూ తినబడేది' అని కాదు, మనిషి ఆరోగ్యాన్ని 'ఎప్పుడూ తినివేసేది' అని అర్థమౌతూంది గంజాయి మొక్క - The Indian Hemp Plant - *Cannabis sativa* 'Cannabinaceae' కుటుంబానికి చెందినది భంగా - భంగు - అని దీనినుండి చేయబడే మత్తుపానీయాన్ని, గంజాయి పొగను త్రాగిన వాళ్ల శరీరం రోజురోజుకూ కృశించి పోతుంది. అయితే వైద్యపరంగా గంజాయి ఎన్నో రుగ్మతల నివారణకు వాడే ఔషధ వృక్షమే. గంజాయి వాతరోగము, శ్వాస కాసలు, అతిసారములను పోగొట్టి చురుకైన బుద్ధి, ప్రసంగ శక్తి, అగ్ని దీపనము, ధాతుపుష్టి వగైరాలను కలుగజేస్తుంది ), కల్లుత్రావి, నంజుఁదు (మాంసం) నమలి, కృతఘ్నుడై నట్టడవిలో శాంతుడు, వేదాంత విద్యా విచార నిపుణుడు, నిరపరాధుడు, మహీసుర వరుడైన (బ్రాహ్మణ శ్రేష్ఠుడైన) విద్యాపాలుడనువానినీ, అతని కుమారుడినీ చంపి చివరకు నిన్నాశ్రయించినాడు వీడు. నీ వంటి వాడే యింతటి నీచుణ్ణి చేరదీస్తే యింక నేనేమి అనగలను? ఓ విశ్వనాథా!'

ఇంకా, 'ఓ శంకరా ! కాయలూ, కందమూలాలే ఆహారంగా తీసుకొని, కోరికలకు కళ్ళెములు వేసుకుంటూ, ఘోరారణ్యాలలో అతి దారుణమైన నిష్ఠతో తపస్సులు చేసేవారికైనా నీ దరిదాపులకు చేరడం సాధ్యంకాదు. అలాంటి నిన్ను చేరి యిప్పుడు శుభాకృతి దాల్చి యున్న ఈ మదాలసుడు చూడబోతే ఎవ్వరికైనా అంటరాని వాడైన పరమనీచుడు.

ఇదెంతైనా చోద్యంగా వుంది. ఇక ధర్మా ధర్మాల గురించి ఎవరాలోచిస్తారు? పరోపకారాలు చేయాలనే సదాలోచనలు, వివేకంగా జీవిస్తూ విధి నిషేధాలు పాటించడం యివన్నీ యిక వట్టి మాటలే కదా! ఇక మీదట జనులంతా తమ యిష్టారాజ్యంగా యధేచ్ఛగా సంచరిస్తూ, బలహీనుల్ని ఎటువంటి పాపభీతీ లేకుండా చంపుతూ చివరకు నిశ్చలుడివైన (ఏమీ ఎదురు చెప్పని) నీలో ఐక్యమౌతారు (అంటే కైవల్య ప్రాప్తి నొందుతారు).

తొల్లియు (లోగడ కూడా) నీవు శ్వేతుడిని (శుక్రాచార్యుడిని) ఇదే విధంగా కాపాడావు (రాక్షస గురువైన శుక్రాచార్యుడు, దేవతల గురువైన బృహస్పతి తండ్రి అంగిరసుడి వద్ద విద్యార్థిగా వున్నప్పుడు శుక్రుడికి విద్యనేర్పడంలో ఆయన పక్షపాతం చూపగా శుక్రుడు గౌతముని సలహాపై శివుడిని ప్రార్థించి ఆయన వద్ద 'మృత సంజీవనీ' విద్య నేర్చుకుంటాడు. దాని నతడు మృతులైన రాక్షసులను పునరుజ్జీవితులను చేయడానికి వుపయోగిస్తూండడంతో తాను నేర్పిన విద్య దుష్టులకు ఉపయోగపడరాదని శుక్రాచార్యుడిని శివుడు మింగుతాడు. అయినా శుక్రుడు శుక్లము రూపములో బయటికి వస్తాడు. ఆ తరువాత శుక్రాచార్యుడి నుండి మృత సంజీవనీ విద్యను సేకరించడానికి దేవతలు కచుణ్ణి ప్రయోగిస్తారు. ఏమైనా దుష్టులకుపయోగపడిన మృత సంజీవనీ విద్య శుక్రుడికి నేర్పి పొరపాటు చేసింది శివుడే కదా! అయితే పాల్కురికి సోమనాథుడు రచించిన 'మల్లికార్జున పండితారాధ్య చరిత్ర' లోని పురాతన ప్రకరణములో శ్వేతుని గురించి ఆసక్తి కరమైన కథ ఒకటుంది. ఒకప్పుడు శ్వేతుడు కాముకుడట. భోగమే యాగంగా జీవించే అతడు ఓసారి తన లంజియ కోసం వేగంగా పుష్పములు తెస్తూన్నప్పుడు ఒక పుష్పం ఒక అంచిత భూ ప్రదేశం (పూజనీయ స్థలం) లో తెగి పడిందట. అతడు ఆ పూవును అక్కడి నుండి తీసికొనడానికి సిగ్గుపడి మనసులోనే దానిని శివార్పితమని తలచి వదలి వెళ్లిపోయాడట. ఆ కాస్త పుణ్యానికే అతనికి కొంతకాలం పాటు దేవేంద్ర పదవి లభించిందట. ఇక లతడు వెంటనే అప్సర కాంతలలో ఉదాత్త భాసురకీర్తియుతయైన రంభను పొందగోరి రమ్మన్నాడట. అప్పుడు రంభ ప్రత్యక్షమై అతనితో 'నీవు మదించిన ఏనుగులా చాల కొవ్వి వున్నావు. రాత్రింబవళ్లూ స్త్రీ వ్యామోహంలో పడి గుడిని చూచి కూడా మృదుని (శివుని) శరణనవు. గురులకు కడకంటనైనా మ్రొక్కవు. రుద్రాక్షలేనాడూ ముట్టివెరుగవు. విభూతి ఏనాడూ ధరించి ఎరుగవు. పుట్టావు ; పెరిగావు ; అయితేనేం పుణ్యమనే మాట కలలోనైనా ఎరుగుదువా? కనుక, భస్మము, రుద్రాక్షలు ధరించి ఈశ్వరుని ఆలయంలో భక్తితో పూజలు చేస్తూ వుండు. నేను యీలోగా కొన్ని ముఖ్యమైన పనులు చక్కబెట్టుకొని మళ్ళీ త్వరగా వచ్చేస్తాను' అంటూ నమ్మబలికి తప్పించుకున్నదట. అక్కడి నుండి శ్వేతుడు రంభ చెప్పిన ప్రకారం అత్యంత భక్తి శ్రద్ధలతో శివాలయం అంతా ఊడ్చి, ముగ్గులు వేసి, పూవులు, పత్రి కోసుకొచ్చి, ఆకాశ గంగాజలం తెచ్చి మజ్జనము చేసి, ధూప దీపములతో శివార్చన చేస్తూ సాగిలపడి మ్రొక్కుతూ, షోడశోపచారములు చేస్తూండగా అతని పాపం పండి ఆయుష్షు మూడిన కారణంగా అతని ప్రాణాలు కొనిపోవడానికి యముడు ప్రయత్నించగా శివుడు అడ్డుపడి యముణ్ణి తన శూలాయుధంతో వక్షము చీల్చునట్లు గాయపరచి వెడలగొట్టి శ్వేతుడికి శివసాయుజ్యం ప్రసాదించి అతడిని తన ప్రమద గణాలలో లీనం చేసుకొన్నాడట. 'చెడ్డవారిని చేరదీయడం, ఆ తరువాత తప్పు తెలుసుకొనడం నీకు మొదటి నుండి వస్తూన్న అలవాటే' అని యముడి ద్వారా శివుణ్ణి విమర్శిస్తున్నాడు రామలింగ కవి) ఇప్పుడు బ్రహ్మహత్యాపాతకుడైన మదాలసుడిని చేరదీశావు. ఓ అద్రిజా పల్లభా ! (ఓ గిరిజాపతీ!) నేను కర్తవ్యోన్ముఖుడిని కనుక ఈ విషమ వర్తనమును అంగీకరించలేను' అన్నాడు.

అప్పుడు శివుడు భానుపుత్రునితో (సూర్యుని కుమారుడైన యమునితో) యిలా అన్నాడు, "ఓ నాళికాప్త ప్రియ పుత్రా ! (కమలాప్తుడైన సూర్యుని ప్రియకుమారుడా !) నా లీలకు ఆలవాలమైన యీ కాశీనగరంలో మరణించిన మానవుడు నాలో లీనమౌతాడు. ఎవ్వడైనా సరే కాశికాపురికి వచ్చి బొంది దిగద్రోయు భాగ్యం పొందాడా - అతడు లింగైక్యం

చెందుతాడు. అంతేకాదు 'కాశీ నగరంలో వున్నవాడు పుణ్యుడు' అని చెప్పే పాపకర్ముడికి కూడా సుకృత ఫలం లభిస్తుంది. 'కాశికి వెళితే పాపము తొలగదు' అని చెప్పే పుణ్యమూర్తికైనా సరే దుష్కర్మల ఫలితం లభిస్తుంది. భ్రమర కీటక న్యాయం ప్రకారం కీటకం భ్రమరంగా మారినట్లు, సిద్ధరసం తగిలితే ఇనుము బంగారమైనట్లు, కాశిలో మరణించిన పాపకర్ముడైనా ముక్తుడై శివైక్యం చెందుతాడు. ఈ పుణ్య క్షేత్రంలో ఏ పుణ్యాత్ముడు నా లింగ ప్రతిష్ఠ చేస్తాడో అతడు బొందితోనే కైవల్య ప్రాప్తినందుతాడు. ఓ భాను తనయా ! అగ్రాహ్యములైన (స్వీకరింపనర్హత లేని) ఇతర మతములను ఖండించి ఈ కాశిలో ఏ పాపకర్ముడైనా, నీచుడైనా నన్ను ప్రతిష్ఠ చేస్తే, అతడు ప్రాణములుండగానే నాకు వలెనే జటాజూటముతో 'కపర్ది' అవుతాడు; శశాంక పోతమును (బాల చంద్రుడిని) శిగపై ధరిస్తాడు; శిరస్సుపై స్వర్వాహినీపోతము (అంటే నాకధుని అయిన గంగ) ను పొంది; మెడల చుట్టూ భుజంగ హారమును చుడతాడు; ప్రభాత కాలంలో వెలుగుచే విడగొట్టబడిన నీహారము (మంచు) లో అంటే వేకువ జాముకు ముందే నా రూపమును పొందుతాడు. ఓ ఇనజా ! (సూర్యపుత్రా !) ఈ కాశి కైవల్య లక్ష్మి కి నివాస స్థానము కనుకనే ఒకప్పుడు దేవేంద్రుడు వృత్రాసురుడిని (సప్తరుషుల సాయంతో) స్నేహం చేసి మోసగించి చంపిన పాపం ప్రక్షాళన చేసికొనడానికి నా విగ్రహాన్ని ఈ కాశిలో ప్రతిష్ఠించి ఆ ఘోర పాపాన్ని కడుక్కున్నాడు. అలాగే దేవగురువైన బృహస్పతి భార్య తారతో గురుపత్ని అని కూడా చూడకుండా అక్రమ సంబంధాన్ని నెరపిన చంద్రుడు యీ కాశిలోనే నా లింగ ప్రతిష్ఠ చేసిన అనంతరం పాప ప్రక్షాళన అయి కీర్తి గాంచాడు (ఆ తరువాత బ్రహ్మ మధ్యవర్తిత్వం చేసి చంద్రుడికీ, తారకూ పుట్టిన బుధుణ్ణి తండ్రియైన చంద్రుడికీ, తారను తిరిగి ఆమె భర్తయైన బృహస్పతికీ అప్పగింపజేశాడట). ఓ కృతాంతా ! (యమా!) ఎట్టి పాపకర్మునికైనా లింగ ప్రతిష్ఠ చేసినా, చేయకున్నా ఈ కాశీపురిలో మరణిస్తే కైవల్య సిద్ధి తథ్యం. ఈ నగరం 'సర్వ కల్మష వికార నిబర్హణమైనది' (అంటే అన్ని రకాల కల్మషాల కారణంగా కలిగే వికారాల్ని నాశనం చేసేది). అందుచేత ఇక్కడ జీవమునుజ్జగించిన విశిష్టుడు కావున ఈ బ్రాహ్మణుడు దుష్టుడైనప్పటికీ శివైక్యం చెందాడు కానీ, లేకుంటే తావక (నీ యొక్క) దండ ఘాతములు వీడికి తప్పేవి కావు కదా ! ఓ భానునందనా ! ఇక నీవు నా ఆజ్ఞ శిరసావహించి యథాస్థితి నుండి ధర్మపాలన గావించుము" అని యమునికి వీడ్కోలు పలికి 'ఆ బ్రాహ్మణుడిని కాపాడి సుర సిద్ధవరాసుర పూజితాంఘ్రియై (అంటే సురులు, సిద్ధవరులు, అసురులచే పూజింపబడే పాదములు కలవాడై) విశ్వము నుతింపగా నిరంతర భక్త రక్షణార్థమై అక్కడే విశ్వేశ్వరుడై వెలిశాడట' అని మదాలసోపాఖ్యానాన్ని ముగించిన కౌండిన్యుడు యింకా రాజుతో యిలా అన్నాడు.

# కాశిలో ప్రమథేశ్వరుడు, ప్రభావతి

'కాబట్టి కాశి మాహాత్మ్యాన్ని కొనియాడడానికి ఎంతటివారికైనా వశమేనా? నీవు ఆకాశవాణి చెప్పినట్లుగా కాశికి వెళ్ళి భక్తవరదుడు, అవిముక్తేశుడు అయిన ఆ విశ్వపతిని సేవించు నీ కోరిక సిద్ధిస్తుంది' అని దీవించగా ప్రమథేశ్వరుడు, ప్రభావతి కౌండిన్యుడి పాదాలకు నమస్కరించి అక్కడి నుంచి బయలు దేరి ఒక సుముహూర్తములో కాశికాపురి ప్రవేశించి జహ్ను కన్నియ యైన (కోపించిన జహ్ను మహర్షిచే పానము చేయబడి భగీరథుని వేడికోళ్ళ కారణంగా జహ్నువుచే చెవి నుండి మరల విడువబడి జహ్నువు కుమార్తెగా భావించబడుతూ జాహ్నవిగా పేరొందిన) గంగానదిలో జలకమాడి విశేషంగా భూనిలింపులకు (బ్రాహ్మణులకు) బంగారమును దానముగా యిచ్చి వారిని తృప్తిపరచి అత్యంత భక్తి ప్రపత్తులతో భార్యాసమేతుడై విశ్వేశ్వరాలయం ప్రవేశించాడు.

దేవాలయ ప్రవేశం చేసిన ప్రమథేశ్వరుడు శివుడినిలా ప్రార్థించాడు.

కII	అలికాక్షుఁ బార్వతీధవుఁ
గలికాల వికార దూరు గణవరు మల్లీ
కలికా వర్ణు ధనేశ్వరు
చెలికానిని నిన్నుఁగొల్తు శివ ! ఫణివలయా !	(ఉద్భటారాధ్య చరిత్రము : 3-12)

అలికము - లలాటము; ఫాలము; నుదురు; అలికాక్షుడు - ఫాలనేత్రుడు; పార్వతీ ధవుడు - పార్వతీపతి; కలికాల వికార దూరు - కలికాలమునకు సంబంధించిన వికారములను పోద్రోలేవాడు; గణవరు - గణములంటే ప్రమథగణములనే శివుని అనుచర గణం. వారికి పర్యవేక్షకుడు గణపతి. గణవరుడు అంటే గణములోకెల్లా సర్వశ్రేష్ఠుడూ, గణాధ్యక్షుడూ అయిన శివుడు. శివుడిని గణాధిపతి అని కూడా అంటారు. మల్లీకలికా - మల్లెమొగ్గ; వర్ణు - వర్ణము గలవాడు (శివుడు తెల్లనైన మల్లెమొగ్గ వంటి మేనిచాయ కలవాడు); ధనేశ్వరు చెలికానిని - విత్తేశుడైన యక్షరాజు కుబేరుని మిత్రుడు అయిన శివుని; నిన్నుఁగొల్తు శివ - ఓ శివా ! నిన్ను పూజిస్తాను. ఫణి వలయా! - సర్ప సమూహ పరివేష్టితా !

అని యింకా యీ అద్భుతమైన పద్యంలో శివుణ్ణి ప్రార్థిస్తున్నాడు ప్రమథేశ్వరుడు -

సీII	కామాహితుఁడ వయ్యుఁ గరుణతో నెట్లుభ
		క్తుల పాలిటికిఁ గామదుండవైతి
వుగ్రలక్షణరేఖ నొందఁ జాలియు సర్వ
		మంగళాన్విత మూర్తి మనితివెట్లు
భవరోగ వైద్య విభ్రమముఁదాల్చియు నెట్లు
		మానని తలయేఱుఁ బూనినాఁడ
వరసి చూడఁగ దిగంబరుఁడ వయ్యును నిరం
		తర విభూతి స్ఫూర్తిఁ దనరి తెట్లు
గీII	తొడరి యింతంత యనరాని పొడవునయ్యుఁ
గుదురు కొంటివి ఏరీతిఁ గొమ్మచంట
నిట్టి నీ సొంపు వర్ణింప నెవ్వఁడోపు?
హరిణలాంఛన జూట ! పశ్యల్లలాట !	(ఉద్భటారాధ్య చరిత్రము : 3-14)

ఓ పశ్యల్లలాట ! (ఓ శివా!) ('పశ్య' అంటే సంస్కృతంలో 'చూచునది' అని అర్థం. తన ఫాలభాగం (నుదురు) పైనున్న మూడవ కన్ను కారణంగా శివుడు తన లలాటంతో కూడా చూడగలడు. లలాటమునే నొసలు, నుదురు, అలికము, ఫాలము అనీ అంటారు. అందుకే శివుణ్ణి 'పశ్యల్లలాట', 'పశ్యత్ఫాలుడు', 'ఫాలనేత్రుడు', 'ఫాలలోచనుడు', 'అలికాక్షుడు' వగైరా పేర్లతో పిలుస్తారు. హరిణమును లాంఛనము - గుర్తు - గా కలిగిన వాడు గనుక చంద్రుడిని హరిణాంకుడు, హరిణ లాంఛనుడు అంటారు. చంద్రునిలోని మచ్చ, జింక (కురంగము) ఆకారములో వున్న కారణంగా చంద్రుడిని కురంగలాంఛనుడని కూడా అంటారు. శివుడు చంద్రుడిని తన జటాజూటములో ధరించాడు గనుక శివుడు 'హరిణాంక జూటుడు', 'హరిణలాంఛన జూటుడు', 'కురంగ లాంఛన జూటుడు' అని పిలువబడ్డాడు.

నీవు కామాహితుడవు (కాముడు – మన్మథుడు; అహితుడు – శత్రువు – శివునకు మన్మథవైరి, స్మరారి వగైరా పేర్లన్నీ మన్మథుడిని భస్మం చేయడంవలననే వచ్చాయంటారు. కామాహితుడు అంటే మన్మథుని శత్రువు అయిన శివుడు) అయినప్పటికీ కరుణతో భక్తులపాలిటి కామదుడ (కామ + ద = కామద; కామదుడంటే కోరినవి ఇచ్చేవాడి) వయ్యావు. శివునికి మరొక పేరు ఉగ్రుడు. ఆయన రూపం కోరుకున్నప్పుడు ఉగ్రంగా మారగలదు. 'నీవు ఉగ్రమూర్తివే అయినా సర్వమంగళాన్వితమూర్తి – అంటే నీ కరుణాదృష్టితో అందరికీ శుభాన్ని చేకూర్చే రూపంతో ఎలా మనుతున్నావు?' అనీ మరొక అర్థంలో 'సర్వమంగళ' (పార్వతీదేవితో) అన్విత (కూడుకొనిన) మూర్తిగా ఎలా వుంటున్నావు? అని.

'భవ' అంటే పుట్టుక. శివుడు తిరిగి జన్మంటూ లేకుండా చేసే (భవరోగ తిమిరాల్ని పోకార్చే) వైద్యుడంటారు. అయితే ఆయన మానని (ఎడతెగకుండా ప్రవహించే) యేఱుఁ (ఆకాశగంగ) ను తలపై ధరించాడు. ఇంతటి ప్రసిద్ధ భవరోగ వైద్యునికి మానని (తగ్గని) తల యేటా? ('యేఱు' అంటే 'తలనొప్పి' అనే అర్థం కూడా వుంది.)

అరసి (విచారించి) చూడగా నీవు దిగంబరుడవు (దిక్కులే అంబరములుగా కలవాడు; దిస మొలవాడు; అంటే కట్టుకొన బట్టకూడా లేని దరిద్రుడు – మరి శివుడు ఆది భిక్షువేగదా !) అయినా నిరంతర విభూతి స్ఫూర్తితో ఎలా తనరు (అతిశయించు) చున్నావు? (నిరంతర విభూతి అంటే ఎడతెగని సంపద – విభూతి అనే పదానికి బూడిద అనే అర్థంతోపాటు సంపద అనే అర్థం కూడా వున్నది శివుడు తన భక్తులకు 'అఖండ విభూతి ప్రదాత' గా ప్రసిద్ధుడట )

ఒకప్పుడు శివుడు యింతా అంతా అనరానంత పొడవు పెరిగాడని ఐతిహ్యం. అప్పుడు మిగిలిన దేవతలంతా ఆ అనంతరూపుని ఆది – అంతాలు కనుగొనాలని ప్రయత్నించి విఫలులయ్యారంటారు. అంతటి అనంతమూర్తివీ కూడా ఏరీతిగా ఒక కొమ్మ (స్త్రీ) చంట (చన్నులో – వక్షములో) కుదురుకొన్నావు? శివుడు అర్ధనారీశ్వరుడై పార్వతీ దేవీ శరీరం యొక్క అర్ధభాగంలో యిమిడిపోయాడు. శరీరానికి హృదయం మూలస్థానం. అది వక్షంలో వుంటుంది గనుక మొత్తం శివుని శరీరం పార్వతీదేవి యొక్క ఒక వక్షంలో యిమిడినట్లేనని కవి భావం. దీనికి యింకొక రకంగా కూడా అన్వయార్థం చెప్పుకోవచ్చు. సుందరమూర్తి నాయనారు (ఆళ్వారులంటే వైష్ణవ భక్తులు; నాయనారులంటే శైవభక్తులు) అనే ప్రఖ్యాత ద్రావిడ శైవ భక్తుడుండేవాడు. ఆయననే ఒడయనంబి అని కూడా అనేవారు. అతడు పరమనాచి అనే వేశ్యను ప్రేమించాడు. అయితే ఆమె కోరినంత ధనం యీయలేని పేదవాడు కనుక ఒడయనంబి ఆమెతో తనకు పొత్తు కూర్చమని శివుణ్ణే కోరాడు. భక్తజన సులభుడైన శివుడు కుంటెనకాడు (తార్పుడుగాడు) గా మారి ఆమెకు రోజుకు వెయ్యి మాడల ధనమిస్తూ వుంటే ఒడయనంబి పరమనాచి వద్ద రోజూ స్వర్గసుఖాలు అనుభవించాడట. ఓ రోజు అర్ధరాత్రి సమయంలో నంబి పరమనాచి యింట్లో వున్నాడట. షట్కాల శివపూజా విధానాన్ననుసరించి అర్ధరాత్రి వేళ శివపూజ చేయవలసి యున్నది. కాని నంబి వద్ద శివలింగము లేదు. ఆనాటికింకా యిష్టలింగధారణ ఆచారం ప్రచలితం కాలేదు. ఎక్కడికి వెళ్లినా శైవులు శివలింగాన్ని తమతో తీసుకువెళ్లేవారట. ఆ రోజు నంబి లింగము తీసుకు రావడం మరిచాడు. అందుచేత భక్తాగ్రేసరుడైన ఒడయనంబి తన ప్రియురాలి స్తనమునే శివలింగంగా భావించి నిష్ఠతో పూజించి శివుడిని భక్తితో నోరారా పిలిచి ఆ చన్ను నుండి శివుడిని 'ఓ' అని పలికించాడట.

రామలింగ కవి ఈ ఉదంతాన్ని యీ పద్యంలోనే కాక యిదే కావ్యంలో యింకా రెండు సందర్భాల్లో కూడా ప్రస్తావించాడు.

దండకం . "రామా (స్త్రీ) కుచాభ్యంతరం బెట్లు నీ కున్కిపట్టయ్యెనే" (3-28)

రగడ "ఒడనంబెన్నకుఁగాఁ దత్కాంత ప
యోధరమున నోహోయని పలికితి" (3-287)

శ్రీనాథ మహాకవి తన శృంగార నైషధ కావ్యంలో (7-178) నలదమయంతుల రహఃకేళి సందర్భంగా నలుడు యిదే తరహాలో అర్ధనిశాసమయంలో ఆ అతివ పయోధరములకు నఖముల (అంటే నఖ క్షతములతో) కింశుకముల (అంటే మోదుగ పూలతో) అర్చన చేసినట్లు పేర్కొన్నాడు 'పరమానందయ్య శిష్యుల కథ'లో యిదే తరహా అర్ధనిశా లింగార్చన మహా శివభక్తుడైన విజయదుర్గ రాజ్య ప్రభువు నందివర్ధన మహారాజు వేశ్య పయోధరానికి చేస్తాడు

ఇట్టి నీ సొంపు వర్ణించడం ఎవరి వల్ల అవుతుంది?

ఆ దంపతులిరువురూ అలా కురంగపాణికి (చేతిపై జింకను ధరించినవాడైన శివునికి) పూజలు చేస్తూ కొన్ని రోజులు హవిష్యం (యజ్ఞంలో హవిస్సులుగా సమర్పించే పదార్థాలు, నెయ్యి వగైరాలు) తినేవారట. కొన్ని రోజులు ఫలములు మాత్రం తినేవారట. కొన్ని రోజులు కేవలం నీళ్ల త్రాగేవారట. ఇంకొన్ని రోజులైతే గాదుపు (గాలి) మాత్రమే గ్రోలేవారట.

ఇలా నిష్ఠతో పూజలు చేయగా చేయగా శివుడు ప్రత్యక్షమయ్యాడు. ఏమి వరము కావాలో కోరుకొనమనగా రాజు తనకు నిరాఘాటతర ప్రతాపుడూ, హిమానీ శుభకీర్తి ప్రియుడూ, జనతా రక్షణదక్షుడూ అయిన కుమారుణ్ణి ప్రసాదించమంటాడు. అప్పుడు శివుడు 'నీ మనస్సులోని కోరిక సిద్ధిస్తుంది' అంటూ అతని భార్య కివ్వమని ఒక కల్ప వృక్ష ఫలాన్నిచ్చాడు. ఆమె ఆ ఫలాన్ని భుజించిన తరువాత కొన్నాళ్ళకు వారిరువురూ వారణములు (ఏనుగులు), రథములు, హయములు (గుర్రములు), భటులు, యిరు పార్శ్వములా వెంటరాగా కాంచన స్యందనము (బంగారు రథము) నెక్కి తిరిగి వల్లకీపురం చేరుకున్నారు.

## గర్భందాల్చిన ప్రభావతి

కొన్నాళ్ళకు రాణి గర్భం దాల్చింది. ఇక్కడ రామలింగ కవి దౌహృది (గర్భిణి) యొక్క లక్షణాల్ని చక్కగా వర్ణించాడు.

మ॥ పలుకంబారెఁ గపోలపాళికలు పైపైఁ దోఁచె జాడ్యంబు చ
న్నుల బొంకంబు ఘటిల్లె సోగల కన్నుల్ వెల్లకాఁజొచ్చె ను
గ్గులు విచ్చెన్ వళిభంగముల్ సరులపైఁ గోర్కుల్ తమింబాసె వె
గ్గలమై చిట్టుములుట్టగాఁ దొడఁగె రాకాచంద్ర బింబాస్యకున్ (ఉద్భటారాధ్య చరిత్రము : 3-40)

కపోల పాళికలు (చెక్కిళ్ళు) పలుకం బారినవట (అంటే వివర్ణమై తెల్లగా అయ్యాయట) పైపైఁదోచె జాడ్యంబు (ఆమెలో జడత్వం ప్రస్ఫుటంగా కనుపిస్తున్నదట) చన్నుల పొంకము ఘటిల్లె (చన్నులకు పొందిక కలిగిందట) సోగల కన్నులున్ వెల్లకాఁజొచ్చె (పెద్దవైన ఆమె కళ్లు వివర్ణమై తెల్లగా అవుతున్నాయట) ఉగ్గులు విచ్చెన్ వళి భంగముల్ (మేనిపైన ఎక్కడైనా ప్రత్యేకించి కడుపుపైన వున్న ముడుతలన్నీ విప్పారి అవయవాలన్నీ పొంకంగా తయారయ్యాయట) సరులపై కోర్కులు (హారములపై కోరికలు) తమిం (తమి అంటే కుతూహలము, అపేక్ష అనీ, త్వరగా అనీ అర్థాలు. ఇక్కడ త్వరగా అనే అర్థం వర్తిస్తుంది) బాసె (పాయుట అంటే తొలగుట) అంటే హారములపై కోరికలు త్వరత్వరగా తొలగినవట. వెగ్గలమై (అధికమై మిక్కుటమై) చిట్టుములు (చిట్టి + ఉములు – గర్భిణికి కలిగెడి ఒకానొక లక్షణమిది. నోటి అరుచి, ఆహారంపట్ల ఏమాత్రం ఆసక్తి లేకపోవడం కారణంగా ఎప్పుడూ నోటి నుండి లాలాజలాన్ని ఊస్తూ వుండడం) ఉట్టగా (ఊటగా స్రవించడం) తొడగె (ప్రారంభమైంది) రాకాచంద్ర బింబాస్యకున్ (పున్నమినాటి చంద్రబింబము వంటి ముఖము కలిగిన ఆ ప్రభావతికి)

స్త్రీలు గర్భిణులైన తొలినాళ్ళలో కృశాంగులుగా ఉన్నప్పటికీ, తరువాత ఆహారం ఎక్కువ తీసుకొని, తగినంత విశ్రాంతి తీసుకుంటూ వుండడం కారణంగా శరీరంపై ముడుతలన్నీ తొలగి వారు స్థూలకాయులవుతారు, వారికి జడత్వం సంక్రమిస్తుంది, రక్తంలోని హెచ్చుభాగం

గర్భకోశానికి చేరడం కారణంగా చెక్కిళ్ళు, కళ్ళు తెల్లనవుతాయి; నగలు కూడా మోత బరువనిపిస్తాయి. అందుకని వాటిపై కోరికలు తొలగుతాయి క్రమంగా నోటినుండి ఉప్పటి నీళ్ళూరుతూ ఆకలి నశిస్తుంది దీనిని అరుచి (*Anorexia - loss of appetite*) అంటారు. ఇవన్నీ గర్భిణి అయిన స్త్రీ లక్షణాలు.

పోలిక కోసం భోజరాజు సంస్కృత భాషలో రచించిన 'చంపూ రామాయణము'లో కౌసల్య, సుమిత్ర, కైకేయిలు దౌహృదలుగా (గర్భిణులుగా) వున్నప్పటి స్థితిని వర్ణిస్తూన్న శ్లోకాన్ని చూడండి (దౌహృదా లేక దౌహృది లేక దౌహృదినీ అంటే రెండు హృదయములు కలది - గర్భిణి. రెండు హృదయములంటే ఒకటి తనది, రెండవది గర్భస్థ శిశువుది )

శ్లో॥ అపాటవాత్కేవల మంగకానాం
మనోజ్ఞకాంతే ర్మహిషీ జనస్య
శనైశ్శనైః ప్రోజ్ఘిత భూషణాని
చకాసిరే దౌహృద లక్షణాని (చంపూ రామాయణము; బాలకాండము - 51)

మనోజ్ఞమైన కాంతులీనుతూన్న పట్టమహిషుల కేవలము అపాటవము (అసౌష్టవము, అసామర్థ్యము)లైన అంగముల కారణంగా ఒక్కటొక్కటిగా మెల్లమెల్లగా విడచిపెట్టబడుతూన్న నగలను బట్టి వారిలో దౌహృద లక్షణాలు ప్రకాశిస్తూన్నాయి (ప్రస్ఫుటమౌతూన్నాయి)

రాణి ప్రభావతి ఓ కలగంటుందట. ఆ కలలో ఒక బాలుడు శివుని త్రిశూలాన్ని చేతబూని కనుపిస్తాడట. తన పొత్తిళ్లలో అదే బాలుడున్నాడని ఆమె ఊహించుకుంటుందట. కైలాసంలో గంధర్వులు గానం చేస్తూండగా తిరిగి అదే బాలుడు అక్కడ కొలువు తీరినట్లుగా కలగంటుందట.

మరొక పద్యంలో రామలింగకవి గర్భవతి అయిన ప్రభావతి ప్రమథేశ్వరునికి ఎలా కనువిందు చేస్తుందో చక్కగా వర్ణించాడు. చూడండి -

చ॥ పలుచని సొమ్ములున్ వెలుకఁ బారు ముఖాబ్జముఁ గ్రమ్ము సూర్పులున్
దొలకుల నిండు కుక్షియును దుమ్మెద బోదల తోడి తమ్మి మొ
గ్గల నగునీల చూచుకయుగంబునఁ బొల్చు పయోధరంబు ల
త్యలస కటాక్షముల్గలిగి యంగన చూపలరించు భర్తకున్ (ఉద్భటారాధ్య చరిత్రము : 3 - 43)

(తన శరీరమే తనకు బరువై ఆభరణములను మోయలేని కారణంగా) పలుచని ఆభరణములను కలిగి; వెలుకఁ బాఱు (వెలుక + పాఱు : వెల్లబాఱు : తెల్లబడు) ముఖాబ్జము : అబ్జము (పద్మము) వంటి ముఖము గలిగి; క్రమ్మే (వెల్లువిరిసే), ఊర్పులున్ (ఊపిరులు - ఎగశ్వాస, దిగశ్వాసలు) కలిగి తొలకు (అతిశయించి ప్రకాశమానమైన) నిండుకుక్షియును (పూర్ణగర్భమును) గలిగి, తుమ్మెద బోదల తోడి తమ్మిమొగ్గల (తుమ్మెద బోదలంటే రోలంబ బాలికలు అనగా పిల్ల తుమ్మెదలు - తామర మొగ్గలపై పిల్ల తుమ్మెదల వలెనున్న) నీల చూచుక యుగంబునఁ బొల్చు పయోధరంబులు - అంటే 'మనోహరమైన రెండు తామర మొగ్గలపై రెండు పిల్ల తుమ్మెదలు వాలినాయా' అన్నట్లున్నవట నీల చూచుక (నల్లబడిన చూచుకములు) అంటే చనుమొనలు కలిగిన ఆమె పయోధరములు (పాలిండ్లు); కుచచూచుకములు నల్లబడడం కూడా గర్భిణి లక్షణాలలో ఒకటి. అతి (ఎక్కువగా) అలస (బద్ధకముతోనున్న) కటాక్షణముల్గలిగి (కడకండ్లు కలిగివున్న) అలసట కారణంగా రెప్పలెత్తి కడగంటి చూపు చూడడానికి కూడా బద్ధకిస్తూన్న ఆ అంగన (ఆ స్త్రీ) భర్తకున్ (భర్తకు) చూపలరించు (కనువిందు చేస్తున్నది)

# ముంజభోజుని జననం

ఐదు శుభగ్రహములు అరుణాంశుని (సూర్యుని) కూడియుండి ఉచ్ఛస్థితిలోనున్న పుణ్యదినాన సూర్య సమాన తేజోవిరాజితుడైన బాలుణ్ణి రాణి కన్నదట.

తనకు కొడుకు పుట్టిన శుభ సందర్భంలో రాజు ఏ ఏ పుణ్యకార్యాలు చేశాడో తెలిపే యీ చక్కటి పద్యం చూడండి.

సీ॥ వినుత పావన జలంబున మజ్జనము చేసి
　　కమనీయ శుద్ధ వస్త్రములు గట్టి
మౌహూర్తికులచేత మార్తాండ ముఖ శుభ
　　గ్రహముల యనవద్య గతులు దెలిసి
తరతమ భావంబుఁ బరికించి పుడమివే
　　ల్పులకు సువర్ణము భూరి వెట్టి
పంజరంబులనున్న పక్షుల బందీల
　　హస్తుల విడిపించి యర్థభంగి
గీ॥ వినుత దానంబు లొనరించి యనుఁగుఁ జెలుల
యట్ల నట్టింటఁ బగవారి నాదరించి
నగర దైవతముల నర్చనా సమృద్ధిఁ
దనిపె సుత జన్మ దినమున ధరణి విభుఁడు (ఉద్భటారాధ్య చరిత్రము : 3 – 47)

పవిత్ర జలములలో స్నానమాచరించి, మనోహరములైన తెల్లని వస్త్రాలను ధరించి, మౌహూర్తికుల (శుభాశుభ ముహూర్తాల్ని నిర్ణయించే పండితుల) చేత సూర్యుడు వగైరా శుభగ్రహముల అనవద్య (నింద్యముకాని, లోపరహితమైన) గతులను తెలిసికొని, తారతమ్యములు, న్యూనాధిక్యములు విచారించి పుడమి వేల్పులకు (భూసురులనబడు బ్రాహ్మణులకు) సువర్ణంబు (బంగారము) భూరివెట్టి (అధికముగా యిచ్చి) పంజరంబుల నున్న పక్షులను, చెరసాలల్లో బందీలుగానున్న వారిని, హస్తుల (ఏనుగులను) విడిపించాడట. – (ప్రాచీన కాలంలో ఏనుగులను భారీ నిర్మాణములు వగైరాలలో అత్యంత కఠినమైన బండ చాకిరీలు చేయడానికి చాల పెద్ద సంఖ్యలో వినియోగించేవారట. హస్తిపకులు, మావంతులు లేక అధోరణులు అని పిలువబడిన మావటి వారిని యీ ఏనుగుల పాలన పోషణలకు నియమించేవారట శుభ దినాల్లో ఆ భారవాహక జంతువుల (*Beasts of Burden*) లో ముసలివై, శక్తి హీనములైన వాటికి విముక్తి ప్రసాదించడం ఆచారంగా వుండేదట ఇది నిస్సంశయంగా ఓ సదాచారమే! గాంధీ జయంతి వగైరా జాతీయ పర్వదినాల సందర్భంగా నేటి ప్రభుత్వాలు కూడా సత్ప్రవర్తన కలిగిన ఖైదీలకు శిక్షలు తగ్గించి విడుదల చేయడం వుందిగానీ, 'పెటా' (People for Ethical Treatment towards Animals), 'బ్లూ క్రాస్' వగైరా జంతు కారుణ్య సంస్థలు ఎంత మొత్తుకుంటున్నా బండ చాకిరీకి తట్టుకొనలేక సతమతమౌతూన్న దున్నలు, ఎద్దులు, ఒంటెలు, ఏనుగులు వగైరా భారవాహక జంతువుల పట్ల యింకా తమ కృపాదృష్టి సారించినట్లు లేవు ఆ మధ్య కేరళలో బండ చాకిరీ చేయడానికి మొరాయించిన ఏనుగులు ఒక్క వారం వ్యవధిలోనే కసిదీరా ముగ్గురు మావటీళ్లను నేలకు కొట్టి, త్రొక్కి చంపాయని పత్రికా వార్తలు చదివాం. అలాగే పంజరాల్లో బంధించబడిన చిలుకలు, గోరింకలు,

మైనాలు వగైరా పక్షులు చూపరులకు కనువిందు చేయవచ్చునేమో గాని, స్వతస్సిద్ధమైన వాటి పరిసరాలకు దూరమైనందునా, వాటి యథేచ్ఛా విహారం అరికట్టబడిన కారణంగానూ దిగులుపడి క్షీణించి అకాల మరణం పొందడం లేదా? కనుక, నేటి ప్రభుత్వాలు రామలింగ కవి సందేశాన్ని స్వీకరించి - ప్రమథేశ్వరుడు కల్పిత పాత్ర అయినందున యిది ఆ రాజు సందేశం కాదు. కవి సందేశమే. ఈ సదాచారం కనీసం కవి కాలమైన క్రీ శ 16వ శతాబ్దినాటి రాజులు పాటించి వుంటారు - నాటి పాలకులు పాటించి ఆ తదుపరి మరుగున పడిన జంతు, పక్షి కారుణ్యమనే సదాచారాన్ని తాము పునరుద్ధరించడం సబబుగా ఉంటుంది.)

ఆ రాజు యింకా ఉచిత రీతిలో దానములు చేసి పగవారిని కూడా ముఖ్య స్నేహితులలా నట్టింటికి సాదరంగా ఆహ్వానించి, ఆదరించి నగరంలో వెలసియున్న దేవతలను - పరిపరి విధములుగా అర్చనలు చేసి - సంతృప్తి పరచాడట.

ఇంకా ఆ నృపతి శేషహారియైన శివునికి తన కుమారుని జన్మదినం సందర్భంగా చిత్రమైన మణులతో చేయబడిన తోరణములు, బంగారముతో చేయబడిన దీప ప్రమిదలు, శివాలయములకు మాన్యములుగా గ్రామాలనూ, బహువస్త్రముల పేటికలనూ, చంచలనేత్రలనూ దానం చేశాడట. (చంచలనేత్రలు అంటే స్త్రీలు ; ప్రాచీన కాలంలో రాజులు దేవరసానులనే కొందరు అవివాహితలైన స్త్రీలను భగవంతుని సన్నిధిలో నాట్యగత్తెలుగా నియమించేవారు. ఇలా నియమింపబడిన స్త్రీని 'గుడిచేటి' అనీ 'దేవాంగన' అనీ కూడా అనేవారు )

ఇక ఆ రాణి పరిస్థితి ఎలా వుందో చూడండి.

సీ॥ ఘుమఘుమ నురుమ నంకురితమౌ నూతన
మణి వహించు విదూర మహి విధమునఁ
చిఱుత ప్రాయముతోడి శీతాంశువుని సొంపు
దళుకొత్తు నపర దిక్తటి తెఱఁగునఁ
గొదమ రాయంచ సమ్మదమున విహరించు
చెలువంబుఁ దలమోచు కొలని కరణి
నవకమై తళుకొత్తు ననకుట్మలంబుచే
వఱలు మోహన కల్పవల్లి పగిది

గీ॥ భాసురోంకారమును గూడి ప్రజ్వరిల్లు
విపుల పంచాక్షరీ మంత్ర విద్యరీతి
భర్గకళ పూని దీపించు బాలుఁ బొడివి
కూర్మి దనరారె నృపురాణి కువలయాక్షి (ఉద్భటారాధ్య చరిత్రము 3-49)

ఘుమఘుమ ఉరిమినప్పుడు విదూరము లేక విడూరము అనే దేశంలో భూమి నుండి వైదూర్య లేక వైడూర్య మణులు (*Cat 's eye gems*) పైకి పొడుచుకొస్తాయట. 'ఘుమఘుమ' శబ్దాన్ని మనం సువాసనకు విశేషణంగా వాడతాం. 'పెళపెళ' లేక 'ఫెళఫెళ' శబ్దాన్ని విరగడం మరియు ఉరమడానికి క్రియా విశేషణంగా వాడతాం. కాని, రామలింగ కవి ఎందుకో 'ఘుమఘుమ ఉరమడం' అనే ప్రయోగం (ఉ.చ. 3-49) చేశాడు. అదే కాలానికి చెందిన శ్రీ కృష్ణ దేవరాయలు తన 'ఆముక్తమాల్యద' నాల్గవ ఆశ్వాసంలోని 101వ పద్యంలో 'పెళపెళ మబ్బు బిట్టుఱుమ' అనే ప్రయోగం చేశాడు. ఆయన కూడా ఉరుముల శబ్దానికి విదూర దేశపు భూమి నుండి వైదూర్య మణులు బయటికి పొడుచు కొస్తాయని





వ్రాశాడు.

విదూరదేశమెక్కడో గానీ కృష్ణాజిల్లా కంచికచర్ల మండలంలోని పరిటాల ప్రాంతపు గ్రామాలలో ఇప్పటికీ ఉరుములతో కూడిన వర్షం కురిసినప్పుడల్లా వివిధ జాతులకు చెందిన విలువైన రంగురాళ్ళు బయల్పడతాయి ఉరుములకూ యీ రంగు రాళ్ళకూ సంబంధమేమిటో మరి! అంతేకాదు *Amaryllidaceae* కుటుంబానికి చెందిన *Crinum Lily (Crinum asiaticum) Zephyr Lily (Zephyranthes rosea)* యింకా లిల్లీ జాతికి చెందిన చాల మొక్కల్లో ఉరుములతో కూడిన వర్షం కురవగానే నేల నుండి బాకుల్లాగా పొడవాటి కాడలుగల పూలు బయటికి పొడుచుకొస్తాయి వెదురు జాతికి చెందిన బొంగు వెదురు (*Bambusa arundinaceae*) సాధనపు వెదురు (*Solid Bamboo - Dendrocalamus strictus*) లలో కూడా ఉరుముల కారణంగా ఉన్నట్టుండి నేలనుండి బాకుల్లాంటి మొలకలు పొడుచుకొస్తాయి కనుక అవి పాదాలలో దిగబడే అవకాశం వున్నందున ఉరుములతో కూడిన వాన కురిసేటప్పుడు వెదురు మొక్కల దాపులకు వెళ్ళొద్దని పెద్దలు చెపుతారు. దక్షిణాశియా, ఆగ్నేయాశియాలలో కనుపించే రాకాసి వెదురు *(Giant Bamboo)* అత్యంత వేగంగా పెరిగే వృక్షం దీనిలేత పిలకలు 24 గంటల సమయంలో 90 సెం మీ లు (మూడు అడుగులు) పొడవు పెరుగుతాయి బాల్యంలో మానవుని పెరుగుదల వేగం కంటే యిది సుమారు మూడువేల రెట్లు ఎక్కువ పైన పేర్కొన్న జాతుల మొక్కల వేగవంతమైన పెరుగుదలకూ, ఉరుములకూ మధ్య వున్న సంబంధమేమిటో మరి !

పిడుగుపాటు *(Thunder Bolt)* సందర్భంగా విడుదలయ్యే విద్యుత్ కాంతే మెరుపు *(lightning)* అప్పుడు విడుదలయ్యే శబ్ద శక్తే ఉరుము (*The Roaring, Rumbling or Rattling of Thunder Clouds*) సెకండు కంటె చాల తక్కువ వ్యవధిలో మెరుపులో లక్ష యాంపియర్ల విద్యుత్తు ప్రవహిస్తుంది. 30 వేల డిగ్రీల సెంటీ గ్రేడ్ ఉష్ణోగ్రత పుడుతుంది మెరుపులు ప్రపంచం మొత్తం మీద ప్రతి సెకండుకూ 100 సార్లు వస్తాయట మెరుపుల వలన (పిడుగుపాటు కారణంగా) మరణాలు సంభవించడం, విద్యుదుపకరణాలు పేలిపోవడం భవనాలు మండిపోవడం వగైరా నష్టాలున్నా, ఎన్నో ప్రయోజనాలున్నాయి. అవి భూమిని సారవంతం చేస్తాయి మెరుపు కారణంగా ఉత్పన్నమయ్యే విపరీతమైన వేడి వాతావరణంలోని నత్రజని *(Nitrogen)* మరియు ప్రాణవాయువు *(Oxygen)* లను ప్రకృతిసిద్ధమైన ఎరువులైన నైట్రస్ ఆక్సైడ్ మరియు నైట్రోజన్ డయాక్సైడ్‌లుగా మారుస్తుంది అవి వాన నీటి ద్వారా భూమికి చేరి భూమిని సారవంతం చేస్తాయి ప్రపంచ వ్యాప్తంగా ఏటా మెరుపుల కారణంగా ఒక కోటీ యాభై లక్షల టన్నుల నత్రజని ఎరువు తయారవుతున్నదట. ఇది ప్రపంచంలో ప్రకృతిసిద్ధంగా తయారయ్యే నత్రజని ఎరువులో నాల్గవ వంతట

ఇకపోతే మెరుపుల కారణంగా కొన్ని జాతుల వృక్షాల విత్తనాలు త్వరగా మొలకెత్తుతాయట ఇలా ఉరుములు, మెరుపుల కారణంగా కొన్ని జాతుల వృక్షాల విత్తనాలు త్వరగా మొలకెత్తడం, మరి కొన్ని జాతుల వృక్షాలు త్వరగా పుష్పించడం, ఇంకొన్ని త్వరత్వరగా పెరగడం, అలాగే ఉరుములతో కూడిన వర్షం కురిసినప్పుడు కొన్ని ప్రాంతాలలో నేలలోని విలువైన రంగురాళ్ళు బయటకు పొడుచుకురావడం వెనుక గల శాస్త్రీయ మర్మమేమిటో అద్యతన భావిలో జరుపబడే శాస్త్రీయ పరిశోధనలలో మరింత స్పష్టంగా ఆవిష్కృతం కాగలదని ఆశిద్దాం

తన నుండి ఉరుముల శబ్దానికి అంకురించిన నూత్న వైదూర్య మణిని చూచుకొని పులకించే విదూరమహి- అంటే విదూరదేశపు పుడమి తల్లి-లాగానూ, చిరుత ప్రాయపు శీతాంశువుని (బాల చంద్రుడిని) సౌందర్యంగా తళుకొత్తే అపరదిక్తటి (పడమటి ఆకాశం) లాగానూ, తన నీటిలో గర్వంగా విహరిస్తున్న రాయంచను గని తృప్తితో తలపై మోసే కొలను లాగానూ, తళుకులీనే తన ననకుట్మలముల (అరవిరిసిన మొగ్గల) ను చూసుకుని ప్రకాశంగా మురిసిపోయే కల్పవల్లిలాగానూ ('కల్పలత' అని కూడా పిలువబడే యీ కోరినవన్నీ యిచ్చే పూల తీగె ఇంద్రుడికి చెందిన నందనవనం (*Elysium*) లో వుంటుందని విశ్వాసం), ఓంకార సహితమై ప్రజ్వరిల్లే విపుల పంచాక్షరీ మంత్రంలా భర్గకళ (శివకళ) పూని వెలుగొందే తన కుమారుణ్ణి పొదివి పట్టుకొని ప్రేమతో అతిశయించిందట కువలయాక్షియైన (కలువ కన్నులు గల)

ఆ రాణి.

అట్టహాసంగా నిర్వహించబడిన ఓ ఉత్సవంలో లేక లేక కలిగిన ఆ కుమారునికి ముంజభోజుడని నామకరణం చేశారట వారు.

ఇక తన పుత్రునికి తల్లి చేసిన సేవలు వర్ణిస్తున్నాడు కవి.

ఆపాద మస్తకమూ, అంగ సంధుల వెంట (చంకలూ, గజ్జలలోనూ) తడిసి మునిగేటట్లు నూనెతో అంటి, ప్రత్యగ్ర (క్రొత్తదీ, శుభ్రమైనదీనైన) బింబికాపత్ర (దొండ ఆకుతో) చుంబితముగా (నిమురుతూ) ఒళ్లంతా పలుచగా నలుగు పెట్టిందట. గాజు కొప్పెర (వెడల్పు ముఖంగల పాత్ర) లలో సుగంధ ద్రవ్యాలు చేర్చిన కమ్మ నీటితో తొడలపై పడుకొనబెట్టుకొని స్నానం చేయించిందట. చివరిగా 'శివరక్ష' అంటూ చుళుక మాత్రము ('పుడిసెడు' అన్నా 'ప్రసృతి' అన్నా అరచేతిని లోనికి కుంచించగా పట్టే చేరదు నీరు. దీనిలో సగం చుళుకము) నీటిని దృష్టి తగులకుండా బాలుని ముఖం చుట్టూ త్రిప్పి, ఒయ్యనొయ్యన (మెల్లమెల్లగా) తడి యొత్తి (గుడ్డతో తడి తుడిచి), ఉగ్గుచూపి (అంటే ఉగ్గుపోసి - ఉగ్గు అంటే పసి బిడ్డలకు చనుబాలతో కలిపి పోసే ఆముదము) తిరిగి తలంటు పోసి, చనుబాలతో తెలివిగొలిపి, నేత్రములకు అంజనము (కాటుక) పెట్టి నిద్రపోవడం కోసం పొత్తులు సవరిస్తూ జోలపాట పాడుతుందట ఆ ధాత్రి (తల్లి).

ఇక ఆ రాజకుమారునికి పరిచారికలు ఎలాంటి సేవలు చేశారో చెపుతున్నాడు కవి ఈ క్రింది పద్యంలో

**శా॥ నీలస్తంభ విజృంభితోజ్జ్వల హిమానీ శుభ్ర సౌధంబులో**
**నాలోలంబగు తొట్టి మంచమున నొయ్యంజేర్చి జో కొట్టి యు**
**య్యాలో జొంపల యంచు నూఁపుదురు శుద్ధాంతాబ్జపత్రాక్షు లా**
**బాలుం బాల శశాంక శేఖర కృపా పారీణు గారామునన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 3 - 54)**

ఇంద్రనీలమణులు (*Sapphires*) పొదిగిన స్తంభముల కారణంగా ఉజ్జ్వలమై వెలుగొందుతూ హిమసమూహములంత శుభ్రంగా అంటే తెల్లగా వున్న ఆ సౌధములో ఊఁగే తొట్టి మంచములో మెల్లగా పరుండబెట్టి, జోకొట్టి 'ఉయ్యాలో జంపాలో' అంటూ ఊఁపుతున్నారట శుద్ధాంత - అబ్జ పత్రాక్షులు (పూరేకు వంటి కన్నులు గల ఆ అంతః పుర కాంతలు). బాల శశాంక శేఖర కృపాపారీణుడిని (శివుని కృపను పొందగలిగినవాడైన) ఆ బాలుడిని; గారామునన్ - గారాబముతో.

ప్రమదనాధుడైన శివునికీ హిమశైలనందనయైన పార్వతికీ పుట్టిన కుమారస్వామి కింత వైభవమేది? పులోముడనే రాక్షసుని కుమార్తెయైన శచీదేవికీ హరిహయుడైన (బంగారు పసుపు - *Golden Yellow* రంగు గల ఉచ్చైశ్రవమను గుఱ్ఱము వాహనముగాగల) ఇంద్రునికీ పుట్టిన జయంతునికీ యీ మహా సౌభాగ్యమేది? ఇందిర (లక్ష్మి దేవి) కీ మధుకైటభారి (మధు, కైటభులనే రాక్షస సోదరులను సంహరించిన విష్ణువు) కీ పుట్టిన పుష్పాయుధుడి (మన్మధుని) కీపాటి సిరియేది? కౌసల్యా దశరథేశ్వరులు కన్న ఖరవిరోధి (రావణుడి పిన్ని కొడుకులైన ఖర, దూషణులకు విరోధి) యైన రాముడికి నీయంత గొప్పతనమేది? దేవకీ వసుదేవులు కన్న లీలామానుష విగ్రహుడైన త్రైలోక్య విభుడు కృష్ణునికి కూడా యింత గోముగా, గారాముగా నుండే ఉనికి పట్టేది? అన్నట్లుగా పెరుగుతున్నాడట ఆ బాలుడు.

ఆ బాలుడికి నడకలు నేర్పడానికి అంతఃపుర కాంతలు అరటిపండు ఇవ్వబోతే అది అందుకొనడానికై అడుగెత్తుతాడట. చెఱకు కోలను అందుకొనడానికి చేయిజాచి ముందుకొస్తాడట. అలా బుడి బుడి నడకలు నేర్చాడట ఆ బాలుడు.

క్రమంగా ముంజభోజుడు పెరిగి యౌవనవంతుడయ్యాడు. క్షాత్ర తేజస్సుతో వెలిగిపోతూన్న అతడు యౌవనారంభ వేళలో సకల జనులకూ కనువిందు చేశాడట.

రాజ కంఠీరవుడైన ముంజభోజుని బలిమి, కలిమిల ముందు మగధ, కురు, వత్స, నిషధ రాజ్యాల రాజులు వెలవెల బోయారట. స్ఫటిక శిలలో ప్రతిఫలించే దాసనపు పూవు (జపాపుష్పము - మందార పువ్వు) యొక్క కెంజాయ తళుకులాగా తండ్రి గుణముల యొక్క విస్ఫూర్తి (ప్రకాశము) నానాటికీ అతనిలో పర్వికొన్నదట (వ్యాపించిందట).

# సాగరకంచికి పాలకుడైన ముంజభోజుడు

రాజు వినయ, వివేక, విక్రమ సంపదలలోనూ, సాధు లక్షణంబున కొదువలేని, శంకర కృప కలిగిన తన కుమారుడిని 'సాగర కంచి'కి ప్రభువుగా చేశాడట.

ముంజభోజుని పాలన ఎలా వుందటంటే -

క॥ నరవరుఁడేల "శతాయుః
పురుష" యనెడు వేద వాక్యమునఁ బ్రజ బ్రదుకున్
ధరఁ గొండ్ర వేయఁ బండున్
దొరఁగున్ వర్షంబు సావితో నెయ్యెడలన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 3 - 79)

ఆ ముంజభోజుని ఏలుబడిలో ప్రజలందరూ 'శతాయుః పురుష' అనెడు వేదవాక్యం ప్రకారం బ్రతుకుతున్నారట. అంటే అక్కడందరూ నిండు నూరేళ్ళూ జీవిస్తున్నారన్నమాట. ధర (భూమి) కొండ్రవేస్తేనే (చాలు దున్నితేనే) పండుతుందట. కాలానుకూలంగా వర్షాలు కురుస్తాయట. అంటే రాజ్యం సుభిక్షంగా వుండేదన్నమాట. ప్రాయములో కొంచెమే అయినా ముంజభోజుడు న్యాయ నిర్ణయంలోనూ, భుజశక్తిలోనూ దిట్టయై, ముదియైన (ఏళ్ళు మీరిన) వటభూజమునకు (మర్రి చెట్టుకు) ఆసరాగా ఊడలెలా ప్రబలమౌతాయో, ఆ విధంగా రాజ్య పాలనలో తండ్రికి సహకరిస్తున్నాడట.

లక్షణ శ్రేష్ఠుడైన ముజభోజుడు సుందరాంగులైన రాచకన్నెల నెందరినో వివాహమాడాడు.

ఇలా వుండగా ఒక రోజు --

# తిరిగి కాశికి బయల్దేరిన రాజదంపతులు

రాజు తన కుమారుడికి మొత్తం బాధ్యతలన్నీ అప్పగించి తాను సతీసమేతంగా కాశికి వెళ్లాలని తలచి కుమారుడితో యిలా అంటాడు -

చ॥ చదివితి నాల్గువేదములు శాస్త్రము లాఱుఁ దదన్య విద్యలున్
సదభిమతోక్త దక్షిణల జన్నము లన్నియు నాచరించితిన్
దుది నిను గూర్మి బంధుజన తోయజ సూర్యునిఁ గంటిఁ బుత్త్రుఁగాఁ
గొదువ యొకింత లేక కనుఁగొంటి నిహంబునఁ గల్గు సౌఖ్యముల్ (ఉద్భటారాధ్య చరిత్రము : 3 - 84)

"నాలుగు వేదములు (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము) ఆరు శాస్త్రములు (తర్కము, వ్యాకరణము, ధర్మము, మీమాంస, వైద్యము, జ్యోతిషము) తదన్య విద్యలు (ఇత్యాది విద్యలు) చదివితి - చదివాను.

"సదభిమత + ఉక్త (సజ్జనులు చెప్పిన పద్ధతిలో) దక్షిణల (యజ్ఞములలో ఋత్విజుల కిచ్చే ధనమునిస్తూ)

జన్మములన్నియు (యజ్ఞములన్నియూ) ఆచరించితిన్ (ఆచరించాను) తుది (చివరకు) కూర్మి (ప్రేమతో) బంధుజనతోయజ సూర్యుని (బంధుజనులనే కమలములకు సూర్యుని వంటి వాడివైన నిన్ను) కంటి పుత్త్రుగా (పుత్రునిగా పొందాను).

"ఇహంబున (ఈ లోకంలో) కలుగు సౌఖ్యాలన్నీ ఒకింత కూడా కొదువ లేకుండా కనుగొన్నాను (పొందాను).

# రాజనీతి బోధ

"శైశవమున చదువు, యౌవనమున భోగాసక్తి, వార్ధక్యములో మునీంద్ర వృత్తి సహజమే కదా! కనుక నేను కాశికి వెళ్లి గరకంఠుని పూజించి సకల పాపాల్నీ కడిగి వేసే పవిత్ర గంగాజలంలో స్నానాలాడి, భవరోగాన్ని పారద్రోలుతాను. నీతోటి రాజులలా నీవూ రాజ్యపాలన చేసుకో. పరోపకారము వలన పుణ్యమూ, పరపీడన వలన పాపమూ వస్తాయి. కావున పరోపకారమే చెయ్యి."

ప్రమథేశ్వరుడు ప్రజలతో రాజులెలా ప్రవర్తించాలో తన కుమారునికి తెలుపుతూన్న మరొక చక్కటి పద్యం కూడా చూడండి -

గీ॥ గోపకుండావు నల్లనఁ గుస్తరించి
యొయ్యనొయ్యన దుగ్ధంబు లొడుచు కరణిఁ
ప్రజల చిత్తంబు గందని పగిది నడచి
ధర్మవర్తనమునఁ గాంచు ధనము లనఘ ! (ఉద్భటారాధ్య చరిత్రము : 3-91)

గోపాలుడు ఆవును మెల్లమెల్లగా కుస్తరిస్తూ - అంటే సవరిస్తూ చల్లచల్లగా పాలు పిదుకుకున్న చందముగా ప్రజల మనస్సులు నొచ్చుకొనని విధముగా పరిపాలిస్తూ ధర్మబద్ధంగా వ్యవహరిస్తూనే (పన్నులు వగైరాల ద్వారా) సంపదలు పొందమని పరిపాలకులకు చక్కటి రాజనీతి సూత్రం తెలుపుతున్నాడు రామలింగ కవి. ఇది నాటి ముంజభోజునికే కాదు - ఆధునిక యుగంలోని పాలకులకూ అనుసరణీయమే కదా !

ఇంకా, సత్ప్రవర్తనకూ, రాజనీతికీ సంబంధించిన ఎన్నో విషయాలు రాజు తన కుమారుడికి బోధిస్తాడు.

# ముంజభోజుని శివానురక్తి

ఇలా వైరాగ్యంతో మునిమతమున తల్లి, తండ్రి కాశికి వెళ్ళిన తరువాత ముంజభోజుడు ఆదిమ శైవ లక్షణ సమాచరణాత్ముడై పేదలు, సాధువుల పట్ల ప్రేమతో ప్రజలకు కన్న తండ్రిలా తన రాజ్యాన్ని చక్కగా పరిపాలిస్తూ వున్నాడు. ఆ సమయంలో ఒక రోజు ఇలా ఆలోచించాడు.

"ఈ కాంతలు, ఈ పుత్రులు, ఈ కాంచనరాశులు - ఇవన్నీ ధ్రువములా? (ఎప్పటికీ నిలిచేవా?) కాదని తెలిసిన బుధులకు (విజ్ఞులకు) కాకోదర రాజహారుని (నాగరాజుని హారముగా ధరించే శివుని) కని (దర్శించి) జీవితాన్ని ధన్యం చేసుకోవడం ధర్మం కాదా ! చదివి కూడా వివేకం లేకుండా హరకథలు చదవడం మరచే మూఢుడికి యమలోక ప్రాప్తి తప్పదు గదా ! పురహరుడైన శివుణ్ణి నాకు హృద్గోచరం చేయించగల సద్గురు డెవరైనా లభిస్తే ఎంత బావుణ్ణు. 'ముక్కంటి మూర్తి యిది' యని నిక్కముగా తెలిపి నాకు చూపనేర్చే గురువు ఎక్కడ దొరకుతాడు? కలుషమైన సంసార సాగరాన్ని దాటి ఆవలి ఒడ్డుకు చేర్చే నావ, దుర్లభతరమైన ముక్తి దుర్గానికి త్రోవ, శ్రీమదారాధ్య పాద రాజీవ సేవేకాదా?"

## ముంజభోజుని కల

అనుకుంటూ ఒక కలగన్నాడట. ఆ కలలో ఒళ్ళంతా రుద్రాక్ష మాలలు, శరీరానికి భస్మపు పూతగల ఒక శైవుడు ముందుండి దారి చూపుతూంటే తాను గరళకంరుని నివాసమైన వెండికొండకు వెళ్లాడట. శివుణ్ణి దర్శించిన తరువాత అతనితో శివుడు 'ఓ అర్భకా ! నీ మనస్సులో చింత వదలు. కుటిల భవబంధ పాశ త్రుటన సమర్థుడైన గురువు ఉద్భటుడు నాచే పంపబడి యిప్పుడు భూలోకంలోనే వున్నాడు. అతడే నీకు గురువౌతాడు' అన్నాడు. ప్రొద్దుటే నిద్రలేచిన ముంజభోజుడు పెద్దలను పిలిపించి తనకు కలలో కనుపించిన విశేషాలన్నీ చెప్పాడు. అప్పుడు వారు 'ఓ రాజా ! కలలో శివుడిని చూశావంటే నీకు గల శంభుభక్తి ఈ రోజులలో ఎవరికీ లేదన్నమాటే ! శివుడు భక్తులైన వారికి అరచేతిలో సురరత్నము. కొంగు బంగారము. అందుకే నీ మనస్సులోని బాధ తెలుసుకొని నీ మనోరథం నెరవేరే మార్గం తెలిపాడు' అన్నారు.

## ఉద్భటారాధ్యుని ఆగమనం

ఆ తరువాత ఒక రోజు శివుని మానసపుత్రుడైన ఉద్భటుడు ముదిగొండ నుండి బయల్దేరి రాజకుమారుడైన ముంజభోజుని వద్దకు వచ్చి రాజ భవనం సమీపంలో నిలిచాడట. ఆయన తేజో మూర్తిని చూచిన ముంజభోజుడు వచ్చింది ఉద్భట గురుడేనని అర్థం చేసికొని 'మాంపాహి పాహి పాహి' అంటూ పులకితాంగుడై ఆ గురుమూర్తికి ప్రణమిల్లగా ఆయన 'శివరక్ష' అంటూ భోజునికి ప్రీతితో విభూతినిచ్చాడు.

భోజుడు ఆనందంతో 'గురువర్యా ! ఇన్నాళ్లూ భవసాగరాన్ని ఎలా దాటాలా అని మథన పడ్డాను. ఇక భవాంబుధి నాకు గుల్ఫము బంటి (చీలమండల లోతు) యేగదా !' అన్నాడు.

ఇంకా ఉద్భట గురుని కీర్తిస్తూ -

శా॥ ఆది బ్రహ్మ కపాల భూషణుఁ ద్రిమూర్త్యాత్మున్ శివున్ వహ్ని చం
ద్రా దిత్యా నిల భూ మరుత్పథి పయో యజ్వ స్వరూపున్ జిదా
మోదున్ శంభు భజించి యోగి జనతా ముఖ్యుండవై యున్న నీ
పాదాబ్జంబులు గంటిఁ బాశములచేఁ బట్టూడి శైవాగ్రణీ ! (ఉద్భటారాధ్య చరిత్రము : 3 - 132)

ప్రస్తుతం చతుర్ముఖుడైన బ్రహ్మ ఒకప్పుడు పంచముఖుడట. శివుడూ పంచాననుడే కదా ! ఒకప్పుడు త్రిమూర్తులు కొలువుదీరి యుండగా అక్కడికి పార్వతి వచ్చిందట. శివ, బ్రహ్మ లిరువురినీ చూచి యిద్దరూ పంచముఖులైన కారణంగా ముందు తికమకపడిన పార్వతి, తరువాత శివుడి కనుసైగ కారణంగా అతణ్ణి గుర్తించి అతడి సరసకు చేరిందట. అప్పుడు శివుడు తన భార్యకు యింతగా భ్రమ కలగడానికి కారణం బ్రహ్మకు ఐదు తలలుండడమే కదా - అని యెంచి తన త్రిశూలంతో బ్రహ్మ ఐదు తలల్లో ఒక దానిని తొలగించాడట. బ్రహ్మ కోపించి 'నీవు కాపాలికత్వమును చెంది భిక్షాటనము చేస్తావు గాక' అని శపించాడట. ఆ బ్రహ్మ హత్యాపాతకం పోవడానికి ఆనాటి నుండీ ఆ ఆది బ్రహ్మ కపాలాన్నే మెడలో ధరిస్తూ ఆదిభిక్షువయ్యాడట శివుడు. విష్ణువు సలహాపై తీర్థయాత్రలు చేసిన శివుడు కాశికి చేరి బ్రహ్మహత్యా పాతక విముక్తుడయ్యాడట. ఈ కథను రామలింగ కవి యీ పద్యంలో చక్కగా వాడుకున్నాడు. ఓ శివభక్త శ్రేష్ఠా ! ఆది బ్రహ్మ కపాల భూషణుడూ; త్రిమూర్త్యాత్ముడూ; అగ్ని, చంద్రుడు, సూర్యుడు, వాయువు, భూమి, ఇంద్రుడు, వరుణుడు - వీరందరూ

ఋత్విజులై చేసే యజ్ఞ స్వరూపుడూ; మనోరంజకుడూ అయిన శంభుని పూజించి యోగి జనులలో ముఖ్యుడవై యున్న నీ పాద పద్మములను నేను (యిహలోక) పాశముల నుండి బయల్పడిన కారణంగా (నేటికి) చూడగలిగాను.

ఇంకా ఉద్భటుణ్ణి కొనియాడుతూ ముంజభోజుడిలా అంటున్నాడు.

ఉ॥ ఏమి తపంబు చేసి పరమేశ్వరు నేక్రియఁ గొల్చినాఁడనో
యే మునుపంటి పుట్టువున నిట్టి గురూత్తము నిన్నుఁగంటి మ
త్కామిత మబ్బెఁ బాపములు గ్రాఁచితి ముక్తి కురంగలోచనా
కోమల దృగ్విలాసములు గొల్లలు పట్టుదు నింక మీఁదటన్ (ఉద్భటారాధ్య చరిత్రము : 3 - 135)

"ఏ మునుపంటి పుట్టువున (ఏ పూర్వజన్మలో) ఏమి తపంబుచేసి (ఏ తపస్సు చేసి) పరమేశ్వరుని ఏ క్రియ ( ఏ విధముగా) కొల్చినాడనో (పూజించినాడనో) ఇట్టి గురూత్తముని (గురుశ్రేష్ఠుడవైన) నిన్ను కంటి (కనుగొనినాను, దర్శించినాను). మత్ (నా యొక్క) కామితము (కోర్కె) అబ్బె (నెరవేరింది) పాపములు గ్రాచితి (పాపములు కక్కి వేశాను. అంటే పాపములు తొలగిపోయాయి) కురంగము (జింక) కురంగలోచన (జింక కండ్ల వంటి కన్నులు గలది - స్త్రీ) ముక్తి కురంగలోచన (ముక్తి కాంత యొక్క) కోమలదృక్ (కోమలమైన దృష్టి) విలాసములు (ప్రియుడు కనుపించగానే స్త్రీ చేసే శృంగార చేష్టలు) ఇంక మీదటన్ (ఇక మీదట) కొల్లలు పట్టుదు (కోకొల్లలుగా పొందుతాను)".

ఇక్కడ రామలింగ కవి ముక్తిని కాంతగా నెంచి ఆ కాంత కోమలమైన దృక్కులు ముంజభోజునిపై యికమీదట విలాసముగా ప్రసరిస్తాయనీ, ఆ ముక్తి కాంత ప్రేమకతడు పాత్రుడవుతాడనీ చాల చమత్కారంగా చెప్పాడు.

"శివలింగము ధరించని అవివేకికి యిహమూ, పరమూ అందవని వేదవిదులు అంటారు. కావున లింగధారణ ప్రకారమును, గురుశిష్య వర్తనమును, శివార్చనా విధానమును సవిశేషంగా చెప్పండి గురువర్యా!" అని కోరాడు ముంజభోజుడు.

# ఉద్భటుని బోధలు

అప్పుడు ఉద్భట గురుమూర్తి ముంజభోజునితో యిలా అన్నాడు - "ఈ అంగనలు (భార్యలు, యితర స్త్రీలు) యీ ఆత్మజులు (కుమారులు, కుమార్తెలు), యీ అర్థములు (సంపదలు), యీ దళంబులు (సైన్యములు) యివన్నీ తృణప్రాయంగా భావించి మనస్సులో ఆ ఇందూత్తంసుని (చంద్రుని శిగపువ్వుగా ధరించిన శివుని) నిలిపావు. ఓ రాజా ! ఇదెంతైనా అద్భుతం" అని, ఇంకా యిలా అంటున్నాడు -

ఉ॥ భూరిసువర్ణ పుష్పములఁ బూజ యొనర్చిన వాఁడ వీవు కా
మారి మురారి బాణుఁ ద్రిపురారి మఖారి గజారిఁ బాపసం
హారి ననేక జన్మముల నట్టి విధం బొనగూడ కుండినన్
వారిజ సూతికైనఁ గనవచ్చునె శంకరు భక్తి భూవరా ! (ఉద్భటారాధ్య చరిత్రము : 3 - 140)

"ఓ రాజా ! పెద్దపెద్ద బంగారు పుష్పాలతో శివపూజలు చేసినవాడవు నీవు. అయితే (సరియైన) శివార్చనా విధానమేదో తెలిసికొనకుండా ఎన్ని జన్మలు ఎత్తి, ఎన్ని పూజలు చేసినా కామారి (కామునికి అరి అంటే శత్రువు. మన్మధుని శత్రువైన శివుడు) మురారి బాణుడు (మురాసురుణ్ణి వధించిన కారణంగా విష్ణువును మురారి అంటారు. త్రిపురాసుర

సంహారంలో విష్ణువును తన బాణపు ములుకు – భల్లు – గా ఉపయోగించాడు శివుడు. అంచేత శివుణ్ణి మురారి బాణుడు అంటున్నాడు కవి) త్రిపురారి (త్రిపురాసురుల్ని సంహరించిన శివుడు) మఖారి (మఖద్విషుడనే వాడొక రాక్షసుడు. ఇతణ్ణి మఖాసురుడనీ అంటారు. ఇతణ్ణి చంపిన కారణంగా శివుణ్ణి మఖారి అనీ, మఖహన్ అనీ అంటారు) గజారి (గజాసురుదు మహిషాసురుడి కొడుకు. ఇతణ్ణి చంపి యితని చర్మాన్ని ధరించి శివుడు కరిచర్మాంబరుడనీ, కృత్తివాసుడనీ – కృత్తి – తోలు; వాసుదు – వస్త్రము కలవాడు – పేరు పొందాడు) మరియు పాపసంహారియైన శివుణ్ణి కేవలం భక్తితోనే కనుగొన గలగడం వారిజసూతుడి (పద్మసంభవుడైన బ్రహ్మ) కైనా సాధ్యమేనా?" అంటే భక్తితో పాటు సరియైన శివార్చన విధము తెలిసికొనడం కూడా ముఖ్యమని భావన.

"ఓ రాజా ! హరునకు నైవేద్యంగా సమర్పించకుండా భుజించే అన్నం కుచ్చితోచ్ఛిష్టము (నికృష్టమైన ఎంగిలి కూడు) వంటిది. భవునికి అర్పించని పానీయం త్రాగడం మానక ఆసవం (కల్లు) త్రాగడం వంటిది. శివుని కర్పించని పూలను వాసన చూడడం కుణప ధూపం (కాలే పీనుగు నుండి వచ్చే పొగ) పీల్చడంతో సమానం. శంభు భక్తుదు కానివానిని ముట్టుకొనడమంటే గెంటకుండా చండాలుణ్ణి అంటుకున్నట్లే ! అందుచేత ప్రాజ్ఞులైన వారు అష్టమూర్తి (పంచ భూతములు, సూర్య చంద్రులు, పురుషుదు – యీ ఎనిమిదింటి రూపాన్నీ కలబోసుకున్న మూర్తి గలవాడైనట్టి శివుడి) ని అన్ని తెరగులా పూజిస్తారు.

# శివదీక్ష ఎప్పుడు స్వీకరించాలి ?

'శివదీక్ష లేకుండా ఎంతటివాడైనా మోక్షము పొందలేదు. ఇష్టలింగధారణ చేయడం ద్వారా శివదీక్ష స్వీకరించవచ్చు. లింగధారణకు శరత్కాల వైశాఖములు ఎంతో మేలైనవి (ఒక్కొక్క ఋతువుకు రెండు మాసాలు చొప్పున సంవత్సరంలో ఆరు ఋతువు లుంటాయి. శరదృతువు అంటే ఆశ్వయుజ, కార్తిక మాసములు. శరత్కాల వైశాఖములు అంటే ఆశ్వయుజము, కార్తికము, వైశాఖము అనే మూడు మాసములు). జ్యేష్ఠ, ఫాల్గుణ, మార్గశిర మాసములు శివదీక్షకు మధ్యమములు. శివదీక్షకు మాఘ, ఆషాడమాసములు కనిష్ఠములు. చైత్ర, పుష్య, భాద్రపద, శ్రావణ మాసములు అవరములు (అంతగా పాటించ దగినవి కాదు).

'సూర్య చంద్రోపరాగ కాలములు (ఉపరాగ మంటే రాహువు సూర్యుణ్ణి, చంద్రుణ్ణీ పట్టడం – అంటే సూర్య చంద్ర గ్రహణ కాలమన్నమాట) శివదీక్ష స్వీకరణకు ఉత్తమములు. ధవళపక్షము – అంటే శుక్ల పక్షము మొత్తంగానూ, బహుళపక్ష (కృష్ణ పక్ష) వశమైన పంచమి భవుని పూనుటకు – అంటే శివదీక్ష స్వీకరించుటకు గ్రాహ్యములు.

'ఓ రాజా ! యిలా దోషరహితమైన కాలములో అంబికేశ్వరుడిని (శివుని) యిష్టలింగంగా ధరించి శివదీక్ష స్వీకరించు" అని శివదీక్ష సందర్భముగా నాలుగు వాకిళ్లతో మంటపమెలా ఏర్పాటు చేయాలో, ఆవు పేడతో దానిని అలికి, ఐదు రంగుల బియ్యంతో అక్కడి స్థండిలము (అగ్ని హోత్రమునకై సంస్కరించబడిన స్థలము) నకై చేయవలసిన ఏర్పాట్లు, పుష్పోపచార సామాగ్రి ముత్యాల ముగ్గులు, ధూప దీపాక్షతాది బహూపచార రచన గురించి, పంచ కలశములలో అమర మూర్తిని (శివలింగాన్ని) నిలపడం, ఆ పైన యింకా శివదీక్షా స్వీకరణ సందర్భంగా జరపాల్సిన తతంగానికి సంబంధించిన ఎన్నో వివరాల్నీ సవిస్తరంగా రాజుకు తెలిపాడు ఉద్భటుడు.

# శివలింగాన్ని ఎక్కడ ధరించాలి ?

అప్పుడు ముంజభోజుడు గురువుతో శరీరంలో ఏయే స్థానములలో ఇష్ట లింగమును నిలుపవచ్చునో తెలుపమని అడుగగా ఉద్భటుడు యిలా చెప్తున్నాడు.

గీ॥ పొక్కిలందునైన భుజమధ్య మునైనఁ
గేలుదమ్మినైన మౌళినైనఁ
గంఠసీమనైనఁ గరకంఠు ధరియింపఁ
దగు నృపాల ! నాభి దిగువఁ దక్క (ఉద్భటారాధ్య చరిత్రము : 3 - 160)

శైవులు శివుని ప్రతిరూపమైన శివలింగాన్ని తమ శరీరంపై ధరించడాన్ని యిష్ట లింగధారణ అంటారు. లింగాకృతినో లేక యిష్ట లింగానికి సంకేతంగా రుద్రాక్ష కాయలనో శైవులు ధరిస్తారు. (*Tiliaceae* కుటుంబానికి చెందిన మరియు పశ్చిమ బెంగాల్, అస్సాం మరియు ఈశాన్య రాష్ట్రాల పర్వత ప్రాంతాలలో లభించే *Elaeocarpus ganitrus* అనే వృక్షపు కాయలను రుద్రాక్ష కాయలంటారు.) "పొక్కిలి (బొడ్డు) నందుగాని, భుజముల మధ్యలోనైనను, కేలుదమ్మినైన (అర చేతిలో కాని - చేతులమీద కానీ) మౌళినైన (శిగపై గానీ, కంఠ సీమలో (మెడలో) గానీ గరకంఠుడైన శివుడిని ధరించవచ్చును. ఓ రాజా ! నాభి (బొడ్డు) కు దిగువ మాత్రం ధరింపరాదు".

ఒకప్పుడు శివుని నయనములనుండి జాలువారి భూమిపై బడిన బాష్ప జలములే రుద్రాక్ష వృక్షాలయ్యాయట!

శివలింగం ధరించడమంటే శివుణ్ణి ధరించడమే. శివలింగానికి ప్రతీక అయిన రుద్రాక్షను ధరించినా శివుణ్ణి ధరించినట్లే.

హరకంఠాదులు, సంయములు, మనువులు - యిత్యాదులంతా ఈశానుడిని (శివుడిని) గళమున - అంటే కంఠసీమలో - ధరించారట. బ్రహ్మ, విష్ణువు, సురేశుడు (ఇంద్రుడు), పావకుడు (అగ్ని) మొదలైన దేవతలందరూ ఊర్ధ్వరేతుడిని (రేతోస్తంభన చేసి కఠోర బ్రహ్మచర్య నియమం పాటించడం కారణంగా శివుడిని ఊర్ధ్వరేతుడు, ఊర్ధ్వరేతసుడు అని అంటారు) ఉత్తమాంగములలో (తలల పైన) తాల్చారట. అక్షపాదుడు, శిలాదుడు, హరదత్తుడు - వగైరాలందరూ వామదేవుడిని (వాముడన్నా, వామదేవుడన్నా శివుడు) నుదుళ్లపై ధరించారట. శక్తులు, నందికేశుడు మొదలైన ఆత్మవేదులు అలికనయనుడిని (ఫాలనేత్రుడైన శివుడిని) ఉరమున (ఛాతీపై) పూనారట. కొమరుసామి (కుమార స్వామి), భృంగి (శివుని అనుచర గణములో ఓ ప్రముఖుడు), కుంజరాస్యుడు (ఇభముఖుడు ; ఏనుగుముఖము కలవాడైన వినాయకుడు) మొదలైన భక్తవరులు హరుణ్ణి అధిక భక్తితో తమ కరపద్మ పుటములలో ధరించారట. సర్వకాల సర్వావస్థల యందునూ, సర్వేశ్వరుడూ, సౌభాగ్య కళా నిర్వాహకుడూనైన లింగమూర్తిని ధరించిన సర్వజ్ఞులకు యిహపరములలో సౌఖ్యం దొరకుతుందట.

# విభూతి తయారుచేసే విధానం

ఆ తరువాత ఉద్భటారాధ్యుడు ముంజభోజునికి విభూతి తయారు చేసే విధానం తెలుపుతున్నాడు. ఏయే వర్ణముల గోవుల పేడను విభూతి తయారీకి వాడాలో వివరంగా చెపుతున్నాడు.

కపిల గోవు (గోరోజనము వంటి వర్ణము - *Tawny Brown* - గల ఆవు. దీనినే పుల్లావు అని కూడా

అంటారు. ఇది పసుపు మించిన తెలుపు వన్నె కలది) ; కృష్ణవర్ణ (నల్లని ఆవు) ; కంబునిభ (శంఖు తెలుపు - *Conch White* - రంగు గలది) ; ధూమ్రగోవు (నలుపు ఎక్కువగా కలిసిన ముదురు ఎరుపు వర్ణపు ఆవు లేక బూడిద రంగు - *Grey Coloured Cow - Dark Red Coloured Cow*) ; చూత పల్లవ (మామిడి చిగురు రంగు గలది); తామ్ర రుచి (రాగి రంగు గల గోవు - *Copper Red Coloured Cow*) అయినటువంటి ఆవులు కడిపెడితే ఆ పేడను తెచ్చి ప్రభూత వహ్నిలో భూతిగా తయారు చేయాలి.

కపిలవర్ణం గల ఆవును 'నంద' అనీ, నల్లని ఆవును 'సుభద్ర' అనీ, తెల్లని ఆవును 'సురభి' అనీ, రక్తవర్ణం గల గోవును 'సుమన' అనీ, ధూమ్ర వర్ణపు గోవును 'సుశీల' అనీ అంటారు. ఇట్టి గోవుల గర్భంలో ఆవిర్భవించిన విభూతి ప్రఖ్యాతమైనది.

## పంచాననుని నుదుట విభూతి

ఈ విభూతిని (శివుని పంచముఖములలో ఒకటైన) సద్యోజాతంబున ధరిస్తే 'విభూతి' అనీ, వామదేవంబున ధరిస్తే 'భసిత'మనీ, అఘోరమున ధరిస్తే 'భస్మ'మనీ, తత్పురుషమున ధరిస్తే 'క్షార'మనీ, ఈశానమున ధరిస్తే 'రక్ష' అనీ అంటారు. అన్ని ఐశ్వర్యాలనూ సమకూరుస్తుంది గనుక దీనిని 'విభూతి' అనీ; సమస్త పాతకములనూ పోగొడుతుంది కనుక దీనిని 'భస్మ'మనీ; శరత్కాలపు చంద్రుని వెన్నెలను మించిన కాంతితో భాసిల్లడం కారణంగా దీనిని 'భసిత'మనీ; శాకిని (దుర్గకు పరిచారికయైన స్త్రీ పిశాచము) ఢాకిని (డాకిని అని కూడా పిలువబడే మరొక పిశాచ స్త్రీ) మరియు సర్పముల భయము మన దరిజేరకుండా చేసేది కనుక 'రక్ష' అనీ, ఆపదల నన్నింటినీ కరగించి వేసేది కనుక 'క్షార' మనీ యీ బూడిదను పిలుస్తారా అన్నట్లు ఫాలనేత్రుడి నుదుటిపై యీ అయిదు పేర్లతో యిది వెలుగొందుతుంది.

## విభూతి విశిష్టత

విభూతిని సర్వకాల సర్వావస్థల యందునూ ధరించవచ్చు ; భసితమును నైమిత్తికముల యందు ధరించాలి. (నైమిత్తిక మంటే ఏదైనా కారణం మూలంగా చేయాల్సి వచ్చిన పనులు - *Occasional rites or periodic ceremonies* ఉదా ఎవరైనా చనిపోయిన సందర్భంగా చేయాల్సిన పనులు. సంధ్య వార్చడం, ప్రాతః , మాధ్యందిన, సాయం సవనములూ వగైరాలు నిత్యకర్మలు నిత్యకర్మలు - నైమిత్తిక కర్మల మధ్య భేదం యిదీ). ఆయా అర్థకృత్యాలలో 'రక్ష'ను ధరించాలి. ప్రాయశ్చిత్తములలో భస్మమును పూసుకోవాలి. మోక్ష విధులలో క్షారమును ధరించాలి. (ప్రాయశ్చిత్తములంటే పాప పరిహారార్థం చేసే చర్యలు - *Atonements, Expiations*)

అత్యంత అనుకూలమైనట్టిదైన శరత్కాలములో శివదీక్షను స్వీకరించదలచి అందుకు తగు ఏర్పాట్లు చేసుకుంటున్నాడు ముంజభోజుడు.

## శరదాగమనం

శరత్కాలమంటే ఆశ్వయుజ, కార్తిక మాసములు.

ఇక్కడ శరదాగమనాన్ని ఏడు చక్కటి పద్యాలలో వర్ణించాడు రామలింగకవి.

చ॥ కుసుమిత కాశ మంబుధర గోపన దూరనభస్సకాశ ము
ల్లసిత మరాళి సస్యఫల లాభ విజృంభిత పామరాళి శ్రీ
విసృమర సారసంబు హృతవిభ్రమ సింధుర సారసంబు నై
యసదృశలీలఁ బొల్చె శరదాగమ మాగమనార్య మార్గమై (ఉద్భటారాధ్య చరిత్రము 3-173)

శరదృతువులో కాశము – అంటే రెల్లు (*Saccharum spontaneum - Graminae family*) పొదలు విరగబూచి వుంటాయి. కుసుమిత కాశము అంటే పూచిన రెల్లుగలది యైన; శరత్కాలమంటే ఆశ్వయుజ, కార్తిక మాసములని ముందే అనుకాన్నాం కదా! ; అంతకు ముందరిదైన వర్ష ఋతువు (శ్రావణ, భాద్రపద మాసముల)లో మేఘాలన్నీ ద్రవీభవించి వర్షాలు కురవడం కారణంగా శరత్తులో ఆకాశమంతా దాదాపు మేఘరహితంగా, వినీలంగా వుంటుంది. అప్పటి వరకూ అంబుధరముల (మేఘముల) చే గోపనమై (కప్పబడి లేక మూయబడి) వున్న దూరనభము – సుదూరాకాశము శరదృతువులో మేఘములు లేకపోవడం చేత సకాశముగా (సంకాశముగా – అంటే దగ్గరగా వున్నట్లు) అనిపిస్తుంది. (శరత్కాలములో వెన్నెల పిండి ఆరబోసినట్లుంటుంది. అందుకే మహాకవి కాళిదాసు 'శరచ్చంద్ర చంద్రికా ధవళమ్ దధీ' అని 'శరత్కాలపు వెన్నెలంత తెల్లనైన పెరుగు' అనే పద ప్రయోగం చేశాడు. పగలంతా సూర్య కిరణాలతో వేడెక్కిన భూమి రాత్రులలో ఆ ఉష్ణాన్ని వెలిగక్కుతుంది. వర్ష ఋతువులో ఆకాశం మేఘావృతమై వున్నప్పుడు అలా వెలువడిన (*Radiate* అయిన) ఉష్ణం మేఘాలచే అడ్డగించబడి తిరిగి భూమిని చేరి వాతావరణాన్ని వెచ్చగా వుంచుతుంది. అయితే మేఘాలు లేని శరదృతువులో భూమి తన వేడిని వేగంగా, నిరాఘాటంగా కోల్పోవడం కారణంగా భూమి త్వరగా చల్లబడి వాతావరణం చలిగా వుంటుంది. అందుకే శరత్కాలపు వెన్నెల రాత్రులు చలిగా వుంటాయి). శరదృతువులో వాతావరణం ఆహ్లాదకరంగా వుండడం కారణంగా మరాళములు (హంసలు) ఉల్లాసంగా వుంటాయి. సంస్కృతములో 'పామర' శబ్దానికి పేదలు, నిస్సహాయులు - *Poor and Helpless* – అనే అర్థం కూడా వుంది. ఏడాది పొడుగునా తాము పడిన కష్టం ఫలించి పంట చేతికొచ్చే తరుణమది. పంటలు బాగా పండిన కారణంగా పామరులు అంటే పేదవారు – సామాన్య కర్షకులు ఉత్సాహంగా ఉన్నారట. (శ్రీ అంటే భాగ్యము, వైభవము, అందము అనే అర్థాలున్నాయి. సారసము అంటే తామరపువ్వు) శ్రీ విసృమర సారసంబు అంటే అందమును నల్దిక్కులకూ ప్రసరింపచేసే తామర పువ్వులు కలదియైనట్టి ఆ శరదృతువు యింకా ఎలా వుందో వివరిస్తున్నాడు కవి.

వర్ష ఋతువులో సింధురములు (ఏనుగులు), సారసంబులు (బెగ్గురు పక్షులు లేక సారస కొంగలు – *Indian Sarus Cranes - Grus antigone antigone*) ఉల్లాసంగా వుండి వర్షాలు అనంతంగా కురుస్తూనే వుంటాయనే భ్రమలో వుంటాయి. నల్లని వస్తువులు (*Black Bodies*) తమపై ప్రసరించే కాంతినీ, వేడినీ పూర్తిగా పీల్చుకుని త్వరగా వేడెక్కుతాయి. నల్లని జంతువులైనా, పక్షులైనా, మనుష్యులైనా అంతే ! తెలుపురంగు కాంతినీ, వేడినీ పరావర్తనం చేయడం కారణంగా తెల్లనివి అంత త్వరగా వేడెక్కవు. అందుకే తెల్లని జంతువులు ఎండలోనూ ఉల్లాసంగా వుంటాయి. వేసవిలో మనం తెల్లని వస్త్రాలు ధరించేది కూడా ఈ కారణంగానే. తెల్లని జంతువైన ఎద్దు ఎండను సహించి, భరించినంతగా నల్లనిదైన దున్న భరించలేదు. అందుకే (ఒకే అరకకు కట్టబడిన) 'ఎద్దు ఎండకీ ఎనుబోతు (దున్న) నీడకీ లాగితే వ్యవసాయం చేయడమెలా?' అనే సామెత పుట్టింది.

ఎలిఫాంటిడే (*Elephantidae*) కుటుంబానికి చెందిన ఆశియా ఖండపు ఏనుగు (*Elephas maximus*)

నల్లనైన భారీ శరీరం కలిగి వున్న కారణంగా ఎండ వేడిమిని భరించలేక ఎప్పుడూ నీటిదాపులనే వుంటుంది. తాపోపశమనానికి తరచూ తన తొండంతో నీటిని పీల్చి తన శరీరంపై చల్లుకుంటుంది. అదీగాక ఏనుగులకు వర్షఋతువు జతకట్టే సమయం. అందుకని ఋతువులలో కెల్లా ఏనుగులకు వర్షఋతువే ప్రీతిపాత్రం.

ఇక సారసము (బెగ్గురు పక్షి) విషయానికి వస్తే అది భారతదేశంలోని పక్షులలోకెల్లా ఎత్తైనది. దీని ఎత్తు సుమారుగా ఒకటిన్నర మీటర్లు వుంటుంది. సారస కొంగలు ఎడబాయని జంటలుగా ప్రసిద్ధములు. ఈ జంటలో ఏ ఒకటి మరణించినా, రెండవది దిగులు వేసుకుని చనిపోతుందట. అందుకే పెండ్లిలో పురోహితుడు వధూవరులను ఆశీర్వదించే మంత్రాలలో ఒకటి సారస పక్షుల్లా జీవితాంతం అన్యోన్యంగా కలసి మెలసి జీవించమని దీవించేది వుంది. ఈ పక్షులు వర్షఋతువులో జతకట్టి ఉల్లాసంగా వుంటాయి. ఆ ఋతువులో ఈ పక్షులు ముక్కుల్ని ఆకాశంవైపుకు పెట్టి బాకా వూదినట్లు పెద్దగా శబ్దం చేస్తూ నృత్యం చేస్తాయి. వేడిని ఏ మాత్రం తట్టుకొనలేని ఈ పక్షులు ఎప్పుడూ నీటి దాపులనే (ఎక్కువగా సరస్సులలోనే) వుంటాయి. అందుకే వీటిని సారస పక్షులు అంటారు. ఈ పక్షులు తమకు అన్ని విధాలా అనుకూలమైన వర్షఋతువు అనంతంగా కొనసాగాలని కోరుకుంటాయి.

ఇలా వర్షాలు అనంతంగా కురుస్తూనే వుంటాయనే భ్రమలో సింధురములూ, సారసములూ వుంటాయి. అయితే వర్షములు ఆగిపోయి శరదాగమనంతో మెల్లగా చలి ప్రారంభమవడంతో ఆ ఏనుగులకూ, కొంగలకూ వర్షాలపై భ్రమలు తొలగిపోతాయి. అవి హృత (హరింపబడిన) విభ్రమములు (భ్రాంతి కలవిగా) అవుతాయి. అలాంటి శరదృతువు యొక్క ఆగమనం అసదృశ (పోల్చ వీలుగాని) లీలన్ (విధముగా) పొల్చె (కనుపించిందట).

ఈ చక్కటి పద్యంలోని కవి భావాన్ని మరొక రకంగా కూడా అర్థం చేసికొనడానికి ప్రయత్నిద్దాం. తెల్లగా విరగబూచిన రెల్లు పూత దూది పింజల్లా వుండి మేఘరహితమై వున్న నిర్మల వినీలాకాశం నేపథ్యంలో చూస్తే మబ్బులతో మూయబడిన సుదూరాకాశాన్ని మన కట్టెదుటే నిలిపినట్లున్నదట. ఉల్లాసంగా సందడి చేస్తూన్న హంసలు పంటలు బాగా పండిన ఆనందంలో విజృంభించి కేరింతలు కొట్టే కర్షకులను తలపింప జేస్తున్నాయట. బాగా విప్పారి తమ అందాల్నీ, సౌరభాల్నీ నల్దిక్కులకూ ప్రసరింప జేస్తూన్న తామరపువ్వులు (వర్ష ఋతువు ఎల్లకాలం కొనసాగుతుందనే) భ్రమలు తొలిగి బుద్ధి విప్పారిన ఏనుగులు, బెగ్గురు పక్షులను తలపింప జేస్తున్నాయట. ఎంతటి మనోహరమైన వర్ణన !

శరత్కాలములో దర్పకుడు (మన్మథుడు) తన పుండ్రేక్షు ధనువుతో (ఇక్షు అంటే సంస్కృతములో చెఱకు, పుండ్రము అంటే నలుపు కలసిన ఎఱ్ఱ చెఱకు - *Saccharum officinarum* - మన్మథుడు చెఱకు వింటి వేలుపుగదా! అతనిది పుండ్రేక్షు ధనుస్సట) కలువ పూల కోల (బాణము) లతో విరహ చిత్తములను కలచి బాధిస్తూ వుంటాడట! మరో చక్కటి పద్యం చూడండి -

**గీ॥ తొల్లి కలఁగిన కొలఁకు నెల్లఁ దేర్చి**
**తనరు కుంభజునున్నతి ధార్త రాష్ట్ర**
**వినుతమై యొప్పెఁ గుంభజ విలసనంబు**
**ధార్త రాష్ట్రులచేఁ బ్రస్తుతంబుగాదె** **(ఉద్భటారాధ్య చరిత్రము 3-175)**

'కుంభము' అంటే ఏనుగు కుంభ స్థలము. కుంభ స్థలము కలది గావున 'కుంభి' అని ఏనుగుకు మరొక పేరు. కుంభజము (మదము) అంటే 'కొవ్వు' అనీ, 'రేతస్సు' అనీ అర్థాలున్నాయి. మదించిన ఏనుగు (*An elephant in rut*) ను 'మదేభము', 'మదహత్తి', 'మదావళము' అని అంటారు. ఎద అయిన మగ ఏనుగుకు మదము ఎనిమిది చోట్ల నుండి పుడుతుందట. కుంభస్థలం నుండి అంటే చెక్కిళ్ళకు సమీపంలో కణతల (*Temples*) పై నుండి స్రవించే మదాన్ని 'దానము' అనీ, కళ్ల నుండి స్రవించే మదాన్ని 'సీధువు' అనీ, చెవులనుండి స్రవించే దాన్ని 'సాగరము' అనీ, తొండము చివరి నుండి స్రవించే మదాన్ని 'శీకరము' అనీ, చనుమొనల నుండి పుట్టే మదాన్ని 'శిక్యము' అనీ, మేహనము (మేఢ్రము) న పుట్టే దానిని 'మదము' అనీ, హృదయమున పుట్టే దానిని 'ఘర్మము' అనీ, చరణముల నుండి స్రవించే దానిని 'మేఘము' అనీ వేర్వేరుగా పిలుస్తారు. ఇలా మదం స్రవించడాన్ని 'మద ప్రసేకము' లేక 'మద ప్రస్రవణము' అంటారు. కుంభ స్థలంలో పుట్టినదైనట్టి మదము 'కుంభజము'. అట్టి మదాన్ని స్రవించే మగ ఏనుగును రామలింగకవి యిక్కడ 'కుంభజుడు' అని పేర్కొంటున్నాడు.

మదించిన మగ ఏనుగులు వర్షఋతువులో కొలకు (కొలను) లలో తమ ఆడ ఏనుగులతో యధేచ్ఛా విహారం చేస్తాయి. అవి నీటిలోనే జతకడతాయి. ఆ సందర్భంగా ఆ కొలనులన్నింటినీ కలచివేస్తాయట. అయితే తరువాత ఆ మదపుటేనుగుల శరీరాన్నుండి స్రవించే మదం యొక్క సుగంధం (కొన్ని మృగముల మదం సుగంధ భరితంగా వుంటుంది కస్తూరి, జవ్వాది లేక సంకుమదము, పునుగు వగైరా సుగంధ ద్రవ్యాలు మన కలా వచ్చేవే మగ కస్తూరి మృగం (*Musk Deer*) యొక్క పొట్టభాగంలోని ఒక గ్రంథి నుంచి కస్తూరి (*Musk*) లభిస్తుంది. అలాగే పునుగు పిల్లి (*Civet Cat - Civettictis civetta*) నుండి పునుగు, కస్తూరి ఎలుక (*Musk rat - Ondatra zibethica*) మరియు ఒట్టర్ (*Otter - Lutra canadensis*) ల నుండి కూడా యిదే మాదిరి సుగంధద్రవ్యాలు లభిస్తాయి అలాగే సంకువు అనబడే జవ్వాది పిల్లి నుండి లభించేది సంకుమదము లేక జవ్వాది అనబడే సుగంధద్రవ్యము) కారణంగా ఆ కొలనులకు కొంత సాంత్వన చేకూరుతుందట. అలా తొల్లి (ముందు) తమ రతి క్రీడల కారణంగా కలఁక బారిన (కలత పడిన) కొలనులను తేర్చి (ఊరడించి), ఉపశమింపజేసి తనరు (ఒప్పేటటువంటి) కుంభజుని (మగ ఏనుగు యొక్క) ఉన్నతి (గొప్పతనము) ధార్తరాష్ట్ర వినుతమై ఒప్పిందట. అంటే ధార్తరాష్ట్రములచే లెస్సగా పొగడబడిందట. (ధార్తరాష్ట్రము అంటే నల్లని ముక్కు, కాళ్ళు గల హంస - *Whooper Swan - Cygnus cygnus*)

ఏనుగుల యధేచ్ఛా విహారాలతో కలతపడిన కొలకులు ఊరడిల్లి శరదాగమన వేళలో కూడా అంతకు ముందెప్పుడో వర్షఋతువులో మదేభముల నుండి ప్రసేకమైనట్టి మదము యొక్క సౌరభాన్నింకా గుబాళిస్తాయట. కనుక శరదాగమన వేళలో ఆ కొలనులలో విహరించే ధార్తరాష్ట్రములు ఆ పరిమళానికి కారణమైన కుంభజు (మగ ఏనుగు) ని గొప్పతనాన్ని కొనియాడుతున్నాయట. మరి తమ ప్రియమైన గురుదేవుడైన కుంభజుని (కుంభ సంభవుడు - ద్రోణాచార్యుడు) విలసనము (ప్రకాశము, కీర్తి) ధార్తరాష్ట్రులచే (ద్రోణుని ప్రియ శిష్యులైన దుర్యోధనాది ధార్తరాష్ట్రులు - ధ్రుతరాష్ట్రుని తనయులైన కౌరవులచే) ప్రస్తుతంబు (ప్ర - బాగుగా; స్తుతంబు - స్తుతించబడినది, పొగడబడినది) కాదె? (కాదా?). అంటే దుర్యోధనాది కౌరవులు తమ గురుదేవుడైన ద్రోణాచార్యుని కీర్తిని కొనియాడినట్లే శరదాగమన వేళలో కొలనుల్లో విహరించే ధార్తరాష్ట్రములనే హంసలు అంతకు ముందరి వర్ష ఋతువులో ఆ కొలకుల్లో యధేచ్ఛా రతి క్రీడల సందర్భంగా సుగంధ భరితమైన మదమును ప్రసేకించిన మదావళముల కీర్తిని గొప్పగా పొగడాయట.

మరో చక్కటి పద్యం చూడండి -

చ॥ మెఱుగులు దీటుకొల్పు చనుమిట్టలఁ గమ్మ జవాది తావులన్
బిఱిఁదికిఁ ద్రోయు వాసనల బేడిసమీల హసించు కన్నులన్
వఱలు కృషీవలాత్మజ లవారణఁ బాడుదు రిందు వంశజుల్
చెఱకును రాజనంబుఁ గల చేలకడన్ శరదాగమంబునన్ (ఉద్భటారాధ్య చరిత్రము 3-179)

శరదాగమన కాలంలో కృషీవలాత్మజలు (రైతుల కూతుళ్ళు) ఎలా వున్నారో వర్ణిస్తున్నాడు. వారి చనుమిట్టలు చక్కగా పరిమళ భరితంగా వున్నాయట. ఆ పరిమళం కమ్మనైన జవాది తావులను (సువాసనలను) కూడా పిఱిఁదికిఁ ద్రోసే (వెనుకకు నెట్టివేసే) టంత సువాసనగా వున్నదట. ఇక వారి కళ్ళు బేడిసమీల (బేడిస చేపల) ను చూసి పరిహసించేటంత పెద్దవట (బేడిస చేప - *Silver Fish* - *Cyprinus chrysopareius* శఫరి - *Carp* - అనికూడా పిలువబడే ఈ చేపల మెరిసే కళ్ళ కారణంగా కవులు తరచుగా వీటి కళ్ళ మెరుపును అందమైన స్త్రీల కళ్ళ మెరుపుతో పోలుస్తుంటారు). వారు మెఱుగులు (మెరపులను) దీటు కొల్పేటట్లు వఱలుతూ (ప్రకాశిస్తూ) వున్నారట. అంటే వారు మెఱపు తీగల వంటి స్త్రీలన్నమాట. ఇక ఆ ఇందువంశజులు (చంద్రుని వంశస్థులు అంటే - చందమామ అంతటి చక్కని స్త్రీలు) చెఱకు, రాజనము (వరి ధాన్యములో ఎర్రని శ్రేష్ఠమైన రకం) వున్న చేల దగ్గర అవారణ (అడ్డులేకుండా) పాడుదురు (పాటలు పాడుతూ వుంటారు) శరదాగమంబునన్ (శరదృతువు ప్రవేశించే సమయంలో).

## ముంజభోజుని శివదీక్షా స్వీకరణ

ఆ సమయంలో జనులందరకూ కన్నుల పండువగా ఉద్భటుడు బోధించిన మార్గంలో ముంజభోజుడు శివలింగమును ధరించ బూనాడు. ఓ శుద్ధ పంచమి నాడు తాను శివదీక్ష స్వీకరిస్తున్నట్లూ, ఆ ఉత్సవానికి తప్పక రాగోరుతున్నట్లూ, దేశ దేశాల్లో వున్న శైవోత్తములందరికీ కాలరులచే (కాలరి - దూత) కబురు పంపాడు.

ఆ ఉత్సవానికి వల్లకీ పురానికి ఏతెంచిన ఆ కమనీయ మూర్తులెలా వున్నారో వర్ణిస్తున్నాడీ చక్కని పద్యంలో-

ఉ॥ మిక్కిలి కన్ను చేతనొక మేటి త్రిశూలము పాఁప సొమ్ములున్
జక్కెర వింటి జోదు మయి సానను రాచిన చందనంబు మే
నిక్కువగాఁగ నుండు నొక యింతియుఁ గల్గిన వేల్పు దామయై
యక్కమనీయ మూర్తులు ప్రియంబున వల్లకి కేఁగి రయ్యెడన్ (ఉద్భటారాధ్య చరిత్రము 3-183)

రాజు ఆహ్వానంపై వల్లకీ పురానికి విచ్చేసిన శైవోత్తములు స్వయంగా తామే సాక్షాత్ శివస్వరూపులై వచ్చారట. మిక్కిలి కన్ను (అందరికీ వున్నట్లు రెండు కళ్ళు కాక అదనంగా మూడో కన్ను) చేతనొక మేటి త్రిశూలము, పాఁప సొమ్ములున్ (సొమ్ములు అంటే నగలు. 'పాఁప' అంటే పాములు; అంటే నాగాభరణములు) చక్కెర వింటి జోదు (చెఱకు విలుకాడైన యోధుడు - మన్మథుడు) మయి (మేనికి) సానను రాచిన చందనంబు (శివుడు తన మూడవ కంటి చూపుతో ఒకప్పుడు మన్మథుడిని భస్మం చేసి ఆ బూడిదను గంధంలా తన శరీరానికి రాసుకున్నాడట) మేన (శివుని శరీరంలో) ఇక్కువ (ఉనికి, నివాసస్థలం) కాగ (కాగా) నుండు (ఉండే) ఒక యింతియు గల్గిన వేల్పు (అంటే తన శరీరంలోని అర్ధ భాగంలో నివాసముండే ఒక యింతి - పార్వతిని - కలిగిన దేవుడు; అర్ధనారీశ్వరుడైన శివుడు) తామయై (తామే అయి) అక్కమనీయమూర్తులు (ఆ కమనీయ మూర్తులు) ప్రియంబున (ప్రేమతో) వల్లకి కేగిరయ్యెడన్ (వల్లకీ నగరమునకు; ఆ+ఎడన్

: ఆ సమయంలో; ఏగిరి - వెళ్ళారు)

ఇలా విచ్చేసిన ఆ అయ్యల పాదములను కడిగి వారిని పూజించాడు రాజు. వారు సంతృప్తి చెంది ఆ నళినవైరి (నళినము - తామర పువ్వు; నళిన వైరి - చంద్రుడు) కులశిఖా (చంద్రవంశ శ్రేష్ఠుడైన) ప్రమథేశుని కొడుకైన ముంజభోజుని ఎంతగానో కీర్తించారు.

అప్పుడు వారు రాజు యిచ్చిన కానుకలు స్వీకరించి రాజును ఆశీర్వదించారు. ఏమనంటే - శివ భక్తులలో అగ్రగణ్యులైన 16 మందిని పేర్కొని 'వారి వలెనే నీవూ భక్తితో, యుక్తితో శంభుణ్ణి పూజిస్తూ కీర్తిగాంచు' అని.

**సీ॥ సింధుబల్లహు రీతి, శ్రీపతి పండితు**
**మరియాద, ధూపద మాచిదేవు**
**నట్లు, మహాకాళుననువున, నల్ల క**
**ల్కద బ్రహ్మ రేవఁ, గక్కయ విధమున,**
**శూలద బ్రహ్మయ్య చొప్పునఁ, బిబ్బ బా**
**చన లీల, వీర నాచాంకు పోల్కి,**
**కదిరె రెమ్మయగారి కైవడిఁ, దెలుఁగేశు**
**మసణయ్య చందాన, మాదిరాజు**

**గీ॥ కరణి, మోళిగ మారయ్య గతిఁ, దెలుంగు**
**జొమ్మనార్యుని వదువున, సురియ చౌడు**
**పగిది, బసవేశ్వరుని మాడ్కి భక్తి యుక్తి**
**శంభుఁ బూజించి బ్రదుకు రాజన్య చంద్ర! (ఉద్భటారాధ్య చరిత్రము 3-186)**

ఆ పదహారు మంది శివభక్తులు వీరు - 1) సింధుబల్లహుడు - ఇతనిని బల్లవరాయుడు, భల్లాణరాజు అని కూడా అంటారు. ఇతడు మూడవ రాజేంద్ర చోళుడే (క్రీ.శ. 1256-80) నని కొందరి విశ్వాసం. ఇతని శివభక్తిని పరీక్షించడానికి శివుడొకసారి జంగముడై వచ్చి ఓ వేశ్య సాంగత్యాన్ని కోరాడట. అప్పుడా రాజు వేశ్యలెవరూ అందుబాటులో లేనందున తన భార్యయైన చల్లమాంబనే జంగముని కడకు పంపాడట. ఆమె శివుని సమీపించబోగా శివుడు ఆమె చేతిలో నెల్లాళ్ల శిశువుగా మారాడట. 2) శ్రీపతి పండితుడు - ఆంధ్రదేశంలో ఆరాధ్య శైవాన్ని ప్రచారం చేసిన పండిత త్రయం (ముగ్గురి)లో ప్రథముడు (మిగిలిన యిరువురు- మల్లికార్జున పండితుడు, శివలెంక మంచన పండితుడు). ఈయన స్వస్థలం విజయవాడ. ఇంద్రకీలాద్రి శాసనంలో యీయన ప్రస్తావన వుంది. ఈ శివభక్తుని గురించి ఎన్నెన్నో కథలు ప్రచారంలో వున్నాయి. ఈయన ఒకప్పుడు తన ఉత్తరీయములో నిప్పుల్ని మూటగట్టాడనేది వాటిలో ఒకటి. 3) ధూపద మాచిదేవుడు - ధూపద అంటే ధూపం యిచ్చే వాడు అని అర్థం. బసవేశ్వరుని కాలంనాటి వాడైన యీయన ధూపం అర్పించడంలో ప్రసిద్ధుడట. 4) బసవేశ్వరునికి పూర్వపు కాలం వాడైన మహాకాళయ్య భక్తితో శివునికి తన తల తరిగి సమర్పించి శివానుగ్రహంతో తిరిగి తన తలను పొందాడట. 5) బసవని కాలంనాటి భక్తుడైన కల్కద బ్రహ్మయ్య. 6) ఇంద్రజాలం చేసే కక్కయ్య అనే శివభక్తుడు. 7) ఎల్లప్పుడూ శూలము ధరించిన శూలద బ్రహ్మయ్య. 8) బిబ్బ బాచన - అత్యంత నిరాడంబరుడైన యీ శివభక్తుడు - శివభక్తుల యిండ్లలో మిగిలినట్టి ఆహార పదార్థములన్నీ సేకరించి ఒక

బండిపై వాటిని అన్నార్తులకు ప్రసాదంగా పంచేవాడట. ఈ సామ్యవాద పోకడ సహించలేని నాటి బ్రాహ్మణులు ఆ బండిని నిరోధించాలని ప్రయత్నించి విఫలులయ్యారట. 9) వీర నాచయ లేక వీరనాచాంకుడనే శివభక్తుడు. 10) కదిరె రెమ్మయ్య - ఈ శివభక్తుడు 7 రోజుల క్రిందట చనిపోయిన ఓ వ్యక్తిని బ్రదికించాడని కథ వుంది. బహుశా 7 రోజులపాటు అచేతనంగా (కోమా - *Coma* లో) వున్న వానికి వైద్యం చేసి నయంచేసి వుంటాడు. 11) తెలుగేశు మసణయ్య - ఇతడు మసనము (శ్మశానము) లో నివాసం వుండిన శివభక్తుడట. 12) మాదిరాజు అనే ప్రసిద్ధ శివభక్తుడు. 13) మోళిగ మారయ్య - కట్టెలమ్ముకొని జీవించే పేద భక్తుడు. తాను కష్టపడి సంపాదించిన దానిలో తన ఖర్చులకు పోను మిగిలిన ధనాన్ని పేదసాదలకు పంచేవాడట. ఓసారి బసవేశ్వరుడు యితని నిజాయితీని పరీక్షించగోరి, కొన్ని బంగారు మాడలను యితని దిండు క్రింద పెట్టి వెళ్లిపోయాడట. మారయ్య యింటికి వచ్చి చూచి ఆ ధనాన్నంతా పేద భక్తులకు పంచి వేశాడట. 14) తెలుగు జొమ్మయ్య - మరో ప్రసిద్ధ భక్తుడు - వృత్తిరీత్యా వేటగాడు. శాపవశమున జింకలుగా మారిన కొందరు గంధర్వులు తమకు తామే యీయన బాణములకు ఎదురువచ్చి యితనిచే వేటాడి, వధింపబడి శాపవిముక్తులయ్యారని ఓ కథ ప్రచారంలో వుంది. 15) సురియ చౌడయ్య అనే ప్రసిద్ధ శివభక్తుడు. 16) బసవేశ్వరుడు - ఈయన్ని వీరబసవడనీ అంటారు. దక్షిణ భారతదేశంలో వీరశైవాన్ని ప్రతిష్ఠించిన గొప్ప మత, సంఘ సంస్కర్త. కర్ణాటక రాష్ట్రంలోని నేటి బీజపూరు జిల్లాలోని ఇంగలేశ్వర్ బగేవాడి గ్రామంలో జన్మించిన యీయన జన్మతః బ్రాహ్మణుడే అయినా వేద ప్రామాణ్యాన్ని ధిక్కరించి, కులవ్యవస్థను నిరసించి, పురుష - స్త్రీ సమత్వాన్ని ప్రబోధించి, జంగమ సంప్రదాయమనే పేరుతో శైవ మతాన్ని వీర శైవంగా మలిచాడు. శివలింగ ధారణే మోక్షానికి మార్గమని బోధించి 'ఇష్టలింగ ధారణ' ప్రారంభించాడు. ప్రజలలో గొప్ప సాంఘిక చైతన్యాన్ని కలిగించి, కులరహిత సమాజాన్ని నిర్మించి, శివభక్తులందరినీ భక్తివీరులుగా తయారు చేశాడీయన. కర్ణాటకలోని కళ్యాణి రాజధానిగా పాలించిన కాలచురి బిజ్జల దేవుడనే జైన రాజు వద్ద యీయన మంత్రిగా పనిచేస్తూ కూడల సంగమేశ్వరం అనే చోట వేలాది శివభక్తులతో తరచు సమావేశాలూ, శైవ సమారాధనలూ నిర్వహిస్తూండడం జైనుడైన ఆ రాజుకు కంటకింపై ఆయనపై చర్యకు సిద్ధమయ్యాడు. ఇది ముందుగా పసిగట్టిన బసవేశ్వరుడు బిజ్జలుని వధించి తానే ప్రభువై శివ సామ్యవాద ప్రభుత్వాన్నేర్పరచాడు. విధవరాలైన తన సోదరిని ఆదర్శంగా ఒక చర్మకారునికిచ్చి పునర్వివాహం చేశాడట. వారి కుమారుడే మరో ప్రసిద్ధ వీరశైవుడైన చెన్న బసవడు. కర్ణాటకలోని లింగాయతులు, ఆంధ్రప్రదేశ్‌లోని ఆరాధ్య శైవులు, జంగమదేవరలు అనబడే మాహేశ్వరులు - వీర బసవని సంప్రదాయం పాటించే వీరశైవులే. వారి విశ్వాసం ప్రకారం బసవేశ్వరుడు శివుని వాహనమైన నందీశ్వరుని అవతారం. తెలుగు కవియైన పాల్కురికి సోమనాధుడు వ్రాసిన బసవేశ్వరుని జీవిత చరిత్రయైన తెలుగు బసవ పురాణమే తదుపరి కన్నడ, సంస్కృత, తమిళ భాషలలో రచించబడిన బసవ పురాణములకు మాతృకయైన కారణంగా కర్ణాటకలో ఉద్భవించిన వీరశైవం తొలిదశలలో ఆంధ్రప్రాంతంలో గొప్ప ప్రాచుర్యాన్ని పొందినట్లు మనం గమనించవచ్చు. బసవేశ్వరుని కాలం (క్రీ.శ. 1150-1180) నాటికి కర్ణాటక రాష్ట్రంలో జైనమతం విజృంభిస్తూ వుంది. జైన మతంలోని సాంఘిక, నైతిక సూత్రాలను మూలాలుగా గ్రహించి, ఆగమ శాస్త్రాలలోని భక్తి మార్గాన్ని మేళవించి, మతరక్షణ కోసం ప్రాణాలనైనా అర్పించే వీరోచిత గుణములు కలిగిన వీర సైనికులను తయారు చేశాడు బసవేశ్వరుడు. దీని కారణంగా ఆంధ్ర, కర్ణాటకలలో జైనమత విజృంభణ నిలిచిపోయి జైనం క్రమంగా క్షీణించసాగింది. తరువాత ఆంధ్రలో విస్తరించి అక్కడి బౌద్ధ మతాన్ని కూడా వీరశైవం బాగా దెబ్బ తీసింది. ఆ దశలో దక్షిణ భారత దేశంలో హిందూమతం సజీవంగా నిలిచి వుండడానికి కూడా బసవేశ్వరుడు స్థాపించిన వీరశైవమే చాల వరకు కారణం.

రామలింగకవి కాలానికి ముందరి శివభక్తులలో ప్రముఖులందరినీ పేర్కొన్న యీ పద్యానికి మరొక ప్రత్యేకత కూడా వుంది. తెలుగు భాషలో 'లాగున', 'రీతి', 'వలె', 'విధమున' వగైరాలను ఇవార్థములంటారు. ఇలాగే 'వలె' అనే అర్థాన్నిచ్చే 'ఇవార్థము'లు మొత్తం తెలుగులో 30 వున్నాయి. రామలింగకవి యీ చక్కటి పద్యంలో మొత్తం 16 ఇవార్థములను ఉపయోగించాడు. అవి – రీతి, మరియాద, అట్లు, అనువున, రేవ, విధమున, చొప్పున, లీల, పోల్కి(పోలె), కైవడి, చందాన, కరణి, గతి, వడువున, పగిది, మాడ్కి. ఇవికాక యింకా తెలుగు భాషలోనున్న ఇవార్థములు 14. అవి లాగు, భాతి, భంగి, గరిమ, రేఖ, భావము, సోయగము, చెలువు, గారవము, వెరవు, సరణి, రమణ, క్రియ, తెఱగు. ఇదే కావ్యంలోని ఘుమఘుమ నుఱుమ (3-49) అన్న పద్యంలో 'విధమున', 'తెఱగున', 'కరణి', 'పగిది', 'రీతి' అనే ఐదు ఇవార్థాలను, 'భవు గొల్చువారల' (1-84) అన్న పద్యంలో 'రీతి', 'పోలె', 'లీల', 'భంగి' అనే నాలుగు ఇవార్థాలను ప్రయోగించిన కవి ఈ పద్యంలో అత్యధికంగా పదహారు ఇవార్థాలను ప్రయోగించడం విశేషం.

ఆ తరువాత వల్లకీపుర పౌరులంతా తమ తమ యిండ్లకు మణితోరణములు కట్టి, ముత్యాల ముగ్గులు పెట్టి ఆ మహోత్సవానికి సర్వసన్నద్ధులయ్యారట. దేవాలయాలన్నీ బహుళ శృంగారావాసములై ముస్తాబయ్యాయట.

ఓ శుభముహూర్తములో ఉద్భటగురుని చేతుల మీదుగా ముంజభోజుడు ప్రాణలింగాన్ని ధరించాడు. శివ పంచాక్షరి, యితర శివమంత్రముల సారమును గురువు శిష్యునికి ఉపదేశించాడు. ఆ తదుపరి రాజు కామ క్రోధములను త్యజించి, (తనవారిపై) మమతలను త్రుంచి, శైవాగమం ప్రకారం భక్త జనుల సంరక్షణ చేస్తూ, యోగి వర్తనము కలిగి, జనులందరూ మెచ్చే విధంగా పాలించాడట. నలినీ పత్రము (తామరాకు) నంటని సలిలకణంబట్ల (నీటి బిందువువలె) తగులు చాలించి (ఐహిక విషయములపై ఆసక్తిని త్యజించి) భూమిని పరిపాలించాడట హిమకర సంభవుడైన (చంద్రుని వంశస్థుడైన) రాజగురుడు (రాజ శ్రేష్ఠుడైన) ముంజభోజుడు.

## ముంజభోజుని వైరాగ్యం

అలాంటి శిష్యుని చూసి ఉద్భట గురుమూర్తి "ఓ ముంజభోజా ! నీవంటి సుగుణాఢ్యుడెక్కడా లేడు. నీవు ధర్మార్థ కామముల నాదరించావు. దుష్ట నిగ్రహమును, శిష్టరక్షణమును నిత్యకృత్యములుగా నిర్వహిస్తున్నావు. సకల భోగములనూ త్యజించి, అప్రమత్తుడవై, బాహ్య శత్రువులనే కాక, అంతశ్శత్రువులను (అరిషడ్వర్గాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను) అణచావు. నిన్ను సరిపోలగల రాజు యీ యిలాతలంలో ఒక్కడైనా వున్నాడా? నీవంటి శిష్యుని వల్ల గురువుకు కూడా సత్కీర్తి వస్తుంది. ఉత్తమ శిష్యుడు దొరకడం గురుని భాగ్యము. అనుత్తముండగు శిష్యుడు దొరకడం గురుని దౌర్భాగ్యము అని వేదవిదులు చెపుతారు కదా ! నీవు సచ్ఛిష్యుడవు గావున అది మా అదృష్టం. గత కాలంలో రాముడు, యయాతి మొదలుగాగల భూపతులెందరో యీ నేలను యేలారు. వారెవరికీ దక్కని కీర్తి నీకు దక్కింది. నీవు భాగ్యవంతుడవు. చేరమరాజు వలెనే నీవు శివుని యీ మేనితో (యీ మేనితోనే అంటే యీ జన్మలోనే) సేవా వృత్తితో సుప్రసన్నుని చేసి సత్కీర్తినందగలవు" అన్నాడు. అప్పుడు ముంజభోజుడు "గురువర్యా ! మీ ప్రభావంతోనే కదా నాకు యీ వైభవమూ, సౌభాగ్యమూ దొరకింది. అయినా నాకీ సంసార సుఖాలు, రాజభోగాల మీద వైరాగ్యం కలిగింది. కనుక యీ భవబంధములపైనా, రాజ్యపాలన పైనా అనురక్తిని పూర్తిగా పోగొట్టి నన్ను కృతార్థుడిని చేయండి" అన్నాడు. అప్పుడు ఉద్భటుడు రాజు మనసులోని వైరాగ్య భావాన్ని పోగొట్టి రాజయోగి లక్షణములతో రాజ్యపాలన చేస్తూనే కైలాసనాథుని సేవలో జీవితం ధన్యం చేసికొనమని దీవించాడు.

# పిశాచముల శాప విమోచనం

'గురో రాజ్ఞాం న లంఘయేత్' అను న్యాయంబున గురువు ఆజ్ఞ ప్రకారం ముంజభోజుడు సక్రమంగా రాజ్యపాలన చేస్తూండగా ఒక రోజున ఉద్భటునికి పిశాచములైన ఖేచరుల శాప విమోచనమును గురించి శివుడు తనను చేరబిలిచి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. అప్పుడిలా ఆలోచించాడు –

'శిష్యుడైన ముంజభోజుడు చక్కగా రాజ్యపాలన సాగిస్తున్నాడు. మలహరుడైన (దోషములను హరించేవాడైన) శివుడి ఆజ్ఞ ప్రకారం నేను పిశాచాలుగా వున్న ఖేచరులకు శాపవిముక్తి కలిగించ వద్దా? నేనింకా యీ భూమి మీద జీవించి వుండడం సబబేనా?'

తరువాత పావనమైన నీటిలో స్నానం చేసి వచ్చి ఒక విశుద్ధమైన స్థలంలో భస్మము, రుద్రమణులు (రుద్రాక్షలు) ఆదిగాగల శైవ చిహ్నాల్ని ధరించి, అరచేతిలో ప్రాణలింగమును ధరించి, యోగ శక్తితో మస్తోద్భేదము (శిరస్సు వ్రయ్యలు) కావించి జీవితముతో సంబంధాన్ని పోద్రోచి కపాల మోక్షమును పొందాడు. అప్పుడా మహాయోగి బ్రహ్మరంధ్రం గుండా శతకోటి సూర్యుల కాంతితో సమానమైన వెలుగొకటి బయల్పడి ఆయన అరచేతిలోని లింగమును కూడి పైకెగసి హరునిలో ఐక్యమయిందట.

ఆ మహనీయ మూర్తి చితాగ్ని ధూమాలు పిశాచములు నివాసముంటున్న వటవృక్షాన్ని తాకగానే ఆ పిశాచాలన్నీ శంభుని రూపాలు పొందాయట. ఆ సమయానికి అక్కడ లేని ఒక్క చిత్రరథుడు మినహా మిగిలిన గంధర్వులు రుద్రమూర్తి రూపాన్ని పొంది వెండిలా మెరుస్తున్నారట.

ఆహారం కోసం వెళ్ళిన చిత్రరథుడు తిరిగి వచ్చేటప్పటికి శ్మశానమంతా నిశ్శబ్దంగా ఉందట. మిగిలిన పిశాచాలన్నీ శాపవిముక్తినంది వెళ్లిపోయాయట. చిత్రరథుడు ఆహారం కోసం వెళ్ళివచ్చేలోపల ముంజభోజుని గురువైన ఉద్భటుడు మరణించడం, అంత్యక్రియలు – అన్నీ పూర్తయి పోయాయట. చితాగ్నేమో ఆరిపోయిందట. చిత్రరథుడు ఆఘ్రాణించడానికి ధూమాలు లేవట. దీంతో భోరుమని విలపించాడట చిత్రరథుడు.

# చిత్రరథుని విలాపం

కం॥ కాయలు రాల్చిన మావిడి
సోయగమున నిట్లు మిత్ర శూన్యంబగుచున్
దూయని తద్భూజముఁగని
హాయనుచున్ గుండెపగిలి యతి విహ్వలుఁడై (ఉద్భటారాధ్య చరిత్రము 3-258)

కాయలు రాల్చిన మామిడి చెట్టులాగా, అప్పటి వరకూ పిశాచ రూపంలోనున్న తన మిత్రులైన గంధర్వుల కోలాహలంతో సందడిగా వుండి ఒక్కసారిగా మిత్ర శూన్యమైపోయిన ఆ భూజము (భూమి నుంచి జనించినది – వృక్షము) ను చూసి 'హా !' అంటూ గుండె పగిలి అతి విహ్వలుఁడై విలపించాడట చిత్రరథుడు.

ఇంకా చిత్రరథుడు రొమ్ములు బాదుకుంటూ – "ఉగ్రమైన శాప భారాన్ని వంద దివ్య సంవత్సరాలు మోశాను. తీరా నే వచ్చేసరికి ఉద్భట గురుని చితాగ్ని ఆరిపోయింది. ఎందుకోసమైతే యింత కాలంగా ఎదురు చూపులు చూశానో

అది దక్కకుండా పోయింది. ఈనునంతవరకు కాచి (కాపాడి) వృకాలి (తోడేళ్ళ గుంపు) కిచ్చిన చందంగా వున్నది నా స్థితి" అని విలపిస్తాడు. ఇక్కడ 'ఈన గాచి నక్కలపాలు చేయడం' అన్న ప్రసిద్ధమైన సామెతను రామలింగకవి స్వల్పంగా మార్చి ప్రయోగించాడు.

వృకము అంటే తోడేలు, ఈహా మృగము. నక్క (*Vulpes bengalensis*), తోడేలు (*Canis lupus*) - రెండూ ఒకే జాతికి చెందిన, సారూప్య లక్షణాలూ, స్వభావమూ కలిగిన జంతువులు కనుక కవి ప్రయోగించిన యీ మార్పు కూడా నేర్పుగానే వుంది.

గురువుపోయిన దుఃఖంలో ఏకాంతంగా ఒక హర్మ్యంలో నిద్రపట్టక పక్కపై పొరలుతూన్న ముంజభోజుడు యీ రోదన విని రుద్రభూమికి వచ్చి చిత్రరథుని విషాద కథ విని కరగిపోయాడు. శివుడి గురించి కఠోరతపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై చిత్రరథునికి శాపవిమోచనం కలిగించాడు. శివుడు తన ఘర్మజలాన్నుంచి (చెమటనుంచి) తిరిగి ఉద్భటుణ్ణి సృష్టించాడు. ఉద్భటుణ్ణి యింకొంతకాలం భూలోకంలోనే వుండి మత ప్రచారం చేయమన్నాడు శివుడు. శివుడి తలపునుండి ఉజ్జ్వల దేహకాంతితో ఉద్భవించి ఓ మారు శివైక్యం చెంది తిరిగి శివుని చెమట నుంచి ఉద్భవించిన ఉద్భటుడు అలా ముదిగొండ వంశానికి మూల పురుషుడయ్యాడు. ఇదీ స్థూలంగా ఈ కావ్య కథాంశం.

**ముగింపు :-** ఈ కావ్యంలోని ఛందస్సు విషయానికి వస్తే రామలింగకవికి కందపద్యం అత్యంత అభిమానపాత్రమైనట్లుగా కనుపిస్తున్నది. మొత్తం మూడు ఆశ్వాసాలలో 842 గద్యపద్యాలలో కూర్చబడిన యీ కావ్యంలో 200 పద్యాలు కందపద్యాలే. మూడవ ఆశ్వాసంలోనైతే 200 వ పద్యం నుండి 220 వ పద్యం వరకు వరుసగా అన్నీ కందపద్యాలే! దీన్ని బట్టే రామలింగకవికి కందమంటే ఎంత అభిమానమో అర్థమవుతూంది. అభిమానమే కాదు; కంద పద్యాన్ని రసపుష్టితో రమ్యంగా తీర్చిదిద్దడంలోనూ రామలింగకవి సిద్ధహస్తుడు. అది ఆయన వ్రాసిన కంద పద్యమే అయివుంటుందని చూడగానే అనిపించేటటువంటి విలక్షణశైలి కంద రచనలో రామలింగనిది.

కనకలత తల్లీ, పరభావవేదీ మాట్లాడుకునే మాటలలో రామలింగ కవి లోకానుభవం ప్రస్ఫుటమవుతూంది. కావ్యంలోని ప్రతిభాగంలోనూ సహజత్వానికి అతిదగ్గరగా కవిచేసిన వర్ణనలు అద్భుతంగా వుంటాయి.

అందుకే ఈ కావ్యం రామలింగనికి మంచి పేరు తెచ్చింది.

ఈ కావ్యకర్తగా ఆయన ఆర్జించిన పేరు ప్రతిష్ఠలే కొండవీటి ఆస్థానంలో రామలింగడు ఆదరణ పొందడానికీ, తిమ్మరుసు మేనల్లుడైన నాదెండ్ల గోపమంత్రి సిఫారసుపై అనంతర కాలంలో హంపి విజయనగరానికి చేరి ముందుగా తిమ్మరుసు మనసు గెల్చుకొని, ఆ తదుపరి శ్రీ కృష్ణ దేవరాయల ఆదరణకు పాత్రుడు కావడానికీ దోహదం చేశాయి.

అయితే విజయనగరం వెళ్ళక మునుపు మరికొందరు చిన్నా చితకా రాజుల ఆశ్రయానికి ప్రయత్నించి నిరాదరణకు గురై నిస్పృహలో పడిపోయాడు రామలింగడు. ఆర్థిక బాధలా మిక్కుటమయ్యాయి. ఆ దశలోనేనేమో వీరబసవరాజేంద్రుడనే రాజు దర్శనం కోరి వెళ్ళి ఈ క్రింది పద్యం చెప్పాడట.

శా॥ ఛత్రాలంబడి కాటముచ్చులు పిశాచాల్లంగిడీ లిప్పుడీ
లొత్రాజేంద్రుల వేఁడనేమిటికిఁ జాలుంజాల నర్థార్థికిన్
ఇట్టా రమ్మని యిచ్చు వీరబసవుండీ ధాత్రినున్నాఁ డురా
కట్టా బొమ్మ దరిద్ర భూతము దొలంగన్ వామ పాదంబునన్

కాయల చెట్టుకు దృష్టి తగులకుండా చెప్పులు కట్టడం, ఇండ్లు నిర్మించేటప్పుడు దిష్టి బొమ్మలు పెట్టడం, ఇండ్ల

దరికి భూతప్రేతాలు చేరకుండా భీకరమైన రాక్షసి బొమ్మలు వ్రేలాడదీయడం అనాదిగా వస్తూన్న ఒక వెర్రి ఆచారం. ఇక్కడ దరిద్రమనే భూతము తన దరికి చేరకుండా తన ఎడమకాలికి బొమ్మను – బహుశా బొమ్మగల తాయెత్తును – కట్టమంటున్నాడు రామలింగడు. బహుశా ఇది దరిద్రభూతంపై తన గెలుపుకు సూచకంగా తన ఎడమకాలికి బొమ్మను కట్టమనడం కూడా కావచ్చు. "కాటముచ్చులు, పిశాచాల్లాంటి పనికిరాని రాజులను అర్థించేపనేముంది? నన్ను పిలిచి పోషించే వీరబసవరాజేంద్రుడుండగా" అంటున్నాడు.

కంచెర్ల గోపన్న అనే భద్రాచల భక్త రామదాసు వ్రాసిన ఒక పద్యంలో కూడా యమకింకరుల్ని పారద్రోలడానికి అంటే మృత్యువుపై తన విజయానికి సూచనగా బొమ్మ కట్టినట్లుగా చెప్తాడు. చూడండి.

ఉ॥ పట్టితి భట్టరార్య గురుపాదము; లిమ్మెయి నూర్ధ్వ పుండ్రముల్
పెట్టితి; మంత్రరాజ మొడి బెట్టితి; నయ్యమ కింకరాళి కిం
గట్టితి బొమ్మ; మీ చరణ కంజములందు దలంపు పెట్టి పోఁ
దట్టితిఁ బాప పుంజముల దాశరథీ ! కరుణాపయోనిధీ ! (దాశరథీ శతకం : 102)

అంటే మృత్యువిక తన దరికి రాకుండా బొమ్మ కట్టాడన్నమాట !

'ఉద్భటారాధ్య చరిత్రము' లోనే రామలింగకవి 'తేలుచుఁబొన్నయాకు పయిఁదేనియ వోలిన' అనే పద్యం (2-103) లో 'కాలునికిఁ గాదని కాలను బొమ్మ గట్టఁడే' అనే ప్రయోగం చేశాడు. (మృత్యువుపై) 'యమునిపై విజయం సాధించదా?' అని దీని భావం.

అలాగే ఆ తరువాత మన రామలింగకవి వీర బసవరాజేంద్రునితో చెప్పిన యీ చక్కటి పద్యం కూడా చూడండి-

క॥ నడవక నడిచే వచ్చితి
నడచిన నే నడచిరాను నడి చెడునట్టున్
నడవక నడచెడు నట్టున్
నడిపింపు బసవరాజ నరనాథేంద్రా !

"ఓ బసవరాజేంద్రా ! నాకు జరుగుబాటు లేక నేను నడిచే నీ దగ్గరకు వచ్చాను. (అంటే అందలాలేమీ ఎక్కి రాలేదు. ) నాకే గనుక జరుగుబాటు వుండి వుంటే ఇలా అవమానకరమైన రీతిలో కాలినడకన రాను. నడిచే పనిలేకుండా నాకు జరుగుబాటయ్యేటట్లు చూడు" అని దీని భావం.

ఈ పద్యాన్ని పోతన భాగవతంలోని గజేంద్ర మోక్షణ కథలోని ఈ క్రింది పద్యంతో పోల్చి చూడండి.

క॥ అడిగెద నని కడువడిఁ జను
నడిగిన దను మగుడ నుడుగఁడని నడయుడుగున్
వెడవెడ సిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్ ! (అష్టమస్కంధము - 103)

మొదటి పద్యంలో 'నడచుట' అనే శబ్దం ఆవృత్తికాగా రెండు పద్యాల్లోనూ 'డ' శబ్దం విన్యాసం చేసింది.

ఇలాగే 'ద' శబ్ద విన్యాసంతో భక్త రామదాసు రచించిన 'దాశరధీ శతకం' లోని ఈ క్రింది పద్యం కూడా చూడండి.

ఉ॥ భండన భీముఁ డార్తజన బాంధవుఁ డుజ్జ్వల బాణతూణ కో
దండ కళాప్రచండ నిజతాండవనర్తికి రామమూర్తికిన్
రెండవసాటి దైవమిలలేఁ డనుచున్ గడగట్టి భేరికా
డాండడడాండడాండ నినదంబు లజాండము నిండ మత్తవే
దండమునెక్కి చాటెదను దాశరథీ ! కరుణాపయోనిధీ ! (దాశరధీ శతకం - 34)

వీరబసవరాజేంద్రుని వద్ద రామలింగడు అట్టే కాలం ఉన్నట్లు లేదు.

రామలింగడిని తన ప్రతిభకు తగిన గుర్తింపు లభించడంలేదనే లోటు వెన్నాడింది

ప్రతిభ వున్నా దానినెవరూ గుర్తించపోతే ఎవరికైనా బాధగానే వుంటుంది. ఈ బాధలోనే మన రామలింగనికి అంతులేని ఆత్మాతిశయం కలిగింది. తనవంటి గొప్ప పండితుడిని అసలింకొకరు గుర్తించేదేమిటి? తన పాండితీ ప్రకర్ష ముందు ఆ 'గుర్తించని ఇతరుల'కున్న పాండిత్యమేపాటిది?' ఇలా ఆలోచించాడు. బహుశా ఆ ఆత్మాతిశయంతోనే నేమో రామలింగకవి స్వోత్కర్షకు కూడా పాల్పడ్డాడు ఈ పద్యం చూడండి -

ఉ. లింగనిషిద్ధుఁ గల్వల చెలింగని, మేచక కంధరుం డ్రిశూ
లింగని, సంగతాళి లవలింగని, కర్దమ దూషిత స్మృణా
లింగని, కృష్ణచేలుని హలింగని, నీలకచన్ విధాతృనా
లింగని, రామలింగ కవిలింగని కీర్తి హసించు దిక్కులన్.

రామలింగ కవిలింగని కీర్తి యీ క్రింది ఆరింటినీ చూసి నవ్వుతుందట. ఎందుకంటే తెల్లదనం కీర్తికి చిహ్నం. తెల్లనివే అయినా ఆ ఆరింటికీ వున్నలోపాలు తన కీర్తికి లేవు. తనది ఏ మచ్చాలేని ధవళకీర్తి అని చెప్పకనే చెప్తున్నాడు రామలింగడు.

కలువలచెలి - అంటే చంద్రుడిది తెల్లని కాంతే అయినప్పటికీ అతడికి మచ్చలున్నాయి; త్రిశూలి - అంటే శివుడు తెల్లనివాడే అయినా మేచక (ముదురు నలుపు లేక ముదురు నీలం) కంధరుడు - అంటే నీలకంఠుడు; 'లవలి' అంటే ఓరకం తీగమొక్క. దీని పూలు తెల్లగా ఉంటాయట. అయితేనేం? సంగతాళి (సంగత+అళి) అళి అంటే తుమ్మెద. సంగతాళి అంటే తుమ్మెద వాలిన లవలిని చూసి 'నీ స్నేహితులెవరో చెప్పు - నీ వేమిటో చెబుతాను' అన్నట్లు నీవి ఎంత తెల్లని పూలయితేనేం? నిన్నెప్పుడూ అంటిపెట్టుకుని ఉండే తుమ్మెద నల్లనిదే కదా? అంటున్నాడు. కర్దమము (అంటే బురద) నంటిన తెల్లతామర కూడా లోపభూయిష్టమైనదే; బలరాముడికి హలాయుధం ధరించడం కారణంగా 'హలి' అనే మరో పేరుంది. అతడూ తెల్లని మేనిఛాయ కలవాడంటారు. అయితేనేం? కృష్ణుడు పసుపుపచ్చని వస్త్రాలు ధరించి పీతాంబరుడని ఎలా పిలువబడుతున్నాడో - బలరాముడలాగే ఎప్పుడూ నల్లని వస్త్రం ధరించడం కారణంగా నీలాంబరుడనీ, కృష్ణచేలుడనీ పేరు పొందినవాడు. ఆ నల్లని వస్త్రం ధరించడం కారణంగా బలరాముని తెల్లదనం కూడా తన కీర్తియొక్క తెల్లదనం ముందు దిగదుడుపే. నీల అంటే సంస్కృతంలో 'నల్లని' అని. అందుకే శిరోజాలని తలనీలాలు అంటారు.

నీలకచన్ – అంటే నల్లని శిరోజాలు కలిగిన. విధాతృనాలి – విధాతృని ఆలి – అంటే బ్రహ్మ భార్య సరస్వతి. ఆమె కూడా తెల్లనిదేనట. అయితే ఆమె శిరోజాలు నల్లనివట. అంచేత ఆమె తెల్లదనమూ పరిమితమైనదే !

అలా యీ ఆరింటినీ చూచి తన తెల్లని సత్కీర్తి పకపకా నవ్వుతున్నదట.

ఈ పద్యపు చివరి పాదంలో 'హసించు దిక్కులన్' కు 'హసించు నిచ్చలున్' (అంటే నిత్యమూ నవ్వుతుంది) అనే పాఠాంతరం కూడా వున్నది.

కవులకు బాధ కలిగితే వారి గళం (లేఖిని) నుండి రసరమ్యమైన కవితలు జాలువారతాయని లోకోక్తి.

పలనాటి సీమలో నీళ్ళు దొరకక బాధపడుతూ శ్రీనాథ కవిసార్వభౌముడు 'లక్ష్మీపతి 16 వేలమందిని పెండ్లాడినా, అది ఆయనకు చెల్లుతుంది; కాని, ఆదిభిక్షువువైన నీ కెందుకయ్యా యిద్దరు భార్యలు? నీకు పార్వతి చాలుగానీ, దయచేసి గంగని విడిచిపెట్టు' అంటూ దాహంతో గంగకోసం పరితపిస్తూ, శివుడిని సంబోధిస్తూ చెప్పిన యీ క్రింది పద్యం అప్పటికే పై లోకోక్తిని నిజమని రుజువు చేసింది.

**సిరిగలవానికిఁజెల్లును**
**తరుణుల పదియారువేలఁదగఁబెండ్లాడన్**
**తిరిపెమున కిద్దరాండ్రా?**
**పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్.**

రామలింగని తరువాత సరిగ్గా మూడువందల ఏళ్లకు పుట్టిన ఆంగ్లకవి జాన్ కీట్స్ (1795-1821) విఫల ప్రేమతో మహాకవిగా మారి అత్యద్భుతమైన కవితలు సృష్టించాడు. గుడ్డివాడైన అనంతరం ఆ విషాద భారంతో జాన్ మిల్టన్ (1608-1674) అనే మరో ఆంగ్ల మహాకవి 'Samson Agonistes' అనే గొప్ప కావ్యాన్ని వెలయించాడు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో భావకవివరులు దేవులపల్లి కృష్ణశాస్త్రి గారికి శస్త్రచికిత్స జరిగి స్వరపేటిక తీసివేయడం కారణంగా ఆయన గొంతు మూగబోయిన విషాద సంఘటన అనంతరం ఆయన లేఖిని నుండి అద్భుతమైన కవితలు వెలువడడం మన మెరిగినవిషయమే! ఇవన్నీ ఆయన బాధాతప్త హృదయంతో రచించినవే.

అందుకే మహాకవి శ్రీశ్రీ వ్రాసిన 'మహాప్రస్థానం' కవితా సంకలనానికి 'యోగ్యతా పత్రం' పేరిట పీఠిక వ్రాస్తూ విఖ్యాత రచయిత చెలం ఏమన్నాడో చూడండి.

"క్రిష్ణశాస్త్రి తన బాధను అందరిలో పలికిస్తే, శ్రీశ్రీ అందరి బాధనూ తనలో పలికిస్తాడు.

**క్రిష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ**
**ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ"**

అయితే రామలింగకవి తాను బాధల్లో వుండి కూడా తన ప్రతిభకూ, కృషికీ తగిన గుర్తింపు లభించడం లేదని లోలోన కుందుతూ పైకి మాత్రం ఆత్మాతిశయాన్ని పెంచుకున్నట్లు కనుపిస్తుంది. అతడు ఎప్పుడూ అందరికంటే తానే ఎక్కువ అనే భావంతోనే వుండేవాడు.

తొలినాళ్లలోని దుర్భర దారిద్ర్యపు బాధలే ఆయన వ్యక్తిత్వాన్నిలా మలుపుతిప్పాయి. ఆశుకవితలతోనూ, సమయోచిత

ప్రజ్ఞతోనూ అతనికి వచ్చిన కీర్తి వెంబడే ఆత్మాతిశయంతోనూ, అహంకారంతోనూ అతడు చేసిన పనులు, చెప్పిన కవితల కారణంగా అంతేస్థాయిలో దుష్కీర్తి కూడా వచ్చిరది.

దీపానికి వెలుగునిచ్చే గుణంతో పాటు కాల్చేగుణం కూడా ఉంటుంది కదా! ఈ రెండు గుణాలూ సమపాళ్ళలో మేళవించిన వ్యక్తిత్వం రామలింగకవిది. ఇదే ఆయన వ్యక్తిత్వంలోని వైశిష్ట్యం. రామలింగనిలోని పాండితీ ప్రకర్ష, ఆశుకవితా పటిమ, సమయోచిత ప్రజ్ఞలు ఒకవైపు; అతని అహంకారము, ఆత్మాతిశయము రెండవవైపు – ఏ విధంగా ఆయన వ్యక్తిత్వాన్ని విలక్షణంగా తీర్చిదిద్దాయో, యీ కారణంగా అనంతమైన సత్కీర్తితోబాటు అనివార్యంగా ఎంతటి దుష్కీర్తిని ఆయన మూటగట్టుకున్నాడో మనం ముందు ముందు చూస్తాం.



కీ॥శే॥ బి. యస్. రంగా నిర్మించిన

"తెనాలి రామకృష్ణ"

చలన చిత్రంలో



# భువన విజయము

విద్యానగరమనే మారుపేరు కల హంపి విజయనగరాన్ని పాలించిన తుళువ వంశ ప్రభువు శ్రీకృష్ణ దేవరాయలు సభామంటపం పేరు భువన విజయము. ఆయన పాలనా కాలంలో ఆ సభ నిత్యమూ విద్వద్గోష్ఠులతో పండిత ప్రకాండుల వాద ప్రతివాదములతో ఘోషిల్లేదట. కృష్ణరాయలు స్వయంగా మహాకవి. 'ఆముక్త మాల్యద' అనే గొప్ప కావ్యాన్ని రచించిన ఆయన రోజూ క్రమం తప్పకుండా కవిపండితులతో తన సభా మంటపంలో విద్వద్గోష్ఠులు నిర్వహించేవారు. దేశవిదేశాలనుండి వివిధ విషయాలలో ప్రతిభావంతులనూ, పండితులనూ తన సభకు రావించి, వారి ప్రతిభా పాటవాలను పరిశీలించి ఘనంగా సత్కరించి పంపేవాడాయన.

ఆ సమయంలో తెనాలిలో కొండవీటి సంస్థానపు స్థానిక పాలకుడు రావూరి రంగారెడ్డిని కలిసిన రామలింగడు తన కావ్య పరిపూర్తికి ఆర్థిక సహాయం పొందడంలో ఎలా విఫలమనోరథుడైనదీ లోగడనే మనం చెప్పుకున్నాం. తదుపరి కొండవీటి సంస్థానంలో తిమ్మరుసు మంత్రి మేనల్లుడు నాదెండ్ల గోపమంత్రి, ఊర దేచయ్యల వద్ద కూడా అతడికి అంతంత మాత్రపు ఆదరణే లభించింది. అయితే 'ఉద్భటారాధ్య చరిత్ర' కావ్యాన్ని మాత్రం వారి పరిపోషణలో ఎలాగోలా పరిపూర్తి చేయగలిగాడు.

తన పాండిత్యానికి తగిన గుర్తింపు లభించడం లేదనే కలత ఒకవైపు, దుర్భర దారిద్ర్యం మరోవైపు రామలింగడిని బాధపెట్టాయి. మార్గాంతరమేమిటా అని యోచించిన రామలింగనికి కళ్ళముందు 'విద్యానగరం' కదలాడింది.

# విద్యానగర ప్రశస్తి

తుంగభద్రా నదిని పంపా నది అని కూడా అంటారు. పంప ఒడ్డున నిర్మింపబడిన నగరం గనుక దీన్ని 'పంపి' అన్నారు. ఆధునిక కన్నడ భాషలో 'ప' ను 'హ' గా పలుకుతారు. (ఉదా : పల్లి – హల్లి, పాలు – హాలు) కనుక 'పంపి' 'హంపి' అయింది.

క్రీ।శ। 1117 నుండి 1156 వరకు ఆనెగొందిని పాలించిన విజయధ్వజుడనే రాజు తుంగభద్రా నదికి దక్షిణ ఒడ్డుననున్న హంపిలో తన పేర నిర్మించిన నగరమే హంపి – విజయనగరం.

క్రీ।శ। 1335లో హరిహరరాయలు, బుక్కరాయలు అనే యిద్దరు సంగమవంశ వీరులు ఈ నగరాన్ని పునర్నిర్మించారు. మాధవాచార్యులు అనే బ్రాహ్మణుడు వీరిద్దరికీ గురువు. ఆయన 'పరాశర స్మృతి'కి వ్యాఖ్యానము వ్రాయడమే కాక, 'సర్వదర్శన సంగ్రహ'మనే తొలి సమగ్ర భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాన్ని కూడా రచించాడు. ఆయన తమ్ముడు సాయణాచార్యులు వేదభాష్యకారునిగా సుప్రసిద్ధుడు. మాధవుడు సన్యాసాశ్రమం స్వీకరించి మాధవ విద్యారణ్యుడయ్యాడు. ఆయన హైందవ సామ్రాజ్య నిర్మాణానికి ప్రజల నుండి విశేషంగా విరాళాలు సేకరించి శ్రీ భాండాగారమనే పేరుతోనున్న ఆ నిధిని హంపి పునర్నిర్మాణానికి వెచ్చించాడు. విజయనగర తొలి పాలకులు సంగమ వంశీయులైన హరిహరరాయలు (1335-1350) బుక్కరాయలు (1350-1377). వీరిరువురి వద్దా మాధవ విద్యారణ్యుడు రాజగురువుగానూ, మంత్రిగానూ పనిచేశాడు. వారి గురువు పేరిట ఆ నగరానికి వారు 'విద్యానగరం' అని నామకరణం చేశారు. అలా హంపి విజయనగరం విద్యానగరమైంది. ఆనాటి రోమ్, లండన్, పారిస్ నగరాల కంటే విద్యానగరం ఎంతో భాగ్యవంతమైనదీ, సువిశాలమైనదీనని పాశ్చాత్య చరిత్రకారులు, యాత్రికులు తమ రచనలలో పేర్కొన్నారు

అక్కడ 1485 వరకు పాలించిన సంగమ వంశ రాజులు కవి పండితులకు కనకాభిషేకాలు చేసేవారు. 1485-90 మధ్య పాలించిన సాళువ నరసింహరాయలు పద కవితా పితామహుడు తాళ్లపాక అన్నమయ్యనూ, పిల్లలమర్రి పినవీరభద్ర కవినీ పోషించాడు. 1490-1506 మధ్య రాజ్యాన్నేలిన సాళువ నరసింహరాయల కుమారులిరువురూ పేరుకు మాత్రమే రాజులు. తుళువ నరసనాయకుడనే సేనాని వీరి తరఫున మొత్తం పాలనను నిర్వహించేవాడు. ఆయన 'వరాహపురాణం' వ్రాసిన నంది మల్లయ్య, ఘంట సింగయ్య అనే కవుల్ని పోషించాడు. నరసనాయకుని అనంతరం గద్దెనెక్కిన ఆయన పెద్ద భార్య కుమారుడు వీరనరసింహరాయలు రోజులలో రాజ్యం అంతఃకలహాలతోనూ, పర రాజుల దండయాత్రలతోనూ అతలాకుతలమైంది. తరువాత రాజ్యానికి వచ్చిన నరసనాయకుని రెండవ భార్య నాగులాంబిక కుమారుడు శ్రీకృష్ణ దేవరాయలు విజయనగరాన్ని నిజమైన విద్యానగరంగా తీర్చిదిద్దడానికి నడుం బిగించాడు. తన ఆస్థానంలో సంస్కృతాంధ్రకవులనే కాక కన్నడాది ఇతర దక్షిణ భారత భాషాకవులను కూడా పోషిస్తూ తనను తాను కవిపండిత పోషణలో భోజునిగానూ, తన పాలనాకాలం సంస్కృతాంధ్రభాషా సాహిత్యాలకు స్వర్ణయుగంగానూ విలసిల్లజేశాడు. కవి పండితులకు పట్టుగొమ్మగా విద్యానగరాన్ని శ్రీకృష్ణదేవరాయలు తీర్చిదిద్దుతున్నారని తెలిసికొనిన మన రామలింగడు తన ప్రతిభావ్యుత్పత్తుల నిరూపణకూ, ఉదరపోషణకూ విద్యానగరమే సరియైన వేదిక కాగలదని ఎంచి అక్కడికి సకుటుంబంగా ప్రయాణమయ్యాడు.

# హంపికి ప్రయాణం

హంపికి వెళ్ళే మార్గమధ్యంలో జరిగిన రెండు ఘటనలు రామలింగని జీవితాన్నే మార్చివేశాయంటారు. అవేమిటో చూద్దాం.

వీనిలో మొదటిది. మార్గాయసంతో దప్పిన రామలింగడు సేదదీరడానికి ఒక కాళికాలయంలోకి వెళ్తాడట. అప్పుడక్కడ కొందరు పల్లీయులు అమ్మవారి కొలుపుల పేరుతో ఓ మేకను బలి యివ్వబోతూంటే రామలింగడు, తానూ కాళీ ఉపాసకుడే అయినా, స్వతహాగా దయాళువైన కారణంగా, జంతుబలి అనాచారమని భావించి, ఆ బలిని అడ్డుకుని మేకను విడిపిస్తాడట. ఆ తదుపరి నిర్భయంగా "రక్తపిపాసివైన నీవు లోకమాతవెలా అయ్యావు? నీ బిడ్డల బలికోరే నీవు అసలు అమ్మవేనా?" అంటూ కాళికాదేవి విగ్రహాన్ని ప్రశ్నించగా దేవి ప్రత్యక్షమై "నీ ధైర్యసాహసాలు నాకు నచ్చాయి. నీకొక వరమిస్తున్నాను నా చేతులలో రెండు పాయసం పాత్రలున్నాయి. ఒకటి త్రాగితే విజ్ఞానం - మరొకటి త్రాగితే ధనం సంప్రాప్తిస్తాయి. మరి నీకేది కావాలో కోరుకో" అన్నదట. మన రామలింగడు ఆత్రంగా దేవి చేతుల్లోని ఆ పాత్రలు రెండూ లాగుకొని, విజ్ఞానం - ధనం రెంటినీ వాంఛించి, ఆ రెండు పాత్రలలోని పాయసాన్నీ కలబోసి త్రాగేశాడట. తర్వాత తాపీగా దేవితో "ఇప్పుడు నాకు విజ్ఞానమూ, ధనమూ - రెండూ లభిస్తాయిగదా?" అన్నాడట. అప్పుడు దేవి కోపంగా "నీవు వికటకవి వవుతావు. నీ విజ్ఞానం వినోదానికే ఉపయోగపడుతుంది. నీ ధనం పరులకే గాని, నీ సుఖానికి వినియోగించదు." అంటూ శపించిందట. ఈ ఘటనకు ఎట్టి హేతుబద్ధమైన ఆధారాలు లేని కారణంగా యిది పుక్కిటి కథ అని మనకు అర్థమవుతూనే వుంది. అయితే మన రామలింగ కవికి 'వికటకవి' అనే పేరు యీ విధంగా వచ్చిందని ప్రచారంలో వున్న కథ కనుక దీనినీ సందర్భంగా ప్రస్తావించవలసి వచ్చింది.

ఇక రెండవది. మార్గాయాసంతో అలసిన రామలింగడు నెల్లూరి సీమలో ఒక రాత్రి ఓ పూటకూళ్ళ ముసలమ్మ యింట బస చేశాడు. ఇతడెవరో - ఎక్కడివాడో - ఎక్కడికి - ఎందు నిమిత్తం వెళ్తున్నాడో తెలిసికొన్న ఆ అవ్వ "ఏమిటీ ! నీ పేరు రామలింగడా? కృష్ణరాయల ఆస్థానంలో ఆశ్రయంకోరి వెళ్తున్నావా?" అని వెటకారంగా అంటూ పకపకా నవ్వేసింది. రామలింగడికేమీ బోధపడలేదు. తర్వాత అవ్వే తాపీగా, "నీ వేషాన్నీ, పేరునూ బట్టి నీవు శైవుడవని తెలుస్తూనే ఉంది. కృష్ణరాయలా వీరవైష్ణవుడు. ఇలాగే వెళితే నీకు రాజాశ్రయం కాదుకదా - రాజదర్శనం కూడా లభించదు" అన్నది. వైష్ణవం స్వీకరించి రాయల వారి గురువైన తాతాచార్యులను మెప్పించగలిగితేనే పని సానుకూల పడుతుందని సలహా కూడా యిచ్చిందా అవ్వ. వెంటనే మన రామలింగడు తనపేరును రామకృష్ణుడని మార్చుకొని, ఆహార్యాన్నీ మార్చివేసి, అడ్డబొట్లు తీసి, నిలువు బొట్టు పెట్టి వైష్ణవునిగా కొత్త అవతారమెత్తాడు. అనంతరం ఎంతో ప్రయాసపడి రాజదర్శనం, అటుపైన పట్టుదలతో రాజాశ్రయం సాధించి రాయల వారి 'భువన విజయం' లోని అష్టదిగ్గజాలలో ఒకనిగా కీర్తిప్రతిష్ఠలను స్వంతం చేసుకున్నాడు మన రామకృష్ణయ్య. ఇదీ రామలింగడు రామకృష్ణుడైన వైనం.

# సభా ప్రవేశానికి పాట్లు - తాతాచార్యులతో శిగపట్లు

విద్యా నగరంలో రాయలవారి దర్శనం కోసం మన రామలింగం పడరాని పాట్లు పడ్డాడు. అప్పట్లో రాజధానిలో రాజకీయ వాతావరణం కొంత కల్లోలంగా వున్న కారణంగా రాజదర్శనం లభించడంలో బాగా జాప్యమయింది. ఆ రోజులలో విజయనగరంలో వైష్ణవానిదే పై చేయి. రాయలవారి వజ్రసింహాసనం కన్నా వారి గురువులైన తాతాచార్యులవారి

ధర్మాసనమే ఒక బెత్తెడు ఎత్తుగా ఉండేదట ! రాయలు వీర వైష్ణవుడు. రాజకీయ వ్యవహారాలలో వైష్ణవమత గురువుల మాటకున్నంత విలువ రాయలమాటకు కూడా వుండేదికాదట. 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' రచించిన ఉద్దండ పండితుడైన వీరశైవుడు ధూర్జటి మహాకవి వంటి వారికి మాత్రం మత వివక్ష లేకుండా రాయల సభలో అపార గౌరవం లభించేదట. రాయలవారి సముఖం లభించాలంటే వైష్ణవ మత గురువుల్నో, మంత్రుల్నో, రాయలవారితో చనువున్న ఆస్థానకవుల్నో ఆశ్రయించాలి. అప్పట్లో రాయలవారి ఆస్థానంలో 'సిఫారసు'లకు చాల విలువున్నట్లు కనుపిస్తున్నది. ఎందుకంటే తరువాతి కాలంలో అష్టదిగ్గజాలలో ఒకనిగా రూపొందాడని భావించబడుతున్న కందుకూరి రుద్రకవి అనే శైవునికి రాయలవారికి స్వయంగా క్షురకర్మ చేసే మంగలి కొండోజి సిఫారసుతోనే మొదటిసారి రాజదర్శనం లభించిందట ! రాజాశ్రయంకోసం మన రామలింగం అప్పటికే మతం మార్చుకొని రామకృష్ణుడయ్యాడు. పుట్టుకతో శైవుడైనా తరువాత వైష్ణవునిగా మారిన ప్రసిద్ధ వాగ్గేయకారుడు తాళ్లపాక అన్నమయ్య, పుట్టుకతో అద్వైతి అయినా విశిష్టాద్వైతం పుచ్చుకొని శఠగోపయతీంద్రుని శిష్యునిగా మారిన ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన ఈ విషయంలో మన రామలింగనికి ఆదర్శప్రాయులయ్యారు. మతం మార్చుకొని రామకృష్ణుడైనప్పటికీ చాల కాలం వరకు విద్యానగరంలో అతనిని రామలింగడనే వ్యవహరించినట్లుగా కనుపిస్తున్నది. అందుకేనేమో రామకృష్ణుని గూర్చిన కథలలో హెచ్చుభాగం అతనిని రామలింగడనే పేర్కొంటున్నాయి.

గుడిలోని దేవుణ్ణి దర్శనం చేసుకొనడానికి ముందుగా పూజారిని మంచి చేసుకోవాలి కదా ! అందుకని మన రామకృష్ణుడు ముందుగా తాతాచార్యుల వారి దర్శనం కొరకు ప్రయత్నించాడు.

ఇక్కడ తాతాచార్యుల వారిని గురించి కొంచెం చెప్పాలి. ఈయన జన్మస్థలం కాంచీపురం. ఇతడుగొప్ప విద్వాంసుడు, సంస్కృత కవి. ధర్మాత్ముడు. విష్ణువు అంశతో యీయన జన్మించాడని జనం అనుకునేవారట! వీరి యింటి పేరు తిరుమలవారు. అయినా తన ఖర్చుతో ఎందరెందరో బీదకన్యలకు వివాహములు చేయించిన కారణంగా వీరిని 'కన్యాదానం' వారని అనేవారట! ఈయన సంస్కృతంలో 'సాత్విక బ్రహ్మవిద్యా విలాసము' అనే గ్రంథం రచించాడట. ఈయన తన శిష్యులైన రాజులచేత బలప్రయోగం చేయించి ప్రజల్ని వైష్ణవంలోకి మారుస్తూ చక్రాంకణాదులు చేయిస్తూ వచ్చాడట. వైష్ణవ మత స్వీకరణకు గుర్తుగా కాల్చిన శంఖు-చక్ర ముద్రలను ప్రజల భుజముల మీదనో, వీపుపైనో, నాలుకల మీదనో వేయడాన్ని 'తప్త చక్రాంకితం' లేక 'తప్త చక్రాంకణం' అంటారు. "తాతాచార్యుల వారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు" అనే లోకోక్తి అందుకే ఏర్పడింది!

వైష్ణవులకు దక్క ఒరులకు శ్రీమాన్ తాతాచార్యుల వారి తిరుదర్శనం లభించటం చాల కష్టతరం. తొలిప్రయత్నంలో అప్పలాచార్యులు, పరాంకుశం వంటి ఉద్దండ పిండాలైన తాతాచార్యుల వారి శిష్యులు రామకృష్ణుడు శైవుడని పసిగట్టి గెంటేశారు. ఆ రోజులలో వైష్ణవ గురువుల మందిరాలు సానివారి శృంగార నృత్యగానాలతో నిత్యమూ సందడిగా వుండేవట. రెండవ తూరి రాధాసాని అనే వేశ్య అన్నమాచార్యుల వారు రచించిన శృంగార సంకీర్తనాలు ఆలపిస్తూ నృత్యం చేస్తూన్న సమయంలో పట్టుదలతో ఆమె యొక్క సంగీత బృందంలో ప్రచ్ఛన్నంగా చేరి మద్దెల వాని మారువేషంలో మందిరంలోకి ప్రవేశించాడు మన రామకృష్ణుడు.

గాయకుడు భైరవి రాగంలో శ్రావ్యంగా గానం చేస్తున్నాడు.
తదనుగుణంగా రాధాసాని నృత్యాభినయం చేస్తున్నది.

"వలచిన పతితోడ వాఁడి మాటలాడనోప
మలసి నా నవ్వులే మల్లెపూలు గాదా ?

గొప్పలు నా కుచములు కొండలఁ బోలుచనేలా ?
ఒప్పుగు పతిఁ గౌగిట ఒత్తనేలా ?
దప్పిదేర నవియే తామరలఁ బోలిచితే
నెప్పున మా యిద్దరికి నిచ్చపూజ గాదా ?వల ॥
మచ్చిక నా కనుచూపు మరునమ్ములననేల ?
నచ్చుదాఁక నా విభుని నాటించనేల ?
కచ్చుపెట్టి అవియే కలువలఁబోలిచితే
మచ్చికైన మాలోని మంచిపూజ గాదా ? వల ॥
తనువు తీగెయననేల తక్కక పొరయనేల ?
అనుగుఁ బూవుఁ గోమలిని అంటే మేలు
ఘనుఁడు శ్రీ వేంకటేశు కౌగిటఁ గూడితినేను
చనవున మాలోని సరిపూజ గాదా వల ॥

తాతాచార్యుల వారు ఆ గానానికీ, నృత్యాభినయానికీ ఎంతగానో ముగ్ధులై అన్నమాచార్యునిదే మరో శృంగార సంకీర్తనం చెప్పి అభినయించమన్నారు –

వేసాల వేంకటగిరి విభుదా
నే నుడివి చేసిన మన్ననలిట్లే చిత్తగించరా
వాసన కస్తురి మేని వన్నెకాదా
నీ ఆశలే మాకు దక్కెనురా ...

దీనికి అనుగుణంగా నృత్యం చేస్తున్నప్పుడు రాధాసానికి ఎక్కడో సంగీతంతో శృతి కుదరక అడుగులు తప్పుగా పడ్డాయి. తాళం సరిగా లేదని ఆమె మద్దెలవానిని మందలించింది. 'ఆడలేని సానికి మద్దెల ఓడేలే !' అంటూ రామకృష్ణుడు 'లోపం నీలోనే ఉంచుకుని తాళం సరిగా లేదంటే ఏం లాభం?' అంటూ తిప్పి కొట్టాడు చమత్కారంగా. దీంతో రాధాసానికి తన మాటకెదురు చెప్ప సాహసించిన ఆ మద్దెలవాడు తన సంగీత బృందంలోని వాడు కాదని అర్థమైపోయింది. ఆమె తాతాచార్యుల వారికి ఆ వేషగాడిని తక్షణం బయటకు గెంటించమని ఫిర్యాదు చేసింది. శ్రీమాన్ తాతాచార్యుల వారు ఈ గొడవతో తమ 'ఏకాంతసేవ' కు భంగం కలిగిందని మన రామకృష్ణయ్య పై ఆగ్రహోదగ్రులయ్యారు. రామకృష్ణయ్య ఎంతగా ప్రాధేయపడినా వినకుండా 'ఈ లింగడిని మందిరం నుండి గెంటేయండి' అని ఆజ్ఞాపించారు. ఆనాటి నుండీ రామలింగడి పేరు ప్రస్తావించినా తాతాచార్యులవారు మండిపడేవారట.

ఇక మన రామకృష్ణుడు ప్రసిద్ధి చెందిన వడహల వైష్ణవ గురువు భట్టరు చిక్కాచార్యుల నాశ్రయించి వైష్ణవ మత దీక్ష తీసుకున్నాడు. నాటి వైష్ణవంలో రెండు తెగలుండేవి. తెంగల – లేక తెన్‌కలై లేక తెంగలై (తెన్ అంటే తమిళంలో

దక్షిణ దిక్కు. కలై అంటే భాష. అంటే దక్షిణ భాషయైన తమిళం.) వడహల - లేక వడకలై లేక వడగలై (వడ అంటే తమిళంలో ఉత్తర దిక్కు. వడకలై అంటే సంస్కృత భాష.) పేరుతో ఈ శాఖలుండేవి. విశిష్టాద్వైత ప్రవక్త రామానుజుని అనంతరం వైష్ణవంలో యీ శాఖా భేదాలు మరింత విస్పష్టంగా మారాయి. వడహల శాఖకు వేదాంత దేశికర్ నాయకుడు కాగా తెంగల శాఖకు మనవాళ ముని నేతృత్వం వహించాడు. దక్షిణ భారతదేశంలో యీ రెండు శాఖలూ క్రీ శ। 14,15 శతాబ్దాల్లో విజృంభించాయి. రెండూ ముక్తి సాధనకు మార్గంగా భక్తినే ఎంచుకున్నా మత, సాంఘిక విషయాలలో వీటివి భిన్నమైన అభిప్రాయాలు. తెంగల శాఖ వారు తమిళ సంప్రదాయాన్ని పాటించేవారు. వేదప్రామాణ్యాన్ని వీరు అంగీకరించరు. తమిళ దివ్య ప్రబంధాన్నే వీరు మూలాధారంగా స్వీకరించారు. కులవ్యవస్థను వీరు పాటించరు. కాగా వడహల శాఖ వారు సంస్కృత సంప్రదాయాన్ని పాటించేవారు. వీరు వేదాల్ని విశ్వసిస్తారు. ఏ కులం వారు వారి ధర్మాలను సక్రమంగా నిర్వర్తించడానికి కులవ్యవస్థ అవసరం అంటారు వీరు. ఆచారాలు, ఆహార్యంలోనే కాక తిరునామం ధరించే విషయంలో కూడా వీరి మధ్య స్పష్టమైన భేదాలుండేవి. తెంగల నామం - వడహల నామం వేరువేరుగా ఉండడం వలన చూడగానే వారే శాఖీయులనేది తెలిసిపోయేదట (మరిన్ని వివరాలకు చూ. అనుబంధం - వైఖానసులు). తాతాచార్యుల వారిది తెంగల సంప్రదాయం. ఆయన మీది కసికొద్దీ రామకృష్ణుడు వడహల శాఖకు చెందిన చిక్కాచార్యుల వారి శిష్యునిగా చేరడంతో తాతాచార్యుల వారికి మన రామకృష్ణయ్యపై కోపం మరింత ఎక్కువయింది. నాటినుండి వీరిరువురి మధ్య పెరిగిన వైరం, జరిగిన స్పర్ధల గురించి ఎన్నెన్నో కథలు ప్రచారంలోకి వచ్చాయి. వీటిలో కొంత మేరకు సత్యం ఉన్నా హాస్యం కోసం కల్పించినవెక్కువే వుండివుండవచ్చు. అయితే రామకృష్ణుని సమయస్ఫూర్తి, హాస్యోక్తి, ఆశుకవితాపటిమను చాటిచెప్పే ఈ కథలు తెలుగు వినోద కథా సాహిత్యంలో వెలలేని రత్నాలు.

తన శైవ మూలాల కారణంగా తాతాచార్యుల వారి నిరాదరణకు గురై రాజసభా ప్రవేశానికి నోచుకొనని రామకృష్ణుడు నాదెండ్ల గోపమంత్రి సిఫారసు మేరకు అతని మేనమామ అయినట్టి మహామంత్రి తిమ్మరుసును కలిశాడు. తిమ్మరుసుకూ, రామకృష్ణుని పూర్వీకులకూ ఎక్కడో దూరపు బంధుత్వం ఉందట. రామకృష్ణుని తండ్రి గార్లపాటి రామన్న మంత్రికీ, తిమ్మరుసుకూ కొంత స్నేహం కూడా ఉండేదట. వరుసకు మనుమడైన రామకృష్ణుడిని సాదరంగా చేరదీసిన తిమ్మరుసు ఆనాటి కల్లోల రాజకీయ వాతావరణం కారణంగా సభాప్రవేశం అంత సులువేమీ కాదనీ, తగిన అవకాశం కోసం వేచిచూడమనీ రామకృష్ణునికి సలహా యిచ్చాడు.

## సభలో రామకృష్ణుడు

రాజసభలో రామకృష్ణునికి తన సమయస్ఫూర్తినీ, ఆశుకవితా పటిమనూ - రెంటినీ ఏకకాలంలో ప్రదర్శించే సువర్ణావకాశం రానే వచ్చింది. ఒకనాడు కృష్ణరాయలు నిండు సభలో కొలువుదీరాడు. తాతాచార్యుల వారితో వైరం కారణంగా సభా ప్రవేశానికి నోచుకొనని మన రామకృష్ణయ్య సభాంగణానికి ఆవల ఎక్కడో వెనుక వరుస చూపరులలో నుంచి నిక్కి చూస్తున్నాడు. ఆ రోజు ఓ వివాదం విచారణకు వచ్చింది. మరణించిన ఒక రాజోద్యోగికి ముగ్గురు కుమారులున్నారట. ఆ రాజోద్యోగి మరణించే ముందు వ్రాసిన పత్రం (మరణ శాసనం) ప్రకారం తనవద్ద వున్న పదిహేడు ఏనుగులలో సగభాగం పెద్దవానికి, మూడవ వంతు రెండవవానికి, తిరిగి అందులో మూడవ వంతు చిన్నవానికి పంచాలని వుంది. పంచవలసింది 17 ఏనుగులు కనుక, జీవహింస చేయకుండా ఏనుగుల్ని పంచటం సాధ్యం కాదు కనుక ధర్మనిర్ణేతలకు ఏం తీర్పు చెప్పాలో పాలుపోలేదు. "ఆ రాజోద్యోగి అమాయకుడు కాదు. పై పెచ్చు ప్రభుభక్తి పరాయణుడు; కనుక ఇలా

ఆచరణసాధ్యం కాని నియమాలతో పత్రం వ్రాయడం వెనుక నిగూఢమైన అంతరార్థం వుంది. ఈ విధమైన పంపిణీ సాధ్యం కాదు కనుక ఆ 17 ఏనుగుల్నీ దివాణం వారే స్వీకరించాలని మరణించిన ఆ రాజోద్యోగి ఉద్దేశ్యమై వుంటుంది. కనుక రాయల వారే వాటిని స్వీకరించాలి" అని తాతాచార్యులవారు ధర్మ నిర్ణయం చేశారు. ఈ నిర్ణయాన్ని అధిక్షేపిస్తూ ఇది అన్యాయమని మన రామకృష్ణుడు అశేష జనసామాన్యంలోని వెనుక వరుసల నుండి బిగ్గరగా అరచాడు. సభా నిర్ణయా[న్ని] అన్యాయమని తప్పుబట్టిన వారెవరో - వారిని తనముందు నిలుపమని రాయలవారు ఆదేశించారు. సభ చేసిన ధర్మ నిర్ణ[యం] ఏ విధంగా తప్పో తెలిపి యీ వివాదానికి పరిష్కారమేమిటో సూచించమని కోరారు రా[య]లవారు. ఇకనేం - మన రామకృష్ణుని రొట్టె విరిగి నేతిలో పడ్డట్లయింది. జీవహింస జరుగకుండానే ఏనుగుల పంపిణీ సాధ్యమేనని తెలిపి రామకృష్ణుడు 17 ఏనుగు బొమ్మలను తెప్పించి, 'రాయలవారే స్వయంగా భద్రగజంపై ఈ పంపిణీకి విచ్చేస్తే ఎవరికీ అభ్యంతరముండబోదు కదా!' అంటూ మరొక ఏనుగు బొమ్మను కూడా వాటిలో కలిపాడు. రామకృష్ణునికి రాజ సముఖం లభించినందున అప్పటికే క్రోధంతో రగులుతూన్న తాతాచార్యులవారు "పంచవలసింది 17 ఏనుగులే. మరి 18 ఏనుగు బొమ్మలు ఎందుకు?" అంటూ హూంకరించారు. రామకృష్ణుడు చటుక్కున "ఆచార్యా ! పంచబడేది కూడా 17 ఏనుగులే. చూడండి" అని సమాధానమిచ్చి తన పనిలో నిమగ్నమయ్యాడు. "పెద్దవాడి సగపాలు అంటే 18లో సగం '9' - రెండవాడి మూడవవంతు అంటే 18లో మూడవ వంతు '6' - తిరిగి దీనిలో మూడవపాలు అంటే '6'లో మూడవ పాలు '2'. అక్కడికి 9+6+2 - మొత్తం పంచబడిన ఏనుగులు 17. ఇక మిగిలింది శ్రీవారి భద్రగజం. అది శ్రీవారిపాలు" - అని ఇలా సమయస్ఫూర్తితో పెద్ద సమస్యను తృటిలో పరిష్కరించి రాయల వారి సభాగౌరవాన్ని కాపాడాడు. రాయలు ఎంతో ముగ్ధుడై ఇకపై రామకృష్ణుని తన ఆస్థానంలోనే ఉండిపొమ్మని కోరాడు. ఇలా కలిసివచ్చిన అదృష్టానికి తబ్బిబ్బై ఆనందం పట్టలేక కృష్ణరాయలపై అప్పటికప్పుడు ఆశువుగా ఓ పద్యాన్ని వినిపించాడు. అతని నోటివెంట ఆశువుగా వెలువడిన ఆ పద్యం ఆంధ్రసాహిత్యంలోని అనర్ఘరత్నాలలో ఒకటి. చూడండి ఆ కంద పద్యాన్ని -

క॥ నరసింహ కృష్ణరాయని
కరమరుదగు కీర్తియొప్పెఁ గరిభిద్గిరిభి
త్కరి కరిభి ద్గిరి గిరిభి
త్కరిభిద్గిరిభిత్తురంగ కమనీయంబై

కృష్ణరాయల కీర్తి ఎంత స్వచ్ఛమైనదో - ఎంతటి కమనీయమైన తెల్లదనం కలదో చెప్తూ అతితెల్లనైన వాటితో ఆ సత్కీర్తిని పోల్చాడు. 'నరసింహ కృష్ణరాయలు' అంటే తుళువ నరసనాయకుడు అను నామాంతరంగల నరసింహరాయలు కుమారుడైన కృష్ణరాయలు అని అర్థం. దక్షిణ భారతదేశంలో అప్పటికే ప్రతివారూ తమ పేరుకు ముందు తండ్రి పేరును జోడించడం అలవాటుగా ఉంది. అతి తెల్లనైన కృష్ణరాయల కీర్తితో ఆరు అంశాలకు సామ్యాన్ని కల్పించాడు రామకృష్ణుడు.

కరిభిద్ - ఏనుగును చంపినవాడు - అంటే గజాసురుణ్ణి సంహరించిన శివుడు. పురాణాల ప్రకారం శివుడు తెల్లనైనవాడు. హాలాహలం మిగడం కారణంగా నల్లనైన కంఠం కలవాడు కనుక నీలకంఠుడు, నీలగ్రీవుడు వగైరా పేర్లతో పిలువబడ్డాడు. సంస్కృతములో నీల అంటే నల్లని. నీలమేఘశ్యాముడైన కృష్ణుడు నల్లని వర్షుకాభ్రం యొక్క చాయగలవాడు అయితే మన చిత్రకారులు శివుడినీ, కృష్ణుడినీ ఆకాశపు నీలం రంగులో చిత్రిస్తుంటారు. ఇది తప్పు. శివుడు పురాణాల్లో వర్ణించిన ప్రకారం తెల్లనివాడు. కృష్ణుడు నల్లనివాడు.

గిరిభిత్ కరి – గిరిభిత్ అంటే ఇంద్రుడు. ఒకప్పుడు పర్వతాలన్నిటికీ రెక్కలుండేవట. అవి తమ రెక్కల సాయంతో ఒక చోటి నుండి మరొక చోటికి ఎగురుతూ జనావాసాలపై వాలుతూ, విపరీతమైన జననష్టం కలుగజేస్తూంటే ఇంద్రుడు జనసంక్షేమాన్ని కోరి తన వజ్రాయుధంతో ఆ పర్వతాల రెక్కలు తెగనరికాడట. అప్పటినుండి అవి ఉన్నచోటి నుంచి కదలక ఎక్కడివక్కడే స్థాణువులై అచలములనే పేరు పొందాయి. గిరులను భేదించిన ఇంద్రుణ్ని 'గిరిభిత్' అన్నారు. గిరిభిత్ కరి అంటే ఇంద్రుని ఏనుగైన ఐరావతం. ఇది అత్యంత తెల్లనైనది. పాల సముద్రాన్ని మదించిన సందర్భంలో ఇది ఉద్భవించిందట.

కరిభిద్ గిరి – గజాసుర దమనుడైన శివుని కొండ – హిమాలయాల్లోని కైలాసగిరి – ఎప్పుడూ మంచుతో కప్పబడి ఉండటాన అత్యంత తెల్లనైనది.

గిరిభిత్ – పర్వతాల్ని ఛేదించిన ఇంద్రుని వజ్రాయుధం – దధీచి మహర్షి వెన్నెముకతో తయారైన ఈ ఆయుధానికి 'శతాధార' అనే మరొక పేరుంది. వంద అంచులతో తళతళ మెరుస్తూ ధవళకాంతులీనే యీ వజ్రాయుధమే ఇంద్రుని చేతిలోని పిడుగు అనబడింది.

కరిభిద్గిరిభిత్తురంగ – ఇక్కడ కరిభిద్ – గిరిభిద్ – యీ రెండు శబ్దాలకూ తురంగ శబ్దాన్ని వేర్వేరుగా జోడించి కరిభిత్తురంగ మరియు గిరిభిత్తురంగ అని మనం అన్వయార్థం చెప్పుకోవాలి.

కరిభిత్తురంగ – అన్న శబ్దంలో తురంగము అంటే వాహనము అని అర్థం. కరిభిత్ (శివుని) తురంగము అంటే శివుని వాహనము – అంటే అత్యంత తెల్లనైన నందీశ్వరుడు.

గిరిభిత్తురంగ – గిరిభిత్ (ఇంద్రుడు) తురంగము అంటే ఇంద్రుని గుర్రమైన ఉచ్చైశ్రవము. ఇదికూడా క్షీరసాగర మథనంలోనే ఉద్భవించింది. అతి తెల్లనైనది.

ఇలా కృష్ణరాయల కీర్తి అత్యంత తెల్లగా కమనీయమై ఒప్పింది అని భావం.

ఈ పద్యం విన్న కృష్ణరాయల ఆనందానికి అంతు లేకుండా పోయింది. రాజకవీ, రసప్రవిష్టుడూనైన రాయలు రామకృష్ణుని కవితా గరిమను గుర్తించి అప్పటికప్పుడే అతనికి అఖండ సన్మానాన్ని చేసి అతనిని తన సభయైన 'భువన విజయం'లో నిత్యమూ జరిగే కవితాగోష్ఠులలో పాలుపంచుకొనవలసినదిగా సమాదరంగా ఆహ్వానించాడు.

## భువన విజయంలోని కవి పండితులతో

ఈ సందర్భాన్ని మరోరకంగా కూడా తనకు అనుకూలంగా మలచుకున్నాడు మన రామకృష్ణయ్య. కృష్ణరాయలను కీర్తించి ఆయన మనసు దోచుకున్నట్లే, భువన విజయంలో అష్టదిగ్గజాలనే పేరుతో ప్రసిద్ధులైన కవులలో ప్రముఖులూ, అప్పుడే తనకు పరిచయమైన అల్లసాని పెద్దన, నంది తిమ్మనలను కూడా ఉచితరీతిని తన ఆశుకవితలతో ప్రస్తుతించి వారి మనసులను కూడా దోచుకున్నాడు. అలా సభలోనూ, వారి మనసుల్లోనూ చల్లగా తిష్టవేశాడు. 'మనుచరిత్ర'ను వ్రాసి 'ఆంధ్రకవితా పితామహ' అనే బిరుదుగాంచిన అల్లసాని పెద్దనను గూర్చి గౌరవపురస్సరంగా రామకృష్ణుడు ఆశువుగా చెప్పిన ఈ పద్యం చూడండి. తిక్కనతో సమానంగా ఆయన్ని గౌరవిస్తూ ఎంత హృదయంగమంగా చెప్పాడో –

క॥ కవి యల్లసాని పెద్దన
కవి తిక్కన సోమయాజి గణుతింపంగా c
గవి నేను రామకృష్ణుcడc
గవియను నామంబు నీరుకాకికి లేదే ?

"ఎంచితే అల్లసాని పెద్దన, తిక్కన సోమయాజి మాత్రమే కవులు. నేనూ పేరుకు కవినే ! ఎందుకు? నీటికాకికి కూడా 'కవి' అనే పేరు లేదా? " - అని దీని భావం. దీన్ని విమర్శకులు కొందరు 'కవినేను రామకృష్ణుడ' అంటూ తాను పెద్దన, తిక్కనలతో సరిసాటివాడినని సగర్వంగా ప్రకటించుకొనడమని అంటారు. కాని ఈ పద్యంలో రామకృష్ణుడు పెద్దన, తిక్కనల పట్ల ఎంతో గౌరవభావంతో వినమ్రంగా వారిముందు తానెంత? అంటూ ఆత్మన్యూనత చేసుకున్నాడని నా అభిప్రాయం.

ఇక 'పారిజాతాపహరణం' కావ్యాన్ని వ్రాసిన ముక్కుతిమ్మనను ప్రస్తుతిస్తూ ఆయన ఆశువుగా చెప్పిన పద్యం చూడండి -

క॥ మా కొలది జానపదులకు
నీ కవనపురీవి అబ్బునే కూపనట
ద్భేకములకు గగనధునీ
శీకరముల చెమ్మ ! నంది సింగయ తిమ్మా !

ఈ పద్యం విని ముగ్ధుడైన రాయలు స్వయంగా కవి కనుక 'గగన ధుని' స్థానంలో 'నాక ధుని' అంటే మరింత రమ్యంగా వుంటుందని సరిచేశాడట.

"నంది సింగయ కుమారుడవైన ఓ తిమ్మా ! నీ కవిత్వపు రీవి మా వంటి సామాన్యమైన పల్లీయులకెక్కడ అబ్బుతుంది? బావిలోని కప్పలమైన మాకు ఆకాశగంగ వంటి నీ కవితా ఝరితో తుంపరగానైనా సంపర్క మేర్పడే భాగ్యాన్ని కల్గించు" అని దీని భావం. నాకము అంటే స్వర్గము. ఆకాశగంగను 'గగన ధుని' అనీ, 'నాక ధుని' అనీ అంటారు. ఇక్కడ 'గగన ధుని' అనే శబ్దం కంటే 'నాక ధుని' అంటేనే నప్పుతుంది. ఇక్కడ 'నాక ధుని' అంటేనే 'భేక' శబ్దంతో అనుప్రాస ఏర్పడుతుంది. ఈ సవరణను కృతజ్ఞతలతో స్వీకరించాడు రామకృష్ణయ్య.

ఈ పద్యం ముక్కు తిమ్మనపై ఎవరో అజ్ఞాతకవి చెప్పినట్లుగా కొందరు భావిస్తున్నారు. అయితే ఈ కంద పద్య రచనా ధోరణి చూస్తే ప్రస్ఫుటంగా అది రామకృష్ణునిదే ననిపించకపోదు. అంతేగాక 'గగనధునీ శీకరము' అనే పదబంధ ప్రయోగాన్ని 'ఉద్భటారాధ్య చరిత్రము'లో రామలింగ కవి మరో విధంగా ఎలా చేశాడో చూడండి.

'గగన గంగా తరంగ శీకరము సోcకc
బావనుండగుc గాశిలోc బంచజనుcడు' (ఉద్భటారాధ్య చరిత్రము 2 - 88)

అలాగే రామకృష్ణుడు చేసిన ఈ క్రింది పద ప్రయోగాలు కూడా చూడండి.

సీ॥ గగన గంగోత్తుంగ కల్లోల రేఖయు
మల్లికా దామంబు మౌళి నమర (ఉద్భటారాధ్య చరిత్రము 2 - 73)

మరో ప్రయోగం చూడండి...

సీ॥ 'అభ్రగంగా ప్రవాహంబు లెన్నియొ కాని' (ఉద్భటారాధ్య చరిత్రము 2 - 87)

ఇంకా గంగానదిని ప్రస్తావించిన చోటల్లా 'గగనధుని', 'అనిమిష గంగ' (2-110), 'అభ్రగంగ' (2-100) 'అమరాపగ' (అమర + ఆపగ (నది) = దేవలోకపు నది) (2-76, 2-98).

అలాగే యింకా 'గగన గంగ', 'గగన ధుని', 'నాక ధుని' అని వాడడం ఆయనకు మాత్రమే స్వంతమైన ప్రయోగ పద్ధతిగా కనుపిస్తూంది.

ఈ విధంగా 'భువనవిజయం'లో తిష్టవేశాడు మన రామకృష్ణయ్య.

# ధూర్జటి మహాకవికి చురకలు

రామకృష్ణయ్య ఎవరినైనా పొగడినా తెగడినా అందులో కొంచెం అతి ధోరణి కనుపిస్తుంది. పొగడినా తెగడినా తానే చేయాలి. తన ఎదుట వేరొకరిని పొగడుతుంటే సహించలేకపోయేవాడట. మరీ ముఖ్యంగా రాయలవారెవరినైనా పొగడితే తన అక్కసంతా వెళ్ళగక్కేవాడట రామకృష్ణయ్య.

"శ్రీకాళహస్తి మాహాత్మ్యం" కావ్యాన్ని వ్రాసిన ధూర్జటి మహాకవి పరమ శివభక్తుడు. గొప్పపండితుడు. ఆ కావ్యంలో అడుగడుగునా ఆ మహాకవి పాండిత్యంతో పాటు ఆయనకున్న అపార లౌకిక అనుభవమూ, సామాజిక దృష్టీ మనకు ద్యోతకమవుతాయి. రాయలవారు వీరవైష్ణవుడైనా, వీరశైవుడైన ధూర్జటి మహాకవిని గురుభావంతో సమాదరించడానికి కారణం ధూర్జటి పాండితీ ప్రకర్షయే. వయస్సులో కూడా పెద్ద అయినందున సభలో అందరికీ ఆయనంటే గౌరవభావముండేది. అయితే ధూర్జటి మహాకవి వేశ్యాలోలునిగా ప్రసిద్ధికెక్కాడు. ఆయన అస్తమానం సానివాడలలో పొద్దుపుచ్చేవాడట. ఆయన కావ్యంలోని శృంగార వర్ణనలు, చెంచితల సోయగాల వర్ణనలు ఈ రంగంలో ఆయనకున్న అపార స్వీయానుభవాలకు దర్పణం పడతాయి.

ఓ రోజు సభలో కవితా పారాయణం జరుగుతున్నది. రాయలవారి అనుమతితో తాను వ్రాస్తూన్న 'శ్రీకాళహస్తి మాహాత్మ్యము' నుండి కొన్ని రసవద్ఘట్టాలను వినిపిస్తున్నాడు ధూర్జటి.

"ఆ కారడవిలో ఏదిక్కూ లేకుండా పడివున్న శివలింగాన్ని తిన్నడు తన పల్లెకు రమ్మని ప్రార్థిస్తూ -

గీ॥ "చుఱుకుఁ జూపునఁ గాలిన కొఱతనుఱుకు<br>నుఱుకుఁ జూపులఁ బుట్టించు నెఱుకువారి<br>ఇఱుకు వలిగుబ్బ పాలిండ్ల ఇగురుఁ బోండ్ల<br>సేవకిచ్చెద నీకు విచ్చేయుమయ్యా . . . !" (కాళహస్తి మహాత్మ్యము : 3-71)

అది విన్న రాయలు ధూర్జటి మహాకవే మధురమైన పదప్రయోగాలకు మంత్రముగ్ధుడై -

చ॥ "స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో<br>అతులితమాధురీ మహిమ -

అంటూ యింకా ఏదో పొగడబోతూంటే రామకృష్ణుడు తన సహజ ధోరణిలో అడ్డుకుని

"హా తెలిసెన్ . . . భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సం
తత మధురాధరోదిత సుధారసధారల గ్రోలుటంజుమీ."

అంటూ ఆ పద్యాన్ని పూరించి ధూర్జటి కవితా మాధుర్యానికంతటికీ కారణం ఆయన నిత్యమూ సానుల అధరామృతాన్ని గ్రోలడమేనని తేల్చిపారేశాడు. ధూర్జటితో రామకృష్ణునికి వైరమేమీ వున్నట్లు లేదు. ఇలాంటి విమర్శలు చేసినా రామకృష్ణుడు ధూర్జటిని "తాతా !" అంటూ గౌరవంగా సంబోధించేవాడట. ధూర్జటికూడా రామకృష్ణుని మనుమనిలా భావించేవాడట. బహుశా రామకృష్ణుని వీరశైవ మత నేపథ్యం కూడా వారిద్దరి సాన్నిహిత్యానికి కొంత వరకూ కారణం కావచ్చు.

## తాళ్లపాక కవుల ప్రస్తుతి

తెనాలి రామకృష్ణకవి తాళ్లపాక కవుల్ని ప్రస్తుతిస్తూ చెప్పిన పద్యం సుప్రసిద్ధం.

ఈ పద్యం కారణంగా రామకృష్ణుడు ఇతరుల కవిత్వంలోని గుణములను గ్రహించి, శ్లాఘించే గుణగ్రహణ పారీణుడని విశదమౌతూంది.

క॥ చిన్నన్న ద్విపద కెఱఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్య శ్రేణిన్.

పదకవితా పితామహుడైన అన్నమాచార్యుని రెండవ భార్య కుమారుడైన పెదతిరుమలయ్య (క్రీ శ 1460-1546) తండ్రి మార్గాన్నే అనుసరించి అద్భుతమైన పదకవితలు వెలయించాడు. అతి వైభవంగా జీవించిన యీయన అప్పాజీ తిమ్మరుసును అవసాన కాలంలో ఆదుకున్నాడట. ఈయన కృషి కారణంగానే అన్నమయ్య కృతులు రాగిరేకులపై వ్రాయించబడి భవిష్యత్ తరాలకు చెక్కుచెదరని అమూల్య సంపదగా నిలిచాయి. అంతేకాదు పెద తిరుమలయ్యా లాక్షణికుడు కూడా. సంకీర్తనలు వ్రాయడమే కాక తెలుగు భాషలో మొదటిసారిగా బండి 'ఱ' ల జాబితా తయారు చేశాడట ఎక్కడ 'సాధురేఫ' (ర) వాడాలో ఎక్కడ 'శకటరేఫ' (ఱ) వాడాలో 53 పద్యాలలో అకారాదిగా వ్రాశాడట.

పెద తిరుమలయ్య నాల్గవ కుమారుడు చిన్నన్న (మరణం క్రీ శ 1565) తాళ్లపాక కవులందరిలోకీ సుప్రసిద్ధుడు. ఇతడిని చిన తిరువేంగళనాథుడు అని కూడా అంటారు. ద్విపద కవితలు చెప్పడంలో యితను దిట్ట. 'అష్టమహిషీ కళ్యాణం', 'పరమయోగివిలాసం' అనే రెండు ద్విపద కావ్యాలనీయన వ్రాశాడు. హంపి-విజయనగర వైభవానికి గ్రహణం పట్టి రాక్షసి తంగడి యుద్ధంలో అళియ రామరాయలు ఓడిన సంవత్సరమే ఇతను మరణించాడు.

ఇకపోతే పద్యగద్యాలలో మిన్నంటి మ్రోగిన కవిత్వాన్ని వెలయించాడని రామకృష్ణునిచే ప్రస్తుతించబడిన నరసింగన్న రచనలు ఏమిటో తెలియరావడంలేదు. ఇతడు అన్నమాచార్యుని పెద్ద భార్య కుమారుడు. కడపజిల్లా పులివెందుల

తాలూకా సుంకేసుల గ్రామంలో స్థిరపడి యితడే సంకుసాల నరసయ్యపేరుతో ప్రసిద్ధుడయ్యాడంటారు. అదే నిజమైతే, ఈయన "కవికర్ణ రసాయన" మనే ఆరు ఆశ్వాసాల ప్రబంధాన్ని రచించాడు.

# ముక్కు తిమ్మన, భట్టుమూర్తిలతో పేచీలు

ఓసారి ముక్కుతిమ్మన ఊయల మంచం పైన కూర్చొని ఉండగా అప్పుడే భోజనం ముగించి తాంబూల సేవనం చేస్తూ రామకృష్ణుడక్కడికి వెళ్లి "తాతా ! ఊతునా?" అని అడిగాడట. ఊయల ఊపుతానంటున్నాడేమోనని "ఊఁ" అన్నారట తిమ్మన. ఊతునా? అంటే "నిష్ఠీవనం చేయనా?" అనే శ్లేషార్థానికి ప్రాధాన్యమిచ్చి రామకృష్ణుడు తిమ్మనపై ఉమ్మాడట. తిమ్మన కోపంతో రామకృష్ణుని ముఖంపైకి తన కాలి పాంకోడు విసిరాడట. రామకృష్ణుని ముందరి పళ్లలో ఒకటి రాలింది. అవమానకరమైన ఈ ఘటన ఎలాగో కప్పిపుచ్చుకొని ఎవ్వరికీ తెలియదనుకొన్నాడు రామకృష్ణకవి. కొన్నాళ్ల తర్వాత ఓ రోజు సభలో రాయలవారు "రవి గానని చో కవి గాంచునే కదా !" (సూర్యుడుసైతం చూడని తావుల్ని కవిచూస్తాడు కదా!) అనే సమస్యనిచ్చారట. అప్పుడు ఎంతకాలం నుంచో అవకాశంకోసం కాచుకు కూర్చున్న భట్టుమూర్తి అనే కవి రామకృష్ణునిపై కసితో పైన తెలిపిన అవమానకర ఘట్టాన్ని బయటపెడుతూ ఆ సమస్యను చాతుర్యంతో యిలా పూరించాడట.

ఉ॥ ఆరవి వీరభద్రుని పదాహతి దుల్లిన బోసి నోటికిన్
నేరదు రామకృష్ణ కవి నేరిచెబో మన ముక్కుతిమ్మరాట్
క్రూరపదాహతింబడిన కొక్కిరి పంటికి దుప్పి కొమ్ముప
ల్లారచి యింపనౌర రవిగాననిచో కవిగాంచునే కదా!

ఇకపోతే భట్టుమూర్తికీ, తెనాలి రామకృష్ణునికీ ఎడతెగని పోరుగా వుండేదట. వారి కొక్క క్షణంకూడా సరిపడేది కాదట. (వీరి మధ్య వైరానికి సంబంధించిన మరిన్ని వివరాల కోసం 'కథలు-గాథలు' అధ్యాయంలోని 24వ కథ చూడండి.) భట్టుమూర్తి శతావధానానికి ఆద్యుడు. మహాకవి. అయితే భట్రాజు కులస్తుడట. ఇతడు 'వసుచరిత్రము' , 'హరిశ్చంద్ర నలోపాఖ్యానము' మొదలగు గొప్ప కావ్యాలను వ్రాశాడు. ఇతనికి రామరాజ భూషణుడనే మరొక పేరుంది. శ్రీకృష్ణదేవరాయల అల్లుడు, అళియ రామరాయలని పిలువబడిన రామరాజు యీ కవిని ఆదరించి పోషించడం కారణంగా అతనికా పేరు వచ్చింది. రామకృష్ణుడు భట్టుమూర్తి కులాన్ని తరచు ఆక్షేపించేవాడట. ఈ పద్యం చూడండి -

క॥ చీఁపర పాఁపర టీఁగల
చేఁపల బుట్టల్లినట్లు చెప్పెదు నీ యీ
కాఁపుఁ గవిత్వపుఁ గూఁతలు,
బాఁపన కవివరుని చెవిఁకిఁ(బ్రమదంబిడునే !

ఇక్కడ 'కాఁపు' అనే పదాన్ని రామకృష్ణుడు 'శూద్ర'కులం అనే భావంతో వాడాడు.

మరొక పద్యంలో భట్టుమూర్తిని అవహేళన చేస్తూ తనను తానొక సింహంగానూ, భట్టుమూర్తిని ఊరకుక్కగానూ చిత్రించాడు. ఆ కంద పద్యం చూడండి.

కII　కెంగేల రామకృష్ణుని
బంగరు కడియంబులుండఁ బండితుఁడగునా !
జెంగులు జెల్లులు గల్గిన
సింగారపు టూరఁగుక్క సింగంబగునా !

జెంగులు - జంగె లేక జంగియ అంటే గండపెండెరముల కుండే గజ్జెలు.

జెల్లులు - జెల్లి లేక జెల్లి పెండెము - అంటే ఒక పాదభూషణము.

రామకృష్ణునికి ఉన్నట్లు చేతులకు బంగారు కడియములుండగానే పండితుడవుతాడా? అలంకారంగా జెల్లులు, జంగులూ వున్నంత మాత్రాన సింగారపు ఊరకుక్క సింహం అవుతుందా?

# రెండు ప్రక్కలా పదునున్న కత్తి

భట్టుమూర్తి గొప్పకవే కాక సమస్యాపూరణంలో అందెవేసిన చెయ్యి. రామకృష్ణునిపై వ్యతిరేకతతో తాతాచార్యులవారు భట్టుమూర్తిని చేరదీశారట. వీరిరువురూ కలసి రామకృష్ణకవిని ఎన్నో తిప్పలు పెట్టి రాయల సమక్షంలో అస్తమానం అతనిని అవమానపరచాలని ప్రయత్నించేవారట. రామకృష్ణుడు ఎంతో చాతుర్యంతో వారు విసిరిన సవాళ్లను ఎప్పటికప్పుడు అధిగమిస్తూ అన్నిటా తనదే పై చేయి అనిపించుకొంటూ వచ్చేవాడు. ఈ కృషిలో రామకృష్ణునికి భట్టుమూర్తి పొడగిట్టని తిమ్మరుసు అండగా నిలిచేవాడట. ఒక రోజు రాయల వారు సభకు విచ్చేయడానికి చాల మునుపే తాతాచార్యుల వారు, భట్టుమూర్తి వచ్చి రామకృష్ణుడిని ఎలా చిక్కుల్లో పడవేయాలా అని సమాలోచించి దౌవారికునికి ఒక సమస్యనిచ్చి రామకృష్ణకవి రాగానే ఆ సమస్యను సంధించమన్నారు. అతడలాగే రామకృష్ణునికీ సమస్యనిచ్చాడు. పూరణ నిమిత్తం ఇచ్చిన ఆ సమస్య ఇది -

'కుంజర యూధంబు దోమ కుత్తుక జొచ్చెన్' (ఏనుగుల గుంపు దోమ గొంతులోకి వెళ్లింది)

రామకృష్ణుడు సమస్య విని, యిది అంతంత మాత్రపు పరిజ్ఞానం కల దౌవారికునికి పుట్టిన యోచన కాదని గ్రహించి భట్టుమూర్తి, తాతాచార్యుల వారి వంక నవ్వుతూ చూశాడు. తిరిగి ఆ ద్వారపాలకుని వంక కోపంగా చూస్తూ ఆ సమస్యనిలా పూరించాడు.

గంజాయి తాగి తురకల
సంజాతము చేత కల్లు చవిగొన్నావా?
లంజలకొడకా ! ఎక్కడ
కుంజరయూధంబు దోమకుత్తుక జొచ్చెన్?

ఆ ద్వారపాలకుడు తన తప్పు మన్నించమని రామకృష్ణుని వేడుకున్నాడు. తర్వాత కొద్దిసేపటికే రాయలవారు విచ్చేశారు. భట్టుమూర్తి సభలో ఈ సమస్యనే లేవనెత్తి దీనిని వికటకవియైన రామకృష్ణుడు పూరిస్తేనే ఉచితంగా ఉంటుదన్నాడు. ఎందుకంటే రాయల సమక్షంలో కూడా యీ పద్యమే చెప్పి అసభ్య పదజాలంతో పూరించడానికి ప్రయత్నిస్తే రామకృష్ణుడు రాయలవారి కోపాగ్నికి గురవుతాడని భట్టుమూర్తి ఆశ. అయితే అప్పుడు రామకృష్ణుడు తిరిగి తానే ఆ సమస్యని యిలా

సభ్యజన మనోరంజకంగా పూరించాడు -

రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటుకొల్వు పాలై రకటా
సంజయా ! విధి నేమందును?
కుంజర యూధంబు దోమకుత్తుక జొచ్చెన్.

"పాండవులు విధివశాన సకలమూ కోల్పోయి అజ్ఞాత వాసంలో విరాటరాజు కొలువులో చేరడం నిజంగా ఏనుగుల గుంపు దోమ గొంతుక లోనికి వెళ్లినట్టే వుంది, సంజయా !" అంటూ ధృతరాష్ట్రుడు సంజయునితో చెపుతున్నట్లు చేయబడిన ఈ పూరణాన్ని విన్న రాయలవారికంటే భట్టుమూర్తి, తాతాచార్యులు ఎక్కువగా నిర్ఘాంతపోయారు. ఎందుకంటే అంతకు కొద్దిసేపటి క్రితమే తిట్లతో అదే సమస్యను రామకృష్ణుడు పూరించడం వాళ్ళు విని వున్నారు. ఇలా రామకృష్ణుని కత్తికి రెండు వైపులా పదునే !

ఇంకొక సందర్భంలో భట్టుమూర్త్యాదులు తనకిచ్చిన "బలరాముడు సీతఁజూచి పక్కున నగియెన్" అనే సమస్యను కూడా రామకృష్ణుడు అంతే చమత్కృతితో పూరించాడట. ఇదేమిటి? బలరాముడు సీతను చూచి పక్కున నవ్వాడా? బలరాముడు ద్వాపర యుగానికి చెందినవాడు. సీతేమో త్రేతాయుగానికి చెందింది. వీరిద్దరూ ఎక్కడ తారసపడ్డారు? అనిపిస్తుంది కదా ! ఈ సమస్యను కూడా రామకృష్ణుడెంత చక్కగా పూరించాడో చూడండి -

'లలనలు పాయస మానిన
కలుగుదురే పిల్లల' నుచు క్ష్మాసుత నవ్వన్
'పొలమున దొరికెద'రని ధీ
బల రాముడు సీత జూచి పక్కున నగియెన్.

ఎంత చక్కగా సన్నివేశాన్ని అల్లాడో చూడండి. సీతా స్వయంవరానికి మిథిలా నగరానికి విశ్వామిత్రునితో కలసి రామలక్ష్మణులు వెళ్లారు. శివధనుర్భంగానికి ఒకరోజు ముందర ఉద్యానవనంలో చెలులతో ఆడుకుంటున్న సీత రామునికి ఎదురైంది. అంతకు ముందెప్పుడో దశరథుడు పుత్రకామేష్టి యాగం చేయగా యజ్ఞ పురుషుడు ప్రత్యక్షమై దశరథునికి ఒక పాయస కలశాన్ని ప్రసాదించడం, ఆ తరువాత ఆ పాయసాన్ని త్రాగిన రాణులు ముగ్గురూ రామ లక్ష్మణ భరత శతృఘ్నులను కనడం గురించి వినివున్న క్ష్మాసుత (సీత) రామునితో ఎగతాళిగా 'ఎక్కడయినా ఆడవాళ్ళకి పాయసం త్రాగితే పిల్లలు కలుగుతారా ?' అంటూ వెటకారంగా నవ్వింది.

దీనికి ప్రతిగా ధీ బల రాముడు - అంటే బుద్ధిబలం కల రాముడు - సీతతో 'లేదమ్మా ! పిల్లలు పాయసం త్రాగితే పుట్టరు. పొలంలో దొరుకుతారు' అని ఘాటుగా బదులిచ్చాడు. సీత జనక మహారాజుకి పొలం దున్నుతుంటే నేలలోని నెర్రెలోని ఒక పెట్టెలో దొరికిందని ప్రతీతి. అందుకే సీతను క్ష్మాసుత, భూసుత అంటారు. 'భూమిలో బిడ్డ దొరకడం సంభవమే అయితే పాయసం తాగితే పిల్లలు పుట్టడమూ అంతే సంభవం' అని ధీ బల రాముడు సీత ఎకసెక్కపు మాటల్ని తిప్పికొట్టాడు. నిజానికి ధీ బలరాముడు ఆ రఘురాముడు కాదు. ఈ సమస్యను తన కల్పనతో చమత్కారంగా పూరించిన మన రామకృష్ణుడే !

# రాయల వారి ఆంతరంగికుడైన శృంగార కవిగా

16వ శతాబ్దికి చెందిన పోర్చుగీసు యాత్రికుడు డామింగో పేయజ్ వర్ణించిన దాని ప్రకారం - రాయల వారికి 12 మంది ధర్మపత్నులట. వారిలో ముగ్గురు పట్టమహిషులు. వారిలో మొదటి భార్య తిరుమలదేవి శ్రీరంగ పట్టణ సామంత రాజు కుమార్తె. ఉమ్మత్తూరు యుద్ధం తరువాత రాయలీమెను పరిణయమాడినట్లు తెలుస్తూంది. రెండవ భార్య చిన్నాదేవి. ఆమె ఒక నాట్యగత్తె అనీ, కృష్ణరాయలకీమె ఆయన పట్టాభిషేకానికి ముందుగానే పరిచయమైన స్త్రీ అనీ, రాయలు గొప్ప వైణికుడు కావున - నాట్యంలో ఆమె, వీణావాదనంలో రాయలు ఒకరికొకరు పోటీపడి ఒకసారి ఆమె గెలువగా ఆమెకిచ్చిన వరం ప్రకారం తాను పట్టాభిషిక్తుడైన అనంతరం ఆమెను కూడా పట్టమహిషిగా స్వీకరించాడట. వీరుకాక రాజుగారి అంతఃపురంలో 12వేల మంది స్త్రీలుండేవారట. వీరు ఏ వృద్ధుడినో తప్ప ఏనాడూ మగవాని ముఖం చూసి ఎరగని వాళ్లేనట. ఈ స్త్రీలంతా రాయలవారి ఆనందం కోసమేనన్నమాట! వీరంతా ఎంతో అందంగానూ, ఎండకన్నెరుగనివారుగానూ ఉండేవారట.

ఓసారి రాయలు లావణ్యగణ్యయగు ఒక స్త్రీరత్నాన్ని బహుప్రయత్నముతో సాధించాడట. ఇందు పై తన విజయోల్లాసాన్ని రాయలు ఆమె వద్ద వెల్లడించగా అప్పుడా స్త్రీ "ఇంతకే అంతగా ఉప్పొంగవలెనా? అంతగా సంబర పడిపోవడానికిది ఏమైనా కటకమును పాలించే గజపతి కుమార్తెను సాధించటమా?" అని తేలనాడిందట. ఈ మాటలు రాయల హృదయానికి శూలాల్లా గుచ్చుకున్నాయి. ఆయన గజపతి కుమార్తెను సాధించాలని అప్పటికప్పుడే నిశ్చయించుకున్నాడు.

"కొండవీడు మందేరా . . కొండపల్లి మందేరా
కాదని ఎవ్వఁడు వాదుకు వచ్చినా కటకం దాకా మందేరా"

అనే విజయసూచకమగు ఉపశ్రుతితో కృష్ణరాయలు కటకముపై దాడి వెడలడం, పొట్నూరులో విజయస్తంభం ప్రతిష్ఠించటం, దాదాపు తన రాజధాని వరకు పురోగమించిన రాయలతో సంధిచేసుకుని, గజపతి తన ఓటమికి సూచనగా జగన్మోహిని (ఆమెను తుక్కాదేవి అని కూడా అంటారు) అనే తన కుమార్తెను రాయలకిచ్చి వివాహం చేయడం మనందరికీ తెలిసిన విషయాలే. అయితే రాయలవారి మూడవ పట్టమహిషిగా స్వీకరించబడిన జగన్మోహిని ఆ తరువాత తన తండ్రి ఓటమికి ప్రతీకారం తీర్చుకొనగోరి తన భర్తపైనే హత్యా ప్రయత్నం చేసిందట. దాంతో రాయలవారు ఆమెను చెరసాలలో బంధించగా ఆమె పశ్చాత్తాపపడి చెరలోనే 'తుక్కా పంచకమ్' అనే సంస్కృత కావ్యాన్ని వ్రాసి ఆ తరువాత చెరలోనే మరణించిందట.

ఈ ముగ్గురు పట్టమహిషులే కాక రాయల వారికి యింకా తొమ్మిది మంది భార్యలు. వారు కాక ఎందరో అంతః పుర కాంతలు. రాయలవారు యుద్ధానికి వెళ్లేటప్పుడు కూడా సానులను వెంట తీసుకొని వెళ్లేవాడని చరిత్రకారులంతా పేర్కొంటున్నారు. ఆ రోజులలో ఒక వ్యక్తికి ఎందరు సానులుంటే ఆ వ్యక్తికి సమాజంలో అంతటి గౌరవ ప్రతిపత్తులుండేవట. అయితే రాయలు స్త్రీలోలుడని ఏ ఒక్క చరిత్రకారుడూ వ్రాయలేదు. ఆయన కర్తవ్య నిష్ఠాపరుడు. సదసద్వివేచనాపరుడు. ఏ పనికి ఎంత ప్రాధాన్యతనివ్వాలో, ఏ పని ఎప్పుడు చేయాలో తెలిసిన వివేకి. వినయశీలి. దయాళువు. ధర్మపరుడు. చక్కని కవి. గొప్ప పండితుడు. అన్నింటినీ మించి కవి పండిత పోషకుడు.

అయినా రాయలు సౌందర్యారాధకుడనేది నిర్వివాదాంశం. సుందరమైన స్త్రీలను పొందగోరితే అందుకోసం ఆయన ఎంతగా పరితపిస్తాడో, ఎంతచేస్తాడో పైన పేర్కొన్న విషయాలు మనకు తెలుపుతున్నాయి. రాయల జీవిత

చరమాంకంలో అంటే క్రీ శ 1525–30 సంవత్సరాల మధ్య రాజ్యం అంతఃకలహాలలో సంక్షుభితంగా వున్న రోజులలో కూడా అస్తమానం రాజకీయపుటెత్తులు పైయెత్తులతో తలమునకలై వుండికూడా, చీకాకుపెట్టే రాచకార్యాల మధ్య కవిపండితులతో గోష్ఠులకూ, సరస సంభాషణలకూ, స్త్రీ సౌందర్యారాధనకూ తగినంతగానే సమయాన్ని కేటాయించుకునే వాడట రాయలు. అలాంటి సమయాలలో తన సమయోచిత ప్రజ్ఞతో రామకృష్ణుడు రాయలవారి మనస్సును రంజింపజేసేవాడట. ఆనాడు తెరపిలేని రాచకార్యాలతో అలసి సొలసిన రాయలవారికి రామకృష్ణ కవితో సరస సంభాషణ ఎంతో ఊరట నిచ్చి వుంటుందని మనం అర్థం చేసుకోవచ్చు.

ఓ రోజు స్త్రీ సౌందర్యాన్ని వర్ణిస్తూ ఓ పద్యం చెప్పమని రాయల వారు రామకృష్ణుని కోరారట. అప్పుడు రామకృష్ణుడు చెప్పిన అద్భుతమైన పద్యం చూడండి.

గీ॥ **ఆననాధర గళ మూర్తు లతివ కజుఁడు**
**చంద్ర కురువింద శంఖ చంచలలఁ జేసి**
**చెలఁగి తచ్ఛిప్హా కారిన్య సిత చలతలు**
**సొరిదిఁ గచ కుచ హాస దృష్టులుగఁ జేసె.**

ఈ పద్యంలో క్రమాలంకారం చిత్రంగా సమన్వయింపబడింది.

'ఆననము' అంటే ముఖము, 'అధరము' అంటే పెదవి, 'గళము' అంటే మెడ, 'మూర్తి' అంటే ఆకారము – ఈ నాలుగింటిని 'అజుడు' అంటే బ్రహ్మ 'అతివకు' అంటే స్త్రీ కోసం వరుసగా – చంద్రునితోనూ, కురువింద మణితోనూ, శంఖముతోనూ, మెరుపుతీగతోనూ చేశాడట. 'ముఖం చంద్రబింబంలా వుంది' అనడం సర్వసాధారణమే కదా! పెదవులను కురువింద మణితో సృష్టించాడంటున్నాడు. కురువింద మణి మాణిక్యములలో ఒక రకం. ఇది పద్మరాగమంత ఎర్రగా లేకుండా కొద్దిగా పసుపు దాళు (చాయ) తో కూడి స్త్రీ పెదవుల రంగుకు చక్కగా సరిపోల్చదగు మణి. 'శంఖంలాంటి మెడగల స్త్రీ' అనడం కూడా సర్వసాధారణమే. మెరుపు తీగలాంటి రూపంగల స్త్రీ అనే వర్ణన కూడా మనం తరచు వినేదే.

అయితే ఆ తరువాత బ్రహ్మ చెలఁగి (అంటే అత్యుత్సాహంగా) తచ్ఛిప్హా – అంటే చంద్రునిలోని ఆ నల్లని మచ్చలతో కచ – అంటే ఆమె శిరోజాల్నీ; కారిన్య – అంటే కురువిందమణి యొక్క కారిన్యంతో ఆమె కుచములను; సిత – అంటే ఆ శంఖము యొక్క తెల్లదనంతో ఆమె హాసమును – అంటే నవ్వును; చలత – అంటే మెరుపుతీగ లోని ఆ చంచలతతో ఆమె దృష్టినీ సొరిది (అంటే వరుసగా) చేసె – అంటే సృష్టించాడట.

అంటే బ్రహ్మ స్త్రీని చంద్రముఖిగానూ, ఎర్రని పెదవులు, శంఖం వంటి మెడ, మెరుపుతీగ వంటి రూపము కలదానిగానూ సృష్టించడమే కాక నల్లని శిరోజాలు గలదానిగానూ, కఠినమైన వక్షోజాలు కలదానిగానూ, తెల్లని నవ్వు కలదానిగానూ, చంచలమైన చూపులు కలదానిగానూ సృష్టించాడట.

మరొక సందర్భంలో స్త్రీ అవయవాలన్నింటినీ క్రమాలంకార ప్రయోగంతోనే చక్కగా వర్ణించి యీ క్రింది పద్యం కూడా చెప్పి రాయలవారి మనసు దోచుకున్నాడట రామకృష్ణ కవి –

తే॥ అతివ కచ నాభి జఘన దేహాననములు
మీన దరసాలతా రాజసా నిరాక
రణ మనంత మనాది నేత్ర గళ భుజ న
ఖోష్ఠ కుచ వచో దంతము లుభయగతిని.

మరొకసారి రాయలవారు స్త్రీలు అలిగి పెడముఖమైనప్పుడు వారి అలకతీర్చి వారిని హసింపజేసి ప్రసన్నం చేసికొనదానికనువైన పద్యమొకటి చెప్పమన్నారట. అప్పుడు మన రామకృష్ణ కవి చెప్పిన ఈ క్రింది పద్యం కూడా అపురూపమైనది. అదికూడా చూడండి.

వరబింబాధరమున్ పయోధరములున్ వక్త్రాలకంబులున్ మనో
హరలోలాక్షులుఁ జూపకవ్వలి మొగంబైనంత నేమాయె నీ
గురు భాస్వజ్జఘనంబు క్రుమ్ముడియు మాకుంజాలవే గంగ క
ద్దరి మేలిద్దరి కీడునుం గలదె యుద్యద్రాజబింబాననా !

ఓ ప్రియురాలు ప్రియునిపై అలుకబూని శయ్యపై అవతలకు తిరిగి పడుకున్నదట. అప్పుడా ప్రియుడేమంటున్నాడో చూడండి.

"ఓ చంద్రముఖీ! శ్రేష్ఠమైన దొండపండు వంటి పెదవి, పాలిండ్లు, (చక్కని పలువరుసతో ఆకర్షణీయమైన) వక్త్రము అంటే నోరు, (ముద్దులొలికే) ముంగురులు, మనోహరమైన కళ్ళు వగైరా చూపకుండా అవతలికి తిరిగి పడుకుంటే మాత్రమేమైంది? నీ ఎత్తైన పిరుదులు, క్రుమ్ముడి - కురుల ముడి అంటే శిగముడి - యీ రెండూ నాకు చాలవా? గంగానదికి ఒక ప్రక్కన మేలూ మరొక దరి కీడూ ఉంటుందా?" స్త్రీకి పెక్కు ఆకర్షణీయమైన అవయవములు, దర్శనీయ శరీర భాగములు ముందుప్రక్క వుండి, కేవలం రెండే రెండు ఆకర్షణలు వెనుకవైపు వున్నప్పటికీ, ముందునకు వెనుక ఏ మాత్రమూ తీసిపోయేది కాదనడం ఈ పద్యంలోని చమత్కారం.

ఈ పద్యం వినగానే రాయలవారు ఒక్క ఉదుటున రామకృష్ణ కవిని కౌగిలించుకుని అతనిపై వరాల జల్లు కురిపించారట.

## విమర్శ - ఆత్మ విమర్శ

రామకృష్ణ కవి ఎవరైనా తన కవిత్వంలోని లోపాల్ని ఎత్తిచూపినపుడు చాల తీవ్రంగా స్పందించేవాడట. 'నా కవిత్వంలో ఎవరైనా తప్పుపట్టే ప్రయత్నం చేస్తే వారిని ముఖంమీద తంతాన'ని అతి తీవ్రంగా నిందిస్తూ రామకృష్ణ కవి చెప్పిన పద్యమొకటి వుంది. బహుశా ఇది భట్టుమూర్తినీ, తాతాచార్యుల వారినీ ఉద్దేశించిందే అయివుంటుంది.

ఈ పద్యంలోని తీవ్రత చూడండి.

చ॥ ఒకని కవిత్వమందెనయు తప్పులు నొప్పులు నా కవిత్వమం
దొకనికిఁ దప్పుబట్టఁ బనియుండదు, కాదని తప్పుపట్టినన్
మొకమటు క్రిందుగా దివిచి ముక్కలువోవ నినుంపకత్తితో
సిక మొదలంట గోయుదును, జెప్పున గొట్టుదు, మోము దన్నుదున్.

"నా కవిత్వంలో ఎవరైనా తప్పుపట్టదానికి ప్రయత్నిస్తే వారి పిలక యినుప కత్తితో మొదలంటా కోస్తాను, చెప్పుతో కొదతాను, ముఖం మీద తంతాను" అని అంత తీవ్రంగా విరుచుకు పడిన రామకృష్ణుదు తనకు తాను ఆత్మ విమర్శ చేసుకొనదు గానీ ఇతరుల కవిత్వాలలో తప్పుల్ని మాత్రం యథేచ్ఛగా ఎంచేవాదు.

దీనికొక చక్కని ఉదాహరణ చూదండి.

రాయలవారొకరోజు

"కలనాఁటి ధనము లక్కఱ
గల నాఁటికి దాఁచఁ గమలగర్భుని వశమా?"

అన్న సమస్యనిస్తే దానిని అల్లసాని పెద్దన ఈ విధంగా పూరించాదట.

నెలనడిమి నాఁటి వెన్నెల
యలవడునే గాదెఁ బోయ నమవస నిశికిన్.

(దబ్బులున్ననాదు వాటిని అవసరమయ్యే రోజు కోసం దాయడం విష్ణువుకు కూడా తరంకాదు. ఎలాగంటే పౌర్ణమినాటి వెన్నెలను అమావాస్యనాటి చీకటిని పారద్రోలదం కోసం గాదెలో పోసి నిల్వ చేయగలమా ? అని దీని భావం.)

తానెంతో గౌరవించే 'ఆంధ్రకవితా పితామహ' అల్లసాని పెద్దన అమావాస్యా శబ్దతత్భవమైన 'అమవస' అనే వికృత శబ్దాన్ని ప్రయోగించాదని రామకృష్ణుదు ఆయన్ని ఎంత నిందాత్మకంగా హేళన చేశాడో చూదండి.

క॥ ఎమిలిని సెపిలివి కపితము
బమపడి వెటిపుచ్చకాయ వడిఁదిని సెపితో
ఉమతక్కయఁ దిని సెపితో
అమవస నిశి అన్నమాట అలసని పెదనా !

"ఏమితిని చెప్పావీ కపిత్వము – ఇది కవిత్వం కాదు కపిత్వం (కోతి తనం) – భ్రమపడి తొందరలో వెఱ్ఱిపుచ్చకాయ తిని చెప్పావా? లేక ఉమ్మెత్తకాయ తిని చెప్పావా? 'అమవస నిశి' అన్న మాట – ఓ అల్లసాని పెద్దనా? " – ఇదీ దీని భావం.

ఇదీ రామకృష్ణుని వ్యవహార శైలి. "అన్నగారూ" అని సంబోధిస్తూనే భట్టుమూర్తిని ఎన్నో ఉచ్చరింపరాని తిట్లు తిదుతూ చెప్పిన పద్యాలున్నాయి. అలాగే "తాతగారూ" అంటూనే పెద్దలైన తిమ్మన, పెద్దన, ధూర్జటి వగైరాలను అవహేళన చేసిన పద్యాలూ ఉన్నాయి.

## కొండవీటి కవితో అధర్మ యుద్ధం

కవితా గరిమతోనే కాక చమత్కృతితో కూద రామకృష్ణుదెందరో కవి పండితుల్ని వాదనలలో ఓడించాదట.

ఒకప్పుదు కొండవీటి సీమకు చెందిన ఒక కవి భువనవిజయాన్ని సందర్శించి తాను చెప్పే ఒక పద్యానికి ఎవరన్నా అర్థం చెప్పగలరా అన్నాదట. రామకృష్ణుదు ఆ పద్యమేమిటో చెప్పమన్నప్పుదు ఆ కవి –

క్రమాలంకారానుప్రాణితమైన చతుష్పాద యమకంలో -

సీ॥ "రాజనందన రాజ రాజాత్మజులుసాటి
తలఁప నల్లయ వేమ ధరణిపతికి
రాజనందన రాజ రాజాత్మజులుసాటి
తలఁప నల్లయ వేమ ధరణిపతికి
రాజనందన రాజ రాజాత్మజులుసాటి
తలఁప నల్లయ వేమ ధరణిపతికి
రాజనందన రాజ రాజాత్మజులుసాటి
తలఁప నల్లయ వేమ ధరణిపతికి
గీ॥ భావభవభోగ సత్కళా భావములను
భావభవభోగ సత్కళా భావములను
భావభవభోగ సత్కళా భావములను
భావభవభోగ సత్కళా భావములను" అని చెప్పగా

అప్పుదు రామకృష్ణుదు "ఆ పద్యానికి అర్థం నేను తరువాత చెపుతాను. ముందుగా మీరీ పద్యానికి అర్థం చెప్పం"దని ఈ క్రింది పద్యాన్ని చదివాడు -

మేక తోకకు మేక తోక మేకకుతోక
మేక తోకామేక మేకతోక
మేక తోకకు మేక తోక మేకకుతోక
మేక తోకామేక మేకతోక
మేక తోకకు మేక తోక మేకకుతోక
మేక తోకామేక మేకతోక
మేక తోకకు మేక తోక మేకకుతోక
మేక తోకామేక మేకతోక
మేక తొక తోక మెకమేక తోక మేక
మేక తొక తోక మెకమేక తోక మేక
మేక తొక తోక మెకమేక తోక మేక
మేక తొక తోక మెకమేక తోక మేక

దీనికి అర్థమేముంటుంది చెప్పడానికి? తికమక పడిన కొండవీటిసీమ కవి ఓటమిని అంగీకరించాడు.

అయితే యిక్కడ రామకృష్ణుని గెలుపు కేవలం సమయస్ఫూర్తితోనూ, చమత్కృతితోనూ సాధించినదే! అతడిది అధర్మ యుద్ధమే ! వాస్తవానికి ఆ కొండవీటిసీమ కవి చెప్పిన పద్యం అద్భుతమైనట్టిది. నల్లయ కుమారుడైన వేమారెడ్డి

అనే రాజు యొక్క ఘనతను కీర్తిస్తూ చెప్పిన పద్యమిది. దాని అర్థం చెప్పగలగడం అది వ్రాసినవానికి మాత్రమే సాధ్యమయ్యే విషయం. సీసపద్యంలోని మొదటిచరణానికి, ఎత్తుగీతిలోని మొదటి పాదానికీ క్రమంగా అన్వయించుకొని అర్థం చెప్పుకోవాలి. అదెలాగో చూడండి.

మొదటి పాదం : రాజనందన : రాజ అంటే చంద్రుడనే అర్థముంది. రాజనందనుడంటే చంద్రుని కుమారుడైన బుధుడు.

రాజ : ర +అజ

ర : సమర్థుడైన; అజ : ఈశ్వరుడు

రాజాత్మజులు : రాజ – దేవేంద్రుడు; ఆత్మజ – బ్రహ్మదేవుడు – సాటి

తలఁప నల్లయ వేమ ధరణిపతికి

ఎందులో? భావ : బుద్ధి యందు; భవ : ఐశ్వర్యంలోనూ; భోగ : వైభవంలో;

సత్కళా : శ్రేష్ఠమైన విద్యల యొక్క; భావములను : అతిశయములోనూ.

అంటే దీని భావం –

బుధుడు, ఈశ్వరుడు, ఇంద్రుడు, బ్రహ్మ – వీరంతా బుద్ధి; ఐశ్వర్యము; విభవము; శ్రేష్ఠ విద్యాతిశయములలో నల్లయవేమునికి సాటి.

రెండవపాదం : రాజనందన రాజ : ర +అజ

ర : మనోహరమైన; అజ : శివునికి; నందన : కుమారుడైన కుమారస్వామి

రాజ : కుబేరుడు; రాజ : ర +అజ : ర : శ్రేష్ఠుడైన;

అజ : రఘు కుమారుడైన అజుడు (దశరధుని తండ్రి);

ఆత్మజ : చంద్రుడు – సాటి.

తలఁప నల్లయ వేమ ధరణి పతికి

ఎందులో? భావ : క్రియలోనూ; భవ : ధనములోనూ; భోగ : పాలనలోనూ;

సత్కళా : సత్ : యోగ్యమైన; కళా : కాంతి యొక్క ; భావములను : బృందంలోనూ.

అంటే దీని భావం –

కుమార స్వామి, కుబేరుడు, అజుడు, చంద్రుడు – వీరంతా క్రియ, ధనము, పరిపాలన, యోగ్యమైన కాంతి పుంజములలోనూ (అంటే కీర్తిలోనూ) నల్లయ వేమునికి సాటి.

మూడవపాదం : రాజనందన – రాజ : ర +అజ

ర : బంగారమువంటి దీపి కలిగిన; అజ : బ్రహ్మకు; నందన : కుమారుడు

అంటే బ్రహ్మ పుత్రుడైన సనత్కుమారుడు;

రాజ : క్షత్రియుడు; రాజ : ర +అజ;

ర : శ్రేష్ఠుడైన; అ : బ్రహ్మకు; జ : పుట్టినట్టి వసిష్ఠుడు; ఆత్మ : బృహస్పతి యందు;

జ : పుట్టిన-కచుడు – సాటి

తలఁప నల్లయ వేమ ధరణి పతికి

ఎందులో? భావ : ఆత్మజ్ఞానములోనూ; భవ : జననములోనూ; భోగ : అనుభవములోనూ;
సత్కళా : అభివృద్ధి పొందునట్టి; భావ : పద్ధతిలోనూ
అంటే దీని భావం – సనత్కుమారుడు, సుక్షత్రియుడు, వసిష్ఠుడు, కచుడు – వీరంతా
ఆత్మజ్ఞానము, జననము, అనుభవము, అభివృద్ధి నందే విధానములలో నల్లయ
వేమునికి సాటి.

నాల్గవపాదం రాజనందన ర + అజ + నందన
ర : గౌవరయుక్తుడైన; అజ : మన్మధునికి; నందన : కుమారుడైన అనిరుద్ధుడు;
రాజ : ర +అజ; ర : సర్వవ్యాపియైన; అజ : విష్ణువు
రాజ : యక్షుడు; ఆత్మజ : మన్మధుడు – సాటి
తలంప నల్లయ వేమ ధరణి పతికి

ఎందులో? భావ : ఆకారములోనూ; భవ : సంసారంలోనూ; భోగ : సంభోగములోనూ;
సత్కళా : సౌందర్యముయొక్క; భావ : రీతిలోనూ
అంటే దీని భావం – అనిరుద్ధుడు, విష్ణువు, యక్షుడు, మన్మధుడు – వీరంతా
ఆకారములో, సంసారములో, సంభోగములో, సౌందర్య రీతిలో నల్లయవేమునికి సాటి.

ఇలా ప్రతి పాదాన్నీ విరిచి, విరిచి ఒక్కో పదానికి ఉన్న నానార్థాలన్నింటినీ వినియోగించుకుంటూ అత్యద్భుతంగా కూర్చబడిన పద్యమిది.

ఈ పద్యంలో కవి వాడిన శబ్దాల నానార్థాలు తెలుసుకోవడం చాల ఆసక్తికరంగా ఉంటుంది.

రాజన్ అనే సంస్కృత పదానికి రాజు, క్షత్రియుడు, ఇంద్రుడు, చంద్రుడు, యక్షుడు (యక్షరాజైన కుబేరుడు) అని కవి వాడిన అర్థాలే కాక యుధిష్ఠిరుడు (ధర్మరాజు), పృధు చక్రవర్తి, సోమలత అనే అర్థాలు కూడా వున్నాయి. 'అజ' అనే సంస్కృత పదానికి 'పుట్టని' అని అర్థం. అజ అంటే బ్రహ్మ, విష్ణువు, శివుడు, రఘువంశానికి చెందిన అజుడు (దశరధుని తండ్రి), మన్మధుడు అని కవి వాడిన అర్థాలే కాక చంద్రుడు, మేకపోతు అనే అర్థాలూ వున్నాయి. మేకపోతు గొంతు క్రింద వ్రేలాడే స్తనాల్ని అజాగళ స్తనములు అంటారు. ఎంత మాత్రమూ ఉపయుక్తం కాని వస్తువుల్నీ, వ్యక్తుల్నీ 'అజాగళ స్తనం' అనడం పరిపాటి. అన్నట్లు సూర్యుని రధానికి పూన్చిన ఏడుగుర్రాల్లో ఒక దాని పేరు కూడా 'అజ'.

ఇక యీ నానార్థాల వ్యవహారాన్నటుంచితే చూడదానికి చర్విత చర్వణం గానూ, అర్ధమేమీ లేనట్లుగానూ కనుపిస్తున్నప్పటికీ ఈ పద్యపు ప్రతి పాదంలోనూ, ప్రతి పదానికీ ఇన్నిన్ని అర్థాల్ని పొదిగి కూర్చిన సత్కవిని రామకృష్ణుడు అర్థమూ పర్థమూ లేని తన 'మేక – తోక' పద్యంతో తికమక పెట్టి ఓడించడమే బాధాకరమనిపిస్తుంది కదూ !

# సహస్ర ఘంట కవితో

'సహస్ర ఘంట కవి' అనే బిరుదు గల పెగ్గదరాజు నరసరాజు అనే చతుశ్శాస్త్ర పండితుడు ఒకసారి రాయల సభకువచ్చి "వేగంగా వ్రాయడంలో నా అంతటి వారు ఎవరైనా ఉన్నారా? నేను వ్రాస్తూ వుంటే నా గంటం ఆగకుండా ఆశుకవితలు చెప్పేవారెవరైనా ఉన్నారా?" అని సవాలు చేశాడట. రామకృష్ణుడు వేగంగా ఆశుకవితలు చెబుతూ చెబుతూ మధ్యలో ఉన్నట్టుండి అతన్ని ఓడించదానికి చెప్పిన ఈ క్రింది పద్యం ప్రసిద్ధం.

కII తు(త్రు) వ్వట బాబా తలపైఁ
బువ్వఁట జాబిల్లి, వల్వ బూదఁట, చేఁదే
బువ్వఁట, చూడఁగను హుళి
క్కవ్వఁట తలఁపంగనట్టి హరునకు జేజే !

ముందీ పద్యం అర్థం చూద్దాం.

ఇదంతా శివుడిని గురించి చేయబడిన వర్ణన.

'త్రువ్వ' అంటే ఎద్దు; 'త్రువ్వాయి' అనే ప్రయోగం కోడెదూడలకి వాడుతూంటాం. 'త్రువ్వెహెయ్!' అంటూ రైతులు ఎద్లను అదలించడం మన మెరిగిందే! 'త్రువ్వ' నే 'తువ్వ' అని కూడా సరళంగా ఉచ్చరిస్తారు. 1960 దశకంలో విడుదలై అఖండ విజయం పొందిన 'నమ్మిన బంటు' చలన చిత్రం కోసం 'చెంగుచెంగునా గంతులు వేయండి . . ఓ జాతి వన్నె బుజ్జాయిల్లారా . . నోరులేని తువ్వాయిల్లారా . . ' అని కోడెదూడల్ని సంబోధిస్తూ కీ॥శే॥ కొసరాజు రాఘవయ్య చౌదరి గారు వ్రాసిన పాట అలనాడు యింటింటా మార్మోగింది.

'బాబా' అంటే వాహనము. అందుకే సూర్యుని రథానికి పూన్చినవని చెప్పబడ్తూన్న ఏడు గుర్రాలను 'పొద్దు బాబాలు' అంటారు. పొద్దు అంటే 'సూర్యుడు' కదా! శుక వాహనుడైన మన్మథుడిని 'చిలుక బాబా వజీరు' అంటారు. ఇంద్రుని వాహనమైన ఉచ్చైశ్శ్రవమనే తెల్లని గుర్రాన్ని 'తెలి బాబా' అంటారు. మరి శివుని వాహనమేమో – 'నంది' అనబడే తెల్లని ఎద్దట.

'తలపైఁ బువ్వట జాబిల్లి. దీనికే 'శిగలో పువ్వట జాబిల్లి' అనే పాఠాంతరం కూడా వుంది. బాలచంద్రుడిని శిగలో ధరిస్తాడు కనుకనే శివుడిని 'బాలేందుమౌళి' , 'తరుణ శశాంక శేఖరుడు' వగైరా పేర్లతో పిలుస్తారు.

'వల్వ బూదట' – దిగంబరుడైన శివుడికి వలువలు – అంటే వస్త్రాలు – ఎందుకు? బూది – అంటే బూడిద – నే ఒళ్లంతా పూసుకుంటాడు గనుక – అదే ఆయన వస్త్రం. అయితే గజాసుర సంహారం తరువాత ఆ ఏనుగు చర్మం వొలిచి దానినే తాను ఉడుపుగా ధరించాడట. అందుకే శివుడిని 'కరి చర్మాంబర – చంద్రకళాధర – సాంబ దిగంబర నమో నమో' అని పూజిస్తుంటారు. అలా ఒకప్పుడు దిగంబరుడైన శివుడు గజాసుర సంహారం తరువాత కరిచర్మాంబరుడయ్యాడట.

'చేఁదు' అంటే మనం రెండు రకాలుగా అర్థం చెప్పుకోవచ్చు. గ్రామాలలో చద్ది అన్నాన్ని చేదన్నం అని కూడా అంటారు. శివుడు ఆది భిక్షువు. బిచ్చమయ్యకు చద్ది అన్నమే బువ్వకదా! చేఁదు అంటే హాలాహలమనబడే అత్యంత చేదైన విషమని అర్థం తీసుకుంటే – దేవదానవులు అమృతం కోసం పాలసముద్రాన్ని చిలికినప్పుడు ముందుగా హాలాహలమనే విషం ఉత్పన్నమై విశ్వమంతా విషపూరితమై అందరూ హాహాకారాలు చేస్తూంటే వారిని కాపాడదానికి శివుడు ఆ విషాన్ని త్రాగి తన కంఠంలో నిలుపుకొని, విషం కారణంగా నలుపెక్కిన కంఠం కలవాడుగా మారి 'నీలకంఠుడ' ని పిలువబడ్డాడు. విషాన్ని మింగినవాడు గనుక శివుడికి చేఁదే బువ్వట.

'చూడఁగను హుళిక్కవ్వట' – హుళక్కి, హుళికి, హుళిక్కి, ఉళక్కి – వీటిలో ఏదన్నా అబద్ధము లేక అభావము (లేకపోవడం) అని అర్థం. ఇంతగా మనం వర్ణించుకున్న శివుణ్ణి తీరా చూద్దామంటే అంతర్హితుడవుతాడట. ఆయన నిరాకారుడు. అందుకే ఆయన్ని 'హుళక్కి' అని కూడా అంటారు. సత్తు – అసత్తు; ఉనికి – హుళక్కి; అస్తిత్వము – అభావము – యివి శివుడనే నాణెమునకు రెండు పార్శ్వాలని శివాద్వైతం చెప్తుంది.

అటువంటి శివునికి నా జేజేలు అని యీ పద్యం భావం.

నోరు తెరువకుండా పెదాల్నుంచి ఉమ్మి తుంపరలు పడేటట్టు 'త్రువ్వట బాబా' అంటూ రామకృష్ణుడు చెప్తూంటే ఈ పద్యంలో మొదటి పాదంలో మొదటి మాటనే ఎలా వ్రాయాలో తెలియక ప్రెగ్గడరాజు నరసరాజు తికమక పడి తన ఓటమిని అంగీకరించాడట. ఈ పద్యంలో మొదటి అక్షరాన్ని 'త్రు' గా వ్రాసినా అది మనం పలికేటట్లు వ్రాయడం కాదు. మనం పలికే విధంగా వ్రాయలేని తెలుగు శబ్దాలలో ఇది ఒకటి.

అప్పుడు ఓడిన నరసరాజును చూసి రామకృష్ణుడు క్రోధంతో ఊగిపోతూ –

చ॥ తెలియని వన్ని తప్పులని దిట్టతనాన సభాంతరంబునన్
బలుకఁగ రాకురోరి పలుఁమారుఁ బిశాచపుఁబాదెకట్ట, నీ
పలికిన నోట దుమ్ముపడ, భావ్య మెఱుంగక పెద్దలైనవా
రల నిరసింతువా, ప్రగ్గడ రాణ్ణరసా ! విరసా ! తుసా ! బుసా !

అని చెప్పిన తిట్టుపద్యం కూడా ఎంతో ప్రసిద్ధం.

# కవయిత్రి మొల్లతో సంవాదం

రామాయణ రచన చేసిన కవయిత్రి ఆతుకూరి మొల్ల కృష్ణరాయల సభను సందర్శించిన సందర్భంలో ఆమెకూ, రామకృష్ణకవికీ జరిగిన సంవాదములు, కవితా గోష్ఠి సుప్రసిద్ధములు.

కుమ్మరి మొల్ల అని పిలువబడే ఆతుకూరి మొల్ల తెలుగు కవయిత్రులలో ప్రాచీనతమురాలు. ఈమె తండ్రిపేరు ఆతుకూరి కేసనసెట్టి. ఈమె స్వస్థలం నెల్లూరు జిల్లా పడుగుపాడు అని కొందరూ నెల్లూరు జిల్లా గోపవరము అని ఇంకొందరూ పేర్కొంటున్నారు. ఈమె రచించిన రామాయణము 'మొల్ల రామాయణము'గా ప్రఖ్యాతి పొందినది. ఇది చాల మృదుమధురంగానూ, రసవంతంగానూ ఉంటుందని సాహితీ విమర్శకుల ప్రశంసలను పొందింది.

తన రామాయణములోని పూర్వకవిస్తుతిలో కృష్ణదేవరాయల కాలంనాటి ప్రబంధకవులెవర్నీ పేర్కొనక పోవడం చేత ఈమె రాయల సమకాలికురాలని భావించబడ్తూంది. శ్రీనాథ మహాకవిని స్తుతించింది కనుక తప్పనిసరిగా ఈమె శ్రీనాథుని తరువాతి కాలపు కవయిత్రి అనడంలో సందేహం లేదు.

ఈమె రాయలవారిని సందర్శించి ఆ రాజమౌళినిలా ప్రస్తుతించిందట.

సీ॥ అతఁడు గోపాల కుండితఁడు భూపాలకుం
దెలమి నాతనికన్న నితఁడు ఘనుఁడు
అతఁడు పాండవ పక్షుఁడితఁడు పండిత రక్షుఁ
డెలమి నాతనికన్న నితఁడు ఘనుఁడు
అతఁడు యాదవ పోషి యితఁడు యాచక పోషి
యెలమి నాతని కన్న నితఁడు ఘనుఁడు
అతఁడు కంసధ్వంసి యితఁడు కష్టధ్వంసి
యెలమి నాతని కన్న నితఁడు ఘనుఁడు

గీ|| పల్లెకాతండు పట్టణ ప్రభువితండు
స్త్రీలకాతండు పద్మినీ స్త్రీలకితఁడు
సురలకాతండు తలఁప భూసురులకితఁడు
కృష్ణుఁడాతండు శ్రీమహాకృష్ణుఁడితఁడు.

అని శ్రీ కృష్ణునీ - శ్రీకృష్ణ దేవరాలయనూ పోల్చి రాయలే అన్ని విధాల గొప్ప అని యిలా తేల్చింది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృష్ణుడు గోపాలకుడు (కేవలం పశువుల కాపరి) | | కృష్ణదేవరాయలు భూపాలకుడు (రాజు) | | కాబట్టి రాయలే గొప్పవాడు | |
| ,, | కేవలం తనబంధువులైన పాండవ పక్షపాతి. | ,, | పండితులందరినీ కాపాడుతున్నవాడు. | ,, | ,, |
| ,, | యాదవుల్ని మాత్రమే పోషించాడు | ,, | యాచకులందరినీ పోషిస్తున్నాడు. | ,, | ,, |
| ,, | దుర్మార్గుడైన కంసుడిని మాత్రమే చంపాడు | ,, | కష్టాన్నంతా ధ్వంసం చేస్తున్నాడు. | ,, | ,, |
| ,, | వ్రేపల్లె అనే కుగ్రామానికి ప్రభువు | ,, | హంపి-విజయనగరమనే మహానగరానికి ప్రభువు | ,, | ,, |
| ,, | అష్టభార్యలూ కాక పదహారు వేల మంది గోపికల్ని చేపట్టిన కారణంగా అన్ని రకాల స్త్రీలకూ కృష్ణుడు పతి | ,, | శ్రేష్ఠమైన పద్మినీజాతి స్త్రీ లకు మాత్రమే రాయలు పతి | ,, | ,, |
| ,, | సురమౌళి అయిన కృష్ణుడు దేవతలకు రాజు | ,, | రాయలు భూసురులకు (బ్రాహ్మణులకు) రాజు | ,, | ,, |
| కనుక, | ఆయన కృష్ణుడైతే | ,, | ఈయన శ్రీ మహాకృష్ణుడు | ,, | ,, |

అంటూ చమత్కారంగా చెప్పింది.

వెంటనే, రామకృష్ణుడు చటుక్కున లేచి యీ పద్యానికి ప్రతిగా తన సహజ వికట స్వభావాన్ని ప్రదర్శిస్తూ ఈశ్వరుడినీ - నందీశ్వరుడినీ పోలుస్తూ ఈశ్వరుని కంటే నందీశ్వరుడే గొప్ప అని ఎగతాళిగా తేలుస్తూ ఈ క్రింది పద్యం చెప్పాడట.

సీ॥ ఆతడంబకు మగఁడు ఈతఁడమ్మకు మగఁ
డెలమి నాతని కన్న నితఁడు ఘనుఁడు
అతఁడు శూలము ద్రిప్పు నితఁడు వాలము ద్రిప్పు
నెలమి నాతని కన్న నితఁడు ఘనుఁడు
ఆతఁడమ్మునవేయు నితఁడు కొమ్మునఁ దాయు
నెలమి నాతని కన్న నితఁడు ఘనుఁడు
అతని కంటను జిచ్చు నితని కంటను బొచ్చు
ఎలమి నాతని కన్న నితఁడు ఘనుఁడు

గీ॥ దాత యాతండు గోనెలమోత యితఁడు
దక్షుఁడాతండు ప్రజల సంరక్షుడితఁడు
దేవుడాతండు కుడితికి దేవుఁడితఁడు
పశుపతి యతండు శ్రీమహా పశువితండు.

ఈ పద్యంలో మొల్ల కవిత్వం పట్ల రామకృష్ణుని యీర్ష్యాసూయలు ద్యోతకమవుతున్నాయి. మొల్ల చెప్పిన అంత చక్కటి పద్యానికి ప్రతిగా యింతటి వెటకారపు పద్యం – అందునా నిండు సభలో రాయల సమక్షంలో అంత ధైర్యంగా ఎలా చెప్పగలిగాడో? కృష్ణరాయలను యింకెవరైనా పొగడినా రామకృష్ణునికి నచ్చేదికాదని ఈ పద్యం ఋజువు చేస్తున్నది.

## తిరుమల రాయనిపై కసి

తెనాలి రామకృష్ణుడు తిరుమల రాయని ఒంటికంటిని స్వభావోక్తి మధురంగా వర్ణిస్తూ చెప్పిన కంద పద్యం ఎంత చక్కటిదో చూడండి –

క॥ అన్నాతిఁగూడ హరుఁడగు
నన్నాతిని గూడకున్న నసురగురుండౌ
నన్నా ! తిరుమల రాయఁడు
కన్నొక్కటి లేదుగాని కంతుఁడు గాఁడే !

అన్నాతిఁ – ఆ+నాతిని – ఆ స్త్రీని కూడితే హరుడగు – అంటే ఆ స్త్రీకి వున్న రెండు కళ్ళు + ఇతనిదొక కన్ను – ముక్కంటి – అంటే శివుడవుతాడు; అన్నాతిని గూడకున్న నసురగురుండౌ – అసురగురుడు అంటే రాక్షసగురువైన శుక్రాచార్యుడు (ఇతడు ఒంటికంటి వాడు); అన్నా – ఔరా ! కన్నొక్కటే తక్కువగానీ తిరుమల రాయడు మన్మథుడు కాదా?

తిరుమల రాయలు శ్రీకృష్ణ దేవరాయలు రెండవ అల్లుడు. ఆయన పెద్దల్లుడైన అళియ రామరాయలు అనబడే ఆరవీటి రామరాజుకు ఇతడు స్వయానా తమ్ముడు. కృష్ణ రాయలకూ, చిన్నా దేవికీ జన్మించిన వెంగళాంబను తిరుమల రాయలు వివాహమాడాడు. ఈయన, ఈయన అన్న రామరాజు భట్టుమూర్తిని ఆదరించారు. భట్టుమూర్తి రచించిన 'వసుచరిత్ర'ను కృతినందుకొన్నది తిరుమల రాయలే ! అందుకే రామకృష్ణుడు భట్టుమూర్తిపై వ్యతిరేకతతో తిరుమల రాయలను

కూడా ద్వేషించాడు. క్రీ. శ. 1565లో జరిగిన తళ్ళికోట యుద్ధంలో రామరాజు చనిపోగా అతడి తమ్ముడు తిరుమల రాయలకు ఒక కన్ను పోయింది.

## రామకృష్ణుడయ్యాక హంపిలో వ్రాసిన కావ్యాలు

వైష్ణవాన్ని స్వీకరించాక రామకృష్ణుడు 'హరిలీలా విలాస'మనే గ్రంథాన్ని రచించాడు.

పెదపాటి జగ్గన్న తన 'ప్రబంధ రత్నాకరం' లో ఈ కావ్యం లోంచి 21 పద్యాలను ఉదాహరించాడు. వాటిలోని ఈ క్రింది పద్యం ద్వారా నాటి భోజన పదార్థాలు ఎలా వుండేవో మనకు తెలుస్తోంది.

ఉ॥ ఆల ఘృతంబు వేడియగు నన్నము నుల్చిన ముద్దపప్పు క్రొం
దాలిపు కూర అప్పడము ద్రబ్బెడ చారులు పానకంబులున్
మేలిమి పిండివంటయును మీగడతోడి దధిప్రకాండముల్
నాలుగు మూడు తోయముల నంజులుఁ గంజదళాక్షి పెట్టగన్. (హరిలీలావిలాసము)

ఆవు నెయ్యి, వేడి అన్నం, బాగుగా మెదిపిన ముద్దపప్పు, అప్పుడే తాలింపు వేసిన కూర, అప్పడము, ద్రబ్బెడ చారులు, పానకములు, మేలిమి పిండి వంట, మీగడతోడి దధి ప్రకాండములు – మీదగ పెరుగుతో చేయబడిన ప్రశస్త వంటకాలు; నాలుగు మూడు రకముల నంజులు వీటన్నింటినీ కంజ దళాక్షి – తామర రేకులంతటి విశాలమైన కళ్లు కలిగిన స్త్రీ వడ్డిస్తూ ఉంటే ఎలా వుంటుందో ఊహించుకోండి.

(ద్రబ్బెడ అనేది ఒక భక్ష్య విశేషం. ఇడి (సేమ్యా), చలిమిడి, బుడుకులు, అడుకులు (అటుకులు), వడలతో పాటు కాశీఖండంలో శ్రీనాథుడు దీనినీ పేర్కొన్నాడు).

ఇంచుమించు యిదే కాలానికి చెందిన అయ్యలరాజు రామభద్రకవి తన 'రామాభ్యుదయము' అనే కావ్యంలో ఎన్ని భక్ష్య విశేషాలను పేర్కొన్నాడో చూడండి.

మ॥ ఇదిరమ్మోని కుపాయనమ్ములు మనోభీష్టంబుగాఁ బూరియల్
వడలుం జక్కెర కర్జకాయలును లడ్వాలు క్కెరల్ పూర్ణపుం
గుడుముల్ గారెలు బెల్లమండెఁగలు నొఁగుల్ కమ్మచాఁపట్లు నూ
టిడులున్ దోసెలు నప్పముల్ సుకియలున్ హేరాళమై కన్పడన్.
(రామాభ్యుదయము రెండవ ఆశ్వాసము)

బూరెలు, వడలు, చక్కెర కర్జకాయలు, లడ్వాలు (లడ్లు), ఉక్కెరలు (చక్కెర చేర్చి పొరఁటిన పిండి), పూర్ణపు కుడుములు, గారెలు, బెల్లపు మండెఁగలు (గోధుమ పూరీలు), ఔఁగులు, కమ్మని చాఁపట్లు, నూటిడులు (నువ్వులతో చేసిన ఇడులు), దోసెలు, అప్పములు, సుకియలు వగైరాలు విస్తర నిండుగా కనుపించేటట్లు ఆ మునికి వడ్డించారట.

ఇక రామకృష్ణకవికి కొంత ముందరి కాలానికి చెందిన శ్రీనాథ మహాకవి 'శృంగార నైషధ' కావ్యంలో వివిధ వంటకములను గూర్చి వర్ణించిన తీరు చూస్తే 'బ్రాహ్మణో భోజనప్రియః' అన్న లోకోక్తి అక్షరసత్యమనిపించక మానదు.

మచ్చుకి చిన్న పద్యం చూడండి.





తే॥ మిసిమిగల పుల్ల పెరుఁగుతో మిళితములుగ
నావ పచ్చళ్లు చవిచూచి రాదరమునఁ
జుట్టుమని మూర్ధములు దాఁకి యొఁట్టిఁదనముఁ
బొగలు వెడలింప నాసికా పుటములందు (శృంగార నైషధము - షష్ఠాశ్వాసము - 130)

మంచి మీగడ గల పుల్ల పెరుగుతో ఆవఁబెట్టిన పచ్చళ్లను ఆదరంగా చవిచూసిన వారికి మంట నసాళానికి అంటిందట! ముక్కు పుటాల్నుంచి పొగలు వెడలు కొచ్చాయట.. ఆ కావ్యంలోనే శ్రీనాథ మహాకవి యింకా ఎలాంటి ఆహార పదార్థాలను పేర్కొన్నాడో చూడండి

చలివాలు, లడ్డువములు, పనసతొలలు, మండెఁగలు, చాఁపట్లు, బూరియలు, వెన్న పడిదము, ఖండ శర్కరలు వగైరాలు, మంచుతో పిసికిన పంచదారలు (ice creams ?) , పేరిన మీగడలతో మనస్సులకు వెర్రెక్కించే బష్కయణీ (తఱపి ఆవు) దధిపిండ ఖండములు (గడ్డ పెరుగులు) వగైరాలన్నీ మిక్కిలి వేడుకగా కంఠదఘ్నముగా - అంటే గొంతు దాకా మెక్కారట. ఇవేకాక అద్భుతమైన మాంసాహారాన్ని కూడా శ్రీనాధుడు తనివిదీరా వర్ణించాడు. క్రమ్మతేమనంబుల (మాంసపు మజ్జిగ పులుసులు - మటన్ కూర్మాలు) నూ, జంబీర రసము (నిమ్మ రసము) తోనూ, నూనె తోనూ కలిపి ఆవఁబెట్టిన కిటి వర్తావలయముల (గుండ్రంగా కోయబడిన పంది వారు ముక్కల)నూ అమృత మధుర రసఖండములుగా వర్ణించాడు. అంతేకాక, ఆమిషము (Non-Vegetarian), అనామిషము (Vegetarian) గానూ, అనామిషము ఆమిషముగానూ భ్రమింపజేసే కళాసామర్థ్యముతో చేసిన వివిధరకములైన తేమనములు (మజ్జిగ పులుసులు - కూర్మాలు) ఆ వారయాత్రికుల (పెండ్లి చుట్టములు) మనస్సులలో రుచుల్ని ప్రతిష్ఠించాయట

ఇక శ్రీనాధుని కాలానికే చెందిన వినుకొండ వల్లభరాయని (శ్రీనాధుడూ, ఈయనా ఒక్కరేననేవారూ ఉన్నారు) 'క్రీడాభిరామము' లోని ఒక అద్భుతమైన పద్యము ఇక్కడ తప్పక ప్రస్తావించాలి. ఎందుకంటే పైన పేర్కొన్న 'ఆల ఘృతంబు' అన్న పద్య రచనలో కొన్ని పదబంధాల విషయంలో రామకృష్ణుడు ఈ పద్యాన్ని అనుకరించినట్లు కనుపిస్తున్నది.

ఉ॥ కప్పురభోగి వంటకము, కమ్మని గోధుమ పిండి వంటయున్,
గుప్పెడు పంచదారయును, గ్రొత్తగఁ గాఁచిన యాలనేఁ, పెస
ర్పప్పును, గొమ్మునల్లనఁటి పండ్లును, నాలుగు నైదు నంజులున్,
లప్పలతోడఁ గ్రొంబెరుగు, లక్ష్మణ వజ్ఝుల యింట రూకకున్ (క్రీడాభిరామము - 166)

కప్పుర భోగి వంటకము - కర్పూర భోగులనే రకపు బియ్యంతో వండిన అన్నం, కమ్మటి గోధుమ పిండి వంట, గుప్పెడు పంచదారయును కూరలు, పచ్చళ్లలోని కారం నసాళానికి అంటినప్పుడు ఆ మంట తగ్గడానికి, పులుసులూ వగైరాలలో పులుపెక్కువైతే కలుపుకొనడానికి ఓ గుప్పెడు పంచదార కూడా ఆ రోజులలో విస్తట్లో వడ్డించేవారట! నిలువ వుంచని తాజా ఆవు వెన్న కాయగా వచ్చిన నెయ్యి, పెసరపప్పు, కొమ్ము నల్లనటి పండ్లును - అరటిపండ్లకుండే ముచ్చిక (కొమ్ము) నల్లబడితే అవి బాగా పక్వానికి వచ్చినట్లు - వీటిని కొమ్ము నల్లనటిపండ్లు అంటారు నాలుగైదు నంజులు, లప్పలు అంటే పెద్ద దొన్నెలు లేక దొప్పలు - వీటితో క్రొంబెరుగు (పులియని తీపిపెరుగు) ఇవన్నీ లక్ష్మణ పంతులుగారి యింట భోజనంలో ఒక రూకకే సమకూరతాయట! మనం కూడా ఆ లక్ష్మణ పంతులుగారి యింటికి వెళ్లాలనిపిస్తుంది కదూ!

'హరిలీలా విలాసం' కథ ఏమిటో ఈ 21 పద్యాల వలన తెలియటం లేదు. ఆ గ్రంథం ఆయన ఎవరికి అంకితమిచ్చాడో తెలియదు. రాయలవారి అవసాన దశలో రామకృష్ణుడు భువనవిజయంలో ప్రసిద్ధి చెందిన అష్టదిగ్గజాలలో

ఒకనిగా ఉన్నందున ఆ రోజులలోనే ఆ గ్రంథాన్ని ఎవరో మంచి పలుకుబడి గలిగిన రాజోద్యోగికి అంకితమిచ్చివుంటాడు. విజయ నగరంలో వుంటున్నప్పుడే రామకృష్ణ కవి 'కందర్ప కేతు విలాస'మనే మరొక కొత్త కావ్యం వ్రాశాడు. ఈ గ్రంథం ఇప్పుడు లభించటం లేదు. దీనిని చిట్టరసు అనే ఆయనకు అంకితమిచ్చాడట. దీనిలోని నాలుగు పద్యాలు మాత్రం పెదపాటి జగ్గన్న తన 'ప్రబంధ రత్నాకరం'లో ఉదహరించాడు. ('హరిలీలా విలాసము', 'కందర్పకేతు విలాసము'లోని మరికొన్ని పద్యాల వివరణ కోసం అనుబంధం- 3 చూడండి).

# కృష్ణరాయల మరణానంతరం

రామకృష్ణుడు రాయల మరణానంతరం ఆయన సవతి తమ్ముడు అచ్యుతరాయలు పాలనా కాలంలో కొన్నేళ్ళ పాటు హంపిలోనే విట్ఠల రాజ ఆలయ పరిసరాలలో ఋషితుల్యమైన జీవితాన్ని గడిపి ఆ తరువాత స్వగ్రామం తెనాలి వెళ్లి స్థిరపడ్డాడు. తెనాలి అగ్రహార నిర్ణేతగా అతను ప్రసిద్ధుడయ్యాడు. ఆ తరువాత పదేళ్ళు కూడా తెనాలిలో ఉండకుండా పొత్తపినాటికి పయనమయ్యాడు. ఈ మధ్యకాలంలో ఆయన కొంతకాలం 'పిఠాపురం'లో ఉండిఉంటాడని నాకు తోస్తున్నది. 'పాండురంగ మాహాత్మ్యము' లోని 'నిగమశర్మోపాఖ్యానా'నికి భూమిక పిఠాపురమే. పీఠికా పురాన్ని (పిఠాపురమును) కవి కళింగ దేశానికి కంఠాభరణమని పేర్కొన్నాడు. కుక్కుటేశ్వరుని పేరిట నిర్మించబడిన అతి ప్రాచీన శివాలయం, కుంతీమాధవ స్వామి పేరిట నిర్మించబడిన అంతే ప్రాచీనమైన విష్ణ్వాలయం కల పిఠాపురం అతి ప్రాచీన పట్టణం. అది పాదగయా క్షేత్రంగా ప్రసిద్ధికెక్కింది. కళింగ ప్రాంతపు బ్రాహ్మణుల ఆచారాలు, అక్కడి పంటపొలాలు, వాటిలోని రకాలు, అక్కడి వేశ్యాలోలుర గురించిన విశేషాలు ఉన్నవున్నట్లుగా వర్ణించడాన్ని బట్టి రామకృష్ణ కవి కనీసం కొంతకాలం పాటైనా పిఠాపురంలో నివసించి ఉంటాడని తోస్తున్నది. పిఠాపురంలో నేటికీ నిలచివున్న గాలి గంగల ఆలయం చాల పురాతనమైనది. ఇక్కడ నేటికీ గాలి గంగలమ్మ జాతర జరుగుతూనే ఉంది. 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యములో గాలి గంగల జాతర గురించి అంత విస్తారంగా వర్ణించడాన్ని బట్టి రామకృష్ణ కవి బహుశా పిఠాపురంలో నివసించిన సమయంలోనే అక్కడి గాలి గంగల జాతరను ప్రత్యక్షంగా నిశితంగా పరిశీలించి ఉంటాడనిపిస్తున్నది.

ప్రాచీన కాలంలో ప్రోలునాడు అని పిలువబడిన పిఠాపురం ప్రాంతాన్ని వెలనాటి తెలుగు చోడులు పాలించారు. బహుశా వారి సహకారంతోనే రామకృష్ణుడు అనంతర కాలంలో పొత్తపినాటి తెలుగు చోడుల పంచకు చేరి ఉంటాడు.

పలనాడు, వెలనాడు, వేగినాడు, కాసలనాడు, పొత్తపినాడు, ప్రోలునాడు వగైరాలన్నీ నాటి తెలుగు ప్రాంతపు పరిపాలనా విభాగాలు. "పొత్తపినాటిలో విపినభూమి కిరాతులకాటపట్టు – లోకోత్తర వన్యవస్తు యుదుమూరను పక్కణమొప్పు' అంటూ 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' లో ధూర్జటి మహాకవి వర్ణించిన ఉదుమూరనే అటవీ గ్రామంగల రాష్ట్రమే ఈ పొత్తపినాడు. అప్పట్లో, పొత్తపినాడును విజయనగర పాలకుడైన సదాశివరాయల తరపున గురుదేవచోడరాజు కుమారుడు పెద్ద సంగరాజు పాలించేవాడు. అతని దగ్గర విరూరి వేదాద్రి అనే వ్రాయసం ఉద్యోగి ఉండేవాడు. ఆయన తెనాలి రామకృష్ణునికి ఆశ్రయమిచ్చి ఆదరించాడు. తెనాలి రామకృష్ణుడు 'పాండురంగ మాహాత్మ్యము' అనే కావ్యాన్ని వ్రాసి విరూరి వేదాద్రికి అంకితమిచ్చాడు. విఠోబా అని పిలువబడే పాండురంగ విఠ్ఠలుని దేవాలయం హంపిలో ప్రసిద్ధమైనది. దీనినే విఠ్ఠలరాజ దేవాలయం అని కూడా అంటారు. ప్రఖ్యాతి చెందిన సప్తస్వర రాతి స్తంభములు, ప్రసిద్ధమైన ఏకశిలా రథం ఈ ఆలయ ప్రాంగణం లోనివే. రాయలవారికి విఠోబా అంటే ఎంతో భక్తి శ్రద్ధలు. హంపి – విజయనగరంలో ఉన్నకాలంలోనే తెనాలి రామకృష్ణునికి ఈ కావ్యం రాయాలనే సంకల్పం కలిగి వుండొచ్చు. దీనికి రాయలవారు ప్రోద్బలమిచ్చి

ఉండవచ్చు. కావ్యంలో కొంత భాగాన్ని ఆయన విజయనగరంలో ఉన్న కాలంలోనే వ్రాసి ఉండొచ్చుకూడా.

ఇది ఐదు ఆశ్వాసాల కావ్యం. 1302 గద్య పద్యాలలో దీనిని వ్రాయడం జరిగింది. దీనిలోని 9 ఉపాఖ్యానాలలో కెల్లా 'నిగమశర్మోపాఖ్యానం' యావత్తు తెలుగు సాహిత్యంలోనే ఎన్నదగినది. దానిని రామకృష్ణుడు 111 గద్యపద్యాలలో వ్రాశాడు.

"అల్లసానివారి అల్లిక జిగిబిగి
ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు
పాండురంగ విజయు పదగుంఫనంబును"

అని సాగే ఓ చాటువు ప్రకారం పెద్దనామాత్యుని కవనంలో జిగీ బిగీ; ముక్కుతిమ్మన కవిత్వంలో ముద్దు పలుకులూ వుంటే తెనాలి రామకృష్ణుని కవితలో పదగుంఫనం ఉంది. పదగుంఫనమునకు సువిఖ్యాతమైన 'పాండురంగ మాహాత్మ్యము'ను పాండురంగ విజయము, పౌండరీకవిభు చరితము, పౌండరీక మాహాత్మ్యము అని కూడా పిలుస్తారని కొందరి భావన. పాండురంగ విజయుడు అంటే రామకృష్ణ కవి అన్నమాట. ఈ కావ్య విశేషాలను మూడవ అధ్యాయంలో పరిశీలిద్దాం.



కీ॥శే॥ బి. యస్. రంగా నిర్మించిన

"తెనాలి రామకృష్ణ"

చలన చిత్రంలో


శ్రీకృష్ణ దేవరాయల పాత్రలో జీవించిన కీ॥శే॥ ఎన్టీఆర్

కీ॥శే॥ బి. యస్. రంగా నిర్మించిన
"తెనాలి రామకృష్ణ"
చలన చిత్రంలో



'కుమార భారతి' గా ఎ.యన్.ఆర్.

# పాండురంగ మాహాత్మ్యము

పరిణతి చెందిన ప్రౌఢకవి తెనాలి రామకృష్ణునిచే రచింపబడిన మహాకావ్యమిది. కొద్దిమంది విమర్శకులు, వ్యాఖ్యాతలు యీ కావ్య విశేషాల్ని విశ్లేషిస్తూ యీ కావ్యానికి లఘుటీకలు వగైరాలు వ్రాశారు. అయితే పరిపూర్ణమైన టీకా తాత్పర్య సహిత గ్రంథం ఎక్కడా నాకు లభించలేదు. అంచేత యీ కావ్య పరామర్శకు కూడా ప్రధానంగా ప్రామాణిక నిఘంటువులనే ఆశ్రయించాల్సి వచ్చింది. ఆంధ్ర పంచకావ్యాలలో యిది నాల్గవది. వీలైనంత సంక్షిప్తంగా యీ కావ్య కథాంశాన్నీ, విశేషాల్నీ మనం ముచ్చటించుకుందాం.

'ఉద్భటారాధ్య చరిత్రము' వలెనే యీ కథ కూడా సూతుడు శౌనకాది మహామునులకు చెపుతున్నట్లుగా వ్రాయబడింది. కథాప్రారంభంలో శౌనకాదులు సూతుడిని క్షేత్రము, వేల్పు, తీర్థము – యీ మూడూ సమాన ప్రాధాన్యములుగా కలిగిన క్షేత్రమును గూర్చి తెలుపమని కోరతారు. అప్పుడు సూతుడు 'ఈ కథను నేనొకప్పుడు కృష్ణద్వైపాయనుడు చెప్పగా విన్నాను. అది విన్నది విన్నట్లుగా మీకు వివరిస్తాను. వినండి' అంటూ ప్రారంభిస్తాడు.

శౌనకుడు ఒక మహాముని. ఆయన శునకుని కుమారుడు. కృత్సమదుని మనుమడు. ఆయన మహత్తర వేద పండితుడైన అశ్వలాయునునికి అధర్వవేదాధ్యాపనం చేసిన గొప్ప అధ్యాపకుడు. 'బృహద్దేవతా', 'అనుక్రమణీ' వగైరా ఎన్నో గ్రంథాల కర్తృత్వం ఆయనకు ఆపాదించబడిన కారణంగా 'శౌనక' అనేది ఒక వంశమనీ, వివిధ కాలాలలో వ్రాయబడిన ఆ గ్రంథాలు ఆ వంశంలోని వేర్వేరు వ్యక్తులు వ్రాశారనీ భావించబడుతున్నది.

హిందూ ధర్మ శాస్త్రాల ప్రకారం ఒక క్షత్రియునికీ, బ్రాహ్మణ స్త్రీకీ పుట్టిన వాడు సూతుడు. అలా పుట్టిన వారు రథచోదక వృత్తి చేపట్టాలి. ఒక వైశ్యునికి క్షత్రియ స్త్రీ ద్వారా పుట్టిన వానినీ సూతుడంటారు. అలాంటి వారు వీర గాథలను ఆలపించే వృత్తినే చేపట్టాలి.

ఇక వ్యాస మహర్షి శిష్యులలో సూతుడనే పేరుకల ఓ మహాముని ఉన్నాడు. మహా భారతంలో పాండవులు వనవాసం చేసేటప్పుడు కొంత కాలం పాటు సూతుని ఆశ్రమంలో గడిపారు. సూతుడు సకల శాస్త్ర మర్మాలూ తెలిసిన గొప్ప జ్ఞాని అని ప్రతీతి. ఈ కథాంశాన్ని శౌనకాది మహా మునులకు వినిపించింది ఆ సూతుడే.

ధృతరాష్ట్రుని రథ చోదకుడైన సంజయునికి కూడా సూతుడనే మారుపేరుంది. ఆయన కూడా వేద వ్యాసుని శిష్యుడేనట.

కృష్ణద్వైపాయనుడనేది వ్యాసునికి మరోపేరు. శంతనునితో వివాహానికి పూర్వం సత్యవతికి పరాశరుని వలన పుట్టిన వాడాయన. చిన్నతనంలోనే సన్యసించిన ఆయన విచిత్రవీర్యుని మరణానంతరం సత్యవతి చేత రావించబడి ఆమె ఆజ్ఞపై విచిత్రవీర్యుని భార్యలతో సంగమించి, ధృతరాష్ట్ర, పాండురాజ, విదురులకు తండ్రి అయ్యాడు. శంతనునితో తన వివాహానికి పూర్వం పరాశరునితో అక్రమ సంబంధం కారణంగా పుట్టిన కృష్ణవర్ణపు (నల్లని) యీ బాలుడిని ఎవరికీ తెలియకుండా ఒక ద్వీపంలో పెంచిందట సత్యవతి. అందుకే ఆయన తొలిపేరు కృష్ణద్వైపాయన. వ్యాసుడు అంటే 'క్రమ పద్ధతిలో అమర్చిన వాడు' అని అర్థం. వేదాలను ఓ క్రమ పద్ధతిలో అమర్చిన కారణంగా కృష్ణద్వైపాయనుడు వేద వ్యాసుడనబడ్డాడు. మహాభారతం యీయన చెబుతుంటేనే గణపతి వ్రాశాడని విశ్వాసం. అష్టాదశ పురాణాలు, బ్రహ్మ సూత్రాలు కూడా యీయన రచనలేనని విశ్వాసం.

మృత్యువే లేని ఏడుగురు చిరజీవులలో వ్యాసుడొకడట. ఈ క్రింది శ్లోకం చూడండి -

శ్లో॥ అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః ।
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥

అలా అశ్వత్థామ, బలి, వ్యాసుడు, హనుమంతుడు, విభీషణుడు, కృపాచార్యుడు, పరశురాముడు అనే ఏడుగురు చిరజీవులన్నమాట.

అయితే మార్కండేయుడు, విష్ణువులకు కూడా చిరజీవులని పేరుంది. పురాణ సాహిత్యాన్ని బట్టి అరూపుడైనా (రూపం లేకున్నా) మన్మథుడు కూడా చిరజీవిగానే కనుపిస్తున్నాడు.

ఆషాఢ మాసంలో శుక్లపక్షంలోని 15వ రోజును వ్యాస పౌర్ణమిగా గురుపూజోత్సవం నిర్వహిస్తారు.

ముందుగా కాశీపుర వర్ణనతో కథ ప్రారంభమౌతుంది.

## కాశీపుర వర్ణనము

శా॥ శీతాహార్య సుతాళినీ వికచ రాజీవంబు విశ్వేశ్వర
జ్యోతిర్లింగ విశుద్ధ రత్నఖని మోక్షోపాయ దుగ్ధాబ్ధి వే
లాళీరావని దుంఠి నామక గజాలానంబు గంగామృత
స్రోతోనిస్సృతి చంద్రగోళ మన మించుం గాశి శ్రీరాశియై (పాండురంగ మాహాత్మ్యం : 1-99)

కాశీపురము 'శీతాహార్య సుతాళినీ వికచ రాజీవ'మట. శీతాహార్యుడు అంటే మంచునే భూషణముగా ధరించిన హిమవంతుడు. అతడి సుత (కుమార్తె - పార్వతీదేవి) అనే అళిని (ఆడు తుమ్మెద) కోసం; వికచ (వికసించిన) రాజీవము (తామరపువ్వు). ఆ నగరం విశ్వేశ్వర జ్యోతిర్లింగమనే విశుద్ధమైన రత్నం లభించే గనియట. విశ్వేశ్వరుని నివాస స్థలమే కదా మరి కాశీపురి ! మోక్షసాధనమగు పాలసముద్రానికి కాశి ఒడ్డట; కాశికాపురి 'ఢుంఠి నామక గజాలానంబు' - అంటే ఢుంఠి అనే పేరుగల గజమునకు (వినాయకునకు) ఆలానము (అంటే ఏనుగును బంధించే స్తంభము). ఇంకా కాశీపురి 'గంగామృత స్రోతోనిస్సృతి చంద్రగోళ'మట. గంగయనే అమృత ప్రవాహం స్రవించే చంద్రగోళమట. పూర్వీకులెందుకోగానీ చంద్రుడిని అమృతానికి నిలయంగా భావించారు. (దీనిపై మరిన్ని వివరాల కోసం చూ.అనుబంధం-6).

ఇంతటి వైభవంతో కాశి శ్రీరాశి (భాగ్య నిలయమై) మించుతున్నదట (ప్రకాశిస్తున్నదట).

శా॥ ప్రాలేయాచల కన్యకా వదన శుంభత్పద్మ సౌరభ్యమున్
గ్రోలంగల్గియుఁ దుప్తిలేక మునిహృత్క్రోడాబ్జ సౌంగధ్య లీ
లా లాలిత్యముఁ గోరునొక్క సిత రోలంబంబు నైజాకృతిన్
దాలొందించుఁ బరాసులన్ భ్రమర కీటక న్యాయరీతిన్ బురిన్ (పాండురంగ మాహాత్మ్యం : 1-100)

'ప్రాలేయము' అంటే మంచు; 'ప్రాలేయాచల కన్యక' అంటే హిమవంతుని కుమార్తె పార్వతి. 'రోలంబము' అంటే తుమ్మెద. శివుడు తెల్లని మేనిచాయ కలవాడు గనుక 'సిత రోలంబంబు' అంటూ శివుణ్ణి తెల్లని తుమ్మెదగా వర్ణిస్తున్నాడు కవి. ఈ తెల్లని తుమ్మెద (శివుడు) పార్వతి యొక్క ముఖము అనే వికసించుచున్న పద్మము యొక్క పరిమళాన్ని ఆస్వాదించ గలిగియుండి కూడా తృప్తిలేక మునుల హృదయముల లోపలి (క్రోడము అంటే అంతర్భాగము) పద్మముల (హృదయముల లోపలి అనాహత పద్మముల – యీ అనాహత పద్మం శివసంబంధి అంటారు.) సౌరభమును పొందగోరుతుందట. అంతేకాదు భ్రమర-కీటక న్యాయ రీతిలో కాశికాపురిలో పరాసుల (పరాసువులు – అసువులు బాసినవారు)ను తన ఆకృతితో దాలొందింప జేస్తుందట – అంటే ప్రకాశింపజేస్తుందట. భ్రమర-కీటక న్యాయం ప్రకారం తుమ్మెద ఒక కీటకాన్ని తెచ్చి తన గూటిలో వుంచి రొదచేస్తూ దాని చుట్టూ పరిభ్రమిస్తుందనీ ఆ కారణంగా కీటకం నిరంతరం భ్రమరాన్నే ధ్యానిస్తూ 'యద్భావం తద్భవతి' అన్నట్లు కొంతకాలానికి ఆ కీటకం కూడా భ్రమరం ఆకారం దాలుస్తుందనీ విశ్వాసం. శైవుల విశ్వాసం ప్రకారం ముక్తి అంటే శివాకృతి ధరించడమే. అది సారూప్య మోక్షం. భగవంతునితో సమానమైన రూపమునందడం సారూప్యం. కవి యీ చక్కటి పద్యంలో రూపకాలంకారంలో శివుడనే తెల్ల తుమ్మెద కాశీపురిలో మరణించినవారిని తన ఆకృతికి మార్చి ఎలా వెలుగొందింపజేస్తాడో భ్రమర-కీటక న్యాయపరంగా అద్భుతంగా వర్ణించాడు. అయితే తుమ్మెద (*Large Black Carpenter Bee*) జైలోకోపిడే (*Xylocopidae*) కుటుంబానికి చెందిన ఓ కీటకం. 'జైలో కోపిడే' అనే లాటిన్ పేరుకు అర్థం 'కొయ్యని తొలిచే'అని. పేరుకి తగ్గట్టు తుమ్మెదలు కొయ్యదుంగల్ని తొలిచి గూళ్లుచేసుకొని అక్కడ గుడ్లు పెడతాయి. అలా ఆ గుడ్ల నుంచి పిల్ల తుమ్మెదల్ని సృష్టిస్తాయేగానీ తుమ్మెదలు వేరే కీటకాల్ని తెచ్చి తమ గూట్లోపెట్టి, ఝుంకారం చేయడం కారణంగా ఆ కీటకాలు కూడా తుమ్మెద ఆకృతిని ధరిస్తాయనేది అశాస్త్రీయ విశ్వాసం. గండు తుమ్మెద (*Bumble Bee-Bombus terrestris*) అనే ఎపిడే (*Apidae*) కుటుంబానికి చెందిన కీటకం కూడా యిదే తరహా పునరుత్పత్తి విధానం కలిగి వుంటుంది.

సీ॥ ఒకనాఁడుఁ దీర్ఘోపయోగి కాని శరుండు సౌఁదల ధరియించు నభ్రగంగ
నా ప్రొద్దు పాయిరాఁజనట్టి నిర్వేదయు భోగించు నైశ్వర్యము లెనిమిదియుఁ
బుష్కరాక్షుల పొంతఁ బోని వర్షవరుండు దేహార్ధమునఁ దాల్చుఁ దీగఁ బోఁడి
నాయుధ ప్రభఁగాంచి యలఁగు భీరువుఁ బూను వాఁడి ముమ్మొముల వేఁడి యలుగు

తే॥ మలిన వర్తనుఁడును సుధాలలితమూర్తి, మించి వర్తించు; మలిలేని మేదకుండు
మౌనివర్యులఁ జదివించు మట్టినీడఁ, బంచముఖువీట మేనోసరించెనేని.

(పాండురంగ మాహాత్మ్యం : 1-101)

శైవుల విశ్వాసం ప్రకారం కైవల్యప్రాప్తి అంటే శివుని రూపం ధరించడమేనని యింతకు ముందే చెప్పుకున్నాం. ఈ చక్కటి పద్యంలో కాశిలో మృతిచెందిన వారు ఏ విధంగా శివుని రూపాన్ని పొందుతారో చెపుతున్నాడు కవి. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములనే ఐదూ శివుని ముఖాలు. పంచముఖుని వీట అంటే పంచముఖములు కల శివుని పురియైన కాశిలో ఒక్కరోజుకూడా నీటిని ఉపయోగించి ఎరగని మూఢుడు కేవలం మేను ఓసరిస్తే – అంటే మరణిస్తే – ఆకాశగంగను ఔదలన్ (తలపై) ధరిస్తాడట. కాశిలో చనిపోగానే శివుడైపోతాడుగా మరి! ఆ రోజు పొయి రాఁజనట్టి (కూటికి లేనట్టి) నిర్పేద (నిరుపేద) అష్టైశ్వర్యములూ అనుభవిస్తాడట. అంటే కాశిలో మరణించినంత మాత్రాన కూటికి గతిలేని నిరుపేదకూడా అష్టైశ్వర్యములకూ ఆకరమైన శివుని రూపం ధరిస్తాడన్నమాట. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనే ఎనిమిదింటినీ అష్టైశ్వర్యములంటారు. పుష్కరాక్షులు – తామరపూల వంటి కన్నులు గలవారు – స్త్రీలు; కాశిలో మరణిస్తే ఏనాడూ స్త్రీల సామీప్యానికి కూడా పోయి యెరగని వర్షవరుడు (అంటే నపుంసకుడు) తీగబోడిని దేహార్ధమున దాలుస్తాడట. అంటే పార్వతిని సగము మేన ధరించిన అర్ధనారీశ్వరుడౌతాడట. ఆయుధ ప్రభ (ఆయుధముల కాంతి) ని చూస్తేనే భయపడే భీరువు (పిరికివాడు) కూడా కాశిలో మరణించినంతమాత్రాన వాడియైన మూడు మొనలుగల తీక్ష్ణమగు ఆయుధము (త్రిశూలము) ను చేబూనుతాడట. అంటే త్రిశూలపాణియైన శివుడైపోతాడట. మలినవర్తనుడు (అంటే చెడునడత కలవాడు) కూడా కాశిలో మరణిస్తే సుధాలలితమూర్తి అంటే అమృతమువలె స్వచ్ఛమైన దేహముకల చంద్రుని మించి ప్రకాశిస్తాడట. మతిలేని స్తబ్ధుడు కూడా కాశిలో మరణిస్తే మఱ్ఱి చెట్టునీడన మౌనివర్యులకే విద్యా బోధ చేస్తాడట. (కైలాసంలోని ఓ పురాతనమైన మఱ్ఱిచెట్టు నీడలో అనవరతమూ శివుడు ముని గణానికి ఆధ్యాత్మికోపన్యాసాలిస్తూ ఉంటాడని ప్రతీతి). అలాంటిది కాశీపుర మాహాత్మ్యమని చెప్తున్నాడు కవి. ఈ పద్యంలో 'నిరుపేద' అనే పదాన్ని క్లుప్తంగా 'నిర్పేద' అంటూ స్వతంత్ర ప్రయోగం చేశాడు రామకృష్ణకవి. పదాల విషయంలో ఇలాంటి స్వతంత్ర ప్రయోగాలకు రామకృష్ణకవి పెట్టిందిపేరు.

నందకపాణి (నందకమనే ఖడ్గాన్ని చేబూనినవాడు – విష్ణువు) ఆనందకాననమైన ఆ కాశికాపురిలో కేశవుడనే పేర వెలశాడట. ఆ పురి స్త్రీల ముఖములు చంద్రబింబముల వలె వున్నాయట. అంచేత అక్కడి స్త్రీలు ఇటునటు తిరుగాడుతూంటే పెక్కుమంది చంద్రులు నాట్యం చేస్తూన్నట్లుందట. ఆ పూరి రాచ వీధిలో జనసమ్మర్దం చేత వారి మెడలలో నుండి జారిపడిన రత్నాల హారములనుండి రాలిన రత్నములను చూస్తే 'ఆ మణులతో రాచ బాటను పూజ చేస్తున్నారా ?' అన్నట్లున్నదట. ధవళగిరియైన కైలాస పర్వతంతో సమానమైనట్టి తెల్లదనంతో మెరిసిపోతూందట తెల్లని ఆ వూరి మేడల కాంతి అనే కౌముది (వెన్నెల)తో వెలుగుతూన్న అక్కడి ఆకాశం. భూమికి రత్నగర్భ అని మరో పేరు. అయితే ఆ భూమిలోపలి భాగమెలా వుంటుందో చూచిన వారెవరూ లేరు. అయితే వివిధములైన రత్నములు అమ్మకం నిమిత్తం పేర్చబడిన విశాలమైన ఆ వూరి అంగళ్లను చూస్తే ఎవరికైనా 'రత్నగర్భా జఠరము (జఠరము అంటే గర్భాంతర్భాగము) యిలా వుంటుందా!' అని అనిపిస్తుందట.

ఇంకా ఆ వూరి భవనములపై ఎత్తైన లాంఛనధ్వజములకు (జెండా కర్రలకు) ఎగురవేయబడిన జెండాల పలిపెపు పట్టువస్త్రముల చివరి భాగములు గాలికి టపటపా కొట్టుకుంటూ సూర్యుని రథానికి పూన్చిన గుర్రాలను తోలే కొరడాలలా వున్నవట. అంటే దాదాపు సూర్యమండలం వరకు వ్యాపించి వున్నవా – అన్నట్లున్నాయట అక్కడి లాంఛనధ్వజములు.

ఇక అక్కడి వివిధ వర్ణముల ప్రజల గుణగణాలను వర్ణిస్తున్నాడు కవి.

చ॥ చదువుల పుట్టినిండ్లు శమసంపద యిక్కలు పుణ్య లక్ష్మికిన్
మొదలి దివాణముల్ సురసమూహము నాఁకటిపంట లంచితా
భ్యుదయ నిసర్గబంధువులు ప్రోడతనంబుల రాణముల్ పురిన్
బొదలెడు భూసురోత్తముల భూరి పవిత్ర శరీర వల్లరుల్. (పాండురంగ మాహాత్మ్యం : 1-109)

కాశికాపురి లోని బ్రాహ్మణులు చదువులకు పుట్టినిళ్లు (ఇక్క అంటే యిల్లు; స్థానము); శమసంపద - అంటే శాంతి సంపదకు స్థానములు; పుణ్యలక్ష్మికి ప్రధానములైన కొలువుకూటములు; సురసమూహము నాఁకటి పంటలు - అంటే దేవగణముల - ఆకలి తీర్చడానికి (వారి ప్రీత్యర్థం) అనునిత్యమూ యజ్ఞయాగాదులు చేస్తారట. (యజ్ఞ యాగాదులలో అగ్నికి సమర్పించబడిన హవిస్సులను అగ్ని మోసుకెళ్ళి దేవతలకు ఆహారంగా అందిస్తాడని విశ్వాసం); అంచితాభ్యుదయ నిసర్గబంధువులు - ఒప్పారుచున్న శ్రేయస్సుకు దగ్గరి చుట్టములు; ప్రోడతనము (అంటే నైపుణ్యము)నకు రాణములు (స్థానములు); అట్టి బ్రాహ్మణుల పరమ పవిత్రములైన తీగలవంటి దేహములు; పురిన్ - ఆ కాశికాపురిలో; పొదలెడున్ - వెలయుచుండును. అంటే కాశిలోని బ్రాహ్మణులు విద్య, శాంతము, పుణ్యము, యాగాభిలాష, శ్రేయస్సు, నైపుణ్యము, పవిత్రత కలిగి వర్ధిల్లుతున్నారట.

ఉ॥ పుట్టిన నాఁటినుండి యును బుణ్యులు సత్పుల మొందు నంతకున్
బట్టిన కార్య మీశ్వరుఁడు పట్టిన నీని దృఢ ప్రతిజ్ఞలే
పట్టున ధర్మముల్ విడని ప్రాజ్ఞులు తద్‌జ్ఞులపాలివేలుపుం
జెట్టులు పోరనైదు పదిసేయని శూరులు వీటిరాసుతుల్. (పాండురంగ మాహాత్మ్యం : 1-110)

ఇక అక్కడి రాసుతులు - అంటే క్షత్రియ కుమారులెలాంటి వారంటే -

పుట్టిన నాటి నుండి పుణ్యచరిత్ర కలిగినవారు; సత్పుల మొందునంతకున్ (తలపెట్టిన కార్యసాధన అయ్యేంత వరకూ) పట్టిన కార్యాన్ని ఈశ్వరుడేవచ్చి అడ్డుపడినప్పటికీ; ఈయని - విడువని; దృఢప్రతిజ్ఞులు - గట్టి పట్టుదల గలవారు, ఏ పట్టునన్ - ఎటువంటి పరిస్థితులలోనూ; ధర్మములు వీడని ప్రాజ్ఞులు (సమర్థులు); తత్త్వజ్ఞులకు అడిగినది లేదనకుండా యిచ్చే వేలుపుంజెట్టులు - దేవతా వృక్షములు అంటే కల్ప వృక్షములు; పోరన్ - యుద్ధములో; ఐదు పది సేయని - శత్రువు ముందు చేతులు జోడించని (ఐదు పది సేయుట అంటే రెండు చేతులూ జోడించి నమస్కరించుట) అంటే యుద్ధములో శత్రువుకు వెరచి లొంగిపోని వీరులు ఆ పట్టణములోని రాజపుత్రులు.

గీ॥ బలయు రత్నాకరములు సంచులుగఁ జేసి
పొదివి నిధులెల్లఁ గొనిసంచి మొదలుచేసి
బేరమాడెడు పాటి యుదారలక్ష్మి
బచ్చు లప్పురి నున్నారు పెచ్చు పెరిగి. (పాండురంగ మాహాత్మ్యం : 1-111)

బచ్చులు అంటే వైశ్యులు. ఈ పద్యంలో కాశిలోని వైశ్యులు ఎంతటి వైభవం కలవారో వివరించాడు కవి.

రత్నాకరములంటే సముద్రములు. భూమిని ఆవరించివుండే సముద్రములలో నవనిధులున్నాయని ప్రతీతి; అవి - మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, ఖర్వము; సముద్రములనే

సంచులుగాజేసి, వాటిలోని సమస్త నిధులనూ సంగ్రహించి దానినే సంచి మొదలు జేసి (సంచి మొదలు జేయటం అంటే వ్యాపారానికి పెట్టుబడి మూలధనముగా నుంచటం) బేరమాడ గల యంతటి - ఉదారలక్ష్మి - అంటే గొప్ప సంపద గలిగిన వారు ఆ పురి వైశ్యులు.

కII హరమౌళి హీర మచ్యుత
చరణాబ్జ మరంద ధార జాహ్నవి లోకే
శ్వరి తమ సోదరి యగునంట
పురి వెలమల భాగ్యమహిమఁ బొగడఁగ వశమే? (పాండురంగ మాహాత్మ్యం : 1-112)

ఇక కాశీపురిలో శూద్రులెలావున్నారంటే -

హరమౌళిహీరము - అంటే శివుని తలపైనున్న వజ్రమణి, అచ్యుత చరణాబ్జ మరందధార - అంటే విష్ణువు పాదపద్మములనుండి జాలువారిన అమృత జలధార (వామనావతారంలో ఆకాశానికి బ్రహ్మ నివసించే సత్యలోకం వరకూ చాచబడిన విష్ణువు పాదాన్ని బ్రహ్మ తన కమండల జలంతో కడుగగా ఏర్పడిన అమృత జలధారయే పవిత్ర గంగయని ఐతిహ్యం). ఉధృత ప్రవాహంగా మొదలైన ఆ దివిజగంగను శివుడు తన జటాజూటంలో బంధించి దాని ఉధృతిని కొంత మేరకు నియంత్రించాడట. శివుణ్ణి ప్రసన్నంచేసుకుని దివిజ గంగను భువికి దించాడట భగీరథుడు. ఆ తదుపరి భగీరథుని వెన్నంటి వస్తూన్న గంగ ఆ క్రమంలో తన ఆశ్రమాన్ని ముంచెత్తిందన్న కోపంతో దాన్ని ముందు త్రాగేసిన జహ్ను మహర్షి తరువాత భగీరథుడు తనను ప్రసన్నం చేసుకొన్న కారణంగా తన చెవి నుండి గంగను తిరిగి బయటకు వదిలాడట. అందుకే నాటి నుండి గంగ జహ్ను పుత్రిక, జహ్ను కన్యక, జాహ్నవి అని పిలువబడుతూంది. విష్ణువు పాదం వద్ద పుట్టింది గనుక గంగను 'విష్ణుపది' అని కూడా అన్నారు. శూద్రులు కూడా 'విష్ణువు పాదాల నుండి పుట్టుకొచ్చిన'వారేనట! అంచేత గంగకు వాళ్లు తోబుట్టువులట!

ఇకపోతే యీ పద్యంలో 'వెలమలు' అనే పదం శూద్ర సామాన్య బోధకంగా వాడబడింది. అయితే అది శూద్రులలోని ఒక కులానికి విశేషవాచక శబ్దం. (వెలమకులస్థులను గురించి వివరాల కోసం అనుబంధం - 8 చూడండి).

ఇక కాశిలో ఏనుగులెలా వున్నాయట? తమ పొందికతో భూమికీ, ఆకాశానికీ మధ్య సందనేది లేకుండా బిగించి వేశాయట. అంతటి ఉన్నతమైన కాశికాపురి ఏనుగుల ముందు ప్రపంచంలోని అన్ని ఏనుగులూ పొట్టివే (వామనములే) కాగా ఒక్క దక్షిణ దిగ్గజమును మాత్రమే 'వామనము' అనడం ఏ మాత్రం సమంజసంగా లేదంటాడు రామకృష్ణకవి (భూభారాన్ని నాలుగు దిక్కులలో మరియు నాలుగు మూలల్లో కలిపి మొత్తం ఎనిమిది ఏనుగులు తమ కుంభస్థలాలపై మోస్తున్నాయని ప్రాచీనుల విశ్వాసం. అవి 1) ఐరావతము 2) పుండరీకము 3) వామనము 4) కుముదము 5) అంజనము 6) పుష్పదంతము 7) సార్వభౌమము 8) సుప్రతీకము. ఈ ఎనిమిది ఏనుగుల్నీ దిగ్గజాలనీ, దిగ్దంతులనీ అంటారు. వీటిలో, దక్షిణ దిక్కున మోసే దిగ్గజం మిగిలిన వాటికంటే పొట్టిదని దానికి 'వామనము' అని పేరు పెట్టారు).

ఆ కాశీపురికి చెందిన గుర్రములు హరిహయుని (ఇంద్రుని) వాహనమైన మావు (గుర్రము) - ఉచ్చైశ్శ్రవము అనే సర్వోత్తమాశ్వాన్ని తలపింపజేసే విధంగా, కొద్దిగా అదలించినా రథాన్ని తటాలున ఏడు సముద్రాలూ దాటించేసేటంత వేగమూ, యుద్ధంలో గాయపడిన తమ యజమానుని అతని స్వస్థలానికి అత్యంత నేర్పుగా చేర్చగలిగిన లాఘవమూ కలిగి వున్నాయట!

ఆ కాశీపురిలో గొప్ప గొప్ప రథాలున్నాయట. అవి ఎంత గొప్ప రథాలంటే కాశీపురాధిపతియైన శంకరుడి

రథాన్ని చూసి, "ఈ డొక్కురథం మాకు ఎందులో సాటి?" అంటూ వాటి కేతనము (జండాకర్ర) ల కుండే కింకిణుల (చిరుగంటల) తో ధ్వని చేస్తూ ఎగతాళిగా నవ్వుతున్నట్లున్నాయట. అదెలాగో ఈ చక్కటి పద్యం చూడండి-

ఉ॥ "సారథి ఛాందసుండు జడిసాగదు చక్రయుగంబు ప్రాతపం
చారపు గుఱ్ఱముల్ రథియు శౌర్యమునం దరమాని సొత్త వి
స్తారము ఖండఖండములు తానంట మాసరి" యంచుఁ దత్పురిం
దేరులు నవ్వు శంకరుని తేరిని గేతన కింకిణీధ్వనిన్. (పాండురంగ మాహాత్మ్యం : 1-115)

ఈ పద్యంలో రామకృష్ణకవి త్రిపురాసుర సంహార సందర్భంలో శంకరుడు వాడిన రథానికి సంబంధించిన ఐతిహ్యాన్ని సందర్భోచితంగా వాడుకున్నాడు. శివుడు త్రిపురాసుర సంహారానికి బయలుదేరినప్పుడు భూమి ఆయనకు రథమయ్యిందనీ, బ్రహ్మ సారథిగా వ్యవహరించాడనీ, సూర్య చంద్రులారథానికి చక్రాలనీ, నాల్గువేదములూ ఆ రథానికి పూన్చిన గుఱ్ఱాలనీ ఐతిహ్యం.

సారథి బ్రహ్మ ఛాందసుడట. వేదానికి ఛందస్సనే మరో పేరుంది. ఛాందసుడంటే వేద పండితుడు. బ్రహ్మ వేద పండితులలో అగ్రగణ్యుడు. అయితేనేం ఆయన వేద జడుడు (*Scholastic*) – లౌక్యమూ, నేర్పరితనమూ లేనివాడు. కనుక అలాంటి లాఘవంలేని వేదపండితుడు రథసారథిగా ఏం పనికొస్తాడు? అని కవి భావం.

ఇక ఆ రథం చక్రాలంటారా? ఒకటి సూర్యుడూ, మరొకటి చంద్రుడూనూ. పరిమాణంలో చంద్రునికన్నా సూర్యుడు సుమారు 400 రెట్లు పెద్ద. (చంద్రగోళపు వ్యాసం 3,476 కి.మీ. కాగా, సూర్యుని వ్యాసం 13,92,000 కి.మీ.) చక్రాలు రెండూ సమాన వ్యాసం కలిగివుంటేనే బండి సాఫీగా నడుస్తుందిగానీ యిలా ఒకటి పెద్దదీ, మరొకటి అతిచిన్నదీనైన చక్రాలతో నిర్మించిన బండి ఎలా నడుస్తుంది? ఈ సూర్య చంద్ర గోళాల సాపేక్ష పరిమాణాల పరిజ్ఞానం ఆనాటికి మన రామకృష్ణ కవికి ఉండి ఉండదు. అయినా 'ఆ రథం యొక్క చక్రయుగంబు (చక్రాల జంట) జడి సాగదు – అంటే ఒక్కసారిగా సాగదు' అని పేర్కొన్నాడు కవి. అలా కొనసాగకపోవటానికి యింకొక కారణం వుంది. సూర్యుడు పగలుంటే చంద్రుడు రాత్రిపూట వుంటాడు. ఒకటి వున్నప్పుడు మరొకటి వుండని ఆ రథ చక్రాలతో ఏర్పడిన బండి క్రమ పద్ధతిలో ఎలా సాగుతుంది మరి?

ఇక ఆ రథానికి పూన్చిన గుర్రాలంటారా? అవి నాలుగు వేదాలట. వేదాలు అపౌరుషేయాలనీ (అంటే మానవులచే రచింపబడనివనీ) భగవంతుని ప్రేరణ వల్లనే వేదవాక్కులు ఋషుల హృదయాలలో ప్రవేశించి వారి ద్వారా మనకందించబడినాయనేది ప్రాచీనుల విశ్వాసం. వేదాలు భగవంతుని నిట్టూర్పులుగా బయల్పడి ఋషులచే వినబడ్డాయట. అందుచేతనే వేదాల్ని 'శ్రుతులు' (వినబడినవి) అనీ, అవి ఋషిప్రోక్తాలనీ అంటారు. వాటి విషయంలో కాలనిర్ణయం చేయలేమనీ, భగవంతుడు నిత్యుడు కనుక ఆయన నిశ్వాసలూ నిత్యములే కాబట్టి వేదాలు నిత్యమైన శబ్దరాశి అనీ ప్రాచీనుల విశ్వాసం. అయితే ఈ విషయంలో శాస్త్రీయ దృక్పథం ఏమిటంటే వేదాలు పౌరుషేయాలే. వసిష్ఠుడు, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, అగస్త్యుడు, గౌతముడు, జమదగ్ని, నారదుడు, దేవరాతుడు, పరాశరుడు, అంగిరసుడు, మధుచ్ఛందుడు, శునఃశేపుడు వగైరా ఋషులు వివిధ దేశకాలాలలో వేదాల్ని వ్రాశారు. 'వేదయతీతి వేదః' అనే నిర్వచనం ప్రకారం నాటి ప్రాయికమైన విజ్ఞానమే వేదం. మానవజాతి పురోగమిస్తున్న కొద్దీ ఎప్పటికప్పుడు తాము నేర్చుకుంటూన్న ప్రాథమికమైన వివిధ విజ్ఞాన విషయాలు పై ఋషులచే వేర్వేరు కాలాలలో మూలానికి జతపరచబడినాయి. ఆయా

ఋషులు చేసిన వర్ణనలను బట్టీ, వారు వర్ణించిన నాటి దేశకాల పరిస్థితులను బట్టీ వేదాలలో అతి ప్రాచీనమైనదైన ఋగ్వేద రచనాకాలం క్రీ.పూ. 2000-1500 సంవత్సరాల మధ్యకాలంలో అయివుంటుందని శాస్త్రజ్ఞులు నిర్ధారించారు. మిగిలిన మూడు వేదాలూ బాగా తరువాతకాలం నాటివి. అయితే ఒకటి మాత్రం సుస్పష్టం. వేదాలు మానవాళి యొక్క అత్యంత ప్రాచీన రచనా సంపద. ఒకప్పుడు వేదాల్ని త్రయీ విద్యలనీ, వేద త్రయమనీ అనేవారు. నాల్గవదైన అథర్వ వేదాన్ని నేటికీ కొందరు ఛాందసులు వేదంగా గుర్తించరు. ఎందుకంటే, అది ఆర్య-అనార్య సంస్కృతుల సమ్మేళనానంతరం సంకలనం చేయబడిందట! ఏది ఏమైనా వేదసాహిత్యం అత్యంత ప్రాచీనమైనదనే విషయం మాత్రం నిర్వివాదాంశం.

రామకృష్ణకవి కాలంనాటికి వేదాలు నాలుగని స్థిరపడింది. అయితే కవి పై పద్యంలో వేదాల (గుర్రాల) సంఖ్యను చెప్పకుండా 'ప్రాత పంచారపు గుఱ్ఱములు' అని మాత్రమే అన్నాడు. అంటే అవి మార్పులేని పాతరీతి నడకలు కలిగినవని అర్థం (వేదాలు విజ్ఞాన నిధులుగా భావించబడిన రోజులలో వివిధ దేశకాల పరిస్థితులలో అవి సంకలించబడినప్పటికీ, వివిధ ఉపయుక్త విషయాలు ఎప్పటికప్పుడు మూలానికి కలుపబడి నప్పటికీ - వాటికి పవిత్రత ఆపాదించ బడిన తరువాత అవి ఎంతమాత్రమూ ఎదుగుదలలేని ప్రాత పంచారపు గ్రంథాలుగా మిగిలాయి. పాతదానికి ఒక్కముక్క కలపడం కానీ, అందునుంచి ఒక్కముక్క తీసివేయడంకానీ నేరంగా భావించి దానినే వల్లిస్తూ క్రమంగా అర్థవిచారణ కంటే భట్టీయం పట్టడానికే ప్రాముఖ్యత యివ్వబడింది. అందుకనే వేదాల్ని ప్రాత పంచారపు గుర్రములంటున్నాడు రామకృష్ణకవి) రథానికి పూన్చే గుర్రాలు ఎప్పటికప్పుడు నవ్యరీతుల్ని అలవరచుకోగలిగినవై వుండాలిగాని మార్పులేని పాతరీతి నడకలు కలిగినవిగా ఉండరాదు.

ఇక రథి సంగతి చూద్దాం. రథికుడు పూర్తి పౌరుషము కలిగి ఎట్టి పరిస్థితులనైనా ఎదుర్కొనడానికి సిద్ధంగా వుండాలి. అయితే, యిక్కడ రథికుడైన శివుడు 'శౌర్యములో అరమానిసి' అంటున్నాడు కవి. శివుడు సగం మగవాడైన అర్ధనారీశ్వరుడు కదా! కనుక పూర్తి పౌరుషవంతుడుకాని అరమానిసి.

ఇక ఆ రథం ఎలా వుందట? రథము భూమేకదా!

ఆత్మ విస్తారము - అంటే ఆ రథం యొక్క స్వరూపము. అతుకులు బొతుకులతో కూడి వున్నదట. ఖండఖండములు - భూమి ఒకచో భూఖండము, తరువాత జలఖండము, మరల భూఖండము - యిలా ఖండఖండాలుగా - అంటే అతుకులు వేయబడిన చిన్న చిన్న భాగములుగా వుంటుంది. "ఇక యిలాంటి లోపాలన్నీ గల రథము మాకు సరిసాటా?" అని ప్రశ్నిస్తూ ఎగతాళిగా నవ్వుతున్నాయట కాశీపురిలోని మేటి రథాలు.

ఈ పద్యం రూపేణా రామకృష్ణకవి ఉత్తమ రథానికుండాల్సిన లక్షణాలేమిటో పనిలో పనిగా వివరించాడు. రథం వీలైనంతమేరకు అతుకులు లేకుండా ఏక ఖండంగా తయారు చేయబడిందిగా వుండాలి. లేకుంటే అత్యవసర సమయాల్లో యుద్ధరంగంలో అతుకులు ఊడి రథం కూలిపడి రథికుడు పరాజయం పాలయ్యే ప్రమాదముంది. సారథి లౌక్యం తెలిసిన నేర్పరిగా వుండాలి. రథ చక్రాలు రెండూ ఒకే పరిమాణం (అంటే ఒకే వ్యాసం, ఒకే బరువు) కలిగి వుండాలి. గుర్రములు నూతనరీతుల నడకలు నేర్చినవై వుండాలి. రథికుడు పూర్తి పౌరుషము కలిగి ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కొన గలిగిన సాహసి అయి వుండాలి. ఈ పద్యంలో కూడా రామకృష్ణకవి 'అరమానిసాత్మ విస్తారము' అంటూ 'ఇ' కారం మీద సంధిచేశాడు. ఇది కూడా స్వతంత్ర ప్రయోగం.

ఇక కాశీపురంలోని కాల్బలం శత్రువులను ఒక్కవేటుకు ఆరు తునకలు అయ్యేట్లు నరుక గలిగిన భుజబలం కలిగినవారట. వారు పోటుమగలట. వారి శౌర్యము శత్రువులకు భయం గొలిపేదిగా వుందట.

తరువాత కాశీపురిలోని వేశ్యల సౌందర్యాన్ని యిలా వర్ణించాడు -

సీ॥ మొలక చీఁకటి జలజల రాల్పఁగా రాదె నెఱులు మించిన వీరి కురులయందు
కెరలించి యమృతంబు గిలకొట్టఁగా రాదె ముద్దుచూపెడి వీరి మోవులందు
పచ్చిబంగారు కుప్పలు సేయఁగా రాదె గబ్బి మీటిన వీరి గుబ్బలందు
పండు వెన్నెల తేటఁ బరిఢవింపఁగ రాదె నగవు గుల్కెడి వీరి మొగములందు

తే॥ నౌర! కరవాఁడి చూపుల యోఘళంబు, బాపురే! భూరి కటితటీ భారమహిమ
చాఁగు! మదమందగమన లక్షణములనఁగ, నేరుపుల మింతురప్పురి వారసతులు.
(పాండురంగ మాహాత్మ్యం : 1-117)

అక్కడి వారసతుల (వేశ్యల) నొక్కులు తిరిగిన శిరోజాలనుండి (అంకురించిన) చిక్కని చీకటిని జలజలా రాల్పవచ్చుట! (అంటే వారి శిరోజాలు చిమ్మ చీకటికి పుట్టినిండ్లా అన్నంత నల్లగా వున్నాయన్నమాట) వారి పెదవులనుండి అమృతాన్ని గిలకొట్టవచ్చుట! (అంటే వారి మోవులనుండి అధరామృతం చిప్పిల్లుతూందట) మదించి, నిక్కిన వారి వక్షోజాలనుండి బంగారం కుప్పలు కుప్పలుగా తీయవచ్చుట (అంటే వారి రొమ్ములు బంగారు కుప్పల్లా వున్నాయట), పండు వెన్నెలలోని ప్రసన్నతను నవ్వులొలికే వారి ముఖాలలో పరిఢవిల్ల జేయవచ్చుట! (అంటే వారి ముఖకాంతులు వెన్నెల రీతిగా వున్నాయట). ఇక మిక్కిలి వాడియైన వారి చూపుల తీక్ష్ణత, పెద్దవైన పిరుదుల భారంతో మదించిన (మందమనే జాతికి చెందిన) ఏనుగులవలె మెల్లనైన వారి నడకల సంగతా? భళీ! ఇక ప్రత్యేకించి చెప్పే పనేముంది? వారవిద్యలలోని నేర్పరితనంలో ఎంతో అతిశయించిన వారట అక్కడి వేశ్యలు.

ఇక అక్కడి పంటలెలా వున్నాయో వర్ణిస్తున్నాడు కవి

సీ॥ మారుతాహతి రాలు నారికేళ ఫలాళి నిడిసి జల్లించు పుండ్రేక్షురసము
చిలుక పోటులచేత జిరిఁగిన సహకార ఫలములఁ దొరఁగెడి పచ్చితేనె
చిక్రోడ దంష్ట్రలు జెక్కు సుగంధియనంటి పండ్లను గాఱు నవ్య సుధయుఁ
బాకవేగారంభ పరిపాటిఁ దమయంతఁ బగిలిన పనస గొబ్బండ్ల బేస

తే॥ మేకమై కాలువలుగట్టి యేక హేలఁ బరఁగ నందలి క్రియ్యూట పసిమితేటఁ
బండు నవ్వీట ముక్కారుఁ బసిఁడిగారు, సరసధాన్యంబు మంచిరాజనపుఁ జేల
(పాండురంగ మాహాత్మ్యం : 1-118)

మారుతాహతి అంటే గాలి దెబ్బకు ఎండిన నారికేళ ఫలాలు (కొబ్బరి కాయలు) రాలి క్రిందనున్న పుండ్రేక్షు (అంటే నామాల చెరకు అనబడే ఎర్ర చెరకు) గడలపై పడగా అవి - ఇడిసి - చీలి, జల్లించు - కారుతూన్న చెరకు రసము. చిలుకల ముక్కుపోటు చేత చిరిగిన సహకార ఫలముల (తియ్య మామిడి పండ్ల) నుండి; దొరఁగెడి - కారుతున్న; పచ్చి తేనె - తాజా (తేనె వంటి) రసము; చిక్రోడము (ఉడుత)ల దంష్ట్రలు - కోరలు; చెక్కు - గీరుతూన్న; సుగంధి అనంటి పండ్లను (కర్పూరపు అరటి పండ్లనుండి) కారు- స్రవించు; నవ్యసుధ - తాజా అమృతము; పాకవేగారంభ పరిపాటిన్ - త్వరగా

వండనారంభించే క్రమంలో; తమయంత - తమకుతామే; వండి వగిలిన వనన గొబ్బండ్ల పేనము - గొప్పవైన-పెద్దవైన-పనసపండ్ల గుజ్జు; ఏకమై - కలసి కాలువలుగట్టి; ఏకహేలన్ - ఒక్క పెట్టున; పఱవన్ - ప్రవహించగా; క్రియ్యూటన్ - క్రిందియూటచేత; పసిమితేటన్ - బంగారు పచ్చని కాంతితో; ఆ వీటిలో - ఆ కాశీపురిలో; ముక్కారున్ - మూడు కాలములును - మూడు పంటలును; పసిడిగారు - బంగారమువంటి; రాజనపుఁజేలన్ - శ్రేష్ఠమైన వరిధాన్యపు చేలలో; సరసధాన్యంబు - రసముతో గూడిన ధాన్యము - పైన చెప్పిన రసములతో కూడిన మధురమైన ధాన్యము; పండున్ - పండును.

ప్రాచీన కాలంనుండీ కొబ్బరి తోటలలో అంతరపంటగా చెరకుసాగు చేయడం మన ప్రాంతంలో ఆనవాయితీ. అలాంటి కొబ్బరి తోటలలో ఎండిన కొబ్బరి కాయలు గాలి విసురుకు క్రిందపడి క్రిందనున్న ఎర్రచెరకు గడలను చీల్చిన కారణంగా వాటి నుండి కారిన రసము, చిలుకలు కొరికిన తియ్య మామిడి పండ్లనుండి స్రవించే తాజారసము, ఉడుతలు తమ కోరలతో కర్పూర అరటి పండ్లను గీరుకుతినడం వలన వాటినుండి స్రవించే అమృత ప్రాయమైన ఫలరసము, వేగంగా పండి తమకు తామే పగిలిన పెద్ద పెద్ద పనసపండ్ల నుండి స్రవించే పండ్ల గుజ్జు - యివన్నీ కలసి ఒక్కపెట్టున కాలువలుగట్టి ప్రవహించగా ఆ ప్రవాహపు క్రియ్యూట (*Percolation*) కారణంగా కాశికాపురిలోని రాజనపుచేలలో మూడుకాలాలలోనూ బంగారువన్నెగలదీ; పైన చెప్పిన మధురసాలతో కూడినదీనైన ధాన్యము పండుతుందట.

కాశ్మీర ఖండములు, దినసరులు, సంబావులు, వంక సన్నములు, కుంకుమ పువ్వులు, గుండ్ర సంబావులు, మొలకొలుకులు, కుసుమలు, సన్న కొనామణులు, చిన్న పిషాణీలు, పెద్ద కాకిరెక్కలు, పిన్న కుసుమలు, పాలాట్రగడ్డలు, బంగారు తీగెలు, సన్న ముత్యాలు, జున్నుబాలు, వంకెలు, పగడాలు, ఢిల్లీ భోగములు, రామ సాగరములు, రాజనాలు (ప్రాసంగులు), సన్న కృష్ణకాటుకలు, కర్పూర భోగములు వగైరా ధాన్యపు రకాలు అనాదిగా తెలుగు మాగాణంలో సాగయ్యేవి. వీనిలో రాజనాలు సర్వశ్రేష్ఠమైనవి. మరొక కవియైతే మూడు కాలాలలో కాశీనగరంలోని రాజనాల చేలలో శ్రేష్ఠమైన ధాన్యము పండుతుందని చెప్పి ఊరకుండేవాడు. కానీ రసహృదయుడైన రామకృష్ణకవి ఆ చేలలో సరస ధాన్యం (రసముతో కూడుకున్న ధాన్యం) పండుతుందనీ, అది మధుర రసపూరితమనీ, బంగారు పచ్చని కాంతి గలదనీ, దానికా వన్నె, మాధుర్యమూ పైన తెలిపిన విధముగా చెరకురసం, తియ్యమామిడిపండ్ల రసం, కర్పూర అరటి పండ్ల రసం, పనసపండ్ల రసములు కలగలసిన ప్రవాహం నుండి వచ్చిన ఊట (ఆ చేలకు పెట్టబడే నీటిలో కలసిన) కారణంగా చేకూరాయనీ కడు రమ్యంగా వర్ణించాడు. వర్ణనలు ఎంతమేరకు వాస్తవానికి దగ్గరగా వున్నాయనే విషయాన్నటుంచితే, కవి కల్పనా చాతుర్యానికి మనం జోహార్లు చెప్పకుండా వుండలేం. కవి వర్ణించింది కాశీపురినైనా ఆ వర్ణనలలో మన వెలమలనూ, మన బచ్చులనూ, మన పండ్లనూ, మన పంటలనూ ప్రవేశపెట్టాడు. ఈ కారణంగా యీ వర్ణనలనుంచి మనం ఆ కాలపు ఆంధ్ర ప్రాంత స్థితిగతుల్ని కొంతమేరకు గ్రహించగలం.

కాశిని వారణాసి, వారాణసి అని కూడా అంటారు. అయితే యీ నగరం అసలు పేరు వరణసి వరణ, అసి అనే రెండు నదుల మధ్యన వున్నందున దీనికాపేరు వచ్చింది 'వరణ' అనే నది యీ నగరాన్ని దాదాపు చుట్టుముట్టినట్లుంటుంది (వరణము - అంటే సంస్కృతంలో చుట్టుముట్టుట, ఆవరించుట అని అర్థాలు) 'అసి' అనే నది కాశికి దక్షిణంగా వుంటుంది ఈ నది 'అసి' (పదునైన కత్తి)లా కోసేటంత వేగమైన ప్రవాహం కలిగివుండడం కారణంగా దానికాపేరు వచ్చిందంటారు.

కాశి అంటే సంస్కృతంలో బిగించిన పిడికిలి (ముష్టి), గుప్పెడు, సూర్యుడు, కాంతి, వైభవం అనే అర్థాలున్నాయి అత్యంత వైభవం (*Splendour*) కలిగి ఆ నగరం వైభవానికి మారుపేరుగా 'కాశి' అని పిలువబడిందని అంటారు. ఈ నగరం ఏడు పరమ పవిత్ర నగరాలలో ఒకటట దీనినిప్పుడు బెనారెస్ (*Benares*) అని కూడా అంటున్నారు ఉచ్చారణలో 'వ' శబ్దం 'బ' గా రూపాంతరం చెందిన సందర్భాలు

కోకొల్లలు. 'వంగ', 'ప్రణవ్', 'భువనేశ్వర్' శబ్దాలు ఉచ్చారణలో 'బంగ', 'ప్రణబ్', 'భుబనేశ్వర్' లుగా రూపాంతరం చెందినట్లే 'వరణసి', 'బరణసి'గా మారింది తరువాత 'శ్రీవాత్సవ' - 'శ్రీవాస్తవ'గా రూపాంతరం చెందినట్లు 'బరణసి' లో 'రణ' ప్రాతిలోమ్యమై 'బణరసి' గా మారి అదే క్రమంగా 'బనారస్', 'బెనారెస్'గా మారింది

ఇంతటి ఖ్యాతి గలిగిన వారణాసిలో సిద్ధతటిని (శివునికి సిద్ధుడు, సిద్ధదేవుడు అని పేర్లు; 'తటిని' అంటే నది; గంగానదిని 'సిద్ధతటిని' అంటారు) ఒడ్డున యోగులు నివసించే సిద్ధాశ్రమంలో ప్రభ (సూర్యకాంతి) తో కూడుకున్న తరణి (సూర్యుడి) లా లోపాముద్ర అనే భార్యతో కలిసి అనుకూల దాంపత్యం నెరపుతూ అగస్త్య మహర్షి ఉన్నాడట. కలశసూతియైన (కలశంలో పుట్టినవాడునూ) తారక బ్రహ్మ విద్యా రహస్యజ్ఞాత (నరులను సంసార సాగరము నుండి తరింపజేసే తత్త్వ విద్యారహస్యము లెరిగినవాడునూ), చుళికితాంభోరాశి (తన చుళుకములో సముద్రాన్ని పట్టి త్రాగినవాడునూ), బ్రహ్మనిభ మూర్తి (బ్రహ్మతో సమానుడునూ) అయిన అగస్త్య మహర్షి ముని జన సముదాయం సేవలందుకుంటూ వైభవంగా నివసిస్తున్నాడట.

అలా ఆయన కాశిలో పెక్కు కల్పంబులు (యుగములు) ఉన్న తరువాత, ఒకప్పుడు వింధ్య పర్వతం, మేరు పర్వతంపై అసూయపడి రోజు రోజుకీ ఎత్తుగా పెరుగుతూ సూర్యచంద్రుల మార్గానికి అవరోధమై నిలిచిందట. దేవతలు దాని గర్వం అణచడానికి అగస్త్యుడే సమర్థుడని యెంచి ఆయన్ని ప్రార్థించగా ఘనులైన వారు పరవిపత్ప్రతికార తత్పరులు (ఇతరులకు ఆపదలు కలిగించిన వారికి ప్రతీకారము చేయుటయందు ఎక్కువ యిష్టము గలవారు) కనుక వింధ్య మదమణచేందుకు ఆ కాశీపురిని వదలి భార్యాసమేతుడై బయలు దేరాడట.

అన్ని యుగాలుగా కాశితో ఆయన కేర్పడిన అనుబంధం సామాన్యమైనదిగా ఎందుకుంటుంది? అగస్త్యుడు కాశిని వదలి వెళ్లే సమయంలో విరహతాపం చెందాడట. ఆ తాపాన్ని అపహ్నుతి అలంకారంలో యీ చక్కని పద్యంలో వివరించాడు కవి.

తే॥ అబ్ధితోఁ గూడ మునుగ్రోల నౌర్వవహ్ని
యుదర బిలమున నొకచోట నుండి యుండి
జటిలవరునకుఁ గద్రూజ కటకకటక
విరహతాప మిషంబున వెడలెనపుడు (పాండురంగ మాహాత్మ్యం : 1-121)

ఈ పద్యం యొక్క అర్థం చెప్పుకొనే ముందు మనం అగస్త్య మహర్షిని గూర్చి కొన్ని వివరాలు తెలుసుకుందాం.

# అగస్త్యుడు

ఋగ్వేదంలోనున్న ఐతిహ్యం ప్రకారం ఒకప్పుడు దేవతలు చేసిన ఒక యజ్ఞంలో మిత్రుడు, వరుణుడు అనే యిరువురు దేవతలు అక్కడికి వచ్చిన అప్సరస ఊర్వసి యొక్క అందం చూసి సమ్మోహితులైన సందర్భంగా స్ఖలితమైన వారిరువురి వీర్యం ఒక కుండలో పడి తరువాత ఫలదీకరణం చెంది అగస్త్యుడు, వసిష్ఠుడు జన్మించారట అందుకే అగస్త్యుడిని కుంభజుడు, కుంభసంభవుడు, కుంభయోని, కలశసూతి, కలశయోని, ఘటోద్భవుడు అనీ మిత్రావరుణుల కుమారుడు గనుక మైత్రావరుణి అనీ, ఊర్వసి కారణంగా పుట్టాడు గనుక ఔర్వసేయుడనీ కూడా పిలుస్తారు.

మరొక ఐతిహ్యం ప్రకారం బ్రహ్మ మానసపుత్రుడైన పులస్త్యుడికీ, అతని భార్య హవిర్భుక్కుకూ అగస్త్యుడు, విశ్రవసుడు పుట్టారు (విశ్రవసుడు - కుబేరుడికీ, రావణ, కుంభకర్ణాదులకూ తండ్రి) అగస్త్యుడు అస్త్రవిద్యలలో ఆరితేరినవాడు. ముందుగా యీయన వింధ్య పర్వతాలకు దక్షిణంగానున్న కుంజర పర్వతంపై ఆశ్రమం నిర్మించుకొని అక్కడ ఎందరినో శిష్యులుగా చేసికొని నివసించాడు తరువాత

కొంతకాలం ప్రయాగలోనూ, కాశిలోనూ, ఆ తరువాత నాసిక్ సమీపంలోని పంచవటిలోనూ ఆశ్రమాలు నిర్మించుకొని దీర్ఘకాలం జీవించాడట.

ఒకప్పుడు అగస్త్యుడు అడవుల్లో సంచరిస్తూ వుంటే చెట్లకు తలక్రిందులుగా వ్రేలాడుతూన్న తన పితృదేవతలు కనుపించి ఉత్తమ లోకాలు పొందడానికి వివాహం చేసుకుని పుత్ర సంతానాన్ని కనమని సూచించారట. అగస్త్యుడు అప్పటికప్పుడు ఒక కన్యను విదర్భరాజుకు కానుకగా యిచ్చి తిరిగి ఆ రాజునుండి తానే ఆమెను కన్యాదానం స్వీకరించాడట. అలా అగస్త్యుడికి భార్య అయిన ఆ కన్యే లోపాముద్ర. ఆమె మహాపతివ్రత. కాని పుత్ర సంతానం కోరిన అగస్త్యుడిని ఆమె తాకనివ్వక ముందుగా తనకు కోరినన్ని నగలూ, వస్త్రాలూ తెచ్చి యిస్తేనే అతనితో సంసారం చేయడానికి అంగీకరిస్తానని తెలిపిందట. అప్పుడిక కటిక పేదవాడైన అగస్త్యుడు డబ్బుకోసం శ్రుతపర్వుడు మొదలైన వారందరినీ అర్థిస్తాడు. ఆ దశలోనే ఇల్వలుడు, వాతాపిలతో తలపడతాడు. మహాభారతంలోని ప్రసిద్ధమైన ఆ కథను కూడా సంక్షిప్తంగా వివరిస్తాను.

కశ్యప మహర్షికీ, దనువు అనే స్త్రీకీ పుట్టిన వాళ్ళు దానవులు. అలాంటి దానవులలో విప్రచిత్తి ఒకడు. అతడు దితి కుమార్తె అయిన సింహికను పెండ్లాడాడు. వారిరువురికీ రాహువు, కేతువు, నరకుడు, ఇల్వలుడు, వాతాపి వగైరా కుమారులు కలిగారు. రాక్షసులైన ఇల్వలుడికీ, వాతాపికీ కామరూప, మృతసంజీవనీ విద్యలు తెలుసు. మణిమతి అనే పట్టణంలో వుంటూ వీరిరువురూ బ్రాహ్మణుల్ని ఓ వింత పద్ధతిలో సంహరించేవారు. ఇరువురిలో పెద్దవాడైన ఇల్వలుడు బ్రాహ్మణరూపం ధరిస్తాడు. తమ్ముడు వాతాపి మేకపోతుగా మారుతాడు. దక్షిణాపథానికి వెళ్లేదారిలో నిలబడి ఇల్వలుడు తమయింట పిత్రుకార్యమని బ్రాహ్మణుల్ని భోజనానికి ఆహ్వానిస్తాడు. ఆ రోజులలో పితృకార్యం రోజున బ్రాహ్మణుడినెవరినైనా భోజనానికి పిలచి ముందుగా అతిథి భోజనం చేయగా మిగిలిన ఆ బ్రాహ్మణ భుక్త శేషాన్ని గృహస్థు తినడం ఆచారం. బ్రాహ్మణ అతిథికి మేకపోతుగా మారిన తన తమ్ముడు వాతాపిని వండిపెట్టి, భోజనానంతరం బ్రాహ్మణ భుక్తశేషాన్ని తినడానికి తమయింటిలోనే వున్న తన తమ్ముణ్ణి పిలుస్తున్నట్లు వాతాపిని పిలుస్తాడు ఇల్వలుడు. మృత సంజీవనీ విద్య తెలుసుగనుక ఆ బ్రాహ్మణ అతిథి కడుపులో అప్పటికే సజీవంగా వున్న వాతాపి బ్రాహ్మణుని కడుపు చించుకుని బయటికొస్తాడు. అప్పుడా బ్రాహ్మణుడి మాంసాన్ని అన్నదమ్ములిద్దరూ కలిసి తృప్తిగా భుజిస్తారు. ఇదీ తంతు. ఈ సంగతి పసిగట్టిన అగస్త్యుడు ఇల్వలుని యింటికి బ్రాహ్మణార్థం వచ్చాడు. భోజనానంతరం ఇల్వలుడు యథాప్రకారం తన తమ్ముడు వాతాపిని పిలువగా అగస్త్యుడు తన పొట్ట నిమురుకుంటూ 'వాతాపే జీర్ణోభవ' ('జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం') అనగా అగస్త్యుని పొట్టలోనే వాతాపి జీర్ణమై నశిస్తాడు. అప్పుడు ఇల్వలుడు ఆగ్రహంతో అగస్త్యునిపై కురకగా ఆ ఋషి అతడిని తన కంటి చూపుతో భస్మంచేస్తాడు. అలా ప్రజలకు- ప్రత్యేకించి బ్రాహ్మణులకు వాతాపి, ఇల్వలుల పీడను విరగడచేస్తాడు అగస్త్యుడు. (మహాభారతంలోని పై కథ మూలంగా ఆనాటికి అగస్త్యుని వంటి ఋషులతో సహా బ్రాహ్మణులంతా మాంసాహారులేనని తెలుస్తున్నది). తరువాత అగస్త్యుడు ఇల్వలుని దగ్గరున్న ధనాన్నంతా తీసుకెళ్ళి తన భార్య లోపాముద్రకిస్తాడు. ఆమె సంతోషించి ఆయనతో సంసారం చేసి దృఢాస్య, దృఢాస్యు అనే యిరువురు కుమారుల్ని కంటుందట. లోపాముద్రను కౌషీతకీ, వరప్రదా అనే పేర్లతోనూ పిలుస్తారు. నల్లని మేనిచాయ గలవాడూ (గోవిందాథుడు), ఋషుల్లోకెల్లా పొట్టివాడైన అగస్త్యునికి పీతాబ్ధి (సముద్రమును త్రాగినవాడు) సముద్రచుళుక (సముద్రాన్ని పుడిసిలి పట్టినవాడు) అనే పేర్లున్నాయి. దానికి సంబంధించిన కథేమిటంటే - బ్రహ్మ మానస పుత్రుడైన మరీచికీ వైశ్వానరుడి కూతురైన రాక్షస స్త్రీ కాలకరూ పుట్టిన 60,000 మంది కొడుకుల్నీ కాలకేయులంటారు. వీళ్ళు సముద్రాల అట్టడుగున దాగి బయటికి వచ్చినప్పుడల్లా బ్రాహ్మణుల్ని హింసపెట్టేవారట. దేవతలు కాలకేయుల్ని సంహరించ బూనిన సందర్భంలో అగస్త్యుడు మొత్తం సముద్రపు నీటినంతా తన చుళుకంలోకి తీసుకుని త్రాగి కాలకేయుల్ని చంపడంలో సహాయపడతాడట. అలా కొందరు కాలకేయుల్ని ఆ సందర్భంలో దేవతలు సంహరించగా కొందరు అప్పటికి పాతాళానికి పారిపోయి ప్రాణరక్షణ చేసుకుని ఆ తర్వాత వివాతకవచులతో కలసి దేవలోకంపై దండెత్తగా, అర్జునుడు వారిని నిశ్శేషంగా సంహరించాడని మహాభారతంలోని ఒకథ మూలంగా తెలుస్తున్నది.

అగస్త్యుడు వింధ్య పర్వతానికి కూడా గురువట! వింధ్య ఒకప్పుడు మేరువుతో పోటీపడి రోజురోజుకూ పెరిగి పెరిగి సూర్యచంద్రాదుల గమనాన్ని అడ్డుకునే పరిస్థితి వచ్చిందట. అప్పుడు దేవతలు వింధ్య మదమణచడానికి సమర్థుడు అగస్త్యుడేనని ఆయనను ప్రార్థింపగా అగస్త్యుడు వింధ్యకు వచ్చి తన పదఘట్టనలతో వింధ్యను తొక్కుతాడట. వింధ్య అగస్త్యుడు తనకు గురువే అయినందున అగస్త్యునికి ప్రణమిల్లి నేలమట్టమయిందట. అప్పుడు అగస్త్యుడు వింధ్యతో 'నేను దక్షిణాపథముకు వెళ్ళి వచ్చేదాక నీవిలాగ ఉండు' అని చెప్పి దక్షిణా పథానికి వెళ్లాడట. నాటి నుండి నేటివరకు దక్షిణాపథంనుండి అగస్త్యుడు తిరిగి వచ్చింది లేదట. అదే విధంగా వింధ్య ఎలాంటి పెరుగుదలా లేకుండా ఆయన కిచ్చిన మాట ప్రకారం అలాగేవుందట. ఈ ఐతిహ్యాన్ని మనం శాస్త్రీయంగా అర్థం చేసుకుంటే వింధ్య పర్వతాల్ని దాటి దక్షిణాపథానికి మొదటగా వచ్చిన ఆర్య ఋషులలో అగస్త్యుడు ప్రసిద్ధుడు. వింధ్యాటవులు, దండకారణ్యము, నర్మద, తపతి నదుల గురించి ఆర్ష సాహిత్యంలోని భీతిగొలిపే ఉటంకింపులను బట్టి నాటికి అవి ఎంత దుర్గమమైనవో మనం అర్థంచేసుకోవచ్చు. ఆర్య సంస్కృతిని వ్యాప్తి చేయాలంటే వాటిని అధిగమించి దక్షిణా పథానికి

వెళ్లితీరాలి. ఆ ప్రాంతంలో ముందుగా ఆశ్రమ మేర్పరచుకొని స్థిరపడిన కారణంగా అగస్త్యుడు తన శిష్యగణంతో దుర్గమమైన వింధ్య పర్వతాలగుండా దక్షిణ భారత దేశానికి మొదటగా మార్గం నిర్మించి వుండవచ్చు. గంగానది ఉధృతిని తగ్గించి బహుశా ఆనకట్టల ద్వారా పర్వత ప్రాంతాలనుండి మైదాన ప్రాంతాలకు దానిని తీసుకునివచ్చి లోకకళ్యాణం చేసిన నాటి భగీరథ చక్రవర్తిలా ఆర్యసంస్కృతీ సామ్రాజ్యం దక్షిణ భారతదేశానికి విస్తరించడానికి ఉద్యమించిన తొట్టతొలి నాయకుడిగా మనం అగస్త్యుడిని భావించవచ్చు. అగస్త్యుడు దక్షిణ భారతదేశంలో స్థిరపడి తమిళభాష నేర్చుకుని, తమిళానికి వ్యాకరణాన్నేర్పరచిన దిట్ట. ఇప్పటికీ తమిళ వ్యాకరణాన్ని 'పేరగత్తియమ్' (ప్రసిద్ధి చెందిన అగస్త్యుడు వ్రాసినది) అని పిలుస్తారు. దక్షిణ భారతదేశంలోని ద్రావిడ జాతులకు విజ్ఞానశాస్త్రం, సాహిత్యం ప్రప్రథమంగా బోధించినది అగస్త్యుడేనంటారు. ఆయన క్రీ.పూ. 700-600 సంవత్సరాల మధ్య జీవించి వుంటాడని శాస్త్రజ్ఞులు నిర్ధారించారు. వనవాస కాలంలో సీతారామలక్ష్మణుల్ని సాదరంగా తన ఆశ్రమానికి ఆహ్వానించి వారికి తగు రక్షణ వసతినేర్పాటు చేసిన అగస్త్యుడు రామునికి విష్ణువు విల్లును బహూకరించాడనీ, ఆదిత్య హృదయాన్ని బోధించాడనీ అంటారు. అంతేకాదు రావణవధ తరువాత అయోధ్యకు రామునితో పాటు వెళ్లిన ఋషులలో అగస్త్యుడు కూడా వున్నాడట. కొన్ని పురాణాల ప్రకారమైతే అగస్త్యుడు బ్రహ్మమానస పుత్రుడైన పులస్త్యునికీ, కర్దముని కుమార్తె హవిర్భుక్కుకూ పుట్టినవాడట. కవేరుని కుమార్తె కావేరిని కూడా యితడు పెండ్లాడాడంటారు. దక్షిణ భారతదేశంలో అగస్త్యేశ్వర స్వామి దేవాలయాలు ఎన్నో ప్రాంతాలలో వున్నాయి. అవన్నీ అగస్త్యుడు ప్రతిష్ఠించినవని లోకోక్తి. అయితే శివుడికి కూడా అగస్త్య అనే పేరుంది. పరమ శివ భక్తుడైన రావణుని సంహరించిన అనంతరం ఆ బ్రహ్మహత్యాపాతకం పోవడానికి రాముడు ఎన్నో శివలింగాలను ప్రతిష్ఠించి ఆరాధించాడంటారు. రాముడు ప్రతిష్ఠించిన శివలింగాలు 'రామేశ్వర', 'రామలింగేశ్వర' నామాలతో ఆరాధించబడుతున్నట్లు అగస్త్యేశ్వర లింగాలన్నీ అగస్త్యుడు ప్రతిష్ఠించినవేనని కొందరు నమ్ముతున్నారు. ఆ సంగతలా వుంచి అగస్త్యుడు ఓ గొప్ప తత్త్వశాస్త్రవేత్తగానూ, ప్రజారంజకుడిగానూ, సాహితీవేత్తగానూ, వైయాకరణిగానూ, కరుణాహృదయుడిగానూ చిరకాలం ప్రజల హృదయాలలో శాశ్వత ముద్రవేసుకొన్నాడు.

ఇక పై పద్యం అర్థాన్ని చెప్పుకుందాం -

ఆధునిక శాస్త్రవేత్తలు తేల్చిన విషయమేమంటే, సముద్రంలోనూ పర్వతాలున్నాయి. వాటిలో భుగభుగ మండే అగ్ని పర్వతాలూ వున్నాయి. ప్రాచీనులు సముద్రపు నీటి అడుగున దాగుండే అగ్నిని బడబాగ్ని, బడబానలము, ఔర్వము, ఔర్వవహ్ని, వార్యపుటగ్గి అని వేర్వేరు పేర్లతో పిలిచారు. దీనినిబట్టి రామకృష్ణకవి పై పద్యంలో ఎలా వ్రాస్తున్నాడో చూడండి. అగస్త్యుడొకప్పుడు సముద్రజలాన్నంతా త్రాగివేసిన సందర్భంలో ఆ నీటితోబాటు ఔర్వవహ్నిని కూడా మ్రింగాడట. అది అప్పుడు కడుపులో ఒకప్రక్కగా ఒదిగివుండి ఆ ఋషివరునకూ కద్రూజ కటక కటకమునకూ (కద్రూజములు - కద్రువసంతానము - అంటే పాములు. కటకము - కడియము (*Bracelet or girdle*) కద్రూజకటక అంటే పాములను కడియములుగా ధరించేవాడు - శివుడు. కటకము అంటే రాజధాని అనే అర్థమూ వుంది. కద్రూజ కటక కటకము అంటే శివుని రాజధానీ నగరమైన) కాశీనగరమునకూ - విరహతాప మిషంబున (అంటే ఎడబాటు వలన కలిగిన తాపమా అన్నట్లు;) ఆ నెపముతో - ఆ వంకతో, వెడలెన్ - బయల్పడెను.

**చ॥ పుడిసిటఁ బట్టి నేతపసి పొంగు పయోనిధి నిల్వలానుజున్**
**కడుపున వ్రేల్చె నేతపసి గాఢతపోనిధి నయ్యగస్త్యునిన్**
**బొడఁగని వింధ్య భూధరము పొంకము బింకము దక్కినేలలో**
**నడఁగె బిలాంతర స్థలి భయాహతిఁ జొచ్చు కుళీరమోయనన్ (పాండురంగ మాహాత్మ్యం : 1-122)**

'పుడిసెడు' అన్నా 'చేర' అన్నా 'ప్రసృతి' అన్నా అరచేతిని లోనికి కుంచించగా పట్టే పరిమాణం. దీనిలో సగం చుళుకము. సముద్రాన్నంతా తన పుడిసిట్లోకి ఏ తపస్వి పట్టాడో, ఇల్వలానుజుని (ఇల్వలుని తమ్ముడైన వాతాపిని) ఏ తపసి తన కడుపులో వ్రేల్చాడో (ఆహుతిగా చేశాడో) అట్టి గాఢ తపోనిధియైన అగస్త్యుని; పొడగని - చూచి, వింధ్య భూధరము -

వింధ్య పర్వతము (భూధరము, ధరణీధరము, మహీధరము యివన్నీ పర్వతానికి మారుపేర్లు), పొంకము బింకము దక్కి (తన పొందికనూ, గర్వమునూ కోల్పోయి) భయకంపితమై కలుగులోనికి చొరబడే కుళీరము (ఎండ్రకాయ)లా నేలలోకి నమ్రతగా అణగిపోయిందట.

# సామిమలకు పయనం

ఇక వింధ్య పర్వతం వద్ద బయలుదేరిన అగస్త్యుడు, లోపాముద్ర మరియు శిష్యులు నేరుగా వచ్చి కొల్లాపురం (నేటి మహబూబ్‌నగర్ జిల్లాలో వుంది) లో కొలువైన లక్ష్మీదేవిని సేవించారట. ఆ లక్ష్మీదేవి ఆజ్ఞమేరకు భార్య మరియు శిష్య బృందం వెంటరాగా కుమారస్వామిని దర్శించడానికి సామిమలకు బయలుదేరాడట. పనిలో పనిగా తనకేర్పడిన ఓ సందేహాన్ని అక్కడుండే కుమారస్వామి వద్ద నివృత్తి చేసుకొనదలచాడు ఆ మహర్షి.

సామిమల అంటే నేటి తమిళనాడులోని కుంభకోణంకు ఎనిమిది కిలోమీటర్లు పశ్చిమంగా వున్న స్వామిమలై అనే ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రం. తమిళనాడులోని అతి ప్రసిద్ధమైన ఎనిమిది సుబ్రహ్మణ్య క్షేత్రాలలో యిదొకటి. ఇక్కడ మట్టిదిబ్బవంటి ఓ చిన్నకొండపై సుబ్రహ్మణ్యస్వామి దేవాలయంవుంది. యీ చిన్న కొండపైని దేవాలయానికి హిందూ కాలచక్రంలోని అరవై సంవత్సరాలను సూచిస్తూ అరవై మెట్లుంటాయి. ముప్పై మెట్లెక్కిన తరువాత శివునికి మురుగన్ (సుబ్రహ్మణ్య స్వామి) ప్రణవ మంత్రాన్ని బోధిస్తున్నట్లుగా చెక్కబడిన జీవం ఉట్టిపడే విగ్రహాల్ని మనం చూడొచ్చు. కొండపైని గర్భ గుడిలోని సుబ్రహ్మణ్య స్వామి ఆరడుగుల నల్లరాతి విగ్రహం అద్భుత శిల్పకళాకృతి. నిలుునివున్న మూర్తి చూపరులనిట్టే ఆకట్టుకుంటుంది. ఇక్కడి ప్రత్యేకత ఏమిటంటే సాధారణంగా సుబ్రహ్మణ్యస్వామి మూర్తికి ఎదురుగా వుండే ఆయన వాహనమైన నెమలి విగ్రహానికి బదులుగా యిక్కడ ఏనుగు విగ్రహం వుండడం. ఇక్కడి సుబ్రహ్మణ్యస్వామిని స్వామినాథస్వామి అంటారు. అంటే దేవునికే నాథుడైన దేవుడు అని అర్థం. సుబ్రహ్మణ్య స్వామి ఈ క్షేత్రంలో ఆదిదేవుడైన శివునికి కూడా దైవమన్నట్లుగా ఆరాధింపబడ్డాడు. అందుకే కొండపైన మురుగన్ (సుబ్రహ్మణ్య) ఆలయం వుంటే, దిబ్బ దిగువ భాగంలో సుందరేశ్వర (శివుడు), మీనాక్షి (పార్వతి) దేవాలయాలున్నాయి. ఇక్కడి సుబ్రహ్మణ్యస్వామిని 'స్వామినాథ స్వామి' అనడానికీ, యిలా కొండపైన ఆయన దేవాలయాన్ని, క్రింద శివపార్వతుల దేవాలయాలనూ నిర్మించడానికీ కారణంగా చెప్పబడే ఓ కథ వుంది. ఒకప్పుడు శివుడు ప్రణవ మంత్రాన్ని మరచిపోయాడట. అప్పుడాయన తన కుమారుడైన సుబ్రహ్మణ్యస్వామిని తనకా మంత్రాన్ని బోధించమని కోరాడట. సుబ్రహ్మణ్యస్వామి అందుకు సమ్మతించాడట గానీ శివుడు విద్యార్థిలా బుద్ధిగా చేతులు కట్టుకొని తలవంచి భక్తి శ్రద్ధలతో తన ఎదుట నిలబడాలనే నియమం పెట్టాడట. శివుడలాగే చేసి ఆ మంత్రం కుమారుడి చేత చెప్పించుకున్నాడట. అంచేతనే, యిక్కడి కుమారస్వామిని 'స్వామినాథ స్వామి' అంటారట. ఏటా యిక్కడ సుబ్రహ్మణ్య స్వామి జయంతి అయిన 'స్కంధ షష్ఠి'నీ, 'వల్లీ కళ్యాణాన్నీ', పదిరోజులపాటు 'తిరుకార్తిగై' అనే ఉత్సవాన్నీ అత్యంత వైభవంగా నిర్వహిస్తారు.

సర్వజ్ఞుడైన శివునికి కూడా ఉపదేశంచేసినట్టి ఉద్దండుడు 'స్వామినాథ స్వామి' అని పిలువబడిన యిక్కడి కుమారస్వామి. అందుకేనేమో అగస్త్యుడు తన సందేహ నివృత్తికి సామిమలలోని సుబ్రహ్మణ్య స్వామి నెంచుకున్నాడు.

అగస్త్యుడు తన భార్య లోపాముద్ర మరియు శిష్యబృందంతో సామిమలకు వెళ్లేదారిలో చూచిన ఎన్నో విశేషాల్ని అద్భుతంగా వర్ణించాడు రామకృష్ణకవి. మార్గమధ్యంలో వారికి ఎదురైన బోయస్త్రీల అందాలను ప్రస్తుతిస్తూ వారి కురుల తీగలవలెనూ, చమరీ మృగము యొక్క వాలము (తోక) యొక్క వెంట్రుకల వలెనూ వున్నవనియు, వారి నాసికలు సంపెంగ మొగ్గల వలెనూ, ఎర్రని చిగుళ్లవలెనూ వున్నవనీ, స్తనములు మిట్టకోలల చివరి భాగములనూ, పూలగుత్తులనూ పోలివున్నాయనీ తొడలు ఏనుగు తొండములనూ, అరటి కంబములనూ పోలివున్నాయనీ వర్ణించాడు.

# కుంతల దేశ వర్ణన

ఆ దంపతులు శిష్యగణ సమేతంగా ప్రతిదినమూ ప్రయాణించి కుంతల దేశాన్ని సమీపించారట. కుంతల

దేశమంటే నేటి కర్ణాటక, చోళ ప్రాంతానికి ఉత్తరంగా, ఆంధ్ర ప్రాంతానికి దక్షిణంగా వుండే 'కుంతల' రాజ్యం. రామకృష్ణకవి రచనలలో ఇది ఎక్కువగా చోటు చేసుకుంది. యయాతి కుమారుడైన యదువు సంతతిలో యయాతి నుండి ఏడవవాడైన కుంతలుడు పాలించిన రాజ్యం ఆయన పేరిట కుంతల రాజ్యమనబడింది. కవి తనకత్యంత ప్రీతిపాత్రమైన తుంగభద్రానది నుండి వచ్చే పిల్ల తెమ్మెరలెలా వున్నాయో వర్ణిస్తున్నాడు.

క॥ పంపాతరంగ రింఖణ
ఝంపా సంపాద్యమాన జలకణరేఖా
సంపాత శీతలానిల
సంపద వొదలించెఁ బరమశైవోత్తంసున్. (పాండురంగ మాహాత్మ్యం : 1-128)

పంపానది (తుంగభద్ర)లోని అలలయొక్క రింఖణ (పొరలికలతోకూడిన) ఝంపా (దూకుళ్లచేత) సంపాద్యమాన (పుట్టించబడిన) జలకణరేఖా (నీటి తుంపరల సమూహము) సంపాత (పడుటవలన) శీతల (చల్లనైన) అనిల (వాయువు యొక్క) సంపద (కలిమి) ఆ పరమ శైవోత్తంసుని (శివభక్తులలో శ్రేష్ఠుడైన ఆ అగస్త్య మహర్షిని) వొదలించెన్ (సంతోష పెట్టెను).

తుంగభద్రానది విపరీతమైన ఉరవడితో ప్రవహించే నది. దీని ఉరవళ్లూ, పరవళ్లూ హొస్పేట డ్యాం వద్దనూ, హంపి విజయనగరం వద్దనూ చూచి తీరాల్సిందే సుడులు తిరుగుతూ ప్రవహించే యీ నది ఉరవడికి హంపి వద్ద నదిలోని పెద్ద పెద్ద గండ్ర శిలలు సైతం అరిగిపోయి గుంటలు పడివుండటాన్ని మనం గమనించవచ్చు. ఈ నది సోయగాలు చూపరులనిట్టే మంత్రముగ్ధుల్ని చేస్తాయి. ఒక్కసారి హంపిని సందర్శించిన యాత్రికుల్నే తుంగభద్ర అందాలు కట్టిపడేస్తాయి అలాంటిది ఏళ్లతరబడి హంపిలో నివసించి, ఆ నదితో అనుబంధాన్ని పెంచుకున్న మన రామకృష్ణకవిని ఆ నది ఎంతగా ఆకట్టుకుందో ప్రత్యేకించి చెప్పాలా? అందుకే కవి తుంగభద్రను విశేషంగా వర్ణించాడు అగస్త్యాది బృందం కొల్లాపురం నుంచి సామిమలకు వెళ్లే దారిలో మరెన్నో సందర్శనీయ స్థలాలున్నా, వాటిని వేటినీ పేర్కొనక కేవలం తుంగభద్రనూ, హంపినీ మాత్రమే విశేషంగా వర్ణించిన కారణంగా కవికి హంపి విజయనగరమన్నా, తుంగభద్రానది అన్నా ఎంత యిష్టమో మనం అర్థంచేసుకోవచ్చు

పొంగి పొర్లుతూ ప్రవహించే తుంగభద్రానది అలల దూకుళ్ల నుంచి పైకెగసి వెలువడిన నీటితుంపర మెల్లగా వీచే గాలితో కలియడం కారణంగా ఏర్పడిన శీతలవాయువు శివభక్తాగ్రగణ్యుడైన అగస్త్య మహర్షిని తాకి ఆయనను సంతోషపెట్టిందట! ఎండనబడి కాలినడకన సుదీర్ఘ ప్రస్థానం చేసిన వారికి నదీతీరాన్ని సమీపించే సరికి అక్కడి ఆర్ద్ర పవనాలు (*Humid Winds*) కలిగించే ఊరట, ఉపశమనాలు అంతాయింతని ఎలా వర్ణించగలం. అవి వారికే అనుభవైకవేద్యాలు.

## అలసి సొలసిన లోపాముద్ర

ఇక ప్రతిదిన ప్రయాణంలో అలసిసొలసిన లోపాముద్ర స్థితిని అద్భుతమూ, ఆద్యంత సంస్కృత పదభూయిష్టమూనైన యీ క్రింది పద్యంలో వర్ణిస్తున్నాడు కవి -

సీ॥ నఖరాగ్రలూనానన స్వేదకోరకం బర్కకషాయ దృగంచలంబు
ప్రబల నిశ్వాస సౌరభతర్పిత మదాళి శోషిత శ్రవణ శిరీషయుతము
దర్శితమధ్యవృత్త స్రస్తమృదునీవి యప్రయత్న పయోధరాంబరంబు
సంతప్త శర్కరా సహపదన్యాసంబు నచలరజోధూమలాలకంబు

తే॥ సరణి తరుణతరుచ్ఛాయ శమిత ఖేద, మలసమృదులాంగకంబునై యరుగుదెంచు
నన్నిజ పరిగ్రహముఁ గూర్మినాదరించి, పలుకు వింధ్యాద్రి నిర్బంధ బాంధవుండు

(పాండురంగ మాహాత్మ్యం : 1-129)

'నఖరాగ్ర లూనానన స్వేదకోరకంబు' – అంటే కొనగోళ్లతో కోయబడిన (ముఖమున) చిరుచెమట మొగ్గలు కలది; 'నఖము' అన్నా 'నఖరము' అన్నా గోరు. నఖరాగ్రము అంటే కొనగోరు. 'కోరకము' అంటే చిరుమొగ్గ; 'స్వేదకోరకము' అనే ప్రయోగం ద్వారా కవి చెమట బిందువును ఒక పూల మొగ్గగా భావిస్తున్నాడు. 'లూనము' అంటే కోయబడినది. పూలమొగ్గల్ని కొనగోళ్లతోనే గదా మనం కోసేది! లోపాముద్ర ఆనన స్వేద కోరకములను అంటే తన ముఖంపై ఏర్పడుతున్న చిరుచెమట బిందువులనే మొగ్గలను తన కొనగోళ్లతో కోస్తున్నదట. అర్ధకషాయ దృగంచలంబు – సగమెర్రబారిన కనుకొలకులుగలది. ప్రయాణంలో వేడిచేయడం కారణంగానూ, కండ్లలో దుమ్ము, యిసుక రేణువులు పగైరా పడడం కారణంగానూ ఆమె సగం ఎరుపెక్కిన కనుకొలకులుగలదిగా మారిందట. ప్రబల నిశ్శ్వాస సౌరభ తర్పితమదాళి – తుమ్మెదలు మానవుల నిట్టూర్పులలోని సుగంధాన్ని గ్రోలుతాయని ప్రతీతి. ప్రబలమైన ఆమె నిట్టూర్పు యొక్క సౌరభంతో తర్పిత (పూర్తిగా తృప్తి పడినట్టివైన) మదాళి (గండు తుమ్మెదలు గలది) – అంటే ఆమె గండు తుమ్మెదల్ని కూడా పూర్తిగా సంతృప్తి పరచేటంతటి సుగంధమైన నిట్టూర్పుల్ని విడుస్తున్నదట. గాఢమైన ఆమె నిట్టూర్పులకు కారణమైన ఆమె యొక్క తీవ్రమైన మార్గాయాసాన్ని ఎక్కడా పేర్కొనకుండానే వెచ్చని ఆమె నిట్టూర్పులలోని సౌరభం గండుతుమ్మెదల్ని సైతం పూర్తిగా తృప్తి పరుస్తుంది అని చెప్పడం ద్వారా ఎంత అలసినా సౌరభం వీడని సుకుమారి లోపాముద్ర అని మనకు సూచన ప్రాయంగా తెలుపడమే యిందలి కవి చమత్కృతి. సౌరభాన్నీ, మరందాన్నీ ఆశించి పద్మములనాశ్రయించే అళుల (తుమ్మెదల)కు ఆమె ప్రబల నిశ్వాసల సౌరభం సంగతి ఎలా తెలిసి వుంటుంది? ఏముంది – పద్మ ముఖియైన లోపాముద్ర ముఖారవిందాన్ని పద్మమని భ్రమించిన మదాళులు ఆమె ముఖంపై ముసిరినందున. కనుక యిక్కడ లోపాముద్ర పద్మముఖి అనికూడా చెప్పకనే చెపుతున్నాడు కవి.

శోషిత శ్రవణ శిరీషయుతము – లోపాముద్ర సుదీర్ఘ ప్రయాణం కారణంగా ఆమె చెవిలోని శిరీషపుష్పం శోషించి (ఎండి) పోయిందట. అందుకే ఆమెను కవి 'చెవిలో ఎండిన శిరీష పుష్పము గలది' అంటున్నాడు.

శిరీషము అంటే 'దిరిసెన' లేక 'తిరిసెన' వృక్షము (*Albizzia lebbeck - Family Mimosaceae*) శిరీష పుష్పాన్ని సంస్కృతంలో మృదుపుష్పమనీ; 'శుకప్రియ' అనీ అంటారు. ఈ పుష్పం మెత్తగా వింజామర ఆకారంలో వుంటుంది. చిలుకలకు యిష్టమైనదేకాక సీతాకోకచిలుకలూ, తుమ్మెదలూ, తేనెటీగలకు కూడా యిదెంతో ప్రియమైన పుష్పం. ఇది యింపైన సువాసన కలిగి వుంటుంది. శిరీషము విషాన్ని హరించే వాటిలో శ్రేష్ఠమైనదట. 'శిరీషః విషఘ్నానామ్ శ్రేష్ఠః' అని చరకుడు పేర్కొన్నాడు. 'శిరీషాసవము' విషహరణమునకు ఉత్తమమైనదని శుశ్రుతుడు పేర్కొన్నాడు. పాము కరచిన, తేలు కుట్టిన సందర్భాలలోనూ, శ్వాసకాసలలోనూ, చర్మరోగాల, రక్తదోషాల నివారణలోనూ శిరీషను ఆయుర్వేదం విస్తారంగా వాడింది. ఆధునిక వైద్యశాస్త్రవేత్తలు కూడా 'శిరీష'లో వున్న 'శాపోనిన్' అనే రసాయన పదార్థం కారణంగా దానిని విషహరణకు ఉపయుక్తమైనదిగా నిర్ధారించారు.

అందుకే మన ప్రాచీనులు యిన్ని ఔషధవిలువలు కలిగిన శిరీష పుష్పాల్ని చెవిలో ధరించేవారేమో!

దర్శిత మధ్యవృత్త స్రస్తమృదునీవి – మధ్య వృత్తమంటే బొడ్డు. దర్శిత మధ్యవృత్త మంటే చూపబడిన బొడ్డు.

'స్రస్తము' అంటే జారినది. 'నీవి' అంటే పోకముడి. 'మృదునీవి' అంటే వదులుగా వేసుకొన్న పోకముడి. ఆమె పోకముడి జారిన కారణంగా ఆమె కనుపించే నాభి కలదిగా వున్నదట.

అప్రయత్న పయోధరాంబరంబు - పయోధరములంటే స్తనములు; పయోధరాంబరంబు అంటే రొమ్ముమీది వస్త్రము. పైటచెంగు. పెద్దగా ప్రయత్నము లేకుండునట్లుగా ఎప్పటికప్పుడు ఆమె తన పైటచెంగు సవరించుకుంటూ వున్నదట.

సంతప్త శర్కరా సహపదన్యాసంబు - 'సంతప్త' అంటే బాగుగా కాలిన, 'శర్కర' అంటే 'మొరప' లేక 'మొరస' లేక గులకనేల. ఆమె సుకుమారియైన కారణంగా కాలిన గులకరాళ్లతో కూడిన నేలపై పాదములు మోపలేక, మోపలేక నడుస్తూన్న పద విన్యాసము కలది. అచల రజో ధూమలాలకంబు - 'అచల రజో' అంటే కొండ నుండి వీచెడు దుమ్ము; ధూమల - ధూమ్ర వర్ణము (*Smoke coloured; Brownish red*), అలకంబు - ముంగురులు. అంటే ఎర్రని దుమ్ముతోకూడిన కొండగాలికి ధూమ్రవర్ణంగా మారిన ముంగురులు కలది అని అర్థం.

సరణి తరుణతరుచ్ఛాయ శమిత ఖేదము - సరణి అంటే బాట; తరుణ తరుచ్ఛాయ - లేతమొక్కల నీడతో, శమిత ఖేదము - శమించిన ఖేదము కలది - శాంతించిన దుఃఖము కలది; మహావృక్షాలు నీడను మాత్రమే యిస్తాయి. తరుణ వృక్షాలు నీడతోబాటు చల్లదనాన్ని కూడా యిస్తాయి. వృక్షాలు తమ వ్రేళ్లనుండి గ్రహించిన నీటిలో తమ అవసరానికి మించిన నీటిని భాష్పోత్సేకము (*transpiration*) అనే ప్రక్రియ ద్వారా ఆకులపైనా, లేత కాండంపైన వున్న స్టోమాటా (*Stomata*) అనే సూక్ష్మ రంధ్రాల ద్వారా అనుక్షణం బయటకు వదలివేస్తూ వుంటాయి. మహావృక్షాల ఆకులు, లేత కొమ్మలనుండి భాష్పోత్సేక క్రియలో వెలువడే నీటితుంపర యొక్క చల్లదనాన్ని మనం అనుభవించలేము. ఎందుకంటే వాటి ఆకులూ, కొమ్మలూ ఎక్కడో పైన ఆకాశంలో వుంటాయి గనుక. కాని, లేతవృక్షాల ఆకులు, కొమ్మలు మనకు అందుబాటులో నుండడం కారణంగా వాటినుండి వెలువడే నీటితుంపర గాలితోకూడి తరుణతరుచ్ఛాయ మనకు చల్లదనాన్నిచ్చి మన బడలికను శమింపజేస్తుంది.

ఆమె బాట వెంటవున్న అలాంటి లేత వృక్షాల నీడలో సేద తీరుతున్నదట.

## హంపీ క్షేత్ర విశేషాలు

అలస మృదులాంగకంబునై అరుగుదెంచు - బడలిన మృదువైన శరీరము కలదియై వస్తూన్న, అన్నిజ పరిగ్రహమున్ - ఆ నిజ పరిగ్రహమును - అంటే తన భార్యయైన లోపాముద్రను, కూర్మి - ప్రేమతో, ఆదరించి - గౌరవించి, వింధ్యాద్రి నిర్బంధ బాంధవుండు - వింధ్య పర్వతముల యొక్క నిర్బంధమునకు బంధువైన అగస్త్యుడు, పలుకు - ఈ విధముగా పలికెను.

అగస్త్యుడు మాల్యవంతమనే పర్వతాన్ని తన భార్య లోపాముద్రకు చూపుతూ దాని విశిష్టతను వర్ణిస్తున్నాడు - ఓ వనితా! చూచావా? ఇది మాల్యవంతమనే మహాపర్వతము. అత్యంత కాంతి కలిగినట్టిదీ, అనేకములైన మణులకు పుట్టిల్లయిన చరియలచే అందంగా ఒప్పేదీ; నిండు చంద్రునివంటి ముఖములుగల దేవతా స్త్రీలకు క్రీడాస్థానమైన చంద్రకాంత శిలలు గలదీ; ఆకాశాన్ని ఒరుసుకునే దీని శిఖరముల ఔన్నత్యం కారణంగా పర్వతముల ప్రస్తావన గనుకవస్తే తక్కిన అన్ని పర్వతములకంటే ముందుగా ప్రస్తావించబడి, వర్ణింపబడిన వృత్తాంతముగల యీ మహాపర్వతమైన మాల్యవంతమును

చూచావా?

మాల్యవంతము అనే యీ పర్వతంలోని గుహలలోనే రాముడు లక్ష్మణుడితో సహా సీతను వెదకడానికి వెళ్లిన హనుమంతుడు వగైరాలు తిరిగి వచ్చేవరకూ నివసించాడట. హంపిలో రామాయణ గాథకు సంబంధించిన ఎన్నో స్థలాలు దాదాపుగా నేటికీ అవే పేర్లతో పిలువబడుతూండడం విశేషం. తుంగభద్రానది ఉత్తర తీరంలో నాటి సుగ్రీవుల వానర రాజ్యమైన 'కిష్కింధ' వుంది. దీనిని నేటికీ 'కిష్కింధ' అనే పిలుస్తున్నారు. మతంగ మహర్షి ఆశ్రమం కల మతంగ పర్వతం (అదే మాల్యవంతము), మునిశాపం కారణంగా వాలి అడుగుపెట్టలేని ఋష్యమూక పర్వతం, సుగ్రీవుని మధువనం, సీతాసరోవరం, పంపాసరోవరం, సీత నగలు భద్రపరచిన సుగ్రీవుని గుహ, హనుమంతుని జన్మస్థలమైన అంజనాద్రి (దానినిప్పుడు అంజనాదేవి బెట్ట అంటున్నారు), తుంగభద్రానది ఒడ్డున పంపాపతి దేవాలయము (దీనినే యిప్పుడు విరూపాక్షాలయం అంటున్నారు), ఉప్పునీటి సరస్సు కలిగిన రుమద్వంతము అనే పర్వతం (దీనిపైనే సుగ్రీవుని భార్య అయిన రుమ జన్మించిందంటారు), హేమకూట పర్వతం, శబరి ఆశ్రమం - యివన్నీ హంపిలో నేటికీ చూడవచ్చు.

ఇక్కడ శబరిని గురించి మరొక విషయం కూడా చెప్పుకోవాలి. హంపి వెళ్లిన వారెవరైనా తుంగభద్రా నదిని దాటి అవతలకు వెళ్తే కిష్కింధ (ఆనెగొంది) చేరతారు. తుంగభద్ర ఉత్తర తీరంలో వున్న యీ ఆనెగొందికి, నైరృతి దిక్కుగా రెండు మైళ్ల దూరంలో రామాయణంలో పేర్కొనబడిన ప్రసిద్ధమైన పంపాసరోవరం వుంది. పంపా సరోవరానికి సమీపంలోనే యాత్రికులు శబరి ఆశ్రమాన్ని కూడా చూడవచ్చు. శబర జాతికి చెందిన ఆ వృద్ధ స్త్రీకి మతంగ మహర్షి గురువనీ, ఆమె సీతాన్వేషణార్థమై అక్కడికి వచ్చిన రామునికి వివిధ జాతుల అడవి పండ్లను తినిపించిందనీ, అప్పుడు తెలియక పుల్లని పండ్లను తింటే రాముని పండ్లు పులుస్తాయేమోనని ప్రతి పండును ముందుగా తాను కొరికి రుచి చూసిన తరువాతనే రాముడికిచ్చి తినిపించిందనే కథలు ప్రచారంలో వున్నాయి. హంపిలోనైతే సుగ్రీవుని రాజ్యమైన కిష్కింధ, మతంగ (మాల్యవంత) పర్వతం, పంపా సరోవరం, శబరి గుహ మొదలైనవి వున్నాయి కనుక రామాయణంలో పేర్కొనబడిన శబరి యీ ప్రదేశంలోనే ఏళ్ల తరబడి ఎదురుతెన్నులు చూసిన పిదప తన అభిమాన దైవమైన రాముడికి పండ్లు తినిపించిందని నమ్మవచ్చు. కాని, ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలోని చిత్రోత్పల (మహానది) తీరంలో మరొక శబరి ఆశ్రమం వుందని కొన్ని పురాణాలు పేర్కొంటున్నాయి. ఏళ్ల తరబడి చేసిన నిరీక్షణ అనంతరం తన యిష్ట దైవమైన రామునికి ఎంగిలి పండ్లను తినిపించిన శబరి నివసించింది అక్కడేనని స్థానికులు నమ్ముతున్నారు కూడా. మహారాష్ట్రలోని నాసిక్‌కు రెండు మైళ్ల దూరంలో దండకారణ్యంలో వున్న పంచవటికి దగ్గరలో శబరి ఆశ్రమం వుండేదని అక్కడి వారు నమ్ముతున్నారు. గోదావరి నదీ తీరంలో భద్రాచలానికి సమీపంలో శబరి ఆశ్రమం వుండేదని తెలుగు వారు భావిస్తారు. అయితే గోదావరికి ఉపనదియైన శబరి ఒరిస్సాలోని కోరాపుట్ జిల్లాలో పుట్టి ఛత్తీస్‌గఢ్‌లోని కొంట వద్ద సీలేరు నదిని తనలో కలుపుకొని భద్రాచలంకు బాగా దిగువన వచ్చి గోదావరి నదిలో కలుస్తుంది. ఈ రెండు నదుల సంగమ స్థలంలోనే ఒకప్పుడు శబరి ఆశ్రమముండేదని కొందరు భావిస్తారు. ఇక కేరళలోని పట్టణమ్ తిట్ట జిల్లాలోని శబరిమలై సమీపంలో ప్రవహించే పంపానదే రామాయణంలో పేర్కొనబడిన పంపా సరోవరమనీ, శబరి రామునికి పండ్లను తినిపించింది అక్కడేననీ అక్కడి వారు నమ్ముతున్నారు. పంపానదిని అక్కడ 'పంబ' అంటారు. అక్కడ అది ఒక నదిలా ఉరవడిగా ప్రవహించక ఒక సరోవరాన్నే తలపింపజేస్తుంది. అక్కడి శబర జాతి ఆ పరిసర పర్వతాలకు శబరిమలై (శబరి కొండలు) అనే పేరు పెట్టుకున్నారు. ప్రోటో- ఆస్ట్రలాయిడ్ జాతులలోని వారైన శబర జాతి వారు పై ప్రాంతాలన్నింటిలో ఒకప్పుడు నివసించిన కారణంగా శబర జాతికి గర్వకారణమైన పరమ భక్తురాలు శబరి తమ ప్రాంతానికి చెందినదంటే తమ ప్రాంతానికి చెందినదని వారంతా పోటీపడినట్లున్నారు. ఆ యా నదులకూ, పర్వతాలకూ వారు శబరి పేరే పెట్టుకున్నట్లున్నారు. రామాయణం ప్రకారం భక్త శబరి రాముడి రాకకోసం పదివేల ఏళ్లు ఎదురుచూసిందట. ఇదెంత అశాస్త్రీయమైన విశ్వాసమో చూడండి. శబరి సంగతి అటుంచి రాముడి స్వస్థలం అయోధ్య అనే నమ్మకం దాదాపు అందరిలోనూ వుంది కదా ! మరి అయోధ్యలోని పలు ప్రాంతాలలో అక్కడి స్థానికులు రాముడు యిక్కడ జన్మించాడంటే, యిక్కడ జన్మించాడని ఒకరికొకరు పోటీపడి ఆ యా ప్రదేశాలలో చిన్నా చితకా ఆలయాలు నిర్మించారు. నిజానికి రామ జన్మభూమి వీటిలో ఎక్కడా లేదు - అది కూలగొట్టబడిన బాబ్రీ మసీదు క్రింద వున్నదని అయోధ్యకు వెలుపల ఎక్కువ మంది నమ్ముతున్నారు. ఇంకా ప్రముఖ వ్యక్తుల జన్మ స్థలాలను గురించిన వివాదాలు మరికొన్నింటిని 'చరిత్ర చిక్కుముడి' అధ్యాయంలో చూడండి.

ఆ తరువాత కవి మాల్యవంతపు ఆశ్రమ భూముల్ని వర్ణిస్తున్నాడు. ఆశ్రమవాసులు యజ్ఞాల్ని అతిఎక్కువగా నిర్వహిస్తూంటారు. అక్కడ యజ్ఞములలో యూప స్తంభములుగా వాడుటకు కొన్ని చెట్ల కొమ్మలు నరికి భద్రపరచబడ్డాయట. యజ్ఞములలో బలిపశువును కట్టివేయడానికి వాడే స్తంభమును యూపస్తంభమంటారు. 'ఔదుంబరో యూపో భవతి!'

ఉదుంబర (మేడి – *Ficus glomerata*) వృక్షపు కొమ్మల్ని యూపస్తంభాలుగా వాడతారు. అక్కడి యిసుకదిబ్బలలో అక్కడక్కడా బుదరగుంటలున్నాయట. వాటిలో దర్భల మోళ్ళు (*Stubbles*) న్నాయట. కుశ లేక దర్భ (*Eragrostis cynosuroides - Family - Graminae*) యొక్క వాడకం యజ్ఞాలలో ఎక్కువ. అక్కడ ఎంత ఎక్కువగా యజ్ఞయాగాదులు జరిగేవంటే – ఆ ప్రాంతంలో ఎక్కడ చూసినా కోయబడిన దర్భల మోళ్లే కనుపిస్తున్నాయిగాని దర్భతృణాలు మచ్చుకైనా కనుపించడంలేదట. ధ్వనికి అలవాటుపడిన లేళ్ల యువజంటలు నరసంచారపు అలికిడి వినికూడా బెదరక అలాగే నిలిచి చూస్తున్నాయట. చలించుచున్న పిలకజుట్లుగల తలలతో బ్రహ్మచారులు చెట్ల నీడలలో నిలబడి తమ హోమధేనువుల దూడలను కాస్తున్నారట. సామగానమున తనకు గలిగిన సంశయమును చిలుక కోకిలనడిగి తెలుసుకుంటూందట. (అంటే అక్కడి పక్షులు కూడా వేదమునభ్యసించినవేనని భావం) అక్కడి గున్నమామిడి చెట్లు విరగబూసి వున్నాయట. ఆ పూలలో పూదేనియ చిప్పిల్లుతూ వుందట. మదించిన గండు తుమ్మెదల సమూహాల దాడికి ఆ గున్నమామిడి పూగుత్తులనుండి ఒలికిన పూదేనియ ఆ చెట్లకు ఆరగట్టిన ఆశ్రమవాసుల కావిగుడ్డలపైబడి ఆ వస్త్రములకు మావిచిగుళ్ల కాంతిని కలిగిస్తూన్నదట!

అక్కడి వాయువులు నిర్ధూత పాతకములనీ (పూర్తిగా తుడిచివేయబడిన పాపములు కలిగినట్టివనీ), వివర్థిత సుకృతంబులనీ (వృద్ధిపొందింపబడిన పుణ్యములు కలిగినట్టివనీ) అగస్త్యుడు లోపాముద్రకు వివరించడం చదువుతూంటే హంపి విజయనగరపు నీరు, గాలిపట్ల రామకృష్ణకవి ఎంతటి అనుబంధాన్ని పెంచుకున్నాడో మనకు అర్థమౌతుంది.

అగస్త్యుడు లోపాముద్రతో యింకా యిలా అంటున్నాడు –

ఉ॥ **ఓ లలితాంగి! యిందు సుఖముందు మృకండు కణాద గాధి వా**
**ధూల ముఖాతిరిక్త చరితుండు మతంగ మహాతపస్వి ని**
**ష్కాలగళుండు నిర్యువతిగాత్రుడు నిర్నిటలేక్షణుండుని**
**ర్వ్యాళవిభూషణుండునగు నంబరకేశుఁ డనంగఁ బెంపునన్.** (పాండురంగ మాహాత్మ్యం : 1-133)

మనోజ్ఞమైన అవయవములు కలిగిన ఓ లోపాముద్రా! మృకండువు, కణాదుఁడు, గాధి, వాధూలుఁడు మొదలగు మునుల నడవడికను మించిన ఉత్తమోత్తమమైన నడవడికగల మతంగుడనే మహాతపస్వి యీ ఆశ్రమంలో సుఖంగా నివసిస్తూంటాడు. అతడు నిష్కాల గళుడు – (శివునిలా) నల్లదనములేని మెడకలవాడు; నిర్యువతిగాత్రుడు (శివునిలా సగభాగం) యువతి శరీరం లేనివాడు; నిర్నిటలేక్షణుండు (శివునిలా) నొసట మూడవ నేత్రం లేనివాడు; నిర్వ్యాళవిభూషణుండు (శివునిలా) పాములు నగలుగా లేనివాడు; అయినప్పటికీ ఆ మహర్షి పెంపునన్ (గొప్పతనములో) అంబరకేశుడైన (వ్యోమకేశుడైన) శివుడేననిపించే విధంగా వెలుగొందుతున్నాడు.

ఈ మతంగ మహర్షి ఓ రోజు ఋష్యమూక పర్వతంపై తపస్సు చేసుకుంటూ వుండగా సుగ్రీవుని అన్న వాలి దుందుభి అనే రాక్షసుడిని చంపి ఆ కళేబరాన్ని ఋష్యమూక పర్వతం పైకి విసరివేయగా అందునుండి రక్త బిందువులు స్రవించి అవి మతంగ మహర్షిపైన పడగా, ఆయన కోపించి ఋష్యమూక పర్వతంపై కాలుబెట్టిన మరుక్షణం వాలి తల వేయి వ్రక్కలవుతుందని శపించాడు. అది మొదలు వాలి ఋష్యమూక పర్వతం చాయలకు కూడా రాడు. ఇంద్రుని కుమారుడైన వాలికి ఇంద్రుడు బహూకరించిన హేమమాలికను మెడలో ధరించిన కారణంగా తననెదిరించి పోరాడే శత్రువు బలంలో సగం తనకు వచ్చి చేరుతుందట. ఆ కారణంగా అమిత బలశాలులైన దుందుభి రావణాదులను సైతం అవలీలగా ఓడించి బలగర్వంతో విర్రవీగుతున్న వాలి సుగ్రీవునితో వైరం ఏర్పడినప్పుడు ఆతడిని ఓడించి తరుమగా మతంగ మహర్షి వాలికిచ్చిన శాపం గురించి తెలిసిన సుగ్రీవుడు తన ప్రాణరక్షణకై ఋష్యమూక పర్వతం పైకి పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాడు. రాముడి చేతిలో వాలి వధింపబడే వరకూ సుగ్రీవుడు ఋష్యమూక పర్వతంపైనే భద్రంగా నివసించాడట.

మతంగ మహర్షి బోయకాంతయైన శబరికి గురువు.

మేరువు కుమార్తె అయిన నియతిని, భృగుమహర్షి కుమారుడైన విధాత పెండ్లాడగా వారిరువురికీ పుట్టినవాడు మృకండు. మృకండువుకూ మనస్వినికీ పుట్టినవాడే శివభక్తాగ్రేసరుడైన మార్కండేయుడు. షడ్దర్శనాల పేరిట ప్రసిద్ధిగాంచిన భారతీయ ఆస్తికదర్శనాలు ఆరింటిలోనిదైన వైశేషిక దర్శనకర్త కణాదుడు. వైశేషిక తత్త్వశాస్త్రము విశ్వమంతా కణముల (పరమాణువుల) సంఘాతంతో ఏర్పడిందని ప్రతిపాదిస్తుంది. అయితే గ్రీకు పరమాణువాదంవలెకాక భారతీయ వైశేషిక దర్శనం గుణాత్మక పరమాణువాదము (*Qualitative atomism*) ను ప్రతిపాదించింది.

గాధి ఇంద్రుని అంశతో కుశాంబుడనే రాజు కుమారుడిగా పుట్టాడంటారు. ఇతడు విశ్వామిత్రుని తండ్రి. అందుకే విశ్వామిత్రుడిని గాధిజ, గాధినందన, గాధిపుత్ర అని కూడా పిలుస్తారు. ఒకప్పుడు కన్యాకుబ్జమని పిలువబడి నేడు కనోజ్‌గా ప్రసిద్ధమైన ఉత్తర ప్రదేశ్‌లోని నగరాన్ని 'గాధినగరమ్', 'గాధిపురమ్' అని పిలువడాన్ని బట్టి కనోజ్ నగర నిర్మాత గాధి అయివుండవచ్చుననిపిస్తుంది.

తైత్తిరీయ సంహితలోని (కృష్ణ యజుర్వేదంలోని) ఒక శ్రౌత సూత్రాన్ని రచించినవాడు వాధూలుడు.

ఆ మాల్యవంత పర్వతం భూమియనే స్త్రీ యొక్క స్తనమువలె వెలుగొందుతున్నదట. ఆ పర్వత సమీపంలోని మతంగాశ్రమము అక్కడ నిరంతరం నిర్వహించబడుతున్న యజ్ఞయాగాదుల కారణంగా ఏర్పడిన హోమధూమములచే పొగచూరి ఆ స్తనముపై అంటిన నల్లని కస్తూరి (మృగనాభి) చుక్కవలె ప్రకాశిస్తున్నదట.

ప్రాచీనకాలంలో స్త్రీలు రొమ్ములకు సువాసన ద్రవ్యమైన కస్తూరిని పూసుకునేవారు.

ఆ మాల్యవంతంపై శ్రీరాముడు సంచారమొనర్చిన ప్రాంతాలనూ, ఆయన వాలిని సంహరించిన ప్రాంతాన్నీ అగస్త్యుడు లోపాముద్రకు చూపించి వాటి విశిష్టత వివరించాడు. వారొక సరస్తీరానికి చేరుకున్నారు. అప్పటికి మిట్టమధ్యాహ్నమైంది. ఆ ఎండ వేడిమికి తాళలేక ఆ సరస్సులోని ఓ రాయంచ గొడుగువంటి తామరపూవు క్రిందకు చేరిందట. ఒక ఘోణి (పంది) తాపానికి దౌడలనుండి కారే నురుగు తెట్టెలతో తాపోపశమనానికి ప్రక్కలనున్న బురద రొచ్చును కెలికి కెలికి ఆడుతున్నదట. దూరంగా అడవిలో దావానలం (కార్చిచ్చు) ఏర్పడి మండుతూంటే ఎగసిన నల్లని దావధూమాన్ని (నల్లని కార్చిచ్చు పొగను) చూసి ఘనమని (వర్షుకాభ్రమని) అనుమానిస్తూ ఒక పొదరింటి లోపలినుంచి నిక్కిచూస్తూందట ఒక నెమ్మి (నెమలి). ఒక సామజము (ఏనుగు) ఆ ఎండతాపాన్ని భరించలేక తన కడుపులోని నీటిని నాసానాళములతో ఎగబీల్చి తొండముతో యిరువైపులా చల్లుకున్నదట. సరస్సుపైనున్న నీరు ఆ వేడికి సలసలా తెర్లుతున్నదట. విపిన సకల వీధులు (ఆ అడవిలోని అన్ని ప్రదేశాలూ) ఆ ఎండ తాపానికి నిర్మృగోచ్చయములు (మృగముల సంచారమేమాత్రమూ లేనివి) అయ్యాయట. "ఓ సుధామధు వాణీ! మట్టమధ్యాహ్నమిది. పథశ్రమ (మార్గాయాసము)ను అపనయింప (తొలగించుకొనుటకు) యీ చోటు అర్హమైనట్టిది" - అంటూ యింకొంచెం ముందుకు వెళ్ళి చూడగా -

క॥ నటనోద్భటుండైన మహా
నటుని జటాజూట మురిలినం దొరఁగు మరు
త్కటక నది యిది యనుచుం జని
యటఁ గనియెన్ దుంగభద్ర నఘముఖముద్రన్. (పాండురంగ మాహాత్మ్యం : 1-138)

"నటనోద్భటుడు - అంటే నాట్యమొనర్చుటలో గొప్పవాడైన మహానటుడు నటరాజు అయిన శివుని జటాజూటము (కపర్దము) ఉరిలినన్ (వీడిపోగా) తొరఁగు (స్రవించునట్టి) మరుత్కటకనది (ఆకాశగంగ) యిదే" అంటూ వెళ్లి అక్కడ అఘముఖముద్ర (పాపములనోటికి తాళమైనట్టిది - సర్వపాపములను నాశనము చేయునట్టిది) యైన తుంగభద్రను చూచాడు.

# తుంగభద్ర విశిష్టత

శా॥ గంగాసంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకారమొనర్చునే యమునతో నానందముంబొందునే!
రంగత్తుంగ తరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగంబంటి సుఖించునేని గుణభద్రా! తుంగభద్రానదీ! (పాండురంగ మాహాత్మ్యం : 1-139)

తుంగ, భద్ర అనే రెండు ఉపనదులు కలిస్తే ఏర్పడిన నది తుంగ భద్ర. 'తుంగ' అంటే ఎత్తైనది. ఎగసిన ఎత్తైన కెరటాన్ని 'ఉత్తుంగ తరంగం' అంటాం. 'తుంగ భంగ' - అంటే 'ఎత్తైన అలలు కలిగినది' అనే ప్రయోగమూ వుంది. 'భద్ర' అన్నా ఎత్తైనది అనే అర్థంవుంది. రాజు కూర్చుండే ఎత్తైన పీఠాన్ని 'భద్రాసనం' అంటాం. రాజుగారి ఎత్తైన ఏనుగును 'భద్రగజం' అంటాం. పడమటి కనుమలలో కర్ణాటకలోని చిక్‌మగళూర్ జిల్లాలో దక్షిణ భారత దేశంలోని అతి ఎత్తైన పర్వతాలలో పుట్టిన యీ రెండు నదులూ అతి ఎత్తైన ప్రాంతంనుంచి ప్రవహించి ఏకమై దాదాపు నిట్రంగా మైదాన ప్రాంతానికి చేరడం కారణంగా తుంగభద్ర గొప్ప ఉధృతమైన ఉరవడి కలిగి వుంటుంది. తుంగనది శృంగేరి, తీర్థహళ్లి, షిమోగాల మీదుగానూ, భద్రనది భద్రావతి మీదుగానూ ప్రవహించి హొస్పేటకు ఎగువనే మరో ఉపనదియైన వరదానదిని తనలో కలుపుకుంటుంది. తుంగభద్రగా ఏకవాహినియైన అనంతరం, హొస్పేట్ డ్యాం వద్ద యీ నది ఉధృతిని చూచిన వారెవరికైనా కళ్లు తిరగకపోవు. ఇక హంపి వద్ద యీ నది ఉరవళ్లూ, పరవళ్లూ చూచి తీరాల్సిందే! తుంగభద్ర అంటే సంస్కృతంలో 'బాగా మదించి అదుపు తప్పిన, ఎద్దైన ఏనుగు' (*an elephant in rut or a restive elephant*) అని అర్థం.

తుంగభద్ర కృష్ణానదికి ఉపనది. నేరుగా కృష్ణానది సముద్రంలో కలుస్తుంది కానీ, తుంగభద్ర సముద్రంలో కలవదు. నదులన్నీ భార్యలైతే సముద్రుడు భర్త అని రామకృష్ణకవి భావం. అంచేత గుణభద్రా! (మంచిగుణములు గలదానివైన) ఓ తుంగభద్రా నదీ! చలించుచున్న ఎత్తైన అలలనెడి చేతులతో, ఆ రత్నాకరేంద్రుడు (సముద్రరాజు) నీ అంగబంటి సుఖించినచో యిక గంగానది పొందు కోరతాడా? కావేరిని దేవేరిగా (పట్టపు రాణిగా) అంగీకరిస్తాడా? యమునతో ఆనందం పొందుతాడా? అని ప్రశ్నిస్తున్నాడు కవి. అయితే యమున కూడా గంగకు ఉపనది. యమునానది గంగానదితో ప్రయాగ (నేటి అలహాబాద్)లో కలుస్తుంది. గంగానది మాత్రమే బంగాళాఖాతంలో కలుస్తుంది. యమునా నది గంగకు ఉపనది అనీ, అది సముద్రంలో నేరుగా కలవదనీ నాటికి రామకృష్ణ కవికి తెలియక పోవడం వింతగానే వుంది! అయితే కొందరు మనకు కనుపించని సరస్వతీనది అంతర్వాహినిగా వచ్చి ప్రయాగలోనే గంగతో కలుస్తుందనీ, అందుకే దానిని త్రివేణీ సంగమమంటారనీ, సంగమమైనప్పటికీ యీ మూడు నదులూ సముద్రంలో కలిసే వరకూ తమ పృథకత్వాన్ని కాపాడుకుంటాయనీ అంటారు. ఇంకొందరు ఒకప్పుడు యమునా నది ప్రయాగలో గంగతో కలవక నేరుగా సముద్రంలో కలిసేదనీ, అంచేతనే ఆనంద రామాయణంలో 'యమునా సంగమం' అనే పదం పేర్కొనబడిందనీ అంటారు. అలాచూస్తే యమున సముద్రుని భార్యే! రామకృష్ణకవి భావన సమంజసమే! అయితే శాస్త్రీయంగా ఆలోచిస్తే ఒకప్పుడు త్రివేణీ సంగమంగా పిలువబడిన ప్రయాగలో గంగతో కలసిన సరస్వతి అనబడిన మరొక నది ఏదైనా ప్రకృతి వైపరీత్యం కారణంగా దారిమళ్లి వుండవచ్చు. లేక ఎడారి వంటి నేలలో యింకి కాలక్రమేణా లుప్తమైపోయి వుండవచ్చు. మన భారతదేశంలో యింకా అలా కాలక్రమేణా ఎడారులలో యింకిపోయి అదృశ్యమైన నదులున్నాయి. (ఉదా : లూనీనది, రాజస్థాన్).

ఇంకా తుంగభద్రా నదిని అగస్త్యుడీవిధంగా కొనియాడుతున్నాడు -

క॥ ఓపున్ భూపరిధింగల
యాపగ లవి బాహ్యతాప మాఁపఁగ నీవే
యోపుదుగా యంతర్గత
తాపత్రయ మడఁప నో యుదన్వన్మహిళా! (పాండురంగ మాహాత్మ్యం : 1-140)

భూపరిధింగల (ఈ భూవలయంలోనున్న) ఆపగలు (నదులు) అవి బాహ్య తాపమాఁపఁగ ఓపున్ (ఆ నదులు బయటికి తెలిసే వేడిమిని ఆపుటకు తగియున్నవి) అంతర్గత తాపత్రయము (లోపలి తాపములైన ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములనెడి మూడు తాపములను) అడఁప (అణచుటకు ఉపశమింపజేయుటకు) నీవే యోపుదుగా (నీవే తగియున్నావుగా) ఓ ఉదన్వత్ + మహిళా (జల ప్రపూర్ణమైన ఓ మహిళా! ఓ తుంగభద్రా!)

'ఉదన్వత్' అంటే సముద్రుడనే అర్థమూ వుంది గనుక 'సముద్రుని మహిళ' అంటే 'సముద్రుని భార్య' అని తుంగభద్రను అగస్త్యుడు సంబోధించాడని కొందరు వ్యాఖ్యాతలు పొరబాటుగా పేర్కొన్నారు. పై పద్యంలో "నీవు ఉపనదివైపోయావు. కనుక సముద్రంలో నేరుగా కలవవు. సముద్రరాజు నీ అంగంబంటి సుఖించినట్లయితే యిక గంగాసంగమాన్ని కోరుకుంటాడా? కావేరిని దేవేరిగా యిష్టపడతాడా? యమునతో ఆనందం పొందుతాడా?" అని ప్రశ్నించిన కవి యీ పద్యంలో తుంగభద్రను సముద్రుని భార్యగా ఎలా సంబోధిస్తాడు? 'ఉదన్వత్' అంటే జలప్రపూర్ణమైన అనే మరో అర్థంవుంది. కాబట్టి యిక్కడ 'ఉదన్వన్మహిళా' అంటే 'జలప్రపూర్ణమైన ఓ తుంగభద్రానదీ!' అనే అర్థమని నా అభిప్రాయం.

అలా తుంగభద్రానదిని కొనియాడిన అగస్త్యుడు అనంతరం ఆ నదిలో మహానియమంతో స్నానంచేసి, పునర్జన్మ అనే రోగపు జాడ్యములు నశించునట్లు బంగారు తామర పూల పరిమళముతో కూడిన రసౌషధంవంటి ఆ నదీ జలాన్ని త్రాగాడట. తరువాత ఒడ్డుకు చేరి కాశీనగరాన్ని వదలిన కారణంగా ఏర్పడిన విరహమనే పెనువిషాదము నశించునట్లు పూజనీయులకు పూజాకార్యక్రమములు నిర్వహించాడట - రోగములచే బాధపడేవారికి ఔషధంలా, భవరోగంతో బాధపడేవారికి తుంగభద్రాతోయము దివ్యౌషధమని రామకృష్ణకవి భావం.

తరువాతి గద్యంలో (1-142) తుంగభద్రను త్రిభువన పవిత్రీకరణ సమర్థచరిత్రంబగు ఉదధికళత్రము అంటున్నాడు. పై పద్యంలో 'ఉదన్వన్మహిళా' అంటే 'జలప్రపూర్ణమైన ఓ తుంగభద్రానదీ' అనే అర్థం చెప్పుకోవచ్చు గానీ, యీ గద్యంలో నేరుగా తుంగభద్రను 'ఉదధి కళత్రము' (సముద్రుని భార్య) అనే సంబోధిస్తున్నాడు కవి. తుంగభద్ర ఒకనది. నదులకు భర్త సముద్రుడు. తుంగభద్ర సముద్రునితో సంగమించినా లేకున్నా సామాన్యార్థంలో నదికి సముద్రుడు భర్తే! అంచేతనే యిక్కడ కవి తుంగభద్రను 'ఉదధికళత్రము' అని సంబోధించాడనుకోవాలి.

ఇక ఆ నీవారముష్టింపచుండు భార్య, శిష్యులతో సహా తుంగభద్రానదిని దాటి నది దక్షిణతీరానికి చేరాడు. (నీవారముష్టింపచుడు అంటే పిడికెడు నివ్వరి ధాన్యమును మాత్రము వండి తినువాడైన అగస్త్య మహర్షి - నీవారము లేక నివ్వరి ధాన్యము అంటే సాగుచేయబడకుండా అడవిలో పెరిగే ఓ రకం వరి ధాన్యం)

ఆ తరువాత ఆ దంపతులిరువురూ శిష్యగణ సమేతంగా హేమకూటపర్వతంపై వెలసి పంపాపతియను పేర ప్రసిద్ధుడైన విరూపాక్ష స్వామిని భక్తితో సేవించి, అక్కడినుండి బయలుదేరి స్వామి శైలమునకు చేరారు.

# సామిమలలో

ఆ కుధరముపై (పర్వతముపై) వెలసిన కేకిరాడ్ధ్వజుడు (నెమలిరాజును ధ్వజముగా కలవాడు), శిఖిసంతప్త హిరణ్మయనిభవర్ణుడు (అగ్ని యందు పుటము పెట్టబడిన బంగారు యొక్క కాంతివంటి మేనిచాయ కలవాడు) షణ్ముఖుడు (ఆరుముఖములు గలవాడు) షాణ్మాతురుడు (ఆరుగురు తల్లులుగలవాడు - శివుని వీర్యం అగ్నిలో పడి అనంతరం అగ్నిచే గంగానదిలో వదలబడగా అక్కడికి స్నానానికి వచ్చి అగ్ని భార్యలైన ఆరుగురు కృత్తికలు ఆ వీర్యం కారణంగా గర్భాలు ధరించి ఆరుగురు శిశువులకు జన్మనీయగా వారందరూ చిత్రంగా కలుపబడి ఆరు ముఖాలూ, పన్నెండు చేతులూ, పన్నెండు కళ్ళూ కల కార్తికేయునిగా రూపొందాడు. అందుకే సుబ్రహ్మణ్య స్వామి ఆర్గురు తల్లుల తనయుడట.) అయిన కార్తికేయుని అగస్త్యుడు సభార్యుడై సేవించాడు.

కలశసూతుడైన అగస్త్య మహర్షి తన మృదువగు వచనాలతో క్రౌంచాచలవిదళన నిపుణ బాహుసారుడైన (క్రౌంచ పర్వతమును భేదించినట్టి సమర్థ బాహుబలశాలియైన) కుమారస్వామిని వేనోళ్ల స్తుతించాడు.

శరవణుడు (రెల్లు దుబ్బులో జన్మించిన కుమార స్వామి) అప్పుడు వింధ్య సంస్తంభయుతుడైన (వింధ్య పర్వతమునణచినవాడైన) అగస్త్యునికి గంగ, పెన్న, విపాశ, చంద్రభాగ, శరావతి, వేత్రవతి, బాహుద, కృష్ణవేణి, కావేరి, కపిశ, వంజీర (మంజీర), భవనాశని (సరయూనది), తుంగభద్ర, గౌతమి (గోదావరి) మొదలగు నదీతీర్థముల దివ్యచరిత్రలను వినిపించాడు.

క॥ ఈ గంగాదిక తీర్థము
లీగంగానీవు తమ సమిద్ధాంబువులన్
దోఁగెడు వారల గనగనఁ
గ్రాఁగెడు నంగారసింధు కల్లోలములన్ (పాండురంగ మాహాత్మ్యం : 1-150)

ఈ గంగ మొదలైన పైన చెప్పబడిన పవిత్ర తీర్థములు; తమ సమిద్ధాంబువులన్ - మిక్కిలి పవిత్రములైన తమ జలములందు; తోఁగెడివారలన్ - మునుగువారిని; గనగనగ్రాఁగెడు - గనగన మండుచున్న; అంగార సింధు కల్లోలములన్ - నిప్పుటేటి అలలయందు; ఈగంగానీవు (ఈగుట అంటే మునుగుట) మునుగనీయవు. అనగా పవిత్రమైన గంగాది తీర్థములందు మునుగువారికి నరకలోకం (*Hades*) లోని వైతరణి (*Styx*) నదిలో గనగన మండే నిప్పుల అలలలో మునగాల్సిన అవసరం లేదు. వారు నరకానికి వెళ్లరు. పుణ్యలోకాలు పొందుతారు.

తరువాత కుమారస్వామి అగస్త్యునితో 'సకలధునీ చరితలు (అన్ని నదుల చరిత్రలు) నీకు చెప్పానుగదా! ఇంకే కథ చెప్పేది?' అన్నాడట.

అప్పుడు అగస్త్యుడు కుమారస్వామిని వేల్పు, తీర్థము, క్షేత్రము సమాన ప్రాధాన్యతతో ఒకే చోటనున్నట్టి పుణ్యక్షేత్రమెక్కడ వుందో తెలుపమని కోరాడు. దానికి కార్తికేయుడు ఎంతో ఆలోచించి కూడా తనకు తోచడంలేదని సందేహనివృత్తికి తన తండ్రియైన శివుని వద్దకు రజతగిరి (వెండి కొండయైన కైలాస పర్వతమునకు) వెళదామని ప్రతిపాదిస్తాడు.

# కైలాస యాత్ర

వారు ప్రయాణానికి సిద్ధమవుతున్నారు. అయితే కుమారస్వామి సందేహ నివృత్తికి తనయుడు తండ్రి దగ్గరకు వెళ్తున్నట్లుకాక యుద్ధానికి అన్నట్లు ససైన్యంగా బయలుదేరాడు. ఆ సైన్యం ముప్పై మూడుకోట్లట! మరి కుమారస్వామి దేవసేనానిగదా! అయినా, ముక్కోటి దేవతలకు ముప్పైమూడు కోట్ల సైన్యమెందుకో? ఆ సైన్యం, వారి ఆహార్యం, వాహనములు, విమానములు పగైరాల గురించి, ఆ సైన్యం చేసే కంచుకీధ్వానములు, రణకాహళుల గురించి, శరవణుని వాహనమైన నెమలి రూపము, దాని నడకల గురించి ఎంతో వివరంగా వర్ణించాడు కవి.

ఆ నెమలి యొక్క గమనములను వర్ణిస్తూ అది ఆస్యందితము (మిక్కిలి వేగమూకాని మిక్కిలి మందమూకాని గమనము) ధౌరితకము (ఆస్యందితము కంటే వడిగల నడక) ప్లుతము (గెంతుతూ వెళ్లే అతివేగమైన గమనము) రేచితము (సూటిగా వేగంగా పోయే గమనము) వల్గితము (కాళ్లు పైకెత్తి అత్యంత వేగంగా వెళ్లే గమనము) మొదలైన వివిధ గమనములతో వెళ్తున్నదంటాడు.

గుర్రములు పరుగెత్తే నాల్గువిధముల ధావన (పరుగు) పద్ధతులతో దౌడుతీస్తూ ఆ నెమలి వాహనము తన యజమానిని మెప్పించిందట. మురళి, ఉరవణము, పరువడి, భంజళి అనే నాలుగూ గుర్రము దౌడు తీయుటలోని భేదములు. వీటిలో అన్నిటికంటే వేగముగా దౌడు తీయుట పరువడి (పరుగు + వడి). భంజళి అంటే పామువలె మెలికలు తిరుగుతూ పోవడం. గోమూత్రికము అనేది భంజళిలోని ఒక పద్ధతి పరుగు.

ఈ విధంగా రామకృష్ణకవి యీ వర్ణనలపరంగా తనకున్న విశేష ప్రజ్ఞాపాటవాలనూ, బహుముఖ పరిజ్ఞానాన్నీ సమయోచితంగా ప్రకటించాడు.

వీరంతా కైలాస పర్వతం చేరుకొనేటప్పటికి అక్కడ ప్రమథగణాలు వీరికి ఎదురొచ్చాయట. ప్రమథులంటే శివభటులు. అయితే వీరందరూ శివసాయుజ్యం పొందినవారు. సారూప్య మోక్షం పొంది శివుడిని సమీపంనుంచి సేవించుకొనే అవకాశం దొరికిన భాగ్యశాలులు. సారూప్య మోక్షమంటే శివుని రూపం పొందడమే. అంచేత ప్రమథగణంలోని ప్రతివారూ శివుని రూపంలోనే వుంటారు.

ఆ ప్రమథగణాన్ని రామకృష్ణకవి యీ చక్కటి పద్యంలో వర్ణించాడు.

సీ॥ బలుపాపతల చుట్టు లలపరించినవారు లేఁతచందురులఁ దాలిచినవారు
పునుక తమ్మంటులఁ బొలుచు వీనులవారు నొసల మిక్కిలి చూపులెసఁగువారు
బూఁదు వాఁటఁగ మేన బూదిఁ బూసినవారు త్రిముఖాస్త్రములు కేలఁద్రిప్పువారు
పులితోలు హెంబట్టు పుట్టముల్ గలవారు కొమ్ముతేజులనెక్కి గునియువారు

తే॥ ఘోరతపముల హరుఁదక్కఁ గొన్నవారు, కరటి దైతేయ కుంభముక్తాలలామ
హారిభుజమధ్యములవా రుదారయశులు, ప్రమథవీరులు గొలిచిరా బాహులేయు.

**(పాండురంగ మాహాత్మ్యం : 1-165)**

శివునిలా పాముల్ని ధరించినవారు, బాలచంద్రుడిని కొప్పున ధరించినవారు, పునుకతమ్మంటులన్ (తలపుర్రెలతో

చేయబడిన కుండలములతో) పొలుచు (ప్రకాశించు) వీనులవారు (చెవులు గలవారు), నొసట అదనంగా మూడవకన్ను కలవారు, బూజుపట్టినట్లు ఒంటిపై బూడిద పూసుకొన్నవారు, చేతులలో త్రిశూలములు త్రిప్పేవారు, పులితోలును, హెుంబట్టు పుట్టములను ('పొన్ను' అంటే బంగారం; దీనినే కన్నడంలో 'హెున్ను' అంటారు. బంగారు జరీతో నేసిన పట్టు వస్త్రాన్ని కన్నడంలో – హెున్ను + పట్టు – హెుంబట్టు అంటారు) ధరించినవారు. వృషభ వాహనములెక్కి గునియువారు (కులికేవారు) కొమ్ముతేజి అంటే వృషభ వాహనము. ఘోరమైన తపస్సులు చేసి హరుణ్ణి (శివుడిని) తమ స్వంతం చేసికొన్నవారు. శివునిలా కరటి దైతేయ (కరటి అంటే ఏనుగు; కరటిదైతేయ – గజాసురుని యొక్క) కుంభముక్తాలలామ (కుంభస్థలంలోని మంచి ముత్యములతో) హారిభుజ మధ్యములవారు (గుర్తుగా చేయించిన హారాన్ని కంఠంలో ధరించినవారు) శివుడొకప్పుడు గజాసురుడనే రాక్షసుడిని సంహరించి ఆ విజయానికి గుర్తుగా ఆ కరిచర్మాన్నీ, ఆ ఏనుగు కుంభస్థలంలో వుండే మంచి ముత్యములతో చేయించిన హారమునూ ధరించాడని ఐతిహ్యం.

ఉదారయశులు – గొప్పకీర్తిగలవారూనైన ఆ ప్రమథులు; ఆ బాహులేయున్ (పెక్కుమంది తల్లులుగల ఆ కార్తికేయుడిని) కొలిచిరి – సేవించిరి.

ఈ పద్యంలో పేర్కొన్న రెండు విషయాలపై మరికొంత వివరిస్తాను. మొదటిది –

'హెుంబట్టు' అనే కన్నడ పదాన్ని వాడడం రామకృష్ణకవికి కన్నడ పద ప్రయోగంపట్ల వున్న మక్కువను సూచిస్తుంది. కన్నడ భాషా ప్రవేశం, కన్నడ పదప్రయోగాలపై ఈ మక్కువ రామకృష్ణకవి హంపిలో శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో వున్నప్పుడేర్పడినదేనని వేరే చెప్పాల్సిన పనిలేదనుకుంటాను.

ఇక రెండవది – ఈ పద్యంలో ప్రస్తావించబడిన 'కరటిదైతేయ కుంభముక్త'ముల గురించి కొంత విచారిద్దాం. ఇభముఖదైత్యుడు అంటే గజముఖుడైన రాక్షసుడి (గజాసురుడి) కుంభస్థలంలోని మంచి ముత్యములతో చేయబడిన హారము అని కవి ప్రస్తావించాడు. ఏనుగు కుంభస్థలంలో మంచి ముత్యాలుంటాయని మన ప్రాచీనుల విశ్వాసం. అయితే ముక్త లేక మౌక్తికము అనబడే ముత్యము, శుక్తి (ముత్యపు చిప్ప) నుంచి మాత్రమే లభిస్తుంది. ఇతర ప్రాచీన కవులు కొందరు కూడా యీ విషయం పేర్కొన్నారు. నవరత్నములలో ముత్యము (*Pearl*) ఒకటి. మొలస్కా తరగతి (*Phylum mollusca*) లో *Pteriidae* కుటుంబానికి, *Pinctada genus* కు చెందిన నత్తలవంటి రెండు వాల్వుల జలచర జంతువులే ముత్యపుచిప్పలు (*Pearl Oysters*). అవి వాటి గుల్లలోపల ఏర్పరచుకొనే నున్నని, గుండ్రని పదార్థములే ముత్యములు. ఇవి తమకు విసుగుదల కలిగించే బయటి పదార్థాలను చుట్టెయ్యడానికి ఓ పదార్థాన్ని స్రవిస్తాయి. అదే గట్టిపడి గుండ్రని ముత్యంగా తయారవుతుంది. ఇవి చాల కఠినంగా ఉంటాయి. ఇవి మనోజ్ఞమైన రంగుతో, కాంతివంతంగా వున్నప్పుడు చాల విలువైనవిగా భావిస్తారు. 'ఆణి' అంటే ముత్యము యొక్క గుండని తనము. మేలిరకము గుండ్రని ముత్యాన్ని ఆణిపూస లేక ఆణిముత్యం అంటారు.

కనుక, ఏనుగు కుంభస్థలంలో మంచి ముత్యాలు లభిస్తాయన్న విశ్వాసం అశాస్త్రీయమైనది. కాకపోతే ఏనుగు కుంభస్థలంలో ఉండే ఏదైనా గుండ్రని ఎముక పదార్థం దంతంలా కలకాలం నిలిచేది కావడాన ఆభరణాల తయారీలో వాడబడుతూండవచ్చు. కొమ్ములూ, దంతాలతో ఆభరణాల తయారీ ఆదిమ మానవుల కాలంనుంచీ వున్నదే. అలాగే మేఘం నుండి అప్పుడప్పుడూ ముత్యాలవాన కురుస్తుందనీ, అడవి పంది కోరల క్రింద కూడా ముత్యాలుంటాయనీ, పాముల పడగలపైన ముత్యాలుంటాయనీ, ముదిరిన వెదురులో ముత్యాలు లభిస్తాయనీ, కొన్నిరకాల శంఖువులూ, చేపలనుండి కూడా ముత్యాలు లభిస్తాయని మన పూర్వుల విశ్వాసం. వీటికీ శాస్త్రీయమైన పునాది లేదు.

అలాగే స్వాతి చినుకులు (స్వాతి నక్షత్రంలో కురిసే వాన చినుకులు) శుక్తి (ముత్యపు చిప్ప)లో పడితే మేలిముత్య మవుతుందనేది కూడా ఎటువంటి శాస్త్రీయమైన ఆధారమూలేని అంధవిశ్వాసమే! హిందూ మహాసముద్రంలోని కొన్ని ప్రాంతాలు ముత్యపు పంటకు ప్రసిద్ధికాగా, మన రాష్ట్రరాజధాని హైదరాబాద్ మేలికరపు మంచి ముత్యాల వ్యాపారానికి ప్రసిద్ధి. (ఈ విషయమై మరిన్ని వివరాల కోసం అనుబంధం – 7 చూడండి.)

ఇక కుమారస్వామి అనంత సేనా వాహినితో మునిగణము తోడురాగా కైలాసగిరికి చేరిన ఆ దృశ్యమెలా వుండట? ఈ చక్కటి పద్యం చూడండి –

శా॥ క్షోణీరేణుకృతంబు లంజన రజోగుచ్ఛాసితంబుల్ తమ
స్త్రేణుల్ దూషిత పూషభీషణగతిన్ జృంభించియున్ దూలె న
క్షీణో త్తంభిత శక్తి భృద్భట శిరస్సీమా కిరీటస్ఫుర
న్మాణిక్యాతప పల్లవస్తబక సామగ్రీ హృతాగ్రంబులై. (పాండురంగ మాహాత్మ్యం : 1-166)

'క్షోణి' అంటే నేల. 'క్షోణీరేణువు'లంటే నేలనుంచి లేచిన దుమ్ము కణాలు. 'క్షోణీరేణు కృతంబులు' అంటే ఆ అనంత సేనావాహిని పదఘట్టనలకు లేచిన దుమ్ముకణాల కారణంగా ఏర్పడినట్టి – 'అంజన రజము' అంటే కాటుకపొడి; గుచ్ఛా – కుప్పలవలె; సితంబుల్ – సితము అంటే తెల్లని, నల్లని అని రెండర్థాలు. ఇక్కడ నల్లని అనే అర్థం. ఇదంతా ముసురుకొంటున్న తమస్త్రేణుల (చీకట్ల)ను గురించి. ఆ దుమ్ము కణాలు పైకి లేచిన కారణంగా ఏర్పడిన చీకట్లు కాటుక పొడికుప్పలవలె నల్లగా వున్నాయట. దూషిత పూషా – పూషా అంటే సూర్యుడు; ఆ చీకట్లు సూర్యుడిని దూషితం (కలుషితం) చేస్తున్నాయట; అంటే ఆయన కాంతిని హరిస్తున్నాయట. భీషణగతిన్ (ఆ సూర్య కాంతులు భయంతో నలుదెసలకూ పారిపోయేటట్లు) జృంభించాయట (విజృంభించాయట) ఆ చీకట్లు. అయినా అవి తూలాయట – అంటే చెదిరి పోయాయట. ఏకారణంగా?

అక్షీణ – ఏమాత్రం తీసిపోనివి; ఉత్తంభిత – పైకి వ్యాపిస్తున్నటువంటి; శక్తిభృద్భట – కుమారస్వామి భృత్యువుల – భటుల యొక్క; సిరస్సీమాకిరీట – తలలపైనున్న కిరీటములందు; స్ఫురత్ – వెలుగొందుతున్న; మాణిక్యాతప పల్లవస్తబక సామగ్రీ (మాణిక్యమంటే కెంపు – *Ruby*) కెంపుల యొక్క ఆతప – వెలుగు, ప్రకాశము; పల్లవ – చిగురుటాకు రంగుతో ప్రకాశిస్తున్న 'స్తబకము' అంటే గుచ్ఛములనే సామగ్రిచేత హృతాగ్రంబులై పోగొట్టబడిన కొనలు గలవియై; తూలెన్ – చెదరిపోయినవి.

కుమారస్వామి సేనల పదఘట్టనలకు నేలనుంచి లేచిన నల్లని కాటుక పొడివంటి దుమ్ము సూర్యకాంతిని హరించివేసి లోకాన్ని చీకట్లలో ముంచినప్పటికీ, ఆ సైన్యం ధరించిన కిరీటాలలోని కెంపుల కూర్పునుండి వెలువడిన కాంతిచే ఆ చీకట్లు పారద్రోలబడ్డాయి.

## అప్సరసలు

ఆ తరువాత సుబ్రహ్మణ్య స్వామిని దేవవేశ్యలు (అప్సరసలు) పూజించారట.

క॥ స్మరశశి తటిదజ పవమా
న రవి సుధా సలిల మునిజన క్ష్మారిష్టా
సురమృత్యు జ్వలనజలగు
సురవేశ్యలు కొలిచిరపుడు సుబ్రహ్మణ్యున్. (పాండురంగ మాహాత్మ్యం : 1-167)

ఈ చిన్న పద్యంలో రంభ, ఊర్వసి, మేనక, తిలోత్తమ, ఘృతాచీ వగైరా స్వర్వేశ్యలు లేక సురవేశ్యలు (అప్సరసలు) ఎవరెవరికి పుట్టారో తెలుపుతున్నాడు కవి.

వారు పధ్నాలుగు జాతుల సంతానమట. అవి –

1) స్మర - మన్మథుడు; 2) శశి - చంద్రుడు; 3) తటిత్ - మెరుపు; 4) అజ - బ్రహ్మ; 5) పవమాన - వాయువు; 6) రవి - సూర్యుడు; 7) సుధా - అమృతము; 8) సలిల - నీరు; 9) మునిజన - మహర్షులు; 10) క్ష్మా - భూమి; 11) అరిష్ట - దక్షప్రజాపతి కుమార్తెలలో ఒకతె. ఈమె పదమూడు మంది అప్సరసలను కన్నదట. 12) సుర - దేవతలు; 13) మృత్యు - మృత్యువు; 14) జ్వలన - అగ్ని - జలు; వీరందరికీ పుట్టిన వారు.

బాణభట్టు 'కాదంబరి' అనే సంస్కృత కావ్యంలో పేర్కొన్న పద్నాలుగు జాతులే యివి. ఇక్కడ యీ అప్సరసల గురించి, భారతీయులలోనున్న కొన్ని విశ్వాసాలు పేర్కొనడం ఉచితమని భావిస్తాను. ఈ స్త్రీ దేవతలు ఆకాశంలో నివసిస్తారట; వీరు గంధర్వులకు భార్యలట; కామరూపులట; స్నాన ప్రియులట; అతీంద్రియ శక్తులు గలవారట. సహజంగా వీరు ఇంద్రుని సేవకులుగా చెప్పబడ్డారు. గొప్ప మునులు ఇంద్రపదవినో, అమరత్వాన్నో, స్వర్గలోకాధిపత్యాన్నో కోరి తపస్సు చేస్తూంటే ఇంద్రుడు ఆ తపస్సును భగ్నంచేయడానికి అప్సరసలను పంపుతుంటాడు. వారు తమ అందచందాలతో ఆ మునుల్ని - వారెంత గొప్పవారైనా సరే - చలింపజేసి వారి తపస్సును భంగంచేసేస్తారు. రణరంగంలో వీరమరణం పొందిన వీరులతో అప్సరసలు కూడతారని ఓ విశ్వాసం. ఇటువంటి విశ్వాసమే గ్రీకు, రోమన్ వీరుల విషయంలో కూడా వుండడం విశేషం. ఇంద్రుడిని 'అప్సరపతి' అంటారు. అద్భ్యః సరంతీతి అప్సరసః - అమరం; జలమందు పుట్టినవారు. వీరు క్షీరసాగర మథనమప్పుడు పుట్టారంటారు. కొందరు అప్సరసలంతా కశ్యపప్రజాపతి సంతానమని చెపుతారు.

దక్షిణాన సామిమలనుండి ఉత్తరాన కైలాస పర్వతం వరకు వారధి కట్టినట్లు ఆ మహాసేనుడి (దేవసేనాని కుమారస్వామి యొక్క) సైన్యాలు నడుస్తూంటే భూమ్యాకాశముల మధ్య భాగము సందు లేనిదై వారి పదఘట్టనలతో పుడమిపైనున్న గిరి (పర్వతములు) సింధు (నదులు) వన (అడవులు) సృష్టి అంతా అదగి (అణగి) పోతున్నదట. వారి తొక్కుడుకు కొండలు పిండి పిండిగానూ, నదులు దుమ్ముతోనిండి నిర్జలములై, అడవులు నామరూపాలు లేకుండాసూ నశిస్తున్నాయట.

## కైలాసగిరి వర్ణన

కైలాస పర్వతాన్ని సమీపిస్తూంటే కుమారస్వామికి కైలాస పర్వతము తన తండ్రియైన శివునివలె కనుపిస్తున్నదట. కైలాసగిరి సమీపిస్తున్న కొద్దీ వారికి ప్రాణాలు లేచివస్తున్నాయట.

క॥ జైవాతృక బింబము నిజ
జీవాతువుఁ గాంచి ప్రాప్త జీవములగుచున్
జీవంజీవము లలరెడు
భావంబున బాహులేయు బలములు పొదలెన్ **(పాండురంగ మాహాత్మ్యం : 1-174)**

జీవజీవములన్నా, జీవజీవకములన్నా, జీవంజీవములన్నా చకోరపక్షులు. చకోరపక్షులు వెన్నెల మాత్రమే భుజిస్తాయని మన పూర్వుల విశ్వాసం. అవి ఆ వెన్నెలకోసం ఎన్నాళ్లైనా వేచి చూస్తాయట. (చూ. అనుబంధం - 6) జైవాతృకుడు అంటే చంద్రుడు; జీవాతువు అంటే జీవగర్ర, జీవనౌషధము; నిజ జీవాతువు - తమ జీవనౌషధమైన; జైవాతృక బింబము - చంద్రబింబమును; కాంచి - చూచి; ప్రాప్తజీవంబులగుచున్ - కొడిగట్టి పోయిన ప్రాణాలు తిరిగి వచ్చాయా అన్నట్లు; జీవంజీవము లలరెడు భావంబున - చకోరపక్షులు సంతోషించు విధమున; బాహులేయు బలములు - కుమారస్వామి సైన్యాలు; పొదలెన్ - సంతోషించెను.

శివుని వాహనమైన నందీశ్వరుని గిట్టలనే గొడ్డళ్ల దెబ్బలకు ఆకాశానికెగసిన ఆ వెండికొండ రాళ్ల తెల్ల దుమ్ము నిత్యం శివుని సమీపంలో తిరుగాడే సప్తర్షులకు నిర్యత్నవిలసిత భసితము (ప్రయత్నము చేయకుండా లభించే భస్మము)గా దొరకుతుందట. (కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు, జమదగ్ని అనే ఏడుగురు సప్తఋషులని ప్రసిద్ధిగాంచారు).

శివుని యింటిని ఆనుకొనివున్న పూదోటలో శివపార్వతులు విహరిస్తూన్నారట. అందున్న ప్రతి వృక్షమూ శివుణ్ణి తన పూలతో పూజించగోరిందో - ఏమో మరి, అక్కడ ఆరు ఋతువులూ ఒక్క సన్నిధి అయ్యాయట. అంచేత, ఆయా ఋతువులలో పూసే పూలన్నీ ఆ వృక్షాలపై ఏకకాలంలో కనుపించాయట. కనుక తేఁటులు వివిధ ఋతువులలో దొరికే సౌరభాన్నీ, పుప్పొడినీ, పూఁదేనెనూ ఆ తోటలో ఒకేసారి సంగ్రహిస్తున్నాయట.

అవి (వసంత ఋతువులో మాత్రమే లభ్యమయ్యే) మరువపు పరిమళమును గ్రోలి అరమూత కన్నుల్తో పరవశిస్తున్నాయట. (శిశిర ఋతువులో లభించే) అరవిరిసిన తెలి మొల్ల పూవులను కొన్ని తేటులు గుమిగూడి రెక్కలతో కప్పుతున్నాయట. (హేమంత ఋతువులో విరగబూసే) గురువింద పూఁదేనె కోసం తమలో తాము కలహించుకుంటున్నాయట మరికొన్ని తుమ్మెదలు. కొన్ని తుమ్మెదలు (గ్రీష్మ ఋతువులో పూసే) మల్లికలు ఎప్పుడెప్పుడు వికసిస్తాయా - అని ప్రతీక్షిస్తూ కాచుకు కూర్చున్నాయట. (వర్ష ఋతువులో మాత్రమే పూసే) గేదంగి (మొగలి) పువ్వు భోగి వశమైపోయిందే (భోగి అంటే పాము అనీ, అనుభవించువాడు అనీ అర్థాలు; మొగలి పువ్వు పాముకు వశమయ్యిందనో లేక అనుభవించు మరియొకనికి వశమైపోయిందనో) అని విచారిస్తాయట మరికొన్ని తుమ్మెదలు. పాములు ముఖ్యంగా మిన్నాగులు పరిమళానికి ఆకర్షించబడి మొగలి పొదలలో చేరతాయట. ఇక మరి ఆ పూల చాయలకు కూడా తేఁటులు చేరలేవు కదా! (శరదృతువులో మాత్రమే పూసే) బంధుజీవక లతాంత గుచ్ఛముల (మంకెనపూల గుత్తులలో) కొన్ని తుమ్మెదలు కొలువు చేస్తున్నాయట. అలా సమస్త ఋతువులతో కూడిన ఆ వనమును తుమ్మెదలు ఆక్రమించాయట. ఇలా (1-181) పద్యంలో ఋతువును పేర్కొనకుండా ఆయా ఋతువులలో లభించే పుష్పసంపద ద్వారా ఆయా ఋతువులను సూచించడం కవి చమత్కృతి. కవి బహుముఖ ప్రజ్ఞకిదొక మచ్చుతునక.

కవి 182 నుండి 185 వరకు గల పద్యాలలో ప్రకృతి శోభను రమణీయంగానూ, 186 నుండి 192 వరకు గల పద్యాలలో శివపార్వతుల కామకేళీ విలాసాలను రసరమ్యంగానూ వర్ణించాడు. శృంగార, సౌందర్య, అలంకార శాస్త్రాలలో రామకృష్ణకవి ఎంతటి చతురుడో ఆ పద్యాలు మనకు తెలుపుతాయి. ప్రతి పద్యమూ ఓ రసగుళిక. స్థలాభావంచేత వాటి విశేషాల్ని ప్రత్యేకించి పేర్కొనలేకపోతున్నాను.

ఆ తరువాత పార్వతీదేవి శివుడిని క్షేత్రము, తీర్థము, దేవత - యీ మూటికీ సమాన ప్రాధాన్యతగల ప్రదేశమేదో వివరించమని కోరగా శివుడు విష్ణు కథలు చెప్పుటయందిష్టము కలవాడై పార్వతితో "మంచి ప్రశ్నే అడిగావు. దీనిని సవివరంగా సమర్మముగా (రహస్యములతో కూడా) వినిపిస్తాను. విను" అనునంతలో అంతఃపుర సేవకులువచ్చి "అగస్త్యాది మునులతో కూడి, కుమారస్వామి తమ దర్శనార్థమై వచ్చాడు. వారిక్కడకు రావచ్చునా?" అని అడిగారు. సరే - రమ్మన్నాడు శివుడు.

అప్పుడు కుమారస్వామి అప్పటి వరకు తననోటనున్న వీడియము (తాంబూలము)ను ఉమ్మివేసి, నీటితో బాగుగా పుక్కిలించివేసి, పల్లెవాటుగా వేసుకొన్న పట్టు పై పంచెను తీసి నడుముకు చుట్టుకొని, తండ్రికివ్వడానికి తాను తీసుకొనివచ్చిన బహుమానాన్ని అప్పటివరకూ మోసుకొని తెస్తూన్న పిల్లవాడి చేతినుండి తానే తీసి పట్టుకుని, ముందుగా పెద్దలగు అగస్త్యా

ృది మునులను లోనికి పంపి, ఆ తరువాత తాను లోపలికి వెళ్లాడు. తననుచూచి ద్వారముల ప్రక్కననున్న వేదికలపై నుండి లేచి నిలిచి నమస్కరిస్తున్న వృద్ధ దౌవారికుల వంక గౌరవ పురస్సరంగా నవ్వులొలుకుతూ చూసి లోనికి వెళ్లాడట. ఇలా రామకృష్ణకవి పెద్దల దర్శనానికి వెళ్లేటప్పుడు మనం ఏయే జాగ్రతలు తీసుకొనాలో కుమారస్వామి ప్రవర్తన ద్వారా పాఠకులకు తెలిపాడు.

లోనికి వెళ్లిన సుబ్రహ్మణ్యస్వామి తండ్రికి శిరస్సు వంచి పాదాభివందనం చేశాడు. అగస్త్యాది మునులనూ, తన ప్రియకుమారుడినీ శివుడు ఎంతగానో మర్యాదచేశాడు. తన వద్దకు వారంతా వచ్చిన కార్యమేమిటని అడిగాడు. వారది తెలుపగా శివుడు "మీ తల్లి పార్వతి కూడా ఆ విషయమే వివరించమని యింతకుముందే అడిగింది. మీరూ అదే అడుగుతున్నారు. సావధానంగా వినండి. 192 కోట్ల సంవత్సరాలకు పూర్వం మొదటి మనువు కాలంలో జరిగిన కథ యిది (మనువులు 14 మంది. ఇది మొదటి మనువు కాలంలో జరిగింది. మనమున్నది వైవస్వత మన్వంతరంలో). నే చెప్పబోయేది మూర్ఖునకు, నాస్తికునకు (నాస్తికో వేదనిన్దకః - వేద ప్రామాణ్యాన్ని అంగీకరించనివాడు నాస్తికుడు) పాషండునకు (వేదవిరుద్ధాచరణములు కలవానికి) హేతువాదికి పొరపాటున కూడా చెప్పవద్దు. వారికిది పరమగోప్యము. జాగ్రత" అంటూ శ్రోతలను హెచ్చరించి కథ ప్రారంభం చేశాడు శివుడు.

## కథా ప్రారంభం - విట్ఠలయ్య స్తుతి

ముందుగా (మహారాష్ట్రలోని పండరీపురంలో వెలసిన) విట్ఠలాధీశుడనబడిన కృష్ణావతార విష్ణువును మదిలో తలచుకున్నాడు శివుడు.

సీ॥ వెడద కన్నులవాని వేయినామములవాని వ్రేఁతల వలపించు వెరవువానిఁ
జిప్పకూఁకటివానిఁ జిన్ని నవ్వులవానిఁ జెరివిన మంచి పింఛియమువానిఁ
బులుగుతత్తడి వానిఁ బొడవుల తుదవానిఁ బొక్కిటి వెలిదమ్మి పూవు వాని
మినుకుటూర్పులవాని మిసిమి మేఁతలవాని మెఱుఁగుఁజామనిచాయ మేనివాని

తే॥ దిస్సమొలవానిఁ బసిఁ గానఁ ద్రిప్పువాని
మురళిగలవాని మువ్వంక మురువువాని
విట్ఠలాధీశుఁ దలఁచి తద్విపులమహిమ
నొడువుఁ(బ్రా)మర్రి క్రీనీడ విడిది ప్రోడ. (పాండురంగ మాహాత్మ్యం : 1-213)

వెడద కన్నులవానిని అంటే విశాలమైన కన్నులు కలవానిని; వేయి నామములవానిని - సహస్రనామములు కలవానిని (మహాభారతంలో విష్ణుసహస్రనామములు పేర్కొనబడ్డాయి); వ్రేఁతల వలపించు వెరవు వానిని - గొల్లస్త్రీలను ప్రేమింపజేసే ఉపాయము తెలిసిన వానిని; ('వ్రే' అంటే గొల్ల - వ్రేపల్లె అంటే గొల్లపల్లె; వ్రేడు అంటే గొల్లవాడు) చిప్పకూకటివానిని - కాకపక్షమని పిలువబడే పిల్ల జుట్టు నుదుటిపై కలవానిని; చిన్ని నవ్వులవానిని - అందమైన నవ్వులు కలవానిని; చెరివిన - దోపిన; మంచి అందమైన పింఛియము వానిని - చక్కని నెమలి పింఛము కలవానిని; పులుగుతత్తడి వానిని - పక్షి వాహనముగా కలవానిని - తత్తడి అంటే వాహనము - అందుకే శుకవాహనుడైన మన్మధుడిని 'చిలుక తత్తడి

రౌతు' అంటారు. ఇంకా పులుగు వాహనముగా కల దేవతలెందరో వున్నారు. అందుకని విష్ణువును 'రాపులుగు తత్తడి' అనడం మరింత సమంజసం. రాపులుగు అంటే కంకము లేక గరుడపక్షి (*eagle - Haliaeetus leucocephalus*). పొడవుల తుదవానిని – ఉన్నతములకంటే ఉన్నతుడైనవానిని; పొక్కిటి – నాభియందు; వెలి – తెల్లని; తమ్మిపూవువానిని – తామరపూవు కలవానిని; మినుకుటూర్పులవానిని – 'మినుకు' అంటే వేదము; వేదము ఊర్పులుగా (నిశ్వాసములుగా) కలవానిని; మిసిమి మేఁతలవానిని – వెన్నతినేవానిని; మెఱుఁగుఁజామనచాయ మేనివానిని – మెరిసే నల్లనిచాయగలదేహము కలవానిని; దిస్సమొలవానిని – దిగంబరుని; పసిన్ – గోగణమును; కానన్ – అడవియందు (మేతకై) త్రిప్పువానిని; మురళిగలవాని – వేణువు కలవానిని; ముప్వంకమురువు వానిని – మురువు అంటే సౌందర్యము. శ్రీకృష్ణుడు మూడు వంకరలుగా నిలబడడం చేత అందము గూర్చువాడట. ఇలా నిల్చొనడాన్నే త్రిభంగి అంటారు; తద్విపులమహిమన్ – ఆ విఠ్ఠలాధీశుని గొప్ప మహిమను; ప్రామఱ్ఱి క్రీనీడ – ప్రాతమఱ్ఱిచెట్టు క్రింది నీడలో; విడిది – నివాసముగా కల; ప్రోడ – ప్రోడ అంటే వివేకి – వివేకియైన శివుడు; నొడువున్ – చెప్పును. (కైలాసంలో ఓ పురాతన మర్రిచెట్టు నీడలో సర్వజ్ఞుడైన శివుడు దక్షిణామూర్తి రూపంలో మునిజనులకు, ప్రమథగణాలకు హితోక్తులు చెబుతాడట. అందుకనే రామకృష్ణకవి యిదే కావ్యంలోని ప్రథమాశ్వాసంలోని 101వ పద్యంలో కూడా కాశిలో మరణించినవాడు సారూప్యమోక్షంపొంది సాక్షాత్తూ శివుడే అవుతాడని చెపుతూ 'మతిలేని మేదకుండు మౌనివర్యులఁ జదివించు మఱ్ఱినీడ, పంచముఖువీట మేనోసరించెనేని' అన్నాడు. ఇక్కడ కూడా విఠ్ఠలాధీశుని విపుల మహిమను వివరించడానికి ఆ మఱ్ఱిచెట్టు క్రీనీడనే వేదికగా ఎంచుకున్నాడు శివుడు).

# పుండరీకుడు

'ఆది కల్పమునందలి పద్దెనిమిదవ ద్వాపర యుగపు చివరిభాగంలో విష్ణువు ఘర్మవీరానది భైమినదితో కలసినచోట పుండరీకుడనే ఓ బ్రాహ్మణునకు ప్రత్యక్షమై అక్కడే వెలశాడు' అని చెప్పిన శివుడు ఇక పుండరీకుని గొప్పతనాన్ని వర్ణిస్తున్నాడు. పుండరీకుడు గొప్ప వివేకి. సుగుణ సంపన్నుడు. సత్యము, దయ, ఆర్జవము (సూటితనము), శాంతి, దాంతి (బ్రహ్మచర్యము మొదలుగాగల తపఃక్లేశములకు తట్టుకొనే స్వభావము) అను గుణములచే పెంపు వహించినవాడు. చలిచీమనైనా సరే చావద్రొక్కుటకు శంకిస్తాడట. ఎన్నడూ మృషా భాషణములు (అబద్ధపు మాటలు) పలుకడట. కలుషవర్తనులున్న దాపులకు కూడా వెళ్లడట. కలిమికి పొంగిపోడట. లేమికి కలతపడడట. పరస్త్రీలను కన్నెత్తైనా చూడడట. ఎంతటి ఒడిదుడుకులు వచ్చిన సందర్భాలలోనైనా ఏమాత్రం ధైర్యం వీడడట. ఇతరుల సంపదలను చూచి అసూయపడడట. ఎంతటి నీచుడినైనా మనసులో కూడా నిందించడట. ఆకలిగొన్న వానికి అందరిలా శుష్కప్రియాలు చెప్పి మిన్నకుండడం కాక తనకు చేతనైన సాయం చేస్తాడట. సర్వ భూతములపట్లనూ దయగలిగి వుంటాడట. వేదమార్గము ననుసరించి నడచువారిలో ప్రధానుడట. ఎట్టిలోపమూలేని వేదాంత శాస్త్రవేత్తట ఆ పుండరీకుడు.

దేవగురువైన బృహస్పతితో సమానుడైన ఆ బ్రాహ్మణోత్తముడి మనస్సులో బంగారానికి కస్తూరి అలదినట్లు ఎప్పుడూ అంబుజోదర చరణారవింద సతతస్మృతి (విష్ణు పాదపద్మముల నిరంతర స్మృతి) అనే వ్యసనమేనట!

అతడు కామక్రోధములను ముందుగా అణచివేశాడట. సత్యమే చెప్పేవాడట. మితభాషణం చేసేవాడట. సాత్త్వికాహారమే తీసుకొనేవాడట – అదీ స్వల్పంగానే. శరీరంలో క్రొవ్వును పూర్తిగా తగ్గించివేశాడట. అంగాష్టకాసక్తి – అంటే అష్టాంగయోగముపట్ల తనకున్న ఆసక్తిని హవణు పరచాడట. హవణు పరచడమంటే అలంకరించడం. అంటే అష్టాంగయోగంపట్ల తనకున్న అనురక్తే అలంకారమన్నట్లు భాసిల్లాడట. ఈ 'హవణు' అనే శబ్దం కూడా కన్నడభాషా

జనితమే. అష్టాంగయోగము అంటే పతంజలి మహర్షి యొక్క 'యోగ సూత్రముల'లో చెప్పబడిన ఎనిమిది అంగముల చిత్తవృత్తి నిరోధ మార్గము. ఆ ఎనిమిది అంగములు యివి : 1) యమము 2) నియమము 3) ఆసనము 4) ప్రాణాయామము 5) ప్రత్యాహారము 6) ధారణము 7) ధ్యానము 8) సమాధి.

పుండరీకుడు తత్త్వజ్ఞుడై ముప్పదిరెండు తత్త్వాల్నీ తెలుసుకున్నాడట. మన పూర్వీకులు చెప్పే 32 తత్త్వాలు యివి : 1) ప్రకృతి, 2) మహత్తు, 3) అహంకారము, 4) నుండి 14) వరకు - ఇంద్రియములు పదకొండు - అనగా ఐదు జ్ఞానేంద్రియములు + ఐదు కర్మేంద్రియములు + మనస్సు; 15) నుండి 19) వరకు - పంచభూతములు - భూమి, అగ్ని, నీరు, గాలి, ఆకాశము; 20) నుండి 24) వరకు - పంచవిషయములు; 25) జీవుడు, 26) పరమాత్మ, 27) నుండి 32) వరకు - షట్చక్రములు - మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞాఖ్యము; మనస్సును సత్త్వసంపదతో స్వాధీనము పొందుంచుకున్నాడట. వివిధ ముద్రలు, ఆసనములతో శరీరాన్ని శ్రమపెట్టాడట. తనలోని పాపపూరుషుని (పాపచింతనగల లోపలి పురుషుని) పారద్రోలాడట. (ప్రతి మనిషిలోనూ పాపంచేయమని లోపలినుండి ప్రోత్సహించే పురుషుదుంటాడని విశ్వాసం. అతడే పాపపూరుషుడు లేక పాపపురుషుడు) పుండరీకుడు మూలాధారమున గుహారూపమందున్న బిలిలో కుండలీస్థానములోనున్న శేషుని తత్త్వమును, విష్ణుతత్త్వమునకు మూలమగు బీజాక్షరములు, అధిదేవతలు, దళములు అనువాని తత్త్వమును బాగుగా ఎరిగినవాడట. అతడు మంత్రరహస్యములను, హఠయోగ, రాజయోగ రహస్యములను బాగుగా ఎరిగినవాడట. తన మనోనేత్రంలో తన హృదయాబ్జంలో వున్న తుమ్మెదవంటి పార్థసారథిని చూసుకుంటూ లోలోపలే పరవశమయ్యేవాడట.

పద్మములవంటి కన్నులు, పొడవైన మొగ్గవలెనున్న ముక్కు, అతసీసూనసవర్ణ వర్ణము - అనగా నల్ల అవిసె పూలరంగుతో సరియగు దేహకాంతిగలవాడైన విష్ణువు స్వరూపం పెట్టెవలె దిట్టమైన పుండరీకుని మనస్సులో ప్రకాశించిందట. విష్ణువు అన్నీ వదలి తన భక్త శ్రేష్ఠుడైన పుండరీకుడిని ఎలా ఆశ్రయించాడో చెపుతున్నాడు కవి.

శ్రీ మహావిష్ణువు మునిజనమానసుడు. ఆయన నివాసం ఎప్పుడూ సనకసనందనాది మునుల మనసుల్లోనే. అయినా ఆ నెలవు విడచిపెట్టాడట. లోకాన్ని ఉద్ధరించడానికి ఎన్నో అవతారాలెత్తాడు విష్ణువు. అలా అవతారాలు ఎత్తే మహిమనుకూడా మరచి వదలివేశాడట. ఒకప్పుడు (మత్స్యావతారమెత్తినప్పుడు) శింశుమారాకృతిని స్వీకరించడం మూలంగా - జలచరరూపం ధరించడం కారణంగానేమో - జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజోరూపములైన ఆరు వైకుంఠములలో విహరించడం కూడా మానేశాడట విష్ణువు. పాలసముద్రం మధ్యనున్న శ్వేతద్వీపంలోని రత్నాద్రిలోని గుహలో నివసించాలనే కోరికనుకూడా వదలివేశాడట.

మరి ఎక్కడికి చేరాడు ఆ మహావిష్ణువు?

పుండరీకుని మానసాంభోజపీఠి (పుండరీకుని మనస్సనే పద్మములోని సింహాసనంపై) గండుతుమ్మెదయై నిండుగా కొలువున్నాడట.

సమాధిలో ఉన్నంతసేపూ అంతర్నయనంతో కృష్ణుని మీదే మనస్సును లగ్నంచేసే పుండరీకుడు సమాధినుండి బయటకురాగానే తల్లిదండ్రుల పాదసేవకే అంకితమైపోతాడట.

సీ॥ తనువుతోఁ జరియించు ధర్మదేవతవోలె మెలఁపున పనవాటిఁ గలయఁ దిరిగి
గణన మీటిన శార్ఙ్గి గుణములు హృదయసంపుటి నించుక్రియ విరుల్ బుట్టిఁ బెట్టి
తనకుఁ బవిత్రవర్ధనమె కృత్యం బనుకరణి నూతన కుశోత్కరముఁ గూర్చి
యపవర్గ ఫలసిద్ధి హదనైనఁ జేపట్టు కైవడి బహుఫలోత్కరము లొడిసి

తే॥ యోగయాగంబు సలుపుచో నూర్మి పశు వి
శసన మొనరించుటకు యూపసమితిఁదెచ్చు
భాతి సమిధలగొని మహాప్రాజ్ఞుడతఁడు
వచ్చు లేఁబగటికి నిజావాసమునకు (పాండురంగ మాహాత్మ్యం : 2-17)

తనువుతోఁ జరియించు ధర్మదేవతవోలె - నడయాడే సశరీర ధర్మదేవతా అన్నట్లున్న ఆ పుండరీకుడు మెలపుఁన - మెలకువతో (వేకువనే); వనవాటి కలయఁదిరిగి - అరణ్యభూములన్నీ తిరిగి తిరిగి; గణన మీరిన - లెక్కకు మించిన, అసంఖ్యాకమైన; శార్ఙ్గి గుణములు - విష్ణువు గుణములు (శార్ఙ్గి అంటే విష్ణువు. శార్ఙ్గము అనే విల్లును ధరించినవాడు). హృదయసంపుటి నించు క్రియ - హృదయమనే పెట్టెలో నింపుతున్నాడా అన్నట్లు; విరుల్ బుట్టిఁబెట్టి - పూలనుకోసి బుట్టలోనింపి; తనకుఁ బవిత్రవర్ధనమె కృత్యంబను కరణి - పవిత్రముగా పెరుగుటయే తన విధి అన్నట్లుగా; నూతన కుశోత్కరముఁగూర్చి - క్రొత్తగా మొలిచిన దర్భతృణాల రాశిని సేకరించి; అపవర్గ ఫలసిద్ధి - మోక్షమనే పండు లభించడం; హదనైన చేపట్టుకైవడి - అదను (లేక) అవకాశము వచ్చిన వెంటనే చేపట్టునట్లు; బహుఫలోత్కరములొడిసి - అనేక పండ్ల రాశులను కోసికొని; యోగయాగంబుసలుపుచో - యోగయాగము చేయనున్నాడా అన్నట్లు; (బలిపశువును యూపస్తంభమునకు కట్టేసి బలియిచ్చే యజ్ఞము శ్రౌత యజ్ఞము. అయితే యిక్కడ పుండరీకుడు జంతుబలి ప్రసక్తి లేకున్నా షడూర్ముల బలితోకూడిన యోగయాగము చేయతలపెట్టాడా అన్నట్లు) ఊర్మి పశువిశసన మొనరించుటకు - షడూర్ములు అనే ఆరు ఊర్ములను వధించుటకా అన్నట్లు; (1. క్షుత్ - ఆకలి, 2. తృష్ణ (లేక) పిపాస - కోరిక, 3. శోక - దుఃఖము, 4. మోహ - అజ్ఞానముతో కూడిన వలపు, 5. జర - వృద్ధాప్యము, 6. మరణము - చావు. ఈ ఆరింటిలో క్షుత్పిపాసలు సూక్ష్మశరీరాన్ని అంటివుంటాయి. జరామరణాలు స్థూలశరీరానికి సంబంధించినట్టివి. శోకమోహాలు కారణశరీరానికి చెందినవి. స్థూలశరీరానికి సూక్ష్మశరీరం మూలంకాగా, సూక్ష్మశరీరానికి కారణ శరీరం మూలం.) యూపసమితిఁ దెచ్చుభాతి - యూపస్తంభములుగా వాడబడు కొయ్యలు తెచ్చేవిధంగా సమిధలను తీసుకొని మహాప్రాజ్ఞుడైన ఆ పుండరీకుడు; లేఁ బగటికిన్ - లేత పగటికే - తెల్లవారి ఎక్కువకాలం కాకమునుపే; నిజావాసమునకున్ - తన యింటికి; వచ్చును.

## పుండరీకుని పితృసేవ

ఆ గృహమేధి వతంసుడు (గృహస్థులలో ఉత్తముడైన పుండరీకుడు) తానే వేయిమంది సేవకులపెట్టయి, తన భార్య ఎదురు తిరుగని బుద్ధితో సహకరిస్తూంటే, మాతాపితరులకు సకలసేవలూ చేస్తున్నాడట.

సీ॥ ఆపాదమస్తంబు నంటు నూనియగాచి స్వయముగా నుద్వర్తనంబొనర్చు
జలకమార్చు నఖంపచ స్వచ్ఛజలములఁ గడు మెదుగుడులఁ బొదివి
లఘుధౌత వసనపల్లవములు గట్టించు శిరసార్చు మృదులీల సురటి విసరి
చేయూఁత యొసఁగి వేంచేయించులోనికి ద్వారావతి గలంతిఁ దానె యొసఁగుఁ

తే॥ దెలుపు సంధ్యా సమాధి విధి ప్రయుక్తి, నగ్ని వేల్పించు విష్ణు సహస్రనామ
పార మొనరించు తతిఁదోడుపడు గురునకు, గవలు వోకుండఁబుత్రుఁడో కలుపకంటి.

(పాండురంగ మాహాత్మ్యం : 2-19)

తన పితృదేవునికి పుండరీకుడు భక్తి శ్రద్ధలతో చేస్తూన్న సేవలను గూర్చి శివుడు పార్వతితో యింకా యిలా చెపుతున్నాడు.

"కలువలవంటి కన్నులుగల ఓ పార్వతీ! తానే స్వయంగా తండ్రికి నఖశిఖా పర్యంతం అంటు నూనెతో అంటి, ఉద్వర్తనము చేస్తాడు (నలుగు పెడతాడు); నఖంపచ స్వచ్ఛజలములన్ - గోరువెచ్చని స్వచ్ఛమైన నీటితో జలకమార్చుతాడు; తరువాత - కదు మెదుగుదులఁ పొదివి - చాల మెత్తని గుడ్డలతో పట్టుకొని తడియొత్తుతాడు (ఒళ్లు తుడుస్తాడు); లఘువైనవి - తేలికైనవీ, ధౌత - తెల్లనివీ - అయిన; వసన పల్లవములు - చిగురుటాకులవంటి వస్త్రాలు కట్టిస్తాడు తండ్రికి; మృదువుగా సురటి (విసనకర్ర) వీస్తూ తలతడి ఆరుస్తాడు. చేయూతయిచ్చి లోపలికి తీసుకువెళ్తాడు; ద్వారావతి గలంతి తండ్రికి తానే యిస్తాడట. (ద్వారావతి అంటే ద్వారక. సన్నని మెడగల గిండిచెంబును లేక గలంతిని లేక గలఁతియను 'ద్వారావతి గలంతి' అంటారు. బహుశా యీ తరహా చెంబు మొదట్లో ద్వారకలోనే తయారయ్యేదేమో! ఆచమనమునకు ఉపయోగించు నీటిని దీనితో దగ్గర పెట్టుకుంటారు). తండ్రికి సంధ్య, సమాధ్యాది విధులు తానే తెలుపుతాడట. తండ్రిచేత అగ్ని వేల్పించుతాడట. విష్ణుసహస్రనామం చదివేటప్పుడు పెద్దవాడైన తండ్రి కవలుబోకుండా (తడబడి క్రమము తప్పకుండా) వుండేందుకు పుత్రుడైన పుండరీకుడు తోడ్పడేవాడట."

## పుండరీకుని విష్ణ్వర్చన, నైవేద్య సమర్పణ

ఇక ఆ పుండరీకుడు విష్ణుపూజలేవిధంగా చేశాడో కూడా వివరిస్తున్నాడు అర్ధేందు భూషణుడు.

సీ॥ అభిషేక మొనరించు నాకాశవాహినీ జననకారణ పాదజలరుహునకు
వైచుఁ దోమాలియ వైజయంతీకాంతి వలయిత వక్షః కవాటునకును
గౌశేయమర్పించుఁ గాంచనమయ పటీ పల్లవారుణ కటిబంధురునకుఁ
జందనం బలఁదు నీళేందిరాకుచకుంభ సంగికుంకుమ పంకిలాంగునకును

తే॥ రత్నహారంబు సాతు నిర్యత్నసిద్ధ, కౌస్తుభోదర్చి రభిరామకంధరునకు
ధూపకల్పన మున్నుగా దీపమిచ్చుఁ, దెఱవ!యాతడు త్రైలోక్యదీపకునకు.

(పాండురంగ మాహాత్మ్యము : 2-21)

"ఓ తెఱవా! (ఓ ఇంతీ! ఓ పార్వతీ!) పుండరీకుడు ఆకాశగంగ జననానికి కారణమైన పాద జలరుహునకు (పాదపద్మములు కలవానికి - జలరుహమంటే పద్మము) అభిషేకంచేస్తాడు; తోమాలియ - వనమాల; వైజయంతి అనే పూమాలయొక్క కాంతిచే ఆవరించబడిన తలుపువంటి రొమ్ముగలవానికి వనమాలవేస్తాడు; కౌశేయము - పట్టువస్త్రము; చిగురువంటి బంగారు వస్త్రముచే ఎరుపెక్కిన మొలచే చక్కనైనవానికి పట్టువస్త్రాన్ని అర్పిస్తాడు; నీళ (విష్ణువు భార్యలలోనొకతె), మరియు ఇందిర (లక్ష్మీ దేవియొక్క) కుచ చూచుకముల సాంగత్యముచే (రాపిడిచే) కుంకుమ అంటిన శరీరముకలవానికి మంచి గంధపు పూత పూస్తాడట పుండరీకుడు. అప్రయత్నముగా దొరకిన కౌస్తుభమణిని ధరించడం కారణంగా దాని కాంతి పుంజములచే యింపైన మెడగలవానికి రత్నహారము; చాతున్ - సమర్పించును. ఆ త్రైలోక్యదీపకుడు (మూడులోకాల్నీ వెలుగొందింపజేసే శ్రీ మహావిష్ణువు)కు ధూప దీపాల్నిస్తాడట పరమభక్తాగ్రేసరుడైన పుండరీకుడు."

ఇక పుండరీకుడు విష్ణువు కెలాంటి నైవేద్యాల్ని సమర్పించాడో చెబుతున్నాడు.

**కII నిడుదచిగురనఁటి యాకున నిడి వివిధాన్నములు భూసురుఁడొసఁగున్**
**బడిఘంట మొరయఁజేయుచు, జడనిధి తల్పునకుఁ బూర్ణసంకల్పునకున్**

**(పాండురంగ మాహాత్మ్యం : 2-22)**

పొడవైన లేత అరటి ఆకులో వివిధాన్నములు పెట్టి ఆ భూసురుడు విష్ణువుకు నైవేద్యంగా సమర్పించాడట.

అరటి (*Musa paradisiaca*) ఆకులోకూడా ఎన్నో ఔషధవిలువలున్నాయి. లేత అరటి ఆకు మరింత ప్రశస్తమైనది. పరిశుభ్రముగా వుండి రుచిపుట్టించడమేకాక లేత అరటి ఆకులో భోజనం జఠరదీప్తినీ, వీర్యపుష్టినీ యిస్తుంది. జ్వరము, శ్లేష్మపైత్యము వగైరాలననుస్తుంది. అందుకే దేవతలకు నైవేద్యాలకే కాదు తాము భుజించడానికి కూడా లేత అరటి ఆకు శ్రేష్ఠమైనదిగా భావించేవారు మన పూర్వులు.

బడిన్ – వెంబడినే; ఘంట మొరయజేస్తూ; పూర్ణసంకల్పుడైన ఆ జడనిధితల్పునకు – (జడ అంటే నీరు; జడనిధి అన్నా జడధి అన్నా సముద్రము; జడనిధి తల్పుడు – అంటే (పాల) సముద్రమే పడకగా కలవాడైన విష్ణువు). ఇలా నైవేద్యాన్ని అర్పించిన తరువాత ఘంటారావమొనర్చుట ప్రాచీనుల సంప్రదాయం. నైవేద్యాన్ని స్వీకరించమని జడనిధి తల్పంపై శయనిస్తున్న విష్ణువుకది బహుశా మేలుకొలుపేమో! **(ఇలా నైవేద్యం సమర్పించి ఘంటారావం చేయడం వైష్ణవులలోని వైఖానస, పాంచరాత్ర శాఖలలో మాత్రమే ఆచారంగా వస్తున్నది. శ్రీ వైష్ణవులలో ఈ ఆచారం లేదు. బహుశా వైఖానస (వడకలై) శాఖకు చెందిన వైష్ణవుడు కనుకనే రామకృష్ణ కవి పుండరీకుడిని వడకలై శాఖకు చెందిన ఆచారాలను పాటించే భక్తునిగా చిత్రించి వుండవచ్చునని నా అభిప్రాయం.)**

ఈ విధముగా తిరువారాధనమొనర్చి విష్ణువుకు అర్పించుటచేత పావనములైన వివిధ ఆహారపదార్థములను ఆ బ్రాహ్మణోత్తముడు తన తల్లిదండ్రులకు ప్రియము మీరగా వడ్డించేవాడట. శాల్యన్నంబులు (శాలి అనేది వరి ధాన్యములో ఒక రకం) నేతులు, వరుగులు (ఎండబెట్టిన కాయదినుసులు), చారులు, పప్పులు, అప్పడములు, తాలింపులు (తాలింపు వేసిన కూరలు), పూపములు (పూపములన్నా, అపూపములన్నా అప్పములు) పరమాన్నములు తన తల్లిదండ్రులకు కొసరి కొసరి వడ్డించేవాడట పుండరీకుడు. వారు కోరాలేగానీ, కోరితే వారికి పులిజున్ను కూడా తెచ్చి యిస్తాడా అన్నంత ప్రేమగా వారిని చూసుకునేవాడట.

తల్లిదండ్రులు చనిపోయిన తరువాత కాశికి వెళ్లి వారి అస్థికలను గంగలో కలిపి, గయలో వారికి పిండములు పెట్టాడట. పితృదేవతల ఋణము తీర్చుకొనుటకు తన భార్యవలన విశేషజ్ఞానము, అణకువ కలిగిన పుత్రులను కన్నాడట. ఇక తన వయస్సు ప్రొద్దు కొంత పడమరకు తిరిగిందట – అంటే పుండరీకునికి నడివయస్సు దాటిందన్నమాట. ఇక ఆయన భార్యాబిడ్డలను విడిచి, యిల్లు మరచి, మదిలో శేషఫణిశయనుడైన మహా విష్ణువును ప్రత్యక్షం చేసుకొనే అభిలాషతో తపస్సు చేయడం ప్రారంభించాడట.

# పుండరీకుని ఘోరతపస్సు

ఆయన తపస్సెంత ఘోరంగా ఉందటంటే –

పుండులా బాధించే చలిలో కూడా ఏ మాత్రం అలసట లేకుండా చల్లటినీటిలో గొంతుకలోతు మునిగి వుండేవాడట. ఆయన చెట్టుకొమ్మకు తలక్రిందులుగా వ్రేలాడుతూ ఘోరతపస్సు చేస్తూవుంటే పద్మంవంటి ఆయన ముఖంపై తేనెటీగలు

తుట్టెలు పెట్టినా ఆయనకు తెలిసేదికాదట. వేరునో, వెల్లంకినో (వెల్లంకి అన్నా వెల్లకి అన్నా గడ్డ లేక దుంప), కాయగూరనో, పండునో కోరకుండా ఉదరాగ్నిని కేవలం గాలిమేసి ఉజ్జగించే (పోగొట్టుకొనే)వాడట. బాధించే వడగాలి యీ చెవినుండి ప్రవేశించి ఆ చెవినుండి వెడలునట్లు తీవ్రంగా వీచగా ఉబ్బులింగములా (కరినంగా, స్థాణువుగా) తయారయ్యేవాడట. ఎండలో నడచునప్పుడైనా, అంతరాయం కలిగించే అంధకారములు అలముకొనినప్పుడైనా వెరవక తన ధైర్యమనే సూర్యోదయకాంతిలో నడచేవాడట. దానవారియైన విష్ణువునే లక్ష్యంగా చేసుకొని 'నాకు తపస్సు చేయకా తప్పదు. విష్ణువుకు ప్రత్యక్షమై వరమీయకా తప్ప'దనే దృఢ విశ్వాసంతో ఘోరమైన తపస్సు చేసేవాడట ఆ సుశ్లోకుడు – (సత్కీర్తికలవాడైన) పుండరీకుడు.

# విష్ణు సాక్షాత్కారం

ఆ తపస్సుకు గోపబాలుని హృదయం వెన్నలా కరగిపోయిందట. గోపికలతో రాసక్రీడలలో మునిగి తేలుతూన్న రాసవిహారి తన బంగారపు టందియలు ఘల్లుఘల్లున మ్రోగగా పరుగుపరుగున పుండరీకుని వద్దకు వస్తూ వున్నాడట. ఆ అందెల శబ్దం ఎలా వున్నదంటే – "ఓ శ్రీకృష్ణా! నీ పాదాలేమో శిరీష పుష్పములంతటి మృదులమైనవి. ఈ భూమి చూడబోతే రూక్షము (కరినము). ఆ సుకుమారమైన పాదాల్ని యీ కరినమైన నేలమీద యిలా అలయించుట ఏమీ బాగుండలే"దని తొలిచదువులు (వేదములు) ఆయన వెంటబడి పలుమార్లు విన్నపాలు చేస్తున్నాయా! అన్నట్లుందట.

క॥ నొదువుల పడఁతుక మగనికిఁ
బొదచూపని తనదురూపు పొడగనిపించెన్
జడనిధిశయనుఁడు కొంగున
ముడిచిన మణిగాదె భక్తముఖ్యులకెల్లన్ (పాండురంగ మాహాత్మ్యం : 2-48)

నొదువులు, నొదుగులు, నుదుగులు లేక నుదువులు అంటే విద్యలు. నొదువుల పడతుక అంటే విద్యల దేవతయైన సరస్వతి ఆమె మగడైన బ్రహ్మకు కూడా చూపించనట్టి తన స్వరూపాన్ని కృష్ణుడు ఆ భక్తాగ్రేసరునికి చూపిస్తూ పుండరీకుని ముందు ప్రత్యక్షమయ్యాడట. మరి జడనిధిశయనుడైన విష్ణువు భక్త ముఖ్యులకు కొంగున ముడిచిన మణి కాదా?

ఇక చూపులతోనే అమృతం గ్రోలుతున్నట్లు ఆ భక్త శిఖామణి నిశ్చేష్టుడై ఇందిరారమణుడిని కన్నులారా చూచాడట. అప్పుడు కృష్ణుడు పుండరీకునితో, "నీ పితృభక్తికీ, జ్ఞానశక్తికీ మెచ్చాను. నీ కోరికలు వందైనా తీరుస్తాను. వెంటనే సందేహించకుండా అడుగు" అన్నాడట.

దానికి ఆ మహాభక్తుడు హరితో – "దేవా! నీవేతప్ప మాకు వేరే దిక్కులేదు. చెడ్డ విషయముల యందలి కోరిక అనే పిచ్చిని వదలగొట్టు. అంతేచాలు" అంటూ –

సీ॥ పొదలు నీ పొక్కిటి పువ్వు కాన్పునఁగదా పెనుమాయ పిల్లలఁ బెట్టుటెల్లఁ
బొదము నీ మొదలి యూర్పుల నేర్పులనకదా చదువు సంధ్యలు గల్గి జగము మనుట
కెరలు నీ యడుగుఁదామరల తేనియఁ గదా పాపంపుఁ బెనురొంపి పలచనగుట
పొసఁగు నీ తెలిచూపు పసగదా యిది రాత్రి యిది పగలను మేర లెఱుఁగఁబడుట

తే॥ భవన ఘటనకు మొదలి కంబమునుబోలె, భువనములకెల్ల నీవాది భూతుఁడగుచు
నిట్టనిలుచున్కిచేఁగాదె నెట్టుకొనియె గెంటు గుంటును లేక లక్ష్మీ కళత్ర.
(పాండురంగ మాహాత్మ్యం : 2-55)

పొక్కిలి అంటే బొడ్డు. విష్ణువు పొక్కిటిపువ్వు అంటే విష్ణువు నాభిలోనున్న తెల్లతామర. ఆ పువ్వు కాన్పున ఉద్భవించిన వాడు బ్రహ్మ. ఈ విశ్వ సృష్టికంతా నీ నాభి పద్మం నుండి ఉద్భవించిన ఆ బ్రహ్మే కారకుడు కదా! పొడము అంటే జన్మించు. నీ మొదటి నిట్టూర్పులలో జన్మించిన వేదముల నేర్పుల వలననే కదా (వేదాభ్యాసముల వలననే కదా) ప్రజలకు చదువు సంధ్యలు అబ్బి యీ ప్రపంచం మనగలుగుతున్నది? కెరలు అంటే అతిశయించు. అతిశయించిన అందంగల విష్ణువు పాదపద్మములను కడిగిన నీరే కదా మకరందవాహిని (ఆకాశగంగ) గా ప్రవహించి నేలకు దిగి జనుల పాపపంకిలాన్ని పలుచన చేస్తున్నది? పొసగు అంటే లభించు. నీ తెలిచూపు (తేటతెల్లమైన దృష్టి) పస కారణంగానే కదా రాత్రి పగలు తేడా మేం తెలుసుకోగలుగుతున్నది. (విష్ణువు ఒక కన్ను సూర్యుడు. మరో కన్ను చంద్రుదని విశ్వాసం). “భవన నిర్మాణంలో మొదటి స్తంభంలాగా చతుర్దశ భువనములకూ నీవే ఆదిభూతుడవై నిట్టనిలువుగా నిలచియుండుటచే కాదా నెట్టుకొని (తేటపడి) యీ విశ్వం ఎటువంటి కంపము, తడబాటు లేకుండా సవ్యముగా నిరాటంకముగా సాగిపోతున్నది? ఓ లక్ష్మీపతీ!” అన్నాడు పుండరీకుడు.

## దశావతారాల వర్ణన

ఇంకా పుండరీకుడు అపార భక్తి ప్రపత్తులతో జగన్నాథుని అర్చించి తనివిదీరా విష్ణువు దశావతారాల్నీ వర్ణిస్తాడు. బ్రహ్మ నిదురిస్తున్న సమయంలో వేదాల్ని దొంగిలించిన సోమకాసురుడిని మత్స్యావతారమెత్తి వధించి వేదాల్ని తిరిగి లోకాలకు అందించడం, ముక్కోపియైన దుర్వాస మహాముని శాపమనే కనకనలాడే నిప్పుతో వెన్నుకాలునట్లుగా తపించి జలచరములకు నివాసమగు సముద్రపు సుడులలో పడినట్టిదైన (జంభాసురుని చంపిన) ఇంద్రుని రాజ్య సంపదను ఉపాయముతో యీదుటకు అనువైన సొరకాయ రూపుగలదైన పృథు కర్పరంబు (గొప్ప వీపుచిప్ప - తాబేలు)గా మారి ఆశ్రితులను రక్షించడం (కూర్మావతారమెత్తడం) ప్రళయకాలపు పెద్ద ప్రవాహములో పడిపోయిన భూమిని (వరాహావతారం)లో కోరలతో ఎత్తిపట్టి లేపి రక్షించడం, లోకాలకు శత్రువులైన రాక్షసులనే ఏనుగుల గుంపులకు అంకుశములైన వాడి కొనగోళ్లు అనే నాగళ్లతో శత్రువుల రొమ్ములనే అడవినేలను చాళ్లు ఏర్పడేటట్లు దున్ని, చిమ్మే నెత్తురుతో నీరుపెట్టి, కలమాంకురము (వరిమొక్క)ను ఇంద్రుని సంపద అనే పంటను ఆశించి నాటడం (నరసింహావతారం), బలిని దండించి జగములన్నీ నిండిపోయే విధంగా వామనుడు అపరిమితంగా పెరుగుతుంటే భూమండలం ఆ వామనుని ముందు చిన్న మచ్చలా ప్రకాశించడం వర్ణించాడు.

ఆ తరువాత పరశురామావతారాన్ని యిలా వర్ణిస్తున్నాడు!

ఉ॥ మాతృకఠోరకంఠబిల మార్గగళద్రుధిరారుణాననం
బై తలకొత్తు దోఃపరశుహంసికి మేఁత యొసంగవే రిపు
క్ష్మాతలనాథ మేచక కచాకుచహార మృణాళనాళ సం
ఘాతము నూతనైణ మదకర్దమ వర్ధన సంప్రభూతమున్ (పాండురంగ మాహాత్మ్యం : 2-61)

తన తండ్రియైన జమదగ్ని ఆజ్ఞమేరకు తల్లి రేణుకాదేవిని వధిస్తాడు పరశురాముడు. హైహయవంశానికి చెందిన కార్తవీర్యార్జునుడు తన తండ్రియైన జమదగ్నిని అకారణంగా చంపినందుకు పగతో ఇలాతలం పైనున్న క్షత్రియులందరినీ చంపి ఇరవై ఒక్కమారులు ప్రపంచాన్నంతా నిక్షాత్రం చేస్తాడు. కురుక్షేత్రంలో తవ్వించిన ఐదు మడుగులను వారి రక్తంతో నింపి దానితో పితృతర్పణ చేస్తాడు. ఇదీ క్లుప్తంగా పరశురామావతార గాథ. దీనినే రామకృష్ణకవి ఎంతటి నేర్పరితనంతో వర్ణించాడో చూడండి.

తన తల్లియొక్క కఠోరమైన కంఠంనుండి చిమ్మిన ఎర్రని నెత్తురుతో తడిసినట్టి ముఖముగలదైన (అంచుగలదియైన) పరశురాముని చేతిలోని తళతళ మెరిసే గొడ్డలిని ఒక ఆడ హంసతో పోల్చాడు. (హంస ముఖం - నోరు - ఎర్రగానే వుంటుంది గదా!) ఆ ఆడహంసకు పరశురాముడు వేటిని ఆహారంగా వేశాడట? శత్రురాజుల భార్యల నల్లని తలవెంట్రుకలు, కుచములపైనుండే హారములు అనే తామరతూళ్ల సమూహాన్నట! (మృణాళనాళములు అంటే తామర తూడులను హంసలు అతి యిష్టంగా తింటాయట) ఇంకా ఆ తామర తూడు లెక్కడ పెరిగినట్టివట? నూతనైణమదము - కర్దమము అంటే బురద. ఏణము అంటే పెద్దకన్నులుగల నల్లజింక. ఆ జింక మదము - అంటే దాని నాభి నుండి పుట్టిన తాజా కస్తూరి. అంటే ఆ తామరతూళ్లు కొత్త కస్తూరి అనే బురదలో పెరిగినట్టివట. పరశురాముని చేతిలోని రక్తముఖియైన గొడ్డలి అనే ఆడ హంసకు శత్రురాజుల భార్యల నల్లని శిరోజాలు, వారి కుచములపైని హారములు, వారు వాడిన కొత్త కస్తూరి - అనే బురదలోపుట్టి పెరిగిన తామర తూడులే ఆహారమట. రాజుల భార్యల శిరోజాలు, వారి కుచములపైని హారాలు వగైరా అలంకారాలు వారి భర్తలు మరణిస్తే తీసేస్తారుగదా! అదే విధంగా భర్తలు మరణించిన ఆ రాణులిక కస్తూరి రాసుకోరుగదా! పరశురాముని చేతి గొడ్డలి అనే హంస రాజుల భార్యల శిరోజాలు, హారాలు అనే తామర తూళ్లనూ, వారువాడే కస్తూరి అనే బురదలో పెరిగినట్టివైన తామర తూళ్లనూ హరించివేసిందంటే తన గొడ్డలి అనే హంస ఆ రాజుల వధ చేయడం కారణంగా రాణులకు వైధవ్యం సంప్రాప్తించిందని చమత్కారంగా సూచిస్తున్నాడు రామకృష్ణకవి.

దారుణ బాణపాతంతో దశముఖుని సంహరించడం కారణంగా బృందారకుల (దేవతల) హృదయ సరోజములను వికసింపజేసినవాడని రామావతారాన్ని వర్ణిస్తాడు.

బలరాముడిని ఆదిశేషుని అవతారమంటారు. ఒక చక్కటి పద్యాన్ని బలరాముని పరంగానూ, ఆదిశేషుని పరంగానూ శ్లేషాత్మకంగా చెప్పాడుకవి. వంకరగా ఎత్తబడిన నాగళ్ల వంటి పడగల గుంపుచే ప్రకాశించు దేహము గలదీ, కుబుసము విడచుటచే భయానకమైనదీ (కుబుసము విడిచిన తరువాత తాచు పాములు అతి తీక్షణంగా వుంటాయని మనమెరిగినదే), వికారమై, వేగముగల విషము గలదీ, నిప్పులను వెదజల్లే వాడిచూపులు గలదీ, కొవ్విన శత్రువుల ప్రాణ వాయువును హరించి వేసేదీ (పాము వాయువును భక్షించే వాతాశనమేగదా!) నైన శేషుడనే పామునూ, యివే వర్ణనలను బలరామునికి అన్వయిస్తూనూ చెప్పాడు.

ఇక బుద్ధావతార వర్ణన ఎలా చేశాడో చూద్దాం -

(ద్వాపరయుగంలోని కృష్ణుడే అనంతర కాలంలో బుద్ధుని అవతారమెత్తాడని కవి భావన)

బౌద్ధులు శిరోముండనం (తలవెంట్రుకలను గొరిగించుకొనడం) కాకుండా ప్రతిదిన కేశలుంచనం (ప్రతిరోజూ తలవెంట్రుకలను పీకివేసుకొనడం) చేస్తారు. ఈ కారణంగా తలపైని చర్మం (*scalp*) పుతపుతమంటూ బాధతో దిమ్మెక్కుతుంది. "అటువంటి బోడితలపై నీ వద్ద నున్న శాశ్వతమైన సొమ్ము(నగ)యైనటువంటి నెమలి పింఛమును ఎలా ధరిస్తావు? అలాగని దానిని విడచి పెట్టనూలేవు. అంచేత, ఓ సౌగతమతధుర్యా! (సుగతుడు అంటే బుద్ధుడు. సౌగతమతమంటే

బౌద్ధమతం. 'సౌగతమతధుర్య' అంటే 'బౌద్ధమత భారమంతా భుజస్కంధాలపై వేసుకుని మోసేవాడవైన ఓ బుద్ధా' అని అర్థం) ఆ పింఛమును (వస్త్రమునకు బదులుగా) నీ కటికి (నడుముకు) ఆచ్ఛాదనగా కట్టుకో. నీకిక మొలబట్టతో పనేముంది?" అంటాడు కవి చమత్కారంగా.

కలికాలమనే చలికాలంలో పరిమళయుతమైన పుష్పాలన్నీ రాలి భూమండలమనే అడవిని కప్పివేసి (ఆవరించి) మందత్వమనే గాలి వీస్తూవుంటే ; అలరులకారు లీలన్ - 'అలరు' అంటే పుష్పం. 'అలరులకారు' అంటే వసంతం. (వసంతకాలము పలె) నీ (కల్కి) యొక్క రాకతో రోషపాటలములైన (కోపముచే ఎరుపెక్కిన) నీ కనుంగడల దాలు (నీ కడకన్నుల కాంతి) చిగురాకు ఎఱ్ఱదనాన్ని కూడా పరిహసిస్తుంది. అంటె అంతటి రోష భీకరంగా వుంటుందన్నమాట కలికాలమనే చలికాలం తరువాత వచ్చే వసంతకాలమనే కల్కిరూపు.

ఇలా రామకృష్ణకవిచే వర్ణించబడిన విష్ణువు దశావతారములలో కృష్ణావతారం లేకపోవడం చిత్రమైన విషయం - పైపెచ్చు రామకృష్ణకవి శ్రీ కృష్ణ భక్తుడుకూడా అయిన నేపథ్యంలో! ఈ కావ్యంలోనే కాదు - మనం ముందు సమీక్షించే 'శ్రీ ఘటికాచల మాహాత్మ్యము' అనే కావ్యంలోకూడా రామకృష్ణకవి నృసింహుని స్తుతించే మహర్షుల దండకములో దశావతారములలోని శ్రీ కృష్ణావతారాన్ని వదలివేయడం విచిత్రం ఎక్కడ కూడా వరుసగా 1) మత్స్య, 2) కూర్మ, 3) వరాహ, 4) నృసింహ, 5) వామన, 6) పరశురామ, 7) శ్రీరామ, 8) బలరామ, 9) బుద్ధ, 10) కల్కి అవతారాలను మాత్రమే కవి ప్రస్తావించాడు ఇంకా చిత్రమైన విషయమేమంటే రామకృష్ణకవికి సమకాలికుడైన శ్రీ కృష్ణ దేవరాయలు తన 'ఆముక్త మాల్యద' కావ్యంలో శ్రీకృష్ణావతారాన్ని కూడా కలుపుకొని మొత్తం 11 అవతారాలను వర్ణించాడు (ఆముక్తమాల్యద 4-17 నుండి 4-31) 'దశావతారములు' అన్న నియమాన్ని నిలబెట్టడానికి వైష్ణవేతరులైన స్మార్తులు బలరామావతారాన్ని దశావతారాల నుండి తీసివేశారు అయితే బలరాముడు ఆదిశేషుని అవతారమని ప్రశస్తి వైష్ణవులకు పరమ పూజనీయుడైన శ్రీరామానుజాచార్యుడు కూడా ఆదిశేషుని అవతారమని వారి నమ్మకం. ఆ కారణంగా వైష్ణవులు బలరాముడినీ, రామానుజుడినీ ఒకే గౌరవంతో చూస్తారు అందుకే వారు దశావతారాలలో బలరామావతారం ఒకటని నమ్ముతూ బుద్ధావతారాన్ని అంగీకరించరు అయితే శ్రీకృష్ణ దేవరాయలు వంటి వైష్ణవులు కొందరు బుద్ధుడినీ, బలరాముడినీ కూడా అంగీకరించి మొత్తం 11 అవతారాలను వర్ణించగా, రామకృష్ణకవి శ్రీకృష్ణావతారాన్ని వదిలి మిగిలిన పది అవతారాల్నీ వర్ణించాడు అతడు కృష్ణునికీ విష్ణువుకూ అభేదాన్ని పాటించాడు ఈ కావ్యంలో ఎక్కడచూసినా విష్ణువు అంటే కృష్ణుడే, కృష్ణుడు అంటే విష్ణువే అన్నట్లు వర్ణించడాన్ని మనం గమనించవచ్చు. స్వయంగా విష్ణువే శ్రీకృష్ణుడు అయినందున యిక ప్రత్యేకించి శ్రీ కృష్ణావతారాన్ని వర్ణించాల్సిన పనేముందని భావించాడు రామకృష్ణకవి. అయితే రామకృష్ణకవి తన కావ్యాలలో యిలా వర్ణించగా ఆయన వ్రాసినవేనని భావించబడే 11 చాటు పద్యాలలో మాత్రం కృష్ణావతార స్తుతి పద్యంకూడా వుండడం విశేషం (చాటు పద్య రత్నాకరము పేజీ 42). వీటి ప్రకారం బుద్ధ బలరామ అవతారాలతో కలుపుకుని మొత్తం 11 అవతారాలు వర్ణించబడ్డాయి.

ఇలా దశావతారములను వర్ణించిన పిదప కొంతసేపు కృష్ణుని రూపలావణ్యాన్ని తనివిదీరా కీర్తించి తన మనస్సులోని కోరికనిలా బయటపెట్టాడు పుండరీకుడు.

"ఓ ఛత్రితశేషా! (శేషనాగును గొడుగుగా కలవాడా! శేషతల్పంపై శయనించిన విష్ణువుకు, శేషుని పడగలు గొడుగైనవని భావం) నీవు నాయందు అనుగ్రహము కలవాడివి అయినట్లయితే శివునికి విరోధియైన మన్మథునికి సిగ్గు కలిగించే యీ జగన్మోహన రూపంతో నా పేరిట ప్రసిద్ధమవుతూ ఈ క్షేత్ర తీర్థములకు అధిపతివై యిక్కడే వసించు. ఈ తీర్థమూ, ఈ క్షేత్రమూ ఏ క్షేత్రమూ, ఏ తీర్థమూ చెందని ఔన్నత్యాన్ని పొందుగాక!"

దానికి విష్ణువు ఆ భక్తాగ్రేసరునితో యిలా అన్నాడు - "భీమఘర్మాంబు సంభూతయైన (భీముడంటే శివుడు. శివుని చెమటనుండి పుట్టినదైన) భైమి నది ఒడ్డున ఉన్న ఈ క్షేత్రంలో పశ్చిమాభిముఖుడనై వర్తిస్తాను. సకల తీర్థక్షేత్రములలో

ఉత్తమములైన యీ తీర్థ క్షేత్రములు పౌండరీకములై పాండురంగడినైన నాకు ఎల్లకాలాల్లో శ్వేతద్వీప సుధాసాగరముల (సుధా సాగరము అంటే పాల సముద్రం. శ్వేతద్వీపమంటే పాల సముద్రంలో విష్ణువు కొలువైన తెలిదీవి) కంటే యిష్టమైనట్టి నిత్య నివాసములవుతాయి. నీవు కోరినట్లే అవుతుంది."

ఇదంతా చెపుతూ పార్వతితో శివుడిలా అన్నాడు.

"ఆ కంబులలితకరుడిని (కంబువంటే శంఖము. శంఖమును ధరించుటచే సొగసైన చేయి కలవాడైన విష్ణువును) ముల్లోకములలోని వారలు బుధ కోకంబుల పాలి హేళిలా – హేళి అంటే సూర్యుడు, బుధజనులనెడి – (విద్వాంసులనెడి) – చక్రవాక పక్షులకు సూర్యునిలా పూజిస్తారు.

కోకము అంటే చక్రవాక పక్షి లేక జక్కవ పక్షి. *The Ruddy Sheldduck (or) Brahminy duck. Tadorna ferruginea.* హంస వంటి యీ పక్షులకు సూర్యుడు అత్యంత ఆప్తుడట. అందుకే సూర్యుడిని సంస్కృతంలో 'చక్రవాకబంధు' అనికూడా అంటారు. పగలంతా సంతోషంతో జతకట్టే యీ పక్షులు రాత్రివేళల్లో భయంతో ఓక్కు ఓక్కు మంటూ వుంటాయట. సూర్యుడంటే ఎంతగానో యిష్టపడే యీ పక్షులు చంద్రుడిని ద్వేషిస్తాయట. అందుకే చంద్రుడిని కోకద్వేషి అంటారు కూడా. చక్రవాక పక్షిని బాపన బాతు అనీ, బాపన చిలువ అనీ కూడా అంటారు. చలికాలంలో మన ప్రాంతంలోని వరిచేలు పనలమీద ఉన్నప్పుడు కాశ్మీర్‌లోని లడఖ్ నుంచి వడ్లగింజల్ని తినడానికివి ప్రతిఏటా మాగాడిచేలకి పెద్ద సంఖ్యలో వలస వస్తూంటాయి. మిగిలిన జలచర పక్షుల్లా యివి చేపల్ని, కప్పల్నీ తినవట. ఇవెప్పుడూ జంటలుగానే వుంటాయట. ఒకదాన్ని ఎడబాసి మరొకటి మనలేవట. అందుకే కవులు స్త్రీల స్తనద్వయాన్ని చక్రవాక పక్షుల జంటతో పోలుస్తారు. హిందీలో ఈ జాతి మగ పక్షిని చాక్వా అనీ, ఆడ పక్షిని చాక్వీ అనీ అంటారు.

# పండరీ క్షేత్ర వర్ణన

"అర్ధయోజనం (యోజనము అంటే నాలుగు క్రోసులు. అర్ధయోజనమంటే రెండు క్రోసులు) పొడవు; అందు సగము వెడల్పు (అంటే ఒక క్రోసు – రెండువేల విండ్ల పొడవు – విల్లుతో రెండువేల సార్లు కొలిస్తే క్రోసు లేక కోసు) కలిగి ఉండే ఈ పండరీ క్షేత్రము నాకూ, విష్ణువుకూ అత్యంత ప్రీతిపాత్రమైనది. పుష్కర క్షేత్రముకంటే మూడురెట్లు, కేదార క్షేత్రమునకంటే ఆరు రెట్లు, వారణాసికంటే పదిరెట్లు; శ్రీశైలం కంటే అనంతమైన రెట్లు మహిమగలదియైన యీ క్షేత్రం పుండరీకుని పేర పౌండరీకమై మహీమండలానికి మణికుండలమన్నట్లు వెలుగొందుతుంది. ఓ అరవింద కోరక సహోదరచారుపయోధరాఢ్య! (అరవిందము – తామర; కోరకము – మొగ్గ; తామర మొగ్గలతో సరిసాటియైన చక్కని స్తన సంపద కల ఓ పార్వతీ!) నేనుకూడా అక్కడే వెలసి ఆ యదుభర్తనూ, ఆ హలధరానుజుని (హలధరుడైన బలరాముని తమ్ముడిని) ఆ నవనీత చోరుడినీ (ఆ వెన్నదొంగనూ) ప్రతిదినమూ పాయని భక్తితో ఇలవేల్పుగా పూజిస్తాను. మిగిలిన యావన్మంది కూడా అదే విధంగా ఆ హరిని సేవిస్తారు. ఇతర దేవతల క్షేత్రములను అరువదివేల ఏండ్లు దర్శించినా రాని పుణ్యఫలము యీ క్షేత్రాన్ని ఒక్కసారి కండ్ల జూచినంతనే నరులకు చేకూరుతుంది.

"ఓ పార్వతీ! పాండురంగ క్షేత్ర నివాసము ఎంతో దుర్లభమైనట్టిది. అంతేకాదు ఇతర తావులలో వెండి అన్నము, బంగారు పప్పుతో కూడిన భోజనముతో అన్నార్తుల ఆకలి తీర్చితే ఎంత పుణ్యం వస్తుందో పౌండరీక క్షేత్రంలో అన్నార్తులకు ఒక్కమెతుకు దానంచేసినా అంతే పుణ్యం వస్తుంది. నియమముతో పాతికయెత్తు కాంచనముగానీ వెండిగానీ జగత్త్రయ పూజ్యమైన ఈ పాండురంగ క్షేత్రంలో దానముచేసిన పుణ్యాత్ములు మరుజన్మలో మేరుపర్వతము వలె శ్రేష్ఠములైన తమ యిండ్లయందు నివసిస్తారు. (ఎత్తు లేక కట్టు అంటే రెండు వీసెలు. అంటే 2.835 కిలోగ్రాములు. పాతిక ఎత్తు అంటే దానిలో నాల్గవవంతు

అంటే 708 గ్రాములు. కట్టెలు వగైరా తూచే రాయి ఎత్తు - *Stone Weight* - వేరే ఉంది. ఒక రాయి ఎత్తు అంటే 6.35 కిలోగ్రాములు)

"ఓ పార్వతీ! వృత్ర విరోధి (వృత్రాసురుడిని చంపిన ఇంద్రుడు) మొదలైన దేవతలు కూడా స్వర్గంలో ఉండడంలో సుఖమేమీ లేదని తలచి కర్మభూమియైన యీ భరత ఖండములో పుట్టాలని కోరుకుంటారు. ఇందుకోసం పౌండరీక సుక్షేత్రపతియైన శ్రీ కృష్ణుని పూజిస్తారు. యోగులలోకెల్లా శ్రేష్ఠుడైన భైరవుడు యీ క్షేత్రపాలకుడు. ఆయనను ముప్పది రెండక్షరముల మంత్రము జపించి పూజిస్తే శుభములు కలుగుతాయి.

"ఓ పార్వతీ! ఈ క్షేత్రంలోని తూర్పువాకిట చంద్రముఖి, దశాక్షరమంత్రమయి, తోయజ గర్భుని (బ్రహ్మ యొక్క) రాణియునైన వాణి (సరస్వతి)ని చూడవచ్చు. 'ఓం నమో నారదాయ' అనే షడక్షర మంత్రమయుడు, సేవించువారికి కొంగు బంగారమైన వాడునూనైన నారదుడు ఈ క్షేత్ర దక్షిణ ద్వారమునయున్నాడు. ఒకప్పుడీ దక్షిణ ద్వారమునందే మహామహిమాన్వితులైన ఐదుకోట్లమంది నాగకన్యకలు పాండురంగని యెడల అపారభక్తి శ్రద్ధలతో హారతులిచ్చారట. ఆ దక్షిణ ద్వార ప్రదేశంలో ఆ హారతి తాలూకు ధూమము యిప్పటికీ వ్యాపించి వున్నట్లుంటుంది. చూడు. ఈ దక్షిణ ద్వారమే పాండురంగని క్రీడాస్థలి. అక్కడ యిప్పటికీ పాండురంగనితో దేవతాస్త్రీల సమూహములు ఆటలాడతాయి. తెలుసా? పశ్చిమపు వాకిటిలో హ్రీంకృతి మంత్రరూపభాస్వర (హ్రీంకార మంత్రమున ప్రకాశించుచున్న) భువనాధినాయిక (భువనేశ్వరీ దేవి) వున్నది. ఇక ఉత్తర ద్వారములో మహిషాసురుని ఎముకలను హారముగాచేసి ధరించినదీ, గొప్ప సింహవాహనము కలదీ, దశాక్షర మంత్రము కలదీ, ఆ యిలదొడ్డికి (భూమి అనే పశువుల శాలకు) వేల్పుగిడ్డియైన (కామధేనువై కోరిన కోరికలిచ్చు నటువంటి) దుర్గ వున్నది. ఈ ద్వారదేవతలు నలుగురినీ నియమంతో పూజిస్తే సంపదలు కలుగుతాయి."

"ఓ కార్తిక రాకాసుధాంశు కమనీయముఖీ! (శరత్కాలము నందలి నిండు చంద్రునివలె చక్కని ముఖముగల ఓ పార్వతీ!) ఇక మానవులు భైమీనది తీర్థములో తీర్థమూర్తికడ సేచన (స్నాన) విధులొనర్చాలి. ఆ సందర్భంగా మహీదివిజకేసరులను (బ్రాహ్మణ శ్రేష్ఠులను) పరమాన్నము, చక్కెర, షాడబము (ఆరు రుచుల పులుసు), ఆవునేయి, చెఱకు రసము, కూరలు, ఫలములు, పానకములు మొదలైన వాటితోనూ, తాంబూలములతోనూ తృప్తిపెట్టాలి. తీర్థమూర్తియైన విష్ణువును అర్చించు బుద్ధిమంతులకు బర్హిబర్హాకల్పుడు (నెమలి పింఛము ఆభరణముగా గల కృష్ణుడు) యిహమునూ (భుక్తినీ) పరమునూ (ముక్తినీ) యిస్తాడు."

## ఆరు ఋతువులలో పాండురంగని అర్చన

ఇక శివుడు పార్వతికి చైత్రమాసంలో పాండురంగని మూర్తిని ఎలా అర్చించాలో చెపుతున్నాడు.

సీ॥ మంత్రపూతముగాఁగ మజ్జనం బొనరించి ప్రన్నని శుభ్రాంబరములుగట్టి
ఘనసార మిశ్రిత గంధసార మలంది పరిమళంబుడివోని విరులు ముడిచి
సిగరలతోడ గోక్షీర పూరముతోడ బహువిధంబగు ఫలప్రతతి తోడ
పిండివంటల తోడఁ గండచక్కెరతోడ నేయులతోడఁ దేనియల తోడ

తే॥ దధులతోఁ గూడఁదగు నివేద్యములఁజూపి, వనధి వనధాముఁ బీతాంబరుని రమాకు
చ రజనివిలిప్త శిఖిబర్హధరుమఖాంశ, భోక్తఁబూజింపఁ దగుఁ జైత్రమున శుభాంగి!

(పాండురంగ మాహాత్మ్యము 2-108)

విగ్రహము మంత్రపూతమయ్యేటట్లు సమంత్రకముగా మజ్జనము (స్నానము) చేయించి ప్రన్నని - మనోజ్ఞమైన; శుభ్రాంబరము - తెల్లని వస్త్రములు కట్టి; ఘనసార (కర్పూరము) మిశ్రిత (కలిపిన) గంధసారము (మంచి గంధమును) అలంది - పూసి; పరిమళంబు + ఉడివోవని (సువాసన ఉడిగిపోని; సౌరభముతగ్గని) విరులు - పూవులు; ముడిచి - అలంకరించి; సిగరల తోడన్ (తాలింపు వేసిన తియ్యని మజ్జిగ - మజ్జిగచారు తోనూ) గోక్షీర పూరము తోడ (ఆవుపాలతో చేసిన భక్ష్యములతోనూ) నానావిధములైన ఫలప్రతతి (పండ్ల సమూహములతోనూ) పిండి వంటలతోడనూ, గండచక్కెరతోనూ, నేతులతోనూ, తేనెలతోనూ, దధులతోగూడ - పెరుగులతో గూడ; తగు నైవేద్యములుచూపి; వనధివన ధాముడు - సముద్రములోని జలమే నివాసముగా కలవాడు; పీతాంబరునిన్ (పచ్చని పట్టుబట్టధరించే వాడైన) రమాకుచ రజని విలిప్తుడు (లక్ష్మీదేవి స్తనముల మీది పసుపు తన మేనికి అంటినవాడు) శిఖిబర్హధరుడు (నెమలి పింఛము ధరించువాడు) మఖాంశ భోక్తన్ - మఖమంటే యజ్ఞము; యజ్ఞాంశము అంటే యజ్ఞములో సమర్పింపబడిన తన హవిర్భాగమును భుజించు) వాడునూ అయిన విష్ణువును చైత్రమునన్ (వసంత ఋతువులోనిదైన చైత్రమాసములో) పూజింపదగును."

ఇక్కడినుండి ఆరు పద్యములలో వివిధ ఋతువులలో పాండురంగని మూర్తికి ఎలాంటి అర్చనలు చేయాలో చెప్పాడు రామకృష్ణకవి. గ్రంథవిస్తరభీతితో వాటిని యథాతథంగా వివరించలేకున్నాను. అయితే ఆ పద్యాల సారాన్ని కొంతమేరకు మీ ముందుంచుతాను.

గ్రీష్మ ఋతువులో నల్లని శ్రీకృష్ణుడిని తెల్లని ఆవుపాలతో అభిషేకం చేయాలి. (ధార్త రాష్ట్రము అనే నల్లని ముక్కు నల్లని కాళ్లు గల తెల్ల హంసవలె) నల్లని ముఖము, చేతులు, పాదములు మాత్రమే కనబడునట్లు కృష్ణుని విగ్రహమునకు తెల్లని పట్టుబట్ట కట్టాలి. మంచి గంధాన్ని మైపూతగాపూసి, గరికనేలపై వడగండ్లు కురిసినట్లు, నల్లని కృష్ణుని విగ్రహాన్ని ఆ ఋతువులో విరివిగా లభించే మల్లెపూలతో అలంకరించాలి. నైవేద్యముగా ఇంతకు మునుపు తెలిపిన భక్ష్యభోజ్యములను అర్పిస్తే శుభము కలుగుతుంది.

వర్ష ఋతువులో ఆ ఋతులక్షణాలకు సన్నిహితమైన పద్ధతిలో జరుపదగు అర్చనాక్రమమెలాంటిదంటే, కుంభవృష్టిగా తేటనీటిధారలతో విగ్రహాన్ని కడగాలి. కారుమబ్బులను తలపింపజేసే నల్లని వస్త్రాన్ని ధరింపజేయాలి. కరకపాతము (వడగండ్లవాన)ను స్ఫురింపజేయునట్లు, విరి గొజ్జగలతో (వర్షా కాలంలో పూసే పన్నీటి పూలతో) అలంకరించి, భూమిపైనున్న బురదలాగా కుంకుమను విగ్రహానికి పులమాలి.

వర్షఋతువులో ఎక్కడపడితే అక్కడ కనుపించే మఘవ గోపములతో (ఆరుద్ర పురుగులతో) సామ్యంగా రంగురంగుల మణులతో చేసిన హారములతో విగ్రహాన్ని అలంకరించి, వర్షఋతువుకు సహజమైన మెరుపులు అన్నట్లు దీపములు వెలిగించి, ఉరుములలా శంఖక్వాణములు (శంఖధ్వానములు) చేస్తూ, విరివిగా వర్షాకాలంలో పెరిగే పచ్చికలా చిక్కని ధూపమును వృద్ధిపరచి, ఉత్పిబముల (చాతక పక్షులు లేక వానకోయిలల) ఆహారమైన వాననీటి రాశులలా వేడినూనెలో వండిన బెల్లపుపిండి వంటలు, పప్పు, పరమాన్నాల రాశులను హరికి కారురాకన్ (వర్షాకాలము వచ్చు సమయంలో) కన్నులపండువగా సమర్పించాలి.

మఘవగోపములు (మఘవుడంటే ఇంద్రుడు; మఘవగోపములన్నా, ఇంద్ర గోపములన్నా ఆరుద్ర పురుగులు). ఈ చిన్న పురుగులు వర్ష ఋతువులో విజృంభిస్తాయి. ఆరుద్ర పురుగులు (*Lady bird beetles*) గుండ్రంగా, ఎరుపు, పసుపు లేక గోధుమ వర్ణంపైన నల్లని చుక్కలతో అందంగా వుంటాయి. వీటన్నింటిలోకీ అందమైనది ఏడు నల్లని చుక్కలు గల ఎర్రని ఆరుద్రపురుగు - (*Coccinella Septempunctata*) ఆరుద్ర పురుగులు పురుషుని సెక్స్ సామర్థ్యాన్ని పెంచుతాయి గనుక వీటిని వివిధ ఆయుర్వేద వైద్య యోగాలలో వాడారు.

ఇక శరదృతువులో విగ్రహానికి ఎలాంటి అర్చనలు చేయాలి? శరదృతువులో ఆవులపాడి ముమ్మరంగా ఉంటుంది. క్రొంబెరుగు (తాజా పెరుగు) తో స్నానం చేయించి, శరత్కాలానికి సహజమైన తెల్లని మేఘముల గుంపును స్ఫురింపజేసే తెల్లని బట్టకట్టి (తెల్లతామరలు, తెల్లని రెల్లుపూల కంకులు, పిండి ఆరబోసినట్లుండే తెల్లని వెన్నెల శరత్కాలానికి సహజమైనట్టివి) అంచేత తెల్లదనాన్ని స్ఫురింపజేసే తెల్లనివైన పూలతో అలంకరించి, శరత్కాలంలో పచ్చగా పండి ఒరిగిన శాలిపాకము (వరిపంట)ను స్ఫురింపజేయునట్లు గోరోచనము (గోరోజనము అని కూడా పిలువబడే ప్రకాశవంతమైన పసుపు వర్ణపు పదార్థం - *Bright yellow pigment.* దీనిని ఆవు మూత్రం నుండి, పిత్తము (*bile*) నుండి తయారు చేస్తారు. గోరోజనము ఆవు తలలో వుంటుందని కూడా అంటారు.) తో కూడిన మైపూతపూసి; శరత్కాలములో సమృద్ధిగా పండిన క్రొంబంటలు (క్రొత్త పంటలు) రైతుల చేతికి వస్తాయి. వారు క్రొంబంట (క్రొత్త పంటలతో) వండిన వంటకాలతో మృష్టాన్న భోజనాలు, సహపంక్తి భోజనాలు చేసుకుంటూ ఆనందములో మునిగితేలుతూ వుంటారు. అంచేత ఆ శరత్కాలములో గోధూమఖండ (గోధుమ నూక) ఖండశర్కర (కండ చక్కెర) కలిపి బాగా వండిన పిండివంటలను అధికంగా అర్పించి విష్ణువును పూజించాలి.

హేమంత ఋతువులో సముద్ర విహరణం వలన తనువుకు జాడ్యము (మందత్వం) కలుగుతుంది. అంచేత కృష్ణుని విగ్రహానికి బాగా కాచిన నెయ్యితో స్నానం చేయించాలి. తులసి దండలతోనూ, ఆ ఋతువులో విస్తారంగా లభించే మరువముతోనూ, మొల్ల (కుందలత అని కూడా పిలువబడే యీ తీగ - *Jasminum multiflorum* - హేమంత ఋతువులో విస్తారంగా పూస్తుంది.) పుష్పములతోనూ అలంకరించాలి. చలిగా ఉంటుంది గనుక వెచ్చగా ఉండడానికి ముతకగా వుండే పచ్చని పట్టుబట్టను కట్టాలి. చిత్రమైన వర్ణములతో కూడిన వస్త్రములు ధరింపజేయాలి. నవ్యదివ్యాన్నముతోనూ, పానీయములతోనూ విష్ణువుకు తృప్తి కలిగించి, రాత్రివేళల్లో విగ్రహానికి మందంగా కుంకుమపొడిని అలది, ధూపధూమములతో వెచ్చజేస్తూ ఆ కుధరధరుడిని (కుధరమంటే పర్వతం; గోవర్ధన పర్వతాన్ని ఎత్తిన ఆ కృష్ణుని) అర్చించితే ముక్తి కలుగుతుంది.

"శిశిరఋతు ఆగమన వేళలలో ఆ యశోద గారాబుపట్టిని, ఆ కాలమునకు ఉచితమైన కుశలు (దర్భలు), కుసుమములు (పూలు), పటములు (వస్త్రములు), అంగ రాగములు (చందనాది మైపూతలు), కూర్పాసములు (వస్త్రములు) వగైరాలతో అర్చించాలి, ఓ శశిముఖీ! (చంద్రుని వంటి ముఖముగల ఓ పార్వతీ!)" అని వివిధ ఋతువులలో పాండురంగని మూర్తికి చేయవలసిన అర్చనా విధానముల వివరణను ముగించాడు శితికంఠుడు.

ఇంకా ఆ మురవిభంజనుడి (మురాసురుని సంహరించిన విష్ణువు) క్షేత్రమూర్తి, తీర్థమూర్తి, మూర్తి మూర్తి రూపములయొద్ద చేయవలసిన అర్చనా క్రమమును కూడా వివరించాడు. పాండురంగని విగ్రహము చుట్టూగల 25 మూరల ప్రదేశములో ఎక్కడ పూజించిననూ అది క్షేత్రమూర్తిని పూజించినట్లే అవుతుంది.

పాండురంగనికి పడమటి దిక్కున నూరు విల్లుల లోతుకలిగిన శుభప్రదమైన పద్మతీర్థంవుంది.

24 అంగుళములు ఒక హస్తము. 4 హస్తములు ఒక ధనువు లేక విల్లు అంటే 96 అంగుళములు ఒక విల్లు నూరు విల్లుల లోతు అంటే 9600 అంగుళాలు. అంగుళమంటే 25 సెం మీ. కనుక నూరు విల్లుల లోతు అంటే 24000 సెం మీ అంటే 240 మీటర్ల లోతు అన్నమాట.

అక్కడ శంఖము, పద్మము మొదలైన నవనిధులూ వున్నాయి. (మహా పద్మము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, ఖర్వము అనేవి మిగిలిన నిధులు). తపస్సుతో ప్రకాశించుచున్న వారైన నరనారాయణులు అక్కడ పిప్పలాకారులై (రావిచెట్టు రూపు ధరించినవారై) వున్నారు. విష్ణువు దేహమునుండి అవతార పురుషులుగా వెలసి, దుష్టులను

శిక్షించే బాధ్యతను స్వీకరించి, బుధజన పరిరక్షణను ఒక వ్రతముగా పూనినట్టి వారైన ఆ నరనారాయణులు ఘుస్రపతినిభులు (ఘుస్రము అంటే దినము. దినమునకు పతి సూర్యుడు. సూర్యబింబ సమాన తేజోవంతులు) సహస్రకవచకవచ నిర్భేదనులు (సహస్రకవచుడు అంటే కర్ణుడు. కర్ణుడి కవచాన్ని భేదించినవారు). సమీపంలోని కుండలతీర్థం, పుష్పావతీ నదీ తీర్థం కూడా జపస్నానార్ఘ్యదానక్రియలకు తగినచోట్లు.

# ముక్తకేశి

ఆ పాండురంగ క్షేత్రమునకు ఈశాన్య దిక్కున మనోహరమైన దేహము కలదియు, జుట్టును విరబోసుకుని నగ్నంగా వున్న ఓ గోపిక శ్రీ కృష్ణుని పాదములు పట్టుకొనుచూ సగము వంచిన దేహము కలదియైయున్న విగ్రహమొకటి వుంటుంది. దీని వెనుక ఓ కథ వుంది. ఒకప్పుడీ గోపిక కృష్ణుని గూర్చి తపస్సు చేసింది. కృష్ణుడెలా వుంటాడో ఆమెకు అప్పటివరకూ తెలియదు – ఏదో జనం అనుకుంటూంటే వినడం తప్ప. తీరా ప్రత్యక్షమైతే – ఆ సమ్మోహనాకారుడిని చూస్తూ ఆమె సకలం మరిచింది. జుట్టు ముడివేసుకోలేదు. చీర పోకముడి జారిన కారణంగా తాను నగ్నశరీర అయినా లెక్కచేయలేదు. జగన్మోహనాకారుడైన ఆ జగన్నాథుడిని రెప్పవేయని కళ్లతో తదేకంగా చూస్తూ స్వామి పాదములు పట్టుకొని, “ఈ అందమైన పాదములు నేను విడువను. నన్నిలాగే ఉండనియ్యి” అని వేడుకుందట. అప్పుడు శౌరి (కృష్ణుడు) ‘అలాగే జరుగుతుంది. నీవు అనంబరవుగా (వస్త్రములు లేకుండా దిస్సమొలతో) ముక్తకేశివిగా (ముడివేయకుండా వదలబడిన, విరబోసుకున్న కేశములు కలదానివిగా) అఖిల భూషణాంచితాంగివై (అన్ని నగలతో అలంకరింపబడిన శరీరము కలదానివై) వుందుము” అని వరమిచ్చాడట.

ఇంకా పార్వతికి శివుడిలా వివరించాడు.

“ఓ కుందవిశద రదనా! (మొల్లపూలవంటి తెల్లనైన చక్కని దంతములుగల ఓ పార్వతీ!) అక్కడ ఇంకా ప్రసిద్ధిచెందిన భైమీ తీర్థముతోపాటు అగస్త్య, గాణాపత్య తీర్థములు, సాంకర్షణ, జాబాలి, శతానంద (బ్రహ్మ) తీర్థములు, కలశ, పితృ, చక్ర తీర్థములు, లక్ష్మీ తీర్థ, పౌండరీక తీర్థములు, ముక్తకేశి, సంగమ, సోమ, దేవ, సూర్య, సరస్వతీ తీర్థములు వగైరా ఎన్నో పుణ్య తీర్థములు కలవు. ఇవన్నియూ మహా మహిమాన్వితములు.”

“ఈ పుణ్య చరితము పఠించినవారు, వ్రాసినవారు, వినినవారూనైనట్టి నరులు యీ జన్మలోనే పుత్రులు, పౌత్రులు, సంపదలు, చతురలగు స్త్రీలు మొదలగు భోగవిశేషములు పొంది ఆ తరువాత గొప్ప మునులుకూడా పొందియుండనట్టి ముక్తిని పొందగలుగుతారు” అని పార్వతికి శివుడు చెప్పాడని చెబుతూ ముగించాడు సూతుడు.

ఇది విని శౌనకాది మునులు అపరిమితానందం పొందారు. శౌనకుడు సూతునితో “ఓ దమనిధీ! (ఓ మునీ!) పాండురంగడు దేవతలలో శ్రేష్ఠుడు; భైమీనది తీర్థములలో శ్రేష్ఠము; పౌండరీక క్షేత్రము వసుధాతలముపైని క్షేత్రములన్నిటా శ్రేష్ఠతమము. ఈ మూడింటి విశేషాల్నీ మాకు శ్రవణానందకరంగా వివరించావు. అయితే అఖిలాండనాయకుడైన హరి నందుని బిడ్డ ఎలా అయ్యాడు? రాధ ఎవతె? ఆ రాధ కోరిక యెట్టిది? శంకరుని దేహంనుండి చెమటగా భైమీనది ఎలా పుట్టింది? శ్రీకాంతుడైన విష్ణువు అంగమునుండి పుట్టిన అక్షరముల యొక్క సమూహము ఏ మంత్ర రహస్యము? యివి కూడా వివరించి మమ్మల్ని ధన్యుల్ని చెయ్యి” అన్నాడు.

అప్పుడు సూతుడు “ఒకప్పుడు నారద మహర్షికి మేచకగ్రీవుడు (నీలకంఠుడైన శివుడు) తెలిపిన పుండరీక చరిత్రమును మీకు తెలియజేస్తాను. శ్రద్ధగా వినండి” అంటూ తాను లోగడ వేదవ్యాసుని వచనములు వినియున్న కారణంగా

ఆ అర్జున సూతుని విహారములు (సూతుడు అంటే సారథి. అర్జునునికి సారథియైన శ్రీ కృష్ణుని లీలలు) నేర్పుగా చెప్పాడు.

"ధనపతి మిత్రుడు (కుబేరుని మిత్రుడైన శివుడు) ఆ విధముగా తన భార్యకు సంతోషము కలుగునట్లుగా ఉపన్యసించగా విని, తీరిన సందేహములు కలవారై, నెమలిని వాహనముగాకల కుమారస్వామితో కలసి మునులందరూ అబ్ధిజలములను (సముద్ర జలములను) ఆను (త్రాగు) ఘనంబుల లీల (మేఘముల వలె) ఏగిరట (వెళ్లిపోయారట)"

మన ప్రాచీనులు మేఘములు సముద్ర జలాల్ని త్రాగి తిరిగి వర్షరూపంలో మనకందిస్తాయని నమ్మేవారు. ఆకాశం మేఘావృతమై వున్నప్పుడు సముద్రపు ఒడ్డుకు వెళ్లి నిలుచుని దిఙ్మండలం (*Horizon*) వంక చూస్తే మేఘాలు సముద్రపు నీటిని తాకుతున్నట్లుగా కనుపిస్తాయి! అలా తాకినప్పుడు అవి స్పాంజిలా సముద్రపు నీటిని త్రాగుతాయని నమ్మేవారు. అయితే మేఘాలు సముద్రాన్ని తాకడం మన భ్రమేకాని, వాస్తవంకాదు. మేఘాలు ఎప్పుడూ భూతలానికి కొన్ని మైళ్ల ఎత్తున ఆకాశంలో తిరుగాడుతూ చల్లదనం తగిలినప్పుడు వాటిలోని నీటియావిరి ద్రవీభవించి వర్షం కురుస్తుంది. అంతేగాని మేఘాలు సముద్రపు నీటిని త్రాగి మళ్లీ వర్షం రూపంలో విడుస్తాయనడం అశాస్త్రీయం.

రామకృష్ణ కవి యీ సందర్భంలోనేకాక యిదే కావ్యంలోని తృతీయాశ్వాసంలో "ధేనుగజాశ్వరత్న" అని ప్రారంభమయ్యే (3-144) పద్యంలో కూడా మేఘాల్ని "విప్లుష్టకరీష పిండముల" (బాగుగా కాల్చబడిన - పేడతో చేసిన ఎండు పిడకల- అంటే కచ్చికల)తో పోల్చి అవి సముద్రంలో నీరు త్రాగుతున్నాయంటాడు.

ఆ సమయంలో ఆకాశమార్గంలో వెళుతూన్న నారద మహర్షి కైలాస పర్వతము నుండి వస్తూన్న యీ అశేషజనవాహినిని ముఖ్యంగా కుమారస్వామి, అగస్త్యాది మునిముఖ్యులు వగైరాలను గమనించి వారందరూ ఏదో గొప్ప విషయమై శివుని కడకు వెళ్లి తమ సందేహము తీర్చుకొని వస్తున్నట్లున్నదని గ్రహించి తానుకూడా అట్టి మహత్తర విషయమేదో తెలిసికొననెంచి కైలాసమునకు వెళ్లాడు.

శివుడు నారదుని సాదరంగా ఆహ్వానించాడు. నారదుడు "కార్తికేయునకూ, అగస్త్యాది ముని ముఖ్యులకూ ఏ విషయము వివరించితివ"ని శివుని ప్రశ్నించాడు. దానికి శివుడు వారికి తానెరింగించిన విషయములు క్లుప్తంగా చెప్పి పౌండరీక క్షేత్రప్రాశస్త్యాన్ని వివరించి, "పౌండరీక తీర్థమనే హారానికి కృష్ణుని విగ్రహం నీలమణి అయితే, సంగమమనే తీర్థం కొలికివంటిది. యింకా ఆ సంగమ తీర్థంలో ఐదు క్రోశములు నిడివిగలిగిన నృసింహ క్షేత్రము కలదు. ఆ తీర్థంలో జలకమాడి నృసింహుని పాదద్వయాన్ని దర్శించి తనకు కలిగినంత దానమిస్తే నరుడు విరాట్ పురుషుని స్థానమైన వైకుంఠాన్ని చేరగలడు. పంచజనుడు (మనుష్యుడు) పంచ మహాపాతకములు చేసినట్టి క్రూరచిత్తుడైనా సరే ఆ నృసింహ క్షేత్రంలోని కుడి భాగంలో మరణిస్తే వైకుంఠానికి చేరతాడు. (1. బ్రహ్మహత్య - బ్రాహ్మణుని చంపడం; 2. సురాపానము - మద్యం సేవించడం; 3. స్వర్ణ స్తేయము - బంగారాన్ని దొంగిలించడం; 4. గురుతల్పగమనము - గురుపత్నీ సంగమం; 5. పై నాలుగు మహాపాతకములు చేసిన వానితో సహవాసము చేయడం. ఈ ఐదింటినీ పంచమహాపాతకములంటారు.) ఆ దేవుని ఎడమప్రక్క తనువుచాలిస్తే సార్వభౌముడౌతాడు. దేవుని వెనుక మరణిస్తే నాకవాసి (స్వర్గలోకవాసి) అవుతాడు. దేవుని దక్షిణ దిక్కున మరణిస్తే ముక్తుడౌతాడు. కావున మనుష్యులు అక్కడే ఎప్పుడూ కాపురము చేయదగును. ఆ క్షేత్రము యొక్క గొప్ప చరిత్ర శ్రుతిపేయంగా (వినసొంపుగా) వుంటుంది. అది చెపుతాను విను, నారదా!" అన్నాడు శివుడు.

# నిగమశర్మోపాఖ్యానము

ఆ అర్ణవతూణీరుడు (అర్ణవ మంటే సముద్రమును తూణీరము అంటే అమ్ములపొదిగా కలవాడు. త్రిపురాసుర సంహార సందర్భంలో – సముద్రమును అమ్ములపొదిగా కలవాడు – శివుడు) నారదునితో యిలా చెప్పాడు "కళింగదేశానికి ఆభరణం వంటి పీఠికాపురము (పిఠాపురం)లో ఒకప్పుడు

**ఉ॥ ప్రాసఁగు విత్తువంటి నెఱపాఱు కొలంబునఁబుట్టి వేదముల్**
**పోసినగాదె శాస్త్రములు పుట్టినయిల్లు కళా కలాపముల్**
**దాసినరచ్చ యంచు నఖిలంబుఁదనుం గొనియాడనొప్పును**
**ద్భాసిత భాసితద్యుతి సభాపతి నా నొకఁ డాహితాగ్నియై. (పాండురంగ మాహాత్మ్యం : 3-3)**

వరిధాన్యపు రకాలలో కెల్లా శ్రేష్ఠమైనది ప్రాసంగులు లేక రాజనాలు అనబడే రకపు ధాన్యం. దీనినే ప్రాసఁగు అనీ అంటారు. 'నెఱవు' అంటే 'ఆధిక్యము'. 'నెఱవు' యొక్క సంక్షిప్తీకరణే 'నెఱ'. పాఱుకొలంబు – బ్రాహ్మణ కులము; వేదములు పోసిన గాదె; శాస్త్రములకు పుట్టిల్లు; కళాకలాపములు దాసిన (చేరిన, సమీపించిన) రచ్చ; అంటూ అందరూ తనను మెచ్చుకొనదగిన, చంద్రునివంటి కాంతి కలిగిన వాడైనట్టియు సభాపతి అను పేరు కలిగినట్టియు ఒకడు ఆహితాగ్నియై (నిత్యాగ్నిహోత్రుడై) ఒప్పును.

ఆయనకొక కుమారుడు. అతడు యువతుల మనస్సులను ఆకర్షించుటలో మన్మధుని వంటివాడు. ప్రజలందరిచేత గౌరవించబడిన సచ్చరితుడు. గొప్ప వితరణ శీలి. పరిపూర్ణమైన కాంతిలో చంద్రుని వంటివాడు. లేలేత యౌవనపు తేజస్సుతో వెలిగిపోతూ ప్రసంగములలో దిట్టగా పేరుగాంచాడట. అతనికి నిగమశర్మఅని తండ్రి పెట్టినపేరు అన్నివిధాలా తగినట్టిదేనట! (నిగమములు అంటే వేదములు).

అతడు వేదాధ్యయన సంపన్నుల, శిష్టాచార పరాయణుల వంశంలో జన్మించినప్పటికీ, సకల నిగమశిఖా (వేదముల శిఖలు – అంటే చివరి భాగములైన సకలోపనిషత్తుల) రహస్యములు తెలిసిన వాడే అయినప్పటికీ దైవఘటన కారణంగా అతని మనస్సు తార్తీయ (తృతీయ) పురుషార్థము (అంటే కామము) వైపునకే మొగ్గిందట. (ధర్మ, అర్థ, కామ, మోక్షములనే నాలుగూ పురుషార్థములు. వాటిలో మూడవదంటే కామము)

**చ॥ తలగడు గంగమర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో**
**జ్జ్వల కలమాన్న భోజనము చందనచర్చ ప్రసూనదామకం**
**బులు కపురంపు వీడ్యమును భూషణ పఙంక్తులు గల్గి నిచ్చలున్**
**బులుగడుగంగఁ బద్ద నునుముత్యముఁ బోలుచు వాలుచుంబురిన్**
**(పాండురంగ మాహాత్మ్యం : 3-9)**

తలగడుగు – అభ్యంగన స్నానము (తలంటు); అంగమర్దనము – శరీరపు మాలీసు – శరీర సంవాహనము - ఒళ్లు పిసికించుకొనుట; ధౌతపటావరణంబు – శుభ్రంగా ఉతికి చలువచేసిన వస్త్రములు ధరించడం; సంస్కృతోజ్జ్వల - బాగా పక్వం చేయబడి తెల్లగావున్న; కలమాన్నం – వరి అన్నం; చందన చర్చ – గంధపు పూత; ప్రసూన దామకములు -

పూలదండలు; కపురంపు వీడ్యము - కర్పూరము వేసిన తాంబూలము; భూషణపంక్తులు - నగల సముదాయము; పులుగడుగంగబడ్డ నునుముత్యము - మురికి కడుగబడిన స్వచ్ఛమైన ముత్యమును; పోలుచున్ - పోలి; పురిన్ - ఆ నగరములో; వాలుచున్ - అతిశయించుచూ వున్నాడట ఆ నిగమశర్మ.

పులు అంటే రత్నాదుల మాలిన్యము (*foulness of the gems*). ఈ మాలిన్యాన్ని తొలగించడాన్నే పులుగడగటం అంటారు. రత్నాదుల బాహ్య మాలిన్యాలను తొలగించడానికి పలు రసాయనాలు వాడతారు. ఉదా : ముత్యాల మురికిని వదలగొట్టి వాటిని ప్రకాశవంతంగా చేయడానికి హైడ్రోజన్ పెరాక్సైడ్ ($H_2O_2$) వాడతారు. వజ్రాలను కాంతితో మెరిసేట్లు చేయడానికి *White Petrol* తో కడుగుతారు. ఇటీవల వజ్రాలలోని మచ్చలు వగైరా అంతర్మాలిన్యాలను కూడా లేజర్ (*Laser*) కిరణాల ద్వారా తొలగిస్తున్నారట.

ఆ నగరంలో ఘంటాపథం (అంటే 10 విల్లుల వెడల్పు కలిగివుండే రాచబాట)లో యువతులను అనుభవించుటచే మలినమైన వస్త్రాలతో, జాతిమాత్రోపజీవి (పుట్టుకను గురించే - అంటే తాను పుట్టిన కులమును గురించే గొప్పగా చెప్పుకొనేవాడు. బ్రాహ్మణోచిత లక్షణాలేవీ లేకున్నా పేరుకుమాత్రం బ్రాహ్మణుడైన) ఆ నిగమశర్మ పరిహాసకులు వెంటరాగా దర్పంగా, దర్జాగా తిరుగుతూన్నాడట.

తే॥ భార్య పాలిండ్లు రిక్త కుంభములు, రోయి
వెలఁది చనుదోయి నిండుకుండలు; కులంబు
తరుణి ఫాలంబు చవితి చందురుఁడు; వేశ్య
నుదురు వానికిఁ బ్రతిపదిందుండు నయ్యె (పాండురంగ మాహాత్మ్యం : 3-11)

భార్య పాలిండ్లు వానికి వట్టి ఖాళీ కుండలుగానూ; రోయి వెలఁది (బోగము పడతి) చనుగవ నిండుకుండలుగానూ అనిపించాయట; ఖాళీ కుండలు ఎదురవడం దుశ్శకునంగానూ, నిండు కుండలెదురవడం శుభశకునంగానూ ప్రాచీనులు భావించేవారు. కులకాంత నుదురు వానికి చవితి చంద్రుడులానూ (చవితి చంద్రుడిని చూడడం అమంగళకరమని భావిస్తారు) వేశ్య నుదురేమో వానికి ప్రతిపదిందుండు అయిందట. ప్రతిపదిందుడు (ప్రతిపత్ + ఇందుడు) అంటే నవీన చంద్రుడు - శుక్లపక్షంలో మొదటి రోజు చంద్రుడు. ఆ పాడ్యమి రోజు చంద్రుడిని చూడడం శుభప్రదమని భావిస్తారు. 'ప్రతిపచ్చంద్రుడు' అని కూడా శుక్లపక్ష పాడ్యమినాటి చంద్రుడిని అంటారు. చవితినాడు పాలుపిదుకుతూ అందులో చవితి చంద్రుని ప్రతిబింబాన్ని చూచిన కారణంగానే కృష్ణుడు 'సత్రాజిత్తు యొక్క సోదరుడు ప్రసేనుడిని చంపి శ్యమంతకమణిని అపహరించాడనే నీలాపనిందను భరించాల్సి వచ్చిందని విశ్వసిస్తూ చవితి చంద్రుడిని చూడడం అమంగళకరమని నమ్మే హిందువులు, పాడ్యమినాటి చంద్రుడిని మాత్రం ప్రయత్నపూర్వకముగా మరోసారి పరిశీలించి చూసి ఓ నూలుపోగు వదులుతారట. చంద్రునికి నూలుపోగు వదలడమెందుకో తెలియదు. చంద్రగోళంపైన ఏకులు వడుకుతూన్న ఓ అవ్వ వుందని భావించడానికీ, చంద్రునికో నూలుపోగు వదలడానికీ సంబంధమేమైనా వుందేమో! అన్ని మతాల్లోనూ శుక్లపక్షపు మొదటి రోజునాటి చంద్రుడిని చూడడం మంగళకరమని భావిస్తారు. అయితే ఈ నమ్మకాలకు శాస్త్రీయమైన పునాది ఏమీ ఉన్నట్లు ఋజువు కాలేదు.

ఇంకా నిగమశర్మ స్థితి ఎలా వున్నదటంటే -

సీ॥ ఉప్పాని హొమాగ్ని యూఁద నొల్లఁడుగాని విరహజ్వరార్తితో వెచ్చనూర్చు
సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడుగాని యెరఁగు నీర్ష్యాకషాయితల కర్థి
నాగమవాదంబు లౌఁగాదనఁడుగాని విటవాదములు తీర్చు వేగిలేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలఁడుగాని యౌవతాధర శీధువాని చొక్కుఁ

తే॥ బుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప సిగ్గుపడుఁగాని కరనఖశిఖరలసిత
జాతనూత్నక్షతాంకముల్ సమ్మతించు, నారజము మీరి యా దుర్వ్యహారహారి.

(పాండురంగ మాహాత్మ్యం : 3-12)

'అరణి' అనే త్రచ్చి నిప్పు పుట్టించే కొయ్యతో హొమాగ్ని రాజేస్తారు. గృహస్థు ప్రాతఃసవనము, మాధ్యందిన సవనము, సాయం సవనముల కొరకు మూడు పూటలా హొమాగ్ని రగిల్చి యింట్లోనే యజ్ఞం చేస్తాడు. దీనినే అగ్నిహొత్రమని అంటారు. ఇది చేసేవానిని ఆహితాగ్ని అంటారు. (కొందరు ప్రాతః, సాయం సవనములు రెండు మాత్రమే చేస్తారు). ఈ అగ్నిని రగిలేచ్చే ప్రక్రియ చాల జటిలమైనది. కళ్లు మంటలెత్తించే పొగను తట్టుకుంటూ నోటితో ఉప్పాని ఊదుతూ సమిధలు రాజుకొనేందుకవసరమైన ప్రాణవాయువును అందించాల్సి వుంటుంది. నిగమశర్మ హొమాగ్నిని ఊదడట; కాని, విరహమనే జ్వరం యొక్క బాధతో వెచ్చని నిట్టూర్పులూరుస్తాడట. సంధ్యావందనం చేయడట; కాని, ఈర్ష్యాకషాయితలకు (తాను యితర స్త్రీల సాంగత్యం చేస్తున్నట్లు తెలుసుకొని యీర్ష్యతో కళ్లెర్రచేసే తన ఉంపుడుగత్తెలకు) మాత్రం అర్థిన్ - మక్కువతో - ఎరగున్ - నమస్కరిస్తాడు; ఆగమవాదంబులు - వేదార్థములు, వేదాంతర్గత విషయములను గూర్చి జరిగే చర్చలలో; ఔగాదనడు - ఔననిగానీ, కాదనిగానీ అనడట; కానీ, వేగి లేచి - పెందలకడనే లేచి; తీర్చు విటవాదములు - గతరాత్రి విటులకు, విటీజనమునకు ఏర్పడిన కలహాలను తీరుస్తాడట; (ప్రత్యేకించి ఇలాంటి కలహములను తీర్చడానికి ప్రాచీనకాలంలో జారధర్మాసనాలుండేవని వినుకొండ వల్లభరాయని 'క్రీడాభిరామం' వలన తెలుస్తూంది. అవి లేని తావులలో మన నిగమశర్మ వంటి వారే న్యాయమూర్తులు.) కంబువు - శంఖము; కంబుభృత్పాదోదకంబు - శంఖధారియైన - పాంచజన్యమనే శంఖమును ధరించిన - విష్ణువు యొక్క పాదతీర్థమును; క్రోలదు - త్రాగడు; యౌవతాధర శీధువు - యువతీజనం యొక్క అధర (పెదవుల) శీధువు (చెఱకురసపు కల్లు) - అనగా అధరామృతము (లేక) మోవితేనెను; ఆని - త్రాగి; చొక్కున్ - పరవశిస్తాడు; పుణ్యచిహ్నంబులు - తిరుమణి, తిరుచూర్ణములు మొదలైనవి; అపఘనంబునన్ - శరీరముమీద; ఘటింప - ధరించుటకు; సిగ్గుపడు గాని - సిగ్గుపడతాడు; కానీ కరనఖశిఖరలసితజాతనూత్నక్షతాంకములు - (యువతులు) తమ చేతిగోళ్ల వాడిమొనలచే చేసే కొత్త క్షతాంకములు - వేసే నఖక్షతములు; వేయించుకొనడానికి సమ్మతిస్తాడట! ఆరజము మీరి - ఇంపు మీరగా; ఆ దుర్వ్యహారహారి - చెడునడతకు ఓడిన (తల ఒగ్గిన) ఆ నిగమశర్మ.

'నిగమశర్మ' అనే పేరును సభాపతి తన కుమారుడు వేదవేత్త కావాలనే ఆకాంక్షతో పెట్టాడు. కాని, అతని కాపేరు నేతి బీరకాయ (ఘృతకోశాతకి) లా అయథార్థ గాథే అయింది. ఆ వీటిప్రోగు - బ్రాహ్మణబ్రువుడు - వ్యర్థముగా జంధెము ధరించినవాడు, ఆ వీటన్ - ఆ నగరములో; వైదికాచారములకు దూరమైన ప్రవర్తనలతో విహరిస్తున్నాడట.

అతడు కొద్దికొద్దిగా దుర్వ్యవహారపు నడవడిలో గడిదేరి పెద్దలు శిక్షించినా నడత మార్చుకొనక గడుసుమీరి

సదికి ఓర్చుకుని వంకపొరక (వంకర గడ్డిపోచ) చాటును కూడా మానుకున్నాడు. అంటే చాటుగా తప్పులు చేసే స్థితినుండి క్రమంగా గడుసెక్కి బహిరంగంగా తప్పులు చేసే స్థితికి చేరుకున్నాడన్నమాట. చాటుమాటుగా తప్పులు చేసే వాడిని మందలిస్తే బాగుపడకపోగా, అవే తప్పుల్ని 'ఇంకా చాటెందుకు?' అని బహిరంగంగా చేస్తున్నాడట.

తాతముత్తాత తండ్రులు తరతరాలుగా ఆర్జించి, చీమలవలె కూడబెట్టి దుర్జితము (భద్రము)చేసిన విత్తము, ఉరగదష్టుని (పాముచే కాటువేయబడినవాని) శరీరంలోని నెత్తురు విరిగిపోయినట్లు నిగమశర్మ చేతికి చిక్కి ఉడిపోయిందట (నశించిందట). పాము విషం రక్తాన్ని విరగగొట్టడం కారణంగా అందులోని హీమోగ్లోబిన్ (*Haemoglobin*) కలుషితమై యింకెంతమాత్రమూ వాయువులను మోసుకువెళ్లలేని స్థితి ఏర్పడి శరీరంలోని జీవరసాయనిక ప్రక్రియలన్నీ దెబ్బతిని అది చావుకు దారి తీస్తుంది

సీ॥ దినవెచ్చమునకునై తన మేనఁ గల సొమ్ము కొదుకక బచ్చింటఁ గుదువవైచు
నీఁదు గీచినరీతి నించుకించుక చేరి గిలుబాడుఁ దల్లిపైఁగల పసిండి
తండ్రికి నిద్ద పత్రములు దొంగిలిపోయి పోయినంతకు నిచ్చి పొరయుఁగొంత
మిండవడ్డికి నోర్చి మృత్యురూపములైన సాహులచే ఋణగ్రాహియగుచు

తే॥ గుడ్డవృత్తులు, వృత్తులుఁ గొలుచు గుత్త, చేలు గ్రామాంశములు గాదినేలలెల్లఁ
జనవరుల కమ్మఁజూపు నిచ్ఛావిహార, వర్తి వాఁడేమి కానున్నవాఁడొ మీఁద.

**(పాండురంగ మాహాత్మ్యం : 3-16)**

దినవెచ్చమునకు అంటే రోజువారీ తన చిల్లర ఖర్చుకు; తనమేనఁగల - తన ఒంటిమీదనున్న; సొమ్ము - నగను; కొదుకక - ఏమాత్రం సంకోచించక; బచ్చింట - కోమటింట; కుదువపెడతాడట. చేరి - (మెల్ల మెల్లగా తల్లిని) సమీపించి; యించుకించుక - కొంచెము కొంచెముగా; ఈఁదు గీచినరీతి - ఈత చెట్టును కల్లు కొరకు అప్పుడుకొంచెం అప్పుడు కొంచెం గీస్తారు - ఆ విధంగా; తల్లిపైఁగల పసిండి - తల్లి ఒంటి మీదనున్న బంగారు నగలు; గిలుబాడుఁ - అపహరించును - నగలు ఒక్కసారిగా అపహరిస్తే అనుమానం కలుగుతుంది. గనుక అప్పుడొకటీ, అప్పుడొకటీ తస్కరించేవాడన్నమాట.

తండ్రికినిద్ద - తండ్రికి నిడిన - తండ్రికివ్వబడిన; తండ్రి దగ్గర ఋణము తీసుకొని ఋణపత్రములు వ్రాసి యిచ్చినవారి యొక్క పత్రాలను దొంగిలించి వారివద్దకే తీసుకెళ్లి వారి పత్రాలు వారికిచ్చేసి ప్రతిఫలంగా ఎంతో కొంత (వారు యిచ్చినంత) వారినుండి పొరయునట (పొందునట).

ఇక అతనెలా ఋణగ్రస్తమైపోయాడో వివరిస్తున్నాడు.

మిండవడ్డికిన్ - అధిక వడ్డీకి, చక్రవడ్డీకి; ఓర్చి - అంగీకరించి; 'యములాళ్లవంటి' అనేది జానపదులు వాడే సాధారణ ప్రయోగం; సాహులచే - షావుకారు అని మనం తెలుగులోవాడే పదానికి మూలరూపం ఒరియా భాషలోని 'సాహూకార్' అనే పదం. ధనాన్ని వడ్డీకి తిప్పేవాడని దీనర్థం. కేవలం ధనవంతుడినికాదు, ఆ ధనాన్ని వడ్డీకి తిప్పేవాడిని మాత్రమే మనం షావుకారు అనాలి. "నీకేం బాబూ! షావుకారువి" అని మనం డబ్బున్న ప్రతివాడినీ దృష్టిలో పెట్టుకుని అనడం సరైన ప్రయోగం కాదు. ఒరియా భాషలోనుంచి 'సాహు' అనే పదం అన్ని భాషలలోకీ వ్యాపించడాన్ని బట్టి ఒరిస్సావారే మొదటి వడ్డీ వ్యాపారులై వుంటారని తోస్తుంది. ఒరిస్సాలో 'సాహు' అనే యింటిపేరు కూడా వుంది. ఉత్తర భారతంలోని 'మహాజన్'లూ వడ్డీ వ్యాపారస్థులే! అయితే హిందీ భాషలో 'సాహు, సాహుకార్, మహాజన్' అనే పదాలకు

'ధనవంతుడు, వడ్డీవ్యాపారి' అనే అర్థాలతోపాటు సజ్జనుడు, మర్యాదస్థుడు అనే అర్థాలూ వుండడం విశేషం! అయితే మన నిగమశర్మకి వడ్డీకి అప్పులిచ్చినవాళ్ళు మాత్రం యములాళ్లవంటి సాహులట! గుడ్డవృత్తులు - అంటే రాజులు, జమీందారులచే యివ్వబడిన అగ్రహారపు భూములు లేక ఇనాము భూములు; వృత్తులు - ప్రాచీన కాలంలో వృత్తులు నాలుగు : 1) కృషి - అంటే వ్యవసాయము, 2) పాశుపాల్యము - పశుపోషణ, 3) వాణిజ్యము, 4) సేవ. 'వృత్తి' అనే పేరుగల భూములు బహుశా నిగమశర్మ పూర్వీకులెవరో చేసిన ఏ విద్యాసేవకో మెచ్చి ఏ రాజో యిచ్చిన భూములు కావచ్చు. 'కొలుచు గుత్త చేలు' అంటే ఎకరానికింత ధాన్యం చెల్లించే ప్రాతిపదికన గుత్తకు (కౌలుకు) యివ్వబడిన భూములు. ఇప్పటికీ భూములు కౌలుకిచ్చే భూమందులు (స్వంతదారులు) ఏడాదికి ఎకరానికింత అనే ప్రాతిపదికన కౌలుదారుకు డబ్బుకౌలుకు గానీ, ధాన్యం కౌలుకుగానీ యిస్తారు. ఈ రెండవరకం చేలను 'కొలుచు గుత్త చేలు' అంటారు. గ్రామాంశములు - 'గ్రామకంఠము' అనబడే గ్రామస్థుల ఉమ్మడి ఆస్తి (*Village Common Property*) నుండి కూడా ప్రాచీనకాలంలో బ్రాహ్మణులు, గురువులు వగైరాలకు భూమి దానమివ్వబడేది. అలా గ్రామ ఉమ్మడి భూమినుండి గ్రామస్థులంతా దానంగా యిచ్చిన భూమిని 'గ్రామాంశము' అంటారు. గాది నేలలంటే పాతరలు. ధాన్యాన్ని ధర పెరిగినప్పుడు అమ్ముకొనడానికీ, భవిష్యత్తు అవసరాల నిమిత్తమూ రైతులు ధాన్యాగారములలో (*granaries*), గాదెలలో (గాది, గాదె లేక గాజె అంటే వెదురుతో చేసిన పెద్ద ధాన్యపు బుట్ట - *grain basket made of bamboo*), గడ్డివెంట్లతో చేసిన పురులలో, నేలలో తీయబడిన పాతరలలో నిల్వచేస్తారు. కొత్త ధాన్యపు బియ్యం పాయసాలు, పొంగలి వగైరా తయారీలలో వాడినా, తేలికగా అరుగుదల అవుతుంది మరియు రుచిగా ఉంటుంది కనుక అన్నానికి మాత్రం నిల్వవుంచిన ధాన్యపు బియ్యమే వాడతారు. ఈ కారణంగా కూడా ధాన్యాన్ని నిల్వచేస్తారు. ఏటా పండిన ధాన్యంలో అవసరాలకు సరిపడా వుంచుకొని మిగిలిన ధాన్యాన్ని నేలలో పాతరలు తీసి వాటిలో నిల్వచేస్తారు. అలా పాతరలున్న భూములను 'గాదినేలలు' అంటారు. అటువంటి భూములనన్నిటినీ ఇచ్ఛావిహారవర్తియైన (స్వేచ్ఛగా తిరుగుళ్లకు అలవాటు పడినవాడైన) నిగమశర్మ; చనవరులకు - చనువున్న పరిచితులకు - మిత్రులకు అమ్మజూపుతున్నాడట. వాడేమి కానున్న వాడోమీద - భవిష్యత్తులో వాడేమౌతాడో మరి!

క॥ అతఁడు కళింగోద్భవుఁడగు, కతముననో వ్రేలఁజూపఁ గసుగందక యో
గ్యతమ స్వీకారమునకు, నితరుండై యుండె మునికులేశ్వర! వింటే (పాండురంగ మాహాత్మ్యం : 3-17)

ఓ మునికులేశ్వరా! (ఓ నారద మునీంద్రా!) ఆ నిగమశర్మ కళింగోద్భవుడు (కళింగదేశమున నున్న పిఠాపురములో పుట్టినవాడు) ఐన కతముననో (కారణముగానో ఏమో) వ్రేలన్‌చూప - వ్రేలుపెట్టి చూపిన, అందరూ నిందించుచున్ననూ; కసుగందక - జంకూ గొంకూ లేకుండా; యోగ్యతమ స్వీకారమునకు - యోగ్యమైనవారి మర్యాదలకు, పద్ధతులకు; ఇతరుండై - తగనివాడై; ఉన్నాడు. కళింగదేశస్థులు అనాచారపరులని ప్రాచీనుల విశ్వాసం.

ఈ పద్యానికి మనం వేరుగా కూడా అర్థం చెప్పుకోవచ్చు. కళింగము అంటే పుచ్చతీగ అనే అర్థమూవుంది. పుచ్చతీగకు ఉద్భవించినది - పుచ్చకాయ. సహజంగా తీగలకు కాచే కాయలన్నీ పిందెలుగా వున్నప్పుడు వాటిని వ్రేలితో చూపితే అవి మురిగిపోతాయి. పుచ్చకాయ తీగకు కాసేదే అయినా, పుచ్చపిందెను వ్రేలితో చూపినా అది మురిగిపోదు (కసుగందదు) అయితే పుచ్చపండును శిష్టులు ఆహారంలో నిషిద్ధవస్తువుగా భావించారు. కనుక మన ప్రాచీనులు దానిని యోగ్యతమంగా స్వీకరించేవారుకాదు.

ఎన్నో ఆహార, ఔషధ విలువలు కలిగిన అరటిని మౌఢ్యంతో వర్జనీయంగా భావించిన ప్రాచీనులు ఏకారణంగానో మరి పుచ్చపండును

కూడా నిషిద్ధవస్తువుగా భావించారు. 'శిష్యులందరికీ పుచ్చకాయ తినవద్దని చెప్పిన గురువు తాను తిన్నట్లు' అన్న సామెత జన వ్యవహారంలో వున్న కారణంగా పైకి పుచ్చకాయను నిషిద్ధ వస్తువుగా ప్రకటించినా, ప్రాచీనులలోని 'తెలివైన కొందరు' పుచ్చకాయను భేషుగ్గా తినే వారని అర్థమౌతూంది. ఎన్నో పోషక విలువలున్న అరటి పండును కూడా 'చరక సంహిత' రచనాకాలం నాటికి కూడా భారతీయులు నిషిద్ధ వస్తువుగా భావించినట్లుంది. ఈ శ్లోకం చూడండి -

శ్లో॥ అభుక్త్వా ఉ మలకం పథ్యమ్
భుక్త్వాత్ బదరీ ఫలమ్ ।
కపిత్థం సర్వదా పథ్యమ్
న పథ్యమ్ కదలీ ఫలమ్ ॥ (చరక సంహిత)

ఆమలకము (ఉసిరిపండు) పరగడుపున (ఖాళీకడుపున) తినదగినది. భోజనానంతరం బదరీఫలం (రేగుపండు) తినదగినది. కపిత్థము (వెలగపండు) ఎప్పుడైనా తినదగినదే ! కదలీఫలం (అరటిపండు) మాత్రం ఎప్పుడూ తినదగినది కాదు.

ప్రోటో - ఆస్ట్రలాయిడ్, ద్రవిడియన్ జాతులచే భారతదేశానికి కొనిరాబడి వారిచే పెంపొందింపబడినవని భావిస్తూన్న జంబీర (నిమ్మ), నారికేళ (కొబ్బరి), కదలీ (అరటి) లను ఆర్యులు ఎంతో కాలం పాటు అనాలోచితంగా నిషిద్ధ వృక్షాలుగా భావించారు. ఆర్యావర్తంలో ఎక్కడా ఆ మొక్కలు కనబడనిచ్చేవారు కారట.

అయితే పుచ్చ (*Water melon - Citrullus lanatus syn. Citrullus vulgaris - Family cucurbitaceae*) ఎన్నో ఆహార, ఔషధ విలువలున్న పండు. దీనిలోని సుక్రోస్ (*Sucrose* - $C_{12}H_{22}O_{11}$) కారణంగా వేసవిలో దాహం, అలసట, నీరసం పోగొట్టడానికి యిది పెట్టిందిపేరు. పండులోపలి ఎర్రని గుజ్జునుండి చేసిన చల్లని సిరప్ ఎండవేడిమి వలన కలిగే తాపాన్నుంచి ఉపశమనం కలిగిస్తుంది. దీనిలో హెచ్చుగా ఉన్న పొటాషియం కారణంగా యిది మూత్రకారి (*Diuretic*). కిడ్నీ వ్యాధులలో అద్భుతంగా పనిచేస్తుంది. పుచ్చపండుకు ఇంకెన్నో ఔషధ విలువలున్నాయి.

దొరకిన చోటల్లా అప్పులుచేసి, దివాణంలోనూ, చుట్టాలు, స్నేహితులవద్దా తిరిసి, తిరిసి (బిచ్చమెత్తి, బిచ్చమెత్తి) ఆ బ్రాహ్మణుడు శిశ్నోదరపరాయణత్వంతో (కూడు, కూటములే ఏకైక లక్ష్యంగా) హద్దూ అదుపూ లేకుండా తయారయ్యాడట!

తన మిత్రుల యిండ్లలో మద్యము వగైరా చెడు తాగుళ్లు తాగుతూ, యింటికెన్నడూ వెళ్లకుండా, దురోదరము (జూదము) ద్వారా ఆర్జించినట్టి, చౌర్యహృతమైనట్టి (దొంగతనముద్వారా సంపాదించినట్టి) అనృతోపపన్నమూ (అబద్ధం చెప్పి సంపాదించినట్టిదీ)నైన ధనమును పిచ్చిపిచ్చి ఖర్చులతో దుబారాగా వ్యర్థంచేసే అవివేకియైన నిగమశర్మ ధనలేమి కారణంగా తన గత వైభవంతో తులతూగలేక చిన్నతనంతో కుంచించుకు పోయేవాడట.

క॥ మితి గడచిన ఋణదాతలు, వెత వెట్టఁగ నూరుచొరక వెలివెలిఁ దిరుగున్
దతిఁ గూడులేక యాఁకటఁ, గుతిలపడు నతండు గువ్వకుత్తుకతోడన్
(పాండురంగ మాహాత్మ్యం : 3-20)

తీసుకున్న అప్పులు తిరిగి చెల్లించడానికి విధించిన గడువు తీరిపోగా, ఋణదాతలు వెతపెట్టగా (బాధించగా) వారికి కనపడకుండా ఊళ్లోకివస్తే ఎక్కడ వారెదురౌతారోనని వెలి వెలిన్ (బయట బయటే) తిరిగేవాడట. తతిన్ - సకాలంలో; కూడులేక - తిండిలేక; ఆకట - ఆకలికి; అతండు - ఆ నిగమశర్మ; గువ్వకుత్తుకతోడన్ - గువ్వగొంతుకవంటి బలహీనమైన స్వరంతో; కుతిలపడున్ - బాధపడును.

క॥ వలువకుఁ గూటికినై నీ, చుల వేఁడం బోదచొరవఁ జొచ్చు నతఁడు పూ
వులు ముడిచిన యంగళ్లనె, కలకల వీడెల్ల నవ్వఁ గట్టెలు మోసెన్

(పాండురంగ మాహాత్మ్యం : 3-21)

వలువకు - వస్త్రమునకు; కూటికినై - ఆహారము కొరకునై; నీచులను వేడుకొనడానికి బోడ చొరవతో (మొండి చొరవతో) వెళ్లాడట నిగమశర్మ. పూవులు ముడిచిన అంగళ్లలోనే (పట్టణంలోని జనమంతా కలకల నవ్వగా) కట్టెలు మోశాడట వాడు. 'పూవులు ముడిచిన అంగడిలోనే కట్టెలు మోయడం' అనే కవివాడిన జాతీయం ప్రస్తుతం 'పూవులు అమ్మిన ఊళ్లోనే కట్టెలు అమ్మడం' అనే రూపంలో వాడబడుతూన్నది.

ఆ దుర్విదగ్ధుడు (పోకిరి) పదను దివిసిన (తడి ఆరి, సువాసన పోయిన) కస్తూరిలా, పాయఁబారిన (పాచి పోయినట్టి) కూడులా; నీర్వట్టు మడుగులా (నీరు వట్టిపోయిన చెరువులా) గళితమణి (రవ్వలు జారిపోయినది) యగు సొమ్ము (ఆభరణము)లా గౌరవ దూరుడై (మర్యాదలేనివాడై) కనుపించాడట.

# నిగమశర్మ అక్క

పిఠాపురమునకు ఐదారు యోజనముల (యోజనము అన్నా ఆమడ అన్నా నాలుగు కోసుల దూరము - అంటే ఎనిమిది మైళ్ల దూరం) లోని ఒక ఊరిలో నిగమశర్మ అక్క వుంటుంది. తన తమ్ముడి చెడునడత కారణంగా తమ కుటుంబానికి వస్తూన్న అపఖ్యాతిని గురించి ఆమె కలతజెంది తన భర్తను, పిల్లల్ని వెంట బెట్టుకుని అక్కడికి వచ్చి యిల్లు చక్కదిద్దడానికి, బాలిశుడైన (మూర్ఖుడైన) తన తమ్ముడికి తగిన బుద్ధి చెప్పడానికి తన పుట్టింట్లోనే మకాం వేసింది.

ఆమె తన తల్లిదండ్రులకు ఉపచారాలు చేస్తూ తమ్ముని విషయమై కలతజెందిన వారికి కొంత ఊరట కలిగించింది. తమ ఇలవేల్పుయైన విష్ణువుకు అనునిత్యమూ పూజలు చేయడం, ముకుందారాధనా తిథులలో సంతర్పణలు జరిపించడం, అతిథి అభ్యాగతుల్ని సాదర సత్కారాలతో సేవించడం ఆమె నిత్యకృత్యాలు. అయితే తన తల్లి యిచ్చిన మొత్తంలో ఖర్చులుపోను మిగిలిన సొమ్మును గోప్యంగా దాచిపెట్టుకునే నేర్పరితనం ఆమెకుందట! పశు శిశు దాసదాసీ జనమందరినీ తనవారిగా చూచుకుంటూ వారిని అన్ని విధాలా ఆదుకునేదట. వారింట్లో ఉన్న పెద్ద పుస్తక భాండాగారం యొక్క రక్షణ బాధ్యత తన భర్తకు అప్పగించిందట ఆమె. అలా ఆ విలువైన పుస్తకాలను అగ్ని, నీరు, చినిగిపోవుట, యాచకులు మొదలైన ఉపద్రవాలనుంచి కాపాడే చర్యలు తీసుకుందట ఆమె. విగళిత (చేజారిపోయిన) సన్నాహంబగు (వస్తువులు కలదియైనట్టి) ఆ గేహమును (గృహమును) యథాపూర్వ నిర్వహణ మనోహరంబుగా (యింటినుండి తన తమ్ముడు ఎన్నో వస్తువులను అపహరించిన కారణంగా వెలవెలబోతూన్న ఆ యింటిని కొద్ది కాలంలోనే ఆమె యథాపూర్వంగా కళకళలాడేటట్లు) చేసిందట. ఇకవారి ఆస్తిపాస్తులలో ఏకభోగ గ్రామములని వున్నాయి. వాటిని రాజులు తమ తండ్రి సభాపతికి అనువంశికంగా అనుభవించడానికి మాత్రమే యిచ్చిన కారణంగా అట్టి గ్రామాల్ని నిగమశర్మ తన అప్పులక్రింద అమ్మడంకానీ, అన్యాక్రాంతం చేయడంగానీ చెల్లదు. ఆ కారణంగా అవి మాత్రం చెక్కుచెదరకుండా మిగిలాయట. అంచేత, ఆమె అలాంటి భూములెక్కడెక్కడ వున్నాయో విచారించి, వాటిని తన స్వాధీనంలోకి తెచ్చుకుని, వాటికి తన కుమారుల్ని కాపుదారులుగా చేసి ఆ ఆస్తులను కాపాడిందట.

ఇక తన తమ్ముడి భార్య చూడబోతే చాల గుట్టుగల యిల్లాలు. భర్త దుర్వర్తన కారణంగా కష్టాలు వచ్చినా భరిస్తూ ఓర్పుగా తన అత్తమామలకు భక్తి శ్రద్ధలతో సేవలు చేసుకుంటూంది. దాచినా దాగక విజృంభిచునట్టి నవయౌవనంలో వున్న తన మరదలి సౌందర్యం అలా అడవిగాచిన వెన్నెల కావడం ఆమెకు బాధ కలిగించింది. ఆమెకు సకాలంలో

సంతానం కలిగే అవకాశముందదేమో, ఆమె నవకేశీపలాశి దోహదము (కాలముకాని కాలములో చెట్లు చిగిర్చి, పుష్పించి, ఫలించుటకు చేసే చికిత్సలను 'దోహదము' అంటారు) అవుతున్నదేమో అని తెగ బాధపడిపోయిందట.

సరిగ్గా ఆ సమయంలోనే ఎక్కడినుంచో ఆకస్మికంగా నింగిచుక్క తెగిపడ్డట్లు యింట్లో చద్దన్నం తినిపోవడానికి ఊడిపడ్డాడట నిగమశర్మ. అక్కను చూచి నమస్కరించి, యిక ముందుకు కదలలేక వినయంగా తలదించుకుని నిలబడ్డాడట. ఒక్కసారి తమ్ముడిని తనివిదీరా ఆప్యాయంగా కౌగిలించుకుందామని దగ్గరగా వచ్చిందట ఆమె. అయితే తమ్ముని శరీరంపై లేత చంద్రవంకల వంటి, నెత్తురుచిందే, వంకరలు కలిగిన (మదంతో కొవ్వెక్కిన స్త్రీలచే కలిగించబడిన) నఖక్షతములను (గోళ్లతో చేయబడిన గాయాలు) చూచి, అతనిని కౌగిలించుకొనడానికి సంశయించి ఆ సీమంతిని (ముత్తయిదువ) ఋజుస్వాంతయై (మనస్సును సరిచేసుకున్నట్టిదై) ఆ పోకిరిని తియ్యని ప్రియవచనాలతో హేతుగర్భితంగా 'సీమంతపు పెండ్లి కొడుకువు కమ్మ'ని ఆశీర్వదించిందట. అతడప్పుడు కొంచెం అయిష్టంగానూ, అసహనంగానూ వున్నట్లూ, ఎప్పుడెప్పుడు అక్కడినుంచి బయటపడి వెళదామా అని యోచిస్తున్నట్లూ గమనించి యిచ్చకపు మాటలతో తమ్ముడిని బులిపిస్తూ చంద్రబింబంవంటి తన కుమారుడిని మేనమామకు చంకకిచ్చి 'ఇప్పుడెక్కడికి వెళ్తావు! ఒక్క నిముషంలో వంట పూర్తిచేస్తాను. మీ బావగారూ, నీవూ కలిసే భోజనం చేద్దురుగాని' అంటూ ఆ వెనుక దూరంగా నిలబడిన తన మరదలికి కనుసైగ చేసిందట.

అప్పుడు ఆ పైదలి (యిల్లాలు) శీతల వారిన్ (చల్లని నీటితో) తన భర్త పాదద్వయాన్ని కడిగిందట. అయితే ఆ చల్లటినీరు (ఎల్లెడలా వ్యాపించిన) ఆమె నిట్టూర్పులవేడి కారణంగా కొంత కొంత తప్తములు (గోరువెచ్చగా) అయ్యాయట.

అక్క తమ్ముడికోసం, గొప్ప చుట్టాన్ని విందుకు ఆహ్వానించితే ఎంతటి మర్యాదలతో అన్ని ఏర్పాట్లూ చేస్తారో, అలా కనుగీటినంతలోనే అఖిలాన్నములూ అద్భుతంగా తయారు చేసిందట.

తమ్ముడికి తలస్నానం చేయించి, శుభ్రమైన తెల్లని వస్త్రాలనిచ్చి, తల వెంట్రుకల తడి యార్చి, క్రొవ్విరులు (కొత్తగా అప్పుడే పూచినపూలు) ఆవటించి (అలంకరింపజేసి) మలయజ చర్చచేసి (గంధపు పూతపూసి) వారి యిలవేలుపైన మాధవునకు నైవేద్యంగా సమర్పించబడిన మనోజ్ఞమైన వంటకములను తన తమ్ముడితో కలసి తన తల్లిదండ్రులు, భర్త, తన కుమారులు కూడా భుజించడానికి ఆప్యాయంగా వడ్డించిందట.

నిగమశర్మ యిలా సంతృప్తికరమైన భోజనం చేసి యెంత కాలమైందో! భోజనానంతరం ఆచమనం చేసి మనస్సులో బహుసంతృప్తిచెంది; తన తొయ్యలి (భార్య) తెచ్చి యిచ్చిన తాంబూలము వేసుకొని, చాల బుద్ధిమంతుని వలె చిరునగవులు చిందిస్తూ అరుగుమీద కూర్చున్నాడట.

**(ఆచమనం అంటే కుడిచేతి చూపుడువ్రేలు పొడవుగాచాచి పుడిసిలితో నీళ్లు మూడుసార్లు పుచ్చుకొనడం దీనినే వార్చడం అనీ అంటారు)**

ఆ అక్క తన చిన్నా పెద్దా సంతానంతో సహా అతడి దగ్గరకు వచ్చి ఆప్యాయంగా అతని శిగముడి విప్పి మంచి మనస్సుతో -

**తే॥** ఎలయు సీత్కారములతోడ నీళ్ల గ్రుక్కి
యంటునంటులు పరికించి యంట్లఁ బొడిచి
గోరుముక్కుల దిగదువ్వి తూరుపెత్తి
నెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ దిగిచి (పాండురంగ మాహాత్మ్యం : 3-30)

'ఈరు' అంటే పేనుగ్రుడ్డు. దానికి బహువచనం ఈళ్లు. వీటిని జుట్టు నుండి తొలగించడాన్ని 'ఈరుచు' లేక 'ఈరవడం' అంటారు. అందుకు 'ఈరుపెన' లేక 'ఈర్పెన' అనే ఓ ప్రత్యేకమైన దువ్వెన వాడతారు. 'ఎలయు' అంటే కలుగుచున్న - సీత్కారములతోడన్ - స్త్రీలు ఈళ్లను కుక్కేటప్పుడు 'ఇస్', 'ఉస్' అనే ధ్వనులు చేస్తూంటారు. ఒకదానికొకటి అంటుకుపోయిన జుట్టు పాయల్ని నిశితంగా శోధించి అంట్లను (అంటు పేలను - ఇవి గుడ్ల నుండి ఉత్పత్తి అయి తొలిదశలో చర్మానికి అంటుకొని ఉండడం కారణంగా వీటికాపేరు వచ్చింది) పొడిచి (కుక్కి); గోరుముక్కులతో (వాడియైన కొనగోళ్లతో) దిగదువ్వి (జుట్టును క్రిందకి దువ్వి), తూరుపెత్తి (తూరుపెత్తడం అంటే వెంట్రుకలు పాయతీసి అడ్డంగా ఎత్తి పట్టుకోవడం. ఇలా తూరుపెత్తినప్పుడు అవటువు లేక ముచ్చిలిగుంటలోని వెంట్రుకలలో దాగివున్న పేలను సులభంగా దువ్వి తీయవచ్చు) అలా నెరులలో (తలవెంట్రుకలలో) నున్న పేలన్నింటినీ తిగిచి (తీసి) వేసిందట ప్రేమమూర్తి అయిన ఆ అక్క

ఇక్కడ తమ్ముడి తలవెంట్రుకలలోని పేలను అక్క తానే ఆప్యాయంగా తీయడంలో యింకో ఉద్దేశ్యం వుంది. కులకాంతలు ఎప్పుడూ తమ శిరోజాల్ని పరిశుభ్రంగా ఉంచుకొనడం కారణంగా వారి తలల్లో సాధారణంగా పేలు చేరే అవకాశం లేదు. ఒకవేళ చేరినా వెంటనే తీసివేసుకుని తలను శుభ్రం చేసుకునే తీరిక వుంటుంది వారికి. అంచేత పురుషులకు అటువంటి యిల్లాళ్లనుండి పేలు ఎక్కే అవకాశం లేదు. అదీగాక, వారాలూ, నెలల తరబడి తమ్ముడు యింటి ముఖం చూడడం లేదాయె! అందుకే తమ్ముడి తలలో చేరిన పేలను స్వయంగా తీసి తమ్ముని ఎదుటే కుక్కుతున్నదీ అంటే ఓ రకంగా ఆమె ప్రశ్నించకపోయినా "ఎక్కడెక్కడ చెడు తిరుగుళ్లు తిరుగుతూ ఎక్కించుకుంటున్నావురా యీ పేలు?" అని తమ్ముడిని నిలదీస్తున్నదనే అర్థం.

పేను (*Louse*) యొక్క శాస్త్రీయనామం *Pediculus humanus capitis.* పురుగు మందులు వాడి పెంచబడిన కూరగాయలు, పండ్లు, ఇతర కలుషిత ఆహార పదార్థాలు తీసుకొనడం కారణంగా మానవుల రక్తం నానాటికీ కొద్దికొద్దిగా విషపూరితమవుతూన్నందున - ఆ రక్తం మీద ఆధారపడి జీవించేవైన పేలు (*lice*) క్రమంగా నశిస్తున్నాయి.

# నిగమశర్మకు అక్క హితబోధలు

క్రమమైన స్నానసంస్కారానికి నోచుకొనని తమ్ముడి మెడమన్ను నలిచి, శిరోజాలు ముడివేసి, పద్మములవంటి తన చేతులను గరగరగా (శుభ్రముగా) కడుగుకొని, తన మరదలు తనకు తెచ్చి యిచ్చిన తాంబూలము వేసుకుని, పచ్చని బంగారు విసనకర్రతో ఆమె వీస్తూంటే, చేటిక (దాసి) తెచ్చివేసిన పీటపై కూర్చుని చంటి బిడ్డకు పాలిస్తూ, "ఏరా తమ్ముడూ! నన్ను చూడడానికి ఎన్నాళ్లుగానో నీవు రావడంలేదు. నీకోసం ఎదురు చూచి చూచి నా కళ్లు కూడా ఎలా వాచాయో చూడు! పైకి అనరుగానీ మీ బావ కూడా ఎప్పుడు వస్తావా నువ్వు అని మనస్సులోనే ఎంతగా ఆశపడతారో - చంద్రోదయంకోసం ఎదురుచూసే సముద్రంలా! సముద్రుని వంటి గొప్ప తండ్రికి నువ్వు తగినట్లే చంద్రునివంటి కొడుకువవుతావని అనుకున్నాం. సాలగ్రామం పుట్టిన గనిలోనే అల్పజాతికి చెందినవైన గులకరాళ్లు కూడా పుట్టినట్లుగా అన్నీ తెలిసిన నీవంటి వాడు యిలా పుణ్యములు వీడి అక్రమ మార్గాన నడవటమేమిటి? చెప్పు."

"నేను చూడబోతే పెళ్లై యింకొకరి సొత్తై పోయాను. మిగిలిన పిల్లలా ఊహతెలియని కసుగందులు. నీవే యింటికి పెద్దవాడివి. నీవిలా బాధ్యత మరచి చెడ్డమార్గం పడితే నీ ప్రోపు (రక్షణ) కోసం ఆశపడే ముసలివాళ్లైన తల్లిదండ్రులకు ఎంత దుఃఖమో ఒక్కసారైనా ఆలోచించావా?"

"పరమేష్ఠి (బ్రహ్మ) మొదలు నీ తరం వరకు విశుద్ధమైన గొప్ప వంశం మనది. ఆలోచించావా? బ్రాహ్మణులంతా తాము బ్రహ్మవంశీకులమనుకుంటారు. రామకృష్ణకవి యిక్కడే కాక ఇదే భావాన్ని 'ఉద్భటారాధ్య చరిత్రము'లోని ఒక పద్యంలోకూడా వెలిబుచ్చాడు. "తమ్ముల చుట్టంబగు వేల్పు వంగడమునన్ బుట్టెన్" (ఉ.చ. 2-112) అని మదాలసుని తండ్రియైన ధీనిధి గురించి చెప్తాడు. తమ్ములు అంటే తామరలు. తమ్ముల చుట్టంబగు వేల్పు అంటే తామరనుండి పుట్టిన బ్రహ్మ. మరి విష్ణువు బొడ్డునుండి పుట్టిన తెల్లతామర నుండి పుట్టినవాడు బ్రహ్మ అంటారు గదా! బ్రాహ్మణుల మూలపురుషుడు విష్ణువు బొడ్డులోని తామర నుండి పుట్టిన బ్రహ్మ అని నమ్మితే బ్రాహ్మణులు విష్ణువు ముఖమునుండి, క్షత్రియులు బాహువులనుంచి, వైశ్యులు ఊరువుల నుంచి, శూద్రులు పాదాలనుంచి జన్మించారనడం అందుకు విరుద్ధంగా లేదా! ఋగ్వేదంలోని 'పురుష సూక్తం'లో వర్ణించబడిన వేయి తలలూ, వేయి కళ్ళూ, వేయి పాదములూ కల పరదైవతమైన విరాట్ పురుషుడు విష్ణువేనని విశ్వాసం.

బ్రాహ్మణో అస్య ముఖమాసీత్
బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాం శూద్రో అజాయత॥

అందుకే రామకృష్ణకవి శూద్రులను 'విష్ణువు పాదోద్భవియైన గంగకు తోడబుట్టిన వార'న్నాడు (పాండురంగ మాహాత్మ్యము 1-112). వారు 'అభ్రగంగకు తోడంబుట్టువు'లనీ 'పాలమున్నీటికి మఱందుల'నీ అన్నాడు (ఉ.చ. 1-157). వాళ్లు కూడా గంగ వలె విష్ణువు పాదము నుంచి పుట్టారు కనుక వారామెకు తోబుట్టువులు; కనుకనే సముద్రునికి బావమరదులూనట. మరి బ్రాహ్మణులు బ్రహ్మనుంచి పుట్టుకొచ్చారో లేక విష్ణువు ముఖం నుంచి పుట్టుకొచ్చారో కవిగారు సెలవివ్వలేదు. బ్రహ్మ విష్ణువు ముఖం నుంచి పుట్టలేదనీ, విష్ణువు బొడ్డులోని తెల్ల తామర నుంచి పుట్టాడనీ పురాణ ఘోష. బ్రాహ్మణులు విష్ణువు ముఖం నుంచి పుట్టారని వేదఘోష. కనుక వారి మూల పురుషుడు బ్రహ్మ కావడానికి వీల్లేదు. ఇలా పరస్పరం పొసగని అశాస్త్రీయ విశ్వాసాలను కలిగివుండడంలో మహాకవి తెనాలి రామకృష్ణునికి మినహాయింపేమీ లేదు.

కొందరు 'బ్రహ్మ' అంటే 'చతుర్ముఖ బ్రహ్మ' కాదనీ, వేదాలలోని 'బ్రహ్మన్' త్రిమూర్తులకూ మూలమైనట్టి ఆదిదేవుడనీ, అలాంటి బ్రహ్మ తమకు మూలపురుషుడుగా కలిగిన వారు బ్రాహ్మణులనీ వాదిస్తున్నారు. బ్రాహ్మణుల వ్యుత్పత్తి సిద్ధాంతాన్ని ఈ వాదన మరింతగా చిక్కుల్లో పడేస్తుంది. ఋగ్వేదంలోని పురుష సూక్తం ప్రకారం ఒక్క బ్రాహ్మణులకే ఏం 'ఖర్మ' - క్షత్రియులకూ, వైశ్యులకూ, శూద్రులకూ కూడా ఆయనే మూల పురుషుడు. బ్రాహ్మణులు పరస్మై పురుషుని ముఖాన్నుంచి పుట్టుకొచ్చినట్లే వారు కూడా వరుసగా ఆయన బాహువుల నుంచీ, తొడల నుంచీ, పాదాల నుంచీ పుట్టుకొచ్చారు కదా ! ఈ లెక్కన వారంతా కూడా బ్రహ్మ సంతానమే కనుక బ్రాహ్మణులనే పిలువబడాలి కదా ! ఇలా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులంతా ఒకే మూలపురుషుడి సంతానమనే విషయాన్ని మరి ఆ ధరానిలింపులు (భూసురులు) అంగీకరిస్తారా ? వారు అంగీకరించినా, అంగీకరించకున్నా 'బ్రాహ్మణ' అంటే చతుర్ముఖ బ్రహ్మ లేక ఆది దేవుడైన బ్రహ్మ యొక్క వంశీకులు అని భావం కాదనేది సత్యం. 'బ్రాహ్మణ' అనే పదానికి 'బ్రహ్మజ్ఞానం కలిగిన' అని అర్థం. సంస్కృత మహాభారతంలోని భీష్మ పర్వంలోని ఈ శ్లోకం చూడండి.

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః
కర్మణా జాయతే ద్విజః
వేదపారమ్ తు విప్రాణామ్
బ్రహ్మ జ్ఞానమ్ తు బ్రాహ్మణః

దీని భావం పుట్టుకతో అందరూ శూద్రులే. వేద విహితమైన కర్మలు చేయడానికి యజ్ఞోపవీతం ధరించిన వారు రెండు జన్మల వారు (ద్విజులు) అవుతున్నారు. వేద పారాలు నేర్చిన వారు విప్రులు (తెలివైనవారు; విజ్ఞులు) అనబడతారు. బ్రహ్మజ్ఞానం కలిగిన వారు మాత్రమే బ్రాహ్మణులు అనబడతారు.

కనుక మన ప్రాచీన సాహిత్యం ప్రకారం కూడా కర్మ బ్రాహ్మణ్యం తప్ప జన్మ బ్రాహ్మణ్యమనేదేమీ లేదు. కర్మ (వారు ఆచరించే పనుల) వలననే ఎవరైనా బ్రాహ్మణులౌతారు. వ్యాసుడు, వాల్మీకి, విశ్వామిత్రుడు వగైరాలను మించిన బ్రాహ్మణులెక్కడ ఉన్నారు ? మరి వారంతా

జన్మత: బ్రాహ్మణులు కాదే! ఒకప్పుడు దైవశాస్త్రం *(Theology)*, తత్త్వశాస్త్రం *(Philosophy)* వగైరా బ్రహ్మవిద్యలలో నిష్ణాతులై బ్రహ్మజ్ఞులు, తత్త్వజ్ఞులు లేక దైవజ్ఞులు అనబడిన వారే బ్రాహ్మణులని పిలువబడే వారు. కనుక బ్రాహ్మణ్యమనేది వేద విద్యలతో ముడిపడిన ఓ వృత్తి మాత్రమే అది జాతీ కాదు, కులమూ కాదు ఆ వృత్తినవలంబించిన వారంతా బ్రాహ్మణులే. బ్రాహ్మణ్యం జన్మద్వారా సంక్రమిస్తుందనీ, తాము పుట్టుకతో చతుర్ముఖ బ్రహ్మ లేక విష్ణువు వంశీకులమనీ, తామేదో మెడలలో జందెములతోనే పుట్టుకొచ్చినట్లు ఇంకా ఎవరైనా విర్రవీగుతూంటే వారినలా వారి ఊహా స్వర్గాల్లో విహరించనిద్దాం !

ఇక ఆ సంగతలా వదలి వేసి పురాణాలలో చెప్పబడిన పరస్పరం పొసగని మరో విషయాన్ని చూద్దాం

పాల సముద్రంలోని తెలిదీవి (శ్వేతద్వీపం)లోని రత్నాద్రి అనే పర్వతంలోని ఒక గుహలో విష్ణువు నివాసమైన వైకుంఠపురమున్నట్లూ, దానిలోని ఏడు నగళ్లను దాటి వెళ్తే అక్కడ బహుయోజనముల విస్తీర్ణం కలిగి, బహు నారీయుతమైన ఒక కేళీ గృహములో పాము అనే ఊయలపై లక్ష్మీదేవితో సహా విష్ణువున్నట్లు పేర్కొన్నాడు రామకృష్ణ కవి (పాం మా - 3-159, 160) కవి మరొక చోట (పాం మా - 3-142) పాలసముద్రాన్ని 'నీరజోదర యోగ నిద్రావరణ సీమ' అంటూ పేర్కొన్నాడు పాలకడలిపైన శేషతల్పంపై ఆదిలక్ష్మి పాదాలు వత్తుతూ ఉండగా విష్ణువు పరుండి వుంటాడని పురాణాలు కూడా పేర్కొంటున్నాయి. అసలు 'నారాయణ' అంటేనే 'నీరు ఉనికి పట్టుగా కలవాడు అని అర్థం 'మనుస్మృతి'లోని ఈ క్రింది శ్లోకం చూడండి

**శ్లో॥ ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః ।**
**తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః ॥ (మనుస్మృతి 1-10)**

"ఆపములు (నీరు) నారా అనబడతాయి. ఆపములు నరసూనువులు. అట్టి నారములు యీ పరమాత్మకు ఉనికిపట్టులగుటచేత ఈ పరమాత్మ నారాయణుడనబడ్డాడు." (నారా ఆపః అయనం స్థానం యస్యసః - జలము స్థానముగా కలవాడు - అమరకోశమ్)

జగన్నాథ పండితుడు నారాయణ శబ్దాన్నిలా వివరించాడు. "నీరే నీరచరైః సమమ్ స భగవాన్ నిద్రాతి నారాయణః"

కవి విష్ణువును 'వనధి వనధాముడు' - (సముద్రములోని జలమే నివాసముగా కలవాడు) అని వేరొక తావులో పేర్కొన్నాడు. (పాం మా. 2-108) నీటిపైన తేలియాడుతున్న శేషపాన్పుపై శయనించిన వాడు కనుకనే విష్ణువుకు నారాయణుడని పేరు వచ్చింది. పాలసముద్రంలోని తెలిదీవిలోని రత్నాచలములోని గుహలో వైకుంఠపురమనే నగరం ఉండడం, దానిలో ఏడునగళ్లు దాటి వెళ్లిన తరువాత అక్కడ బహుయోజనముల విస్తీర్ణం కలిగిన, బహు నారీజన యుతమైన ఒక కేళీ గృహం ఉండే అవకాశం వుండడం ఏమేరకు సాధ్యమనే సంగతి అటుంచి అసలు నారాయణుడి నివాసం పాలకడలిలోని శేషపాన్పా ? లేక తెల్లదీవిలోని రత్నాద్రిలోని గుహలోని కేళీ గృహమా ? ఒకదానికొకటి వైరుధ్యంగా అనిపించడం లేదూ ? ఇందులో వైరుధ్యమేముంది ? సర్వ వ్యాపి *(Omnipresent)* సర్వాంతర్యామి *(Immanent and Transcendent)* అయిన శ్రీహరి అక్కడా యిక్కడా కూడా ఉంటాడు - అని కొందరు అనవచ్చు. ఆయన సర్వాంతర్యామి అయినా ఆయన యొక్క ప్రధాన కార్యస్థలం *(Head Quarters)* ఏది ? - అనేది కదా ప్రస్తుత ప్రశ్న ఒకచోట ఒకరకంగానూ, మరొక చోట మరొక రకంగానూ, శ్రీహరి ప్రధాన కార్యస్థలం వర్ణించబడ్డది. ఇలా పరస్పరం పొసగని అశాస్త్రీయ విశ్వాసాల సమాహారమే మన పురాణాలు. మన కవిగారు కూడా ఈ అశాస్త్రీయ విశ్వాసాలకతీతంగా ఏమీ లేదు.

'పయస్సు' అన్నా 'క్షీరము' అన్నా సంస్కృతంలో పాలు అనే అర్థంతో పాటు 'మంచినీరు' అనే అర్థమూ ఉంది కనుక క్షీర సాగరం (పాలసముద్రం)లో వున్నది పాలు కాదు - మంచినీరే అయివుంటుంది అనే శాస్త్రీయ భావనకు 'నారాయణ' అనే శబ్దం యొక్క వ్యుత్పత్తి అర్థం మరొక ఋజువు. నారము అంటే నీరు. నీటిపైన - నీరు వునికి పట్టులుగా - నిదురించే వాడు కనుకనే విష్ణువు నారాయణుడు అనబడ్డాడు అంచేతనే ఒక వేళ విష్ణువు చారిత్రక పురుషుడే అయివుంటే అతడు నీటిపైన తేలే శేషపాన్పుపై శయనిస్తాడనే అంధవిశ్వాసాన్ని అటుంచితే, ప్రపంచంలోని అతి పెద్ద మంచి నీటి సరస్సైన బైకాల్ సరస్సు సమీపంలోనే ఆయన నివాస స్థలము వుండి వుంటుందనీ, పురాణాలలో పేర్కొనబడ్డ పాలసముద్రమే బైకాల్ సరస్సనీ నేను విశ్వసిస్తున్నాను.

తతిఁ దక్కియున్న (మరణ సమయం ఆసన్నమైయున్న) యీ తల్లి దండ్రులను చాల పఱచవై (అల్పుదవై) సంతోష పరచవైతివి. అగ్నిసాక్షిగా పెండ్లాడిన యీ లలితాకారయైన యిల్లాలిని ఒల్లవైతివి. ధర్మశాస్త్రార్థాలు తెలిసిన పండితులను పోషించి సంతోషపెట్టి విఖ్యాతి నొందవైతివి. నీ చదువులన్నీ నిరర్థకమైన చిలుకపలుకులనీ (అర్థం

తెలుసుకొనకుండా వల్లెవేసినట్టివేననీ) నీ శీలమంతా పిల్లి శీలమనీ (కపటమైన నడత అనీ) తోటివారందరూ నవ్వుతూండగా – ఓ నా తోడబుట్టినవాడా! ఎందుకిలా బేల (మూఢుడు) గా మారావు? నీకీ దుర్గుణం ఎందుకు? చెప్పు."

అంటూ ఆ కంఠీరవమధ్య (సింహము నడుము వంటి నడుము కలిగిన ఆమె) తన తమ్మునికెన్నో విధాలుగా హితబోధలు చేసింది.

ఇంకా, "నా తమ్ముడు సత్పురుషులచే కొనియాడబడే నీతివంతమైన ప్రవర్తనతో అందరి మెప్పునూ పొందుతాడు. ఆతడు నిర్వహించే యజ్ఞంలో నేను పూజ్యురాలినిగా వేదికపై ఆసీనురాలనౌతానని వేలమందికి చెప్పుకొన్నానే! కాని, నీవు ఏదీ లేకుండా యిలా సర్వగుణహీనుడిలా తయారవటం నేనెరుగనురా, తమ్ముడూ!" అని వాపోయింది.

శా॥ వీరావేశముదాల్చి సర్వధనముల్ వెచ్చింతుగాకేమి ము
క్కారుం బండు నఖండ సేతువృతముల్ కాశ్మీర ఖండంపుఁ గే
దారంబుల్ తెగనమ్మఁగాఁజనునె? నిర్దారుండవే? వెన్కనె
వ్వారున్ లేరె సహోదరాదులు? కులధ్వంసంబు నీకర్హమే? (పాండురంగ మాహాత్మ్యం : 3-40)

"నీవే మొనగాడిననుకుని చరాస్తి మొత్తాన్నీ ఖర్చు చేస్తే చేశావేమో; మూడు పంటలూ పండేవీ ఎక్కడా ఖండితములుగాని గట్లతో చుట్టబడినవీ నైన (పెద్ద పెద్దవైన భూఖండాలు) కాశ్మీర ఖండములనే వడ్లు బాగాపండే మేలిరకపు కేదారములు (వరి పొలాలు) తెగనమ్మటం ఏమైనా పద్ధతిగా వుందా? నిర్దారుండవే? (దార అంటే భార్య; నీవేమైనా భార్యలేనివాడవా?) నీ తరువాత ఆస్తిని అనుభవించడానికి నీ తమ్ముళ్లూ మొదలైనవారు లేరా? ఈ విధంగా కుల (వంశ) నాశనం చేయడం నీకు ధర్మమా?" అంటూ యింకా,

"నీ ఆత్మలో కామవికారం తీవ్రతరమైతే గొప్ప శోభతో వెలుగొందేవారూ, రూపమూ, గుణమూ, శీలమూ, కుల ఔన్నత్యమూ కలిగిన బ్రాహ్మణ కన్యామణుల్ని వేయిమందినైననూ వరించి (వివాహమాడి) రమింపరాదె? (అనుభవించ రాదా?) సంసారులు మునులు కాదుగదా? భర్త తన ధర్మపత్నులెందరినైనా రమించడం తప్పేమీ కాదుకదా? నీవు చపలత్వంతో మత్తకాశినులకు (బోగము స్త్రీలకు) యిళ్లూ మొదలైన స్థిరాస్తులూ, బంగారము మొదలైన చరాస్తులూ ఎందుకు ధారపోయాలి? లోకంలోవున్న మన్నీలూ (రాజులూ, జమీందారులూ) ఆఢ్యులూ (ధనవంతులూ) యిలా భోగకాంతలకు తమ ఆస్తులను ధారపోయడానికి సరిపోవడం లేదా? ('నీలాంటి పిచ్చి బ్రాహ్మడే దొరికాడా వాళ్లకి?' అని భావం) ఇలా నీవు ధనాన్నీ, ఆస్తిపాస్తుల్నీ వ్యయం చేయడంవల్ల నీకేం ఒరిగింది? పెద్దదాన్నైనా చేతులెత్తి నిన్ను ప్రార్థిస్తున్నాను. ఆ వారకాంతల్ని వదలిపెడితే నీకు తప్పక లాభం కలుగుతుంది. ఉత్తముడైనవాడు ఎక్కడన్నా దుశ్శీలాగారము (చెడునడతకు నిలయమైనది) అనదగిన వారవనితల గుంపును పాటిస్తాడా? (లెక్కచేస్తాడా?)" అన్నది. తమ్ముడు తన మాటల్ని ఓపిగ్గా వింటూండడంతో – ఆమె రెట్టించిన ఉత్సాహంతో వేశ్యలపై తమ్ముడికున్న వ్యామోహాన్ని పోగొట్టడానికి వారకాంతలు విటుల్ని ఎలా మోసగించి తమ బుట్టలో వేసుకుంటారో యిలా వివరించసాగింది.

సీ॥ నర్మగర్భోక్తులు నక్కటక్కులు వింత నయగారములు బహు నాటకములు
పిలుపిచ్చు విద్యలు పిఁకవన్నియలును బెలుచఁదనంబులు ప్రేలదములు
వక్రభావంబులు వలకారిబాగులు వలసియొల్లములును వట్టిపసలు
కేరడంబులు సొళగింపులు కిళ్ళిషాక్రీడనంబులు నడకించు వగలు

తే॥ బాసపోసనములు విడంబములు భ్రమలు, లేనిమచ్చిక లివియాదియైన వివిధ
దుర్గుణంబుల ప్రోవులు ద్రోహమతులు, వారకాంతలఁ దడవిన వచ్చుఁ గీడు.

(పాండురంగ మాహాత్మ్యం : 3-43)

నర్మము అంటే పరిహాసము; నర్మగర్భ + ఉక్తులు – పరిహాసము దాగియున్న మాటలు; వేరే అర్థం స్ఫురింపజేసే మాటలు; నక్కటక్కులు – జిత్తులమారి నక్కలా అతివినయాన్ని ప్రదర్శించడం; వింత నయగారములు – వింత పద్ధతిలో పలికే ప్రియ వచనాలు; బహు నాటకములు – పెక్కు కపట నాటకములు; పిలుపిచ్చ విద్యలు (మణి, మంత్ర, ఔషధ, వశీకరణ చేసుకొనడం వగైరా) అతినీచమైన, హీనమైన పనులు; పీఁకవన్నియలు – పై పై మెరుగులు; పెలుచఁదనంబులు – మొరటుతనములు; ప్రేలడములు – వదరుబోతులై యిష్టంవచ్చినట్లు మాట్లాడడం; వక్రభావంబులును – వంకర ఆలోచనలు; వలకారిబాగులున్ – ప్రేమలో పడవేసే నేర్పరితనాలు; వలసి యొల్లములును – కావాలనే ఉపేక్ష చేయడాలు; ఏదో ఉద్దేశ్యం మనస్సులో పెట్టుకొని బెట్టుగా పట్టీ పట్టనట్లుండడం; వట్టిపసలు – ఒట్టొట్టి చాతుర్యములు; కేరడంబులు – పరిహాసంగా తిరస్కరించడాలు; సొళగింపులు – అంతలోనే కలివిడిగా కలగలసిపోవడాలు; కిల్బిషా క్రీడనములు – తప్పుడు ఆలోచనతో – దురుద్దేశ్యంతో ఆడే ఆటలు (ఆస్తి వ్రాయించుకునే ఉద్దేశ్యంతో ఆడే మాయా జూదం, ప్రియుడిని మద్యం మత్తులో ముంచి పందెములుకాసి ఆడే ఆటలు వగైరా) అడకించు వగలు – మోసపు ఏడుపులు; కల్లబొల్లి (దొంగ) ఏడ్పులు; బాస పోసనములు – పొందికైన భాషతో పలికే పైపూత మాటలు; విడంబములు – మోసపు అనుకరణలు (ఒక వేశ్య తన విటుడిని ఎలా బుట్టలో వేసుకున్నదో తెలుసుకొని అలాగే మరొక వేశ్య అనుకరించడం) భ్రమలు – మోహములు, భ్రాంతులు కలిగించడం; లేని మచ్చికలు – కపటపు ప్రేమలు, లేని మక్కువలు; ఇవి యాదియైన – ఇవి మొదలుగా కలిగిన; వివిధ – పలురకములైన; దుర్గుణంబుల ప్రోవులు – చెడ్డ గుణముల యొక్క రాశులు; ద్రోహమతులు – ద్రోహబుద్ధికలవారు; వారకాంతలన్ - (అటువంటి) వేశ్యా స్త్రీలను గూర్చి తడవినన్ – ప్రసంగవశాత్తూ ప్రస్తావించిననూ; కీడు – పాపము; వచ్చున్ – ప్రాప్తించును.

తమ్ముడితో ఆమె యిలా హితవు పలికింది –

"ఇకనైనా మంచేదో చెడేదో తెలుసుకొనలేని యీ అవివేకాన్ని విసర్జించు. నేను చెప్పిన పద్ధతిననుసరించి సక్రమ మార్గంలో నడువు. నీకు కావాల్సివస్తే విష్ణువు యొక్క వక్షస్థలంలో ఉండే ఆభరణమైన కౌస్తుభమణినైనా తెచ్చి యిస్తాను. (అంటే ఎంతటి దుర్లభమైన వస్తువునైనా నీవు కోరిందే తడవుగా తెచ్చి యిస్తాను అని భావం.) అసాధ్యులూ, కుచ్చితపు స్వభావంగల పలుగాకులను (పలుగు + కాకులు – దుష్టులు) వదిలెయ్యి; నీ చెయ్యి పైన ఉండేట్లు (అంటే దానమిచ్చే చెయ్యిగా) ఎప్పుడూ యితరుల మీద ఆధిక్యంతో పూర్ణకాముడిగా (నెరవేరిన కోరికలు గలవాడిగా) జీవించావు – యిప్పటి వరకూ. నాకు తమ్ముడవైనందున నా మాట పెడచెవిని పెట్టొద్దు. ఇలా చేయడం నీకు భావ్యమా?" అని ముగించింది.

అక్క యీ విధమైన హితవచనాలు ప్రేమతో పలుకగా, అవి రుచించకున్నా, నిగమశర్మ చాల దినముల నుండి మైలపడి, నీరసించి, యింటి భోజనానికి మొగమువాచి వున్నందున అయిష్టంగానే తల ఊపాడు. ఇకనేం యింట్లో వారంతా సంబరపడి పోయారు – నిగమశర్మ మారాడని.

నిగమశర్మలో మార్పు కూడా కొంత కొట్టవచ్చినట్లే కనుపించిందట. అతడు రోజూ దివాణానికి వెళ్లివస్తున్నాడట. మరచిపోయిన వేద విద్యలన్నీ మరల మరల చదువుకొని జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాడట. ఇంతకాలం తాను స్నేహం చేసిన వ్యక్తులు ఎదురైతే తలదించుకుంటున్నాడట. ఇన్నాళ్ల తన దుష్టప్రవర్తనకు తనను మన్నించమని కులవధువును (భార్యను) కుస్తరిస్తున్నాడట (సముదాయిస్తున్నాడట). గురువులను ప్రతిరోజూ సంభావనలతో సత్కరిస్తున్నాడట. దేవతా విగ్రహాలకు

క్రమం తప్పక నైవేద్యాలు సమర్పిస్తున్నాడట. కుతపవేళకు యింటికి వచ్చిన అసంఖ్యాకులైన అతిథులను సమాదరించి వారికి తగు భోజనాదులు ఏర్పరచి ఉచితరీతిన వారిని సేవించేవాడట.

సూర్యోదయాన్నుంచి సూర్యాస్తమయం వరకు గల పగటి కాలాన్ని దినము లేక దివసము అంటారు. దీనిని 15 భాగములుగా విభజించారు. వీటిని ముహూర్తములంటారు. దినములో 12 గంటలు - అంటే 720 నిముషాలుంటాయి. కనుక ముహూర్తము అంటే 48 నిముషాలు. అందులో ఎనిమిదవది కుతపము. అంటే సూర్యోదయ సమయాన్నుంచి 7 ముహూర్తాలు గడచిన తరువాత అంటే సరిగ్గా సూర్యోదయం తరువాత 5 గంటల 36 నిముషాల తరువాత ప్రారంభమై 6 గంటల 24 నిముషాలకు ముగిసే ఎండమండే మధ్యాహ్న వేళ కుతప ముహూర్తమన్నమాట. ఒక రోజు సూర్యోదయం 5 గంటల 40 నిముషాలకు అయిందనుకుంటే ఆ రోజు 11 గంటల 16 నిముషాల నుండి 12 గంటల 4 నిముషముల మధ్య కాలం కుతప ముహూర్తమన్నమాట. పితృదేవతలకు హవిస్సులూ, తర్పణలూ సమర్పించడానికి కుతపము అత్యంత అనుకూలమైన ముహూర్తమని భావిస్తారు.

పశువుల మందను సంరక్షిస్తాడట; పంట పొలాలకు వెళ్లి వాటి స్థితిగతులు తెలుసుకునేవాడట. తండ్రి యొక్క ఉద్గమనీయమును (దోవతిని) తానే స్వయంగా ఉతికేవాడట. అత్తికా భర్త (అక్క భర్త) తో అల్ప సరదిన్ (మృదువైన రీతిలో) నవ్వునట (మేలమాడుతాడట. పరాచకాలాడతాడట) అంగడికి (రచ్చబండవద్దకు) వచ్చి గ్రామ కార్యములు (ఊరివారి తగవులు, వ్యాజ్యెములు వగైరా) పరిష్కరించేవాడట. ఇవన్నీ ఆ ధాత్రీసురుడు (బ్రాహ్మణుడు) తేనె పూసిన కత్తిలా చేస్తున్నాడట. అంటే పైకి నడవడిక మారినట్లు కనుపిస్తున్నా లోలోపల తన దుష్టచింతన మానక తగిన అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడన్నమాట.

## నిగమశర్మ పలాయనం

అలాంటి అవకాశం రానే వచ్చింది. ఇకనేం నిగమ శర్మ యిల్లంతా తుడిచిపెట్టి విలువైన నగలూ వగైరా మూటగట్టి పలాయనానికి సిద్ధమయ్యాడు.

సీ॥ గోమేధికో పలాంకుర మానితంబులు పుష్యరాగచ్ఛటా పుంఖితములు
వైదూర్య సంధాన వర్ణనీయంబులు హరినీల కీలనాభ్యంచితములు
కురువింద సందర్భ గురుతరంబులు చతుర్విధ వజ్రదళ సమావేల్లితములు
మహనీయ తర హరిన్మణి పరీతంబులు నకలుష స్థూల మౌక్తిక యుతములు

తే॥ పద్మరాగ పరీరంభ భాస్వరములు, దంత విద్రుమకృత సముద్గక భృతములు
మాతృభూషలు నత్తికా మండనములు, నిజయువతి దాల్చు సొమ్ములన్నియు హరించి.

(పాండురంగ మాహాత్మ్యం : 3-48)

ఈ చక్కటి పద్యంలో కవి మనకు నవరత్నాలతో పొదగబడిన వివిధ ఆభరణములను పరిచయం చేస్తున్నాడు. నవరత్నాలంటే ఏమిటో, అవి లభించే తావులు, యితర వివరాలకోసం ప్రత్యేకానుబంధం చూడండి. ఇక ఆ ఆభరణాలెలా వున్నాయో చూద్దాం.

గోమేధిక ఉపల (మణులయొక్క) అంకుర (మొలకలచేత) మానితంబులు (కూర్చబడినవి); పుష్యరాగముల ఛటా - గుంపులచేత; పుంఖితములు - పుంఖాను పుంఖముగా చేయబడినవి; వైదూర్యముల యొక్క సంధాన (కూర్పుచేత)

వర్ణనీయంబులు – పొగడదగినవి; హరినీల – ఇంద్రనీలమణులయొక్క కీలన (కూర్పుచేత) అభ్యంచితములు – ఒప్పిదమైనట్టివి, కురువింద మణుల; సందర్భ – కూర్పుచేత; గురుతరంబులు – గొప్పవైనట్టివి; చతుర్విధములైన వజ్ర (మణుల); దళ (రేకులతో); సమావేల్లితములు – బాగుగా ఆవరించిన ప్రకాశము కలవి; మహనీయతర – గొప్పవైన; హరిన్మణి – పచ్చలచే; పరీతంబులు – పొదగబడినవి; అకలుష – దోషములేని; స్థూలమౌక్తిక- పెద్ద (మంచి) ముత్యాలతో; యుతములు - కూడినవి; పద్మరాగ మణులు; పరీరంభ (పొదుగుటచే) భాస్వరములు (వెలుగొందునట్టివి); దంత – దంతముతోనూ; విద్రుమ – పగడములతోనూ; కృత – చేయబడిన; సముద్గక (బరణి, బరిణె; మందసము లేక సంపుటములో); భృతములు – ఉంచబడినవీనైన; మాతృభూషలు – తల్లి నగలు; అత్తికా మండనములు – అక్క నగలు; నిజ యువతి – తన భార్య; తాల్చు – ధరించు; సొమ్ములు – నగలు; అన్నియూ అపహరించి –

ఒకనాటి రాత్రి పడుకునే పడకకు కూడా చెప్పకుండా గాఢ తమోనికరము (చిమ్మ చీకట్ల సముదాయమే) తన తోడుగా ఒక్కడే పేరడవిత్రోవ (కారడవి దారి)లో పరుగెత్తుకుంటూ వెళ్లాడట.

ఇక యిక్కడ యింటి దగ్గర వృద్ధ బ్రాహ్మణుడు సభాపతి (నిగమశర్మ తండ్రి) తన తండ్రి తనకిచ్చిన దర్భముడి వుంగరం పోయిందని కలత చెందాడట! నిగమశర్మ తల్లేమో తన అత్తగారు తనకిచ్చిన హరిసుదర్శనపు పేరు (హారము లేక దండ) కోసం వనట (దుఃఖము) పొందిందట. ఆడబిడ్డేమో తాను కొత్తగా చేయించుకొన్న ముక్కర కోసం ఎవరెంతగా ఓదారుస్తున్నా ఆగకుండా గొల్లుమన్నదట. ఇక జామాత (అల్లుడేమో) వ్యామోహియై తన నవగ్రహ కర్ణవేష్టనము (నవగ్రహ శాంతి కోసం చేయించుకున్న చెవిపోగు) పోయిందని వెతఁబొందాడట. అలా ఆ దురాచారశీలుడు సర్వధనములూ ఊచముట్టుగా (నిశ్శేషముగా – ఏమీ మిగల్చకుండా) దోచుకొని పోవడం వారందరినీ శోకసాగరంలో ముంచింది.

మోయటానికి శక్యం కానంత బరువైన ఆ సొత్తును మోసుకుంటూ దారీతెన్నూ కానరాని ఆ పేరడవిలో, చావునకు సిద్ధమై ఒక్కడే మొండిధైర్యంతో వెళుతూ వుండగా ఓ ఊరికి సమీపంలోని కారడవిలో కరుణలేనివారూ, కారుచీకటి వలె నల్లనైనవారూ, త్వరగా వస్తువులు దొంగిలించడంలో నేర్పరులూ, విశ్వద్రోహులూ, అసాధ్యులూనైన కొందరు దొంగలు ఒక్క ఉదుటున అతనిని చుట్టుముట్టి గుండెలు పగిలే విధంగా అతనిపై బాణములు సంధించారట. అతని శరీరంపై ఆ అమ్ములు పెద్దపెద్ద గాయాల్నే చేసినప్పటికీ యింకా యీ భూమి మీద అతనికి నూకలు చెల్లనందున అవేవీ మర్మస్థానములకు తగలలేదట! బకాసురుని వంటి దొంగలు ఆ భ్రష్టుడిని తృటిలో దోచుకుని ఎక్కడివాళ్లక్కడే చెట్టుకొకడూ, పుట్టకొకడుగా చెల్లాచెదరై పోయారట.

## కాపు కొడుకు ఉపచారాలు

అప్పుడా బాటవెంట వెళుతూన్న కాపు (శూద్రుడి) కొడుకు ఒకడు యీ కాపురుషుడిని (నీచుడిని) చూచి జాలిపడి అతనిని తన యింటికి తీసుకువెళ్లి సకలోపచారాలూ చేశాడట. తడిగుడ్డతో ఒంటిపైని రక్తపు మరకలన్నీ తుడిచాడట. అతని ప్రాణములు కూర్కుపాటు (నిద్ర)కుపక్రమిస్తున్నాయట. అంటే అతని కడప్రాణాలు దీర్ఘనిద్ర (మరణాని) కుపక్రమిస్తున్నాయట. ఆ స్థితిలో కూర్కు ప్రాణములను మేల్కొల్పడానికా అన్నట్లు ఆ కాపు యువకుడు గాయాలకు సంబంధించిన గంట్లలోకి శాకినీ కాండములను (పెరుగు తోటకూర కాడలను) జొప్పిస్తున్నాడట.

శాకినీ అంటే స్త్రీ పిశాచమనీ, పెరుగుతోటకూర అనీ రెండర్థాలున్నాయి. 'శాకవీర' అని కూడా పిలువబడే పెరుగుతోటకూర (*Amaranthus blitum syn. A.lividus*) మన ఆహారంలో ఆకుకూరగా వాడబడడమే కాక, ఎన్నో ఔషధ విలువలున్న మొక్క. దాదాపు

తోటకూర జాతులన్నీ విషఘ్నములే (విషాన్ని హరించేసేవే). అందుకే పుండ్లు కడగడానికి వీటి ఆకుల రసం వాడతారు. జ్వరహారిణి (*febrifuge*) గా కూడా దీనికి పేరుంది. రక్తస్రావాన్ని అరికడుతుంది కనుకనే దీని ఆకుల్ని నూరి గాయములకు, వ్రణములకూ కడతారు. బహుశా అందుకే ఆ కాపు యువకుడు కూరుకుపోటు పడుతున్న నిగమశర్మను స్పృహలోనికి తేవడానికి పెరుగు తోటకూర కాడలను అతని గాయాల గంట్లలోనికి జొప్పించి వుంటాడు.

శమనుడి (యముడి) దూతలు నిగమశర్మ ప్రాణాలు తీసుకెళ్లడానికి వస్తే యిప్పుడింకా సమయం ఆసన్నంకాలేదని వాళ్లని పారద్రోలుతున్నాడా అన్నట్లు ఆ కాపు యువకుడు నిగమశర్మ శరీరంలో నాటుకున్న బాణాల్ని ఒక్కటొక్కటిగా ఊడబెరుకుతున్నాడట. అంటే ఆ బాణాల్ని ఒక్కొక్కటిగా పెరికివేస్తుంటే అతని కడ ప్రాణాలు తెప్పరిల్లుకుని యింకొంతకాలం బ్రతుకుతాడా అని ఆశ మొలుస్తున్నదన్నమాట.

మంచంమీద పరుండబెట్టబడిన అతని శరీరం పతయాళువుగా (అంటే క్రిందపడుటకు సిద్ధముగా) వున్నదట. ఆ యువకుడు వస్త్రాల్ని మెలిపెట్టి పురివేసి క్షతగాత్రుడిని క్రింద పడకుండా చేయదానికిచ్చే గండ్రపురుల కోసమా అన్నట్లు ఎన్నో వస్త్రాలను పొత్తులుగా అతని ప్రక్కపై పేర్చాడట.

రోజూ అతనికి ఎట్టి వ్యంజనములు (కూరలు) లేని వట్టికూడు పెట్టేవాడట. త్రాగడానికి వేడినీళ్లిచ్చేవాడట; ఒబ్బగలుగు (కారమైన, ఘాటైన) వీడ్యములు (మందుతో కూడిన తాంబూలములు) యిచ్చి వలతియైన (సమర్థుడైన) వెజ్జుని (వైద్యుని) ఆ బ్రాహ్మణుడి బాగోగులు శ్రద్ధగా చూడమని ఎచరించి (హెచ్చరించి) ఆ కాపుపెద్ద తానుకూడా కంట్లో వత్తులువేసుకుని అతని పడక వద్దనే కాపలా కాశాడట.

**కః నిరనిల సంచారస్థల, మరయిక సుస్నేహపూరమాయుః స్థితి యా**
**యిఱుదెఱగు బలిమిదుర్దశఁ, బొరయక దీపమ్ము పగిది భూసురుఁడెసగెన్.**

**(పాండురంగ మాహాత్మ్యం : 3-57)**

ఈ పద్యంలో కవి చక్కటి శ్లేషాలంకారాన్ని ప్రయోగించాడు. ఆ భూసురుడి స్థితిని దీపంతో పోల్చి వర్ణించాడు.

'అనిలము' అంటే గాలి. 'నిరనిల సంచారస్థలము' అంటే గాలిపాటు లేనిచోటు; 'అరయిక' - అంటే భద్రంగా చూడడం; 'సుస్నేహపూరము' - నిండు మక్కువతో; స్నేహము అంటే నూనె అనే అర్థమూ వుంది. సుస్నేహపూరము అంటే మంచినూనె ప్రమిద నిండుగా పోయబడి వుందన్నమాట. ఆయుఃస్థితి - ఆయువు కలిగియుండడం; యా యిఱుదెఱగు బలిమిన్ - ఈ రెండు విధములైన బలము వలన - (దైవ, పౌరుష ప్రయత్నముల రెంటిచే - గాలిపాటు లేకుండడం, ఆయువు కలిగి వుండడం దైవబలములైతే - భద్రంగా చూచుకొనడం, సుస్నేహపూరము మానుష బలములు) దుర్దశన్ - చెడ్డ స్థితిని; పొరయక - పొందక; దీపమ్ము పగిది - దీపము వలెనే; భూసురుడు - ఆ బ్రాహ్మణుడు; ఎసఁగెన్ - ప్రకాశించెను. భద్రంగా చూచుకొనబడి, ప్రమిద నిండుగా మంచినూనె పోయబడి, గాలిపాటు లేనిచోట ఉంచబడి, ఆయుః స్థితి కలిగిన దీపం యా యిఱుతెఱగు బలములతో ఎలాగైతే కొడిగట్టి ఆరిపోకుండా ప్రకాశిస్తుందో, అలాగే ఆ బ్రాహ్మణుడు కూడా తనను జాగ్రతగా, నిండు మక్కువతో చూచుకొనడం; గాలిపాటు లేని లోపలి గదిలో వుంచడం, తనకు యింకా ఆయుర్దాయం ఉండడం కారణంగా ప్రకాశిస్తున్నాడు.

చిన్నచిన్నగా అతని ఆరోగ్యం కుదుటపడ సాగింది. ఆ కాపు పెద్దకు నిగమశర్మ చాల ఆప్తుడయ్యాడు. అంతేకాదు అన్నీ తనకే తెలిసినట్లు అధికప్రసంగం చేసే ఆ కుచ్చితుడైన నిగమశర్మను అతడు తన కులస్తులు మరియు భార్యతో సహా గురువుగా భావించి గౌరవించసాగాడట. అతడు కొద్దికాలంలోనే వారందరికీ తలలోని నాలుక, పూసల్లో దారం, పాలలో

నీరులా కలగలసిపోయి అభేదమున (వారికంటే భిన్నమైన వ్యక్తిననే స్పృహకోల్పోయి) వారితో కలసి వున్నాడట.

## కాపు కోడలు

ఆ కాపుటింట్లో చంద్రకళ వంటి ఒక కోడలున్నదట. ఆమె చేష్టలు మాత్రం వికారంగా వుండేవట. ఒకచోట నిలువక చంచలంగా అంతటా తిరుగాడే ఆమె కడకంటి చూపులనే ఉచ్చులు యువకులనే ఖంజనములను కట్టిపడేస్తున్నాయట.

ఖంజనము అంటే కాటుక పిట్ట. (కాటుక పిట్టలను జిట్టంగి పిట్టలనీ అంటారు. *Wagtails - Motacilla Maderaspatensis; family - Motacillidae*). చురుకుగా ఉండే యీ పక్షులు ప్రమాదాన్ని పసిగడితే మాత్రం తెలివిగా వెంటనే ఎగిరిపోతాయి. అయితే క్రిములను వేటాడుతూ తోక ఊపుకుంటూ మంచినీటి చిత్తడినేలల్లో తిరుగాడేటప్పుడు మాత్రం యీ చిన్న పక్షులు వేటగాళ్లు పన్నిన ఉచ్చుల్లో అమాయకంగా చిక్కుకుంటాయి. రామకృష్ణకవి ఆ కాపుకోడలు కడకంటి చూపుల ఉచ్చులో చిక్కుకునే యువకులను ఖంజనము (కాటుకపిట్ట)లనడం ఆయన అమోఘ పరిశీలనా శక్తికి నిదర్శనం. ఖంజనములను సంస్కృతంలో ఖంజరీటములనీ అంటారు. ఆకాశమును శీఘ్రంగా పొందేది అని ఆ పేర్ల అర్థం. అంటే 'ప్రమాదాన్ని పసిగట్టి తుర్రున ఎగిరిపోయేది' అని. ఈ పక్షులు భాద్రపదమాసం మొదలు ఆరు నెలలు కనిపించకుండా (వలస)పోయి మళ్లీ వస్తాయట. వీటిని తెలుగులో మందపిచ్చికలనీ, రువ్వుపులుగు కౌజులనీ కూడా అంటారు.

ఉ॥ ఇంటను నడ్డమాఁక యొక యింతయు లేక చరించువానిఁ జే
నంటినఁగందు క్రొందళుకు లంగమునం గలవాని మిక్కిలిం
గంటికి నించువానిఁ దెలికన్నుల వానిఁ బిసాళి బాపనిం
బంటది గోరుఁ జారు కుచపంజర కీరముగా రచింపగన్. (పాండురంగ మాహాత్మ్యం : 3-61)

ఇంటనున్ - ఇంటిలో; అడ్డము - ఎదురు; ఆక - ఆటంకము; ఒక యింతయు - కాస్తకూడా; లేక - లేకుండా చరించువానిన్ - స్వతంత్రంగా తిరిగేవాడిని; చేనంటినన్ - చేతితో తాకితేనే; కందు - కందిపోయే; క్రొందళుకు లంగమునం గలవాని - క్రొత్త తళుకులు శరీరంలో కలవానిని; మిక్కిలిం - బాగుగా; కంటికిన్ - కంటికి; ఇంచువానిన్ - నచ్చినవానిని; తెలికన్నుల వానిని - అందమైన, విప్పారిన కన్నులు కలవానిని; పిసాళి బాపనిన్ - వంచకుడగు ఆ బ్రాహ్మణుడిని - ఆ నిగమశర్మను; చారుకుచ పంజర కీరముగా రచింపగన్ - తన అందమైన కుచములనే పంజరములో చిలుకవలె బంధించాలని; కోరున్ - కోరుకున్నది; పంటది - ఆ కాపు స్త్రీ . ఇక్కడ 'పంటది' అనే పదానికి కొంత వివరంగా అర్థం చెప్పాలి.

రామకృష్ణకవి 'కాపు' అనే పదాన్ని శూద్రులు మొత్తానికీ సామాన్యార్థకంగా చాలచోట్ల ప్రయోగించాడు. 'పాండురంగ మాహాత్మ్యం' కావ్యంలోని ప్రథమాశ్వాసంలోని 112వ పద్యంలో మాత్రం కాశీపురిలోని శూద్రులను 'పురి వెలమలు' అని పేర్కొని 'వారి భాగ్యమహిమఁ బొగడఁగ వశమే?' అన్నాడు. శూద్రులలో వెలమలు ప్రముఖులు. శూద్రులు అంటే వెలమలు మొదలైన చతుర్థజాతికి చెందినవారు అని. అలాగే 'కాపు' అనే పదాన్ని శూద్రులకు సామాన్యార్థకంగా పలుచోట్ల వాడినప్పటికీ, యీ సందర్భంలో అది రెడ్లనుద్దేశించి వాడినదే !

పొత్తపినాడు అంటే నేటి నెల్లూరు జిల్లాలో కొంత భాగము. నెల్లూరు జిల్లాలో నేటికీ రెడ్డికులస్థులు తాము కాపులమనే చెప్పుకుంటారు. నెల్లూరు పట్టణంలో మొత్తం రెడ్డి కులస్థులు కాపురముంటున్న ఒకవీధి పేరు కాపువీధి అని వుంది. రామకృష్ణకవి తాను కూడా పొత్తపినాడు నివాసిగా వుంటూనే యీ కావ్యం వ్రాశాడు కనుక తగినట్లుగానే రెడ్లను 'కాపులు' అనే సంబోధించాడు. తృతీయాశ్వాసములోని 55వ పద్యంలో 'కాపు కొడుకు' అనే పదం వాడాడు. తరువాతి పద్యంలో నిగమశర్మకు సేవలు చేసిన 'కాపుపెద్ద'ను 'సైరిక ప్రభుండు' అన్నాడు (సైరికుడు అంటే దున్నేవాడు; హాలికుడు; ఇదికూడా శూద్రులకు సామాన్యార్థక పదమే). 58వ పద్యంలో 'జానపదాగ్రగామి' అని ప్రయోగించాడు. అంటే పల్లెలో నివసించేవారి (పల్లీయుల) నాయకుడు. ఈ పదం కూడా శూద్రులకు సామాన్యార్థకంగానే ప్రయోగించాడు. ఆ తరువాతి పద్యంలోనూ 'కాపు'

అనే ప్రయోగమే చేశాడు. ఆ తరువాతి పద్యంలోనూ ఆ యింటిని 'శూద్రవసతి' (శూద్రుల యిల్లు) అన్నాడుగానీ, యింటి యజమాని కులమేదో చెప్పలేదు.

ఇక యీ పద్యంలో ప్రయోగించిన 'పంటది' అనే శబ్దం కారణంగా ఆ 'శూద్రవసతి' - 'రెడ్డివారిల్లు' అనేది తేటతెల్లమవుతుంది. (పంటరెడ్లు అనేది రెడ్లలో ఒక శాఖ). తరువాత 68వ పద్యంలో 'రెడ్డి యింటికి' అనే పదాన్నే నేరుగా ప్రయోగించాడు కవి. రెడ్డి కులంలోని శాఖల వివరాల కోసం అనుబంధం-8 చూడండి.

ఆ కాపుకోడలు నిగమశర్మ పొందును కోరి చేసిన వికారపు చేష్టలను కవి యిలా వర్ణిస్తున్నాడు.

సీ॥ పలువికారంబుల కలగల్పు చూపుల రాకపోకలు బయల్ ప్రాకఁజేయుఁ
దమకంబు గమకంబుఁ దత్తరంబును హత్తి మనసు సాఁగిన పజ్జఁ జొనుపుఁగోర్కి
కుదురు పాలిండ్లపైఁ గొంగుజాఱఁగఁ గొప్పువీడ నూఱక నవ్వు వెట్టినవ్వు
నేరాలి పట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వఁ గఱచి వాఁడేడ్చినఁ గౌఁగిలించు

తే॥ దండసకిమెడఁ బుంజాలదండఁబెట్టుఁ, దిట్టు మెట్టెలు బిగువంచుఁ దెగి కళాదు
వనిత చిన్నారి పొన్నారి వయసు వాని, విప్రనందనుఁ గన్నంత వెకలి యగుచు

**(పాండురంగ మాహాత్మ్యం : 3-62)**

చిన్నారి పొన్నారి వయసువాడైన (మంచి పరువంలోనున్న) విప్రనందనుడైన ఆ నిగమశర్మను చూడగానే ఆ వనిత వెకిలిగా చేసే వికారపు పనులెలా వున్నాయంటే -

పలు వికారములతోనూ, కలుపుగోలుతనంతోనూ కూడిన చూపుల యొక్క రాకపోకలను (ప్రసారోపసంహారములు) ఆమె బయటకు ప్రాకఁజేస్తుందట. ఆ చూపులను అతనిపై ప్రసరించి మళ్లీ అంతలోనే తన చూపులను మరలించుకొంటుందట.

తమకము (మోహము) గమకము (పూనిక) తత్తరము (సంభ్రమము) హత్తి (కలిగిన కారణంగా) మనస్సును యధేచ్ఛగా అది వెళ్లిన దగ్గరకు దాన్ని చొనుపుతున్న (ప్రసరింపజేస్తున్న)దట.

పొందికయైన తన స్తనముల మీద నుండి పైటచెంగు జారినా, తన కొప్పుముడి వీడి పోయినా అతనివంక చూస్తూ కారణం లేకుండానే పిచ్చినవ్వు నవ్వుతుందట.

ఏరాలు అంటే తన తోడికోడలు పట్టి (కొడుకు)ని చటుక్కున చంకకెత్తుకుని వాడి బుగ్గ నొప్పి పుట్టేటట్లుగా కొరికి వాడు ఏడుస్తూంటే వాడిని గట్టిగా కౌగిలించుకుంటుందట.

'దండ' అంటే హారము, సామీప్యము, అండ అని అర్థాలు. 'చేయి' అనే అర్థంలో కూడా ఆ పదం వాడబడింది. ఇక్కడ 'దండ సకి' అంటే దగ్గరలో వున్న సఖి (నెచ్చెలి, స్నేహితురాలు) అని అర్థం. ఆమె 'పుంజాల హారము' అనే పేరుగల దండను తన యిష్ట సఖి మెడలో వేస్తుందట.

తనకాలి మెట్టెలు బిగుతుగా వున్నాయని తెగబడి అవి చేసిన కళాదుడిని తిడుతుందట. కళాదుడు అంటే కంసాలి (అగసాలె) వాడు. (చూ. అనుబంధము-8). స్త్రీలు తాము యిష్టపడే పురుషుడి దృష్టిని ఆకర్షించడానికి, తమ స్తనములమీది ముంజెరగు కావాలనే తప్పించడమో లేక దానంతట అదే జారినా పైటచెంగు వెంటనే సవరించుకొనడంపై శ్రద్ధచూపక, ఆ చెంగు జారడం ఆ పురుషుడి దృష్టిలో పడిందా లేదా అన్నదానిపైన ఆసక్తి కనబరచడం చేస్తారట. జారిణి అలాంటి సమయంలో వైశికపు (కపటపు) సిగ్గు నటిస్తుందట. పరపురుషుడిని రెచ్చగొట్టడానికా అన్నట్లు తన చంకనున్న

బిడ్డను గాఢంగా కౌగిలించుకొనడం, ముద్దుపెట్టుకొనడం, కొరకడం వంటి చేష్టలు చేస్తుందట.

అలా దుష్టమైన మన్మథోద్రేకముచేత ఏ మాత్రమూ సిగ్గులేని మనస్సుగల (కామాతురాణాం న భయం న లజ్జా) ఆ స్త్రీ వలపులు ఏరులై ప్రవహించగా ఆ మహీసురునితో చెరలాట లాడుతున్నదట.

# చాటుమాటు సరసాలు

ఇకనేం, తేరగా బంగారు కుండ వంటి స్త్రీ దొరికిందని ఆనందపడుతూ చంకలు తాటిస్తూ, ఎర్రని ఆమె పెదవుల్ని కసిగా తన దంతములతో ఒడిసి పట్టదానికి (పెదవులపై దంతక్షతములు వేయదానికి) ఒక్క ఉదుటున ఆమె స్తనద్వయాన్ని తనగాఢమైన కౌగిలింతతో బలంగా అదమదానికి, (పద్మమువంటి) ఆమె ముఖంనుండి వెలువదుతూన్న సుగంధాన్ని ఆఘ్రాణించదానికి, ఆమె పిరుదులపై ఉత్పల పత్రాళిని (కుముద పత్రములనే పేరుగల నఖక్షతములను) వేయుటకు సంసిద్ధుదయ్యాదట ఆ మిత్రద్రోహి.

సీ॥ **తలపుండ్లు గదిగించి తను బ్రతికించెఁగా యడవిఁ జోరాహతుండైనఁ దెచ్చి**
**కన్నబిడ్డలకన్న గారవంబునఁ జనవిచ్చెఁగా నిచ్చలునింటిలోన**
**గ్రాసవాసఃక్లేశ కశ్మలత్వమడంచి యనురక్తిఁ బెనిచెఁగా యనుదినంబు**
**గురువుగా వేల్పుగాఁ గూర్చుచుట్టంబుగా భావించి కొలిచెగా భక్తియుక్తి**

తే॥ **నెవ్వఁడా రెడ్డి యింటికి నెగ్గు చాలఁ జేయు గుడినుండి గుడి వాళ్లు దీయు కరణిఁ**
**గపట నటనానటుఁడు త్రాటిఁగట్టుబోయ, కాయజామేయసాయకాఘాతభీతి.**

**(పాందురంగ మాహాత్మ్యం : 3-68)**

తల అంటే శిరస్సు, ముందు భాగము, ప్రధానమైన అనే మూడు అర్థాలనూ 'తలపుండ్లు' అనే మాటకు మనం అన్వయించుకోవచ్చు. శిరస్సుకు తగిలిన గాయాలు, ఛాతీపై అయిన గాయాలు లేక ప్రధానమైన (ప్రాణాంతకమైన) గాయాలను మాన్పించి, అడవిలో చోరాహతుడైన (దొంగలచే కొట్టబడిన) తనను తెచ్చి, బ్రతికించి, తాను కన్న సంతానంకంటె ఎక్కువగా నిచ్చలు (నిత్యము) యింట్లో చనువిచ్చి, గ్రాసము (ఆహారము) వాసము (వసనము, వస్త్రము)ల కొరకు యిబ్బందులు పడటమనే కశ్మలము (మలినము, నీచత్వము) అడచి (పోగొట్టి), రోజుకొక తీరుగా ప్రేమతో పెంచి, గురువుగానూ, దైవంగానూ, దగ్గర చుట్టంగానూ భావించి, భక్తియుక్తముగా తనను పూజించిన ఆ రెడ్డి యింటికి ఎగ్గు (కీడు) చేసేవాడెవడైనా ఉంటాడా?; గుడిన (గుడిలో) వుండి గుడివాళ్లు (గుడితాళ్లు) తీసేవాడెవడైనా వుంటాడా? కపటములను నటించుటలో నేర్పరియూ కాయజామేయ సాయకాఘాత భీతి – కాయజ + అమేయ + సాయక + ఆఘాత + భీతి. కాయజుడు అంటే మన్మథుడు. మన్మథుని యొక్క అమేయమైన (తిరుగులేని) సాయక (బాణముల) ఆఘాత (దెబ్బ యొక్క) భీతి (భయము)తో నున్నవాడైనట్టి యీ త్రాటిఁగట్టుబోయ తప్ప ప్రపంచంలో? త్రాటిఁగట్టు (జందెపు త్రాటిని కట్టుకునేవాడు – బ్రాహ్మణుడు); బోయ – కిరాతకుడు; త్రాటిఁగట్టుబోయ – కిరాతకమైన బ్రాహ్మణుడు – యీ నిగమశర్మ తప్ప !

మెత్తపడిన మనస్సులతో, అంతులేని కోర్కెలతో, పారవశ్యంతో ఒకరినొకరు తదేకంగా చూచుకూంటూ, సంతోషంతో జలదరించిపోతూ, చిరిగిన సిగ్గులతో (అంటే సిగ్గూ యెగ్గూ లేకుండా), చీకటి రాత్రులలో ఆ అలీక విశిష్టుదు (అలీకము – అబద్ధము; బొంకులమారి బ్రాహ్మణుదు) తలిరాకుబోడి (తలిరు అంటే చిగురు. చిగురు వలె మనోజ్ఞమైన స్త్రీ) ప్రణయ

పారవశ్యాన్ని పొందారట.

మనస్సులో పాపమని కూడా తలంచక ప్రాణాపాయమును కల్గించే తెగువకు అతను సిద్ధపడ్డాడట. "నరకేసతి కోదోషః" (నరకమే ప్రాప్తించనున్నప్పుడు యింకా తప్పొప్పులు ఎంచి, తటపటాయించాల్సిన పనేముంది? ఎటు తిరిగీ నరకానికే వెళ్లేటప్పుడు తప్పే చేసి వెళదాం.) "మరణేసతి కిం భయమ్?" (చావుకు తెగించినవాడికింకా భయమేమిటి?) అని ఒకప్పుడు చదువుకున్నది అతని మనస్సులో వుందా? అన్నట్లుందట అతని తెగింపు.

ఇక ఆమె సంగతెలా వుందంటే –

అర్ధరాత్రిదాకా పొలం పనులలో అలసి సొలసి యింటికి వచ్చినప్పటికీ ఆమె భర్త (మారశిలీముఖాహలిన్) మన్మథుని బాణపు ములుకుచే కొట్టబడినవాడై నిద్రపోకుండా భార్య పొందుకై నిరీక్షిస్తూ నిద్ర కాచేవాడట. కానీ, మాయలాడియైన ఆ ధూర్తురాలు భర్తకు సేవచేయదట. ఒక ముచ్చట చెప్పదట. మూగమొద్దులా కళ్లు మూసుకుని మనస్సులో ప్రియుడైన నిగమశర్మనే వీక్షిస్తుందట, భర్త యింటికి వచ్చేవరకూ తాను తన ప్రియునితో సాగించిన శృంగారకాండను తృప్తిగా జ్ఞప్తికి తెచ్చుకుంటూ!

సీ॥ పొన్నాకు పైఁదేనె సన్నచెంద్రిక మోవి మాధుర్యమనక వేమాఱుఁ బొగడి
యామని బుగబుగ లంగ చంపకదామగంధం బనక పెక్కుగతులనెన్ని
పడనున్న పండ్ల సంపదపెంపు పాలిండ్ల బీరం బనక సారె సారె దలఁచి
తెలియ నభ్రచ్ఛాయ వలమాన కచభర ప్రకటనంబనక మాటికిని మెచ్చి

తే॥ దినదినంబున గసికాటు చెనకువలన, దప్పితీరని తమకంబు దెప్పరంబుఁ
బాపసమకట్టి జారుదక్కాఁపు సలిని, నెత్తుకొనిపోవ నిందందు నెదరువేచె.

**(పాండురంగ మాహాత్మ్యం : 3-72)**

పొన్నచెట్టు (*Calophyllum inophyllum*) ఆకు చాల నున్న (*glabrous*) గా వుంటుంది. ఆ కారణంగా దానిపై పడ్డ తేనె చుక్క జారిపోతుందే కాని నిలవదు. పలుచగా ఎర్రగా వున్న పెదవుల మాధుర్యమూ అంతే. పొన్నాకుపై తేనెలా స్త్రీ అధరామృతం కూడా ఎంతోకాలం నిలిచేది కాదు. అయినా యీ నిజం తెలుసుకోక నిగమశర్మ తన ప్రియురాలి అధరామృతాన్ని వేయి మార్లు పొగడుతున్నాడట.

ఆమని అంటే వసంతం. వసంతాగమనంతో చెట్లన్నీ పుష్పించి కొత్త సోయగాల్నీ, సౌరభాల్నీ అలదుకుంటాయి. అయినా ఈ పరిమళాల వ్యాపనం ఎంతకాలం? దాని వెంటనే నిర్దయగా మండే ఎండలతో గ్రీష్మం తరుముకుంటూ వస్తుంది. ఆ వేడిమికి వృక్షాలన్నీ విలవిలలాడతాయి. ఆ ఆమని బుగబుగలవలె తాత్కాలికమైనదే శరీరమనే సంపెంగపూలదండ యొక్క సౌరభం కూడా. ఇది తెలుసుకోకుండా, అతడు ఆమె శరీర పరిమళాన్ని పెక్కుగతుల (అనేక రీతులుగా) ఎన్నాడట (కొనియాడాడట). అలాగే పాలిండ్ల బీరము (స్తనముల బిగువు) కూడా ఎన్నాళ్లో నిలవదు. మిగులపండి రాలిపోవడానికి సిద్ధంగా వున్న పండ్ల యొక్క సౌందర్యంలాగానే ఆమె స్తనముల బిగువుకూడా అశాశ్వతమైనదనే సత్యాన్ని గుర్తించకుండా అతడు మాటి మాటికీ ఆమె స్తనసౌందర్యాన్నే తలచుకునేవాడట.

'అభ్రము' అంటే 'ఆకాశము', 'మబ్బు' (మేఘము) అనే రెండర్థాలున్నా, యిక్కడ 'మేఘము' అనే అర్థమే వర్తిస్తుంది.

'ఛాయ' అంటే 'నీడ', 'కాంతి' అనే రెండర్థాలున్నాయి. ఆ రెంటినీ మనం యిక్కడ అన్వయించుకోవచ్చు. మేఘం యొక్క కాంతి తాత్కాలికమైనది. మేఘం సూర్యుడిని కప్పివేసినప్పుడు అది వెండి మబ్బులా వెలిగిపోతుంది. జలతారు అంచు నల్లని చీరలా క్షణకాలం భాసిల్లుతుంది. అయితే ఆ మేఘపుకాంతి క్షణభంగురమే. అలాగే మేఘం చండమార్తాండుడిని అడ్డగించినప్పుడు ఒక్కక్షణం మనకు నీడనిస్తుంది. అయితే, ఆ నీడకూడా క్షణభంగురమైనదే! మేఘం ముందుకు సాగగానే మరల మార్తాండుడి వేండ్ర తీండ్రములకు మనం గురికావలసిందే! ఇలా మేఘముయొక్క కాంతి, నీడ రెండూ అశాశ్వతములే! అదే విధంగా ఆమె యొక్క గుండ్రంగా చుట్టబడిన భారమైన కొప్పు యొక్క ప్రకాశం కూడా తాత్కాలికమైనదేనని గ్రహించని కారణంగా నిగమశర్మ ఆ శిరోజాల అందాన్ని మాటిమాటికీ మెచ్చుకుంటాడట.

దినదినంబును (ప్రతిరోజూ) కసికాటు చెనకు వలన - తగిలీ తగులని స్పర్శవలన - అంటే తృప్తిలేని శృంగారము వలన - ఆమె భర్త ఎప్పుడు పొలాన్నుంచి వస్తాడో, లేక తమనెవరైనా చూస్తారేమో అనే భయంచేత శృంగారంలో పూర్తి తృప్తి పొందలేకపోయిన కారణంగా; దప్పితీరని తమకమును బాపన్ (పోగొట్టుకొనుటకు) సమకట్టి - నిశ్చయించుకొని; జారుదు - విటుడైన ఆ నిగమశర్మ; అక్కాపుసతిన్ (ఆ కాపు భార్యను) ఎత్తుకొనిపోవ - లేపుకొనివెళ్లడానికి; ఇందందున్ - ఇక్కడా? అక్కడా? అని అంటే ఎప్పుడెప్పుడా అని; ఎదరు (సందు - అంటే యుక్త సమయం - అనువైన అవకాశం) కోసం; వేచిచూశాడట.

ఆ సమయంలో ఆ నగరపు రాజు అక్కడి పశువులన్నీ ఒక వ్యాధి పాలిటబడి గుంపులు గుంపులుగా మరణిస్తూంటే గాలిగంగలకు (గాలిరూపంలో నున్న క్షుద్రదేవతల కన్నింటికీ) జాతర చేయాలని చాటింపు వేశాడట. 'అనితరసాధ్య - ఆతత - వాతామయ నిర్ఘాత'మన్నాడు కవి ఆ వ్యాధిని. అంటే అది అనితర సాధ్యమూ, 'ఆతతమూ (విరివియైనదీ), వాతామయమూ (వాతముతో కూడుకున్నదీ)నైన నిర్ఘాతము - పిడుగువంటిది. బహుశా రామకృష్ణకవి పేర్కొన్న ఆ ప్రాణాంతక వ్యాధి 'గాలికుంటు' వ్యాధి కావచ్చు.

గాలికుంటు వ్యాధి (*Rinderpest*) పశువులకూ, గొఱ్ఱెలకూ వైరస్ కారణంగా వచ్చే ప్రాణాంతక వ్యాధి ఇది చాల వేగంగా వ్యాపిస్తుంది తీవ్రమైన జ్వరం (107 డిగ్రీల వరకూ), అతిసారము, నోటినుండి చిక్కటి చొంగ, చర్మంపై పగుళ్లు దీని ప్రత్యేక లక్షణాలు ఇది ఎంతగా ప్రాణాంతకమైనదంటే దీనిని *Cattle plague* (పశువుల ప్లేగు) అంటారు. వైరస్‌ల కారణంగా వచ్చే ప్రాణాంతక వ్యాధులను గురించిన శాస్త్రీయ పరిజ్ఞానం లేని ప్రాచీన కాలంలో భూభారం తగ్గించడానికి భూదేవి చెల్లెళ్లయిన ఆటలమ్మ (తట్ట అమ్మవారు లేక తట్టు - *Chicken pox*), చిన్నమ్మవారు (పొంగు లేక తడపర - *Measles*) మహమ్మారి (ప్లేగు - *Plague*), అమ్మవారు (మశూచికము - *small pox*), మరిడీ మహాలక్ష్మి (కలరా - *Cholera*) వగైరాలు విజృంభించి జననాశనం, జంతునాశనం చేస్తారనీ నమ్మేవారు. పోలేరు (పోలేరమ్మ), వాంతి,భ్రాంతి, చేలి జ్వరాలు ఏకకాలంలో చాల మందిలో కనుపిస్తే దానికి అమ్మవారి ఆగ్రహమే కారణమని భయపడేవారు. అందుకే ఈ వ్యాధులన్నిటికీ అమ్మవార్ల పేర్లు పెట్టారు. ఆ వ్యాధుల నివారణకై ఆ అమ్మవార్ల శాంతికై జాతరలూ, బలులూ నిర్వహించేవారు. ఆధునిక శాస్త్ర విజ్ఞానాభివృద్ధి కారణంగా ఈ వ్యాధులన్నీ వివిధ వైరస్‌ల మూలంగా వచ్చేవని కనుగొని, వాటిని పూర్తిగా నిర్మూలించే కార్యక్రమం చేపట్టాయి నేటి ప్రభుత్వాలు. నేడు ప్రజారోగ్య శాఖ "మశూచిని తెలుపండి. లక్షరూపాయలు బహుమతిని పొందండి" అని ప్రకటిస్తున్నదంటే ఆ వ్యాధి ఎంతగా కనుమరుగైందో అర్థంచేసుకోవచ్చు. 'స్ఫోటకము' అని కూడా పిలువబడిన యీ మశూచిక వ్యాధి సోకి ఒకప్పుడు ఎందరో అంధులయ్యారు. మరెందరో ఆ మచ్చల కారణంగా వారి ముఖసౌందర్యం కోల్పోయారు. అట్టి భయానక వ్యాధి శాస్త్ర విజ్ఞానాభివృద్ధితో 'పతా' లేకుండా పోయింది ఒకప్పుడు పాపిష్టివారి భారంతో క్రుంగి కునారిల్లుతున్న భూదేవికి సాంత్వన చేకూర్చడానికి ఆమె చెల్లెళ్లైన ఈ వ్యాధులన్నీ విజృంభించి పాపులభారం తగ్గిస్తారని ప్రజలు అమాయకంగా నమ్మేవారు. నేడు శాస్త్రవిజ్ఞానం అభివృద్ధి చెందడంతో ఆ యా వ్యాధి నిరోధక వ్యాక్సీన్ (*Vaccine*) లు అందరికీ అందుబాటులోకొచ్చాయి. ఆ టీకాలు వేయించుకుంటే ఎంతటి పాపిష్టివాడినైనా యీ అమ్మవార్లు ఏమీ చేయలేకపోతున్నారు. ఇంకా అక్కడక్కడా వైద్య సదుపాయాలు లేని మారుమూల గ్రామాలలోని పుణ్యాత్ములు సైతం వ్యాధి నిరోధక టీకాలు

వేయించుకోకనపోతే జాతరలూ, బలులూ నిర్వహించినప్పటికీ ఆ అమ్మవార్ల పాలౌతున్నారు!

# జాతరలో కాపు వనితలు

ఇక కవి ఆ జాతర దినములలో అక్కడి కాపు వనితలెలా వున్నారో వర్ణిస్తున్నాడు.

ఆ పండుగ రోజులలో అక్కడి పామర ప్రమదలు (పామరుడంటే 'అజ్ఞాని' అనీ 'నీచుడు' అనీ అర్థాలు. ఇక్కడ మనం 'పామర ప్రమదలు' అంటే 'కాపు పడతులు', 'శూద్రస్త్రీలు' అనే అర్థం చెప్పుకోవచ్చు) ఆయా నియమాలను ఆచరించాలనే సత్సంకల్పము, శ్రద్ధలతో గోరువెచ్చని నూనెతో తలలు అంటుకున్నారట. నిశామిళితవారితో (పసుపు కలిపిన నీటితో) స్నానం చేశారట. చిరుత చౌకముల (చిన్నగళ్లు కలిగిన) క్రొంబుట్టములు (కొత్త పుట్టములు – కొత్త చీరలు) కట్టుకున్నారట. కళ్లకు కాటుక తీర్చారట; సిందూర తిలకాన్ని నుదుట బటువుగా (గుండ్రంగా) దిద్దారట; కొప్పులలో విరులు (పూవులు) క్రుక్కారట; నింబ ప్రవాళ మాల్యంబులు వేసుకున్నారట. (మెడలలో వేప చిగుళ్ల మాలలు ధరించారట) చిట్టిబొట్టు (అంటే తాళిబొట్టు)ను మాత్రం యిట్టునట్టున్ (వ్యత్యస్తముగా – అనాదరముగా) ధరించారట; అప్పుడే తోముకున్న కారణంగా ధగధగలాడుచున్న ముత్యాల వంటి పళ్లకు, లేత తాంబూలపు రంగును హత్తుకొలిపారట (అలదుకొన్నారట). అంటే లేత తమలపాకుల తాంబూలాలు వేసుకున్నారన్నమాట.

జాతర దినములలో అక్కడి శూద్రస్త్రీలు నిష్ఠతో పాటించిన నియమాల ద్వారా కొన్ని ఆరోగ్య సూత్రాల్ని కూడా కవి మనకు అందించాడు. ఇటువంటి ప్రాణాంతక వ్యాధులు వేగంగా వ్యాపించే సందర్భాలలో అవి మనుష్యులకు సోకకుండా ఉండడానికి వ్యక్తిగత శౌచానికి మన ప్రాచీనులు ఎక్కువ ప్రాధాన్యతనిచ్చేవారు. గోరువెచ్చని నూనెతో తలంటుకొనడం, గోరువెచ్చని నీటితో స్నానం చేయడం (కించిదుష్ణోదకస్నానం) గోరువెచ్చని ఆహారాన్ని భుజించడం (కించిదుష్ణాన్న భోజనం) వగైరాలు జలుబు చేయకుండా నిరోధిస్తాయి. జలుబు చేసిన వారికి వ్యాధికారక క్రిములు త్వరగా సోకుతాయని అప్పటివారు భావించేవారు. అందుచేత, ముందుగా తాము జలుబు బారిన పడకుండా చూసుకునేవారు.

ఇకపోతే పసుపు (నిశా అంటే పసుపు – *Turmeric - Curcuma longa*) అనాదిగా సౌందర్య పోషకంగా ప్రసిద్ధి చెందిందేకాక, క్రిమిసంహారకంగా కూడా వాసికెక్కింది. పసుపులో చెప్పలేనన్ని ఔషధ విలువలున్నాయి. భారతీయ స్త్రీలు మొటిమల నివారణకూ, ముఖ సౌందర్యానికీ పసుపును ముఖానికి రాసుకుంటారు. క్రిమిసంహారకం కనుకనే పాదాలనుంచీ, పాదాల పగుళ్ల నుంచీ వ్యాధికారక క్రిములు శరీరంలోనికి ప్రవేశించి వ్యాపించకుండా పాదాలకు పసుపు రాసుకుంటారు. చర్మ సౌందర్యంకోసం పసుపు కలిపిన నీటితో స్నానంచేస్తారు. సంస్కృతంలో 'నిశాహ్వము', 'హరిద్రము' అని కూడా పిలువబడిన పసుపు యొక్క ఔషధ విలువలను ఆయుర్వేదం ఏనాడో కనిపెట్టి ఉపయోగించింది.

ఇక నింబప్రవాళ మాల్యముల (వేపచిగుళ్ల మాలల) విషయానికొద్దాం. వేప (*Azadirachta indica*) మనకు సర్వసాధారణ వృక్షం. వేము అని కూడా పిలువబడే వేప పుల్లలతో దంతధావన చేయడం పండ్లకూ, చిగుళ్లకూ ఆరోగ్యకరం. మొక్కలకు పట్టిన చీడల నివారణకు వేపనూనెను పిచికారీచేస్తారు. వేపకాయల పిండిని కూడా సస్య రక్షణలో వేరుపురుగుల నివారణకు క్రిమిసంహారకంగా వాడతారు. ఇక మశూచికము, ఆటలమ్మ వగైరా వ్యాధులు సోకిన వ్యక్తులకు వేప మండలను విసనకర్రలుగా వీస్తారు. ఆ గాలిలో క్రిమిసంహారక గుణాలున్నాయి. వేపచిగుళ్లు నూరి వంటికి పైపూతగా పూస్తారు. నూరిన వేప చిగురు ముద్దను నీటిలో కలిపి ఆ నీటితో స్నానం చేయిస్తారు. రోగిని వేపచెట్టుగాలి సోకేటట్లు ఆరుబయట పరుండ బెడతారు. ఇంటి గడపలకు వేపమండలు కడతారు. జాతర రోజులలో జంతువుల మెడలలోనూ వేపమండలు కట్టడం కేవలం మూఢాచారం కాదు. వేపకున్న ఔషధవిలువల గురించి నేటితరం వారికంటే ప్రాచీనులకే ఎక్కువగా తెలుసేమోననిపిస్తుంది. అంటువ్యాధులు, ప్రాణాంతకవ్యాధులు సోకకుండా నిరోధించడానికీ, గర్భిణులకు సహజంగా వచ్చే వ్యాధుల నిరోధానికీ గార (*Balanites roxburghii*) అనే ముండ్లచెట్టు మండల్ని ఇండ్ల గడపలకు కట్టడం కూడా మన ప్రాచీనుల అలవాటుగా మారింది. క్రిమిరోగాల్ని హరించడంలో, విషాన్ని విరిచెయ్యడంలో, కుష్టు, బొల్లి వగైరా చర్మవ్యాధుల నివారణలో గార (సంస్కృతంలో ఇంగుదీ)ది పెట్టిందిపేరు. గారచెక్క, వేళ్లరసము, కషాయము, గారకాయలనూనె (ఇంగుదీ తైలము) ఆయుర్వేదంలో ప్రశస్తంగా వాడబడ్డాయి. నేటి తరంలో ఎక్కువ మందికి 'గార' చెట్టంటే ఏమిటో కూడా తెలియదు. ప్రాచీనులు కనీసం ఆ చెట్లంటే ఏమిటో ముందుతరాలకు తెలుస్తుందేమోనని క్రిమిరోగాలు

సోకినప్పుడునూ, స్త్రీల ప్రసవపు రోజులలోనూ గార మండలు, వేపమండలు యిళ్ల గుమ్మాలకు కట్టడం అలవాటుచేశారు.

కొత్త చోటికి వెళ్లే ముందు దంతధావనంచేసి విడియము (తాంబూలం) వేసుకొనడం మరో ఆరోగ్య సూత్రం. తాంబూలము వేసుకొనడం వలన ముత్యాలవంటి పలువరస గారపట్టి వికారంగా కనుపించే మాట నిజం. అయితే తాంబూలంలో వేయబడే సున్నము క్రిమిసంహారకమేకాక కస్తూరి, కాచు (ఖదిరము), జాజికాయ, జ్యాపత్రి, పిప్పళ్లు, ఏలకులు, పునుగు వగైరా తాంబూలాల తయారీలో వాడబడే సుగంధ ద్రవ్యాలన్నీ చిగుళ్లకు గట్టితనాన్నిచ్చి, చిగుళ్లనుండి అయ్యే రక్తస్రావాన్ని నిరోధించి, నోటి దుర్వాసనను అరికడతాయి. అంతేగాక వ్యాధికారక క్రిములు వ్యాపించే సందర్భంలో కొత్తచోట మనం నోరు తెరచి నవ్వినా, మాట్లాడినా గాలిలోని క్రిములు తేలికగా మన చిగుళ్లనుండి శరీరంలోనికి ప్రవేశించి, వ్యాపించే అవకాశం వుంది. పైన తెలిపిన ద్రవ్యాలతో తయారు చేయబడిన తాంబూలము వేసుకొనడం కారణంగా చిగుళ్లనుండి రోగ కారక క్రిముల వ్యాప్తి అరికట్టబడుతుంది. అంచేత కొత్తచోటికి బయటికి వెళ్లేటప్పుడూ, ప్రయాణాలలోనూ తాంబూలం వేసుకొనడానికి కొంత ప్రాముఖ్యత ఏర్పడింది. ఇక భోజనానంతరం తాంబూలసేవనం అరుగుదలకు తోడ్పడుతుందనేది ఎల్లరూ ఎరిగిన సత్యమేకదా!

క॥ ఎడ్డెతనపుఁ గయిసేఁతల, రడ్డులు నడచిరి పురస్సరద్వార్యముగా
గుడ్డంబు చక్కఁగట్టం, బడ్డ మహాశక్తి దివ్య భవనంబునకున్ (పాండురంగ మాహాత్మ్యం : 3-75)

ఎడ్డెతనము అంటే మౌఢ్యము, మోటుతనము; మొండితనము; అయితే 'కయిసేతలు' అంటే 'అలంకరణలు' అని అర్థం కనుక 'ఎడ్డెతనమున'కు అర్థం యిక్కడ 'మోటుతనపు' అని చెప్పుకోవాలి. ఎంచేతనోగాని కవులు రెడ్లను ఎడ్డెతనపు వారిగానే వర్ణించారు. రామకృష్ణ కవేకాదు స్వయంగా రెడ్డి కులస్థుడే అయిన వేమన కూడా తన గురించి చెప్పుకుంటూ -

" ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి
మూగచింతపల్లె మొదటి యిల్లు
ఎడ్డె రెడ్డి కులమదేమని చెప్పుదు
విశ్వదాభిరామ వినురవేమ" అన్నాడు.

అయితే మరో సందర్భంలో -

కాపువా లెంత కర్మరులైనను
పాపరాశి కొంత పరశిపోవు
వివరమెరుఁగనట్టి వెట్టి జీవులుగాన
విశ్వదాభిరామ వినుర వేమ.

ఇదీ రెడ్లను గురించే వేమన చెప్పిన పద్యం. 'కాపువారలు' అంటే రెడ్లు.

'కర్మరుడు' అంటే ఒకపని అనుకుంటే అది నెరవేరేదాకా పట్టువిడువనివాడు. శ్రమైకజీవులైన గ్రామీణులు కనుక వారిలో కొంత మోటుతనం ఉండడం సహజం. రామకృష్ణకవి పద్యంలో 'ఎడ్డెతనపుఁ కయిసేఁతల' అంటే 'మోటైన అలంకరణలు చేసికొని' అనే అర్థమే సమంజసమైనప్పటికీ సాధారణంగా నేటి రెడ్లు మనకు మోటువారిగా కంటే మొండివారుగానే అంటే 'కర్మరులు'గానే అంటే పట్టిన పట్టు విడువని కార్యసాధకులుగానే కనుపిస్తారు.

# జాతర

ఆ రడ్డులు (రెడ్లు) పురస్సరద్భార్యముగా - ముందు నడచుచున్న భార్యలు కలవారై గుడ్డంబు చెక్కిస్ - గుడ్డము అంటే పొలము. ఊరి పొలము దిక్కుగా కట్టబడిన మహాశక్తి (గ్రామదేవత) దివ్య భవనమునకు నడిచారట.

చెక్కి అంటే స్థానము అనే అర్థంలో రామకృష్ణకవి యిదే కావ్యంలోని ద్వితీయాశ్వాసంలో "అవ్వీటి నడిచెక్కి నభిరామ శుభ విభా ధగధగాయిత మొక్క నగరు గాంచె" అని ప్రయోగించాడు. అయితే యిక్కడ 'చెక్కి' అంటే 'దిక్కు' అని అర్థం. పైడిపాటి లక్ష్మణకవి 'ఆంధ్రనామ సంగ్రహము' లోని దేవవర్గులో దిక్పాలకులలో ఉత్తర దిక్కుకు అధిపతియైన కుబేరుడిని 'వడచక్కేలిక' అంటాడు. 'వడచక్కి' అంటే ఉత్తర దిక్కు 'ఏలిక' అంటే దేవుడు.

ఇక యిక్కడ కవి ఆ జాతర మహోత్సవాన్ని విపులంగా వర్ణిస్తాడు. ఆ మహోత్సవం అజప్రధానమట. 'అజ' అంటే మేక. క్షుద్రదేవతలకు మేకల్ని బలియివ్వడానికే అసలీ తరహా జాతరలు నిర్వహిస్తారు. ఆ జాతర మహాసురోదారమట. అంటే అక్కడ సుర (కల్లు) మహా ఉదారంగా ఏరులై పారిందట. జాతరలో ఒక స్త్రీ మబ్బుక్రింద వ్రేలాడే (ఐరావతిలా - మెరుపులా) సిడిమ్రాను (జాతరలో నాటిన స్తంభము మీది అడ్డమ్రాను)కు వ్రేలాడిందట. మరో స్త్రీ చెందమ్మి (ఎర్రతామరల) కొలనులో తిరుగాడే రాజహంసలా నిప్పుటేట (నిప్పులన్నీ ఒకచోట బాటలా పరచి జాతరల సందర్భంగా వాటిపై కొందరు పూనకం పూనిన భక్తులు నడుస్తారు) నాట్యంచేసిందట. తొలి సంధ్యలోని లేత ఎండ కోసం ఎదురుతెన్నులు చూసే జక్కవ పక్షి (జక్కవ పక్షి అంటే - చక్రవాకపక్షి. ఆ పక్షులు రాత్రంతా దిగులుపడుతూ సూర్యోదయం కోసం ఎదురు తెన్నులు చూస్తాయట. అందుకే సూర్యుడిని 'చక్రవాకబంధు' అంటారు) లా పందిరిగుండం (పందిరిలో ఏర్పాటు చేసిన అగ్ని గుండం)లో మరో స్త్రీ ప్రవేశించిందట. జలనీలి (నీటిలో తేలియాడే పాచి - *Blue - Green Algae - Cyanobacteria*)పై గర్వంగా నిలిచివున్న కలువమొగ్గలాగా మరో స్త్రీ అనంటాకు (అరటి ఆకు) పై నృత్యం చేసిందట.

ఒక స్త్రీ లోగడ తాను మొక్కుకున్న ప్రకారం భుజము మీది కండల్నికోసి శక్తికి బలియిచ్చిందట. ఒకతేమో గ్రామదేవతకు మారుకాలు (తయారు చేయించిన మరకాలు) యిచ్చి తన మొక్కు తీర్చుకుందట.

బత్తులు (భక్తులు) పదునైన కత్తులతో నెత్తురు ధారలు కట్టేటట్లు పశువుల గుంపుల తలలు నరికారట. 'బత్తుడు' అంటే 'కంసాలివాని పట్టపుపేరు' (బిరుదు) అని 'శబ్దరత్నాకరము' పేర్కొంటుంది. అయితే కంసాలివారు బలులు, జాతరలలో ఎక్కడా జంతువధ చేయడానికి వినియోగింపబడినట్లు దాఖలాలు లేవు. 'భక్తుడు' అనే పదానికి 'వైకృతము'గానే 'బత్తుడు' అనే పదం కవివాడి వుంటాడిక్కడ. అయితే శ్రౌత యజ్ఞాల సందర్భంగా యజ్ఞపశువును వధించే పనిని నిర్వహించేవాడిని 'శమితా' లేక 'శమిత్ర' అంటారు. అనాదిగా యీ బాధ్యతను కుమ్మరి కులస్థులు వహిస్తున్నారు. 'కుంభకారులనీ, కులాలులనీ, శాలివాహనులనీ కూడా పిలువబడే కుమ్మరులు అనాదిగా కుండలు వగైరా మట్టి పాత్రలు చేయడం కుల వృత్తిగా కలవారు. శ్రౌత యజ్ఞాలలోనేకాక స్మార్త యజ్ఞాలలో కూడా వంట చేయడానికి వీరిని వాడతారు. కంసాలిని బత్తుడన్నట్లే, వడ్రంగి (వడ్లంగి)ని వడ్లాబత్తుడనీ, నేత పని వాడిని సాలిబత్తుడనీ, కుంభకారుడిని కుమ్మరి బత్తుడనీ చేతివృత్తుల వారందరినీ 'బత్తుడు' అనే పదం జోడించి పిలవడం అలవాటుగా వస్తున్నది. అంచేత యిక్కడ కవి కుంభకారులను దృష్టిలో పెట్టుకొని 'బత్తులు' అనే పదాన్ని వాడివుండే అవకాశమూ వుంది.

అధికముగా త్రాగిన కల్లు వలన కలిగిన మత్తు ఆ స్త్రీల తలలకెక్కిందట. దాంతో పాటు తమము (చీకటి) దిక్కుల తలకెక్కసాగిందట. అంటే చీకటి నల్దిక్కులా వ్యాపించసాగిందన్నమాట. దేవిగుడిలో దివియలు (దివ్వెలు, దీపాలు) ఒక్కొక్కటిగా వెలుగ సాగాయట. దాంతోపాటు మింట (ఆకాశంలో) చుక్కలు ఒక్కొక్కటిగా మిణుకుమనసాగాయట.

# కాపు కోడలి కొత్త కాపురం

ఆ దుష్ట బ్రాహ్మణుడు యిదే అదనని భావించి 'సందట్లో సడేమియా' అంటూ ఆ వయసు మిరారిని లేవదీసుకుని మారుభూమికి (దేశాంతరానికి) బయలుదేరాడట.

ఆ కాపుటింటి కోడలు కంచంత కాపురాన్నీ (కాంచీ నగరమంత పెద్ద సంసారాన్నీ), పాలవంటి స్వచ్ఛమైన కులాన్నీ, కాద్పరచి (చెడగొట్టి), భర్తను ఆవలపెట్టి, రంకుమగనితో ఉరికిందట. ఉవిద(స్త్రీ)లకు బుద్ధి పెడతలను (తలవెనుక వైపున) ఉంటుందేమోమరి! ఇన్నాళ్లూ ఆమె ఆకు మఱుంగు పిందె (ఆకు చాటు పిందె)లాగా తనవారి రక్షణలో వుండేది. అంతఃపురంలో వున్నదా అన్నట్లు ఎన్నడూ యిల్లు విడిచి బయటకు వచ్చిందికాదు ఆ రాకాకుముదప్రియాస్య (పున్నమి చంద్రుని వంటి చక్కని ముఖం గల ఆ స్త్రీ).

భయ గాఢతర త్వరన్ (తనవారు వెదకి పట్టుకొంటారేమోననే భయము చేత) మిక్కిలి హెచ్చయిన వేగిరపాటుతో ఏగుతున్నదట (పోతూవుందట); కానీ, మనస్సులో రవికరార్తియు (ఎండవేడిమి యొక్క తాకిడికి కలిగే బాధ) లెక్కించదట. మన్మథుని బాణముల కారణంగా రేగిన జ్వాలలలో తపించుచున్న మనస్సులుగల వారికి యితర నొప్పులేవైనా తెలుస్తాయా?

వారిద్దరూ గహన ఘంటాపథంబులు (అడవి మార్గములు) దాటుతూ వెళుతున్నారట. ఆ అడవి మార్గాలెలాంటివట? సింహములు వాటి వాడియైన గోళ్లతో ముసలి ఏనుగుల యొక్క కుంభస్థలాల్ని చీల్చి వాటిలో ఉండే ముత్యాల్ని గులకరాళ్లుగా ఆ మార్గాలపై చల్లాయట. జంతువుల కంఠములలో ఉండే రక్తాన్ని త్రాగిన భయంకరమైన వ్యాఘ్రములు (పులులు) చేసే గాండ్రింపులతో ఆ అడవి మార్గాలు ప్రతిధ్వనిస్తున్నాయట. ఆ బాటలపైనున్న రాళ్లపై అడవి దున్నలు రంకెలేస్తూ తమ వాడిగల కొమ్ముల మొనలతో పొడుస్తున్నాయట. ఆ రాళ్లేమో శిలాపుష్పాల (జాతిపువ్వుల) సౌరభంతో కూడి వున్నాయట.

శిలా పుష్పమంటే బెంజాయిన్. ఇది లారేషియస్ *(Lauraceous)* మొక్క లారస్ *(Laurus)*, స్టైరాక్స్ *(Styrax)* మరియు లిండెరా *(Lindera)* జాతులకు *(Genus)* చెందిన స్పైస్‌బుష్ *(Spice Bush)* మొదలగు సుగంధ మొక్కలు కూడా యీ తరగతికే చెందుతాయి. ఇండోనేషియాలోని జావా (యవ) ద్వీపం వగైరా తూర్పు ఆశియా ప్రాంతాలలో ఈ మొక్కలు విస్తారంగా పెరుగుతాయి. ఐరోపా ఖండ దేశాలలో యీ జాతికే చెందిన లారస్ నొబిలిస్ *(Laurus nobilis)* అనే చిన్న మొక్క ఆకులు, రెమ్మలతో అల్లిన గుచ్ఛాల *(Wreaths)* తో యుద్ధాలలో విజయులైవచ్చిన వీరులను సత్కరిస్తారు. వనిల్లా *(Vanilla)* వాసనను పోలిన వాసన కలిగిన ఎర్రని జిగురు *(Resin)* ను ఈ మొక్కలిస్తాయి. దీనిని సెంట్లు, అత్తర్లు వగైరా సుగంధ ద్రవ్యాల తయారీలో వాడతారు. ధనుర్వాత నివారణకూ *(Antiseptic)*, శ్వాసకోశాన్నుంచి కళ్లెను వెలువరించే మందుల *(Expectorant)* తయారీలోనూ దీనిని వాడతారు. కాని యిక్కడ కవి రాళ్లు శిలా పుష్పాల సౌరభంతో కూడి వున్నాయన్నాడు. ఆ రాళ్ల నెర్రెలలో పెరిగే *Lichens* లేక యితర *terrestrial orchids* ను కవి 'శిలా పుష్పాలు' అని పేర్కొని వుంటాడనిపిస్తున్నది.

సూర్యుడి కిరణాలు ఎక్కడా చొరరాకుండా దట్టంగా వ్యాపించిన చెట్ల యొక్క నీడ కారణంగా ఆ బాటలు అతి శైత్యఖనులు (అతిచల్లదనానికి గనులు)గా వున్నాయట. అలాంటి అడవి మార్గాలను దాటుకుంటూ వెళ్లి ఓ బోయపల్లెను చూచి సంతోషపడి, ఆ బ్రాహ్మణాధముడు, ఆ శూద్రస్త్రీ - యిరువురూ బోయకులంలో కలిసిపోయారట.

ఎన్ని జన్మలో ఎత్తిన తరువాత కానీ లభించని ధరానిలింప (భూసుర - బ్రాహ్మణ) జాతిని ఒక్క గడియలో విడచిపెట్టిన ఆ పాపాత్ముడైన నిగమశర్మ పెల్లు (అధికముగా) ఆనున్ - త్రాగుతాడు; వేటాడతాడు; ఎరచిన్ - మాంసమును; కరచున్ - కొరుకుతాడు.

ఆ కాపుపడతి, నిగమశర్మ వేటకు బయలుదేరారట. ఆమె నడక నెమలి నడకలా వుందట. ఆమె నడుము సింహము నడుములా వుందట. స్తనములు ఏనుగు కుంభస్థలములా వున్నాయట. కుంతలములు (కేశపాశము) చమరీమృగం

యొక్క తోకలా వుందట. ఆమె చూపులు లేడి చూపులలా వున్నాయట. ఈ చక్కదనాన్ని చూచుకుని ఆమె చాల గర్వపడుతున్నదట. నెమళ్లూ, సింహాలూ, ఏనుగులూ, చమరీమృగాలూ, లేళ్లూ గర్వపోతు అయిన ఆమెను చూచి యిలా అనుకున్నాయట. 'ఈ స్త్రీ వలన మన మానమే ఊనమయ్యింది (నశించినది). ఈమె అవయవములు యిదివరకే మన మానాన్ని హరించాయి. యింకా నిస్సారమైన యీ ప్రాణాలు మనకెందుకు?' అని, ఏవగించి జంతువులన్నీ ఆ శూద్ర స్త్రీ యొక్క వాడియైన బాణముల అగ్నిజ్వాలలకు తమకు తామే ఆహుతి అయ్యాయట.

ఇక ఆ స్త్రీ నిగమశర్మకు ఎలాంటి ఆహారాన్ని పెడుతున్నదటంటే -

తెల్లగా అయ్యేట్లు దంచబడిన వెదురుబియ్యాన్ని చిన్న వంటకుండలో వండి, గంజి వార్చి, పువ్వులవలె ఉడికిన ఆ అన్నాన్ని దించి బాగా తోమిన మూకుటిలో చాలినంత వడ్డించి, పెక్కు విధములైన వన్యామిషములు (అడవి మృగముల మాంసములు) చుట్టూ పెట్టి బాగుగా కాచిన గురు నెయ్యి (ఆవులాగానే వుండే అడవి ఆవును 'గవయీ' (*Gayal*) అంటారు. దాని నెయ్యిని గురునెయ్యి అంటారు) ని చేతినిండా కుమ్మరించి, ఆ గవయీ మృగము యొక్క మజ్జిగను అలాబు శలాటు - సొరకాయ ఖండోదరము (చిప్ప)లో నిండుగాపోసి, ఒక ప్రక్కవుంచి, తానుకూడా బంతిలో కూర్చుని ఒక్కొక్క మాంసపుకూర యొక్క రుచిని పలు విధములుగా వర్ణిస్తూ అన్నం ముద్దలుగా చేసి ప్రతి ముద్దనూ తాను సగం తిని, మిగిలిన సగం ముద్దనూ తన స్వామికి పెడుతూన్నదట, ఆ యిగురుబోడి (చిగురువంటి దేహముగల ఆ కాపు పడతి)

## నిగమ శర్మ మరో సంసారం

కొన్నాళ్లకు ఆ కాపు స్త్రీ మరణించిందట. అలా నిస్సంతుగానే ఆ కాపు కోడలు మరణించిందన్నమాట. అప్పుడా నిగమశర్మ వేరొకచోట రూపాజీవ (అందమే జీవనాధారంగా కలది - పడుపు వృత్తి చేసుకొనేది) యైన ఒక రాజానన (చంద్రుని వంటి ముఖముగల స్త్రీ)ని పెండ్లాడాడట. ఆమె తాపింఛ (తాపిచ్ఛ వృక్షము. తమాల వృక్షము లేక చీకటి క్రానుగుచెట్టు) వృక్షపు ఆకుల గుంపులవలె నల్లని మేని చాయగలదట. మదంతో క్రొవ్వినదట. చక్కని పిరుదులు గలదట. వీణానాదంవంటి స్వరం కలిగిందట ఆ ప్లవకన్య. ప్లవకన్య అంటే మాలపడుచు. ప్లవ అంటే చండాలుడు అంటే చర్మకారుడని కొన్ని నిఘంటువులు పేర్కొన్నాయని కొందరు వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. (మరిన్ని వివరాల కోసం అనుబంధం -8 చూడండి.)

ఆ భార్య ద్వారా నిగమశర్మకు పుత్ర సంతానం కలిగింది. ఒకరోజు అతనొక్కడే నెత్తిపై కళ్లుండే శరభ మృగములతో సమానమైన క్రౌర్యం కలిగిన రెండు కుక్కపిల్లల్ని గొలుసులతో కట్టి తన వెంటబెట్టుకుని వేటకు బయల్దేరాడు.

శరభ మృగమంటే ఎనిమిది కాళ్లుండి, సింహం కంటె బలశాలిగా చెప్పబడే ఓ ఐతిహాసిక మృగం. దీనికి నెత్తిమీద కళ్లుంటాయట. క్రౌర్యానికి మారు పేరుగా యీ మృగాన్ని పేర్కొంటారు. (అష్టపాద: శరభ: సింహఘాతీ - మహాభారతం)

అక్కడికి దగ్గరలోనున్న అడవిలో తనకు యిష్టం వచ్చినన్ని మృగాల్ని వేటాడి వాటి మాంసాన్ని కావడిలో వేసుకుని సూర్యాస్తమయానికి తన యింటికి చేరాడట.

అతను యింటికి చేరేటప్పటికి కోపించిన శమనుడి (యముడి) కంటిచూపు యొక్క తీక్షత అనే అగ్నికీలలచే ఆక్రమించబడి ఆ దివాకీర్తి యొక్క (చండాలుడి; అంత్యజుడి యొక్క) యిల్లంతా తగులబడి పోయిందట. దైవం యొక్క చెడ్డచూపు కారణంగా, కల్లు మత్తులో జోగుతూన్న అతని భార్య, పుత్రులు, సేవకులు యావత్తూ ఆ మంటలకు బలియైనారట. అతని పశువులూ, ధనసంపదలు మొత్తం నాశనమయ్యాయట. ఆ దృశ్యం చూడగానే ముందుగా మూర్ఛపోయి, తరువాత

తెప్పరిల్లి గొల్లుమని ఏడ్చాడట ఆ వినిందిత కులవ్యవహర్త (అంటే నిందించబడిన కులాచారములు కల నిగమశర్మ). తన భార్యనే తలచుకుంటూ, నోటినుండి చొంగకారుస్తూ పదే పదే విలపించాడట.

"ఓ పల్లవపాణీ! (సున్నితమగు చేయికల ఓ ప్రియురాలా!) లోకంలో ఎక్కడైనా ధనములిచ్చి అందరూ స్త్రీలను కొనుక్కుంటారు. నేను మాత్రం పరమపావనమైన నా వంశాన్ని యిచ్చి (బ్రాహ్మణ జాతిని యిచ్చి - అంటే నా వంశగౌరవాన్ని వదలుకొని) నిన్ను కొన్నాను, నీ చక్కని నల్లటి రూపు శాశ్వతమని నమ్మి. అయితే అది నేడు క్షణంలో మెరిసి మాయమైపోయే మెరుపుతీగ కంటే కూడా అశాశ్వతమైనదని అర్థమయింది." (దీన్ని బట్టి కవి కాలంలో కన్యాశుల్కమిచ్చి వధువును కన్యాదాతనుండి కొనుక్కొనేవారని తెలుస్తున్నది)

చిన్న చిన్న చూచుకములు కలిగిన నీ స్తనముల పైనున్న పయ్యెద జారునట్లుగా కిన్నెర వీణను మోపి నీ కొనగోళ్లతో తంత్రులు మీటుతూ స్వర సంధానంతో ఆలపించే నీ మధురమైన కంఠ ధ్వని యొక్క తేనెలూరే రుచులనే ఎప్పుడూ నా మదిలో తలచుకుంటాను. ఈ కడజాతి నాతికి (ఈ అంత్యజురాలికి) మహిదేవుడు (భూసురుడు - బ్రాహ్మణుడైన నిగమశర్మ) చిక్కాడే అని వచ్చేపోయేవారు నన్నెంతగా నిందించినా, చివరికి ఉమ్మేసినా నేను లెక్కచేయలేదు. ఎందుకనుకున్నావు? మచ్చలేని చంద్రునివంటి నీ ముఖంలో ప్రకాశమానమైన అమృతాన్ని కాంచి మోహించిన కారణంగానే సుమా!"

"ఈ భూమి మీద ఎవ్వరికీ పుత్రులు లేరా? మదన్వయ వర్ధనులు (నా వంశవర్ధనులైనట్టి) నీ పుత్రులను పోలినవారు ఎక్కడైనా వున్నారా? వారి ముఖముల తేజస్సు, వారి దేహముల పుష్టి, వారి భుజబల విజృంభణము, వారి మాటల సొంపు; తామరపూవు రేకులవంటి వారి నేత్రముల సోయగము చూసేవాళ్లని పరవశుల్ని చేయవా?"

క॥ అని తన యాలినిఁ దనయా
లిని గని మటికాని కుడవలేఁ గూడు జలం
బును ద్రావలేననుచు నన
శనమున నతఁడేఁగఁజొచ్చె జనరహితమహిన్. (పాండురంగ మాహాత్మ్యం : 3-97)

ఈ విధంగా విచారించి అతడు తన ఆలిని (భార్యను) తనయాలిని (తనయుల సమూహమును) చూస్తేగాని కూడు కుడవలేను, జలము త్రాగలేను అంటూ అనశనమున (నిరాహారంగా, ఆహారమేమీ తీసుకొనకుండా) జనరహిత మహిన్ (నిర్జన ప్రదేశంలో) ఏగజొచ్చెన్ (పోసాగాడట).

ముందుముందు పుణ్యాత్ముడయ్యేవాడు దుఃఖము యొక్క భారాన్ని ఓర్పుతో సహించునట్లు ఆ విషమాటవిలో (ఆ కారడవిలో) తూగుచూ, తూలుచూ, ఈరములలో (పొదలలో) ఈగుచూ (దూరుచూ) తలవంచుకుని అదే పోకగా పోతూ వున్నాడట!

నీచమైన శరీరాన్ని పారవేసినట్లుగా తూలి దుల్లిపడే నిగమశర్మ, సరోరుహనేత్రుని (పద్మనేత్రుడైన విష్ణువు యొక్క) అపార కరుణ (అంతులేని దయ) కారణంగా నరకలోకాన్ని వదలి శ్రీ వైకుంఠమును చూచుటకు వెళుతున్నాడా అన్నట్లు తనంతటతానే ఓపిక తెచ్చుకుని లేచి తన ప్రయాణాన్ని కొనసాగిస్తున్నాడట.

అలా ఎట్టి ప్రయోజనమూ ఆశించనివాడై, నిర్భోజనుడై (భోజనము చేయనివాడై) నిరంబుభజనుండునై (నీరుత్రాగనివాడైన) ఆ కుజనుండు (ఆ దురాత్ముడు) నరసింహ క్షేత్రాన్ని చేరుకున్నాడు.

మిక్కిలి పచేళిమమై (పరిపక్వమైనదై) తనను సమీపిస్తున్న పూర్వ సంస్కార తపఃఫలము కారణంగా అతడు

పాపసమూహములను నాశనం చేసేదైనట్టి సంగమ తీర్థంలో స్నానమాచరించి నరసింహస్వామిని దర్శించుకున్నాడట.

## నిగమ శర్మకు మోక్ష ప్రాప్తి

ఇక నిగమశర్మ సారూప్య మోక్షం పొందే దశ సమీపిస్తూందట. 'సారూప్య మోక్షం' అంటే భక్తుడు సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువు యొక్క రూపాన్ని పొందడమన్నమాట. అంతకంటే ముందు విష్ణువు ఎత్తిన పది అవతారములనూ తాల్చాడట నిగమశర్మ. ఓ చక్కని పద్యంలో కవి నిగమశర్మ చేష్టలు ఏ విధంగా విష్ణువు యొక్క పది అవతారాలనూ సూచిస్తున్నాయో వర్ణించాడు. దాని భావమేమిటో మనం చూద్దాం.

ఆ ధరణిసురుడు దానవారాతి (విష్ణువు) కాదలచి – విష్ణుసారూప్యమును పొందదలచి – 'ముందుగానే తదవతార దశకమును ధరించాడా!' అన్నట్లు –

ఒకింతకూడా రెప్పవేయక వెర్రిగా యితరుల్ని చూస్తున్నాడట

– రెప్పవేయక చూసేది చేప (మత్స్యావతారాన్ని సూచిస్తూ)

(భార్య, పిల్లలు మరణించిన బాధతో) తలకొట్టుకుంటూ దుఃఖ జలధి (దుఃఖ సముద్రం)లో మునిగాడట

– కూర్మము సముద్రంలో మునిగివుంటుంది (కూర్మావతారాన్ని సూచిస్తూ)

దుఃఖంలో 'ఈ భూమి బ్రద్దలయితే బాగుండు'నని తలపోసి 'బిలము తెరువ'మంటూ భూమిలో చొరబడడానికి ప్రయత్నిస్తాడట – భూమిలో చొరబడేది వరాహము (వరాహావతారాన్ని సూచిస్తూ)

కొయ్యబారి బిగుసుకుపోయి స్తంభంలా తయారయ్యేవాడట

– నరసింహస్వామి స్తంభంనుంచే పుట్టాడుగదా!

(నరసింహావతారాన్ని సూచిస్తూ)

తొరగు (స్రవించే) అస్రాంబుధి (అస్రము అంటే కన్నీరు, నెత్తురు అని రెండర్థాలు)లో ఎక్కువగా మునుగుతాడట – అయినవారినందరినీ కోల్పోయిన దుఃఖంలో నిగమశర్మ కన్నీటి సముద్రంలో మునిగాడట.

క్షత్రియులందరినీ నరికి తనివిదీరా వారి రక్తసముద్రంలో మునిగినవాడు

పరశురాముడు. (పరశురామావతారాన్ని సూచిస్తూ)

భార్య గురించి 'హా ! పోయితే !' అని అరుస్తాడట నిగమశర్మ

– భార్యా వియోగంతో రాముడు తల్లడిల్లాడు. (రామావతారాన్ని సూచిస్తూ)

బహువిధైరాసక్తి (బహువిధ + ఇరా + ఆసక్తి – పెక్కువిధములుగా దప్పిక)చే విభ్రాంతి పొందాడట నిగమశర్మ. 'ఇరా' అంటే భూమి, నీరు, మద్యము అనే అర్థాలున్నాయి.

– అనేక రకములైన భూములను తన హలంతో దున్నాలనే ఆసక్తితో భ్రాంతి నొందినవాడు బలరాముడు. అలాగే బలరాముడు మద్యపాన ప్రియుడని ప్రసిద్ధం కనుక పలు విధములైన మద్యములపై ఆసక్తితో భ్రాంతినొందినవాడు అని కూడా అన్వయించుకోవచ్చు. (బలరామావతారాన్ని సూచిస్తూ)

చేరగారాని దర్శన స్థితి వహిస్తాడట నిగమశర్మ (దర్శనము అంటే చూపు, శాస్త్రము అని అర్థాలు) ఆ అంతిమ దశలో చూపు కోల్పోయిన నిగమశర్మ చేరాలనుకున్న చోటికి చేరలేడట.

- దగ్గరకు చేరగా రాని దర్శనము (శాస్త్రము) (నాస్తిక దర్శనంపై ఆధారపడిన బౌద్ధమతము) యొక్క స్థితిని - అంటే సుగతుని స్థితిని పొందాడట. (బుద్ధావతారాన్ని సూచిస్తూ)

బాడబస్ఫూర్తి లోగొన్న పగిదినుండు - అంటే బడబాగ్ని కడుపులో ప్రవేశించిన రీతిలో ఆందోళన పడతాడట నిగమశర్మ. (బాడబము - బడబాగ్ని; ఆడగుర్రము)

- కల్కి పక్షాన గుర్రము యొక్క స్వరూపమును వహించాడనడం.

(కల్క్యవతారాన్ని సూచిస్తూ)

ఇలా అవతార దశకమును (దశావతారములను) ముందుగానే తాల్చాడట ఆ ధరణిసురుడు (నిగమశర్మ)

ఎడతెగని ఉపవాసాలతో అతని చెవులు గడియలు (దిబ్బళ్లు) పడ్డాయట. మేను వణకిందట. కాలము గడవక ఆ పుడమి వేలుపు (బ్రాహ్మణుడు) వడిగా చెడి (ఆరోగ్యం క్షీణించి) పుడమిని పడి విగత జీవుడయ్యాడట.

అతని హీనమైన యాతనా దేహమును తీసుకెళ్లడానికి దంతావళము (ఏనుగు)ల గుంపులా నల్లగావున్న దండధరానుచరులు (యమభటులు) బయల్దేరి వచ్చారట. (పాపులను యముడు వారి యాతనా దేహంతో సహా తీసుకెళ్ళి యమలోకంలోని యాతనా గృహం (*Torture chamber*) లో తీవ్రంగా హింసిస్తాడని విశ్వాసం. నరకంలో యముడు పెట్టే యీ హింసలనే యమ యాతనలు, నరక యాతనలు అంటారు. మరణానంతరం అలా యమ యాతనలకు గురయ్యే దేహాన్ని యాతనా దేహమంటారు.)

"స్త్రీల మధురాధరోదితమైన లాలాజలాన్ని రకరకాల మద్యములతో కలగలిపి సేవించాడు వీడు. వావివరుసల రావును (రీతిని) అవంతైనా లక్ష్యపెట్టక తనకంటికి నచ్చిన స్త్రీని పొందాడు. జనులందరూ ప్రవ్వగ తిట్టినా (పురుగులు పడేట్లు తిట్టినా) అవమానాలన్నీ సహించి పశ్యతోహర వృత్తిన (చూచుచుండగానే దొంగిలించే - బందిపోటు దొంగతనపు పద్ధతిన) బంగారాన్ని ప్రోవులుగా సంపాదించాడు. ఇండ్లకు కన్నాలు వేసేకాక, బాట వెంట వెళ్లే లెక్కకు మించిన భూలేఖవరులను (బ్రాహ్మణోత్తములను) కొట్టి చంపి దోచుకున్నాడు వీడు. ఇంకా యీ విధంగా క్రూరులతో జతకలిసి చెప్పలేనన్ని ఘోరాలు చేశాడీ దురాత్ముడు. వీడిని పట్టండి. కట్టండి. కొట్టండి" అంటూ ఒక్కుమ్మడిగా ముట్టడించిన యమదూతల్ని చూచి అతడు దడుచుకుని దిక్కులు ప్రతిధ్వనించేటట్లుగా ఆక్రోశించాడు. (విగతజీవుడైన నిగమశర్మ యమభటుల్ని ఎలా చూస్తాడు? వారి బాధలకు తట్టుకోలేక ఎలా ఆక్రోశిస్తాడు? బహుశా 'అతడు' అంటే యింకా కట్టెను వీడని "అతని ఆత్మ" అని కవి భావం కావచ్చు.) వెంటనే అమరద్రోహి విరోధి (దేవతలకు శత్రువులైన రాక్షసులకు విరోధి - అంటే విష్ణువు) లోగడ ఆ నరసింహ క్షేత్రానికి కాపుగా వుంచిన సుదర్శన చక్రము విక్రమించి వేయి సూర్యుల తీక్ష్ణతతో విజృంభించి ఆ యమదూతల సమూహమును కకావికలు కావించి ఆ విప్రుడిని కట్టిపడేసిన యమపాశాల్ని తన పదునైన అంచులతో తెగగొట్టేసిందట.

అప్పుడు కాలానుగులు (యమభటులు) సీకులు (చెదిరినవారు)గా కాందిశీకులు (భయంతో పారిపోయినవారు)గా తరలిపోగా విష్ణుదూతల సమూహం వచ్చి గరుడవాహనంపై నిగమశర్మను కూర్చుండబెట్టి శ్వేతద్వీపం దిశగా (వైకుంఠం దిశగా) అతనిని తీసుకెళ్లారట.

వెయ్యి సూర్యుల కాంతితో వెలుగొందుతున్న ఆ గరుడ వాహనముపైనెక్కిన నిగమశర్మ పుండ్రేక్షుకోదండు తండ్రిబోలి (చెఱకు విలుకాని అంటే మన్మథుని తండ్రియైన విష్ణువులా) తేజస్సుతో వెలుగొందుతూ వైకుంఠానికి పోయేవారిలో ఫణిభుక్ (పాముల్ని భుజించేవాడు - గరుత్మంతుడి) యొక్క రెక్కలనే విసనకర్రలు వీచే గాలికి నిగమశర్మ మేనిచర్మం పైని చెమట ఆరిపోతున్నదట.

ఆది శేషుడు తన పడగలను ముత్యాలగొడుగులాపట్టి అతనికి ఎండ తగలకుండా చేశాడట. సూత్రవతీదేవి భర్తయైన విష్వక్సేనుడు (విష్ణువు సేనాని) నిగమశర్మ క్రీగంటితో సైగచేస్తే అక్కడ గుమిగూడిన దేవతలందరినీ తన చేతిలోని బెత్తంతో అదలించి వైకుంఠానికి వెళ్లడానికి అతనికి దారిచేశాడట. అతనికి యిరు పార్శ్వములా భృగు, భరద్వాజాది మునులు నిలిచి స్వస్తి వచనాలు పలుకుతున్నారట. ఇంతెందుకు అతడు సాక్షాత్తూ విష్ణు స్వరూపుడే అయ్యాడన్నమాట!

"నిగమశర్మ బాహువులు పచ్చలు పొదిగిన స్తంభములలా వున్నాయి. గొప్ప పరిమళములు కలిగిన అతని మెడలోని బంగారు పూలమాలలు మెరుపు తీగలలా వున్నాయి. ఇక అతని కళ్లు చెవులను దాటుకొని తలచుట్టూ తిరిగి వస్తున్నాయా అన్నంత విశాలంగానూ, తెల్లతామర పూలరేకులకు ప్రాణబంధువులన్నట్లునూ అతని అస్యప్రభలు (ముఖకాంతులు) ప్రపంచాన్నంతటినీ వెలుతురుతో నింపగలిగిన లేత సూర్యబింబములకు ప్రతిబింబాలలా వెలుగొందగా, ఆ నిగమశర్మ యిప్పుడు 'కుముదుడు' అనే పేరుతో వైకుంఠంలో విష్ణువు కొలువులో వున్నాడు, ఓ నారదమునీంద్రా!"

"అంతేకాదు పుండరీకుడు, శంఖకర్ణుడు, వామనుడు, కుముదాక్షుడు, విజయుడు, జయుడు, సర్పనేత్రుడు అను సేవకులలో విష్ణువు గౌరవాన్ని ఎక్కువగా పొందేది కుముదుడేనట." అన్నాడు శివుడు.

ఇలా చెప్పడం ద్వారా రామకృష్ణకవి ప్రపంచానికి ఏం సందేశ మివ్వాలనుకుంటున్నాడో తెలియడం లేదు. ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడిపిన గొప్ప భక్తుడూ, మాతాపిత సేవకుడూ, తపస్వి, పరమ భాగవతోత్తముడూనైన పుండరీకునికంటే కూడా విష్ణు సాయుజ్యం మరియు సామీప్యం పొందిన పిదప విష్ణువు గౌరవాన్ని కుముదుడే ఎక్కువగా పొందుతాడని చెపుతున్నాడు కవి.

అంతేకాదు తన తల్లిని, తండ్రిని, సోదరుడిని, గురువును చంపినట్టి ఎంతటి నీచుడైనా కూడా పాండురంగ క్షేత్రంలో మరణిస్తే ఇంద్రపదవిని పొందుతాడంటాడు కవి మరొకచోట. (పాం.మా. 3-117). ఇక జీవితంలో ఎవరికైనా నిగమశర్మలాగా 'మనం కూడా ఎన్ని తప్పులు చేసినా పర్వాలేదు. పండరీపురంలో సంగమ తీర్థంలో స్నానం చేసి ఒక్కసారి నరసింహస్వామినో, పాండురంగడినో దర్శించుకుంటే చాలు. విష్ణుసారూప్య, సామీప్య మోక్షాలు లభిస్తా'యనే అభిప్రాయం ఏర్పడదా? ఈ రకమైన ఆలోచన ఏ విధంగా ఉత్తమాదర్శం?

క॥ అమృతమయ మూర్తి, బుధహిత
విమల విభోద్భాసి, మసృణ విలసన శుభల
క్ష్మమహితవక్షుండు, విధుండట!
కుముదానంద ప్రదాన కుశలుండు కాండే? (పాండురంగ మాహాత్మ్యం : 3-113)

ఈ చక్కటి పద్యంలో విష్ణువుకూ, చంద్రునికీ శ్లేష చెప్పబడింది –

**విష్ణుని పక్షమున :** అమృతమయ మూర్తి – మృతిలేని రూపుకలవాడు; బుధహిత – విద్వాంసులకు మేలు కలిగించే; విమల విభోద్భాసి – నిర్మలమైన కాంతితో ప్రకాశించేవాడు; మసృణ విలసన శుభలక్ష్మ మహిత వక్షుండు – మెరుగులు తేరిన ప్రకాశము కలిగి, శుభకరమైన శ్రీవత్సాంకముచే గొప్పదైన రొమ్ముకలవాడు; (విష్ణువు రొమ్ముపైని వెంట్రుకలలో శుభప్రదమైన 'శ్రీవత్సము' అనే సుడి వున్నదట. ఆ కారణంగానే విష్ణువును శ్రీవత్సాంకుడు, శ్రీవత్సధారి, శ్రీవత్సభృత్, శ్రీవత్సలాంఛనుడు, శ్రీ వాత్సవ అని పిలుస్తారు); విధుడట – దేవుడట; కుముదానంద ప్రదాన కుశలుడు కాడే? కుముదుడనే తన ఆశ్రితునికి ఆనందమునిచ్చుటలో నేర్పరి కాదా?

**చంద్రుని పక్షమున :** అమృతమయ మూర్తి – అమృతముతో చేయబడిన దేహము కలవాడు; బుధహిత విమల విభోద్భాసి – బుధునికి మేలు చేకూర్చే చల్లని వెన్నెలలో ప్రకాశించేవాడు; బుధుడు – చంద్రునికీ తారకూ కలిగిన కుమారుడు. ఇతడు తపోశక్తితో అంతరిక్షంలో గ్రహంగా నిలిచాడట! మసృణ విలసన శుభలక్ష్మ మహితవక్షుండు – మెరుగైన ప్రకాశము

కలిగిన చక్కని మచ్చతో కూడిన మధ్య ప్రదేశము కలిగినవాడు (చంద్రబింబంలోని మధ్య ప్రదేశంలో చక్కని మచ్చ మనకు తెలిసినదే కదా!) విధుడట - చంద్రుడట; కుముదానంద ప్రదాన కుశలుడు కాడే? - కుముదములు అంటే కలువలు - చంద్రుడు కలువల రేడే కదా! కుముదానంద ప్రదాన కుశలుడు కాడే? - కలువలకు ఆనందము నిచ్చుటలో నేర్పరికాదా?

ఇలా ఒకే పద్యంలో శ్లేషాలంకార ప్రయోగంతో విష్ణువుకూ, చంద్రునికీ యిద్దరికీ అన్వయించేట్లు చక్కగా చెప్పాడు రామకృష్ణ కవి.

ఆ నరసింహక్షేత్రంలో వాగ్దేవీ వల్లభుడు (సరస్వతి భర్తయైన బ్రహ్మ) మొదలైన నిర్జరులు (దేవగణం) నరకేసరిని (నరసింహుడిని) అర్చిస్తూ నిత్యప్రీతితో వున్నారట.

ఆ క్షేత్రంలో నరసింహునికి దక్షిణదిశలో పార్వతి, యక్షులు, ప్రమథులు వగైరా గణములతో నేను వసిస్తాను. తన తల్లిని, తండ్రిని, సోదరులను, గురువును చంపినట్టి దుష్కర్ముడైనాసరే ఆ క్షేత్రంలో మరణిస్తే ఇంద్రపదవి పొందుతాడు. కాబట్టి ఆ క్షేత్రంలో నివసించే వారికి ఐహిక ఆముష్మికములు (ఈలోకపు మరియు పరలోకపు సుఖములు) చేజిక్కుతాయి" అని చెప్పిన శివుని నారదుడిలా కోరాడు.

"దేవా! నీ దయవల్ల ఆ మహాక్షేత్ర మహిమను సవిస్తరంగా తెలుసుకున్నాను. నా భ్రమము (భ్రాంతి), తమము (అజ్ఞానము) తొలగినాయి. ఆ వాచంయములు (మునులు) మరియు గుహునికి (కుమారస్వామికి) తెలిపినట్టి దైవము, క్షేత్రము, తీర్థముల యొక్క తత్త్వము నాకు కూడా తెలిపి నన్ను కృతార్థుడిని చెయ్యి."

అప్పుడా ఉడురాజమకుటుడు (ఉడువులంటే నక్షత్రాలు; ఉడురాజు అంటే చంద్రుడు; ఉడురాజ మకుటుడు - అంటే చంద్రుని మకుటంగా ధరించిన చంద్రశేఖరుడు - శివుడు) నారదునితో యిలా చెప్పాడు.

"ఆ నరసింహ తీర్థమునకు భిదేళిమ దిక్కునందు (ఎదుటివైపున) ఘర్మవీరానది ప్రవహిస్తూన్నది. అది అఖిల తీర్థములలోకెల్లా వాసికెక్కి చంద్రభాగ అని పేరొందుతుంది. అక్కడ తపమాచరించి ఒకప్పుడు ఇంద్రుడు దేవతలలోకెల్లా విశేషమైన భాగమును (వైభవాన్ని) పొందగలిగాడు. దానికి యోజన దూరంలో అన్నింటికన్నా శ్రేష్ఠమైనట్టిదైన పౌండరీక తీర్థం వుంది. ఈ క్షేత్రం యొక్క మహిమ ఎంత అనూనమైన (లోపరహితమైన)దంటే నక్షత్రాలకూ, క్షపాధిపతికీ (క్షప అంటే రాత్రి - కి అధిపతియైన చంద్రుడికీ), నాకూ (శివునికీ), త్రియామాచరాధ్యక్ష ద్వేషికీ (త్రియామము అంటే రాత్రి త్రియామాచరులు అంటే రాక్షసుల అధ్యక్షుడు అంటే ప్రభువు యొక్క ద్వేషి అంటే విష్ణువుకూ), భానుపుత్రికీ (సూర్యుని కుమార్తెయైన యమునకూ)మరుత్కల్లోలినీ వేణికీ (మరుత్తుల అంటే దేవతల కల్లోలినీ వేణి అంటే నదీ ప్రవాహము అంటే దేవలోకపు నదియైనట్టి గంగకూ), పక్షుల రాజైన గరుత్మంతుని కంటెనూ అధికమైన కీర్తితో యీ క్షేత్రం భాసిల్లుతూంటుంది. ఈ మహిమ ఇదమిత్థమని నేను మదిలో కూడా ఊహచేయలేకున్నాను. నా శక్త్యానుసారం నీకు దాన్ని వివరిస్తాను. దృఢ బుద్ధితో విను."

యముని చెలియలు (యముని చెల్లెలైన యమునానది), నిర్జర శైవలిని (నిర్జరులు అంటే దేవతల యొక్క శైవలిని అంటే నది - అమర గంగ) యిత్యాది ఋషులు తెలిపినట్టి తీర్థములన్నీ కూడా పౌండరీక తీర్థం యొక్క మహిమలో పదహారవ వంతు కూడా చేయలేక పక్కకు తొలగుతాయి.

ఇంకా పౌండరీక తీర్థం యొక్క గొప్పతనం ఎలాంటిదంటే -

"సీ॥ పాతకవ్రాత భూజాతజాతానలం బాశ్రితాభీష్ట పాకావసరము
విషధిరాట్పర్యంక విహరణ స్థానంబు నిఖిల పుణ్య క్షేత్ర ముఖముకురము
నమదస్మదాది నానామరున్నాధంబు వర్ణితాఖిల పుణ్యవైజననము
దైత్య భిన్నగర యాత్రా పరస్థానంబు వాఙ్మనసామేయ వైభవంబు (పాండురంగ మాహాత్మ్యం : 3-127)

పాతకములు - పాపములు; వ్రాతము - సమూహము; భూజాతము - వృక్షము; అనలము - అగ్ని; అడవిలో చెట్లు గాలి తీవ్రతకు ఊగుతూ ఒకదానినొకటి ఒరుసుకున్నప్పుడు పుట్టే అగ్నిని కార్చిచ్చు అంటారు. ఆ కార్చిచ్చు చెట్లను దహించి వేస్తుంది. అలాగే పాపముల గుంపు అనే చెట్ల ఒరిపిడికి జనించిన దావానలము వంటిదైన పాండరీక క్షేత్రం ఆ పాపాలనే దహించివేస్తుంది. ఆ క్షేత్రం ఆశ్రితుల యొక్క అభీష్టముల (కోరికల)కు పాకావసరము (పంటకాలము లేక వంటకాలము) పంటలకాలంలో వచ్చిన ఆశ్రితుల పంట పండి వారి కోరికలన్నీ నెరవేరుతాయి. అలాగే వంట సమయంలో వచ్చిన ఆశ్రితులకూ కడుపునిండా భోజనం లభిస్తుంది.

విషధి అంటే 'జలధి' లేక 'సముద్రము'. విషధిరాట్ - అంటే సముద్రములకు రాజు; విష్ణువు పర్యంకము అంటే పాన్పు సముద్రమే కనుక అతడు విషధిరాట్ పర్యంకుడు; పాండరీకము విష్ణువుకు విహారస్థలమట!

'ముకురము' అంటే అద్దము; పాండరీకము నిఖిల పుణ్యక్షేత్ర ముఖముకురమట. అంటే పాండరీక క్షేత్రమనే నిలువుటద్దంలో చూస్తే అన్ని పుణ్యక్షేత్రాలూ దర్శించినట్లేనన్నమాట!

మరున్నాథులు - దేవతా శ్రేష్ఠులు; పాండరీకములో నా వంటి (శివుని వంటి) వివిధ దేవతా శ్రేష్ఠులు నమస్కరించి నిలుస్తారు.

పాండరీకము కొనియాడబడిన సమస్త పుణ్యములను పుట్టించే వైజననమట! 'వైజననము' అంటే ప్రసవించే నెల (*the last month of pregnancy*).

దైత్యులు అంటే రాక్షసులు; 'దైత్యభిద్' అంటే రాక్షసులను భేదించిన, వారిని నాశనం చేసిన వాడు - విష్ణువు. దైత్య భిన్నగరము అంటే విష్ణువు నగరమైన వైకుంఠము. పరస్థానము అంటే మజిలీ. వైకుంఠానికి పుణ్యాత్ములైన భక్తులు జరిపే ప్రస్థానంలో పాండరీకము ఒక మజిలీ అట. అంటే పాండరీక క్షేత్రము చేరుకున్న భక్తుడు యిక వైకుంఠము చేరుకొనడమే తరువాయి అన్నమాట!

వాఙ్మనసామేయ వైభవంబు - వాక్ + మనసా + అమేయము అంటే మాట ద్వారాకానీ, మనస్సులో కానీ యింత అని పరిమాణాన్ని ఊహింప వీలుకానిది. మితి విధించడానికి వీలుకానిది. అంటే పాండరీకము యొక్క వైభవాన్ని మాటలలోనూ చెప్పలేము; మనస్సులోనూ యింత అని ఊహించలేమన్నమాట!

అంతేకాదు. ఆ పాండరీక క్షేత్రము వంకువు, వామదేవుడు, వాల్మీకి, వరతంతువు, గర్గ, గాధిపుత్రుడు (విశ్వామిత్రుడు), గౌతముడు, అత్రి, జహ్నూ, జమదగ్ని, జాబాలి, జైమిని వగైరా మహర్షులకు అత్యంత ప్రీతి పాత్రమైనదట, ఓ అనఘా! (నిర్మలమైన ఓ నారదా!)

ఇతర క్షేత్రములలో దాన, స్నాన, నిధన, వాఃపానాదుల (దానముచేయడం, స్నానం చేయుడం, మరణించడం, నీటిని త్రాగడం వగైరాల) వలన ఏయే ఫలములు చేకూరుతాయో అవి పాండరీక క్షేత్రంలో ఒక్క నిముషంలోనే చేకూరుతాయి.

భర్మస్తేయము (బంగారాన్ని దొంగిలించడం), బ్రహ్మహత్య (బ్రాహ్మణుని చంపడం), సురాపానము (మద్యాన్ని

సేవించడం), అగమ్యా రహఃకర్మము (పొంద కూడని స్త్రీతో సంగమించడం), గృహదాహము (ఇంటిని తగుల బెట్టడం), ధేనువధ (ఆవును వధించడం), వాక్పారుష్యము (తిట్టడం) మొదలైన వివిధ పాపకార్యములను చేసే దుష్కర్ముల పాపములు సైతం పౌండరీక క్షేత్రము పేరు ఒక్కమారు ఉచ్చరించినా చాలు మృగేంద్ర ధ్వనికి (సింహ గర్జనకు) మారుమోములుపడే (వెనుదిరిగి పారిపోయే) లేటిగుంపుల (లేళ్ల సమూహముల) వలె అదృశ్యమౌతాయట.

ఆ పౌండరీక క్షేత్రం యొక్క నాలుగు అక్షరాలలో ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే చతుర్విధ పురుషార్థములూ కలసిమెలసి యిమిడి వున్నాయట. తలలు ముదిరిన దురిత దంతావళులను – పాపములనే దంతావళులను (ఏనుగులను) ఆ పౌండరీక క్షేత్రం హరి (సింహం) లా చెండివేస్తుందట.

"ఆ క్షేత్రం యొక్క నట్టనడుమ యక్షాక్షకేళీరతుడూ (అక్షమంటే జూదం. యక్షాక్షమనేది బహుశా యక్షులు ప్రాచుర్యంలోకి తెచ్చిన ఒక జూదం. శ్రీ కృష్ణుడికి ఆ యక్షాక్షమనే జూదమంటే అమిత యిష్టమట. కుబేరాక్ష క్రీడ అంటే గచ్చకాయలాట. ఈ యక్షాక్ష క్రీడనే కుబేరాక్ష క్రీడ అని కూడా అంటారు.), అక్షోభ్యుడూ (క్షోభపెట్టడానికి అలవికానివాడు – క్షోభ ఎరుగనివాడు), అజరుడూ (వృద్ధాప్య మెరుగనివాడు) అనాది నిధనుడు (అనాది మరియు అనిధనుడు; జనన మరణాలు లేనివాడు) అక్షామ రక్షామయుడు (ఆదుకుని రక్షించడంలో ఏలోటూ లేనివాడు) ఈక్షామాత్రకృతాఖిలుడు (కేవలం చూపుతోనే సకలాన్నీ సృష్టించేవాడు) నవశక్తీశుడు (నవశక్తులకూ భర్తయైన కృష్ణుడు. ఇచ్ఛా శక్తి, జ్ఞాన శక్తి, క్రియాశక్తి, ప్రభుత్వ శక్తి, ఉత్సాహ శక్తి, మంత్ర శక్తి, సత్త్వ శక్తి, రజశ్శక్తి, తమశ్శక్తి అనే తొమ్మిది శక్తులనూ నవశక్తులంటారు) ప్రత్యక్షంగా వెలశాడు" అని చెప్పిన ఉమాప్రాణేశుని (శి[illegible])తో మరున్ముని (దేవముని నారదుడు) యిలా అన్నాడు.

"ఓ సద్భద్రా! (మంచి శుభములు కలుగజేసేవాడా! శివుడా!) నిఖిల జగద్భరితుడు (సమస్త లోకములనూ తనలో యిముడ్చుకున్నవాడు), యోగి హృదయగమ్యుడు (యోగుల హృదయాలకు లక్ష్యమైనట్టివాడు) అయిన కృష్ణుడు ఆ క్షేత్రంలో ఉద్భవించిన తీరును తెలిపే అద్భుతమైన కథను సుప్రసన్నతతో వివరించు"

అప్పుడా పురవైరి (త్రిపురాసుర సంహారియైన శివుడు) కలహాశి (కలహమే అశనముగా – ఆహారముగా కలవాడు), కుశేశయపౌత్రుడు (కుశేశయము అంటే తామర పువ్వు. బ్రహ్మ తామరకు పుత్రుడు. బ్రహ్మ కుమారుడైన నారదుడు తామరకు పౌత్రుడు అంటే మనుమడు) అయిన నారదునితో యిలా అన్నాడు "విను. ద్వాపరయుగం ముగిసే సమయంలో దాంతుడు (మనోనిగ్రహం కలవాడు) శాంతుడు (ఇంద్రియ నిగ్రహము కలవాడు) హృద్విపక్ష శిక్షాపటుశక్తి (హృదయములోని విపక్షములు – అంటే అంతర్గత శత్రువులైన – కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషడ్వర్గాలను అదుపులో వుంచడంలో దృఢమైన శక్తి కలవాడు) విష్ణుపద సంభృతభక్తియు (విష్ణువు పాదములందు పూర్ణమైన భక్తి కలవాడు)నైన పుండరీకుడనే నిష్పాపుడైన బ్రాహ్మణుడొకడు ఆశ్చర్యకరంగా జన్మించాడు.

పాతకములను పంచబంగాళము చేసేది (చీల్చి చెండాడేది. బంగాళ దేశములో గంగానది ఎలా చీలికలై పారుతుందో అలా పాపాలను చీల్చి చెండాడేది. బ్రౌన్ నిఘంటువు పంచబంగాళము చేయడమంటే అదృశ్యము చేయడమని పేర్కొంది) కేవలం దర్శనమాత్రంచేత మోక్షాన్నిచ్చేదీ, పుష్కరమునకు మున్మడ్లు (రాజస్థాన్‌లోని అజ్మీరు జిల్లాలోని ప్రసిద్ధమైన పుష్కర తీర్థమునకు మూడురెట్లు పుణ్యఫలమిచ్చేది), పంపకు నల్మడ్లు (తుంగభద్రకు మరొక పేరు పంపానది. పంపా తీర్థంకంటే నాలుగురెట్లు పుణ్యఫలప్రదాయిని) అనజాలినదీ, ప్రఖ్యాతిలో బిందు సరస్సుకు ప్రతిబింబము అనదగినదీ, స్వర్గద్వారము కంటే అత్యంత మేటియైనట్టిదీనైన చంద్రభాగ మహాపుష్కరిణి ఒడ్డున ఒక ఆశ్రమాన్ని నిర్మించుకున్నాడట పుండరీకుడు. ఆ ఆశ్రమంలో చూత (మామిడి), ఖర్జూర, పనస, జంబు (నేరేడు), కాంచన (సంపెంగ) వృక్షాలు ఏపుగా పెరిగి వున్నాయట.

ఆ ఆశ్రమం నృత్యచ్ఛిఖండి (నృత్యత్ + శిఖండి – నాట్యము చేయుచున్న నెమళ్లు కలదీ) కూజదిష్టపరపుష్ట (కూజత్ + ఇష్ట + పరపుష్ట – కూయుచున్న యిష్టమైన కోయిలలు కలిగినదీ) గాయదళీంద్రజుష్టము (గాయత్ + అళీంద్ర జుష్టము – అళీంద్రములు అంటే గండుతుమ్మెదలు. పాడుచున్న గండుతుమ్మెదలచే ఎంగిలి చేయబడిన పూలు కలిగినదీ) అలస కల్హార పవన నమ్రాగ్ర దళము (కల్హారము అంటే కొంచెం ఎరుపు, తెలుపు కలిసిన మిక్కిలి పరిమళం కలిగిన సౌగంధికము అనే కలువ పువ్వు–*A type of white water Lily*. సౌగంధికముల మీద నుండి మందంగా వస్తున్న గాలికి ఆ ఆశ్రమంలోని చెట్ల చిగుళ్లు నమ్రతతో వంగాయట).

# పుండరీకుని ఘోర తపస్సు

పుండరీకుడు గొప్ప మోక్ష సామ్రాజ్యాన్ని అనుభవించే కోరికతో, బాఢ నిష్ఠానురక్తితో (దృఢమైన నియమముల యందలి ఆసక్తితో) తపస్సు చేస్తున్నాడట.

అతడు నీట మునిగి తపస్సు చేస్తున్నాడట. తన మనస్సంతా నిండివున్న నారాయణుడే బహుశా అతనికి నీట మునిగి వుండడమెలాగో నేర్పాడేమో! (నారము అంటే నీరు. నారాయణుడు అంటే నీట నివసించేవాడు – విష్ణువు).

అతడు ఆకాశం నుండి వ్రేలాడుతూ తపస్సు చేస్తున్నాడట. అతడి నొసలు యొక్క లోపలి చక్కి (లోపలి ప్రదేశము) చంద్రుడిలా వుందట. బహుశా అతడి నొసటి చంద్రుడే అలా వ్రేలాడి తపస్సు చేసే దీమసము (ఉపాయం) అతడికి నేర్పాడేమో!

అతడు కేవలం గాలిభోంచేసి జీవిస్తున్నాడట. అంటే వేరే ఏ ఘనద్రవాహారములు తీసుకొనడం లేదట! బహుశా అతని మూలాస్థానంలోనున్న కుండలిని అనే లేలిహానము (పాము) అతనికా వాయుభక్షణ విద్య నేర్పిందేమో! మనందరిలోనూ మూలా స్థానములో కుండలిని అనే పాము చుట్టలు చుట్టుకుని పడుకుని వుంటుందనీ, నిద్రాణమైన దానిని సాధన ద్వారా జాగృతం చేసి మూలాధార చక్రాన్నుంచి సహస్రార చక్రంవరకూ లేచేట్లు చేయవచ్చునీ విశ్వాసం. ఈ సాధనను కుండలినీ యోగం అంటారు. (చూ. *The Serpent Power - John Woodrough*). పామును వాతాశనము అంటారు. అంటే గాలి భోజనం చేసేది అని.

అతడు ఏమాత్రం జంకకుండా, రెప్పవాల్చకుండా సూర్యుడివంక తదేకంగా చూస్తున్నాడట. ఇలా తీక్షణమైన సూర్యుడి కిరణాలకు కూడా లొంగని ధైర్యాన్ని అతని శరీరంలోని యిరుమూడు (రెండు మూళ్లు – ఆరు) కమలములు – పద్మం ఆకారంలో వున్న షట్చక్రాలు – మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా చక్రములు ఆరింటినీ షట్చక్రాలంటారు. శిరస్సు పైభాగంలోని తిరుగబడివున్న కమలంవంటి సహస్రారం ఆత్మకు స్థానమని విశ్వాసం. అతనికీ ధృతిని బహుశా ఆ షట్చక్రాలు నేర్పాయేమో! – అన్నట్లు ఆయా క్రియలను అతడు అలసట లేకుండా చేస్తున్నాడట.

ఆ ఉగ్ర తపస్సు యొక్క తీక్ష్ణతకు ముల్లోకములూ క్రుంగి గగ్గోలు పడ్డాయట! పుండరీక నేత్రుడు (పుండరీకమంటే తెల్లతామర. తెల్లతామర వంటి కన్నులు కలవాడైన విష్ణువును పుండరీకాక్షుడు, పుండరీక నేత్రుడు అంటారు) అనే భృంగము (తుమ్మెద వంటి విష్ణువు) మాత్రం తనలోనే నెలకొనియున్నదట! మరి తన పేరు పుండరీకుడే కదా. తుమ్మెద మధువును కోరి తామరలోనే వుంటుందికదా!

# పాల సముద్ర వర్ణన

పుండరీకుడు యిలా ఘోర తపస్సు చేసే సమయంలో భూదేవి విష్ణువును చూడడానికి వెళ్లిందట. ఆమె పాలసముద్రాన్ని చేరుకున్నదట. కవి యిక్కడ పాలకడలిని వర్ణిస్తున్నాడు.

సీ॥ నీరజోదర యోగనిద్రావరణ సీమ చతురంబు సితసామజప్రభునకుఁ
బానలుబ్ధాబ్ద ప్రపాకల్పనము సూతికానికేతనము పుష్కరసదనకుఁ
గామధుక్సందాననీ మధ్యదేశంబు రసవతి దేవతా విసరమునకు
గోత్రభిల్లోక చకోరదృగ్గోత్రంబు మందురాస్థాన మమర్త్యహరికిఁ

తే॥ గాయమానంబు బలిగృహాంగణ వసుధకు, సకల వాహినులకు జనాంతికపదంబు
సారలోహారరము భూధ్రవైరి బద్ధ, బుద్ధిఁ జొరఁబొంచియున్న దంభోళికబ్ధి

(పాండురంగ మాహాత్మ్యం : 3-142)

అది నీరజోదరుడు (నీరజము అంటే పద్మము. పద్మము ఉదరమునందు కలవాడు - విష్ణువు) యోగనిద్రలో ఆవరించెడి (పరుండే) సీమ. సితసామజ ప్రభువు (తెల్ల ఏనుగులకు రాజు - ఐరావతము)నకు చతురము (గజశాల. దేవదానవులు మథించిన కారణంగా క్షీరసాగరం నుండే కదా ఐరావతం పుట్టుకొచ్చింది !) అది పానలుబ్ధాబ్ద ప్రపాకల్పనము (దాహంతో దప్పిగొన్న మేఘములకు చలివేంద్రము లేక చలిపందిరి. అబ్దము - మేఘము; పానలుబ్ధాబ్దము - దప్పిగొన్న మేఘము; ప్రపా - చలిపందిరి. పూర్వకాలంలో దప్పిగొన్న బాటసారుల కోసం బానలతో నీరు నింపి ప్రతి యింటి ముంగిట చలిపందిరిలో వుంచేవారట. మేఘములు సముద్రపునీటిని త్రాగి తిరిగి వర్షిస్తాయని ప్రాచీనుల విశ్వాసం. ఈ విశ్వాసం యొక్క శాస్త్రీయతను గురించి వేరొకచోట వివరంగా ముచ్చటించుకుందాం).

అది పుష్కర సదనకు సూతికానికేతనము. పుష్కరమంటే తామర పువ్వు. 'పుష్కర సదన' అంటే తామరలో కూర్చుండేది - పద్మాసనయైన లక్ష్మి యొక్క సూతికానికేతనము - పురిటిల్లు; పుట్టిల్లు - ప్రాచీనకాలంలో స్త్రీలు పురుడు పోసుకొనడానికి ఇంటిలో ఒక ప్రత్యేకమైన గదిని కేటాయించేవారు. దానినే సూతికా గృహము అనేవారు. అప్పట్లో బాలారిష్టాల బారినపడి శిశుమరణాలు చాల ఎక్కువగా ఉండేవి. ఆ కారణంగా ప్రసవించిన తరువాత చాల కాలంవరకు శిశువును ఆ గది బయటకు తెచ్చేవారుకారు. శిశుసంరక్షణ (*Neonatal care*) కు ఏర్పాట్లు చాల ఎక్కువగా ఉండేవి. మరి లక్ష్మీదేవి క్షీరసాగరసుత కదా! అంచేత పాలసముద్రమే ఆమె పుట్టిల్లు.

అది కామధుక్ సందాననీ మధ్యదేశము - కామధుక్ అంటే కామధేనువు. 'సందాననీ' అంటే గోశాల. ఈనిన ఆవును గోశాల మధ్యలో కట్టేస్తారు. కామధేనువు పుట్టింది కూడా పాలసముద్రంలోనే కదా! అంచేత, పాలకడలి 'కామధుక్ సందాననీ మధ్యదేశము'.

అది దేవతా విసరమునకు రసవతి - రసవతి అంటే వంటిల్లు. విసరము అంటే గుంపు. దేవతల సమూహమునకు ఆహారమైన అమృతం పాలకడలి చిలికితే ఉద్భవించినదే కదా! అంచేత పాలసముద్రం దేవతల సమూహమునకు వంటిల్లువంటిది.

అది గోత్రభిల్లోక చకోరదృగ్గోత్రము - (గోత్రము అంటే పర్వతము అనే అర్థంకూడా వుంది. 'గోత్రభిద్' అంటే పర్వతాల రెక్కలు ఖండించినవాడైన ఇంద్రుడు. గోత్రభిల్లోకము అంటే ఇంద్రలోకము. చకోరదృక్ - అందమైనవారు. చకోరపక్షి కళ్లవంటి కళ్లు కలిగినవారు - అప్సరసలు; గోత్రము - జన్మ స్థలము; దేవలోకానికి చెందిన అప్సరసలు కూడా పాలసముద్రంలోనే పుట్టారని ఐతిహ్యం.

అది అమర్త్య హరికి మందురాస్థానము - అమర్త్యులు అంటే దేవతలు. హరి అంటే గుర్రము అనే అర్థం కూడా వుంది. 'అమర్త్యహరి' అంటే దేవతల అశ్వమైన ఉచ్చైశ్రవమునకు' మందురా స్థానము' అంటే అశ్వశాల. ఈనను న్న ఆడు గుర్రాన్ని 'మందురాస్థానము'లోనే కట్టివేస్తారట. ఉచ్చైశ్రవము అనే దివ్యాశ్వము కూడా పాలసముద్రం చిలికేటప్పుడు పుట్టినదేనని ఐతిహ్యం. అది బలిగృహాంగణ వసుధకు కాయమానము - 'కాయమానము' అంటే పందిరి. గృహాంగణము అంటే యింటి ముంగిలి. ఇంటి ముంగిట్లో మనం పందిరి వేస్తాం. బలిచక్రవర్తి యొక్క యింటి ముంగిట వేసిన పందిరి పాలసముద్రమట. బలిచక్రవర్తిని వామనావతారంలో విష్ణువు ఒక పాదంతో పాతాళలోకానికి తొక్కేశాడు. కనుక బలిచక్రవర్తి యిల్లు పాతాళలోకం. బలిచక్రవర్తి యింటి ముంగిలికి వేయబడ్డ పందిరి పాలకడలి. పాలకడలిలో ప్రవేశించి లోనికి వెళితే పాతాళలోకం చూడవచ్చుననే విశ్వాసం.

అది సకల వాహినులకూ జనాంతిక పదము - వాహినులు అంటే నదులు. జనాంతిక పదము అంటే అంతఃపురము - రాణివాసము; సముద్రుడు నదులకు భర్త కనుక ఆ సముద్రము నదులన్నిటికీ అంతఃపురం వంటిది. ఆ పాలసముద్రము భూధ్రవైరిబద్ధబుద్ధి చొర పొంచియున్న దంభోళికి సారలోహారరము - మహీధరము, ధరణీధరము, భూధ్రము - అంటే పర్వతము; 'భూధ్రవైరి' అంటే పర్వతముల రెక్కలు ఖండించిన వాడైన ఇంద్రుడు; ఇంద్రుని యెడల బద్ధ బుద్ధితో అంటే లగ్నమైన బుద్ధితో పాలసముద్రంలో చొరబడాలని పొంచియున్న దంభోళికి (ఇంద్రుని వజ్రాయుధమునకు) సారలోహారరము (ఉక్కు తలుపు - అరరము - కవాటము). వజ్రాయుధము తనలోనికి ప్రవేశించాలని ఎంత ప్రయత్నించినా పాలసముద్రము దానిని పోనీయదట. మరి కారణమేమిటో!

అలా యీ చక్కటి పద్యంలో రామకృష్ణకవి స్థూలంగా నాటి గృహముల నిర్మాణమెలా వుండేదో మనకు పరిచయంచేస్తూ, నాటి మానవ గృహాలకు సంబంధించిన ప్రధాన భాగములైన నిద్రావరణ సీమ (*Bed Room*), ప్రపాకల్పనము (చలి పందిరి-*A place where passers - by are supplied with water to drink*), సూతికా నికేతనము (పురిటిల్లు - *Labour Room*), మధ్య దేశము (నట్టిల్లు - *Central Hall*), రసవతి (వంటిల్లు - *Kitchen*) కాయమానము (ముంగిటి పందిరి లేక ముఖమంటపము - *Portico*), గృహాంగణము (ముంగిలి - *Front Room*) జనాంతిక పదము (అంతఃపురము, లోనిల్లు - *Private Room - Master Bed Room - Harem*) సారలోహ అరరము (*strong steel door*) వగైరా పదజాలాన్నంతా యిమడ్చడమేకాక జంతువుల ఇండ్లైన చతురము (గజశాల), సందాననీ (గోశాల), మందురాస్థానము (అశ్వశాల) అనే పదాల్ని కూడా యిందులో చక్కగా ప్రయోగించాడు. ఇలా ఒక ప్రత్యేకమైన విషయాన్ని గురించి ఒకే పద్యంలో ఇంత పదజాలాన్ని (*Terminology*) యివ్వగలగడం యీ కవికి మాత్రమే చేతనైన విద్య అనిపిస్తున్నది. వీటిలో దాదాపు అన్ని భాగాలూ నేటి గృహ నిర్మాణంలోనూ కనుపిస్తాయి. అయితే కాలక్రమేణా వ్యక్తులలో సామాజిక సేవాభావం అడుగంటినందున ప్రపాకల్పనముల నిర్వహణ నేటి సమాజంలో కొన్ని సేవా సంస్థలు చేపడుతున్నాయి. నేటి మహిళలు ప్రసవించడానికి ఆస్పత్రులను ఆశ్రయిస్తున్నారు కనుక క్రమంగా యిండ్లలో సూతికా నికేతనములు కనుమరుగయ్యాయి.

చ॥ అమిత పిశాచభర్త త్రిపురాంతకుఁ డొందిన రాజశేఖర
త్వముఁ బెనుగొల్లఁ డచ్యుతుఁడు దాలుచు శ్రీపతి భావమున్ మరు
త్కమనులు కూటిపేదలటుగాక సదా యమృతాన్న భోజులౌ
క్రమము సుధాబ్ధి పుణ్యమునఁ గల్గినవంచు నుతించు లోకముల్
(పాండురంగ మాహాత్మ్యం : 3-143)

రాజు అంటే చంద్రుడు. రాజశేఖరత్వము అంటే చంద్రచూడుడవడం; అమిత పిశాచభర్త (సకల పిశాచములకూ అధినాథుడైన) త్రిపురాంతకుడు (త్రిపురాసుర సంహారియైన శివుడు) చంద్రుడిని శిగలో ధరించుటచేతనే అర్ధేందుమౌళి, చంద్రమౌళి, రాజశేఖరుడు వగైరా పేర్లతో పిలువబడ్డాడు. పాలకడలిని దేవదానవులు అమృతంకోసం మథించేటప్పుడు మిగిలిన వాటితోపాటు అందునుంచి చంద్రుడు, లక్ష్మీదేవి, అమృతము వెలువడ్డాయి. పాలసముద్రం నుండి చంద్రుడే పుట్టనట్లయితే శివునికి చంద్రశేఖరత్వమెలా ప్రాప్తించేది? అలాగే, పెనుగొల్లడు (గొల్లపెద్ద) అయిన అచ్యుతుడు శ్రీపతి ఎలా అయ్యేవాడు? (విష్ణువు శ్రీ (లక్ష్మీదేవి)ని పెండ్లాడిన కారణంగా లక్ష్మీపతి అయ్యాడు) అలాగే మరుత్కమనులు (మరుత్తులు అంటే దేవతలు. కమనులు అంటే కాముకులు) - విపరీతమైన శృంగారేచ్ఛకల దేవతలు కూటికి పేదలుగా మారకుండా (పాలసముద్రం చిలుకగా వచ్చిన అమృతాన్ని భోజనం చేయడం కారణంగా వారికి ఆకలి దప్పులులేవు. ఆ కారణంగా కూటిని గురించిన దిగులు లేదు) సదా అమృతాన్న భోజులయ్యారు. ఇదంతా సుధాబ్ధి (పాలసముద్రం) పుణ్యాన కాదా? అని లోకాలు నుతిస్తున్నాయట (పొగడుతున్నాయట).

ఉ॥ ధేను గజాశ్వరత్న సుదతీ ప్రముఖాఖిల వస్తుకోటి వై
మానికభర్త మున్గొనియు మచ్చరమారఁ బయోధి లోఁతుఁగ్రై
కో నెస కొల్పెనో బలుమొగుళ్ల విషుష్ట కరీషపిండ రే
ఖానిభవృత్తి నత్తెఱఁగు గాకఁటి నీరవి ద్రావనేటికిన్. (పాండురంగ మాహాత్మ్యం : 3-144)

వైమానికులు అంటే విమానములలో తిరిగేవారు - దేవతలు; వైమానిక భర్త అంటే దేవతల అధిపతియైన ఇంద్రుడు. మున్ను - మునుపు; పాలసముద్రం చిలికినప్పుడు అందుండి ఉద్భవించిన ధేనువు (కోరినవన్నీ ఇచ్చే కామధేనువు అనే ఆవు), గజ (ఇంద్రుని వాహనమైన ఐరావతము అనే ఏనుగు), అశ్వ (ఇంద్రుని వాహనమైన ఉచ్చైఃశ్రవము అనే ఉత్తమ జాతి గుర్రము), రత్న (చింతామణి అనే అన్ని కోరికలూ తీర్చు రత్నము - *Philosopher's stone*); సుదతీ (స్త్రీలు - అప్సరసలు) వగైరా సమస్తవస్తు సంచయాన్నీ తీసుకుని కూడా, ఇంద్రుడు యింకా మాత్సర్యంతో పాలసముద్రం యొక్క లోతును కొలుద్దామని (గుట్టును గ్రహిద్దామని - యింకా లోపల ఏమేమున్నాయో చూద్దామని); బలు మొగుళ్లను - గొప్ప మేఘములను (మొగుళ్లు, మొయిళ్లు) ఎసకొల్పెనో (ఏమో) - రెచ్చగొట్టాడో ఏమో! లేకపోతే అవి విషుష్ట కరీష పిండ రేఖానిభవృత్తిన్ - బాగుగా కాల్చబడిన ఎండు పిడకల - కచ్చికల - వలె; ఆ రకంగా నీరెందుకు త్రాగుతాయి? బాగా కాలిన కచ్చికలు నీళ్లను విపరీతంగా పీలుస్తాయి. మేఘములు సముద్రంలో మునిగి నీళ్లు పీల్చుకొని మళ్లీ పైకి వెళ్లి వర్షిస్తాయనే నమ్మకం యొక్క శాస్త్రీయత ఏ పాటిదో మనం వేరొక సందర్భంలో ముచ్చటించుకున్నాం. పాలసముద్రం నుంచి మేఘాలు కచ్చికలలాగా నీళ్లను త్రాగడమేమిటి? క్షీరనీర న్యాయం ప్రకారం హంసలు నీరు కలిసిన పాలలో పాలను

మాత్రమే గ్రహించి నీటిని వదలి వేస్తాయని నమ్ముతున్నట్లు, యీ కచ్ఛికలు పాలసముద్రంలో పాలను వదిలేసి వాటిలో కలిసిన నీళ్ళను మాత్రమే త్రాగుతాయనుకోవాలా ?

క్షీర నీర సముద్రములకు ఐక్యముచెప్పుట కవి సమయమని కొందరు వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. కాని నా అభిప్రాయం అసలు 'పాలకడలి' అంటేనే 'పాలసముద్రం' (*a sea of milk*) కాదు. మంచినీటి సముద్రం. పాలతోనూ, పెరుగుతోనూ, నెయ్యితోనూ, సముద్రాలున్నవనే విశ్వాసం అశాస్త్రీయం. 'పాలగుమ్మి', 'పాలపర్రు', 'పాలదుగు', 'పాల్వాయి', 'పాలకురికి', 'పాలవంచ' వగైరా ఊళ్ల పేర్లన్నీ 'పాలు' అంటే మంచినీరు అనే అర్థంలో ఏర్పడినవే. సంస్కృతంలో పయస్సంటే పాలు అనీ, నీరు అనీ అర్థాలు; క్షీరము అన్నా పాలు, నీరు అని రెండర్థాలు. చిత్తూరు జిల్లాలో 'పాలసముద్రం' అనే వూరే వుంది. ఆ వూర్లో వున్న మంచినీటి చెరువును బట్టి దానికాపేరు వచ్చి వుంటుంది. హిందీలో 'బావ్‌డీ' లేక 'బావ్‌లీ' అంటే లోతైన చిన్న చెరువు. అది ఉప్పునీటి చెరువైతే 'ఖారీ బావ్‌లీ' (ఢిల్లీ) అన్నారు. 'ఖారీ' అంటే 'ఉప్పటి' అని అర్థం. మంచినీటి చెరువైతే 'దూధ్ బావ్‌లీ' (హైదరాబాద్) అన్నారు. బావ్‌లీ క్రమేణా 'బౌలీ' అయింది. అలా హిందీలో కూడా మంచినీటిని 'దూధ్' (పాలు) అని వాడడం వుంది. పాలసముద్రమని ప్రాచీనులచే భావించబడినది ప్రపంచంలోకెల్లా పెద్ద మంచినీటి సరస్సైన బైకాల్ అనీ, విష్ణువు నివాసస్థలమైన వైకుంఠం ఉన్నదని చెప్పబడే పాలసముద్రంలోని శ్వేతద్వీపం బైకాల్ (వైఖానస) సరస్సులో వున్నట్టి ద్వీపమేనని నా దృఢాభిప్రాయం. ప్రపంచంలో అతి లోతైన సరస్సూ అదే కావడం విశేషం. దీన్ని గురించి మరిన్ని వివరాలు 'వైఖానసులు' అనే అనుబంధంలో చూడండి.

విష్ణువు చారిత్రక పురుషుడే అయితే అతని నివాసస్థలం ప్రపంచంలోని అతి పెద్దదీ, లోతైనదీ అయిన 'బైకాల్' అనే మంచినీటి సరస్సు. (వైశాల్యం 31,498 చ.కి.మీ., లోతు 1620 మీటర్లు) పయోధి, పయోనిధి అనే పదాలు మంచినీటి సముద్రానికి సూచకాలు. బైకాల్ సరస్సు సముద్రమంత పెద్దది కనుక దానిని పయోధి అని వుంటారు. పెద్దవైన చెరువుల్ని కూడా ద్వార సముద్రం (హళేబీడు, కర్ణాటక), తిమ్మ సముద్రం (ప్రకాశం జిల్లా), పాల సముద్రం (చిత్తూరు జిల్లా), కేసముద్రం (వరంగల్ జిల్లా) వగైరా పేర్లతో పిలవడం మన మెరిగినదే !

శా॥ **అంతర్మగ్న దిగంతదంతి కట నిర్యద్దాన ధారాఝరా**
**క్రాంతంబుల్ నిజవేగ భగ్నవపురుగ్ర గ్రాహముల్ మేఘఘో**
**షాంతేవాసి వికంకట ధ్వనులు నాగావాసగాహుల్ పయ**
**స్సంతానంబులు గ్రాలుఁ బాలకడలిన్ జాగ్రత్ప్రచారంబులై. (పాండురంగ మాహాత్మ్యం : 3-145)**

ఇక అప్పటి పాలసముద్ర స్థితిని వర్ణిస్తున్నాడు కవి. ఆ పాలకడలిలోని క్షీర సమూహములెలా వున్నాయంటే- అంతర్మగ్న - (సముద్రం) లోపల మునిగిన; దిగంత - దిక్కుల - అంతమునందున్న; దంతి - ఏనుగుల యొక్క (దిగ్దంతులు లేక దిగ్గజముల యొక్క); కట - చెక్కిళ్లనుండి; నిర్యత్ - కారుచున్న; దానధారా ఝర - మద ధారల ప్రవాహముచే; ఆక్రాంతముల్ - ఆక్రమించబడినవి;

భూగోళాన్ని బయటినుండి ఎనిమిది దిక్కులా ఎనిమిది ఏనుగులు మోస్తున్నాయని మన పూర్వుల విశ్వాసం. ఆ ఎనిమిదింటినీ 'అష్టదిగ్గజాలు' లేక 'అష్ట దిగ్దంతులు' అంటారు. అవి - 1) ఐరావతము, 2) పుండరీకము, 3) వామనము, 4) కుముదము, 5) అంజనము, 6) పుష్పదంతము, 7) సార్వభౌమము, 8) సుప్రతీకము.

ఇంకొక విశ్వాసం ప్రకారం 'ధరతి లోకా నితి ధర్మః', 'ధరతి విశ్వం ధర్మః' అని కూడా - అంటే లోకాన్నీ, విశ్వాన్నీ మోసేది ధర్మమే. ఆ ధర్మం ఓ ధర్మధేనువుగా భావించబడింది. కృతయుగంలో అది నాలుగు పాదాలతో నడిచిందనీ, త్రేతాయుగంలో మూడు పాదాలతోనూ, ద్వాపరయుగంలో రెండు పాదాలపైనా, ప్రస్తుత కలియుగంలో ఒకేపాదంపైన నడుస్తున్నదనీ నమ్ముతున్నారు.

అథర్వ వేదంలోని ఒక మంత్రం ప్రకారం -

**సత్యమ్ బృహదృతమ్ ఉగ్రమ్**
**దీక్షా తపో బ్రహ్మ యజ్ఞా**
**పృథివీమ్ ధారయన్తే**

సత్యమూ, గొప్పదీ, ఉగ్రమైనదీనైన ఋతము (*cosmic law*); దీక్ష; తపస్సు; బ్రహ్మ; యజ్ఞము - ఈ ఆరూ భూమిని మోస్తున్నాయి. (ఈ ఆరింటితో కూడుకున్నదే ధర్మం అని ప్రాచీనుల భావన)

రామకృష్ణ కవి ఇదే కావ్యంలో మరో సందర్భంలో (పాం. మా. 5-90) ఇల (భూమి) జలములలో మునుగకుండా స్థిరముగా నిలచియుండడం విష్ణుని ఆజ్ఞ కారణంగానేనని పేర్కొన్నాడు.

గురుత్వాకర్షణ సిద్ధాంతం (*Theory of Gravitation*) గురించి అవగాహనలేని రోజులలోని వారికి రోజూ తాము చూసే సూర్యుడు, చంద్రుడు వగైరా గ్రహాలు నియమిత కక్ష్యలలో ఎటువంటి ఆధారం లేకుండా తిరగడం ఓ వింతగా తోచేది. సూర్యచంద్రుల విషయంలో అయితే - అబ్బురపడి వదిలేసి ఊరుకున్నా, తాము నివసిస్తున్న భూమి విషయానికొచ్చేటప్పటికి వారు కొంత భద్రతను కోరుకున్నట్లున్నది. కలలో మనం ఎత్తుమీద నుంచి పడిపోతే ఒక ఈక మోస్తరుగా చిన్నగా భద్రంగా నేలమీదికి దిగుతున్నట్లు ఊహించుకుంటాం. ఎందుకంటే కలకు రూపకర్తలం మనమే కనుక. మన భద్రత మనకు ముఖ్యం కనుక. వేగంగా భూమి మీద పడితే తాను గాయపడతాననే స్పృహ కలగంటున్న వ్యక్తికి ఉంటుంది కదా! అలాగే తాము నివసిస్తున్న భూమి భద్రంగా ఉండాలని కోరి, అలా ఉన్నట్లు ఊహలు చేశారు ఆనాటి మానవుడు. ఆ ఊహల ఫలితమే పైన తెలిపిన భూభారాన్ని ఏనుగులో, ధర్మమో మోయడం అనే విశ్వాసాలు. నిజానికి భూగోళం కూడా సౌరకుటుంబంలోని యితర గ్రహాలలో దేనిపైనా భౌతికంగా ఆధారపడకుండా వ్యోమంలో తనచుట్టూ తాను తిరుగుతూ, నియమిత కక్ష్యలో సూర్యుని చుట్టూ తిరుగుతున్నది. భూమికూడా ఎక్కడికో అధోలోకాలకు జారి పడిపోవడం లేదు. లేక మరో పెద్ద లేక చిన్న గ్రహాన్ని ఢీకొనడం లేదు. సూర్యుని గురుత్వాకర్షణ శక్తికి లోబడిన కారణంగా అది దాని నియమిత కక్ష్యను వీడడంలేదు. (మొత్తం సౌరకుటుంబం - *Solar System* - యొక్క ద్రవ్యరాశి - *Mass* - లో 99% సూర్యుడి ద్రవ్యరాశే. గురుత్వాకర్షణ శక్తికి ద్రవ్యరాశే మూలం కదా. ఆ కారణం చేతనే సౌరవ్యవస్థలోని మిగిలిన గ్రహాలన్నింటినీ సూర్యుడు తనచుట్టూ త్రిప్పుకోగలుగుతున్నాడు. సూర్యుడి గురుత్వాకర్షణ పరిధి 1.5 కాంతి సంవత్సరాలట. కాంతి వేగం సెకనుకు 1,86,000 మైళ్ళు. ఆ లెక్కన కాంతి సంవత్సరమంటే 58,80,00,00,00,000 మైళ్ళు లేక 94,60,00,00,00,000 కి.మీ. అంటే 1 1/2 కాంతి సంవత్సరాల దూరం వరకూ రోదశిలో తిరుగాడే అన్ని గ్రహాలూ, వాటి ఉపగ్రహాలూ, యాస్టరాయిడ్ (*Asteroid*) లూ వగైరా సూర్యుని గురుత్వాకర్షణ పరిధికి లోబడే తమ తమ కక్ష్యలలో సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయన్నమాట. సూర్యుడు కేంద్రముగా తిరుగాడే వ్యవస్థ కనుకనే దీనిని సౌరకుటుంబం అన్నారు.)

అలా గురుత్వాకర్షణ శక్తి అనే భౌతిక నియమం పైన భూమియొక్క వేగం, కక్ష్యలో స్థిరీకరణ వగైరాలు - తద్వారా మనందరి భద్రత ఆధారపడి వున్నాయే గాని, దిగ్గజాలపైన గానీ లేక ధర్మమనే నైతిక సూత్రం (*Ethical Principle*) పైన గానీ భూమండలం ఆధారపడి లేదు. బహుశా భూమిపైన అనైతికత (*Immorality*) పెచ్చు పెరిగిపోకుండా వుండేందుకు భూగోళంపై మనందరి భద్రత ధర్మాన్ని రక్షించడం పైనే ఆధారపడి వుందనీ, ధర్మమే భూమండలాన్ని మోస్తుందనీ, 'ధర్మో రక్షతి రక్షితః' అనీ పూర్వులు బోధించి వుంటారు. ఇక్కడి ప్రజల శాంతి సౌభాగ్యాల కొరకే ధర్మమనే సామాజిక, నైతిక నియమాన్నేర్పరచి వుంటారు. సమాజం అభివృద్ధి చెందే కొద్దీ సామాజిక అవసరాలు మారుతుంటాయి. మారే సామాజిక అవసరాలకనుగుణంగా ధర్మం కూడా మారి తీరాలి. కానీ, కొందరు సనాతనులు ఎప్పటివో బూజుపట్టిన సామాజిక, నైతిక నియమాలను ధర్మం పేరిట వర్తమాన సమాజంపై రుద్దజూస్తారు. ఎన్నో యుగాలుగా సమాజంపైన ఆధిపత్యం చెలాయిస్తున్న వర్గాలు ధర్మ సంరక్షణ పేరుతోనే సామాజిక, ఆర్థిక రంగాలలో సంస్కరణలను వ్యతిరేకిస్తూ యథాపూర్వ స్థితినే కొనసాగింపజూస్తారు. శాస్త్రీయంగా ఆలోచిస్తే

ధర్మం లేక దిగ్గజాలు భౌతికంగా భూమిని మోయడంలేదు నైతికత కోసం సమాజానికి కొన్ని ధార్మిక నియమాలు అవసరమైనప్పటికీ - జనం కోసం ధర్మమే కాని, ధర్మం కోసం జనం కాదు అందుకే కాలం చెల్లిన ధార్మిక, సామాజిక, నైతిక నియమాలకు స్వస్తి చెప్పి ఎప్పటికప్పుడు సామాజిక అవసరాలకు అనుగుణమైన నియమాలను రూపొందించుకుంటూ ముందుకు సాగాలి.

మదించిన ఏనుగు చెక్కిళ్లనుండి దానము అనే మదం స్రవిస్తుంది. అయితే రామకృష్ణకవి వర్ణించిన దాని ప్రకారం దిగ్దంతులు పాలసముద్రంలో మునిగి భూభారాన్ని మోస్తున్నాయి. అంచేత లోపల మునిగివున్న ఆ దిగ్గజముల చెక్కిళ్ల నుండి స్రవిస్తూన్న మదధారల ప్రవాహం పాలకడలిలోని క్షీరసమూహాలను ఆక్రమించేస్తున్నదట! రామకృష్ణుని దిగ్దంతులు భూగోళం యొక్క భారం మొత్తాన్నీ మోయడం లేదు - అవి సముద్రంలో మునిగి లోపలినుండి కేవలం భూభాగాన్ని మాత్రమే మోస్తున్నాయన్నమాట! అందుకే భూభాగం సముద్రంలో మునగకుండా తేలుతున్నదని ఆయన విశ్వాసం కాబోలు! (భూగోళవైశాల్యంలో 29.2% భూభాగంకాగా, మిగిలిన 70.8% జలమయమే!)

అ) ఆ క్షీర సమూహములు లోపల మునిగిన దిగ్గజముల చెక్కిళ్లనుంచి స్రవిస్తున్న మదధారాప్రవాహం చేత ఆక్రమించబడినవి.

ఇంకా ఆ పాలకడలిలోని క్షీర సమూహములెలా వున్నాయట?

నిజ - తమయొక్క; వేగ - రయముచేత; భగ్న - పగులగొట్టబడిన; వపుః - శరీరములు కలిగిన; ఉగ్ర - పెద్దవైన, భయంకరములైన; గ్రాహములు - గ్రాహములు అంటే మొసళ్లు, సొరచేపలు అని నిఘంటువులు అర్థాలు చెపుతున్నాయి. అయితే ఉగ్ర గ్రాహములు అంటున్నాడు కనుక అవి తిమింగలాలైనా కావచ్చు.

ఆ) తమ వేగం కారణంగా తమ శరీరములే చీలినట్టి తిమింగలములు కలవి.

మేఘఘోష - మేఘ గర్జనలకు (ఉరుములకు) అంతేవాసి - శిష్యులనదగిన; విశంకట ధ్వనులు - పెద్ద ధ్వనులు, పెను రవములు

ఇ) ఉరుములకు శిష్య ప్రాయములైన హోరుమనే పెను రవములు కలిగినవి.

నాగ - సర్పముల యొక్క; ఆవాస - నివాసమైన పాతాళ లోకము వరకు; గాహుల్ - చొచ్చుకొని వ్యాపించినట్టివి.

ఈ) పాతాళలోకం వరకూ వ్యాపించినట్టివి

అయినట్టి ఆ పయస్సంతానంబులు (క్షీర సమూహములు) జాగ్రత్ప్రచారంబులై - నిరంతర సంచారము కలవియై; పాలకడలిన్ - ఆ పాలసముద్రంలో; క్రాలున్ - ప్రవర్తిల్లును.

పాలసముద్రం మధ్యలోని వెలిదీవి (శ్వేతద్వీపం) వెన్నెల యేటిలో పుట్టిన కర్పూరపు కొండలా ప్రకాశిస్తూన్నదట!

తెల్లని మంచుకొండపై (హిమాలయముపై) పచ్చని వైదూర్య శిఖరమున్నట్లు; తెల్లని ఆ శ్వేతద్వీపంపై బంగారు కోట గోడలు కల వైకుంఠపురమున్నదట;

ఆ వైకుంఠపురము రోహణము వలె వున్నదట. రోహణము అంటే సింహళము (శ్రీలంక)లోని ఎత్తైన శిఖరములు గల ఒక పర్వతం. అది మదించిన ఏనుగుల గుంపులకు ప్రసిద్ధి చెందినది. విష్ణువు అనే గొప్ప ఏనుగు విహరిస్తూన్న ఆ వైకుంఠపురి ఎత్తైన శిఖరములతో ఒప్పారే రోహణ శైలమువలె ప్రకాశిస్తున్నదట!

అక్కడి కోట, సౌధములు, కేళీవనములు, పద్మసరస్సులు అద్భుతంగా వున్నాయట. అక్కడి స్త్రీలు శరత్సమయ రాజవదనలట. అంటే శరత్కాలంలోని పున్నమి చంద్రుని ముఖం కలవారన్నమాట!

# ప్రళయ హరి

బ్రహ్మకు ఒక దినమును కల్పము అంటారు. కల్పాంతములో ప్రళయము వస్తుందట. అప్పుడు 'ప్రళయ ఘనము' లేక 'ప్రళయ జలధరము' అనే మేఘం కారణంగా కురిసే విశేష వర్షాలు లోకాన్నంతా జలమయం చేస్తాయట. అంచేత ప్రళయమంటే జల ప్రళయమే (*deluge*). బ్రహ్మ సృష్టించినదంతా నాశనమై, అంతా జలమయమై పోతుందట. దానికి ముందు ప్రళయ దహనమనే అగ్ని అన్నిటినీ భస్మీపటలం చేస్తుందట. ఆ ప్రళయపయోధిలో జగన్నాథుడైన విష్ణువు చిన్ని కృష్ణుని రూపంలో ఒక మర్రి ఆకుపై పరుండి తేలుతూ వెళతాడని మన పూర్వుల విశ్వాసం. న్యగ్రోధ పత్రశాయి - న్యగ్రోధ పత్రంపై శయనించినవాడు, వటపత్రంపై పరుండిన వాడు అని వర్ణించబడ్డాడు, ఆ ప్రళయహరి మనసాహిత్యంలో (చూ. భోజరాజ విరచిత 'చంపూ రామాయణము' బాలకాండము - శ్లో. 53) ఆ తర్వాత బ్రహ్మ మళ్లీ సృష్టి ప్రారంభిస్తాడట. అంతటి ప్రళయంలోనూ పాలకడలిలోని, శ్వేతద్వీపంలోని వైకుంఠపుర వాసులకు ఎలాంటి ఆపదకానీ, ఆందోళనకానీ వుండదట. నీటిపై మర్రి ఆకు మీద వెల్లకిలా పరుండి కుడికాలి బొటన వ్రేలిని నోటితో చీకుతూ ప్రళయపయోధిలో తేలుతూ వస్తూన్న ఆ బాలకృష్ణుని వైకుంఠపురంలోని స్త్రీలు 'ఎవరి పిల్లవాడో'నని ప్రేమతో తెచ్చి పెంచుతారట. దీనిని వర్ణిస్తూ రామకృష్ణకవి ఓ చక్కటి పద్యం చెప్పాడు. చూడండి-

సీ॥ జలధి వీచీ వాత్యఁజలిదాఁకెఁగాయని యక్కున నందంద యలమి యలమి
ప్రామఱ్ఱి యాకొత్తి రాయిడిఁ బొందెఁగా యని సన్నపొత్తుల నునిచి యునిచి
వాపోయి వాపోయి వసివాడి యాఁకటఁ బెగడెఁగాయని యుగ్గు వెట్టి పెట్టి
పెనుఁ జీకటులు గ్రమ్ము పెన్ బైట వసియించి వెఱచెఁగాయని పుల్లవిఱిచి విఱిచి

తే॥ మంచి లక్షణముల పుట్టు మచ్చవాఁడు
నేత్రములు విప్పనట్టి యీ నెత్రుగందు
వరద నేతెంచె నెవ్వారి వాఁడొయనుచు
విలయహరిఁ దెచ్చి పెనుతు రవ్వీటి సతులు. (పాండురంగ మాహాత్మ్యం : 3-156)

జలధివీచీ వాత్యన్ - సముద్రపు కెరటముల మీది చలిగాలి కారణంగా ఆ బిడ్డడికి చలి తాకిందని ఆ వీటి సతులు (వైకుంఠపురమునందలి యిల్లాళ్లు) అతడిని తమ రొమ్ములకు మరి మరీ అదుముకున్నారట, ఆ వెచ్చదనం చేత చలి పోతుందనే భావంతో.

ప్రామఱ్ఱియాకు అంటే ప్రాత మఱ్ఱి ఆకు. ముదురు మర్రిఆకుపై యీనెలు ప్రస్ఫుటంగానూ, మరింత గరుకుగానూ వుంటాయి. ఆ ప్రామర్రి ఆకు రాయిడి (ఒరిపిడి, రాపిడి)కి బాలకృష్ణుని మేను గాయపడిందని మెత్తని బట్టలను పొత్తిగుడ్డలుగా వేశారట.

ఆ సుదీర్ఘ సముద్ర ప్రయాణంలో ఆకలికి ఏడ్చి ఏడ్చి మిక్కిలి అలసిపోయి బెంగపడ్డాడని ఆ బాలుడికి పలుమార్లు ఉగ్గుపెట్టారట. (ఉగ్గు అంటే చనుబాలతో ఆముదము, నెయ్యి వగైరాలు కలిపి శిశువులకు పట్టేది)

పెను చీకట్లు ముసిరిన ఆరుబయట ఒక్కడే (ప్రళయకాలపు ఉరుములు, మెరుపులతో కూడిన ఆకాశాన్ని చూస్తూ) ప్రయాణించి వచ్చినందున వెఱపు గలిగి గుబులుకుని ఆ బిడ్డడు దడుచుకున్నాడేమోనని అతడికి పుల్లవిరిచి దిష్టి తీశారట.

దృష్టి లేక దిష్టి - *Evil eye or Blasting look* - కొందరి విష పూరితమైన ఈర్ష్యాదృక్కుల కారణంగా కీడు వాటిల్లుతుందనీ, నరుడి దృష్టికి నల్లరాయైనా పగులుతుందనీ మన పూర్వులు నమ్మి యీ దోష నివారణకు ఉప్పు, ఎండు మిరపకాయలు దృష్టి తగిలిన మనిషిచుట్టూ త్రిప్పి నిప్పులలో పారవేయడమో లేక పుల్లవిరిచి నిప్పులలో పారేయడమో లేక ఎర్ర నీళ్లను త్రిప్పి పారబోయడమో చేసేవారు. పసి పిల్లలకు స్నానం చేయించే తల్లులు స్నానమంతా అయిన తరువాత మూడు చుకుకాల నీటిని ఆ పసి పిల్లల చుట్టూ త్రిప్పి పారబోసి దృష్టి దోషం నివారణ అయిందని భావిస్తారు. ఇలా దృష్టి తగులుతుందనే నమ్మకం కూడా అశాస్త్రీయమైన అంధవిశ్వాసమే.

"శుభలక్షణములు కలిగిన శ్రీవత్సమనే పుట్టుమచ్చ (వక్షంపై సుడి) కలిగినవాడు, కళ్లు కూడా తెరువని యీ నెత్తురుకందు వరదలో కొట్టుకొచ్చాడు పాపం! ఎవ్వరివాడో" అంటూ ఆ విలయహరి (ప్రళయ కాలపు విష్ణువు)ను తెచ్చి పెంచుకున్నారట వైకుంఠపురంలోని యిల్లాళ్లు ప్రేమతో.

భూదేవి అలాంటి ఆ వైకుంఠపురంలో సప్త కక్ష్యాంతరములను (ఏడు లోపలి నగళ్లను) దాటి లోనికి వెళ్లిందట.

అక్కడ బహు యోజనముల విస్తీర్ణము కలిగి, బహునారీయుతమైన ఒక కేళీగృహములో ఆనంద కోరకితమానసుడైన (సంతోషంతో చిగురులెత్తే మనస్సు కలవాడైన) విష్ణువును భూదేవి చూచిందట.

అప్పుడు విష్ణువెలా వున్నాడట? ముఖములపై అమృత బిందువులవలె చెమట బిందువులు పట్టగా చంద్రముఖులైన దేవకన్యలు తమ చేతులకున్న కంకణములు గలగలమంటూ మ్రోగుతూండగా, విష్ణువు పరుండిన సర్పపుటుయ్యాలను మెల్లమెల్లగా ఊపుతున్నారట. విష్ణువు లక్ష్మీదేవి యొక్క ఎత్తైన స్తనములను పోలిన మున్నొరగు (ముందుంచుకొనే దిండు)ను దగ్గరకు తీసుకుని దానిపై సుఖ శయనుడయ్యాడట.

పుండరీకుని ఉగ్రతపస్సు వలన కలిగిన ప్రపంచ బాధను వివరించదానికి వచ్చిన బ్రహ్మ భుజముపై చేయివేసి అతడు చెప్పేది వింటున్నాడట.

అప్పుడే వచ్చిన తన పుత్రుడైన బ్రహ్మను చూచి సంతోషంతో ఉప్పొంగి తన నాభికమలం ఉబ్బి వెదల్గ్రక్కే పుప్పొడి యొక్క పుసుపుపచ్చదనంలా వున్నదట ఆయన నడుముకు ధరించిన హళదిపుట్టము (పీతాంబరము - పసుపు పచ్చని వస్త్రము)

ఆద్యుడు (మూల పురుషుడు), ప్రణవ స్వరూపుడు (ఓంకార స్వరూపుడు) వేదాంత వేద్యుడు (ఉపనిషత్తుల చేతనే ఎరుగ దగినవాడు) మోక్ష విద్యోపదేష్ట (మోక్ష విద్య బోధించేవాడు) నిర్ముక్తజననుడు (జన్మరహితుడు) ప్రభవిష్ణుడు (ప్రభువు) నిత్య వర్ధిష్ణుడు (ఎల్లప్పుడూ వృద్ధి పొందేవాడు) అయిన విష్ణువుకు నారీజనోచితముగా (స్త్రీలకు ఉచితమైన రీతిలో) ధరిత్రి (భూదేవి) మ్రొక్కిందట.

కన్నీరు ఒక్కొక్క బొట్టుగా ఆమె సోగసైన చెక్కిళ్లపై జారుతూంటే వాటిని కొనగోళ్లతో చిమ్ముతూ తన మనస్సులో ఉన్న దుఃఖాన్నంతా విష్ణువుకు వినిపించిందట ఆ నేల నెలతుక (భూదేవి)

ఆ బాధలు విని విష్ణువు కలత చెందాదట. ఆయన భూదేవితో -

"శత్రు సంహారంచేసి నీకు తాపోపశమనం చేస్తాను. పెరిగిన నీ భారాన్ని తగ్గిస్తాను. ముల్లోకములకూ ఉపద్రవ కారకమైన పుండరీక మహర్షి యొక్క తపస్సు వలన ఏర్పడిన చిచ్చు యొక్క వ్యాప్తిని అరికడతాను. ఈ నలువ (బ్రహ్మ) కూడా అదే విషయం నాకు విన్నవించదానికి వచ్చాడు. కొలది దినములలోనే నీకు మేలు కలుగుతుంది" అంటూ భూదేవిని ఓదార్చి పంపాడు. శతానందుడు (బ్రహ్మ) కూడా తన యథాస్థానమైన సత్యలోకానికి మరలాడు.

ఆ విధంగా పుండరీకునికి తపోఫలం అందించదానికి, భూదేవి భారం తొలగ ద్రోయదానికి, కోరి మానవుడయ్యాడు

(మనుష్య జన్మ ఎత్తాడు) ఆ శౌరి (విష్ణువు) పరార్థమై (యితరుల కొరకు) పురుషవరులు (పురుషోత్తములు) తమను తాము మార్చుకున్న (దిద్దుకున్న) రీతిలో. ఇతరుల సౌఖ్యంకోరి తామే సర్దుకుపోయే ఉత్తమ పురుషుల పద్ధతిలో లోక శ్రేయస్సును కాంక్షిస్తూ శౌరి కోరి మానవజన్మ ఎత్తాడు.

# శ్రీ కృష్ణావతార చరిత్రము

అతడు వసుమతీభార నిర్వాపణ (భూభార నివారణ)కు ఉద్యుక్తుడయ్యాడట. యాదవాన్వయ పయోధి (యాదవ కులము అనే సముద్రము)ను వృద్ధిపొందించేవాడట. దేవకీ వసుదేవులకు నిధియట. నందుని మందిరమనే రసాల వృక్షంపై (తియ్య మామిడి చెట్టుపై) నివసిస్తూన్న పరభృతమట (కోకిలయట), పూతన యొక్క ప్రాణవాయువులను పీల్చివేసిన పామట (పాము గాలి భోంచేస్తుందనే దానిని వాతాశనము అంటారు) శకటాసురుడనే రాక్షసుని సంహరించిన నేర్పరియట. మదించిన తృణావర్తుడనే రాక్షసుడి పాలిట ప్రళయకాలపు యముడైనవాడట. పడగొట్టబడిన రెండు అర్జున వృక్షములు కలవాడట. (అర్జున వృక్షమంటే తెల్లమద్ది చెట్టు. *Terminalia arjuna*). వత్సాసురుని హృదయమునకు సాయకమట (బాణమట); బకాసురుడిని బాధించి చంపినవాడట. అఘాసురుని చంపినవాడట. కాళియమానభేది (కాళింది మడుగులోని కాళియుడనే పాము గర్వాన్ని అణచినవాడట.); క్రూరమైన దావానలమును భక్షించే నియమం కలవాడట. ఆశ్రితలోక వర్ధిష్ణుడు (తనను ఆశ్రయించిన ప్రజలకు వృద్ధిని కలుగజేయువాడు) అయిన కృష్ణునిగా శ్రీ కృష్ణావతారంలో విష్ణువు వెలుగొందాడట.

ఒకప్పుడు బ్రహ్మ కృష్ణుని పరీక్షింపగోరి ఆతడు మేపుచున్న గోవత్సములను (ఆవు దూడలను) మాయం చేశాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తానే గోవులుగానూ, దూడలుగానూ మారి బ్రహ్మను విభ్రాంతుడిని చేశాడట. ఆ విధంగా కృష్ణుడు బ్రహ్మను దాగుడుమూత లాడించాడట. ఇంకొకసారి తన పూజను ఆటంకపరచిన కృష్ణుని గొప్పతనం ఏ పాటిదో పరీక్షించడానికి ఇంద్రుడు బృందావనం (నేటి ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని మథుర ప్రాంతం)లో మహోదృతమైన రాళ్ల వర్షం కురిపింపగా దానినుండి తన వారిని, గోవుల మందలను గొడుగుపట్టి రక్షించుకొనడానికి గోవర్ధనమనే ఒక పర్వతాన్ని ఎత్తి తన చిటికెన వ్రేలిపై చేతిలోని బంతిలాగా ఏడు రోజులపాటు నిలిపి వుంచాడట. (అందుకే కృష్ణుడిని గిరిధారి అంటారు). రాసక్రీడలో నాలుగుస్తంభాల ఆట ఆడే నెపంతో గొల్లపడుచులను తన బిగికౌగిట బంధించాడట. (నాలుగు స్తంభాల ఆటలో స్తంభాలనే కౌగిలించుకొనడం ఒక నియమం) యక్షాక్షమనే జూదాన్ని తరచుగా యక్షరాజైన కుబేరుడి సేవకులతో ఆడుతూ వారి శిరోరత్నములను గెలుచుకునేవాడట కృష్ణుడు. సుదర్శనుడనే విద్యాధరరాజు సర్పమై వచ్చినప్పుడు తాను, తన అగ్రజుడు (బలరాముడు) కఠినమైన అతని శరీరాన్ని కాలి బొటన వ్రేలితో తన్నుబిళ్లాటాడారట. అలా బృందావనంలో గొప్ప కఠినమైన కార్యాలనన్నిటినీ శ్రీకృష్ణుడు శైశవక్రీడలలా అలవోకగా సాధించాడని చెప్పడానికి యిక్కడ కవి ఆనాడు పిల్లలు ఆడుకునే వివిధ క్రీడలను ఒక్కతావున పేర్కొన్నాడు. అవి - దాగుడు మూతలు, కందుక క్రీడ (బంతి ఆట), నాలుగు స్తంభాలాట, యక్షాక్షము (సొగటాల ఆట లేక పగడసాల ఆట లేక పాచికలాట), తన్నుబిళ్లాట.

# శ్రీరాధాదేవి చరిత్రము

ఈ విధముగా ఆ మధుకైటభ విరోధి (మధు, కైటభులనే రాక్షసులను సంహరించిన విష్ణువు) పేరుకు మనుష్యావతారమెత్తినప్పటికీ అమానుష (మనుష్యుల కతీతమైన) కార్యములు చేస్తూ వుండగా, ఆ వెన్నుని (విష్ణువు) మనస్సునకు

తృప్తి కలిగించడానికి బ్రహ్మ నిఖిలభువనమోహినియైన ఒక శక్తిని సృష్టించగా అది బ్రహ్మ ఆదేశం మేరకు నందుని మరదియగు శతగోపుడనే గొల్లవాని కుమార్తెగా పుట్టి రాధ అనే పేరుతో పెరుగుతూ దంతావళ (ఏనుగు) మరాళ (రాజహంస) శిఖావళ (నెమలి) గమనంబు (వలె ఠీవియైన నడక) గలదిగా వర్ధిల్లుతూన్నదట. ఆమె పాదములు చిగుళ్ల వలెనూ, బంగారు పద్మముల వలెనూ వున్నాయట. ఆమె కాలిగోళ్లు చుక్కలను, ముత్యములను, చంద్రబింబమును, అద్దమును పోలివున్నాయట. ఆమె పిక్కలు మన్మథుని అమ్ములపొదిలా వున్నాయట. ఆమె తొడలు బంగారు అరటి బోదెలవలె వున్నాయట. ఆమె పిరుదులు చక్రములవలె గుండ్రముగానూ, ఇసుక తిన్నెలవలె విశాలముగానూ, ఏనుగు కుంభస్థలంవలె గట్టిగానూ వున్నాయట. ఆమె బొడ్డు సరస్సు వలె లోతుగానూ, సుడివలె గుండ్రంగానూ, పొన్న పువ్వువలె మనోజ్ఞంగానూ వుందట. ఆమె స్తనములు తామరమొగ్గల్లా, బంగారు కుండలలా, ఏనుగు కుంభస్థలంలా, చక్రవాక (జక్కవ) పక్షుల జంటలా, గజనిమ్మపండ్లలా కుదురు నుండి చంకలవరకూ వ్యాపించి వున్నాయట. ఆమె నడుము ప్లక్షపల్లవములా (జువ్వి చిగురులా) మనోహరంగా వుందట. యజ్ఞవేదిక యొక్క నడిమి భాగంతో సమానంగా అది వుందట. ఆమె మెడ శంఖంకంటే అందంగా క్రముక ఫల కమనీయంగా (పోకకాయలా అందంగా) వుందట. కోమలమైన అంశుమత్ఫలా ముకుళము (మృదువైన అరటి మొగ్గవలె) ఆమె మెడ ఎంతో అందంగా వుందట. ఆమె పెదవులు బంధుజీవ ప్రసూనంబుల (మంకెన పూవుల) లా వున్నాయట. ఆమె పలువరుస మొల్లమొగ్గల్ని పరిహసించేదిగానూ, ఆణిముత్యాల్ని మించేదిగానూ వుందట. ఆమె పైపెదవి దొండపండులా వుందట. ఆమె క్రిందిపెదవి సాయం సంధ్యా రాగరంజితంగా (ఎర్రగా) వుందట. ఆమె ముక్కు సగము విచ్చిన సంపెంగ మొగ్గను అపహసించేదిగా వుందట. ఆమె కనుబొమలు చంద్రవంకల వలె నున్నాయట. చేపలవంటి ఆమె కళ్లు మెరపుల ఒరపు కలిగి, మన్మథుని బాణముల వాడిని కలిగి, ఉత్పలముల (నీలి కలువల) అందమూ, కైరవముల (తెల్ల కలువల) గౌరవము కలిగి, ఏణనేత్రంబుల వైచిత్రి (జింక కన్నుల చమత్కృతి) కలిగి, శ్రవణపుట కూప పతయాళువులుగా (చెవులనెడి నూతులలో పడడానికి సిద్ధంగా వున్నాయా అన్నట్లు ఉన్నాయట.) - అంటే ఆమెవి చెవులదాకా వ్యాపించిన విశాల నేత్రాలన్నమాట. ఇక ఆమె వదన వలయం (ముఖబింబం) దర్పణముల (అద్దముల) దర్పమును (అహంకారమును) త్రిప్పికొట్టేదిగానూ, సరోజముల (పద్మముల) అందాన్ని మరపించే విధముగానూ, (పెదవుల అధరామృతం కలిగినది కనుక) అమృత కలశం లాగానూ, చంద్రబింబం యొక్క అందాన్ని త్రోసి పుచ్చేదిగానూ వుండి కూడా అశేషమైన కళాసమూహము ఆలపించే పాణింధమ (ఊదుతిత్తి - *Bagpiper* వంటి ఒక వాద్య విశేషము) స్వరముతో వెలుగొందేదిగానూ వుందట. ఆమె చెవులు చక్కిలములవలె వున్నాయట. ఆమె కురులు లోపంలేనివిగా, సందులేనివిగా (ఒత్తుగా), నీలపు గుంపులసొంపుగా (ఇంద్రనీలమణుల సమూహపు అందాన్ని స్ఫురింపజేసేలా) నొక్కులతో వున్నాయట. ఆమె వీపు మన్మథుని నెత్తపలకం (సొగటాలపలకలా) వుందట. ఇన్ని ప్రత్యేకతలతో ఆ పారిజాతామోద (పారిజాత పరిమళం వంటి పరిమళం కలిగినది)యైన ఆ రాధ అతిశయించిన విలాసంతో భాసిల్లిందట.

రామకృష్ణకవి పాతిక పైచిలుకు గద్యపద్యాలలో రాధాదేవి అందాల్ని వర్ణించాడు. అందులోనుంచి మచ్చుకు రెండు చక్కటి పద్యాల్ని చూద్దాం.

భా॥ మానవతీ లలామ తనుమధ్యమమన్ గజవైరి కుక్షి త
ద్యాన మరున్మదావళము యౌవనపుంబొదరిల్లు దూఱఁ బైఁ
గానఁగవచ్చు కుంభములు కావుగదా కుచకుంభ యుగ్మకం?
బౌ; నటులైన వల్లభ నఖాంకుశయోగ్యత గల్గు మీఁదటన్. (పాండురంగ మాహాత్మ్యం : 3-186)

ఆ మానవతీలలామ యైన రాధ యొక్క తను మధ్యమము (నడుము) అనే గజవైరి (సింహము)నకు ఉల్కి (భయపడి); తద్యాన మరున్మదావళము - మదావళము - ఏనుగు; మరున్మదావళము - దేవతల ఏనుగైన ఐరావతము; తద్యాన (ఆమె నడకయనే) ఐరావతము యౌవనమనే పొదరింట్లో దూరిందట. అయితే పొదరింటి బయటికి కుంభములు కనపడుతున్నాయట. అవి ఒకవేళ రాధయొక్క కుచకుంభములనే జంటకాదు కదా! ఔను. నిస్పందేహంగా అవే! అట్లయితే వాటికి వల్లభుని (ప్రియుని) యొక్క నఖములు (గోళ్లు) అనే అంకుశయోగ్యత (ప్రియుని చేతిలో నఖక్షతములు వేయించుకొనే యోగ్యత) మున్ముందు కలుగుతుంది. ఒకవేళ అది ఐరావతం యొక్క కుంభస్థలమా? అయితే దానికి వల్లభ (అధిపతి యైన సింహము) యొక్క నఖములు (వాడిగోళ్లు) అనే అంకుశ యోగ్యత (సింహము తన యొక్క వాడిగోళ్లతో ఐరావతము యొక్క కుంభ స్థలమును చీల్చే పరిస్థితి) మున్ముందు కలుగుతుంది. (ఆమె నడుము సింహం నడుము వంటిదనీ, నడక ఐరావతం నడక వంటిదనీ, ఆమె స్తనద్వయం ఐరావతం కుంభస్థలం వలె నున్నదనీ కవి చెప్పకనే చెప్పాడు).

మ॥ పదలి ముఖాంశు నిష్కములు భాసుర వర్ణలలాట పత్రకం
బిడి ఋణలీలఁగైకొనియె నిందుఁడు నద్దము సాక్షిగాఁగ నె
న్నడొ జలజాత; మప్పు జతనంబుగఁ దీర్పని బల్మినొక్క పే
రదుసున నీట నెండలను నాఁగినఁ దూఁగుచు నోర్చుచుండుటల్.

(పాండురంగ మాహాత్మ్యం : 3-199)

జలజాతము (పద్మము) ఎప్పుడో చాలకాలం క్రిందట రాధాదేవి యొక్క ముఖ కాంతులనే నిష్కములను (బంగారు నాణెములను) అప్పుగా తీసుకున్నదట. ప్రతిగా భాసుర వర్ణ లలాట పత్రకము (మెరిసే అక్షరాలు కలిగిన ఋణ పత్రము)ను వ్రాసి యిచ్చిందట. లేక మరోవిధంగా - మెరుస్తున్న చందనము ఆదిగాగల మైపూతలను లలాటంపై (నుదుటిపై ఇలాంటి పూతను లలాటికా అంటారు) వ్రాసిందట. ఈ ఋణపత్రానికి సాక్ష్యులు చంద్రుడు, అద్దమూనట. అయితే ఆ అప్పును ప్రయత్నించి తీర్చలేకపోవడం కారణంగానేమో (కలువలరేడైన చంద్రుడు పద్మముల విరోధి కదా! అంచేత చంద్రుడు పద్మానికి ప్రతికూలంగా చెప్పిన సాక్ష్యం కారణంగా) అప్పు తీర్చలేకపోయిన పద్మానికి పేరదుసు (పెద్ద బురద)లోనూ, నీటిలోనూ, ఎండలలోనూ నిలవబెట్టడం అనే శిక్షలు వేయగా ఓర్చుచుండడం (సహిస్తూ వుండడం) పద్మానికి తప్పలేదు. పద్మం మరి ఎప్పుడూ (పంకజము కనుక) అదుసులోనూ, (నీరజము కనుక) నీటిలోనూ, (పగలు వికసించేది కనుక) ఎండలోనూ వుండేదే గదా! (బహుశా రామకృష్ణ కవి కాలంనాటికి యీ తరహా ఆర్థికనేరాలకు పాల్పడినవారికి బురదల్లోనూ, మండుటెండల్లోనూ, నీటిలోనూ బలవంతంగా నిల్చోబెట్టడాలు శిక్షలుగా వుండేవేమో! చంద్రుడు కలువలకు నెచ్చెలి అనీ పద్మములకు శత్రువు అనీ భావిస్తారు. పద్మములకు ఆ సోయగం రాధాదేవి ముఖ కాంతుల్ని అరువు తీసుకొనడం కారణంగానే వచ్చాయంటున్నాడు కనుక, ఆమె ముఖ సౌందర్యం ఎంత గొప్పదో చెప్పకనే చెపుతున్నాడు కవి.)

పద్మమువంటి ఆమె నుండి మకరందమును గ్రోలడానికి ఉబలాటపడుతూన్న గోధుగ్బాలకదివ్యమూర్తి (గొల్లపిల్లవాని రూపంలో అవతరించినవాడైన శ్రీకృష్ణుడు) అళిసమ్రాడాకృతిని (తుమ్మెదరాజు ఆకారాన్ని) స్వీకరించాడట.

ఆ రాధామాధవులకు చెట్టు తొర్రలవంటి వారిరువురి హృదయాలలో దిన ముఖ వారిజ గర్భముల (ప్రాతః కాలములో వికసించిన పద్మముల గర్భములలో) పొంగే పరిమళములవలె కోరికలు అంకురితములయ్యాయట.

ఆ నిలింపనదీ కిరీటుడు (స్వర్గంగను జటాజూటమున ధరించినవాడైన శివుడు) హాటకగర్భ సంభవునితో (హాటకము - బంగారము; హిరణ్యగర్భుడైన బ్రహ్మకుమారుడు నారదునితో) యింకా యీ విధంగా చెప్పాడు.

"ఆ విధంగా దినదిన ప్రవర్ధమానమవుతూన్న అనురాగం కలిగినదైన రాధ మాధవుడిని తనకు పతిగా కోరి గోవర్ధనగిరికి సమీపంలోని ఋణవిమోచనా తీర్థంలో తపస్సు చేసిందట. ఇదివరలో పూవుల లేత తొడిమలు ఒత్తుకున్నా మృదువైన ఆమె తల బాధపడేదట. అలాంటిది కరుకైన మోటుజడలు ఎలా పెంచుకున్నదో! కస్తూరి తిలకం గాలికి తడి ఆరిపోయినా ఆమె నుదుటిపై చర్మం మంట మండేటంత సుకుమారమైనదట. అలాంటిది ఆమె నొసలు భసితపు పూతకు ఎలా ఇష్టపడ్డాయో! వజ్రాలు పొదిగిన నాజూకు మొలత్రాడును కూడా ఓర్చుకోలేనంత సుకుమారమైన నడుము ఆమెది. అలాంటిదిప్పుడు బిరుసైన దర్భత్రాటి మొలనూలును ఆమె ఎలా భరిస్తున్నదో! ఇదివరలో సన్ననైన (మెత్తనైన) ఆమె చీర శరీరంపై కొంచెం ఒరుసుకున్నా గగుర్పాటు చెందేదట. మరిప్పుడు గరుకైన కావిగుడ్డ కట్టుకొనడాన్నెలా సహిస్తున్నది ఆమె కుసుమకోమల శరీరం? అంటూ జనమంతా ఆశ్చర్యపోతూంటే హేమంత ఋతువునందలి వణకించే చలిగాలిలో క్రూరమైన నిష్ఠతో ఆమె ఘోరమైన తపస్సు చేస్తూంటే సముద్రం కంపించిందట. లోకము భయపడి వణకిందట.

# హేమంత ఋతువు

మిగిలిన ఋతువులలో స్త్రీలు రవికలు ధరించనందున వారి ప్రియులు వారి ఉన్నతమైన కుచములను గాఢంగా కౌగిలించుకుని ఆలింగన సుఖం పొందేవారట. మరి హేమంత ఋతువులో స్త్రీలు వెచ్చదనం కోసం కంచుకములను (రవికలను) ధరిస్తారు, కనుక యువకులకు ప్రత్యక్షంగా వారి స్తనాలింగన భాగ్యం దొరకడంలేదట. అలాగే హేమంత ఋతువులో కుబుసంతోనున్న కారణంగా ఆడ నాగు పాములతో అనగిపెనగి ఉండడానికి వీలుకావడం లేదట మగనాగులకు. ఇలా సీతుకందువ (చలికాలం)వారికి కత్తివేటువంటి బాధను కలిగిస్తూందట.

సాధారణంగా పాములు వాటి జాతినిబట్టి క్రమానుగతంగా 72 నుంచి 210 రోజుల కొకసారి కంచుకము లేక కుబుసము (*slough*) ను విడుస్తాయి. కుబుసంతో ఉన్న పాముతెల్లగా అయిపోతుంది. అప్పుడది చాల మందకొడిగా వుంటుంది. కదలికలలో చురుకుదనం పోవడమేకాక దృష్టికూడా మందగిస్తుంది. దాని కళ్లపైన కూడా తెల్లని పలుచటి చర్మపు పొర ఏర్పడడమే దీనికి కారణం. పాములు వేసవిలో తరచుగా కుబుసం విడుస్తాయి. హేమంత ఋతువు యొక్క రెండునెలల కాలంలో అవి కుబుసంతోనే వుంటాయి.

కంచుకము అంటే రవికె అనీ కుబుసమనీ అర్థాలు. దీన్నుపయోగించి కవి యిక్కడ శ్లేషాలంకార ప్రయోగం చేశాడు. 'కుబుసము' కలది కనుక పామును 'కంచుకి' అంటారు. కుబుసము విడిచేది కనుక 'ముక్త కంచుకము' అనీ అంటారు.

ఆ కడిది (అధికమైన) చలికి లోకంలోని ప్రజలంతా మూదంకె వేసినట్లు ముడుచుకొని పడుకుంటుంటే చంద్ర బింబాస్యయైన (చంద్రబింబంవంటి ముఖం కలిగినదైన) రాధ మాత్రం మంచులో తడుస్తూ వున్నప్పటికీ కొంచెం కూడా వణకటల్లేదట రారూపువోలె (రాతిబొమ్మలా). మరి కుచములనే కఠిన శైలములకు (కొండలకు) పుట్టిల్లు కదా ఆమె శరీరం? నిశ్చలంగా – శిలాసదృశంగా కాక యింకెలా వుంటుంది? పర్వతాలకు పుట్టినచోటైన స్థిర (భూమి)తో కుచశైలములకు (కుచములనే పర్వతాలకు) పుట్టినచోటైన ఆమె శరీరాన్ని పోల్చాడు కవి. అంత చలిలోనూ ఆమె భూమిలా నిశ్చలంగా వుందని కవి భావం. అన్నట్లు, భూమికి 'నిశ్చల', 'స్థిర' అనే పేర్లున్నాయి. సూర్య చంద్రాదులు తమ కక్ష్యలలో పరిభ్రమిస్తూండగా, భూమి మాత్రం ఏ చలనమూ లేకుండా స్థిరంగా వుందని ప్రాచీనుల విశ్వాసం. అయితే భూమి కూడా తనచుట్టూ తాను తిరుగుతూ, సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నదని శాస్త్రీయంగా నిర్ధారణ అయింది. భూమి ఎప్పుడూ పడమర నుండి తూర్పుకు తిరుగుతున్న కారణంగా సూర్యుడు తూర్పున ఉదయించి పడమట అస్తమిస్తున్న భావన మనకు కలుగుతున్నది.

తెల్లకలువల వంటి తెల్లనైన తుషారము (మంచు) సంపంగి పూవుతో సమానమైన బంగారు కాంతిగల ఆమె శరీరంపై పడుతూంటే, ఆమె పారదము (పాదరసం)లో ముంచితీసిన బంగారు తీగలా మెరిసిపోతున్నదట.

బంగారాన్ని శుద్ధిచేయడానికి పాదరసం (*Mercury*) లో ముంచుతారు. పారతము అన్నా పాదరసమే!

కొత్త కాలాగరు (కస్తూరి) పూతవలన ఆమె చన్నుఁగొండలలో ఊష్మాగ్ని (వేసవి వేడి అనే అగ్ని) ప్రజ్వరిల్లిందట. బహుశా ఆ అగ్ని కారణంగానే ఆమె అంతటి గండు చలికీ తట్టుకొన్నదేమో! (ఒకప్పుడు స్త్రీలు సుగంధ ద్రవ్యంగా తమ స్తనాలపై రాసుకొనే కస్తూరి చలికాలంలో కేవలం సుగంధాన్నే కాక శరీరానికి తగు వెచ్చదనాన్ని కూడా యిచ్చేది.) మతి సమగ్రులు (సమగ్రమైన బుద్ధికలవారు; విజ్ఞులు) ధూమానుమానము చేత అచలములలోని అగ్నిని నిరూపిస్తారంటున్నాడు కవి.

అనుమానమనేది ఒక ప్రమాణము. జ్ఞాన సముపార్జనకు సాధనములే ప్రమాణములు. ప్రత్యక్ష, ఉపమాన, అనుమాన, శబ్దాది ప్రమాణములతో ఒక వస్తువును గురించిన జ్ఞానమును మనం పొందవచ్చు. పంచేంద్రియములు, మనస్సులతో ఒక వస్తువు గురించి నేరుగా తెలుసుకుంటే అది 'ప్రత్యక్ష' ప్రమాణం (*Perception*). వేరొక వస్తువుతోపోల్చి దాని స్వభావాన్ని అర్థం చేసుకొనడం 'ఉపమానం'(*Comparison*). ఎవరైనా ఆప్తుల వచనాల ద్వారా లేక గ్రంథస్థ విషయాలను చదివి తెలిసికొనడం 'శబ్ద' ప్రమాణం (*Verbal Testimony*); కాగా అనుమితి చేయడం అనుమానం (అనుమితికరణమనుమానమ్). ఇదెలాగంటే - మనం పొగవున్న ప్రతిచోటా అగ్ని కూడా వుండడాన్ని చూస్తున్నాం. కాబట్టి పొగవున్న చోటల్లా అగ్ని ఉండి తీరుతుందనే నిర్ధారణకు వస్తాం. అలా అగ్ని కనుపించకుండా దూరంగా మనకు పొగ కనుపించినా అక్కడ అగ్ని ఉండే వుంటుందని అనుమితి చేస్తాం. 'యత్రయత్ర ధూమస్తత్రతత్రాగ్ని' ఎక్కడెక్కడైతే పొగ వుంటుందో అక్కడల్లా అగ్ని ఉండే తీరుతుంది అనే నిర్ధారణకు వస్తాం. అయితే, అగ్ని పర్వతాలనుంచి వచ్చేపొగ చాల దూర ప్రాంతాలకు కూడా కనుపిస్తుంది. కానీ, లోపలి అగ్ని కనుపించదు. అయినా కనుపించే ఆ ధూమాన్ని బట్టి ఆ పర్వతాలలోని అగ్నిని అనుమితి చేస్తారు బుద్ధిమంతులు. అలా వారు అనుమాన ప్రమాణం (*Inference*) సాధనంగా అచలములలో అగ్ని వుందనే నిర్ధారణకు వస్తారు.

ఇక్కడ కవి ప్రయోగించిన రూపకాలంకారంలో కాలాగరు ధూమముగానూ, రాధయొక్క స్తనములు కొండలుగానూ, వాటిలోని వేడి అగ్నిగానూ నిరూపించబడ్డాయి.

కురిసే మంచంతా యింకిపోయి నేలంతా పగుళ్లు విచ్చిందట. అప్పుడా భూమి దేవతలు తన కళలన్నీ పీల్చివేస్తే మిగిలిన చంద్రునిలా, లోపలి కర్పూరమంతా పారబోసిన క్రోవి (బంగారు కర్పూరపు బరిణె)లా, తుమ్మెదలు తనలోని పూదేనెనంతా జుఱ్ఱేస్తే మిగిలిన అంభోరుహం (పద్మము)లా వున్నదట.

పాలసముద్రాన్ని దేవదానవులు అమృతం కోసం చిలికినప్పుడు వివిధములైన వస్తు సంచయంతో పాటు అమృత స్వరూపుడైన చంద్రుడు కూడా పుట్టాడనీ, దేవతలు అమృతాంధసులు (అమృతాశనులు) అనీ, కనుక వారు తమకు ఆకలైనప్పుడల్లా చంద్రబింబంలోని ఆ అమృతాన్ని పీల్చివేయడం కారణంగా చంద్రుడు కృష్ణపక్షంలో క్షీణిస్తూ పోతాడనీ, తిరిగి శుక్లపక్షంలో సూర్యుని కాంతి కారణంగా క్రమంగా పుంజుకుంటాడనీ మన పూర్వులు విశ్వసించేవారు.

మన పూర్వులు చలికాలంలో వెచ్చదనానికి వంటికి కస్తూరి రాసుకునేవారు. కస్తూరి మృగం (*Musk deer*) యొక్క నుదుటి నుంచి స్రవించే మదమే కస్తూరి. 'కాలాగరు' లేక 'కాలాగురు' అని కూడా కస్తూరిని పిలుస్తారు. అయితే కాలాగరు అనే వేరే అగరుపొడితో వెచ్చదనంకోసం ధూపం కూడా వేసుకునేవాళ్లు. ఇది కృష్ణాగరు (*Amyris balsamifera*) అనబడే రూటేసీ (*Rutacea*) కుటుంబానికి చెందిన వృక్షాన్నుంచి స్రవించే జిగురుయొక్క పొడి. ఇంకా *Rutaceae* కుటుంబానికే చెందిన *Vepris bilocularis* జిగురును కూడా ధూపానికి వాడతారు. ఇంకా వెచ్చదనం కోసం చలికాలంలో తొగరు చేలలు (ఎర్రని వస్త్రాలు) ధరించేవారు. అలాగే కుంకుమ పువ్వును వేడి పాలలో కలుపుకొని త్రాగేవారు. కుంకుమ పువ్వు (*Saffron*) అంటే ఇరిడేసీ (*Iridaceae*) కుటుంబానికి చెందిన *Crocus sativus* అనే మొక్క యొక్క వంగపువ్వు రంగుపూల యొక్క ఎర్రని పుష్పకీలాగ్రములు.

అగరు, కుంకుమపువ్వు, తొగరుచేలలూ సీతుడిని (చలిని) పారద్రోలగలవా? పొగలేని ముర్మురముల (నిప్పుల

కుంపట్ల) వంటి మగువల పాలిండ్లు మాత్రమే చలికాలంలో భోగమహనీయములు (అనుభవింపదగినవి) అంటున్నాడు రామకృష్ణకవి.

కొలకులలోని తామరపుష్పాలు మంచు బిందువుల వర్షంతో తడిసిపోయాయట. అవి విష్ణుధ్యానంతో నిమీలితములైన (మూసుకొనియున్న) రాధాదేవి కళ్లలా వున్నాయట.

నల్లని కాలాగురు ధూపపు పొగ హృదయానికి సుఖం కలిగించగా, వేగంగా మూసుకున్న తోరపుకన్నుల (విశాలనేత్రాల) వలె ఆ చలికాలంలో అక్కడి సౌధస్తోమము (భవన సముదాయము) సోరణగండ్లచే (సోరణము అంటే గవాక్షము, తలుపు; సోరణగండ్లు అంటే పెద్దవైన తలుపులు) ఒప్పారాయట.

## వసంత ఋతువు

వసంతాగమనాన్ని కవి యిలా వర్ణిస్తున్నాడు.

క॥ అంత వసంతము జితహే
మంతము దీపించె మత్త మధుకర కలభా
క్రాంత మురుపుష్ప రసవే
శంతము సకల ద్రుములఁ బిసాళము చెలఁగన్. (పాండురంగ మాహాత్మ్యం : 4-13)

హేమంత ఋతువుని త్రోసిరాజంటూ వసంతం రంగ ప్రవేశం చేస్తుంది. అంచేతనే వసంతాన్ని కవి జితహేమంతము (గెలువబడిన హేమంత కాలము కలది) అన్నాడు.

మధుకరము అంటే తుమ్మెద; మధుకర కలభములు - అంటే పిల్ల తుమ్మెదలు. మదించిన పిల్ల తుమ్మెదలచే ఆక్రాంత (ఆక్రమించబడినది, మూగబడినది) ఉరు - శ్రేష్ఠమైన, పుష్పరసము - పూఁదేనె; వేశంతము - పడియ (నీళ్ళు నిలిచిన చిన్న గుంట), సకల ద్రుముల .- అన్ని వృక్షములందును; పిసాళము - వికాసము; చెలగన్ - అతిశయించి (కలుగగా) దీపించెన్ - ప్రకాశించెను.

శ్రేష్ఠమైన పూదేనియ జుర్రుకొనడానికి అన్నిచెట్ల పూవులపైన ఎగబడుతూన్న మదించిన పిల్లతుమ్మెదల గుంపులతో ఆ వసంత ఋతువు ప్రకాశిస్తూన్నదట.

ఆ మధుల÷ (వసంతం యొక్క వైభవం, శోభ) ఎలా వున్నదట?

ఎర్రని లేత చిగురాకుల కాంతి రాధ ధరించిన కావి వస్త్రములవలెనూ, పుప్పొడి అంటించుకున్న తుమ్మెదల సమూహములు విభూతి పూసుకున్న రాధ జడలవలెనూ ఉండడం కారణంగా ఆ వసంతల÷ నీలాంజనవర్ణుని (నల్లని కాటుక వంటి శరీర చాయ గలిగిన వాడైన కృష్ణుని) గూర్చి తపస్సు చేస్తూన్న రాధా దేవి వలెనే వున్నదట.

కొన్నాళ్లకు పూవులకారు (వసంత ఋతువు) ఉడివోయిందట (ఉడిగి పోయిందట) ఆ తరువాత వచ్చిన వేసవి నీలగ్రీవుడి (శివుడి) యొక్క అలికము (లలాటము, నుదురు) నందలి కీలి కీల (అగ్ని జ్వాలలకు) కేవలసఖమై (ప్రాణ మిత్రుడా అన్నట్టిది) హాసవిపుల (నవ్వుచే అతిశయించిన) ఖరకరమగుచూ (ఖరకరుడు అంటే సూర్యుడు) వేసవి మున్ముందు శివుని మూడోకంటి అగ్ని జ్వాలల్లా మండేదే అయినా నవ్వుతో అతిశయించిన సూర్యుని ప్రసన్న వదనంతో ప్రవేశించిందట.

# వేసవి విశేషాలు

రామకృష్ణ కవి యిక్కడొక వచనంలో **(పాండురంగ మాహాత్మ్యం: 4-16)** వేసవి విశేషాలను అత్యద్భుతంగా వర్ణించాడు

అప్పుడా పటు గభస్తి (గభస్తి అంటే సూర్యుడు. పటుగభస్తి అంటే తీక్ష్ణమైన కిరణములు గల సూర్యుడు) హస్తి (ఏనుగు) వలె 'పద్మినీ ప్రమోదావహ కరప్రచారుండై' సూర్యుని పక్షాన – పద్మిని అంటే తామర తీగెను సంతోషపెట్టే విధంగా కరప్రచారుడయ్యాడట. కరములు అంటే కిరణములను వ్యాపింపచేయడం ద్వారా మరిన్ని తామర పుష్పాల్ని వికసింపజేశాడు. తామర పూలు సూర్యరశ్మి చేతనే వికసిస్తాయి కదా! ఇక ఏనుగు పక్షాన – పద్మిని అంటే ఆడ ఏనుగు ప్రమోదం చెందే విధంగా తన కరప్రచారణం – అంటే తొండము యొక్క వ్యాపనము చేసిందట. తామర తీగలు విరగబూసేదీ, ఏనుగులు స్వైరవిహారం చేసేదీ వేసవిలోనే.

దవ దహనము (కార్చిచ్చు) కురుమహీవిభుని (దుర్యోధనుని) వలె స్వగోత్ర నిర్భేదన నిపుణమయ్యిందట. దుర్యోధనుడు తాను జన్మించిన కురువంశ వినాశనానికెలా కారకుడయ్యాడో – అదే విధంగా తాను పుట్టిన అడవినే నాశనం చేసిందట కార్చిచ్చు. కార్చిచ్చు చెట్ల కొమ్మల రాపిడికి పుట్టి ఆ చెట్లనే తన మంటలలో మాడ్చేస్తుంది కదా మరి! వేసవిలోనే కార్చిచ్చులు విజృంభిస్తాయి.

వేసవిలో మల్లెలు విరగబూస్తాయి. ఇక ఆ మల్లియల పెల్లు (సంపద) ఎలా వుందటంటే కన్నడ కవితా వితానములా షట్పదవృత్త విలాస భాసురముగా వున్నదట. షట్పదము అంటే తుమ్మెద. మల్లెపూల సంపద తుమ్మెదల ఉనికి యొక్క విలాసముచేత ప్రకాశిస్తున్నదట, ఏ విధంగానైతే కన్నడ కవితా సౌరభము షట్పదము అనే ఆరు పదముల వృత్తము యొక్క విలాసము చేత ప్రకాశిస్తున్నదో అలా. వేసవి విరగబూసే మల్లెలకు, పూదేనె కొరకు వాటిని ముసిరే గండు తుమ్మెదలకూ ప్రసిద్ధి. కన్నడ భాషలోని కవిత్వంలో ఆరుపదముల 'షడ్పద వృత్తము' సుప్రసిద్ధము.

సరసులు సరసులవలె వనితా విహార మహనీయములై రహి వహించాయట. సరస్సులు సరసుల (సరసులైన పురుషుల) వలె వనితలు విహరించడం కారణంగా మహనీయము లైనాయట. సరసులైన పురుషులెలా వనితలతో విహరించి ఒప్పారుతారో, ఆ విధంగా సరస్సులు కూడా తమ జలాల్లో వనితలు జలక్రీడలాడితే మరింత బాగు మీరతాయట. వేసవిలో అందరి మనసులూ ఆహ్లాదకరమైన సరస్తీరాల వైపుకే లాగుతాయి. వేసవిలో సరస్తీరాలలో వీచే చల్లని ఆర్ద్ర పవనాల (*humid airs*) కారణంగా ప్రాచీన కాలాన్నుంచీ రాజులు తమ వేసవి విడిది గృహాలను సరస్సుల సమీపాల్లోనే నిర్మించారు. ఆధునిక యుగంలో కూడా ప్రభుత్వాలు హ్రదవిలోకినీ అతిథి గృహాల (Lake View Guest Houses) పేరిట సరస్తీరాలలోనే విడిది గృహాలను నిర్మిస్తున్నాయి. వేసవిలో తాపోపశమనానికి స్త్రీలు చెరువులూ, జలాశయాలలో జలక్రీడలాడడం నేటికీ మన గ్రామసీమలలో సాధారణ దృశ్యమే!

అంచలంచల చంచలా చపలములూ, విపులములూ అయిన పడమటి పవనములు పొరుగుల ఉప వనములలో పెరుగు కరువలి వారువములకు గమనాధ్యయన గురువుల వలె వడి మెరసి సుడిపాయట. వేసవిలో తీవ్రమైన పడమటి గాలులు వీస్తాయి. అవి చంచలముల (మెరుపుల) వలె చపలములూ (వేగము కలవిగానూ), విపులములూ (ఎక్కువైనవిగానూ) అయి, అన్ని ప్రక్కలకూ వీచడం కారణంగా అంచలంచల (ప్రతిపార్శ్వములోనూ) తాకిడి కలిగించడమే కాక, పొరుగులలో (సమీపములలో) నున్న ఉప వనములు (ఉద్యాన వనముల)లో పెరిగే కరువలి వారువములకు (కరువలి అంటే గాలి. వారువము అంటే గుర్రము. ఉద్యానవనాల్లో పుట్టి పెరిగే పిల్లగాలులు అనే గుర్రాలకు) గమనాధ్యయన గురువులవలె

(నడకలు నేర్చే గుర్రుపులలా) వడిగా మెరుపులా సుడులు తిరుగుతున్నాయట. మండువేసవిలో వీచే పడమటి గాలుల వేడీ, సుడులు తిరిగే వాటి వాడీ మనందరికీ సుపరిచితాలే!

అసితయగు వసుధ (నల్లనైన నేల) నెఱియలు వారి తదుదర విస్ఫురితాంత్ర లతామతల్లికల పెల్లన్నట్లు పాతాళ వ్యాళములు కానవచ్చాయట. నెర్రెలుగా బీటలు వారిన నల్లరేగడి నేలలో 'దాని కడుపు లోపలి భాగములోని పెద్ద ప్రేవుల సంపదయా' అన్నట్లు పాతాళ లోకములోని వ్యాళములు (పాములు) కనుపించాయట. వేసవిలో నల్లరేగడి నేలలు బాగా నెర్రెలు పడేట్లుగా పగలడం మనమందరం ఎరిగినదే. అయితే కవి ఉత్ప్రేక్షను జోడించి ఆ పగుళ్లెంత లోతైన వంటే భూగర్భంలోని (భూమి పొట్టలోని) పెద్ద ప్రేవులా అన్నట్లున్న పాతాళ లోకపు పాములు కూడా ఆ పగుళ్ల నుండి కనుపిస్తున్నాయంటున్నాడు.

అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళములనే సప్త అధోలోకాలలో పాతాళము అన్నింటికంటే క్రిందిదని ప్రాచీనుల విశ్వాసం. అది పాములకు నెలవైన కారణంగా దానిని నాగలోకమనీ అంటారు. సముద్రాల అధస్తలముల నుండి, ప్రత్యేకించి పాల సముద్రపు అడుగు నుండి, కొన్ని జీవ నదుల అడుగు నుండి, పాము పుట్టలనుండి, నైమిశారణ్యము, దండకారణ్యములలోని సరోవరముల అడుగు నుండి పాతాళ లోకానికి దారులున్నాయని నమ్మేవారు. మహిమాన్వితులైన సాహసులు ఆ మార్గాల గుండానే పాతాళ లోకానికి వెళ్లి వచ్చినట్లు కూడా కథలున్నాయి. మహాభారతంలోని భీముడికి కౌరవులు విషాహారం పెట్టి నదిలోపారేస్తే అతడు పాతాళ లోకానికి చేరి నాగరాజైన శేషుని ఆదరణ పొంది విషహరణం చేయబడి తిరిగి భూమికి చేరిన కథ మనం చదువుకున్నదే. అయితే, విజ్ఞాన శాస్త్రాలు దీన్ని అంధ విశ్వాసంగా కొట్టివేస్తున్నాయి. కారణమేమంటే భూమిపొరలు లోనికి వెళ్లిన కొద్దీ విపరీతమైన వేడి కలిగి వుండి 6,378 కిలో మీటర్ల లోతుననున్న భూకేంద్రం కేవలం వాయు-ద్రవ స్థితిలోనున్న ఇనుము, నికెల్ కలిగివున్నదనీ శాస్త్ర పరిశోధనలు నిర్ధారించాయి.

కనుక, అక్కడి తీవ్ర ఉష్ణోగ్రతకు జీవజాలమనేదే ఉండడం అసంభవం సరికదా - మూల ధాతువులు కూడా ద్రవ - వాయు రూపాలలో మాత్రమే వుంటాయి. జూల్స్‌వెర్న్ (1828-1905) అనే ప్రఖ్యాత ఫ్రెంచి నవలాకారుడు భూకేంద్రానికి యాత్ర (*'A journey to the centre of the Earth'*) అనే చక్కని ఊహాజనితమైన నవల వ్రాశాడు. భూకేంద్రానికి యాత్ర, నాగులకావాసమైన పాతాళ లోకము - ఇవి ఊహించుకోడానికైతే బాగుంటాయి కానీ వాస్తవదూరాలు, అశాస్త్రీయాలు.

ఇక ఆ వేసవిలోని రాత్రులెలా వున్నాయి?

పెచ్చు పెరుగు ఖరకరకర నిపాతములచే ఆతప్తములైన నెలవులం దొరఁగి పరఁగు వెలఁది వెన్నెలలను నీర్వట్టు వెన్నెల పిట్టలు పొట్టలు నిండేట్టుగా ఆస్వాదించాయట. ఖరకరుడు అంటే వేడిమిని సృష్టించేవాడైన సూర్యుడు. కరము అంటే కిరణము అనే అర్థం కూడా వుంది. నిపాతము అంటే పడడం. రోజురోజుకీ పెరుగుతూన్న సూర్యకిరణముల నిపాతముచే ఆతప్తములైన (బాగుగా వేడెక్కిన) నెలవులలో (తావులలో) తొరఁగి (స్రవించి) పరఁగు (ప్రసరించే) వెలది వెన్నెల (నిర్మలమైన వెన్నెల)లను నీర్వట్టు (దప్పి గొన్నట్టి) వెన్నెల పిట్టలు (చకోరములు) పొట్టలు నిండేట్టుగా ఆస్వాదించాయట. వేసవిలో పగలంతా ఎండతాపానికి తల్లడిల్లిన ప్రాణికోటికి రాత్రివేళల్లోని వెన్నెలలు ఎంతో ఉపశమనాన్నిస్తాయి. ఇక వెన్నెల మాత్రమే భుజించి బ్రతికేవిగా పేరుపడిన చకోరపక్షుల సంగతి వేరే చెప్పాలా? వాటికి పండగే పండగ. (చకోర పక్షులు వెన్నెల భోంచేస్తాయనే విశ్వాసం ఏ మేరకు శాస్త్రీయమైనదో అనుబంధం-6 లో చూడండి.)

రక్కెస జవ్వనులు మవ్వంపు మచ్చికల నిచ్చలుఁ గ్రీడింప నా వ్రీడావతులు యతులనాభీ వివరంబుల నింకినవియుంబోలె నదుల యుదకంబులింకె. ఎండాకాలంలో నదులలోని నీరు పెరిగే ఉష్ణోగ్రతలకు ఆవిరవడమే కాక, వేడెక్కిన నేల పీల్చడం కారణంగానూ యింకిపోతుంది. ఇది సర్వసాధారణం. అయితే రామకృష్ణకవి తన అద్భుత ఊహాశక్తితో చమత్కారంగా ఏం చెపుతున్నాడో చూడండి. రక్కెస జవ్వనులు (రాక్షస యువతులు) మవ్వంపు మచ్చికల





(కోమలమైన కోరికలతో) క్రీడింపగా (ఆ నదులలో జలక్రీడలాడగా) ఆ వ్రీడావతుల (స్త్రీల) అతుల (సాటిలేని) నాభీవివరములలో (నాభీ రంధ్రములలో) యింకినవియుంబోలె (ఇంకినవేమో అన్నట్లు) నదుల ఉదకంబులు (నీళ్లు) ఇంకె (ఇంకిపోయాయి). రాక్షసులను కుంభోదరులుగానూ, లోతైన నాభీ బిలములు కలవారిగానూ కవులు వర్ణించారు. దీనినిక్కడ రామకృష్ణకవి చక్కగా ఉపయోగించుకున్నాడు.

వేసవిలో సూర్య తాపానికి తట్టుకోలేక ఎక్కడ చెమ్మవుంటే అక్కడికి చేరతాయి ఎర్రచీమలు. మనందరమూ ఎరిగిన యీ విషయాన్ని ఎంత చమత్కారంగా చెపుతున్నాడో చూడండి రామకృష్ణకవి.

విచికిల మాలికాలంకృత మౌళిభాగులును, నారంజిత ధాతుపట పరభాగులునగు భోగుల బాగున గ్రుద్దుమోచు నెఱచీమలచాలు చెమ్మయిమ్ములం గ్రుమ్మరం దొడంగె.

విచికిలములంటే మల్లెలు; మల్లెమాలలతో అలంకరించబడిన మౌళిభాగులును (శిరోజములు కలవారును). ఆరంజిత ధాతుపట పరభాగులునగు - అంతటా ఎర్రనైన బట్టలతో ప్రకాశించేవారు అయినట్టి భోగుల (విలాస పురుషుల) బాగున (విధముగా) గ్రుద్దుమోసే ఎర్రచీమల చాలు (బారు, వరుస) చెమ్మయిమ్ములన్ (తడిగావున్న చోట్లలో) క్రుమ్మరందొడగె (తిరుగ నారంభించెను). వేసవిలో గ్రీష్మతాపానికి తట్టుకోలేని ఎర్ర చీమలు తమ నెలవులను ఎప్పటికప్పుడు చల్లదనము, చెమ్మ ఉన్న తావులకు మారుస్తూపోతాయి. అలా మారేటప్పుడు తమ గ్రుడ్లను కూడా తప్పనిసరిగా మోసుకెళతాయి. తలమీద తెల్లని గ్రుడ్లుగల ఎర్రని చీమలు, ఒళ్లంతా ఎర్రని వస్త్రాలు ధరించి, శిగలో మల్లెపూదండల్ని సింగారించుకొన్న విలాసపురుషులలా వున్నాయట. ఎంతటి అద్భుతమైన ఊహ! నేటి శృంగారపురుషులు చేతులకు మాత్రమే మల్లెపూల దండలు చుట్టుకుంటారు. కవికాలం నాటి శృంగారపురుషులు శిరోజాలు పెంచి ముడివేసి స్త్రీలలా సిగముడిలో కూడా మల్లెమాలలు ధరించేవారు. నిగమశర్మను వర్ణించిన సందర్భాలలో కూడా మనం యీ విషయాన్ని గమనించవచ్చు.

వ్యావహారిక సత్యాన్ని ప్రకటించే ప్రపంచముచేత వంచితులగు నెఱుకలేని కఱటుల కరణి హరిణంబులు మరీచికా వీచికాపాన వివశంబులై దిశల పరిభ్రమించాయట.

కరటి అంటే వంచకుడు. సత్యం చెప్పే ప్రజల్ని కఱటి మోసం చేస్తాడు. అయితే సత్యానికి రెండు పార్శ్వాలున్నాయి. పారమార్థిక సత్యము; వ్యావహారిక సత్యము. ప్రపంచం వ్యావహారిక సత్యాన్ని ప్రకటించిందనుకోండి. వంచన చేయబోయిన కఱటి తానే వంచితుడవుతాడు. అయితే అతనికా ఎరుక వుండదు. అలా ఎరుక లేకుండా మోసపోయే కఱటిలా హరిణములు (జింకలు) వేసవిలో మరీచిక (ఎండమావి) వీచికలనుండి (అలలనుండి, ప్రవాహంనుండి) నీటిని త్రాగాలనే కోరికతో బుద్ధంతా దానిమీదే నిల్పినవై అన్ని దిక్కులా తిరుగుతున్నాయట.

మండు వేసవిలో మరీచికలు (ఎండమావులు - *Mirages*) ముఖ్యంగా ఎడారులవంటి ఉష్ణప్రాంతాల్లో అతి సహజమైనవి. ఎండ తాపానికి గాలిలోని క్రింది పొరలు తేలికై పైకిపోగా ప్రక్కలనుండి దూసుకువచ్చిన గాలి ఆ స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఇలా పై పొరలలోని గాలి పలుచగా చల్లగానూ, క్రింది పొరలలోని గాలి చిక్కగా, వేడిగానూ ఉన్నప్పుడు వీక్షించే వారి దృష్టికి దూరపు వస్తువుల ప్రతిబింబాలు (తరచుగా తలక్రిందులుగా) కనుపిస్తాయి. వేర్వేరు ఉష్ణోగ్రతలలో వుండే గాలి పొరలలో ప్రయాణించే కాంతి కిరణాలు వక్రీభవనం చెంది వీక్షకుడు ఈ భ్రమకు లోనవుతాడు.

వేసవి అనగానే మనకు గుర్తొచ్చేవి సంపెంగపూలు. వేసవిలో అవి విరివిగా పూస్తాయి. ముంచుకొను సంపెఁగల సౌరభంబులకుం దాళని రోలంబంబుల లీల వియోగి లోకంబులు విషయ విముఖములయ్యాయట. దట్టమై వ్యాపించే సంపెంగల సౌరభానికి రోలంబంబులు (తుమ్మెదలు) తట్టుకోలేవట! ఎందుకంటే సంపెంగ సువాసన యొక్క ఘుమాయింపేమో అద్భుతంగా వుంటుంది. తీరా పూఁదేనె కోసం తుమ్మెదలు దరిజేరితే వాటికి నిరాశే మిగులుతుంది. కారణం -

సంపెంగపూలలో తేనె వుండదు. అందుకని ఆ గంధఫలి (సంపెంగ) సౌరభానికి సారంగములు (తుమ్మెదలు) ఏ మాత్రమూ స్పందించవట - తరువాత ఆశాభంగం తప్పదని వాటికి తెలుసుగనుక. వేసవిలో సంపెంగల సౌరభం పెరిగే కొద్దీ తుమ్మెదలు తట్టుకోలేక వైరాగ్యభావాన్ని పెంపొందించుకుంటాయట. అదే విధంగా ఒకరినొకరు ఎడబాసిన ప్రేయసీ ప్రియ సమూహాలు కూడా కలుసుకొనలేమని తెలిసి తెలిసీ కలలు కనడందేనికి అన్నట్లుగా వైరాగ్య భావాన్ని అలవరచుకుని విషయ విముఖములు (భోగముల కిష్టపడనివి) అయ్యాయట. తీగ సంపెంగ, చెట్టు సంపెంగలలోని వివిధ రకముల వృక్షములన్నీ వేసవిలో విస్తారంగా పూస్తాయి. సంపెంగ చెట్ల వర్గీకరణ వివరాలు మనం లోగడనే చెప్పుకున్నాం.

ఇసుక మెదువు నెలవులంబన్నిన పసుపుటాకుఁజప్పరములలో కుప్పళించిన కర్పూరంతో కురువేరు పరిమళములు, జాజివిరుల వలపు, వట్టి వేళ్ల వాసనలు కలిగిన ప్రపాపాలికాపవర్జితంబులగు కలశోదకంబులు గ్రోలి సేదదేరి తెరువరులు తాలవృంతానిలంబుల బలుపుకొలిపి మున్ను పరిక్షీణంబులగు ప్రాణ పవనములను పోసరింపజేశారట.

ఇసుక మెదువు నెలవులలో (మెత్తని యిసుకగల నేలలో) పన్నిన (ఏర్పరచిన) పసుపుటాకు చప్పరములలో (తాటాకు పందిళ్లలో) కుప్పళించిన కర్పూరంతో (కర్పూరం ఎక్కువగా వేసిన), కురువేరు పరిమళములు (హ్రీబేరు - *Coleus vetiveroides* - అనబడే వేళ్ల సువాసనలు) జాజివిరుల వలపు (జాజిపూల - అంటే జాపత్రి లేక జ్యాపత్రి *Mace, the membranous covering of the nutmeg - Myristicaceae* కుటుంబానికి చెందిన *Myristica fragrans* అనబడే జాజిచెట్టు యొక్క సౌరభము), వట్టివేళ్ల వాసనలు (వట్టివేళ్ల యొక్క - *Khuskhus plant - Vetiveria zizanioides* ఎన్నో ఔషధవిలువలుకలది. వేసవితాపాన్ని పోగొట్టడానికి దీనికిదేసాటి. ఆ కారణంగా షర్బత్‌ల తయారీలో అనాదిగా వట్టివేళ్లను వాడుతున్నారు) కలిగినదీ, ప్రపాపాలికా (చలిపందిరులలోని స్త్రీలతో) అపవర్జితములగు (ఉచితంగా పోయబడుతూన్న) కలశోదకములను (కుండలలోని నీరు) గ్రోలి (త్రాగి) సేదదేరి (తెప్పరిల్లుకొనిన) తెరువరులు (బాటసారులు) తాలవృంతానిలంబుల (తాటాకు విసనకర్రలతో వీయగా వచ్చిన గాలితో) బలుపుకొలిపి - వృద్ధి పొందింపజేసి; మున్ను - బడలిక తీర్చుకొనుటకు ముందు; పరిక్షీణంబులగు (క్షీణించియున్న) ప్రాణ పవనంబులను (ప్రాణ వాయువులను) పోసరింపజేసిరి (తెప్పరిల్లజేశారు). వేసవిలో మన ప్రాంతంలో పందిళ్లు వేయడం అనాదిగా వస్తూన్న సదాచారం. శ్రీరామనవమికి వేసే పందిళ్ళు నవమి ముందు కొంతకాలము, తరువాత కొంతకాలము కొనసాగి బాటసారులకెంతో ఊరటనిస్తాయి. ప్రత్యేకించి కవి పేర్కొన్న ఇసుక మెదువునేలలు (మెత్తటి యిసుకనేలలలో) ఎండవేడిమికి కాళ్లు చుర్రున కాలుతూంటాయి. కనుక ఆ నెలవులలో పందిళ్ల అవసరం ఎంతైనా వుంది.

రామనవమి పందిళ్లలో గ్రీష్మతాపాన్ని బాపడానికి మిరియాలు, ఏలకులు వంటి సుగంధ ద్రవ్యాలు కలిపిన బెల్లపు పానకం భక్తులకు ఉచితంగా పోస్తారు. వడదెబ్బ నుంచి తెప్పరిల్లడానికి నానబెట్టిన పెసరపప్పును వడపప్పు అనే పేరుతో బెల్లం, కొబ్బరి ముక్కలతో కలిపి రామనవమి పందిళ్లలో ప్రసాదంగా యిస్తారు. భక్తిమాటలావున్నా వేసవి తాపాన్ని పోగొట్టి శరీరానికి చలువచేసే యీ పదార్థాల ఉచిత పంపిణీ శ్రీరామనవమి పందిళ్లలో నేటికీ జరుపబడుతూండడం ముదావహం. తెనాలిలో అనాదిగా రామనవమి సందర్భంగా పట్టణం నలుచెరగులా పెద్ద పందిళ్లు వేయడం ఆనవాయితీగా వస్తున్నది. ప్రాచీన కాలంలో బొక్కెనాకు (*Lippia nodiflora*) ను పాత బెల్లంతో కలిపి తొక్కి ఆ ముద్దను పెద్ద బానలలో మంచినీళ్లతో కలిపి ఆ పానకాన్ని తాపోపశమనానికి పందిళ్లలో ప్రజలకు పోసేవారని పెద్దలు చెప్పగా విన్నాను. పానకం పాత బెల్లంతోనే చేయాలట. ఎందుకంటే అది మాత్రమే జ్వరాన్నీ, తాపాన్నీ పోగొట్టి, మూత్రవిసర్జన జారీకావించి, నోటి రుచినీ, జఠర దీప్తినీ పెంచుతుందట. ఇక జలపిప్పలి అని కూడా పిలువబడే బొక్కెనాకు రసం కారంగా వగరుగా వుండి అజీర్ణాన్నీ, ఉదరరోగాల్నీ పోగొట్టి ఆకలిని వృద్ధిచేస్తుందట!

ఆ పద్మిని (ఉత్తమమైన పద్మినీ జాతి స్త్రీ - రాధ) దినకర కరతాపమునకు (సూర్యుని కిరణముల వేడికి) ఓర్చుకుని

ఘోరతపస్సు చేసిందట. శ్రీపతి అడుగులనే (విష్ణువు పాదాలు అనే) గొడుగుల ప్రాపు (ఆశ్రయము) కలిగినవారికి తాపభరము ఎలా అంటుకొంటుంది?

ఈ విధంగా అత్యుగ్రమైన గ్రీష్మ ఋతువు ఏసరేగి (మిగుల విజృంభించి) కాలవశమున తనుదాన (తనకు తానే) తీలుపడిందట (క్షీణించిందట). పెచ్చు పెరిగి హెచ్చి పేర్చే ఏదైనా సరే స్రగ్గటకే (తగ్గటకే)ననే లోకోక్తి చాటడంలేదా! (పెరుగుట విరుగుట కొరకేనని).

దీపం ఉడిగిపోతే చీకటి వ్యాపించినట్లూ, కోపం ఉడిగిపోతే శాంతగుణము వర్ధిల్లినట్లూ, ఆటోపోద్భటమైన (మిక్కిలి ఆర్భాటము కలదియైన) వేసవి కైపు (విజృంభణము) సడలగా కారుగాలము (వర్షకాలము) దట్టమై వచ్చిందట.

# వర్ష ఋతువు

ఆకాశతత్త్వ దేహము కలవాడు, కాకోల గ్రీవుడు (కాకోలమనే విషమును కంఠమునందు ధరించిన వాడైన) 'శివుని యొక్క కంఠము యొక్క నల్లదనమా!' అన్నట్లు కోకిల నీలము (కోయిల వలె నల్లనైన) జలధర పాకము (ఒక పిల్ల మేఘము) పర్యాయ వృద్ధితో (క్రమ క్రమాభివృద్ధితో) ప్రబలదొడగిందట (పెరుగసాగిందట). నీరాళ్ల గొందిలో (ఈశాన్యమూలలో) ఓ కన్నియ మెఱుంగు (ఓ క్రొత్త మెరుపు) ధళుధళుక్కని పదేపదే పలుమార్లు నింగిని తాటించిందట.

పౌలస్త్యపవన సంపాత జాత ప్రీతి కారణంగా (పౌలస్త్యుడు అంటే కుబేరుడు. కుబేరుడు ఉత్తర దిక్పాలకుడు. పౌలస్త్య పవనము – అంటే ఉత్తరపు గాలి సోకడం వలన పుట్టిన ప్రేమ చేత) ఇవిరిన మ్రాకులలో (ఎండిపోయిన చెట్లలో) ఎలమి (వికాసము) కలిగిందట.

పగిలిన నేల అనే శరీరానికి ప్రథమోద బిందు సంభారము (తొలకరివాన చినుకులు) మందు నూనె అయ్యాయట. (మన ప్రాచీనులు పైత్యప్రకోపాది కారణాల వలన చర్మం పగులుతుంటే నివారణోపశమనాలకు నూనె రాసి మర్దన చేసేవారు.)

విదూరదేశంలో తోరపు మణులకు (పెద్ద మణులైన వైడూర్యములకు) ఉరుము మంత్రసానిలా కనుపించిందట. ఉరుములతో కూడిన వాన కురిసినప్పుడు విదూరదేశంలో వైడూర్యములనే మణులు నేలనుంచి బయటికి పొడుచుకొస్తాయనే విషయం మనం లోగడనే వివరంగా చెప్పుకున్నాం.

షణ్ముఖుని (కుమారస్వామి) యొక్క మఱువ మావు (మూగ గుఱ్ఱమైన నెమలి) కెరలి (విజృంభించి) సకిలించిందట. వర్షాగమనాన్ని స్వాగతిస్తూ నెమళ్లు పురివిప్పి నృత్యం చేస్తాయి. అయితే యీ నెమలి కుమారస్వామికి వాహనంగా వుంది. అంచేత దానికా స్వేచ్ఛ లేదు. ప్రస్తుతం అది షణ్ముఖుని గుఱ్ఱం మాత్రమే. కనుకనే, గుఱ్ఱంలానే పెద్దగా సకిలించిందట. కవి యిక్కడ నెమలి వాహనాన్ని సూచించదానికి యీ 'మఱువ మావు' (మూగ గుఱ్ఱం) అనే పదాన్ని చాల చక్కగా వాడాడు.

ఏనుగులకు నీటి మడుగులంటే మహా యిష్టం. వర్ష ఋతువంతా అవి దాదాపు మడుగుల్లోనే గడుపుతాయి. వర్షాకాలం ఆరంభంలో ఎప్పుడెప్పుడు వర్షం కురుస్తుందా అని అవి ఆశతో ఎండిన మడుగుల వద్ద ఎదురుతెన్నులు చూస్తాయి. ఓ శుష్క పల్వలము (ఎండిన పడియ-*dry puddle*) దగ్గర ఏనుగొకటి తన తొండంతో నేలను తాకి వాసన చూసిందట. మట్టివాసనను బట్టి వర్షాగమనాన్ని పసికట్టదానికో ఏమో!

కడిమి చెట్టు చిగురించిందట.

కడిమి చెట్టు (*Anthocephalus cadamba*) ను సంస్కృతంలో కదంబ వృక్షం అంటారు. ఈ మనోహర పుష్ప వృక్షం ఛాయలే బృందావనంలో శ్రీ కృష్ణుని రాసక్రీడలకు ఆటపట్టుగా వర్ణించబడినాయి. గుండ్రని బంతుల్లా వుండే కడిమిపూల అద్భుతమైన సువాసన వర్ష

ఋతువుకు శోభను చేకూర్చే ముఖ్యాంశాలలో ఒకటి. అయితే 'కడిమి' లేక 'కడప చెట్టు' అని పిలువబడుతున్న *Barringtonia acutangula* అనే సాంకేతిక నామం కల మరో వృక్షమూ వుంది. ఇది నీటి దాపులలో పెరిగే వృక్షం. దీని పూలు ఎర్రగా క్రిందకు వ్రేళ్లాడే అనంత పుష్ప విన్యాసముల (*Racemose inflorescences*) తో మనోహరంగా వుంటాయి. అయితే కదంబ పుష్పాలలా యివి సుగంధం కలిగి వుండవు. కనుక కవి పేర్కొన్నది కదంబ వృక్షాన్నేనని మనం భావించవచ్చు.

గ్రాcజ అనే ఒక వృక్ష జాతి కూడా చిగురించిందట. ఈ గ్రాcజ వృక్షమంటే ఏమిటో ఎంత యత్నించినా అంతుచిక్కలేదు.

ఇలా వుంది వర్ష ఋతువు యొక్క ఆగమనం.

కార్చిచ్చు (దావానలము) అనే పరశురాముని కారణంగా పెటిలి (కాలి పగిలిపోయి) నిర్వంశమైన (నాశనమైన) భూభృత్ కులంబు క్షేత్రముల (కొండ వెదురు క్షేత్రములలో) వర్షకాలమనే బ్రాహ్మణుల అనుగ్రహం పొందుట వలన వంశవృద్ధి (వెదుళ్ల వృద్ధి) రాజిల్లిందట. కులము అన్నా వంశము అన్నా 'వెదురు' అనే అర్థం కూడా వుంది. దీనికి శ్లేషాత్మకంగా మరో విధంగా కూడా అర్థం చెప్పుకోవచ్చు. భార్గవ రాముని కారణంగా నిశ్శేషమై పోయిన రాజవంశపు క్షేత్రములలో (నశించిన రాజుల భార్యల యందు) వర్షాకాలం వంటి విప్రుల అనుగ్రహం కారణంగా తిరిగి రాజవంశపు వృద్ధి జరిగింది. వెదురుబొంగులలో ఉండే గాలి కారణంగా అవి కాలినప్పుడు పెద్ద శబ్దంతో పగులుతాయి. వేడికి ఒక్కసారిగా వాటిలోని గాలి వ్యాకోచించడం కారణంగా ఆ శబ్దం ఏర్పడుతుంది. అలా కాలిపగలడాన్ని 'పెటలటం' లేక 'పెట్లటం' అంటారు.

వడగండ్లు ప్రబలంగా పడ్డాయట.

వర్షాకాలం ప్రారంభదశలో వడగండ్ల వానలు ఎక్కువగా పడతాయి. పిడుగులతో కూడిన వానలు కురిసిన సందర్భాలలో ఒక్కోసారి వర్షపునీటి బిందువులు ఘనీభవించి సాధారణంగా 5 మి.మీ. తక్కువకాని వ్యాసార్థంకల గుండ్రని మంచు రాళ్లుగా తయారై వడగండ్లు (*Hail stones*) గా పడతాయి. అంతకంటె తక్కువ పరిమాణంలో పూర్తిగా ఘనీభవించని వడగండ్లు కూడా అప్పుడప్పుడూ పడుతూంటాయి. వీటిని లఘుకరకలు (*sleet*) అంటారు. వడగండ్లవానను 'కరకాసారము' అంటారు. వడగండ్లు కరిగిన నీరు శుభ్రమైనది కనుక దానిని ప్రాచీనులు వైద్యంలో కూడా వాడేవారట. దానిని 'కరక వారి' అంటారు. శుభ్రమైనవి కనుకనేనేమో కొబ్బరినీళ్లను కూడా ప్రాచీనులు 'కరకతోయము' అన్నారు. కొబ్బరి చెట్టును కూడా 'కరక అంభస్' అనీ అంటారు.

ఇంద్ర గోపములు (ఆరుద్ర పురుగులు) వర్షాలు పడగానే విజృంభించి పుట్టుకొస్తాయి. వీటిని గురించి యిదివరకే వివరించాను. ఇవి ఎక్కువగా ఎర్రగా వుంటాయి.

వర్షాకాల ప్రారంభదశలోనే జంబూ ఫలాలు (నేరేడు పండ్లు) వస్తాయి. వర్షాకాలమనగానే పండిన నల్లని నేరేడుపండ్లు ఎవరికైనా గుర్తుకొస్తాయి.

నేరేడు (*Syzygium cumini*) చెట్లు మన ప్రాంతపు అనాది వృక్షాలు. మన భూఖండాన్ని జంబూద్వీపమని వీటి పేరిటే పిలుస్తారు. మేరు పర్వతాన్ని ఆవరించి వున్న ఏడు ద్వీపాల (భూ ఖండాలలో) జంబూద్వీపం ఒకటి. మిగిలినవి ప్లక్ష (జువ్వి), శాల్మలీ (బూరుగ), కుశ (దర్భ), క్రౌంచ, శాక (టేకు), పుష్కర (తామర, మెట్ట తామర) ద్వీపాలు. ఈ ఏడు ద్వీపాలలో ఒక్క క్రౌంచ ద్వీపము పేరు మాత్రం క్రౌంచపక్షి (*Heron - Ardeola grayii*) పేరు మీదుగా ఏర్పడగా మిగిలిన ద్వీపాల పేర్లన్నీ వృక్షాల పేరు మీదుగానే ఏర్పడ్డాయి.

పచ్చిక బయళ్ల నేపథ్యంలో మణుల్లా మెరుస్తూన్న తెల్లని వడగండ్లనూ, ఎర్రని ఆరుద్ర పురుగులనూ, నల్లని నేరేడు పండ్లనూ చూస్తూ వుంటే వనధి (సముద్రము) యొక్క నీటిలో ఉండే ఆ మూడురంగుల మణులనూ అంబుదములు (మేఘములు) సముద్రపు నీటితోపాటు కలిపి తాగి అరగక వర్షంతోపాటు (బయటికి కక్కాయా) అన్నట్లున్నాయట. మరి సముద్రం రత్నగర్భయైన కారణంగా మణులన్నిటికీ నెలవు కదా! (సముద్రాన్నీ, భూమినీ 'రత్నగర్భ' అని కూడా అంటారు.)

ఆ వర్షాకాలపు శోభ ఆ అంబుజాక్షి (పద్మములవంటి కన్నులు కలిగిన రాధ) యొక్క సౌందర్యపు శోభతో పోటాపోటీ పడిందట. శోభస్కరమైన ఏయే అంశాల్ని చూపి రాధతో పోటీ పడిందట ఆ వర్షఋతు శోభ ?

ఒకటి - మోవి చెలువము. మోవి అనే పేరుగల వృక్షపు సొరు. మోవి చెట్లు వర్షాకాలంలోనే విరగబూసి మధుర ఫలాల్నిస్తాయి. ఈ వృక్షం వివరాలు మనం యింతకు ముందే తెలుసుకున్నాం.

రెండు - గేదంగి పూవుటేకు (మొగలిపువ్వు రేకు) యొక్క సోయగం. మొగలిపూలు మనోహరంగా వుంటాయి. మొగలి పొదలు (*Fragrant Screwpine - Pandanus odoratissimus*) వర్ష ఋతువులోనే విపరీతంగా పూస్తాయి. సంస్కృతంలో 'కేతకీ' పుష్పమని పిలువబడే దీని రేకులతో స్త్రీలు శిరోజాలంకరణ చేసుకుంటారు. గేదఁగి అని కూడా పిలువబడే యీ పూలు శివపూజకి అనర్హములట - ఎందుకోమరి?

మూడు - నెమళ్లు పురివిప్పి నాట్యం చేస్తూంటే ఊగే నెమలి ఈక కన్నులతో పోటీపడి చలించుచున్న నెమలి పించము యొక్క కాంతి. నెమళ్లు పురివిప్పి నాట్యం చేయడం కూడా మనం వర్ష ఋతువులోనే చూస్తాం. వర్షాగమనాన్ని యివి ఎంతగా స్వాగతిస్తాయంటే ఉరుములను పోలిన శబ్దాలు వినబడినా వర్షమే రాబోతున్నదని యివి పురివిప్పి నాట్యం చేస్తాయట. నెమలి (*Pavo cristatus*) భారతదేశపు జాతీయ పక్షి. ఒకప్పుడు మన ప్రాంతంలో విస్తారంగా కనువిందు చేసిన యీ అందమైన పక్షి వేటగాళ్ల దౌష్ట్యానికి బలై ఉనికిని కోల్పోయే పరిస్థితి వచ్చి రక్షిత పక్షిగా ప్రస్తుతం అభయారణ్యాలూ, జంతు-పక్షి ప్రదర్శన శాలలకు మాత్రమే పరిమితమై పోయింది. మయూరము, కేకి అనే పేర్లతో కూడా పిలువబడే యీ జాతి మగపక్షి (*Peacock*) ఆడు పక్షి (*Peahen*) ని జతకట్టడానికి ఉత్తేజపరచేందుకే పురివిప్పి నాట్యం చేస్తుంది.

వృద్ధ జలధరములు (నీటి బరువుకు నడుములు వంగిన ముసలి మేఘములు) చినుకు చినుకుగా కాక ఒకటే ధారగా కురుస్తూంటే ఆ తొలివాన చినుకుల కాళులు (ధారలు) ఆ వృద్ధ మేఘాలు వాడుతున్న ఊతకోలల (ఊతము కోసం వృద్ధులు వాడే చేతికర్రల) లాగా వున్నాయట. ఈ వర్షధారకు కలహంస సమూహాలు బెదిరి చెల్లా చెదరయ్యాయట.

వర్షాకాలంలో ఆ పాథోధర శ్రేణి (మేఘముల గుంపు) భద్రేభము (భద్ర + ఇభము - భద్రగజము) వలె అద్రిగ్రావముల (కొండరాళ్ల)ను నేలకు విసరినట్లూ, పవిఘోషాడంబరముల (ఉరుములు, మెరుపుల ఆర్భాటముల)తో విరహులకు కష్టం కలిగేటట్లూ, అదే సమయంలో వాహినులు (నదులు), వారి భర్తయైన వారినిధిని (సముద్రమును) కలుసుకొనేటట్లూ, విమలాంభఃపూర ధారావళిన్ (శుభ్రమైన మంచినీటితో నిండిన ధారల సమూహాన్ని) కుంభద్రోణములుగా (కడవలతో కుమ్మరించినట్లు) కుండపోతగా వర్షం కురిసిందట. సాధారణంగా వర్షాకాలం రహస్య ప్రేమికులకు అంతగా అనువైనది కాదు. ఎందుకంటే ఆ ఋతువులలో వారు కలసికొనదలచిన సంకేత స్థలములు వర్షాలతో జలమయమవడమేకాక, ఉరుముల కారణంగా జనులంతా జాకరూకతతో వుంటారు. మెరుపుల కారణంగా సంకేత స్థలానికి చీకటిలో వెళ్తున్నప్పటికీ ఎవరైనా గుర్తుపట్టే అవకాశముంది. అందుకే కవి పవిఘోషాడంబరములు వియోగిద్రోహ మొనరిస్తాయంటున్నాడు.

ఆ తొలకరి చినుకులు రాధాదేవి పాపట తెరువున (శిరోజముల పాపిట మార్గము. దీనినే సీమంత మార్గము అనీ అంటారు) పడి అక్కడి నుంచి జారి ఆమె నాసాగ్రమున (ముక్కు చివరన) ముక్తా ఫలములా (మంచి ముత్యములా) అన్నట్లు వెలుగొంది, తరువాత అక్కడి నుండి జారి ఆమె పృథు వక్షోరుహములపై (పెద్దవైన ఆమె స్తనములపై) పడ్డాయట.

ఇందాక మనం వర్షఋతువు సాధారణంగా రహస్య ప్రేమికులకు అంతగా అనువైనది కాదనుకున్నాం. అయితే రామకృష్ణకవి వర్షాకాలపు రాత్రులలో కూడా ప్రియురాళ్లు ఎంత తెగువగా సంకేత స్థలంలోని తమ ప్రియులను కలుసుకొనడానికి వెళతారో వర్ణిస్తున్నాడు.

సూచీముఖాభేద్యములైన (సూదిమొన మోపడానికి కూడా సందులేని) చీకటి తెరల సమూహములు చుట్టూ ముసురుకున్నా సరే, చెవులు బ్రద్దలయ్యేటట్లున్న దంభోళి గంభీర రవములు (పిడుగుపాటు యొక్క భీకర ధ్వనులు - దంభోళి అంటే ఇంద్రుని చేతిలోని వజ్రాయుధం - అదే పిడుగు) నల్దిక్కులా వ్యాపిస్తున్నా సరే, మూడులోకాలూ మూడంకె వేసుకుని ముడుచుకు పడుకునేట్లు చేయగలిగే వణకించే ఈదరగాడుపులు (చలి గాలులు) వేగంగా వీస్తున్నప్పటికీ, సోనవానలు (ముసురు వానలు) వ్యాపించి రహస్య ప్రదేశాలనన్నింటినీ చొరరాని బురదనేలలుగా మార్చివేసినప్పటికీ, చెదరక - బెదరక అరికాలులో కన్ను వుందా అన్నట్లు దారి తప్పిపోకుండా జాగ్రతతో నడికిరేలు (అర్ధరాత్రివేళ) కాయసంభవ బాధే సహాయ మగుచు (అంటే మన్మథబాధే సహాయముగా) నిర్భయమైన స్వేచ్ఛాగమనంతో స్వైరిణీకోటి (కులటల గుంపు) నాధ సంకేతములకు (తమ ప్రియులున్న సంకేత స్థలములకు) వెళ్లిందట.

దళిత హరినీలమణి (కోతకోయబడిన ఇంద్రనీలమణి) వంటి కాంతి కలిగిన ఒక నీలము మొగులు (కారుమొయిలు - నల్లని మేఘము) సూర్య చంద్రులను కప్పివేయగా యిది రాత్రి, యిది పగలు అని వేరుచేసి చెప్పగలగడం త్రిదశగురు ప్రతిమానుల (త్రిదశులు అంటే దేవతలు. వారి గురువైన బృహస్పతి సమానులైన బుద్ధి మంతుల)కు కూడా సాధ్యంకాని పని. తరణి (సూర్యుడు) పడమటి దిక్కున అస్తమించిన తరువాత తిరిగి తేజోవంతమైన సూర్యబింబాన్ని తయారుచేయడానికా అన్నట్లు ఖద్యోతములు (మిణుగురు పురుగులు) పరమాణువులన్నీ ఒకచోట కూడబడునట్లు దగ్గర దగ్గరగా చేరుతున్నాయట.

(అప్పటి వరకూ ఎక్కడుంటాయోగానీ) సరిగ్గా సూర్యాస్తమయ సమయానికే మిణుగురు పురుగులు *(Fire Flies)* వెలుగులు చిమ్ముతూ చీకటి పొదలలో గుమికూడటం మనకు గ్రామీణ ప్రాంతాలలో కనుపించే సర్వసాధారణ దృశ్యం. అస్తమించిన సూర్యునికి ప్రత్యామ్నాయంగా తమ సంఘాతంతో మరో సూర్యుడిని తయారు చేయాలని అవి తలపోస్తున్నాయనే భావన కవి అద్భుత ఊహాశక్తికి ఓ మచ్చుతునక.

మిణుగురు పురుగులు ఫైలమ్ ఆర్థ్రోపోడా *(Phylum Arthropoda)* లో కొలియోప్టెరా *(Coleoptera)* ఆర్డర్‌కు చెందిన లాంపిరిడే *(Lampyridae)* కుటుంబానికి చెందిన కీటకాలు (ఉదా : *Lamprocera selas*). వీటిని ఫైర్‌ఫ్లైస్ *(Fire Flies)* అనీ లైట్‌నింగ్ బగ్స్ *(Lightning bugs)* అనీ కూడా పిలుస్తారు. వీటిలోని మగ కీటకాలు తమ ఆడ కీటకాల్ని ఆకర్షించడానికి తమ పొట్ట క్రింది భాగము నుండి ఆపిల్ గ్రీన్ వర్ణపు *(Apple Green Colour)* కాంతిని వెలువరుస్తాయి

లూసిఫరేస్ *(luciferace)* అనే ఎంజైము *(enzyme)* ఆ మగ కీటకాల పొట్ట క్రింది భాగాలలో గల లూసిఫరిన్ *(luciferin)* అనే పిగ్మెంటు *(pigment)* పైచూపే ప్రభావం కారణంగా ఆ కాంతి పుడుతుంది

ఈ కీటకాలు గ్రుడ్లద్వారా పునరుత్పత్తి చేస్తాయి గ్రుడ్డు నుండి లార్వా *(Larva)* వెలువడి అదే క్రమంగా మిణుగురు పురుగుగా పరిణామం చెందుతుంది. లార్వా దశలోని యీ కీటకాల్ని గ్లోవర్మ్స్ *(Glow Worms)* అంటారు అవి కూడా పై తరహా కాంతిని వెలువరుస్తాయి

రాధ నిరాఘాటంగా తపస్సు చేస్తూనే వున్నదట. వర్ష ఋతువుకు సంబంధించిన ఏ అంశాన్ని చూసినా ఆమెకు అది కృష్ణ సంబంధమైనదిగానే కనుపిస్తున్నదట. ఆమె ఆలోచనలెలా వుంటున్నాయటంటే -

ఇంద్ర చాపము (ఇంద్రధనస్సు) ను చూచిన ఆమె అది కృష్ణుడు కొప్పున ధరించే బర్హిపింఛము (నెమలి పింఛము) అని భావించింది.

భిదుర ఘోష (పిడుగు చప్పుడు) వినిన ఆమె అది శ్రీకృష్ణుని శంఖమైన పాంచజన్యము యొక్క గంభీర ఘోష అనుకొన్నది.

చుట్టూ మూగిన బలాకావళిని (కొంగల గుంపును) చూచిన ఆమె దానిని కృష్ణుడు ధరించిన ముత్యాల హారంలోని ఒక పేటగా (పేరుగా) భావించింది.

కోల మెఱుగు (వంకరలేని మెరుపు)ను చూసి ఆమె దానిని ఉదిరి బంగారపు (అపరంజి - పదివన్నె బంగారు) పచ్చదనపు కాంతి కమ్మే పచ్చపట్టుగా భావించింది. కృష్ణుడు పచ్చపట్టు అంబరాన్నే - పీతాంబరాన్నే - ధరిస్తాడు కదా !

కుంభవృష్టిని చూసి అదే కృష్ణుని కరుణారస వృష్టి అనుకుంది. తన కన్నుల ముందరి నీల మేఘాన్ని చూసి, 'యిది నీల మేఘం కాదు; సాక్షాత్తూ నీలవర్ణుడే (కృష్ణుడే)నా మ్రోల (ఎదుట) ప్రత్యక్షమయ్యాడు' అంటూ ఆ వధూటి (స్త్రీ - ఆ రాధాదేవి) హర్ష పులకిత తనువయిందట (అంటే ఆనందంతో పులకించిన శరీరం కలది అయిందట).

ఈ విధంగా అనవరత ధ్యాన ధారా ప్రవాహమగ్న హృదయ (ఎడతెగని ధ్యానమనే ప్రవాహము నందు మునిగిన హృదయం కలది)యైన ఆ రాధాదేవికి కృష్ణుడు ప్రత్యక్షమయ్యాడట. ఆ యాదవ రాజవంశమణియైన కృష్ణుడు అద్రిజ నేలిన శూలి (పార్వతిని స్వీకరించిన శివుని) పోలికన రాధను తన అర్ధ శరీరముగా (అర్ధాంగిగా) చేసుకున్నాడు.

## శరదృతువు

రాధాసంగమ ముదితుడైన (రాధా సంగమంచేత సంతోషించినవాడైన) ఘనశ్యాముడిని (మేఘము వలె శ్యామవర్ణుడైన కృష్ణుని) చూచి శంపాధరములు (మేఘములు) ఓటు పడినట్లు (అపజయము నందినట్లు) తమ వర్ణములోని నల్లదనాన్ని తగ్గించుకొని వెలుకబారాయట (తెల్లబారాయట). అంటే ఆకాశమంతా వెలిమబ్బు వేయసాగిందన్నమాట. దీంతో వర్ష ఋతువు క్రమంగా వెనకడుగు వేసి శరదృతువు మెల్లగా ప్రవేశించింది. మేఘాలు నల్లదనం కోల్పోయి తెల్లగా దూది పింజలలా తయారవడం శరదృతువు లక్షణాలలో ఒకటి.

కవి శరదృతు శోభను వర్ణిస్తూ చెప్పిన చక్కటి పద్యమొకటి చూడండి.

**సీ॥ కలఁక నీరెంతయు గతకల్మషముఁజేసెఁ, గతకాఫలము రీతిఁ గలశసూతి**
**పాపట దీర్చె భూభాగంబు నాశ్యాన, శాదంబు శకటౌఘ చక్రధార**
**శిఖితాండవము కళాసిగఁ జేసి సడలించెఁ గఱకుటీఁకల పేరి కాసెబిగువు**
**లుడిగిన జడివాన లుదయించె వెండియుఁ గరిఘటా మదవృష్టి కైతవమున**

**తే॥ రెల్లు శోభిల్లె మంకెనలుల్లసిల్లెఁ, గాలకంధర వాహంబు గజ్జ రేఁగె**
**ముదిత శతగోపకన్యకా వదనతులిత, లలితరుచిఁ బొల్చె రాకాకళాధరుండు**

**(పాండురంగ మాహాత్మ్యం : 4-37)**

భాద్రపద మాసం చివరిలో అగస్త్య నక్షత్రం (*Canopus*) ఉదయిస్తుంది. ఇది శరదాగమనానికి సంకేతం. భాద్రపద మాసపు కృష్ణపక్షంలోని ఏడవరోజును 'అగస్త్యోదయ' అంటారు. అగస్త్యోదయంతో నదులు, తటాకాలు, యితర జలాశయాలలోని నీరంతా ఒండ్రుతేరి తేటబడుతుంది. ఈ అగస్త్యచార కాలంలో (శరదృతువులో) భూమి మీది ప్రతివస్తువూ మనోజ్ఞమైన కొత్త అందాలు సంతరించుకుంటుందట.

వానలు కురిసే వర్షఋతువులో ఎప్పటికప్పుడు మట్టితో కలిసిన మురికినీరు వచ్చి నదులలోనూ, జలాశయాలలోనూ కలుస్తూంటుంది. కనుక వర్షాకాలంలో నీరంతా దాదాపు మురికిగానే వుంటుంది. శుభ్రమైన నీరెక్కడా లభించక మురికి నీరు త్రాగడం తప్పనిసరి అయ్యేటట్లయితే చిల్లగింజల (*clearing nuts*) ను అరగదీసి ఆ రసాన్ని నీటిలో కలుపుతారు. లేక పాత్రల అడుగు భాగంపై చిల్లగింజలతో రుద్దుతారు. అప్పుడా నీటిలోని మురికి విరిగి క్రిందకి చేరుతుంది. తేరిన తేట నీళ్లు త్రాగుతారు. చిల్లగింజలను ఇందుప గింజలనీ అంటారు. సంస్కృతంలో వీటిని కతక ఫలాలంటారు. 'ఫలం కతకవృక్షస్య యద్యప్యంబు ప్రసాదకమ్'. - (మనుస్మృతి 6-67) అంబు ప్రసాదనమునకు (నీటిని

శుభ్రపరచుటకు) వాడబడే గింజలు కనుక వీటిని అంబు ప్రసాదకములన్నారు. 'ఇందుప' లేక 'చిల్ల' చెట్టు (*Strychnos potatorum*) మన ప్రాంతపు అడవులలో సర్వ సాధారణ వృక్షమే. ఇది లోగానియేసీ (*Loganiaceae*) కుటుంబానికి చెందిన వృక్షం. శరదాగమనంతో వానలు వెనకపట్టు పట్టి కొత్తగా మురికినీరు వచ్చిచేరడం ఆగిపోతుంది. భూమ్యాకర్షణ కారణంగా జలాలలోని బరువైన మట్టి కణాలు క్రమంగా క్రిందికిదిగి నీరు తేటబడుతుంది. తగ్గిన నీటి కదలికలు కూడా యీ ప్రక్రియకు దోహదం చేస్తాయి. అగస్త్య నక్షత్రోదయానికీ నీళ్లు తేటబడడానికీ వేరే సంబంధమేమీ లేదు. ఒకవేళ శరదృతువులో కూడా (అంటే నక్షత్రోదయం తరువాత కూడా) అకాల వర్షాలేనైనా కురిస్తే మురికినీళ్లు తప్పునిసరే! ఇది శాస్త్రీయ దృక్పథం.

అయితే రామకృష్ణకవి కడుచమత్కారి. పైగా గొప్ప ఊహాశక్తిగల మహాకవి. అందుకని పై పద్యంలో శరదృతు సంబంధమైన విషయాల్ని చెప్పేటప్పుడు అగస్త్య నక్షత్రోదయంతో శరదృతువు ఆరంభమవుతుందనీ, శరదృతువులో జలాశయాలలోని నీరంతా తేటబడుతుందనీ చెప్పడానికి కలశసూతి (అగస్త్యుడు) కతకాఫలము రీతి (ఇందుపగింజ వలె) కలంకనీటిని (బురదనీటిని) గతకల్మషముగా (పోయిన కల్మషము కలదిగా – పరిశుద్ధమైనదానిగా) చేశాడని చెబుతున్నాడు.

ఆశ్యాన శాదమైన (ఎండిన బురదగల) భూభాగాన్ని శకటౌఘచక్రధార (బండ్ల చక్రముల అంచు) పాపట తీర్చిందట. అంటే ఎండిన బురద నేలపై బండ్లన్నీ వరుసగా నడిచిన కారణంగా ఆ నేలపైన బండి చక్రాల గాళ్లు పడ్డాయన్నమాట. శిఖి (నెమలి) తాండవము (తాండవ నృత్యమును) కళాసిగంజేసి (అలసిపోయేట్లుచేసి) కఱకుటీంకలపేరి కాసెబిగువులు సడలించిందట (అంటే – వర్ష ఋతువంతా అలసిపోయేట్లు తాండవనృత్యం చేసిన నెమలి బిగువు సడలించి తన ఈకలు కొన్ని రాల్చేసిందన్నమాట.

శరదాగమనంతో వానలు ఆగిపోతాయి. అయితే కరిఘటా (ఏనుగుల గుంపులు) మదవృష్టి (మదాన్ని వర్షంలా స్రవించిన) కారణంగా వెండియు (తిరిగి) (కపటమైన) జడివాన లొస్తున్నాయా అన్నట్లుందట.

తెల్లు శోభిల్లిందట. శరత్కాలపు రెల్లు శోభను 'కుసుమిత కాశమంబుధర' (ఉ.చ. 3-173) అనే పద్యంలో రామకృష్ణకవి ఎంచక్కా వర్ణించాడో మనం యీవరకే చూశాం.

మంకెన పూలు ఉల్లసిల్లాయట (వికసించాయట). మనోహరమైన ఎర్రని మంకెనపూలు వికసించేది శరదృతువులోనే. కాలకంధర (నీలకంఠుని) వాహంబు (వాహనమైన ఎద్దు) గజ్జురేఁగె (మదమెక్కి ఎదయిందట). ముదిత (సంతోషపడినదైన) శతగోప కన్యకా (శతగోపుని కుమార్తెయైన రాధ యొక్క) వదన తులిత (ముఖకాంతికి సమానమైన కాంతితో) రాకాకళాధరుడు – పున్నమి చంద్రుడు; పొల్పెన్ – ప్రకాశించాడట.

రాధ యొక్క క్రింది పెదవిపై తన పండ్లతో కృష్ణుడు చేసే దంతక్షతముల (పండ్ల గాట్ల) లా అప్పుడే విరిసిన మంకెనపూల (అవీ రాధ పెదవుల్లా ఎర్రనివే) పై తుమ్మెదలు వాలాయట.

పుండరీకుడిని రక్షించడానికీ, భూమి భారం తగ్గించడానికీ అవనీతలంపై అవతరించిన తన అల్లుడిని చూడడానికి వచ్చే దుగ్ధాబ్ధి (పాలసముద్రమా) అన్నట్లుగా వున్న మేఘముల కాంతి తెల్లని వెన్నెలలా ప్రకాశించిందట. శరదృతువులో మేఘాలు తెల్లగా వుంటాయనేది లోకవిదితమే!

వర్షాకాలంపోయి శరత్కాలం వచ్చింది కదా – రామకృష్ణకవి "శరత్కాలం మాత్రం ఏం తక్కువది?" అంటూ శరత్కాలంలో లభించే వివిధ వస్తు సంచయాన్ని మనకు పరిచయం చేస్తూ, అవి ఏ రకంగానూ వర్షాకాలంలో లభించే వస్తు సంచయానికి తీసిపోనివని ఋజువు చేస్తున్నాడు.

వర్షాకాలంలో గుబాళించే కడిమి పువ్వుల తావి (సుగంధం) శరత్కాలంలో వుండదు. ఐతేనేం? అప్పుడు లభించే

మరువపు చిగుళ్లు మాత్రం సౌరభంలో ఏం తక్కువ? ఎక్కువేనని కవి భావం.

మదించిన మగ నెమళ్ల నాట్యాలు మనం శరత్కాలంలో చూడలేకపోవచ్చు. ఐతేనేం? హంసల నడకల కంటే నెమళ్ల నాట్యాలు గొప్పవా? కావని కవిభావం. వర్షాకాలమంతా ఎడతెగని వానల కారణంగా యిబ్బందిపడ్డ హంసలు శరత్కాలంలో వాటి మనోజ్ఞ గమనంతో అందరినీ అలరిస్తాయట. నీడాగూడూ లేనివైన కారణంగా కావచ్చు హంసలు వర్షాకాలంలో కలత చెందుతాయట. అందుకే వాటిని తొలుకారు (వర్ష ఋతువు) కలంక పులుగులంటారు.

వర్ష ఋతువులోని మెరపుల పొలపము (కాంతి) కంటే శరత్కాలంలోని శాలిధాన్యపు చేల ధళధళములు (తళతళ కాంతులు) ఏం తక్కువ? ఏమీ తక్కువ కాదు.

సోనవానల పెల్లు (అధికమైన వాన జల్లులు) సుడియకుంటే మాత్రమేం? (చుట్టుముట్టి రాకుండా ఉంటే మాత్రమేం?) శరత్కాలంలోని ఏనుగుల మదజల వర్షాలకు అవి ఎందులో సాటి? ఎందులోనూ కాదు. ఎందుకంటే, మదజలం సుగంధభరితంగా వుంటుంది కూడా. కారుకాలానికి (వర్షాకాలానికి) ఏ గౌరవమైతే లభించిందో, అది శరదృతువు సౌష్ఠవం కారణంగా తేలికైపోయింది. ఎందుకంటే - శరదృతువు తన ఋతు ధర్మాలన్నీ కలిగివుండి కూడా పైపెచ్చు వర్షర్తువు యొక్క ధర్మాలను కూడా చూపగలిగి యుండడంచేత.

ముందు పనిచేసిన అధికారి తన అధికారాన్ని వీడి తప్పుకుంటే ఆ అధికారాలు, ఐశ్వర్యపు కళలూ అతని తరువాత వచ్చిన అధికారివే కదా!

శరదృతువులో పాడిపంటలు సమృద్ధిగా వుంటాయట. కోరుకున్న చోటల్లా పంక విహీన మనోహరాంబువులు (బురదలేని స్వచ్ఛమైన నీళ్లు) లభిస్తాయట. భానుడు (సూర్యుడు), శీతభానుడు (చంద్రుడు) గడచిన వర్షఋతువులో మేఘములలో నాటుకొనిపోయిన కాళిమ వికారము (వికారమైన నల్లదనాన్ని) తమ తెల్లని, ప్రకాశవంతమైన కిరణాలతో దూరం చేస్తారట. అలా శారద దినములు (శరదృతువు) నిర్మలమైన మౌక్తికాకృతిలో (స్వచ్ఛమైన ముత్యంలా) మెరిసిపోతున్నవట.

శరదృతువులోనే కార్తిక పౌర్ణమి ఉత్సవాలు జరుగుతాయి. కార్తిక మాసంలో చంద్రుడు కృత్తికా నక్షత్రము (*Pleiades*) నకు దగ్గరగా వుంటాడు. మన ప్రజలు యీనాటికీ కార్తికపౌర్ణమి (సాధారణంగా నవంబర్ నెలలో దీపావళి అనంతరం 15 రోజులకిది వస్తుంది) సందర్భంగా ఉపవాసాలు, నోములు వగైరా చేస్తారు. ఆ నాటి కార్తిక పౌర్ణమి సంరంభాలెలా వుండేవో యిక్కడ మనకు కవి వర్ణిస్తున్నాడు.

మహీరమణులు (భూపతులు - రాజులు) తమ గుర్రాలకు హారతులు సమర్పించి 'రక్ష'లు కట్టారట. వాహనముల రక్షణ, భద్రతకోరి రక్ష రేకులు, మూలికలు వగైరాలను కార్తిక పౌర్ణమి రోజున కట్టడం అనాదిగా వస్తూన్న ఆచారం.

వర్షాకాలం చదువులకు అనుకూలమైనది కాదు. అందుకే అస్తుబిస్తు చదువులను 'వానాకాలం చదువు'లనడం పరిపాటి. ఆ రోజులలో వానాకాలం ముగిసిన తరువాత శరదృతువులోనే పిల్లలను బళ్లలో వేసేవారు. గురువుల యిండ్లే వారికానాడు పాఠశాలలు. ఫలక గ్రహణము (పలకలు పట్టడం), చౌపదములు (గిలకల పద్యాలు) నేర్పడం గొప్ప వైభవంగా గురువుల యిండ్లలో జరిగేవట.

ఇంటివద్ద అక్షరాభ్యాసం జరిపించడం ఓ పెద్ద వేడుక అయితే, గురువు యింట నూతన విద్యార్థిచేత పలక పట్టించడం యింకో పెద్ద పండుగ. ఈ సందర్భంగా శక్తి కొద్దీ గురువుకు సంభావనలు, తోటి పిల్లలకు మిఠాయిలు, కానుకలు యివ్వడం ఆనవాయితీ. అప్పటినుండే పిల్లలకు కుదిరికగా కూర్చొనడం, పలకలపై చిన్నచిన్నగా అక్షరాలు దిద్దడంలో శిక్షణ యివ్వబడుతుంది. వారికి రోజూ గిలకల పద్యాలు కూడా నేర్పబడేవట. ఈనాటి నర్సరీ రైమ్స్ (*Nursery Rhymes*) ఆనాటి గిలకల పద్యాలు. ఆ పద్యాలెంతో భావస్ఫోరకంగా వుండి చిన్ననాడే పిల్లలకు ఉత్తమ ఆదర్శాలను బోధించేవిగా వుండేవి. కొన్ని చమత్కారంగానూ వుండేవి. మచ్చుకు ఓ పద్యం చూడండి -

తేరా వలకా బలపము
ఈ(య)రా అయవారిచేతి కింపలరంగా
పోరా భోజనవేళకు
రారా పద్యాలు చదువ రాజకుమారా!

అంటే ఆ రోజులలో ఉదయం వేళలలో లేఖనాభ్యాసము, మధ్యాహ్నం నుండి మౌఖికాభ్యాసము ఉండేవన్న మాట. ఇంకా యిలాంటివే 'చిన్న చెంబుతో నీళ్లు', 'చేతవెన్న ముద్ద' వగైరాపద్యాలు ఆ గిలకల పద్యాల కోవకే వస్తాయి.

ఇంకా కార్తిక పున్నమి ఉత్సవాల సందర్భంగా ఏర్పాటు చేయబడే చిచ్చర తోరణముల (జ్వాలా తోరణముల) నుండి మంట తగలకుండా ధైర్యంగా దూకినవారు కృతాంతుడి (యముడి) తోరణాల నుండి దూరాల్సిన పనిలేదట. ఈ సందర్భంగా ఎండు అరటి ఆకులు వగైరాలతో తోరణాలుకట్టి, వాటికి నిప్పు అంటించి, వాటినుండి దూరివెళ్లడంలో ఒకరికొకరు పోటీపడేవారట. అలా విజయవంతంగా దూరి వెళ్లిన వారికి మరణానంతరం యాతన శరీరాన్ని యముడు పెట్టే చిత్రహింసల లోనిదైన జ్వాలా తోరణంనుండి దూరడం అనే బాధ తప్పుతుందని విశ్వాసం.

జనులంతా కార్తిక మాసంలో పెద్దసంఖ్యలో భుజాభోజనాలకు హాజరయ్యే వారట. భుజాభోజనములు అంటే ఒకరి భుజము (చేతులు) లింకొకరి భుజాలతో తాకుతూ సహపంక్తిన కూర్చొని చేసే విందు భోజనాలు. కార్తికమాసం అలాంటి సామూహిక విందు భోజనాలకు నాటినుంచే ప్రసిద్ధి. భుజాభోజనాలనే పేరును బట్టే అవి వర్ణ వివక్షలేని సామూహిక భోజనాలనిపిస్తున్నది. అయితే వాటిని కొందరు భుగా భోజనాలని పిలుస్తున్నారు. కార్తిక వనసమారాధనలు నేటికీ జరుగుతున్నాయి. అయితే నేడివి కుల, రాజకీయ ప్రయోజనాలనాశించి జరుపబడుతుండడం విచారకరం.

అటువంటి కార్తిక భుజాభోజనములలో తొలిక్రొత్త వంటకాలను ప్రజలు తృప్తిగా భోంచేశారట. మనమైతే దీనిని గొంతుదాకా మెక్కారని అంటాం. కాని రామకృష్ణకవి చమత్కారి కనుక ప్రజ తొలి క్రొత్తవంటకాలను (అప్పటికప్పుడు తయారైన లేక కొత్త బియ్యంతో చేయబడిన ఆహారపదార్థాలను) సిగబంటిగా భుజించారన్నాడు. అంటే తలమునుగ భుజించారన్నమాట!

పుష్పాయుధుడు (మన్మథుడు) అఖిల దిగ్జయకాంక్షతో (అన్ని దిక్కులనూ జయించాలనే కోరికతో) వచ్చి వెలి గుడారములో (ఊరిబయట వేసిన గుడారంలో) విడిది చేశాడట. ఆదినారాయణుడు త్రిభువన మోహనంగా (ముల్లోకములూ పరవశమయ్యేట్లు) పిల్లన గ్రోవి వాయించాడట.

ఈ విధంగా ఋణత్రయ విమోచనమునకు హేతువైన ఆ ఋణవిమోచన తీర్థంలో తపస్సుచేసిన రాధ యొక్క కోరిక తీరింది. (జప, పూజ, హోమాదులతో దేవ ఋణము, వేదాధ్యయనము వలన ఋషి ఋణము, పుత్ర సంతానము వలన పితృణము తీర్చవలెనట) ఆ గోపబాలుడు రాధతోగూడి మాయచే ఆవరించబడిన జీవాత్మలా అనేక రకములైన భోగములను అనుభవిస్తున్నాడు.

ఇక అక్కడ బ్రాహ్మణోత్తముడైన పుండరీకుడి ఘోరతపస్సు కారణంగా అతని శిరస్సులోనే పుట్టి కాంతులు విరజిమ్మే సహస్రదళ పద్మం దిశగా సాగి, బొట్టు బొట్టుగా స్రవిస్తూన్న అమృత రసమును త్రాగుతూ మూలాధార చక్రాన్నుంచి పైకి లేచిన అతని భోగిని నాలుగు రెండు మూలలూ (ఎనిమిది దిక్కులూ) తిరుగుతూ ఆతని కుడి చెవినుండి వినవస్తూన్న మేఘధ్వనికి పరవశమౌతున్నదట. (కుండలిని అనే ఆడుపాము దుర్గ లేక శక్తి ప్రతిరూపం. 'యోగ'లో ప్రస్తావనకు వచ్చే ఒక నాడి.)

అతడి మనస్సు విశాలనేత్రుడూ, పీతాంబరుడూ, శ్రీవత్స లాంఛనుడూ, శ్యామల వర్ణం కలవాడూ, పీలినెట్టెము (పీలిపిట్ట యీకలతో అలంకరించిన తలపాగా) కలవాడూనైన కృష్ణ పరమాత్మపైనే లగ్నమైయున్నదట. పీలిపిట్ట లేక

పికిలిపిట్ట (*The Red Vented Bulbul - Pycnonotus cafer bengalensis*) మన ప్రాంతంలో సుపరిచితమైన పక్షి.

అప్పుడు పుండరీకుని యెదుట బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడట. బ్రహ్మ నాలుగు ముఖాలూ నాలుగు ప్రాత మినుకులు (వేదములు) అంటున్నాడు కవి. అతని కమండలములోని వారి (నీరు) దనుజారి (విష్ణువు) పాదములను కడిగిన పాద్యము. తన మనస్సులో ఏదితోస్తే దానికొక రూపం కల్పించగల సమర్థుడట బ్రహ్మ. తాను కట్టుకున్న శ్రేష్ఠమైన చర్మము సృష్టి చేయడమనే దీక్ష కొరకే ధరించాడా అన్నట్లు కప్పుదేరిందట (దీక్షావస్త్రము దీక్ష పరిపూర్తి అయ్యేవరకు విడువరు. అందుచేత అది మురికితో నల్లబడుతుంది. సృష్టిచేయడమనే బ్రహ్మదీక్ష ముగిసేది కాదుగదా! అంచేత ఆయన నడుముకు కట్టుకున్న చర్మం మరింత నల్లబడి వుందట). వింజామర పట్టుకొని వీస్తూ తన చిరుత చనుదోయిని బ్రహ్మకు ఆనుకొనే దిండయ్యేటట్లుగా ఆయన వెనుకనే నిలబడిందట పలుకుఁజెలువ (సరస్వతి). అలా తొలుకారు కలఁక పులుగైన హంసను మావుగా (గుర్రంగా) కలవాడైన రావుత్తు (రౌతు) అంటే హంసవాహనుడైన బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడట. (వర్షాకాలంలో కలత చెందే పక్షి కనుక కవి హంసను తొలుకారు కలఁక పులుగు అన్నాడు.)

బ్రహ్మ వాహనమైన హంస గర్వంతో మెడ కూడా కదల్చకుండా వుందట. ఎందుకంటే స్వర్గలోకం లోనిదైన గంగానదీ తటములో పుట్టిన స్వర్ణకమలముల (బంగారు పద్మముల) పిసాళములను (కాడలను) మాత్రమే తింటున్నాననే అతిశయంతో అది కొవ్వెక్కిందట. అలాంటి హంసవాహనాన్నుంచి దిగిన బ్రహ్మ వినయ శీలియైన పుండరీకుడిని ప్రేమతో కౌగిలించుకున్నాడట.

ఆ తరువాత 'నీకూ, నీ వారికీ కుశలమేనా?' అని అడిగాడట బ్రహ్మ. 'శుభాలన్నిటికీ మూలాధారమైన నీవు వచ్చిన తరువాత యింక మాకు కుశలానికేం లోటు వుంటుంది?' అంటూ పుండరీకుడు బ్రహ్మను ఒక పరమాసనం (ఉన్నతాసనం)పై కూర్చుండబెట్టాడట. తాను పూర్వజన్మలో చేసిన ఏ నోము కారణంగానో బ్రహ్మ అంతటివాడు తనకు అతిథిగా లభించాడని సంతోషించాడట పుండరీకుడు.

"అరుణావిష్కారము భాస్కరోదయాన్ని సూచిస్తుంది.

అరుణుడు లేక అనూరుడు సూర్య రథసారథి. రథం వచ్చేటప్పుడు ముందు సారథే కనుపిస్తాడు కదా! అలాగే సూర్యోదయానికి (పొద్దు పొడుపుకి) ముందు అరుణుడు పొడుస్తాడు. ఏడు గుర్రాలు పూన్చిన సూర్య రథాన్ని అనూరుడు (ఊరువులు లేనివాడు - తొడలు లేకుండా పుట్టినవాడైన అరుణుడు) తోలతాడని విశ్వాసం. కశ్యప ప్రజాపతి భార్య అయిన వినత రెండు గ్రుడ్లకు జన్మనిస్తుందట. ఆమె సవతి కద్రువకు కొన్ని లక్షల పాములు సంతానంగా జన్మించగా వినతకు పుట్టిన గ్రుడ్లు మాత్రం ఎంతకూ పగలకపోతుంటే సవతి పట్ల ఈర్ష్య జనించిన వినతకు ఓర్పు నశించి ఒక గ్రుడ్డును తానే పగులగొడుతుందట. అందులోనుంచి స్ఫురద్రూపీ, అమిత బలశాలీ అయిన ఓ బాలుడు వెలువడ్డాడట. అయితే వినత ఆ గ్రుడ్డును నిర్ణీత సమయానికి ముందరే పగుల గొట్టిన కారణంగా అప్పటికి ఆ బాలుడి శరీర నిర్మాణం యింకా పూర్తవలేదట. ఊరువులు (తొడలు) లేకుండా నడుము వరకే తయారైన ఆ బాలుడిని అనూరుడు అన్నారు. అరుణ వర్ణంతో ఉన్న కారణంగా అతడిని అరుణుడనీ అన్నారు. గ్రుడ్డునుంచి వెలువడగానే ఆ బాలుడు తన దుస్థితికి బాధపడి అందుకు కారణం తన తల్లికి ఆమె సవతి యెడల కలిగిన యీర్ష్యేనని గ్రహించి, 'ఆ సవతికే నీవు బానిసవవుతా'వని తన తల్లిని శపించి సూర్యుని రథానికి సారథిగా పని చేయడానికి వెళ్లిపోతాడట. రెండవ గ్రుడ్డు మాత్రం సకాలంలో పగిలి అందునుంచి అమిత పరాక్రమశాలీ, విష్ణుభక్తాగ్రేసరుడూ అయిన పక్షిరాజు గరుత్మంతుడు ఆవిర్భవించాడట. వినత కుమారుడు కనుక ఆయన్ని వైనతేయుడు అనీ అంటారు. అనూరుడి శాపం కారణంగా వినతకు సంప్రాప్తించిన బానిసత్వాన్ని స్వర్గాన్నుంచి అమృతం తెచ్చి గరుత్మంతుడే పోగొడతాడు.

ఇక అసలు విషయానికి వస్తే - సూర్యోదయానికి పూర్వం కనుపించే అరుణిమ (ఎఱ్ఱదనం) సూర్య రథసారథియైన అరుణుడు ముందు కనుపించడం కారణంగానేనని మనవారి విశ్వాసం. అయితే సూర్యాస్తమయం సందర్భంలోనూ ఆకాశం అరుణవర్ణ రంజితమవుతుంది. మరి అప్పుడు రథసారథి (రథానికి ముందుంటాడు కనుక) మనకు ముందు కనుపించే అవకాశం లేదు కదా! శాస్త్రీయంగా ధృవపడిన

సత్యమేమంటే భూమి చుట్టూ సూర్యుడుకాదు - సూర్యుడి చుట్టూనే భూమి తిరుగుతూంది. సూర్యుని చుట్టూ తిరగడమేకాక భూమి తన చుట్టూ తాను పడమటి నుంచి తూర్పు దిశగా పరిభ్రమిస్తూన్నందున సూర్యుడు తూర్పున ఉదయించి పడమరకు క్రుంగుతున్నట్లు మనకు అనిపిస్తున్నది. భూమి సూర్యుడి చుట్టూ తిరగడానికి 365 రోజుల 5 గంటల సమయం పడుతుంది. తనచుట్టూ తాను తిరగడానికి సరిగ్గా 23 గంటల 56 నిముషముల 4.09 సెకండ్ల సమయం పడుతుంది.

సూర్యుడి నుంచి వెలువడే కాంతి తెల్లగా ఉంటుంది. ఆ తెల్లని కాంతిలో ఏడు రంగులుంటాయి. అవి : 1) ఊదారంగు *(Violet)* 2) నీలిమందు రంగు *(Indigo)* 3) నీలం *(Blue)* 4) ఆకుపచ్చ *(Green)* 5) పసుపు పచ్చ *(Yellow)* 6) నారింజ రంగు *(Orange)* మరియు 7) ఎరుపు *(Red)*. కాంతి తరంగాల *(Waves)* లో ప్రయాణిస్తుందనీ, వేరు వేరు రంగుల కాంతులకు వేర్వేరు తరంగదైర్ఘ్యాలు *(wave lengths)* వుంటాయనీ శాస్త్రీయంగా నిర్ధారించబడింది. సెకండుకు సుమారు 3 లక్షల కిలోమీటర్ల వేగంతో ప్రయాణించే వెలుగు కిరణాలు సూర్యుడి నుండి భూమిని చేరడానికి 8 నిముషాల కాలం పడుతుంది. సూర్యుడికీ భూమికీ మధ్యనున్న అంతరిక్షం లేక రోదశి *(space)* అంతా శూన్యమైనందున ఆ ప్రయాణంలో కాంతి కిరణాలు ఎటువంటి పరావర్తన *(refraction)*, విశ్లేషణ *(dispersion)* ప్రక్రియలకు లోను కావు. అయితే కాంతి కిరణాలు భూమియొక్క వాతావరణపు పొరలో ప్రవేశించగానే వాతావరణంలోని గాలి మరియు దుమ్ము కణాలు, నీటి ఆవిరి ఒక పట్టకము *(prism)* లా పనిచేసి కాంతికిరణాలను విశ్లేషించి వికీర్ణం *(scatter)* చేస్తాయి. ఆ విధంగా వికీర్ణమవడం ఆ యా రంగుల తరంగదైర్ఘ్యాల పైన ఆధారపడి ఉంటుంది. తక్కువ తరంగదైర్ఘ్యం కల కాంతి త్వరగా వికీర్ణమైపోతుంది. ఎక్కువ తరంగదైర్ఘ్యం కల కాంతి అంత తేలిగ్గా వికీర్ణం కాదు. పగటి సమయంలో సూర్యకాంతి ప్రయాణం చేసే వాతావరణపు పొరయొక్క మందం చాల తక్కువ. వాతావరణంలోని గాలి, దుమ్ము, నీటి ఆవిరి కణాలు అప్పుడు నీలి రంగు కాంతిని వికీర్ణం చేయడం కారణంగా పగటి ఆకాశం మొత్తం మనకు నీలంగా కనుపిస్తుంది. అయితే సూర్యోదయ, సూర్యాస్తమయాలలో సూర్యకాంతి ప్రయాణించాల్సిన వాతావరణపు పొర చాల మందం కనుక ఆ కాంతి మనకు చేరే లోపలే అందులోని నీలిరంగు కాంతి పూర్తిగా వికీర్ణమైపోయి కేవలం ఎర్రని కాంతి మాత్రమే మన కంటికి చేరి సూర్యోదయ, సూర్యాస్తమయాలకు అరుణిమను అలదుతున్నది. అలా మనోహరమైన రక్తిమతో కూడిన సూర్యోదయ, సూర్యాస్తమయ దృశ్యాలకు మూలం ఎర్రని కాంతి యొక్క తరంగదైర్ఘ్యమే కాని అరుణుడు కాదు.

తామరపూల సువాసన ఎక్కడో అంభోరుహాకరము (తామర సరస్సు) ఉండడాన్ని సూచిస్తుంది. వేలుపువిల్లు (ఇంద్రధనుస్సు) ప్రవర్షణమును (అధిక వర్షాన్ని) సూచిస్తుంది. అలాగే ముందుగా చేసే ఓంకారము కూడా తరువాత చేసే మంత్రాక్షర స్ఫురణమును ప్రకటిస్తుంది. నీ రాక కూడా తరువాత శ్రీపతి రాకను సూచిస్తున్నది అన్నాడట పుండరీకుడు బ్రహ్మతో. అంతేకాకుండా 'విష్ణువు మీవంటి వారిలో వసించునట్లు పూజా విగ్రహాలలో ఉండడని అంటారు. మీరీ విధంగా యిక్కడికి రావడాన్ని బట్టి శ్రీదయితాగమము (శ్రీవిష్ణునిరాక) ఇంకెంతో కాలం పట్టదని అనిపిస్తున్నది' అన్నాడట.

అప్పుడు బ్రహ్మ మేఘ గర్జన వంటి కంఠస్వరంతో 'నీ కోరికేమిటో తెలుపు తీరుస్తాన'నగా దానికి పుండరీకుడు యిలా అన్నాడట.

"ఓ బిసరుహగర్భా! (ఓ బ్రహ్మా!) విష్ణువును చేరుటకంటే సుఖమేదీలేదు. నాకు ఆ సుఖాన్ని ప్రసాదించు". దానికి బ్రహ్మ, "ఓ మునివరా! కడారపటుడు (కపిలవర్ణపు - పీతాంబరము ధరించినవాడు - విష్ణువు) ఎల్లి నేటన (నేడో రేపో) నీ ముందు ప్రత్యక్షమవుతాడు. నీవు చతుర్థసంపదతో (పురుషార్థములలో నాల్గవదైన మోక్ష సంపదతో) చరితార్థుడవవుతావు. నీ యీ క్షేత్రము నరులకూ, మునులకూ వారు కోరే శుభముల నిచ్చేదని పేరొందుతుంది" అని అంతర్థానం చెందాడట బ్రహ్మ.

ఇక ఆ లక్ష్మీపతి ఎప్పుడెప్పుడు తన మ్రోల ప్రత్యక్షమవుతాడా అని ఎదురుతెన్నులు చూశాడట పుండరీకుడు. అప్పుడతనికి దక్షిణేక్షణ వనజచ్ఛదము (తామర పూరేకు వంటి కుడి కన్ను) శుభనివహపిశునంబై (శుభసమూహమునకు సూచకమై - ఎన్నో శుభాలు చేకూరనున్నాయని సూచిస్తూ) అదిరిందట. మగవారికి కుడికన్ను అదరడం శుభసూచకమని

విశ్వాసం.

ఆ రోజూ, మరునాడూ కూడా ధాత మాటల చందమున (బ్రహ్మ తెలిపిన విధంగా) దానవారి (విష్ణువు) తనకడకు 'వచ్చురాముల' (రావడమూ, రాకపోవడముల) గురించి తలచి, తలచి, ముచ్చటల ఏట్లో మునిగి మునిగి స్నానం చేశాడట ఆ విప్రనందనుడు.

మూడవనాడు తానుంటున్న సిద్ధాశ్రమంలో బద్ధ పద్మాసనము (పద్మాసనములలో ఇదొకటి) వేసుకొని కూర్చున్నాడట. అప్పుడు అతని దేహమునందలి షట్చక్రములనే కమలముల నుండి సౌరభములు వ్యాపించాయట.

ఇక్కడ కవి షట్చక్రములను ఒక్కటొక్కటిగా వర్ణించాడు.

1) అధిదేవతయైన విఘ్నేశ్వరునితో కూడినదీ; ఎఱ్ఱనికాంతి
కలిగినదీ; నాలుగు రేకులు కలదీ; వ, శ, ష, స అను
నాలుగక్షరములు కలదీయైన మూలాధార చక్రము.

2) బ్రహ్మ అధిష్ఠాన దేవతయైనది; మెరుపువంటి
కాంతి కలది; ఆరు దళములు కలది; బ, భ
మ, య, ర, ల అను ఆరు అక్షరముల కూర్పుచే
ప్రకాశించే స్వాధిష్ఠాన చక్రము.

3) 'డ'కారముతో మొదలై 'ఫ' కారముతో అంత
మయ్యేది; నల్లని కాంతి కలిగినది; పదిరేకులచే
వెలుగొందేది; విష్ణువు అధిదేవతగా కలది;
డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ – అనే పది
అక్షరములు కలదీనైన మణిపూరక చక్రము.

4) శివుడు అధిష్ఠాన దేవతగా కలది; 'క' మొదలు
'ఠ' వరకు గల – క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ
ట, ఠ – అనే పన్నెండు అక్షరములనూ పన్నెండు
రేకులుగా కలది; బంగారువర్ణపు కాంతితో
ప్రకాశించేదీనైన అనాహత చక్రము.

5) పదహారు అచ్చులు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ
ఋ, ౠ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః –
పదహారు రేకులుగా కలిగినది; నారదుడు
అధిష్ఠాన దేవతగా కలది; గొప్ప వెలుగునకు
స్థానమైనదీనైన విశుద్ధ చక్రము.

6) జ్ఞానాంశమైనది;
మణుల కాంతితో వెలుగొందేదీ;
'హ, క్ష' అనే రెండక్షరాలనూ రెండు
రేకులుగా కలదీనైన ఆజ్ఞా చక్రము.

వీటికంటే యింకా పైదీ, శిరోభాగమున, తలక్రిందులుగా వుండి మిక్కిలి ప్రకాశమానమైనట్టిదీ; ఆద్య శివాశ్రయమై (యిక్కడ 'శివ' అంటే భగవంతుడని అర్థం; ఆద్య శివుడంటే శివునికీ, బ్రహ్మకూ, విష్ణువుకూ కూడా మూలపురుషుడైన భగవంతుడికి - పరమాత్మకు - నివాసస్థలమై) వేయిరేకులుగల సహస్రార కమలము నుంచి కూడా సౌరభం పరివ్యాప్తి చెందుతున్నదట.

ఈ సహస్రార పద్మము పరమాత్మ నివాసస్థలమనీ, అందునుండి చిదానందామృతము వెల్లువలై పారుతుందనీ విశ్వాసం.

పైన చెప్పిన ఆరు పద్మములను నిచ్చెనగా చేసుకుని ఎగబ్రాకి సహస్రార పద్మమునందలి చిదానందామృతమును త్రాగి పరవశించిందట ఆ సర్ప పురంధ్రిక (ఉత్తమ జాతి ఆడ నాగుపామైన ఆ కుండలిని)

పుండరీకుడు కళ్లు రెండూ మూసుకుని అంతర్దృష్టితో జ్ఞాన స్వరూపుడైన శేషావాసుడిని (ఆది శేషునిపై పవళించే విష్ణువును) చూసే సమయంలో -

అసాధ్యుడైన ధేనుకాసురుడనే రాక్షసుడిని సంహరించి, గోవర్ధన పర్వతమెత్తి గోవులనూ, గోపాలురనూ కాపాడినవాడు, ఇంద్రధనుస్సు ఆకారంలో వెలుగొందే నెమలి పింఛము ధరించినవాడు, వేదములను, పద్మముల పరిమళములను వ్యాపింపజేయు నాసాపుటి కలవాడు, (అతని నిశ్వాసములే వేదములు కదా!) ఇంద్రనీల మణులతో తాపడం చేయబడిన స్తంభాలవంటి పెద్ద చేతులు, వివిధ ఆభరణముల కాంతిచే ప్రకాశిస్తున్న విశాలమైన వక్షము కలవాడు, చేతులలో శంఖ చక్రాదులు కలవాడు, నాభి కమలమున పుట్టిన బ్రహ్మ కలవాడు, పృధువను పేరుగల రాజు రూపమున పుట్టినవాడు, లక్షమంది మన్మథులను పోలినవాడు, ఉత్తమ భార్యలు కలవాడు, ఐదేళ్ల వయస్సువాడు, విజ్ఞులైన మునులు కూడా చూడగాలేని ఆ పరమాత్మ పుండరీకుని కన్నులముందు సాక్షాత్కరించాడట.

అప్పుడు పుండరీకుడు - "ఓ మధుమధనా! (మధువనే రాక్షసుడిని సంహరించిన వాడా! ఓ హరీ!) విధి (బ్రహ్మ), శివుడు, సనకాదులైన ఋషులు, వేదములు కూడి నీ మహిమను కొనియాడుతూంటే గాఢమైన (లోతైన) అజ్ఞాన సాగరంలో వేగంగా పడిపోతూన్న నా బోటివాడికి నీ వాటము (నీ గొప్పతనము) ను పొగడ సాధ్యమేనా? తాపత్రయ నాశనమునకు నీ పాదములే శరణ్యములు కదా!"

"ఓ పూతనా ఘాతనా! (పూతన అనే రాక్షసిని చంపినవాడా!) నీవు వేనరాజు కుమారుడైన పృధువుగా జన్మించి భూమిని గోవుగానూ, హిమవత్పర్వతమును దూడగానూ, మేరుపర్వతమును (పాలు పిదుకు) గొల్లవానిగానూ చేసి, రత్నములను, ఓషధులనూ పిదికించలేదా? దశావతారములలో నీవు లోకోద్ధరణ గావించలేదా?"

ఓ కమలేక్షణా! (పద్మములవంటి కళ్లు కలవాడా!) కాటుక కుప్పవలె మనోజ్ఞమూ, శుభప్రదమూనైన నీ దేహము ఎల్లరకూ సులభంగా చూడ వీలయ్యేదిగా వున్నది. కంజభవుడు (బ్రహ్మ) మొదలుగాగల వృద్ధులు తాళపత్రములపై సరిగా కనుపించని అక్షర లక్ష్మిని కాటుకపూసి కాదా చదువగలుగుతున్నది?"

ఎందుకో మన పురాణాలన్నీ బ్రహ్మను వయోవృద్ధుడిగా భావించాయి. ఒక ప్రక్కన బ్రహ్మ తండ్రియైన విష్ణువును నిత్యయౌవనుడిగా భావిస్తూ బ్రహ్మను మాత్రం వృద్ధ ఛాందసుడని పేర్కొన్నాయి. జర (వృద్ధాప్యమున)కు లోబడిన బ్రహ్మను మన చిత్రకారులు కూడా తెల్ల మీసాలు, గడ్డాలతో, చతుర్ముఖునిగా సృష్టించారు. జరకు లోబడిన వారు దేవతలయ్యే అవకాశం లేదు. వారు జరామరణాలు లేని వారని కదా విశ్వాసం! 'పరస్పరం పొసగని అశాస్త్రీయ విశ్వాసాల సమాహారం మన పురాణాలు' అనడానికి బ్రహ్మ వృద్ధాప్యం ఓ మచ్చు తునక. అయితే వృద్ధ అంటే పెద్ద *(elder)* అనే అర్థం కూడా వుంది. నవ బ్రహ్మలు తొమ్మిది మందిలో మొదటి వాడైన బ్రహ్మను వృద్ధ బ్రహ్మ అంటారు. వైఖానసులు విఖనసుడు వృద్ధబ్రహ్మ అని వాదిస్తారు.

ధర్మ శాస్త్రాలు, యితర ప్రాచీన రచనలలో 'బృహత్' (గొప్ప) 'లఘు' (చిన్న) అనే విశేషణాలతో గ్రంథాలున్నట్లే, 'వృద్ధ మను', 'వృద్ధ హారీత' అనీ వున్నాయి. ఒకే విషయంపై పలు గ్రంథాలున్నప్పుడు వాటిలోకెల్లా అతి ప్రాచీనమైన సంకలనాని *(recension)* కి 'వృద్ధ' అనే విశేషణాన్ని జోడించడం పరిపాటి.

కాని యిక్కడ తాళ పత్రాలపై వ్రాయబడిన అక్షరాలు కాటుక పూస్తేనే కాని సరిగా చదువలేని దృష్టి దోషంకల వృద్ధుడైన బ్రహ్మ, జరామరణాలకు అతీతులైన దేవతా గణంలోని వాడెలా అయ్యాడు ? అతడికి కూడా తండ్రి అయినట్టి విష్ణువు నిత్య యౌవనుడెట్లా అయ్యాడు ? ఇదే మన పురాణాలలోని గందరగోళం ! ఆ గందరగోళంలో చిక్కుకునే మన రామకృష్ణ కవి 'కంజభవుడు మొదలైన వృద్ధులు తొలుత తాళ పత్రములపై తాము స్పష్టముగా చదువలేక పోయిన అక్షరలక్ష్మిని, దానిపై కాటుక పూసిన పిదప, (అంతకు ముందు కనుపించని) అక్షరస్థితులను చూడగలుగుతున్నారు కదా !' అని వ్రాశాడు. – (పాం. మా. 4-87)

"అణువులు, రేణువులు, తృణములు (గడ్డిపోచలు), కాష్ఠములు (కర్రలు) మొదలగు ఎన్నో వాటితో పరిపూర్ణవృత్తిగా సమకూరిన నీ అమిత మహామహిమాబ్ధికి (నీ అంతులేని మహామహిమ అనెడి సముద్రమునకు) కమలభవప్రముఖులు (బ్రహ్మ మొదలైన దేవతలందరూ) ఎన్నగా (ఎంచి చూడగా) బుద్బుదములే (నీటిబుడగలే)"

"ఎవడైతే నీ పాదపద్మ యుగము (జంట) ఎడల భక్తితో, వేరే ప్రత్యామ్నాయాన్ని గురించి ఆలోచించక, అగణ్యమైన నీ గుణ కీర్తనము చేయడంలో అతిశయిస్తాడో, వాడు మాత్రమే అగాధమైన భవసాగరమును (లోతైన సంసార సాగరాన్ని) ఒకే అంగలో దాటగలడు."

"ఓ పరమధామపతీ! (పరమ పదమైన వైకుంఠమునకు అధిపతీ!) భవదంఘ్రిదూరునకు (నీ పాదములకు దూరమైన వానికి) పుణ్యవసతి (స్వర్గము) సులభమేనా? అన్యభవంబులు సవరింప (పునర్జన్మలు ఎత్తుటకు) వెరచుచున్నాను (భయపడుతున్నాను) అంచేత నన్ను యుష్మదర్చా ప్రవణమతిని (నీ పూజయందు లగ్నమైన మనస్సు కలవానిని) గా చెయ్యి."

"నీ క్షేత్రమునకు నడచి వస్తాను. నీ నమ్మినబంట్లను చెయ్యిచాచి అర్చిస్తాను. నీ పాదాలకు మ్రొక్కుతాను. నాలుకపై నీ నామములే ఎప్పుడూ వక్కాణిస్తాను. నా సర్వదేహమునూ నీ సేవకే సమర్పిస్తాను. చిత్త సరణిలో (మనో మార్గములో) నీ లీలల గూర్చే చింతిస్తాను (ఆలోచిస్తాను), తనివి తీరక నీ చక్కదనమునే మరిమరీ చూస్తాను. నీ అవధానమును (నిన్ను గూర్చిన ప్రసంగాన్ని) నెమ్మి (ప్రేమతో) వింటాను. ఓ నీలవర్ణా! బ్రహ్మరుద్రాదులకు కూడా కనుపించని నీవు నేడు నా ఎదుట నిలచావు వర్ణనాతీతా! (వర్ణించడానికి అలవికానివాడా!) మత్ప్రాగ్భవ ప్రవృత్తి (నా పూర్వ జన్మ ప్రవృత్తి యొక్క) పుణ్య పరిపాకము (పరిపక్వమైన పుణ్యము) కారణంగానే నాకీ అదృష్టం లభించింది" అన్నాడు.

ఇవన్నీ విన్న పరంధాముడు పుండరీకునిపై తన చూపు లగ్నంచేసి, తన చుట్టూ వున్న దేవతా శ్రేష్ఠులతో యిలా అన్నాడు. "ఇంద్రియ నిగ్రహము కలవాడు, సత్య సంధుడు, నా భక్తుడు, పితృ సేవకు అంకితమైనవాడూ నైన యీ బ్రాహ్మణుడికి తాను కోరిన వరాలివ్వడానికి నేనిక్కడికి వచ్చాను. మీరు కూడా యీతనికి ప్రీతితో సహాయము చేయుటకు వచ్చారు. నాకు ఎవరు హితులో వారి పనులన్నీ మీవే. నా భక్తుల యందు ప్రీతి గలవారిని నేనుద్ధరిస్తాను."

"నేను సద్భక్తుని సేవకు తృప్తి చెందినట్లుగా తరు శిలాద్యుద్భూత ప్రతిమార్చన (కొయ్య మరియు శిలల నుండి పుట్టినవైన విగ్రహములను అర్చించడం) వలన తృప్తి చెందను. అది నాకు సంతోషకరమూ కాదు."

అని యింకా యిలా అంటున్నాడా పరంధాముడు -

మ॥ వలనా యేటికి నాశ్రయించి మనఁగా వానీరమున్ నీరమున్?
దలవెట్టే పచరింపనేటికి సమిద్దానంబు దానంబు? న
చ్చలమా యేటికి నెత్తి గొట్టుకొనఁగా సన్న్యాసమున్ న్యాసమున్?
గలదేఁ జాలు మదీయభక్తి రుచి భక్త శ్రేణి కశ్రాంతమున్. (పాండురంగ మాహాత్మ్యం : 4-98)

వానీరము అంటే పేములోని ఒక రకం. ఇవి నదుల అంచులలోని నీటిలో పొదలు పొదలుగా పెరుగుతాయి. 'యమునాతీర వానీర నికుంజముల'ను గూర్చి 'గీతగోవింద' కావ్యంలో జయదేవుడు ప్రస్తావించాడు.

'వానీర మాలినీ రమ్యానదీ పులిన శోభితా' అని సంస్కృత మహాభారతం (3.95.10)లో వర్ణించబడింది. 'వానీరములను మాలగా ధరించినదీ, పులినము (సైకతము, ఇసుక తిన్నె)లతో శోభితమైనదీనైన రమ్యమైన నది.'

వానీరమును 'నీటి ప్రబ్బలి చెట్టు' అనీ, 'జలవేతసము' అనీ అంటారు. హిందీలో 'పానీ బేత్' అని పిలువబడే దీని శాస్త్రీయ నామం *Calamus fasciculatus*. ఇది బెంగాల్‌లోనూ, ఒరిస్సాలోనూ ఎక్కువగా లభిస్తుంది. *Bengal Cane, Cuttack cane* అనే పేర్లతో యీ తరహా పేము ఉత్పత్తులు మార్కెట్లో లభిస్తాయి.

"వానీరపు పొదలను ఆశ్రయించి మనడం (జీవించడం), నీటిలో మునిగి (తపస్సు చేస్తూ) జీవించడం, వలనా - యేటికి? (అవసరమా - ఏమిటి?) అవసరంలేదు. (ఏకాంతం కోసం తాపసులు నదీతీరాలలో నిర్మానుష్యమైన వానీరపు పొదలలో జీవించేవారు).

సమిద్దానము అంటే సమిధలను దానం చేయడం. యజ్ఞంలో హవిస్సులుగా సమర్పించడం. అంటే యజ్ఞం చేయడం, దానాలు చేయడం వగైరాలు. ఎందుకు చేయాలి? ఏమైనా తలవెర్రా? సన్న్యాసము స్వీకరించడం, న్యాసము (శరీరాన్ని అనుకున్న పద్ధతిలో ఉంచడం. అంటే ఆసనాల ద్వారా శరీరాన్ని స్వాధీనంలో ఉంచుకొనడం) వగైరాలు చేసే తీరాలనే మొండి పట్టుదలా? దేనికి నెత్తి కొట్టుకొననదానికా? భక్త జనానికి ఎల్లప్పుడూ నా మీది భక్తిపై యిచ్ఛ వుంటే చాలు."

అన్ని ధర్మములూ విడిచి చరించేవాడైనా, ఆత్మలో నా ఎడల భక్తివుంటే, ఆతడే నాకు అత్యంత హితుడు; సుశ్లోక రతుడు (మంచి కీర్తియందు ఆసక్తి కలవాడు), ధర్మప్రవర్తన నిశ్చితుడు (సమస్త ధర్మములనూ నెరవేర్చాలనే కృత నిశ్చయం కలవాడు)

"ఓ నాకులారా! (ఓ దేవతలారా!) అస్మదంకధారి (నా యొక్క చిహ్నములైన శంఖ, చక్రములను చక్రాంకనము ద్వారా ధరించిన వ్యక్తి)యగు భక్తవరుని శరీరము నాకెంతో యిష్టమై వైకుంఠ నగరంలో వదలకుండా వసిస్తుంది."

రామకృష్ణ కవి వడకలై లేక వడహల (వైఖానస) శాఖకు చెందిన వాడు కదా ! మరి యిక్కడ పుండరీకుడి వంటి భక్తుడిని గురించి చెప్తూ విష్ణువు 'అస్మదంకధారి' అని ఎందుకన్నాడు ? తన చిహ్నాలైన శంఖ, చక్రాలను అంకనం ద్వారా ధరించడం అంటే - అది శ్రీవైష్ణవ (తెన్‌కలై లేక తెంగల) శాఖకు చెందిన ఆచారం కదా - అని మనం ఆలోచించవచ్చు.

అయితే వడహల లేక వైఖానస శాఖలో ఒంటిపై చక్రాంకనం చేసుకొనే ఆచారం లేదు కానీ - పాయసంలో తప్తచక్రాంకనం చేసి - ఆ పాయసాన్ని గర్భిణికి ప్రాశనం చేస్తారు. దీనిని 'విష్ణుబలి' అంటారనీ, అలా వైఖానసులు గర్భస్థ శిశువుగా వున్నప్పుడే అంకన సంస్కారం పొందుతారనీ వారు శరీరంపై ఎక్కడో బుజాలపైన మాత్రమే కాక అణువణువునా అంకన సంస్కారం పొందిన వారైన కారణంగా వారిని 'జన్మ వైష్ణవులు' లేక 'ఆగర్భ వైష్ణవులు' అంటారనీ మనం వేరొక చోటులో కూడా చెప్పుకున్నాం. అలాగే తన కావ్యాలలో రామకృష్ణ కవి 'శ్రీవైష్ణవ అనే

పదాన్ని కూడా వైష్ణవులందరికీ సామాన్యార్థకంగానే వాడినట్లున్నది. భాగ్యశాలురైన వైష్ణవులందరినీ దృష్టిలో వుంచుకొనే ఆ పదం ఆయన వాడాడనిపిస్తున్నది. నేడు మాత్రం వైష్ణవులలోని తెంగల శాఖ వారికి మాత్రమే 'శ్రీవైష్ణవ' అనే సంబోధన స్థిరపడింది.

"నాలో భక్తుడు నివసిస్తాడు. నేను భక్తుడిలో నివసిస్తాను. *(Immanent and Transcendent)* మా యిరువురికీ కాయ ప్రాణానుకూల్య కౌశల్యము (దేహమునకూ, ప్రాణమునకూ ఉండే సంబంధం) వుంటుంది."

"మహిత పుణ్యులైన నా భక్తులకు కానివాడు నాకూ కానివాడే. భాగవతుల (భగవద్భక్తుల)నూ నన్నూ ఒకటిగా భావించేవాడు నన్ను చూచినట్లే.'

"సుకర్మంది (నారదుడు), హిరణ్య దైత్యసుతుడు (ప్రహ్లాదుడు), వ్యాసుడు, శౌనకుడు, శ్రీ పరాశరుడు, రుక్మాంగదుడు, అంబరీషుడు, సరమాజాని (విభీషణుడు), వసిష్ఠుడు, పురందర పుత్రుడు (ఇంద్రుని కొడుకైన అర్జునుడు), శుకుడు, దాల్భ్యుడు (ఓ వైయాకరణి – *a Grammarian*), భీష్ముడు మొదలైన పరమ భాగవతోత్తములను కూడా ఆశ్చర్య పరచేటంతటి భక్తి తత్పరుడు యీ పుండరీకుడు. ఇతనిని నేను గొప్ప వరములచేత పాలిస్తాను (కరుణిస్తాను)."

"వినండి దేవతలారా! మీకు కూడా ఎప్పుడూ యిచ్చి వుండని వరాన్ని యీ భక్తవరుడికీరోజు యిద్దామనుకుంటున్నాను. అతడేది కోరుకుంటే అది యిచ్చెయ్యడానికి కంకణం కట్టుకున్నాను నేను" అనిన దేవకీనందనుడు పుండరీకుని వైపుతిరిగి మోదాంబుద గర్జనముతో (సంతోషమనే మేఘం ఉరిమినట్లు) యిలా అన్నాడు. "నీ పితృభక్తి, నీవు అనవరతము భక్తితో నాకై చేసిన అర్చన నన్నెంతగానో సంతోషపెట్టాయి. నేను అనంత పుణ్య స్వరూపము కలవాడిని. వైరాగ్య జ్ఞానోన్నతులూ, యోగ్యతములూ అయిన వారిపట్ల నేను ప్రేమ కలిగి వుంటాను. ప్రత్యేకించి నీ పట్ల ప్రసన్నుడినై యున్నాను. నీకేది కావాలో కోరుకో."

అప్పుడు పుండరీకుడు "లోకంలో సిరిసంపదలన్నీ బుద్బుదాభములు (నీటిబుడగల వంటివి) సాక్షాత్తూ నీవే వరమిస్తానంటే బుద్బుదప్రాయమైన సిరి సంపదల్ని కోరడం కల్పవిటపి (కల్పవృక్షం) దగ్గరకెళ్లి కుల్మాషములు (గుగ్గిళ్లు) కోరినట్లు. అటువంటి వెర్రివాడెవడైనా వుంటాడా? లోకాలన్నిటికీ దుర్లభుడవైన నీవు నా ఎదుట ప్రత్యక్షమై 'నిన్ను కరుణిస్తాను. వరమిస్తాను. కాపాడతాను. నీ కోరిక తీరేదుస్తాను' అన్నావు. అంతేచాలు. నీ అండనవున్న నాకింకా భయమెందుకు? అయితే, ఓ అద్భుతమైన కోరిక కోరతాను. నీ విప్పుడు నిల్చిన చోటనే నా పేరుతో యీ తీర్థ క్షేత్రముల మధ్యతలమున శాశ్వతంగా నిలిచిపో – సకల జనులకూ మోక్ష రాజ్యం ప్రసాదిస్తూ, ఇదే నా కోరిక. జగదేకహితమూ యిదే. ఇంతకు మించిన సిరిసంపదలు నాకు వద్దేవద్దు. ఓ దేవదేవా!" అన్నాడు.

అప్పుడా పరాత్పరుడు పుండరీకునితో "దుర్లభుడనైన నేను నీకు లభించడంతో నీవు అతి దుర్లభమైన కోరిక కోరావు. అయినా తప్పుతుందా? ఈ స్థలములో నన్ను సేవించిన వారందరూ చిర పుణ్యవంతులు, గళితభవులు (జారిన పునర్జన్మ కలవారు. అంటే పునర్జన్మంటూ లేనివారు – జన్మ రాహిత్యాన్ని పొందిన వారు) అవుతారు. ఈ క్షేత్రమూ, తీర్థమూ సమస్త భువనాలలోని యెల్ల పుణ్యస్థలముల కంటె ఎక్కువ ప్రాధాన్యత కలవవుతాయి. ఓ మౌనివర్యా! నేటినుంచీ నీ పేరుతో అలరారే యీ క్షేత్రమే నాకు తెల్లదీవి (శ్వేతద్వీపము – వైకుంఠము)" అని సకలదేవతా సమూహముతో కూడి అంతర్హితుడయ్యాడు.

"ఆ శుభదినాన్ని మునులందరూ వేనోళ్ల పొగడారట. జగములన్నీ ఆనందించాయట. అమర రమణులు (యక్ష, గంధర్వాది దేవతా స్త్రీలు) ఆట పాటలతో లోకాలను ఆనంద పరచారట. ఆ దినము ఎంతో సుదినమైనప్పటికీ దుర్దినమయిందట. ఎంచేతంటే, ఆ రోజంతా విబుధ తరు లతాంత వృష్టి (విబుధులంటే దేవతలు; విబుధతరువు అంటే

కల్పవృక్షము; లతాంతవృష్టి అంటే ఆ కల్పవృక్షం యొక్క పూలవాన) అదేపనిగా కురిసిందట. అందుకని ఆకాశమంతా చీకట్లు మూగాయట. మబ్బుకమ్మిన దినాన్ని (మేఘాలు ముసరిన దినాన్ని) దుర్దినము అనీ ముసరుప్రొద్దు అనీ అంటారు. అలా ఆ రోజు శుభదినమూ, దుర్దినమూకూడానట!" అని శివుడు నారదుడితో యింకా యిలా చెప్పాడు.

"శిఖిపింఛధారియై చేతులు రెండూ నడుముపై నిల్పి, హరి ఆ క్షేత్రమునందు తూర్పుకు తిరిగినవాడై, తీర్థమునందు పశ్చిమమునకు తిరిగినవాడై వున్న రెండు మూర్తులు దాల్చి యుంటాడు. ఫణిభర్త (నాగరాజు) ఆయన పాద పీఠమైవుంటాడు. రమ (లక్ష్మీదేవి) హ్రీ, శ్రీ అనే రెండు పేర్లతో చామరములతో శ్రీనాథునికి విసరుతూ రెండు ప్రక్కలా వుంటుంది. ఖగలోకనాథుడు (పక్షిరాజైన గరుత్మంతుడు) ఎదుటి భాగంలో వుంటాడు. కుడిప్రక్క సనకాదిమునులతో కలిసి తన తండ్రిని పొగడుతూ సేవించే తమ్మిచూలి (బ్రహ్మ) ఉంటాడు. నేను, రుద్రులు ఎడమప్రక్క వుంటాము. ఇంద్రుడు మొదలుగాగల విబుధవరులు (దేవతా శ్రేష్ఠులు) వెనుక భాగంలో ఉంటారు."

"అక్కడ యిరుగడలా (రెండు దిక్కులా) వున్న శ్రీకృష్ణుని దివ్యమూర్తుల మధ్యలో నివసించే మానవులెవరైనా మనుష్య రూపంలో తిరుగాడే యక్ష, కిన్నర, గరుడ, ఉరగాది (నాగులు వగైరా) ద్యుచరనాథులని (దేవతలని) భావించి మొక్కబడతారు." "పైపెచ్చు విష్ణుభక్తి యొక్క ప్రాశస్త్యం ఎలాంటిదంటే -

మ॥ అలసంబుల్ మునిరాట్ప్రణీతములు ప్రాయశ్చిత్తముల్ పాతకం
బుల నిర్జింపఁగ, విష్ణుభక్తియు తగున్‌బో దానికిం బూనఁ, బా
ముల పల్గాటులు చీరలం దుడిచినం బోనేర్చునే మాంత్రికా
కలితాహి ప్రతివీర మంత్రపదరేఖా శ్లాఘ చేతంబలెన్. (పాండురంగ మాహాత్మ్యం : 4-124)

పాతకంబులను (పాపములను) నిర్జించుటకు (ఓడించుటకు, నశింపజేయుటకు) మునిరాట్ ప్రణీతంబులు (గొప్ప మునులు ఏర్పరచిన) ప్రాయశ్చిత్తములు అలసంబులు (అసమర్థమైనవి); ఆ పాప వినాశనమునకు విష్ణుభక్తి పూనుటయే తగినట్టిది. ఎక్కడన్నా పాముల పల్గాటులు (పాములపళ్ల - కోరల - గాట్లు) చీరలతో తుడిచేస్తే పోతాయా? మాంత్రికుడు వేసే అహిప్రతివీర (పాము విషమునకు విరుగుడైన) మంత్రముయొక్క పదరేఖా (పద పంక్తుల యొక్క) శ్లాఘు చేతంబలెన్ - ఉచ్చారణ యొక్క గొప్పతనము చేత మాత్రమే) ఆ పల్గాటుల విష ప్రభావం నశిస్తుంది గానీ.

మన పూర్వీకులలో అనాదికాలంనుంచీ మాంత్రికుడు వేసే మంత్రం కారణంగా పాము విషం విరుగుడు సాధ్యమౌతుందనే విశ్వాసంవుంది. ఇది అశాస్త్రీయమైన విశ్వాసం. పాములంటే - ముఖ్యంగా త్రాచుపామంటే - మానవులకు విపరీతంగా భయముండడానికి కారణం వాటి కాటు ప్రాణాలు తీసేటంతటి ప్రమాదకారి (*fatal*) కనుక. పైపెచ్చు పాము విషం యొక్క ప్రాణాంతక స్వభావాన్ని గురించి చిన్నప్పటి నుంచీ పెద్దలు చెప్పేమాటలు, సాహిత్యం ద్వారా నేర్చుకున్న విషయాల కారణంగా మనలో ఆ భయం మరింతగా పెరుగుతుంది. కరచింది పాము అనగానే పై ప్రాణాలు పైనే ఎగిరిపోయేటంతగా ఆందోళన పడతారెవరైనా. ఆందోళన ఎక్కువైనప్పుడు మూత్రపిండాల (*kidneys*) ను ఆనుకొని ఉండే ఎడ్రినల్ (*Adrenal*) గ్రంథులు ఉత్పత్తిచేసే ఎడ్రినలిన్ (*Adrenaline*) లేక ఎపినెఫ్రిన్ (*Epinephrine*) అనే హార్మోను (*Hormone*) ఎక్కువగా ఉత్పత్తయి రక్తంలో కలిసి రక్తపోటు (*Blood Pressure*) ను అధికం చేస్తుంది. అంతేకాక, యీ హార్మోను గుండె కండరాలకు ఉత్ప్రేరకంగా పనిచేసి గుండె కొట్టుకొనే వేగాన్ని కూడా పెంచుతుంది. ఆ కారణంగా రక్తప్రవాహ వేగం పెరిగి అధిక రక్తపోటు వలన విషం అతివేగంగా శరీర భాగాలన్నిటికీ వ్యాపిస్తుంది. ఇది బాధితుడు త్వరగా మరణించడానికి దారితీస్తుంది.

అంతేకాక ఎక్కువగా ఆందోళన పడినవారు విషంలేని మట్టిపాములు కరచినా, చీకట్లో వెళ్తున్నప్పుడు ముళ్లుగీసుకున్నా పామే కరచిందనుకుని భయపడి ఆందోళన చెంది కేవలం అధిక రక్తపోటుతోనే మరణించిన సందర్భాలు కూడా వున్నాయి. (పాము కరచిన చోట

రెండు లేక మూడు గాట్లు మాత్రమే వుంటే అది విషసర్పమనీ, అంతకంటే ఎక్కువ గాట్లుంటే అది మామూలు పామేననీ గ్రహించాలి) పాములంటే ఏమాత్రం భయంలేని పొలం పనులు చేసుకునే గ్రామస్తులు విషపూరితమైన పాము కరచిన వెంటనే తగు విరుగుళ్లువాడి బ్రతికిన సందర్భాలూ వున్నాయి. అలాగే తమను విషపూరితమైన పాము కరచిందని తెలియనివారు ముందు ఏవో ముళ్లుగీసుకున్నాయని ధైర్యంగా వుండి, తర్వాత పాము కరచిన విషయాన్ని గ్రహించి తగు చికిత్సతో బ్రతికి బయటపడ్డ సందర్భాలూ వున్నాయి.

ఇక్కడ మనం గమనించాల్సిందేమంటే పాము విషానికి విరుగుడుగా యివ్వబడే ఔషధాల ప్రభావానికి తోడు, విషహరణానికి రోగి మానసికంగా ధైర్యంగా వుండడం కూడా అవసరం. అప్పుడే శరీరంలోని రోగనిరోధక శక్తులు విషంపై విజయవంతంగా పోరాడి గెలుస్తాయి. అందుకే ఈ విషనిరోధక శక్తి పాములను గురించి ఎక్కువగా తెలియని, పాముల్ని పెద్దగా చూసి ఎరగని పట్టణవాసులలో కంటే, నిత్యమూ పొలం పనులు చేసుకుంటూ పాములతో సహజీవనం చేసే జానపదులలో ఎక్కువగా వుంటుంది. సకాలంలో చికిత్సజరగడం, సరియైన చికిత్స జరగడం, రోగి మానసికంగా ధైర్యంగా వుండడం – యీ మూడూ పాము విషం విరుగుడుకు అత్యవసరం.

విషంపై పాము మంత్రం ప్రభావం ఏమీ వుండదు. పాము కరిస్తే మరణం తప్పదు అని చిన్నప్పటినుండీ మనస్సులో అభిప్రాయాన్నేర్పరచుకున్నట్లే, కొందరు 'పాము మంత్రం వేస్తే పామువిషం విరిగి ప్రాణాపాయం తప్పుతుంది' అని చిన్నతనంనుంచీ మూఢంగా విశ్వసిస్తారు. అలాంటి వారికి పాము కరవగానే మంత్రగాడు వేసే మంత్రం కారణంగా విపరీతమైన ఆత్మవిశ్వాసం కలిగి తాము బ్రతికి తీరుతామని ధైర్యంగా ఉంటారు. అలాంటి వారికి చేసే ఏ చికిత్సయినా సత్ఫలితాలనిస్తుంది. మంత్రగాడు తన దగ్గరకు వెళ్లగానే పాము కరచిన కాలుకో, చేయికో కాటుకు పై భాగంలో గట్టిగా తాడుతో కడతాడు. దీనివల్ల శరీరంలోని మిగతా భాగాలకు విషవ్యాప్తి కొంతమేరకు తగ్గుతుంది. తీర్థంపేరుతో ఏదో ద్రవాన్ని లోపలికిస్తాడు. గాయంపైన ఏవో పూస్తాడు. మంత్రంలో మహిమే వుంటే తాడుకట్టడం, తీర్థం యివ్వడం, పై పూత పూయడాలతో పనేముంది? కొంతమంది 'మాంత్రికుల'మని చెప్పుకు బ్రతికేవాళ్లు ఆ పై పూతలోనూ, తీర్థంలోనూ అనాదిగా పాము విషానికి విరుగుళ్లుగా ప్రసిద్ధిచెందిన ముక్కు తుమ్మిడి లేక దూదిపాలతీగ (*Dregea volubilis*) తెల్లపురుగుడు లేక తెల్లపులిచేరు (*Flueggea leucopyrus*) నల్లపురుగుడు (*Phyllanthus reticulatus*)ల యొక్క వ్రేళ్లు మరియు ఆకుల రసాన్ని వాడేవారు. నేటి 'మాంత్రికులు' మరేవైనా ఔషధ పదార్థాలు ఆ తీర్థంలోనూ, పైపూతలలోనూ కలుపుతున్నారేమో పరిశీలించాలి. అలా 'మాంత్రికులు' రోగి బ్రతికి బయటపడితే మంత్రమహిమ కారణంగానని ప్రచారం చేసుకుంటున్నా వాస్తవానికి అక్కడ జరిగేది మందుల ద్వారా జరిగే వైద్యచికిత్సే! అన్నింటికన్నా గొప్ప ప్రభావం కలిగించేమందు (మంత్రంపై విశ్వాసంకల రోగికి) 'మంత్రం వేశారు – యిక నాకేమీకాదు' అని విపరీతంగా పెరిగే ఆత్మవిశ్వాసమే! శతాబ్దాలనుంచీ పాముల పట్ల, పాముమంత్రం యొక్క 'గొప్పతనం' పట్ల మన మనస్సులలో నాటుకుపోయిన అంధవిశ్వాసాలు పాములగూర్చిన శాస్త్రీయ పరిజ్ఞానం వెలుగులోకి వస్తున్నప్పటికీ తగ్గకపోగా పెరుగుతూండడం శోచనీయం. మంత్రంలో మహిమే వుంటే పాముల నరసయ్యలూ, భూషయ్యలూ పాము కాటుతోనే ఎందుకు చనిపోతున్నారో అందరూ ఆలోచించాలి. సర్పాల నేస్తంగా పేరుగాంచిన మధ్యప్రదేశ్‌లోని భోపాల్ నివాసి ఇమాన్ ముక్తార్ అనే మంత్రగత్తె కూడా చివరికి ఓ పాముకాటుకే బలయ్యింది యిటీవలే !

ఈ సందర్భంగా పాముల్ని గురించీ, పాము కాటును గురించీ మరికొన్ని విషయాలు మనం ముచ్చటించుకోవాలి. మనదేశంలో వున్న 216 రకాల పాము జాతులలో 52 జాతులు మాత్రమే ఎంతో కొంత విషపూరితాలు. కేవలం త్రాచుపాము(*Cobra-Naja naja*), మహానాగు లేక రాచేనాగు (*King Cobra-Naja hanna*), కట్లపాము(*Common Krait-Bungarus caeruleus*), రక్తపింజెర (*Russell's Viper - Vipera russelli*), మరియు సముద్రపు పాము (*Sea Snake - Hydrophis caerulescens*) వగైరాలు మాత్రమే ప్రాణాంతకమైనవి. ఈ విషానికి కూడా యాంటీ స్నేక్‌వెనమ్ (*Anti Snake Venom*) లేక *Antivenin* చక్కటి విరుగుడుగా పనిచేస్తుంది. గుర్రాల శరీరంలోకి కొద్దికొద్దిగా పాము విషాన్ని ప్రవేశపెట్టి తరువాత యీ విషానికి అది తయారుచేసుకునే విరుగుడును గుర్రం రక్తం నుంచి సేకరించి దానినుండి యాంటి స్నేక్ వెనమ్ (*A.S.V*) తయారు చేస్తారు. *A.S.V.* మొదటిసారిగా క్రీ. శ. 1900 ప్రాంతాలలో బొంబాయిలోని హాఫ్‌కిన్ ఇన్‌స్టిట్యూట్‌లో తయారు చేశారు. త్రాచు, కట్లపాములు కరిస్తే న్యూరోటాక్సిన్ అనే విష పదార్థం శరీరమంతా వ్యాపించి నాడులు, కండరాలు పనిచేయకుండా పోయి, కళ్లు క్రమేపీ మూతపడి పోతూంటాయి. ఈ విషప్రభావంతో బాధితుడు కళ్లు తెరవలేడు. వాంతి అవుతుంది. కొద్దిసేపట్లో ఊపిరి ఆగిపోయి, గుండె, మెదడు, స్థంభించి మరణించడం జరుగుతుంది. అదే రక్తపింజెర కరిస్తే శరీరంలోని ఏ భాగం విషపూరితమైతే, ఆ శరీర భాగము, సమీపంలోని లింపు గ్రంథులు వాస్తాయి. గజ్జలలోనూ, చంకలలోనూ బిళ్లలు కట్టి విపరీతమైన నొప్పి పుడుతుంది. తరువాత రక్తస్రావం జరుగుతుంది. బాధితుడు కోమాలోకి వెళ్లాడంటే మెదడులో రక్తస్రావమైందని అర్థం చేసుకోవాలి. ఒక్కోసారి ఈ విషం మూత్రపిండాలను

దెబ్బతీసి బాధితుని మరణానికి దారితీస్తుంది.

మరో విషయం – విషపు పాముల కాట్లలో కూడా 30 నుంచి 50 శాతం వరకు విషం ఎక్కని ఉత్తుత్తి కాట్లే ఉంటాయి. అంటే విషపు పాము కరచినప్పుడు సైతం అన్ని సందర్భాలలో బాధితుని శరీరంలోనికి విషం ఎక్కదన్నమాట. పాము కరచినప్పుడు అది తన విషాన్ని బాధితుని శరీరంలోనికి ఎక్కించాలనుకుంటే ఎక్కిస్తుంది. వద్దనుకుంటే వట్టి పల్గాటులతోనే వదిలేస్తుంది. ఈ తరహా కాట్లను మనం శుష్క పల్గాటులు *(dry bites)* అనవచ్చు. విషసర్పం కరచి, అది విషాన్ని ఎక్కించని సందర్భాలలో మంత్రగాడి మంత్రాలు, లేక మంత్రించి వేసిన దుమ్ము లేక నీళ్లు పనిచేసినట్లు మనల్ని భ్రమింపజేసే అవకాశం వుంది. బాధితుడిని పాము కరచింది. కాని విషమేమీ ఎక్కలేదు. విషం ఎక్కితే 20 నిముషాల లోపే దాని ప్రభావం తీవ్రత చూపెడుతుంది. అప్పటి వరకు ఆందోళన పడిన బాధితుడు కాసేపటికి షాక్ నుండి తేరుకుంటాడు. అదంతా మంత్రగాడి మంత్ర ప్రభావం వలన అని అక్కడి వారంతా నమ్ముతారు. ఇదీ తంతు. శరీరంలోకి విషం ఎక్కడమంటూ జరిగితే యాంటీ స్నేక్ వెనమ్ *(A.S.V.)* వలన తప్పితే మరో రకంగా బాధితుడు రక్షించబడే అవకాశం లేదు. కొన్ని ఆకు పసరులు కొంత మేరకు ఉపశమనాన్ని కలిగించినా పూర్తి స్థాయిలో ప్రాణరక్షణకు అవి పనిచేయలేవు. నేను యిందాక పేర్కొన్న తెల్ల పురుగుడు, నల్ల పురుగుడు, ముక్కు తుమ్మిడి కాక తెల్ల ఈశ్వరి, నల్ల ఈశ్వరి వేళ్లు కూడా పాము విషానికి విరుగుడుగా పనిచేస్తాయంటారు. దీనికి తార్కాణంగా ఆ వేరు ముక్కనొకదానిని పట్టుకొని పాముకు దగ్గరగా తీసుకొస్తారు పాముల వాళ్లు. అప్పుడు పాము గిరుక్కున తన పడగను ఆ వేరుకు దూరంగా లాగేసుకుంటుంది – బహుశా ఆ వేరు వాసన దానికి గిట్టకనో ఏమో ! కొన్ని మొక్కల నుండి వచ్చే వాసనలు పాములకు రిపెలెంట్స్ *(repellents)* గా పనిచేస్తే చేయవచ్చు. కొన్ని జాతుల మొక్కలు దోమలను పారద్రోలే *Mosquito Repellents* గా పనిచేయడం మనమెరిగినదే కదా ! కానీ, ఆ విష ప్రభావాన్ని ఈ మూలికలు ఏ మేరకు నిరోధించగలవనేది ఇంకా శాస్త్రీయంగా ఋజువు కాలేదు. విషహరణంలో మంత్ర ప్రభావం వుంటుందనుకోవడం మాత్రం పూర్తిగా నిరాధారమైన, అశాస్త్రీయమైన అంధ విశ్వాసమే !

శాస్త్ర విజ్ఞానం యింతగా అభివృద్ధి చెందని ఆ కాలంలో రామకృష్ణ కవికి పాముల పల్గాటులలో శుష్క పల్గాటులూ వుంటాయనీ, పాము విషానికి మంత్రతంత్రాలేవీ విరుగుడుగా పనిచేయజాలవనీ తెలియక పోవడంలో విడ్డూరమేమీలేదు. ఎంచేతనంటే, కవి కాలం నాటికి పాము విషానికి మంత్రం విరుగుడు అనే అంధ విశ్వాసం ప్రజలలో మరింత ప్రబలంగా ఉండి వుంటుంది.

"భ్రూణహుండును (భ్రూణహత్య చేసినవాడు – కడుపులోని పిండమును చంపినవాడు), సురాపుండు (మద్యమును త్రాగేవాడు) బ్రహ్మఘాతి (బ్రాహ్మణుడిని చంపినవాడు), గురు పత్నితో సంబంధం పెట్టుకొన్నవాడు, బంగారము దొంగిలించినవాడు, గోవులను చంపి జీవించే కసాయివాడు, తల్లిదండ్రులకు ద్రోహం చేసినవాడు, శిశుహంత (శిశుహత్య చేసినవాడు), పరదార రతుడు (ఇతరుల భార్యలతో సంగమించేవాడు), ఇతరులను నిందించేవాడు, సర్వత్రభోక్త (అందరి పొత్తున భోజనం చేసేవాడు), సత్పురిత్యక్తుడు (మంచి వారిచే వెలి వేయబడినవాడు), సర్వాభిమర్శి (అందరినీ విమర్శించే వాడు) హైతుకుడు (హేతువాది), సర్వాపలాపకుడు (సర్వము దాచుకొని కూడబెట్టేవాడు), అశుచి (బాహ్య, అంతరంగ శౌచములు లేనివాడు), నిజధర్మ విద్వేషి (స్వమత ధర్మాలనే ద్వేషించేవాడు), నీచుడు, పాషండ షండ ప్రవణుడు (పాషండులు – అంటే నాస్తికులు, షండులు – అంటే నపుంసకులతో ఆసక్తిగా స్నేహం చేసేవాడు) స్వేచ్ఛావిహారి (నీతి, నియమాల్లేకుండా యధేచ్ఛగా సంచరించేవాడు), కృతమెరుగనివాడు (యితరులు తనకు చేసిన మంచిని గుర్తించనివాడు), సూనృతము లేనివాడు (సత్యము పాటించనివాడు), నమ్మిన చెడజూచువాడు (నమ్మి చేరిన వారిని నాశనం చేయజూచేవాడు) మొదలైన పాపకారులకు కూడా పౌండరీక తీర్థంలోని హరి మూర్తి యుగము (శ్రీ హరి విగ్రహముల ద్వయం) దివ్యపదము నిస్తుందట.

"పాండురంగ క్షేత్రంలోని దైవాన్ని విట్టల దేవుడనీ పిలుస్తారు. ఐదేళ్ల చిరుత ప్రాయపు కృష్ణుడు నడుముపై రెండు చేతులూ నిలిపి కొయ్యలా (ఎవ్వరికీ లొంగని మొండితనంతో) వుంటాడట ఆ విట్టలయ్య. ఒక్కోవేళలో మువ్వంక మురువుతో (మూడు వంకరలతో నిలబడి) వేణువు వాయిస్తాడట. ఒక్కోసారి తోటి బాలురతో కుబేరాక్ష క్రీడను (యక్షాక్ష క్రీడను) ఆడుతూ ఆనందిస్తాడట. ఇంకొక వేళలో భీమరథీనది లోతైన నీటిలో ప్రేమతో జలవిహారం చేస్తాడట. మరో సమయంలో తనవారైన నళిన సంభవుడు (బ్రహ్మ), పుండరీకుడు మొదలైన వారు సేవింపగా కొలువౌతాడట. ఒక్కో సందర్భంలో ఉరగ

రిపు (పాముల శత్రువైన గరుత్మంతుని) వాహనమెక్కి తిరువీధులలో వేడుకగా విహరిస్తాడట. ఎన్ని కల్పములు గడచిపోయినా ఏన ఏండ్ల (ఐదేళ్ల) ప్రాయము గలవాడిగానే వెలసివుంటాడట. కొయ్యయైన (మొండివాడైన) ఆ విట్లలయ్య.

"శ్రీరంగము, ద్వారక, గయ, కురుక్షేత్రము, నైమిశారణ్యము, అంజన శైలము, పుష్కర క్షేత్రము, హరిద్వారము, శ్రీ పురుషోత్తమ క్షేత్రము, అయోధ్య, సేతు (రామేశ్వరము), గంగాబ్ధి సంగారూఢస్థల (గంగ సాగరములో సంగమించే గొప్పదైన చోటు; గంగాసాగర్ అనే చోట గంగా నది బంగాళాఖాతంలో కలుస్తుంది) పౌండరీకము - ఈ క్షేత్రాలలో దైత్యారాతి (విష్ణువు) వెలసి వుంటాడు.

"పౌండరీక క్షేత్రంలో హరికి ఉత్తర భాగములో ఎవరైనా పాపంగానీ, పుణ్యంగానీ సురకాని (చిన్న కాని) యంతచేసినప్పటికీ అదే పరిణతమై (వృద్ధి పొంది) మేరు కుధర భారము చూపుతుందట (అంటే మేరు పర్వతమంత బరువైనదౌతుందట.) కాబట్టి పౌండరీక క్షేత్రంలో పుణ్యమే చేయాలి." అంటూ శివుడు యింకా నారదుడితో యిలా చెప్పాడు.

## కాకి, హంస, చిలుక, పాము, తేనెటీగ, ఆవు మోక్షమునందిన కథ

"ధ్వాంక్షము (మాంసమును కాంక్షించేది - కాకి) సమ్మార్జనము (సమ్మార్జని అంటే చీపురు. సమ్మార్జనము అంటే చీపురుతో ఊడవడం) వలన మోక్షం పొందింది.

మరాళము (హంస) ఉపలేపనము (పేడతో అలుకుట) వలన మోక్షమందింది.

రంగమున (రంగవల్లులు అంటే ముగ్గులు వేసిన కారణంగా) విచిత్ర శుకము (రంగురంగుల చిలుక) మోక్షం పొందింది.

దీపాంకుర ప్రకటనమున (చిరుదీపమును కూర్చుట కారణంగా) పాము మోక్షం పొంద గలిగింది. పదపద్మ తీర్థానుభవము (పద్మములవంటి పాదములపైని జలము ననుభవించుటచే) సరఘ (తేనెటీగ) మోక్షమందింది.

ఊధస్య పరిషేచనమున (పాల అభిషేకము వలన) ధేనువు (ఆవు) మోక్షం పొందింది" అని శివుడు నారదునితో చెప్పగా 'ఈ పశు, పక్షి, కీటకాదులకు మానవ జన్మ ఎలా సంప్రాప్తించిందో వివరంగా చెప్పుమ'ని శివుడిని వేడుకున్నాడు నారదుడు. (కీటకములు, పశు పక్ష్యాదులు వగైరా మోక్షమందాలంటే అవి ముందుగా మానవ జన్మ ఎత్తి తీరాలని మన ప్రాచీనుల విశ్వాసం)

అప్పుడు శివుడిలా వివరించాడు.

## ఆవు కథ (సుశీల కథ)

"ఓ కార్తీక పున్నమిరోజు విట్ఠలుడు భీమరథీ నది ఒడ్డున సుర లీలావతులు (దేవతా స్త్రీలు) నరాంగనలు (మానవ కాంతలు) చక్షుశ్శ్రోత్ర కన్యలు (నాగకన్యలు) మొదలైనవారితో క్రీడిస్తూ మురళీనాదం చేస్తూ వినోదంలో మునిగి తేలుతూండగా ఆ నాదము విని ఆ అడవిలోని ఒక ముని ఆశ్రమంలోని ఒక హోమధేనువు అధిక సంతోషము కలదియై పరవశమై, మేనుమరచి, అపరిమిత దుగ్ధములను (అంతులేని క్షీరమును) ధారలుగా కురిపించిందట. ఆ ధారలనుండి అపరిమితమైన నురుగు పుట్టిందట. అందలి ఓ ఫేన కణము (నురుగు కణము) గాలికి వచ్చి మురళీ కృష్ణుని మౌళిపై పడిందట. ఆ మాత్రానికే ఆ ధేనువు పరమాత్ముడికి క్షీరాభిషేకం చేసినట్టిదై, ముసలిది కావున దేహము చాలించి మరుజన్మలో ఒక వైష్ణవునకు కుమార్తెగా పుట్టిందట. ఆమెకు సుశీల అని పేరు పెట్టారట. యుక్తవయస్సులో ఆమెకు పెళ్లయింది. భర్తే దైవమని ఎంచే గొప్ప పతివ్రత ఆమె. అమాయకురాలు. భర్త ఎంతగా కొట్టినా, తిట్టినా, రట్టు పెట్టినా (రగడ చేసినా) తాళి

(సహించి) ప్రతిదినమూ ఆ భర్త యొక్క చరణ తామరసములను (పాద పద్మములను) పూజిస్తూ వుండేదట. కృతబుద్ధులు (బుద్ధిమంతులు), వృద్ధులు ఆమెను చూసి నేల (భూమి ఓర్పుగలవారిలో గొప్పది అని వాడుక) కూడా ఓరిమిలో యీమెకు సరిపోలదు అని పొగడేవారట.

తన భర్త అందవికారి, కోపిష్టి, అతిలోభి, అసూయాపరుడు, పెడబుద్ధి కలవాడు, మోసగాడు, చపలచిత్తుడు, చుట్టాలందరినీ ద్వేషించేవాడు, ఊరకే లెక్కలేనన్ని ఒట్లు పెట్టుకొనేవాడు, మూర్ఖుడు, తనను ఎప్పుడూ అనుమానించేవాడు, గర్వపోతు, కలహ భోజనుడు, కుతర్కంలో మేటి, ఉన్మాది అయినప్పటికీ కూడా అటువంటి మగనితో సర్దుకుపోతూ అతడెంత రాపాడుతున్నప్పటికీ సహించి, మనస్సులోనైనా సరే విసుక్కోకుండా, ధాత (నుదుటి రాత రాసిన బ్రహ్మ)ను తిట్టకుండా, తన తండ్రి సేతకు వగవక ('ఇలాంటివాడికిచ్చి చేశాడేమిటా నా తండ్రి' అని విచారించక) అత్యంత ఓర్పుతో దొడ్డగరితయై (ఉత్తమ యిల్లాలై) సంసారం చేస్తున్నదట ఆ సుశీల.

తీవ్రాంశుడి (సూర్యుడి) వేడికోర్చుకుని ఆతని భార్య ఛాయాదేవి మనుతున్నట్లే పతివ్రతయైన ఆమె, దుర్జాతుడైన (చెడ్డవాడైన) తన భర్త వెకిలి కోర్కెలన్నీ తీరుస్తూ వాడికి అనుకూలమైన పనులన్నీ చేస్తూ వాడిని నిత్యమూ సంతోష పెడుతూన్నదట.

ఇంట్లో పెత్తనమంతా అప్పట్లో భర్తలదే కదా! భార్యలు వారానికొకసారో, పదిరోజుల కొకసారో భర్తనుండి అవసరాలకు సరిపడా ధాన్యంతీసుకుని, వాటిని దంచి వండేవారట. భర్తలు యింటి అవసరాలపై సరైన అంచనా లేకుండా యిచ్చిన కొద్దిపాటి ధాన్యంతోనే అంతా జరుపుకు రావాలన్నట్లుండేవారేమో - భార్యలు మాత్రం "వండితే అందరూ తింటారుగా - నాకొక్కదానికే దానం యిస్తున్నట్లుగా భావిస్తారేం" అని బాధపడుతూ భర్తనుండి ఆ ధాన్యం తీసుకునేటప్పుడు మాత్రం పరాయి వాళ్లని అడుక్కుంటున్నట్లే బాధపడేవారట

ఆ భర్త గొణుగుతూ కొన్ని, కినుస్తూ కొన్ని, తుటారములాడి (దుర్భాషలాడి) కొన్ని, 'ఇది తప్పేది కాదు; యివ్వడం మానివేయలేము కదా!' అంటూ విధిలేక 'యిన్నాళ్లకు యిన్ని' అని కూటికి పిచ్చపాటి (తక్కువ కొలతలతో కొలిచి) తీసుకోమనగా అదే మహాప్రసాదమని భావించిన ఆ నళినాక్షి కళ్లలో ఆనందం ఉప్పొంగుతూన్న ముఖము కలదై భర్త యిచ్చిన ఆ ముక్కిపోయిన ధాన్యాన్నే తీసుకునేదట పాపం!

ఆమె ఒకవైపు యింటి అవసరాలన్నీ చూసుకుంటూ, ఉత్తమ గృహిణిలా యింటిని చక్కదిద్దుకుంటూ ఆ యింటికి గృహలక్ష్మిలా వెలుగొందుతూ వుంటే, అతడు మాత్రం ప్రస్తుతమని (అప్పటికప్పుడు జరిపించాల్సిన ఒక కార్యానికి అవసరమని) చెప్పి రాజులనుంచి దానముగా స్వీకరించి తెచ్చిన వస్తువులను కోమటింట్లో అమ్మించి సొమ్ము చేసుకుంటాడట. కనీసం ధాన్యపు పాతరపై (మెత్తుతూ అలకబడిన) పూతలు పెచ్చులూడిపోతూంటే వాటిని ఊడవడు - పస్తులైనా ఉంటాడట గానీ. ఎవరైనా చుట్టాలు యింటికివస్తే 'రెండవ సూతకము' అని చెప్పి వెంటనే పంపించేస్తాడట. అంటే ఎందునిమిత్తమైనా సరే పాతరను కదిలించడం మాత్రం అతనికి యిష్టముండేది కాదు. (ఇంట్లో రెండవ ప్రసవంకానీ, గర్భస్రావంగానీ అయితే పాటించే మైలను 'రెండవ సూతకము' అంటారు)

'మును ప్రతిశ్రుతము చేసిన పైడి రాకున్నను ముచ్చిచ్చునను వ్రేగు వచ్చుదనుక'

ఒకప్పుడు ప్రతిశ్రుతము చేసిన ధనము (సకాలంలో) రాకుంటే అది వచ్చేదాకా ముచ్చిచ్చులో వేగిపోతాడట. ప్రతిశ్రుతము అంటే రెండర్థాలున్నాయి. అందులో 'అప్పిచ్చి వ్రాయించుకునే ఋణపత్రము (ప్రామిసరీ నోటు)లో ఋణగ్రహీత ఆ ఋణాన్ని తిరిగి యింతకాలానికి చెల్లిస్తానని చేసే వాగ్దానము' అనే అర్థం ఒకటి.

యజ్ఞంలో అధ్వర్యుడనే యాజకుడు ఆగ్నీధ్రునితో 'ఓ శ్రావయ' అంటాడు దానికి సమాధానంగా ఆగ్నీధ్రుడు, "అస్తి శ్రౌషట్" అనే యజ్ఞసూత్రాన్ని పలుకుతాడు దీనిని కూడా 'ప్రతిశ్రుతము' అంటారు.

అంటే తాను బాకీగా యిచ్చిన సొమ్ము పుచ్చుకున్న వాడినుండి సకాలంలో రాకపోతే, అవి వసూలయ్యేదాకా

"ముచ్చిచ్చున" (త్రేతాగ్నులలో) వేగుతాడట. అంటే కోపంతో అగ్గీబుగ్గీ అవుతాడన్నమాట.

యజ్ఞ నిర్వహణలో గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము అనే మూడు అగ్నులు రగుల్పజేస్తారు. వీటిని త్రేతాగ్నులంటారు.

'శాకాయ లవణాలయ వా' అంటూ (కూరగాయ అయినా సరే చివరికి ఉప్పయినా సరే దేనికో ఒకదానికి పనికొస్తుంది లెమ్మంటూ) అందరి దగ్గరా దేబిరిస్తూ, ఎంత విలువ తక్కువ వస్తువయినా సరే ఉచితంగా అడిగి తెచ్చుకునేవాడట.

'ధూళిఃపరగృహాదపి' (ఇతరుల యింటినుండి దుమ్మయినా తీసుకురావాలి) అనే ఆశతో తపన పడిపోతూ పెనగునట (బాధపడేవాడట). 'ఈగకు కాటు', 'పాముకు బలి' కూడా యివ్వనట్టి పిసినిగొట్టట ఆమె భర్త. అంతటి నికృష్టమైన వ్యక్తితో సంసారంచేస్తూ ఆ మహాపతివ్రత తన భర్త ప్రవర్తనకు మనస్సులోనే బాధపడుతూండట.

ఆమె తన భర్తనే దేవునిగా తలుస్తూ, అతడిని ఉపాసించడంతోనే తనకు యిహపరాలు సిద్ధిస్తాయని నమ్మేదట.

ఇలా ఉండగా ఒకరోజు తన భర్త ప్రక్క ఊరికి వెళ్లిన సమయంలో కపట బ్రహ్మచారియైన వామనుడి మేని కాంతిని త్రోసిరాజనే దేహకాంతి కల ఓ వడుగు (బ్రహ్మచారి) ఆమె యింటికి వచ్చాడట - భుక్త్యాపేక్షతో (తినడానికేమైనా కావాలనే కోరికతో)

ఆమె లోనింటి గూటిలోనుండి తొంగిచూస్తూ 'ఎక్కడి నుండి వచ్చారు మీరు? ఏం పనిమీద? అన్నం కావాలని వచ్చినట్లుంది' అనగా అతడు ఔనన్నాడు. అప్పుడామె 'అట్లయితే మొగసాల (యింటి తలవాకిట నుండే పంచ)లో ఉండండి. ఆయన ఊళ్లో లేరు. యామార్ధమునకే అన్న సంస్కారం పూర్తిచేస్తాను (యామము అంటే జాము. జాము అంటే ఏడున్నర గడియల కాలము. గడియ అంటే 24 నిముషములు. దీనినిబట్టి జాము అంటే 180 నిముషములు లేక మూడు గంటలు. యామార్ధము అంటే గంటన్నర) మీరు వేగిరముగా ఆరగింతురుగాని' అన్నదట. "ఓ మగువా! నేను ఎన్నాళ్లనుండో ఆహారమేమీ తీసుకొనకుండా ఉన్న కారణంగా వేడి అన్నం వండేదాకా ఆగలేను. మాడుచెక్కలైనా, పులిసిన అన్నమైనా పోకయంతైనా (పోక కాయంత స్వల్పమైనా సరే) యిచ్చి నాక్షుద్బాధ తీర్చు. చద్ది అన్నం తినడం కారణంగా వచ్చేపాపం ఏదైనా ఉంటే అది నా తపశ్శక్తితో పోగొట్టుకుంటాను" అన్నాడట.

అయితే బ్రాహ్మణుడు చద్ది అన్నం తినకూడదనీ, బ్రాహ్మణుడి కెవరూ చద్ది అన్నం వడ్డించకూడదనీ నియమం.

ఆ కారణంగా ఆమె "నీకు చలిది అన్నం నేనెట్లా వడ్డిస్తాను? క్షణంలో వంట పూర్తి చేస్తాను. భుజించి నీవు కోరిన చోటికి వెళ్లువుగాని" అన్నదట.

దానికా వటువు "ఓ పూబోడీ! త్రోవ గమించుచోట (ప్రయాణ సమయాలలో) అవరవర్ణ (శూద్రవర్ణ) ఆచారములు పాటించినా బ్రాహ్మ్యము చెడదు. ఈ తడవు (ఆలశ్యము) దేనికి? ఒకింత మెతుకులు, యిన్ని నీళ్లు యిచ్చి నా ప్రాణరక్షణ చెయ్యి" అన్నాడట. ఇంకా -

"తృప్తినొందిన అతిథి వాఙ్మనః కాయకర్మల (మనోవాక్కాయ కర్మల) ప్రవర్తనము కారణంగా గృహమేధికి సంభవించిన పాపమును అతనికి సంహరించి శాశ్వత సుఖాలు ప్రసాదిస్తాడు. 'అభ్యాగతః స్వయంవిష్ణు' (అతిథి స్వయంగా విష్ణువే) అనే ఆర్యోక్తి నీవు వినలేదా?

"ఓ అతివా! నీ మీద ఒట్టు. తీర్థయాత్రల యందుగల మక్కువతో వడిగావచ్చి త్రోవలో ఆకటివేళకు ఆహారం దొరకక అన్నార్థినై నీ గడపత్రొక్కాను. ఎవ్వడైనా జఠరవహ్నికి (ఆకటిచిచ్చుకు) ఏనాడో ఒకనాడు ఎరియక (మండక) తప్పదుకదా!

"నాతో యాత్రకు వచ్చిన వారంతా బక్కచిక్కిన బదుగు వదుగులే ఐనప్పటికీ వేగము చెదక (తగ్గక) పూనికతో త్వరితముగా వెళ్లిపోయారు. 'కూటిబీద తోడు తప్పె'నన్నట్లు నేను మాత్రం క్షుద్బాధకు తట్టుకొనలేక పోయానుగనుక ఆకలి తీర్చుకొనదానికి ఆగడం వలన వెనకబద్దాను. మిగిలిన వారందరూ పౌండరీక క్షేత్రంలో పుండరీకుడిని దర్శించుకొనదానికి వెళ్లారు.

"ఓ తరుణీ! 'క్షుధాతురాణాం న రుచి ర్న చ కాల' (ఆకటి బాధకు తట్టుకోలేని వాడికి రుచిగల భోజనమూ, సకాల భోజనమూ ఎలా సమకూరుతాయి?) అనే లోకోక్తి నిజంకాదా? తెరువరులకు పాయసంబు తిరిసినగలదే? (బాటసారులకు పాయసం అదుక్కున్నా దొరుకుతుందా?) ఏదో దొరికిన దానితో తృప్తిపడి, సరిపెట్టుకోవాలిగానీ.

"ఓ అమ్మా! నీ యింటిలో ఎంత భాండ శుద్ధి! ఎటువంటి గృహశుద్ధి! ఎలాంటి చిత్తశుద్ధి! ఈ యింట్లో చద్దికూడు దొరికినా అదే పురోడాశము (ఆర్యులు యజ్ఞాలలో అర్పించి భుజించే ఓ ఆహార పదార్థము)తో సరిసాటి అవుతుంది.

"దమము, శమము, తేజస్సు వగైరాలతో వెలుగొందిన గాధి సుతుడు (విశ్వామిత్రుడు) మొదలైన వారు అనుచిత శతములు (వందలకొలది తగనిపనులు) చేసైనాసరే తమ తనువులు రక్షించుకోలేదా? తన ప్రాణం నిలుపు కోవడం కంటే ధర్మమేముంది?

(విశ్వామిత్రుడు ఓ సారి ప్రాణం నిలుపుకొనదానికి కుక్కమాంసం తిన్నాడట)

"ఇందాక నేను చద్ది అన్నం పెట్టమన్నప్పుడు 'చద్ది అన్నం నీకు నేనెట్లా పెడతాను?' అన్నావుగానీ 'ఇంట్లో చద్దిఅన్నం లేదు' అనలేదు నీవు. కాబట్టి యింట్లో అశనశేష స్థితికి (ఆహారము మిగిలి వున్నది అనదానికి) సందేహమేలేదు. అది సరిపోతుందా – చాలదా అనే శంక నీకు వద్దు. ఎంతైనా సరిపెట్టుకుంటాను.

"ఓ సతీ! ఆత్మస్తుతి (తనను తాను పొగడుకొనడం) అత్యంత గర్హితమని (మిక్కిలి నిందించబడినదని) నా పెంపు (గొప్పతనము) తెలపడంలేదు. నేను మనోగతిన (నా మనస్సులో) తృప్తిగా చూచినట్లయితే, భువన త్రితయము (మూదు భువనాలూ) పరమతృప్తితో తిలకించును సుమా!" అని అంతటితో ఆగకుండా, 'పెట్టకపోతుందా' అని ఆకలితో తొట్టిగిల బదుచూ (తత్తర పదుతూ) దురదుర (త్వరత్వరగా) వెళ్లి నట్టింట్లో కూర్చున్నాదట. 'ఎట్లాగు?' అని అనలేకపోయిందట ఆ మృగేక్షణ (జింక కళ్లవంటి కన్నులు గలది.) భయంతో ఆమె యిలా అనుకుందట మనస్సులో –

"తెరువరినీ (బాటసారినీ), పసిబిద్దనూ, అర్థినీ (సహాయం కోరివచ్చినవానినీ) ఆకలితో అలమటించే వానినీ పరిహరించుట (ఏదో విధంగా వదలించుకొనదానికి లేదు పొమ్మనడం) కీడు. పర్యుషితము (చద్ది అన్నము)ను చూస్తూ చూస్తూ వడ్డించలేను. తగని పని చేస్తే పాపం రాదూ? పోనీ మినుకు (చిన్నమెత్తు బంగారు నాణెం) ఒక్కటిచ్చి పొమ్మంటే? ప్రయాణం చేసిచేసి అలసిన శరీరం కలవాడితదు. అంతతేలిగ్గా వెళతాదా? ఆ వున్న చలిది అన్నం కూడా చాలుతుందో – చాలదో? నా భర్తకు ఊరికెళుతూంటే మూటకట్టి యిచ్చింది పోను కొంచెమేగా మిగిలింది? చాలకపోతే బాగుండదు. ఇతదా బాలుదు. కొసరి కొసరి గొంతెమ్మ కోరికలు కోరితే? అతడికి భోజనం పెట్టకపోవదమూ బాగుండదు. అలాగని పెట్టదమూ బాగుండదు. ఈరు తీస్తే పేను రాకుండా వుంటుందా? తైర్థికులు (తీర్థయాత్రికులు) పెళుచులు (కఠినాత్ములు) అంటారు."

"వంట అయ్యేంత వరకూ యీ వదుగు ఆగేట్లు లేదు. బండిమీద పోతున్నాదు (అంటే ఎక్కడలేని తొందరపదుతున్నాదు అని). ఇది నాకు పెద్ద ధాటి (దాడి) లాగానే అనిపిస్తున్నది. అయితే ఏమిలే! చూద్దాం ముందేం జరుగుతుందో. ముందు జరుగనున్న దానికి యిప్పట్నుంచే గడకట్టదమెందుకు? ఎలా జరుగుతుందో అలా జరుగనియ్య"మని-

సుశీల ఆ వడువును రారయ్యా! అని - శుద్ధిమచ్చరణుని - కాళ్లు కడుగుకొన్న వానిని; గోత్రదేవతా పుత్రుని - బ్రాహ్మణపుత్రుని, విస్మేరాగ్ని ప్రభుని - వెలుగుతున్న అగ్నివంటి తేజస్సు కలవానిని, కూర్చుండజేసి, అతని ప్రోల (ఎదుట) చేపట్టు గావించి (చేతితో పట్టుచేసి అలికి), శుద్ధిచేసి, నీటి సమృద్ధి చేత బాగుగా పండిన పాత రాజనపు (పాత బియ్యపు) దివ్యాన్నమును కుండ ఊడ్చిపెట్టిందట - ఒకింత వార్ధారాధౌతమును (నీటిధారచే కడుగ బడినదైన) రంభాపలాశము (రంభ అంటే అరటి చెట్టు. పలాశము అంటే ఆకుపచ్చనిది. అంటే ఆకుపచ్చని అరటి ఆకు)లో

దధ్యోదనము (దధి + ఓదనము - పెరుగన్నము) ను సవ్యంజనముగా (పచ్చళ్లతో కూడా) ఒసగి (పెట్టి) 'ఆరగించండి. క్షమించండి', అని (ఈ అన్నదాన కారణంగా) పరిపూర్ణమైన సంతోషంతో నిండిన మనస్సుకలదై, తన భావ సంపదవలె జల పరిపూర్ణమైన ఒక గిండి (చిన్నమూతి చెంబు)ని ఆతని ప్రక్కన పెట్టి వెళ్లిందట.

నీటిని చేతిలో ఆపోశనము చేసి (భోజనమునకు ముందు పుడిసిట జలముంచుకొని మంత్రపూర్వకంగా త్రాగడాన్ని ఆపోశనమంటారు), ధ్యానముచేసి, ఆ చంద్రానన (చందునివంటి ముఖముగల సుశీల) వద్ద తగు అనుమతి తీసుకుని, ఆ పర్యుషితము (చద్ది అన్నమును) తిన్నాడట ఆ వటువు.

ఆమె యిలా తిరిగి చూచేటప్పటికి, ఆ త్రిమ్మరీడు (స్వేచ్ఛావర్తి) ఒక్క సిక్థము (మెతుకు) కూడా మిగల్చ కుండా మ్రింగేసి మెత్తగా ఆమెను పిలిచి, ఆ శరదిందుబింబముఖి (శరత్కాలపు చంద్ర బింబంవలె వెలుగొందుతున్న ముఖం కలది)యైన సుశీలతో యిలా అన్నాడట.

"ఓ శోభనాంగీ (చక్కని శరీరము కలదానా!) ఆ అన్నపు కుండను మరొకసారి పరిశీలించి చూడు. అందులో భిస్సటము (కుండకు అంటుకున్న మాడు అన్నము) కాని లేక యిందాక నీవు వడ్డించినపుడు నీ చేతికి చిక్కక తప్పి పోయినది కాని ఉండకపోదు; ఆ కుండలో వున్నదంతా ఊడ్చి తీసుకురా. అలఘు జఠరజాతవేదము (గొప్పదైన జఠరాగ్ని. జఠరము అంటే కడుపు. జాతవేదము అంటే అగ్ని) ఈ స్వల్ప భుక్తిన (కొద్ది తిండి కారణంగా) హెచ్చింది."

అది విని సుశీల సంభ్రమము, తొట్రుపాటు కలిగినదై గతరాత్రి తనకోసమని వండి దించుకొని భర్త ఊరికి వెళుతున్నాడనే విచారంతో సంతాపించి తాను భుజించనిదీ, మట్టి పాత్రలో నిండుగా అట్టకట్టినదైనట్టి పాడి అన్నాన్ని గంజి మూకుట్లో యిచ్చిందట.

ఆకలితో కాఁగుచున్న (తపిస్తూన్న) ఆవులకు యెడపేర్పులో (దాలిలో) మేతవేస్తే ఎంత శీఘ్రంగా తింటాయో. అలా ఆ యివుర్వంటకమును (ఇగిరి పోయిన పాడి అన్నాన్ని) అతడు గబగబా తినేశాడట!

అదికూడా తినేసి యింకా తెమ్మని గజిబిజి చేశాడట ఆ వటువు. దానికి ఆ సతి ఎంతమాత్రం కలత చెందక వికసించిన ముఖంతో హస్తాంబుజములు (పద్మములవంటి హస్తములు) మొగిడించి (జోడించి) ఆ భూసురసూతి (బ్రాహ్మణపుత్రుని)తో యిలా అన్నదట.

"ఓ అధ్వశమారూఢా! (కాలినడకచే అలసినవాడా!) విను. ఇకపై అన్నమేమీలేదు. నీకు వడ్డించినది కూడా చలిది అన్నం. నవ్యములైనవీ (కొత్తగా వండినవీ) సాధుగుప్తములు (జాగ్రతగా భద్రపరచబడినవీ) అయిన కజాయంబులు (పిండివంటలు) కావాలంటే యింట్లో ఎన్నైనా వున్నాయి. అవి తెమ్మంటే తెస్తాను. కాకపోతే లేచి వార్చుకోండి (సంధ్య వార్చుకొనడం) అతివేగంగా కూడు, కూర వండి వడ్డిస్తాను. భోజనానికి అంగీకరించండి"

అప్పుడా వటువు "ఓ వనితా! తైలపరిపక్వములు (పిండివంటలు) ఎన్నైనాసరే తీసుకురా. కాదనను. లేవడి (స్వల్పము) అయిన భుక్తిని (ఆహారమును) కొని (తీసుకొని) లేవడానికి ఆకలి కొంచెంకూడా దిగంబడదు (తగ్గటంలేదు)

నీవు భోజనం వండి వడ్డించే వరకూ నేను ఆగే అవకాశం లేదు. ధావనమున (పరుగున) పోయి నా వారిని కలుసుకొనవలసి యున్నది" అన్నాడు.

అప్పుడా హరిణనయన నిండైన హృదయంతో ఆ తరువాత భర్త వచ్చి తనపై కోపించి తనను శిక్షించినా పరవాలేదని (ఆ శిక్షకు సిద్ధపడిన మనస్సుతో) అప్పుడే వండిన వాటివలె కమ్మగా, ఘాటుగా వున్న చవులొదవే (నోరూరించే) సమత్స్యండికాపూప పంక్తులను (మత్స్యండిక అంటే కండ చక్కెర. కండ చక్కెరపాకంతో తయారైన అపూపముల - అప్పముల - పంక్తులను - సమూహములను) వడ్డించిందట.

ఈ అప్పాలన్నీ తన భర్త లోగడ లెక్కపెట్టి భద్రపరచాడట. అయినా ఆ పిండివంటలన్నీ నిరవశేషంగా (ఒక్కటికూడా మిగల్చకుండా) తినివేశాడా వటువు. అయినా అతడి వాలకం చూస్తుంటే యింకా కడుపు నిండినట్లు లేదు. ఇంకా ఏమైనా వడ్డిస్తుందేమోనని సిగ్గు నటిస్తూ చూస్తున్నట్లుగా వున్నాడతడు.

అప్పుడామె తన మనస్సులో యిలా వితర్కించుకున్నది.

"ఇసుమంత (ఇసుక రేణువంత) కూడా లేని యీ పసి బాలుడు, యీ విధంగా ఎసరి (విజృంభించి) బహుభక్ష్యరాశులను మెసగుట (తినుట)లో విసువడు (విసుగు చెందడు). అయినా ప్రతుష్టి (పూర్తి సంతృప్తి)ని పొందడుగదా! ఈ నిసువు (ఈ బిడ్డడు) మాయపు బిడ్డ. మనిషైతే కాదు. దేవతా నాయకుడో (ఇంద్రుడో) చతుర్ముఖుడో (బ్రహ్మో) లేక నా భవబంధాల్ని త్రెంచడానికేతెంచిన నారాయణ మూర్తేనో కొంచెం కూడా అంతుపట్టడం లేదు. బుభుక్షమై (తినాలనే ఆశతో) విస్తరిలో నుంచి చేయి తొరగడు (తీయడు). అప్పములు చూడబోతే సమస్తమూ చెల్లిపోయాయి." అని నివ్వెరపోతూ ఆ బ్రాహ్మణపత్ని మనస్సులో 'అగ్ని వలన సంపద కలుగుతుంది' అని తలపోసి హుతవహుడిని (అగ్నిని) ప్రార్థించిందట. ఆ హుతాశనుడి అనుగ్రహంతో అన్ని రకముల ఖాద్యపదార్థములు (భోజన పదార్థములు) సమకూరాయట.

సీ॥ ఒకకొన్ని వడియంబు లొకకొన్ని వరుగులు నొకకొన్ని తెలఁగుల యొలుపుఁ బప్పు
లొకకొన్ని ద్రబ్బెడ లొకకొన్ని తాలింపు లొకకొన్ని విధముల యొట్టిచారు
లొకకొన్ని కలకల్పు లొకకొన్ని బజ్జులు నొకకొన్ని రీతుల యూర్పువగలు
నొకకొన్ని సిగరులు నొకకొన్ని యంబళ్లు నొకకొన్ని వహులపూపోత్కరములు

తే॥ వివిధ ఫలకంద మూలంబు లవియుఁగొన్ని
యూరుఁ బిండులు నొకకొన్ని యొక్క కొన్ని
యూరుఁగాయలుఁ బచ్చళ్లు నొక్కకొన్ని
పెరుగుపాల్ తేనె నేఁతులు పెచ్చు పెరుగ (పాండురంగ మాహాత్మ్యం : 4-184)

ఈ చక్కటి పద్యంలో ఆ రోజులలో ప్రజలు తినే ఆహార పదార్థాలు పేర్కొన్నాడు కవి.

వడియాలు; వరుగులు (ఎండవేసిన కాయదినుసులు. పచ్చి కాయగూరలు దొరికినప్పుడు కూరలు వాటితో చేస్తారు. పచ్చి కాయగూరలు లభించనప్పుడు యిలా కోసి ఎండబెట్టిన వరుగులతో కూరలు, పులుసులు వండుతారు); ఒలుపు పప్పు (తోలూడ్చిన చాయపప్పు దినుసుతో చేయబడిన ముద్దపప్పు); ద్రబ్బెడలు (ఇదొక రకమైన భక్ష్యవిశేషము); తాలింపులు (తిరుగమోతలు వేసి వండే వేపుడు కూరలు); ఒట్టి చారులు (మిరియాలు, శొంఠి, కారం వగైరాలు ఎక్కువగా

వేసి కాచిన ఘాటైన, కారమైన చారులు); కలగల్పులు (రకరకముల కూరగాయ ముక్కల్ని కలిపి వండిన కూరలు - *Mixed vegetable curries*); బజ్జీలు (రోట్లో వేసి నూరే రోటి పచ్చళ్లలోనివే అయిన కొన్ని పలుచని జారు పచ్చళ్లు); ఊర్పువగలు (ముక్కల నుండి సెగలు వెదలించే పిండి మిరియములు, ఆవపెట్టిన పచ్చళ్లు వగైరాలు); శిగరులు (శిఖరిణి లేక సిగరి అంటే కొన్ని దినుసులు వేసి చేసే పక్వము చేసిన మజ్జిగ. పెద్దఉల్లిపాయ ముక్కలు, మెంతులు, జీలకర్ర, కొత్తిమీర వగైరా చేర్చి పుల్లటి మజ్జిగతో చేసే మెంతిమజ్జిగ లేక మజ్జిగచారు వగైరాలు సిగరుల క్రిందకే వస్తాయి.) అంబలి (నూకలు కాని, బియ్యంకాని ఉడికించి, మెతుకుమెత్తనైన తరువాత జొన్న, రాగి లేక సజ్జ పిండి వేసి బాగా కలియదిప్పి ఉప్పు, మజ్జిగతోగానీ, పాలు, పంచదారతోగానీ కలుపుకొని తాగేది. ఇది పేదవాని ఆహారం. అందుచేతనే 'అంబలి తాగేవాడికి మీసాలు ఎత్తిపట్టుకునే వాడొకడా?' 'అంబలి త్రాగేవేళ అమృతం అబ్బినట్లు' అనే సామెతలు పుట్టాయి.) ఒకకొన్ని వహుల (కొన్ని విధములైన) పూపోత్కరములు (పిండివంటల సమూహములు); వివిధ రకముల పండ్లు, కంద మూలములు (దుంపలు); ఊరుపిండులు (పెసర పిండి, శనగపిండి వగైరాలతో పట్టే ఆవకాయ పచ్చళ్లు వగైరా. కొందరు మామిడికాయ ఆవకాయ పచ్చడిలో కూడా ఊరుపిండిగా పెసరపిండి లేదా శనగపిండి కలిపి పడతారు); 'ఊరగాయ' అంటే నిల్వ పచ్చడి కాగా పచ్చడి అంటే తాజాగా ఒకటి లేక రెండు రోజుల వాడకానికి తయారుచేసే రోటి పచ్చడి. ఇంకా పెరుగు, పాలు, తేనె, నెయ్యి వగైరాలన్నీ సమకూర్చబడ్డాయట.

ఆ సుశీల యొక్క మహానసము (వంటిల్లు)లో అప్పుడు పుట్టుకొస్తున్న వివిధ ఆహార పదార్థముల సుగంధములు అనంతములై పైకి ఆకాశము వైపుకు వెళ్లాయట. అమరుల (దేవతల) తరువైనట్టి కల్పవృక్షము యొక్క ప్రసూనతతులు (పూల సమూహములు) సుశీలపై దేవతలు కురిపించగా వాటి సౌరభము క్రిందికి భూమి దిక్కుగా వ్యాపించిందట. ఈ రెండు పరిమళములూ దారిలో కలసికొన్నచోట ఉపగూహనము (ఆలింగన సౌఖ్యము) ననుభవిస్తున్నాయట.

ఆ సుశీల యొక్క నిత్యములైన సత్యము, శాంతి, త్యాగబుద్ధి, ధైర్యము, పరిశుద్ధి అనువానికి ఎంతగానో మురిసిపోయిన ఆ పరంధాముడైన శౌరి మాయావటు రూపం తొరగి (తీసివేసి) తన నిజరూపంలో ప్రత్యక్షమయ్యాడట. అప్పుడా శౌరి సుశీలతో యిలా అన్నాడట "పూర్వ జన్మలో నీవు ఒక ముని యొక్క వేలిమిజన్నెవై (హోమ ధేనువువై) నా మధుర వేణుగానంతో పరవశించి తెల్లని నీ పాలను వరదగా స్రవించావు. ఆ పాల నురుగు గాలికి తేలివచ్చి నా మౌళిపై పడింది. దానివలన నీవు నాకు క్షీరాభిషేకం చేసినట్లయింది. అంచేత యీ జన్మలో మహాపతివ్రతవై పుట్టి నాకు ఆతిథ్యమిచ్చి నీ జన్మను చరితార్థం చేసుకుని ముక్తురాలవయ్యావు."

"ఇక నీ భర్త పూర్వజన్మ చరిత్రము చెబుతాను విను. వసుధానువు అనే రాజు పట్టణంలో అకృత సత్క్రియుడు అనే విప్రుడుండేవాడు. అతడు పుట్టువడుగు (ఘోటక బ్రహ్మచారి). అతను ధనవంతుడే అయినా పెండ్లి చేసుకోకుండా భర్త చనిపోయిన విధవల మూతులు నాకేవాడు; కులవంతుడయినప్పటికీ పెద్దలమాట పెడచెవిని బెట్టి పాషండులు (నాస్తికులు), షండుల (నపుంసకులు) తో సంబంధాలు పెట్టుకొనేవాడు; మతిమంతుడే అయినప్పటికీ ఆమ్నాయములు (వేదములు) చెవినబెట్టకుండా అసభ్యపు మాటలాడడానికి అలవాటుపడ్డాడు. స్థితిమంతుడైనప్పటికీ తన భాగ్యాన్ని అనుభవించక, యింటింటి కూళ్లుమరిగి, అధ్మలను (కలనారిని) సేవిస్తూ త్రిమ్మరినాడు (తిరిగినాడు). బ్రాహ్మణులసొత్తు, దేవుని సొత్తు (దేవస్థానముల సంపద) అపహరింపజూసేవాడు. (వరిధాన్యపు) కుప్పకు చిచ్చిడి (చిచ్చుపెట్టి) దాన్నుంచి లభించే పేలాలు తినడానికి ప్రయత్నిస్తాడు (అంటే తనకు వచ్చేది స్వల్ప లాభమైనా అందుకోసం యితరులకు గొప్ప నష్టాన్ని కలిగించడానికైనా వెనుదీయడు). గ్రహణకాలమునందు జలముల మునుగడు. (గ్రహణ స్నానములు చేయడు). ఆ బ్రాహ్మణ బ్రువుడు

(పేరుకు మాత్రమే బ్రాహ్మణుడైన వాడు - కులం పేరు చెప్పుకుని బ్రతికే బ్రాహ్మణుడు.) - ఆ అకృత సత్క్రియుడు సెబ్ర చెంచేదము (సెబ్ర లేక సెబ్బర అంటే చెడ్డ అని అర్థం. చెంచేదము అంటే దేగ) అంటే క్రూరమైన డేగలా యితరుల్ని వేటాడి నిర్దయగా కొట్టుకుతినేవాడు."

"ఒకానొక సందర్భంలో అతడు ఒక వెలయాలి మోజులోపడి భూమండలానికి కుండలము వంటి నగ అనదగిన ప్రధాన నగరమైన పౌండరీకములో కొంతకాలం వుండాల్సి వచ్చింది. అప్పుడు అక్కడ జరిగిన ఓ మహోత్సవంలో అనుకోని విధంగా ధూపమిచ్చిన అనంతరం నాకు చేయబడే నైవేద్య సమర్పణను దూరాన్నుంచి ఒక్కక్షణం వాడు చూడడం జరిగింది. అనంతరం తన మార్గాన తాను వృద్ధుడయ్యేవరకూ యథేచ్ఛగా జీవించి మరణానంతరం ఆ కొద్ది పుణ్యం ఫలితంగా ఉత్తమ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి, సకల విద్యలూ నేర్చి, నిండు ప్రాయంలో నిన్ను భార్యగా చేపట్టాడు."

"ఆ కొద్దిపాటి పుణ్యకార్యం యితడి పాపవహ్ని (పాపమనే అగ్ని) పాలిట సలిలమై (నీరై) కాపాడింది కానీ, లేకుంటే యితడు ప్రాగ్జని (పూర్వజన్మ) లో ఒనరించిన పాపాలకు నిష్కృతి ఉందా? అలా అతని పాపాలన్నీ దహించుకుపోయిన యవసరాశి (ఎండుగడ్డి కుప్ప)గా అయినా, బ్రాహ్మణ కుమారులలో తాను శ్రేష్ఠునిగా వెలుగొందినా యితడు కట్టిడి (కఠినాత్ముడు)గా మారడానికి కారణం చెబుతా విను."

"పరిశుద్ధ స్వభావం కల ఓ సుశీలా! నీ మనశ్శుద్ధిని పరీక్షించడం కోసం నేనే నీ భర్తకు లోభ, క్రోధములనూ, మనఃక్షోభనూ కలిగించి అతడిని బాలిశుడు (క్రూరుడు)గా మార్చాను. లోకంలో నీ వంటి పతిదేవతలు (పతివ్రతలు) భర్త కొట్టినా, తిట్టినా, నిర్దయతో ఏ బాధలు పెట్టినా, మనస్సులో వేరేవిధంగా తలచక పతిని దైవంగానే భావిస్తారు."

"నేటినుంచి నీ భర్త క్రూర, లోభ స్వభావములను విడిచిపెట్టి నీయందు ప్రేమానురాగాలు కలిగి నీకు అనుకూలంగా మెలిగి నీయందు పరమభాగవతులైన ఐదుగురు కొడుకుల్ని కంటాడు. నీ యింట్లో పైడి (బంగారం) త్రవ్వి తండమవుతుంది (త్రవ్వి తండమవడమంటే కుప్పలు తిప్పలుగా - అపరిమితంగా అవడం), మేలికూడు (మంచి ఆహారము)నకూ, పాడికీ నీ యింట్లో కొదువ వుండదు. నీవు అన్ని నోములూ నోచి, నిండు నూరేళ్లు బ్రతికి నీ భర్తతో సహా పరమపదాన్ని పొందుతావు. ఓ మహిళా! మురమర్దనుడు (ముర అనే రాక్షసుని చంపినవాడు - మురారి - కృష్ణుడు) నన్ను కరుణించి, గౌరవించాడు కదా అని నేటినుంచి అహంకరించ వద్దు. అలా అయితే కీడు మూడుతుంది. నీవు యిదివరకటి కంటే మహితమైన వర్తన కలిగి మసలుకో."

"ఓ విష్ణుపదవలగ్నా! (విష్ణుపదము అంటే ఆకాశము. అవలగ్నము అంటే నడుము. ఆకాశములా కనుపించనంతటి సూక్ష్మమైన నడుము కలదానా!) తృష్ణారహితులూ (కోరికలు లేనివారూ), నా పాదసేవలో నిష్ణాతులూ, నిత్యసత్యనిరతులూ అయిన శ్రీవైష్ణవులను నన్నేనన్నట్లుగా భావించి, గౌరవించి, సేవించు" అని అంతర్థానమయ్యాడు.

నాటి నుండి సుశీల భర్త మోహము, లోభము, క్రోధము వగైరా అంతర్గత శత్రువులను అణచి, మనస్సులో వినయము, వివేకము, సౌశీల్యము వగైరా ఉత్తమ గుణాలను అలవరచుకున్నాడట.

కII కోపంబు నాఁగి మిక్కిలి, పాపమునకు లోఁగి బుద్ధి పశ్చాత్తాపా
టోప శిఖిఁ గ్రాఁగి కరుణా, ద్వీపవతీ లహరిఁ దోఁగి విప్రుఁడు మఱియున్.

**(పాండురంగ మాహాత్మ్యం : 4-209)**

కోపమును ఆఁగి (అణచుకొని), పాపమునకు లోఁగి (వెనుకంజ వేసి), పశ్చాత్తాపమనే ఆటోప (గొప్ప ఆర్భాటముగల)

శిఖిలో (అగ్నిలో) గ్రాఁగి (పరితప్తుడై) కరుణా ద్వీపవతీ లహరిలో (ద్వీపవతి అంటే నది. దయయనే నదీ ప్రవాహములో) తోఁగి (మునిగి)న ఆవిప్రుడు -

కాళ్లీడ్చుకుంటూ ఆ యింటికీ యీ యింటికీ వెళ్లి దేబిరించే వాడల్లా వైరాగ్యంలో నిష్ఠ కలిగినవాడైనాడట. కయ్యాల క్రచ్చ (జగడాలమారి) యై ఎప్పుడూ యితరులపై మండిపడుతూ కాలుద్రువ్వేవాడల్లా అతి శాంత మహితుడు (గొప్ప శాంతగుణము కలవాడు) గా మారాడట. ఎప్పుడూ ఎంగిలి చేత్తో కాకిని కూడా కొట్టనివాడల్లా (అతి పిసినారి వాడల్లా) సతతాన్నదాన ప్రశస్తుడయ్యాడట (నిరంతరం అన్నదానం చేసేవాడిగా ప్రసిద్ధి పొందాడట). బ్రహ్మకల్పము దాకా బ్రతకాలని ఆశపడేవాడల్లా, విశ్వమంతా అశాశ్వతమని తలస్తున్నాడట. పద్మభవునైనా (బ్రహ్మనైనా) లెక్కచేయకుండా చులకనగా మాట్లాడే వాడల్లా అతి వినమ్రుడయ్యాడట. ఒరుల లచ్చికి (ఇతరుల సంపదకు) ముచ్చిరి (ఓర్చుకోలేక బాధపడి) ఉడుక్కుని అసూయపడే వాడల్లా విష్ణువిచ్చిన వరం కారణంగా సర్వసముడయ్యాడట (స్వపర భేదం పాటించని వేదాంతి అయ్యాడట). తన యింటిలోని పెద్దపెద్ద కాగులలో ఎంతో కాలం నుంచి మూల్గుతూన్న పెద్దపెద్ద కడ్డీలరూపంలోనున్న పాతబంగారాన్నంతా తీసి యాచకులకు దానంగా యిచ్చాడట; విష్ణు దేవాలయాలు నిర్మించి, అందు విగ్రహ ప్రతిష్ఠలకు కొంత బంగారాన్నిచ్చాడట. ఇంకా వివిధములైన సత్కార్యములు జరుపడానికి తన భార్య చేతికి కావలసినంత బంగారాన్ని యిచ్చేవాడట ఆ బ్రాహ్మణుడు.

ఆ ఆలుమగలు విష్ణుపదసేవా పరాయణులై నిశ్శ్రేయసపదమైన (మోక్ష ప్రదమైన) ఆ పౌండరీక క్షేత్రంలో రకరకాలైన వ్రతములను ఎంతో దీక్షతో చేస్తూ వుండగా -

## కాకి కథ

మ॥ యమరాడ్దూతశిఖావతంసము చిరప్రాణంబు దూరప్రియా
గమ శంసిస్ఫుట కాకలీకలన మేకప్రక్రియాపాలి వీ
క్షము శీతర్తుబలీయ మొక్క బలిభుగ్రాజంబు రాజిల్లు శ్రీ
రమణాగార పురోధరోర్ధ్వ చలపత్ర స్థూలశాఖాశిఖిన్. (పాండురంగ మాహాత్మ్యం : 4-213)

కాకిని సంస్కృతంలో కరటము ('క' అని పలికేది); అరిష్టము (రోగములచే హింసించబడనిది. అంచేత త్వరగా మరణములేనిది); బలిపుష్టము (బలిచే పోషించబడేది అంటే పిండాలు తిని బ్రతికేది); సకృత్ప్రజము (ఒక్క గ్రుడ్డే పెట్టేది; ఒక్కసారే పిల్లను కనేది); ధ్వాంక్షము (మాంసాన్ని కాంక్షించేది); ఆత్మఘోషము ('కా - కా' అని తన పేరునే ఘోషపెట్టేది); పరభృతము (తనకు పుట్టనివైనట్టి కోకిల పిల్లల పోషణ భారం మోసేది); బలి భుక్కు (బలిని భోంచేసేది. పితరులను పూజించి, అర్పించే పిండాన్ని కూడా 'బలి' అంటారు); చిరజీవి (చాల కాలం జీవించేది); ఏకదృష్టి (ఒకకంటి చూపేకలది) మౌకళి (మూకలుడంటే యముడు. 'మౌకళి' అంటే యమసంబంధమైనది); పికవర్ధన (కోకిల పిల్లల్ని పెంచేది. సోమరిపోతు కోకిల తనగుడ్లను తెలివిగా కాకి గూళ్లలో పెడుతుంది. కాకి అమాయకంగా ఆ గుడ్లను తన గుడ్లతో పాటే పొదిగి పిల్లల్ని చేసి పెంచుతుంది. అలా కొన్నాళ్లు సాకబడిన అనంతరం ఆ కాకుల్తో యిమడలేక కోకిల పిల్ల తన తల్లి దగ్గరకు వెళ్లిపోతుంది); వాయసము (వయస్సు కలిగినది); ఈ పేర్లన్నీ దాదాపు కాకి స్వరూప, స్వభావాల్ని మనకు తెలుపుతున్నాయి.

అయితే రామకృష్ణకవి పై పద్యంలో కాకినెలా చమత్కారంగా వర్ణిస్తున్నాడో చూడండి -

యమరాడ్దూతశిఖా వతంసము - యమరాట్ (యమరాజు యొక్క) దూత శిఖా వతంసము (దూతలలో తలమానికమైనది); - కాకి పేరు అరిష్టము. అది రోగములతో హింసించబడనిదీ, త్వరగా మరణించనిదీ కాబట్టి దానికాపేరు వచ్చింది. కాని, ప్రజలలో ఎందుకోగానీ, ప్రొద్దున్నే లేవగానే కాకిముఖం చూడడం అరిష్టమనే భావం ఏర్పడింది. 'మౌకళి' అనే పేరునుబట్టి కూడా అది 'యమసంబంధి' గా పేరుపొందింది. అందుకే కవి దానిని యమధర్మరాజు దూతలలో

అగ్రగణ్యమైనది అంటున్నాడు. చిరప్రాణంబు - చాలకాలం జీవించేది.

దూరప్రియాగమశంసిస్ఫుట కాకలీ కలనము - దూరప్రియ - దూరానవున్న యిష్టమైనవారి (బంధువుల) ఆగమ (ఆగమనాన్ని) శంసి (తెలుపుతూ, కోరుతూ) స్ఫుట (స్పష్టమైన) కాకలీ (సన్ననైన మధురధ్వని) కలనము (చేసేది)

ఏక ప్రక్రియా పాతి వీక్షము - ఒంటికంటి చూపుకలది.

శీతర్తు బలీయము - శీతాకాలంలో బలీయమైనది. మిగిన పక్షులన్నిటికీ చలికాలం మరణ సదృశం. చలికి పక్షులు విపరీతంగా మరణిస్తాయి. కాకి మాత్రం తన ప్రత్యేక శరీర నిర్మాణం కారణంగానో ఏమో - చలిని తట్టుకుని నిలబడగలుగుతుంది. అందుకే అది చిరజీవి అయిందేమో!

బలి భుగ్రాజంబు - బలిభుక్కులకు (కాకులకు) రాజము (రాజు)

శ్రీరమణాగార : శ్రీరమణుడు అంటే లక్ష్మీదేవి భర్త అయిన విష్ణువు అగారము (యిల్లు) - ఆలయము యొక్క

పురోధరోత్థ : పురోధరము - ఎదుటనున్న స్థలము (ప్రాంగణము)లో పుట్టిన; చలపత్రము (ఎప్పుడూ కదలుతూండే ఆకులు కలది - రావి చెట్టు) యొక్క స్థూల (లావైన) శాఖాశిఖిన్ (కొమ్మచివర) రాజిల్లుతూన్నదట (ప్రకాశిస్తూన్నదట)

కాకి (*House crow - Corvus splendens splendens*) సంఘ బలిమికల సాముదాయిక పక్షి. ఉలూకము (గుడ్లగూబ) కాకికి శత్రువు. అందుకే దానిని 'వాయసారాతి' అని అంటారు. ఎందుకో తెలియదు కానీ యీ రెంటికీ ఎడతెగని పోరు. 'పంచతంత్రము' లోని 'కాకోలూకీయము' అనే కథాక్రమం యీ వైరుధ్యం ఆధారంగా వచ్చిందే. వాడుకలో కాకితో కబురంపడం అంటారు కానీ మన ప్రాచీన సాహిత్యంలో కూడా మేఘాలు, హంసలు, చిలుకలు, పావురాలలా కాకులెక్కడా దౌత్యం చేసినట్లు వర్ణించబడలేదు. బంధువుల రాకను సూచిస్తూ కాకులు అరుస్తాయనేది అశాస్త్రీయమైన విశ్వాసం. 'కాకి కూసినప్పుడు లేవడం' అనే వాడుక పల్లెల్లో వుంది. అదికూడా కోడిలా వేకువనే లేచే పక్షి. అది అత్యంత అందవికారమైన పక్షి కనుకనే 'కాకిపిల్ల కాకికి ముద్దు', 'కాకిముక్కుకు దొండపండు' అనే సామెతలు పుట్టుకొచ్చాయి. 'ఎద్దుపుండు కాకికేం ముద్దు?' అనడాన్నిబట్టి 'ధ్వాంక్షము' అనే దాని పేరు సార్ధకమైందనిపిస్తుంది. కాకి దాని ఆహారం కానివాటిని కూడా తస్కరించి తన్నుకుపోతుంది. సబ్బు బిళ్లలు, ఎండుమిరపకాయలు, చిన్న గరిటెలు దాని ఆహారం కాకున్నా, కొంటెగా తస్కరించడం దానినైజం. 'కాకి ముక్కర తన్నుకుపోయి డొంక పాల్జేస్తుంది గానీ తినగలదా?' అని అందుకే అన్నారు. కాకులలోనే మరింత పెద్ద పరిమాణంలో మెరిసే నల్లని రంగుతో వుండే కాకిని మాలకాకి లేక బొంత కాకి (Raven) అంటారు. దేవస్థానాల ఆవరణలలో ఎక్కువగా పెంచబడే చలపత్ర వృక్షం (రావి చెట్టు) ను హిందీలో 'పీపల్' అంటారు. దీని శాస్త్రీయ నామం Ficus religiosa. మత సంబంధమైన ప్రాధాన్యత కలది కనుక యీ వృక్షానికి ఆ శాస్త్రీయ నామం వచ్చింది. గౌతముడు నేటి బీహార్‌లోని బోధ్‌గయ లోని ఓ రావిచెట్టు క్రింద చేసిన తపస్సులోనే బుద్ధుడ (enlightened) య్యాడంటారు. అందుకే అక్కడి ఆ రావిచెట్టును బోధి వృక్షమంటారు.

**శా॥ తాతల్తండ్రులు మామలల్లురును ముత్తాతల్ సహాయుల్ సహ**
**శ్రోతల్ భ్రాతలు సేవకుల్ హితులు మిత్రుల్ పుత్త్రు లోలిం దివా**
**భీతాభీతములై తనుం గొలువఁగాఁ బెన్మూఁకలై వాయస**
**వ్రాత శ్రేష్ఠము గ్రాలు రేలు పగలున్ బ్రాంతాగమాంతంబులన్. (పాండురంగ మాహాత్మ్యం : 4-214)**

సహశ్రోతలు అంటే సహాధ్యాయులు; భ్రాతలు - సోదరులు; 'ఓలిన్' అంటే క్రమముగా; దివాభీతములు - పగటిని చూచి దడిచేవి - గుడ్లగూబలు; దివాభీత - అభీతములై - గుడ్లగూబలకు భయపడనివై; పెన్మూకలై - పెద్ద మూకలుగా (గుంపులుగా) కూడినవై; తనుం గొలువగా - తనను సేవిస్తూండగా; వాయస వ్రాత శ్రేష్ఠము - వాయసము - కాకి; వ్రాతము - సమూహము; కాకుల గుంపులో ఉత్తమమైనట్టిది; ప్రాంతాగమాంతంబులన్ - సమీపములో వున్న చెట్ల చివర (కొనకొమ్మ)లలో; రాత్రింబవళ్లు; క్రాలున్ - ప్రకాశించును.

ఆ కాకి ఒకరోజు విట్ఠల గృహాంగణ భూమిలో (విట్ఠలుని ఆలయ ప్రాంగణములోని) బలిపీఠవర్తులౌ (బలిపీఠముపైన వున్నట్టి) మెతుకులు మేయడానికి కన్నేసి అమేయగతితో (వేగముగా) ఎగురుకుంటూ వచ్చిందట. ఆయతమైన (వెడల్పైన) దాని యొక్క ఛదముల (రెక్కల) వలన పుట్టిన భూరిమారుతవశంబున (పెద్దగాలి వలన) ఆ చోటున వున్న దుమ్ము, ధూళి తుడిచిపెట్టుకు పోయిందట. దీంతో ఆ కాకి గుడిని ఊడ్చినట్టిదై (గుడి ఊడిస్తే ఎంతటి ఫలం లభిస్తుందో) అంతటి అగణ్య పుణ్యములు (లెక్కింపరాని పుణ్యములు) అభ్యుదితములయ్యాయట (కలిగాయట).

ఈ విధముగా అతర్కితోపపన్నమైన (అనుకొనకుండా జరిగినట్టిదైన)పాండురంగ విట్ఠలుని దేవాలయాన్ని సమ్మార్జనము (ఊడ్చుట) చేసిన పుణ్యము లభించినదైన ఆ కాకి లోకోత్తరమైనదయిందట.

# హంస కథ

ఒక కలహంసము (ధూమ్రవర్ణపు ముక్కు, కాళ్లు, రెక్కలు కలిగిన హంస – రాజహంస) యదుకుల హంసము (యాదవ కుల శ్రేష్ఠుడైన కృష్ణుని) యొక్క దేవాలయములో కుసుమాయుధుని (మన్మథుని) కీర్తిలతా (కీర్తి అనే లతకు పూచిన) గుచ్ఛము కైవడి (పుష్పగుచ్ఛము వలెనూ), జలరుహ సంభవుని (పద్మసంభవుడైన బ్రహ్మ యొక్క) మరాళ సంకాశమై (హంస వాసహనమును పోలినదై) సంచరిస్తున్నదట.

ఆ దివ్య క్షేత్రములోని సరస్సులలో పాండురంగని దేవేరియైన లక్ష్మీదేవి నిత్యమూ జలక్రీడలాడుతుండట. ఆ సమయంలో అందలి అలలు ఆమె స్తనములపై తపతపా చరుస్తున్నట్లు కొట్టుకుని, ఆ తాకిడికి ఆమె రొమ్ములపై ద్రవరూపమైన కుంకుమ, గోరోచనా పంకము (ముద్దగానున్న గోరోజనము)లను కలిపి పెట్టుకున్న మకరికా పత్రములు నీటకరగి ఆ నీరు కళంకితమైందట. అట్టి సుగంధ ద్రవ్యములతో మలినములైనట్టి నీటితో కూడిన ఆ క్షేత్రపు కాసారముల (సరస్సుల) సంతతిలో (సమూహములలో) కుతుకము యింకక (ఉత్సాహము తగ్గక) ఆ నీడభవము (నీడము అంటే పక్షి గూడు; నీడభవము అన్నా నీడోద్భవము అన్నా గూటిలో పుట్టినది – పక్షి) క్రీడ సలుపుతున్నదట. (మరి హంస పక్షే అయినా గూడు కట్టుకొనదని ప్రతీతి. అది తెలిసే చమత్కృతికోసం హంసను పక్షి అనే సామాన్యార్థంలో నీడభవము అని వాడి వుంటాడు కవి.)

స్త్రీలు ప్రాచీనకాలంలో లత్తుక (లక్క), గోరోజనము, కుంకుమ ద్రవము, కస్తూరి వగైరా ద్రవ్యములతో తమ చెక్కిళ్లు, స్తనములు వగైరాలపై మకర (మొసలి) రూపంలో రేఖలు చిత్రించుకునేవారట. వీటిని 'మకరికములు', 'మకరికా పత్రములు' లేక 'పత్రాంకములు' అంటారు.

సీ॥ మొన రెండు గాఁగఁ ద్రెవ్విన విద్రుమ ద్రుకందము నేలు ముక్కునఁ దడవి తడవి
మొగివిచ్చు పసిఁడి గేదఁగి ఱేకు గమి మించు విశ్లథచ్ఛదముల విద్రిచి విద్రిచి
నగు మొగంబుల దాసనపుఁ గ్రొవ్విరుల నవ్వు చిగురాకు నడుగులఁ జిమ్మి చిమ్మి
నిద్దపుఁ బందు వెన్నెల గుత్తి కడకొత్తి మలయు మైమొంపులఁ గలఁచి కలఁచి

తే॥ శార్ఙ్గిసౌధ ప్రఘణ కాసారసార
సారసామోద మేదుర వారిఁదేలి
వచ్చియా యంచ గుడిలోనఁ జొచ్చెనొక్క
నాఁడు పవలింటి బీఁటెండ వేఁడిఁ దలఁకి. (పాండురంగ మాహాత్మ్యం : 4-220)

శార్ఙ్గము అనే పేరుగల విల్లును ధరించే వాడు కనుక విష్ణువును 'శార్ఙ్గి' అంటారు. (విష్ణువు శంఖము పేరు పాంచజన్యము, చక్రము పేరు సుదర్శనము; కత్తి పేరు నందకము).

ఆ విష్ణువు యొక్క సౌధము (భవనము) యొక్క ప్రఘాణ (ముంగిట) కాసారము (సరస్సు) యొక్క సార (శ్రేష్ఠమైన) సారస (పద్మముల యొక్క) ఆమోద (పరిమళములతో) మేదుర (కూడినట్టి) వారిన్ (నీటిలో) ఆ రాజహంస మొన రెండుగా త్రెవ్విన (తెగిన) విద్రుమ ద్రుకందము (విద్రుమము - పగడము; ద్రు - చెట్టు; కందము - ముడి లేక బుడిపె; విద్రుమ ద్రుకందము - పగడపు చెట్టుపైని ముడి లేక బుడిపె)ను ఏలిన (పరిపాలించిన - అంటే అలాంటి విద్రుమము కంటె ఎంతో మిన్నయైన) ముక్కున (తన ముక్కుతో) తడవి, తడవి (వెదకి, వెదకి - అన్వేషించి) -

కందము అంటే దుంప అనే అర్థం కూడా వుంది; కానీ యిక్కడ ముడి (*Knot - Gnarl*) లేక బుడిపె (*swelling*) అనేదే సమంజసం. జలచర పక్షులు ముక్కు రెండుగా చీలునట్లుగా ఎడంచేసి, చేపలు, క్రిములు వగైరాల కోసం నీటిలోకి జొనిపి వెదకులాడతాయి. ఆ హంస యొక్క చీలిన ముక్కు రెండుగా చీలిన పగడపు చెట్టు యొక్క బుడిపె (అంటే పగడము) లా వున్నదట. పగడాలు (ప్రవాళములు) మన కవులు వర్ణించిన విధంగా వృక్షాల నుండి లభించేవి కాదు. అవి కోరల్స్ (*corals*) అనబడే సముద్రపు జంతుజాలం సామూహికంగా తయారు చేసుకునే కాల్కేరియస్ కంకాళాలు (*Calcareous Skeletons*). ఇక్కడ కవి పగడాలను పగడపు చెట్టు యొక్క కొమ్మల పైని ముడి లేక బుడిపెలుగా వర్ణించాడు.

మొగివిచ్చు (బాగుగా విచ్చిన - మొత్తముగా విప్పారిన) పసిడి గేదఁగి రేకుల (బంగారు వర్ణపు మొగలి రేకుల) గమి (సమూహమును) మించు (అతిశయించు) తన విశ్లథ (వదలుగా వదలబడిన) ఛదముల (రెక్కలతో) విద్రిచి, విద్రిచి (విదలించి, విదలించి) -

నగు మొగంబుల (నవ్వు మొగముల) దాసనపు (మందార లేక జపా పుష్పపు - *Hibiscus rosa sinensis*) క్రొవ్విరుల (తాజా పూవులను) నవ్వు (పరిహసించేటంతటి అందమైన) చిగురాకు నడుగుల (చిగురాకుల వంటి ఎర్రని పాదములతో) చిమ్మి, చిమ్మి -

నిద్దంపు (నున్నని) పండు వెన్నెలగుత్తి (వెన్నెల గుత్తి అంటే చంద్రుడు. పండు వెన్నెల గుత్తి అంటే పున్నమినాటి నిండు జాబిలిని) కదకొత్తి (కదకు - ప్రక్కకు; ఒత్తి - నెట్టివేసి) మలయు (విజృంభించే) మై (మేనును - అంటే ఆ హంస మేను పున్నమి చంద్రుని యొక్క తెల్లదనాన్ని కూడా మించినట్టిదన్నమాట!) ముంపుల (మునుకలతో) కలచి, కలచి (చలింపజేసి)-

ఒకరోజు పవలింటి (పవలు అంటే పగటి యొక్క) బీఱెండ (బీఱము అంటే పెద్దది. బీఱెండ అంటే మధ్యాహ్న కాలపు మిక్కుటపుటెండ. దీనినే తెల్ల ఎండ అనీ, తెల్ల అగ్గి అనీ అంటారు) యొక్క వేడిమికి తాళలేక, తలఁకి (భయపడి) వచ్చి ఆ హంస గుడిలోన చొచ్చెన్ (గుడిలో ప్రవేశించింది)

అది తన దేహాన్ని అక్కడ విదలించిందట. దాని పక్షముల (రెక్కల) సలిల విప్రుషములతో (నీటి తుంపరలతో) పెద్ద చొదుకు (తడి, చెమ్మ, చల్లదనము) కలిగించే గాడ్పులు (గాలులు) ఉద్భవించి రజోవికారములను (దుమ్ము వ్యాప్తిని) దూరం చేశాయట.

ఆ సలిల ఖగమునకు (ఆ జలచర పక్షియైన హంసకు) ఏతదాచరణమున (ఈ విధంగా నీటితుంపర పడేట్లు రెక్కల్ని విదలించిన మాత్రాననే) ఆ కంబుపాణి (శంఖమును చేతిలో కలవాడైన విష్ణువు యొక్క) గర్భ గేహము (గర్భ గృహము)ను ఉపలేప సంస్కారము (అలుకుట అనే సంస్కారము) చేసినంత పుణ్యఫలం సంప్రాప్తించిందట. 'హంస' (*Cygnus olor*) గురించి మరిన్ని శాస్త్రీయమైన వివరాలు యిదే గ్రంథంలో వేరొక చోట పొందుపరచాను.

# చిలుక కథ

కు॥ శుకమొకటి చంచుజిత కిం
శుకమై హరిహయ శరాస సురుచిర వపురం
శుకమై కుసుమాకర కిం
శుక మానందమున నందసుతు గుడిఁ బెరుగున్. (పాండురంగ మాహాత్మ్యం : 4-223)

శుకము అంటే చిలుక. కింశుకము అంటే మోదుగ పూవు. దాని రేకులు ఆకారంలోనూ, ఎఱ్ఱదనంలోనూ చిలుక ముక్కును పోలి వుండడం కారణంగా 'కిం శుకాః?' (చిలుకా ఏమి?) అని దానికి పేరు పచ్చింది. 'చంచుజిత కింశుకమై' అంటే తన ముక్కుతో, కింశుకమును జయించినదైనట్టి అంటే సౌందర్యంలో కింశుక పుష్పాన్ని తలదన్నినట్టిదైన ముక్కుకలిగినదై; హరిహయుదు అంటే ఇంద్రుడు; శరాసము - ధనుస్సు; సురుచిర - బాగుగా ఒప్పిదమైన; వపుః - శరీరము యొక్క; అంశుకమై - కాంతులు కలదియై (ఇంద్రధనుస్సు రంగులన్నీ ఆ చిలుక శరీరంలో వున్నాయన్న మాట) కుసుమాకర కింశుకమై - కుసుమాకరము అంటే వసంత ఋతువు; 'కుసుమాకర కింశుకము' అంటే వసంత ఋతువునకు మోదుగ పువ్వై (వసంత ఋతువులో మోదుగపూలు ప్రధానమైన ఆకర్షణ); ఆనందముతో; నంద సుతుగుడిన్ - నందుని కుమారుడైన పాండురంగని ఆలయంలో పెరుగుతున్నదట.

మోదుగ చెట్టు (*Butea monosperma*) ను పలాశ వృక్షమనీ, యాజ్ఞిక వృక్షమనీ కూడా పిలుస్తారు. గరుత్మంతుడు స్వర్గాన్నుంచి అమృతాన్ని తీసుకువచ్చేవేళ ఆ అమృతం ఒలికి ఒకచుక్క నేలపై పడి దాన్నుంచి మోదుగ చెట్టు మొలుచుకొచ్చిందని విశ్వాసం. ఎండు మోదుగ మండలు యజ్ఞంలో సమిధలుగా వాడతారు. అంచేత యీ వృక్షాన్ని 'యాజ్ఞిక' వృక్షమంటారు. పలాశ వృక్షపు పూలు ఎఱ్ఱగా, ఆకర్షణగా వున్నప్పటికీ ఏ మాత్రం సువాసనగా వుండవు. అంచేత యీ పుష్పాన్ని 'కిం సుఖ?' ('సుఖమేమి వుంది?') అని కూడా కొందరంటారు. ఈ వృక్షపు పూలు సౌరభం లేకున్నా వాటి ఆకర్షణీయమైన రంగు కారణంగా వాటి రసాన్ని నీటిలో కలిపి హోలీ వంటి పండుగలలో చల్లుకుంటారు. ఎన్నో వైద్యపరమైన ప్రయోజనాలున్న యీ వృక్షాన్ని గురించి గుర్తుంచుకొనదగిన విశేషమింకొకటి వుంది. భారతదేశ చరిత్రను మలుపుతిప్పి, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలో తిష్టవేయడానికి దారితీసిన క్రీ॥శ॥ 1757 నాటి ప్లాసీయుద్ధం 'పలాశ' వృక్షముల తోపులోనే జరిగింది. దీనిలో క్లైవ్ సైన్యాలు, బెంగాలు నవాబ్ సురాజ్ ఉద్దౌలా సైన్యాల్ని ఓడించాయి. మోదుగతోపును 'పలాశి' అంటారు. అదే జన వ్యవహారంలో క్రమంగా 'ప్లాసీ' అయింది.

ఒకప్పుడు మరుడు (మన్మథుడు) మూడు లోకాల్నీ జయించే సందర్భంలో అతని రథం లాగే తోటి చిలుకలు దగదొట్టి (దప్పికగొని) రథాన్ని ముందుకు లాగలేకపోతే, యీ చిలుక ఒక్కటే ప్రీతితో మిగిలిన వాటి భారాన్ని కూడా తానే వహించి రథాన్ని ముందుకు నడిపిందట. దానికి కృతజ్ఞతగా మన్మథుడీ చిత్ర శుకనాథునికి (రంగు రంగుల విచిత్రమైన చిలుకకు) మణులతో కూడిన మూడు మాలలను బహూకరించాడట. ఈ చిలుక మెడపైనున్న మూడు రేఖలు (చారలు) ఆ మూడు మాలికల వలె వున్నాయట. మన్మథుడు శుకవాహనుడు (చిలుకను వాహనముగా కలవాడు). అతని చిలుక శబలము (విచిత్ర వర్ణములు కలది). మన్మథుడిని తెలుగులో 'చిలుక తత్తడి రౌతు' అంటారు.

ఆ దేవాలయం లోని ఒక హరిపరిచారికను (హరిదాసిని) ఆ చిలుక ఆశ్రయించిందట. ఆమె దానిని చదివిస్తూ (చిలుక పలుకులు నేర్పుతూ), ఆహారమును బాగుగా యిస్తూ, దానిని భవన మార్జారాదుల నుండి (పెంపుడు పిల్లుల నుండి) సంరక్షిస్తూందట. (మార్జారము అన్నా మార్జాలము అన్నా పిల్లి).

ఆ హరిదాసి కొన్నాళ్లు తన యింట్లో, యింకొన్నాళ్లు దేవాలయంలో - ఎప్పుడూ ఆ చిలుకను వదలకుండా

తనతోపాటే వుంచుకుంటూ పువ్వులా కాపాడుకుంటున్నదట. ఆమె దానికి పసుపు పూసి స్నానం చేయిస్తుందట. ఎండసెక (ఎండసెగ) మరియు కంపము (చలితో వణుకు) పోగొట్టి, ఎప్పుడూ దాని మేను మృదువుగా నిమురుతూ, వస మరియు వెన్నతో కూడిన ఆహారాన్ని సమృద్ధిగా దానికిస్తూ, శ్రీరామనామ సుధామాధురిని (శ్రీరాముని పేరు అనే అమృతము యొక్క తియ్యదనాన్ని) దానికి బోధిస్తున్నదట.

రామచిలుక (*Rose ringed parakeet - Psittacula crameri*) లను యిండ్లలో ఎక్కువగా పెంచుతారు. ఇవి మన మాటలనూ, చేతలనూ చక్కగా అనుకరిస్తాయి. ఈ జాతి మగ పక్షికి మెడ చుట్టూ ముదురు ఎరుపు రంగుచార వుంటుంది. చిలుకలకు మాటలు బాగా రావడానికి వస (*Sweet Flag - Acorus calamus*) తో కూడిన ఆహారాన్ని ఇస్తారు. మన పిల్లలకు కూడా బాల్యంలో మాటలు శీఘ్రంగా రావటానికి వసను అరగదీసి ఆ గంధాన్ని నాలుకపై రాస్తారు. దీనిని కొద్దికొద్దిగా తినిపిస్తూంటే పిల్లల నాలుక పలచబడుతుందట. కొంచెం ఎక్కువగా మాట్లాడే వ్యక్తి గురించి 'చిన్నప్పుడు వస ఎక్కువగా పోసి వుంటారు వాడికి' అనడం మనమెరిగినదే! సంస్కృతంలో 'ఉగ్రగంధా' అని పిలువబడే వస ఘాటైన వాసనతో చేదుగా, కారంగా వుంటుంది. దీని చూర్ణము లేక కషాయము ఎన్నో ఔషధ గుణాలు కలిగి, ఎన్నో రుగ్మతలకు దివ్యౌషధంగా ప్రసిద్ధి పొందింది.

వసంతాగమన వేళల్లో - ఆ బింబోష్ఠి (దొండపండ్ల వంటి పెదవులు కలిగిన ఆ హరిదాసి) ఆ చిలుకను ఎప్పుడూ కనకమణి పంజరములలో (మణులు పొదిగిన బంగారు పంజరములలో) ఉంచుతూ, చక్కెర, ఉక్కెర (బెల్లంతో చేసిన ఓ రకమైన భక్ష్యము)లను దానికి క్రుక్కి క్రుక్కి మేపుతూ, ఒఅపు పలుకులను (చక్కని మాటలను) పలుమార్లు దానికి కరపుతూ (బోధిస్తూ) పెంచుతున్నదట - ఆ కలికి చిలుకల కొలికి (ముద్దుగుమ్మయైన ఆ హరిదాసి)

మ॥ కలహంసోపమయాన ల జక్రకుచ ఁ బ్రేంఖత్ఖంజరీటాక్షిఁ గో
కిల సారస్వర బర్హిబర్హ చికురం గీరప్రియాలాపఁ దొ
య్యలిఁ జాలన్ మరిగెన్ శుకం బది గరీయః ప్రేమ గావించుచున్
బులుగుం బొందున నంది పొందినగతిన్ బొత్తొత్తులన్ హత్తుచున్.

**(పాండురంగ మాహాత్మ్యం : 4-229)**

ఆ హరిదాసి కలహంస నడకలను పోలిన నడక కలదట. గుండ్రనైన కుచములు కలదట. (లేక చక్రవాక -జక్కవ - పక్షుల జంటవంటి స్తనద్వయం కలిగినదట); ప్రేంఖత్ - ఖంజరీటాక్షి - (ఖంజరీటము అంటే కాటుకపిట్ట) తిరుగాడే కాటుకపిట్ట కన్నులవంటి నల్లని కన్నులు కలిగినదట; కోకిల సారస్వర - కోకిల స్వరమువంటి మధురమైన కంఠస్వరము కలిగినదట; బర్హిబర్హ చికురయట - అంటే నెమలి పురివంటి చక్కని జుట్టు కలిగినదట; కీరప్రియాలాపయట - అంటే చిలుకవలె ప్రియముగా మాట్లాడేదట. అటువంటి తొయ్యలి (స్త్రీ)ని ఆ చిలుక చాల మరిగి (మచ్చికై) గరీయః ప్రేమ గావించుచున్ - ఎక్కువ అనురాగమును చూపుతూ; ఆ పులుగు యొక్క కలయికతో, అందిపొందిన గతిన్ - అరమరికలు లేనట్లుగా; పొత్తొత్తులను హత్తుతూ - ఎక్కువ స్నేహము, చనువు కలిగినదై వున్నదట. ఇక్కడ రామకృష్ణకవి ఆ హరిదాసిలో హంస, చక్రవాకము, కాటుకపిట్ట, కోకిల, నెమలి, చిలుక వగైరా రకరకాల పక్షుల లక్షణాలున్నట్లు వర్ణించాడు. ఆ చిలుక కూడా అన్ని పక్షుల లక్షణాలు కలిగిన ఆ స్త్రీని ఓ వింత పక్షిలా భావించి ఆమెతో ప్రగాఢమైన స్నేహం చేసిందని కవి భావం. పై పద్యంలో 'శుక' శబ్దాన్ని ఉపయోగించడం వెనుక రామకృష్ణ కవికి మరో ఉద్దేశ్యం కూడా వుంది. అంతటి చక్కని స్త్రీని చూచిన యెడల ఇంద్రియ నిగ్రహమునకు ప్రఖ్యాతి పొందిన శుకమహర్షి కూడా ఆమెను మోహించి తీరాల్సిందేనని

కవి భావము.

ఇలా ఉండగా ఓ రోజు ఆ హరిదాసి పసుపాడదలచి (పసుపు పూసుకుని స్నానమాడ దలచి) తన మెడలోని బన్నసరము (నానా విధములైన రత్నములతో కూర్చిన హారము)ను తీసి బరణిమూకుట్లో పెట్టి స్నానశాలకు వెళ్లిందట.

అప్పుడు ఆ హారములోని పచ్చల కాంతి వలన ఆ చిలుక బుద్ధిలో ఏదైనా భ్రాంతి లేత మొలకలా జనించిందో ఏమో - లేక ఆ హారములోని ఎర్రనైన పద్మరాగ మణులను చూచి అది దాడిమఫలోద్భవ బీజములు (దానిమ్మ పండు యొక్క ఎర్రని గింజలు) అని భ్రమపడిందో ఏమో - లేక ఆ హారములోని ఇంద్రనీల మణులను చూచి జంబుఫలంబులని (నేరేడు పండ్లని) అది భ్రాంతి చెందిందో ఏమో - లేక ఆ హారములోని హుర్మంజి ముత్యములు (హురుముంజి దేశపు మంచి ముత్యములు) చూచి మధూక పుష్పములు (విప్ప లేక ఇప్పపూలు) అనుకుని ఆశపడిందో ఏమో - (తియ్యగా వుండే విప్పపూలను పక్షులన్నీ యిష్టంగా తింటాయి)

ఆ చిలుక ఒక ప్రగల్భవిటుడు (నేర్పరియైన సరసుడు) బాలికా మానసమును హరించుకుని వెళ్లునట్లు నేర్పరితనంగా ఆ హారాన్ని ముక్కున కరచుకొని పోయిందట.

మన ప్రాంతపు అడవులలో సర్వసాధారణ వృక్షమైన ఇప్ప చెట్టును శాస్త్రీయంగా *Bassia latifolia* లేక *Madhuca indica* అంటారు. దీని పువ్వులు మధురంగా వుండడం కారణంగా దీన్ని సంస్కృతంలో 'మధుపుష్ప' అంటారు. దీని పూలు తీయగా, రుచిగా వుండడం వలన యివంటే పక్షులూ, జంతువులతో పాటు మనుష్యులకూ ఎంతో యిష్టం. ఈ పూలతో సారాయి కాస్తారు. ఈ పూలను రొట్టెల పిండిలో కలిపి రొట్టెలు చేస్తారు. వీటికెన్నో ఔషధ విలువలున్నాయి.

ఆ దేవదాసి అప్పుడే స్నానం చేసి వచ్చింది. ఆమె యింకా తడి వంటితోనే వుంది. చేలము (చీర)లో కొంత భాగము నడుము చుట్టూ చుట్టి, మిగిలినది స్తనములకు ఆచ్ఛాదనగా వేసుకున్నదట. ఆమె సుస్తని (చక్కని పాలిండ్లు కలది) యట. ఆమె తడి శరీరం దట్టమైన వర్షధారలచే చుట్టుకొనబడిన మెరుపు ఆకారం కలిగి వుందట. ఆమె తడిచీర దట్టమైన వర్షధార లాగానూ, ఆమె శరీరం మెరుపుతీగ లాగానూ వుందట. అంటే వర్షధారలో అప్పుడప్పుడూ కాంతివంతమైన మెరుపు మెరసినట్లు ఆమె తడిచీరలో నుంచి మెరుపుతీగ వంటి ఆమె అవయవ సౌందర్యం ప్రస్ఫుటంగా కనుపిస్తున్నదన్నమాట. ధమ్మిల్ల బంధమును (శిగముడిని) వేసుకుంటూ వచ్చి, హారం లేకపోవడాన్ని గమనించి, ముంగిట్లోకి ఆత్రంగా వచ్చిందట ఆ సుస్తని తన గోస్తనము (నలుబది మణులతో చేసిన నాలుగుపేటల హారము)ను అపహరించుకు పోయిన చిలుకను పట్టుకునే తొట్రుపాటుతో కూడినట్టిదై.

ఆ వెలది (స్త్రీ) చాపలమున (ఆ నగ యందలి భ్రాంతితో) దానిని ఆహరించిన (అపహరించిన)కీరమును (చిలుకను) తవులుచూ (వెంట తరుముతూ) వెళ్లిందట. అదెలా వుందట అంటే - వర్షధారలు కురియగా గాలిలో మిగిలిన నీటి తుంపరల కారణంగా బయల్పడిన మువ్వన్నెల విల్లు (మూడురంగులు కలదైన ఇంద్రధనుస్సు)ను వేడుకతో వెంటాడే శశిలా (చంద్రునిలా) వున్నదట.

ఇంద్రధనుస్సును చంద్రుడు వెంటాడడమేమిటో అర్థం కావడంలేదు. వర్షానికి ముందు, వర్షం అనంతరం గాలిలోని నీటి తుంపరలలో సూర్యుని కాంతి కిరణాలు వక్రీభవనం చెందిన కారణంగా ఇంద్రధనుస్సు ఏర్పడుతుంది. నీటి తుంపరలకూ, ఇంద్ర ధనుస్సుకూ కల అవినాభావ సంబంధాన్ని కవి ఆ రోజుల్లోనే గుర్తించ గలగడం విశేషం. ఇంద్రధనుస్సును కవి 'మువ్వన్నె విల్లు' అని పేర్కొన్నప్పటికీ, ఆధునిక విజ్ఞాన శాస్త్రం ఇంద్రధనస్సులో ఏడు రంగులుంటాయని నిర్ధారించింది. అవి - ఊదారంగు (*Violet*), నీలిమందు రంగు (*Indigo*), నీలము (*Blue*), ఆకుపచ్చ (*Green*), పసుపుపచ్చ (*Yellow*), నారింజవర్ణము (*Orange*), ఎరుపు (*Red*). ప్రతి కాంతి కిరణాన్నీ పట్టకము (*prism*) ద్వారా

విశ్లేషిస్తే యీ ఏడు రంగులూ వస్తాయి. తిరిగి ఈ ఏడురంగులూ కలిస్తే తెల్లని కాంతి కిరణం ఏర్పడుతుంది. అయితే యీ ఏడు రంగులలో మూలవర్ణాలు లేక ప్రాథమిక వర్ణాలు (primary colours) మూడే ! అవి : ఎరుపు, పసుపు మరియు నీలం. మిగిలిన వర్ణాలన్నీ యీ మూడు రంగుల నుండి ఏర్పడినవే ! ఉదా :- ఎరుపు, పసుపు కలిస్తే కాషాయ వర్ణం ఏర్పడుతుంది. నీలం, పసుపు కలిస్తే ఆకుపచ్చ ఏర్పడుతుంది. అలాగే ఎరుపు నీలం కలిస్తే ఊదారంగు (Violet) ఏర్పడుతుంది. ప్రాథమిక వర్ణాలు మూడేననే పరిజ్ఞానం రామకృష్ణ కవికి అప్పటికే వుండడం విశేషమే ! అందుకే ఆయన ఇంద్రధనుస్సును 'మువ్వన్నె విల్లు' అన్నాడేమో !

ముక్కున ముత్యాల హారంతో వున్న ఆ చిలుకను చూచిన ఎవరైనా, పార్వతీదేవి కంఠసీమ నలంకరించే స్ఫటికమాలను తెల్ల చెరకు (సితేక్షు) ముక్కల గుచ్ఛమని భ్రమించి తీసుకొని పోతున్న రతిరాట్పట్టాశ్వము (రతి రాజైన మన్మథుని పట్టపు అశ్వము - రంగు రంగుల విచిత్రమైన చిలుక) అని భావిస్తారట.

ఆ కందర్ప స్యందనము (మన్మథుని రథమనదగిన ఆ చిలుక) దొంగలా జంకుతూ మెల్లమెల్లగా వెళుతున్నదట. మలిమ్లుచునిలా (దొంగలా) అది దుర్గమ ప్రవేశ నిపుణంబట - అంటే చొరరాని ప్రదేశములలోకి కూడా దొంగలా చొరబడే నైపుణ్యం కలదట.

ఆ చిలుక నిరాలమైన ఆకాశంలో చక్రములా గిరికీలు కొడుతూంటే, స్వర్గములోని అప్సరస కాలినుండి జారిపడుతూన్న పచ్చల కడియములా ప్రకాశిస్తూన్నదట. ఈ చిలుక మనుష్య స్త్రీచే పెంచబడుతూన్న కారణంగా దీనికా వాసన అబ్బి మిగిలిన స్వజాతి చిలుకలు దీని మేని వాసన కారణంగా దీనిని వేరే జాతి పక్షియని భ్రమించి దీనితో జగడానికి సిద్ధమయ్యాయట. అప్పుడిది కూడా కోపించగా రోమాంచితములైన దీని చెక్కిళ్లయందలి యీకలు నిక్కబొడుచుకున్నాయట. ఇది తన కనుగ్రుడ్లను వికారంగా త్రిప్పిందట. నోటిలో మణి హారముతో నున్న ఈ చిలుక, మణులు పొదిగిన కంకణం కలిగిన రతీదేవి ముంజేయిలా వున్నదట. అది అలా ఎగురుతూ పోయిందట. ఆ హరిదాసి దానిని వెంబడిస్తూ వెళ్లిందట. ఆమె చెలులు కూడా ఆ చిలుకను పట్టుకొనడానికి ఆమెతో పాటు ఎంతో శ్రమపడ్డారట. 'గోరువంక కనుపిస్తున్నది; కానీ కీరము దూర మయ్యింది కదే!' అనుకుంటూ 'ఓ అక్కా! చిక్కింది. చిక్కింది. ఇక్కడ. ఇక్కడ' అంటూ దాని వెంటబడి పొలసిన (సమీపిస్తున్న) చేటికా నికరము (చెలికత్తెల సమూహము)ను అల్లంత దూరంలోనే పసిగట్టి ఆ పులుగు (పక్షి) మెరపులా మాయమవుతూ సమీపించగానే మాయమయ్యే మాయలేటి వలె (మాయలేడి వలె) సమీపిస్తున్న కొద్దీ దూరమయ్యే ఎండమావులలా, మువ్వలోని రాయిలా (మువ్వలోని రాయి తీయదానికి రాదు) ఒక మాత్రాన పట్టుబడకుండా ప్రమర రయమున (ఎక్కువ వేగముతో) ఎగిరి ఎగిరి పాండురంగని దేవాలయపు మధ్య భాగంలోని దండెపు కర్రపై తన మనస్సునకు నచ్చిన రీతిలో వచ్చి వాలిందట.

కరకైన తన వంకర గోళ్లతో త్రొక్కి త్రొక్కి తన కరకు ముక్కుతో ఆ మణిహారాన్ని కరచి కరచి, పోగులా ఒక్కపూసైనా మిగలకుండా (అన్ని ముత్యాలూ చెల్లాచెదరయ్యేట్లు) ఆ విచ్చికపు పులుగు (చెడ్డ పక్షి) ముత్యాలపేరును త్రెంచేసిందట. దాంతో పెక్కు విధములైన కూర్పులచే ప్రకాశిస్తున్న ఆ మణిహారమునందలి మణులు అహిశయనుడి (శేషతల్పశయనుడైన విష్ణువు) ఆలయమను మహాసముద్రమునకు 'అహీన రత్నాకరము' (గొప్పవైన రత్నములకు నెలవైనది) అనే పేరును చేకూర్చాయట.

దాంతో ఆ చిలుకకు అప్రయత్నంగా పాండురంగని దేవస్థానములో మణి రంగవల్లులను (ముత్యాల ముగ్గులను) కూర్చినట్టి పుణ్యఫలము చేకూరిందట. పౌండరీక నిలయుడైన విష్ణువుకూడా మనస్సులో ఆ చిలుకను మెచ్చుకున్నాడట.

# పాము కథ

ఒక రోజు ఆ మురమర్దనుడి (మురారియైన విష్ణువు యొక్క) మందిరంలోనికి గిరికానుషక్తబుద్ధితో (చిట్టెలుక యందు ఆసక్తిగల బుద్ధితో) ఒక పన్నగము (పాము) ఎక్కడినుంచో కానీ ఉరవడిగా వచ్చిందట. యమదండమంతటి భయానకమైన ఆ పామునకు భయపడి ఒక ఆఖు కన్యక (ఎలుకపిల్ల) కమలారమణుని (కమలాదేవి భర్తయైన విష్ణువు యొక్క) అంఘ్రిన్ (పాదములను) చేరిందట – గురుభీతమతియైన (తన తండ్రియైన విష్ణుచిత్తుని వలన భయమునందిన మనస్సు కలదియైన) ఆముక్త మాల్యదలా (విష్ణుచిత్తుని కుమార్తెయగు గోదాదేవిలా).

ఇక్కడ రామకృష్ణకవి ఎలుకపిల్లను ఆముక్తమాల్యదతో పోలుస్తున్నాడు. అంచేతనే కవి దానిని 'ఆఖు కన్యక' అన్నాడు. గోదాదేవిని ఆమె తండ్రి పెరియాళ్వారు అను నామాంతరం కల విష్ణుచిత్తుడు ఒక సామాన్య మానవునికిచ్చి వివాహము చేయబోగా, ఆండాళ్లమ్మ అని కూడా పిలువబడే ఆమె భయముతో విష్ణువు పాదములనే ఆశ్రయించి మోక్షమందడం మనమందరమూ ఎరిగిన కథే! (ఈ కథాంశాన్ని అప్పటికే శ్రీకృష్ణదేవరాయలు 'ఆముక్త మాల్యద' పేరిట సప్తాశ్వాసాల మహా ప్రబంధంగా మలచాడు.)

ప్రళయ కాలంలో తక్కిన జీవులవలె నశించిపోకుండా వుండాలంటే విష్ణువు కుక్షిలో దూరాలట. చిరంజీవియైన మృకండూద్భవుడు (మార్కండేయుడు) అలాగే విష్ణువు యొక్క జఠరము (ఉదరము)లో దూరి ప్రళయ కాలంలో కూడా సుఖంగా వుంటాడట. ఆ చిట్టెలుక కూడా విష్ణువు పాదపీఠమునందుగల సరియ (సందు)లో దూరి ప్రళయకాలంలో విష్ణువు జఠర పేటికలో దూరి సుఖంగావున్న మార్కండేయుని వలె సుఖంగా వున్నదట.

చీకట్లో జారిపడిన గాజుకోసం వెదుకగా, వెదుకగా పద్మరాగము దొరికినట్లు, ఆ పాముకు ఆ సరియలో ఎలుకకోసం వెదుకగా రమారమణుడి (విష్ణువు) పాదముల పైనున్న కైతక ప్రసవము (కేతకీ పువ్వు – గేదంగి పువ్వు అంటే మొగలిపువ్వు) దొరికిందట.

ఆ పాము దానిని మ్రింగాలని ప్రయత్నించగా ఆ మొగలి పూరేకుల ముళ్లు పాముకు తగిలి గాయములై అవి విటుని మేనిపైన వేశ్య తన ముళ్లవంటి గోళ్లతో వేసిన నఖక్షతముల వలె కనుపిస్తున్నాయట.

అలా విష్ణువు పాద పీఠము పైకి చేరిన ఆ మహాసర్పము యొక్క పడగపైనున్న దివ్యమణుల ఎర్రని కాంతి కమలతో విష్ణువునకు జరిగిన వివాహ సందర్భంలో ఆయన పాదముల గోళ్లకూ, వ్రేళ్లకూ లత్తుకతో పెట్టిన పారాణి శోభను కలిగిస్తున్నదట. ఆ ఎర్రటి కాంతి అచటి గంగానది యొక్క స్వచ్ఛమైన జల ప్రవాహంలో వ్యాపించి ఎర్రకలువల శోభను తెచ్చిందట. (గంగకు విష్ణుపది అనిపేరు. అది ఎల్లప్పుడూ విష్ణుపాదముల చెంత నుండి ప్రవహిస్తూ వుంటుందని విశ్వాసం). ఆ ఎర్రని కాంతులు విష్ణువు పాదాలపై మోకరిల్లి వంచిన తల ఎత్తని నాలుగు వేదములనే స్త్రీల యొక్క పాపటి సిందూరంలా భాసించాయట. (వేదాలు విష్ణువు పాదపీఠం క్రింద వుంటాయని విశ్వాసం. అందుకే విష్ణువుకు వేదాధిపుడు అని మరోపేరు). ఆ ఎర్రని కాంతులు విష్ణువు పాదపీఠంగా చుట్టలు చుట్టుకుని కూర్చున్న ఆదిశేషుని పడగలపైగల మణుల కాంతులకు దన్నుపెట్టే కర్రల శోభతో వున్నాయట.

అలా వ్యాపించిన తిమిరహరమైన (చీకటిని పోగొట్టునదైన) ఆ పాము పడగలపైని మణుల ఎర్రని కాంతుల కారణంగా, అప్రయత్నంగా ఆ భుజంగము, హరికి దీపారాధనము చేయుట వలన కలిగిన పుణ్యఫలమును పొందిందట.

మన ప్రాంతంలో సర్వసాధారణమైన త్రాచుపాము (*Naja naja*) కు గానీ, మన ప్రాంతానికి అరుదైన మహానాగు (*Naja hannah*

- *king cobra*) కు గానీ, మరే సర్పానికిగానీ పడగలపై మణులుండవు. నాగుపాముల పడగలపై మణులుంటాయనే విశ్వాసం ఏమేరకు శాస్త్రీయమైనదో మరో తావులో చర్చిద్దాం.

## తేనెటీగ కథ

ఆ సమయములో ఆ వాతాశనశయనుడి (పామును - శేషనాగును - పాన్పుగా కలవాడైన విష్ణువు యొక్క) కేళివన వసుమతి (ఉద్యానవన భూమి) నుండి తమ 'పెర'కు (తేనెతుట్టెకు) గొప్ప అపాయము కలుగుటచేత ఓ సరఘా సంఘాతము (ఒక తేనెటీగల గుంపు) వచ్చిందట. ఆ తేనెటీగల దేహకాంతి నూనె జిడ్డులా మెరుస్తూన్నదట. ఆ తేనెటీగల గుంపు అన్ని దిక్కులనూ ఆశ్రయించి జలధరాధ్వమునకు (ఆకాశమునకు) తైలకటాహ న్యాయమొనరించిందట. (ఒక పెద్దపాత్రలోని నీటి తలంపై ఒక చుక్కనూనె పడినా అది కొద్ది సేపట్లోనే ఆ పాత్రలోని నీటి పైభాగానికంతటికీ వ్యాపిస్తుంది. దీనిని 'తైల కటాహ న్యాయము' అంటారు. కటాహము అంటే నూనె కాచే బాండీవంటి పాత్ర) అలా ఆ తేనెటీగల గుంపు ఆకాశమంతా వ్యాపించిందన్నమాట.

ఆ మధుమక్షికలు (తేనెటీగలు) విట్ఠలుని ఆలయం ముందున్న నిర్మాల్యమగు పుష్పములందలి సువాసనా భరితమైన తేనెను గ్రహించాలనే కోరికతో అక్కడ తిరుగాడాయట.

అందులోని ఒక సరఘ (తేనెటీగ) విష్ణువు యొక్క పాద్యమైన జలముతో కూడిన పూజాపుష్పముల మకరందాన్ని త్రాగుటచే, దానికి తీర్థ స్వార్థములు రెండూ ఫలించాయట. దేవుని పాదతీర్థము త్రాగడం కారణంగా తీర్థఫలం లభించిందట. దానియందు కలగలిసిన మధువు (తేనె)ను త్రాగడం వలన క్షుద్బాధ తీరి స్వార్థము ఫలించిందట. ఇలా అనుకొనకుండానే ఆ తేనెటీగకు విష్ణుపాద ప్రక్షాళన కుపయోగించిన నీరు త్రాగే అదృష్టం కలిగింది. దాని కారణంగా ఆ తేనెటీగకు యజ్ఞములుచేసి, సోమపానం చేసిన సోమయాజులకు కలిగే పుణ్యఫలం దక్కిందట. అదృష్టముంటే పుణ్యల÷ పురుషుడికి పెన్నిధిలా తనంతతానే దొరుకుతుందట.

'సరఘము', 'మధు మక్షికము' అని పిలువబడే తేనెటీగ (*Honey Bee*) సామూహిక కీటకం. కొండతెర (*Apis dorsata*) అనబడే పెద్ద తేనెటీగలు ఎత్తైన భవనాలపైనా, కొండగుహలు వగైరాలలోనూ తమ పెరలు (తుట్టెలు) పెడతాయి. సాధారణంగా మన పరిసరాలలోని చెట్లపై తుట్టెలు పెట్టే మధ్యరకం జాతి *Apis indica* జాతి తేనెటీగలనే చెక్కపెట్టెలలనూ పెంచుతారు. పొదలలో తేనెపట్టులు పెట్టే చిన్న తేనెటీగల (*Apis florea*) రకం వేరొకటి వుంది.

తన కులానికి ఆభరణమై వెలుగొందుతూ, పాతివ్రత్య మహిమ కలిగి, పరమ వైష్ణవ ధర్మాల్ని ఆచరించడంలో నేర్పరితనం కలిగి, పౌండరీక తీర్థ విభుడైన శ్రీ కృష్ణునికి కోరిన భోజనములిచ్చి మొప్పించినట్టి ఆ పతివ్రతా శిరోమణియైన సుశీలకు ఆ కాకి, హంస, చిత్ర శుకము (వింత చిలుక), భుజంగము, సరఘలు వరుసగా సురథ, సులభ, సుముఖ, సువ్రత, సుకృతి అనే నామధేయములతో ముత్యపుచిప్పలో జనించిన ముత్యాలలా జన్మించారట. గోముగా పెరుగుతూ కేసరిశాబముల (సింహపు పిల్లల)లా ప్రకాశిస్తూన్న ఆ ఐదుగురికీ ముయ్యాదు వచ్చిందట. (శైశవము, కౌమారముల తర్వాత వచ్చే మూడవ యీడైన యౌవనము - ముయ్యాదు). గర్భవైష్ణవాగ్రేసరులైన తన ముద్దు కుమారుల్ని చూసుకుని మురిసిపోతున్న ఆ సుశీల నిండుగా కాచిన దొండతీగలా ప్రకాశించిందట. (గర్భ వైష్ణవులంటే శ్రీ వైష్ణవులవలె తప్తచక్రాంకనములక్కరలేనట్టి పుట్టుకతో వైష్ణవులైన వైఖానసులు). భూలేఖకులైన (భూలేఖ కులంలో పుట్టినట్టి - బ్రాహ్మణులైనట్టి) వారికి బ్రాహ్మణోచిత కర్మలు తండ్రి నేర్పించాడట.

వారైదుగురూ శాణము (సానరాయి)పై రుద్దితే శోభిల్లుతూన్న రత్నములవలె గురువు శిక్షణలోని కిశోరాల్లా శోభిల్లుతున్నారట. శరీరంపైని దుమ్ము, ధూళి కడిగి వేయబడిన కలభముల (ఏనుగు గున్నల)లా వున్నారట. దోహదక్రియలతో దినదిన ప్రవర్ధమానమవుతూన్న కొత్త మొక్కలలా వున్నారట. కుబుసము విడిచిన పాములలా వున్నారట. తాము నేర్చిన గొప్ప కళలతో విద్వాంసులనూ, బంధువులనూ తృప్తి పరుస్తున్నారట.

ఒకడేమో నిరూఢమైన కృష్ణ రుచియట. రుచి అంటే 'యిష్టము' అనే అర్థంలో 'కృష్ణుడంటే గాఢమైన యిష్టంకలవాడు' అని అర్థం. రుచి అంటే 'కాంతి' అనే అర్థంలో 'గాఢమైన కృష్ణ (నల్లని) (శరీర) కాంతి కలవాడు' అని అర్థం. (క్రిందటి జన్మలో యితడు కాకి).

ఒకడు నిర్మల మానసప్రియుడట. నిర్మల (పరిశుభ్రమైన జలములు కలిగిన) మానస ప్రియుడు అంటే మానస సరోవరాన్ని యిష్టపడేదైనట్టి హంస. మరోవిధంగా అతడు నిర్మలమైన (పరిశుద్ధమైన) 'పరమహంస' అంటే పరబ్రహ్మ స్వరూపియట. తెల్లని రూపము కలవాడు. (క్రితం జన్మలో యితడు హంస).

ఒకడు ప్రయత్న యోగ్యఫలుడట. (దేవుని గూర్చిన) తన ప్రయత్నంలో సఫలీకృతుడైనవాడు. చిలుక కూడా ప్రయత్నం ద్వారా మాట్లాడడం అనే కృషిలో సఫలీకృతమౌతుంది. (వెనుకటి జన్మలో యితడు చిలుక).

ఒకడు అనాదృత బంధకంచుకుడట. ఆదరింపబడని (సంసార) బంధమనే కవచం కలవాడట. ఐహికమైన సంసారబంధనాలలో తగులుకొనడం యితనికిష్టం వుండదు. ఆముష్మికంపైనే ధ్యాసతో బంధనమనే కుబుసం ఎప్పుడెప్పుడు వీడిపోతుందా అని ఎదురుచూసే పాము వంటి వాడితడు. (గత జన్మలో యితడు సర్పము).

ఒకడు రసానుకూలమతియుక్తుడట. 'రస' అంటే 'నాలుక' అనే అర్థంలో మధుర రసము (పూదేనియ)ను అనుభవించాలని కోరేవాడు. (నాలుకకు అనుకూలమైనది మధురరసమే కదా!) ఇంకొక రకంగా, పరబ్రహ్మ స్వరూపమగు రసమును అనుభవించాలనే బుద్ధికలవాడు. 'రస' అంటే భూమి అనే అర్థమూవుంది. భూమికి అంటే భూమిపైని ప్రజలకు అనుకూల మతియుక్తుడు - అంటే ఎక్కడెక్కడో తిరిగి సేకరించే తేనెను ప్రజలకందజేస్తూ ఎనలేని సేవలందిస్తున్న తేనెటీగలా. (గడచిన జన్మలో యితడు తేనెటీగ).

ఆ యింతి పుత్రకులు యీ విధంగా విలసిల్లారట. ఇలలో ఎట్టివారలకైనా తొల్లిటి (గత) జన్మవాసనలు (సంస్కారాలు) తప్పుతాయా?

వారు లౌకిక, వైదికాచరణలు రెంటిలోనూ ఆసక్తి కలిగి, విష్ణుభక్తిలో గొప్ప కీర్తికలవారుగానూ, సూనృతలక్ష్మి (సత్యసంపద)కి పట్టుగొమ్మలుగానూ, సర్వభూతముల పట్ల దయయే తమ ఆస్తిగా కలవారిగానూ దిక్కులేని దీనుల మనస్సులలోని కలత పోగొట్టే ధనాఢ్యులు వీరే - అన్నట్లూ విలసిల్లారట.

ఆ తొలుకొలము (తొలికులము - నాలుగు కులములలో మొదటిదైన బ్రాహ్మణకులము) ఈ ఐదుగురి ప్రాభవం కారణంగా అలరులు (పూవులు) మాలగా గుచ్చినట్లూ, పాలుపొంగినట్లూ వికసించియున్న నెత్తమ్మి కొలని చెలువున (నిండుగా పూచిన పద్మములతో కూడిన కొలనులా) ఆయా సౌభాగ్యములతో ఉదాత్తంగా అయిందట.

అఖిల కల్యాణ గుణశీలయైన ఆ సుశీల చేమీదుగా చుట్టము లందరికీ దాన ధర్మాలు చేసిందట. మునిమనుమ కుఱ్ఱలను (మనుమల సంతానమును) కూడా ఎందరినో ఎత్తుకున్నదట. (అంటే మనుమళ్లు, మనుమరాళ్లకు కూడా పిల్లలు కలిగేటంతవరకూ జీవించి వున్నదన్నమాట) 'భర్తతో కూడ ముత్తాటి పండు తిన్నదట.' అంటే భర్తతో కలిసి మూడు తరాల తాటిపండ్లు తిన్నదట. (ఒకతాటి పండుతిని దానిలోని విత్తును పాతిపెడితే, అది మొలిచి వృక్షమైన అనంతరం దాని

పండునుతిని, ఆ విత్తునుకూడా పాతిపెడితే మొలిచిన వృక్షపు పండును కూడా తినగలగడానికి - అంటే మూడు తరాల తాటిపండ్లను తినగలగడానికి ఎంతో దీర్ఘకాలంపాటు జీవించాలి. భర్తతో కూడ ముత్తాటి పండు తినడమంటే వారి వివాహానంతరమే యిరువురూ మూడుతరాల తాటిపండ్లు తిన్నారన్నమాట).

తాటిచెట్టు (*Palmyra Tree - Borassus flabellifer*) ను మన గ్రామీణులు కల్పవృక్షంగా భావిస్తారు. మన గ్రామసీమలలో యిదొక సర్వసాధారణ వృక్షం వీటిలో ఆడ, మగ చెట్లు వేర్వేరుగా వుంటాయి. ఆడచెట్లు సాధారణంగా 25 ఏళ్లకు కాపుకొస్తాయి. గృహనిర్మాణంలో నిడుపాటి దీని కాండాన్ని దూలములు, వాసములుగానూ, ఆకులను పైకప్పుగానూ వాడతారు. లేతచెట్ల ఆకులను విసనకర్రల తయారీకి వాడతారు. పేపరు కనుగొనక ముందు తాటి ఆకుల (తాళపత్రముల)ను గంటముతో రాయడానికి ఉపయోగించేవారు. తాటాకులు గొడుగులు, బుట్టలు, టోపీలు, సంచులు వగైరాల తయారీకి కూడా వాడతారు దీని కాండాన్ని డొల్లగాచేసి నావలుగానూ వాడతారు. కొల్లేటి సరస్సులో మనమిలాంటి నావల్ని ఎక్కువగా చూడవచ్చు. లేత తాటి కాయలలోని ముంజలు వేసవిలో ఎంతో ఊరట కలిగించే ఆహారం. తాటిపండ్లు కాల్చుకొని తింటే ఎంతో రుచిగా వుంటాయి ఈ పండ్లరసాన్ని చాపలపై పోసి, ఎండబెట్టి తాటితాండ్ర (*Palm jelly*) తయారు చేస్తారు. ఇది పిల్లలకు యిష్టమైన ఆహారం తాటిపండ్ల గుజ్జునుండి తాటిబెల్లం (*Palm gur*) తయారు చేస్తారు. తాటి చెట్లనుండి మధురమైన రసాన్ని తీయడాన్ని కల్లుగీత అంటారు మగ, ఆడ తాటిచెట్లలో 25-30 సంవత్సరాల వయస్సు కలిగిన వాటిని గీత (*tapping*) కు ఎన్నుకుంటారు వీటినుండి తీయబడే నీరా లేక తీపికల్లు (*sweet toddy*) ఆరోగ్యకరమైన పానీయం. అది పులిస్తే కల్లు (*Toddy*) అంటారు అది మత్తుపానీయం. నీరా నుండి తాటికలకండ (*Palm candy*), కాడి (*Vinegar*), తాటిపంచదార (*Palm sugar*) వగైరాలు తయారుచేస్తారు. తాటి విత్తనాలను పాతిపెడితే వచ్చే తాటి తేగలు (*Young seedlings*), విత్తనాల (బుర్రల)లోని గుజ్జు (గుంజు) మనందరికీ ఎంతో యిష్టమైన ఆహారాలు. తాటినార గట్టితనానికి ప్రతీతి మన గ్రామీణులు మగ తాటిచెట్టు పూల గెలల (*inflorescences*) లను కూడా వృధా కానివ్వరు. 'గులకచక్ల' అని పిలిచే వీటితో దీపావళి సందర్భంగా రవ్వలుచిమ్మే 'అగ్గి బరాటా'లు తయారు చేసేవారు. వీటినే పూల పొట్లాలనీ అంటారు. ఈ విధంగా ఎన్నో రకాలుగా ఉపయోగపడే తాటిచెట్టును కల్పవృక్షమనికాక మరేపేరుతో పిలుస్తాం?

ఆ నలినాయతాక్షి (తామరల వంటి విశాల నేత్రములు కల సుశీల) కానుపు లుడిగి, పండు ముదుసలియై ప్రాణవిభుని (భర్త యొక్క) ఉపలాలనము (బుజ్జగింపు)తో మనుమలు, మునిమనుమలు కల్పించే రక్షణ - జరనూ (ముసలితనమునూ), దైన్యమునూ పోగొట్టగా హాయిగా జీవించిందట.

## సుశీల హితబోధలు

ఒకరోజు సకల ధర్మముల మర్మముల నెరిగిన ఆ సుశీల తన కుమారులైదుగురినీ చేరఁబిలిచి, ప్రాచీన కాలంలో కువలయాశ్వుని భార్యయైన మదాలస తన కుమారులు నలుగురికీ ధర్మ తత్త్వమునూ, బ్రహ్మ జ్ఞానమునూ బోధించినట్లు, యీ విధంగా చెప్పసాగింది.

"కుమారులారా! ఇహలోకంలోని అన్ని భోగాలనూ నేను అనుభవించాను. ఆర్యులను (పూజనీయులను) ఎందరినో పూజించాను. బంగారము వగైరాలను ఎంతగానో దానములు చేశాను. మీ క్షేమాన్నీ, అభివృద్ధినీ కన్నులారా చూచాను. నేను జీవత్పతిని (జీవించియున్న భర్తకలదానిని. నిండు ముత్తయిదువను); జనతామాన్యను (జనులచే గౌరవింపబడినదానిని), అశీతివృద్ధను (ఎనభైఏళ్ల వృద్ధురాలిని). కనుక యింకా నేను జీవించి ఏమి ప్రయోజనం? ఇక నేను యీ సంసార బంధనాల నుంచి విముక్తురాలిని కావడానికి ప్రయత్నించాలి.

నేను మీ తండ్రి గారితో సహా వెళ్లి పాండురంగని దర్శించుకుని, భక్తితో పూజించి, పరమపదమును పొందాలని కోరికగా వుంది.

ఎదురు పలుకకుండా ఒక మంచి మాట చెపుతాను వినండి. సకల ఆగమ (వేద) మతములను (సిద్ధాంతములను) అవగాహనచేసికొని, అకుటిల మతితో (స్పష్టమైన రీతిలో) జనకుడు, సనకుడు, శుకమహర్షి మొదలైన యోగులు తెలుసుకున్న మార్గాన్ని మీకు బోధపడేటట్లుగా వివరిస్తాను.

సీ॥ అమిత భోగాయతనము దేహమను సర్ప, ముగ్ర కృత్యములేల యుడిగియుండు?
ధాతుమయంబు గాత్రమను ధాత్రీధరంబది యేల రాగంబు నవలఁద్రోయు?
నిచిత నానాగుణ ప్రచుర మీ తనువను పట మేల చిరుఁగక పదిలమొందు?
నూర్మి పరంపరాయుత మంగమను వార్ధియెడ, జీవనభ్రాంతి యేలయుడుగు?

ఆ॥ నార్జవంబు చాల దతి కఠినాశయ, మెపుడు మైల విడువ దెందుఁ జివుకుఁ
బటికిడొక్క; దీనిఁబాటింపరెప్పాట, లక్షయేనియును ముముక్షు జనులు.

(పాండురంగ మాహాత్మ్యము 4 - 273)

అమిత భోగాయతనమైన (అమిత సుఖాలను కోరుకునే; పెద్ద పడగ కలిగినట్టిదైన), యీ శరీరం అనే సర్పం ఉగ్రకృత్యములు (క్రూరకార్యాలు) చేయకుండా ఎలా వుండగలదు? (భోగము అంటే పడగ అనే అర్థం కూడా వుంది. అందుకే భోగిని అంటే పాము.) ధాతుమయమైన (పంచ భూతాత్మకమైన) యీ శరీరం అనే ధాత్రీధరము (పర్వతం) రాగాన్ని (అనురాగాన్ని, ఎర్రదనాన్ని) ఎలా అవతలికి తోస్తుంది? (పర్వతానికి ఖనిజ ధాతువుల కారణంగా రాగము - రంగు ఎలా తప్పదో శరీరానికి అనురాగమూ అలాగే త్రోసివేయలేనిది.)

ఈ దేహమనే పటము (వస్త్రం) ఎన్నో గుణములతో (దారములతో) కూర్చబడినది. అలాగే వ్యాపింపబడిన అనేక గుణములతో కూర్చబడినదీ దేహం. (నిచిత నానాగుణ ప్రచురము). అది ఎప్పటికీ చిరిగిపోకుండా, పదిలంగా ఎలా వుంటుంది?

ఊర్మిపరంపరాయుతమైన (జరామరణము క్షుత్పిపాస శోకమోహములు - ముసలితనము, మరణము, ఆకలి, దాహము, శోకము, మోహము - అనే ఆరింటినీ షడూర్ములు అంటారు.) అంగము అనే సముద్రములో జీవన భ్రాంతి (బ్రతుకుపట్ల భ్రమ; సుడిగుండం) నశిస్తుందా? (ఊర్మి అంటే పెద్ద అల అనే అర్థమూ వుంది) (జీవనము అంటే నీరు; జీవనభ్రాంతి అంటే నీటిలోని సుడిగుండం). పెద్ద పెద్ద అలలతో కూడిన సముద్రానికి ఏ విధంగా సుడిగుండాలు తప్పవో, షడూర్ములూ కలిగిన అంగానికి జీవన భ్రాంతి అలాగే తప్పదు.

ఆర్జవము (తిన్ననైన ఋజువర్తన) చాలదు. ఎందుకంటే దేహము సర్పము వంటిది కనుక మెలికలు లేకుండా తిన్నగా వుండలేదు.

అతి కఠినాశయము అంటే లక్ష్యము చాల కఠినమైనది. శరీరము పర్వతము వంటిది కనుక, అతి కఠినమైనది.

మైలన్ విడువదు (కలుషములను, చీకటినీ, అజ్ఞానాన్ని విడువదు) శరీరం వస్త్రము వంటిది కనుక, దానికి పట్టిన మురికి అంత తేలిగ్గా వదలదు.

పటికి డొక్క (కంకాళము, అస్తి పంజరము) అయినట్టి అంగము యింకా దేనిలో చివుకుతుంది? అంగమనే సముద్రం యిక దేనిలో చివుకుతుంది? (చివుకుట అంటే తడిసి సారహీనమవటం)

లక్ష చెప్పినా సరే, దీనిని మాత్రం ముముక్షుజనులు (మోక్షాన్ని కోరేవారు) పాటించరు.

పంచభూతములతో కూడినట్టిదైన యీ శరీరం మాయ, జీవుల సంబంధంతో పెరుగుతుంది. మాయ ఆడపనిని, జీవుడు మగపనిని చేస్తూవుంటే జీవనం ముందుకు సాగుతుంది. ప్రకాశమానమైన, పాంచభౌతికమైన పైరు పండిన అనంతరం జర (ముసలితనము) ఆమయము (వ్యాధి), వ్యసనము, మృత్యువు అనేవాటి చేత నియమించబడిన కడంగరీయములు (పొల్లుగడ్డి తినే ఎద్దు) వచ్చి ఆ పంటనంతా మ్రోడయ్యేట్లు తినివేస్తాయి. కనుక అశాశ్వతమైన యీ దేహం నిత్యమని నమ్మొద్దు.

విజ్ఞులైనవారు - విద్వాంసులనే తామర పూవులకు ద్యుమణి (సూర్యుడు) అయినట్టి విష్ణువును మదిలోనిల్పి, గట్టిపట్టుదలతో అతి భయంకరమూ, అంతము లేనిదీనైన సంసారాంధకూపమును (సంసారమనే పాడు చీకటి బావిని) నేర్పుగా దాటుతారు. వారు చివరిదాకా దృఢ చిత్తంతోనూ, ధృతితోనూ, పట్టుదలతోనూ దాన్ని దాటుతారు. ఇంకా చింతాకు అంతదూరమే కదా మిగిలి వుంది అని ఏమరుపాటుగా వుండరు. ఎంతైనా కడమ (శేషము) కడమే కదా అని వారు చివరి క్షణం వరకూ పట్టుదలతో వుండి సంసారాన్ని అధిగమిస్తారు.

'తలచుట్టూ ముచ్చుట్టులు (మూడు చుట్లు) తిరిగినా కడి (ముద్ద) పోవాల్సింది నోట్లోకే'నన్నట్లు ఎన్ని రకాలుగా తిరిగినా, విష్ణుసేవామార్గంలో తప్పితే జీవుడికి వేరే పద్ధతిలో గతి (మోక్షము) కలుగదు.

కొందరు ఉత్తమ పురుషులు తమ నడవడిక, జ్ఞానము, వైరాగ్య భావములతో ప్రకాశించునట్లుగా, గురుకృపా సంపన్నులై సాధనాంతర (వేరే సాధనముల ద్వారా), మంత్రాంతర (వేరే మంత్రముల ద్వారా) దైవతాంతర (వేరే దైవముల ద్వారా) ముక్తి పొందవచ్చునేమోనని తర్కించి (అవి తమకు అననుకూలములని గ్రహించి) క్షీరోదక పద్ధతిలో (పాలు, నీరు ఒకదానితో నొకటి కలసినట్లుగా) ముకుందలీనతనులై (ముకుందునిలో లీనమైన తనువులు కలవారై) యిక పునర్జన్మంటూ పొందరు. మోక్షమును పొందడానికి హరిభక్తియే సాధనం. ఈ సంగతి తెలిసికొనకుండా కొందరు కర్మపరులు మోక్షంకోసం నానాతిప్పలూ పడుతున్నారు.

విషయాంకురములను (విషయ వాసనలు - కోరికలు అనే మొగ్గలను) గిల్లివేయని వాడికి ఇనుప కచ్చడములున్నా ప్రయోజన మేముంది? మనోమాలిన్యాన్ని ప్రక్షాళనం చేయని వాడికి త్రిషవణములు (మూడు కాలాలలో చేసే సవనములు - ప్రాతఃసవనము, మాధ్యందిన సవనము, సాయం సవనము) ఏం ఒరగ బెడతాయి? చింతలన్నియూ (అన్ని విచారములనూ, ఆలోచనలనూ) మ్రోడు సేయనివాడికి (మనస్సు నుండి తుడిచిపెట్టని వానికి) తల గుండు చేయించుకున్నంత మాత్రాన చేకూరేదేమిటి? యేను తత్త్వంబులు (ఐదు తత్త్వాలు) తెలియనివాడికి కలిగే యెఱుక (జ్ఞానము, తెలివి) ఏపాటిది? వాళ్ల మొఖాలు చూడండి - వారిని చూడండి - వారికి ముక్తి ఎప్పటికైనా లభిస్తుందా? ఏనుగుమీద నున్నవారిని (అంటే గొప్పవారిని) పద్దతీపాడూ లేకుండా సున్నం అడుగుతారా ఎవరైనా? - ఏవైనా విలువైనవి కోరుకుంటారు గానీ. ముక్తికి చక్కని రాచబాట వంటి భక్తి మార్గాన్ని వదలి ఆ కర్మపరులు అనవసర కర్మలు ఏవేవో చేస్తున్నారే? - వ్యర్థంగా.

ఇతరుల భార్యలనూ, యితరుల ధనమునూ యిష్టపడనివారూ; పరగుణ పరమాణు పర్వతీకరణము (ఇతరులలో మంచి కొంచెమే అయినా దానిని కొండంత అని భావించుట)ను వ్రతముగా పాటించేవారూ; నేరస్తుడు పరాయివాడు అయినా, తన స్వంత కొడుకే అయినా సమత్వంతో ఒకే శిక్షను నిర్ణయించేవారూ; బాగా ఐశ్వర్యం వున్నప్పుడూ, ఆపదవేళలలో కూడా దీక్షగా సత్యమే పలికేవారూ; అసాధ్యమైన (గొంతెమ్మ) కోర్కెలు కోరనివారూ; క్రూర కర్మలు చేయడం విడచిపెట్టినవారూ; మోక్షంపట్ల ఆసక్తితో వెలుగొందేవారూ తప్ప మిగినవారందరూ భవవహ్ని (పునర్జన్మ లేక సంసారము అనే అగ్ని)కి బలౌతారు.

మీరు పెక్కుమంది దేవతల మార్గానపడి నడవకుండా, పౌండరీక తీర్థాధీశుడైన విట్ఠలుడినే యిలవేలుపుగా భజించి తరించండి. ఆ విట్ఠలుడిని చేరుకోవాలంటే భక్తి మార్గం తప్ప వేరే మార్గంలేదు. మీరు కూడా గృహస్థాశ్రమ ధర్మాలను అతిక్రమించకుండా నడుచుకుంటూ, మిత్రామాత్యోదారహితదారదారకవారకములతో - మిత్రులు, అమాత్యులు (మంత్రులు), ఉదారహితులు (గొప్ప బంధువులు), దార (భార్యలు), దారక (పిల్లలు), వారకముల (తీర్థయాత్రలలో ఉపయోగించే గుర్రాల)తో సహా బయలుదేరి పుణ్యక్షేత్రాలు దర్శించండి.

మృదువైన తులసీదళ మాలలతో ఒప్పుచున్న వానిని, శ్రీవత్సలాంఛనంతో ప్రకాశించువానిని, పయోద శ్యాముని (పయోదము అంటే మేఘము. మేఘమువలె నల్లనిచాయ కలవానిని), పదద్వయ నత (రెండుపాదములకూ వంగి నమస్కరిస్తూన్న) సుత్రాముని (ఇంద్రుడు కలవానిని), మన పౌండరీక ధాముడైన పాండురంగ విట్ఠలుడిని పూజించండి."

అంటూ వుండగానే అర్కనిభమైన (సూర్యునితో సమానమైన తేజస్సుగల) అనిమిషయానము (అనిమిషుల - అంటే దేవతల - వాహనమైన విమానము)ను తెచ్చి హరి పార్శ్వచరులు (విష్ణు దూతలు)ఆ ఘనశీల (గొప్ప శీలము కలది) విష్ణుగాథాలోల (విష్ణువు గాథలయందు ఆసక్తి కలది) అయిన సుశీలను సభర్తృకముగా (భర్తతో సహా) వైకుంఠమునకు సగౌరవంగా తీసుకువెళ్లారట.

ఇలా ఆవు, బ్రాహ్మణుడు, కాకి, హంస, చిలుక, పాము, తేనెటీగ ముక్తిపొందిన యీ కథ వినే భక్తకోటికి భవము (పునర్జన్మ) అనేది పర్వతాగ్రము(కొండచివర)న వున్న శిలపై తామరపూవు పూయడమంత అసంభవమైనది."

అని చెప్పి ఆ ఇందుధరుడు (చంద్రశేఖరుడైన శివుడు) శతానంద నందనుడి (బ్రహ్మ కుమారుడైన నారదుడి)తో యింకా యిలా అంటున్నాడు -

## కాలభైరవుని ఖ్యాతి

"ఇప్పుడు పుండరీక క్షేత్రపాలకుడైన కాలభైరవుని గొప్పతనాన్ని కొంత వివరిస్తాను (శివుని మరొక రూపే కాలభైరవుడు). ఇంద్రనీలమణియో, నల్లని మేఘముల గుంపో అన్నట్లుగా లేత పాచిరంగు కల కాంతితో మెరసి పోతున్నాడట ఆ సిద్ధవరుడు. ఆ మేటి జోగి జడలు కెంపులా, పగడాల గుంపులా, యీరెండ (ఉదయ సంధ్యా కాలపు ఎర్రని లేత ఎండ) సొంపులా అన్నట్లు ఎర్రగా వున్నాయట. ఆ ఆదిపురుషుని నవ్వు హారమువలెనూ, హారి నీహారములా (ఊరట కలిగించే చల్లని మంచు వలెనూ), భూరి కర్పూరములా (గొప్ప కర్పూరపు కుప్పలాగానూ) వున్నదట. ఇక ఆ వటూత్తముని (బ్రహ్మచారులలో శ్రేష్ఠుడైన కాలభైరవుని) కోఱలు (దంతాలు) మెఱవులా, వజ్రాల ఒఱవులా (వజ్రముల సౌందర్యములా) అన్నట్లుండి చంద్రరేఖ యొక్క యౌవన శోభను తలపిస్తున్నాయట. విట్ఠలునికి ఈశాన్యదిక్కులో ప్రేత, భూత, నిశాచర పీడలను తొలగిస్తూ క్షేత్రరక్షణలో దక్షుడై, విష్ణువు ఆజ్ఞలను తలమోస్తూ వెలుగొందుతున్నాడట క్షేత్రపాలకుడైన ఆ కాలభైరవుడు. అతడి ఆజ్ఞలను ఉల్లంఘించి ఆ క్షేత్రంలో సంచరించడం ఎవ్వరికీ తరం కాదట. చెడుగులనూ (చెడ్డవారినీ), విష్ణు భక్తిని నిరసించే దురాత్ములనూ, మోక్షలక్ష్మిని చేపట్టే అర్హతలేని హీనులనూ ఒక్కపూటకూడా ఉండనీయకుండా ఆ క్షేత్రాన్నుంచి తరిమి తరిమి కొట్టి మహోగ్ర రూపంతో వారి మనస్సులను ఆరట పెడతాడట (దుఃఖపెడతాడట) ఆ బుడిబుడి తాల్పుడు (బుడుత నెలతాల్పు అన్నా బుడి బుడి తాల్పు అన్నా బాలచంద్రశేఖరుడైన ఆ కాలభైరవుడు).

ఒకరోజు ఒక అందగాడైన ఖేచరుడు (ఆకాశంలో విహరించేవాడు - గంధర్వుడు లేక విద్యాధరుడు) పూలతో అలంకరించుకొని, చందనాది మైపూతలను పూసుకొని, దివ్య వస్త్రాలను, దివ్యములైన ఆభరణములనూ ధరించి, లేతయౌవన

ప్రాయంలో వున్న స్త్రీలు తనను ప్రేమతో సేవిస్తూండగా తన విమానమెక్కి ఆ వనమాలి యొక్క (పాండురంగ విభుని యొక్క) హాటకమయ (బంగారముతో నిండిన) అవసథము (అంటే యిల్లు - యిక్కడ దేవాలయము) యొక్క ఉపరివీథిలో (పై భాగంలోని గగన వీధిలో) క్రొవ్వెసగగా (అహంకారం అతిశయించగా) యథేచ్ఛగా త్రిమ్మరు (తిరుగు) చున్నాడట. ఆతడి విమాన రుచి (కాంతి) కోకనదప్రియ రోచిని (చంద్రుని యొక్క కాంతిని) మించి వెలుగుతూన్నదట. కోకనదము అంటే చెంగల్వ. కోకనదప్రియుడు అంటే చెంగల్వలకు ప్రియుడైన చంద్రుడు.

అలా ఆ విద్యాధరుడు యౌవనంతో మదించి మీదెరుంగక (మీదు - భవిష్యత్తులో జరిగేది; ఎరుగక - గమనించక) దేవాలయము మీది గగనస్థలమును కనక ప్రసూనముల (బంగారుపూల)ను ధరించుటచే మనోహరమైనట్టి కాంతికలదిగా చేస్తూ త్రిమ్మరుతున్నాడట. అప్పుడు క్షేత్రపాలుడైన కాలభైరవుడు ఉత్క్రోధరసోగ్రమూర్తియై (ఉత్ + క్రోధరస + ఉగ్రమూర్తి- ఎక్కువైన కోపంతో భయంకరమైన రూపం కలవాడై) ఆకాశంకేసి చూస్తూ పెద్దగా అరచాడట.

ఆ బొబ్బరింతకు అనంతమైన సమాధి స్థితిలో నున్న మునిసమూహము కళ్లుతెరచి చూడడమేకాక, దిగ్గున లేచి నిల్చున్నారట. తమతమ గూళ్లలో గ్రుడ్లపై పొదుగుతూన్న పులుగు (పక్షి) మూకలు చెదరి చెట్లపై కలకలం సృష్టించాయట. పులు (కసవు) మేస్తున్న లేళ్ల గుంపులు కలతపడిన మనస్సులతో యిటూ అటూ గంతులు పెట్టాయట. ప్రజయేమో చేతులతో కర్ణరంధ్రాలను (చెవులను) మూసుకొనడమేకాక పవి శంకతో (ఆ ధ్వని పిడుగుపాటు అనే భ్రాంతితో) నరనుతి ప్రవణమయ్యిందట. (నరుడు అంటే అర్జునుడిని స్తుతించడానికి ఆసక్తి కలదయిందట).

పిడుగు శబ్దానికి భయపడే జనం ఆ శబ్దం వినబడగానే అర్జునుడి పది పేర్లనూ తలచుకుంటూ యీ క్రింది శ్లోకాన్ని చదవడం అనాదిగా వస్తూన్న ఆచారం.

శ్లో॥ అర్జునః ఫల్గుణః పార్థః కిరీటీ శ్వేతవాహనః
బీభత్సు ర్విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః॥

వర్షకాభ్రాన్ని (*Thunder cloud or cumulonimbus cloud*) 'పర్జన్యము' అంటారు. ఇంద్రుడికి పర్జన్యుడనే మరో పేరుంది. సాధారణ వర్షాలకు వరుణ దేవుని కృప కారణమనీ, మెరుపులూ, పిడుగులతో కూడిన జడివానకు ఇంద్రుని ఆగ్రహం కారణమనీ మన పూర్వులు విశ్వసించేవారు. పిడుగు అంటే, ఇంద్రుని చేతిలోని వజ్రాయుధమేనని వారి విశ్వాసం. అందుచేత, పిడుగుపాటు యొక్క విపరిణామాల్ని గురించి ఎరిగిన భారతీయులకు తమను పిడుగుపాటునుంచి రక్షించమని అనాదిగా ఇంద్రుని కొడుకైన అర్జునుడి నామస్మరణ చేయడం ఓ ఆచారమైంది. ఏ యింటి నుండి అర్జునుడిని స్తుతిస్తూ అతడి దశ నామాలనూ తెలిపే శ్లోకం వినబడుతుందో ఆ యింటిపై ఇంద్రుడు పిడుగులు కురిపించడని వారు విశ్వసించేవారు.

శాస్త్రీయ దృష్టితో ఆలోచిస్తే గాలి ప్రవాహానికి పర్జన్యము (*cumulonimbus cloud*) లోని నీటి మరియు మంచు కణాలు ఒరుసుకున్న కారణంగా స్థావర విద్యుత్ (*static electricity*) పుడుతుంది. ఆ వర్షకాభ్రము యొక్క పై భాగంలో ధనవిద్యుత్తు, క్రింది భాగంలో ఋణవిద్యుత్తు పోగుపడుతుంది. ధనవిద్యుదావేశం కలిగిన మేఘపు పై భాగము, ఋణవిద్యుదావేశం కలిగిన దాని క్రింది భాగముల మధ్య మెరుపుతో కూడిన పిడుగు ఏర్పడి ఆ ఛార్జ్ తటస్థీకరించ (*neutralise*) బడుతుంది. అలాగే ఒక్కోసారి ఋణవిద్యుదావేశం కలిగిన ఆ మేఘపు క్రింది భాగము, ధనవిద్యుత్ ఛార్జ్ కలిగిన భూ ఉపరితలం మధ్య కూడా మెరుపులతో కూడిన పిడుగు ఏర్పడి ఛార్జ్ తటస్థీకరించబడుతుంది. విద్యుత్ప్రవాహమేకాక అప్పుడు విపరీతమైన వేడీ, కాంతీ కూడా పుడతాయి. మెరుపు (*lightning*) లోని విద్యుత్ వేడికి వెచ్చబడిన గాలి పొరలు అతిశీఘ్రంగా వ్యాకోచించడం (*expansion*) కారణంగానే పిడుగుపాటు యొక్క శబ్దం పుడుతుంది. మెరుపు జనించిన సందర్భంలో ఏర్పడిన విద్యుత్ ప్రవాహం వెంటనే భూ ఉపరితలాన్ని తాకుతుంది. కాంతి కూడా అతివేగంగా (కాంతివేగం సెకనుకు 29,97,92,458 మీ.) చూపరుల కంటికి చేరుతుంది. అయితే పిడుగుపాటు శబ్దం మాత్రం (శబ్దవేగం సెకనుకు 331 మీటర్లు మాత్రమే) మెరుపు కనుపించిన తర్వాత కొంతసేపటికి మనం వినగలుగుతాం. కాంతికీ, శబ్దానికీ వేగంలో ఉన్న తేడానే దీనికి కారణం. పిడుగుపాటు సందర్భంగా ఏర్పడిన

విద్యుత్ప్రవాహం భూ ఉపరితలం దిశగా అతివేగంగా ప్రవహించి ఎత్తైన వృక్షాలు మరియు భవనాలపై పడి నాశనం చేస్తుంది. పెద్దలు అందుకే పిడుగులూ, మెరుపులతో కూడిన వాన కురిసేటప్పుడు నేలపై బల్లపరుపుగా పడుకుంటే అపాయం తప్పుతుందని చెప్తారు. అలాగే ఆ సమయాల్లో ఎత్తైన వృక్షాల క్రింద నిల్చొనవద్దనీ చెప్తారు. ఎత్తైన కొబ్బరిచెట్లు, తాటిచెట్లవంటి వాటిపై పిడుగులు పడి ఆ విద్యుదాఘాతానికి అవి నిలువునా మాడిపోవడం మనం తరచూ చూసే దృశ్యమే. అలాంటప్పుడు ఎత్తైన చెట్లక్రింద వుంటే వాటితోపాటు మనమూ పిడుగుపాటుకు గురౌతాం. అధునాతనంగా నిర్మించబడే పెద్ద పెద్ద భవనాలకు పిడుగుపాటులోని యీ హైవోల్టేజి విద్యుత్ప్రవాహాన్నుంచి రక్షణ కల్పించడానికి లైట్నింగ్ అరెస్టర్ (*Lightning Arrester*) లను ఏర్పాటు చేస్తున్నారు.

మనం ఇంద్రుడిని పిడుగుకు అధిపతిగా భావించినట్లే ప్రాచీనకాలపు గ్రీకులు జియస్ (*Zeus*)నూ రోమన్లు జూపిటర్ (*Jupiter*)నూ పిడుగుపాటుకు అధిపతిగా భావించేవారు. అతడు ఎడమ చేతిలో రాజదండాన్నీ (*Sceptre*) కుడిచేతిలో పిడుగునూ ధరించేవాడని వారి విశ్వాసం. ఆకాశాన్నుంచి రాలే ఉల్కలూ (*Meteors*), వ్యోమశకలాలూ (*Asteroids*), బొలైడులూ (*Bolides*), ఎయిరోలైట్స్ (*Aerolites*) వగైరాలన్నీ భూమండలంపై నివసిస్తూన్న ప్రజలపై కోపంతో మెరుపు, పిడుగులతో కలిపి జియస్ లేక జూపిటర్ విసరుతున్నట్టివని వారు నమ్మేవారు. అయితే ఆధునిక విజ్ఞానశాస్త్రం తేల్చినదేమంటే – పిడుగు ఏర్పడినప్పుడు కేవలం విద్యుత్తు, కాంతి, ధ్వనీ మాత్రమే జనిస్తాయనీ పిడుగుపాటు సందర్భంగా ఎటువంటి ఘన పదార్థపు శకలాలూ జనించవనీ, కనుక పైన తెల్పిన శకలాలకు పిడుగుపాటుతో ఏ సంబంధమూ లేదనీ.

మరో చిత్రమైన విషయమేమంటే మన వాళ్లు ఉరుముశబ్దం వినగానే 'అర్జునా . . . ఫల్గుణా' అంటూ అర్జున నామ సంకీర్తనం చేస్తారు. పిడుగుపాటుకు ఏర్పడే విద్యుత్తూ, కాంతీ అత్యంతవేగంగా భూమిమీదికి చేరతాయి. మనం ఇందాకనే చెప్పుకున్నట్లుగా శబ్దవేగం తక్కువ కనుక పిడుగుపాటు ధ్వని మాత్రం ఆ తర్వాత కాసేపటికి మనకు వినబడుతుంది. అంటే మెరుపు మెరసినప్పుడే దానితో బాటు విద్యుదాఘాతం భూమికి చేరి నాశనం సృష్టిస్తూంటే, ఆ తరువాత కాసేపటికి మనకు వినబడే ఉరుము శబ్దం విన్నాక మనం 'నరసుతి' చేస్తే మాత్రం ఏం ప్రయోజనం? అప్పటికే జరగాల్సిన విధ్వంసమేదో జరిగిపోతుంది. అందుకే పిడుగుపాటు నుండి నేటికీ యీ విధమైన 'రక్షణ' పొందగోరేవారు ఉరుము శబ్దం విన్న తర్వాత కాక మెరుపును చూడగానే అర్జున నామ సంకీర్తన చేయడం ఉచితమనిపిస్తూంది కదూ !

ఇలా తీరని కోపము కాలభైరవుని మనస్సులో మల్లడి కొల్పగా (కలతపెట్టగా) అతడు మహాశ్యేనము వలె (పెద్ద డేగ, గరుత్మంతుని వలె) ఒక్క ఉదటున ఆకాశానికెగసి ఆ విద్యాధరుని విమానాన్ని భగ్నంచేసి కూల్చగా ఆ త్రిదశగాయకుడు (దేవతల గాయకుడైన ఆ గంధర్వుడు) నేలకూలాడట.

రామకృష్ణకవి ఓ పద్యంలో అతడు విద్యాధరుడనీ, మరోపద్యంలో గంధర్వుడనీ, త్రిదశ గాయకుడనీ (అంటే గంధర్వుడే), యింకొక పద్యంలో ఖేచరుడనీ (దేవతనీ) పేర్కొనడం కొంచెం వింతనిపిస్తున్నది.

క్రిందపడిన ఆ బాలిశుని (మూర్ఖుడైన ఆ గంధర్వుడిని) ఒక వ్యాళవిభుడిని (పెనుబామును) పెను పులుగు (గరుడపక్షి) పట్టి నేలపై యీడ్చు కెళ్లిన విధంగా, అతని మేనిపై చర్మం (కుబుసం) ఒక పోరువ (పొర) లేచేటట్లు యీడ్చుకెళ్లాడట.

అదిచూచిన విష్ణువు 'ఓ కాలభైరవా! ఆగు. విమానభ్రష్టుడై నేలపై కూలిన యీ గంధర్వుడి గర్వం అణగిపోయింది. ఇతన్ని చంపకూడదు. గొప్ప అపరాధములు చేసిన వాడినైనప్పటికీ, భయపడేవాడిని చంపకుండా విడచిపెట్టడం ఉత్తమ పురుషుల లక్షణం. ఈ సందర్భంలో కొంచెం నీ కోపాన్ని అదుపులో పెట్టుకో" అన్నాడు.

అప్పుడు కాలభైరవుడు ఆ విద్యాధరుడిని విడచిపెట్టాడు. అతడు గులగులలై (నలిగిపోయి) లావు అగలిన (బలము నశించిన) తన దేహాన్ని విదలించుకుంటూ కిదుకుచూ (మూల్గుతూ) పైకి లేచాడట.

అవతీర్ణగర్వవిద్యాధరుడైన (నశించిన గర్వవిద్య కలవాడైన అంటే గర్వం నశించినట్టి) ఆ విద్యాధరుడు విట్ఠలునితో – "ఓ లక్ష్మీశా! నీ ఆలయం మీదిభాగపు ఆకాశంలో నా విమానంతో గిరికీలు కొడుతూండగా, కోపోద్రగుడైన ఒకడు నా విమానాన్ని ధ్వసం చేసిన కారణంగా నా క్రొవ్వు నశించి నిన్ను దర్శనం చేసుకోగలిగాను. ఓ సురేశా! (దేవాధిపుడివైన ఓ శ్రీహరీ!) నిర్మదులకు (మదము – అహంకారము – నశించినవారికి) కనుపించినట్లుగా నీవు దుర్మదులకు (దురహంకారులకు)

కనుపించవు కదా!" అన్నాడట ఆ మనుజధర్మ భటుడు (మనుష్యధర్ముడంటే నరవాహనుడైన కుబేరుడు. గంధర్వులు కుబేరకింకరులే కదా! అందుకే కవి గంధర్వుడిని మనుజధర్మ భటుడు అంటున్నాడు.) మనోముర్మురదార్తితో (మనస్సనెడి ఉముకనిప్పు - ఊకనిప్పు - వలని తాపంతో) పశ్చాత్తప్తుడై యింకా యిలా అంటూ "నేను పాపాత్ముడిని. మూర్ఖుడను. అహంకారిని. అజ్ఞానిని. పెక్కు రూపముల ద్రోహములు, అపచారములు అనే అర్బుదముల (సమూహముల) యందు మనస్సు నిలిపినవాడిని. అయినా నీ పవిత్ర పాదద్వయంపై ఎక్కువ మక్కువ కలవాడిని. నన్ను రక్షించు. ఓ శివకరా! (మేలుచేసేవాడా!)" అని ఆ జిష్ణువైన (జయశీలుడైన) కృష్ణుని నుతించాడట.

ఇంకా అతడు, "ఓ యదుకులనాథా! ఈ కాలభైరవుడు కోపంతో నాకు విధించిన శిక్ష నా పాలిట వరంగా మారింది. ఇంద్రియములకు నన్ను బానిసను కావించిన శ్రీమదము (ధనగర్వము)ను అణచి ఈతడు నన్ను నీ అడుగుమానిసిగా (పాద సేవకునిగా) మార్చివేశాడు కానీ లేకుంటే సంపద గల గర్వపోతు లోకంలో ఎక్కడైనా నేనిప్పుడు చేస్తున్న విధంగా నీకు పూజలు చేస్తాడా? మూఢుడిని నేను. నన్ను బ్రోవుము. మహద్రీఢ (మహత్ + రీఢ - పెద్దలను తిరస్కరిస్తూ తెగడడం)కు నేనిక ముందెప్పుడూ పాల్పడను. ఓ దయాగాథా! (ఎక్కువ దయగలవాడా! దయానిధీ!) ఓ కాతర సముద్ధరణోచిత కార్యధుర్యా! (భయపడినవారిని రక్షించుటకు పూనుకొనిన దేవుడా!) త్వదాజ్ఞ (నీ ఆజ్ఞమేరకు) విమానారూఢుడినై జగములన్నీ తిరుగుతాను ఓ శ్రీహరీ! సురసదనములో కానీ (అమరులకు రాజధానియైన అమరావతి యందుకానీ) క్షోణితలంబున కానీ (భూలోకంలోకానీ) భీకర నిరయములో కానీ (భయంకరమైన నరకలోకములో కానీ) ఎల్లప్పుడూ నీ చరణ సరోరుహములనే (నీ పాద పద్మములనే) తలస్తూ వుంటాను" అని వలగొని (వలయంగా విష్ణువు చుట్టూ ప్రదక్షిణంచేసి) నిరుపమానమైన ఆతని దివ్యరూప సందర్శనముచే తృప్తిపడుతూ, పరవశిస్తూ ఆ విద్యాధరుడు అక్కడినుంచి వెళ్లి పోయాడు.

"ఓ శతధృతి తనయా! (ఓ నారదా!) ఈ విధంగా మధుమథనుడి (మధువనే రాక్షసుని సంహరించిన విష్ణువు యొక్క) ఆజ్ఞతో ఇంతటి గొప్ప ప్రాభవంతో ప్రకాశిస్తూ, ధరా (భూలోక), అధోభువన (పాతాళలోక) స్వర్గధామములలో నుతింప (కొనియాడ) బడుతూన్న క్షేత్రవిభుడైన భైరవ దేవుడిని దర్శనం చేసుకున్న పిదపనే కృష్ణుని దర్శనం చేసుకోవాలి" అంటూ ముగించాడు శివుడు.

అప్పుడా అనిమిషముని (దేవముని - నారదుడు) శివునికి ప్రాంజలియగుచూ (చేతులు జోడిస్తూ) "ఓ చంద్రశేఖరా! భవబంధములు వీడిపోయే విధంగా నీవు చెప్పిన యీ క్షేత్ర మాహాత్మ్యము, మహా క్షేత్రపాలుని దివ్య చరితము, అందలి దేవదేవుని గుణకలాపము, పుండరీకుని మహిమ విని తరించాను. అయితే యీ మహాక్షేత్రమునకు ఎన్ని ద్వారములున్నాయో, అక్కడ నివసించే ద్వారదేవత లెందరో, ఆయా ప్రదేశముల పుణ్యవైభవమేమిటో - యింకేమైనా విశేషాలుంటే వివరించు" అని కోరాడు.

అప్పుడా మనసిజమర్దనుడు (మన్మథుని సంహరించిన శివుడు) తన చిత్తాంభోజమున (మనస్సనే పద్మములో) పద్మదళాయతాక్షుని (తామరరేకులంతటి విశాల నేత్రములు కల విష్ణువును) స్మరించి మధుర గంభీరస్వరంతో యిలా చెప్పసాగాడు.

# తూర్పు ద్వారం

"సుఖమాలిక అనే తరంగిణి (నది) భీమరథీ నదితో సంగమించే తీర్థము ఆది తీర్థమై వెలుగొందుతూ చతుర్ముఖాదులచే కొనియాడబడుతూంది. అది దర్వీకరసార్వభౌమతల్పు నగరికి (సర్పములకు రాజైన ఆదిశేషుడిని తల్పముగా కల విష్ణువు

నగరానికి) తూర్పు ద్వారము. అక్కడ సర్వసుపర్వార్చితపద (సకల దేవతలచే అర్చించబడే పాదములు కలదియైన) గీర్వనిత (గీ : + వనిత - సరస్వతీ దేవి) కృష్ణుని ఆజ్ఞ మేరకు నివసిస్తూన్నది. ఆ తీర్థమునకు సిద్దేశ్వర తీర్థమని పేరు. అది సంపదలచే గొప్పది. అది అపంకజల సనాథము (బురదలేని తేటనీటితో కూడినట్టిది). అది లక్ష్మీకాముకునిచే (లక్ష్మీ దేవికి ప్రియుడైన విష్ణువుచే) నిహితము (ఏర్పరచబడినది). అక్కడ ఖచరాలీమాన్యమగు (సకల దేవతల సమూహమునకు గౌరవింప దగినదియైన) శంభులింగము (శివలింగము) కూడా వుంది.

# దక్షిణ ద్వారం

"ఇక దక్షిణపు వాకిలిన పుష్పావతీ నది భీమరథీ నదిని సంగమించే తీర్థముంది. అజ్ఞానమనే అగ్నిని ఆ తీర్థములోనే దానము, స్నానము మొదలగు వానిచే నశింపజేసుకొనవచ్చును. సంగమ తీర్థముగా ఖ్యాతిగాంచిన అక్కడి నీటిలో దేవతలు శిలల రూపులో వుంటారట. అచ్చటికి సమీపంలోనే నీ ఆశ్రమం వుంది కనుక నీకు దానిని గూర్చి పెద్దగా వివరించే పని లేదనుకుంటాను, నారదా!" అక్కడికి సమీపంలోని అరణ్యంలో ఒక బోయవాడున్నాడు. అతడు విల్లంబులు ధరించి, కల్మష సమూహములు (పాపముల గుంపు) ధరించిన శరీరము అన్నట్లుగా వున్న భీకర శరీరంతో పేరలుక (గొప్ప క్రోధము) వహించినచో భూమి క్రింద భూభారాన్ని మోస్తూన్న కరీంద్రులకే (దిగ్గజములకే) హృదయం కలతపడుతుంది. ఇక మిగిలిన జంతుజాలం ఆ తీక్ష్ణతకు ఏం ఓర్చుకోగలవు?

ఒకసారి అతడు వేటకు వెళ్లాడట. తన తీక్ష్ణమైన రెండు దృక్కుల్నీ ఏకాగ్రంచేసి మెడ త్రిప్పకుండా అతడు ఒక దుప్పికి గురిపెట్టాడు. బూడిద పండు (విభూతి పండు)లా బూదుపారుతూ(దుమ్ముకొట్టుకొని) యున్న ఆ దుప్పి బీదకన్నుపడి (భయపడి బెదురుచూపులు కలదియై) భయజ్వరతప్తచిత్తమైందట (భయమనే జ్వరంతో కాగిపోయిన మనస్సు కలిగినదైనదట) ఆ చమూరువు (ఆ దుప్పి) యూథమును (గుంపును) వదలి పరుగెత్తిందట. ఆ బోయవాడు దానిని వెన్నాడుతూ తరుముకుంటూ వెళ్లాడట. అప్పుడా దుప్పి పొడవుసాగి విజృంభిస్తూన్న నాలుకతో భయంకరమైన ముఖంకల రాహువుకు భీతిచెంది పరుగెత్తుతూన్న ఇందుమృగశాబమా (చంద్రుడనే జింకపిల్లా లేక చంద్రునిలోని జింకపిల్లా) అన్నట్లున్నదట!

ఆ రురువు (నల్లచారల దుప్పి) యిలా పరుగెత్తి పరుగెత్తి, పడుతూ లేస్తూ అమితవేగంగా పరుగెడుతూ, వపుర్వ్యథ చేత (శరీరంలో అలసట కారణంగా ఏర్పడిన బాధతో) సంగమ తీర్థ తీరంలోని విస్ఫార లతానికుంజములలోనికి (విశాలమగు తీగ పొదరిండ్ల లోనికి) వడిగా దూరిందట. అప్పుడా కిరాతుడు క్రూర శిలీముఖంతో (వాడి బాణంతో) దాని గుండియగాడం గా (గుండెలలో నాటుకొనేట్లు) దాన్ని కొట్టాడట. ఆ దెబ్బకు - గాలి తాకిడికి బంధుజీవ కుంజంబు (మంకెన పొద) నుండి ఎర్రని పూలు జలజలా రాలినట్లు ఆ జింక శరీరం పైని క్షతము (గాయము) నుండి క్రొంగొత్త రక్తబిందువులు ధారగా స్రవించాయట. దాని వివృతాస్యసీమ (తెరువబడిన నోటి) నుండి గొప్ప ఆర్తనాదం వెలువడుతూండగా ఆ మృగము ఆ యేటిలోని తెలినీటి తెమలులో (స్వచ్ఛమైన నీటి ప్రవాహంలో) దూకిందట. ఆ నీటి కెంత మహిమ వుందంటే, నీటిని తాకీ తాకగానే ఓ దేదీప్యమానమైన హాటక (బంగారు) విమానము నెక్కిన విద్యాధరేంద్రునిగా (విద్యాధరులకు రాజుగా) మారిపోయిందట ఆ జింక. శరీర లావణ్యంలో పుష్పాస్త్రుడా (మన్మథుడా) అన్నట్లున్న ఆ జింక (విద్యాధరుడు) చంద్రకాంతిని మించిన దేహకాంతితో, ఇంద్రుని గొప్పతనాన్ని మించిన గొప్పతనంతో గగనవీథికేగిందట.

ఆ మృగవధాజీవుడు (మృగవధచే బ్రతికే ఆ బోయవాడు) ఎంతో ఆశ్చర్యమునంది, మనస్సులో పదేపదే యీ వృత్తాంతాన్నే తలచుకొంటూ, తన దుర్వృత్తిని విసర్జించి, మహామహిమాన్వితములైన ఆ తీర్థజలములలో స్నానమాడి, వాటిని

త్రాగి, విగతాంతరాత్ముడై (నిర్విచారమైన మనస్సు కలవాడై) ముక్తిపొంది దివ్యులు (దేవతలు) మెచ్చేవిధంగా ఉచ్చస్థితిని పొందాడట.

ఏ మాత్రం బుద్ధిలేనివారు కూడా ఆ తీర్థంలో మరణిస్తే కైవల్య ప్రాప్తిని పొందుతారు. ఇక నీ వంటి అతి శుద్ధమతుల సంగతి వేరే చెప్పాలా?

దక్షిణపు వాకిలి దగ్గరవున్న మహాక్రీడనస్థలిలో తొల్లి (ఒకప్పుడు) లచ్చిమగడు (విష్ణువు) లంఘనా క్రీడనము లాచరించాడట. (అంటే గంతులాటలు ఆడాడట). అక్కడ యిప్పుడు విబుధ వల్లభాజనములు (దేవతా స్త్రీలు) మూడు సంధ్యలలో నివాళులు (హారతులు) యిస్తూ, బిరుదాంక మాలికలు పేర్కొంటూ (విష్ణు సహస్రనామాల్ని పఠిస్తూ) లోచూపుతో (అంతర్దృష్టితో) పరవశిస్తూ, పులకాశ్రు గాద్గద్యము (శరీరం పులకించడము, ఆనందాశ్రువులు జలజలా రాలడము, కంఠమునుండి మాటరాక గద్గదమవడము) పొందుతారట. శ్రుతులను (వేదములను) ఉన్నవి వున్నట్లుగా స్తుతిస్తారట. విష్ణు కథావళిని వీనులవిందుగా వింటారట. కరతాళగతుల (చేతులతో తాళం వేస్తూ) చొక్కటముగా (చక్కగా) నాట్యం చేస్తారట. ఆవేశమునూ, మూర్ఛలనూ (పారవశ్యాన్నీ) అసలట కారణంగా పొందుతూ విష్ణువును సేవిస్తారట ఆ దేవతా స్త్రీలు.

ఒకప్పుడు సంగముడనే మరుద్విద్వేషి (దేవతలను ద్వేషించేవాడు – రాక్షసుడు) శౌరి (విష్ణువు) చేతిలో ఓడిపోయి, ఎక్కడికో పారిపోయి, మరలా వచ్చి అక్కడ భూగర్భంలో శిలాసంఛన్నదేహంతో (రాళ్లతో కప్పబడిన శరీరం కలవాడై) దాక్కుంటే, అది కనిపెట్టిన కృష్ణుడు గాఢక్రోధుడై (తీవ్రంగా కోపించినవాడై) ఆ శిలను గ్రొచ్చివైచి (పగులగొట్టివేసి) ఆ రాక్షసుడిని చూర్ణంలాగా (పిండిలాగా) మెదిపివేశాడట.

ఈ విధంగా ఆ దక్షిణపు వాకిటి యొక్క మహిమలు బహువిధములుగా పొగడదానికి అహిపతికి (వేయినోళ్లున్న నాగరాజైన శేషుడికి) కూడా సాధ్యంకాదు. ఇక మిగిలిన వారికేం సాధ్యమౌతుంది?

## పశ్చిమ ద్వారం

ఇక ఆ క్షేత్రపు పశ్చిమ ద్వారంలో భువనేశ్వరి వెలసిందట. ఆమె కటాక్ష వీక్షణములు (కడగంటి చూపులు) సంతానచింతారత్ననిర్మాణపరమాణునికరములట. దీని అర్థమేమిటో చూద్దాం.

**పంచైతే దేవతరవో మన్దారః పారిజాతకః ।**
**సతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచన్దనమ్ ॥** – అమరకోశము

స్వర్గలోకం (*Heaven, Paradise*) లో ఇంద్రుని నందనవనం (*Eden garden, Elysium*) లో కల్పవృక్షాల పేరుతో ఐదు వృక్షాలుంటాయట. వాటి పేర్లు మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము. ఈ ఐదింటినీ కల్పద్రుమములనీ, కల్పతరువులనీ, కల్పపాదపములనీ కూడా అంటారు. ఇవి కోరిన కోర్కెలు తీరుస్తాయట. ఇవి కాక కల్పలత లేక కల్పలతిక లేక కల్పవల్లి అనే పేరుకల స్వర్గంలోని ఒక తీగ మొక్క కూడా కోరిన కోరికలను తీరుస్తుందని విశ్వాసం. స్వర్గమనేది మానవుడు తనకు అనుకూలమైన రీతిలో చిత్రించుకున్న మనోచిత్రం. అక్కడి నందనవనమైనా అంతే! తనకు సుపరిచితమైన, ఎంతో ప్రయోజనకరమైన వృక్షాలనే మానవుడు నందనవనంలో ఉన్నట్లుగా భావించాడు. మనోహరమైన ఎర్రని జపాపుష్పాలు కల దాసనపు చెట్టు లేక మందార వృక్షము (*Hibiscus rosa-sinensis*) కు వైద్యపరంగా ఎన్నో ప్రయోజనాలున్నాయి. అయితే 'మందార' అంటే అర్కవృక్షమనీ (జిల్లేడు – *Calotropis gigantea*),

బాడిద చెట్టనీ (*Indian coral tree - Erythrina indica*) ఉమ్మెత్త చెట్టనీ (*Datura alba*) వేర్వేరుగా అర్థాలున్నాయి. ఏదిఏమైనా యివన్నీ భూమిమీద మనకు తటస్థించే ఉపయుక్త వృక్షాలే!

ఇకపోతే పారిజాత వృక్షం (*Nyctanthes arbor-tristis*) మనోహరమైన సుగంధ పుష్ప వృక్షం. దీనినే పారిజాతకమనీ, పారిభద్రమనీ అంటారు. పాలసముద్రాన్ని దేవదానవులు అమృతం కోసం చిలికినప్పుడు వెలువడిన యీ చెట్టు అప్పటినుండీ నందనవనంలో ఇంద్రుని సంరక్షణలోనే వుండి, ఆ తరువాత తన ముద్దుల భార్య సత్యభామ కోసం కృష్ణునిచే అపహరించబడి ఆమె ఉద్యానవనంలో నాటబడిందట. సూర్యోదయం కాగానే రాలిపోయే ఎర్రకాడల తెల్లని సుగంధ సుకుమార పుష్పాలు మనందరికీ పారిజాతాలుగా సుపరిచితాలే కదా! 'పారిజాత', 'పారిభద్ర' పదాలకూ బాడిద చెట్టనీ, నింబ వృక్షమనీ (వేపచెట్టు – *Azadirachta indica*), మందారవృక్షమనీ, దేవదారు వృక్షమనీ (*Pine tree - Cedrus deodara*), సరళ దేవదారు వృక్షమనీ (*Pinus longifolia*) వివిధ అర్థాలున్నాయి. ఏమైనా, యివన్నీ ఉపయోగితా విలువలున్నవీ భూమండలంపై మనకు తటస్థపడేవీ ఐనట్టి వృక్షాలే!

ఇక కల్పవృక్షము లేక కల్పకము అంటే 'కచోర' అనే అల్లం జాతికి చెందిన మొక్క (కచ్చూరము లేక కిచిలిగడ్డల చెట్టు – *Curcuma zedoaria*). దీని పూలు చాల ఆకర్షణీయంగా ఉండడమే కాక దీని దుంపలు ముక్కలు కోసి ఎండబెట్టి వైద్య పరిశ్రమలలోనూ, సుగంధద్రవ్యాలు (*perfumes*), సౌందర్య పోషకాల (*cosmetics*) తయారీలోనూ వాడతారు. అయితే యిది వృక్షము కాదు. పొదలుగా పెరిగే మొక్క. కొన్ని గ్రంథాలలో దీనినే కల్పవృక్షమని పేర్కొన్నా యిది వృక్షం కాదు కనుక సందేహాస్పదమే!

హరిచందనము అంటే పసుపుపచ్చని గంధపుచెట్టు (*Yellow sandalwood tree - santalum album*). ఎర్రచందనం లేక రక్తచందనపు చెట్టు (*Red sanderswood or Red sandalwood tree - Pterocarpus santalinus*) వేరొక వృక్షం. హరిచందనం యొక్క గంధం అరగతీసి పూస్తే చర్మం యొక్క సౌందర్య పోషణకూ, శరీరంలోని ఉష్ణతాపాన్ని హరించడానికీ ఎంతో ఉపయుక్తంగా వుంటుంది. ఎన్నో ఔషధవిలువలున్న వృక్షమైన హరిచందనాన్నిసైతం మానవుడు స్వర్గలోకంలోని నందనవనపు కల్పవృక్షాల జాబితాలో చేర్చడంలో ఆశ్చర్యమేమీ లేదు!

ఇక సంతానవృక్షము లేక సంతానక వృక్షము (*Rhododendron arboreum*) హిమాలయాలలో మనకు విస్తారంగా కనుపించే వృక్షం. చక్కటి నీడనివ్వడమేకాక, ఆకర్షణీయమైన ఎర్రని రక్తవర్ణపు పెద్దపెద్దపూలు పూస్తుందీ చెట్టు. ఈ పూలను పూజల్లో వాడతారు. రుచికి కొంచెం పుల్లగా వుండే యీ పూలను తింటారు. వీటితో ఊరగాయ పచ్చళ్లు పడతారు; షర్బత్‌లు తయారుచేస్తారు. ఐదు పుష్పదళాలూ అతుక్కుని, గంట ఆకారంలో వుండే యీ పూలు ఫిబ్రవరి – మే నెలల మధ్యలో పూస్తాయి. ఇది ఎరికేసీ (Ericaceae) కుటుంబానికి చెందిన వృక్షం.

చింతారత్నము అన్నా చింతామణి (*The philosopher's stone*) అన్నా మనకు కథలలో చెప్పబడిన ఓ దివ్యమణి. ఇది ఎవరి వద్ద వుంటే వారికి కోరిన కోరికలన్నీ నెరవేరతాయట. అంతేకాక యీ ఊహాజనిత మణిస్పర్శతో క్షుద్రలోహాలు వెండి, బంగారుగా మారతాయట; ఇది కలిగివున్న వారు దీర్ఘకాలంపాటు జీవిస్తారట.

అంటే ఆ భువనేశ్వరీదేవి కడగంటి చూపులు సంతాన (కల్ప) వృక్షము యొక్కయు, చింతామణి యొక్కయు సృష్టికి ఉద్దేశించబడిన పరమాణు సమూహమట. అంటే ఆమె కటాక్షములు కోరిన కోర్కెలనొసగుతాయట.

# ఉత్తర ద్వారం

ఆ నగరి ఉత్తరపు వాకిటిలో తన అంఘ్రి (పాదము) యొక్క బొటన వ్రేలితో పోర్మహిషుడిని (యుద్ధము చేస్తున్న మహిషాసురుడిని) త్రొక్కిపట్టి, ఆ అసురుడి దేహమును నుజ్జునుజ్జు చేసి, తాను ఆ రక్తంతో తన నుదుటిపై పెట్టుకున్న ఎఱ్ఱని బొట్టా అన్నట్లుగా ఎఱ్ఱగా ప్రకాశిస్తున్న వీక్షణము (కన్ను)ను అలికదేశమున (నొసటన) కలిగిన 'స్వర్గద'యైన (స్వర్గమునిచ్చేది - మోక్షమునిచ్చేదియైన) దుర్గను వార్మణిధారి (నీటియందు పుట్టిన - కౌస్తుభమణిని ధరించినవాడైన విష్ణువు) తన నగరికి కాపుగా నిలిపాడట.

క॥ తరణియు భైమియును బర
స్పరమచ్చటఁ గూడి నిగుడఁ బావనమగు త
త్సరిదంబువునం దాడిన
నరునకు నవ్వారి చరణ నఖమున వెడలున్. (పాండురంగ మాహాత్మ్యం : 5-26)

తరణి అంటే సూర్యుడనీ, సముద్రమనీ అర్థాలున్నాయి. అయితే భైమీనదికి తరణి అనే పేరుగల ఒక ఉపనది కూడా వున్నది. ఈ రెంటి సంగమ స్థలములో పావనమైన ఆ సరిదంబువులో (సరిత్తు అంటే నది. అంబువు అంటే నీరు. ఆ నది నీటిలో) ఆడిన (జలకమాడిన, స్నానం చేసిన) నరునకు ఆ వారి (ఆ నదీజలము) చరణ నఖమున (కాలిగోటిన) వెడలుతుందట. విష్ణువు పాదం నుండి దివిజ గంగా ప్రవాహం ఏవిధంగా జాలువారిందో అలా. అంటే అక్కడ స్నానమాడినవారు సాక్షాత్తూ విష్ణుస్వరూపులౌతారట. అంటే సారూప్యమోక్షం పొందుతారట.

వ్యాధిగ్రస్తుడైనవాడు, భయవిహ్వలాత్ముడు (భయంతో కంపిస్తున్న మనస్సు కలవాడు), అధనుడూ (నిర్ధనుడు - ధనములేని పేదవాడు) అయినట్టివాడు అక్కడి దుర్గను పువ్వులతో పూజిస్తే యిష్టభోగములను (కోరిన సౌఖ్యములను) పొందుతాడట.

"ఈ నాలుగూ అంతర్ద్వారములు (లోపలి ద్వారములు); ఇక బహిర్ద్వారముల (బయటి ద్వారముల) సంగతికూడా చెపుతాను విను" అన్నాడు గోకర్ణ కుండలుడైన (పాములను హారములుగా ధరించే వాడైన) శివుడు శ్రద్ధతో వింటూన్న నారదునితో.

జగత్పతియైన యీ పాండురంగ విట్ఠలుడి నగరానికి పశ్చిమ బహిర్ద్వారంగా (వెలి ద్వారంగా) కరవీరమనే గొప్ప నగరం వుంది. ఆ నగరిలో కరకు రక్కసుడిని త్రొక్కివేసిన భద్రకాళిక ప్రకాశమానంగా వుంటుంది. ఇక్కడ వున్నట్లే అక్కడ కూడా నేను (శివుడు) కోటీశ్వరుడనే ఆహ్వయము (పేరు)తో నివసిస్తూంటాను. అక్కడ జలధియోషామతల్లి (సముద్రునికి భార్య) యైన గొప్ప పుణ్యజలములు కలిగిన పవిత్రమైన నది అభ్రంకషోర్మలతో (ఆకాశాన్ని తాకే ఎత్తైన అలలతో) ప్రవహిస్తూంటుంది. నత జగత్త్రితయ (మూడులోకములూ - స్వర్గ, మర్త్య, పాతాళ లోకములూ - తనకు వంగి నమస్కరిస్తూన్నట్టిదైన నారాయణీ దేవి అక్కడ ప్రసిద్ధంగా వెలసింది. బురుజులూ, తోరణములూ, హట్టములూ (అంగడి వీథులూ), తిన్నెలూ, ప్రకాశించే గోపురాలూ, దడిగోడల యిండ్లూ, మణులు తాపడం చేసిన మేడలు మున్నగువానితో శోభిస్తూన్న ఆ కరవీర పట్టణం పుండరీక క్షేత్రానికి పడమటి వెలి ద్వారంగా వున్నది.

ఇక పాండురంగ పురానికి దక్షిణ బహిర్ద్వారమైన కృష్ణానదీ తీరంలోని శూర్పలమనే ప్రధాన క్షేత్రములో నేన

(శివుడు) జాగరూకతతో పాలిస్తూంటాను. (శూర్పల ప్రస్తుతం పేరేమిటో తెలియడం లేదు. ఇది ప్రస్తుతం కర్నాటకలోని బీజపూర్ జిల్లాలో కృష్ణానది ఒడ్డున వుండవచ్చు.)

ఆ నగరి తూర్పు బయటి ద్వారమునందు పుష్కరిణి అనే ఆపగ (నది) తనకు ఉత్తర దిశలో ప్రవహిస్తూ వుండగా సర్వాలంకృతుడై చేతిలో గదతోనున్న త్రివిక్రముడు పయోదచ్ఛవితో (నీలమేఘ కాంతితో) వెలుగొందుతున్నాడట.

తన ఖరనఖర (వాడియైన గోళ్లతో) దళిత (చీల్చబడిన) రాక్షసరాజైన హిరణ్యా కశిపుని యొక్క వక్షము (రొమ్ము) నుండి స్రవిస్తూన్న ఎర్రని రక్తంతో తడిసి ఎరుపెక్కిన కేసరములు (జూలు) కలవాడైన నరకేసరి (నరసింహుడు) ఉత్తరపు గవనిని (ద్వారమును) కావలి కాస్తాడు.

"ఓ నారద మునీంద్రా! ఇలా లోపలి ద్వారాలు నాలుగు, బయటి ద్వారాలు నాలుగు అపవర్గ శ్రీ (మోక్ష సంపద)ని కలుగజేయగా యీ నగరాద్ధరుని (నగరాట్ - పర్వతములకు రాజనదగిన గోవర్ధన గిరిని ధరించిన కృష్ణుని) నగరమైన పాండురంగ క్షేత్రము అగణిత (లెక్కింప వీలుగానంత గొప్ప) విభూతి (సంపద)తో వెలుగొందుతూన్నది" అని చెప్పి, యింకా ఆ కృష్ణుని గొప్పతనమును గూర్చి మరింతగా తెలుపుటయందు ఆసక్తికల శివుడు నారదునితో యిలా అన్నాడు.

# ధర్మరాజు తమ్ములతో కూడి పాండురంగ క్షేత్రానికి వెళ్లిన కథ

ఒకప్పుడు బ్రహ్మ మానస పుత్రుడైన సనందనుడు ఇభపురము (హస్తినా పురము)నకు వెళ్తే దాని ప్రభువైన ధర్మరాజు ఆతడిని వేయి విధములైన సాధు పూజలతో తెలచెనట (సంతృప్తి పరచాడట)

సనక, సనందన, సనాతన, సనత్కుమారులు నలుగురూ బ్రహ్మ మానస పుత్రులైన మహర్షులు. వివాహం చేసుకుని సృష్టిని పెంచమని బ్రహ్మ కోరినా తిరస్కరించిన వీరు తపస్సుకు వెళ్ళి మహర్షులవుతారు. వీరి శాపం కారణంగానే విష్ణువు యొక్క ద్వారపాలకులైన జయవిజయులు హరి విరోధులైన హిరణ్యాక్ష - హిరణ్యకశిపులుగా, రావణ - కుంభకర్ణులుగా, శిశుపాల - దంతవక్త్రులుగా జన్మించి ఆయనచే వధించబడి తిరిగి విష్ణు సాయుజ్యం పొందారు.

పృథా ప్రథమాత్మజుడు (కుంతీదేవి పెద్ద కొడుకైన ధర్మరాజు) తన తమ్ములతో కూడి ఆ ముని శ్రేష్ఠుని చెంత నిలచి సబాష్ప నేత్రములతో యిలా అన్నాడు. "ఓ భద్రప్రదా! (శుభము లొనగూర్చే వాడా! ఓ సనందనా!) నేను మీరువునై వేడుకుంటున్నాను. నీ దివ్య దృష్టికి పొడమనిది (కనుపించనిది) యీ భువన త్రయములో ఏదైనా వుందా? నాకు ఏదైనా ఉపాయం చెప్పు. చింతాకంత కూడా వెనుదీయక నేను కురుక్షేత్రంలో పాప సంక్రాంత స్వాంతుడనై (పాపముచే ఆక్రమించబడిన మనస్సు కలవాడనై) ఎందరో సుహృదులను (చెలికాళ్లను; మిత్రులను) సుతులను (వరుసకు పుత్రులను) పితృలను (వరుసకు తండ్రులను), భ్రాత్రాదులను (సోదరులు వగైరాలను) చంపి అత్యంత ద్రోహమొనర్చి కూడా యింకా ప్రాణములతో తిరుగాడుతున్నాను. వితర్కించి చూస్తే యీ విషయంలో నాతో పోటీ పడగలవాడు ఎవ్వడూ కానరాడు. వంగడము (వంశము) అనే వెదురును కోపపుటింగలమున (కోపము + ఇంగలమున – కోపమనే అగ్నితో) కాల్చి సంపాదించిన యీ సిరి (రాజ్యలక్ష్మి) నిందాసంగతి చేత (ఆత్మీయులను చంపిన అపకీర్తి కారణంగా) పొగచూరింది. ఆ వెదురులోని ముత్యము పొగచూరి మలినమైనట్లే సిరి యనే యీ ముత్యం కూడా దానిలోని పసిమి (కాంతి) నశించి మసకబారింది.

అసిధారలతో (పదునైన కత్తి అంచులతో) దళిత (చీల్చబడిన) బంధువుల భుజమధ్యముల నుండి స్రవిస్తూన ద్రవరూపమైన కొవ్వుచేత మలినమైనట్టి యీ మహాదురితములు (ఘోర పాపములు) మన్నెట్టియు (మన్ను పెట్టి - భూదానం చేసి) వాజిమేధ సమిద్ధానల భూతి చేతనూ (అశ్వమేధయాగం చేసి అందలి అగ్ని యొక్క బూడిదతోనూ) ఉసిమి (తుడిచి)

కూడా పోగొట్టలేక పోయాను. (పాత్రలకు నూనె జిడ్డు వదలాలంటే మన్నుబెట్టి, బూడిదపెట్టి తోముతారు. అలాగే పాప ప్రక్షాళనకు భూదానాలు చేయడం, అశ్వమేధయాగాలు చేయడం చేస్తారు.) అయితే అవేవీ నా ఘోరపాపాల్ని ప్రక్షాళన చేయలేక పోయాయి. ఈ కసటు (పాపము) ఏ రీతిన తొలగుతుంది? నేను శుభములతో ఒప్పారే వాడినిగా ఎలా మారతాను. కొంచెం చెప్పు ఓ మునీంద్రా!"

"ఓ ద్రుహిణ ప్రభవా! (ఓ బ్రహ్మ కుమారుడా!) నేను దుర్మదుడిని; నరకంలో (వైతరణిలో) మునగడానికి సిద్ధంగానున్న నన్ను అందు పడనీయకుండా రక్షించు. ఓ చిత్పూర్ణమతీ! (జ్ఞానముచే నిండిన బుద్ధికలవాడా!) మా వంటి పాపాత్ములకు, అసద్భావులకు శ్రీ వైష్ణవవరులే (ఉత్తమమైన విష్ణుభక్తులే) దిక్కు" అన్నాడు యుధిష్ఠిరుడు.

అప్పుడు సనందనుడు మనస్సులో సంతోషించి, "ఓ భూలోక పాకవిమతా! (పాకాసురుడనే రాక్షసుడిని సంహరించాడు కనుక ఇంద్రుడిని పాకశాసనుడనీ, పాక విమతుడనీ – అంటే పాకాసురుని శత్రువనీ అంటారు. భూలోకపాకవిమతా! అని సంబోధిస్తూ కవి ధర్మరాజును భూలోకములోని ఇంద్రుడంటున్నాడు) శాంబరీ గోపాలుడు (మాయ గొల్లడైన కృష్ణుడు) నీ పక్షాన వున్నాడు. పరమ వైష్ణవ ధర్మపరత్వంతో మెలిగే నీ ముఖము చూస్తేనే చాలు అన్ని పాపములూ అగ్నిని తాకి నశించే తూలికల (దూది పింజల) వలె తొలగిపోతాయి. హరి భక్తి అనే గంగాప్రవాహానికి పాపములనే యిసుకతో కట్టిన అసదుకట్ట (చిన్న ఆనకట్ట) ఎదురు నిలవగలదా? తామరాకు మీది నీటిబిందువులా దురితరాశి (పాపరాశి)లో మునిగినప్పటికీ విష్ణుభృత్యునికి అవేమీ అంటవు. రాత్రింబవళ్లు దీన్ని గురించే ఆలోచించి మనస్సు పాడుచేసుకొనడానికి నీవేమన్నా ప్రాకృతుడివా? (మూఢుడివా?)"

"సత్కీర్తిధురీణా! (గొప్ప కీర్తికలవాడా!) నీవు కర్తవు కావు (చేసే వాడివి కావు); హర్తవు కావు (హరించే వాడివీ కావు; నశింపజేసేవాడివీ కావు); అభిరక్షివీ కావు (రక్షించువాడవూ కావు). ఉత్పత్తి చేయడం (సృష్టి); అభిరక్షణ (స్థితి), హరణము (లయము) – ఈ మూడింటికీ కృష్ణుడే మూలము. పుణ్యము చేసిన గొప్పతనము కానీ, పాపము చేసినందువల్ల సంభవించే వికారము కానీ పురుషుడు పొందడు. తన కర్మల విషయంలో మానవుడు అస్వతంత్రుడు. నిమిత్తమాత్రుడు. పాకము (వంటకము) యొక్క మంచి చెడులు (రుచులు) తెడ్డు (అబక)కేం తెలుస్తాయి?"

"భ్రాతృవధ (సోదరులను చంపడం), పితృవధ (తండ్రిని చంపడం) వగైరాల వలన విష్ణుభక్తులకు పాతకములు కలుగవు. విభీషణుడికి భ్రాతృవధ యొక్క పాతకమూ, ప్రహ్లాదునికి పితృవధ యొక్క పాతకమూ యిసుమంతైనా అంటాయా?"

"ఆ కంసారి (కృష్ణుడి) ప్రసక్తి నీ మదిలో ఒక్కమారు స్ఫురిస్తే చాలు పాతకానీకములు (పాపముల సమూహములు) వణికిపోతూ తొలగిపోతాయి. రవిని (సూర్యుడిని) కప్పివేసే చీకట్లను ఎక్కడైనా చూచామా? విన్నామా? నీ పొటిపొటి తలపోతలు (చిన్న చిన్న సందేహములు) పోగొట్టుకో. ఆరటము (కలత)ను వదలిపెట్టు. నేను చెప్పేది సావధానంగా విను."

"అభ్యుదయము చెందాలనే కోరికతో ఉన్నట్లయితే వెంటనే జగత్కర్తయైన శ్రీమహావిష్ణువు లోక కళ్యాణార్థమై విట్ఠలునిగా భూమిపై అవతరించి, క్షేత్రపాలుడు, పుండరీకుడు వగైరాలచే కొలువబడుతూన్న పుండరీక తీర్థము దర్శించుకో".

క॥ ఏఁగి మహానది వారిం
దోఁగి హరింగొలువు నిఖిల దురిత శ్రేణుల్
కాఁగిన యిను మామిషమని
మూఁగి కొనిన మక్షికా సమూహంబులగున్ (పాండురంగ మాహాత్మ్యం : 5-52)

"నీవు వెళ్లి మహానది (భైమీనది) నీటిలో తోఁగి (మునిగి; జలకమాడి) హరిని పూజించు. సమస్తపాప సమూహములూ, ఎఱ్ఱగా కాలిన యినుప ముక్కను చూచి ఆమిషమని (మాంసమని) భ్రమించి మూగే మక్షికా సమూహముల (ఈగల గుంపుల)లా మాడి నశిస్తాయి."

"బ్రాహ్మణుడినీ, తల్లినీ, తండ్రినీ, సోదరులనూ, దాతలనూ, పెద్దలనూ హింసించే క్రూరుడైనా సరే; శీధుపానాభిరతుడైన (మద్యపానలోలుడైన) దుశ్శీలుడైనా సరే పాండురంగని చూచి పరమపదం పొందుతాడు."

అని చెప్పగా విని, ధర్మరాజు ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణ శ్రేష్ఠులు వెంటరాగా తమ్ములతో కూడి పౌండరీక క్షేత్రమునకు బయలుదేరాడు.

బయలుదేరిన కొంత కాలానికి -

ఆ కుముదాప్త వంశ విభుడు (కలువలకు బంధువైన చంద్రుని వంశపురాజు - ధర్మరాజు) వసుంధరా నాకము (భూలోక స్వర్గము) అన దగినదీ; వాల్మీకి, శుకనాసుడు, శుకుడు మొదలగు మహర్షులచే కొనియాడబడినదీనైన పౌండరీక క్షేత్రమునకు చేరుకున్నాడు.

శుకమహర్షి లేక శుక దేవుడు అని కూడా పిలువడే శుకుడు వ్యాసమహర్షి తనయుడు. ఈయన పుట్టుకతోనే మహాజ్ఞాని అంటారు ఘృతాచీ అనే అప్సరస అందమైన ఆడ చిలుక రూపంలో వచ్చి వ్యాస మహర్షిని మోహింపజేయగా, ఆయన వీర్యం పతనమైంది అందులో నుంచి పుట్టిన తన కుమారుడికి శుకుడని పేరు పెట్టాడు వ్యాసుడు. ఆయన నీతిమంతులలోకెల్లా గొప్పవాడుగానూ, నియమ నిష్ఠలు గల అస్ఖలిత బ్రహ్మచారిగానూ పేరుగాంచాడు. ఆయనలో ప్రేమను రగుల్కొల్ప జేయడానికి దేవవేశ్య రంభ చేసిన అన్ని యత్నాలూ విఫలమయ్యాయట భాగవత పురాణాన్ని పరీక్షిత్తుకు ఉపదేశించింది శుకమహర్షేనట. శుకనాసుడు తారాపీడుడనే రాజు యొక్క మంత్రి అనంతరం గొప్ప భక్తుడిగానూ, మహర్షిగానూ ప్రసిద్ధుడు. చిలుక ముక్కులా వంగినట్టి ముక్కు - గద్ద ముక్కు (*Aquiline Nose*)ను బట్టి యీయనకా పేరు వచ్చింది.

కంబువు (శంఖము) ధరించి, అరాళ చికురంబులు (దట్టమైన తలవెంట్రుకలు) కలిగి, కటి (నడుము)పై నుంచుకొన్న రెండు చేతులు కలిగి, అలికాంబకము (నొసటకన్ను) కలిగి, దిగంబరముగా, జంబుఫలము (నేరేడు పండు) యొక్క కాంతిని తలదన్నే మేనిచాయతో ప్రకాశిస్తున్న, ఐదేళ్ల వయస్సుకల ఆ విట్ఠలుని విగ్రహానికి ధర్మరాజు పూజలు చేశాడట.

పుష్కరిణిలో స్నానంచేసి, పుష్కరదళముల (తామర రేకుల) వంటి నయనములు కలిగిన మూర్తిని (విట్ఠలుని) పూజించి, ధర్మరాజు గొప్ప శుభసంపదలు పొంది, నిష్కల్మషమైన మనస్సు కలవాడయ్యాడట. తండ్రులు, గురువులు, మిత్రులు, సోదరులు వగైరాలను చంపుటచే కలిగిన పాపము తొలగి కురుపతి (ధర్మరాజు) హరి కృపా దానమును పొందాడట దాని కారణంగా యిక అతనికి పునర్జన్మ లేకుండా పోయిందట. అలా ధర్మజుడు కృతార్థుడై తన తమ్ములు, బ్రాహ్మణోత్తములు వెంటరాగా తిరిగి హస్తినాపురానికి చేరుకున్నాడట.

పౌండరీకము మహాపుణ్యఫలములనిచ్చే క్షేత్రమని తెలియని మెదుక (మూర్ఖుడు) యితర పుణ్యతీర్థములకు అవే ముక్తిప్రదాలని ఎంచి వెళతాడు; లోకంలో వాలిన దప్పికతో (అతిశయించిన దాహంతో) వియజ్ఝర కూలంబున (గంగానది

ఒడ్డున) నుయ్యి త్రవ్వే మూఢుడు పుట్టినట్లే - శ్రీలలనా విభుడు (శ్రీలక్ష్మీపతి - విష్ణువు) లేని నేలకూడా క్షేత్రమని భావించి దర్శించుకునే మూఢుడూ పుడతాడు.

చ॥ మసనమునందునైనఁ బురమార్గమునం బడియైన నింటనై
న సకల గర్హిత స్థలమునం బ్లవగేహమునందునైన నా
కసమున నీట నేలపయిఁ గంకటిమీఁదనునైన మానవుం
డసువులఁ బాసి నిష్కలుషుఁడై హరిదానగు నమ్మహాస్థలిన్. (పాండురంగ మాహాత్మ్యం : 5-63)

శ్మశానములోనైనా, పురవీధిలో పడియైనా, ఇంటిలోనైనా, అందరిచే నిందించబడే స్థలంలోనైనా, ప్లవగేహము (మాలవాని గృహము)లోనైనా, ఆకాశములోనైనా, నీటిలోనైనా, నేలపైనైనా, కంకటి (మంచము) మీదనైనా మానవుడు ఆ మహాస్థలిలో (పౌండరీక క్షేత్రంలో) అసువులుబాస్తే నిష్కలుషుడై (పాపములు తొలగినవాడై) హరి తానగు (తానే విష్ణువవుతాడు). సారూప్య మోక్షం పొందుతాడు.

పతితుడైనాసరే వెళ్లి ఆ క్షేత్రంలో మరణించినట్లయితే ఎవ్వడూ పునర్జన్మనందడు. అంచేత, జనులందరికీ ఆ పౌండరీక క్షేత్రానికి వెళ్లి తనువును చాలించడం ఉత్తమం.

అద్రిభృత్ (కొండను మోసినవాడు. గోవర్ధనగిరిధారియైన కృష్ణుని) యొక్క ఉత్తర దిక్కున శతహస్త మితావని (వందమూరల దూరంలో) బోధిద్రుమమూర్తియై (రావిచెట్టు రూపుకలవాడై) తీర్థవాసులను సంరక్షించడానికై నృహరి (నరసింహుడు) వెలశాడు. ఆ నరసింహునికి ఉత్తరపు అంచున గొప్ప మహిమాన్వితమైన కుండల తీర్థమున్నది. ఆ కుండల తీర్థంలో స్నానంచేసి, నరకేసరిని (నరసింహుని) పూజించిన నరుడు రాజసూయ యాగం చేసిన ఫలం పొందుతాడు.

ఆ నరసింహుని యెదుట మరణించినవారు తమ వారితో సహా స్వర్గలోకాన్ని పొందుతారు. దీనికి కప్పయైన ప్రయుతుడి ప్రియపుత్రుడగు అయుతుడే సాక్షి. ఆ క్షేత్రంలో కాని తెరగుల (చెడ్డ దారులలో) ప్రవర్తించే దుష్టులు నిరయము (నరకము)ను పొందక తప్పదు.

కృష్ణునికి పశ్చిమదిక్కులో పద్మ తీర్థముంది. అక్కడ బొందిని (శరీరాన్ని) విడిస్తే వృజినోపేతుడు (పాపములతో కూడుకున్నవాడు) కూడా అనవధి సవనోద్భూత ఫలము (అంతులేని యాగములు చేసిన పుణ్యము) పొందుతాడు.

ఆ పద్మ తీర్థంలోని నీటిని ఎవ్వడైనా, ఎన్నడైనా, ఒక్కించుక త్రాగినా వానికి పాపములు అభ్రపుష్పములు (ఆకాశ కుసుమాలు - అంటే లేనివి); బంధనాలు శశశాబ శృంగములు (కుందేటి పిల్ల కొమ్ములు - అవీ లేనివే); తాపవికారములు మరుజలములు (మరుభూమిలో నీళ్లు అంటే ఎడారిలో నీళ్లు - అవీ లేనివే); పునర్జన్మలు అశ్మతైలములు (రాతిలోని నూనెలు - అవికూడా లేనట్టివే).

# సుశర్మోపాఖ్యానము

ఒకప్పుడు సుశర్మ అనే పేరు కలవాడు ఒకడుండేవాడు. వాడు ఘాతుకుడు (క్రూరుడు); కల్లు త్రాగేవాడు; ధరామర్త్యకులులను (భూసుర కులపువారిని - బ్రాహ్మణులను) వాడు తునిమేవాడట (చంపేవాడట); గురువునకు అఱ (ద్రోహము) తలపెట్టేవాడట. రోజూ బంగారం దొంగిలించేవాడట.

ఆ వృషలీపతి (శూద్ర స్త్రీ భర్త) క్రమక్రమముగా యావజ్జీవితములో చేసిన పెక్కువిధములైన అంహో విసరములను

(అంహస్సు అంటే పాపము; విసరములు అంటే సమూహములు - పాపముల సమూహములను) చిత్రగుప్తుడు (యముని లేఖరి) గుడ్డకాగితంపై కోవలుపడగా (పంక్తులు పంక్తులుగా తీర్చి) పూసగుచ్చినట్లు వ్రాసి భద్రపరచాడట.

ఆ నీచుడొకనాడు నలుగురు వ్యాధులతో (వేటగాళ్లతో) కూడి, ఒక పెద్ద అడవిలో ప్రయాణం చేస్తున్న యాత్రికులను అటకాయించి కట్టిండియై (నిర్దయుడై, కఠినాత్ముడై) దోచుకుని, దాహముతో మండుటెండలో నీటికోసం పరితపిస్తున్న కాసరము (దున్నపోతు)వలె, దాహంతో తపిస్తూ నలుదిక్కులా నీటికోసం రోయుచూ (వెదకుచూ) వున్నాడట.

అంతలో అక్కడ పద్మతీర్థాన్ని చూచిన వాడు అందులో చెమట వదిలేట్లుగా మునిగి ఆ విమలవారిని (నిర్మలమైన ఆ నీటిని) త్రాగి ఒడ్డున ఉన్న రావిచెట్టు మొదట్లో కొద్దిసేపు కూర్చుని బడలిక తీరిన పిదప యింటికి వెళ్లాడట. అతడు త్రాగిన నీరు అతడు లోగడ చేసిన పాపముల సమూహము కరగిపోయేటట్లు, నలుని యందు ప్రవేశించిన కర్కోటకుని విషము నలుని యందలి కలిపురుషుని నశింపజేసినట్లుగా హరించి వేసింది. అతడు చనిపోయిన తరువాత చిత్రగుప్తుడు తన చిట్టాలో వ్రాసుకున్న సుశర్మ పాపముల వివరాలు ఎంచి చూడగా అందు వ్రాయబడిన వందలకోట్ల పాపాలలో ఒక్క అక్షరంకూడా కనబడకపోగా, ఆందోళన చెంది జముని (యముని) దగ్గరకు వెళ్లి చేతులు జోడించి గద్గద స్వరంతో యిలా అన్నాడట.

ఉ॥ దక్కఁగ వ్రాసితిన్ మును పటమ్మున యందు సుశర్మ పాపముల్;
లెక్క యెఱుంగరాదు లవలేశము వానికి; నట్టి వ్రాంతయం
దక్కజ మిప్పుడొక్కటియు నక్షర రూపము లేదు దేవ! నేఁ
డక్కడితంబు గట్టియిడినట్టుల యున్నది కప్పుదేఱుచున్. (పాండురంగ మాహాత్మ్యం : 5-80)

ప్రాచీనకాలంలో వ్రాయడానికి కాగితానికి బదులు గుడ్డ కాగితము వాడేవారు. ఒక గుడ్డపై ఒకప్రక్క నల్లని రంగుగల తైలవర్ణాన్ని మందంగా పూసి, ఆరిన పిదప దానిని పత్రంలా వ్రాసుకొనడానికి ఉపయోగించేవారు. దీనినే 'పటము' అనీ 'కడితము' అనీ అనేవారు. ఒకసారి వ్రాతకు వినియోగించిన పటాన్ని తిరిగి దానిపై నల్లరంగు పూతపూసి ఆరిన పిదప దానినే వ్రాసుకొనడానికి కొత్త కడితముగా వాడేవారు. ఇలా పటానికి రంగు పూసి దానిని మరల వ్రాతకు సిద్ధం చేయడాన్ని 'గట్టి యిడడం' అంటారు. కొత్త కడితం కప్పుదేరుతూ - అంటే నలుపు రంగు తేరుచూ ప్రకాశిస్తూంటుంది.

దక్కగా వ్రాయడమంటే స్థిరమగునట్లు వ్రాయడం. మును - ఒకప్పుడు; లోగడ; లవలేశము - అతికొద్ది; అక్కజము - ఆశ్చర్యము.

"లోగడ స్థిరంగా వుండేట్లు సుశర్మ పాపాలను నేను వ్రాసి పెట్టుకున్న పటము మీద ఆశ్చర్యకరంగా యిప్పుడొక్కటీ కనుపించడం లేదు. ఆ కడితమేమో కొత్తదానివలె నల్లగా తళతళా మెరుస్తున్నది."

"నశించిపోయిన లతాంతములు (పువ్వులు) కలిగిన ఆరామము (తోట)లాగా; విగత తారమైన (అస్తమించిన చుక్కలుగల) విన్ను (మిన్ను; ఆకాశం) లాగా; గళిత (జారినట్టి) వర్ణమైన (అక్షరములుకల) కడితము యిది. దీనికి కారణం మీరే కనుగొనాలి."

అప్పుడు యముడు ఆ మహామతి (గొప్ప బుద్ధికలవాడైన చిత్రగుప్తుని)తో "అసలు నీ కవిలియ (కవిలెకట్ట; కడితము)లో నీవు వ్రాసిన లిపి ఉన్నదో - లేదో మరొకసారి బాగా పరిశీలించి చూడు, ఓ గణకవరా! (ఓ గొప్ప లేఖరీ!)" అన్నాడు.

ఆతడట్లేనని దండధరుని (యముని) ఆజ్ఞమేరకు తనచిట్టా యొక్క ప్రతిపుటనూ పరికించి చూడగా దానిలో చక్రపాణి (విష్ణువు) యొక్క చేతివ్రాతను వీక్షించాడట. అది యిలా వుందట.

'ఒకానొక రోజు యితడు పద్మతీర్థమునకేగి తత్పయోధౌత నిజాంగుడై (ఆ నీటితో కడుగబడిన శరీరము కలవాడై) వెళ్లినందున విప్రవధాది పాతక వ్రాతము (ఈ జన్మలో చేసిన బ్రాహ్మణ హత్యలు మొదలైన పాపముల సమూహము) తొల్లింటి పుట్టువుల ప్రాప్తములైన అఘంబులు (గత జన్మలలో చేసిన పాపఫలములు) – మొత్తం మరుద్ధూత ఘనాఘనావళులలా (గాలిపాటు వలన చెదరగొట్టబడిన వానాకాలపు మేఘములలా) చెల్లాచెదరైపోయాయి.'

ఇదే విషయాన్ని చిత్రగుప్తుడు యమునికి విన్నవించి, "నేనింతకు ముందర యిక్కడ వ్రాసిన లిపి కనుపించడంలేదు. ఆ స్థానంలో ఎవరి వ్రాతోకానీ పై లిపి వ్రాయబడివుంది. ఓ విద్వదింద్రా! (విద్వాంసులలో ఇంద్రునివంటి వాడవైన యమా!) ఆ కౌతుకజనకాక్షరశ్రేణి (కుతూహలం కల్గించే లిపి)ని నేను చూచివచ్చాను. ఒక్కసారి మునిగినంతనే లోగడ చేసిన పాపముల సమూహాలు సమస్తం నశింపజేసే పుణ్యతీర్థమును ఎన్నడూ నేను చూడలేదు. కనీసం దానిని గూర్చి వినివుండలేదు కూడా. ఆ దివ్య తీర్థం యొక్క వైభవమును నాకు దయచేసి వివరించు, ఓ భానుపుత్రా! (సూర్యపుత్రా!)" అని కోరాడు.

అప్పుడు ఆ పద్మమిత్ర పుత్రుడు (పద్మములకు మిత్రుడైన సూర్యుని కుమారుడైన యముడు) చిత్రగుప్తునితో యిలా అన్నాడు -

"దండకా మహారణ్యము పుణ్యార్థులైన పంచాశత్కోటి (ఏబది కోట్ల) జనులు తిరుగాడే కారణంగా ప్రశస్తమైనట్టిది. (దండకారణ్యంలోని జనస్థానం ఒకప్పుడు ముముక్షువులైన మునులు తపస్సు చేసుకొనడానికి అనువుగా ఉన్నందున ఎక్కడెక్కడినుంచో జనులు మోక్ష పిపాసతో అక్కడికి వచ్చేవారట.) అది ఖలులకు (నీచులకు) దుష్ప్రాపమైన (పొందరానిదైన) గొప్ప మాహాత్మ్యసంపద కలిగినట్టిది. అయితే గుణోత్సేకము యొక్క కలిమితో (అతిశయించు గుణ సంపదతో) గౌతమీనది (గోదావరీనది) దండకారణ్యం కంటెనూ ప్రశస్తమైనట్టిది. ఈ రెంటికంటెనూ హృషీకేశుని (విష్ణువు) నివాసమైన పౌండరీకము ప్రసిద్ధి చెందింది."

"అర్కుడు (సూర్యుడు) ప్రకాశించడం; అనిలుడు (వాయుదేవుడు) వీచడం; ఇంద్రుడు వర్షించడం; ఇల (భూమి) జలములలో మునగకుండా తిరమవడం (స్థిరముగా నిలిచి యుండడం) ఏ విష్ణుని ఆజ్ఞప్రకారం జరుగుతాయో; ఎవ్వడు అఖిల జగములనూ బ్రహ్మయై సృష్టించి, పద్మాక్షుడై (విష్ణువై) ప్రోచి (స్థితికర్తగా); మదనారియై (శివుడై) త్రుంచునో (నాశనముచేయునో); నేను (యముడు) మొదలుగాగల లోకపాలకులు ఏ లోకేశుని యొక్క కరుణా కటాక్ష వీక్షణముల కారణంగా అధికారములో నున్నామో; అటువంటి విభుడు మనుష్య లోకంలో వెలసి భూతకోటిని అనుగ్రహంతో సాకుతూ ఏ తీర్థ ప్రదేశంలో వున్నాడో; ఎందులో మునిగి సుశర్మ ముక్తినందాడో; ఆ తీర్థమునకు సరిసాటియైన తీర్థము యీ ధరణిలో వుందా?" అంటూ ఆ పద్మతీర్థము యొక్క అగణిత (లెక్కలేని) ప్రభావములను మెచ్చుకుంటూ సుశర్మను అతిదయగా శరీరం నిమిరి, ఆదరణతో దండధరుడు (యముడు) అతనిని చంద్రకాంతి వలె చల్లనైన చందన భూషణ వనమాల్యములతో తర్పితుని చేసి (గంధము, నగలు, వస్త్రములు, మాలలు వగైరాలతో తృప్తి పరచి) ఒక గగనచర యానము (విమానము)లో సుశర్మను నాగులు, నరులు, యక్షులు, దేవతలు వగైరా జాతులలోని పురుష శ్రేష్ఠులు వీడుకోలు పలుకగా నాకమునకు (స్వర్గమునకు) సాగనంపాడట.

లోగడ మనం నిగమశర్మ విషయంలో అనుకున్నట్లే సుశర్మోపాఖ్యానం ద్వారా కూడా రామకృష్ణ కవి ప్రజలకు ఏ తరహా సందేశం

యివ్వాలనుకున్నాడో బోధపడడం లేదు. ఎంత పాపిష్టి పనులు చేసిన వాడైనా చివరికి ఓ తీర్థం లేక మరో క్షేత్రం మహిమ కారణంగా అతడు లోగడ చేసిన పాపాలన్నీ పటాపంచలై అతడికి మోక్షప్రాప్తి కలుగుతుందనే విశ్వాసం ప్రజలలో నాటుకుంటే అది ఎంతటి విపరిణామాలకు దారితీస్తుందో మనమెరిగిన విషయమే ! ఇందు వలన జీవితమంతా - ఏ తప్పుడు పనులు చేసినా పర్వాలేదు. ఏదో ఓ పుణ్యక్షేత్ర సందర్శనం చేస్తేనో లేక ఓ పుణ్య తీర్థంలో స్నానం చేస్తేనో ఆ పాపమంతా నశిస్తుందనే భావన భక్తులలో ప్రబలే ప్రమాదం లేదా ? నిత్యమూ చేసే పాపిష్టి పనులన్నీ చేస్తూనే వాటి పరిహారార్థం అప్పుడప్పుడూ షికారుకెళ్లినట్లు పుణ్య క్షేత్రాలకు వెళ్తూన్న 'భాగవతుల'ను మనం ఎందరిని చూడడం లేదు? సనాతన మతం మొదట్లో భగవంతుడిని కర్మఫలదాత అని విశ్వసించింది. ప్రతివారికీ వారి వారి పుణ్య కార్యాలు *(merits)* మరియు పాప కార్యాల *(demerits)* ను బట్టి వాటికి తగిన ప్రతిఫలాన్ని భగవంతుడు యిస్తాడనే ఒక విశ్వాసం ప్రాచీనులలో ప్రబలంగా వుండేది. తాము చేసిన పాపాలకు శిక్షగా రౌరవాది నరకాలలో తమ యాతనా శరీరంపై యమభటులు పెట్టే హింసలు, బాధలను తలచుకుని సమాజంలోని ప్రజలు (ప్రజలలో అధిక శాతం సజ్జనులు, సాధువర్తనులు, అమాయకులు, భయస్తులు కనుక) పాపకార్యాలు చేయడానికి జంకేవారు. అలాగే ఆశ ఎవరికైనా సహజం కనుక పుణ్యకార్యాలు చేస్తే యీ లోకంలో బ్రతికుండగా తాను పొందలేకపోయినవేవైనా వుంటే వాటిని మరణానంతరం స్వర్గలోకంలో పొందుతామనే ఆశ వారిని బ్రతికుండగా పుణ్య కార్యాలు చేయాలనే లక్ష్యంవైపు పురికొల్పింది. పుణ్యం చేసి మరణిస్తే స్వర్గంలో అమృతం త్రాగుతూ, శాశ్వతంగా మళ్లీ జన్మంటూ లేకుండా వుండొచ్చనో, రంభాది దేవ వేశ్యలతో అమర సుఖం పొందవచ్చనో - యిలా ఆశ ఏదైనా వారు యీ కారణంగా పరోపకారం వంటి మంచి పనులు (పుణ్య కార్యాలు) చేయడానికే మొగ్గుచూపే అవకాశమేర్పడింది. యిలా స్వర్గ, నరకాలనే భావన అశాస్త్రీయమైనదే అయినా సమాజంలో అది కొంత మేరకు సత్కార్యాలకు ప్రోత్సాహకారి*(catalyst)*గానూ, దుష్కార్యాలకు నిరోధకం *(preventive)* గానూ పనిచేసింది.

ఐహికమే సత్యం, ఆముష్మికం అసత్యమని భావించే వారిలో పెక్కురు ఏది పడితే అది చేసి నిర్భయంగా జీవించడానికి అలవాటు పడగా, అతి కొద్దిమంది భౌతిక వాదులు పాపపుణ్యాలు, స్వర్గనరకాలు అసత్యమనీ, భూమిపై మన జీవనమే సత్యమనీ నమ్ముతూనే మానవతావాదంపై విశ్వాసమున్న కారణంగా సాటి మనుషులకు ఇబ్బంది కలుగని రీతిలో జీవిస్తూ 'పరోపకారార్థమిదమ్ శరీరమ్' అన్న ఆర్యోక్తిని అక్షరాల పాటిస్తున్నారు. మనం చేసే మంచి, చెడు కార్యాల వలన కర్మ ఏర్పడుతుందనీ, అది చెడని పదార్థమనీ, ప్రతివారూ కర్మ ఫలం అనుభవించి తీరాల్సిందేననీ, సనాతనులు నమ్మేవారు. ఇప్పటికే ఒక వ్యక్తి జీవితంపై తన ప్రభావం చూపిస్తూన్న కర్మను 'ప్రారబ్ధ కర్మ' అనీ, యింకా తన ప్రభావం చూపడం మొదలిడని కర్మను 'అనారబ్ధ కర్మ' అనీ నమ్మేవారు. గత జన్మలలో ప్రోగు వేసుకున్న కర్మను 'సంచిత కర్మ' అనీ, యీ జన్మలో ఒక వ్యక్తి తన చర్యల ద్వారా పోగేసుకుంటున్న కర్మను 'సంచీయమాన కర్మ' అనీ పేర్కొన్నారు. భగవంతుడు 'కర్మ ఫలదాత' అంటే ఎవరి మంచి, చెడు కార్యాల వలన వారికి చెందాల్సిన కర్మ ఫలాన్ని వారు పొందేట్లు చూసేవాడనీ వారు నమ్మేవారు. తమ తమ కర్మలకు తగిన ఫలితాన్ని పొందడంలో ఎవరికీ ఎటువంటి ప్రత్యేక ప్రతిపత్తులు గానీ, మినహాయింపులు గానీ వుండవని మన ప్రాచీనులు విశ్వసించే వారు. వారు చేసిన పాపం ఎక్కువగా వుండి పుణ్యం తక్కువగా వుంటే ముందు స్వర్గానికి వెళ్లి పుణ్యఫలం అనుభవించి అనంతరం నరకానికి వెళ్లి తమ పాప ఫలం పూర్తిగా అనుభవించే వరకు అక్కడే వుంటామని విశ్వసించే వారు. అలాగే పుణ్య కార్యాలు ఎక్కువగా చేసిన వారు ఏవైనా కొద్ది పాప కార్యాలు చేసి వున్నట్లయితే ముందుగా నరకానికి వెళ్లి ఆ పాప ఫలం అనుభవించి ఆ పిమ్మట తమ పుణ్యఫలానుభవం పూర్తయే వరకు స్వర్గంలో గడుపుతామనీ నమ్మేవారు. అంటే కర్మఫలం - అది పుణ్యకార్యాల కారణంగా సంక్రమించింది కానీ, లేక పాపకార్యాల కారణంగా వచ్చిందే కానీ - అనుభవించక ఎవ్వరికీ తప్పదని సనాతన మత విశ్వాసం. అంచేతనే వారు వీలైనంత మేరకు సత్కర్మలు చేస్తూ దుష్కర్మలకు దూరంగా వుండేవారు.

భక్తి ఉద్యమ ప్రభావంగానూ, పురాణాల ప్రభావంగానూ పాప పరిహారానికీ, ముక్తిసాధనకూ, జన్మరాహిత్యానికీ కేవలం భక్తినే సాధనంగా స్వీకరించడం ప్రారంభమైంది. జ్ఞానకాండకూ, కర్మకాండకూ ప్రాధాన్యత క్రమంగా తగ్గుతూ వచ్చింది. కర్మఫలం పట్లనూ, వివిధ దుష్కర్మల కారణంగా లోగడ చేసుకుంటూండిన ప్రాయశ్చిత్తాల పైననూ, విశ్వాసం సన్నగిల్లి క్రమంగా భక్తితోనూ తీర్థయాత్రలు వగైరాలతోనూ ప్రోగుపడిన తమ పాపాల్ని పరిహారం చేసుకోవచ్చనే భావన ప్రజలలో బలపడింది. క్రమంగా ఎన్ని పాపాలు చేసినా ఒక్కసారి భగవన్నామస్మరణ

చేయడమో, పవిత్ర జలాలలో స్నానం చేయడమో, లేక పవిత్ర క్షేత్రాలను దర్శించుకొనడమో చేస్తే ఆ పాపమంతా చిటికెలో నశిస్తుందనే నమ్మకం ప్రబలింది. ఎంత పాపం చేసినా దానికి పశ్చాత్తాపపడితే చాలు - పాపమంతా నశిస్తుందనే భావం ఏర్పడింది. అనంతరం వివిధ క్షేత్ర, తీర్థాల మాహాత్మ్యాలకు ప్రాచుర్యం కలిగిస్తూ గ్రంథాలు వెలువడ్డాయి. పాపిష్టి వాడు కూడా ఏ కాశిలోనో, పండరీపురంలోనో మరణిస్తే ఆత్మతో సహా వాడి యాతనా దేహాన్ని తీసుకు పోవడానికి సాక్షాత్తు యముడే స్వయంగా వచ్చినా, శివుడో, విష్ణువో అడ్డుకొని యముడిని పారద్రోలినట్లు కథల్లబడ్డాయి. ఈ సాహిత్య సృష్టి అనంతరం ఎంత పాపిష్టి వాడైనా ఒక్కసారి భగవన్నామస్మరణ చేస్తే చాలు అతడి పాపమంతా పటాపంచలౌతుందనే విశ్వాసం ప్రబలింది. సనాతన మతంలోని యీ తరహా విశ్వాసాలనే జైనులు 'పంచ పాషండములు' అని పేర్కొన్నారు. భక్తి ఉద్యమ ప్రభావం కారణంగా యిటువంటి విశ్వాసాలు ప్రబలినప్పటికీ ప్రముఖ భక్తి ఉద్యమకారులంతా ముక్తికి యీ విధమైన అడ్డదారులు కూడదనీ, కొండలెక్కడం, నదులలో స్నానం చేయడం వగైరాల కంటే పరోపకారం, సత్యసంధత, సాధుజీవనం వగైరాలను పాటించాలనీ బోధించారు. తుల్సీజీ, రవిజీ, కబీర్‌దాస్, నానక్ వగైరా సంత్ మహాత్ముల బోధనలన్నీ దీన్నే నొక్కి వక్కాణించాయి. "విగ్రహాన్ని పూజిస్తే ముక్తి లభిస్తుందంటే - విగ్రహానికేం ఖర్మ ? నేను కొండకే పూజలు చేస్తాను." అన్నాడు కబీర్. ఇంకా "నదీ స్నానాలే కనుక మన పాప పంకిలాన్ని కడిగివేయ గలిగితే గంగలో వున్న చేపలూ కప్పలూ మనకంటే ముందుగా స్వర్గానికి చేరి మనకు స్వర్గ ద్వారం దగ్గరే ఎదురొస్తాయి." అని కూడా చమత్కరించాడు. నిజమే కదా మరి ? పవిత్ర జలాలని మనం భావించే నీటిలో కేవలం ఒక్కసారి స్నానం చేయడం వల్లనే మనకు స్వర్గప్రాప్తి కలిగేటట్లయితే మరి ఎప్పుడూ అదే నీటిలో మునిగి వుండే చేపలూ, కప్పల సంగతేమిటి ? 'జాత్ పాత్ పూఛే నహి కోయీ... హరి కా భజే సో హరి కా హోయీ' అని యింకొక చోట పేర్కొన్నాడు కబీర్ దాస్. "ఎవరిది ఏ కులం లేక ఏ గోత్రం అయినప్పటికీ హరిని భజించిన వారందరూ హరినే చేరతారు." ముక్తి విషయంలో భక్తుడి కుల గోత్రాలకు ఎట్టి ప్రాధాన్యతా లేదని దీని భావం.

నేటికీ ప్రజలు మోక్షానికి అడ్డదారుల్నే నమ్ముకుంటున్నారు. ఎప్పటికప్పుడు వారు తమ దైవాలనూ మారుస్తున్నారు. సాటి మనిషికి పిసరంత సాయాన్ని కూడా అందించని వారు దైవ కార్యాల పేరుతో కోట్లు గుమ్మరిస్తున్నారు. సనాతన మతంలో 'కర్మఫలానుభవం' అనే అంశంపైన వచ్చిన ఈ ప్రస్ఫుటమైన మార్పు వారి జీవన విధానంలో పరార్థాన్ని పక్కకు నెట్టి స్వార్థచింతనకే పెద్దపీట వేసింది.

అలా మతంలోని మానవత్వ భావన మాటు మణిగింది.

శ్లో॥ కేదారేహ్యుదకమ్ పీత్వా
వారణాస్యామ్ మృతమ్ తథా ।
శ్రీశైల శిఖరమ్ దృష్ట్వా
పునర్జన్మ న విద్యతే ॥

కేదార్‌నాథ్‌లోని నీరు త్రాగినా, వారణాసిలో మరణించినా, శ్రీశైల శిఖరాన్ని ఒక్కసారి దర్శించినా, అట్టి వాడికి తిరిగి జన్మంటూ వుండదు. (ముక్తి లభిస్తుంది)

ఇటువంటి విశ్వాసాలు ఏ రకమైన దుర్మార్గాలు, దుష్టకార్యాలు చేసిన వారైనా తేలికగా ముక్తినొందవచ్చు. అందుకోసం స్వార్థత్యాగం చేయాల్సిన పనిలేదు. సాటి మనుషులపై జాలి, ప్రేమ, వుండనక్కరలేదు; సత్కార్యాలు చేయాల్సిన పనే లేదు - అనే భావాన్ని పెంపొందింప జేశాయి. పరోపకారం, మానవతా విలువలు, సత్య సంధత, సాధుజీవనం పైన సంత్ మహాత్ముల బోధనలనెవ్వరూ పట్టించుకొనే వారు లేరు. తమ స్వార్థం, తమ ముక్తి, తమ గొడవ చూసుకునే వారే తప్ప.

ఐరోపా సమాజంలో మార్టిన్ లూథర్ *(Martin Luther)* కాలం నాటికి సరిగ్గా ఇటువంటి పరిస్థితులే వుండేవి. నిత్యమూ పరులను దోపిడీ చేసే ధనాఢ్యులు డబ్బు వెచ్చించి చర్చ్ వద్ద పాప పరిహార పత్రాలు కొనుక్కొనే వారు. అలా వారు స్వర్గలోకంలో తమ బెర్త్ రిజర్వు చేసుకొనే వారు. లూథర్ యీ పాప పరిహార పత్రాల బండారాన్ని ఎండగట్టాడు. ఏసుక్రీస్తు ప్రవచించిన విధంగా 'ఒక సూది బెజ్జం *(Eye of the Needle)* లో నుంచి ఒంటె అయినా దూరవచ్చునేమో కానీ, పాపి అయిన భాగ్యవంతుడు స్వర్గద్వార ప్రవేశం చేయలేడ'నీ స్వర్గప్రాప్తి అంత సులువైనదేం కాదనీ, అందుకోసం స్వార్థం వదలి సత్కార్యాలు చేయాలనీ వక్కాణించాడు లూథర్. 'అంగడిలో డబ్బున్న వాడు మాత్రమే కొనుగోలు

చేసే చిల్లర సరకు కాదు మోక్షమంటే. అదే నిజమైతే నిరుపేద గతేమిటి ?' అని నాటి చర్చిను ఆయన నిలదీశాడు. అందుకే ఆయన్ని యూరోపియన్ మత పునరుజ్జీవనోద్యమానికి వేగుచుక్క (*Morning Star of the European Rennaissance*) అని నేటికీ కీర్తిస్తున్నారు. రోజుకో రకంగా వెర్రితలలు వేస్తున్న సనాతన మత పెడపోకడలను చక్కదిద్దడం ఏ సంత్ మహాత్ముల వల్లనో, మార్టిన్ లూథర్ వంటి వారి వల్లనో అయేపనిగా కనుపించటం లేదు.

రామకృష్ణ కవి వంటి వారు అడ్డదారుల్లో మోక్షాలు, తీర్థక్షేత్ర మాహాత్మ్యాల గురించి వ్రాసిన కావ్యాల ప్రభావం ప్రజల మనస్సులలో అంతగాఢంగా నాటుకున్నది మరి !

సుశర్మను అమరాధీశుడైన ఇంద్రుడు తన అర్ధాసనంలో కూర్చుండజేసి గౌరవించాడట. అతడు స్వర్గ సుఖాలన్నీ అనుభవించాడట. భూమిపై బ్రాహ్మణ కులంలో పుట్టిన సుశర్మ స్వర్గంలో కమలావల్లభుని (విష్ణువు) ఆలయాన్ని శుభ్రపరచడం, అలంకరణలు చేయడమే పనిగా వుండేవాడట (వేరొక పని లేకుండా).

ఇలా సుశర్మ ఆపంచత్వముకాగా (ఆపంచత్వమవడమంటే మరణానంతరం విలయమై పంచభూతములలో లీనమవడం) యీ విధంగా హరిగేహక్షోణి సమ్మార్జనము (విష్ణు దేవాలయ భూమిని ఊడ్చడం) వలన కలిగిన పుణ్యం కారణంగా చంద్రలోకాన్నిచేరి, అనేక సంవత్సరాలపాటు పెక్కు భోగములను అనుభవించి, గొప్ప రాజుగా సుకీర్తి అనే పేరుతో భూమిపై తిరిగి జనించాడు.

అతడు అధికభక్తితో, గొప్ప కీర్తితో ప్రకాశిస్తూ, భక్తిపరతంత్రుడై ప్రతిఘస్రము (ప్రతిరోజూ) జగత్పతిని, ఉచిత పూజలతో స్తుతిస్తున్నాడట.

అతడు యౌవనములోనే అన్ని భోగాలనూ సన్న్యసించాడట - నందనందనుడి (కృష్ణుడి) అంఘ్రినాళీక (పాద పద్మముల) సేవోపర్గాగ భోగమొక్కటి మినహా (అంటే శ్రీకృష్ణుని పాదపద్మములను సేవించుట కుపయోగపడే భక్తి రూపమైన భోగము మినహా) మిగిలిన భోగాలన్నింటినీ త్యజించాడట.

అతడిని జయించడానికి మన్మథుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడట. అయితే అవేవీ ఫలించలేదు. అతని వైరాగ్య భావము అంతగాఢతరమైనదన్నమాట. అతడిని గెలవలేక మన్మథుడు పారిపోయి కోపంతో తన బంట్లను శిక్షించిన విధాన్ని వివరిస్తూ యిక్కడ రామకృష్ణకవి ఓ చక్కటి పద్యం చెప్పాడు.

సీ॥ నిలువున నొలిపించె విలువంగడమునెల్ల, శరముల యాయంబుఁ బొరయు టుడిపెఁ
దగ శబ్దమాత్ర పాత్రముచేసె గుణలత, మ్రాఁకునఁ గట్టించె మౌల బలముఁ
గంచుకి వశము గావించె సేనానాథుఁ, గమరించె సహచరుఁ గటికి యెండఁ
బ్రతిపక్ష భావసంగతుఁడని హితుఁజూచె, వరకేతనము కీర్తిభరము దులిపె

తే॥ ధర్మ నిర్మల బుద్ధి సుశర్మఁగదిసి, గెలువఁగా లేక చని కోపగించి మదనుఁ
డుటుక తనవార లతనికి నోడుమనిరె? పతికిఁ గీడౌట బంట్ల పాపంబుగాదె!

(పాండురంగ మాహాత్మ్యం : 5-98)

ధర్మనిర్మలబుద్ధిన్ - యోగిధర్మముచే పరిశుద్ధమైన బుద్ధికలవానిని; సుశర్మన్; కదిసి - సమీపించి; గెలవగా లేక చని కోపగించి మదనుడు (మన్మథుడు) ఉటుక - పరుగెత్తగా -

మన్మథుని విల్లు చెఱకు; తానోడిపోయినందున శిక్షగా తన చెరకు వింటిని నిలువునా చీల్పించడమే కాక మదనుడు విలువంగడముసెల్ల (చెరకు జాతినంతా) నిలువునా ఒలిపించాడట. అందుకే మనం చెరకును నిలువుగా చీల్చి తింటామట. తప్పుచేసిన వారినే కాక వారి బంధుజనాన్ని కూడా శిక్షించడం రాజసహజం. నిలువునా ఒలిపించడం శిక్షలలో ఒకటి.

మన్మథుడు పుష్పశరుడు. సుకీర్తిని జయించలేక ఆ కోపంతో మన్మథుడు తన బాణములైనట్టి పుష్పాలను జీవము లేకుండా వాడి రాలిపోయేట్లు శిక్షించాడట. సంపూర్ణంగా పెరిగిన పూలు రాలిపోవడం తప్ప గత్యంతరం లేదు. ఆయము అంటే జీవము అనే అర్థంతోపాటు మర్మస్థానము అనే అర్థమూ వుంది. రాజులు తమకు యిష్టంలేని వారిని ఆయువు పట్టులలో (మర్మస్థానములలో) శిక్షించుట కూడా సర్వసాధారణమే.

గుణము అంటే వింటినారి (అల్లెతాడు) అనే అర్థమూ వుంది. గుణమెప్పుడూ వినదగినదే కాని, చూడదగినది కాదు. మన్మథుని వింటినారి తుమ్మెదలగుంపు. అయితే అది ఎప్పుడూ కనుపించదట. తుమ్మెదలెప్పుడూ ఝంకారం చేస్తూనే వుంటాయి. అందుచేత మిగిలిన విల్లుల్లా వింటినారిని సంధించి ధనుష్టంకారము చేసినప్పుడేకాక ఎల్లప్పుడూ మన్మథుని వింటినారి శబ్దము చేస్తూనే వుంటుంది. అయితే ఆ వింటినారి కనుపించదట. మారుడు కోపంతో తన వింటి యొక్క గుణలత (తీగవంటి వింటినారిని) శబ్దమాత్ర పాత్రముచేశాడట. అంటే తన వింటినారి శబ్దము చేయడమేకాని, కనుపించకుండేట్లు చేశాడట. నామమాత్రావశిష్టముగా అయ్యేట్లుగా (పేరు మాత్రమే మిగిలివుండి స్వరూపం నాశనమయ్యేట్లుగా) చేశాడట. రాజులు కోపగిస్తే తమ బంట్లను యిలా శిక్షించడం కద్దు.

మన్మథుని మూలబలం (మూలసైన్యం - మౌలబలం) శుక పికాదులు - అంటే చిలుకలు, కోకిలలు వగైరాలు. ఈ ఓటమి వల్ల ఏర్పడిన క్రోధంతో స్మరుడు తన సైన్యాన్ని చెట్లకు కట్టించాడట. అంటే చెట్లకు అంటిపెట్టుకొనే ఉండమని శపించాడట. శుకపికాలందుకే ఎప్పుడూ చెట్లకు అంటిపెట్టుకొనే వుంటాయంటున్నాడు కవి. నేరస్తులను చెట్లకు కట్టించడమనేది కూడా ఒక రకమైన శిక్ష.

అనంగుని సేనానాథుడు (సేనాపతి) మలయమారుతం. సుకీర్తిని గెలువ లేకపోయాననే అవమానంతో అతడు తన సేనానిని కంచుకి వశము కావించాడట. కంచుకము అంటే కుబుసము. కంచుకి అంటే పాము. పాము గాలిమేసి జీవిస్తుందని ఓ విశ్వాసం. అందుకే దానిని వాతాశనము అని కూడా అంటారు. (వాతము అంటే గాలిని - ఆశనము అంటే ఆహారముగా కలది) కందర్పుని శిక్ష మేరకే మలయానిలం కంచుకి (పాము) వశమై నాటినుండీ పాములు వాతాశనములయ్యాయని కవి చమత్కారంగా చెపుతున్నాడు. నేరస్తులను పాముల కప్పగించడం - (పాముల చేత కరపించడం) రాజులు వేసే సర్వసాధారణమైన శిక్ష.

బంట్లనే కాదు రతిపతి తన సహచర మిత్రుల్ని కూడా శిక్షించకుండా వదలనట్లున్నది. వసంతుడు మన్మథుని సహచరుడు. చెట్లు చిగురింపజేయడం, వాటికి పూలు పూయించడం మృదుస్వభావుడైన వసంతుని పని. సుకీర్తి విషయంలో ఓటమికి కినిసిన పంచశరుడు వసంత ఋతువును కటికి ఎండలో కమరించాడట (మాడివాడిపోయేట్లు చేశాడట). మన్మథుడు విధించిన శిక్ష కారణంగానే వసంత ఋతువు వెనువెంటనే గ్రీష్మం వచ్చిపడి వసంతుడు వాడి వత్తి అవుతాడని చమత్కరిస్తున్నాడు కవి. మండుటెండలో ఎట్టి ఆచ్ఛాదన, పాదరక్షలు లేకుండా నిల్చుండ బెట్టడం కూడా ఒకప్పుడు రాజులు విధించే సాధారణ శిక్షలలో ఒకటి.

ఇక హితులను (మేలుకోరేవారిని) కూడా మన్మథుడు వదలిపెట్టినట్లులేదు. చంద్రుడు మన్మథునికి హితుడు. అతని చల్లని వెన్నెల విరహ తాపాన్ని రేపి, ఎడబాసిన జంటలను కలపడమనే మన్మథుని పనిని సానుకూల పరుస్తుంది.

అయితే తన ఓటమికి మరుదు తన హితుడైన చంద్రుడిని తప్పుపడుతున్నాడు. అందుకే చంద్రుడిని ప్రతిపక్ష భావసంగతుడని నిందించాడు. అందుకే శుక్ల, కృష్ణ పక్షాలలో వృద్ధిక్షయములు పొందుతూ వుంటాడట చంద్రుడు. ప్రతిపక్షము (శత్రువు) యొక్క భావముతో ఏకీభవించాడు చంద్రుడని మరుని అభియోగం. రాజులు కూడా స్వపక్షీయుడెవడైనా తమ మేలుకోరి ఏవైనా సలహాలిస్తే అవి వారికి రుచించకపోతే, వారిని శత్రుజన పక్షపాతులుగా ముద్రవేయడం, తమ ఓటమికి వారిని బాధ్యులను చేయడం సర్వసాధారణం. రావణుడికి హితబోధచేసిన అతని సోదరుడు విభీషణుడు హితుడే అయినా ప్రతిపక్ష భావసంగతుడని భావించిన రావణుడు అతడికి రాజ్య బహిష్కార శిక్ష విధిస్తాడు. అయితే అతడు తరువాత ధర్మరక్షణార్థం నిజంగానే ప్రతిపక్షంలో చేరాడనుకోండి. అది వేరే సంగతి.

కామదేవుడైన మన్మథునికి మీనకేతనుడని మరో పేరుంది. అతని కేతనం చేప. తన ఓటమికి తన కేతనంపైన కూడా కోపించిన మీన కేతనుడు శ్రేష్ఠమైన ధ్వజమైన చేపను దాని కీర్తి నశించగా కీర్తిభరమున (దట్టమైన బురదలో) దులిపాడట (రాల్చాడట). అంటే బురదనీటిపాలై ఉండమని దానిని శిక్షించాడట. అందుకే చేపలు బురదనీటిలో జీవిస్తాయట. కీర్తి అంటే యశస్సు అనే అర్థంతో పాటు అడుసు (బురద) అనే అర్థమూ వుంది. యోగ్యమైన మీనధ్వజాన్నలా మన్మథుడు బురదలో వుండమని శపించాడన్నమాట. ఇష్టములేని వారి గొప్ప కీర్తిని నశింపజేయుట రాజులకు స్వాభావికం. మండుటెండలో అడుసులో నిలబెట్టడం ప్రాచీనకాలపు శిక్షలలో ఒకటి.

ఇలా యీ శిక్షలన్నీ తన బంట్లకూ, సహచరులకూ, హితులకూ తన ఓటమి కారణంగా మన్మథుడు వేశాడుకానీ, వారంతా ఏమన్నా మన్మథుడిని ఓడిపొమ్మన్నారా? పతికి (యజమానికి) కీడు జరగడం బంట్లకు పాపము (శాపము; నరకప్రాయము) కాదా? ఓడిన యజమాని ఆ కసిని తనకు లోకువైన తన బంట్లపైనేగా చూపగలిగేది? (వేరే ఎవరిపై చూపితే ఎవరూరుకుంటారు?) అని చమత్కారంగా ప్రశ్నిస్తున్నాడు రామకృష్ణకవి.

ఆ రాజర్షి (సుకీర్తిగా జన్మించిన సుశర్మ) పదంపడి (తరువాత) క్షీరోద న్యాయమున (పాలలో కలిపిన నీటివలె) లక్ష్మీరమణుడితో లయమైనాడట.

## ఏకదంష్ట్రుని పునర్జన్మలు

కృతయుగంలో ఏకదంష్ట్రుడు (ఒక్క కోర కలవాడు)గానూ, త్రేతాయుగమున రెండు కోరలు కలవానిగానూ, ద్వాపర యుగములో మూడు కోరలు కలిగినవానిగానూ జన్మించిన ఒక దైత్యుడు (దితి పుత్రుడైన రాక్షసుడు) మదించి విర్రవీగేవాడు. ఆశ్చర్యం కలిగింపజేసే ప్రతాపములోనూ, భూరి (గొప్ప) బలములోనూ, మాయ పెంపు (సమృద్ధి)లోనూ వృత్రాసురుడు కూడా వాడికి సాటిరాడట. (వృత్రుడు మహా పరాక్రమవంతుడైన రాక్షసుడు. బ్రహ్మ మానసపుత్రుడైన త్వష్టకూ, రచనకూ పుట్టి, చీకటికి వ్యక్తీకరణ (*Personification of Darkness*) గా భావించబడే అతి బలశాలియైన రాక్షసుడితడు. నర్మదానదీ తీరంలో దేవతలు యీ రాక్షసునితో కృతయుగాంతములో యుద్ధం ప్రారంభించి త్రేతాయుగం ప్రారంభం వరకూ పోరాడారట. చివరికి ఇంద్రుడు యితడిని సంహరించాడట. అంచేతనే ఇంద్రునికి వృత్రహన్ – వృత్రుని చంపినవాడు – అని పేరు).

ఆ హరిహయారి (ఇంద్రుని శత్రువు) పార్ష్ణిగ్రాహి (యుద్ధంలో వెనకనుండి పోరాడుతూ సహకరించేవాడు)గా హిరణ్య కశిపునికి సహకరిస్తూ అతనికి గాదిలి పుత్రునిగా (అభిమాన పుత్రునిగా) వ్యవహరిస్తూ ఏకదంష్ట్ర, తానూ కలిసి మూడులోకాల్నీ తన భుజబలమనే అగ్నితో కాల్చివేశాడట. అంటే ఒక ప్రక్క హిరణ్య కశిపుడూ, మరో ప్రక్క ఏకదంష్ట్రుడూ

ముజ్జగాలనూ అగ్నికీలలలో ముంచెత్తారన్నమాట.

ఆ ఒంటిపంటి వేలుపుదాయ (దేవతలకు శత్రువైన ఆ ఒంటిపంటివాడి)ని నృహరి (నరసింహుడు) దంభోళి (వజ్రాయుధము)లా కఠినమైన, వాడియైన గోళ్లతో పులి వఱదును (పెద్ద నక్కను) చీల్చినట్లుగా చీల్చి చెండాడట.

తిరిగి (త్రేతాయుగంలో) వాడు రావణాబ్ధిలో (రావణుని వంశంలో) రెండు కోరలు కలవానిగా పుట్టి అతికాయుడనే నామం ధరించి ముదులోకాలకూ విషమన్నట్లుగా మందుతూండగా, విష్ణువు అనిలో (యుద్ధములో) రాముడై ప్రళయకాలంనాటి సూర్యుని కిరణాలవలె వాడియైన తన బాణములతో అతడిని సంహరించాడట. ఈ కావ్యంలోని (5-105) పద్యాన్ని బట్టి రామకృష్ణకవి యొక్క పురాణ పరిజ్ఞానపు సమగ్రత కొంతమేరకు ప్రశ్నార్థకమవుతూంది. ఎందుకంటే రావణుని కుమారుడైన అతికాయుడు బ్రహ్మ వరంచేత అవధ్యకవచమును పొంది విర్రవీగుతూండగా, లక్ష్మణుడతనిని బ్రహ్మాస్త్రంతో సంహరించినట్లుగా రామాయణం పేర్కొంటూంది. కాగా రామకృష్ణ కవి 'తలఁదర్వోఁదదుగ్ర నిశాటుఁబట్టి విష్ణుం దని రాముఁడై విలయ సూర్యకరోగ్ర శరాగ్రధారలన్' అన్నాడు. (పాం. మా. 5 - 105). మరి రామకృష్ణ కవి ఎలా చేశాడో యీ పొరపాటు ?

అంతటితో ఊరుకొనకుండా వాడు బద్ధవైరంతో తిరిగి భూమిపై ద్వాపరయుగంలో త్రిదంష్ట్రుడనే పేరిటపుట్టి, ఆదిలక్ష్మి భర్తయైన పౌండరీక విభుని సమీపించి, క్రోధంతో ఊగిపోతూ కొలిమిగూళ్లలా ఎర్రగా మందుతూన్న తన కళ్లు ఉబ్బగా యిలా అన్నాడట.

"ఓ శేషశాయీ! ఎక్కడికని బయల్దేరి వచ్చావు? నీకు నేను చక్కగా చికిత్స చేస్తాను. (నీ రోగం కుదురుస్తాను). మోసంతో నా వాళ్లైన రాక్షసులను పూర్వం పెలుచగా (అతిక్రూరంగా) చంపావు నువ్వు. ఇప్పుడు నిన్ను పట్టి నీ ప్రాణం తీస్తాను. నీ గర్వం నశించి నీవు సాధువుగా మారినా నిన్ను నేను వదలను. నీ తొల్లిటి త్రుళ్లు (వెనుకటి మిడిసిపాటు) యిక చెల్లదు" అంటూ సింహంపై కోపించిన నక్కలా అతడు అంతకుని (యముని) దండమనదగిన తన గదాదండంతో పాండురంగడిని ఒక్కవేటు వేయగా అది అతని మొలనుండి వ్రేలాడుచున్న శిక్యమునకు (చిక్కము - లేక - జాలె సంచికి) తగిలి ఆ వేగానికి అది కొంత భగ్నమైంది.

అపఋ్డా తార్క్ష్యధ్వజుడు (గరుడ ధ్వజుడైన విష్ణువు) కోపంతో ఆ దానవుడిని తన దక్షిణ కరాంభోజముతో (కుడిచేతితో) మెత్తగా మొత్తాడట. దాంతో వాడు ముక్కునుండి, నోటినుండి నెత్తురు ధారలు కట్టగా నేలబడి కడతేరాడట (మరణించాడట). దేవతలు ఎంతో సంతోషించి దామోదరుడిని ప్రస్తుతించారట.

"నారదా! పాండురంగని నడుముకు ఎడమవైపు వ్రేలాడుతున్న చిక్కము యిప్పటికీ భగ్నమై కనుపిస్తూన్నది. చూడు." అన్నాడు శివుడు.

# శ్రీ కృష్ణుని మంత్ర మహిమ

"ఆ కమలేక్షణుడు (పద్మములవంటి కన్నులు కలవాడు - విష్ణువు) తన హృదయంలో తాల్చిన సిద్ధమంత్రాన్ని పూర్వం నాపట్ల తనకున్న ప్రేమానురాగాల కారణంగా నాకు తెలిపాడు. నాకు తప్ప ఆ మంత్రము దాని వ్యాకృతీ (వివరమూ) ఏ లోకంలోనూ, ఎవ్వరికీ తెలియదు." అని శివుడు పలుకగా; నారదుడు "పశుపతీ! మా వంటి ప్రపన్నుల (శరణాగతుల)పై దయ సమృద్ధిగా వుండడం మీ వంటి వారికి నైజము. కనుక ఆ మంత్రాన్ని నాకు విశదీకరించు. దాంతో నేను దుఃఖ సముద్రాన్ని అంతంచేసి నీ దయతో ఎడతెగని సుఖానుభవాన్ని పొందుతాను" అన్నాడు.

అప్పుడు శూలి (శివుడు) "ఓ నారదా! ఈ మనువు (మంత్రము) ఎల్లెడలా గోప్యమై వుంటుంది. దీన్ని దురిత

ప్రవణాత్ములకూ (పాపమునందు ఆసక్తికల మనస్సు కలవారికి), విష్ణుసేవను యిష్టపడని వారికి, వైష్ణవేతరమైన హీనపు త్రోవలో నడచే సజ్జన విరోధులకూ ఎంత మాత్రమూ తెలుపరాదు. నీవు హరి భక్తుడవు. అందుకే నీవంటే నాకెప్పుడూ యిష్టం. గొప్ప విజ్ఞాన బుద్ధివి. అందుచేత నీకు యీ మంత్రాన్ని వినిపిస్తాను." అంటూ నారదునికి యిలా ఆ మంత్రాన్ని చెప్పాడు.

శ్లో॥ స్పర్శాద్యం సత్యనామాద్యం షష్ఠ షష్ఠం సదీర్ఘకమ్।
షష్ఠం షష్ఠాది నత్యంతం సమారం తం విదుర్బుధాః॥ (పాండురంగ మాహాత్మ్యం : 5-115)

'స్పర్శాద్యం' అంటే స్పర్శాక్షరాల (*contact sounds*) లో మొదటిదైన 'క'కారము కలదిగానూ; ('క' నుండి 'ప' వరకు 'క' 'చ' 'ట' 'త' 'ప' లతో మొదలయ్యే ఐదు వర్గాలూ స్పర్శాక్షరాలు)

'సత్యనామాద్యం' అంటే సత్యము యొక్క పేరులోని మొదటి అక్షరము - 'ఋతగ్ం సత్యం' అనే దానిలో ఆది - అంటే 'ఋ'కారము కలదిగానూ;

షష్ఠం షష్ఠం - ఆరవ వర్గము (అంతస్థాదికము) (య, ర, ల, వ, శ, ష - యీ ఆరింటినీ అంతస్థములు *liquid sounds* లేక *Semi - vowels* అంటారు) లోని ఆరవ అక్షరము

'య', 'ర', 'ల', 'వ', 'శ', 'ష' లలో ఆరవది - అంటే 'ష'

సదీర్ఘకమ్ - దీర్ఘముతో కూడినదీ - అంటే 'షా'

షష్ఠాది - ఆరవ వర్గమైన అంతస్థములలో మొదటిదైన 'య' అక్షరము

నత్యంతం - నతి + అంతం - నమస్కృతి యొక్క చివరిభాగం అంటే 'నమః' కలదిగానూ;

ఇక మూడవ స్పర్శాక్షర వర్గం (ట, ఠ, డ, ఢ, ణ)లోని ఐదవ అక్షరమైన 'ణ'కారము ఇక్కడ గుప్తమైనదని ఊహించవచ్చు.

క + ఋ - కృ - ష్ణాయనమః

షష్ఠం సమారం - సమానములగు ఆరుదళములు కలిగినదీ; అంటే గరుడవాహనుడైన విష్ణువు అధిదేవతగా కల స్వాధిష్ఠాన చక్రము కలదిగానూ వున్న;

తం - ఆ మంత్రమును; బుధాః - విద్వాంసులు, విదుః - తెలిసికొంటారు. కృష్ణుడిని ఋషిగానూ, మహావిష్ణువును దేవతగానూ భావించే వైష్ణవులకు యీ మనువు (మంత్రము) ధృవస్థితిని (మోక్షాన్ని) ఒసగుతుంది.

ఎవ్వడైనా పౌండరీక క్షేత్రానికి వెళ్లి గొప్పదైన భైమీనదిలో స్నానమాచరించి విధ్యుక్తంగా కమలాక్షునికి ప్రణమిల్లి యీ ప్రసిద్ధ మంత్రాన్ని నూరుమార్లు పఠిస్తే, అతడి పాప పంకిలములన్నీ వెనువెంటనే దూరంగా నెట్టివేయబడ్తాయి.

విష్ణుసాన్నిధ్యంలో నేనెప్పుడూ యీ మంత్రాన్ని విధ్యుక్తంగా (నియమానుసారంగా) పఠిస్తాను. అన్ని భవరోగ తిమిరాలనూ తన కాంతితో పోగొట్టే చంద్రుడీ మంత్రం. ఆ విష్ణువు యొక్క అనుగ్రహం పొందాలనే అపేక్షతో నేనీ మంత్రం ఎప్పుడూ పఠిస్తూంటాను." అన్నాడు శివుడు.

## బలరాముని తపస్సు

"ఒకప్పుడు నీలాంబరుడు (నల్లని వస్త్రం ధరించేవాడు - కృష్ణచేలుడు - బలరాముడు) తీర్థయాత్రలు చేస్తూ

పాండరీకమునకు వచ్చి భీమరథీనదిలో స్నానంచేసి అక్కడ సాక్షరుడైన పుండరీకాక్షుని చూచి ఆ అక్షరముల లక్షణము నెరుగక ఊరక నిలబడిపోయాడట ఏకకుండలుడైన ఆ బలరాముడు.

"చేతులు పైకిచాచి; ఊపిరి బిగబట్టి; తనలోని కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే రిపూత్కరములను (అరిషడ్వర్గములను; రిపు - శత్రు; ఉత్కరములను - సమూహములను) పో నదల్చి (పోయేటట్లుగా అదల్చి); ముఖము పద్మమువలె ప్రకాశిస్తూండగా, కాలి వ్రేళ్ల ఆధారంగా నిలబడి తన బరువునంతా మునివేళ్ల గోళ్లపై నిలిపి, చండాంశుని కనుగొనుచూ (సూర్యుని చూస్తూ - తూర్పునకు తిరిగి) భాస్వర నిష్ఠతో (ప్రకాశించే నియమంతో) అన్నవర్జంబుగా (ఆహారాన్ని విసర్జించి) ఒక మాసంపాటు తపమాచరించాడట.

దానితో ప్రసన్నుడైన దానవధ్వంసి (శ్రీ కృష్ణుడు) తన అన్నకు ప్రేమతో ఆ మహా మంత్రాన్ని ఉపదేశించాడట. నాటి నుండి అతడు దానిని గాయత్రిలా నిత్యమూ జపిస్తూన్నాడట." అన్నాడు శివుడు.

# మన్మథుని పునర్జన్మ

"నీరజనాభుడు (విష్ణువు - ఇక్కడ కృష్ణుడిని ఉద్దేశించి) భూరిగుణ రత్నరాశి (గొప్ప సుగుణాల రాశి)యైన కుమారుడిని కనాలనే మమకారంతో తన భార్య రుక్మిణికి కూడా యీ మంత్రాన్ని ఉపదేశించాడట.

ఐదు రోజులపాటు ఉపవాసముంటూ తన పతిచే ఉపదేశించబడిన ఆ మంత్రాన్ని నిష్ఠతో, ఉత్సుకతతో జపించిందట ఆ ఉగ్మలి (వనిత - రుక్మిణి).

అందువలన ఒకప్పుడు నా (శివుని) మూడవకంటి చిచ్చు కారణంగా యముని దగ్గరకు వెళ్లిన (మరణించిన) ఇందుబింబ సుకుమారుడైన (చంద్రబింబం వలె చక్కనివాడైన) మన్మథుడు భోజతనూజ యందు మధువైరి (మధు అనే రాక్షసునికి శత్రువైన విష్ణువు - యిక్కడ కృష్ణుడు) తెలిపిన కడింది జపము (కఠినమైన జపము) నిష్ఠతో ఆచరించడంచేత తిరిగి ప్రద్యుమ్నుడై పునర్జన్మ ఎత్తాడు.

కృష్ణా తీరాన్నుంచి నర్మదా తీరం వరకు వ్యాపించిన - నేడు బేరార్ అని పిలువబడుతూన్న - ఒకప్పటి విదర్భకు రాజైన భీష్మకుడు భోజవంశీకుడు. అతనిని భోజపతి అని కూడా అంటారు. భోజకటము అనేది అతని రాజధాని. అతనికి రుక్మి, రుక్మ కేశుడు, రుక్మరథుడు, రుక్మనేత్రుడు, రుక్మ బాహువు అనే ఐదుగురు కుమారులు, రుక్మిణి అనే కుమార్తె వున్నారు భోజవంశంలో పుట్టినందున రుక్మిణిని భోజతనూజ అనీ అంటారు.

అలా జన్మించిన చిన్న మన్మథుడు తన తల్లి రుక్మిణీదేవి చీర పట్టుకొని వెంట తిరుగుతూ శైశవచాపల్యంతో (శిశువునకు సహజమైన చపలత్వంతో) అసాధ్యమైన కోరికలు కోరుతున్నాడట యిలా -

సీ॥ బలభిదారామ సంభవ లతాంతశ్రేణిఁ బన్నుము నాకొక్క చిన్నతేరు
కాళి కెంగేలి చిల్కలరాజుఁ గొని తెచ్చి నావెంటఁ బడివాగె నడవఁబనుపు
గగనచంద్రాశి గణవర్తి మకరంబు బిరుదుటెక్కెముగ వేగిర మొనర్పు
మదన గోపాలుండు మాతండ్రిచే నాకుఁ జెఱకుచే మలిపింపు కఱకు విల్లు

తే॥ వనజహితు వేఁడి తమ్మి తూపునకుఁదెమ్ము, దివ్యములఁగాని సాధింపఁదీరదీశు
నంబ! నీవంచు రుక్మిణి నట్టు నిట్టుఁ, దిరుగు శైశవ చాపలార్ధితుఁడు మరుఁడు.

**(పాండురంగ మాహాత్మ్యం : 5-125)**

శ్రీకృష్ణునికి అష్ట భార్యలు - రుక్మిణి, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవింద, భద్ర, నాగ్నజితి, లక్షణ. ఈ ఎనిమిది మంది భార్యలేకాక ఆయన పదహారువేల మంది గోపికలతో క్రీడిస్తూండేవాడట. మరి వీరంతా రుక్మిణీదేవికి సవతులే! ఎప్పుడూ కృష్ణుడిని తమ కడకొంగున కట్టేసుకోవాలని యత్నించే సత్యభామాది సవతులేకాక, మనోహరమైన తమ చాతుర్యంతో కృష్ణుడిని కట్టిపడేసిన రాధాది గోపికల బారినుండి తప్పుకుని రుక్మిణీదేవి మందిరం చేరడం కృష్ణుడికి సాధ్యపడేది కాదో ఏమో - రుక్మిణి తన ప్రాణనాథుడిని తలచుకుంటూ రోజుల తరబడి ఎదురుచూసేదట. బహుశా అటువంటి సమయంలోనేనేమో ప్రద్యుమ్నుడు (బాల మన్మథుడు) తల్లికి సాయపడదానికి సమాయత్తమై ఈశుని (నీ భర్తయైన కృష్ణుని) సాధించాలంటే నీకు దివ్య వస్తువుల ద్వారాగానీ సాధ్యంకాదని చెపుతూ వాటిని కావాలని కోరుతున్నాడు.

ఇంద్రుడు బలాసురుడనే ఒక రాక్షసుడిని చంపాడు. అంచేత ఇంద్రుడిని 'బలభిత్' అనీ 'బలసూదనుడనీ' అంటారు. బలభిదారామము అంటే స్వర్గంలోని ఇంద్రుని తోటయైన నందనవనము. లతాంతములంటే పూలు. మన్మథుడు పూల రథంపై వెళతాడుకదా! అందుకే నందనవనంలో పూచిన పూలతో నాకొక చిన్న తేరు (రథము) పన్నుము (తయారు చేయించు). భద్రకాళి అనబడే కాళికాదేవి చేతిపై చిలుకను ధరిస్తుందని ప్రతీతి. ఆ రాజకీరాన్ని తెచ్చి నేను స్వారీచేయడానికి వీలుగా దానిపై ఆసనము, జీను వగైరాలతో 'పడివాగె'ను ఏర్పరచి నా వెంటపంపు. (మన్మథుడు శుకవాహనుడు కదా!) ఆకాశములోని మకరరాశిని (*Capricornus of the zodiac*) బిరుదుటెక్కెముగా వేగిరము (వెంటనే) నాకు చెయ్యి. (మన్మథునికి మకరధ్వజుడు, మకరాంకుడు, మకర కేతనుడు అని కూడా పేర్లున్నాయి. మొసలిని టెక్కెముగా - ధ్వజముగా కలిగి వుండడం చేతనే అతడికీ పేర్లు). మా తండ్రియైన మదనగోపాలునిచేత చెఱకుతో ఒక కఱకువిల్లు (వీక గల విల్లు)ను నాకు చేయించు. (మన్మథుడు చెఱకు వింటివేలుపు కదా!). మన్మథుని పుష్ప బాణాలు తాపాన్ని (వేడిని) కలిగించాలి కదా! అంచేత, వనజహితుడి (సూర్యుడి) వేడిని తన తమ్మితూపు (తామర పూబాణము)నకు కలిగించమంటున్నాడు. లేక సూర్యుడిని వేడుకుని తనకు బాణంగా ఒక తామర పూవును తెమ్మంటున్నాడు. సూర్యుడు తామర పూలకు అధినాథుడు కదా! ఇలా దివ్యమైన (దైవ సంబంధమైన - స్వర్గ సంబంధమైన) వస్తువుల సహాయంతో కానీ, నీ భర్తను సాధింప తీరదు (సాధించడానికి సాధ్యపడదు) అంటున్నాడట శైశవ చాపల్యంతో పీడింపబడుతూన్న ఆ బాల మన్మథుడు.

శ్రీ కృష్ణునితో పొందును తన తల్లి రుక్మిణీ దేవికి కూర్చడానికి ఇక్షుచాపుడు (చెఱకు వింటివాడు - ప్రద్యుమ్నునిగా జన్మించిన మన్మథుడు) పలుచటి లేత కెంజిగురు (కెంపు రంగులోని - ఎర్రని - చిగురుటాకును) బత్తళిక (అమ్ములపొది) నుంచి పెకలించి తేనె పూసిన కొత్త పూవుల బాణములు కృష్ణునిపై సంధించడంతో కార్యసాఫల్యం చెందాడు. అయితే, ఆ గెలుపు కృష్ణుని పట్టపురాణియైన రుక్మిణీదేవి నిత్యమూ జపించే మంత్రబలము వలన ఆమె కుమారుడు ప్రద్యుమ్నునికి కలిగినట్టిదే కాని, యిందులో మన్మథుని గొప్పతనమేమీ లేదని తెలుసుకో - నారదా!" అన్నాడు శివుడు.

# భీమరథీ నది పుట్టుక

"సరసిజ భవుడు (పద్మ సంభవుడు - బ్రహ్మ) అనే వాయువు వలన ప్రోత్సహింపబడినవారై (వరములు పొందినవారై) త్రిపురాసురులనే మూడు అగ్నులూ విజృంభించి తమ అకుంఠిత శక్తితో (మొక్కవోని బలంతో) ఒకప్పుడు లోకాలనన్నింటినీ నీరస యవసాంకురముల వలె (యవసము అంటే గడ్డి; నీరస అంటే ఎండిన; ఎండిన గడ్డి పరకలవలె) దహించి వేశాయట.

ఆ త్రిపురాసురుల తాకిడికి ఆకాశాన్ని తాకే అడవులు సైతం పెద్ద కంప తొడుగు (ముండ్ల కంప మోపు)తో యూడ్చిన మొల్క ససి (లేత పైరు)లా అయ్యాయట. పశువులు మొదలైన జంతువులు సైతం ఒక మహాకాయుడు చీమల చాలును (చీమల బారును) కాలరాచినట్లయ్యాయట. గొప్ప దిగ్గజములు కూడా ఒక్కసారిగా బడిగండ్లలో (బడిగండ్లు అంటే ఎలుకలను చంపే రాతి యంత్రములు) పడిన విఘ్నేశ వాహనములలా (మూషికములలా - ఎలుకలలా) అయ్యాయట.

కులాచలములు (మహేంద్రగిరి మొదలుగా కల సప్త కుల పర్వతములు) వనపాలురు (తోటమాలులు) బురదలో వేసి త్రొక్కే తాళీఫలముల (తాటిపళ్ల)వలె అయ్యాయట. (తాటి తోపులలో పండిన తాటిపళ్లను కాల్చుకొని తిన్న తరువాత వాటి విత్తులను అడుసులో వేసి త్రొక్కుతారు. వాటి లేత మొలకలుగా వచ్చిన తేగలను కాల్చుకొని తింటారు. చక్కటి ఆహారమైన ఆ మొలకెత్తిన విత్తులలోని బుర్రగుంజు కూడా పగలగొట్టుకొని తింటారు మన గ్రామీణులు).

ఇక వీళ్ల ప్రజలు (పట్టణ ప్రజలు; వీడు అంటే పట్టణం) మెత్తని గోమయ పిండము (ఆవు పేడతో చేసిన పిడక)కు అడ్డబడిన కారవేల్ల ఫలబీజ సమమయ్యారట. (కారవేల్లమన్నా, కారవేల్లకమన్నా కాకర – కాకరగింజల వలె అయ్యారట. విత్తడానికి ముందు కాకర, పొట్ల వగైరా పండ్ల విత్తనాలను పేడలో కానీ, బూడిదలో కానీ కలిపి నిలువచేస్తారు.) కమల సంభవుడైన బ్రహ్మ యిచ్చిన వరములతో గర్వితులైన ఆ త్రిపురాసురులు భరించరాని ఆక్రమణలనే వికారములతో విజృంభించారట.

ఇలా కొంతకాలము క్రూరగతిన ఆ సోకు మూకల (రాక్షస మూకల) కుడిదలయూళ్లు (ఉనికి పట్టులగు త్రిపురములు) ముల్లోకములలోని జనులను కారింపగా (బాధించగా) నేను (శివుడు) భువనహితబుద్ధితో (లోకహితం కోరి) వారిని వారించుటకు కణగాను (పూనుకున్నాను).

అప్పుడు పినాకమనే నా విల్లునూ – పవి నిభాస్త్రములను (ఇంద్రుని వజ్రాయుధములను పోలిన అస్త్రములను) చేబూని ఆ త్రిపురాసుర సంహారం చేయనెంచి నా మూడు కళ్లనూ వారిపై లగ్నంచేసి తీక్ష్ణంగా చూస్తూవుంటే ఆ శ్రమకు మద్వపురుదితములైన (నా శరీరం నుండి ఉద్భవించిన) శ్రమవారి జలములు (ఘర్మజలములు – చెమట నీళ్లు) తొఱగి (జారి) వెల్లువై నదీత్వ మొందాయి (నదిరూపం పొందాయి). అదే భీమరథీనది లేక భైమీనది. (శివునికి భీముడని మరో పేరుంది. భీముడంటే భయానకమైన ఉగ్రరూపం కలవాడని అర్థం).

లోగడ నేను వంటికి రాసుకున్న ప్రసన్ని భసితమును (మనోజ్ఞమైన విభూతిని) అణచి నా శ్రమవారి (చెమట) విజృంభించి నదీరూపంలో ప్రవహించింది – హిమవత్పర్వతపు మంచును అణచి ప్రవహించే సురనది (గంగా నది)లాగా. నామేన పుట్టినది కావున భీమ, భైమీ, భీమరథి అనే పేర్లతో దాన్ని పిలుస్తున్నారు.

అలా ఆ భైమీనది విశ్వమునంతనూ నిజకృపీటార్ద్రము గావిస్తూ (కృపీటము అంటే నీరు. తన నీటితో ఆర్ద్రము కావిస్తూ – తడుపుతూ) శ్రీభామావిభుక్షేత్రమును (లక్ష్మీపతియైన పుండరీకుని క్షేత్రమును) డాసెను (సమీపించెను). వీచిరేఖాభీలమైన (అలల సమూహముచే భయంకరమైన) ఆ నదిని చూచి ఆ క్షేత్రములోని ప్రాణులు క్షోభతో కూడిన మనస్సులు కలవారై ఆక్రోశించారట.

భూరి భయార్దితులై (గొప్ప భయముచే పీడించబడినవారై) క్షేత్రపాలుడైన భైరవుని వద్దకు వెళ్లి అమృతాహారులు (దేవతలు) తమ గోడు వెళ్లబోసుకున్నారట. "మిక్కుటమైన పొంకముతో (గొప్ప వేగంతో) యీ నది యొక్క మహా స్రవంతి యీ క్షేత్రం యొక్క ఉత్తర సీమ వరకూ వచ్చి లయాబ్ధిని (ప్రళయ కాలపు సముద్రాన్ని) తలపిస్తున్నది. ఓ నాగహారా! మేమిక్కడ నిలువలేము. ఎక్కడికి వెళ్తాము మేము? ఇక మీదట మాకు దారేది?" అన్నారట వారు.

కాలభైరవుడు ఆ సమయంలో తన భార్య కాళికాదేవితో రతి క్రీడలలో మునిగితేలుతున్నాడట. కాలభైరవుడు తన మేనికి పూసుకున్న భస్మము, కాళికను గాఢంగా హత్తుకున్న కారణంగా, ఆమె స్తన చూచుకములు అదుముకున్న చోట మాత్రం రాలిపోయి మిగిలిన తావులలో దట్టంగా వుండట. ఇలా వున్న అతని ఛాతీ ఎంతో అందంగా వున్నదట. చెంగావి జడముడి చిలుకూడి (ముడి వీడి) నెలపువ్వు (తలలో పువ్వుగా ధరించిన నెలవంక – చంద్రుడు) జారి చెంపనంటుతూందట.

ఆత్రంగా లేచి అతను మెడలోని పుసుకల పేరును సవరించుకొనబోయి తన చేతితో జందెపు చిలువను (మెడలో ఉపవీతంగా ధరించిన పామును) సవరించగా అది జలదరించిందట. "ఎక్కడ పుట్టింది? ఏది ఆ యేఱు?" అంటూ సరభసోక్తులతో (తొట్రుపాటు మాటలతో) జగజ్జంతులు (లోకములోని జీవులు) ఉలికి పడేటట్లు, చేతిలోని శీధు పాత్రను (మధు కలశాన్ని) పారవేసి, కురువు (తొడ)పైనున్న కిన్నెర (వీణ)ను త్రోసివేసి, అతిరహఃకేళి నుండి (భార్యతో నున్న ఏకాంత కేళి నుండి) బయటికి వచ్చాడట ఆ కాలభైరవుడు.

బయటికి వచ్చి, ఆ మహానదిని చూచి, చేతులెత్తి, బిట్టు (శీఘ్రముగా) చిట్టమిడిచి (చిటికె వేసి) మిక్కిలి కోపంతో తడబడుతూన్న మాటలతో యిలా అన్నాడట.

"నిలునిలు. తుంగభంగ (గొప్ప ఎత్తైన అలలు కలదాని)వైన నిన్ను చూచి యీ క్షేత్ర ప్రజలు భయంతో విలవిల లాడుతున్నారు. అందుకని నీ మీద కోపగించాడు వలమురితాలుపు (వలలో దక్షిణావర్త శంఖమును తాల్చినవాడు విష్ణువు. దక్షిణావర్తమంటే కుడివైపునకు తెరచుకొనే దివ్యావదానము అనే శంఖము). ఓ మచ్చెకంటీ! ఇంక యిటు రావడం మానుకో" అనగా ఆ నది ఆగిపోయి ఆ జగత్పతిని యిలా నుతిస్తూన్నదట.

"ఈ జగత్తు సృష్టి, స్థితి, లయాలకు మూలకారణం ఏ దేవుడో అతడే దిక్కు నాకు. మొసలి బారినుండి కరీంద్రుడికి మోక్షము కల్గించిన ఆ త్రిభువనాధీశుడే నాకు దిక్కు. పరమపదాన్ని ప్రసాదించి, ధ్రువుడిని కాపాడిన ఆ దృఢ దయామయమూర్తియే దిక్కు నాకు. ద్రౌపదికి మాన సంరక్షణం చేసి ఆమె భంగపాటును తప్పించిన ఆ దీనమందారుడే నాకు దిక్కు. ఎవరి పాదాలు ప్రక్షాళనం చేయగా పుట్టిన జలమును (వియద్గంగను) నా తండ్రియైన శివుడు తన జటాజూటములో నిలుపుకున్నాడో, ఆ మహావిష్ణువు; ఆ కృష్ణుడు, ఆ గుణాబ్ధి, దేవకీనందనుడే నాకు ఎల్లెడలా దిక్కు. నా భయమనే జ్వరమును పోగొట్టు, కుర్కురభర్త (కుక్క వాహనముగా కల కాలభైరవుడి) కారణంగా నేను భగ్నమతి నయ్యాను. ఓ చక్రాంకా! నన్ను బ్రోవుము."

అప్పుడు ఆ నదితో పాండురంగడిలా అన్నాడట.

"ఓ మధుర ప్రియభాషిణీ! రా. బెదరుపాటును వదలిపెట్టు. నన్ను చూచిన తరువాత యింకా భయమెందుకు? కలతపాటు చెందవద్దు. నాచే ఆజ్ఞాపించబడి యీ క్షేత్రంలో వ్యాపించి యుండి యీ తీర్థాన్ని దర్శించుకునే జనుల జన్మజాడ్య పాశములను (పునర్జన్మ జాడ్య పాశములను) త్రెంచివెయ్యి. భూతకోటికి అనిశమూ (ఎల్లప్పుడూ) శుభాలు నింపు. భవ భస్మాంగజా! (శివుని భస్మ పూతమైన శరీరాన్నుంచి పుట్టినదానా!) నా క్షేత్రంలో నీవు గంగ కంటె పవిత్రంగా వెలుగొందుతూ లోకంలోని ప్రజల దురిత బాధాశతమును (వందల కొలది పాపాలను) భస్మీకరించు (భస్మం చెయ్యి)."

అది మొదలుగా భైమీ తీర్థం గొప్ప తీర్థ రాజముగా వెలుగొందుతూ వుంది.

## ముక్తకేశి కథ

ఆ పాండురంగ క్షేత్రంలో ఈశాన్య దిక్కున వున్న ముక్తకేశి విగ్రహాన్ని గురించి యింతకుముందే ప్రస్తావించిన కవి యిప్పుడు ముక్తకేశి కథను వివరిస్తున్నాడు.

వెన్నుడు (కృష్ణుడు) వెలసిన చోటికి దక్షిణంగా ఒక పులిన తలము (ఇసుక తిన్నె) వున్నదట. ఒకప్పుడు కృష్ణునిచే అనుభవించి వదలబడిన రూపధన్య (అందగత్తె)యైన గొల్లపిల్ల ఒకతె కృష్ణుడక్కడ వున్నాడని తెలిసికొని అక్కడికి వచ్చిందట. ఆమె వేషం బ్రాహ్మణ స్త్రీ వేషాన్ని పోలివుందట. ఆమె స్తనములు చక్రాల్లా వున్నాయట. అనురాగంతో కూడిన మెఱుగు చెక్కిళ్లతో ఆమె వచ్చి కృష్ణుని మ్రోల నిలిచిందట.

స్త్రీలు సహజంగా కొప్పు పెట్టుకొని అందులో నవ ప్రసవములను (కొత్త పూవులను) ముదుచుకుంటే అందంగా కనుపిస్తారు. అయితే యీమె జలధర శ్యామ కుంతలయట (నీల మేఘమువలె నల్లని శిరోజములు కలదట) అంచేత, కొప్పు పెట్టుకొనకుండా జట్టు విరబోసుకుని వున్నా ఆమె అందంగానే వుందట. ఆమె యొక్క దళిత నీలోత్పల దళ చంచదక్షులు (వికసించిన నల్లకలువ రేకుల వలెనున్న కళ్లు) ఆమీలనం (అరమూతగా వుంచడం) చేసినా కాలాంజనము (నల్లని కాటుక) పెట్టుకొన్నట్లు అందముగానే వున్నాయట. ఆమె స్తనద్వయం ఏనుగు కుంభస్థలంలా (బలంగా) ఉన్నదట. స్త్రీలు వక్షోజాలపై ముత్యాల సరాలు ధరించి అందంగా కనుపిస్తారు. అయితే ఆమె వేసిన జ్ఞానముద్రే ఆమె ఛాతీపై ముత్యాలసరంలా అందంగా భాసిల్లుతున్నదట. (కుడిచేతి బొటన మరియు చూపుడు వ్రేళ్ల చివరలు చేర్చి రొమ్ముపై వుంచి ఎడమ చేతిని ఎడమ మోకాలి చిప్పపై ఉంచదాన్ని తపస్సులో ధ్యానముద్ర అంటారు) ఆమె నడుము ఆకాశం వలె శూన్యంగా వుందట. అంటే ఉండీలేనట్లున్న సన్నని నడుము ఆమెది. సాధారణంగా స్త్రీలు నడుముకు ఒడ్డాణం ధరించడం వారి అందాన్ని యినుమడింప జేస్తుంది. అయితే యీమె ఓఢ్యాణమనే ఓ ఆసనం వేసి కూర్చొని ఉందట. ఆ కారణంగా ఆమె ఒడ్డాణం పెట్టుకున్నదా అన్నంత అందంగా కనుపిస్తున్నదట.

ఇలా జుట్టు విరబోసుకుని, అర్ధనిమీలిత నేత్రాలతో, జ్ఞానముద్రలో, ఓఢ్యాణ బంధం వేసుకుని మొలనూలు తీసివేసి కూర్చుని తపస్సు చేస్తూన్న ఆ కలువకంటి యొక్క అంగ లతిక (తీగవంటి దేహము) నిరాకల్ప మైననూ (ఎట్టి అలంకారములూ లేనిదైనప్పటికీ), శారదారంభ విమలాభ్రములా (శరత్కాల ప్రారంభంలో వుండే వినిర్మలమైన మేఘంలా) ప్రకాశించిందట. (అభ్రము అంటే ఆకాశము, మేఘము అనే రెండర్థాలున్నాయి. వర్షర్తువులో వర్షాలు విపరీతంగా కురిసి శరదారంభంలో ఆకాశం వినిర్మలంగా, దాదాపు మేఘరహితంగా వుంటుంది. ఉన్న ఆ కొద్ది మేఘాలు కూడా వర్షించడం కారణంగా తమ నల్లదనాన్ని కోల్పోయి శరత్కాలంలో తెల్లని దూది పింజల్లా వుంటాయి. ఆమె దేహము శరత్కాలారంభంలోని తెల్లని మేఘంలాగానూ, వినిర్మలమైన ఆకాశం లాగానూ ప్రకాశించిందన్నమాట) ప్రకృతి మధురములకు (స్వతస్సిద్ధంగా మనోహరమైన వాటికి) వేష రచనలేల? (అలంకారములెందుకు?). ఎట్టి వేషభూషలూ లేకుండా, అతి నిరాడంబరంగా తపస్సు చేసుకుంటున్నప్పటికీ ఆమె మనోహరమైన అందంతో ప్రకాశిస్తూన్నదట.

ఆ గొల్లపడుచు అంచెలంచెలుగా మోక్షం పొందిన విధాన్ని వర్ణిస్తూన్నాడు కవి. మోక్షం నాలుగు విధాలు. 1) సాలోక్యము (భగవంతుడుండే లోకంలో నివసించడం), 2) సామీప్యము (భగవంతునికి సమీపంగా వుండడం), 3) సారూప్యము (భగవంతునితో సమానమైన రూపం పొందడం), 4) సాయుజ్యము (మనస్సులో భగవంతునే నిలిపి ఆయనలో లయమై పోవడం).

తన ప్రభువగు విష్ణువు భూలోకంలోనే నివసిస్తూన్నందున ఆమెకు మొదటిదైన సాలోక్యమోక్షం అప్రయత్నంగానే చేకూరినట్లయింది. ఇక తాను ఆ లక్ష్మీకాంతుని పాదపద్మముల నర్చించ నారంజభించడంతో ఆమెకు సామీప్య మోక్షమూ లభించింది. ఆ సద్భక్తరక్షాకారియైన శ్రీకృష్ణుడిని తన రూపుగా నిలిపిన ఆమె సారూప్య మోక్షాన్నీ, దేవతా శ్రేష్ఠుడైన ఆ విష్ణువును మనస్సులోనే నిల్పినందున ఆమె విష్ణువులోనే లయమై సాయుజ్య మోక్షాన్నీ కూడా పొందిందట.

ఈ క్రమంలో ఆమె ఘోరమైన తపస్సు నాచరించిందట. ఆ భగవంతుడు కరుణార్ద్ర మతితో సశరీరుడై ఆమె ప్రోల నిలిచాడట. అతని శరీరం మేఘమువంటి కాంతితో, అనల్పంగా, అనంతంగా, అభ్రమముగా (భ్రాంతి లేనిదిగా), కాంతిమంతముగా, అక్షోభముగా (కలత లేనిదిగా), అలోభముగా (లోభము లేనిదిగా), సాటిలేని చక్కని శోభతో ప్రకాశించేదిగా వుండి వివిధ ఆభరణములతో, కుసుమితమైన అమరభూజము (పుష్పించిన పారిజాత వృక్షము)లా రాజిల్లుతూ (ప్రకాశిస్తూ) వున్నదట.

ఆ శరదిందుబింబ సన్నిభాసన (శరత్కాలపు చంద్రబింబం వంటి ముఖం కల స్త్రీ) మానసరాసకోటి సంకాశుని (కోటి మంది మన్మథులకు సమానుడైన వానిని) రమేశుని (లక్ష్మీపతిని) రాగరసకశ్మలనేత్రయు (అనురాగ రసముచే - ఆనంద బాష్పములచే - మలినమైన కన్నులతో). స్రస్తనేత్రయును (జారిన పైట కలిగినదియు) (నేత్రము అంటే వలువ - సన్నని తెల్ల వస్త్రము - అనే అర్థం కూడా వుంది.) పేశల బంధకైశికయు (వదులైన కొప్పుముడి కలిగినదియు) పదము. ఆనందము మీఱటచే అశ్రువులను రాలుస్తున్న మెరుపు వంటి దేహాంకల ఆ స్త్రీ కనుమూసింపు వాల్చిందట (పారవశ్యంతో కళ్ళు మూసుకున్నదట).

గొప్ప విజ్ఞానమనే నీటితో నిండిన హృదయం. శుకుడు మొదలైన మహర్షుల మనస్సులనెడి దీర్ఘిక (దీర్ఘిక - నడబావులలో విహరించే విష్ణువు పాదపద్మములను ఆ భీతమృగపోతలోచన (భయపడిన జింకపిల్ల చూపులవంటి చూపులు కలిగిన స్త్రీ) బిగియబట్టిందట - మళ్ళీ ఎక్కడ మాయమై పోతాడోనన్న భయంచేతనో యేమో!

ఇక శౌరి చక్కలో నవ్వులు చిందిస్తూ, ఆ విధుబింబముఖిని (చంద్రబింబంవంటి ముఖం కల స్త్రీని) వరసంభావితా (వరములచే గౌరవింపబడినదానినిగా) చేశాడట.

"ఆ గొల్లపడుచు చిలిపి శిగముడితో వున్నది కనుక దానికి 'ముక్తకేశి' అని పేరు పెట్టాడట. ఆమె కడకు వరాలిచ్చి యున్నాడట. ఒక్కసారి అమాయకురాలైన ఆ గొల్లపడుచు విడుగుబ్బల్ని (విచ్చిన చన్నులను) చిన్నగా చిటికి ఆమెను ఆ క్షేత్రరాజమునందు ఊశాస్య వీధిలో ఉండునట్లు చేశాడట. వెన్నుడు తనూ, ఆమె ప్రేమల్లిలో మొరయుతనంగా చేసుకున్న రతి క్రీడలను మనస్సులో ఊహించుకుని నవ్వుకున్నాడట. ఆమె చేతులతో పీడింపబడిన పాండురంగేశుని పాదపల్లవము (చిగురుటాకుల వంటి పాదద్వయం)పైన ఆమె అంగుళి మధ్యతల రేఖలు (చేతివేళ్ళ మధ్య భాగంలోని గీతలు) అంటుకొని వున్నాయట - గంగానదిపై నీరు పారుటచే ఏర్పడిన జాడలలా."

"ఆ ముక్తకేశి దర్శనము వలన పెక్కు లక్ష్మీదేవి విగ్రహములను దానముచేస్తే వచ్చినంత పుణ్యం లభిస్తుందట. ఇంతెందుకు? ఆ గొల్లపడుచే లక్ష్మీదేవియని మనం భావించవచ్చు, నారదా!" అని ముక్తకేశి కథను ముగించాడు శివుడు.

అప్పుడు నారదుడు "ఆ సుశీల పుత్రులు ఏ విధంగా మోక్షం పొందారు? ప్రియుతుని కుమారుడెవరు? అతడెవిధంగా నరసింహుని కృప పొందగలిగాడు? అది కూడా వివరించు" అని అడిగాడు.

అప్పుడా నీలగళుడు యిలా చెప్పసాగాడు.

"తమ తల్లి సుశీల మరణించిన పిదప, ఆమె కుమారులు తల్లి ఉపదేశించిన విధంగానే విష్ణువు పాదములపై శ్రద్ధను నిలిపి, భైమీతీర్థ నివాసుడూ, రాస కుశలుడూ (రాస క్రీడలయందు నేర్పరి), పద్మేక్షణుడూ (పద్మములవంటి కన్నులు కలవాడు), సామజ వత్సలుడూ (గజేంద్రుని యెడల దయగలవాడూ)నైన యాదవస్వామిని (కృష్ణుడిని) పూజించి, సకల ఐశ్వర్యములతో తులతూగి, సకళత్రపుత్రముగా (భార్యా బిడ్డలతో సహా) దీప్యన్మూర్తులై (ప్రకాశిస్తున్న దేహములు కలవారై) విష్ణుసాయుజ్యాన్ని పొందారట.

అప్పుడు నారదుడు, "ఓ భర్గా! (శివా!) మనస్సులో హాళి (ఆసక్తి) పెరుగగా 'నాభార్య, నా బిడ్డలు' అంటూ, తన అవసాన దశలో తనకు పరిచర్యలు చేయుటానికి ఒక ఐంటు పైద (బంటుగా నుండే పిల్లవాడు) కావాలని వాపోతూ, భార్యాపిల్లల పోషణ కోసం ధనం కూడబెట్టే ప్రయత్నంచేసి, వారికి ఇల్లూ, ముంగిలీ ఏర్పరచి, గళదఘ్న దర్పతతో (గొంతువరకూ గర్వంతో) వాలిన (అతిశయించిన) వారికి అపవర్గము (మోక్షము) ఎలా సిద్ధించింది? ముకుందుడెవిధంగా వారిని రక్షించాడు? ఇక యిలాంటి వారికే మోక్షం లభించేటట్లయితే, యింకా కటాసము (తాపసులు క్రింద వేసుకు కూర్చునే

కృష్ణాజినము), జడలూ, దండ కమండలాలూ ఎందుకు?" (అంటే నేనూ, నా వాళ్లూ అనే స్వార్థంతో, పూర్తి ఐహిక చింతనతో జీవించే సంసారులకు కూడా మోక్షం లభించేటట్లయితే, యింకా సన్న్యాసమెందుకు?) అన్నాడు శివుడితో.

దానికి శివుడు నారదునితో "ఓ హరి విచారా! (చక్కని ఆలోచన కలవాడా!) సుశీల పుత్రులు సామాన్యులు కాదు. కారణపురుషులు. అంచేతనే గృహస్థులై కూడా వారు విష్ణుసాయుజ్యం పొందారు. అదలా వుంచి, పూర్వజన్మలో చేసిన పుణ్య సంపద వారిని ఆవహించడం వల్ల, మునివల్లభులకు కూడా దుర్లభమైన విష్ణుసాయుజ్యం వారికి లభించింది. వారే ఎందుకు? గృహస్థధర్మాల్ని చక్కగా పాటించే వారెవ్వరికైనా ముక్తి లభించి తీరుతుంది." అన్నాడు.

## గృహస్థ ధర్మములు

ఇక్కడ ఒక చక్కటి పద్యంలో రామకృష్ణకవి గృహస్థ ధర్మమును మించిన ధర్మమే లేదంటున్నాడు. చూడండి -

**సీ॥ పరిణీత యగునింతి ప్రతికూల గాదేని తనయుండు తన యాజ్ఞ దాటఁడేని**
**నిజ సహోదరులు వినీతులై మనిరేని కోడలోరుపుదక్కి గొనఁగదేని**
**కూఁతు రీలువునందుఁ గొదవ జూపదయేని ఋణమను పాతకంబెనయ దేని**
**తేజోగరిమ పరాధీనతఁ జెడదేని నిందాంధకారంబు నెఱయదేని**

**తే॥ న్యాయమున మొల్లముల పెల్లు దాయునేని**
**యతిథి సంతర్పణంబింట నమరునేని**
**సముచితాచారమును నింట సాగునేని**
**కలదె గృహమేధి ధర్మంబు కంటె మేలు? (పాండురంగ మాహాత్మ్యం : 5-166)**

పరిణీత యగునింతి - పెండ్లి యాడిన స్త్రీ; భార్య ప్రతికూలము కాకుండా అనుకూలవతి యైనచో, తనయుడు (కుమారుడు) తన ఆజ్ఞ జవదాటకుండా వున్నట్లయితే, నిజ సహోదరులు (తన అన్నదమ్ములు) వినీతులై (వినయశీలురై) మనిరేని (జీవించినచో); కోడలు ఓరుపు దక్కి (శాంతము కోల్పోయి) గొనఁగదేని - గొణగకుండా వున్నట్లయితే - అంటే కోడలు ఓర్పుతో వ్యవహరిస్తూ యింటిగుట్టును రచ్చకీడ్చకుండా వున్నట్లయితే; కూతురు ఈలువునందు (పాతివ్రత్యమునందు; సత్ప్రవర్తనయందు) కొదువ చూపనట్లయితే (కొరతలేనిదైనట్లయితే); ఋణము (అప్పు) అనే పాతకము (పాపము) లేకున్నట్లయితే; స్వీయ తేజస్సు పరాధీనత కారణంగా మసకబారనట్లయితే; నిందయనే చీకటి వ్యాపించకున్నట్లయితే; న్యాయమున మొల్లముల (ధనముల) పెల్లు (ఆధిక్యము) దాయునేని (సమీపించినట్లయితే); అంటే సక్రమమైన మార్గంలో విపరీతమైన సంపద చేకూరినట్లయితే; ఇంట్లో అతిథి సంతర్పణం (అతిథి అభ్యాగతులకు భోజనములు వగైరా) అమరినట్లయితే; సముచితాచారము (ఆయా కాలములలో ఆచరింపదగు నియమములు) యింట్లో సాగినట్లయితే -

గృహమేధి (మేధ అంటే యజ్ఞము. గృహమేధి అంటే గృహములో చేయాల్సిన పంచయజ్ఞాలనూ నిర్వర్తించేవాడు. వేదపాఠము, వైశ్వదేవాది హోమము, అతిథిపూజ, పితృతర్పణము, భూతబలి - యీ పంచ యజ్ఞములనూ చేస్తూ భార్యతో ధర్మార్థకామములను నడిపే వాడిని గృహమేధి అంటారు) ధర్మం కంటే మేలైన ధర్మమింకేదైనా వుందా? అని ప్రశ్నిస్తున్నాడు కవి - ఇవన్నీ చేకూరితే గృహస్థ ధర్మం కంటే మేలైన ధర్మం లేదని చెపుతూనే - ఉత్తమ గృహస్థు ఎలా వుండాలో - ఎలా

వుండకూడదో - తెలుపుతున్నాడు కవి.

## అయుత - నియుతుల కథ

"ఓ మునివరా! (ఓ నారదా!) అయుతుడు, నియుతుడు అనే మునికుమారుల కథ - గృహస్థ ధర్మము గొప్పదని నిరూపించుటకు ఏనోహరమైన (ఏనస్సు అంటే పాపము; పాపహరమైన) ఒక ఉపాఖ్యానము (చిన్న కథ)ను చెప్తాను విను దాంతో నీ మనస్సులో ఆవరించిన సంశయం తొలగిపోతుంది" అంటూ ఉగ్రుడు (శివుడు) యిలా చెప్పాడు.

"వింధ్యపర్వతం అమరాద్రి (మేరుపర్వతం)తో పోటీపడి ఒకప్పుడు వివిధ నక్షత్రములు తన మొలపూసలుగా కనుపించేటంత ఎత్తుకు పెరిగిందట; మరి కాశీలో నన్ను సేవించిన, ఘటములో పుట్టినట్టి (కుంభ సంభవుడైనట్టి), ప్రస్తుతం ఉటజములో ఉన్నట్టి (పర్ణశాలలో నున్నట్టి) తేజము (తేజోవంతుడైన అగస్త్యమహాముని) గురించి ఎరుకలేదేమో ఆ వింధ్య పర్వతానికి?

అడ్డులేని తపోశక్తిచే గొప్పవాడైన ఆ కుంభసంభవునకు వున్న శిష్యులు వేయిమందిలో ప్రయుతుడనే ముని యొక్క కుమారులు అయుతుడు, నియుతుడు అనే వారలున్నారు. వారంటే ఆ పారికాంక్షి (ముని)కి ఎంతో యిష్టం. ఒకరోజు ఆ మునిలోక పాకశాసనుడు (మునీంద్రుడు) యీ విధంగా ఆలోచించాడట. "వీరిద్దరూ నా శిష్యులలోకెల్లా గొప్ప జ్ఞానవిచారం కలవారు. తేజస్సు, ఓర్పు, శాంతము, ప్రసిద్ధి - అనే గుణములలో వీరికి వీరేసాటి. వీరి మనస్సెప్పుడూ నాయందే లక్ష్యమై వుంటుంది. అట్టి వీరినిక అవశ్యం పాణిపీడన విధానశ్రీలతో (పాణి పీడనాది వైభవములతో - అంటే వివాహ వైభవములతో) సన్మానించాలి.

వారికి వంటిపై వస్త్రములున్నాయా - లేవా అనే స్పృహే వుండదు. ఆకలినీ, నీర్వట్టునూ (దప్పికనూ) వారు లెక్కచేయరు. తలలు మాసినా పట్టించుకోరు. శరీరాంగములు బడలినా పాటించరు. అది యట్లుండనిచ్చి, ఆసాయంబుగా (సాయం వేళవరకూ) ఆనిశాత్యయముగా (ఉదయమగు వరకు - అహోరాత్రములు - ఎడతెరిపి లేకుండా) వారు ఆమ్నాయములు (వేదములు) క్రోల్చునప్పుడు (వల్లించేటప్పుడు) ఆసీన ప్రచలాయితమైనా లేదే! (కదలక కూర్చుంటే వచ్చే కునికిపాటైనా వారికి రాదే!) ఆహా! (ఎంతటి ఆశ్చర్యము!)"

"వీళ్లు వీరికి తగిన మగువలను భార్యలుగా పొందలేరు. అంచేత, నేనే వెళ్లి సకరగ్రహణలుకాని (గతంలో పెండ్లికాని) ధాతృ తనయుల (బ్రహ్మ పుత్రికల)ను వీరికొరకు కమలజుని (బ్రహ్మను) అడిగి తెస్తాను" అని నిశ్చయించి ఆ సత్యవ్రతుడైన అగస్త్యుడు సత్యలోకానికి వెళ్లాడట.

అక్కడ మినుకు చేడియ (వాగ్దేవి - సరస్వతి)తో కూడియున్న బ్రహ్మ, హంస వాహనము చెంగట (సమీపమున) ఉండగా, మేరు పర్వతంలా మెరిసి పోతున్నాడట. మేరుపర్వతాన్ని సౌవర్ణగిరి, హాటకాద్రి (బంగారుకొండ), భూరిశైలము కాంచనాగము అని కూడా అంటారు. బ్రహ్మ శారదాభ్రము (శరత్కాలపు మేఘము)లను అంటుతూన్న భూరిశైలములా తెలుపు కైసేతల (అలంకరణల)తో ఉన్నాడట. వెలిదమ్మి (తెల్లతామర) గద్దెపై ఆసీనుడైన బ్రహ్మ కకుభిభముల మీది కాంచనాగము వలెనున్నాడట. (కకుభ + ఇభము - కకుభ - అంటే దిక్కు, మూల; 'ఇభము' అంటే ఏనుగు; భూమికి ఎనిమిది మూలలలో ఎనిమిది దిగ్గజములు భూభారాన్ని మోస్తున్నాయని విశ్వాసం). అలాంటి నలువ (బ్రహ్మ)కు చుళుకిత పాథోధి (సముద్రాన్ని పుడిసిట పట్టిన అగస్త్యుడు) నమస్కరించి స్తోత్రం చేశాడట.

బ్రహ్మ అతనికి అగ్రాసనమిచ్చి అతడిని పొగడ్తలతో ముంచెత్తాడు. అగస్త్యుడు లోగడ విపరీతంగా పెరిగి సూర్యచంద్రాదుల గమనాన్ని అడ్డుకొంటున్న వింధ్య మదమణచాడట; సముద్రములో దాక్కున్న కాలకేయులు వగైరా రాక్షసులను బయటపెట్టుటకు దేవతల కోరికపై సముద్రాన్ని పుడిసిటపట్టి త్రాగాడట; వాతాపి అనే రాక్షసుడిని తన జఠరాగ్నితో జీర్ణంచేసుకుని వాడి బారినుండి బ్రాహ్మణులను కాపాడాడట. వంద క్రతువులు చేసిన నహుషుడు ఇంద్రపదవినొంది, మునులను అవమాన పరచినప్పుడు, అగస్త్యుడు అతడిని సర్పమగునట్లు శపించాడట. ఇవన్నీ పేర్కొంటూ బ్రహ్మ "ఓ మిత్రావరుణ కుమారా! (ఓ అగస్త్యా!) ఇలా నీ వలె లోకకళ్యాణం కోసం, దుష్ట శిక్షణ, శిష్ట సంతుష్టి కోరి రోషభీషణమైన పద్ధతిలో క్రీడించే ప్రోడలు (నేర్పరులు) లేరుగాక లేరు. లోకములకు కలిగిన ఉపద్రవములు నీ కారణంగా అణగిపోగా ఇందుధరుడు (శివుడు), హరి (విష్ణువు), నేను - ప్రోపు (రక్షణ, పోషణలు) పొందాము" అంటూ బ్రహ్మ అగస్త్యుడు వచ్చిన పనేమిటో కనుక్కొని, "నీవు అర్థించడానికి యిది ఎంతపని?" అంటూ లోగడ తాను తన ఆత్మలో లోకంలోని యువతులందరి కంటే ఎక్కువైన అందముతో సృష్టించిన తన కుమార్తెలైన గాయత్రి, సావిత్రి అనే ప్రశస్త నామధేయములు కలిగినట్టి వారిని ఆ శతానందుదు అగస్త్యున కప్పగించగా, అతడు తిరిగి తన పర్ణశాలకు వచ్చి, అయుత నియుతులను రావించి వారికీ విషయము తెలిపి, వారిలో అయుతుడు వివాహానికి అంగీకరించనందున, ఆ యిద్దరు కన్యలనూ నియుతునకిచ్చి వివాహం చేశాడట.

తన యిరువురు భార్యల కుటిలాలకములు (మెలితిరిగిన ముంగురులు) చీకటి ప్రోగులలా, అజ్ఞానాంధకారములా నల్లగా వున్నాయట. అయితేనేం? వారి చిత్తగతులు (మనస్సుల నడకలు - అంటే మనస్సులలోని ఆలోచనలు) చిచ్చంద్రికాఢ్యములట (చిత్ చంద్రిక - జ్ఞానమనే వెన్నెలచే సంపన్నమైనవట). వారి మధురోష్ఠములు (తీయని పెదవులు) రాగమహితములట (అంటే ఎరుపుతో కూడి - రజోగుణ పూరితములట). అయితేనేం? వారి భావములు వైరాగ్య బంధురములట (వైరాగ్య గుణముచే ఒప్పారేవట). వారి గురు కుచములు (పెద్దవైన వక్షోజములు) గర్వభరితములట (పొంకము కలిగినవట). అయితేనేం? వారి ఆశయములు హతదుర్వికారములట (నశించిన చెడ్డతనములు కలిగినట్టివట). వారి అలవోక నడకలు మాంద్యంతో కూడుకున్నవట (జడత్వం కలిగినట్టివి; చొరవ లోపించినవి) అయితేనేం? వారి అంతరంగములు (మనస్సులు) బోధాస్పదములట (జ్ఞానమునకు నిలయములట). వారి పొగరు చూపులు చపలమైనవేనట. అయితేనేం? వారి నిండు మనములు నిశ్చలములట. అందుకే అప్పటిదాకా సర్వసంగపరిత్యాగిగా వుండిన నియుతమౌని వారిరువురి యందు సమబుద్ధి నిలిపి, ప్రియమూనాడట (ప్రీతి కలిగివున్నాడట).

అతడట్లుండగా, అతని అన్న అయుతుడు గురువు మాటను తాను కాదన్నాడు కనుక ఆయన అనాదరణకు గురై మనస్సులో బాధతో హిమాలయ ప్రాంత భూములకు వెళ్లాడట.

అతడు తన మనస్సులో యిలా ఆలోచన చేశాడట -

చ॥ చిలుకలు కమ్మతెమ్మెరలు శీతమయూఖుఁడుఁ దేఁటులాదిగాఁ
గల ననవిల్తు సాధన నికాయము వేలముపట్టు లంగనా
కుల; మటుగాన దాని విడఁగొట్టక తృట్టికడొట్ట వీతరా
గులమని విఱ్ఱవీఁగెదరు కొందఱు బోదలు నానగండలై. (పాండురంగ మాహాత్మ్యం : 5-182)

చిలుకలు, కమ్మతెమ్మెరలు (కమ్మగాడ్పులు - మలయానిలములు), శీతమయూఖుడు (చల్లని కిరణములవాడు - చంద్రుడు) తేఁటులు (తుమ్మెదలు; ఇవి మన్మథుని చెరకువిల్లునకు వింటినారిగా పనిచేస్తాయి); ఆదిగా గల (మొదలైన);

ననవిల్తుని (మన్మథుని) సాధన నికాయము (సాధన సంపత్తి)కి వేలము పట్టులు (శిబిర స్థానములు, ఉనికి పట్టుల ఆలంబనములు) అంగనా కులము (స్త్రీ జాతి); అటుగాన (అందుచేత) దాని విడఁగొట్టక (దానిని దూరంగా త్రోసివేయకుండా) కొందరు బోదలు (సన్న్యాసులు) నానగండలై (సిగ్గుమాలినవారై) తృట్టు (దప్పిక) ఎకదొట్టగా (అతిశయించగా) వీతరాగులమని (గతించిన రాగ ద్వేషాదులు కలవారమని; ప్రేమ, ద్వేషం వగైరాలు నశించిన వారమని) విఱ్ఱవీగుతారు (మిక్కిలి గర్వపడతారు).

తాపసులకు ఎట్టి పరిస్థితులలోనూ వివాహం కూడదని చెపుతూ అయుతుదేమంటున్నాడంటే -

జడలట (వైరాగ్యాన్ని సూచిస్తూ తైల సంస్కారం లేక తాపసుల శిరోజాలు పెరిగి జడలు కడతాయి) చుట్టుకొనడానికీ కట్టుకొనడానికీ కడ వసమట (కృష్ణాజినమట – *The skin of the black antelope*). మేనిపై కప్పుకొనడానికేమో కాషాయమట (కాషాయ వస్త్రాలు – కావిగుడ్డలు). అడవులలో నవయు (శుష్కించే) తపస్వికీ, మిక్కిలి సౌఖ్యవంతమైన జీవితం కోరుకొనే సతికీ (భార్యకూ) కలయిక తగునే? (తగునా?).

అటువంటప్పుడు గురువైన అగస్త్యుడు తనను పెండ్లి చేసుకొమ్మని ఎందుకు వత్తిడి చేశాడు? దాని పర్యవసానమేకదా యిలా గురువుకు దూరంగా ఉండాల్సిరావడం అనుకుంటూ -

సీ॥ ఉర్వీధరము లెక్కి యురుకనే కుచకుంభయుగ మొల్లఁగాక తానుఱుకుమనిన
వాడికైదువులపై వ్రాలనే నిడుఁజూపు దాలొల్లఁగాక త్రావ్రాలుమనిన
మున్నీటి సుడివడి మునుఁగనే నతనాభిఁ గననొల్లఁగాక తామునుఁగుమనిన
బెడఁగారు కాలాహిఁ దొడుకనే నూఁగారు తొడుసొల్లఁగాక తాఁదొడుకు మనినఁ

తే॥ జెప్పి గురుఁడేమి పనిచినఁ జేయలేనె? కావె తనసొమ్ము మామక కాయకర్మ
గతులు, మొఱ్ఱోయనంగ లింగంబు గట్టు, జంగమన నంగనలఁగూర్పఁ జనదుగాక!

(పాండురంగ మాహాత్మ్యం : 5-184)

ఆయన దూకమంటే ఉర్వీధరములు (కొండలు) ఎక్కైనా దూకుతాను. అయితే కుచకుంభ యుగము (కుండల వంటి స్తనద్వయం) పైకి లంఘించడం మాత్రం నా వల్లకాదు.

ఆయన పదునైన ఆయుధములపై పడమంటే పడదానికి సిద్ధం. అయితే నిడుఁజూపు (స్త్రీల సోగ చూపుల) దాలు (కాంతి)ని చూడడం మాత్రం నా వల్లకాదు.

ఆయన మున్నీటి (సముద్రపు) సుడి (సుడిగుండం – జలావర్తము) లో మునగమన్నా మునగడానికి సిద్ధం అయితే స్త్రీల నతనాభి (లోతైన బొడ్డును) చూడమంటే మాత్రం నేను చూడలేను.

ఆయన పట్టుకొమ్మని ఆజ్ఞాపిస్తే బెడగారు (మెరిసే కాంతితోనున్న) కాలాహిని (నల్లత్రాచును) సైతం తొడుకనా? (పట్టుకొననా?) అయితే నూగారు తొడుసు (స్త్రీల రోమాలతో సంబంధము)ను మాత్రం నేను యిష్టపడను.

ఆయన నాకు ఏ పని చెప్పినా అదే ఆజ్ఞగా భావించి చేయలేనా? మామక కాయకర్మగతులు (నా శరీరము వలన అయ్యే పనులేవైనా వుంటే – అవి) తన సొమ్ముకావే? 'మొఱ్ఱో! లింగము కట్టవయ్యా జంగమా!' అంటే 'అంగనలను (స్త్రీలను) కూర్ప (కలపడం; తగిలించడం) చనదుఁగాక (తగదుగాక తగదు).

అలాంటి పనికి నియుతుడు తగిపోతాడేమో కాని, నేను మాత్రం గృహస్థుడవడం కంటె వేరే కీడు లేదని భావిస్తాను

గురువు మాట విని ఉరివేసుకోవడం నాకిష్టం లేదు. అందుకే నేను బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్నాను" అని మనస్సులో వితర్కించాడు.

ఆ జటిల వ్యాఘ్రము (మునులలో పులివంటివాడైన - ముని శ్రేష్ఠుడైన అయుతుడు) అనాఘ్రాత పుష్పము (వాసన చూడబడని పువ్వు) వంటి తన దేహమును గొప్ప నియమము అనే అగ్నితో తపింపజేస్తూ, నిర్మలమైన మనస్సుతో, ఇచ్ఛనూ, ఈర్ష్యాసూయలనూ విడచిపెట్టి, ధౌత మణిదర్పణంలా (నిర్మలమైన మణులతో కూర్చిన అద్దములాగా) మనస్సులో ఆదితత్త్వాన్ని (పరమాత్మను) నిలిపి తీవ్ర నియమ నిష్ఠలతో తపస్సు చేశాడట.

అతని ఘోర తపస్సుకు సమస్తలోకాలూ భయకంపితమయ్యాయట. గొప్ప కాంతులకు నిధియైన పెనుమినుకు (సూర్యుడు) కాంతి విహీనమై మినుకు మినుకుమన్నాడట. ధరణి (భూమి) బిట్టు (వేగంగా) ఊటాడిందట (గజగజ వణకిందట). వన నిధులు (వనము అంటే నీరు అనే అర్థమూ వుంది. నీటికి నిధులు - సముద్రాలు) ఉప్పొంగాయట. 'గనగనగన' మంటూ ఆకాశాన్నుంచి నిప్పు కలు (నిప్పురాళ్లు - అగ్ని కణములు) కుప్పతిప్పలుగా కురిశాయట.

ఉ॥ అత్తటి నిప్పు ద్రొక్కినటు లౌఁదలఁ దేల్గొనినట్టు లావ యు
వ్వెత్తుగఁ ద్రావినట్లు విబుధేశుఁడు మాణవకోగ్ర నిష్ఠకున్
జిత్తమునం దపించి యతి శీఘ్రగతిన్ క్షితి కేఁగు దెంచెఁద
ద్వృత్తము మానిపింతునని వృద్ధమహీసుర వేషధారియై (పాండురంగ మాహాత్మ్యం : 5-189)

నిప్పుత్రొక్కినవాడూ, ఔదల (ఔ + తల - నడినెత్తి)పై తేలు కొనినవాడూ (తేలు కుట్టినవాడూ) పడే బాధ వర్ణనాతీతం. ప్రాచీన కాలంనుంచీ ఆవ రసాన్ని, వమనకారి (*Emetic*) గానూ, విరేచనకారి (*Purgative or Cathartic*) గానూ, మూత్రకారి (*Diuretic*) గానూ వాడేవారు. విషపదార్థాలు మ్రింగినవారి చేత ఆవ నూనె లేక నీటిలో కలిపిన ఆవ పిండి త్రాగించి వాంతులు చేయించేవారు. ఆవ (*Brassica juncea*) పైత్యము, కాక చేయడమేకాక, అది ఉవ్వెత్తుగా (ఎక్కువగా) తీసుకున్న వారికి జాడించి విరేచనాలు అవుతాయి. మూత్రము జారీగా వెడలుతుంది. వాంతులు ఎక్కువగా అవుతాయి. దీనికి విరుగుళ్లు నెయ్యి, మజ్జిగ, కలినీళ్లు (పచ్చి బియ్యాన్ని కడిగి, ఆ కడుగు నీరును పులియబెడితే దానిని కలినీరు అంటారు. మన పూర్వీకులు ఆ కడుగు నీటిని కూడా వృథాగా పోనివ్వకుండా బానలలో నిల్వచేసి, పులియబెట్టి దానిని పేదసాదలకు పోసేవారు. కలోగంజో త్రాగి బతుకీడవడం అనే మాట మనకు సుపరిచితమే కదా!) మొత్తం మీద ఆవ ఎక్కువగా పుచ్చుకున్నవాడు అసహనంగా, నిప్పుల మీద వున్నట్లుగా, మనసంతా వ్యాకులతతో నిండి వుంటాడు.

అత్తటి (ఆ + తటి - ఆ సమయములో) ఆ మాణవకుడి (యువకుడి) ఉగ్రనిష్ఠకు (ఉగ్రమైన తపోనిష్ఠకు) విబుధేశుడు (విబుధులంటే దేవతలు. దేవతల అధిపతి - ఇంద్రుడు) చిత్తములో తపించి (మనస్సులో కలతచెంది) అతి శీఘ్రగతిన క్షితి (భూమి) కేగుదెంచాడట - ఒక వృద్ధ మహీసురుని (వృద్ధ బ్రాహ్మణుని) రూపంలో - ఆ తాపసి యొక్క వృత్తము (నడత) మాన్పిస్తానంటూ.

సీ॥ జీర్ణైణకృత్తివేష్టిత శాస్త్రశబళికా సారపేటిక లొక్క చేట్టుపూనఁ
గంబళ కటబ్రుసీకాషాయ కరకంబు లొక్క యంతేవాసి యుద్వహింప
నాళికాఫలసారయవసక్తుతండుల సూపాదులొక్క శిష్యుండు మోవ
సమిదాజ్య పూర్ణ కీచక కుశస్రుక్ స్రువచయ మొక్క ఛాత్రుండు సంగ్రహింపఁ

తే॥ దలుగు దామెనఁ బెనఁచిన గళముతోడఁ, జంట వెన్నాడు క్రేపుతోఁ జాల నలసి
నడచు ధేనువునొకచిన్న వడుగు రొప్ప, నడుచు న్నాశ్రమవాట మయ్యతిథి దాసి.
(పాం. మా. 5-190)

ఈ చక్కటి పద్యంలో రామకృష్ణకవి ఆ రోజులలో గురువులు ప్రయాణాలలో శిష్యసమేతంగా ఏయే వస్తుసంచయంతో, ఎలా బయలుదేరేవారో తెలిపాదు.

ఏణము అంటే పెద్దకన్నులు గల నల్ల యిఱ్ఱి (జింక). కృత్తి అంటే చర్మము. జీర్ణైణకృత్తి వేష్టిత - నలిగి పాడైపోయిన పాత జింకతోలులో చుట్టబడిన; శాస్త్రశబళికా - శబళికా అంటే కామధేనువు - కోరినవి యిచ్చేది - 'శాస్త్ర శబళికా' అని యిక్కడ వాడడంలో కవి ఉద్దేశ్యం - సకల శాస్త్ర గ్రంధసంచయమునూ కలిగినట్టివని. సౌరపేటికలను (దేవతార్చన పెట్టెలను) ఒక చేట్టు (శిష్యుదు) పూనగా (వహించగా, మోయగా); 'సౌరపేటిక' అనే పదం నేను వెదకిన నిఘంటువులు వేటిలోనూ కనుపించలేదు. అయితే 'సౌరము' అంటే ఋగ్వేదంలో సూర్యుడిని ఉద్దేశించి చెప్పబడిన ఋక్కుల సముదాయము. 'సౌరము' వగైరా ఋక్కుల (పవిత్ర ప్రార్ధనా గీతముల) తాళపత్ర గ్రంథాలను ఉంచే పెట్టెలు కనుక ఆ పెట్టెలను సౌరపేటికలని వుండవచ్చు పూర్వులు. వాటిలో ఆధ్యాత్మిక గ్రంథాలను తీసుకు వెళుతూండడం వలన వాటినే దేవతార్చన పెట్టెలనీ అని వుండొచ్చు. పండితులు అలాంటి సౌరపేటికలలో సకల శాస్త్ర గ్రంథ సంచయాన్నీ తీసుకెళ్లేవారేమో! వానలకు తడిసి లోపలి గ్రంథాలు పాడవకుండా జింకతోలులో ఆ పెట్టెల్ని చుట్టేవారన్నమాట.

కంబళము (కంబళి - క్రింద పరుచుకుని కూర్చునే వస్త్రం), కటము (చాప), బ్రుసి (వ్రతం చేసేవారు కూర్చునే ఆసనము), కాషాయము (కావి గుడ్డలు), కరకము (కమండలువు; గిండి వంటి పాత్ర)లను ఒక అంతేవాసి (శిష్యుడు) ఉద్వహిస్తున్నాడట (మోస్తున్నాడట).

ఆమ్లికా ఫలము అంటే చింతపండు; సారము అంటే తేనె; యవలు అంటే బార్లీ ధాన్యము; సక్తు అంటే పేలపిండి తండులము అంటే బియ్యము; సూపము అంటే వండిన పలుచని పప్పు; మొదలైన వాటిని మరో శిష్యుడు మోస్తున్నాడట దూర ప్రయాణాలలో వున్న బ్రాహ్మణులు యిలా తమతో తీసుకువెళ్లే సంబాళముల (సంబారములు - వేశవారముల)లో కేవలం ఆహారానికేకాక యజ్ఞ నిర్వహణ కవరసరమైన - యజ్ఞములో హవిస్సులుగా వేయబడే - తిల (నువ్వులు), మాష (మినుములు) వ్రీహి (ధాన్యం), యవా (బార్లీ ధాన్యము), నెయ్యి వగైరాలు కూడా వుండేవి. సుదీర్ఘ ప్రయాణాలలో వున్నప్పటికీ ఆహితాగ్నులు రోజూ యజ్ఞాలు నిర్వహించాలి కదా మరి!

సమిత్ - సమిధలు; ఆజ్యము - అంటే నెయ్యితో; పూర్ణ (నిండిన); కీచకము (లోపల డొల్లగా వుండే వెదురు బొంగు) డొల్ల వెదురు బొంగుతో నెయ్యి వగైరా పోసుకొనడానికి క్యాను (*Can*) వంటి పాత్రను తయారు చేసేవారు. దానిని కీచకము అనేవారు. ఆజ్యపూర్ణ కీచకము అంటే నెయ్యితో నిండిన కీచకము; కుశ - దర్భలు; స్రుక్ - దీనిన్ స్రుచ్ అనీ అంటారు. ఇది యజ్ఞాలలో నెయ్యిని అగ్నికి ఆహుతి చేయడానికి వాడే పెద్ద కొయ్య గరిటె - *Wooden ladle spoon* - వీటి తయారీకి సాధారణంగా పలాశ (మోదుగ) లేక ఖదిర (చండ్ర) కర్రలే వాడతారు. స్రువ - ఇదీ యజ్ఞాలలో నెయ్యి పోయడానికివాడే కొయ్య గరిటె. అయితే సోమయజ్ఞాలలో వాడే స్రుచ్‌ని స్రువమంటారని తెలుస్తున్నది. దీనిని ఒకజాతి కానరేగు (*Flacourtia sapida*) చెట్టు కర్రతోనే చేస్తారట. ఈ చెట్లు బెంగాల్ ప్రాంతాలలో విస్తారంగా వుంటాయి. స్రుక్ స్రువచయము అంటే యజ్ఞాలలో వాడే పరికరాల సముదాయమన్నమాట. ఇంకా 'అరణి' అనే కొయ్య పరికరాన్ని యజ్ఞం

సందర్భంగా త్రచ్చి (చిలికి) నిప్పు పుట్టించడానికి వాడతారు. దీన్ని తయారు చేయడానికి శమీ వృక్షపు (జమ్మి చెట్టు) కలపనుపయోగిస్తారు. జమ్మి చెట్టు గర్భంలో అగ్ని వుంటుందని విశ్వాసం. 'అరణి కేతు' అనే పేరుతో పిలువబడే అగ్నిమంథ వృక్షం (*Premna integrifolia*) యొక్క గర్భంలోనూ అగ్ని వుంటుందని విశ్వాసం. ఇలాంటి యజ్ఞ సంబంధిత వస్తు సంచయాన్నంతటినీ ఒక ఛాత్రుడు (శిష్యుడు, విద్యార్థి) మోసుకొస్తున్నాడట.

తలుగు దామెన (పలుపు త్రాడు)పెనవేసిన మెడతో, చంట వెన్నాడు క్రేపుతో (చన్ను వదలకుండా తన వెంటబడి వచ్చే దూడతో), చాల అలసిపోయి నడుస్తూన్న ధేనువు (ఆవు)ను ఒక చిన్న వడుగు (బాల బ్రహ్మచారి) రొప్పుగా (త్రోలగా, తరుమగా) ఆ అతిథి అయుతుని ఆశ్రమవాటము (ఆశ్రమ ప్రదేశము)ను దాసినాడట (సమీపించాడట).

తల వణకుతూ జుట్టంతా తెల్లగా నెరసి పోయిన గృహమేధిని (ఆ బ్రాహ్మణుని భార్య) కూడా వారి వెంటనే వస్తున్నది.

ఈ విధముగా ఆ కుహనాహితాగ్ని (కుహన + ఆహితాగ్ని - బూటకపు గృహస్థు), త్రైర్థిక వేషాభినయ నిపుణుడు (తీర్థయాత్రకు వెళ్తున్నవానిలా నటించడంలో నిపుణుడు) అయినటువంటి ఆఖండలుడు (ఇంద్రుడు) తపోమహత్త్వంతో కళకళలాడుచున్న ఆ ఆశ్రమంలోని ఒక పటకుటికా (పర్ణశాల) మండపము మధ్యలో అధ్యాసించి (కూర్చుని), మాధ్యందిన సవనమును ఆచరించి, కాసేపు విశ్రమించి, సాయంత్రం నదీతీరంలో సాయంసంధ్యోపాసన కుపక్రమిస్తూన్న అయుతుడిని తన పరివారంతో సమీపించగా అతడు వారికి ప్రేమతో అతిథి మర్యాదలు చేసి వారు వచ్చిన పనేమిటో తెలిసికొనగోరాడు.

అప్పుడు కపటవేషధారియైన ఇంద్రుడు అయుతునితో, "మాది హైమ నగము (హిమాలయ పర్వతముల) సమీప ప్రాంతంలోని ఒక ఆశ్రమము. అది అమృత భుగాస్పదము (అమృతభుక్ - ఆస్పదము - దేవతలకు నివాసమైనట్టిది) విశదాప్సరము (విశద + ఆప + సరము - స్వచ్ఛమైన జలములతో కూడిన సరస్సు కలిగినది లేక పరిశుద్ధమైన అప్సరసలతో కూడినది) నవపారిజాతము (కొత్త లేక వింత పారిజాతము) మొదలైన వృక్షములతో రాజిల్లునట్టిది. హైమనగోపరి సీమలోని (మేరు పర్వత శిఖర భాగంలోని) నా నివాసం అనంత ఫలాయతనము (అంతములేని ఫలములకు స్థానమైనట్టిది - లేక - అనంత ఫలాయతనము - అంటే అనంతమైన స్వర్గము), అది నిత్యరమ్యము (ఎప్పుడూ రమ్యంగా ఉండేది) మదము, లోభము, క్రోధము అక్కడ మొలవనుకూడా మొలవవు" అని చెపుతూ తాను స్వర్గాధిపతి ఇంద్రుడినని చెప్పకనే చెప్పాడు.

ఇంకా ఇంద్రుడు, "ఓ ధ్రువ తపోగామీ! (స్థిరమైన తపోదీక్షగల ఓ మునీ!) ఈ మేను ధ్రువముకాదు (శాశ్వతము కాదు) అంచేతనే అఖిల ధర్మములలో గార్హస్థ్య ధర్మమే ఉత్కటమని (గొప్పదని) ఎంచి గార్హస్థ్య ధర్మనిష్ఠను ఓర్పుగా పాటిస్తూ తీర్థయాత్రలు చేయాలనే ఆశతో ప్రపంచమంతా తిరుగాడుతున్నాను. కంచి భజించి (కాంచీపురం లోని వైకుంఠపెరుమాళ్, వరదరాజ స్వామినీ సేవించి), శేషగిరి కనుగొని (శేషాచలవాసుడైన తిరుపతి వేంకటేశ్వరస్వామి దర్శనం చేసుకుని) ఆదిముదైన (శ్రీరంగములోని) రంగధాముని కీర్తించి, ప్రయాగ (నేటి అలహాబాద్)లోని మాధవుని నుతించి, గయలో కొలువైన గదాధరుడిని (విష్ణువును) కాంచి, కరిద్విషన్నగ శిఖామణికి ప్రణమిల్లి (కరి - ఏనుగుకు; ద్విషత్ - శత్రువైనట్టి సింహము; కరిద్విషన్నగము అంటే సింహాచలము - సింహాచల శిఖామణి - అంటే అక్కడ వేంచేసిన నరసింహస్వామికి నమస్కరించి) వార్ధిని (సముద్రములో) ఏతెంచిన (కొట్టుకొనివచ్చిన) కొయ్యవేల్పు (ఒరిస్సాలోని పూరీ జగన్నాథుని) చూచి, దిక్కుల తీర్థములెల్ల (అన్ని ప్రక్కలా వున్న సకల తీర్థములలో) స్నానములాడి, తిరుగాడుతూన్నాను." (పూరీలోని జగన్నాథ, బలభద్ర, సుభద్రల విగ్రహాలు కొయ్యవే. అవి సముద్రంలో కొట్టుకొస్తే ప్రతిష్ఠించారని ప్రతీతి).

"వచ్చి వచ్చి, కల్పకము (కల్పవృక్షము) వంటి ఒంటివానిని (పౌండరీక క్షేత్రములోని పాండురంగ విఠలుడు

లక్ష్మీవిరహితుడు. ఒంటరివాడు) కన్నిచ్చవచ్చు (తన కంటికి నచ్చిన) గ్రచ్చకాయలెంచి ఆడువాని (విట్టలుని వయస్సు ఐదు సంవత్సరాలు. కనుక, గ్రచ్చకాయలనే బాలక్రీడలో ఆసక్తి కలవాడట. సంస్కృతంలో కుబేరాక్షి అని పిలువబడే గచ్చ పొదలా పెరిగే ముండ్ల చెట్టు. గచ్చకాయలంటారు కానీ వాస్తవానికి మనం ఆడుకొనేది యీ చెట్టు విత్తనాలతో. ఈ విత్తనాలు (*Molucca bean or physic nut*) చాల గట్టిగా వుంటాయి. వైద్యపరంగా ఎంతో విలువైన గచ్చచెట్టు (*Caesalpinia bonduc*) మన ప్రాంతపు సాధారణ వృక్షం), విచ్చు నెచ్చుగంటివానిని (తెరువబడుతూన్న ఎచ్చుకన్ను - అంటే మూడవ కంటివానిని. విట్టలునికి నుదుటిపై శివునికివలె మూడవకన్ను ఉన్నట్లు యింకొన్ని సందర్భాలలో కూడా పేర్కొనబడింది. కొందరు విమర్శకులు 'ఎచ్చుకన్ను' అంటే మురళి (వేణువు) అని అభిప్రాయపడుతున్నారు. వేణువుకూ చాల కళ్ళు - రంధ్రాలు - ఉంటాయి గదా!), వెన్నముచ్చును (వెన్నదొంగను), ఆ పచ్చవిల్తుని కన్నతండ్రిని (పచ్చవిల్తుడు - మన్మథుడు) గూర్చి విన్నాను. విని, ఆ దేవాదిదేవుని సేవించడానికి సపరిచ్ఛదంబుగా (సపరివారంగా) బయల్దేరాను. నీ వెవ్వరవు? ఏం కోరి భువన భయానకమైన యీ తపస్సు చేస్తున్నావు? వాచంయమి (మౌనవ్రతం పాటించేవాడు - ముని) వంశకరీరమా! (ముని కులమనే వెదురుకు పుట్టిన వెదురు మొలకా! ముని కిశోరమా!) నీ శరీరం శుష్కించడానికి మూలకారణమైన నీ హృదయము అదయమని (దయలేనిదని) ఉచ్చరించుట వలన నా నోరు పొక్కుచున్నది. మరి, నిజమేదో నీవే ఉన్నదున్నట్లుగా వివరించు" అనగా, దానికా వటువు యీ విధంగా సమాధాన మిచ్చాడు.

"ఓ గతస్మయా! (గర్వములేనివాడా!) నేను ప్రయుతుడనే ముని కుమారుడను. నా పేరు అయుతుడు. నియుతునికి నేను అన్నను. విస్మయావహమైన (ఆశ్చర్యకరమైన) తపోనిష్ఠచే వెలుగొందే కలశజన్ముడి (అగస్త్యుడి) శిష్యుడను. తనకున్న శిష్యులలోకెల్లా మేమిద్దరమంటే ఆయనకెంతో యిష్టం. ఆయనే మాకు దాత, దైవము, గురువు, తల్లీ తండ్రీ కూడా. ఆయన మాకు అభేద్యమైన విద్యాతిశయాన్ని (ఎదురులేని గొప్ప విద్యలను) రాజొనిపాదు (వచ్చునట్లు చేశాడు). ఒకనాడు మా గురువు మన్మథుని బాణములవలెనూ, చంద్రబింబం వంటి ముఖవర్చస్సుతోనూ వెలుగొందుతూన్న తలోదరులను (యువతులను) ధాతృ సంజాతలను (బ్రహ్మ పుత్రికలను) మాకు చూపి, 'నాళీకాసనుడిని (పద్మాసనుడైన బ్రహ్మను) వేడుకొని మీకోసం యీ నళిననయనలను తీసుకు వచ్చాను. జ్యేష్ఠానుక్రమముగా (పెద్దవాడు పెద్దదానిని, చిన్నవాడు చిన్నదానిని) పాణిస్వీకృతి చేకొనండి (పాణి గ్రహణము - వివాహము చేసుకొనండి) అనగా -

నేను ఆడవాళ్లు అపగుణగణ శేవధులు (చెడ్డ గుణాల గుంపుకు నిధులు) అని చెప్పి ధవళాక్షుల కీడు (స్త్రీల వలన ఆపద) తలచుకొని దారాదరణ వ్యవహృతికి (భార్యను స్వీకరించేపనికి - వివాహమునకు) మారు మొగమిడి (విముఖత చూపి) ఔగాదని (ఔను, కాదు అంటూ) అతనిని కొన్ని మాటలాడాను. నా మాటలకు కోపించిన అగస్త్యముని శరీరమంతా మంటలు క్రక్కుతూ, చెమట కారుతూ, నన్ను శపించదలచి కూడా, కరవాలనుకున్న పాము తానే వెనక్కి తగ్గినట్లుగా ఉపశమించాడు. శిఖముడి (పిలక ముడి) వీడిపోగానే విపులామరుడి (విపుల అంటే భూమి - భూసురుడి - బ్రాహ్మణుడి) విపుల కోప విషము (గొప్ప కోపమనే విషము) కూడా తిరిగి పోతుంది (మరలి నశించి పోతుంది). నన్నిక ఆశ్రమాన్నుంచి బయటికి పంపివేసి బంగారుకాంతి గల ఆ యిద్దరు కవలలనూ నా తమ్ముడికే యిచ్చి వివాహం చేశాడు.

సలసలమనే ఆ కలశజుడి వెగ్గలపు కినుక (విపరీతమైన కోపం) కారణంగా నేను కలతపడి, ఔదలయుంటి (ఒకవేళ ఆ కోపాగ్నికి నేను దగ్ధమౌతున్నానేమోననే అనుమానంతో నా తలపై తాకి చూసుకుని), హెచ్చిన భీతితో ఆ క్షణమే యిలు వెడలాను.

విషనిభములైన (విషముతో సమానములైన) విషయాభిలాషలను (అనుభవించాలనే కోరికలను) అన్నింటినీ ప్రక్కన

బెట్టి బ్రహ్మచర్య వ్రతాన్ని దీక్షగా పాటిస్తూ, మోక్షమొందే కోరికతో ఉగ్రమైన తపస్సు చేస్తున్నాను."

అప్పుడా మాయలాడు (కపట గృహస్థు - ఇంద్రుడు) నవ్వుతూ యిలా అన్నాడు -

"నీ తండ్రి ప్రయుతుడు నాకు మిత్రుడే. అతడు గొప్ప ప్రాభవం కలవాడు. ఆ గుణగరిష్ఠుడి జ్యేష్ఠ కుమారుడివవడం చేత నిన్ను చూడడానికి నాకెంతో ఆనందంగా వుంది. ఓ సాధుబోధయుతా! (ఉత్తమ జ్ఞానము కలవాడా!) నీ విరుద్ధ చరితము (విపరీత స్వభావము) మాత్రం శ్రవఃపుటసూచి (చెవులకు సూదివంటిది) అయింది. కులధర్మాన్ని పక్కకునెట్టి, నీ గురువుకు కోపం పుట్టించి, మిత్రులనీ, అయినవారినీ, తోబుట్టువులనూ వదలివేసి దూరంగావచ్చి ఒక్కడివే ఉట్టిగట్టుకుని వ్రేలాడుతున్నావు. స్మరజ్వలనజ్వాలిక (మన్మథుడనే అగ్నిజ్వాల) సోకనీయకుండా జ్ఞానామృతస్యందమును (జ్ఞానమనే అమృతము - నెయ్యి - స్రవించడాన్ని) నిలువరించడం దుస్సాధము (అసాధ్యము) సుమా!"

"చలనవిహీనవృత్తికి (నిశ్చల దీక్షకు) సడిసన్న (పేరుపడిన) పరాశరుడు మొదలుగాగల అయ్యల (ఉత్తముల) రాయివంటి హృదయాలను కూడా నీరుగా చేయడం బోయపూవిల్తునకు (మన్మథుడనే బోయవానికి) ఎంత దొడ్డపని? (ఎంతపాటి పని?). వెన్నెల బిట్టని (దట్టంగా) కాసినంతలో వారి హృదయం కరగిపొంగే పసిబాలుర చిత్తంలా మెత్తగా అయిపోతుంది."

"అన్ని భోగాలనూ అనుభవించిన జనకుని వంటి రాజులు కూడా సచ్చిదానందములను పొందలేదా? కలలోని వార్తలు విప్పిచెప్పినట్లుగా పురాణేతిహాసముల గాథలన్నీ అర్థాలతో సహా పూసగుచ్చినట్లు వివరించి చెప్పే ముందధారులు (సన్న్యాసులు) కూడా తీవ్రమైన వ్రతనియమములతో కృశించినప్పటికీ ముక్తులు దాయగా (మోక్షము నందుటకు) నేరరు (సమర్థులు కారు). తత్పరిష్వంగము (ఆ మోక్షాలింగనము - మోక్షమును కౌగిలించుకొనుట) చింతకాయల కజ్జాయము తోయము (చింతకాయల కజ్జాయము అనే మధురమైన పిండివంట చేయడమంత కష్టసాధ్యమైనది); ఇంత చదరంబా? (అంత తేలికనుకున్నావా?)"

"వర సారస్వత పట్టభద్రులైన (వాఙ్మయమున ఆరితేరిన) కవులు కూడా విపరీతంగా వర్ణించినప్పటికీ తుది (చివరకు) యోషా విభ్రమాంబోధికి (వనితల విలాసమనే మహా సముద్రమునకు) సరస (హద్దును) ఆవంతయూ కనుగొనలేకపోయారు. విరసాంతఃకరణుడివైన (రసములేని మనస్సు కలవాడివైన) నీవు సరసాకారమూ, ఉదార మన్మథకళా సర్వస్వమూ (గొప్ప మన్మథ కళకు నిధియైనట్టిదీనైన) శృంగార రసాన్ని ఏ రీతిన నిందిస్తావో, అయ్యా!"

అంటూ గృహస్థ జీవితం ఎంతటి పరిపూర్ణ ఆనందదాయకమో వివరిస్తున్నాడు ఆ మాయ గృహస్థు (ఇంద్రుడు). ఈ చక్కటి పద్యంలో రామకృష్ణకవి నాటి ఆదర్శ గ్రామీణ గృహస్థు జీవితమెలా వుండేదో విశదీకరిస్తున్నాడు.

సీ॥ కీలారముననుండి పాలింటి కేతేర బహుధాన్యములు చేలఁబండి యొరఁగ
నెడనెడఁ బెండ్లిండ్లు వడుగులు వొడముఁ గృతార్థులై యర్థించు నర్థులలరఁ
బరిచారికా కోటి పనిపాటు పాటింపఁ జుట్టంపు సందడి నెట్టు కొనఁగ
గ్రామ మెంతయు నిజప్రాభవంబున మన సత్యనిష్ఠకుఁ దన్ను సాక్షిగోర

తే॥ నిత్యనైమిత్తికములు నిర్నిద్రబుద్ధి, నాచరించుచు హరిభక్తమాత్మభార్య
భక్తినిడ భుక్తిఁగొనుచున్కి ముక్తికాని, నిదురవంటిది టాలివంటిదియుఁగాదు.

(పాండురంగ మాహాత్మ్యం : 5-216)

కీలారము (పశువుల కొట్టము) నుండి పాలు యింటికి ఏతేర (రాగా); బహుధాన్యములు (వివిధములైన ధాన్య విశేషములు) చేలలో పండి యొరగ (పంట విరివిగా పండితేనే ఒరుగుతుంది); అప్పుడప్పుడూ పెళ్లిళ్లూ, వడుగులూ (ఉపనయన మహోత్సవాలూ) జరుగుతూ; ఆయా సందర్భాలలో అర్థులు (యాచకులు) అడిగినంత పొంది కృతార్థులై అలరగా (సంతోషించగా); పరిచారికా సమూహము పనిపాటులు పాటించగా; చుట్టాలు, పక్కాలు అతిశయించి యిల్లు నిండగా విచ్చేయగా; తన యొక్క ప్రాభవము (వైభవము) కారణంగా గ్రామమంతా తన సత్యనిష్ఠకు మెచ్చి, తననే సాక్షిగా కోరుతూండగా; నిర్ఛిద్ర బుద్ధితో (మిక్కిలి శ్రద్ధతో) నిత్య నైమిత్తికాదులను ఆచరించుచూ (ప్రతిదినమూ జరిపే ఔపాసనములు త్రిసవనములు, అతిథిపూజ మొదలగునవి నిత్యములు; ఆ యా ప్రత్యేక దినములలో చేసే వ్రతములు, శ్రాద్ధములు నైమిత్తికములు); హరి భుక్తమును (విష్ణువుకు నైవేద్యంగా పెట్టబడిన ఆహారమును) ఆత్మ భార్య (నిజ సతి) భక్తితో వడ్డించగా భుక్తి గొనుచున్కి (భుజించడం) ముక్తి కానీ (పైన చెప్పిన గృహస్థ ధర్మాలను ఆచరించడం ముక్తి కానీ) నిదుర వంటి, రాతి వంటి (ఒంటరి బ్రహ్మచారి) జీవితం ముక్తికాదు (ముక్తినొసగదు).

అని యీ విధంగా బోధించిన ఆ జరఠ తపస్వి (ముసలి తాపసి) పలుకులను తన మనస్సులోకి చొరబడనీయక ప్రయుతుని తనయుడు బిగి (తనకున్న పట్టుదల) వదలక యిట్లన్నాడట.

"పుక్కిటి యోవరిలో (పుక్కిలి అనే సౌధములో) చదువు పుత్తడి (సరస్వతీదేవి) హత్తిన (ఆవహించిన) వాడినైనా సరే ఒకానొక సందర్భములో తప్పు మాట్లాడితే చక్కబెట్టేవారు మీరు. (అంటే గొప్ప విద్వాంసుడినైనా సరే తప్పు చేస్తే సరిదిద్దాల్సిన వారు మీరు అని భావం.) అక్కటా! మీరే యీ విధంగా మాట్లాడ దగునా? నన్ను నిష్కారణంగా నిర్దయగా తన ఆశ్రమాన్నుంచి బహిష్కరించిన ఇల్వలవైరిని (అగస్త్యుడిని) వదలివేసి మీరు దయలేనివాడని నన్ను నిందిస్తున్నారు మమకార దూరునకు (ఇది నాది అను భావము లేనివానికి) మిత్రులు, కళత్రములు (భార్యలు) అన్నదమ్ములు అను బంధముల పరిస్పందము (పరివారము) న్యాయమేనా?

గాఢ విజ్ఞానమయమనోరూఢమైన (తత్త్వవిషయమై మనస్సుకు పంచకోశములు – అన్నమయ, ప్రాణమయ మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు – ఉంటాయంటారు. లోతైన విజ్ఞానమయ కోశములో ఆరూఢమైన) నిర్మముని దైర్యమును (మమకారము లేనివాని ధీరత్వమును) అతనుడు (తనువు లేనివాడు; మన్మథుడు) కొనసేరదు (స్వాధీన పరచుకొనలేదు). (మమకారము వదలిన వానిని మన్మథుడు కూడా ఏమీ చేయలేదు) దానధారాకరాళ కాంతార దంతి (మదజల ప్రవాహంలో భయంకరమైన అడవి ఏనుగు) యొక్క కుంభముక్తా (కుంభ స్థలంలోని ముత్యముల) హరణము (గ్రహించుట, తస్కరించుట) ఏ రీతిన సంభవిస్తుంది?

తనలోని సుగంధాన్ని నలుదెసలా వ్యాపింపజేసే లేత మరువపు కొనను పోలినట్టివాడూ, పుట్టుకతోడనే జ్ఞానియైన వాడూ (వ్యాసుని కుమారుడూనైన) శుకమహర్షి గురించి ప్రస్తావన తీసుకురారేల? ఎంతసేపూ పరముఖోపనత విజ్ఞానుడైన (ఇతరులవలన సంపాదించిన విజ్ఞానము కలవాడైన) రాజర్షి జనకుని ప్రస్తావనే తెస్తారేం? – సారెకు (మాటి మాటికీ)"

"ఓ అనఘ విచారా! (పాపచింతన లేనివాడా!) మునిజన భాగధేయము (మునులపాలిట సంపద) యైనట్టి మోక్షము పక్షాన మాట్లాడకుండా నీవు సారె (మాటి మాటికి) బూడిద బొట్టువంటి యీ చెనటి (నీచమైన) గృహస్థధర్మాన్ని కొనియాడుతున్నావు. అది కేవలం చిమ్మెట. సింగమా? (సింహమా? – కాదు) (చిమ్మెట అంటే ఇలకోడి. చిమ్మట, ఘలఘరుగు, ఝిల్లి, ఝిల్లిక అనే పేర్లతో కూడా పిలువబడే ఇలకోడి (*cricket or cicada*) చిత్తడినేలల్లో ముఖ్యంగా రాత్రివేళల్లో కీచుమని ధ్వనించే కీటకం) గాజు రత్నమౌతుందా? కాదు. కనక శలాటుకాధమము కల్పఫలమవుతుందా? (కనకము

అంటే ఉమ్మెత్త చెట్టు *Datura alba*; శలాటువు అంటే పచ్చికాయ; అధమమైన పచ్చి ఉమ్మెత్తకాయ కల్పవృక్షపు ఫలమౌతుందా? ఎన్నటికీ కాదు. ఇక చలములు ఏటికి? (ఇక్కడ చలము అనే పదానికి మాత్సర్యము అనే అర్థంలో – 'అసూయ ఎందుకు?' అని భావం చెప్పారు కొందరు విమర్శకులు. అయితే యిక్కడ మాత్సర్యము అనే పదం నప్పనందున యిది ఛలము అయివుంటుందని నా అభిప్రాయం. భారతీయ తత్త్వశాస్త్రంలో షడ్దర్శనాలలోనిదైన న్యాయదర్శనం (*Nyaya Philosophy*) లో చెప్పబడిన 'ఛలము' వాదదోషము (*Deceitful disputation*) లలో ఒకటి. ఎదుటివ్యక్తి వాదనను ఏదో విధంగా ఖండించడం లక్ష్యంగా ఎంచి చేసే వాదమిది. ఉదాహరణకు వాది "అతడు నవరత్న కంబళుడు" (అతడు కొత్త రత్న కంబళి కప్పుకున్నవాడు) అన్నాడనుకోండి; ప్రతివాది వెంటనే, "నీవు చెప్పేది తప్పు. అతడు నవ రత్న కంబళుడు కాదు. ఎంచేతనంటే అతనికి నవ (తొమ్మిది) రత్న కంబళులు లేవు కనుక" అని ఖండిస్తాడు. నవ అంటే సంస్కృతంలో కొత్త, తొమ్మిది అనే రెండర్థాలున్నాయి. ఇలా ఏదో విధంగా వాది వాదనను ఓడించపూనుకుంటాడు ప్రతివాది. ఇలాంటి మొండి వాదననూ, మోసపు వాదననూ 'ఛలము' అంటారు.

కనుక, రామకృష్ణకవి అయుతునిపరంగా మొండివాదన లెందుకు? అని చెప్పడానికి 'ఛలంబు లేటికిన్?' అని వాడి వుంటాడనిపిస్తుంది.

ఇంకా అయుతుడు యిలా అన్నాడు, "సంపదలుంటేనేగాని, గృహస్థ ధర్మములు ఆచరించడం సాధ్యమయ్యేపనికాదు. మరి సంపదల మాటేమిటి? పూర్వజన్మలో మనం చేసుకున్న సుకృతం చేతనేగాని అవి మనకు చేకూరవు. ఒకవేళ సంపదలు చేకూరినా, అవి మహాత్ములనైనా సరే మద వశంవదులనుగా (గర్వపోతులుగా) చేసేస్తాయి. కనుక దయచేసి, నన్ను కన్నుసిమి (కన్నుగప్పి; మోసగించి) చంపుదు ముంపుదు బోధ గాథలతో (చచ్చు బోధలు కల కథలతో) చంపవద్దు."

"స్త్రీలను సుధీబృందములు (విద్వాంసులు) కందర్పాస్త్రముల (మన్మథ బాణముల)ని పొగడారు. మన్మథుడు పుష్పశరీరుడు కదా. అంచేత, మన్మథుని బాణములు సుతిమెత్తని వలపు రేకెత్తించే మెత్తని పుష్పాలు. అయితే అవి సుకుమారమైనవే కాని, వాడి నశిస్తాయి కనుక అశాశ్వతములు. అలాగే స్త్రీలను తటిల్లత (మెఱపు తీగ)లని పొగడారు. మెఱపుతీగ ఎంత అందమైనదో అంత క్షణికమైనది. అలాగే స్త్రీలను సుధామందస్యందము (ఎడతెగని అమృత ప్రవాహము)లని కీర్తించారు. సుధా స్యందములు (అమృత ప్రవాహములు) మధురమైనవే. అయితేనేం, వాటికి మూలమైన చంద్రునిలా అవి కూడా వృద్ధిక్షయాలకు లోబడినట్టివి. విద్వాంసులు స్త్రీలను కాంచనలతామతల్లులని కూడా కీర్తించారు. మనోహర పరిమళం కల పుష్పాలతో అలరారే కాంచనలత (సంపెంగ తీగ) యింపైనదే; కాని, ఆ లత లాగితే తెగుతుంది; నీరు లేకపోతే ఎండుతుంది. అలా అదీ అశాశ్వతమైనదే!

ఇలా ఆలోచిస్తే, ఈ బింబోష్ఠులందెల్ల (ఈ దొండపండువంటి పెదవి కల స్త్రీల విషయంలో అంతా) ఆనందాభాసమే (ఆనందమున్నట్టుగా అనిపించడమే) కాని భాసిత చిదానందము (ప్రకాశించే చిద్రూపమైన బ్రహ్మానందం) ఎక్కడన్నా వుందా?"

ఓ మునివంశశ్రేష్ఠా! కురులసిరుల (శిరోజముల అందాల)ను ఇంద్రనీల మణుల కాంతితోనూ; మెఱుగు చనుగుబ్బల నిబ్బరములను (కాంతివంతమైన – యౌవనకాలపు – స్తనముల బిగువును) సమున్నత పర్వత శృంగముల (ఎత్తైన కొండ కొమ్ముల)తోనూ; మొగంబు విస్ఫురణముల (ముఖకాంతుల)ను కురంగ లాంఛనుడి (చంద్రుడి)తోనూ పోలుస్తావు. అయితే జరాభరమున (వృద్ధాప్యం మీదపడిన తరువాత) అందమైన శిరోజాలు తెల్లబడతాయి; చనుగుబ్బల పొంకం నశించి, అవి పడుపాటు (వ్రేలాడ) బడతాయి; చంద్రబింబంవంటి ముఖాన కూడా వళీవలనము (ముడుత)లు వస్తాయి. కనుక ఆ అందాలేవీ శాశ్వతాలు కాదు.

నేను కులగోత్రాలను యిష్టపడను. కలకంఠులనూ (స్త్రీలనూ), కలుములనూ (సంపదలనూ) యిష్టపడను. బాధానలహుత (నిషేధమనే అగ్నిచే దహించబడిన) దుర్భవ బాధానలమతినై (చెడ్డదైన పునర్జన్మ అనే బాధను దహించే ఉద్దేశ్యం కలవాడినై) ఒకే ఒక్క ధనముచే (తపోధనము చేత) పరతత్త్వము నొందాలని ప్రయత్నిస్తున్నాను.

ఇలా ఒకటికి పది, పదికి నూరుగా తాను మాట్లాడే మాటలకు బదులిస్తూ తన యుక్తులకు చలించకుండా ఎత్తుకు పైయెత్తుగా సమాధానాలిస్తూన్న అయుతుని దృఢనిష్ఠకు మనస్సులో సంతోషించి కూడా ఆ కపట సంయమి (మాయముని) కోపంతో యిలా అన్నాడు.

"పందకు (పిరికిపందకు) పోటు (యుద్ధము)ను గురించి; లోభగ్రస్తునకు (పిసినారికి) ఈగిని (త్యాగమును) గురించి; బోయకు (వేటగానికి) కరుణ గురించి; నపుంసకునకు అంగనా (స్త్రీ) సుఖమును గురించి చెప్పినట్లయింది - నా బుద్ధి (హితవచనాలు) నీయందు (నీ మనస్సులో) నాటుకొనని కారణంగా; ఎలా అవుతావో యిక నాకనవసరం; అసదు బొదువకు (నీచుడైన దుష్టునికి) యుక్తాయుక్తాలు తెలుస్తాయా? నీరు పల్లానికే వెళుతుంది. పల్లానికి వెళుతూన్న నీటిని త్రిప్పి, కావలసిన తావుకు మళ్లించడం ఎవరి వల్ల అవుతుంది? అలమి (ఆక్రమించి) గుడిని మ్రింగేవానికి తలుపులు అప్పడాల వంటివే కదా! అగస్త్య మహాముని యంతటివాని ఆజ్ఞను ధిక్కరించి యిగుర్చున (చిగురునందే - పసితనంలోనే) మిన్నుముట్టి (ఆకాశమంత ఎత్తుకు ఎదిగిన) యింత మేటికి (యిట్టి గొప్పవానికి) నా మాట ఎంతపాటి? (నా హితవచనాలొక లెక్కా?)"

"వ్యాస సుతుడైన శుకమహర్షి మొదలగువారిని తలచుకొని, వాసికి (మెప్పుకోసం) మంగలి కత్తి మ్రింగుతున్నావు. ఆసాసలతో (పేరాసలతో) అందని పంటికి (అందని పండు కోసం) అబ్బు (మెడ)ను చాస్తున్నావు. బొందె (పార్థివ శరీరం)తోనే కైలాసము చేర చూస్తున్నావు? చలంబది ఏమి ఫలం? (మొండిపట్టుదల వలన ప్రయోజనమేముంది?)" అంటూ ఆ భూసురుడు ఈసుపెంచి (కోపం రెట్టించి) ఆ మునిపుత్రుని వదలి వెళ్లి, తిరిగి, కామధేనువు ద్వారా కార్యసిద్ధి బడయుటకు (తాననుకున్న కార్యాన్ని సాధించుటకు) ఊహించి (యోచించి) మాయలు పన్ని వెళ్లాడట. ఓ నారదా! తపము చేసేవారిని చూస్తే ఆఖండలునకు (ఇంద్రునకు) తలయేర్పుగాదె? (తలనొప్పి పుడుతుంది కదా!) వారి తపస్సు భంగం చేసేవరకు ఇంద్రునికి నిద్ర పట్టదు కదా! అందుకే, మాయోపాయంతో తన కామధేనువును అయుతుని పర్ణశాల వద్ద వదలి వెళ్లాడు.

అతి హీనస్థితిలో వున్న ఆ ధేనువు అయుతుని కంటబడింది. అదెలా వున్నదో వర్ణిస్తున్నాడు కవి. లేచి నిలబడాలంటే మనోబలమేకాని దానికి శరీరశక్తి లేదట. అది దష్టదర్భయట. దౌడలతో నమలే ఓపికలేక అది దర్భలను ముని పండ్లతో కొరకుతున్నదట. ఇకపోతే కాకులు పశువుల శరీరంపైని పుండ్లను పొడిచి పొడిచి మాంసాన్ని పీక్కుతింటాయి. క్షతికృత్ (గాయ పరచుచున్న) ఉగ్ర ధ్వాంక్షతతి (భయంకరమైన కాకుల గుంపును) అద్దుకొని తోలుతున్న వాలాగ్రము (తోక చివర) కలిగినదట ఆ ఆవు. ఆ పుళ్ల చుట్టూ అడవి యీగలు ముసురు కున్నాయట. అందుకే దానిని 'దంశ పిహిత' (అడవి యీగలచే కప్పబడినట్టిది) అన్నాడు కవి. ఆవులకూ, ఎద్దులకూ కంఠం క్రింద వ్రేలాడే తోలు వుంటుంది. దీనిని గళకంబళమనీ, గంగడోలనీ, సాస్నయనీ అంటారు. గోవులు తీరుబాటుగా నేలపై పడుకొనడానికి ఉపక్రమించబోయేటప్పుడు వాటి గంగడోలు అందం తెలుస్తుంది. అంచేతనే కవి ఆ ఆవును వర్ణిస్తూ అది 'అధశ్శయనారంభ విస్రంభ గళకంబళాభోగ' అన్నాడు - అంటే 'క్రింద పడుకొనబోయే ముందు స్వేచ్ఛగా వదలబడిన గంగడోలు యొక్క ఒప్పిదము కలది' అని అర్థం. 'కాతరాక్షి' (బెదరు కన్నులు కలది); పశువులు ఒక ప్రక్కనే పడుకొనడంచేత వాటి క్రీదొడలు విరిగినట్లవుతాయట. అందుకని కవి ఆ ధేనువును వర్ణిస్తూ అది 'ఏకపార్శ్వస్థితి స్వీకార నిర్భగ్న చరమోరు కరశల్య' అంటున్నాడు. అది 'సాంద్రబాష్ప'యట. అంటే

దట్టమైన, విస్తారమైన కన్నీరు కలది. పాలు సేవించే సమయం తెలుసుకున్న ముగ్ధ వత్స (చిన్నదూడ) చేత ఆపీనపర్యంతం (పొదుగు యొక్క మొదలు వరకు) పీడించబడుతూన్నదట ఆ ధేనువు. అంచేతనే కవి దానిని 'దుగ్ధసేవాసమయబోధ ముగ్ధవత్స పీడితా పీనపర్యంత' అంటున్నాడు. 'పృథుల దామ వేష్టిత గ్రీవ' - పృథుల - పొడవైన; దామ - పశువులను కట్టే తలుగు; వేష్టిత - కట్టబడిన; గ్రీవ - మెడకలదియునైన అర్జునిన్ - తెల్ల ఆవును; తన పర్ణశాల ప్రఘాణాంతరము (ముంగిలి యందు) చూశాడట ఆ విప్రుడు.

దాన్ని చూసి అయుతుడు ఆశ్చర్యపోయాడట. ఎంచేతనంటే, అది యింతకు మునుపు తాను చూసిన వాచంయముని (ముని యొక్క) వేల్మిగిడ్డి (హోమధేనువు)లా కనుపిస్తూంది. ఈ నైచికి (చక్కని రూపము, మంచి ప్రాయము కలిగి సమృద్ధిగా పాలిచ్చే ఆవు)కి నిన్ననేటనే (ఇంత కొద్ది వ్యవధిలోనే) యీ నీచత ఎట్లు వాటిల్లి యుంటుంది? - అనుకున్నాడు మనస్సులో.

మనస్సులో కృప కలుగగా ఆ బాడబ కుమార శిఖామణి (బాడబుడు అంటే బ్రాహ్మణుడు. బ్రాహ్మణకుమారులలో శ్రేష్ఠుడైన ఆ అయుతుడు) భూపతిత (భూమిపై పడిపోయిన) ఆ తపస్వి రోహిణిని (ముని ధేనువును) ఉద్ధరించి (పైకిలేపి) దానిని అపాయ పరంపర నుంచి తప్పించి, సాకి, ఊర్జితబల (బలము చేకూరుదానిగా) చేయదలచి, శిష్టహితన్ - శిష్టులకు మేలగుదానిని కలికాలమునందు కలిగిన హీనస్థితినుండి ధర్మదేవతను శతచ్ఛద లోచనుడు (పద్మాక్షుడైన విష్ణువు) ఉద్ధరించిన విధంగా లేవనెత్తాడట.

అప్పుడా ధేనువు పడఁబడఁ పాఱుచూ (ద్రవముగా పేడవేస్తూ) గడగడ వణకుతూ వుందట. అతడు దాని కాళ్లను కొంకు (దడ) పోయేటట్లుగా పిసికాడట. పార్శ్వభాగంలోని స్రుక్కు (ముడుతలను) ఎడలించి (పోగొట్టి), అడవి ఈగలను త్రోలి, దానిని సంతోషపెట్టి, గోళ్లతో దాని సాస్న (గంగడోలు)ను దువ్వి, నెత్తురోడుతూన్న దాని గాయములపై ధూరజము (మన్ను) చల్లి, ముఖస్థ తృణమును (నమిలే ఓపిక లేక నోట్లోనే ఉండిపోయిన గడ్డి పరకలను) లోనికి త్రోసి, ఆ మొదవు (పాడియావు)ను మృదువుగా నడిపించి ముంగిట పందిటి రాట (రాటు అంటే గుంజ, స్తంభము; పందిటి గుంజకు) కట్టివేశాడట.

ప్రేమతో దానికి ఆ తాపసి 'చేతోజ హయచ్ఛాయా పాతాసహమైన' మంచి పచ్చికను వేశాడట. 'చేతోభవుడు' లేక 'చేతోజుడు' అంటే మన్మథుడు. అతని హయము (గుఱ్ఱము) చిలుక. చిలుక ఛాయ ఆకుపచ్చగా వుంటుంది. అంతకంటె కూడా మించిన పచ్చదనం కలిగిన పచ్చికతో అతడు దానిని మేపాడట. ఇక దానికి ఎలాంటి నీటిని త్రాగడానికి పెట్టాడట? అవి 'వినిర్ధౌత కలధౌత దండ విభాతులిత జలంబు'లట. అంటే కడుగబడిన వెండి కడ్డీవలె ప్రకాశించే స్వచ్ఛమైన జలములట.

ఆ ధేనువు వెంట తిరుగుతూ అది పడిపోయినప్పుడు లేవనెత్తుతూన్న కారణంగా అయుతునికి ఆసనాభ్యాస నైపుణశక్తి పట్టు వదలిందట. అంటే అతనికి ఆసనాలు వేసే సమయం కూడా దొరకడంలేదు. కదలకుండా పట్టుమని పదిక్షణాలు ఒకే చోట కూర్చుండే నైపుణ్యం కూడా అతడికి నశించిందట. ఉలపాంకురములు (గడ్డిపోచలు) కోసి ఆవుకు తినిపించే పనిలో పడి కుశపల్లవాహృతి (చిరుదర్భలు కోసి యజ్ఞం కొరకు తీసుకొనిరావడం) కుంటుపడిందట. అంటే, యజ్ఞనిర్వహణకు కూడా అతనికి సమయముండడం లేదు. ఆ ఆవు మెడకు కట్టబడిన రజ్జువు (త్రాడు) సడలితే (వదులైతే) కడు వడిగా (వెంటనే) దానిని తిరిగి బిగించే అయుతునికి, అక్షసూత్రావృత్తి (తావళము లేక తావడము అనబడే రుద్రాక్షమాల లేక జపమాలను త్రిప్పడం) అవల జనియెనట (అవతలకు పోయిందట) అంటే, నియమానుసారం అయుతుడు లోగడ

చేస్తుండిన జపతపాలకు కూడా సమయం చిక్కదం లేదన్నమాట. ఆ ధేనువు వంటిపైని పుండ్ల నుండి పాల (మాంసముల) ఊడ్చి తినుటకు పాలయమున్న (తిరుగుతున్న) పుల్లులను (పక్షులను) పోవ నదలించు (పారద్రోలుటకు వేసే) హుంకృతి (హుంకారముచేత) మంత్రము చెదరిందట. అంటే మంత్ర సాధన కుంటుపడిందట.

ఆశలన్నీ మొదలుకంటా కోసియున్న ఆ గోచికట్టునకు (బ్రహ్మచారికి) అటువంటి గొదవ (ఆ ఆవు వ్యవహారం) గడవ రాక (తన మార్గాన తనను ముందుకు సాగనీయక) మెదకు చుట్టుకొందట. దాని పనులన్నీ మానవేసుకొనే వారికెక్కడి సుఖం వుంటుందా మరి?"

'ఓ విబుధ తపోధనేంద్రా! (ఓ దేవమునీ! నారదా!) అయుతము వేయి విధాలుగా పెరగా (పోషింపగా) బలిసి (బలిసి) ఆ బలవిభేది సైరికి (బలవిభేది అన్నా బలసూదనుడన్నా బలుడనే రాక్షసుని సంహరించిన ఇంద్రుడు. సైరికి అంటే ఆవు. ఇంద్రుని ఆవు. అంటే కామధేనువు) విశృంఖలమై 'ఓదవలిసి బందిరాదైనట్టు' (బందిపోటైనట్టు) ఆ మహిలోన తిరుగుతున్నదట.

ఆ ధేనువు గుండులాంటి బలియమైన కోడెతో (ఎద్దుతో) చరింపగా ఆ సమాంసమీనకు (ప్రతి సంవత్సరం యీనే ఆవుకు) చూలు నిలిచిందట. దాని పై సిరి (శరీరపు కాంతి) అరగా పండిన బలుసు పండు వంటి పసతో భాసిల్లి, అది యిచ్చే పాలు క్రమంగా తగ్గుతూ రావడంతో అది మొదిదని (సూడిదని) ధృవ పడిందట.

(బలుసు రూబియేసి (*Rubiaceae*) కుటుంబానికి చెందిన ముండ్ల పొద మొక్క. *Canthium parviflorum* బలుసు పళ్ళు పారదర్శకంగా లేత గోధుమ వన్నెతో వుంటాయి. ప్రతి కణుపులో ఒకదానికొకటి లంబకోణంలో వుండే పదునైన పదునైన ముండ్లవాడిన పదునైన వీటి ఆకుల్ని కానీ, పండ్లనుకానీ కోయలేం. బలుసువేరు క్రిమిసంహారకంగా ప్రసిద్ధి. ప్రమాదకరమైన ముండ్లను తప్పించుకుంటూ, శ్రమించి కోసినా దీని ఆకులూ, పండ్లూ ఆహారపరంగా విలువేమీ లేదు. అందుకేనేమో 'బ్రతికుంటే బలుసాకైనా తినొచ్చు' అంటారు. సూడి ఆవు (*pregnant cow or cow in calf*) లక్షణాలలో అది యిచ్చే పాలు తగ్గిపోవడం, శరీరం వింత కాంతులతో మెరిసిపోవడం ప్రధానమైనవి.)

వత్సయుతయు (దూడతో కూడియున్నదియు) గర్భవతియూనైన ఆ మాహేయి (ఆవు) ఆ వ్రతి వ్రతమును (ముని యొక్క తపోనిష్ఠను) భంగం చేయడానికి ఎదురుచూస్తూ వుందట. కళ్ళల్లోని విచారము ముకురమున (అద్దంలో) కనిపిస్తున్న ఆ ముని కుమారుడు ఆ కపట గోవు చరితను గ్రహించి అది తన తపోనియమాన్ని యీసరికే చాలమేరకు నాశనం చేసిందని బాధపడుతూ యీ విధంగా ఆలోచించాడట.

ఈ ఆవుపై నుండి వీచేగాలి ఆశ్రమం ఆవరణలోని నీవార పాకములకు (నివ్వరి పంటలకు) వత్సనాభి గంధవహమయిందట. మునులు తమ ఆశ్రమ ప్రాంగణాలలో నీవారమనే తృణ ధాన్యం పండిస్తారు. నివ్వరి అని కూడా పిలువబడే యీ అడవి వరి ధాన్యాన్ని దంచగా వచ్చిన బియ్యాన్నే వారు వంటకుపయోగిస్తారు. వసనాభి మొక్కలనుండి వీచే విషపుగాలికి తృణధాన్యాల పంటలు ఎండి నశిస్తాయట. వస (*sweet flag*) గురించి మనం లోగడనే చెప్పుకున్నాం. ఇక్కడ కవి భావం ఆ నివ్వరి పంటనంతటినీ యీ మాయగోవు తినివేస్తున్నదని.

(ఆశ్రమవాసులు పరిసర ప్రాంతాలలోని నేలలో పెరిగే కందమూలాల్ని తిని కడుపు నింపుకుంటారు) అయితే యీ జన్నె మునిదెక్కలు (యీ ఆవు ముంగాళ్ళ గిట్టలు) ఆ కందమూలాల పాలిట కఠిన కుద్దాల వక్త్రములు (వాడియైన గునపముల చివరి భాగములు) అయ్యాయట. అంటే ఆ కందమూలాల నన్నింటినీ, త్రొక్కివేసి, తినివేసి ఆ ఆవు నాశనం చేసిందన్నమాట.

(అడవిలో తరచు ఏర్పడే కార్చిచ్చు లేక దావానలమునకు దర్భ పొదలు సమూలంగా మాడి మసైపోతుంటాయి)

ఈ గిడ్డి (ఆవు) యొక్క కటుజిహ్వ (గరుకు నాలుక) బర్హిర్నికాయములకు (దర్భ వనముల పాలిట) చటుల దవానలచ్ఛటలు (భయానకమైన దావాగ్ని జ్వాలలు) అయ్యిందట. అంటే అడవిలో పుట్టే కార్చిచ్చు కుశవనాలను దగ్ధంచేసినట్లే యీ ఆవు గరుకైన నాలుక ఆశ్రమం చుట్టు ప్రక్కల వున్న దర్భ అడవులన్నింటినీ తినివేసిందన్నమాట. (లేత గర్భిణులు భయానకమైన పెద్ద శబ్దాలు వింటే వారికి గర్భస్రావమవుతుంది.) ఈ తొఱ్ఱు (ఆవు) యొక్క కంఠర హుంకృతులు (హుంకారాలు) విన్న ఏణ గర్భిణులకు (గర్భముతో వున్న ఆడలేళ్లకు) అది వాటిపాలిట గర్భస్రావాన్ని కలిగించే మంత్రమయిందట. అంటే ఆ ఆవు పెద్దగా హుంకరిస్తూ ఆ ఆశ్రమ ప్రశాంత వాతావరణాన్ని భగ్నం చేస్తున్నదని మనం అర్థం చేసుకోవచ్చు. మొత్తంమీద ఏ రకంగా చూచినా ఆ ఆవు ఆ ఆశ్రమానికి ముప్పుగా పరిణమించింది.

"అతనింకా యిలా యోచించాడట. "నాకు ఫిర్యాదు చేయడానికి మొగమోటపడి ఆశ్రమంలోని తాపసులంతా ఊరుకుంటున్నారు. ఏమైనా, యీ నింద తొలగాలంటే యీ ఆవును దూడతో సహా యీ సమీపంలోని అడవికి బలి చేస్తాను (అడవిలో వదలి వేస్తాను). మైల పూయకనే యీ దూల నాకెందుకు? (మురికి కాకుండానే యీ దురద నాకెందుకు?) నాకే ప్రయోజనమూ లేకుండానే యీ ఆవు కారణంగా వారందరి చేతా మాట పడాల్సి వచ్చిందనే చిత్తక్షోభ నాకెందుకు?"

"నేను సన్యసించి తపస్సు చేసుకుంటూన్న మునిని. మునులకుండాల్సినవి దండ కమండలాలు, గోచిగుడ్డ. తాపసి ఉండాల్సింది భూబిలాంతరములో. అవన్నీ వదలివేసి ఈ మాయదారి ఆవు తోకనే దండంగా భావించాను. దీని కుండపొదుగే అమృతంతో నిండిన వాఃకరకము (కమండలువు) అనుకున్నాను. దీని నాసారంధ్రాలే భూమి బిలాంతరములనుకున్నాను. దీని మెడ కంబళమే (గంగడోలే) నా ఖండపటము (గోచి గుడ్డ) అనుకున్నాను. మునుల కుండాల్సిన దండ కమండలాలూ, గోచిగుడ్డ వగైరాలు వదలివేసి దీని వెంటబడి దీనిని కాపాడాల్సిన అవసరం నాకేమిటి?" అని వితర్కించుకుంటూ ఆ కొండిక బ్రహ్మచారి (చిన్న వడువు) కూకులు వత్తులూనై (తీవ్రంగా కలతచెంది) ఆ అసద్గవిని (ఆ మాయగోవును) త్యజించాడట (విడచి పెట్టాడట).

అప్పుడా క్రేపు (దూడ) అదేపనిగా అరచిందట. అయుతుడు దానిని ఒక తాడుతో కట్టి ఆ ఆవు మెడకున్న తాడుతో దానికి లంకె వేశాడట. ఆ ఆవు తనను వీడిపోవడానికి దానిని తోలవియగా (పై చర్మం ఊడిపోయేట్లుగా) కొట్టి, దాని మెడకు ఒక గుదిగఱ్ఱ (దుష్టమైన గోవులకు మెడకు కట్టే బరువైన కొయ్య – దీనినే తుండు, టొంప అని కూడా అంటారు – ను కట్టి, దాని తలకు కట్టిన త్రాడును చేతిలో పట్టుకుని మారిని (మశూచిని) వెడలించే వడువున (పద్ధతిలో) ఆ ఆవును తన ఆశ్రమం నుండి బయటికి పంపేశాడట, ఆ మాణవకుడు (బ్రహ్మచారి). (మనం లోగడ చెప్పుకున్నట్లే అంటువ్యాధులు ప్రబలమైనప్పుడు అవి శాంతించడానికి మన పూర్వులు అమ్మతల్లుల *(Mother Godesses)* ప్రీత్యర్థం జాతరలు, జంతుబలులు చేసేవారు. అలాంటి జాతరల్లో బలియివ్వబడే పశువును కొమ్ములకు తాడుకట్టి వధ్యస్థలికి తీసుకెళ్లి బలియిచ్చి ఆ జాడ్యం దానితోనే నశించిపోయిందని నమ్మేవారు).

ఆ గోవు వానిచే పెట్టబడిన బాధల వలన కోపించినదై పరమాత్మ తత్త్వాన్ని బోధించే జ్ఞానంతో ప్రకాశించే వాధూల మునీంద్రుడుండే అడవిలో ప్రవేశించిందట. (కృష్ణయజుర్వేదంలోని తైత్తిరీయ సంహితలో వాధూలుడు రచించిన ఒక శ్రౌతసూత్రము 'వాధూలము' అనే పేరుతో వుంది). పులి ఉన్న పొదరు (పొద), మొసలికి నెలవగు బలు మడువు (పెద్ద మడుగు), త్రాచు నిల్చిన వల్మీబిలము (పుట్ట రంధ్రము) లాగా ఆ ముని వున్న ఆ వనము (అడవి) కూడా ఏ వలననూ (ఏ విధముగానూ) వాసవ ప్రభృతులకైనా సరే (ఇంద్రాదులకైనా సరే) చొర జనదు (ప్రవేశింపగా రానిది).

ఆ అడవిలో వెళుతూ ఆ మాయదారి ఆవు అయుతుని చేతిలోని తాడును లాగివేసుకుని పరుగెత్తుతూ మార్గమధ్యంలో

మేఘములు కప్పిన సురాద్రి (మేరుపర్వతం)లా పుట్టలూ, దట్టమైన చెట్ల గుంపులో కలిసిపోయిన ఆకారం కలిగిన తపోగరిష్ఠుడు, చిరజీవి (వయోవృద్ధుడు) గతవ్యామోహుడూ (గతించిన వ్యామోహం కలవాడు), దేవతులితుడైన (దేవతలతో సమానుడైనట్టి) వాధూల వాచంయముని (వాధూల మునీంద్రుని) మట్టెనట (త్రొక్కిందట). అంటే తన శరీరంపై పుట్టలు, వాటిపై దట్టమైన మొక్కలు పెరిగియున్న ఆ మునీశ్వరుడిని త్రొక్కిందన్నమాట.

దాంతో ఆ ముని కోపంతో శీఘ్రంగా మిట్టిపడి (ఎగిరిపడి) లేచి నిలబడడంతో ఆ పుట్టపగిలి శ్రవశ్శకుంతములు (ఆతని చెవులనే యిరవులు చేసుకొని జీవిస్తూన్న శకుంతములు అనే పక్షులు – శకుంతము లేక భాసపక్షి లేక చమురు కాకి (*the blue jay or black headed jay - Garrulus lanceolatus*) తల నల్లగానూ, రెక్కలు, తోక నీలం, బూడిద రంగుల మేళవింపుగానూ వుండే పక్షి. ఈ పొడవు సుమారు 33 సెం.మీ. వుంటుంది. అంత పక్షులు ఆ ముని చెవుల్లో యిరవులు చేసుకున్నాయంటే నమ్మశక్యంగా లేదు. 'శకుంతము' అంటే పక్షి అనే సాధారణార్థంలో 'కవి' యీ పదాన్ని ప్రయోగించి వుంటాడు.) చట్టుపలెత్తి (రెక్కలెత్తి) ముందుకు సాగాయట. ఆతని జటాచ్ఛటాచ్ఛదిలో (ఆ ముని జడల గుంపు అనే యింటి పైకప్పులో) త్రుట్టెలు కట్టి నిద్రిస్తూన్న మరుద్భుగధీశ కులము (మరుత్ అంటే గాలి. మరుద్భుక్ అంటే గాలిని భోంచేసేది పాము. అధీశుడు – రాజు, నాగరాజు యొక్క కులము - పాముల సమూహము) మేల్కొన్నదట. అంటే ఆ ముని జడలలో పాములూ చెవులలో చమురు కాకులూ నివాస మేర్పరచుకున్నాయన్నమాట. శకుంత పక్షులు ఎప్పుడూ కర్ణకఠోరంగా రొద చేస్తాయి. అందుకే ఆంగ్ల భాషలో కూడా *'jangle like a jay'* అంటారు. అంతటి రొదను కూడా పట్టించుకోనంతటి ఘోర తపస్సు చేస్తున్నాడన్నమాట ఆ మునీంద్రుడు. మరి, అంతటి తపస్సూ యీ ఆవు తనని త్రొక్కడంతో భగ్నమైపోయింది. ఇక ఆతని క్రోధానికి అంతుంటుందా?

ఆ కోపంలో అతడు గడ్డితీగలు కార్చిచ్చుపాలై మంటలెగస్తూంటే ప్రకాశిస్తూన్న పర్వతంలా వున్నాడట. దీర్ఘశ్మశ్రు (పొడవైన గడ్డమూ, మీసాల)తోనూ, చంచజ్జటా విసరము (చలించుచున్న జడల సమూహము)తోనూ క్రోధ రసోగ్రమూర్తియైన (కోపముచే భయంకరమైన స్వరూపము కలిగినవాడైన) ఆ వృద్ధ వ్రతిశ్రేష్ఠుడు (ముసలి మునీంద్రుడు) తన సమీపంలో నిలబడినట్టి ధేనువును విడిచిన వాడైనట్టి ఆ వర్ణి (బ్రహ్మచారి)ని నిశితంగా చూస్తూ –

"ఓరి దురాత్మా! వినయోజ్ఝితా! (వినయము విడచినవాడా!) మదాంధా! (మదంతో కళ్లు మూసుకు పోయిన వాడా!) బ్రతుకుమీద ఆశవున్న ఎవ్వడూ యీ వనంలోకి యింతవరకూ ప్రవేశించ లేదు. ఈనాడు నీవీ వనంలోకి చొచ్చి, జంభారికృత (జంభాసురుడిని చంపినవాడైన ఇంద్రుడు చేసిన) ఉపఘాత శతహార్యము కాని (నూరు విధ్వంస యత్నాలకు కూడా భంగంకాని) నా ఘోర దుర్వార సమాధి గౌరవమును (తీవ్ర దుర్భర సమాధి స్థితిని) ఆసురక్రియన (రాక్షస పద్ధతిలో) వమ్ముగా (వ్యర్థమైనదానినిగా) చేశావు. నేను వృద్ధుడిని. ప్రణిధాన నిర్మగ్న బుద్ధిని (ఈశ్వర ప్రణిధానములో - ధ్యాన యోగములో మునిగిన బుద్ధికలవాడిని) బలవిహీనుడిని. నన్ను నీవిట్లు చేశావు కనుక, నీవు యిట్టి ప్రాయము (ఈ యౌవనము), ఈ రూపు (యీ స్వరూపము), ఈ అదటూ (యీ గర్వము) ఉడివోయి (పోయి) భేకము (కప్ప)వై పోతావు" అని శపించాడు.

దీంతో ఆ పృథ్వీసురసూతి (బ్రాహ్మణ కుమారుడైన అయుతుడు) ఆ ముని పాదములపైబడి "ఓ నిష్ఠా పద్మాసనా! (నిష్ఠయందు బ్రహ్మయైనవాడా!) నీ కోపాటోపం తగ్గించు. ఈరు (మీరు) అలిగినచో (కోపించినచో) కొండలు పడిపోతాయి. వారిధులు (సముద్రాలు) వాటి స్వరూపాన్ని కోల్పోతాయి. ధర (భూమి) వ్రయ్యలుగా పగులుతుంది. మిన్ను విరిగి మీద పడుతుంది. నా మొఖం. నేనెంత? అన్నీ బాగా తెలుసుకున్నాకనే నన్ను శాపాగ్నిచే క్రాపు (కాల్చు). నీవు తరుగని లయశిఖివని (ప్రళయాగ్నివని) నాకు తెలుసు, ఓ వాధూలమునీంద్రా! తెలిసి తెలిసీ, కొఱవితో తన ఔదలను (నడినెత్తిని) గోకాలని తివురు (ప్రయత్నించు) కుమతి (మందబుద్ధి కలవాడు) ఎవడైనా వుంటాడా? నన్ను ఊరక ఉండనీయని కంధరాబద్ధమహాహి (మెడలో కట్టుకున్న పాము) లాంటి యీ కపిల (ఆవు)ను వదలించుకోవాలనుకున్నాను. వేరేమియు

లేదు. దీనోద్ధరణ కరుణా సముద్రుడివైన నీ మనస్సులో భూరి దవానల కీలఖేలము (పెద్ద కార్చిచ్చు మంటల విలాసము)ను ఊహించనైనా ఊహించవచ్చా?" అని అయుతుడు ఆ ధేనువు ఆ అడవిలో ప్రవేశించగా తాను దానిని తరుముతూ రావడం మొదలైన విషయాలన్నీ ఆ మునికి ఏకరువు పెట్టాడు. అనంతరం ఆయన తన దివ్యదృష్టితో నిజం తెలుసుకుని అప్పటిదాకా చండప్రచండ క్రోధంతో ప్రకాశించిన వాడల్లా చంద్రునిలా చల్లగా ప్రకాశించాడు. సప్రణయుడగుచూ (ప్రీతితో కూడినవాడై) ఆ మునిలోక ప్రవరుడు (మునిశ్రేష్ఠుడు) ఆ విప్రకుమారుడైన అయుతుడిని కనికరంతో ఆదరించాడు. అవని బుధులు (భూసురుల - బ్రాహ్మణుల) ఆగ్రహములు (కోపములు) తృణాంచల విప్రుషములు కావా? (గడ్డిపోచల చివరి నీటి బిందువులు కావా?)

తొలి సంధ్య వేళలో గడ్డి పోచల చివర నిలిచే నీటి బిందువులు ముత్యాల్లా మెరిసి క్షణంలో జారి అదృశ్యమౌతాయి

ఆ బ్రాహ్మణ కుమారుడితో వాధూల మునీంద్రుడు యిలా అన్నాడట "వత్సా! నా దివ్య దృష్టితో నిన్ను అపాపునిగా (పాపము చేయనివానిగా) కనుగొన్నాను. ఆగ్రహ వ్యాలిలమైన (కోపమునకు లొంగిన) మనస్సుతో యిలా పలికాను - మీదు (భవిష్యత్తు) అరయ లేక (చూడలేక; ఆలోచించలేక). నా యీ వచనము (యీ శాప వాక్యము) తప్పదు. కనుక, మూర్ఖత్వం నన్ను ఆవహించినందుకు నేనెంతో క్రుంగిపోతున్నాను. నీవు బాధ పడొద్దు. దైవఘటనగా ప్రాప్తించిన యీ కీడును తలచుకొని మనస్సులో తపించవద్దు. కర్మ నశించాలంటే దాన్ని అనుభవించడ మొక్కటే మార్గం. విశ్వగురువైన కరీంద్రవత్సలుడిని (గజేంద్రుని వాత్సల్యంతో సంరక్షించిన విష్ణువును) దివానిశము (పగలూ రాత్రీ) ధ్యానించు. నీకు శుభం జరుగుతుంది. హరిభక్తి యుక్తులకు ఎన్నడూ ఆపద రాదు.

ఇల్లాలి మేని మెరుపుల సమూహానికి జలధరములా (మేఘములా) ఏది పొలపము పుట్టిస్తుందో (ప్రకాశమును కలిగిస్తుందో) (మెరపుకూ దాని కాంతికీ ఆధారం మేఘమేకదా!); మణిపూసలవంటి కుమారులు పుట్టుకురావడానికి ఏది మున్నీరు (సముద్రం)లా ఆవాలము (పాదు) ఔతుందో (రత్నగర్భయైన సముద్రమే మణులకు జన్మస్థలం కదా!); ఆకలిగొన్న ద్విజావళులకు (బ్రాహ్మణ సమూహాలకు) నీడ మ్రాకయి (నీడనిచ్చే చెట్టయి) ఏది నిలువ నీడనిస్తుందో; కుంటుతూన్న పిచ్చుకలకు మెట్టులా నిలిచి ఏది దివికి (స్వర్గమునకు) ఎగబ్రాకుతూన్న పితృదేవతలకు ఆధారమవుతుందో; (పితృదేవతలకు - మరణించిన కుటుంబ పెద్దలకు గృహస్థు యిచ్చే తర్పణలే వారిని స్వర్గం దిశగా మున్ముందుకు నడుపుతాయని పూర్వుల విశ్వాసం.) అట్టి గృహమేధి (గృహస్థు) ధర్మాన్ని నీవు కుత్స చేశావు (నిందించావు) దాని కారణంగా యిదంతా జరిగింది. ఇలా ఒప్పుదానిని ఒప్పదని పలికే ఉద్ధతులకు (గర్వపోతులకు) రాళ్లపై గాలి కూడా కసరి (విజృంభించి) పైబడుతుంది. (సాధారణంగా అరణ్యాలనుంచీ, సముద్రాలనుంచీ గాలి వీస్తుంది. ఇలాంటి గర్విష్ఠులపై రాళ్లపైని గాలికూడా కసరి వీస్తుందట).

'నేనింతవాడిని; పూనుకుంటే ఏ కార్యమైనా కాకపోవడమేమిటి?' అని పంతం పడితే మానవులకే కాదు సరికదా, అమర్త్యులకూ (దేవతలకూ) ఫలసిద్ధి లభించదు. మునులు అనుష్టుభమున (వేదమంత్రములతో) తనను పూజింపదగిన వాడూ, ప్రహ్లాదుని రక్షింపబూనినవాడూ, గొప్ప స్తంభముల వంటి ముప్పది రెండు శాఖలు కలిగిన అశ్వత్థమూర్తీ (రావిచెట్టు ఆకారం కలిగినవాడూ), తన చక్రముతో క్షేత్రజనులను సంరక్షించేవాడూ, వివిధ ఆయుధములతోనూ, గొప్పవైన ఆభరణములతోనూ వెలుగొందేవాడూ, భీమరథ్యాపగా (భీమరథీ + ఆపగ - భీమరథీనది) సీమవాడూ. వివిధ కథలవాడూ, వివిధ రూపముల వాడూనైన శ్రీనృసింహ దేవుడిని - భేకమువై (కప్పవై) ఆ పవిత్ర పాదముల కడ నివసిస్తూ సేవించు.

"కొంతకాలం గడచిన తరువాత, దర్దురాంగన (ఆడ కప్ప) యందు నీకు సంతానం కలుగుతుంది. దానితో

తక్షణం నీకు పితౄణము (పితృదేవతల ఋణము) తీరి మోక్షం సంప్రాప్తిస్తుంది." అని చెప్పి అయుతునికి శాపవిమోక్ష మార్గమును తెలిపి వాధూల మునీంద్రుడు ఆ వటువును ఆశ్వాసించి (ఊరడించి), లోకములన్నీ ఆశ్చర్యపోయేటట్లు అంబురుహప్రియ మండలమును (సూర్యమండలమును) ఛేదించుకుంటూ వెళ్లి అపవర్గ సామ్రాజ్యం (మోక్ష సామ్రాజ్య) సింహాసనాసీనుడయ్యాడట (మోక్ష సామ్రాజ్యానికి చేరేవారు ముందుగా సూర్య మండలాన్ని ఛేదించుకుని వెళతారని విశ్వాసం). ఇక్కడ వియచ్చరధేనువు (స్వర్గమునకు చెందిన మాయగోవు) ఏలినవాని పనిని (తన ప్రభువైన ఇంద్రుని కార్యాన్ని) ముగించుకొని ఫలోదయాన్ని (స్వర్గాన్ని) చేరిందట. అయుతుడు ఉసూరుమంటూ ముల్లోకములనూ పవిత్రీకరించే సామర్థ్యంకల పాండురంగ క్షేత్రానికి చేరుకున్నాడు. భీమరథీనది మొదలుగాగల తీర్థములన్నిటిలో తనువు తోగించి (శరీరాన్ని ముంచి) ఆ ముని గ్రామణి (ఉత్తమ మునియైన అయుతుడు) మాయ గొల్లడైన కృష్ణుని మణిమయ దేవాలయం లోనికి వచ్చాడట. విట్ఠలుడిని పూజించాడట. అయుతుడు కంసాభియాతిని (కంసుని శత్రువగు శ్రీకృష్ణుని) ఎంతగానో స్తుతించాడట. అక్కడి నుంచి ఉత్తరంగా వెళ్లి తరళదళతరుమూర్తిని (తరళదళతరువు లేక చలదళ తరువు అంటే రావిచెట్టు లేక అశ్వత్థ వృక్షం. అక్కడ నృసింహుడు రావిచెట్టు రూపంలో వున్నాడట) దర్శించి స్తుతించాదట.

భవిష్యద్భేకమైన (కప్పగా మారనున్న) అయుతునకు ఆ లక్షణాలు చిన్న చిన్నగా వచ్చేస్తున్నాయట. అతడు క్రమంగా మనోబలం కోల్పోతున్నాడట. నీరప్రాంగణ కర్కటీ బిలంలో (నీటి దాపులనున్న ఎండ్రకాయ బొరియలో) నిద్రించాలని కోరుకుంటున్నాడట. (పాములనుండి తమను తాము రక్షించుకొనడానికి కప్పలు ఎండ్రకాయలు చేసిన బొరియల్లో నిద్రిస్తాయట భద్రంగా); కప్పలు తిన్నట్లు మృత్స్నామయాహారాన్ని (మట్టి సంబంధమైన ఆహారాన్ని) తినగోరుతున్నాడట. పెల్లు (గట్టిగా) అరచుటకూ, యిటూ అటూ ప్లుతములు (కప్ప గంతులు) వేయడానికీ యిష్టపడుతున్నాడట. (పని వున్నా లేకున్నా యిటూ అటూ గంతులు వేయడం; ఎప్పుడూ పెద్దపెట్టున బెకబెకమంటూ అరవడం కప్పల లక్షణం).

దూరాయాస్యదహీంద్ర భీతిహతి (దూరమునుండి వచ్చు పాముల భయముపాటు వలన) యిరుకైన గోతులలో దూరగోరుతున్నాడట. కప్పలకు స్థానికంగా వుండే పాముల నుంచి పెద్ద బెడద వుండదు. వాటి బారి నుంచి ఒడుపుగా ఎలా తప్పుకోవాలో వాటికి తెలుసు. ఎటొచ్చీ దూరం నుంచి వచ్చే పాములే ప్రమాదకరం. ఆహారం దొరక్క అవి ఆకలితో తీక్ష్ణంగా ఉండడమేకాక, వాటి పరిమాణమూ, దాడి పద్ధతులూ యీ కప్పలకు కొత్త. కనుక యిక్కడ 'దూరాయాస్య దహీంద్ర భీతిహతి' అనే పదప్రయోగం రమ్యంగా వుంది). ఇలా యీ పద్యం (పాం. మా. 5-275)లో కప్పల అలవాట్లను మనకు చక్కగా పరిచయం చేశాడు రామకృష్ణ కవి.

అంతటి ఘోరశాపం కారణంగా మనస్సున కలతచెంది కూడా సుప్రతిభాదేవేజ్యుడు (దేవ + ఇజ్యుడు - గురువు - బుద్ధిలో దేవగురువైన బృహస్పతి వంటివాడైన అయుతుడు.) దితిసుత శత్రువును (రాక్షసులకు శత్రువైన విష్ణువును) స్తుతించాడట.

ఆ నృహరిని (నరసింహమూర్తిని) అర్యమ సహస్ర దివ్యతేజః ప్రభావుని (వేయి సూర్యుల తేజః ప్రభావము కలవానిని) కీర్తించి అయుతుడు ఆయన పాదాలకు వందనము చేస్తూ వుండగానే తాపసి శాపం కారణంగా అతడు ప్లవము (కప్ప)గా మారిపోయాడట. దైవఘటనలు విచిత్రం కదా? లేకపోతే ఆ శమము (శాంతి), ఆ వివేకము, ఆ శుద్ధి, ఆ తపస్సు, ఆ బహునిగమప్రాశస్త్యము (వివిధాగమ విజ్ఞానము) కల అయుతుడేమిటి? – కప్పగా మారడమేమిటి? రంగురంగుల దేహంతో ప్రకాశిస్తూ – ముత్యాలూ, పగడాలూ కనకాకృతి (బంగారు మయమైన రూపం) దాల్చినట్లుగా ఆ చక్కని రూపుగల కప్పను తైర్థికులు (తీర్థ యాత్రికులు) అంతా విస్మయంతో ప్రశంసిస్తున్నారట.

అది కమలాప్తుడు (సూర్యుడు) ఉదయించకముందే సంగమ తీర్థానికి వెళ్లి పుటుక్కున మునుగుతుందట. సైకత

నిషణ్ణ ముని వేదనినదంబును (సైకత ఇసుక తిన్నెలపై; నిషణ్ణ - కూర్చుండిన; మునుల వేద ఘోషను) తగు చోట కూర్చుని లేబగటిదాకా ఆలకిస్తుందట. (మధ్యాహ్నం పన్నెండు గంటలకు ముందరి పగటి కాలాన్ని లేబగలు అంటారు.) మధ్యాహ్న వేళలో బలిపీఠంపైనున్న పులాకములను (మెతుకులను) మితముగా ప్రాశిస్తుందట (తింటుందట); సందెపొద్దునుండి (సాయం సంధ్యా సమయాన్నుంచి) సవరేయి (అర్ధరాత్రి) వరకూ ఆ నృసింహుని పూజిస్తూ ఆతని సమ్ముఖంలోనే నివసిస్తుందట. శ్రీనృసింహుడు పెనుఁబాపసెజ్జపై (పెద్దపాము పానుపుపై - శేషపాన్పుపై) మేనువాల్చగానే ఆ దివ్య చరణ రాజీవముల (ఆ పవిత్ర పాదపద్మముల) క్రింద భూమిలోని రంధ్రంలో రాత్రంతా జాగారం చేస్తుందట - శాలూర చక్రవర్తి (కప్పలరాజు) అనదగిన ఆ వింత కప్ప.

రంగురంగుల తన దేహం నరసింహదేవుని ఆలయంలో వేయబడిన రత్నాల రంగవల్లులలో (రత్నాల ముగ్గులలో) పువ్వుగుత్తిలా పొలుపు నిలుపగా (శోభను కలిగించగా) ఆ లంబుచరము (కప్ప) ప్రాతరారంభ వేళలలో (తొలి సంధ్య వేళలలో) నృహరి అగ్రవీధిన (నరసింహుని ఎదుట) నిలుస్తుందట. దాన్ని అందరూ హరిదాసము (హరి సేవిక) అని పిలచు విధంగా ఆ ప్లవము (కప్ప) పూర్వజన్మజ్ఞానం కలిగి మోక్షాన్ని కోరుతూ చిరకాలం జీవించిందట. ఇలా కొన్నేళ్లు గడచిన పిదప పౌండరీక నాథుని పర్వము రోజున పూజలు చేయదానికి కన్యాకుబ్జ రాజు కుమార్తె, ఆమె యిష్టసఖులు అక్కడికి వచ్చారట. వారి వాహనాలనుంచి దిగి, వారు నారసింహ తీర్థమునకు కుఱంగటలో (సమీపంలో)నున్న భైమీనదీ తీరంలో విడిశారట. దారిబడలిక తీర్చుకొనదానికి కొంతసేపు వారు భైమీనదిలో జలకాలాడారట.

ఇక ఆ ప్రాంతపు మునులు యీ కన్యాకుబ్జ రాకుమారి యొక్క అందచందాలుచూచి, ఆమెపై తమకు కలుగుతూన్న వలపును అతి బలవంతంగా అణచిపెడుతూ, తమ రోజువారీ విహితకృత్యములను ఎలా చేస్తున్నారో తెలుపుతున్నాడు కవి. మన్మథునికి సహాయకారులైన గంధవాహము (గాలి), పుష్పబాణములు, చంద్రుడు, శుకములు వగైరాలను వారు ఏహ్యాభావంతో చూశారట.

వీజనము, వీవన లేక తాళవృంతము అంటే విసనకర్ర. యజ్ఞాలలో అగ్నిని రగిలింపజేయదానికి వీజనము వాడడం తప్పనిసరి. అయితే మన్మథునికి సహాయకారియైన గంధవాహము (గాలి)కి వీజనములు అగారముల (నిలయముల)ని ఆ మునులు వాటిని చూచి వెగటు కదిరారట (వెగటు పొందారట) పూల మొగ్గల్ని చూచి యివి మన్మథుని పుష్పబాణములకు సహోదరవర్గమేనని నెట్టివేసేవారట. (మన్మథుడు పుష్పశరుడు కదా!).

యజ్ఞాలలో ఆ మునులు పుల్లతీగలను చూచినప్పుడల్లా అవి (ఆ సోమలతలు) కమలారి (పద్మములకు శత్రువు - చంద్రుడు) యొక్క పేరును గైకొన్నట్టివని వాటి పట్ల విరక్తి చెందుతున్నారట.

యజ్ఞాలలో హవిష్యంగా సమర్పించే సోమరసాన్ని సోమలత (*Ephedra vulgaris*) నుంచి తయారు చేస్తారు. సోమ అంటే చంద్రుడు ఇలా -సోమలత పేరులో చంద్రుడుండడమేకాక చంద్రకళలను బట్టి ఆ తీగ కృష్ణపక్షంలో ఒక్కొక్క ఆకు రాలుస్తూ అమావాస్యకు ఆకులేవీ లేకుండా వుండి, తిరిగి శుక్లపక్షంలో రోజుకొక్క ఆకు చొప్పున వచ్చి పౌర్ణమి నాటికి 15 ఆకులతో వుండే వింత తీగట. అందుకే సోమలత చంద్ర సంబంధి, ఇది హిమాలయ పర్వత శ్రేణులలోని 'ముంజవత్' పర్వతం పైన మాత్రమే లభిస్తుందట అందుకే దీనికి మౌంజవత్ అనే మరో పేరు కూడా వుంది మన ప్రాంతములో నిర్వహించే యజ్ఞాలలో సోమలతకు బదులుగా దానికి దగ్గర లక్షణాలున్న పల్లకాడ లేక పుల్లతీగ (*Asclepias acida*) సోమరసం తయారీకి వుపయోగిస్తున్నారు అయితే చంద్రకళలతో సోమలతకున్నట్లు చెబుతూన్న ఆ వింత సంబంధం మాత్రం శాస్త్రీయంగా విశ్వసించదగినది కాదు. ఎవరి చేతనూ అలాగని ఋజువుపరచబడలేదు కూడా. సనాతనులు మాత్రం *Ephedra vulgaris* అనే శాస్త్రీయ నామం కలిగిన మొక్క సోమలత కాదనీ - పైన చెప్పబడిన వింత లక్షణాలు కలిగిన సోమలత హిమాలయాలలో లభిస్తుందనీ వాదిస్తారు. కానీ స్వయంగా దానిని చూసినవారు కానీ, యితరులకు ఆ లతను చూపించిన వారు కానీ లేరు.

తన చితిని తానే పేర్చుకుని దగ్ధమై, ఆ బూడిద నుంచి తిరిగి పునరుత్థానం (*Resurrection*) చెందుతుందని భావించే పౌరాణిక పక్షి (*mythical bird*) అయిన ఫీనీ (*Phoenix*) వలె సోమలత కూడా కేవలం ఊహాజనితమేమో ! తెలుగులో దీనిని పుల్లతీగ లేక పుల్లకాడ అంటారు. సోమలత కాండం నుంచి ఎఫెడ్రిన్ (*Ephedrine*) అనే ఓ ఆల్కలాయిడ్ (*Alkaloid*) తీస్తారు. దీనికెన్నో వైద్యపరమైన ప్రయోజనాలున్నాయి.

చిగురుటాకులను చూచినప్పుడల్లా మన్మథుని వాహనమైన చిలుకరంగూ యిదేనని వాటిపట్ల ఏహ్యభావాన్ని పొందుతున్నారట (మన్మథుడు శుకవాహనుడు కదా!) ఇలా వారు మన్మథుని దాడికి భయపడి, ఆమె అందచందాల్ని చూచి పళ్లబిగువున తట్టుకుంటూ, ధైర్యాన్ని చిక్కబట్టుకుని, మిక్కిలి కష్టంతో తమ రోజువారీ తపోవిధులను నిర్వర్తిస్తున్నారట.

వనజనాభుని (పద్మనాభుని - విష్ణువు యొక్క) అభిషేకమునకు మాత్రమే వాడబడుతూ, కనక గర్భాదులకు (హిరణ్యగర్భుడైన బ్రహ్మమొదలగు దేవతలకు) కూడా వాడుకొనగరాని తీర్థకుండంలోని పవిత్ర జలాలను ఆ స్త్రీల పొంకంగల గబ్బి చన్నులనే చక్రవాక పక్షుల (జక్కవ పక్షుల)చే మలినం చేయబడ్డాయట. (స్త్రీల స్తనద్వయాన్ని కవులు తరచు చక్రవాక పక్షుల జంటతో పోలుస్తారు). వారు ఆ పాండురంగ విట్ఠలుని ఉద్యానవనాన్ని కూడా కలచి వేశారట.

దేవతలుకూడా అంత దూరాన్నుంచే తనకు వంగి వందనాలు చేసే ముక్కుమీద కోపంగల అతికోపిష్టియైన క్షేత్రపాలకుడు కాలభైరవుడిని ఆ స్త్రీలు ఆటబొమ్మలా అంటుకున్నారట. మఠముల అంతరాళముల (అంతర్భాగముల)లోని విశాలమైన వేదికలపైనా, యిరుకైన చీకటి మూలలలోనూ, తపస్సు చేసుకునే మునుల తాల్ములు (ధైర్యములు) ఆ బాలికల గుంపు యొక్క సాటిలేని స్తనాగ్రములకు రాసుకున్న మృగనాభి (కస్తూరి) పరిమళపు గాలి తాకిడికి పక్వశాల్మలి తూలికా శకలాల్లా (బాగుగా పండిన బూరుగ దూది పింజల్లా) తూలాయట (ఎగిరిపోయాయట) (స్త్రీలు ప్రాచీనకాలంలో తమ స్తనములకు కస్తూరి వగైరా సుగంధ ద్రవ్యాలు రాసుకొనేవారు. శాల్మలీవృక్షం లేక బూరుగ చెట్టు - *silk cotton tree* - *Bombax ceiba* - మెత్తని తేలికైన దూదినిస్తుంది. శాల్మలీ వేష్టమని పిలువబడే బూరుగ జిగురుకు ఎన్నోవైద్యపరమైన ప్రయోజనాలున్నాయి).

పోలుంబోలములు (యిది ఉచితము, యిది అనుచితము అని ఎంచకుండా) ఆ పద్మేక్షణలు (పద్మములవంటి కన్నులుకల ఆ స్త్రీలు) ఆ మహాబోధి వృక్షపు (రావిచెట్టు) నీడలో డోలారోహణలు (ఊయల లూగడం), శృంగార సంభాషణలు చేయడం, మన్మథ పూజలు, హాలాపాన విహారములు (సారాయి సేవించి విహరించడము) వగైరా అకృత్యాలన్నీ చేశారట.

జవ్వనంపు మదము (యౌవనంలో వున్నామనే గర్వం), సౌందర్య మదము (అందంగా వున్నామనే గర్వం) ధన మదముతోపాటు ఆ మృగాక్షుల (జింక కళ్లు గల స్త్రీల) మనస్సులనే పెను కుదుళ్లలో (పెద్ద పాదులలో) శీధుమదము (మద్యపు మదం) కూడా నిగిడిందట (వ్యాపించిందట). అక్కడ మద్యం త్రాగి తిరుగాడుతున్న ఒక విధు నిభాస్య (చంద్రబింబం వంటి ముఖం కల స్త్రీ) మధు మదక్షీబయై (ఒళ్లు తెలియకుండా పోయేటంత మత్తుతో కూడినదై) మదివెద (మనోవికారము) పొడముదేరగా (పుట్టగా) పూర్వజన్మ వాసనతో యిలా చిత్రంగా మాట్లాడిందట. తేనె క్రోలుటకు విరిగుత్తి (పూలగుత్తి)పై అళి (తుమ్మెద) భ్రమించడం చూసి దామోదరుడు (కృష్ణుడు) యశోదా దేవి స్తన్యం (చనుబాలు) త్రాగడానికి వచ్చాడని ఆ అళికి మ్రొక్కుతుందట. వేణుగర్భిణి (బాగా ముదిరి పగలడానికి సిద్ధంగా వున్న ముత్యములతో కూడిన వెదురు. ముదిరిన వెదురులోపల ముత్యాలుంటాయని విశ్వాసం)ని చూసి కద్రూదేవికిప్పుడు ప్రొద్దులు సొచ్చాయని (ప్రసవకాలం సమీపించిందని) ప్రియమందుతుందట (సంతోషపడుతుందట). కద్రువ కశ్యపప్రజాపతి భార్య. పాముజాతికి తల్లి. పాములకు కూడా పడగలపై ముత్యాలుంటాయని విశ్వాసం. అంచేత బాగా ముదిరిన వెదురు ప్రసవిస్తే (చీలితే)నూ; కద్రువాదేవి ప్రసవిస్తేనూ

ముత్యాలే లభిస్తాయి కనుక, ఆమె వేణుగర్భిణిని చూసి చమత్కారంగా కద్రువాదేవికి ప్రసవకాలం సమీపించిందని అంటున్నది. ఏనుగులు త్రొక్కుకుంటూ పోవడం కారణంగా అరటి చెట్లు ఒరిగిపోతే, పావని (భీముడు. పవనుని - వాయుదేవుని - కుమారుడు - పావని) యొక్క గదా ఘాతంతో ఫణికేతుడి (పాము పతాకంగా కల దుర్యోధనుడి) తొడలు నొచ్చాయంటూ అదలుతుందట (దుఃఖిస్తుందట). కానలో (అడవిలో) విరగబూచిన కింశుక వృక్షాన్ని (మోదుగ చెట్టును) చెలులకు చూపించి బడబాగ్ని (సముద్రంలో వుండే అగ్ని) జడధి (సముద్రము) నుండి బయటకు వెళ్ళడినదని చిత్రంగా చెపుతుందట. పలాశము లేక కింశుకము అని పిలువబడే మోదుగ చెట్టును (*Butea monosperma*) గూర్చి మనం లోగడనే చెప్పుకున్నాం. ఫిబ్రవరి మార్చినెలల్లో ఆకంతా రాల్చేసి చెట్టు మొత్తం ఎర్రని పూలు విరగబూసే ఆ వృక్షానికి ఆంగ్లేయులు కార్చిచ్చు లేక దావానలము (*Flame of the forest*) అని పేరిడితే మన రామకృష్ణకవి దానిని బడబాగ్ని (సముద్రంలోని అగ్ని) బయటికి వచ్చినట్లుందంటున్నాడు. ఏమైనా విరగబూచిన ఆ వృక్షాన్ని దూరాన్నుంచి చూసేవారికి మంటమండుతున్నట్లే కనుపిస్తుంది.

హంస కౌగిట వున్న హేమాంబుజాన్ని (బంగారు పద్మాన్ని) చూసి శేషవృత (ఆదిశేషునిచే చుట్టుకొనబడిన) మేరుపర్వతం అని పొగడుతుందట. చిత్రమైన యీ మాటలటుంచి మద్యం మత్తులో జోగుతూ వారు చేసిన అనుచిత కార్యాలకు అందరికీ ఆ కాంతామణులపై కోపం కలిగిందట.

దుర్గకు తన కేశపాశంలోని సుధలోలికే (అమృతం స్రవించే) సోమార్ధము (అర్ధ చంద్రుని) వలె లేత చెక్కిళ్లు చెమర్చాయట. కుర్కురభర్త (కాలభైరవుని) దృగ్గోళాలు (కనుగ్రుడ్లు) శీధుసంసేవనంబునఁబోలె (మద్యము త్రాగాడా అన్నట్లు) కోపంతో జేవురించి ఎర్రగా అయ్యాయట. అన్యాసక్తుడైన (యితర స్త్రీలపై యిష్టము కలవాడైన) విష్ణువును చూచిందా అన్నట్లు ముక్తకేశి కోపంతో కనుబొమలు ముడిచేసిందట. ఇలా ఎంతో పవిత్రంగా వుంటూ వచ్చిన ఆ పౌండరీక క్షేత్ర, పుణ్య తీర్థముల పవిత్రత ఆ రాచకన్నె సఖీజనుల వివిధ విలసనముల కారణంగా మలినమైనందున అక్కడి క్షేత్రపాలాదులకు జనియించిన అలుక (కోపము)ను కవి చిత్రంగా వివరించాడు.

అప్పుడు ఆ స్త్రీలు నరసింహస్వామి పాదపీఠం క్రింద సరియ (రంధ్రం) నుండి వెడలి అక్కడకు వచ్చిన పొదలు పొదలుగానున్న శరీరం కలిగి పూర్వజన్మలో తాపసియై ప్రస్తుతం కప్పగా వున్నట్టి జడభరతమునితో సమానమగు నట్టిదైన (మచ్చల కప్పయైన) అయుతుని పొడగన్నారట (చూచారట).

జడభరతుడనే ముని పేరు జాబాల ఉపనిషత్‌లో ప్రస్తావించబడింది. ఈయన తెలివి తక్కువ దద్దమ్మగా నటిస్తాడట. బహుశా యీ కప్పకు వలెనే జడభరతమునికి కూడా వళ్లంతా మచ్చలుండేవేమో?

వారు ఆ వింత కప్పని చూసి ఆశ్చర్యపోయారట. ఆ దర్దుర పట్టభద్రుడిని (కప్పలలో శ్రేష్ఠుడైన అయుతుడిని) ఆ చంపక పుష్పనాసికలు (సంపెంగ పూవువంటి ముక్కులుగల ఆ స్త్రీలు) చంపాలనే ప్రయత్నం చేయక అతని చుట్టూ తమ వాలు చూపుల వలను పన్నారట.

వింత కాంతులీనుతున్న ఆ కప్ప శరీరాన్ని చూసి ఆశ్చర్యపడిన ఆ స్త్రీలు 'దీని జన్మస్థలం ఎక్కడో? రోహణ నగమా? (రోహణ గిరి లేక రోహణ నగము అనేది శ్రీలంకలో ఒక పర్వతమట. ఇది వివిధ మణులకు జన్మస్థానమై బంగారు కాంతులీనే పర్వతమట. క్రీ॥పూ॥ 5వ శతాబ్దికి చెందిన భాస మహాకవి 'స్వప్న వాసవదత్త' నాటకంలో దీని ప్రస్తావన చేశాడు. రోహణగిరిః సకల గుణరత్న సమూహస్య - వాసవదత్తము). లేక సుధాంబు నిధాన గర్భమా? (పాలసముద్రం మధ్యలోని శ్వేతద్వీపమా?) అనిమిష కార్ముకము (ఇంద్ర ధనుస్సు) పుట్టేచోటా? ఈ వింత కప్ప జన్మస్థలం?' అంటూ దానిని పట్టుకోవాలని ప్రయత్నించారట.

అదేమన్నా కందుకమా? (బంతా?) కాదు; ఆటాడుకునే కేళీ శుకమా? (పెంపుడు చిలుకా?) కాదు. విలువైన వీణా కాదు; దర్పణమూ (అద్దమూ)కాదు, అయినా చంచలాక్షులూ (బెదరు కన్నులుగలవారు) చపల ప్రచారలూ (దుర్వినీతమైన నడత కలవారూ) నైన ఆ స్త్రీలు ఆ వర్ష పిశునమును (ఆ రంగుల మచ్చల కప్పను) పట్టుకొనదానికి పరుగులు తీశారట.

కప్పను వర్షపిశునము లేక వర్షాఘోషము అంటారు. తెప్పలుగా వాన కురిస్తే కప్పలు అసంఖ్యాకంగా చేరి బెకబెకమంటాయి. కప్పలు మట్టి సంబంధమైన ఆహారాన్ని తింటాయి. వర్షం మట్టిని బాగా తడిపి దానిలోని క్రిమి కీటకాదులను కప్పలకు అందుబాటులోకి తెస్తుంది. అంచేత కప్పలు వర్షం పట్ల హర్షం ప్రకటిస్తాయి. కప్పకు 'వర్షభూ' అనే పేరుండడాన్ని బట్టి కప్పలు ఆకాశం నుండి వర్ష బిందువులతోపాటు పడతాయని కొందరు విశ్వసిస్తారు. ఇది అశాస్త్రీయమైన అంధవిశ్వాసం. 'వర్షభూ' అంటే 'వర్ష ఋతువులో పుట్టేది' అనే అర్థం చేసుకోవాలి. వర్షాకాలంలో చురుకుగా కనుపించే కప్పలు మిగిలిన కాలాల్లో నెర్రెలలో, నేల బొరియల్లో ప్రవాస జీవితాన్ని (*Hybernation*) గడుపుతాయి. కప్పలు బెకబెక మంటే వర్షాలు కురుస్తాయనీ, కప్పలకు పెళ్లిళ్లు జరిపితే వర్షాలు కురుస్తాయనీ కొందరికున్న విశ్వాసాలు కూడా అంధ విశ్వాసాలే! దర్దురము, శాలూరము, ప్లవము అని కూడా పిలువబడే *Anura Order* కి చెందిన ఉభయచరజీవి (*Amphibian*) యైన కప్ప (*Rana Spp.*) మానవునికీ, పంటలకూ అపకారం కలిగించే క్రిమికీటకాదులను భక్షించి మానవసమాజానికి ఎంతో సేవ చేస్తున్నది.

వారిలో ఒక స్త్రీ నీలనీలవేణియట (మిక్కిలి నల్లని కురులు కలిగినదట) ఆమె యువజనులను (యువకులను) తన ఉరిలో తగులపరచే (తగుల్కొనజేసే) కీలు (నేర్పరితనం) కలిగినదట. ఆమె తన తలలో తురుముకొనే విరిదండ (పూలదండ)ను తీసి, దానితో ఉరి (ఉచ్చు) వేసి ఆ వారిచరము (కప్ప)ను బంధించ బోయిందట. అయినా అది దొరక్కుండా నేర్పుగా తప్పించుకు పోయిందట. దాంతో ఆమె మదిలో చిక్కుబడిందట (కలత చెందిందట). ఇంకొక మచ్చెకంటి (చేపవంటి కన్నులు కల స్త్రీ) ఉచ్చువేసిన తన చేలాన్ని (వస్త్రాన్ని) నేలపై పరచి దానిని పట్టుకోవాలని చూసిందట. అయితే ఆ దర్దురము (కప్ప) పూర్వ జన్మలో తన బంధువులు వగైరాలపై ఎట్టి ప్రేమలూ లేని అయుతుడైన కారణంగా తన అంటుసంటువారి మీది (బంధువుల మీది) మమకారం అనే నదిని యీది దాటినట్లుగా ఆ వస్త్రాన్ని దాటుకుని వెళ్లిపోయిందట.

ఆ వర్షభూవిభునకు (కప్పలరాజునకు) బిసరుహాక్షుల (పద్మములవంటి కళ్లు కలిగిన స్త్రీల) చేతిలో హావళి (హావళి అన్నా, హావడి అన్నా, ఆవడి అన్నా ఉపద్రవము. ప్రమాదము) తఱచు (ఎక్కువ) అయ్యిందట. వైకుంఠపురవాస స్త్రీల చేతిలో రావణునకు జరిగే అలజడి (అల్లరి)లాగా. (వైకుంఠపురము అనబడే శ్వేతద్వీపంలోని స్త్రీలు రావణుడిని పదితలలుగల పురుగుగా భావించి అల్లరి చేస్తారట).

అయినప్పటికీ పూర్వజన్మలో కుంభభూ శిష్య ముఖ్యుడూ (కుంభసంభవుడైన అగస్త్యుని శిష్యులలో ప్రముఖుడూ) భేకరూప కూప బింబితుడూ (కప్ప రూపమైన హీనజన్మ కలవాడూ)నైన ప్రయుత సుతుడు (ప్రయుతుని కుమారుడైన అయుతుడు), భూపాల తనయ సఖులచేత (రాజు కుమార్తె చెలికత్తెల చేతికి) తవులు పడదు (చిక్కదు).

ఇక అప్పుడు ఆ నరనాథ పుత్రి (ఆ రాజ కుమార్తె) స్వయంగా ఆ కప్పను పట్టుకొనదానికి రంగంలోకి దిగింది. ఆమె 'ఉరు కుచ కచ జఘన భారయుత' అట. అంటే గొప్ప కుచముల, శిరోజముల, పిరుదుల భారంతో కూడుకున్నదట. అయినప్పటికీ కొండలతోనూ, అడవులతోనూ, ద్వీపములతోనూ కూడినట్టి భూమిలా ఆమె ధైర్యంగా కార్యభారం ధరించిందట (వహించిందట).

'ఈ కప్పను నేను పట్టుకుంటాను. ఏమైనా పన్నిదము (పందెము) వేస్తారా?' అని తన చెలికత్తెలతో అంటూ, ఆ స్త్రీ వారి చేతగానితనానికి వారిని నిందిస్తూ, తన కాంచి (ఒంటిపేట మొలనూలు)నే వల (ఉచ్చు)లా ఏర్పరచి ఆ సలిల జంతు లలామమును (నీటి జంతువగు ఆ కప్పను) ఉబ్బుచూ (ఆనందంతో పొంగుతూ) పట్టుకున్నదట. అయుతుడు సర్వతీర్థ ప్రదేశ ప్రశస్తమతియట (అంటే సమస్త పుణ్యక్షేత్రములనూ పొగడే బుద్ధి కలవాడట) అంచేతనే కాంచి (మొలనూలు

అనీ, ప్రసిద్ధ పుణ్యక్షేత్రం కాంచీపురమనీ రెండు అర్థాలు) లో తగులుకొనడం తనకు అర్థమైనదేనని ఆ వరుణ దంతావళము (ఆ కప్ప రూపంలోనున్న అయుతుడు) భావించాడట. అందుకే ఆ రాజపుత్రి పసిడి రశన (బంగారు మొలత్రాడు)తో తన మెడచుట్టూ ఉరివేసినా, ఉలకకుండా ఊరుకున్నాడట అయుతుడు.

దంతావళము అంటే ఏనుగు. వరుణ దంతావళము అంటే వరుణుడి ఏనుగు. అయితే పురాణాలలో వరుణుడి వాహనం మొసలి అని కొన్నిచోట్ల, హంస అని కొన్ని చోట్లా పేర్కొనబడింది. బహుశా కప్పలవల్లనే వర్షం వస్తుందనే అంధవిశ్వాసం రామకృష్ణకవికి కూడా ఉన్నందునే ఆయన కప్పను 'వరుణదంతావళము' (వరుణుడు ఎక్కివచ్చే వాహనం) అని పేర్కొని ఉంటాడు. ఏమైనప్పటికీ కప్పను 'వరుణ దంతావళము' అనడం చక్కగా వుంది.

అలా బంధించిన కప్పను ఆ రాజకుమార్తె ఒక పులుగును (పక్షిని) ఆడించినట్లుగానూ, ఒక సకినను (బొమ్మను) ఆడించినట్లుగానూ ఆడిస్తున్నదట. ఆ రామ (ఆ స్త్రీ) ఆ చిత్రశాలూరమును (వింత కప్పను) గర్వంతో కూడిన చిరునవ్వుతో ఆడిస్తూ కప్పకు భయపడిన ఒక వృద్ధ విప్రుని (ముసలి బ్రాహ్మణుని)పైకి దానిని వేసి అతని శాపం కారణంగా తానూ, తన సఖీజనము కప్పలై ఆ భేకమునకు (అయుతునకు) భార్యలయ్యారట. ఈ విధంగా ఒక్క భార్య కూడా వద్దనుకున్న అయుతునకు ఏకంగా ఆలి పిండు (భార్యల సమూహమే) లభించింది.

తమ రాజకుమార్తెకు చెలికత్తెలుగా వ్యవహరించిన చామలే (స్త్రీలే) యిప్పుడు ఆమెకు దాయలు (శత్రువులు. ఇక్కడ సవతులు అనే అర్థంలో). కాని దినాలలో (చెడ్డ రోజులలో - అందరూ కప్పలుగా మారిన కష్టకాలంలో) కాబట్టి సరిపోయింది గానీ, యిదే అయిన దినాలలో (ఆమె రాకుమారిగానూ, వాళ్లంతా చెలికత్తెలుగానూ ఉన్న రోజుల్లోనయితే) రాజకుమార్తెతో సాపత్న్యం ఎంతకీడు? (అంటే రాజకుమార్తెతో బాటు ఒకే భర్తకు సవతులుగా ఉండడం ఎంత ప్రమాదకరం?)

నున్నని పాలుగారే ముఖము, నూనూగు మీసములు చెన్నటి కాకముందే (నశించక ముందే) 'మా అన్నవుగా! గృహస్థులకు అగ్రణివై జీవించు' అంటూ లోగడ వేయికన్నులవేల్పు (ఇంద్రుడు) వేడుకున్నప్పటికీ, అది సాధ్యంకాదని వాదులాడిన ధైర్య సంపన్నుడు అయుతుడు ఆ కప్ప భార్యల గుంపుతో సంసారాన్ని సాగిస్తూ, కుపితులైన వారి ప్రణయ కోపాన్ని శాంతింపజేయడానికి, చివరికి వారికి పాదనతులు (వారి కాళ్లకు నమస్కరించడం) కూడా చేస్తున్నాడట.

విషమ శరుడు (మన్మథుడు) వేసే తూపుల (బాణముల) వేడికన్నా, వాధూల మునీంద్రుడి శాపవచనముల వాడి కారణంగానే ఆ రాతికొడుకు (కప్ప) అయినట్టి ఇల్వలారాతి చట్టు (ఇల్వలుని శత్రువైన అగస్త్యుని శిష్యుడు) మనస్సు కరగించి తన భార్యలతో మమతలను పెనవేశాడట. మనోకాఠిన్యం కలిగిన అయుతుడిని యిక్కడ రాతి కొడుకుగా పేర్కొనడం కవి చమత్కృతి. ఒక్కోసారి రాళ్లలోని కొన్ని పొరలలో కప్పలు కానవస్తాయట. బహుశా ఇది కూడా వాటి భూబిలాంతర జీవనము (*hybernation*) లో భాగమే కావచ్చు. ఈ కారణంగానే కవి కప్పను 'రాతి కొడుకు' అని చమత్కారంగా పేర్కొన్నాడు.

స్వాతి కార్తెలో మేఘము నుంచి వర్షించిన చినుకులు వనధి (సముద్రం)లోని శుక్తి (ముత్యపు చిప్ప)లో పడి ముయ్యాడై (పరిపూర్ణత చెంది) మౌక్తికత వహించినట్లు (ముత్యములవుతున్నట్లు) ఆ స్త్రీలందరినీ తత్కాలమునందు (ఆయా కాలములలో) వారిపై ప్రణయం నిల్పుతూ క్రమంగా వారితో సంసారం సాగించాడట. స్వాతి అనేది ఒక కార్తె. అశ్వని మొదలగు 27 నక్షత్రములలో స్వాతి ఒకటి. స్వాతి (*The star Arcturus*) శుభప్రదమైన కార్తెయని విశ్వాసం. ఈ కార్తెలో వర్షపు చినుకులు ముత్యపు చిప్పలలో పడితే ముత్యాలు అవుతాయనేది అంధవిశ్వాసమని మనం లోగడే చెప్పుకున్నాం. ముయ్యాడు అంటే బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధక్యము అనే నాలుగు యీడులలో మూడవది. పదహారు

సంవత్సరములనుండి ఏభై సంవత్సరాల వరకుగల ప్రాయము ముయ్యాదు. యౌవన దశకు మానవునిలో పెరుగుదల పరిపూర్ణత చెందుతుంది. ముత్యం పరిపూర్ణత చెందడాన్ని 'ముయ్యాడై' అని పేర్కొనడం రామకృష్ణకవి చమత్కృతి.

ఆ మునిపతి అయుతునకూ, ఆ రాజసుతకూ ఒక తనయుడు జన్మించాడట. అంతటితో ఆ వాధూల మునీంద్రుని శాపపుటిరులు (శాపపు + ఇరులు - శాపపు చీకటులు) తొలగి జ్ఞాన చంద్రుడు కనుపించాడట. విష్ణు పదము (విష్ణువుండే స్థానము) కూడా కానవచ్చిందట. మూగకప్పు రూపాన్ని వదలి అతడు సలపితుడు (మాటలాడ నేర్చినవాడు) అయ్యాడట.

గృహమేధి ధర్మమనే వర్మము (కవచము) ధరించడానికి అసహమతి (ఇష్టపడని, సమ్మతించనివాడు)యైన కుమతి (చెడ్డబుద్ధి కలవాడు) అయుతునిలాగా దుస్సహమైన (సహింపరాని) దుఃఖమనే ఆగ్రహానన గుహ (మొసలి నోరు అనే గుహ) యందుపడతాడని మునుపు ముకుందుడు చెప్పగా విన్నాను.

విష్ణుభక్తులై, వివేకులై, తృష్ణావిదూరులై (ఆశకు దూరంగానున్నవారై) స్వకుక్షి పూరణము (తమ పొట్టపోసుకొనడం) సమయ సంభృతార్థి సంతృప్తిగాగొని (ఆయా కాలములతో దొరికే వస్తువులతో పొట్టపోసుకుని ఉన్నదానితో తృప్తి చెంది) నడచేవారు, భవము గడచేవారు (పునర్జన్మ పొందనివారు) అవుతారు."

అని, "యీ విధంగా నిఖిలోన్నతములగు (ప్రపంచంలో అన్నిటికంటేనూ గొప్పదైన) దైవత, క్షేత్ర, తీర్థమేళనము (మేళవింపు)ను పరమభాగవతోత్తముడివైన నీవు అడిగావు కాబట్టి చెప్పాను. దీనిని ఎన్నడూ వైష్ణవధర్మం ఆచరించని అసదులకు (అల్పులకు) తెలుపవద్దు. గుప్తంగా వుంచు" అన్నాడు శివుడు.

దానికా అమరసంయమి (దేవముని నారదుడు) శివునితో "ఓ మునిధ్యేయా! (మునులచే ధ్యానింపబడువాడా! ఓ శివుడా!) దురాపరూపయైన (పొందగారాని స్వరూపముగల) ఆ క్షేత్ర రాజం యొక్క స్వరూపాన్ని నీ మూలంగా తెలుసుకొనగలిగాను. తరగని సౌఖ్యాలను పొందగలిగాను."

"భయమునదల్చి (బెదరగొట్టి) దుఃఖములను పోగొట్టి సుఖములను ప్రోదిచేసి, మిక్కిలి ప్రకాశవంతమైన నీ అడుగుదమ్ములను (పాదపద్మములను) ఇమ్ములను (భక్తితో) కొలిచి నిత్యసంశ్రయమొనరించే నాకిక అసాధ్యమంటూ లేదు. దుర్ణయ (చెడ్డదైన) భవసాగరోత్తరణ నావికులు (సంసార సాగరాన్ని దాటించు నావికులు) ఆదిమ వైష్ణవోత్తములే! వారు తరించుచూ యితరులనూ తరింపచేస్తారు."

ఆ వనజాసనసూతి (బ్రహ్మకుమారుడైన నారదుడు) పౌనఃపున్యంబుగా (మాటిమాటికి) హరుని (శివుని) మ్రొక్కి వలగొని (ప్రదక్షిణము చేసి) పౌండరీక క్షేత్రానికి వెళ్లి, భైమీనదిలో తీర్థమాడి (స్నానం చేసి) చక్రిని (విష్ణువును) భజించాడట (పూజించాడట).

భజియించి, ఆ పాండురంగ విట్ఠలుని అనుగ్రహమనే వ్యజనానిలశమిత తాపుడై (విసనకర్ర గాలికి శమించిన - అణగిన - తాపముకలవాడై), యిప్పుడు ఆ అబ్జజసూతి (అబ్జజుడు అంటే పద్మము నుంచి పుట్టినవాడు - బ్రహ్మ. అబ్జజసూతి అంటే - బ్రహ్మ కుమారుడు నారదుడు) దక్షిణ ద్వార జగతిన (దక్షిణ ద్వార ప్రదేశంలో) సుస్థిర ప్రమదమున (నిత్య సంతోషముతో) వున్నాడు" అని కథకుడైన సూతుడు శౌనకాది మునులకు దురిత తమములను (పాపములనే చీకట్లను) తొలగించే దినకర కిరణములు (సూర్యకిరణాలు అనే) హరిదివ్య చరితములను (విష్ణువు యొక్క దివ్యగాథలను) వినిపించాడట.

కీ॥శే॥ బి. యస్. రంగా నిర్మించిన

"తెనాలి రామకృష్ణ"

చలన చిత్రంలో



వికట కవిగా

చిరస్మరణీయ పాత్రలో

ఎ.యన్.ఆర్

# శ్రీ ఘటికాచల మాహాత్మ్యము

ఇది ప్రౌఢకవియైన తెనాలి రామకృష్ణుడు తన జీవిత చరమాంకంలో రచించిన కావ్యమని భావించబడుతున్నది. ఈ కావ్యం యొక్క అవతారికను బట్టి తెలుస్తున్నదేమంటే - ఓ రోజు ఖండోజీ ప్రభువు వద్దకు నుదుట వెదురాకు వంటి తిరుమణి ధరించిన విప్రుడొకడు ఒక అనూతన కావ్యాన్ని తీసుకొచ్చి ఆశీర్వదించి "ఓ ఖండోజీ విచిత్రరాయా! ఈ సమస్త భూమండలంలో నీ వొక్కడవు తప్ప ఈ కావ్య సుగంధాన్ని ఆఘ్రాణించి, ఆనందించ గలిగేవారూ, యీ కావ్యరసాస్వాదన చేయగలిగే మనసున్న మారాజులూ మందుకైనా లేరు. విచిత్ర వాక్సరణితో ప్రకాశించిన తెన్నలి (తెనాలి) రామకృష్ణ కవికులవజ్రపాణి (కవికులేంద్రుడు) ఈ ఘటికాగిరినాథ మహాచరిత్రమును వ్రాసి, యీ కావ్య కన్యకను స్వీకరించగల యోగ్యుడైన కృతిభర్త ఎవ్వరూ దొరకనందుకు మదిలో బాధపడుతూ వుండేవాడు.

"ఓ భాగాంబికా తనూజా! (ఖండోజీ తల్లిపేరు భాగాంబ) యీ కావ్యం విషయమై ఆయనిలా పరితపించేవాడు - 'ఈ కావ్యాన్ని పుట్టులోభుల పాలుచేస్తే పొలుపు (ఒప్పిదము) వుండదు - పశువును అమ్మితే మనకు దాని మూల్యం ప్రాప్తించినట్లే! మూఢాత్ములైన కాముకులకు దీనిని సమర్పిస్తే వాళ్లు నెనరు (ప్రేమ)తో దీనిని పాలింపనేరరు. హీనులకు దీనిని అంకితమిస్తే వసుమతి (భూమి)లో అపకీర్తి వస్తుంది. పామరులకు దీనినిచ్చానా - ఏం ప్రయోజనం? వాళ్లు దీనినో మూల పడవేస్తారు. అర్హుడైన కృతిభర్త లభించనప్పుడు అసలెవరికైనా యీ కావ్య కన్యకనెందుకియ్యాలి?' అని యోచించి తన యింట్లోనే యింతకాలం దీనిని అట్టిపెట్టుకున్నాడు. ఆయన కాలంచేసిన తరువాత యిన్నాళ్లకు ఆయన అభీష్టం సిద్ధించింది. యోగ్యుడవైన నిన్ను గురించి విని, ఆ నిరుపమాన కావ్యాన్ని నీకివ్వాలని తీసుకువచ్చాను. తీసుకో!" అన్నాడట. అప్పుడు ఖండోజీ ఆ కావ్యాన్ని స్వీకరించి ఆ విప్రుడు కోరినవన్నీ ఒసగి పంపి, వేంకటగిరీంద్రుడనే తన ఆస్థానకవిని పిలిపించి, తన అర్ధసింహాసనంపై కూర్చుండబెట్టుకొని, "వేంకటగిరీంద్రా! ఇది తెనాలి రామకృష్ణకవి కల్పించిన కావ్యం. దీనినాయన పౌత్రుడు (మనుమడు) నాకు సమర్పించాడు. నా వంశావళిని దీనికి జోడించి దీనికి అవతారికను తయారు చెయ్యి" అన్నాడట. చారిత్రకంగా చూస్తే - రామకృష్ణకవి మరణించిన అనంతరం సుమారు నూటపాతిక

సంవత్సరాలకు గాని ఖండోజీ పుట్టలేదు. అంచేత, యీ కావ్యాన్ని ఆయనకు తెచ్చి యిచ్చింది రామకృష్ణకవి మనుమడు అనడం అసంబద్ధంగా వుంది కనుక, ఇక్కడ 'పౌత్రుడు' అనే పదాన్ని వట్టి ఔపచారిక పదంగానే మనం భావించాలి రామకృష్ణకవి వంశంలో నాలుగైదు తరాల తర్వాత వ్యక్తి ఎవరో ఆ కావ్యాన్ని ఖండోజీకి అందించి వుంటాడు

ఇక యీ కావ్యానికి 'అవతారిక'ను వ్రాసిన వేంకటగిరీంద్రుడు అప్పటికే 'రుక్మాంగద చరిత్ర' అనే ద్విపదనూ, 'అభినయ దర్పణము' అనే కృతినీ వ్రాసి ఖండోజీకే అంకితమిచ్చి వున్నాడు. 'రుక్మాంగద చరిత్ర' లో వర్ణించబడిన దాని ప్రకారం – వేంకటగిరీంద్రునిది లోహితస గోత్రము ఆపస్తంబ సూత్రము ఇంటి పేరు 'దర్భ'వారు, తండ్రి ఔబళుడు (అహోబిలంలో వెలసిన అహోబలుడిని ఔబళుడు అనీ అంటారు ) తల్లి జానకమ్మ కొంతకాలమితను తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజులలో సంస్కృతాంధ్ర కవులను పోషించిన శాహాజీ ఆస్థాన కవిగా వున్నాడట. ఆ తర్వాత శరభోజీ ఆస్థానాన్ని యీ కవి అలంకరించాడు ఈయనను 'వేంకటగిరి కవి' అని కూడా వ్యవహరించేవారు 'విచిత్రరాయ చంద్ర వతంసుడు' అనేది యీయనకు ఖండోజీ రాయడిచ్చిన బిరుదు ఖండోజీ తన తండ్రి పేరునే తన అభిమాన పాత్రుడైన ఆస్థాన కవికి బిరుదుగా యిచ్చి, అతనిని తన అర్ధ సింహాసనంలో కూర్చుండ బెట్టుకొనేవాడట

ఈ కావ్యాన్ని తెనాలి రామకృష్ణ కవి వ్రాశాడు. అయితే అవతారికను వ్రాసిన వేంకటగిరీంద్రుడు కృత్యాదిని కూడా రామకృష్ణకవే వ్రాసివుంటే ఎలా వ్రాస్తాడో అచ్చు అలానే వ్రాయడం విశేషం 'పాండురంగ మాహాత్మ్యము' లోవలెనే దీని అవతారికలో కూడా కృష్ణుడే ముందు ప్రార్థించబడ్డాడు కృష్ణుడు తెనాలి రామకృష్ణునికి యిష్టదైవం. తెనాలి రామకృష్ణుడు శైవాన్ని వదలి వైష్ణవాన్ని ఎంతగా కౌగిలించుకున్నప్పటికీ తన జన్మతో తనకు అబ్బిన శైవం యింకా ఆయనకు ప్రాణలింగంగ్గానే వున్నది అంచేతనే పాండురంగ మాహాత్మ్యము కృత్యాదిలోనే ఇష్టదేవతాస్తుతిలో కృష్ణుడు, లక్ష్మి, ధాత, వాణిలతోబాటు శంకరుడు, పార్వతిలను కూడా రామకృష్ణుడు స్తుతించాడు. వేంకటగిరీంద్రుడు కూడా యీ కావ్యానికి తాను వ్రాసిన 'అవతారిక'లో ఆ ఆర్గురు దేవతలనే – అదే క్రమంలోనే స్తుతిస్తూ, ఒక్క శంకరుని స్తుతిస్తూ వ్రాసిన "ఆలోలాత్మ . . " అనే పద్యాన్ని మినహాయించి, మిగిలిన ఐదు దేవతా స్తుతులనూ రామకృష్ణ కవి తన 'పాండురంగ మాహాత్మ్యము' యొక్క కృత్యాదిలో ఏ ఛందస్సులో వ్రాశాడో అదే ఛందస్సులోనే వ్రాయడం విశేషం ఇంత జాగ్రతతో కృతికర్త హృదయం తెలిసి అవతారిక రచించే కవి రామకృష్ణుడు మరణించిన నూట పాతికేళ్లకు ఆయన కావ్యానికి లభించడం ఓ అరుదైన విశేషం !

ఇక యీ కావ్యాన్ని స్వీకరించిన ఖండోజీ తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజులలో ఒకడనడానికి మాత్రం ఆధారాలు చిక్కడంలేదు ఇతడు శాహాజీ మహారాజు బంధువర్గంలోని ఓ సామంతరాజు అయివుండవచ్చు. లేక చిన్న స్వతంత్ర పాలకుడై వుండవచ్చు విఖ్యాత మరాఠా సంఘసంస్కర్త మహాత్మా జోతిరావ్ ఫులే (1827–1890) వ్రాసిన 'గులాంగిరీ' గ్రంథాన్ననుసరించి మహారాష్ట్ర పాలకులు తమ విశాల సామ్రాజ్యాన్ని ఖండాలుగా విభజించేవారనీ, ఆ ఖండాన్ని పాలించేవాడిని 'ఖండోబా' అనేవారనీ తెలుస్తున్నది (పే 36 'గులాంగిరీ ప్రచురణ · హైదరాబాద్ బుక్ ట్రస్ట్). ఆ ఖండోబానే గౌరవంగా 'ఖండోజీ' అనేవారనుకుంటాను. ఇతని తండ్రి విచిత్ర రాయుడు తల్లి భాగాంబ. ఈ కావ్య అవతారికలోని 38, 39 పద్యాలలో ఖండోజీ తండ్రి విచిత్రరాయుడు 'మల్లవడీ' పురీశ్వరుడనీ, ముత్తాపఖానుడు, బలబలాఖానుడు అంబారుఖానుడు, ఖానఖానుడు మొదలైన మహమ్మదీయ వీరులను ఓడించాడనీ, 'మల్లా దళములలో చొచ్చి సోమ-సూర్య వీధులేర్పడ నడికిన వీరుడనీ' వర్ణించబడింది. మహమ్మదీయ వీరుల సంగతి అటుంచితే, విచిత్రరాయుడు 'మల్లా' దళములను జయించాడనే విషయం గమనార్హం 'మల్లా' అంటే మల్ల యోధులని కాదు. మల్లజాతి ఉత్తర భారతదేశానికి చెందిన యుద్ధ పిపాస కల ఓ జాతి. బహుశా ఒకప్పుడు కృష్ణుడు, శివుడూ కూడా యీ జాతివారిని జయించి వుంటారు. అందుకే వారిద్దరికీ కూడా 'మల్లారి' అనే నామాంతరముంది ఔత్తరాహులైన మల్లజాతివారు దక్షిణ భారతదేశానికి వలసవచ్చి తెలుగునాడులో కూడా స్థిర నివాసమేర్పరచుకున్న దాఖలాలున్నాయి. కర్నూలు జిల్లాలో నందికొట్కూరు తాలూకాలోని మల్యాల, కర్నూలు తాలూకాలోని మల్లాపురం, సిరివెళ్ల తాలూకాలోని మల్లవేముల, ప్రకాశం జిల్లా మార్కాపురం తాలూకాలోని మల్లపేట, నెల్లూరు జిల్లా సూళ్లూరుపేట తాలూకాలోని మల్లాం; అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకాలోని మల్లా కాలువ మరియు తాడిపత్రి తాలూకాలోని మల్లాగుండ్ల వగైరా గ్రామాలన్నీ వీరి పేరిట ఏర్పడినవే! 'మల్లవాడి'నే వేంకటగిరీంద్రుడు 'మల్లవడి' అని పేర్కొని వుంటాడు కర్నూలు జిల్లా పత్తికొండను ఒకప్పుడు 'మల్లవాడి' అనేవారని తెలుస్తూంది. విచిత్రరాయుడు పత్తికొండను మల్లజాతి వారినుండి స్వాధీనం చేసుకుని పాలించిన చిన్న స్వతంత్ర పాలకుడైన మహారాష్ట్ర జాతీయుడో లేక పత్తికొండ ఖండాన్ని పాలించిన మరాఠా సామంతరాజో అయి వుంటాడని నా ఊహ. అవతారికలో తెలిపినదాని ప్రకారం, కౌశిక గోత్రుడు, ప్రసిద్ధ విశ్వామిత్రుడి వంశంలో కుశికుడు, గాధి, విశ్వామిత్రుడు వగైరాల అనంతర కాలానికి చెందిన మాలి అనే వానికి మనుమడైన నరసరాజు చిన్నకొడుకైన విచిత్రరాయని కుమారుడు ఖండోజీ

ఈ కావ్యానికి రామకృష్ణకవి కృత్యాది వ్రాయలేదు కనుక యిది ఆయన అవసాన కాలంలో వ్రాసిన కావ్యం అయివుంటుందనే దానిలో సందేహమేమీ లేదు వ్రాసి ఎవ్వరికీ అంకితమీయకుండానే ఆయన మరణించగా ఆయన తర్వాత నాల్గవ లేక ఐదవతరం వాడు దానిని భద్రంగా ఖండోజీకి అందించి పురస్కారం పొందాడని వేంకటగిరీంద్రుడు వ్రాసిన అవతారికను బట్టి అర్థమౌతూంది ఇది మూడాశ్వాసాల చిన్నకావ్యం. దీనికి ముందర వ్రాసిన యీ కవి కావ్యాలతో యీ కావ్యానికి ఎన్నో సారూప్యతలున్నప్పటికీ, శైలి, భాషాగాంభీర్యాల విషయంలో పాండురంగ మాహాత్మ్యము' ముందు యిది దిగదుడుపే ఆ కారణంగా, యిది యింకా అంతటి ప్రౌఢ కవిగా రామకృష్ణుడు పరిణతి చెందక మునుపు అంటే 'పాండురంగ మాహాత్మ్యము' రచించక ముందు వ్రాసిన కావ్యమై వుంటుందని కొందరు విమర్శకుల అభిప్రాయం వయస్సు ముదిరే కొద్దీ శైలిలోనూ, భాషలోనూ పాటవం తగ్గడం అసమంజసమేమీ కాదనీ, వృద్ధాప్య భారంతో ఆయన వ్రాసిన కావ్యాన్ని ఆయన వ్రాసిందేనా, కాదా అనీ; ఆయనే వ్రాస్తే 'పాండురంగ మాహాత్మ్యము' కంటే ముందు వ్రాశాడా? దాని తరువాతనా? అనీ మరీ అంతగా పట్టి చూడాల్సిన పని లేదని కొందరి అభిప్రాయం 'పాండురంగ మాహాత్మ్యం'తో దీనిని పోటీకి నిలపలేమన్నంత మాత్రంచేత యీ కావ్యం ఉత్కృష్టమైనది కాకపోలేదు. ఇదీ చక్కటి కావ్యమే! అయితే దీని ప్రత్యేకతలు దీనివి

దీని కథాంశమేమిటో కూడా సంక్షిప్తంగా చూద్దాం ప్రథమాశ్వాసంలో భృగు - నారద సంవాదముతో ప్రారంభించి 108 దివ్య తిరుపతులలో ఘటికాచల ప్రాశస్త్యము, ధవళాంగుని కథ, ద్వితీయాశ్వాసములో నారదుని పూర్వజన్మ వృత్తాంతము, సప్తర్షుల తపస్సు, ఘటికాచల యాత్ర, కాంచీపుర వర్ణన, తృతీయాశ్వాసములో వైఖానసుల విశిష్టత, నరసింహుని కళ్యాణోత్సవం వర్ణించబడ్డాయి

శ్రీలతో రాజిల్లే నైమిశారణ్యంలో సూతుడు తాపసులకు చెపుతున్నట్లుగానే యీ కావ్యము కూడా ప్రారంభించబడింది. ఆ తాపసులు సూతునితో పద్మాధీశ సద్మములలో (విష్ణు క్షేత్రములలో) శ్రేష్ఠమైనదేదో తెలుపమనగా అందుకు - నారద మునీంద్రునికీ, భృగు మహర్షికీ జరిగిన సంవాదంతో కథ ప్రారంభం చేస్తాడు సూతుడు.

## మానస సరోవరం

ముందుగా మానస సరోవరాన్ని వర్ణిస్తాడు కవి. ఆ వర్ణనే ఎంత ఉత్కృష్టంగా ఉందో చూడండి -

సీ॥ శశికరద్రుతసార శశికాంత వాఃపూర
పరితః ప్రపూరిత పరిసరంబు
జలచరాశనకేళి జలచరద్విహగాళి
కలరవోద్ధత కలకల ధురంబు
సుర మునీశ క్షమాసుర దుర్లభాతిమా
సర ముక్తిమౌక్తిక సరవరంబు
కమనీయ మకరంద కమల కైరవబృంద
పరిలస ద్రోలంబ పరికరంబు
ఘటిత కిసలయసమ జటానిటల పటల
ఫలక తిలకిత శశిసిత భసిత లసిత
రసిత పరమ సమాధిమద్విసర రుచిర
రసఝరభరంబు వొల్చు మానససరంబు. (ఘటికాచల మాహాత్మ్యము 1-3)

శశికాంతములు అంటే చంద్రకాంత శిలలు; శశి (చంద్రుని) కర (కిరణములచే); ద్రుత (కరగిన); వాఃపూర (జలముచే నిండిన); పరితము అంటే పికము, కోకిల; ఆ సరోవరం చంద్రుని కిరణాల కారణంగా చంద్రకాంత శిలలు

కరుగగా ఏర్పడిన నీటితో నిండి వున్నదట. చంద్రుని కిరణాల స్పర్శకు చంద్రకాంత శిలలు (*Moon stones*) ద్రవిస్తాయని విశ్వాసం. అలాంటి చంద్ర శిలా ద్రవంలో పరితః (అన్ని దిక్కులా) ప్రపూరిత (నిండిన) పరిసరములు కలది అని ఒక అర్థం. అలాగే రెండవ పాదానికి ఆ పరిసరాలన్నీ కోకిలలతో నిండి వున్నాయని మరో అర్థం చెప్పుకోవచ్చు. పచ్చని పరిసరాలలోనే కోకిలలుంటాయి. కనుక, ఆ ప్రాంతమంతా సస్యశ్యామలంగా వుందన్నమాట. 'అశనము' అంటే ఆహారము జలచరాశన (జలచరములైన చేపలు వగైరాలను) కేళి (ఆటగా వేటాడుతూ) జలచరత్ + విహగాళి - నీటిలో చరించే పక్షుల (చిలవలు (*teals*) బుడుబుంగలు (*coots*), బాతులు (*ducks*), హంసలు (*Swans*) వగైరా జలచర పక్షుల) సముదాయములు చేసే కలరవాల (కలకల ధ్వనుల) ఉద్ధతిని ధురము (మోస్తున్నది) మానస సరోవరం అని ఒక అర్థం అలాగే జలచర ఆహారాన్ని వేటాడుతూన్న జలచర పక్షులు కలిగి వుండడమే కాక, కలరవములు (పారావతములు; పావురములు) ఉద్ధత (గర్వంగా) చేస్తూన్న కలకల రవాలతో నిండినట్టిది అనే అర్థంకూడా చెప్పుకోవచ్చు. సుర (దేవతలకూ) మునీశులకూ (ఋషులకూ) , క్షమాసురులకూ (భూసురులైన బ్రాహ్మణులకూ) కూడా దుర్లభమైనట్టి ముక్తిమౌక్తిక (ముక్తి అనే ముత్యముల యొక్క) సరవరంబు (శ్రేష్ఠమైన దండ). అంటే మానస సరోవరం అత్యంత దుర్లభమైనట్టి ముక్తి అనే ముత్యాలతో కూర్చబడిన ముత్యాలసరమట. అక్కడికి చేరిన వారికి ముక్తి మెడలోని ముత్యాలదండగా లభిస్తుందన్నమాట! కమనీయమైన మకరందం (తేనె) కలిగిన కమల (తామరల) కైరవ (తెల్ల కలువల) బృందా (సమూహము)లతో నిండినదీ; పరిలసత్ (ఆ ప్రాంతంలో - ఆ తేనె కోసం - ఆడుతూ, నృత్యం చేస్తూన్న) రోలంబ పరికరము (తుమ్మెదల సమూహము) కలదిగానూ వున్నదట ఘటిత (కూర్చబడిన) కిసలయము (చిగురుటాకు)లా అన్నట్లున్న జటా (జటాజూటములతో) నిటల పటలముల (నుదుటి బొట్ల)తోనున్న ఫాల భాగముపై తిలకిత (వ్రాసుకొనబడిన) శశిసిత (చంద్రుని వంటి తెల్లనైన) భసితము (బూడిద) కలిగివుండి రసిత (ఆస్వాదించి రుచిచూచుటకై) లసిత (అక్కడక్కడే ఆడుతూన్న) పరమ సమాధిమత్ విసర (పరమ యోగుల సమూహములకు) రుచిర (ఒప్పిదమైన) రస ఝరభరంబు (తేనె ఊటలతో కూడినట్టిదిగా; 'ఝర' అంటే ప్రవాహం అనే అర్థంతో పాటు ఊట (*Spring or cascade*) అనే అర్థమూ వుంది) మానససరంబు - మానససరోవరము పొల్చు - పొలుచు - కనబడుతూన్నదట.

హిమాలయాలలోని 'మానస సరోవరం' ఒకప్పటి అఖండ భారతంలోనిదే అయినప్పటికీ, ప్రస్తుతం యిది చైనా ఆక్రమించిన టిబెట్ భూభాగంలో వుంది కైలాస పర్వతానికి సమీపంలోనిదైన యీ సరోవరం అతి విశాలమైనదీ, స్వచ్ఛ జలపరిపూర్ణమైనదీనని ప్రసిద్ధి హిమాలయ పర్వతాలు సమస్తం - ప్రత్యేకించి మేరుపర్వతం (కైలాసగిరి) మరియు మానస సరోవరం దేవతలకు ఉనికిపట్లుగా ప్రసిద్ధికెక్కాయి 'దేవా' అంటే వెలుగొందే శరీరం (తెల్లని మేనిచాయ) కలవారు అని అర్థం. ఈ అర్థంలో దేవతలంటే - మనం తెల్లని శరీరం కలిగిన ఓ జాతివారుగా భావించవచ్చు ఈ మానససరోవరం ఆ జాతివారికి నివాస స్థలమన్నమాట అనాదిగా భారతీయులకు కైలాస పర్వతం మరియు మానస సరోవరం అతి పవిత్ర స్థలాలుగా వుంటూ వస్తున్నాయి. తాపసులకూ, పరమ యోగులకూ మానస సరస్సును చేరడం జీవిత లక్ష్యం ఈ సరస్సు చుట్టూ ఒక్కసారి పరిక్రమించడం (ప్రదక్షిణ చేయడం) ముక్తిదాయకమని వారు భావిస్తారు మానససరోవరం హంసల (*Swans*) కు కూడా ఉనికిపట్టు ప్రతి సంవత్సరం వర్షాకాల ప్రారంభంలో హంసలు పునరుత్పత్తి (*Breeding*) కోసం మందలు మందలుగా యీ సరస్సీరానికి వలస వస్తాయట హంస బ్రహ్మకు వాహనమవడం కారణంగానేనేమో ఈర్ష్యాద్వేషాలను జయించి బ్రహ్మ యందు (భగవంతుని యందు) మనస్సును లగ్నం చేసిన పరిశుద్ధ భాగవతుడిని కూడా 'హంస' అని అంటారు. 'పరమహంస' అంటే పరమ భాగవతోత్తముడు ఒకప్పుడు అఖండ భారతదేశంలో భాగంగావున్న యీ మానససరోవరానికి తీర్థయాత్రికులు, మునులు తండోపతండాలుగా వెళ్లేవారు. అయితే చైనా దండయాత్ర అనంతరం 1962-1981 మధ్యకాలంలో చైనా ప్రభుత్వం యీ యాత్రలను నిషేధించింది. 1981లో చైనా ప్రభుత్వంతో కుదిరిన

ఓ ఒప్పందం ప్రకారం 'చైనా వీసా'తో ప్రతి సంవత్సరం కొద్ది మంది యాత్రికులను బృందాలుగా మానస సరోవరయాత్రకు అనుమతిస్తున్నారు

ప్రపంచంలోని ఏ ప్రాంతంలోనైనా ప్రాచీన మానవులు తాము చూసిన, తమకు తెలిసినంత మేరలో అతి ఎత్తైన ప్రదేశమే స్వర్గమని భావించారు ప్రాచీన గ్రీకులు మౌంట్ ఒలింపస్ *(Mount Olympus)* ను స్వర్గమని భావించేవారు ఈశాన్య గ్రీసులో థెస్సలీ మరియు మాసిడోనియాలకు సరిహద్దుగా వున్న యీ పర్వతం సముద్ర మట్టాన్నుంచి 9,730 అడుగుల ఎత్తున వుంది గ్రీకు వారు తమ ప్రధాన దేవతలైన జీయస్ *(Zeus)*, హీరా *(Hera)* హీలియోస్ *(Helios)* ఈరోస్ *(Eros)* డయోనీసస్ *(Dionysus)* ఎథీనా *(Athena)* అపోలో *(Apollo)* యాఫ్రొడైట్ *(Aphrodite)* వగైరాలంతా ఒలింపస్ పర్వతం పైనే వుండేవారని విశ్వసించారు

అలాగే ప్రాచీన రోమన్‌లు రోమ్‌లోని కాపిటలిన్ *(Capitoline)* అనే పర్వతమూ, దాని పరిసరాలలోని ఆరు పర్వతాలే తమ దేవతలకు ఆలవాలమైన స్వర్గమని భావించారు. (ఈ ఏడు పర్వతాల పైనే ప్రాచీన రోమ్ నగరం నిర్మించబడింది ) రోమన్‌లు తమ ప్రధాన దేవతలైన జూపిటర్ *(Jupiter)* జూనో *(Juno)* సోల్ *(Sol)*, క్యూపిడ్ *(Cupid)* మినర్వా *(Minerva)* వీనస్ *(Venus)* వగైరాలంతా అక్కడే నివసిస్తారని నమ్మేవారు. స్వర్గాన్ని చేరుకోవాలనో లేక స్వర్గాన్ని తలదన్నేటంత ఎత్తైన భవనాన్ని నిర్మించాలనో చేసిన ప్రయత్నం మనకు బైబిల్ పాత నిబంధనావళిలోని బెబెల్ టవర్ *(Tower of Bebel)* నిర్మాణంలో ద్యోతకమౌతుంది *(Genesis 11-4-9)*

ప్రాచీన భారతీయులు కూడా మానస సరోవరం, కైలాస పర్వతం మరియు ఆ పరిసర ప్రాంతాలే దేవతలకు ఆవాసాలని భావించారు ప్రపంచానికి పైకప్పు *(Roof of the World)* గా ప్రసిద్ధిగాంచిన టిబెట్‌లోనే ఈ మానస సరోవరం, కైలాస పర్వతం వున్నాయి మేరు పర్వతమే కైలాస పర్వతమని నిర్ధారించబడినది. మానస సరోవరం మరియు దాని పరిసర ప్రాంతాలు దేవతల నివాస స్థలంగా మన ప్రాచీనులు భావించడమే కాక, అక్కడికి కనీసం జీవితంలో ఒక్కసారన్నా వెళ్లిన వారు ముక్తి పొందుతారని భావించారు అందుకే ముముక్షువులంతా ఎంత కష్టమైనా సరే మానస సరోవరానికి వెళ్లాలని ప్రయత్నించేవారు. 'దేవాః' అంటే సంస్కృతంలో వెలుగొందే మేనిచాయ కలవారు అని అర్థమని చెప్పుకున్నాం కదా! మనం ఉత్తరానికి వెళ్తున్న కొద్దీ అంతకంతకూ ఎత్తుకు వెళ్లి చివరిగా ప్రపంచంలోనే ఎత్తైన ప్రాంతంలో వున్న మానస సరోవరానికి చేరతాం ఉత్తర దిశగా ప్రయాణిస్తున్న కొద్దీ వెలుగొందే మేనిచాయ కలవారు మనకు తటస్థిస్తుంటారు పైకి వెళ్లే కొద్దీ వారి సంఖ్య, మేని కాంతి కూడా పెరుగుతూ పోతుంది వారే మన ప్రాచీన సాహిత్యంలో చెప్పబడిన దేవతలు శాస్త్రీయంగా ఆలోచిస్తే దేవతలను ఏవో అతీంద్రియ శక్తులు, మహిమలు కలవారిలా కాక వెలుగొందే మేనిచాయ గల ఓ జాతి వారని మనం భావించాల్సి వుంటుంది కైలాస శిఖరంపై నివసించే శివుడు తెల్లని మేనిచాయ కలవాడని పురాణాలు వర్ణించాయి ఆయన ఆది దేవుడు రామకృష్ణ కవి 'ఉద్భటారాధ్య చరిత్రము' లో శివుడిని ఆదిమ భిల్లుడనీ, మంచుమల అల్లుడనీ కడు సమంజసంగా పేర్కొన్నాడు. (ఉ చ. 2-113). భిల్లజాతి అత్యంత ఆదిమ జాతులలో ఒకటి. శివుడు ఆదిమ భిల్లుడంటే ఆయన ఆ అత్యంత ఆదిమ జాతికి కూడా మూలపురుషుడన్నమాట కాల క్రమేణా దేవగణంలోకి కొందరు నల్లని మేనిచాయ కలవారు కూడా ఆ తరువాత ప్రవేశించి వుంటారు అంతేకాదు. క్రమేణా వివిధ జాతుల ప్రజల కలయికతో మన దేవతా గణంలోకి ఆ యా జాతుల దేవతలు కూడా ప్రవేశించారు దేవతలకు ఎన్నెన్నో మహిమలు ఆపాదించబడ్డాయి. వారిపై ఎన్నెన్నో కథలు అల్లబడ్డాయి వారికి వింత వింత రూపాలు కట్టబెట్టబడ్డాయి. వారంతా వివిధ జాతులకు చెందిన మానవులే అయినా, అతీంద్రియ శక్తులు కలిగిన దేవతలుగా వారు భావించబడ్డారు. కొన్ని వాస్తవ గాథల పునాదిపై పుక్కిటి పురాణాలు పుట్టుకొచ్చాయి. ప్రాచీన గ్రీకుల ఒలింపస్ పర్వతము, ప్రాచీన రోమన్‌ల కాపిటలిన్‌లా ప్రాచీన భారతీయులు మానస సరోవరాన్నీ, దాని పరిసరాలను దేవతలకు ఆలవాలమైన స్వర్గంగా భావించారు. అందుకే ముక్తి కోరే వారందరూ అక్కడికి వెళ్లి తీరాలని ఉబలాట పడ్డారు. ఎముకలు కొరికే చలిలో, మంచు తుపానులను తట్టుకుంటూ, ప్రమాదకరమైన నదులనూ, హిమానీ నదాలనూ దాటుకుంటూ అక్కడికి చేరుకొనడం అంత సులువేమీ కాదు కనుక ఆ ప్రయత్నంలో మరణించిన వారూ జీవితంలో పుణ్య కార్యాలు చేసి మరణించిన వారిలా తప్పక స్వర్గానికి చేరతారనే విశ్వాసం ఏర్పడింది. ఆ స్వర్గానికి చేరడం అసాధ్యం కాకున్నా దుస్సాధ్యం. రామకృష్ణ కవి అందుకే మానస సరోవరాన్ని ముముక్షువులకు దుర్లభమైన ముక్తి అనే ముత్యాల సరమని పేర్కొన్నాడు.

# భృగ్వాశ్రమ వర్ణన

పుణ్య జనులతో ఎప్పుడూ కిటకిటలాడే ఆ మానస సరస్సు తీరంలో సకల దేవర్షి సముదాయాలకూ ఆధారమనదగిన భృగుమహర్షి ఆశ్రమం వుంది. ఆ ఆశ్రమ ప్రాంగణాన్ని అడవి మృగాలూ, పక్షులూ సైతం తమ స్వంతదిగా భావిస్తాయట తమ వాలములే (తోకలే) చీపుళ్లుగా చమరీమృగాలు ఆశ్రమ ఆవరణనంతా సమ్మార్జనము (ఊడ్చుట) చేస్తాయట. కలభములు (గున్న ఏనుగులు) తమ తుండాలతో తీర్థకుండోదకాల్ని పీల్చి ఆ ప్రాంతమంతా కలయంపి చల్లుతున్నాయట. (కలయంపి అంటే కలాపి. ఇప్పుడు మనం యిండ్ల ముందు పేడకలాపినో, వట్టి నీటినో చల్లుతున్నాం. ప్రాచీనకాలంలో దుమ్ము అణగడానికేకాక, సుగంధం కోసం కస్తూరి, చందనం మొదలైన ద్రవ్యాలను నీటిలో కలిపి యిండ్ల ముందు కలాపిగా చల్లేవారట). పచ్చి కస్తూరిని అసలు (అదుసు)లో కలిపి భల్లూకములు (ఎలుగుబంట్లు) ఆశ్రమప్రాంతమంతా అలుకుతున్నాయట ఏనుగుల కుంభస్థలాలలోని ముత్యాలు తెచ్చి శుకములు (చిలుకలు) ముత్యాల రంగవల్లికలు (ముగ్గులు) తీర్చిదిద్దుతున్నాయట

శుకములు ప్రామినుకులు (వేదములు) గుణిస్తాయట (వల్లిస్తాయట). శారికలు (గోరువంకలు) ధర్మ మర్మాల్ని తెలిపే యితిహాస కథలను ఈరికలుగొను (మొలకలువేసే) మనీష (ప్రజ్ఞ)తో గణిస్తాయట. పికములు (కోకిలలు) భాషావిశేష కళా శాస్త్రములపై ఉపన్యసిస్తాయట. అళులు (తుమ్మెదలు) సాత్రాజితీ ప్రాణనాయక నామాళిని (సత్రాజిత్తు కుమార్తెయైన సత్యభామ యొక్క ప్రాణనాథుడు - కృష్ణుని యొక్క - అంటే విష్ణువు యొక్క సహస్ర నామాలను) గీతికా చాతుర్యంతో పఠిస్తున్నాయట.

ఆ ఆశ్రమంలోని మునిబాలకులు ఫలదళాదులకోసం (పండ్లు, ఆకులు వగైరాల కోసం) ఎండనబడి అడవంతా తిరుగుతూంటే అహీంద్రములు (శ్రేష్ఠమైన పాములు) వచ్చి తమ పడగలువిప్పి ఆ ముని బాలకులపై ఎండ పడకుండా చాటు చేస్తున్నాయట. అప్పుడు నెమ్మిలు (నెమళ్లు) వచ్చి 'ఈ స్వాములకు మేమొనరించిన నేరమేమిటి? మమ్మల్ని కూడా సాయపడనివ్వవచ్చు కదా!' అంటూ ఒక ప్రక్కన నిల్చి నీడగా పురివిప్పుతాయట.

మ॥ పులులేడున్ మృగశాబకంబుల హరుల్ పోషించు నత్యాదృతిన్
కలభానీకముఁ గాకముల్ మెలఁగు ఘూకశ్రేణితోఁ బిల్లు లె
ల్కలఁగాచున్ శిఖికోటి లేఁజిలువలన్ లాలించు నుత్ఫుల్ల బ
ర్హ లసచ్ఛాయల నుంచి యచ్చటి యరణ్యానీ ప్రదేశంబులన్. (ఘటికాచల మాహాత్మ్యము1-11)

పులులు మృగ శాబకములను (జింక పిల్లలను) ఏదుతాయట (రక్షిస్తాయట). హరులు (సింహాలు) అత్యంత ఆదృతితో (ఆదరణతో) కలభానీకములను (గున్న ఏనుగుల సమూహాలను) పోషిస్తాయట. కాకములు (కాకులు) ఘూక శ్రేణితో (గుడ్లగూబ మందలతో) కలసిమెలసి జీవిస్తాయట. పిల్లులు ఎలుకలను రక్షిస్తాయట. శిఖికోటి (నెమళ్ల సమూహములు) లేజిలువలను (లేత చిలువలను - అంటే పాము పిల్లలను) తమ ఉత్ఫుల్ల బర్హ లసచ్ఛాయలలో (బాగుగా విప్పిన తమ పురుల నీడల్లో) వుంచి లాలిస్తాయట - సాధారణంగా పరస్పర శతృత్వమున్న జంతుకోటి అచ్చటి అరణ్య ప్రదేశములలో ప్రేమతో సహజీవనం చేస్తాయన్నమాట. జింక పిల్లలు పులుల ఆహారం; ఏనుగులు సింహాల ఆహారం; ఎలుకలు పిల్లుల ఆహారం; పాములు నెమళ్ల ఆహారం; గుడ్ల గూబలు కాకుల ఆహారం కాకున్నా ఆ రెంటికీ బద్ధవైరం. అందుకే గుడ్లగూబకు వాయసారాతి (కాకికి శతృవు) అని పేరు. దానికి ఉలూకమని మరోపేరు. ఉలూకమంటే కంటి తేజస్సుతో కాకులను

దహించేది అని అర్థం - అమర కోశము. దానికే 'పేచకము' అని మరోపేరు (అంటే కాకులను హింసించేది అని అర్థం). ఎందుకో మరి తెలియదుగానీ, ఇలా కాకులకూ, గుడ్లగూబలకూ ఎడతెగని శతృత్వం. పరస్పరం బద్ధవైరంతో వుండే యీ జాతులన్నీ ఆ అరణ్యంలో మాత్రం కలసి మెలసి జీవిస్తాయట.

మునులు చేసే హోమాల నిర్వహణలో హోమగుండాల నుంచి వెలువడే ధూమము విబుధ వధూటీ జనముల (దేవతా స్త్రీల) నెఱి ముంగురులకు సాంబ్రాణి ధూపంలా వుండట. హోమాలలో వేల్చే నెయ్యి, సుగంధ ద్రవ్యాలతో కూడిన హోమద్రవ్యాల కారణంగా అందునుంచి వెలువడే ధూమము సాంబ్రాణి ధూపంలా సువాసనలతో నిండివుంటుంది. అయితే అది పైకి వెళ్తుంది కనుక పైనున్న దేవతాస్త్రీల కురులకు సాంబ్రాణి ధూపంలా వుందనడం కవి చమత్కృతి. (స్త్రీలు జుట్టుతడి ఆరడానికి, శిరోజాల పరిమళం కోసము అభ్యంగన స్నానం తరువాత సాంబ్రాణితో పొగ వేసుకుంటారు).

సీ॥ మొకరి తేఁటులు మూతిముట్టవు తేనియల్
శ్రీమధుశాసి కర్పించిగాని
కోకిలమ్ములు చివురాకులు గొఱకవు
శ్రీవనమాలి కర్పించిగాని
లేఁబచ్చికల్ గబళింపవు హరిణముల్
శ్రీ నీలమూర్తి కర్పించిగాని
ఫలభుజిక్రియలకుఁ జిలుకలు దలపవు
శ్రీ మాధవునకు నర్పించిగాని
యితర జంతువులును హరి మతిఁదలంచి
గాని యే వర్తనములకుఁ బూనవనిన
నా తపోవన మాహాత్మ్య మభినుతింప
నలవియే వేమొగమ్ముల చిలువకైన. (ఘటికాచల మాహాత్మ్యము 1-13)

ఈ పద్యం యింతకు ముందెక్కడో విన్నట్లుగా వుందే - అనుకుంటున్నారా? మన కవే వైష్ణవునిగా మారకముందు - అంటే రామలింగ కవిగా వ్రాసిన 'ఉద్భటారాధ్య చరిత్రము' లోని 'అచలసుతాభర్త కర్పించి మఱికాని మృగములు లేఁ బూరి మేయవచట' (1-54) అనే పద్యంలో శివుని స్థానంలో విష్ణువునుంచితే యీ పద్యం తయారవుతుంది. కొద్దిగా భాషలో మార్పులు చేర్పులు చేసి అదే పద్యాన్ని తిరిగి యీ కావ్యంలో విష్ణువు పరంగా ఉపయోగించుకున్నాడు మన రామకృష్ణకవి. ఆయన కత్తికి రెండువైపులా పదునే!

మొకరి తేఁటులు - తుమ్మెదలు ఎప్పుడూ రొదచేస్తూ ఊగుతూ తిరుగుతుంటాయి. అందుకే వాటిని మొకరి తేఁటులంటారు. మధుశాసి - మధుసూదనుడు - 'మధు' అనే రాక్షసుని సంహరించినవాడు - విష్ణువు. అక్కడి తుమ్మెదలు విష్ణువు కర్పించిగాని తేనెలను మూతిముట్టవట. వనమాలి - అడవి పూలూ, ఆకులూ చేర్చి కట్టిన 'తోమాల' లేక 'తోమాలె' లేక 'తోమాలియ'ను 'వనమాల' అంటారు. శ్రీ కృష్ణుడెప్పుడూ అలాంటి వనమాలను ధరించేవాడు కనుక ఆయన్ని 'వనమాలి' అంటారు. శ్రీనీలమూర్తి - నల్లని దేహచాయ కలవాడు - విష్ణువు లేక కృష్ణుడు; మాధవః - మాయాః లక్ష్మ్యాః ధవః - లక్ష్మీదేవి భర్త - విష్ణువు; 'మాయ' అనేది లక్ష్మీదేవి మారుపేరు; చిలువ అంటే సర్పము. ఆ తపోవన మాహాత్మ్య

ృన్ని వేనోళ్ల పొగడడానికి మన కవి 'వేమొగమ్ముల చిలువ' (వేయితలల - వేయినోళ్ల - శేషనాగు)కు కూడా సాధ్యం కాదని చెప్తున్నాడు చిత్రంగా. శేషుడు, ఆదిశేషుడు, శేషనాగు అని పిలువబడే మహాసర్పం తన తలపై భూమిని మోస్తున్నదనీ, ఆ శేషుడు చుట్టలు చుట్టుకొనగా, దానిపై అదే పాన్పుగా (శేషపాన్పు) శ్రీమహావిష్ణువు శయనిస్తాడనీ పూర్వుల విశ్వాసం.

అంతటి మహత్తరమైన ఆశ్రమంలో భృగు మహర్షి తన తాపసబృందంతో జీవిస్తున్నాడట.

## భృగు మహర్షి

మన పురాణాల ప్రకారం భృగు మహర్షి చాల గొప్పవాడు. పురాణ సాహిత్యంలో ఇదే పేరుతో యిద్దరు ముగ్గురున్నట్లు కనుపిస్తుంది. వీరు వేర్వేరు దేశకాలాలకు చెందిన వారనిపిస్తున్నది. భృగుమహర్షి బ్రహ్మ మానసపుత్రులలో ఒకడట. భాగీరథీనదీ తీరంలో యాయన ఆశ్రమం వుండేదట. ఈయన ఒక మనుమడు రాక్షస గురువైన శుక్రాచార్యుడు కాగా, వేరొక మనుమడు మృకండుడు (ప్రసిద్ధ శివభక్తుడూ, మృత్యుంజయుడూ నైన మార్కండేయుడు మృకండుని కుమారుడే). భృగువు మీసాలను దక్షయజ్ఞం సందర్భంలో వీరభద్రుడు పెరికివేశాడట. 'అగ్ని'ని సర్వభక్షకుడవు కమ్మని శపించిందీయనేనట. ఈయన శాపం కారణంగానే విష్ణువు మానవలోకంలో రాముడై జన్మించి భార్యావియోగంతో మరణించాడంటారు. తొట్టతొలి మనువు సృష్టించిన పదిమంది ఆదిపురుషులు (*Patriarchs*) లో యీయనొకడు. జ్వాలలతో బాటు సృష్టించబడ్డాడు కనుక యీయన కాపేరు వచ్చింది – "సహజ్వాలాభిరుత్పన్నో భృగుస్తస్మాద్ భృగుః స్మృతః ।" (ఇతడు వరుణుడు చేసిన యజ్ఞంలో విఖనసుడు, అత్రి, అంగిరసుడు మొదలగువారితో బాటు యాగాగ్ని నుండి పుట్టాడని ఓ గాథ). వైఖానసుల మూలపురుషుడైన విఖనసుడి కితడు ప్రథమ శిష్యుడట.

ఒకప్పుడు మహర్షులకు బ్రహ్మ, శివుడు, విష్ణువులలో అత్యంత ప్రభావశాలియైన సత్పురుషుడు, బ్రాహ్మణులకు పూజనీయుడూ ఎవరనే విషయంపై చర్చవచ్చి, వారు భృగు మహర్షిని తమ ప్రతినిధిగా ఎన్నుకొని, త్రిమూర్తుల శీలాన్నీ, సత్ప్రవర్తననూ పరీక్షించే బాధ్యతను ఆయన కప్పగించారు. ముందుగా భృగుమహర్షి బ్రహ్మ నివాసమైన సత్యలోకానికి వెళ్లాడట. అక్కడ సరస్వతీదేవి వీణావాదనాన్ని ఆలకించడంలో లీనమై పరాకుగా వున్న బ్రహ్మ యీ మహర్షి ఆగమనాన్ని గమనించక, ఆయనకు అభివాదం చేయలేదట. దాంతో కోపించిన భృగు మహర్షి బ్రహ్మకు ఎక్కడా పూజార్హత వుండదని శపించాడట. అందుకే బ్రహ్మకు దేవాలయాలు చాల అరుదట. గుంటూరుజిల్లా చేబ్రోలులో అలాంటి అరుదైన నవ బ్రహ్మాలయం ఒకటి వుంది. ('కథా సరిత్సాగరా'న్ననుసరించి శివుడిని దురాశతో గొంతెమ్మ కోరికలు కోరాదని కోపించి శివుడు బ్రహ్మకు పూజార్హత ఉండరాదని శపించాడు. ఇంకో ఐతిహ్యాన్ని అనుసరించి ఒకప్పుడు వివాహం చేసుకుని సంతానాన్ని సృష్టించమని నారదుడిని ఆయన తండ్రి బ్రహ్మ వత్తిడి చేశాడట. నారదుడు అందుకు నిరాకరించి హరి పాదసేవే తన జీవిత పరమ లక్ష్యమనీ, తనకు సంసార వాంఛ లేదనీ చెప్పాడట. దీనికి బ్రహ్మ కోపించి నారదుడిని స్త్రీలోలుడవు కమ్మని శపించాడట. తండ్రి శాపానికి ప్రతిగా తానుకూడా బ్రహ్మకు ఎక్కడా పూజాదికములు లేకుండేటట్లు శపించాడట నారదుడు). తరువాత ఆయన శివుడిని పరీక్షించడానికి కైలాసం వెళ్లాడట. అక్కడ పార్వతీదేవితో కలసి ఏకాంత సేవలో వున్న శివుడు యీ మహర్షికి అసలు దర్శనమే యివ్వలేదట. దాంతో కినిసిన భృగుమహర్షి శివుడికి పార్వతితో కలసి పూజార్హత లేకుండా వుండేట్లుగానూ, తన నిజరూపంలో కాక లింగరూపంలో మాత్రమే శివుడు పూజింపబడేట్లూ శపించాడట. ఆ పిమ్మట శ్రీపతిని పరీక్షించడానికి భృగువు వైకుంఠానికి వెళితే, అక్కడ ఆదిలక్ష్మి తన పాదములు ఒత్తుతూ వుండగా శ్రీహరి సుఖంగా శేషపాన్పుపై నిదురిస్తూ వున్నాడట. దాంతో ఉగ్రుడైన భృగుమహర్షి తన కాలితో విష్ణువు వక్షంపైన ఎగిరి తన్నాడట. ఉలిక్కిపడిలేచిన విష్ణువు ఏమాత్రం కోపగించుకోకుండా 'కఠినమైన తన వక్షాన్ని తాకి ఆ మహర్షి సున్నితమైన పాదం నొచ్చుకున్నదేమో'నని ఆ పాదాన్ని సుతిమెత్తగా పిసికాడట. (భృగుమహర్షి పాదంలో వున్న ఒక కన్ను కారణంగానే ఆయనకు అంతటి కోపమూ, అహంకారమూననీ, ఆయన పాదం పిసికే సందర్భంగా విష్ణువు తెలివిగా ఆ కంటిని చిదిమివేసి భృగువు కోపాన్నీ, అహంకారాన్నీ హరించి, ఆయనకు జ్ఞానోదయం కలిగించాడనీ అంటారు. ఈ కథలోని సత్యాసత్యాలనటుంచితే, తనను వక్షంపై తన్నిన వ్యక్తికే పాదసేవ చేయడం ద్వారా విష్ణువు భృగుమహర్షి మనస్సును జయించాడు.)

దీంతో త్రిమూర్తులలో విష్ణువే అత్యంత ప్రభావశాలి, బలసంపన్నుడు, దయార్ద్ర హృదయుడూననీ, అందరి పూజలూ అందుకొనడానికి విష్ణువొక్కడే తగినవాడనీ ప్రకటించాడు భృగుమహర్షి.

అగ్ని నుంచి భృగువు పుట్టాడనడం శాస్త్రీయంగా లేదు. ఇంతటి కోపం కలిగి, అందరినీ తన శాపానలాలకు గురిచేసినవాడు కనుక ఆ కోపాగ్నికి ప్రతీకగా ఆయనకాపేరు వచ్చి వుంటుంది. అన్నట్లు భృగుమహర్షి వంశీయుడే 'జమదగ్ని' కూడా. ఆయనకు భృగువనే మరో పేరుంది. రుచికుని కుమారుడైన జమదగ్ని కూడా అతికోపిష్టివాడు. ఆయన కుమారుడు పరశురాముడు సరేసరి. భృగువు కొడుకు కనుక ఆయన్ని భార్గవరాముడు అనీ అంటారు. ఆగ్రహోదగ్రునిగా ఆయన ప్రసిద్ధికెక్కినవాడు. ఇలా భృగుమహర్షి వంశం కోపానికి ప్రసిద్ధి చెందినదిగా కనుపిస్తుంది.

# భృగుమహర్షి చెదరని దీక్ష

ఆ భృగుమహర్షి ఎంతో నియమనిష్ఠలతో శ్రీహరిని పూజిస్తున్నాడట. ఆయన తన పంచేంద్రియాలను చెదరనీయకుండా విష్ణుపూజలు నిర్వహిస్తున్నాడని వివరించడానికి కవి మనకో చక్కని పద్యం చెప్పాడు.

సీ॥ కటికి యెండల కాఁకఁ గరఁగి గుబాళించు
గోవ జవ్వాజి నెత్తావులకును
కమ్మతమ్ములతావి కానుక సేయుచు
సొలయు చల్లని గాలి సోకులకును
వట్టివ్రాకుల ననల్ పుట్టింప జాలిన
కిన్నరయువతి సంగీతములకు
బిస కాండములుమేసి కొసరుచుఁ బల్కు జ
క్కవకవ కలయిక కాన్పులకును
కలికి పల్కుల రాచిల్క గముల మధుర
మేదుర రసాలఫల రసాస్వాదములకుఁ
జెదరనీయక యింద్రియ శ్రేణి నిలిపి
యతఁడు శ్రీహరి భజియించు నవసరమున. (ఘటికాచల మాహాత్మ్యము 1-15)

జ్ఞానేంద్రియాలు ఐదు. ఘ్రాణేంద్రియము (వాసన తెలిపేది – ముక్కు - *olfactory sense*); త్వగింద్రియము లేక స్పర్శేంద్రియము (స్పర్శ లేక తాకుడు తెలిపేది – చర్మము - *tactual sense*); శ్రోత్రేంద్రియము లేక శ్రవణేంద్రియము (శబ్దము తెలిపేది – చెవి - *Auditory or hearing sense*); చక్షురింద్రియము (దృష్టిని తెలిపేది – కన్ను - *visual sense*); రసనేంద్రియము (రుచిని తెలిపేది – నాలుక - *the sense of taste*). పంచ జ్ఞానేంద్రియములు, మనస్సులను కలిపి 'షడాయతనములు' అంటారు. యోగికి యింద్రియ నిగ్రహం అత్యంత ఆవశ్యకం. అందచేతనే పతంజలి తన 'యోగ సూత్రాల'లో పేర్కొన్న అష్టాంగములలో ప్రత్యాహారము (ఇంద్రియాలను వాటి విషయముల నుండి దూరంచేయడం - *Removal of senses from sense objects*) నకు ఎంతో ప్రాధాన్యత యిచ్చాడు.

ఇక్కడ కవి భృగుమహర్షి ఎలా తన పంచేంద్రియ శ్రేణిని చెదరనీయకుండా దీక్షగా విష్ణుపూజలు చేస్తున్నాడో తెలిపాడు.

'కటికి' అంటే 'అధికము' అనే అర్థమూ వుంది. తీవ్రమైన ఎండల కాక (వేడి)కి కరిగి గుబాళించే గ్రొ (మనోజ్ఞమైన) జవ్వాజి నెత్తావులకు (పరిమళములకు). జవ్వాజి లేక సంకుమదము జవ్వాజిపిల్లి లేక సంకువు (*civet cat - civettictis civetta*) అనే మృగం నుంచి లభించే పరిమళ ద్రవ్యం. ఇది గ్రీజు (*grease*) లా మెత్తగానూ, పసుపుపచ్చగానూ, వాసనకు కస్తూ (*musk*) లాగానూ వుంటుంది. వేడెక్కిన కొద్దీ యిది కరిగి సువాసనలు వెదజల్లుతుంది. భృగుమహర్షి జవ్వాజి పరిమళములకు కూడా తన ఘ్రాణేంద్రియాన్ని చెదరనీయకుండా నిగ్రహంతో వున్నాడట. తమ్మి అంటే తామరపువ్వు. 'కమ్మ తమ్ముల తావి' అంటే కమ్మనైన సౌరభం కలిగిన తామర పూవుల సువాసనను వెంటబెట్టుకొని మెల్లగా వీచే చల్లగాలి సోకు (తాకిడి, స్పర్శ)కు తన త్వగింద్రియాన్ని చెదరనీయకుండా నిగ్రహంగా వున్నాడట.

'నన' అంటే పూవు, మొగ్గ, చిగురుటాకు అని అర్థాలు. మోడైపోయిన చెట్టే మ్రాకు (మానులకు కూడా చిగుళ్ళు పొడిపించగల కిన్నర యువతుల సంగీతములకు కూడా చెదరకుండా తన శ్రోత్రేంద్రియాన్ని సైతం నిగ్రహించుకున్నాడు.

మనుష్య శరీరం అశ్వముఖం కలిగిన దేవతలు కిన్నరలు. వీరు పులస్త్య బ్రహ్మ సంతానం. వీరి ప్రభువు యక్షుల అధిపతియైన కుబేరుడు. అందుకే ఆయన్ని 'కిన్నరేశుడు' అంటారు. గుర్రం శరీరం మనుష్య ముఖం కలిగిన దేవతలను కింపురుషులంటారు. వాళ్ళకీ కుబేరుడే అధిపతి. అందుకే ఆయన్ని 'కింపురుషేశ్వరుడు' అనీ అంటారు. యక్షులూ, కిన్నరలూ, కింపురుషులూ దేవతల వినోదం కోసం సంగీత నాట్యాల నందించేవారట. గుర్రం శరీరం - మనుష్య ముఖం కలిగిన కింపురుషులుగానీ, మనుష్య శరీరం - గుర్రం ముఖము కలిగిన కిన్నరలుగానీ కేవలం కవుల కల్పనలే. పాశ్చాత్య సాహిత్యంలోనూ కవులిలాంటి కల్పనాత్మక పాత్రలను సృష్టించారు. గ్రీకు పురాణాలలో క్రీటు దీవిలోని చిక్కుల చిట్టడివి (*Labyrinth*) లో థెసియస్ (*Theseus*) అనే వీరుడిచేత చంపబడిన మినోటార్ (*Minotaur*) ఎద్దు శరీరం మనుష్యముఖం కలిగిన వింత జంతువు. అలాగే రాశి చక్రం (*Zodiac*) లోని ధనూరాశి (*Sagittarius*) ని కూడా పాశ్చాత్యులు తల మొదలు గుర్రం శరీరము మరియు విల్లును ఎక్కుపెట్టిన మానవుడి శరీరం నడుమువరకు గల ఓ వింత జంతువు ఆకారంగా సృష్టించారు.

ప్రాచీన ఈజిప్షియన్లు యాన్యూబిస్ (*Anubis*) అనే దేవుడిని కూడా యిలాగే ఊహించుకున్నారు. ఆ దేవుడు మనుష్య శరీరం గుంటనక్క (*Jackal*) తల కలిగి వుంటాడట. ఆయన సమాధులకు అధిపతట. చనిపోయిన వారి గుండెల బరువు తూచడం, వారి పార్థివ శరీరాలు పాడవకుండా వాటికి నూనె పూయడం (*Embalming*) యీ దేవుడి పని. మృతుల ఆత్మలు ఒక శరీరం వదలి వేరొక శరీరంలోకి ప్రవేశిస్తాయనీ, తిరిగి కొన్నేళ్ళ అనంతరం మళ్ళీ అదే మానవుడి శరీరం వెతుక్కుంటూ వచ్చి, అందులోకి ప్రవేశిస్తాయని ఈజిప్షియన్లు నమ్మేవారు. ఈ ప్రక్రియనే ఆత్మ ప్రస్థానం లేక పరకాయ ప్రవేశం (*Metempsychosis*) అంటారు. క్రైస్తవులు దీనిని నమ్మరు. అయితే ప్రాచీన ఈజిప్షియన్లు మాత్రం వారి విశ్వాసానికి తగ్గట్టే వారి ఆత్మలు తిరిగి వచ్చే వరకు వారి పార్థివ శరీరం కుళ్ళి పాడవకుండా కొన్ని నూనెలు, రసాయనాలు, సుగంధ తైలముల (*Balsams*) తో దానికి పై పూత పూసి మృతునికి యిష్టమైన వస్తు సంచయంతో సహా సమాధి చేసేవారట. రాజులు, ధనవంతులు యిందుకోసం మరింత ఆడంబరంగా పెద్ద సమాధులను నిర్మించేవారట. అలా ప్రాచీన ఈజిప్టును పాలకులైన ఫారోలు (*Pharaoh*) నిర్మించిన బృహత్ సమాధులే పిరమిడ్లు (*Pyramids*). అలా ప్రాచీన ఈజిప్షియన్లు తమ సమాధులకు కాపలా కాసే నిమిత్తం యీ మనుష్య శరీరం, గుంటనక్క తల కల దేవుడిని సృష్టించుకున్నారన్నమాట.

అయితే యక్షజాతి మాత్రం కవి కల్పన కాదు. వారు సంగీతోపజీవులై తిరుగాడే ఓ సంచారజాతి (*Nomads*). వారి వివరాల కోసం యీ గ్రంథం యొక్క అనుబంధం-5 చూడండి.

బిసము అంటే తామర తీగ. బిస కాండము అంటే తామర తూడు. జక్కవ కవ అంటే చక్రవాక పక్షుల జంట. చక్రవాక పక్షులకు తామర తూళ్ళే ఆహారం. కాన్పులు అంటే చూపులు. తామర తూళ్ళు మేసిన జక్కవ పక్షుల జంట కొసరుచూ (విజృంభించుచూ) సంగమిస్తున్న దృశ్యం చూపరులకు కామోద్రేకాన్ని కలిగిస్తుంది. అయితే ఆ మహర్షి ఆ

దృశ్యాన్ని చూచికూడా చెదరకుండా తన చక్షురింద్రియానికి కళ్లెం వేశాడన్నమాట.

గమి అంటే సమూహము. కలికి అంటే మనోజ్ఞమైన ఆడది. కలికి పలుకులు అంటే మనోజ్ఞమైన పలుకులు. మనోజ్ఞంగా మాటలాడే రాచిలుకల సమూహములు మధుర మేదురమైన (తియ్యగా, నున్నగానున్న) రసాల ఫలాల (మామిడి పండ్ల) నుండి రసాస్వాదము చేస్తూంటే ఎవరికైనా నోరూరకపోదు. ఆ దృశ్యాన్ని చూచికూడా చలించకుండా ఆయన తన జిహ్వాచాపల్యాన్ని అణచుకుని, రసనేంద్రియానికి కళ్లెం వేశాడన్నమాట.

ఇలా తన జ్ఞానేంద్రియ శ్రేణిని భృగుమహర్షి అదుపులో వుంచుకున్నాడట - శ్రీహరిని పూజించే సందర్భములో.

## నారదుని రాక

సరిగ్గా అదే సమయంలో అక్కడికి నారదుడు వచ్చాడట. శరత్కాల మేఘంపై మెరిసే మెరుపుతీగల వంటి జటాజూటములతోనూ, కల్పకశాఖి (కల్పవృక్షము) యొక్క మంజరి (చిగిర్చిన లేతకొమ్మ)లా వున్న తన దాకేల (ఎడమ చేతిలో) మడి కమండలువుతోనూ, వెండికొండ అనబడే తెల్లని నిటల లోచన శైలతటముపై (ధవళగిరి - కైలాసగిరి తటముపై) మెరిసే నల్లని మేఘంలా నడుము చుట్టూ చుట్టుకున్న అజినము (చర్మము) మెరుస్తూండగా (అంటే ఆయన శరీరం తెల్లగానూ, అజినము నల్లగానూ వున్నాయన్న మాట), శ్రవమున (చెవికి) ఆకృతి దాల్చిన అక్షరాల వరుసా? అన్నట్లున్న స్ఫటికాక్షసరము (స్ఫటిక లక్షమాల)తోనూ, అనుక్షణం చేసే విష్ణునామ జపం కారణంగా వచ్చే కీర్తి వలన పవిత్రమైనట్టి మహత్తర వీణ - 'మహతి' మారుతాహతికి (గాలి దెబ్బకు) తనకుతానే మొఱయగా (మ్రోగగా) తనుకాంతి నిర్జిత పారదుండూ (తన శరీరపు కాంతితో పాదరసాన్ని కూడా జయించినవాడు; అంటే పాదరసపు కాంతి కంటే మించిన శరీరకాంతి కలవాడు) భక్తజన సస్య నారదుండు (భక్తజనులనే పంటలకు నారము - అంటే నీటిని - యిచ్చేవాడు) అయినట్టి నారదుడు అక్కడికి వచ్చాడట.

ఇలా వచ్చిన నారదుడికి ఆతిథ్యమిచ్చి భృగుమహర్షి ఆయనతో "మహాత్మా! పుష్కరము మొదలైన పుణ్యతీర్థముల మాహాత్మ్యములు, వైష్ణవ క్షేత్రముల విచిత్రచరిత్రలు, వైష్ణవోత్తముల పవిత్ర విశేష కథలు, నా దుష్కృతములు (పాపములు) తొలగేటట్లు నాకు వివరించండి. మీరిప్పుడు ఎక్కడి నుంచి యిక్కడకు వచ్చారో అది కూడా సెలవీయండి" అన్నాడు.

అప్పుడు నారదుడు తాను క్షీరసాగరములోని సామి నగరము (విష్ణువుకు నెలవైన వైకుంఠపురము) నుండి వచ్చానని చెపుతాడు. క్షీరసాగరాన్నీ, దానిలోని తెల్లదీవినీ (శ్వేత ద్వీపాన్నీ), దానిలోని వైకుంఠపురాన్నీ వర్ణిస్తాడు.

## క్షీరసాగర వర్ణన

శ్వేతద్వీపం క్షీరసాగరంలో వున్నదట. దానిలో వైకుంఠపురమున్నదట. అదే శ్రీహరి నివాసమట.

ఆ క్షీరసాగరము ఘనరత్నరాశికి ఆకరమట (గనియట). అది వియచ్చరమానినీ జనన నిదాన భూమి (అప్సరసల జనన మరణములకు ఆది కారణమైన స్థలము) అట. (క్షీరసాగర మథనం సందర్భంగా అందునుంచి అప్సరసలు పుట్టుకొచ్చారని నమ్మకం అలాగే మిగిలిన దేవతలందరి వలెనే అప్సరసల అంతిమ లక్ష్యం కూడా సారూప్య, సామీప్య మోక్షాల ద్వారా శ్రీహరిలో లయమవడానికి క్షీరసాగరాన్ని చేరుకొనడమే! అందుకే పాలసముద్రాన్ని అప్సరసల జనన నిదాన భూమి అంటున్నాడు కవి). సంతాన భూరుహ సమితికి (సంతానము వగైరా కల్పవృక్షములకు) నెలవట. నారాయణుడు యోగనిద్రలో పరుండే చోటట. వనజ వాసిని (ల÷ )కి పుట్టిల్లట. దేవతా విసరమునకు (సమూహమునకు) మహానసగృహమట (మహానస గృహము అంటే వంటిల్లు - పాలసముద్రం

చిలికితేనే అమృతం లభించింది. అదే దేవతలకు ఆహారం. అంచేత, క్షీరసాగరాన్ని దేవతల వంటిల్లు అంటున్నాడు కవి చమత్కారంగా). పాలసముద్రం ద్వీప సంతతికి పెనుప్రాపట (పెద్దదిక్కు; ఆశ్రయము. అంటే ఆ పాలసముద్రంలో ఎన్నో దీవులున్నాయన్నమాట. నదులకు ద్వీపవతులని మరో పేరు. ద్వీపాలు నదీ ప్రవాహంలో తేలుతూ వెళతాయని విశ్వసిస్తూ – నదులన్నీ సముద్రంలో సంగమిస్తాయి కనుక పాల సముద్రాన్ని ద్వీపసంతతికి పెనుప్రాపు అంటున్నాడు కవి.) పాలసముద్రం తరంగిణీ భామినీ మణులకు ప్రాణభర్తట. (తరంగిణులంటే నదులు. నదులనే స్త్రీలకు సముద్రుడు భర్త అని భావిస్తారు). పాలసముద్రం కలువ నెచ్చెలికానికి (కలువలకు మిత్రుడైన చంద్రునికి) కన్నతండ్రట. (క్షీరసాగర మథనంలో అందునుంచే చంద్రుడు పుట్టుకొచ్చాడని విశ్వాసం). అక్కడి సాలములు (వృక్షములు) హాటకము (బంగారము)లో హరినీల మణులు (ఇంద్రనీల మణులు) పొదిగారా అన్నట్లు ప్రదీప్తమై (వెలుగొందుతూ) వున్నాయట. అవన్నీ అమర సాలములట. (దేవవృక్షాలైన కల్పతరువులట); మందర కుధరము (మందర పర్వతము) వలె వున్నాయట అక్కడి సౌధతతులు (భవనముల వరుసలు); ఎటుచూచినా అక్కడ యోగి సంతతులేనట. ఎటు చూసినా కమలములూ (తామరలూ) కైరవములూ (తెల్లకలువలూ) గుబాళిస్తున్న అమృత సరోవరముల వితానము (సమూహము)లట. ఎల్లెడలా సుర విమానములట (దేవతలు విహరించే విమానములట). ఎటు చూసినా నిండు పున్నమి చంద్రుని వంటి ముఖాలతో వెలిగిపోయే స్త్రీ జనులట. ఏ ప్రక్కచూసినా మణి మందిరాలేనట. అక్కడి అరణ్యాలు మహిత వనులట (మహత్తు కలిగినవట); ఎందుకంటే అవి సతత కిసలయ సుమఫల సహితాలట (ఎల్లప్పుడూ చిగుళ్లూ, పూలూ, పండ్లూ కలిగినవట) అక్కడ నిత్యమూ వసంతమేనన్నమాట! ఆ వైకుంఠపురము శాశ్వతంగా అపవర్గము (మోక్షము) లభించేందుకు యోగ్యమైన భాగ్య నికరమట (భాగ్య రాశియట).

ఇక్కడ కవి వైకుంఠపురంలో ఎక్కడ చూసినా విష్ణువులేనంటున్నాడు. మనం లోగడ చెప్పుకున్నట్లే సారూప్య మోక్షం పొందిన భాగవతులు సాక్షాత్తూ విష్ణు స్వరూపాన్నే పొంది, ఆయన సామీప్యాన్ని (సామీప్య మోక్షం) పొందడం కారణంగా వైకుంఠపురిలో ఎందరో విష్ణువులుండడం సాధ్యపడింది.

అక్కడ నునుగాలి దూది పానుపు లెన్నున్నాయో గానీ, అందరూ శయనీకృతాహివరులేనట (అహివరుడు అంటే శేషుడిని తల్పంగా చేసుకున్న వారేనట). సురలోకవాహి నిర్ఝరములు (అంటే దివిజ గంగలు) అక్కడ ఎన్ని వున్నాయోగానీ, అక్కడివారందరూ దివ్య తీర్థాంబుపదులేనట (అంటే – విష్ణువులా – దివ్య తీర్థముల నీటితో కాళ్లు కడుగబడిన వారేనట). అక్కడ నీటిలో పుట్టిన మాణిక్యాలు ఎన్ని వున్నాయోగానీ, అందరూ (విష్ణువులా) కౌస్తుభ మణిని ధరించిన వారేనట. మరి అక్కడ చలివెలుగుల సాములు (చంద్రులు) వేడివెలుగుల సాములు (సూర్యులు) ఎందరున్నారోగానీ, అందరూ (విష్ణువులా) యిందు కంజాప్తదృశులేనట (చంద్రుడు, సూర్యుడు కళ్లుగా కలిగినవారు. విష్ణువుకు ఒక కన్ను చంద్రుడూ, మరోకన్ను సూర్యుడూనని విశ్వాసం. కంజము అంటే తామర. కంజాప్తుడు అంటే సూర్యుడు). అక్కడ ఖగకులాధీశులు (పక్షిరాజైన గరుత్మంతులు) ఎందరున్నారోకానీ, అందరూ (విష్ణువులా) పుల్గురాటెక్కియములవారేనట (గరుడధ్వజము కలిగినవారేనట). ఇలా నారుపోసిన రీతిగా (అంటే అసంఖ్యాకంగా) వున్నారట ఆ నగరిలో కాపురమున్న ధీరులు.

ఇలా వర్ణించిన పిదప నారదుడు, "ఆ నగరిలోని ఓ కేళికా మణిగృహములో ఇందిరా సరసిజాననను (పద్మముల వంటి కళ్లు కలిగిన లక్ష్మిని) కౌగిలించుకొని ఆనంద రసాబ్ధిలో తేలుచున్న అనారతము (అనవరతమూ – నిత్యమూ) సనకాది యోగిరాడ్బృందముచే కొలువబడుచూనున్న అఖిలేశ్వరభావుడైన వాసుదేవుని సేవించి, ఆయన పాదములను అర్చించి, ఆ పిమ్మట భూమిపైనున్న కమలాధిప లీలావాసములు (విష్ణు క్షేత్రములు) చూచాను" అనగా, భృగుమహర్షి నారదుడిని ఆ క్షేత్రాలేమిటో తెలుపమని కోరాడు. అప్పుడు నారదుడు 108 దివ్య తిరుపతులు అని ప్రసిద్ధిగాంచిన వైష్ణవ క్షేత్రములను

వర్ణించాడు (దివ్య తిరుపతులను గురించి మరిన్ని వివరాల కోసం చూ. అనుబంధం-4). రామకృష్ణ కవి ఈ కావ్యంలోని ప్రథమాశ్వాసములోని 28వ పద్యము నుండి 71వ పద్యం వరకు దివ్య తిరుపతుల వర్ణన కొరకు ప్రత్యేకించాడు. తాళ్లపాక తిరువేంగళనాథుడు రచించిన "పరమయోగి విలాసము"లో గోదాదేవి తన తండ్రి విష్ణుచిత్తుడిని శ్రీమహావిష్ణువు యొక్క అర్చావతార నిలయములు ఎక్కడ వున్నాయని అడుగుతుంది. అప్పుడు విష్ణుచిత్తుడు 108 దివ్యతిరుపతుల వివరాలను తెలుపుతాడు. రామకృష్ణకవి తన కావ్యంలో ఆ వివరాల్నే సంగ్రహించాడు. లేక 'నాలాయిర ప్రబంధము' అనే ద్రావిడ ప్రబంధాన్ని కూడా యిందుకు అతడు ఉపయోగించుకొని వుండవచ్చు. శ్వేతద్వీపము (దీనినే సిత ద్వీపము లేక తెలిదీవి అనీ అంటారు), వైకుంఠము కూడా యీ 108 దివ్య తిరుపతుల లోనివే. వైష్ణవ భక్తాగ్రేసరులైన ఆళ్వారుల మంగళాశాసనములకు పాత్రములైన పవిత్ర స్థలాలే యీ దివ్య తిరుపతులు. మొత్తం 12 మంది ఆళ్వారుల చేతగానీ, లేక అందులో ఏ ఒక్కరి చేతనైనాగానీ మంగళాశాసనము చేయబడిన పవిత్ర క్షేత్రమునే 'దివ్య తిరుపతి' అంటారు. ఆళ్వారులు మొత్తం నూట ఎనిమిది దివ్య తిరుపతుల గురించి 'నాలాయిర ప్రబంధము'లో మొత్తం నాలుగువేల పాశురాలు సాయించియున్నారు. (తమిళ భాషలో నాల్ - నాలుగు; ఆయిరమ్ - వెయ్యి)

'చోళనాడు' అనగా నేటి తంజావూరు జిల్లాలో గల దివ్య తిరుపతులు - 40; 'పాండ్యనాడు' అనగా నేటి మదురై జిల్లాలో - 18; 'మలైనాడు' అనగా కేరళ రాష్ట్రంలో - 13; 'నడునాడు' అనగా రామనాథపురం, తిరునల్వేలి జిల్లాల ప్రాంతంలో - 2; 'తొండైనాడు' అనగా చెంగల్పట్టు మరియు ఉత్తర ఆర్కాట్ జిల్లాల ప్రాంతంలో - 22. ఇలా తమిళనాడు, కేరళ రాష్ట్రాలను కలుపుకొని మొత్తం 95 దివ్య తిరుపతులున్నాయి. 95వది ఘటికాచలము. ఆంధ్రదేశంలో కేవలం రెండే రెండు దివ్య తిరుపతులున్నాయి. అవి : ఒకటి - తిరుపతి; రెండు - అహోబల క్షేత్రము (కర్నూలు జిల్లాలోని అహోబిలము). ఈ 97 క్షేత్రాలూ పోను మిగిలిన 11 క్షేత్రాలలో సితద్వీపము, వైకుంఠము (దీనిని తిరునాడు అంటారు. ఇది 108వది) కాక మిగిలిన 9 దివ్య తిరుపతులు ఉత్తర భారతదేశంలో వున్నాయి.

ఘటికాచలము ఆళ్వారుల మంగళాశాసనమునకు పాత్రమైన పవిత్ర స్థలము. నాలాయిర ప్రబంధంలో పేయాళ్వార్ల చేతనూ, తిరుమంగై ఆళ్వార్లచేతనూ ఒకటి రెండుసార్లు ప్రశంసించబడిన దివ్యక్షేత్రమిది. 108 దివ్య తిరుపతులను వరుసగా పేర్కొంటూ నారదుడు యీ క్షేత్రాన్ని గురించి యిలా అంటాడు -

కII ఎక్కుడు తపమునఁదనువుల్
చిక్కఁగ ఘటికాచలాఖ్య శిఖరిస్థలిపై
నెక్కొను సప్తర్షులకున్
దక్కిన యక్కారు కణ్ణి నరహరి మూర్తిన్. (ఘటికాచల మాహాత్మ్యము 1-62)

"ఘటికాచలమను పేరుగల శిఖరంపై నెలకొని, శరీరములు శుష్కించిపోయేట్లు ఉగ్రతపము చేసిన సప్తర్షులకు ప్రసన్నుడైనట్టి ఆ నరసింహమూర్తిని దర్శించుకున్నాను.

మొత్తం నూట ఎనిమిది దివ్య తిరుపతులనూ నారదుడు వర్ణించిన పిదప భృగుమహర్షి, "ఓ నారదా! యిందాక ప్రసంగ వశాన ఘటికాచల క్షేత్ర మహిమను మీరు సూచన ప్రాయంగా తెలిపారు. హరి ఆ క్షేత్రానికి వేంచేయుటకు కారణమేమిటి? ఓ సురమునీ! ఆ గిరి చూడామణి(ఆ ప్రసిద్ధ పర్వతం) యొక్క కథ వినాలని వేడుకగా వుంది. దయచేసి ఈడిత (పొగడబడిన) మృదు వచనాలతో ఆ కథను వివరించండి" అన్నాడు. అప్పుడు నారదుడు, "ఓ మహాత్మా!

ధన్యుడనయ్యాను. ఆత్మభూనేతకైనా (స్వయంభూ - తనకు తానే ఆధారభూతమైన పరమాత్మకూ), వాగ్దేవతకైనా (సరస్వతీ దేవికైనా), వేదములకైనా, వేయినోళ్లు కల పన్నగస్వామి (పాపరేడైన ఆదిశేషునికైనా), వాచస్పతికైనా (దేవగురువైన బృహస్పతికైనా) ఆ కుధరమును (పర్వతమును) వర్ణించడం సాధ్యంకాదు. ఇక వేయి మాట లెందుకు? మా బోంట్లకు శక్యమవుతుందా? సనక జనక జనకుడు (సనకుడు బ్రహ్మ మానస పుత్రుడు. కనుక సనక జనకుడంటే బ్రహ్మ. సనక జనక జనకుడు అంటే బ్రహ్మతండ్రి - విష్ణువు) రమకు (లక్ష్మీదేవికి) చెపుతూండగా ఆ అచలము (పర్వతము) యొక్కచరిత్రను నేను విన్నాను. అది మహోఘచ్ఛటా దారణము (గొప్ప పాపముల శ్రేణిని చీల్చివేసేది) ముక్తి కారణము. కనుక, శ్రద్ధగా విను."

# విష్ణుభక్తి మాహాత్మ్యము

"నిత్యమూ హరి కథా శ్రవణం చేసే హరి భక్తులనూ, ముకుందుడిని ఎల్లప్పుడూ కీర్తించే పుణ్యచరితులనూ అల్లంత దూరముననే చూచి తప్పుకుని పరుగెత్తే దురితమతులను (పాప చింతన కలవారిని) కాసర వాహనుడి (దున్నపోతు వాహనముగా కల యముడి) కింకరాళి (భటుల సమూహము) కెదపుతుంది (చంపుతుంది). హరి కథలు వినడానికి యిష్టపడని దురితాత్ముడికి యిహలోకంలో మనశ్శాంతి వుండదు. వాడు పరలోకంలో నిరవధిగా (నిరంతరము) నిరదు నీరధిలో (నరక సముద్రంలో) మునుగుతాడు.

శౌరి గేహము (విష్ణువు యిల్లు. వైష్ణవ క్షేత్రము)నకు చనగ జాలని (వెళ్లలేని) కాలు కాలుకాదు - మరకాలు (కృత్రిమ పాదము)గాని; పురుషోత్తముని దివ్యమూర్తిని చూడలేని అక్షి (కన్ను) అక్షికాదు; గవాక్షి గాని (గవాక్షమంటే గుండ్రని కిటికీ). అచ్యుతుని చరిత్రను ఆలకించని చెవి చెవికాదు; అది రాట్నపు చెవియగాని. నర సఖుని (అర్జునుని మిత్రుని) కీర్తించని నాలుక నాలుకేకాదు, అది కొండనాలుకేగాని; దానవారాతి (దానవులకు శత్రువైన శ్రీహరి)ని పూజించదానికి రాని కరము (చెయ్యి) కరమేకాదు; అది ఘోరాఘకరముగాని (ఘోర పాపకరముగాని); హరి పాదోదకములో దోఁగని (జలకమాడని) రూపు రూపుకాదది చిత్రంపు రూపుగాని.

కమలలోచన భక్తుడి (హరిభక్తుడి) సాంగత్యం ఎప్పుడు అబ్బుతుందో అప్పుడే ఆర్యునికి తలపు వికసిస్తుంది - బిసరుహాప్తుని (కమలాప్తుడైన సూర్యుని) రాకతో యింపొసగగా విరిసే బిసరుహము (తామరపువ్వు)లా.

ముక్తికి భక్తజన సాంగత్యము అత్యంత ఆవశ్యకము. దానము, జపము, తపస్సు, అనూనమైన (వెలితిలేని) ధర్మాచారము, సూనృతాధ్యయనము (ప్రియమూ, సత్యమూనైన వాటినే చదవడం) కారణంగా నానాటికీ తేటతెల్లమై కనుపిస్తూ విష్ణుభక్తి అలవడుతుంది. నేను గత జన్మలలో చేసుకున్న సుకృతం కారణంగా నీ దర్శనం నాకు లభించింది. ఈ క్షేత్ర మాహాత్మ్యాన్ని నీకు వివరించడం కూడా ఆ సుకృత ఫలితమే" అంటూ కథా ప్రారంభం చేశాదు నారదుడు.

# ధవళాంగుని కథ

సరయూ నదీ తీరంలో అయోధ్య అనే ఒక నగరముంది. అది పరాయి సైన్యాలకు గెలువసాధ్యంకాని మణిమయ ప్రాసాదములూ, హర్మ్యాలూ కల నగరం. అది పరరాజ ఉత్కరములకు (సమూహములకు) దుర్నిరీక్షమైన పరిఘా ప్రాకారములు (పరిఘ అంటే కోట గవను - ప్రధాన ద్వారము; ప్రాకారము అంటే ప్రహరీ గోడ) కలిగి వున్నదట ఆ అయోధ్యా నగరానికి ప్రభువు ధవళాంగుడనే ప్రసిద్ధరాజు. ఒకరోజు ఆయన నిండు కొలువులో వుండగా -

ఉన్నట్లుండి అతని మస్తకముపై నున్న మాణిక్య మకుటం (మణి కిరీటం) స్థానంలో పిట్ట యీకల నెట్టము

(తలపాగా) ఉట్టిపడిందట. అతని ఉరము (ఛాతీపై) తారా హారములుండాల్సిన స్థానంలో గడ్డిపోచల దండలొచ్చాయట. వ్రేళ్లకి అంగుళీయకములు (ఉంగరములు) ఉండాల్సిన స్థానంలో 'జిగురు గండెలు' చేతికొచ్చాయట. వేటగాళ్లు పక్షులను పట్టుకొనడానికి బాణమునకు (కోలకు) బందన చమురుతారు (పూస్తారు) బందన అంటే జిగట బంక అలా బందన చమిరిన కోలను 'జిగురు గండె' అంటారు జాళువా పైరాణి శాలువు తొలగిపోయి కరకుతోలు కటిసీమను (నడుమును) చుట్టుకొని వున్నదట. జాళువా' అంటే అపరంజి (పది వన్నె బంగారు) బంగారు జరీతో నేసిన పైరాణీ శాలువా (పైరాన్ గోదావరీ నదీతీరంలో నేటి మహారాష్ట్రలోని మరార్వాడా ప్రాతంలోని ఔరంగాబాద్ జిల్లాలో వుంది, ఒకప్పుడు దీనిని ప్రతిష్ఠానపురం అని అనేవారు. ఇది కొంతకాలం శాతవాహనులకు రాజధాని ఇది కవికాలానికి బంగారు జరీ శాలువాల తయారీకి ప్రసిద్ధి పొందియుండవచ్చు)

అయ్యో! ఇదేమిటి? ఉన్నట్లుండి ఇలా జరిగిందేమిటి? అని సభాసదులందరూ ఆశ్చర్యపోతూ వుండగానే కటికచీకటి వంటి మేనిచాయతో ఆ భూతలాధీశుడు చూస్తుచూస్తూనే కిరాతుడు (బోయవాడు)గా మారిపోయాడట.

ఆయనకు అంతకు ముందరి దయాగుణభరిత హృదయం పోయి దాని స్థానంలో పెను బోయతనము (కరకు కసాయి తనము) సంప్రాప్తించి, బంధుకోటినీ, భటులనూ విడచిపెట్టి అతడు ప్రాణి నిధనమునకు (ప్రాణులను చంపడానికి) ఉద్యుక్తుడయ్యాడట. ఈ విధంగా కిరాతదశకు ఆభీలుడై (భయపడి, బాధపడినవాడై) అతడు నగరాన్ని విడచి క్రూరమైన సర్పములూ, క్రూరమృగ సమూహములూ, క్రూరమైన పక్షులకూ నెలవైన ఓ కోనలో తానొక్కడే వున్నాడట. ఆతడా విధంగా తిరుగుతూ, జంతువుల తలలు తరుగుతూ, తరు గుల్మలతలు (చెట్లూ, పొదరిండ్లూ, తీగలూ) తనకు యిరవులు (స్థావరములు)గా చేసుకుంటూ వెళ్లి వెళ్లి ఓ రోజున బ్రహ్మర్షి వసిష్ఠముని తపోవనానికి వెళ్లి ఆయన్ని చూశాడు. ధవళాంగుని చూసిన వసిష్ఠుడు 'వీని రాకకు కారణమేమిటి? ఇది నా ఆశ్రమమని వీడికి తెలియదా? ఔరా! ఈ కిరాత కీటము (బోయవాడనే కీటకము) మా వనమునకు ఏమాత్రం భయంలేకుండా రావడానికి పనేముంది?' అని ఉగ్రుడై, తిరిగి వచ్చిన కోపాన్ని అణచుకుని ఆ తపోధనమణి దివ్యదృష్టితో ధవళాంగుని పరిస్థితికి కారణం గ్రహించి అతనితో ప్రేమగా యిలా అన్నాడట. "ఓ భూమీశా! (ఓ రాజా!) ఒకప్పుడు నీవు మృగములను వేటాడి తరుముతూ విశ్వామిత్రుని ఆశ్రమానికి వెళ్లావు. దానికి ఆ మౌనీంద్రుడు కోపగించి నిన్ను కిరాతుడై పొమ్మని శపించాడు. ఆ శాపఫలం యింతకాలమూ నీవు అనుభవించావు. ఇక నీకు క్షేమం కలుగుతుంది. నీవు నీ పూర్వాకృతిని పొందుతావు" అనగా, వెంటనే ధవళాంగుడు తన నిజరూపాన్ని పొందాడు. "ఒకప్పుడు నరమాంసాశన వృత్తిన వర్తిల్లే (నరమాంసాన్ని ఆహారంగా భక్షించే) ఘంటాకర్ణుడనే రాక్షసుడు అరవిందాక్షుడి (విష్ణువు)తో వైరం కారణంగా పేట్రేగిన మహాహంకారంతో ఆజన్మపాపరతుడై – కృష్ణుని దర్శనం కాగానే ఖల వ్యాపారములు (నీచపు పనులు) విడచిపెట్టలేదా? ఓ ముని పుంగవా! సాధు సమాగమం కారణంగా శుభములు చేకూరడం అరుదేమీ కాదుకదా!" అంటూ తిరిగి "ఇంతెందుకు? దీనికి సరియైన ఉదాహరణము నా జనన కథా కథనమే! అది వివరిస్తాను. శ్రద్ధగా విను" అంటాడు నారదుడు. నారదుడు భృగుమహర్షితో తన పూర్వజన్మ వృత్తాంతాన్ని ఇలా చెప్పసాగాడు.

# నారద జనన కథ

హరిచక్రము అనే పురము అరిచక్రాభేద్యమై (శత్రు సమూహములకు అభేద్యమై) హరిచక్రమైన సుదర్శనమా? అన్నట్లు రథాంగము (చక్రము) అన్న పేరుకు తగ్గట్లే తనరుతున్నదట (అతిశయిస్తూన్నదట). ఆ నగరంలో సాక్షాత్తూ గోవింద సమానుడైన గోవింద శర్మ అనే గోత్రాదేవుడు (బ్రాహ్మణుడు - గోత్ర అంటే నేల - గోత్రాదేవుడు - భూసురుడు) ఆవిష్కరించిన మేధానిధియై వైష్ణవధర్మాన్ని పాటిస్తూ వెలుగొందుతున్నాడట. ఆయన సదాచారము, వినయము, విద్య, దయ మొదలైన సద్గుణాలను ప్రజలందరూ మెచ్చుకునేవారట. అతడికి భద్రాంగి అనే సాధ్వితో ఉద్వాహమయిందట (వివాహము అయిందట).

**క॥ ఆ లేమకు నుదయించిరి**
**నాళీకప్రభవ నిభులు నలువురు తనయుల్**
**నాళీక వచను లర్చిత**
**నాళీకోదరులు సుజన నయనాళీకుల్. (ఘటికాచల మాహాత్మ్యము 2-7)**

ఆ లేమకు (ఆ స్త్రీకి) నాళీక ప్రభవనిభులైన (తామర పువ్వు నుంచి ఉద్భవించిన బ్రహ్మతో సమానులైన) నలుగురు పుత్రులు జన్మించారట. వారు నాళీక వచనులట. అళీకము అంటే అప్రియము, అబద్ధము. (న+అళీక - అబద్ధము కానిది, అప్రియముకానిది. నాళీక వచనులంటే సత్యమైనవీ, ప్రియమైనవీ మాత్రమే పలికే వారు - అంటే వారు సూనృత వచనులన్నమాట). వారు అర్చిత నాళీకోదరులట. అంటే పూజించబడిన నాళీకోదరుడు (పద్మనాభుడు - విష్ణువు) కలవారట. అంటే విష్ణుభక్తులన్నమాట. వారు సుజనుల (ఉత్తముల) నయనాళికి (నేత్రములకు) ఈకులట (ఆర్ద్రత కలిగించేవారట).

ఆ గోవింద శర్మ కుమారులు కృతాధ్యయన సంపన్నులయ్యారట. అంటే చదువనే ధనంతో వారు సంపన్నులయ్యారట వ ~ తండ్రి ఆజ్ఞను ఔదల ధరిస్తారట. దివసాదినే (వేకువజామునే) లేచి నదీస్నానం చేసి విమల దుకూల వస్త్రములను (శుభ్రమైన తెల్లని సన్నని వస్త్రములను) ధరించి, ఉచితాసనములలో కూర్చుండి, మదిలో నిశ్చలమైన నిష్ఠతో ఆచార్యుని (గురువును) తలంచి, తిరుపవిత్రమును, తిరుమణి (వైష్ణవులు నొసట ధరించే ధవళమృత్తిక - తెల్లమట్టి - నాము)ని, తిరుచూర్ణము (పసుపు, బియ్యము చేర్చి తయారుచేసి వైష్ణవులు నొసట రాసుకొనే పొడి)ను మేన ధరించేవారట. భక్తితో సంధ్యావందనాది క్రియలను ఆచరించేవారట. స్వాధ్యాయము (వేదాధ్యయనము) చేస్తూ 'కాయమెత్తిన అతుల వైష్ణవధర్మమో' అన్నట్లు (వైష్ణవ ధర్మమే వీరి రూపంలో జన్మించిందా అన్నట్లు)గా వున్న వారిని చూసి యింటికి వచ్చే చుట్టాలు పక్కాలు గోవింద శర్మ భాగ్యమునకు ఆయన్ని పొగడుతున్నారట. ఇక ఆయన భార్య భద్రాంగి యింటికి చేరగానే ఎదురొచ్చి పతి పాదపద్మములను తీర్థజలాలతో కడిగి, ఆ పాద తీర్థాన్ని ఉత్కంఠతో త్రాగేదట.

వారి యింటిలోని అభ్యంతర మందిరంలో అంబుజోదరుని (పద్మనాభుని) పూజా మందిరమున్నదట. అక్కడ ఆ నలుగురు కుమారులూ విష్ణుపూజలు చేసేవారట. ఒకడు తిరు తొళసి దళములు (పవిత్రమైన తులసీ దళములు) కోసుకొచ్చేవాడట. ఒకడు పువ్వులు కోసి తెచ్చేవాడట. ఒకడు చందన గంధం తెస్తే మరొకడు తీర్థం తీసుకొచ్చేవాడట ఇలా కుమారులు నల్గురూ పూజా పరికరాల్ని సమకూర్చగా గోవిందశర్మ పూజకుపక్రమించేవాడట.

ఆయన కలశ పారావార కల్లోల కణసిక్త (కలశపారావారము అంటే పాలసముద్రములో కల్లోలితమైన నీటి కణాలతో తడిసిన శరీరం కలవాడైన విష్ణువునకు) పవిత్ర తీర్థజలాలతో స్నానం చేయిస్తాడట. కాంచన పటి కటీరాంచితునకు (మొలకు బంగారు వస్త్రం ధరించినవాడికి – విష్ణువునకు) హొన్నంచు పైరాణి సన్న జీబులిస్తాడట. (పొన్ను అంటే బంగారం. కన్నడంలో దీనినే 'హొన్ను' అంటారు. హంపిలో కొన్నేళ్ళపాటు జీవించిన కారణంగానే రామకృష్ణకవికి హొంబట్టు, హొన్నంచు వగైరా కన్నడ పదాలు అబ్బి వాటిని స్వేచ్ఛగా తెలుగులో ప్రయోగించాడు. పైరాణి సన్నజీబులంటే పైరాన్‌లో తయారయ్యే సన్నని కట్టువస్త్రాలు. అంటే బంగారు జరీ అంచుకల సన్నని పైరాణీ అంగవస్త్రాలిస్తాడన్నమాట). రాధా కుచాగ్ర సాంకవ కుంకుమాంకితునకు (సాంకవము అంటే సంకుమదము లేక జవ్వాజి. నాటి స్త్రీలు సౌరభంకోసం తమ కుచచూచుకములకు జవ్వాజి వగైరా సుగంధ ద్రవ్యాల్ని రాసుకొనేవారు. రాధతో నిత్యమూ శృంగార కేళిలో మునిగి తేలే కృష్ణునికి – విష్ణువుకు – రాధాదేవి తన చనుమొనలకు రాసుకున్న సంకుమదము అనే కుంకుమ ఆ సరికే అంటుకున్నదట. అటువంటివానికి) కాశ్మీర తిలకాన్ని (కుంకుమ తిలకాన్ని) దిద్దాడట.' కౌస్తుభ మణిని ఆభరణంగా ధరించిన విష్ణువుకు నవరత్నమయ భూషణములను (నవరత్నాలతో కూడిన ఆభరణములను) సమర్పించాడట. అరవిరిసిన పూలతో కట్టిన విరిసరముల (పూలమాలల)ను తాపసుల హృదయాలలోని తామర పూవనదగిన విష్ణువుకు నెయ్యమున (ప్రేమతో) వేశాడట. క్రూరులైన దైత్యవీరుల (రాక్షస వీరుల) ప్రతాపమనే చీకటిని పారద్రోలిన కాంతి యనదగిన విష్ణువుకు దీపమర్పించాడట (దీపారాధన చేశాడట). కమలాధరామృత స్వీకృతుడైన (లక్ష్మీదేవి యొక్క అధరామృతాన్ని స్వీకరించినవాడైన) విష్ణువుకు అమృత దివ్యాన్నపానములు అర్పించాడట. మహామునీంద్ర బృంద సచ్చిదానంద చూతమంజరియైన హరికి (చూతము అంటే మామిడి చెట్టు. మంజరి అంటే పూచిన లేతకొమ్మ. హరి సచ్చిదానంద అంటే – సత్ + చిత్ + ఆనంద స్వరూపుడని ప్రసిద్ధి. మహామునీంద్ర సమూహములకు సచ్చిదానంద ప్రదాతయైన పూచిన లేత మామిడి కొమ్మయనదగిన శ్రీహరికి) పుష్పాంజలి ఘటించాడట.

ఆ గోపకన్యకా విటమణికి (గొల్లపడుచులతో క్రీడించే విటశ్రేష్ఠుడైన కృష్ణునికి), అలిగిన ఇందిరా చరణములకు (లక్ష్మీదేవి పాదములకు) ఎరగు (నమస్కరించుచున్న) ఆ విష్ణువుకు వందన మొనర్చాడట గోవిందశర్మ. మాయాడింభక చూడామణిగా (మాయలు నేర్చిన బాలక శ్రేష్ఠుడైన కృష్ణునిగా) గోప సుదతులు (గోపికలు) ప్రేమతో చూస్తూండగా తన తల్లి యశోద ముందు కయనీయ మోహనాకృతితో నృత్యంచేసే ఆ గోపబాలుని ఎదుట గోవిందశర్మ నృత్యం చేశాడట.

ఇక గోవింద శర్మ భోజన విశేషాలు వర్ణిస్తున్నాడు కవి. ఆయనకు భోజనం చేపట్టు చేసిన (నీటితో శుద్ధిచేసిన) మ్రొల్చివర కలిగిన (మేలైన చివరి భాగం కలిగిన) చిగురరటి ఆకులలోనూ (లేత అరటి ఆకులలోనూ) దొన్నియల (దొన్నెల లేక దొప్పల)లోనూ వడ్డించబడేదట. నారికేళఫలాశనమ్ములు (భోజనంలో కొబ్బరి ముక్కలు, పండ్ల ముక్కలు కలిపి చేయబడిన ప్రసాదం వంటి ఆహారాన్ని ముందుగా వడ్డిస్తారు) వడ్డించి ఆకులపై అభిఘారము (అరటి ఆకులపై వడ్డించబోయే ముందు నెయ్యి పులుముతారు. ఇలా చేయడాన్ని అభిఘారము అంటారు) చేసి; కర కంకణములు (చేతికి ధరించిన కడియములు) ఝణఝణ మంటూండగా, కాళ్ల అందియలు ఘల్లుఘల్లుమని మ్రోగుచుండగా, బంగారు సరిగంచు (జలతారు అంచు) రంగు సుగ్గడితపు (తఱచునేత లేక మందంగా నేసిన) తెల్లని దువ్వటము (దుప్పటము – నడుముచుట్టూ – స్త్రీ ధరించే వస్త్రము) ఫెళఫెళలనీనుతూండగా (ఫెళ ఫెళమను కాంతులతో ప్రకాశిస్తుండగా), కదలే మెట్టెలకవ (మెట్టెలజంట) తాళగతులతో మొరయ (మ్రోగగా), నెయ్యమున (ప్రేమతో) పదరక (ఏ మాత్రం త్వరబాటులేకుండా) కొందరు స్త్రీలు అన్ని పదార్థాలనూ ఆమెకు అందిస్తూవుండగా, తాల్మితో (ఓర్పుతో) వగ మీరగా (ప్రేమ మీరగా) భద్రాంగి వడ్డిస్తూందట.

కలమాన్నము (వరి అన్నము, కలమము అంటే వరిపైరు), ఒలిచిన పప్పు (పొట్టు తీసిన పప్పు - చాయపప్పు), సద్యోఘృతము (అప్పటికప్పుడు కాచిన నెయ్యి), కారపు కూరలు, చారులు, శాకములు, అంబళ్లు (అంబలి అంటే పిండి, నూకలు కలిపి అనుకుగా వండిన ఓ ద్రవాహారం), పచ్చళ్లు, ఆనవాలు (ఆన + పాలు - కాచి విరిచిన పాలు - జున్ను), వరుగులు (ఎండబెట్టిన కాయగూర ముక్కలతో చేయబడిన ఆహార పదార్థాలు), అప్పడములు, వడియములు, తేనియ పాకములు, సిగరలు (సిగర అంటే - కొన్ని సంబారువులు వేసి తిరుగమోత వేయబడిన మజ్జిగ - దీన్ని 'మెంతి మజ్జిగ' లేక 'మజ్జిగ చారు' అనీ అంటారు), పాయసములు, కల వంటకములు (కలగూరలు - రెండు లేక అంతకన్నా ఎక్కువ కూరగాయలతో వండిన కూరలు), బజ్జులు (బజ్జి అంటే ఎనిచి పల్చగా చేసే వ్యంజనము. ఉల్లిపాయ ముక్కలను ఎక్కువగా వేసి కాల్చిన లేక వేయించిన వంకాయలతోనూ లేక టొమాటోలతోనూ పలుచగా చేసే పచ్చడిని కూడా బజ్జి అంటారు), పిండివంటలు, చక్కెర జున్ను, రసాయనములు (మజ్జిగతో చేసే మజ్జిగపులుసు, మజ్జిగచారు వగైరాలు), పాలు, ఫలములు, ఎడనీళ్లు (లేత కొబ్బరి కాయలలోని నీరు), పానకములు, ఊరుపిండి - ఊరగాయలు (ఊరగాయ పచ్చడిలో మామిడి వగైరా ముక్కలేవీ లేకుండా శనగ లేక పెసరపిండితో చేసే ఊరుపచ్చళ్లను 'ఊరుబిండ్లు' అంటారు), తైరు (పెరుగు), శొంఠి, పాంసు లవణము (ఓ రకమైన ఉప్పు), జంబీర రసములు (నిమ్మ రసములు), ఆ తరువాత నించదగు నీరు మోరు (నీటి మజ్జిగ) ఆరగించి లేచాడట గోవిందశర్మ. శొంఠి - *Drygınger - Zingiber Officinale* తో పాంసు లవణమును కలిపి తీసుకుంటే అరుగుదలకు మంచిది (భోజనం చేసిన తరువాత కడుపులోని ఖాళీని నీళ్ల మజ్జిగతో నింపాలంటారు పెద్దలు. 'భోజనాన్తే పిబేత్తక్రమ్' -అని ఆర్యోక్తి భోజనానంతరము నీరు ఎక్కువగా కలిపిన మజ్జిగ త్రాగాలి)

ఆ తరువాత కరములను (చేతులను) అచ్ఛోదకములతో (స్వచ్ఛమైన నీటితో) కడుగుకొని, వార్చి (భోజనానంతరం చేసే ఉపస్పర్శము లేక ఆచమనముచేసి; ఈ ఉపస్పర్శము లేక ఆచమన క్రియలో శుభ్రమైన నీటిని చూపుడువ్రేలు పొడవుగా నిలిపిన పుడిసిటిలో గ్రహించి మూడుసార్లు పుచ్చుకొంటారు. పుక్కిలించి ఊస్తారు కూడా. కనుక యిది మత ధర్మంగా ప్రవేశపెట్టబడిన ఆరోగ్యసూత్రం. దంతశుద్ధికి ఉద్దేశించినట్టిది), తులసిరేకులు సేవించి (కఫాన్ని హరించే తులసి దళాలను భోజనానంతరం తినడం కూడా ఆరోగ్యసూత్రాలలో ఒకటి). కళుకు (కాంతివంతమైన) పచ్చడాలు (పసుపు వన్నెకల) తిన్నెపై కూర్చుని (భోజనానంతరం ఆవుపేడతో అలుకబడి బంగారు పసుపు రంగులో మెరిసే తిన్నెపై కూర్చోవడం కూడా ఓ ఆచారం.), బాగాలు, ధవళనాగవల్లి దళములు అందరికీ యిచ్చాడట. ('బాగములు' అన్నా 'బాగాలు' అన్నా వక్కలు లేక వక్కపొడి. ధవళ నాగవల్లి దళములు అంటే తెల్ల తమలపాకులు - *Betel leaves - Piper betle*

భారతదేశంలో 35 రకాలకుపైగా తమలపాకులు సాగవుతున్నాయి అయితే 'తెల్లాకులు' లేదా 'తెలనాకులు' లేక ధవళనాగవల్లి దళములు అని పిలువబడే రకపు పలుచని లేత తమలపాకులు తాంబూలానికి శ్రేష్ఠమైనవి వీటిలో ఈనెలు, పీచు తక్కువగా వున్న కారణంగా యివి కారం (తిమ్మిరి) తక్కువగా వుంటాయి కనుక తాంబూలంగా వాడడానికి అనుకూలమైనవి. 'బంగ్లా' లేక 'భుబన' అనే బెంగాలు తదితర ప్రాంతాలలో సాగయ్యే మందపాటి పెద్ద ఆకులు కారంగా, ఘాటుగా వుంటాయి తమిళనాడులో సాగయ్యే 'కారపాకు' అనే మరోరకం తమలపాకులు కూడా ఘాటుగా వుంటాయి వీటిని జర్దాకిల్లీల తయారీలో ఎక్కువగా వాడతారు. ఘాటుగా, తిమ్మిరిగా వుండే యీనెలు తీసివేసి వాటిపై తడిసున్నము, కాచుపొడి (*Catechu* - చంద్రగుజ్జు - దీనిని కవిరి చంద్ర చెట్టు - *Acacia Catechu* - కాండం నుంచి తయారు చేస్తారు)ని చల్లి, వక్కలు లేక వక్కపొడితో కలిపి సేవిస్తారు. తాంబూలంలో ఎండు కొబ్బరి ముక్కలు, ఏలకులు, లవంగాలు, సోంపు (*Sonf - Foeniculum vulgare*), జాజికాయ లేక జాతీఫలము (*Nutmeg - Myristica fragrans*) జాతీ పత్రము లేక జాతీపత్రి లేక జ్యాపత్రి (*Mace* - ఇది జాజికాయపైన వుండే ఎండబెట్టిన పొర (*aril*). అతిమధురము లేక యష్టిమధుకము (*Liquorice - Glycyrrhiza glabra* అనే తీగమొక్క ఎండువేళ్ల పొడి) వేస్తారు కొందరు పాన్ మసాలా పొడరు, కుంకుమ పువ్వు (*Saffron - Crocus sativus*), కర్పూరము వగైరా ద్రవ్యాలుకూడా తాంబూలంలో చేరుస్తారు. కొందరు తాంబూలంలో పలుచని బంగారు లేక వెండి రేకులను కూడా వేసుకుంటారు

తాంబూల సేవనం భారతదేశంలో అనాదిగా వస్తూన్న అలవాటు. మితంగా సేవిస్తే దీనివల్ల ఎంతోమేలు ఇదినోటికి పరిమళాన్ని కలిగించి (aromatic), అరుగుదలను పెంచడమే (digestive) కాక, ఉత్తేరకంగానూ (stimulant) కడుపులోని గ్యాస్‌ను తగ్గించేది (carminative) గానూ పనిచేస్తుంది ఎన్నో వ్యాధులకు వాడడమే కాక సెగగడ్డలు వగైరా వ్రణాలు పక్వానికి రావడానికి వేసే మలాం పట్టీలలో కూడా తమలపాకులు వాడతారు. శరీరానికి అత్యంత ఆవశ్యకమైన కాల్షియం (calcium) ను తాంబూలం చవగ్గా అందిస్తుంది తాంబూలంలో పొగాకు, జర్దా వగైరా పదార్థాలు వాడితే అది నోటి కాన్సరుకేకాక, పయోరియా అల్వియొలరిస్ (pyorrhoea alveolaris) వగైరా దంత వ్యాధులకు కూడా దారితీయవచ్చు తాంబూలాన్ని విడియము, విడెము, వీడెము, వీడ్యము వగైరా పేర్లతో కూడా పిలుస్తారు కర్పూరము వేసిన కప్పుర విడియము ప్రస్తావన కావ్యాల్లో ఎక్కువగా కనుపిస్తుంది

ఆ తరువాత ఆ అతిథి ప్రజను (అతిథుల సమూహమును) పనిచి (పంపివేసి) అంచిత భక్తితో బాలరామాయణమును పఠించి తెలనాకులతో (తెల్లని తమలపాకులతో) కపురంపు బాగములు (కర్పూరము కలిపిన వక్కపలుకులు) జాయ యొసంగగా (భార్య యివ్వగా) నమలుతూ రమేశుని (లక్ష్మీపతి) సత్కథలు తప్పకుండా వింటూ ప్రతిరోజూ ఆ ఘనుడైన గోవిందశర్మ యీ విధంగా ధన్యుడై ప్రవర్తిస్తున్నాడట.

# తరళ

కు॥ తరళ యనంగ నొకానొక
తరళ విలోచన తదార్య దంపతి సేవా
తరలమతిఁ దద్గృహమ్మునఁ
దరలక వర్తించు నెంచఁదగు వర్తనలన్. (ఘటికాచల మాహాత్మ్యము 2-20)

తరళ అనే ఒకానొక తరళ విలోచన (చలించే కన్నులు కలది - స్త్రీ) ఆ ఆర్యదంపతులను సేవించాలనే తరలమతియై (అనురాగము మనస్సున కలదియై) ఆ గృహంలో ఎంచదగు వర్తనలతో (పొగడదగు సద్వర్తనలతో) తరలక (వెళ్లిపోక; అంటిపెట్టుకుని) వర్తించుచున్నది (ఉంటూ వున్నది)

కు॥ వఱువాత లేచి యాబుధ
వరు వరవుడుఁ బోల్పఁ దగిన వారెవరన శ్రీ
వరుఁ గీర్తింపుచు వాఁకిలి
వరుసన్ ముంగిళ్లు దుడిచి వారని భక్తిన్. (ఘటికాచల మాహాత్మ్యము 2-21)

వరవుడు అంటే దాసి. చీపురుకట్టతో ఊడ్చే స్త్రీ. వఱువాత అంటే ప్రాతఃకాలమున. తొలిసంధ్యాకాలానికే లేచి ఆ దాసి నీకు సాటి ఎవరున్నారని శ్రీవరుడిని (శ్రీపతిని) కీర్తిస్తూ, వారని భక్తితో (ఉడుగని - నశించని - భక్తితో) ఇళ్లూ, వాకిళ్లూ, ముంగిళ్లూ తుడిచేదట.

గోమయము (ఆవుపేడ)తో గోముఖము చేయడం కారణంగా (అలకడం కారణంగా) ఆ లోగిళ్లకు సంపదల యొక్క కాంతులు చేకూరాయట. ఐదురంగుల, రీతుల ముగ్గులను ప్రేమతో ఆమె నలుగడలా (నాలుగు వైపులా) నింపివేసిందట. దీనికి సాటి తరుణీజనం (స్త్రీలు) వేమరు (వేయిమార్లు; మరీమరీ) విస్మయంచెందారట (విస్తుపోయారట). ఆమె స్త్రీలపట్లనూ, పురుషులపట్లనూ ఎంతో నమ్రతగా వుండేదట.

ఆమె ఆ ఆర్యదంపతులను ఎంతో ప్రేమతో 'అయ్యా!, 'అమ్మా!' అని సంబోధిస్తూ వారికి సకలోపచారాలూ చేసేదట. ఆ విష్ణుభక్తులు తినగా మిగిలిన శేషాన్నంతో తన క్షుత్కీలలను (ఆకలి అనే అగ్నిని) బాపుకొనేదట. ఈ విధంగా ఆ మహాత్ముడి అగారము (గృహము)లో సంచరించడం కారణంగా ఆ నారీమణికి పూర్వజన్మలో చేసిన ఘోరాఘములు (ఘోరమైన) పాపాలు నశించాయట. పుణ్యములు మిక్కిలిగా చేకూరాయట.

# హరిశర్మ

శా॥ ఆ చెంతన్వసియించు భూసురుఁడొకం డౌదార్య కర్ణుండు రే
ఖా చేతోభవమూర్తి కాంతిజిత రాకాకోక విద్వేషి వి
ద్యాచాతుర్య ఫణీశ దేశికుఁడు ప్రేమాయత్త చిత్తుండు త్ర
య్యాచారాచరణ ప్రచారి హరిశర్మాఖ్యుండుదారోన్నతిన్. (ఘటికాచల మాహాత్మ్యము2-26)

ఆ చెంతన (సమీపంలో) ఔదార్యానికి ప్రసిద్ధిగాంచిన ఒక భూసురుడు (బ్రాహ్మణుడు) నివసిస్తున్నాడట. ఔదార్యంలో అతడు కర్ణుడంతటి వాడట. రూపు రేఖలలో అతడు చేతోభవుడట (మన్మథుడట); కాంతిజిత (గెలువబడిన కాంతి గల) రాకా కోక విద్వేషియట (నిండు చంద్రుడట); (కోకము అంటే చక్రవాక లేక జక్కవ జక్షి - *the ruddy goose*. ఈ పక్షులు పగలంతా ఎంతో ఉల్లాసంగా ఎడబాయని జంటగా వుంటాయట. రాత్రయ్యేసరికి అవి భయంతో వ్యాకులపడతాయట. పగలు వాటికి మోదం. రాత్రి ఖేదం. అందుకే మన సాహిత్యంలో సూర్యుడిని 'కోకబంధు' లేక 'చక్రవాకబంధు' అని పిలిస్తే చంద్రుడిని 'కోకద్వేషి' అనీ 'చక్రవాక ద్వేషి' అనీ అన్నారు) విద్యాచాతుర్యంలో ఫణీశునకు (సకల శాస్త్రాలూ తెలిసిన ఆదిశేషునకు) కూడా దేశికుడట (గురువు వంటివాడట). (ఆదిశేషుడు లేక శేషనాగు అనబడిన వేయితలల మహాసర్పము యోగనిద్రలో అనంతశయనుడైన శ్రీమహావిష్ణువుకు తల్పమని విశ్వాసం. అలా శేషుడు విష్ణువుకు సన్నిహితుడేకాక, కృష్ణుని సోదరుడైన బలరాముడు ఆదిశేషుని అవతారమేననీ; శ్రీవైష్ణవ మతస్థాపకుడూ, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవక్త అయిన శ్రీ రామానుజాచార్యులు కూడా ఆదిశేషుని అవతారమేననీ వైష్ణవుల విశ్వాసం. అందుకే వారికి ఆదిశేషుడంటే అపారమైన గౌరవం. ఆదిశేషుడిని సకల శాస్త్రమర్మములూ క్షుణ్ణంగా తెలిసిన మహాపండితునిగా వైష్ణవులు భావిస్తారు. మరి మనందరం ఒక తలతో ఆలోచిస్తే ఏకకాలంలో ఆదిశేషుడి వేయితలలూ పనిచేస్తాయనో ఏమో - యీ నమ్మకం ఏర్పడి వుటుంది.) అతడు ప్రేమాయత్తచిత్తుడట (ప్రేమకు స్వాధీనమైన మనస్సు కలవాడట) అతడు త్రయ్యాచారాచరణ ప్రచారియట. అంటే వేదాచార పరాయణుడట. (వేదములను త్రయీ విద్యలనేవారు. అథర్వ వేదాన్ని కొందరు వేదంగా గుర్తించరు. మూడు వేదాల ఆచారములను ఆచరిస్తూ ప్రచారం చేసేవాడనటానికి త్రయ్యాచారాచరణ ప్రచారి అన్నాడు కవి.) అతడి పేరు హరిశర్మట. అతడు నిండు యౌవనంలో వున్నాడట. అతడిని మన్మథుడెలా ఆవహిస్తున్నాడో చూడండి.

మన్మథుడు మీనలాంఛనుడు. (మీనము టెక్కియముగా కలవాడు) మన్మథుడి రథమేమో తెమ్మెర (మలయ మారుతము) ఆ రథానికి గుర్రాలేమో రాచిలుకలు. హరిశర్మ యొక్క కలికి ప్రాయపు (మనోజ్ఞమైన వయస్సు అనే) రాచిలుక బాబాలు (బాబా అంటే గుర్రము) మీన లాంఛనం కలిగిన మలయ మారుతపు తేరును (రథాన్ని) పూనాయట. అరవిరిసిన విరి మొగ్గలు (పూ మొగ్గలు) తెల్లచెరకు వింటికి శరములు (బాణములు) అయ్యాయట.

తమ్మిపూరేకుల (తామర పూరేకుల) దోదుమ్మికత్తి (దోదుమ్మి అనేది ఒక ఆయుధం. మన్మథుని ఖడ్గం కూడా పూరేకులేనట.) తేనె బిందువులనూ, నూనె వంటి జిగినీ (కాంతినీ) చిమ్ముతున్నదట. నాళీకలోచనా జనులకు (తామరపూల వంటి కన్నులు కలిగిన వారికి - స్త్రీలకు) నవమనోజుడి (నవమన్మథుడిగా) కనుపిస్తున్నాడట ఆ భూదేవతాత్మజుడు ( ఆ

బ్రాహ్మణ కుమారుడు) వలపు చెలువొందే ఆ నిండు యౌవనదశలో.

నున్నగా దువ్వివేసుకున్న శిఖాబంధము (పిలకముడి) బరువుగా అవటు భాగంలో (అవటువు అంటే పెడతల. ముచ్చలిగుంట.) వ్రేలాడిందట. నున్ననైన మేలిమి జాళువా (బంగారు) పోగుల ప్రకాశమునకు లేత చెక్కిళ్ల జిగి (కాంతి) వెలవెల పోయిందట. తెల్లని అతని యజ్ఞోపవీతము (జందెము) యొక్క తేటలు (నిర్మల కాంతులు) దుకూలోత్తరీయము యొక్క ద్యుతి (కాంతి)తో కలసిపోయాయట. అతని నుదుటిపైనున్న ఊర్ధ్వపుండ్రము (పంగనామాలు) వెలితమ్మి రేకులను (తెల్ల తామర రేకులను) కూడా వికవికా నవ్వేటంత తెల్లగా మురువు చూపుతూ (సుందరంగా) వున్నాయట. అతడు జిలుగు నీరుకావి (పలుచని; కొద్దిగా ఎర్రని) దోవతి చెఱగు ధరించాడట. కొదమ ప్రాయపు (యౌవన ప్రాయపు) మేని నిగ్గులు (శరీర కాంతులు) కదాని పొదులు (బంగారు పొదులు. కదాని అంటే తప్త కాంచనము, కాల్చిన బంగారము) వెదజల్లగా ఆ విప్రుడు ఆ నగరంలో చరిస్తుండేవాడట.

# తరళ - హరిశర్మల ప్రణయం

వేశ్యాజనం యొక్క భ్రమలు కొల్పే లేటి (లేడి) చూపుల యొక్క వలపు వాడులను చూసి (ప్రేమ యొక్క పదునులను చూసి) తలవంచుకొనే ఆ హరిశర్మ, దైవకృత మెలాంటిదోకాని తరళను చూసి మాత్రం తరళతరచిత్తవృత్తియై (చలించే మనస్సు కలవాడై) తత్తరించేవాడట (సంభ్రమానికి లోనయ్యేవాడట).

వేదాచార పరాయణుడైనప్పటికీ హరిశర్మ ఆ చెలి చెలువము (సౌందర్యము)ను తలచి మోహముతో చేతోజాత దశలతో (మన్మథుడు పెట్టే అవస్థలతో) అలజడి పడుతున్నాడట. ఆమెను చూసినప్పుడు అతడు చేసే వింత చేష్టలను కవి వర్ణిస్తున్నాడు.

ఊరకే పనిలేకుండా శిగ దువ్వుకుంటాడట. ముడివేసి మళ్లీ దువ్వుతాడట. రెండు చేతులూ ఒక్కసారిగా పైకెత్తుతాడట. నిక్కిచూస్తూ పెక్కు వింతచేష్టలతో బెట్టు (ఉధృతంగా) ఆవలిస్తాడట. నఖాగ్రగతితో (కాలిముని వ్రేళ్ల గోళ్లపై నిలిచి నడుస్తూ) సమీపించి ఒక్క ఉదుటున ఘర్మాంబువులు చిమ్ముతూ (చెమటలు కార్చుకుంటూ) మీద పడతాడట. పెద్ద కంఠంతో ప్రేమగా ఏవేవో ఉగ్గడిస్తాడట. జమిలి (జంట) తెలి జన్నిదములను (తెల్ల జందెములను) సమములుగా పట్టి వ్రేళ్లసందున దువ్వుతాడట. (బ్రాహ్మణ గృహస్థులు రెండు యజ్ఞోపవీతములను తప్పనిసరిగా ధరిస్తారు). భ్రమతో తనపెదవి చిమచిమమనేటట్లు తానే కొరుక్కుంటాడట. చొక్కుతాడట (పరవశిస్తాడట). చెలిగని (చెలినిచూసి) మ్రొక్కుతాడట.

రామకృష్ణ కవి హరిశర్మను నవమనోజుడనీ, అతడు నిండు జవ్వనములో, కలికి ప్రాయములో వున్నాడనీ, లేత చెక్కిళ్లు కలవాడనీ, కొదమ ప్రాయపువాడనీ, భ్రమలు గొలిపే ఆ వూరి వేశ్యాజనం యొక్క వాడి చూపులకు అతడు తలదించుకొనేవాడనీ, ఒక్క తరళను చూసి మాత్రం అతడు చిటిపొటి నునువలపులలో చిక్కుకున్నాడనీ వ్రాయడాన్ని బట్టీ, శృంగారంలో అతని అనుభవరాహిత్యాన్ని బట్టీ, మనం హరిశర్మ బ్రహ్మచారియైన నవయువకుడని భావిస్తాం. పైపెచ్చు కవి ఆయన భార్య ప్రస్తావన కుడా ఎక్కడా తేలేదు. కాని హరిశర్మను వర్ణిస్తూ 'ధవళ యజ్ఞోపవీతముల తేటలు' అని ఒకటికంటే ఎక్కువ యజ్ఞోపవీతాల్ని అతడు ధరించాడని సూచిస్తూ ఒకసారీ, 'జమిలి తెలి జన్నిదములు' అని రెండు యజ్ఞోపవీతాల్ని స్పష్టంగా సూచిస్తూ మరోసారీ చెప్పడాన్ని బట్టి రెండు జందెములు ధరించే హరిశర్మ బ్రహ్మచారి కాదని అర్థం చేసుకోవచ్చు. బ్రహ్మచారి ఒకటి, గృహస్థు రెండు, వానప్రస్థుడు మూడు, సన్యాసి నాలుగు జందెములు ధరించాలని నియమమట. కనుక, అతని భార్య గురించి కవి ఎక్కడా పేర్కొనకపోయినా తరళతో వలపులో చిక్కుకునేటప్పటికే అతడు గృహస్థు అని అర్థమవుతూంది. బహుశా కొత్తగా పెళ్లై భార్యనింకా కాపురానికి తీసుకురాని వాడై వుంటాడు. ఒక్క వైఖానసులలోనే స్నాతకం అయిన తరువాత ఓ ఆరు నెలలపాటు యింకా

బ్రహ్మచారిగా వున్నప్పటికీ గృహస్థు కాబోయే వ్యక్తి (*Initiated House - holder*) ఇలా రెండు జన్నిదములు ధరించే ఆచారమున్న తెలుస్తున్నది. కనుక, హరిశర్మ పాత్ర ఇంకా వివాహం కానట్టి వైఖానస స్నాతకుడై వుండవచ్చు ననిపిస్తున్నది. ఇక అతని పేరు విషయానికి వస్తే కేవలం ఆచార్యులు, భట్టాచార్యులు, భట్టర్ వగైరా ఉత్తరనామాలే కాక వైఖానసులలో శర్మ, శాస్త్రి, దీక్షితులు వగైరా ఉత్తరనామాలు కూడా ధరించే ఆచారముంది. కనుక హరిశర్మ వైఖానస స్నాతకుడై వుంటాడు.

ఈ విధంగా తనను చూసినప్పటినుండి భావ భవుడి (మన్మథుడి) సాయకముచే (బాణముచే) కొట్టబడినవాడై దిట చెడి (శక్తి సన్నగిల్లి) చిటిపొటి (అల్పమైన) నునువలపు వలలలో చిక్కుకొనడం చేత ఆమె కూడా చిత్తము కన్న కరుణాయత్తమతితో (జాలికి లోబడిన మనస్సుతో) సజ్జనాచారపు పొత్తు విడచి తానుకూడా మరుని (మన్మథుని) చిగురు కత్తికి (వృక్షాల చిగుళ్లే మన్మథుడి ఖడ్గాలు) లోనయిందట.

ఆమెలో కూడా వింతచేష్టలు మొదలయ్యాయి.

ఆమె చేతులకున్న నున్నని వెండి కడియాలు మినుకు మినుకుమని మెరవగా సారెకును (మాటిమాటికీ) తలదువ్వి కొప్పు పెడుతుండట. గబ్బిగుబ్బలు (పొంకముగల రొమ్ములు) బయల్పడేటట్లు పైటచెరగు జాళించి (జాడించి దులుపుతూ) సారెసారెకూ సవరించుకుంటుండట. తళుకుటద్దంలో చూసుకుంటూ బొద్దును అందంగా దిద్దుకుంటుండట. (బొట్టుకు కూడా కొందరు స్త్రీలు కస్తూరి, సంకుమదము వగైరా సుగంధ ద్రవ్యాలు రాస్తారు) గర్వం ఉట్టిపడే వాలుకన్నులతో పనిలేనిపనిగా ఏటవాలుగా చూస్తుండట. ముద్దు ముద్దుగా ప్రొద్దునొకటి కడప్రొద్దు (సాయంత్రము) నొకటిగా వన్నెపుట్టములు (రంగురంగుల చీరలు) కట్టుకుంటుండట. చిటిపొటి (అల్పమైన) పూతసొమ్ములు (బంగారు పూతపూసిన క్షుద్రలోహపు నగలు) పెట్టుకొని మట్టెల రవళి (మట్టెల శబ్దం) కన్పట్టగా (ప్రస్ఫుటంగా ధ్వనించునట్లుగా) తిరుగుతుండట. చిరుగు సిగ్గుతో (చిరిగిపోయే సిగ్గుతో; అంటే సిగ్గుతొలగిపోతూ) పొరుగు భూసురుని యెదుట (పొరుగింటి బ్రాహ్మణుని ఎదురుగా). (మెట్టెలు మెట్టియలు. మట్టియలు లేక మట్టెలు స్త్రీలు గానీ, పురుషులుగానీ తర్జనికి అంటే కాలి రెండవ వ్రేలికి ధరిస్తారు. పురుషుడు ధరిస్తే దీనిని 'మించు' అని అంటారు. ప్రస్తుతం వివాహిత స్త్రీలు మాత్రమే యివి ధరిస్తున్నారు. కాని అప్పట్లో అవివాహితలు కూడా వీటిని ధరించేవారేమో. ఈమె అవివాహితే కదా!)

వారిరువురికీ యీ విధంగా వలపుల కోరికలీరికలెత్తాయి. విద్య, కులము, శీలము, పెద్దరికము మొదలైన వాటినన్నింటినీ కట్టిపెట్టాడా విప్రుడు. ఆ స్త్రీ కూడా పెద్దలు పిలిస్తే వెళ్లడం, ఇళ్లూ వాకిళ్లూ శుభ్రం చేయడం, నీళ్లు తీసుకురావడం వగైరాలను మరచిపోయింది. ఈ విధంగా వారిరువురూ అన్నీ మరచి రతి క్రీడలు సలుపగా ఆ తనుమధ్యకు (సన్నని నడుముగలది - ఆడది) నేను తనయుడిగా పుట్టాను. బాలురకు సహజమైన చేష్టలతో, తల్లి పెంపున ప్రేమమీరగా పెరుగుచూ, నాలుగైదు శరత్తుల (నాలుగైదు సంవత్సరాల) వయస్సుకల బాలునిగా నేను పెరుగుచూ వుండగా -

## వర్షర్తువు వర్ణన

అది ఓ వర్షాకాలం. ఇక్కడ వర్షర్తువు వర్ణన రామకృష్ణకవి కదు చమత్కారంగా చేశాదు. చూదండి.

క॥ ఇల నెమ్మల నాడింపఁగఁ
దొలకరి నట్టువకొలంపు దొర యెత్తినచే
నలరెడు పుత్తడి బెత్తనఁ
దళుక్కుమనెఁ దీగ మెఱుపు ధనదాప్తదెసన్. (ఘటికాచల మాహాత్మ్యము 2-43)

ఇలన్ - భూమిపైన; నెమ్ములన్ - నెమళ్లను; ఆడింపగ - ఆడించుటకు; తొలకరిలో; నట్టువ కొలంపు దొర - నాట్యకులానికి రాజు - నటరాజు (శివుడు); యెత్తినచే - ఎత్తిన చేతిలో; అలరెడు - ప్రకాశించే; పుత్తడి బెత్తనన్ - పయిడి (బంగారపు) బెత్తమా అన్నట్లు; తళుక్కుమనె; తీగ మెఱుపు - ఓ మెఱుపు తీగ (తటిల్లత); ధనదాప్తు దెసన్ - ధనదుడు అంటే కుబేరుడు; ధనదాప్తుడు - కుబేరునికి మిత్రుడు (శివుడు) - శివుడికి కుబేరసఖుడనీ, కుబేరుడికి త్ర్యంబక సఖుడనీ పేర్లున్నాయి. వారిద్దరూ సన్నిహిత మిత్రులట. ధనదాప్తుదెసన్ - శివుడి (ఈశానుడి) దిక్కైన ఈశాన్య దిక్కులో. ఈ చక్కటి పద్యంలో ఈశాన్య దిక్కున ఆకాశంలో మెరిసే మెరుపు తీగను బట్టి కవి ఓ అద్భుతమైన కల్పన చేశాడు. నెమళ్లకు నాట్యమంటే అతి యిష్టం. నెమలిని నర్తన ప్రియమనీ, నట్టువ పులుగు అనీ నట్టువపిట్ట అనీ అంటారు. నట్టువ కులానికి దొర అంటే నట్టువకాళ్లకు (నాట్యగాళ్లకు) రాజు నటరాజైన శివుడు. వారికి ఆదిగురువూ ఆయనే. ఉరుములు మెరుపులు మొదలవగానే నెమళ్లు నాట్యం చేయడం ప్రారంభిస్తాయి. ఇక్కడ నటరాజైన శివుని దిక్కైన ఈశాన్యంలో ఆకాశంలో మెరిసే మెరుపుతీగను కవి నాట్యాచార్యుని చేతిలోని పసిడి బెత్తంగా వర్ణించాడు. ఆ దిక్కుకు అధిపతియైన ఈశానుడే (శివుడే) నాట్యాచార్యుడై ఎత్తిన చేతిలో పసిడి బెత్తంతో తొలకరిలో భూమిపైని నెమళ్లచే నాట్యం చేయిస్తున్నట్లున్నదట. ఎంతటి అద్భుతమైన కల్పనయిది! బహుశా అతి కొద్దిమంది మహాకవులు మాత్రమే యిలాంటి కల్పనలు చేయగలరనేది ప్రత్యక్షర సత్యం.

వర్షర్తువు యొక్క ఆగమనాన్ని కవి ఎలా వర్ణిస్తున్నాడో చూడండి. సమయవీరుడు (కాలపురుషుడు) వేసవి అనే తన శత్రువును త్రోలివేయగా, మొగిలు (మొయిలు - మేఘము) సింహనాదంచేస్తూ (ఇక మీదట అంతా నా యిష్టారాజ్యమే అన్నట్లు) పాంథ తతి (బాటసారుల సమూహము, తెరువరుల గుంపు) యొక్క గుండెలు ఫక్కున పగిలేటట్లు, దిక్కులు ఘూర్ణిల్లేటట్లు ఘుమఘుమ ఉరిమిందట. (అడవులలో కాలిబాటను వెళ్లే పథికులకు సింహనాదం వింటే గుండె గుభిల్లుమంటుంది. పైపెచ్చు బాటసారుల ప్రయాణానికి వర్షాకాలం అననుకూలమైనది. వానరాకడ అందరికీ ఆనంద దాయకమే అయినా తెరువరులకు మాత్రం కంటక ప్రాయం. అందుకే కవి మేఘ గర్జనను పాంథులపాలిటి సింహనాద మన్నాడు.)

'ఔరా! తనవారే అయిన చాతక గణాన్ని (వాననీరు మాత్రమే త్రాగి జీవించే చాతక పక్షుల సమూహాన్ని) మేఘుడు రాళ్లతో కొడుతున్నాడేమిటి?' అన్నట్లుగానూ; స్థిరను (భూమిని) అనంత (ఆకాశము) పూవులతో పూజిస్తున్నదా?' అన్నట్లుగానూ పూజాసుమాలలా ఆకాశాన్నుంచి వడగండ్లు జలజలా రాలాయట! (వాన నీటి బిందువుల కోసం కాచుకున్న చాతక పక్షులకు వడగళ్లు అశనిపాతంలా వూహించని ఉపద్రవం వంటివి).

ఇక అప్పుడు కురిసిన వర్షం ఎంత తీవ్రంగా ఉందో చెపుతున్నాడు కవి. 'ఉడుపథము (ఉడువు అంటే నక్షత్రము. ఉడుపథము అంటే ఆకాశము) అనే మఱ్ఱిచెట్టు భూమి మీదికి బలమైన ఊడలు దించిందా? అన్నట్లుగా పెద్ద వర్షధారలతో బెడిదముగా (భయంకరముగా, అధికముగా) అంబుదంబులు (మేఘములు) ఒకటే కుండపోతగా జడిగొని (నిరంతరంగా) జడధులు (సముద్రములు) పొంగగా కుంభవృష్టి కురిసిందట.

## కౌండిన్యుని రాక

ఆ సమయంలో కౌండిన్యుడనే ముని సచ్ఛాత్రుడై (శిష్య సమేతంగా) తీర్థ యాత్రలకు వెళ్తూ మార్గమధ్యంలో ఆ హరిచక్ర పురానికి వచ్చాడట. ఈ సంగతి తెలిసి గోవిందశర్మ ఎదురేగి ఆయన్ని శిష్యసమేతంగా తన యింటికి తోడ్కొని

తెచ్చి, పుత్రులు, తాను, తన భార్య అర్ఘ్య పాద్యమ్మొలిచ్చి, సాష్టాంగ నమస్కారముచేసి, "ఘోరమైన పాపముల సాగరాన్ని దాటలేకున్న నాకు నేటికి కోర్కెలు ఫలించాయి. మీ రాకతో నా గృహం పావనమైంది" అన్నాడట. ఆ తరువాత అమృత ప్రాయమైన భోజన పానీయాదులతో వారిని సంతృప్తి పెట్టి, "ఓ యమివరేణ్యా! (ఓ ముని శ్రేష్ఠా!) వానకాలంలో మీరు తీర్థయాత్రలు చేయడం కష్టం. కనుక ఓ రెండు నెలలపాటు యిక్కడే మా యింట్లో బసచేయండి" అని కోరగా ఆ ఆరణ్యకుడు (బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అనే నాలుగు ఆశ్రమ ధర్మములలోని మూడవదైన వానప్రస్థమును అవలంబించిన వాడైన కౌండిన్యుడు) సరేనని ఆ గృహస్థుకు వైష్ణవాగమ కథా మర్మార్థాలను వివరిస్తూ కొన్ని నెలలపాటు శిష్య సమేతంగా అక్కడే వున్నాడట.

'ఓ భృగుమహర్షీ! నేనప్పుడు డింభకుడనే (పిల్లవాడనే) అయినప్పటికీ, ఆ ఆగమ తత్త్వాలను వినగలగడం నా అదృష్టమనే చెప్పాలి. ఆ మహామహుడు నన్ను అత్యంత దయతో చూసేవాడు. నా చుంచు (పిలకజుట్టు: పిల్లజుట్టు)ను కేలదువ్వుచూ (చేతితో దువ్వుతూ), నా లేత చెక్కిళ్లను మృదువుగా స్పృశిస్తూ, ముద్దుముద్దుగా పిలుస్తూ, నన్ను ముద్దుపెట్టుకుంటూ, నాకు తిరుమణి దిద్ది, నన్ను ఎంతో ఆదరిస్తారుగాని, అవతలకు పొమ్మని మాత్రం అనరు. నాకైతే ఆకలి, దప్పిక అనేవి కూడా వుండేవి కావు. వారి తోడిదే నా లోకం. ఆ మమత ఎట్టిదోకాని, ఆ మౌనివరుడే నాకు చక్రాంకనం చేసి (శంఖ చక్ర చిహ్నములకు పాత్రుడిని చేసి) నాకు మంత్రోపదేశం చేశాడు.

## నారదుడి తపస్సు

'తర్వాత కొంతకాలానికి కౌండిన్యుడు శిష్యగణంతో సహా అక్కడినుంచి తీర్థయాత్రలకు వెళ్లిపోయాడు. నా తల్లి మరణించింది. నేను గోవిందశర్మకు ఎరగి (నమస్కరించి) నేను అడవికివెళ్లి తపస్సు చేసుకుని భవ వారిధిని (సంసారమనే సాగరాన్ని) దాటే ఉపాయం ఆలోచిస్తాను. నాకు సెలవివ్వమని కోరాను. ఆయన అనుమతి తీసుకొని కొన్ని దినాలు ప్రయత్నించి కుధర తతులలో (పర్వత సమూహములలో) ఘనమైనట్టి ఘటికాద్రికి చేరుకున్నాను. ఎట్టి చపలత లేకుండా, శీతాతప వర్షబాధలకు (చలి, ఎండతాపము, వర్షము మొదలైన బాధలకు) దైన్యం పొందక (అధైర్యపడక) నేను తపస్సు చేశాను. హరి ఆ తపస్సునకు మెచ్చి చపలము (మెరపుతీగ)ను పోలిన పచ్చని దట్టిని నడుముకు కట్టుకుని, చేతులలో శంఖ చక్రములను పట్టుకుని, గరుడపచ్చ (గారుత్మతము, ఇంద్రనీలమణి) చాయగల నల్లని శరీరముతో, చలి, వేడి వెలుగు చూపులతో (విష్ణువుకు ఒక కన్ను చలి వేలుపైన చంద్రుడు కాగా, మరియొక కన్ను వేడివెలుగువేలుపైన సూర్యుడని నమ్మకం) వనధికన్యక సాగరసుతమైన (లక్ష్మీదేవి) ప్రేమతో కొలువుండే వక్షంలో శ్రీవత్సలాంఛనము అలరగా, హారములు, కిరీటము, మంజీరములు (అందెలు, నూపురములు) వగైనాలనుండి వెలువడే కాంతులు దిక్కులకు ఆమనిదై (వసంతస్తవలా) పరచుకొనగా తార్క్ష్యునిపై (గరుత్మంతునిపై) నెక్కి ప్రత్యక్షమై రభసగతిన (అతివేగంగా) యిలా వచ్చి అలా వెళ్లిపోయాడు. ఆ తొందరలో ఇందిరారమణుడి (లక్ష్మీపతి) మూర్తిని (స్వరూపాన్ని) నేను చూడలేక పోయాను. ఆయన నిజస్వరూపాన్ని తృప్తితీరా చూచితీరాలనే దృఢవాంఛతో నేను తిరిగి ఘోరతపస్సుకుపక్రమించాను. అప్పుడు అశరీరవాణి నాతో 'నీవెంతగా తపస్సు చేసినా యీ జన్మకింతే! నీకు మరుజన్మలోనే లక్ష్మీపతి కటాక్షం సిద్ధిస్తుంది.' అనగా జన్మాంత పర్యంతము (ఈ జన్మముగిసే వరకూ) ఈ తనువెందుకు? అని యోగ ప్రక్రియద్వారా నా శరీరాన్ని విసర్జించి వనజాతోద్భవునికి (నీటినుండి పుట్టినదైన తామరకు పుట్టిన బ్రహ్మకు) నందనుడిగా (కుమారుడిగా) దివ్యమూర్తిని గైకొన్నాను" అన్నాడు నారదుడు.

ఇక్కడ మనమింకో ముఖ్య విషయం గమనించాలి. నారదుడి పూర్వజన్మ వృత్తాంతాన్ని యిలా తెలపడం ద్వారా రామకృష్ణకవి తాను

వైష్ణవములోని వైఖానసశాఖకు చెందిన వాడినని చెప్పకనే చెప్పుకున్నట్లయింది అదెలాగంటే - తరళ, హరిశర్మలకు జన్మించిన బాలుడైన నారదుడికి పాంచరాత్రాగమానికి మూలపురుషునిగా భావించబడుతూన్న కౌండిన్యుడు చక్రాంకనం చేసి, మంత్రోపదేశం చేశాడు కవి వర్ణించిన దానినిబట్టి హరిశర్మ వైఖానస శాఖకు చెందిన వాడై వుంటాడని మనం ముందే అనుకున్నాం కాని తరళ ఎవరో తెలియదు ఇండ్లలో పనిపాటలు చేసుకుని బ్రతుకుతూన్నది కనుక సమాజంలోని అణగారిన వర్గాలకు చెందినదై వుండవచ్చు. నారదుడి జననానికి పూర్వం వైఖానసుల నియమం ప్రకారం 'విష్ణుబలి' అనే సంస్కారం ద్వారా తప్తచక్రాంకితం చేయబడిన పాయసాన్ని ఆమెకు ప్రాసనం చేయించినట్లెక్కడా లేదు కనుక గత జన్మలో నారదుడు ఆగర్భ వైష్ణవుడు కాదు జన్మించిన కొంతకాలానికి - అంటే కవి పేర్కొన్న దాన్నిబట్టి నారదుడు నాలుగైదు శరత్తుల వయస్సుకల బాలునిగా పెరుగుచూ వుండగా - కౌండిన్యుడు అతడిని సుదర్శన శంఖ చిహ్నములకు పాత్రుడిని చేసి అతడికి మంత్రోపదేశము చేశాడు (2-51). ఇలా జన్మించిన అనంతరం అంకన సంస్కారం ద్వారానూ, గురు మంత్రోపదేశం వలననూ వైష్ణవం స్వీకరించడం పాంచరాత్ర, శ్రీవైష్ణవ శాఖలలో వున్నది. అయితే వైఖానసులు మాత్రం యిలా అంకన సంస్కారం, మంత్రోపదేశం పొందిన వారు వైష్ణవులైనప్పటికీ వారికి విష్ణు సాక్షాత్కారం లభించదనీ, కనుక వారికి భగవదర్చనార్హత లేదనీ నమ్ముతారు విష్ణుబలిలో గర్భిణి చక్రాంకనం చేయబడిన పాయసం తింటే గర్భస్థ శిశువు వైష్ణవుడైనట్లేననీ, అట్టి ఆగర్భవైష్ణవులకే విష్ణు సాక్షాత్కారం లభిస్తుందనీ, భగవదార్చనకు వారే అర్హులనీ వారు విశ్వసిస్తారు ఈ కథలో ఆగర్భవైష్ణవునిగా జన్మించని నారదుడు ఎంతతీవ్ర తపస్సు చేసినా అతనికి విష్ణు సాక్షాత్కారం కలుగలేదు పైపెచ్చు అశరీరవాణి అతడితో నీ వెంతగా తపస్సు చేసినా యీ జన్మకింతే నీకు మరుజన్మలోనే లక్ష్మీపతి కటాక్షం సిద్ధిస్తుంది' అంటుంది (2-57). ఇలా ఐదేళ్ల బాలునిగా చక్రాంకనమూ, మంత్రోపదేశమూ పొందినప్పటికీ ఆగర్భవైష్ణవుడు కానట్టి నారదుడికి ఆ జన్మలో విష్ణు సాక్షాత్కారం లభించక యోగప్రక్రియ ద్వారా ఆయన తన శరీరాన్ని చాలించి మరుజన్మలో బ్రహ్మ కుమారునిగా జనియించాడని వర్ణించడాన్నిబట్టి రామకృష్ణకవి వైఖానస శాఖకు చెందినవాడని రూఢిపడుతూన్నది వైఖానస (వడహల) శాఖకు చెందిన తన గురువైన భట్టరు చిక్కాచార్యులు వద్ద వైష్ణవం స్వీకరించి, కృష్ణయజుర్వేదం చదువుకొని, వైఖానసాగమ మర్మాలను క్షుణ్ణంగా తెలుసుకుని ఆ శాఖలో ఎంతటి సాధికార పరిజ్ఞానాన్ని స్వంతం చేసుకున్నప్పటికీ ఆగర్భ అంకన సంస్కారం పొందని కారణంగా రామకృష్ణకవి కూడా వైఖానస పక్షవాది (*Champion of the Vaikhanasas*) గా గుర్తింపబడినా ఆగర్భవైష్ణవుడు' కాలేకపోవడం విచిత్రం బహుశా అందుకేనేమో రామకృష్ణకవి తాను నారదునితో తాదాత్మ్యమై నారదుడు భృగు మహర్షితో చెపుతున్నట్లే యీ కావ్యాన్నంతా ప్రథమ పురుషలో చెప్పాడు

అప్పుడు భృగుమహర్షి "ఓ నారదా! విను జనులకు (వినే ప్రజలకు) కొంగు కనకము (కొంగు బంగారము), విద్యా జనకము అయిన పుణ్యకథను వినిపించావు. అది అద్భుతంగా వుంది. అయితే ఘటికాచల వృత్తాంతము కూడా వినితీరాలని ఆసక్తిగా వుంది. నా వీనులకు విందయ్యేటట్లు ఆ వృత్తాంతం కూడా వినిపించు" అని కోరాడు.

## జల ప్రళయం

అప్పుడు నారదుడు "పరమాణు సమూహములను లెక్కపెట్ట గలిగిన వారు సైతం ఘటికాద్రి మాహాత్మ్యం యింతని చెప్పలేరు. అయినా నాకు తెలిసిన కొద్దిపాటి వృత్తాంతాన్ని వివరిస్తాను. విను. ఒకప్పుడు వనజనాభుడిని (విష్ణువును) చూడగోరి నళినాప్త తేజులు (సూర్యుడి రథంలాగే గుఱ్ఱాలు), సప్తర్షులు మొదలైన చాక్షుష మన్వంతరాంతంలో (పధ్నాలుగు మంది మనువులలో ఆరవవాడైన చాక్షుష మనువుదైన మన్వంతరం ముగిసే సమయంలో -డెబ్బైఒక్క దివ్యయుగములు ఒక మన్వంతరము. అంటే 4320000 మానవ సంవత్సరాలు. ఇది బ్రహ్మ రోజులో పధ్నాల్గవ వంతు. మొత్తం పధ్నాలుగు మన్వంతరాలూ కలిసి బ్రహ్మకు ఒక రోజు. మనం ప్రస్తుతం ఏడవవాడైన వైవస్వతమనువు కాలంలో వున్నాం.) అర్ణవములన్నీ (సముద్రములన్నీ) ఒక్కటై మహా జలప్రళయం వచ్చినప్పుడు హరి ఏకశృంగ మహామత్స్యమై (ఒంటికొమ్ముకల పెద్దచేప

రూపాన్ని ధరించి) కరుణబూని వివస్వత్తనయుడిని (వివస్వత్తు అంటే సూర్యుడు. సూర్యుని కుమారుడైన వైవస్వత మనువును) కాపాడబూని యావజ్జీవులనూ మేదినీ రూపమైన ఓడలో నింపి వాసుకికి దానినంటగట్టి తీసుకెళ్లి శతశృంగ పర్వతంపై నిలిపాడట. ఇక అక్కడి నుండి వైవస్వత మనువు మానవ సమాజాన్ని పునర్నిర్మించి, దానికి తగు విధమైన ధర్మ సూత్రాలను నిర్దేశించి మార్గదర్శకునిగా ప్రసిద్ధికెక్కాడు.

ఈ కథనంలో శాస్త్రీయత ఏ మేరకున్నదనే విషయాన్నటుంచితే, ప్రపంచంలోని అన్ని మత గ్రంథాలలోనూ ప్రస్తావించబడిన పెద్ద జలప్రళయమొకటి ఒకప్పుడు యావత్తు విశ్వాన్నీ ధ్వంసం చేసివుంటుందనేది నిర్వివాదాంశం. బైబిల్‌లో మహా జల ప్రళయం (*Deluge*) ని గురించిన ప్రస్తావన వుంది. బైబిల్ లోని మొత్తం కథన కాలాన్ని జలప్రళయానికి ముందరి కాలం (*Pre-diluvian period*) గానూ, జలప్రళయానంతర కాలం (*Post - diluvian period*) గానూ విభజించారు. భారతీయ ఐతిహ్యాల ప్రకారం జలప్రళయాన్నుంచి సకల జీవరాశుల్నీ రక్షించి, సమాజానికి మొదటి ధర్మసూత్రాల్ని నిర్దేశించినవాడు 'మనువు' అయితే, బైబిల్ ప్రకారం నొవహు లేక నోవా (*Noah*) అనేవాడు జలప్రళయం సందర్భంగా యిదే పనిచేశాడు. ఒక పెద్దపడవ (*Noah's Great Ark*) ను నిర్మించి, సకల జీవరాశులను అందులో వుంచి, జలప్రళయాన్నుంచి అతడు కాపాడాడట. (*The Bible - Genesis 6-9*) ఆ మహాప్రళయంలో ఆ పెద్దపడవ ఒక కొండకొమ్మును తాకి నిలిచిపోవడం – ఆ తరువాత సకల జీవాలు తిరిగి పునరుత్పత్తిని ప్రారంభించడం జరిగిందట. ముస్లిముల పవిత్ర గ్రంథం "ఖుర్-ఆన్" ప్రకారం జలప్రళయం సందర్భంగా యిదే పనిని 'ను – అలై' చేశాడట.

మిగిలిన అశాస్త్రీయ విషయాల్నటుంచి మను, నోవా, ను – అలై – యీ పేర్లలో గల సారూప్యత, జలప్రళయం జరిగిందనడం సత్యమే అయివుంటుందని అనిపింపజేస్తున్నది. అంతేకాదు, యావత్తు మానవాళికీ మూలాలు ఒకటేననే విషయాన్నీ మనకు స్ఫురింపజేస్తున్నది.

ఇక వైవస్వత మనువు వ్రాసిన 'మనుస్మృతి'లో పన్నెండు అధ్యాయాలున్నాయి. ఇది అష్టాదశ (18) స్మృతులలో శ్రేష్ఠమైనది. ఇది క్రీ. పూ. 500 ప్రాంతంలో రచించబడిందని చారిత్రకులు నమ్ముతున్నారు. దీనికి కుల్లూక భట్టు అనే ఆయన 'మన్వర్థ ముక్తావళి' అనే పేరుతో వ్యాఖ్యానం వ్రాశాడు. 'మనుస్మృతి'లో మనిషి మనుగడకు, నాటి సమాజానికి అవసరమైన ఎన్నో ఆరోగ్య, ఆహార నియమాలు, రాజకీయ సామాజిక సూత్రాలు పొందుపరచబడ్డాయి. గృహస్థ ధర్మాలు, రాజధర్మాలు, తపోనియమాలు వగైరాలూ పేర్కొనబడ్డాయి. మారిన కాలానికి అనుగుణంగా సామాజిక, రాజకీయ నియమాలు కూడా మారితీరాలి. అయితే, కొందరు ఛాందసులు ఏ వాక్యమైనా 'మనుస్మృతి'కి భిన్నంగా వుంటే ఆ వాక్యాన్ని ప్రమాణంగా విశ్వసించరు. 'మనుస్మృతి'లో చెప్పబడిన ప్రతి వాక్యమూ నేటికీ అనుసరణీయమేనని కూడా వారు వాదిస్తారు. ఇది అర్థరహితం. 'మనుస్మృతి'లో నేటికీ అందరికీ ఉపయోగపడే ఆహార నియమాలు, ఆరోగ్యసూత్రాలు, అతిథి మర్యాదలు వగైరా గృహస్థ ధర్మాలు ఎవరైనా పాటించవచ్చు. అభ్యంతరం లేదు. అయితే నేటి సమాజానికి పొసగని నియమాలూ, సూత్రాలూ పట్టుకుని వ్రేళ్లాడడమే అర్థరహితమూ, అశాస్త్రీయమూ. ఇది నేటి సమాజానికి అభ్యంతరకరం కూడా.

## శతశృంగ పర్వతం

ఆకాశగంగా తరంగాలనుండి చల్లని పవనాలు యీ శతశృంగ పర్వతం మీదికి వీస్తాయట. ఇక్కడ అనిశము (అనవరతము – ఎల్లప్పుడూ) విద్యాధర, గరుడ, ఉరగ (నాగ) కాంతలు శ్రీహరిని కీర్తిస్తూ పాటలు పాడుతూంటారట. 'వెలలు మించిన మాణిక్యాలను ధరించి, పునుగు, కస్తూరి, కర్పూరము, జవ్వాది మొదలైన సుగంధద్రవ్యాలను పూసుకుని హిమవారి (మంచునీటి)లో మునిగి స్నానం చేస్తున్న వాసికెక్కిన (ప్రసిద్ధికెక్కిన) రాజులా' అన్నట్లు అక్కడి స్వచ్ఛమైన నీటిలోని రాళ్లు ప్రకాశిస్తున్నాయట. ఇక ఆ శతశృంగపర్వతం కొమ్ములు దాదాపు చంద్రబింబాన్ని తాకేటంత సమున్నతంగా వున్నాయని ఓ గమ్మత్తైన పద్ధతిలో రామకృష్ణకవి చెప్పాడు.

చేరువగానున్న నెలజింకకు (చంద్రునిలో వుంటుందని విశ్వసించబడే జింకకు) ఆ గిరి హరిణము (ఆ శతశృంగ పర్వతంపై గల కొండ జింక) ఆహార మివ్వడానికి సెలవి పూరిని (సెలవి అంటే పెదవి మూల. పూరి అంటే గడ్డి) అందిస్తున్నదట దయోదారతతో. ఆహా! బంధుభావమెంత గొప్పది! (తన నోటిలోని గడ్డిని చంద్రునిలోని జింక నోటికి ఆ కొండ జింక అందించ బోయిందంటే, శతశృంగ పర్వతం చంద్రుడిని తాకేటంత ఎత్తైనదని చెప్పకనే చమత్కారంగా చెపుతున్నాడు కవి.)

ఆ శతశృంగ పర్వతం మీదనే ఘోరతపస్సు చేసిన అర్జునుడు ఉగ్రునితో (శివునితో) భండనము (యుద్ధము) చేసి అతడి నుండి పాశుపతాస్త్రాన్ని వరంగా పొందాడట.

శతశృంగ పర్వతమంటే వేయి కొమ్ముల పర్వతము. ఇది హిమాలయాల లోనిదే. ఇక్కడే ఒకప్పుడు పాండురాజు కుంతీ, మాద్రులతో కలసి తపస్సు చేశాడట. వారిక్కడ ఉన్నప్పుడే దుర్వాసముని కుంతీ, మాద్రులకుపదేశించిన మంత్ర ప్రభావంతో వారిరువురూ పాండవులను కన్నారు

# సప్తర్షుల తపస్సు

ఇక కవి ఆ పర్వతం మీద సప్తర్షులు ఎంతటి ఘోరతపస్సు నాచరించారో చెప్తున్నాడు.

ఆ శతశృంగ పర్వతం మీద రాజీవములు (తామర పూలు), కుముదముల (కలువ పూల) తో విరాజిల్లుతున్న, మరాళములు (హంసలు), సారసములు (బెగ్గురు పక్షులు) వగైరా నానావిధ పక్షిజాతులతో విలసిల్లుతున్న ఒక సరోవరాన్ని చూసి, దాని ఉదంచిత స్థితికి (ఉన్నత స్థితికి) సంతోషించి, అది తమ అనూన (వెలితిలేని) స్నాన, పాన, అనుష్ఠాన విధానములకు తగినదిగా నెంచి, ఆ తటాకము చెంతనే నిత్యకృత్యములను తీర్చుకొని, కుక్కుటాది మయూరాంత నిగమ నియమాసనములతో నియతాత్ములై నిలిచి (కుక్కుటాసనము మొదలు మయూరాసనము వరకు గల అనేక ఆసనములను వారు వేశారన్నమాట), ఇంద్రియాలను విషయానురక్తికి దూరంచేసి, కాంచన కాచములందు మనస్సును ఏకంగాచేసి (అంటే బంగారాన్నీ, గాజుముక్కనూ ఒకటిగానే భావించే తత్త్వాన్ని అలవరుచుకుని) మమతలు కోసి (ప్రేమలు త్రుంచివేసి) సుషమ, విశోక, జ్యోతిష్మతి, విషయవృత్తి అనే ప్రసిద్ధమైన ధారణలతో (ధారణ అంటే మనస్సును ఒక విషయంపై లగ్నం చేయడం. ఇది యోగసాధన లోని అష్టాంగములలో ఒకటి – యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు – పతంజలి యోగశాస్త్రంలో పేర్కొన్న ఎనిమిది యోగాంగాలు); కామప్రకోపాన్ని అణచివేసి, ఇందిరాసుందరీ మనోహరుడగు హరిని ఆనందంతో మనస్సులో పొందుపరచి ఎటువంటి చంచలత కానీ, వేసట కానీ లేకుండా తపస్సు చేస్తున్నారట ఆ సప్తర్షులు.

వైజయంతము అనబడే ఇంద్రసభలో నిండుకొలువై యున్నాడట ఆఖండలుడు (ఇంద్రుడు). అప్పుడెక్కడినుంచో ఒక చారుడు (వేగులవాడు) నుదుటి నుంచి పాదముల వరకు ఒకే ధారగా కారుతూన్న ఘర్మ కణజాలముతో (చెమటతో), రొప్పుతూ, శరీరం వణకుతూ, వారిస్తున్న దౌవారికులను (ద్వారపాలకులను) దాటుకుంటూ, కైవారపు వారిని (వంది మాగధులను) తొలగదీసుకుంటూ, కిన్నరులు (సంగీత, గానములతో దేవతలను ఆనందింపజేసే జాతివారు), చారణులు (దేవతలను తమ నాట్య వినోదాలతో ఆనందింపజేసే నట్టువజాతి ఖేచరులు) వగైరాలను తప్పుకుంటూ దేవేంద్రుని సముఖం చేరి, భయంగా నిలుచున్నాడట.

అతడు దేవేంద్రుడిని లెస్సగా పొగిడి, ఆ తరువాత యిలా అంటాడు "దేవేంద్రా! ఇదివరకు తమకు అనుకూలురుగా

వుండిన మాన్యచరితులైన భరద్వాజ, కశ్యప, గౌతమ, అత్రి, కౌశిక, జమదగ్ని, వసిష్ఠమునులు, పరమ పతివ్రతా మణియైన అరుంధతి - అతి తీవ్ర నియమములతో శతకూట పర్వతంపై ఉగ్ర తపస్సు చేస్తూన్నారు. వారు కోరుకుంటున్నది - నాకమో (స్వర్గమో); నళినభవుని లోకమో (పద్మసంభవుడైన బ్రహ్మయొక్క సత్యలోకమో); స్మరవైరి లోకమో (మన్మథునికి శత్రువైన శివుని కైలాసమో) లేక ముకుంద లోకమో (విష్ణువు యొక్క వైకుంఠమో). మరుగుబెట్ట కుండా (దాచకుండా), వెరవకుండా (భయపడకుండా), మరపు లేకుండా (మరచిపోకుండా), కన్నకార్యములు (చూచిన విషయములు) మరియు విన్న కార్యములు (విన్న విషయములు) అన్నియూ, విన్నపమొనర్చడమే (స్వామికి విన్నవించుకొనడమే) వేగరులకు (గూఢచారులకు) నీతి. చిత్తము. ఇక దేవర (ప్రభువు) పరాకు చేయతగదు. వెంటనే యీ విషయమై ఏదో ఒక చర్య తీసుకోవాలి." వెంటనే ఇంద్రుడు ఒక భృత్యుడిని పిలిచి తక్షణం రంభను పిలచుకు రమ్మన్నాడు.

## దేవేంద్ర సభకు రంభ రాక

రంభ ఇంద్ర సభకు బయలుదేరింది. ఆమె ఆ పరిస్థితిలో ఎలా వున్నదో వర్ణిస్తున్నాడు కవి. చల్లని పన్నీట్లో జలకాలాడిందట. చెంగావి (మనోజ్ఞమైన ఎర్రని) పావడ (నడుముకు కట్టుకొనే వస్త్రం) యొక్క జిగి (కాంతి) అందగిస్తున్నదట వెలిపట్టు (తెల్లని పట్టు వస్త్రాన్ని) జిలుగుగా (సూక్ష్మ వస్త్రంగా) నడుముకు కట్టిందట. కర్పూర తిలకం దిద్దిందట. కమ్మని తావులు (సువాసనలు) కదలంట (వ్యాపించునట్లుగా) కొప్పులో (సిగలో) మందార కుసుమ దామములు (మందార పుష్ప మాలలు) చెరివిందట. ఒంటి మీద పంకజ గంధము (తామర పుష్పముల సౌరభము) పూత జవ్వాది తావి (పూసుకున్న సంకుమదపు గుబాళింపు) ఒకదాని నొకటి త్రస్తరిస్తున్నాయట (పరిహాసం చేస్తున్నాయట). కను రెప్పలపై జిగిబిగి (అల్పముగా) కాటుక రేకను దిద్దిందట. గబ్బిగుబ్బచన్నులపై (గంభీరమైన పెద్ద పాలిండ్లపై) ధవళకాంతులతో మెరుస్తూ వెన్నెలల పంటలా వున్న హార వితతి (హారముల సమూహము) చెన్ను గులకరించిందట (అందము మరింత రమ్యమైందట). తొలకరి మెఱుంగు (తొలకరి మెరుపు) వలె ఆమె మేను తులకరించిందట (ప్రకాశించిందట). ఆమె మెల్లమెల్లగా నడుస్తూంటే ఆమె మెట్టెదోయి (కాళ్లకున్న మట్టెలు) కదలి ఘల్లుఘల్లుమని తాళగతులలో మ్రోగుతున్నాయట. ఆమె నడచి వస్తూంటే కీరమా? (చిలుకా?) లేక చిల్కతురికీ దొర (చిలుక గుర్రముగా కల దొర – మన్మథుడు. తురికి అంటే గుర్రము) యొక్క రాణి (రతీదేవి) ధరించు మౌక్తిక (ముత్యాల) హారమో? పాకజిజ్జియ విహారమో? (పాకాసురుడిని చంపిన ఇంద్రుని తోటయైన సందనవనమో?), నిండు వెన్నెలకు ప్రతిరూపమా? మెరుపు తీగ కాంతుల సారమా? ఔరా! అంటూ చూపరులు పదేపదే పొగడుతూండగా హంస నడకలతో రంభ బలారి (బలాసురుడి శత్రువైన ఇంద్రుడి) వద్దకు వచ్చిందట.

రామకృష్ణకవి రంభ అందాన్ని తనివితీరా ఏకబిగిన రెండవ ఆశ్వాసంలోని 76వ పద్యం నుండి 93వ పద్యం వరకు మొత్తం 18 పద్యాలలో వర్ణించాడు. గ్రంథ విస్తరభీతితో ఆ చక్కటి పద్యాలనిక్కడ స్పృశించకుండా కథాంశాన్ని కొనసాగిస్తున్నాను.

## రంభ భీషణ ప్రతిజ్ఞ

తన వద్దకు వచ్చిన రంభతో ఇంద్రుడు ఆమెను రావించిన కార్యాన్ని తెలిపి, శతకూటపర్వతంపై ఉగ్రతపస్సు చేస్తూన్న సప్తర్షుల తపమును భంగంచేసి లోకాల తాపాన్ని పోగొట్టమన్నాడు. అలాగేనని బయలుదేరింది రంభ. ఇంద్రసభనుండి వెళ్లబోయే ముందు సభలో రంభ ఓ భీషణ ప్రతిజ్ఞ చేసింది.

గీ॥ తాళవృంతంబు నిలువుటద్దంబు కుంచె
పసిడి కాళంజి కపురంపు పైడిగిండి
యడపములు మోచి మునులు నాబడిని కాణ
యాచి బంటులు వోలె రా నరుగుదెంతు.

(ఘటికాచల మాహాత్మ్యము 2-97)

ఈ పద్యంలో రంభ ఎంతో గర్వంగా ఆ సప్తర్షుల తపస్సును భగ్నం చేసి తన పరికరాలన్నీ వాళ్లచేత మోయిస్తూ తిరిగి ఇంద్రసభలో అడుగు పెడతానని బీరాలు పలుకుతున్నది. తాళవృంతము అంటే (తాటాకు) విసనకర్ర; నిలువుటద్దము; కుంచె – తన అందాలకు మెరుగులు దిద్దుకునేది; పసిడి కాళంజి (కాళంజి అంటే తమ్మ పడిగము. అంటే తాంబూలమును ఊసే పాత్ర) కపురంపు పైడిగిండి (సన్నని మెడగల బంగారు చెంబు. దీనిలో కర్పూరం కలిపిన పానీయం పోసుకుని ప్రయాణంలో వెంట వుంచుకుని దాహం తీర్చుకుంటారు). అడపము అంటే తమలపాకులు, వక్కలు వగైరాలు వేసుకునే తిత్తి. ఆ తిత్తిని మోసుకొచ్చే పురుషుడిని 'అడపకాఁడు' అనీ, స్త్రీని 'అడపకత్తె' అనీ అంటారు. అడపములనే సంస్కృతంలో 'ఘౌలికములు' అంటారు. తమలపాకులకు ఒక తిత్తీ, వక్కలు, సున్నము, కస్తూరి, జాజికాయ, జ్యాపత్రి, ఏలకులు వగైరాలు వేసుకొనడానికి మరొక తిత్తీ – అంటే వేర్వేరుగా రెండు అడపములుంటాయన్నమాట. ఇవన్నీ మోసుకుంటూ ఆ మునులు నా బడిని (నా వెంటబడి) కాణయాచి బంట్ల వలె తిరిగి వస్తారు. (కాణయాచి బంటు అంటే వేశ్య వద్దనుండే పురుష సేవకుడు - *Pimp.* వీరు సాధారణంగా షండులై వుంటారు. కాణయాచి అంటే చిరకాలానుభవం కల స్త్రీ. గడనకత్తె. వేశ్య). ఇలా సప్తర్షులు ఏడుగురి చేతనూ వేశ్యలు వాడే ఏడు వస్తువులను మోయించుతానని ప్రగల్భాలు పోతున్నది రంభ. వాళ్లు నా వస్తువులన్నీ మోసుకుంటూ కాణాచిబంట్ల వలె నా వెంట రాగా నేను తిరిగి యీ సభలోకి అరుగుదెంచుతాను (వస్తాను). "ఓ దివిజేశ్వరా! ఇది నాకొకపనా? నా దృష్టికి మదనవిరోధి (శివుడు) కూడా నిలువజాలడు. వాళ్లెంత?" అంటూ బయల్దేరిందట.

రంభాదులు ఆ శతశృంగ పర్వతం చేరేముందు అక్కడికి ఆమని వన్నెకాడు వచ్చి చేరాడట. అంటే వసంత ఋతువు ఆరంభమయింది.

## రంభాదుల కుసుమహరణం

దాంతో రంభ, తిలోత్తమాది ముఖ్య అప్సరసలు రకరకాల అడవిపూలు కోసుకుంటూ మైమరచి పరాచకాలాడుకున్నారట. ఆ వనజముఖులు (పద్మముఖులైన స్త్రీలు) సాగించిన కుసుమహరణాన్ని (పూవులు కోయడాన్ని) ఎంతో రమ్యంగా వర్ణించాడు కవి. ఈ పద్యం చూడండి –

సీ॥ నీకేల యటువోవ నీకేల నందుకొ
మ్మా కొమ్మ నీ కొమ్మ మలయు విరులు
కేసరంబులు వేనికే సరమ్మునకైన
భాసిల్లు నందన ప్రసవచయము

చెంప చంపకమున్న చేరనేరదు తేఁటి
చంపకామోద యీా సరస నిలుము
వావిలిపూవు లివా విలువకు మఱి
సేవంతి నీవంతు సేసినాము
బాల నీ కింద పూఁబాళ యేలమాకు
కేళికొదవెను నీకు కంకేళి చివురు
మొల్లలేమొల్ల మెల్లరు మెల్లరారె
యనుచుఁ బువ్వులు గోయుచు వనజముఖులు. **(ఘటికాచల మాహాత్మ్యము 2-104)**

అందులో ఒక యువతి మరో యువతితో అంటున్నదట – నీకేల యటువోవ (నీవు అటెందుకు వెళ్లావు?; నీకేల నందుకొమ్మా – నీచేతితో తీసుకో; కొమ్మను; ఈ కొమ్మ మలయు విరులు – ఈ కొమ్మంతా విరులు (పూలు) వ్యాపించివున్నాయి; కేసరంబులు – పొగడపూలు; వేనికి ఏ సరమ్మునకైనా – ఎటువంటి పూల దండలోనికైనా; భాసిల్లు నందన ప్రసవచయము – వెలుగొందే నందనవనంలోని పుష్పసముదాయము వంటివి; చెంప చంపకమున్న – కపోలమున (లేక) చెవిలో చంపక పుష్పము (సంపెఁగ లేక గంధఫలి) ధరిస్తే; చేరనేరదు. తేఁటి – తుమ్మెద చేరనేరదు – అసలే స్త్రీలు పద్మముఖులు కదా; వారి ముఖాలు నిజంగా పద్మాలని భ్రమించో ఏమో స్త్రీల ముఖాలపై తుమ్మెదలు ముసురుతాయట. కవులు చెప్పే దాన్నిబట్టి అందమైన స్త్రీల నిట్టూర్పులలోని సుగంధం కోసం కూడా తుమ్మెదలు స్త్రీల ముఖాలపై తిరుగాడుతాయట. అయితే తుమ్మెదలెప్పుడూ సంపెఁగ (గంధఫలి) పూవులకు ఆమడదూరంలో ఉంటాయట. మరి వాటికి సౌరభమేకానీ, వాటిలో తుమ్మెదలకు కావల్సిన మకరందం వుండదు కదా! కనుక, ఓ చంపకామోదా! (చంపకం యొక్క సౌరభం కలదానా!) యీా సరస నిలుము – ఇక్కడ నిల్చో – నీ చెవిలో చంపక పుష్పం పెడతాను.

నల్లవావిలి పూవులు చిన్నవిగా లేత వంగపండు రంగులో వుంటాయి. ఔషధ వృక్షమైన నల్లవావిలి (*Vitex negundo*) ని సంస్కృతంలో 'శేఫాలి' (శేఫముల సముదాయము) అని అంటారు. వావిలి పూలను కోస్తూ 'యివి పేరు వరకేనా విలువకు యీాయవా మఱి?' అని చమత్కారంగా ప్రశ్నిస్తున్నారట ఆ రమణీమణులు.

'ఇదిగో సేవంతి నీవంతుకు వచ్చింది. తీసుకో' –

సేవంతి (లేక) సేమంతి (లేక) సేమంతిక – యివన్నీ చేమంతి (*Chrysanthemum*) పేర్లే.

'ఓ బాలా నీకింద (నీకు + ఇంద) పూఁబాళ యేలమాకు? (మాకెందుకు?) పూ + పాళ – పూఁబాళ – పువ్వులు గల పాళ (తోడిపూగుత్తి)'

'కంకేళి' అన్నా 'కంగేళి' అన్నా అశోకవృక్షము *Jonesia asoca Syn Saraca asoca* 'కంకేళి' చిగురు మామిడి చిగురును పోలి మనోజ్ఞంగా వుంటుంది. "కేళికి (ఆటకు) యికనీకు కంకేళి చిగుళ్లే ఒదవినాయి (దక్కినాయి)" అంటున్నదో స్త్రీ. మొల్ల లేక కుందము (*Jasminum pubescens*) చక్కటి అటవీపుష్పం. "మొల్లలేమొల్లము – మొల్లలు మాకేం వద్దు; ఎల్లరు – అందరూ; మెల్లరారె – మెల్లగా యిక్కడి నుంచి కదలి రండి" అంటున్నదింకొకతె.

# పూల మొక్కలపై మానవ ప్రభావం

ఇక కవి వృక్షములు పుష్పించడంపై మానవుల ప్రభావం వివరిస్తున్నాడు. ప్రాచీన కాలంనుంచి వృక్షాలకు ప్రాణముందనీ, అవీ స్పందిస్తాయనీ (*irritability*) ప్రజలు నమ్మేవారు. కొందరు అవి ఆలోచిస్తాయని కూడా నమ్ముతారు. ఇది శాస్త్రీయంగా నిర్ధారించబడలేదు. వాటికి ప్రాణముండడం, స్పందనలుండడం నిర్వివాదాంశములు. వాటిని పలుకరించడం, తాకడం, కౌగిలించుకొనడం వగైరాలు అవి విరివిగా పుష్పించడానికి ఏ మేరకు దోహదపడతాయో యింకా శాస్త్రీయంగా నిర్ధారించబడవలసి వుంది. ప్రఖ్యాత భారతీయ శాస్త్రవేత్త జగదీశ చంద్రబోస్ 'మొక్కలు పిలిచాయి' అనే తమ గ్రంథంలో వృక్షాల స్పందనలు వివరించగా, కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి తమ 'పుష్పవిలాప' కావ్యంలో ఆ స్పందనలకు కవితా రూపమిచ్చి వాటి మూగగోదును లోకానికి ఎలుగెత్తి చాటారు. కాని అంతకు ఎంతో ముందే రామకృష్ణకవి వృక్షాల స్పందనను గురించి ఎందరికో తెలియని విషయాలు కొన్ని చెప్పాడు. అవి నమ్మశక్యంగాకున్నా అద్భుతంగా వున్నాయి. (కథా క్రమంలో అప్సరసల పరంగా పేర్కొనబడినా పూల మొక్కలపై మానవ ప్రభావాన్ని తెలపడమే కవి లక్ష్యం.)

ఈ చక్కటి పద్యం చూడండి -

చ॥ పలుకఁగ నంట నూర్చఁ గనఁ బాడ ముఖాంబుజమెత్త కాలిసో
కుల నుమియంగఁ గౌఁగిలిద గోగు రసాలము సింధువారమున్
తిలకము ప్రేంకణంబు గఱులింపఁగ సంపెఁగ పొన్న వంజుళం
బల సురపొన్న క్రోవియుఁ బ్రాయమ్మున గ్రొవ్విరులిచ్చె హెచ్చుగన్.

(ఘటికాచల మాహాత్మ్యము 2-112)

పలుకగన్ (పలుకరిస్తేనూ), అంటన్ (అంటుకుంటేనూ), ఊర్చన్ (ఊపిరి విడిస్తేనూ; నిట్టూర్పులు విడిస్తేనూ); కనన్ (చూసినా) ముఖమెత్తి పాడినా; కాలుసోకినా, ఉమ్మివేసినా, కౌగిలించుకున్నా గోగుచెట్టూ (గోగు (*Hibiscus Cannabinus*) లో చాల రకాలున్నా ప్రసిద్ధమైనవి రెండు - ఊరగోగు లేక ధనాసగోగు మరియు కొండగోగు; ఇవి కాక కొండగోగు (*Cochlospermum religiosum*) అనే వేరే వృక్షముంది. రసాలము (మామిడి చెట్టు - *Mangifera indica*); సింధువారము అంటే తెల్ల వావిలి (*Vitex trifolia*). నల్ల వావిలిలా యిది కూడా ఔషధ వృక్షమే. తిలకము (తిలకపు చెట్టు - దీనిని ఛత్రపుష్పకమనీ అంటారు - *Cinnamomum malabathrum*. ఇదీ ఔషధవృక్షమే. దీని గింజల్ని పొడిచేసి తేనెతో కలిపి పిల్లలకు వచ్చే గ్రహణి, దగ్గు, జ్వరములకు వాడతారు), ప్రేంకణము (ప్రియంగు - *Callicarpa macrophylla*). ఇదీ ఔషధ వృక్షమే. చల్లదనాన్ని కలిగించే దీనిపళ్లు కుష్ఠు నివారణకు వాడతారు. సంపెఁగ; పొన్న; వంజుళంబు (వంజుళము) (అశోక వృక్షము - *Saraca asoca*. యౌవనవతులైన స్త్రీలు అశోకవృక్షాన్ని కాలితో తన్నిన వెంటనే పూస్తుందనే కథలు మన పురాణ సాహిత్యంలో కోకొల్లలు. సీతను లంకలో రావణుడు చెరబట్టింది అశోకవనంలోనే. ఈ వైద్య వృక్షం స్త్రీల పాలిట కల్పతరువు. ఈ చెట్టు బెరడు రసాన్నుంచి అశోకారిష్ట, అశోక ఘృతము తయారు చేస్తారు. ఇవి స్త్రీల ఋతు దోషాలకు దివ్యౌషధాలు); అల; సురపొన్న (దీనినే కొందరు 'నాగకేసర' అనీ అంటారు. *Ochrocarpus longifolius* ఇదీ ఔషధ వృక్షమే) క్రోవి మొదలైన చెట్లు ప్రాయములో (వయస్సులో) క్రొవ్విరులను (కొత్తపూలను) హెచ్చుగా (విరివిగా) యిస్తాయట.

ఆ తరువాత పద్యంలోనే కవి ఏ వృక్షం పూతకు మానవ సంపర్కం ఎలా దోహదం చేస్తుందో వివరిస్తున్నాడు

చ॥ సురయు మియంగఁ గేసరము చూచినచోఁ దిలకంబు కౌగిలిన్
గురవము తన్న వంజులము కూరిమిఁ బాడఁగఁ బ్రేంకణంబు చే
పరపుల మావి మూర్కొనఁగ వావిలి పల్కఁగ గోగు మోమునె
త్తరచినఁ జంపకం బుమియఁ దా సురపొన్నయుఁ బూచె నయ్యెడన్.

(ఘటికాచల మాహాత్మ్యము 2-113)

కేసర వృక్షము (*Calophyllum inophyllum*) దానిపై సురను (మద్యాన్ని) ఊస్తే పూస్తుందట. కేవలం దాని వంకచూస్తేనే తిలకపుచెట్టు పూస్తుందట; కౌగిలించుకుంటే కురవము (క్రోవి లేక అడవి గోరింట) పూస్తుందట; కాలితో తంతే వంజులము (అశోకవృక్షం) పూస్తుందట; కూరిమితో (ప్రేమతో) పాడితే ప్రేంకణపు చెట్టు (ప్రియంగు వృక్షం) పూస్తుందట చేతితో స్పృశిస్తే మామిడి చెట్టు, మూర్కొంటే (వాసన చూస్తే) వావిలి చెట్టు, పలకరిస్తే గోగుచెట్టు, ముఖమెత్తి అరిస్తే చంపక వృక్షము (సంపెంగ చెట్టు) ఉమియ (ఉమ్మేస్తే) సురపొన్న చెట్టు విరగబూశాయట అక్కడ. ఇంకా ఆ తర్వాత కవి పాదిరి పూవులు (కలిగొట్టు లేక పాటలము - *Bignonia suaveolens*) ఏలకి తీవలు (*Elettaria cardamomum*); గేదఁగి పూలు (మొగలిపూలు - *Pandanus odoratissimus*); బొండుమల్లె (*Jasminum sambac*); గన్నేరు పువ్వులు (కరవీర పుష్పాలు - *Nerium odorum*)లను కూడా ప్రస్తావించాడు.

వివిధ వృక్షాలు పుష్పించడంపై మానవ ప్రభావం ఏ విధంగా వుంటుందనేది రామకృష్ణకవి చాల విపులంగా వివరించాడు అయితే ఆయన చెప్పిన విషయాలు శాస్త్రీయంగా ఏ మేరకు సరైనవో మనం విచారిద్దాం

వృక్షాలు చిగురించడం, పుష్పించడంపై హార్మోన్లు (*Hormones*) అపార ప్రభావం చూపుతాయని శాస్త్రజ్ఞులు నిర్ధారించారు హార్మోన్లు అనేవి వృక్షాల పెరుగుదలను నిర్దేశించే రసాయన పదార్థాలు. పరిమాణానికి చిన్నవే అయినా యివి అత్యంత శక్తిమంతంగా వుంటాయి ఇవి ఒకచోట ఉత్పత్తి అయి, వేరొక చోటికి రవాణా అయి అక్కడ తమ ప్రభావాన్ని చూపుతాయి. హార్మోన్‌లను వృద్ధి నియంత్రకాలు, వృద్ధి హార్మోన్లు లేదా ఆక్సిన్‌లు అని అనేక రకాలుగా వ్యవహరిస్తారు. మొక్కలలో సహజసిద్ధంగా లభ్యంకాని కొన్ని రసాయనాలు కూడా హార్మోన్లవలె పని చేస్తాయి. అంచేత వాటిని కృత్రిమ లేక కృతక హార్మోన్లు (*Synthetic or artificial hormones*) అంటారు సహజ హార్మోన్లకు ఉదాహరణలు - 1) ఇండోల్ - ఎసెటిక్ యాసిడ్ (*Indole Acetic Acid* - $C_{10}H_9NO_2$) ఇది మొక్కలూ, వాటి వ్రేళ్లు త్వరగా పెరగడానికి తోడ్పడుతుంది. 2) ఇండోల్ బ్యుటిరిక్ యాసిడ్ (*Indole Butyric Acid* - $C_{12}H_{13}NO_2$ - మొక్కలు త్వరితంగా పెరగడానికి తోడ్పడుతుంది) 3) ఆబ్సిసిక్ యాసిడ్ (*Abscisic acid* - $C_{15}H_{20}O_4$) ఇది వృక్షాల పెరుగుదలను నియంత్రించే మరో రకం హార్మోన్. చలికాలంలో వృక్షాలు పెరుగుదల తగ్గి నిద్రాణంగా వుండడానికీ, ఆకులకూ, పండ్లకూ అవి కాండంతో కలిసే దగ్గర ఒక పలుచని బెండువంటి పొర ఏర్పడి, వాటి పెరుగుదల మందగించడానికి యీ హార్మోన్ కారణం. 4) జిబరెలిన్‌లు (*Gibberellins*) అనే జీవరసాయనాలు. ఇవి యాస్కోమైసెటస్ ఫంగస్ (*Gibberella fujikuroi*) నుండి ఉత్పత్తయి గింజలు మొలకెత్తడంలోనూ, మొక్క వ్రేళ్లు, ఆకులు, కాండం త్వరత్వరగా పెరగడంలోనూ తోడ్పడతాయి. అంతేకాక జిబరెలిన్‌లు వృక్షాలు విరివిగా పుష్పించడానికి కూడా తోడ్పడతాయి 5) ఆక్సిన్‌లు (*Auxins*) - యివి కూడా మొక్కలలో ఉండే హార్మోన్లు (*Phytohormones*). ఇవి మొక్కలు విరివిగా పుష్పించి, ఫలించడానికి, వ్రేళ్లు బలంగా నాటుకొనడానికి తోడ్పడతాయి. కణవిభజన త్వరితంగా జరగడానికి, కణాలు పొడవు సాగడానికీ యీ హార్మోన్లే తోడ్పడతాయి.

వృక్షాల ఎదుగుదలకూ అవి విరివిగా పుష్పించడానికీ పైన తెలిపిన హార్మోన్లే కాక కార్బన్, హైడ్రోజన్, ఆక్సిజన్, నత్రజని, పొటాషియం, ఫాస్ఫరస్, కాల్షియం, మెగ్నీషియం, సల్ఫర్ వగైరా మూలకాలు ఎంతో అవసరం.

అయితే రామకృష్ణకవి వివరించినట్లు వివిధ మొక్కలను తాకినా, వాటిపై ఉమిసినా, కేవలం వాటి వంక చూసినా, కౌగిలించుకున్నా, స్పృశించినా, వాసన చూసినా, పలుకరించినా – అవి విరివిగా పుష్పిస్తాయనే విషయం మాత్రం నమ్మశక్యంగా లేదు. వృక్షాలకూ స్పందనలున్నాయనీ (*irritability*), వాటి కాండాలు సూర్యరశ్మి లభించే దిశకూ, వ్రేళ్ల నీరు లభించే వైపుకూ పెరుగుతాయనీ, మొక్కల వ్రేళ్లు భూకేంద్రం వైపుకూ, కాండం దానికి వ్యతిరేక దిశకూ పెరుగుతాయనీ శాస్త్ర పరిశోధనలు నిర్ధారించాయి. అత్తపత్తి (*Touch - me - not; Mimosa pudica*) పులిచింత (*Biophytum sensitivum*) (*Oxalidaceae*) వగైరా మొక్కల ఆకులు ముట్టుకోగానే ముడుచుకుపోయే స్వభావం కలిగి వుంటాయనేది మనందరకూ తెలిసిన విషయమే. వృక్ష శాస్త్రంలో మరిన్ని పరిశోధనలు జరిగితేగాని రామకృష్ణకవి చెప్పిన పై విషయాలన్నీ ఏ మేరకు శాస్త్రీయంగా సబబో నిర్ధారించలేం. హార్మోన్ల ప్రమేయం లేకుండా కేవలం తాకడం, నిట్టూర్చడం, ఉమియడం వగైరాలతో పుష్పీకరణ ప్రక్రియ పుంజుకుంటుందంటే అనుమానాస్పదమే!

ఇంకా వృక్ష ప్రపంచాన్ని గురించి ప్రాచీనకాలం నుండీ మానవులకు ఎన్నో వింత వింత విశ్వాసాలుంటూ వచ్చాయి. వాటిలో ఎన్ని, ఏ మేరకు శాస్త్రీయమైనవో కాలమే నిర్ణయించాలి.

నేను పశ్చిమ గోదావరి జిల్లా నిడదవోలు సర్కిల్‌లో పోలవరం ఉప వాణిజ్య పన్నుల అధికారిగా కొంతకాలం పనిచేశాను. ఆ ప్రాంతమంతా మామిడి (*Mangifera indica*) జీడిమామిడి (*Anacardium occidentale*) తోటలు విస్తారంగా వున్నాయి. అక్కడి ప్రజల విశ్వాసం ప్రకారం మామిడి విస్తారంగా కాపుకాసిన సంవత్సరం జీడిమామిడి దిగుబడి చాల తక్కువగా వుంటుంది. జీడి మామిడి విరగకాసిన సంవత్సరం మామిడి కాపు అంతగా వుండదు. ఇది అక్కడి ప్రజల విశ్వాసమే కాక అక్కడ వున్న కాలంలో నేను గమనించిన వాస్తవం కూడా. ఆ రెండు వృక్షాల మధ్య మరి యీ వ్యతిరిక్తానుబంధమేమిటో? మామిడి, జీడిమామిడి రెండు వృక్షాలూ ఎనాకార్డియేసీ (*Anacardiaceae*) కుటుంబానికే చెందినవి కావడం విశేషం!

ఇంకా పలు వృక్ష జాతుల మధ్య యిదే విధమైన అనుషంగిక (*Concomitant*) వ్యతిరిక్త (*Antagonistic*) అనుబంధమున్నట్లు నేను మొట్టమొదటిసారిగా 'రెట్టమత శాస్త్రము' అనే జ్యోతిష శాస్త్ర గ్రంథము చదివినప్పుడు తెలుసుకుని ఆశ్చర్యపోయాను. చిక్కుముడులపాలైన తెనాలి రామకృష్ణుని చరిత్రను నాకు చేతనైనంత మేరకు లోతుకు వెళ్లి పరిశీలించి 'చరిత్ర చిక్కుముడి' అన్న అధ్యాయంలో ఆ చిక్కుముడులను విడదీసే ప్రయత్నంచేశాను. ఆ సందర్భంగా రామకృష్ణకవి కాల నిర్ణయానికి కీలకమైన ఆధారంగా పేర్కొనబడుతున్న 'రెట్టమత శాస్త్రము' మూలప్రతి కొరకు అన్వేషించాను. ఓ రోజు మా పెద్ద అల్లుడి తాతగారు ఆర్యసామాజికులు, బహుగ్రంథ సేకర్త, విజ్ఞులు శ్రీ రావి వేంకటరావు గారి వద్ద యిదే విషయాన్ని ప్రస్తావించాను. అడిగిందే తడవుగా, 'నా దగ్గర వున్నద'ంటూ, గుంటూరు జిల్లా వట్టిచెరుకూరు లోని తన స్వంత గ్రంథాలయం నుండి అత్యంత అరుదైన ఆ గ్రంథాన్ని తీసి యిచ్చారాయన. అందుకాయనకు సర్వదా కృతజ్ఞుడిని. ఎప్పుడో 1931లో పురాణం సూర్యనారాయణ తీర్థులవారిచే సంస్కరింపబడి, పమ్మి త్యాగరాయ శ్రేష్ఠి, మద్రాసు వారిచే ప్రచురింపబడిన 204 పేజీల చిరు గ్రంథమది. పొత్తపినాటి తెలుగు చోడ ప్రభువైన కొండ్రాజు తిమ్మరాజుగారి కుమారుడు, రాజకవి యైన వేంకటాద్రి పరిపోషణలో అయ్యల రాజవంశీకులైన అయ్యలు, భాస్కరుడు అను యిరువురు కవులు తెలుగులో వ్రాసిన ఐదు ఆశ్వాసాల కావ్యమిది. కన్నడ భాషలో రెట్టడనే కవి వ్రాసిన కావ్యానికి యిది తెలుగు అనువాదం. ఈ గ్రంథం రామకృష్ణకవి చరిత్రపై ఏ మేరకు వెలుగుల్ని ప్రసరిస్తుందనే విషయాన్ని 'చరిత్ర చిక్కుముడి' అన్న అధ్యాయంలో చర్చించాను. ప్రస్తుతం ఆ గ్రంథంలోని 'వృక్ష, పుష్ప, ఫల లక్షణము' అనే అధ్యాయంలో వివరించబడిన వృక్షజాతుల మధ్య అనుబంధాల విషయానికి వద్దాం.

అశోక వృక్షములు, బ్రహ్మామేడి చెట్లు విరివిగా పూచి, కాస్తే అన్ని పంటలూ సమృద్ధిగా పండుతాయట. కర్పూరపు అరటి చెట్లు విరగకాస్తే నల్ల అవిసె వగైరా నల్లని ధాన్యములు బాగా వృద్ధి పొందుతాయట. చింతచెట్లు, పాలచెట్లు, కరివేపచెట్లు విరగకాసిన సంవత్సరం వరిధాన్యం బాగా పండుతుందట. తుమికి చెట్లు విరివిగా కాసిన సంవత్సరం జొన్నలు సమృద్ధిగా పండుతాయట. ములు మోదుగ చెట్లు విరగకాస్తే కొర్రధాన్యమూ, మొల్లలు, ప్రత్తి, జనుము పంటలు విస్తారంగా పండుతాయట. ఏ సంవత్సరం జమ్మి, చంద్ర, మర్రిచెట్లు, ఒద్ది చెట్లు, ఇప్పచెట్లు, మారేడు చెట్లు, నేరేడు చెట్లు, మెంతి, గోధుమ, మినుము, యవలు (బార్లీ), కలివి చెట్లు సమృద్ధిగా కాస్తాయో ఆ యేడు పంటలు తక్కువగా పండుతాయట. అలాగే లొద్దుగ చెట్లు (లోధ్ర - *Symplocos racemosa*) వృక్షాలు, దిరిసెన వృక్షాలు (*Albizzia lebbeck*) విపరీతంగా ఏ సంవత్సరం పూస్తాయో ఆ సంవత్సరం కూడా పంటలు బాగా తక్కువగా పండుతాయట.

ఇవన్నీ కేవలం రెట్టడనే కన్నడ కవి అభిప్రాయాలుగానే మనం భావించలేం. శతాబ్దాలుగా వివిధ వృక్ష జాతుల మధ్యగల అనుబంధాల్ని మానవ సమాజం అధ్యయనం చేసిన ఫలితమే యీ విశ్లేషణ. అయితే యీ విశ్లేషణ ఏ మేరకు శాస్త్రీయమైనదో భవిష్యత్తులో జరుపబడే శాస్త్ర

పరిశోధనలే నిగ్గు తేల్చగలవు.

# వెనక్కి తగ్గిన అప్సరసలు

కుసుమహరణేచ్ఛ (పూవులు కోసుకోవాలనే కోరిక)ను చాలించి, కుసుమశరుని శాత (వాడి) బాణములనగా రంభ, తిలోత్తమాది ముఖ్య అప్సరసలు ఆ మునుల్ని సమీపించారట. అప్పటి వరకూ తామనుకున్న పనిని సాధించి తీరుతామనే ఆత్మ విశ్వాసంతో వున్నవారు ఒక్కసారే ఆ మునుల్ని సమీపించబోయి బేజారయ్యారట!

క॥ దగ్గర బోరా దగ్గికి
వెగ్గలమై యున్న దౌర వీరల తేజం
బగ్గలిక పలుకు పలుకుట
సిగ్గుల చేటయ్యె నేమి చేయుదమింకన్. (ఘటికాచల మాహాత్మ్యము 2-116)

'అగ్నిని సమీపించకూడదు. ఔరా! వీరి తేజస్సు వెగ్గలమై (అధికమై) యున్నది. అగ్గలిక పలుకు పలుకుట (మనమే అధికులమని అతిశయపు మాటలు చెప్పుకోవడం) సిగ్గుల చేటయ్యింది. ఇంకేమి చేద్దాం?' అనుకున్నారట ఆ అప్సరసలు. 'దేవతలందరూ వినేటట్లు మనమానాడు అమరేంద్రుని సమ్ముఖంలో అన్నమాటలు నేడు అమరలేకపోయెను గదా!' అని ఆ అమర సతులు వ్రీడతో (సిగ్గుతో) మంతనములాడుకున్నారట వారిలోవారు.

ఆ అప్సరసలు ఎన్నిరకాలుగా ప్రయత్నాలు చేసినా ఆ తాపసులు శిలా ప్రతిమలవలె నిశ్చలంగా వుండడం చూసి అలసినవారు లజ్జతో తలలువంచారట.

# అప్సరసల జలక్రీడలు

తరువాత వారంతా ఉద్దిగూడి (జతగూడి) చిత్రమైన చెందురు కావి (సిందూర వర్ణపు) పావడాలు ధరించి చేతులలో నీలశృంగములు (చిమ్మన గ్రోవి లేక బుఱ్ఱట కొమ్ము అని కూడా పిలువబడే నీల శృంగముతో జలక్రీడలలో ఒకరిపై ఒకరు నీళ్లు చిమ్ముకుంటారు) చేతబట్టుకొని జలక్రీడలకు సిద్ధమయ్యారట. వారి జిలుగురవికల లోపలి గబ్బి సిబ్బెంపు ఓగి వలిగుబ్బలు చిత్తజాతుని (మన్మథుని) ఉరులలో చిక్కి వున్న జక్కవ పక్షుల జంటలలా వున్నాయట.

పలుకులలో పంతాలు కులుకుతూ (మాటలలో ప్రతిజ్ఞలు వెదజల్లుతూ) వారు వరుసగా ఆ కొలనులో ప్రవేశించి గుబ్బచనుంగవబంటిలోతులో ('మొలబంటి - నడుమువరకు'; 'గుల్ఫముబంటి - చీలమండల వరకు'; 'మోకాలిబంటి' వగైరాలలా) నిల్చుని, ఒకళ్లపై మరొకరు నీరజములు (తామరలు), కైరవములు (తెల్ల కలువలు), హల్లకములు (చెంగలువలు - ఎర్రకలువలు), ఉత్పలములు (నీలి కలువలు) విసురుకుంటూ బుఱ్ఱట కొమ్ములతో నీళ్ళు చిమ్ముకున్నారట.

ఒకతె జాబిల్లిపై కసితో దాడిచేసే సింహికాతనయుడిలా (సైంహికేయుడు లేక సింహికా తనయుడు అంటే రాహువు) మరొక చంద్రముఖిని పట్టుకొనడానికి దూకిందట. మరియొకతె తాను ఎవ్వరినీ పట్టుకొనలేక నవ్వుతూ కొలనంతా కలగుండు పడునట్లుగా యీదిందట. మరొకతె వెల్లకిలా యీదుతున్నదట. అప్పుడామె చన్నుదోయి యామినీగత వియోగ గ్లానిని (యామిని అంటే రాత్రి. రాత్రంతా అనుభవించిన వియోగపు బాధను) వారించే వెరవూహించి (పోగొట్టే ఉపాయమునాలోచించి) ముఖాబ్జునిగాంచి (సూర్యుడిని చూసి) కృతజ్ఞతాంజలులు ఘటిస్తూన్న జక్కవ పక్షుల జంటలా

వున్నాయట. (మనం లోగడనే చెప్పుకున్నట్లు కోకములు లేక జక్కవ పక్షులు లేక చక్రవాకములు రాత్రంతా వియోగ బాధను అనుభవిస్తాయట. వాటికి రాత్రంటే భయం. తెల్లవారుతూనే అవి తిరిగి జత కడతాయట. అంచేతనే సూర్యుడిని 'చక్రవాక బంధు' లేక 'కోకబంధు' అనీ చంద్రుడినీ 'కోక విద్వేషి' అనీ పిలుస్తారు).

మరొక స్త్రీ నిలువీత (నిలువు యీత - నిలచివున్న భంగిమలో యీదే యీత) యీదుతున్నదట. అందుకని నీటిపై ఆ మోహనాంగి ముఖం మాత్రమే కనుపిస్తున్నదట. అది 'నిండు జాబిల్లి తల్లి'లా నిగ్గు దేరుతున్నదట. ఆ ముఖారవిందము (ముఖమనే పద్మము - తమ్మి - తామరపూవు) పై కమ్ముకొని వీడని భృంగముల (తుమ్మెదలలా) వున్నాయట ఆమె నల్లని కురులు.

వారి కులుకు గుబ్బలపైనున్న యిగిరిన గంధపు పూతలు, వారి గళములపైని కుంకుమలు, వారి నుదుటి కస్తూరి, వారి మేనున వ్రాసుకొన్న పసుపు వారు కొలనులో జలకాలాడడంతో కరగి చెలువుగా (అందంగా) ఆ సరోల÷కి (సరస్సనే లక్ష్మికి) సహజ శృంగారముగా అయ్యాయట.

వాళ్లంతా ఒడ్డుకు చేరి ఒంటి తడి తుడుచుకుని ఒకరికొకరు నఖముఖాలు చూసుకుంటూ చిరునవ్వు అంకురింపగా (మొలకలెత్తగా) చలువలు (చలువ చేసిన వస్త్రాలు. ఉదికిన వస్త్రాలు) ధరించి రత్నభూషణాలను అలంకరించుకున్నారట.

# సూర్యాస్తమయం

అప్పుడు మువ్వన్నియ వేలుపు (సూర్యుడు) చరమ భూధరమునెక్కాడట. (అంటే పడమటి కొండనెక్కాడు; అక్కడినుంచి క్రిందకు జారి అస్తమించ బోతున్నాడని అర్థం) (రామకృష్ణకవి సూర్యుడిని మువ్వన్నెల వేలుపు అంటున్నాడు పాండురంగ మాహాత్మ్యంలో మనకవి ఇంద్రధనుస్సును 'మువ్వన్నె విల్లు' అన్నాడు (పాం మా. నాల్గవ ఆశ్వాసం) సూర్యుని కాంతిలో వాస్తవానికి ఏడు రంగులున్నాయి. అవి ఊదారంగు (*Violet*), నీలిమందురంగు (*indigo*), ముదురు నీలం (*Blue*), ఆకుపచ్చ (*Green*), పసుపుపచ్చ (*yellow*), నారింజ రంగు (*orange*), ఎరుపు (*red*) వీటన్నింటి మొదటి అక్షరాల్ని కలిపి *'VIBGYOR'* అనే సంకేతనామంతో యీ సప్తవర్ణాలనీ ఆధునిక విజ్ఞాన శాస్త్రం పిలుస్తుంది ఈ ఏడురంగులూ కలిస్తే తెలుపురంగు ఏర్పడుతుంది అలాగే తెల్లని సూర్యకాంతిని పట్టకం (*Prism*) ద్వారా విశ్లేషిస్తే యీ ఏడురంగులూ వస్తాయి వీటిలో ఎరుపు, పసుపు, నీలం ప్రాథమిక వర్ణాలు (*Primary Colours*) వాటి కలయికతో మిగిలిన వర్ణాలేర్పడ్డాయి. అయితే రామకృష్ణకవి కాలంనాటికి సూర్యకాంతిలో మూడే రంగులున్నట్లు భావించేవారేమో! అంచేతనే కవి 'మువ్వన్నె విల్లు', 'మువ్వన్నె వేలుపు' అనే ప్రయోగాలు చేశాడు ఒక వేళ ఆనాటికే మొత్తం ఏడురంగులలో ప్రాథమిక వర్ణాలు మూడేననే పరిజ్ఞానం కవికి వుంటే అది నిజంగా గొప్ప విశేషమే!)

గీ॥ మొదలఁ బూర్వాశఁ జెందితి పిదప పద్మి
నికిని కరములు సాచితి విఁకను దొలఁగు
మని యపూర్వాశ కాలఁదాచినఁ దదంఘ్రి
యావమనగ రాగమిగురొత్తె నర్కుమేన. (ఘటికాచల మాహాత్మ్యము 2-139)

సూర్యాస్తమయం ఎలా వుందో యీ పద్యంలో చక్కగా వర్ణిస్తున్నాడు కవి. సూర్యుడితో అపూర్వాశ (పడమటి దిక్కు) యిలా అంటూ "ముందేమో పూర్వాశఁ (తూర్పు దిక్కున) చేరావు (ఉదయించావు). ఆ తర్వాతేమో కరములు చాచి పద్మిని (లక్ష్మీదేవి)ని అందుకున్నావు. ఇక తొలగి పోవయ్యా!" అంటూ కాలితో తాచినఁ (తన్నితే) ఆ అంఘ్రి (పాదములకు వ్రాసుకొన్న) యావము (లాక్షారసము లేక లత్తుక లేక లక్క) అన్నట్లుగా అర్కుడి (సూర్యుడి) మేనున ఎర్రగా రాగము

(రంగు) యిగురొత్తిందట. ఈ పద్యంలో అపూర్వాశ (పడమటి దిక్కు) ఒక స్త్రీ గానూ సూర్యుడు ఆమె భర్తగానూ, పూర్వాశ (తూర్పు దిక్కు), పద్మిని (లక్ష్మీదేవి) సవతులుగానూ కవి ఊహించాడు (స్త్రీలు పాదాలకు లత్తుక వ్రాసుకుంటారు).

ఆ సంధ్యా కాలపు ద్యుతులను (కాంతులను) చూస్తూంటే పగలంతా ప్రచండకాంతితో వెలుగొందిన సూర్యుడు మిక్కిలి అనురాగంతో తనను చేరరాగా అపరదిక్కు (పడమటి దిక్కు) అనే తన్వీ శిరోరత్నం (స్త్రీ శిరోమణి) నీరాజనము (హారతి) యిస్తున్నట్లున్నదట.

ఇక్కడ కవి చక్కనైన చాల పద్యాలలో సూర్యాస్తమయాన్నీ, చంద్రోదయాన్నీ రమణీయంగా వర్ణించాడు.

అప్పుడు ఆ నాకలోక కోకకుచా నికరంబులు (స్వర్గలోకపు స్త్రీ సముదాయములు – కోకకుచా – యిది అందమైన స్త్రీకి పర్యాయపదం; కోకము – అంటే జక్కవ పక్షి వంటి – స్తనములు కలిగనది కోకకుచ) మునిలోక కోకవైరులను చూచి (కోకవైరి అంటే చంద్రుడు; మునిచంద్రులు) 'మోహమును పారద్రోలి ఘనతరమైన వైరాగ్య నిరూఢి (ప్రసిద్ధి)నున్న వీళ్లను కదిలిస్తే మనల్ని శాపాగ్నికి గురిచేయడం ఖాయం. ఫాలలోచనుడైన శివుని ఫాలనేత్రం (మూడవ కన్ను) నుండి వెలువడే అగ్ని కీలలలా వీరు తపోగ్నితో తనరారుచూ (అతిశయించుతూ) వున్నారు. వీరల ధైర్యమనే ధనాన్ని కంతుడు (మన్మధుడు)కూడా కన్నపెట్టగలేదు (తస్కరించలేదు)' అనుకున్నారట. చివరికి తమ ఎదుటనున్న అరుంధతిని చూచి ఆ అప్సరసలిలా అన్నారట, "సుందరముగా నున్న నీ మేను యీ తపోగ్నికి కందిపోతున్నది. నీవిలా చేసి వసిష్ఠ మునీంద్రునికి వికారం కలుగజేయవచ్చా?" దానికి ఆమెకూడా చలించకపోయేసరికి రంభతో మిగిలిన అప్సరసలు "మన ఆటలూ, మన పాటలూ, మన కళామర్మానుభవక్రియలూ యిక్కడేం పనిచేయవు. ఊరికే వాదనలెందుకు? మనం పడ్డ యీ పాట్లు ఎవరైనా చూడకముందే మనమిక్కడినుంచి కదలడం మంచిది" అంటూ వచ్చిన జాడనే వెళ్లిపోయారట ఆ జేజె మిటారులంతా (జేజె అంటే దేవుడు, మిటారి అంటే మదించిన స్త్రీ. జేజె మిటారి అంటే మదించిన దేవతా స్త్రీలు).

అప్సరసలకు కూడా లొంగనంతటి ధైర్యసంపద కలిగినట్టి యీ మునులను త్వరగా చూద్దామనే ఆసక్తితో వచ్చిందా అన్నట్లు కాంతులు చిమ్ముతూ వేగుచుక్క పొడిచిందట.

వేలుపు జవ్వనులు (దేవ యువతులు) కూడా వీరికి దడిచి వేకువజామునే వెళ్లిపోయారు. 'కొంపదీసి ఒక వేళ యీ మునులు తాలిమి తూలి (క్షమాగుణం నశించి) దయతప్పి కొంచెం కన్ను విప్పిచూశారో, చాల ప్రమాదం అనుకుంటూ అతివేగంగా అంబుజవైరి (పద్మములకు శత్రువు – చంద్రుడు) అస్తకూటముల (పడమటి కొండల) చాటున దాక్కొనదానికా అన్నట్లు జారుకున్నాడట. పెక్కు సహస్ర సమలు (అనేక వేల సంవత్సరాలు) వాళ్లు అంతటి అత్యుగ్ర తపస్సు చేసికూడా అఖిలలోకేశ్వరుడైన ఆ రమాజాని (లక్ష్మీపతి) ఎన్నేళ్లకూ ప్రత్యక్షం కాకపోవడంతో, "భాగ్యహీనులకు ఎక్కడైనా రమాపతి ప్రత్యక్షమవుతాడా? తోటి తాపసులలో వాసి, వన్నె పోయే విధంగా, అందరిలో తలవంపులయ్యేటట్లుగా పూనిక విడచి మధ్యలో తపస్సు చాలించి వెళ్లకూడదు. అలా మధ్యలో తపస్సు చాలించి పోయి ఎవరి ముఖమైనా ఎలా చూడగలం? ఏమన్నా గౌరవం వుంటుందా? ఇక గతి ఏది?" అనుకున్నారట విచారంగా. సరిగ్గా ఆ సమయంలో ఆకాశవాణి భోరంటూ యిలా పలికిందట "ఇక్కడ తపస్సు చేస్తే ఎన్నాళ్లకూ ఆ పచ్చిక దాల్మేని సామి (ముదురు పచ్చిక వర్ణపు శరీరం కలిగినవాడు – కృష్ణుడు; మంచి ముదురు పచ్చిక నల్లగా వుంటుంది) ప్రత్యక్షం కాదు. ఘటికాద్రికి వెళ్లండి. ఘటికా మాత్రంబున (ఘటిక – అంటే 24 నిముషాల కాలంలో) మీకు కాంక్షితములన్నీ (కోరిన కోరికలన్నీ) ఘటిల్లుతాయి (కలుగుతాయి). ఘటికాద్రి మాద్రి (మాదిరి) అద్రి (పర్వతము) యీ జగతిలోనే లేదు. అమర స్రవంతికి (గంగానదికి) శమన దిగ్భాగిని నూరు యోజనముల దూరంలో వేద విద్యలకు నిలయమైన కంచి వున్నది. (యోజనము అంటే ఆమడ – అంటే నాలుగు కోసుల

దూరము. కోసు లేక క్రోసు అంటే రెండువేల విల్లుల పట్టు. *A two thousand bow - shots off.* వింటిపట్టు అంటే అమ్ముమేటు నేల అమ్ముమేటు నేల అంటే బాణము పోయిపడునంత దూరము కల భూమి పూర్వకాలంలో ధనస్సుకొక ప్రామాణికమైన కొలతవుందనీ, విల్లు అంటే ఆ ధనస్సు పొడవనీ కొందరంటున్నారు. ఒక విల్లు అంటే నాలుగు హస్తాలు, హస్తము అంటే మోచేయి నుంచి మధ్యవ్రేలి కొసవరకు గల దూరము దీన్నే మూర - *Cubit* - అంటారు వ్యక్తి పరిమాణాన్ని బట్టి మూర పరిమాణం మారుతుంది గదా అయినా దీని సగటు పరిమాణం సుమారు 18 అంగుళాలు. కనుక విల్లు అంటే 72 అంగుళాలు అనగా ఆరు అడుగులు. కాబట్టి క్రోసు లేక క్రోశము అంటే 12,000 అడుగులు - అంటే 4 వేల గజాలు. ఒక మైలు అంటే ఎనిమిది ఫర్లాంగులు ఫర్లాంగు అంటే 220 గజాలు. కనుక మైలు అంటే 1760 గజాలు. అంటే క్రోసు అంటే రెండు మైళ్ల రెండు ఫర్లాంగుల నలభై గజాలు యోజనము అన్నా, ఆమడ అన్నా నాలుగు క్రోసులు కనుక యోజనము అంటే 9 మైళ్ల 160 గజాలు కనుక నూరు యోజనములు అంటే సుమారు 910 మైళ్లు వారణాసికి నూరు యోజనాల దూరంలో కాంచీనగరము వున్నదనడం సమంజసంగానే వుంది. ఎందుకంటే 910 మైళ్లంటే 1464 కి మీలు. ఘటికాచల క్షేత్రం ప్రస్తుత తమిళనాడులోని ఆర్కోణం రైల్వే స్టేషనుకు పడమరగా 30 కి మీ ల దూరంలో వున్నది దీనినిప్పుడు షోలింగర్ (చోళలింగపురము) అంటున్నారు. చిత్తూరుకు తూర్పుగా 40 కి మీ లు ప్రయాణించినా ఘటికాచలం చేరవచ్చు. ఘటికాచలం - కాంచీపురంల మధ్య దూరం సుమారుగా 50 కి మీలు వుంటుంది.) అద్రిరాజమైన ఘటికాచలము అచ్యుతునకు నిత్య సదనము. అక్కడ చేసే తపస్సు అణువంతయినా కోర్కెలు కోటిరెట్లు ఫలిస్తాయి. అక్కడికెళ్లి తపస్సు చేయండి."

# సప్తర్షుల తీర్థయాత్రలు

ఇక అక్కడినుంచి బయలుదేరి ఆ మునులు పుణ్యాశ్రమములు, అగణ్యపుణ్య భూములు, పుణ్య దేశములు, పుణ్య నదులు, పుణ్య తీర్థములు, పుణ్య పురులు (పుణ్య పట్టణములు), పుణ్య శైలములు (పుణ్య పర్వతములు) చూసుకుంటూ వెళ్తూ దారిలో గంగాస్నానం చేశారట.

ఇక్కడ కవి గంగానదీ ప్రాశస్త్యాన్ని చెప్తున్నాడు.

ఆది త్రివిక్రముడి (మూడు పాదాలవాడైన వామనుడి) పాదపంకేరుహ (పాపపద్మముల) మధ్యభాగంలో అవతారమెత్తి (బ్రహ్మ తన లోకం వరకు చాచబడిన తండ్రి పాదం కడుగుతూంటే ఆ నీటితో గంగ పుట్టిందని విశ్వాసం) సత్యలోకాన్ని పరిపాలించే బ్రహ్మ కలశాన్ని పావనం చేసి (విష్ణువు పాదాలు కడుగక ముందు గంగ బ్రహ్మ కలశంలో వుండేదట) నిటలలోచనుడైన శివుడి జటాపటలాలను తడిపివేసి, భగీరథుడి తపోవ్రతం కారణంగా ప్రాలేయశైల (హిమాలయ) మార్గమున భూమికి జారి ప్రేమతో తన నీట మునిగినవారి కలుషములన్నీ పోగొట్టి రంగత్తరంగ, త్రిజగతీకృత సుకృతవర్ధిత నిజాంగమైన (మూడు లోకాలు చేసే పుణ్యకార్యాల వల్ల పెరిగే తనువు గల) గంగను చేరి సాష్టాంగ ప్రణామంచేసి అందులో స్నానం చేశారట వారు.

ఆ తరువాత పూరీ జగన్నాథ క్షేత్రానికి వెళ్లి జలదనీలశ్యాముడు (మేఘమువలె నల్లనైనవాడు) సకలదేవతా సమూహ సార్వభౌముడు, నీలాచలవాసుడు, అఖిలలోకాధ్యక్షుడు, కౌస్తుభము, శ్రీవత్సము లాంఛనములుగా కలిగిన వక్షము కలవాడు, నందగోపకుమారుడూనైన శ్రీ జగన్నాథుని సేవించి, ఆ తరువాత కృష్ణా తీరంలోని శ్రీకాకుళం వెళ్లి ఆంధ్రమహావిష్ణు దేవుని పూజించారట. అక్కడ వారిధి రాణి (సముద్రుని పట్టమహిషి) యైన కృష్ణవేణీ నదిని చూశారట. ఆ నది అందం వారి కళ్లకు వసంతాన్ని స్ఫురింపజేసిందట. ఆ నదిలో అవగాహము (మునుక) వలన మహా ప్రబోధరస పారగులయ్యారట వారు (దివ్య ప్రబోధమునకు దరిజేరిన వారయ్యారట).

# శేష శైలము

ఇంకా అనేక నదులలో స్నానం చేస్తూ వెన్నునికి (విష్ణువునకు) దివాణము (కొలువు కూటము) అనదగిన వేంకట శైలాన్ని చూడదానికి వేడుకతో వెళ్లారట. అత్యంత ప్రభావవంతమైన అనేక గుహలు, తటములు, శృంగములు (కొండ కొమ్ములు) సాలములు (వృక్షములు) అనేక పుణ్యతీర్థజాలములు కలిగి సనకసనందనాది మునులచేత సంస్తుత (బాగుగా పొగడబడిన) శీలము కలిగినట్టి శేషశైలమును (శేషాచల పర్వతమును) చూశారట. చూచి ఆ శేష శైలం యొక్క ఉదంచిత స్థితికి (అత్యున్నతికి) హర్షించి (సంతోషించి) అమందానంద కందళిత హృదయారవిందులై ఆ మునిపురందరులు (మునీంద్రులు) ఆ కుధరము (పర్వతము)నెక్కి వివిధ వృక్షాలతో కూడిన అక్కడి ఉద్యానవనాలు చూశారట. అక్కడవున్న రకరకాల వృక్షాలను రామకృష్ణకవి అతి విస్తారంగా పేర్కొన్నాడు.

తాల (తాళ వృక్షములు, తాటి చెట్లు) హింతాల (గిఱకతాడి చెట్టు; సంస్కృతంలో హింతాల అంటే పొట్టి తాటి చెట్టు అని అర్థం). సంస్కృతంలో ఈ వృక్షం పేరును బట్టి యిది తాటి జాతికి చెందిన వృక్షమని మనం పొరబడతాం కాని, యిది ఈతజాతికి చెందిన చిన్న వృక్షం. *Phoenix paludosa.* దీని పళ్లు తియ్యగా, చల్లగా, కొంచెం పుల్ల (*acidulous*) గా వుండి దాహాన్ని తీర్చేవిగానూ, వాపులను తగ్గించేవిగానూ (*anti phlogistic*), కఫాన్ని కలిగించేవి (*Phlegmatic*)గానూ వుంటాయి), తమాల (చీకటి కానుగచెట్లు - *Garcinia pictoria* (*Family Guttiferae*) ఈ వృక్షాల కాండం చాల నల్లగా వుంటుంది. తమాల వృక్షపు కాయను అరగదీసి ఆ గంధాన్ని నుదుటిపై రాసుకుంటారు ఈ నుదుటి బొట్టును తమాల పత్రం అంటారు. ఈ చెట్టు జిగురుకు ఎన్నో వైద్యపరమైన ప్రయోజనాలున్నాయి). రసాల (మామిడి చెట్లు) సాల (సాలవృక్షములు - అశ్వకర్ణ వృక్షములు - *Shorea robusta*) తిలక (తిలకపుచెట్లు - *Cinnamomum malabathrum*) తిందుక (తుమికి చెట్లు - *Diospyros tomentosa*); ఘనసార (కర్పూరపు చెట్లు లేక సీమ చేమంతి చెట్లు - *Chamomile - Anthemis nobilis.* దీని పూలు కర్పూరపు వాసనకలిగి వుండడం వలన దీనిని కర్పూరపు చెట్టు అంటారు); ఖర్జూర (ఖర్జూరపు చెట్లు - *Phoenix dactylifera*) జంబీర (నిమ్మచెట్లు - *Citrus limon*) కర్పూర కదళికా (కర్పూర అరటి చెట్లు); కదంబ (కడిమి చెట్లు - *Anthocephalus cadamba*); కుంద (మొల్ల చెట్లు); చందన (గంధపు చెట్లు - *Santalum album*); మందార (మందార చెట్లు - *Hibiscus rosa - sinensis*) పున్నాగ (సురపొన్న); పూగ (క్రముకఫల లేక వక్కచెట్లు - *Areca catechu*); నాగకేసర (*Mesua ferrea*), సరళ (సరళదేవదారు వృక్షాలు - *Pinus longifolia*); మన్మధ (మన్మధవృక్షమంటే వెలగచెట్టు. వెలగ - *Feronia elephantum* లేక ఇక్కడ కవి ఉద్దేశించినది 'మన్మధానంద' అనే పేరుగల ఓరకం మామిడి చెట్లు కావచ్చు. దీనినే రాజామ్రము అని కూడా అంటారు. మధూక (ఇప్ప లేక విప్ప చెట్లు - *Madhuca indica or Bassia latifolia*); పనస (స్కందఫల వృక్షాలు లేక పనస చెట్లు - *Indian Jack tree - Artocarpus integrifolia*); పాటల (కలిగొట్టు వృక్షాలు లేక పట్టెల వృక్షాలు లేక పాదిరి చెట్లు - *Stereospermum suaveolens*); పారిభద్ర (బాడిద చెట్లు - *Indian coral tree - Erythrina indica*); బిల్లు (బిల్లుదు చెట్లు - *East Indian Sa'in Wood tree - Chloroxylon swietenia*); బిల్వ (మారేడు చెట్లు - *Aegle marmelos*).

ఇంకా ఆ శేషాచలము ఉత్ఫుల్ల (బాగుగా వికసించినట్టి) తేనెలు జుర్రే తుమ్మెదల గుంపులచే ముట్టడించబడిన హల్లక (చెంగలువ - ఎర్రకలువ); కుముద (తెల్లకలువ) కువలయ (నీలికలువ) పూలతో నిండిన సుందర సరోవరాలు

కలిగి వున్నదట. ఆ శేషశైలంపై మాధవీ (మాధవీ లత – *Hiptage benghalensis* – తెలుపు పసుపు రంగుల్లో సుగంధ భరితపుష్పాలు పూచే ఎగబాకే పూల పొద (*Climbing shrub*), మాలతి (మాలతి అనేది తెల్లని సుగంధభరితమైన గిన్నె పూలు పూసే పూలతీగ – *Aganosma caryophyllata*) మల్లికా మతల్లికా (మల్లిక అని సంస్కృతంలో పిలువబడే మల్లెతీగలలో ఎన్నోరకాలున్నాయి. ఇక్కడ కవి బనమల్లికా లేక వనమల్లిక – *Jasminum sambac* – బొండుమల్లెను ఉద్దేశించి వుంటాడు). కుసుమ విసరములు (పుష్ప సమూహముల)తో నిండిన గట్లు కలిగిన స్వామి పుష్కరిణిలోని పవిత్రములైన, సుగంధ కబంధములలో (పరిమళమైన నీటిలో) కృతావగాహనులై (మునిగి స్నానం చేసినవారై) ఆ దేవాలయ ప్రాకారాన్ని సమీపించారట.

# తిరుమల శ్రీ వేంకటేశ్వరుని వర్ణన

భేరీ, మృదంగాది గంభీర రవాలు, అవిరళమైన ధూపధూమములు; కేతువు (ధ్వజము లేక టెక్కెము) యొక్క వస్త్రపు చివరనున్న కింకిణీ (చిరుగంటల) శబ్దములు, అనుదినము అక్కడ నృత్యంచేసే నటన్నటీ జనుల పాద హంసకముల (అందెల) రవళులు వగైరాలతో కోలాహలంగా వుందట ఆ ఇందిరాజాని (లక్ష్మీపతి) యొక్క కాంచన మందిరం (కవి ఆ ఆలయాన్ని కాంచన మందిరం అని పేర్కొనడాన్ని బట్టి, ప్రస్తుతం ప్రపంచమంతట్లోకీ అత్యధిక ఆదాయం కలదియైన తిరుమల దేవస్థానం కవి కాలంనాటికే బంగారు తాపడాలు చేయబడిన వైభవోపేత ఆలయమని తెలుస్తున్నది).

పొడుపు గుబ్బలి (తూర్పుకొండ) మీద పొడుచు భానుని (సూర్యుని)వలె ఆయన తలపై కిరీటం వుందట. నుదుటిపై ముత్యాల తిరుమణి వుందట. ఎంతో అందమైన కుండలయుగము (కర్ణ కుండలాల జంట)తో తళుకులీనే లేత చెక్కిళ్లపై చెరగని కులుకు (చిరునవ్వు) కలవాడట ఆయన. కలువ కులాన్నీ, తామర కులాన్నీ కూడా వలపింపచేసుకొనే చూపులలో చలీ వేడీ కూడా చూపేవాడట ఆయన. (ఒక కన్నైన చంద్రుడు చలిచూపుతో కలువలను రంజింపచేస్తే, వేరొక కన్నైన సూర్యుడు వేడి చూపుతో తామరలను వలపింప జేస్తాడు). ఇక ఆయన వాతెర (పెదవులు) పగడాల్లా ఎర్రగా వున్నాయట.

చేతిలో వున్న శంఖము ఎంత చెలువు (అందం)గా వుందో ఆయన గ్రీవం (మెడ) కూడా అలాగే వుందట. (అంటే ఆయన శంఖువు వంటి అందమైన మెడ కలవాడట). కీర్తికి సంకేతంగా ఒకచేతిలో శంఖం, ప్రతాపానికి సంకేతంగా మరొక చేతిలో చక్రం ధరిస్తాడట ఆయన. కోరిన కోరికలన్నీ తీర్చే ఆ కల్పవృక్షపు శాఖలకు వేంకటేశ్వరుని కేలుదోయి (రెండు చేతులు) దాయాదులట. (అంటే అవి కూడా అలాగే అడిగిన కోర్కులన్నీ తీరుస్తాయట). ఆయన అలక తీరిన తుమ్మెద వంటి అలమేలుమంగకు ఆశ్రయమైన పచ్చని రొమ్ముకలవాడు. కోరి యిరుదుగ మొగముల (దుగ అంటే రెండు, ద్వయము. ఇరుదుగ అంటే నాలుగు. నాలుగు ముఖముల) కుర్రను (కుమారుడిని – బ్రహ్మను) కన్న అమ్మ అనదగిన తమ్మి (తామరపూవును) తన పొక్కిట (బొడ్డునందు) కలవాడు ఆయన. ఘోరమైన దానవులు (రాక్షసులు) అనే విపినము (అడవి) పాలిట కురారము (గొడ్డలి) అనదగిన బలమైన కటారము (కత్తి) నడుముకు కలవాడట ఆయన (విష్ణువుకు నందకమనే ఖడ్గం ఆయుధం).

ఆయన నడుముకు పట్టు దుప్పటి కట్టుకుంటాడట. వేదాలు ఆయన పాదాలకు మంజీరాలట (అందెలట). ఆయన భూషలు (ఆభరణాలు) సాటిలేని కాంతులతో వెలుగొందేవట. ఆయనది మెఱుఁగు చామనచాయ మేనట. సర్వగీర్వాణ సముదయ సార్వభౌముడని ఆయనకు బిరుదట. ఆయన శుభగుణాలకు ఆలవాలమైనవాడు, విశాలమైన కీర్తికలవాడు, వితత (విరివియైన) కరుణ నిధిగా కలవాడట.

మొలకు కటారము (కత్తి) కలవాడు, నెనరు (ప్రేమ) కలవాడు, పొగడితే తనరు (అతిశయించే) వాడు, దయగలిగిన సహృదయుడు, తనవానిని తనయంతవానిగా చేసేవాడు, మోమున నవ్వుల వెన్నెలలు కురిపించేవాడు, అంబుదము (మేఘము) యొక్క దంబు (ఆధిక్యము)ను త్రోసిరాజనే గాత్రము (శరీరము) కలవాడు. కొండలంత వరములను కొండని (తీసుకొండని) యిచ్చే కొండలరాయుడు, అందమైన బంగారు వస్త్రం ధరించినవాడు, మేలు సమకూర్చే అలమేలు మేలువాడు (అలమేలు మంగ ప్రియుడు. మేలువాడు అంటే వలపుకాడు).

ఆ వేంకటపతి తలనిల్లుగట్టు వ్రతంబులరాయడట. అంటే గృహస్థాశ్రమ ధర్మముల ననుసరించేవాడట. ఆయన తోమని పళ్యాల నేమగాడట. అంటే ఆయన వాడిన పళ్లెములు తోమకూడదనే నియమమేమైనా ఉందేమో! ఆయన చేరుడు బియ్యాల యోరెములు తినేవాడట. చేర అంటే ప్రస్నతి లేక పుడిసిలి. ఓరెము అన్నా ఓగిరము అన్నా ఓయిరము అన్నా అన్నము అని అర్థం. చేరెడు బియ్యపు అన్నం తింటాడన్నమాట ఆయన. ఆయన కోణంగి సేవల నాణెగాడట. కోణంగి అంటే అంగములను వికారంగా చూపి బిచ్చమడిగే దాసరి. నాణెగాడంటే యిచ్చి పుచ్చుకొనుటయందు యోగ్యత కలవాడు. అంటే వికార రూపులో వచ్చి బిచ్చమడిగి భక్తులు తనను తృప్తి పెడితే వారికి అంతకు మరింత లాభం చేకూర్చేవాడు. ఆయన కానుకలుగా వడ్డికాసులు పుచ్చుకుంటాడట. శ్రీనివాసుడు ఆకాశ రాజు కుమార్తెయైన పద్మావతీదేవిని వివాహమాడేటప్పుడు కుబేరుడివద్ద అప్పుచేశాడట. తమ దైవం చేసిన అప్పుకు వడ్డీలు భక్తజనులే తీరుస్తారట. ఆయన 'ముక్కోటి తీర్థపు టెక్కులాడ'ట. అంటే ముక్కోటి తీర్థములలో తనదే ప్రసిద్ధమైనదని టెక్కులు (గర్వము) కలవాడు. మరి ముక్కోటి దేవతలలోనూ కలియుగంలో వేంకటేశ్వరుడే దైవమని విశ్వాసం కదా! (కలౌ వేంకటనాయకః). దీన్ని మనం మరోరకంగానూ అన్వయించుకోవచ్చు. తిరుమల ఏడుకొండలపైనా ముక్కోటి దేవతలు కొలువుంటారని ప్రతీతి. వారు కొలువున్న ప్రతి ప్రదేశమూ దివ్యతీర్థమని భక్తుల విశ్వాసం. అలా తిరుమల ముక్కోటి తీర్థములు కలిగినట్టిదనే టెక్కు పోయేవాడు అని కూడా దీని భావం కావచ్చు. ఆయన అడుగడుగునకు మ్రొక్కులందుకొనేవాడట. తిరుమల కాలిబాటన కొండ యెక్కేవారు. 'అడుగడుగు దండాలవాడా! ఆపద మొక్కులవాడా! గోవిందా! గోవిందా!' అంటూ ఎక్కడం మనమెరిగినదే కదా! ఆయన కూకటి మాడల గుత్తవాడట. 'కూకటి' అంటే జుట్టు. 'మాడ' అంటే వరహాలో సగం విలువకలిగిన నాణెము.

నాటి విజయ నగర సామ్రాజ్యంలో వరహా అంటే వరాహ ముద్ర కలిగిన ఓ బంగారు నాణెము. మాడ కూడా బంగారు నాణెమే. మాడలో పదో భాగం పణం. అదీ బంగారు నాణెమే. 'చిన్నము' అనే వెండి నాణెము విలువ వరహాలో ఎనిమిదవ భాగము. కాసు అనేది ఆనాటి రాగి నాణెము. ఇది పణంలో ఎనభయ్యోవంతట. కాసునే ఆంగ్లేయులు *farthing* లేక *pie* అనేవారు. ఈ 'కాసు' శబ్దమే పోర్చుగీసు భాషలో 'కెయిక్సా' (*Caixa*) అయి ఇంగ్లిష్‌లో 'కాష్' (*Cash*) గా రూపాంతరం చెందింది.

అంటే విలువైన భక్తుల తలనీలాలను గుత్తగా స్వీకరించేవాడని అర్థం. తిరుమలలో భక్తులు తలనీలాలు సమర్పించే (*tonsure*) ఆచారం అప్పటికే వుందన్నమాట. కూకటి మాడలు అనడాన్ని బట్టి తలనీలాలను అప్పటికే విలువైనవిగా భావించేవారన్నమాట. ప్రస్తుతమైతే తిరుమల వెంకటేశ్వర స్వామి ఆలయానికి ఏటా రూ. 750 కోట్ల ఆదాయం వస్తోందగా అందులో సగటున ఏటా కోటి మందికి పైగా భక్తులు సమర్పించిన తలనీలాలను వేలం వేయడం ద్వారానే ఏటా రూ. 40 కోట్లు సమకూరుతున్నాయట. కాబట్టి కవికాలం నాటికి విగ్గుల తయారీ కోసం విదేశాలకు కేశాల ఎగుమతి లేకున్నప్పటికీ కవి ప్రయోగించిన 'కూకటి మాడలు' అనే పదం నేటికి మాత్రం సార్థకంగానే కనుపిస్తున్నది. ఏమైనా 'మాడపట్టు' లేక 'సోడు' అనే పదానికి (తలలోని) 'బ్రహ్మరంధ్రం' అనే అర్థముండడాన్ని బట్టి 'కూకటి మాడలు' అనే పదాన్ని 'తలవెంట్రుకలు' అనే సామాన్యార్థంలోనే కవి ప్రయోగించాడనిపిస్తున్నది. తలపై భాగాన్ని మాడు అనడం కూడా 'మాడ' నుంచే ఏర్పడి వుంటుంది. శుక్రవారపు సేవల సొగసువాడట ఆయన. ఇప్పటికీ తిరుమలలో శుక్రవారపు సేవలు ప్రత్యేకమైనవే! ఆయన

మానినులను (స్త్రీలను) కోరివలపించే మాయలాడట. ఆయన తిండి మెండయ్యగారట. అంటే ఎక్కువగా తినేవాడట. (మరి యింతకు ముందేమో కవి ఆ దేవుడిని 'చేరుదు బియ్యాల యోరెముల్ దినువాడు' అని చెప్పాడు?) ఆయన తిగళగురుడట. (అంటే మూడు గళములు కలవాడు. తి అంటే త్రి - మూడు). బహుశా ఆయనకు మూడు గొంతుకలున్నాయి కనుక ఆయన గొప్ప తిండికాడు అని వుంటాడు కవి. అటువంటి వేంకటాచలపతిని ఆ మునులు చూచి సేవించి సంతోష కలితులయ్యారట (అంటే సంతోషమును పొందిన వారయ్యారట).

ఆ తరువాతి పద్యం (2-181)లో కవి ఆ మునులు వేంకటేశ్వరుని కీర్తిస్తూ అంజలి ఎలా ఘటించారో తెలుపుతూ వృషభాఖ్య దివ్యకూటము (వృషభాద్రి), గరుడాభిధానశైలము (గరుడాద్రి), శేషనామాధిక ధరణీధరము (శేషాద్రి), శ్రీ వేంకట విఖ్యాత నామధేయాచలము (వేంకటాద్రి), అంజనాద్రిలను మాత్రమే పేర్కొనడం విశేషం. మొత్తం తిరుమలలోని ఏడుకొండలలో నీలాద్రి, నారాయణాద్రిలను కవి ఎందుకోమరి యీ పద్యంలో వదలివేశాడు. ఆ కొండల రాయుడు ఎప్పుడూ అక్కడి గుహలూ, సరస్సులలో కేళికి యిష్టపడతాడట. అంచేత ఆ మునులు 'శరణు గుహ సరసీ కేళి సక్తమతికి' (గుహలూ, సరస్సులలో కేళికి ఆసక్తి చూపే మనస్సు కలిగినవానికి శరణు) అని ప్రార్థించారట. 'త్రిమూర్తుల మొదలి దొరకు మోడ్పుకేలు; జోహారు వినత వేదండునకు' (త్రిమూర్తులకు కూడా మూలదైవం. వేదండము అంటే ఏనుగు. వినత వేదండము అంటే సుశిక్షితమైన, నమ్రత కలిగిన ఏనుగు) అని కూడా వారు ప్రార్థించారట.

"ఓ సర్వేశా! సర్వాత్మా! సర్వగుణాతీత! నీలనీరదనీల వినీల గాత్రా! (నీలమేఘము యొక్క నల్లదనము కంటె నల్లనైన శరీరం కలవాడా!) నందనందనా! (నందుని కుమారుడా! కృష్ణుడా! - కృష్ణుడే విష్ణువనీ, విష్ణువే తిరుమల శ్రీనివాసుడనీ భక్తుల విశ్వాసం). సనకసనందననుతా! (సనక సనందనాది మునులచే పొగడబడినవాడా!) శరణు" అంటూ వారు ప్రార్థించారట.

"ఓ దేవా! నీవు సవరక్షాచణుడవు (యజ్ఞములు నిర్విఘ్నంగా జరిగేటట్లు రక్షించడంలో నిపుణుడివి) సామ గేయపద భాస్వత్పీత కౌశేయ రూపవరేణ్యా! (సామవేద గానంలా మండే పసుపుపచ్చని పట్టు వస్త్రంతో శోభిల్లేవాడా!) సుచరిత్రా! (మంచి శీలం కలవాడా!) సూరిజన భావ్యా! (పండిత జనులను సంభావించే - సన్మానించే - వాడా!) సేవనాసక్త వాసవముఖ్యామర సైంధవత్పతగ రాజా! (నీకు సేవలు చేయడానికి ఆసక్తిపడే ఇంద్రుడు మొదలుగాగల దేవతలు, సైంధవము - ఉచ్చైశ్శ్రవము అనే క్షీరసాగర మథనమున పుట్టిన గుర్రము; పతగరాజా - పక్షీంద్రుడైన గరుత్మంతుడు - వగైరాలు కలవాడా!) సోమ (శివుడు. సోమ శేఖరుడంటేనే కాక, సోముడన్నా శివుడనే అర్థముంది) వాణీశ (సరస్వతీ దేవి భర్తయైన బ్రహ్మ) లచే; సంస్తవ (బాగుగా పొగడబడినవాడా!) సౌమ్యాత్మకుడా! (సౌమ్యుడంటే బ్రాహ్మణుడు అని అర్థం. బ్రాహ్మణులను ఆత్మలోనుంచుకొనేవాడా!) సంగదూరతర (సాంగత్య దోషం అంటనివాడా!) సర్వప్రాణి సంరక్షకా!" అంటూ ఆ మునులు వేంకటాచలపతిని స్తుతించారు.

ఇంకా వారు శ్రీనివాసుని యిలా స్తుతిస్తున్నారు "ఓ దేవా! భువనములు పుట్టించడానికీ, పోషించడానికీ, అణగించడానికీ కర్తయైనట్టి ప్రధాన మూర్తివి నీవు. (సాధారణంగా మనం భువనములు మూడు - త్రిభువనములు - స్వర్గము, భూమి, పాతాళము - అని భావిస్తాం. కాని పూర్తి వర్గీకరణ ప్రకారం మొత్తం పధ్నాలుగు భువనాలున్నాయి. (చతుర్దశ భువనములు). అవి - భూమినుండి పైకి ఏడు భువనాలు - భూలోకము, భువర్లోకము, స్వర్లోకము, మహర్లోకము, జనర్లోకము, తపర్లోకము, సత్యలోకము (అదే బ్రహ్మలోకము). భూమి నుండి క్రిందకు ఏడు భువనాలు - అవి అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ లోకములు). శరీరంలోని మస్తకము (శిరస్సు) మొదలైన

సమస్తాంగములకూ లక్ష్యమైనట్టి జగత్కుక్షివి నీవు. (జగత్కుక్షి అంటే సమస్త జగత్తూ తన కడుపులో కలవాడు). పూజించే వారికి సమస్త కోరికలూ దయచేసి రాజిల్లే వేల్పులరాజువు నీవు. అజుడు (బ్రహ్మ), రుద్రుడు (శివుడు), ఇంద్రుడు మొదలైన దేవతలకు తత్త్వబోధ చేసే బోధనిధివి నీవు. తలపుపండని (వివేక జ్ఞానము లభించని) తాపసులకు చూడదానికి అలవి కానట్టి బ్రహ్మ పదార్థానివి నీవు. శంఖము (పాంచజన్యమనే శంఖము), చక్రము (సుదర్శనమనే చక్రము), గద (కౌమోదకి అనే గద), శార్ఙ్గమనే చాపము (ధనస్సు) ల యొక్క గొప్పకీర్తితో కూడినవాడివి నీవు. నీవు విబుధులకు (దేవతలకు) విబుధ భూజమువై (కల్పవృక్షమువై), విబుధారి సమూహములకు (దేవతల శత్రువులైన రాక్షస మూకలకు) విషభూజము (విషవృక్షాని)వయ్యావు. అబలులందరకూ నీవే బలము. ప్రబలేటటువంటి మహాబలుడవైన ఓ పంకజనాభా! (పంకజము అంటే బురద నుంచి పుట్టేది యైన – తామరను బొడ్డునందు కలవాడా!)

"ఓ దేవా! తులసీదళాలతోనైనా దూర్వలనైనా (గరికతోనైనా) జలములనైనా, కంజములనైనా (తామరపూవులతోనైనా) పూనికతో నిన్ను పూజించే మహామహులకు యిహపరాలు రెండూ సిద్ధిస్తాయి. నీ మహామహిమము (గొప్పదైన మహిమ)ను తెలుసుకున్నవారు ధరణిలో ధన్యులై వర్తిస్తారు. కంజాసనాదులు (పద్మాసనుడైన బ్రహ్మ మొదలైనవారు) కూడా చూడలేని వేదమంజరుడివైన (వేదములే పాదానికి అందెలుగా కలిగిన) నిన్ను చూడకలిగాము కనుక భవవార్ధిని (పునర్జన్మ అనే సముద్రాన్ని) దాటి జన్మరాహిత్యాన్ని పొంది మాకు భవములు (శుభములు) చేకూరాయి. మా జపము యీదేరింది. మా ముఖములలో కాననగు కోరికలన్నీ ఫలించాయి. వినుత తారాచలాధీశ! వేంకటేశ!" అంటూ ప్రార్థించారట ఆ మునులు (తారాచలము అంటే చుక్కల పర్వతం. తిరుమల కాలిబాటన వెళ్లేవారికి చుక్కల పర్వతం, మోకాళ్ల పర్వతం సుపరిచితాలే).

ఈ విధంగా శ్రీనివాసుని కొనియాడుతూ, పునఃపునరాచరిత ప్రణామముల (మళ్లీ మళ్లీ చేస్తూన్న నమస్కారములతో) పరవశులయ్యారట వారు.

## తిరుమల కొండల ప్రాశస్త్యము

వారు ఎట్టకేలకు ఆ మందిరమునుండి వెలువడి ఆ గట్టుఱేనిని (మహా పర్వతాన్ని) చూచి యిలా అన్నారట 'భానుకోటి ప్రభల (కోటిసూర్య కాంతుల)ను కూడా తీలుపరచే (అణచివేసే) తఱుచు జేగురులు (అధికమైన ఎర్రదనం) కలిగిన యీ శిఖరములు చెంతనున్న అంబరమనే (ఆకాశమనే) కాయమానమును (పందిరిని) తాల్చు (మోసే) మణిమయ స్తంభాలలా వున్నాయి. (తిరుమల గిరులలోని రాళ్లలోగల *Chalcolite, Chalcocite* అనే రాగి ఖనిజాల కారణంగా ఆ శిలలు మనోజ్ఞమైన ఎర్రని రంగులో వుంటాయి). ఇది పగటి సంగతి. ఇక రాత్రి వేళలలో –

ఆకాశాన్ని మోస్తున్నట్లున్న యీ పర్వత శృంగములు (కొండ కొమ్ములు) ఫణా సహస్రము కరణి కన్పట్టగా (వేయి పడగలవలె కనుపించగా) గైరికధాతువులా మెరిసే తారకలు (నక్షత్రాలు) ఆ పడగలపై మెరిసే మణులలా కనుపిస్తూ యిది శేషాద్రి అనే పేరును సార్థకం చేస్తున్నాయి. (ఆది శేషునికి వేయితలలనీ, ప్రతి పడగపైనా దివ్యమణులుంటాయనీ విశ్వాసం).

కుసుమములు (పూలు), కోరకములు (మొగ్గల)తో యింపుగా అలరారుతూ వున్న భూజ శాఖలు (చెట్ల కొమ్మలు) యీ శైలభర్త (మహాపర్వతము) గగనాన్ని తాకుతున్నట్లున్న చోటికి ఎత్తబడిన మౌక్తిక భూషణ భుజములలా వున్నాయట.

ఈ పర్వతం ముక్తిసతి (మోక్షము) చేతిలో అలరు బంతి (పూబంతి); పాపములనే కదళులను (అరటి చెట్లను) యిలకూల్చే (నేలకూల్చే) భద్రదంతి (భద్రగజము); ఈప్సితార్థ రసములను యిచ్చే సురభి (కోరిన కోర్కెలను తీర్చు కల్పవృక్షము); సంయమీంద్ర కులములకు (మునీంద్రుల సమూహములకు) అవనీజాత సురభి (భూలోకపు కల్పవృక్షము. అంటే దేవలోకంలో

కల్పవృక్షము కోరిన కోర్కెలనెలా తీరుస్తుందో, అలా భూలోకంలో మునీశ్వరులకు కోరిన కోర్కెలు తీర్చేది తిరుమల పర్వతమట).

ఈ శైలము యొక్క వైభవము, ఈ దేశికుల (ఈ గురువులు లేక యీ ప్రదేశపు నివాసుల) సౌభాగ్యము, ఈ సుతీర్థము యొక్క మహత్త్వము (గొప్పతనము), యీ శౌరి (విష్ణువు) కరుణ - గురు (పెద్దలైన) వాగీశ (బ్రహ్మ) ఫణీశు (ఆదిశేషు)లకునైన ఎన్న సాధ్యమేనా? (లెక్కించ సాధ్యమేనా?)

ఉ॥ ఏమి తపంబొనర్చితిమొ యే సుకృతంబొనరించినామొ యే
నోములు నోచినారమొ మనోరథముల్ మది దైలువారఁగఁ
గామిత దానపాటవముఁ గల్గిన తండ్రిని వేంకటాచల
స్వామినిఁ జూడఁగంటిమి శుభమ్ములు గూడ నఘమ్ములూడఁగన్.

(ఘటికాచల మాహాత్మ్యము 2-194)

"మేము గతంలో చేసిన ఏ తపస్సు, ఏ పుణ్యకార్యాలు, నోచిన ఏ నోముల కారణంగానో మా మనోరథం నెరవేరి కామిత దానపాటవము (కోరిన కోర్కెలను యిచ్చే సామర్థ్యము) కలిగిన తండ్రిని, వేంకటాచల స్వామిని చూడగలిగాము, మాకు శుభములు చేకూరే విధంగానూ; మా పాపాలు తొలగిపోయేటట్లూ."

ఈ విధంగా అంటూ మనసులో గొప్ప అనురాగంతో తృప్తిగా ఆ గిరిశిఖరం దిగి, దానికి దక్షిణంగా విధాత (బ్రహ్మ) కమండల నాళం (గొట్టం) వెడలే స్వర్ణది (స్వర్గంగ; దేవనదియైన గంగ) తెరగున (విధమున)నున్న ఆళువారి తీర్థమున స్నానములాడి అక్కడ కౌశిక దిక్తటముపైనున్న (కౌశికుడంటే శివుడనే అర్థమూ వుంది. శివుడు ఈశాన్య దిక్కుకు అధిపతి. అంటే అక్కడికి ఈశాన్య దిక్కుగా వున్న) అనలాక్షుడిని (నిప్పుకంటి వానిని - శివుని) పూజించి, భక్తితో గోవిందరాజులను సేవించి, వదలలేక వదలలేక ఆ దివ్యక్షేత్రాన్ని వదలుతూ, పెనగే చూపులను బలవంతాన మరల్చుతూ, మినుకుటందియదోయి సామిని (నాలుగు వేదములనే పాదద్వయమునకు అందెలుగా కల ఆ స్వామిని) మనస్సులో తలచుకుంటూ అక్కడి నుంచి భారంగా ముందుకు సాగారట.

అక్కడి నుంచి బయలుదేరి, నారికేళ (కొబ్బరి, *Cocos nucifera*), రసాల (మామిడి), జంబీర (నిమ్మ), పనస, మన్మథ (వెలగ), మధూక (ఇప్ప లేక విప్ప), సాల (*Shorea robusta* - జాలారి చెట్టు; రంభా (అరటి - *Musa paradisiaca*) తోటలను దాటుకుంటూ కనక కాంతులతో (బంగారు కాంతులతో) ప్రకాశిస్తూన్న కలమ సస్యములను (వరిచేను పంటలతో) పొలపొందే (ఒప్పిదమైన) జనపదములను (గ్రామములను) దాటుకుంటూ వెళ్లారట. అలా నడచి నడచి వారు కాంచీ పురాన్ని చేరుకున్నారట.

## కాంచీపుర వర్ణనము

నేటి తమిళనాడులోని కాంచీపురం సప్త పవిత్ర నగరాలలో ఒకటి. ఈ ఏడు నగరాలలో ఎక్కడ చనిపోయినా శాశ్వతానందం (ముక్తి) లభిస్తుందని విశ్వాసం. అందుకే హిందువులు ఈ నగరాలను ఏడింటినీ 'మోక్షదాయిక' లు అంటారు. మిగిలిన ఆరు నగరాలూ యివి; కాశి, అయోధ్య, మధుర (యీ మూడూ నేటి ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలో వున్నాయి), మాయా నగరం (నేటి బీహార్‌లోని గయ), ద్వారవతి (నేటి గుజరాత్ రాష్ట్రంలోని ద్వారక), మరియు అవంతి (నేటి మధ్య ప్రదేశ్‌లోని ఉజ్జయిని). 'కాంచీ' అంటే సంస్కృతంలో స్త్రీ కాలికి ధరించే కటకం (కడియం). ఒరిస్సాలోని కటకం (*Cuttack*), కడియం, మెట్టూరు (మెట్టి + ఊరు), కంటెపూడి, గాజుల్లంక, కంకణాల పల్లె, మువ్వలపాలెం వగైరా

ఆభరాణాల పేర్లతో ఏర్పడిన గ్రామ నామాల వలెనే కాంచీపురం కూడా ఏర్పడి వుంటుంది. అయితే కాంచన (బంగారు) పురమే కాంచీ పురమయిందని కొందరు పేర్కొంటారు. ఇది దక్షిణ కాశిగా ప్రసిద్ధిగాంచింది. ఇది పాలార్‌నది ఒడ్డున వుంది. కంచి అనాదిగా వేద విద్యలకు ప్రసిద్ధిగాంచిన కేంద్రం. వైష్ణవుల నూట ఎనిమిది దివ్య తిరుపతులలో యిది 'తిరుక్కచ్చి' పేరిట పేర్కొనబడింది. తమిళులు దీనిని 'కాంజీవరమ్' అని కూడా అంటారు.

ఒకప్పుడిక్కడ జైన, బౌద్ధ మతాలు కూడా పరిఢవిల్లాయి. ఒకప్పుడీనగరంలో వెయ్యి దేవాలయాలు, పదివేల శివలింగాలు వుండేవని ప్రసిద్ధి. ఇక్కడి కైలాసనాథ దేవాలయం దక్షిణ భారతదేశంలోని అత్యంత ప్రాచీనమైన శివాలయమట. ఇక్కడి ఏకాంబరేశ్వర, కామాక్షి అమ్మన్ ఆలయాలు యితర ప్రసిద్ధ ఆలయాలు. ఇక్కడి వరద రాజస్వామి ఆలయం మరియు వైకుంఠ పెరుమాళ్ ఆలయం వైష్ణవులకు ప్రాణప్రదమైనవి. ఇక్కడ మొత్తం 18 ప్రసిద్ధ విష్ణ్వాలయాలున్నాయి. వరద రాజస్వామి ఆలయం విజయ నగర రాజులచే అభివృద్ధి పరచబడింది. ఇక్కడ ఒకే శిల నుండి మలచిన రాతి గొలుసులు చూసే వాళ్లను అబ్బురపరుస్తాయి. ఒకప్పుడు మైసూరును పాలించిన హైదర్ అలీ (టిప్పు సుల్తాన్ తండ్రి) యీ రాతి గొలుసులను తన ఖడ్గంతో తెగనరకాలని ఎంతో ప్రయత్నించి కూడా విఫలుడయ్యాడంటారు. కాంచీపురం అద్భుతమైన పనితనంతో నేసే పట్టుచీరల తయారీకి ప్రసిద్ధిగాంచిన నగరం.

ఆ నగరం శ్రీకరములైన (శుభకరములైన) అనేక రత్నాకర (రత్నములకు నెలవైన) ప్రాకారములు, గోపురములు, ప్రాసాదములతో దీపితమైనట్టిదట (వెలుగొందునట్టిదట). అక్కడి సౌధాగ్రములలో (భవనములపైన) సంచరించే జలజముఖీ (స్త్రీల) ముఖమణుల కాంతిచే వెలుగొందే చంద్రమండలములా వున్నదట ఆ నగరం. అక్కడివన్నీ కనక నికేతనాలట (బంగారు గృహములట). ప్రతి మందిరం యొక్క అళిందభాగము (ముందు భాగము) ముక్తాఫలముల (ముత్యముల) రంగవల్లులతో (ముగ్గులతో) వెలుగొందేదట. ఆకాశాన్ని చుంబించే ఆ నగరపు హర్మ్యములు (భవనములు) వాటిలో పొదిగిన నీలమణుల వలన నీలాంబుదములనే (నీలి మేఘాలనే) భ్రమకలుగజేసిన కారణంగా అహిభుక్ వితానములు (నెమళ్ల సముదాయములు - నెమలి పాముల్ని తింటుంది కనుక దానిని అహిభుక్ అంటారు) వర్షం రాబోతున్నదేమోనని ఆనందంగా నాట్యం చేస్తున్నాయట ఆ కాంచీపురంలో.

ఆ నగరం పట్ల అరుంధతి ముఖంలో కనుపించిన ఆసక్తిని చూసి ఆ నగర ప్రాశస్త్యాన్ని ఆమెకు వివరించాడు వసిష్ఠుడు.

ఈ పురము ధారుణీ మణి నూపురము (ప్రపంచానికి మణి నూపురము వంటిది). సమస్త జనులకూ వారి మనోరథాలను సిద్ధింపజేసే శ్రీ పురము (భాగ్య నగరము). ఈ పురములోని సమస్త ప్రదేశాలూ నీడలు తేరే గారుడ మణుల (గరుడ పచ్చ - మరకతముల - *emeralds*)తో తాపడం చేయబడిన కుట్టిమ సీమలే (గచ్చు చేసిన లేక రాతికట్టడపు నేలలే). ఇక్కడి స్త్రీలు తమ భర్తలతో కలసి విహారం చేసేటప్పుడు ఆ గారుడమణులలో ప్రతిబింబించే ఆకాశంలోని అమర్త్య రాజనగరీ (దేవతల రాజధానియైన అమరావతిలోని) సుర జంపతి రూపరేఖలు (సురదంపతుల రూపరేఖా విలాసాలు) చూసి, వారు మాకేమి జోడని (మాకేమి సరిసాటియని) సారె (మాటిమాటికీ) గేలిగొనఁజూస్తారట సౌధవిహార వేళలలో. ఇక యిక్కడ నిండుపున్నమి రాత్రులలో చంద్రకాంత శిలలతో కట్టబడిన ప్రాకారములు (ప్రహరీ గోడలు) వారములు (తలు వాకిళ్లు) చంద్రకాంతికి కరగి ప్రణాళులు (నీళ్లు పోవుదారులు) నిండి అశ్రాంతధారగా (నిరంతరం ఏకధారగా) పారుతూ వుంటే రతినాథుడు (మన్మథుడు) వేగంగా చేసే సస్యావనశ్రీకి (పంట యొక్క సౌభాగ్యానికి) చంద్రుడు యీ పురవీధులలో చేసిన పంట కాలువలన్నట్లుంటాయట. ఇక్కడి సారసలోచనలు (సారసము అంటే పద్మము. పద్మముల వంటి కళ్లుకు స్త్రీలు) నగర సౌధములలోని విధూపల వేదులందు (విధువు - చంద్రుడు; ఉపల - మణులు - చంద్రకాంతమణులతో

నిర్మించిన వేదికలలో) సంచారం చేసేటప్పుడు నికట (సమీపంలోని) నదిలోని తామరపూవును ఎంతో యిష్టంతో కోసుకొనబోగా అచ్చట ద్రిమ్మరే (తిరుగాడే) తేంట్లు (తుమ్మెదలు) వారి ముఖారవిందములను (పద్మములవంటి ముఖాలను) చుట్టుముట్టగా ఆ స్త్రీలు వెరగొందుతారట (భయపడిపోతారట), తమ చెంతనున్న కాంతలు గేలిచేసేటట్లుగా (అంటే అక్కడి స్త్రీలు పద్మముఖులనీ, అందుకే తుమ్మెదలు అవి కూడా పద్మములేనని భ్రమించి వారి ముఖాలను చుట్టుముట్టాయని భావం).

కాంచీపురములోని అభ్రంకష (ఆకాశాన్ని తాకే ఎత్తైన) భవనాలను చూచి వేల్పుందంతి (దేవతల ఏనుగైన ఐరావతము) అవి శైలాళి (పర్వత పంక్తులు) అని తలచి రహితో (ఆసక్తితో, ఆనందంతో) తన కొమ్ములతో (దంతములతో) త్రవ్వి ఆడుకొనడానికి (కోరాడడానికి) అక్కడికి చేరుతుందట. అయితే ఆ భవనాలలో ఉగ్రవైఖరి కనపడగా, యిదేదో కృత్రిమమైన ఇభరిపుల (ఏనుగులకు శత్రువుల) సంఘములావున్నదని వెఱతో (భయంతో) పారిపోతుండగా అనిమిషులు (దేవతలు) నిర్విణ్ణులై (నిర్వేదంతో) చూస్తుండి పోయారట.

ఆ పురము మేడలు ఎంత ఎత్తైనవంటే ఆ మేడలలోని అంభోజముఖులు (పద్మముఖులైన స్త్రీలు) కమ్మని కస్తూరిని వేలుపుఁగొమ్మమూక (దేవతా స్త్రీల)కు అర్పించి వారినుంచి నునువు తావుల (అతిశయించిన సౌరభంకల) హరిచందన ద్రవము (శ్రీచందన ద్రవము)ను అందుకుంటారట.

తరువాత కవి కాంచీపురంలో ఇంద్రోపలముల (ఇంద్రశిలల)తో నిర్మించబడిన వలభి (చంద్రశాల) తదితర హర్మ్యాల గురించి వర్ణించాడు.

క॥ ప్రాకారమగుట నున్నతిఁ
గైకొని సాలంబుగానఁ గదు కొమ్మలచే
జోకై యట కోట తగున్
పాకారి శిలావిలాస భాసురమగుచున్. (ఘటికాచల మాహాత్మ్యము 2-207)

ఈ పద్యంలో అక్కడి కోటను వర్ణిస్తున్నాడు. దాని ప్రాకారం (చుట్టుగోడ) చాల ఎత్తైనదట. అది సాలము కనుక (సాలము అంటే వృక్షము అనీ ప్రాకారమనీ రెండర్థాలున్నాయి) అది చాల కొమ్మలతో (కోట కొమ్మలతో) జోకై (యుక్తమై) అక్కడి కోట పాకారిశిలా విలాస భాసురమవుతూ వున్నదట. (పాకారి - పాకాసురుని శతృవు - ఇంద్రుడు - ఇంద్రశిలా విలాసంతో ప్రకాశిస్తూన్నదట).

తరువాత అక్కడి ఖేయములు (అగడ్తల)ను కూడా వర్ణించాడు.

గురుని (దేవగురువైన బృహస్పతిని) కూడా నిరసించేటంతటి ధీశాలులట ఆ పురివిప్రులు. అక్కడి రాజమార్తాండులు (క్షత్రియులు) అతి దుర్నిరీక్ష భాసిత తేజమున పొల్చేవారట. (చూడడానికి వీలుకానంతటి కాంతితో వెలుగొందేవారట).

ఇక అక్కడి కోమటులను (వైశ్యులను) గురించి చెపుతున్నాడు.

చ॥ అనవరతంబు నెచ్చెలి దిగంబరియై బికిరంబులెత్తఁ దా
ధనదుఁడనంచు నెక్కనొక తట్టువయైనను లేక మానిసిం
బనిఁ గొనె కల్మి కల్మికిది మార్గముగాదని యెంచి మించి కై
కొనరు కుబేరు మేటి ధనకోటిని మీటగు వీటి కోమటుల్. (ఘటికాచల మాహాత్మ్యము 2-211)

చిత్రరేఖ కుబేరుడి నెచ్చెలి (భార్య). (ఆమె పేరు కొన్ని గ్రంధాలలో భద్ర అనీ, మరికొన్నింటిలో చిత్రలేఖ అని కూడా వుంది. కాని వారు వేరే వ్యక్తులు. కుబేరుని భార్య చిత్రరేఖే.) ఆమె అనవరతమూ (ఎప్పుడూ) దిగంబరియై బికిరము లెత్తుతూ (బిచ్చమెత్తుతూ వుంటుందట). ఎక్కడానికి ఒక్క తట్టువ (గుర్రము) కూడా లేక తనేమో మానిసిని పని గొన్నాడట. కల్మి (కలిమి లేక కల్మి అంటే కుబేరుడు) మనుష్యుడిని ఆ పనికి నియమించాడట. కుబేరుడు నరవాహనుదని ప్రసిద్ధి మనుష్యుడినే ఆయన వాహనంగా వాడతాడట. అయినా తాను ధనదుడనంటాడు కుబేరుడు (ధనదుడు అంటే ధనమునిచ్చేవాడు అని అర్థం. అంటే సంపద కలవాడని. ఇది కుబేరుని మరోపేరు.).

కలిమికి (సంపదలకు) యిది మాత్రం మార్గం కాదంటూ ఎంచి (తలపోసి) మించి (అతిశయించి) కుబేరుడిని కైకొనరట (లక్ష్యపెట్టరట) మేటి ధనకోటితో (ధన సంపదలతో) మీటగు (అధికులైనట్టి) ఆ వీటి (ఆ కాంచీపురమందలి) కోమటులు. అంటే అక్కడి వైశ్యులు కుబేరుడిని కూడా లక్ష్యపెట్టనంతటి ధనవంతులన్నమాట.

ఇక ఆ కాంచీపురములోని నాలవజాతిని (శూద్ర కులమును) వర్ణిస్తున్నాడు కవి.

శూద్రులకు పుట్టినిల్లు హరి పదాంబుజములట (విష్ణు పాదములట) శ్రీకర వ్యాప్తిలో (శుభకరములైనట్టి వాని వ్యాప్తిలో) ఉద్యత్ప్రసిద్ధిగాంచిన (గొప్ప పేరుగాంచిన) తమ పుట్టినిల్లైన శ్రీహరి పాదములవలెనే సొంపు వహిస్తున్నదట (సౌందర్యము కలిగివున్నదట) ఆ వీటి శూద్రకులము.

ఇక ఆ కాంచీపురములోని మదపుటేనుగుల గురించి చెపుతున్నాడు.

**క॥ ఒదుగుచు నొక్కొకమూలను**
**జదికిలఁబడి కదలమెదలఁ జాలవు తామే**
**మదకరులని దిక్కరులన్**
**మదిరోయుc బురంబులోని మదనాగంబుల్. (ఘటికాచల మాహాత్మ్యము 2-214)**

దిక్కరులు అంటే దిగ్గజములు. భూమిని ఎనిమిది దిక్కులలో ఎనిమిది బలిష్ఠమైన ఏనుగులు మోస్తున్నాయని విశ్వాసం. అవెక్కడికీ కదలలేవు. మెదలలేవు. ఊరకే ఒదిగి ఓ మూల నిలబడి (దీనినే చదికిలబడి' అంటున్నాడు కవి చతికిలబడడమంటే పిఱ్ఱలను నేలనానించడం) భూమిని మోసే అవేం మదకరులు? (మదపు టేనుగులు?) అని మది రోస్తాయట (మనస్సులో అసహ్యించుకుంటాయట) ఆ కాంచీపురపు మదనాగంబులు (మదపుటేనుగులు. నాగము అంటే ఏనుగు అని కూడా అర్థం). అలా అనుకుంటూ "ఏం? మేం మాత్రం మోయలేమా యీ భూమిని?" అంటూ భూమిని పెకల్చి తాల్చుటకు (మోయుటకు) ప్రయత్నిస్తున్నవా అన్నట్లుగా తరులను (వృక్షములను) ఒక్కుమ్మడిగా తమకొమ్ములతో (దంతాలతో) కుమ్ముతున్నాయట ఆ ఆద్యద్దంతి సంతానములు (ఆది దంతి సంతానములు. ఏనుగులన్నీ ఐరావతమనే ఆది దంతి సంతానములేనని విశ్వాసం).

ఇక కంచిలోని గుర్రాలెలావున్నాయట?

అహిభయాపాదకమై (పాములకు భయం కలుగజేస్తూ) నిజేచ్ఛగా చరించే (తనకు యిష్టంవచ్చినట్లు తిరుగాడే) అంబుజోదరుడి (దామోదరుడి - విష్ణువుయొక్క) తురగము (విష్ణువుకు గరుత్మంతుడనే పక్షి వాహనము. అదే ఆయన గుర్రము)ను తెగడి (తిరస్కరించి) -

అలఘు (తేలికైనవి కానట్టి. కఠినమైనట్టి) పద క్రమములతో (పద నిర్మాణంతో) మీటి (అతిశయించి) తనరారు

(ఉన్నతిని పొందినట్టి) కందర్పహరుని (మన్మధుని హరించివేసిన శివుడి) ఘోటకముల నవ్వి (గుర్రములను ఎగతాళిచేసి) త్రిపురాసుర సంహారము చేసిన సందర్భంలో శివుడి రథానికి నాలుగు వేదాలూ గుఱ్ఱాలుగా వున్నాయట. వేదాలు కఠినమైన పదజాలంతో కూడినవని ప్రసిద్ధి. శివుడి గుఱ్ఱాలైన వేదాలను చూసి 'యివేం గుర్రాలని ఎగతాళి చేస్తూ' -

ఇక నలినజుడి (బ్రహ్మ) వాహనమేమిటి? అది హంస. అది యితర పక్షులతో చేరి పక్షిగానే గుర్తింపబడుతున్నది గానీ, అదేమి వాహనము? (వాహనము అంటే గుఱ్ఱము అనే అర్థంలో) అది వాహనముకాదు - అని హసిస్తున్నాయట -

శతృవులు ఆశుగప్రతతి (బాణముల సమూహము)తో దాడికి దిగినప్పుడు అళికి (భయపడి; అళుకు అంటే వెఱపు, భయము) దిక్కులఁబాఱు (దిక్కులవెంట పరుగులెత్తే) అమరవల్లభుని (దేవతల అధిపతియైన ఇంద్రుని) వాహనములను కేరి (తిరస్కరించి) -

అనిశమూ (అనవరతమూ, ఎల్లప్పుడూ) సాదిచేతః (సాది అంటే రౌతు లేక సారథి. రౌతు లేక సారథి యందు బుద్ధినిలిపి ఉండే అశ్వాన్ని సాదిచేతః అంటారు. అదే ఉత్తమాశ్వం. ఎప్పటికప్పుడు సారథి ఆదేశాలను గమనించి తదనుగుణంగా నడచుకోవడం ఉత్తమాశ్వ లక్షణం) ప్రమోదకర, నిరాఘాట, వేగబంధురమనే విశేష ఉత్తమాశ్వ గుణగణాలతో భ్రాజితమై (ప్రకాశము నొందినవై) రణ నిరంకుశములై ఒప్పుతున్నాయట ఆ వీటి సైంధవములు (గుర్రములు).

ఇక ఆ కంచిలోని వేశ్యలెలావున్నారో వర్ణిస్తున్నాడు కవి.

వారి పాదాలకున్న కటకములు (కడియములు) ఘణిల్లు ఘణిల్లు మని చేసే నిక్వణనములు (నిక్వణములు; మ్రోతలు) వ్రతుల (ఏకపత్నీ వ్రతుల) ధైర్యాన్ని వకావకలు (వ్రయ్యలు) చేస్తున్నాయట. వారు శరీరంపై పూసుకున్న గుబాళించే మైపూతల ఘుభఘుగలు పల్లవాలి (విటసమూహము యొక్క) మరులకు (వ్యామోహానికి) బలిమి చేకూరుస్తున్నాయట. ఇంచు విల్తుడిని (ఇంచు అంటే చెరకు. చెరకువిల్తుడు - అంటే మన్మథుడిని) కూడా యీసడించే వారి వీక్షణ రుచులు (చూపుల కాంతులు) ప్రజల్ని తప్పుకోమని హెచ్చరికలు చేస్తున్నట్లున్నాయట. వారి కావి చక్కెర మోవి (ఎర్రని తీయని పెదవి) కమ్మకస్తురి తావి (వారినుండి వచ్చే కమ్మటి కస్తూరి వాసన) యువజనమ్ములకు నోరూరింప జేస్తున్నాయట. విటశ్రేష్ఠులకు వేయదానికి దండలుపూని, మదముతో కూడుకొన్న పోకడల పెంపు (అతిశయము) మందహాసముల (చిరునవ్వుల) సొంపు (సౌందర్యము) వెలయగా ఆ వీట (ఆ కంచిలో) విహరిస్తారట లలితరూప భాజనమైన (సుకుమారమైన రూపముతో యోగ్యమైనట్టి) వారనారీజనము (వారకాంతలు - వేశ్యలు).

ఇక ఆ కాంచీపురములోని జారిణులు (రంకుటాళ్లు) ఎలా వున్నారో తెలుపుతున్నాడు కవి.

కరుడుబారే వీటికా రసము (చిక్కబడిన తాంబూల రసము) కావి మోవిపై (ఎర్రని పెదవిపై) రంకుమగడు వేసిన కాటులకు (దంత క్షతములకు) మేలిముసుగు లొసగిందట. (పెదవిపై చిక్కబడిన ఎర్రని ఆ తాంబూల రసములో జారుని పంటి గాట్లు కలిసిపోయాయట.) గుబ్బలపై (ప్రియుడు యింపు మీరగా వేసిన క్రొన్నెల బారు (క్రొత్త + నెల - నెల అంటే చంద్రుడు; క్రొన్నెలబారు అంటే అర్ధచంద్రాకారంలో వేయబడిన నఖ క్షతముల వరుస) వలన అంతకుముందు స్తనాలకు రాసుకున్న గంధముచిట్లి నిండు సిగ్గును కలుగజేస్తున్నదట. తెల్లని తామరపూవుల వలెనున్న కళ్లలో నిద్దురమంపు (నిద్రమత్తు; మైకము) తేరి (కలిగి), అది వ్యాపించి మనస్సులో భయం ఆవరించిందట. వారు భర్తలలో తమ ప్రియుడిని ఊహించుకున్నప్పుడు ఒక్కసారిగా వారి మనస్సులు చలించి వారి ముఖాలు వెలవెల బోతాయట (వివర్ణమౌతాయట). అయినా దానిని పైకి కనుపించనీయకుండా సమయస్ఫూర్తితో కప్పిపెట్టి భర్తలకు కూడా మదిలేని మరులుచాటిన (భర్తలతో మనస్సులో లేని ప్రేమను నటించిన) మగువ కవ (జారిణుల జంట) ఒకపాటి (సమముగా, ఒకేసారి) మరుని ధాటిగా కూడదానికి (ప్రియుడితో గాఢ శృంగారం కోసం) వెఱపు పోమీటి (భయం పోగొట్టుకొని) వేకువజాము వరకూ రంకుమగనితో రతి క్రీడలలో

తేలియాడే ఆ వీటి మేటి జారిణీకోటి (సమూహము) చతురతా స్వర్ణపేటి (చతురతలో బంగారు పేటికల్లు) •

ఇక ఆ నగరంలోని ఉపవనాలెలా వున్నాయో చెపుతున్నాడు కవి.

స్వర్గంలోని నందనవనంలో ప్రసిద్ధమైన కల్పవృక్షముల లోనిదైన సంతాన ధరిత్రీరుహ (సంతాన వృక్షం యొక్క) సంతాన సమావనీజ సంతానవర (సంతానసమ + అవనీజ + సంతానవర - సంతానంతో సమానమైన వృక్షాల సంతతి అనదగిన వృక్షములతో) అశ్రాంత వసంత విలాసాక్రాంతములై (తెరపిలేని వసంతపు శోభనిండినవై) అక్కడి ఉపవనములు రాజిల్లుతున్నాయట (ప్రకాశించుతున్నాయట).

ఆ పురం యింకా అలరుల (పూల) తోటలు, మణిమయ కాంచన సౌధాలు, చిలుకల మాటలు, రసము చిల్కే చెలువల ఆటపాటలు, కొలకుల తేటలు (కొలనులలోని తేటనీరు), కళలు కులికే చతుర్విధ గేహకోటులూ (కళ అంటే శిల్పము అనే అర్థం కూడా వుంది. కళలు కులికే - లేక కళలొలికే - అంటే శిల్పములతో కూడిన నాలుగు విధములైన గృహ సముదాయములు కలిగి), కలిమి పొలంతి (సంపద అనే స్త్రీ; లక్ష్మీదేవి)కి నిచ్చలున్ (నిత్యమూ) కాపురమై విలసిల్లుతుందట - అని వసిష్ఠుడు చెప్పగా మిగిలిన ఆరుగురూ విన్నారట. (మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు వీరిని సప్తర్షులంటారు. వీరినే చిత్ర శిఖండులనీ అంటారు. అంటే చిత్రములైన జటావిశేషములు కలవారు).

ఆ తరువాత దేనిని చూస్తేనైతే నరులకు అనంతానంత ఫలశ్రీలు (అంతులేని భాగ్యఫలములు) చేకూరుతాయో అట్టి అనంత సరోవరపు జలాలలో తీర్థమాడారట ఆ మునీంద్రులు. నిక్కపు (నిజమైన) భక్తితో ఆ మునీశ్వరులు తక్కిన ఐదు తీర్థములలో స్నానం చేసి వేగవతీనది ఉత్తర తటాగ్ర భాగమునగల యజ్ఞవేదిపై ప్రసన్నుడై వెలసిన శ్రీ వరదరాజ స్వామిని ఆరాధించారట. శంఖము, చక్రము, గద మూడు చేతులలో కలిగి, వరదానాభినయ శోభితమైన అభయహస్తముకలవానిని, కరుణారసంతో ఉదీర్ణమైన (ఉదారమైన) కర్ణాంత విశ్రాంత (చెవుల వరకూ వ్యాపించిన) రవిచంద్రరూప నేత్రములు (సూర్య చంద్రుల రూపములు కలిగిన కండ్లు) కలిగినవానిని, జనుల పాదసేవ కారణంగా విభాస్వర (వెలుగొందే) ముఖాబ్జము (ముఖపద్మం) కలిగిన వానిని, అసమాన శృంగార రసమానమైన కౌస్తుభ లసమాన (కౌస్తుభ మణియొక్క కాంతితో ప్రకాశించే) వక్షస్థలము కలవానిని, తరణిబింబం (సూర్యబింబం) అనిపించే విధంగా వెలుగొందుతూవున్న నూతన రత్నమకుటంతో రమ్యమైన శిరస్సుకలవానిని, దేవతా చక్రవర్తినీ, దివ్యమూర్తినీ కాంచి సేవించారట ఆ పారికాంక్షివరులు (మునివరులు).

ఇక ఆ నగరాన్నుంచి బయలుపడి మూడు యోజనాలు నడిచి ఘటికాచలాన్ని చేరుకున్నారట.

యోజనమంటే నాలుగు క్రోసులు కనుక మూడు యోజనాలంటే 12 క్రోసులు. క్రోసుకు 4 వేల గజాలు కనుక 12 క్రోసులంటే 48,000 గజాలు. మైలుకు 1760 గజాలు కనుక యీ దూరం 27.27 మైళ్లు. అంటే 43.87 కి.మీలు. కాంచీపురం ఘటికాచలం ల మధ్యదూరం మనమిందాక సుమారు 50 కి.మీలు అని తేల్చాం. ఇది దానికి దాదాపుగా సరిపోతున్నది.

# ఘటికాచల వర్ణన

అక్కడ పనస, నింబ (వేప - *Azadirachta indica*), కదంబ (*Anthocephalus cadamba*), పాటలీ (కలిగొట్టు చెట్టు - *Bignonia suaveolens*), ఘనసార, సహకార (తియ్యమామిడి), ఖర్జూర మొదలైన మహీరుహముల (వృక్షముల)తోనూ, కుంద (మొల్ల), మందార, అబ్జ (తామర, ఎర్రగన్నేరు), కుంజర (ధాతకీ, ఏఋ జాజి), మాలతీ, మల్లికా వల్లీమ తల్లికలతోనూ, అన్ని రుతువులలోనూ ప్రవహించే తీయని జలములతో కూడిన ఝరముల (సెలయేళ్ల)తోనూ, సహకార పల్లవములు (తియ్యమామిడి చిగుళ్లు) తిని మత్తెక్కికూసే కోయిలల కుహూకారములతోనూ, గత వైరాన్ని మరచిపోయి, కలసి విహరిస్తూన్న హరి (సింహము), కరి (ఏనుగు), వ్యాఘ్రము (పులి), గోవు (ఆవు), బిడాలము (పిల్లి), ఆఖువు (ఎలుక), శిఖి (నెమలి),

భుజంగము (పాము) మొదలైన జంతు సమితిచే నిరంతర పరిపూర్ణమైన దానిని ఘటికామాత్రంలోనే జనులకు కాంక్షితార్థములను ఘటిల్లజేసి, కుటిలమైన మహాకల్మషములను (పాపములను) తొలగించే యీ క్షేత్రానికి సాటివచ్చే మరొక ప్రదేశం భూమిపై యింకేదైనా వున్నదా?' అని పెద్దగా ప్రశ్నిస్తూన్న శిఖిరవములు (నెమళ్ల శబ్దాలు) రాజిల్లునట్టిదైన ఘటికాచలమును చేరుకున్నారు వారు.

అక్కడి సింగముల గములు (సింహాల గుంపులు) నిసర్గములైన (స్వభావ జనితములైన) పగలెరుగకుండా (ద్వేషభావాలు లేకుండా) అక్కడి మృగములను (జింకలను) పరిపాలిస్తూ వున్నాయట. (మరి అవి మృగపతులు కదా!)

ఆ ఘటికాచలము తన నెత్తములందు (నెత్తము అంటే కొండమీది విశాల సమతల ప్రదేశము) లభించే మాణిక్యముల కలిమి (సౌభాగ్యము) చేత మేరు మహీధ్రమును (మేరు పర్వతాన్ని) తలదన్నుతున్నదట. రహి (బాగు, సొంపు) మించు స్ఫటిక రాళ్ల సమూహం కారణంగా కైలాస కుధరాన్ని (పర్వతాన్ని) కాకు (తిరస్కారం) చేస్తున్నదట. నెలరాతి (చంద్రశిలల) చాలువు (వరుస)లపై ప్రవహించే వలి (చల్లని) నీటి చాలున (ధార కారణంగా) హిమవన్నగేంద్రమును (హిమవత్పర్వతరాజమును) ఈసడిస్తున్నదట. నిగనిగ బంగారంలా మెరుస్తున్న సిగరమ్ముల (శిఖరముల) కారణంగా హేమకూట పర్వతానికి ఎగ్గులెన్నుతున్నదట (దోషాలను ఎంచుతున్నదట) (హేమకూట పర్వతాన్నే హేమాద్రి అనీ, సుమేరు అనీ అంటారు). సురభి (మంచి సుగంధం కల) చందన శాఖిచే (శ్రీ చందన వృక్షములచే) సంశోభితమైనదైనందువలన మలయ ధరణిధరేంద్రమును (మలయ పర్వతాన్ని) చులకన చేస్తున్నదట. స్ఫటికాక్ష సరమును చేతబూని ఘటికామాత్రము (ఇరవైనాలుగు నిముషాల కాలం) జపంచేస్తే ఘనమైన సిద్ధులు ఘటిల్ల చేస్తుందట ఆ ఘటికాద్రి.

## కొనసాగిన సప్తర్షుల తపస్సు

అక్కడి సరోవరం యొక్క గట్టుపై నిలిచి నిశ్చలంగా తపమాచరించుచున్న మునులను చూచి వారు తమకు దర్భాసనములనిచ్చి, వందనార్చనలు చేయగా, వాత్సల్యంతో ఉజ్జ్వలమైన వచో వైభవంతో సప్తర్షులిలా పలికారు.

"అనిశము (ఎల్లప్పుడూ) అర్థకామముల యందు విరక్తితో, చిత్తశాంతితో జీవించే మీకు, మీ మనస్సులలోనే మోక్షం ప్రసాదించేవాడైన మాధవుడుండగా, తపస్సు చేయాలనే కోరిక యింకా ఏమి సాధించాలని కలిగింది? అదేమిటో మాకు తెలపండి."

అప్పుడు వారు "మహర్షులారా! మీరు పేర్కొన్నట్లుగానే మాకు త్రివర్గములపై (ధర్మార్థ కామములపై) ఒకింత కూడా ఆశ లేదు; మోక్షం కొరకు వనజదళాక్షుడిని (తామరపూరేకుల వంటి కన్నులుకల విష్ణువును) చూడాలనే వాంఛ ఒక్కటితప్ప. లోగడ మేమందరం మాపతి (లక్ష్మీపతి) గురించి తపస్సు చేయగా ఆకాశ భారతి (ఆకాశ వాణి) భూమిపైన విష్ణువు ప్రత్యక్షం కావడం అంత సులభమైన కార్యమేమీ కాదనీ, అది ఘటికాచలంలో తపస్సు చేయడం ద్వారానే సాధ్యమౌతుందనీ, కృతయుగంలో సప్తర్షులు అక్కడ తపస్సు చేసి శౌరిని చూడగలుగుతారనీ, అప్పుడే మీరూ శ్రీహరిని చూడవచ్చుననీ, కనుక అక్కడికి వెళ్లండని చెప్పింది. అందుకే యిక్కడికి వచ్చి తపస్సు చేసుకుంటూ వున్నాం' అని తెలిపారు. దీంతో తమకు హరి సాక్షాత్కారం తప్పనిసరిగా అయితీరుతుందనే సంతోషంలో మునిగితేలారు సప్తర్షులు.

ఇక ఆ తరువాత వారు దయాసార గంభీరాకారుడూ, ఉదారుడూ, ఘటికాచలేశ్వరుడూనైన జగత్స్వామిని తమ మనోపీఠంపై నిలిపి వేదచోదితమైన ధ్యానం చేశారు. హరి సర్వజీవుల హృదయాంతర్గత విషయాలన్నీ ఎరిగినవాడైనప్పటికీ ఆ మునుల చిత్త స్థిరత్వాన్ని పరీక్షించగోరి క్రీడాతత్పరుడై వారికి ప్రత్యక్షమవడంలో కొంచం విలంబం (ఆలశ్యం) చేశాడట.

శౌరి ప్రత్యక్షం కానందున వారు బాధపడుతూ నారద, వాయునందన, సనందనాదులకువలె మనకు హరిని చూడగలిగే భాగ్యం కలుగలేదు కదా! అని వాపోయారట. అనంతరం తమ తపస్సును మరింత తీవ్రతరం చేశారట.

# నరసింహుని ప్రత్యక్షం

అప్పుడు పిశంగలోచనుడూ (కపిలవర్ణపు కళ్లు కలిగినవాడూ; కపిలవర్ణము అంటే గోరోజనపు రంగు) రత్నమంజీరములూ (అందెలు), కంకణములూ, కేయూరము (బాహుపురి)లూ, హారములూ, కుండలములూ మొదలుగాగల ప్రముఖ విభూషణములతో వితానుడూ (విరివియైనవాడూ); వితాన ధ్వంసము కావించిన (దక్ష యజ్ఞాన్ని ధ్వంసం చేసిన-వితనమంటే సమూహము, విరివి అనే అర్థాలతో పాటు యజ్ఞమనే అర్థమూ వుంది.) వీరభద్రుడి యొక్క రౌద్రరసాన్ని కూడా విదారణము చేయగల (పారద్రోలగల, కరగించి వేయగల) కరాళదంష్ట్రాయుగళము (పొడవైన కోరల జంట) కలవాడునూ, హాటక కశిపుడి (హిరణ్య కశిపుడి) వక్షఃకవాటమును (వక్షమనే తలుపును) పాటనము చేసిన (చీల్చిన) కురార కఠోర (గొడ్డలిలా కఠినమైన) నఖరములు (గోళ్లు) కలిగినవాడునూ, దివ్య గాయనులైన (గాయనుడు అంటే పాటలు పాడేవాడు) విశ్వావసు, తుంబుర, నారదాదుల గీతాలలో తన దివ్యనామాలు, బిరుదనామాలు ఉదాహరించబడే మంగళాష్టకములు, దండకములు మొదలైన ప్రబంధముల సంరంభము కలిగినవాడూ, రంభ మొదలుగాగల అప్సరసలు నృత్యాలతో స్వాగతించగా, దివ్యలోకపు పారిజాత వృక్షం తన ప్రసూనాలను (పూవులను) వర్షించగా, దివ్యదుందుభి ధ్వానాలు (భేరీ ధ్వనులు) స్వాగతంపలికే శ్రీ నరసింహ దేవుడు ప్రత్యక్షమయ్యాడట.

విశ్వావసుడనే వాడొక గంధర్వ రాజు ; గాయకుడు. ఈయనకు యాజ్ఞవల్క్య మహర్షి తత్త్వోపదేశం చేశాడట.

తుంబురుడు కూడా ఓ గంధర్వ సంగీత విద్వాంసుడు.

# నరసింహ స్తుతి

అప్పుడు భయము, కంపము (వణకు), విస్మయము (ఆశ్చర్యము), సంభ్రమము (మనస్సున తొట్రుపాటు), చిత్తసమ్మోదము (మనస్సున మిక్కిలి సంతోషము), భక్తి – యివన్నీ ముప్పిరిగొనగా (మూడు పిరులుగా పెనగొను; పిరి అంటే మెలి) నియమం ప్రకారం ప్రణతులు (నమస్కారములు) చేసి, ఆ తాపసులు నిటలాంజలి (హస్తములను నుదురుకు తాకించి చేసే నమస్కారం) ఘటిస్తూ యిలా స్తుతించారు –

"జనులు కోరినవన్నీ ప్రదానంచేసేవాడా! తమస్సును (చీకటిని) విదారము చేసేవాడా! (చీల్చిచెండాడే వాడా!) ప్రాగ్వార్జితమైన (పూర్వజన్మలో చేసుకొన్న) మహాపాతకములనే అంబుధరము (మేఘము) పాలిటి ప్రభంజనము (పెనుగాలి) వంటివాడా! సురారి భంజనుడా! (దేవతల శత్రువులైన రాక్షసులను విరిచేసినవాడా!) దయతో విరాజిల్లేవాడా!"

ఆ తరువాత వారు నరసింహమూర్తిని చూచిన ఆనందోద్రేకంతో సుదీర్ఘమైన దండకాన్ని చదివారు. దాని భావాన్ని సంక్షిప్తంగా చూద్దాం –

శ్రీ నృసింహా! సురారుల (రాక్షసుల) అతి అహంకారమనే ప్రమత్తేభానికి (ప్రమత్తమైన యిభము – ఏనుగు - నకు) సింహము వంటివాడా! సాధు సంకీర్తితుడా! (సాధువులచే కీర్తింపబడేవాడా!) ద్విజిహ్వాధి రాడ్భూషణుడు, (ద్విజిహ్వము అంటే సర్పము. రెండు నాల్కలు కలది. సర్పముల రాజును భూషణంగా ధరించినవాడు – శివుడు) బ్రహ్మ మొదలుగాగల దేవతలచే పూజించబడే అంఘ్రిద్వయం (పాదద్వయం) కలవాడా! సృష్టి, రక్షా, వినాశక్రియాదక్షా! (సృష్టి, రక్షణ, వినాశనము

వగైరాలు చేయ సమర్థుడైనవాడా!) నీ లీలానికాయములు (నీ లీలల సముదాయములు) అప్రమేయములు (యింతని పరిమితిలేనివి) వాటిని మేమేమని నుతిస్తాము? ఓ దేవోత్తమా! సోమకుడను పేరుగల దైతేయముఖ్యుడు (రాక్షస ప్రముఖుడు) వాణీవధూనాథుడిని (బ్రహ్మను) వంచించి ప్రామిన్కులెల్లన్ (వేదములనన్నింటినీ) ప్రమోషించి (దొంగిలించి) మున్నీటి పెన్నీటిలో దాగ (సముద్రపు జలాలలో దాగుకొనగా) వానిని మహామత్స్య రూపంలో పుట్టి వారాశి (సముద్రము)లో పట్టి పుచ్ఛంబుతో (తోకతో) కొట్టి ఆ వేదములుతెచ్చి ఆ వేధకు (బ్రహ్మకు) ప్రీతితో యిచ్చి కటాక్షింపలేదా! వైదికాచార మార్గాన్ని రక్షించ లేదా! దేవదానవులు అమృతం కోసం మందర పర్వతంతో వారిరాశిని (సముద్రాన్ని) మథించడానికి పూనుకున్నప్పుడు, ఆ పర్వతం అబ్ధిలో (సముద్రంలో) క్రుంగిపోగా దానిని కూర్మావతారం తాల్చి పైకెత్తవా! కీర్తిని హత్తవా! (కీర్తిని పొందలేదా?) పాపబుద్ధితో హిరణ్యాక్షుడనే రాక్షసుడు యీ ధారుణిని (భూమిని) చాపగా చుట్టి పాతాళ లోకములో పెట్టగా దానిని వరాహావతారమున దంష్ట్రాగ్రభాగముతో (కోరచివరి భాగంతో) ఎత్తి ఎల్లలోకములనూ సంతోష పరచలేదా? సర్వమూ విష్ణుడే అంటూ భాషించిన ప్రహ్లాదునిపై కినుక వహించి 'యీచోట నీవా హరిని చూపుమంటూ' హిరణ్యాక్ష దైత్యానుజుడు (హిరణ్యాక్షుని తమ్ముడు - హిరణ్య కశిపుడు) ఉక్కు కంబమును (ఉక్కు స్తంభాన్ని) పగులమోదగా అందే నృసింహావతారముతో పొల్చి (ప్రత్యక్షమై) ఘోరమైన ఆర్భటులతో (మ్రోతలతో. ఆర్భటి అంటే మ్రోత) ఆ దైత్యుని త్రుంచవా? (చంపలేదా?) బాలుడైన ప్రహ్లాదుని రక్షించి విఖ్యాతిచే మించవా? (అతిశయించవా?) వామనుడైన (పొట్టివాడైన) బ్రహ్మచారి ఆకృతిని పూని బలిని దానమడిగి పాద త్రయీ మాత్ర భూదానమును పొంది (కేవలం మూడడుగుల నేలనే దానంగా పొంది) త్రైవిక్రమాకారాన్ని పూని (త్రివిక్రమునిగా అవతరించి) ఆకాశమునూ, ధరిత్రినీ నీ పదద్వయంతో నింపి శిష్టైక పాదాన్ని (మిగిలిన ఒకపాదాన్నీ) ఆ దైత్యుని మూర్ధభాగము (శిరము) పై నుంచి అతడిని పాతాళమునకు త్రొక్కవా? (త్రొక్కి వేయలేదా?) వజ్రికి (ఇంద్రుడికి) కోర్కెతీర్చవా? తన తండ్రికి కీడు వాటిల్ల జేసిన కార్తవీర్యార్జునుడిని జామదగ్న్యుండవై (పరశురామునివై) త్రుంచి, శోధించి (వెదకి వెదకి) తద్రాజ వంశావళిని కినుకతో (కోపంతో) ముయ్యేడు మార్లు (*Thrice seven times* - 3 x 7 = 21 మార్లు) కురాగ్ర హేతితో (గొడ్డలి అంచుల అగ్ని శిఖలతో) రణక్షోణిలో (రణభూమిలో) హింసించి ఆ రక్త ధారావళితో సప్తహ్రదములను (ఏడు సరస్సులను) సృష్టించి వాటిలో పితౄణమును (తర్పణలు విడవడం ద్వారా) దీర్చవా? భూభారాన్ని ఆర్పవా? (పోగొట్టవా?) పంక్తికంఠుడు (పంక్తి అంటే వరుస అనే అర్థంకాక పది అనే అర్థమూ వుంది. అందుకే దశరథుడిని పంక్తిరథుడనీ అంటారు. పంక్తిగ్రీవుడు అన్నా పంక్తికంఠుడు అన్నా దశకంఠుడైన రావణుడు) అకుంఠ ప్రతాపంతో వాసవుడు (ఇంద్రుడు) మొదలైన అష్టదిక్పాలకులనూ; సిద్ధ, సాధ్య, అప్సర, యక్ష, గంధర్వ, విద్యాధర శ్రేణులనూ పట్టి బాధించగా వానిని విదారించుటకు (చీల్చుటకు - చంపుటకు) ధరిత్రిలో దశస్యందన క్షోణీపాలాత్మజాతుడవై (స్యందనము అంటే రథము. దశరథుడనే భూపాలుని ఆత్మజుడవై - కుమారుడవై) రామనామంతో పుట్టి, సీతాసతిని పెళ్లాడి తండ్రి ఆజ్ఞతో యీరేడు (యీరు + ఏడు - అంటే రెండు ఏళ్లు - పధ్నాలుగు) సంవత్సరములు మహారణ్యవాసము కావించి, సీతను అపహరించిన మహావీరుడైన లంకాపురవాసుడు రావణుని భండన క్షోణిలో (యుద్ధ భూమిలో) త్రుంచి (వధించి) సీతాసమేతంబుగా రాజ్యమును చెందవా? సర్వలోకస్తుతులూ పొందవా? ధాత్రిలో కృష్ణాగ్రజాతుడవై (కృష్ణునికి అన్నవై) రోహిణేయుడవై (రోహిణి కుమారుడవై) పుట్టి ప్రలంబాసురుడు మొదలైన దుష్టాసురులను (దుష్టులైన రాక్షసులను) ఖండింపవా? దిక్కులన్నిటా కీర్తులను నిండింపవా? తరువాత త్రైపురేంద్ర ద్విడాయుర్వినాశార్థమై (త్రైపురేంద్ర ద్విష్ - అంటే త్రిపురాసురుల శత్రువు. శివుడు; శివుని మతమైన శైవమును వినాశనం

చేయడానికి) బుద్ధరూపంలో తద్వధూశీల భంగము గావింపవా? (ఆ శైవమనే వధువుకు శీలభంగం చేయలేదా? సైద్ధాంతికంగా దానిని ఓడించ లేదా?) మోహనములైన అనేక శాస్త్ర ప్రసంగములు నీవు చేయలేదా? మీదట (భవిష్యత్తులో) కల్కిరూపములో మ్లేచ్ఛులను మట్టనున్నట్టి (త్రొక్కనున్నట్టి, అణచివేయనున్నట్టి) మీ దివ్య లీలలను ప్రశంసిస్తాము.

సంస్కృతం పలుకని, ఆర్యసంస్కృతికి భిన్నమైన బర్బరజాతివారు మ్లేచ్ఛులు. బర్బర దేశమంటే పర్వతమయమై ఎగుడు దిగుడుగానున్న భూమి. బోధాయనుని నిర్వచనం ప్రకారం మ్లేచ్ఛుడంటే గోమాంస ఖాదియైన (గోమాంసాన్ని భక్షించే వాడైన) బహువిరుద్ధ భాషణముచేసే సర్వాచార విహీనుడు, యథేచ్ఛావిహారి. మ్లేచ్ఛ దేశము అంటే కామరూపము (ప్రస్తుత అస్సాం) అని చెప్తారు కొందరు.

ఈశా! విధీశా! చిత్తదుష్ప్రాపమైనట్టి నీ రూపమును కనుగొన్నాము. మా తపములు ఫలించాయి. ఓ రమాధీశా! సర్వేశ్వరా! నృసింహా! నమస్తే నమస్తే నమః"

# నరసింహుని శాంతస్వరూపం

ఇదంతా అవధరిస్తూన్న (వింటూన్న) భృగువుతో ధాతృనందనుడు (బ్రహ్మ కుమారుడైన నారదుడు) తన సవరన (చదునైన) చెక్కిళ్లపై నవకుంద దంతకాంతులు (కొత్తగా పూచిన మొల్లల వలెనున్న దంతముల ధవళకాంతులు) సాంద్ర (దట్టమైన) చంద్రికలు (వెన్నెలలు) కలిగించగా అవిరళమైన తీయని పలుకులతో యిలా అన్నాడట.

సప్తర్షివర్యులు ఆ విధంగా సప్తతురంగమ సహస్ర సదృశమైన మహాభవ్యాప్తిని (సప్త తురంగముడు అంటే ఏడుగుర్రాల రథంపై వెళ్లే సూర్యుడు. అంటే వేయిమంది సూర్యులతో సమానమైన కాంతి వ్యాపింప జేసినవానిని) ఆ దేవుని చూచి ప్రాప్త భయోత్కర్షమున (ప్రాప్తించిన భయము, ఉత్కర్షము – ఆనందము – కలగలసినవారై) అంజలి ఘటిస్తూ (నమస్కరిస్తూ) యిలా విన్నపం చేశారట –

"సర్వేశ్వరా! సర్వాత్మకా! శర్వాది (శర్వుడు అంటే శివుడు మొదలుగాగల) సుపర్వ (దేవతల యొక్క) నయన సాధ్వసకరమైన (కనులకు భీతిగొలిపేదైనట్టి) నీ రూపమును కననోర్వము (చూడలేము). మాపై దయతో కొంచెం శాంతస్వరూపుడవు కమ్ము, మహాత్మా!"

అప్పుడు ఆకాశంలో దేదీప్యమానంగా వెలిగిపోతూన్న విమానమొకటి కనుపించిందట. వారు దానిని సమీపించి దాని ద్వారము వద్ద నిలువగా విమానపు దక్షిణదిశలో ప్రమథవైభవంతో వెలుగొందుతూన్న ప్రసవాయుధవైరిని (పుష్పాయుధుడైన మన్మథుని శత్రువైన శివుడిని) చూశారట. అంతేకాదు చేతులలో శంఖ చక్రములను ధరించిన వానిని, పద్మాసన స్థితిలో కూర్చుని రెండు చేతులనూ ఊరుద్వయంపై (రెండు తొడలపై) నిలిపిన వానిని, మేరుకూటము (మేరు శిఖరం)పై మిహిరబింబము (సూర్యబింబము)వలె తలపై మకుటము (కిరీటము) కలవానిని, అళికము (నొసటి)పై ఊర్ధ్వ పుండ్రము (తిరునామం) కలవానిని, కణకణ వెలిగే నిప్పు కణికలా కనుపించే మిక్కిలికంటి వానిని (మూడవకంటి వానిని), మంకెనకావి (మంకెన పూవు వంటి ఎర్రని) మోవి (పెదవి)పై తీవిగా ఓ అలంతి నవ్వు (చిరునవ్వు) నివ్వటిల్లగా (వ్యాపించగా) భక్తుల యెడల తనకుగల కారుణ్యం కారణంగా నేత్రాంచలములలోని (కనుకొలకులలోని) ఆరుణ్యము (ఎర్రదనము) తారుణ్యము సంపాదించగా (పలుచబడిపోగా) చెవులకున్న కుండలముల కాంతులు గండమండలములో (బుగ్గలపై) తాండవం చేయగా, కెందమ్మి (ఎర్రతామర) చెంతనున్న తుమ్మెదకొదమ (పిల్లతుమ్మెద)వలె వక్షంపైనున్న కౌస్తుభ మణి చెంత శ్రీవత్సాంకము అనే పుట్టుమచ్చ శోభిల్లగా, శంఖము, చక్రము, హలము (నాగలి), కులిశము (వజ్రాయుధము), జలజాత పత్రము (తామర పూరేకు), పతాకము వగైరా చిహ్నములతో రేఖాంకితములగు పాదములు విలసిల్లగా, చరణముల కాంతి అనే వాహిని (ప్రవాహం)లో తేలియాడే రాయంచ (రాజహంసల) గుంపు సొంపున నఖములు (కాలిగోళ్లు) విరాజిల్లగా, ఐంద్రజాలికునివలె

మాయగా యింతకు ముందరి భీకరాకారాన్ని వదలి సౌమ్యాకారాన్ని దాల్చి నిల్చిన శ్రీ నరసింహదేవుని ఆలోకించి (చూసి) దండప్రణామములు సమర్పించి కృతాంజలులై (నమస్కరించి) యిలా వినతి చేశారట.

"జయ జయ సితపద్మాక్షా! (తెల్ల తామర వంటి కన్నులు కలవాడా!); జయ జయ నిటలాక్షా! (నుదుటిపై కన్నుకలవాడా!) సర్వజగదభిరక్షా! జయ జయ దుర్జన శిక్షా! (దుర్జనులను శిక్షించేవాడా!) జయ జయ దితి సుత విపక్షా! (దితికి పుట్టినవారైన దైత్యులకు - రాక్షసులకు విపక్షా - శత్రువైనవాడా!) సదవనదక్షా (సత్ - మంచి వారిని; అవన - కాపాడుటలో దక్షా - సమర్థుడా!) ఓ దేవా! నీవు జగత్తుయొక్క సృష్టి, రక్షణ, సంహారములకు కర్తవు; జగత్తు యొక్క అంతర్బహిర్వ్యాపకుడవు (లోపలా బయటా వ్యాపించినవాడవు - *both immanent and transcendent*); సర్వాంతర్యామివి; పృథివ్యాది (భూమి మొదలైన) పంచతత్త్వ స్వరూపుడివి (భూమి, ఆకాశం, నీరు, అగ్ని, వాయువు - వీటిని పంచతత్త్వాలంటారు) శబ్దాది గుణాత్మకుడవు (శబ్దము మొదలైన పంచగుణములు కలవాడివి - శబ్దము, రూపము, రసము (రుచి), గంధము (వాసన), స్పర్శ - వీటిని యింద్రియార్థములు - *Objects of sense* - అనీ, గుణములనీ అంటారు), సచ్చిదానంద స్వరూపుడవు. అణువున కణువువు నీవు. మహత్తునకు మహత్తువు నీవు. నీ కటాక్షంతో కాదా నడిసముద్రంలో భోగీంద్ర తల్పమున (శేష తల్పమున) యోగనిద్రా ముద్రితుడవైన నీ నాభిపద్మమున (బొడ్డుననున్న తామరకు) జన్మించిన బ్రహ్మకు మానస పుత్రులై మరీచి మొదలుగాగలవారుద్భవించి పెక్కు విధములుగా సృష్టిగావించారు?

## కాల విభజన

సంస్కృతంలో 'నిమిషః' అంటే విష్ణువు అనే అర్థమూ వుంది. కాలపరిమాణంగా తీసుకుంటే నిమిషము అంటే కన్నుమూసి తెరచేకాలం (*a moment; winking, twinkling or shutting of the eye*) 'నిమేషము' లేక 'నిమేషకము' అన్నా అదే అర్థం గంటలో అరవయ్యవ భాగం నిముషము. అది వేరు. 'నిమేషకము' అంటే మిణుగురు పురుగు అనే అర్థమూ వుంది. 'అనిమేషుడు' అంటే రెప్పవాల్చనివాడు - దేవుడు అనిమిషులు అంటే దేవతలు.

సప్తర్షులు నరసింహదేవునికి చేసిన స్తుతిలో భాగంగా ఇక్కడ రామకృష్ణకవి కాలవిభజనను చక్కగా వివరిస్తున్నాడు.

పదునెనిమిది నిమేషములు ఒక కాష్ఠ. ముప్పైకాష్ఠలు ఒక కళ. కళలు ముప్పై ఒక క్షణం. ఆరు క్షణాలు ఒక గడియ. రెండు గడియలు ఒక ముహూర్తం. ముప్పై ముహూర్తములు ఒక అహోరాత్రము. పదిహేను అహోరాత్రములు ఒక పక్షం. రెండు పక్షములు ఒక మాసం. రెండు మాసములు ఒక ఋతువు. మూడు ఋతువులు ఒక అయనము. రెండు అయనములు ఒక హాయనము లేక వత్సరము. ఇటువంటి మానుష వత్సరములు వెయ్యికలిస్తే దేవతలకు ఒక దినమవుతుంది. అంటే ఒక దివ్య దినమునకు 3,65,000 మానుష దినములన్నమాట. ఒక దివ్య సంవత్సరమంటే 13,32,25,000 మానుష దినములు లేక 3,65,000 మానుష సంవత్సరాలన్నమాట.

ముప్పై ముహూర్తములు ఒక అహోరాత్రము (24 గంటలు - అంటే 1440 నిముషములు) అంటే ఒక ముహూర్తము అంటే 48 నిముషములు. రెండు గడియలు ఒక ముహూర్తం కనుక గడియ అంటే 24 నిమిషములు. ఒక గడియకు ఆరు క్షణాలు కనుక క్షణమంటే 4 నిముషాలు. క్షణంలో (240 సెకండ్లలో) 30 కళలుంటాయి కనుక కళ అంటే 8 సెకండ్లు, ఒక కళలో తిరిగి 30 కాష్ఠలుంటాయి కనుక ఒక కాష్ఠ అంటే 4/15 సెకండ్లు. ఒక కాష్ఠలో తిరిగి 18 నిమేషములుంటాయి కనుక ఒక నిమేషము అంటే 2/135 సెకండ్లు. అంటే మనం 2/135 సెకండ్ల కాలంలో (అంటే 0 015 సెకండ్ల కాలంలో) రెప్పవేస్తామన్నమాట. ఇది నిమేషకాలం. నిమేషానికీ, నిముషానికీ తేడాచూద్దాం. నిముషంలో

60 సెకండ్లుంటే, నిమేషమంటే 2/135 సెకండ్లు. ఒక నిమేషము = 1/4050 నిముషాలు. (అంటే 0.00025 నిముషాలు) అంటే 4050 నిమేషములు ఒక నిముషం. (రెప్ప వేసే కాలమే నిమేషమైతే మనం వెంటవెంటనే రెప్పవేస్తూ పోతే నిముషంలో మహా అయితే వందసార్లో లేక యింకా వేగంగానైతే 150 సార్లో రెప్ప వేస్తాం. కనుక యీ లెక్క ఎందుకో నాకు సంతృప్తికరంగా లేదు )

చతుర్యుగముల పరిమాణం పన్నెండువేల దివ్య సంవత్సరాలు (అంటే 438 కోట్ల మానుష సంవత్సరాలు). ప్రతి చతుర్యుగములో వరుసగా కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలుంటాయి. ఇటువంటి చతుర్యుగాలు రెండువేలు కలిస్తే బ్రహ్మకు అహోరాత్రములు (24 గంటలు) (9,76,000 కోట్ల మానుష సంవత్సరాలు) అటువంటి అహోరాత్రులు 360 కలిస్తే బ్రహ్మకు ఒక సంవత్సరం (35,13,60,000 కోట్ల మానుష సంవత్సరాలు) ఇటువంటి బ్రహ్మ వత్సరములు నూరు కలిస్తే బ్రహ్మ పరమాయు ప్రమాణం అవుతుంది. (35,13,60,00,000 కోట్ల మానుష సంవత్సరములు). ఈ కాలమంతా నీకు నిమేషము. ఆ నిమేషకాలంలో బ్రహ్మ బ్రహ్మాండంతో విలీనమవుతాడు. అప్పుడు నీవు మరొక బ్రహ్మాండాన్ని సృష్టిస్తావు కాబట్టి దీనికంతటికీ నీవు మూలకారణానివి. బ్రహ్మాది దేవతలకు కూడా దురధిగమమైన (దాటశక్యంకాని) నీ ప్రభావాన్ని వర్ణించగలమా?" అంటూ పునఃపునః ప్రణామములు (మళ్లీ మళ్లీ నమస్కారాలు) చేస్తూ లేచి ఆడుతూ పాడుతూ 'నృసింహా నృసింహా! రక్షించు' అంటూ భక్తిరసావేశంతో ప్రవర్తిల్లారట ఆ భక్తులు.

## ప్రహ్లాదుని కథ

వారిని చూచి పరమేశ్వరుడిలా అన్నాడట.

"ఇన్నాళ్లూ ఏకచిత్తతతో (ఏకాగ్రమైన మనస్సుతో) మీరు నన్నెప్పుడూ తలచలేదుగానీ, లేకుంటే నేను ఎప్పుడో మీకు ప్రత్యక్షమయ్యేవాడిని. తపస్సు ఫలించడానికి కారణం దృఢ భక్తే కదా? దుష్ట శిక్షణకూ, శిష్ట రక్షణకూ నేను భూమిపై అవతరిస్తాననే సత్యానికి కనక కశిపుడి (హిరణ్య కశిపుడి) వధ, కరుణతో చేసిన ప్రహ్లాదావనము (అవనము అంటే కాపాడుట) నిదర్శనములు కావా?"

"హాటక కశిపుడు (హిరణ్య కశిపుడు) అనే అసురుడు ఉదారబలుడు (గొప్ప బలసంపన్నుడు). హరిభక్తులను హింసిచేవాడు. ఎక్కడైనా తన పేరే వినబడాలి. హరి నామస్మరణ ఆయన రాజ్యంలో మహాపాపం. చిన్నవాడైన అతని కుమారుడు ప్రహ్లాదుడు నా భక్తితో సమగ్రుడు. ప్రహ్లాదుడు నా నామస్మరణ నిత్యం చేస్తుండడం సహించలేక ఆ అసురుడు తన కుమారుడిని కూడా ఘోర దృష్టితో చూసి 'హరిని వినుతించావో నిన్ను నేను హరిస్తాను. హరి అసురులకు వైరిసుమా' అంటూ బోధచేసి, అప్పటికీ వినని కుమారుడిని పసివాడని కూడా ఎంచకుండా కఠినవృత్తితో చంప జూశాడు."

"కత్తులతో మొత్తించాడు. గంధ ద్విపములచేత (మదపుటేనుగులచేత) తొక్కించాడు. వాటి కొమ్ములతో (దంతములతో) కుమ్మించాడు. ఫణులచే (పాములచేత) కరిపించాడు. పావక శిఖలలో (అగ్ని కీలలలో) పొర్లేటట్లు త్రోయించాడు. అంబుధులలో (సముద్రాలలో) ముంచాడు. కట్టించి కొట్టాడు. కాల్చిన కర్రలతో వాతలు పెట్టాడు దట్టించి (అదలిస్తూ) గట్ల చరుల (కొండ చరియల)పై నుంచి ద్రొబ్బించాడు (త్రోయించాడు) నరకాగ్నిలో దూలించాడు (చలింపజేశాడు) దానవ భటులచే వంచి (లొంగతీసుకొనే ప్రయత్నంచేసి) యిప్పాట్లు (ఇను + పాట్లు – మిక్కిలి యిబ్బందులు) పెట్టినా ఆ బాలుడు అలయడు-సొలయడు. మదిలో నా యందు భక్తిని ఏమరడు. విష్ణుపక్షాన నిలవడం మానుకుంటానని చెప్పడు. ఆ బాలుడి హృదయ శుద్ధిని ఏమని వర్ణిస్తాను?"

"అతనిని రక్షించడానికి సభా స్తంభం నుంచి బయల్వెడలి కడిది (కఠినమైన) అక్కసుడి వెడద (విశాలమైన)

వక్షమును వాడి గోళ్లతో చీల్చి అవనిపై కూల్చి కరుణతో బాలుడిని రక్షించాను. ఓ ముని ప్రవరులారా! (ముని శ్రేష్ఠులారా!). మిమ్మల్ని మెచ్చుకుంటున్నాను. ఇన్నాళ్లూ మీరెంతగా నొచ్చుకున్నారో. మీకు కోరిన వరాలిస్తాను. నిశ్చయంగా మీ తపస్సు నేటికి ఫలించింది" అన్నాడట.

# నృసింహుడిచ్చిన వరం

అది వినిన ఆ సప్తర్షులు అమందానంద కందళిత హృదయారవిందులై యిలా అన్నారట.

"ఓ అజా! (పుట్టుకలేనివాడా!) పురహరుడూ (శివుడూ), పురందరాదికులకు (ఇంద్రాదిదేవతలకు) దురధిగమమై (పొందుటకు కష్టమైనదైన) భవాది దూరమైన (పునర్జన్మ వగైరాలను దూరంచేసేదైన) నీ ఉరుమూర్తి (శ్రేష్ఠమగు స్వరూపాన్ని) చూడగలగడం కంటే వరము (శ్రేష్ఠమైనది) యింకే వరమున్నది వర్ణించడానికి? నీకు భూమిపై అమృత ఫలుడనీ, భక్తోచితుడనీ ఏ కతమున (ఏ విధంగా) పేర్లు వచ్చాయో చెప్పు" అని వారడుగగా సర్వేశ్వరుడు ఆ ఋషులతో యిలా అన్నాడట. అమృతమంటే మోక్షము. ఆ మోక్ష ఫలాన్ని అమర్చాను కనుక అమృత ఫలనామధేయాన్ని పొందాను. శమము కల్గిన (కామ క్రోధాది అరిషడ్వర్గాలనూ జయించిన) భక్తుల కాంక్షితముల నమరిచి (కోర్కెలను తీర్చి) భక్తోచితుడనే పేరు పొందాను. ఈ పర్వత శిఖరంపై ఆ నా రెండు పేర్లతోనే ఆ రెండు తీర్థాలూ వెలుగొందుతున్నాయి. అవి ప్రాపించువారు సార్థత నొందుతారు. దివ్యమౌనీంద్ర తీర్థంలో మునిగి ధన్యులై ఏ నా భక్తులు యిందులో స్నానం చేస్తారో వారు అపవర్గ సంప్రాప్తికి (మోక్షప్రాప్తికి) అర్హులవుతారు. నాకు నారాయణగిరి అత్యంత ప్రీతిపాత్రమైన ఆశ్రమము. రెండవది ఘటికాచలము. వృషభాద్రి మూడవది. (వీటిలో నారాయణగిరి, వృషభాద్రి తిరుమల కొండలలో వున్నాయి.) ఈ మూడు నెలవులలో నేను అశ్రాంతము (ఎల్లప్పుడూ) విశ్రమిస్తాను' అన్న ఆ దేవదేవుని పాదాంబుజములకు (పాద పద్మములకు) ఆ మునీంద్రులు సాష్టాంగ ప్రణామమునాచరించి, "ఓ విన్నపమున్నది. వేదవేద్యా! (వేదముల ద్వారా తెలియదగువాడా!) కృప తలిర్పగా (కనికరము చిగురించగా) దానిని చిత్తగించుము. జలజాక్షా (పద్మనేత్రా!) ఈ పర్వతంపైన మూడు యోజనముల వరకు ఝరులు (సెలయేళ్లు), దీర్ఘికలు (డిగ్గియలు; నడబావులు – నడచి పోవడానికి మెట్లు ఏర్పరచిన బావులు), నదములు (పడమరగా పారే ఏఱులు), ఏఱులు (నదులు), మడువులు (మడుగులు) భూరి మోక్షదములు (గొప్ప మోక్ష ప్రసాదములు) అగుగాక. నేటి మొదలు యిక్కడ నివసించే జనులకు ఏ ఆపదలూ లేక, దయ, శాంతి, దాంతి (బ్రహ్మచర్యము మొదలుగాగల తపఃక్లేశములను ఓర్చుకొనే తనము), ధర్మబుద్ధి కలగాలి. మృగములు ఎప్పుడూ అన్యోన్యమైత్రితో జీవించాలి. శబర, యవన, పుళిందాది ఆటవిక జాతుల వారెల్లరూ జ్ఞానవైరాగ్య ధర్మాల్ని పూనాలి. నెల నెలా మూడు వానలు నిండా కురిసి ధరణి (భూమి) సస్యసమృద్ధితో తనరాలి (అతిశయించాలి).

ధరామరులు (బ్రాహ్మణులు) ఆగమ (వేదశాస్త్రములు) యాగ (యజ్ఞములు) యోగ, అన్నదాన పరాయణులుగానూ, క్షత్రియులు కరులతో (ఏనుగులతో), హరులతో (గుర్రములతో), వరవీరభటులతో (శ్రేష్ఠమైన వీరసైనికులతో) జగతిని పాలిస్తూనూ, ధనధాన్య పశు సహృద్బంధువర్గముతో, కోమటులు (వైశ్యులు) కోట్లకు పడగలెత్తియు, ధరణీసురుల (బ్రాహ్మణుల యొక్క) ఉత్తమ చరణ సేవారతిలో (శ్రేష్ఠమైన పాదములను సేవించాలనే అనురాగంలో) ప్రవరులై (శ్రేష్ఠులై) శూద్ర ప్రవరులూ (శూద్ర శ్రేష్ఠులూ) వెలయుదురు గాక" అని తనను వేడుకొనిన మునులకు కనికరంతో అలాగే కానిస్తానని మాట యిచ్చాడట ఆ నరసింహమూర్తి.

ఆ మునుల కారణంగా నృసింహుని కృపతో ఆ గిరి మాహాత్మ్యమును విన్న హరుదు (శివుడు), విరించి (బ్రహ్మ) మదిలో నివ్వెరపోతూ, తమ తమ మందిరాలకు వెళ్లారట.

## వైఖానసుల ఆగమనం

అప్పుడు వసుధామరాగ్ర్యులైన (వసుధామరులు అంటే బ్రాహ్మణులు. అగ్ర్యులు అంటే శ్రేష్ఠులు. బ్రాహ్మణులలో అగ్రేసరులు. గామిదులు అయిన) వైఖానసులు అజుదు పంపగా సంతసంబావహిల్ల (సంతోషం ఆవహించగా) అక్కడికి వచ్చి హరినామంతో ప్రసిద్ధమైన రెండు సరస్సుల నీటిలో ('అమృత ఫలము', 'భక్తోచితము' అనేవి ఆ సరస్సుల పేర్లు) స్నానం చేసి కటితటి (నడుముకు) ధౌత పటములు (శుభ్రమైన ఉదికిన వస్త్రములు) ధరించి నిలిచి, మల్లెలు, కమలములు వగైరా పూలతో కూర్చిన వల్లరులు (పూల దండలు), గన్నెరులు (గన్నేరు పూలు), వాసంతికములు (బండి గురివింద పూలు – *Adenanthera Pavonina*), హల్లకములు (చెంగలువలు; ఎర్ర కలువలు), పాటలములు (కలిగొట్టు పూలు), ఉత్ఫుల్ల (బాగుగా వికసించిన) వకుళ (పొగడ పూలు – *Mimusops elengi*) చంపకములు (సంపెంగ పూలు) పొరిపొరి గొనుచూ (మాటిమాటికి తీసుకుంటూ) సద్భావంతో దేవతా గృహమున చొచ్చి, స్వస్తికాసనములలో వరుసగా నిలబడి, ధౌతులై (బాహ్య, అంతరంగ శౌచములు కలవారై; ధౌతి అనేది దేహశోధన కర్మ. శౌచములలో యోగి పాటించే షట్కర్మలలో యిది మొదటిది. జల, సూత్ర, వస్త్ర, పవన కర్మలని ధౌతి నాలుగు విధములు.), దేహశోధన మాచరించి (దేహమును శుద్ధి చేసుకుని; బాహ్య శౌచమును పాటించి – పాతంజల యోగములో అష్టాంగములలోనిదైన 'నియమము'లోగల ఐదు నియమాలలో శౌచము – బాహ్య, అంతరంగ – నకు చాల ప్రాధాన్యమివ్వబడింది. మిగిలిన నాలుగు నియమాలు – సంతోషము - కలిగిన దానితో తృప్తిపడడం; స్వాధ్యాయము – వేదాధ్యయనము; తపస్సు; ఈశ్వర ప్రణిధానము – భగవత్ప్రార్థన); ప్రాణాయమం చేసి, అంతరంగాన్ని ఏకాగ్రం చేసి, ఎలమితో (సంతోషముతో) సంకల్ప కల్పిత వస్తు నికాయమునను (మనస్సులో ఊహించుకున్న వస్తు సముదాయంపై) మనస్సు లగ్నంచేసి మానసపూజ (ధ్యానము) నేమంబున (నియమంతో) కావించి (చేసి) ఆవాహనము (భగవంతుడిని ఆహ్వానించడం, పిలవడం) ఆసనము, అర్ఘ్యము మొదలైన విధులు (ఉచిత కర్తవ్యములు) పాటించి, గంధ, సుమ, ధూప, దీపాదికములను మధురమైన నైవేద్యములు, వీటీ (తాంబూలములు) సమర్పించి, ఆడుతూ పాడుతూ పూజలను చేశారు" అని చెప్పిన నారదునితో భృగుమహర్షి యిలా అన్నాదు.

"సకల జీవులకు అంతరాత్మయైన శౌరిని భూమిపై ఆవాహన, ఉద్వాసనలు చేయడం ఎలా సంభవించింది? దానిని కూడా కాస్త వివరంగా చెప్పండి మహర్షీ !"

అప్పుడు నారదుడిలా అన్నాడట – దైత్యాంతకుడైన హరి అంతరాత్మ అవుతూ వేరొకచోట కూడా నివసిస్తాడు. లోకములంతటా ప్రతి పదార్థంలోనూ నిండియున్న శిఖి (అగ్ని) ఎలాగైతే శమీగర్భంలో మాత్రమే కనుపిస్తాడో, అదే విధంగా బింబగతుడై, తోడ్తోడ, ఆవాహన – ఉద్వాసనలతో ఆ మహామహుదు సంపూర్ణ స్థితిని పొందుతాడు.

శమీవృక్షము – లేక – జమ్మి చెట్టు – గర్భంలో అగ్ని వుంటుందని విశ్వాసం (అగ్నిగర్భాం శమీమివ). అందుకే అగ్నిని శమీగర్భుడని కూడా పిలుస్తారట. మహాభారతంలోని అనుశాసన పర్వంలో శమీ వృక్షాన్ని 'అగ్ని జార' అని పేర్కొనడం జరిగింది. ఇది శివునికి అత్యంత యిష్టమైన వృక్షమట. అంచేత దాదాపుగా ప్రతి శ్మశానంలోనూ, శివాలయంలోనూ జమ్మిచెట్లను తప్పనిసరిగా పెంచుతారు. పాండవులు అజ్ఞాతవాస ప్రారంభంలో తమ నగలూ, ఆయుధాలూ శమీవృక్షంపైనే దాచిపెట్టారట. ఈ ముళ్లచెట్టు వేరు కంతుల ద్వారా వాతావరణంలోని నత్రజనిని స్థిరీకరిస్తుంది కనుక, భూసారాన్ని పెంపొందించేదని దీనిని రైతులు అనాదిగా తమ చేలలో పెంచుతున్నారు. తాళ్లలా వ్రేలాడే సన్నని కాయలుగల యీ చెట్టును *Prosopis spicigera* అనే సాంకేతిక నామంతో పిలుస్తారు. దీని కాండానికుండే తొర్రల్లోంచి అప్పుడప్పుడూ ఏ

కారణంగా అగ్ని వెలువడుతుందో యింకా శాస్త్రీయంగా నిర్ధారించబడినట్లు లేదు.

బైబిల్ (*The Bible*) పాత నిబంధనావళి (*Old Testament*) లోని 'మోజెస్-మండే పొద' (*Moses and the Burning Bush*) అనే ఉపాఖ్యానంలో యెహోవా (దేవుడు) మోజెస్‌కు ఓ మండే పొద మధ్య నుండి దర్శనమిచ్చినట్లుగా పేర్కొనబడింది. ఆ పొద మధ్యనుండి మంట వస్తున్నా పొద మాత్రం మండదట; తరగదట. ఆ మంటనే మోజెస్ దేవుడని భావించాడు. దేవుడు ప్రత్యక్షమవడం, మోజెస్ ఆయనతో మాట్లాడటం ఏ మేరకు శాస్త్రీయ విశ్వాసమనే విషయాన్ని అటుంచి, ఈ కథను బట్టి ఆ వృక్షం మన జమ్మిచెట్టులా తనలోపలి నుండి పొగలనూ, మంటలనూ వెలువరించే తరహా వృక్షమని అర్థం చేసుకోవచ్చు. శాస్త్రజ్ఞులు ఆ పొద మొక్క రూటేసీ (*Rutaceae*) కుటుంబానికి చెందిన *Dictamnus fraxinella* అయివుంటుందని భావిస్తున్నారు. అది తన కాండం నుంచి మండే స్వభావం కల (*inflammable*) వాయువులను వెలువరిస్తుందట. దీన్నే మండేపొద (*Burning Bush*) అనీ, *Gas Plant* అనీ పిలుస్తారు. ఇదే రూటేసీ కుటుంబానికి చెందిన *Dictamnus albus* అనే ఘాటైన వాసన కలిగిన ఆకులు కల మొక్క పశ్చిమ హిమాలయాలలో కూడా లభిస్తుంది. ఈ పొద మొక్క కాండం నుంచీ, ఆకుల నుంచీ ఓ రకమైన తేలికగా ఆవిరయ్యే (*volatile*) నూనెను తీస్తారు. ఈ నూనెకు సంబంధించిన వాయువులు బాగా ఎండకాసే సమయాలలో యీ మొక్క ఆకుల నుండీ, కాండం నుండీ వెలువడుతాయి. ఆ సమయంలో కొంచెం అగ్గి రాజుకున్నా ఆ వాయువులు మండుతాయి. మురుగుతో నిండిన బురద నేలల నుండి మండే వాయువులు (*marsh gases*) వెలువడడం మనమెరిగినదే ! మీథేన్ (*Methane* - $CH_4$) వంటి మండే వాయువులు మండు వేసవిలో ఎండి నెర్రెలు విచ్చిన నదీ గర్భాలలోని నేల నెర్రెలలోంచి వెలువడడం, అగ్గిరాజుకునే అవకాశమున్నప్పుడు ఆ వాయువులు లోపలి నుండి మండుతూనే మంటలుగా వెలువడడం కూడా మనమెరిగినదే ! నదుల వరదలలో మట్టి క్రింద భూస్థాపితమైన వృక్షాల కాండాలు, జంతు కళేబరాలు వగైరా జీవ పదార్థాలు భూమి పొరల క్రింద కప్పబడి ఏళ్ల తరబడి మ్రగ్గిపోయిన కారణంగా నేలబొగ్గు (*coal*), పెట్రోలియం, నాచురల్ గ్యాస్ (సహజ వాయువు) వగైరా హైడ్రో కార్బన్‌లు ఏర్పడతాయి. వీటిని శుద్ధి చేసే సందర్భంగా ఉప ఉత్పాదనలుగా మండే స్వభావం కల బ్యూటేన్ (*Butane*), ప్రొపేన్ (*Propane*), మీథేన్ (*Methane*) వగైరా గ్యాసులు లభిస్తాయి. వేసవిలో అత్యంత వేడిగా వున్న భూమి పగుళ్లలోంచి బయటకు వస్తూనే ఈ సహజ వాయువులు ఒక్కోసారి మండుతూ వెలువడుతాయి. ఈ శాస్త్ర పరిజ్ఞానం లేని కొందరు ప్రాచీనులు వేసవి రాత్రులలో ఎండిన నదీ గర్భాలలో నుండి నదిని దాటేటప్పుడు నెర్రెలలో నుండి మండుతూ వచ్చే సహజ వాయువులను చూసి 'కొరివి దయ్యా'లని భయపడే వారు.

అని నారదుడు చెప్పగా భృగుమహర్షి "వైఖానసులంటే ఎవరు? నాకు వినాలని కుతూహలంగా వుంది" అని అడిగాడట.

## వరుణుడి యాగం

అప్పుడు నారదుడు ఆదరంతో యిలా చెప్పాడట. "ఓ శిష్ట జనాఢ్యా! (శిష్టజన సంపన్నా!) ఇది గోప్యము (రహస్యమైనది). కలుషహరము (పాపాల్ని తొలగించేది) లోగడ దీని తెఱగు (క్రమము) నేను వినివున్నాను. ఇప్పుడు మీకది తెలిసేటట్లు వివరిస్తాను. అవధానముగా (ఎచ్చరికగా) వినండి."

"ఓ అనఘా! (పాపము అంటనివాడా!) నిరుక్త వేదాంగోక్తమై (నిరుక్తమనే వేదాంగములో చెప్పబడినట్టిదై)

వేదమునకు ఆరు అంగములు. వాటిని షడంగములంటారు. అవి - శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము.

ధరలో పొగడొందు (ప్రపంచ ప్రసిద్ధిగాంచిన) యీ పుణ్యకథను విను. అంబుధీశ్వరుడు (వరుణుడు) ఒకప్పుడు యాగం చేశాడట. ఆ యజ్ఞాన్ని చూడవచ్చిన బ్రహ్మ అక్కడవున్న జలదద అనే అప్సరసను చూచి మోహించాడట. వెంటనే బ్రహ్మకు వీర్యపతనం జరిగిందట. ఆ వీర్యమును ఆయన ఒక పర్ణపుటిలో (మోదుగ ఆకుతో చేసిన దొప్పలో) నింపి దానిని వహ్ని (అగ్ని)లో పోశాడట. దాని నుంచి అర్చి, భృగుడు, అంగారపిండము నందు అంగిరుడు, అత్రిముని, విఖనసుడు పుట్టుకొచ్చారు. ఆ విఖనసుడి వంశం వారే వైఖానసులు. వైఖానసులు వేద శాస్త్రార్థాలు తెలిసిన, అఖిల మంత్రతంత్రార్థ రహస్యాలూ తెలిసిన విప్రవర్యులు (బ్రాహ్మణ శ్రేష్ఠులు)" అన్నాడు.

(ఇక్కడ కవి ప్రస్తావించిన వారిని ఒక్కొక్కరినే చూద్దాం. అర్చి కృశాశ్వుని భార్య. ధూమకేతువునకు తల్లి. మన పురాణాల్లో భృగువులు చాల మంది కనుపిస్తున్నారు. భృగు మహర్షి బ్రహ్మ మానసపుత్రులలో ఒకడంటారు. ఆయన భార్య ఖ్యాతి. ధాత విధాతలితని పుత్రులు. మరో భృగుమహర్షి కూడా వున్నాడు. ఆయన భార్య దితి. దేవతలందరినీ శపించిన, ముక్కోపానికి మారుపేరైన భృగుడింకొకరున్నారు. ఈయన వంశానికి చెందినవాడే పరశురాముడు. ఏమైనా, భృగువు విషయం మన పురాణాలలో కొంచెం గందరగోళంగానే వుంది. నారదుని ద్వారా ఘటికాచల మాహాత్మ్యాన్ని తెలుసుకుంటున్నదీ భృగువే. వైఖానసులలో ఒక భృగువున్నాడు. ఈయన విఖనసునకు ప్రథమ శిష్యుడు. శ్రీ విఖనసముని భృగువు, అత్రి, కాశ్యప, మరీచి మహర్షులు నలుగురికీ వైఖానస కల్పసూత్రమును ఉపదేశించాడంటారు. ఆ భృగువు 'వాసాధికారము'ను వ్రాశాడంటారు. ఇదిలావుండగా మన గ్రంథంలోని భృగువు నారదుడిని వైఖానసులంటే ఎవరని ప్రశ్నిస్తున్నాడు మరి భృగుమహర్షిని గురించి కొన్ని విషయాలు లోగడనే మనం ముచ్చటించుకున్నాం.

'మత్స్యపురాణం'లో వరుణుడి యజ్ఞం సందర్భంగా యాగాగ్ని నుంచి పుట్టిన ముగ్గురు ఋషులలో అంగిరసుదు (లేక) అంగిరుడొకరని వున్నది. అగ్ని అతడిని తన కుమారునిగా దత్తత చేసుకున్నాడట. ఒకప్పుడు అగ్ని తన రూపాన్ని మార్చి తపస్సు చేసుకుంటున్నాడట. అప్పుడు అగ్ని స్థానంలో అంగిరసుడు బ్రహ్మచే నియమించబడ్డాడట. తేజస్సులోనూ, శక్తిలోనూ తనని మించుతున్న అంగిరసుడిని చూసి యీర్ష్యపడి, అగ్ని తపస్సు మానుకొని తిరిగిరాగా, ఆయన పదవి ఆయనకిచ్చి అగ్ని కుమారుడిగానే ఉండిపోయాడట అంగిరసుడు. అంగిరసుడు పది మంది బ్రహ్మమానస పుత్రులలో ఒకడని కొందరంటారు. అతడి భార్య కర్దముని కుమార్తెయైన శ్రద్ధ. మరొక కథనంలో అంగిరసుదు అగ్నికి తండ్రి అని వున్నది. ఆయన సప్తర్షులలో ఒకడట. ప్రజాపతులు (*Progenitors or Patriarchs*) పదిమందిలో ఆయన ఒకడంటారు స్మృతికారులలోని అంగిరసుడు వేరా? ఖగోళశాస్త్రంపై ఎన్నో గ్రంథాలు వ్రాసిన అంగిరసుడొకరున్నారట. అంగారకుడే అంగిరసుడనీ అంటారు. ఎందరో భార్యల ద్వారా ఎంతో సంతానాన్ని పొందిన అంగిరసుడు వేదాలలో ఎన్నో ఋక్కులు కూడా రచించాడు. ఆయన కుటుంబంలోని 33 మంది వేదాలలోని ఎన్నో ఋక్కులు వ్రాశారు. ఆయన కుటుంబంలో కేవలాంగిరసులు, గౌతమాంగిరసులు, భారద్వాజాంగిరసులు అనబడే మూడు శాఖలున్నాయట.

అత్రి బ్రహ్మమానస పుత్రులలో ఒకడు. సప్తర్షులలో ఒకడు. అనసూయ భర్త.

'విఖ' అంటే ముక్కులేని వాడని అర్థం; విఖనస - అంటేనూ అదే అర్థం; విష్ణు సహస్రనామాలలో 'విఖనస' అనేదొకటి. బ్రహ్మకూ 'విఖనసుడ'ని మరోపేరు. (విఖనసుడు మరియు వైఖానసుల గురించి మరిన్ని వివరాల కోసం అనుబంధం - 2 చూడండి.)

# పంచ బేరార్చన

"వైఖానసులు పంచవిధ బేర పూజా చుంచువులు, (బేరము అంటే ప్రతిమ లేక విగ్రహము. ఆరాధన చేయబడే విగ్రహములు ఐదు రకములు ఈ ఐదురకాల విగ్రహాలకు పూజ చేయడంలో వారు చుంచువులు అంటే ప్రసిద్ధులు, నేర్పరులు). వారెప్పుడూ శుద్ధాత్మకులై (పరిశుద్ధాంతరంగులై) పంచాయుధ శోభితుడైన (శార్ఙ్గము అనే విల్లు, నందకమనే ఖడ్గము, కౌమోదకి అనే గద, సుదర్శనమనే చక్రము, పాంచజన్యమనే శంఖము - యీ ఐదింటితో శోభితుడైనట్టి) నరపంచాస్యుని (పంచాస్యుడంటే శివుడనే అర్థంకాక సింహమనే అర్థమూ వుంది అదెప్పుడూ తననోటిని బాగా తెరచి వుంచుతుంది కనుక దానికా పేరు వచ్చింది. పంచమ్ - బాగుగా తెరువబడిన - ఆస్యం (నోరు) - యస్య - పంచాస్య నరపంచాస్యుడంటే నరసింహుడిని) పూజిస్తూ వుంటారు" అని నారదుడు చెప్పగా

భృగుడు పంచ బేరార్చన అంటే ఏమిటో, అదెలాగో వివరించమని కోరాడు. అప్పుడు నారదుడు – "ధృవ, కౌతుక, స్నపన, ఉత్సవ, బలి విగ్రహములు ఐదింటినీ బేరపంచకము అంటారు. ఆరవది బాలాలయాహ్వాయము (ఆహ్వాయము అంటే పేరు. బాలాలయము అనే పేరు కలది) అది పాంచరాత్రాభిధంబు ('అభిధా' అంటే పేరు పెట్టడం. పాంచరాత్రులు పెట్టిన పేరు). వరుసగా, శ్రీకృష్ణుడు, పురుషుడు, సత్యుడు, అచ్యుతుడు, బుద్ధుదులను ఆ బేరములలో (ప్రతిమలలో) ఒక్కొక్క దానిని ఆవాహనచేసి అర్చన చేయాలి." (వైఖానస ఆగమం ప్రకారం పంచబేరార్చన చేయాలి.) అని చెప్పగా అప్పుడా భృగువు "ఒక విగ్రహములో ముందు ఆవాహన చేయబడిన దైవం రెండవ విగ్రహంలోకి ఎలా ప్రవేశిస్తాడు?" అని ప్రశ్నించాడు. దానికి నారదుడు "ఒక దీపంనుండి రెండవ దీపాన్ని వెలిగిస్తున్నాము. అయినప్పటికీ రెండూ తేజస్సుతోనే వెలుగుతున్నాయి కదా! సరిగ్గా అలాగే!" అన్నాడు.

# విష్ణుక్షేత్రాలలో ఘటికాచల ప్రాశస్త్యం

ఓ రోజు వైఖానసులు సంశయంతో కూడిన మనస్సులు కలవారై సాధుచిత్తుడైన ఆ వసిష్ఠునితో 'మేమిక్కడ ఇదే పద్ధతిన సంతోషంతో స్థిర నివాసముండగోరితే ఎలా?' అని ప్రశ్నించారు. అప్పుడు వసిష్ఠుడు వారితో "బదరికాశ్రమము, శాలగ్రామ ధరణీధరము (శాలగ్రామమనే పర్వతం. శాలగ్రామ గిరి అనేది ప్రత్యేకించి ఉత్తర భారతదేశంలోని ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రం. శివుడు లింగంలో వుంటాడని శివభక్తులెలా భావిస్తారో విష్ణువు శాలగ్రామము లేక సాలగ్రామము అనబడే పెద్ద శిలలో వుంటాడని వైష్ణవులు విశ్వసిస్తారు. చాల వైష్ణవ క్షేత్రాలలో శాలగ్రామం పేరుతో పెద్ద శిలలు విష్ణువు మారురూపాలుగా భావించబడి పూజలందుకుంటున్నాయి.) అయోధ్య, ద్వారక, కాశి (ఇక్కడ బిందుమాధవ స్వామి పేరిట విష్ణ్వాలయం వుంది), మధుర, నైమిశారణ్యము, అవంతి (ఒకప్పటి మాళ్వరాజ్యానికి రాజధానియైన ఉజ్జయిని నగరం మహంకాళి దేవాలయముండడం, కుంభమేళా జరగడమేకాక ఉజ్జయినిలో ప్రసిద్ధ విష్ణ్వాలయాలు కూడా వున్నాయి. హిందువులందరకూ అతి ప్రశస్తమైన ఏడు పుణ్యక్షేత్రాలలో 'అవంతిక' అని కూడా పిలువబడే ఉజ్జయిని ఒకటి. ఇక్కడ మరణిస్తే మోక్షం లభిస్తుందని విశ్వాసం. 'అయోధ్యా మథురా మాయా కాశీ కాంచి అవంతికాపురీ ద్వారావతీ చైవ సప్తైతా మోక్షదాయికాః' అయోధ్య – రాముని జన్మస్థలం; మధుర – కృష్ణుని జన్మస్థలం; కాశీ లేక వారణాసి – ఈ మూడూ ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలో వున్నాయి. మాయాపురి అని కూడా పిలువబడే 'గయ' బీహార్‌లో వుంది. అవంతికాపురి అని కూడా పిలువబడే ఉజ్జయిని మధ్య ప్రదేశ్‌లోనూ, ద్వారావతీ అని కూడా పిలువబడే ద్వారక గుజరాత్‌లోనూ, కాంచీ పురమని కూడా పిలువబడే కంచి తమిళనాడులోనూ వున్నాయి – ఈ ఏడు ప్రసిద్ధ క్షేత్రాలూ మోక్షప్రదములట ), నారాయణాఖ్య పర్వతము (నారాయణుని పేరుగల పర్వతము. తిరుమలలోని నారాయణగిరి), నీలగిరి (తిరుమలలోని నీలాద్రి), కురుక్షేత్రము (ఢిల్లీకి సమీపంలో ప్రస్తుతం హర్యానాలో వున్న ప్రదేశం. ఇది కౌరవ పాండవుల మధ్య జరిగిన మహాసంగ్రామానికి రణక్షేత్రం), కాంచీపురము (ఇక్కడ 18 ప్రసిద్ధ విష్ణ్వాలయాలున్నాయి.) – యివన్నీ హరి వసతులలో (విష్ణునివాసములలో) సుప్రసిద్ధములు."

"(ఈ ఘటికాచలంలోని) వేగవతీ నది ఉత్తరపుటొడ్డున వెలయు హస్తిగిరిలో అజుని యజ్ఞవేదిక యొక్క పరిసరాలలో తనరు (ప్రకాశించు) పుణ్యకోటి విమానంలో నివసిస్తూన్న వరదుడు (వరములిచ్చే వేల్పు) ఆత్మీయ భక్తులకు (తన భక్తులకు) కోరిన వరములిస్తాడు.

కం॥ ఇచ్చోటుల వసియింతురు
సచ్చరితులు బుధులు సత్యసంధులు పెక్కం
డ్రెచ్చో నేమూర్తి భయం
బచ్చో నామూర్తిఁ గొలుతు రనుపమ భక్తిన్ (ఘటికాచల మాహాత్మ్యము 3-45)

ఈ చోటులోనే సచ్చరితులూ (ఉత్తమ శీలం కలవారూ), బుధులూ (పండితులూ), సత్యసంధులూ (సత్యవ్రతులూ) పెక్కండ్రు (చాల మంది) నివసిస్తారు. ఎచ్చోన్ (ఏచోట) ఏ మూర్తి (ఏ విగ్రహం) భయంకరమైనదో, అచ్చోన్ (ఆ చోట) ఆ మూర్తిని (ఆ ఉగ్రనరసింహ మూర్తి యొక్క ప్రసన్న రూపాన్ని) అనుపమ భక్తితో (చక్కటి భక్తి శ్రద్ధలతో) కొలుతురు (పూజిస్తారు). (అన్ని తావులలో ఉగ్రరూపంతో వుండే నరసింహుడు యిక్కడ ప్రసన్న రూపంతో వుంటాడన్నమాట.) ప్రత్యేకించి యీ ఘటికాచలము సకల జన ప్రశంసనీయము" అన్నాడు వసిష్ఠుడు.

అప్పుడు వైఖానసులు "స్వామీ ! యింతటి విషమ ప్రదేశంలో మేము ఉండగలగడం ఎలా సాధ్యం? దీనికేదైనా ఉపాయముంటే చెప్పండి" అన్నారు.

అప్పుడు "ఈ మహీధ్రమునకు (ఈ పర్వతమునకు) చుట్టూ ఎవ్వరైనా సమతలంగా చేయగలిగితే ఇక్కడ మీరు సుఖంగా ఉండవచ్చు" అన్నాడు వసిష్ఠుడు.

అప్పుడు వైఖానసులు శ్రీ నరసింహుని యీ విధంగా ప్రార్థించారట.

"అసంఖ్యాకములైన తలలు, కళ్లు, చెవులు, కాళ్లు కలిగి త్రిభువనేశుడవై (మూడు భువనములకూ ఈశుడవై - ముల్లోకాలకూ దేవుడవై), బ్రహ్మవై (సృష్టికర్తవై), శక్రరూపివై (శక్రుడు అంటే ఇంద్రుడు, శివుడు అని రెండర్థాలున్నాయి ఇక్కడ శివుడనే అర్థమే గ్రాహ్యం. శక్రరూపి అంటే లయకారుడివై) అఖిలదేవతల ఆకృతులలో అలరుతూ (ప్రకాశిస్తూ) వుండే రూపదీపితుడవూ, అపురూపుడవూ, అఖిల స్వరూపుడవూ నీవే సంప్రాపకుడవు (సంప్రాపనము అంటే చేరుకొనడం, సాధించడం. ఎవ్వరినైనా చేరగలగడం అనే 'సంప్రాపకత్వం' భగవంతుని లక్షణాలలో ఒకటంటారు), అసమాక్ష ముఖ్యులే (ఎగుడు దిగుడు కన్నులవాడైన శివుడు మొదలుగా గలవారే) నీ ఆజ్ఞ దాటలేరు. ఇక యితరులు నిన్నెరుగుటకు ఎంతవారు? పాకశాసన ముఖ్య దిక్పాలవరులు (పాకశాసనుడంటే ఇంద్రుడు. ఇంద్రాది దిక్పాలకులు) నీసాంద్ర కృపతోటే (మెత్తని కరుణతోనే) – శాశ్వత ఐశ్వర్య వంతులయ్యారు. నీవు సర్వభూతాత్మకుడవు (సకల భూతాలూ నీలోనే వున్నాయి). నీవు సర్వశుచివి. నీ ప్రభావం మాకెలా తెలుస్తుంది?"

"దివిజ వరుడైన కుబేరుడు నీవాడే కనుక నిధినాథుడయ్యాడు (సంపదలకు ప్రభువయ్యాడు).

నిన్ను పూజించిన కారణంగానే దుర్వాసముని శాపజలధిలో (శాపమనే సముద్రంలో) మునిగిన శ్రీని (భాగ్యమును) మున్నుపోలె (మునుపటి వలెనే) తిరిగి పొందగలిగాడు.

జమదగ్నిలాగే అతి కోపిష్టియని ప్రసిద్ధిగాంచిన దుర్వాసముని అత్రి, అనసూయల పుత్రుడు. చంద్రుడు, దత్తాత్రేయుడు ఆయన సోదరులు. ఆయన శివాంశవల్ల పుట్టాడంటారు. ఆయన్ని సంతృప్తి పరచడం ఎంతో కష్టం. ఎందరినో ఆయన అతిదారుణంగా శపించాడు ఒకప్పుడు కణ్వాశ్రమానికి దుర్వాసుడు వెళ్లాడు. అప్పుడక్కడ శకుంతల ఒక్కతే ఉంటుంది. ఆమె కూడా దుష్యంతుడిని గురించిన తలపులలో మునిగి పరధ్యానంగా వుండి, అసలు ఆయన వచ్చిందే గమనించదు. దీనికి కినిసిన దుర్వాసుడు 'నీ భర్త నిన్ను మర్చి పోతాడు' అని శపిస్తాడు అతి గర్వానికీ, అకారణంగా శపించడానికి ఆయన పెట్టిందిపేరు.

అంబరీషుడనే విష్ణుభక్తుడి కారణంగా దుర్వాసుడికి గర్వభంగమవుతుంది. మనువు కొడుకు నభగుడు. నభగుని కుమారుడు నాభగుడు. ఆయన పుత్రుడే అంబరీషుడు. ఒకప్పుడాయన ద్వాదశీ వ్రతం చేస్తూండగా దుర్వాసుడు వస్తే భోజనానికి ఆహ్వానిస్తాడు స్నానానికని వెళ్లిన దుర్వాసుడు ఎంతకీ రాకపోవడంతో ద్వాదశి ఘడియలు మించి పోతుండడంతో వ్రతఫలం కోసం ఉదకపారణంచేస్తాడు అంబరీషుడు (ఉదక పారణమంటే ఉపవాస దీక్ష విరమణకు నీరు త్రాగడం). ఇది తెలిసి యిది అతిథిని అవమానించడమేనని భావించి, కోపించిన దుర్వాసుడు ఆ రాజుపై కృత్యను ప్రయోగిస్తాడు. అంబరీషుడు మహావిష్ణు భక్తుడు. తన భక్తుడి రక్షణకోసం విష్ణువు ప్రయోగించిన సుదర్శన చక్రం కృత్యను సంహరించి దుర్వాసుని వెంటబడుతుంది. ఆయన బ్రహ్మనూ, శివుడినీ తనను కాపాడమని మొరబెట్టుకుంటాడు లాభంలేక

చివరకు విష్ణువునే ఆశ్రయిస్తాడు. విష్ణువు అంబరీషుని పాదాలపైబడి క్షమాపణ వేడుకొమ్మంటాడు. అప్పుడు దుర్వాసుడు అంబరీషుని శరణు వేడగానే సుదర్శన చక్రం వెనుదిరిగిపోతుంది. అలా దుర్వాసునికి గర్వభంగమై నాటినుంచి ఆయన తన ప్రవర్తనలో మార్పు తెచ్చుకున్నాడట.

ఏనాడూ తన తండ్రి అంకంపై (తొడపై) కూర్చుండి ఎరుగని ధ్రువుడిని నీ అంకగానిఁగాఁగ (నీ తొడపై కూర్చుండేవానిగా చేసుకుని) కాపాడావు.

స్వాయంభువ మనువుకు శతరూపి అనే భార్య వలన కలిగిన రెండవ కుమారుడు ఉత్తాన పాదుడు. ఆయనకు సునీతి, సురుచి అనే యిద్దరు భార్యలు. వారికి ఇద్దరు కుమారులు. సునీతికి పుట్టినవాడు ధృవుడు చిన్నభార్య సురుచికి పుట్టినవాడు ఉత్తముడు. రాజుకు చిన్న భార్య అంటే మోజు. ఒక రోజు సింహాసనంపై కూర్చున్న తండ్రి తొడపైన చిన్నభార్య కుమారుడైన ఉత్తముడు దర్జాగా కూర్చున్నాడు అప్పటికి నాలుగేళ్ల వయస్సువాడైన ధృవుడు, తానూ తండ్రి అంకంపై కూర్చోవాలని ఉబలాటపడ్డాడు. అతడిని ఉత్తముడు, దుర్భాషలాడి నెట్టివేసినా తండ్రి మిన్నకుండడం చూసి ధృవుడు జరిగినదంతా తన తల్లికి వివరించి, నారద మహర్షి ఉపదేశంతో ఉగ్రతపస్సుచేసి, తన తల్లితో సహా విష్ణు సాయుజ్యం పొందాడు

లోకంలోని జనులందరూ నిన్ను పొగిడే విధంగా అంబరీషుడిని కాపాడావు. అలాగే మమ్మల్ని కూడా నీ ఘనమైన కృపా విభవంతో కాపాడు"మని ప్రార్థించగా నృసింహుడు అంబుదము (మేఘము) యొక్క రావమువలె (గర్జన వలె) గంభీరమైన ఫణితి (వాక్కు)తో వారితో యిలా అన్నాడు.

"ఓ మునులారా! మిమ్మల్ని మెచ్చుకున్నాను. మీ యిచ్చేకు వచ్చిన వరములేవో కోరుకోండి. ఇస్తాను" అనగా వారు "దేవా ! ఈ పర్వతం చుట్టు ప్రక్కలలో ఏ వేళనైనా నీ సేవ చేయదానికి అనువైన తావు (స్థలం) యివ్వు" అని వేడుకున్నారట.

# హనుమ గ్రామం

నృసింహుడు ఆంజనేయుడిని ఆత్మలో తలచుకున్నాడట. అప్పుడు -

మ॥ కనకోర్వీధర సన్నిభంబగు మహాకాయంబుతో విస్ఫుర
ద్ఘన కాంతిస్ఫుట కుండల ద్వయముతోఁ గౌశేయ వస్త్రంబు తోఁ
గన దుత్కంపిత వాలవేష్టనముతోఁ గ్రమాంజలి స్ఫూర్తితో
హనుమంతుం దపుడేగుదెంచి నిలిచెన్ హర్మ్యాగ్రభాగంబునన్. (ఘటికాచల మాహాత్మ్యము 3-53)

ఉర్వీధరము అంటే పర్వతము కనకోర్వీధరము అంటే బంగారు కొండయైనట్టి మేరు పర్వతము అది బంగారు పర్వతమట మేరు పర్వతం పరిమాణంలో చాల పెద్దదేకాక సప్తద్వీపాలకూ అది కేంద్రమనీ, గ్రహాలన్నీ దానిచుట్టూనే తిరుగుతాయనీ, ఆ పర్వతం బంగారము, రత్నాలతో నిండివుంటుందనీ మన పూర్వుల నమ్మకం అది శివుడి నిలయమట అందుకేనేమో, శివుడికి మేరుధాముడని మరోపేరు మేరు పర్వతం ఆకాశాన్నంటుతుందట. అందుకేనేమో ఆకాశానికి 'మేరు పృష్ఠమని' మరోపేరు. మేరు పర్వతాన్ని 'సుమేరు' అనీ అంటారు శివుడికీ సుమేరుడనే మరో పేరుంది శివుడి నివాస స్థలమైన రజతగిరి (కైలాసము), కనక గిరియైన మేరుపర్వతం ఒకటేనని విశ్వాసం

మేరు పర్వతంతో పోల్చదగిన మహాకాయంతో (గొప్ప శరీరంతో) విస్ఫురత్ (మిరుమిట్లు గొలిపే) ఘనమైన కాంతి కలిగిన కుండలద్వయం (కర్ణకుండలాల జంట)తో, కౌశేయ వస్త్రముతో (పట్టు వస్త్రముతో) ఉత్కంపితమై (వణకుతూ అటూ యిటూ ఊగుతూ) వాలవేష్టనముతో (చుట్టుకొంటున్న తోక కలిగిన) క్రమాంజలి స్ఫూర్తితో (ఇంపుగా నమస్కరిస్తూన్న రూపంతో) హనుమంతుడు అప్పుడు ఏగుదెంచి (వచ్చి) ఆ హర్మ్యాగ్రభాగంబున (ఆ నృసింహుని ముందు) నిలిచాడట.

హనుమంతుడు నృహరికి సాగిలపడి మ్రొక్కి 'ఓ నీరజాక్షా ! నేను నీకు నచ్చిన తొలిబంటును (ప్రథమ సేవకుడిని). ఇప్పుడు నన్ను పిలిపించిన పని ఏమిటి? నాకు తెలియజెప్పు' అన్నాడట.

దానికి అభవుడైన ఆ నృహరి 'ఈ మునులిక్కడ స్థిరనివాసం వుండడానికి యీ పర్వతపు పార్వతీశ్వరు దెసలో (శివుని దిక్కగు ఈశాన్యములో) భూమిని సమతలంగాచేసి, నీ పేరుతో ఒక గ్రామాన్ని అక్కడ నిర్మించు' అని ఆజ్ఞాపించాడట హనుమంతుడిని.

హనుమంతుడలాగే చేసి తన పేరిట హనుమద్గ్రామమనే ఓ గ్రామాన్ని నిర్మించి తన నెలవుకు (నివాస స్థలానికి) మరలి వెళ్లాడట. అప్పుడా ద్విజవరులు (బ్రాహ్మణ శ్రేష్ఠులైన వైఖానసులు) ఎంతో సంతోషంతో ప్రతినిత్యమూ హనుమద్గ్రామంలోని తమ యిండ్లనుండి హరి గృహమునకు (విష్ణ్వాలయమునకు) వెళ్లి పూజలు చేస్తూ అలా వుంటూ వున్నారట.

# నృసింహుని కళ్యాణ మహోత్సవం

ఒకసారి ఆ నృసింహునికి కళ్యాణ మహోత్సవం చేయాలనుకున్నారట వైఖానసులు. ఆ అంబుజాక్షునికి కళ్యాణ మహోత్సవం చేయాలని మనస్సులో తలచిందే తడవుగా, పూవుల చప్పరములు (పూల పందిళ్లు), మేలైన కురువేరు సువాసనలతో కూడిన పందిళ్లూ, దళ్లూ పెక్కు పట్టులలో (పెక్కు తావులలో) వేశారట.

కురువేరు (*Coleus vetiveroides*) ను సంస్కృతంలో హ్రీబేరు అనీ అంటారు ఈ గడ్డిమొక్క వ్రేళ్లు సువాసన కలిగివుండి, తడిపితే చల్లని సుగంధభరితమైన గాలినిస్తాయి.

వారు దివ్యమణులతో అమర్చిన తోరణాలను అక్కడక్కడా కట్టారట. అంగడి వీధులన్నీ అగరు ధూపాలతోనూ (అగరు అనే సుగంధ ద్రవ్యంతో వేసే పొగలతోనూ కృష్ణాగరు వృక్షపు - *Aquilaria agallocha* - చెక్క పొడిని సంస్కృతంలో 'అగరు అంటారు ) కర్పూరం కలిపిన ముగ్గులతోనూ బుగబుగలీను తున్నాయట. యాగశాలలు, కనక కళ్యాణవేదిక (బంగారు కళ్యాణవేదిక), భర్మ హర్మ్యములు (బంగారు భవంతులు) ఆ సరసిజాక్షుని కళ్యాణానికి వీడుపట్టులుగా (విడిది గృహాలుగా) చేసి కళ్యాణోత్సవ దినాన్ని అట్టహాసంగా వైఖానసులు సకల దిక్చక్రములో చాటింపు వేశారట.

**సీ॥ భూషణ ప్రవిలుప్త భూరిమణిప్రభా**
**కోటి దిక్కోటుల గుమురుగట్ట**
**ముత్యాల గొడుగుల మొలుచుడాల్ వెన్నెల**
**మొత్తమాకస మెల్ల ముంచి కొనఁగ**
**చామరంబులు వీఁచు చామకరంబున**
**హేమ కంకణ రవం బింపుఁ గులుక**
**పటహ భేరీ శంఖ పణవ మర్దళ ముఖ్య**
**వాద్యధ్వనుల్ దిశావలయ మ్రువ**
**నందలంబులు పల్లకీలశ్వములును**
**సామజంబులు నెక్కి యుత్సాహ మొదవ**
**నవని నాయకులేతెంచి రచ్చటికిని**
**సరసిజాక్షుని పరిణయోత్సవముఁ జూడ.** **(ఘటికాచల మాహాత్మ్యము 3-59)**

భూషణముల నుంచి (ఆభరణముల నుంచి) ప్రవిలుప్తమైన (జారి వేరుపడిన) భూరి (గొప్ప) మణుల ప్రభాకోటి (కాంతుల సమూహాలు) దిక్కోటులలో (దిక్కుల అంచులలో; దిగంతాలలో - కోటి అంటే చివర, అంచు అనే అర్థమూ వుంది) గుమురు కట్టాయట (దట్టంగా, గుబురుగా, చిక్కగా మూగాయట). ముత్యాల గొడుగులనుంచి వెలువడే దాలు (కాంతి) వెన్నెలలాగా ఆకాశాన్నంతా ముంచెత్తిందట.

చామరములు వీచే చామ (స్త్రీ) చేతికున్న హేమకంకణాల (బంగారు కడియాల, రవముల (శబ్దము) యింపు కులుకుతూ వుందట.

చమరీ మృగం - *YAK (Bos grunniens)* అనే జంతువు యొక్క తోక వెంట్రుకలతో చేయబడిన విసనకర్రను చామరము అంటారు. రాజులు 'చామర గ్రాహిణి' అని పిలువబడే దాసి చేత చామరములతో గాలి వీయించుకొనడం తమ రాజసానికి ప్రతీకగా భావించేవారు. అలాగే చమరీమృగపు వెంట్రుకలతో తమ అశ్వాల తలలపై రాజసానికి ప్రతీకగా జూలువంటి ధ్వజ పటము (తలాటం)తో అలంకరణ చేసేవారు.

పటహము (తప్పెట), భేరి (దుందుభి - *the Kettle drum.* - దీనిలోనే పెద్ద భేరిని 'నగారా' అంటారు. ఢక్క, ఢంకా, డోలు వగైరాలన్నీ కూడా వివిధ పరిమాణాలలోని భేరివంటి వాద్యపరికరాలే.) శంఖము (*the conch shell* - కొమ్ముబూర - *horn* - లాగా యిది ఊదడానికి ఉపయోగిస్తారు. భిక్షువులు ప్రధానంగా - జంగందేవరలు, శైవులు, యితరులు ఆలయాలలోనూ ఊదుతారు. యుద్ధానికి బయల్దేరేముందు యోధులు వీటిని ఊదుతారు. దక్షిణావర్త శంఖము కుడివైపుకు విస్తరించి యోధుడు తన కుడిచేతితో పట్టుకొని ఊదడానికి అనువుగా వుంటుంది కనుక అది ప్రశస్తమైనది. శ్రీకృష్ణుని పాంచజన్యము, అర్జునుని దేవదత్తము అతి ప్రశస్తమైన శంఖాలు), పణవము (ఉడుక లేక హుడుక్కము అనే వాద్య విశేషము. *a small drum or tabor* దీన్ని మెడలో వ్రేలాడేసుకుని నోటితో ఊదే బాకాలు వగైరా వాద్యములకు ప్రక్కవాయిద్యంగా యీ చిన్న డోలును వాడతారు), మర్దళము (లేక మర్దలము అంటే మద్దెల. దీని ధ్వనిని గుండిలము అంటారు. డోలును ఒక ప్రక్కే వాయిస్తే మద్దెలను రెండు ప్రక్కలా వాయిస్తారు. అందుకే డోలువచ్చి తన బాధను మద్దెలతో మొరపెట్టుకుంటే ఏం ప్రయోజనం! అని లోకోక్తి.) మొదలైన వాద్యముల ధ్వనులతో దిశావలయము అదిరిందట (అ్రదుచు అంటే అదురు, కంపించు అని అర్థం). అందలములు ('అందలము' అన్నా 'ఆందోళము' అన్నా 'ఆందోళిక' అన్నా మరుగులేని పల్లకీ - *open palanquin*), పల్లకీలు, అశ్వములు, సామజములు (ఏనుగులు) ఎక్కిఉత్సాహంతో ఎందరో ప్రభువులు సరసిజాక్షుని (పద్మముల వంటి కళ్లు కలిగిన నృసింహుని) కల్యాణ మహోత్సవాన్ని చూడడానికి వచ్చారట. (ఇలా ఈ పద్యంలో యీనాడు మరుగున పడిన ఆ కాలానికి చెందిన ఎన్నెన్నో పదాలనూ, పరికరాలనూ మనకు పరిచయం చేశాడు రామకృష్ణ కవి).

వ్యాసుడు మొదలైన సంయమి వర్గం (మునుల బృందం)తో కలిసి వాధూల సంయమీశ్వరుడు అక్కడికి వచ్చాడట. రామకృష్ణకవిది కౌండిన్యస గోత్రం. అంచేత, తన గోత్రకర్తయైన కౌండిన్యుడి పాత్రను తన కావ్యాలలో తప్పనిసరిగా కథాంశంలో యిరికిస్తాడు. అలాగే కవికి కృష్ణయజుర్వేదంపై ప్రత్యేక అభిమానం. కనుక కృష్ణయజుర్వేదంలోని (తైత్తిరీయ సంహితలోని) 'వాధూలమ్'అని ప్రసిద్ధిగాంచిన శ్రౌతసూత్ర కర్త అయిన వాధూలమునీశ్వరుడి పాత్రను కూడా తన కావ్యాల కథా చట్రంలోకి చక్కగా యిముడుస్తాడు. ఆ యిరువురిపై కవికున్న అభిమానం అలాంటిది. వీణలు ధరించి పాటగాళ్లూ, పాటగత్తెలూ వచ్చారట. దేవలోకంలో నివసించే దేవతలు, నుదుటిపై ఊర్ధ్వపుండ్రము (పంగనామాలు) నీర్కావులు (లేత ఎరుపు వస్త్రాలు) ధరించి అఖిలాగ్రహార జనులు (అన్ని అగ్రహారాల ప్రజలు) అక్కడికి వచ్చారట. కవి యిక్కడ మూడు రకాలైన బండ్లమీద వ్యాపారులు యీ కళ్యాణానికి సరుకులు తెచ్చారని వ్రాశాడు. అవి - గొన్నన బండ్లు, గొల్లెనబండ్లు, కొల్లారుబండ్లు.

గొన్నన బండ్లంటే చిన్న పొట్టి బండ్లు (వీటినే గొనప బండ్లనీ అంటారు); గొల్లెన బండ్లంటే బండిపై చిన్న డేరాలాగా వేసిన వాహనములు; వీటినే గొల్లియన బండ్లనీ, గాడీలనీ అంటారు. గొల్లెన అన్నా గొల్లియన అన్నా గుడారము. కొల్లారు బండినే కొలారు బండి అని

కూడా అంటారు. కొల్లారు అంటే మధ్యలో ఖాళీస్థలము నాలుగు ప్రక్కలా కట్టడముకల యిల్లు. కొల్లారు బండి అంటే ఒక పెద్ద బండిపై రెండుగానీ అంతకంటే ఎక్కువ దేరాలు వేసి వాటి మధ్య ఖాళీస్థలం వదిలే రథం వంటి నిర్మాణం కల బండి. దీనినే కొల్లా బండి అని కూడా అంటారు.

తేనె, నెయ్యి, నూనె, తిలలు (నువ్వులు), పెసలు, గుడము (బెల్లము), జీరకము (జీలకర్ర *cumin seed - cuminum cyminum* - దీనిని అజామోదమనీ అంటారు. ఇవి సువాసనగా వుండడమే కాక జీర్ణశక్తిని పెంచుతాయి), హరిద్రము (పసుపు - *Turmeric - Curcuma longa* - పసుపు అనాదికాలం నుంచీ వాడబడిన క్రిమిసంహారకం, సౌందర్యపోషకం), గోధుమలు, వరుగులు, వడియాలు, అల్లము (*Green ginger - Zingiber officinale* - అల్లం మొక్క వ్రేళ్లు పచ్చిగా వున్నప్పుడు ఆర్ద్రకమనీ - అల్లమనీ - ఎండబెడితే శొంఠి అనీ పిలుస్తారు. ఇదీ జీర్ణక్రియను పెంపొందించేదే) వగైరాలను వరుసగా తీసుకొని వణిజులు (వ్యాపారులు), బేరివారు గణనమీరి (లెక్కకుమించి) ఆ దేవ దేవుడి ఉద్వాహము (వివాహము)ను చూడడానికి అక్కడికి వచ్చారట.

బేరి వారంటే వైశ్యులలో ఒక తెగ. వీరు యుద్ధాలలో భేరీలు మ్రోగించడానికి వినియోగించబడేవారట. అంచేతనే వారికి బేరీల అని పేరు వచ్చింది వీరిలో కొందరు వ్యాపారం కూడా కొనసాగించారట. వీరు గుండె ధైర్యం కలవారుగా ప్రసిద్ధి క్రీ శ 1757లో జరిగిన బొబ్బిలియుద్ధంలో బుస్సీ దొర నాయకత్వంలోని ఫ్రెంచి సైన్యాన్ని నిలువరించి పోరాడిన భేరి రామక్క ఆమె సోదరీమణుల కథ మనమెరిగినదే వీరు ఆ సైన్యంతో కొన్ని గంటలపాటు తక్కెడ రాళ్లతో పోరాడారట. అంచేత దీనికి తక్కెడరాళ్ల పోరాటమని పేరు వచ్చింది

అప్పుడు వైఖానసులు అత్యంత సదాచారుడూ, అన్వయ వృద్ధుడూ (కులములోని వృద్ధుడు) శాంతుడు, అయిన ఒకరిని ఈ పెండ్లికి ఆచార్యత్వం వహించడానికి ఆచార్యునిగా వేదోక్త విధిన (వేదములలో చెప్పబడిన ప్రకారం) ఎన్నుకున్నారట.

హోమ పూర్వకంగా (యజ్ఞం నిర్వహించి) ఉత్తుంగ (ఎత్తైన) గరుడ కేతన పటమును (గరుడ ధ్వజస్తంభమును. పటము అంటే వస్త్రము లేక జెండా. అది ఎగురవేసే స్తంభము ధ్వజస్తంభము) ఎత్తి, తాళమాన విధము తప్పకుండా (తాళమానము అంటే యిటువంటి కార్యక్రమాలు జరిపేటప్పుడు పాటించే కాల ప్రమాణము. సరిగ్గా యీ సమయానికి యీ వాద్యం వాయించాలి అని నియమం పెట్టుకుంటారు). వివిధ వాద్యములు మొరయజేస్తూ (మ్రోగిస్తూ) వారు ధ్వజారోహణ కార్యక్రమం పూర్తి చేశారట.

పురహరుడు (శివుడు), కమలోద్భవుడు (బ్రహ్మ), దిశాధిపతులు (దిక్పాలకులు) సపరివారంగా వారి వారి వాహనాలెక్కి సత్వరముగా (వేగముగా) స్థిర (భూమి)కి వేంచేశారట, ఆ నృసింహుని చూడడానికి.

కనక కుంభాలు (బంగారు కుండలు) ఎత్తి కరిరాజ యుగ్మంబు (గజేంద్రుల జంట) తనపై కుమ్మరిస్తున్న నీటితో ఆ నీలవేణి (లక్ష్మీదేవి) స్నానం చేస్తున్నదట. వెన్నెలను ఒరపెట్టే (పోల్చదగిన) వెలిపట్టు వస్త్రము (తెల్లని పట్టు వస్త్రమును) జోకగా (బాగుగా) కట్టుకున్నదట ఆ లోకజనని. గురుకుచ కుంభయుగళయైన (పెద్దవైన కుంభముల వంటి స్తనద్వయం కలిగిన) ఆ లక్ష్మీదేవి అలి నీలములతో ఒప్పారే (నల్లని తుమ్మెదలతో అందగించినట్టి) అబ్జాసనముపై (పద్మపీఠంపై) కొలువున్నదట. ఆ శోభనాంగి (సుందర శరీరంకల లక్ష్మీదేవి) సోగకళ్లు నెత్తమ్మి రేకులను (వికసించిన తామర రేకులను) నిరసించేటంతటి విశాలమైనవట. ఆ జగదీశుడి ఎదురుగా ఇందిరాదేవి (లక్ష్మీదేవి) నిలిచి, మంగళాష్టకముల (వధూవరులకు శుభం జరగాలని కోరుతూ వివాహ సందర్భంలో పురోహితుడు చదివే ఎనిమిది ప్రత్యేక మంత్రాల్నే మంగళాష్టకములంటారు) యొక్క ఉలివు (మోత) సెలగగా (విజృంభించగా) చిత్రకరమైన (నానావర్ణములు కల) తెర ఎత్తగా చేతులెత్తి హరికి తలఁబ్రాలు (తలంబ్రాలు) పోసిందట ఆ సందర్భంలో.

అందరూ నెటిమించి (అందము మీరగా) కౌతుకబంధాలు (వివాహ సందర్భంగా చేతికి కట్టుకొనే బంధాలు)

కట్టుకున్నారట. భూరి వాద్యాల (గొప్ప వాద్యముల) ఘోరు (ఘోరుధ్వని మోత)కి ముక్తాఛత్రములు (ముత్యాల గొడుగులు) లేచి వెళ్లి మిన్ను ముట్టాయట. భాగవతులు (భక్తజనులు) ఆటపాటలతో రంజింపజేశారట. ఆగమ స్తుతులు (వేదాలలోని స్తుతులు), గాయకుల పాటలు ఒప్పారినాయట (అందాన్ని చేకూర్చాయట) అంబుజాననల (పద్మముఖులైన స్త్రీల) నాట్యాలు తనరుచున్నాయట (అతిశయిస్తున్నాయట). దేదీప్యమానంగా వెలుగుతూన్న దీప ప్రతానములు రోదసి (*Outer space*) అనే కుహరం (గుహ) లోకి కూడా రుచులు (కాంతులు) నింపుతున్నాయట. (ప్రతానము అంటే లత. నేలపై విస్తారంగా వ్యాపించిన లత. ఇక్కడ నేలపై వెలిగించబడిన దీప ప్రమిదల విస్తృతి (*ramification*) ని తెలియజేయడానికి కవి 'దీప ప్రతానము' అనే పదాన్ని ప్రయోగించాడు.)

రత్న వాహనాలలో ఉంచి రాజసము మీరగా తిరువీధులలో అంచితముగా వధూవరులను ఊరేగించి తిరిగి నగరులో ప్రవేశించి వారు దేవదేవుడిని ఎలమిన్ (సంతోషంతో) మంచి నైవేద్యములతో తనియించారట (తృప్తి పెట్టారట).

ఈ విధంగా తొమ్మిది రోజులు వైఖానసులు ఆగమవిధి సమ్మతంగా (ఆగమాలలో చెప్పబడిన నియమాల ప్రకారం) కళ్యాణోత్సవం నిర్వహించారట. ఇలా వైఖానసులు ఎల్ల వేళలా మహోత్సవములు జరుపుతూ వుండగా ఆ విభుదు (ఆ నృసింహ దేవుడు) జనులను సద్భావంతో ప్రోచుచూ (ప్రోచుచూ అంటే పోషించుచూ) తాను సుఖాబ్ధిలో (సంతోష సాగరంలో) ఓలలాడుతూ (తేలియాడుతూ) ఉన్నాడట.

ఆ ఘటికాచలము యొక్క యీ చరిత్ర అపవర్గ కాములకు (మోక్షం కోరేవారికి) అపవర్గ ఫలాన్ని (మోక్ష ఫలాన్ని) యిస్తుందట. ధనకాములకు (ధనాన్ని కోరేవారికి) మహాధనకరమట (గొప్ప సంపదలు చేకూరుస్తుందట) పుత్రార్థులకు బహుపుత్రదాయకమట (పుత్రుల్ని కోరేవారికి చాలమంది పుత్రుల్నిస్తుందట) ఆయుష్కాములకు (ఆయుష్షును కోరుకొనేవారికి) దీర్ఘాయువునిస్తుందట. పాతకములను (పాపములను) హరించి వేస్తుందట. బహు రసములు, అలంకారములు, భావములు, నానార్థములతో భాసిల్లుతూ అది అఖిలపురాణేతిహాస విఖ్యాతము (అన్ని పురాణాలు, ఇతిహాసాలలోనూ ఖ్యాతిగాంచినది) చదివే పాఠకులకు, వినే శ్రావకులకు అది భాగ్య ఫలము. నిఖిల కవిబుధ సంస్తవనీయమైన (అందరు కవులు, పండితులచే బాగుగా పొగడబడదగిన) యీ చరిత్రము, తారకా (నక్షత్రములు) చంద్ర (చంద్రుడూ), భాస్కర (సూర్యుడూ), ధరణి (భూమి), శైల (పర్వతములు) శరధులు (సముద్రములు) యీ జగతిలో ఎందాకా నిలిచి వుంటాయో అంతవరకూ నిరంతరం ఎసగుచూ (అతిశయిస్తూ) వుంటుంది" అని పలికిన నారదునితో భృగుమహర్షి మనస్సులో సంతోషంతో "అనఘా ! నీ వల్ల నేను యీ రోజు సుకృతుడనయ్యాను" అంటూ నారదునికి నతులు గావించాడట (నమస్కారములు చేశాడట).

# ముగింపు

ఈ ఘటికాచల క్షేత్రము నేటి తమిళనాడులోని ఉత్తర ఆర్కాటు జిల్లా వాలాజా తాలూకాలోని చోళ లింగపురము. దీనినిప్పుడు షోలింగర్ (*Sholinghur*) అంటున్నారు. ఇది ఆర్కోణం (సదరన్ రైల్వే) స్టేషన్‌కు పడమరగా సుమారు 18 మైళ్ల దూరంలో వుంది. చిత్తూరుకు తూర్పుగా 25 మైళ్లు ప్రయాణిస్తే ఘటికాచలం చేరవచ్చు. షోలింగర్ పట్టణానికి దక్షిణంగా సుమారు రెండు మైళ్ల దూరంలో యీ ఘటికాచలం వుంది. తూర్పు పడమరలుగా ఒక దాని కెదురుగా మరొకటిగా ఒక పెద్దకొండ - దానిపై యోగ లక్ష్మీ నృసింహ స్వామి ఆలయం. మరొక చిన్న కొండ - దానిపై చతుర్భుజములు, శంఖ చక్రములతో వున్న యోగాంజనేయస్వామి ఆలయం వున్నాయి.

రామకృష్ణకవి స్వయంగా కల్పించిన ధవళాంగుని కథను అంతగా రక్తి కట్టించలేక పోయాడు. ఈ కథలో

సందర్భశుద్ధి కూడా లోపించింది. నారదుని పూర్వ జన్మ వృత్తాంతము భాగవతమునుండి, వరాహ, బ్రహ్మ వైవర్త పురాణములనుండి సేకరించినా, గోవిందశర్మ, హరిశర్మ, తరళ పాత్రలు కవి సృష్టించినవే. అందులోని వర్షర్తువు వర్ణన కావ్యానికి అందం తెచ్చింది. రంభ గురించిన వర్ణనలు, అప్సరసల పుష్పహరణము, జలక్రీడలు, శతశృంగము నుండి ఘటికాచలం వరకు సప్తర్షుల యాత్ర, ప్రత్యేకించి తిరుమల వేంకటేశ్వరుని వైభవం, కాంచీపుర వర్ణన, ఘటికాచల వర్ణనలు కావ్యానికి సమున్నత స్థానాన్ని కల్పించాయి.

ఇక వైఖానసుల విషయానికొస్తే నిరుక్తవేదాంగోక్తమని చెపుతూ చేసిన వైఖానసుల వ్యుత్పత్తికి సంబంధించిన సిద్ధాంతం అసలే వివాదాస్పదంగా వున్న వారి చరిత్రను మరింత జటిలం చేసింది. బహుశా ఇది కవి స్వీయ కపోల కల్పన కావచ్చు. ఈ విషయమై మరిన్ని ఆసక్తికరమైన వివరాల కోసం యీ గ్రంథం యొక్క అనుబంధం-2 చూడండి.

అలాగే యీ కావ్యంలో ఎన్నో పద్యాలు మొత్తంగానూ, కొన్నింటిలోని కొన్ని పదబంధాలూ అచ్చుగుద్దినట్లు 'పాండురంగ మాహాత్మ్యము', 'ఉద్భటారాధ్య చరిత్రము' లలోని పద్యాలనూ, పదబంధాలనూ పోలి వుండి ఆ కావ్యాలు మూడూ ఒకే కవి కృతములని ఋజువు చేస్తున్నందున రామలింగకవి, రామకృష్ణకవి ఒక్కరేననేది నిర్ద్వంద్వంగా ధృవపడుతున్నది. మరిన్ని వివరాల కోసం అనుబంధం - 3 చూడండి.






తెనాలిలోని అతి ప్రాచీనమైన శ్రీ రామేశ్వర దేవస్థానం

# తెనాలి రామకృష్ణ కవి - శాస్త్రీయ పరిశీలన

## కథలు - గాథలు

తెలుగు కథా సాహిత్యంలో తెనాలి రామకృష్ణకవికో ప్రత్యేక స్థానముంది. బహుశా మరే కవికీ దక్కని గౌరవ స్థానం ఆయనకు దక్కింది. తెలుగులోనే కాక యావద్దక్షిణ భారత భాషలలోని కథా సాహిత్యంలో యీ కవికున్న పేరు ప్రతిష్ఠలు మరే కవికీ లేవంటే అతిశయోక్తి కాదు. తెలుగు జానపద కథలలో మర్యాదరామన్న, తమిళ కథాసాహిత్యంలో అవ్వైయ్యార్‌ల పేరిట కూడా ఎన్నో కథలు చెలామణి అవుతున్నా వారెవ్వరూ తెనాలి రామకృష్ణుని స్థాయిలో విస్తృత ప్రాచుర్యానికీ, ప్రసిద్ధికీ నోచుకున్నవారు కారు. మేధాశక్తీ, హాస్యానురక్తీ, సమయస్ఫూర్తీ, ఆశుకవితా ధోరణీ యీయనలో సమపాళ్లలో మేళవించినందున యీ కవి చుట్టూ కొన్ని వందల హాస్య కథలు అల్లుకున్నాయి. ఈయన కేవలం కవిగా ప్రసిద్ధుడే కాక, హాస్యప్రియుడు కూడా. సరస సంభాషణా చాతుర్యం యీయన సొత్తు. హాస్యాన్ని ఒక జీవన విధానంగా మలచుకున్న యీయనలో ఒక్కోమారు హాస్యం మోతాదు మించి వికటించిన కారణంగా ఎందరి మనస్సులనో గాయపరచడం, తన ప్రాణాలమీదికి తెచ్చుకోవడం కూడా జరిగింది. 'బుద్ధి చెప్పువాడు గుద్దితే నేమయా!' అంటాడు వేమన. మన రామకృష్ణకవి సరిగ్గా అదే పంథాను అనుసరించినట్లు కనుపిస్తుంది. సజ్జనుల రక్షణకూ, దుర్జనుల నియంత్రణకూ నడుం బిగించినట్లు మనకీయన ద్యోతకమవుతాడు. 'కుక్క కాటుకు చెప్పు దెబ్బలు' తీయడంలోనూ, 'కీలెరిగి వాత బెట్టడం'లోనూ ఆయన కాయనే సాటి.

ఆయనను గురించిన కథలలో హెచ్చుభాగం శ్రీకృష్ణదేవరాయలు, ఆయన ఆస్థాన విద్వత్కవులకు సంబంధించినవిగానే వున్నాయి. ఆయన భట్టుమూర్తినో, అల్లసాని పెద్దననో, ముక్కు తిమ్మననో, ధూర్జటినో లేక మరో కవినో వెక్కిరించే

గాథలతో యీ కథలన్నీ నిండి వున్నాయి. ఇవన్నీ పుక్కిటి పురాణాలు కావు; చారిత్రకమైనట్టివేననడానికి ఆధారాలుగా ఎన్నో చాటువులు ప్రచారంలో వున్నాయి. శ్రీకృష్ణదేవరాయల కాలం నాటికి రామకృష్ణకవి నిండు యౌవనంలో వున్నాడు; సహజంగానే ఆయనది దుందుడుకు స్వభావం; ఆయనకు స్వాతంత్ర్యేచ్ఛ, ఆత్మాతిశయం చాల ఎక్కువ; దానికితోడు వికట స్వభావం - వీటన్నిటి పర్యవసానంగా అవకాశం దొరకినప్పుడెల్లా ఆయన యితర కవులను అధిక్షేపించడం, వారిని వెక్కిరించి, అవహేళన చేయడం ద్వారా తన ఆధిక్యతను చాటుకొనడానికి ప్రయత్నించడం సహజమే.

కథలు కల్పితాలుగా వుంటాయి. గాథలలా కాదు. వాటిలో కొంత చరిత్రాంశం మిళితమై వుంటుంది. చరిత్రలో వాస్తవంగా జరిగిన ఘటనల ఆధారంగా అల్లబడ్డవే గాథలు. కనుక, రామకృష్ణకవి చరిత్రకు సంబంధించిన వివిధ దృగంశాలపై ప్రచలితమవుతూన్న వివాదాలను గురించి తరువాతి అధ్యాయంలో తెలిసికొనబోయే ముందు ఆ మహాకవిని గురించి ప్రచారంలో వున్న కొన్ని గాథలను యిక్కడ మనం పరిశీలిద్దాం. వీటిలో కొన్ని హాస్యరస పూరితాలుగా వుండి కేవలం కాలక్షేపానికి పనికొచ్చేవే అయినా; హెచ్చుభాగం ఆయన చరిత్రకు ఎంతో కొంత అద్దం పట్టేవే. ప్రతి కథకూ సంబంధించిన చరిత్రాంశాలనూ, ఇతర ఉపయుక్త సమాచారాన్నీ సందర్భానుసారం జోడించాను.

ఎక్కువశాతం కథలలో ఆయన రామలింగనిగానే ప్రసిద్ధుడు. ఆయన మతం మార్చుకుని, వైష్ణవంలోని వడకలై లేక వడహల (వైఖానస) శాఖను అనుసరించినప్పటికీ ఆయన వ్యతిరేకులు ఆయన్ని వైష్ణవునిగా గుర్తించక రామలింగడనే సంబోధించడం దీనికొక కారణం. ఆయనను గురించిన కథలలో హెచ్చుభాగం ఆయన మతం మారక ముందు రాయలవారి ఆస్థానంలో స్థానం సంపాదించడానికి ఆయనపడ్డ తిప్పలు, మతం మారిన తొలిదినాల్లో తెంగలశాఖకు చెందిన తాతాచార్యుల తదితరులతో ఆయనకున్న వైరుధ్యాలూ వగైరాలు ప్రధానాంశాలుగా కలిగినవే. అదీకాక, యౌవనంలో రామలింగనిగా వున్నప్పుడు ఆయన చేసిన చిలిపిపనులు, దుడుకు చేష్టలు వగైరాలపైనే యీ కథలలో ఎక్కువ భాగం అల్లబడ్డాయి. అందుకే అధికశాతం కథలన్నిటిలో ఆయన పేరు రామలింగడు గానే వుంది. అప్పుడాయన పేరు రామలింగడే కదా మరి ! అయినా సౌలభ్యంకోసం అన్ని కథలలోనూ నేను ఆయన్ని రామకృష్ణునిగానే పేర్కొన్నాను.

ఇప్పుడిక రామకృష్ణకవికి సంబంధించిన కొన్ని విశేష ప్రాచుర్యమున్న కథల్ని ఒక్కటొక్కటిగా చూద్దాం.

## 1. రామకృష్ణుని పిల్లి

ఒకప్పుడు విజయనగర సామ్రాజ్యంలో ఎలుకలూ, పందికొక్కులూ, చుంచులూ విపరీతంగా పెరిగిపోయి పెద్ద బెడదగా తయారయ్యాయట. రాజ్యంలోని పంట పొలాల్నీ, యిండ్లలో నిల్వవుంచిన ధాన్యాన్నీ అవి సర్వనాశనం చేస్తున్నాయట. ఈ పీడ తప్పించమని ప్రజలంతా రాయలవారికి మొర పెట్టుకున్నారట. రాయలవారు తమ మంత్రులతో సమాలోచనలు చేసి యింటింటికీ ఒక్కో పిల్లిని పెంచితే యీ సమస్య పరిష్కారమవుతుందని నిర్ణయించారట. ఇకనేం వేలకువేలుగా పిల్లుల్ని పర్షియా దేశాన్నుంచి తెప్పించి కుటుంబానికొకటి చొప్పున పంచారట. తమ కుటుంబ పోషణే తమకు భారమైందనీ; అదనంగా పిల్లుల్ని పోషించడం తమ శక్తికి మించినట్టి పననీ కొందరు రాయలవారికి విన్నవించుకున్నారు. దీంతో రాయలవారు పిల్లుల పోషణకై ప్రత్యేకించి యింటికో ఆవును కూడా పంపిణీ చేయిస్తే, ఆ పాలతో పిల్లులు బలంగా పెరిగి ఎలుకల భరతం పడతాయని భావించారు. ఇకనేం యింటికో పాడియావును తక్షణం పంపిణీ చేశారు. ఆ ఆవుల పాలను కేవలం పిల్లుల పోషణకే వాడితీరాలనే నియమం కూడా విధించారు. ఈ పథకంలో భాగంగా రామకృష్ణునికి కూడా ఒక పిల్లి, దానితోపాటు ఓ మంచి పాడియావూ యివ్వబడ్డాయి.

రాజ్యంలోని పిల్లులన్నీ చక్కగా పాలు తాగుతూ అనతికాలంలోనే బలిసి ఎలుకలవేట ప్రారంభించాయి. రామకృష్ణుడు మాత్రం ఆవు పాలన్నీ పిల్లికి పోసి పెంచడం శుద్ధదండగని భావించాడు. తమ కుటుంబమంతా కడుపు కట్టుకుని ఆవు పాలన్నీ పిల్లికి పోయడంలో ఔచిత్యమేమీ లేదని ఆయన అభిప్రాయపడ్డాడు. ఇంకేం, తెలివిగా ఓ పథకం పన్నాడు. ఒక గిన్నెలో సలసల మసిలే పాలను పోసి త్రాగడానికి తన పిల్లి ముందుంచాడు. అది ఆత్రంగా తాగబోయి మూతి కాల్చుకుని "మ్యా . .వ్" అని దీనంగా అరుస్తూ పరుగెత్తింది. అది మొదలు రామకృష్ణుని పిల్లి పాలను చూస్తే చాల భయంతో వణికిపోసాగింది. నాటి నుండి అది రామకృష్ణుని యింట్లోని ఎంగిలి మెతుకులు గతికేది. రాజుగారు యిచ్చిన ఆవుల పాలు త్రాగి అందరి పెంపుడు పిల్లులూ బలంగా తయారై ఎలుకల్ని చురుగ్గా వేటాడుతుండగా రామకృష్ణుని పిల్లిమాత్రం సరైన పోషణలేక చిక్కి శల్యమైంది.

ఇలా వుండగా రాయలవారు ఓసారి తాను ప్రజలకిచ్చిన పిల్లులు ఎలా పోషించబడుతున్నాయో పర్యవేక్షించదలచి ఓ సభ ఏర్పాటు చేశారు. అందరి పిల్లుల విషయంలోనూ అధికారులు సంతృప్తి చెందారు. రామకృష్ణుని పిల్లి మాత్రం ఆ సరికే ఎముకల పోగులా తయారయింది. 'రామకృష్ణయ్యా! ఏమిటి నీ పిల్లి యిలా బలహీనంగా వుంది? ఒకవేళ దానికని ఉద్దేశించిన పాలు నీవుగానీ త్రాగడం లేదు కదా!' అన్నారట సంకోచిస్తూ, రాయలవారు. అప్పుడు రామకృష్ణుడు, "ఔను దేవరా! నా ఆవు పాలన్నీ మా కుటుంబ అవసరాలకే వినియోగిస్తున్నాం. ఏం చేసేది మరి? నా పిల్లి పాలు త్రాగదు", అన్నాడట. దీంతో రాయలవారు ఉగ్రులై, "రాజాజ్ఞ మీరడమే కాక, నీ పిల్లి పాలు త్రాగదని అబద్ధమాడడం కూడానా? ఇందుకు శిక్షేమిటో తెలుసా? ప్రపంచంలో పాలు త్రాగని పిల్లులు కూడా వుంటాయా? ఏదీ, నీ పిల్లి పాలు త్రాగదని రుజువు చెయ్యి చూద్దాం," అన్నారట. వెంటనే రాజభటులు ఓ పాత్రలో పాలు తీసుకొచ్చారు.

రామకృష్ణుడు తన పిల్లిని ఆ పాలగిన్నె దగ్గరకు తీసుకెళ్లాడు. పాలను చూస్తూనే ఆ పిల్లి వణికిపోతూ ఒక్క ఉదుటున ఆయన చేతుల్లోంచి దూకి ఎటో వుడాయించింది. దీనికి కారణమేమిటో తెలిసికొనగోరారు రాయలవారు. రామకృష్ణుడు తన పిల్లికి వేడి పాలతో ఎలా మూతి కాల్చిందీ ఉన్నదున్నట్లు పూసగుచ్చినట్లు వివరించి, "మహారాజా! రాజ్యంలోని పిల్లుల పోషణకన్నా ప్రజల యోగక్షేమాల్ని విచారించడమే రాజుకు ప్రధానం. ఒకప్రక్క ప్రజలు అర్ధాకలితో మాడుతూంటే తమరు పిల్లుల పోషణ చేపట్టడం నాకంత సమంజసంగా అనిపించడం లేదు. అందుకే యీ విషయాన్ని తమకు నేరుగా విన్నవించడానికి సాహసించలేక యిలా చేశాను. ఈ నేరానికి మీరు ఏ శిక్ష విధించినా సంతోషంతో స్వీకరిస్తాను" అన్నాడు. రాయలవారు ముందుగా రామకృష్ణుని మోసానికి కోపగించుకున్నా, ఆయన ధైర్యానికీ, తెలివితేటలకూ, సమయస్ఫూర్తికీ ముగ్ధులై ఆయనకు విలువైన కానుకలిచ్చారట.

## ౨. గుమ్మడికాయల దొంగతనం

కృష్ణదేవరాయల రాజ ప్రాసాదం లోపల పెద్ద పెరటి దొడ్డి వుండేది. అందులో ఎన్నెన్నో రకాల కూరగాయలూ, ఆకుకూరలూ పండించేవారు. ఒకప్పుడు రాజ్యంలో చీడపీడల కారణంగా గుమ్మడి తీగలన్నీ అంతరించాయి. రాజుగారి పెరట్లో చేపట్టే ప్రత్యేకమైన సస్యరక్షణ పద్ధతుల కారణంగా అక్కడి గుమ్మడి తీగలు మాత్రం సమృద్ధిగా పెరిగి ఏపుగా కాపు కాశాయి. ఆ యేడు బయట గుమ్మడి పండే లభించని పరిస్థితి ఏర్పడింది.

సంస్కృతంలో పీత కూష్మాండమని పిలువబడే గుమ్మడి పండు *(Squash gourd or Red gourd - Cucurbita maxima)* కూర దేహపుష్టినీ, బలాన్నీ, వీర్య వృద్ధినీ, మేహశాంతినీ చేస్తుంది. కాలిన గాయాలకూ, వాపులకూ, సెగ గడ్డలకూ, మైగ్రేన్ *(Migraine)*

అనే ఓ తరహా పార్శ్వపు తలనొప్పికీ, నరముల పోటు (*Neuralgia*) కు నివారిణిగా పనిచేస్తుంది. కడుపు ఉబ్బరం, పైత్య రోగం, మూలవ్యాధి (*Piles*) వగైరాలకది దివ్యౌషధం.

అంతటి ఔషధ విలువలున్నది కనుకనే గుమ్మడి పండుతో చేసిన కూరగానీ, పులుసుగానీ ఏడాదిలో ఒక్కసారైనా తినాలంటారు పెద్దలు. శుభ సూచకమైనదిగా భావించి వివాహాది శుభకార్యాలలో వాడబడడమే కాక బ్రాహ్మణులకిచ్చే సంభావనలలో గుమ్మడి పండును తప్పక యివ్వడం ఆనవాయితీగా మారింది. అదీకాక, గుమ్మడికాయను పితృదేవతలకు తర్పణ లివ్వడంలో కూడా ఉపయోగిస్తారు అందుకే 'గుమ్మడికాయ దొరికిననాడే తర్పణం వదిలినట్లు' అనే సామెత ఏర్పడి వుంటుంది. కొన్ని వైపరీత్యాల కారణంగా అప్పుడప్పుడూ గుమ్మడికాయలు దొరకని పరిస్థితి కూడా ఉండేదనీ ఈ సామెతను బట్టి మనం అర్థం చేసుకోవచ్చు. అలా దొరకనప్పుడు గుమ్మడికాయను దొంగిలించినా పరవాలేదనే భావం ప్రజలలో ప్రబలింది. 'గుమ్మడికాయల దొంగ అంటే, భుజాలు తడుముకున్నట్లు' అనే సామెత మనందరకూ తెలిసినదే!

ఓ రోజు రామకృష్ణుని భార్య కమల గుమ్మడికాయ పులుసు తినాలని మనసు పడింది. అదే విషయాన్ని భర్తతో వెలిబుచ్చింది. రామకృష్ణుడు ఎలాగోలా సాధిస్తానని భార్యకు మాట యిచ్చాడు. అవి రామకృష్ణుడు కొత్తగా రాజ ప్రాసాదంలో అగుడు పెట్టిన రోజులు. రాయలవారితో కూడా ఆయనకంత పరిచయమూ, చనువూ యింకా ఏర్పడలేదు. రాయలవారి పెరట్లోని గుమ్మడిపండ్లు అన్నీ కలిపినా రాయలవారి వంటింటి వాడకానికీ, రాజోద్యోగులకూ కూడా చాలతాయో, చాలవో అన్నట్లుంది పరిస్థితి. పై పెచ్చు దూరదేశస్థులైన కవి పండితులనూ, అతిథులనూ సత్కరించేటప్పుడు వారికిచ్చే సంభావనలలో గుమ్మడి పండును తప్పనిసరిగా యివ్వడం రాయలవారికి రివాజు. అంతేకాక గుమ్మడికాయ పులుసంటే రాయలవారికి ఆరో ప్రాణమట. అంచేత ఆయన తన పెరట్లోని గుమ్మడి కాయల భద్రతకు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేయించాడట తనకున్న కొద్దిపాటి పరిచయంతో రాయలవారిని గుమ్మడి పండు అడిగితే, అడిగి లేదనిపించుకోవడమే అవుతుందని రామకృష్ణునికి తెలుసు. కనుక, దొంగతనం చేయకుండా తన భార్యకిచ్చిన మాట చెల్లించుకోవడం రామకృష్ణునికి సాధ్యమయ్యే పనిగా కనుపించ లేదు. అందుకని దొంగతనం చేయడానికే నిర్ణయించుకున్నాడు రామకృష్ణుడు.

అనుకున్నదే తడవుగా – అదే రోజు సాయం సంధ్యలో అప్పుడే ముసురుకుంటున్న లేత చీకట్ల మాటున రాయలవారి పెరట్లో ప్రవేశించిన రామకృష్ణుడు రెండు గుమ్మడి పండ్లను దొంగిలించి తెచ్చాడు. ఆ రాత్రికి సుశీల ఆ గుమ్మడి పండ్లతో చక్కటి పులుసు చేసి భర్తకు వడ్డించి, తానూ తింది. వాళ్ల కుమారుడు ఏడేళ్ళ మాధవుడు అప్పుడు నిద్రపోతున్నాడు రామకృష్ణుడు తన భార్య కమలతో "మాధవుడిని కూడా లేపుదాం. వాడూ యీ పులుసు రుచి చూస్తాడు" అన్నాడు. సుశీల భయంతో, "వద్దులెండి. వాడీ గుమ్మడి కాయ పులుసు సంగతి ఎక్కడైనా తెలివితక్కువగా వాగి, అది రాయలవారిదాకా పొక్కితే మన ప్రాణాల మీదికి వస్తుంది" అన్నది. 'ఏం పర్వాలేదులే! దీనికి నేనొక ఉపాయం ఆలోచించాను' అంటూ రామకృష్ణుడు తన పథకాన్నిలా అమలు పరచాడు.

బిందెడు నీళ్ళు తీసుకుని చెంబుతో అంతటా చల్లుతూ ఆరు బయట నిద్రిస్తూన్న తన కుమారుడి పక్కపై కూడా చల్లి, "లేరా మాధవా! చినుకులు పడుతున్నాయి. లోపలికి వచ్చి వర్షానికి తడిసిన నీ బట్టలు మార్చుకుని కమ్మటి గుమ్మడికాయ పులుసుతో భోంచేద్దువుగాని, రా!" అంటూ పిలిచాడు.

మాధవుడు అలాగే లేచివచ్చి దుస్తులు మార్చుకుని తల్లి వడ్డించిన గుమ్మడికాయ పులుసుతో తృప్తిగా భోంచేసి తిరిగి యింట్లో వేసిన పక్కపై పడుకున్నాడు.

ఆ తెల్లవారే రాచనగరులో కలకలం బయలుదేరింది. రాయలవారి పెరట్లో బాగా పండిన రెండు గుమ్మడి

పండ్లనెవరో దొంగిలించారనే వార్త నగరులో గుప్పుమంది. రక్షకభటులు తమ కొంపమునిగిందని భయపడుతూ యిదే విషయాన్ని రాయలవారికి విన్నవించారు. రాయలవారు ఆగ్రహోదగ్రులయ్యారు. 'ఎవరు చేశారీ దొంగతనం? నా ఆజ్ఞను ఉల్లఘించేటంతటి ధైర్యం ఎవరికుంది? ఈ రోజు సాయంత్రంలోగా ఆ దొంగ ఎవరో కనిపెట్టి బంధించి నా ముందుంచండి" అని వారిని ఆజ్ఞాపించారు రాయలవారు.

అనుమానించినట్లే మాధవుడి ద్వారా గుమ్మడికాయ పులుసు వార్త అతని మిత్రులకు ప్రాకి క్షణంలో రాచనగరంతా వ్యాపించింది. దీంతో రామకృష్ణుడిని దెబ్బతీసే అవకాశంకోసం ఎప్పటినుంచో కాచుక్కూచ్చున్న రాజగురువు తాతాచార్యుల వారికి మంచి అవకాశం దొరికినట్లయింది. ఆయన హుటాహుటిన బయల్దేరి రాజప్రాసాదానికి వచ్చి రాయలవారితో "రాయా! ఇది విన్నారా! రాత్రి రామకృష్ణుని యింట్లో గుమ్మడికాయ పులుసు వండుకు తిన్నారట. దొంగ వేరెవరై వుంటారు? తక్షణం రామకృష్ణుడిని పిలిపించి, విచారించి రాజాజ్ఞ ఉల్లంఘించినందుకు కఠినంగా శిక్షించండి" అన్నారు.

రామకృష్ణుడిని భటులు రాయలవారి యెదుట హాజరు పరిచారు. రాయలవారు రామకృష్ణునితో "రామకృష్ణయ్యా! మీరు దొంగతనాలు కూడా మొదలెట్టారా? రాత్రి మీ యింట్లో గుమ్మడి కాయల పులుసు వండుకు తిన్నారట – దీనికి మీ సమాధానమేమిటి?" అంటూ కటువుగా ప్రశ్నించారు.

దానికి రామకృష్ణుడు నేరుగా సమాధానం చెప్పక, 'మహారాజా! నాకు గుమ్మడి కాయలు దొంగిలించాల్సిన పనేం వుంది? అంతగా కావాలంటే మిమ్మల్నడిగితే మీరు యివ్వరా? ఈ గుమ్మడికాయ పులుసువార్త నా వ్యతిరేకులెవరో కల్పించి వుంటారు' అన్నాడు తాతాచార్యులవంక కోపంగా చూస్తూ.

రామకృష్ణుని భార్య కమల కూడా రాయలవారి ఎదుట భర్త చెప్పినట్లే చెప్పి యీ గుమ్మడికాయల దొంగతనం విషయం తమకేమీ తెలియదని నమ్మబలికింది. రాయల వారు కొంచెం విసుగ్గా, "రామకృష్ణుని కుమారుడిని నా ఎదుట హాజరు పరచండి. అతడే కదా తన మిత్రులతో యీ విషయం బహిర్గతం చేసింది? అతడి నోటి వెంటే నిజం బయట పెట్టిద్దాం" అన్నారు భటులతో.

రాయలవారి ఎదుట మాధవుడిని హాజరు పరచారు. రాయలవారు ఆ బాలునితో మృదువుగా 'అబ్బాయీ! రాత్రి మీ యింట్లో నీవేం కూర తిన్నావు?" అని ప్రశ్నించారు.

మాధవుడు తడుముకోకుండా "మహారాజా! రాత్రి నేను అన్నంలో గుమ్మడికాయ పులుసు వేసుకు తిన్నాను. అది ఎంతో రుచిగా వుంది" అన్నాడు.

"రాత్రి ఏ వేళప్పుడు నీవు అన్నంలో గుమ్మడికాయ పులుసు వేసుకు తిన్నావు?" అని ఆసక్తితో ప్రశ్నించారు రాయలవారు.

"గత రాత్రే – అప్పుడు సమయం ఎంతైందో గుర్తులేదు. అప్పుడు వానపడింది. అది మాత్రం గుర్తు" అన్నాడు మాధవుడు.

రాయలవారు ఆశ్చర్యపోతూ "రాత్రి వాన పడిందా? లేదే! రాత్రి వాన పడడం మీరెవరైనా గమనించారా?" అని సభికుల్ని ప్రశ్నించారు. వారందరూ గత రాత్రి వాన పడలేదని చెప్పారు. రాయలవారు కొంచెం విసుగుదలను ప్రదర్శిస్తూ తిరిగి బాలుడికేసి చూసి "అబ్బాయీ! అబద్ధాలు కట్టిపెట్టు. నిజమేదో చెప్పు. లేకుంటే బాలుడివని కూడా చూడకుండా నిన్ను కఠినంగా దండించాల్సి వుంటుంది" అన్నారు. అందుకు మాధవుడు, "నిజం మహారాజా! అంతకు ముందు ఆరుబయట పడుకున్న నేను రాత్రి వర్షానికి తడిశాను కూడా. నా తడి బట్టలు మార్చుకున్నాక అమ్మ వడ్డించిన గుమ్మడికాయ పులుసుతో

అన్నం తిని తిరిగి నిద్రపోయాను. రాత్రి తడవడం కారణంగా నాకు జలుబు కూడా చేసింది. నన్ను నమ్మండి" అన్నాడు.

దీంతో రాయలవారికి మతిపోయినంత పనైంది. అప్పుడు రామకృష్ణుడు తెలివిగా, "మహారాజా! మా అబ్బాయికి కలలో జరిగిన విషయాలను వాస్తవంగా జరిగినట్లు చెప్పడం అలవాటు. ఎప్పట్నుంచో గుమ్మడికాయ పులుసు తినాలనే కోరిక వున్న మా అబ్బాయి గత రాత్రి గుమ్మడికాయ పులుసు తిన్నట్లు కలగని వుంటాడు. గత రాత్రి వానకురిసిందనేది ఏ మేరకు వాస్తవమో వాడు గుమ్మడికాయ పులుసు తినడం కూడా అంతే మేరకు వాస్తవం" అన్నాడు.

రాయలవారు చేసేదేమీ లేక విచారణ చాలించి రామకృష్ణుడినీ, కమలనూ, మాధవుడినీ వదలివేశారు. అలా ఆ గుమ్మడికాయల దొంగ ఎవరన్నది ఎప్పటికీ తేలని సమస్యగానే మిగిలిపోయింది.

# 3. రామకృష్ణుడు - దొంగలు

విజయనగర సామ్రాజ్యం ఎంతటి వైభవోపేతమైన చరిత్ర కలిగినదైనప్పటికీ రాజ్యంలో చోర బాధకూడా మిక్కిలిగా వుండేదట. తలారులు రాత్రంతా గ్రామాల్లో గస్తీ తిరుగుతూ, చోర బాధ నుండి గ్రామీణులను రక్షించడమేకాక, అనుమానాస్పదులుగా వున్న వారినందరినీ రాత్రంతా నిర్బంధించి, రాణాల్లో బందీలుగా వుంచి, తెల్లవారాక నిరపరాధుల్ని మాత్రం విడిచిపెట్టేవారట. వెండి బంగారములు దొంగిలించబడితే, కంసాలులను బంధించి తెచ్చి, వారు కొన్న దొంగ సొత్తును వారికి అమ్మిన దొంగలెవరో తెలుపమని నిర్బంధించేవారట. న్యాయ విచారణ గ్రామాల్లో వున్న పంచాయితీ సభలు చేపట్టేవి. ఈ సభలు గ్రామంలోని రచ్చబండవద్దకానీ, దేవాలయంలో కానీ నిర్వహించబడేవి. ఇవే నాటి కోర్టులు. ఈ సభల్లో వేదములు, శాస్త్రాలలో నిష్ణాతులైన బ్రాహ్మణులే విచారణాధికారులు. వారు 'విజ్ఞానేశ్వరీయము' అనే గ్రంథాన్ని ముఖ్య ప్రామాణిక గ్రంథంగా భావించి, ఎట్టి ప్రతిఫలాపేక్ష లేకుండా సివిల్, క్రిమినల్ కేసులను పరిష్కరిస్తూ నిష్పాక్షికంగా తీర్పులు చెప్పేవారు. ('యాజ్ఞవల్క్యస్మృతి'పై 'మితాక్షరా' అనే వ్యాఖ్యాగ్రంథం వ్రాసిన వాడే విజ్ఞానేశ్వరుడు. ఆయన పేరిటే ఆ వ్యాఖ్యను 'విజ్ఞానేశ్వరీయము' అంటున్నారు) కూటసాక్ష్యములిచ్చినా, తప్పుడు తీర్పులిచ్చినా వంశనాశనమౌతుందనే భయం నాటి ప్రజలలో వుంది కనుక యీ గ్రామ సభలలో ప్రజలకు ఎక్కువ సందర్భాలలో న్యాయమే లభించేది. ఇక్కడ తేల్చలేని విషయాల్ని రాజ సభకు నివేదించేవారు. రాజు ఉభయ పక్షాల వాదనలూ విని, పండిత మండలి సలహాలపై న్యాయనిర్ణయం చేసేవాడు. నేరస్తులకు బొండవేయడం నుంచి మరణశిక్ష వరకు వివిధ శిక్షలు విధించబడేవి. (కొయ్యతో చేసిన చట్రంలో చేతుల్ని బంధించడమే బొండవేయడమంటే. దీనినే దండ అని కూడా అంటారు. ఇది శిక్షలలో కెల్లా అల్పమైనది. కారాగార శిక్షలు, కళ్లు పీకించడం, కొరడాలతో కొట్టించడం, చర్మంపై వాతలు పెట్టించడం, చర్మం వలిపించడం, అంగచ్ఛేదము, శిరచ్ఛేదము వగైరాలు కూడా అమలులో వుండేవి.) అయితే, ఎంత గొప్ప నేరం చేసినా బ్రాహ్మణులకు మాత్రం మరణదండన విధింపబడేది కాదు. వారికి తీవ్ర నేరాలకు తలగొరగడం, దేశబహిష్కరణ, దేవిడీ మనా (రాజప్రాసాదం నుండి బహిష్కరణ) వగైరా అల్పమైన శిక్షలే విధించబడేవి.

తెనాలి రామకృష్ణుని యింటి చుట్టూ పెద్ద పెరటి తోట వుండేది. అందులో ఆయన భార్య కమల ఉపయుక్తమైన ఎన్నో ఫలపుష్ప వృక్షాలనూ, ఆకు కూరలనూ పెంచేది. ఆ పెరట్లో వున్న పెద్ద చేదబావి నుండి ప్రతిరోజూ నీళ్లు తోడి ఆవిడ మొక్కలను పెంచేది. అయితే ఆ యేడు వర్షాలు సరిగా పడక బావిలో నీళ్లు అడుగంటాయి. అంత అడుగు నుంచి నీటినితోడే శక్తిలేని ఆమె తన భర్తను తోటకు నీరు పెట్టమని పోరుకాడేది. స్వతస్సిద్ధంగా పనిదొంగయైన రామకృష్ణుడు ఏదో ఒకటి చెప్పి తప్పించుకునేవాడే కాని పట్టుమని ఒక్క రోజు కూడా తోటను తడిపిన పాపాన పోలేదు. తోటలోని

మొక్కలన్నీ ఎండిపోయి నేడో రేపో చావడానికి సిద్ధంగా వున్నాయి. 'పోనీ, ఎవరైనా పనివాళ్లను పెట్టి నీళ్లు తోడించి తోటను బతికించండి' అని కమల భర్తను కోరింది. పనివారిని పెడితే వారికి డబ్బులీయాల్సి వస్తుంది. అది రామకృష్ణుడికి యిష్టంలేదు. అంచేత ఆ పనీ రామకృష్ణుడు చేయలేదు. అలా కాలం దొర్లుకు పోతున్నది.

ఇలా వుండగా, ఓ రోజు సాయం సంధ్య వేళలో పిచ్చాపాటీ కబుర్లాడదానికి రచ్చబండ దగ్గరకు బయల్దేరాడు రామకృష్ణుడు. ఇంట్లోంచి బయటికొచ్చిన రామకృష్ణుడు చెప్పులు వేసుకొనబోతూ అప్పుడే ముసురుకుంటున్న లేత చీకట్లలో రెండు ఆకారాలు మెసలడం గమనించాడు. అతడి రాకను గమనించి వారు తోటలోని మామిడి గుబురు వెనక నక్కారు. వారు దొంగలై వుంటారనీ, రాత్రికి తన యింటిని ఎలా దోచుకోవాలా అని వారు పథకం పన్నుతున్నారనీ అతడికి అర్థమై పోయింది. అతడి బుర్రలో చటుక్కున ఓ ఆలోచన తట్టింది. వెంటనే ఆయన తన భార్యతో "ఏమేవ్! కమలా! నేనలా రచ్చబండ దాకా వెళ్లివస్తాను. వీధి తలుపులు భద్రంగా వేసుకో. అసలే రాజ్యమంతా దొంగల హడావుడి ఎక్కువగా వుందంటున్నారు. రాజుగారు తరచుగా నాకు వివిధ ఆభరణాలు, విలువైన కానుకలూ యిస్తారని జనమందరికీ తెలుసు. ఈపాటికి దొంగల దృష్టి మన యింటి మీద కూడా పడే వుంటుంది. ఈ రాత్రికి భోజనాలయ్యాక మనం నగానట్రా అంతటినీ మూటలుకట్టి మన పెరట్లో వున్న చేదబావిలో పడేద్దాం. కాస్త యీ హడావుడి తగ్గాక వాటిని తీసుకోవచ్చు. మనం అంత విలువైన వస్తువులు బావిలో పడేస్తామని ఏ దొంగలూ ఊహించలేరు కదా! కనుక దొంగల నుంచి మనకే యిబ్బందీ వుండదు" అని దొంగలకు కూడా వినపడేటంత కంఠస్వరంతో చెప్పి, బయటికెళ్లి ఓ అరగంటలో తిరిగి వచ్చాడు. ఈలోగా దొంగలు తమ పథక రచన పూర్తి చేశారు. 'ఇంటికి కన్నం వేయకుండా, ఎలాంటి హింసకూ పాల్పడకుండా, ఎలాంటి శ్రమా లేకుండా యింత సులభంగా దొంగతనం చేయడానికి ఎక్కడన్నా అవకాశం దొరుకుతుందా? ఇంటి యజమాని రాత్రి భోజనానంతరం నగలు, విలువైన వస్తువులు మూటగట్టి బావిలో వేస్తాడు. రాత్రికి రాత్రే నీటిని తోడి బావిలోని ఆ మూటలను తాము దోచుకెళ్లిపోవచ్చు' అని ఆలోచించారు దొంగలు.

రామకృష్ణుడు రచ్చబండ నుంచి తిరిగి వచ్చిన అనంతరం భోజనాలు పూర్తి చేసి, భార్యాభర్త లిరువురూ తమ యింటిలోని నగానట్రా అంతా భోషాణంలో దాచి, పనికిరాని పాత సామాను, కొన్ని రాతి బండలు కలిపి వాటిని రెండు మూటలుగా తయారు చేశారు. ముందుగా కమల బయటికెళ్లి తన భర్తతో గోప్యంగా చెపుతున్నట్లు 'ఎవ్వరూ యిటుగా రావటం లేదు. ఇక్కడంతా చీకటిగా వుంది. మీరు ఆ రెండు మూటలనూ తెచ్చి బావిలో పడెయ్యండి' అన్నది భర్తతో. రామకృష్ణుడు అలాగే చేశాడు. జరిగేదంతా దూరాన మామిడి గుబురుల్లో నుంచి గమనిస్తూనే వున్నారు దొంగలు. తమ రొట్టె విరిగి నేతిలో పడ్డదనుకున్నారు వాళ్లు సంబరంగా. రామకృష్ణుడూ తన పాచిక పారిందని సంతోషిస్తూ భార్యాబిడ్డలతో ఆ రాత్రి పెందరాడే నిద్రపోయాడు. ఆ యిరువురు దొంగలకూ తోడు వారి ముఠా నాయకుడు, మరో యిరువురు దొంగలు వచ్చి వారితో కలిశారు ఆ రాత్రికి.

ఒక రాత్రివేళ అంతా మాటుమణిగిన తరువాత ఆ దొంగలంతా కలిసి బావిలోని నీటిని తోడడం మొదలు పెట్టారు. విసుగూ విరామం లేకుండా వారు నీటిని తోడుతూనే వున్నారు. అంతకు ముందు తోటలో ఏర్పరచ బడిన కాలువల ద్వారా తోటంతటికీ నీరు చేరి, తోటంతా బాగా తడిసింది. తెల్లవారబోతూ వుండగా ఆవలించుకుంటూ లేచిన రామకృష్ణుడు చేదబావి దగ్గరకు వెళ్లి బిగ్గరగా నవ్వుతూ, "దొంగలూ! ఇప్పటి వరకూ తోడింది చాలు. తోటంతా బాగా తడిసింది. వారం రోజుల వరకూ మొక్కలకు నీళ్లు అవసరం లేదు. మళ్లీ యింకోసారి అవసరమైనప్పుడు తోడుదురుగాని. ఇక మీ యిండ్లకు వెళ్లి విశ్రాంతి తీసుకోండి" అన్నాడు హేళనగా. ఆ మాటలు వింటూనే దొంగలంతా కకావికలై పరుగెత్త బోయారు. సరిగ్గా అదే సమయంలో తలారి, రక్షకభటుల బృందం వచ్చి వారిని అదుపులోకి తీసుకుంది. రామకృష్ణుడు

గతరాత్రి రచ్చబండకు వెళ్లినప్పుడు తలారితో 'రేపు వేకువ జాముకు రక్షకభటులతో మీరు మా యింటికి రండి. మీకు విలువైన కానుకలు లభిస్తాయి' అని చెప్పాడు. వాళ్లు 'రామకృష్ణుడు వేకువనే తమను తన యింటికి ఎందుకు రమ్మని వుంటాడా! తమకాయన ఏం కానుకలివ్వబోతున్నాడా !' అనుకుంటూ వచ్చేసరికి ఆ దొంగలు వాళ్ల కళ్లబడ్డారు. వాళ్లంతా విజయనగర సామ్రాజ్యాన్ని గడగడలాడిస్తున్న పేరుమోసిన గజదొంగలు. ఆ సరికే వారిని సజీవంగా గానీ, నిర్జీవంగా గానీ పట్టి యిచ్చినవారికి ప్రభుత్వం విలువైన బహుమతులు ప్రకటించి వున్నది. అందుకని, దొంగలను పట్టుకున్నందుకు తలారికీ, రక్షక భటులకూ, పట్టించినందుకు రామకృష్ణునికీ రాయలవారు విలువైన బహుమతుల్ని యిచ్చారు. రాయలవారు అసలేం జరిగిందో రామకృష్ణుడిని ఆసక్తిగా అడిగి తెలుసుకున్నారు. జరిగింది విన్న తరువాత రాయలవారితో పాటు సభికులంతా పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వుకున్నారు. రామకృష్ణుని స్థానంలో మరో వ్యక్తి వుంటే రచ్చబండకు వెళ్లినప్పుడే రక్షకభటుల్ని వెంటతీసుకుని వచ్చి దొంగలను వారికి అప్పగించేవారు. రామకృష్ణుడు యుక్తిపరుడు కదా! అందుకని రక్షకభటుల్ని ఎందుకో చెప్పకుండా వేకువ జాముకు తన యింటికి రమ్మన్నాడు. అంతా ఆయన అనుకున్నట్లే జరిగింది రామకృష్ణుడికి స్వామికార్యం (బాధ్యతకల పౌరునిగా గజదొంగలను పట్టించడం)తో బాటు స్వకార్యం (తన తోటకు నీరు పెట్టడం) – రెండూ నెరవేరినట్లయింది. రామకృష్ణుని చతురత రాయలవారికి ఆయన్ని మరింత సన్నిహితుడిని చేసింది అప్పటి వరకూ ఎలాగోలా అతిథి పీడ వదిలించుకునే తెలివైన గృహస్థును ప్రజలు 'చుట్టంతో పామును చంపించేవాడు' అనటం వాడుకగా వుంది. (చుట్టం చేతిలో పాము చస్తే గృహస్థుకు మేలు. లేదా ఆ ప్రయత్నంలో పాము కరచి చుట్టం చనిపోతే అతడికి తిండి పెట్టే బాధ్యత తప్పుతుంది) దొంగల విషయంలో రామకృష్ణుడి చాతుర్యం చూసిన ప్రజలు ఆయన్ని 'దెయ్యంతో కూడా దేకిసాలు తోమించే వాడ'ని మెచ్చుకున్నారు.

## 4. కాశ్మీర దేశపు మల్లయోధుడు

ఒకప్పుడు కాశ్మీరదేశపు మల్ల యోధుడొకడు విజయనగరానికి వచ్చాడు. రాజాస్థానానికి వచ్చి ఆ మల్లుడు రాయలవారికి వినమ్రంగా నమస్కరించి, "మహారాజా! నేను మల్ల యుద్ధంలో అనేక దేశాలకు చెందిన ఎందరెందరో విఖ్యాత యోధుల్ని ఓడించాను. మీ రాజ్యంలో కూడా నా సత్తా చాటాలని నాకు ఆసక్తిగా వుంది. మీ రాజ్యంలోని ఏ మల్లుడైనా నాతో ద్వంద్వ యుద్ధానికి సిద్ధమేనా?" అని సవాలు విసిరాడు. రాయలవారి ఆస్థానంలోని మల్లులకు కాశ్మీర దేశపు మల్లుడి భీకరమైన ఆకారం చూస్తేనే ముచ్చెమటలు పోసుకొచ్చాయి. భయంతో వారు వెనకడుగు వేశారు. దీంతో రాయలవారికి అవమానమనిపించింది. అప్పుడు సభలోనే వున్న రామకృష్ణుడు రాయలవారి ముఖంలోని దైన్యాన్ని గమనించాడు. భువన విజయానికి అవమానం జరిగితే అది రాయలవారికి అవమానమేనని భావించాడు రామకృష్ణుడు. ఒక్కక్షణం కళ్లుమూసుకుని ఆలోచించాడు. వెంటనే ఎక్కడ లేని ధైర్యం తెచ్చుకుని లేచి నిలబడి, 'మహారాజా! మీరు అనుమతిస్తే యీ మల్లుడితో నేను పోరాడి గెలిచి మన విజయనగరం ప్రతిష్ఠను నిలబెడతాను". స్వయంగా గొప్ప మల్లయోధుడైన రాయలవారు ఆ కాశ్మీర దేశపు మల్లుడిని స్వయంగా తామే ఎదుర్కొని విజయ నగర సామ్రాజ్యపు పరువు ప్రతిష్ఠలు నిలబెట్టాలని యోచిస్తున్న తరుణంలో, ఇప్పటికైనా కనీసం తన ఆస్థానంలోని ఒకరు ఆ మల్లుడితో పోరాడదానికి ముందుకొచ్చినందుకు రాలయవారు ఆనందపడినా, 'ఇంతటి బలహీనమైన శరీరంతో రామకృష్ణుడు అంతటి దృఢకాయంగల మల్లుడినెలా ఓడించగలడు?' అని సంకోచించారు. పైపెచ్చు రామకృష్ణుని ఆత్మవిశ్వాసం, ధైర్యం ఆయనను అబ్బురపరచాయి.

ఇదే విషయం కాశ్మీర మల్లుడి మనస్సునూ చీకాకు పెట్టింది. అయినా అతను తన మనస్సులోని సందేహాన్ని తొక్కిపట్టి పైకి వికటాట్టహాసం చేస్తూ, "హుం! నీవా నన్నెదిరించేది? నీలాంటి బలహీనుడిని నల్లిని నలిపినట్లు నలిపేస్తాను"

అంటూ హుంకరించాడు. తెనాలి రామకృష్ణుడు కూడా బిగ్గరగా నవ్వుతూ, "సరేలే, చూద్దాం! ఎవరి పస ఏమిటో యిప్పుడే తేలిపోతుంది. అది సరే, నీకు 'జూ-జూ' తరహా ద్వంద్వయుద్ధం ఎలా చేయాలో తెలుసునా?" అన్నాడు. ఆ మల్లయోధుడు యీ తరహా యుద్ధం ఉందనికూడా ఆనాటి వరకూ వినియెరుగడు. అంచేత "లేదే! నేనెప్పుడూ ఆ తరహా మల్లయుద్ధం వున్నట్లు కూడా వినలేదు" అన్నాడా మల్లుడు.

అప్పుడు తెనాలి రామకృష్ణుడు బిగ్గరగా ఎగతాళిగా నవ్వి సభికులతో, "చూడండి! ఇదన్న మాట యీ మల్లయోధుడికి మల్లయుద్ధాన్ని గురించి వున్న పరిజ్ఞానం! 'జూ-జూ' యుద్ధంలో ఆరితేరిన నేను నేటి వరకూ ఆ పేరు కూడా వినివుండని మల్లుడితో యుద్ధం చేయాల్సి రావడమా! హతవిధీ! తన కండబలంతో ఎలాగోలా నాపై నెగ్గుదామనుకుంటున్నాడీ పొగరుబోతు మల్లుడు. 'జూ-జూ' యుద్ధానికి బుద్ధిబలంతోనే కానీ భుజబలంతో అస్సలు పనిలేదు. వీడి పని యిట్టే పట్టేసి వీడిని పరాభవించి పంపుతాను. చూడండి" అంటూ ఆత్మ విశ్వాసం తొణికిసలాడే కంఠస్వరంతో అన్నాడు.

ఇది విన్నాక ఆ మల్లుడు పునరాలోచనలో పడ్డాడు. రాయలవారితో అతడు 'మహారాజా! రేపు నేను మీ రామకృష్ణునితో 'జూ-జూ' మల్లయుద్ధం చేస్తాను. నేటికి నన్ను వెళ్లి విశ్రాంతి తీసుకొననివ్వండి' అన్నాడు.

తెల్లవారి సభాభవనం ప్రజలతో కిటకిటలాడి పోయింది. కాశ్మీర దేశాన్నుంచి వచ్చిన ప్రఖ్యాత మల్లునితో 'జూ-జూ' యుద్ధం చేయదానికి అర్భకుడైన రామకృష్ణుడు సిద్ధమవడం రాజ్యంలోని ప్రజలను సంభ్రమాశ్చర్యాలకు గురి చేసింది. నమ్మశక్యంగాకున్నా ఈ వార్త రాజ్యమంతటా దావానలంలా వ్యాపించింది. దీనిలో నిజమెంతో తెలుసుకుందామనీ, యీ మల్లయుద్ధాన్ని ప్రత్యక్షంగా వీక్షిద్దామనీ ఎక్కడెక్కడినుంచో ప్రజలు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు.

ఇంతలో ఓ వార్తాహరుడు వచ్చి ఆ కాశ్మీర మల్లుడు తన విడిది గృహాన్ని విడిచి పరారయ్యాడనే వార్తను రాయలవారికి విన్నవించాడు. రాయలవారి ఆశ్చర్యానికీ, ఆనందానికీ అంతేలేదు. ఆయన ఆనందం ప్రధానంగా తనకు ఆత్మీయుడైన రామకృష్ణుడు ఆ మల్లుని చేతిలో తప్పనిసరి ఓటమి నుండి ఎట్టకేలకు తప్పించుకున్నాడనే. ఇలా విజయనగరపు పేరు ప్రఖ్యాతులను రామకృష్ణుడు కాపాడగలిగినందుకు రాయలవారెంతో సంతోషించారు. అయితే, ఈ 'జూ-జూ' యుద్ధమేమిటి? ఆ విద్యలో తమకు తెలియకుండా రామకృష్ణుడెప్పుడు ప్రవీణుడయ్యాడు?' అనే అనుమానాలు ఆయన మనస్సును తొలిచివేస్తున్నాయి.

స్వయంగా గొప్ప మల్లయోధుడైన రాయలు రామకృష్ణుని వంక తిరిగి నవ్వుతూ, "రామకృష్ణయ్యా! మీరేదో 'జూ-జూ' యుద్ధమంటున్నారు. అదేమిటో కాస్త వివరించండి" అన్నాడు ఆసక్తిగా.

దానికి రామకృష్ణుడు నవ్వుతూ, "అసలు అలాంటి పేరుగల ద్వంద్వ యుద్ధమే లేదు మహారాజా! ఆ సమయానికి నాకు తోచినదేదో అనేశాను. అంతే! అంతటి గొప్ప మల్లయోధుడిని ఓడించడం నావల్ల అయ్యేపనా? అందుకే అతన్ని గందరగోళ పరచి భయపెట్టి తరిమేసే ఉద్దేశ్యంతోనే ఎక్కడాలేని ఆ యుద్ధాన్ని నేను సృష్టించాను. మీరు స్వయంగా తలపడితే ఆ యోధుడిపై అవలీలగా నెగ్గగలరు. అయితే ఆ క్రమంలో మీకేదైనా ప్రమాదం జరిగితే - యీ సామ్రాజ్యమూ, ప్రజలూ యేం కావాలి? అందుకే మోసంతో ఆ మల్లుడిని తరిమి యుద్ధనీతిని అతిక్రమించినా, విజయనగర సామ్రాజ్యం యొక్క ప్రతిష్ఠను కాపాడ గలిగాననే సంతృప్తి నాకు మిగిలింది. నేను చేసిన తప్పుకు నన్ను మన్నించండి" అన్నాడు.

రాయలవారు చిరునవ్వుతో 'రామకృష్ణయ్యా! నేడు నీ కారణంగా విద్యానగర ప్రతిష్ఠ నిలబడింది. నిన్ను చూస్తుంటే నాకెంతో గర్వంగా వుంది. అందుకో మా యీ చిరుకానుక" అంటూ ఓ బంగారు నాణెముల మూటను రామకృష్ణునికిచ్చి నిండు సభలో ఆయన్ని ఘనంగా సత్కరించారు రాయలవారు.

శ్రీకృష్ణదేవరాయలు రాజోచిత విద్యలన్నింటిలో నిష్ణాతుడు. ఆయనను 'వ్యాయామ స్థిర సంధిబంధువు' అని 'మనుచరిత్ర' పేర్కొంటున్నది. (మనుచరిత్ర 6-123). ఆయన చక్కని కండలు తిరిగిన యోధుడు. నాటి విజయనగర సామ్రాజ్యంలో మల్లయుద్ధాలు, సాము గరిడీలు ప్రజలకు ఎంతో అభిమాన పాత్రమైన విద్యలు. విజయనగరంలో అడుగడుగునా వ్యాయమశాలలు (తాలింఖానాలు) వుండేవి. స్త్రీలు సైతం వాటిలో కసరత్తులు చేసి యుద్ధవిద్యా ప్రవీణులయ్యేవారు కృష్ణరాయల పాలనా కాలంలో హరి అక్క అనే పౌరుషవంతురాలు తన తండ్రిని అక్రమంగా కుస్తీలో చంపిన జెట్టీలను ఒక్కొక్కరినే ద్వంద్వయుద్ధంలో ఎదుర్కొని వారందరినీ చంపి పగతీర్చుకున్నదట. కృష్ణదేవరాలు ప్రతిరోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేసేవాడట. ప్రొద్దున్నే చిన్న గిన్నెడు కుసుమ నూనె త్రాగి, అదే నూనె ఒళ్లంతా పట్టించుకుని సాముచేసి, సవారీలు చేసి, కుస్తీలు పట్టేవాడట ఆయన. సంగడాల సాములో ఆయన ఆరితేరినవాడు. ఆయనను 'వాజ్యారోహణ నైపుణ్య నకులుడు' అని 'పారిజాతాపహరణం' పేర్కొంటుంది. (అంటే గుర్రం ఎక్కడంలో నకులుడి అంతటి నైపుణ్యం కలవాడు). అశ్వహృదయాన్ని బాగా అర్థం చేసుకొని వివిధ రకాల గుఱ్ఱపు స్వారీలలో ఆయన ఆరితేరాడట.

రాయలవారి వ్యాయామ ప్రావీణ్యాన్ని గురించి పోర్చుగీసు రాయబారితో వచ్చిన డామింగో పేయజ్ యీ విధంగా వ్రాశాడు. రాయలు రోజూ సూర్యోదయానికి ముందేలేచి క్వార్టిల్హో (*Quartilho* - ముప్పావు పింటు) నువ్వుల నూనె త్రాగి, అదే నువ్వుల నూనె ఒళ్లంతా పూసుకునేవాడు. నడుముకు చిన్న గుడ్డ (లంగోటి) కట్టుకుని మట్టితో చేసిన గొప్ప బరువులు (అవే సంగడాలు అయి వుంటాయి) ఎత్తుతూ వ్యాయామం చేసేవాడు. ఆ తరువాత ఓ కత్తిని గాలిలో తిప్పుతూ తాను తాగిన నువ్వులనూనె అంతా చెమట ద్వారా బయటికి వచ్చేటంత సేపు వ్యాయామం చేసేవాడు. అనంతరం తన ఆస్థాన మల్లుల్లో ఒకరితో కుస్తీ పట్టేవాడు. ఇదంతా అయ్యాక ఓ గుర్రమెక్కి తెల్లవారే వరకు అన్ని దిక్కులకూ స్వారీ చేసేవాడు తరువాత అతి పవిత్రుడైన ఒక బ్రాహ్మణుడు ఆయనకు స్నానం చేయించేవాడు. *(P. 73 VIJAYANAGAR. ED - VASUNDHARA FILLIOZAT, PUB : NBT, N.D )*

# 5. రామకృష్ణుడు - కావలి తిమ్మన

ఓసారి కృష్ణదేవరాయలు తన కోట ప్రధాన ద్వారం వద్ద కాపలావాడైన తిమ్మన అనే సైనికుడి ధైర్య సాహసాలకు మెచ్చి ఆతడిని నిండు కొలువులో సత్కరించి, అతడికి విలువైన ఓ పట్టు శాలువను బహూకరించారు. రామకృష్ణుడికి రాయలవారు తన సమక్షంలో ఎవరినైనా పొగడినా, ఘన సన్మానం చేసినా యిష్టం వుండేది కాదు. రాయలవారిని మరొకరు తన సమక్షంలో పొగడినా రామకృష్ణునికి గిట్టేది కాదు. ఏదో విధంగా యుక్తిగా దాన్ని ఆక్షేపించేవాడు. రాయలవారిని కవయిత్రి మొల్ల ప్రశంసిస్తూ చెప్పిన పద్యాన్ని తిప్పికొట్టడం, రాయలవారు ధూర్జటి మహాకవిని మెచ్చుకుంటూ పద్యం చెప్తూంటే అద్భుతగిలి ధూర్జటి వేశ్యాలోలుడని చాటి సభలో ఆయన పరువు తీయడం వగైరాలెన్నో రామకృష్ణుడు చేశాడు. పొగడితే రాయలవార్ని తానే పొగడాలి. తనను మాత్రమే రాయలవారు మెచ్చుకోవాలి. యిలా వుండేది రామకృష్ణుని ఆలోచనా ధోరణి. ఓ రకంగా ఆయనకు ఈర్ష్యాసూయలు ఎక్కువేనని చెప్పుకోవాలి.

ఓ చిరుద్యోగియైన దౌవారికునకు యింతటి ఘన సన్మానమా? పైపెచ్చు విలువ తెలియని వారికి అంతటి విలువైన పట్టు పచ్చడమా? రామకృష్ణుని హృదయం ఈర్ష్యతో రగిలిపోయింది. ఆ విలువైన పట్టు శాలువపై ఆయన కన్నుపడింది. 'ఎలాగైనా ఆ శాలువను కావలి తిమ్మన నుంచి తాను కొట్టెయ్యాలి' అని ఆలోచించాడు.

ఆ రోజు కావలి తిమ్మన రాజసన్మానానంతరం రాచబాటకు సమీపంలోనే వున్న తన యింటి బయట అరుగు మీద ఠీరిగ్గా కూర్చున్నాడు. తనకు సభలో జరిగిన సన్మానం గురించి యిరుగు పొరుగు వారికి గొప్పగా చెప్పుకుంటున్నాడు

తిమ్మన. ఆ సమయంలో రాచబాటన వెళ్తున్న తెనాలి రామకృష్ణుడు, భట్టుమూర్తి, ముక్కు తిమ్మన, అల్లసాని పెద్దనలను చూసి వినమ్రంగా లేచి నిలబడి అభివాదం చేశాడు కావలి తిమ్మన. ఆంధ్రకవితా పితామహుడైన అల్లసాని పెద్దన ముందుగా "ఏమోయ్ కావలి తిమ్మనా! కవి సమ్రాట్టులకు మాత్రమే దక్కే సన్మానాలకేమాత్రం తీసిపోని విధంగా యీ రోజు రాయలవారు నిండు సభలో నిన్నూ సన్మానించారు. నీ జీవితం ధన్యం. నేటి సన్మానంతో నీ కీర్తి అజరామరమైంది. రాయల వారికి నీవెంతో అభిమాన పాత్రుడవయ్యావు. అతి సామాన్య ద్వారపాలకుడివైన నీకే యింతటి వైభవం లభిస్తే, అది మన రాయలవారికీ, విజయనగర సామ్రాజ్యానికీ మరింత వైభవం చేకూర్చదా? నీపై ఒక పద్యం చెప్పాలని నా మనస్సు ఉవ్విళ్లూరుతున్నది" అంటూ, ఓ కంద పద్యం మొదటి పాదాన్ని చెప్పాడు -

కం॥ వాకిట కావలి తిమ్మా

వెంటనే ముక్కు తిమ్మన అందుకొని రెండవ పాదాన్నిలా పూరించాడు.

ప్రాకటముగ సుకవివరుల పాలిట సొమ్మా

ఆ వెనువెంటనే భట్టుమూర్తి ఆ కంద పద్యం మూడవ పాదాన్నిలా చెప్పాడు.

నీ కిదె పద్యము కొమ్మా

అప్పుడు రామకృష్ణుడు సమయస్ఫూర్తితో చటుక్కున ఆ పద్యపు నాల్గవ పాదాన్ని యిలా చెప్పి ఆ కంద పద్యాన్ని తెలివిగా పూరించాడు.

నాకీ పచ్చడము చాలు నయముగ నిమ్మా!

అప్పుడు కావలి తిమ్మన ఆ పద్యము విని చాల సంతోషించి, ఆ పద్యపు నాల్గవ పాదంలో తన కోరికను తెలివిగా బయటపెట్టిన రామకృష్ణునికి ఆ పచ్చడమునిచ్చి, మిగిలిన ముగ్గురు కవులకు కూడా రాయలవారు తనకిచ్చిన విలువైన బహుమతుల నుండి కొన్నింటిని యిచ్చి గౌరవించి పంపారట. ఏమైతేనేం, రామకృష్ణుడికి తాను కోరుకున్న శాలువ లభించింది. అలా రామకృష్ణుడు అనుకున్న పనిని ఎలాగైనా సరే సాధించడంలో దిట్ట.

# 6. సత్యానికీ అసత్యానికీ మధ్య దూరం

ఓసారి రాయలవారిని ఓ వింత సమస్య చీకాకు పెట్టింది. 'సత్యానికీ, అసత్యానికీ మధ్య వ్యత్యాసం ఏమిటి? నిజానికీ, అబద్ధానికీ మధ్య దూరమెంత?' అని. ఇదే విషయాన్ని ఆయన ఓ రోజు 'భువన విజయం'లో ప్రస్తావించారు. అష్టదిగ్గజాలుగా ప్రఖ్యాతిగాంచిన ఎనిమిది మంది ప్రసిద్ధ కవులేకాక ఎందరో పండితులు యీ విషయమై జుట్టు పీక్కున్నారు. ఒక్కొక్కరొక్కక్క విధంగా సమాధానాలిచ్చారు. కానీ, అవేవీ రాయలవారికి రుచించలేదు.

కొందరు సత్యం యొక్క అర్థం అసత్యం యొక్క భావానికి పూర్తిగా భిన్నమైనదని చెప్పారు. కొందరు సత్యాసత్యాల మధ్య గల అంతరం భూమ్యాకాశాల మధ్య ఉన్న దూరంతో సమానమన్నారు. భూమిని సత్యంతో పోల్చడం కొంతమేరకు పర్వాలేదుగానీ, ఆకాశాన్ని అసత్యంతో పోల్చడం రాయలవారికి నచ్చలేదు. ఆకాశమంటే ఖాళీ స్థలం. ఘటము (కుండ) లోనూ, ఆకాశముంటుంది. భూ ఉపరితలం నుంచే ఆకాశం మొదలవుతుంది. కనుక సత్యాసత్యాలను భూమ్యాకాశాలతో సరి పోల్చడం రాయలవారికి రుచించలేదు. పైపెచ్చు ఆకాశమంటే అనంతం కనుక భూమ్యాకాశాల మధ్య వ్యత్యాసం కూడా అనంతమే అవుతుంది. కనుక, పండితుల నుండి ఇంకా యింతకంటే మెరుగైన, ఖచ్చితమైన సమాధానాన్ని ఆయన ఆశించారు.

ఈ చర్చ జరిగినంత సేపూ మౌనం పాటించిన రామకృష్ణునికేసి తిరిగి రాయలవారు, "రామకృష్ణయ్యా! మీరు మౌనంగా వున్నారేం? దీనిపై మీ అభిప్రాయాన్ని కూడా తెలపండి" అన్నారట.

"మహారాజా! సత్యానికీ అసత్యానికీ మధ్యదూరం భూమ్యాకాశాలకు మధ్య వున్నంత వుంటుందని నేననుకోను" అన్నాడు.

"మరెంత వుంటుందను కుంటున్నారు మీరు? చెప్పండి త్వరగా" అన్నారు రాయలవారు ఆసక్తిగా.

"ఆ రెంటి మధ్యా రెండు మూడంగుళాలకు మించి పెద్దగా దూరముండదు ప్రభూ!" అన్నాడు రామకృష్ణుడు.

దీంతో రాయలవారికి ఓర్పు నశించింది. "ఏమిటిది రామకృష్ణయ్యా ! వేళాకోళాలకిది సమయమా ? విసిగించక త్వరగా చెప్పండి అదెలాగో !" అన్నారాయన.

"మహారాజా! ఖచ్చితంగా చెప్పాలంటే సత్యానికీ, అసత్యానికీ మధ్య దూరం మనకంటికీ, చెవికీ మధ్య వున్నంత దూరం మాత్రమే" అన్నాడు రక్కున రామకృష్ణుడు.

రాయలవారు విస్మయంగా 'అదెలా? కాస్త వివరంగా చెప్పండి, రామకృష్ణయ్యా?' అన్నారు.

అప్పుడు రామకృష్ణుడు యిలా వివరించాడు. "మహారాజా! మన కన్ను దేన్ని చూస్తుందో అది సత్యం. మన చెవి ఏది వింటుందో అది అసత్యం. (అంటే మనం చెవితో వినేవన్నీ నిజాలు కావు. కంటితో చూసే నిజానిజాలు నిర్ధారించుకుంటాం మనం.) కనుక సత్యానికీ, అసత్యానికీ మధ్య దూరం ఖచ్చితంగా మన కంటికీ, చెవికీ మధ్య వున్న దూరమే!"

ఈ వివరణ రాయలవారికెంతో నచ్చింది. రాయలవారు దిగ్గునలేచి రామకృష్ణుడిని కౌగిలించుకుని ఆయన్ని ఘనంగా సత్కరించారు.

## 7. రామకృష్ణుడు - ఐంద్రజాలికుడు

ఓసారి నేపాళ దేశాన్నుంచి ఓ ప్రసిద్ధ ఐంద్రజాలికుడు విజయనగరానికి విచ్చేశాడు. అతడు గారడీ గజకర్ణ గోకర్ణ, టక్కు టమార మంత్ర విద్యలతో రాజధానిలోని ప్రజల నెంతగానో అలరించాడు. ఓ రోజు రాజ సభను దర్శించిన ఆ ఐంద్రజాలికుడు రాయలవారి దర్శనం చేసుకుని ఆయనకు "మహారాజా! నేను నా మంత్ర విద్యలతో ఎన్నో ప్రదర్శనలిచ్చి మీ రాజ్యంలోని ప్రజలను ఆనందాశ్చర్యాలలో ముంచెత్తాను. నా తిరుగు ప్రయాణానికింకా ఎంతో వ్యవధిలేదు. ఈలోగా నాకు తెలిసిన గారడీ, గజకర్ణ, గోకర్ణ, టక్కుటమార, మంత్ర విద్యలలో మీ సభలో వున్న వారెవరైనా నన్ను ఓడించగలరేమో పరీక్షించండి. నేను గెలిస్తే బంగారు గండ పెండరము నా కాలికి మీరే స్వయంగా తొడగండి. నేనోడితే నన్ను ఓడించిన వ్యక్తికి నా జీవిత కాలంలో నాకు లభించిన విలువైన పతకాలూ, కానుకలూ అన్నీ సమర్పించి ఆ వ్యక్తి పాదదాసుడనౌతాను" అని సవాలు విసిరాడు. భువన విజయంలోని ఎందరో ఉద్దండ పండితులు, మంత్రవేత్తలు సైతం ఆ నేపాళ మాంత్రికుడిని ఎదుర్కొనడానికి ధైర్యం చాలక వెనకడుగు వేశారు. అప్పుడు రామకృష్ణుడు ధైర్యంగా ముందుకువచ్చి, "మహారాజా! ఈ మాంత్రికుడిని ఎదిరించి, ఓడించే అవకాశాన్ని మీరు నాకు కల్పించండి" అన్నాడు. రాయలవారు ఆశ్చర్యపోతూ, "రామకృష్ణయ్యా! నీకు మంత్ర విద్యలలో ఏమాత్రం ప్రవేశం లేదని నాకు తెలుసు. ఇది సాహసం సుమా!" అని హెచ్చరించారు. అయినా, రామకృష్ణుడు వెనక్కి తగ్గలేదు. 'రామకృష్ణుని దగ్గర యుక్తి తప్ప, మంత్ర శక్తి లేదు. జరుగనున్నది మంత్రశక్తిలో పోటీ. ఎలాగైనా నెగ్గి భువనవిజయం పరువు నిలపాలనే రామకృష్ణుని మొండి పట్టుదల మెచ్చదగిందే! ఒకవేళ ఏదైనా యుక్తి పన్ని యీ పరీక్షలో రామకృష్ణుడు గెలుస్తాడేమో!', అని ఆలోచించిన రాయలవారు రామకృష్ణుడిని యీ పోటీకి

అనుమతించారు.

అప్పుడు రామకృష్ణుడు ఆ నేపాళ మాంత్రికునితో "ఓ మహా మాంత్రికా! వందనములు. ముందుగా చిన్నవాడినైన నేను మీకొక పరీక్ష పెడతాను. అందులో మీరు నెగ్గితే నా ఓటమినంగీకరిస్తాను. నేను కళ్లు రెండూ మూసుకుని ఏ పనిని చేస్తానో మీరు మీ రెండు కళ్లూ తెరిచి అదే పనిని చేయాలి. అంతే! సరేనా?" అన్నాడు. 'నా ప్రత్యర్థి రెండు కళ్లూ మూసుకుని చేయగలిగిన పనిని నేను రెండు కళ్లూ తెరచి కూడా చేయలేనా?' అని ఆ మాంత్రికుడు వెంటనే సరేనన్నాడు.

వెంటనే రామకృష్ణుడు ఓ దౌవారికుడిని చేరబిలిచి అతని చెవిలో ఏదో చెప్పాడు. వాడు వెంటనే వెళ్లి ఏదో తెచ్చి రామకృష్ణుని చేతికిచ్చాడు. అందరూ చూస్తూ వుండగానే రామకృష్ణుడు తన రెండు కళ్లూ మూసుకుని, తన చేతిలోని దుమ్మును కళ్లపై చల్లుకున్నాడు. ఇక మాంత్రికుడి వంతు వచ్చింది. ఆయన రెండు కళ్లూ తెరచి వుంచి అదే దుమ్మును తన కళ్లలో చల్లుకోవాలి. ఇది సాధ్యమయ్యే పని కాదని ఆ నేపాళ మాంత్రికుడికి అర్థమైపోయింది. ఒక వేళ తాను తెరచివున్న కళ్లపై దుమ్ము చల్లుకున్నా తన కనురెప్పలు అసంకల్పితంగా మూతబడతాయనీ, అంచేత తాను ఓడిపోవడం ఖాయమనీ, అతడు గ్రహించాడు. అంచేత, ముందుగానే తన ఓటమిని అంగీకరించి, రామకృష్ణుని బుద్ధికుశలతకు మెచ్చుకుని, తన వద్ద వున్న విలువైన వస్తువులనన్నింటినీ రామకృష్ణుడికి కానుకగా యిచ్చి, జీవితాంతం ఆయనకు దాస్యం చేయడానికి సిద్ధపడ్డాడు. రామకృష్ణుడు యీ గెలుపులో తన గొప్పతనమేమీ లేదనీ, ఎంతటి మహామాంత్రికుడైనా రాయలవారిని తాను గెలిస్తే తనకు స్వయంగా కాలికి గండపెండరము తొడగాలని రాయల వారిని కోరడంచేత, అది తప్పించడానికి యీ యుక్తి పన్నాననీ, స్వతహాగా స్వేచ్ఛా ప్రియుడనైన తనకు మరొకరు జీవిత పర్యంతం దాస్యం చేయడం ఏమాత్రం యిష్టంలేదనీ, తిరస్కరించి ఆ ఐంద్రజాలికుడిచ్చిన కానుకలన్నీ తిరిగి ఆయనకే యిచ్చివేశాడు. రామకృష్ణుని ఔదార్యానికీ, ప్రభుభక్తికీ రాయలవారు ఎంతగానో సంతోషించి ఉచితరీతిన రామకృష్ణుడిని సత్కరించి, ఐంద్రజాలికుడికీ వీడ్కోలు పలికారు. ప్రజలు రామకృష్ణుడి ప్రతిభకు జయజయధ్వానాలు చేశారు.

## 8. తాతాచార్యులతో రామకృష్ణుని కయ్యం

తెంగల వైష్ణవ గురువైన శ్రీమాన్ తిరుమల తాతాచార్యులవారు రాయలవారికి రాజగురువుగా వ్యవహరించేవారు. రాయలకు ఆయన మాటే వేదం. అప్పట్లో రాయలవారి సభలోకి పండితులకు ప్రవేశం దొరకడం, రాయలవారి సముఖం లభించడం బహు కష్టసాధ్యంగా వుండేవి. అందుకని పండితులూ, కవులూ రాజగురువైన తాతాచార్యుల వారిని ఆశ్రయించి వారి సిఫారసుతో సభా ప్రవేశం చేయగలిగేవారు. తాతాచార్యుల వారు గొప్ప పండితుడు. సంఘ సేవకుడు. అయితేనేం స్వమతాభిమాని. ముక్కోపి. పరమతాల్ని చులకనగా చూసేవాడు.

ఒకప్పుడు తాతాచార్యులవారు గుంటూరు జిల్లా మంగళగిరిలో జరిగిన ఓ విద్వత్సభలో పాల్గొనడానికి విజయనగరం నుంచి అక్కడికి శిష్య, పరివార సమేతంగా విచ్చేశారట. రామకృష్ణుడి స్వస్థలమైన తెనాలికి మంగళగిరి సమీప గ్రామమే. ఎలాగో తాతాచార్యులవారి రాక సంగతి తెలుసుకున్న రామకృష్ణుడు (అప్పటికింకా ఆయన రామలింగడే) మంగళగిరి వెళ్లి తాతాచార్యులను కలిశాడు. తాను కవిననీ, రాయలవారి దర్శనాన్ని కోరుతున్నాననీ, కొంచెం సిఫారసు చేయమనీ కోరాడు. తాను వ్రాసిన కావ్యాలలోని కొన్ని విశేషాంశాల్ని ఆయనకు చదివి వినిపించాడు రామకృష్ణుడు. ఆయన వాటిని మెచ్చుకుని "నీవు రాయలవారి 'భువన విజయం' లో ఉండదగిన కవివి. నేను కబురంపినప్పుడు విద్యానగరం వచ్చి కలువు. చేతనైనంత సాయం చేస్తాను" అన్నాడు. సాయం చేస్తానని నోటిమాటగా అననైతే అన్నాడు కానీ, తరువాత తన శిష్యుల ద్వారానూ

రామకృష్ణుని వలెనే విజయనగరంలోని భువనవిజయంలో ప్రవేశం కొరకు ప్రయత్నిస్తూన్న భట్టుమూర్తి అనే మరొక కవి ద్వారానూ రామకృష్ణుడు శైవుడనీ, అంచేత వీరవైష్ణవుడైన రాయలవారి సభ నలంకరించదానికి అతడు అనర్హుడనీ గ్రహించి మిన్నకున్నాడు.

ఎన్నాళ్లకూ తాతాచార్యుల వద్ద నుండి కబురు రాక, ఎదురుచూసి, ఎదురుచూసి రామకృష్ణుడు ఎట్టకేలకు తానే భార్యా పుత్ర సమేతంగా హంపికి బయల్దేరాడు. తాతాచార్యుల వారి దర్శనం కోరి, దౌవారికులు నిరోధించినా, మాయోపాయంతో ఎలాగో మందిర ప్రవేశం చేశాడు. తాతాచార్యులవారు యీయన్ని గుర్తించి అక్రమంగా మందిర ప్రవేశం చేసినందుకు ఆగ్రహోదగ్రుడై రక్షకభటులచేత బయటకు గెంటించాడు. అది మొదలు 'ఈ లింగడు నా సముఖానికి రావదానికి వీల్లేదు' అని హుకుం జారీ చేశారు తాతాచార్యులవారు. రామలింగడు రామకృష్ణుడుగా పేరు మార్చుకొనడం, తాతాచార్యుల మీది వ్యతిరేకతతో వడహల వైష్ణవ శాఖను స్వీకరించి భట్టరు చిక్కాచార్యుల వద్ద శిష్యునిగా చేరడం మన మెరిగినదే! విజయనగరంలో ఉన్నంతకాలం వైష్ణవం స్వీకరించి, రామకృష్ణునిగా పేరు మార్చుకున్నా, తెంగల వైష్ణవులు ఆయన్ని 'రామలింగడ'నే పిలుస్తూ ఆయన్ని శైవుడిగానే భావించినట్లు కనుపిస్తున్నది. తెంగల, వడహాల శాఖల వైష్ణవులు వీరిద్దరి స్పర్థలను చిలవలు పలువలు చేసి కథలుగా అల్లారు. ఈ కథలలో కొన్ని అసభ్యంగా వుండి మహా పండితుడూ, ఉదారస్వభావి, సంఘ సేవకుడూ అయిన తాతాచార్యుల ప్రతిష్ఠకూ, తెనాలి రామకృష్ణుని ఖ్యాతికీ మచ్చ తెచ్చేవిగా వున్నాయి. వీటిలో కొన్ని వాస్తవాలూ అయి వుండవచ్చు. ఈ రెండు వైష్ణవ శాఖల అనుయాయులూ తమ పాక్షిక మత ప్రయోజనాన్ని ఆశించి కల్పిత కథల్ని కొన్నింటిని వీటికి జోడించి వుంటారు. వీరిద్దరి స్పర్థకు సంబంధించి ప్రసిద్ధమైన ఒక కథను మనమిప్పుడు చూద్దాం.

రాయలవారి వద్దనూ, విజయనగరం పౌరులలోనూ రామకృష్ణుడికి రోజు రోజుకూ పెరిగిపోతున్న పేరు ప్రఖ్యాతుల పట్ల రాజగురువు తాతాచార్యుల వారికి యీర్ష్యగా వుండేది. దానికితోడు రాయలవారు రామకృష్ణునికి తరచుగా యిచ్చే విలువైన కానుకలు తాతాచార్యుల వారికి మరింత కంటకింపయ్యాయి. అంచేత ఏదో విధంగా రాయలవారి దృష్టిలో రామకృష్ణుడిని కించపరచాలనే పట్టుదల ఆయనలో రోజురోజుకూ పెరగసాగింది.

ప్రతిరోజూ వేకువ జామునే రాజగురువుకు తుంగభద్రానదిలో స్నానం చేయడం అలవాటు. అలాగే ఓ రోజు తుంగభద్రానదీ తీరంలోనున్న ఒక పొదపై తన విడిచిన వస్త్రాలు, తుండు వగైరాలు వేసి స్నానానికి నదిలోకి దిగాడు రాజగురువు.

సరిగ్గా అదే సమయానికి రామకృష్ణుడు అటుగా వెళ్లడం తటస్థించింది. తాతాచార్యులవారు నీళ్లలోకి దిగడం అతడు గమనించాడు. పొద మీద వున్న ఆయన బట్టల్నీ అతడు చూశాడు. వెంటనే అతడి మనస్సులో ఓ ఆలోచన తళుక్కుమని మెరిసింది. తన బట్టలు అవి వేసిన చోట ఉండకపోవడం గమనిస్తే రాజగురువు ఎంత కంగారు పడతాడో మనస్సులో ఊహించుకుంటేనే రామకృష్ణుడికి నవ్వొచ్చింది. తాతాచార్యులవారి మీద పగ తీర్చుకొనదానికి తనకిదే సరైన అదనని రామకృష్ణుడు భావించాడు. వెంటనే ఆ పొదమీది బట్టల్ని తెలివిగా తస్కరించి వేరొక పొదమాటున నక్కాడు రామకృష్ణుడు. రాజగురువు నీటిలో చాలసేపు జలకాలాడాడు. తృప్తిగా జలకమాడిన అనంతరం నది ఒడ్డుకు వచ్చిన తాతాచార్యులవారు అక్కడి పొదపై తన బట్టలు కనుపించకపోవడంతో హతాశుడై లబోదిబోమన్నారు. కనుచూపు మేరలో నరసంచారమే లేదు – పోనీ సహాయానికై కేకలు పెడదామంటే.

తాతాచార్యులవారి యీ అవస్థ చూసి తానున్న పొద వెనుకనుండే రామకృష్ణుడు పెద్దగా పకపకా నవ్వాడు. "ఏం రాజగురువు గారూ! మీ బట్టల కోసం వెతుక్కుంటున్నారా? అవి నా దగ్గర భద్రంగా వున్నాయిలే. కంగారేమీ పడొద్దు"

అన్నాడు రామకృష్ణుడు.

దీంతో తాతాచార్యుల వారికి మతిపోయినంత పనైంది. అతడు దీనంగా, బలహీనమైన స్వరంతో రామకృష్ణుడిని ప్రాధేయపడుతూ "ఒరేయ్ అబ్బీ! నా బట్టల్ని నాకు యిచ్చెయ్యరా. ఇప్పటి దాకా నీళ్లలో నానాను. తడి తుడుచుకోకపోతే జలుబు చేస్తుంది. కేవలం గోచీతో రాచవీధిలోనున్న మా మందిరానికి పోవడం నా వల్ల అయ్యేపనేనా? ఇప్పుడిప్పుడే తెల్లవారుతూ జనం వీధుల్లోకొస్తున్నారు కూడా. మా బాబువిగా. దయచేసి నా బట్టలు నాకిచ్చెయ్యి" అన్నాడు. అప్పుడు రామకృష్ణుడు తాపీగా, "రాజ గురువు గారూ! మీ బట్టలు మీకు యిచ్చెయ్యాలంటే ముందుగా మీరు నాకొక వాగ్దానం చేయాలి. చేస్తారా?" అని అడిగాడు. దీనికి తాతాచార్యులవారు అసహనంగా, "అబ్బ! చంపకురా. నీవు చెప్పినట్లే చేస్తాను. ఆ వాగ్దానమేమిటో త్వరగా చెప్పు" అన్నారు. అప్పుడు రామకృష్ణుడు, "ఆఁ! అలా రండి దారికి. మీ బట్టల్ని మీకు యివ్వాలంటే యిక్కడి నుంచి మీ మందిరం వరకు యిప్పుడు మీ భుజాలపై నన్నెక్కించుకుని తీసుకెళతానని వాగ్దానం చేయాలి. తెలిసిందా? అప్పుడే నేను మీ బట్టల్ని తిరిగి యిస్తాను" అన్నాడు. తాతాచార్యులవారు తమ చెవుల్ని తామే నమ్మలేక పోయారు. ఏమిటి రామకృష్ణుడి యీ వింత కోరిక? ఇది సాధ్యపడేదేనా? అనుకుని రామకృష్ణునితో "అబ్బీ! నీ కోరిక సాధ్యపడేది కాదు. రాచవీధిలో నిన్ను బుజాలపై ఎక్కించుకుని మోస్తూ నా మందిరానికెళితే మా పరువేం కాను? మేమెవరో తెలిసే మాట్లాడుతున్నావా?" అని అప్పటికే సగం చచ్చిన రాజగురువు లేని హుందాతనాన్ని తెచ్చి పెట్టుకుంటూ అన్నాడు. దానికి రామకృష్ణుడు, "సరే మీ యిష్టం. మీ మందిరానికి రాచబాటలో గోచీతో వెళ్లడం మీకు పరువు తక్కువో, బట్టలు వేసుకుని నన్ను మోసుకుంటూ వెళ్లడం పరువు తక్కువో ఆలోచించుకుని నిర్ణయించుకోండి. ఎలాగైనా నాకభ్యంతరం లేదు" అన్నాడు.

కేవలం గోచీతో రాచవీధిలో నడుస్తూ వెళ్లేకంటే బట్టలు వేసుకుని రామకృష్ణుడిని బుజాలపై మోసుకుంటూ వెళ్లడమే మెరుగని భావించాడు రాజగురువు. అప్పుడైతే నడవలేని స్థితిలో ఉన్న రామకృష్ణునికి సాయపడదానికి అన్యమత శాఖకు చెందిన వాడని వివక్ష చూపించకుండా తన బుజాలపై మోస్తూ సేవ చేస్తున్నాడని జనం భావిస్తారు గానీ, అన్యథా భావించే అవకాశం లేదు' అనుకున్నాడు రాజగురువు తన మనస్సులో. అందుకని వెంటనే ఆయన రామకృష్ణుని నిబంధనకు అంగీకరించాడు.

రామకృష్ణుడు యిచ్చిన తుండుతో ఒళ్లు తుడుచుకుని, బట్టలు వేసుకుని అతడిని తన బుజాలపై మోసుకుంటూ రాచవీధిన మెల్లగా నడుచుకుంటూ వెళ్తున్నాడు రాజగురువు.

తన రాజమందిరం యొక్క పై అంతస్థులో ఉదయం వాహ్యాళి చేస్తూన్న రాయలవారి కంటబడిందీ దృశ్యం. రాయలవారు ఆ మసక వెలుతురులో అంతదూరం నుంచీ కూడా రాజగురువును వెంటనే గుర్తించారు కానీ ఆయన బుజాలపై స్వారీ చేస్తున్న వాడెవడో గుర్తించలేకపోయారు. ఒక్కసారి తోక త్రొక్కిన త్రాచులా అయి రాలయవారు తన భటులతో వివరాలేమీ చెప్పకుండా, "మీరు హుటాహుటిన వెళ్లి రాచబాటలో సాటిమనిషిపై స్వారీచేస్తున్న ముష్కరుడిని తన్నుకుంటూ నా దగ్గరకు యీడ్చుకురండి. పొండి" అని ఆజ్ఞాపించారు.

తాతాచార్యుల వారి బుజాలపై నుంచి యిదంతా గమనించిన రామకృష్ణుడు ఏదో కీడు శంకించి, వెంటనే తాతాచార్యుల వారితో "గురువర్యా! ఇప్పటి వరకూ నేను మీ బుజాలపై నెక్కి పెద్ద అపరాధమే చేశాను. ఏదో పాత కక్ష నన్నిలాంటి పాడు పనికి పురికొల్పింది. ఏమైనాసరే నేనీ పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకు తీరాలి. మిమ్మల్ని మీ మందిరం వరకూ మోసి నా పాప ప్రక్షాళన చేసుకుంటాను" అంటూ ఆయన బుజాల మీది నుంచి తాను దిగి, తన బుజాలపై

తాతాచార్యుల వారిని మోసుకుంటూ వెళ్లసాగాడు. తాతాచార్యుల వారిది భారీ శరీరం. మోయడం కష్టమే. అయినా కొద్ది దూరమే కదా! ఈలోపే రాయలవారు పంపిన భటులు వచ్చెయ్యవచ్చు - అనుకుంటూ బుజాలపై రాజగురువును మోస్తూ భారంగా అడుగులేస్తున్నాడు రామకృష్ణుడు.

కొద్దిదూరం వెళ్లగానే వెనుక నుండి వచ్చిన రాజభటులు ముందూ వెనకా చూడకుండా రాయలవారు ఆదేశించినట్లు సాటిమనిషిపై స్వారీ చేస్తున్న తాతాచార్యులను పడద్రోసి తన్నుకుంటూ రాయలవారి సమక్షానికి యీడ్చుకొచ్చారు. ఆ మసక చీకటిలో తాము తన్నుకుంటూ రాజ సముఖానికి తెస్తున్నది సాక్షాత్తూ రాజగురువునేనని వారు గమనించలేదు. రాజగురువు కూడా మౌనంగా దెబ్బల్ని సహిస్తూ పరువు పోతుందనే భయంతో బిక్కుబిక్కు మంటూ భటులవెంట నడిచాడు.

తాతాచార్యులవారిని చూడగానే రాయలవారికి భటులపై మండుకొచ్చింది. "తెలివి తక్కువ దద్దమ్మల్లారా! నేను తీసుకురమ్మన్నది మోస్తున్న వ్యక్తిని కాదు. సాటి మనిషిపై స్వారీ చేస్తున్న వాడిని. వాడిని విడిచి రాజగురువును తన్నుకుంటూ పట్టుకొచ్చారా మీరు?" అంటూ జరిగిన దానికి భటుల తరపున తాను క్షమాపణలు వేడుకుని, "మీ బుజాలపై ఎక్కి దర్జాగా స్వారీ చేస్తున్న ఆ ముష్కరుడెవరు? భటులు వచ్చేసరికి మీరు వాడి బుజాలపైకి ఎలా మారారు? అంతా వింతగా వుందే! జరిగిందేమిటో వివరంగా చెప్పండి" అన్నారు.

రాజగురువు నది ఒడ్డున జరిగినదేదీ చెప్పకుండా, "ఆ యువకుడు నది ఒడ్డున నాకు తటస్థపడ్డాడు. అతడి పేరు తెనాలి రామకృష్ణుడు. నడవలేను; కాళ్లు నొప్పులుగా వున్నాయన్నాడని నేను మానవతా దృక్పథంతో యిక్కడి దాకా మోసుకొచ్చాను. రాజభవనం సమీపించగానే, మరి ఏం ఆలోచించాడో ఏమో! నన్ను తన బుజాల మీద మోయడానికి సిద్ధపడ్డాడతడు" అన్నాడు రాజగురువు. రాజగురువు నీవిధంగా మోసం చేసిన రామకృష్ణుని తెలివి తేటలకు రాయలవారు ఆశ్చర్యపడినా, రాజగురువును యింతగా అవమానించినందుకు కోపగించుకున్నారు. రామకృష్ణునిపై ఆ కోపం ఎంతో కాలానికి గాని తగ్గలేదు రాయలవారికి.

రామకృష్ణుడు కవి అనీ, మత వివక్షతో తాను అతడు కోరినట్లు రాజదర్శనమిప్పించడానికి తిరస్కరించాననీ చెపితే రాయలవారికి తన మీద కోపం రావచ్చు. ఎందుకంటే యీ మత విద్వేష భావం రాయలవారిలో ఏ కోశానా లేదు. ఆయన వీర వైష్ణవుడే అయినా స్మార్తులూ, ధూర్జటి మహాకవి వంటి శైవులూ అప్పటికే ఆయన ఆస్థానంలో పరిపోషణ పొందుతున్నారు. అందుచేత రామకృష్ణుడి పూర్వాపరాలుగానీ, అతడికీ తనకూ వైరానికి గల కారణాలను గానీ రాయలవారితో చెప్పకుండా గోప్యంగానే వుంచారు తాతాచార్యుల వారు.

అరచేతిని అడ్డుపెట్టి సూర్య కాంతిని ఆపడం ఎలా సాధ్యం కాదో, అలాగే విద్వన్మణియైన రామకృష్ణుడి ప్రతిభాపాటవాలను తొక్కిపట్టి ఉంచడం ఎవరి వల్ల అవుతుంది? అవి అనతి కాలంలోనే వెలుగులోకొచ్చి, రామకృష్ణుడు రాయల వారి దృష్టినాకర్షించి, ఆయనకు సభాప్రవేశము లభించింది. కొద్ది కాలంలోనే అష్టదిగ్గజాలలో ఒకడిగా ఆయనకు అఖండ ఖ్యాతీ లభించింది.

## 9. నాగులాంబిక ఆఖరి కోరిక

శ్రీ కృష్ణదేవరాయల తండ్రి తుళువ నరసనాయకునికి ముగ్గురు భార్యలు. వీరిలో పెద్ద భార్య తిప్పాంబికకు వీరనరసింహ రాయలు జన్మించాడు. తన తండ్రి అనంతరం యీయన రాజ్యమేలాడు. రెండవ భార్య నాగులాంబిక. ఈమె గండికోట ప్రభువులైన పెమ్మసాని వారి ఆడబడుచు. ఈమెకు పుట్టినవాడే శ్రీకృష్ణ దేవరాయలు. క్రీ।శ। 1509వ

సంవత్సరంలో వీర నరసింహరాయలు మరణించగా సింహాసన మధిష్టించిన శ్రీ కృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్య వైభవ, ప్రాభవాలను దింగతాలకు వ్యాప్తి చేసి క్రీ॥శ॥ 1530లో మరణించాడు. నరసనాయకుని మూడవ భార్య ఓబాంబిక. ఆమె కుమారులే అచ్యుతరాయలు, రంగరాజు. శ్రీ కృష్ణదేవరాయల అనంతరం అచ్యుతరాయలు క్రీ।శ।1530 నుండి క్రీ శ 1542 వరకు అతి వైభవంగా విజయనగర సామ్రాజ్యాన్ని పాలించాడు. శ్రీకృష్ణదేవరాయలకు తన తల్లి నాగులాంబిక అంటే అపరిమితమైన ప్రేమానురాగాలు. అందుకే ఆమె పేరిట 'నాగులాపురము' అనే పట్టణాలను మూడింటిని నిర్మించాడు. కర్ణాటకలోని హంపికి సమీపంలోనూ, చిత్తూరు జిల్లాలో ఒకటీ, అనంతపురం జిల్లాలో మరొకటీ 'నాగులాపురాల'ను మనం నేటికీ చూడవచ్చు. హంపి సమీపంలోని నాగులాపురాన్ని నేడు 'నాగెనహళ్లి' అంటున్నారు. తన తల్లి స్మృతి చిహ్నంగా కృష్ణదేవరాయలు యీ పట్టణాన్ని క్రీ శ॥ 1516లో నిర్మించాడట.

శ్రీ కృష్ణదేవరాయలు తన తల్లిని ఎంతగానో ప్రేమించేవాడు. ఆమె బ్రతికినన్నాళ్లూ ఆమె మాటే ఆయనకు శాసనం. ఏ ముఖ్యమైన పనినీ తల్లిని సంప్రతించకుండా చేసే అలవాటు ఆయనకు లేదు. ప్రతిరోజూ ఆమెకు రాయలవారు శిరస్సు వంచి పాదాభివందనం చేసి ఆమె ఆశీర్వాదం పొందేవారని చరిత్రకారులు పేర్కొంటున్నారు.

నాగులాంబికకు మామిడి పళ్లంటే మహా చెడ్డ యిష్టం. ఆమెకు అంతిమ ఘడియలు సమీపించినప్పుడు మరణశయ్యపై నున్న ఆమెకు ఎందుకోగానీ మామిడి పళ్లు తినాలనే కోరిక కలిగిందట. రాయలవారు వెంటనే భటుల్ని అన్ని పక్కలకూ పంపారు. అయితే అది మామిడి పండ్లు లభించే కాలం కాకపోవడాన భటులు వెదకి వెదకి పునాస మామిడి పండ్లు తీసుకొచ్చినప్పటికీ సమయం మించి పోయింది. ఆ మామిడిపండ్లు తినకుండానే ఆమె మరణించింది.

సాధారణంగా మామిడి పండ్లు లభించే కాలంలో కాక మిగిలిన కాలాల్లో దొరికే మామిడి పండ్లను పునాస మామిడి పండ్లంటారు. వాస్తవానికి పునాస కారు అంటే రేవతి, అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి కార్తెలు కల ఎండ కారు. ఏప్రిల్, మే నెలలు. అప్పుడే మామిడి పండ్లు లభిస్తాయి. అయితే మే నుండి ఆగష్టు నెల వరకు కూడా కొన్ని రకాల మామిడి పండ్లు లభిస్తాయి. వీటినే మనం పునాస మామిడి పండ్లు అంటాం. ఆ కాలంలో చేసే మూడవ వరిసాగు *(paddy third crop)* ను కూడా మనం పునాస పంట అంటాం. ఒకప్పుడు శ్రావణమాసం, ఆగష్టు నెల వరకు మాత్రమే లభించే పునాస మామిడి కాయలు – ఆధునిక శాస్త్ర పరిశోధనల పుణ్యమా అని ఇప్పుడు దాదాపు ఏడాది పొడవునా లభిస్తున్నాయి.

మరణ శయ్యపైనున్న తన తల్లి చివరి కోరికను తీర్చలేక పోయినందుకు రాయలవారికి ఎంతో బాధ కలిగింది. ఆమె చివరి క్షణాలలో తీరని కోరికతో అశాంతితో మరణించినందుకు రాయలవారెంతో కలత చెందారు. కలత చెందిన రాయలను ఊరడించిన రాజగురువు తాతాచార్యుల వారు ఆయనతో "రాయా! ఇప్పుడు విచారించి ప్రయోజనమేముంది. ఆమె మామిడిపండ్లు తినాలనే కోరికతో మరణించింది కదా! కనుక ఆమె ఆత్మకు శాంతి కలగాలంటే ఒక మార్గం వుంది. 108 బంగారు మామిడిపండ్లు చేయించి కర్మ రోజున 108 మంది బ్రాహ్మణులకు 108 వెండిపళ్ళెములలో పెట్టి యిస్తే ఆమె ఆత్మ శాంతిస్తుంది. బ్రాహ్మణులకు యిలా హిరణ్యదానం చేయడం వల్ల పరలోకంలో నున్న నీ తల్లి నాగులాంబిక ఆత్మ సంతృప్తి చెందుతుంది" అని సలహా యిచ్చాడు. అప్పట్లో రాజగురువు తాతాచార్యులవారి మాటంటే రాయలవారికి వేదవాక్కే కదా! అంచేత కొందరు స్వార్థపరులైన బ్రాహ్మణులు యిదే అవకాశంగా తీసుకుని తాతాచార్యుల వారి నేతృత్వంలో తమ స్వార్థ ప్రయోజనాల నిమిత్తం యిటువంటి సలహాలు యిస్తూ రాయలవారి మత విశ్వాసాలను తమ ప్రయోజనాలకు అనువుగా మలచుకునేవారు. గురువు సలహా యిచ్చిందే తడవుగా రాయలవారు కర్మరోజున 108 మంది బ్రాహ్మణులను పిలిచి వారికిచ్చే సంభావనలతో బాటు ఒక్కొక్కరికి ఒక్కొక్క బంగారు మామిడి పండు చొప్పున 108 వెండి పళ్లెములలో

పెట్టి తాతాచార్యులవారి సలహాపైన బహూకరించారు. తాను కాక మిగిలిన 107 మంది జాబితాను కూడా తాతాచార్యుల వారే తయారు చేసి రాయలవారికిచ్చారు. కర్మ రోజునే కాక ప్రతి సంవత్సరం చేసే సంవత్సరీకం (దీనినే ఆబ్దికము లేక ఏడుడి (ఏడు + ఉడి) అని కూడా అంటారు) నాడు కూడా యిలాగే 108 మంది బ్రాహ్మణులకు బంగారు మామిడి పండ్లు పంచడం రాయలవారికి ఆనవాయితీగా మారింది. దీంతో తాతాచార్యులవారి శిష్య బృందమైన బ్రాహ్మణుల పంట పండింది. వారు అనతికాలంలోనే అతి భాగ్యవంతులయ్యారు. రాయలవారి ఖజానా మాత్రం దాదాపు వట్టి పోయే స్థితికి చేరింది. 'సామ్రాజ్యం యొక్క ఆర్థిక స్థితిని చక్కదిద్దడానికి ఏం చేయాలా' అని మహామంత్రి తిమ్మరుసు వగైరాలు దీర్ఘంగా ఆలోచించారు రాజ్యంలో తాతాచార్యుల మాటకూ, రాయల వేటుకూ తిరుగులేని ఆ కాలంలో ఈ దుర్వ్యయం మాన్పడానికి ఏం చేయాలో – రాయలవారికి ఎలా నచ్చజెప్పాలో తెలియక మంత్రులంతా సతమతమయ్యారు.

తెనాలి రామకృష్ణుడికీ తిమ్మరుసు మంత్రికీ సత్సంబంధాలుండేవి. తిమ్మరుసు మేనల్లుడైన కొండవీటి దుర్గాధ్యక్షుడు నాదెండ్ల గోపమంత్రి సిఫారసుతోనే రామకృష్ణుడు హంపి వచ్చి తిమ్మరుసును కలిసి పరిచయం ఏర్పరచుకున్నాడు. అదీకాక రామకృష్ణుని తండ్రి గార్లపాటి రామన్న మంత్రికీ, తిమ్మరుసుకూ కూడా పూర్వకాలంలో కొంత పరిచయముంది. దీన్ని ఆసరాగా తీసుకుని రామకృష్ణుడు హంపికి వచ్చింది మొదలు మహామంత్రి తిమ్మరుసుతో సత్సంబంధాలు కలిగి వుండేవాడు. రాజ్యక్షేమం, రాయలక్షేమం వీరిరువురి ఉమ్మడి లక్ష్యాలు. ఆ ఉమ్మడి లక్ష్యసాధనకోసం వీరిరువురూ ఎన్నోసార్లు పరస్పరం సంప్రతించుకొని సహకరించుకున్నట్లు తెలుస్తున్నది. ఏటా నాగులాంబికా దేవి సంవత్సరీకం రోజున బ్రాహ్మణులకు బంగారు మామిడి పండ్లు దానం యివ్వడం అనే దుర్వ్యయం కారణంగా ఖజానా వట్టిపోవడాన్ని అరికట్టి రాజ్య ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దాలని సమకట్టిన మంత్రి తిమ్మరుసు రాయలవారి మనస్సు నొచ్చుకొనకుండా యీ కార్యం ఎలా సాధించాలో యుక్తిగా సూచించమని తెనాలి రామకృష్ణుడిని కోరాడు. తెనాలి రామకృష్ణుడు దీనికొక చక్కని పథకం రచించాడు.

ఆ పథకం ప్రకారం రామకృష్ణుడు తాతాచార్యుల వద్దకు వెళ్ళి తాను కూడా తన తల్లి సంవత్సరీకం కూడా తాను ఘనంగా నిర్వహించనున్నాననీ, దానికి కూడా రాజ్యంలో ప్రముఖులైన 108 మంది బ్రాహ్మణుల్ని ఆహ్వానించ దలచాననీ, ఆ సందర్భంగా రాయలవారిలా బంగారు మామిడి పండ్లు కాకున్నా ఏదో తనకు కలిగినంతలో ఘనంగానే వారికి ముట్టజెబుతాననీ, కనుక అందరూ ఆ రోజుకు తన యింటికి రావాలనీ నమ్మబలికాడు. రాయలవారి వద్ద తరచు ఘనమైన కానుకలు అందుకుంటున్న రామకృష్ణుడు ఆ రోజున 108 మంది బ్రాహ్మణులకూ సంభావనలు ఘనంగానే ముట్టచెబుతాడని ఆశించారు తాతాచార్యులవారు. తన వారినందరినీ వెంటబెట్టుకుని రామకృష్ణుడు తెలిపిన సమయానికి ఆయనింటికి వెళ్ళాడు ఆయన.

వీరంతా వెళ్ళేసరికి రామకృష్ణుడు లోపలి గదిలో ఏదో ముఖ్యమైన పనిలో వున్నాడు. ఎంతకూ బయటికి రాడు. ఈ తాత్సారం చూసిచూసి ఆ 108 మంది బ్రాహ్మణులకూ సహనం నశించింది. రామకృష్ణుడిని వారు లోపలేం చేస్తున్నావని ప్రశ్నించారు. దానికాయన, "మీకిచ్చే సంభావనలతో బాటు నా తల్లి ఆఖరి కోర్కె తాలూకు బహుమతిని కూడా యివ్వడానికి ఏర్పాట్లు చేస్తున్నాను. మీ పని మీదే వున్నాను. కొంచెం ఓపిక పట్టండి" అన్నాడు. కాసేపటి తరువాత లోపలి నుంచి బాగా ఎర్రగా కాలిన ఇనుపకడ్డీలు పట్టుకు వచ్చిన రామకృష్ణుడు వారితో "ముందుగా నా తల్లి ఆఖరు కోరికగా ఒక్కొక్కరు రెండు వాతలు వేయించుకోండి. ఆ తరువాత నేనిచ్చే భోజనతాంబూలాదులు, సంభావనలూ స్వీకరిద్దురు గాని" అన్నాడు. దానికి వారు, "నీకు మతిగాని పోలేదు గద! సంవత్సరీకం భోజనానికని పిలిచి, సంభావనలతోపాటు విలువైన కానుకలు ముట్టజెపుతాను రమ్మని తీరా వాతలు పెట్టాలని చూస్తావా? నీ వ్యవహారం రాయలవారికి ఫిర్యాదు చేస్తాం. అప్పుడు నీ

గతేమవుతుందో చూసుకో" అని బెదిరిస్తూ తాతాచార్యులు వగైరా బ్రాహ్మణ సంఘీయులు పరుగు పరుగున అక్కడి నుంచి నిష్క్రమించారు. ఒక స్థూలకాయుడు మాత్రం అక్కడ జరిగిన తొక్కిసలాటలో బయట పడలేక రామకృష్ణుడికి చిక్కి అతని చేత రెండు వాతలు వేయించుకున్నాడు. తాతాచార్యులు మొదలైన వారు ఆ వాతలు వేయించుకున్న స్థూలకాయుడిని సాక్ష్యంగా వెంటబెట్టుకుని రాయలవారి వద్దకు వెళ్లి జరిగింది యావత్తూ ఫిర్యాదు చేసి విచారించి రామకృష్ణునిపై తగు చర్య తీసుకొనమని కోరారు.

రాయలవారు వెంటనే రామకృష్ణుడిని విచారణకు పిలిపించారు. "నీకు మతి చలించినట్లుంది. బ్రాహ్మణుల పట్ల నీవు చేసిన యీ ఘోరమైన అపచారానికి నీకు కఠినాతి కఠినమైన శిక్షే లభిస్తుంది. అయినా శిక్షించబోయే ముందు నేరస్థుడు చెప్పేది వినడం మా ఆనవాయితీ. ఈ విషయమై నీవు చెప్పదలచుకున్నదేమైనా వుందా?" అన్నారు రాయలవారు గద్దిస్తూ

రామకృష్ణుడు తాపీగా, "మహారాజా! కొడుకుగా మీ తల్లిగారి ఆఖరి కోర్కె తీర్చి ఆమె ఆత్మకు శాంతి కలిగించడం మీ బాధ్యతగా భావించారు కనుక మీరు ఏటా ఆవిడ సంవత్సరీకంనాడు 108 మంది బ్రాహ్మణులకు 108 బంగారు మామిడి పండ్లను, 108 వెండి పళ్లెములలో పెట్టి సంభావనగా యిస్తున్నారు. మీ తల్లిగారు తన ఆఖరి కోరికగా మామిడి పండ్లను తినాలని కోరారు కనుకనే తమరలా చేస్తున్నారు. మరి నా తల్లిగారి ఆఖరి కోరిక ఏమిటో వినండి. ఆమె చివరి దినాల్లో వాతరోగం కారణంగా ఆమె చేతులు విపరీతంగా నొప్పులు పుట్టేవి. చనిపోతూ ఆమె నన్ను చేతులపై కాల్చిన కడ్డీతో వాతలు పెట్టి ఆ వాత రోగాన్నుంచీ, ఆ వాత నొప్పుల నుంచీ తనకు విముక్తి కలిగించమని కోరింది. కానీ, అంతటి వృద్ధురాలికి చూస్తూ చూస్తూ నేను వాతలు వేయలేక పోయాను. ఆమె ఆ కోరిక తీరకుండానే మరణించింది. కనుక, కొడుకుగా ఆమె తుది కోర్కెను తీర్చి ఆమెకు ఆత్మశాంతి కలిగించడం నా బాధ్యత కాదా? చూడండి. ఈ 108 మంది బ్రాహ్మణులు ఒక ప్రక్క తమరి తల్లిగారి ఆత్మశాంతికి తమరు ఏటా వెండి పళ్లాలలో పెట్టి యిచ్చే బంగారు మామిడి పండ్లు ఎంచక్కా స్వీకరిస్తున్నారు. నా తల్లి ఆత్మ శాంతికి ఆమె సంవత్సరీకం రోజున నేనిచ్చే సంభావనలతో పాటు ఆమె ఆఖరి కోరికగా కోరిన వాతలు మాత్రం వీరికి అక్కరలేదట. ఇదెక్కడి న్యాయం? పైపెచ్చు వీరంతా నాకు పిచ్చెక్కిందని ప్రచారం చేస్తూ చనిపోయిన నా తల్లి ఆఖరు కోరిక తమ 108 మందికీ వాతలు వేస్తే ఎలా తీరుతుందని ప్రశ్నిస్తున్నారు. మరైతే చనిపోయిన తమరి తల్లి గారి ఆఖరు కోరిక యీ 108 మంది బ్రాహ్మణులకూ బంగారు మామిడి పండ్లు దానం చేస్తే తీరుతుందనడం విడ్డూరంగా లేదూ? కాల్చిన ఇనుపకడ్డీలతో కాకపోతే వీరందరికీ కాల్చిన బంగారు కడ్డీలతో వాతలు వేయించండి మహారాజా! లేకపోతే ఏటా 108 బంగారు మామిడి పండ్లు బ్రాహ్మణులకు పంచితే తమరి తల్లిగారికి ఆత్మశాంతి కలుగుతుందని చెప్పడం తప్పని వాళ్లను ఒప్పుకోమనండి. అది నిజమైతే యిదీ నిజం కావాలి. అది అబద్ధమైతే యిదీ అబద్ధమే అవుతుంది" అన్నాడు.

రాయలవారికి రామకృష్ణుని వాదనలో ఏదో బలం కనుపించింది. ఆయన సాలోచనగా తలపంకిస్తూ బ్రాహ్మణ బృందం వైపుకు తిరిగి తన చూపులతోనే వారిని యీ విషయమై సంజాయిషీ కోరారు. పరిస్థితి చెయ్యిదాటి పోకముందే తప్పును ఒప్పేసుకుంటే శిక్ష తప్పుతుందని భావించిన తాతాచార్యులు వగైరాలు తమ స్వార్థ ప్రయోజనం కోసమే బంగారు మామిడి పండ్లు పంచే పథకాన్ని రాయలవారికి సూచించినట్లు అంగీకరించి, తమకు అప్పటి వరకూ రాయలవారు యిచ్చిన బంగారు మామిడి పండ్లన్నీ తిరిగి తెచ్చి యిచ్చివేశారు. తాను ఒకసారి యిచ్చిన దానాన్ని తిరిగి వెనక్కు తీసుకొనడం యిష్టం లేని రాయలవారు ఆ బంగారాన్ని రాజ్యంలో కరవు నెదుర్కొంటున్న ప్రాంతాలలో సహాయ కార్యక్రమాలకు

వినియోగించమని తిమ్మరుసు మంత్రిని ఆదేశించారు. ఇలా జటిలమైన సమస్యను తన సమయోచిత ప్రజ్ఞతో చిటికెలో పరిష్కరించిన రామకృష్ణుడు అన్ని వర్గాల ప్రజల ఆదరణను చూరగొన్నాడు. తన సలహా మేరకే రామకృష్ణుడు యీ నాటకం ఆడినట్లు తిమ్మరుసు రాయలవారికి తెలిపాడు. ఈ ఘటనతో రాయలవారి హృదయంలో రామకృష్ణుని స్థానం మరింత పదిలమయింది. తన మనస్సు నొచ్చుకోని రీతిలో యీ దుర్వ్యయాన్ని అరికట్టి తన కళ్లు తెరిపించడానికి రామకృష్ణుడు చేసిన ప్రయత్నానికి రాయలవారెంతో ముగ్ధులయ్యారు.

## 10. రాజభటుల అవినీతి

ఒకప్పుడు విద్యానగరానికి కళింగ దేశాన్నుంచి ఓ నాట్య బృందం వచ్చింది. వారు రాజ్యమంతటా అనేక ప్రదర్శనలు యిచ్చి ప్రజలను చక్కగా రంజింప జేశారు. రాయలవారు వారిని రాజమందిరానికి ఆహ్వానించి వారిచే ప్రత్యేక ప్రదర్శనను ఏర్పాటు చేయించారు. ఆ ప్రత్యేక ప్రదర్శనకు కొద్ది మంది మంత్రులు, ఉన్నతోద్యోగులకు మాత్రమే ఆహ్వానాలు వెళ్లాయి. అప్పటికే తెనాలి రామకృష్ణుని మితిమీరిన ప్రవర్తనతో రాయలవారికి విసుగుదల జనించింది. రామకృష్ణుడు అక్కడికి వస్తే చక్కటి ఆ నాట్య కార్యక్రమం రసాభాస అవుతుందని ఎరిగిన రాయలవారు రామకృష్ణునికి ఆహ్వానం పంపలేదు. పై పెచ్చు నాట్య ప్రదర్శన ముగిసే వరకు రామకృష్ణుడిని ఎట్టి పరిస్థితులలోనూ లోనికి రానివ్వవద్దని దౌవారికులైన భటులను ఆదేశించారు రాయలవారు.

ప్రదర్శన ప్రారంభమవడానికి కొద్దిసేపటి ముందు ఎక్కడి నుంచి ఊడిపడ్డాడో మరి రామకృష్ణుడు అక్కడికి వచ్చి చేరాడు. రాజప్రాసాదం యొక్క ప్రధాన ద్వారం దగ్గర భటుడు అతడిని నిలువరించి లోపలికి ప్రవేశించడానికి వీలులేదని తెలిపాడు. "నేను రాయలవారికి అత్యంత సన్నిహిత మిత్రుడను. పైపెచ్చు ఎల్లప్పుడూ ఆయనకు వినోదాన్నివ్వడమే నా విధి. నన్ను లోపలికి వెళ్లనివ్వకపోతే ఎలా? నన్ను అడ్డగించడం ద్వారా రాయలవారు నాకిచ్చే విలువైన బహుతులను నాకు కాకుండా చేస్తున్నావు నువ్వు. అంతేకాదు వాటిలో నీకు నేనిచ్చే భాగం కూడా వృధాగా పోగొట్టుకుంటున్నావు" అన్నాడు రామకృష్ణుడు తెలివిగా. అతడి ఉద్దేశ్యం రాజభటులలో అవినీతి ఉందా లేదా అని పసిగట్టడమే. అతడి పాచిక పారింది. "రాయలోరు మీకు శానా యిలువైన కానికలిత్తారని నాకు తెలుసు. అయితే నాకు తమురు అందులో ఎంతోకొంత బాగం యిత్తానంటే కాదు. మీకిచ్చే దాంట్లో సగం యియ్యాల. అలా యిత్తానంటేనే మిమ్ముల్ని లోపలికొదులుతా!" అన్నాడా ద్వారపాలకుడు. "సరే! అలాగే యిస్తాను. రాయలవారు ఏది యిచ్చినా అందులో సగం నీకే. సరేనా!" అన్నాడు రామకృష్ణుడు.

అలా లోనికి ప్రవేశించిన రామకృష్ణుడిని ప్రదర్శన జరిగే మందిర ద్వారం వద్ద ద్వారపాలకుడు అటకాయించాడు. అతడితో కూడా రామకృష్ణుడు తెలివిగా రాయలవారిచ్చే దానిలో సగం అతడికిచ్చేటట్లు ఒప్పందం కుదుర్చుకుని ఎట్టకేలకు ప్రదర్శనా మందిరం లోనికి ప్రవేశించాడు. జయదేవుని 'గీత గోవింద' కావ్యం ఆధారంగా వ్రాయబడిన నృత్య నాటకాన్ని ప్రదర్శిస్తున్నది ఆ బృందం. రామకృష్ణుడు ఒక ప్రక్కన ఎవ్వరి దృష్టిలో పడకుండా కూర్చుని ప్రదర్శనను శ్రద్ధగా తిలకిస్తున్నాడు.

అసలే రాజ్యమంతా సంక్షుభితంగా వుంది. అంతఃకలహాలతో అట్టుడుకుతూన్న రాజ్యంలో రాయలవారి భద్రత అత్యంత ముఖ్యం. రాయలవారి రక్షణలో అత్యంత కీలకమైన పాత్ర వహించే ద్వారపాలకులే అవినీతిపరులుగా వుంటే రాయలవారికి రక్షణేది? రాయలవారికే రక్షణ లేకపోతే రాజ్యానికి మనుగడ ఏది? ఇలా ఆలోచించిన రామకృష్ణుడు వారి అవినీతిని బట్టబయలు చేయాలని ఎంచి, తాను చాటుగా ప్రదర్శన చూసి వెళ్లిపోవడం కాక, తనను అక్కడికి రాకుండా

నిరోధించమని స్పష్టమైన ఆదేశాలున్నప్పటికీ అవినీతిపరులైన భటుల కారణంగా తాను లోపలికి సులభంగా రాగలిగాననే విషయం అందరికీ తెలియజెప్పి రాజభటుల అవినీతిని రాయలవారి దృష్టికి తేవాలని నిర్ణయించుకున్నాడు.

అలా అనుకున్నదే తడవుగా ఒక కర్ర తీసుకుని నాటకంలో కృష్ణ పాత్రధారిని అదేపనిగా కొట్టడం ప్రారంభించాడు. రామకృష్ణుడు యిలా ఆహ్వానం లేకుండా మందిరంలోనికి ప్రవేశించడమే కాక, ప్రదర్శనకు భంగం కలిగిస్తూ అకారణంగా ఒక నటుడిని కొట్టడం రాయలవారికి తీవ్ర క్రోధాన్ని కలిగించింది. ఆయన ఆగ్రహంతో ఊగిపోతూ "ఈ ఉన్మాదిని లోనికెవరు రానిచ్చారు? ఇతడి బాధ్యతారహితమైన ప్రవర్తనకు యితడికి వెంటనే వంద కొరడా దెబ్బలు వేయండి" అని తన భటులను ఆదేశించారు.

అప్పుడు రామకృష్ణుడు భటులతో బిగ్గరగా "ఆగండాగండి. రాయలవారిచ్చిన ఈ శిక్షను నాతో మరో యిద్దరు పంచుకోవాలి. నన్ను లోపలికి వదిలిన ఆ ద్వార పాలకులు రాయలవారు నాకు ఏది యిచ్చినా అందులో సగం లంచంగా వారికిచ్చే షరతు మీదనే నన్ను లోనికి వదిలారు. కనుక, వారి వాటా వారికి చెందడం న్యాయం" అన్నాడు.

ఈ ఘటనతో రాయలవారికి కొంత మేరకు జ్ఞానోదయమైంది. రామకృష్ణుడు ఏ పని చేసినా అందులో ఏదో పరమార్థం, ప్రభుభక్తి, దేశభక్తి యిమిడి వుంటాయనే నమ్మకం రాయలవారికి కలిగింది. తన భటుల అవినీతిని బహిర్గతం చేసి తనకు కనువిప్పు కలుగ చేసినందుకు రాయలవారికి రామకృష్ణుడు మరింతగా ఆంతరంగికుడయ్యాడు. ఆయన రామకృష్ణుడిని ఎంతో ఘనంగా సత్కరించాడు.

## 11. మామిడి చెట్టు సాక్ష్యం

ఒకప్పుడు విజయనగర సామ్రాజ్యంలో రాజధాని హంపికి సమీపంలోని మిట్టపల్లె అనే కుగ్రామంలో ఓబయ్య అనే అమాయకుడుండేవాడు. అతడో మధ్య తరగతి రైతు. అతడికి సంతానం కానీ, వెనకా ముందూ బంధువులు కానీ ఎవ్వరూ లేరు. భార్య కూడా గతించి పోయింది. ఉన్న కొద్దిపాటి పొలం అమ్మేసి కాలినడకన తీర్థయాత్రలు చెయ్యడానికని బయల్దేరాడు ఓబయ్య. అదే గ్రామంలో లక్ష్మీపతి అనే మోతుబరి వున్నాడు. కాలినడకన దేశాటనం చేసేటప్పుడు బందిపోట్ల బెడద వుంటుంది కనుక తన దగ్గర అంత డబ్బు వుండడం శ్రేయస్కరం కాదని యోచించిన ఓబయ్య, తన దారి ఖర్చులకు సరిపడా మాత్రం వుంచుకొని మిగిలిన ఐదు వేల ఫణములను (పణము లేక ఫణము ఆనాటి నాణెము) లక్ష్మీపతికి యిచ్చి, తాను దేశాటన ముగించుకు వచ్చాక తిరిగి తీసుకుంటానన్నాడు. అయితే ఆ డబ్బు ఓబయ్య లక్ష్మీపతి యింటికి వెళ్లి యివ్వలేదు. ఊరుకు దూరంగా పడమటి పొలంలో నాటు వేయిస్తూ పొలిమేర డొంక దగ్గర వున్న మామిడి చెట్టు క్రింద కూర్చుని విశ్రాంతి తీసుకుంటుండగా లక్ష్మీపతికి ఓబయ్య ఆ డబ్బిచ్చాడు. ఇచ్చినట్లు సాక్ష్యులెవ్వరూ లేకున్నప్పటికీ సాటి మనిషి మీద నమ్మకంతో ఆ డబ్బిచ్చాడు అమాయకుడైన ఓబయ్య. అదే నమ్మకంతో ఎలాంటి నోటూ, పత్రమూ కూడా వ్రాయించుకోలేదు. ఊరంతటికీ మోతుబరి, అందరి తగవులు తీర్చే పెద్దమనిషి అయిన లక్ష్మీపతి తనకు అన్యాయం చేస్తాడని ఓబయ్య ఎలా అనుకుంటాడు మరి.

తీర్థ యాత్రలకు వెళ్లిన ఓబయ్య మరుసటేడు ఏరువాక పున్నమికి మిట్టపల్లెకు తిరిగి వచ్చాడు. వ్యవసాయ పనుల్లో గ్రామస్థులంతా హడావిడిగా వున్నారు. లక్ష్మీపతి ఊర్లోకెల్లా పెద్ద భూస్వామి అయినందున ఆయనకసలే తీరికలేదు. ఆ రోజుల్లో దేశాటనకు వెళ్లిన వాళ్లు పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయని కాశికి వెళ్లి మరణించేవారు. లేక దారిలో అనారోగ్యం పాలబడో, క్రూరమృగాల బారినపడో మరణించేవారు. క్షేమంగా తిరిగి వచ్చేవారు దాదాపు వుండేవారే కాదు. లక్ష్మీపతి

కూడా ఓబయ్య విషయంలో అదే జరుగుతుందని ఊహించాడు. అతడెటూ తిరిగి రాడు కనుక ఆ డబ్బు తనదే అవుతుందని ఆశించాడు. అందుకే ఓబయ్యను చూడగానే గతుక్కుమన్నాడు. అయితే పైకి మాత్రం బెట్టుగానే వుండి, ఓబయ్య వచ్చింది కూడా గమనించనట్లుగా పట్టీ పట్టనట్లు వుండిపోయాడు. లక్ష్మీపతిని కలిసిన ఓబయ్య ఏడాదినాడు తాను యిచ్చిన ఐదువేల ఫణాల్ని తిరిగి యివ్వమని అడిగాడు. దీంతో లక్ష్మీపతి ఉగ్రుడై 'నీకు తీర్థయాత్రలలో మతి గాని పోలేదు కదా! నువ్వు.. నాకు.. డబ్బిచ్చావా? ఒళ్లు తెలిసే మాట్లాడుతున్నావా? అయినా పేదవాడివి నీకంత డబ్బెక్కడిది? నాకు నువ్వు డబ్బు యిచ్చానని చెబుతున్నావు – మరి అందుకు సాక్ష్యులెవరన్నా వున్నారా?" అని గద్దించాడు. ఓబయ్య అమాయకంగా, "అలా అంటారేమిటి లక్ష్మీపతిగారూ! నేను పొలం అమ్మగా వచ్చిన డబ్బులో నా దారి ఖర్చులకు సరిపడా వుంచుకుని మిగిలిన ఐదువేల ఫణాల్నీ మీకే యిచ్చానుగా. తీర్థయాత్రల నుండి తిరిగి వచ్చిన తరవాత తీసుకుంటానన్నాను. సాటి మనిషన్న నమ్మకంతో సాక్ష్యులు కూడా లేకుండా ఆ డబ్బు మీకిచ్చాను. ఏ నోటూ, పత్రమూ కూడా వ్రాయించుకోలేదు. పడమటి పొలాన – సరిగ్గా ఏడాది క్రిందట – అప్పుడు మీ పొలంలో నాట్లు వేయిస్తూ పొలిమేర డొంక పక్కన గల మామిడి చెట్టు క్రింద కూర్చుని వుండగా మీకా డబ్బు యిచ్చాను. బాగా గుర్తుకు తెచ్చుకోండి" అన్నాడు.

దీంతో లక్ష్మీపతి మరింత కోపంగా "ఛ . . ఛ . . ముందు బైటికి నడు! మతిలేకుండా మాట్లాడకు. అంత డబ్బు నీ దగ్గరున్నట్లు నీ కేమైనా కలగానీ వచ్చిందా, యేం? లేకపోతే, పేదవాడివైన నీ దగ్గర అంత డబ్బుండడ మేమిటి? దాన్ని నువ్వు నాకివ్వడమేమిటి? జనం వింటే నవ్విపోతారు. వెళ్లు . . వెళ్లు . ." అని కసురుకున్నాడు.

గ్రామ పెద్దల వద్ద తనగోడు వెళ్లబోసుకొనడానికి – అందరూ ముమ్మరంగా వ్యవసాయ పనుల్లో వున్నారు ఎవ్వరూ ఓబయ్య మొర ఆలకించేటంత తీరుబాటుగా లేరు. పైపెచ్చు మోతుబరి అయిన లక్ష్మీపతి అంటే అందరికీ భయమే. తనకు యింకెవరు న్యాయం చెబుతారు? ఇక చేసేది లేక ఓబయ్య విద్యానగరానికి వెళ్లి రాయలవారికే తనకు జరిగిన అన్యాయాన్ని విన్నవించుకున్నాడు. అప్పుడు సభలో ఉన్న రామకృష్ణుడు రాయలవారి అనుమతి తీసుకుని, యీ విషయం విచారించి ఓబయ్యకు తాను న్యాయం జరిగేట్లు చూస్తానన్నాడు.

మరుసటి రోజు భటులు లక్ష్మీపతిని కూడా సభలో ప్రవేశపెట్టారు. రామకృష్ణుడు లక్ష్మీపతిని యిలా ప్రశ్నించాడు, "ఏం లక్ష్మీపతీ! నీ వితని వద్ద తీసుకున్న ఐదువేల ఫణాలు ఎందుకని తిరిగి యివ్వనన్నావు?"

"నేను తిరిగి యివ్వననడమేమిటి? మహాకవీ! అసలు నేనితని దగ్గర ఏ డబ్బూ తీసుకోలేదు. ఇతనెవరో కూడా నాకు తెలియదు. నేనసలు యింతకు ముందెప్పుడూ యితని ముఖం చూసి ఎరుగను. పోనీ నాకతను డబ్బులిచ్చినట్లు అతని దగ్గర సాక్ష్యమేమన్నా వుందేమో విచారించండి" అంటూ బుకాయించాడు లక్ష్మీపతి.

అప్పుడు రామకృష్ణుడు, "ఏం ఓబయ్యా! ఆ పెద్దమనిషి చెప్పే మాటలు వినబడుతున్నాయా? నీ వాయనకు డబ్బులిచ్చినట్లు నీ వద్ద యేమైనా సాక్ష్యం వున్నదా?" అని అడిగాడు.

"అయ్యా! ఇందుకు నా వద్ద సాక్ష్యులెవరూ లేరు. నిజంగా నే నాయనకు మామిడి చెట్టు క్రిందనే ఆ డబ్బు యిచ్చాను" అన్నాడు ఓబయ్య ఉద్రేకంగా.

అప్పుడు రామకృష్ణుడు నవ్వుతూ "ఓహో! అలాగైతే మామిడి చెట్టే సాక్ష్యమన్నమాట. పోనీ నీవెళ్లి ఆ మామిడి చెట్టునే సాక్ష్యం చెప్పటానికి రమ్మని రాజాజ్ఞ అయిందని చెప్పరాదూ! అది రాజాజ్ఞను తిరస్కరించలేదు కదా! వచ్చి సాక్ష్యం చెపుతుంది. నీ సమస్య పరిష్కారమవుతుంది" అన్నాడు.

ఓబయ్య అమాయకుడే కానీ, పిచ్చివాడు కాదు.

అతడు బిగ్గరగా నవ్వుతూ "చెట్టు వచ్చి ఎలా సాక్ష్యం చెపుతుంది అయ్యవారూ! ఇదెలా సాధ్యం?" అన్నాడు.

దానికి రామకృష్ణుడు, "ఏం మాట్లాడుతున్నావు నువ్వు? చెట్లేమిటి? ప్రాణంలేని వస్తువులతో కూడా నేను మాట్లాడించగలను. నా వద్ద అలాంటి అద్భుత శక్తులున్నాయి. నువ్వు ముందు వెళ్లి ఆ మామిడి చెట్టును రమ్మని రాజాజ్ఞ అయిందని చెప్పు" అన్నాడు కరుకుగా.

ఓబయ్య సరేనని తలూపి అక్కడి నుండి బయలు దేరాడు.

ఒక గంట గడిచింది.

రామకృష్ణుడు లక్ష్మీపతికేసి తిరిగి "ఎందుకీ ఓబయ్య యింకా రాలేదు? ఈ జాప్యానికి కారణమేమై వుంటుంది?" అన్నాడు.

లక్ష్మీపతి అనాలోచితంగా, "అయ్యా! ఆ మామిడి చెట్టు యిక్కడికి నాలుగు క్రోసులుంటుంది. కాలినడకన వెళ్లి రావాలి కదా! అంత త్వరగా ఎలా వస్తాడు?" అన్నాడు.

రామకృష్ణుడు మారు మాట్లాడ లేదు. మిట్ట మధ్యాహ్నమైంది. ఓబయ్య రొప్పుతూ, రోజుతూ రాజసభకు చేరుకున్నాడు.

"అయ్యా! నేను ఆ మామిడి చెట్టుకు రాజు గారి ఆజ్ఞను తెలియజేశాను. దాన్ని రమ్మని కోరాను. అది మారు పలుకలేదు. కనుక నేను దాన్ని వెంట బెట్టుకుని తీసుకు రాలేక పోయాను" అన్నాడు ఓబయ్య.

రామకృష్ణుడు పెద్దగా నవ్వుతూ, "ఓబయ్యా! ఖంగారేమీ లేదు. ఆ మామిడి చెట్టు యిక్కడికి వచ్చింది. సాక్ష్యం కూడా చెప్పి, వెళ్లిపోయింది" అన్నాడు.

అప్పుడు లక్ష్మీపతి కొంచెం చిరాగ్గా "అదేమిటి అయ్యవారూ! నేనిక్కడే ఉన్నానుగదా! మామిడి చెట్టు ఎప్పుడొచ్చింది? ఎప్పుడు సాక్ష్యమిచ్చింది? చెట్టు ఎక్కడైనా నడచి వచ్చి సాక్ష్యం చెప్తుందా? మీరు పండితులు. మీరు కూడా యిలా మాట్లాడడం ఏమీ బాగుండలేదు" అన్నాడు.

దీంతో రామకృష్ణుడు ఉగ్రుడయ్యాడు. "లక్ష్మీపతీ! యిక నీ బుకాయింపులు ఆపు. సాక్ష్యం చెప్పడానికి అది రాలేదనే గదా నీ దిమ్మ? కానీ అదే నీ నోటి వెంట నిజాన్ని కక్కించింది. ఓబయ్య నిజంగా నీకు డబ్బు యిచ్చి వుండకపోతే, ఆ మామిడి చెట్టు యిక్కడికి నాలుగు క్రోసుల దూరంలో వున్నదని నీకెలా తెలుసు? ఇదొక్కటి చాలు. నీకు ఓబయ్య ఆ మామిడి చెట్టు క్రిందే డబ్బులిచ్చాడని చెప్పడానికి. మర్యాదగా ఆ డబ్బు ఓబయ్యకు వడ్డీతో సహా తిరిగి యిచ్చెయ్యి. లేకపోతే, నీకు కఠిన దండన తప్పదు" అన్నాడు కటువుగా.

లక్ష్మీపతి భయంతో వణుకుతూ నిజాన్ని ఒప్పుకున్నాడు. ఆ ఐదువేల ఫణాల్నీ వడ్డీతో సహా అక్కడికక్కడే ఓబయ్యకు యిచ్చివేశాడు.

ఓబయ్య రామకృష్ణునికి కృతజ్ఞతలు చెప్తూ, రాయలవారికి ప్రణామమాచరించి నిష్క్రమించాడు. లక్ష్మీపతికి నెలరోజులు కారాగారవాస శిక్ష విధించబడింది.

రామకృష్ణుని చమత్కృతి, సమయస్ఫూర్తి, న్యాయ నిర్ణయ సామర్థ్యం రాయలవారి నెంతగానో ఆకట్టు కున్నాయి.

ఫణం అనేది ఆనాటి ఒక నాణెం. కృష్ణదేవరాయల కాలంలో ఒక ఫణానికి పండ్ల అంగడిలో మూడు ద్రాక్ష గుత్తులు వచ్చేవనీ, పది దానిమ్మ పళ్లు లభించేవనీ ఆ కాలంలో విజయ నగరాన్ని సందర్శించిన విఖ్యాత పోర్చుగీసు యాత్రికుడు డామింగో పేయస్ పేర్కొన్నాడు.

ఇంకా ఒక ఫణానికి నాలుగు కోడిపెట్టలూ, ఎనిమిది కౌజు పిట్టలూ, రెండు కుందేళ్లూ, పన్నెండు పావురాలూ వచ్చేవనీ బలిసిన పంది ధర మాత్రం నాలుగైదు ఫణాలు వుండేదనీ వ్రాశాడు పేయస్.

## 12. రామకృష్ణుడు - గుర్రం అమ్మకం

తెనాలి రామకృష్ణుడు ఉన్నంతలో విలాసంగానే జీవించేవాడు. కాబట్టి రాయలవారిచ్చే భత్యం అతని కుటుంబ ఖర్చులకు సరిపోయేది కాదు. అంచేత అప్పుడప్పుడూ అతడికి అప్పులు చేయక తప్పేది కాదు. రాయలవారిని తన భత్యం పెంచమని అడగడం అతనికిష్టముండేది కాదు.

రామకృష్ణుని పొరుగునే ధనదత్తుడనే ఓ ధనిక వ్యాపారి నివసించేవాడు. అతడు అందరికీ డబ్బులు వడ్డీకిచ్చేవాడు. రామకృష్ణుడు కూడా ఓసారి ధనదత్తుడి దగ్గర వంద బంగారు నాణెములు అప్పుచేశాడు.

తెనాలి రామకృష్ణుడికి ఒకప్పుడు రాయలవారు అద్భుతమైన అరేబియా గుర్రాన్ని కానుకగా యిచ్చారు. 'అలాంటి గుర్రం పేద బాపడైన రామకృష్ణుని దగ్గరెందుకు? తనలాంటి భాగ్యవంతుడి దగ్గర ఉండడమే ఉచితం' అనుకునే వాడు ధనదత్తుడు ఆ గుర్రాన్ని చూసినప్పుడల్లా. దాన్ని ఎప్పుడు, ఎలా తన స్వంతం చేసుకోవాలా అనే ఆలోచించేవాడు.

. ఇప్పుడు రామకృష్ణుడే తన దగ్గరకు అప్పుకోసం వచ్చాడు. ఇదే సరైన అదను - అనుకుని, "ఇవిగో మీరు అప్పుగా కోరిన వంద బంగారు నాణెములు. ఏడాదికి దీనికి వడ్డీగా మీరు 50 బంగారు నాణెములివ్వాలి. "సరిగ్గా ఏడాదికి మీరు అసలు, ఫాయిదాలు చెల్లించలేకపోతే, మీ గుర్రాన్ని అమ్మేసి ఎంత వస్తే అంత మొత్తాన్నీ నాకివ్వాలి. లేదా ఆ గుర్రాన్ని నాకు స్వాధీన పరచాలి. అదీ నా షరతు. మీకు సమ్మతమేనా?" అన్నాడు.

రామకృష్ణుడి గుర్రం శ్రేష్ఠమైన అరేబియన్ గుర్రం కనుక, దాన్ని అమ్మితే 300 బంగారు నాణెముల ధర పలుకుతుంది. కనుక, రామకృష్ణుడి నుంచి పెద్ద మొత్తంలో డబ్బు కొట్టెయ్యాలనీ, అదీ కాకపోతే ఏకంగా ఆ గుర్రాన్నే కాజేయాలనీ చూశాడు ధనదత్తుడు.

ఈ షరతుకి అంగీకరించి రామకృష్ణుడు అలాగే పత్రం వ్రాసి యిచ్చి ధనదత్తుడి వద్ద వంద బంగారు నాణెములు అప్పుగా పుచ్చుకున్నాడు. పెట్టిన గడువు ఏడాదీ పూర్తయింది. అయినా రామకృష్ణుడు ధనదత్తుడికి అసలు, వడ్డీ చెల్లించలేకపోయాడు.

ఓ రోజు ధనదత్తుడు రామకృష్ణుని యింటికి వచ్చి, "నేను విధించిన ఏడాది గడువు పూర్తయింది. మన షరతు ప్రకారం మీ గుర్రాన్ని అమ్మి ఎంత వస్తే అంత నాకు యివ్వాలి. సంతకు బయలు దేరండి. గుర్రాన్ని అమ్ముదాం. లేదంటే గుర్రాన్ని నాకు స్వాధీన పరచండి." అన్నాడు.

ఇద్దరూ గుర్రాన్ని వెంట తీసుకుని సంతకు బయల్దేరారు. రామకృష్ణుడు ఒక పిల్లి పిల్లను కూడా చంకన బెట్టుకొని బయలు దేరాడు.

బేరసారాలు మొదలైనాయి. రామకృష్ణుడు తన చేతుల్లోని పిల్లిపిల్ల ధర 300 బంగారు నాణెములనీ, అది కొన్నవారికి తన అందమైన అరేబియన్ గుర్రాన్ని ఒక్క బంగారు నాణెమునకు యిచ్చేస్తాననీ ప్రకటించాడు.

ప్రజలందరూ యిదేదో వింత బేరం లాగా వుందే - అనుకున్నారు. 'అతని అరేబియన్ గుర్రమే 300 బంగారు నాణెములకు తక్కువ చెయ్యదు. 300 బంగారు నాణెములకు పిల్లిపిల్లను కొన్నవారికి ఒక్క బంగారు నాణెమునకే అరేబియన్ గుర్రం రావడం అంటే మంచి చౌక బేరమే' అనుకున్నారు వారు. ఒక ఆసామీ 300 బంగారు నాణాలిచ్చి పిల్లిపిల్లనూ,

ఒక్క బంగారు నాణెమిచ్చి అరేబియన్ గుర్రాన్నీ కొనుక్కున్నాడు. రామకృష్ణుడు వెంటనే ఆ ఒక్క బంగారు నాణాన్ని ధనదత్తుడి చేతిలో పెట్టి 'ఇక మీ బాకీ తీరిపోయినట్లే కదా!" అన్నాడు.

ధనదత్తుడు "అదెలా కుదురుతుంది? నేను మీ కిచ్చిన అసలే వంద బంగారు నాణాలు. వడ్డీ 50 బంగారు నాణాలు" అని గద్దించాడు.

"మీరు పొరపాటు పడుతున్నారు. మన ఒప్పందం ప్రకారం నేను అసలు ఫాయిదాలు ఏడాదిలోగా చెల్లించలేక పోయినట్లయితే, గుర్రాన్ని అమ్మి ఎంత వస్తే అంత మీరు తీసేసుకోవాలి. ఇక్కడ అదే జరిగింది. నా గుర్రాన్ని నేను ఒక్క బంగారు నాణానికి మాత్రమే అమ్మాను. గుర్రాన్ని అమ్మితే వచ్చిన మొత్తం సొమ్మును నేను మీకిచ్చేశాను కదా! ఇక నా బాకీ పూర్తిగా చెల్లిపోయినట్లే కదా!" అన్నాడు రామకృష్ణుడు.

దీంతో ధనదత్తుడు కాళ్లబేరానికి వచ్చాడు, "రామకృష్ణయ్యా! కనీసం నేను నీకు అప్పుగా యిచ్చిన అసలు వంద బంగారు నాణాలనైనా నాకిచ్చెయ్యి. వడ్డీ సంగతి దేవుడెరుగు. పిల్లలు గలవాణ్ణి. నన్ను అన్యాయం చెయ్యొద్దు" అని బతిమిలాడాడు.

"ధనదత్తా! మన ఒడంబడిక మర్చిపోయి మాట్లాడుతున్నావు. నీవు విధించిన షరతుకు విరుద్ధంగా నీవే మాట్లాడుతున్నావు. ఒప్పందం ప్రకారమే పోదాం. లేకపోతే మన ఒప్పంద పత్రం ఆధారంగా రాయలవారికి ఫిర్యాదు చేయవలసి వుంటుంది సుమా!" అన్నాడు రామకృష్ణయ్య.

రాయలవారికి ఫిర్యాదు చేసినా ఆయన కూడా ఒప్పందం ప్రకారం ప్రవర్తించిన రామకృష్ణయ్యను తప్పుపట్టరని ధనదత్తుడికి తెలుసు. అంచేత అతడు కళ్లలో నీళ్లు కుక్కుకుంటూ మారుమాట్లాడకుండా ఆ ఒక్క బంగారు నాణాన్ని తీసుకుని యింటి ముఖం పట్టాడు.

విజయనగర రాజ్యంలో శ్రేష్ఠమైన అరేబియన్ గుర్రాలు ఒక్కొక్కటి 300 నుంచి వెయ్యి 'దుకాట్లు' దాకా ధర పలికేవని అళియ రామరాయల కాలంలో క్రీ।శ॥ 1563లో ఇటలీలోని వెనిస్ నుంచి వచ్చి విజయనగరాన్ని సందర్శించిన సీజర్ ఫ్రెడరిక్ అనే యాత్రికుడు వ్రాశాడు. దుకాట్ (*Ducat*) అనేది యూరప్‌లో ముఖ్యంగా ఇటలీలో వాడబడిన బంగారు నాణెం.

# 13. మంగలి కొండోజి - నల్లకుక్క

శ్రీ కృష్ణ దేవరాయలకు క్షురకునిగా కొండోజి అనే వాడుండేవాడు. ఇతడు చారిత్రక పురుషుడే. క్రీ।శ।1544-50ల మధ్య విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన సదాశివరాయల వారి ఆజ్ఞ చొప్పున వేయించిన చాల దానశాసనాల్లో యీ మంగలి కొండోజి పేరు కనుపిస్తున్నది. సుమారుగా క్రీ।శ॥ 1509 నుండి ఆస్థాన క్షురకుడిగా వున్న యీ కొండోజికి రాయలవారి వద్ద ఎంతో పలుకుబడి వుండేది. రాయలవారి 'భువన విజయం'లోని అష్టదిగ్గజాలలో కందుకూరి రుద్రకవి అనే ఓ కవి వుండేవాడు. ఆయన ఈశాన్య దిశలో ఉండే సింహాసనంపై కూర్చుని కవితా గోష్ఠులలో పాల్గొనే వాడని ప్రతీతి. ఆయన క్రీ।శ। 1518 ప్రాంతంలో మంగలి కొండోజి సిఫారసు మేరకు రాయలవారి ఆస్థానంలో ప్రవేశించినట్లు తెలుస్తున్నది. ఆ రోజుల్లో కృష్ణదేవరాయల వారి దర్శనం దొరకడం అంటే సామాన్యం కాదు. ఆయనతో చనువున్న ఆస్థానకవులో, తాతాచార్యుల వారి వంటి పలుకుబడి గలిగిన మతగురువులో, తిమ్మరుసు వంటి మంత్రి సత్తములో సిఫారసు చేస్తేనేగాని రాయలవారికి ఎంతటి మహాకవిని గురించైనా తెలిసే అవకాశం లేదు. అప్పట్లో కవులు, మత గురువులు, మంత్రులు

ఒకటై కక్షగట్టినట్లుగా, కందుకూరి రుద్రకవి గురించి యిసుమంతైనా రాయలవారికి తెలియనివ్వలేదు. ఎందుకోగానీ మంత్రులు మరీ పగబట్టారట అతని మీద. రాయలవారి ఆస్థాన క్షురకుడైన కొండోజీ సిఫారసు మీద ఎలాగోలా రుద్రకవికి రాజదర్శనం లభించిందట.

అప్పుడాయన సభలో చెప్పిన పద్యం చూడండి -

ఎంగిలి ముచ్చు గులాములు
సంగతిగాఁ గులము జెరుప జనుదెంచిరయా
ఇంగిత మెరిగిన ఘనుడీ
మంగలి కొండోజి మేలు మంత్రులకన్నన్.

'బ్రాహ్మణులై పుట్టికూడా యీ మంత్రులు కులనాశనం చేయడానికి పూనుకున్నట్లున్నారు. వాళ్లకంటే ఇంగిత జ్ఞానం కలిగిన మంగలి కొండోజి ఎంతోమేలు.'- అని వాపోయాడట రుద్ర కవి.

విజయనగర సామ్రాజ్యంలో ఎప్పుడూ మంత్రులు బ్రాహ్మణులే. రాయలవారు రచించిన 'ఆముక్త మాల్యద' కావ్యంలో యామునాచార్యుడనే భాగవతోత్తముడు తాత్కాలికంగా రాజరికాన్ని అనుభవిస్తాడు. ఆయన రాజరికాన్ని విడిచి నివృత్తి మార్గాన ప్రవేశించి తన కుమారుడికి పట్టాభిషేకం చేసిన సందర్భంలో కుమారుడికి రాజనీతిని బోధిస్తాడు. 'రాజు సమర్థులును, పండితులును, తనకు హిత చింతకులునూ అయినట్టి బ్రాహ్మణులనే మంత్రులుగా నియమించుకోవాలి దుర్గపాలకులుగా కూడా బ్రాహ్మణులనే నియమించాలి. తన వివేచనా శక్తి నుపయోగించి రాజు ఆ మంత్రులు తనకు హితులో కాదో తెలుసుకోవాలి. దుష్టులను ఎప్పుడూ మంత్రులుగా పెట్టుకొనకూడదు. వారు ప్రభువును నాశనం చేస్తారు దుష్టమంత్రుల సలహాపై పాలించడం కంటె, రాజు తనకు తానే మంత్రియైపాలన చేయడం మంచిది.' ఈ రాజనీతిని అనుసరించే విజయ నగర సామ్రాజ్యంలో మంత్రులు, దుర్గాధ్యక్షులుగా బ్రాహ్మణులనే నియమించేవారు. తిమ్మరుసు వగైరా మంత్రులు, కొండవీటి దుర్గాధ్యక్షుడైన నాదెండ్ల గోపమంత్రి వగైరాలు అలా నియమింపబడిన వారే. కనుక పై పద్యంలో కందుకూరి రుద్రకవి అభిప్రాయం ప్రకారం కులమునకు చెరుపు చేస్తున్నది బ్రాహ్మణులైనట్టి మంత్రులేనన్నమాట. వారికంటె యింగిత జ్ఞానం కలిగిన ఘనుడైన మంగలి కొండోజి ఎంతో మేలని పొగడుతున్నాడు కందుకూరి రుద్రకవి.

ఓ రోజు ఉదయాన్నే రాయలవారి మందిరాన్నుంచి వెంటనే క్షురకర్మ నిమిత్తం రావాలని మంగలి కొండోజీకి కబురు వచ్చింది. ఆ కబురు వచ్చే సమయానికి అతడు అందుబాటులో వున్నాడో లేడో కానీ, రావడానికి కొంచెం ఆలశ్యం చేశాడు. రాయలవారు గతరాత్రి నాట్యాలూ, యితర వినోద కార్యక్రమాలూ చూసి అర్ధరాత్రి దాటాకనే నిద్రకుపక్రమించారు కనుక, ఉదయాన్నే లేచి కాలకృత్యాలు ముగించుకున్నప్పటికీ యింకా నిద్రలేమి కారణంగా రాత్రి బడలిక తీరక కొండోజీ కోసం ఎదురుచూసి చూసి తాను కూర్చున్న ఆసనంలోనే వెనక్కువాలి నిద్రపోయారు. ఆయన గాఢ నిద్రలోకి జారుకున్న తరువాత కొండోజీ వచ్చాడు. రాయలవారికి నిద్రాభంగం చేయడం అతనికిష్టం లేదు. అందుకే అతి చాకచక్యంగా నిద్రిస్తూన్న రాయలవారిని లేపకుండానే, ఆయనకు క్షురకర్మ చేశాడు. అంతా పూర్తయిన తరువాత రాయలవారు నిద్రనుండి లేచి తనకు క్షురకర్మ చేయమన్నారు. అప్పుడు కొండోజీ వినయంగా "తమరు నిద్రలో వుండగానే తమకు క్షౌరం చేసేశాను, మహారాజా!" అని బదులిచ్చాడు. అప్పుడు అద్దంలో చూసుకున్న రాయలవారు అతడి నేర్పరితనానికి ఎంతగానో ముగ్ధులై అతనికి విలువైన కానుకలివ్వడమే కాక, అతడిని తనకేం కావాలో కోరుకొనమన్నారు. అప్పుడు కొండోజీ రాయలవారితో రాజ్యంలోని మంగళ్లందరిపైనా వేసి వసూలు చేస్తూన్న వృత్తి పన్నును రద్దుపరచమని కోరాడట. రాయలవారు అట్లే

శాసనం చేశారట. తనకోసం ఏదైనా కోరిక కోరుకునే అవకాశమున్నా, అలా కోరుకోక తన కులంవారికి వృత్తి పన్ను రద్దు చేయమని కోరిన కొండోజి ఉదాత్త స్వభావం రాయలవారి కెంతో నచ్చింది. ఆనాటి నుంచీ కొండోజి రాయలవారి ఆంతరంగికులలో ఒకడైనాడు.

ఎంతకాలంనుంచో రామకృష్ణుడిని దెబ్బతీయాలని కాచుకుని వున్న తాతాచార్యులు, భట్టుమూర్తి వగైరాలకు యిప్పుడు మంచి అవకాశం దొరికింది. అప్పటి వరకూ రాయలవారి విదూషకులలో అగ్రగణ్యుడిగా ఖ్యాతిగాంచిన రామకృష్ణుడికి పోటీగా కొండోజిని 'విదూషకునిగా' నియమింపజేసి అతడిని రాయలవారికి మరింత సన్నిహితుడిని చేయాలని ఎంచారు వారు.

అందుకని, కొండోజి వద్దకు వెళ్లి వారు రాయలవారిని ఓ వరం అడగమనీ, వరమిస్తానని రాయలవారు వాగ్దానం చేసిన తరువాత మాత్రమే తనను 'రాజ విదూషకుడి'ని చేయమని కోరవలసిందిగా బలవంత పెట్టారు.

కొండోజి అందుకు అభ్యంతరం చెబుతూ, "నాకెందుకు బాబయ్యా! ఈ విదూషకుడి పదవి. నేనిప్పుడున్న 'ఆస్థాన క్షురకుడి' పదవితో చాల తృప్తిగానే వున్నాను" అన్నాడు వినయంగా. అయినా తెనాలి రామకృష్ణుని వ్యతిరేకులు పట్టువిడవలేదు. ఎట్టకేలకు వారెలాగో కొండోజికి నచ్చజెప్పి ఒప్పించారు. రామకృష్ణుడు ప్రస్తుతం రాజవిదూషకునిగా వున్నాడు. అతడితో సమానంగా కొండోజికి కూడా విదూషకుడి పదవి వస్తే అది తప్పనిసరిగా రామకృష్ణుడిని కించపరచడమే అవుతుందని వారు భావించారు.

వారు కోరిన విధంగానే కొండోజి రాయలవారిని తనను ఆస్థాన విదూషకుడిని చేయమని కోరడం, రాయలవారు కొండోజిని ఆ పదవిలో నియమించడం జరిగి పోయాయి. మంచి రోజు చూసుకుని వచ్చి తన పదవిలో చేరమని సూచించారు రాయలవారు. అలాగేనని నిష్క్రమించాడు కొండోజి.

రేపే కొండోజి కూడా తనకు పోటీగా ఆస్థాన విదూషకుని పదవినలంకరించ బోతున్నాడనే వార్త రామకృష్ణునికి అశనిపాతమైంది. అనన్య సామాన్యమైన మేధా సంపత్తీ, అనర్గళ వచోవైభవమూ, అనితరసాధ్యమైన ఆశుకవితా పటిమ కల తనతో సమానంగా నిరక్షరకుక్షియైన మంగలి కొండోజికి విదూషక పదవా? దీన్ని జీర్ణించుకోలేక పోయాడు రామకృష్ణుడు. కొండోజి కంటె కులరీత్యా తాను అధికుడననే భావం కూడా అతడిని వెన్నాడింది. రాజ విదూషక పదవికి రాయలవారు కొండోజిని అనాలోచితంగా నియమించారని భావించాడు తెనాలి రామకృష్ణుడు. ఎలాగైనా రాయలవారికి తాము తీసుకున్న నిర్ణయం తప్పని తెలియజెప్పాలని భావించి చటుక్కున ఓ ఆలోచన తట్టి వెంటనే కార్యరంగంలోకి దూకాడు.

హంపి నగరానికి నడి బొడ్డున ఓ పెద్ద ఊరచెరువుంది. రామకృష్ణుడు తన యింటిలో పెంచుకుంటున్న నల్ల కుక్కను ఆ చెరువు దగ్గరకు తీసుకెళ్లి ఊరి జనమంతా చూస్తూ వుండగా దాన్ని మూడుసార్లు చెరువులో ముంచి ఎత్తాడు. తరువాత ఒడ్డుకు తెచ్చి దాని నల్ల చర్మాన్ని మట్టితోనూ, యిసుకతోనూ రుద్దసాగాడు. దారిన పోయే దానయ్యలకు యిది వింతగా తోచి, "రామకృష్ణయ్యా! ఏం చేస్తున్నావు నీవు?" అని ప్రశ్నించారు. అతడు వారితో, "ఈ కుక్కను తెల్లకుక్కగా మార్చడానికి దీని చర్మాన్ని బాగా రుద్దుతున్నాను. కనుపించడంలేదా?" అన్నాడు. వాళ్లు విస్తుపోయి, "నీవేం పండితుడవయ్యా! నీకు పిచ్చిగాని ఎక్కలేదు కద?" అనుకుంటూ ఎవరి దారిన వారు పోయారు.

అలా అలా యీ వార్త రాజధాని మొత్తానికీ పాకింది. ఏం జరుగుతుందో చూద్దామని సాధారణ ప్రజలు, రామకృష్ణయ్య అభిమానులూ ఊరచెరువు దగ్గర పెద్ద సంఖ్యలో గుమి కూడి జరిగేదంతా వింతగా చూస్తున్నారు. రామకృష్ణుని వ్యతిరేకులు కూడా అక్కడికి రాకుండా వుండలేక పోయారు. తమ బద్ధవిరోధి రామకృష్ణుడికి పిచ్చెక్కిందనే వార్త ఎంతవరకు

నిజమో రూఢి పరచుకొనడానికి వారు వచ్చారు. ఎందరు తనను గమనిస్తున్నా రామకృష్ణుడు ఏమీ పట్టనట్లుగా ఆ నల్ల కుక్క తోలును రుద్దే పనిలోనే నిమగ్నమయ్యాడు.

తెనాలి రామకృష్ణుని వింత చేష్టల వార్త రాజభవనానికి కూడా చేరింది. రాయలవారు ఓ రథంపై నగరం నడిబొడ్డుననున్న ఊర చెరువుకు చేరుకున్నారు. ఆయన రామకృష్ణునితో 'రామకృష్ణయ్యా! మీకు మతి చలించిందా? ఏం చేస్తున్నారు మీరు? జనం అంతా అనుకుంటున్నారు – మీరేదో యీ నల్లకుక్కను తెల్లదాన్నిగా మార్చడానికి ప్రయత్నిస్తున్నారని అదసలు సాధ్యపడే పనేనా?" అన్నారు.

దానికి రామకృష్ణుడు తాపీగా, "మహారాజా! మన రాజ్యంలో జరగరానివెన్నో జరుగుతున్నాయి. అక్షరం ముక్కరాని ఒక క్షురకుడు రేపు తెల్లారేసరికి ఆస్థాన విదూషకుడు కానున్నాడు. అలాంటప్పుడు ఈ నల్లకుక్క తెల్ల కుక్కగా మారదంటారా?" అన్నాడు.

రామకృష్ణుడి పరోక్ష విమర్శ అంతా తన అనాలోచిత నిర్ణయం మీదనేనని రాయలవారికి అర్థమైంది. అక్కడ చేరిన పండితులు, బ్రాహ్మణులుసైతం తన నిర్ణయం పట్ల అసంతృప్తిగా వున్నారని కూడా అక్కడి పరిస్థితిని బట్టి రాయలవారికి అర్థమైపోయింది. బ్రాహ్మణుల అభిప్రాయాలకు ఎంతో గౌరవాన్నిచ్చే రాయలవారు తన నిర్ణయాన్ని వెనక్కి తీసుకొనడానికి ఏమాత్రం సంకోచించలేదు. కొండోజికి కబురంపి యధా ప్రకారం అతడిని ఆస్థాన క్షురకుడిగానే కొనసాగమని కోరారు రాయలవారు.

కొండోజికీ రాయలవారి నిర్ణయం సంతోషదాయకమైంది. ఎందుకంటే అతడికి మొదటి నుంచీ ఆస్థాన విదూషకుడి పదవిపై ఏ మాత్రం యిష్టంలేదు. తెనాలి రామకృష్ణుడి వ్యతిరేకుల వత్తిడిపైననే, ఆ పదవి కావాలని రాయలవారిని అడిగాడు కొండోజి.

ఎటొచ్చీ తాతాచార్యులు, భట్టుమూర్తి వగైరా రామకృష్ణుని ప్రతికక్షులకు మాత్రం రాయలవారి తాజా నిర్ణయం ఆశాభంగం కలిగించింది. కొండోజిని ఆస్థాన విదూషకుడిగా తెనాలి రామకృష్ణునికి పోటీగా నిలిపి,అతడిని రాయలవారికి మరింత సన్నిహిత ఆంతరంగికునిగా మార్చి తెనాలి రామకృష్ణుడిని పరోక్షంగా దెబ్బతీయాలని చూసిన వారి ఆశలు యిలా అడియాసలయ్యాయి.

## 14. రోజుకు వంద తప్పులు

శ్రీకృష్ణదేవరాయలు యుద్ధానికి వెళ్లేటప్పుడు కూడా తన భార్యలనూ, అష్టదిగ్గజ కవులనూ యుద్ధ భూమికి తన వెంట తీసుకెళ్లేవాడట. ఇదే సంప్రదాయాన్ని ఆయన అల్లుడు అళియ రామరాయలు (అళియ అంటే కన్నడ భాషలో 'అల్లుడు' అని అర్థం) కూడా కొనసాగించాడు. విజయనగర ప్రభువులు రణభూమికి తమ సానులను కూడా వెంట తీసుకెళ్లే అలవాటున్నట్లు ప్రతీతి. క్రీ॥శ॥ 1565లో బహమనీ సుల్తానులతో జరిగిన రాక్షస తంగడి లేక తళ్లికోట యుద్ధంలోనైతే రామరాయలు ఏకంగా తన వజ్రాలు పొదిగిన బంగారు సింహాసనాన్ని ఒక తెరపి పల్లకి (బహిరంగ పల్లకి - *open palamquin*) పై వుంచి కొలువు కూటంలో వలె రణభూమిలో దానిపై అధిష్ఠించి ఊరేగాడట. రాజధానిలోనే కాదు తన సామ్రాజ్యపు ఎల్లలకు ఆవలి రణభూమిలో కూడా తన సార్వభౌమత్వమే చెల్లుబాటవుతుందని చాటడానికి కాబోలు! అయితే యిలా ఊరేగడమే ఆయన ప్రాణాలు కోల్పోవడానికి దారితీసి, అదే విజయనగర మహాసామ్రాజ్య పతనానికి నాందీ ప్రస్తావన అయింది. ధైర్యంగల బహమనీ రౌతులు కొందరు దర్పంగా పల్లకిపై ఊరేగుతూన్న రామరాయలు వైపుకు దూసుకొచ్చారట ఈ అలజడి కారణంగా సమీపంలో ఏదో ప్రమాదాన్ని శంకించిన రామరాయలు వెంటనే హడావిడిగా పల్లకిని దింపించి దానిపై నుంచి తన

గుర్రం మీదికి ఎక్కబోయాడట. తత్తరపాటుతో చేసిన ఆ ప్రయత్నంలో జీను నుండి కాలుజారి బోర్లాపడ్డాడట ఆ ఎనభైయ్యేడేళ్ల యోధుడు. (అళియ రామరాయలు వయస్సులో తన మామ శ్రీకృష్ణదేవరాయల కంటె నాలుగేళ్లు చిన్నవాడని ప్రతీతి. శ్రీకృష్ణదేవరాయలు 1530లో మరణించేటప్పటికి ఆయన వయస్సు 56 సంవత్సరాలుంటుందని చరిత్రకారుల అంచనా. ఉదయగిరి శాసనం ప్రకారం క్రీ.శ. 1569లో పెనుగొండ రాజధానిగా అళియరామరాయల తమ్ముడు తిరుమలరాయలు అధికారం చేపట్టే నాటికి అతడికి తొంభైయేళ్లట. అంటే తళ్లికోట యుద్ధం (1565) నాటికి తిరుమల రాయల వయస్సు 86 సంవత్సరాలు. తన అన్న కంటె తిరుమలరాయలు ఒక సంవత్సరం చిన్న వాడనేది సహజంగానే వుంది) ఇదే అదనుగా భావించి ఒక బహమనీ రౌతు తన వాడికత్తితో రామరాయలు తల ఖండించి తన యీటెకు ఆ తెగిన తల గుచ్చి దానిని పైకెత్తి ప్రదర్శిస్తూ, "మీ రాజు మరణించాడోహో!" అంటూ ఎలుగెత్తి చాటాడట. అప్పుడే కనుక గుర్రమెక్క గలిగి వుంటే అరివీరభయంకరుడైనట్టి ఆ యోధుడు అలా అనవసరంగా అకాల మరణం పాలయ్యేవాడు కాడు. నాయకుడు మరణించిన తరువాత ఎంతటి సుశిక్షిత సైన్యమైనా బెంబేలెత్తి పోతుంది. హిందూ సైన్యాల విషయంలో యిది మరింత సంభావ్యం. విద్యానగర సైన్యాల విషయంలోనూ అదే జరిగింది కకావికలై పారిపోతున్న వారిలో లక్షన్నర మందిని శత్రుసైన్యాలు తురిమేశాయి. లక్షకుపైగా క్షతగాత్రులయ్యారు. అలా మహోన్నత ప్రాభవం కల విజయనగర సామ్రాజ్యం 'ఇదంతా కలలోని కథ' అన్నట్లు ముగిసిపోయింది ఆరు నెలలపాటు హంపి విజయనగరం శత్రువులు చేసిన లూటీలకూ, ధ్వంసరచనకూ లోనయింది. అలా విజయనగర సామ్రాజ్య పతనానికి నాంది రామరాయలకు యుద్ధభూమిలో తన వజ్రపు సింహాసనంపై కొలువు దీరాలనే 'విపరీతమైన వింత కోరిక' కారణంగానే జరిగిందని చరిత్రకారుల నిర్ధారణ. అందుకే 'హంపీ క్షేత్రము' అనే తన కావ్యంలో కొడాలి వెంకట సుబ్బారావుగారు యిలా అన్నారు.

**ఆ పదాత్యశ్వ సైనికాభ్యంతరమున**
**నిజకిరీట ద్యుతులు రీవినెరప, రామ**
**రాజా బంగారు గద్దెపై రణము నందె**
**కొలువు కుదిరె మా యాంధ్రుల కొంపకాల్ప.** **(తళ్లికోటయుద్ధము – 'హంపీక్షేత్రము')**

ఇకపోతే యుద్ధ భూమిలో కూడా తన అష్టదిగ్గజ కవులతో భువన విజయాన్ని నిర్వహించేవారట రాయలవారు. తన దర్పానికి గురుతుగా ఎక్కడకెళ్లినా వారిని వెంట తీసుకు వెళ్లేవాడట. ఇలా 'అష్టదిగ్గజాలు' అనబడే కవులతో సాహిత్య గోష్ఠి చేయడం వైష్ణవ సంప్రదాయం. క్రీ.శ. 1370-1433 కాలం నాటి వాడైన మనవాళముని వద్ద అష్ట దిగ్గజాలూ, నవరత్నాలూ వుండేవారట.

ఒకసారి రాయలవారు పెద్దసైన్యమేమీ వెంట తీసుకొనకుండా హంపి విజయనగరంలో తుంగభద్రానదికి ఉత్తర తీరంలోనున్న 'కిష్కింధ' లోని అటవీ ప్రాంతానికి అష్టదిగ్గజ కవులతో కలసి విహారానికి వెళ్లారట. అప్పటికే రాయలవారిపై పగబట్టివున్న కటకము రాజధానిగా కళింగదేశాన్ని పాలిస్తూన్న వీరభద్రగజపతి రాయలవారిని తుదముట్టించదానికి బలమైన సైన్యంతో తన సేనానియైన నవకము గోవిందరాజు అనే యోధుడిని పంపాడట. తగిన అవకాశం ఎప్పుడు దొరుకుతుందా అని ఎదురుచూస్తూన్న గోవిందరాజుకు మంచి అవకాశం యిలా కలిసి వచ్చింది. ఈ గోవిందరాజు పూర్తిపేరు బసవరాజు గోవిందరాజు. ఆ కాలంలో ప్రతివ్యక్తి పేరుకూ ముందు తండ్రిపేరు తగిలించి చెప్పుకొనేవారు. తమిళనాడు కర్ణాటక రాష్ట్రాలలో యీ అలవాటు యిప్పటికీ వుంది. బసవరాజు కుమారుడైన యీ గోవిందరాజు గొప్ప యోధుడట. పైపెచ్చు వీరభద్ర గజపతికి నమ్మిన బంటట. అంచేత తన బద్ధశత్రువైన రాయలవారిని శవంగానో, సజీవంగానో పట్టి తెచ్చే కార్యభారాన్ని ఆయన యీ గోవింద రాజుపై పెట్టాడు.

ఇకనేం వ్రేళ్లపై లెక్కించతగు సంఖ్యలో అంగరక్షకులు, అష్టదిగ్గజ కవులతో కలిసి తుంగభద్ర ఆవలి తీరంలోని

అడవిలో విహారానికి వెళ్లిన రాయలవారిని తన సైన్యంతో దిగ్బంధనం చేశాడు గోవిందరాజు. గోవిందరాజు, అతని సుశిక్షిత సైన్యం యొక్క విజృంభణ ఎంత తీవ్రంగా వుందటంటే గెలుపుమాట పెరుమాళ్లు కెరుక, రాయలవారు ఓటమి అంచున విలవిలలాడారట. అప్పుడు అష్టదిగ్గజాలలో ఒకనిగా రాయలవారి ననుసరించి వెళ్లిన తెనాలి రామకృష్ణుడు 'ఏం చేస్తే గోవిందరాజు విజృంభణను అరికట్ట వచ్చా' - అని ఆలోచించి, చివరికి గోవిందరాజుకు వినబడేటట్లు బిగ్గరగా యీ క్రింది కంద పద్యం చదివాడట.

క॥ బసవనకుఁ బుట్టినపుడే
పసరము గోవిందరాజు; పసరంబైతేఁ
గసవేటికిఁ దినడంటేఁ
గసవుందిను శత్రులాజిఁ గవిసిన వేళన్.

(రామకృష్ణుని యీ పద్యం 'అప్పకవీయం' (2-379)లో పేర్కొనబడింది)

దీని భావం గోవిందరాజు తండ్రి బసవరాజు. అంటే ఆయన బసవన్నకు పుట్టాడన్న మాట. బసవన్న అంటే ఎద్దు అనే అర్థం. బసవరాజు కుమారుడు కనుక ఎద్దుకు పుట్టినట్లే. ఎద్దుకు పుట్టినప్పుడే అతడు పసరము - అంటే పశువు. 'మరి పశువైతే అతడు కసవు (గడ్డి) ఎందుకు తినడు?' అంటే - అతడు ఆజిలో (యుద్ధములో) శత్రువులు కవిసే (కవియుట అంటే వ్యాపించుట; విజృంభించుట) వేళల్లో కసవు తింటాడట. ఇక గోవిందరాజు పని కుడితిలో పడ్డ ఎలుకలా అయింది. రామకృష్ణుని పద్యం ప్రకారం అది అతడు గడ్డి తినే సమయమన్న మాట. ఇది విని అతడు నిశ్చేష్టుడయ్యాడు - అవమాన భారంతో కృంగిన అతడు విజృంభిస్తున్న రాయలవారిని ఎదుర్కొనే మానసిన స్థైర్యాన్ని కోల్పోయాడు. అనంతరం రాయలవారు అలా డీలా పడిన గోవిందరాజును సులభంగా ఎదుర్కొని చంపి వేయగలిగారట.

ఈ ఊహించని విపత్తు నుండి బయటపడిన రాయలవారు రామకృష్ణుడి అద్భుత కవితా పాటవానికీ, అతడి సమయస్ఫూర్తికీ, యుక్తికీ మెచ్చి 'ఏం వరం కావాలో కోరుకొమ్మన్నా'రట. రామకృష్ణుడు ఏ మాత్రం సంకోచించకుండా 'దినమునకు వంద తప్పుల వరకూ నన్ను క్షమించండి. నా కదే పదివేలు" అన్నాడట.

ఇది కథో నిజమో తెలియదు. ఇదే కనుక నిజమైతే రామకృష్ణుడు ఆ రోజుల్లో తాను చేస్తూన్న దుందుడుకు పనుల కారణంగా తరచు రాయలవారి ఆగ్రహానికి గురయ్యేవాడని అర్థమవుతూంది. రామకృష్ణుడు తన సూటితనంతో, చిలిపితనంతో, దుందుడుకు స్వభావంతో, పరులను గాయపరచే భాషతో ఎన్నో సందర్భాలలో రాయలవారికి ఆగ్రహం కలిగించినట్లు మనకు యీ తరహా కథలూ గాథల మూలంగా అర్థమవుతూంది. రోజుకు నూరు తప్పుల వరకూ కాస్తానని రాయలవారు ఆయనకు అభయమిచ్చారో లేదో కానీ రామకృష్ణుడు తరచు రాయలవారి ఆగ్రహానికి గురై 'దేవిడీమనా' వంటి స్వల్ప శిక్షల మొదలుకొని మరణశిక్ష వంటి తీవ్రశిక్షలకు కూడా గురైనట్లు తెలుస్తున్నది. రాయలవారి శిక్షా స్మృతిలో మరణశిక్ష నుండి బ్రాహ్మణులు మినహాయించబడ్డారు. అయినా తెనాలి రామకృష్ణుడు కనీసం రెండు సందర్భాలలో మరణ శిక్షకు గురైనప్పటికీ వాటి నుంచి తెలివిగా తప్పుకున్నట్లు తెలుస్తున్నది. రామకృష్ణుడు ప్రథమశాఖకు చెందిన నియోగి బ్రాహ్మణుడు. వైదికుల ప్రాబల్యం చెల్లిన కాలంలో నియోగులను ఎవరూ బ్రాహ్మణులుగా ఎంచేవారు కారు. ఇటీవలి వరకూ బ్రాహ్మణులంటే వైదికులే! కాని కృష్ణదేవరాయల కాలంలో బ్రాహ్మణులంటే వైష్ణవులే! నాటి సమాజంలో వారి ఆధిక్యతే చెల్లుబాటయింది మరి. బహుశా నియోగియైన రామకృష్ణుడిని బ్రాహ్మణుడిగా గుర్తించక పోవడం కారణంగానే బ్రాహ్మణులు అవధ్యులే అయినా, వస్తుతః రాయలవారు బ్రాహ్మణ పక్షపాతి అయికూడా రామకృష్ణునికి అలా మరణదండన విధించి వుంటారు. శ్రీకృష్ణదేవరాయల కాలంలో బ్రాహ్మణులుగా గుర్తింపబడింది పురోహితులూ, ఆలయాలలో అర్చకులూ మాత్రమేననీ, పరిపాలనలో పాలుపంచుకుంటున్న నియోగులనూ, యితరులనూ రాయలవారు బ్రాహ్మణులుగా భావించి గౌరవించలేదనీ డామింగో పేయజ్ అనే పోర్చుగీసు యాత్రికుడు క్రీ.శ. 1520-22 మధ్య కాలంనాటి పరిస్థితులను వివరిస్తూ వ్రాసిన వ్రాతలను బట్టి అర్థమవుతూంది. పేయజ్

యిలా వ్రాశాడు "ఇక బ్రాహ్మణుల (*BRAMYNES*) విషయానికొస్తే - వారు మన ఫ్రయర్ల (*Friars*) వంటివారు (ఫ్రయర్‌లు అంటే రోమన్ కాథలిక్కులలోని ఫ్రాన్సిస్కన్ మరియు డొమినికన్ తరగతికి చెందిన సన్న్యాసులు) వారు తమను తాము అతి పవిత్రులుగా భావించేవారు - నేను చెప్పేది బ్రాహ్మణ పురోహితులూ, దేవాలయాలలో అర్చకులుగా వున్న విద్యావంతుల సంగతే సుమా - యింకా ఎందరో యితర బ్రాహ్మణులు రాజసేవలో, దుర్గాధ్యక్షులుగా, పట్టణాల్లో, నగరాల్లో పాలనాధికారులుగా వుండేవారు కొందరు బ్రాహ్మణులు వ్యాపారాలు కూడా చేసేవారు మిగిలినవారు తమకు తాత తండ్రుల నుంచి సంక్రమించిన పొలాల్లో పండే పంటను అనుభవిస్తూ జీవించేవారు. దేవాలయాల్లో అర్చకులుగా వున్న వారు మాత్రం గొప్ప విద్వాంసులుగా వుండేవారు చనిపోయిన దేనినీ వారు తినేవారు కాదు - మాంసం కానీ, చేపలు కానీ అలాగే చారునో, పులుసునో ఎర్రగా మార్చివేసే దేనినీ వారు ఆహారంలో అంగీకరించేవారు కాదు ఎందుకంటే వారు ఎర్రనిదంతా రక్తమనే అభిప్రాయంతో వుండేవారు వారంతా గృహస్థులే వారి భార్యలు ఎంతో అందంగా వుండేవారు. ఆ స్త్రీలు ఎప్పుడూ యింట్లోనే వుండేవారు ఎంతో అరుదుగా వారు యింటి బయటికి వచ్చేవారు. వారు తెల్లని మేనిఛాయ కలిగి వుండేవారు బ్రాహ్మణులు - స్త్రీలు కానీ, పురుషులు కానీ - యీ దేశంలో కెల్లా అందమైన వారుగా వుండేవారు. ఈ దేశంలో తమను తాము బ్రాహ్మణులమని చెప్పుకునే వారెందరో వున్నారు - కానీ, పైన తెలిపిన వారి జీవన శైలికీ, వారి జీవన శైలికీ ఎంతో వ్యత్యాసముండేది. రాజు మాత్రం ముందు చెప్పిన తరగతికి చెందిన బ్రాహ్మణులనే ఎక్కువగా అభిమానించి గొప్పగా గౌరవించే వాడు" (*P. 69, 'VIJAYANAGAR', Ed. VASUNDHARA FILLIOZAT, PUB · NBT, NEW DELHI*)

క్రీ శ 1524లో రాయలవారు తన ఏకైక కుమారుడు ఆరేళ్ల తిరుమల రాయలుకు పట్టాభిషేకం చేశారు ఆరు నెలలు తిరక్కుండానే అతడి నెవరో విష ప్రయోగంతో హత్య చేశారు. తిరుమల రాయల హత్య అనంతరం రాజ్యమంతా అల్లకల్లోలమైంది. మనశ్శాంతి కోల్పోయిన రాయలవారు తిమ్మరుసునూ, అతని కుమారులనూ యీ హత్యకు బాధ్యుల్ని చేసి తిమ్మరుసు కళ్లు పీకించాడట. దీనికి రాయలవారిపై కోపించిన తిమ్మరుసు కుమారులు అంతర్యుద్ధం లేవదీశారట. ఇలా అంతఃకలహాలలో మునిగితేలుతున్న వాతావరణంలో మనశ్శాంతి కోల్పోయిన రాయలవారు సహజంగానే సహనం కోల్పోవడం, ఉచితానుచితాలు ఆలోచించకుండా ప్రవర్తించినందుకు రామకృష్ణుడిని మోతాదుకు మించి శిక్షించడం పెద్దగా అసమంజసమేమీ కాదు. పైపెచ్చు తన తండ్రి వంటివాడు, గురుతుల్యుడు, ప్రాణానికి ప్రాణమైన తిమ్మరుసు మంత్రినే అనుమానించి, బంధించి, కళ్లు పీకించిన రాయలు, తిమ్మరుసుకు సన్నిహితునిగా పేరుగాంచిన రామకృష్ణుడిని శిక్షించడంలో పెద్ద వింతేమీ లేదు రామకృష్ణుని విపరీత ప్రవర్తనతో విసుగెత్తిన రాయలవారు నాటి విజయనగర సామ్రాజ్య శిక్షాస్మృతికి భిన్నంగా బ్రాహ్మణుడైన రామకృష్ణుడికి కనీసం రెండు సందర్భాలలో మరణశిక్ష, ఒకటి రెండుసార్లు దేవిడీ మనా, మరోసారి దేశబహిష్కార శిక్ష విధించడం అసహజమేమీ కాదు. అయితే రామకృష్ణుడిని శిక్షించిన ప్రతిసారీ ఆయన తెలివిగా తప్పుకొనడం, ఆ తరువాత రామకృష్ణుని విపరీత ప్రవర్తన వెనుక నిజాయితీ, ప్రభుభక్తి, దేశభక్తి యిమిడి వున్నాయని గమనించిన రాయలవారు తాను రామకృష్ణుడిని శిక్షించడం తప్పని పశ్చాత్తాప పడడం జరిగాయని తెలుస్తున్నది. క్రీ.శ. 1524-30 మధ్యకాలంలో అంటే తిరుమల రాయల హత్యకూ తన మరణానికీ మధ్య కాలంలో రాయలవారు తన నీడనే తాను నమ్మేవారు కాదట. మంత్రులు సామంతులనే నమ్మని వాడికి ఎంతటి మహాకవియైనా, ఆపైన తన కెంతటి సన్నిహితుడైనా, విదూషకుడైన రామకృష్ణుడిని అలా శిక్షించడంలో పెద్ద వింతేమీ లేదు. ఇక కృష్ణదేవరాయలకు ఉన్నట్లుండి విపరీతమైన కోపం వచ్చేదని చరిత్రకారులు కూడా ధృవపరిచారు. డామింగో పేయజ్ ఆయన్ని గురించి చేసిన వర్ణన చూడండి - "కృష్ణదేవరాయలు ఓ మాదిరి ఎత్తు, చక్కని రూపం, తెల్లని మేనిఛాయ కలవాడు. కొంచెం బొద్దుగానే వుండేవాడని చెప్పుకోవాలి. ముఖంపై మశూచికం పోసిన మచ్చలుండేవి. ఆయన ఎప్పుడూ హుషారుగా, ఆనందంగా వుండేవాడు. ఆయన రాజులందరిలోకీ అరివీరభయంకరుడూ, పరిపూర్ణుడూ అయినట్టి వాడు విదేశీయులనెంతగానో గౌరవించేవాడు. వారిని సాదరంగా స్వాగతించి, వారి స్థితి గతులెలా వున్నాయో విచారించి, వారి యోగక్షేమాలు అడిగి తెలుసుకునేవాడు ఆయనో గొప్ప పరిపాలకుడు. న్యాయ నిర్ణేత. అయితే ఆయనకు అప్పుడప్పుడూ వున్నట్టుండి విపరీతమైన కోపం వచ్చేది"

తీవ్ర మానసిక అశాంతిలోనున్న రాజును విదూషకుడు తన విధ్యుక్తధర్మంలో భాగంగా నవ్వించడానికి ప్రయత్నించినప్పటికీ రాజు యొక్క క్రోధానలానికి గురై విదూషకులు శిక్షింపబడడం చరిత్రలో సర్వసాధారణమే.

గ్రీకు చరిత్రలో యీ తరహాకు చెందిన ఓ ప్రసిద్ధమైన గాథ వుంది. డామోక్లీజ్ (*Damocles*) అనేవాడు క్రీ పూ. 4వ శతాబ్దంలో సిరాక్యూజ్ (*Syracuse*) రాజ్యాన్ని ఏలిన నియంత దయోనీసియస్ (*Dionysius*) దగ్గర విదూషకుడిగా ఉండేవాడట ఓ రోజు రాజుగారు

ఎందుకోమరి విషాదంగా వున్నారట. రాజుగారి మనస్థితిని గమనించకుండా డామోక్లీజ్ తన కర్తవ్యంలో భాగంగా యథా ప్రకారం ఆయన్ని నవ్వించడానికి హాస్యోక్తులు పలుక నారంభించాడట. దీంతో డయోనిసియస్‌కి చిర్రెత్తు కొచ్చిందట. "నేనెవ మరికి మాటలతో నవ్వించకు. కాసేపన్నా నన్ను ప్రశాంతంగా వుండనియ్యి. నీకు మాత్రం జీవితంలో విషాదం వుండదా? ఆతురత, ఆందోళన వున్నప్పుడు నువ్వు మాత్రం హాయిగా ఎలా నవ్వగలవు? నవ్వించగలవు?" అంటూ ఆ రాజు తన విదూషకుడికి ఓ వింత పరీక్ష పెట్టాడట. ఓ పెద్ద బల్ల తెప్పించి దానిపై రకరకాల పిండివంటలు, రుచికరమైన భోజన పానీయాలను ఏర్పరచి ఒక కుర్చీలో డామోక్లీజ్‌ను కూర్చుండబెట్టి, సరిగ్గా అతని తలపైన కొంచెం ఎత్తులో ఒక పదునైన కత్తిని కేవలం ఒకే వెంట్రుక ఆధారంగా వ్రేలాడదీయించాడట. గాలి ఏ కొంచెం బలంగా వీచినా ఆ పదునైన కత్తి తాలూ వెంట్రుక తెగి ఆ కత్తి అతడి నెత్తిమీద పడి, ఏ క్షణంలోనైనా అతడు మరణించే అవకాశముంది. 'ఇక యిప్పుడు నవ్వు. నవ్వించు. ఎలాగో నేనూ చూస్తాను" అన్నాడట అప్పుడు ఆ రాజు. ఇక ఆ విదూషకుడి నవ్వులు బంద్! అలా ఆ రాజు, "జీవితంలో హాస్యంతోపాటు విషాదం కూడా వుంటుందనీ, విషాదంలో వున్న రాజు మనసెరుగకుండా అప్పుడు కూడా హాస్యోక్తులు పేల్చే విదూషకులకు విషాదమంటే ఏమిటో ఏనాడూ ఆ విషాదకర పరిస్థితి ఎదురై దాన్ని వారు స్వయంగా అనుభవించినప్పుడేగాని బోధపడదనీ" నిరూపించాడు. ఈ గాథ నుండి పుట్టిందే ఇంగ్లీషు భాషలో 'పొంచివున్న ప్రమాదం' 'ఏ క్షణానైనా సంభవించ గల ఉపద్రవం' (*Lurching Danger or Imminent Catastrophe*) అనే అర్థమిచ్చే *'The sword of Damocles'* (డామోక్లీజ్ కత్తి) అనే జాతీయం వాడుకలోకి వచ్చింది.

## 15. రామకృష్ణుడు - గూని చాకలి

హంపి రాజధానిగా విజయనగర సామ్రాజ్యాన్ని క్రీ.శ. 1336వ సంవత్సరంలో సంగమ వంశానికి చెందిన హరిహర రాయలు, బుక్కరాయలు అనే యిరువురు సోదరులు స్థాపించారు. సంగమ వంశంలోని చిట్టచివరి పాలకుడైన రాజశేఖర రాయలును రాజ్యభ్రష్టుడిని చేసి క్రీ.శ. 1485లో సాళువ నరసింహరాజు సాళువ వంశపాలనను ప్రారంభించాడు. అతని కుమారుడు రెండవ సాళువ నరసింహుడి (క్రీ.శ. 1496-1505)తో సాళువ వంశపాలన అంతమయింది. అతని సేనానాయకుడిగా వున్న తుళువ నరసింహుడు లేక నరసనాయకుడు రాజు బలహీనత గమనించి తానే అధికారం చెలాయించేవాడు. క్రీ. శ. 1503లో తుళువ నరసనాయకుని మరణానంతరం అతని పెద్ద భార్య తిప్పాంబిక కుమారుడైన వీరనరసింహ నాయకుడు తండ్రి స్థానంలో సేనాని అయ్యాడు. ఆ వెంటనే బలహీనుడైన రెండవ సాళువ నరసింహుడు క్రీ.శ. 1505లో మరణించగా వీరనరసింహ నాయకుడే, భుజబలరాయుడనే పేరుతో మహామంత్రి తిమ్మరుసు సహాయంతో సింహాసనాన్ని కైవసం చేసుకొని తుళువ వంశ పాలనను ప్రారంభించాడు. ఈ తుళువ వంశం వారు ఎప్పుడో కొంకణ తీరంలోని తుళు ప్రాంతాన్నుంచి వలస వచ్చి ఆంధ్ర ప్రాంతంలో స్థిరనివాస మేర్పరచుకున్నారని కొందరు చరిత్రకారులు, ఒకప్పుడు తెలుగువారైన వీరు తుళు ప్రాంతానికి వలస వెళ్ళి తిరిగి తమ మాతృదేశానికి వచ్చి స్థిరపడ్డారని మరికొందరు అభిప్రాయ పడుతున్నారు. క్రీ.శ. 1509లో భుజబలరాయుడి మరణానంతరం ఆయన సవతి తల్లి నాగులాంబికకు పుట్టిన శ్రీకృష్ణదేవరాయలు సింహాసనమధిష్ఠించి క్రీ.శ. 1529లో మరణించే వరకు పాలించాడు. అనంతరం ఆయన సవతితల్లి ఓబాంబిక కుమారుడు అచ్యుతరాయలు అధికారానికి వచ్చి క్రీ.శ. 1542 వరకు పాలించాడు. ఆయన మరణానంతరం ఆయన తమ్ముడు రంగరాజు కుమారుడు సదాశివరాయలు క్రీ.శ. 1565 వరకు పాలించాడు. బలహీనుడైన ఆ ప్రభువు పేరుకు మాత్రమే పాలకుడు. శ్రీకృష్ణదేవరాయల అల్లుడు, అరవీటి వంశానికి చెందిన అళియ రామరాయలు సదాశివరాయల పాలనా కాలంలో తానే మొత్తం చక్రం తిప్పేవాడు. అరవీటి వంశస్థులు ఆంధ్ర ప్రాంతంలోని అరవీడుకు చెందిన పదహారణాల తెలుగువారు. క్రీ.శ. 1565లో కృష్ణ - మలప్రభ నదుల సంగమ స్థలంలో జరిగిన తళ్ళికోట లేక రాక్షస తంగడి యుద్ధంలో బహమనీ రాజ్యాలైన అహ్మద్‌నగర్ (నిజామ్ షాహీ వంశం), బీజాపూర్ (ఆదిల్ షాహీ వంశం), గోల్కొండ (కుతుబ్ షాహీ వంశం), బీదరు (బరీద్‌షాహీ వంశం), బీరారు (ఇమాద్ షాహీ వంశం) రామరాయలుపై సాధించిన విజయం విజయనగర సామ్రాజ్య పతనానికి దారి తీసింది. ఆ తరువాత రామరాయలు పెద్ద తమ్ముడైన తిరుమల రాయలు కొంత కాలం హంపిలోనూ, అనంతరం తిరుపతి కేంద్రంగానూ, తుదకు పెనుగొండ రాజధానిగానూ పాలించాడు. ఈ తిరుమల రాయలు శ్రీకృష్ణదేవరాయల రెండవ కుమార్తె వెంగళాంబ భర్త; యీయనకు 'చెన్నమదేవి' అనే మరో భార్య కూడా వుంది. ఈయనకు నల్గురు కొడుకులు కాగా, అందు పెద్దవాడైన రఘునాథరాయలు తళ్ళికోట యుద్ధంలో మరణించాడు. (అదే యుద్ధంలో తిరుమల రాయలకు ఒక కన్ను కూడా పోయింది) ఆయన మిగిలిన కుమారులు ముగ్గురూ - శ్రీరంగరాయలు (ఉదయగిరి రాజధానిగా ఆంధ్రప్రాంతానికీ), రామరాజు (శ్రీరంగ పట్టణం రాజధానిగా కన్నడ ప్రాంతానికీ), వేంకటపతి దేవరాజు (చంద్రగిరి రాజధానిగా తమిళ ప్రాంతానికీ) - మూడు ప్రాంతాలకు పాలకులుగా

నియమించబడ్డారు. బలహీనమైన పరిపాలన, నాయక రాజుల తిరుగుబాట్లు, మహమ్మదీయులతో కలహాలు, అంతఃపుర కలహాలు వగైరాలు మహత్తరమైన విజయనగర సామ్రాజ్యాన్ని అనతి కాలంలోనే నామరూపాలు లేకుండా చేశాయి. క్రీ.శ. 1680 వరకు బలహీనంగా సాగిన నామమాత్రపు పాలన శ్రీరంగ రాయల కుమారుడైన వేంకటపతి రాయలుతో ముగిసి, ప్రాభవం కోల్పోయిన విజయనగర మహాసామ్రాజ్యం క్రమేపీ మహారాష్ట్ర రాజ్యంలో విలీనమై పోయింది.

క్రీ.శ. 1336లో విజయనగర సామ్రాజ్యం స్థాపించబడితే, దానికి కేవలం పదకొండేళ్ల తరువాత క్రీ.శ. 1347లో కర్ణాటకలోని గుల్బర్గా పట్టణంలో అలావుద్దీన్ హసన్‌గంగూ బహమన్‌షా అనే అతను బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. ముస్లిములలో వీరిది షియా తెగ. నాటి నుండి వీరికీ విజయ నగర సామ్రాజ్యానికీ జరిగిన చిన్న చిన్న వైరములే పెరిగి పెద్దవై మహోన్నతమైన విజయనగర సామ్రాజ్య పతనానికి ప్రధాన కారణమయ్యాయి. మహమూద్‌షా (క్రీ.శ. 1482–1518) పరిపాలనా కాలంలో బహమనీ రాజ్యం చీలి, పైన పేర్కొన్న ఐదు షియా రాజ్యాలుగా విడిపోయింది. ఈ ఐదింటికీ విజయనగర సామ్రాజ్యంతో సరిపడేది కాదు. అలాగని వాళ్లంతా ఐకమత్యంగా వుండేవారా అంటే - అదీ లేదు. పరస్పరం తమ తమ ప్రయోజనాల కోసం కలహించుకున్నా క్రీ.శ. 1565లో జరిగిన తళ్లికోట యుద్ధంలో మాత్రం వారంతా ఏకమై దండెత్తి వచ్చి విజయనగర సామ్రాజ్య వినాశనానికి కారకులయ్యారు. ఆ ఐదు ముస్లిం రాజ్యాల సేనలూ కలిపినా సంఖ్యాపరంగానూ, సామర్థ్యం పరంగానూ, క్రమశిక్షణ పరంగానూ విజయనగర సైన్యం ముందు దిగదుడుపే - అయినా, యుద్ధ భూమిలో అళియ రామరాయలు చేసిన చిన్న తప్పిదం కారణంగా బహమనీ రాజ్యాలకే ఊహించని విజయం సంప్రాప్తించిందని లోగడ మనం తెలుసుకున్నాం.

బహమనీ రాజ్యం ఏర్పడిన నాటి నుంచి వారికి సంపన్నమైన, బలీయమైన పొరుగు రాజ్యం విజయనగరంపై ఈర్ష్యాసూయలే. ఎప్పుడూ విజయనగర సామ్రాజ్యంలో అశాంతి, అల్లకల్లోలాలు సృష్టించడానికి, పుకార్లను వ్యాపింపజేసి అక్కడి ప్రజల్లో అపోహలు, భయాందోళనలు కలిగించడానికి బహమనీ గూఢచారులు యత్నిస్తూనే వుండేవారట. రాజధానిలో రక్షణ పరమైన ఏర్పాట్ల గుట్టుమట్టులు తెలుసుకొనడానికీ, యుద్ధాలకు విజయనగర సైన్యం ఏ మేరకు సన్నద్ధంగా వుందో తెలిసికొనడానికి ఎప్పటికప్పుడు బహమనీ వేగుల వాళ్ళు ప్రయత్నించేవారట. అత్యంత బలోపేతమైన విజయనగర సామ్రాజ్యాన్ని యుద్ధంలో గెలువగలిగిన సామర్థ్యంలేని బహమనీ వారు తమ చారుల ద్వారా శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఆయనపై పలుమార్లు హత్యాయత్నాలు కూడా చేసి వ్యక్తిగతంగా ఆయన్ని తుదముట్టించే ప్రయత్నాలు కూడా చేశారు. ఇందుకు తగిన అదను కోసం వారు రాయలవారి ఆంతరంగికులతో పరిచయం పెంచుకుని వారి ద్వారా రాయలవారి రోజువారీ అలవాట్లు, ఆయన వ్యక్తిగత బలహీనతలు, ఆయన ఏకాంతంగా గడిపే సమయాలు వగైరాలపై కూడా కూపీ లాగేవారట. దీనికి తోడు వివిధ పద్ధతులలో రాజ్యంలో సామూహిక జనహననాలకు పూనుకొని ప్రజలలో భయాందోళనలు సృష్టించేవారట.

దీనిలో భాగంగానే ఒకప్పుడు బహమనీల పనుపున విజయనగర సామ్రాజ్యంలోకి ఒక దొంగ సన్యాసి వచ్చాడు. సచ్చిదానంద స్వామి అనే మారు పేరుతో వచ్చిన ఆ కపట సన్యాసి ప్రజలందరికీ దీర్ఘకాలం ఆరోగ్యంగా జీవించగలిగే ఓ సంజీవని వంటి మందును చవగ్గా యిస్తూ వున్నాడు. నిజానికి ఆ మందు మంద గరళం (*slow poison*). అది తీసుకున్న వారు నిదానంగా ఒక వారంలో కృంగి, కృశించి మరణిస్తారు. ఈ వారం కాలంలో కొన్ని వేల మందికి అనుమానం కలుగని రీతిలో ఆ మందును పంచి వేషం మార్చుకుని తెలివిగా అక్కడి నుంచి వుడాయించాలని ఆ బూటకపు సన్యాసి ఎత్తుగడ. అనుకున్నట్లే విజయనగరంలో అమాయకులైన సాధారణ పౌరులు యీ మందు కోసం ఎగబడ్డారు. అయితే సన్యాసి ఊహించినట్లుగా కాక ఆ మందు తీసుకున్న చాల మంది పౌరులు రెండు మూడు రోజులలోనే మరణించారు. ఒక వ్యక్తికి మందు బెడిసి కొట్టి మతి చలించింది.

రాజధానిలో ప్రజల నుండి యివన్నీ తెలుసుకున్న తెనాలి రామకృష్ణునికి ఆ కపట సన్యాసి దుశ్చర్యల పట్ల విపరీతమైన కోపం వచ్చింది. వెంటనే కొంత మంది జనాన్ని వెంటేసుకుని ఆ సన్యాసికి తగ్గ గుణపాఠం చెప్పాలని బయలు దేరాడు. ఆ జనంలో సన్యాసి యిచ్చిన మందు వికటించిన కారణంగా పిచ్చివాడైన వ్యక్తి కూడా వున్నాడు. రామకృష్ణుడు తెలివిగా అతడు నిజమైన సన్యాసి కాదనీ, వేషధారి అనీ, బహమనీ రాజ్యపు గూఢచారి అనీ అందరి ఎదుట ఋజువులతో సహా నిరూపించాడు. దీంతో కోపోద్రిక్తులైన ప్రజలు ఆ సన్యాసికి దేహశుద్ధి చేశారు. ఆ పిచ్చివాడైతే

విజృంభించి ఒక బాకుతో ఆ సన్న్యాసిని పొడిచి చంపాడు.

సన్న్యాసి హత్య వార్త రాచనగరులో దావానలంలా వ్యాపించింది. ఈ వార్త తెలిసిన వెంటనే రామకృష్ణుని బద్ధ శత్రువైన రాజగురువు తాతాచార్యులకు యిది చక్కటి అవకాశంగా పరిణమించింది. ఆయన హుటాహుటిన బయల్దేరి రాయలవారి వద్దకు వెళ్లి విషయాన్ని వివరించి, "రాయా! రామకృష్ణుడు అమాయకపు జనాన్ని రెచ్చగొట్టిన కారణంగానే ఈ రోజు ఓ సన్న్యాసి నిండు ప్రాణం బలైంది. ఒకవేళ రామకృష్ణుడు చెబుతున్నట్లు ఆ సన్న్యాసి దేశద్రోహి అయినప్పటికీ అతడిని శిక్షించాల్సిందెవరు ? తమ ఆంతరంగికుడైన రామకృష్ణుడే యిలా ఉచితానుచితాలు యోచించకుండా చట్టాన్ని చేతుల్లోకి తీసుకొంటే ఇక సాధారణ పౌరుల సంగతి వేరే చెప్పేదేముంది? ప్రభుత్వం చేయాల్సిన పనిని రామకృష్ణుడు ఒక విప్లవకారుడై తానే చేసేస్తున్నాడు. యింక ప్రభుత్వం వున్నట్లా? లేనట్లా? వెంటనే రామకృష్ణుడిని యీ నేరానికి తీవ్రంగా శిక్షించండి. ఇలా జనాన్ని రెచ్చగొట్టి హత్యలు చేయించడం రాజ్యంలో అరాచకానికి దారితీస్తుంది అది రాజద్రోహ నేరంతో సమానమని మీకు తెలియంది కాదు" అన్నాడు.

మనం ముందు చెప్పుకున్నట్లే రాయలవారు పాటించిన శిక్షాస్మృతి ప్రకారం బ్రాహ్మణులు అవధ్యులు. అంటే వారికి మాత్రం ఎట్టి పరిస్థితులలోనూ మరణ శిక్ష వేయరాదు. తీవ్ర నేరాలు చేసిన బ్రాహ్మణులను కూడా తప్పని పరిస్థితులలో రాజ్య బహిష్కారం, దేవిడీ మనా, కళ్లు పీకించడం వగైరా శిక్షలతోనే శిక్షించాలి. అయితే నేనింతకు ముందు తెలిపినట్లే (డామింగో పేయజ్ వ్రాతల ప్రకారం) పురోహితులూ, దేవాలయాలలోని అర్చకులు మినహా రాయలవారు యితర వృత్తులలో వున్న బ్రాహ్మణులను బ్రాహ్మణులుగా భావించే వాడు కాదు. అందుకేనేమో బ్రాహ్మణుల అవధ్యత అనే నియమాన్ని కూడా పాటించకుండా రాయలవారు ఎట్టి విచారణ లేకుండానే తాతాచార్యులు వగైరా బ్రాహ్మణ బృందం సలహాపై రామకృష్ణుడికి శిరచ్ఛేదం చేయాలని ఆదేశించారు. రాయలవారు బ్రాహ్మణ పరిషత్తు యొక్క దుర్బోధలకు లోనై, జరిగిన వాస్తవాలేమిటో లాపీగా విచారించడానికి పూనుకోలేదు సరికదా - కనీసం రామకృష్ణునికి తన గోడు వెళ్లబోసుకునే అవకాశం కూడా యివ్వలేదు.

రామకృష్ణుడి నేరాన్ని రాజధర్మం కొద్దీ రాజద్రోహ నేరంగా రాయలవారు భావించారే కానీ ఆయన అంతరాత్మకు ఆ నేరానికి యీ శిక్ష ఎక్కువేననిపించింది. 'ఒకవేళ తర్వాత విచారణలో ఆ సన్న్యాసి దేశద్రోహియని తేలితే రామకృష్ణుడు చేసిన పని నేరమెలా అవుతుంది ?' అని యోచించాడాయన. తన ఆంతరంగికుడైన రామకృష్ణుడి పట్ల రాయల వారికి ఎంత అభిమానముండి ఏం ప్రయోజనం? ఆయన కర్తవ్య నిష్ఠాగరిష్ఠుడు. పైపెచ్చు తాతాచార్యులు వగైరా బ్రాహ్మణ ప్రముఖుల వత్తిడి ఆయనపై తీవ్రంగా వుండింది. రామకృష్ణుడిని కాపాడే విషయంలో నిస్సహాయుడైన రాయలవారు యీ గండం నుంచి రామకృష్ణుడు యుక్తిగా ఎలాగోలా బయటపడగలడని నమ్మారు. బయటపడాలని మనస్సులో కోరుకున్నారు కూడా!

అతన్ని వధించేందుకుద్దేశించిన యిద్దరు భటులు క్షణంలో విచ్చుకత్తులతో సిద్ధమై అతడిని వెంట బెట్టుకుని ఒక డింగీలో తుంగభద్రా నది ఆవలి తీరంలోని కిష్కింధ ప్రాంతంలోని చిట్టడవిలోని వధ్యస్థలికి తీసుకెళ్లారు. తీరా అక్కడికి వెళ్లాక వారు బ్రహ్మ హత్యకు వెనుకాడారు. అప్పుడు రామకృష్ణుడు వారితో "భటులారా! ఇందులో మీ తప్పేముంది? మీ విధి మీరు నిర్వర్తించి తీరాలి. నిర్భయంగా రాజాజ్ఞను అమలు జరిపినందుకు మీరు స్వర్గానికి వెళతారు. రాజాజ్ఞను పాటించడం కంటె భృత్యులకు వేరే ధర్మమేముంది? బ్రహ్మహత్యాపాతకం మిమ్మల్ని అంటనే అంటదు. అయితే మీ కర్తవ్యాన్ని మీరు నెరవేర్చే ముందు నాదొక చిన్న కోరిక. జీవితంలో చివరిసారిగా నా కత్యంత ప్రీతిపాత్రమైన తుంగభద్రానదిలో

టి స్నానం చేసి శుచినై వచ్చిన పిదప మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి. దయచేసి యీ పేద బ్రాహ్మడి ఆఖరి కోరికను కాదనకండి" అని ప్రాధేయపడ్డాడు. ఆ భటులకు కూడా రామకృష్ణుడిపట్ల సానుభూతిగానే వుంది. రాయలవారు యింత నిర్దాక్షిణ్యంగా రామకృష్ణుడికి మరణ శిక్ష విధించడం వారికీ రుచించ లేదు. అయినా ఏం చేస్తారు? రాజాజ్ఞ అనుల్లంఘనీయం కదా! అప్పుడా భటులు రామకృష్ణునితో, "అయ్యోరూ! నువ్వు సేసిన సిన్న తప్పుకు నీకు మరనశిచ్చేశారు రాయలోరు. నీ బాదలు సూత్తావుంటే మాకు కూడా బాదగానే వుంది. సరే నీ యిట్ట పెకారంగానే కానియ్యి. సావబోయే ముందు నువ్వు తుంగబద్రలో రెండు మునుగులు మునిగితే మాకు పోయేదేముంటది? ఎట్టాగూ సావబోయే నేరత్తుడివి. అందులోనూ బాపనయ్యవి. నీ కోరిక ఎట్టా కాదనగలం? గబుక్కున ఎల్లి దుబుక్కున రొండు మునుగులు మునిగి యీడనే వున్నట్టుగా ఎంటనే వచ్చెయ్యాల. నువ్వొచ్చేదంక యేటి ఒడ్డున యీ సెట్టుకాడనే కూకుని వుంటాం. బేగి ఎల్లిరా!" అన్నారు. ఇదే అదనుగా భావించిన రామకృష్ణుడు మెల్లగా తుంగభద్రానదిలోకి దిగి తాను మునిగిన మొదటి మునుగులోనే అతివేగంగా తుంగభద్రానది కుడి గట్టు వైపుకు – అంటే విజయనగరం వైపుకు వేగంగా యీదసాగాడు. రామకృష్ణుడు మునుగు యీతలో మంచి ప్రవీణుడు. దానికి తోడు నది మంచి ఉరవడిగా ప్రవహిస్తున్నది. అంచేత క్షణాల్లో నది దక్షిణపు గట్టుకు అతడు చేరుకుని జరిగిన ఘటనలో వాస్తవాలేమిటో రాయలవారికి స్వయంగా తెలుపుకొనడానికి రాజసభ వైపుకు దూసుకెళ్లాడు. రాజభటులు మొర్రో అనుకుంటూ తిరిగి డింగీలో ఎక్కి యీవలి గట్టుకు రాసాగారు. "ఏదోలే యెర్రి బాపనయ్య అనుకున్నాంగానీ, మనన్ని యిట్టా మోసం సేత్తాడనుకోలేదురా. ఈ యిసయమంతా యెంటనే యెల్లి మారాజు గోరికి సెప్పెయ్యాల" అనుకుంటూ వాళ్లు కూడా పరుగు పరుగున రామకృష్ణుడికి కొంచెం వెనకగా రాచనగరుకు చేరుకున్నారు.

రామకృష్ణుడు అసలు జరిగిందేమిటో ఏకాంతంగా రాయలవారికి విన్నవిద్దామనుకుంటే అతడు వెళ్లే సరికి రాయలవారింకా సభలోనే వున్నారు. రామకృష్ణుడిని తిరిగి రాజసభలో చూడగానే పురోహిత వర్గం అగ్గిమీద గుగ్గిలమయింది. రాయలవారు తాము ఊహించినట్లుగానే ఏదో రకంగా టక్కులు చేసి రామకృష్ణుడు తప్పించుకున్నందుకు మనస్సులో సంతోషించారు. ఆ సమయంలో ఆయన ఒంటరిగా ఉంటే ఎలా వుండేదో మరి! బ్రాహ్మణ పరిషత్తు సమక్షంలో రాయలవారు తీవ్రమైన కోపాన్ని ప్రదర్శిస్తూ "ఏం రామకృష్ణయ్యా! రాజాజ్ఞను ధిక్కరించ సాహసించి మీరు మరో నేరానికి పాల్పడినట్లయింది. మరణశిక్ష అమలు కాకుండా పారిపోయి వచ్చి మీరు మరింత పెద్ద నేరం చేసినట్లయింది. ఇక దానికి శిక్ష ఏనుగులతో త్రొక్కించడమే" అంటూ భటులతో, "యితడిని వెంటనే తీసుకెళ్లి గొయ్యితీసి గొంతు వరకు పాతి పెట్టి మదపుటేనుగులతో త్రొక్కించి చంపండి. శిక్షను అమలు పరచడంలో ఏదైనా తేడా వచ్చిందో మీ తలలు తీయిస్తాను. జాగ్రత" అని కఠోరంగా ఆజ్ఞాపించారు. రామకృష్ణుడు చెప్పబోయిన విషయాల్ని వినేందుకు ఎంతమాత్రమూ యిష్టపడక రాయలవారు నిర్దాక్షిణ్యంగా మరణదండన విధించినా – ఆయన మనస్సులో మాత్రం యీసారి కూడా రామకృష్ణయ్య ఏదో మాయ చేసి తప్పుకుంటాడేమోననే ఊహ మెదిలింది. అలాగే జరిగితే బాగుణ్ణని రాయలవారు లోలోపల కోరుకున్నారు కూడా!

ఈసారి భటులు తుంగభద్రానది ఒడ్డున వున్న ఒక సమతల ప్రదేశానికి రామకృష్ణుడిని తీసుకెళ్లారు. రాజాజ్ఞ మేరకు అక్కడి కాలి బాటకు ప్రక్కగా అతడిని ఓ గొయ్యి తీసి అందులో గొంతు వరకు పూడ్చిపెట్టారు. అప్పుడు రాత్రి ఏడుగంటలు కావచ్చింది. వెంటనే గజశాలలకు వెళ్లి ఏనుగుల్ని తీసుకురావడానికి బయల్దేరారు వాళ్లు. వెళ్తూ రామకృష్ణుడికేసి చూసి "అయ్యోరూ! యీసారి మాకాడ నీటక్కులేయీ సెల్లవు. ఏదోలే యెర్రి బాపనయ్య వని దయదలిత్తే మా కొంపలకే ఎసరు పెడతావ్? అద్దరేతిరి కల్లా యేనిగలు నిన్ను తొక్కిసంపేత్తాయి. యీ లోపటే దేవుడికి సేసే ప్యార్థనలేం సేసుకుంటావో సేసుకో. నీ యిట్టం" అంటూ వెళ్లారు.

వాళ్లటు వెళ్లారో లేదో ఆ ఏకాంత స్థలానికి యిద్దరు వ్యక్తులు వచ్చారు. అక్కడెవరూ లేరు కదా అని వారు కొంచెం బిగ్గరగానే మాట్లాడు కుంటున్నారు. వారు మాట్లాడుకునేదేమై వుంటుందా అని రామకృష్ణుడు శ్రద్ధగా ఆలకించాడు వారి మాటలను బట్టి వారిలో ఒకడు బహమనీ సుల్తానుల ప్రతినిధియైన గూఢచారి అనీ, రెండవవాడు విజయనగర ఆస్థాన జోశ్యుడు పేరిశాస్త్రి అనీ అర్థమయింది రామకృష్ణుడికి. ఆ గూఢచారి జోశ్యుడిని రాయలవారికి రాయచూరుపై దాడికది సమయం కాదనీ, అప్పటి ఆయన గ్రహస్థితి బాగుండలేదనీ నమ్మజెప్పి, రాయలవారు రాయచూరుపై దండెత్తకుండా చూడాలని కోరుతున్నాడు. ఇందుకుగాను ఆ గూఢచారి పేరిశాస్త్రికి ఐదువేల పణాలు లంచంగా యిచ్చి, మరో ఐదువేలు పని పూర్తయితే యిచ్చేట్లు ఒప్పందం కుదుర్చుకున్నాడు. రాయలవారికి ముహూర్తబలం మీద ప్రగాఢమైన విశ్వాసం వుంది. ఇతరత్రా కూడా మూఢ నమ్మకాలు ఎక్కువేనని చెప్పాలి.

రామకృష్ణుడు అప్పుడిలా ఆలోచించాడు. "వీరిద్దరి మధ్య జరిగిన సంభాషణను బట్టి బహమనీ సుల్తానులు ప్రస్తుతం యుద్ధానికి సన్నద్ధంగా లేరు. అంచేతనే వారు యీ గూఢచారి ద్వారా జోస్యాలపైనా, జోశ్యులపైనా రాయలవారికున్న విశ్వాసాన్ని అడ్డం పెట్టుకుని ప్రస్తుతానికి రాయలవారు రాయచూరుపై దాడి వెడల కుండా చూడాలని ప్రయత్నిస్తున్నారు ఈ ముఖ్యమైన రహస్యాన్ని రాయలవారికి చేరవేసి ఎలాగైనా సరే రాయలవారు వెంటనే రాయచూరుపై దండెత్తేట్లు చేయాలని అతడు భావించాడు. అలా జరిగితే రాయలవారి గెలుపు, బహమనీల ఓటమి తథ్యమని నమ్మాడతడు. ఇందుకేం చేయాలి? రాయలవారికి జోశ్యుడు పేరిశాస్త్రి నమ్మక ద్రోహం కబురు చేరవేసేదెలా? తాను చూడబోతే గొంతులోతు పాతేయబడ్డాడు. ఒకవేళ అందులో నుండి ఏదైనా యుక్తి పన్ని తప్పుకున్నా, రాజాజ్ఞను ఉల్లంఘించి, మరణశిక్ష నుండి తప్పుకుని రాయలవారి క్రోధానికి ఒకసారి గురైన తాను తిరిగి మరోసారి రాయలవారిని నేరుగా కలిసే ప్రయత్నం చేయడం అవివేకమూ, అత్యంత ప్రమాదకరమూ ననిపించిందతనికి. ఈ వార్త నెలాగైనా మహామంత్రి తిమ్మరుసుకు చేరవేయాలి అందుకు మార్గమేమిటి? ఇక్కడ నుంచి ముందు బయట పడాలి గదా!"

ఇలా ఆలోచిస్తూ వుండగా అప్పటి వరకూ బాగా అలసి పోయి వున్న రామకృష్ణుడికి కళ్లు మూతలు పడుతున్నాయి చిన్న కునుకు తీస్తూండగా ఏదో అలికిడి వినిపించి మెలకువ వచ్చింది. పారజూస్తే ఓ గూని చాకలి కూని రాగాలు తీస్తూ బట్టల మూటలు మోస్తున్న తన గాడిదను అదలిస్తూ వస్తుండడం కనుపించింది. అతడి పేరు మడేలు మల్లన్న.

విజయనగరంలో ఆ కాలంలో మడేలు మల్లన్నని ఎరగని వాళ్లు లేరు. పొట్టిగా, గూనిగా వుండే మల్లన్నకి పిల్లనిచ్చే వాళ్లు ఎవరూ దొరక్క ఎన్నాళ్లో పెళ్లికాకపోతే, చివరికి – అక్కకూతురు, తన కంటే యిరవయ్యేళ్లు చిన్నదైన ఎల్లిని చేసుకున్నాడు మల్లన్న. పదో యేటే పెళ్లయిన ఎల్లమ్మకు అప్పట్లో లోకజ్ఞానం బొత్తిగా లేదు. వయసొచ్చే కొద్దీ ఊహ తెలిసి అందరు మొగాళ్లలా కాక తన మొగుడు పొట్టిగా, గూనిగా, అందనికారంగా ఉన్నందుకెంతో కుమిలి పోయేది. తమ కులంలోని అందరు మొగుడూ పెళ్లాలలా చాకిరేవుకు జంటగా వెళ్లి బట్టలుతుక్కు రావాలంటే యీ గూని మొగుడి వెనకనబడి వెళ్లాలి. అదెంతో అవమానకరమని భావించేది ఎల్లి. నలుగురూ గేలిచేస్తారని దడిచేది. 'తన అంద చందాలు, వయస్సు యిలాగే అడవి గాచిన వెన్నెలగా వృధా కావల్సిందేనా?' అని మనస్సులో ఎంతో బాధపడేది. ఆ బాధనంతా మొగుడిపై వెళ్లగక్కేది. 'సాకి రేవు కెల్దాం రాయే ఎల్లీ!' అని మొగుడు పిలిస్తే, "మొహం జూడు మొహం. ఈ గూని మొగుడితోనా నేను సాకిరేవు కొచ్చేది? పాణాలు పోయినా అది జరగదు. ఏం జేత్తావో నాకనవసరం. ఏ మందులన్నా మింగు – ఎట్టనన్నా సరే నీ గూని పోగొట్టుకో. అప్పుడే నీతో ముద్దూ మురిపెం – మావా!" అంటూ కుండబద్దలు కొట్టినట్టు చెప్పేసేది. ఇక మల్లన్న ఒంటరిగానే చాకి రేవు కెళ్లి బట్టలుతుక్కొచ్చేవాడు. అతడి కుంటి గాడిదే అతనికి తోడు. పొద్దంతా రేవులో బండ

చాకిరీ చేసి యింటికొస్తే యింటి దగ్గర ఎల్లి సతాయింపొకటి! పొట్టి వాడనీ, గూనివాడనీ, అందవిహీనుడనీ మల్లిగాడిని ఎల్లి అస్తమానం ఎత్తి పొడిచేది. వంటపని మినహా యిటు పుల్లతీసి అటు పెట్టేది కాదు. పొద్దంతా యింట్లో ఊరికేనయినా వుండేది గానీ ఉదికిన బట్టలు మడతలు పెట్టి చలవ యిస్త్రీ చేయడం కూడా తప్పుగా ఎంచేది. ఇదంతా తన మొగుడి మీద కసి కారణంగానే! అతడిపై కలిగిన విరక్తి అతడి కులవృత్తిపైన వ్యతిరేకతగా మారింది ఎల్లికి. మల్లిగాడికో – పెళ్లామే సర్వస్వం! పొద్దున్నే రేవు కెళ్లేముందు ఆమె ఒక్క చిరునవ్వుతో సాగనంపితే చాలు – రోజంతా సంతోషంగా బండచాకిరీ చేసేవాడు మల్లన్న. ఎల్లి తనని సతాయిస్తున్న విషయమై తన అక్కా బావా ఎల్లిని మందలించి హితవు చెప్పడం కూడా మల్లన్నకిష్టముండేది కాదు. 'ఇంకా చిన్న పిల్ల. కొన్నాళ్లుపోతే అదే సర్దుకు పోతుందిలే. దాని మనసెందుకు కష్టపెట్టాలి' అన్న ఆలోచన మల్లన్నది.

ఆ రోజుల్లో విజయనగరంలో ఊర చెరువులన్నీ మంచినీళ్లకే వాడేవాళ్లు. చాకళ్లు బట్టలుతుక్కు రావాలంటే తుంగభద్రానదికి వెళ్లాల్సిందే. తుంగభద్ర కుడిగట్టు పొడవునా చాకిరేవులుండేవి. చాకళ్లందరూ హుషారుగా మొగుడూ పెళ్లాలు జంటలు జంటలుగా రేవుకెళ్తే గూని మల్లన్న ఒక్కడే కాళ్లీడ్చుకుంటూ కుంటి గాడిద తోడు రాగా భారంగా చాకిరేవు కెళ్లేవాడు. తన ప్రాణానికి ప్రాణమైన ఎల్లిని యింట్లో ఒంటరిగా వదలి వేసి వెళ్లడం అతనికి యిష్టముండేది కాదు. అయినా భుక్తి కోసం తప్పదు మరి. వెళ్లేటప్పుడు కూడా అతడికి ఎల్లి యావే! అందరు చాకళ్లూ పొద్దున్నే నదికి వెళ్లి సాయంత్రం యిళ్లకు తిరిగి వచ్చేవారు. మల్లన్నేమో బారెడు పొద్దెక్కినాక రేవు కెళ్లి బాగా చీకటి పడ్డాక యింటికి తిరిగొచ్చేవాడు. మరి మల్లన్న సమస్యలు మల్లన్నవి. పొద్దునపూట విజయనగరంలోని పిల్లలంతా బళ్లకు వెళ్లాకనే మల్లన్న రేవుకు బయల్దేరి వెళ్లి, సాయంత్రం బజారులలో ఆటపాటలన్నీ ముగిసి పిల్లలంతా ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోయినాక మాత్రమే రేవునుంచి తిరిగొచ్చేవాడు. ఏ రోజన్నా కొంచెం ముందుగా రేవుకు బయల్దేరినా, కొంచెం పెందరాడే యింటి ముఖం పట్టినా, మల్లన్నకు ఎక్కడో ఒక చోట బడి పిల్లలు తారసపడేవారు. ఇక అంతే – వాళ్లు అతడిని గేలిచేసి, ఏడిపించడం, రాళ్లువేసి కొట్టి బాధించడం జరిగేది. ఈ బాధలు పడలేకనే మల్లన్న బడిపిల్లలు వీధుల్లో వుండే సమయం తప్పించి బారెడు పొద్దెక్కాక రేవుకెళ్లి, బాగా చీకటి పడ్డాక తిరిగి రావడం అలవాటు చేసుకున్నాడు.

ఎప్పట్లాగే ఆ రోజు కూడా మసక చీకట్లో రేవు నుంచి బయలుదేరి, బట్టల మూటలు మోస్తున్న కుంటి గాడిదను అదలించుకుంటూ, చిన్నగా కూని రాగాలు తీస్తూ తుంగభద్రానది ఒడ్డునగల కాలి బాటపై హుషారుగా వస్తున్నాడు మల్లన్న. అతడు ఇంటి నుండి రేవు కెళ్లేటప్పుడు భారంగా వెళ్తాడు గానీ, ఇంటికొచ్చేటప్పుడు అతని హుషారు చూసి తీరాల్సిందే. ఇంట్లో ఒంటరిగా వున్న ఎల్లిని తలచుకుని ఒకటే చిందులు, పాటలు.

" అందాల నా ఎల్లీ . . . మురిపాల మరుమల్లీ
మల్లిగాడి పెతాపం . . . యినుకోవే . . మల్లీ . . . మల్లీ . . .
ఇవరంగ సెబుతాను . . . ఆలకించు నా ఎల్లీ . . .
ఇప్పి యిప్పి సెబుతాను . . . యినుకోవే . . మల్లీ . . . మల్లీ . . .

సలవ మడత కట్టుకుని. . . తలపాగా సుట్టుకుని
నెత్తికి మూటెత్తుకుని . . . సాకిరేవు కెళతంటే . . .

' అందరంటివోడు గాదు . . . మాయదారి మల్లిగాడు
అందానికి మనమదుడు . . . దర్వాలో దొరబాబే . . .

' మల్లిగాణ్ణి మించినోదు మరిలేద'ని వూరు జనం
ఎగబడి పైకొచ్చారు. . . ఎగాదిగా సూశారు. . . అందాల ॥

కోరమీసంలో వుంది . . . కోదెతాసు రోసం
జబ్బల సత్తాతోటి . . . అబ్బా అనిపించగలదు . . .

గతుకుదులో ఉతుకుదులో . . . గడసరోదు మల్లిగాడు
బండమీద దెబ్బేస్తే . . . కొండలు పిండవుతాయి

మల్లిగాడికేది లోటు . ... మాయదారి గూనితప్పు
యీ . . . మదేలన్నకేంది లోటు . . . ముదనట్టపు గూని తప్పు . . . ఈ ముదనట్టపు గూని తప్పు . . .
రేవు కాడి జనం గూడ . . . ఒకే మాట . . . ఇదే పాట
సత్తెం . . . మరి నమ్మకుంటె . . . కుంటిగాడిదే సాచ్చెం . . . అందాల ॥

అందగాడినైనా . . . నేనదరగొట్టేటోణ్ణైనా . . . గూని వున్నదనే గదా . . . గోలగోల సేత్తారు . . .
ఆకతాయి పిల్లమూక . . . నన్ను గేలి సేత్తారు . . . ఎగాదిగా సూత్తారు . . . ఎకసక్కెం సేత్తారు . . .

పిల్లకాకి కేందెలుసే . . . ఉండేలు దెబ్బ? యీ . . . పిల్లమూక కేందెలుసే . . . యీ మదేలు దెబ్బ ?
యీ . . . మల్లన్నకు గూనిపోవు మందో మరి మంతరమో . . .
దొరికిందా . . . సిగదరగ . . . సచ్చిందే గొఱ్ఱె . . .

అట్టాగే జరగాలని కోరుకోవె ఎల్లమ్మా . . .
అదే . . అదే కావాలని మొక్కుకోవె నా సిలకా . . .
అందాకా మరికాస్త ఓర్సుకోవె నా సిలకా . . . అందాల నా ఎల్లి ॥

అలా ఉల్లాసంగా చిందులేస్తూ వస్తున్న మల్లిగాడు గొంతు దాకా నేలలో పాతి పెట్టబడిన రామకృష్ణుడి కంట్లో పద్దాడు రామకృష్ణుడికి వెంటనే మెరుపు లాంటి ఆలోచన మదిలో మెదిలింది. వెంటనే అతడు మల్లన్నతో "ఏం మదేలా! ఏమిటి విషయం? జోరు మీదున్నావు?" అని ప్రశ్నించాడు. (మదేలు అంటే చాకలి అని అర్థం) అతడు చుట్టూ తేరిపార చూశాడు. కనుచూపు మేరలో నర సంచారమే కానరాలేదు. అంచేత ముందీ మాటలు వినగానే ఏ దెయ్యమో, భూతమో అనుకుని అతడి పై ప్రాణాలు పైనే పోయాయి. తరువాత పరిశీలనగా చూస్తే తాను నిలబడిన చోటికి మూడడుగుల దూరంలో నేలపై ఒక మనిషి తల కనపడింది. నుదుట పంగనామం, వెనుక పిలక కలిగి వుండడాన్ని బట్టి ఎవరో బ్రాహ్మడిని గోతిలో గొంతుదాకా పాతిపెట్టారని అర్థమయింది మల్లన్నకి. "ఏంది అయ్యోరూ యిది? నిన్నెవురిట్టా పాతి పెట్టారు?" అంటూ ప్రశ్నించాడతడు. దానికి రామకృష్ణుడు తెలివిగా, "ఏం చెప్పమంటావులే మదేలా! నాకు పుట్టుకతో

గూని. అందరూ ఎగతాళి చేస్తూంటే ఎలాగోలా భరిస్తూ నెట్టుకొస్తున్నాను. మొన్ననో సాధువు యిలా గోతిలో 24 గంటలు గడిపితే గూని పోయి, వీపు సాఫవుతుందని చెప్పాడు. అంచేత నిన్న సాయంత్రం గొయ్యి తీయించి నన్నిలా గొంతు దాకా పాతిపెట్టించు కున్నాను. 24 గంటలు గడిచాయి. కాబట్టి నన్ను బయటికి తియ్యి. నా గూని పోయిందో లేదో చూద్దాం" అన్నాడు మల్లన్నతో. మల్లన్న ఎంతో ఉత్సుకతతో, "ఎట్టా! అయ్యోరూ – నీవు సెప్పేదంతా నిజమే? పొద్దుగాల నేను రేవు కెల్లేటప్పుడు తమర్ని సూడలేదే. . .ఏమో– నా యావలో నేనుండానేమోలే!" అంటూ గబగబా అక్కడి పారతో మట్టిని తొలగించి రామకృష్ణుడు గోతిలోంచి బయటికి వచ్చేటట్లు చేశాడు. రామకృష్ణుడు గోతి నుంచి బయట పడి, ఒక్కసారి ఒళ్లు విరుచుకుని, "మడేలా! ముందుగా నా వీపు సాఫయి పోయిందేమో చూడు" అన్నాడు. మల్లన్న రామకృష్ణుడి వీపు సాపుగా వుండడం చూసి, ఎగిరి గంతేసి "అయ్యోరూ! అయ్యోరూ! నాక్కూడా తమరిలాగే పుటుకతో గూని. నన్ను సూసి ఆకతాయి పిల్ల మూకలు ఒకటే ఎగతాళి సేత్తండారు. రాళ్లేసి కొట్టి బాదిత్తన్నారు. ఇంటి కాడ నా పెళ్లాం ఎళ్లికి నేను యీ గూని వల్లనే లోకువై పొయ్యాను. ఏం చెప్పేది నా బాదలు! ఇలా గోతిలో కూకుంటే నాక్కూడా యీపు సాపవుద్దా?" అని అడిగాడు ఆసక్తిగా. దానికి రామకృష్ణుడు "ఓ ! భేషుగ్గా అవుతుంది. అయితే 24 గంటలపాటు యిలా గోతిలో కదలకుండా వుండాలి మరి" అన్నాడు. అప్పుడు ఒక్క ఉదుటున ఆ గోతిలోకి దూకి మల్లన్న ఆనందంతో, "అయ్యోరూ! నన్నిందులో పీకెదాకా పాతెయ్యి. ఇరవైనాలుగ్గంటలేం కర్మ నా యీపు సాపవుద్దంటే ఇరవై నాలుగు రోజులన్నా యిందులోనే వుంటా – ఈపు సాపయితే గబగబా యెల్లి నా ఎళ్లికి సూపెట్టాల. పిచ్చిముండ ఎంత సంబరపడి పోతదో!" అన్నాడు. రామకృష్ణుడు, మనస్సులో 'ఈ మడేలు నా కారణంగా అన్యాయంగా బలవుతున్నాడే అని బాధపడుతూనే దేశరక్షణ కోసం యీ పని చెయ్యక తప్పదు మరి' అని తనను తాను సమాధాన పరచుకుని మల్లన్నను గొంతుదాకా గొయ్యిలో పూడ్చి హుటాహుటిన తిమ్మరుసు మందిరానికి బయల్దేరాడు.

తిమ్మరుసుకు రామకృష్ణుడంటే ఎనలేని అభిమానం. తన అల్లుడు నాదెండ్ల గోపన్న రామకృష్ణుడి గురించి తనకు సిఫారసు చేశాడనే కాక, రామకృష్ణుని తండ్రి గార్లపాటి రామన్నతో తిమ్మరుసుకు పూర్వ పరిచయం, కొంత దూరపు బంధుత్వం వుండడం కూడా యిందుకు కారణం. రామకృష్ణుడు ఆప్యాయంగా 'తాతగారూ!' అని సంబోధించేవాడట ఆ మహామంత్రిని. తిమ్మరుసు ఎప్పుడూ రామకృష్ణుని క్షేమం కోరేవాడు. అతడి తెలివి తేటలూ, సూటితనం, సమయస్ఫూర్తీ ఆయననెంతో ఆకట్టుకున్నప్పటికీ, ఉచితానుచితాలు పాటించని రామకృష్ణుని దుందుడుకుతనం, ప్రాణాల మీదకు తెచ్చుకునే అతడి తొందరపాటు చర్యలు తిమ్మరుసుకు నచ్చేవి కావు. అయినా మరణ దండనపాలైన రామకృష్ణుడు రెండవసారి కూడా ఏదైనా అద్భుతం జరిగి ప్రాణాలతో బయట పడితే బాగుణ్ణని రాయలవారితో పాటు తిమ్మరుసు మంత్రి కూడా మనస్సులో కోరుకున్నాడు.

రామకృష్ణుడు అక్కడికి వెళ్లేసరికి తిమ్మరుసు విజయనగర సర్వసైన్యాధ్యక్షుడు పెమ్మసాని రామలింగ నాయకునితో రాజ్య రక్షణ పాటవంపై దీర్ఘంగా మంతనాలు జరుపుతున్నాడు. రామకృష్ణుని చూడగానే ఆశ్చర్య పోవడం వారిద్దరి వంతయింది. తిరిగి తానెలా ప్రాణాలతో బయటపడ్డాడో వివరించ మన్నాడు అప్పాజి. దానికి రామకృష్ణయ్య 'తాతగారూ! అవన్నీ మరోసారి తీరుబాటుగా చెబుతాను. ప్రస్తుతం అనుకోని ఉపద్రవమొకటి దాపురించింది' అంటూ బహమనీ సుల్తానుల గూఢచారికీ, పేరిశాస్త్రికీ జరిగిన, తాను విన్న సంభాషణ తిమ్మరుసుకు వివరించి కర్తవ్య బోధ చేయమన్నాడు.

ముందు జోశ్యుల మీద – మరీ ముఖ్యంగా ఆస్థాన జోశ్యుడు పేరి శాస్త్రి మీద రాయలవారికి గల అపార విశ్వాసం తొలగితేనే గానీ విజయనగర సామ్రాజ్యానికి క్షేమం లేదు అని వారంతా ఏకాభిప్రాయానికి వచ్చారు. పేరిశాస్త్రి

రాజగురువు తాతాచార్యుల వారికి అత్యంత ఆప్తుడు. పైగా ఆస్థాన జోశ్యుడు. రాయలవారి సమక్షంలో పేరిశాస్త్రి రాజద్రోహ నేరాన్ని బయట పెట్టాలి. ఎలా? - అని ఆలోచించి ముగ్గురూ కలిసి యుక్తిగా ఒక పథకం రచించారు. దాని ప్రకారం రామకృష్ణుడు తెల్లని గడ్డాలు, మీసాలు తగిలించుకుని అక్షయ మెహతా అనే ప్రసిద్ధిగాంచిన సౌరాష్ట్రకు చెందిన జ్యోతిశ్శాస్త్ర పండితుని అవతారమెత్తాడు. ఆ వేషంలో తిమ్మరుసు ద్వారా రాయలవారికి పరిచయం చేయబడ్డాడు. వీరు రాలయవారిని కలవడానికి వెళ్లినప్పుడు ఆయన తాతాచార్యుల వారితోనూ, పేరిశాస్త్రితోనూ సమాలోచనలో వున్నారు. 'యావద్దేశంలో ఖ్యాతి గాంచిన జ్యోతిశాస్త్ర పండితుడు అక్షయమెహతా, మహామంత్రి తిమ్మరుసు తమ సముఖానికి రానున్నారు' అని దౌవారికులు తెలుపగానే రాయలవారు తమ గ్రహస్థితిపై జ్యోతిశ్శాస్త్ర చర్చే జరుగుతున్నది కనుక వెంటనే వారిద్దరిని కూడా రమ్మని కబురంపాడు. రాయలవారి సమక్షంలో పేరిశాస్త్రిని చూడగానే మెహతా (రామకృష్ణుడు) అప్పాజీతో 'ఎవరీ అల్పాయుష్కుడు?' అని ప్రశ్నించాడు. "స్వామీ! వారు పేరిశాస్త్రులవారని - ఆస్థాన జోశ్యులు" అన్నాడు తిమ్మరుసు. పేరిశాస్త్రికి తనను ఆ నూతన వ్యక్తి అల్పాయుష్కుడు అన్నందుకు చిర్రెత్తుకొచ్చింది. అతడు కోపంగా, "నాది పూర్ణాయుర్దాయం. సరిగ్గా ఎనభైనాలుగేళ్ల పదకొండు నెలల ఇరవై మూడు రోజులు నేను జీవిస్తాను. ఇది తిరుగులేని సత్యం' అన్నాడు. మెహతా చిరాకుగా 'అర్భకా! నీ జోశ్యం శుద్ధతప్పు. నువ్వు మరి కొన్ని క్షణాలలో మరణిస్తావు" అన్నాడు. సరిగ్గా అదే సమయంలో తిమ్మరుసు, రామకృష్ణుడు, రామలింగ నాయకుడు ముందుగా వేసుకొన్న పథకం ప్రకారం ఒక తెరచాటు నుంచి వారు నియమించిన ఒక విలుకాడు విషపూరితమైన బాణాన్ని సూటిగా పేరిశాస్త్రి గుండెల్లో నాటాడు. పేరిశాస్త్రి విలవిలా తన్నుకుంటూ చివరి క్షణంలో తననోటితో తానే తన రాజద్రోహ నేరాన్ని అంగీకరించి తనలాంటి ద్రోహికిది తగిన శాస్తే' అంటూ ప్రాణాలు విడిచాడు. తిమ్మరుసు పేరిశాస్త్రి రాజద్రోహాన్ని వివరించి, బహమనీలు యుద్ధానికి సన్నద్ధంగా లేరనీ, వెంటనే రాయచూరుపై యుద్ధ సన్నాహాలు ప్రారంభిస్తే విజయం తమనే వరించి తీరుతుందనీ ఘంటాపథంగా చెప్పాడు. దీనికి రాలయవారు ఎంతగానో సంబరపడి "అప్పాజీ! మీ ఋణం నేనెలా తీర్చుకొనగలను. నా కళ్లు తెరిపించి మన సామ్రాజ్యానికి యీ విధంగా మీరు మరువలేని మహోపకారం చేశారు" అన్నారు. అప్పుడు అప్పాజీ, "రాయా! ఈ విషయంలో నేను నిమిత్తమాత్రుడిని. తన అఖండ ప్రజ్ఞాపాటవాలతో ప్రాణాలకు తెగించి యీ కుట్రను బయటపెట్టిన ఓ దేశభక్తుడున్నాడు. అయినా ఏం లాభం? అతడు మీ ఎదుటపడలేని దురదృష్టవంతుడు. అతడు లోగడ చేసిన పొరపాట్లను మన్నించి పెద్ద మనస్సుతో మీరు క్షమిస్తానంటే అతడిని మీ ఎదుట హాజరు పరచగలను" అన్నాడు. రాయలవారు విస్మయంగా "అప్పాజీ! అంతటి మహోన్నత వ్యక్తిని నేను క్షమించడమా? నా రాజ్యం, ప్రజలు ఆ మహాత్ముడికి ఎల్లకాలం ఋణపడి వుంటాం. ఆ దేశభక్తుడెవరో త్వరగా బయట పెట్టండి" అన్నారు. వెంటనే రామకృష్ణుడు తన మీసాలూ, గెడ్డాలూ పీకేసి, "నేను మహాప్రభూ! నా భార్య చేతివంట యింకా తినాలనీ, మీరు వేసే శిక్షలు యింకెన్నో భరించాలనీ నా జాతకంలో వుండడం కారణంగా రెండోసారి కూడా మీరు విధించిన మరణ దండన నుండి క్షేమంగా తప్పుకోగలిగాను. నన్ను క్షమిస్తానని ముందే మాట యిచ్చారు కనుక మీ ఎదట పడగలిగాను. కరుణించి మన్నించండి" అన్నాడు. దానికి రాయలవారు, 'ఎంత మాట రామకృష్ణయ్యా! మీ వంటి ఉదారశీలినీ, దేశభక్తుడినీ అర్థం చేసుకోనందుకు నన్ను నేనే శిక్షించుకోవాలి. ఎన్నో మార్లు 'భువన విజయం' ప్రతిష్ఠ కాపాడిన మీరు యీ సారి విజయనగర మహా సామ్రాజ్యం యొక్క ఉనికినే కాపాడి ఎనలేని మహోపకారం చేశారు. దైవ నిర్ణయం మీకనుకూలంగా వుండి మీరు మృత్యువును రెండు సార్లు అవలీలగా జయించారు. ఇంకా మీ వంటి మహోన్నత వ్యక్తిని శిక్షించడం కూడానా? ఇక మిమ్మల్ని శాశ్వతంగా నా హృదయమనే చెరసాలలో బంధిస్తాను" అంటూ ఆప్యాయంగా రామకృష్ణయ్యను కౌగిలించుకున్నారు. ఎన్నడూ కన్నీరొలుకని

ఆ అరివీర భయంకరుడి కళ్ళ వెంట ఆనందబాష్పాలు జలజలా రాలాయి. రాయల వారికీ, రామకృష్ణయ్యకూ యీ ఘటనతో మైత్రీబంధం మరింత బలపడింది. పేరిశాస్త్రి కుట్ర బహిర్గతమైనందున, పేరిశాస్త్రికి అన్నింటిలోనూ వత్తాసు పలికే రాజగురువు తాతాచార్యుల వారు యీ ఘటన కారణంగా రాయలవారి దృష్టిలో మన్నన కోల్పోయారు. ఈ కుట్రలో తాతాచార్యులకూ భాగముందని నిర్ధారించిన మంత్రి మండలి ఆయనకు తీవ్రాతితీవ్రమైన దండన విధించాలని నిర్ణయించింది. అయితే రామకృష్ణుని వత్తిడిపై రాయలవారు తాతాచార్యులను క్షమించి వదిలేశారు. ఎప్పుడూ తనపై చాడీలు చెపుతూ రాయలవారి చేత తనను దండింప జేయటానికి ప్రయత్నించిన తాతాచార్యులును ఆపద సమయంలో సమర్థించి కాపాడిన రామకృష్ణుడి ఔదార్యాన్నీ, ఉన్నత వ్యక్తిత్వాన్నీ అందరూ వేనోళ్ల కొనియాడారు.

ఇక అక్కడ పీకల లోతు గోతిలో కూరుకున్న మడేలు మల్లన్న తనకు గూని పోయి వీపు సాపై పోయినట్లు, ఎల్లితో సరదాగా సంసారం చేసుకుంటున్నట్లూ కలలు కనసాగాడు. ఇంతలో భయంకరమైన ఏనుగుల ఘీంకారానికి వాడు ఉలిక్కిపడి మేలుకున్నాడు. ఏనుగులు తన మీదికి రాబోతుంటే 'లబోదిబో' మని కేకలు పెట్టాడు. ఏనుగులతో పాటు అక్కడికి వచ్చిన రాజభటులు మల్లన్నను గమనించి, రామకృష్ణుడు మళ్లీ తెలివిగా మోసం చేసి తప్పుకున్నాడనీ, గోతిలో వున్న వాడెవడో అమాయకుడనీ గుర్తించి, మల్లిగాడిని గోతిలో నుంచి బయటకు తీయబోయారు. వాడు 'ఇంకా ఇరవై నాలుగు గంటలు పూర్తి కాలేదు. నా యీపు సాపయ్యేదాకా నేనీ గోతిలోనే వుంటా. నన్ను బైటికి తియ్యమాకండి' అంటూ వాళ్లను బతిమిలాడాడు. రాజ భటులు వీడెవరో పిచ్చివాడులా వున్నాడనుకొని, "నీ వీపు రాయలవారు సాపు చేస్తారులే. అక్కడికే పద!" అంటూ యీడ్చుకెళ్లారు. జరిగినదంతా తెలుసుకుని రాయలవారు పకపకా నవ్వి "ఓ మడేలా! నిన్ను మా ఆస్థాన రజకులపై పెద్దగా నియమిస్తున్నాను. ఇప్పుడైనా నీ ఎల్లి నిన్ను మెచ్చుకుంటుందా? మీరిద్దరూ నేటి నుంచి ఎంచక్కా రాచనగరు లోనే కాపురం వుండొచ్చు. నా ప్రాణానికి ప్రాణమైన రామకృష్ణయ్య నీ కారణంగా బ్రతికి బయటపడి, మా సామ్రాజ్యానికి ఎనలేని మహోపకారం చేశాడు. ఇందుకు నీకేమిచ్చినా మా ఋణం తీరదు. మీరు తరతరాలూ అనుభవించినా తరగని ఐదు వందల ఎకరాల మాన్యాన్ని నీకు యిస్తున్నాను. రాచవారి వస్త్రాలు చలువ చేస్తూ, పిల్లా పాపలతో నువ్వూ, ఎల్లీ పది కాలాలపాటు సుఖంగా జీవించండి" అన్నారు. మల్లిగాడు, ఎల్లి ఆ రోజు నుంచి రాచనగరులో మకాం వేసి కలకాలం సుఖంగా జీవించారు. హంపి వద్ద తుంగభద్రా నదికి ఉత్తర తీరంలోని ఆనెగొందికి సమీపంలో స్థానికులు మడేలు మల్లన్న చలువమాన్యం అని యిప్పటికీ సందర్శకులకు చూపిస్తుంటారు.

తప్పుడు జోశ్యం కుట్ర బట్టబయలై, మూఢనమ్మకాల చెరవీడిన రాయలవారు యిక ఎంత మాత్రమూ జాగు చేయక రాయచూరుపై సమరానికి సకల సన్నాహాలు చేయించారు క్రీ.శ. 1511 వ సంవత్సరంలో తాను 37 సంవత్సరాల ప్రాయంలో వున్నప్పుడు శ్రీకృష్ణదేవరాయలు మొదటిసారి రాయచూరు దుర్గాన్ని ఆక్రమించాడు. అయితే యీ గాథ అప్పటిది కాదు తన 48వ ఏట క్రీ శ 1522 వ సంవత్సరం మే 25న ప్రారంభించి జూన్ 13వ తేదీ వరకు శ్రీకృష్ణదేవరాయలు రాయచూరు దుర్గాన్ని ముట్టడించి స్వాధీన పరచుకున్నాడు బీజాపూర్ సుల్తాన్ ఇస్మాయిల్ ఆదిల్‌ఖాన్ యుద్ధంలో పరాజితుడై పరారయ్యాడు రాయలు అతడిని వెన్నాడుతూ ముద్గల్లును కూడా జయించి, చివరికి బీజాపూరు కోటను కూడా స్వాధీనపరచుకున్నాడు అయినా ఆదిల్‌ఖాన్ దొరక లేదు అప్పుడు రాయలు కళ్యాణి, కలబరిగి (కులుబరుగ – గుల్బర్గా) లను కూడా స్వాధీన పరచుకున్నాడు. అంతకు ముందు కలబరిగి కోటలో బహమనీ వంశజులైన ముగ్గురు రాకుమారులను ఆదిల్‌షా ఖైదు చేసి వుంచాడు. రాయలు వారిని విడిపించి వారిలో పెద్ద వానికి రాజ్యాభిషేకం చేశాడు మిగిలిన యిద్దరినీ తన వెంట విజయనగరం తీసుకెళ్లి వారికి తన కొలువులో ఉన్నతోద్యోగాలిచ్చాడు.

ఆదిల్‌షాతో అసలీ యుద్ధం ఎందుకు జరిగిందంటే – సయ్యద్ మర్కార్ అనే తురుష్కుడొకడు లోగడ ఉత్తమాశ్వాలను సరఫరా చేస్తానని రాయలవారి వద్ద పెద్ద మొత్తంలో ధనాన్ని తీసుకొని మోసం చేసి, ఆ తరువాత బీజాపూర్ నవాబు ఆశ్రయం పొందినట్లు రాయలవారికి తెలిసింది. అతడిని తనకు స్వాధీన పరచమని రాయలు ఆదిల్‌షాకు వర్తమానం పంపాడు దీనిని ఆదిల్‌షా బేఖాతరు చేశాడు అప్పుడు

రాయలు కోపోద్రిక్తుడై తన సామంతులందరినీ రావించి మహత్తరమైన సేనావాహినిని తోడ్కొని రాయచూరుపై దండెత్తాడట ఈ సైన్యంలో విల్లంబులు, విచ్చుకత్తులు, యీటెలు, తుపాకులు ధరించిన కాల్బలం (*infantry*) ఏడు లక్షలకుపైనే వున్నట్లు, 30 వేలకుపైగా అశ్వసైనికులు (*cavalry*), 600కు పైగా ఏనుగులున్నట్లు పోర్చుగీసు వాడైన న్యూనిజ్ (*NUNIZ*) వ్రాతల వలన తెలుస్తున్నది. దీనిలో నలభైవేల కాల్బలాన్నీ, ఆరువేల ఆశ్వికుల్నీ, మూడు వందల ఏనుగుల్నీ తనకు రక్షక సైన్యంగా శ్రీకృష్ణదేవరాయలు వుంచుకున్నాడట ఈ యుద్ధంలో రాయలతోబాటు సర్వసైన్యాధ్యక్షుడు పెమ్మసాని రామలింగ నాయకుడు, ప్రసిద్ధవీరులు కామనాయకుడు, త్ర్యంబక నాయకుడు, తిమ్మప్ప నాయకుడు, ఆదెప్ప నాయకుడు, కొండమరెడ్డి, అతని కుమారుడు, యింకా విద్యానగరము యొక్క నగర పాలకుడు సాళువ గోవిందరాజు, మైసూరు మండలాధిపతి (రాయలు భార్య తిరుమలదేవి తండ్రి) కుమార వీరయ్య అని పిలువబడే కుమార వీరశ్యామ రాయలు, మధుర నాయకులు మొదలైన మహావీరు లెందరో తమ తమ సైన్యాలతో పాల్గొనడమే కాక, రాయల వారికి అత్యంత ప్రీతిపాత్రులైన ముగ్గురు కొజ్జాలు కూడా 40 వేల కాల్బలమును ఆరు వేల గుర్రములను, పదిహేను ఏనుగులను వెంట తీసుకొని యీ యుద్ధంలో పోరాడారు.

రాయలు మూఢనమ్మకాలకు లోనై రాయచూరుపై దాడి వెడలడానికి సుముహూర్తం కోసం ఎదురుచూస్తూ ఆస్థాన జోశ్యుడు పేరిశాస్త్రి మోసంలో చిక్కుకుని వుంటే యింతటి ఘనవిజయం రాయలుకు స్వంతమయ్యేది కాదు.

ఇక రాయలవారికి అశాస్త్రీయమైన అంధవిశ్వాసాలు కొంచెం ఎక్కువగానే వుండేవని నాటి చరిత్రకారుల వ్రాతల వలన తెలుస్తున్నది ఇందుకు ఉదాహరణగా ఓ చిన్న ఘటనను పేర్కొంటాను కర్నాటకలోని తుంగభద్రానది ఒడ్డునగల నేటి హరిహర్ నుండి హొస్పేటకు వెళ్లేదారిలో రెండు చిన్న కొండల మధ్య ఒక పెద్ద తటాకం వుంది ఈ తటాకాన్ని రాయలవారే నిర్మింపజేశారు 20వేల మందికి పైగా కార్మికులు చీమలదండులా యీ నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారట. అయితే రెండు మూడుసార్లు ఆ తటాకానికి గండ్లు పడి విపరీతంగా పంటలు, యిళ్లు మునిగిపోగా, దీని నివారణకు ఏం చేయాలో సూచించమని రాయలవారు బ్రాహ్మణులను అడిగారట నరబలి, జంతుబలితో దుష్టగ్రహాలకు శాంతి చేయాలని వారు సూచించారట రాయలవారు అరవై మంది పురుషులనూ, కొన్ని గుర్రాలనూ, కొన్ని దున్నపోతులనూ అక్కడిక్కడే బలియిచ్చారట. పోర్చుగీసు యాత్రికుడు డామింగో పేయజ్ వ్రాతలలో యిదంతా వివరించబడింది

రాయల కాలంలో జంతుబలి అనే అనాచారం ఎంత తీవ్రంగా ఉండిందంటే దసరా ఉత్సవాల తొలిరోజు రాజధానిలో 24 దున్నపోతులు నూటయాభై గొర్రెలూ బలి యివ్వబడేవట ఈ బలి కార్యక్రమాల అనంతరం అర్ధరాత్రి వరకూ నృత్య వినోదాలు సాగేవట ఈ నవరాత్రులలో ప్రతిరోజూ పగలంతా రాయలవారు కటికి ఉపవాసముండేవారట ఆయన భోజనం చేసేటప్పటికి అర్ధరాత్రయ్యేదట ఇలా తొమ్మిది రోజులు సాగే జంతుబలి రోజు రోజుకూ పెరుగుతూ తొమ్మిదవ రోజు రాత్రి 250 దున్నపోతులను, 4,500 గొర్రెలనూ బలి యివ్వడంతో ముగిసేదట బలికి వాడబడే ఆయుధాలు ఎంత పదునుగా వుండేవంటే ఎంతటి జంతువు తలైనా ఒక్క వేటుకే తెగి పడేదట. ఈ కార్యక్రమాలన్నింటినీ డామింగో పేయజ్ ఎంతో విపులంగా వర్ణించాడు

అంతేకాదు. ఆనాడు రాయలవారు జరిపించిన యజ్ఞాలలో హోమాగ్నిలో వివిధ సుగంధ ద్రవ్యాలతో తయారైన హోమద్రవ్యంతో బాటు, నెయ్యి, ఆహార ధాన్యాలు వగైరాలే కాక విలువైన ముత్యాలు, కెంపులు, వజ్రాలు వగైరా నవరత్నాలు కూడా పొడిచేసి అగ్నికి ఆహుతి చేసేవారని పేయజ్ వ్రాశాడు పేయజ్ వ్రాతలను బట్టి జంతు బలులు, యజ్ఞాల పట్ల రాయలవారి మత విశ్వాసాలు ఎంత తీవ్ర స్థాయిలో వుండేవో అర్థం చేసుకోవచ్చు

# 16. రామకృష్ణుడి పొగరుబోతు గుర్రం

రాయలవారికి గుర్రాలంటే అమితమైన మక్కువ. వేకువనే లేచి రోజూ క్రమం తప్పకుండా గుర్రపు స్వారీ చేసేవాడాయన. అశ్వహృదయం బాగా తెలిసిన వాడవటమే కాక రాయలవారు యుద్ధాల్లో తమ విజయం ఎల్లప్పుడూ అశ్వసైన్యంపైనే ఆధారపడి వుంటుందని నమ్మేవారు. అంచేత ఉత్తమ తరగతికి చెందిన విలువైన అరేబియన్ గుర్రాలను తరచు విదేశీ వ్యాపారుల నుంచి ఆయన కొనుగోలు చేసేవారు. ఓసారి ఆయనకో ఆలోచన వచ్చింది. గుర్రాలను శాంతి కాలంలో కూడా పోషించడమంటే ప్రభుత్వానికి ఖర్చుతో కూడిన పనేకాక, యిందుకోసం బోలెడంత మంది సిబ్బందిని కూడా నియమించాలి. ఉత్తమ జాతి గుర్రాలను వాటి అమ్మకందారులు తెచ్చినప్పుడే మనం కొనాలి కానీ మనకు

కావాలన్నప్పుడు అవి దొరకక పోవచ్చు. అంచేత యుద్ధ అవసరాలకు సరిపడా గుర్రాలను ఒకేసారి కొనుగోలు చేసి వాటిని పెంచుతూ పాలన పోషణ చేయడానికి కుటుంబానికొక గుర్రం చొప్పున ప్రజలకు పంచి పెట్టి యిందుకయ్యే ఖర్చుల నిమిత్తం కుటుంబానికి నెలకు యింత మొత్తం చొప్పున యివ్వాలని నిర్ణయించారు. ఇకనేం – కొన్ని వేల గుర్రాల్ని కొని వాటిని రాజధానిలోని గృహస్థులకు యింటి కొకటి చొప్పున పంచి పెట్టారు. రామకృష్ణునికి కూడా ఒక గుర్రం యివ్వబడింది. దాని పాలన పోషణకు – పచ్చి గడ్డి, ఉలవ గుగ్గిళ్ల దాణా వగైరాల కోసం నెలకు రెండు బంగారు నాణెములు అతనికివ్వబడేవి.

రామకృష్ణుడి కివ్వబడిన గుర్రం చాల బలిష్టమైనది. అతడు దానిని తెచ్చి దానికోసం ప్రత్యేకించి ఓ మందురాస్థానము (అశ్వశాల) ను నిర్మింపజేశాడు. అది కేవలం ఆ గుర్రం నిలబడడానికి సరిపడే స్థలం మాత్రమే వుండేటట్లు నిర్మించబడింది. దాని నోటికి అందేట్లుగా గడ్డి వేయడానికి నాలుగు అడుగుల ఎత్తులో ఒక కన్నం ఏర్పాటు చేశాడు. ఒక ప్రక్క ఏర్పాటు చేయబడిన ద్వారం నుంచి దానిని లోపలకు పంపి ద్వారానికి తాళం వేసేవాడు. రామకృష్ణుడు గుర్రం పోషణ నిమిత్తమై నెలనెలా తనకు రాయలవారిస్తున్న రెండు బంగారు నాణెముల బత్తెము మొత్తాన్నీ తన కుటుంబ అవసరాలకే ఖర్చు చేసేవాడు. గుర్రానికి మాత్రం రోజూ ఉదయం పది పరకలు, సాయంత్రం పది పరకలు మాత్రమే ఎండు గడ్డి వేసేవాడు. పాపం – ఆ గుర్రం ఆకలికి అలమటిస్తూ ఆ గూటి వద్ద మూతి పెట్టి, గడ్డి పరకలు కనపడగానే ఆబగా లాగేసుకు తినేసేది. ఎప్పుడెప్పుడు గడ్డి వేస్తారా – అని కనిపెట్టుకుని వుండేది. ఆహారం అమరక అది చిక్కి శల్యమై పోయింది.

ఇలా వుండగా ఒకసారి రాయలవారు తాము లోగడ రాజధానిలోని ప్రజలకిచ్చిన గుర్రాల స్థితిగతులేమిటో విచారించదలచి, ఓ తనిఖీ శిబిరాన్ని (*Inspection Camp*) ఏర్పాటు చేసి, అందరినీ తాము పెంచుతున్న గుర్రాల్ని అక్కడికి తీసుకురమ్మని ఆదేశించారు. అందరూ తమ తమ గుర్రాల్ని తీసుకు వెళ్లి ఆ శిబిరంలో పాల్గొన్నారు. రాయలవారు ఆ గుర్రాల ఆరోగ్య స్థితిని చూసి సంతృప్తి చెందారు. తాము గృహస్థులకు యిస్తున్న నెలసరి భత్యం సరిపోతున్నదా అని స్వయంగా ప్రశ్నించి తెలుసుకుని, అవసరమైన చోట్ల భత్యాల పెంపుదల చేశారు. రామకృష్ణుడు మాత్రం ఆ శిబిరానికి తన గుర్రాన్ని తీసుకెళ్లలేదు. కారణమేమిటని రాయలవారు ప్రశ్నించారు. దీనికి రామకృష్ణుడు – "నా గుర్రాన్ని వెంట తీసుకు రాగలిగే శక్తి నాకు లేదు. అది మహా పొగరుబోతు గుర్రం. దానినిక్కడికి తీసుకురావడం అశ్వహృదయం తెలిసిన నేర్పరికే సాధ్యం" అన్నాడు. రాయలవారికి రామకృష్ణుని సమాధానంలో ఏదో అనుమానం పొడచూపింది. "అంటే నేను వస్తేనేగాని మీ గుర్రం యిక్కడికి రాదంటారా . . . . రామకృష్ణయ్యా!" అన్నారాయన. "అయ్యయ్యో ! ఎంత మాట. క్షంతవ్యుణ్ణి మహాప్రభూ! తమరి దాకా ఎందుకు? ఇందుకు మన రాచనగరులోని అశ్వశాలాధిపతి దౌలత్‌ఖాన్ సరిపోతాడు. దయచేసి ఆయన్ని పంపించండి. చిటికెలో నా గుర్రం ఆయనకు లొంగి, ఆయన వెంటబడి యిక్కడికి వస్తుంది" అన్నాడు రామకృష్ణుడు.

రాయలవారి కొలువులో ఎందరో ముస్లిం, క్రిస్టియన్ ఉద్యోగులుండేవారు. అరేబియా, పర్షియాలకు చెందిన ఉత్తమజాతి అశ్వాలను కొన్న సందర్భాలలో ఆ జాతి గుర్రాల అలవాట్లు బాగా తెలిసిన అక్కడి శిక్షకులనే ఆ అశ్వాలపై పర్యవేక్షకులుగానూ, అశ్వశిక్షకులుగానూ, అశ్వశాలాధిపతులుగానూ రాయలవారు నియమించేవారు. ఇలా రాయలవారి సైన్యంలో ముస్లింలు ప్రవేశించడం జరిగింది. అలాగే విదేశీ జాతుల గుర్రాల్ని తమ ఓడలలో తెచ్చి అమ్మే పోర్చుగీసు గుర్రాల వ్యాపారులు, వారి సిబ్బందికీ కూడా రాజధానిలో గొప్ప మర్యాదలు జరిగేవి. పోర్చుగీసువారే కాక, యింకొందరు పాశ్చాత్యులు కూడా రాయలవారి శతఘ్నిదళము (*artillery*) నకు శిక్షణ నిమిత్తం నియమింపబడుతుండేవారు. విజయనగర సైన్యంలో యీ ముస్లిం, క్రిస్టియన్ ఉద్యోగస్తులుండే వారనడానికి ప్రబల సాక్ష్యంగా హంపి శిథిలాలలో మసీదులు, చర్చిలు కూడా బయల్పడ్డాయి.

దౌలత్‌ఖాన్ అశ్వ శిక్షణలో ఆరితేరిన అరేబియన్ జాతీయుడు. అతడు ఆజాను బాహుడు. అతడిది బలిష్టమైన శరీరం. మీసం తీసేసి, పొడవాటి గడ్డం పెంచి చూపరులకు అసలు సిసలైన ముస్లిం అనిపించే వాడతడు. రాయలవారికి అత్యంత విశ్వాస పాత్రుడతడు. అయితే ఒకప్పుడు ఏదో చిన్న విషయమై అతడు రామకృష్ణుడిని కించపరచి, లెక్కలేనట్లు మాట్లాడాడట. ఆనాడు అతడు చేసిన తృణీకారం రామకృష్ణుని మనస్సులో అలా గాఢంగా నాటుకు పోయింది.

గతంలో జరిగిన ఆ ఘటనేమిటో, ఏ కారణంగా రామకృష్ణ కవికీ, దౌలత్ ఖాన్‌కూ పొరపొచ్చాలేర్పడ్డాయో క్లుప్తంగా తెలుసుకుందాం.

దౌలత్ ఖాన్‌లో కొంచెం పరమత ద్వేషం పాలు హెచ్చుగా వుండేది. తమ ఇస్లాం మతమే గొప్పదనీ, చెట్లకూ, పుట్లకూ కూడా పూజలు చేసే హిందువులవన్నీ అంధ విశ్వాసాలనీ అతడు భావించేవాడు. తనకన్న బలహీనులైన హిందువులను అతను ఏదో రకంగా విసిగించి, ఏడిపించేవాడు. రాయలవారి వద్ద అతడికున్న పలుకుబడి గురించి అందరికీ తెలుసు కనుక ఎవ్వరూ దౌలత్ ఖాన్‌ని ఎదిరించి మాట్లాడలేక నీళ్లు నమిలి మిన్నకుండే వారు. అంచేత అమాయకులూ, బలహీనుల పట్ల దౌలత్ ఖాన్ దౌష్ట్యం రోజురోజుకూ మరింత మితిమీరింది.

దౌలత్ ఖాన్ రోజూ ఉదయాన్నే స్నానం చేయడానికి తుంగభద్రా నదికి వెళ్లేవాడు. రాచనగరులోని వారు నదికి వెళ్లాలంటే తప్పని సరిగా రామకృష్ణుడుండే వీధిగుండానే వెళ్లాలి. రామకృష్ణుని యింటి ఎదురుగా సుబ్బావధాని అనే ఓ వైదిక బ్రాహ్మణుడుండేవాడు. అతడు పరమ నైష్ఠికుడు. నిత్యాగ్నిహోత్రి. రోజూ దౌలత్ ఖాన్ నది నుండి ఇంటికి తిరిగి వెళ్ళే సమయానికి తన నిత్య కర్మలు ముగించుకున్న సుబ్బావధాని తన యింటి ముందు తులసి కోటలో వున్న తులసి మొక్కకు ఉద్ధరిణతో నీళ్లు పోసి, పూవులతో పూజించి, దానికి ప్రదక్షిణలు చేస్తుండేవాడు. అప్పటికి కొంత కాలంగా యిది గమనిస్తూ వచ్చిన దౌలత్ ఖాన్‌కు సుబ్బావధానిలోని మౌఢ్యాన్ని వదలించాలనే తలంపు కలిగింది. ఓ రోజు అతడు దురుసుగా, “అరే పాగల్ బొమ్మన్ ! హర్ పత్థర్, హర్ పౌధా ఖుదా కా ఆవాస్ హై క్యా ? పత్థర్‌కూ, పౌధాకూ, పూజ చేస్తే హేంటి వచ్చుద్ది అయ్యవార్ ? హిద్గో సూడు నువ్ రోజూ మొక్కే హీ తులసీ మొక్కలో హెంత పాటి తాకత్ వుందో హిప్డే తేల్చేస్తా,” అంటూ ఆ మొక్కను పీకేసి దాని ఆకులన్నీ నలిచి తన ఒంటికి రాసుకున్నాడు. ఏమీ చేయలేని నిస్సహాయుడైన సుబ్బావధాని మిన్నకుండి పోయాడు. బిగ్గరగా నవ్వుకుంటూ అక్కడి నుండి నిష్క్రమించాడు ఖాన్. అతడటు వెళ్లీ వెళ్లగానే వేరొక తులసి మొక్కను తీసుకొచ్చి అక్కడ నాటుకున్నాడు అవధాని.

తిరిగి రెండవ రోజు ఉదయం అటుగా వెళ్తున్న దౌలత్ ఖాన్‌కు తులసి కోటలో నాటిన మరో తులసి మొక్కకు అవధాని మొక్కుతూ వుండడం చూసి చిర్రెత్తుకొచ్చింది. అతడు విసురుగా, “అరే పాగల్ బొమ్మన్ ! నీకి దిమాగ్ పూరా ఖరాబ్ అయినట్టుందే ? ఒక్సారి చెప్తే నీకి సమఝ్ అయితల్లేదా ? రాల్ రప్పల్లో, పేడ్ పౌధాలో ఖుదా వున్నాడన్కొని మొక్కటం ఖుదాని బద్నామ్ చెయ్‌టమే ! అరే ఖుదాకే నామ్‌కో జలీల్ కర్నేవాలా బద్మాష్ !” అంటూ తిరిగి ఆ తులసి మొక్కను పీకేసి, దాని ఆకుల్ని నలిచేసి తన ఒంటికి పులుముకుని అక్కడి నుంచి వెళ్లిపోయాడు. దూరాన్నుంచి ఇదంతా గమనిస్తున్న రామకృష్ణుడు ఏం జరిగిందో వివరంగా తెలుసుకొనగోరి అవధాని దగ్గరకు వచ్చాడు. అతడిని చూస్తూనే అవధాని జరిగినదంతా పూస గుచ్చినట్లు చెప్పి రామకృష్ణుడికి తన గోడు వెళ్లబోసుకున్నాడు. ఈ దౌలత్ ఖాన్ పీడ విరగడ చేసుకొనడానికి రామకృష్ణుడు అవధానితో కలిసి ఓ పథకం ఆలోచించాడు.

ఆ మరుసటి రోజు ఉదయాన్నే నదికి వెళ్తున్న దౌలత్ ఖాన్ అవధాని ఇంటి ముందరి తులసి కోటలో తులసి మొక్క లేకుండటం చూసి తృప్తిగా నవ్వుకున్నాడు. ఒక్క హిందువుకైనా అంధ విశ్వాసాన్ని పోగొట్టగలిగానని గర్వ పడ్డాడు

పక్కనే దిగులుగా నిలుచున్న అవధానితో, "క్యారే బొమ్మన్ ! అబ్ తూ సమఝ్‌దార్ బన్‌గయా క్యా? అల్ ఖాలిక్ (సృష్టికర్త) అయిన ఖుదా (భగవంతుడు) అల్ ఖయ్యూమ్ (సర్వవ్యాపి *Omnipresent*), అల్ అలీమ్ (సర్వజ్ఞాని – *Omniscient*), అల్ అజీజ్ (సర్వశక్తి సమన్వితుడు – *Omnipotent*). అని తెలుస్కో. అట్లాటి ఖుదాని రాల్ రప్పల్లోనూ, పేడ్ ఝూడ్‌లలోనూ వున్నాడని మొక్కేది పాగల్‌పన్ కాదా ?" అన్నాడు. అప్పుడు అవధాని వినయంగా, "ఖాన్ సాహెబ్ గారూ ! హిందువులకు తులసి, కందూతి పత్ర మొక్కలు అతి పవిత్రమైనవి. మేం వాటిని సాక్షాత్తూ దైవ స్వరూపాలుగా భావించి పూజిస్తాం. తులసి మొక్క దొరకకపోతే కందూతి పత్ర మొక్కనే మేం పూజిస్తాం. తమరికి దడిచి ఈ వీధిలో జనం ఎక్కడా తులసి మొక్కంటూ లేకుండా చేశారు. తమరు అండలేని వారూ, బలహీనులూ అయిన నాలాంటి వారిని అదుపు చేయగలరేమో కానీ, రాయలవారి ఆంతరంగికుడూ, ఆస్థాన విదూషకుడూ అయిన నా ఎదురింటి రామకృష్ణ కవిని ఏం చేసి మార్చగలరు ? ఆయన రోజూ నదిలో స్నానం చేసిన తరువాత నది ఒడ్డునే వున్న కందూతి పత్ర మొక్కలను పూజించి గాని ఇంటికి రావడం లేదు. తమరు ఆయన తిక్క కూడా కుదిరిస్తే బాగుంటుంది." అన్నాడు. దీనికి ఖాన్ చిరాగ్గా, "క్యా.. క్యా.. ? కందూతి పత్తర్ ? అదేంటిది వయ్యా ? రామ్ కిట్టయ్య కా దిమాగ్ భీ ఖరాబ్ హోగయీ క్యా ? వాడి సంగతి నేన్ సూస్కుంటాలే." అంటూ నది వైపుకు కదిలాడు.

దౌలత్ ఖాన్ నది ఒడ్డుకు చేరేటప్పటికి అక్కడ నిష్ఠగా ఓ దూలగొండి మొక్కకు నమస్కరిస్తూ భక్తితో దాని చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాడు రామకృష్ణుడు. అతడిని చూస్తూనే ఖాన్ చిరాగ్గా, "హేమ్‌టీ – రామ్ కిట్టయ్యా! తూ భీ పాగల్ బన్‌గయా క్యా ?" అంటూ ఆ దురదగొండి మొక్కను పీకేసి దాని ఆకులు నలిచి తన ఒంటికి రాసుకున్నాడు. కొద్ది క్షణాల్లోనే ఖాన్ ఒళ్లంతా దురదలతో మెలికలు తిరిగి పోయాడు. తట్టుకోలేక నదిలో దూకి ఒళ్లంతా రుద్దుకుని మళ్లీ ఒడ్డుకు వచ్చాడు. అయినా దురద ఓ పట్టాన వదలదే ! "అరే అల్లాహ్ ! ఏ కమ్‌దూతీ పత్తర్ కౌన్‌సీ చీజ్ హై ? మేరీ జాన్‌తో చల్‌గయీ. హాయ్ ఖుదా ! ముఝే యే దాద్ సే బచాలో." అంటూ గోలగోలగా అరిచాడు. ఈ గోలకి నదిలో స్నానం చేస్తూన్న విద్యానగర వాసులంతా క్షణాల్లో అక్కడ పెద్ద సంఖ్యలో గుమిగూడారు. వారిలో మాధ్వులు, వైఖానసులు, శ్రీ వైష్ణవులు, వైదికులు, నియోగులు వగైరా హైందవ శాఖల వారే కాక మహమ్మదీయులు కూడా వున్నారు. వారంతా అసలేం జరిగిందని రామకృష్ణుడిని అడిగారు. రామకృష్ణుడు వారికి జరిగిందంతా వివరించి, ఖాన్‌కు కనువిప్పు కలిగించడానికే తానీ నాటకమాడినట్లు చెప్పాడు.

తరువాత రామకృష్ణుడు, "ఖాన్ సాహెబ్ ! అతి ప్రాచీనమైన మతం కనుక మా హిందూ మతస్థులలో ఎన్నో అశాస్త్రీయమైన అంధవిశ్వాసాలున్న మాట నిజం. మేము ప్రకృతిలోని అణువణువునా భగవంతుడున్నాడని విశ్వసిస్తాం. అందుకే అన్నిటికీ మొక్కుతాం. ఉపయోగితా విలువలు కలిగిన మొక్కలన్నింటినీ పెంచుకుంటూ పవిత్రంగా పూజించుకుంటాం. మీది ఇటీవలే పుట్టిన ఆధునిక మతం కనుక కొన్ని నమ్మకాల విషయంలో మా మతం కంటే మీ మతం కొంత మేరకు శాస్త్రీయమైనదైతే కావచ్చు. అయినా భగవంతుడు సర్వాంతర్యామి అని నమ్మే మీరు కూడా మక్కా, మదీనా, జెరూసలెం వగైరా స్థలాలకు ప్రాధాన్యతనివ్వడం మౌఢ్యం కాదా ? మక్కాలోని 'కాబా' అనే శిలకున్న ప్రత్యేకత ఏమిటి ? ప్రపంచంలోని మసీదులన్నీ మక్కావైపుకు తిరిగి వుండేట్లుగా నిర్మించబడతాయంటారు. ఇది మౌఢ్యం కాదా మరి ? సర్వాంతర్యామి, సర్వశక్తి సమన్వితుడు, సర్వ జ్ఞాని అయిన భగవంతుడిని కొన్ని 'పవిత్ర' క్షేత్రాలనబడుతున్న వాటికే పరిమితం చేయడం మీరూ చేస్తున్నారుగా ? కాకుంటే మక్కాకు మీరు చేసే 'హజ్' యాత్రలెందుకు ? అన్ని తావుల్లోనూ భగవంతుడున్నాడని భావిస్తే కొన్ని పవిత్ర క్షేత్రాలూ, ఇంకొన్ని అపవిత్ర క్షేత్రాలూ ఎలా అయ్యాయి ? పరమత ద్వేషం అక్కడక్కడా మాలో కూడా వున్నప్పటికీ మా హిందువుల్లో హెచ్చు శాతం మంది పరమత సహనమే పరమావధి అని భావిస్తారు. ఒక విశ్వాసి యొక్క ధనం, గౌరవం మక్కాలోని కాబా (బైతుల్లా షరీఫ్) కంటే గొప్పవని మహమ్మద్ ప్రవక్తే స్వయంగా.చెప్పారు కదా. మరలాంటప్పుడు

యింకా బైతుల్లా షరీఫ్ చుట్టూ ప్రదక్షిణలు చేయడంలో అర్థమేమైనా వుందా ?

"తెల్లవారు ఝామున చేసే తహజ్జుద్ నమాజ్ చేసే సందర్భంలో సాక్షాత్తు మహమ్మద్ ప్రవక్తే తన భార్య హజ్రత్ ఆయేషాకు నిద్రాభంగమౌతుందేమోనని ఎంతో జాగ్రత వహించేవారట. అలా నమాజ్ (దైవారాధన) కూడా యితరులకు ఇబ్బంది కలిగించకుండా చేయాలని ప్రవక్త ఉద్బోధించారు. ఇలా ఇతరుల హక్కులకు భంగం కలుగ కుండా చేసే నమాజ్‌ను హుఖూఖుల్ ఇబాద్ అంటారు. ఇతరుల హక్కులను ప్రవక్త మహమ్మద్ అంతగా గౌరవించే వారన్నమాట. ఇతర మతస్థుల హక్కులను గౌరవించడమే ఇస్లాం అంతస్సారమని తన ఉదాత్త ప్రవర్తన ద్వారా ప్రవక్త మహమ్మద్ లోకానికి చాటారు మరి ఖాన్ గారూ ! ప్రవక్త వారసులైన మీరు ఎంత మేరకు పరమత సహనాన్ని పాటిస్తున్నారు ?

"ఖాన్ గారూ ! ఎవరి విశ్వాసాలు వారివి. ఎవరి విశ్వాసాలు ఏ మేరకు శాస్త్రీయమైనవో చర్చించవచ్చు. తప్పులేదు కాని, తమ మత విశ్వాసాలే సరియైనవి. ఇతరుల విశ్వాసాలు అంధవిశ్వాసాలు అని భావించి ఇతరులపై తమ విశ్వాసాలను రుద్దడం తప్పు. గురివింద తన నలుపు ఎరగదట ! మతాలన్నీ నదులైతే భగవంతుడు సముద్రం. ఈ నదుల పయనం ఆ సముద్రునిలో లయమవడానికే. కనుక పరమతస్థుల విశ్వాసాలను - మీరు అంగీకరించక పోయినా - గౌరవించడం నేర్చుకోండి. మతాలు వేరైనా మనమందరం మానవులం. అది మరువకుండా నేటి నుండి పరమత సహనంతో మెలగండి." అని ఖాన్‌కు సుదీర్ఘంగా హితోపదేశం చేశాడు. ఒంటి మంట నసాళానికంటుతున్న ఖాన్‌కు ఈ మాటలు ఏ మేరకు చెవికెక్కాయో తెలియదు కాని అక్కడ గుమిగూడిన పౌరులందరూ రామకృష్ణుని విషయ పరిజ్ఞానానికీ, ఔన్నత్యానికీ అతడిని వేనోళ్ల మెచ్చుకున్నారు.

కానీ, దౌలత్ ఖాన్‌కు మాత్రం హిందూ మతమంటే చులకన భావం ఏమాత్రం తగ్గలేదు. పైపెచ్చు అతడికి రామకృష్ణయ్య అంటే నాటి నుంచి మరింత ఒళ్లుమంటగా వుండేది. రామకృష్ణుడు మాత్రం దౌలత్ ఖాన్‌కు తగిన రీతిలో కనువిప్పు కలుగ జేయడానికి మరో సరైన అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు.

అందుకే రామకృష్ణుడు తెలివిగా "నాకు తెలిసిన మటుకు నేను విన్నవించాను మహారాజా! ఇందుకు దౌలత్‌ఖాన్ సాహెబే తగిన వ్యక్తి అని నా అభిప్రాయం. మరి వారు యిది తనవల్ల కూడా అయ్యేపని కాదు అంటారో. లేక యింత చిన్న పనికి రానెందుకు - అని తెలివిగా తప్పుకుంటారో!" అన్నాడు ఖాన్ వంక చూస్తూ. దౌలత్‌ఖాన్ పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుకలా అయింది. అతడిలా ఆలోచించాడు - ఇన్ని వేల గుర్రాల్లో యిలా ఫిర్యాదు వచ్చింది ఒక్క యీ గుర్రం విషయంలోనే. రామకృష్ణుడి గుర్రం నిజంగానే పొగరుబోతు దయ్యే వుంటుంది. అది తనకీ లొంగక పోతే రాయలవారి ముందు పరువు పోతుంది అనుకుని, అయినా రాయలవారి సమక్షంలో వెనక్కెందుకు తగ్గాలని భావించి ఖాన్ ధీమాగా, "రాయల్ వారూ . . హిది నాకు హెంత పని . . . హిప్పే హెల్లి ఆ ఘమండీ ఘోడాని హెంట పెట్కొని తెస్తాన్" అంటూ రామకృష్ణుని వెంట అతని యింటికి బయల్దేరాడు.

అప్పుడు సాయంసంధ్యా సమయమైంది. రాచబాట వెంట తన యింటికి వెళ్తూ మార్గ మధ్యంలో ఊర చెరువు దగ్గర రామకృష్ణుడు సంధ్య వార్చుకున్నాడు. దౌలత్‌ఖాన్ చిరాగ్గా "నీ గ్గుంచి హెంతసేప్ ఇంతజార్ చెయ్యాలి. హరే పాగల్ బొమ్మన్! నాకి హింత పరేషాన్ చేస్తున్నవ్? చలో . . . హమేఁ జల్దీ జాకే వో ఘమండీ ఘోడే కో పకడ్‌కే లానా . . . మేరా వక్త్ ఖరాబ్ మత్ కరో" అని చిందులు తొక్కాడు. రామకృష్ణుడు దౌలత్‌ఖాన్ మాటలన్నీ మౌనంగా సహించాడు. కాసేపటి తరవాత వారిద్దరూ రామకృష్ణుడి యింటికి చేరారు. అవమానంతో కుతకుతా ఉడికిపోతున్న రామకృష్ణుడికి మెరుపులాంటి ఆలోచన మెదిలింది మనస్సులో. ఆ రోజు సాయంత్రం గుర్రానికి వేయాల్సిన గడ్డి పరకలు వేయకుండా రామకృష్ణుడు.

"ఖాన్ సాహెబ్! మీరు గుర్రాల్ని మచ్చిక చేసుకోవడంలో రాయలవారికి కూడా శిక్షకులని ప్రతీతి. నా పొగరుబోతు గుర్రాన్ని లొంగదీయడం మీ వల్ల కాకపోతే యింకెవరి వల్లా కాదు" అన్నాడు వినయంగా. దీనికి దౌలత్‌ఖాన్, "అరే చుప్ . . . మాకీ తారీఫ్ బాద్‌మే చేస్తావ్ గానీ . . ముంద్గా నీ ఘోడా హెక్డా వుందో దిఖావ్! పాగల్ కా బచ్చా" అన్నాడు పొగరుగా, యీ మాటల అర్థమేమిటో రామకృష్ణుడికి తెలియదనుకుని. అరబ్బీ, పారశీక భాషలలో అంతో యింతో ప్రవేశమున్న రామకృష్ణుడిని దౌలత్‌ఖాన్ తనను చులకన చేస్తూ మాట్లాడిన మాటలు తీవ్రంగా నొప్పించాయి. అయినా, పైకి మాత్రం ఎటువంటి భావాలూ కనబరచకుండా, రామకృష్ణుడు దౌలత్‌ఖాన్‌కు ఆ అశ్వశాల గోడకున్న కన్నం చూపి అందులోంచి గుర్రాన్ని చూడమన్నాడు. ఖాన్ వెంటనే గుర్రాన్ని చూడడానికి తన తలను అందులోకి పెట్టాడు. సరిగ్గా అప్పుడు – ఆ గుర్రానికి రోజూ సాయంత్రం గడ్డి వేసే సమయం. తల కన్నంలో పెట్టి లోనికి చూస్తూన్న ఖాన్ పొడవాటి గడ్డం చూసి ఆ పొగరుబోతు గుర్రం అవి రోజూ తనకు పెట్టే గడ్డి పరకలే అనుకుని మునిపళ్లతో గట్టిగా కరుచుకుని లోపలికి గుంజసాగింది. దౌలత్‌ఖాన్ యీ హఠాత్ పరిణామంతో ఖంగు తిన్నాడు. ఆ గుర్రం గుంజుడుకు తన ముఖం వెళ్లి ఆ అశ్వశాల గోడకు గుద్దుకో సాగింది. ఆ గుర్రం పట్టు ఎంత గట్టిగా వున్నదంటే చివరికి ఆ గడ్డం ఊడిపోతుందేమో అనిపించింది. ఖాన్ గీ పెట్టి గింజుకున్నాడు. అయినా లాభం లేక పోయింది. "హత్తేరీ మాకీ . . . అరే . . అరే . . మేరీ దాఢీ . . అరే . . అల్లాహ్ . . గయీరే మేరీ జాన్ . . . బచావ్ . . బచావ్" అంటూ వెర్రిగా కేకలు పెట్టాడు ఖాన్. రామకృష్ణుడు పుండు మీద కారం చల్లినట్లు, "అదేంటి సాహెబ్ గారూ! మీ గొప్పతనం గురించి మా పిచ్చి గుర్రానికేం తెలుసు? తెలిస్తే అది యింతకు తెగిస్తుందా? కొంచెం దాని కర్థమయ్యేటట్లు మీ గొప్పతనం వివరించండి!" అన్నాడు. దీంతో ఖాన్‌కి మండుకొచ్చింది. అయినా అతి దీనంగా రామకృష్ణుడిని బతిమిలాడుతూ "అయ్యవార్! అయ్యవార్! నాకి హెట్లనన్నా యీ బద్మాష్ ఘోడా నుంచి కాపాడు. బాద్మే నీకి కాళ్లు పట్కుంటా" అని ప్రాధేయపడ్డాడు. రామకృష్ణుడు లోలోపల సంతోషిస్తూ, "వెంటనే వెళ్లి ఈ విషయాన్ని రాయలవారికి చెప్పి రావచ్చు. అయితే తమరు ఎంతో ప్రయోజకులని నమ్మే రాయలవారు మీరు బక్కచిక్కిన గుర్రాన్ని కూడా లొంగ దీయలేక పోయారని తెలిస్తే యిక మీకు ఏం విలువిస్తారు? కనుక, అశ్వహృదయం తెలిసిన మీరు మిమ్మల్ని వదలమని ఆ గుర్రాన్నే ప్రాధేయపడండి. ఏ చిక్కూ వుండదు" అన్నాడు. "లేదు . . లేదు . . రామ్ కిట్టయ్యా . . నాది పాణం పోకముందే హేదో ఒక్టీ చెయ్. హిప్డూ హేళాకోళం చెయ్ వద్దు . . " అంటూ వేడుకున్నాడు దౌలత్‌ఖాన్. ఇంత జరిగినా ఆ పొగరు బోతు గుర్రం ఖాన్ గడ్డం వదల లేదు.

అప్పుడిక లాభం లేదని రామకృష్ణుడు ఖాన్ వెంట వచ్చిన యిద్దరు భటులలో ఒకడిని అక్కడే కాపలాగా వుంచి, మరొక భటుడిని వెంట తీసుకుని రాయలవారి వద్దకు వెళ్లి జరిగిందంతా వివరించాడు. రాయలవారు హుటాహుటిన బయల్దేరి రామకృష్ణుడి యింటికి వచ్చారు. అప్పటికీ ఆ మొండి గుర్రం దౌలత్ ఖాన్ గడ్డాన్ని వదలలేదు. ఖాన్ పరిస్థితి చూసి రాయలవారికి జాలి వేసింది. అతడి గడ్డాన్ని వెంటనే కత్తిరించమని తన భటుల్ని ఆదేశించారు రాయలవారు. ముందు దౌలత్‌ఖాన్‌ని ఆ గుర్రం బారి నుండి విడిపించాకనే, ఆ పొగరుబోతు గుర్రం ఎలా వుంటుందో చూద్దామని ఆ అశ్వశాల తలుపు తెరవమని భటుల్ని ఆదేశించారు రాయలవారు. లోపలి దృశ్యంచూసి తన కళ్లను తానే నమ్మలేక పోయారాయన. తిండి లేక బక్కచిక్కి ఎముకల గూడులా నేడో రేపో చావడానికి సిద్ధంగా వున్న గుర్రాన్ని చూసి రామకృష్ణుని వంక తీవ్రంగా చూస్తూ రాయలవారు, "ఏమిటిది రామకృష్ణయ్యా! చూస్తే మీరు గుర్రం గడ్డి, దాణాల కోసమని మీకు యిచ్చే నెలసరి భత్యాన్ని గుర్రానికి వాడక, మీరే వాడుకుంటున్నట్లున్నది? ఇలా ప్రభుత్వాన్ని మోసం చేస్తే శిక్షేమిటో తెలుసా?" అన్నారు. రామకృష్ణుడు వెంటనే తెలివిగా "మహాప్రభూ! ఈ దీనుడిని కనికరించండి. మీరే ఆలోచించండి.

రోజూ ఉదయమూ, సాయంత్రమూ పదిపరకల ఎండు గడ్డి మాత్రమే తింటుంటేనే యింత పొగరుబోతుగా వున్న యీ గుర్రం యిక నెలసరి మిారిచ్చే భత్యంతో రోజూ ఉలవలూ, పచ్చిగడ్డీ వగైరా బలమైన ఆహారం తింటే యిక దానిని లొంగదీయడం బ్రహ్మకైనా తరమవుతుందా? తిండి యివ్వక ఎండగట్టినా యిలా మనుషుల్ని పీక్కుతింటున్నదే - యింకా బలమైన తిండి వుంటే దాన్ని ఆపడం ఎవరి వల్ల అవుతుంది?" అన్నాడు. ఈ మాటలకు రాయలవారు చిన్నగా నవ్వుకుని చావడానికి సిద్ధంగా వున్న ఆ గుర్రాన్ని అక్కడి నుండి తరలించి ఆ రోజు నుంచీ రాచనగరులోని అశ్వశాలలో దాని సంరక్షణకు ఏర్పాటు గావించారు.

అశ్వశాలలో గుర్రాలన్నింటినీ అజమాయిషీ చేసే దౌలత్‌ఖాన్ రామకృష్ణుడి గుర్రం వున్న చాయలకు మాత్రం పొరపాటునైనా వెళ్లేవాడు కాదట. అప్పటి నుంచీ రామకృష్ణుడెక్కడ కనపడ్డా దౌలత్‌ఖాన్ మర్యాదగా "ఆదాబ్" అంటుండేవాడట రామకృష్ణుడి వాక్పటిమకూ, తెలివి తేటలకూ, సమయస్ఫూర్తికీ రాయలవారు మెచ్చుకున్నా, అతడు గుర్రానికి వాడమని యిచ్చిన భత్యాన్ని తన కుటుంబ ఖర్చులకు వాడుకుని ప్రభుత్వాన్ని మోసగించినందుకు రాయలవారికి కొంతకాలం పాటు అతని పట్ల కోపంగానే వుండేదట. ఆ తరువాత కొద్ది కాలానికే రామకృష్ణుని ప్రభుభక్తినీ, దేశభక్తినీ అర్థం చేసుకున్న రాయలవారు అతడికి నెలసరి ప్రత్యేక భరణం ఏర్పాటు చేశారు. అప్పుడప్పుడూ అతడి కుటుంబ యోగ క్షేమాలు వ్యక్తిగతంగా విచారించి, అవసరం మేరకు తగు సహాయం చేస్తుండేవారట రాయలవారు.

# 17. తిలకాష్ఠ మహిషబంధనం

మాధవాచార్యులు లేక మాధవ విద్యారణ్యుడు అని పిలువబడిన తమ గురువు పేరిట విజయనగర రాజ్యం స్థాపించిన హరిహరరాయలు బుక్కరాయలు దానికి విద్యానగరమని నామకరణం చేశారని మనం లోగడ తెలుసుకున్నాం. మాధవాచార్యులు గొప్ప పండితుడు, తత్త్వవేత్త ఇతడు కొంతకాలం శృంగేరి శారదా పీఠానికి అధిపతిగా వున్నాడు. ఇతని తమ్ముడు సాయణాచార్యులు వీరిరువురూ శతాధిక గ్రంథాల్ని రచించారు వేదములకు సాయణుడు వ్రాసిన భాష్యము ప్రసిద్ధిగాంచింది. జ్యోతిశ్శాస్త్రము, వేదాంతము, వైద్యము, వ్యాకరణము, చరిత్ర మీమాంస, ధర్మ శాస్త్రములు వగైరాలలో వీరు దిట్టలు మాధవాచార్యులు వ్రాసిన 'సర్వదర్శన సార సంగ్రహము' అనే శాస్త్రీక గ్రంథం సుప్రసిద్ధమైనది. 'సంగీత సారము' అనే తన గ్రంథంలో యీయన 267 రాగములను సూచించాడట. బుక్కరాయల పాలనాకాలంలో నాచన సోముడనే ప్రసిద్ధ ఆంధ్రకవి ('ఉత్తర హరివంశ' కర్త), మొదటి దేవరాయలు (క్రీ.శ. 1404-22) కాలంలో 'విక్రమార్క చరిత్ర' వ్రాసిన జక్కన కవి పోషించబడ్డారు. సాళువ నరసింహ రాజుకు పిల్లలమర్రి పినవీరభద్ర కవి తాను వ్రాసిన 'జైమినీ భారతా'న్ని అంకితమిచ్చాడు. సంకీర్తనాచార్యుడైన తాళ్లపాక అన్నమాచార్యులు సాళువ నరసింహ భూపతిచే ఆదరించబడ్డాడు. తుళువ నరసనాయకుని పోషణలో నంది మల్లయ్య, ఘంట సింగయ్య అనే మొదటి తెలుగు జంటకవులు 'వరాహ పురాణము', 'ప్రబోధ చంద్రోదయం' అనే కావ్యాలు వ్రాశారు. ఇక పదహారవ శతాబ్దంలో, ప్రత్యేకించి శ్రీకృష్ణదేవరాయల పాలనా కాలంలో ప్రబంధమనే పేరుతో శృంగార రసప్రధానంగా స్వతంత్ర కావ్యరచన ప్రారంభమైంది ఆ తరువాత కాలంలో ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రమము అనే మూడు శాఖలకు చెందిన ప్రబంధములు అసంఖ్యాకంగా రచించబడ్డాయి శ్రీకృష్ణ దేవరాయలు కవిపండిత పోషణ ద్వారా ఆంధ్రభోజుడని కీర్తి గాంచడమే కాక సంస్కృతంలో 'మదాలస చరిత్ర', 'సత్యవధూ పరిణయము వగైరా ఎన్నో రచనలు చేసి తెలుగులో పంచ కావ్యాలలో ఒకటైన 'ఆముక్త మాల్యద' అనే మహాప్రబంధాన్ని వ్రాసి అఖండ కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించాడు. ఆయన తన ఆస్థానంలో 'అష్టదిగ్గజములు' గా ప్రసిద్ధులైన ఎనిమిది మంది మహా కవులను పోషించాడు. వారు : 1) అల్లసాని పెద్దన ('మనుచరిత్ర' కర్త); 2) ధూర్జటి (కాళహస్తి మాహాత్మ్యము, కాళహస్తీశ్వర శతకము); 3) నంది తిమ్మన లేక 'ముక్కు' తిమ్మన (పారిజాతాపహరణము); 4) మాదయగారి మల్లన (రాజశేఖర చరిత్ర); 5) తెనాలి రామకృష్ణుడు (ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగ మాహాత్మ్యము ఘటికాచల మాహాత్మ్యము); 6) భట్టుమూర్తి లేక రామరాజ భూషణుడు (వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానం); 7) కందుకూరి రుద్రకవి (అనంతర కాలంలో 'నిరంకుశోపాఖ్యానము' అనే కావ్యం వ్రాయడం ద్వారా ప్రసిద్ధుడైన కవి); 8) పింగళి సూరన (ప్రభావతీ ప్రద్యుమ్నము రాఘవ పాండవీయము, కళాపూర్ణోదయము) రాయలవారి కాలం నాటి 'అష్టదిగ్గజములు' అంటే యీ ఎనిమిది మంది కవులే అనే విషయాన్ని

తెలుగు సాహితీ విమర్శకులలో 99 శాతం మంది అంగీకరిస్తున్నారు. అలాగే సంకుసాల నృసింహకవి, తాళ్లపాక తిరుమలాచార్యుడు కూడా విజయనగర యుగపు ప్రసిద్ధ కవులే. లొల్ల లక్ష్మీధర పండితుడు కటకము గజపతుల ఆస్థానం నుండి వచ్చి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో పోషణ పొందాడు ఇతడు 'దైవజ్ఞాన విలాసము' అనే ప్రసిద్ధ గ్రంథం వ్రాసి, 'శివానంద లహరి'కి వ్యాఖ్యానం వ్రాశాడు. రాయలవారి మంత్రి తిమ్మరుసు కూడా గొప్ప సంస్కృత పండితుడు. అతడు అగస్త్య భారతానికి వ్యాఖ్యానం వ్రాశాడు అతని మేనల్లుడు నాదెండ్ల గోపన్న 'ప్రబోధ చంద్రోదయము'నకు టీక వ్రాశాడు. పెక్కురు కవయిత్రులు కూడా ఆ రోజులలో వెలుగొందారు. 'మధురా విజయము' ను వ్రాసిన గంగాదేవి బుక్కరాయల కుమారుడైన కుమార కంపభూపతి భార్య తన సవతిని గురించి 'వరదాంబికా పరిణయం' వ్రాసిన తిరుమలాంబ అచ్యుత రాయలు రెండవ భార్య అలా మాధవ విద్యారణ్యుని పేరిట ఏర్పడిన విద్యానగరం కొన్ని శతాబ్దాలపాటు నిజంగా సకల విద్యలకూ నిలయంగానే విలసిల్లింది

ముందుగానే పేర్కొన్నట్లు ప్రబంధ రచన వెల్లువెత్తడం, నిత్య కవితా గోష్ఠులు, పండిత ప్రకాండుల చర్చోపచర్చలతో రాయలవారి పాలనా కాలం మరింత వైభవోపేతంగా గణుతికెక్కింది రాయలవారు తన ఖాళీ సమయాలను కవి పండిత గోష్ఠులకు కేటాయించడమే కాక, యుద్ధ భూములకు కూడా కవులను వెంట తీసుకు వెళ్లేవారట ఎందరో యితర ప్రాంతాలకు చెందిన కవులు విజయనగరం వెళ్లి అక్కడ ఘన సన్మానాలు పొందిన సందర్భాలున్నాయి అలాగే అక్కడి కవుల చేతిలో ఓటమి పాలైన సందర్భాలూ వున్నాయి ప్రౌఢదేవరాయలు (క్రీ శ 1423-46) కాలంలో శ్రీనాథ మహాకవి విజయనగరం వెళ్లి, అతని ఆస్థానములో నున్న గౌడ (బెంగాలు) దేశమునకు చెందిన డిండిమ భట్టు అనే మహా విద్వాంసుడిని శాస్త్ర చర్చలో ఓడించి, అతడి కంచుఢక్కను పగులగొట్టించి, అప్పటి వరకు డిండిమభట్టు వహించిన 'కవిసార్వభౌముడు' అనే బిరుదును తాను స్వీకరించాడు. అలా బయటి ప్రాంతాల పండితులు వచ్చి విద్యానగరంలోని పండితులను ఓడించి సన్మానం పొందడం చాల అరుదైన ఘటన. ఇతర ప్రాంతాల కవి, పండితులు విజయనగర కవుల చేతిలోనూ, పండితుల చేతిలోనూ ఓటమిపాలై వెనక్కు మరలిన సందర్భాలే కోకొల్లలు అలాంటి ఒక ప్రత్యేకించి పేర్కొనదగిన ఘటన శ్రీకృష్ణదేవరాయల పాలనా కాలంలో జరిగింది.

ఒకప్పుడు ఉజ్జయినికి చెందిన విద్యానిధి అనే గొప్ప పండితుడు విజయనగరం వచ్చాడు. అతడు గొప్ప పండితుడే కాక మహాకవి. కూలంకష ప్రజ్ఞావంతుడు. తాత్వికుడు. బహుభాషా వేత్త. తార్కికుడు. ఛందస్సులోనూ, అలంకార శాస్త్రంలోనూ దిట్ట. ప్రత్యేకించి ఒక శాస్త్రమని ఎందుకు? సకల శాస్త్రాలలోనూ ఆరితేరినవాడు. అతడు వయోవృద్ధుడేకాక జ్ఞాన వృద్ధుడు కూడా. కవిపండిత గోష్ఠులకూ, పోటీలకూ, సత్కవుల పోషణకూ విద్యానగరంలోని భువన విజయమనే సభ ప్రసిద్ధిగాంచినదని విని విద్యానిధి ఉజ్జయిని నుంచి హంపికి వచ్చాడు.

శ్రీకృష్ణదేవరాయలు విద్యానిధిని సాదరంగా 'భువన విజయం'లోనికి ఆహ్వానించారు. విద్యానిధి రాయలవారికి వినమ్రంగా ప్రణమిల్లి 'మాది మాళవ దేశంలోని ఉజ్జయినీ నగరం. నేను బహుభాషావేత్తనూ, కవినీ. ఎన్నో రాజాస్థానాలలో అఖండ సన్మానాలు పొందాను. వందల కొద్దీ రాజులునన్ను సన్మానించి తమనుతాము గౌరవించుకున్నారు. మీ విద్యానగరంలోని 'భువన విజయం' ఎప్పుడూ కవి పండిత గోష్ఠులతో మారు మ్రోగుతుందనీ, యిక్కడ ప్రతిభ పుష్కలమనీ, ప్రతిభ చూపిన వారికి ప్రతిఫలమూ పుష్కలమేనని విని నా ప్రతిభ చూపడానికి అత్యంత ప్రయాసపడి ఎంతో దూరం ప్రయాణించి యిక్కడికి చేరుకున్నాను. తమరి సెలవైతే యీ రోజు నేను తమరి ఆస్థానంలోని కవి పండితులతో తలపడతాను. నన్ను ఓడించిన మేధావికి నా కున్న బిరుదులన్నీ యిచ్చేస్తాను" అన్నాడు. రాయలవారు విద్యానిధినైతే సభలోనికి సాదరంగా ఆహ్వానించారు గానీ, ఆయన మనస్సులో ఓ మూల 'భువన విజయంలో' గల ఏ కవి గానీ, పండితుడు గానీ విద్యానిధికి సాటిరాడని అనిపించింది. "ఇప్పటి వరకూ అఖండ ఖ్యాతి గల 'భువన విజయం' యీ విద్యా నిధికి 'దాసో 2 హం' అనాల్సిందేనా" అని ఆయన ఆందోళన పడ్డాడు. అయితే యీ ఆందోళన ముఖంలో కనుపించనీయక, "ఓ విద్యానిధీ! ఉజ్జయిని నుంచి ఎడతెగని ప్రయాణం చేసి యిక్కడికి యీ రోజే చేరుకున్నారు. ఈ దినం కాస్త విశ్రాంతి తీసుకోండి. రేపటి నుంచి 'విద్యాగోష్ఠి' ప్రారంభిద్దాం" అన్నారు రాయలవారు. విద్యానిధి తన విశ్రాంతి మందిరానికి వెళ్లిపోయిన

తరువాత రాయలవారు గొప్ప విద్యావేత్త, పండిత ప్రకాండుడు అయినట్టి రాజగురువు తాతాచార్యుల వారిని ముందుగా యీ విషయమై సంప్రతించారు. ఆ తరువాత అష్టదిగ్గజ కవులతో సమాలోచనలు జరిపి ఎవరైతే రేపు సభలో విద్యానిధిని ఎదిరించి 'భువన విజయం' యొక్క పరువు నిలపగలరా – అని యోచించాడు. ఎంత కాలంనుంచో రామకృష్ణుడికి తగిన పరాభవం చేయాలని కాచుకు కూర్చున్న తాతాచార్యులు యిదే అదనుగా భావించి రాయలవారితో "రాయా! విద్యానిధిని ఎదుర్కొని ఓడించగల సమర్థుడు మన సభలో రామకృష్ణుడొక్కడే. రేపు అతనినే విద్యానిధిపైన మనం ప్రయోగిద్దాం" అన్నాడు. కాని రాయలవారికెందుకో రామకృష్ణుని ప్రతిభావ్యుత్పత్తులపై పూర్తిగా గురి కుదరలేదు. ఇంకా కొన్ని సందేహాలున్నాయి. అంచేతనే ఆయన రాజగురువుతో, "ఒకవేళ మనం ప్రోత్సహించినా రామకృష్ణయ్య విద్యానిధితో తలపడేందుకు సిద్ధపడతాడో – లేదో! మీరు కూడా యీ విషయమై మరొకమారు ఆలోచించండి" అన్నాడు. అష్టదిగ్గజ కవులలో పని మీద గ్రామాంతరం వెళ్లిన రామకృష్ణుడు మినహా అందరూ ఆ రోజు సభలో వున్నారు. ఏదో అద్భుతం చేసి రామకృష్ణయ్యే విద్యానిధిపై ఎలాగోలా గెలవగలడనే ఆశ అందరూ వెలిబుచ్చినా ఒక వేళ రామకృష్ణుడు ఓడితే 'భువన విజయం' పరువేం కాను? అనే ప్రశ్న అందరి మనస్సులనూ వెన్నాడింది.

ఎలాగైనా సరే విద్యానిధికి రామకృష్ణుడినే బలి చెయ్యాలనే కృతనిశ్చయంతో వున్న తాతాచార్యులు, 'రామకృష్ణుడు గెలిస్తే భువన విజయంలోని తమందరి పరువు దక్కుతుందనీ, ఓడిపోతే రామకృష్ణుడికి పరువు పోతుందనీ ఏదైనా మన మంచికే' – అని ఆలోచించారు. ఆ రాత్రి తన ప్రథమ శిష్యుడు శ్రీమాన్ అప్పలాచార్యులును రామకృష్ణుని యింటికి యీ విషయమై రాయబారం పంపారు. పనిమీద పొరుగూరు వెళ్లిన రామకృష్ణుడు సాయంత్రానికల్లా యింటికి వచ్చి, స్నానం, భోజనం ముగించుకుని అరుగు మీద కూర్చుని కమల చిలకలు చుట్టి యిస్తుంటే తాంబూల సేవనం చేస్తున్నాడు. 'తనను ఒకప్పుడు తాతాచార్యులవారి యింటి నుండి గెంటి వేసిన అప్పలాచార్యులు, పరాంకుశంలు తలవని తలపుగా తన యింటికి ఊడిపడ్డారేమిటా?' అని ఆశ్చర్య పోయాడు రామకృష్ణుడు. వారిపైన అప్పటి కోపం యింకా తగ్గక పోయినా – పైకి ఆప్యాయత కనబరుస్తూ "ఓ హెూ హెూ! శ్రీమాన్ తాతాచార్యులవారి భృత్యశ్రేష్ఠులు శ్రీమాన్ అప్పలాచార్యుల వారా' దయచేయండి. దయచేయండి. అరే! పరాంకుశం గారు కూడా విచ్చేశారే! 'ఊరకరారు మహాత్ములు' అంటారు. తమరు విచ్చేసిన కార్యమేమిటో చెప్పి యీ దీనుడిని కృతార్థుడిని చేయండి" అన్నాడు ఎత్తి పొడుపుగా. అప్పుడు అప్పలాచార్యులు "ఎత్తిపొడుపు లెందుకులే రామకృష్ణ కవీ! నేరుగా విషయంలోకి వస్తాను. ఉజ్జయిని నుండి ఈ రోజు విద్యానిధి అనే మహా పండితుడు భువన విజయానికి వచ్చారు. రాయలవారు రేపు విద్యాగోష్ఠి జరుప నిశ్చయించారు. విద్యానిధినెదుర్కొనగల సమర్థులు మీరేనని పండిత పరిషత్తు నిర్ణయం. మీరు కూడా సమ్మతి తెలియజేస్తే బాగుంటుందని మీకు నచ్చ జెప్పడానికి శ్రీమాన్ ఆచార్యులవారు నన్ను పంపారు. దయతో మీరు అంగీకరించాలి. ఇది శ్రీవారి కోరిక. చిత్తగించండి" అన్నాడు

"భువన విజయంలో ఎందరో పండితులూ, మహా పండితులూ, గండపెండర కవులూ, మహా కవులూ, ఉద్దండ పిండాలూ వుండగా తాతాచార్యులవారి కృపాకటాక్ష వీక్షణాలు నాపైనే ప్రసరించాయేం? ఇందులో ఏదైనా మతలబు లేదు కద? నేనో అర్భకుడిని. అంతటి మహాపండితుడిని ఓడించటం నావల్లనేమవుతుంది?" అన్నాడు తప్పుకోజూస్తూ రామకృష్ణుడు.

శ్రీమాన్ అప్పలాచార్యులు ఓ పట్టాన రామకృష్ణుడిని వదలలేదు. "మహాకవీ! ఇందుకు తమరే సమర్థులు తమరైతేనే విద్యానిధిని ఏదో విధంగా ఓడించగలరు. శ్రీవారి అభీష్టం కూడా అదే. కాదనకండి. ఇవి చేతులు కావు కాళ్లు" అన్నాడు రామకృష్ణుని చేతులు పట్టుకుంటూ.

అప్పటి వరకూ బెట్టు చేసిన రామకృష్ణుడు చివరికి "సరే! నేను వస్తానన్నానని శ్రీమాన్ ఆచార్యుల వారికి చెప్పండి"

అన్నాడు.

తెల్లవారి 'భువనవిజయం' కవి పండితులతోనూ, భాషాభిమానులతోనూ కిటకిటలాడింది. రాజధానిలోని సామాన్య ప్రజలు కూడా యీ అరుదైన విద్యాగోష్టిని చూడడానికి అసంఖ్యాకంగా వచ్చారు. విద్యానిధి తన శిష్య బృందంతో సహా డజన్లకొద్దీ సొరపేటికలతోనూ (పవిత్రమైన తాళపత్ర గ్రంథాల నుంచే చెక్క పెట్టెలను సొర పేటిక లంటారు) విద్వద్గోష్ఠికి సిద్ధమయ్యాడు. రామకృష్ణుడు అతి సాదాసీదాగా ఒక పట్టువస్త్రంలో దేనినో చుట్టుకుని దానిని చంకన బెట్టుకుని రాజసభకు వచ్చాడు. అది చూసిన వారెవరికైనా పొట్టేలు కొండను ఢీకొనబోతున్నదని అనిపించక మానదు.

రామకృష్ణుడు విద్యానిధిని "అయ్యా! మనం ఏ శాస్త్రంపై చర్చను ప్రారంభిద్దాం?" అని అడిగాడు.

విద్యానిధి గంభీరంగా "ఏ శాస్త్రమైనా మాకు కరతలామలకమే. ఏదైనా మాకు యిబ్బందిలేదు. వయస్సులోనూ, అనుభవంలోనూ మీరు నా కంటే చిన్న కనుక మీరే ఏదైనా మీకు తోచిన శాస్త్రాన్ని కోరుకోండి. అయినా మీరేదో శాస్త్రగ్రంథాన్ని చంకన బెట్టుకొచ్చి నట్లుంది. అదేమిటో చెప్పండి. పోనీ, దానిపైనే చర్చ చేద్దాం" అన్నాడు ధీమాగా.

దానికి రామకృష్ణుడు "మహా పండితా! ఈ గ్రంథం పేరు 'తిలకాష్ఠ మహిష బంధనము' మా రాజ్యంలో యిది అత్యంత ప్రసిద్ధి చెందిన గ్రంథము. మా రాజ్యంలో చివరికి ప్రతి బడి పిల్లాడికి కూడా యీ గ్రంథాన్ని గురించి అంతో యింతో తెలుసు" అన్నాడు.

దాంతో విద్యానిధి ఖంగు తిన్నాడు. అతడికీ పేరుగల గ్రంథమొకటుందని నేటి వరకూ తెలియనే తెలియదు. అయినా ఆయన తన మనస్సులోని తడబాటును ముఖంలో కనుపించనీయక, "అవును నేనూ చిన్న తనంలో ఆ గ్రంథం చదివాను. అయితే చాల కాలమైంది కదా! దాని ముఖ్యాంశాలేమిటో గుర్తు లేదు. ఆ గ్రంథంపైనే చర్చ జరిగితీరాలంటే మరొకసారి దాన్ని పరిశీలించి, రేపు మీతో చర్చలో పాల్గొంటాను. ఈ రోజుకిక చాలిద్దాం" అన్నాడు. రాయలవారు కూడా చర్చ తరువాతి రోజు చేపట్టడానికి అనుమతించారు. రెండవరోజు యథా ప్రకారం సభ సమావేశమైంది. అందరూ సభకు విచ్చేశారు - విద్యానిధీ, ఆయన శిష్యబృందం తప్ప. విద్యానిధి 'తిలకాష్ఠ మహిష బంధనం' అనే గ్రంథంపై తెనాలి రామకృష్ణునితో చర్చ చేయడానికి దడిచి రాత్రికి రాత్రే విజయ నగరాన్నుంచి పారిపోయి - ఓటమి తప్పించుకున్నాడని రాజధాని అంతా వార్తలు గుప్పుమన్నాయి. రాయలవారు పంపిన భటులు విద్యానిధి రాత్రి బసచేసిన విడిది గృహానికి వెళ్లివచ్చి యీ వార్తను ధృవపరిచారు. 'భువన విజయం' లో జయ జయధ్వానాలు మిన్ను ముట్టాయి. ప్రజల ఆనందోత్సాహాలకు అంతే లేదు.

రాయలవారు మాత్రం గంభీర ముద్రతో రామకృష్ణుని కేసి తిరిగి "ఏమిటిది రామకృష్ణయ్యా! 'తిలకాష్ఠ మహిష బంధనం' అనే పేరుగల గ్రంథం ఒకటుందని మేము కూడా లోగడ వినివుండలేదే! వాస్తవానికి అటువంటి గ్రంథమేమైనా వుందా? వుంటే అందులోని కొన్ని భాగాలను చదివి వినిపించండి" అన్నారు.

అందుకు రామకృష్ణుడు నవ్వుతూ, "విజయనగరం పరువు నిలపడానికి అబద్ధమాడి, ఓ మహాపండితుడితో అనివార్యమైన ఓటమిని నివారించాను. నిజానికి యీ పట్టు వస్త్రంలో చుట్టబడినది 'తిలకాష్ఠ మహిషబంధన'మే! అయితే అది గ్రంథం కాదు. 'తిలకాష్ఠ మహిష బంధనము'ను తెచ్చిన మాట నిజం. అయితే అది గ్రంథ మన్న మాట అబద్ధం" అన్నాడు.

సభికులందరితో బాటు రాయలవారికి కూడా అంతా గందరగోళ మనిపించింది. "రామకృష్ణయ్యా !, పరాచకాలు మాని నిజమేమిటో వెంటనే బయట పెట్టండి" అన్నారు రాయలవారు క్రోధంగా.

దానికి రామకృష్ణుడు, "క్షంతవ్యుణ్ణి మహాప్రభో! ఏం చేసేది? విద్యానిధి నెదుర్కొనే కార్యభారం అందరూ కలిసి నాపై మోపారు. మోసంతోనైనా జయించి తీరాలని యిలా చేశాను. అసలు 'తిలకాష్ఠ మహిష బంధనము' అనే పేరు గల గ్రంథం లేనే లేదు. మా దొడ్లో పెరిగిన నువ్వు మొక్క మండలు (తిల కాష్ఠములు) రెండు తీసుకుని వాటిని దున్నపోతును కట్టివేసే తాడు (మహిష బంధనము) తో ముడివేసి యీ పట్టు వస్త్రంలో చుట్టి పైకి ఒక ఉద్గ్రంథానికి సంబంధించిన తాళపత్రాలు అనిపించేటట్లుగా చంకన పెట్టుకుని తీసుకొచ్చాను. అబద్ధం చెప్పి - విద్వాంసుడిని మోసం చేసినా, విజయనగరం పరువు, భువన విజయం ప్రతిష్ఠ నిలపడానికే అలా చేయాల్సి వచ్చింది. ఈ అపరాధానికి తమరు నాకు ఏ శిక్ష విధించినా సంతోషంతో స్వీకరిస్తాను" అన్నాడు. రాయలవారి కోపం అంతలోనే మటుమాయమయింది. ఇలా మోసం చేసి విద్వద్గోష్ఠులలో గెలిస్తే అది ఓ గెలుపు కాదని సున్నితంగా రామకృష్ణుడిని మందలిస్తూనే, మరో ప్రక్క 'భువన విజయం' పేరు ప్రఖ్యాతులను నిలబెట్టినందుకు రాయలవారు రామకృష్ణుడిని ఘనమైన కానుకలతో సత్కరించారు. రామకృష్ణుని తెలివితేటలకూ, చాకచక్యానికీ విజయనగర ప్రజలు అతడినెంతగానో కీర్తించారు.

## 18. రామకృష్ణుడు - గాడిదలకు ప్రణామం

శ్రీకృష్ణదేవరాయల రాజ్యంలో వైష్ణవులకు అన్ని రంగాలలో ప్రాధాన్యత యివ్వబడేది, ప్రోత్సాహం లభించేది కారణం రాయలవారు వీరవైష్ణవులు కావడమే. అయితే ఆయన యితర మతాలవారిని ఎన్నడూ ద్వేషించలేదు. ధూర్జటి వంటి శైవులూ, అల్లసాని పెద్దన వంటి జన్మతః స్మార్తులూ కూడా ఆయన ఆస్థానంలో పోషణ నందుకున్నారు. (పెద్దన మహాకవి శఠకోపయతి అనే వైష్ణవ గురువు శిష్యరికం చేసి వైష్ణవుడయ్యాడు) హంపి విజయనగరాన్ని పాలించిన సంగమ వంశీయులు శైవులు కాగా, సాళువ, తుళువ, ఆరవీటి వంశస్థులు వైష్ణవులు విజయనగర రాజ్యస్థాపకుడైన మాధవ విద్యారణ్యుడు శృంగేరి పీఠాధిపతి. అద్వైతవాది. భగవంతుని నిజరూపము తెలిసిన జ్ఞాని, కాబట్టి హరి హర బుక్కరాయలకు ఆయన సర్వమత సమభావాన్ని బోధించి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. బుక్కరాయలు ఒక సందర్భంలో కర్ణాటకలోని శ్రావణ బెళగొళలో జైనులకూ, వైష్ణవులకూ మధ్య వివాదం ఏర్పడగా, మిక్కిలి న్యాయబుద్ధితో వ్యవహరించి వారికి సంధి చేశాడట విద్యారణ్యుని ప్రభావం చేతనేనేమో మొదటి నుండీ విజయనగర పాలకులు ఎప్పుడూ పరమతాల్ని ద్వేషించలేదు. ముస్లిముల పట్ల కూడా వారికి ఎన్నడూ ద్వేష భావం లేదు. మొదటి దేవరాయలు (క్రీ. శ. 1404-1422) తన సేనలోని ముస్లిము సైనికుల కొరకు విజయనగరంలో ఒక మసీదు కట్టించాడట. తన సామంతులలో ఒకడైన శాంతలింగప్ప అనే వీరశైవుడు ఒకప్పుడు మతావేశపరుడై అనేకమంది శ్వేతాంబర జైనులను చంపివేయగా, శ్రీకృష్ణదేవరాయలు దీనిని సహించలేక వెలుగోటి తిమ్మానాయుడనే సేనానిని పంపి శాంత లింగప్పను వధింపజేశాడు. రాయలవారు తిరుపతి, కంచి, సింహాచలము, అహోబిలము మొదలైన వైష్ణవ క్షేత్రాలకు ఎలా దానాలు చేశారో, తిరువణ్ణామలై, చిదంబరము, కాళహస్తి శ్రీశైలం, అమరావతి మొదలగు శైవ క్షేత్రాలకు కూడా అదే రీతిలో దానాలిచ్చారు రాయల ఆస్థానంలో క్రైస్తవులు, మహమ్మదీయులు, యూదులూ కూడా ఉద్యోగాలు చేస్తున్నారనీ, అందరూ సర్వమత సమభావంతో ఆయన రాజ్యంలో ప్రశాంతంగా జీవిస్తున్నారనీ, వారికెట్టి కష్టములూ లేవనీ బార్బోసా అనే విదేశీ యాత్రికుడు పేర్కొన్నాడు. ఈ మత సహనాన్ని కృష్ణదేవరాయల అల్లుడు అళియ రామరాయలు మరింతగా పెంపొందింప జేశాడు. వారు చేసిన యుద్ధాలన్నీ రాజ్య రక్షణ కోసమే కానీ మత పరిరక్షణ కోసం కానే కాదు వ్యక్తిగతంగా తాము తమ యిష్ట ప్రకారం పూజాదికాలు నిర్వహించుకొనడం తప్ప విజయనగర పాలకులు ఎప్పుడూ మతాన్ని ప్రభుత్వ పాలనతో మిళితం చేయలేదు తమ మత విశ్వాసాలను సాధారణ పౌరులపై రుద్దలేదు.

కృష్ణదేవరాయలుకు ఏ విధమైన మత పరమైన సంకుచిత దృష్టి లేకున్నప్పటికీ, రాజగురువు తాతాచార్యుల వారికీ, ఆయన ప్రథమ శిష్యుడు అప్పలాచార్యుల వారికీ స్మార్తులు, శైవుల పొడ గిట్టేది కాదు. మత విషయమై వారిది అత్యంత సంకుచిత దృష్టి రామకృష్ణుడు వైష్ణవం పుచ్చుకున్నప్పటికీ తమదైన తెంగల శాఖ వైష్ణవుడు కాదు (అతడు వడహల - వైఖానస - శాఖకు చెందిన వైష్ణవుడు). అదీగాక, అతడు జన్మతః స్మార్తుడు, విజయనగరం రాకముందు పాలగుమ్మి ఏలేశ్వరుడనే గురువు వద్ద వీరశైవ మత దీక్ష తీసుకున్నవాడు అంచేత, అతడి పొడ వారిరువురికీ గిట్టేదే కాదు.

రాయలవారి సభలో ప్రవేశించిన తొలినాళ్లలో రామకృష్ణుడు ఓ రోజు ప్రొద్దున్నే ఏదో శాస్త్ర విషయమై సందేహం వచ్చి అప్పలాచార్యుల వారి యింటికి వెళ్లాడు. అప్పలాచార్యులు తన గురువు తాతాచార్యుల వారంతటి పండిత ప్రకాండుడు కాకున్నా శుశ్రూషలతో గురువును మెప్పించి ఆయన ప్రథమ శిష్యుడని ఖ్యాతి గాంచినవాడు. తాతాచార్యులవారి భృత్యులలోకెల్లా విశిష్టభృత్యునిగా పేరుగాంచాడు. గురువు లాగే రామకృష్ణుడిని చూస్తే ఒంటికి కారం రాసుకున్నంత కోపం కలుగుతుందతడికి. ఎన్నోసార్లు రామకృష్ణుడిని పరాభవించాలని యత్నించి భంగపడ్డాడు అప్పలాచార్యులు. అయినా ఎప్పుడూ అప్పలాచార్యులు రామకృష్ణుడిని కించపరచే అవకాశం ఎక్కడ దొరక్కపోతుందా – అనే ఎదురు చూసేవాడు. ప్రొద్దున్నే యీ లింగడి ముఖం చూడాల్సి వచ్చిందే . . భగవంతుడా . . అని బాధపడిపోతూ వెంటనే తన ముఖాన్ని పై పంచెతో కప్పుకున్నాడు రామకృష్ణుడిని అవమానపరచడానికి అప్పలాచార్యుడు. రామకృష్ణుడికిదేమీ బోధపడలేదు. అప్పలాచార్యుల వారెందుకలా చేశారో అతనికి అర్థం కాలేదు. "ఆచార్యా! నేనొక ముఖ్యమైన శాస్త్ర విషయంపైన కొన్ని సందేహాలు తీర్చుకొనడానికి మీ దగ్గరకు వచ్చాను. ఆ విషయాలు తరువాత అడుగుతాను. ముందుగా మీరు నన్ను చూసి గబుక్కున పై పంచెతో ముఖం ఎందుకు చాటు వేశారో చెప్పండి స్వామీ! అది తెలుసుకోవాలని నాకు కుతూహలంగా వుంది" అన్నాడు రామకృష్ణుడు. అప్పలాచార్యులు రామకృష్ణునితో విసురుగా "నాతో శాస్త్ర మీమాంస చేస్తావేం? ఏమిటి నీ సందేహాలు? నీ ముఖం చూడగానే నేనెందుకు నా ముఖం గుడ్డతో కప్పుకున్నానో నీకు తెలియదేం? నీ వేదో మహా పండితుడవని రాయలవారితో సహా అందరూ నిన్ను తెగ మెచ్చుకుంటారే ! నీకు యీ మాత్రం కూడా తెలియదూ?" అన్నాడు యీసడింపుగా.

అప్పుడు రామకృష్ణుడు తాపీగా "మహాశయా! తెలియకనే కదా అడుగుతున్నది. మీరలా ఎందుకు గుడ్డతో ముఖం కప్పుకున్నారో దయచేసి త్వరగా తెలియజేయండి" అన్నాడు చిరాగ్గా.

అప్పుడు అప్పలాచార్యులు కసిదీరా కోపంగా యిలా అన్నాడు, "చెప్పక తప్పదంటావా? అయితే విను. నాలాంటి శుద్ధవైష్ణవుడు ప్రొద్దున్నే లేచి నీ లాంటి లింగడి (శైవుడి) ముఖం చూస్తే వచ్చే జన్మలో గాడిదై పుడతాడు. తెలిసిందా. అందుకే నేను ముఖం కప్పుకున్నాను. విషయం తెలిసిందిగా. ఇక దయచెయ్యి."

రామకృష్ణుడు అవమానంతో ముఖం ఎర్రబడగా మారు మాటాడకుండా అక్కడి నుంచి రక్కున వెళ్లిపోయాడు. నాటినుండి అప్పలాచార్యులు పైన యింతకింతా ఎలా బదులు తీర్చుకోవాలా అని ఎదురు చూడసాగాడు రామకృష్ణుడు.

చాల కాలం తర్వాత ఓ రోజు ఉదయం కృష్ణ దేవరాయలు పండితులతో శాస్త్ర చర్చ జరుపుతూ తుంగభద్రా నదీ తీరంలోని కాలిబాటపై చిన్నగా నడుస్తూ వెళ్తున్నాడు. ఆయనతో పాటు వున్న పండిత బృందంలో శ్రీమాన్ అప్పలాచార్యులు, తెనాలి రామకృష్ణుడు కూడా వున్నారు. నదీ తీరంలోని మైదానం మీద రజకులు తమ బట్టల మూటలు మోయడానికి వినియోగించే గాడిదలు కొన్ని గడ్డిమేస్తున్నాయి. వాటిని చూడగానే రామకృష్ణుడికి ఒక చక్కటి ఆలోచన వచ్చింది. వచ్చిందే తడవుగా దానిని అమలులో పెట్టాడు. ఆ గాడిదలను చూడగానే రామకృష్ణుడు ఎంతో వినమ్రంగా వెళ్లి వాటికి గౌరవ భావంతో వంగి నమస్కరించి వచ్చాడు. ఇదంతా చూస్తున్న రాయలవారికి 'రామకృష్ణుడికి మతిపోలేదు కదా?' అన్న అనుమానం కలిగింది. "రామకృష్ణుడి వింత ప్రవర్తనకు అర్థమేమిటి? ఇలాంటి పిచ్చి పనులు చేయడమంటే యితనికి మతి చలించిందేమో!" అన్నారు రాయలవారు అప్పలాచార్యులతో. ఆయన వెంటనే అందుకుని "అవును మహారాజా! ఇతడు యిటీవల యిలాంటి పిచ్చి పనులు చేస్తున్నాడని అందరూ అంటున్నారు – నిస్సందేహంగా యితడికి పిచ్చెక్కింది" అని తేల్చివేశాడు.

గాడిదలకు ప్రణామం చేసి తిరిగి వచ్చిన తరువాత రామకృష్ణుడిని రాయలవారు, "ఏమిటి రామకృష్ణయ్యా! మీరు

చేసిన పని ఏమిటి? మీ పనికి అర్థమేమైనా వుందా అసలు? మీకు పిచ్చి గాని ఎక్కలేదు కద?" అన్నారు మందలింపుగా.

దానికి రామకృష్ణుడు "దేవరా! నేను కాని పని యేమీ చేయలేదు. నా మనస్సు సవ్యంగానే వుంది. నాకు పిచ్చేమీ ఎక్కలేదు. నేనిప్పుడు అప్పలాచార్యుల వారి బంధువులకు ప్రణామం చేసి వచ్చాను" అన్నాడు తాపీగా.

దీంతో రాయలవారు ఉగ్రులై, "రామకృష్ణయ్యా! మీ వింత చేష్టలతో అప్పలాచార్యుల వంటి మర్యాదస్తుడిని అవమాన పరుస్తున్నారు మీరు. ఆయనో గొప్ప విద్వాంసుడు. సమాజంలో పేరు ప్రతిష్ఠలున్న మర్యాదస్తుడు. మీరు ఆయన్ని అవమానిస్తే నన్ను అవమానించినట్లే. ఇందుకు శిక్షేమిటో తెలుసా? ఇప్పుడు చెప్పండి. అసలు గాడిదలకూ, అప్పలాచార్యుల వారికీ సంబంధమేమిటి? చెప్పండి!" అంటూ నిలదీశారు.

అప్పుడు రామకృష్ణుడు వినయంగా, "మహాప్రభో! నాపై కన్నెర్ర చేయకండి. దయచేసి నే చెప్పేదంతా సావధానంగా వినండి. నేనెన్నడూ అప్పలాచార్యుల వారిని అవమానించడానికి ప్రయత్నించ లేదు. ఆయనే అవకాశం దొరికినప్పుడల్లా నన్ను అవమానిస్తున్నాడు. ఆయనకు నాపై కసి ఎందుకో తెలియదు. స్మార్తుడిగా పుట్టి, బాల్యంలోనే శివదీక్ష స్వీకరించాను పరిణతి చెందిన నేను యిటీవల వడహల వైష్ణవ శాఖకు చెందిన భట్టరు చిక్కాచార్యులు అనే వైఖానసుడి వద్ద వైష్ణవ దీక్ష స్వీకరించాను. అంత మాత్రానికే తెంగల శాఖకు చెందిన అప్పలాచార్యుల వారు నాపై పగబట్టాలా? వీలు దొరికినప్పుడల్లా నన్ను అవమాన పరుస్తున్నారే! నేను చేసిన నేరం ఏమిటి? ఈ మధ్య ఓసారి ఉదయాన్నే ఏదో శాస్త్ర విషయమై నాకున్న సందేహాలు తీర్చుకొనడానికి అప్పలాచార్యుల వారింటికి వెళ్తే నన్ను చూస్తూనే తన ముఖాన్ని పై పంచెతో కప్పుకున్నారాయన దానికి కారణమేమిటని అడిగితే – తన వంటి శుద్ధవైష్ణవులు ప్రొద్దున్నే లేచి నా వంటి లింగడి (శైవుడి) ముఖం చూస్తే వచ్చే జన్మలో గాడిదలై పుడతారని చెప్పాడు. ఇది నిజమేనా? ఒకవేళ నిజమైతే నేను నమస్కరించింది గత జన్మలో వైష్ణవులకు – గాడిదలకు కాదు. అది మంచిపనే గదా మరి. వారంతా అప్పలాచార్యుల వారి వంశీకులే కదా మరి! ఒకవేళ యిది అబద్ధం కనుక అయితే అప్పలాచార్యుల వారిని 'తాను చెప్పిందంతా అబద్ధమ'ని అంగీకరించమనండి. ఆ తరువాత యింకా నాది అనుచిత ప్రవర్తన అని తమకు తోస్తే నాకు తగిన శిక్ష విధించండి. మత విషయాలలో తమకు లేని సంకుచిత దృష్టి తమ గురువుల కెందుకు? తమ దృష్టిలో శ్రీవైష్ణవులూ, వైఖానసులూ, శైవులూ, స్మార్తులూ అంతా ఒక్కటేనని నేనెరుగుదును. ఈ విషయంలో సముచిత న్యాయ నిర్ణయం చేసి తమ మత నిరపేక్షతను లోకానికి చాటండి" అన్నాడు.

అప్పుడు రాలయవారు "అప్పలాచార్యా! నా గురువుకు ప్రథమ శిష్యులైన మీరు నాకు అగ్రజునితో సమానం అన్య మతస్థులతో మీరిలా అనుచితంగా ప్రవర్తించ వచ్చా? మతం పూర్తిగా వ్యక్తిగతమైనది. ఎవరి ఆరాధనా పద్ధతులు వారివి. అన్ని మార్గాలూ మనలను భగవంతుని దరికి చేర్చేవే. అందుకే నా రాజ్యంలోని ప్రజలకు నేను వైష్ణవం గొప్పదీ, శైవం తక్కువదీ అని ఏనాడూ చెప్పలేదు. నేను వైష్ణవంలో తెంగల శాఖ (శ్రీవైష్ణవ) అనుయాయినే అయినా వడహల (వైఖానస) శాఖను ఏనాడూ కించ పరచలేదు. రాజు అన్నాక అన్ని వర్గాల, మతాల ప్రజలనూ సమదృష్టితో చూడాలి సంకుచిత భావం విడనాడితేనే రాజ్యమైనా, మతమైనా విస్తరించేది. కనుక రాజుకు వర్తించే న్యాయం మతాధిపతికీ వర్తిస్తుంది. నేటి నుంచి మతపరమైన సంకుచిత భావాన్ని విడనాడి, మీ ఉదాత్తమైన వర్తనతో అన్యమతానుయాయులను కూడా ఆకట్టుకుని వైష్ణవ మతాన్ని నలు చెరగులా వ్యాపింప చేయడం ద్వారా యీతోధికంగా మత సేవచేసి మీ జీవితాన్ని తరింప చేసుకోండి" అని అప్పలాచార్యులకు హితబోధ చేశారు.

తరువాత రాయలవారు రామకృష్ణునితో "రామకృష్ణయ్యా! ఎప్పటికప్పుడు నా హ్రస్వదృష్టితో మిమ్మల్ని నేను

సరిగా అర్థం చేసుకోలేక పోయాను. అలాంటప్పుడల్లా మీరు నాకు చక్కగా కనువిప్పు కలిగించారు. నేటి నుండి యీ మత గురువుల ప్రభావం నాపై ఏ మాత్రం ఉండబోదు. నాకు చక్కగా జ్ఞానోదయం కలిగించారు మీరు. అందుకు మీకు సర్వదా కృతజ్ఞుడిని. నా దృష్టికి తేవడానికి మీకు ఉచితమనిపించిన ఏ విషయాన్నైనా సరే నిర్భయంగా నాకు తెలియ జేయండి. సంకోచించవద్దు. మీ సూటితనం, దేశభక్తి, స్వామిభక్తితో పలుమార్లు మీరు విజయనగర సామ్రాజ్య విజయ కేతనాన్ని వినువీధులలో ఎగుర వేశారు. అందుకు యిప్పటికే యీ రాజేకాక, యీ రాజ్యం కూడా మీ కెంతో ఋణపడి వున్నది. ఇక ముందు కూడా మీ సలహాలు యీ రాజ్యానికి ఎంతో అవసరం. అంచేత నేటి నుండి మిమ్మల్ని నా ఆంతరంగిక సలహాదారులలో ఒకనిగా నియమిస్తున్నాను. కాదనకండి" అన్నారు.

నాటి నుండి రామకృష్ణుడు రాయలవారి ఆంతరంగికులలో ఒకనిగా ఎప్పుడూ రాయలవారిని వెన్నంటే వుంటూ రాయల వారికి తనకు ఉచితమనిపించిన సలహాలనిస్తూ రాయలవారి క్షేమమూ, రాజ్య క్షేమమూ కాంక్షిస్తూ గొప్ప దేశభక్తునిగా కీర్తిగాంచాడు.

## 19. రామకృష్ణుడు - వజ్రాల దొంగ

విజయనగర సామ్రాజ్యంలోని ఆముదాల పల్లె అనే గ్రామంలో ధనగుప్తుడనే ఓ భాగ్యవంతుడుండేవాడు. అతడు తరతరాలకు సరిపడా బంగారం, వజ్రాలు, రత్నాలు, ఆభరణాలు యితర విలువైన వస్తువులు పోగేశాడు. అతడు పిల్లికి కూడా బిచ్చం పెట్టేవాడు కాదు. సాటి గ్రామస్థులకు కూడా అతడంటే గిట్టేది కాదు. కారణం అతడు ఏనాడూ వారి సాధక బాధకాల పట్ల కనికరం చూపలేదు సరికదా - ఎంగిలి చేత్తో కాకిని కూడా తోలి ఎరగడతడు.

ఓసారి దొంగలు అతని యిల్లు దోచారు. విలువైన ఆభరణాలు, నవరత్నాలు, యితర విలువైన వస్తువులన్నీ ఏక మొత్తంగా దోచేశారు. ఈ పని ఎవరు చేశారో కనుగొనడానికి ధనగుప్తుడు చేసిన యత్నాలేవీ ఫలించలేదు. అతడు వారికోసం గాలించి గాలించి వూరుకున్నాడు. తన యింట్లో సంపద గురించి బాగా ఎరిగిన వాళ్లే యీ పని చేసి వుంటారని అతడు భావించాడు. తన పనివాళ్లను కూడా అతడు విశ్వసించలేదు. ఇక యిలా లాభం లేదనుకుని, యీ దొంగతనం విషయమై రాజధాని హంపిలో ఫిర్యాదు చేయాలని నిశ్చయించుకున్నాడు.

రాచనగరుకు చేరుకున్న ధనగుప్తుడు తన యింటిలో జరిగిన దొంగతనం గురించి రాజసభలో ఫిర్యాదు చేశాడు. ఆ సమయంలో సభలో నున్న రామకృష్ణుడు యీ ఘటన పూర్వాపరాలను ధనగుప్తుడిని అడిగి తెలుసుకున్నాడు. రాయలవారు కూడా జరిగిందేమిటో ధనగుప్తుడు చెప్పగా విని యీ విషయం విచారణ జరిపి దోషులను పట్టుకునే బాధ్యతను రామకృష్ణునికే అప్పగించారు. "నీ కెవరి మీదన్నా అనుమానముందా?" అని ధనగుప్తుడిని అడిగాడు రామకృష్ణుడు. దానికి ధనగుప్తుడు, "మహాకవీ! నాకు యీ దొంగతనం జరిగిన దగ్గర్నుండీ రాత్రిళ్లు నిద్రే వుండడం లేదు. తిండి సహించడం లేదు. నా దగ్గర పది మంది పనివాళ్లున్నారు. వారిలో ఏ ఒకడో యీ పని చేసి వుంటాడు. అతడెవరో కనుగొని తమరు అతడిని నిర్బంధించే వరకు నా యింటికి భద్రత లేదు. నాకు భయం తొలగదు. మనశ్శాంతి కలుగదు" అన్నాడు.

అప్పుడు రామకృష్ణుడు "ధనగుప్తా! నీ పది మంది పనివాళ్లలో ఒకడే యీ దొంగతనం చేసి వుంటాడని నమ్మకంగా చెపుతున్నావు కనుక, రేపు ఆ పది మంది పనివాళ్లనూ రాజసభకి పంపించు. వారిలో దొంగ ఎవరో నేను నిర్ధారిస్తాను. ఇక నీవు ఇంటికి వెళ్లి నిర్భయంగా వుండు" అన్నాడు. ధనగుప్తుడు ఆ రాత్రికే ఆముదాలపల్లె చేరుకున్నాడు. రెండవ రోజు సాయంత్రానికి ఆ పదిమంది పనివాళ్లు విజయనగరం చేరుకుని, యీ దొంగతనం విషయంలో విచారణాధికారిగా

నియమించబడిన రామకృష్ణుని ఎదుట హాజరయ్యారు.

రామకృష్ణుడు వారిని "మీ యజమాని ధనగుప్తుని యింట్లో బంగారు ఆభరణాలు, విలువైన నవరత్నాలు వగైరాల దొంగతనం జరిగిందట. నిజమేనా?" అని ప్రశ్నించాడు. వారంతా అవునన్నారు.

అప్పుడు రామకృష్ణుడు వారితో "మీలో ఎవడో ఒకడు యీ దొంగతనానికి పాల్పడ్డాడని మా కులదేవత కాళీమాత చెపుతున్నది. ఆ ఒక్కడూ ఎవరో కూడా కాళీమాత మహిమతో నేను కనిపెట్టగలను. అయినా మీ మంచితనాన్ని ఋజువు పరచుకునే అవకాశమిస్తున్నాను. ఆ దొంగతనం చేసిందెవరో ఒప్పేసుకోండి. లేకుంటే మీ అందరికీ కఠిన శిక్ష తప్పదు. ఒక్క వ్యక్తి కోసం అందరూ అన్యాయంగా బలైపోతారు సుమా!" అంటూ హెచ్చరించాడు.

అయినా వారిలో దొంగతనం చేసిన వాడెవడో తన తప్పు ఒప్పుకోలేదు. ఇక యిలా లాభం లేదని రామకృష్ణుడు సమానమైన పొడవుగల పది సన్నటి కర్రపుల్లలు తెప్పించాడు. వాటినన్నింటినీ కాళీమాత విగ్రహం ముందు పూజించి మంత్రించిన పిదప అక్కడికి తెచ్చామని వారికి తెలిపాడు. ఆ మంత్రించిన పుల్లలను పది మంది పనివాళ్లకూ ఒక్కొక్కటి చొప్పున యిచ్చి, "ఈ పుల్లలు అన్నీ మంత్ర శక్తి కలవి. ఈ రాత్రికి ఇవి మీ పక్కలో పెట్టుకుని పడుకోండి. మీలో దొంగతనం చేసిన వ్యక్తి దగ్గర వున్న పుల్ల మాత్రం యీ రాత్రికి 4 అంగుళాలు పొడవు పెరుగుతుంది. మిగిలిన పుల్లలు యధాతథంగానే వుంటాయి. వెళ్లండి. తిరిగి ప్రొద్దున్నే ఎవరికిచ్చిన పుల్ల వాళ్లు తీసుకొచ్చి నాకు చూపండి" అంటూ వాటికి ఓ సత్రంలో బస ఏర్పాటు చేసి కాపలా కట్టుదిట్టం చేశాడు.

ఆ పది మందిలో దొంగతనం చేసిన పని మనిషి యిలా ఆలోచించాడు – "నేను దొంగతనం చేశాను కనుక కాళీమాత మహిమ వల్ల నా దగ్గరున్న యీ మంత్రించిన పుల్ల తెల్లారేసరికి 4 అంగుళాలు పొడవు పెరుగుతుంది. మిగిలిన తొమ్మిది మంది దగ్గరున్న పుల్లలు మాత్రం అదే విధంగా వుంటాయి. అందుకని రామకృష్ణుడు రేపు ఉదయం నా దొంగతనం బయటపెట్టేస్తాడు. కాబట్టి నా పుల్లకూడా మిగిలిన వాళ్ల పుల్లలంత పరిమాణంలోనే వుండాలి – కానీ నాలుగంగుళాలు ఎక్కువ పొడవుగా వుండ కూడదు" అని భావించి, "ఆ పెరగబోయే నాలుగంగుళాలూ ముందే తగ్గిస్తే పోలా!" అనుకుని ఎవరూ చూడకుండా తన వద్ద వున్న పుల్లను నాలుగంగుళాల మేరకు విరిచి వేసి ఏమీ ఎరగనట్లు అందరితో పాటు తానూ నిద్రపోయాడు.

ఉదయాన్నే రామకృష్ణుడు అందరినీ రాజసభకు పిలిపించి ఒక్కొక్కరినీ వేర్వేరుగా తన వద్దకు రమ్మని రాత్రి తాను యిచ్చిన పుల్లల్ని తిరిగి యిమ్మన్నాడు. దొంగతనం చేసిన పనివాడు ముందుగా లోనికి వెళ్లడానికి జంకి అందరికంటే వెనకగా వెళ్లాడు. మిగిలిన వారి పుల్లలన్నీ యధాతథంగా వుండగా, కేవలం ఆఖరుకు వచ్చిన ఆ పనివాడు యిచ్చిన పుల్ల పొడవులో మిగిలిన వాటి కంటె నాలుగు అంగుళాలు తక్కువగా వుంది. అలా దొంగ ఎవరో తెలివిగా తేల్చివేశాడు రామకృష్ణుడు. కాళీమాత మహిమ వలన దొంగతనం చేసిన వాడి వద్ద వున్న మంత్రించిన పుల్ల తెల్లారే సరికల్లా నాలుగంగుళాల పొడవు పెరుగుతుందని అతడు అబద్ధంచెప్పి ఆ దొంగని నమ్మించగలిగాడు. దాంతో వాడు బుట్టలో పడి అది నిజమేనని నమ్మి, తన పుల్ల పొడుగు పెరిగితే రేపు తను దొరికి పోతానని ముందు జాగ్రతగా అన్ని పుల్లల పరిమాణంలోనే తన పుల్లకూడా వుండడం కోసం నాలుగంగుళాల మేర విరిచి వేయడం కారణంగా వాడు దొరికి పోయాడు. రామకృష్ణుని తెలివి తేటలకు రాయలవారు అబ్బురపడ్డారు. విజయనగర పౌరులంతా ఆయన మేధా శక్తికి నీరాజనాలిచ్చారు.

# ౨౦. తాతాచార్యుల వారి ప్రాయశ్చిత్తం

శ్రీవైష్ణవుడైన తాతాచార్యులు శ్రీకృష్ణదేవరాయలకు గురువు ద్వైత (మాధ్వ) మతమునకు చెందిన వ్యాసతీర్థుడు కూడా కృష్ణదేవరాయలకు ఆధ్యాత్మిక గురువుగా వ్యవహరించినప్పటికీ రాయలవారు స్వయంగా శ్రీవైష్ణవావలంబి కావున వ్యాస తీర్థుల ప్రభావం ఆయనపై అంతగా లేదు అయితే రాయలవారిని అన్ని విషయాలలోనూ ప్రభావితం చేసిన ఘనత తాతాచార్యుల వారిదే ఆయనది కాంచీపురం ఆయన గొప్ప సంస్కృత పండితుడే కాక, ధార్మిక విషయాలలో దిట్ట సంఘసేవా తత్పరుడు ఆయన యింటి పేరు తిరుమలవారు ఎందరో పేద కన్యలకు ఆర్థిక సహాయం చేసి కన్యాదానం చేయించిన కారణంగా వారి యింటి పేరు 'కన్యాదానం అయిందట ఈయన సంస్కృతంలో 'సాత్త్విక బ్రహ్మవిద్యా విలాసము' అనే గ్రంధం రచించాడట ఎంత గొప్ప పండితుడైతేనేం తాతాచార్యులు తీవ్రమైన స్వమతాభిమానం కలవాడుగా ప్రసిద్ధుడయ్యాడు ఇతర మతాలకు చెందిన వారిని చులకన చేసి మాట్లాడడం ఆయనకున్న బలహీనత రాయలవారి అభిమానం పొందగలిగిన కారణంగా, బలవంతంగా తప్త చక్రాంకణం చేయించడం ద్వారా ఎందరినో శ్రీవైష్ణవులుగా మార్చిన ఘనుడీయన అందుకే నేమో 'తాతాచార్యుల వారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు' అనే నానుడి వచ్చింది ఈ శ్రీవైష్ణవ గురువు శ్రీకృష్ణదేవరాయల కాలం నుండి ప్రారంభించి క్రీ శ 1590 ప్రాంతాల వరకు విజయనగర ప్రభువులకు ఆధ్యాత్మిక గురువుగా వ్యవహరించాడట

తాతాచార్యుల వారిచే నిరాదరణకు గురైన రామకృష్ణుడు సహజంగానే శ్రీవైష్ణవ (తెంగల శాఖ) కు వ్యతిరేకిగా తయారయ్యాడు ఆయన వడహల శాఖ (వైఖానస శాఖ) కు చెందిన భట్టరు చిక్కాచార్యులు అనే గురువు దగ్గర వైష్ణవ దీక్ష తీసుకున్నాడు వైఖానస మతాన్ని ఆగర్భ వైష్ణవం' అంటారు. ఎవరైనా వైఖానసునిగా పుట్టాల్సిందే కానీ, వైఖానస మతం స్వీకరించడానికి అవకాశం లేదు శిశువు జన్మించడానికి ముందే తప్తచక్రాంకనం చేయబడిన పాయసాన్ని గర్భిణిచే ప్రాశన చేయించడం ద్వారా ఆ శిశువుకు వైష్ణవం అబ్బుతుందని వీరి విశ్వాసం అయితే తాతాచార్యుల మీద వ్యతిరేకతతో రామకృష్ణుడు వైఖానస పక్షపాతియైన వైష్ణవునిగా వ్యవహరించేవాడన్న మాట తెలుగు కధాసాహిత్యంలో రామకృష్ణుడికీ, తాతాచార్యులుకీ మధ్య వైరుధ్యాన్ని ఆధారం చేసుకుని అల్లబడిన కథలెన్నో వున్నాయి వీటిలో కనీసం కొన్ని గాథలు చారిత్రకంగా వాస్తవాలై వుంటాయి అలాంటి మరో గాథను యిప్పుడు మనం చూద్దాం

తాతాచార్యుల వారికి రామకృష్ణుని ముఖం చూడడమే యిష్టముండేది కాదు. ఒకవేళ అనుకోకుండా ఎదురైతే గిరుక్కున తలతిప్పుకునే వాడాయన. అందరికంటే శ్రీవైష్ణవులే మిన్న అని నమ్ముతూ, శ్రీవైష్ణవుడననే అహంకారం కలిగి వుండేవాడాయన. స్మార్తులనూ, శైవులనూ చూస్తేనే పంచమహాపాతకాలు అంటుకుంటాయని ఆయన విశ్వాసం. రామకృష్ణుడు కావాలని పరాచకానికి ఆయన్ని కదిలించి పలకరించేవాడు.

ఓ రోజు రాజసభలో రామకృష్ణుడు తాతాచార్యుల వారితో ఓ ధర్మ సందేహాన్ని ప్రస్తావించి నివృత్తి అడిగాడు. "తాతాచార్యా! యీ రోజు ఉదయం పొరబాటున నా ఎడమ చేతి బొటన వ్రేలికి గోమయం (ఆవు పేడ) అయింది. ఇందుకు ప్రాయశ్చిత్తమేమిటి?" అని ప్రశ్నించాడు.

తాతాచార్యుల వారికి మంచి అవకాశమే దొరికింది. ఆయన విసురుగా ముఖం అటు తిప్పుకుని, "ఏముంది? సదాచార నిష్ఠతో మెలగే పండితులయితే ఎంత మేరకు గోమయమైందో ఆ శరీర భాగాన్ని ఖండించాలని శాస్త్రం చెపుతున్నది. పండితుల మని చెప్పుకునే వారు శాస్త్ర విరుద్ధంగా ప్రవర్తించ లేరుగా?" అంటూ ఆయన బొటన వ్రేలిని మొదలుకంటా ఖండించి తీరవలసిందేననే అర్థమొచ్చేట్లు మాట్లాడాడు. ధార్మిక విషయాలలో తాతాచార్యుల వారి మాట నాటి విజయ నగర సామ్రాజ్యంలో శాసనంతో సమానం. అందునా నిండు సభలో ప్రస్తావించబడిన విషయమాయె. తన బద్ధ శత్రువైన రామకృష్ణుడి బొటన వ్రేలు తెగిపడుతున్నందుకు తాతాచార్యులు లోలోపల సంతోషించాడు.

తెల్లవారి సభకు వచ్చేటప్పుడు తన ఎడమ చేతి బొటన వ్రేలును లోనికి మడిచి దానిపై గుడ్డతో కట్టుకట్టి చూసేవాళ్లకు తాను బొటనవ్రేలు కోసుకుని ప్రాయశ్చిత్తం చేసుకున్నట్లు కనుపించేలా చేశాడు రామకృష్ణుడు.

కొన్ని దినాలు గడిచాయి. రామకృష్ణుడి చేతి కట్టు అలాగే వున్నది. తాతాచార్యుల వారిని ఎలాగైనా దెబ్బకు దెబ్బ తీయాలని రామకృష్ణుడు ఒక పథకం వేశాడు. రాచబాటకు కొంచెం ప్రక్కగా వున్న తన యింటి మీద నుంచే తాతాచార్యుల వారు రోజూ ఉదయం తుంగభద్రానదిలో స్నానం చేయడానికి వెళతారు. కనుక ఆయన్నెలాగైనా తన యింటికి ఆహ్వానించి పరాభవించాలని నిశ్చయించుకున్నాడతడు. ముందుగా తన యింటి వెనుక పెరట్లో కంఠము లోతు గొయ్యి త్రవ్వి ఆ గోతినిండా పేడ వేయించాడు. పేడ పైభాగంలో బాగా పొడిమన్ను చల్లించి అది కొంత బిగిసిన తరువాత దానిలో తోటకూర మొక్కల్ని నాటాడు. తోటకూర మొక్కలు పేడ కారణంగా చాల బలంగా పెరిగి ఆ ప్రదేశమంతా తోటకూర మొక్కలతో నిండి అందంగా కనుపించసాగింది. తాతాచార్యుల వారికి తోటకూర అంటే చాల ప్రీతి. ప్రతిరోజూ ఆహారంలో తోటకూరతో వండిన కూర లేందే ఆయన ముద్ద ఎత్తేవారు కాదట.

ఇక తాననుకున్న పథకం ప్రకారం ఓ రోజు నదీ స్నానం చేసి వస్తూన్న తాతాచార్యుల వారితో తన యింటి బయట నిలబడి "ఆచార్యా! ఈ దినం తమరు నా యిల్లు పావనం చేయండి. నా పెరట్లో తమకు అత్యంత యిష్టమైన తోటకూర ఏపుగా పెరిగి వున్నది చూడండి. మీకు కావలసినంత కోసుకోండి. రండి" అన్నాడు రామకృష్ణుడు. అప్పుడు తాతాచార్యులు ఆశ్చర్యపోతూ "ఏమిటిది? వీడి బొటన వ్రేలు కత్తిరించుకొమ్మని ప్రాయశ్చిత్తం చెప్పినందుకు నేను ఆనంద పడుతున్నాను గాని, యీ లింగడికి నాపై యిసుమంతైనా ద్వేషం కలిగినట్లు లేదే! పొద్దున్నే వీడి ముఖం చూడడమేమిటబ్బా! అయినా యీ లింగడి ముఖం చూడకుండానే వాడి పెరట్లోకి వెళ్లి తోటకూర కోసుకెళ్తేపోలా! లింగడి ముఖం చూసినా, యింట్లో అడుగిడినా పంచమహా పాతకాలు తగులు కుంటాయి గానీ, పెరట్లోకి వెళ్లి తోటకూర కోసుకొస్తే తప్పేమీ లేదుగా" అనుకుంటూ, ముఖం పెడగా త్రిప్పుకుని, రామకృష్ణుడి పెరటి దొడ్లోకి ప్రవేశించాడు. అక్కడ ఏపుగా పొదలు పొదలుగా పెరిగి వున్న తోటకూర మొక్కలు ఆయనకు నేత్రపర్వంగా కనుపించాయి. ఆత్రంగా అటు వెళ్లి తోటకూర కాడల్ని విరచ బోయిన తాతాచార్యులు తన భారీ శరీరం కారణంగా ముందుగా ఏర్పరచిన పేడ గుంటలోకి దిగబడి కంఠంలోతు కూరుకు పోయాడు. చూడడానికి గట్టి నేలలా కనుపించిన ఆ గోతి పై భాగం లోని మట్టి ఆయన శరీరపు బరువుకు ఒక్కసారిగా క్రుంగి లోపలి పేడ గోతిలోకి జారిపోయాడాయన. ఇక ఒకటే కేకలు – పెడ బొబ్బలు. రామకృష్ణుని యింటి చుట్టూ నివసిస్తున్న యిరుగు – పొరుగు వారంతా యీ కేకలు విని అక్కడకు వచ్చి చేరారు. అప్పుడు రామకృష్ణుడు పుండు మీద కారం చల్లినట్లు, "ఇదేమిటి గురువర్యా! చూసుకోకుండా యిలా గోమయ గర్తము (ఆవు పేడ గుంట)లో పడిపోయారా? ఇక యేం చేసి యేం ప్రయోజనం? మీరు ఆ గోతిలోంచి బయటకు వచ్చినా కంఠంలోతు గోమయంలో దిగిపోయారు కనుక తమరి ప్రాయశ్చిత్త నియమావళి ప్రకారం తమరి కంఠం ఖండించి తీరవలసిందే! అప్పుడే మీకు భూమి మీద నూకలు చెల్లిపోయాయన్న మాట" అంటూ కల్లబొల్లి విచారం చూపుతూ మొసలి కన్నీరు కార్చసాగాడు. "ప్రాయశ్చిత్తం సంగతి దేవుడెరుగు. ముందు ఆయన్ని బయటికి తీసే మార్గం ఆలోచించండి రామకృష్ణయ్య గారూ" అని ఓ పొరుగింటాయన సూచించాడు. దానికి రామకృష్ణుడు విచారం నటిస్తూ "ప్రొద్దున్నే శ్రీవైష్ణవులు కాని వారి ముఖం చూస్తేనే పంచమహాపాతకాలు చుట్టుకుంటాయని ఆచార్యులవారి శాస్త్రం చెబుతున్నది. ఇక వారిని చేతితో పట్టుకుని పైకి లాగడమా! అంతటి సాహసమెవరి కుంటుంది? దగ్గరలో శ్రీవైష్ణవులెవరూ కానరావడంలేదే! ఏం చేయాలి చెప్మా!" అంటూ తలపట్టుకున్నాడు.

దీంతో తాతాచార్యుల వారికి సహనం నశించి పోయింది, "రామకృష్ణయ్యా! మనస్ఫూర్తిగా చెబుతున్నాను. నాలోని అహంకారం నశించింది. నేటి నుంచి సర్వమత సౌభ్రాతృత్వమే నా మతం. ఇతర మతాల్ని గౌరవించలేని వాడు తన

మతానికి కీడే చేస్తాడు కానీ మేలు కాదని అర్థం చేసుకున్నాను. నీ మాటలతో సగం చచ్చిన నన్ను ఇంకా చంపక వెంటనే బయటకు తియ్యి" అంటూ బతిమిలాడాడు.

రామకృష్ణుడు వెంటనే అక్కడి ఒకరిద్దరి సహకారంతో తాతాచార్యుల వారిని పేడ గోతిలో నుంచి బయటకు తీసి శుభ్రంగా స్నానం చేయించి తొలిసారిగా తన యింటికి వచ్చిన అతిథిగా ఆయనకు నూతన వస్త్రాలనిచ్చి ఉచిత రీతిన సన్మానించి పంపాడు.

ఆ రోజు రాజసభలో శాస్త్ర నియమం పేరుతో పేద అయిన బొటన వ్రేలిని ఖండించమని ప్రాయశ్చిత్తం చెప్పి రామకృష్ణ కవికి తాను బాధ కలిగించినందుకు పశ్చాత్తాప పడుతున్నట్లుగా తాతాచార్యులవారు ప్రకటించారు. మానవత్వమే మతమనీ, మానవ న్యాయాన్ని మించిన నియమావళి లేనేలేదనీ చిరంజీవి రామకృష్ణయ్య కారణంగా నాడు తనకు అవగతమైందని ఆయన ప్రకటించి ఆ రోజు ఉదయం జరిగినదంతా పూస గుచ్చినట్లు వివరించారు.

అప్పుడు రామకృష్ణుడు లేచి తన ఎడమ చేతికి వున్న కట్టును ఊడబీకి, "తాతాచార్యా! మీరు చెప్పిన ప్రాయశ్చిత్తం నేను అమలు పరచలేదు. అమలు పరిచినట్లు నటించానంతే. కాబట్టి మీరు బాధ పడాల్సిన పనేంలేదు. నా బొటన వ్రేలు యథాతథంగా వుంది" అన్నాడు. ఆనాటి పరిణామాలు సభలోని అందరికీ ఆనందాన్ని కలిగించాయి - ప్రత్యేకించి రాయలవారికి. ఎంచేతనంటే మత విషయాలలో విశాల దృక్పథంతో వ్యవహరించమని తన గురువైన తాతాచార్యులవారికి తాము అప్పుడప్పుడూ విజ్ఞప్తులు చేసినా ఫలితం లేకపోయింది. ఈ రోజు రామకృష్ణుడు యుక్తిగా తాతాచార్యుల వారి దృక్పథంలో మార్పు తీసుకొని వచ్చాడు. ఇంక అంతకంటె తనకు కావలసిందేమున్నది? అందుకే ఆయన ఆనందానికి అవధుల్లేవు. ఆ రోజు సభలో రాయలవారు రామకృష్ణుడిని అత్యంత ఘనమైన రీతిలో సన్మానించారు.

## 21. రామకృష్ణుడు - బాబర్ చక్రవర్తి

క్రీ శ 1529 వ సంవత్సరంలో రాయలవారు నాల్గవ సారి రాయచూరుపై దండెత్తి అఖండ విజయం సాధించారు ఈ యుద్ధ సమయంలో ఢిల్లీని పాలిస్తున్న మొగలాయి ప్రభువు బాబర్ దక్కన్‌లోని సోదర ముస్లిం రాజ్యాధినేతలైన బహమనీ ప్రభువులకు సాయంగా తన త్రివిధ దళాలలో కొంత భాగాన్ని పంపుతానని మాట యిచ్చాడు అయితే ఏ కారణంగానో చివరి క్షణంలో ఢిల్లీ నుంచి దళాలు రాలేదు ఆ విధంగా ఆ దళాలు వచ్చి వుంటే రాయలవారికి తప్పని సరిగా ఘోరమైన ఓటమి సంప్రాప్తించేది అలా బాబర్ నుంచి దళాలు రాకుండా బాబర్‌తో దౌత్యం నెరపిన రామకృష్ణుడు తన సమయస్ఫూర్తితోనూ, తెలివి తేటలతోనూ బాబర్‌ను ఆకట్టుకుని ఢిల్లీ నుంచి దళాలు రాకుండా ఆపివేయించాడని కొందరి విశ్వాసం దీని ఆధారంగానే ప్రస్తుత గాధ ప్రాచుర్యంలోకి వచ్చింది. మిగిలిన ముస్లిం పాలకులవలెకాక మహా పండితుడిగానూ, ఉదార స్వభావిగానూ బాబర్ ప్రసిద్ధుడవడం, తుర్కీ, అరబ్బీ, పర్షియన్ భాషలతో కూడా రామకృష్ణ కవికి అంతో యింతో పరిచయ ముందనే నమ్మకం యీ గాధకు పునాదులు

బాబర్ పూర్తిపేరు జహీరుద్దీన్ మహమ్మద్ బాబర్ ఛగతాయ్ ప్రసిద్ధిగాంచిన తైమూర్ వారసత్వం తండ్రి నుంచి, చెంఘిజ్ ఖాన్ వారసత్వం తల్లి నుంచి యీయనకు సంక్రమించింది పరిపాలకులలో బాబర్‌ది ఓ విలక్షణమైన తరగతి వ్యసనాలకు అతీతుడుగానూ, సరస సంభాషణా చతురునిగానూ, ఉదార శీలిగానూ, ఉదాత్త స్వభావిగానూ, తుర్కీ (టర్కిష్) భాషలో గొప్ప పండితుడిగానూ బాబర్ పేరుగాంచాడు టర్కిష్ భాషలో ఆయన వ్రాసుకున్న ఆత్మకథ 'తుజుక్-ఇ-బాబరీ ని ప్రసిద్ధ ఆంగ్ల రచయిత స్టాన్లీ లేన్‌పూల్ (*Stanley Lanepool*) *Memoirs of Babur'* (మెమ్‌వార్స్ ఆఫ్ బాబర్) గా ఆంగ్లంలోనికి అనువదించాడు బాబర్ యొక్క బహుముఖ ప్రజ్ఞా విశేషాలకు యీ ఆత్మకథ అద్దంపడుతుంది. భారతీయ సాంస్కృతిక వైవిధ్యాన్ని సుసంపన్నం చేసిన సుప్రసిద్ధమైన మొఘలాయి వంశానికి ఆయనే మూల పురుషుడు క్రీ శ. 1526లో భారత దేశంపైకి దండెత్తి వచ్చి మొదటి పానిపట్టు యుద్ధంలో ఢిల్లీని పాలిస్తున్న ఇబ్రహీం లోడీని ఓడించి ఢిల్లీపై మొఘల్ పాలనను ప్రారంభించాడు. రాణా సంగ్రామ్ సింహ్ తదితరులను ఆ మరుసటి సంవత్సరం ఘాగ్రా యుద్ధంలో ఓడించి ఉత్తర భారతదేశంపై

సంపూర్ణంగా పట్టు సాధించాడు బాబర్. క్రీ.శ. 1530లో యాయన తన కుమారుడు హుమయూన్‌కు తన వారసత్వాన్ని అప్పగించి మరణించాడు. క్రీ.శ. 1529లో రాయలవారు నాల్గవసారి రాయచూరుపై దండెత్తిన సందర్భంలో బహమనీ సుల్తానులకు త్రివిధ దళాలను పంపుతానని హామీ యిచ్చాడనీ, రామకృష్ణుని దౌత్యం ఫలప్రదమై బాబరు ఆ ఆలోచన మానుకున్నాడనీ, ఆ కారణంగానే ఆ యుద్ధంలో రాయలవారికి అఖండ విజయం చేకూరిందనీ కొందరు విశ్వసిస్తున్నారు. ఇది విశ్వాసయోగ్యంగానే కనుపిస్తున్నది. ఎంచేతనంటే, తనను మెప్పించిన వారికి ఏది అడిగినా యిచ్చివేసే ఉదారశీలి బాబర్ అని చరిత్రకారులు ముక్త కంఠంతో ఘోషిస్తున్నారు. తుర్కీ, అరబ్బీ, పర్షియన్ భాషలతో కూడా అంతో యింతో పరిచయమున్న రామకృష్ణుడు రాయలవారు పంపకపోయినా, తానప్పటికే చేయని నేరానికి రాజ్య బహిష్కరణకు గురైనా దేశభక్తితో రాయలవారి తరఫున, విజయనగర సామ్రాజ్య ప్రజానీకం తరఫున బాబర్‌తో యీ దౌత్యం నెరపి, సఫలీకృతుడై, విజయనగర పౌరుల ప్రయోజనాలు పరిరక్షించి వారి మన్ననలకు పాత్రుడయ్యాడు. ఆ రోజులలో విజయనగరంలో మేలిరకం అరేబియన్ గుర్రాలను అమ్మకానికై తీసుకొని వచ్చే, వాటి శిక్షకులుగానో, గుర్రపు శాలల పర్యవేక్షకులుగానో అరేబియా, పర్షియా వగైరా దేశాల నుంచి వచ్చిన ఎందరో మహమ్మదీయులు నివసించేవారు. ఇట్టే చూసి, అట్టే పట్టేయగల నేర్పరితనమూ, వివిధ భాషల పట్ల విపరీతమైన ఆసక్తీ కలిగిన రామకృష్ణుడు హంపిలోని ఆ ముస్లింల వద్ద నుండి వారి భాషలు నేర్చుకొని వుండే అవకాశముంది. ఈ గాధ సత్యదూరం కాదనడానికి యివే ఆధారాలు. తెనాలి రామకృష్ణుడేమిటి? బాబర్‌తో దౌత్యం నెరపడమేమిటి? అలా దౌత్యం నెరపడానికి ఆయనకున్న అర్హత లేమిటి? అటువంటి సంక్షుభిత సమయంలో అంతటి దూర ప్రయాణం చేసి ఢిల్లీ చేరడానికి ఆయనకున్న ధైర్య సాహసాలేపాటివి? ఇలాంటి ప్రశ్నలన్నీ మన మనస్సులలోనికి శరపరంపరగా రావచ్చు. అయితే యిదంతా వట్టి కల్పితం అనేవారెవరైనా సమాధానం చెప్పి తీరాల్సిన ప్రశ్నలు కూడా కొన్ని ఉన్నాయని మనం మరచిపోరాదు. బహమనీలకు సాయంగా త్రివిధ దళాలను (కాల్బలం, అశ్వికదళం, గజబలం) పంపుతానని వాగ్దానం చేసిన బాబర్ హఠాత్తుగా ఎందుకు వెనక్కు తగ్గాడు? నాల్గవ రాయచూర్ యుద్ధంలో జయాపజయాల తీరుతెన్నుల్నే మార్చివేసిన బాబర్ వెనుకంజకు కారణమేమై వుంటుంది? రాయలవారికి తెలియకుండా బాబర్‌తో విజయనగర సామ్రాజ్యం తరఫున ఏదైనా దౌత్యం జరిపే అవకాశం వేరెవరికున్నది – రాజ్య బహిష్కరణ శిక్ష అనుభవిస్తున్న దేశ భక్తుడు రామకృష్ణునికి తప్ప?

బహమనీ రాజ్యాలవారు విజయనగర సామ్రాజ్యంలోనికి గూఢచారి చర్యలు చేయడానికి ఎందరెందరో వేగుల వాళ్లను పంపేవారు. అలా వచ్చిన ఒకడు రామకృష్ణుడి దూరపు బంధువు నంటూ అతడి యింటిలో తిష్ట వేశాడు. నిజానికి అతడు రామకృష్ణుడి దూరపు బంధువే. చెడునడతకు అలవాటుపడి, ధనాశతో బహమనీలకు చారుడిగా మారాడు. ఏదోలే దూరపు బంధువు కదా – అతడికి ఏదైనా కొలువు కుదిరే వరకూ కొన్నాళ్లు తన యింట్లో వుంటే యిబ్బందేముందిలే అనుకున్నాడు రామకృష్ణుడు. అయితే ఆ అతిథి వీళ్ల యింట్లో ఉంటూండగానే, రాయలవారు ఏ సమయంలో ఎక్కడ ఏకాంతంగా వుండేది వగైరాలు ఆయన ఆంతరంగికుడైన రామకృష్ణుడి నుంచి కూపీలు లాగి – చివరికి రాయలవారిపైనే హత్యాయత్నం చేసి, అది విఫలమై దొరికిపోయాడు. అతనికి మరణ దండన విధించబడింది. అతడికి ఆశ్రయమిచ్చినందుకు రామకృష్ణుడికీ ముందు మరణదండన విధించి రాయలవారు రామకృష్ణయ్య మీది కరుణతో దానిని రాజ్య బహిష్కార శిక్షగా మార్చారు. రాజ్యం విడిచి వెళ్లబోతూ మహామంత్రి తిమ్మరుసును కలిసిన రామకృష్ణుడు భార్య కమల, కుమారుడు మాధవుడి రక్షణ, పోషణ భారాన్ని ఆయనపై పెట్టాడు. ఆయన సలహాపైనే ఢిల్లీకి ప్రయాణం కట్టాడు. కరుణా హృదయుడూ, గొప్ప పండితుడూ అయిన బాబర్ చక్రవర్తిని ఎలాగైనా రంజింపజేసి, మంచి చేసుకుని ఢిల్లీ నుండి బహమనీలకు ఎటువంటి సహాయమూ అందకుండేట్లు చూడాలని తిమ్మరుసు రామకృష్ణుడిని కోరాడు. అప్పటికే తన కుమారుడు తిరుమల దేవ మహారాయలుకు రాయలవారు పట్టాభిషేకం చేయించడం (క్రీ.శ. 1525), అతడు అనంతరం ఆరు నెలలకే హత్యకు గురవడం, ఆ హత్య విషయమై తిమ్మరుసునూ, అతడి తమ్ముడు సాళువ గోవిందరాజు (విజయనగర పురపాలకుడు) వగైరాలను రాయలవారు ఖైదు చేసి కళ్లు పీకించడం, దీనికి ప్రతిగా తిమ్మరుసు కుమారులు రాజ్యంలో అంతర్యుద్ధాలు రేపడం, రాయలవారు వాటిని అణచి వేయడం జరిగిపోయాయి. తిమ్మరుసు కళ్లు పీకించడం చారిత్రక సత్యం కాదని కొందరి వాదన. ఏది ఏమైనా విజయనగర మహాసామ్రాజ్యాన్ని అవసర కాలాల్లో రక్షించి, రాయలవారికి అండదండగా

నిలిచిన మహామంత్రి తిమ్మరుసు ప్రభుభక్తినే చివరి దశలో రాయలవారు శంకించారు. అటువంటి పరిస్థితులలో రాజకీయ వ్యవహారాలకు తిమ్మరుసు కొంత కాలం దూరంగా వుండి వుండవచ్చు. సరిగ్గా అదే కాలంలో రాయలవారిచే అనుమానానికి, అవమానానికి గురైన తిమ్మరుసు, రామకృష్ణయ్యలకు తమ దేశభక్తిని చాటు కొనడానికి యీ ఢిల్లీ దౌత్యం అయాచిత వరంగా లభించింది. అందుకే దేశ బహిష్కృతుడైన రామకృష్ణయ్యను యిందుకు ప్రోత్సహించి వుంటాడు దేశభక్తుడైన తిమ్మరుసు.

కొందరి వ్రాతలు, ప్రాచుర్యంలో వున్న కొన్ని కథల ప్రకారమైతే రామకృష్ణుడి ప్రాశస్త్యాన్ని గురించి తెలుసుకున్న బాబర్ చక్రవర్తే రామకృష్ణుడిని తన ఆస్థానానికి పంపమని శ్రీకృష్ణదేవరాయలుకు వ్రాసిన ఒక లేఖలో కోరాడట. అయితే యిది నమ్మశక్యంగా లేదు.

ఏది ఏమైనా రామకృష్ణుడు అకుంఠిత దేశభక్తితోనూ, ప్రభుభక్తితోనూ ప్రాణాలకు కూడా తెగించి తెలియని సీమలలో వారాలూ నెలల తరబడి ప్రయాణించి చివరికి ఢిల్లీ చేరుకున్నాడు. రోజూ బాబర్ పాదుషా, ఆయన వ్యక్తిగత సిబ్బంది ఉదయాన్నే గుర్రాలపై వాహ్యాళిగా వెళ్లే బాటకు ప్రక్కనే మకాం వేసి బాబర్ రాక పోకలను గమనించాడు. ఓ రోజు బాబర్, ఆయన అంగరక్షకులు వచ్చే సమయానికి నెరిసిన గడ్డాలూ, మీసాలూ గల ఒక ముదుసలి ముస్లిం వేషం ధరించి బాటకు ప్రక్కనే మామిడి మొక్కలు నాటుతూ వాటికి నీళ్లు పోస్తూ వున్నాడు. 'ఈ వృద్ధుడిక్కడేం చేస్తున్నాడా' – అని పరిశీలనగా చూసిన బాబర్, రామకృష్ణుడిని 'క్యా దాదా ఆప్ యహాఁ పర్ క్యాకర్ రహే హైఁ?' (ఏం తాతా! మీరిక్కడ ఏం చేస్తున్నారు?) అని ప్రశ్నించాడు. రామకృష్ణుడు చెవుడు నటిస్తూ ఆ మాటలు తనకు వినబడనట్లు పట్టీ పట్టనట్లుగా ఊరుకున్నాడు. అప్పుడు బాబర్ తిరిగి అదే ప్రశ్న రెట్టించి అడిగాడు. రామకృష్ణుడు తలయెత్తి 'మామిడి మొక్కలు నాటి నీళ్లు పోస్తున్నాను. చూస్తూనే వున్నారు కదా జనాబ్!' అన్నాడు పరాకుగా. దీంతో బాబర్‌కు ఆ ముసలి వాడి పట్ల మరింత ఆసక్తి పెరిగింది. ఢిల్లీలో తన నెరుగని వాడా? బహుశా పరదేశి అయివుంటాడు. పరదేశి యిక్కడ మామిడి మొక్కలు నాటడమంటే మరింత విశేషమే. ఇతడిని కదిలించి మరిన్ని వివరాలు రాబట్టాలి – అని మనస్సులో అనుకున్నాడు బాబర్. 'తాతా! నీవు చూడబోతే పండు ముదుసలివి. ఇంకా ఎన్నాళ్లు బతుకుతావో నీకే తెలియదు. నీవు నాటే యీ మొక్కలు ఎప్పుడు పెరిగి పెద్దవై ఫలాలిస్తాయి? ఆ పండ్లు నీవు తినాలనే వీటిని నాటి నీరు పోస్తున్నావా?" అని అడిగాడు బాబర్ ఆసక్తిగా. దానికి రామకృష్ణుడు యుక్తిగా, "హాయ్ ఖుదా! ఇప్పుడు మనం అనుభవిస్తున్న ఫలాలు మనం నాటిన చెట్లవి కాదు. అవి నాటి నీరు పోసి పెంచినవాడు కూడా మీలాగే ఆలోచిస్తే – అంటే నేను పండ్లు అనుభవించ గలిగితేనే చెట్లు నాటాలి; లేకపోతే లేదు అని అనుకుని వుంటే యిప్పుడు మనం తింటున్న ఫలాలే వుండేవి కావు. ఎన్నడో వేరొకడు నాటిన మొక్కలు పెరిగి పెద్దవై కాసిన ఫలాలు నేడు మనం తింటున్నాం. నేడు మనం నాటే యీ మొక్కలు పెద్దవై యిచ్చే ఫలాల్ని ముందు తరాలు అనుభవిస్తాయి. ఇది లోక సహజమే కదా జనాబ్! ఇది కూడా గ్రహించలేకపోయారా?" అన్నాడు రామకృష్ణుడు. వెంటనే నజీబ్ అనే బాబర్ అంగరక్షకులలోని ఒకడు ఉద్రేకంగా "ఖామోష్! నీవెవ్వరితో మాట్లాడుతున్నదీ తెలిసే మాట్లాడుతున్నావా? భారతదేశ సార్వభౌముడు షాహన్‌షాహ్ జహీరుద్దీన్ మహమ్మద్ బాబర్ ఛగతాయ్ ఎదుట యిలాగేనా మాట్లాడేది?" అన్నాడు. అప్పుడు బాబర్ జోక్యం చేసుకుని, "బంద్‌కరో నజీబ్! ఠీక్ ఐసేహీ నిడర్ ఔర్ ఖుద్ ముఖ్తార్ లోగోం సే హీ హమేఁ హమారే రాజ్‌కా అస్‌లీ జాన్‌కారీ మిలేగీ. ఉసే బోల్‌నే దో' (ఇక ఆపు నజీబ్! సరిగ్గా యిలాంటి నిర్భయులూ, ఎవరికీ లోబడని ప్రజల నుండే మనకు మన పాలన గురించి సరియైన సమాచారం లభిస్తుంది. ఆయన్ని మాట్లాడనివ్వు) అన్నాడు. ఆ తర్వాత ప్రక్కనున్న ఒక భటుడి వద్ద నున్న ఓ బంగారు నాణెముల మూట తీసుకుని

రామకృష్ణుడికేసి విసిరి "వాహ్ దాదా! కోట్లకు విలువచేసే మాట చెప్పావు. కేవలం తమ స్వార్థం గురించే ఆలోచించక అందరూ నీలాగా ఆలోచిస్తే యీ రాజ్యంలో దేనికీ లోటుండదు కదా!" అన్నాడు బాబర్ చక్రవర్తి. రామకృష్ణుడు అప్పుడే బాబర్‌ని గుర్తించినట్లు మోకాళ్లపై నిలిచి వంగి వంగి సలాం చేస్తూ, "షాహెన్‌షా - ఎ -హింద్ ముబారక్ షాహీ జహీరుద్దీన్ మహమ్మద్ బాబర్ ఛగతాయ్ - జిందాబాద్! మాఫ్ కీజియేగా బాద్‌షాహ్! ఖుదా రాజ్యం (దేవుడి రాజ్యం) కంటే తమరి రాజ్యమే ఎన్నో రెట్లు మెరుగు. ఎందుకంటారేమో - ఖుదారాజ్యంలో మొక్క నాటిన తరువాత ఎన్నో ఏండ్లకు అది ఫలాలనిస్తుంది. మరి తమరి రాజ్యంలో - యిటు మొక్క నాటానో లేదో ఫలం చేతి కొచ్చింది" అంటూ తనకీయబడిన బంగారు నాణెముల మూటను చేత్తో పైకెగరేస్తూ అన్నాడు. ఈ మాటలకు బాబర్ పులకించి పోయాడు. అతడికి కానుకగా మరో బంగారు నాణెముల మూట విసరుతూ, "శాబాష్ దాదా! తుమ్సే మిల్‌నా మేరా నసీబ్ హై. జరూర్ ఆజ్ యాద్ మనానా హోగా" (సెహబాస్ తాతా! నిన్ను కలవడం నిజంగా నా అదృష్టం. ఈ రోజు నేను తప్పని సరిగా పండుగ చేసుకోవాలి) అన్నాడు బాబర్. రెండో నాణెముల మూట అందుకున్న రామకృష్ణుడు, "ఆలంపనా! ఖుదా రాజ్యంలో నైతే మామిడి చెట్లు ఒక ఏదాదికి ఒకే కాపు కాస్తాయి. తమరి రాజ్యంలో వెంట వెంటనే రెండు కాపులు - అదీ మొక్క నాటీ నాటగానే! నిస్సందేహంగా ఖుదారాజ్యం కంటే తమరి రాజ్యమే ఎంతో మెరుగైనది" అన్నాడు.

దాదా సమయస్ఫూర్తికి బాబర్ ఉబ్బితబ్బిబ్బయ్యాడు. "బహుత్ ఖూబ్! ఉమ్దా బాత్ కియా దాదా!" అంటూ మరో నాణెముల మూటను కూడా దాదా వైపుకు విసిరి, "నీ వంటి వాడిని మా మహల్‌సరా కు పిలిచి సన్మానించాలి. ఇప్పుడు వేరే అత్యవసరమైన పని మీద పోతున్నాం. నీకిదే మా ఆహ్వానం. రేపు ఉదయాన్నే వచ్చి మమ్మల్ని కలువు. ఖుదా హాఫీజ్!" అంటూ బాబర్ చక్రవర్తి తన గుర్రాన్ని దౌడు తీయించాడు.

బాబర్ ఆహ్వానం మేరకు ఉదయాన్నే కోటకు వెళ్లాడు రామకృష్ణుడు. అంతఃపురంలోని ఓ ప్రత్యేకమైన గదిలో ఉన్నతాసనంపై ఆశీనుడై వున్న బాబర్ పాద్‌షాహ్ ఎదుట మోకాళ్ల మీద నిలిచి ఆచారం ప్రకారం ప్రణామం చేశాడు రామకృష్ణుడు. 'దాదా! నీ చక్కటి మాటలు మా మనసును దోచాయి. నీ గురించి వివరాలింకేమైనా చెప్పు' అని ఆదేశించారు పాద్‌షాహ్.

అప్పుడు రామకృష్ణుడు "జహాఁపనా ! మాది విజయనగర రాజ్యం. నేనో అదృష్టహీనుడనైన పేద ముస్లింను. నా బాధేమిటో చెబుతాను వినండి. మా రాజ్యంలో అన్ని మతాలవారూ అన్నదమ్ముల్లా కలిసి మెలిసి జీవిస్తారు. మాకు పొరుగున ఉన్న బహమనీ రాజ్యం యిన్నాళ్లూ మాది కాఫిర్ రాజ్యమని అకారణంగా మాపై దాడులు చేసి శాంతికి భంగం కలుగజేసేది. తరువాత వాళ్లు ఐదు చిన్న రాజ్యాలుగా విడిపోయారు. ఆ రాజ్యాల పాలకులు వాళ్ల రాజ్యాలలోని ప్రజల బాగోగుల గురించి ఆలోచించక వాళ్లలో వాళ్లు ఎప్పుడూ యుద్ధాల్లో మునిగి తేలుతుంటారు. ఇప్పుడు వారంతా ఏకమై కాఫిర్ల రాజ్యాన్ని నాశనం చేస్తామంటూ అకారణంగా మా విజయనగరంపై దండెత్తుతున్నారు. మేం శాంతి కాముకులం మా ప్రభువు కృష్ణదేవరాయలు జనరంజకుడైన పరిపాలకుడు. మా దేశం సుభిక్షమైనది. దేశాన్ని సుసంపన్నం చేసి జనుల జీవన ప్రమాణాలు పెంచి, వారి సుఖ శాంతులను పరిరక్షిస్తూ, జనరంజకంగా పాలించే రాజు కాఫిర్ ఎలా అవుతాడు జహాఁపనా! ఖుదా ప్రతినిధి అవుతాడు గానీ! మా రాజ్యాన్ని అల్ల కల్లోలం చేసి, అశాంతి పాలు చేయాలని చూస్తున్న బహమనీ ముష్కరులకు మీరు సైనిక సాయం చేస్తామని మూడు నెలలనాడు మాట యిచ్చారట. ఈ పేద ముస్లిం మాట మన్నిస్తానంటే చెపుతాను. మీరలా చేస్తే ఖుదా కూడా మిమ్మల్ని క్షమించదు. బాద్‌షాహ్! క్షమించండి. నా ఉద్రేకమలాంటిది నా బాధ మీకు పూర్తిగా అర్థమయ్యే వుంటుందని భావిస్తాను. కనుక బహమనీ ముష్కరులకు మీ సైనిక సాయం నిలుపుదల

చేసి మా రాజ్యంలో శాంతికి తోడ్పడండి." అన్నాడు.

ఈ వృద్ధుడి సూటితనానికి బాబర్ ఆశ్చర్య చకితుడయ్యాడు. "మైదాన్-ఎ-జంగ్ మేఁ అమన్ ! లేకిన్ యే హో సక్తా కైసే ? జిహాద్ తో జారీ హై." (కదన రంగంలో శాంతా ? అదెలా సాధ్య పడుతుంది ? పవిత్ర మతయుద్ధం సగబడా జరిగిపోతున్నదే !) అప్పుడు రామకృష్ణుడు బాబర్ ఎదుట వినమ్రంగా వంగి, "హుజూర్ ! ఇది పవిత్ర మతయుద్ధమెలా అవుతుంది ? మా రాజూ, రాజ్యంలోని ప్రజలూ శాంతి కాముకులు. వాళ్లు బహమనీ సుల్తానులకు గానీ, మీకు గానీ చేసిన అపకారమేమిటి ? లేక మా రాజ్య పాలకులు మన మతానికి చేసిన హాని ఏమిటి ? హిందూ ముస్లిముల మందరం అక్కడ అన్నదమ్ముల్లా కలిసి మెలిసి జీవిస్తున్నామే ? మా సంపద, సుఖ సంతోషాల పట్ల బహమనీ ముష్కరుల ఈర్ష్యా ద్వేషాల కారణంగానే ఈ యుద్ధం మొదలైంది. పరాయి పాలకుల అసూయా ద్వేషాలకు మా రాజ్యం అకారణంగా బలి కావలసిందేనా? ఈ బద్-నసీబ్ ముసల్‌మాన్ మొర ఆలకించరా ? దయచేసి ఈ దాడిలో బహమనీ సుల్తానులకు మీరందిస్తానన్న సాయాన్ని నిలిపి వేసి, యీ అదృష్ట హీనుడిని సంతోష పెట్టండి." అన్నాడు రామకృష్ణుడు.

బాబర్‌కు ఈ మాటలు ఎంతగానో నచ్చాయి. ఆయన రామకృష్ణునితో "దాదా! ఏ దేశంలోనైనా నీలాంటి ప్రజలుంటే ఆ ప్రభువుకెంతో మేలు. విజయనగర రాజ్యాన్ని గురించి, రాయలవారి సుపరిపాలన గురించి విని కూడా బహ్మనీలకు సైనిక సాయం చేస్తాననడం ఎంత తప్పో యిప్పుడు నాకర్థమైంది. నా కళ్లు తెరిపించినందుకు నీకు సర్వదా కృతజ్ఞుడిని. ప్రమత్తుడైన ప్రభువు కళ్లు తెరిపించగలిగే నీవంటి ప్రజలే ఏ ప్రభుత్వానికైనా రక్ష. వెంటనే నా నిర్ణయాన్ని రద్దు చేసుకుంటున్నాను. ఎవరక్కడ? ఈ రోజు బహమనీలకు సాయంగా దక్కన్‌కు పంపాలనుకుంటున్న కాల్బలాన్నీ, ఆశ్వికులనూ, గజదళాన్నీ వెంటనే నిలుపు చేయండి. ఇక వాళ్లు వెళ్లే పని లేదు" అంటూ, "దాదా! నీకు కోటలోనే యీ రోజు ఆతిథ్యం. నీవు రేపు భద్రంగా తిరిగి నీ రాజ్యానికి వెళ్లేందుకు అవసరమైన అన్ని ఏర్పాట్లూ చేయబడ్డాయి. నీ రక్షణకు అంగరక్షకులను, దారి ఖర్చులకు తగినంత ధనాన్ని యిచ్చి నీ కూడా పంపుతున్నాను. అలాగే నీవు జీవితాంతం సుఖ సంతోషాలతో బతకడానికి చాలినంత ధనాన్ని కూడా నీకిస్తున్నాను" అన్నాడు. రామకృష్ణుడి ఆనందానికి పట్టపగ్గాలు లేవు. తెల్లవారే బాబర్ వద్ద సెలవు తీసుకుని అతడు బయలుదేరాడు.

అతడు విజయనగరానికి చేరుకునే సరికి యుద్ధంలో విజయనగర సైన్యాలు అపూర్వ విజయం సాధించాయనీ; చివరి క్షణంలో బాబర్ చక్రవర్తి నుండి ఆశించిన సైనిక సహాయం అనుకున్న సమయానికి అందక బహమనీ సేనలు ఘోర పరాజయం చవిచూశాయనీ వార్తలు రాజధానికి చేరాయి. రామకృష్ణుడు అదే వేషంలో నేరుగా తిమ్మరుసు మంత్రి యింటికి వెళ్లాడు. ఆయన కూడా రామకృష్ణుడిని పోల్చుకోలేక ఎగాదిగా చూశాడు. రామకృష్ణుడు వేషం తీసేసి 'విజయనగర మహాసామ్రాజ్యానికీ జై!" అని నినదిస్తూ తన అసలు రూపంలో తిమ్మరుసు ఎదుట నిలిచి, "తాతయ్యా! నేననుకున్నది సాధించాను. బాబర్ చక్రవర్తిని కలుసుకుని ఆయన్ని మెప్పించాను. ఆయనెంత కృపాళువో! నన్నెంతగానో సత్కరించారు. నా సమస్య సావధానంగా విన్నారు. బహ్మనీలకు చేయాలనుకున్న సైనిక సాయాన్ని నేను కోరిన వెంటనే నిలుపుదల చేశారు. దేశభక్తితో పునీతమైన నా జీవితం ధన్యమైంది" అన్నాడు హర్షాతిరేకంతో.

ఈ మాటలకు పులకించి పోయాడు తిమ్మరుసు. "చిరంజీవీ! ఒకవేళ బాబర్ సేనలే బహమనీలకు అండగా వచ్చి కలిస్తే ఖచ్చితంగా మన సైన్యాలు యీ యుద్ధంలో ఓటమి పాలయ్యేవి. నేనూహించినట్లే బాబర్ సేనలు రాకపోవడానికి నీవే కారణమన్నమాట! అయినా ఏం లాభం? ఈ సంతోషకరమైన వార్త రాయలవారికి నివేదించేదెలా? దేశద్రోహ నేరంపై రాజ్య బహిష్కరణకు గురైన వాడివి నీవు. నన్నేమో యిటీవల రాయలవారు అనుమాన దృక్కులతో చూస్తున్నారు; సరే పద.

ముందుగా యింటికి వెళ్లి కమలనూ, మాధవుడినీ కలిసి త్వరగా తయారై వుండు. నేను కబురంపిన తరువాత రాజాస్థానానికి వద్దువుగాని" అన్నాడు తిమ్మరుసు. తిమ్మరుసు నేరుగా రాజప్రాసాదానికి, రామకృష్ణుడు తన యింటికీ వెళ్లిపోయారు.

రాయలవారికి తిమ్మరుసు జరిగినదంతా విశదంగా వివరించాడు. రాయలవారి ఆనందానికి అంతే లేదు. "నేను రెండుసార్లు మరణ శిక్ష విధించినా, యీసారి రాజ్యబహిష్కరణ శిక్ష విధించినా నా పట్ల, నా రాజ్యం పట్ల ఆయనకున్న అభిమానం యిసుమంతైనా తగ్గలేదు. ఏదీ ఆయన్ని నా ముందు హాజరు పరచండి. నేను చేసిన నేరాన్ని నా కన్నీళ్లతో కడిగేసుకుంటాను. ఆయన చేసిన మహోపకారానికి ఆయనకు ఘనమైన పౌర సన్మానం చేయాలి. వెంటనే రామకృష్ణయ్యను సగౌరవంగా సభకు తీసుకురండి" అంటూ భటులను పంపారు రాయలవారు.

వెళ్లిన భటులు తిరిగి వచ్చారు. కాని, వారితో రామకృష్ణుడు రాలేదు. అది చూసి రాయలవారు క్రుంగిపోయారు. "అంటే రామకృష్ణయ్య యింకా నన్ను క్షమించలేదన్న మాట. నా పాపానికి నిష్కృతి లేదు. నేను మహాపాపిని" అంటూ బిగ్గరగా ఏడ్చారట. దీంతో జనసందోహం నుంచి ఒక వ్యక్తి ముందుకు దూసుకు వచ్చాడు. అంతా మనిషి లాగే వున్న అతడి ముఖం మాత్రం బోర్లించిన కుండతో కప్పబడి వుంది. ఆ కుండకు కండ్ల వద్ద రెండు, ముక్కు వద్ద ఒకటి బెజ్జాలు పెట్టబడ్డాయి. ఆ వింత మనిషి ముందుకు వచ్చి, "క్షంతవ్యుణ్ణి దేవరా! నీ ముఖం నాకు చూపెట్టొద్దు అని ఆదేశించారు కదా! అంచేత నా భార్య కమల – 'ఏమండీ మీరు ఆయన ఎదుట పడితే మీ మెడ మీద తల వుండదు. అది లేకపోతే నా మాంగల్యమూ వుండదు. అందుకని ఆ రెండూ వుండాలంటే యీ కుండ తగిలించుకుని రాజుగారి ఎదటకు వెళ్లండి' అని సలహా యిచ్చింది. అందుకే నాకు అందగా యీ కుండ" అన్నాడు.

రాయలవారి కళ్లు చెమర్చాయి. "మీరేనా రామకృష్ణయ్యా! వచ్చారా! ఈ నిర్భాగ్యుడిని కరుణించారా! ఒక ఆకళంక దేశభక్తుడినా నేను రాజ్య బహిష్కృతుడిని చేసింది? నాకిక నిష్కృతి లేదు. అజ్ఞాతంలో కూడా మీరు దేశానికీనాడు చేసిన సేవ ఎనలేనిది. మీకు యీ సభలో సకల జనసమూహాల ఎదుట మీరు సాధించిన ఘనకార్యానికి గుర్తుగా కలకాలం నిలిచి పోయేట్లు అఖండ సన్మానం చేసే వరకు నాకు మనశ్శాంతి లేదు" అంటూ తన రెండు చేతులతో ఆ కుండను ఎత్తి వేసి కళ్ల నుండి బాష్పజలధారలు కారుతూండగా ఆప్యాయంగా రామకృష్ణుడిని కౌగిలించుకున్నాడు.

రామకృష్ణుడికి ఆ రోజు సభలో అఖండమైన సన్మానం జరిగింది. బహుశా మరే కవికీ అలాంటి సన్మానం ఏ రాజ సభలోనూ జరిగి వుండదు.

## 22. రామకృష్ణుడు - బూతు కవి

రాయలవారు సరసులే అయినా, మోటు శృంగారాన్ని గురించి, బూతు సాహిత్యాన్ని గురించి ఎప్పుడైనా, ఎక్కడైనా, ఎవరు మాట్లాడినా సహించేవారు కాదట. కావ్యాలలో సున్నితమైన శృంగారాన్ని ఆయన ఎంతగా మెచ్చుకునేవారో, అసభ్యతను అంతగా ద్వేషించేవారట. అసలు బూతుకవులకు 'భువన విజయం'లో ప్రవేశం లభించేది కాదట. అప్పట్లో బూతుకవిగా ప్రసిద్ధి గాంచిన కళింగ ప్రాంతంలోని పిఠాపురానికి చెందిన పేరంభొట్లు అనే కవి ఎలాగోలా తానెవరో బయటపడని రీతిలో సభాప్రవేశం చేశాడట. సభ ప్రారంభమైన కాసేపటికి అతడు లేచి "మహారాజా! బూతు కవిత్వం చెప్పడంలో నాకు సరిసాటి అనదగిన కవి నాకింతవరకూ తటస్థించలేదు. ఇక్కడ నా ప్రజ్ఞా విశేషాలు చూపి, భువన విజయంలోని అష్టదిగ్గజ కవులలో ఎవరన్నా నాతో సరితూగ గలరేమో చూడాలని కుతూహలంగా వుంది. దయచేసి నా కోర్కె మన్నించి నాకు అనుమతి యివ్వండి" అన్నాడు.

ఇలా ఒక్కసారిగా అనుకోని సంఘటన ఎదురైనందుకు రాయలవారు నిర్ఘాంతపోయారు. అతడిని సభ నుంచి పంపేయడమన్నా చేయాలి. లేక అతని బూతు కవితల పట్ల నిరసనగా తమ విముఖతను ప్రదర్శించాలి. సభ నుంచి పరదేశస్థుడైన కవిని బయటకు పంపడం 'భువన విజయ' సంప్రదాయానికి విరుద్ధం. అందునా వచ్చిన కవి అష్టదిగ్గజాలతో సవాలు విసిరాడు. ఇప్పుడాతనిని సభ నుండి బహిష్కరిస్తే అది 'భువన విజయం' యొక్క ఓటమితో సమానం. అందుకే ఆ కవి కూడా ముందే తాను బూతు కవినని తెలిస్తే లోనికి రానివ్వరని ప్రచ్ఛన్నంగా లోనికి వచ్చి తన సవాలును విసిరాడు. ఇక తనను సభ నుండి బయటికి పంపలేరని అతనికీ తెలుసు. ఆ కారణంగా రాయలవారు 'ఇతడినెవరు లోనికి రానిచ్చారు?' అన్నట్లు సైనికాధికారుల వంక కోపంగా చూసి, ఆ కవి పట్ల తన నిరసన తెలియజేయదలచి అతడికి విముఖులై మౌనం దాల్చారు. కొంత సేపటి తరువాత తిమ్మరుసుతో రాయలవారు 'అప్పాజీ! యీతని బూతు కవిత్వం వినాలనే కోరికగానీ, వినేటంత తీరికగానీ మాకు లేదు. పొరుగు దేశాన్నుంచి వచ్చిన కవి కనుక, తగిన బహుమానమిచ్చి సాగనంపండి" అన్నారు.

దీంతో పేరంభొట్లు అహం దెబ్బతిన్నది. ఊరకే బహుమానం తీసుకుని వెళ్లిపోవడం అతడికిష్టం లేదు. ఏమైతే అది అవుతుంది లెమ్మని – అతడు కొంచెం ముందుకు వెళ్లి బిగ్గరగా అప్పటికప్పుడు ఆశువుగా యీ పద్యం చదివాడు.

"ఉ॥ బూతుకవిత్వ వైఖరుల ప్రౌఢిమఁ జూడక పొమ్మనంగ నీ
కే తగుగాక యిటుల మరెవ్వరు చెప్పుదురో నృపోత్తమా
చాతురితో తెనాలి రామకవి సత్తముడీతడు రామకృష్ణుడీ
రీతిని యూరకుండిన విరించినైన జయించజాలనే?"

"ఓ రాజా! బూతు కవిత్వ రీతుల యొక్క నేర్పును పరీక్షించకుండానే వెళ్లమనడం నీకే చెల్లింది. ఇలా మరెవ్వరూ అనరు. నీ ఆస్థానంలో (బూతు కవిగా ప్రసిద్ధుడైన) కవి సత్తముడైన రామకృష్ణుడు యీ విధంగా మౌనంగా వుంటే చాతురితో (నేర్పుతో) నేను విరించినైనా (బ్రహ్మనైనా) గెలువజాలనా?"

రామకృష్ణుడు మంచి వాళ్లకు మంచివాడు. ఎదుటి వ్యక్తిలో యితరుల్ని హేళన చేసే స్వభావం కానీ, పరనింద కానీ కనుపిస్తే వెంటనే పదునైన పదజాలంతో వారి పని పట్టేవాడు. ఆ క్రమంలో ఒకోసారి మోతాదు మించి అసభ్యకరమైన భాష కూడా ఉపయోగించేవాడు. 'భువనవిజయం'లో వున్న కాలంలో రామకృష్ణుడు నిండు యౌవనంలో వుండడం చేత ఆయనలోని ఆ దూకుడు సహజమైనట్టిదే. ఆయన వాక్చాతుర్యము, భాషా పాటవము, సమయస్ఫూర్తి, తెగువ వగైరాలనెంతో మెచ్చుకునే రాయలవారు సైతం ఆయన భాషలో అప్పుడప్పుడూ పొడసూపే అసభ్యతను ఏవగించుకునే వారట. ఇతరుల మనస్సులను నొప్పించే బూతుకవితలు ఎవరు వ్రాసినా రాయలవారు వాటిపట్ల చిరాకునూ, పరాకునూ ప్రదర్శించేవారట. అయితే రాయలవారి పరోక్షంలో రామకృష్ణుడు బూతుకవిగా కూడా పేరుగాంచాడు. పేరంభొట్లు కేవలం రామకృష్ణుడిని రెచ్చగొట్టడానికే సభా ప్రవేశం చేశాడు. ఎలాగైనా రామకృష్ణుడిని కార్యరంగంలోకి దింపి బూతు కవిత్వంలో అతడి మీద తనదే పై చేయి అని నిరూపించుకోవాలని ఆ కవి తపన. ఎంతగా రెచ్చగొట్టినా రాయలవారి అనుజ్ఞ లేనిదే మాట్లాడడం సబబు కాదని ఊరకున్నాడు రామకృష్ణుడు. రామకృష్ణుడు ఉలుకూ పలుకూ లేకుండా వుండడం చేత 'నేను బ్రహ్మనైనా గెలవనా?' అనే దిమ్ముతో పేరంభొట్లు మరింత రెచ్చి పోయాడు.

రామకృష్ణుడు 'యిక లాభం లేదనుకుని, రాయలవారి మౌనాన్నే అంగీకారంగా భావించి తాను పేరంభొట్లు విసరిన సవాలు నెదుర్కొనడానికి సిద్ధమని తెలిపాడు.

పేరంభొట్టు రామకృష్ణుడికి యీ క్రింది సమస్యనిచ్చి పూరించమన్నాడు -
'గర్భము గాకున్నఁ బోతు గాడ్దెల కొసఁగెన్'
వెంటనే రామకృష్ణుడు ఆ దత్తపదిని కంద పద్యంగా యిలా పూరించాడు.

"క॥ అర్భకులు లేక కూచన
దర్భలపాపన్న కిచ్చెఁదనయాలిని నా
నిర్భాగ్యుఁడు తనచే మఱి
గర్భము గాకున్నఁ బోతుగాడ్దెల కొసఁగెన్"

(పిల్లలు లేక కూచన అనేవాడు ఎలాగోలా తన భార్యకు సంతానం కలిగితే చాలునని తన భార్యను దర్భల పాపన్న అనే వాడికి యిస్తే, గర్భం చేయడం ఆ నిర్భాగ్యుని వల్ల కూడా కాక, మగ గాడిదలకి అప్పజెప్పాడట)

ఇలా యీ సమస్యను పూరించి పేరంభొట్టుకు చెంపపెట్టు పెట్టడమే కాక, ఆ కూచన, దర్భల పాపన్నలపై తనకున్న అక్కసును కూడా నిండు సభలో చాకచక్యంతో తీర్చుకున్నాడు రామకృష్ణుడు.

అప్పుడు పేరంభొట్టు రామకృష్ణునితో - "మీ కవితా చాతురిని గుర్చి లోగడ యితరులు చెప్పగా విని వున్నాను నేడు ప్రత్యక్షంగా చూస్తున్నాను. మీకే రంభ ఎదురు పడిందనుకోండి. ఆమె కంటికి మీరు సహజంగానే ఆనరు కదా' కనుక, ఆమె మిమ్మల్ని లెక్క చేయకుండా చులకనగా మాట్లాడిందనుకోండి. అప్పుడు మీరు రంభతో ఏమంటారో ఓ పద్యంలో వివరించండి" అన్నాడు. ఇలా పేరంభొట్టు రామకృష్ణుడిని రెచ్చగొట్టి, అతడి చేత రంభను తిడుతూ ఓ బూతు పద్యం చెప్పించాలనుకున్నాడు.

అప్పుడు రామకృష్ణుడు తన సహనం కోల్పోక రాయలవారి వంక తిరిగి "మహారాజా! కవిగారికి నన్ను త్వరగా రంభ దగ్గరకు పంపెయ్యాలని వున్నట్లున్నది. మరి ఆయనకు నేనేం అపకారం చేశానో? పైపెచ్చు నేను అందగాడిని కానని కూడా కవిగారు పరోక్షంగా దెప్పిపొడుస్తున్నారు. దీనికి సమాధానంగా సభ్యతకూ, సభామర్యాదకూ భంగం కలుగని రీతిలో ఓ పద్యం చెప్పదలచుకున్నాను. దయచేసి అనుమతించండి" అంటూ యీ క్రింది ఉత్పలమాలికను చెప్పాడు -

"ఉ॥ చక్కని వారిలో మిగుల చక్కని దాననటంచు పూరకే
నిక్కుచు విఱ్ఱవీగెదవు; వేషము వేరొకటింతెగాక నీ
చక్కెర విల్తు మందిరము - చెలియల కందరి కొక్కటే గదే
యెక్కువ యేమి? నీ యెడల యేమి విశేషము చెప్పవే చెలీ?"

సభికులంతా యిది విని కరతాళ ధ్వనులు చేశారు. రాయలవారు కూడా రామకృష్ణుడు తన సమక్షంలో హద్దుమీరి అసభ్య పదాలతో బూతు కవిత్వం చెప్పనందుకు తృప్తి పడ్డారు.

దీనితో పేరంభొట్టులో పట్టుదల పెరిగింది. ఎలాగైనా సరే రెచ్చగొట్టి రాయలవారి సమక్షంలో రామకృష్ణుడి చేత బూతు కవిత్వం చెప్పించి అతడిని బూతుకవిగా నిరూపించి రాయలవారికి అతడి పట్ల వ్యతిరేక భావం కలుగజేయాలని వెటకారంగా "మీరు పెద్ద బూతుకవి అని జనశ్రుతి. మీరు బూతు కవిత్వం చెప్పలేరని నేడు నిరూపణ అయింది మచ్చుకు ఒక్కటైనా బూతు పద్యం చెపుతారా? లేక బూతు కవిత్వంలో నాతో పోటీపడలేనని గౌరవ ప్రదంగా తప్పుకుని మీ

ఓటమిని అంగీకరిస్తారా?" అని సవాలు చేశాడు.

రామకృష్ణుడు తిరిగి రాయలవారి వంక చూసి "మహారాజా! మీరు అనుమతిస్తే మాటల కూర్పులో అశ్లీలత ధ్వనించినా సభ్యమైన అర్థం కలిగిన ఓ పద్యం చెప్పి పేరంభొట్టు నోరు మూయిస్తాను" అన్నాడు. రాయలవారు సమ్మతించారు.

అప్పుడు రామకృష్ణుడు యీ క్రింది కంద పద్యం చెప్పాడు -

"క॥ పూ కులము లోనఁ గేతకి
పూకెంత సువాసననుచుఁ బొలఁతి పలుకుచున్
పూ కడకుఁగడకు రమ్మని
పూ కరమునఁ బట్టిఁ జూపెఁ బురుషులకెల్లన్"

(పుష్ప జాతులలోకెల్లా కేతకి పుష్పానికి - మొగలి పువ్వుకు - ఎంత సువాసనో - అంటూ ఆ స్త్రీ ఆ పువ్వు దగ్గరకు వాసన చూడడానికి - రమ్మని దానిని చేతిలో పట్టుకొని పురుషులందరకూ చూపెట్టిందట. - 'పూ' అనే పదం 'పుష్పము'నకు సంక్షిప్త రూపం.)

ఈ పద్యం అర్థంలో అసభ్యతేమీ లేదు. మాటల కూర్పులోనే అశ్లీలత ధ్వనిస్తుంది.

ఈ పద్యాన్ని విన్న సభికుల కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి. పేరంభొట్టుకైతే నోట మాట పెగల లేదు. కాసేపు దిమ్మర పోయాడతడు. తరువాత తెప్పరిల్లుకొని తన ఓటమిని అంగీకరించి రామకృష్ణ కవి గొప్ప తనాన్ని పొగడుతూ యీ క్రింది పద్యం చెప్పాడు -

ఉ॥ అర్ణవ వేష్టితాభీత మహామహితాత్ముడు బూతులన్
బూర్ణుడు రామకృష్ణ కవి బోలు కవీశ్వరు డొండు కల్గునే
నిర్ణయమెంచి చేయు మహనీయ గుణాఢ్యుడు బూతు మంచిగా
దుర్ణయుడైనచో దివిరి ధూర్తత మంచిని బూతు చేసెడిన్.

అంటూ మరెన్ని విధాలుగానో రామకృష్ణ కవిని కీర్తిస్తూ, రాయలవారికి వినమ్రంగా ప్రణమిల్లి సభ నుండి సెలవు తీసుకుని తిరిగి కళింగ దేశానికి బయలు దేరాడు పేరంభొట్టు.

అయితే రాయలవారి సమక్షంలో కాబట్టి రామకృష్ణకవి పూర్తి సంయమనాన్ని పాటించి ఎక్కడా అసభ్యపదాలు రాకుండా జాగ్రత వహించాడు గానీ, యిదే రాయలవారి పరోక్షంలోనైతే విశృంఖలంగా వ్యవహరించి, పచ్చి బూతు కవితలతో పేరంభొట్టు నోరు మూయించేవాడే. బూతు పదాలు ప్రయోగిస్తూ కవితలల్లడంలో అతడు అందె వేసిన చెయ్యి. భట్టుమూర్తిని అధిక్షేపిస్తూ చెప్పిన పద్యాల ద్వారా మనకిది అర్థమవుతుంది.

ఎంత వరకూ నిజమోగానీ మొల్లను కించపరుస్తూ కూడా ఆయన కొంచెం అసభ్యంగా వ్యవహరించా డంటారు. రాయలవారి పాలనా కాలంలో ఆత్మకూరి మొల్ల అనే కుమ్మరి కులానికి చెందిన గొప్ప కవయిత్రి కొంత కాలం విజయనగరంలో నివసించిందంటారు. బాల వితంతువైన ఆమె సంస్కృతాంధ్రాలలో పాండిత్యం గడించడంతో బాటు చిన్నతనంలోనే కవిత్వం చెప్పనారంభించింది. పద్యరూపంలో వ్రాయబడిన యీమె రామాయణాన్ని మొల్ల రామాయణమంటారు. దీనిని ఆమె మొదట్లో రాయలవారికే అంకితమివ్వాలని యోచించిందట. ఆయన అందుకు సమ్మతించారట.

అయితే ఆమె శూద్ర కులానికి సంబంధించినదని, ఆమెను కవయిత్రిగా అంగీకరించలేక రామకృష్ణుడు పదేపదే ఆమెను కించపరచే వాడంటారు. శ్రీకృష్ణదేవరాయలను శ్రీకృష్ణునితో పోలుస్తూ మొల్ల చెప్పిన చక్కటి పద్యాన్ని రామకృష్ణుడు మరో వికటమైన పద్యం చెప్పి ఎలా హేళన చేసి మొల్లను కొంచపరచాడో మనం లోగడనే తెలుసుకున్నాం. అయితే రాయలవారు మొల్ల కవిత్వం వింటే ఎక్కడ మెచ్చుకుని ఆ 'రామాయణ' గ్రంధాన్ని కృతినందుకుంటారోనని యీర్ష్యపడిన రామకృష్ణుడు రాయలవారిని ఒక కోరిక కోరాడట. ముందుగా తాను చెప్పే ఒక పద్యం విని, ఆ తరువాత మొల్ల రామాయణం వినమని బ్రతిమిలాడాడట. దానికి రాయలవారు సమ్మతించగా రెండర్థాలు వచ్చే ఓ బూతు పద్యం చదివాడట అది విని స్త్రీ గనుక సిగ్గుపడి అవమాన భారంతో అక్కడి నుండి మొల్ల వెళ్లి పోయిందట. ఆ తరువాత ఆమె తన రామాయణాన్ని శ్రీరామునికే అంకిత మిచ్చిందనుకోండి. అది వేరే సంగతి. అయితే మొల్ల రామాయణాన్ని కృతి స్వీకరించకుండా రాయలవారిని రామకృష్ణుడు అడ్డుకున్నాడనేది ఏ మేరకు చారిత్రకంగా సత్యమో తెలియదు.

ఓసారి మొల్ల తాను పెంచుకునే కుక్కను మెడలో గొలుసుతో కట్టి తన వెంటబెట్టుకుని సంతకు వెళ్లి తనకు కావలసిన సరకులు కొనుగోలు చేసుకుని, ఒక కోడి పెట్టను కూడా కొనుక్కొని, రాచవీధిన వస్తున్నదట. అప్పుడు కొంటె వాడైన రామకృష్ణుడు ఆమెకు ఎదురై 'మొల్లా ! నీకు రూకనిస్తాను. కుక్కనిస్తావా? పెట్టనిస్తావా?' అంటూ శ్లేషాత్మకంగా అసభ్యత ధ్వనించేటట్లు అడిగాడట. ఆమె మాత్రం తక్కువదా? 'నేను నీకమ్మను గదా!' అంటూ అక్కడి నుంచి ముందుకు సాగిందట. కుక్క నా పెంపుడు కుక్క. అది ఎటు తిరిగీ అమ్మను. కోడినేమో వండుకుతినడానికి యిప్పుడే కొనుక్కొస్తున్నాను కనుక అవెలా అమ్ముతాను? అనే భావంతో, 'నేను నీకు తల్లిని గదా! నీ వెధవ వేషాలు నా దగ్గరా?' అని స్ఫురించేటట్లు అతడికి వాత బెట్టిందన్న మాట కవయిత్రి మొల్ల.

# 23. మాధ్వులతో వైరం

మధ్వాచార్యులు యొక్క ద్వైత సిద్ధాంతాన్ని అనుసరించేవారు మాధ్వులు. వీరు వైష్ణవులే అయినా రామానుజుడి విశిష్టాద్వైత సిద్ధాంతంతో వీరు ఏకీభవించరు. ఒకప్పుడు హంపిలో వారి ప్రాభవం చాల తీవ్రంగా వుండేది. విష్ణువును ఆరాధించే మాధ్వులు కూడా నుదుటిపై తిరుమణి దిద్దుకుంటారు. గోపీ చందనం అని పిలువబడే శ్వేత మృత్తికతో ముక్కు మీదుగా తెల్లని రెండు సమాంతర రేఖలు, వాటి మధ్యలో ఒక ముదురు రంగు రేఖ, ఆ రేఖ మధ్యలో ఒక ఎర్రని చుక్క - యిదీ వీరి తిరునామం. వీరు శరీరంలో వివిధ భాగాలలో శంఖు చక్రములతో సహా విష్ణువు వివిధ ఆయుధాల ముద్రలను కూడా గోపీ చందనంతో వేసుకుంటారట. శరీరంపై శ్రీవైష్ణవుల లాగా తప్త చక్రాంకనం కూడా అప్పుడప్పుడూ వీరు చేసుకుంటారట. మధ్వాచార్యులును మాధ్వులు ఆంజనేయుని అవతారంగా భావిస్తారు. ఆచార్యుల యొక్క సజీవ సమాధిని వారు 'బృందావనం' అని పిలుస్తారు. తుంగభద్రానది ఒడ్డున కర్నూలు జిల్లా మంత్రాలయంలో ఒక్క రాఘవేంద్రస్వామి బృందావనం మాత్రమే వుంటే హంపిలో అదే తుంగభద్ర ఉత్తరపు ఒడ్డునగల కిష్కింధలో వ్యాసతీర్థుడు (వ్యాసరాయడు), విజయేంద్రుడు మొదలగు తొమ్మిది మంది మాధ్వ స్వాముల సమాధులున్నాయి. వీటిని 'నవ బృందావనం' అంటారు హంపిలో మాధ్వ మతం అంతటి ప్రాచుర్యంలో వుండేదన్నమాట.

మాధ్వ మత ప్రారంభకుడైన మధ్వాచార్యులును ఆనందతీర్థుడని కూడా అంటారు. కర్ణాటకలోని ఉడిపి (ఉడుప) తాలూకాలోని కళ్యాణపూర్ (ఒకప్పటి రజతపీఠ) అనే గ్రామం యీయన జన్మస్థలం. ఈయన తండ్రి మధ్యగేహభట్టు మధ్వాచార్యులుది ద్వైత సిద్ధాంతం (ద్వైతం). చరాచర ప్రకృతిలో జీవ పదార్థం, నిర్జీవ పదార్థం – యీ రెండూ సత్యాలూ,

భిన్నాలౌననీ తమ అస్తిత్వం కొరకు అవి ఒకదానిపై మరొకటి ఆధారపడి లేవనీ ఆయన సిద్ధాంతం. శంకరాచార్యులు యొక్క మాయా వాదాన్ని ఆయన ఖండించాడు. అలాగే రామానుజుని విశిష్టాద్వైతాన్ని కూడా తిరస్కరించాడు. ప్రత్యగాత్మ, పరమాత్మ - యీ రెండూ భిన్నమైనట్టివి. భగవంతుడు, నిర్జీవ పదార్థం - యీ రెండూ పృధక సత్యాలే. అవి ఒకదానిపై ఒకటి ఆధారపడి లేవు. అలాగే ప్రత్యగాత్మకూ, నిర్జీవ పదార్థానికీ ఏ సంబంధమూ లేదు. అలాగే ఒక ఆత్మకూ వేరొక ఆత్మకూ; ఒక నిర్జీవ పదార్థానికీ వేరొక నిర్జీవ పదార్థానికీ ఎట్టి సంబంధమూ లేదు. అవి స్వయం ఆధారితమైన విభిన్న సత్యాలు - ఇదీ క్లుప్తంగా మాధ్వ సిద్ధాంతం. మధ్వాచార్యులు సిద్ధాంతం గురించి, ఆయన జీవిత కాలంలో సాధించిన విజయాల గురించి నారాయణుడు వ్రాసిన 'మధ్వ విజయ' అనే గ్రంథంలో విపులంగా వివరించబడింది. గురువైన అచ్యుతప్రేక్షాచార్యులు వద్ద శిక్షణ ముగించుకుని మధ్వాచార్యులు హిమాలయాలలోని బదరికాశ్రమానికి వెళ్లి అక్కడి నుంచి దిగ్విజయ రాముడు మరియు వేదవ్యాసుడు యొక్క విగ్రహములను తీసుకు వచ్చాడట. పద్మనాభ తీర్థుడూ, నరహరి తీర్థుడూ, మాధవ తీర్థుడూ, అక్షోభ్య తీర్థుడూ యీయన శిష్యుల్లో ప్రముఖులు. సీతారాముల యొక్క మూల ప్రతిమలను తీసుకురమ్మని తన శిష్యుడైన నరహరి తీర్థుడిని మధ్వాచార్యులు ఒరిస్సాలోని (పూరీ) జగన్నాథం పంపాడట. బహుశా పూరీకి వెళ్తూనో, అక్కడి నుంచి వస్తూనో నరహరి తీర్థుడు శక సంవత్సరం 1203లో అంటే క్రీ.శ. 1281లో యోగానంద నరసింహ స్వామికి శ్రీకాకుళం తాలూకాలోని శ్రీకూర్మంలో ఒక దేవాలయం నిర్మింపజేసినట్లు కూర్మేశ్వరాయలంలో దొరికిన ఒక శాసనం ద్వారా తెలుస్తున్నది. దీని ఆధారంగా చరిత్రకారులు మధ్వాచార్యులు క్రీ.శ. 1197 - 1276 సంవత్సరాల మధ్య కాలంలో జీవించినట్లు భావిస్తున్నారు. తన జీవిత కాలంలో ఆయన 37 ఉద్గ్రంథాలను వ్రాశాడట. మాధ్వులు ప్రస్తుత కర్ణాటకలో పశ్చిమ తీరంలో గోవా నుండి దక్షిణ కెనరా వరకు గల ప్రాంతంలో చాల ఎక్కువగా వున్నారు. వీరికి 11 మఠాలున్నాయి. ఉడిపిలోని శ్రీకృష్ణ పెరూవర్ మఠం అతి ప్రసిద్ధమైనది.

తెనాలి రామకృష్ణుడికి రాయలవారు రాచవీధికి ప్రక్కగా మాధ్వుల యిండ్ల మధ్యన గల ఖాళీ స్థలంలో ఒక చక్కని యిల్లు కట్టించి యిచ్చారట. అంతేకాక, ఆ గృహ ప్రవేశ మహోత్సవానికి ఆయన స్వయంగా హాజరై దంపతులిరువురినీ ఆశీర్వదించారట. దీంతో మాధ్వులందరికీ కడుపు రగిలిపోయింది. ఇందరం మేమిక్కడ వుండగా మా మధ్యలో యీ శైవుడుంటాడా? (రామకృష్ణుడు వైష్ణవం స్వీకరించినా, మాధ్వులు ఆయన్ని శైవునిగానే భావించారు) రాయలవారు ఆయనకింత ప్రాముఖ్యత నిస్తారా? ఇతడిని యిక్కడి నుంచి ఎలాగైనా సాగనంపాలి - అనుకుని వారంతా ఆ రాత్రికే సమావేశమయ్యారు. ఎలాగైనా యీ లింగడి పీడ వదలించుకోవాలనే నిర్ణయానికి వారంతా వచ్చారు. రాత్రికి రాత్రే ఒక చిత్రకారుడిని పిలుచుకు వచ్చి రామకృష్ణుడి యింటి గోడపై ఒక గాడిద బొమ్మవేసి దాని క్రింద యిలా వ్రాయించారు - "ఈ శైవ గాడిదను యిక్కడి నుంచి తరిమి కొట్టండి."

తెల్లవారింది. ఆ వీధిలో ఎవరు వెళ్లాలన్నా రామకృష్ణుడి యింటి ముందునుంచే వెళ్లాలి. ఆ వీధిలో నివసించేదంతా బ్రాహ్మణులే. వీధిలోకి వచ్చిన బ్రాహ్మణులంతా రామకృష్ణుని యింటి వద్ద గుమిగూడారు. యింటి గోడపై చిత్రించబడిన గాడిద బొమ్మను, దాని క్రింద వ్రాసిన వ్రాతలను చూసి విస్తు పోయారు కొందరు. తమలో తాము గుసగుస లాడుకున్నారింకొందరు. ఈ పని ఎవరు చేయించారో - వాళ్ళు మాత్రం లోలోపల ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. వారిలోని కొందరైతే యిందరి సమక్షంలో రామకృష్ణుడిని అవమానించగలిగామనే ఆనందాన్ని పట్టలేక పకపకా నవ్వసాగారు.

రామకృష్ణుడింకా పక్క మీది నుండి లేవలేదు. మెలకువ వచ్చినా యింకా బద్ధకంగా పక్కమీదే పొర్లుతున్నాడు. ఇంతలో తన యింటి ముందు వైపు నుంచి అతడికి కలకలం వినబడింది. 'ఏమిటా యీ సందడి?' అనుకుంటూ

బయటకు వచ్చాడు. తన యింటి వెలుపలి గోడ మీద చిత్రించబడిన గాడిద బొమ్మ, దాని క్రింద వ్రాసిన వ్రాత చూశాడు వచ్చిన కోపాన్ని లోలోపలే దిగమింగుకుని పైకి మాత్రం చిరునవ్వు నవ్వుతూ వున్నాడు. ఇదంతా ఎవరి పన్నాగం అయి వుంటుందో అతడికి అర్థమయింది.

ఇంతలో మాధ్వ గురువైన వ్యాసరాయుడు తుంగభద్రానదిలో స్నానం చేసి యింటికి తిరిగి వస్తూ - రామకృష్ణుడి యింటి ముందరి జనసందోహాన్ని చూసి ఆగాడు. ఆయన్ని చూసి అక్కడి వారంతా ప్రక్కకు తప్పుకుని దారి వదిలారు ముందుకు వచ్చి ఆయన కూడా ఆ గోడ మీది గాడిద బొమ్మనూ, దాని క్రింద వ్రాయబడిన మాటలనూ చదివాడు కాని, ఏమీ తెలియనట్లు "ఏమిటిది తెనాలి రామా! ఈ గోడ మీది గాడిద బొమ్మేమిటి? దాని క్రింద ఆ రాతలేమిటి? నీ యింటి చుట్టూ మూగిన యీ బ్రాహ్మణులంతా నిన్ను గురించి చులకనగా మాట్లాడడమేమిటి? ఏమిటీ సంత? యీ బ్రాహ్మణ వీధిలో యింతకు ముందెప్పుడైనా యిటువంటివి మేము ఎరుగుదుమా?" అంటూ విసుక్కున్నాడు.

దీంతో రామకృష్ణుడికి తన మనస్సులోని వ్యధను వెళ్లగక్కే మంచి అవకాశం లభించినట్లయింది. అతడు బిగ్గరగా, "ఏముంది గురువర్యా! ఆ బొమ్మలో ఒక శైవ గాడిద వుంది. అది చాల పొగరుబోతు గాడిద. తమని తన్నడానికే ఆ గాడిద తెల్లారేసరికి యిక్కడికి వచ్చిందని వీరంతా భావిస్తున్నారు. అది యీ వీధిలోని మాధ్వులనందరినీ ఎక్కడ యీడ్చి యీడ్చి తంతుందోనని అందరూ తెగ భయపడి పోతున్నారు. మీరు కూడా మాధ్వులే కనుక వచ్చేటప్పుడూ, వెళ్లేటప్పుడూ కాస్త జాగ్రతగా వుండండి. ఎందుకైనా మంచిది! అది మిమ్మల్ని కూడా వదిలే రకం కాదు - మీరు సాక్షాత్తూ రాజగురువే అయినప్పటికీ. అది శైవ గాడిద అని క్రింద వ్రాశారు కదా! కనుక దాన్నుంచి నాకే ప్రమాదమూ లేదు. వాస్తవానికి నేను ఎప్పుడో వైష్ణవం పుచ్చుకున్నప్పటికీ యింకా శైవుడినేనని సాక్ష్యం చెప్పడానికి ఎటూ మీరంతా వుండనే వున్నారు కదా! అంచేత నేను నిర్భయంగా యీ వీధిలోనే వుండవచ్చు. పాపం - మీ పరిస్థితి చూస్తుంటేనే జాలి వేస్తున్నది" అన్నాడు తెలివిగా.

దాంతో వ్యాసరాయుడు, ఆయన శిష్యులైన మాధ్వులకందరికీ నోట మాట పెగల లేదు; ముఖాన నెత్తురు చుక్కలేదు "ఈ లింగడికి యింత పొగరూ, యింతటి ఆత్మ విశ్వాసమా? మన సిగ్గు చెడక ముందే యిక్కడి నుంచి నిష్క్రమించాలి మనల్నింతగా అవమాన పరుస్తూ మాట్లాడతాడా? తన యింటి చుట్టూ యిందరం మాధ్వులమున్నామనే భయమే లేదే అతనికి? అతడు నిజంగా గుండెలు తీసిన బంటు. మొండి ఘటం. అతడిని కదిలించడమంటే పేడ మీద రాయి వెయ్యడమే! అతడిని రెచ్చగొట్టి పెద్ద పొరపాటే చేశాం" అనుకుంటూ వ్యాసరాయనితో సహా మాధ్వులంతా ఒక్కరొక్కరే అక్కడి నుంచి చల్లగా జారుకున్నారు.

ఆ వీధిలో ఇక ఆ తరువాత రామకృష్ణుడి జోలికి వచ్చిన వాళ్లు లేరు.

వ్యాసరాయుడు అనే ప్రసిద్ధ మాధ్వ తత్త్వవేత్త శ్రీకృష్ణదేవరాయలకు గురువుగా వుండేవాడట. అతడు మొదటి సాళువ నరసింహుని కాలంలో జీవించిన ప్రసిద్ధ మాధ్వ తత్త్వవేత్తయిన శ్రీపాదరాయడి శిష్యుడు. హంపిలోని విట్ఠలరాయని దేవాలయం మాధ్వుల కారణంగానే అత్యున్నతంగా అభివృద్ధి చెందింది. ఆ దేవాలయం చుట్టూ మాధ్వ మతస్థులు వేలాదిగా కాపురముండేవారట. వ్యాసరాయుడు కృష్ణదేవరాయల సవతి తమ్ముడైన అచ్యుత రాయలకు కూడా గురువుగా వ్యవహరించి క్రీ.శ. 1539లో మరణించాడు. శ్రీకృష్ణదేవరాయలకు గురువు శ్రీ వైష్ణవుడైన తాతాచార్యులా లేక మాధ్వుడైన వ్యాసరాయడా అనే విషయమై శ్రీవైష్ణవులకూ, మాధ్వులకూ మధ్య భేదాభిప్రాయాలున్నాయి. మాధ్వుల లెక్క ప్రకారం క్రీ.శ. 1539లో వ్యాసరాయుడు మృతిచెందిన తరవాతనే శ్రీవైష్ణవ ఆచార్యులు హంపి విజయనగరంలో ప్రవేశించారు. ఈ వాదన అంతగా

నమ్మశక్యం కాదు. ఎంచేతనంటే శ్రీకృష్ణదేవరాయలు శ్రీవైష్ణవావలంబకునిగానే ప్రసిద్ధి. ఆయన కావ్యం 'ఆముక్త మాల్యద' కూడా ఈ విషయాన్నే సుస్పష్టం చేస్తున్నది.

మాధ్వుల ప్రాబల్యం శ్రీకృష్ణదేవరాయలపై ఎంత తీవ్రంగా వుండేదో యీ క్రింది గాధను బట్టి తెలుస్తున్నది.

మాధ్వుల లెక్క ప్రకారం రాయలవారికి జాతకాల పిచ్చి ఎక్కువ. ఆయన పరిపాలనా కాలంలో రాయలవారి జాతకం ప్రకారం రాజుకు ఒక రోజుపాటు దుర్ముహూర్తమనీ (వాస్తవానికి ముహూర్తమంటే పన్నెండు క్షణాల కాలం మాత్రమే) ఆ రోజంతా అశుభ దినమని భావించిన జోశ్యులు దీనికి పరిష్కారంగా దుర్దినమైనట్టి ఆ రోజు వరకు సింహాసనం దిగి రాజ్య పాలన వేరెవరికైనా అప్పగించమని రాయలవారిని కోరారట. ఆయన అదే విధంగా ఆ రోజు వరకు సింహాసనం దిగి తన మాధ్వ గురువైన వ్యాసరాయడిని ఆ ఒక్క రోజు సింహాసనాధిష్ఠుడిని చేశాడట. ఆయన ఆ ఒక్క రోజు పాలనలోనే కేవలం రాజధాని అయిన హంపిలోనే ఐదు వందల హనుమాన్ దేవాలయాల నిర్మాణానికి ఆదేశించాడట. (ద్వైత మత స్థాపకుడైన మధ్వాచార్యుడిని హనుమంతుని యొక్క అవతారంగా మాధ్వులు భావిస్తారు.) రాయలవారికి గురువు కాకున్నా యీ వ్యాసరాయడు రాయల కాలం నాటి రాజ పురోహితులలో ఒకడయ్యే అవకాశం వుంది. తుంగభద్ర ఒడ్డున హంపిలోని వరాహ దేవాలయానికి సమీపంలో వ్యాసరాయ మంటపం వుంది. ఇది ఆ మాధ్వ గురువుకు స్మారకంగా నిర్మించబడింది. ఇక్కడ ఏటా ఉత్సవాలు నిర్వహించబడేవి. ఇది ఆ కాలంలో వ్యాసరాయని ప్రాముఖ్యతకు ప్రతిబింబంగా నిలుస్తున్నది. విఠ్ఠల ఆలయ అభివృద్ధికీ, ప్రాభవానికీ మాధ్వ మతస్థులే కారణమట. నారదుని అవతారంగా భావించబడిన భక్త పురందర దాసు తాను స్వయంగా రచించి స్వరబద్ధం చేసిన 'కృతులు' లేక 'కీర్తనలు' అనబడే భక్తి గీతాలను ఆలపిస్తూ విఠ్ఠల ఆలయంలో ఒక్కోసారి ఉన్మత్తంగా నృత్యం చేసేవాడట. ఆయన విఠ్ఠల ఆలయ కీర్తిని దిగంతాలకు వ్యాప్తి చేశాడు. సుప్రసిద్ధమైన సప్త స్వర మండపం, రాతి రథం, విఠ్ఠల ఆలయంలోనివే. కృష్ణరాయలపైనా, రామకృష్ణునిపైనా విఠ్ఠల దేవుని ప్రభావం ఎక్కువ. కొన్ని విషయాలలో మాధ్వులతో విభేదించినప్పటికీ శ్రీవైష్ణవుల పొడ గిట్టని రామకృష్ణుడు మాధ్వులతో సన్నిహితంగా మెలగుతూ రోజూ విఠ్ఠల ఆలయానికి వెళ్లి పూజలు చేస్తూ క్రమంగా విఠ్ఠలునికి మహా భక్తుడయ్యాడు. మాధ్వులెవ్వరూ కానీ, యితర విఠ్ఠల భక్తులెవ్వరూ కానీ విఠ్ఠలునికి చేయలేని మహత్తర సేవ తదుపరి కాలంలో 'పాండురంగ మాహాత్మ్యము' అనే ప్రౌఢ ప్రబంధాన్ని రచించడం ద్వారా చేశాడు రామకృష్ణకవి. మహారాష్ట్రలోని పంఢర్‌పూర్‌కు వెలుపల అతి ప్రసిద్ధమైన పాండురంగ విఠ్ఠల దేవాలయం నాటికి ఒక్క హంపి లోనిదే. హంపిలో నివసించిన కాలంలో విఠ్ఠల భక్తితో ప్రభావితుడైన కారణంగానే రామకృష్ణుడు అనంతర కాలంలో 'పాండురంగ మాహాత్మ్యము' అనే విఠ్ఠల దేవుని చరిత్రను మహత్తర కావ్యంగా వెలయించాడు.

## 24. భట్టుమూర్తితో పేచీలు

భట్టుమూర్తి మహాకవి. అతడి బహుముఖ ప్రజ్ఞకు మచ్చుతునక 'వసు చరిత్రము'. ఇదొక మహత్తరమైన శ్లేష ప్రబంధము. దీనిలో ఉపరిచరుడని ప్రసిద్ధిగాంచిన వసురాజవర్యుని చరిత్ర వర్ణించబడింది. ఇది మహాభారతంలోని ఆది పర్వంలో సంగ్రహంగా చెప్పబడింది. ఈ ప్రబంధానికి పీఠిక వ్రాసిన శౌంరి భద్రాద్రి రామశాస్త్రి గారిలా వ్రాశారు "ఈ ప్రబంధము రసములకు సముద్రము; కల్పనలకు కల్పవల్లి; అలంకారములకుఁ బేటిక; శబ్దవైచిత్ర్యమునకు నాటపట్టు; శ్లేషలకు నిధి; ధ్వనులకు జయఘంట." ఇదీ సంక్షిప్తంగా యీ ప్రబంధం యొక్క విశ్వరూపం.

ఈ కవి భట్టు కులస్థుడు. అసలు పేరు మూర్తి. అంచేత 'భట్టు మూర్తి' అని పిలిచేవారు. అయితే శ్రీకృష్ణదేవరాయల

మొదటి భార్య తిరుమలదేవి కూతురైన తిరుమలాంబికను పెళ్లాడిన 'అళియ' రామరాయలు (క్రీ.శ. 1541-1565) లేక రామరాజు (ఇతడు ఆరవీటి శ్రీరంగరాయల పెద్ద కుమారుడు) ఆస్థానంలో కొంత కాలం పోషణనంది 'రామరాజ భూషణుడు' అనే బిరుదు పొందాడు. అళియ రామరాయలుకు స్వయానా తమ్ముడు, శ్రీకృష్ణదేవరాయల రెండవ భార్య చిన్నాదేవి కుమార్తెయైన వెంగళాంబను పెండ్లాడిన తిరుమల రాయలు (1565-1572) ఆస్థానంలో కూడా యీ కవి కొనసాగాడు 'వసుచరిత్ర'ను రామరాజభూషణుడు అంకిత మిచ్చింది తిరుమల రాయనికే.

భట్టుమూర్తి చాల గ్రంథాలు వ్రాశాడంటారు. అయితే ప్రస్తుతం లభిస్తున్నవి 'వసుచరిత్ర', 'హరిశ్చంద్రనలోపాఖ్యానము', 'నరసభూపాలీయము' మాత్రమే. 'హరిశ్చంద్రనలోపాఖ్యానము' ద్వ్యర్థికావ్యము. హరిశ్చంద్రుడి యొక్క నలుడి యొక్క కథలు యిందులో జోడించబడ్డాయి. పింగళి సూరన తరువాత ద్వ్యర్థికావ్య రచన చేసిన మొదటి కవి భట్టుమూర్తే. 'నరసభూపాలీయము' అలంకార శాస్త్ర గ్రంథము. ఇతడు శ్రీరామ, ఆంజనేయోపాసకుడట. ఏకదిన ప్రబంధ ఘటనా సమర్థుడట. సద్యశ్శతగ్రంథ కల్పనా శక్తి కలవాడట. సంగీత శాస్త్ర మర్మాలను క్షుణ్ణంగా ఎరిగిన వాడట సంస్కృతాంధ్ర భాషా సామ్రాజ్య సర్వంకషుడట. చతుర్విధ కవితా నిర్వాహకుడిగానూ, సాహిత్య రసపోషణుడిగానూ ఖ్యాతి గాంచిన వాడట. ఈ కవి 'నరసభూపాలీయము' లో తాను 'ఆశు ప్రబంధ బంధాభిజ్ఞుడననీ', 'ఘటికా శతగ్రంథ కరణ ధుర్యుడ'ననీ, 'శతలేఖినీ పద్య సంధాన ధౌరేయుడ'ననీ చెప్పుకున్నాడు. ఇతడు శతావధానానికి ఆద్యుడట.

భట్టుమూర్తి జన్మస్థానాన్ని గురించి ఎన్నో వాదోపవాదాలున్నాయి. కొందరు యీయన జన్మస్థలం బళ్లారి జిల్లాలోని పాలమండలం తాలూకాలోని బట్టుపల్లె అంటారు. మరి కొందరు కడపజిల్లాలోని పులివెందుల తాలూకాలోని బట్టుపల్లె అనీ, యింకొందరు గుంటూరు జిల్లా లోని మోదుకూరనీ అంటారు. ఈ మోదుకూరు తెనాలికి సమీప గ్రామమే. అయితే యీయన పుట్టిన చోటు యిది అని యిదమిత్థంగా నిర్ణయింపదగిన ఆధారాలు మాత్రం లభించలేదు. కాని యీ కవి యింటి పేరు 'ప్రబంధాంకము' వారని, యీయన పూర్వీకులకు 'ప్రబంధాంకము' అనేది బిరుదనీ, వారి కవితా గరిమకు మెచ్చుకున్న శ్రీకృష్ణదేవరాయలు వారికి ఆ బిరుదుతోబాటు, బళ్లారి జిల్లాలోని బట్టుపల్లె గ్రామాన్ని కూడా యిచ్చినట్లు తెలుస్తున్నదనీ, ఆ కారణంగా యీయన జన్మభూమి బళ్లారి జిల్లా పాలమండలం తాలూకా బట్టుపల్లె అయివుంటుందనీ తమ 'విజయనగర చరిత్రము'లో నూతలపాటి పేర్రాజుగారు పేర్కొన్నారు. అయితే యీ సిద్ధాంతం నాకెందుకో అంగీకారయోగ్యంగా కనుపించడంలేదు. క్రీ.శ. 1474లో పుట్టినట్లుగా చరిత్రకారులు నిర్ధారించిన శ్రీకృష్ణదేవరాయల కంటే మహా అయితే పది పదిహేనేళ్ళు చిన్నవాడైన భట్టుమూర్తి యొక్క పూర్వీకులెవరికో రాయలవారు 'ప్రబంధాంకం' అనే బిరుదునూ, 'బట్టుపల్లె' అనే గ్రామాన్నీ యిచ్చారనడం ఏ రకంగానూ నప్పడం లేదు. రాయలవారు పాలించింది కేవలం 20 సంవత్సరాలే (1509-1529). భట్టుమూర్తి వయస్సులో రామకృష్ణ కవి కంటె కొంచెం పెద్ద. వీరిరువురూ సమకాలికులు రాయలవారి ఆస్థానంలో వున్నవారు.

భట్టుమూర్తి జన్మస్థలం తెనాలికి సమీపంలోని భట్టుపల్లె అయివుంటుందని నా అభిప్రాయం. దీనిని విజయనగరాన్నేలిన రెండవ దేవరాయలు లేక ప్రౌఢదేవరాయలు లేక గజబెంట దేవరాయలు (ఏనుగుల వేటంటే ఆయనకు విపరీతమైన మక్కువ కనుక యీ పేరు వచ్చింది) భట్రాజులకు యిచ్చాడంటారు. అందుకే దీన్ని దేవరాయ భట్ల పాలెమని కూడా అంటున్నారు. ఇది ప్రస్తుతం వెంకట కృష్ణాపురం గ్రామ పంచాయితీలో చేరిన శివారు గ్రామం - తెనాలి నుంచి నందివెలుగు మీదుగా గుంటూరు వెళ్లే రహదారికి ఉత్తరపు ప్రక్కగా యీ గ్రామం వుంది. రెండవ దేవరాయల పాలనా కాలం క్రీ.శ. 1422-46 కనుక దేవరాయలే యీ గ్రామాన్నీ, 'ప్రబంధాంకము' వారనే బిరుదునూ భట్టుమూర్తి తాతకో లేక

ఆ వయస్సు కల మరెవరికో యిచ్చి వుండొచ్చు. ఈ గ్రామంలో ఇప్పుడు భట్రాజు కులస్థులెవరూ లేరు. ఒకప్పుడు యిక్కడ 'ప్రబంధాంకం' అనే యింటి పేరు కలవారు వుండే వారట. వారిలో కొందరు తెనాలి తాలూకా వలివేరు గ్రామానికి వలస వెళ్లి అక్కడ స్థిరపడ్డారట. అక్కడి నుండి ఉద్యోగ రీత్యా ప్రబంధాంకం వెంకట రాజు అనే ఆయన గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా ముప్పాళ్ల వెళ్లి స్థిరపడ్డారని తెలిసి ముప్పాళ్ల వెళ్లి ఆయనను కలిశాను. 1983లో ముప్పాళ్ల జిల్లా పరిషత్ హైస్కూల్‌లో తెలుగు పండిట్‌గా ఆయన రిటైరయ్యారు. 80 ఏళ్లు పైబడిన ఆయన తమ కులస్థులలో ప్రథమ శాఖ, తెలగాణులు అనే రెండు శాఖలున్నాయనీ, తాము ప్రథమ శాఖకు చెందిన వారమనీ, తమది తెనాలి సమీపంలోని వలివేరు గ్రామమనీ, ప్రబంధాంకం యింటిపేరు కలవారు ఒకప్పుడు వలివేరు, మోదుకూరులలో వుండేవారనీ, ప్రస్తుతం ప్రబంధాంకం యింటి పేరు కలవారు కృష్ణా జిల్లా నూజివీడు సమీపంలోని నరసింగుపాలెంలోనూ మరికొన్ని గ్రామాలలోనూ మాత్రం వున్నారనీ, యింకా ఎన్నో వివరాలు తెలిపారు. (భట్రాజులలో యింకా తంగెళ్ల, ఇనపకుతిక, మొగసాటి, చల్లగాలి, వర్ణ కవి, తాతపూడి, చిరంజీవి, బాలగోపాల, మారెళ్ల వగైరా యిళ్లపేర్లున్నాయట.) వీటన్నింటి కారణంగా భట్టుమూర్తి జన్మస్థలం దేవరాయభట్లపాలెం అనే నిర్ధారణకు నేను వచ్చాను. దీనికి సమీప గ్రామమైన గార్లపాడు (నేడిది గారపాడుగా వ్యవహరించబడుతున్నది.) రామకృష్ణ కవి స్వస్థలమనీ, కందుకూరి వీరేశలింగం పంతులు గారు 'ఆంధ్ర కవుల చరిత్ర'లో పేర్కొన్న భట్టుపల్లె ఈ దేవరాయభట్ల పాలెమేననీ, రామకృష్ణ కవి బాల్యంలో ఆ గ్రామంలోని భట్రాజు కులస్థుల వద్దే కావ్యాలు చదువుకున్నాడనీ, ఆ సందర్భంలోనే భట్టుమూర్తితో ఆయనకు పేచీలు ఏర్పడి వుండవచ్చుననీ నిర్ధారణకు వచ్చాను. శ్రీకృష్ణ దేవరాయల పేరును సంక్షిప్తంగా కృష్ణరాయలు అనడం పరిపాటి గానీ, ఆయన్ని దేవరాయలు అన్నట్లు ఎక్కడా కానరాదు. అంచేత దేవరాయభట్ల పాలెం గ్రామాన్ని భట్రాజులకు దానమిచ్చింది రెండవ దేవరాయలే (క్రీ.శ. 1422-46)కానీ వేరొకరు కారనే నిర్ధారణకు కూడా వచ్చాను.

శ్రీకృష్ణదేవరాయలే భట్టుమూర్తి పూర్వీకులకు 'ప్రబంధాంకం' అనే బిరుదు నామాన్నీ, భట్టుపల్లె గ్రామాన్నీ ఇచ్చాడని నమ్ముతున్న కొందరు, ఆ కారణంగానే భట్టుమూర్తి కృష్ణరాయలకు చాల కాలం తరువాతి వాడనీ, అంచేతనే తెనాలి రామకృష్ణుడు కూడా శ్రీకృష్ణ దేవరాయల సమకాలికుడు కావడానికి వీలులేదని వితండ వాదనలు చేస్తున్నారు. అయితే యీ దేవరాయభట్ల పాలెంపై నేను వెలికి తీసిన వాస్తవాలతో ఆ గ్రామాన్నీ, ప్రబంధాంకం అనే బిరుద నామాన్నీ, భట్రాజులకిచ్చింది రెండవ దేవరాయలే కానీ, కృష్ణదేవరాయలు కాదనీ, ఆ కారణంగా భట్టుమూర్తీ, రామకృష్ణుడూ శ్రీకృష్ణదేవరాయలకు సమకాలికులేననీ నిర్ద్వంద్వంగా ఋజువవుతున్నది.

పైపెచ్చు తెనాలి రామకృష్ణ కవి స్వగ్రామమైన గార్లపాడుకు యీ గ్రామం కూతవేటు దూరంలోనిది. తాతాచార్యులవారు మంగళగిరికి వచ్చినప్పుడు విజయనగర ఆస్థానం లోనికి ప్రవేశం కొరకు ఆయన సిఫారసు కోసం రామలింగనితోపాటు, భట్టుమూర్తి కూడా ప్రయత్నించాడనీ, రామలింగకవి జన్మతః వైష్ణవుడు కాదనీ, శైవునిగా మారిన స్మార్తుడనీ తాతాచార్యుల వారి చెవిలో ఊదిందీ, హంపిలో సభా ప్రవేశం రామలింగనికి దక్కకుండా చేసిందీ భట్టుమూర్తేననే కథలెటూ వుండనే వున్నాయి. (భట్టుపల్లె, గార్లపాడు - యీ రెండూ మంగళగిరికి కూడా సమీప గ్రామాలే. భుజబలరాయలని కూడా పిలువబడిన శ్రీకృష్ణ దేవరాయల సవతి అన్నయైన వీర నరసింహ రాయలు మంగళగిరి కొండ దిగువననున్న లక్ష్మీనరసింహ స్వామి ఆలయాన్ని దర్శించినట్లు ఆ ఆలయ ఆవరణలో ఆ సందర్భంగా చెక్కించిన శిలాశాసనం ప్రకారం తెలుస్తున్నది. అలా ఆయనతో పాటు రాజగురువు తాతాచార్యులు కూడా ఆ నాడు మంగళగిరికి వచ్చి వుండే అవకాశముంది.) అప్పటి నుంచే తాతాచార్యుల వారికీ, భట్టుమూర్తికీ మైత్రి, వీరిద్దరితో రామలింగనికి వైరమూ ప్రారంభమై వుంటాయి.

రాయలవారికి మాత్రం భట్టుమూర్తి సమర్థుడైన కవి అనీ, తన గురువైన తాతాచార్యులకు అత్యంత సన్నిహితుడనీ, భట్టుమూర్తి అంటే ప్రత్యేకమైన అభిమానం, గౌరవం ఉండేవట. రాయలీయనను పురస్కరించినా తిమ్మరుసు తిరస్కరించినట్లున్నాడు భట్టుమూర్తి, తాతాచార్యుల మీది వ్యతిరేకతతో రామకృష్ణకవి హంపిలో వున్నంత కాలమూ తిమ్మరుసుతో అత్యంత సన్నిహితంగా మెలిగేవాడు. దానికి తిమ్మరుసు అల్లుడు నాదెండ్ల గోపమంత్రి రామకృష్ణుడికి చేసిన సిఫారసు కూడా కొంత కారణమై వుండవచ్చు.

ఒకప్పుడు భట్టుమూర్తికి తిమ్మరుసంటే ఎంతో గౌరవముండేదని భట్టుమూర్తి చెప్పిన యీ క్రింది చాటువు వలన తెలుస్తోంది -

క॥ అయ్యవని పించు కొంటివి
నెయ్యంబునఁ గృష్ణరాయ నృపపుంగవుచే
నయ్యా నీ సరియేరీ
తియ్యని విలుకాడవయ్య! తిమ్మరుసయ్యా!

మొదటి నుంచీ రామకృష్ణుడికి ఒక అలవాటు వుంది తాను అభిమానించే వారిని గానీ, తనను అభిమానించే వారిని గానీ, తానే పొగడాలి. తన సమక్షంలో మరొకరు పొగిడితే అతడు దానిని సహించలేక పోయేవాడు. అలాగే తన సమక్షంలో తాను అభిమానించే వ్యక్తి మరొకరిని పొగడడం కూడా అతనికిష్టముండేది కాదు. రాయలవారిని తన సమక్షంలో కవయిత్రి మొల్ల పొగడుతూ చక్కటి పద్యం చెబితే దానిని అధిక్షేపించి, మొల్లను కించపరచాలని ఆయన చేసిన ప్రయత్నం మనకు తెలుసు. ధూర్జటి మహా కవిని రాయలవారు పొగడుతూంటే అడ్డుకున్న తీరు, 'స్తుతమతియైన ఆంధ్రకవి' అన్న పద్యాన్ని రామకృష్ణుడు పూరించిన విధాన్ని బట్టే మనకు అర్థమవుతుంది.

అలాగే యిక్కడ రామకృష్ణ కవికి తాను తాతలా గౌరవిస్తున్న మహామంత్రి తిమ్మరుసును తన సమక్షంలో భట్టుమూర్తి పొగడడం కూడా యిష్టంలేదు కాబోలు! అందుకే వెంటనే యీ క్రింది పద్యం చెప్పాడు.

క॥ చీపర పాఁపర తీఁగల
చేఁపల బుట్టల్లినట్లు చెప్పెదు నీ యీ
కాఁపుఁ గవిత్వపుఁ గూఁతలు,
బాఁపన కవివరుని చెవికిఁ బ్రమదంబిడునే?

ఇక్కడ 'కాపు కవిత్వపు కూతలు' అంటే 'శూద్రులు వ్రాసే కవిత్వాలు' అని అర్థం. కాపులంటే రెడ్లు. అయినా 'కాపు' అనే పదాన్ని శూద్రులకందరికీ సామాన్యార్థకంగా వాడాడు కవి. పాండురంగ మాహాత్మ్యములో వెలమలు అనే పదాన్ని శూద్రులకు సామాన్యార్థకంగా మొత్తం శూద్రవర్ణానికి అన్వయిస్తూ వాడాడు. ఇక్కడా అంతే! భట్టుమూర్తి భట్రాజు. అంటే శూద్రవర్ణం. కాపు కవిత్వం అని ప్రయోగించడం ద్వారా శూద్రుడు వ్రాసిన కవిత్వాన్ని అధిక్షేపిస్తున్నాడిక్కడ రామకృష్ణుడు. బాపన కవివరుని చెవికి ప్రమదంబిడునే? అంటే బ్రాహ్మణకవీంద్రుడనైన నా చెవులకు ఆనందాన్ని కలిగిస్తాయా? అని ఓ అర్థం. బ్రాహ్మణ కవీంద్రుడైన తిమ్మరుసుకు వీనులవిందు చేస్తాయా? అని మరో అర్థం. తిమ్మరుసు కూడా ప్రఖ్యాతిగాంచిన కవే ! సంస్కృతాంధ్రములందు అసామాన్యమైన పాండితీ ప్రకర్ష కలవాడు. అగస్త్యుడు సంస్కృతంలో వ్రాసిన 'బాలభారతము'నకు

తిమ్మరుసు సంస్కృతంలో మనోహరమైన వ్యాఖ్య వ్రాశాడట.

ఇంతగా పొగిడిన భట్టుమూర్తి అనతికాలంలోనే తిమ్మరుసు పొడగిట్టనంత వ్యతిరేకిగా ఎలా మారిపోయాడో మరి! తిమ్మరుసు, రామకృష్ణకవి ఒక ప్రక్క తాతాచార్యులు, భట్టుమూర్తి మరొక ప్రక్క రెండు కూటములుగా ఏర్పడి ఎప్పుడూ ఒకరిని మరొకరు దెబ్బతీయాలని యత్నించేవారట.

తిమ్మరుసు మీది కోపంతో ఓసారి భట్టుమూర్తి తిమ్మరుసు గత చరిత్రంతా తవ్వి ఆయన పుట్టుపూర్వోత్తరాలన్నీ బట్టబయలు చేయదానికి యీ క్రింది పద్యం చెప్పాడట -

శా॥ గుత్తిం బుల్లెలు గుట్టి చంద్రగిరిలోఁ గూడెత్తి పెన్గొండలో
హత్తిన్ సత్రమునందు వేఁడి బలు దుర్గాధీశు తాంబూల పుం
దిత్తుల్మోసి పదస్థులైన ఘనులన్ దీవింప . . . . . .

అని చెపుతూ వుండగా, అప్పటిదాకా ఓపిగ్గా వింటూ వున్న తిమ్మరుసు, తన గత చరిత్రనంతా తవ్వి తీసి యింకేం చెపుతాడోనని భయపడి, తన మెడలోని ఓ విలువైన పచ్చల హారాన్ని తీసి వెంటనే భట్టుమూర్తి మెడలో వేశాడట. అప్పుడాయన తృప్తి పొంది -

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . దీవించెదన్
మత్తారాతి యయాతి నాగమసుతున్ మంత్రీశ్వరున్ తిమ్మయన్.

అని మిగతా పద్య భాగాన్ని చమత్కారంగా పూరించాడట.

అక్కడి నుంచీ ఎప్పుడూ భట్టుమూర్తి తిమ్మరుసును ఏదో ఒక రీతిలో యిబ్బంది పెట్టేటట్లు మాట్లాడుతూ 'బ్లాక్ మెయిల్' రాజకీయాలు నడిపేవాడట.

అందుకని తిమ్మరుసు ప్రోత్సాహంతోనే కామోసు భట్టుమూర్తి పైకి రామకృష్ణుడు ఒంటి కాలిమీద లేచేవాడట. కులం పేరుతో నిందించడం, అంతటి గొప్పకవి కవిత్వాన్ని చులకన చేసి మాట్లాడడం తగని పనులే అయినా రామకృష్ణకవి ఆ పనులకు పాల్పడ్డాదని ఎన్నో దృష్టాంతాలున్నాయి. ఇది వీరిద్దరి వ్యతిరేకత మాత్రమే అయివుండక పోవచ్చు. వీరివి సమీప గ్రామాలే కనుక ఏవైనా భూ తగాదాలు కూడా వీరిద్దరి పూర్వీకుల మధ్య ఉండి ఉండే అవకాశం కూడా వుంది.

రామకృష్ణుడు భట్టుమూర్తిని నిందిస్తూ వేరొక సందర్భంలో 'అన్నగారూ!' అంటూనే ఎంతటి పరుషమైన పదజాలం వాడాడో చూడండి -

క॥ ఒద్దారపు నా కొడుకులు
దొడ్డదొరల్ కవులకీయ దొరకొనుచోఁ దా
మద్దాలె వచ్చుచుందురు
ముద్దా చూచెదవు భట్టుమూర్తనగారూ!

'గొప్ప ప్రభువులు ఎవరైనా కవులకేవైనా బహుమతులిచ్చి వారిని సత్కరించాలని తల పోసినప్పుడు కొందరు ద్వేషభావం కల కుమతులు మధ్యలో అడ్డం వస్తూ వుంటారు' అని దీని భావం ఈ పద్యంలో "ఇది కవులకూ, ఉదారులైన ప్రభువులకూ మధ్య విషయం. నీకిక్కడ పనేం వుంది?" అంటున్నాడు భట్టుమూర్తితో. ఇది మరింత దారుణం. అంతటి

మహాకవిని పట్టుకుని ఆయనసలు కవే కాదన్నట్లు మాట్లాడడం రామకృష్ణుడికే చెల్లుబాటయింది.

రామకృష్ణుడు మరొక పద్యంలో భట్టుమూర్తిని అవహేళన చేస్తూ తననొక సింహంగానూ, భట్టుమూర్తిని కుక్కగానూ చిత్రించాడు. ఆ కంద పద్యం చూడండి.

క॥ కెంగేల రామకృష్ణుని
బంగరు కడియంబులుండఁ బండితుఁడగునా ?
జెంగులు జెల్లులు గల్గిన
సింగారపు టూరఁగుక్క సింగంబగునా ?

జెంగులు - జంగె లేక జంగియ అంటే గండపెండెరముల కుండే గజ్జెలు.

జెల్లులు - జల్లి లేక జల్లి పెండెము - అంటే ఒక పాదభూషణము.

రామకృష్ణునికి ఉన్నట్లు చేఁతులకు బంగారు కడియము లుండగానే ప్రతివాడూ పండితుడవుతాడా? అలంకారంగా జెల్లులూ, జంగులూ వున్నా సింగారపు ఊరకుక్క సింహం అవుతుందా?

## 25. రామకృష్ణుడు - సోమరి బిచ్చగాళ్లు

రాయలవారి కాలం నాటి హంపి విజయనగరం అప్పటి ప్రపంచంలోని నగరాలలోకెల్లా మస్తు సమృద్ధి కలిగినట్టి నగరమని పోర్చుగీసు యాత్రికుడు డామింగో పేయజ్ వ్రాశాడు. బియ్యం, గోధుమలు, జొన్నలు, రాగులు, సజ్జలు మొదలైన తృణధాన్యాలు అక్కడ సమృద్ధిగా లభించేవట. (మొక్కజొన్న మినహా, ఎంచేతనంటే మొక్కజొన్న అప్పటికింకా భారతదేశంలోకి ప్రవేశించ లేదట) బార్లీ, చిక్కుడు, పెసర, మినుము వగైరా అన్ని రకాల పప్పు ధాన్యాల నిల్వలు. పాడి పశువులకు, గుర్రాలకు వాడే ఉలవల నిల్వలు సమృద్ధిగా వుండేవట. ధరలు సరసంగా వుండేవట. నగరంలోని ముస్లింలు మటుకు గోధుమలు తినేవారట. నగరంలోని పశు సంపదకు లెక్కేలేదట. కోళ్లు వగైరా పక్షి సంపద అపారంగా వుండేదట. నగరంలో ఒక ఫణానికి మూడు కోళ్లు లభించేవట. అదే నగరం బయటైతే నాలుగు కోళ్లు లభించేవట. కొన్ని కసాయి వీధులలో తెల్లని పరిశుభ్రమైన పందులు లభించేవట. ఒక్కో పందిని నాలుగైదు ఫణాలకు కొనుక్కోవచ్చట. కమలా ఫలాలు, నారింజలు, అడవి వంకాయలు, నిమ్మపండ్లు, దానిమ్మపండ్లు, పాలు, వెన్న, వంటనూనెలు విస్తారంగా లభించేవట. ఒక ఫణానికి మూడు ద్రాక్షపళ్ల గుత్తులు లభిస్తే, పది దానిమ్మ పళ్లు లభించేవట. విజయనగరం అంగళ్లలో నవరత్నాలూ రాసులుపోసి అమ్మేవాళ్లనే ప్రతీతి ఎలాగూ వుండనే వుంది. ఇదీ నాటి విద్యానగరం యొక్క సంపద.

అయినా విద్యానగరంలో బిచ్చగాళ్లు జాస్తిగానే వుండేవారట. కన్నూ, కాలూ, చెయ్యీ అన్నీ బాగుండి కూడా కొందరు అడుక్కు తినడానికి అలవాటుపడి సోమరి పోతులుగా మారారట. ప్రజలలో ధార్మికత పాలు కొంచెం ఎక్కువైనందున, తమకున్న దానిలో దాన ధర్మాలు చేస్తే ముక్తి లభిస్తుందనే భావం వారిలో ప్రబలంగా వున్న కారణంగా, ప్రజల విశ్వాసాలను ఆధారంచేసుకుని రాజధానిలో బిచ్చగాళ్ల బెడద చాల తీవ్రంగా వుండేదట. రాయలవారు అంతటి సంపద్వంతమైన విజయనగరంలో బిచ్చగాళ్లుండడం ఒక మాయని మచ్చగా భావించి, వారందరినీ తన తల్లి నాగులాంబ పేరిట నిర్మించబడిన ఓ పెద్ద ధర్మసత్రంలోనికి తరలించి, వారందరికీ అక్కడ ఉచిత భోజన, వసతి సౌకర్యాలు కల్పించారట. అయితే బిచ్చగాళ్ల

పునరావాసానికి ఉద్దేశించి చేపట్టిన యీ చర్య బిచ్చగాళ్ల సంఖ్యను మరింతగా పెంచిందట. మొదటగా అక్కడికి తరలించింది రెండు వందల మందినైతే, రెండు నెలలలోనే ఆ సంఖ్య ఆరువందలయిందట. అంటే రాజధానిలో కొత్తగా బిచ్చగాళ్లు తయారవుతున్నార్నమాట. పోనీ పేద రైతులు, వ్యవసాయ కూలీలు ఆర్థికంగా చితికిపోయి యిలా బిచ్చగాళ్లుగా మారుతున్నారేమోనని రాయలవారు రాజ్యంలో రైతుల ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు లభిస్తున్నాయా? వ్యవసాయ కూలీలకు తగు రోజు కూలి లభిస్తున్నదా? వారి వేతనాలు, జీవన ప్రమాణాలు ఎలా వుంటున్నాయి?' అనే దానిపై ఆరాలు తీసి విస్తృతంగా సర్వేక్షణ చేయించారట. దానిలో తేలిందేమంటే - రాజ్యంలో వస్తు సమృద్ధికి లోటు లేదు. అన్ని వస్తువుల ధరలు సరసంగానూ, సామాన్యుడికి అందుబాటులోనూ వున్నాయి. చేసుకునేవాడికి సాలుకు 365 రోజులూ ఏదో ఒక పని లభిస్తున్నది. వారి వేతన సరళి, జీవన ప్రమాణాలు సంతృప్తికరంగానే వున్నాయి. రాజధానిలో వెనకా ముందూ ఆధారం ఎవ్వరూ లేని వికలాంగులు, కుంటి, గ్రుడ్డి మొదలైన వారు, మతి స్థిమితంలేని అనాథలు, ఏ పనీ చేసుకోలేని నిస్సహాయులు, వృద్ధుల సంఖ్యపై ఆరాతీయిస్తే వారు రెండు వందలలోపే వున్నారని తేలిందట. కనుక, మిగిలిన బిచ్చగాళ్లంతా కన్నూ, కాలూ, చెయ్యీ అన్నీ బాగుండి కూడా సోమరిపోతులుగా మారి భిక్షాటనకు అలవాటు పడ్డారన్న మాట. నాగులాంబ సత్రంలో ఎప్పుడు చూసినా ఒకటే హడావుడి. సత్రంలో చేరుతున్న పునరావాసితుల సంఖ్య రోజు రోజుకీ పెరిగి పోతున్నది. రాజోద్యోగులలోని అవినీతి కూడా దీనికి దోహదం చేస్తున్నది. అన్ని అవయవాలూ బాగున్న వారిని వెంటనే సత్రం నుంచి ఖాళీ చేయించాల్సిన ఉద్యోగులు, అలాంటి సోమరుల నుండి తృణమో, పణమో తీసుకుని వారిని సత్రంలోనే వుంచి సకల మర్యాదలూ చేస్తున్నారు. ఖజానాపై యిది అమితమైన భారాన్ని మోపుతున్నది.

ఇవన్నీ తెలుసుకున్న రాయలవారు రాజధానిలోగల ధర్మసత్రాలను మూసివేసి యీ సమస్యను పరిష్కరిద్దామనుకున్నారు కానీ ఆ సత్రాలలో పునరావాసం పొందుతున్న అనాథలు, కుంటి, గ్రుడ్డి వగైరాల శాపం తన రాజ్యానికి నష్టకరంగా పరిణమించవచ్చుని భయపడ్డారు. మరి వీరి పీడ ఎలా వదిలించుకోవాలోనని యోచించి సలహా కోసం ఓసారి రామకృష్ణుడిని సంప్రతించారట. విచారణ జరిపించి సోమరి పోతులనే అయినా సత్రం నుంచి యిప్పుడు ఖాళీ చేయిస్తే అది తన రాజ్య ప్రతిష్ఠకు మచ్చ తెస్తుంది. తనిఖీ సమయంలో అవయవాలన్నీ సరిగ్గా వున్న వారు కూడా మతి స్థిమితం కోల్పోయినట్లో, కాళ్లూ, చేతులూ, కళ్లూ సరిగా లేనట్లో నటించే అవకాశముంది. అయినా అలాంటి తనిఖీ జరిపి సత్రంలోని జనంలోని సోమరిపోతుల్ని ఖాళీ చేయించినా తాము విమర్శలకు గురి అయ్యే అవకాశముంది. అంచేత, వాళ్లకై వాళ్లే సత్రం ఖాళీ చేసే ఉపాయమేదో ఆలోచించమని రాయలవారు రామకృష్ణుడిని కోరారట.

రామకృష్ణుడు బాగా ఆలోచించి ఓ పథకం వేసి దాన్ని వెంటనే అమలు పరచడానికి పూనుకున్నాడు. ఓ రోజు రాయలవారు, రామకృష్ణుడు కొద్ది మంది అంగరక్షకులు కలిసి మారు వేషాలలో నాగులంబ సత్రానికి వెళ్లారు. సోమరిపోతు బిచ్చగాళ్లంతా అత్యంత సౌకర్యవంతమైన ఆ సత్రంలోనే ఆశ్రయం పొందుతున్నారు. రామకృష్ణుని ఆదేశం పై వందల కొద్దీ ఎండుగడ్డి మోపులు తెల్లారేసరికల్లా అక్కడికి చేర్చబడ్డాయి. మారు వేషాలలో వున్న అంగరక్షకులు ఆ సత్రం ప్రధాన ద్వారం వద్ద ఆ ఎండు గడ్డిని ఒత్తుగా పరచడం మొదలు పెట్టారు. దీన్ని గమనించిన కొందరు బిచ్చగాళ్లు యీ అజ్ఞాత వ్యక్తులెవరో, వీళ్లు యిదంతా ఎందుకు చేస్తున్నారో తెలుసుకొన గోరారు. ఇంతలో మారు వేషంలోనున్న రామకృష్ణుడు బిగ్గరగా అరుస్తూ, "మిత్రులారా! సత్రంలోని వాళ్లంతా శ్రద్ధగా వినండి. ఇప్పుడే భయానకమైన ఓ పెద్ద నల్ల త్రాచుపాము సత్రంలోకి ప్రవేశించింది. దాన్ని ఎలాగైనా బయటికి రప్పించడానికి మేం మంట, పొగ ఏర్పాటు చేశాం. అది మిమ్మల్ని కరిచిందో - యిక మీ పని అంతే! కాబట్టి ముందు మీ ప్రాణాలు కాపాడుకోండి" అని కేకలు వేశాడు.

దాంతో యిక సత్రంలోని కన్నూ, కాలూ, చెయ్యీ బాగున్న వాళ్లంతా ఒకరినొకరు పడదోసుకుంటూ బయటికి పరుగులెత్తారు. అంధులూ, కుంటివారూ, మానసిక వికలాంగులూ, నిస్సహాయులు – జరుగుతున్న దేమిటో తెలియక, తెలిసినా తప్పుకోలేక లోపలే ఉండిపోయారు. కాసేపటికి గొడవ సద్దుమణిగింది. మంటలు ఆరిపోయాయి. పరుగెత్తు కుంటూ బయటికి వచ్చినవాళ్లు లోపల నల్లుత్రాచు వున్నదనేది కేవలం పుకారు అని గ్రహించి తిరిగి లోనికి వెళ్లే ప్రయత్నం చేశారు. అప్పుడు మారు వేషాలలో వున్న రాజభటులు వారిని అటకాయించారు. తాము పరుగు పరుగున బయటికి రావడం రాయలవారు, రాజోద్యోగులు మారు వేషాలలో వుండి గమనించారని తెలుసుకున్న ఆ సోమరి పోతు బిచ్చగాళ్లు భయంతోనూ, సిగ్గుతోనూ కుంచించుకు పోయారు. వారితో రామకృష్ణుడిలా అన్నాడు హెచ్చరికగా, "సోమరి వెధవల్లారా! రాజుగారి ఔదార్యం, ప్రజల ధర్మబుద్ధిని ఆధారం చేసుకుని మీరు సోమరిపోతులుగా మారారు. అవయవాలన్నీ సరిగా వున్న వాళ్లైన మీరు యీ రోజు నుంచీ కష్టపడి పనిచేస్తేనే యీ రాజ్యంలో వుండగలుగుతారు. లేకుంటే రాజ్య బహిష్కార శిక్ష విధించబడుతుంది. నేటి నుంచి బుద్ధిగా ఏదో ఒక పని చేసుకుని సంపద సృష్టించడంలో మీరూ పాలు పంచుకోండి. సోమరులకు యీ రాజ్యంలో స్థానం లేదు. అవయవాలన్నీ బాగుండి బిచ్చమెత్తుతున్న వాడెవడు కనుపించినా నేటి నుండి రాజ్య బహిష్కార శిక్షకే గురౌతారు. బాగా ఆలోచించుకుని ఒళ్లు దగ్గర పెట్టుకుని మసలుకోండి".

రామకృష్ణుని యుక్తికీ, సమయస్ఫూర్తికీ రాయలవారు అతడి నెంతగానో మెచ్చుకున్నారు.

## 26. దేవిడీ మనా

తెనాలి రామకృష్ణుడు తాను చేసిన చిలిపి చేష్టలు, దుందుడుకు పనులు వగైరాలతో ఎన్నో సార్లు తన ప్రాణాల మీదికి తెచ్చుకున్నాడు. రాయలవారికి ప్రీతి పాత్రుడైన ఆంతరంగికుడూ, ఆస్థాన విదూషకుడూ అయినప్పటికీ రామకృష్ణుడు తరచు రాయలవారి ఆగ్రహానికి గురయ్యేవాడు. రాయలవారు స్వభావ రీత్యా వున్నట్టుండి కోపోద్రిక్తుడయ్యే తత్త్వం కలవాడని చరిత్ర కారులంతా వ్రాశారు. ఇక రామకృష్ణుడంటారా – తాను చేసే దుందుడుకు చేష్టలకు ఎదుటి వారి మనస్సులెంతగా గాయపడతాయో ఆలోచించనంతటి మూఢత్వంతో కూడిన సూటితనమున్నవాడు. ఆ కారణంగానే ఆయన రాయలవారిచే తరచు దండనలకు గురయ్యేవాడట. రెండు పర్యాయాలు మరణ దండనకు కూడా గురైనా, ఎలాగోలా ఆ దండనల నుంచి తప్పించుకున్నాడు. అదెలా జరిగిందో వేరొక తావులో వివరించాను. ఇక స్వల్ప దండనలకైతే లెక్కేలేదు. అలాంటి స్వల్ప దండనల లోనిదే 'దేవిడీ మనా'. 'దేవిడీ మనా' అంటే రాజ ప్రాసాదం నుంచి బహిష్కరణ. దోషికి ఒక పరిమిత కాలం పాటు రాజ ప్రాసాదంలో అడుగిడరాదనీ, తనకు ముఖం చూపరాదనీ, రాజు విధించే శిక్ష యిది. రాయలవారు తాతాచార్యుల వారినో, భట్టుమూర్తినో, ధూర్జటినో, కవయిత్రి మొల్లనో, చింతలపూడి ఎల్లన (రాధామాధవ కవి)నో మెచ్చుకుంటుంటేనో, సన్మానిస్తుంటేనో అది చూసి ఓర్చుకోలేక తెనాలి రామకృష్ణుడు వాటి ఔచిత్యాన్ని ప్రశ్నించాడనీ, ఆ యా కవులను అవహేళన చేశాడనీ, ఆ యా సందర్భాలలో 'రాజ ప్రాసాద బహిష్కరణ' శిక్షకు గురయ్యాడనీ ఎన్నో ఉదంతాలున్నాయి. అయితే బరితెగించి రామకృష్ణుడు ఓసారి రాయలవారి అంతఃపుర రహస్యాన్నే తన వింత ప్రవర్తన ద్వారా విజయ నగరమంతా పొక్కేటట్లు చేశాడని జనం చెప్పుకునే ఓ కథ వుంది. బహుళ ప్రాచుర్యంలో వున్న యీ కథనే తిరుమల రామచంద్ర గారు తమ 'హంపీ నుంచి హరప్పా దాక' అన్న గ్రంథంలో 'తెనాలి రామన మంటప' అనే శీర్షికన వివరించారు.

హంపి విజయనగరంలోని అంతఃపుర రహస్యాలు బయటి వారికి ఓ పట్టాన అంతు చిక్కేవి కావు. ఏడు నగళ్లు దాటితేనే కాని వైకుంఠవాసుడిని చూడలేమన్నట్లు ఆ రోజులలో విజయనగరంలో కూడా రాయలవారిని చేరాలంటే సప్త

ప్రాకారాలూ దాటి తీరాల్సిందే. ఆయన సముఖం లభించడం అంతంత మాత్రపు వారికైతే జీవిత కాలంలో నెరవేరని స్వప్నం! నాటి సంక్షుభిత రాజకీయ పరిస్థితులూ, బహమనీ సుల్తానుల కుట్రలు, కుహకాల కారణంగా రాయల వారి భద్రత అంత కట్టుదిట్టంగా వుండేది. ఇన్ని జాగ్రతలు తీసుకుంటూ వుండినా, అడుగడుగునా రాయలవారి వేగుల వాళ్లు అప్రమత్తంగా వ్యవహరిస్తూండినా, శత్రు రాజ్యాల గూఢచారులు ఎలాగోలా కూపీలు లాగి అంతఃపుర రహస్యాలు తెలుసుకుంటూనే వుండేవారట. ఈ కారణంగా విజయనగర పాలకులు అంతఃపుర రహస్యాల గోపనీయత విషయంలో అత్యంత కట్టుదిట్టంగా వ్యవహరించేవారట. సహజంగానే స్వేచ్ఛా ప్రియుడైన రామకృష్ణుడికి యీ నియమనిబంధనలు, కట్టుబాట్లు నచ్చేవి కావు. ఇవి రామకృష్ణుడికి కొంచెం 'అతి' గా అనిపించేవి కాబోలు! అయినా రక్షణ అవసరాల రీత్యా ఆ నియమాలు తప్పనిసరి. తనకు నచ్చకపోయినా బహిరంగంగా రామకృష్ణుడు ఈ నియమాలను ఖండించలేదు. వాటిని ఉల్లంఘించలేదు. అందుకే రామకృష్ణుడు తెలివిగా యీ గోపనీయతా నిబంధనలను సున్నితంగా వెటకారం చేస్తూ అందరి దృష్టినీ ఆకర్షించాడు. అదెలాగో – ఆ గమ్మత్తైన ఉదంతమేమిటో యిప్పుడు చూద్దాం.

అవి రామకృష్ణ కవికి హంపిలో సభా ప్రవేశం లభించిన తొలిరోజులు. అప్పటికింకా ఆయన రాయల వారి ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకడు కాలేదు. అయితే కేవలం అల్లసాని పెద్దన గారి శిష్యుని గానే కాక, హాస్యోక్తులు విసరడంలో నేర్పరిగానూ, తెలివిగా చిక్కు సమస్యలను పరిష్కరించడంలో నిపుణునిగానూ అతడప్పటికే పేరు పొందాడు. అప్పటికే ఒకటి రెండు మార్లు రాయలవారి దృష్టిని ఆకర్షించిన రామకృష్ణుడి ధైర్యం రాయలవారికి కూడా ఆశ్చర్యం కలిగించేదట. సభలో రాయల వారికి వినబడేటంత బిగ్గరగా మన రామకృష్ణయ్య తరచుగా హాస్యోక్తులు విసరడం, అవి విన్న రాయల వారు ఓర చూపుతో ఆ నూనూగు మీసాల యువకుడిని మెచ్చుకోవడం జరిగేవట. ఒకటి రెండు సందర్భాలలో రామకృష్ణుడు తన ఆశు కవిత్వం ద్వారా కూడా రాయలవారిని ఆకట్టుకోగలిగాడట.

ఒకసారి రాయల వారు అంతఃపురంలో ఏకాంతంగా రెండవ భార్య చిన్నాదేవితో మాట్లాడుతున్నారట. మరి రాయల వారికి అప్పుడు ఆ చిలుకల కొలికి పలుకులు ముద్దొచ్చాయో ఏమో – ఉన్నట్టుండి ఒక్కసారిగా ఆమెను ముద్దుపెట్టుకుందామని ముందుకు వంగారట. సరిగ్గా అదే సమయంలో 'హా....ఛ్' అంటూ ఆమె పెద్దపెట్టున రాయల వారి ముఖానే తుమ్మిందట. ఏం చేస్తుంది మరి పాపం ? తుమ్మును ఎవరమైనా ఆపుకోలేం కదా ! ఆ వెధవ తుమ్ము సరిగ్గా అప్పుడే వచ్చింది. రసాభాసమై రాయలవారు మనస్సు విరిగి అక్కడి నుంచి లేచి విసవిసా వెళ్లిపోయారట.

"అయిందేదో అయింది. రాయలవారు యీ రోజు కోపంగా వెళ్లిపోయినా రేపు మరల రాకపోరు. కానీ ఆ తుమ్ము కారణంగా యీ చిన్న భార్య మీద ఆయనకు కలిగిన యీ వైరస్యము (వెగటు) విషయం నలుగురికీ తెలిసి పోతే ! ఇంకేమైనా వుందా ? రాయలవారి ముద్దుల భార్యగా యీ చిన్నాదేవికున్న పేరు ప్రఖ్యాతుల గతేంకాను? కనుక, ఏ పరిస్థితులలోనూ యీ సంగతి బయటకు పొక్కకూడదు." – యిలా సాగాయి రాణీ చిన్నా దేవి ఆలోచనలు. అందుకే ఆమె అప్పటికప్పుడే తన దాసీలందరికీ హెచ్చరికలు జారీ చేశారు. ఈ తుమ్ము ఉదంతం – ముఖ్యంగా రాయల వారికి తనపై వెగటు కలిగి వెళ్లిపోయిన సంగతి – ఎట్టి పరిస్థితులలోనూ బయటకు పొక్కరాదని ఆవిడ హుకుం చేశారు. అయితే ఆడదాని నోట్లో నువ్వు గింజ నానదని సామెత. దాసి కూడా ఆడదే కదా మరి ! అక్కడ పని చేసే ఓ దాసి అక్కడ జరిగింది జరిగినట్లు తన కూతురుకు వివరించిందట, "మళ్లీ ఎవరితోనైనా అనేవు. రహస్యం సుమా ! యిది బయటకు పొక్కితే మన ప్రాణాల మీదకు వస్తుంది," అంటూ. ఆ కూతురేమో తెనాలి రామకృష్ణుని యింట్లో దాసిగా పనిచేస్తున్నదట. తెలిసీ తెలియని ఆ పిల్ల ద్వారా విషయమంతా తెలివిగా రాబట్టాడు రామకృష్ణుడు. కాస్త అలజడి రేపి, గొడవ చేసి నలుగురి దృష్టిలో

పడడానికి అతడికి మంచి అవకాశమే దొరికినట్లయింది. సభా ప్రవేశం చేసిన తొలినాళ్లలో రామకృష్ణుడి ఆలోచనంతా నలుగురి దృష్టినీ – ముఖ్యంగా రాయలవారి దృష్టిని ఎలా ఆకర్షించాలా – అనే. ఈ అవకాశం అంది పుచ్చుకున్నట్లు బాగానే దొరికింది. ఇకనేం – అందరినీ కవ్వించి, నవ్వించడానికీ, అలా అందరినీ ఆకట్టుకొనడానికీ తెలివిగా ఓ పథకం వేశాడు.

వెంటనే తన గుర్రం మూతిని ఎర్రటి గుడ్డతో గట్టిగా బిగించి కట్టి, చేతితో ఓ బెత్తం పట్టుకుని, దాంతో ఆ గుర్రాన్ని చావ బాదుతూ రాచనగరుకేసి వడివడిగా బయలుదేరాడు. ఈ చోద్యం చూస్తున్న జనమంతా విస్తు పోయారు "ఏమిటిది అయ్యావారూ ? ఎందుకు మీ గుర్రాన్నలా హింసిస్తున్నారు ? దాని మూతికి ఆ ఎర్రటి గుడ్డనలా బిగించి కట్టారెందుకు ?", అని అడిగారు జనసామాన్యంలోని కొందరు. దానికతడు గుట్టుగా, "నా వెధవ గుర్రానికి అంతఃపుర రహస్యమొకటి తెలిసిపోయింది. నేను వినేటప్పుడు అదీ వినేసింది. నేనంటే రాజభక్తీ, రాజశాసనం పట్ల గౌరవమూ కలిగిన వాడిని. నా ప్రాణం పోయినా ఆ అంతఃపుర రహస్యాన్ని బహిర్గతం చేయనుగాక చేయను. నా గుర్రమేమో ఉచితానుచితాలు తెలియని మొద్దు. ఆ పరమ రహస్యాన్ని యిది ఎక్కడైనా సకిలించేస్తుందేమోనని నా భయం. అందుకే దాని మూతికిలా గుడ్డ బిగించి కట్టాను," అన్నాడు. కొద్ది సేపట్లోనే రాచ నగరంతా యీ వార్తతో అట్టుడికి పోయింది. "ఏదో ముఖ్యమైన అంతఃపుర రహస్యం తెనాలి రామకృష్ణుడికి తెలిసిపోయింది. ఏమిటా రహస్యం ?" అంటూ జనం ఒకటే గుసగుసలు. ఎలాగైతేనేం – యీ సంగతి రాజుగారి చారులకు తెలిసిపోయింది. వారు నిజాన్ని నిర్ధారించుకొనడానికి అతడి దగ్గరకు వచ్చి విషయమేమిటని అడిగారు. రాయల వారి ఆంతరంగికులైన ఆ వేగుల వారి ద్వారా తాను చేరాలనుకున్న చోటికే యీ వార్త చేరగలదని లోలోపల సంతోషిస్తూ, పైకి మాత్రం భయం నటిస్తూ, ఆ చారులతో రామకృష్ణుడు, "అబ్బే. ఏంలేదండీ ! రాత్రి రాణీ చిన్నాదేవి గారితో రాయల వారు ఏకాంతంలో వుండగా వున్నట్టుండి ఆవిడ గారు పెద్దపెట్టున తుమ్మారట. వెంటనే వెగటు చెంది రాయల వారు అక్కడి నుంచి విసవిసా వెళ్లిపోయారట. ఇది మరి అంతఃపుర రహస్యం కదండీ ! బయటకు పొక్కరాదు కదండీ ! ఈ రహస్యం యీ వెధవ గుర్రానికి కూడా తెలిసి పోయింది. నేను వినేటప్పుడే అదీ వినేసింది. ఈ తెలివిమాలిన గుర్రం ఎక్కడైనా ఆ రహస్యాన్ని సకిలించేస్తుందేమోనని దాని మూతికి గుడ్డ బిగించి కట్టాను. నేనైతే ప్రభు భక్తితో ఏ రహస్యం తెలిసినా కిమ్మనకుండా నా నోరు నొక్కేసుకోగలను. కాని యీ పనికిమాలిన గుర్రం ఎక్కడైనా సకిలిస్తే, గుట్టు బయటపడి కొంప మునుగుతుందేమోనని నా భయం. అయినా కవిత్వం చెప్పుకుని బతికే మా బోటి వారికి రాణుల సంగతులెందుకండీ ? గురువు గారికి తెలిస్తే యింకా ఏమైనా వుందా ?" అన్నాడట.

రాయల వారికి తమ చారుల ద్వారా యీ కబురు చేరింది. రాత్రి అంతఃపురంలో ఏకాంతంలో జరిగిన యీ స్వల్ప విషయం రామకృష్ణయ్య ద్వారా రాచనగరు మొత్తం చాటింపు కావడం ఆయనకెంతో బాధ కలిగించింది. అయితే రామకృష్ణుడు యీ అంతఃపుర రహస్యం బయటకు పొక్కేట్లు చేయడానికి ఎంచుకున్న మార్గం – ఆ గుర్రానికి మూతి బిగించి, దానిని చావ బాదడం – నచ్చి ఆయన ముసిముసిగా నవ్వుకున్నారట. అయినా యింత రగడ చేసిన రామకృష్ణయ్యను ఊరకే విడచి పెట్టకూడదని భావించి వెంటనే రామకృష్ణయ్యకు 'దేవిడీ మనా' శిక్ష విధించి, అతడిక తనకు ముఖం చూపించడానికి వీల్లేదని హుకుం చేశారట రాయలవారు. ఇంకేం – తాతాచార్యుల వారూ, భట్టుమూర్తి తదితరులకు రాయలవారి నిర్ణయం భలే ఆనందాన్ని కలుగచేసింది.

రాయలవారి ఉత్తర్వులు రామకృష్ణునికి అందాయి. ఆయన మిన్నకుండిపోయాడు – తిరిగి రాయలవారి ఆదరణ పొందడానికి తగిన అవకాశం రాకపోతుందా – అనుకుంటూ. అలా కొన్ని రోజులు గడిచాయి. ఓ రోజు రాయల వారు సభా మండపానికి తరలి వెళ్తున్నారు. వెళ్లే దారిలో రహదారికి కొద్ది దూరంలో వున్న ఓ నాలుగు స్తంభాల రాతి మంటపం

పైన ఓ వ్యక్తి రాయల వారు విజయం చేస్తున్నారనే స్పృహైనా లేకుండా అర్ధనగ్నంగా లెక్కలేనట్లు అవతలి ప్రక్కకు తిరిగి కూర్చున్నాడు. అతడి వీపుపై పెద్ద పెద్ద నామాలున్నాయి. అదాటున యీ దృశ్యాన్ని చూసిన రాయలవారు నివ్వెరపోయారు. రామకృష్ణుడిని పోల్చుకోలేక పోయిన ఆయన, "ఈ రాజ్యంలో – అందునా రాజధానిలో – మంత్రి, సామంత, వందిమాగధ, సేనానాయక సమేతంగా తాను సభకు విజయం చేస్తూంటే ఏమాత్రం లెక్కలేనట్లు అర్ధ నగ్నంగా అవతలికి తిరిగి కూర్చున్న యీ అపరిచిత వ్యక్తి ఎవరు ?" అన్న సందేహం రాయల వారికి కలిగింది. వెంటనే ఆయన ఆ అజ్ఞాత వ్యక్తికేసి వేలుచూపి, "అతడు విజయనగర పౌరుడు కాదా? అతడి వీపుపై ఆ నామాలేమిటి ? వెంటనే అతడిని నా ముందు హాజరు పరచండి." అని తన సేనానులను ఆదేశించాడు. అప్పటికప్పుడు కొందరు భటులు వెళ్లి రాయల వారి ఆజ్ఞను తెలిపి రామకృష్ణుడిని రాయల వారి వద్దకు రమ్మన్నారు. అతడు వారితో, "రాయల వారు నన్ను ముఖం చూపించవద్దన్నారుగా. అందుకే వెనక్కి నడుస్తూ, వీపు చూపిస్తూ వస్తాను. కొంచెం ఆలస్యమౌతుంది. త్వరగా రమ్మని నన్ను బలవంత పెట్టొద్దు." అన్నాడు. అలాగే వెనక్కు అడుగులేస్తూ వీపు చూపిస్తూ మెల్లగా రాయల వారి సమక్షానికి వచ్చాడు రామకృష్ణయ్య. రాయలవారి వెంట వున్న మంత్రి, సామంత, వందిమాగధ, సేనా నాయకులంతా యీ దృశ్యం చూసి నవ్వు ఆపుకోలేక నోటికి చేతులు అడ్డంగా పెట్టుకున్నారు. రాయల వారికీ రామకృష్ణుని అవతారం చూసి పొట్టచెక్కలయ్యేట్లు నవ్వు వచ్చినా, ఆపుకుని, గంభీర ముద్రతో, "యువకవి గారూ ! ఇటు తిరగండి. పరవాలేదు. నాకు వీపు చూపనక్కరలేదు." అన్నారట. అప్పుడు రామకృష్ణుడు "మహా ప్రభో ! అత్యంత పరాక్రమ వంతులైన శత్రు రాజులే తమ ధాటికి వీపు చూపుతూండగా, నేనేపాటి ?" అని అవతలవైపు నుండే మనవి చేశాడట, యిటు తిరుగకుండా. దాంతో రాయలవారు లాలనగా, "వెన్ను చూపడం ఓడిన శత్రువుల పని – ఓటమి ఎరుగని కవుల పని కాదు. కనుక మీరు వెనక్కు తిరగొచ్చు, రామకృష్ణయ్యా !" అన్నారట. రామకృష్ణుడు చటుక్కున వెనక్కి తిరిగి రాయల వారికి అభివాదం చేశాడట. ఆయన శరీరం పైన ద్వాదశ ఊర్ధ్వ పుండ్రాలు (పన్నెండు పంగనామాలు) వున్నాయట. అక్కడి వారంతా జరిగిన దానికి పెద్దగా నవ్వేశారట. రాయల వారు కూడా మిగిలిన వారితో శృతి కలిపారట.

రాయల వారు సభా మంటపానికి వెళ్లే రహదారికి కొంచెం దూరంగా వున్న ఆ నాలుగు స్తంభాల రాతి మంటపం హంపిలో నేటికీ 'తెనాలి రామకృష్ణుని మండపం' అనే పేరుతో పిలువబడుతున్నదనీ, యీ ఏకశిలా మండపాన్ని తెనాలి రామకృష్ణుడే నిర్మింపజేశాడని స్థానికులు చెపుతారనీ నేను 'చరిత్ర చిక్కుముడి' అన్న అధ్యాయంలో పేర్కొన్నాను. ఈ మండపంపై మరిన్ని వివరాల కోసం ఆ అధ్యాయం చూడండి.

# తెనాలి రామకృష్ణ కవి - శాస్త్రీయ పరిశీలన

## చరిత్ర చిక్కుముడి

ప్రముఖులైన వ్యక్తులందరి చరిత్రలూ వివాదాస్పదంగానే వుంటాయి. ప్రముఖ కవుల చరిత్రలూ యిందుకు మినహాయింపేం కాదు. ఓ భాషకు చెందిన కవి ప్రసిద్ధికెక్కితే ఆ గౌరవమంతా వాస్తవానికి ఆ భాషకూ – ఆ భాష మాట్లాడే వారందరికీ దక్కాలి. అయితే ఆ ప్రశస్తినంతా తామే స్వంతం చేసుకోవాలని ఒక మతంవారో, కులంవారో, లేక ప్రాంతంవారో సహజంగానే యత్నిస్తారు. విపరీతమైన స్వపక్షాభిమానంతో ఆ ప్రసిద్ధ కవి తమ కులంవాడనో, తమ మతం వాడనో లేక తమ ప్రాంతం వాడనో నిరూపించదానికి, అవసరమైతే చరిత్రను వక్రీకరించదానికి కూడా వారు వెనుదీయరు. ఫలితంగా కవుల చరిత్రలకు చేయబడిన యీ తరహా వక్రీకరణలు ఎన్నెన్నో !

## భక్త కవులు

పౌరాణిక యుగంలో ప్రముఖుల పుట్టుకలకు సంబంధించిన కథలన్నీ మార్మికతతో కూడుకొని దురవగాహమైన, అశాస్త్రీయమైన అంధవిశ్వాసాలతో ముడిపెట్టబడ్డాయి. చారిత్రక యుగంలోనూ అదే ఒరవడి కొనసాగింది. శ్రీవిల్లిపుత్తూరుకు చెందిన విష్ణుచిత్తుడు లేక పెరియాళ్వారు తనకు తులసివనంలో దొరికిన బిడ్డకు 'ఆండాళ్' అని పేరు పెట్టి పెంచుకున్నాడు. ఎవరో కన్న యీ 'అవాంఛిత సంతానా'న్ని ఆ వనంలో వదలి వెళ్లివుంటారు. పెరియాళ్వార్ పెంపకంలో ఆమె ప్రముఖ ఆళ్వారుగా రూపొంది 'తిరుప్పావై' అనే దివ్య ప్రబంధాన్ని రచించిన అనంతరం, ఆమెను కన్న తల్లిదండ్రులెవరో తెలియదు కనుక, ఆమె 'అయోనిజ' అనే కథలు పుట్టుకొచ్చాయి. పౌరాణిక యుగంలో, మిథిల నేలిన

జనక మహారాజుకు 'భూమిలో దొరకిన' సీత కథకేమాత్రం తీసిపోయేది కాదీ ఆండాళ్ జన్మవృత్తాంతం. అలాగే భాగవతోత్తముడు, సుప్రసిద్ధ హిందీ భక్తకవి కబీర్‌దాస్ జన్మ వృత్తాంతం కూడా చరిత్రలో వివాదాంశమైంది. ఎవరో కని అక్రమ సంతానమని వారణాశిలోని లహర్ చెరువు వద్ద ఒక కుప్పతొట్టిలో పారవేస్తే, పేద ముస్లిం నేత కార్మికులైన 'నీరూ', 'నీమా' అనే దంపతులు ఆ బిడ్డను చేరదీసి, 'కబీర్' అని పేరుపెట్టి పెంచుకున్నారు. అనంతరం రామానందుని శిష్యరికంలో అతడు గొప్ప వేదాంతిగానూ, కవిగానూ రూపొంది 'దోహాలు' అనే ద్విపదలు, రమైనీలు, సాఖీలు రచించి వాటి ద్వారా భక్తి ప్రబోధం చేయడమే కాక సామాజిక దుర్నీతిని ఎండగట్టాడు. తాను ఏర్పరచిన 'పంథ్'లనే సంస్థల ద్వారా సాంఘిక విప్లవానికి పాటుపడ్డాడు. అతడు ప్రసిద్ధుడైన తరువాత కొందరేమో ఆయన తల్లి ఓ బ్రాహ్మణ వితంతువనీ, అందుకే అక్రమ సంతానమైన ఆ శిశువును ఆమె కుప్పతొట్టిలో పారవేసిందనీ, ఆ కారణంగానే ముస్లింల యింట పెరిగినా ఆయనకు హైందవ సంస్కారం జన్మతోడనే అబ్బిందనీ వాదిస్తూండగా, కొందరేమో సాక్షాత్తూ శ్రీకృష్ణుడే అయోనిజునిగా ఆయన రూపుదాల్చి అవతరించాడంటున్నారు. (కబీర్ వాస్తవంగా కూడా శ్రీకృష్ణుడి వేషధారణే - అంటే శిగలో నెమలి పింఛం, చేతిలో వేణువూ ధరించేవాడంటారు.) క్రీ.శ. 1488 నుండి 1517 వరకు ఢిల్లీని పాలించిన సికందర్ లోడీ యొక్క గురువైన షేక్ తక్కీని కబీర్ ఎన్నో మతపరమైన చర్చలలో ఓడించాడట. షేక్ తక్కీ మరియు ఇరవై ఒక్క మంది పీర్లతో కబీర్ జరిపిన సంవాదాల గురించి ఎన్నో కథలు ప్రచారంలో వున్నాయి. ఇవన్నీ నిజమని విశ్వసిస్తే కబీర్ రామానందుని శిష్యుడు కావడానికి వీలు లేదు. ఎంచేతనంటే రామానందుడు క్రీ.శ. 1298లో జన్మించి క్రీ.శ. 1411లో మరణించాడని చరిత్రకారులచేత ధృవపరచబడింది. కబీర్‌కూ ఆయన భార్య లోయీకీ కమాల్ అనే కొడుకూ , కమాలీ అనే కుమార్తె కలిగారు. కబీర్ క్రీ.శ. 1398లో జన్మించి క్రీ.శ. 1518లో సరిగ్గా 119 సంవత్సరాల, 5 నెలల, 27 రోజులకు మరణించాడని కొందరూ, ఆయన క్రీ.శ. 1440లో పుట్టి 78 ఏళ్ళు జీవించి క్రీ.శ. 1518లో మరణించాడని యింకొందరూ విశ్వసిస్తున్నారు. గోరఖ్‌పూర్ జిల్లాలోని మాఘర్ అనే చోట ఆయన మరణించినప్పుడు ఆయన శవాన్ని హిందూ పద్ధతిలో దహనం చేయాలా లేక ఇస్లామిక్ పద్ధతిన ఖననం చేయాలా - అని హిందూ, ముస్లిం భక్తుల మధ్య వివాదం చెలరేగిందట. అనంతరం వారు ఆయన శవంపైన కప్పబడిన గుడ్డను తొలగించి చూస్తే అక్కడ శవం స్థానంలో ఓ పూల గుట్ట కనుపించిందట! దానిలో సగాన్ని తీసుకుని ముస్లింలు మాఘర్‌లోనే వాటిని ఖననం చేసి అక్కడ ఓ సమాధి నిర్మించగా, హిందువులు మిగిలిన సగం పూలనూ వారణాశికి తీసుకెళ్లి దహనం చేశారట ! ఇక తిరిగి ఆండాళ్ విషయానికొస్తే ఆమె 'అయోనిజ' అని నమ్ముతున్నారు కనుక ఆవిడ అందరిలా ఏ తల్లిదండ్రులకో పుట్టలేదని భక్తుల విశ్వాసం. ఆమె రంగనాధునిలో సజీవంగా లీనమైందని నమ్ముతున్నారు కనుక ఆమె అందరిలా మరణించలేదు కూడానట! ఇలా భక్తకవులైన ఆండాళ్‌నూ, కబీర్‌నూ ప్రజలు దైవాంశ సంభూతులుగా మార్చేశారు కనుకనే వారి జన్మ వృత్తాంతాలూ, మరణ వృత్తాంతాలూ కూడా దేవతల వృత్తాంతాల వలె ఎటువంటి శాస్త్రీయతా లేని అంధ విశ్వాసాలతో ముడిపెట్టబడ్డాయి.

## మహాకవి కాళిదాసు పై వివాదం

మహాకవి కాళిదాసు ఏ కాలానికి చెందినవాడై వుంటాడనే విషయం మీద కూడా చరిత్రకారుల్లో ఎన్నో భేదాభిప్రాయాలున్నాయి. ఈ విషయంలో అభిప్రాయ భేదం ఎంత తీవ్రంగా వున్నదంటే - వివిధ చరిత్రకారులు ఆయనకు సంబంధించి చేసిన కాల నిర్ణయంలో అతి తీవ్ర వ్యత్యాసాలు చోటుచేసుకున్నాయి. ఆయన క్రీ.పూ. 8వ శతాబ్దికి చెందినవాడని కొందరు విమర్శకులు పేర్కొంటుంటే కొందరు ఆయన క్రీ.శ. 11వ శతాబ్దంలో ధారానగరాన్ని (ఉజ్జయినిని) పరిపాలించిన

భోజరాజు ఆస్థానకవి అని పేర్కొంటున్నారు. అయితే భోజరాజు ఆస్థానంలోని ప్రసిద్ధ కవికి 'కాళిదాసు' అనేది బిరుదనామమే కాని, ఆయన 'మహాకవి కాళిదాసు' మాత్రం కాదు. ఈ విషయంపై ఎన్నో వాదోపవాదాలు సాగుతున్నా, ఆయన కావ్యాల్లోనూ, నాటకాల్లోనూ వర్ణించబడిన వ్యక్తులు, అంశాలు, ప్రాంతాల వివరాలు వగైరాలను బట్టి ఆయన క్రీ.పూ. 150 ప్రాంతానికి చెందినవాడని హెచ్చుమంది విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. ఆయన బెంగాలుకు చెందినవాడని భావించే బెంగాలీలు ముర్షిదాబాద్ జిల్లాలోని గడ్డాసింగార్‌లో కాళిదాసు జన్మించాడని ఏటా అక్కడ జయంతి ఉత్సవాలు కూడా నిర్వహిస్తున్నారట కాళిదాసు తన రచనల్లో హిమాలయాలను విస్తారంగా వర్ణించాడు కనుక ఆయన కాశ్మీర్‌కు చెందినవాడని కొందరి వాదన అయితే హెచ్చుమంది విమర్శకులు ఆయన మధ్యభారతానికి చెందిన విదిశ, విదర్భ, ఉజ్జయిని, మాళ్వాల మధ్య ప్రాంతానికి చెందినవాడని నమ్ముతున్నారు. కాళిదాసు గొల్లవాడా లేక మొదట విదేశీయులై తరువాత భారతదేశంలోని మాళ్వ ప్రాంతంలో స్థిరపడిన 'ఆభీర' జాతికి చెందినవాడా అనే విషయమై కూడా వాదోపవాదాలున్నాయి.

'ఆభీర' అంటే సంస్కృతంలో 'బాగుగా భయపడేవాడు' అని అర్థం వీరు పశుపాలనే వృత్తిగా కల ఓ సంచార జాతి మధుర నుంచి ద్వారక వరకు గల ప్రాంతంలో వీరు నివసించేవారు. వృష్ణి, యాదవుల మూలపురుషుడైన 'యదువు' ఆభీర సంతతికి చెందిన వారేనని కొందరి విశ్వాసం. మన ప్రాచీన సాహిత్యంలో ఆభీరులు పంజాబు ప్రాంతంలో నివసించిన మ్లేచ్ఛులనీ, దొంగతనం వృత్తిగా కలవారని వర్ణించబడ్డారు విష్ణు పురాణం వీరిని అపరాంత (కొంకణ తీరం) లోనూ సౌరాష్ట్రం (గుజరాత్)లోనూ స్థిరపడిన విదేశీ జాతిగా వర్ణించింది. ఒకప్పుడు గుంపులు గుంపులుగా వీరు విదేశాల నుంచి వలసవచ్చి భారతదేశంలో స్థిరపడ్డారట. వీరినే యిప్పుడు 'ఆహిర్'లనీ, 'అహిర్'లనీ అంటున్నారు (స్థానికులైన గోపాలురు లేక గొల్లవారికీ వీరికీ ఎన్నో విషయాలలో తేడాలున్నాయి. మన రాష్ట్రంలో స్థానికులైన గోపాలురను 'పూని గొల్లలు' లేక పూజ గొల్లలు' అని పిలుస్తూండగా, 'అహిర్'లను ఎర్ర గొల్లలు అంటున్నారు. 'అహిర' శబ్దమే 'అయిర'గా పలుకబడి క్రమంగా అదే 'ఎర్ర'గా రూపాంతరం చెంది వుంటుంది.) ఆభీరులు భారతదేశంలోకి క్రీ శ. 1వ శతాబ్దంలో వలస వచ్చారట. ఆభీరులు వస్తూ వస్తూ బాలయేసు లీలలూ, మహిమలకు సంబంధించిన కథలు, తండ్రి కాకున్నా యేసును జోసెఫ్ పెంచడం, హేరోదు రాజు చేసినట్టి అమాయక శిశువుల ఊచకోత వగైరా గాధలనూ క్రీస్తు అనే పేరునూ బయటి నుంచి భారత దేశంలోకి తీసుకు వచ్చారు. వారి క్రీస్తే కృష్ణుడనే దైవంగా రూపొందాడు వారి పూర్వపు విశ్వాసాల పునాదిపైనే వాసుదేవ కృష్ణుడనే దేవుడు, అతనికి సంబంధించిన కథలు ఏర్పడ్డాయి. ఆభీరుల 'క్రీస్తు' శబ్దమే సంస్కృతంలో కృష్ణ శబ్దానికి మూలమట. గోవన్లు, బెంగాలీలు కృష్ణుడిని నేటికీ 'కుష్టో' లేక 'క్రిస్టో' అనే పిలుస్తారట బాలయేసు గాధలే బాలకృష్ణుని కథలయ్యాయట ఈ బాలుడు తనకు పుట్టిన వాడు కాదని జోసెఫ్‌కు తెలిసినట్లే, నందుడికి కృష్ణుడు తన బిడ్డ కాదని తెలుసు. ఈ రెండు గాధలలోనూ ఒక కారణ జన్ముడి కారణంగా తమ పాలనకు ముప్పు వస్తుందని భావించిన నియంతలు ఆ కారణ జన్ముడెవరో మాత్రం కనుగొనలేక పోయారు అందుకే హేరోదు వలెనే కంసుడూ అమాయక శిశువుల్ని ఊచకోత కోయించాడు. బాలయేసు మహిమలు, లీలలు కొన్ని బాలకృష్ణుని కథల్ని తలపిస్తాయి అంచేత హిందువులచే దశావతారాలలో ఒకటిగా స్వీకరించబడిన వాసుదేవ కృష్ణుడనే భావనకు క్రీ.శ. 1వ శతాబ్దంలో భారతదేశంలోకి వలస వచ్చి స్థిరపడిన ఆభీరులే కారణమన్నమాట. ఆ తరువాత ఆ పాత్రకు స్థానిక తళుకులు అద్దబడ్డాయన్నమాట. విప్లవాత్మకమైన యీ విశ్లేషణ 'వైష్ణవిజం – శైవిజం' అనే తన ఆంగ్ల గ్రంథంలో ఆర్. జి. భండార్కర్ చేశారు. *(Page 53 - 'Vishnavism - Savism' - Rama Krishna Gopal Bhandarkar. Pub : Asian Educational Services, New Delhi, Madras - 1913)*

అయితే కబీర్‌కు 'బ్రాహ్మణుడనే ముద్రవేయడానికి జరిగిన ప్రయత్నం వంటిది కాళిదాసు విషయంలో మాత్రం ఆ స్థాయిలో జరగకపోవడం విశేషం. కొందరు ఆయన పంచగౌడ బ్రాహ్మణుడని వాదిస్తున్నా, దాదాపు విమర్శకులందరూ ఆయన్ని శూద్ర కవిగానే అంగీకరిస్తున్నారు. కాని 1992 జూన్‌లో 'కాళిదాసు మన నియోగుల మూలపురుషుడా ?' అన్న పేరుతో ఓ పరిశోధక వ్యాసాన్ని ప్రచురించారు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి. దానిలో ఆయన కాళిదాసు గుప్త చక్రవర్తియైన

రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుని (క్రీ.శ.. 380-413) కాలం నుండి క్రీ.శ. 455 వరకు వున్న కవియనీ, మేఘదూత కావ్యంలో ఆయన వర్ణించిన రామగిరి నేటి రామ్‌టెక్కేననీ, నందివర్ధన నగరం రాజధానిగా కలిగిన వాకాటక రాజ్యమే విదర్భయనీ, రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుని పనుపున పాటలీపుత్రం నుంచి వచ్చి, కుంతల - వాకాటక రాజైన రెండవ ప్రవరసేనుడి వద్ద కొంతకాలం సంధి విగ్రహకునిగానూ, నిధిపాలుని గానూ, పనిచేసిన కాళిదాసు(రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుని మనుమడైన) రెండవ ప్రవరసేనుని సేతుబంధ కావ్యానికి మెరుగులు దిద్దాడనీ, ఆ తరువాత ప్రవర సేనుని సిఫారసుతో తిరిగి రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుని ఆస్థానంలో ప్రవేశించి అక్కడి నవరత్నాలలో ఒకడై వెలుగొందాడనీ వ్రాశారు. అంతవరకూ బాగానే వుంది. కానీ, మరింత ముందుకు వెళ్లి ఆంధ్ర నియోగి బ్రాహ్మణులందరూ ఒకప్పుడు కుంతల (పూర్వోత్తర కర్ణాటక - *North Eastern Karnataka* )ప్రాంతం నుంచి ఆంధ్ర దేశానికి వచ్చిన వారేననీ, అంతకు ముందర వారు పాటలీపుత్రాన్నుంచి కుంతల - వాకాటక ప్రాంతానికి వలస వచ్చారనీ, వాకాటక రాజ్యమే విదర్భయనీ, తెలుగు బ్రాహ్మణులలోని వెలనాటి వైదికులకు వైదర్భులని (విదర్భకు చెందిన వారని) పేరున్నదనీ, కాళిదాసు సంధి విగ్రహకునిగానూ, నిధిపాలుని గానూ నియమింపబడిన వాడు కనుక ఆయన కవి కాక ముందు రాజ నియోగియనీ, పాటలీపుత్రాన్నుంచి కుంతల - వాకాటక (విదర్భ) రాజ్యానికి వైదికులతో పాటు కొందరు నియోగులు కూడా వలస వచ్చి వుంటారనీ, ములకనాటి బ్రాహ్మణులలో కాళిదాసు యింటిపేరు కలవారు వున్నారనీ, కనుక కాళిదాసు ఆంధ్ర నియోగులకు మూలపురుషుడై వుండే అవకాశం లేకపోలేదనీ పేర్కొన్నారు. ఈ వాదనకు బలం చేకూర్చే మరికొన్ని వివరాలను కూడా ఆయన పేర్కొన్నారు. శైవ మతమవలంబించి బసవేశ్వరుని బోధనలు ప్రచారం చేయడానికి కర్ణాటకం నుంచి వేంగికి వచ్చిన పండిత త్రయము (శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు, శివలెంక మంచన పండితుడు) రాజ నియోగులే ! కాళిదాసు బంధువర్గం వారు వాకాటక - విదర్భ రాజ్యంలో రాజ నియోగులై వుండి, క్రమంగా కుంతల (కర్ణాటక) ప్రాంతంలో కొంతకాలం స్థిరపడి, కన్నడ కావ్య కర్తలుగా వెలుగొంది, పిమ్మట తెలుగుదేశంలో ప్రవేశించి, తెలుగువారై, తెలుగుకవులై, మహా కావ్య నిర్మాతలై వెలుగొందారు. (ప్రాచీనాంధ్ర కావ్య కర్తలు తొంభై శాతం నియోగులే కదా మరి!) విదర్భకు కుండిన నగరము రాజధాని. వెలనాడులో బ్రహ్మకుండి (గుండ్లకమ్మ) నది వుంది. కనుక, విదర్భకూ, మన వెలనాటి వారికీ 'లింకు' వుంది. ఏతావాతా, ఆయన తేల్చినదేమంటే - కాళిదాసు మన ఆంధ్ర నియోగుల మూలపురుషుడని. అయితే ప్రస్తుతానికి మాత్రం హెచ్చుమంది పరిశోధకులు నిగ్గుతేల్చినదేమంటే - కాళిదాసు అసలు బ్రాహ్మణుడే కాదనీ, ఆభీర సంతతికి చెందిన వాడనీ.

ప్రసిద్ధి చెందిన పండితులనూ, కవులనూ తమ ఖాతాలో వేసేసుకొనడం అనే అలవాటు బ్రాహ్మణ పండితులలో అనాదిగా ఆచారంగా వస్తున్నది. ఇందుకు చక్కటి ఉదాహరణ మహాభారతంలోని ధర్మవ్యాధుడనే బోయవాడు. వేట వృత్తిగా కలిగి మిథిలలో నిత్యమూ అడవి పందుల, అడవి దున్నల మాంసాలను విక్రయిస్తూ కూడా ధర్మవ్యాధుడు వేద వేదాంగ విద్యలలో ఆరితేరాడు. సకల ధర్మాల మర్మాలూ అతడికి క్షుణ్ణంగా తెలుసునట. బోయవాడైన అతన్ని మరి తమ ఖాతాలో వేసుకొనడమెలా? అదెలా చేశారో చూడండి. ధర్మవ్యాధుడు పూర్వజన్మలో ఓ బ్రాహ్మణ పండితుడట. ఒకసారి అతడు సరదాకు వేటాడుతూ పొరపాటున ఓ బ్రాహ్మణుడిని గాయ పరచాడట. ఇందుకు కోపించిన ఆ బ్రాహ్మణుని శాపం కారణంగా తరువాతి జన్మలో అతడు ధర్మవ్యాధుడిగా పుట్టాడట. అతడి వేద పాండిత్యానికీ, ధర్మ నిరతికీ అతడి పూర్వ జన్మ వాసనలే కారణమట ! ఇదండీ వరస. ఇటువంటి వాదనల వెనుక వేద విద్యల స్వత్త్వమంతా గుండుగుత్తగా తమకే చెందాలనే బ్రాహ్మణుల తపన, తహతహ

కనుపిస్తాయి. ఈ కారణంగానే అనాదిగా వారు స్వయం కృషితో, కఠోర దీక్షతో పాండిత్యం గడించిన బ్రాహ్మణేతర పండితుల గొప్పతనాన్ని గుర్తించడానికి నిరాకరించారు. ఒకవేళ గుర్తించక తప్పని పరిస్థితులలో పూర్వ జన్మ సిద్ధాంతాలనాశ్రయించి యిలాంటి కథలు సృష్టించి, ఆ పాండిత్యం పూర్వ జన్మలో సదరు పండితుడు బ్రాహ్మణుడైనందువల్లనే సాధ్యమైందనే వాదనలు చేయడానికి పూనుకున్నారు. కబీరు తల్లి బ్రాహ్మణ వితంతువనే వాదన కూడా అలాంటిదే. ఇటువంటి వాదనలు చేసేవారు మహా భారతంలోనే భీష్మ పర్వంలో చెప్పబడినట్లు కర్మ బ్రాహ్మణ్యమూ, జ్ఞాన బ్రాహ్మణ్యమూ తప్ప జన్మ బ్రాహ్మణ్యమంటూ ఏదీ లేదనీ, పుట్టుకతో అందరూ శూద్రులేననీ ఎప్పటికి గ్రహిస్తారో మరి ! కేవల ఊహా సామర్థ్యంతోనే కాక కాళిదాసు విషయమై శాస్త్రి గారి పరిశోధనా ఫలితాలు *(Findings)* సత్యమని సాధికారికంగా, సోపపత్తికంగా ఋజువైతే, ఆంధ్ర నియోగుల కొక్కరికేముంది - తెలుగు వాళ్లందరికీ అంతకంటే ఆనందించ దగినదేముంటుంది ?

# తెలుగు కవుల వివాదాస్పద చరిత్రలు

తెలుగు కవులలో బమ్మెర పోతన జన్మస్థలం కడప జిల్లా ఒంటిమిట్టా? లేక ఓరుగల్లు సమీపంలోని బమ్మెర గ్రామమా? 'భోగినీ దండకం' ఆయనే వ్రాశాడా? లేదా? అనీ వాదోపవాదాలున్నాయి. ఆదికవి నన్నయ అసలు బ్రాహ్మణుడే కాదు, క్షత్రియుడని కొన్ని వాదనలున్నాయని పేర్కొంటూ, తమ 'వేమన' గ్రంథంలో రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మగారు 'కాపువారు (రెడ్లు) నన్నయకు కల ఆదికవిత్వ కీర్తిని వేమనకీయదలచి వేమన నన్నయకన్న పూర్వుడన్నారట' అని వ్రాశారు (వేమన - రా.అ.కృ.శ. ప్రచురణ : 1929 ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు). అలాగే వేమన జన్మస్థలం గుంటూరు జిల్లా కొండవీడని కొందరూ, అనంతపురం జిల్లాలోని కటారుపల్లె లేక కడప జిల్లాలోని మూగచింతపల్లె అని యింకొందరూ లేక చిట్వేలు అని కొందరూ, కర్నూలు జిల్లా క్రిష్టిపాడు అని మరి కొందరూ, గుంటూరు జిల్లా వినుకొండ లేక మరేదో గ్రామమని కొందరూ - యిలా వివాదాలు పుంఖానుపుంఖాలుగా సాగుతూనే వున్నాయి. వేమన జంగమ కులస్థుడై వుండవచ్చని వేమన పద్యాలను వెలుగులోకి తీసుకొచ్చిన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ ఒకప్పుడు అభిప్రాయపడ్డాడు. ఆ తర్వాత బ్రౌన్‌తో సహా దాదాపు సాహితీ విమర్శకులంతా ఆయన రెడ్డి కులస్థుడనే విశ్వసిస్తున్నారు. ఆయన తన ఊరును గురించీ, కులాన్ని గురించీ -

"ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి
మూగచింతపల్లె మొదటి యిల్లు
ఎడ్డె రెడ్డి కులమదేమని చెప్పుదు?
విశ్వదాభిరామ వినురవేమ !

(మూగచింతపల్లె అనేది కొండవీడుకు పడమటి వీధినే వెళితే వచ్చే ఓ శివారు గ్రామమట).

ఇలా యీ పద్యంలో విస్పష్టంగా చెప్పినప్పటికీ యింకా కొందరు ఆయన రాయలసీమ వాడనీ, జంగమ కులస్థుడనీ వాదించడం విశేషం. (అనంతపురం జిల్లా కటారుపల్లెలో నేటికీ 'వేమన సమాధి' అని పిలువబడే ఓ సమాధి వుంది. అది వేమన శిష్యుడైన తుంగ వేమన అనే మరో కవిదట. బహుశ అతడు జంగమ కులస్థుడై వుంటాడు. వేమన కొండవీటికి చెందిన పైడిపాల కొడిది రెడ్ల వంశం వాడు. అతడిది కనుగోళ్ల గోత్రము. వేమన కొండవీడు శివారు గ్రామమైన

మూగచింతపల్లెలో జన్మించినా, తానెరిగిన జీవిత సత్యాలూ, యోగ రహస్యాలూ సామాన్యులకు బోధిస్తూ రాయలసీమ ప్రాంతంలోనే జీవితకాలంలో హెచ్చుభాగం గడిపాడనేది చరిత్రకారుల విశ్వాసం.) బ్రౌన్ వేమన ఓ సారి 18వ శతాబ్ది ప్రారంభంలోని వాడనీ, మరోసారి 17వ శతాబ్ది ప్రారంభంలోని వాడనీ, వేరొక సందర్భంలో క్రీ.శ. 15వ శతాబ్ది ప్రారంభంలోని వాడనీ పేర్కొన్నాడు. గురజాడ అప్పారావు తమ 'కన్యాశుల్కం' నాటకంలో వేమన్న మనవడినని చెప్పుకొనే ఓ పాత్ర చేత వేమన మరణించి అప్పటికి వెయ్యేళ్లయిందని రెండు ఎడిషన్‌లలోనూ (1892, 1897), ఆరు వందల సంవత్సరాలవుతుందని 1909 ఎడిషన్‌లోనూ చెప్పించారు. ఇలా వేమన జీవిత కాలం ఎప్పుడనేదీ వివాదాంశంగానే మిగిలిపోయింది.

వేమనలాగా అడిదము సూరకవి (క్రీ.శ. 18వ శతాబ్దం) కూడా తన వూరు చీపురుపల్లె అనీ, తన పేరు సూరకవి అనీ, యింటి పేరు అడిదము వారనీ, తాను విజయరామరాజు సమకాలికుడననీ యీ క్రింది పద్యంలో ప్రశ్న - సమాధాన రూపంలో ఎంత చక్కగా చెప్పాడో చూడండి -

క॥ ఊఁరెయ్యది? చీపురుపలె ;
పేరో? సూరకవి; యింటి పే? రడిదము వార్;
మీ రాజు? విజయరామ మ
హారా ; జతఁడేమి సరసుఁడా? భోజుఁడయా?

ఇంత విపులంగా తన ఊఁరు, పేరు చెప్పినా ప్రసిద్ధ తిట్టుకవియైన అడిదము సూరకవి స్వస్థలం సూరపరాజు రేగ అనీ, గురివిందాడ అనీ, కంచరాల అనీ వివాదాలున్నాయి. చీపురుపల్లెలాగానే యివన్నీ విజయనగరం జిల్లాలోని గ్రామాలే.

ఇక పధ్నాలుగో శతాబ్ది ద్వితీయార్ధ భాగంలో నివసించిన శ్రీనాథ మహాకవి జన్మస్థలం విషయమై కూడా వాదోపవాదాలున్నాయి. శ్రీనాథుడి పితామహుడు కమలనాభామాత్యుడు సముద్ర తీరమునందలి కాల్పట్టనమునకు అధీశ్వరుడని 'భీమఖండము'లో పేర్కొనబడింది. ఇది పాకనాటిలోని కాల్పట్టనమని కొందరు పేర్కొనగా, వీరేశలింగం పంతులుగారు (ప్రస్తుత ప్రకాశం జిల్లా) కొత్తపట్టణమే కాల్పట్టనమనీ; చిలుకూరి వీరభద్రరావుగారు నెల్లూరు జిల్లా కృష్ణపట్టణమే కాల్పట్టనమనీ పేర్కొన్నారు. మచిలీపట్టణం సమీపంలోని కలపటమే కాల్పట్టనమనీ, దానికి సమీపంలోనే ఆ మహాకవి అత్తగారి వూరు దగ్గ(బ)మిల్లి వుంది కనుక కలపటమే శ్రీనాథుని జన్మస్థలమని యింకొందరి వాదన. సంగీత సాహిత్యాలలో అనితరసాధ్యమైన ప్రతిభాపాటవాలు కలిగి, 'వసుచరిత్ర' అనే మహా ప్రబంధాన్ని వ్రాసిన భట్టుమూర్తి అనే రామరాజ భూషణుడి కీర్తిని తామే కొట్టేయాలని ఆతడు బ్రాహ్మణుడేకాని, భట్రాజు కాదు అనే వాదనొకటి బ్రాహ్మణులు చేస్తున్నట్లు రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు అదే 'వేమన' గ్రంథంలో పేర్కొన్నారు. ఇక భట్టుమూర్తి జన్మస్థలం ఏదనే విషయమై నెలకొన్న వివాదాలను 'కథలు-గాథలు' అనే అధ్యాయంలోని 'భట్టుమూర్తితో పేచీలు' అనే కథలో వివరంగా చర్చించాను. ఇలా ఆంధ్రకవుల చరిత్రలూ చిక్కుముడుల పాలయ్యాయి.

## చిక్కుముడుల పాలైన రామకృష్ణ కవి చరిత్ర

ఇక ప్రస్తుతాంశానికి వస్తే తెనాలి రామకృష్ణకవి అత్యంత ప్రజాదరణ పొందిన మహాకవి. ఆయన కీర్తి కేవలం ఆంధ్ర రాష్ట్రానికే పరిమితం కాలేదు. యావద్దక్షిణ భారతదేశంలో ప్రముఖ కవిగానూ, హాస్య చతురుడుగానే కాక, సరసుడైన వికటకవి గానూ, ఎట్టి జటిల సమస్యనైననూ చిటికెలో సమర్థంగా పూరించే మేధావిగానూ ఆయన ఖ్యాతిగాంచాడు.

ఆయన పేరిట తమిళ, కన్నడ, మలయాళ కథాసాహిత్యాలలో కూడా ఎన్నో హాస్య కథలు ప్రాచుర్యంలోకి వచ్చాయి అందరూ ఆయన తమ ప్రాంతానికి చెందినవాడనో, తమ మతానికి చెందినవాడనో, తమ కాలానికి చెందినవాడనో ఒకరికొకరు పోటీ పడేటంతటి విశేష ప్రాచుర్యం కలిగిన ఘనుడాయన. ఈ విషయం నిర్వివాదాంశం. అందుకే ఆయన చరిత్ర కూడా పలు చిక్కుముడుల పాలయింది. అవి అంత తేలిగ్గా విడిపోయే దూముడులూ కావు. మరీ అంతగా బిగిసిపోయిన పీటముడులూ కావు. కొంత శ్రమిస్తే తెలివిగా మనం ఆ చిక్కుముడుల్ని విడదీయవచ్చు. ఆయన్ని గురించి ప్రాచుర్యంలో వున్న కథలకు, వాస్తవ చరిత్రాంశాలకు కొంత వైరుధ్యమున్నది. అలాగే ఆయన మతం ఏదనేదీ పెద్ద వివాదాంశం శైవుడైన రామలింగకవే వైష్ణవునిగా మారి, రామకృష్ణుడని పేరు మార్చుకున్నాడా? లేక ఆయన వేరూ, యీయన వేరూనా? – యివి చర్చనీయాంశాలయాయి.

ఆయన చరిత్రకు సంబంధించి ప్రచలితమవుతూన్న వివాదాంశాలు, వాటిపై వాదప్రవాదాల్ని గురించి మనం యిప్పుడు వివరంగా పరిశీలిద్దాం. ఎందుకోగానీ యీ మహాకవి జన్మస్థలం గుంటూరు జిల్లా తెనాలి అనే విషయాన్ని మాత్రం ఎవ్వరూ నేటివరకూ వివాదాంశంగా చేయలేదు. అయితే తెనాలికి సమీపంలోని గార్లపాడు (ఇప్పుడు దానినే గారపాడు అంటున్నారు. ఇది గుంటూరు – తెనాలి మధ్యనున్న తక్కెళ్లపాడుకు సమీప గ్రామం.) నుంచి వీరి కుటుంబం యీయన జననానికి చాలకాలం ముందే తెనాలికి వలస వచ్చిందట. వీరి యింటిపేరు కూడా గార్లపాటి వారే! ఆంధ్ర నియోగులలో స్వస్థలమైన ఊరిపేరే యింటి పేరుగా వుండడం సర్వసాధారణం.

పూర్తిగా లభిస్తూన్న ఈయన కావ్యాలు మూడు : 1) ఉద్భటారాధ్య చరిత్రము, 2) పాండురంగ మాహాత్మ్యము, 3) ఘటికాచల మాహాత్మ్యము. ఈ మూడు కావ్యాల రచయిత ఒక్కరేనని ఋజువుపరిస్తే 'ఉద్భటారాధ్య చరిత్రము' వ్రాసిన శైవుడైన రామలింగకవే పేరు మార్చుకొని రామకృష్ణకవియై వైష్ణవం స్వీకరించి 'పాండురంగ మాహాత్మ్యము' మరియు 'ఘటికాచల మాహాత్మ్యము' అనే కావ్యాలు కూడా వ్రాశాడని నిర్ద్వంద్వంగా ఋజువు అయినట్లే. ఈయన్ని గురించిన కొంత సాధికార సమాచారం కోసం యీ మూడు కావ్యాల అవతారికలు, ఆశ్వాసాంత గద్యములూ ఒకసారి పరిశీలిద్దాం.

'ఉద్భటారాధ్య చరిత్రము' యొక్క అవతారికలో యీయన తాను కౌండిన్యస గోత్రుడననీ, తన గురువు పాలగుమ్మి ఏలేశ్వరుడనీ, తాను విపుల మహాయజుర్వేద వేదిననీ, (తెనాలిలోని) రామేశ్వరస్వామి రమణీయ కరుణ కారణంగా తాను సహజ సాహిత్య మాధురీ సంయుతాత్ముడనయ్యాననీ, తాను లక్కమాంబ, రామధీమణి అనే దంపతులకు పుట్టి రామలింగ నామంతో విఖ్యాతుడైనట్టివాడిననీ చెప్పుకున్నాడు. అదే కావ్యం ఆశ్వాసాంత గద్యంలో తాను రామనార్యుడి సుపుత్రుడననీ 'కుమార భారతి' అనేది తన బిరుదనీ, రామలింగయ్య తన పేరనీ చెప్పుకున్నాడు. వీటిని బట్టి 'ఉద్భటారాధ్య చరిత్రము కావ్యకర్త పేరు రామలింగయ్య అనీ, ఆయన కౌండిన్యస గోత్రుడనీ, తండ్రి రామయ్య, తల్లి లక్కమాంబ అనీ, గురువు పాలగుమ్మి ఏలేశ్వరుడనీ, ఆయన బిరుదు 'కుమారభారతి' అనీ మనం అర్థంచేసుకోవచ్చు. కవి పేర్కొన్న రామేశ్వర స్వామి తెనాలిలోని రామేశ్వరస్వామి అనే విజ్ఞుల అభిప్రాయం. ఎందుకంటే తెనాలి రామేశ్వరస్వామి ఆలయంలోని ఉత్సవ విగ్రహ పీఠంపై యీ క్రింది శ్లోకం వుంది.

"శ్రీ తెనాలి నగరే వ్యరాజయ
ద్గార్లపాటి పుర రామపండితః
శుక్ల మాఘ సితపంచమీ గురౌ
రామలింగ ముమ యోత్సవాకృతిమ్."

ఇది రామకృష్ణుని తండ్రి రామయ పండితుడు రామేశ్వర దేవాలయానికి ఉత్సవ విగ్రహాలను సమర్పించినప్పుడు వేయించిన శ్లోకము. దీన్ని గురించి తర్వాత వేరొక సందర్భంలో విపులంగా చర్చిద్దాం.

ఇక 'పాండురంగ మాహాత్మ్యము' అవతారికలో తనను రామకృష్ణ కవి అంటారనీ, తాను శైవ, వైష్ణవ పురాణావళి నానార్థ రచనాపటిష్ఠైక రమ్యమతి'ననీ, ఆంధ్రభూమికి కుచాగ్రహారము వంటిదైన శ్రీ తెనాల్యగ్రహారానికి తాను నిర్ణేతననీ, అగ్రశాఖా కోకిలముననీ (అగ్రశాఖ అంటే ప్రథమ శాఖకు చెందిన నియోగి), రామయ రామకృష్ణ తన పేరనీ (తండ్రి పేరును తమ పేరుకు ముందుంచుకొనడం నాటి పద్ధతి. ఉదా : ఊర అన్నయ దేచమంత్రి అంటే ఊర అన్నయ కుమారుడు ఊర దేచమంత్రి – ఉ.చ. 1-21) కౌండిన్యస గోత్రుడననీ, లక్ష్మమా వరతనయుడననీ, తాను రూపుదాల్చిన శారద (సరస్వతి)ననీ చెప్పుకున్నాడు. మంగయ గురువ భూవిభుని కుమారుడైన పెద్ద సంగ భూపాలుని వద్ద వ్రాయసకాడుగా వున్న విరూరి వేద్రాద్రి (రామానుజయ్య కుమారుడు) తన కృతిభర్తయనీ, విరూరి వేదాద్రికి గురువు ప్రసిద్ధుడైన వాధూల మునీంద్రుని వంశీకుడైన ఆళువందారు కందాళయప్ప అనీ చెప్పుకున్నాడు.

ఇక 'ఘటికాచల మాహాత్మ్యము' కావ్యానికి కృత్యాదిని వ్రాయకుండానే రామకృష్ణకవి మరణించగా, ఆ తరువాత సుమారు నూట పాతికేళ్లకు ఆయన వంశీకుడొకరు ఖండోజి విచిత్రరాయడనే రాజు వద్దకు ఆ కావ్యాన్ని తీసుకొచ్చి 'భువిని విచిత్ర వాక్సరణిఁబొల్చిన తెన్నలి రామకృష్ణ సత్కవికులవజ్రపాణి వ్రాసిన ఘటికాగిరినాథ మహాచరిత్రమిది' అని ఆయనకివ్వగా ఖండోజి దానిని స్వీకరించి తన ఆస్థానంలోని వేంకటగిరీంద్రుడనే కవిచే దానికి అవతారిక వ్రాయించి తానే కృతినందుకున్నాడు. ఈ అవతారికలో రామకృష్ణకవికి సంబంధించిన వివరాలేవీ లేవు. అయితే ఆశ్వాసాంత గద్యములో 'పాండురంగ మాహాత్మ్యము' యొక్క అశ్వాసాంత గద్యంలాగానే 'సరసకవితా సనాథుడైన రామకృష్ణ కవినాథ ప్రణీతము' అని వుండి కవి పేరుకు ముందు తెనాలి అని కలుపబడింది. అంటే వేంకటగిరీంద్రుడు ఆ కావ్యానికి 'అవతారిక'ను వ్రాసే నాటికి గార్లపాటి రామకృష్ణకవి 'తెనాలి రామకృష్ణ కవి'గా ప్రసిద్ధుడయ్యాడన్నమాట. కవిగా ఆయన ప్రసిద్ధుడవటానికి ఆయన వ్రాసిన 'పాండురంగ మాహాత్మ్యము' యొక్క ప్రాచుర్యం కారణమైతే ఆయన 'తెనాలి రామకృష్ణకవి'గా ప్రసిద్ధుడవడానికి ఆయన రాయలవారిచే తెనాల్యగ్రహార నిర్ణేతగా నియమితుడు కావడం కారణం.

కొందరు విమర్శకులు 'లక్కమాంబ', 'లక్ష్మమాంబ' పదాలు వేర్వేరు వ్యక్తుల్ని సూచిస్తున్నాయనీ, కనుక 'ఉద్భటారాధ్య చరిత్రము' రచించిన రామలింగయ్య, 'పాండురంగ మాహాత్మ్యము' రచించిన రామకృష్ణకవి – ఈ యిరువురి యొక్క తండ్రి రామయ్యే అయినప్పటికీ ఒకరి తల్లి లక్కమాంబ, మరియొకరి తల్లి లక్ష్మమాంబ కనుక యీ యిరువురు కవులూ భిన్నవ్యక్తులని అభిప్రాయపడుతున్నారు. కాని యిది సరికాదు. 'లక్ష్మమాంబ', 'లక్కమాంబ' పదాలు రెంటికీ ఏ భేదమూ లేదు. ఒక్క తెలుగు భాషలోనే కాదు – ఉత్తర భారతదేశంలోనూ యిలాంటి ప్రయోగాలున్నాయి. హిందీలో 'లక్ష్మి'కి 'లాఖిమ్' వికృతి. 'లక్ష్మణ్'కు 'లఖన్' వికృతి. 'లక్ష్మీపూర్'ని 'లాఖిమ్‌పూర్' అనీ, 'లక్ష్మణ్‌పాల్'ని 'లఖన్‌పాల్' అనీ, 'రామలక్ష్మణ్'ను 'రామ్ లఖన్' అనీ అనడం సర్వసాధారణం. తెలుగులో 'లక్ష్మి' కి వికృతి 'లక్కిమి'. 'లక్ష్మి' ని 'లక్ష్మమ్మ' అన్నట్లు 'లక్కిమి'ని 'లక్కమ్మ' అనడం, 'లక్ష్మమ్మ'ను 'లక్ష్మమాంబ' అన్నట్లే 'లక్కమ్మ'ను 'లక్కమాంబ' అని అనడంలో వింతేమీ లేదు. కనుక 'లక్ష్మమాంబ'ను 'లక్కమాంబ' అని పేర్కొనడం సబబైనదే. కనుక రామలింగ కవి తల్లి పేరు లక్ష్మమ్మేనని నా అభిప్రాయం. పైపెచ్చు 'ఉద్భటారాధ్య చరిత్రము'లో తన తల్లి లక్కమాంబ అని పేర్కొంటూ రామలింగ కవి వ్రాసిన పద్యం చూడండి.

గీ॥ సహజ సాహిత్య మాధురీ సంయుతాత్ము
లక్కమాంబకు ఘనయశోలక్ష్మి వెలయు
రామధీమణికిని బుత్త్రు రామలింగ
నామ విఖ్యాతుఁ గావ్య నిర్ణయ ధురీణు. (ఉద్భటారాధ్య చరిత్రము : 1-24)

పై పద్యంలో కవి 'లక్కమాంబ'కు బదులుగా 'లక్ష్మమాంబ' అని ప్రయోగించినా ఛందస్సు పరంగా దోషమేమీ వుండదు. అయితే 'లక్ష్మమాంబకు ఘన యశోలక్ష్మి వెలయు' అని ప్రయోగిస్తే పునరుక్తి దోషం (ఒకే పద్యపాదంలో లక్ష్మి పదం రెండుసార్లు రావడం) వుంటుందని కామోసు కవి కొంచెం మార్పుతో 'లక్కమాంబ' అనే పదం ప్రయోగించాడు పద్య రచనలో సొబగు కోసం అలా పేర్లను స్వల్పంగా మార్చడం కవులకు అప్పుడప్పుడూ అవసరమౌతూ వుంటుంది

కవి తన 'ఉద్భటారాధ్య చరిత్రము'లో తన కృతిభర్త ఊర దేచయ్యది కౌండిన్యస గోత్రమనీ, ఆయన తండ్రి అన్నయ అనీ, దేచయ్య కొండవీటి దుర్గపాలకుడైన నాదెండ్ల గోపమంత్రి వద్ద రాజకార్య నిర్వాహకునిగా పనిచేస్తున్నాడనీ చెప్పాడు. తాను కౌండిన్య మునిరాజ మండలేశ్వరుని వంశమనే పాథోధికి (సముద్రమునకు) నవసుధా భానుమూర్తిననీ చెప్పడం ద్వారా (ఉ.చ. 1-24) తనదీ కౌండిన్యస గోత్రమని తెలియపరచినట్లయింది.

'పాండురంగ మాహాత్మ్యము'లో తాను అగ్రశాఖికా కోకిలమునని పేర్కొన్నాడు. (పాం.మా. 1-23). ఆంధ్ర నియోగి బ్రాహ్మణులలో ప్రథమ శాఖవారు, ఆరువేల నియోగులు అనే శాఖా భేదాలున్నాయి. ప్రథమ శాఖ వారినే ఆదిశాఖవారనీ, యజ్ఞవల్క్య శాఖవారనీ, కాణ్వ శాఖీయులనీ కూడా పిలుస్తారు. ఈ శాఖవారంతా శుక్ల యజుర్వేదులు యజుర్వేదంలో శుక్ల (తెల్లని) యజుర్వేదము, కృష్ణ (నల్లని) యజుర్వేదము అని రెండున్నాయి. వీటిలో శుక్ల యజుర్వేదము మొదటిదైనందున ఆ శాఖవారిని ప్రథమ శాఖవారనీ, అగ్రశాఖీయులనీ పేర్కొనడం పరిపాటి అయింది. మిగిలిన బ్రాహ్మణ శాఖలవారంతా కృష్ణ యజుర్వేదులు. సూర్యుని వలన తాను పొందిన శుక్ల యజుర్వేదాన్ని యాజ్ఞవల్క్యుడు ముందుగా తన ప్రథమ శిష్యుడైన కణ్వునకుపదేశించగా, అనంతరం ఆయన దానికి విస్తృత ప్రాచుర్యాన్ని చేకూర్చాడట. అంచేత, ప్రథమ శాఖ నియోగులను కణ్వునిపేర, కాణ్వ శాఖీయులని కూడా అంటారట. కణ్వ మహర్షి (శకుంతలను పెంచిన ఋషి) కృష్ణ యజుర్వేదియనీ, వైఖానసుడనీ చెప్పడానికి మన ప్రాచీన సాహిత్యంలో ఎన్నో ఆధారాలున్నాయి. మరి శుక్ల యజుర్వేది అయిన యీ కణ్వుడు వేరే వ్యక్తి అయివుండవచ్చు. మన ప్రాంతంలో కొండా, వరాహగిరి, రావూరి, మట్టిగుంట, పులిపాటి, గార్లపాటి, నల్లగొండ, ఇంటూరి వగైరా యిండ్లపేర్లు కల నియోగి బ్రాహ్మణులు తాము అగ్రశాఖీయులమని చెప్పుకుంటారు

ఈ ప్రథమశాఖవారినే అగ్రశాఖీయులనీ అంటారు. తెనాలి రామకృష్ణకవి ప్రథమ శాఖకు చెందిన నియోగి బ్రాహ్మణుడు కాగా 'పాండురంగ మాహాత్మ్యము' కృతినందుకున్న విరూరి వేదాద్రి ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. అందుకే కవి తన కృతిభర్తను 'షట్సహస్రాన్వయేశా' అంటూ పొగిడాడు (పాం. మా. 5-327). షట్సహస్రము అంటే ఆరువేలు అన్వయము అంటే కులము. 'షట్సహస్రాన్వయేశా!' అంటే 'ఆరువేల నియోగి కులములో శ్రేష్ఠుడా!' అని సంబోధించాడు

తెనాలి రామకృష్ణకవి కులగోత్రాదుల విచారణ ఎందుకవసరమవుతున్నదంటే - 'రామలింగకవి', 'రామకృష్ణకవి - వేరు కాదు ఒక్కరే అని నిరూపించడానికి - ముందుగా ఆయన శైవ మతంనుండి మారి వైష్ణవ మతం పుచ్చుకొనడానికి ఏ మేరకు అవకాశాలున్నాయో పరిశీలించడం కోసం. స్మార్తులైన ఆంధ్ర బ్రాహ్మణ శాఖలలో ఒక్క,నియోగులకు మాత్రమే శైవాన్ని కానీ, వైష్ణవాన్ని కానీ స్వీకరించే అలవాటున్నదట. మిగిలిన స్మార్త శాఖలైన వెలనాటి వైదికులు, తెలగాణ్యులు,

కాసలనాటివారు, ద్రావిడులు మొదలైన వారు తమ మతాన్ని ఎట్టి పరిస్థితులలోనూ మార్చుకొనరట. మల్లికార్జున పండితారాధ్యుడు ఆంధ్ర దేశంలో ఆరాధ్య సంప్రదాయాన్ని ప్రవర్తింపజేసిన తరువాత ఆంధ్ర స్మార్తబ్రాహ్మణ శాఖలలో ఒక్క నియోగులే లింగధారణ దీక్షను స్వీకరించి ఆరాధ్యులుగా మారారట. అంచేతనే నియోగులకూ, ఆరాధ్యులకూ నేటికీ వివాహ సంబంధాలు కొనసాగుతున్నాయట.

మొదట్లో రామలింగడు నియోగులలోని ప్రథమ శాఖకు చెందిన స్మార్తుడు ఆ తరువాత ఆయన ఆరాధ్య వీర శైవాన్ని స్వీకరించాడు. ఆ దశలో శైవ నియమాలననుసరించి తన శాఖ ఏదో తెలుపరాదు. అందుకే 'ఉద్భటారాధ్య చరిత్రము'లోని ఆశ్వాసాంత గద్యములో ఆయన తన శాఖను పేర్కొనలేదు. తిరిగి వైష్ణవంలోని 'వడహల' శాఖ అనుయాయిగా మారాడు. వైష్ణవంలో బ్రాహ్మణ శాఖా భేదాలను ఉటంకించ కూడదనే నియమమేదీ లేని కారణంగా (పాం. మా. 1-23 లో) తాను అగ్రశాఖ కోకిలనని (ప్రథమ శాఖ నియోగినని) తెలిపాడు. ఇలా స్మార్తుడు శైవునిగా, తిరిగి వైష్ణవునిగా మతం మార్చుకొనడానికి అసలు ఏ మేరకు అవకాశమున్నదో నిర్ధారించుకొనడానికి 'ఆయన జన్మతః నియోగి' అనే అంశం ఎంతగానో ఉపకరిస్తున్నది. ఎందుకంటే బ్రాహ్మణ శాఖలలోని నియోగులొక్కరే సులువుగా మతాంతరీకరణ చెందుతారు. అగ్రశాఖ కోకిల (ప్రథమ శాఖ నియోగి)యైన రామలింగడు ఆదిలో స్మార్తుడైనా, ముందుగా ఆరాధ్య వీరశైవం, ఆ తరువాత వైష్ణవం స్వీకరించడం, షట్సహస్రాన్వయేశుడైన (ఆరువేల నియోగియైన) విరూరి వేదాద్రి మంత్రి వైష్ణవం స్వీకరించడం యిందుకు చక్కటి ఉదాహరణలు.

కనుక శైవుడైన రామలింగకవి వైష్ణవునిగా మారాడనడానికి ఆస్కారం వుంది. 'ఉద్భటారాధ్య చరిత్రము'నకు వ్రాసిన విపుల పీఠికలో నిడదవోలు వెంకటరావు గారు, రామకృష్ణ కవి మొదట స్మార్తుడైన ప్రథమ శాఖా నియోగి బ్రాహ్మణుడనీ, తరువాత ఆరాధ్య శైవం (వీరశైవం) స్వీకరించాడనీ తెలిపారు. అనంతరం ఆయన వైష్ణవం స్వీకరించాడనే విషయాన్ని మాత్రం ఆయన అంగీకరించ లేదు. పేరు మాత్రం రామకృష్ణుడని మార్చుకొని ఆయన 'పాండురంగ మాహాత్మ్యము', 'ఘటికాచల మాహాత్మ్యము' కావ్యాలను వ్రాసి వుంటాడనీ, ఆ కావ్యాలు రచించడానికి కవి వైష్ణవ మతం స్వీకరించాల్సిన అగత్యమేమీ లేదనీ పేర్కొన్నారు.

కవి తన 'ఉద్భటారాధ్య చరిత్రము'లో తాను 'విపుల మహా యజుర్వేద వేది'నని (1-24) పేర్కొన్నాడు. కనుక స్మార్తుడైన రామలింగనిగా వున్నప్పుడు తాను అగ్రశాఖీయుడైనందున శుక్ల యజుర్వేదాన్ని నేర్చుకొని, అనంతరం వీరశైవం స్వీకరించి పాలగుమ్మి ఏలేశ్వరుని వద్ద కృష్ణ యజుర్వేదం చదువుకున్నాడు కనుకనే పై విధంగా తాను విపుల మహాయజుర్వేద వేదినని పేర్కొన్నాడని వెంకటరావు గారు పేర్కొన్నారు. అయితే వడహల వైష్ణవం స్వీకరించిన తరువాత తన గురువైన భట్టరు చిక్కాచార్యుల వద్ద వైఖానసాగమంతోబాటు కృష్ణ యజుర్వేదాన్ని కూడా ఆయన మరింత క్షుణ్ణంగా నేర్చుకుని వుంటాడు. పాలగుమ్మి ఏలేశ్వరుడు ఆరాధ్య శైవ సంప్రదాయానికి చెందినవాడు. భట్టరు చిక్కాచార్యులు వడహల (వైఖానస) శాఖకు చెందిన వైష్ణవుడు. ఈ రెండూ కృష్ణ యజుర్వేదీయ శాఖలే. అంచేత ఆ గురువులిద్దరి వద్దనూ కవి కృష్ణ యజుర్వేదాన్ని క్షుణ్ణంగా అభ్యసించి వుంటాడు.

శ్రీనాథ మహా కవికి సమకాలికుడైన పాలగుమ్మి శ్రీకంఠగురుడు క్రీ.శ. 1414 ప్రాంతానికి చెందినవాడు. (ఈయనకు సంబంధించిన శాసనాధారాలున్నాయి). రామలింగ కవికి శివదీక్షనిచ్చిన గురువు పాలగుమ్మి ఏలేశ్వరుడు క్రీ.శ. 1520 ప్రాంతపువాడు. కవి సోదరుడైన అన్నయ తాను వ్రాసిన "సుదక్షిణా పరిణయం'లో తన గురువు పాలగుమ్మి భీమేశ్వరుడని పేర్కొన్నాడు. క్రీ. శ. 1560 ప్రాంతాలకు చెందిన యీయన బహుశా ఏలేశ్వరుని కుమారుడై వుంటాడు.

# రామకృష్ణ కవి యింటిపేరు - జన్మస్థలం

రామకృష్ణ కవి శా.శ. 1384 (క్రీ.శ. 1462) జన్మించాడనీ, ఆయన యింటి పేరు ఈశ్వరప్రెగ్గడ వారనీ వ్రాయబడిన ఒక జన్మ పత్రికను ఉటంకిస్తూ తమ 'హిందూస్థాన కవి చరిత్రము'లో కావలి వేంకటస్వామిగారు పేర్కొనిన దాన్ని వీరేశలింగం పంతులుగారు సత్యదూరమని కొట్టిపారేశారు. ఆ జన్మపత్రిక తరువాతి కాలపు సృష్టియనీ, అది సత్యమైనచో శ్రీకృష్ణదేవరాయలు సింహాసనానికి వచ్చేనాటికి (అంటే క్రీ.శ. 1509 నాటికే) రామకృష్ణకవికి 47 ఏళ్లు వుంటాయనీ, అప్పుడు చంద్రగిరిలో తిరుమల తాతాచార్యుల వారితోనూ, అప్పయ్య దీక్షితుల వారితోనూ సమకాలికుడిగా (క్రీ.శ. 1585 - 1590 మధ్య కాలంలో) వేంకటపతిరాయల ఆస్థానంలో రామకృష్ణకవి ఎలా వుండగలడనీ, అలా ఆయన చంద్రగిరిలో కొంతకాలమున్నట్లు కొన్ని నిదర్శనములు కనబడుతున్నవి కనుక, యీ జన్మపత్రిక తరువాతి కాలపు సృష్టి అయివుంటుందని పంతులుగారు తేల్చారు. కాబట్టి ఆయన యింటి పేరు ఈశ్వరప్రెగ్గడ వారనేదీ సందేహాస్పదమే.

గార్లపాటి వారికి ఆ యింటి పేరు రావడానికి ముందు వారు ఈశ్వరప్రెగ్గడ వారుగా ప్రసిద్ధి గాంచారనే మరొక వాదన వుంది. దీనిని కూడా సత్యదూరమని ఆరుద్రగారు తమ 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో కొట్టేశారు. ఆయన యీ నిర్ధారణకు రావడానికి దారితీసిన కారణాలు చూడండి. 'ఉద్భటారాధ్య చరిత్రము' కృతినందుకున్న ఊరదేచయ్యది కౌండిన్యస గోత్రం. గార్లపాటి వారిదీ అదే గోత్రం. 'గార్లపాటి' అనే యింటి పేరు రావడానికి ముందు వారి యింటి పేరు 'ఈశ్వరప్రెగ్గడ' అయితే ఈశ్వరప్రెగ్గడ వారిదీ కౌండిన్యస గోత్రమే కావాలి. అప్పుడు ఊరవారూ, ఈశ్వరప్రెగ్గడ వారూ సగోత్రీకులై ఒకరి పిల్లను మరొకరు పెండ్లి చేసుకొనడానికి వీలుండదు. అయితే ఊరదేచమంత్రి తల్లి ఈశ్వరప్రెగ్గడ మల్లన్నగారి కుమార్తె కృష్ణమాంబ. తండ్రి అన్నయ్య మంత్రి. "హిమగిరి ధైర్యు౯ దన్నవిభుడీశ్వర ప్రెగ్గడ మల్లనార్యు గౌరమకుఁగుమారియై రమకు నద్భుత సంపద సాటియై మనోరమ కులయుగ్మ హారమయి ప్రౌఢి వహించిన కృష్ణమాంబ" ను శివుడు అద్రిసుతను వరించిన తీరున వరించాడని పేర్కొన్నాడు రామకృష్ణకవి (ఉ.చ. 1-39). దేచమంత్రి తల్లిదీ తండ్రిదీ ఒకే గోత్రం కావడానికి వీల్లేదు కదా! కనుక గార్లపాటి వారికి ఆ యింటిపేరు రావడానికి ముందు వారు ఈశ్వరప్రెగ్గడ వారనేది అవాస్తవం.

నేను లోగడ పేర్కొన్నట్లుగానే రామకృష్ణ కవి పూర్వీకుల స్వస్థలం తెనాలికి సమీపంలోని గార్లపాడు. (దీనినిప్పుడు గారపాడు అంటున్నారు.) నియోగులలో ఊరి పేరు యింటిపేరు ఒక్కటే వుండడం సర్వసాధారణం. మేనమామల యింట రామకృష్ణుడు తెనాలిలోనే జన్మించి వుంటాడు. గర్భిణులు పురిటికి పుట్టింటికి రావడం ఆనవాయితీయే కదా! కొందరి నమ్మకం ప్రకారం వారి కుటుంబం రామకృష్ణకవి జననానికి కొంచెం ముందే తెనాలి వచ్చి స్థిరపడింది. అయినప్పటికీ వ్యవసాయము, ఆస్తుల నిర్వహణ కారణంగా గార్లపాడుతో వారి సంబంధాలు కొనసాగి వుంటాయి. రామకృష్ణకవి బాల్యంలో కొంతమేరకైనా గార్లపాడు, సమీప ప్రాంతాలలో గడిచి వుంటుంది. "ఆయన చిన్నతనములో బట్టుపల్లెయను గ్రామమునందుండు బట్రాజులతో సాంగత్యము చేసి, వారి చెలిమి చేత సంస్కృతాంధ్ర సాహిత్యమును, కవిత్వ కౌశలమును సంపాదించి, బుద్ధిబలముచేత ప్రబంధ కవీశ్వరుడయి వన్నెకెక్కెనట" అని కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ 'ఆంధ్ర కవుల చరిత్రము' (ఆం.క.చ. ద్వితీయ భాగము పేజీ 111) లో పేర్కొన్నదానిలో సత్యము లేకపోలేదు. బట్టుపల్లె లేక దేవరాయ భట్లపాలెం అనే పేరుగల ఆ గ్రామమే భట్టుమూర్తి జన్మస్థలమై వుంటుందనీ, ఏకారణంగానో రామకృష్ణుడికి భట్టుమూర్తితో బాల్యంలో అక్కడ ఏర్పడిన వైరమే జీవితాంతం కొనసాగి వుంటుందనీ నేను నమ్ముతున్నాను. అంతేకాదు

యీ రెండూ మంగళగిరికి కూడా సమీప గ్రామాలే కనుక, తాతాచార్యులవారు మంగళగిరి వచ్చినప్పుడు ఆయన్ని రామలింగ కవీ, భట్టుమూర్తీ – యిద్దరూ కలిసి హంపిలోని 'భువనవిజయం'లో ప్రవేశించడానికి ఆయన సిఫారసును కోరారనీ, ఆ సందర్భంలో తాతాచార్యులుకు తనపై వున్నవీ లేనివీ చెప్పి భట్టుమూర్తి తన అవకాశాలను దెబ్బతీశాడని రామలింగకవికి భట్టుమూర్తిపై ద్వేషం మరింత పెరిగిందనీ జనం చెప్పుకునే కథలు పూర్తిగా అసత్యాలని కొట్టిపారేయడానికి వీలులేనట్టివనీ నేను నమ్ముతున్నాను.

భట్టుమూర్తి జన్మస్థలం నూతలపాటి పేర్రాజు గారు 'విజయనగర చరిత్రము' లో పేర్కొన్నట్లు కర్నాటకలోని బళ్లారి జిల్లా పాలమండలం తాలూకాలోని బట్టుపల్లె కానీ, ఆరుద్రగారు పేర్కొన్నట్లు కడపజిల్లా పులివెందులకు సమీపంలోని భట్టుపల్లెగానీ, కర్నాటకలోని భట్టరహళ్లిగానీ, కొందరు భావిస్తున్నట్లు తెనాలి తాలూకా మోదుకూరు కానీ అవడానికి అవకాశాలు లేవు. ఏ రకంగా చూసినా అది రామకృష్ణకవి స్వస్థలమైన తెనాలి – గుంటూరు మధ్యగల గార్లపాడుకు సమీప గ్రామమైన వెంకటకృష్ణాపురం పంచాయితీలో చేరిన భట్టుపల్లె లేక దేవరాయ భట్లపాలెం కాక వేరొకటి అయ్యే అవకాశం లేదని నా విశ్వాసం. ఈ విషయమై మరిన్ని చారిత్రక వివరాలకోసం 'భట్టుమూర్తితో పేచీలు' (కథలు – గాథలు) చూడండి. అలా భట్టుమూర్తి స్వగ్రామానికి సమీప గ్రామం కూడా అయినందున రామకృష్ణుని స్వస్థలం గార్లపాడు అనే విషయం కూడా ధృవపడుతున్నది. ఎందుకంటే ఎక్కడో బళ్లారి జిల్లాలోనో, కడపజిల్లాలోనో వున్న భట్టుపల్లెకు వెళ్లి బాల్యంలో రామలింగకవి ప్రబంధాలను అధ్యయనం చేసే అవకాశాలు చాల తక్కువ. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోవడం కారణంగా యింటికి పెద్ద మగదిక్కు తానే కావడం కారణంగానూ, మేనమామలపై ఆధారపడాల్సిన నాటి వారి కుటుంబ ఆర్థిక దుస్థితి కారణంగానూ ప్రబంధాల అధ్యయనానికి రామలింగయ్య అంత దూర ప్రాంతాలకు వెళ్లే అవకాశాలు లేవు. ప్రౌఢ దేవరాయలు, గజబెంట దేవరాయలు అనే బిరుదములు కల రెండవ దేవరాయలు భట్రాజులకు యిచ్చిన గ్రామము యీ భట్టుపల్లె కనుకనే దీనిని దేవరాయ భట్లపాలెం అని కూడా వ్యవహరిస్తున్నారు. ప్రబంధాల పఠనంలో కడు నేర్పరులైన భట్టుమూర్తి పూర్వీకులైన భట్రాజులకు 'ప్రబంధాకం' అనే బిరుదనామాన్ని కూడా రెండవ దేవరాయలే యిచ్చివుంటాడు. ప్రబంధాలు పఠించడంలో ఆరితేరి, సంగీతాత్మకంగా వాటిని చదవడం, ప్రబంధాలు కూర్చడంలో కూడా నిపుణమతులైన కొందరు భట్రాజులు యీ గ్రామంలో ప్రసిద్ధికెక్కి వుంటారు. అందుకే తన బాల్యంలో రామలింగకవి వారి శిక్షణ పొంది వుంటాడు. సంగీత సాహిత్యాలలో దిట్టయైన భట్టుమూర్తితో ఆ కాలంలోనే ఏ కారణంగానో రామలింగకవికి పేచీ లేర్పడి వుంటాయని నేను దృఢంగా విశ్వసిస్తున్నాను.

హంపి విజయనగరంలోని శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమైన 'భువన విజయం'లోని అష్టదిగ్గజాలలో ఒకడుగా వాసికెక్కిన తెనాలి రామకృష్ణ కవి వైష్ణవునిగా మారిన ఒకప్పటి శైవుడైన గార్లపాటి రామలింగకవి. కొందరు సాహితీ విమర్శకులు, ప్రత్యేకించి విశ్వబ్రాహ్మణ కులస్థులు యీ వికటకవి తమ వంశీయుడేనని భావిస్తారు. తెనాలి రామలింగకవి అనే విశ్వబ్రాహ్మణుడు రాయలవారి పాలనా కాలంలో తెనాలి నుంచి వెళ్లి విజయనగరంలో స్థిరపడి అష్టదిగ్గజాలలో ఒకనిగా వెలుగొందాడని వారు అనాదిగా నమ్ముతున్నారు. అయితే యిది తప్పు. ఈ విశ్వబ్రాహ్మణ కవియైన తెనాలి రామలింగడు అంతకు చాలకాలం తరువాతి వాడు. ఈ విషయాన్ని మొట్టమొదటిసారి పేర్కొన్నది కీ.శే. మానవల్లి రామకృష్ణ కవిగారు. ఆయన క్రీ.శ. 1914 ఆనందనామ సంవత్సర 'ఆంధ్ర పత్రిక' ఉగాది సంచికలో "తెనాలి కవులు" అనే తన వ్యాసంలో తెనాలికి చెందిన ప్రాచీన కవులలో యీ తెనాలి రామలింగము అనే విశ్వబ్రాహ్మణుడిని చివరివానిగా గుర్తించాడు. తరువాత యిదే విషయాన్ని నిడుదవోలు శివ సుందరేశ్వరరావుగారు తమ 'ఆంధ్రదేశపు సంస్థానాధీశ్వరులు' అనే వ్యాసంలోనూ, కేతవరపు రామకోటిశాస్త్రిగారు 'ఘటికాచల మాహాత్మ్యము'నకు తాము వ్రాసిన పీఠికలోనూ పేర్కొన్నారు.

ఈ విశ్వబ్రాహ్మణ కవి రాయలవారి కాలంనాటివాడు కాదనీ, యితడెప్పుడూ రాయలవారి ఆస్థానంలో లేడనీ స్పష్టంగా ఋజువుపరచ బడింది.

ఈ విశ్వబ్రాహ్మణ కవి 'ధీరజన మనోవిరాజితము' అనే మరొక పేరుగల 'పరిమళ చోళ చరిత్ర'ను వ్రాసిన కవి ఇతడు కాశ్యపగోత్రుడు. ఋగ్వేది. ఈయన యింటి పేరు తెనాలి వారు. ఈయన పూర్వీకుల స్వస్థలం తెనాలి కనుక వీరి యింటిపేరు 'తెనాలి' అయింది.

మన రామకృష్ణ కవి వైష్ణవం స్వీకరించక ముందు గార్లపాటి రామలింగ కవి. ఆయన ప్రథమ శాఖీయుడైన నియోగి బ్రాహ్మణుడు. కౌండిన్యస గోత్రుడు. యజుర్వేది. వారి స్వస్థలం తెనాలికి సమీపంలోని గార్లపాడు. అయితే మేనమామల యింట తెనాలిలో పెరిగి తదుపరి కాలంలో తెనాలి అగ్రహార నిర్ణేతగా మారి తెనాలి యింటిపేరు కాకున్నా తెనాలి రామకృష్ణునిగా ప్రసిద్ధికెక్కినవాడు.

మన రామకృష్ణ కవి తల్లిదండ్రుల పేరు లక్ష్మమ్మ. రామయ్య కాగా ఆ విశ్వబ్రాహ్మణ కవి తండ్రి మల్లికార్జునుడు, తాత మృత్యుంజయుడు. ఈ విశ్వబ్రాహ్మణ కవి పూర్వీకులు తెనాలి నుండి వెళ్లి ప్రస్తుత ప్రకాశం జిల్లాలోని త్రిపురాంతకం ప్రాంతంలో స్థిరపడ్డారట. అక్కడి నుండి ఆ కవి గోలకొండ రాజ్యానికి వెళ్లి అక్కడ అక్కన్న, మాదన్నల ఆశ్రయం పొందాడట గోల్కొండలో తానీషా ప్రభువు క్రీ.శ. 1672 నుండి 1687 వరకు పాలించాడు. అక్కన్న, మాదన్న సోదరులు క్రీ.శ. 1666 లో గోల్కొండలో కొలువు సంపాదించారు. పింగళి మాదన్న క్రీ.శ. 1674 లో తానీషాకు ప్రధాన మంత్రియై క్రీ.శ. 1686 లో మహమ్మదీయులచే వధింపబడ్డాడు.

'ధీరజన మనోవిరాజితము' అనేది విశ్వబ్రాహ్మణుల చరిత్రను వివరించే ఏకాశ్వాస ప్రబంధము. ఇందులో 158 గద్య పద్యాలు మాత్రమే వున్నాయి. దీనిని తెనాలి రామలింగ కవి అక్కన్న, మాదన్న సోదరులకు అంకిత మివ్వకుండా ఆ సోదరులను దీనికి వక్తృ శ్రోతలను చేశాడు. దీంతో కావ్యముఖంగా వారికి అజరామరత్వం కల్పించినట్లయింది. అక్కన్న, మాదన్నలు క్రీ.శ. 1666 నుండి 1686 వరకు గోల్కొండలో ఓ వెలుగు వెలిగారు కాబట్టి యీ రామలింగ కవి అప్పటి వాడనేది రూఢి పడిన సత్యం.

విశ్వబ్రాహ్మణుడైన తెనాలి రామలింగము నాటి హంపిలో రాయలవారి కాలంలో ప్రఖ్యాతి గాంచిన రామలింగ కవి కాదు; తానీషా కాలంనాటి కవి అని కొందరు విశ్వబ్రాహ్మణ రచయితలే కాక దాదాపు చరిత్రకారులు, సాహితీ విమర్శకులందరూ అంగీకరిస్తూ వుండగా - మరికొందరు సాహితీ విమర్శకులు యింకొక వింత వాదన చేస్తున్నారు అదేమిటంటే - తెనాలి రామలింగ కవి అనే పేరుతో యిద్దరు విశ్వబ్రాహ్మణ కవులున్నారట. అందులో రెండవ కవి గోల్కొండలో అక్కన్న మాదన్నల పరిపోషణలో 'ధీరజన మనోవిరాజితము' అనే కావ్యం రచించగా మొదటివాడైన రామలింగకవి రాయలవారి కాలంలో హంపి విజయనగరంలోని 'భువన విజయం'లో అష్టదిగ్గజాలలో ఒకడిగా వెలుగొందాడట తిట్టుకవితలూ, సమస్యాపూరణములూ, బూతు కవితలూ అన్నీ ఆయనవేనట. ఆయన యింటి పేరు ఈశ్వర ప్రభ లేక ఈశ్వర ప్రెగ్గడ. ఆయన జీవిత కాలం క్రీ.శ. 1462-1526. ఆయన శిల్పి. యజుర్వేది. మల్లికార్జునుని కుమారుడు వికటకవి, బూతుకవి, హాస్య కళానిధి. ఆయన ఆది పురాణము, పాండురంగ విజయము, శ. విజయము, వీరజన మనోరంజనము అనే కృతులను రచించాడట. ఆయన నిరోష్ఠ్య రామాయణాన్ని కూడా వ్రాశాడంటారు కాని అది అలభ్యమైనందున నిజమని భావించలేమట. ఆయన రాయలవారి కంటె ముందుగానే మరణించాడట. 'ఉద్భటారాధ్య చరిత్రము', 'పాండురంగ మాహాత్మ్యము', 'ఘటికాచల మాహాత్మ్యము' మొదలైన కావ్యాలు వ్రాసిన తెనాలి రామకృష్ణ కవి వేరట. ఆయన ఏనాడూ హంపి విజయ నగరం వెళ్లి ఎరగడట. ఆయనకు శ్రీకృష్ణదేవరాల ఆస్థానంతో ఎట్టి సంబంధమూ

లేదట. ఇదీ వారి వింతవాదన.

(చారిత్రక శిరోమణి కొడాలి లక్ష్మీనారాయణ గారు 'విశ్వబ్రాహ్మణుడగు తెనాలి రామలింగని చరిత్ర' అన్న తమ గ్రంథంలో ఈ వాదనను ముందుంచారు. ఈ గ్రంథం 1969 లో ప్రచురించబడింది. ఇటీవలే రామకృష్ణుని రచనలను అధ్యయనం చేసే సందర్భంలో యీ గ్రంథాన్ని నేను చదవడం తటస్థించింది. ఇందులో ప్రస్తావించబడిన వివిధ అంశాలపై తరువాత విపులంగా చర్చిద్దాం.)

ఈ వాదనను నేను రెండు విధాలుగా ఎదుర్కొన దలచాను.

మొదటిది ఆనాడున్న సామాజిక స్థితిలో ఒక విశ్వబ్రాహ్మణ కవికి రాయల వారి ఆస్థానంలో ప్రవేశించడం, ఆస్థాన కవి కాగలగడం, రాయల వారికి ఆంతరంగికుడు కాగలగడం ఏమేరకు సాధ్యమనే విషయాన్ని ఆలోచించడం. రెండవది తెనాలికి చెందిన గార్లపాటి రామలింగ కవి మతం మార్చుకుని రామకృష్ణ కవి కాగలగడానికి, రాయల వారి సభలో ప్రవేశించి రాయలవారికి సన్నిహితునిగా వ్యవహరించడానికి కల అవకాశాలను చర్చించడం. ఆయన సమకాలికులుగా చెప్పబడుతున్న వారికి సంబంధించిన స్పష్టమైన కాల నిర్ణయం చేసి తద్వారా రామకృష్ణ కవి అష్టదిగ్గజ కవులలో ఒకడనేది నిర్ద్వంద్వంగా నిరూపించడం.

## నాటి విశ్వబ్రాహ్మణుల స్థితి గతులు

మొదటిగా మనం ఆలోచించాల్సింది రాయలవారి కాలంనాటి భౌతిక స్థితిగతులు (*objective conditions*), ఆనాడున్న పరిస్థితులలో శుక్లయజుర్వేదీ, ప్రథమశాఖకు చెందిన నియోగి బ్రాహ్మణుడైన రామలింగకవి, వైష్ణవం పుచ్చుకున్నప్పటికీ రాయలవారి సభలో ప్రవేశించడానికి ఎన్ని తిప్పలు పడవలసి వచ్చిందో మనం యిది వరకే చూశాం. ఆనాటి స్థితిలో వైష్ణవ అర్చకులు, పురోహితులు మాత్రమే బ్రాహ్మణులుగా చెలామణి అవుతున్న రోజులలో బ్రాహ్మణులే అయినప్పటికీ యితర శాఖల వారికి 'భువన విజయం'లో ప్రవేశించడం కలలో కూడా ఊహింపరానిదిగా వున్నట్లు మనం వివరంగా తెలుసుకున్నాం. కందుకూరి రుద్రకవి బ్రాహ్మణ మంత్రులందరూ కులాన్ని చెరచడానికే పుట్టారనీ, వారంతా కత్తు కలిసి తన సభా ప్రవేశాన్ని అడ్డుకున్నారనీ, మంగలి కొండోజీ వారికంటె ఎంతో మేలనీ, చివరకు ఎలాగోలా అతని సిఫారసుతోనే తాను సభాప్రవేశం చేయగలిగాననీ వాపోయాడు. కందుకూరి రుద్రకవి విశ్వబ్రాహ్మణుడనీ, తన స్వస్థలమైన కందుకూరులోని సోమేశ్వర స్వామికి ఆయన తాను వ్రాసిన 'నిరంకుశోపాఖ్యానము' అనే కావ్యాన్ని అంకితమిచ్చాడనీ కొందరి విశ్వాసం. వైష్ణవులు కాని బ్రాహ్మణ కవుల పరిస్థితే అతిగడ్డుగా వున్న ఆ రోజులలో, శైవుడైన ఒక విశ్వబ్రాహ్మణ కవి అక్కడి సభలో ప్రవేశించ గలిగితే అదే గొప్ప. ఇక అతడు అష్టదిగ్గజ కవులలో ఒకనిగానూ, రాయలవారికి ఆంతరంగికునిగానూ కాగలగడం ఊహకైనా అందని విషయం. బహుశా మనం యిందాక చెప్పుకున్న విమర్శకులు యీ రుద్రకవినే తెనాలి నుంచి వెళ్లిన రామలింగడనే విశ్వబ్రాహ్మణ కవి అని పొరబడుతున్నారేమో! రుద్రకవి కూడా తిట్టు కవిగానూ, బూతుకవిగానూ ప్రసిద్ధుడు. రుద్రకవి విశ్వబ్రాహ్మణుడైనందునే అష్టకష్టాలూ పడి ఎలాగోలా 'భువన విజయం'లో ప్రవేశించగలిగినట్లు చెప్పబడుతున్నప్పటికీ రాయలవారికి సన్నిహితునిగా అయినట్లు ఎక్కడా దాఖలాలు లేవు. మరోప్రక్క రామకృష్ణకవి రాయలవారి ఆంతరంగికులలో అత్యంత ముఖ్యునిగా పేరుగాంచాడు. ఇలా కాగలగడానికి అప్పాజీ తిమ్మరుసు 'సిఫారసు' ఆయనకెంతగానో ఉపయోగపడింది. అది సత్సంప్రదాయం కాకున్నా రాయలవారి సభలో బ్రాహ్మణ కవులకే గుర్తింపు వుండేది. వారిలోనూ వైష్ణవులకే మన్నన లభించేది. శూద్రకవి అయినందుకే భట్టుమూర్తి ఎన్ని సందర్భాలలో తిరస్కారానికి గురయ్యాడో చూశాం. నాటికే ప్రతిభాశాలి

అయినప్పటికీ, భట్టుమూర్తి రాయలవారి కాలంలో తగిన గుర్తింపుకు నోచుకొనక రాయల మరణానంతరం అళియ రామరాయలు, తిరుమల రాయల పోషణలో ప్రఖ్యాత కవిగా గుర్తింపు పొందాడు. రామకృష్ణ కవి, తిమ్మరుసులపై వ్యతిరేకత కారణంగా తాతాచార్యుల వారి ప్రోద్బలంతో రాయలవారి పాలనా కాలంలో భట్టుమూర్తికి ఆ మాత్రం గుర్తింపన్నా లభించింది అలాగే తిమ్మరుసు ప్రోత్సాహం, సిఫారసులతో రామకృష్ణకవి రాయలవారి పాలనా కాలం చివరి పది సంవత్సరాలలో అష్టదిగ్గజాలలో ఒకనిగా స్థానం పొందగలిగాడు. ఒక విశ్వబ్రాహ్మణ కవి ఒకవేళ యిలా అష్టదిగ్గజాలలో ఒకనిగా కాగలిగినా రాయలవారికి సన్నిహితులలో ఒకనిగా వెలుగొంది వుంటాడనేది మాత్రం ఊహించనైనాలేం. ఎంచేతనంటే ప్రత్యేకించి విశ్వబ్రాహ్మణులు ఒకప్పుడు సమాజంలో ప్రముఖ కులంగా వున్నప్పటికీ, తరువాత కొన్ని వందల ఏండ్లపాటు అందరూ వారిని చాల చులకనగా చూసేవారు. 'కంసాలిని మించు కడజాతి లేదయా – విశ్వదాభిరామ వినురవేమ' అని వ్రాసిన వేమన పరుసవేది సాధించడంలో ఒక కంసాలి తనను మోసం చేశాడనే కోపంతో అలా వ్రాసి వుండవచ్చు. (విశ్వద అనే వేశ్య కారణంగా ఆయనకు కాంతపైన మోజు పోయిందనీ, అభిరాముడనే స్వర్ణకారుడిని వేమనే మోసం చేశాడనీ, తరువాత వేమనకు కనకంపైన కూడా మోజు పోయి, పశ్చాత్తాపంతో 'విశ్వద'కూ, 'అభిరాముడి'కీ తన పద్యాల ద్వారా అజరామరత్వం కల్పించాడనీ కొందరు నమ్ముతున్నారు.) అయితే ఒకప్పుడు స్వర్ణకార మొదలైన పంచాణపు వృత్తులు చేసుకుంటూ, సమాజంలో గౌరవనీయ ప్రతిపత్తి కలిగి వుండడమే కాక, రాజాస్థానాలలో గణకులుగానూ, లేఖకులుగానూ, రాజకీయ పత్రరక్షకులుగానూ విశ్వబ్రాహ్మణులుండే వారట. ఒకప్పుడు కరణీకాలు కూడా వారివేనట. చాళుక్య చోళ యుగము (క్రీ.శ. 625–1077) లో విశ్వబ్రాహ్మణులకు సమాజంలో ఎంతటి గౌరవ ప్రతిపత్తులుండేవో 'ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి అనే తమ గ్రంథంలో ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందుశేఖరం గారలు యిలా తెలిపారు –

"విశ్వకర్మ కులమనబడు కంసాలి వారికి సంఘమునందు విశేష గౌరవముండెను. రాజ శాసనములను రాగిరేకులపై చెక్కుట వీరి ప్రత్యేక విద్య. శాసన లేఖకులుగా విశ్వకర్మ కులజులు పేర్కొనబడుచుందురు. వీరు శైవులైననూ వృత్తి గౌరవమును బట్టియు, శిల్పులగుటచేతను (వైష్ణవులకు వలె) 'ఆచార్య' శబ్దము వీరి పేర్లకు చేర్చబడుచుండెను. ఒక్కొక్క రాజు కాలమున ఒక్కొక్క విశ్వకర్మ రాజశాసన లేఖక పదవి యందుండినట్లు తోచును. రెండవ విజయాదిత్యుని శాసనముల వ్రాయసకాడు అక్షర లలితాచార్యుడు. రాజరాజనరేంద్రుని శాసన లేఖకుడు గండాచార్యుడు. శాసన శిల్పమునందు నిపుణులైన విశ్వకర్మలు తరుచు విజయవాడ వాస్తవ్యులు" ('ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి' పేజీ 209 – ప్రచురణ బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు – మద్రాసు). అయితే 'అమర కోశము' వ్రాసిన అమర సింహుడు వారిని శూద్ర వర్ణంలో చేర్చి, సంకరులనుగా చిత్రించి వారి పేర్లు తన 'అమరకోశం'లో చర్మకారుల పిమ్మట చేర్చాడట. ('అమరకోశం' లో 'పాదూకృచ్చర్మకారస్స్యాత్' – పాదుకలు మరియు చర్మంతో చెప్పులు తయారు చేసేవాడు అని చర్మకారుల్ని పేర్కొన్న తరువాతనే 'వ్యోకారులు' 'లోహకారకులు' – కమ్మరులు; 'నాడింధములు', 'స్వర్ణకారులు', 'కలాదులు', 'రుక్మకారకులు' – అగసాలెవారు; వగైరాలను పేర్కొన్నాడు అమర సింహుడు.) ఇలా దేశమంతటా ఒకేసారి ఎందుకోమరి విశ్వబ్రాహ్మణులను స్థాయి తగ్గించి శూద్రులలో కూడా క్రింది తరగతికి చెందినవారిలా చూడడం ప్రారంభించారు. ఈ ప్రక్రియ దేశమంతటా ఒకే విధంగా జరిగినట్లుంది. ఎందుకంటే 'అమర కోశ' కర్త అమర సింహుడు ఉజ్జయినిని పాలించిన విక్రమాదిత్యుని సోదరుడైన భర్తృహరి ఆస్థానంలోని వాడు. అలా ఉత్తర భారతదేశంలో వాసి కోల్పోవడమే కాక దక్షిణ భారతదేశంలో కూడా విశ్వబ్రాహ్మణులు తమ వెనుకటి సామాజిక ప్రతిపత్తిని కోల్పోయి, కేవలం తమ కులవృత్తులకే – అంటే కమ్మరి, కంచరి, వడ్రంగి, శిల్పి, కంసాలి వృత్తులకే పరిమితమై వెనుకబడిన కులంగా మిగిలి పోయారు. ఆంధ్ర ప్రాంతంలో

యిదెలా జరిగిందో వివరించే చిన్న గాథ 'ధీరజన మనోవిరాజితము' లోనే వుంది. దాన్ని తరువాత పరిశీలిద్దాం.

విశ్వబ్రాహ్మణులు చెప్పుకొనే ఒక ఐతిహ్యం ప్రకారం – గోపరాజు రామన అనే ప్రథమ శాఖకు చెందిన నియోగి బ్రాహ్మణుడు క్రీ.శ. 1144లో తిరుపతి యాత్రకు వెళ్లి తన తిరుగు ప్రయాణంలో సత్తెనపల్లి తాలూకా మాదల గ్రామంలో ఒక రాత్రి ఒక బ్రాహ్మణుడి యింటిలో విడిది చేశాడట. అప్పటి వరకు గ్రామకరణీకాలన్నీ విశ్వబ్రాహ్మణులకే వుండేవట. ఆ రోజు ఆ బ్రాహ్మణుడి యింట్లో తండ్రిగారికి 'ఆబ్దికం' (ఏడుడి లేక సంవత్సరీకం) ఉన్నదట. కాని అప్పటి వరకు అతడు సర్కారుకు చెల్లించాల్సిన కిస్తు (వార్షిక శిస్తు మొత్తం) చెల్లించకుండా జాప్యం చేసినట్లున్నాడు. అందుకని తండ్రిగారి 'ఆబ్దికం' అని కూడా సంకోచించక ఆ గ్రామ కరణం సదరు బకాయిపడ్డ బ్రాహ్మణుడికి 'బొండగొయ్య' వేయించాడట. (రెండు చేతుల మణికట్లకూ, కంఠానికీ కలిపి వేసే చెక్కతో తయారైన బరువైన కొయ్యను 'బొండగొయ్య' అంటారు. పల్నాడులో పులిపాడు కరణం ఏడు నూర్ల టంకాలు చెల్లించలేదని శ్రీనాథుడికి యిటువంటి కొయ్యే వేశాడని ప్రతీతి. అయితే శ్రీనాథుడి కథ చాల తర్వాత కాలానికి చెందినది – బహుశా క్రీ.శ. 1380 ప్రాంతంలో అది జరిగి వుంటుంది). తనకు ఆతిథ్యమిచ్చిన గృహస్థును కరణం అలా శిక్షించడం చూసి, ఆ యింటికి అతిథిగా వచ్చిన గోపరాజు రామన చలించిపోయాడట. ఈ కరణాల పీడ ఎలాగైనా వదలించుకోవాలని అప్పుడే రామన తన మనస్సులో కృతనిశ్చయుడయ్యాడట.

ఆ సంవత్సరం అంటే క్రీ.శ. 1144 రక్తాక్షి పితృ అమావాస్యనాడు సూర్య గ్రహణం ఏర్పడగా గణపతి మహారాజు కృష్ణానదిలో స్నానం చేయడానికి వచ్చాడట. అప్పుడు గోపరాజు రామన తాము ముందుగా సిద్ధం చేసుకున్న పథకం ప్రకారం ఆ కృష్ణా తీరానికి బ్రాహ్మణు లెవ్వరూ రాకుండా కట్టడి చేసి తాను మాత్రమే రాజు గారికి కనుపించి సంకల్పం చెప్పి రాజుగారిచే గ్రహణ స్నానం చేయించి ప్రతిఫలంగా ఏడు గడియల పాటు రాజముద్రిక తనకు యిచ్చేటట్లుగా వరం పొంది (గ్రహణ స్నానం తరువాత బ్రాహ్మణుడికి రాజులు అడిగినది సంకోచించక దాన మిచ్చేవారట), అంతకు ముందే తాను సిద్ధం చేసి ఉంచుకున్న కరణీకం ఫర్మానాలపై ఆ రాజముద్రను వేసి, సమయం పూర్తవగానే తిరిగి రాజముద్రను మళ్లీ రాజుగారికి అప్పగించేసి, అంతక్రితం తాను ముద్రలు వేసి పెట్టుకున్న పత్రాలను తమ నియోగులకు పంచాడట. ముందుగా తమ గోత్రీకులైన యాజ్ఞవల్క్యులకు (ప్రథమ శాఖీయులకు) అవి పంచి అనంతరం మిగిలిన వారికి పంచాడట. అంచేత ఆనాటి నుంచి నియోగులలో యాజ్ఞవల్క్యులు ప్రథమ శాఖవారు, తక్కినవారు ఆరువేల వారు అయ్యారట. గోపరాజు రామన ఒక్కడు చేసిన యీ పని కారణంగా ఒక్కరోజులో 535 మంది విశ్వబ్రాహ్మణుల కరణీకాలన్నీ పోయాయట. వారి స్థానంలో బ్రాహ్మణులు కరణాలుగా నియమింప బడ్డారట. ఈతవాయి అనే గ్రామంలో మాత్రం ఒక్క మాసాబత్తుల వారు ఎలాగో నేటికీ కరణాలుగా మిగిలివున్నారట.

ఈ వృత్తాంతం యొక్క సత్యాసత్యాలపై కొంచెం చర్చించాల్సి వుంది. 'ధీరజన మనోవిరాజితము'లో వ్రాసిన దానిప్రకారం క్రీ. శ. 1144 రక్తాక్షినామ సంవత్సరంలో గ్రహణ స్నానం చేసిన ఆ రాజు గణపతి కాదు. శ్రీకృష్ణదేవరాయలు. ఆయన గ్రహణం సందర్భంగా కృష్ణానదీ తీరానికి కాదు, సముద్ర స్నానానికి వెళ్లాడు. అయితే, చారిత్రకంగా చూస్తే కృష్ణదేవరాయల పాలనా కాలం క్రీ.శ. 1509–30. కనుక యిది సమంజసం కాదు. పోనీ ఆ రాజు కాకతి గణపతి దేవ చక్రవర్తి అనుకుందామా – అందుకూ వీల్లేకుండా వుంది. ఎంచేతనంటే యీ ఘటన క్రీ.శ. 1144 లో జరిగిందంటున్నారు. కాని క్రీ.శ.1149 వరకు ఓరుగల్లును రెండవ ప్రోలరాజే పరిపాలించాడు. కనుక అప్పటికి యింకా గణపతి దేవ చక్రవర్తి పాలన ప్రారంభం కాలేదు. అంచేత యీ గణపతి మహారాజు కాకతి గణపతి దేవుడు కాక, (కటకం) గజపతి వంశీయుడై వుంటాడు. చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ లోకల్ రికార్డులలో పేర్కొనబడిన (తెనాలి తాలూకా) కూచిపూడి గ్రామ కైఫీయ్యత్ ప్రకారం

– ఆ రాజు గజపతుల వంశానికి చెందిన గణపతి అనేవాడు. అతడి పాలనా కాలం శాలివాహన శకం 1056 నుండి ప్రారంభమైంది. అంటే క్రీ.శ. 1134 నుండి ఆ గణపతి రాజు పాలించాడన్నమాట. ఈ ఘటన శా.శ. 1062 అంటే క్రీ.శ. 1140లో జరిగింది. (*Brown Local Records; Madras M. 313, L.R.Vol. 5. PP 409-412*)

సత్యమైనా, అసత్యమైనా ఈ గాథ యింత విపులంగా దేనికి పేర్కొన్నానంటే – దేశంలోని అన్ని ప్రాంతాలలో ఒకప్పుడు లేఖకులుగా, రాజోద్యోగులుగా, కరణములుగా ఒక వెలుగు వెలిగిన విశ్వబ్రాహ్మణులు ఒక్కసారిగా రాజుల నిరాదరణకు గురై, కేవలం కులవృత్తులపై ఆధారపడి జీవించే వెనుకబడిన తరగతికి చెందిన వారుగా మారిపోయారన్నది సత్యం. దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ ఒకే సమయంలో యిదే విధంగా ఎలా జరిగిందనేది విచిత్రం! దీనికి కారణాలు వేరే ఏవైనా వుండి వుండవచ్చు. 'అమరకోశం'లో అమరసింహుడు వారిని శూద్ర వర్ణంలో చేర్చి, సంకరులనుగా చిత్రించి, వారి పేర్లు చర్మకారుల తరువాత చేర్చినంత మాత్రాన ఈ పరిణామం జరగదు. ఇంకా చెప్పాలంటే ఆ గణపతో లేక గజపతో – ఆయన అధికార ప్రాభవం ఎంత వైశాల్యానికి పరిమితం? ఆయన ఫర్మానా ఎంత మేరకు చెల్లుబాటవుతుంది? ఇంత సువిశాల దేశంలో కేవలం 535 మంది విశ్వబ్రాహ్మణులను కరణీకాలనుంచి తొలగించి వారి స్థానంలో బ్రాహ్మణులను నియమించినంత మాత్రాన దేశ వ్యాపితంగా విశ్వబ్రాహ్మణులు సామాజిక, ఆర్థిక ప్రతిపత్తి కోల్పోయి వెనుకబడిన కులంగా మారిపోతారా ? ఒకప్పుడు ఓ వెలుగు వెలిగిన విశ్వబ్రాహ్మణులు స్థాయి తగ్గి వెనుకబడిన కులంగా మారడం దేశవ్యాప్త పరిణామం. దీనికి వేరే కారణాలేవైనా వుండి వుంటాయి. అవి మన ప్రస్తుత చర్చకు ఏ విధంగానూ ఉపయోగపడేవి కావు కనుక దీనినింతటితో ముగిద్దాం.

అటువంటి ఆనాటి పరిస్థితులలో విశ్వబ్రాహ్మణ కులస్థుడైన తెనాలి రామలింగకవి రాయలవారి ఆస్థానంలో ప్రవేశించడం, రాలయవారికి అతి సన్నిహితుడైన వికటకవిగానూ, అష్టదిగ్గజ కవుల్లో రాయలవారికి అత్యంత ప్రీతిపాత్రుడైన వాడిగానూ వుండగలగడం అసాధ్యం. వైష్ణవేతరులైన బ్రాహ్మణులకే సాధారణంగా రాయలవారి సముఖం లభించనప్పుడు యిది ఊహకు కూడా అందని విషయం. కనుక తిమ్మరుసుచే ప్రోత్సహించబడిన గార్లపాటి రామలింగకవే, వైష్ణవుడై, రామకృష్ణ కవిగా రాయలవారి హృదయంలో స్థానం సంపాదించాడనేది యథార్థం. పైపెచ్చు హంపిలో నివసించి, రాయలవారి కంటే ముందుగా మరణించిన తెనాలి రామలింగము అనే విశ్వబ్రాహ్మణ కవి ఒకరు ఉన్నట్లుగా ఎవరిచేతనూ యింతవరకూ సోపపత్తికంగా నిరూపించబడలేదు కూడా.

ఆనాడు రాయలవారి ఆస్థానంలో వున్నాడని చెప్పబడుతున్న ఆ విశ్వబ్రాహ్మణ కవి కంసాలి భద్రయ్య అనీ, అతడు 'సరస మనోరంజనము' అనే ప్రబంధాన్ని వ్రాశాడని కొందరంటారనీ పేర్కొంటూ కందుకూరి వీరేశలింగం పంతులు గారు తమ 'ఆంధ్రకవుల చరిత్రము' ద్వితీయ భాగంలో బ్రౌన్ దొర ఉదాహరించిన యీ క్రింది పద్యాన్ని పేర్కొన్నారు.

ఉ॥ **ఎన్నఁడు నేరిచెన్ బెళుకులీ చెలి కన్నులు, కారుకమ్ము ల**
**న్నన్న కురుల్, పిఱుందు బటువై పటు వైఖరి గైకొనంగదే,**
**మొన్న గదమ్మ పిన్న మొన మొల్కలు నేఁడివె ముద్దులాడి లేఁ**
**జన్నులు గొప్పవై పయిఁట సందున దాఁగుడు మూఁతలాడెడున్.**

ఈ పద్యం భద్రయ్య రాయలవారి ఎదుట చదివినప్పుడు తెనాలి రామకృష్ణకవి 'మొల్క'యని ప్రయోగించినందుకు ఆక్షేపించాడట; అప్పుడు దానికి సమాధానంగా ఎవరో లేచి యీ క్రింది పద్యాన్ని చెప్పారట–

చ॥ వెలగకు వెల్గయంచు సరవిన్ జతికొండ నృసింహుఁడాడఁగా,
మొలకకు మొల్కయంచుఁ గవి ముఖ్యుఁడు భద్రయ పల్కదోసమా?
బళిబళి! మంచి మాటయె! ప్రబంధమునా జలరాశి దానిలో
పల నెరుసుల్గణింతురె యపారములౌ మణులెల్ల నుండఁగన్?

'వెలగ' అని పేర్కొనడానికి చరికొండ నరసింహ కవి 'వెల్గ' అని పేర్కొనగాలేనిది ప్రసిద్ధ కవియైన భద్రయ్య మొలక అనడానికి మొల్క అని పేర్కొంటే దోషమేముంది? ప్రబంధము అంటే మహా సముద్రము. దానిలో అపారములైన మణులు వగైరా సంపదలుండగా వాటిని గ్రహించి అనుభవించాలి గానీ ఎవరైనా నెరుసులు లెక్కిస్తారా?

అయితే 'అప్పకవీయము'లో అప్పకవి యీ పద్యాన్ని ఉదాహరించి యిది వినుకొండలో గుంటుపల్లె భాస్కరుని వద్ద కందుకూరి రుద్రయ్య అనే అగసాలె కవి చెప్పినట్లు వ్రాశారు. దీనిని బట్టి 'శశిబిందు చరిత్రము' అనే కావ్యం వ్రాసిన చరిగొండ నరసింహకవి కందుకూరి రుద్రయ్యకు పూర్వుడనీ 'సరస మనోరంజనము' అనే ప్రబంధము వ్రాసినది కందుకూరి రుద్రయ్య అనే అగసాలె కవే గాని భద్రయ్య కాదనీ పంతులుగారు తేల్చారు. ఈ రుద్రయ్య కూడా రాయలవారి కాలంలో లేడనీ క్రీ.శ. 17వ శతాబ్ది ఆరంభంలోనున్న గుంటుపల్లి భాస్కరుడికి సమకాలికుడనీ తేల్చారు. స్వర్ణకారుడైన యితడిది కందుకూరు. అక్కడి సోమేశ్వరస్వామికి యీయన తాను వ్రాసిన 'నిరంకుశోపాఖ్యానము'ను అంకితమిచ్చాడు. ఈయన తండ్రి స్వర్ణకార వృత్తి చేసుకొనే పెదలింగన్న. ఈ రుద్రకవి తిట్టుకవిగా ప్రసిద్ధుడు. రాయలవారి కాలంలో యీయన వున్నాడని కొందరి వాదన. తన భువనవిజయ ప్రవేశానికి ఆటంకాలు కలుగజేసిన బ్రాహ్మణ మంత్రుల్ని 'కులాన్ని చెరిచే ఎంగిలి ముచ్చు గులాములు' అని తిట్టిందీయనే. బహుశా యీయన తిట్టుకవితలలోని ఘాటు కారణంగా యీయనే రామలింగడని పొరబడి తెనాలి రామలింగ కవి అనే విశ్వబ్రాహ్మణ కవి రాయలవారి సమకాలికునిగా వుండేవాడని కొందరు తప్పుగా అభిప్రాయపడినట్లున్నారు.

ఇక రెండవ అంశంగా మన రామకృష్ణ కవి హంపి విజయనగరంతో సంబంధమున్నవాడా? కాదా? అనే విషయానికొద్దాం. 'ఉద్భటారాధ్య చరిత్రము' వ్రాసిన శైవుడైన గార్లపాటి రామలింగకవే, ఆ తరువాత వైష్ణవుడై 'పాండురంగ మాహాత్మ్యము', 'ఘటికాచల మాహాత్మ్యము' అనే కావ్యాలు వ్రాశాడనేది నిర్ధారింపబడిన సత్యం. ఈ మూడు కావ్యాల కర్త ఒక్కరేననే విషయంలో యింకా ఏవైనా అనుమానాలున్న వారు 'రామకృష్ణ కవి కావ్యాలలోని సారూప్యతలు' పేరిట వున్న యీ గ్రంథపు మూడవ అనుబంధాన్ని చూడండి. ఈ మూడు కావ్యాలనూ రచించింది ఒకే కవి అనేది నిర్ద్వంద్వంగా నిరూపణ అయింది.

ఇక మన రామలింగ (రామకృష్ణ) కవికి హంపితో ఏమైనా సంబంధమున్నదా? లేదా? అనే విషయానికొస్తే - విశ్వబ్రాహ్మణుడైన తెనాలి రామలింగ కవి రాయలవారి కాలంలో జీవించి రామకృష్ణుడని తన పేరును మార్చుకున్నట్లు ఎట్టి ఆధారాలూ లేవు. ఏ విమర్శకుడూ అలాగని వాదించడం లేదు కూడా. కనుక తెనాలి రామకృష్ణుడనే పేరుగల ఓ కవికీ హంపికీ సంబంధమున్నట్లు ఋజువుపరిస్తే చాలు; మన గార్లపాటి రామకృష్ణ కవి రాయలవారి కాలంలో హంపిలో నివసించినట్లు ధృవపడుతుంది. తెనాలి రామకృష్ణుడిగా సుప్రసిద్ధుడైన ఒకప్పటి రామలింగకవి హంపిలో నివసించాడనడానికి ఎన్నో సాక్ష్యాధారాలున్నాయి. ఒక్కొక్కటిగా వాటిని మనమిప్పుడు చూద్దాం.

అ) హంపి వెళ్లిన వారెవరికైనా అక్కడి తెనాలి రామకృష్ణుని మండపం సుపరిచితం. ఈ మండపం యొక్క వివరాలు మనం చూద్దాం. 1948లో ప్రచురింపబడిన 'విజయనగర వైభవ శిథిలాలు' (*Relics of Vijaya Nagar Glory*)

అనే తన ఆంగ్ల గ్రంథంలో రచయిత ఎ.కె. బాల సుందరం గారు (యీయన ఒకప్పుడు బళ్లారి జిల్లా బోర్డు విద్యాశాఖాధికారి - డి.ఇ.ఓ. - గా పనిచేసినవారు) యిలా పేర్కొన్నారు - "హంపిలోని మతంగ పర్వతానికి తూర్పుగా వున్న రెండవ గిరిశిఖరం పైన వీరభద్రస్వామి ఆలయం వుంది. గజశాలలకు బాగా వెనుకగా వున్న దశావతారముల వీధి నుండి కొండల నడుమగా యీ ఆలయానికి దారి వుంది. ఇక్కడి వీరభద్రస్వామి విగ్రహం 7×6 అడుగుల ప్రమాణంలో వున్న అద్భుత శిల్పకళాకృతి. ఒక పెద్ద బండరాతిలో నాలుగవ వంతు భాగంలో యీ విగ్రహం చెక్కబడింది. ఆ బండరాయి దక్షిణపు కొన విప్పిన నాగుపాము పడగలా వుంటుంది. ఈ ఆలయానికి ఒక మండపం వుంది. అది పడమటి దిక్కుగా వున్న మరొక పెద్ద బండరాతిపైన 6×4 అడుగుల పరిమాణంలో ఏక శిలలో తొలిచి నిర్మించబడింది. దానిని 'తెనాలి రామకృష్ణుని మండపం' అంటారు. (Page 130. Relics of Vijayanagar Glory') (తెలుగు సేత యీ రచయితది)

తెనాలి రామకృష్ణుడు హంపి విజయనగరంలో జీవించిన వ్యక్తి అనడానికి యీ సాక్ష్యం సరిపోతుంది. ఈ మండపం వీరభద్ర ఆలయం చెంత రామకృష్ణుడే నిర్మింపజేశాడని అక్కడి వారు చెబుతారు. ఒక్క తెనాలి రామకృష్ణుని మండపమే కాక హంపిలో మాధ్వ గురువు వ్యాసరాయని స్మృతి చిహ్నంగా నిర్మింపబడిన 'వ్యాసరాయ మండపం', చింతామణి ఆశ్రమం సమీపంలో తుంగభద్రనది ఒడ్డున 64 శిలా స్తంభాలతో నిర్మింపబడిన కృష్ణదేవరాయల సమాధి, వ్యాసరాయుడు, విజయేంద్రుడు వగైరా తొమ్మిది మంది మాధ్వస్వాముల సమాధులైన 'నవ బృందావనం', యింకా తుంగభద్రా తీరంలో రాతి స్తంభాలపై నిర్మింపబడిన క్రీ.శ. 16వ శతాబ్దికి చెందిన సంగీత విద్వాంసుడు భక్త పురందర దాసు మందిరము వగైరాలు విజయనగర సామ్రాజ్యం యొక్క గత కాలపు వైభవానికీ, చరిత్రకూ తీపి గురుతులుగా నిలిచి పోతాయి.

ఆ) ఒక్క తెలుగు సాహిత్యంలోనే కాక తెనాలి రామకృష్ణ కవిని గురించిన కథలు తమిళ, కన్నడ, మలయాళ సాహిత్యాలలోనూ యితర భారతీయ భాషా సాహిత్యాలలోనూ సుప్రసిద్ధమైనట్టివి. అవి కేవలం హాస్యానికి సంబంధించినవిగానే కాక, ఆశుకవిత్వం, సమస్యాపూరణం వగైరాలలో ఆయనకున్న సర్వతోముఖ ప్రతిభావిశేషాలకు కూడా దర్పణం పడుతున్నాయి. అక్కడక్కడా తిట్టుకవితలూ, బూతు కవితలూ చెప్పినా ఆయన ప్రాయికంగా గొప్ప రసదృష్టి, అభినివేశము, ఆవేశమూ కల మహాకవి. ఇతర చారిత్రక ఆధారాలేకాక, మొదట శైవుడైనా తరువాత వైష్ణవుడుగా మారిన గార్లపాటి రామలింగ కవి తన పేరు రామకృష్ణునిగా మార్చుకున్నట్లు ఎన్నో కథలు ప్రచారంలో వున్నాయి. అసంఖ్యాకంగా వున్న ఆయనకు సంబంధించిన చాటువులు కూడా రాయలవారి కాలంలో హంపిలో తెనాలి రామకృష్ణ కవి నివసించినట్లు ధృవపరుస్తున్నాయి. తన గురువైన భట్టరు చిక్కాచార్యులు వద్ద వైష్ణవం స్వీకరించి వడహల (వైఖానస) వైష్ణవునిగా మారిన రామకృష్ణకవి తెంగల శాఖకు చెందిన తాతాచార్యులు వగైరాలతో పట్టిన శిగపట్లు, భట్టుమూర్తితో ఆయనకున్న వైరుధ్యాలు వగైరాల గురించిన గాథలు రామకృష్ణకవి రాయలవారి కాలంలో హంపిలో కొంతకాలం వెలుగొందినట్లుగా ఋజువు పరుస్తున్నాయి. అల్లసాని పెద్దన, నంది (ముక్కు) తిమ్మన, ధూర్జటి, పింగళి సూరన వగైరా కవులందరితో ఆయన తలపడినట్లుగా ప్రచారంలో వున్న చాటువులు యీ సత్యాన్ని మరింతగా ధృవపరుస్తున్నాయి. భట్టుమూర్తి తన ప్రసిద్ధమైన చాటువులో, 'ఆరవి వీరభద్రుని పదాహతి దుల్లిన బోసినోటికిన్. . నేరదు రామకృష్ణకవి' అనే పేర్కొన్నాడు. కనుక నాడు హంపిలో వున్నది మన రామకృష్ణ కవే గానీ, ముమ్మాటికీ తెనాలి రామలింగడు అనే పేరుగల విశ్వబ్రాహ్మణ కవి కానేకాదు. ఎందుకంటే ఆ రామలింగడు రాయలవారి కాలంలో వున్నట్లుగానీ, వుండి వుంటే శైవాన్ని వదలి వైష్ణవుడైనట్లుగానీ, ఆయన కూడా రామకృష్ణుడని పేరు మార్చుకున్నట్లుగానీ ఏ ఆధారాలూ లేవు. ఆ రామలింగ కవి ఆ తరువాత చాల కాలం పిమ్మట గోలకొండలో అక్కన్న, మాదన్నల పరిపోషణలో 'ధీరజన మనోవిరాజితం' అనే ఏకాశ్వాస కావ్యం వ్రాసిన రామలింగమే కాని వేరొకరు కాదు

మన రామకృష్ణ కవి రామలింగ కవిగా వున్నప్పుడు 'ఉద్భటారాధ్య చరిత్రము' వగైరా కావ్యాలు వ్రాసి, రామకృష్ణుడైన అనంతరం 'పాండురంగ మాహాత్మ్యము', 'ఘటికాచల మాహాత్మ్యము' వగైరా కావ్యాలు వ్రాసిన మహాకవి. కనుక హంపిలో నాడు నివసించినది తెనాలి రామకృష్ణునిగా ప్రసిద్ధుడైన గార్లపాటి రామకృష్ణకవే గాని, 'తెనాలి రామలింగము' అనబడిన విశ్వబ్రాహ్మణ కవి కానేకాదు. వైష్ణవునిగా మారిన గార్లపాటి రామలింగకవి తన పేరును రామకృష్ణునిగా మార్చుకొన్నప్పటికీ, తెంగల వైష్ణవులు ఆయన్ని 'రామలింగడి' గానే వ్యవహరించారనీ; రామకృష్ణకవికి సంబంధించిన హాస్య కథలలో హెచ్చుభాగం ఆయన హంపికి వెళ్లిన తొలినాళ్లకు సంబంధించినవనీ, అంచేత హెచ్చు శాతం కథలలో ఆయన రామలింగడనే పేర్కొనబడ్డాడనీ నేను లోగడనే తెలిపాను.

ఇ) 'ఉద్భటారాధ్య చరిత్ర' కర్తయైన తెనాలి రామకృష్ణ కవి అనంతరకాలంలో హంపిలో 'భువన విజయం'లోని అష్టదిగ్గజములలో ఒకనిగా కీర్తిగాంచాడని తెలుగు సాహితీ విమర్శకులంతా దాదాపు ఏకగ్రీవంగా నిర్ధారించారు. అదే కవి తరువాత కాలంలో 'పాండురంగ మాహాత్మ్యము', 'ఘటికాచల మాహాత్మ్యము' రచించాడని వారంతా అభిప్రాయపడ్డారు. నంది తిమ్మన, అల్లసాని పెద్దన, ధూర్జటి, అయ్యలరాజు రామభద్రుడు, మాదయగారి మల్లన, తెనాలి రామకృష్ణుడు, భట్టుమూర్తి, పింగళి సూరన – ఈ ఎనిమిది మందీ రాయలవారి 'భువన విజయం'లో అష్టదిగ్గజ కవులుగా వెలుగొందిన వారని హెచ్చుమంది సాహితీ విమర్శకుల అభిప్రాయం. కొందరు కందుకూరి రుద్రకవి కూడా అష్టదిగ్గజాలలోని వాడేననీ, సూరన ఆ తరవాత కాలం వాడనీ, మరికొందరు భట్టుమూర్తీ, అయ్యలరాజు రామభద్రుడూ, కందుకూరి రుద్రకవీ ఆ తరువాతి కాలం వారనీ వాదించినప్పటికీ తిమ్మన, పెద్దన, ధూర్జటి, తెనాలి రామకృష్ణుడు – ఈ నలుగురూ అష్టదిగ్గజాలలో వున్నారనే విషయంలో ఆంధ్ర సాహితీ విమర్శకులందరిదీ ఒక్కటే అభిప్రాయం. ఈ అభిప్రాయం వెలిబుచ్చిన ప్రముఖులు గురజాడ శ్రీరామమూర్తిగారు, కందుకూరి వీరేశలింగం పంతులుగారు, చిలుకూరి వీరభద్రరావు గారు, కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారు, వేటూరి ప్రభాకర శాస్త్రి గారు, చాగంటి శేషయ్య గారు, నేలటూరి వేంకట రమణయ్యగారు, నిడుదవోలు వేంకటరావు గారు వగైరాలు. అష్టదిగ్గజాలలో తెనాలి రామకృష్ణుడు ఉండేవాడా? లేదా? అనే విషయంపై యిక చర్చకు ఎంత మాత్రమూ తావు లేకుండా వీరంతా రామకృష్ణుడు నాటి రాయలవారి అష్టదిగ్గజాలలో ఒకడని ఏకగ్రీవంగా అభిప్రాయపడ్డారు.

ఈ) డాక్టర్ వసుంధర ఫిల్లియోజాత్ అనే గొప్ప చరిత్ర పరిశోధకురాలు విజయనగర సామ్రాజ్య చరిత్రకు సంబంధించినంతవరకు సాధికారమైన వ్యక్తిగా భావించబడుతున్నది. ఆమె విజయనగర సామ్రాజ్యానికి ఆ కాలంలో విచ్చేసిన విదేశీ రాయబారులు, వ్యాపారులు వగైరాలు నాటి స్థితిగతులను గురించి వారి వారి భాషలలో వ్రాసిన విషయాలను ఆంగ్లంలోనికి అనువదించి, ఆ సమాచారాన్ని విశ్లేషించి ఎన్నో విలువైన చారిత్రకాంశాలతో పలు గ్రంథాలు వ్రాశారు. ఆమె కూడా తన 'విజయనగర్' అనే ఆంగ్ల గ్రంథంలో అల్లసాని పెద్దన వగైరాలతో రాయలవారి 'భువనవిజయం'లో తెనాలి రామకృష్ణకవి ఉండినట్లు వ్రాశారు. (తెనాలి రామలింగము అనే పేరును ఆమె కూడా పేర్కొనలేదు)

ఉ) రాయలవారి పాలనా కాలంలో చివరి దశ అంటే సుమారుగా క్రీ.శ.1520 నుండి తిరుమలరాయల పాలనా కాలం వరకు అంటే సుమారుగా క్రీ.శ. 1572 వరకు రామకృష్ణకవి విజయనగర సామ్రాజ్యంలోనే (అంటే హంపిలోనో, చంద్రగిరిలోనో లేక పెనుగొండలోనో) నివసించి వుంటాడు. లేక విజయనగర సామ్రాజ్యంలో తనకు గిట్టని తిరుమల రాయల ప్రాభవం చెల్లుబాటైన కాలంలో మాత్రం విజయనగర సామ్రాజ్యానికి దూరంగా తెనాలి, పిఠాపురంలలోనూ, అటు తరువాత పొత్తపినాడులోనూ వుండి వుండే అవకాశమూ వుంది. రాయలవారికి ఆంతరంగికుడిగా ఎంత సన్నిహితంగా

మెలిగినా ఒక్కపాటుగా విపరీతమైన కోపం వచ్చే వ్యక్తి అయిన రాయలవారి ఆగ్రహానికి అతి తరచుగా గురై రెండు సార్లు మరణ శిక్షలు, ఒకసారి దేశ బహిష్కరణ శిక్ష, 'దేవిడీ మనా' మొదలైన రాచనగరు బహిష్కరణ శిక్షలు ఎన్నో మార్లు ఆయన రాయలవారిచేతిలో రుచి చూశాడు. విజయనగర రాజులంటే ఆ దశలోనే ఆయనకు కొంత ఏవగింపు జనించి వుండవచ్చు. తన సంగతి సరే – తనో సామాన్యుడు. తనపై ఎలాంటి తీవ్ర నేరాలు మోపి ఎంతటి కఠిన శిక్షలు విధించినా పరవాలేదు కాని రాయలవారి ప్రాభవానికి మూలకారకుడైన అప్పాజీ తిమ్మరుసును రాయలవారు అనుమానించి, అవమానించి, శిక్షించిన తీరును బట్టి బహుశా రామకృష్ణకవికి కేవలం విజయనగర రాజులంటేనే కాక అసలు రాజులంటేనే తీవ్రమైన నిరసన జనించి వుండవచ్చు. రాజసామీప్యం యాతి బాధలలో ఒకటని ఆనాడు రామకృష్ణకవికి అర్థమై వుండవచ్చు. అందుకే 'భువన విజయము' లోని తన ఉనికి ఆయనకు మరువలేని ఒక చేదు జ్ఞాపకంగా మారి వుండవచ్చు. అంతేకాక ఈ కారణంగానే ఆయన అటు తరువాత ఎప్పుడూ హంపిలోని తన జీవితాన్ని గురించి గొప్పగా చెప్పుకొని వుండకపోవచ్చు. తరువాత యిక ఎప్పుడూ ఆయన ఏ రాజు ఆస్థానంలోనూ లేడు. రాయలవారి మరణానంతరం అచ్యుతరాయల పాలనా కాలంలో కూడా రామకృష్ణ కవి హంపిలోనే కొనసాగినట్లు కనుపిస్తున్నది. అయితే ఆ కాలంలో ఆయన ఓ సామాన్య పౌరుడిగా, రాజభరణం స్వీకరిస్తూనో లేక తనకు తానుగా యితర మార్గాలలో ఉదర పోషణ చేసుకుంటూనో, తనకు అత్యంత ప్రీతిపాత్రమైన విట్ఠల ఆలయం సమీపంలో నివసిస్తూ, రాచవ్యవహారాల జోలికి వెళ్లకుండా కేవలం విట్ఠల భక్తిలోనే తాదాత్మ్యం చెందినట్లు కనుపిస్తున్నది. ఆ కాలంలో విట్ఠల దేవునిపై ఆయనకేర్పడిన అపారమైన భక్తి విశ్వాసాలు, అనురక్తి తదనంతర కాలంలో ఆయన రచించిన 'పాండురంగ మాహాత్మ్యము' లో ప్రతిఫలించాయి. విట్ఠల భక్తి ఆయన జీవితపు తీరు తెన్నులనే మార్చివేసింది. ఆయనలోని తిట్టు కవిత్వము, బూతు కవిత్వము, హాస్యానురక్తి మరుగున పడి ఆయనొక భక్తకవిగా రూపుదాల్చాడు. వయస్సు పైబడడంతో పాటు ఆలోచనలలో వచ్చిన పరిణతి దీనికి మరింత దోహదం చేసింది. ఈ సహజ బౌద్ధిక పరిణామాన్ని గుర్తించకుండా కొందరు విమర్శకులు దుందుడుకు స్వభావం కల ఆ తిట్టుకవి వేరూ, మహాభక్తుడైన 'పాండురంగ మాహాత్మ్య' కర్త వేరూనని భావించడం శోచనీయం.

పైబడిన వయస్సులో కూడా ఆయనలోని స్వతస్సిద్ధమైన హాస్యానురక్తి ఒంటి కంటి తిరుమల రాయలుపైన ఆయన చెప్పిన 'అన్నాతి గూడ హరుడౌ' అన్న పద్యంలో ద్యోతకమవుతున్నది. తిరుమలరాయలపై ఆయన కసికి కారణముంది ఆ సంగతేమిటో తరువాత వివరంగా చూద్దాం.

ఊ) రామకృష్ణ కవి హంపిలో నివసించిన కాలంలో ఆయనకు ఆ నేల మీదా, ఆ గాలి మీదా ఆ తుంగభద్రానదీ తోయం పైనా ఎనలేని మక్కువ జనించింది. అది యింత అని చెప్పడానికి వీలుకానంత అపరిమితమైనది.

'పాండురంగ మాహాత్మ్యము' కావ్యంలో అగస్త్యుడు, ఆయన భార్య లోపాముద్ర శిష్యులతో కూడి కాశీ నుంచి బయలుదేరి వింధ్య మీదుగా సామిమల (ప్రస్తుత తమిళనాడులోని కుంభకోణంకు ఎనిమిది కిలోమీటర్లు పడమరగా వున్న ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రం స్వామిమలై) వెళ్తూ కొల్లాపురం (నేటి మహబూబ్‌నగర్ జిల్లాలో వుంది)లో కొలువైన లక్ష్మీదేవిని సేవించి వారి ప్రయాణంలో భాగంగా కుంతల దేశాన్ని చేరుకున్నారని చెపుతూ అక్కడి ప్రదేశం యొక్క సౌందర్యాన్ని, అక్కడి ప్రజలనూ ఆయన వర్ణించిన తీరును బట్టి కుంతలదేశమంటే ఆయనకెంత మమకారం వుందో మనం అర్థం చేసుకోవచ్చు. నేటి ఈశాన్య కర్ణాటకే ఒకప్పటి కుంతల రాజ్యం. యదువు సంతతిలోని వాడైన కుంతలుడు పాలించిన ప్రదేశం కావున ఆయన పేరు మీదుగా అది కుంతల రాజ్య మనబడింది. ఒకప్పటి హంపి విజయనరగం ఆ రాజ్యంలోని భాగమే. ఆ ప్రాంతపు సౌందర్యాన్ని కవి తనివిదీరా వర్ణించాడు. ఆ తుంగభద్ర నీటినీ, దాని నుండి వచ్చే తెమ్మెరలనూ, ఆ నది ఒడ్డున

వున్న ఆశ్రమాలను, అక్కడి ముని బాలకులనూ, వృక్ష, పశుసంపదలనూ, మాల్యవంతము వగైరా పర్వతాలనూ ఎంతో వివరంగా వర్ణించాడు. తుంగభద్రా నదిని 'పాండురంగ మాహాత్మ్యము' లోనే కాక, 'ఘటికాచల మాహాత్మ్యము' లో కూడా అవసరానికి మించి వర్ణించడం ఆయనకు తుంగభద్రపై వున్న అవ్యాజమైన అనురాగాన్ని సూచిస్తున్నది. ఆ ప్రాంతంపైన, అక్కడి ప్రజలపైన, ప్రత్యేకించి తుంగభద్ర నదిపైన ఆయనకున్న మక్కువ ఆయన హంపి విజయనగరంలో నివసించినప్పుడేర్పడినట్టిదే. లేకుంటే సామిమలకు వెళ్లే దారిలో ఎన్నో ప్రాంతాలున్నప్పటికీ ప్రత్యేకించి వారి ప్రయాణంలో హంపిని ఒక మజిలీగాచేసి, ఆ ప్రాంతాన్నీ, తుంగభద్ర సోయగాల్నీ వివరంగా వర్ణించాల్సిన పనేముంటుంది కవికి? కనుక, 'హంపికీ రామకృష్ణకవికీ సంబంధం లేదు; ఆయనెప్పుడూ హంపిలో నివసించ లేదు; 'పాండురంగ మాహాత్మ్య' కర్త పొత్తపినాడుకే పరిమితమైన మరోకవి' అని వాదించే వారిని 'పాండురంగ మాహాత్మ్య' కర్తకూ హంపికీ, తుంగభద్రకూ మధ్యనున్న యీ అవ్యాజమైన అనురాగాన్ని యికనైనా గుర్తించమని కోరుతున్నాను. మనం లోగడనే చెప్పుకున్నట్లు తళ్లికోట యుద్ధం జరిగిన క్రీ.శ. 1565 నుండి ఒంటికంటి తిరుమల రాయని పాలనాకాలం ముగిసే వరకు అంటే క్రీ.శ. 1572 వరకు పదేళ్ల కాలంపాటు మాత్రమే రామకృష్ణకవి విజయనగర సామ్రాజ్యంతో ఎట్టి సంబంధం లేకుండా దూరంగా స్వస్థలం తెనాలిలోనూ, కొంతకాలం పిఠాపురంలోనూ, ఆ తరువాత పొత్తపినాడులోనూ వున్నట్లున్నది. తన బద్ధ శత్రువైన భట్టుమూర్తి అనే రామరాజ భూషణకవిని తిరుమల రాయదు అభిమానించి పోషించడమే ఆయనపై రామకృష్ణుని వ్యతిరేకతకు కారణం కావచ్చు. వీర వైష్ణవులైన అళియ రామరాయలు, తిరుమల రాయలు - లపైన తాతాచార్యుల వారి ప్రభావం అధికంగా వుండి వుంటుంది. ఆ కారణంగానే వారు భట్టుమూర్తిని ఆదరించి, రామకృష్ణ కవిని నిరాదరించి వుంటారు. అచ్యుతరాయల పాలనా కాలం ముగిసేవరకు అంటే క్రీ.శ. 1542 వరకు మాత్రం రామకృష్ణకవి నిస్సందేహంగా విజయనగరంలో వుండి వుంటాడు. ఆ కాలంలో రాజాస్థానంతో ఎటువంటి సంబంధమూ లేకుండా కేవలం భరణం స్వీకరిస్తూ రాజధానిలో నివసిస్తూ విరోబా భక్తిలో మునిగితేలుతూ వుండి వుంటాడు రామకృష్ణ కవి. ఆ కాలంలో రాజాస్థానంలో లేదు కనుకనే సంస్కృతంలో 'అచ్యుత రామాభ్యుదయము' అనే కావ్యాన్ని వ్రాసిన అచ్యుతరాయల ఆస్థానకవి రాజనాథ డిండిముదు, 'వరదాంబికా పరిణయమ'నే సంస్కృత కావ్యాన్ని వ్రాసిన తిరుమలాంబ వగైరాలతో రామకృష్ణకవి తలపడినట్లు ఎక్కడా దాఖలాలు లేవు. కాని 'తారక బ్రహ్మ రాజీయం', 'రాధా మాధవం' అనే కావ్యాలు వ్రాసిన చింతలపూడి ఎల్లన్నతో రామకృష్ణకవి తలపడినట్లు కొన్ని కథలు ప్రచారంలో వున్నాయి. ఈ ఎల్లన్న అచ్యుతరాయల ఆస్థానంలో కవిగా వెలుగొందినప్పటికీ, అంతకు పూర్వం కృష్ణరాయల పాలనాకాలంలో కూడా రాయలవారి ఆస్థాన కవులలో ఒకడిగా వుండేవాడని కొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. కళింగదేశం నుంచి వెళ్లి రాయలవారి ఆస్థానంలో చేరిన లొల్ల లక్ష్మీధరుదు, దివాకరుదు, బందారు లక్ష్మీనారాయణ కవి మొదలైన వారితోబాటే చింతలపూడి ఎల్లన్న కూడా విజయనగరం వెళ్లాడని ఆరుద్రగారు తెలియజేశారు. తెనాలి రామకృష్ణకవి భువన విజయంలో చురుకైన పాత్రను నిర్వహించిన రోజులలోనే ఎల్లన్న కూడా ఆ సభకు పరిచయం చేయబడి వుంటాడు. రాధామాధవ కవి అని పిలువబడిన యీ ఎల్లన్న అష్టదిగ్గజాలలో ఒకడని వాదించే విమర్శకులూ వున్నారు. అంచేతనే వారిరువురికీ సంబంధించిన కథలు ప్రచారంలోకి వచ్చి వుంటాయి. దీనిని బట్టే అంతకుముందే రాజసామీప్యంతో విసుగెత్తిపోయిన రామకృష్ణకవి అచ్యుతరాయల పాలనా (1530-42) కాలంలో రాజాస్థానానికి దూరంగా హంపిలో విరోబా ఆలయ సమీపంలో నివసిస్తూ విట్ఠల భక్తి పారవశ్యంలో మునిగితేలుతూండే వాడని నేను నమ్ముతున్నాను.

హంపిలోని యీ విరోబా ఆలయం - మహారాష్ట్రలోని పంఢర్‌పూర్‌లోని పాండురంగ విఠల్ ఆలయం కాక

యావద్దక్షిణ దేశంలో అప్పటికిదొక్కటేనని ప్రతీతి. పంధర్‌పూర్ కూడా ఒకప్పుడు బెల్గాం జిల్లాలోని కన్నడ ప్రాంతమేనట. అనాదిగా ఆ పౌండరీక క్షేత్రంలో పాండురంగ విట్ఠలుని ఆలయమున్నట్లు విశ్వసించబడుతున్నా చారిత్రక ఆధారాలు మాత్రం క్రీ.శ. 13వ శతాబ్ది మధ్య భాగం నుంచి యీ దేవాలయ ప్రసిద్ధిని చాటుతున్నాయి. దేవగిరిని పాలించిన యాదవరాజు కృష్ణుని పాలనా కాలంనాటి ఒక తామ్రశాసనం యీ దేవాలయం యొక్క చరిత్రపై కొంత వెలుగును ప్రసరిస్తున్నది. ఆ శాసనంలో తెలిపిన దానిని బట్టి రాజప్రతినిధి అయిన మల్లిసెట్టి అనే ఒక సేనాని భీమరథీనది ఒడ్డున వున్న అతి పవిత్రమైన యీ పౌండరీక క్షేత్రంలోని విష్ణు దేవాలయానికి శక సంవత్సరం 1171లో అంటే క్రీ.శ. 1249లో ఒక గ్రామాన్ని దానమిచ్చినట్లు తెలుస్తున్నది. 'కృష్ణ' అన్న సంస్కృత శబ్దం కన్నడ భాషలో 'కిట్టి', 'కుట్ట' అయినట్లే, 'విష్ణు' అనే సంస్కృత పదమే కన్నడ భాషలో 'విట్టు', 'విట్ఠు' అయింది. అదే క్రమంగా 'విట్ఠల', 'విట్ఠోబా'గా రూపాంతరం చెందింది. (హొయసాల రాజైన విష్ణువర్ధనుడి పేరు యిలాగే కన్నడ భాషలో 'విట్టి' లేక 'బిత్తి' వర్ధనుడిగా మారింది) పంధర్‌పూర్‌లోని క్రీ.శ. 1270 నాటి మరొక శిలా శాసనం ప్రకారం ఆ క్షేత్రం పేరు పాండురంగ పురం. కేశవుని కుమారుడైన భాను అనే వ్యక్తి పాండురంగ పురంలో అప్తోర్యామమనే యజ్ఞం నిర్వహించి విట్ఠలుడితో సహా సకల దేవతలనూ, ప్రజానీకాన్నీ సంతృప్తి పరచాడని ఆ శాసనంలో వుంది. **(అప్తోర్యామమంటే జ్యోతిష్టోమమనే యజ్ఞంలో ఏడవదీ, చివరిదీనైన భాగం. సామవేదంలో యిది విపులంగా పేర్కొనబడింది.)** హేమచంద్రుడు పేర్కొన్న దాని ప్రకారం పండరంగడన్నా, పాండురంగడన్నా, పాండురాంగుడన్నా తెల్లని శరీరంకలవాడైన శివుడు. అది మొదట్లో శివక్షేత్రమట. అక్కడవున్న శివాలయానికి వెళ్లి శివుడిని దర్శనం చేసుకున్న తరువాతనే విరోబా ఆలయానికి వెళ్తారట ఎవరైనా. పాండురంగ క్షేత్రంలో వున్నాడు కనుకనే విట్ఠలుడికి కూడా పాండురంగ విట్ఠలుడనే పేరు వచ్చిందట.

ఇక హంపిలోని విట్ఠల దేవాలయం విషయానికొస్తే – యావద్దక్షిణ దేశంలో పంధర్‌పూర్ ఆలయాన్ని మినహాయిస్తే నాటికి అంత ప్రసిద్ధమైనది అదొక్కటే. పంధర్‌పూర్ నుంచి కృష్ణదేవరాయలు విరోబా విగ్రహాన్ని తెచ్చి అక్కడ ప్రతిష్ఠించాడనే కథలు కూడా ప్రచారంలో వున్నాయి. అయితే హంపిలోని విరోబా ఆలయం రెండవ దేవరాయలు కాలం (క్రీ.శ. 1423-1446) నాటికే ప్రసిద్ధమైనట్టిది. కనుక, యీ కథలంతగా విశ్వసనీయాలు కావు. అయితే హంపిలోని విట్ఠల దేవాలయం కృష్ణరాయలు, అచ్యుతరాయలు, అళియ రామరాయల పాలనా కాలాలలో అత్యంత వైభవంగా ఓ వెలుగు వెలిగింది. ఆ కాలంలోనే రామకృష్ణకవి కూడా విరోబా భక్తి పారవశ్యంతో తాదాత్మ్యం చెంది వుంటాడు. 'పాండురంగ మాహాత్మ్యము' అనే దివ్య ప్రబంధ రచనకు రామకృష్ణ కవి హంపిలో విట్ఠల భక్తి కారణంగా పొందిన స్ఫూర్తే మూలం. విట్ఠల భక్తితో ఆ మహాకవి ఎంతగా తాదాత్మ్యమయ్యాడో 'పాండురంగ మాహాత్మ్యము' చదివిన వారికే తెలుస్తుంది. కేవలం పొత్తపినాడులో నివసించే ఒక కవికి అంతటి విట్ఠల భక్తి పారవశ్యం కలుగ జేయగల విట్ఠల ఆలయమేదీ నాటికి ఆంధ్రప్రాంతంలో లేదనేది కాదనజాలని సత్యం. నాడే కాదు నేటికీ పాండురంగ విట్ఠల్ దేవాలయాలు ఆంధ్ర ప్రాంతంలో అత్యంత అరుదు. ఆ కొద్ది ఆలయాలు కూడా యిటీవలి కాలం (20వ శతాబ్దం) నాటివే! (విశాఖ జిల్లా పాయకరావు పేటలో ఒకటి, కృష్ణాజిల్లా మచిలీపట్నంలో ఒకటి, తెనాలిలో ఒకటి నాకు తెలుసు.) విట్ఠల భక్తి ఏ చారిత్రక దశలోనూ ఆంధ్ర ప్రాంతంలో వేళ్లూనుకొనలేదన్నది నిజం. కనుక 'పాండురంగ మాహాత్మ్య' కర్తకు స్ఫూర్తి ప్రదాత హంపిలోని విరోబానే అనే దానిలో సందేహించాల్సిన పనిలేదు. కనుక రామకృష్ణకవి తాను హంపిలో నివసించిన కాలంలోనే ఆ స్ఫూర్తి పొందాడనేది కూడా నిర్వివాదాంశమే. అంచేత యీ అంశం కూడా రామకృష్ణ కవి తన జీవిత కాలంలో కొంత భాగం హంపిలో గడిపాడనేదానికి తార్కాణం.

అంతేకాదు. రామకృష్ణ కవి తన కావ్యాలలో వాడిన 'హొంబట్టు', 'హొన్నంచు' 'హళది పుట్టము' (పీతాంబరము) వగైరా కన్నడ పదాలు కూడా కన్నడ భాషతో అతడికున్న పరిచయాన్ని తెలుపుతున్నాయి. ఈ పరిచయం ఆ కవి హంపిలో వున్నప్పుడే ఏర్పడినట్టిదని వేరుగా చెప్పాల్సిన పని లేదనుకుంటాను.

ఇంకా 'పాండురంగ మాహాత్మ్యము'లో ఒక చోట కవి యిలా అంటాడు – 'మల్లియల పెల్లు కన్నడ కవితా వితానంబునుంబోలె, షట్పదవృత్త విలాసభాసురంబై' (పాం. మా. 4-16). ఇందులో శ్లేష వుంది. 'షట్పదము' అంటే తుమ్మెద అనీ, ఆరు పదముల వృత్తము అనీ అర్థాలు. మల్లెపూల సంపద కన్నడ భాషయందలి కవిత్వపు పరంపర వలె షట్పద వృత్తము (ఆరు పదముల వృత్తము) యొక్క విలాసము చేత ప్రకాశిస్తున్నదని ఒక అర్థం. మల్లెపూల సంపద తుమ్మెదల యొక్క విలాసము చేత ప్రకాశిస్తున్నదని మరో అర్థం. కన్నడ భాషలోని కవిత్వంలో ఆరు పదముల 'షట్పద వృత్తం' సుప్రసిద్ధమట. ఈ కన్నడ వృత్తం యొక్క పరిజ్ఞానం కూడా మన రామకృష్ణ కవి హంపిలో వుండగానే ఏర్పడి వుంటుందనేది నిర్వివాదాంశం.

రామలింగడు హంపి చేరుకొనడానికి, అక్కడి రాజాస్థానంలో ప్రవేశించడానికి పడిన పాట్లన్నీ మనం 'భువన విజయము' అనే అధ్యాయంలో వివరంగా తెలుసుకున్నాం. హంపి విజయనగరంలో ఆయన కనీసం కొన్నేళ్ల పాటైనా ఉండగలగడానికి అసలు ఆస్కారముందో లేదో కూడా ఇప్పుడు పరిశీలిద్దాం.

రామలింగ కవి తన 'ఉద్భటారాధ్య చరిత్రము' ను ఊర దేచమంత్రికి అంకిత మిచ్చాడు. ఈ దేచ మంత్రి అన్నయ్య మంత్రి కుమారుడు. ప్రథమ శాఖ నియోగి. కౌండిన్య గోత్రుడు. కొండవీటి దుర్గాధ్యక్షుడైన నాదెండ్ల గోపమంత్రికి రాజకార్య నిర్వాహకుడు. కొండవీడు దుర్గాన్ని రెడ్డిరాజుల అనంతరం కటకం గజపతులు స్వాధీన పరచుకున్నారు. శ్రీకృష్ణ దేవరాయలు మహామంత్రి తిమ్మరుసు సైన్యాధిపత్యం వహించగా ఈ దుర్గాన్ని ది. 23-6-1515 న వశపరచుకొని ఈ ప్రాంతాన్ని విజయనగర సామ్రాజ్యంలో విలీనం చేశాడని చరిత్ర కారులంతా నిర్ధారించారు. ఈ దుర్గ పాలనా బాధ్యతను రాయల వారు తిమ్మరుసుకే అప్పగించారట. తిమ్మరుసు తన మేనల్లుడు, అల్లుడు అయిన నాదెండ్ల అప్పమంత్రిని కొండవీటి దుర్గాధ్యక్షుడిగా నియమించాడట. కాని, ఆరు నెలల అనంతరం అంటే క్రీ.శ. 1516 ప్రారంభంలో తిమ్మరుసు అప్పమంత్రిని వినుకొండ దుర్గానికి పాలకునిగా పంపి, అప్పటి వరకు గుత్తి దుర్గ పాలకునిగా వున్న తన మరియొక మేనల్లుడు గోపమంత్రిని కొండవీటికి మార్చాడట. ఆ తరువాత వెంటనే గోపమంత్రి దేచమంత్రిని తన కార్య నిర్వాహకునిగా నియమించాడు. ఆ దశలో క్రీ.శ.1516 లోనే కొండవీటి సీమలోనిదైన తెనాలి నుండి రామలింగ కవి కొండవీటి ఆస్థానానికి వచ్చి దేచమంత్రిని కలిసి పరిపోషణ కోరాడు. దేచమంత్రి యొక్క కుల గోత్రాలూ, రామలింగని కుల గోత్రాలూ ఒకటే కనుక రామలింగనికి దేచమంత్రి వద్ద ఆదరణ సులువుగా లభించింది. ఈ దేచమంత్రి ఉద్భటారాధ్యుని వంశీయుడగు ముదిగొండ చంద్రశేఖరారాధ్యుని వద్ద శివ దీక్ష స్వీకరించాడు. అంతేకాదు దేచమంత్రి మహా విద్వాంసుడైన లొల్ల లక్ష్మీధర పండితుని శిష్యుడు. దేచమంత్రి స్వయంగా పండితుడు కూడా. శివ భక్తాగ్రేసరుడైన ఆయన సంస్కృతంలో శివ పంచస్తవానికి వ్యాఖ్య వ్రాశాడు. ఆయనను 'శంభుస్తుతి పరన ధురీణుడ'ని (ఉ. చ. 3-1) రామలింగ కవి పేర్కొన్నాడు. ఇక నాదెండ్ల గోపమంత్రి విషయానికొస్తే – ఆయన సంస్కృతంలో గొప్ప విద్వాంసుడు. సంస్కృతంలో కృష్ణ మిశ్ర వ్రాసిన ప్రబోధ చంద్రోదయమునకు చంద్రికా వ్యాఖ్యానము వ్రాశాడు. తెలుగులో కృష్ణార్జున సంవాదము అనే ద్విపద కావ్యాన్ని వ్రాశాడతడు. కొండవీటి ప్రభుత్వం తరపున తెనాలిలో స్థానిక పాలకునిగా వున్న రావూరి రంగారెడ్డిని కలిసి, తగినంత ప్రోత్సాహం లభించనందున రామలింగ కవి కొండవీడుకు వెళ్లి ముందుగా స్వగోత్రీకుడైన ఊర దేచయ్యను కలిసి వుంటాడు. స్వయంగా పండితుడు కనుక ఆయన

రామలింగడిని సమాదరించాడు. నాదెండ్ల గోప మంత్రి కూడా స్వయంగా కవి కనుకనే రామలింగ కవి ప్రతిభా వ్యుత్పత్తులను ఆ కాలంలోనే గ్రహించి, తన మేనమామ తిమ్మరుసుకు రామలింగ కవి విషయమై 'సిఫారసు' చేసే అవకాశముంది. తిమ్మరుసు మంత్రికీ, రామలింగ కవికీ దూరపు బంధుత్వం వుండడమే కాక, రామలింగ కవి తండ్రి గార్లపాటి రామన్న మంత్రి తిమ్మరుసుకు సన్నిహిత మిత్రుడవడం కూడా హంపిలో రామలింగ కవికి రాజాశ్రయం పొందదానికి అనుకూలాంశాలుగా మారి వుంటాయి.

ఇక ఇప్పుడు రామకృష్ణ కవి సమకాలికులను కొందరిని గురించి విచారిద్దాం. వారికి సంబంధించిన స్థల, కాలాదుల నిర్ణయం రామకృష్ణ కవి చరిత్రపై ముసిరిన చీకట్లను పారద్రోల గలదు.

# తిరుమల రాయలు

ఈ తిరుమల రాయలు అళియ రామరాయలకు స్వయానా తమ్ముడు. (ఆరవీటి శ్రీరంగ రాజుకు కోనరాజు, తిమ్మరాజు, రామరాయలు లేక రామరాజు, తిరుమల రాయలు, వేంకటాద్రి అనే ఐదుగురు కుమారులు). తిరుమల రాయలు శ్రీకృష్ణదేవరాయలకు చిన్నాదేవి వలన జన్మించిన వెంగళాంబను వివాహమాడాడు. ఈయన అన్న రామరాజు కృష్ణదేవరాయలుకు తిరుమలదేవి వలన పుట్టిన తిరుమలాంబను వివాహం చేసుకున్నాడు.

క్రీ.శ. 1565 జనవరి 25వ తేదీన జరిగిన తళ్లికోట యుద్ధంలో తిరుమల రాయలు ఒక కన్నును కోల్పోవడమే కాక, తన పెద్ద కుమారుడు రఘునాథ రాయలును కూడా కోల్పోయాడు. బహమనీ సైన్యాలు హంపి విజయనగరాన్ని విధ్వంసం చేసి వెళ్లిపోయిన తరవాత కొంత కాలం యీయన హంపిలో వుండి తిరిగి రాజధానిని బలోపేతం చేయదానికి ప్రయత్నించాడు. అయితే ఏ కారణంగానో ఆ కార్యక్రమంలో విఫలమయ్యాడు. అనంతరం తిరుపతిలో నామమాత్రపు చక్రవర్తి (Titular Emperor) యైన సదాశివరాయలను బందీగా వుంచి, తానే పరిపాలన సాగించాడు. క్రీ.శ. 1567 నాటి కడప జిల్లా కందుకూరు శిలాశాసనం వలన యీయన పరిపాలన యావత్తూ తన గుప్పిట్లో వుంచుకుని దానాలు వగైరా తన పేరిటే చేసినట్లు తెలుస్తున్నది. తరువాత తిరుమల రాయడు తన రాజధానిని పెనుగొండకు మార్చాడు. క్రీ.శ 1569లో తన తొంభయ్యవ ఏట తిరుమల రాయలు పెనుగొండలో పట్టాభిషిక్తుడయ్యాడు. (అంతకు కొంచెం ముందే తిరుమలుని కొడుకు వేంకటపతి దేవరాజు సదాశివరాయలును చంపివేశాడు) తన తొంబై మూడవయేట క్రీ.శ. 1572లో తిరుమల రాయలు మరణించాడు.

తిరుమల రాయలు, అతడి అన్న రామరాయలు వీరవైష్ణవులు. వారిపై తాతాచార్యులవారి ప్రభావం ఎక్కువ వారు తాతాచార్యుల వారి ప్రభావంతోనే వారి పాలనా కాలంలో భట్టుమూర్తిని ఆదరించారు. భట్టుమూర్తి రామరాజుచే పోషించబడ్డాడు కనుకనే ఆయన 'రామరాజ భూషణుడు' అని కూడా పిలువబడ్డాడు. భట్టుమూర్తి వ్రాసిన 'వసుచరిత్ర' కృతినందుకొన్నది తిరుమలరాయలే. అంతకు పూర్వమే కృష్ణ దేవరాయల మరణానంతరం రాజాస్థానాలకు దూరంగా విరోబా భక్తి పారవశ్యంలో జీవితం గడుపుతూన్న రామకృష్ణ కవికి తన గర్భశత్రువైన భట్టుమూర్తిని తిరుమలరాయలు చేరదీయడం సహజంగానే రుచించి వుండదు. అచ్యుతరాయల పాలనా కాలంలో రామకృష్ణుడు బహుశా 'కందర్పకేతు విలాసము', 'హరిలీలా విలాసము' అనే కావ్యాలు వ్రాసి అళియ రామరాయలు, తిరుమల రాయల పాలనా కాలంలో 'పాండురంగ మాహాత్మ్యము', 'ఘటికాచల మాహాత్మ్యము' పూర్తి చేసి వుంటాడు.

క్రీ.శ. 1565లో జరిగిన తళ్లికోట యుద్ధంలో కన్ను పోగొట్టుకున్న తిరుమల రాయలుపై (అతడు భట్టుమూర్తిని

ఆదరిస్తున్నాడనే కసి చేతనో లేక మరే కారణంగానో) చెప్పిన 'అన్నాతిఁగూడ హరుడౌ' అనే పద్యాన్ని బట్టి క్రీ.శ. 1565 తరువాత కూడా విజయనగర రాజ్యంతో ఆయన అనుబంధం వీడిపోలేదు. రామకృష్ణకవి అప్పయ్య దీక్షితుల వారితోనూ, తిరుమల తాతాచార్యుల వారితోనూ సమకాలికుడై చంద్రగిరి పాలకుడైన వేంకటపతి రాయలు కాలంలో చంద్రగిరిలో వున్నట్లు కొన్ని ఆధారాలున్నాయని కందుకూరి వీరేశలింగం పంతులు గారు తమ 'ఆంధ్ర కవుల చరిత్రము'లో పేర్కొన్నారు. (ఆం.క.చ. ద్వితీయ భాగము పేజీ 106) ఈ వేంకటపతి రాయలు తిరుమల రాయలు నాల్గవ కుమారుడు. తండ్రి తరువాత సోదరులు శ్రీరంగ రాయలు, రామరాజుల పాలన అనంతరం పెనుగొండ నుండి తన రాజధానిని చంద్రగిరికి మార్చుకుని యీయన క్రీ.శ. 1585 నుండి క్రీ.శ. 1614 వరకు పరిపాలించాడు. క్రీ.శ. 1585లో చంద్రగిరిలో జరిగిన వేంకటపతిరాయలు పట్టాభిషేక మహోత్సవానికి ప్రధాన పురోహితుడు రాజగురువైన తిరుమల తాతాచార్యులేనట! క్రీ.శ. 1495 ప్రాంతంలో జన్మించిన రామకృష్ణ కవికి ఆ పట్టాభిషేకం నాటికి 90 ఏళ్ల వయస్సుంటుంది. ఆ వార్ధక్యంలోనే ఆయన 'ఘటికాచల మాహాత్మ్యము' పూర్తిచేసి వుంటాడు. ఆ కావ్యానికి 'అవతారిక' (కృత్యాది) వ్రాయకుండానే ఆ తర్వాత కొద్ది కాలానికే ఆయన మరణించి వుంటాడు. ఆరుద్రగారి అభిప్రాయం ప్రకారం కూడా ఆయన బహుశా క్రీ.శ. 1495 లో జన్మించి వుంటాడు. కనుక అప్పయ్య దీక్షితులు, తాతాచార్యుల వారితో సమకాలికుడై వేంకటపతిదేవ రాయల కాలంలో రామకృష్ణకవి చంద్రగిరిలో కొన్నేళ్లు వున్నాడనే సిద్ధాంతాన్ని మనం అసంబద్ధమనీ, వాస్తవ విరుద్ధమూననీ ఖండించాల్సిన అవసరం లేదు. కృష్ణదేవరాయలు మరణానంతరం ఏబది ఐదేళ్లకు రాజ్యానికి వచ్చిన వేంకటపతిరాజు యొక్క రాజ్యకాలంలో వున్న రామకృష్ణకవి నిజంగా ఒకవేళ కృష్ణదేవరాయల కాలంలో కూడా వుండడం తటస్థించిన పక్షంలో అతడప్పుడు బాలుడై వుంటాడని వీరేశలింగం గారు అదే గ్రంథంలో పేర్కొన్నారు. క్రీ.శ. 1495లో జన్మించిన రామకృష్ణకవి తన యౌవనంలో క్రీ.శ. 1520లో కృష్ణదేవరాయల సభలో ప్రవేశించి వుంటాడని నా అభిప్రాయం. తన 25 ఏళ్ల వయస్సునాటికే ఆయన వేదాధ్యయనం పూర్తి చేసి, వ్యాకరణం, ఛందస్సు, అలంకార శాస్త్రాలలో నిష్ణాతుడై 'ఉద్భటారాధ్య చరిత్రము' వగైరా కావ్యాలు వ్రాసి లబ్ధప్రతిష్ఠుడై 'కుమార భారతి' అనే బిరుదు పొంది, ఆ కీర్తి కారణంగానే తిమ్మరుసు అల్లుడు నాదెండ్ల గోపమంత్రి సిఫారసుపై 'భువనవిజయం'లో ప్రవేశించి వుంటాడు. రామకృష్ణకవి క్రీ.శ. 1462 వ సంవత్సరంలో పుట్టాడనీ, ఆయన యింటి పేరు 'ఈశ్వరప్రెగ్గడ' వారనీ రామలింగనిదని చెప్పబడుతూన్న ఒక 'జన్మపత్రిక' ను ఉటంకిస్తూ 'హిందూస్థాన కవి చరిత్రము' లో కావలి వేంకటస్వామిగారు వ్రాసిన విషయం విశ్వాసయోగ్యమైనదికాదని వీరేశలింగం పంతులుగారు తమ 'ఆంధ్రకవుల చరిత్రము' లో సహేతుకంగా నిరూపించారు.

## అప్పయ్య దీక్షితులు

అప్పయ్య దీక్షితుడు కూడా రాయల పాలనా కాలంనాటికి యువకుడై వుంటాడని వీరేశలింగం గారు పేర్కొన్నారు. ఇక్కడ అప్పయ్య దీక్షితుని గురించి కూడా కొంత చెప్పుకోవాలి. ఇతడు కంచికి సమీపంలోని అడెపోలమనే అగ్రహారంలో నారాయణ దీక్షితుని కుమారుడై జన్మించి, తన పన్నెండవ ఏటనే వేదాధ్యయనం చేసి, 'శివార్చన చంద్రిక', 'శివతత్త్వ వివేకము', 'శివ మణి దీపిక', 'ఆత్మార్పణము' మొదలైన శైవ గ్రంథములనేకం వ్రాసి వేంకటపతిరాయల ఆస్థానంలో రాజగురువైన తాతాచార్యులవారిని వాదనలో ఓడించి రాజసన్మానం పొందాడని, కొంతకాలం కావేరీ తీరంలో అనేక యాగాలు చేసి అవసానదశలో కాశికి పోవాలని వెళ్తుండగా చిదంబరంలో అభిమాన భక్తులు ఆయనను వెళ్లనీయక అపరకాశియైన చిదంబరంలోనే ఆయన నివాసానికి సకల ఏర్పాట్లు చేయగా ఆయన మరణించే వరకు అక్కడే నివసించి

ఎనభై శైవ గ్రంథాలు వ్రాశాడని వీరేశలింగం గారు తెలిపారు. ఈయన రచనలలో 'కువలయానందము' అనే అలంకార శాస్త్ర గ్రంథము సుప్రసిద్ధమట. ఈ అప్పయ్య దీక్షితుని మేనల్లుడు అయ్యదీక్షితుడట. ఆయన క్రీ.శ. 1623 నుండి 1659 వరకు మధుర రాజధానిగా పాండ్య రాజ్యమును పాలించిన తిరుమల నాయకుడి వద్ద మంత్రిగా వున్నాడట. ఒక ప్రక్క అప్పయ్య దీక్షితుడు తన యౌవనంలో రాయలవారి ఆస్థానంలో వుండి వుండవచ్చునని అంగీకరిస్తూనే వీరేశలింగం గారు అప్పయ్య దీక్షితుడి మేనల్లుడు అయ్యదీక్షితుడు తిరుమల నాయకుని (క్రీ.శ. 1623-1659) మంత్రిగా వుండడం చేత అప్పయ్య దీక్షితుడు అంతకు నూరు సంవత్సరముల క్రిందట కృష్ణదేవరాయల సభలో వున్నాడనడం నమ్మదగినదికాదనీ, అంచేత దీక్షితుల వారితోడి సమకాలికుడైన రామకృష్ణకవి కూడా కృష్ణరాయల ఆస్థానము నందుండలేదనుట నిశ్చయము అనీ వ్రాశారు. (పేజీ 107- - ఆం.క.చ. 2వ భాగము). ఈ వాదన ఎంతమాత్రమూ ఆమోద యోగ్యం కాదు. ఒకప్రక్క తన పన్నెండవ ఏటనే వేదాధ్యయనం చేసిన ప్రతిభాశాలి అప్పయ్య దీక్షితులు - అని పంతులుగారే పేర్కొంటున్నారు. అంటే సుమారుగా క్రీ.శ. 1510లో జన్మించిన అప్పయ్య దీక్షితులు బాలకవిగా కృష్ణరాయల వారి అవసానదశలో క్రీ.శ. 1525-30 మధ్యకాలంలో తన నూత్న యౌవనంలో రాయల సభలో ప్రవేశించగలిగే అవకాశం లేకపోలేదు. తనకంటె ఇరవయ్యేళ్లు చిన్నదైన చెల్లెలుకు (జననం క్రీ.శ. 1530) ఆమె ముప్పయ్యవయేట క్రీ.శ. 1560లో అయ్యదీక్షితుడు జన్మించే అవకాశాన్నీ, ఆ అయ్యదీక్షితులు తన అరవై మూడవ యేట అంటే క్రీ.శ. 1623 లో తిరుమల నాయకునికి మంత్రి అయివుండే అవకాశాన్నీ వీరేశలింగంగారు ఎందుకు తిరస్కరించారో అర్థం కావడంలేదు.

## తిరుమల తాతాచార్యులు

తెనాలి రామకృష్ణుని కంటె పెద్దవాడైన తిరుమల తాతాచార్యులు కంచిలో వుంటూనే రాయలవారి పాలనాకాలం చివరి దశ నుంచి వేంకటపతిరాయలు కాలం వరకు విజయనగర సామ్రాజ్య పరిధిలోనే అంటే హంపిలోనో, పెనుగొండలోనో లేక చంద్రగిరిలోనో రాజగురువుగానో లేక పలుకుబడి కలిగిన రాజపురోహితునిగానో కొనసాగాడు. మాధ్వగురువైన వ్యాసరాయని అనంతరం రాయలవారి పాలనా కాలపు రెండవ అర్థ భాగంలో సుమారుగా క్రీ.శ. 1523 నుండి 1530 వరకు యీయన హంపిలో రాజగురువుగానో పలుకుబడి కలిగిన రాజపురోహితునిగానో వున్నాడు. తాతాచార్యులవారు రాయలవారికి శ్రీవైష్ణవ ముద్రాంకన గురువుగా వ్యవహరించినా వయస్సులో ఆయన కంటే ఓ పదిపదిహేనేళ్లు చిన్న అయివుండే అవకాశమూ వుంది. రాయలవారికి మరణించేటప్పటికి అంటే క్రీ.శ. 1530 నాటికి 56 సంవత్సరాల వయస్సుంటుందని చరిత్రకారులంతా అభిప్రాయపడుతున్నారు. అప్పటికి తిరుమల తాతాచార్యులు వయస్సు 40 సంవత్సరాలనుకుంటే వేంకటపతి రాయలు పట్టాభిషేకం (క్రీ.శ. 1585) నాటికి తాతాచార్యుల వయస్సు 95 సంవత్సరాలు ఒకప్రక్క 125 సంవత్సరాల దీర్ఘకాలంపాటు జీవించిన విశిష్టాద్వైతమత స్థాపకుడు రామానుజాచార్యులు యొక్క చరిత్ర అందరకూ విదితమే. అలాగే యీ తిరుమల తాతాచార్యులు కూడా దీర్ఘకాలంపాటు అంటే ఏ వందేళ్లో, నూట ఐదేళ్లో జీవించి వుండి వుంటాడనే విషయాన్ని అంత తేలిగ్గా కొట్టి పారవేయలేము.

అదే విధంగా క్రీ.శ. 1495 లో రామలింగడు జన్మించాడనీ, ఆయన పదిహేనవయేట క్రీ.శ. 1510 లో శివదీక్ష స్వీకరించిన సందర్భంగా తెనాలి రామేశ్వరాలయంలో ఆయన తండ్రి గార్లపాటి రామయ్యచే గాని లేక తన చేతనే గాని ఉత్సవ విగ్రహములు బహూకరించబడినవనీ, క్రీ.శ. 1516 నాటికే ఆయన 'లింగ పురాణం', 'ఉద్భటారాధ్య చరిత్ర' రచించాడనీ, ఆయన వైష్ణవం స్వీకరించి రాయలవారి ఆస్థానంలో క్రీ.శ. 1520 నుండి క్రీ.శ. 1530 వరకు అష్టదిగ్గజాలలో

ఒకనిగా వెలుగొందాడనీ, కృష్ణరాయల కాలంలోనే ఆయన తెనాలి అగ్రహార నిర్ణేతగా పేరుగాంచాడనీ, కృష్ణరాయల మరణానంతరం క్రీ.శ. 1530 నుండి క్రీ.శ. 1565 తళ్లికోట యుద్ధం వరకు హంపిలో కొనసాగిన ఆయన 'కందర్పకేతు విలాసము', 'హరిలీలా విలాసము' వగైరా రచనలు చేశాడనీ, క్రీ.శ. 1565 - 70 మధ్య కాలంలో తెనాలిలో కొంత కాలము, పిఠాపురంలో కొంతకాలము వుండి వుంటాడనీ, క్రీ.శ. 1570-72 ప్రాంతంలో పొత్తపినాడులో నివసిస్తూ విరూరి వేదాద్రి పరిపోషణలో 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యాన్ని పరిపూర్తి చేశాడనీ, క్రీ.శ. 1590 వరకు చంద్రగిరిలో వేంకటపతిరాయల రాజ్యంలో వుండి తన తొంభై అయిదవ ఏట మరణించి వుంటాడనీ నేను విశ్వసిస్తున్నాను. అలా మన రామకృష్ణ కవికి హంపితోనూ, తళ్లికోట యుద్ధం అనంతరం విజయనగర రాజ్యంతోనూ సన్నిహిత సంబంధం కొనసాగిందనేది యధార్థం. రాజులు ఆ రోజులలో కవులకిచ్చే భరణాల కారణంగా రాయలవారి మరణానంతరం కూడా రామకృష్ణకవి కుటుంబ పోషణార్థం విజయనగర రాజ్యంలోనే కొనసాగినట్లున్నది. అయితే కొన్ని కారణాల మూలంగా ఒంటికంటి తిరుమల రాయలును రామకృష్ణకవి ద్వేషించినట్లు కనుపిస్తున్నది. ఆ తిరుమల రాయలు పాలనా కాలంలో మాత్రం అంటే క్రీ.శ. 1569-72 మధ్యకాలంలో విజయనగరానికి దూరంగా పొత్తపినాడు సంస్థానాధీశుడైన తెలుగు చోడ ప్రభువు మంగయ గురవరాజు కుమారుడు పెదసంగ భూపాలుని వద్ద వ్రాయసకానిగా వున్న విరూరి వేదాద్రి పరిపోషణలో 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యం వ్రాశాడు. పాండురంగ మాహాత్మ్యము క్రీ.శ. 1560-72 మధ్య కాలంలో వ్రాయబడినట్టి కావ్యమనేది హెచ్చుమంది చరిత్రకారులు విశ్వసిస్తున్నారు. వేదాద్రికి ప్రభువైన పెద్ద సంగ భూపాలుడి తండ్రి గురవరాజు సదాశివరాయల రాజ్యకాలంలో క్రీ.శ. 1545లో ఆయన వలన దేవుని నిమిత్తం నాలుగు గ్రామములు పొందినట్లు కర్నల్ కాలిన్ మెకంజీ స్థానిక చరిత్రల ద్వారా తెలుస్తున్నది. (ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, చెన్నై). క్రీ.శ. 1545 నాటికి గురవరాజుకు 50 సంవత్సరాల వయస్సు వుందనుకుందాం. అంటే ఆయన క్రీ.శ. 1495 లో జన్మించి వుండాలి. అతడికి తొమ్మిది మంది పుత్రులట. వారిలో పెద్ద సంగభూపాలుడు మూడవవాడట. కనుక, పెద్ద సంగభూపాలుడు ఎంతలేదన్నా ఆయన 30వ ఏట అంటే క్రీ.శ. 1525లో పుట్టి వుండొచ్చు. పెద్ద సంగభూపాలుని వ్రాయసకాడు విరూరి వేదాద్రి. ఆయన కూడా అదే వయస్సు వాడనుకుందాం. అప్పుడు రామకృష్ణకవి విరూరి వేదాద్రికి 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యాన్ని క్రీ.శ. 1570 ప్రాంతాలలో అంకితమిచ్చాడని మనం చేసిన నిర్ధారణ సవ్యమైనదే అవుతుంది. ఎందుకంటే 'పాండురంగ మాహాత్మ్యము' కృతినందుకునే సమయానికి విరూరి వేదాద్రి సోదరులు, సుతులు, సతులతో విరాజిల్లుతున్నాడని (పాం. మా. 1-86) తెనాలి రామకృష్ణకవి పేర్కొన్నాడు. (అప్పటికింకా వేదాద్రికి మనుమ సంతానం కలిగినట్లు లేదు.) క్రీ.శ. 1570 నాటికి మనం అనుకుంటున్న ప్రకారం విరూరి వేదాద్రికి 45 సంవత్సరాల వయస్సు కనుక యిది కూడా సరైన నిర్ధారణే అవుతుంది.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ 'ఆంధ్రకవుల చరిత్రము'లో తెనాలి రామకృష్ణకవి రాయలవారి కాలంలో హంపిలో వుండే అవకాశం లేదనీ, 'పాండురంగ మాహాత్మ్యము' రచనా కాలం క్రీ.శ. 1650 ప్రాంతం అనీ వాదించారు. ఈ విషయమై ఆయన చేసిన వాదనలు కొన్నింటినిప్పుడు పరిశీలిద్దాం.

## సారంగు తమ్మకవి - తెనాలి రామకృష్ణుడు

తెనాలి రామకృష్ణ కవి కాలాన్ని నిర్ధారణ చేయడానికి తగిన ఆధారాలు కొన్ని ఆయన రచించిన 'పాండురంగ మాహాత్మ్యము' లోనే కనపడుతున్నాయి – అంటూ వీరేశలింగం పంతులుగారు తమ 'ఆంధ్ర కవుల చరిత్రము' లో రామకృష్ణకవి కాలానికి సంబంధించిన ఓ వింత సిద్ధాంతం చేశారు. (ఆం.క.చ. రెం.భా. పేజీ 108) అది యిలా సాగింది. ఆ కావ్య

కృతిపతి విరూరి వేదాద్రి యొక్క గురువు ఆళువందారు కందాళయప్ప. తెనాలి రామకృష్ణ కవి తన కృతిపతి యొక్క గురువులను పాండురంగ మాహాత్మ్యము (1-77) పద్యంలో పలు విధాలుగా కీర్తించాడు. 'వైజయంతీ విలాసము'ను రచించిన సారంగు తమ్మకవి కూడా యీ కందాళ అప్పలాచార్యులు గారినే తన గురువుగా పేర్కొంటూ ఆ కావ్యం ప్రథమాశ్వాసంలోని యీ క్రింది పద్యంలో చెప్పాడు.

క॥ వందారు దాస జనతా
మందారు న్వేదశాస్త్ర మహిత ప్రజ్ఞా
బృందారక గురు మద్గురుఁ
గందాళాప్పలగురున్ జగద్ధితుఁ గొలుతున్. (వైజయంతీ విలాసము - ప్రథమాశ్వాసము)

ఈ పద్యాలు రెంటినీ పరిశీలిస్తే రామకృష్ణకవి, తమ్మకవి సమకాలీనులగుట స్పష్టమగుచున్నది.

తమ్మకవి తన 'వైజయంతీ విలాసము' అనే విప్రనారాయణ చరిత్రములో తాను గోల్కొండ కరణమయినట్లునూ, తన కాలంలో ఆ రాజ్యాన్ని మహమ్మద్ శాహి పరిపాలన చేస్తున్నట్లుగానూ ఆ కావ్య ప్రథమాశ్వాసములోని యీ క్రింది పద్యంలో చెప్పాడు -

చ॥ ఇనసమతేజులౌ నృపులనెల్ల మహమ్మదు శాహి యేలు నీ
యెను బదినాల్గు దుర్గముల నేలిన యేలిక గోలకొండ త
ద్ఘన నగరస్థలిన్ గరణికం బొనరించును దమ్మమంత్రి యా
జనపతి రమ్ముపొమ్మనఁ బ్రజల్జయపెట్ట గృహస్థులౌననన్.

సూర్యుని కాంతితో సమానమైన కాంతిగల ఎనభైనాలుగు మంది సామంతరాజులపై ఆధిపత్యం వహిస్తూ పాలించే మహమ్మద్ శాహి యొక్క రాజధాని అయినట్టి ఘనమైన గోల్కొండకు తమ్మమంత్రి కరణం. అతడిని ఆ రాజు 'రా', 'పో' అని (ఆప్యాయంగా) పిలుస్తూంటాడు. ప్రజలు (తమ్మమంత్రి ప్రతిభకు) జయజయధ్వానాలు చేస్తారు. గృహస్థులు కూడా (అతడి కరణీకాన్ని) మెచ్చుకుంటారు.

మహమ్మద్‌శాహి నవాబుగానున్న కాలం క్రీ.శ. 1581 నుండి 1611 వరకు. కనుక యీతని ఆస్థానములోనున్న సారంగు తమ్మకవి ఆ కాలంలో జీవించి వున్నాడు. తమ్మకవి తోడి సమకాలికుడైన రామకృష్ణకవి కూడా యించుమించుగా యీ కాలమునందే అంటే పదహారవ శతాబ్దాంతములోనూ పదిహేడవ శతాబ్ది ప్రారంభంలోనూ ఉండేవాడనడానికి సందేహం లేదు. ఇదండీ ఆ 'వింత సిద్ధాంతం' !

సారంగు తమ్మకవి క్రీ.శ. 1581 నుండి క్రీ.శ. 1611 వరకు గోల్కొండను పాలించిన మహమ్మద్‌షా కొలువులో కరణీకం చేసేవాడని అంగీకరించడానికి ఎవ్వరికీ అభ్యంతరం వుండనక్కరలేదు. అయితే అతడి గురువూ, 'పాండురంగ మాహాత్మ్యము' యొక్క కృతిపతియైన విరూరి వేదాద్రి యొక్క గురువూ కందాళ అప్పలాచార్యుల వారే కనుక, వేదాద్రీ, రామకృష్ణకవీ సమకాలికులు కనుక, సారంగు తమ్మయ్య - రామకృష్ణుడు సమకాలికులే! అంటే రామకృష్ణకవి పదిహేడవ శతాబ్ది ప్రారంభంవరకు జీవించినవాడు అని తీర్మానించారు పంతులుగారు. ఈ వాదన మాత్రం అంగీకారయోగ్యం కాదు

ఈ వాదనలోని బలహీనతలను మనమిప్పుడు పరిశీలిద్దాం.

ఇదే ఆళువందారు కందాళయప్ప పేరుతో యిద్దరు వుండే అవకాశముంది. తాతపేరు మనవడికి పెట్టుకోవడం ఎన్నో కుటుంబాలలో ఒక ఆచారంగా అనాది నుంచీ వస్తున్నది. ఓ నలభై యాభై ఏళ్ల వయస్సు తేడాతో తాత కందాళయప్ప ఆయన మనుమడు కందాళయప్ప - యిద్దరు భిన్నవ్యక్తులు వుండే అవకాశాన్ని మనం కొట్టి పారేయలేం. ఈ కందాళయప్ప విషయంలో అలాంటిదేం లేకున్నప్పటికీ, రామకృష్ణుని గురువు భట్టరు చిక్కాచార్యులు వంశంలో యిలాగే మనకు తాతామనవళ్లు ఒకే పేరుతో తటస్థిస్తారు. ఆ విషయమేమిటో మున్ముందు పరిశీలిద్దాం.

ఇక పంతులు గారి వాదనలోని ఇంకొక బలహీనతేమిటంటే - కందాళయప్పగారు విరూరి వేదాద్రికి గురువు. రామకృష్ణకవికి కాదు. రామకృష్ణకవీ - విరూరి వేదాద్రి మంత్రీ - యిద్దరూ సమకాలికులే కానీ సమవయస్కులని ఏ విధంగానూ నిర్ణయించలేం. ఒకవేళ అలా నిర్ణయించ గలిగినా, వారిరువురూ - తమ్మకవీ ఒకే వయస్సు వాళ్లని ఏ ఆధారాలతో ఎలా నిర్ధారిస్తాం? తమ్మకవికీ, వేదాద్రికీ గురువొక్కరే కనుకనా? రిటైర్‌మెంట్ వయోపరిమితి లేనట్టి ఆ రోజులలో గురువులు కనీసం యాభై ఏళ్లయినా అధ్యాపనం చేసే అవకాశముంది. వారి శిష్యుల వయస్సులలోనూ ఆపాటి అంతరం వుండే అవకాశం వుంది. షుమారుగా క్రీ.శ. 1495 నుండి 1590 ప్రాంతాల వరకూ జీవించిన తెనాలి రామకృష్ణకవిని తీసుకెళ్లి క్రీ.శ. 1581 నుండి క్రీ.శ. 1611 వరకూ గోల్కొండను ఏలిన మహమ్మద్‌షా సమకాలికునిగా చెప్పజూడడం బట్టతలకూ మోకాలికీ ముడిపెట్టడం వంటిదే. ఏదో ఒక విధంగా రామకృష్ణకవి రాయలవారి కాలంలో లేదని నిరూపించదానికే కందుకూరి వీరేశలింగంగారు యిన్ని తిప్పలూ పడ్డట్టు కనుపిస్తున్నది. పంతులుగారు ఒక చోట రామకృష్ణకవి క్రీ.శ. 1560-70 ప్రాంతాల నుండీ కవియై వుండవచ్చుననీ, మరొక చోట 17వ శతాబ్దిలో రామకృష్ణకవి వున్నాడనదానికి సందేహం లేదనీ, యింకొకచోట 'పాండురంగ మాహాత్మ్యము' రచనా కాలం క్రీ.శ. 1650 కంటె పూర్వం అయి వుండదనీ వ్రాశారు. సారవిహీనమైన యీ వాదన యొక్క డొల్లతనం విద్వజ్జనుల పరిశీలనకే వదలి వేస్తున్నాను.

మనం లోగడ అనుకున్నట్లే క్రీ.శ. 1570 ప్రాంతాలలో 'పాండురంగ మాహాత్మ్యము' కృతి నందుకొనే నాటికి కృతి భర్త వేదాద్రికి షుమారుగా 45 సంవత్సరాలు, కృతి కర్త రామకృష్ణకవికి 75 సంవత్సరాలు వయస్సుంటుంది. ఒకవేళ తమ్మకవీ, వేదాద్రీ సమవయస్కులని భావించినా, తమ్మకవి రామకృష్ణకవి కంటె కనీసం 30 ఏళ్ల తర్వాత జనించిన వాడనడంలో సందేహం అక్కర్లేదు.

అయితే రామకృష్ణకవి రాయలవారి 'భువనవిజయం'లో లేదని ఋజువు పరచదానికి యిన్ని తిప్పలూ పడ్డ వీరేశలింగంగారు ఆ తరువాత తమ అభిప్రాయాన్ని మార్చుకుని, రామకృష్ణకవి రాయలవారి అష్టదిగ్గజ కవులలో ఒకడనే నిర్ణయానికి వచ్చారు. అలా రామకృష్ణకవి కాల నిర్ణయంపై కొంతకాలంపాటు కమ్ముకున్న కారు మొయిళ్లు తొలగిపోయాయి. దాదాపు పండితలోకం యావత్తూ తెనాలికి చెందిన రామకృష్ణకవి హంపిలోని భువనవిజయంలోని రాయలవారి అష్టదిగ్గజ కవులలో ఒకడనే ఏకాభిప్రాయానికి వచ్చింది.

## మానవల్లి రామకృష్ణ కవి (క్రీ.శ.1866-1957) గారి అభిప్రాయం

ఇదిలా వుండగా క్రీ.శ. 1914 వ సంవత్సరం 'ఆంధ్ర పత్రిక' సంవత్సరాది సంచికలో మానవల్లి రామకృష్ణ కవి గారు 'తెనాలి కవులు' అనే తమ వ్యాసంలో రామకృష్ణ కవి కాలం విషయమై కొంత వివరంగా చర్చించారు.

పండితాగ్రగణ్యుల అభిప్రాయాలను, ప్రజల మనస్సులలో చిరకాలంగా నాటుకు పోయిన పుక్కిటి పురాణాలను అబద్ధమని నిరూపించడం సంపూర్ణ సామగ్రి ఉన్నప్పటికీ గొప్ప మతిమంతులకైననూ చాల కష్టమైనపని - అని ప్రారంభిస్తూ

తెనాలి రామకృష్ణుడు ఆ కృష్ణ రాయని సభలో హాస్యరస చతురుడై వుండేవాడో లేక ఆ తరువాత నూట యిరవై ఏళ్లకు కూడా తన 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యాన్ని వ్రాయలేదో - అనే అంశం చిరకాలం నుంచి తన హృదయాన్ని వేధిస్తున్నదని పేర్కొన్నారు.

ఆ వ్యాసంలో ఆయన పేర్కొన్న వివిధ విషయాలలో మన లక్ష్యానికి ఉపకరించేవాటిని నేను ఉటంకిస్తాను.

ఆయన ముందుగా తెనాలి కవులుగా రామకృష్ణకవి, అన్నయ్య, గిరియప్ప, రెండవ రామకృష్ణ కవి, వీరరాఘవుడు, రామభద్రుడు, రామలింగడు అనే వారిని పేర్కొన్నారు. చివరి రామలింగకవి స్వర్ణకార కులజుడనీ, అతడు గోలకొండ తానీషా కొలువులోనున్న అక్కన్న, మాదన్నల ఆస్థానకవియనీ పేర్కొన్నారు. స్వర్ణకార కులప్రాశస్త్యమును వర్ణించే 'ధీరజన మనోవిరాజితము' అనే ఏకాశ్వాస గ్రంధము ఆయన రచనే అని పేర్కొన్నారు.

తెనాలి రామకృష్ణకవి, అన్నయ్య, శ్రీగిరి లేక గిరియప్ప స్వయానా అన్నదమ్ములు. ఇమ్మడి రామకృష్ణుడు లేక రెండవ రామకృష్ణకవి శ్రీగిరి కుమారుడు. వీర రాఘవుడు, రామభద్రుడు రెండవ రామకృష్ణుని పుత్రులు. రామకృష్ణకవి కందర్ప కేతువిలాసము, హరిలీలా విలాసము, పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచల మాహాత్మ్యమును రచించాడు. (ఈ వ్యాసం వ్రాసే నాటికి గార్లపాటి రామలింగకవి వ్రాసిన 'ఉద్భటారాధ్య చరిత్రము' వున్నట్లు సాహిత్యలోకానికి తెలియదు. ఆ కావ్యాన్ని క్రీ.శ. 1925 లో ముక్త్యాల నుండి వెలువడుతున్న 'సరస్వతి' పత్రికలో కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రి మొదటి సారిగా పీఠికతో సహా ప్రచురించారు.) తెనాలి అన్నయ్య 'సుదక్షిణా పరిణయం' అనే కావ్యకర్త; శ్రీగిరి లేక గిరియప్ప 'శ్రీశైల మాహాత్మ్యము' అనే కావ్యం వ్రాశాడు; ఇమ్మడి రామకృష్ణుడు 'కృష్ణ చరితము'ను; రామభద్రుడు 'ఇందుమతీ కళ్యాణము'ను వ్రాశారు.

'ఇందుమతీ కళ్యాణం' లో రామభద్రకవి కవిస్తుతిలో భాగంగా -

ఉ॥ మామక నవ్యకావ్యము సమంచిత మాధురి సాధురీతిగా
యామకృత ప్రబంధ రచనాయత పాక చతుర్విధైక వా
గ్ధామహిమోజ్జ్వలాఢ్య కవితా ఘనతామహ మల్పితామహున్
రామయ రామకృష్ణ కవిరాజుఁ దలంచి నుతించి మ్రొక్కెదన్.

అంటూ తన పెదతాత రామకృష్ణ కవిని పొగిడి తరువాత ఆయన తమ్ముడైన అన్నప్ప కవీంద్రుడిని పొగిడాడు. ఆ తరువాత తన కృతిభర్త కృష్ణ భూపాలుడు తనతో యీ విధంగా అన్నాడని రామభద్ర కవి చెప్తున్నాడు -

సీ॥ ప్రౌఢి మీ పెద తాత పాండురంగాది స
త్కృతులు సేసెను రామకృష్ణ సుకవి
అనుజుఁ డన్నప్ప మీ పినతాత రచియించెఁ
బరఁగ సుదక్షిణా పరిణయంబు
మీ తాత శ్రీగిరి చాతురీ విఖ్యాతి
శ్రీశైల మాహాత్మ్య కృతియొనర్చెఁ
గడిమి మీ తండ్రి యిమ్మడి రామకృష్ణాఖ్యుఁ
డనఁ గీర్తిగనె సంస్కృతాంధ్రములను

గీ॥ దొరులనిపించె మీ అన్న వీర రాఘు
వాఖ్య కవి సర్వకవితా మహత్త్వమునను
నిన్ననూచాన సంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞ హృదయాబ్జ రవి రామభద్ర సుకవి!

ఈ పద్యం వలన గార్లపాటి రామన్న గారి కుటుంబం మొత్తం సంస్కృతాంధ్రములలో దిట్టలనీ, లబ్ధప్రతిష్ఠులైన కవులనీ అర్థమౌతుంది.

# చరిగొండ ధర్మన కవి - తెనాలి రామకృష్ణ కవి

చరిగొండ ధర్మన అనే కవి 'చిత్ర భారతం' అనే ఎనిమిది ఆశ్వాసాల కావ్యం వ్రాశాడు. ఈ కవి మహబూబ్ నగర్ జిల్లా చరిగొండకు చెందినవాడు. క్రీ.శ. 1503-1512 సంవత్సరాల మధ్యలో ఓరుగల్లును పాలించిన చిత్తపుఖాన్ అనే హిందూ ప్రభువు పోషణలోనో లేక ఆయన మంత్రి ఎనుములపల్లి పెద్దన పోషణలోనో 'చిత్రభారత' కావ్యాన్ని పూర్తిచేశాడు. ఈ ఎనుములపల్లి పెద్దనామాత్యుడి తండ్రి కూడా కందాళం అప్పలాచార్యుల వారి శిష్యుడట. ధర్మన రామకృష్ణ కవి (క్రీ.శ. 1495 - జననం) కంటె కనీసం పాతికేళ్లయినా వయస్సులో పెద్దవాడై (జననం సుమారు క్రీ.శ. 1470) వుంటాడు. అంటే 'చిత్రభారతం' వ్రాసేనాటికి ధర్మనకు 35-40 ఏళ్ల మధ్య వయస్సుండి వుంటుంది. అప్పుడు ఆయనకు ఆశ్రయం యిచ్చిన పెద్దనామాత్యునికి ఎంత లేదన్నా 50 ఏళ్లు వయస్సుండి వుండొచ్చు. ఆ పెద్దన తండ్రికి కనీసం డెబ్భైయేళ్లయినా వుండాలి. కందాళం అప్పలాచార్యులవారు పెద్దన తండ్రికి విద్యాగురువు అయితే అప్పటికాయనకు కనీసం తొంభై యేళ్లయినా వుండి తీరాలి. మనం పైన చెప్పుకున్నట్లు సారంగుతమ్మకవి రామకృష్ణకవి కంటె ముప్పై ఏళ్ల తర్వాత (అంటే క్రీ.శ. 1525లో) జన్మించాడనుకుంటే ధర్మన్న 'చిత్రభారతం' రచించిన అనంతరం సుమారు పాతికేళ్ల తరువాత గాని తమ్మకవి పుట్టలేదు. ఆయన గురువు కందాళం అప్పలాచార్యుల వారికేమో అప్పటికే తొంభై యేళ్లు. కనుక ఆయన తమ్మకవికి గురువయ్యే అవకాశం లేదు. ఈ చిక్కు సమస్య నుంచి బయట పడడమెలా?

ఇక్కడ ఒక్క విషయం మనం గుర్తుంచుకోవాలి. వైష్ణవ గురువులంతా వాళ్ల శిష్యుల కంటె వయస్సులో కనీసం యిరవై యేళ్లయినా పెద్ద వాళ్లయి వుండాలనే అవగాహనే తప్పు. ఎంచేతనంటే ఆ గురువులు తమ శిష్యులకు తప్త చక్రాంకనం చేసినవారేకానీ విద్యాగురువులు కారు. ముద్రాంకన శిష్యులు గురువు కంటె వయస్సులో చాల పెద్దవాళ్లుగా కూడా వుండడం కద్దు. బాల గురువుల వద్ద వృద్ధ శిష్యులుండవచ్చు. శ్రీకృష్ణదేవరాయలు తన ముద్రాంకన గురువైన తిరుమల తాతాచార్యుల వారికంటె పది పదిహేనేళ్ళు పెద్దవాడని ప్రతీతి.

ధర్మన జనన సంవత్సరం క్రీ.శ. 1470 అయితే ఎనుములపల్లి పెద్దనామాత్యుని జనన సంవత్సరం క్రీ.శ. 1460 అయివుంటుంది. ఆయన తండ్రి జనన సంవత్సరం క్రీ.శ. 1440 అయివున్నా తనకంటె ఇరవై ఏళ్ల చిన్నవాడైన వైష్ణవ గురువు కందాళం అప్పలాచార్యులవారి వద్ద ఆయన వైష్ణవ మతదీక్ష తీసుకున్నాడనుకుంటే అప్పలాచార్యులు జనన సంవత్సరం క్రీ.శ. 1460 అవుతుంది. ఆయన తనకంటె అరవై ఐదేళ్ల చిన్నవాడైన తమ్మకవికి బాల్యంలో వైష్ణవదీక్ష యిచ్చి వుంటాడు. అందుకే తన దీక్షా గురువైన అప్పలాచార్యులును తమ్మకవి తన 'వైజయంతీ విలాసము' అనే 'విప్రనారాయణ చరిత్ర' కావ్యంలో ప్రస్తుతించాడు.

ఇకపోతే చరిగొండధర్మన భట్ట పరాశర దేశికుని పౌత్రుడైన (మనుమడైన) రంగనాధ దేశికుని శిష్యుడట రామకృష్ణుడేమో భట్టపరాశరుని కుమారుడైన భట్టరు చిక్కాచార్యులు శిష్యుడట. రామకృష్ణకవి తన 'పాండురంగ మాహాత్మ్యము కావ్యంలో తన గురువు భట్టరుచిక్కాచార్యులును యిలా ప్రస్తుతించాడు -

క॥ వాక్కాంతాశ్రయు భట్టరు
చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్యకళాకలాప మీడేఱుటకున్. (పాండురంగ మాహాత్మ్యము 1-17)

"సరస్వతీ దేవి ఆశ్రయం పొందినట్టి మహాత్ముడైన నా గురుదేవులు భట్టరుచిక్కాచార్యుల వారిని యీ కావ్య రచన (నేననుకున్న రీతిలో) పరిపూర్తి కావడానికి నిజమైన భక్తితో పూజిస్తాను."

## లింగముగుంట తిమ్మ కవి - భట్టరు చిక్కాచార్యులు

లింగముగుంట తిమ్మకవి కూడా యీ భట్టరు చిక్కాచార్యుల వారి శిష్యుడేనట. తెలుగులో ప్రసిద్ధ ఛందో గ్రంధమైన 'సులక్షణ సారం' వ్రాసిన లింగముగుంట తిమ్మకవి తెనాలి రామకృష్ణుని అల్లుడు లింగముగుంట రామయ్యకు స్వయానా తమ్ముడు. ఈ లింగముగుంట తిమ్మకవి 'బాలబోధచ్ఛందం' అనే మరోలక్షణ గ్రంధాన్ని కూడా వ్రాశాడట ప్రసిద్ధ కవియైన తన అన్న లింగముగుంట రామయ్యకు లేఖకుడిగా యీయన చాలకాలం పనిచేశాడట.

రామకృష్ణకవి సుమారుగా క్రీ.శ. 1495లో జన్మించి వుంటాడని మనం భావిస్తున్నాం. ఆయన అల్లుడు లింగముగుంట రామయ్య రామకృష్ణుని కంటె కనీసం పదిహేనేళ్లు చిన్నవాడయినా తిమ్మకవి యింకొక అయిదేళ్ల చిన్నవాడనుకున్నా, ఆయన క్రీ.శ. 1515 లో జన్మించి వుంటాడు. రామకృష్ణకవికి గురువైన భట్టరు చిక్కాచార్యులు సుమారుగా క్రీ.శ. 1460లో జన్మించిన వాడైనా క్రీ.శ. 1540 ప్రాంతాలలో నైనాసరే తన ఎనభయ్యవయేట లింగముగుంట తిమ్మకవికి వైష్ణవదీక్షా గురువు అయివుండడానికి అవకాశం వుంది కదా!

## భట్టరు చిక్కాచార్యుల వంశావళి

తంజావూరును పరిపాలించిన విజయరాఘవ నాయకుడి (క్రీ.శ. 1633-1673) ఆస్థానంలో పోషణ నందుకున్న శేషము తిమ్మకవి రచించిన 'అంబరీష చరిత్రము'లో భట్టరు చిక్కాచార్యుల వంశావళి వివరంగా తెలుపబడింది. భట్టపరాశరుని కుమారుడు భట్టరు చిక్కాచార్యుడనీ, ఆయన కుమారుడు రంగనాధ దేశికుడనీ, ఆయన కుమారుడు తిరిగి భట్టరు చిక్కాచార్యుడనీ మరల ఆయన పుత్రుడు రంగనాధ దేశికుడనీ, ఆ రంగనాధుడు తన గురువనీ శేషము తిమ్మకవి వ్రాసుకున్నాడు. తిమ్మకవి విజయరాఘవ నాయకుని ఆస్థానంలో వెలుగొందాడు కనుకనూ, విజయ రాఘవుని పాలనా కాలం క్రీ.శ. 1633-73 కనుకనూ తిమ్మకవి సుమారుగా క్రీ.శ. 1600 సంవత్సరంలో జన్మించాడనుకుందాం. అప్పుడు చిక్కాచార్యులవారి వంశావళి యీ క్రింది విధంగా వుండివుండే అవకాశముంది -




ఆ విధంగా రామకృష్ణకవికి మనం చేసిన కాలనిర్ణయం (క్రీ.శ. 1495-1590) చక్కగానే సరిపోతుంది. శేషము తిమ్మకవి గురువైన రంగనాథ దేశికుని కాలనిర్ణయం కూడా సరిపోతుంది.

ఇకపోతే చరిగొండ ధర్మనకవి గురువు భట్టపరాశరుడి మనుమడైన రంగనాథ దేశికుడు అయివుండడానికి అవకాశముందో లేదో కూడా పరిశీలిద్దాం. చరిగొండ ధర్మన కవి సుమారుగా క్రీ.శ. 1470లో జన్మించిన వాడనే నిర్ధారణకు మనమింతకు ముందు వచ్చాం. ఆయన క్రీ.శ. 1512 ప్రాంతాలలో 'చిత్రభారత' రచన పూర్తి చేసి వుండవచ్చు. అంతకు కనీసం ఒక సంవత్సరం ముందు అంటే క్రీ.శ. 1511లో ఆయన వైష్ణవం స్వీకరించాడనుకుంటే అప్పటికి 21 సంవత్సరాల వయస్సున్న రంగనాథ దేశికుని వద్ద ఆయన కంటె వయస్సులో ఇరవై సంవత్సరాలు పెద్దవాడైన చరిగొండ ధర్మన చక్రాంకనం పొంది వైష్ణవ మంత్ర దీక్షా స్వీకరణ చేసి వుంటాడనడాన్ని కూడా మనం అసమంజసమని త్రోసివేయలేం.

## పెద్ద సంగ భూపాలుడు - కొండ్రాజు వేంకటాద్రి - విరూరి వేదాద్రి

తెనాలి రామకృష్ణకవి తన 'పాండురంగ మాహాత్మ్యము'ను విరూరి వేదాద్రి మంత్రికి అంకితమిచ్చాడనీ, వేదాద్రి పొత్తపినాటిని పాలించిన తెలుగు చోడ ప్రభువు మంగయ గురవరాజు కుమారుడు పెద్దసంగ భూపాలుని వద్ద వ్రాయసకాడుగా పనిచేసేవాడనీ మనం తెలుసుకున్నాం. రామకృష్ణకవి కాలాన్ని నిర్ధారించడానికి మనం పెద్ద సంగ భూపాలుని గురించీ, అతని మేనల్లుడు కొండ్రాజు వేంకటాద్రిని గురించీ క్లుప్తంగానైనా తెలుసుకొనడం అవసరం. (తెలుగు చోడుల గురించి మరిన్ని వివరాల కోసం 'తెలుగు చోడులు - వారి బంధువర్గం' అనే ప్రత్యేకానుబంధం చూడండి.)

పొత్తపినాటి తెలుగుచోడ ప్రభువైన మంగయ గురవరాజు సదాశివరాయలు రాజ్యకాలంలో క్రీ.శ. 1445 లో దేవుని నిమిత్తం నాలుగు గ్రామాలు పొందినట్లు కర్నల్ కాలిన్ మెకంజీ స్థానిక చరిత్రల ద్వారా తెలుస్తున్నదని మనం లోగడ అనుకున్నాం. ఈ గురవరాజుకు తొమ్మిది మంది కుమారులట. వారిలో పెద్దసంగ భూపతి మూడవవాడు. (అతని వద్ద వ్రాయసకాడే మన విరూరి వేదాద్రి మంత్రి). తొమ్మిది మంది పుత్రుల తరువాత గురవరాజుకు పాపమాంబ అనే కుమార్తె కలిగింది. ఆమెను కొండ్రాజు తిమ్మరాజనే తెలుగు చోడ పాలకుని కిచ్చి వివాహం చేయగా వారికి కలిగిన కుమారుడే వేంకటాద్రి.

ఈ వేంకటాద్రికి 'రెట్టమతము' అనే జ్యౌతిష్యగ్రంథం అంకితమీయబడిందట. అంతేకాక 'కామందకము' అనే

రాజనీతి శాస్త్ర గ్రంధం ఒకటికూడా ఆయనకు అంకితం యివ్వబడిందట. ఆ గ్రంధంలో ప్రధమాశ్వాసంలో చివరగా -

క॥ శ్రీ చంచద్భట్టరు చి
క్కాచార్య వరార్య శిష్యయతులిత శౌర్య
ప్రాచుర్య వర్య గుణ ర
త్నావల జయలలిత ధైర్య నయవినయనిధీ.

అని వుండడాన్ని బట్టి యీ వేంకటాద్రి కూడా భట్టరు చిక్కాచార్యుల వారికి శిష్యుడైనట్లు తెలుస్తున్నది. ఇది సాధ్యమో, కాదో, సాధ్యమైతే - ఎలా సాధ్యమో చూద్దాం మనమిప్పుడు.

సదాశివరాయలు పాలనాకాలంలో ఆ రాజు నుండి క్రీ.శ. 1545 లో ఆ నాలుగు గ్రామాలు పొందే నాటికి పొత్తపినాటి తెలుగు చోడ ప్రభువైన మంగయ గురువరాజుకు నలభైయేళ్ల వయసైనా వుంటుందని భావిస్తే - ఆయన క్రీ.శ 1505లో పుట్టిన వాడైవుంటాడు. ఆయన మూడవ కుమారుడైన పెద్దసంగభూపాలుడు క్రీ.శ. 1535లో జన్మించి వుండవచ్చు. గురవరాజుకు తొమ్మిది మంది పుత్రుల అనంతరం క్రీ.శ. 1565లో పాపమాంబ జన్మించియుండవచ్చు. ఆమెను కొండ్రాజు తిమ్మరాజు వివాహం చేసుకొనగా వారికి వేంకటాద్రి క్రీ.శ. 1580-85 ప్రాంతాలలో జన్మించి వుండవచ్చు. రామకృష్ణుడికి గురువైన భట్టరు చిక్కాచార్యులు క్రీ.శ. 1460 ప్రాంతాలలో జన్మించి వుంటాడనే నిర్ధారణకు మనం లోగడే వచ్చాం. కనుక ఆయన వేంకటాద్రికి గురువయ్యే అవకాశం లేదు. కాని కొండ్రాజు వేంకటాద్రికి ఆ చిక్కాచార్యులవారి మనుమడు, క్రీ.శ 1520లో జన్మించి వుంటాడని భావిస్తున్న అదే పేరుగల మరొక భట్టరు చిక్కాచార్యులు ముద్రాంకన గురువయ్యే అవకాశముంది

అయితే వేంకటాద్రికి సంబంధించిన కాలనిర్ణయాన్ని యిలా కాక కందుకూరి వీరేశలింగం పంతులుగారు వేరొక పద్ధతిలో చేసి 'పాండురంగ మాహాత్మ్యము' క్రీ.శ. 1650 తరువాత ఎప్పుడో వ్రాసినట్టి కావ్యమని ఋజువు చేయడానికి ప్రయత్నించారు. దీనికి ఆయన వేరొక ఆధారాన్నెంచుకున్నారు. ఆయన వాదనేమిటో మనమిప్పుడు వివరంగా చూద్దాం

వీరేశలింగం పంతులుగారు కొండ్రాజు వెంకటాద్రి కృతినందుకున్న 'రెట్టమతము' అనే జ్యోతిశ్శాస్త్ర గ్రంధము చివరనున్న యీ క్రింది పద్యం ఆధారంగా తెనాలి రామకృష్ణ కవి కాలనిర్ణయాన్ని చేయబూనుకున్నారు.

ఆ పద్యం చూడండి -

సీ॥ కలియుగ ప్రథమ భాగము నాల్గువేల యె
న్మిదినూర్ల పైని డెబ్బదియు నొకటి
శాలివాహన శక సమ లిల వేయునా
ర్నూట తొంబది రెండు రూఢిగాఁగ
బ్రభవాది గతములు పరఁగ నిర్వదిమూఁడు
నేండ్లయ్యె నెంతయునెన్న బుధులు
అట్టికాలంబున నయ్యన భాస్కర
కవివర్యులల రాజకమల హితుని
యాజ్ఞఁ బూర్వోక్త రెట్టమతాఖ్య కావ్య
మును నొనర్చిరి యాచంద్రముగను కీర్తి.

ఈ పద్యం ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో వున్న 'రెట్టమత' గ్రంధము యొక్క మొత్తం నాలుగు ప్రతులలో ఒక్కదానిలోనే వున్నదట. ఈ పద్యం నిండా తప్పులు కోకొల్లలుగా వున్నట్లుగా పేర్కొంటూనే వాటన్నిటినీ దిద్దిన వీరేశలింగం పంతులుగారు అనుమానాస్పదమయిన యిదే పద్యాన్ని ఆధారంగా చేసుకుని రామకృష్ణకవి కాలనిర్ణయానికి పూనుకోవడం విచిత్రం.

పై పద్యంలో వేయునార్నూట తొంబదిరెండు (1692) శాలివాహనశక సమములు (సంవత్సరములు) అంటే 1692+78 : క్రీ.శ. 1770 అవుతుంది. పై పద్యాన్ననుసరించి వీరేశలింగం గారి వాదనేమంటే క్రీ.శ. 1770లో 'రెట్ట మతశాస్త్రము' యొక్క కృతిపతియైన కొండ్రాజు వేంకటాద్రి వుండగా ఆయన మేనమామయైన పెద్ద సంగభూపాలుడు క్రీ.శ. 1650 కంటె పూర్వుడు కాజాలడు. ఆయన వద్ద వ్రాయసకాడైన వేదాద్రి మంత్రి కూడా క్రీ.శ. 1650 ప్రాంతాలలో వుండినవాడే అయివుంటాడు. కనుక 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యము క్రీ.శ. 1650 కంటె తరువాతదే కాని అంతకు ముందరి కాలపు రచన కాదు అని తేల్చారు. కనుక క్రీ.శ. 1520 నుండి 1530 వరకు అంటే 'పాండురంగ మాహాత్మ్యము' రచనకు నూటయిరవై యేళ్ల ముందు తెనాలి రామకృష్ణకవి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో వున్నాడనడం అర్థరహితమని కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆక్షేపిస్తున్నారు.

ఇలా విశ్వసనీయం కాని, అన్ని వ్రాత ప్రతులలోనూ కానరాని ఒక పద్యాన్ని పట్టుకుని మాత్రమే 'పాండురంగ మాహాత్మ్యం' రచనా కాలాన్ని నిర్ణయించ బూనుకొనడం ఎంతమాత్రం సమర్థనీయం కాదు. ఈ కొండ్రాజు వేంకటాద్రి ఏ కాలంవాడో నిర్ధారించడానికి మరింకేమైనా ఆధారాలున్నాయేమో చూద్దాం.

రెట్టమతములోని యింకో పద్యం చూడండి -

సీ॥ శ్రీమదహోబల స్వామి మహారాజ్య
రక్షకుండగుచు నేరాజు వెలయు
నభిరామ కామందకాఖ్య సత్కావ్య ర
త్నమునకు నేరాజు నాథుఁడయ్యె
నొరయూరి పురవరాధీశాది బహుబిరు
దాంకుఁడై యేరాజు యశముగాంచె
జానకీనాయక చరణసంసేవన
ప్రాభిచే నే రాజు ప్రబలు సిరుల

గీ॥ నతఁడు కొండ్రాజు తిమ్మభూపతి వరేణ్య
తనయ పెదతిమ్మరాజవతంస గర్భ
వార్ధి చంద్రుండు సత్కులవర్ధనుండు
సతత విభవుండు వేంకటక్ష్మావిభుండు

వేంకటాద్రి అహోబలస్వామి భక్తుడట. 'కామందకము' అనే కావ్యానికి కూడా ఆయన కృతిపతియట. ఒరయూరి (వరయూరి) పురవరాధీశుడు అనే చాల బిరుదనామములతో ఆయన కీర్తిగాంచాడట.

'కామందకము' అనే కావ్యాన్ని వేంకట రామకృష్ణులు వ్రాశారు. వాళ్లు దానిని ఎనిమిది ఆశ్వాసాల కావ్యంగా

వ్రాసి వేంకటాద్రికి అంకితమిచ్చారట. వేంకటాద్రికి 'రెట్టమత శాస్త్రము' అంకితమివ్వబడింది దీని తరువాతనే. (తిక్కన కంటె పూర్వకాలానికి చెందిన మరో 'కామందకము' కూడా వున్నదట)

అయితే వేంకటాద్రి కృతినందుకున్న కామందకములో -

**రమణీయంబుగ శాలివాహ శక వర్షంబుల్ గతంబై సహ**
**స్రము వేనూటను నాఱునై వెలయఁగా బ్రౌఢిందెనింగించి రౌ**
**ర మహిందిమ్మయ వేంకటాద్రి విభుపేరన్ వేడ్కఁగామందకీ**
**యము శ్రీవేంకట రామకృష్ణులు స్వభాన్వబ్దంబున్ రూఢిగన్.**

వేనూరు అంటే ఐదువందలు. సహస్రము వేనూరును ఆరు అంటే 1506. శాలివాహన శక సంవత్సరం 1506 అంటే క్రీ.శ. 1584 (1506+78) అవుతుంది. అంతేకాక స్వభాన్వబ్దంబునన్ - అంటే స్వభాను నామ సంవత్సరంలో - ప్రభవ మొదలు అక్షయ వరకు గల అరవై సంవత్సరాలలో స్వభాను ఒకటి. 2004వ సంవత్సరం స్వభాను నామ సంవత్సరంతోనే ప్రారంభమైంది. అంటే వరుసగా 60 ఏళ్లు తీసేస్తూ వెనక్కి వెళితే స్వభాను నామ సంవత్సరాలు యిలా వుంటాయి - క్రీ.శ. 1944, 1884, 1824, 1764, 1704, 1644, 1584. అలా 'కామందకము' అనే కావ్యము వెంకట రామకృష్ణ కవులచే తెనిగించబడి తిమ్మయ వెంకటాద్రికి (కొండ్రాజు తిమ్మయ్య కొడుకు వేంకటాద్రికి) అంకితమీయబడినది క్రీ.శ. 1584 లోననేది రూఢి పడింది.

ఇక అహోబల క్షేత్రంలోని మహాద్వారంపైని శాసనంలో కూడా యీ కొండ్రాజు వేంకటాద్రి కాలనిర్ణయం చేయడానికుపకరించే సమాచారం కొంత వుంది. దాన్ని కూడా పరిశీలిద్దాం.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు 1506 అగు నేటి తారణ సంవత్సరం వైశాఖ శుద్ధ 14 శ్రీమద్రాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీవీర ప్రతాప శ్రీవీర శ్రీరంగరాయ దేవమహారాయలు గారు పెనుగొండ నగరమందు వజ్ర సింహాసనారూఢులై పృథ్వీ సామ్రాజ్యముచేయుచుండగాను శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య సర్వతంత్రోభయ వేదాంతాచార్యులయిన శ్రీ శఠగోపజియ్యంగారి కార్యకర్తలయిన రాచప్పగారున్ను, శ్రీ అహోబల స్థానం వారున్ను, కాశ్యపగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన సూర్య వంశోద్భవులయిన మూరురాయర బసవశంకర గుత్తిహంనిబ్బరగండ యొరయూరి పురవరాధీశ్వరులయిన వేంకటరాజుదేవ మహారాజులుంగారికి యిచ్చిన శిలాశాసన క్రమమెట్లన్నను. . . . . . . . . . . . . ", యిలా సాగుతుంది ఆ శాసనం. శాలివాహన శక వర్షములు 1506 అంటే క్రీ.శ. 1584. క్రీ శ 1584 వ సంవత్సరం స్వభాను నామ సంవత్సరంతో ప్రారంభమై తరువాత చైత్ర శుద్ధ పాడ్యమి నుంచి తదుపరిదైన తారణ నామ సంవత్సరం మొదలవుతుంది. అందుకే యీ శాసనం వైశాఖ శుద్ధ చతుర్దశినాడు వేయించినది కనుక - అది తారణ నామ సంవత్సరం అయింది. అలా యీ శాసనం కొండ్రాజు వేంకటాద్రి కాలాన్ని 'కామందకము'లోని పైన పేర్కొన్న పద్యంలో తెలిపిన విధంగానే క్రీ.శ. 1584 అని రూఢి పరుస్తున్నది. ఇది వేంకటాద్రికి ఉన్న బిరుదులు తెలపడమే కాక ఆయన తండ్రి తిమ్మరాజునీ తిరిగి తిమ్మరాజు తాత తిమ్మరాజునీ కూడా రూఢి పరుస్తున్నది. అంతేకాక అది పెనుగొండను రాజధానిగా చేసుకుని శ్రీరంగరాయ దేవ మహారాయలు పరిపాలిస్తున్న కాలమని కూడా విశదపరుస్తున్నది. ఈ శ్రీరంగ దేవరాయలు శ్రీకృష్ణదేవరాయల రెండవ అల్లుడైన ఒంటికంటి తిరుమల రాయలు యొక్క రెండవ కుమారుడు. ఇతడు పెనుగొండ రాజధానిగా విజయనగర సామ్రాజ్యాన్ని క్రీ.శ. 1572 నుండి 1585 వరకు పరిపాలించాడు. శ్రీరంగరాయలు యొక్క పట్టాభిషేకమైతే పెనుగొండలో క్రీ.శ. 1572 జరిగిందిగానీ, ఆ తరువాత వెంటనే ఆయన తన రాజధానిని చంద్రగిరికి

మార్చాడని అనంతపురం జిల్లా గెజిటీర్‌లో పేర్కొనబడింది. (*Anantapur Gazetteer page 21*) ఈ శాసనం ఆయన చనిపోయే (క్రీ.శ. 1585) వరకు పెనుగొండనే తన రాజధానిగా పాలించాడనే సత్యాన్ని కూడా ధృవపరుస్తూ యీ విషయమై వాదోపవాదాలకు తావు లేకుండా చేసింది. 'రెట్టమతము' యొక్క ఒకే ఒక్క వ్రాత ప్రతిలోనున్న అనుమానాస్పదమైన ఆ 'కలియుగ ప్రథమ భాగము' అని ప్రారంభమయ్యే పద్యం యింతటి చర్చోపచర్చలను లేవదీసింది. ఎట్టకేలకు వీరేశలింగం పంతులుగారితో సహా దాదాపు సాహితీ విమర్శకులంతా ఆ పద్యం సత్యదూరమని విశ్వసిస్తూ మిగిలిన ఆధారాల సహాయంతో 'పాండురంగ మాహాత్మ్యము' రచనా కాలం క్రీ.శ. 1560-70 మధ్య ప్రాంతమై వుండవచ్చుననే నిర్ధారణకు వచ్చారు. పంతులుగారు కూడా చివరిదశలో రామకృష్ణ కవి రాయలవారి ఆస్థానంలోని అష్టదిగ్గజ కవులలో ఒకడని నిర్ధారణకు వచ్చారని ఆరుద్రగారి 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' పేర్కొంది.

పై శాసనంలోని కొండ్రాజు తిమ్మయ్యగారి కుమారుడు వేంకటాద్రి ఒరయూరి పురవరాధీశ్వరుడగు సూర్య వంశోద్భవుడు కనుక తెలుగు చోడులలోనివాడు. కామందకములో వేంకటాద్రిని గురించి 'శ్రీదేవచోడ వంశ మహోదధి పరిపూర్ణ చంద్రా . . . కొండ్రాజు వేంకటాద్రి నరేంద్రా!" అనీ 'రెట్ట మతము'లో 'కామందక కావ్య నాయకా' అనీ, 'భాను వంశాగ్రణీ' అనీ పేర్కొనబడింది.

## తెనాలి అన్నయ్య వ్రాసిన 'సుదక్షిణా పరిణయము'
## - కృతిభర్త పులిజాల సోమామాత్యుడు

తెనాలి రామకృష్ణ కవికి యిద్దరు తమ్ముళ్లు. పెద్ద తమ్ముడు అన్నయ్య; చిన్న తమ్ముడు శ్రీగిరయ్య. అన్నయ్య 'సుదక్షిణా పరిణయము' అనే కావ్యం వ్రాశాడు. శ్రీగిరయ్య 'శ్రీశైల మాహాత్మ్యము' అనే కావ్యాన్ని వ్రాశాడు.

'సుదక్షిణా పరిణయ' కావ్యాన్ని అన్నయ్య కవి పులిజాల సోమామాత్యుడు అనే ఆయనకు అంకిత మిచ్చాడనీ, సోమామాత్యుడు క్రీ.శ. 1580 ప్రాంతాలలో వుండే వాడని తెలుతున్నదనీ వీరేశలింగం పంతులుగారు వ్రాశారు. ఇది నిజమని నమ్మామనుకోండి మరప్పుడు గార్లపాటి అన్నయ్యకు అన్నగారైన తెనాలి రామకృష్ణ కవి క్రీ.శ. 1650 ప్రాంతంలో 'పాండురంగ మాహాత్మ్యము' వ్రాశాడని వీరేశలింగం పంతులుగారు యింతకుముందు చేస్తూన్న వాదన ఎలా సమర్థనీయం? తమ్ముడు అన్నగారి కంటె 70 ఏళ్లముందరి వాడనడం ఎలా పొసగుతుంది? ఇలా పంతులుగారి వాదనలు ఒక దానికొకటి పొంతన లేనివిగా వున్నాయి.

ఇప్పుడసలు యీ పులిజాల సోమామాత్యుడెప్పటివాడో అది కూడా చూద్దాం.

పులిజాల సోమామాత్యుడు కోనేటి తిమ్మరాజు కొడుకైన రామరాజు దగ్గర మంత్రి. కోనేరు వారు ఆరవీటి వంశానికి చెందిన చాళుక్య శాఖీయులు. ఈ వంశం వారిలో రామరాజు అనేవాడు 'మహామండలేశ్వర' అనే బిరుదు వహించి పాలించాడు. ఆయన కుమారుడు కోనేటి తిమ్మరాజు. ఈ తిమ్మరాజు నెల్లూరు జిల్లా ఉదయగిరిలోని రఘునాథస్వామి ఆలయానికి గోపురము, మండపము, ప్రాకారములను కట్టించి కోనేరు కూడా త్రవ్వించి ప్రసిద్ధి కెక్కినవాడు. ఉదయగిరిలోని ఒక శాసనంలో యీ తిమ్మరాజుకు 'దంబాదికమ్మ' అనే బిరుదున్నట్లు పేర్కొనబడింది. 'దంబాదికమ్మ' (దంబు+ఆది+కమ్మ) అంటే "ఘనమైన ఆదికమ్మ" అని అర్థం చెప్పారు 'కమ్మవారి చరిత్ర' వ్రాసిన కొత్త భావయ్య చౌదరిగారు. ఈ కోనేటి తిమ్మరాజు కొడుకు రామరాజు. ఈయన తాతపేరు పెట్టబడిన మనుమడన్న మాట. ఈయన అళియ రామరాయలుకు

మనుమడు అవుతాడట. పులిజాల సోమామాత్యుడు యీ రామరాజు దగ్గర మంత్రిగా పని చేసినవాడు. అళియ రామరాయలు పెద్ద కుమార్తె తిమ్మరాజు అనే అతడిని పెండ్లాడిందట. అళియ రామరాయలు తాత బుక్కయ రామరాజు. ఆయనకు రామరాయలు తండ్రి శ్రీరంగరాజు కంటె పెద్దవారైన యింకా యిద్దరు కుమారులున్నారు. వారు తిమ్మరాజు, కొండరాజులు అళియ రామరాయలుకు పెదనాన్న అయిన యీ తిమ్మరాజు మనుమడే (కుమార్తె కొడుకే) యీ కోనేటి తిమ్మరాజు. అంటే అళియ రామరాయలు తన పెదనాన్న కూతురు కొడుకైన (వరుసకు మేనల్లుడైన) తిమ్మరాజుకు తన పెద్ద కుమార్తెనిచ్చి పెండ్లి చేశాడన్నమాట. వారి కుమారుడే రామరాజు (అళియరామరాజు కుమార్తె తన కుమారుడికి తన తండ్రి పేరే పెట్టుకున్నదన్నమాట). క్రీ.శ. 1565 లో జరిగిన తళ్లికోట యుద్ధం నాటికి అళియరామరాయలుకు ఎనభై ఏడు సంవత్సరాలని చరిత్రకారులు నిర్ధారించారు. అతని మనుమడు కోనేటి రామరాజుకు అప్పటికి షుమారు 30 ఏళ్ల వయస్సుండి వుంటుంది కనుక క్రీ.శ. 1565-70 సంవత్సరాల మధ్యకాలంలో గార్లపాటి అన్నయ్య తాను రచించిన 'సుదక్షిణా పరిణయము'ను కోనేటి రామరాజు వద్ద మంత్రిగా వున్న పులిజాల సోమామాత్యునికి అంకితం యిచ్చివుండే అవకాశం వుంది. ఇది సంభావ్యమే!

## కందాళం అప్పలాచార్యులు - గండికోట భూదానం

క్రీ.శ. 1542 పరాభవ నామ సంవత్సరంలో గండికోట ప్రభువు కందాళం అప్పలాచార్యునికి భూదానం మిచ్చినట్లు ఒక దాన శాసనముంది. గండికోట విజయనగర సామ్రాజ్యానికి గడిదుర్గం. ఒక ప్రక్కలోతైన అగడ్త, మరొక ప్రక్క పెన్నానది, యింకొక ప్రక్క చిత్రావతి నదులు ప్రవహిస్తూంటే పటిష్టమైన రక్షణ ఏర్పాట్లతో నిర్మించబడిన గండికోట మిక్కిలినేని రామానాయుడు అనే కమ్మ ప్రభువు చేత నిర్మించబడిందంటారు. ఆయనకు పురుష సంతానం లేదట. తన ఏకైక కుమార్తె భర్త అయిన గుంటూరు జిల్లా బెల్లంకొండకు చెందిన కమ్మ ప్రభువు పెమ్మసాని తిమ్మానాయడిని యిల్లరికం తెచ్చుకుని కోట అప్పజెప్పాడంటారు. క్రీ.శ. 1431లో అనంతపురం జిల్లా యాడికి పరగణా పాలనాధికారాన్ని యీయనకు ప్రౌఢ దేవరాయలు యిచ్చినట్లూ, కల్బుర్గ (గుల్బర్గా) కోట పట్టుకొనడంలో 8 వేల సైన్యంతో తనకు సహాయపడిన తిమ్మానాయడిని మెచ్చుకుని ప్రౌఢ దేవరాయలు లోగడ జిల్లేళ్ల చలపతిరాజు కట్టించిన గండికోటను యీయనకు స్వాధీన పరచాడనీ, దాన్ని యీయన పునర్నిర్మించాడనీ స్థానిక చరిత్రలు తెలుపుతున్నాయి. ఈయన తల్లి వెంకటమ్మ పేరుతో వెంకటాపురం అనే గ్రామం నిర్మించాడట. గొప్పదాతగా ప్రఖ్యాతి గాంచినవాడు తిమ్మానాయుడు. ఈయన తమ్ముడి కుమారుడు చెన్నమనాయుడు యితని తరువాత వారసుడయ్యాడంటారు. చెన్నమనాయడి కుమారుడే కృష్ణ దేవరాయల కాలంలో సేనానిగానూ, సామంతరాజు గానూ ప్రసిద్ధిగాంచిన రామలింగనాయకుడు. ఈ రామలింగ నాయకుడు శ్రీకృష్ణదేవరాయలు వద్ద 80 వేల సైన్యానికి అధిపతిగా వుండేవాడట. చెన్నమనాయడి చెల్లెలు కృష్ణదేవరాయలు తల్లియైన నాగులాంబిక (తుళువ నరసనాయకుని రెండవ భార్య) అలా తన మేనమామ కుమారుడైన రామలింగనాయకునికి తన రాజ్యంలో రాయలవారు ఎంతో ప్రాధాన్యతనిచ్చారు. రామలింగనాయకుని కుమారుడు పెదతిమ్మానాయుడు. ఇతడు కూడా వీరనరసింహరాయలుకూ, శ్రీకృష్ణ దేవరాయలుకూ సమకాలికుడేనట! రామలింగనాయకుడు కృష్ణదేవరాయలు కంటె పదేళ్లు పెద్దవాడట. క్రీ శ 1530 లో చనిపోయేనాటికి కృష్ణదేవరాయలుకు 56 సంవత్సరాలని చరిత్రకారులు నిర్ధారించారు. అంటే క్రీ.శ. 1530 నాటికి రామలింగ నాయకునికి 66 సంవత్సరాల వయస్సుంటే ఆయన కుమారుడు పెదతిమ్మానాయనికి 46 సంవత్సరాలుండవచ్చు. అతని కుమారుడు పెమ్మసాని అర తిమ్మానాయుడు. ఈయన్నే చినతిమ్మానాయడంటారు. ఈయన

అన్న బలిచిన్న నాయకుడు యౌవనంలోనే మహమ్మదీయులతో జరిగిన ఘోరయుద్ధంలో దుర్మరణం పాలుకాగా, తమ్ముడైన అరతిమ్మానాయుడు క్రీ.శ. 1540లో తండ్రి తరువాత రాజ్యపాలన చేపట్టాడు. అప్పుడు అతడి వయస్సు సుమారు 35 సంవత్సరాలు. అతడు గొప్ప దాతగా ప్రసిద్ధిగాంచాడు. గొప్ప యోధుడు కూడా. ఇతడికి ఎన్నో బిరుదులున్నాయి. ఇతడి దానాలకు అంతేలేదు. గడ్డుకాలంలో విజయనగరం నుంచి ఆశ్రయం కోరి వచ్చిన అళియ రామరాయలుకు అరతిమ్మానాయుడు ఆశ్రయమిచ్చి ఆయన శత్రువైన సలకము తిమ్మరాజు సైన్యాలను ఓడించి పారద్రోలాడట. ఎన్నో దేవాలయాలకు భూములు దానమిచ్చాడు. తిమ్మానాయనిపేట అనే గ్రామాన్ని తన పేరిట నిర్మించాడు. అప్పటి గండికోట ప్రభువు అరతిమ్మానాయడే కనుక, ఆయనే క్రీ.శ. 1542 లో కందాళం అప్పలాచార్యుల వారికి భూదాన మిచ్చి వుంటాడు. ఈ అప్పలాచార్యుని శిష్యుడైన విరూరి వేదాద్రి సమకాలికుడైన తెనాలి రామకృష్ణుడు నూట యిరవై ఏళ్ల తరువాత క్రీ.శ. 1660 ప్రాంతాలలో 'పాండురంగ మాహాత్మ్యము' ఎలా వ్రాశాడో మరి వీరేశలింగం పంతులుగారే చెప్పాలి!

## గార్లపాటి రామభద్రకవి - 'ఇందుమతీ కళ్యాణము'

మనం యింతకుముందే చెప్పుకున్నట్లు తెనాలి రామకృష్ణ కవి చిన్న తమ్ముడైన శ్రీగిరికి రామకృష్ణుడనే కుమారుడున్నాడు. ఆయన్నే రెండవ రామకృష్ణుడు లేక ఇమ్మడి రామకృష్ణుడు అంటారు. ఆయనా కవే! ఆయన 'కృష్ణ చరితము' అనే కావ్యం వ్రాశాడు. గార్లపాటి రామభద్రకవి యీ యిమ్మడి రామకృష్ణ కవి రెండవ కుమారుడు. ఈయనే 'ఇందుమతీ కళ్యాణము' అనే కావ్యకర్త. ఆ కావ్యాన్ని రామభద్రకవి పాలచురి కృష్ణభూపాలునికి అంకితమిచ్చాడట. ఆ రాజు యొక్క గురువు శ్రీనివాసాచార్యుడు. ఆయన వంశీకుడొకరు క్రీ.శ. 1650 లో 'కర్మవిపాకము' అనే గ్రంథాన్ని వ్రాసి తన శిష్యుడైన పూడూరి శోభనాద్రి రాజుకు అంకితమిచ్చాడట. ఈ గురుపరంపరను పరిశీలించి చూస్తే ఏ లెక్కన చూసినా రామభద్రకవి కానీ, ఆయన కృతి భర్త పాలచూరి కృష్ణభూపాలుడు కానీ క్రీ.శ. 1590-1600 సంవత్సరాల మధ్య కాలంలో వున్నట్లు తెలుస్తున్నది. వీరేశలింగం గారు భావిస్తున్నట్లుగా 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యము ఆయన క్రీ.శ. 1650 తరువాత వ్రాసిన విషయం నిజమే అయితే తెనాలి రామకృష్ణకవి తన చిన్న తమ్ముని మనుమడి కంటె 50 సంవత్సరాల తరువాత కూడా జీవించాడన్న మాట! ఇవి ఎట్టి ఆధారమూ లేని ఊహలు. ఇది ఏ మాత్రం సంభవం కాదు. కనుక, రామకృష్ణకవి క్రీ.శ. 1495 లో జన్మించి క్రీ.శ. 1520-30ల మధ్య రాయల వారి ఆస్థానంలో వుండి; క్రీ.శ. 1570 ప్రాంతాలలో 'పాండురంగ మహాత్మ్యము' కావ్యాన్ని విరూరి వేదాద్రికి అంకితమిచ్చి వుంటాడని మనం యింతకు ముందుకు చేసుకున్న నిర్ధారణే సవ్యమైనది.

## చిట్టరసు - కందర్పకేతు విలాసము

ఇక తెనాలి రామకృష్ణుడు వ్రాసిన 'కందర్పకేతు విలాసము' అనే కావ్యం చిట్టమంత్రి అనే వానికి అంకిత మీయబడిందట. ఈ చిట్టమంత్రినే 'చిట్టరసు' అని కూడా అంటారు. 'అరసు' అంటే తమిళ, కన్నడ భాషలలో 'రాజు' అని అర్థం. (అరసు అంటే ప్రభుత్వం అని కూడా వాడుక వుంది.) కరణములుగా నియమించబడిన నియోగులలో అక్కిరాజు, భావరాజు, దేశిరాజు, బసవరాజు, అబ్బరాజు, వాసిరాజు వగైరా యిళ్ల పేర్లుండడమేకాక నియోగి బ్రాహ్మణులలో సుబ్బరాజు, బసవరాజు వగైరా రాజు శబ్దంతో అంతమయే పేర్లు కూడా చూస్తున్నాం. కన్నడంలో అప్పాజీ తిమ్మరుసు పేరు యిలా ఏర్పడిందే. నియోగి బ్రాహ్మణుడు, అప్పాజీ తిమ్మరుసు మేనల్లుళ్లయిన నాదెండ్ల అప్పన్న, గోపన్నలకు సన్నిహిత జ్ఞాతి,

సమకాలికుడు అయినట్టి చిట్టరసు పేరు కూడా అలా ఏర్పడిందే! కృతి భర్త కాలాన్ని బట్టి 'కందర్పకేతు విలాసము' కూడా క్రీ.శ. 1545లో రామకృష్ణకవిచే వ్రాయబడి వుండాలి. ఈ కావ్యం వ్రాసి చిట్టరసుకు అంకితమిచ్చిన తరువాత నూట పదిహేను ఏళ్లకు క్రీ.శ. 1650లో 'పాండురంగ మాహాత్మ్యము' పూర్తిచేయదానికి రామకృష్ణకవి ఎలా బ్రతికి వుండే అవకాశముందో మరి కందుకూరి వీరేశలింగం పంతులుగారే వివరించాలి.

కనుక, ఏ విధంగా చూసినా మనం అనుకున్నట్లుగానే రామకృష్ణకవి క్రీ.శ. 1495 లో జన్మించి చిన్న వయస్సులోనే సకల విద్యలలో ప్రావీణ్యం పొంది, శైవుడిగా 'ఉద్భటారాధ్య చరిత్రము' వగైరా కావ్యాలు వ్రాసి, నిండు యౌవనంలో క్రీ.శ. 1520-30 మధ్యకాలంలో రాయలవారి సభలో చతురోక్తులు, సమస్యాపూరణాలు, ఆశుకవితా రచనలూ చేసి, క్రీ.శ. 1565 వరకూ హంపిలో కొనసాగి, తరువాత తెనాలి చేరుకుని, కొంతకాలం అక్కడ వుండి, మరికొంత కాలం పాటు కళింగ దేశంలోని పిఠాపురంలో జీవించి, ఆ పిమ్మట పొత్తపినాటి తెలుగు చోడ ప్రభువైన పెదసంగ భూపాలుని వ్రాయసకాడైన విరూరి వేదాద్రి పరిపోషణలో క్రీ.శ. 1570-72 ప్రాంతాలలో 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యాన్ని వెలయించి, అనంతరం క్రీ.శ. 1585 నుండి ఒకటి రెండేళ్లు చంద్రగిరిలో వేంకటపతిరాయలు ఆస్థానంలో వుండి చేతులు వణికే వృద్ధాప్యంలో 'ఘటికాచల మాహాత్మ్యము' అనే కావ్యాన్ని వ్రాసి దానికి 'అవతారిక' వ్రాయకుండానే సుమారుగా క్రీ.శ. 1590లో తన 95వ ఏట మరణించి వుంటాడు.

## కాకమాని మూర్తి కవి - పాండురంగ విజయుడు

'పాంచాలీ పరిణయం', 'రాజవాహన విజయం' అనే కావ్యాలను వ్రాసిన కాకమాని మూర్తి కవి 'బహుళాశ్వచరిత్ర' వ్రాసిన దామెర్ల వెంగళ రాజు, 'ఉషా పరిణయం' వ్రాసిన దామెర్ల అంకరాజులకు సమకాలికుడు. దామెర్ల వారికి ఆశ్రితుడై కావ్య రచనలో వీరిద్దరికీ మూర్తి కవి సహాయం చేశాడంటారు. ఈ కవి క్రీ.శ. 17వ శతాబ్ది ప్రథమార్థ భాగంలోని వాడు ఈయన తన 'రాజవాహన విజయం'లో చంద్రగిరి కోట లోని హనుమంతుడిని సన్నుతి చేశాడు ఆ కావ్యాన్ని తిరుపతి వేంకటేశ్వరునికి అంకితం చేశాడు. కనుక, ఆయన చంద్రగిరి ప్రాంతం వాడై వుంటాడు. ఆయన తన 'పాంచాలీ పరిణయం' వ్రాద్దామనుకొనే రోజుల్లో ఒకనాడు కలలో శ్రీరంగ నాథుడు ప్రత్యక్షమై అతనితో యిలా అన్నాడని వ్రాసుకున్నాడు తన కావ్యంలో -

అల్లసాని వాని యల్లిక బిగి సొంపు - ముక్కు తిమ్మనార్యు ముద్దుఁ బలుకుఁ
బాండురంగ సుకవి పద్యంపు హరువును - గాక మాని రాయ నీకె కలదు (పాం. ప. 1-13)

"అల్లసాని పెద్దన కవిత్వంలో వుండే జిగీ, బిగీ - ముక్కు తిమ్మన కవిత్వంలో వుండే ముద్దు ముద్దు పలుకులు, పాండురంగ సుకవి (తెనాలి రామకృష్ణుని) పద్యాలలో వుండే హరువు (మనోజ్ఞత) - ఓ కాకమాని రాయా ! ఇవన్నీ నీకే వున్నాయి." అన్నాడట శ్రీరంగ నాథుడు. తెనాలి రామకృష్ణుని పద్యాలకు ఆ మనోజ్ఞత పద గుంఫనం (పదాల కూర్పు) ద్వారా సమకూరినదే!

పోతే ఈ పద్యంలోని 'పాండురంగ సుకవి' అనే పద బంధానికి 'పాండురంగ విజయు' అనీ, 'పాండురంగ విభుని' అనీ పాఠాంతరాలున్నాయి. 'పాండురంగ సుకవి' అన్నా, 'పాండురంగ విభుదు' అన్నా, 'పాండురంగ విజయుడు' అన్నా తెనాలి రామకృష్ణ కవే ! పాండురంగ విజయుడు అంటే 'పాండురంగ విజయము' అనే కావ్యాన్ని వ్రాసినవాడు. ఆ కావ్యం మొత్తంగా ప్రస్తుతం లభించడం లేదు కాని, కొన్ని భాగాలు మాత్రం లభిస్తున్నాయి. ఆ కావ్య కర్తృత్వం కూడా తెనాలి రామకృష్ణ కవిదేనని జన బాహుళ్యం విశ్వాసం. దశావతారములపై వ్రాయబడిన పదకొండు పద్యాలు 'పాండురంగ

విజయము' అనే కావ్యంలోనివని సాహితీ విమర్శకులంతా ఏకగ్రీవంగా అభిప్రాయపడుతున్నారు. ఈ 'పాండురంగ విజయము' అనే కావ్యాన్ని కూడా తెనాలి రామకృష్ణ కవే వ్రాశాడనే విషయాన్ని ముందుగా ప్రఖ్యాత సాహితీ విమర్శకులు కీ.శే. గురజాడ శ్రీరామ మూర్తి గారు ప్రకటించారు. ఈ కావ్యం రామకృష్ణ కవిచే 'హరిలీలా విలాసము' తరువాత రచింపబడి వుంటుందని భావిస్తున్నారు. మద్రాసులోని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలోని ఒక తాళ పత్ర గ్రంథంలో అది కృష్ణమాచార్యుడనే ఆయన పాండురంగ ప్రబంధంలోని దశావతారికా పద్యమాలికకు వ్రాసిన టీక అని పేర్కొనబడింది. 'పాండురంగ విజయము' అనే మరో ప్రబంధం వున్నదని ముందుగా రూఢి పరచుకున్న విమర్శకులు 'పాండురంగ మాహాత్మ్యము' లోని దశావతార పద్యములనూ, 'పాండురంగ విజయము'లోనివని చెప్పబడుతూన్న దశావతార పద్యములతో సరిపోల్చి చూసి శైలి, భావానుసరణము, పదబంధములలో పోలికలను బట్టి 'పాండురంగ విజయము' అనే ప్రబంధం కూడా తెనాలి రామకృష్ణ కవి కృతియేనని తేల్చారు. 'పాండురంగ విజయము'లో దశావతార పద్యములు 11 వున్నాయి. ఇవి శైలిలోనూ, భావంలోనూ పూర్తిగా 'పాండురంగ మాహాత్మ్యము'లోని దశావతార పద్యాలను పోలివున్నాయి. వీటిలో బలరాముడు, కృష్ణుడు వేర్వేరు పద్యాలలో స్తుతించబడ్డారు. శ్రీనాథ మహా కవి యొక్క శృంగార నైషధాన్ని అనుసరించి రామకృష్ణ కవి యిలా బలరామకృష్ణులను వేర్వేరు పద్యాలలో స్తుతించిన కారణంగా, యివి దశావతార పద్యాలే అయినా మొత్తం 11 పద్యాలయాయి. 'పాండురంగ విజయము' కావ్యంలోనేమో శ్రీనాధుడిని అనుసరించి రామకృష్ణ కవి బలరామకృష్ణులిరువురినీ వేర్వేరు పద్యాలలో స్తుతించి, తరువాతి కావ్యాలైన 'పాండురంగ మాహాత్మ్యము', 'ఘటికాచల మాహాత్మ్యము' కావ్యాలలో వారిరువురూ ఏకావతారులగుట వలననూ, బలరాముడు జ్యేష్ఠుడు కనుకనూ, బలరాముడిని మాత్రమే స్తుతించి కృష్ణుడిని వదలివేశాడు. బలరాముడిని స్తుతిస్తే కృష్ణుడిని స్తుతించినట్లే కనుక ప్రత్యేకించి కృష్ణుడిని స్తుతించాల్సిన పని లేదని రామకృష్ణ కవి అభిప్రాయ పడ్డాడు. 'పాండురంగ విజయము' రచనా కాలం నాటికీ, 'పాండురంగ మాహాత్మ్యము' రచనా కాలం నాటికీ ఆయన వైష్ణవ తత్త్వంలోని పరిణతి మనకు స్పష్టంగా ద్యోతకమౌతుంది. వైష్ణవులు బలరాముడిని, శ్రీరామానుజుడిని కూడా ఆదిశేషుని అవతారంగా భావిస్తారు.

'పాండురంగ విజయము'లోని కూర్మావతార స్తుతి భావరీత్యా 'పాండురంగ మాహాత్మ్యము'లోని తృతీయా శ్వాసంలోని 'ధేను గజాశ్వరత్న' (పాం. మా. 3-144) ను పోలివుంది. అంతే కాక తెనాలి రామకృష్ణ కవి పేరిట ప్రాచుర్యంలో వున్న 'అతివ కచ నాభి జఘన దేహాననములు', 'ఆననాధర గళమూర్తు లతివ కజుడు', 'వరబింబాధరమున్ పయోధరములున్' వగైరా పద్యాలు 'పాండురంగ విజయము'లో యథాతథంగా అవే పదబంధాలతో వున్నాయి.

ఈ విషయమై కందుకూరి వీరేశలింగం పంతులుగారి అభిప్రాయం – 'పాండురంగ మాహాత్మ్యము'నకే 'పాండురంగ విజయము' అనే నామాంతరం వుంది. కొంత మంది 'పాండు రంగ విజయము' అనే వేరొక కావ్యం తెనాలి రామకృష్ణ కవి వ్రాసినది వుందనే అభిప్రాయంలో వున్నారు. అది పాటింపదగినది కాదు. ఎందుకంటే తెనాలి రామకృష్ణ కవి కాలానికి కొంచెం తరువాతి కాలం వారైన అప్పకవి మొదలైన లాక్షణికులెవ్వరూ కూడా 'పాండురంగ విజయము' అనే కావ్యం ఒకటి వున్నట్లుగా కూడా పేర్కొని యుండలేదు. ఇప్పుడు కొందరు 'పాండురంగ విజయము' కావ్యము లోనివని భావిస్తున్న పద్యాలు కొన్ని యితర కవుల కావ్యాలలో కనుపిస్తున్నాయి. ఉదాహరణకు 'భుజగ లోకాధీశ భోగి తల్ప శయన' అనే పద్యం 'పాండురంగ విజయము' లోనిదని అందరూ సర్వ సాధారణంగా భావిస్తున్నారు. కాని నిజం విచారిస్తే యిది పైడిమఱ్ఱి వేంకట కవి వ్రాసిన 'చంద్రాంగద చరిత్రము' లోని చతుర్థాశ్వాసములోనిది. అదే విధంగా 'అరుణ పల్లవ రుచిబోలు నా పదంబు' అనే పద్యం సింహాద్రి వేంకటాచార్య వ్రాసిన 'చమత్కార మంజరి' లోనూ కనుపిస్తుంది. ఇలా 'పాండురంగ

విజయము' లోనివని పేర్కొనబడుతున్న కొన్ని పద్యాలు యితర ప్రబంధాలలోనివిగా కనుపిస్తున్నాయి. 'పాండురంగ మాహాత్మ్యము' కథనే స్వీకరించి, తిరిగి రామకృష్ణ కవి 'పాండురంగ విజయము' అనే ప్రబంధం వ్రాయాల్సిన అవసరం ఏముంది? కాబట్టి 'పాండురంగ విజయము' అనే వేరే ప్రబంధం ఒకటి వుందనే వార్త కల్ల అని నిశ్చయించవలసియున్నది."

– ('ఆంధ్ర కవుల చరిత్ర' ద్వితీయ భాగము పేజీలు 175 – 177 : భాష యీ రచయితది.)

ఇకపోతే – 'వరబింబాధరమున్ పయోధరములున్ వక్త్రాలకంబుల్ మనో
హరలోలాక్షులుఁ జూప కవ్వలి మొగంబైనంత నేమాయె నీ
గురు భాస్వజ్జఘనంబు క్రుమ్మడియు మాకుంజాలవే గంగక
ద్దరి మే లిద్దరికీడునుం గలదె యుద్యద్రాజ బింబాననా.–––' అన్న పద్యం సంగతి విచారిద్దాం.

మనం 'భువన విజయము' అన్న అధ్యాయంలో శ్రీ కృష్ణ దేవరాయలు కోరిన మీదట రామకృష్ణ కవి యీ పద్యం చెప్పాడని చెప్పుకున్నాం. అయితే యీ పద్యం వెనుక ఓ కథ వుంది. అదేమిటో క్లుప్తంగా వివరిస్తాను. ఇది 'స్వర్ణయోగ చింతామణి'లోని 'యోగి–భోగినీ సంవాదము' లో వ్యాఘ్రాజిన శయ్యా సందర్భమున చెప్పబడిన పద్యమట. ఈ పద్యం రామకృష్ణ కవి వ్రాసినదేనని నిర్ధారిస్తూ గురుజాడ శ్రీరామమూర్తి గారు దీనికి సంబంధించిన కథను గ్రంథస్థం చేశారు. అది క్లుప్తంగా – శ్రీ కృష్ణ దేవరాయలకు ఎందరో వేశ్యలుండేవారు. వారిలో ఒకతె రాయలు తనయందే అనురక్తి కలవాడనీ, తాను రాయల వారిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాననీ, కనుక తాను పరపురుషుడిని కన్నెత్తి కూడా చూడననీ, చెప్పుకునేదట రాయల వారు కూడా ఆమె 'పాతివ్రత్యాన్ని' గూర్చి కవి పండిత గోష్ఠులలో కూడా ఎంతో మెచ్చుకునే వారట. రామకృష్ణ కవి మొదలైన కొందరు 'వేశ్యలలో పతివ్రతలుండడమేమిటి ? వేశ్యలను నమ్మవద్దు' అంటూ హెచ్చరించినా, 'వేశ్యలలో కూడా పతివ్రతలుంటారని మీరు తెలుసుకోండి' అనే వాడట రాయలవారు. ఎలాగైనా సరే ఆ వేశ్య నిజస్వరూపం బట్టబయలు చేసి రాయల వారికి ఆమెపై గల భ్రమలు పోగొట్టాలని తలచాడు రామకృష్ణుడు. ఆయన దీనికో ఉపాయం ఆలోచించాడు ఆ వేశ్య తల్లికి బంగారంపై విపరీతమైన వ్యామోహమట. ఇది గమనించిన రామకృష్ణుడు స్వర్ణయోగ విద్య నేర్చిన ఓ యోగి వేషంలో వేశ్య యింటి ముందు పీఠము పెట్టి, తన బూటకపు స్వర్ణయోగ విద్యతో జనాన్ని విపరీతంగా ఆకర్షించడం మొదలుపెట్టాడు. దీంతో ఆ వేశ్య మాత ఆయన్ని తన యింట్లోకి ఆహ్వానించింది. పైకి మౌనం వహిస్తూ చేతులతో, కళ్లతో చేసే సంజ్ఞల ద్వారానే తనకు కావలసిన సేవలన్నీ పొందుతూ ఆ యోగి వేషంలో రామకృష్ణుడు ఆ వేశ్య యింట్లోనే మఠం వేశాడు. ఓ రోజు ఆయన వేశ్య తల్లికి మూడు వరహాలు యిచ్చి అంగడికి వెళ్లి తన పూజకు కావలసిన వస్తువులు తెమ్మన్నాడట. (వరహా అంటే వరాహ ముద్ర కల బంగారు నాణెం) దీంతో ఆ వేశ్య తల్లికి ఎలాగైనా ఆ యోగి నుంచి స్వర్ణయోగ విద్యను గ్రహించాలని యిందుకోసం రాయలవారి వేశ్యయైన తన కుమార్తెను ప్రత్యేకంగా ఆ యోగికి సపర్యలకోసం నియమించిందట. ఆయనకు రోజూ సపర్యలు చేస్తున్న వేశ్య ఆ యోగిని ఎలాగైనా లోబరుచుకోవాలని ప్రయత్నించిందట రామకృష్ణుడు యింద్రియ నిగ్రహం పాటించడం కారణంగా ఆమె అతడిని లోబరుచుకొనలేక పోయిందట. పైపెచ్చు అతడు నోరు తెరిచి ఒక్క మాట కూడా మాట్లాడడాయె. ఒక రోజు ఆ యోగి శయ్యపై వ్యాఘ్రాజినము (పులితోలు) పరచుకుని పడుకున్నప్పుడు ఆ యోగి యొక్క వికారమైన ముఖం చూసి దడుచుకుని, కళ్లుమూసుకుని, అవతలి ప్రక్కకు తిరిగి ఆయన ప్రక్కనే ఒదిగి పడుకున్నదట ఆ వేశ్య, భయం నటిస్తూ. ఇక రామకృష్ణుడి మౌనం భగ్నమైంది. తమకంతో తట్టుకోలేక ఆయన పైపద్యం చదివాడట. దీంతో ఆమె వెంటనే ఆ కపటయోగి రామకృష్ణుడని గ్రహించి తన తల్లికి ఆ విషయం చెప్పి,

రామకృష్ణుడు తనను భంగ పరచాడని కూడా చెప్పిందట.

మరునాడు ఆ వేశ్య రాజసభకు వచ్చి 'గంగ కద్దరి మేలిద్దరి కీడునుం గలదె యుద్యద్రాజ బింబాననా' అన్న సమస్యనిచ్చి సభలోని కవులను పూరించమన్నదట. అప్పుడు మిగిలిన కవులందరూ దీనిని తెనాలి రామకృష్ణ కవే పూరించ సమర్థుదని అన్నారట. అప్పుడు రామకృష్ణుడు – ఆ పద్యం 'స్వర్ణయోగ చింతామణి'లోని 'యోగి-భోగినీ సంవాదము'లోనిదని చెప్పి – రాయల వారి పేరును కానీ, ఆమె రాయల వారి వేశ్య అనేది కానీ, బయటకు రానీయకుండా 'ఒకదేశపు రాజు – ఆయన వెలయాలు' అంటూ ఆ పద్యం వెనుక కథనంతా చెప్పాడట. ఆ రాజ వేశ్య పలికిన దంబాచారాలు ఎలా భంగపడ్డాయో కూడా వివరించాడట. అప్పుడు రాయల వారు యిదంతా తన వృత్తాంతమే అని గ్రహించి కూడా పైకి ఏమాత్రం వైవిధ్యం కనబరచక 'సెబాస్ ! ఆ యోగి ఎవరో – అతడిని మెచ్చుకోవచ్చు' అన్నారట. అప్పుడు రామకృష్ణుడు 'ఆ యోగికి కావలసింది కూడా అంతే' అన్నాడట.

ఈ వేశ్యా కథా సందర్భము 'పాండురంగ విజయము' లోనిదేనని 'కావ్య ప్రశంసా చంద్రిక' అనే గ్రంథం తెలుపుతున్నది.

ఈ పద్యము, దీని వెనుక కథే కాక 'పాండురంగ విజయము' లోనివని పేర్కొనబడుతున్న పద్యాలను బట్టి, ఆ కావ్యం శృంగార రస ప్రధానమైన కావ్యంగా కనుపిస్తుంది. అంతేకాక, 'పాండురంగ విజయము'లోనిదైన 'నడచెనా గంధ' అనే సీస పద్యాన్ని కవి 'పాండురంగ మాహాత్మ్యము' లోని 'కరుణించి చూచెనా కవి గాయకార్థార్థి' (1-34) అన్న పద్యంగా సమకూర్చుకున్నాడు. విషయం వేరైనా యీ రెండు పద్యాల శైలి, కూర్పు ఒకే విధంగా వున్నాయి.

పై అంశాలనన్నింటినీ పరిశీలిస్తే 'పాండురంగ విజయము' అనే కావ్యం తెనాలి రామకృష్ణుడు వ్రాసినదే. అది ఆయనచే 'పాండురంగ మాహాత్మ్యము' కంటే ముందు రచించబడినవి. దానినాయన శృంగార ప్రధానంగా వ్రాశాడు. ఆ తరువాత తిరిగి రామకృష్ణ కవే భక్తి రస ప్రధానంగా 'పాండురంగ మాహాత్మ్యము' ను వ్రాశాడు. అని మనం నిర్ధారించవచ్చు.

# తెనాలి రామకృష్ణుని కాల నిర్ణయం

'పాండురంగ మాహాత్మ్యము' యొక్క రచనా కాలం క్రీ.శ. 1650 కంటే పూర్వమై వుండదని ముందుగా వాదించిన వీరేశలింగం పంతులు గారు ఆ తరువాత తమ వైఖరి ఎలా మార్చుకున్నారో చూశాం. క్రీ.శ. 1829 లో మొట్టమొదట రామలింగ (కృష్ణ) కవి కాలాన్ని గురించి వ్రాసిన కావలి వేంకట రామస్వామి గారు ఆయన శాలివాహన శకం 1384 అనగా క్రీ.శ. 1462 సం॥లో వున్నట్లు వ్రాశారు. గురజాడ శ్రీరామమూర్తి గారు 'పాండురంగ మాహాత్మ్యము' క్రీ.శ. 1703 నాటిదని నిరూపించబూనారు.

కానీ క్రీ.శ. 1925 లో ముక్త్యాల నుండి వెలువడుచుండిన 'సరస్వతి' పత్రికలో 'ఉద్భటారాధ్య చరిత్రము' ప్రకటించబడే సరికి రామకృష్ణ కవి కాల నిర్ణయం పై అంతకు పూర్వం జరిగిన వాదోపవాదాలు పటాపంచలయ్యాయి.

తెనాలి రామేశ్వర స్వామి ఆలయంలోని ఉత్సవ విగ్రహ పీఠంపై వున్న ఈ క్రింది శ్లోకం గురించి మనమీవరకే తెలుసుకున్నాం.

"శ్రీ తెనాలి నగరే వ్యరాజయ
ద్గార్లపాటి పుర రామ పండితః
శుక్ల మాఘ సిత పంచమీ గురౌ
రామలింగ మమ యోత్సవాకృతిమ్".

ఇది రామకృష్ణుని తండ్రి గార్లపాటి రామయ్య రామేశ్వర స్వామి దేవస్థానానికి ఉత్సవ విగ్రహాలను సమర్పించినప్పుడు వేయించిన శ్లోకమని జనుల విశ్వాసం. అయితే నిజనిర్ధారణకు మనం మరికొంత నిశిత పరిశీలన చేయాల్సి వుంది.

కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రి గారు యీ శ్లోకాన్ని ఉదాహరిస్తూ, ఇది రామకృష్ణుని తండ్రి రామయ్య పండితుడు దేవాలయానికి ఉత్సవ విగ్రహాలను సమర్పించే సందర్భంలో వేయించిన శ్లోకమని పేర్కొన్నారు. అంతేకాక, స్వామికణ్ణు పిళ్ల గారి పంచాంగ గ్రంథం ప్రకారం దీని కాలనిర్ణయం యిదమిత్థమని చేయలేకున్నామని వ్రాశారు.

అయితే నిడుదవోలు వేంకట రావు గారు తమ 'ఉద్భటారాధ్య చరిత్రము' యొక్క పీఠికలో సూక్ష్మపరిశీలన చేసి యీ శ్లోకం ఆధారంగానే రామలింగ కవి కాలాన్ని ఖచ్చితంగా నిర్ధారించి, కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ లోని సమాచారం ఆధారంగా ఆ ఉత్సవ విగ్రహాలు దేవస్థానానికి బహూకరించినది స్వయంగా రామలింగ కవే కాని ఆయన తండ్రి రామయ్య పండితుడు కాదని తేల్చారు. అదెలాగో చూద్దాం.

పై శ్లోకంలో 'శుక్ల మాఘ సిత పంచమీ గురౌ' అని వుంది. కానీ, శుక్ల నామ సం॥రం మాఘ శుద్ధ పంచమి - స్వామికణ్ణు పిళ్ల గారి గ్రంథం *(The Indian Ephemerist. Volume 5)* యొక్క తేదీ ఆంగ్ల క్యాలెండర్ ప్రకారము 14-01-1510 అవుతున్నది. కాని అది గురువారం కాదు. అందేతనే ప్రభాకర శాస్త్రి గారు 'కాలము కుదురకున్నది' అని వ్రాసి వుంటారు. కానీ, దీన్ని మరోసారి సూక్ష్మంగా పరిశీలిస్తే విషయం సుబోధకం కాగలదు.

'మార్గ సిత పంచమీ గురౌ' అని చెక్కడానికి బదులు ఆ శిల్పి దానినే 'మాఘ సిత పంచమీ గురౌ' అని చెక్కాడు. పూర్వ లిపి సంప్రదాయాన్ని బట్టి 'మార్గ' ను 'మాగ ర్' గా వ్రాసేవారు. "మాగ ర్' క్రమంగా 'మాగ' అదే 'మాఘ'గా లేఖకులు పొరపాటుగా వ్రాయడం తటస్థించింది.

ఆ శ్లోకానికి 'శుక్ల మార్గ సిత పంచమీ గురౌ' అనునది సవ్యమైన పాఠము. అప్పుడు శుక్ల నామ సంవత్సర మార్గశిర మాస శుక్ల పక్ష పంచమి గురువారం ది. 14-1-1510 తో సరిగ్గా సరిపోతున్నది. అలా యీ ఉత్సవ విగ్రహాలు దేవస్థానానికి యివ్వబడిన తేదీ స్పష్టంగా నిర్ధారణ అయింది. యిక యివి ఎవరు యిచ్చారు. అన్న విషయాన్ని కూడా ఆలోచిద్దాం.

తెనాలి కైఫీయ్యత్‌లో తెనాలి నగరంలో లక్ష్మీ వల్లభుడైన గోవర్ధనేశ్వరుడు శాలివాహన శకం 1411లో అంటే క్రీ.శ. 1489 లో మూల స్థానమున ప్రతిష్ఠించబడ్డాడని వుంది. తెనాలి గాంధీచౌక్‌కి సమీపంలో జిల్లా గ్రంథాలయ సంస్థ వారి గ్రంథాలయానికి ఎదుట యీ గోవర్ధన స్వామి, వీరాంజనేయ స్వామి ఆలయాలు నేటికీ నిలిచి వున్నాయి. ఈ కైఫీయ్యత్‌లోనే కాక, ఉత్సవ విగ్రహాల పైని శ్లోకంలో కూడా తెనాలి నగరమని పేర్కొనబడడం విశేషం ! అయినా యీ తెనాలి నగరం కొంతకాలం రేపల్లె తాలూకాలోనూ, యీ ప్రాంతం మొత్తం కొంత కాలం కృష్ణా జిల్లాలో అంతర్భాగంగా కూడానూ వుండేదట. తెనాలిలోని గోవర్ధన స్వామికి శ్రీకృష్ణ దేవరాయల మంత్రి సాళువ తిమ్మయ్య తెనాలి నగరాన్ని దానంగా యిచ్చాడట. సాళ్వ తిమ్మరుసు (తిమ్మయ్య) సోదరి కృష్ణమాంబ. ఆమె నాదెండ్ల తిమ్మయ్య సతీమణి. వారికి నాదెండ్ల అప్పయ్య, గోపయ్య అనే యిద్దరు కుమారులు. తిమ్మరుసు సోదరి, ఆమె భర్త తిమ్మయ్య వారి కుమారులు నాదెండ్ల

అప్ప మంత్రి, గోపమంత్రి యొక్క ధర్మ కార్యాలు యీ గ్రామ శాసనంలో వివరంగా వ్రాయబడ్డాయి. ఈ గ్రామ శాసనంలోని ముఖ్యమైన అంశాలను కొన్నింటిని మాత్రం యిక్కడ పేర్కొంటాను.

నాదెండ్ల అప్పయామాత్యుడు శాలివాహన శకం 1438లో అంటే క్రీ. శ. 1516లో మంగళగిరి నృసింహ స్వామికి మంటపమును కట్టించి ఆ దేవాలయానికి మంగళగిరి గ్రామాన్ని దానం చేశాడట. 'తెనాలి నగరంలోని గోవర్ధన స్వామికి కృష్ణదేవరాయల వారు స్వయంగా యీ స్థళానికి వచ్చి తేలప్రోలు అనే ముజుకూరిలో చేరిన శివారు పాలెం 25 కుచ్చెళ్ల ఖండ్రిక' యిచ్చారట. (కుచ్చెల అంటే 8 గొఱ్ఱులు. గొఱ్ఱు అంటే 32 కుంటలు. అనగా కుచ్చెల అంటే 256 కుంటలు. కుంట అంటే రెండున్నర సెంట్లు. అప్పుడు 25 కుచ్చెళ్లు అంటే 25 x 256 = 6400 కుంటలు అంటే 160 ఎకరాలు.)

ఇకపోతే, కృష్ణామండల వృత్తాంతిని *(The Krishna District Manual- Gordan Mackenzie-Page 253-Repalle Taluq)* లో పేర్కొన్న దాని ప్రకారం కృష్ణ దేవరాయని ఆస్థానమునలంకరించిన తెనాలిలో జన్మించిన గార్లపాటి రామలింగము యిక్కడి రామేశ్వరాలయంలో నున్న కంచు విగ్రహములలో ఒకదాని పైనున్న శ్లోకాన్ని బట్టి క్రీ.శ. 1509 సం।లో రామేశ్వరునికి కళ్యాణ మహోత్సవం జరిపించాడు.

తెనాలి కైఫీయ్యత్‌లో యిలా పేర్కొనబడింది - 'శాలివాహన శకం 1437 (అంటే క్రీ. శ. 1515) నుండి కృష్ణ దేవ మహారాయలు ప్రభుత్వం చేసేటప్పుడు గార్లపాటి రామలింగము అనే లింగధారి యీ స్థళంలో వుండి శ్రీ రామలింగేశ్వర స్వామి వారిని గురించి బాల్య కాలమందే వుపాస్తి చేసినందున స్వామి వారు ప్రత్యక్షమై అభీష్ట వరములు యిచ్చినారు. అతడు యీ స్థళమందు వుండుట వల్లను తెనాలి రామలింగమను పేరు వచ్చినది. ఆతని దినములలో స్వామి వారి ఆలయము మరమ్మత్తు చేయించినాడు. ఉత్సవ విగ్రహముల జోడు సమర్పించినాడు. తదనంతరము రాయలవారి సముఖము నందు ఆస్థాన కవి అయినాడు.'

ఉత్సవ విగ్రహాల బహూకరణ సందర్భముగా వేయించిన శ్లోకములో శిల్పి చేసిన తప్పు దిద్దుకుని కాల నిర్ణయం చేస్తే అది క్రీ. శ. 1510వ సం। రం జనవరి 14వ తేదీ అయింది. జిల్లా మాన్యువల్‌లో పేర్కొన్న ప్రకారం అది క్రీ. శ. 1509వ సం॥రంగా యివ్వబడింది. శాలివాహన శకం నుండి క్రీస్తు శకానికి హిందూ తిథుల నుండి ఇంగ్లిష్ క్యాలెండరు లోనికి మార్చేటప్పుడు ఆ కొద్దిపాటి పొరపాటు జరిగి వుంటుంది. అదే విధంగా కైఫీయ్యత్‌లో కృష్ణ దేవరాయలు అధికారానికి వచ్చింది క్రీ. శ 1515 అని వ్రాయబడింది. వాస్తవానికి ఆయన అధికార పీఠాన్నెక్కింది క్రీ. శ 1509లో. అంతేకాక గార్లపాటి రామలింగ కవి మూడు ఉత్సవ విగ్రహాలు బహూకరించినట్లు స్థానికులు, ఆలయ అర్చకులు తెలుపుతూండగా కైఫీయ్యత్‌లో ఉత్సవ విగ్రహముల జోడు యిచ్చినట్లుగా వుంది. కనుక యీ చిన్నపాటి పొరపాట్లను ఉపేక్షించి అవన్నీ లేఖకుల లేఖనంలో దొర్లినట్టివిగా మనం భావించి ఆ ఉత్సవ విగ్రహం పైని గల శ్లోకము, కృష్ణా మండల వృత్తాంతినిలోనూ, తెనాలి కైఫీయ్యత్‌లోనూ పేర్కొనబడ్డ విషయాల సమగ్ర అవగాహనతో ఏతావాతా గ్రహించి అర్థం చేసుకోవాల్సినదేమంటే -" గార్లపాటి రామకృష్ణ కవి క్రీ.శ. 1510వ సంవత్సరంలో తెనాలిలోని శ్రీ రామలింగేశ్వరాలయము మరమ్మత్తులు చేయించి, కంచుతో చేసిన ఉత్సవ విగ్రహాలు సమర్పించాడు. రామలింగ కవి నివాస స్థలం తెనాలి అయినందు వలన ఆయనకు తెనాలి రామలింగమను పేరు వచ్చింది. అనంతర కాలంలో ఆయన కృష్ణ దేవ మహా రాయల వారి ఆస్థాన కవి అయినాడు."

మనం లోగడ చెప్పుకున్నట్లు, ఆరుద్ర గారు 'సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర'లో అభిప్రాయపడినట్లు

క్రీ.శ. 1495లో రామలింగ కవి జన్మించాదనుకుంటే యీ ఉత్సవ విగ్రహ సమర్పణ కాలం నాటికి ఆయనకు 15 ఏళ్ల వయస్సు వుంటుంది. కనుక నిడుదవోలు వేంకటరావు గారు పేర్కొన్నట్లుగా రామలింగ కవి కాక యీ ఉత్సవ విగ్రహాలు ఆయన తండ్రి రామయ్యే చేయించి బహూకరించి వుండవచ్చు. తండ్రి తన జ్యేష్ఠ కుమారుడికి సంబంధించిన ఏ జన్మదినోత్సవం నాడో, శివదీక్షా స్వీకరణ సందర్భంగానో, ఆ కార్యక్రమాన్ని కుమారుని పేరిటే జరిపించే అవకాశమూ వుంది. 15 ఏళ్ల వయస్సు నాటికే కవి శుక్ల యజుర్వేదాధ్యయనం పూర్తి చేయడం, ఆ తరువాత శివదీక్ష స్వీకరించి, కృష్ణ యజుర్వేదాధ్యయనం మరో ఆరేళ్లలో పూర్తి చేయడం, ఈలోగా కొన్ని చిన్న కావ్యాలు వ్రాసి 'ఉద్భటారాధ్య చరిత్ర' రచనను చేపట్టడం సంభవమయ్యే విషయాలు కాదని ఎందుకు కొట్టి పారెయ్యాలో నాకైతే అర్థం కావటం లేదు. క్రీ.శ. 1520 ప్రాంతాలలో కవి హంపి విజయనగరంలో రాజాశ్రయం పొంది వుండే అవకాశముంది. (రాయల వారు మరణించే వరకు) నికరంగా పదేళ్లపాటు శ్రీకృష్ణ దేవరాయలకు అతి సన్నిహితుడిగా, ఆస్థాన పండితునిగా (యిందులో కనీసం ఐదేళ్ల పాటైనా అష్ట దిగ్గజ కవిగా) ఆయన వెలుగొందే అవకాశం వుంది. రాయలవారి మరణానంతరం రామకృష్ణ కవి హంపిలోనే వుంటూ క్రీ. శ. 1530 - 1540 మధ్యలో బహుశా 'కందర్ప కేతు విలాసము', 'హరిలీలా విలాసము', 'పాండురంగ విజయము' మొదలైన కావ్యాలు వ్రాసి, విర్థల రాజ ఆలయ సమీపంలో కేవల భక్తి పారవశ్యంతోనూ, ఆముష్మిక చింతనతోనూ కూడిన ఋషితుల్యమైన జీవితాన్ని గడిపి అనంతరం ఓ పదేళ్ల పాటు హంపికి దూరంగా తెనాలిలోనూ, కొంతకాలం పిఠాపురంలోనూ, ఆ తరువాత పొత్తపినాటిలోనూ వుండి వుండే అవకాశాన్ని కొట్టి పారేయలేం. నేనింతకుముందు పేర్కొన్నట్లే రామకృష్ణ కవి క్రీ.శ. 1585 నుండి ఒకటి రెండేళ్లు చంద్రగిరిలో వేంకటపతి రాయల ఆస్థానంలో వుండి చేతులు వణికే వృద్ధాప్యంలో 'ఘటికాచల మాహాత్మ్యము' వ్రాసి, దానికి అవతారిక వ్రాయకుండానే సుమారు క్రీ.శ. 1590లో తన 95 వ ఏట మరణించి వుంటాడు. ఏ రకంగానైనా తెనాలి రామకృష్ణ కవి ఎన్నడూ కృష్ణరాయల ఆస్థానంలో లేడని ఋజువు పరచడానికి యత్నించిన కొందరు విమర్శకులు అప్పయ్య దీక్షితుడు తన పన్నెండవ ఏటనే వేదాధ్యయనం పూర్తి చేసి 'శివార్చన చంద్రిక', 'శివతత్త్వ సారము', 'శివమణి దీపిక', 'ఆత్మార్పణము' మొదలైన శైవ గ్రంథాలు అనేకం వ్రాసి వేంకటపతి రాయలు ఆస్థానంలో రాజగురువైన తాతాచార్యులను ఓడించాడంటే నమ్ముతారు. ఆది శంకరుడు బాల్యంలోనే సకల శాస్త్ర పారంగతుడయ్యాడంటే నమ్ముతారు. కాని తెనాలి రామలింగ కవి 25 సం॥ల వయస్సు నాటికి శుక్ల, కృష్ణ యజుర్వేదాధ్యయనం పూర్తి చేసి, 'ఉద్భటారాధ్య చరిత్రము' వగైరా కావ్యాలు వ్రాసి కృష్ణ రాయల ఆస్థానంలో ప్రవేశించాడంటే మాత్రం నమ్మరు. శ్రీ రామానుజుడు 125 సం॥ల సుదీర్ఘ కాలం పాటు జీవించి విశిష్టాద్వైత ప్రచారం చేశాడంటే నమ్ముతారు. ఇటీవలి కాలంలో మానవల్లి రామకృష్ణ కవి గారు (క్రీ.శ. 1866 – 1957) 91 సం॥ల సుదీర్ఘ కాలం జీవించి సాహితీ సేవ చేశారంటే కూడా నమ్ముతారు. కాని, 'కృష్ణ రాయల ఆస్థానంలో వున్న రామకృష్ణ కవి, చంద్రగిరిలో వేంకటపతి రాయల ఆస్థానంలో కూడా వుండగలగడం ఎలా సాధ్యం ?' అని వారు ప్రశ్నిస్తారు. క్రీ.శ. 1495 లో పుట్టిన మన కవి గారికి క్రీ.శ. 1585లో వెంకట పతి రాయలు చంద్రగిరిలో సింహాసనం అధిష్టించే నాటికి 90 ఏళ్ల వయస్సు. తిరుమల రాయలు తన 90వ ఏట క్రీ.శ. 1569లో పెనుగొండలో పట్టాభిషేకం చేసుకున్నాడనేది చరిత్ర కారులు నిర్ధారించిన సత్యం. అలాగే అళియ రామరాయలు క్రీ.శ. 1565లో జరిగిన తళ్లికోట యుద్ధంలో తన 87వ ఏట వీరోచితంగా పోరాడి అనూహ్య పరిస్థితులలో శత్రువులచే సంహరించబడ్డాడని కూడా చరిత్రకారులు నిర్ధారించారు. అలాంటిది రామకృష్ణ కవి తన 90వ ఏటి నుంచి 92వ ఏటి వరకు వేంటకటపతి రాయల ఆస్థానంలో తాతాచార్యులు వగైరాలతో తలపడి వుంటాడనే విషయాన్ని మాత్రం వారు ఖండిస్తారు. అలాగే తన వృద్ధాప్యంలో – చేతులు వణికే వయస్సులో – 'ఘటికాచల మాహాత్మ్యము' వ్రాసిన ఆయన

అవతారిక వ్రాయకుండానే - అంటే ఎవరికీ అంకితమీయకుండానే బహుశా తన 95వ ఏట అనగా క్రీ.శ. 1590 ప్రాంతాలలో కీర్తి శేషుడై వుంటాడని పేర్కొంటే వారు ఖండిస్తారు. ఈ తరహా ఖండనలను మనం అంతగా పట్టించుకొనవలసిన అవసరం లేదని నేను భావిస్తాను.

ఇక యిప్పుడు చారిత్రక శిరోమణి కొడాలి లక్ష్మీనారాయణ గారు 'విశ్వబ్రాహ్మణుడగు తెనాలి రామలింగని చరిత్ర' అన్న తమ గ్రంథంలో ప్రస్తావించిన కొన్ని విషయాలను విపులంగా చర్చిద్దాం.

అ) ఆ గ్రంథంలోని 10వ పేజీలో పేర్కొన్నట్లు ఈశ్వరుని పేర సుందరమైన ప్రభ నిర్మించిన విశ్వబ్రాహ్మణ శిల్పవేత్త అయిన రామలింగము ముందుగా 'ఈశ్వరప్రభ' రామలింగము అని పిలువబడి, అనంతరం 'ఈశ్వర ప్రెగ్గడ' రామలింగము అనని పిలువబడ్డాడనేది అత్యంత సారవిహీనమైన వాదన. ఇది లక్ష్మీనారాయణ గారు పేర్కొన్నట్లు 'ఒక పండితుని వ్రాత' అయినా, లేక వారి స్వంత అభిప్రాయమే అయినా - తప్పని మాత్రం చెప్పక తప్పదు.

పేరు+ కడ → ప్రెగ్గడ. ప్రెగ్గడ యొక్క వ్యుత్పత్తి యిదే కాని 'ప్రభ' శబ్దం 'ప్రెగ్గడ'గా రూపాంతరం చెందలేదు. మన సాహిత్యంలో ప్రెగ్గడ, ప్రెగడ, ప్రగడ అనే పదాలు మంత్రి, యువరాజు, ప్రధాన పురుషుడు అనే అర్థాల్ని సూచిస్తూ వాడబడ్డాయి. అన్నా ప్రగడ, చెన్నా ప్రగడ, మానా ప్రగడ, భావరాజు, దేశిరాజు వగైరా యిండ్ల పేర్లు నియోగులలోనే వున్నాయి. ఈశ్వర ప్రెగ్గడ అనే యింటి పేరు కూడా నాకు తెలిసి నియోగి బ్రాహ్మణులలోనే వుంది. ఆ యింటి పేరు విశ్వ బ్రాహ్మణులలో కానరాదు. కరణములకు ప్రెగ్గడ అని యింటిపేరులో వుండడం సర్వ సాధారణమైనా, విశ్వ బ్రాహ్మణులు కరణాలుగా పని చేసిన వారే అయినా, ఆంధ్ర ప్రాంతంలో యిండ్లపేరు ఏర్పడడానికి చాల కాలం ముందే క్రీ.శ. 1144 లోనే విశ్వబ్రాహ్మణుల కరణీకాలు పోయి నియోగులకు వచ్చినందున నియోగులకే యింటి పేరులో 'ప్రెగ్గడ' అని వచ్చింది. ఆ కారణం చేతనే విశ్వబ్రాహ్మణులలో 'ఈశ్వర ప్రెగ్గడ' అనే యింటి పేరు గల వారున్నారనడం విశ్వసనీయం కాదు.

రామలింగ కవి క్రీ. శ. 1462 లో జన్మించాడనీ, ఆయన యింటి పేరు ఈశ్వర ప్రెగ్గడ వారనీ తెలిపే ఓ జన్మ పత్రికకూ, యీ విశ్వబ్రాహ్మణ కవికీ లంకె వేయడానికి 'తెనాలి' యింటి పేరుగా కల రామలింగమునకు ఈశ్వరునికి అందమైన ప్రభ నిర్మించడం ద్వారా 'ఈశ్వర ప్రభ' అనే యింటిపేరు వచ్చి, అదే 'ఈశ్వర ప్రెగ్గడ' అనే యింటి పేరుగా రూపొందిందనీ పేర్కొనడం హాస్యాస్పదంగా వుంది. ఆ జన్మ పత్రిక విశ్వసనీయం కాదనీ, అది అనంతర కాలపు సృష్టి అయి వుంటుందనీ మనం లోగడనే చెప్పుకున్నాం.

ఆ) తమ 'ఆంధ్ర కవుల చరిత్రము' ద్వితీయ భాగములో (పేజీ 111) రామలింగ కవి గురించి వ్రాస్తూ కందుకూరి వీరేశలింగం పంతులు గారు యిలా పేర్కొన్నారు. "ఇతని పూర్వులు కాపురముండిన చోటు తెనాలికి రెండు క్రోసుల దూరములోనున్న గార్లపాడు గ్రామమనియు, యితడు తన నివాసమునచ్చట నుండి తెనాలికి మార్చు కొనెననియు నొకరు వ్రాసి యున్నారు. ఇతడు చిన్న తనములో బట్టు పల్లెయను గ్రామమునందుండు బట్రాజులతో సాంగత్యము చేసి, వారి చెలిమి చేత సంస్కృతాంధ్ర సాహిత్యమును, కవిత్వ కౌశలమును సంపాదించి, బుద్ధిబలము చేత ప్రబంధ పరమేశ్వరుడై వన్నెకెక్కెనట."

తమ గ్రంథం 17వ పేజీలో లక్ష్మీనారాయణ గారు తెనాలి గుంటూరు మధ్య వేంకట కృష్ణాపురము వద్ద ఒక గార్లపాడు వున్నది అని పేర్కొని తరువాత 'గార్లపాడుకు దగ్గరగా భట్టుపల్లె కాన్పించలేదు' అని పేర్కొన్నారు. తిరిగి 18వ పేజీలో "కనుక 'ప్రబంధాంకము' వారికివ్వబడిన గ్రామము 'భట్టుపల్లె' దత్తమండలములోని దగుట వాస్తవము. మోదుకూరులో రాయభట్టు వీరరాఘవ రాజ కవి, అమ్మిరాజు మున్నగు కవులు ఖ్యాతిగాంచిరి. ఇచట 'ప్రబంధాంకము' వారున్న ఆధారములు

లేవు." అని పేర్కొన్నారు. ఇంకా "సమాజములో కవులకు గల పరస్పర వైషమ్యముల చేత అగ్రహార స్వామ్యమును పొందిన (విశ్వ బ్రాహ్మణ కవి) రామలింగని పేరును తుడిచిపెట్టి యుండవచ్చునని నమ్ముటకవకాశములు గలవు." అని వ్రాశారు.

కాని, తెనాలి సమీపంలోని వేంకట కృష్ణాపురము గ్రామ పంచాయితీ పరిధిలోనే భట్టుపల్లె అని నామాంతరం కలిగిన 'దేవరాయ భట్లపాలెం' అనే శివారు గ్రామం వుంది. ఈ గ్రామంలో యిప్పుడు భట్రాజు కులస్థులెవ్వరూ లేరు. గార్లపాడుకు సమీప గ్రామములలో భట్రాజు కులస్థుల ఉనికిని గురించి విచారించడానికి నేను ఈ గ్రామం వెళ్తే అక్కడి వారు ఒకప్పుడు ఆ గ్రామంలో నివసించిన భట్రాజు కులస్థుల కుటుంబాలకు చెందిన కొందరు ప్రస్తుతం పల్నాడు, నర్సరావుపేట తాలూకా గ్రామాలలో నివసిస్తూ తెనాలి తాలూకా గుడివాడకు అప్పుడప్పుడూ వస్తూ, పోతూ సంచార జీవితం గడుపుతున్నారని తెలిపారు. నేను గుడివాడ వెళ్లి విచారించగా ఏటా డిసెంబర్, జనవరి నెలలలో పంటలు చేతికి వచ్చే సమయంలోనే వారు వస్తారనీ, లోగడ తమకు బహుమానాలుగా వచ్చిన వస్త్రాలు వగైరాలు చుట్టుపట్ల గ్రామాలలోని పేదవారికి అమ్మి, తిరిగి కొత్త పంటలు చేతికి వచ్చే సమయంలో వారి నుండి డబ్బులు వసూలు చేసుకొనడానికి వస్తారనీ తెలిపారు. 'వారిలో కవులెవరైనా వున్నారా ? ప్రబంధాంకం అనే యింటిపేరు కలవారెవరైనా వున్నారా ?' అన్న నా ప్రశ్నలకు ఆ గ్రామస్థులు తమకా విషయం తెలియదనీ, ఒకప్పుడు దేవరాయభట్ల పాలెం వాస్తవ్యులైన భట్రాజులకు తెనాలి రాజుల కాలనీలోనూ, తెనాలి తాలూకా కరెవరం గ్రామంలోనూ బంధువులున్నారని మాత్రం అంటారనీ తెలిపారు. అనంతరం నేను కరెవరం వాస్తవ్యులు, తెనాలి రాజుల కాలనీకి చెందిన రిటైర్డ్ తెలుగు పండితులు తంగెళ్ల కోటంరాజు గారిని కలిసి "నేను తెనాలి రామకృష్ణ కవి చరిత్ర పై పరిశోధిస్తున్నాననీ, అందుకోసం ముందుగా భట్టుమూర్తి స్వంత గ్రామమేదో తేలాల్సి వుందనీ, వెంకటకృష్ణాపురం శివారు గ్రామమైన దేవరాయ భట్లపాలెంలో ఒకప్పుడెప్పుడైనా ప్రబంధాంకం అనే యింటిపేరు కల భట్రాజులెవరైనా ఎవరైనా వుండేవారా ? అసలా యింటి పేరు కలవారు భట్రాజు కులస్థులలో వున్నారా ? లేరా ?" అని ప్రశ్నించాను. ఆయన దేవరాయ భట్ల పాలెంలో ప్రస్తుతం భట్రాజు కులస్థులెవ్వరూ లేరనీ, మోదుకూరు, వలివేరు గ్రామాలలో యిటీవలి కాలం వరకు నివసించిన 'ప్రబంధాంకం' యింటి పేరు కలవారు దేవరాయ భట్ల పాలెం నుంచే వెళ్లి అక్కడ స్థిరపడ్డారని అంటారనీ తెలిపారు. ఇంకా వలివేరుకు చెందిన ప్రబంధాంకం వెంకట రాజు అనే ఆయన గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా ముప్పాళ్ల జిల్లా పరిషత్ హైస్కూలులో తెలుగు పండితునిగా పనిచేసి రిటైరై ఆ గ్రామంలోనే యిల్లు కట్టుకొని స్థిరపడ్డారని తెలిపారాయన. నేను ముప్పాళ్ల వెళ్లి ప్రబంధాంకం వెంకట రాజు గారిని కలిశాను. ఆయన ద్వారా మరిన్ని విషయాలు తెలిశాయి. తమ యింటిపేరు ప్రబంధాంకం వారనీ, ఒకప్పుడు తెనాలి సమీపంలోని వలివేరు, మోదుకూరులలో వున్న ప్రబంధాంకం వారు తనకు తెలిసి యిప్పుడు కృష్ణాజిల్లా నూజివీడు సమీపంలోని నరసింగుపాలెంలో మాత్రం వున్నారనీ తెలిపారు. వలివేరుకు చెందిన తాను 1983లో తెలుగు పండితునిగా ముప్పాళ్ల జిల్లా పరిషత్ హైస్కూలులోనే రిటైరై అక్కడనే స్థిరపడి పోయానని తెలిపారు. భట్టుమూర్తి వంశీకునితో మాట్లాడగలిగినందుకు తృప్తి పడి గుర్తుగా రెండు ఫోటోగ్రాఫులు తీసుకుని అక్కడి నుంచి వెనుదిరిగాను.

చారిత్రక పరిశోధన చేయాలంటే మనం కొంచెం శ్రమించి నిజ నిర్ధారణ చేసుకోవాల్సి వుంటుంది. భట్టుమూర్తిది దేవరాయ భట్లపాలెం కావడం, గార్లపాటి రామలింగ కవిది దానికి అతిసమీప గ్రామమైన గార్లపాడు కావడం, ఆయన భట్టుపల్లెలో చిన్న తనంలో భట్రాజుల సాంగత్యంలో సంస్కృతాంధ్ర సాహిత్యాలు చదువుకొనే అవకాశం, మంగళగిరిలో వీరిద్దరూ తాతాచార్యులును కలిసిన సందర్భంగా వీరిద్దరి మధ్య పేచీలు ఏర్పడే అవకాశం వుండడం, వారిరువురూ కృష్ణ దేవరాయల ఆస్థానంలో సమకాలికులుగా వుండే అవకాశం వుండడం, రెండవ దేవరాయలు ప్రబంధాంకం వారికి యిచ్చిన గ్రామం కనుకనే ఆ గ్రామాన్ని దేవరాయభట్లపాలెం అని పిలుస్తున్న కారణంగా భట్టుమూర్తి, గార్లపాటి రామలింగ కవి కృష్ణ

రాయలకు సమకాలికులయ్యే అవకాశం వుండడం – ఈ విషయాలన్నీ ఒకదానికొకటి ముడి పడి వున్నాయి. ఈ దేవరాయ భట్లపాలెమే ఆనాటి భట్టుపల్లి అనేది ప్రత్యక్షర సత్యం.

చారిత్రక సత్యం యిది కాగా, తన గ్రంథంలో లక్ష్మీనారాయణ గారు తెనాలి – గుంటూరు మధ్య వేంకట కృష్ణాపురం సమీపంలో ఒక గార్లపాడున్నదని పేర్కొని తరువాత ఆ గార్లపాడుకు దగ్గరగా భట్టుపల్లె కాన్పించలేదు అని వ్రాయడం ఎంతటి బాధ్యతారాహిత్యమో వేరే పేర్కొనవలసిన అవసరం లేదనుకుంటాను. ఆయన పేర్కొన్న వేంకట కృష్ణాపురం పంచాయితీలోని శివారు గ్రామమైన దేవరాయ భట్ల పాలెం ఆయనకు కనుపించలేదో – లేక విశ్వబ్రాహ్మణుడైన రామలింగ కవికి అష్టదిగ్గజ కవి గౌరవం కల్పించడానికి ఉద్దేశ్య పూర్వకంగానే వారు దానిని చూడలేదో మరి ! అలా వాస్తవాలు కట్టెదుటే వున్నా, గమనించకుండా గార్లపాటి రామకృష్ణయ్య జన్మస్థలానికి సమీపంలో ఎక్కడా భట్టుమూర్తి గ్రామమైన భట్టుపల్లె లేదని నిర్ణయించిన లక్ష్మీనారాయణ గారు అది దత్త మండలములోనిదని నిర్ధారించడానికి మాత్రం ఎట్టి ఆధారాలు చూపకపోవడం విచిత్రం ! ఇలా కళ్లెదుట వున్న గ్రామాన్ని చూడలేక పోవడం, ఆధారాలేమీ లేకున్నా 'ప్రబంధాంకము వారికివ్వబడిన భట్టుపల్లె దత్తమండలములోని దగుట వాస్తవము' అని నిర్ధారించడం చరిత్ర పరిశోధకుల లక్షణం కాదు. ఆ గ్రంధమంతా విశ్వబ్రాహ్మణుడైన తెనాలి రామలింగ కవికి రావలసిన కీర్తిని కొందరు పనిగట్టుకుని రాకుండా చేశారని తెగ బాధపడిపోయిన ఆ రచయిత – అలాంటి తప్పే గార్లపాటి రామలింగ కవి పట్ల తానూ చేయబూని యిలాంటి వక్రీకరణలు చేస్తే చరిత్ర క్షమిస్తుందా ?

అలాగే – ఆ రచయిత తమ స్వగ్రామమైన మోపర్రు పక్క గ్రామమే అయిన మోదుకూరులో ఒకప్పుడెప్పుడైనా 'ప్రబంధాంకము' అనే యింటిపేరు కల భట్రాజు కులస్థులు వుండేవారా – అని స్పష్టంగా నిర్ధారించుకొనకుండా 'అక్కడ ప్రబంధాంకము వారున్న ఆధారములు లేవు' అని వ్రాయడం కూడా చరిత్ర పరిశోధకుని స్థాయికి తగినట్లుగా లేదు. కాకినాడలో ఒకప్పుడు గురుజాడ శ్రీరామమూర్తి గారిని కలుసుకుని తాము భట్టుమూర్తి వంశస్థులమని చెప్పిన ప్రబంధాంకము వారు దేవరాయభట్ల పాలెం నుంచి వెళ్లి మోదుకూరులో స్థిరపడిన వారే అయి వుంటారు. అందుకే శ్రీరామ మూర్తి గారు భట్టుమూర్తిది మోదుకూరు కావచ్చునని అభిప్రాయపడ్డారు.

ప్రథమ శాఖ నియోగి అయిన గార్లపాటి రామలింగయ్య – లేక విశ్వబ్రాహ్మణుడైన తెనాలి రామలింగము వీరిరువురిలో ఆనాడు భువన విజయములో ఎవరు అష్టదిగ్గజ కవిగా వుండే వారని తేలినా ప్రత్యేకించి మనకిప్పుడు ఒనగూడే ప్రయోజనమేమీ వుండదు. అయితే చరిత్ర పరిశోధకులు తాము కనుగొన్న నిజాల్ని ఒకటికి రెండుసార్లు పరీక్షించి నిగ్గుదేల్చి నిష్కర్షగా పాఠకుల ముందుంచాలి.

ఇ) లక్ష్మీనారాయణ గారు తమ గ్రంథంలో విశ్వబ్రాహ్మణుడైన తెనాలి రామలింగ కవి తిట్టుకవి, బూతు కవి, వికట కవి అని ఆయన చాటువులు, కృతులు తెలుపుతున్నాయని, ఆయన 'శ. విజయము' అను గ్రంథమును రచించాడనీ, అందలి ఆశ్వాసాంత గద్య యిలా వుందనీ తెలిపారు –

"ఇది యాది పురాణాది సద్గ్రంధకార కృష్ణరాయ దత్త తెనాల్యగ్రహార తెనాలి వంశ పవిత్రార్యజన స్తోత్ర మల్లికార్జున తనూభవ రామలింగ నామధేయ ప్రణీతంబగు శ. విజయంబను మహా ప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము సంపూర్ణము"

పై గద్యను బట్టి "కృష్ణ రాయల నుండి తెనాలి రామలింగ కవి తెనాలి అగ్రహారాన్ని బడసినట్లు చెప్పవచ్చును." అని వ్రాశారు లక్ష్మీనారాయణ గారు. (పేజీ 21 – 'విశ్వబ్రాహ్మణుడగు తెనాలి రామలింగని చరిత్ర'). ఈ నిర్ధారణ కూడా తొందరపాటుతోనే చేసినదేనని పై గద్యను నిశితంగా పరిశీలిస్తే అర్థమౌతుంది. పై గద్యననుసరించి తెనాలి అగ్రహారం

కృష్ణరాయలు యిచ్చిందనేది సత్యమేననుకున్నా ఆయన ఎవరికిచ్చాడో యీ గద్యలో వుందా ? కృష్ణరాయదత్త తెనాల్యగ్రహార అంటే కృష్ణరాయలు యిచ్చిన తెనాలి అగ్రహారం అనే అర్థం. పోలవరం అంటే ముసునూరి ప్రోలయనాయఁడు యిచ్చిన గ్రామమనీ, కాపవరం అంటే ముసునూరి కాపయ నాయఁడు యిచ్చిన గ్రామమనీ, భీమవరం అంటే చాళుక్య భీముడు యిచ్చిన గ్రామమనీ ఎలా భావిస్తున్నామో కృష్ణరాయ దత్త తెనాల్యగ్రహార అని ఆ కవి పేర్కొంటే అది కృష్ణరాయలుచే నెలకొల్పబడినదనే భావించాలి గానీ, ఆ అగ్రహారం ఆ కవికి యివ్వబడిందేనని ఎలా నిర్ధారించారో నాకైతే అర్థం కావడం లేదు. ఎవరైనా కవి నేను పోలవరంకు చెందిన వాడినని గద్యలో పేర్కొంటే ముసునూరి ప్రోలయ నాయఁడు ఆ కవికి ఆ గ్రామాన్నిచ్చాడని మనం అనుకోవడం ఏ మేరకు సబబు ? ఇక్కడ 'తెనాల్యగ్రహార గ్రహీత' అని గనక వుంటే దానికి ఆక్షేపణే వుండేది కాదు. రామకృష్ణ కవి తన గద్యలో 'తెనాల్యగ్రహార నిర్ణేత' నని చెప్పుకున్నాడు. ఇక్కడ అదీ లేదే ?

ప్రాచీన కాలంలో రాజులు బ్రాహ్మణులు తదితరులకు అగ్రహారాలను నెలకొల్పడం పుణ్యకార్యాలలో ఒకటిగా భావించేవారు. ఒక్క కలంపోటుతో ప్రభుత్వ భూమినో లేక అంతకు ముందు వేరొకరి హక్కుభుక్తాల క్రింద వున్న భూమినో రాజులు అగ్రహారంగా ప్రకటించి బ్రాహ్మణుల లేక యితర పండితులు వగైరాల పరం చేసేవారు. అదే భూమిని ఒక రాజు గతించిన అనంతరం వేరొక రాజు పాలనలో మరొక రకంగా వినియోగించడం కూడా కద్దు. అంచేతనే అగ్రహారంగా యివ్వడంతోటే ఆ గ్రామం అస్తిత్వంలోనికి వచ్చిందని భావించడం తప్పు.

అగ్రహారాన్ని 'నల్లిండ్లు' అనికూడా వ్యవహరిస్తారు. 'నల్లిండ్లు' నిలపడం (అగ్రహారాన్ని నెలకొల్పడం) ఎంతో పుణ్య కార్యంగా ప్రాచీన పాలకులు భావించే వారు.

రామలింగ కవి 'ఉద్భటారాధ్య చరిత్రము' లో కాశీయాత్ర యొక్క విశిష్టతను వివరిస్తూ చెప్పిన యీ క్రింది పద్యం చూడండి -

గీ॥ యాగములు వేయి చేయంగనైన ఫలము
కోటి గోదానముల నొనగూడు ఫలము
పెక్కు నల్లిండ్లు నిలుపుటఁ బేర్చు ఫలము
కాశినొకపూఁట వసియింపఁ గలుగు నధిప (ఉ. చ. 2-85)

అలా పుణ్య ఫలాన్ని ఆశించి శ్రీకృష్ణ దేవరాయలు తన పాలనా కాలంలో ఎప్పుడో తెనాలి సమీపంలోని కొంత భూమిని ఒక అగ్రహారంగా ఏర్పరచి ఎవరికో యిచ్చి వుంటాడు. ఆ గద్యలోని 'కృష్ణరాయదత్త' అనే పదాన్ని వాస్తవమేనని భావిస్తే అది తెనాలి కైఫీయ్యత్‌లో పేర్కొన్న విధంగా కృష్ణరాయలు తెనాలి వచ్చి గోవర్ధన స్వామికి తేలప్రోలు గ్రామంలోని 25 కుచ్చెళ్ల భూమిని యిచ్చిన సందర్భంలోనే అయి వుండవచ్చు. అది బహుశా రాయలవారి పూర్వ దిగ్విజయ యాత్రలో భాగంగా క్రీ. శ. 1515 లో జరిగి వుంటుంది. బహుశా 23 - 6 -1515 లో కొండవీడును జయించిన అనంతరం అదే కొండవీటి సీమలోని అంతర్భాగమైన తెనాలికి కూడా ఆయన వచ్చి వుండవచ్చు. 'మాది కృష్ణరాయలంతటి వాడు యిచ్చిన అగ్రహారం' అని చెప్పుకోవడం ఆ అగ్రహారంలో జన్మించిన ఎవరికైనా గర్వకారణమే కనుక కవి తమది 'కృష్ణరాయదత్త తెనాల్యగ్రహారమ' ని పేర్కొని వుంటాడు. అలా ఈ గద్యను బట్టి మాత్రం అది శ. విజయ గ్రంధకర్తకో లేక విశ్వబ్రాహ్మణ కులస్థులకో యివ్వబడిన అగ్రహారమని మనం నిర్ధారించలేం.

ఈ) పై పెచ్చు ఆ రచయిత దిగ్విజయ యాత్ర అనంతరం విజయనగరం తిరిగి వెళ్లేటప్పుడు రాయల వారు తెనాలి

రామలింగ కవిని తనవెంట తోడ్కొని పోయెనేమోనని భావించడం (అదే గ్రంథం పేజీ 21) మరింత విడ్డూరంగా వుంది. ఆ రచయిత పేర్కొన్నట్లే ఆ రామలింగ కవి తిట్టు కవి, బూతు కవి, వికట కవి. రాయల వారు రాజ కవి. కవి రాజు. ఈ తెనాలి రామలింగము అప్పటికి ఏ మహత్తర కావ్యాలు వ్రాసి ప్రసిద్ధికెక్కాడని ఆయనను రాయలవారు సగౌరవంగా తమ వెంట విజయనగరం తోడ్కొనిపోయే అవకాశముంది ? లక్ష్మీ నారాయణ గారు అదే గ్రంథంలోని 22వ పేజీలో నిర్ధారించినట్లు తెనాలి అగ్రహారం ఆ రామలింగ కవికి క్రీ.శ. 1515-17 మధ్య కాలంలో లభించింది అనే విషయం నిజమనుకుంటే శ. విజయం గద్య ప్రకారం శ. విజయమనే బూతు పుస్తకం ఆ రామలింగ కవి తెనాలి అగ్రహారాన్ని పొందిన పిదప వ్రాసినదే కదా ! కాబట్టి పేరు కూడా పూర్తిగా ఉచ్చరించలేని ఆ శ. విజయమనే బూతు పుస్తకం నచ్చి రాయల వారు ఆయన్ని విజయనగరం తోడ్కొని వెళ్లాడనుకోవడానికి వీలులేదు కదా ! ఆ కవి నిర్వోష్ఠ్య రామాయణము వ్రాసినట్లు చెప్పబడే వార్త సత్యం కాదని ఆ రచయితే పేర్కొన్నారు. (అదే గ్రంథం పేజీ - 26). ఇక ఆదిపురాణము, పాండురంగ విజయము, వీరజన మనోరంజనము వగైరా కావ్యాలు రచించినట్లు శ. విజయములోని ఒక పద్యంలో చెప్పబడింది. కేవలం యీ పద్యం ఆధారంగానే మనం పై రచనల కాల నిర్ణయం చేసి అవన్నీ క్రీ.శ. 1515 కు ముందర కాలానివని నిర్ణయించలేం. ఆది పురాణం కూడా నేటికీ అలభ్యమే ! పాండురంగ విజయములోనివని చెప్పబడుతున్న కొన్ని పద్యాలు మాత్రం లభిస్తున్నాయి. వీరేశలింగం పంతులు గారు వీటిపై విశేష పరిశోధన చేసి యీ పద్యాలలో హెచ్చు భాగం యితరుల కావ్యాలలోనివని తేల్చి, పాండురంగ విజయమంటూ వేరుగా ఏ కావ్యమూ లేదనీ, పాండురంగ మాహాత్మ్యాన్నే కొందరు పాండురంగ విజయము అంటున్నారనీ అభిప్రాయపడ్డారు. నిడదవోలు వేంకటరావు గారు కూడా దీనిపై సమగ్ర పరిశీలన చేసి పాండురంగ విజయములోనివని చెప్పబడుతున్న చాల పద్యాలు శైలి, పదగుంఫన విషయంలో గార్లపాటి (తెనాలి) రామకృష్ణుని శైలిని పూర్తిగా పోలి వుండడం కారణంగా రామకృష్ణ కవే ముందుగా శృంగార పరంగా పాండురంగ విజయమును వ్రాసి అనంతర కాలంలో భక్తి పరంగా పాండురంగ మాహాత్మ్యమును వ్రాసి వుంటాడని నిర్ధారించారు. నాకు కూడా యిది సమంజసంగానే కనుపిస్తున్నది.

అలా ఆ విశ్వబ్రాహ్మణ కవి వ్రాసిన కావ్యాలేవో అవి లభ్యమై, వాటికి స్పష్టమైన కాలనిర్ణయం చేయబడి, వాటిలోని భావ గాంభీర్యమో లేక పదగుంఫనో ఆ కవికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చాయని కూడా ఋజువై, కృష్ణ రాయలు తెనాలి రావడానికి ముందరే - అంటే క్రీ.శ. 1515 కు ముందరే ఆ కవి యిలాంటి కీర్తి ప్రతిష్ఠలు పొందాడని ఋజువైతేనే తప్ప ఆ కవిని రాయల వారు తన వెంట తోడ్కొని విజయనగరం వెళ్లి వుంటాడనే విషయాన్ని మనం నమ్మే అవకాశం లేదు.

ఉ) మరో వంక ఆ రచయిత "మహోన్నత వైభవముతోనున్న హంపి విజయ నగరమును రామకృష్ణ కవి కంటితోనైన జూచి యుండలేదు." అని వ్రాశారు. (అదే గ్రంథం పేజీ 22)

ఆయన హంపిని కంటితో చూశాడో - లేదో మనమెవ్వరం చూడలేదు. కాని హంపిలో అష్టదిగ్గజ కవిగా వుండి వుండడానికి గార్లపాటి రామకృష్ణ కవికే ఎన్నో అనుకూలాంశాలున్నాయి. హంపి విజయనగరంలో ఆయన కొన్నేళ్ల పాటు అష్టదిగ్గజాలలో ఒకనిగా వున్నాడనేది సత్యమని పూర్తి ఆధారాలతో సహా నేనిదివరకే ఋజువు పరచాను. ఇక యీ విషయమై చర్వితచర్వణం అనవసరమని నా అభిప్రాయం.

ఊ) లక్ష్మీ నారాయణ గారు అదే గ్రంథంలోని 29వ పేజీలో యిలా వ్రాశారు. "శ. విజయ కర్తృత్వము విషయమై శ్రీ వీరేశలింగ కవి యిట్లు వ్రాసెను. 'శ. విజయ కృతి కర్తృత్వము రామకృష్ణుని కారోపించిరి. కాని అందొక పద్యమునైనను జదివిన వారికి నా పాడు పుస్తకము రామకృష్ణ కవి విరచితము కాదని తోఁపకమానదు.' (ఆంధ్ర కవుల చరిత్ర - ద్వితీయ

భాగము - 297వ పుట). అట్లయినచో యీ పాడు పుస్తకము కర్త విశ్వబ్రాహ్మణుడగు తెనాలి రామలింగ కవియేయని, ఆయనయే రాయల ఆస్థాన కవియని సిద్ధాంతము చేయవచ్చును కదా ! దీనికెవరు ఆక్షేపించరు కదా !"

నిజమే. ఆ బూతు పుస్తకం వ్రాసింది తెనాలి రామలింగము అనే విశ్వబ్రాహ్మణ కవే. దీనినెవ్వరూ ఆక్షేపించడం లేదు. ఎందుకంటే ఆ శ. విజయంలోని ఆశ్వాసాంత గద్యలో ఆ కవే 'తాను ఆదిపురాణం వగైరా సద్గ్రంథాలు వ్రాసిన వాడననీ, కృష్ణరాయలచే యివ్వబడిన తెనాలి అగ్రహారంలో తెనాలి వంశంలో పవిత్రులైన ఆర్య జనులచే పొగడబడే మల్లికార్జునుడి పుత్రుడననీ, రామలింగము తన నామధేయమనీ' విస్పష్టంగా పేర్కొన్నాడు. అయితే మాత్రం - ఆ శ విజయం అనే గ్రంథం వ్రాసిన వ్యక్తి ఎవరో అతడే రాయలవారి ఆస్థాన కవి అని ఎలా నిర్ధారిస్తాం? ఏ ఆధారాలతో ? ఆ గద్యలోని 'కృష్ణరాయదత్త' అనే పదం ఆధారంగానా ? అది సాధ్యమయ్యే పని కాదని మనం ముందే చెప్పుకున్నాం కదా !

ఋ) ఇక చివరిగా భట్టుమూర్తి, మొల్ల వగైరా శూద్ర కవులను తీవ్రంగా విమర్శిస్తూనో, తిడుతూనో రామకృష్ణ కవి చెప్పిన అనేక చాటువులలో ఆయనలోని బ్రాహ్మణాధిక్యతా భావం, నిమ్న కులాల వారి పట్ల ఆయనకున్న చులకన భావం ప్రస్ఫుటంగా కనుపిస్తాయి. వయస్సు పరిపక్వమయ్యే కొద్దీ ఆయనలోని ఆ బ్రాహ్మణాధిక్యతా భావం క్రమంగా తగ్గినట్లు మనం గమనించవచ్చు. 'ఉద్భటారాధ్య చరిత్రము'లో చేసిన 'శంభు భక్తుఁడు గాని జడ బుద్ధినంటుట - గెంటక చండాలునంటినట్లు' (ఉ. చ. 3-141) 'వినిందిత కులుడు' తరహా ప్రయోగాలు 'పాండురంగ మాహాత్మ్యము'లో కానీ, 'ఘటికాచల మాహాత్మ్యము'లో కానీ మచ్చుకైనా కానరావు.

కందుకూరి రుద్రకవి అష్టదిగ్గజములలోని వాడనీ, ఆయన ఈశాన్య దిక్కు సింహాసనాన్ని అధిష్ఠించాడనీ, చేసే వాదనను వీరేశలింగం పంతులు గారు వగైరా విమర్శకులు అంగీకరించలేదు. ఒకవేళ మనం దీనిని నిజమని నమ్మినా, కనీసం భువన విజయ ప్రవేశమే బ్రాహ్మణేతరులకు ఎంత కష్టమైన పనో రుద్రకవి చెప్పిన 'ఎంగిలి ముచ్చు' పద్యమే తెలుపుతున్నది. నాటి సాంఘిక పరిస్థితులలో విశ్వ బ్రాహ్మణులకు నాడివ్వబడిన నిమ్న సామాజిక ప్రతిపత్తి దృష్ట్యా, ఒక విశ్వ బ్రాహ్మణ కవి రాయల వారి అష్ట దిగ్గజాలలో ఒకనిగా వుండగలగడం, రాయలవారికి అత్యంత సన్నిహితునిగా మెలగగలగడం ఊహించడానికి కూడా సాధ్యం కాని విషయాలని మనం ముందే చెప్పుకున్నాం.

జన బాహుళ్యంలో విస్తృత ప్రచారంలో వున్న రామకృష్ణుని చాటువులలో ఆయనకున్న బ్రాహ్మణాధిక్యతా భావం, శూద్ర కులాలకు చెందిన కవుల పట్ల కల చులకన భావం ప్రస్ఫుటంగా కనుపిస్తాయని మనం ముందే చెప్పుకున్నాం కదా! ఒక విశ్వ బ్రాహ్మణ కవికి శూద్ర కవులను తక్కువగా చూసే పనేముంటుంది ? తాను కూడా నాటి సామాజిక పరిస్థితులలో బ్రాహ్మణుల చేత శూద్రులకంటే కూడా తక్కువగా ఎంచబడుతున్న వాడే కదా ? పైపెచ్చు గార్లపాడుకు చెందిన రామకృష్ణ కవి బాల్యం నుండి భట్టుపల్లెకు చెందిన భట్టుమూర్తితో పేచీలు పడ్డాడనేది జనశృతి. భౌతిక పరిస్థితులు కూడా అది వాస్తవమేనని ఋజువు పరుస్తున్నాయి. రామకృష్ణ కవికి సంబంధించిన కథలలో హెచ్చు శాతం ఆయన్ని రామలింగడుగానే పేర్కొంటున్నాయనీ, అవి ఆయన హంపికి చేరిన తొలి దినాలకు సంబంధించినవి కనుక ఆయన మతం మార్చుకుని, పేరు మార్చుకున్నప్పటికీ, అందరూ అప్పట్లో ఆయనను రామలింగడనే వ్యవహరించేవారనీ చెప్పుకున్నాం. అయితే భువన విజయం వేదికగా నాడు జరిగినట్లు ప్రచారంలో వున్న ఘటనలకు చెందిన చాటువులలో మాత్రం 'రామకృష్ణ కవి' అనే పేర్కొనబడింది. అంతేకాక హంపిలో వుండిన రామకృష్ణ కవి చాటువులలో భట్టుమూర్తిని 'అన్నగారూ !' అంటూ సంబోధించాడు. లక్ష్మీనారాయణ గారు హంపిలో వున్నాడని చెప్తున్న బూతుకవి భట్టుమూర్తి కంటె చాల పెద్దవాడు. (వారే చెప్తున్నట్లు ఆ రామలింగ కవి క్రీ.శ. 1462 లో జన్మించాడని భావిస్తే) ఆ రామలింగ కవి భట్టుమూర్తిని అన్నగారని సంబోధించే అవకాశం లేదు కదా ! పైపెచ్చు

ఆ రామలింగ కవిని భట్టుమూర్తితో తలపడిన కవేనని భావించాలన్నా, గార్లపాడుతో అతడికేవిధమైన సంబంధమూ లేదు కదా ! ఆ విశ్వ బ్రాహ్మణ కవిది కూడా గార్లపాడేననీ, భట్టుమూర్తితో పేచీలు పడింది కూడా ఆయనేననీ, శైవుడైన ఆ విశ్వబ్రాహ్మణ కవి కూడా మతం మారి వైష్ణవం స్వీకరించి రామకృష్ణుడని పేరు మార్చుకున్నాడనీ ఎవరైనా అంటే యిక చెప్పగలిగేదేమీ లేదు. అప్పుడిక గార్లపాటి రామలింగ కవి (రామకృష్ణుడు), విశ్వబ్రాహ్మణుడైన తెనాలి రామలింగ కవి - యిద్దరూ అష్టదిగ్గజాలలో వున్నారనుకోవలసి వస్తుంది. అయితే ఆ రామలింగ కవి శైవాన్ని వీడి వైష్ణవాన్ని స్వీకరించినట్లుగానీ, పేరు మార్చుకున్నట్లు గానీ ఎక్కడా ఆధారాలు లేవు. అలాగని ఎవరూ వాదించడం లేదు కూడా. కనుకనే ఆ విశ్వబ్రాహ్మణ రామలింగ కవి తరువాత కాలంలో అక్కన్న, మాదన్నల పరిపోషణలో 'వీరజన మనోవిరాజితము' అనే ఏకాశ్వాస ప్రబంధము వ్రాసిన వాడేనని అనుకోవలసి వుంటుంది. లేక శ. విజయము, వీరజన మనోరంజనము వ్రాసిన భువనవిజయముతో ఎట్టి సంబంధమూ లేని మరో రామలింగ కవి అయివుండాలి.

# వికటకవి

ప్రపంచంలో యింతమంది కవులుండగా ఒక్క రామకృష్ణ కవికే 'వికటకవి' అనే బిరుదనామం స్థిరపడింది. 'వికట' అనే విశేషణానికి సంస్కృతంలో భయానకమైన *(Hideous, Formidable, Frightful, Horrible, Dreadful)* అనే అర్థమూ, వికారమైన *(Ugly)*, క్రూరమైన *(Savage)* అనే అర్థాలతోపాటు గొప్ప *(Great)*, పెద్ద *(Lagre)*, విశాలమైన *(Broad, Spacious and Wide)*, గర్విష్టియైనట్టి *(Proud)*, తలపొగరుకల, విపరీతమైన స్వోత్కర్షకల *(Haughty ; Arrogantly self - admiring)*, (యితరులను) ఎగతాళి చేసి వెక్కిరించే స్వభావం కల *(Frowning)*, ఒక పట్టాన తేలికగా అర్థం కాని భావాలు కల *(Obscure)*, పొడవాటి దంతములు కల *(Large Toothed)*, తానే అధికుడననే భావం కల, యితరులందరినీ తీసి పారవేసే స్వభావం కల *(Disdainful)* అనే ఎన్నో అర్థాలున్నాయి. అంతేకాదు - 'వికట' అనే విశేషణానికి రూపం (వేషం, ఆహార్యం) మార్చినట్టి *(Changed in appearance)* అనే అర్థం కూడా వుంది. 'వికటః' అంటే గణేశుడు అనే అర్థం వుంది. (లంబోదరశ్చ, వికటో, విఘ్ననాశో, వినాయకః). 'వికటమ్' అంటే కురుపు, గడ్డ, పుండు, విస్ఫోటము, కణితి *(A boil, Tumour)* అనే అర్థాలూ, చందనము *(Sandal)*, తెల్ల పాషాణం *(White Arsenic)* అనే అర్థాలూ వున్నాయి. (ఈ అర్థాలన్నీ వామన్ శివరామ్ ఆప్టే గారు సంకలనం చేసిన *The Practical Sanskrit - English Dictionary* లో యివ్వబడ్డాయి.)

'వికట' అనగానే మనకు రామకృష్ణ కవిపై అల్లబడిన ఏవేవో చౌకబారు హాస్య కథలు గుర్తుకొస్తాయి. వాటిలో కొన్ని నిజాలు వుండే వుంటాయి. ఇంకొన్ని కేవలం కల్పితాలైవుంటాయి. ప్రతి ఒక్కరూ ఆయన హాస్య కథలు చదివే వుంటారు కానీ, ఆయన కావ్యాలు ఎక్కువ మంది చదివి వుండరు. ఆయన కావ్యాలు చదువుతూ వుంటే ఆయన ఉదాత్తమైన హాస్య ప్రియత్వం అర్థమౌతుంది. ఆయన సరస సంభాషణా చతురుడు. సరస కవిని అని తానే చెప్పుకున్నాడు కదా ! (పాం. మా. 1-23) ఆయనను గురించి కల్పించబడిన కథలు విన్నవారూ, అవి చదివిన వారూ ఆయన కావ్యాలను కూడా చదివితే ఆ కథలు కల్పించిన వారు ఆయన స్థాయిని ఎంత ఘోరంగా దిగజార్చారో అర్థం కాగలదు. రామకృష్ణుని గురించి అంతగా తెలియని ఆ యింకొక పార్శ్వాన్ని కూడా అవగాహన చేసుకుంటే పాఠకులకు ఆయన ఎంత మహాకవో అర్థం కాగలదు. తెనాలి రామకృష్ణుడు కేవలం ఓ కవి కాదు. మహాకవి. కవులకు కవి. కవీనాం కవి : . తన కావ్యాలలో సందర్భానుసారం శృంగార, హాస్య, కరుణ, వీర, రౌద్ర, భయానక, బీభత్స, అద్భుత, శాంత రసాలను తొమ్మిదింటినీ

ఒలకబోసి రక్తి కట్టించిన మహా కవి ఆయన. ఆయన కావ్యాలలో ఎన్నో సందర్భాలలో ఆయన కూలంకష ప్రజ్ఞ, వివిధ విషయాలపై ఆయనకున్న సర్వ సమగ్ర పరిజ్ఞానం ప్రకటితమైంది.

'వికట కవి' అనగానే 'వంకర కవిత్వం' చెప్పిన ఓ బూతు కవో లేక తిట్టు కవో మన మనస్సులలో మెదులుతాడు. మరి ఆయన్ని గురించి అల్లబడిన కట్టుకథల మాహాత్మ్యమది !

'వికట' అనే శబ్దానికున్న అన్ని అర్థాలకూ అతికినట్టు సరిపోయే వ్యక్తి మన రామకృష్ణ కవి. ఆ శబ్ద నిర్వచనాలు ఆయన్ని దృష్టిలో వుంచుకునే రూపొందించబడినాయా – అన్నంత ఆశ్చర్యం మనకు కలుగక పోదు ! ఆయనకు 'వికట కవి' అన్న పేరు ఎవరు పెట్టారో కాని – నిజంగా ఆయన సమగ్ర స్వరూపానికి నిర్వచనాత్మకంగా, చక్కగా సరిపోయే పేరది. ఆయన రూపం భయానకమైనదవడం చేతనే లేక వికారమైన ఆయన పొడవాటి దంతాల కారణంగానే ఆ పేరు పెట్టి వుంటారా ? – అయినా కావచ్చు. శ్రీ కృష్ణ దేవరాయలు స్ఫురద్రూపి అనీ, పెద్ద పొడగరి కాదనీ, ముఖంపై స్ఫోటకపు మచ్చలుండేవనీ కొందరు విదేశీ చరిత్రకారులు వ్రాశారు. అలా రామకృష్ణ కవి రూపాన్ని గురించిన ఆ తరహా వర్ణనలు మనకెక్కడా లభించడం లేదు. కానీ, 'స్వర్ణ యోగ చింతామణి'లోని 'యోగి – భోగినీ సంవాదము' లో వ్యాఘ్రాజిన శయ్యా సందర్భములోనిదని చెప్పబడిన, 'పాండురంగ విజయము' లోనిదని భావించబడుతూన్న 'వరబింబాధరమున్....' అనే పద్యానికి సంబంధించిన కథను బట్టి ఆ వేశ్య రామకృష్ణ కవి రూపాన్ని చూచి దడుచుకుని కళ్లుమూసుకున్నదని వర్ణించడాన్ని బట్టి ఆయన రూపం భయానకంగా, వికారంగా వుండి వుంటుందని మనం భావించవచ్చు. తనకు ఒకసారి ఎగ్గుచేయ తలపెట్టిన వారిని ఆయన 'కందిరీగ'లాగా ఎలా వెంటపడి, వెంటపడి ప్రతీకారం తీర్చుకుంటాడో రామకృష్ణ కవికీ, భట్టుమూర్తికీ మధ్య నడచిన విద్వేషపూరిత గాథనుబట్టే అర్థమౌతుంది. భట్టుమూర్తి కూడా మహాకవి అని తెలిసి వుండి కూడా ఆయన పట్ల రామకృష్ణ కవి తన జీవిత చరమాంకం వరకు ఎంతటి క్రౌర్యాన్ని ప్రదర్శించాడో మనం గమనించాం. ఇక ఆయన జీవితాన్ని, ఆయన కావ్యాలను నిశిత పరిశీలన చేసిన వారికి ఆయన గొప్ప హృదయం, పెద్ద మనస్సు, విశాలమైన భావాలు తెలియడం మాత్రమే కాక, ప్రపంచంలోని ఏ మహత్తర భావాన్నైనా తనలో యిముడ్చుకోగలిగినంత హృదయ వైశాల్యం కల వ్యక్తి ఆ మహా కవి అన్న విషయం మనకు బోధ పడుతుంది. ఇక ఆయన గర్వము, తలపొగరు, స్వోత్కర్ష జగద్విదితములే కదా ! 'లింగనిషిద్ధు కల్వల చెలింగని' అన్న పద్యంలోనూ, మరికొన్ని పద్యాలలోనూ ఆయన స్వోత్కర్ష గుర్తించదగు స్థాయిలోనే ప్రకటితమైంది కదా ! ఇక యితరులను వెక్కిరించి, ఎగతాళి చేసే ఆయన స్వభావం కూడా మనమందరమూ ఎరిగినదే. ఆయన భావాలు ఎంతటి గంభీరమైనవో, కఠిన శిలా సదృశమైన భాష, నారికేళపాకంలా అంతు చిక్కని ఆయన భావాల లోతు ఆయన కావ్యాలు చదివిన వారికి అనుభవైకవేద్యం. ఆయనకున్న బ్రాహ్మణాధిక్యతా భావం. శూద్ర కవులను కించపరుస్తూ ఆయన చెప్పిన చాటువులు ఆయన వ్యక్తిత్వంలోని మరొక పార్శ్వాన్ని ఆవిష్కరిస్తాయి. శైవాన్ని వదలి వైష్ణవం స్వీకరిచగానే, ఆయన రూపం వేషభూషలు, ఆహార్యం తప్పక మారి వుంటాయి. అతడు తనతో పేచీ పెట్టుకున్న వారి దేహంపైన నిస్సందేహంగా పుండులాంటి వాడు. ఇంకా చెప్పాలంటే వారి నరాలమీది కురుపులాంటి వాడు. అస్మదీయులకు ఆయన చందనపు మైపూత వంటి వాడు. తన శత్రువుల పాలిటి నిజంగా ఆయన ప్రాణాంతకమైన శ్వేత పాషాణం *(White Arsenic - Arsenic Trioxide)* వంటివాడు. గణేశుని అంఘ్రిద్వయం 'నిగమశాఖి శిఖా ప్రవాళమ'ని ప్రసిద్ధి. అంటే వేదాలనే వృక్షపు కొమ్మల యొక్క చిగురుటాకులు అనదగిన ఉపనిషత్తులను తన పాదద్వయంగా కలిగిన వాడన్నమాట అంటే గణేశుడు ఉపనిషత్ సారం తన పాదాల వద్ద కలిగినవాడు. అంతటి ప్రజ్ఞావంతుడు కనుకనే వేద వ్యాసుడు భారతం వ్రాయడానికి లేఖకునిగా ఆయన్ని నియమించుకుని వుంటాడు !. రామకృష్ణ కవికి కూడా వేదోపనిషత్తులు కొట్టిన పిండి.

పాఠకులూ ! ఇప్పుడు చెప్పండి – 'వికటః' అనే పేరు ఆ శబ్దానికి వున్న అన్ని అర్థాలకూ తూచినట్లు సరిపోయే గుణ రూపాదులు కలిగిన రామకృష్ణ కవికి నప్పుతుందో లేక గణేశుడికి నప్పుతుందో ?

**ముగింపు :** ఇలా తన జీవితకాలంలో తాను వ్రాసిన కావ్యాలతో, ఆశు కవితలతో, చాటువులతో, తిట్టు కవితలతో, సమస్యాపూరణాలతో, హాస్యోక్తులతో, చతురోక్తులతో, సందర్భోచితోక్తులతో వీర విన్యాసాలు చేసి ఆంధ్రదేశంలోనే కాక యావద్దక్షిణ భారతంలో పేరు ప్రఖ్యాతులనార్జించాడు మన తెనాలి రామకృష్ణ. అంతేకాదు. తెనాలి పేరునూ అజరామరం చేశాడు.

రామలింగకవి రామకృష్ణ కవిగా ఎలా, ఎప్పుడు, ఎందుకు మారాడో ఇదివరలో చూచాం. అయితే గార్లపాటి రామకృష్ణ కవి తెనాలి రామకృష్ణునిగా ఎలా, ఎందుకు పిలువబడ్డాడు? అప్పటికే ప్రముఖులందరూ ఇండ్లపేర్లతో వ్యవహరించబడడాన్ని మనం చూడవచ్చు. 'సంపెట నరపాల సార్వభౌముడు' అని పెద్దన తన చాటువొకదానిలో పేర్కొనడాన్ని బట్టి కృష్ణదేవరాయలు ఇంటి పేరు 'సంపెట' వారని తెలుస్తున్నది. 'అల్లసాని' పెద్దనామాత్యుని ఇంటి పేరు. ఆయన స్వగ్రామం కడపజిల్లా జమ్మలమడుగు తాలూకా కోకట అనే గ్రామమైనా ఆయన్ని 'కోకట పెద్దన' అని ఎవరూ అనేవారు కాదు. 'నంది' ముక్కు తిమ్మన ఇంటి పేరు. తిమ్మన తండ్రి పేరు 'సింగయ'. అందుకని ఆయన్ని 'నంది సింగయ' తిమ్మన అని కూడా అనేవారు. మరొక కవి మల్లన తండ్రిపేరు 'మాదయ' కనుక ఆయనను 'మాదయ గారి మల్లన' అనేవారు. ఇలా తండ్రి పేరును యింటి పేరుగా తమపేరుకు ముందు చేర్చుకొనడం దక్షిణ భారతదేశంలోని అనేక ప్రాంతాలలో అప్పటికే వాడుక అయింది. అందుకే తండ్రి తుళువ నరసనాయకుడు అనబడిన నరసింహరాయలను బట్టి కృష్ణరాయలను నరసింహ కృష్ణరాయలనేవారు. మరి మన రామకృష్ణుని ఇంటిపేరు 'గార్లపాటి' వారు. తండ్రి పేరు 'రామన్నమంత్రి'. ఈ రెండూ కాక 'తెనాలి' శబ్దం రామకృష్ణుని ఇంటిపేరు ఎలా ఐవుంటుంది? దీనికి కారణం ఒక్కటే అయివుంటుంది. అప్పటికే తెనాలి చాల సుప్రసిద్ధమైన గ్రామమై వుంటుంది. అందుచేతనే అంత దూరం హంపి-విజయనగరం వెళ్లికూడా మన రామకృష్ణుడు తాను తెనాలి రామకృష్ణుడినని సగర్వంగా చెప్పుకొని వుంటాడు. చిన్నదే అయినా తెనాలి ఏకారణంగానో అప్పటికే ప్రసిద్ధిచెందిన గ్రామం కావడాన రామకృష్ణకవి తాను తెనాలి వాడినని చెప్పుకున్నాడు. (యిందాక నేను పేర్కొన్న ఉత్సవ విగ్రహం పైన వ్రాయబడిన శ్లోకంలోనూ, తెనాలి కైఫీయ్యత్‌లోనూ తెనాలి నగరంగా పేర్కొనబడడం వలన అది అప్పటికే ప్రసిద్ధమైనదిగా మనం ఊహించవచ్చు) ఇప్పటికీ తెనాలి వాళ్ళెక్కడికి వెళ్లినా తమ స్వస్థలాన్ని గురించి ఎందుకో గొప్పగా చెప్పుకుంటారు. ఎందుకేముంది? తమది గొప్ప చరిత్ర కలిగిన గ్రామం కనుకనే ! తెనాలి వారికి స్వస్థలాభిమానం మెండని యిప్పుడందరికీ తెలుసు. అయితే 16వ శతాబ్దంలోనే తన స్వస్థలాభిమానాన్ని ఇలా 'తెనాలి' ని తన పేరుముందు పెట్టుకోవడం ద్వారా చాటుకున్నాడు మన రామకృష్ణయ్య.

కన్నడ సాహిత్యంలో రామకృష్ణకవిని 'తెన్నాలి రామ' అని పేర్కొంటారు. ఆమధ్య ప్రఖ్యాత చలన చిత్ర దర్శకుడు శ్యాం బెనెగల్ దర్శకత్వం వహించిన టి.వి. సీరియల్ 'తెన్నాలి రామ' దూరదర్శన్ లో చాల కాలంపాటు ధారావాహికంగా ప్రసారమైంది. అదే విధంగా 'తెన్నాలి రామ' అనే పేరుతో కీ।శే। సి.కె. వెంకట రామయ్య, యం.ఎ., యల్.యల్.బి., రచించిన నాటకం ఆధారంగా ప్రఖ్యాత కన్నడ చలన చిత్ర నిర్మాత – దర్శకుడు బి. యస్. రంగా తన విక్రం ప్రొడక్షన్స్ ద్వారా 'తెనాలి రామకృష్ణ' అనే చలన చిత్రాన్ని నిర్మించారు. (దీనిలో కీ। శే యన్.టి.ఆర్. – కృష్ణరాయలుగానూ, అక్కినేని నాగేశ్వరరావు – తెనాలి రామకృష్ణునిగానూ నటించారు. ఈ చలన చిత్రానికి సంభాషణలు సుప్రసిద్ధ రచయిత కీ।శే। సముద్రాల రాఘవాచార్య సీనియర్ వ్రాశారు.) దీనిని బట్టి 'తెన్నాలి' – తెనాలి యొక్క పూర్వరూపమై ఉంటుందని

తెలుస్తోంది. స్థానిక తెలుగు ప్రజల వాడుకలో 'తెన్నాలి' కాస్తా క్రమంగా 'తెనాలి' అయింది. అందుకే తెలుగువారి సాహిత్యంలో యిది 'తెనాలి'గా రూపాంతరం చెందింది. అయితే కన్నడ సాహిత్యంలో మాత్రం యింకా 'తెన్నాలి'గా మిగిలిపోయింది.

కొందరు విమర్శకులు రామకృష్ణ కవి రాయలవారికి ఏ కావ్యాలూ అంకితమీయలేదు గనుక, ఆయన ఆ ఆస్థానంలో ఉండి ఉండడానికి ఆస్కారం లేదంటున్నారు. వారు రామకృష్ణ కవి హంపిలో వున్నట్లుగా మనం ఊహిస్తున్న క్రీ.శ. 1520-30 మధ్య కాలంలో అప్పుడుండిన సంక్షుభిత రాజకీయ వాతావరణంలో రాయలవారు అసలు కవితా గోష్ఠులు నిర్వహించే అవకాశమే లేదు కనుక రామకృష్ణ కవి హంపిలో వున్నాడనడం అసత్యమని పేర్కొంటున్నారు. కావ్య రచన అంతతేలికైన పనేంకాదు. అల్లసాని పెద్దన వ్రాసిన 'మనుచరిత్ర', నంది తిమ్మన వ్రాసిన 'పారిజాతాపహరణం', ధూర్జటి వ్రాసిన 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యం' పరిపూర్తికి చాల కాలం పట్టినట్లు దాఖలాలున్నాయి. ఆరుద్రగారి అభిప్రాయం ప్రకారం తిమ్మన పారిజాతాపహరణాన్ని క్రీ।శ। 1525 ప్రాంతాలలో పూర్తి చేసి ఉంటాడు. అప్పటికే రాజ్యం రాజకీయంగా సంక్షుభితంగా వుంది. రాయలు మరణించింది క్రీ।శ। 1530లో . ఆ చివరి ఐదేళ్ళలో ఏ కావ్యాలూ ఆయన కృతిపొందిన దాఖలాలు లేవు. ఇందుకు ఆనాటి సంక్షుభిత వాతావరణమే ప్రధాన కారణం. కొత్త కావ్య రచనను పరిపోషించి, పర్యవేక్షించే వెసులుబాటు కృష్ణరాయలకు ఆ వాతావరణంలో ఉండి ఉండకపోవచ్చు. తెనాలి రామకృష్ణుని హాస్యోక్తులు, సమస్యాపూరణాలు, చతుర కవితలు చికాకుగా ఉన్న కృష్ణరాయలకు ఆనాడెంతో ఓదార్పునూ, ఆనందాన్నీ తప్పక చేకూర్చి ఉంటాయి. రామకృష్ణ కవి తదితరులతో కృష్ణరాయలు తన జీవితకాలపు చివరి పదేళ్ళలో నడిపిన సాహిత్య గోష్ఠులను అవాస్తవమైనవిగా ఎలా త్రోసివేయగలం? దక్షిణ భారత భాషాసాహిత్యాలన్నిటా ఇవి ఉటంకించబడ్డవే కదా ! పైపెచ్చు రాయలవారు యుద్ధ రంగానికి కూడా కవులను తీసుకెళ్లే వారని ప్రతీతి. అలాంటి రాజ కవి సంక్షుభిత రాజకీయ పరిస్థితులలోనైనా సరే విద్వద్గోష్ఠులు తప్పక నిర్వహించే వుంటాడు.

కనుక, గార్లపాటి రామకృష్ణయ్య క్రీ।శ।। 1520-30 మధ్య కాలంలో కృష్ణరాయల ఆస్థానాన్ని అలంకరించి, తన ఆశుకవితలతో, చతురోక్తులతో సభను అలరించాడని నేను విశ్వసిస్తున్నాను. పైపెచ్చు హంపిలో ఉన్న కాలంలోనే అక్కడి ప్రసిద్ధమైన, కృష్ణరాయల కత్యంత యిష్టమైన విఠ్ఠల దేవునిపై పాండురంగ మాహాత్మ్యమనే కావ్యం వ్రాయాలనే సంకల్పానికి ఆయన వచ్చి వుంటాడు. ఈ కావ్య రచనకు ప్రేరణ తప్పక కృష్ణరాయలే అయి ఉంటాడు. కావ్యంలో కొంత భాగం రామకృష్ణుడు హంపిలో ఉండగానే వ్రాసి ఉంటాడు. రాయల మరణానంతరం కొంత కాలం తెనాలిలో (బహుశా కొంత కాలం పిఠాపురంలో కూడా) గడిపి పొత్తపినాటికి చేరి విరూరి వేదాద్రి పరిపోషణలో ఆయన కావ్య పరిపూర్తి చేసి ఉంటాడు.

ఆ రోజులలో ఒక విశ్వబ్రాహ్మణ కవి రామకృష్ణుడు చేరినంత ఉచ్చదశకు చేరగలడని ఊహించనుకూడా లేము. ఆదిలో రాయల దర్శనం కోసం, కనీసం సభాప్రవేశం కోసం రామకృష్ణుడు ఎన్నో ఇబ్బందులు పడ్డా ఆయన నియోగి బ్రాహ్మణుడైనందున తిమ్మరుసు ప్రోత్సాహం, మద్దతూ ఆయనకు లభించాయి.

బ్రాహ్మణులలోనే వైష్ణవ కవులకు తప్ప శైవులైన కవులకు రాజాశ్రయం దక్కనీయని వాతావరణం హంపిలో వుండేదట. పండిత పరిషత్తూ, మంత్రులూ అందరూ కరడుగట్టిన భావాలతో వుండేవారని కందుకూరి రుద్రకవి కొండోజీ అనే ఆస్థాన క్షురకుడి సిఫారసుతో రాజదర్శనం పొందిన తరువాత చెప్పిన ఈ పద్యం చెప్పకనే చెపుతున్నది.

**ఎంగిలిముచ్చు గులాములు – సంగతిగా గులము జెరుప జనుదెంచిరయా**
**ఇంగితమెరిగిన ఘనుడీ – మంగలి కొండోజి మేలు మంత్రులకన్నన్.**

రాయలవారి ఆస్థానంలో పాండిత్యమూ, కవిత్వమూ బ్రాహ్మణులకే స్వంతం అన్న వాతావరణం ఉండేదట.

ఇలాంటి ప్రతికూల వాతావరణంలో ఒక విశ్వబ్రాహ్మణుడు రామకృష్ణ కవి సాధించినవన్నీ భువన విజయంలో సాధించాడనడం నమ్మశక్యంగా లేదు. పైపెచ్చు కటకం గజపతులలోని వాడైన గణపతి చక్రవర్తి నుండి గోపరాజు రామన్న మంత్రి అనే నియోగి బ్రాహ్మణుడు స్వీకరించిన వరం కారణంగా విశ్వబ్రాహ్మణులు మరియు బలిజల నుండి కరణీకములు తీసివేయబడి నాటినుండి ఆరువేల నియోగులకీయబడినాయి. నాటినుండి విశ్వబ్రాహ్మణులు సామాజికంగానూ, ఆర్థికంగానూ వెనుకబడిపోయారు. అటువంటి వెనుకబడిన వర్గాన్నుంచి వచ్చిన కవి ఆనాటి ప్రతికూల వాతావరణంలో భువన విజయంలో యింతటి పేరుప్రఖ్యాతులు పొందగలిగే అవకాశం లేదు. అంతేకాక బ్రాహ్మణకులాభిమానం చేతనూ, భట్టుమూర్తి అంటే గిట్టని కారణంగానూ, అప్పాజీ అనబడే మహామంత్రి తిమ్మరుసు రామకృష్ణ కవికి పూర్తి ప్రోత్సాహమిచ్చినట్లు తెలుస్తూంది. అప్పాజీ అండతోనే రామకృష్ణుడు భట్టుమూర్తి పై అనేక సందర్భాలలో చెలరేగిపోయాడు. అదీగాక భట్టుమూర్తి కులాన్ని విమర్శిస్తూ రామకృష్ణుడు చెప్పిన, నేను లోగడ పేర్కొన్న 'చీఁపర పాఁపర తీఁగల . . . ' పద్యంలో రామకృష్ణుడు తనను తాను 'బాపన కవి వరుని'గా పేర్కొన్నాడు.

రామకృష్ణుడు భట్టుమూర్తి వగైరా శూద్రకవుల కవితలను విమర్శిస్తూ నిదర్శనాలంకారంతో చెప్పిన ఈ క్రింది పద్యం కూడా చూడండి-

**శా॥ అద్రిస్నిగ్ధ తలంబు బుద్బుదములుద్యద్దారు భూషావళుల్**
**క్షుద్రౌదుంబర పాక పక్వఫలముల్ శుక్త్యంతరాకాశముల్**
**రుద్రాక్షాక్షర పంక్తి విభ్రమము లీరూఢిన్నిరూపింపనీ**
**శూద్ర ప్రజ్ఞలు విప్రసత్కవి వచస్స్ఫూర్తిన్విడంబించునే.**

శూద్రప్రజ్ఞలు - అంటే శూద్ర కవులు చెప్పే కవితలు - పర్వతపు కోమలత్వం కలవి. అంటే సరళత్వం లేనివి. బుద్బుదాలు - అంటే నీటి బుడగల్లా అశాశ్వతములు. జీవంలేని చెక్క ఆభరణాలవలె విలువలేనివి. పైకిబాగా కనుపించినా లోపల పురుగులుండే క్షుద్రమైన మేడిపండ్లవంటివి. శూన్యమైన ముత్యపు చిప్పలు. అక్షరాల్లా కనుపించినా ఏ భావాన్నీ ఇవ్వని రుద్రాక్షలపైని పంక్తులు ఏ విధంగా అక్షరాలు కాదో అదే విధంగా శూద్రకవి చెప్పేది కవితలా కనుపించినా అది ఉత్తమ కవిత కాదు. ఎంతైనా శూద్ర కవితలు ఒక బ్రాహ్మణ సత్కవి వచస్స్ఫూర్తిని అనుకరించగలవా? ఈ పద్యాన్ని బట్టికూడా హంపిలో వెలుగొందిన తెనాలి రామకృష్ణకవి తెనాలికి చెందిన గార్లపాటి రామన్నమంత్రి కుమారుడేనని రూఢిగా తెలుస్తున్నది. ఆనాటి వాతావరణంలో ఒక విశ్వబ్రాహ్మణ కవి శూద్ర కవులను యీ విధంగా విమర్శించాల్సిన అవసరం లేదు. ఎందుకంటే అతడూ బ్రాహ్మణుల చేత శూద్రులకంటే తక్కువ వానిగా చూడబడే వాతావరణమే అప్పుడక్కడ వుంది. కనుక తెనాలి రామలింగము అనే విశ్వబ్రాహ్మణ కవి రాయల వారి ఆస్థానంలో వుండే వాడంటే నమ్మశక్యం కాదు.

రామకృష్ణ కవి బ్రాహ్మణ కులతత్త్వంతో శూద్ర కవులను - ప్రత్యేకించి భట్టుమూర్తిని - ఎంత తీవ్రంగా విమర్శించే వాడో మనం లోగడనే తెలుసుకున్నాం. మరొక ఉదాహరణ కూడా చూద్దాం.

ఒకప్పుడు అళియ రామరాయలకు వాయురోగం వచ్చిందట. అంతఃపుర స్త్రీలు ఆయనకు రకరకాల సపర్యలు చేస్తూ, ఎన్నో రకాల మందులు వాడుతూ వుండగా, తెనాలి రామకృష్ణుడు జోక్యం చేసుకొని ఆ స్త్రీలతో యిలా అన్నాడట -

క॥ ఓ యమ్మలార ! మందులు వేయేల
మకార కొమ్ము విషకవిగానిన్
వా యెత్తకుండఁ జేసిన
వా యెత్తదు రామరాయ వసుధేశునకున్.

భట్టుమూర్తికి 'రామరాజ భూషణుడు' అనే మరొక పేరుంది. దీని అర్థం 'రామరాజు లేక అళియ రామరాయలు చేత సత్కరించబడిన వాడు' అని. అళియ రామరాయలు రోజూ భట్టుమూర్తి చెప్పే పద్యాలు శ్రద్ధగా విని, ఆనందించి భట్టుమూర్తినెంతగానో మెచ్చుకునే వాడట. ఇది మన రామకృష్ణునికి గిట్టేది కాదు. రామకృష్ణ కవి ఎప్పుడూ భట్టుమూర్తిని శూద్రకవి అని కించపరుస్తూ మాట్లాడే వాడు. అంతటి మహా కవిని 'మకార కొమ్ము విషకవిగాడు' అని పేర్కొనడం రామకృష్ణునికే చెల్లింది. అందుకే ఆయన అంతఃపుర స్త్రీలకు 'భట్టుమూర్తి విష కవిత్వ ప్రయోగం చేతనే రామరాయలకు రోగం వచ్చింది భట్టుమూర్తిని నోరెత్తకుండా చేయండి. రామరాయల వాయురోగం దానంతట అదే ఉపశమిస్తుంది' అని చెప్పాడు. (వా అన్నా, వాయి అన్నా నోరు అనే అర్థం)

రామకృష్ణుడు కులవివక్షతో విమర్శించినంత మాత్రాన భట్టుమూర్తి అనే రామరాజభూషణుడి కీర్తికేమీ భంగము వాటిల్లలేదు. ఆయన రచించిన 'వసుచరిత్రము' ఓ మహా కావ్యం. 'వసుచరిత్రము' యొక్క ఘనతను గూర్చి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు ఏమంటున్నారో చూడండి –

"ఇంక మన తెలుగు కవు లొకరింకంటె నొక రధికులు.

ఒకానొక భాష తీసికొన్నచో దానిలో నెన్నియో యందములుండును. పలుమాట లుండును. కొన్ని మాటలు నాలుగైదర్థములిచ్చును. కొన్ని యర్థములు నిఘంటువులలోననే యుండును. కవి వాడెడు నేర్పు వలన మరికొన్ని యర్థములు వచ్చును.

ఈ యర్థము లెన్నో విధములుగా నుండును.

ఒక మాటను రెండుగా చీల్చినచో రెండు మాటలగును. ఒకొకప్పుడు రెండు మాటలను గలిపినచో నొకమాటవలె నుండును.

మరి యొకప్పుడొక వాక్యమును దీసికొన్నచో దానికి రెండు మూడర్థములు వచ్చును.

భాషలో నిట్టి చమత్కారములు వేనవేలుండును.

మను చరిత్రలో నిట్టి చమత్కారములు తక్కువ.

వసు చరిత్ర యిట్టి చమత్కారములకు పుట్టినిల్లు.

ఈ విషయములో వసుచరిత్రను మించిన గ్రంథము తెలుగులో లేదని చెప్పవచ్చును. సంస్కృతములో కూడ నొకటియో రెండో యున్నవి.

ఈ గ్రంథము వ్రాసిన యాయన పేరు రామరాజభూషణుడు. ఆయన యింకొక పేరు భట్టుమూర్తి.

ఇట్లు రెండు మూడర్థములు వచ్చెడి పద్ధతికి శ్లేష యందురు.

ఈ శ్లేషలో నింత గొప్ప కావ్యము సంస్కృతములో గూడ లేదని దీనిని సంస్కృత భాషలోనికి మార్చుకొనిరి.

ఇట్లనేకార్థములతో పద్యము చెప్పుట యొక గొప్ప. మన యాంధ్ర భాషలోనే మరికొంత మంది యిట్టి గ్రంథములు

వ్రాసిరి. ఆ గ్రంథములకు పిల్ల వసుచరిత్రలు అను పేరు వచ్చినది.

అనగా వసుచరిత్ర దాని కదియే సాటి యని యర్థము."

బ్రాహ్మణుడినని విర్రవీగడం, ఇతర కవుల పై ఈర్ష్యాసూయలు, యితర కులాల కవులను తక్కువగా చూడడం, నిజంగా రామకృష్ణ కవి వ్యక్తిత్వంపై చెరగని మచ్చలే. అయితే ఆనాటి సాంఘిక నేపథ్యాన్నీ, స్థితిగతుల్నీ కూడా మనం అర్థం చేసుకోవాలి.

ఆనాటి బ్రాహ్మణ కవులు ఎవరినైనా సుకవిగా గుర్తించాలంటే తప్పని సరిగా అతడు అగ్రకులజుడు (అంటే బ్రాహ్మణుడు) అయి వుండాలనే నియమం విధించినట్లుంది. 'రాఘవాభ్యుదయం' లో చింతలపల్లి ఛాయాపతి అనే కవి ఏమంటున్నాడో చూడండి -

**శుచియు దక్షుండు శాంతుండు సుజననుతుడు**
**సూనృతోక్తి కళావేది శోభనాంగు**
**డాత్మ దైవజ్ఞుడు కృతజ్ఞుడగ్ర కులజు**
**డతి మధుర వాఙ్మి ఛందస్వి యాతడు సుకవి** (రాఘవాభ్యుదయము 1-41)

శుచి (బాహ్యాశౌచము, అంతరంగ శౌచము కలవాడు), దక్షుడు (సమర్థుడు) శాంతుడు (శాంత స్వభావము కలవాడు), సుజన నుతుడు (మంచివారిచేత పొగడబడే వాడు), సూనృతోక్తి (ప్రియమూ, సత్యమూనైన మాటలాడువాడు), కళావేది (సకల కళా మర్మములెరిగినవాడు), శోభనాంగుడు (సుందరమైన అవయవములు కలిగిన వాడు), ఆత్మ దైవజ్ఞుడు (ఆత్మలో నెలకొన్న దైవాన్ని ఎరిగిన వాడు), కృతజ్ఞుడు (కృతజ్ఞతా భావం కలవాడు), అగ్రకులజుడు (బ్రాహ్మణుడు), అతి మధుర వాఙ్మి (తియ్యని వాక్కు కలిగినవాడు), ఛందస్వి (వేదవిదుడు - ఛందస్సు అంటే వేదము అనే అర్థమూ వుంది: పద్య లక్షణ శాస్త్రజ్ఞానం కలవాడు) - ఈ లక్షణాలన్నీ కలవాడు సుకవి (మంచి కవి).

అగ్ర కులంలో పుట్టని వాడు సుకవి కాలేదని ఆనాడు చాల మంది నమ్మేవారు. ముఖ్యంగా అగ్ర కులం వారే యిది ప్రచారం చేశారు కూడా.

సరిగ్గా యిదే తరహా భావనలను కాకునూరి అప్పకవి తన లక్షణ గ్రంథంలో యిలా చెప్పాడు.

**ధరణీసురుడు ప్రశాంతుడు**
**గురుభక్తుడు శుచియుఁ గల్పకుడు పూర్వకవీ**
**శ్వర వాక్ప్రయోగ దక్షుడుఁ**
**గరుణామతి యెవ్వడతడు కవియనఁ బరగున్** (అప్పకవీయం 1-44)

బ్రాహ్మణుడు, ప్రశాంత చిత్తం కలవాడు, గురుభక్తి కలవాడు, బాహ్యాశౌచము, అంతరంగ శౌచము కలవాడు, కల్పకుడు (కాలపరీక్షకు తట్టుకొని నిల్చిన ప్రమాణాలకూ, నియమాలకూ కట్టుబడేవాడు), సందర్భోచితంగా వాక్యాలను ప్రయోగించడంలో నేర్పరి, కరుణ కలిగినవాడు ఎవడో వాడు మాత్రమే కవి అనబడతాడు. అలా బ్రాహ్మణుడు మాత్రమే మంచి కవి కాగలుగుతాడని ఛాయాపతి అంటే, అప్పకవి యింకొంచెం ముందుకెళ్ళి ఎవరైనా అసలు కవి అనబడాలంటేనే మిగిలిన లక్షణాలు కలిగివుండడంతో పాటు అతడు తప్పనిసరిగా బ్రాహ్మణుడై వుండాలంటున్నాడు.

శూద్రులు చెప్పే కావ్యాలు గ్రాహ్యాలు కావని అప్పకవి యిలా తేల్చి చెప్పాడు-

ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న
నంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబు గాదు
పాయసంబైన సంస్కార పక్వమైనఁ
గాకజుష్టంబు హవ్యంబు గానియట్లు. (అప్పకవీయం 1-26)

ఉపమ గలిగిన - పోల్చదగిన : శయ్య - పద గుంఫనము : అంఘ్రిభవుడు - విష్ణువు పాదాల నుంచి పుట్టిన వాడు - శూద్రుడు : సంస్కార పక్వము - చక్కటి పాకముగా వండబడినది : కాకజుష్టము - కాకిచే ఎంగిలి చేయబడినది : హవ్యము - దేవతలకు పెట్టే నైవేద్యము.

గొప్ప కవులతో పోల్చదగిన పద గుంఫనముతో ఒప్పారుతున్నప్పటికీ, శూద్రుడు వ్రాసినట్టి కావ్యము గ్రహింప దగినది కాదు – మంచి పాకంగా వండిన పాయసమైనా సరే కాకి ముడితే అది దేవతలకు నైవేద్యమివ్వడానికి పనికిరానట్లు.

ఛాయాపతి శూద్రులు చెప్పే ప్రబంధ సద్భాషితములు అనుచితమైనవని ఎంత హేయమైన తీరులో చెప్పాడో చూడండి –

శునకీ దుగ్ధము లేగతి
ననర్హములు వృషలకృతము లట్లనుచితముల్
ఘనగోక్షీరంబులవలె
జను విప్రకృతి ప్రబంధ సద్భాషితముల్. (రాఘవాభ్యుదయము 1-42)

శునకి - ఆడుకుక్క: దుగ్ధము - పాలు: వృషలుడు - శూద్రుడు:

విప్రుడు వ్రాసిన ప్రబంధాలలోని సద్భాషితాలు ఘనమైన ఆవుపాల వంటివి. కుక్కపాలు ఏవిధంగా అనర్హమైనవో శూద్రుడు వ్రాసిన కావ్యములు అలా అనుచితములైనవి.

ఆ కాలపు బ్రాహ్మణ కవుల యీ అహంకార పూరిత ధోరణి, వాగాడంబరము ఎవరికైనా జుగుప్స కలిగించక మానవు. మన రామకృష్ణ కవి కూడా అదే తానులోని గుడ్డే కదా ! ఆయన మటుకు ఈ విషయంలో తన కాలపు తన వారికి భిన్నంగా విచక్షణా జ్ఞానం, సామరస్య భావం కలిగిన ప్రత్యేకమైన వ్యక్తిగా ప్రవర్తిస్తాడని ఎలా ఊహించగలం ?

రామకృష్ణ కవిని ఆనాటి కరడుగట్టిన కుల వివక్షాపూరిత వాతావరణాన్ని అధిగమించ లేకపోయిన ఓ వ్యక్తిగా మనం భావిద్దాం. ఎంతటి మహాకవి అయినా వ్యక్తిగత బలహీనతలు ఉంటాయి.

ఏ కవులకు సంబంధించి అయినా వారి వారి గొప్పతనాన్ని గుర్తించి, గౌరవించే క్రమంలో వారి వ్యక్తిత్వంలోని బలహీనతలు మనకు అడ్డు కారాదు కదా !

అందుకే ఆ మహాకవికి అక్షర నీరాజనాలు సమర్పిస్తున్నాను.

గారలపాటి వంశజుడవౌ నీ
ఊరది యేది యన్న ఘనమౌ తెనాల్యగ్ర
హారము మాదియంటి వద్దానినె గేహపుఁ
బేరనఁ దాల్చి తీవు ధృవకీర్తి నందగా.

పందెము వేసి పల్కెద నిమ్మహిని నీకు సాటిగా
కందము లెస్సగఁ జెప్పుకవిని గానలే
మెందు నెయ్యడన్ సుందర సుమధుర పదముల
డెందము లలరంగ కూర్చు కృష్ణ కవీంద్రా !

ఒద్దిక కృష్ణరాణ్నృపుని పేరిమి కవివై పెంపునందగా
పద్దెము లెన్ని యెన్నొ చతురంబుగ నల్లితి వల్లవోకగా
నెద్దియు సంశయంబు లే దరయంగ నీకు సరిసాటిగ
పద్దెముఁ జెప్పు చతుర కవి వర్యుడీ యిలను లేదు లేదొకో.

పారణపూరణల్ నీకు వెన్నునుఁ బెట్టిన విద్దెగాగ నీ
వేరికిన్ వలనుగాని బహు జటిల సమస్యా
పూరణము లెన్నియొ మారులుం గదు చమ
త్కారము మీరగఁ జేసినావు ఘన యశముఁ గాంచగా

పదగుంఫనమ్మున నీకు నెవ్వరు సాటి
పద్యంపు హరువున నీవె మేటి
కదు రమ్య కావ్యములఁ గన్నట్టి స్రష్టా !
కవి కుల పరపుష్ట రామకిష్టా !

ఓర్చితి వెన్నెన్నొ ఒడిదుడుకులకును నిర్వేదవై నీవు తారుణ్యమునను
కూర్చితి వొక కొన్ని కావ్యమాలికల విబుధజనులు నిన్ను వినుతి సేయంగ
తీర్చితి వెన్నెన్నొ సమాసార్థమ్ముల కదు జటిలమైనను జడియక తృటినె
నేర్చితి వెట నీవు చిత్రమౌ వాక్సరణి సంస్కృతాంధ్రంబులు సహచరింప.

వికట కవి పగతురకు పవి
సమస్యా లోహారరపు సవ్యమౌ చెవి
సాహితీ నభమున సముజ్జ్వల రవి
అర్థ గౌరవమున ఆంధ్ర భారవి.

# అనుబంధము - 1

## తన కావ్యాలలో రామకృష్ణ కవి పేర్కొన్న నదులు

తన కావ్యాలలో రామకృష్ణ కవి వేర్వేరు సందర్భాలలో పలు నదుల పేర్లను ప్రస్తావించాడు. ఆ యా నదులకు సంబంధించిన భౌగోళిక పరమైన విశేషాలను వీలైనంత మేరకు ఆ యా సందర్భాలలోనే వివరించాను. మరికొన్ని ప్రస్తావనార్హమైన విశేషాలను యీ అనుబంధం రూపంలో పాఠకుల ముందుంచుతున్నాను.

**గంగానది** - ఈ నది మానస సరోవరం సమీపంలోని గంగోత్రి వద్ద పుట్టి పశ్చిమబెంగాల్‌లోని గంగాసాగర్ వద్ద బంగాళాఖాతంలో కలుస్తున్నది. ఇదో జీవ నది. భారతీయ సాంస్కృతిక చరిత్ర యీ నదితో పెనవేసుకుపోయింది. గంగ భూమిపైనా, స్వర్గంలోనూ, నరకంలోనూ, ప్రవహిస్తుందని విశ్వాసం. అంచేతనే గంగకు 'త్రిపథగా', 'త్రిశ్రోతా' అనే పేర్లు కూడా వచ్చాయి. ఆకాశంలో నుంచి వచ్చిందని విశ్వాసం కనుక 'ఖాపగా', 'వియద్గంగా', 'స్వర్గంగా' వగైరా పేర్లతో పిలిచారు. స్వర్గంలో పుట్టింది కనుక 'దేవభూతి' అనీ, విష్ణు పాదప్రక్షాళన సందర్భంగా పుట్టింది కనుక, 'విష్ణుపది' అనీ, నిదానంగా ప్రవహిస్తుంది కనుక 'మందాకిని' అనే పేర్లు కూడా గంగకు వచ్చాయి. 'గంగ'కు ఇలా అసంఖ్యాకమైన పేర్లున్నాయి. వాటిలో కొన్నింటి వ్యుత్పత్తిని గురించి లోగడనే చెప్పుకున్నాం.

అన్ని భారతీయ భాషలలోనూ 'గంగ' నీటికి పర్యాయపదమైపోయింది. 'ప్రొద్దుటి నుంచీ పచ్చి గంగైనా ముట్టలేదు' అనే వాడుక మనందరికీ తెలిసినదే ! ఋగ్వేదంలో రెండుసార్లు మాత్రమే పేర్కొనబడినా, పురాణేతిహాసాలలో మాత్రం

గంగ శివుడికి భార్య అనీ, భీష్ముడికి తల్లియనీ, పార్వతికి అక్క అనీ (హిమవంతుడి పెద్ద కుమార్తె అనీ) - యిలా ఎన్నెన్నో ఐతిహ్యాలున్నాయి. వీటిలో కొన్నింటిని ఆ యా సందర్భాలలో విపులంగా వివరించాను.

గంగ హిమాలయ పర్వతాలలోని గౌముఖ్ లేక గంగోత్రిలో పుట్టినప్పుడు దాని పేరు భాగీరథి. కొంత ముందుకు సాగి దేవ ప్రయాగ వద్ద అలకనందా నదితో కలిసి గంగానది అని పిలువబడుతున్నది. గంగ మొదటి సారి మైదాన ప్రాంతంలోకి ప్రవేశించేది హర్‌ద్వార్ వద్ద. ఇదో ప్రముఖ పుణ్యక్షేత్రం. ప్రయాగ (నేటి అలహాబాద్)వద్ద గంగతో యమున సంగమిస్తుంది. ఇక్కడే అంతర్వాహినిగా సరస్వతీ నది కూడా వచ్చి కలుస్తుందని ప్రాచీనుల విశ్వాసం. ఇక్కడ త్రివేణీ సంగమంలో స్నానం చేయడం అతి పవిత్రమని భావిస్తారు. ప్రతి పన్నెండేళ్లకొకసారి యిక్కడ జరిగే కుంభమేళాలో సుమారు కోటి మంది పుణ్య స్నానాలు చేస్తారు. ఘాగ్రా, కోసి, గండక్, గోమతి, సోన్, యమున, వరుణ, అసి వగైరాలన్నీ గంగకు ఉపనదులు*(Tributaries)*. ఇక పశ్చిమ బెంగాల్‌లోని మాల్దా వద్ద రెండు పాయలు *(Distributaries)* గా చీలిన గంగ యొక్క భారత దేశంలోని పాయను హుగ్లీ నది అంటారు. ఇది గంగా సాగర్ వద్ద బంగాళా ఖాతంలో కలుస్తుంది. మరొక పాయ పద్మానది పేరుతో బంగ్లాదేశ్‌లో ప్రవేశించి జమున, మేఘన నదులు దానిలో సంగమించిన అనంతరం దిగువన మరిన్ని పాయలుగా చీలి బంగాళాఖాతంలో కలుస్తుంది. గంగానది సముద్రంలో కలిసే ముందు ఏర్పడిన పాయల మధ్యగల అతి సారవంతమైన డెల్టాలోని అడవులను 'సుందర్ బన్స్' అంటారు. ఇవి విఖ్యాతమైన బెంగాల్ పెద్ద పులుల *(Bengal Tigers)* కు ప్రసిద్ధి. గంగానదిపై హర్‌ద్వార్, ఫరక్కాల వద్ద రెండు డ్యామ్‌లు నిర్మించారు. బీహార్‌లోని పాట్నా వద్ద గంగానదిపై నిర్మించబడిన 'మహాత్మాగాంధీ సేతు' అనే వంతెన (బ్రిడ్జ్) నదులపై నిర్మించబడిన వంతెనలలో ఆసియాలోకెల్లా పెద్దది.

**పెన్నానది** కర్ణాటకలోని నందిదుర్గ పర్వతాలలో పుట్టి ఆంధ్రప్రదేశ్‌లోని నెల్లూరు జిల్లా మోపసు బందరు దగ్గర బంగాళాఖాతంలో కలుస్తున్నది.

**విపాశ** - 'విముక్త పాశం కృతవతీతి విపాశా' అని నిర్వచనం. విశ్వామిత్రుని శాపం కారణంగా ఒకప్పుడు వసిష్ఠుని పుత్రులు మరణించారట. అప్పుడు వసిష్ఠుడు విరక్తితో తన కంఠానికి పాశం చుట్టుకుని దానికి ఒక పెద్ద రాతిని కట్టుకుని యీ నదిలో దూకగా నది అతని పాశములను విప్పి ఒడ్డుకు చేర్చిందట. పాశములను విప్పినది కనుక 'విపాశ' అనబడిందట. తనలో దూకిన వసిష్ఠుని చూచి భయపడి నూరు పాయలుగా చీలిన యీ నదిని 'శతద్రుస్తు' అనీ అంటారు. ఇదే నేటి పంజాబ్ రాష్ట్రంలోని బియాస్ *(Beas)*. ఇది సింధునదికి ఉపనది.

**చంద్రభాగ** - దక్షిణ భారత దేశంలో చంద్రభాగ పర్వతాలలో పుట్టిన నది.

**శరావతి** - కర్నాటక రాష్ట్రంలోని ఒక నది. అయితే శరావతి పేరుతో ఒక నగరం కూడా ఉత్తర భారతదేశంలో వుంది. రాముడు తన కుమారుడైన లవుడిని యీ నగరానికి పాలకుడిగా చేస్తాడు. శరావతి నగరానికీ అదే పేరుతోనున్న నదికీ ఏ సంబంధమూ లేదు. శరమనేది 'కాకి చెరకు' అనబడే ఒక గడ్డిపేరు. దీనిని 'కాకిరెల్లు' అనీ, 'గుంద్రము' అనీ కూడా అంటారు. ఈ నదిలో విస్తారంగా పెరిగే కాకిరెల్లు కారణంగా దీనికాపేరు వచ్చింది.

**వేత్రవతి** - ఉత్తర భారతదేశంలోని ఒక నది. ఇది యిప్పుడు బేత్వా *(Betwa)* అని పిలువబడుతున్నది. వేత్రము అంటే పేము *(cane rattan - Calamus rotang)* ప్రేప తీగలు లేక పేము పొదలతో నిండి యున్నందు వలన యీ నదికి ఆ పేరు వచ్చి వుంటుంది. ఇది యమునా నదికి ఉపనది. మధ్య ప్రదేశ్‌లో పుట్టిన యీ నది ఉత్తర ప్రదేశ్‌లోని హమీర్‌పూర్ సమీపంలో యమునానదిలో కలుస్తుంది.

**బాహుద** - మహాభారత ఐతిహ్యాన్ననుసరించి స్మృతికారులైన శంఖలిఖితులలోని, లిఖితునకు ఖండిత బాహువులనిచ్చిందట యీ నది. అందుకే బాహుద అని పేరు వచ్చిందట. ఇది కార్తవీర్యార్జుననిచే భూమికి తేబడిందట. దీనిలో నీళ్లు తెల్లగా వుంటాయి కనుక దీనిని సైతవాహిని అనీ అంటారట. ఇది శ్రీకాకుళం జిల్లాలో వుంది. శంఖుడనే ఋషి ఆశ్రమంలో అతడు లేనప్పుడు పండ్లు కోసి తినిన అపరాధానికి శంఖుని ఆజ్ఞచేత ప్రద్యుమ్నుడనే రాజు లిఖితుని రెండు చేతులూ నరికిస్తాడట. ఆ తరువాత యీ నదిలో లిఖితుడు స్నానం చేయగా అతని చేతులతనికి యథా పూర్వకంగా వచ్చాయట.

**కృష్ణవేణి** - దీని పూర్వపు నామం కణ్ణ బెణ్ణ. పడమటి కనుమలలో మహాబలేశ్వరంలో పుట్టిన యీ నది ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లాలోని హంసలదీవి వద్ద బంగాళాఖాతంలో కలుస్తున్నది.

**కావేరి** - పడమటి కనుమలలోని సహ్యాద్రి (కవేర పర్వతం)లో పుట్టిన యీ నది తమిళనాడులోని కావేరి పట్టణమ్ దగ్గర సముద్రంలో కలుస్తుంది. ఈ నది కవేరుడను రాజు కూతురని ప్రసిద్ధి.

దీనికి దక్షిణ గంగ అనే మరో పేరుంది. కబిని, భవాని, లోకపావని, అమరావతి దీని ప్రముఖ ఉపనదులు. క్రీ. శ. 3వ శతాబ్దిలో కరికాల చోళుడు యీ నదిపై 'కలవై' అనే ఆనకట్టను నిర్మించాడు. అది ప్రపంచంలోనే ఓ నదిపై నిర్మించబడిన తొలి ఆనకట్టగా ప్రసిద్ధి. అప్పట్లోనే ఆ ఆనకట్ట క్రింద 69,000 ఎకరాలు సాగయ్యేవట. 1902 లో కర్ణాటకలోని శివ సముద్రం వద్ద కావేరి నదిపై భారత దేశంలోని మొదటి జలవిద్యుత్కేంద్రం నిర్మించబడింది. అక్కడ ఉత్పత్తైన విద్యుచ్ఛక్తితో ఆసియాలోనే మొదటిగా బెంగళూరు నగరంలో వీధి దీపాలు వెలిగించారు.

దీని తీరంలో ఎన్నో పుణ్య క్షేత్రాలు, పర్యాటక స్థలాలు వున్నాయి. కర్ణాటకలోని శ్రీరంగ పట్నం, శివ సముద్రం, తమిళనాడులోని శ్రీరంగం (తిరుచ్చిరాపల్లి) రంగనాథ స్వామి ఆలయాలకు ప్రసిద్ధి. ఇంకా కర్ణాటకలోని గోగర్భం, సోమనాథపుర, తలక్కాడ్ యితర పుణ్య క్షేత్రాలు. ఇక కర్ణాటకలోని శివ సముద్ర జలపాతం, హొగెనకల్ జలపాతం పర్యాటక కేంద్రాలుగా విపరీతంగా జనాలను ఆకట్టుకుంటాయి. తమిళనాడులోని మెట్టూరు డ్యామ్, చిదంబరం, తంజావూరు, కుంభకోణం నిత్యం పర్యాటకులతో రద్దీగా వుంటాయి. ఈ నది కర్ణాటక నుంచి తమిళనాడు భూభాగంలోకి కొండల మధ్యనుంచి సన్నని మార్గం ద్వారా ప్రవేశిస్తుందట. అది ఎంత సన్నని మార్గమంటే, అక్కడ యీ నదిపై ఓ మేక కూడా అటునుంచి యిటు దూకగలదట. అంచేతనే ఆ సన్నని మార్గాన్ని కన్నడంలో 'మేకె దాటు' అంటారు. ఇక హొగెనకల్ వద్ద కావేరి నది 22 మీటర్ల ఎత్తు నుండి పడి ఏర్పడిన జలపాతం అత్యంత సుందరమైనది. ఇక్కడ ఏర్పడిన నీటి తుంపర పొగమంచులాగా తయారై దూరాన్నుంచి చూసే వారికి 'ఆ కొండ పొగ త్రాగుతున్నదా ?' అన్నట్లుంటుందట. అందుకే దానికా పేరు. 'హొగెనకల్' అంటే కన్నడ భాషలో 'పొగత్రాగే కొండ' అని అర్థం. ఈ నదిపై తమిళనాడులో నిర్మించబడిన మెట్టూరు డ్యాం రిజర్వాయిర్‌కు అతి పెద్ద మానవ నిర్మిత సరస్సుగా పేరుంది. ఈ నదిపైనే నిర్మింపబడిన కర్ణాటకలోని కృష్ణరాజ సాగర్ డ్యాం రిజర్వాయిర్ సమీపంలో అతి సుందరమైన 'బృందావన గార్డెన్స్' అనే పూల తోటలు వెలిశాయి. బెంగళూరు - మైసూర్‌ల మధ్యనున్న యీ పూల తోటలు పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తాయి.

**కపిశ** - కపిశ వర్ణమంటే గోధుమ వన్నెగల ముదురు ఎరుపురంగు. ఆ నది నీటి రంగునుబట్టి దానికాపేరు వచ్చి వుండొచ్చు. లేక 'కపిశ' అంటే ఓ విధమైన బాణం పేరు. ఆ బాణంలా శరవేగంతో దూసుకు పోవడం కారణంగా కూడా దానికాపేరు వచ్చి వుండొచ్చు. వసంత కాలంలో పుష్పించే తెల్లని సుగంధ పుష్పలతయైన మాధవీలతను కూడా

'కపిశ' అంటారు. తులసికి కూడా 'కపిశ' అనే మరో పేరుంది. ఈ మొక్కలను బట్టి కూడా ఆ నదికాపేరు వచ్చి వుంటుందేమో! ఉత్కళ (నేటి ఒరిస్సా) దేశంలోని యీ నదిని ప్రస్తుతం 'సువర్ణ రేఖ' అని పిలుస్తున్నారు.

**వంజిర (మంజిర)** - మహారాష్ట్రలోని బాలాఘాట్ కొండలలోపుట్టి గోదావరిలో కలిసే నది.

**భవనాశని (నేటి సర్యూ లేక సరయూ నది)** - కోసల రాజ్య రాజధాని అయోధ్యకు దక్షిణంగా వున్న నది. రాముడు వనవాసానికి బయలుదేరినప్పుడు గుహుడు సీతా రామ లక్ష్మణుల్ని తన పడవలో యీ నదిని దాటిస్తాడు.

**తుంగభద్ర** - ఈ నది గురించిన చాల వివరాలు యిదే గ్రంథంలో పలు సందర్భాలలో పేర్కొన్నాను.

**గౌతమి (గోదావరి)** - మహారాష్ట్రలోని నాసిక్ వద్ద త్ర్యంబకేశ్వర్ వద్ద పుట్టిన నది యిది. (గంగ నుంచి) గౌతముడు దీన్ని తెచ్చాడు కనుక దీనిని 'గౌతమి' అనీ అంటున్నారు. గౌతమ ఋషికి ఒక వరం కారణంగా కరవు రోజులలో కూడా చక్కటి పంటలు పండేవట. ఇది చూసి ఓర్వలేని మునులు కొందరు ఒక మాయ గోవును సృష్టించి అది గౌతముని పొలాలలో మేస్తున్నదని గౌతమునికి తెలిపారు. గౌతముడు కోపంతో దాని మీద మంత్రించిన నీళ్లు చల్లగానే అది మరణిస్తుంది. గోహత్య మహాపాతకమనీ, ఆ పాప ప్రక్షాళన కొరకు అక్కడికి గంగను తేవాలనీ ఆ మునులు చెప్పగా గౌతముడు శివుడిని గూర్చి తపస్సు చేసి శివుని మెప్పించి ఆయన కపర్దం (జటాజూటం)లోని ఒక జడను తెచ్చుకొని దానిని మరణించిన ఆ గోవుపై ధారగా పిండుతాడట. ఆ గోవు వెంటనే బ్రతుకుతుందట. అలా పిండబడిన జలధారయే గోదావరి నది అయిందట. గౌతమ మహర్షిచే తీసుకుని రాబడిన నది కనుక దీనిని 'గౌతమి' అనీ అంటారు.

ఈ నది తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రి వద్ద మైదాన ప్రవేశం చేసి మరింత దిగువన సప్తగోదావరులు అనే ఏడుపాయలుగా చీలి సముద్రంలో కలుస్తుంది. గోదావరి యొక్క యీ ఏడు పాయలు *(Distributaries)* సప్తర్షుల పేర్లు కలిగి వుండడం విశేషం. అవి - కశ్యప (తుల్యభాగ), అత్రి (కోరంగి), గౌతమి, భరద్వాజ, విశ్వామిత్ర, (కౌశికి), జమదగ్ని, వసిష్ఠ. ఈ పాయల మధ్య ఏర్పడిన గోదావరి డెల్టా అత్యంత సారవంతమైనట్టిది. ఈ పాయలలో వసిష్ఠ గోదావరి పడమటి కొసన పశ్చిమ గోదావరి జిల్లా భూభాగాన్ని ఒరుసుకుంటూ ప్రవహిస్తుంది. తూర్పు దిక్కు కొసన గౌతమి గోదావరి పాయ ప్రవహిస్తూండగా మిగిలిన పాయలు ఆ రెంటి మధ్యన ప్రవహించి బంగాళా ఖాతంలో కలుస్తాయి.

**రవిజ** - యమునా నది. యముడు, యమున (జమున) యిద్దరూ సూర్యుని సంతానమట. అందుకే యమునా నదిని 'రవిజ' అని కూడా అంటారు. ఇది గంగా నదికి ఉపనది. ప్రయాగ (ఉత్తరప్రదేశ్‌లోని నేటి అలహాబాద్)లో యిది గంగానదిలో సంగమిస్తుంది.

యమునా నదిని గురించిన కొన్ని విశేషాలు మనం 'పాండురంగ మాహాత్మ్యము' 1-139 పద్యం వివరణలో తెలుసుకున్నాం.

ఈ నది మొదట్లో ఘగ్గర్ అనే నదికి ఉపనది. ఈ ఘగ్గర్ నదినే కొందరు సరస్వతీ నది అనికూడా అంటారు. ఒకప్పుడు జరిగిన ఓ ప్రకృతి వైపరీత్యం కారణంగా సరస్వతీ నది ఎడారి వైపుకు దారిమళ్లి ఎడారిలో యింకి అదృశ్యమైపోయిందని భౌగోళికుల విశ్వాసం. భూభ్రమణంలో భాగంగా భూమి లోపలి ఫలకాలు కదలడం వల్ల అంతకుముందు సరస్వతిలో సంగమిస్తున్న యమునానది దిశమారి, తూర్పు దిక్కుగా సాగి నాటినుండి గంగకు ఉపనదిగా మారింది.

ఋగ్వేదంలో సరస్వతి 'హిమాలయాల నుండి సముద్రంలో కలిసే వరకు పవిత్రంగా ప్రవహించే నది'గా పేర్కొనబడింది. మహాభారతంలోని ఓ ఐతిహ్యం ప్రకారం అంగిరసుని వంశానికి చెందిన వాడు, బృహస్పతికి అన్న అయిన

ఉతథ్యుడనే ఋషి భార్య భద్ర అందాన్ని చూసి మోహించిన వరుణుడు ఆమెను ఎత్తుకొని పోగా ఉతథ్యుడు కోపంతో సరస్వతీ నదిని యింకిపొమ్మని శపించాడట. ఈ నది ఆర్యుల తొట్టతొలి నివాస స్థలమైన బ్రహ్మావర్తమునకు ఒక సరిహద్దుగా ప్రవహించేదట. ఒకప్పుడు ఆ దేశంలో తీవ్రమైన దుర్భిక్షమేర్పడి ఆహారధాన్యాలకు కరవు వచ్చిందట. అప్పుడు ఆకలికి అలమటిస్తున్న ఎందరో బ్రాహ్మణులు తమ వేద విద్యా వ్యాసంగాలను కొనసాగించలేని పరిస్థితి వచ్చి వివిధ యితర వృత్తులు చేపట్టారట. అప్పుడు సారస్వత బ్రాహ్మణులనే పేరుతో అరవైవేల మంది సరస్వతీ నదిలోని చేపలు తిని ఆకలి బాధ తీర్చుకుంటూ, తమ వేద విద్యా ప్రావీణ్యాన్ని నిలబెట్టుకోగలిగారట. పంజాబ్, తదితర ప్రాంతాలలో మనకు కనుపించే యీ సారస్వత బ్రాహ్మణులు నేటికీ చేపలు అతి యిష్టంగా తింటారు. వారి వారసులే అయిన ఆంధ్ర ప్రాంతంలోని 'సారస్వతుల' అనే యింటిపేరు కల వైదిక బ్రాహ్మణులు మాత్రం శాకాహారులే !

**మలాపహారి (మలప్రభ)** -ఇది కృష్ణా నదికి ఉప నది.

**భిమరథి (భైమీ నది)** - ఇది కూడా కృష్ణా నదికి ఉప నది. ఇది మహారాష్ట్రలోని పూనా జిల్లాలోని భీమ శంకర వద్ద పుట్టి కర్ణాటకలోని రాయచూరు సమీపంలో కృష్ణా నదిలో కలుస్తుంది. దీన్ని గురించిన వివరాలు 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యంపై వ్రాసిన వ్యాఖ్యలో చూడవచ్చు.



కవి ఉపాసన చేసిన రామేశ్వరాలయంలోని
అతి పురాతన కాళికాదేవి విగ్రహం

# అనుబంధము - ౨

## వైఖానసులు

వైఖానసులు ఆది వైష్ణవులు. తెనాలి రామకృష్ణుడు వడకలై (వైఖానస) శాఖ వైష్ణవం స్వీకరించాడనేది మనమెరిగిన సత్యమే ! తెన్‌కలై (తెంగల) వైష్ణవ గురువైన శ్రీమాన్ తాతాచార్యుల వారిపై వ్యతిరేకతతో మొదట అవసరార్థమే వైఖానసం స్వీకరించినప్పటికీ, తన గురువైన భట్టరు చిక్కాచార్యుల వారి ప్రభావంతో వైఖానసాగమాన్ని, వారి సంప్రదాయాలను, ఆచార వ్యవహారాలను రామకృష్ణుడు లోతుగానే అధ్యయనం చేసినట్లు కనుపిస్తుంది. ఆయన రచించిన 'పాండురంగ మాహాత్మ్యము', 'ఘటికాచల మాహాత్మ్యము' లలోని కొన్ని వర్ణనలే యిందుకు నిదర్శనాలు. వైఖానస ఆర్చనా పద్ధతులను ఆయన ఆ కావ్యాలలో కదు విపులంగా వర్ణించడమే కాక, జన్మరీత్యా వైఖానసుడు కాకున్నప్పటికీ, తన వైఖానస పక్షపాతాన్ని ఎన్నో సందర్భాలలో బయల్పరచాడు రామకృష్ణ కవి.

ఇటీవలి కాలంలో వైఖానసుల గురించీ, వైఖానస ఆగమాన్ని గురించీ వార్తా పత్రికలలో మనం తరచుగా వార్తలు చూస్తున్నాం. తిరుమలలోని శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానంలో నేటికీ వైఖానసులే వైఖానస ఆగమం ప్రకారం అర్చన చేస్తారు. అయితే కాలక్రమేణా వైఖానస ఆగమం ప్రకారం సక్రమంగా చేయాల్సిన పూజాదికాల నిర్వహణలో యితరుల జోక్యం రోజురోజుకూ మితిమీరుతున్నదనీ, వైఖానస ధర్మ పరిరక్షణ పేరుతోనే కొందరు దాని వినాశనానికి ప్రయత్నాలు చేస్తున్నారనీ వైఖానసులలోని కొందరు భావిస్తున్నారు. తిరుమలలోని వేయికాళ్ల మండపం కూటగొట్టడం, మహాప్రాకారాన్ని నిర్మించబూనడం వైఖానస ఆగమ శాస్త్ర విరుద్ధమని శ్రీ వైష్ణవ శాఖకు చెందిన శ్రీ త్రిదండి రామానుజ చిన్న

జీయర్ స్వామి వాదిస్తూండగా యింకొందరు దీన్ని ఖండిస్తూ ప్రభుత్వ చర్యను సమర్ధిస్తున్నారు. ఈ వివాదాలనటుంచి, ఇటీవల చర్చనీయాంశంగా మారిన ఆది వైష్ణవులైన వైఖానసుల చరిత్ర ఏమిటో, వారి ఆగమం యొక్క ప్రాశస్త్యమేమిటో పాఠకులకు తెలిపే ఉద్దేశ్యంతో తత్సంబంధిత విషయాలపై ముఖ్యంగా వైఖానసుల పుట్టుక గురించిన సిద్ధాంతాలూ, వారి ఆచార వ్యవహారాలూ, వైఖానస ఆగమం, వైఖానస సరస్సు (బైకాల్ సరస్సు) వగైరా అంశాలపై గత కొన్నేళ్లుగా నేను పరిశోధించి నిగ్గుతేల్చిన సత్యాలను యిలా ప్రత్యేకానుబంధంగా మీకందిస్తున్నాను.

'పాండురంగ మాహాత్మ్యము'లో వైఖానసుల నుద్దేశించి ఆదిమ వైష్ణవోత్తములు (పాం. మా. 5-321) వగైరా పదాలను ప్రయోగించిన తెనాలి రామకృష్ణ కవి తన మూడాశ్వాసాల 'ఘటికాచల మాహాత్మ్యము' కావ్యములోని మూడవ ఆశ్వాసము మొత్తాన్నీ వైఖానసుల గురించి వివరించడానికే కేటాయించాడు. వైఖానసులు వసుధామరాగ్ర్యులనీ (వసుధామరులలో అంటే భూసురులైనట్టి బ్రాహ్మణులలో శ్రేష్ఠులనీ) వారు అజుడు (బ్రహ్మ) పంపిస్తే ఘటికాచలానికి వచ్చి అక్కడి నరసింహునికి వివిధ పుష్పాలతో పూజలు చేశారనీ, స్వస్తికాసనములలో వరుసగా నిలిచారనీ, బాహ్య, అంతరంగ శౌచాల్ని పాటిస్తూ ప్రాణాయామ సాధనతో, అంతరంగాన్ని ఏకాగ్రంచేసి నియమంగా మానసపూజ చేస్తూ, ఆవాహన, ఆసన, అర్ఘ్యాది విధులు, గంధ, సుమ, ధూప, దీపాదికములు, మధుర నైవేద్య, వీటీ (తాంబూల) సమర్పణలతో పూజలు చేశారనీ వర్ణించాడు. 'వైఖానసులంటే ఎవరు?' అని భృగువు ప్రశ్నిస్తే, " నిరుక్తమనే వేదాంగములో చెప్పబడిన కథ ప్రకారం - ఒకప్పుడు అంబుధీశ్వరుడు (వరుణుడు) చేసిన యజ్ఞానికి వచ్చిన బ్రహ్మకు జలదద అనే అప్సరసను చూసి వీర్యపతనం కాగా, దానిని ఆయన మోదుగ ఆకులతో చేసిన ఒక దొప్పలో నింపి అగ్నిలో పోయగా దానినుంచి అర్చి, భృగుడు, అంగిరసుడు, అత్రి, విఖనసుడు పుట్టుకొచ్చారనీ, ఆ విఖనసుని అన్వయము (కులం)లోని వారంతా వేదశాస్త్రార్థ నిరతులనీ, ఆ విప్రవర్యులు (బ్రాహ్మణ శ్రేష్ఠులు) అఖిలమంత్ర తంత్రాల అర్థాల రహస్యాలన్నీ ఎరిగినవారనీ, పంచవిధములైన బేరార్చన (విగ్రహార్చన)లో నిపుణుల"నీ పేర్కొన్నాడు నారదుడు ఆ కావ్యంలో. విఖనసుని సంతతియే వైఖానసులపేర ప్రసిద్ధులయ్యారు.

మన ప్రాచీన సాహిత్యంలో - కృష్ణయజుర్వేదంలోని 'అరుణం'లో 'వైఖానస' శబ్దం మొదటగా ప్రస్తావించబడింది. ప్రజాపతి యొక్క కామానంతరమందలి సృష్టి యిలా వివరించబడింది.

"స తపో ఽ తప్యత । సతపస్తప్త్వా । శరీర మధూనుత । తస్య యన్మాంస మాసీత్ । తతో ఽ రుణాః కేతవో వాతరశనా ఋషయ ఉదతిష్ఠన్ । యే నఖాః । తే వైఖానసాః । యే వాలాః । తే వాలఖిల్యాః । యో రసః । సో ఽ పాం।"

తాత్పర్యము : ప్రజాపతి సృష్టిని చేయ నిశ్చయించి తపించిన తన శరీరాన్ని కంపింపజేయగా కంపమానమైన ఆ శరీరపు మాంసాన్నుంచి అరుణులు (ఎర్రనివారు; పరాశరుడు యీ శాఖవాడే), కేతువులు (మరుగుజ్జులు), వాతరశనులు (గాలినే ఆహారంగా తీసుకునేవారు) అనే ఋషులు ఉత్పన్నమయ్యారు.

ఆ ప్రజాపతి తప్త శరీరపు నఖముల (గోళ్ల) నుండి వైఖానసులనే ఋషులు ఉద్భవించారు.

ఆ తప్త శరీరపు సూక్ష్మరోమముల (వాల; బాల) నుండి వాలఖిల్యులనే ఋషులేర్పడ్డారు. (ఋగ్వేదంలో 'వాలఖిల్యం' అనే పేరుతో 11 మంత్రాల సంకలనముంది. రామాయణంలోని ఐతిహ్యం ప్రకారం అంగుష్ఠమాత్రులైన - బొటన వ్రేలి పరిమాణంకల - వీరి సంఖ్య అరవై వేలట. వీరు సూర్య రథానికి ముందుండి నడుస్తారట). ప్రజాపతి తప్త శరీరాన్నుంచి గళితమైన (జారిన) రసమే కూర్మ రూపమైంది.

'న', 'ఖ' వర్ణములకు ప్రాతిలోమ్యమై 'ఖన', 'విఖన' శబ్దాలేర్పడ్డాయని ప్రసిద్ధ వేదపండితులు ఉప్పులూరి గణపతి శాస్త్రి గారు తమ 'వేద సార రత్నావళి' (పేజీ 422)లో పేర్కొన్నారు. అయితే ప్రజాపతి నఖముల (గోళ్ల) నుంచి ఋషులు

పుట్టుకు రావడం నమ్మశక్యం కాదు. ఏమైనా అరుణంలో పేర్కొనబడిన ఋషులంతా చాల ప్రసిద్ధులు. శాస్త్రీయంగా ఆలోచిస్తే అరుణులు అంటే ఎర్రని మేనిచాయ కలవారు, కేతువులు అంటే మరుగుజ్జులు అనే మనం అర్థం చేసుకోవాలి. గాలి భోంచేసి జీవించడం మానవులకు అసాధ్యం కనుక వాతరశనులు అంటే శుష్క శరీరం కలవారు (వాతం శుష్కం రశనా శరీరం యేషాం తే వాతరశనాః) గానే మనం భావించాలి. బొటన వ్రేలి ప్రమాణంలో మనుష్యులుండడం సాధ్యం కాదు కనుక వాలఖిల్యులనే ఆ ఋషులు ముందు చెప్పబడ్డ కేతువుల కంటే కూడా మరుగుజ్జులై వుండవచ్చునని అర్థం చేసుకోవాలి. అలాగే వారి పేరు విషయానికొస్తే వాల (సూక్ష్మ రోమముల విషయంలో) ఖిల్యాః (ఎడారి వంటివారు) - అంటే 'శరీరంపై వెంట్రుకలు లేనివారు' అనే మనం అర్థం చేసుకోవాలని నా అభిప్రాయం.

పైన తెల్పిన ప్రముఖ ఋషులంతా ఎలాగైతే ప్రజాపతి తప్త శరీరంలోని వివిధ భాగాలనుంచి ఉత్పన్నమయ్యారనడం అశాస్త్రీయమో, అలాగే ప్రజాపతి గోళ్లనుంచి వైఖానసులు ఉద్భవించారనడం కూడా విజ్ఞాన శాస్త్ర సమ్మతం కాదు. 'విఖ' అంటే సంస్కృతంలో 'ముక్కులేని' (*nose-less*) అని అర్థం. 'విఖనస' అన్నా అదే అర్థం. 'నస్' అంటే ముక్కు (నాసిక యొక్క రూపాంతరం) (*Crooked, Curved or Bent Nose*). దీనినిబట్టి 'విఖనస' అంటే చిన్నముక్కు కలవాడు (నస్ - క్షుద్ర లేక చప్పిడి ముక్కువాడు) అనే అర్థం చేసుకోవాలని నా అభిప్రాయం.

శాస్త్రీయ దృష్టితో ఆలోచించేటప్పుడు మనం రాగద్వేషాల కతీతంగా ఉండాలి. సాధ్యాసాధ్యాలనే పరిశీలించాలి కాని, పుక్కిటి కథలను విశ్వసించకూడదు. ఉదాహరణకు తైత్తిరీయ సంహిత (కృష్ణ యజుర్వేద సంహిత)ను వైశంపాయనుడు తన మేనల్లుడూ, శిష్యుడూ అయిన యాజ్ఞవల్క్యునికి బోధించిన పిదప, ఏదో కారణంగా శిష్యునిపై కోపించిన వైశంపాయనుడు తిరిగి తన ఉపదేశాన్నంతా వెనక్కి యిచ్చెయ్యమని శిష్యుడిని కోరితే, ఆ ఋషి అదంతా కక్కివేయగా ఒక తైత్తిర లేక తిత్తిరి పక్షి (*Partridge*) ఆ వమథువును తిని, ఆ తరువాత కొందరు ఋషులకు దానిని ఉపదేశించింది కనుక కృష్ణయజుర్వేద సంహితను తైత్తిరీయ సంహిత అంటున్నారని కొందరు విశ్వసిస్తున్నారు. అలా నమ్మే ప్రబుద్ధులు - వేదోపదేశాన్ని ఆహారం వలె వమథువుగా కక్కడం సాధ్యమేనా? దానిని తిన్న తైత్తిర పక్షి దాన్ని ఋషులకు బోధించడమేమిటి? అని కనీసం కాస్తన్నా ఆలోచించరు. వాస్తవమేమై వుంటుందో యింగితంతో గ్రహిద్దామని యత్నించరు. వాస్తవమేమంటే తైత్తిరి అనే పేరుతో ఒక ఋషి వున్నాడు. ఆయన వైశంపాయనుని అన్న. ఆయన బోధించినదైనందున కృష్ణయజుర్వేదానికి 'తైత్తిరీయ సంహిత' అనే పేరు వచ్చింది కానీ తిత్తిరి పక్షికీ, ఆ వేద సంహితకూ ఎలాంటి సంబంధమూ లేదు. భారతీయ షడ్దర్శనాలలోనిదైన వైశేషిక దర్శనాన్ని మనకందించిన కణాదుడు గుడ్లగూబ వంటి ముఖం కలిగి వున్న కారణంగా ఆయనకు ఉలూకుడని మరో పేరుండడం, వైశేషిక దర్శనాన్ని ఆయన పేరుతో 'ఔలూక్య దర్శనం' అని కూడా పిలుస్తూండడం మనమెరిగిందే. ఈ తైత్తిరి ఋషికి కూడా తైత్తిర లేక తిత్తిరి పక్షి పోలికలుండడాన్ని బట్టి ఆ పేరు వచ్చి వుంటుందని మనం అర్థం చేసుకోవాల్సి వుంటుంది.

అరుణంలో చెప్పబడినట్లు విఖనసుడు ప్రజాపతి గోళ్లనుంచి పుట్టాడా, లేక రామకృష్ణకవి చెప్పినట్లు బ్రహ్మ వీర్యం అగ్నిలో వేస్తే పుట్టాడా, లేక అతడు విష్ణు మానస పుత్రుడా? అయితే వైఖానసులు విశ్వసిస్తున్నట్లు విఖనసుడు పద్మాసన బ్రహ్మ కంటే ముందరి విష్ణుమానస పుత్రుడా – కాదా? ఈ శుష్క ప్రశ్నలపై తర్కం అనవసరమని నా అభిప్రాయం. ఒకటి మాత్రం స్పష్టం. వైఖానసులు వేదాల్లోనే ప్రస్తావించబడిన ఋషులు కనుక వారి ప్రాచీనత నిస్సందేహమైనది. కృష్ణయజుర్వేద కాలంనాటికే (షుమారుగా క్రీ.పూ. 1500–1000) వైఖానసులు ఋషులుగా ప్రసిద్ధులై వున్నారన్నమాట.

ఇక 'విఖనస' అనే శబ్దంనుంచి 'వైఖానస' శబ్దం ఆవిర్భవించిందా? లేక 'విఖనస' – వైఖానస' రెండూ వేర్వేరు శబ్దాలా? అని కూడా మనం యోచించాలి. విఖనసుడనే ముని బ్రహ్మకంటే ముందు విష్ణువుచేత మానసపుత్రునిగా సృష్టించబడిన వాడని వైఖానసుల విశ్వాసం. తన అర్చనను సక్రమంగా సాగించే విధానాన్ని ప్రజలకు బోధించడానికే విష్ణువు విఖనసమునిని సృష్టించాడట. అయితే మహాభారతంలోని శాంతిపర్వం బ్రహ్మను కూడా 'విఖనస' అనే పేర్కొంటుంది.

ఇంకా విష్ణు సహస్రనామాలలో 'విఖనస' కూడా ఒకటి! భగవద్గీతలోని 'విభూతి యోగం'లో కృష్ణుడు మునులలో తాను కపిలుడననీ, గుర్రములలో ఉచ్చైశ్రవముననీ ఇలా సృష్టిలోని ఉత్తమోత్తమమైనవన్నీ తానేనని చెప్పుకుంటాడు. అదే విధంగా విఖనసుడు ఋషులలో ప్రసిద్ధిగాంచిన అనంతరం బ్రహ్మకు, విష్ణువుకు కూడా 'విఖనస' అనే పర్యాయ నామం వచ్చివుండొచ్చు.

తామంతా విఖనసుని వారసులమేనని వైఖానసుల విశ్వాసం. "వినత సంతానం వైనతేయులు అనబడినట్లు విఖనస సంతానం 'విఖనసేయులు' అనబడాలి కాని వైఖానసులెలా అయ్యారు? కనుక 'విఖనస', 'వైఖానస' శబ్దాలు రెండూ వేరు. వైఖానసులు విఖనసుని వారసులు కారు" - అనేది కొందరి వాదన. కాని యిది సరికాదని నా అభిప్రాయం. 'ఉదుంబర' శబ్దాన్నుంచి 'ఔదుంబర' వచ్చినట్లు; 'ఉలూఖల' శబ్దాన్నుంచి 'ఔలూఖల' శబ్దం వచ్చినట్లు; 'అంగిరస' శబ్దాన్నుంచి 'ఆంగిరస' శబ్దం వచ్చినట్లుగా 'విఖనస' శబ్దాన్నుంచే 'వైఖనస' శబ్దం పుట్టి అదే క్రమంగా 'వైఖానస'గా రూపొంది వుంటుంది. కనుక విఖనసుడనే ముని వైఖానసులకు మూలపురుషుడనేది నిర్వివాదాంశ మనిపిస్తున్నది. అయనే శ్రీ సూత్రము లేక వైఖానస కల్పసూత్రానికి కర్త.

విఖనసుడు నవబ్రహ్మలని పిలువబడే భృగువు, అంగిరసుడు, మరీచి, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు, దక్షుడు అనే తొమ్మిదిమంది ఋషులకు గురువట. అయితే అత్రి, భృగు, మరీచి, కశ్యపులు నల్గురూ ఆయనకు ప్రధాన శిష్యులట. భృగువు విఖనసుడికి ప్రధాన శిష్యుడైతే తెనాలి రామకృష్ణుని "ఘటికాచల మాహాత్మ్యము' కావ్యంలో భృగువే నారదుడిని 'వైఖానసులంటే ఎవరు? పంచబేరార్చన అంటే ఏమిటో వివరంగా తెలపమ'ని కోరడం వింతగా లేదూ? అయితే అలా ప్రశ్నించిన భృగువు విఖనసముని ప్రధాన శిష్యుడైన భృగువు కుటుంబంలో ఆ తరువాత చాల కాలానికి జన్మించిన వేరొక భృగువు అయి వుంటాడనుకోవడం కూడా అంతగా నప్పడంలేదు. ఎందుకంటే ఆదివైష్ణవుల మూల పురుషుడైన విఖనసుడికి ప్రథమ శిష్యుడైన భృగువు కుటుంబీకునికి (అతడు తప్పనిసరిగా జన్మతో వైఖానసుడై వుండి) వైఖానసులంటే ఎవరో తెలియకపోవడమూ వింతే ! ఆ కావ్యాన్ని వ్రాసిన రామకృష్ణకవి తన కథనంలో వైఖానసులెవరని నారదుడిని ప్రశ్నించడానికి భృగువు పాత్ర నెంచుకోవడమే ఏమీ బాగుండలేదు. కవికి వైఖానసుల గురించిన పరిజ్ఞానం అంతగా లేకపోవడం వలన యిది జరిగి వుంటుందా? అలానూ అనుకోలేం. రామకృష్ణకవికి వైఖానసుల గురించి పరిజ్ఞానంలో లోపమేమీలేదు. ఆయన గురువైన భట్టరు చిక్కాచార్యులు వైఖానసుడే. ఆయన మీది అభిమానంతోనే 'ఆదివైష్ణవ', 'శుద్ధవైష్ణవ', 'ఆగర్భ వైష్ణవ', 'జన్మ వైష్ణవ', 'గర్భ వైష్ణవత్వం' వగైరా వైఖానసులకు సంబంధించిన పదాలను 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యంలోకూడా పలు సందర్భాలలో ప్రయోగించాడు కవి. శ్రీ వైష్ణవులు జన్మతో వైష్ణవులు కాదు. కనుకనే వారు తప్త చక్రాంకనము చేయబడిన పిదప వైష్ణవులుగా మారుతున్నారు. అంటే వైష్ణవమత స్వీకరణకు గుర్తుగా కాల్చిన శంఖు-చక్ర ముద్రలను శరీరంపై వేసుకొని వైష్ణవులుగా మారుతున్నారు. వైఖానసులు జన్మ వైష్ణవులు, ఆగర్భ వైష్ణవులు కనుక వారికా అవసరం లేదట. శ్రీసూత్రంలో చెప్పబడిన దాని ప్రకారం వారు శిశువు తల్లి గర్భంలో వుండగానే తప్త చక్రాంకనం చేసిన పాయసాన్ని ఆ గర్భిణికి పెడతారట. దానితో గర్భస్థ శిశువు వైష్ణవుడైనట్లే. ఆ పాయస భక్షణం చేతనే గర్భస్థ శిశువుకు అంకన సంస్కారం లభిస్తుందట. దీనినే 'విష్ణుబలి' అంటారు. కనుక వైఖానసులు పుట్టుకకు ముందే వైష్ణవులట.

# వైఖానసాగమం

విఖనసముని సూత్రకారుడు. ఆయన అష్టాదశ (18) కల్పసూత్రముల లోనిదైన వైఖానస కల్పసూత్ర కర్త ఆయన యితర మునులవలె కాక, శంఖచక్రములు, చతుర్భుజములు, ఊర్ధ్వ పుండ్రములు (పంగనామాలు), వనమాల, కిరీట హారాభరణాదులు కలిగి వుంటాడట. ఇవన్నీ భగవంతుడి లక్షణాలు. మరి ఆయన విష్ణు మానసపుత్రుడనే కదా విశ్వాసం! ఇంకా ఆయన కాషాయవస్త్రాలు, కుండలములు, బ్రహ్మసూత్రము, త్రిదండ శృంఖలాంగుళీయక హారముతో విరాజిల్లుతాడట. ఇవన్నీ ముని లక్షణాలు. ఏది ఏమైనప్పటికీ మనం విఖనసుడొక అతి ప్రాచీన ఋషి అనీ, ఆయన పేరును బట్టి ఆయన చిన్నముక్కు కలవాడనీ మాత్రమే విశ్వసించవచ్చు.

కృష్ణ యజుర్వేదాన్ని అనుసరించి ఆయన మొత్తం 32 ప్రశ్నలతో, 1 కోటి 50 లక్షల ప్రమాణాలతో కల్పసూత్రాలను చెప్పాడట. దీనినే 'శ్రీ శాస్త్రము' లేక 'భగవచ్ఛాస్త్రము' లేక 'వైఖానస కల్ప సూత్రము' అంటారు. ఆయన శిష్యులు వీటిని సంక్షేపించి, 4 లక్షలకు కుదించి, 'ఆనంద సంహిత', 'క్రియాధికారము', 'ఖిలాధికారము', 'వాసాధికారము', 'ప్రకీర్ణాధికారము', 'సమూర్తార్చనాధికారము', 'జ్ఞానకాండ' వగైరా గ్రంధాలుగా సంకలనం చేశారట. ఈ సమస్తాన్నీ 'వైఖానసాగమం' అంటారు దీనిలో పంచబేరార్చన, షట్కాలార్చన వగైరా అర్చనా పద్ధతులు సవిస్తరంగా వివరించబడ్డాయి. పంచబేరార్చన అంటే అయిదు రకములైన దేవతా విగ్రహములను అర్చించడం. షట్కాలార్చన అంటే ప్రత్యూష, ప్రభాత, మధ్యాహ్న, అపరాహ్న, సాయం, నిశీధి కాలాలలో చేసే అర్చన.

వైఖానస కల్ప సూత్రాన్ని 'దేవయజన' సూత్రమనీ అంటారు. దానిని ఔఖేయ సూత్రమనీ అంటారు. (వైఖానసులు ఔఖేయులనీ పిలువబడ్డారు. ఎందుకంటే వారు 'ఉఖా' అంటే కుండ నుండి రగుల్చచేసిన అగ్నిని నిత్యాగ్నిహోత్రంగా జీవితాంతం వాడతారట). దానిని వైష్ణవ సూత్రమని కూడా అంటారు.

శ్రీ వైఖానస కల్ప సూత్రంలోని పదవ ప్రశ్నలో గృహస్థు పాటించాల్సిన గృహస్థాశ్రమ ధర్మాలు వివరించబడ్డాయి వీటిలో సామాన్య హైందవ ధర్మ సూత్రాలైన 'అతిధులను ఆదరించాలి', 'సత్యాన్నే పలకాలి' వంటి వాటితోపాటు గృహస్థుకు విధించబడిన కొన్ని ప్రస్తావనార్హమైన నియమాలను యిక్కడ పేర్కొంటాను.

తడిపాదాలతో గృహస్థు పరుండరాదని నియమం. ఇది శరీరారోగ్యాన్ని దృష్టిలో పెట్టుకొని విధించిన నియమమే ఆరోగ్యవంతుడైన మానవుడి శరీరం ఎప్పుడూ $98.6^0$ ఫారెన్‌హీట్ (*Fahrenheit*) ఉష్ణం కలిగి వుంటుంది. శరీరంలో రక్త ప్రసరణ సవ్యంగా జరగడానికీ, శరీరం తన ధర్మాలను నిర్వర్తించడానికీ ఆ ఉష్ణం అత్యంత ఆవశ్యకం. అలాగే శరీర ఉష్ణోగ్రతలో సమతౌల్యత సాధనకు రక్త ప్రసరణే మూలం. పగలు తడి కాళ్లతో పడుకుంటే గాలిలోని ఉష్ణాన్ని గ్రహించి ఆ తడి ఆవిరై పాదాలు వెంటనే ఆరిపోతాయి. అదే రాత్రి వేళల్లో కాళ్లు తుడుచుకోకుండా పడుకున్నప్పుడు పాదాలపైన నీరు తాను ఆవిరి కావడానికి పాదాలలోని ఉష్ణాన్ని గ్రహించివేస్తుంది. దీనితో పాదాలు చల్లబడతాయి. అప్పుడు పాదాల ఉష్ణాన్ని శరీర ఉష్ణోగ్రతతో సమం చేయడానికి శరీరంలోని మిగిలిన అవయవాల నుండి అదనపు రక్తం పాదాలలోనికి ప్రవహిస్తుంది. ఆ మేరకు ఆయా అవయవాల సాధారణ విధులు కుంటుబడతాయి. మనం స్నానం చేసిన వెంటనే మరియు పాద ప్రక్షాళన చేసుకున్న వెంటనే బట్టతో తడిని పూర్తిగా తుడిచి వేసుకోవడం, మన శరీర ఉష్ణోగ్రతలో సమతౌల్యతను కాపాడుకొనడానికేనన్నమాట! అంతేకాదు, తడి శుభ్రంగా తుడుచుకొనకపోతే కాళ్ల వ్రేళ్ల సందుల్లో వుండిపోయిన తడి కారణంగా పాదాలు పాచి పడతాయి. *'Athlete's Foot'* వగైరా ఫంగస్ కారణంగా వచ్చే చర్మ వ్యాధులు సంక్రమించే అవకాశమూ వుంది.

మనం నిద్రించేటప్పుడు పశ్చిమ దిక్కునగాని, ఉత్తర దిక్కునగాని తలపెట్టి పరుండరాదట. ఈ నియమానికీ కొంత శాస్త్రీయత కనుపిస్తుంది. భూమి ఎప్పుడూ పశ్చిమాన్నుంచి తూర్పుకు తిరుగుతూ (*Rotation*) వుంటుందనేది శాస్త్రీయంగా నిర్ధారించబడింది. అంటే యీ భూభ్రమణం కారణంగా గాలి ఎప్పుడూ తూర్పునుంచి పడమరకు వీస్తుంది. అంతేకాక, భూగోళానికి వున్న ధృవాభిముఖ్యత (*Polarity*) కారణంగా దక్షిణాన్నుంచి ఉత్తరానికి కూడా ఎప్పుడూ గాలి వీస్తుంది. అంచేత, మనం పడమరకు గానీ, ఉత్తరానికి గానీ తలపెట్టి పడుకుంటే వీచే గాలితోబాటు ధూళి, సూక్ష్మక్రిములు మన నాసికా పుటముల (*Nostrils*) లోకి నేరుగా వెళ్లి అపకారం కలిగించే అవకాశముంది. ఆరుబయట పడుకున్నప్పుడు ఇది మరింత సంభావ్యం. అంతేకాక, భూమి యొక్క అయస్కాంత క్షేత్రం యొక్క ప్రభావం (*the effect of Earth's Geo magnetic Field*) మన శరీరంపై పడకుండా వుండాలంటే మనం ఉత్తరానికి తలపెట్టి పడుకొన కూడదంటారు. (మరి ఇదెంతవరకు శాస్త్రీయమైన ఆలోచనో? ఒక వ్యక్తి మరణించిన అనంతరం ఆ శవాన్ని మాత్రం తల ఉత్తర దిక్కుకు వుండేటట్లుగా పరుండబెడతారు.) మనం తూర్పుకుగానీ, దక్షిణానికిగానీ తలపెట్టుకొని నిశ్చింతగా నిద్రించ వచ్చున్నమాట.

గృహస్థు న్యాయార్జితమైన ధన సంపాదన కలిగి వుండాలట. అతడెప్పుడూ మితంగానే ధాన్యాన్ని నిల్వ చేసుకోవాలట. ఈ సందర్భంగా వైఖానస కల్పసూత్రం కొన్ని ప్రత్యేక పదాలను పేర్కొంది. అవి – 1) కుశూల ధాన్యకుడు. కుశూలమంటే ధాన్యాగారం; కుశూలధాన్యకుడంటే మూడు సంవత్సరాల వరకూ సరిపడే ధాన్యం నిల్వ కలిగిన గృహస్థు. 2) కుంభీ ధాన్యకుడు. కుంభీ అంటే ఒకప్పుడు ధాన్యపు కొలమానము (*a measure of grain*) గా వాడబడిన ఒక మట్టి కూజా వంటి పాత్ర. ఆరు రోజుల అవసరాలకు సరిపడా నిలువచేయబడిన ధాన్యాన్ని కుంభీ ధాన్యమంటారు. అలా ఆరు రోజులకు సరిపడా ధాన్యం నిల్వలు కలిగిన గృహస్థును 'కుంభీ ధాన్యకుడ'ంటారు. 3) 'త్ర్యహైహికుడు' అంటే మూడు రోజులకు సరిపడా ధాన్యం నిల్వలు కలిగిన గృహస్థు. 4) కేవలం ఆ రోజుకూ, మరుసటి దినానికీ సరిపడ మాత్రమే ధాన్యం నిల్వ కలిగిన గృహస్థును 'అశ్వస్తనికుడ'ంటారు. గృహస్థు మితంగానే ధాన్యం నిల్వలు కలిగివుండాలనే నియమం సామ్యవాద భావం (*idea of socialism*) తోనే ఏర్పరచబడి వుంటుంది.

ఉదయాస్తమయాలలో సూర్యుని చూడరాదనే నియమంలో కూడా శాస్త్రీయత వుంది. అధిక ఉష్ణోగ్రత కలిగిన ఇన్‌ఫ్రారెడ్ (*Infra Red - below the red*) కిరణాల నుండి కంటిలోని సున్నితమైన భాగాలను కాపాడుకొనడానికి ఉదయించే సూర్యుడినిగాని, అస్తమించే సూర్యుడిని గాని నేరుగా చూడకూడదన్న నియమం.

వైఖానసులు వైదికులు. అందుకే వారు అగ్ని యొక్క పవిత్రతకు ఎంతో ప్రాధాన్యమిచ్చారు. తమ ఆగమంలో అగ్నిమీద చలికాగుతూ, పాదాలను వెచ్చజేసుకొనడాన్నీ, నోటితో అగ్నిని ఊదడాన్నీ, అగ్నిని పాదాలతో తాకడాన్నీ, పాదాల క్రింద అగ్నిని ఉంచడాన్నీ వారందుకే నిషేధించారు. (అగ్నిని నోటితో ఊదితే, ఆ పవిత్రాగ్నిలో ఉమ్మి పడే అవకాశముంది కదా !) హోమాగ్నిలో యితర అగ్నిని వేయడం కానీ, నీటిని పోయడం కానీ నిషిద్ధం. అగ్నియందు మూత్రవిసర్జన, రక్తము, రేతస్సు, కఫము, ఎంగిలి వస్తువులు, శరీరానికి నలుగు పెట్టుకున్న పిండి వగైరాలు వేయడం కూడా నిషేధించారు. అయితే మనం లోగడనే తెలుసుకున్నట్లు తెనాలి రామకృష్ణకవి వివరణ ప్రకారం వరుణుడు నిర్వహించిన యజ్ఞంలో జలదద అనే అప్సరసను చూచి బ్రహ్మకు రేతస్సు పతనంకాగా దానిని ఆయన మోదుగాకు దొప్పలో నింపి యాగాగ్నిలో వేస్తే అందునుంచి పుట్టుకొచ్చిన వాడే విఖనసుడు – ఆయన సంతానమే వైఖానసులు. ఈ కట్టు కథను మనం నమ్మినా, నమ్మకున్నా, వైఖానసులు తామెలా ఉత్పత్తి అయ్యామని భావిస్తున్నారో – 'ఆ యాగాగ్నిలో రేతస్సు వేయడం' అనే దాన్నే నిషేధించడం విచిత్రం కదూ! 11 రోజులపాటు జరుపబడే సోమయాగమైన 'పౌండరీకం'లో కూడా యాగాగ్నిలో రేతస్సును వేస్తారంటారు. మరి గృహస్థుకు యిదెలా ఆచరణీయమో? ఈ చర్య అగ్ని పవిత్రతను భంగ పరచదా ?

ఇంద్రధనుస్సును గృహస్థు యితరులకు చూపరాదట. దానిని గురించి యితరులెవరికీ చెప్పరాదట. ప్రకృతిలోకెల్లా అతి సుందరమైన 'ఇంద్రధనుస్సు' విషయంలో పెట్టిన యీ నియమం అర్థరహితంగానే కనుపిస్తున్నది.

గృహస్థు ఎప్పుడూ ఒంటరిగా ప్రయాణం చేయరాదట. ఈ నియమం ఉపయుక్తమైనదే. ప్రయాణంలో ఎప్పుడూ తోడు అవసరమే. ప్రయాణాలలో నివార్యమైన విపత్తులను నివారించడానికీ, అనివార్యమైన ప్రమాదాలు సంభవించినప్పుడు తక్షణ సహాయానికీ, తమ వారికి కబురు అందించడానికీ గృహస్థుకు రెండో మనిషి తోడుండడం అభిలషణీయం.

గృహస్థు ఇతరుల పొలాలలో మేస్తున్న ఆవును నివారించకూడదట. మరి యీ నియమమేమిటో ! వాస్తవానికి తన పొలంలో పడి మేస్తున్న ఆవును ఎలాగైతే తోలివేస్తాడో అలాగే గృహస్థు యితరుల పొలాలలో మేస్తున్న ఆవును కూడా తోలి వేయడమే ధర్మం. అలాగే పాలు తాగుతున్న దూడను నివారించకూడదట. అలా దూడను మధ్యలో నివారించకుండా పాలు త్రాగనిస్తే యింక గృహస్థుకేం మిగులుస్తుంది ఆ దూడ?

శవము యొక్క పొగను గృహస్థు పీల్చకూడదట. అతడు ఉదయపు వేళ ఎండలో తిరుగరాదట. దీని శాస్త్రీయతను లోగడనే 'ఉద్భటారాధ్య చరిత్రము'పై వ్యాఖ్యలో 'బాలార్కో ప్రేత ధూమశ్చ' శ్లోకాన్ని వివరించినప్పుడు పేర్కొన్నాను.

'బోధాయన స్మృతి' ననుసరించి "వానప్రస్థః వైఖానస శాస్త్ర సముదాచారః" (వానప్రస్థులు వైఖాన శాస్త్రాన్ని ఆచరించేవారు). చతురాశ్రమ ధర్మాలలో వానప్రస్థము మూడవది. బ్రహ్మచర్య, గార్హస్థ్య ఆశ్రమముల తరువాతనూ, సన్న్యాసాశ్రమానికి ముందుగానూ స్వీకరించేది వానప్రస్థాశ్రమము. బ్రహ్మచర్యములో విద్యా సముపార్జన, గార్హస్థ్యములో గృహ్య సూత్రముల ననుసరించి నియమబద్ధ గృహస్థ జీవనం చేయబడతాయి. కాగా, వానప్రస్థములో కఠోర నియమాలతో సంక్లిష్టమైన విషయాలపై మనస్సును కేంద్రీకరించి ధారణ, ధ్యాన, సమాధులతో తపస్సు నాచరించే రాబోయే సన్న్యాస దశకు తనను తాను సమాయత్త పరచుకుంటూ చిన్నగా ఐహిక విషయాలపై ఆసక్తి తగ్గించుకుంటూ, కంద మూలాలు భుజిస్తూ, నిరాడంబర జీవనంతో, ఆముష్మిక చింతనతో అడవులలో తిరుగాడుతూ సన్న్యాస స్వీకరణకు సిద్ధమవుతాడు వానప్రస్థుడు. ('వనప్రస్థ' అంటే 'అడవిలో నడవడం' నుండి వానప్రస్థ శబ్దం వచ్చింది) వైఖానసులు ఆ వానప్రస్థ ధర్మాల్ని ప్రచారంచేస్తూ, ఐహిక విషయాలపై (భూసంబంధిత విషయాలపై) విరక్తి కలిగి, ఆముష్మికపు (పరలోకపు) చింతన కలిగివుంటారట.

వానప్రస్థాశ్రమ ధర్మాలను వైఖానసాగమం వివరంగా పేర్కొన్నది. వాటిలో కొన్ని వింతగా వున్నాయి. వానప్రస్థుడు పంటపొలాలు తొక్కకూడదట. అతడు కోతకోసిన చేలలో కూడా ప్రవేశించరాదట. అతడికి భిక్షాటన నిషిద్ధము. కందమూలాలను తిని మాత్రమే జీవించాలి. అలాగే వానప్రస్థుడు చెట్లనుండి పండ్లు కోయరాదు. పండి రాలిన ఫలాలను మాత్రమే అతడు భుజించాలి. ఇక యీ విధి నిషేధాల శాస్త్రీయతను పరిశీలిద్దాం. కోత కోసిన చేలలో వానప్రస్థుడు ప్రవేశిస్తే అతడు కోసిన పంట పనలను సంగ్రహించి వాటినుండి ధాన్యాన్ని పొందగలిగే అవకాశముంది. గృహస్థులు అతిథుల కోసమైతే ప్రత్యేకంగా వంట వండుతారు కాని భిక్షకులకు తాము తినగా మిగిలిన శేషాన్నాన్నే భిక్షగా వేస్తారు. కనుక ఆ ఆహారం కేవల సాత్వికాహారమయ్యే అవకాశం లేదు. అందుకే వానప్రస్థుడికి భిక్షాటనను నిషిద్ధం చేసి వుంటారు. ఇంకా పక్వం కాని ఫలంలో రజస్తమోగుణ కారకములైన పదార్థములు వుంటాయనేనేమో వారు కేవలం పండి నేలరాలిన ఫలాల్ని మాత్రమే తినాలనే నియమం పెట్టారు. ఏమైనా వానప్రస్థ దశలో ఒక వ్యక్తి ఆహారాన్ని అతి మితంగానే స్వీకరించాలి. అదికూడా సాత్వికాహారంతోనే పొట్టపోసుకోవాలి. తరువాత దశయైన సన్న్యాస దశలో మాత్రం భిక్షాటనం నిషిద్ధం కాకపోవడం విచిత్రం. అప్పటికే వానప్రస్థ దశలో జిహ్వాచాపల్యాన్ని అణచుకొన్న సన్న్యాసికి యిక ఏ రకమైన ఆహారం

తీసుకున్నప్పటికీ ఎటువంటి చిత్తచాంచల్యం కలగదని పూర్వులు విశ్వసించారు కాబోలు. ఇలా వానప్రస్థ నియమాలన్నీ శరీరాన్ని శుష్కింపజేసి, మనస్సును సాత్వికంగా మార్చి, తనువునూ, మనస్సునూ అన్ని విధాలా సన్న్యాస దశకు సన్నద్ధం చేసేవిగా వున్నాయి. భార్యతో కలసి చేసే వానప్రస్థము, భార్యలేకుండా చేసే వానప్రస్థము - యీ రెండు విధాలూ వున్నాయి.

వైఖానసుల విశ్వాసం ప్రకారం భగవంతుడు నిర్గుణుడు మాత్రమే కాదు. ఆయన అనంత కళ్యాణగుణ పరిపూర్ణుడు కూడా. భక్త జనులకు నిర్గుణోపాసన అంత సులభసాధ్యం కాదు. వారికి సౌలభ్యమైనది సాకారార్చన మాత్రమే. అంటే విగ్రహరూపంలో భగవదర్చన చేయడం. అనంత నామ, గుణ సంపన్నుడైన పరమాత్మను నిరంతరము ధ్యానించుట సాధ్యంకానిపని. అంచేత ప్రతిమాదులయందు విష్ణు, పురుష, సత్య, అచ్యుత అనిరుద్ధులను అయిదు పేర్లతో వ్యూహ భేదము కలిగి విలసిల్లే వేదవేద్యుడిని ఆవాహించి అర్చించాలి. ఇదే సమూర్తార్చన అంటే. ఇండ్లలోనూ, దేవాలయాలలోనూ స్వార్థ, పరార్థములలో ఉభయత్రా వైఖానసులు సమూర్తార్చనే చేయాలి. వీరు విష్ణువును పంచమూర్తులుగా పంచబేరార్చన చేస్తారు. అవి గర్భ గుడిలో వుండే ధృవ బేరము, కౌతుక బేరము, ఉత్సవ బేరము, స్నపన బేరము మరియు బలి బేరము. ధృవ బేరము శిలా విగ్రహముగానూ, మిగిలిన బేరములు పంచలోహ విగ్రహములుగానూ వుంటాయి. ఆ బేరములలోనికి వీరు ఆవాహన చేసేది విష్ణు, మహావిష్ణు, సదావిష్ణు, సర్వవ్యాపి, నారాయణులను.

## వైఖానసము - పాంచరాత్రము

వైష్ణవంలోనే విష్ణ్వర్చనకుద్దేశించిన పాంచరాత్రమనే మరొక ఆగమం వుంది. వైఖానసాగమం వేదోక్తమైన ఆగమములు మూడింటిలో (శైవ, పాంచరాత్ర, వైఖానస) ఒకటి. అయితే పాంచరాత్రము ఎటువంటి మంత్రమూలేని క్రియారూపము. ఒకప్పుడు సోమకుడనే రాక్షసుడు వేదాలను అపహరించుకుపోయాడట. అప్పటి వరకూ ప్రజలు వైఖానసాగమ రీతిలో విష్ణువును అర్చిస్తున్నారట. ప్రపంచం వేదరహితమైన ఆ ఐదు రాత్రుల కాలంలో కౌండిన్యుడు మొదలైన ఋషులు తమ తపోబలంతో పాంచరాత్ర ఆగమాన్ని ఏర్పరచి దాని ప్రకారం అర్చనగావించారట. వైఖానసుల విశ్వాసం ప్రకారం అవి ఆ కాలంలో ఆపద్ధర్మములుగా నిర్మించుకున్న కొన్ని పద్ధతులు మాత్రమే. మత్స్యావతారమెత్తి విష్ణువు సోమకాసురుడిని సంహరించి వేదములను తిరిగి ఉద్ధరించి ప్రజలకు అందజేశాడు కనుక కేవలం కొంతకాలంపాటు పాటించిన ఆ పాంచరాత్ర ఆపద్ధర్మ మంత్రరహిత, క్రియా పద్ధతులను విడిచి అప్పటి నుండి ప్రజలు తిరిగి వైఖానస ఆగమం ప్రకారం విష్ణ్వారాధన చేస్తున్నారు. పాంచరాత్ర ఆగమాన్ననుసరించి విష్ణువు చతుర్మూర్తి (అంటే నాలుగు రూపాలు కలిగినవాడు). అవి - పరమేశ్వరుడు (వాసుదేవుడు); సంకర్షణుడు (బలరాముడు) - జీవుడు; ప్రద్యుమ్నుడు (కృష్ణుని కుమారుడు) - మనస్సు; అనిరుద్ధుడు (కృష్ణుని మనుమడు) - అహంకారము; రామకృష్ణ కవి చెప్పినదాని ప్రకారం వైఖానసులు శ్రీకృష్ణ, పురుష, సత్య, అచ్యుత, బుద్ధ బేరములను - పాంచరాత్రులు యీ ఐదూ కాక అదనంగా 'బాలాలయ' అనే బేరమును కూడా అర్చిస్తారట.

శ్రీ రామానుజులు పాంచరాత్రము నుండే భగవదారాధనను స్వీకరించారు. తమ సూత్రములలో లేని త్రిదండ సన్న్యాసమును వైఖానసమునుండి ఆయన అనుష్ఠించినట్లు 'కౌమోదకి'లో పేర్కొనబడింది. విష్ణ్వాలయాలలో వైఖానసాగమ ప్రోక్తంగానూ, పాంచరాత్రానుసారంగానూ కూడా విష్ణ్వర్చన జరుగుతుంది. అయితే వైఖానసమునకు మాత్రమే ప్రత్యేకించి సూత్రము, శాఖ, మంత్రము ఉన్నాయి. రామానుజునికి పూర్వం శ్రీరంగం వగైరా వైష్ణవ క్షేత్రాలలో శ్రీ వైఖానసులే విష్ణువునర్చించారని 'బ్రహ్మాండ పురాణం' పేర్కొంటూంది. తిరుమల దేవస్థానంలోనూ, భూతపురి (శ్రీ పెరంబుదూర్ - ఇది

రామానుజుడి జన్మ స్థలం)లోనూ, కంచిలోని మొత్తం 18 విష్ణ్వాలయాలలో వరదరాజస్వామి ఆలయం మినహా మిగిలిన 17 దేవస్థానములలోనూ, మదురై, వానమామలై, నాగపట్టణం, చిదంబరం, పూందమల్లి (పూనమల్లి), మహాబలిపురం, బిట్రగుంట, సింగరాయకొండ, బాపట్ల, పొన్నూరు, మంగళగిరి, అంతర్వేది మొదలైనచోట్లగల విష్ణ్వాలయాలన్నింటిలో నేటికీ వైఖానసాగమం ప్రకారమే అర్చన జరుగుతూండగా, కేవలం శ్రీరంగం, కంచిలోని వరదరాజస్వామి ఆలయం, తిరువళ్లూరు, అహోబిలం మొదలైన ప్రదేశాలలో మాత్రమే పాంచరాత్ర పద్ధతిన అర్చన జరుగుతున్నది. వైఖానస అర్చనా క్రమము వైదికము. దానికొక ప్రత్యేక శాస్త్రము, శాఖ వున్నాయి. పాంచరాత్ర ఆరాధనా క్రమము తాంత్రికము. అది మిశ్ర వైష్ణవమని వైఖానసులు భావిస్తారు. పాంచరాత్ర శాఖలో పంచసంస్కారం పొందిన ఏ బ్రాహ్మణుడైనా చేరవచ్చును. ఉత్తర భారత దేశంలోని భాగవత శాఖలోనూ అంతే. కాని, ఇతర సూత్రములవారు పంచ సంస్కారములు పొందినప్పటికీ కూడా వైఖానసులు అవడానికి అవకాశం లేదు. అందుకే వైఖానసులు నానాటికీ సంఖ్యాబలం కోల్పోయి అల్ప సంఖ్యాకులుగా వుండిపోయారు.

## వైఖానసం యొక్క ప్రాచీనత

వైఖానసం విఖనసునితోనే ప్రారంభమైనదనీ, ఆయన విష్ణువును విగ్రహరూపంలో అర్చిస్తూ, ఆ అర్చనా పద్ధతులను ప్రచారం చేశాడనీ చెప్పుకున్నాం. విఖనస అనే పదానికి 'విశేషేణ ఖననా జ్ఞాతః విఖనసా' అని కొందరు అర్థం చెపుతున్నారు. దీనికి విశేషించి ఖననం (త్రవ్వడం) చేయడం ద్వారా జ్ఞానం పొందినవాడు అని అర్థం. అంటే ఆయన శాస్త్రాల్ని మథించాడన్నమాట. ఇంకొక అభిప్రాయం ప్రకారం శ్రీపరమపద నివాసియైన శ్రీమన్నారాయణుని ఆత్మకు విఖనమని మరొక పేరట. ఆ ఆత్మనుండి భగవదర్చనాపరుడగు మునిగా నారాయణునిచే సృష్టించబడినవాడు కనుక 'విఖనసు'డయ్యాడట. మరొక అభిప్రాయం - విఖనసుడు తన సూత్రాలలో వానప్రస్థాశ్రమ ధర్మాలనే ప్రధానంగా చెప్పాడు. వానప్రస్థులు అడవిలో కందమూలాలు ఖననం చేసి (త్రవ్వితీసి) తింటారు. కనుక విఖనస అనే పదానికి అర్థం 'విశేషించి త్రవ్వి కందమూలాల్ని తీసే ఓ వానప్రస్థుడు' అయి వుంటుందని.

స్వాయంభువ మనువు కాలంలో అంటే సుమారు 197 కోట్ల 29 లక్షల 49 వేల సంవత్సరాలకు పూర్వం 88 వేల మంది మునులు బ్రహ్మ యొక్క లోకమైన సత్యలోకాన్ని చేరి భూలోకంలో తమకు తపస్సు చేసుకొనడానికి అనువైన స్థలం చూపమని కోరగా, బ్రహ్మ వారితోపాటు తన మనోమయ చక్రాన్ని పంపాడట. ఆ చక్రం యొక్క నేమి ఏ ప్రదేశంలో భూమిలోనికి చొచ్చుకొనిపోయిందో అదే నైమిశారణ్యంలోని చక్రతీర్థం. గోమతీనదీ తీరంలోని నిమిశ క్షేత్రం యిదే. నైమిశారణ్యంలోనే రాముడూ, ధర్మరాజూ అశ్వమేథ యాగాలు చేశారు. ప్రస్తుతం 'నీమ్‌సార్' అని ఉత్తర్ ప్రదేశ్‌లోని సీతాపూర్ జిల్లాలో లక్నోకు 100 కి.మీ. దూరంలో నైమిశారణ్యంలోని ఒక భాగమైన బదరికాశ్రమం వుంది. హనుమంతుడు నివసిస్తాడని చెప్పే గంధమాదన పర్వతం కూడా నైమిశారణ్యంలోనే వుంది. నైమిశారణ్యంలోనే బదరీనాథ్‌కు 4 మైళ్ల దూరంలో వైఖానస తీర్థం వుంది. దీనికి ఆ పేరు రావడానికి కారణం విష్ణుమానసపుత్రుడైన విఖనసుడు నైమిశారణ్యంలోనే మునులకు విష్ణువును అర్చించే పద్ధతులను తెలిపే శ్రీ సూత్రాన్ని బోధించాడు. వైఖానస కల్పసూత్రాన్ని బోధించడానికి శ్రావణ శుద్ధపూర్ణిమ సోమవారం సింహలగ్నయుక్త శ్రవణా నక్షత్రంలో నైమిశారణ్యంలో ప్రవేశించి వైఖానస తీర్థంలో వారి కాయన ఆ బోధనలు చేశాడట. విఖనసుని సంతానమైన వైఖానసులు విష్ణుభక్తినీ, విష్ణ్వారాధనా పద్ధతులనూ ప్రచారం చేస్తూ కొందరు హిమాలయాలకు ఉత్తరంగా గోబి ఎడారికి ఆవలగా వున్న ఉత్తర కురుభూములకు వెళ్లారట. కొందరేమో

దక్షిణ భారత దేశానికి వెళ్లారట. మైనాక పర్వతంపైనా, లీన నది ఒడ్డున, వైఖానస సరస్సు (బైకాల్ సరస్సు) సమీపంలోనూ వైఖానసులు ఆశ్రమాలు ఏర్పాటు చేసుకుని నివసించేవారట.

వాల్మీకి రామాయణంలోని 'కిష్కింధ కాండ'లోని 43వ సర్గలో సీతను వెదకడానికై తూర్పు దిశగా పంపబడిన వినీతుడనే వానర నాయకునితో చెపుతూ సుగ్రీవుడు భూగోళపు తూర్పు కొసయందున్న ఉదయ పర్వతం యొక్క సౌమనస శృంగంపైన అప్పటికే తపస్సు చేసుకుంటున్న వైఖానస, వానప్రస్థ, వాలఖిల్యులున్నట్లుగా పేర్కొన్నాడు. (ప్రస్తుతం సౌమనస శృంగం రష్యాలోని సైబీరియా తూర్పుకొసన గల చుకోత్స్కీ ద్వీపకల్పంలోని చుకోత్స్కీ ఖ్రెబెత్ లోనిదై వుండవచ్చు. ఖ్రెబెత్ అంటే రష్యన్‌భాషలో పర్వత శ్రేణి).

అలాగే సీతను వెదకడానికి ఉత్తర దిక్కుకు పంపబడిన శతబలితో మాట్లాడుతూ సుగ్రీవుడు మైనాకపర్వతానికి ఆవల (ఉత్తరపు దిక్కున) వైఖానస సరస్సు తీరంలో గల సిద్ధాశ్రమంలో వైఖానస, వాలఖిల్యులనే మునులున్నారని చెప్పాడు. వారు వంద్యులనీ (నమస్కరింపదగిన వారనీ) తపశ్శక్తి సంపన్నులనీ, వీతకల్మషులనీ (పరిశుద్ధులనీ), వినయంగా సీత జాడ తెలిస్తే చెప్పమని వారిని అడగండనీ చెప్పాడు. మైనాక పర్వతమంటే ప్రస్తుతం చైనా, మంగోలియా సరిహద్దులలోని ఆల్తాయ్ ఖ్రెబెత్ (*Altai Khrebet* - ఆల్తాయ్ పర్వత శ్రేణులు). ఇది దాటి వెళ్తేనే బైకాల్ సరస్సు వస్తుంది.

రామాయణ భారతాల్లో వైఖానసులు తేజోమూర్తులైన తాపసులుగా వర్ణించబడ్డారు. వానప్రస్థులలో ఒక తెగవారు వైఖానసులని మహాభారతం చెపుతున్నది. వానప్రస్థాశ్రమ ధర్మాలను వివరించి, స్వయంగా ఆచరించడం ద్వారా ప్రాచుర్యంలోకి తెచ్చినవారు వైఖానసులు. ఆంధ్ర మహాభారతంలోని ఆరణ్యపర్వంలో చెప్పబడిన దాని ప్రకారం తన యిరువురు ధర్మపత్నులైన కుంతి, మాద్రిలతో పాండురాజు ఉత్తర కురుభూములలో వానప్రస్థంచేస్తూ అక్కడే గతించగా, మాద్రి ఆయనతో సహగమనం చేయగా, శతశృంగ పర్వతంపై తపస్సు చేసుకుంటున్న వైఖానసాది మునులు కుంతినీ, పుత్రులనూ తీసుకొని వచ్చి హస్తినాపురంలో అప్పగించారట.

కాళిదాసు యొక్క 'అభిజ్ఞాన శాకున్తలమ్'లో 'శకుంతల వైఖానస వ్రతనియమాల్ని పాటించగలదా?' అని ఒకచోట వుండడాన్నిబట్టి నాటికే వైఖానసం ఎంత ప్రచారంలో వుందో అర్థమౌతూంది. మృగము (లేడి)పై బాణము నెక్కుబెట్టిన దుష్యంతునికి అడ్డుపడి భూతదయను ప్రకటించారట వైఖానసులు. దీనిని బట్టి వైఖానస వ్రతమెంత పవిత్రమైనదో అర్థమవుతుందనీ, కణ్వమహర్షి ఆశ్రమాన్నుంచి నందగిరివరకు గల ప్రదేశం 'బదరీ క్షేత్రమ'నీ, అక్కడి వారందరూ విష్ణుస్వరూపులనీ వసిష్ఠుడు అరుంధతితో చెపుతాడట. కణ్వ మహర్షి వైఖానసుడేనట. క్రీ॥పూ॥ 2వ శతాబ్దపు నానెఘాట్ (మహారాష్ట్ర) శిలాశాసనం ప్రకారం వైఖానసం నాటి పశ్చిమ భారతదేశంలో కూడా విశేష ప్రాచుర్యంలో వుంది.

## వైఖానస సరస్సు - బైకాల్ సరస్సు

రామాయణంలో చెప్పబడిన వైఖానస సరస్సే బైకాల్ సరస్సు. ఈ నిర్ధారణకు వచ్చే ముందు మనం రామాయణంలో ఉత్తర కురుభూములుగా పిలువబడిన నేటి చైనా, మంగోలియా, సైబీరియా (రష్యాలోనిది) ప్రాంతాలలోని అనేక నదుల, సరస్సుల, పర్వతాల పేర్లు ఆ ప్రాంతమంతా నాటికే ఏ విధంగా భారతీయ సాంస్కృతిక సామ్రాజ్యంలోని అంతర్భాగములని నిరూపిస్తున్నాయో కొంచెం పరిశీలిద్దాం.

ముందుగా కొన్ని నదుల పేర్లు చూద్దాం. ఖటంగ నది (ఖటంగ అంటే సంస్కృతంలో గడ్డి దుబ్బులతో నిండినది అని అర్థం). ఈ నది లాప్తెవ్ సముద్రంలో కలిసే ప్రాంతాన్ని ఖటంగ్ స్కీ జాలివ్ (*Khatangskiy zaliv*) అంటారు. జాలివ్

అంటే రష్యన్ భాషలో అఖాతము (*Bay*) అని అర్థం. యాన నది (ప్రయాణమునకు అనువైనది అని అర్థం). ఇది కూడా లాప్తెవ్ సముద్రంలోనే కలుస్తుంది. అంగారనది (నిప్పు వర్ణపు నది) ఇది యెనిసీ (*Yenisey*) నదికి ఉపనది. ఖేట నది (భయానకమైన నది). ఇది ఖటంగ నదికి ఉపనది. ఓఖా (ఎండిపోయినది). ఈ పేరుతో ఒక నది, ఒక పట్టణం సఖాలిన్ దీవిలో వున్నాయి. దీని పేరుతోనే 'ఓఖోట్స్క్' నగరం మరియు 'ఓఖోట్స్క్ సముద్రం' యొక్క పేర్లు కూడా ఏర్పడ్డాయి. 'మాయా' నది 'లీన' నదికి ఉపనది. అలాగే 'యుధ్మ'నది కూడా లీన నదికి ఉపనది. (యుధ్మ అంటే సంస్కృతంలో 'శరము' అనే అర్థముంది. ఇది బాణంలా వేగంగా ప్రవహించే నది అయివుంటుంది) దీనినిప్పుడు యుదోమ (*Yudoma*) అంటున్నారు. శిలికా నది అమూర్ నదికి ఉపనది. (శిలికా అన్నా సంస్కృతంలో బాణము. ఇది కూడా బాణంలా వేగంగా ప్రవహించేదైనందున దీనికాపేరు వచ్చి వుంటుంది). అమూర్ నది ఓఖోట్స్క్ సముద్రంలో కలిసేనది. (అమూర అనేది వేదాలలో ప్రయోగింపబడిన సంస్కృత శబ్దం. దీని అర్థం 'తెలివైన', 'జ్ఞానముకలిగిన', 'తప్పుచేయని' అని) 'శైలోద' అని పూర్వులు చెప్పిన నదే నేటి సెలెంగ నది. (శిలా + ఉదక) సంవత్సరంలో హెచ్చుభాగం దానిలోని ఉదకము (నీరు) శిలారూపంలోనే (మంచు శిలలుగానే) వుండడంచేత దానికి 'శైలోద' అనే పేరు వచ్చింది. లీన నది సంవత్సరంలో హెచ్చుకాలం గడ్డకట్టి చుట్టూవున్న మంచు ప్రదేశంలో లీనమై వుండడం వలన దానిని 'లీన' అని అన్నారు. వక్షునది (పామీర్ పీఠభూమి గుండా ఆఫ్ఘనిస్తాన్‌కూ తజికిస్తాన్‌కూ సరిహద్దుగా ప్రవహించేనది. దీని ప్రస్తుతపు పేరే ఆక్సస్ నది. యక్షులు లేక జక్కులు యీ ప్రాంతంనుండే అన్నిచోట్లకూ విస్తరించారని చరిత్రకారులు నిర్ధారించారు.) ఇక పర్వతాల విషయానికొస్తే నేటి ఆల్తాయ్ పర్వతాలే నాటి మైనాక పర్వతములనీ, నేటి యాబ్లొనొవీ (*Yablonovyy*) పర్వతాలే నాటి క్రౌంచ పర్వతాలనీ భావించబడుతున్నది. 'ఓం' (ప్రణవం) తో ఓంస్క్, 'అంగార' నుండి అంగార్స్క్, 'శిబిర' నుంచి శిబిర్స్క్, నోవో (కొత్త) శిబిర్స్క్ వగైరా నగరాల పేర్లేర్పడ్డాయి. సైబీరియాలోని ఇర్తుష్ నది ఒడ్డున 'తారా' పట్టణం వుంది. మంగోలియా దేశపు ప్రస్తుత రాజధాని 'ఉలాన్ బతోర్' యొక్క పూర్వపుపేరు 'ఉరుగ్రామ' (విశాలమైన పెద్ద గ్రామం). దీన్నే 'ఉర్‌గా' అనీ అనేవారు. అంతే కాదు – ఉక్రెయిన్‌లోని గోరిన్ నది ఒడ్డునవున్న 'విష్ణెవెట్స్' విష్ణువత్సలపురం; కజఖ్‌స్తాన్‌లోని ప్రఖ్యాత అంతరిక్ష కేంద్రంగల పట్టణం బైకానూర్ – వైఖానూర్; మొల్డావియా రాజధాని కిషినెవ్ – కృష్ణెవ్ – (కృష్ణ పట్టణం) అయివుండవచ్చుననిపిస్తున్నది.

బైకాల్ సరస్సుకు తూర్పుగా సుమారు 200 కి.మీ. దూరంలో త్సీపా (*Tsipa*) నది ఒడ్డున 'కదలి' (*Kadali*) అనే పట్టణముంది. ద్రావిడ భాషలన్నింటిలో కదలి అంటే సముద్రం. అయితే ఆ పేరుతో మన దేశంలో గ్రామ నామాలూ వున్నాయి. బైకాల్ సరస్సుకు ఆగ్నేయంగా ఓనాన్ (*Onan*) నది ఒడ్డున అక్ష (*Aksha*) నగరముంది. 'అక్ష' అనే సంస్కృత పదానికెన్నో అర్థాలున్నా, రుద్రాక్ష కాయల చెట్టు (*Elaeocarpus ganitrus*) లేక తాండ్ర లేక తానికాయల చెట్టు (విభీతక వృక్షం – *Terminalia bellerica*) అనే అర్థాలే ప్రముఖం. ఈ వృక్షాల పేర్ల మీదనే ఈ పట్టణం పేరు ఏర్పడి వుంటుంది. చెట్ల పేరుతో గ్రామనామాలేర్పడడం సర్వసాధారణమేకదా !

'కారాకుల్' అంటే క్షారకుల (అంటే ఉప్పునీటి సరస్సు). ఇది కిర్గిజ్‌స్తాన్‌లో వుంది. 'నారము' అంటే సంస్కృతంలో నీరు. మధ్య ఆశియాలో సరస్సుని 'నార్' (*Nor*) అంటారు. కారానార్ – *Kara Nor* – క్షార సరస్సు, *Kirghiz Nor* – కిర్గిజ్ నార్ – వగైరాలు యిలాగే ఏర్పడ్డాయి. ఇదే శబ్దం మంగోలియన్ భాషలో 'నూర్'గా మారింది. అలా హర్‌నూర్ (*Har Nur* – హరి సరస్సు) లాప్ నూర్ (*Lop Nur*) వగైరా సరస్సుల పేర్లేర్పడ్డాయి. సంస్కృతంలో 'గంగాధర' అన్నా 'గంగాభృత' అన్నా సముద్రమనే అర్థమూ వుంది. చైనీస్ భాషలో 'గంగ్' అంటే హార్బరు. 'ఉలు' అంటే మంగోలియన్ భాషలో పర్వతం

అనే అర్థం. ఇదీ సంస్కృత పదం 'ఉల్క' నుంచి ఏర్పడిందే. ఇప్పుడు అచలాలుగా (కదలని స్థాణువులుగా) ఉన్న పర్వతాలు ఒకప్పుడు రెక్కలు కలిగి ఎగురుతూ జనావాసాలపై (ఉల్కల లాగా) పడేవట. అందుకేనేమో పర్వతాల రెక్కలను ఖండించినవాడని విశ్వసిస్తున్న ఇంద్రుడికి 'ఉలూకః' అనే మరో పేరుంది. రష్యన్ భాషలో రిజర్వాయర్ (నిలువచేయబడిన నీరు)ను వొదొఖారా నిలిష్చె (*Vodokhara nilishche*) అంటారు. అచ్చంగా ఇది 'ఉదకాన్ని నిలయనం' చేయడమన్నట్లే ధ్వనించడం లేదూ? మాత (మాత్), భ్రాత (బ్రాత్), సూప (సూప) వగైరా ఎన్నో పదాల విషయంలో రష్యన్ భాషకూ, సంస్కృతానికీ ఎంతో దగ్గర సంబంధముంది.

కజఖ్‌స్తాన్‌లోని బాల్కష్ సరస్సుకు తూర్పుగానూ, చైనా సరిహద్దుకు పడమరగానూ 'ఒజెరో అలకోలు' (అలకోలు సరస్సు) వుంది. కుబేరుడి రాజధాని అలకాపురం బహుశా దీని సమీపంలోనే నిర్మించబడి వుంటుంది. (చూ. అనుబంధము-5)

ఇక బైకాల్ సరస్సు విషయానికొస్తే అది ప్రపంచం మొత్తంమీద అతి విశాలమైన, లోతైన మంచినీటి సరస్సు. ప్రాచీన నాగరకతలన్నీ మంచినీటి వనరుల సమీపంలోనే ఏర్పడ్డాయి. ఆ ప్రాంతం ఒకప్పుడెంత గొప్ప నాగరకతా కేంద్రమో మనం ఊహించుకోవచ్చు. ఆ సరస్సు లోతు ఐదు వేల అడుగులట. పొడవు 400 మైళ్లట. అంతేకాదు అది అత్యంత ప్రాచీనమైన సరస్సు. అది సుమారు 200 కోట్ల సంవత్సరాల నాటిదట. దానిలో 1200 రకాల నీటి జంతువులు, జలవృక్షజాలములు వున్నాయట. వీటిలో 80 శాతాన్ని కేవలం మొత్తం ప్రపంచంలో అక్కడ మాత్రమే చూడగలం. కేవలం బైకాల్ సరస్సు యొక్క నీటినీ, అందలి జీవరాశుల్నీ, జీవవైవిధ్యాన్నీ పరిశోధించడానికే ఒక విజ్ఞాన శాస్త్ర విభాగం ప్రారంభించారట రష్యన్లు. ఆ సరస్సు ఒడ్డుకు వెళ్ళి నిలబడితే సముద్రపు ఒడ్డున నిలబడినట్లే వుంటుందట. మొత్తం ప్రపంచంలో లభించే మంచి నీటి వనరులలో అయిదవ వంతు బైకాల్ సరస్సులోనే లభిస్తున్నదట. బైకాల్ అంటే రష్యన్ భాషలో పవిత్రమైన సముద్రం (*Sacred Sea*) అని అర్థం. మొన్న సునామీ *(Tsunami)* లో వచ్చినట్లు ఎప్పుడూ బైకాల్ సరస్సులో 20 అడుగుల వరకూ ఎత్తైన అలలు వస్తాయట. ప్రపంచంలోని నైలు, అమెజాన్, మిసిసిపి, వోల్గా వగైరా వగైరా నదులలో ప్రవహించే మొత్తం మంచినీటిని మొత్తంగా యీ సరస్సులోకి మళ్ళిస్తే అది నిండడానికి దాదాపు సంవత్సరం పడుతుందట. అంతటి బృహత్తరమైనది బైకాల్ సరస్సు.

రామాయణంలో కైలాస పర్వతానికి ఉత్తరంగా వెళ్తే వైఖానస సరస్సు వస్తుందనీ, 'అపర్వత నదీ వృక్షమ్ సర్వసత్వ వివర్జితమ్' – అంటే ఎటువంటి కొండలుగానీ, నదులుగానీ, వృక్షములుగానీ, ప్రాణులుగానీ లేనటువంటి ప్రాంతాన్ని (అదే నేటి 'గోబి' ఎడారి – మంగోలియన్ భాషలో గోబి అంటేనే ఎడారి. ఈ ఎడారిని చైనీయులు 'షామొ' అంటారు) దాటుకుని వెళ్తే వైఖానస సరస్సును చేరవచ్చునీ పేర్కొనబడింది. 'కైలాస పర్వతం' లేక 'మేరుపర్వతం' లేక 'సుమేరు'ను ప్రస్తుతం చైనీస్ భాషలో 'తీసా' అనీ టిబెటన్ భాషలో 'కాంగ్‌రిన్ పోఛే' అనీ అంటారు. ఇది పశ్చిమ టిబెట్‌లోని 'అలీ' జిల్లాలో వుంది. భారతదేశంలోని అల్మోరా నుంచి అక్కడికి వెళ్లొచ్చు. దానికి ఉత్తరంగా ప్రయాణిస్తే 'గోబి' ఎడారిని చేరవచ్చు. దానిని దాటితే వచ్చేదే వైఖానస (బైకాల్) సరస్సు.

రామాయణంలో 'కిష్కింధ కాండ'లోని 43వ సర్గలో సీతను వెదకడానికి ఉత్తరదిక్కుకు పంపబడిన శతబలితో సుగ్రీవుడు చెపుతున్నట్లు వర్ణించబడిన దాని ప్రకారం 'హేమ పుష్కర సంఛన్నం తస్మిన్ వైఖానసం సరః । తరుణాదిత్య సంకాశైః హంసైః విచరితం శుభైః । ఔషవాహ్యః కుబేరస్య సార్వభౌమ ఇతిస్మృతః । గజః పర్యేతి తం దేశం సదా సహకరేణుభిః । (అక్కడే వైఖానసము అనే సరస్సున్నది. అది బంగారువన్నె తామర పూలతో నిండి నేత్రపర్వంగా వుంది. బాల సూర్యుని

పోలిన అందమైన హంసలు ఆ సరస్సులో విహరిస్తున్నాయి. ఉత్తర దిక్పాలకుడైన కుబేరుని వాహనమైన 'సార్వభౌమము' అనే దిగ్గజము అక్కడే తోటి ఏనుగులతో విహరిస్తూంటుంది).

ఈ విషయమై లోగడ కొంత సమాచారం సేకరించిన శ్రీ ఎ. యోగానంద్ 'శిలోద'నదే రామాయణంలో పేర్కొనబడిన 'లీన' నది అని వ్రాశారు. ఇది తప్పని నా అభిప్రాయం. 'లీన' నది బైకాల్ సరస్సుకు సమీపంలోని పర్వతాలలో పుట్టి ఉత్తరాభిముఖంగా మెలికలు తిరుగుతూ ప్రవహించి లాప్తెవ్ సముద్రంలో కలుస్తుంది. మంగోలియాలోని ఉలియస్తాయ్ (*Uliastay*) సమీప పర్వత శ్రేణులలో పుట్టిన 'సెలెంగె' నదే రామాయణంలో పేర్కొనబడిన 'శిలోద' నది అయివుంటుందని నా విశ్వాసం. పేరులో సారూప్యత రీత్యా కూడా యిదే సబబై వుంటుంది. ఈ 'సెలెంగె' నది ఉత్తరాభిముఖంగా ప్రవహించి మంచు కరగిన తన స్వచ్ఛ జలాలతో బైకాల్ సరస్సులో కలుస్తున్నది. బైకాల్ సరస్సు రష్యాలో వుండగా, శిలోద (సెలెంగె) నది అక్కడికి దక్షిణ దిక్కునున్న మంగోలియాలో పుట్టి ఉత్తరాభిముఖంగా ప్రవహించి బైకాల్ సరస్సులో కలుస్తున్నది. శిలోదనదీ జన్మస్థలానికి పశ్చిమంగా కొంత దూరంలో కజఖ్‌స్తాన్‌లోని అలకోలు (అలకాపురి అనబడిన కుబేరుని రాజధాని?) వుండడం గమనించదగ్గ విశేషం. బహుశా అందుకేనేమో రామాయణంలోని వర్ణనలో కుబేరుడి 'సార్వభౌమము' అనే దిగ్గజం తన తోటి ఏనుగులతో ఆ సమీపప్రాంతంలో విహరిస్తుందని చెప్పబడింది.

రామాయణంలో వర్ణించబడిన క్రౌంచ (యాబ్లొనొవీ) మైనాక (ఆల్తాయ్) పర్వతాల మధ్యలోనున్న వైఖానస ఆశ్రమం సమీపంలోని 'వైఖానస' సరస్సే బైకాల్ సరస్సు (ఒజెరో బైకాల్ – *Ozero Baikal*) అనే నిర్ధారణకు రావడానికి పై వివరణలు సరిపోతాయనుకుంటాను. 'వైఖానస సరః' అని ఒకప్పుడు వ్యవహరించబడిన ఆ సరస్సు క్రమంగా 'వైఖానస లి' ('లి' అనేది నీటి వనరును సూచించే పదం. ఇదీ ప్రాగ్ద్రావిడ పదజాలంలోనిదై వుండవచ్చు. ఇందుకు తజిక్‌లి, ఇరాక్‌లి, తుర్కేలి, పేర్‌లి – ప్రసిద్ధమైన నీటి వనరు, వదలి – ఉత్తరపు నీటి వనరు, అత్తిలి, కొవ్వలి వంటి ఎన్నో ఉదాహరణలు మనం పేర్కొనవచ్చు.) అయి అదే 'వైఖాలి' – 'వైకాలి' – 'వైకాల్'గా రూపాంతరం చెంది 'బైకాల్' అయివుంటుంది. 'వ' – 'బ' గా పలుకబడడం మనమెరిగినదే. ఉదా : 'వంగ' – 'బంగ'; 'విపిన్' – 'బిపిన్'; 'భువన' – 'భుబన'.

బైకాల్ సరస్సులోని 'ఆస్ట్రోవ్ బెలోయే' (*White island* – ఆస్ట్రోవ్ బెలోయె అంటే రష్యన్ భాషలో తెల్లదీవి) మన పురాణాలలో వర్ణించబడిన 'శ్వేత ద్వీపము' అయి వుంటుందని నేను భావిస్తున్నాను. బైకాల్ సరస్సే పాలసముద్రమై వుంటుందని మనం లోగడనే అనుకున్నాం. పాలసముద్రాలు, పెరుగు సముద్రాలు వున్నాయని నమ్మడం అశాస్త్రీయమనీ, తెలుగులో 'పాలు' అంటే మంచినీరనే అర్థమూ వుందనీ, సంస్కృతంలోకూడా 'పయస్సు', 'క్షీరము' అనే పదాలకు 'పాలు' అనీ, 'నీరు' అనీ కూడా అర్థాలున్నాయి కనుక మన ప్రాచీనులు పెద్ద మంచినీటి సరస్సు అయినట్టి 'వైఖానస' సరస్సును పాలసముద్రం అన్నారని 'పాండురంగ మాహాత్మ్యము' (3-114) పద్య వివరణలో పేర్కొన్నాను. శివుడు, కుబేరుడి విషయంలోలాగే విష్ణువునుకూడా మహిమాన్వితమైన దైవంగా కాక, చారిత్రక పురుషుడిగా భావిస్తే అతని నివాసస్థలం బైకాల్ సరస్సులోని తెలిదీవిలోని వైకుంఠం అయివుంటుంది. ఇక వేయి శిరస్సులు కలిగిన ఆది శేషుడిని తల్పంగా చేసుకొని ఆయన శయనించాడనడం మాత్రం శాస్త్రీయమైన విశ్వాసం కాదు. క్షీరసాగరాన్ని ఒకప్పుడు దేవదానవులు ఎందుకు శోధించారనే విషయాన్ని అటుంచి అనంతమైన నిధులకు నిలయమై భాసిల్లుతూన్న బైకాల్ సరస్సు అంతరాంతరాల గవేషణ రష్యన్ ప్రభుత్వం నేటికీ సాగిస్తున్నది. దీనిపై పరిశోధనకు ప్రత్యేకించి ఒక విజ్ఞాన శాస్త్రమే ఏర్పడిందంటేనూ, అందు నిమిత్తం డజన్లకొద్దీ పరిశోధక నౌకలు, జలాంతర్గాములు వినియోగిస్తున్నారంటేనూ యీ అన్వేషణ ఏ స్థాయిలో వుందో అర్థం చేసుకోవచ్చు.

ఇలా విష్ణువు నివాస స్థలమైన పాలసముద్రములోని శ్వేత ద్వీపము, విష్ణ్వర్చకులూ, ఆది వైష్ణవులూ అయిన వైఖానసుల తొలిస్థావరాలలో ఒకటైన వైఖానసాశ్రమము సమీపంలోనిదవడంలో వింత యేమిలేదు. రష్యాలో సైబీరియాలోనే కాక చైనా, మంగోలియా, కజఖ్‌స్తాన్ తదితర ప్రాంతాలలోనూ ఒకప్పుడు విష్ణ్వారాధన బలీయంగా వుండి వుండే అవకాశం వుంది. ఏమైనా యీ ప్రాంతాలలో వైఖానసుల ఆవాసానికి సంబంధించిన మరిన్ని వాస్తవాలు ముమ్ముందు ఈ ప్రాంతపు చరిత్ర పరిశోధనలలోనే వెలుగు చూడగలవు.

## వైఖానసులు - ఆయుర్వేదం

ఒకప్పుడు క్షీర సాగర మథనంలో ప్రభవించిన దేవతల వైద్యుడు ధన్వంతరికీ, బ్రహ్మకూ తప్ప ఆయుర్వేద రహస్యాలెవరికీ తెలియవట. తరువాత ఆయుర్వేదాన్ని బ్రహ్మ దక్షప్రజాపతికి ఉపదేశించాడట. దక్షప్రజాపతి అశ్వనీ దేవతలకూ, తిరిగి వారు ఇంద్రునికీ దానిని ఉపదేశించారట. జనానికి రోగముల బారినుండి విముక్తి కలిగించడానికి ఇంద్రుని వద్దకు వెళ్లి ఆ వేదాన్ని నేర్చుకురాగల సమర్థుడెవరా అని యోచించి ఒకప్పుడు మహర్షులంతా హిమాలయాలలో సమావేశమై ఈ కార్యానికి భరద్వాజ మహర్షిని ఎన్నుకున్నారట. ఆయన స్వర్గలోకానికి వెళ్లి ఇంద్రుడి నుండి ఆయుర్వేదాన్ని ఉపదేశం పొంది, ఆత్రేయాది మహర్షులకు, వైఖానసులకు, వాలఖిల్యులకు ఆ శాస్త్ర రహస్యాల్ని ఉపదేశించాడట. ఇదంతా 'చరక సంహిత' అనే ప్రసిద్ధ ఆయుర్వేద గ్రంథంలో చెప్పబడింది. మిగిలిన విషయాలనటుంచి, ఆయుర్వేదాన్ని ప్రాచీన కాలంనుంచీ ఆదరించి, అధ్యయనంచేసి, ఆచరించి, ఆ శాస్త్రరీత్యా ప్రజలకు వైద్యమందిస్తున్న వారిలో వైఖానసులు ప్రముఖ స్థానం వహిస్తున్నారనడంలో సందేహం లేదు. 'అర్చకస్తు హరిస్సాక్షాత్' అన్నట్లు గ్రామస్థులకు తక్షణ వైద్య సాయాన్నందించడంలో వీరు ముఖ్య భూమిక నిర్వహిస్తున్నారు. ఆధునిక యుగంలో కూడా క్రీ॥శ॥ 1901 సం॥లో మద్రాసులో ఆయుర్వేద కళాశాల స్థాపించిన భిషగత్న కీ॥శే॥ పండిత దీవి గోపాలాచార్యులు (1872-1920) బ్రిటిష్ రాజు 5వ జార్జిచే 'వైద్య రత్న' బిరుదు పొంది 'అపర ధన్వంతరి'గా పేరుగాంచారు. వీరి స్వస్థలం కృష్ణాజిల్లాలోని మచిలీపట్నం.

## వైఖానసులు వైదికులు

ఒకప్పుడు బ్రహ్మ తన తండ్రియైన విష్ణువును గురించి వెయ్యేళ్లు తపస్సు చేశాడట. అప్పుడు బ్రహ్మ హృదయాన్నుంచి పద్మం ఆకారం కల ఒక అగ్ని పుట్టిందట. అది మూడు వేదికలతో పరిపూర్ణంగా ఉందట. ఆ అగ్ని మధ్యనుండే బ్రహ్మ వేదములనూ, ఋషులనూ, పంచభూతములు మొదలైన వాటిని సృష్టించాడట. దాని పేరే పౌండరీకాగ్ని అని వైఖానసుల విశ్వాసం. ఆ పౌండరీకాగ్నిని రగిల్చి వైఖానసులు బ్రహ్మవర్చస్ కామ, ఆయుష్కామ, శ్రీకామ, విద్యాకామ, అకల్మషకామ, శాంతికామ - మొదలైన వివిధ యజ్ఞ ప్రక్రియలు నిర్వహిస్తారు. వైదికుడు అంటే వేదములను తెలుసుకుని అనుసరించేవాడు. ఈ అర్థంలో వైఖానసులు వైదికులే. వారు కృష్ణయజుర్వేద శాఖీయులు. 32 ప్రశ్నలు, 4 లక్షల ప్రమాణాలతో కూడిన వారి కల్పసూత్రము కృష్ణ యజుర్వేదంపై ఆధారపడినదే ! వైదిక యజ్ఞాలలో వీరు ప్రతిహర్తృత్వపాత్ర వహించేవారు. 'ప్రతిహర్త' అంటే సామగానం చేసే 'ఉద్గాత'కు సహాయకుడు. వైదిక యజ్ఞాలలో షోడశ (16 మంది) ఋత్విజులుంటారు. హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ - ఈ నలుగురూకాక మరల వీరిలో ప్రతిఒక్కరికీ ముగ్గురేసి సహాయకులుంటారు. అంటే మొత్తం 16 మంది ఋత్విజులన్నమాట. ఇందులో ప్రతిహర్త అనబడే సభ్యతా పదవి శ్రీ వైఖానససూత్ర ధర్మానుష్ఠాతలదే. వారు అచ్ఛావాక సామమును గానం చేసేవారు. అచ్ఛావాక సామమునే ఉద్వంశీయ సామమంటారు. హోతకు సహాయకుడు

అచ్ఛావాకుడు. 'అగ్ని హోత్రం', 'దేవయజనం' వగైరా వైఖానసుల ఇండ్లపేర్లు వైఖానసుల యాజక వృత్తికి సంకేతాలు. అలాగే వారి హౌతృత్వానికి తార్కాణాలు. అంతేకాక, వేదవిహితమైన చతురాశ్రమ ధర్మాలలోని వానప్రస్థ ధర్మములకు ఒకరకంగా వైఖానసులు ఆది గురువులు. 'వేదాంతం' అనే ఇంటి పేరుకూడా వైఖానసులలో వుండడాన్ని బట్టి వారు ఒకప్పుడు ఉపనిషద్విద్యలలోకూడా ప్రవీణులై వుంటారనిపిస్తున్నది. ప్రముఖ తర్కవేదాంత మహావిద్వాన్ కీ॥శే॥ శ్రీమాన్ పండిత వేదాంతం జగన్నాథాచార్యులు (1894-1986 - వీరి స్వస్థలం అప్పికట్ల, గుంటూరు జిల్లా. వీరు 1955 నుండి 1986 వరకు తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన పండితులుగా వ్యవహరించారు.) వగైరా వేదపండితులు వైఖానసుల వైదిక ప్రతిభకు ఉదాహరణలు. వైఖానసులు తమ అర్చనాదులలో వేదభాష అయిన సంస్కృతాన్నే వినియోగిస్తారు. వేద స్వరూపుడైన విష్ణువునే వారు పూజిస్తారు కాని శ్రీ వైష్ణవులలా ఆళ్వారులను, ఆచార్యులను, మఠాధిపతులను, జియ్యరులనూ (జియ్యరు అంటే వైష్ణవ సన్న్యాసి) వారు తమ యిండ్లలోకాని, ఆలయాలలోకాని పూజించరు. వారు కేవలం విష్ణువుకు, విష్ణు అవతార మూర్తులకు అర్చన చేస్తారే తప్ప ఏ విధమైన పీఠాలకు, మఠాలకు వారు కట్టుబడరు. వారి విష్ణ్వర్చనా విధానాలన్నీ వేద చోదితములే. శ్రీ వైష్ణవులలా ద్రావిడ ప్రబంధాన్ని వారు పఠించరు. చతుర్వేద చోదితమైన వైదిక ఆగమం ప్రకారం సంస్కృత మంత్రాలనే వైఖానసులు పఠిస్తారు. వారు నిషేకాది అష్టాదశ (18) వేదవిహిత సంస్కార సంయుతులు. ఇలా ఏ రకంగా చూసినా వారు వైదికులే. అందుకే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1968లో ప్రచురించిన 'ఘటికాచల మాహాత్మ్యము' పీఠికలో శ్రీ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి యిలా పేర్కొన్నారు. "వైఖానసులు వసుధామరాగ్ర్యులు. వారు వైదికులు. పాంచరాత్ర వైష్ణవమున కంటె వైఖానస వైష్ణవము వైదికమైనది. అది ఉత్తర దేశము నుండి దక్షిణ దేశమునకు వచ్చినది. యజ్ఞ యాగాది క్రతు ప్రాధాన్యము కల వైదిక వైఖానసమును రామకృష్ణుడు ప్రతిపాదించుచున్నాడు."

వైఖానసుల గోత్రములన్నీ ఋషి గోత్రములు. గౌతమస, ఆత్రేయస, భారద్వాజస, కాశ్యపస, భార్గవస, కౌశికస, వసిష్ఠ, మౌద్గల్యస వగైరా వైఖానస గోత్రాలన్నీ వైదిక ఋషుల పేర్ల మీదుగా ఏర్పడినవే !

## వైఖానసుల ప్రస్థానం

వేద కాలంలో వైఖానసులు ఔత్తరాహులు. అప్పటి వారి నివాసం నైమిశారణ్యం, గంగానదీ మైదాన ప్రాంతాలు. బౌద్ధ మతం ప్రబలమవుతూన్న కొద్దీ వారు క్రమంగా దక్షిణ భారతదేశానికి వలసవచ్చారు. ఇప్పుడు వారు ప్రధానంగా నేటి కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలు, గంజాం (ఒరిస్సా), విశాఖ, వెల్లూరు (తమిళనాడు), కొచ్చిన్, కడప, బళ్లారి, అనంతపురం, కర్నూలు ప్రాంతాలలో వున్నారు. వీరి సంఖ్య తంజావూరు, తిరుచినాపల్లి, చెంగల్పట్టు, చిత్తూరు జిల్లాల్లో అత్యధికం. తిరునల్వేలి, రామనాథపురం, సేలం, కోయంబత్తూర్, ఉత్తర ఆర్కాట్, దక్షిణ ఆర్కాట్ జిల్లాలలోనూ, కొచ్చిన్, కూర్గు, మలబార్, మైసూర్ ప్రాంతాలలోనూ వీరున్నారు. తెలంగాణలో కూడా స్వల్పంగా వున్న వైఖానసులు ఉత్తర భారతదేశంలో దాదాపు లేరనే చెప్పవచ్చు.

భారతదేశంలో వైఖానసుల ప్రస్థానం ఎలా సాగిందనే విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. రామకృష్ణ కవి అభిప్రాయం ప్రకారం ఉత్తర భారత దేశాన్నుంచి ఘటికాచలానికి బ్రహ్మ పనుపున వచ్చిన వైఖానసులు ఆ తరువాత అక్కడి నుండే యితర ప్రాంతాలకు విస్తరించారు. ఇదే సరియైనదని నా అభిప్రాయం. కొందరు వైఖానసులు తమ పూర్వీకుల నైమిశారణ్యము, గంగా మైదానముల నుండి నేరుగా ఆంధ్రలోని కొన్ని ప్రాంతాలకు వచ్చి స్థిరపడ్డారని నమ్ముతున్నారు. ఇది సరికాదు. ఆదిలో వైఖానసులు ఔత్తరాహులైతే అయివుండవచ్చేమో కానీ, ఆంధ్రప్రాంతానికి రాకముందు మాత్రం వార

ప్రాయికంగా దాక్షిణాత్యులే ! ఇటీవల కాలంవరకు వారి పూర్వుల సంభాషణలలో 'సాదం', 'సాపాటు', 'పుళిహోర', 'తైరు', 'నీరు మోరు', అనే తమిళ పదాలు తరచు వస్తూండేవి. వారిని స్థానికులు, ఆచార్యులు, దేవుదారు (దేవుడివారు) అనే కాక 'నంబి'వారనీ పిలుస్తుంటారు. 'గుడిమీది క్రోతి తోదను - గుడి లోపలి నంబివారి కోదలి తోదన్' అంటూ శ్రీనాథ మహాకవి అడిగొప్పులపై వ్రాసిన చాటు పద్యంలో 'నంబి' పదాన్ని ఆనాడే ప్రయోగించాడు. నంబి అనే తమిళపదానికి అర్థం వైష్ణవ భక్తుడు. నంబూరు, నంబులపల్లి, నంబుల పులి కుంట (దీనినే యిప్పుడు నంబుల పూల కుంట అని కూడా అంటున్నారు.) వగైరా గ్రామ నామాలు వారినుండి ఏర్పడినవే. వారు తమ పిల్లలకు వాసుదేవన్, రామకృష్ణన్ వగైరా దక్షిణ దేశపు పేర్లను పోలిన పేర్లు పెట్టుకోవడం కూడా కద్దు. అలాగే వైఖానసులలో ఎవరూ 'వైఖానస', 'విఖనస' అని పలకడం లేదు. అందరూ 'వైఘానస', 'విఘనస' అనే ఉచ్చరిస్తున్నారు. వీరి తమిళ మూలాల కారణంగానే వీరు 'ఖ'ని 'ఘ'గా పలుకుతున్నారు. ఉదా॥ తమిళులు 'మేఖల'ను 'మేఘల' అని పలుకుతారు. ఈ తమిళ వాసనే వారు ఆంధ్ర ప్రాంతానికి తమిళ ప్రాంతాన్నుంచి వలసవచ్చి వుంటారని ధృవ పరుస్తున్నది. అలాగే వారు ఘటికాచలాన్నుంచే అన్ని ప్రాంతాలకు విస్తరించారనే రామకృష్ణ కవి వాదనను కూడా ఋజువు పరుస్తున్నది. అయితే వారి యిండ్ల పేర్లన్నీ తెలుగు ప్రాంతపు ఊళ్లపేర్లుగానే వుండడాన్ని బట్టి ఆంధ్రప్రాంతంలో ఇండ్లపేర్లు ఏర్పడడానికి ముందే వైఖానసులు తమిళప్రాంతాల నుండి వలసవచ్చి వుంటారని ధృవపడుతున్నది. వైఖానసుల ఇండ్ల పేర్లలో ఒక్కటికూడా తమిళ ప్రాంతపు ఊరుపేరు లేకపోవడం గమనించదగిన విశేషం. శ్రీ వైష్ణవులు అలాకాక, ఆ తరువాత చాలకాలానికి ఆంధ్రప్రాంతానికి వలస వచ్చినందున వారి యిండ్ల పేర్లలో తమిళనాడులోని ఊళ్ల పేర్లైన శ్రీరంగం, మధురాంతకం, కిళాంబి, వానమామలై, ముదుంబై, కీళాత్తూరు, కలయూర్ వగైరాలు వుండడం మనం గమనించవచ్చు. వారంతా ఆ యా గ్రామాల నుండి వచ్చి వుంటారని మనం అర్థం చేసుకోవచ్చు. 12వ శతాబ్దం 2వ అర్ధ భాగంలో అంటే క్రీ.శ. 1150 తరువాత తెలుగు సీమలో ఇండ్లపేర్లు ఏర్పడ్డాయని నా విశ్వాసం. కాబట్టి వైఖానసులు అంతకుముందే ఆంధ్రప్రాంతాలకు వలస వచ్చి వుంటారు. ఆ తరువాత వచ్చిన వారు కూడా కొందరు వుండవచ్చు.

మనం ముందే చెప్పుకున్నట్లు పంచ సంస్కారములు (తాపం, పుండ్రం, నామం, మంత్రం, యాగం) పొందిన ఏ వ్యక్తియైనా పాంచరాత్ర శాఖలోకానీ, ఉత్తర భారతదేశపు భాగవత శాఖలోకానీ చేరవచ్చును. కాని, యితర సూత్రాలవారు పంచసంస్కారం పొందినా వైఖానసులుగా మారడానికి అవకాశం లేదు. వైఖానసులెవరైనా జన్మతః వైఖానసులు కావలసిందే! ఈ సంకుచిత నియమం కారణంగా వీరి జనసంఖ్య నానాటికీ సన్నగిల్లి వైఖానసులు భారతదేశంలో అల్పసంఖ్యాకులుగానే వున్నారు. శ్రీ వైష్ణవులు మాత్రము విశాల దృక్పథంతో దక్షిణ భారత దేశంలోని వెనుకబడిన కులాల వారందరినీ తప్తచక్రాంకనముల ద్వారా తమలో కలుపుకొని, పండితుల భాషయైన సంస్కృతంలో కాక ప్రజల భాషయైన తమిళభాషలో ఉన్న ద్రావిడ ప్రబంధాన్ని అర్చనలో చదవడం కారణంగా సామాన్య ప్రజలకు మరింత దగ్గరై బాగా విస్తరించారు. వైఖానసులు నానాటికీ అల్ప సంఖ్యాకులైపోయారు.

## ఆచార్య శబ్ద ప్రాశస్త్యము

ఇక వైఖానసుల పేరు చివరనున్న 'ఆచార్య' శబ్దాన్ని గురించి కూడా కొంచెం విచారిద్దాం. 'మన్త్ర వ్యాఖ్యా కృదాచార్యః' అని అమరం. కల్పసూత్రాది సహితమైన వేదమంత్రాల్ని అధ్యయనం చేయించి అర్థము తెలియజెప్పేవాడే ఆచార్యుడని అర్థం. 'ఆచారం గ్రాహయతీతి ఆచార్యః' అని మరో నిర్వచనం. 'సంప్రదాయమును గ్రహింపజేసేవాడు ఆచార్యుడు' అని

దీనర్థం. ఆదివైష్ణవులైన వైఖానసులు మొదటగా తమ పేర్ల చివర 'ఆచార్య' శబ్దాన్ని ధరించగా, తరువాతికాలం వారైన పాంచరాత్రులు, శ్రీవైష్ణవులు, ఆ తర్వాత ఈ ఉత్తర నామాన్ని ధరించారు. ఇదేకాక వైఖానసులలో శర్మ, శాస్త్రి, దీక్షితులు వగైరా ఉత్తరనామాలు కూడా అక్కడక్కడా కనుపిస్తాయి. బ్రాహ్మణేతరులలో ముందుగా విశ్వబ్రాహ్మణులు బ్రాహ్మణులవలెనే పేరుచివర 'శర్మ', 'శాస్త్రి', 'ఆచార్య' శబ్దాల్ని ధరించనారంభించారు. 'శృణా త్యశుభమితిశర్మన్' అంటే 'అశుభమును చెరిచేది శర్మన్'. అంటే 'శుభాన్ని కలిగించేది శర్మన్'. 'శర్మ వర్మ మమాంతరమ్' అంటే 'శర్మ నాలో వుండి నాకు ఆధ్యాత్మిక రక్షణనిచ్చే కవచం' అని ఒక సామవేద మంత్రంలో పేర్కొనబడింది. అనగా భౌతిక రక్షణ ఏ విధంగానైతే వర్మ (*Coat of mail* - కవచం) కలిగిస్తుందో అలా ఆధ్యాత్మిక రక్షణ కలిగించేవాడు శర్మ అనబడ్డాడు. 'శాస్త్రం వేత్తీతి శాస్త్రవిత్' అనీ 'శాస్త్రజ్ఞాన మధీయతే యితి శాస్త్రిః' అనీ శాస్త్రి పదానికి నిర్వచనాలు. ఒకప్పుడు వెలమ కులస్తులకే పరిమితమైన 'రావు' అనే పదం నేడు అన్ని కులాల వారూ ధరిస్తున్నట్లే – ఒకప్పుడు బ్రాహ్మణులకే పరిమితమైన 'ఆచార్య', 'శర్మ', 'శాస్త్రి' వగైరా ఉత్తర నామాలు యిలా క్రమంగా శాస్త్రజ్ఞానం కలిగి, ఆధ్యాత్మిక రక్షణకు పూనుకున్న వారెవరైనా – వారు జన్మరీత్యా బ్రాహ్మణేతరులే అయినా – ధరించడం మొదలుపెట్టారు. ఇలా బ్రాహ్మణేతరులైన విశ్వబ్రాహ్మణులలో కొండూరు వీరరాఘవాచార్యులు, కొండూరు వేంకట కృష్ణశాస్త్రి, శ్రీరాం పూర్ణయ్య శర్మ, యర్రోజు మాధవాచార్యులు, వజ్రాల రాజలింగ శాస్త్రి, అలాగే కమ్మవారిలో వీరమాచనేని ఆంజనేయశాస్త్రి, కావూరి గోపదేవశాస్త్రి, పాలడుగు శేషాచార్యులు, కొసరాజు అప్పయ్య శాస్త్రి, తెలగ (కాపు) వారిలో ఊరుబండి ఆచార్యులు, పద్మశాలీయ బహూత్తములలో దామర్ల రామశాస్త్రి, క్రైస్తవులలో క్రైస్తవాచారి, దయాచారి, ప్రేమాచారి, అంతర్వేది శాస్త్రి, మిల్టన్ శాస్త్రి వగైరా బ్రాహ్మణ ఉత్తర నామాలు నాకు తటస్థించాయి.

## ఊర్ధ్వ పుండ్రములు

వైష్ణవులందరూ అంటే విష్ణువును పూజించేవారంతా తప్పనిసరిగా ఊర్ధ్వ పుండ్రాలను ధరిస్తారు. ఊర్ధ్వ పుండ్రములంటే పంగనామాలు. ఈ పంగ నామాలు రెండు రకములు. ఒకటి ఆంగ్ల భాషలోని 'యు' అక్షరము వలె పెట్టుకొనబడే నామం. దీనిని 'వడకలై' లేక 'వడహల' నామం అంటారు. రెండవది ఆంగ్లభాషలోని 'వై' అక్షరము వలె పెట్టుకొనబడే నామం. దీనిని 'తెన్‌కలై' లేక 'తెంగల' నామం అంటారు. మనం లోగడ చెప్పుకున్నట్లే వైష్ణవంలో దక్షిణ భారతదేశంలో 'తెంగల' మరియు 'వడహల' అనే శాఖా భేదాలు ఏర్పడ్డాయి. తమిళంలో 'తెంగలై' అంటే 'దక్షిణ ప్రాంతపు భాష – తమిళం' అని అర్థం. 'వడకలై' లేక 'వడహల' అంటే 'ఉత్తర ప్రాంతపు భాష – సంస్కృతం' అని అర్థం. తమిళ భాషను అభిమానించి, ద్రావిడ ప్రబంధమునే దేవాలయాల్లో పఠిస్తూ, తప్త చక్రాంకనముల ద్వారా ఏ కులంవారినైనా వైష్ణవంలోనికి మారుస్తూ తమ శాఖను విస్తృతపరచుకున్నారు తెంగల వైష్ణవులు. వారి నామం క్రింద పాదం వుండి అది ఆంగ్ల భాషలోని 'వై' అక్షరాన్ని పోలి వుంటుంది. [ U] సంస్కృతాన్ని మాత్రమే గౌరవిస్తూ, సంస్కృతంలోనివైన వేదమంత్రాల్ని మాత్రమే విష్ణ్వర్చనలో ఉపయోగిస్తూ, పంచ సంస్కారాలు చేసుకున్నప్పటికీ, ఇతర కులాల లేక శాఖల వారిని తమలో కలుపుకొనటానికి నిరాకరిస్తూ తాము ఆది వైష్ణవులమూ, ఆగర్భ వైష్ణవులమూనని భావిస్తూ, 'విష్ణుబలి' అనే సంస్కార ప్రక్రియలో తప్త చక్రాంకనము చేసిన పాయసం గర్భిణికి తినిపించడం ద్వారా పుట్టుకకు ముందే శిశువు వైష్ణవుడుగా మారతాడని నమ్ముతూ అల్ప సంఖ్యాక వర్గంగా ఒకప్పుడు ప్రస్తుత తమిళ ప్రాంతంలోని ఉత్తర భాగంలో వుండిన ఒకప్పటి 'వడహల' సంప్రదాయానికి చెందిన వైఖానసులు ధరించేది 'వడహల' నామం. దీనిలో క్రింద పాదం వుండక ఇది ఆంగ్ల

భాషలోని 'యు' అక్షరాన్ని పోలివుంటుంది. [ U ]

తెంగలవారు కానీ, వడహలవారు కానీ - ఇద్దరూ తిరుమణి (తిరుమణ్ అంటే తమిళంలో పవిత్రమైన మట్టి) అనే నామము (సుద్ద – *white pipe - clay.* దీనినే తెల్లమన్ను లేక శ్వేత మృత్తిక అని కూడా అంటారు.)తో తెల్లని 'యు' ఆకారంలోని నామం ధరిస్తారు. శ్రీ వైష్ణవులు లేక తెంగల వైష్ణవులు అదనంగా ఆ నామం క్రింద పాదం కూడా పెట్టుకుంటారు. పైన తెలిపిన 'యు' ఆకారపు నామంలో వైఖానసులు లేక వడహల సంప్రదాయపు వారు పసుపు పచ్చటి నిలువు బొట్టును ధరిస్తారు. పసుపు కొమ్ములను నీడలో ఎండించి, పొడిచేసి, మెత్తని బియ్యపు పిండిని దానితో కలిపి వస్త్రకాళితం చేసిన మెత్తని పొడిలో నీటిని కలిపి సదరు పసుపుపచ్చని నామాన్ని వైఖానసులు ధరిస్తారు. ఆ పొడిని వారు శ్రీచూర్ణం అంటారు. తెంగల సంప్రదాయానికి చెందిన వారు (శ్రీవైష్ణవులు) పైన తెలిపిన 'యు' ఆకారపు నామంలో రక్తవర్ణపు లేక కెంపువన్నె (*Crimson colour*) నామాన్ని ధరిస్తారు. సదరు నామం కోసం వారు వాడే చూర్ణాన్ని తిరుచూర్ణం అంటారు. దానినిలా తయారు చేస్తారు. పసుపుకొమ్ములను నిమ్మరసం, వెలిగారం (వెలిగారము లేక టంకణ క్షారము - *Borax* - $Na_2B_4O_7 10H_2O$) కలిపిన ద్రవములో ఊరవేసి ఆ తరువాత నీడలో సదరు కొమ్ములను ఎండబెట్టి పొడిచేస్తారు. అదే తిరుచూర్ణం. వీరు నామం ధరించేటప్పుడు అదనంగా ముక్కుపైకి పాదాన్ని కూడా దిద్దుకుంటారు. ఇదీ 'తెంగల' – 'వడహల' నామాల మధ్య వున్న తారతమ్యం.

## వైష్ణవులలో శాఖాభేదాలు

విష్ణువును పూజించే వారందరూ వైష్ణవులే. ఐతే ప్రస్తుత వైష్ణవులలో మూడు శాఖలున్నాయి. మొదటిది ఆదివైష్ణవులైన వైఖానసులు. వీరు ఒకప్పటి తమిళ దేశంలోని ఉత్తర ప్రాంతంలో ప్రబలంగా ఉండిన 'వడకలై' (వడహల) సంప్రదాయానికి నేటి ప్రతినిధులు. రామానుజుని అనంతరం వేదాంత దేశికర్ (వేదాంత దేశికుడి) నేతృత్వంలో 'వడహల'శాఖ, మనవాళముని, శ్రీమాన్ పిళ్లై లోకాచార్యులు వగైరాల నేతృత్వంలో 'తెన్‌కలై' లేక 'తెంగల' శాఖ ఏర్పడ్డాయి. ఇప్పుడు 'శ్రీవైష్ణవులు' లేక క్లుప్తంగా 'వైష్ణవులు' అని పిలువబడుతూన్న వారు అప్పటి 'తెంగలశాఖ'కు ప్రతినిధులు. ఈ రెండు శాఖలవారూ పూజించేది విష్ణువునే అయినా వారి ఆచార వ్యవహారాలలో ఎన్నో భేదాలున్నాయి. 'పాంచరాత్రులు' అనబడే మరొక వైష్ణవ శాఖ కొన్ని 'తెంగల' సంప్రదాయాలను, కొన్ని 'వడహల' సంప్రదాయాలను పాటిస్తూ 'మిశ్ర వైష్ణవం'గా కనుపిస్తున్నది. వైఖానసులవలె వీరుకూడా మొదట్లో వేదాంత దేశికుల అనుయాయులే అయినా కాలక్రమంలో వీరిపై శ్రీవైష్ణవుల ప్రభావం పడినట్లు ప్రస్ఫుటంగా కనుపిస్తున్నది. ఈ రెండు శాఖలూ పాంచరాత్రాగమాన్నీ, ఆపస్తంబ సూత్రాన్నీ పాటించడమే దీనికి కారణం కావచ్చు. ప్రస్తుతం ఎన్నో విషయాలలో శ్రీవైష్ణవులకు దగ్గరగా వున్న పాంచరాత్ర శాఖవారు నామం తదితర కొన్ని పద్ధతుల విషయంలో నేటికీ వైఖానసులను పోలి వుండడం ఒక చారిత్రక దశలో వీరు వైఖానసుల నుండి విడివడ్డారని సూచిస్తున్నది. ఇరువురూ ఒకప్పుడు వేదాంత దేశికానుయాయులైన వైష్ణవులే కదా!

తమిళ దేశంలోని ఉత్తర ప్రాంతంలో వడకలై సంప్రదాయం ప్రబలంగా వున్నప్పటికీ తెంగల వైష్ణవులు కూడా అక్కడ అల్ప సంఖ్యాకులుగా వుండేవారు. ఉదాహరణకు కంచి తమిళ దేశంలోని ఉత్తర ప్రాంతంలోనే వుంది. అక్కడి మొత్తం 18 విష్ణ్వాలయాలలో వరదరాజస్వామి ఆలయం అతి ప్రధానమైనది. మిగిలిన 17 ఆలయాలూ వడహల వైష్ణవుల ఆధీనంలో వుండగా వరదరాజస్వామి ఆలయం మాత్రం నాటి నుండి నేటికీ తెంగల వైష్ణవుల ఆధీనంలోనే వుంది. యావద్దక్షిణ

భారత దేశంలో తెంగల శాఖకు జీవం పోసిన తాతాచార్యులు తమిళదేశంలోని ఉత్తర ప్రాంతానికి చెందిన కాంచీపురానికి చెందినవాడు కావడం విశేషం. ఉత్తర ప్రాంతంలోనూ తెంగలవారున్నప్పటికీ వారు అల్పసంఖ్యాకులు. అలాగే తమిళదేశంలోని దక్షిణ భాగాలలో 'వడహల' శాఖ వారు అల్పసంఖ్యాకులు. విఖనస ముని సంకలనం చేసిన 'శ్రీ సూత్రము' ను పాటించే వైష్ణవులు కనుక వైఖానసులు శ్రీవైష్ణవులే. రామకృష్ణకవి తన రచనలలో వైఖానసులను శ్రీవైష్ణవులనే పేర్కొన్నాడు. అయినా జన వ్యవహారంలో 'శ్రీవైష్ణవ', 'వైష్ణవ' పదాలు క్రమంగా 'తెంగల'శాఖ వారికి పర్యాయపదాలై, 'వడహల'శాఖ వారు తమ మూల పురుషుడైన విఖనసునిపేర వైఖానసులని పిలువబడసాగారు. కాలక్రమంలో 'విష్ణుబలి' వంటి కొన్ని సడలింపులేని కఠినమైన ఆచారాల కారణంగా వైఖానసులు అల్పసంఖ్యాకులైపోయి, తప్తచక్రాంకనముల ద్వారా జన బాహుళ్యంలో విస్తరించిన 'తెంగల' శాఖవారు 'శ్రీవైష్ణవ', 'వైష్ణవ' పదాలను గుత్తకు తీసుకొనడానికి దారితీసింది.

ఈ వైష్ణవ శాఖలకున్న భేదాలను క్లుప్తంగా పరిశీలిద్దాం. ఊర్ధ్వపుండ్రముల విషయంలో వైఖానసులు నుదుటిపై విష్ణుపాదాకృతిలో వట్రువుగా [ ] ఆకారంలో తిరుమణిని (నామును) ధరించి మధ్యలో శ్రీచూర్ణం అనే హరిద్రాచూర్ణము (పసుపు పొడిని) ధరిస్తారు. పాంచరాత్రులు వైఖానసుల వలె ఇదే తరహా ఊర్ధ్వపుండ్రం ధరిస్తారు. అయితే శ్రీవైష్ణవులు (తెంగల వారు) తిరుమణిని వట్రువుగా ధరించి ముక్కుపైకి [ ] ఆకారంలో పాదం దిద్దుకొని మధ్యలో నిలువుగా ఎర్రని తిరుచూర్ణం ధరిస్తారు. వైఖానసులూ, పాంచరాత్రులూ భగవద్విగ్రహాలకూ, భాగవతులకూ (భగవద్భక్తులకూ) అనేక పర్యాయాలు నమస్కరిస్తారు. శ్రీవైష్ణవులు ఏక ప్రణామాన్ని పాటిస్తారు. తెంగలవారు అర్చనా కాలంలో ఘంటానాదం చేయరు. పాంచరాత్రులు నైవేద్య సమర్పణ సందర్భంగా గంట మ్రోగిస్తారు. వైఖానసులు అర్చన ప్రారంభంలోనూ, నైవేద్య సమర్పణ సందర్భంగానూ గంట మ్రోగిస్తారు. వైఖానసులూ, పాంచరాత్రులూ దేవాలయం చుట్టూ రెండు మార్లు ప్రదక్షిణ చేస్తారు. శ్రీవైష్ణవులు ఒకేసారి ప్రదక్షిణ చేస్తారు. భర్త మరణించిన స్త్రీకి (వితంతువుకు) వైఖానసులూ, పాంచరాత్రులూ శిరోముండనం /కేశఖండనం చేయిస్తారు. శ్రీవైష్ణవులకా ఆచారం లేదు. ఇక వానప్రస్థాశ్రమ విధుల ప్రస్తావన ఒక్క వైఖానస సూత్రములోనే వుంది. పాంచరాత్ర, శ్రీవైష్ణవులకు ఈ వానప్రస్థ విధి లేదు. వైఖానసులు విష్ణు, పురుష, సత్య, అచ్యుత, అనిరుద్ధ వ్యూహ భేదములతో ధృవ, కౌతుక, స్నపన, ఉత్సవ, బలి బేరాలతో (విగ్రహములతో) పంచ బేరార్చన చేస్తారు. రామకృష్ణకవి "పాంచరాత్రులు పై అయిదు బేరములు కాక 'బాలాలయ' బేరాన్ని కూడా అర్చిస్తారని" పేర్కొన్నాడు. దీని అవసరం మహాసంప్రోక్షణ కాలంలోనే వస్తుందట. మూల విగ్రహ స్థానములను బాగుచేయవలసి వచ్చినప్పుడు ఆ విగ్రహమును ఆ స్థానము నుండి కదలించుటకు ముందు ఆ విగ్రహస్థమైన కళావైభవమును యీ ఆరవ బేరమునకు ఆవాహన చేస్తారట. ఆ తరువాత ఆ విగ్రహాన్ని అక్కడి నుండి తీస్తారట. తిరిగి ఆ విగ్రహం సుస్థిరంగా నెలకొల్పబడేవరకు నిత్యనైమిత్తికాది కైంకర్య కార్యకలాపములన్నీ బాలాలయ బేరమునకే జరుగుతాయట. వైఖానసులు యిలాంటి సందర్భాలలో ఆ భగవంతుడిని ఆరవ బేరంలోకి కాక పూర్ణకుంభములోనికి ఆవాహన చేస్తారట. అలాగే వైఖానసులు పంచ బేరములలోనికి వరుసగా కృష్ణ, పురుష, సత్య, అచ్యుత, బుద్ధులను ఆవాహన చేస్తారని రామకృష్ణకవి తెలిపాడు. అలా రామకృష్ణకవి వైఖానస ఆవాహన దేవతలలో విష్ణువుకు బదులుగా కృష్ణుడినీ, అనిరుద్ధునికి బదులుగా బుద్ధుడినీ పేర్కొనడానికి కారణమేమై వుంటుందో! వైఖానసులు సంపూర్ణ సూత్రాన్ని కలిగి సర్వం విష్ణుపరమైన వైదిక మంత్రాలతో అర్చన సాగిస్తారు. అసంపూర్ణమూ, తాంత్రికమూ, అమంత్రకమూ, క్రియాపరమూనైన పాంచరాత్ర అర్చనాక్రమం కూడా సర్వం విష్ణుపరమే! పాంచరాత్రాగమాన్ని అనుసరించి శ్రీ రామానుజులు రూపొందించిన స్వసూత్రం ఆధారంగా జరిగే శ్రీవైష్ణవ అర్చనాక్రమం వాసుదేవపరం. తప్తచక్రాంకనము చేయబడిన పాయసమును గర్భిణి తినడం ద్వారా గర్భస్థ శిశువుకు అంకన సంస్కారం లభిస్తుందనీ,

అతడు ఆగర్భవైష్ణవుడౌతాడనీ వైఖానసుల విశ్వాసం. కనుక వారు ప్రత్యేకించి చక్రాంకనం చేయించుకొనడం కానీ, దీక్షా స్వీకరణ కానీ, గురువు నుండి మంత్రోపదేశం పొందడం కానీ చేయవలసిన అవసరం లేదట. పాంచరాత్రులకూ, శ్రీవైష్ణవులకూ తప్తచక్రాంకనం తప్పనిసరి. ఊర్ధ్వపుండ్రాలను వైష్ణవులెవరైనా బొడ్డుకుపైగా పన్నెండు చోట్ల (ద్వాదశ ఊర్ధ్వపుండ్రములు) ధరించాలట. అవి పొట్టపై – 3; ఛాతీపై – 1; భుజాలపై – 2; వెన్నుపూస మొదట్లో – 1; కంఠంపై – 3; నుదుటిపై – 1; వెన్నుపూస చివర – 1 – మొత్తం 12. వైఖానసులు ద్వాదశ ఊర్ధ్వపుండ్రధారణ పూర్తయిన పిదప మొదట కలుపుకున్నదానిలో మిగిలిన తిరుమణినీ, శ్రీచూర్ణాన్నీ పరిత్యజిస్తారు. పాంచరాత్రులూ, శ్రీవైష్ణవులూ ఆ మిగిలిన తిరుమణినీ, తిరుచూర్ణాన్నీ వదలివేయకుండా ఆ పదార్థంతో శిరస్సుపై (మాడుపై) పదమూడవ నామాన్ని ధరిస్తారు. బ్రాహ్మణేతర కులం నుండి వైష్ణవం స్వీకరించిన ప్రపన్నుడు వైష్ణవుడే కానీ, జన్మవైష్ణవుడు కాదనీ, అంచేత అతడికి ఆలయాలలో అర్చనార్హత లేదనీ వైఖానసుల నమ్మకం. పాంచరాత్రులూ, శ్రీవైష్ణవులూ బ్రాహ్మణేతర కులానికి చెందిన ప్రపన్నుడు వైష్ణవం స్వీకరిస్తే, అతడికి అర్చనార్హత బ్రాహ్మణునితోపాటు సమానంగా వుంటుందని విశ్వసిస్తారు. ఈ విషయంలో వైఖానసులు సంప్రదాయశృంఖలాబద్ధులై (*Conformist*) నందున అల్పసంఖ్యాకులుగా మిగిలిపోయినట్లూ, పాంచరాత్ర, శ్రీవైష్ణవ శాఖలు సంప్రదాయేతర పద్ధతి (*Heretic*) ననుసరించి, సమాజంలోని అన్ని వర్గాల ప్రజల అభిమానాన్ని విశేషంగా చూరగొన్నట్లూ తెలుస్తున్నది. మనం లోగడ చెప్పుకున్నట్లే వైఖానసులు కేవలం విష్ణువునూ, విష్ణు అవతార మూర్తులనూ మాత్రమే అర్చిస్తారు. ఇంటిలోకానీ, ఆలయంలోకానీ వారు ఎటువంటి ఆళ్వారులనూ, ఆచార్యులనూ, మఠాధిపతులనూ, జియ్యరులనూ పూజించరు. వైఖానసులకు ప్రత్యేక పీఠములు, గురువులు లేరు. విష్ణువునే గురువుగా చేసుకొన్న విఖనసుడి అనుయాయులు వీరు. ప్రతి విష్ణుపీఠమూ వీరికి పీఠమే. పాంచరాత్ర, శ్రీవైష్ణవ శాఖలవారికి ప్రత్యేక గురువులున్నారు, పీఠములున్నాయి. తెంగల శాఖకు చెందిన వారు విష్ణ్వాలయాలలో తమిళ ప్రబంధాన్ని చదువుతారు. 'వడహలశాఖ'వారు వేదచోదితములైన వైఖానసాగమంలోని సంస్కృత మంత్రాల్ని మాత్రమే చదువుతారు. వారు 'దేవభాష'యైన సంస్కృతానికి పరిమితమై జనబాహుళ్యంలో విస్తృతికి నోచుకొనక అల్పసంఖ్యాకులుగా మిగిలిపోయారు. ప్రజల భాషయైన తమిళంలో విష్ణుభక్తిని పాశురాల ద్వారా ప్రచారం చేసి అప్పటికే ఆళ్వారులు వైష్ణవాన్ని ప్రజాబాహుళ్యంలో ముఖ్యంగా వెనుకబడిన వర్గాలలో విస్తరింపజేశారు. దీనిని తెంగల శాఖవారు మరింత ముందుకు తీసుకెళ్లి వారి శాఖను విస్తరించుకున్నారు. గురుశిష్య సంబంధాల విషయంలో తెంగల వారిది మార్జాల కిశోర న్యాయం. అంటే పిల్లి తన పిల్లల్ని ఒక చోటినుండి మరొకచోటుకు తరలించేటప్పుడు నోట కరచుకొని ఎలా జాగ్రతగా తీసుకెళ్తుందో, అలాగే శిష్యుని ఆధ్యాత్మికోన్నతిలో గురువు పాత్ర అతి ప్రధానమైనది. పిల్లిపిల్ల వలెనే శిష్యుడు అక్కడ నిమిత్తమాత్రుడే. వడహల (వైఖానస) సంప్రదాయంలో భగవంతుడు తప్ప వేరే గురువులే వుండరు. వీరిది మర్కట కిశోర న్యాయం. గురువైన భగవంతుడిని శిష్యుడైన భక్తుడు కోతి పిల్ల తన తల్లిని ఎప్పుడూ ఎలా అప్రమత్తంగా కరుచుకుని ఉంటుందో అలా వెన్నంటి వుండే బాధ్యత భక్తునిదే. శ్రీవైష్ణవుల (తెంగల వారి) లో వలె వైష్ణవ దీక్షా స్వీకరణ, చక్రాంకనము, మంత్రోపదేశము వగైరాలు అవసరంలేని ఆగర్భ వైష్ణవులు లేక జన్మ వైష్ణవులు కనుక వడహల (వైఖానస) శాఖవారికి గురువు (ఆచార్యుని)తో అసలు పనేలేదు. కాని తెంగలవారికి గురువు సాక్షాత్తూ రెండో దైవం. పాంచరాత్ర, శ్రీవైష్ణవములతో పోలిస్తే వైఖానసము యజ్ఞయాగాది క్రతువులకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చింది. కర్మ, జ్ఞాన, భక్తి, యోగములను పాటింపలేని వారికి అంతకంటే సులభోపాయము 'ప్రపత్తి' అని వడహల సంప్రదాయపు వారంటే, సర్వులకూ ప్రపత్తియే శరణ్యమని తెంగలవారంటారు. వీరి భోజన ప్రక్రియలోకూడా కొన్ని భేదాలున్నాయి. వైష్ణవులందరూ భోజనమునకు వాడే అరటి ఆకును లేక విస్తరను నేయి రాచి అభిఘారము చేస్తారు. అయితే వైఖానసులు,

పాంచరాత్రులు ఆ విస్తరలో నిర్వ్యంజనమైన సాదం (కూరలు వగైరాలు లేని వట్టి అన్నం) వడ్డించగానే పరిషేచనం చేసి (నీటిని చేతితో విస్తర చుట్టూ చల్లుకుని) ప్రాణాగ్నిహోత్ర విధానంలో భోజనానికి ఉపక్రమిస్తారు. శ్రీవైష్ణవులు విస్తరలో లవణాన్వితములైన వ్యంజనములన్నియూ వడ్డించబడిన తరువాతనే పరిషేచనం చేసి భోజనానికి ఉపక్రమిస్తారు. మిగిలిన వైష్ణవ శాఖలవలె వైఖానసులకు ధనాసక్తిగానీ, మోక్ష సంపాదనాసక్తిగానీ లేదట. రామకృష్ణకవి రచించిన 'ఘటికాచల మాహాత్మ్యము'లో భృగువు నారదుడితో 'విష్ణువును పూజించే ధరణిసురులు దేవత్వం ప్రాప్తించి దేవతలై పోతారంటారు కదా! అప్పుడు వీరు లేకపోతే విష్ణుపూజ లెలా జరుగుతాయి?' అని ప్రశ్నిస్తే నారదుడు దానికి సమాధానంగా 'ఘనులైన వైఖానసులకు కమలోద్భవుడు (బ్రహ్మ) ఈ విష్ణు పూజనే వరంగా యిచ్చాడు. వీరు ఏ మోక్షాసక్తీ కూడా లేకుండా విష్ణుపూజకు అంకితమయ్యేవారు కాబట్టి వీరికి పై నియమం వర్తించదు. పైపెచ్చు వీరు కూలి తీసుకుని అర్చన చేసేవారు కాదు. విష్ణ్వర్చన వారికి జన్మహక్కుగా సంక్రమించింది. అందుకోసమే వారు సృష్టించబడ్డారు' అంటాడు. అంటే రామకృష్ణకవి చెప్పినదాని ప్రకారం ఎటువంటి ధన సంపాదనాసక్తి, మోక్ష ప్రాప్తికై ప్రాకులాట లేకుండా విష్ణువును అర్చిస్తూ వుండడమే వైఖానసుల విధి అన్నమాట.

ఇంకా ఈ వైష్ణవ శాఖల ఆచార వ్యవహారాలలోని సామ్యాలూ, భేదాలూ చాల వున్నప్పటికీ ముఖ్యమైన వాటిని మాత్రమే మీ ముందుంచాను.

వైష్ణవునిగా మారిన అనంతరం తన గురువైన భట్టరు చిక్కాచార్యులు ప్రభావంతో తెనాలి రామకృష్ణకవి కూడా ఆది వైష్ణవమైన వైఖానసాన్నే అనుసరించాడు. సంస్కృత భాషనే అభిమానించి, 'వడహల' తిరు నామాన్నే ధరించాడు. ఆయన ప్రత్యర్థియైన 'తెంగల' వైష్ణవ గురువు తాతాచార్యులపట్ల ద్వేషంతోనే తెనాలి రామకృష్ణకవి 'వడహల' వైష్ణవాన్ని స్వీకరించినట్లు కనుపిస్తున్నది. అంతేకాక, రామకృష్ణుడు గొప్ప సంస్కృత పండితుడు కూడా. (వడకలై అంటే ఉత్తరాది భాషయైన సంస్కృతం అని అర్థం.) తప్త చక్రాంకనమునకెంతో ప్రాధాన్యత నిచ్చిన తాతాచార్యులు కూడా గొప్ప సంస్కృత పండితుడే అయినా, తన స్వస్థలం తమిళదేశపు ఉత్తర ప్రాంతంలోని కాంచీపురమే అయినా, తాతాచార్యులు వడకలై సంప్రదాయపు ఛాయలకు కూడా పోకుండా, తమిళ భాషకు ప్రాధాన్యతనిచ్చి, తెంగల శాఖకు దక్షిణ భారతదేశంలో జీవం పోశాడు. 'తాతాచార్యుల వారి ముద్ర బుజానికి తప్పినా వీపుకు తప్పదు' అనే నానుడి ఆయన ప్రభువర్గాల సహకారంతో ఎంత ఉధృతంగా తప్త చక్రాంకనము చేయించి తెంగల వైష్ణవ శాఖ విస్తృతికి పాటుపడ్డాడో తెలియజేస్తుంది !

వడకలై, తెన్‌కలై శాఖా భేదాలను వివరంగా తెలుసుకొనే నిమిత్తం ఎందరో శ్రీ వైష్ణవ, పాంచరాత్ర, వైఖానస శాఖీయులను కలిశాను. ఎన్నో గ్రంథాలను పరిశీలించాను. యథాశక్తిగా సమగ్ర సమాచారాన్ని పాఠకుల ముందుంచడానికి ప్రయత్నించాను. ఆ క్రమంలోనే రంగారెడ్డి జిల్లా చిలుకూరు బాలాజీ దేవస్థాన ప్రధాన అర్చకులు సౌందర రాజన్ గారిని కూడా కలిశాను. ఆయన మరెవ్వరూ చెప్పని ఓ వింత విషయం చెప్పారు. అదేమిటంటే - వైఖానసులలో కూడా తెంగల శాఖ వారున్నారని. నాకెందుకో అది విశ్వసనీయంగా కనుపించలేదు. వైఖానసులు ఉత్తర భారత దేశం నుండి వలస వెళ్లి ద్రావిడ దేశంలో స్థిరపడిన వారవడమే కాక, వారు 'వడకలై'ని (అంటే ఉత్తరాది భాషయైన సంస్కృతాన్ని) మాత్రమే అర్చనలో వినియోగిస్తారు కనుకనే, 'తెన్‌కలై' శాఖ వారైన శ్రీ వైష్ణవులకు భిన్నంగా వైఖానసులను 'వడకలై' శాఖ వారిగా వ్యవహరించారు. వేదాంత దేశికుల అనుయాయులుగా వడకలై శాఖగా ఏర్పడినప్పుడు ఆ శాఖలో కేవలం నేటి వైఖానసులే కాక, నేడు పాంచరాత్ర శాఖీయులుగా వున్నట్టి వారు కూడా కొంత కాలం కలిసి వున్నారు. అంచేతనేనేమో యింకా కొన్ని ప్రాంతాలలో పాంచరాత్ర శాఖీయులను వడకలై శాఖ వారంటున్నారు. మనమింతకు పూర్వం చెప్పుకున్నట్లు పాంచరాత్ర

శాఖీయుల పూజాదికములు, ఆచార వ్యవహారములలో నేటికీ కొన్ని వైఖానస విధానములనూ, కొన్ని శ్రీ వైష్ణవ విధానములనూ పోలి వుండడం గమనించదగిన విశేషం. ఏమైనప్పటికీ నాటి వడకలై శాఖ నియమావళికీ, వారి ఆచార వ్యవహారాలకూ నేటి వైఖానసులే పూర్తి ప్రతినిధిత్వం వహిస్తున్నారు కనుక, వైఖానసులంటేనే వడకలై లేక వడహల శాఖ వారని మనం సాధారణ పరిభాషలో భావించవచ్చు.



# అనుబంధము - 3

# రామకృష్ణ కవి కావ్యాలలోని సారూప్యతలు

తెనాలికి చెందిన గార్లపాటి రామలింగ కవి 'ఉద్భటారాధ్య చరిత్రము', మరికొన్ని కావ్యాలు రచించి 'కుమార భారతి' బిరుదు పొంది, ఆ పిమ్మట వైష్ణవం స్వీకరించి రామకృష్ణకవిగా మారి కొన్ని సంవత్సరాలు హంపిలో శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానమైన 'భువన విజయము'లోని అష్టదిగ్గజాలలో ఒకడై కీర్తి గాంచి, అక్కడ వుండగానే 'కందర్ప కేతు విలాసము', 'హరి లీలా విలాసము' మొదలగు కావ్యాలు రచించి, తిరిగి తెనాలి చేరి కొంత కాలముండి అనంతరం పెద్ద సంగ భూపాలుడనే పొత్తపినాటి ప్రభువు యొక్క వ్రాయసకాడైన విరూరి వేదాద్రిమంత్రి పోషణలో శారద రూపుదాల్చిన ప్రౌఢకవిగా 'పాండురంగ మాహాత్మ్యము'ను రచించి దానిని ఆయనకే అంకితమిచ్చి, తన అవసాన దశలో 'ఘటికాచల మాహాత్మ్యము' అనే కావ్యాన్ని వ్రాసి, దానికి కృత్యాది వ్రాయకుండానే అంటే ఎవరికీ అంకితమీయకుండానే కాలధర్మం చెందగా, ఆ కావ్యాన్ని ఖండోజీ రాయడనే మరాఠా పాలకునికి కవి వంశీకుడొకరు తెచ్చి యీయగా దానికాయన తన ఆస్థానకవి వేంకటగిరీంద్రునిచే అవతారిక వ్రాయించి ఆ కృతిని తానే స్వీకరించాడు. సాహితీ విమర్శకులలో హెచ్చుభాగం దాదాపు యిదే అభిప్రాయాన్ని కలిగివున్నారు. పై అన్ని కావ్యాల కర్త ఒక్కరేననేది ఎక్కువమంది విమర్శకుల అభిప్రాయం. అయితే కొందరు రామలింగకవి వేరు; రామకృష్ణకవి వేరు అనే దృఢాభిప్రాయంతో వున్నారు. వారి అభిప్రాయాలు ఏ విధంగా తప్పో యీ గ్రంథంలోని 'చరిత్ర చిక్కుముడి' అన్న అధ్యాయంలో తెలిపాను. అయితే లభ్యమైనంత వరకు ఆ మహాకవి రచనలను

సాకల్యంగా పరిశీలించిన మీదట నేను వాటిలోని సారుప్యతలను కొన్నింటిని గమనించాను. ఈ విషయమై లోగడ నిడదవోలు వేంకటరావు, బులుసు వేంకట రమణయ్య, కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి గారలు యీ కావ్యాల సాపేక్ష సారూప్యతలను పరీక్షించి వెలిబుచ్చిన అభిప్రాయాలను కూడా నా వాదనకు బలం చేకూర్చేవిగా భావించి వాటిని నా పరిశీలనతో జతపరచి యీ ప్రత్యేక అనుబంధంలో మీ ముందుంచుతున్నాను.

కవి రచనలలో 'ఆదిపురాణము' పూర్తిగా అలభ్యంకాగా 'లింగపురాణం'లోనిదని చెప్పబడుతూన్న 'లింగ నిషిద్ధు కల్వల చెలింగని' అనే పద్యం ఒక్కటి మాత్రమే ఆ కావ్యం తాలూకు ప్రస్తుతం లభ్యమవుతూంది. దానిని మనం లోగడనే పరిశీలించాం. 'కందర్పకేతు విలాసము' అనే కావ్యాన్ని రామకృష్ణకవి విజయనగరంలో ఉండగానే వ్రాశాడు. ఆ గ్రంథమిప్పుడు అలభ్యం. అయితే దానిలోనుంచి నాలుగు పద్యాలను మాత్రం పెదపాటి జగ్గన్న తన 'ప్రబంధ రత్నాకరం' లో ఉదాహరించాడు. నాయికానాయకుల విరహతాపాలు తప్ప 'కందర్పకేతు విలాసం' యొక్క కథాంశమేమిటో తెలిపే వివరాలేవీ ఆ నాలుగు పద్యాలలో లేవని మనమీవరకే చెప్పుకున్నాం.

అక్కమలాక్షిఁ గన్గొనిన యప్పటి నుండియు నేమి చెప్పనా
కెక్కడఁ జూచిన న్మదను డెక్కడఁ జూచిన రోహిణీ విభుం
డెక్కడఁ జూచినం జిలుక లెక్కడఁ జూచినఁ గమ్మగాడ్పులిం
కెక్కడ వెట్ట యోర్వఁగల నీ విరహానల తాప వేదనన్? (కందర్పకేతు విలాసం)

ఆ కమలాక్షిని చూసినప్పటినుంచీ (ఏం చెప్పేది?) నాకెక్కడ చూసినా మన్మథుడే కనుపిస్తున్నాడు. రోహిణీ విభుడే (చంద్రుడే) కనుపిస్తున్నాడు. ఎక్కడ చూసినా మన్మథుని వాహనాలైన చిలుకలే. ఎటు చూచినా (వీచినా) కమ్మ గాడ్పులే (మలయ మారుతాలే) ఇంక యీ విరహాగ్ని తాపం యొక్క బాధను ఎలా ఓర్చుకుంటాను?

ఈ పద్యం భావంలోకానీ, భాషలోకానీ పూర్తిగా 'ఉద్భటారాధ్య చరిత్రము'లో మదాలసుడు కనకలతపై విరహంతో పాడుకున్న 'ఈ పికరాజి, యీ శుకము లీ శశికాంతులు' అనే పద్యాన్ని పోలి వున్నది. ఈ పద్యాలు రెంటినీ నిశితంగా పరిశీలించిన ఎవరికైనా యివి వ్రాసిన కవి ఒక్కరే ననిపించక మానదు.

ఇంకా, యీ కావ్యంలోని కథానాయకుడు తన ప్రియురాలి కోసం గాలిస్తూ పద్మములనూ, చేపలనూ, కోకములనూ (చక్రవాక పక్షులనూ), అళివర్గాన్నీ (తుమ్మెదలనూ), సితచ్ఛదములనూ (హంసలనూ) పూలతీగలనూ, పేరుపేరునా పిలిచి, 'మీరు నా ప్రియురాలి నెక్కడైనా చూశారా?' అని ప్రశ్నిస్తున్నాడు -

ఉ॥ వారిజ, మీన, కోక, యళివర్గ, సితచ్ఛద, సల్లతావనీ
మీ రుచిరాస్య, మీ నయన, మీ కుచ, మీ యలకాళి, మీ గతిన్
మీ రమణాంగి మత్ప్రియ నమేయగతిన్ విరహాతురాననన్
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరు గానరే? (కందర్ప కేతు విలాసం)

కవి ఈ పద్యంలో చక్కటి క్రమాలంకార ప్రయోగంతో కథానాయకుడి ప్రియురాలు పద్మముఖియనీ, మీనాక్షియనీ, ఆమె స్తనద్వయం చక్రవాకముల జంట వలె నున్నదనీ, ఆమె ముంగురులు తుమ్మెదల సమూహంలా వున్నాయనీ, ఆమె నడక హంసల నడల వలె నున్నదనీ, ఆమె లతాంగి అనీ వర్ణించాడు. "విరహంతో ఆతురమైన (బాధ పడుతున్న) కళ్ళ

కలిగిన నా ప్రియురాల్ని మీరెక్కడా చూడలేదా?" అని అడుగుతున్నాడు ఆ కావ్య నాయకుడు.

ఈ పద్యం యొక్క చివరి పాదం అచ్చంగా రామకృష్ణకవి కూర్చిన ఒక చాటు పద్యాన్ని పోలివుంది. ఆ చాటు పద్యాన్ని పై పద్యంతో సరిపోల్చి చూస్తే యీ రెండూ రామకృష్ణకవి వ్రాసినవేనని ఎవరికైనా చటుక్కున స్ఫురిస్తుంది. ఆ చాటు పద్యం వెనుక ఓ చిన్న కథ వుంది. అదేమిటో చూద్దాం.

ఒకప్పుడు చతురమతియైన ఓ వేశ్య కృష్ణదేవరాయల ఆస్థానాన్ని సందర్శించిందట. అప్పటికింకా తెనాలి రామకృష్ణకవి పూర్తి స్థాయిలో రాయలవారి ఆస్థాన కవిగా లేడు. ఆయన అల్లసాని పెద్దన శిష్యునిగా వున్నాడట. ఆ వేశ్య అల్లసాని పెద్దనను పూరించమని ఓ సమస్య యిచ్చిందట. అది - "మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరలందఱున్"

ఆ సమయంలో రామకృష్ణకవి సభలో లేడట. పెద్దన యీ సమస్యను ఆ రోజు పరిష్కరించలేక మరునాడు తన శిష్యుడైన రామకృష్ణకవికి దానినిచ్చాడట. రెండవరోజు ఆ వేశ్య మరల రాజసభకు రాగా తన గురువైన పెద్దన తరఫున సరసకవి యైన రామకృష్ణుడు ఆ సమస్యనిలా పూరించాడట -

ఉ॥ కోరికలుప్పతిల్ల మదిఁ గోరిన యట్టి కళా విశేషముల్
చారుతరంబులన్ రతుల సల్పఁగ నేర్చినయట్టి జాణ యీ
వారవధూ శిరోమణిని వంతులు వేసుక దెబ్బ తీయుఁడీ
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరలందఱున్.

ఈ సమస్యను చతురతతో పూరించిన రామకృష్ణకవి, ఆ తరువాత కొద్దిగా మార్చి యీ చివరి పాదాన్నే తన 'కందర్ప కేతు విలాసం' కావ్యంలోని పై పద్యంలో వాడుకున్నాడు.

నా గ్రంథంపై అభిప్రాయం వ్రాయమని కోరడానికి డా॥ చేకూరి రామారావు గారి వద్దకు వెళ్ళినప్పుడు ఆయన ఏల్చూరి మురళీధరరావు గారు వ్రాసిన "సుబంధుని వాసవదత్తా కథ : తెనాలి రామలింగ కవి కందర్పకేతు విలాసము" అనే పరిశోధనాత్మక గ్రంథం యొక్క వ్రాత ప్రతిని నా ముందుంచి, "రామకృష్ణ కవిపై మీరు సమగ్ర పరిశోధన చేశారు కదా - యీ వ్రాత ప్రతిని కూడా పరిశీలించి, యిందులోని అంశాలు మీకేమైనా ఉపయోగపడతాయేమో చూడండి" అన్నారు.

అప్పటికి పెదపాటి జగ్గ కవి 'ప్రబంధ రత్నాకరం'లో ఉదాహరించిన నాలుగు పద్యాలు మినహా 'కందర్పకేతు విలాసము' పై నా వద్ద సమాచారమేమీ లేదు. ఆ కావ్యాన్ని గురించి తమ 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో ఆరుద్ర గారు కూడా కవి చిట్టరుసు అనే ఆయనకు దానిని అంకితమిచ్చినట్లు మాత్రమే పేర్కొంటూ, దాని కథాంశమేమిటో తెలియరాలేదని పేర్కొన్నారు. అందుకే నేను ఆ వ్రాత ప్రతిని ఆమూలాగ్రం ఆసక్తిగా చదివాను. సుబంధు మహాకవి అతి చిన్న ఇతివృత్తాన్ని తీసుకుని తన 'వాసవదత్తా కథ'ను అత్యద్భుతంగా రక్తి కట్టించాడనీ, సంస్కృతంలో సుబంధు మహాకవి రచించిన వాసవదత్తా కథకు మొదటి తెలుగుసేత తెనాలి రామలింగ కవి వ్రాసిన కందర్పకేతు విలాసమేననీ, ఆ రచయిత నిర్ధారించారు. సుబంధుడు పాటలీపుత్రాన్ని పాలించిన చంద్రగుప్త మౌర్యుని కుమారుడైన బిందుసారుడి ఆస్థానంలో మంత్రిగా పనిచేసి, ఆ రాజుచే అవమానం పొంది, అనంతర కాలంలో మగధ రాజ్యాన్ని విడిచి కౌశాంబి చేరి వత్సరాజు ఆదరణ పొందాడట. ఈ కవి ఆంధ్ర దేశంతో పరిచయమున్న మాళవ దేశీయుడట. (కవి తన వాసవదత్తా కథలో శ్రీశైల మల్లికార్జునుని కూడా ప్రస్తావించడం విశేషం !)

ముందుగా ఆ వ్రాతప్రతిననుసరించి సుబంధుడు వ్రాసిన వాసవదత్త కథేమిటో సంక్షిప్తంగా చూద్దాం.

చింతామణి మహారాజు కుమారుడైన కందర్పకేతుడికి కలలో ఓ సౌందర్యరాశి కనుపించి ఆయన మనస్సు దోచుకుంటుంది. తెల్లవారగానే అతడు మకరందుడనే తన ప్రియమిత్రుడిని వెంటబెట్టుకుని ఆమెకోసం గాలిస్తూ వింధ్య పర్వతాలకు చేరి అక్కడ ఒక చెట్టు క్రింద విశ్రమిస్తూండగా - ఆ చెట్టు కొమ్మపై వాలిన శుక శారికలు (చిలుక-గోరింకలు) యిలా మాట్లాడుకొనడం వినిపిస్తుంది.

కుసుమపురాధీశుడు శృంగార శేఖరుని కుమార్తె వాసవదత్త వంటి సౌందర్యవతి ముల్లోకాలలోనూ లేదు. తండ్రి ఆమెకు స్వయంవరం ప్రకటించాడు. దేశదేశాల నుంచి వచ్చిన రాజకుమారులలో ఏ ఒక్కరూ ఆమెకు నచ్చలేదు. ఆ రోజు రాత్రే ఆమెకు కలలో కందర్పకేతుడనే అందగాడు కనుపించాడట. తన ప్రేమను వెల్లడిస్తూ ఆమె ఓ లేఖ వ్రాసి తమాలిక అనే తన ప్రియ శారిక ద్వారా అతడికి పంపిందట.

అదృష్టవశాత్తూ అదే చెట్టు కొమ్మపైనున్న ఆ శారిక (గోరింక) కందర్పకేతుడిని గుర్తించి అతనికి ఆ లేఖను అందించి తన వెంట అతడిని తోడ్కొని కుసుమపురానికి తీసుకెళ్తుంది. అక్కడొక దివ్యసౌధంలో నాయికా నాయకులు కలుసుకుంటారు.

కాని, అదే రోజున రాజు తన కుమార్తె వాసవదత్తను విద్యాధర రాజకుమారుడు పుష్పకేతునకిచ్చి వివాహం చేయాలని నిశ్చయించి ఏర్పాట్లు చేస్తుంటాడు. ఆ సందట్లో యీ ప్రేమికులిరువురూ మనోజవమనే మాయగుర్రాన్నెక్కి వింధ్య పర్వత ప్రాంతాలకు వెళ్లిపోతారు. అయితే మకరందుడిని మాత్రం రాజధానిలోనే వుంచి ఎప్పటికప్పుడు అక్కడి వర్తమానాలు తెలుసుకుంటూ వుండమంటారు. ఆ రాత్రంతా వారిరువురూ ప్రణయ లీలలతోనే గడుపుతారు.

తెల్లవారి వాసవదత్త నిద్రలేచి తన ప్రియుడికి పండ్లు తీసుకురావడానికి అడవిలోకి వెళుతుంది. అలసి వున్న కందర్పకేతుడు అక్కడే విశ్రమిస్తాడు. అక్కడ అడవిలో వాసవదత్త ఘోర యుద్ధం చేస్తున్న ఆటవిక సైన్యాల మధ్య చిక్కుకుంటుంది. ఆమె అందానికి ముగ్ధులైన వారు తమ కలహం మాట మరచి ఆమె వెంట పడతారు. వాసవదత్త వారి నుండి తప్పుకొనడానికి ఒక యోగి ఆశ్రమంలో తలదాచుకుంటుంది. ఆటవికులు ఆ ఆశ్రమంలోకి కూడా చొరబడి అక్కడ అల్లకల్లోలం సృష్టిస్తారు. ఈ గందరగోళమంతటికీ కారణం ఆమేనని గ్రహించిన ఆ యోగి మండిపడి ఆమెను శిలామూర్తివైపొమ్మని శపిస్తాడు. తరువాత ఆమె తనను క్షమించమని దీనంగా వేడుకుంటే, ఆమె దీనోక్తులకు మనస్సు కరగి, 'నీ ప్రియుని స్పర్శ తగలగానే నీకు శాప విమోచనం కలుగుతుంది' అంటాడు.

అక్కడ కందర్పకేతుడు మేలుకుని వాసవదత్త తన ప్రక్కన లేకుండడం చూసి ఆందోళన చెంది పరిసర ప్రాంతాలన్నీ గాలించి ఆమెను కనుగొనడంలో విఫలమై తీవ్ర నిరాశతో ఆత్మహత్య చేసుకోబోతాడు. అయితే ఆకాశవాణి ఆయనను వారించి ప్రేయసీ పునస్సమాగమం తప్పక సిద్ధిస్తుందని చెపుతుంది. అతడు ధైర్యం కూడదీసుకుని కొంతకాలం పాటు ఆ ఘోరారణ్యంలో ఆమె కొరకు గాలిస్తూ ఎట్టకేలకు తన ప్రియురాలి శిలా శరీరం ఉన్న తావుకు వచ్చి తన కర స్పర్శతో ఆమెను పునరుజ్జీవితురాల్ని చేస్తాడు. వారిద్దరూ ఒకరితో మరొకరు జరిగిన విషయాలన్నీ చెప్పుకుంటుండగా అక్కడికి మకరందుడు వచ్చి చేరతాడు. వారు ముగ్గురూ కలిసి కుసుమపురానికి తిరిగి వస్తారు. అలా కథ సుఖాంతమవుతుంది.

ఈ విధంగా 'వాసవదత్త' లోని కథా భాగం యింతేకాని, కావ్యమంతా విద్వత్శ్లాఘ్య రసాయన వర్ణనా పూర్ణమనీ, యీ రచన సుబంధుని స్వీయ కపోల కల్పనేననీ, యిందలి వాస్తవిక చిత్రీకరణ, అనితర సాధ్యమైన సుబంధుని శైలి నచ్చిన మీదటే తెనాలి రామలింగ కవికి దీనిని ఆంధ్రీకరిద్దామనే ఉబలాటం కలిగి వుంటుందనీ మురళీధర రావు గారు పేర్కొన్నారు.

పెదపాటి జగ్గకవి 'ప్రబంధ రత్నాకరం' వ్రాత ప్రతిలో ఉదాహరించబడిన 'కందర్పకేతు విలాసం'లోని మొత్తం నాలుగు పద్యాలలో పైన తెలిపిన రెండు పద్యాలూ కాక మరో రెంటిని కూడా చూద్దాం -

ఉ. కామిని చంద్రుఁ జూచి మదిఁ గందు సరోరుహగంధి మందిరా
రామముఁ జూచి మ్రానుపడు రాజనిభానన సారెకున్ శుక
స్తోమముఁ జూచి యేఁకరును దొయ్యలి కోకిలఁ జూచి కంటఁ గెం
పౌ మదలీలఁ దాల్చు మదనానల తాప విషాద వేదనన్.

సీ. తారామనోరంజనారంభమే దొడ్డు
శిలలుద్రవింపంగఁ జేయుననినఁ
జాకోర హర్షయోజనకేళి యే దొడ్డు
పేర్చి యంబోధు లుబ్బించుననినఁ
గుముదౌఘ తాపోపశమకృత్య మే దొడ్డు
సృష్టియంతయుఁ జల్ల సేయుననిన
వర నిశాకామినీ వాల్లభ్యమే దొడ్డు
వర్ణింప సత్కళా పూర్ణుఁ డనినఁ

గీ. దనకు సర్వజ్ఞశేఖరత్వంబు గలుగ
హిత సుధాహార వితరణం బేమి దొడ్డు
ననఁగ విలసిల్లె హరిదంత హస్తిదంత
కాంతి నిభకాంతిఁ జెలువారి కంజవైరి.

('ఏ దొడ్డు' అన్న కైముతిక వాచకం తెనాలి రామలింగ కవిపై కన్నడిగుల వాక్ప్రభావాన్ని సూచిస్తున్నది. కన్నడ జైనకవి నేమిచంద్రుని 'లీలావతీ ప్రబంధం' యొక్క ప్రభావం కూడా 'కందర్పకేతు విలాసము' పై వున్నది.)

ఈ పద్యాలతో పాటు ప్రబంధ రత్నాకరంలోని 'లలితాస్యాంబురుహంబు' అని ప్రారంభమయ్యే మరొక పద్యం కూడా 'కందర్పకేతు విలాసం'లోనిదేనని మానవల్లి రామకృష్ణ కవి గారు ఊహించారు. ఇవికాక 'మౌళిఁ గెంజడల జొంపము ఫాలపట్టికఁ దీంద్రించు భసిత త్రిపుండ్రకంబుఁ' అని ప్రారంభమయ్యే మరొక పద్యం 'ప్రబంధ రత్నాకరం' యొక్క మరొక ప్రతిలోనిదని ఇటీవల డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి గారు వెలుగులోకి తెచ్చారు. ఇవికాక చాగంటి శేషయ్య గారు తెనాలి రామకృష్ణ కవి చాటువుల నుండి 'అల ఘన చంద్రబింబ సమమై' అనీ, 'ధర భుజగైణ సింహములఁ' అనీ ప్రారంభమయ్యే రెండు పద్యాలను తమ 'ఆంధ్ర కవి తరంగిణి'లో పేర్కొని, "ఈ పద్యములు మనకు లభ్యము కాని ఏ కందర్పకేతు విలాసములోనివో యై యుండునని నా యభిప్రాయము" అని పేర్కొన్నారు.

ఈ పద్యాలు కాక మురళీధర రావు గారు 'కందర్పకేతు విలాసము'లోనిదని 'గగన తాపసముఖ్య కమనీయ కరతల సంగత స్ఫాటిక లింగమనఁగ' అని మొదలయ్యే మరొక సీస పద్యాన్ని కూడా తాను గుర్తించినట్లు ఆ వ్రాతప్రతిలో పేర్కొన్నారు.

'కందర్పకేతు విలాసము' కావ్యాన్ని రామలింగ (కృష్ణ) కవి- ఉద్భటారాధ్య చరిత్రకు తరువాత, పాండురంగ మాహాత్మ్య కృతికి పూర్వం- క్రీ.శ. 1545 ప్రాంతాలో వ్రాసి వుంటాడని డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి గారు తమ 'తెలుగు సాహిత్య చరిత్ర' (తృతీయ భాగం)లో పేర్కొన్నారు.

'హరి లీలా విలాసం' అనే రామకృష్ణుని కావ్యంకూడా పూర్తిగా లభ్యం కావడంలేదు. అందులోని 21 పద్యాలను మాత్రం పెదపాటి జగ్గన్న తన 'ప్రబంధ రత్నాకరం'లో ఉదాహరించాడు.

వీటిలో నాటి భోజన విశేషాలను వర్ణించే 'అలఘుతంబు వేడియగు నన్నము' అన్న పద్యాన్ని మనం లోగడనే వివరంగా పరిశీలించాం. కవి అదే కావ్యంలో ఒక పురాన్ని వర్ణిస్తూ అక్కడి పుష్పలావికల (పూల బంతులు, పూల దండలు గుచ్చి అమ్మే స్త్రీల)ను వివరంగా వర్ణించాడు. ఈ విషయంలో ఆయన కృష్ణదేవరాయల 'ఆముక్త మాల్యద'ను అనుసరించాడు. ఇదేకాక, రామకృష్ణకవి కావ్యాలలోని ఎన్నో పద్యముల రచనా రీతి కృష్ణరాయల శైలిని పోలివున్న కారణంగా, ఆయనపై ఆ రాజకవి ప్రభావమెంతగా వున్నదో అర్థమవుతూంది.

ప్రభాత మారుతాన్ని (ఉదయపు గాలి)ని వర్ణించే యీ క్రింది పద్యంచూడండి -

**చ॥ తెలతెలవాఱ నొయ్య నరుదెంచు నిశాంత రతాంత తాంతలౌ**
**చెలువల కింపుగా మెలఁగుఁ జెక్కులఁ గూరిన చూర్ణకుంతలా**
**వళి సరసంబుగా జడియు, వాడిన సెజ్జల మీది ప్రావిరుల్**
**దొలఁగఁగఁ జేయు నూడిగపు తొయ్యలులం బలె వేగుదెమ్మెరల్ (హరి లీలా విలాసము)**

తెలతెలవారుతూండగానే ఒయ్యన (తిన్నగా) వచ్చి, వేకువ జామున జరిపిన సంభోగంలో అలసినట్టి చెలువలకు (స్త్రీలకు) ఆనందం కలిగేటట్లుగా వారి చెక్కిళ్లపైకి జారిన ముంగురులను సరసంగా పైకి తొలగతీసి, పడకల మీది పాత పూవులు తొలగి క్రింద పడిపోయేటట్లు చేసే పరిచారికల (సేవకురాళ్ల) వలె వేగుదెమ్మెరలు (ప్రభాత వాయువులు) వున్నాయట. ఈ పద్యంలో 'ఊడిగపు తొయ్యలి' అని పరిచారికకు (దాసికి) చక్కటి పేరు పెట్టాడు కవి.

సాధారణంగా కవులు లోగడ తాము వ్రాసిన కావ్యాలనుంచి తమ తరువాత రచనల కోసం పద్యాలను, పదబంధాలను అరువు తెచ్చుకుంటారు. వీటిని స్వసంవాదములంటారు. రామకృష్ణకవి యిలా ఎన్నో సందర్భాలలో చేశాడు. పై పద్యాన్ని కొద్దిగా మార్చి తిరిగి తన 'పాండురంగ మహాత్మ్యము'లో కాశీపుర వర్ణనలో భాగంగా అక్కడి ప్రభాతవాయువులను వర్ణించడానికి యిలా ఉపయోగించుకున్నాడు -

**చ॥ తెలతెలవాఱ నొయ్య నరుదెంచి నితాంత రతాంత తాంతలౌ**
**చెలువల కింపుగా మెలఁగి చెక్కులఁ గూరిన చూర్ణకుంతలా**
**వళి సరళంబుగా జడిసి వాడిన సెజ్జలమీఁది ప్రావిరుల్**
**దొలఁగఁ బ్రభాతవాయువులు దోఁచుఁ బురిం బరిచారికాకృతిన్.**
**(పాండురంగ మాహాత్మ్యము 1-119)**

ఇక పూర్తిగా లభిస్తూన్న రామకృష్ణకవి కావ్యాలు మూడు. అవి : 1. ఉద్భటారాధ్య చరిత్రము. 2) పాండురంగ మాహాత్మ్యము. 3. ఘటికాచల మాహాత్మ్యము.

ఈ మూడు కావ్యాలలోని పద్యాల కూర్పు, రచనా శైలిని పరిశీలించి చూస్తే యీ మూడూ ఒక కవి వ్రాసినవేనని గ్రహించగలం. దానినిబట్టి 'రామలింగ కవి', 'రామకృష్ణ కవి' ఒక్కరే తప్ప వేరుకాదని అర్థం చేసుకోవచ్చు. కనుక, రచనాశైలిలో అతి దగ్గర పోలికలున్న పద్యాలను సాపేక్షంగా పరిశీలించడానికి ఒక చోటకు చేర్చి చూడడం అవసరం. అవి-

<u>ఉద్భటారాధ్య చరిత్రము</u>

'అచల సుతాభర్త కర్పించి' (1-54)

హరిణంబున్ బులివెంచుసింగ' (1-55)

సామగుణంబు గొల్చుఁ బికశాబక' (1-57)

<u>ఘటికాచల మాహాత్మ్యము</u>

'మొకరి తేఁటులు మూతిముట్టవు తేనియల్'(1-13)

'పులు లేదున్ మృగశాబకంబుల' (1-11)

'శుకముల్ ప్రామినుకుల్ గుణించు'(1-8)

మ వలదింద్రోపల ఖండదీధితుల రేవల్ కంర హాలాహలం
బులు సున్నంబులు భూతి వెల్లపడగల్ మూర్ధస్థితస్వర్ధునీ
జలపూరంబులు లోనఁ గ్రుమ్మరు సతుల్ సాఁబాలు మైగొన్నయా
యలరుంబోఁడుల యొప్పునై తగుఁబురిన్ హర్మ్యేశ్వర శ్రేడికిన్
(1-151)

మ వలభీంద్రోపల ఖండదీధితుల రేవల్ కంర హాలాహలం
బులు సున్నంబు విభూతి వెల్లపడగల్ మూర్ధ స్థితస్వర్ధునీ
జలపూరంబులు లోనఁ గ్రుమ్మరు సతుల్ సాఁబాలు పైగొన్నయా
యలరుంబోదుల యొప్పునైతగుఁ బురిన్ హర్మ్యేశ్వర శ్రేడికిన్
(2-206)

సీ॥ అభ్రగంగా ప్రవాహంబు లెన్నియొ కాని
తల ధరియింతు రందఱును నదులు
పదినూరు పడగల పాములెన్నియొ కాని
యందఱు నురగేంద్ర హార యుతులు
దాలొందు చంద్రఖండంబులెన్నియొ కాని
యందరు ధరియింతు రమృతకరుని
విషరాశిఁ బుట్టిన విషములెన్నియొ కాని
యందరు హాలాహలాంక గళులు

గీ॥ గంధ గజదైత్యులెందరో కాని యంద
ఱతుల కరిచర్మపటధారు లైనవారు
కర్మబంధంబు స్వప్న భాగముగ నైన
క్రాలుకొనకుండ నిద్రింపజాలు ఘనులు
(2-87)

(శివ సారూప్య మోక్షం పొందిన వారి గురించి)

సీ॥ నునుగాలి దూది పానుపు లెన్నియొ కాని
యందఱు శయనీకృతాహివరులు
సురలోక వాహి నిర్ఝరములెన్నియొ కాని
యందఱు దివ్య తీర్థాంబు పదులు
నీటజనించు మానికములెన్నియొ కాని
యందఱు కౌస్తుభ హార యుతులు
చలివేఁడి వెలుఁగుల సాములెందఱొ కాని
యందఱు నిందు కంజాప్త దృశులు

ఖగ కులాధీశులెందఱు కలరొ కాని
యందఱును పుల్గురా టెక్కియముల వారు
నారు వోసిన రీతి నున్నారు ధీరు
లన్నగరియందు కాపురంబున్నవారు
(1-25)

(విష్ణు సారూప్య మోక్షం పొందిన వారి గురించి)

చ। మొదలఁ బురందరాశఁ దగముట్టితి రాగము తోడఁ బద్మినిన్
బిదపఁ జమత్కరించితివి వేడ్కఁ గరంబులు సాఁచి యింకనన్
బొదువకు మంచు దూఱుచు నపూర్వ దిశాంగన కాలఁ దాఁచినన్
దదమిత యావకద్రవముఁ దాల్చెను నా నినుఁ డొప్పె రక్తిమన్.
(2-33)

గీ॥ మొదలఁ బూర్వాశఁ జెందితి పిదప పద్మి
నికిని కరములు సాచితి వికను డొలఁగు
మని యపూర్వాశ కాలఁ దాచినఁ దదంఘ్రి
యావమన రాగ మిగురొత్తె నర్కుమేన.
(2-139)

ఉద్భటారాధ్య చరిత్రము

'నెర వెంద్రుకలు దువ్వి' (2-121) మరియు

'బోఁడికె మూఁపుపైఁ గరము' (2-122)

పాండురంగ మాహాత్మ్యము

'తలగడు గంగ మర్దనము' (3-9)

'కలదు లేదను వాదములకోర్చి' (3-10)

చ॥ వ్రతములు చేసి పెక్కులుపవాసములున్ మరిపెక్కులుప్పిఁడుల్
ధృతినొనరించి కూర్మిఁబరదేసులఁ దల్లియ పోలెఁ బ్రోచిమా
నితగతి మింటి దయ్యముల నేలకుఁ దెచ్చి కుమారుఁ గాంచెఁ ద
త్పతి శుభకీర్తి నాబఁరగుఁ జామ పతివ్రత సంతసంబునన్.
(2-115)

తే॥ ఆ మహీసురు లేమకు నతుల నిష్ఠ
నింగివేల్పుల నేలకు, నేలవేల్పు
కొలము నింగికిఁ దెచ్చుచుఁ గొలువఁబుత్రుఁ
డొక్కఁడుదయించెఁ దత్కృపాభ్యుదయ మహిమ.
(3-5)

'కోకకుఁ గూటికై యొకనిఁగొల్చి' (2-91)

'వలువకు గూటికినై నీచుల వేడం' (3-21)

మ॥ కవులున్ బాఠకులున్ బ్రధానులు సుధీగణ్యుల్ పురాణజ్ఞులున్
వివిధార్థుల్ సఖులున్ బురోహితులు నుర్వీనాథులున్ జోస్యులున్
ధవళాక్షుల్ గొలువంగ నిండు కొలువై దైవారు హర్షంబుతో
నవధానంబున నుండి శంకర కథా వ్యాసక్తి భాసిల్లుచున్.
(1-23)

మ॥ కవులుం బాఠకులున్ బ్రధానులు నలంకారజ్ఞులున్ బ్రాజ్ఞులున్
ధవళాక్షుల్ భజియింప నిండు కొలువై తారేందు తారావళీ
ధవళంబైన సువర్ణ కుంభయుత సౌధంబందు నాస్థానమై
వివిధామ్నాయ పురాణ గుంభన కథల్ వించున్ బ్రమోదంబునన్
(1-21)

ఉద్భటారాధ్య చరిత్రము

గీ॥ -----------------------------------
-----------------------------------
-----------------------------------
బ్రహ్మవిద్యా విదూరుడై బ్రాహ్మణుండు. (2-124)

పాండురంగ మాహాత్మ్యము

గీ॥ -----------------------------------
-----------------------------------
-----------------------------------
బ్రహ్మ విద్యానవద్యుండు బ్రాహ్మణుండు (2-6)

'కేతువు నీట ముంచి తమకించి' (1-152)

'నిలువున నొలిపించె విలువంగడము నెల్ల' (5-98)

పాండురంగ మాహాత్మ్యము

'అభిషేక మొనరించు నాకాశవాహినీ
జనన కారణపాద జలరుహునకు' (2-21)

ఘటికాచల మాహాత్మ్యము

'జలకంబు సవరించుఁ గలశపారావార'
(2-12)

'చలిది చిక్కపు జిల్గు సాలుముల్గాసుపై
నొయ్యారముగఁ బింఛమొయ్యఁ జెరివి. (2-229)

'చిప్ప కూఁకటి రేఁకనొప్పు నౌఁదల మీఁద'
(1-66)

'పలు వికారంబుల కలగల్పు చూపుల రాకపోకలు' (3-62)

'నును వెండి కడియముల్ మినుమినుక్కన సారె' (2-36)

'చతుర సమ్మార్జనా చరణంబు దొలునాటి' (4-148)

'గోమయ గోముఖ కలన' (2-22)

'రారయ్యా ! యని శుద్ధిమచ్చరణు' (4-168)

'చేపట్టు చేసి మ్రొల్చివర గల్గిన' (2-16)

'ఒక కొన్ని వడియంబు లొక కొన్ని వరుగులు' (4-184) 'తునియ కొండొకటితో పెనగొను కలమాన్న' (2-17)

పైన పేర్కొన్న పద్యాలలో చాల మేరకు పూర్తిగా ఒకే రకంగా వున్నట్లూ, కొన్నింటిలో ఒకే విధమైన పదబంధాలు ఎన్నో వాడబడినట్లూ మనం గమనించవచ్చు. తాను లోగడ వ్రాసిన కావ్యాలలోని పద్యాలను మక్కికి మక్కి అనుసరిస్తూ సందర్భోచితంగా వేరే భావాన్నిచ్చే పద్యాల్ని అల్లగలడం ఒక్క రామకృష్ణకవికే చేతనైన విద్యగా కనుపిస్తూంది.

ఇన్ని సారూప్యతలుండడం చేతనే యీ కావ్యాలు మూడూ ఒక్కరే వ్రాశారనీ, కనుక తెనాలి రామలింగడూ, తెనాలి రామకృష్ణుడూ ఒకరేననీ మనం భావించాల్సి వుంటుంది.

అంతేకాదు. రామకృష్ణకవి తన గోత్రకర్తయైన కౌండిన్య మునీశ్వరుని ఏదో ఒక విధంగా కథాక్రమంలో యిరికిస్తాడు. 'ఉద్భటారాధ్య చరిత్రము'లో రాజు ప్రమథేశ్వరుదు భార్యా సమేతంగా కాశికి వెళ్తూ మార్గమధ్యంలో కౌండిన్యుని ఆశ్రమం దర్శించినట్లు వ్రాశాడు. ఆ కథకూ కౌండిన్య మునికీ ఎక్కడా సంబంధం లేదు. అయితేనేం కౌండిన్యుడు తన గోత్రకర్త మాత్రమేకాక, ఆ కావ్యాన్ని అంకితం పుచ్చుకున్న కృతిపతి ఊర దేచమంత్రికీ గోత్రకర్తే – కాబట్టి కృతిపతి వంశోత్కర్ష కోసం కౌండిన్య మహామునిని ఆ కథలో ప్రవేశపెట్టాడు కవి.

అలాగే 'ఘటికాచల మాహాత్మ్యము'లో కూడా నారదుని పూర్వజన్మ వృత్తాంతములో కౌండిన్యుడు తీర్థయాత్రలు చేస్తూ గోవింద శర్మ అనే వైష్ణవ భక్తుని యింటికి వచ్చి వర్షాకాలమైనందున అక్కడే రెండు నెలలపాటు వున్నట్లుగా వ్రాశాడు. తన గోత్రకర్తయైన కౌండిన్యుడిని అలా ఆ కథలో కూడా ప్రవేశపెట్టాడు కవి. కథకు పెద్దగా సంబంధంలేని పాత్రగానూ, కేవలం కవి తన వ్యక్తిగతమైన ఇష్టం కొద్దీ ఆ రెండు కావ్యాలలోకీ జొప్పించిన పాత్రగానూ కౌండిన్యుడు కనుపించినా, ఆయన తక్కువ వాడేం కాదు. బ్రాహ్మణులకు సముద్రయానం నిషిద్ధమైనప్పటికీ దాన్ని ధిక్కరించి మొదటిసారిగా సముద్రయానం చేసి మలయా, కాంబోడియా (కాంభోజ) రాజ్యాలలో హైందవ సంస్కృతిని వ్యాపింప జేసినవాడు కౌండిన్యుడు. అలాగే సోమకాసురుడు వేదాలను దొంగిలించుకు పోవటాన లోకాలు నిర్వేదమైన ఆ ఐదు రాత్రుల కొరకు 'పాంచరాత్రం' పేరిట విష్ణ్వర్చనా పద్ధతులను ఏర్పరచిన ఋషిగా కూడా ఆయన ప్రసిద్ధుడు. కౌండిన్యుడి పేరుతో అనేక రచనలలో అనేకులు కనుపిస్తున్నారు. వాస్తవానికి వీరంతా వివిధ తరాలకు చెందిన కౌండిన్యుని వంశీకులై వుంటారని మనం అర్థం చేసుకోవాలి.

అలాగే వాధూల మునీంద్రుని పాత్ర . 'ఉద్భటారాధ్య చరిత్రము'లో కేవలం వాధూలుడిని ఒక సందర్భంలో పేర్కొన్న రామకృష్ణకవి, 'పాండురంగ మాహాత్మ్యము'లోని పంచమాశ్వాసంలోని 'అయుత నియుతుల కథ'లో అయుతుడిని శపించే ముక్కోపియైన మునిగా వాధూలుడిని కథలోకి జొప్పించాడు. అలాగే 'ఘటికాచల మాహాత్మ్యము'లో కూడా మూడవ ఆశ్వాసంలో వైఖానసులు నరసింహ దేవునికి కళ్యాణోత్సవం జరుపుతూంటే అది చూడడానికి వ్యాసాది సంయములతో వాధూల సంయమీశ్వరుడు కూడా వచ్చాడని పేర్కొన్నాడు. ఇంతకీ ఎవరీ వాధూల మునీంద్రుడు? రామకృష్ణకవికి ఆయనంటే ఎందుకంత అభిమానం?

తైత్తిరీయ సంహిత (కృష్ణయజుర్వేద సంహిత)లో 'వాధూలము' అనే పేరుతో వున్న శ్రౌత సూత్రానికి కర్త యీ వాధూలుడు. రామకృష్ణకవి జన్మతః ప్రథమ శాఖ నియోగి కనుక శుక్ల యజుర్వేదం చదువుకుని, అనంతరం శైవం స్వీకరించి పాలగుమ్మి ఏలేశ్వరుడనే గురువు వద్ద కృష్ణ యజుర్వేదాన్ని చదువుకున్నాడు. ఆ తరువాత వైష్ణవం స్వీకరించి భట్టరు చిక్కాచార్యులనే వైఖానసుని వద్ద కృష్ణ యజుర్వేద సంహితను (తైత్తిరీయ సంహితను) మరింత విపులంగా చదువుకున్నాడు. వైఖానస కల్పసూత్రానికి మూలమైనట్టి తైత్తిరీయ సంహిత వైఖానసులకెంతో పవిత్రమైనది. అలాగే అందలి సూత్రకారులలో

ఒకడైన వాధూలుడు కూడా వారికి వంద్యుడే. అలా వాధూలునిపై ఏర్పడిన గౌరవంతో ఆ పాత్రను ఏదో ఒక విధంగా తన కావ్యాలలో యిరికించాడు రామకృష్ణకవి.

'ఉద్భటారాధ్య చరిత్రము' కావ్యము సూతుడు నైమిశారణ్యంలోని మునులకు చెపుతున్నట్లుగా ప్రారంభించాడు కవి. 'పాండురంగ మాహాత్మ్యము' కూడా శౌనకాది మహామునులకు సూతుడు చెప్తున్నట్లే ప్రారంభించబడింది. 'ఘటికాచల మహాత్మ్యము' కావ్యం కూడా సరిగ్గా అదే విధంగా నైమిశారణ్యంలో సూతుడు తాపసులతో చెపుతున్నట్లుగానే ప్రారంభించబడింది.

ఒకప్పటి శైవుడు కనుకనే రామకృష్ణకవి 'పాండురంగ మాహాత్మ్యము' వైష్ణవకావ్యమే అయినా దానిలో శివుడే అగస్త్యుడు, కుమారస్వామి మొదలైన వారికి విట్ఠలాధీశుని కథాక్రమాన్ని కైలాసములోని పురాతనమైన మర్రిచెట్టు నీడ క్రింద కూర్చుని వివరించినట్లుగా వ్రాశాడు. విట్ఠలునికి కూడా శివుని వలె నుదుట మూడోకన్ను వున్నట్లు వర్ణించాడు. 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యంలో 'భస్మోద్ధూళన పాండురాంగము రమా ప్రాణేశు పాదద్వయిన్' (2-54) అంటాడు. (భస్మము పూసుకొనడం చేత తెల్లగా అయినట్టి లక్ష్మీపతి పాదద్వయము). విభూతిని శరీరమంతటా పూసుకుంటే దానిని 'భస్మోద్ధూళనము' లేక 'భసితోద్ధూళనము' అంటారు శైవులు. అదే కావ్యంలో మరోచోట 'భసితోద్ధూళిత నిర్మలావయవుడున్ పంచాక్షరీ సంతతాభ్యసనవ్యాప్తి పరాయణుండు' అంటూ విష్ణువుని కూడా భస్మోద్ధూళనమనే శివాచారపరాయణుడిని చేస్తాడు కవి. 'పాండురంగ క్షేత్రం' మొదట శివక్షేత్రమేనని 'పాండురాంగుడు' అంటే తెల్లని శరీరం కలవాడు అనే అర్థంలో శివుడేనని కొందరు విమర్శకుల అభిప్రాయం. 'ఉద్భటారాధ్య చరిత్రము'లో కాశీపుర వర్ణన చేసినట్లే రామకృష్ణకవి 'పాండురంగ మాహాత్మ్యము'ను కాశీపుర వర్ణనతోనే ప్రారంభించాడు. అగస్త్యుడు సతీ సమేతంగా హంపిలోని ప్రసిద్ధ శైవక్షేత్రమైన విరూపాక్ష (పంపాపతి) ఆలయాన్ని దర్శించడం, స్వామిమలకు వెళ్లి శివపుత్రుడైన షణ్ముఖుని దర్శించుకొనడం, ఆ తరువాత కైలాసానికి వెళ్లి ఆదిదంపతులను దర్శించుకొనడం, శివపార్వతుల ఉద్యాన విహారం, శివుని ద్వారా కథా క్రమవర్ణన ప్రారంభం – యిలా విష్ణుకావ్యమైన 'పాండురంగ మాహాత్మ్యము' ప్రథమాశ్వాసంలో ఎక్కడా విష్ణు ప్రస్తావనే లేదు. 'పాండురంగ క్షేత్రం' వైష్ణవ క్షేత్రమే అయినా క్షేత్ర పాలకుడు కాలభైరవుడట! 'పాండురంగ మాహాత్మ్యము'లో పుండరీకుని ఘోర తపస్సును వర్ణిస్తూ 'యీ చెవి గాడుపా చెవి బోవంగ నుబ్బులింగము పోలె నుండు నెండ' (2-29) 'ఆ తీవ్రమైన ఎండలో యీ చెవిలోని గాలి ఆ చెవిలోకి వెళ్తూ వున్నప్పటికీ స్థాణువులా, శిలా సదృశంగా (ఉబ్బులింగము పోలె) వున్నాడు'. జన్మతః వైష్ణవుడైన ఏ కవీ కూడా 'లింగము' అనే శబ్దాన్ని ఉచ్చరించడానికి కూడా యిష్టపడడు; కనుక, రామలింగడే రామకృష్ణుడైన పిదప యీ కావ్యం వ్రాశాడు కాబట్టే, యీ పద ప్రయోగం చేశాడని కొందరు విమర్శకులు పేర్కొన్నారు. అలాగే విట్ఠలయ్యను 'విట్ఠలేశ్వరుడు' అంటాడు కవి. (పా.మా. 2-166). అదేవిధంగా 'ఘటికాచల మహాత్మ్యము'లో కూడా నృసింహస్వామిని 'పరమేశ్వరుడ'ని అంటాడు (3-11). నృసింహుడిని అదే కావ్యంలో 'మిక్కిలి కంటి వాడు' అంటాడు (3-8). అలాగే అదే కావ్యంలోని మూడవ ఆశ్వాసంలో సప్తర్షులకు కనుపించిన విమానంలోనున్న నృసింహుని కంటె ముందు ప్రమథవైభవంతో నున్న శివుడిని వర్ణిస్తాడు కవి (3-7). 'పాండురంగ మాహాత్మ్యము' తృతీయాశ్వాసములో భూదేవి విష్ణువు కడకేగు సందర్భంలో 'వీరభద్ర గదా విదారితంబగు పూషార్కు వదన గహ్వరము' అని శివసంబంధమైన ఉపమానాన్ని చెప్పాడు (3-150). చతుర్థాశ్వాసంలో రాధ తపస్సును వర్ణిస్తూ 'కస్తూరి తిలకంబు గాలి వాటిన నేర్చు నొసలెట్లు నినినెనో భసితమునకు' (4-3) అంటూ రాధ కూడా విభూతి ధరించినట్లు వర్ణించాడు. (కస్తూరి తిలకం గాలికి తడి ఆరిపోయినా ఆ మంటకు తట్టుకొనలేని సుకుమారి రాధ నొసలు విభూతి పూసుకొనడానికి ఎలా అంగీకరించాయో?). అదే ఆశ్వాసంలో తపోవనంలోని రాలిన పుప్పొడి అంటిన తుమ్మెదలు బూడిద పూసుకొనిన జడల గుంపుల వలెనున్నవని వర్ణించాడు. 'చదుకెక్కు పుప్పొడుల

నంటిన తేఁటులు భూతిభృజ్జటా పుంజముఁ బోలగా' (4-14) అన్నాడు రామకృష్ణకవి. పాండురంగ విట్ఠలుడిని అళికాంబకము (నొసటి కన్ను) కలవానిగా వర్ణించాడు (5-56). ఆ దైవాన్నే 'వెచ్చగంటివాడు' (అనల నేత్రుడు - చిచ్చు కంటి వాడు) అని కూడా వర్ణించాడు కవి (5-197). దీనికి 'ఎచ్చు కంటి వాడు' అనే పాఠాంతరం కూడా వుంది. హె(ఎ)చ్చు కంటి వాడంటే మూడవ కన్ను వాడు. అదీ శివుడి లక్షణమే. ఇలా రామకృష్ణకవి ఒకప్పుడు శైవుడు కనుకనే ఆయన కావ్యాలన్నిటిలో ఎక్కడో ఒకచోట శైవ పరిమళం గుబాళిస్తూ వుంటుంది.

'రామలింగడు', 'రామకృష్ణుడు'గా పేరు మాత్రమే మార్చుకున్నాడు గానీ, శైవమును వదలి వైష్ణవాన్ని స్వీకరించలేదనీ, విష్ణుకావ్యాలు వ్రాసినంత మాత్రంచేత ఆయన వైష్ణవం స్వీకరించినట్లు కాదనీ, అలా వైష్ణవం స్వీకరించలేదు కనుకనే ఆయన వ్రాసిన విష్ణు కావ్యాలలో కూడా శైవం గుబాళిస్తున్నదనే అభిప్రాయాన్ని నిడదవోలు వెంకటరావు గారు వెలిబుచ్చారు. అయితే యీ వాదన అంత సమంజసమనిపించదు. రామకృష్ణకవి వ్రాసిన విష్ణు కావ్యాలలో లీలగా మునుపటి శైవం ద్యోతకమవుతున్నదే కానీ, అవి వైష్ణవ భక్తి ప్రపూరితాలు. వైష్ణవునిగా మారని ఒక కవి అంతటి వైష్ణవ పరిజ్ఞానాన్నీ, భక్తి తాత్పర్యాన్నీ కలిగి వుండడం అసంభవం. పైపెచ్చు వైఖానసుడైన భట్టరు చిక్కాచార్యులు తనగురువని రామకృష్ణుడే పేర్కొన్నాడు కనుక ఆయన వైష్ణవం స్వీకరించి గురువు వద్ద కృష్ణ యజుర్వేదాన్నీ, వైఖానసాగమాన్నీ, వైష్ణవ సాహిత్యాన్నీ అధ్యయనం చేసి వుంటాడనేది నిర్వివాదాంశమని నా భావన.

'పాండురంగ మాహాత్మ్యము'లోని పుండరీకుని పోలిక 'ఘటికాచల మాహాత్మ్యము'లోని గోవిందశర్మలో కనుపిస్తుంది. 'ఉద్భటారాధ్య చరిత్ర'లో కవి చేసిన వల్లకీపుర వర్ణన, 'పాండురంగ మాహాత్మ్యము'లోని కాశీపుర వర్ణన, 'ఘటికాచల మాహాత్మ్యము'లోని కాంచీపుర వర్ణన - ఒకే విధంగా వుంటాయి. 'ఘటికాచల మాహాత్మ్యము'లో నృసింహుడు ప్రత్యక్షం కాగానే సప్తర్షులు చదివే దండకంలోని దశావతార వర్ణన, 'పాండురంగ మాహాత్మ్యము'లో పుండరీకుని విష్ణుస్తుతి - రెండూ అచ్చుగుద్దినట్లు ఒకే విధంగా వుంటాయి. 'పాండురంగ మాహాత్మ్యము'లో అగస్త్యుడు తన భార్య లోపాముద్రను వెంటతీసుకుని స్వామిమలకు యాత్ర చేస్తూ దారిలోని విశేషాలను వివరించడం; 'ఘటికాచల మాహాత్మ్యము'లో వసిష్ఠుడు తన భార్య అరుంధతికి కాంచీనగరాన్ని వర్ణించి చూపడాన్ని తలపింపజేస్తుంది.

రామకృష్ణకవి కావ్యాలలోని మరికొన్ని సారూప్యతలను కూడా పరిశీలిద్దాం. 'ఉద్భటారాధ్య చరిత్రము'లో కవి సృష్టించిన మదాలసుని పాత్రకు మారురూపే 'పాండురంగ మాహాత్మ్యము'లోని నిగమశర్మ పాత్ర. 'ఉద్భటారాధ్య చరిత్రము'లో ధీనిధి భార్య శుభకీర్తి పెక్కు వ్రతములు, ఉపవాసములు దీక్షతో చేసి మింటి దయ్యములను నేలకు తెచ్చి తన కుమారుడైన మదాలసుడిని కన్నదట (2-115). 'పాండురంగ మహాత్మ్యము'లో సభాపతి భార్య (పేరు చెప్పలేదు) అత్యంత నిష్ఠతో నింగి వేల్పులను నేలకూ, నేలవేల్పు కొలము నింగికి తెస్తూ పూజించగా నిగమశర్మ కలిగాడట (3-5), ఇలా కవి వీరిద్దరి పుట్టుకనూ ఒకేవిధంగా వర్ణించాడు. పొటమరించిన వీటి విటుల అలకలు తీరుస్తాడట మదాలసుడు (2-129). వేగిరంగా లేచి విటవాదములను తీరుస్తాడట నిగమశర్మ (3-12). ఇంట్లోంచి పారిపోయి, మదాలసుడు గుడి కొల్లగొట్టి, 'ఇరులు ఓయన నోయను నడికి రేయి' పారిపోయాడట (2-137). నిగమశర్మ యింట్లో నగలన్నీ దొంగిలించి 'గాఢతర తమోనికరము తన తగు తోడుగ నొకరుడు పేరడవి త్రోవన' పారిపోయాడట (3-49). ఇలా యిద్దరూ అర్ధరాత్రి వేళలోనే చిక్కని చీకటే తమకు తోడురాగా ఒంటరిగా పారిపోయారు. దొంగిలించుకుపోయిన సొమ్ములతో మదాలసుడు కొత్త ఊర్లో 'మానితలీల, సజ్జనునివలె, ఆ పురంలోని మనుష్యులతో కలసి మచ్చికయై తలలోని నాలుకయై' వున్నాడట (2-141). కాపువారింట నిగమశర్మ 'తలలోపల నాలుకలా, పూసలలో దారంలా, పాలలో చల్లిన నీరులా, తేడాపాడాలు లేకుండా మనసులు కలిసి

అభేదమున' ఆ కాపు దగ్గర అతదున్నాడట (3-59). అలాగే ద్యావాపృథ్వ్యవకాశుఁ డీశ (ఉ.చ. 1-33) అనే పదబంధాన్ని 'పాండురంగ మాహాత్మ్యము'లో ద్యావాపృథ్వ్యవకాశపుంభిత' అని వాడుకున్నాడు. ఈ పదబంధాలు రెండింటినీ కవి ఆయా కావ్యాలలోని ప్రథమాశ్వాసాలలోని 33వ పద్యంలోనే ప్రయోగించడం విచిత్రం.

ఇలా యీ కావ్యాలలోని ఎన్నో సారూప్యతలు యీ కావ్యాలన్నీ రచించిన కవి ఒక్కరేనని అంటే రామలింగకవే రామకృష్ణకవి అనీ తిరుగులేని విధంగా ఋజువు చేస్తున్నాయి.



# అనుబంధము - 4
# రామకృష్ణ కవి పేర్కొన్న దివ్య తిరుపతులు

వైష్ణవులు 108 విష్ణు క్షేత్రాలను దివ్య తిరుపతులుగా భావిస్తారు. వీటినే దివ్య దేశములనీ అంటారు. తెనాలి రామకృష్ణకవి తన 'ఘటికాచల మాహాత్మ్యము'లో 44 పద్యాలలో యీ నూట ఎనిమిది దివ్య క్షేత్రాలనూ పేర్కొన్నాడు. ఘటికాచల క్షేత్రం (కడిగై) కూడా యీ దివ్యతిరుపతులలో ఒకటి. వీటిని గురించి తెలుసుకొనబోయే ముందు మనం ఆళ్వారుల గురించి కొంత తెలుసుకొనడం అవసరం. క్రీ.శ. 7, 8 మరియు 9 శతాబ్దాలలో తమిళదేశంలో వైష్ణవ భక్తి ఉద్యమం ఊపందుకుంది. ఈ ఉద్యమ సృష్టికర్తలే ఆళ్వారులు. 'ఆళ్వారు' అనే తమిళ పదానికి 'పరిణతి చెందినవాడు', 'లోతు నెరిగినవాడు' అని అర్థాలు. భగవద్భక్తి ఫలితంగా చేకూరిన పరమానందమనే సముద్రపు లోతు నెరిగినవాడు 'ఆళ్వారు'. ఆ భగవద్భక్తి పారవశ్యంలో తనను తాను మరచి ఆ నిత్యానందాబ్ధిలో ఓలలాడేవాడు 'ఆళ్వారు'. అందుకేనేమో తమిళనాట వ్యసనాలు లేకుండా, నిత్యమూ ఆనంద పరవశుడైవున్న వ్యక్తిని 'ఆళ్వారు' అనడం వాడుక అయింది.

ఉత్తర భారతదేశములో వేద ప్రామాణ్యాన్ని అంగీకరించని బౌద్ధ, జైన, చార్వాక మతాలు అప్పటికే వైదిక మతం విధించిన దారుణమైన వర్ణవ్యవస్థా దాశ్య శృంఖలాలలో మ్రగ్గుతున్న పీడిత, తాడిత జనావళికి ఎంతో ఉపశమనాన్ని కలిగించాయి. 'వేదములు శూద్రులు చదవడం నిషిద్ధం' అనే నియమం కారణంగా వేదాలపట్ల సామాన్యులలో ఏర్పడిన నిరసన భావాన్ని జైనులూ, బౌద్ధులూ, చార్వాకులూ మరింత ముందుకు తీసుకెళ్లారు. అత్యంత వ్యయ ప్రయాసలతో

కూడిన, హింసాత్మకమైన జంతుబలితో కూడిన యజ్ఞ నిర్వహణ ఏ కొద్దిమంది ధనాఢ్యులకో, రాజవర్గాలకో సాధ్యంకానీ, సామాన్యులకు సాధ్యం కాదు. అంచేత ఖరీదైన యజ్ఞయాగాల స్థానంలో అందుబాటులో వుండే ప్రత్యామ్నాయ మోక్షమార్గాల కోసం సామాన్యులు ఆరాటపడ్డారు. అలాగే వ్యవసాయానికీ, వాణిజ్యానికీ ఎంతో అవసరమైన పశుసంపద అంతా యజ్ఞకాండలో అంతరిస్తున్నందున వ్యావసాయకులూ, వణిజులూ కూడా వైదిక కర్మకాండలను వ్యతిరేకించారు. వైదికులు 'దేవభాష' అయిన సంస్కృతంలో తమ క్రతుకాండ జరుపుతూండడం కారణంగా హైందవ మతము క్రమంగా ప్రజలకు దూరమవగా, ప్రజల భాషలైన పాళీ, అర్ధమాగధి వగైరా భాషలలో బోధనలు చేస్తూ బౌద్ధ, జైన మతాలు ప్రజా బాహుళ్యంలో విస్తరించాయి. అలాగే తమకు ఎటువంటి వ్యక్తీకరణ స్వేచ్ఛ, తమ వికాసానికి ఎటువంటి అవకాశాలూ వైదిక వ్యవస్థలో లేవని భావించిన స్త్రీలు వైదికేతర (నాస్తిక) మతాలైన జైన, బౌద్ధాలను పెద్ద ఎత్తున స్వాగతించారు. ఇలా వర్ణ వ్యవస్థ దౌష్ట్యాలకూ, ధనస్వామ్యానికీ వ్యతిరేకంగా, అహింసామార్గంలో ప్రజలకు అందుబాటులో వుండే మోక్షసాధనా మార్గాలను, ప్రజల భాషలలో బోధిస్తూ వీరు ప్రజాబాహుళ్యంలోని అన్ని వర్గాలనూ ఆకట్టుకుని, ఉత్తర భారతదేశంలో ప్రబలమై, క్రమంగా దక్షిణ భారత దేశానికి కూడా విస్తరించారు.

దక్షిణాదిలో ఈ నాస్తిక మతముల దాడి నుండి తనను తాను రక్షించుకొనడానికి వైష్ణవం సమకట్టింది. తమ మత వ్యవస్థలోని లోపాలను సరిదిద్దుకుని, ప్రజలు జైన, బౌద్ధ మతాల వైపుకు మొగ్గకుండా వుండదానికి నాటి వైష్ణవం చేసిన కృషిలో భాగంగానే ఆళ్వారులు ఉద్భవించారు. మహాపండితులు, ఆలోచనాపరులు, జ్ఞానులు, భక్తులు అయిన ఆళ్వారులు నాస్తిక్యము కారణంగా ప్రజలలో నీతి మార్గమునకు భంగం కలుగుతున్నదని భావించి, భక్తి, ప్రపత్తి, శరణాగతి భావములను ప్రచారం చేస్తూ ప్రజలను నీతిమంతులుగా చేయడానికి పూనుకున్నారు. అహింస, భూతదయ, స్వార్థ రాహిత్యము, నిరాడంబరత్వము, వర్ణభేదాలకతీతమైన అఖిలమానవ సౌభ్రాతృత్వ భావము వీరి సాధనాలు. వీరు ప్రజల భాషయైన తమిళంలో శ్రీమన్నారాయణుని గుణగానం చేశారు. విష్ణువు యొక్క విగ్రహములకు అర్చన చేయడం, ఆ మూర్తులను ఆరాధించడం వీరి మార్గం కాదు. అయినా వీరు విగ్రహారాధనను నిరసించలేదు. కేవలం విష్ణు భక్తిని ఆనందపరవశులై ప్రచారం చేయడమే వీరి లక్ష్యం. ఈ లక్ష్యసాధనకు స్వార్థరహితంగా ఆళ్వారులు సుమారు మూడు శతాబ్దాలపాటు జరిపిన అవిరళ కృషి కారణంగానే దక్షిణ భారతదేశంలో, ప్రత్యేకించి తమిళదేశంలో, ఆస్తిక మతము (వైదిక మతము) ప్రత్యేకించి వైష్ణవము పునరుజ్జీవనానికి నోచుకున్నది. రాజుల మొదలు సామాన్య ప్రజానీకం వరకు ఆళ్వారుల భక్తి ప్రచారానికి ముగ్ధులయ్యారు.

దక్షిణ భారతదేశాన్ని కుదిపివేసిన అత్యంత ప్రభావవంతమైన యీ భక్తి ఉద్యమానికి ఆద్యులైన ఆళ్వారులు పన్నెండు మంది. వీరిని పన్నిద్దరాళ్వారులనీ, ద్వాదశాళ్వారులనీ అంటారు. వీరిలో అన్ని కులములకు సంబంధించిన వారూ వున్నారు. వీరిలో కొందరి పుట్టు పూర్వోత్తరాలు, కులగోత్రాలు నేటికీ తెలియవు. వీరిలో ఒకరు స్త్రీ, ఒకరు పంచమ జాతికి చెందినవారు, కొందరు శూద్రులు, కొందరు బ్రాహ్మణులు, ఒక క్షత్రియుడు వున్నారు.

క్లుప్తంగా వారి వివరాలు :

1) పొయిగై ఆళ్వారు – ఈయన జన్మస్థలం కాంచీపురం.

2) భూదత్తాళ్వారు లేక పూదత్తాళ్వారు – ఈయన జన్మస్థలం మహాబలిపురం.

3) పేయాళ్వారు – ఈయన జన్మస్థలం మద్రాసులోని మైలాపూర్.

పై ముగ్గురినీ ముదలాళ్వారు లంటారు.

4) తిరుమళిశై ఆళ్వారు - తమిళనాడులోని చెంగల్పట్టు జిల్లాలోని తిరుమళిశై అనే ఊరు ఈయన జన్మస్థలం.

పై నలుగురు ఆళ్వార్లు సుమారుగా ఒకే కాలానికి చెందినవారని చరిత్రకారులు అభిప్రాయ పడుతున్నారు. వీరే కులాలకు చెందిన వారో నిర్ధారణ కాలేదు.

5) కులశేఖరాళ్వారు - కేరళకు చెందిన చంద్రవంశపు రాజు. ఈయన రాజభోగాలను త్యజించి విష్ణు క్షేత్రములు దర్శించి భక్తి పారవశ్యంతో ఎన్నో పాశురాలను సాయించారు. నలభై పాశురముల 'ముకుందమాల' అనే స్తోత్ర ప్రబంధ కర్త యీయనే.

6) తొండరడిప్పొడి ఆళ్వారు - ఇతడు బ్రాహ్మణుడు. ఈయన్ని విప్రనారాయణుడనీ అంటారు. 'తొండ రడి ప్పొడి' అంటే తమిళంలో 'భక్తుని పాద ధూళి' అని అర్థం. వృత్తిచే మాలాకారుడు. ఈయన తమిళనాడులోని శ్రీరంగంలోని రంగనాథుని సేవకు జీవితాన్ని అంకితం చేసిన పరమభక్తుడు. ఈయన కొంతకాలం దేవదేవి అనే వేశ్య వ్యామోహంలో పడి తిరిగి పశ్చాత్తప్తుడై ఆమెను తన శిష్యురాలిగా స్వీకరించి, అనంతరం సోదరీ సోదరుల వలె వారిరువురూ రంగనాథుని సేవకే తమ జీవిత శేషాన్ని అంకితం చేశారు. ఈయన తమిళంలో 'తిరుమాలై', 'తిరుప్పళ్ళి ఎళుచ్చి' అనే రెండు స్తోత్ర గ్రంథాల్ని రచించాడు.

7) తిరుప్పాణి ఆళ్వారు - తమిళనాడులో నేత వస్త్రాలకు ప్రసిద్ధిగాంచిన వరయూరు (ఉరైయూర్)కు చెందిన దళితుడు. కనుక శ్రీరంగనాథుని ఆలయం లోనికి ప్రవేశించలేక, దూరాన్నుంచే ఆలయ గోపురంకేసి చూస్తూ, వీణ మీటుతూ, భక్తి పారవశ్యంతో హరి సంకీర్తనం చేస్తూ, కావేరి గట్టుపైనే నివసిస్తూ, ఎవ్వరేది పెట్టినా తింటూ జీవిక సాగించేవాడు. ఓసారి లోకసారంగ ముని అనే శ్రీరంగనాథ దేవాలయ ప్రధాన అర్చకుడు స్వామి అర్చన కొరకు కావేరి నది నుండి బిందెతో తీర్థం మోసుకొస్తూ ఒక యిసుకతిన్నెపై భక్తి పారవశ్యంలో దారికడ్డంగా పడుకున్న తిరుప్పాణిని చూసి అంటరానివాడని కసురుకుని ఒక రాయితో అతనిని తలపై తీవ్రంగా గాయపరచాడు. దానికి తిరుప్పాణి ఏమాత్రం కోపగించుకొనక 'ఈ అపరాధిని క్షమించమ'ని రంగనాథుడిని ప్రార్థించాడు. దీంతో లోకసారంగునికి జ్ఞానోదయమై తనలోతానే యిలా తర్కించుకున్నాడు.

"విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణ శ్రేష్ఠుడిని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్క మాసం తినేవాడినీ అందరినీ సమదృష్టితో చూసి ఆదరించే వాడే నిజమైన పండితుడని భగవద్గీత పేర్కొంటున్నది కదా! నేనసలు పండితుడనేనా? నేనింత హాని తలపెట్టినా నాపై కోపం వహించక నన్ను క్షమించమని భగవంతుని ప్రార్థించిన తిరుప్పాణి పంచముడా? ఒకవేళ పంచముడైనా కావచ్చు. ఎందుకంటే భూలోకంలోని నాలుగు వర్ణములకూ చెందిన వాడు కాడతడు. గరుత్మంతుడు, అనంతుడు, ల÷ , నారదుడు, తుంబురుడు, ప్రహ్లాదుడు వలెనే వైకుంఠంలో హరిని నిత్యమూ సేవించే నిత్యసూరి వర్ణమునకు చెందినవాడతడు. ఆ రకంగా అతడు పంచముడే!" అనుకుంటూ ఆ తీర్థపు బిందెను ఆలయ ద్వారం వద్దే విడిచి పెద్దగా కేకలు వేసుకుంటూ పోయి తిరుప్పాణిని తాకడమే కాదు. తన బుజాలపై మోసుకుంటూ అతన్ని ఆలయంలోకి తెచ్చి శ్రీరంగనాథుని దర్శన భాగ్యం అతడికి కల్పించాడు. ఎన్నడూ రంగనాథ విగ్రహము చూసి ఎరగని తిరుప్పాణి ఆ విగ్రహ సౌందర్యాన్ని శిరస్సు నుండి పాదాలవరకు రమ్యంగా వర్ణిస్తూ అప్పటికప్పుడు సాయించిన ప్రబంధమే 'అమలనాదిప్పిరాన్' అనే పేరుతో ప్రసిద్ధమైనట్టిది. దక్షిణ భారతదేశంలో దళితులు వైష్ణవం వైపుకు పెద్దఎత్తున ఆకర్షితులవడానికి యీయన ప్రధాన కారకుడు. ఆళ్వారుల వైష్ణవ భక్తి ఉద్యమంలో నిమ్నకులాల నుంచి సాతానివారూ, దాసరులూ, హరిదాసులూ, మాల దాసరులూ వగైరాలు ఉద్భవించారు. సాతాని అనే పదానికి మూలం 'చాత్తాతవర్' అనే తమిళ పదమే. దీనర్థం శిఖ (పిలక), యజ్ఞోపవీతము (జందెము) లేకుండా వుండేవాడు. వీరినే కొన్ని ప్రాంతాల్లో చాదాత్త వైష్ణవులనీ, సాతిన వారనీ,

చాతిన వారనీ పిలుస్తున్నారు. విష్ణుదేవాలయాలలో అర్చన వైఖానస, శ్రీవైష్ణవ, పాంచరాత్ర శాఖలకు చెందిన బ్రాహ్మణులు నిర్వహిస్తూండగా కొన్ని నిమ్నకులాలలో శూద్రులైన ఈ చాదాత్తులు పౌరోహిత్యం చేస్తున్నారు. బ్రాహ్మణేతరులైన వైష్ణవ భక్తుల్ని దాసరులు, దాసులు అనే వారు. ఇతర శూద్రులలోనే కాక కమ్మ, కాపు కులాల్లోనూ, వైశ్యులలో కూడా 'దాసరి' అనే ఇంటి పేరుండడాన్ని బట్టి బ్రాహ్మణేతర కులాలలో వైష్ణవ భక్తి ఉద్యమం ఎంత బలీయంగా వుండేదో అర్థం చేసుకోవచ్చు. ఓ రకంగా, బ్రాహ్మణాధిపత్యం కల వైదిక మతానికి ప్రత్యామ్నాయంగా బ్రాహ్మణేతరులలో యీ ఆళ్వారుల వైష్ణవ భక్తి ఉద్యమం వేళ్లూనుకుంది.

8) తిరుమంగై ఆళ్వారు – ఈయన కొండ జాతికి చెందిన సైన్యాధిపతి. తరువాత తిరుమంగై అనే ప్రదేశానికి గ్రామ పాలకునిగా నియమించబడ్డాడు. ఇతడు కుముదవల్లి అనే వైష్ణవ కన్యను ప్రేమించి వివాహం చేసుకొనగోరతాడు. అప్పుడామె సదుద్దేశ్యంతో ఒక షరతు విధిస్తుంది. సంవత్సరకాలంపాటు తానొక వ్రతం చేస్తాననీ, ఆ కాలంలో ప్రతిరోజూ వెయ్యిమంది విష్ణు భక్తులకు భోజనాలు ఏర్పరచాలనీ, యిలా సంవత్సరంపాటు నిర్విఘ్నంగా తన వ్రతం పూర్తయితే, అనంతరం తాను తప్పక పెళ్లికి అంగీకరిస్తాననీ తెలిపింది. తన ఆస్తి అంతా హరించుకుపోయే వరకు అన్నదానాలు నిర్వహించిన తిరుమంగై ఆ తరువాత అందుకోసం ఒక బృందాన్ని కూడగట్టి ధనవంతులనూ, దుర్మార్గులనూ దారిదోపిడీ చేసేవాడు. పేదలు, సన్మార్గుల జోలికి పోయేవాడు కాదు. ఒకసారి కొత్తగా పెళ్లైన యువ దంపతులను దోచుకొనబోయి జ్ఞానోదయమై నాటి నుండి ప్రజలనుండి విరాళాల సేకరణ చేసి మాత్రమే తన అన్నదానాలను కొనసాగించి, దొంగలెందరిలోనో పరివర్తన తెచ్చి, ఎందరో భక్తులను తన శిష్యులుగా చేసికొని, విరాళాలతో శ్రీరంగనాథాలయానికి గోపుర, ప్రాకారములు నిర్మించి ప్రసిద్ధికెక్కాడు. ప్రసిద్ధిగాంచిన, 'సియ తిరుమాదల్', 'పెరియ తిరుమాడల్' ఈయన రచించిన గ్రంథములే.

9) పెరియాళ్వార్ – ఈయనకు విష్ణుచిత్తుడని మరోపేరు. శ్రీవిల్లిపుత్తూరు యీయన జన్మస్థలం. ఈయన బ్రాహ్మణుడు. కృష్ణభక్తుడు. పెద్ద పండితుడు కాదు. అతి సామాన్యుడు. ఒకప్పుడు పాండ్యరాజు ఆస్థానానికి ఉత్తర భారతదేశాన్నుండి వచ్చిన ఒక ఉద్దండ సంస్కృత పండితుడు 'తర్కవేదాంతాలలో నన్ను ఎవరైనా ఓడించగలరా!' అని సవాలు విసరగా, అంతగా శాస్త్ర పరిజ్ఞానంలేని విష్ణుచిత్తుడు కృష్ణ భక్తి కారణంగానే ఆ పండితుడిని చిత్తుగా ఓడించాడని వైష్ణవుల విశ్వాసం. అప్పుడు రాజు యీయన్ని ఘనంగా సత్కరించి గజారోహణం కావించి పురవీధులలో ఊరేగించాడు. అప్పుడు యీయన నోటి నుండి ఆశువుగా వెలువడిన దివ్యపాశురములే 'తిరుప్పల్లాండు' (దివ్యమంగళం) పేరుగల గ్రంథంగా రూపొందాయి.

10) ఆండాళ్ – విష్ణు చిత్తుడికి శ్రీవిల్లిపుత్తూరులోని తన తులసివనంలో అనాథ శిశువుగా దొరికింది యీమె. చేరదీసి పెంచిన విష్ణుచిత్తుడు యీమెకు గోదాదేవి అని పేరు పెట్టాడు. ఈమె కులగోత్రాలు తెలియవు. విష్ణుచిత్తుని పెంపకంలో బ్రాహ్మణ బాలికగానే పెరిగింది. రోజూ తులసి చెట్లకు నీరుపోస్తూ, తులసి ఆకులు కోస్తూ, వాటిని తులసి మాలలుగా అల్లుతూ తన తండ్రి చేసే పూజల కోసం మాలలను సిద్ధంచేయడం యీమె పని. ఒకనాటి సాయంత్రం రంగనాథునికి అర్పించడానికి తయారుచేసిన తులసి మాలను తన శిగలో ధరించి అద్దంలో తన సౌందర్యాన్ని చూసుకుంటున్నది గోదాదేవి. దీనిని చూసిన విష్ణు చిత్తుడు ఆమెను కసురుకుని, తిరిగి మాల తయారుచేసే వ్యవధి లేనందుకు బాధపడ్డాడు. ఆ రాత్రి కలత నిద్రపోయిన ఆయన తెల్లవారి లేచిచూడగా, పర్ణశాలలో స్తంభానికి వ్రేల్లాడుతున్న తులసిమాల వాడకపోగా మరింత తాజాగా వుందట. అంతకు మునుపు గోదాదేవి తన శిగలో ముడుచుకున్న ఆ తులసిమాల వాడిపోకపోగా మరింత ప్రకాశవంతం అయిందట. దానినాయన తీసుకువెళ్లి రంగనాథునికి అర్పించాడు. స్వామి మెడలో వేయగానే అది మరింతగా వెలుగొందిందట. విష్ణుచిత్తుడు గమనించలేదుగానీ, యిలా గోదాదేవి అంతకుముందు కూడా రోజూ తన సిగలో ముడిచిన

ఖనసుడి విగ్రహాన్ని మాత్రమే పూజిస్తారు.

విష్ణు భక్తాగ్రేసరులు 'ఆళ్వారు'లని పిలువబడితే, శివభక్తాగ్రేసరులు 'నాయన్మారు'లని పిలువబడ్డారు. దక్షిణ భారతదేశంలోని శివాలయాలలో శివభక్తాగ్రేసరులైన అప్పర్, తిరుజ్ఞాన సంబంధర్, నందనార్ మొదలైన నాయన్మారుల (వీరినే నాయనారులని కూడా అంటారు) విగ్రహాలు కూడా దేవతా ప్రతిమలతోపాటు పూజలందుకుంటాయి. దక్షిణాదిన వైష్ణవ గురువులను అయ్యంగారులనీ, శైవ గురువులను అయ్యర్లనీ పిలవడం పరిపాటి.

ఈ ఆళ్వారులు పన్నెండు మందిలో ఏ ఒక్కరిచేతనైనా లేక అందరిచేతనూ, మంగళాశాసనము సాయించబడిన విష్ణుక్షేత్రమును 'దివ్యతిరుపతి' లేక 'దివ్యదేశము' అంటారు. ఇవి మొత్తం 108. ఈ నూట ఎనిమిది దివ్య క్షేత్రముల గురించి ఆళ్వారులు నాలుగువేల పాశురములను రచించి గానంచేశారు. అదే 'నాలాయిర ప్రబంధమ్' పేరిట ప్రసిద్ధమైంది. తమిళంలో 'నాల్ ఆయిరమ్' అంటే నాలుగు వేలు.

చోళనాడున - నేటి తంజావూరు జిల్లా ప్రాంతమున - గల దివ్యక్షేత్రములు 40; పాండ్యనాడున - అనగా నేటి మధుర ప్రాంతమున - 18; మలైనాడు లేక కేరళ ప్రాంతమున - 13; రామనాధపురం, తిరునల్వేలి జిల్లాల ప్రాంతంలో - 2; తొండైనాడు లేక చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు జిల్లాల ప్రాంతంలో - 22 - మొత్తం 95 దివ్య దేశములు దక్షిణ భారతదేశంలో వున్నాయి. 95వది ఘటికాచల క్షేత్రము. ఆంధ్రప్రదేశ్‌లో తిరుమల, అహోబిలము (కర్నూలు జిల్లాలోని ప్రసిద్ధ విష్ణు క్షేత్రం). మిగిలిన పది ఉత్తర దేశంలో వున్నాయి. 108వ దివ్యతిరుపతి తిరునాడు. అదే పరమపదము.

ఆళ్వారుల మంగళాశాసనములకు పాత్రమైన పవిత్ర స్థలములు దివ్య తిరుపతులు. నాలాయిర ప్రబంధంలో పేయాళ్వారు, తిరుమంగై ఆళ్వార్లచేత 'కడిగై' అని ప్రశంసలందుకున్న క్షేత్రం ఘటికాచల క్షేత్రము.

మొత్తం 108 దివ్య తిరుపతులనూ రామకృష్ణకవి తన ఘటికాచల మాహాత్మ్యములోని ప్రథమాశ్వాసములోని 29 నుండి 72 వరకు గల పద్యాలలో పేర్కొన్నాడు. అవి -

| దివ్య తిరుపతి పేరు ← (రామకృష్ణ కవి పేర్కొన్న ప్రకారం) → | దైవము పేరు | నాలాయిర ప్రబంధంలో పేర్కొన్న దివ్యదేశం |
|---|---|---|
| 1. రంగధామము (శ్రీరంగం) | రంగధాముడు | 1. తిరువరంగం |
| 2. తిరువాళురందధామము | జనార్ధనుడు | 2. ఉరైయూర్ |
| 3. తంజాపురి (తంజావూరు) | నృసింహుడు | 3. తంజైమామణిక్కోయిల్ |
| 4. నంబిల్నామపురి | సౌందర్యనాధుడు (విష్ణువు) | 4. తిరునంబిల్ |
| 5. కరంబనూర్ | ఉత్తమనాముడు (విష్ణువు) | 5. తిరుక్కరంబనూర్ |
| 6. తిరువెళ్లరపురి | పుండరీకలోచన దేవుడు | 6. తిరువెళ్లరై |
| 7. పుళ్లన్ బుదకుడి | రఘునాధుడు | 7. పుళ్లంబూదంగుడి |
| (ఈ క్షేత్రం కుంభకోణానికి వాయవ్యంగా రెండు కోసుల దూరంలో వుంది) | | |
| 8. తిరుపేర్ నహరపురము | అనంతశయనుడు | 8. తిరుప్పేర్నహర్ |
| 9. ఆదనూరు | విష్ణువు | 9. తిరు ఆదనూర్ |
| (ఈ క్షేత్రం కూడా కుంభకోణానికి వాయువ్య దిక్కునే వుంది) | | |
| 10. తిరువళుందూర్ | గోపికా వల్లభుడు | 10. తిరువళుందూర్ |

| | | |
|---|---|---|
| 11. చిరుప్పూరి (ఈ క్షేత్రం కుంభకోణానికి ఆగ్నేయ దిశగా వుంది) | ఫణితల్పశాయి | 11.సిరుపులియూర్ |
| 12. సిరిచిర్పురము | బాలకృష్ణుడు | 12. తిరుచ్చేరై |
| 13. చొక్కుణ్ణూరు | జనార్ధనుడు | 13. తలైచ్చ ఎగణాన్ మదియమ్ |
| 14. కుంభఘోణము (కుంభకోణం) (శార్ఙ్గమనే విల్లును ధరించిన విష్ణువు) | శార్ఙ్గపాణి | 14. తిరుక్కుదందై |
| 15. తిరుకండియూర్ | ఆదినారాయణుడు | 15. తిరుక్కండియూర్ |
| 16. తిరువిణ్ణహర్పురము | వేంకటేశుడు | 16. తిరువిణ్ణహర్ |
| 17. తిరుక్కణ్ణపురము | నీలదేహుడు | 17. తిరుక్కణ్ణపురమ్ |
| 18. తిర్నగరి (నగరి) | లక్ష్మీనారాయణుడు | 18. తిరువాలిత్తిరునగరి |
| 19. నాగపట్టణము | వేంకటేశుడు | 19. తిరునాగై |
| 20. తిరుణరయ్యూరు | వేంకటేశుడు | 20. తిరునరయ్యూర్ |
| 21. నందిపుర విణ్ణహరనగరి | జగన్నాథుడు | 21. నందిపుర విణ్ణహరమ్ |
| 22. తిరువిందళూరు | సుగంధివననాథుడు (విష్ణువు) | 22. తిరు ఇందళూర్ |
| 23. శ్రీరామ విణ్ణహరీపురము | త్రివిక్రమదేవుడు (వామనుడు) | 23. కాళిచ్చీరామ విణ్ణహరమ్ |
| 24. తిరుకూదలూర్పురము | వరదరాజు | 24. గూదలూర్ |
| 25. తిరుక్కణ్ణంగుడి | చిన్ని కృష్ణుడు | 25. తిరుక్కణ్ణంగుడి |
| 26. తిరుక్కణ్ణమంగై | భక్తవత్సలుడు (విష్ణువు) | 26. తిరుక్కణ్ణమంగై |
| 27. కపిస్థలము | గజేంద్రవరదుడు (విష్ణువు) | 27. కపిత్తలమ్ |
| 28. తిరువెళ్లియన్‌గుడి | రాఘవుడు | 28. తిరువెళ్లియంగుడి |
| 29. తిరుణాంగ పత్తనము | | 29. తిరుణాంగూర్ |
| 30. మాణిమాదక్కోవెల | | 30. తిరుమణి మాడక్కోయిల్ |
| 31. తిరువెళ్లక్కొళం | | 31. తిరువళ్లక్కుళమ్ |
| 32. తిరుమణిక్కూద | | 32. తిరుమణిక్కూడం |
| 33. వణ్పురుషోత్తమమ్ | పురుషోత్తముడు (విష్ణువు) | 33. తిరువణ్పురుషోత్తమమ్ |
| 34. శంబోజ్జకోవెల | | 34. తిరుచ్చెంబున్ శైక్కోయిల్ |
| 35. పాత్తంపల్లి | | 35. తిరు పాత్తన్‌పల్లి |
| 36. అరిమేయ విణ్ణహరము | | 36. తిరుఅరిమేయ విణ్ణహరమ్ |
| 37. కావళంబాడి | | 37. తిరుక్కావళంబాడి |
| 38. వైకుంఠ విణ్ణహరము | | 38. తిరువైకుంఠ విణ్ణహరమ్ |
| 39. తిరుత్తేవనార్తోహమ్ | | 39. తిరుత్తేవనార్ తొగై |

| | | |
|---|---|---|
| 40. తిరుత్తెత్తియంబలము | | 40. తిరుత్తెట్టి అంబలమ్ |
| 41. మన్నారుకోవెల | బాలకృష్ణుడు | 41. తిరుమాలి రుంజులై |
| 42. అలహర్తిరుమల | శ్రీ వేంకటేశుడు | 42. తిరువేంగడమ్ |
| 43. తిరుకోటియూరు | కృష్ణదేవుడు | 43. తిరుక్కొట్టియూర్ |
| 44. తిరుమ్మెయివిణ్ణపురము | సత్యగిరీశుడు | 44. తిరుమెయ్యమ్ |
| 45. తిరుపుల్లానిపురి | రామభద్రుడు | 45. తిరుప్పుల్లాణి |
| 46. తిరుతంగాల్పురము | నారాయణుడు | 46. తిరుత్తణీకాల్ |
| 47. తిరుమోహూర్పురి | కాలమేఘుడు (విష్ణువు) | 47. తిరుమోహూర్ |
| 48. దక్షిణ మధుర | కూడలవకియ | 48. తిరుకూడల్ |
| 49. కురువిత్తురీ పురము | కృష్ణదేవుడు | 49. తిరువెల్లక్కా |
| 50. శ్రీవిల్లి పుత్తూరు | మన్ననార్ (కృష్ణుడు) | 50. శ్రీవిల్లిపుత్తూరు |
| 51. తిరునగరి | ఆదినాథుడు (విష్ణువు) | 51. తిరుక్కురుహూర్ |
| 52. తిరువెళ్లి మంగళాద్భుత పట్టణము | అరవిందనేత్రుడు (విష్ణువు) | 52. తులైవిల్లి మంగలం |
| 53. శ్రీవరమంగపురి సనాథుడు (విష్ణువు) | అమృతాంబునిధి తనయా | 53. సిరి వరమంగై |
| 54. తెందిరుప్పేర్పురి | కేశినేందుడు (విష్ణువు) | 54. తిరుప్పేరై |
| 55. వైకుంఠపట్టణం | వైకుంఠనేత (విష్ణువు) | 55. శ్రీవైకుందం |
| 56. తిరుప్పుళిగుడిపురము | భూమిపాలుడు (విష్ణువు) | 56. తిరుప్పుళింగుడి |
| 57. మంగపట్టణము | విజయాసనుడు (విష్ణువు) | 57. వరగుణమంగై |
| 58. కుళింద నగరి | నవనీతచోరుడు (కృష్ణుడు) | 58. తిరుక్కుళందై |
| 59. తిరుకురుంగుడి | బృందారకవైరి వైరి (విష్ణువు) | 59. తిరుక్కురుంగుడి |
| 60. తిరుకోలూరిపురి | శౌరి (విష్ణువు) | 60. తిరుక్కోళూర్ |
| 61. అనంతపురము | చాణూరవైరి (కృష్ణుడు) | 61. తిరువనంతపురమ్ |
| 62. వన్పరిసరము | శ్రీవత్సవత్సుడు (విష్ణువు) | 62. తిరువణ్పరిసరమ్ |
| 63. తిరుక్కాత్కరపురము | అప్పాభిధానుడు (అప్ప అనుపేరు కలవాడు- విష్ణువు) | 63. తిరుక్కాక్కరై |
| 64. తిరుమూడికలము | పుండరీకనేత్రుడు (విష్ణువు) | 64. తిరుమూళిక్కళమ్ |
| 65. కుట్టనాడ్తిరుపులియూర్పురము | అపూర్వనాథుడు (విష్ణువు) | 65. తిరుప్పులియూర్ |
| 66. తిరుచెంగణూర్ | దేవసేవ్యుడు (విష్ణువు) | 66. తిరుచ్చెంగనూర్ |
| 67. తిరుణావై నగరి | దేవదేవుడు (విష్ణువు) | 67. తిరునావాయ్ |

| | | |
|---|---|---|
| 68. తిరువణ్ణవార్నగరి | మన్ననారు (కృష్ణుడు) | 68. తిరువల్లవాళ్ |
| 69. తిరువందూర్‌పురము | ప్రవాళాధరుడు (విష్ణువు) | 69. తిరుదణ్‌వందూర్ |
| 70. తిరువత్తూరు | కేశవుడు | 70. తిరువాట్టార్ |
| 71. ఉత్తమక్కొండ | అనన్యగతినాథుడు (విష్ణువు) | 71. తిరునీరగం |
| 72. తిరుక్కుడి | నారాయణుడు | 72. తిరుక్కుడిత్తానమ్ |
| 73. తిరువారనెదుపురము | బాలకృష్ణుడు | 73. తిరువారన్‌విళై |
| 74. తిరుమందివెళ్లనగరి | దేవనాథుడు (విష్ణువు) | 74. తిరువయిందిపురమ్ |
| 75. తిరుక్కోవలూర్నగరి | కృష్ణుడు | 75. తిరుకోవలూర్ |
| 76. కరినగరము | వరదరాజు | 76. తిరువూరగం |
| 77. కాంచికాపురము (కంచి) (రమేశుడు - విష్ణువు) | వేగవతీశుడు | 77. తిరుక్కచ్చి |
| 78. పరమేశ విణ్ణహరము | చిన్ని కృష్ణుడు | 78. పరమేశ్వర విణ్ణహరమ్ |
| 79. తిరుప్పాదహం | పార్థసారథి | 79. పాదగం |
| 80. తిరుతంగస్థలము | అఖిల ప్రదీపుడు (విష్ణువు) | 80. తిరుత్తణ్‌కా |
| 81. కామాక్షి విలరతింగళ్ (తుండధామము) | తుండధామధాముడు (విష్ణువు) | 81. నీలాత్తింగళ్ తుండమ్ |
| 82. వెళుక్కుమ్ | నరసింహుడు | 82. వెళుక్కై |
| 83. తిరువరసరము | చోళహరందుడు (శౌరి) | 83. తిరుక్కళ్వనూర్ |
| 84. కారహకల్పనూర్పురము | శ్రీహరి | 84. తిరుక్కారహమ్ |
| 85. కార్వానము | శ్రీహరి | 85. తిరుకార్వానమ్ |
| 86. వీక్ష్యావనము | వీర రాఘవుడు | 86. తిరువెవ్వుళ్ |
| 87. అష్టభుజంగమ నిలయము | నీరజాక్షుడు (విష్ణువు) | 87. అట్టబుయకరమ్ |
| 88. తిరునిన్నయూర్పురము | వేంకటేశుడు | 88. తిరునిన్నవూర్ |
| 89. తిరుప్పుక్కులి | విజయరాఘవుడు | 89. తిరుప్పుళ్కుళి |
| 90. తిరునీర్మల (నీర్మల - నీరుకొండ) | నారసింహుడు | 90. తిరునీర్మలై |
| 91. తిరువదవెంద | వద్యానువర్తి (విష్ణువు) | 91. తిరువిడవెందై |
| 92. తిరుకదమల | అమరలోకమాన్యుడు (విష్ణువు) | 92. తిరుక్కడన్మలై |
| 93. తిర్వల్లిక్కేణి | కృష్ణుడు | 93. తిరువల్లిక్కేణి |
| 94. ఘటికాచలము | నరహరిమూర్తి (నృసింహుడు) | 94. తిరుక్కడిగై |
| 95. అంజనాచలము (అంజనాద్రి) | శౌరి (విష్ణువు) | 95. తిరుమల తిరుపతి |

| | | |
|---|---|---|
| (తిరు వేంగచమ్) | | |
| 96. అహోబల పర్వతము (అహోబిలము) | శ్రీయుతాయత వక్షుడు, శిక్షిత విపక్షుడు (నరసింహుడు) | 96. సింగవేల్ కుంద్రమ్ |
| 97. పాపనాశనపురి | వరదరాజు | 97. తిరువిత్తువక్కోడు |
| 98. సాలగ్రామ శైలము | దీనాధినాథుడు (విష్ణువు) | 98. సాలగ్రామమ్ |
| 99. నైమిశకాననము | జ్వాలా నృసింహుడు | 99. నైమిశారణ్యమ్ |
| 100. బదరీవనము | నారాయణుడు | 100. వదరి ఆశ్రమమ్ |
| 101. చిత్ర కూటము | గోవిందరాజు | 101. తిరుచిత్రిరకూడమ్ |
| 102. ద్వారావతి (ద్వారక) | ద్వారకాధీశుడు (కృష్ణుడు) | 102. ద్వారక |
| 103. ప్రయాగ | మధుమాధవుడు | 103. తిరుకణ్ణంగడి నహరమ్ |
| 104. అయోధ్య | శ్రీ రామచంద్రుడు | 104. తిరు అయోధ్య |
| 105. మధుర | రమావిలాసుడు (విష్ణువు) | 105. వడమదురై |
| 106. పురుషోత్తమ స్థానము (పూరీ) | జగన్నాథుడు | 106. తిరుపురుషోత్తమమ్ |
| 107. సితద్వీపము (తెల్లదీవి) | శేషశాయి (విష్ణువు) | 107. తిరుప్పాల్కడల్ |
| 108. వైకుంఠము | వైకుంఠనాముడు (విష్ణువు) | 108. పరమపదమ్ |
| 109. పండరీపురము (పంఢర్పూర్) | పాండురంగ విట్ఠలుడు | 110. పంచవటి |
| 111. యాదవ శిఖరి | చళ్ళంపిళ్ళరాయ శౌరి (విష్ణువు) | |
| 112. అవంతి (ఉజ్జయినీ నగరం) | | |
| 113. వారణాసి | బిందు మాధవ స్వామి | |
| 114. మాయానగరము (గయ) | గదాధరుడు (విష్ణువు) | |
| 115. శమ్యాప్రాసము అనే ఆశ్రమము | | |
| 116. తిరునల్వేలి | | |
| 117. తిర్వారయిప్పాడి | | |
| 118. పల్లిగొండ | పెరుమాళ్లదేవుడు (విష్ణువు) | |
| 119. తిరుప్పేరుత్తిరుమణి | బాలముకుందుడు | |
| 120. అభ్రగంగ (గంగానది) | | |
| 121. రవిజ | యమునా నది | |
| 122. నంద | | |
| 123. విపాశ | | |
| 124. వేత్రవతి | | |

125. రేవ

126. సరయువు (సరయూ లేక సర్జూ) (కోసల రాజ్యానికి దక్షిణ హద్దుగా ప్రవహించే నది. సీతా రామ లక్ష్మణులు అరణ్య వాసానికి బయలుదేరినప్పుడు వారిని గుహుడు తన పడవలో దాటించేది యీ నదినే.)

127. మలాపహారి (మలప్రభ) (కృష్ణానదికి ఉపనది)

128. భీమరథి (భైమీ) (పండరీపురం వద్ద ప్రవహించే నది. కృష్ణానదికి ఉపనది)

129. వృద్ధగంగ (గోదావరి కావచ్చు)

130. కృష్ణ (మహారాష్ట్రలోని పడమటి కనుమలలో మహాబలేశ్వర్ వద్ద పుట్టి ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లా హంసలదీవిలో బంగాళాఖాతంలో కలిసే నది.

131. కావేరి

132. తుంగభద్ర

133. వేగవతి

(పై పద్నాలుగు నదులనూ రామకృష్ణకవి పేర్కొన్నాడు)

134. పుష్కరము

135. పుష్కరము

136. పుష్కరము

దివ్య ప్రబంధములలో ఆళ్వారులచే ప్రస్తుతించబడిన 108 దివ్యతిరుపతులకు అదనంగా సప్తపవిత్ర నగరాల లోనివైన వారణాసి, అవంతి (ఉజ్జయిని), మాయానగరము (గయ)లనూ రామకృష్ణ కవి పేర్కొన్నాడు. (మిగిలిన నాలుగు పవిత్ర నగరాలూ - కాంచీపురము, అయోధ్య, మధుర, ద్వారావతీ (ద్వారక) - 108 దివ్య దేశాలలో పేర్కొనబడినట్టివే). అలాగే పంచవటి, 3 పుష్కరములు, 14 పవిత్ర నదీ తీర్థాలు మరియు శమ్యాప్రాసమనే ఆశ్రమము వగైరాలను రామకృష్ణ కవి అదనంగా పేర్కొన్నాడు. నారదుడు తాను ఈ దివ్య క్షేత్రాలనన్నింటినీ సందర్శించి వచ్చినట్లు భృగునితో చెపుతున్నట్లుగా 'ఘటికాచల మాహాత్మ్యము'లో రామకృష్ణకవి పేర్కొన్నాడు. ఈ దివ్యతిరుపతులలో కొన్నింటి విషయం సందిగ్ధంగా వుంది. సాధ్యమైనంత మేరకు 108 పేర్లను రామకృష్ణకవి పేర్కొన్నవాటితో 'నాలాయిర ప్రబంధము'లో పేర్కొనబడిన దివ్య దేశములనూ, తాళ్లపాక తిరువెంగళనాథుడు 'పరమయోగి విలాసము'లో పేర్కొన్నవాటినీ సరిపోల్చడానికి ప్రయత్నించాను. వీటిలో కొన్ని సరియైనవనే సంతృప్తి నాకే కలుగలేదు. కొన్నింటి విషయంలో భేదాభిప్రాయాలు కూడా వున్నట్లున్నది.

ఏది ఏమైనా కనీసం ఒక్క ఆళ్వారు చేతనైనా తన పాశురములలో ప్రస్తుతించబడినదే దివ్యతిరుపతి అని తెంగల శాఖవారి అభిప్రాయం. మనమింతకుముందే చెప్పుకున్నట్లు, ఆంధ్రప్రదేశ్‌లో రెండే దివ్యతిరుపతులు. అవి - 1. అహోబిల క్షేత్రము (ఇది కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ తాలూకాలో వుంది. ఇది ప్రసిద్ధ నరసింహ క్షేత్రము. ఇక్కడ తెంగల శాఖకు చెందిన శ్రీ వైష్ణవ అర్చకులచే పాంచరాత్రాగమ పద్ధతిన ఆరాధన సాగుతున్నది). 2. తిరుమల - తిరుపతి దేవస్థానములలో

వైఖానసాగమం ప్రకారం వడహల శాఖకు చెందిన వైఖానసుల అర్చన సాగుతున్నది. ఇలా మొత్తం 97 దివ్య తిరుపతులు దక్షిణ భారతదేశంలోనే వున్నాయి. మిగిలినవి 1. చిత్రకూటము (తిరుచిత్తిరకూడమ్) - ప్రయాగ సమీపంలోని ఒక కొండ. 2. శాలిగ్రామ శైలము (సాలగ్రామం), 3. నైమిశకాననము (నైమిశారణ్యమ్), 4. బదరీ వనము (వదరి ఆశ్రమమ్), 5. ప్రయాగ (తిరుకణ్ణంగడి నహర్), 6. ద్వారావతి (ద్వారక), 7. మథుర (వడ మదురై - ఉత్తర భారతదేశంలోని మథుర; వడ అంటే తమిళంలో ఉత్తర దిక్కు. తమిళనాడులో వున్న మదురై 'తెన్‌మదురై' అంటే దక్షిణ మథుర). 8. అయోధ్య (తిరు అయోధ్య), 9. పాపనాశనపురి, 10. పాలకడలిలోని శేతద్వీపము (తిరుప్పాల్‌కడల్), 11. తిరునాడు లేక వైకుంఠము (పరమ పదమ్).

వడహల (వైఖానస) శాఖవారు 'ఈ నూట ఎనిమిది మాత్రమే దివ్యతిరుపతులు, అవి మాత్రమే పవిత్రమైనవి' అనే సిద్ధాంతాన్ని అంగీకరించరు. ఆళ్వారులు వ్యక్తిగతంగా తాము దర్శించిన క్షేత్రాలనూ, లేక కొన్నింటి విశిష్టతను గూర్చి వినివుండీ, వాటిపై పాశురాలు సాయించారు. వారి పాశురములలో చోటుచేసుకొనలేదు కనుక మిగిలినవి దివ్య క్షేత్రాలు కావనే వాదనను వైఖానసులు అంగీకరించరు. అంచేత దివ్యతిరుపతుల సంఖ్య ఎంత అనేది వైష్ణవ శాఖల మధ్య వివాదాస్పదంగానే మిగిలిపోయింది.

రామకృష్ణకవి వైష్ణవులలోని వైఖానస శాఖకు చెందినవాడు కనుకనే ఈ 108 దివ్య క్షేత్రాలకు ఎన్నో యితర ప్రసిద్ధ విష్ణు క్షేత్రాలనూ జోడించాడు. 'ఘటికాచల మాహాత్మ్యము' కావ్యములోని ప్రథమాశ్వాసములోని 29 నుండి 72 వరకు గల పద్యాలలో రామకృష్ణకవి మొత్తం 142 దివ్య క్షేత్రాలను పేర్కొన్నాడు. 62వ పద్యంలో 96వ దివ్యక్షేత్రంగా ఘటికాచలాన్ని పేర్కొన్నాడు. ఉత్తర భారత దేశంలోని ప్రయాగ సమీపంలోని చిత్రకూటమనే దివ్య క్షేత్రాన్ని 46వ పద్యంలో (దక్షిణ భారతదేశ దివ్య క్షేత్రాలతోబాటు) పేర్కొన్న కారణంగా, దానిని మినహాయిస్తే ఘటికాచలం 'నాలాయిర ప్రబంధం'లో పేర్కొనబడ్డట్లు 95వ దివ్యక్షేత్రమే అవుతుంది. ఆంధ్రదేశంలో తిరుమల వేంకటేశ్వరుడిని అంజనాచల (అంజనాద్రి) శౌరి (1-64) అని పేర్కొన్నాడు. అహోబల క్షేత్రాన్ని అహోబలము అని (1-65) పేర్కొన్నాడు. ఈ 97 క్షేత్రాలు పోను యింకా 11 దివ్యతిరుపతులను (ఉత్తర భారతదేశంలోనివి) మాత్రమే పేర్కొనాల్సి వుండగా అంటే మొత్తం 108 క్షేత్రాలను మాత్రమే పేర్కొనాల్సి వుండగా మొత్తం 142 క్షేత్రాలను పేర్కొన్నాడు. అందులో చిత్రకూటము (1-46) పద్యంలోనూ మరియు (1-72) పద్యంలోనూ, శ్రీరంగము (1-29) మరియు (1-67) పద్యాలలోనూ, మథురాపురి (1-69) లోనూ మరియు (1-71)లోనూ, అయోధ్య (1-63) లోనూ తిరిగి (1-71)లోనూ, ద్వారక (1-69) పద్యంలోనూ మరియు (1-71)లోనూ రెండు రెండు సార్లు పేర్కొన్నందున ఈ ఐదింటినీ మినహాయిస్తే కవి మొత్తం 137 దివ్య క్షేత్రాలను పేర్కొన్నట్లయింది. కవి పేర్కొన్న ఒకేరకంగా ధ్వనించే వేంకటేశ్వర క్షేత్రాలైన అలహరి తిరుమల (1-50), అంజనాచలము (అంజనాద్రి - తిరుమల తిరుపతి) (1-64) రెండూ ఒకటిగా కనుపిస్తున్నా వేర్వేరు వైష్ణవ క్షేత్రాలు. తిరుతంగాల్పురము (తిరుత్తణ్‌కా) (1-51) తిరుతంగస్థలము (తిరుత్తణ్‌కా) (1-73) రెండూ ఒకే దివ్య క్షేత్రమై వుంటాయి. అప్పుడు కవి పేర్కొన్న దివ్యతిరుపతులు 136 అవుతాయి. కాబట్టి రామకృష్ణకవి 108 దివ్య తిరుపతులకు అదనంగా 28 క్షేత్రాలను చేర్చాడన్నమాట. అందులో 14 నదీతీర్థాలు. మిగిలిన 14 దివ్య క్షేత్రాలూ ఇవి. 1. పంచవటి (మహారాష్ట్రలోని నాసిక్‌కు రెండు మైళ్ల దూరంలో యిది వుంది. దండకారణ్యములో గోదావరి జన్మస్థానానికి సమీపంలో యిక్కడ ఒకప్పుడుండిన ధాత్రి - ఉసిరి, అశ్వత్థ - రావి, బిల్వ - మారేడు, వట - మర్రి, అశోక అనబడే 5 వట వృక్షాల క్రింద రాముడు అరణ్యవాసంలో సీతతో సహా కొంతకాలం గడిపాడట. 2. యాదవశిఖరి, 3. తిరుప్పేరుత్తిరుమణి, 4. తిరునల్వేలి, 5. పల్లిగొండ, 6. తిర్వారయిప్పాడి 7. శమ్యాప్రాసమనే

ఆశ్రమము, 8. నుండి 10. వరకు మూడు పుణ్యతీర్థ పుష్కరములు - వీటిలో అతి ప్రసిద్ధమైనది రాజస్థాన్‌లోని అజ్మీర్ జిల్లాలో వుంది. మిగిలిన పుష్కర క్షేత్రాలెక్కడ వున్నాయో? 11. పండరీపురము లేక పాండురంగ క్షేత్రము (మహారాష్ట్రలోని షోలాపూర్ జిల్లాలోని పంఢర్‌పూర్), 12. వారణాశి - ఇది ప్రసిద్ధ శైవ క్షేత్రమే కాక ప్రసిద్ధి చెందిన బిందు మాధవ స్వామి ఆలయం కారణంగా విఖ్యాత విష్ణుక్షేత్రం కూడా. (మా నాన్నకు ఆ ప్రసిద్ధ బిందు మాధవుని పేరే పెట్టారట.) 13. అవంతి (మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని ఉజ్జయినీ నగరం), 14. మాయా నగరము (బీహార్ రాష్ట్రములోని గయ. ఇక్కడ గదాధరుని పేరిట విష్ణువుకు ప్రసిద్ధ ఆలయం వుంది).

ఇలా తాను 108 దివ్య తిరుపతులుగా ప్రసిద్ధికెక్కిన క్షేత్రాల్నేకాక మిగిలిన పవిత్ర విష్ణుక్షేత్రాలను కూడా దర్శించి వచ్చానని 'ఘటికాచల మాహాత్మ్యము'లో నారదుడు భృగు మహర్షికి వివరిస్తాడు. (1-73)

(తమిళంలో నగరమును 'నహరమ్' అని పలుకుతారు. 'విణ్ణహరమ్' అంటే విష్ణు నగరము. 'విణ్ణపురం' అంటే 'విష్ణు పురము'. కుంభఘోణము అంటే కుంభకోణం. కచ్చి అంటే కంచి).



# అనుబంధము - 5

## అలకాపురి - యక్షులు - జెక్కులు - కుబేరుడు

తెనాలికి చెందిన కీ॥ శే॥ కాకుమాను నారాయణ రావు మా కుటుంబానికి చిరకాల మిత్రులు. 1934కు పూర్వం స్వాతంత్ర్యోద్యమంలోనూ, 1934-40 మధ్య కాలంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలోనూ మా నాన్నకు సహచరుడిగా పనిచేసిన ఆయన తరువాత చక్రపాణి గారి ప్రోత్సాహంతో మద్రాసు వెళ్లి 'చందమామ'ప్రెస్‌లో మెకానిక్‌గా చేరి మరణించే వరకు ప్రింటింగ్ టెక్నాలజిస్ట్‌గా అక్కడే కొనసాగారు. ఆయన్ని నా చిన్న నాటి నుంచి నేనెరుగుదును. ఆయన జెక్కుల కులస్థుడు. ఆయన తరచు "మేం జెక్కులం కాదు - జెక్కులం. మా పూర్వులు జెకోస్లోవేకియా నుంచి వచ్చారట" అని అంటూంటే అందరూ తేలిగ్గా కొట్టి పారేసేవాళ్లు. మరి ఆయన ఏ ఆధారాలతో ఆ నిర్ధారణకు వచ్చారో !

నాలుగేళ్ల నాడు నేను అట్లాస్ తిరగేస్తుంటే జెకోస్లోవేకియా రాజధాని ప్రాగ్ (Prague) యొక్క అసలు పేరు (స్థానిక నామం) ప్రాహా (Praha) అని తెలిసింది. 'ప్రాహః' అంటే సంస్కృతంలో 'నాట్య కళలో శిక్షణ' (Instruction in the art of dancing) అని వామన్ శివరామ్ ఆప్టే సంకలనం చేసిన 'The Practical Sanskrit - English Dictionary' లో వుంది. జెక్కులు అనాదిగా నాట్య కళా ప్రవీణులు. యక్షగానం అనే కళా రూపంలో వారు నిష్ణాతులు. కనుక యిది నాకు జెక్కుల మూలాల్ని గురించి పరిశోధించడానికి ఓ 'క్లూ'లా అనిపించింది. అప్పటి నుండీ యీ విషయమై ఆలోచిస్తూ సానుకూల సమాచారాన్ని సేకరించనారంభించాను. ఇది తెలిసిన నారాయణ రావు గారి తమ్ముడు కీ॥ శే॥ కాకుమాను రామారావు నన్నభినందించి అల్ప సంఖ్యాకులుగా మారి, నేడు ఎట్టి గుర్తింపుకూ నోచుకోని జెక్కుల పూర్వ చరిత్రపై మరింత లోతుగా అధ్యయనం చేయమని నన్ను కోరారు. ఈ విషయమై నేను పరిశోధించి నిగ్గుదేల్చిన విషయాలను రామకృష్ణ కవి కావ్యాలను నిశిత పరిశీలన చేసే సందర్భంలో మరింతగా సంపద్వంతం చేసి యీ ప్రత్యేకానుబంధం రూపంలో పాఠకుల ముందుంచుతున్నాను.

కజఖ్‌స్తాన్‌లోని బాల్కష్ సరస్సుకు తూర్పుగానూ, చైనా సరిహద్దుకు

పడమరగానూ ఒజెరో అలకోలు (అలకోలు సరస్సు) వుంది. ఒజెరో అంటే రష్యన్ భాషలో సరస్సు అని అర్థం. అక్కడికి సమీపంలోని తర్బగటాయ్ (*Tarbagatay*) పర్వతాల నుండి జాలువారే సెలయేళ్లు, చిన్న నదులు యీ సరస్సును ఎప్పుడూ స్వచ్ఛమైన జలాలతో నింపుతాయి. అలక + ఓలు : అలకోలు అంటే అలకానగరపు జలవనరు. 'ఓలు' అంటే జలవనరు. ఈ పదం ప్రస్తుతం మన నిఘంటువులలో ఎక్కడా కనుపించడం లేదు. ఇది ప్రాక్ ద్రావిడ భాషా శబ్దం అయివుంటుందనిపిస్తున్నది. 'ఓలాడడం' (మునగడం - లేక - తేలడం); ఓలలాడు; ఓల - జలక్రీడల సమయంలో ప్రేరేపించడానికి వుపయోగించే శబ్దం; ఓల పాట - స్నానం చేసేటప్పుడు కానీ, ఈత కొట్టేటప్పుడు కానీ పాడుకొనే పాట - లేక - పడవపాట - ఈ పదాలు మాత్రం మన నిఘంటువులలో కనుపిస్తున్నాయి. కాలువకు పోతమట్టితో కట్టపోస్తే దాని నుండి నీళ్లు చెమరిస్తే దానిని 'ఓల' దిగడం అంటారు మన రైతులు. ఓలు అంటే జలవనరు అనేది కొన్ని గ్రామ నామాలనుబట్టి మనం అర్థం చేసుకోవచ్చు. వంగ + ఓలు - వంగోలు; (వంగ తోట సమీపంలోని నీటి వనరు అయివుండవచ్చు). చిరు+ఓలు - చిరువోలు (చిన్న నీటి వనరు); రాజ+ ఓలు - రాజోలు (రాజుగారు త్రవ్వించిన నీటి వనరు); బిక్క + ఓలు - బిక్కవోలు (బిక్క అంటే నిరుపేద. బహుశా బిక్కవోలు అంటే నీరులేని లేక నీరు వట్టిపోయిన నీటివనరు కావచ్చును. లేక బిక్కి అంటే అక్షోటము లేక అక్రోటు - *Walnut* - జాతికి చెందిన వృక్షము పేరిట బిక్కివోలు ఏర్పడి అదే క్రమంగా బిక్కవోలుగా మారి వుండనూవచ్చు.) ఓలు (నీటి వనరు) పేరిట ఏర్పడిన ఊళ్ల పేర్లు యిలా ఎన్నైనా చెప్పుకోవచ్చు.

ఇదంతా ఎందుకంటే 'అలకోలు' ఒకప్పుడు మయుడు నిర్మించాడని చెప్పబడుతున్న యక్షరాజైన కుబేరుని రాజధాని అలకాపురియేనని నా విశ్వాసం. కుబేరుడు ఉత్తర దిక్పాలకుడని ప్రసిద్ధి. ఈ అలకోలు భారత దేశానికి సరిగ్గా నడినెత్తిన ఉత్తర దిశగానే వుంది. పై పెచ్చు కుబేరుడు నరవాహనుడని ప్రసిద్ధి. ఇదే మంగోలియా, కజఖ్‌స్తాన్, చైనా ప్రాంతాలనే కాక యూరప్‌లోని నల్లసముద్రం, ద్నీపర్‌నది వరకూ ఆక్రమించి పరిపాలించిన చెంఘిజ్‌ఖాన్ (1162-1227) అతని మనుమడు కుబ్లైఖాన్ (1216-94)లు మనుష్యులు పూన్చిన రథాలనే వాడేవారనేది అందరూ ఎరిగినదే ! ప్రత్యేకించి చెంఘిజ్‌ఖాన్ ఓడి లొంగిన జాతుల పురుషుల తలలపై ఏర్పాటు చేసిన వేదికలపై ఆసీనుడవడం, వేరే చక్రాలు లేకుండా కేవలం మానవులతో ఏర్పడిన రథంపై స్వారీ చేయడం చేసేవాడంటారు. అంటే నరవాహనాల్ని వాడడం ఆ ప్రాంతపు ఆచారమని అర్థమవుతూంది. కనుక కుబేరుడిని ఏవో మహిమలున్న దేవతగా భావించక, ఆయనను అమిత ధనవంతుడైన యక్ష (జక్ష లేక జక్కుల) రాజుగానే భావిస్తే ఆయన రాజధాని నేటి కజఖ్‌స్తాన్‌లోని 'అలకోలు' అయివుంటుందని నా విశ్వాసం. ఆ ప్రాంతంలోని నదుల, నగరాల పేర్లన్నీ శివుడి అనుచర గణమైన యక్షుల ఉనికినే సూచిస్తున్నాయి. కొన్ని బౌద్ధావలంబకులైన యక్షుల ఉనికిని సూచిస్తున్నాయి. మరిన్ని వివరాల కోసం అనుబంధం -2 లో 'వైఖానస (బైకాల్)సరస్సు' కూడా చూడండి.

రామాయణం లోని కిష్కింధకాండ లోని 43వ సర్గలో సీతను వెదకడానికి ఉత్తర దిక్కుకు వెళ్ళిన శతబలితో సుగ్రీవుడు చెపుతున్నట్లుగా పేర్కొన్నదానిలో వైఖానస సరస్సుకు సమీపంలో కుబేరుడి సార్వభౌమమనే ఏనుగు తోటి ఏనుగులతో కలసి విహరిస్తూంటుందని పేర్కొనబడడం కూడా నా యీ వూహకు మరింత ఊతాన్నిస్తున్నది. కైలాస పర్వతానికి ఉత్తరంగా 'అపర్వత నదీ వృక్షమ్' (ఎటువంటి పర్వతాలు, నదులు, వృక్షాలు లేనట్టిదైన) మరియు 'సర్వసత్వ వివర్జితమైనట్టిదీనైన (ఎటువంటి జీవజాలము లేనట్టిదీనైన) గోబి (షామొ) ఎడారిని దాటి వెళితే బంగారు కమలాలతో విరాజిల్లే వైఖానస సరస్సు వస్తుందట. అక్కడకు వెళ్ళే దారిలోనే కుబేరుడి సార్వభౌమమనే ఏనుగు విహారం చేస్తూ మనకు కనుపిస్తుందట. అంటే

కైలాస పర్వతానికి ఉత్తరంగా ప్రయాణించి గోబి ఎడారిని దాటి తీన్‌షాన్ పర్వత పంక్తుల్ని కూడా దాటి వెళ్తే 'అలకోలు' సరస్సు వస్తుంది. అక్కడి నుంచి ప్రాగుత్తర (ఈశాన్య) దిశగా సాగితే వైఖానస సరస్సు వస్తుంది. కనుక నేటి కజఖ్‌స్థాన్ దేశంలోని తర్బగటాయ్ పర్వత శ్రేణులలో పుట్టిన నదుల నీటితో జల పరిపూర్ణమైన అలకోలు సరస్సు దాపులలోనే కుబేరుడి అలకాపురి నాడు నిర్మించబడి వుండవచ్చునని నా విశ్వాసం.

సంచార జాతి అయిన జక్కులు అంతకు ముందే అక్కడికి చేరారో, లేక చెంఘిజ్‌ఖాన్ దండయాత్రల సందర్భంగా డ్నీపర్ నదికి పశ్చిమంగా కూడా విస్తరించారో గానీ, డ్నెస్ట్ర నదిని కూడా దాటి వెళ్లి వారు జెక్ (*Czech*) దేశ నిర్మాతలుగా ఖ్యాతి గాంచారు. జక్కుల పేరిట ఏర్పడిన జెక్ ప్రాంతము, హంగేరీ నుంచి వలస వెళ్లిన స్లొవాక్ జాతి వారితో ఏర్పడిన స్లొవాకియా కలిసి జెకోస్లొవాకియా ఏర్పడింది. సంస్కృతానికి దగ్గర సంబంధం వున్న నాటి తమ భాషలో వీరు అక్కడి నదులకూ, పట్టణాలకూ పేర్లు పెట్టినట్లుంది. జెక్ భాషలో 'వాహ్' అంటే నది. సంస్కృతంలో 'వాహిని' అంటే నది. అక్కడ 'వాహ్' అని ఒక నదీ, 'వీత వాహ్' అని మరోనదీ వున్నాయి. వీత వాహిని అంటే నిశ్శబ్దంగా ప్రవహించేనది (*Qiet River*) అని అర్థం. ఓత వాహ్ అని మరో నది వుంది. ఓత వాహిని అంటే అన్ని ప్రక్కలకూ ప్రవహించే నది. ఈ నది నిజంగానే మెలికలు మెలికలు తిరుగుతూ ప్రవహిస్తుంది. సజ వాహ్ - ఇది సజల వాహిని అయివుండవచ్చు. మోర వాహ్ (*Peacock River*) - మన నెమలి వాగు లాగా. 'లాబె వాహ్' - ఇదిప్పుడు 'ఎల్బ్' నది (*Elbe River*) అని పిలువబడుతున్నది. 'లాబ' అంటే లావుకపిట్ట లేక పురిడి పిట్ట (*Quail*); 'బోద్వా' - బోధవా (బోధ వాహిని) అయివుంటుంది. అక్కడ 'తారణ' నదీ వుంది. 'తారణ'మంటే నదిని దాటడం. దాటబడిన నది అని బహుశా దానికాపేరు పెట్టబడి వుండవచ్చు. తమ అధిపతి శివుని పేరుతో జక్కులు ఓ నదికి 'త్ర్యంబక' నది అని పేరు పెట్టినట్లున్నారు. అదే యిప్పుడు డాన్యూబ్ (*Danube*) నదికి ఉపనదియైన త్రిబేక్ (*Tribec*). డాన్యూబ్ నది పూర్వపు పేరు 'దూనజ' లేక 'దూనవ' (సంతాపం నుండి పుట్టినది) అక్కడ తిష్య (*Tisza*) అనే పేరుగల నదీ వుంది. (తిష్యలోని 'య' కారం 'జ' కారంగా రూపాంతరం చెందింది) తిష్య అంటే 'శుభప్రదమైన' అని అర్థం. సంస్కృతంలో 'తిష్య', పాళీ భాషలో 'తిస్స' అయింది. బౌద్ధ సాహిత్యంలో 'తిష్య' శబ్దానికెంతో ప్రాముఖ్యత వుంది. ప్రక్క దేశమైన యుగోస్లావియాలో త్రిముఖ (పాళీలో తిమొఖ) నది వుంది. త్రిముఖుడంటే బుద్ధుడు. బల్గేరియాలో వర్ణ (*Varna*) నగరముంది. ఇది ఒకప్పటి వరుణ నగరం కావచ్చు. జెకొస్లొవాకియాలోని తిష్య నదీ, యుగోస్లావియాలోని త్రిముఖ నదుల పేర్లు ఆయా ప్రాంతాలలో ఒకప్పుడు బౌద్ధ మతావలంబకులైనట్టి యక్షుల (జక్కుల) ఉనికిని కూడా సూచిస్తున్నాయి. బల్గేరియాలో 'యంత్ర' (*Yantra*) నది, అగస్త్య (*Ogosta*) నది, మారీచ (*Maritsa*) నది, రుమేనియాలో డాన్యూబ్ (*Danube*) నదికి ఉపనదియైన బిస్తృత లేక విస్తృత (*Bistrita*) నదీ వున్నాయి. ఈ బిస్తృత నది కార్పేతియన్ పర్వతాల్లో పుట్టింది. డాన్యూబ్‌కి బేలి లోమ (తెల్ల వెంద్రుకలు), చెర్నీ లోమ (నల్ల వెంద్రుకలు) అనే ఉప నదులు కూడా వున్నాయి.

ఇక యీ సంచార యక్షజాతి యుగోస్లావియా, పరిసర భూభాగాలలో కూడా పెద్ద సంఖ్యలో స్థిర నివాసాలేర్పరచుకుని వుంటారనే దానికి నిదర్శనంగా ఈ క్రింది నదుల, ప్రాంతాల పేర్లు చూడండి.

**ద్రవ నది** (*Drava*)

**శోక నది** (*Soca*)

**పృథు నది** (*Prutu*) - పృథు అంటే సంస్కృతంలో వెడల్పాటి, విశాలమైన, గొప్ప, పెద్ద అనే అర్థాలున్నాయి.

**ఉవాచ నది** (*Uvach*) - ఉవాచ అంటే 'చెప్పెను' అని అర్థం - (ఉపదేశం)

**కూప నది** *(Kupa)* - లోతైనది

**ప్రహోవ లేక ప్రహోమ** *(Prahova)* ఇది మన ప్రయాగ లాగా హోమాలెక్కువగా చేయబడిన ప్రాంతమై వుండవచ్చు.

**సెర్న నది** *(Cerna)* - స్వర్ణ నది

**వరధారా నది** *(Varadara)*

**సెర్న రేక నది** *(Cerna Reka)* - స్వర్ణరేఖా నది

**సోమేశ నది** *(Somes)* - సోమేశుడంటే శివుడు

**మూర నది** *(Mura)* మూర అంటే సంస్కృతంలో అవివేకమైన అనే అర్థంతో పాటు వినాశనకరమైన అనే అర్థమూ వుంది.

**సావ నది** *(Sava)* - సావమంటే సంస్కృతంలో యజ్ఞంలో సమర్పించబడే ద్రవ ద్రవ్యము *(Libation)*

ప్రక్కనే వున్న మొల్దావియాలో పృథు *(Prut)*, పృథుల *(Prutul)* నదులున్నాయి. ఇవి దాన్యూబ్ నదికి ఉపనదులు. పృథుల అన్నా సంస్కృతంలో విశాలమైన, పెద్ద అనే అర్థాలు.

ఆ ప్రాంతంలోని నదులూ, నగరాల పేర్లు ఇలా పరిశీలిస్తూ పోతే అక్కడ సంచార జాతియైన యక్షుల స్థిర నివాసం కారణంగానే ఆ యా పేర్లు ఏర్పడి వుంటాయని సూచన ప్రాయంగా అర్థం చేసుకోవచ్చు.

జెకొస్లొవాకియాలో త్ర్యంబకుడి (శివుడి) పేరుతో ఓ పట్టణం ట్రెబిక్ (*Trebic*) వుండడమేకాక జెకొస్లొవాకియా రాజధాని ప్రాగ్ (*Prague*) యొక్క పూర్వపు పేరు ప్రాహః (అంటే సంస్కృతంలో నాట్యశిక్షణకు కేంద్రం.) అయివుండడం కూడా విశేషం. యక్షులు మరి నాట్య కళలో నిష్ణాతులే కదా ! ఈ ఆధారాలన్నింటిని బట్టి ఒకప్పుడు ఆశియా ప్రాంతాలలో శైవులైన యక్షులు బౌద్ధమతాన్ని స్వీకరించి, అనంతర కాలంలో ఐరోపా ఖండానికి విస్తరించి అక్కడ స్థిరనివాసమేర్పరచుకుని, చెకొస్లొవేకియా నిర్మాతలయ్యారనే నిర్ధారణకు మనం రావచ్చు. పశ్చిమ దిశగా ఐరోపాకు, దక్షిణ దిశగా భారతదేశానికి వ్యాపించక పూర్వం యక్షులు ఉజ్బెకిస్తాన్ సరిహద్దులలోని ఆక్సస్ (*Oxus* - వక్షు లేక ఇక్షు) నదీ తీర ప్రాంతంలో చాల కాలంపాటు స్థిరనివాసం చేశారని చరిత్రకారులు ధృవీకరించారు. స్వయంగా వీరు ఆయుధోపజీవులు కాకున్నా యుద్ధ సమయాలలో కూడా తమ సంగీత నాట్యాదులతో సైనికులకు వినోదమివ్వడానికి వీరు ఆయా జాతుల దండయాత్రలలో పాల్గొని, నల్దిశలా విస్తరించి వుంటారు. సంగీతోపజీవులైన వీరు ప్రాయికంగా సంచార జాతి కాబట్టి కూడా భూగోళపు అన్ని దిక్కులకూ వీరి విస్తరణ జరిగి వుంటుంది.

చూస్తుంటే సంచార జాతియైన జిప్సీ *(Gypsies or Gipsies)* లకూ, జెక్కులకూ చాల దగ్గర సంబంధమున్నట్లుంది. జిప్సీలు వాస్తవంగా భారత దేశం నుండి వివిధ ప్రాంతాలకు వలస వెళ్లారని చరిత్ర కారులు నిర్ధారించారు. వారు ప్రాయికంగా హిందూ సంతతికి చెందిన వారని కూడా రూఢిపడింది. అయితే క్రీ॥ శ॥ 1418లో యూరప్‌లో కనుగొనబడిన ఓ జిప్సీల గుంపు ఈజిప్టు నుంచి వచ్చిందని పొరబడి స్థానికులు వారికి 'జిప్సీలు' అనే పేరు పెట్టారు. ఈజిప్షియన్ అనే పదానికి అపభ్రంశమే జిప్సీ. హంగరీ దేశంలో జిప్సీలను ఫారో ప్రజలు *(Pharaoh People)* అంటారు. అంటే ఈజిప్టును ఒకప్పుడు పాలించిన ఫారో చక్రవర్తుల తాలూకు ప్రజలని అర్థం. వీరు స్థానికులచే మతం లేని వారు *(Heathen)* గా భావించబడ్డారు. యూరప్‌లోనూ, ఉత్తర అమెరికాలోనూ కూడా మనం జిప్సీలను చూడవచ్చు. కొన్ని ప్రాంతాలలో వీరిని సింటె *(Sinte)* లని కూడా పిలుస్తారు. అంటే సింధు ప్రాంతం నుంచి వచ్చిన ప్రజలని అర్థం. జప్సీల భాష రొమానీ *(Romany)* లో ఐదువేల మాటలున్నాయట. దాదాపు అవన్నీ సంస్కృత శబ్దాలకు అపభ్రంశ పదాలేనట ! జిప్సీలు కూడా సంగీత నాట్యాలలో ప్రావీణ్యమున్న సంచార జాతి ప్రజలే ! జిప్సీలు కూడా జెక్కులలా పింగళాక్షులే ! ఈ అంశాలనన్నింటినీ పరిగణనలోనికి తీసుకున్నప్పుడు ఆక్సస్ నదీ తీరాన్నుంచి పడమటి దిక్కుకు తమ ప్రస్థానాన్ని ప్రారంభించి క్రమక్రమంగా

యూరప్ ఖండమంతా విస్తరించిన జెక్కులే జిప్సీలయ్యే అవకాశాన్ని మనం ఎంతమాత్రమూ త్రోసి వేయలేము. ఏమైనా యీ కోణంలో మరిన్ని పరిశోధనలు జరిగితే వాస్తవాలు మరింత ప్రస్ఫుటంగా నిర్ధారించబడతాయి.

తెనాలి రామకృష్ణ కవి 'పాండురంగ మాహాత్మ్యము' కావ్యంలో పాండురంగనికి యక్షాక్ష లేక కుబేరాక్ష క్రీడ (గచ్చకాయలాట) అంటే చాల యిష్టమని పేర్కొన్నాడు. యక్షాక్షమన్నా, కుబేరాక్షమన్నా గచ్చచెట్టు *(Physic nut - Caesalpinia Bonduc)*. కుబేరుడి కళ్లు గచ్చకాయ రంగు *(Tawny Colour)* లో పిల్లి కళ్లలా వుంటాయట. కుబేరుడితో సహా యక్షులంతా పింగళాక్షులేనట. అయితే భారత దేశంలో స్థిరపడిన యక్షుల కళ్ల రంగు కొంత కాలం పిదప నల్లగా మారిందట.

ఇంగ్లండ్ దేశంలోని జిప్సీలలో మగవారు గుర్రాలు అమ్మడం, ఇంట్లో వుపయోగించే చిన్న చిన్న ఉపకరణాలు తయారు చేసి అమ్మడం చేస్తూంటే, ఆడవాళ్లు మాత్రం సోది చెప్పడం *(Telling Fortunes)*, తాయెత్తులు అమ్మడం, మంత్ర తంత్ర విద్యలు ప్రయోగించడం వగైరా చేస్తారట. భారతదేశంలో బౌద్ధం క్షీణ దశకు వచ్చినపుడు మహాయాన బౌద్ధ శాఖ అయిన వజ్రయానం స్వీకరించిన యక్షిణులు యిలాగే మంత్ర తంత్రాలు నేర్చి క్షుద్ర విద్యలు ప్రయోగించే వారనీ, అంచేతనే బౌద్ధం పట్ల ప్రజలకు అసహ్యం కలిగి బౌద్ధం ప్రజల నిరాదరణకు గురయ్యిందని చరిత్ర కారులు నిర్ధారించారు. సింహవక్త్ర డాకిని *(a female imp or a female goblin)* వజ్రయానంలో క్షుద్ర దేవతగా ప్రసిద్ధమైన యక్షిణి. దుర్గ అనుచర గణంలో ఒకతె అయిన యక్షిణి శాకిని కూడా వజ్రయాన బౌద్ధంలో దుష్ట శక్తులు కలిగిన యక్షిణిగా పూజలందుకుంది. యక్ష, యక్షి విగ్రహాలు ప్రతి బౌద్ధ క్షేత్రంలోనూ క్షేత్రపాలకులు *(Tutelary Deities)* గానో, ద్వారపాలకులుగానో మనకు కనుపిస్తాయి. పర్ఖమ్ యక్ష, పట్నా యక్ష, దీదార్ గంజ్ (క్రీ॥ పూ॥ 3వ శతాబ్ది) కి చెందిన యక్షిల బృహత్తర విగ్రహాలు వజ్రయానాది తాంత్రిక బౌద్ధ శాఖలలో యక్షుల ప్రాముఖ్యతను చాటుతున్నాయి. తన కుమార్తె ప్రకృతికి బుద్ధుని ప్రథమ శిష్యుడైన ఆనందుడిని వశపరచడానికి అతనిపై క్షుద్ర శక్తులను ప్రయోగించిన ముదుసలి మంత్ర గత్తె అయిన యక్షిణి కథ బౌద్ధ సాహిత్యంలో సుపరిచితమే !

కుబేరుడు ఉత్తర ధిక్కుకు అధిపతి. ఈశాన్య (*North - East*) దిక్కుకు అధిపతియైన ఈశానుడికి (శివుడికి) అతడు ప్రాణమిత్రుడని పురాణాలు వర్ణిస్తున్నాయి. శివుడిని కుబేరసఖుడనీ, కుబేరుడిని త్ర్యంబక సఖుడనీ అవి పేర్కొంటున్నాయి. దీనిని బట్టి దేవతలు ('దేవాః' అంటే సంస్కృతంలో వెలుగొందే మేనిచాయ కలవారు) అందరూ ఎత్తైన హిమాలయ పర్వతాలు, యింకా ఆ పై ఉత్తర ప్రాంతాలలో ఒకప్పుడు నివసించిన తెల్లని శరీరం కలిగిన జాతి వారై వుంటారని ధృవపడుతూంది. శివుడిని పురాణాలు తెల్లని శరీరం కలవానిగానే వర్ణించాయి. కుబేరుడు పింగళాక్షుడని వర్ణించబడ్డాడు. ఆయన గణం వారైన యక్షులు (నేటి జెక్కులు) కూడా ఒకప్పుడు పింగళాక్షులే (బంగారువర్ణపు కళ్లు కలవారే) అయినప్పటికీ భారతదేశానికి వలసవచ్చిన అనంతరం వారి కళ్లు నల్లగా మారి వుంటాయని చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు.

'యక్షుల నిధులు అందరివండీ . . . రక్షిస్తాలవి పాతాళంలో
లక్ష సిద్ధులు రక్ష వుంటవి . . . లక్ష్యసాధకుడికి దొరికేనండీ
ఇతిహాసం విన్నారా . . .? అతిసాహసులే వున్నారా?

హెచ్చరికో . . హెచ్చరిక . . .' అంటూ కీ॥శే॥ యన్.టి.ఆర్. నటించిన 'విజయ' వారి 'పాతాళ భైరవి' చిత్రంలో ఓ పాట వుంది. (దీన్ని శ్రీమతి టి.జి. కమలపై చిత్రీకరించారు.) యక్షులు అత్యంత ధనవంతులనీ, అయితే వారి

సంపదను స్వయంగా రక్షించుకోలేని నిస్సహాయులు, బలహీనులు కనుక వారు ఆ ధనాన్ని, బంగారాన్ని లంకెల బిందెలలో నింపి నేల మాళిగలలోనూ, ఏకాంత ప్రదేశాలలోనూ పాతిపెడతారనీ ఓ నమ్మకం అనాదిగా ప్రజలలో వుంది. ఈ గుప్త నిధులకు కాపుగా క్షుద్రశక్తులు వుంటాయనీ, యక్షులు కూడా స్వయంగా ఎన్నో సిద్ధులు కలవారనీ కూడా ఓ అంధవిశ్వాసం జనంలో వుంది. ఈ సిద్ధుల మాటెలా వున్నా యక్షులు ఆర్థిక సౌష్టవం కల ఓ సంచార జాతి అనే విషయం మాత్రం నిర్వివాదాంశం. అయితే వారు బలహీనులైనందున వారి నిధులను సాహసికులందరూ కొల్లగొట్టేవారన్నమాట. అందుకే యక్షుల నిధులు సాహసం కలవారందరివీ అనే భావన ప్రబలింది. మొదట్లో శైవులైన వీరు బౌద్ధమతం భారతదేశంలో ఉచ్చదశలో వున్న కాలంలో బౌద్ధమతావలంబకులై, తిరిగి బౌద్ధం క్షీణించగానే శైవం స్వీకరించినట్లు కనుపిస్తుంది. నేటికీ జక్కులలో అత్యధికులు శైవులుగానే కనుపిస్తున్నారు. వారి పేర్లు శంకరుడు, శివుడు, భద్రుడు, రుద్రుడు, గంగాధరుడు, ఉమామహేశ్వరుడు, కాత్యాయని, గౌరి, జగదాంబ, హైమవతి, గిరిబాల, ఉమ – యిలా దాదాపు అన్నీ శైవ నామాలుగానే వున్నాయి. గౌతమ బుద్ధునికి వ్యక్తిగత సేవకురాళ్లుగా యక్షిణులు వున్నట్లు బౌద్ధ చిత్రాలు, శిల్పాలను బట్టి మనకు తెలుస్తున్నది. బుద్ధునికి వింజామరలు వీస్తున్నట్లున్న యక్షిణుల చిత్రాలు కోకొల్లలు. యక్షిణీ దేవతలకు సంతానమిచ్చే శక్తులున్నాయని బౌద్ధయుగంలో ప్రజలు విశ్వసించేవారట. అందుకే యక్షిణీ ఆరాధనలు ప్రారంభమయ్యాయట. యక్షిణుల పేరిట వివిధ చైత్యాలు నిర్మించబడినట్లూ, సంతానం లేని వారు సప్తాంబికా చైత్యంలోనూ, బహుపుత్ర చైత్యంలోనూ కొలుపులు కొలిచే వారనీ, బుద్ధఘోషుడు వీటిని 'యక్కచేతియాలని' అన్నాడనీ, పాళీ భాషలోని బౌద్ధ గ్రంథాల ద్వారా తెలుస్తున్నది. పాళీ భాషలో యక్కలు అంటే యక్షులు. ఈ చైత్యాలలో జంతు బలులు, నరబలులు కూడా వుండేవట. పాళీ భాషలోని 'సప్తాంబికలు' సంస్కృతంలో సప్తమాతృకల్లయ్యారట. బుద్ధ ఘోషుడు పేర్కొన్న యక్కలను తెలుగు వారు అక్క దేవతలు అనే వారు. వారు కూడా లెక్కకు ఏడుగురే. వీరి ఆరాధన సింధు నాగరకత కాలం నుండీ వుండేదట. వినుకొండ వల్లభామాత్యుని 'క్రీడాభిరామం' లో కూడా గృహస్థులు సంతానం కోరి యక్షకన్యల ఆరాధన చేయడం గురించిన ప్రస్తావన వుంది. ఈ ఏడుగురు అక్కచెల్లెళ్లను బౌద్ధ యుగానంతరం హిందువులు పార్వతీ దేవి కుమార్తెలుగా భావించసాగారు. తెలుగు వారి యిండ్ల పేర్లలో 'అక్కల'తో బాటు 'యక్కల' అనే యింటి పేరు కూడా వుండడం విశేషం!

బౌద్ధమతంలో వజ్రయానం వగైరా తాంత్రిక శాఖలు ప్రబలి బౌద్ధమతం క్షీణదశకు చేరిన తరువాత యక్షిణులు నైతికంగా పతనమయ్యారనే నెపంతో హిందువులు బౌద్ధ ఆరామాలు, చైత్యాలపై దాడులు జరిపి వాటిని నాశనం చేయడం, సదరు బౌద్ధ నిర్మాణాల శిధిలాలను నేటికీ హిందువులు 'లంజ దిబ్బలు' అని వ్యవహరించడం మనమెరిగినదే.

యక్షులు యూదుల తరహాలోనే సాముదాయక జీవనం చేసేవారనిపిస్తున్నది. యూదులకు ఆ పేరు అసలు 'యూథ' అనే సంస్కృత పదాన్నుంచి వచ్చింది. 'యూథ' అంటే సమూహము అని అర్థం. క్రైస్తవులకు వడ్డీ వ్యాపారం చేయడం నిషిద్ధం. కనుక దీన్ని అవకాశంగా తీసుకుని యూదులంతా వడ్డీ వ్యాపారులు (*Usurers*) గా అమిత ధనార్జన చేసి తమ ఆస్తులు కాపాడుకొనడానికి సాముదాయికంగా ఘెట్టోలు (*Ghettos*) అనే శత్రుదుర్భేద్యమైన కాలనీలలో నివసించేవారట. యూదులు ఎక్కడవున్నా పొరుగువారి కంటే తాము ఎక్కువ అన్నట్లుంటారు. ఈ ఆధిక్యతా భావం కారణంగా ఎప్పుడూ వారికి చుట్టుప్రక్కలవారితో పేచీలే. పైపెచ్చు వారికి యుద్ధపిపాస చాల ఎక్కువ. క్రీ॥శ॥ 1275లో ఇంగ్లండులో మొదటి ఎడ్వర్డ్ రాజు యూదులు వడ్డీ వ్యాపారం చేయరాదనీ, అయితే వారు యితర వ్యాపారాలు చేస్తూ ఆస్తులు సంపాదించ వచ్చుననీ చట్టంతెచ్చి కొంత మేరకు వారిని అదుపు చేశాడు. యక్షులు కూడా ఆర్థిక సౌష్టవం కలవారే అయినా వీరిది సంచార జీవనం. ప్రాయికంగా వీరు సాహసికులు కానట్లుంది. తమ నిధులను ఎక్కడెక్కడో నిర్మానుష్య

ప్రదేశాలలో నిక్షిప్తంచేసి దేశాంతరం వెళ్ళి తిరిగి కొన్నేళ్ల తర్వాత వచ్చి వీరు తమ గుప్త నిధుల కోసం వెతుక్కుంటారట. యక్షుల గుప్త నిధుల కోసం సాహసికులు జరిపే అన్వేషణలు కథాంశాలుగా ఎన్నెన్నో కథలు అల్లబడ్డాయి.

'ఏసు' అనే పదం 'జేసు' అని కూడా పలకబడుతున్నట్లు 'యక్ష' అనే పదం 'జక్ష'గా పలుకబడి అదే కాలక్రమేణా 'జక్కు'గా రూపాంతరం చెందింది. యక్షులు దేవతలకు తమ సంగీత, నాట్యాలతో వినోదాన్నిచ్చేవారట. 'యక్షగానం' అనే కళా రూపం వీరి సృష్టే. వినుకొండ వల్లభరాయని 'క్రీడాభిరామం'లో ఓరుగల్లు నగరంలోని 'జక్కుల పురంధ్రి'ని గురించిన వర్ణన వుంది. అనంతర కాలంలో యక్షగానం అనే కళారూపాన్ని కృష్ణాజిల్లా కూచిపూడి గ్రామానికి చెందిన బ్రాహ్మణ నాట్యాచార్యులు స్వీకరించి అభివృద్ధి చేశారు.

ఆంధ్రదేశంలోని నేటి కమ్మవారి పూర్వీకులలో కాకతీయులు వగైరాలంతా శైవం స్వీకరించిన ఒకప్పటి జైనులు కాగా, మిగిలిన వారిలోని అధిక సంఖ్యాకులు ఒకప్పటి బౌద్ధావలంబకులు. అయితే ఆంధ్ర ప్రాంతంలో బౌద్ధానికి ప్రతికూల పరిస్థితులేర్పడిన తరువాత వారు ఎక్కువ కాలం బౌద్ధులుగా కొనసాగలేక హైందవ ధర్మం స్వీకరించినప్పటికీ, యజ్ఞసంస్కృతిని అంగీకరించక, యజ్ఞోపవీత ధారణకు యిష్టపడనందున వారిలో కొందరు ఒకప్పుడు కత్తిపట్టి రాజ్యాలేలిన క్షత్రియులే అయినప్పటికీ, మరికొందరు వ్యవసాయ వ్యాపారాదులు చేసిన వారే (వైశ్యులే) అయినప్పటికీ, వీరు శూద్రులుగా పరిగణింపబడ్డారని 'తెలుగు చోడులు - వారి బంధువర్గం' అనే 9వ ప్రత్యేకానుబంధంలో విపులీకరించాను. అలా వీరిలో చాల మంది హైందవ సమాజంలో అంతర్భాగమైపోయినప్పటికీ, తమ జైన, బౌద్ధ మూలాల కారణంగా స్వేచ్ఛా చింతనాపరులు *(Free Thinkers)* గానూ, నాస్తికులు *(Atheists)* గానూ, హేతువాదులు *(Rationalists)* గానూ, కాలం చెల్లిన అంధ విశ్వాసాలను, బూజుపట్టిన సనాతన ధర్మాలను ప్రశ్నించే వారి *(Heretics)* గానూ కొనసాగుతున్నారు. జెక్కులు అలా కాక బౌద్ధం క్షీణ దశకు వచ్చే వరకు ఆ మతంలోనే కొనసాగి, వీర శైవులు తదితరుల నుండి హింసకూ, అవమానాలకూ, అత్యాచారాలకూ గురై, ఆ క్రమంలో తమవారి నెందరినో కోల్పోయి, అల్ప సంఖ్యాకులైపోయిన తరువాత - మిగిలిన ఆ కొద్ది మంది వీర శైవుల ఒత్తిడికి లోనై, శైవం స్వీకరించినట్లు కనుపిస్తున్నది. (శైవ సాహిత్యం వర్ణించిన భట్టిప్రోలు ప్రాంతంలోని బౌద్ధులపై వీర శైవులు జరిపిన అతి అమానుష హింసాకాండ బహుశా బౌద్ధ మతాన్ని ఆంధ్రప్రాంతం నుంచి ఊచేముట్టుగా తుడిచి పెట్టే యత్నాలలో చిట్ట చివరిదై వుంటుంది.)

పురాణాల ప్రకారం యక్షులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు - వీరంతా కుబేరుని ఆధిపత్యం క్రింద వుండేవారు. చారిత్రకంగా చూస్తే వీరు సంగీతం, నాట్యం, గానం జీవనోపాధిగాగల సంచార జాతులుగా కనుపిస్తారు. వీరందరికీ కుబేరుడే అధిపతి; అలకాపురే రాజధాని అయినట్లుంది. అందుకే 'ఉద్భటారాధ్య చరిత్రము' లో శాపమిచ్చిన శివుడితో గంధర్వులు 'అక్కటా! చంద్రజూటా! నీ బంటు బంటులమైన మమ్మల్ని ఒక్క తప్పే కదా అని మన్నించకుండా ఘోరమైన శాప దావానలం పాలు చేశావు' అంటారు. (ఉ.చ. 1-116)

'భగవద్గీత'లోని 'విభూతి యోగం'లో అన్నింటిలో శ్రేష్ఠతమమైనవన్నీ తానేనని చెబుతూ శ్రీకృష్ణుడు గుర్రాలలో తాను ఉచ్చైశ్రవమనే గుర్రాన్ననీ, ఏనుగులలో ఐరావతాన్ననీ, యక్ష, రాక్షసులలో విత్తేశుడనని (అంటే కుబేరుడినని) చెప్తాడు. 'విత్తేశో యక్ష రక్షసామ్ (భగవద్గీత - విభూతి యోగం -23) యక్షులు, రాక్షసులు బ్రహ్మ మానస పుత్రుడైన పులస్త్యబ్రహ్మ సంతానం. పులస్త్యబ్రహ్మ కుమారుడైన విశ్రవశుడికి కేకసి ద్వారా పుట్టిన వారు రావణ, విభీషణ, కుంభకర్ణాదులు కాగా ఇలబిల ద్వారా పుట్టినవాడు కుబేరుడు. అంచేతే కుబేరుడికి ఐలబిలుడనే మరో పేరుంది. వారు దాయాదులు కనుకనే రావణుడు తన విజృంభణలో ముందుగా కుబేరుడి రాజధాని అలకాపురంపై దండెత్తి అక్కడి ఆస్తులన్నీ కొల్లగొట్టాడట.

# అనుబంధము - 6
# చంద్రుడు - అమృతం - వెన్నెల - చకోర పక్షి

చంద్రుడికి పీయూషధాముడు అనే మరో పేరుంది. సుధకు ఆకరము - అంటే నిలయమైనవాడు కనుక చంద్రుడిని సుధాకరుడనీ అంటారు. పీయూషము మరియు సుధ అని కూడా పిలువబడే అమృతము (*Nectar or Ambrosia*) దేవదానవులు పాల సముద్రాన్ని చిలికితే వచ్చిందంటారు. చంద్రుడుకూడా ఆ సందర్భంలోనే పాలసముద్రం నుండే వెలువడ్డాడట. మనవాళ్ళు చంద్రుడిని నిత్యమూ అమృతాన్ని స్రవించే వానిగా భావిస్తారు. అందుకే చంద్రుడిని అమృతాంశువు (అమృతపు కిరణాలు కలవాడు), పీయూష భానుడు (అమృతపు సూర్యుడు), పీయూష వర్షుడు (అమృతం కురిపించేవాడు), పీయూష రుచి (అమృతాన్నే కాంతిగా కలవాడు), పీయూష మహస్ (తేజస్సుగా అమృతాన్నే వెలువరించేవాడు) అనే రకరకాల పేర్లతో పిలుస్తారు. పీయూషమంటే పాలు అనీ, జున్నుపాలు (ఈనిన ఆవు మొదటి వారం రోజులలో యిచ్చే పాలు) అనీ కూడా అర్థాలున్నాయి. అలాగే సుధ అంటే పాలు అనే అర్థం కూడా వున్నది. అందుకే పాలసముద్రాన్ని 'సుధార్ణవము' అని అంటారు. తీక్షణమైన కిరణాలు గల సూర్యుడు ప్రచండుడని పిలువబడితే, (స్వయం ప్రకాశం లేనివాడు గనుక) సూర్యుని కిరణాలనే ప్రతిఫలించే చంద్రుడు 'శీతమయూఖుడు' (చల్లని కిరణాలు కలవాడు) అని పిలువబడ్డాడు. మంచు కూడా చంద్రునినుంచే వెలువడుతుందని పూర్వీకులు నమ్మేవారు. అందుకే వారు చంద్రుడిని హిమకరుడనీ, తుహినకరుడనీ,

తుహినాంశుడనీ పిలిచారు. పగలంతా సూర్యుని ప్రచండమైన కిరణాల తాపానికి విలవిలలాడే జీవకోటికి రాత్రివేళల్లో చంద్రుని చల్లని కిరణాలు ఉపశమనాన్ని కలిగిస్తాయి. పగలు మనం భరించేది నేరుగా సూర్యుడి నుంచి వచ్చే కాంతిలోని ఉష్ణాన్ని. రాత్రిళ్లు సూర్యుని కిరణాలు చంద్రునిపైపడి, వానిలోని కాంతినీ, వేడినీ చంద్రమండలం హెచ్చుభాగం పీల్చుకొనగా మిగిలిన కాంతీ, వేడీ చంద్రునిచే ప్రతిఫలించబడి చంద్రకిరణాల రూపంలో భూమిని చేరుతున్నాయి. అందుకే అవి మసక కాంతితోనూ, చల్లగానూ వుంటాయి. దీనికి తోడు పగలంతా సూర్యుని కిరణాల ఉగ్రతకు వేడెక్కిన భూమి సూర్యాస్తమయాన్నుంచీ పగలు తాను గ్రహించిన వేడిని తిరిగి బయటికి వదలివేస్తూ వుంటుంది. ఈ ఉష్ణ వికీర్ణ ప్రక్రియను రేడియేషన్ (*Radiation*) అంటారు. రాత్రిళ్లు భూగోళం ఉష్ణాన్ని కోల్పోయి చల్లబడుతుంది. చల్లబడే భూగోళంతోపాటు దాన్ని ఆవరించి వున్న వాతావరణపు పొరలూ చల్లబడతాయి. ఆ కారణంగా వాతావరణంలోని నీటి ఆవిరి చల్లబడి మంచుగా మారి, మంచుగా మారిన గాలి పొరలు బరువెక్కి క్రమంగా క్రిందికి దిగుతాయి. దీనినే రాత్రిళ్లు మంచు కురవడం అని మనం అంటాం. తెల్లవారుజామునకు భూమి మరింత చల్లబడుతుంది గనుక మంచు మరింత ఎక్కువవుతుంది. అయితే గ్రీష్మంలో విపరీతంగా వేడెక్కిన భూమి సూర్యోదయం వరకూ చల్లబడదు. అందుకే ఆ ఋతువులో మంచు కురవదు. రాత్రిళ్ళు ప్రకాశించే చంద్రుని నుంచే ఈ 'హిమము' లేక 'తుహినము' వస్తున్నదనే నమ్మకం మన పూర్వులకేర్పడింది. అయితే శాస్త్రీయంగా ఆలోచిస్తే మంచు ఉత్పత్తికీ, చంద్రుడికీ ఏ సంబంధమూ లేదు. అలాగే పగలు ఎండవేడిమికి విలవిలలాడి, తమలోని జీవశక్తిని కోల్పోయి దాదాపు నిర్జీవంగా మారిన వృక్షాలకు రాత్రివేళల్లోని చల్లని వాతావరణం, కురిసే చల్లటి మంచు ఎంతో ఊరటనిస్తాయి. అవి తిరిగి జీవశక్తిని పుంజుకొని ఉదయానికల్లా కళకళలాడుతాయి. చిన్న లేత మొక్కలలో పగటివేళలకూ, రాత్రివేళలకూ ఈ వ్యత్యాసం స్పష్టంగా కనుపిస్తుంది. పగటి ఎండకు మృతప్రాయంగా మారిన ఆ మొక్కలకు, రాత్రివేళల్లో కురిసే మంచూ, చల్లదనమూ అమృతప్రాయమే. అందుకేనేమో మనవాళ్లు చంద్రుని కాంతిలో అమృతముందనీ, చంద్రుడు పీయూషవర్షుడనీ నమ్మేవాళ్ళు. సోమరసానికి అధిదేవత అయిన సోముడిని ఋగ్వేదంలో అమృత నిష్యందుడనీ, లతారూపుడనీ, 'వనస్పతి' అనీ, సుదీర్ఘ ఆయుః ప్రదాత అనీ పేర్కొన్నారు. ఋగ్వేదంలో 'ఇందు' లేక 'సోమ' అనే పేర్లతో యజ్ఞానికి వచ్చి దర్భలమీద పెట్టిన ఆహుతులను స్వీకరించమని చేసే ప్రార్థనలున్నాయి. సోమలతను రాళ్లతో నలగగొట్టి, వడకట్టి సోమరసాన్ని తయారు చేస్తారు. ఇది అగ్నికి ఆహుతి యివ్వడం ద్వారా దేవతలకు సమర్పించింది పోను మిగిలినది యాజకులు త్రాగుతారు. మత్తు కలిగించే ఈ సోమరసం దేవతలకు అత్యంత ప్రీతిపాత్రమని ఆర్యులు భావించేవారు. దీనిలో తేనె కూడా కలుపుతారు. సోమరసాన్నే పీయూషమని కూడా ఋగ్వేదం పేర్కొంటూంది (ఋ. 3-48-2). సోమరసానికి నీటిని కలిపిగానీ, తేనెను కలిపిగానీ, నెయ్యిని కలిపిగానీ సేవించడం కూడా వుంది. అయితే ఆర్యులు సోమరసంలో పాలు, పెరుగు, బార్లీ పిండి కలిపి సేవించడాన్నే ఎక్కువగా ఇష్టపడ్డారు. సోమరసంలో పాలు కలిపితే దానిని గవాశిరమనీ, పెరుగు కలిపితే దధ్యాశిరమనీ, బార్లీపిండి కలిపితే దానిని యవాశిరమనీ అనేవారు. యజ్ఞాలలో సోమయాగం ముఖ్యమైనది. అందుచేతనే సోముడు ఆర్యులకు అతి ముఖ్య దేవతలలో ఒకడయ్యాడు. సోమలత ఓ అరుదైన మొక్క. అది దివి నుంచి భువికి వచ్చిందని ఋగ్వేదం 9-61-10లో చెప్పబడింది. స్వర్గంలో దేవతలు త్రాగే అమృతం ఈ సోమరసమేనట. సోమలత, సోముడు ఈ రెంటి రంగూ బభ్రువర్ణం (గోధుమ రంగు) లేక అరుణవర్ణం (ఎరుపు రంగు) లేక గోధుమ పసుపు రంగులు కలగలసిన హరిత వర్ణం అని ఋగ్వేదం పేర్కొంటూంది. సోముడు నదులకు భర్త అనీ, సముద్రానికి సంబంధించిన దేవత అనీ (రాజా దేవః సముద్రియః ఋ. 9-107-16) నీళ్లు ఆయన అక్కచెల్లెళ్లనీ (ఋ. 9-82-3) చెప్పబడింది. శతపథ బ్రాహ్మణంలో నీళ్లే అమృతం అని చెప్పబడింది. (శ. బ్రా. 11-5-4-5) నీళ్లని పుట్టించింది సోముడేననీ,

వర్షాలకు హేతువు సోముడేననీ ఋగ్వేదం 9-96-3 లో చెప్పబడింది. సోముడిని వర్షములకు దేవుగు (ఈశోయో వృష్టేః ఋ.9-74-3) అని పేర్కొంటున్నది ఋగ్వేదం. సోముడు పసుపు పచ్చగా ప్రకాశించేవాడు. సోమరసపానం వలన కలిగే మత్తుతో దేవతలు యుద్ధాల్లో విజయం సాధించేవారట. అది వారిని అజేయం చేసిందట. సోమమే అమృతమనీ, సోమం స్వర్గాన్నుంచి తేబడిందనీ, దానిని గద్ద తీసుకువచ్చిందనీ (సోమః శ్యేనా భృతః ఋ. 1-80-2) ఋగ్వేదంలో పేర్కొనబడడం వైనతేయుడైన ఖగపతి (గరుత్మంతుడు) స్వర్గాన్నుంచి అమృతాన్ని తెచ్చే ఐతిహ్యాన్ని మనకు గుర్తుకు తెస్తుంది. అయితే 'అగ్నయే దివః శ్యేనాయ' అని ఋ. 7-15-4లో ఉండడాన్ని బట్టీ, అగ్నిని ఋగ్వేదంలో తరచూ పక్షి అనడాన్ని బట్టీ, శ్యేన అనేపదం వైద్యుతాగ్నికి (మెరుపుకి) వాడబడడాన్ని బట్టీ, విఖ్యాత పాశ్చాత్య వైదిక విద్వాంసుడు బ్లూమ్‌ఫీల్డ్ (*Bloomfield*) గద్ద సోమాన్ని తేవడం అనే గాథ నల్లని వర్షుకాభ్రం అనే యినుప కోటనుంచి మెరుపు / పిడుగు క్రిందికి వస్తూ తనతోబాటు మేఘంలో దాగివున్న సోమం (నీరు) అనే అమృతం క్రింద పడేటట్టు చేయడానికి సూచకమని వివరించాడు. కనుక 'అమృతం' అని ఋగ్వేదంలో వ్యవహరించబడిందంతా నీటిని గురించేననిపిస్తున్నది. స్వర్గాన్నుంచి అగ్నిని మాతరిశ్వుడు, సోమాన్ని గద్దా భూమికి తీసుకు వచ్చాయని ఋగ్వేదంలో వుంది. మాతరిశ్వుడంటే వాయువు. గ్రీకు ఐతిహ్యాల ప్రకారం ప్రామీతీయస్ (*Prometheus*) అనే మహాకాయుడు (*Titan*) ఈశాన్య గ్రీసుదేశంలోని ఒలింపస్ పర్వతం (ఇదే గ్రీకువారి స్వర్గం) నుండి దేవదేవుడైన జియస్ (*Zeus*) ఆజ్ఞను ధిక్కరించి అగ్నిని దొంగిలించి మానవాళికి అందించాడట. అందుకు శిక్షగా జియస్ అతనిని ఓ పెద్ద బండరాతికి గొలుసులతో కట్టివేయగా అక్కడికో గద్ద వచ్చి రోజూ అతని కాలేయాన్నుంచి కొంత భాగాన్ని పీక్కు తినసాగిందట. తరువాత హెర్క్యులీజ్ (*Hercules*) అనే మహావీరుడతడిని రక్షిస్తాడట. ప్రామీతీయస్, మాతరిశ్వులకున్న సారూప్యాన్ని చూడండి.

ఐతరేయ బ్రాహ్మణములోని ఓ ఐతిహ్యం ప్రకారం గద్ద ఇలా సోమాన్ని తీసుకుపోతూ వుండగా కృశానువు అనేవాడు అగ్ని బాణం వేయడం వల్ల ఆ పక్షి యీక ఒకటి రాలిపడిందట. అది నేలమీద పడి పలాశ వృక్షం (మోదుగ చెట్టు) గా మారిందట. అందువల్లనే మోదుగ చెట్టుకి యజ్ఞకర్మలో పవిత్రత లభించిందట!

బహుశా యీ ఐతిహ్యాన్నుంచి స్ఫూర్తి తీసుకునేనేమో గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం' లో గిరీశం యీ పద్యం చెప్తాడు -

**ఖగపతి యమృతము తేగా**
**భుగ భుగ మని పొంగి చుక్క భూమిని వ్రాలెన్**
**పొగ చెట్టై జన్మించెను**
**పొగ త్రాగనివాడు దున్నపోతై పుట్టున్.**

అమృతాన్ని తెస్తూన్న గరుత్మంతుని యొక్క ఒక ఈక రాలి నేలమీద పడితేనే పవిత్రమైన మోదుగ వృక్షం అక్కడినుంచి పుట్టుకొచ్చింది. మరి ఆ ఖగపతి తెస్తూన్న అమృతం నుండే ఒక చుక్క నేలరాలితే అక్కడినుంచి పుట్టుకొచ్చిన పొగచెట్టు (పొగాకు మొక్క) ఇంకెంత పవిత్రమైనది? అని గిరీశం భావన. అన్నట్లు గరుత్మంతుని దెబ్బతీసిన కృశానువు అనేవాడు స్వర్గలోకపు శతఘ్ని దళాధిపతో లేక శతఘ్నిని కనుగొన్నవాడో అయివుంటాడు. ఎందుకంటే సంస్కృతంలో 'కృశాను యంత్ర'మన్నా, 'అగ్ని యంత్ర'మన్నా ఫిరంగి (*Cannon*).

సోముడు అన్ని మొక్కల్నీ పుట్టించాడని ఋ. 1-91-22 పేర్కొంటూంది. బ్రాహ్మణాలలో చెట్టుకి 'సౌమ్య' (సోముడికి సంబంధించినది) అనే వ్యవహార నామం వుంది. పూర్వీకులు భూమిపై పచ్చదనానికంతటికీ కారణం చంద్రుడేనని భావించారు. ఇక సోమలత విషయానికొస్తే - అది చెట్లలోకెల్లా ఉత్తమమైనదట. అది చెట్లకు రాజు. చెట్లకు అమృతప్రాయమైనది నీరు. 'హిమకరుడు' లేక 'తుహినకరుడు' అని పిలువబడిన చంద్రుడు కురిపించే మంచు కరిగితే నీరు లభిస్తుంది. అయితే వేదాల తరువాత సాహిత్యంలో 'సోమ' శబ్దం చంద్రుడికి పర్యాయ పదంగా మారింది. 'చంద్రుడు దేవతల అన్నం. దాన్ని దేవతలు భక్షిస్తారు' అని ఛాందోగ్యోపనిషత్‌లో పేర్కొనబడింది. చంద్రబింబం దేవతలు భక్షించడంవల్ల క్షీణించి మళ్లీ సూర్యునిచే పూరించబడుతుందనీ ఆ కాలపు విశ్వాసం. ఇలా 'సోమ'శబ్దం సోమలతనూ, సోమరసాన్నీ దేవతాపరంగా చంద్రుడినీ సూచిస్తుంది. సోమం అనే అమృతానికి ఆధారమైన పాత్ర చంద్రుడు.

అలా అమృత ప్రాయమైన నీటికి సృష్టికర్త చంద్రుడేననే భావం ప్రాచీనులలో స్థిరపడింది. అంతేకాదు చంద్రుడికీ, అమృతానికీ మరో 'లింకు' కూడా వుంది. దేవదానవులు క్షీరసాగర మథనం చేసిన తర్వాత విష్ణువు జగన్మోహిని రూపంలో అమృతాన్ని ముందుగా దేవతలకు పంచుతాడు. ఆ సమయంలో దానవులలోని వాడైన రాహువు (ఇతడు విప్రచిత్తికీ, సింహికకూ కొడుకు గనుక ఇతడిని సైంహికేయుడనీ అంటారు) దేవతల వరుసలో వచ్చి కూర్చొని అమృతం త్రాగుతాడు. సూర్య చంద్రులిది పసికట్టి విష్ణువుకు చెప్పగా అతను చక్రంతో రాహువు తల నరుకుతాడు. అమృతపానం కారణంగా ఆ తల సజీవంగా వుండి పగతీర్చుకొనడానికి సూర్యచంద్రుల్ని మ్రింగుతూ సూర్య, చంద్ర గ్రహణాలకు కారణమౌతున్నదని పూర్వుల విశ్వాసం. అంతేకాక సైంహికేయుని మొండెం కేతువు అనే పేరుతో అనంత వ్యోమంలో మంచు, దుమ్ముతో కూడిన ధూళిమేఘం (*Comet*) గా మారి సంచరిస్తూ అప్పుడప్పుడూ సూర్య చంద్రుల్ని ఇబ్బంది పెడుతూ వుంటుందని కూడా మన వారి నమ్మిక. అందుకే ధూమకేతువు (తోకచుక్క) కనుపించడం అశుభసూచకమని కూడా భావించారు. నవగ్రహాలలో రాహువు ఎనిమిదవది కాగా, కేతువు తొమ్మిదవది.

ఇక సూర్యచంద్రగ్రహణాల్ని శాస్త్రీయంగా విశ్లేషించి చూద్దాం. నిత్యం సూర్యుని చుట్టూ భూమి, భూమి చుట్టూ చంద్రుడు పరిభ్రమిస్తాయి. ఈ క్రమంలో ఒక్కోసారి ఈ మూడు గ్రహాలూ ఒకే సరళరేఖలోకి వస్తాయి. అప్పుడు సూర్యుడి నుంచి వచ్చే కాంతి కిరణాలకు భూమి అడ్డుపడిన కారణంగా చంద్రునిపై పడే భూమి నీడ చంద్ర గ్రహణానికి (*Lunar Eclipse*) కారణం. ఇది సూర్యుడికీ, చంద్రుడికీ మధ్య భూమి అడ్డుగా వచ్చినప్పుడు జరిగే ప్రక్రియ. అలాగే సూర్యునికీ, భూమికీ మధ్య చంద్రుడు అడ్డుగా వచ్చినప్పుడు కొద్దికాలంపాటు చంద్రమండలం సరిగ్గా సూర్యగోళాన్ని కప్పివేస్తుంది. అప్పుడు సూర్యుని కిరణాలు నిరోధించబడి కొద్దిసేపు ఏర్పడే సూర్యగ్రహణం (*Solar Eclipse*) కారణంగా పగలే చీకటి ఏర్పడుతుంది. ఒక్కసారి చీకటి పడడం కారణంగా ప్రకృతి యావత్తూ ఉన్నట్టుండి నీరవంగా మారుతుంది. పక్షులు అది సాయం సంధ్యాకాలమని భ్రమించి తమ తమ గూళ్ళకు మరలుతాయి. ఈ ప్రకృతి వింత అద్భుతంగా వుంటుంది. చంద్రుడు అడ్డుతొలగగానే తిరిగి ప్రకృతిలో చైతన్యం పుంజుకుంటుంది. గర్భిణులు గ్రహణకాలంలో బయటికి వస్తే వారి పిల్లలు మొర్రితో పుడతారనేది అశాస్త్రీయమైన విశ్వాసం. పుట్టుకతో పై పెదవిగాని, క్రింది పెదవిగాని పూర్తిగా ఏర్పడక, చీలి వెలితిగా లేక తొర్రితో ఉండడాన్ని 'గ్రహణం మొర్రి' అంటున్నారు. గ్రహణ కాలంలో సూర్యచంద్రులు కొంచెం మొర్రి పోయి వున్నట్లుగా, ఇలా పుట్టిన పిల్లల పెదాలు కూడా మొర్రిపోయి వుంటాయి గనుక వారిని మొర్రినోటి పిల్లలు అనీ, ఆ మొర్రిని గ్రహణం మొర్రి అనీ అంటారుగానీ, వాస్తవానికి సూర్యచంద్రగ్రహణాలకూ, మొర్రి శిశువుల జననానికి ఏ విధమైన

సంబంధమూ లేదని శాస్త్రీయంగా రుజువైంది.

సూర్యుడు విష్ణువు కుడి కన్నయితే చంద్రుడు ఎడమ కన్నట. వీళ్ళిద్దరూ బహుశా విష్ణువుకు వేగుల వాళ్ళయివుంటారు. అందుకే వారు సైంహికేయుడిపై విష్ణువుకు ఫిర్యాదు చేసి వుంటారు! చంద్రుడు బ్రహ్మ అంశతో అత్రి మహర్షి నేత్రం నుంచి పుట్టి, అనసూయ, అత్రి దంపతులచే పెంచబడ్డాడట. క్షీరసాగర మథన సమయంలో బ్రహ్మే అందునుండి చంద్రునిగా అవతరించాడని మరో విశ్వాసం. అందుకే చంద్రునికి సాగరసూనుడనే మరో పేరుంది. దక్ష ప్రజాపతి కుమార్తెలైన 'అశ్వని' మొదలుగాగల 27మంది యితని భార్యలు. అయితే చంద్రుడు వారిలో 'రోహిణి' పట్ల అధిక ప్రేమతో వ్యవహరించేవాడట. అందుకని మిగిలిన భార్యలు తమ తండ్రికి ఫిర్యాదుచేయగా దక్షుడు చంద్రుడి పక్షపాత బుద్ధికి కోపించి అతడిని క్షయరోగ పీడితుడవుకమ్మని శపించాడట. ఆ కారణంగానే చంద్రునికి వృద్ధిక్షయాలేర్పడ్డాయనీ, కృష్ణపక్షంలో క్షయము కలిగినా, సూర్యుని కారణంగా శుక్లపక్షంలో తిరిగి చంద్రుడు పుంజుకుంటాడనీ మనవారి విశ్వాసం. అమృత మయూఖుడైన చంద్రుని అమృత కిరణాల్ని దేవతలు భుజిస్తూండటం కారణంగా చంద్రుడు కృష్ణపక్షంలో క్షీణించి, తిరిగి సూర్యకిరణాల కారణంగా శుక్లపక్షంలో పుంజుకుంటాడనీ ఇంకొందరి విశ్వాసం. అమృత కిరణాల్ని భుజించటమంటే చంద్రుని వెన్నెలను భుజిస్తుందని చెప్పబడే చకోర పక్షి విషయం గుర్తొస్తుంది.

చకోర పక్షి (*Alectoris chukar - Genus - Francolinus; Order - Galliformes*) ని ఉత్తర భారతదేశంలో చుకార్ అనీ పిలుస్తారు. హిమాలయాలు ప్రధానంగా ఈ పక్షి ఆవాసం. ఇది సుమారు 40 సెం॥మీ॥ పరిమాణంలో వుంటుంది. దీని ముక్కు కాళ్ళు ఎర్రగా వుంటాయి. తెల్లని ఈ పక్షి రెక్కలు మాత్రం బూడిద రంగులో వుంటాయి. మెడ చుట్టూ నల్లని వలయం వుంటుంది. రెక్కలపై నల్లని చారలుంటాయి. ఈ పక్షిని తెలుగులో 'వెన్నెల పులుగు' అనీ, 'వెన్నెల పిట్ట' అనీ సంస్కృతంలో జీవంజీవములనీ, జీవజీవములనీ అంటారు. ఇది చంద్రుని అమృత కిరణాల్ని మాత్రమే భుజించి వేరేమీ ఆహారం తీసుకొనకుండా జీవిస్తుందనే ఒకే అశాస్త్రీయమైన నమ్మకం మన పూర్వీకులలో వుంది. దేవతలు చంద్రుని అమృత కిరణాల్ని భుజిస్తారని నమ్మినట్లే వారు చకోర పక్షికూడా వెన్నెలను భుజిస్తుందని నమ్మారు. వెన్నెలలో భుజించటానికేముంటుంది? హిమాలయ పర్వత ప్రాంతాలలో ప్రత్యేకించి శరదృతువులోని వెన్నెల రాత్రులలో మంచు విపరీతంగా పడుతుంది. వెన్నెల రాత్రులలో ఘనీభవించిన మంచు తునకల రూపంలో ఆకాశాన్నుంచి రాలుతూ వుంటుంది. కురిసే మంచుకూ – చంద్రునికీ ఏ సంబంధమూ లేకపోయినా తుహినకరు (చంద్రు)ని కారణంగానే హిమపాతం జరుగుతూందనీ, చంద్రుని నుండి వచ్చే వెన్నెలకుప్పలే ఆ హిమరాశులనీ భావించి బహుశా ఆకాశాన్నుంచి జారిపడే మంచు తునకలను తినే చకోర పక్షిని వెన్నెల భుజించే పక్షిగా వారు భావించి వుంటారు. చకోర పక్షి ఆకాశాన్నుంచి పడే మంచు తునకలను భుజించినట్లే, చాతక పక్షి (వాన కోయిల) వేరే ఆహారము తీసుకొనక కురిసే వాన నీళ్లను మాత్రమే త్రాగుతుందట. అయితే ఈ రెండు పక్షులూ నేరుగా కురిసే మంచు (వెన్నెల)ను తినడం, వాన నీటిని త్రాగడం వాస్తవం కావచ్చుగానీ, అవి వేరే ఆహారమేదీ తీసుకోవనడం శాస్త్రీయంగా ఋజువుకాని విశ్వాసం. పాముకి వాతాశనం (గాలిని భుజించేది) అనే మరో పేరుంది. అంటే అవసరమైతే అది దీర్ఘకాలంపాటు ఆహారం లేకుండా గాలి మేసే జీవిస్తుందట. ఎక్కువకాలం ఆకలికి తట్టుకోగలగడం కారణంగా పాముకి ఆ పేరు వచ్చి వుండవచ్చుగాని, తన సహజ సిద్ధమైన ఆహారమైన కప్పలూ, ఎలుకలూ వగైరాలను తినకుండా కేవలం గాలి భోంచేసి బ్రతికే పాము ఎక్కడా వుండే అవకాశం లేదు. చకోర, చాతక పక్షుల విషయమూ అంతే!

# అనుబంధము - 7
# నవరత్నాలు

ప్రపంచంలో లభించే విలువైన రంగురాళ్లలోకెల్లా అత్యంత విలువైన తొమ్మిదింటిని భారతీయులు నవరత్నాలు (*The nine precious Jewels or Gems*) అని పిలుస్తారు.

ముక్తా మాణిక్యవైదూర్య గోమేదా వజ్ర విద్రుమౌ।
పుష్యరాగోమరకతం నీలశ్చేతి యథాక్రమమ్॥

పై శ్లోకాన్ని బట్టి ప్రాచీన భారతీయులు వాటి సాపేక్ష విలువలను బట్టి నవరత్నాలను పై క్రమంలో అమర్చారు. వాటి గురించి అదేవరుస క్రమంలో వివరంగా చూద్దాం.

1) ముక్తా : సంస్కృతంలో 'ముక్తా' అన్నా 'ముక్తాఫలమ్' అన్నా ముత్యం (*pearl*) దీనినే 'మౌక్తికము' అని కూడా అంటారు. 'కరీంద్ర జీమూత వరాహ శంఖ మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని ముక్తా ఫలాని ప్రథితాని లోకే తేషాంతు శుక్త్యుద్భవమేవ భూరి।' అని మల్లినాథుడు పేర్కొనడాన్ని బట్టి ముత్యములు యీ క్రింది విధాలుగా లభిస్తాయని ప్రాచీనులు నమ్మేవారని తెలుస్తున్నది.

i) కరీంద్ర – మదించిన గొప్పఏనుగు కుంభస్థలంలో ముత్యాలు లభిస్తాయని నమ్మేవారు. అందేవలనే ధూర్జటి మహాకవి 'సమద సామజ కుంభజములైన మౌక్తికంబులు' (మదించిన ఏనుగు కుంభస్థలంలో పుట్టిన ముత్యాలు) అని (శ్రీ కాళహస్తి మహాత్మ్యము 3-4) పేర్కొన్నాడు.

ii) జీమూత – 'జీమూతము' అంటే సంస్కృతంలో 'మేఘము', 'పర్వతము'

అనే రెండర్థాలున్నాయి. ఒక్కోసారి మేఘములు వర్షించినప్పుడు 'ముత్యాలజల్లు' కురుస్తుందని ప్రాచీనుల విశ్వాసం. అంతేకాక 'జీమూతము' అంటే 'పర్వతము' అనే అర్థం తీసుకుంటే పర్వతాలలో ముత్యాలు దొరుకుతాయని కూడా ప్రాచీనులు నమ్మేవారేమో! ఏమైనా 'జీమూతప్రభ' అనే ఓ రత్నం వున్నట్లు కౌటిల్యుని అర్థశాస్త్రం పేర్కొంటుంది.

iii) వరాహ – అడవి పంది (*Wild Boar*) కోర లేక దంతం క్రింద ముత్యాలు దొరకుతాయని నమ్మేవారు. అందుకే ధూర్జటి మహాకవి 'స్తబ్ధరోమ విషాణ లబ్ధ మౌక్తికములు' (అడవి పంది కోరనుండి లభించిన ముత్యములు) అని అదే పద్యంలో పేర్కొన్నాడు. 'స్తబ్ధరోమము' అంటే అడవిపంది. 'విషాణము' అంటే కోర లేక కొమ్ము.

iv) శంఖ – శంఖువు (*Conch Shell*) నుండి కూడా ముత్యాలు లభిస్తాయని నమ్మేవారు. 'శంఖజము' అనే పెద్దముత్యం పావురం గుడ్డంత పరిమాణంలో వుంటుందట.

v) మత్స్య – కొన్ని రకాల చేపల నుండి ముత్యాలు లభిస్తాయని నమ్మేవారు.

vi) అహి – 'అహి' అంటే సర్పం. శ్రేష్ఠమైన జాతిపాముల పడగలపై ముత్యాలుంటాయని ప్రాచీనులు నమ్మేవారు. అందుకే ధూర్జటి మహాకవి పైన చెప్పిన పద్యంలో 'ముక్తకంచుక మస్త ముక్తా ఫలములు' ('ముక్త కంచుకము' అంటే కుబుసము (*slough*) ను విడిచేది – పాము. దాని మస్తకము (పడగ)పైనున్న ముక్తా ఫలములు– ముత్యములు) అని పేర్కొన్నాడు.

vii) శుక్త్యుద్భవ – 'శుక్తి' అంటే ముత్యపు చిప్ప. శుక్త్యుద్భవ అంటే ముత్యపు చిప్ప (*pearl oyster*) లో పుట్టినట్టివైన ముత్యాలు. వాటిని గురించిన వివరాలు మనం యిదివరకే పాండురంగ మాహాత్మ్యము 1-165 పద్యం తాత్పర్యంలో విపులంగా తెలుసుకున్నాం. అసలు ముత్యాలంటే యివే. ముత్యాలుగా పేర్కొనబడిన మిగిలినవన్నీ ముత్యాల వంటివి మాత్రమే ! మన ప్రాచీనులు త్రిగర్త దేశంనుండి అతి విలువైన త్రిగర్త ముత్యాలు కొనుగోలు చేసే వారట. త్రిగర్త దేశమంటే భారత దేశానికి వాయవ్యంగా (*North West*) వున్న జలంధర దేశమట. అయితే ప్రస్తుతం భారత శ్రీలంకల మధ్యనున్న పాక్ జలసంధి (*Palk Straits*) లో విలువైన ముత్యాలు విరివిగా లభిస్తున్నాయి. సుమారు 70 కి పైగా జాతులకు చెందిన ముత్యపు చిప్పల నుండి లభించే ముత్యాలలోకెల్లా నల్లముత్యాలు అత్యంత శ్రేష్ఠమైనవి. గుజరాత్‌కు చెందిన సంజయ్ దేశాయ్, భార్గవ్ దేశాయ్ నల్ల ముత్యాల వుత్పత్తిలో ప్రపంచ ప్రఖ్యాతిని ఆర్జించారు.

viii) వేణు – ముదిరిన వెదురు (*Bomboo*) నుండి కూడా ముత్యాలు లభిస్తాయని నమ్మేవారు. అంచేతనే ధూర్జటి మహాకవి పైన తెల్పిన పద్యంలో 'వేణుజాతములైన యాణిపూసలు' అని పేర్కొన్నాడు. (వెదురు నుండి పుట్టిన ఆణిముత్యాలు). ఆణి అంటే 'ముత్యము యొక్క గుండ్రం దనము'. ఆణిపూస అంటే గుండ్రని ముత్యము.

'ఇలా ముత్యాలు పై ఎనిమిది విధాలుగా లభించినప్పటికీ ప్రధానంగా ముత్యపు చిప్పలనుండే అవి లభిస్తాయి' అన్నాడు మల్లినాథుడు. ముత్యపు చిప్పలనుండికాక యితర పద్ధతులలో ముత్యాలు లభిస్తాయని చెప్పడం శాస్త్రసమ్మతం కాదు.

ఐతే కొన్నిరకాల చేపలూ, శంఖువులూ ముత్యాలవంటివాటి ఉత్పత్తికి కారకములయ్యే అవకాశంమాత్రం లేకపోలేదు. మదించిన ఏనుగుల కుంభస్థలంలోనూ, అడవిపంది కోరల క్రిందనూ, పాముల కపాలముల (పుర్రెల)లోనూ ఏవైనా గుండ్రని ఎముక పదార్థం ఉండే అవకాశముంది. అవి కొమ్ములూ, దంతాలలా పూర్వీకులచే ఆభరణాల తయారీలో కూడా వాడబడ్డాయేమో! అంతమాత్రంచేత వాటిని మంచి ముత్యాలతో పోల్చలేం. అలాగే ముదిరిన వెదురులో కూడా చిన్న

గోళాకారపు క్షీరపదార్థం వుండి దానిని ఆభరణాల తయారీలో ఉపయోగించిన కారణంగా - వాటిని కూడా ముత్యాలు అన్నారేమో! ఇక మేఘాలనుండి ముత్యాలజల్లు కురవడానికి ఏమాత్రమూ అవకాశంలేదు - మన ఊహలలో తప్ప.

2) 'మాణిక్యము' లేక 'కెంపు' (*Ruby*) అరుదైన రత్నం. ముదురు ధూమ్రవర్ణం నుంచి లేత గులాబి రంగువరకూ వుండే కొరండమ్ (*corundum*) కలిగిన అత్యంత విలువైన రంగురాళ్లివి. దేనిలోనైనా పరిపూర్ణత సాధించిన వారిని మాణిక్యంతో పోల్చడం పరిపాటి. మాణిక్యములకు సింహళము, కాలపురము, ఆంధ్రదేశము, తుంబురము జన్మస్థానాలట. సింహళదేశం (ప్రస్తుత శ్రీలంక)లో లభించే కెంపులు రక్తవర్ణం కలిగి వుంటాయట. వాటిని 'పద్మరాగము'లనీ, 'తామర కెంపు'లనీ అంటారు. అవి ఉత్తమోత్తమమైనవి. ఇక కాలపురము (ఇది బహుశా బీహార్‌లోని రాజమహల్ కొండలలోని ఒకప్పటి కాలక వనమునకు ముఖ్య పట్టణం కావచ్చు)లో లభించే మాణిక్యము కొంత పసుపుదాళు కలిగి 'కురువిందము' అనే పేరుతో ప్రసిద్ధమైనదట. ఇదికూడా ఉత్తమమైన కెంపేనట. ఆంధ్రదేశంలో పుట్టిన కెంపు అశోకవృక్షపు చిగురు దాళు కలిగినదట. దానిని 'సౌగంధికమ'ని పిలుస్తారట. అది మధ్యమమైన కెంపట. తుంబుర దేశం (ఇదెక్కడో తెలియరాలేదు) లో లభించే కెంపు నీలపు దాళుకలిగిన ఎఱ్ఱరాయి. దానిని 'నీలగంధి' అంటారు. కెంపులలో యీ తరగతికి చెందినవాటిని అధమమైనవిగా భావిస్తారు.

3) 'వైదూర్యము' లేక 'వైడూర్యము' లేక 'విదూరజము' (*Cat's eye or lapis lazuli or fine-marble*) ను 'పిల్లి కన్నతనము' అని కూడా అంటారు. 'విదూరము' లేక 'విదూరము' అనే దేశంలో ఉరుములతో కూడిన వర్షం వచ్చినప్పుడు యీ విలువైన రాళ్లు నేలలోనుంచి బయటికి పొడుచుకొస్తాయట. దీని శాస్త్రీయత గురించి ఉద్భటారాధ్య చరిత్రము 3-49 పద్య తాత్పర్యంలో మనం విపులంగా తెలుసుకున్నాం. ఇది నీలంగా వుండే మణి. దీనిని రాజావర్తము అని కూడా అంటారు. దీనినే 'విరాటకము'అనీ 'విరాటజము' అనికూడా అంటారు గనుక విదూరదేశం అంటే విరాటరాజు పాలించిన మత్స్యదేశంకావచ్చు. (ఇది ప్రస్తుత రాజస్థాన్ రాష్ట్రంలోని ధోల్‌పూర్ ప్రాంతానికి పడమరగా వున్న ప్రాంతం. విరాట రాజ్యానికి వైరాట నగరం రాజధాని. ప్రస్తుతం జైపూర్‌కు 40 మైళ్ల దూరంలో వున్న బైరాట్ ఒకప్పటి వైరాట నగరం. ఇక్కడే పాండవులు అజ్ఞాతవాసం చేశారు.)

4) 'గోమేదము', 'గోమేధికము' లేక 'గోమేదకము' (*Sardonyx*) హిమాలయములు మరియు సింధునదీ లోయలలో లభించే రత్నం. దీని సహజమైన రంగు లేతపసుపు వన్నె. ఇది ఎగేట్ (*Agate*) వంటి గట్టి రంగురాయే. అయితే యిందులో ఒకపొర తెల్లనిదీ, మరొకపొర శార్డ్ (*Sard*) కు చెందిన లేతపసుపు రంగుదీ అయివుంటుంది. వీటిలో తెల్లనివి, ఎర్రనివి, ముదురునీలం రంగువీ కూడా లభిస్తాయి.

5) 'వజ్రము' లేక 'వజ్రమణి' (*Diamond*) దీనిని 'హీర' మనీ, 'హీరక'మనీ, 'రవ' అనీ అంటారు. జనవ్యవహారంలో 'రవ్వ' అనీ అంటారు. వజ్రాలు అత్యంత కఠినమైన రాళ్లు. అందుకేనేమో వజ్రాన్ని వజ్రంతోనే కోయాలంటారు. ఇవి పరిశుద్ధమైన కర్బనం (*carbon*) తో ఏర్పడినట్టివి. వజ్రాల్ని చేతిగడియారాల తయారీలోనూ, గాజు ఫలకాల (*Glass sheets*) ను కోయడానికీ వాడుతారు. వజ్రాలు నాలుగు వర్ణముల (రంగుల)లో లభిస్తాయనీ, అవి వరుసగా సమాజంలోని నాలుగు వర్ణాలనూ స్ఫురింపజేస్తాయనీ అంటారు. శ్వేత (తెల్లని) వజ్రం బ్రాహ్మణుల్నీ; లోహిత (ఎర్రని) వజ్రం క్షత్రియుల్నీ; పీత (పసుపుపచ్చ) వజ్రం వైశ్యులనూ, అసిత (నల్లని) వజ్రం శూద్రులనూ స్ఫురింపజేస్తాయట.

నల్లని వజ్రాలు (*Black Diamonds*) బ్రెజిల్ దేశంలో దొరుకుతాయి. వీటిని కార్బనేడో (*Carbonado*) అనే పేరుతో పిలుస్తారు.

6) 'విద్రుమము' లేక 'ప్రవాళము' అంటే పగడము (*Coral*). ఇవి సముద్రంలో కోరల్స్ (*Corals*) అనబడే యాంథోజోవా తరగతి (*Anthozoa*) కి చెందిన నిదేరియన్ (*Cnidarian*) జంతుజాలం సామూహికంగా తయారు చేసుకునే కాల్కేరియస్ కంకాళాలు (*Calcareous skeletons*) సముద్రంలోని కొన్ని దీవులలో విస్తారంగా ఆ జీవులు పగడాల్ని పెట్టడం కారణంగా పగడాల చట్టు (*coral reef*) లూ, పగడాల దీవులూ (*coral islands*) ఏర్పడ్డాయి. పగడాలు లేత పసుపుపచ్చ, ఎరుపు రంగుల మిశ్రమంగానూ లేక పాటలవర్ణము లేక పన్నీరుపువ్వు వర్ణము (*pink colour*) లోనూ వుంటాయి.

7) 'పుష్యరాగము' లేక 'పుష్పరాగము' లేక 'పుష్పరాజము' (*Topaz*) అనబడే రత్నం తెల్లనిది. అయితే లేత పసుపురంగులో కూడా లభించే యీ మణులు పారదర్శకం (*transparent*) గా వుంటాయి. ఇవి అల్యూమినియం సిలికేట్ (*Aluminium silicate*) తో ఏర్పడతాయి.

8) 'మరకతము' - సంస్కృతంలో 'హరిన్మణి', 'గారుత్మతము' అని కూడా పిలువబడే యీ రత్నాన్ని తెలుగులో 'పచ్చ' (*emerald*) అంటాం. ఇది ప్రకాశవంతమైన ఆకుపచ్చ రంగులో వుంటుంది. బెరీలియం అల్యూమినియం సిలికేట్ (*Beryllium Aluminium Silicate*) తో ఏర్పడే యీ అరుదైన మణులలో పారదర్శకమైనవీ (*transparent*) పారదర్శకం కానివీ (*opaque*) కూడా వున్నాయి. అయితే ముదురు ఆకుపచ్చ రంగులో పారదర్శకమైన మణులే శ్రేష్ఠమైనవి.

9) 'నీలము' - 'హరి నీలము', ఇంద్ర నీలము' లేక 'నీలమణి' (*sapphire*) అని పిలువబడే యీ రత్నం కూడా కెంపు (*Ruby*) వలె కొరండమ్ (*Corundum*) యొక్క రూపమే కానీ, యిది ముదురునీలం రంగులో పారదర్శకంగా వుంటుంది.

నవగ్రహాల గమనం (గ్రహచారం) మానవజీవితాల పై ప్రభావం నెరపుతుందనీ, దుష్టగ్రహాల కారణంగా 'గ్రహపీడనం' సంభవిస్తుందనీ, దీని నివారణకు యజ్ఞాలు వగైరాల నిర్వహణలో ఆయా గ్రహాలకు 'గ్రహశాంతి' చేయాల్సి వుంటుందనీ పూర్వులు నమ్మేవారు. మానవ జీవితంలోని ప్రతిదశకూ దిశానిర్దేశనం చేసేది నవగ్రహాల గమనమేనని వారు విశ్వసించారు కనుకనే, మానవుని జాతకాన్ని (*Horoscope*) 'గ్రహవర్తము' అన్నారు. నవగ్రహాలకూ నవరత్నాలకూ అవినాభావ సంబంధం వుందనీ, నవరత్నాలతో తయారైన ఆభరణాలను ధరించడం కారణంగా ఆ యా గ్రహదోషాలు నివారించవచ్చనీ మన ప్రాచీనుల విశ్వాసం. అయితే, యీ విశ్వాసాలేవీ ఆధునిక విజ్ఞాన శాస్త్రాల అనుసంధాన పరిధిలో సాధారమైనవిగా సోపపత్తికంగా నిరూపితం కాలేదు.

క్రీ. పూ. 56 నుండి విక్రమ సంవత్ (*Vikram era*) ప్రారంభానికి కారకుడైన విక్రమాదిత్యుని ఆస్థానంలో నవరత్నాలనే పేరుతో తొమ్మిది మంది ప్రముఖులుండేవారట.

వారు :
1) ధన్వంతరి (గొప్ప వైద్యుడు)
2) క్షపణకుడు(గొప్ప గ్రంథకర్త)
3) అమర సింహుడు ('అమర కోశము' అనే సంస్కృత నిఘంటు కర్త. బౌద్ధ పండితుడు.)
4) శంకు
5) వేతాళ భట్టు లేక బేతాళ భట్టు (ఈయనే భట్టి. విక్రమాదిత్యుని సవతి సోదరుడు)
6) ఘట కర్పరుడు
7) మహాకవి కాళిదాసు
8) వరాహ మిహిరుడు (ఈయన గొప్ప ఖగోళ శాస్త్రవేత్త.)
9) వరరుచి (ఈయన విక్రమాదిత్యుని మరొక సవతి సోదరుడు)

కొందరు సుభాషిత శతక కర్త, విక్రమాదిత్యుని మరొక సవతి సోదరుడూనైన భర్తృహరి కూడా నవ రత్నాలలోని వాడంటారు. అయితే, భర్తృహరి వైరాగ్యం చెంది, రాజ్యాన్ని విక్రమాదిత్యునికి అప్పగించి, దేశ ద్రిమ్మరిగా మారిన అనంతరమే విక్రమాదిత్యుని పాలన ప్రారంభమైంది కనుక, విక్రమాదిత్యుని ఆస్థానంలోని నవరత్నాలలో భర్తృహరి వుండే అవకాశం లేదు.

రామకృష్ణకవి 'పాండురంగ మాహాత్మ్యము' (3-48) పద్యంలో నవరత్నాలతో చేయబడిన వివిధ ఆభరణాలను పేర్కొన్నాడు. నవరత్నాలలోనిదైన 'మాణిక్యము' లేక 'కెంపు' తరగతికి ప్రతినిధిగా ఉత్తమోత్తమమైన పద్మరాగాన్ని పేర్కొని ఊరకుండవచ్చు. కాని కవి భారతీయుడు, పద్మరాగమేమో సింహళదేశపు రత్నం. కనుకనేనేమో మన దేశంలో లభించే 'కెంపు' తరగతికే చెందిన 'కురువింద మణి'ని కూడా కవి ప్రస్తావించాడు. అంతేకాక అనాదిగా ఆభరణాల మందసముల (పెట్టెల) తయారీలో వాడబడిన దంతాన్ని (*ivory*) కూడా ప్రస్తావించాడు.



# అనుబంధము - 8
# రామకృష్ణ కవి ప్రస్తావించిన కొన్ని కులాల వివరాలు

రామకృష్ణ కవి తన కావ్యాలలో నాటి సమాజంలోని వివిధ కులాలను ప్రస్తావించాడు. బ్రాహ్మణులను గురించిన ప్రస్తావనలు వచ్చిన సందర్భాలలో సమగ్రమైన వివరణలతో కూడిన వ్యాఖ్యానం ఎక్కడికక్కడ పొందు పరచాను. వైశ్యుల (వారిని కవి బచ్చులు లేక కోమటులు అని పేర్కొన్నాడు.)కు సంబంధించి ఆ యా సందర్భాలలోనే కాక, 9వ అనుబంధంలో కొంత వివరణ ఇచ్చాను. నాటి గిరిజన తెగలను గురించి కూడా ఇదే గ్రంథంలో మరో సందర్భంలో వివరణ ఇచ్చాను. కవి తన కావ్యంలో పేర్కొన్న కొన్ని కులాలకు సంబంధించి మరిన్ని వివరాలు తెలిపే లక్ష్యంతో ఈ ప్రత్యేకానుబంధాన్ని పాఠకుల ముందుంచుతున్నాను.

## వెలమ కులస్థులు

వెలమ కులస్థులు ప్రాయికంగా ఉత్కళ (ఒరిస్సా) దేశస్థులని ప్రతీతి. అయితే పద్మనాయక వెలమలు పలనాడునేలిన హైహయ వంశస్థుల నుండి చీలిన శాఖకు చెందిన వారంటారు. అలా చీలిన శాఖ వారు తదుపరి ఉత్కళ దేశపు వారితో బాంధవ్యాలేర్పరచుకుని వుంటారు. వీరు రాహుత్తరాయులు లేక గుర్రపు రౌతులు (*Knights*) గా ప్రసిద్ధులు. రాహుత్తరాయ, రావత్, రావు, రౌత్, రౌత్రాయ్, రాయ్ వగైరా పదాలన్నీ వెలమల నుద్దేశించినవే! ఒకప్పుడు వీరిని 'రావు'లనేవారు. అప్పట్లో వీరు మాత్రమే 'రావు' శబ్దాన్ని తమ పేరు చివర ధరించగా తరువాతి కాలంలో అన్ని కులాల వారూ తమ పేరు చివర 'రావు' పెట్టుకోవడం మొదలైంది.

తెలుగు మాగాణంలో స్థిరపడిన వీరు కమ్మ, రెడ్డి, కాపు కులస్థులతో కలుపుకొని సచ్ఛూద్రులనబడ్డారట ! ఆంధ్ర చరిత్రలో రేచర్ల వంశమునకు చెందిన పద్మనాయక వెలమలు, రాచకొండ, దేవరకొండ రాజ్యపాలకులుగా ప్రసిద్ధులు. క్రీ॥శ॥ 1368లో ఓరుగల్లు సమీపములోని భీమవరమువద్ద జరిగిన యుద్ధములో 'ఆంధ్ర సురత్రాణ' బిరుదాంకితుడైన కమ్మ ప్రభువు ముసునూరి కాపయనాయకుడిని పద్మనాయకుడైన అనపోతానాయకుడు సంహరించిన తరువాత వెలమల ప్రభ ఓరుగల్లు, భువనగిరి, పానగల్లు, మెతుకు ప్రాంతాలకు విస్తరించింది. అలా కమ్మవారు ఆంధ్రప్రాంతానికే పరిమితమయ్యారు. రెడ్డి, కమ్మ, వెలమ, కాపుల యిండ్ల పేర్లూ, గోత్రాలూ పరిశీలిస్తే వీరంతా ఒక కుదురునుంచే ఉద్భవించి విస్తరించినట్లుగా అర్థమవుతుంది. అయితే కొన్ని ఆధారాలను బట్టి చూస్తే వీరిలో రెడ్లు బాగా ముందుగా విడివడి వుండొచ్చుననిపిస్తున్నది. కాకతీయ ప్రభువులు (వీరు కమ్మవారని దాదాపు చరిత్రకారులందరూ భావిస్తున్నారు) పద్మనాయక వెలమల పట్ల ప్రత్యేక అభిమానాన్నీ, ఆదరణనూ చూపిన కారణంగానే కాకతీయ సామ్రాజ్యానికి మూలస్తంభాల వంటి రెడ్డివీరులలో అసంతృప్తి రేకెత్తి - చివరకు అది ఆ మహాసామ్రాజ్య పతనానికెలా నాంది అయిందో చరిత్ర చదివిన వారందరికీ తెలుసు. కాకతీయ సామ్రాజ్య పతనానంతర కాలంలో వారి వారసత్వాన్ని కొనసాగించడానికి ముసునూరి వంశస్థులు చేసిన ప్రయత్నానికి వెలమల విజృంభణ కారణంగా గండిపడి తెలంగాణంలో కమ్మవారి ప్రభ అంతరించింది. అలా తెలంగాణం వెలమ పాలకుల వశమైంది.

## రెడ్డి కులస్థులు

రెడ్డి శబ్దావిర్భావాన్ని గురించి ఈ గ్రంథంలో వేరొక సందర్భంలో యిదివరకే వివరించాను. అలాగే రెడ్డి కులస్థులకు మిగిలిన శూద్ర కులాలతో వున్న సంబంధ బాంధవ్యాలను కూడా 'తెలుగు చోదులు - వారి బంధువర్గం' అన్న 9వ అనుబంధంలో క్లుప్తంగా వివరించాను.

ఇక్కడ రెడ్డి కులంలోని శాఖల గురించి కొంత చెప్పుకోవాలి. వడ్లలో ఎన్ని రకాలున్నాయో రెడ్లలో అన్ని రకాలున్నాయంటారు. అయితే ముఖ్యమైన శాఖలు 14 మాత్రమేనంటారు. విఖ్యాత చరిత్రకారులు చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు "కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము"లో రెడ్లలోని శాఖా భేదాల్ని వివరించే ఒక పద్యాన్ని పేర్కొన్నారు. 16వ శతాబ్దికి చెందిన ఆర్వీటి బుక్కభూపాలుని ఆస్థానంలో దేవళ్రాజు అనే ఒక భట్టురాజు చెప్పినట్లుగా చెప్పబడిందీ పద్యం -

(ఈ ఆరవీటి బుక్క భూపతి సాళువ నరసింహరాయల సేనాని. ఆరవీడును స్వతంత్రంగా పాలించిన పిన్నశౌరి కుమారుడు. కృష్ణ దేవరాయలు అల్లుడు (అళియ) రామరాయలుకు బుక్కరాజు ముత్తాత. బుక్కరాజు కుమారుడు రామరాజు. అతని కుమారుడు శ్రీరంగ రాజు. ఆయన మూడవ కుమారుడు (అళియ) రామరాయలు. క్రీ.శ. 1565 లో జరిగిన తళ్లికోట యుద్ధంలో రామరాజు మరణించే నాటికి ఆయనకు 87 సం॥ల వయస్సు వుంటుందని చరిత్రకారులు తేల్చారు. అంటే క్రీ.శ. 1478 ప్రాంతాలలో జన్మించిన అళియ రామరాజు ముత్తాత కనుక సుమారు క్రీ.శ. 1418 ప్రాంతాలలో జన్మించాడనుకున్నా బుక్కరాజు క్రీ.శ. 1509లో కృష్ణదేవరాయల పట్టాభిషేక మహోత్సవం జరిగే వరకు ఆరవీడు పాలకునిగానే వుండగలగడం విశేషం.)

"పంటాన్వయమునను పదునాలు శాఖలఁ
జక్కగా వివరింతు సత్యమరసి
మోటాటి వెల్నాటి మొరసు నేరదయోధ్య
పంట పొంగలినాటి పాకనాటి
భూమంచి కుంచేటి మున్నూటి గోటేటి
యొనర గండికోట యోరుగంటి
యన బరగుచునుండు నాంధ్రావనీస్థలి
గౌరవాధిష్ఠిత కాఁపుకులము

పంటపదునాల్గు కులములంచంట జగతిఁ
దరతరంబుల నుండియు వరలెడి నుడి
వీనికుపజాతులున్నవి వివిధములుగ
భుజబలాటోప పిన్నమ బుక్కభూప"

ఈ పద్యంలో కూడా రెడ్లను కాపులనే సంబోధించాడు కవి. (తెనాలి రామకృష్ణ కవి కూడా రెడ్లను కాపులనే ప్రస్తావించాడు. కడప, నెల్లూరు జిల్లాలలోనూ, మరికొన్ని ప్రాంతాలలోనూ రెడ్డి కులస్థులను నేటికీ కాపులనే పిలుస్తారు.)

ఈ పద్యాన్ని బట్టి క్రీ॥శ॥ 16వ శతాబ్దంనాటికి రెడ్డికులంలో 14 శాఖలుండేవనీ; రెడ్డి కులాన్ని 'పంటాన్వయము' అనీ; దానిలోని శాఖలను 'పంట పదునాల్గు కులములు' (పంట మొదలైన 14 శాఖలు) అనీ ప్రయోగించదాన్ని బట్టి ఆ 14 శాఖలలో పంటరెడ్లు ప్రముఖులనీ అర్థం చేసుకోవచ్చు. రెడ్లలోని 14 శాఖలు యివి : 1) మోటాటి, 2) వెలనాటి, 3) మొరసు, 4) నేరడి, 5) అయోధ్య, 6) గండికోట, 7) ఓరుగంటి, 8) పంట, 9) పొంగలినాటి, 10) పాకనాటి, 11) భూమంచి, 12) కుంచేటి, 13) మున్నూటి, 14) గోటేటి

వీరిలో పంట రెడ్లు చాల ప్రముఖులు. మొదట అద్దంకి రాజధానిగా, ఆ తరువాత కొండవీడు రాజధానిగా పరిపాలించిన ప్రోలయ వేమారెడ్డి (క్రీ॥శ॥ 1326-1350), అన పోతారెడ్డి (క్రీ॥శ॥ 1350-1370), అన వేమారెడ్డి (క్రీ॥శ॥ 1370-1385), కుమారగిరి రెడ్డి (క్రీ॥శ॥ 1385-1407), ప్రస్తుతపు ఒరిస్సాలోని కటకము వరకు దిగ్విజయ యాత్రచేసిన మహావీరుడు, కుమారగిరి రెడ్డి బావ అయిన కాటయ వేమా రెడ్డి (1385-1414); పెదకోమటి వేమారెడ్డి (1402-1420) వగైరా ప్రముఖ రెడ్డి రాజులందరూ పంటరెడ్డి శాఖకు చెందినవారే.

పలనాటి యుద్ధంలో శైవులకు నేతృత్వం వహించి నలగామ రాజు వగైరాలకు అండగా నిలిచి పోరాడిన నాయకురాలు నాగమ్మ పంటరెడ్డి వారి ఆడపడుచే. శ్రీనాథ మహాకవి తన 'పలనాటి వీర చరిత్ర' ద్విపద కావ్యంలో యిలా వ్రాశాడు -

"పంటరెడ్డి వారి పడతియు మరియు
వీర జగ్గారెడ్డి వేడుక పుత్రి
మేకపోతుల రెడ్డి మేనకోడలును
ఆరవెల్లి వారింటి యనుగు కోడలును
నాగమ్మయను ఒక నారీ లలామ."

('పలనాటి వీర చరిత్ర' 912-916 పంక్తులు, పేజీ 34, ప్రచురణ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్)

పంట రెడ్లను దేవేటి, దేసటి, దేష్టి వారని కూడా అంటారు.

శ్రీనాథ మహాకవి రచించిన 'కాశీ ఖండము' అనే కావ్య కృతిభర్త వీరభద్రారెడ్డి, ఆయన అన్న వేమారెడ్డి దేసటి శాఖకు చెందిన వారే!

**శ్రీ మద్దేసటి వంశ శి**
**భా మణి ! మూర్ధాభిషిక్త కంఠీరవ ! సు**
**త్రామ నిభ వైభవోన్నత !**
**భామా పాంచాల వీరభద్ర నృపాలా! ('కాశీ ఖండము' 3-1)**

అలా 'సుత్రాముని (ఇంద్రుని)తో సరిపోల్చదగు వైభవోన్నతి కలిగినవాడా!' అంటూ వీరభద్రా రెడ్డిని కీర్తించాడు శ్రీనాథ మహాకవి. అదే కావ్యంలో 'బంధులోక పారిజాత! పంటవంశ పావనా!' అనే సంబోధన కూడా వుంది.(2-167)

'పాండురంగ మాహాత్మ్యము కావ్యం'లో దొంగల చేతిలో గాయపడి మృత్యు ముఖంలో వున్న నిగమ శర్మకు సకల సేవలూ చేసి, ప్రాణాలు కాపాడిన యువకుడు పంటరెడ్డి శాఖకు చెందిన వాడే! అతడిని కవి (3-55) పద్యంలో 'కాఁపు కొడుకు' అంటాడు. (రెడ్డి కులస్థులను రాష్ట్రంలోని చాల ప్రాంతాలలో నేటికీ కాఁపు లనే అంటారు.) (3-56) పద్యంలో సైరిక ప్రభుండు (రైతుపెద్ద) అంటాడతడిని కవి. (3-58) పద్యంలో కవి అతడిని జానపదాగ్రగామి (గ్రామీణుల నేత) అంటాడు. (3-60) పద్యంలో వారి యింటిని 'శూద్ర వసతి' అని, ఆ తరువాత పద్యం (3-61)లో 'తెలికన్నుల వానిఁ బిసాళి బాపనిం బంటది గోరుఁ జారు కుచ పంజర కీరముగా రచింపఁగన్' అంటాడు. (ఆ పంటరెడ్డి వారి కోడలు తెలి కన్నుల వాడు, వంచకుడూనైన ఆ బ్రాహ్మణుడిని తన అందమైన స్తనద్వయమనే పంజరంలో చిలుకలా బంధించాలని తలపోసిందట). (3-68) పద్యంలో 'ఎవ్వడా రెడ్డి యింటికి నెగ్గు చాలఁజేయు' అంటాడు కవి. (చేసిన మేలు మరచి, ఆ రెడ్డి యింటికి అపకారం చేసిన వాడు అంటూ). ఈ పద్య పాదానికి, 'నెవ్వడా దేసటింటికి నెగ్గు' అనే పాఠాంతరం కూడా వుంది. (3-72) పద్యంలో 'ఆ కాఁపుసతిని ఎత్తుకొని పోవ నందందు నెదరువేచె' అంటాడు కవి. (ఆమెను లేవఁదీసుకుని పోయే అవకాశం కోసం అతడు ఎదురు చూశాడట). (3-75) పద్యంలో కవి 'ఎద్దెతనపుఁగ్రైసేతల రద్దులు నడచిరి పురస్సరద్భార్యముగా' (తమ తమ భార్యలు వెంటరాగా రెడ్లు మోటుతనపు అలంకారాలతో జాతరకు తరలి వెళ్లారట). అంటూ అజప్రధానమైన (మేకలను బలియిచ్చే) ఆ మహోత్సవాన్ని వర్ణించాడు. 'రద్ది' అనే పదం రెడ్డి పదానికి సమానార్థకమే.

తరువాత కాలంలో రెడ్లలో చాల శాఖా భేదాలు ఏర్పడ్డాయి. కడప జిల్లా పెడకల్లు ప్రాంతాన్నుంచి రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు విస్తరించిన ఒక శాఖ వారిని పెడకంటి రెడ్లని పిలుస్తున్నారు. వీరిలో ఓ వింత ఆచారముంది. పెడకంటి రెడ్ల భార్యలు తాళి బొట్టు ధరించరు. పెండ్లి సందర్భంగా వరుడు వధువు మెడలో నూలు పోగులు మాత్రమే కడతాడు. పదహారు రోజుల పండుగ అనంతరం నూతన వధువు ఆ నూలు పోగుల స్థానంలో బంగారు నాను తాడు మాత్రం ధరిస్తుంది. ఈ శాఖ రెడ్ల స్త్రీలు తాళిబొట్టు ధరించక పోవడానికి చిత్రమైన కారణముందట. అయోధ్యనేలిన రాముడు భార్యను అడవులకు పంపిన అనంతరం అశ్వమేధ యాగం చేశాడు. అప్పుడు పూర్తిగా బంగారంతో స్వర్ణ సీత విగ్రహమొకటి తయారు చేయించాడట. రాముడి ఖజానాలో అందుకు చాలినంత బంగారం లేని కారణంగా బంగారం కోసం రాముడు ప్రజా సభలో తులాభారం తూగాడట. అప్పుడు ఈ పెడకంటి శాఖ వారి స్త్రీలు తమ వద్ద వున్న బంగారమంతా వలిచి

యిచ్చినా త్రాసు మ్రొగ్గని కారణంగా, తమ మెడలలోని తాళిబొట్టులను కూడా ఆ పవిత్ర కార్యం కోసం త్యజించారట. దాంతో త్రాసు మ్రొగ్గు చూపిందట. అందుకే నాటి నుండి నేటి వరకు ఈ శాఖ రెడ్ల స్త్రీలు తాళిబొట్టు ధరించరట. పెడకంటి రెడ్ల వధువును ఇతర శాఖలకు చెందిన వరుడు వివాహమాడితే ఆమె మామూలుగా తాళిబొట్టు ధరిస్తుంది. కాని ఏ శాఖకు చెందిన వధువునైనా పెడకంటి శాఖ వరుడు వివాహమాడితే ఆమె మాత్రం తాళిబొట్టు ధరించదు. పిచ్చిగుంటల వారు చెప్పే యీ వింత కథ విశ్వసనీయంగా కనుపించకున్నప్పటికీ, ఆ ఆచారం వీరిలో నేటికీ కొనసాగుతూండడం మాత్రం వాస్తవం. ప్రధాన శాఖలు పద్నాలుగింటిలో 'పెడకంటి' శాఖ లేనందున, యిది 'అయోధ్య' శాఖకు ఉపశాఖ అయి వుండే అవకాశం వుంది.

ప్రసిద్ధి చెందిన కాకతీయ సేనాని గోన గన్నారెడ్డి వంశస్థులమని చెప్పుకొనే ఓరుగంటి శాఖ రెడ్లు తెనాలి తాలూకా పెదరావూరు, దుండిపాలెం గ్రామాలలోనూ, బాపట్ల తాలూకా కర్లపాలెం పరిసర గ్రామాలలోనూ పెద్ద సంఖ్యలో వున్నారు. వీరి ఆర్థిక వెనుకబాటుతనం కారణంగా ఈ ప్రాంతంలో అధిక సంఖ్యాకులైన మోటాటి రెడ్లు వీరితో వివాహ సంబంధాలు పెట్టుకొనడానికి ఇష్టపడే వారు కారు. ఇప్పుడిప్పుడే విద్యా పరంగానూ, ఆర్థికంగానూ పుంజుకుంటున్న ఈ ప్రాంతపు ఓరుగంటి రెడ్లతో మిగిలిన శాఖల రెడ్లు బాంధవ్యం కలుపు కుంటున్నారు.

ఉత్తరాంధ్ర జిల్లాలలోని 'రెడ్డిక' కులస్థులతో కూడా మిగిలిన రెడ్డి శాఖల వారు ఇదే వెనుకబాటు తనం కారణంగా బాంధవ్యమేర్పరచుకొనరు. ఈ కారణంగా 'రెడ్డిక' కులస్థులు వెనుకబడిన కులంగానే పరిగణింపబడుతున్నారు.

తూర్పు గోదావరి జిల్లా అనపర్తి ప్రాంతంలో భూమంచి రెడ్లు, ఊలపల్లి గ్రామంలో మోటాటి రెడ్లు నాకు తారసపడ్డారు.

పెడకంటి, పాకనాటి, మోటాటి శాఖలవారు కడప జిల్లాలో కూడా పెద్ద సంఖ్యలో వున్నారట. పాకనాటి శాఖ వారిలో యిటీవలి కాలం వరకు కుడిపైట ఆచారంగా వుండేదట. ఇంకా రాయలం, చిన్నకొడిద, పెద్దకొడిద మొదలైన ఉపశాఖలు ఎన్నో వున్నాయి. మన రాష్ట్ర ప్రస్తుత ముఖ్యమంత్రి వై.యస్. రాజశేఖర రెడ్డి చిన్న కొడిద శాఖకు చెందిన వారట.

రెడ్డి అనే పదానికి గ్రామపాలకుడు *(VillageHeadman)* అని అర్థం. 'రెడ్డిగము' అంటే గ్రామ పాలకుడు రచ్చబండ మీద విచారణ జరిపేటప్పుడు కూర్చునే ఒక విధము *(Sitting Posture)*. ఒక కాలిని ముడుచుకొని దానిపై ముడిచిన మరియొక కాలుయొక్క పాదము మోపి, ఆ కాలిని, వీపును అంగ వస్త్రముతో గట్టిగా బిగించి కట్టుకుని కూర్చోవడాన్ని రెడ్డిగం వేసుకొనడం అంటారు. రామలింగ కవి కూడా 'పెనుబాము రెడ్డిగంబున మించి' అంటూ (ఉ.చ. 3-113) యీ పద ప్రయోగం చేశాడు.

రెడ్డి రెడ్డి రెడ్డి అనేది నాకు తారసపడిన ఓ వింత పేరు. ఇందులో మొదటి రెడ్డి శబ్దం ఆ వ్యక్తి యింటి పేరు కాగా, రెండవది ఆయన పేరును సూచించే పూర్వ నామం ; యికపోతే మూడవ రెడ్డి శబ్దం కులసూచకమైన ఉత్తర నామం.

## కళాదుడు (కంసాలి లేక అగసాలె)

'కళాదుడు' అంటే కంసాలి (అగసాలె)వాడు. ఆభరణాల తయారీకి స్వర్ణకారుడు రైతులవద్ద ముందుగా బయానాలు (అడ్వాన్సులు) తీసుకుని వారికి అగ్గముపడి (స్వాధీనపడి) ఉంటాడు కనుక అతనిని (అగ్గము + సాలె) అగసాలెవాడని అంటారు. నాడింధముడన్నా, స్వర్ణకారుడన్నా, రుక్మకారకుడన్నా అగసాలెవాడే. ఈ 'అగసాలె' పదమే తెలంగాణ ప్రాంతంలో అపభ్రంశమై 'ఔసుల' అయింది. వీరిని పంచాణులు, పంచాణపువారు అనీ అంటారు. 'పంచాణము' అంటే శిల్పము.

'పంచాణుడు' అంటే శిల్పి. 'వఁద్రంగి' అనే పదం అపభ్రంశమై 'వడ్లంగి'గా మారింది. ఆ కారణంగా తెలంగాణ ప్రాంతంలో 'వడ్లాబత్తులు', 'వడ్లోళ్లు' అనే పదాలు వాడుకలోకి వచ్చాయి.

పంచాణము - వఁద్రంగి (*Carpenter*) / కమ్మరి (*Blacksmith*) / కంచరి (కాంశ్యకారుడు) రీతికారుడు (*Brazier, one who works on brass*) / స్వర్ణకారుడు (*Gold smith*) శిల్పి (*sculptor*) - *The united five castes - C.P. Brown.* మన ప్రాంతంలో యీ వృత్తుల వారందరినీ కలిపి ప్రస్తుతం విశ్వ బ్రాహ్మణులు అని వ్యవహరిస్తున్నారు. వారికి చెందిన సమగ్ర చారిత్రక సమాచారం 'చరిత్ర చిక్కుముడి' అధ్యాయంలో చూడవచ్చు.

## ప్ల వ క న్య

'పాండురంగ మాహాత్మ్యము' కావ్యంలో నిగమ శర్మ ఓ ప్లవ కన్యతో సహజీవనం చేసి, ఆమె యందు సంతానాన్ని కంటాడు.

ప్లవకన్య అంటే మాలపడుచు. ప్లవ అంటే చండాలుడు అంటే చర్మకారుడని కొన్ని నిఘంటువులు పేర్కొన్నాయని కొందరు వ్యాఖ్యాతలు పేర్కొన్నారు.

ఈ రెంటి మధ్య వైరుధ్యమేమీ లేదని నా అభిప్రాయం. దళితులలో ప్రస్తుతం చర్మకారులుగా వున్న మాదిగ కులస్తులు ఒకప్పుడు దుర్భిక్షానికి తట్టుకొనలేక అటవీ ప్రాంతాల నుంచి జనావాసాలకు వలసవచ్చిన ఆటవికులట. (వీరు మూలంలో ప్రధానంగా నిషాదులు లేక ప్రోటో ఆస్ట్రలాయిడ్ జాతికి చెందిన వారనిపిస్తున్నది.) అప్పటికే గ్రామాలకు దూరంగా వున్న పల్లెలలో చండాల (చర్మకార) వృత్తి చేసుకుంటూ స్థిర జీవనం కలిగి వున్న మాలవారిని యిలా వలస వచ్చిన ఆటవికులు జీవనోపాధికై ఆశ్రయించగా, తమ పల్లెలకు దూరంగా మాదిగ గూడెము లేర్పరచి, హైన్యమైన తమ చర్మకార వృత్తిని వారికి అప్పగించి, తాము కొంత గౌరవప్రదమైన నూలునేత వృత్తిని స్వీకరించారట మాలవారు. మాలపోగు, మాసిపోగు, ఏసిపోగు (వేశపోగు) వగైరా మాలవారి యిండ్లపేర్లు నూలుపోగులను వడికే వారి కులవృత్తిని సూచిస్తాయి. రంపతోటి, గోవతోటి, నామతోటి (తోటి శబ్దం తొగటి యొక్క రూపాంతరం. 'తొగటి' లేక 'తొగట' అంటే తక్కువ రకం బట్టలునేసి బతికే వాడని అర్థం) వగైరా మాలవారి యిండ్లపేర్లు వారి బట్టలు నేసే వృత్తిని సూచిస్తున్నాయి. ఆంధ్ర దేశంలో 'మాల సాలె', 'నేత్కాని' (నేతకాని) అనే దళితులలోని ఉప కులాలు కూడా దీనినే సూచిస్తున్నాయి. 'ఏమైనా సాలెనేత సాలెనేతే. మాలనేత మాలనేతే' అనే సామెత మనందరికీ బాగా తెలిసిందే. అలా నేత వృత్తిలో నాణ్యమైన వస్త్రాలు నేసే సాలెవారితో పోటీపడలేక ఆ వృత్తికి స్వస్తి చెప్పి, తిరిగి చర్మకార వృత్తిని చేపట్టలేక, వ్యవసాయ కార్మికులుగానూ, చేనమాలలుగానూ (చేలకు కాపలా కాసే మాలలుగానూ) స్థిరపడ్డారు మాలవారు. అయినా యింకా కొందరు తొగటలు అనే పేరుతో చేనేత వృత్తిని కొనసాగిస్తున్నారు. మరికొందరు సాతులు అనే పేరుతో నార నుండి గోనె సంచులు నేసే వృత్తిని స్వీకరించారు. గుంటూరు జిల్లా ఫిరంగిపురం ప్రాంతంలో తొగటలను, సాతులూరు ప్రాంతంలో సాతులను మనం చూడవచ్చు. కొత్తగా చర్మకార వృత్తి స్వీకరించిన వారిని మాలవారు 'మా దిగువవారు' (అంటే సామాజిక సౌధ సోపానములలో మా కంటే క్రిందివారని) పిలవడం ప్రారంభించారు. అదే కాలక్రమేణా 'మాదిగ' అయింది. అంచేత మాల కులస్థులు కూడా ఒకప్పుడు చర్మకారవృత్తి చేసిన వారే కనుక 'ప్లవకన్య' అంటే సామాన్యార్థంలో 'మాలపడుచు' అని చెప్పుకోవచ్చు. సంస్కృతంలో 'ప్లవ' అంటే నీటిపై తేలడం, యీదులాడడం; వరదలో నది పొంగడాన్ని కూడా 'ప్లవ'మంటారు. చిన్నపడవనీ, బల్లకట్టునూ కూడా 'ప్లవ'మంటారు. కప్పనీ, చేపలు పట్టే వలనూ, కారండవమనే బాతు తరహా నీటి పక్షినీ కూడా 'ప్లవ'

అనే పేరుతోనే పిలువడాన్ని బట్టి ప్లవ అనే కులం వారు మొదట్లో పడవలు నడిపే వృత్తివారై వుంటారు.

ప్రాచీన భారతీయ సమాజంలో చండాల వృత్తి (చనిపోయిన పశువుల చర్మములను ఒలిచే వృత్తి)ని చాల నీచమైన వృత్తిగా భావించేవారు. ఒక శూద్రునికి బ్రాహ్మణ స్త్రీ ద్వారా కలిగిన సంతానం కూడా చండాలురుగా పరిగణింపబడేవారు. సమాజంలో విలోమ వివాహాలు జరుగకుండా నిరోధించడానికి ఈ కఠోరమైన కట్టుబాటు చేయబడింది. (నిమ్నవర్ణ పురుషుడికీ, అగ్రవర్ణ స్త్రీకీ జరిగే వివాహాన్ని విలోమ వివాహం అంటారు.) మహాముని వసిష్ఠుడు చండాల కన్యయైన అరుంధతిని వివాహమాడడం, దుర్గకు 'చండాలికా' అని మరొక పేరుండడం గమనించదగ్గ విశేషాలు.

అరుంధతి దేవహూతి, కర్దమ ప్రజాపతుల కుమార్తె. ఈమెను ఆరంజోతి అనీ అంటారు. ఈమె మహా పతివ్రత. ఈమె నక్షత్రంగా మారిందట ! వివాహ సమయాలలో వధూవరులకు ఉత్తమ దాంపత్య నిష్ఠ కోసం యీ నక్షత్రాన్ని చూపుతారు.

స్వాయంభువ మనువు కుమార్తె అయిన దేవహూతి కపిల మహర్షికి కూడా తల్లి. కర్దముడు బ్రహ్మ ఛాయ (నీడ) నుంచి పుట్టాడని కొన్ని గ్రంథాలు తెలుపుతున్నాయి. కర్దమము అంటే బురద, మురికి అనే అర్థాలతో పాటు 'మాంసం' అనే అర్థమూ వుంది. బహుశా ఆ కర్దమ ప్రజాపతి మాంస విక్రయం చేసేవాడేమో ! అరుంధతి సోదరుడు కపిల మహర్షి. ఈయన భారతీయ షడ్దర్శనాలలోనిదైన సాంఖ్య దర్శనాన్ని ప్రతిపాదించినవాడు. ఈయన 'చండాల' అని పిలువబడినట్లు ఎక్కడా లేదు కాని, అరుంధతిని మాత్రం చండాల కన్య అంటారు. "మహాముని వసిష్ఠుడేనాడో మాదిగ కన్యను పెండ్లియాడెరా.. ఎవరిదీ ఎక్కువ కులము ?.. ఎవరిదీ తక్కువ కులము ? .." అంటూ మన జానపదుల పాటలు కూడా వున్నాయి. మాదిగ వారు తమను తాము అరుంధతీయులమని చెప్పకుంటారు. మాదిగ పల్లెలను 'అరుంధతీయ వాడ' అని కూడా పిలవడం పరిపాటి. మరి దుర్గకూ, అరుంధతికీ 'చండాలిక' అని పేరు రావడానికి కారణమేమిటో !

మాల కులస్తులు ఒకప్పుడు చండాల వృత్తి చేశారనడానికెన్నో ఉదాహరణలున్నాయి. ప్రజాకవి వేమన మాంసాహారులైన హిందూ అగ్రవర్ణాలకు యీ క్రింది పద్యంలో ఎలాంటి చురక అంటించాడో చూడండి.

"కసవునేరి తినెడు పసరముఁ దినువాని
మాల యండ్రు గాని మహిని జనులు
పంది కోడి దిన్న ప్రాజ్ఞులటందురా?
విశ్వదాభిరామ వినురవేమ.

శుభ్రమైన గడ్డిపరకలను మాత్రమే ఏరేరి తినే పశువును చంపితినే మాలవాడిని ఏదో కాని ఆహారాన్ని తింటున్నాడని విమర్శించేవారు పంది, కోడి మాంసాల్ని నిరభ్యంతరంగా వండుకు తింటారు. కాని పందుల, కోళ్ల ఆహారం ఏమిటి? కనుక వాటిని తినే వారు (అగ్రవర్ణాలలోని మాంసాహారులు) ఎంతటి గొప్పవాళ్లు? - ఈ పద్యాన్ని బట్టి వేమన కాలం వరకు కూడా మాలవారు చండాల వృత్తినే అవలంబించారని అర్థమవుతుంది. వృద్ధ, అనుత్పాదక పశువులను చంపి వాటి చర్మాలను వలిచి ఆ మాంసం తాము తినడానికి ఉపయోగించుకొనే వారు చండాలురు. మాల అనే శబ్దం 'మైల' (రక్తం) నుండి వచ్చింది. సంతలలోకూడా నేడున్నట్లు ఒకప్పుడు మడి సంత (*Vegetable Shandy*), మైల సంత (*Meat Shandy*) అని వేర్వేరుగా వుండేవని వినుకొండ వల్లభరాయని 'క్రీడాభిరామం' పేర్కొంటున్నది. జంతువధచేసి ఆ మాంసాన్ని

విక్రయించేవారు మాలవారని పిలువబడ్డారు.

'శబ్దరత్నాకరము', సి.పి. బ్రౌన్ - ఆంధ్రాంగ్ల నిఘంటువు 'చండాలుడు' అంటే మాలవాడు అనే పేర్కొనడాన్ని బట్టి యిటీవలి కాలంవరకు మాలవారి వృత్తి చండాల వృత్తేనని అర్థమవుతుంది. చండాలురు (*Out castes or Pariahs*) మృత పశువుల చర్మం ఒలిచి, దాని మాంసం వండుకు తినేవారు.

**చర్మకార వృత్తికి స్వస్తి చెప్పి నేతను వృత్తిగా స్వీకరించిన నాటి నుండి మాలవారికి తాము వదలి వేసిన వృత్తి పట్ల సహజంగానే చిన్నచూపు ఏర్పడి వుంటుంది. అందుకే 'తోలు' అనే శబ్దాన్ని ఉచ్చరించడానికి కూడా వారు యిష్టపడే వారు కాదట. మాల వారిలో ఒకప్పుడు 'బేతవోలు' అనే యింటి పేరుండేది. అది జన వ్యవహారంలో 'బేతోలు' అయింది. దీనిలో తోలు శబ్దం వుండడం యిష్టపడని మాలవారు తమ యింటిపేరును 'బేతాళ'గా మార్చుకున్నారు.**

'అంటరాని జాతుల చరిత్ర' రచయిత బొనిగల రామారావు గారి వంటి కొందరు విమర్శకులు పేర్కొన్నట్లు 'మాల' శబ్దం 'మల్ల' శబ్దాన్నుంచి ఉద్భవించిందనడం సబబుగా లేదు. సి.పి. బ్రౌన్ తన నిఘంటువులో పేర్కొనినట్లు ఆ శబ్దం 'మయిల' యొక్క రూపాంతరమేనని నేనూ భావిస్తున్నాను. మల్ల జాతి వారు మల్ల దేశము (నేటి పాకిస్థాన్‌లోని ముల్తాన్ ప్రాంతం) నకు చెందిన వారు. రామాయణం ప్రకారం రాముడు లక్ష్మణుడి కుమారుడు చంద్రకేతును మల్ల దేశానికి రాజును చేస్తాడు. మహా భారతం ప్రకారం ముల్తాన్ రాజధానిగా వున్న మల్ల దేశాన్ని మాళవ అని కూడా పిలిచేవారు. (మ. భా. 2-32-7) (ఉజ్జయిని రాజధానిగా కలిగి అవంతీ రాజ్యమనే పేరిట కూడా ప్రసిద్ధమైన మరొక మాళవ రాజ్యం అందరూ ఎరిగినదే !) మల్ల జాతి వారిని జయించినందునే కృష్ణుడికీ, శివుడికీ 'మల్లారి' అనే నామాంతరాలేర్పడ్డాయి. మల్ల జాతి వారి గురించి మరిన్ని వివరాలకు ఇదే గ్రంథంలో 'ఘటికాచల మాహాత్మ్యము' పై వ్రాసిన వ్యాఖ్య యొక్క పీఠిక చూడండి. మల్ల జాతి వారు ముల్తాన్ నుండి విజృంభించి పశ్చిమోత్తర భారతదేశంలోనూ, దక్షిణ భారతదేశంలోని ఆంధ్ర ప్రాంతం వరకూ దాడులు చేసిన ఆయుధోపజీవులు కాగా, మాల కులస్థులు ఆది ద్రావిడులు. వారిలో కొందరు అతి ప్రాచీనులైన నిగ్రిటో (*Negrito*) సంతతికి చెందిన వారని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. వారు ఆర్య సంస్కృతీ విజృంభణలో పరాజితులైన దాస, దస్యుల సంతతి వారు. అనంతరం హిందూ కుల వ్యవస్థలో నిమ్న కులంగా చేర్చుకొనబడి దళితులుగా పరిగణింప బడుతున్న వారు. మల్లజాతి వారు ముల్తాను నుంచి విజృంభించి అపరాంత, కొంకణ ప్రాంతాలను, ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలను దాడి చేసి దోచుకున్న అతి క్రూర యుద్ధోన్మాదులు. ముల్తానుకు చెందిన మల్లజాతి వారికి క్రీస్తు పూర్వపు చరిత్ర లేదు. మాల వారు ఆదిమ జాతి వారు (*Aborigines*). వేల ఏళ్లుగా సామాజిక, ఆర్థిక దోపిడీకి గురైన చరిత్ర వారిది. అలా మల్ల జాతి వారికీ - మాల కులస్థులకూ ఎట్టి సంబంధమూ లేదు.

సి.వి. వైద్య వ్రాసిన 'ఎపిక్ ఇండియా' గ్రంథం యొక్క రెండవ అనుబంధంలో ఇతిహాస యుగంలోని ఉత్తర భారత దేశపు జాతులను పేర్కొంటూ (50) మల్ల రాష్ట్రులు (65) మల్ల జాతి వారిని వేర్వేరుగా పేర్కొన్నారు. అయితే నాటికే వున్నట్టి (8) మాలాః అనే మరో జాతిని విస్పష్టంగా పేర్కొన్నారు. నాటి దక్షిణ భారత జాతులలో కూడా (33) మాల వారిని 'మాలవాస్' లేక 'మాలవార్' అని పేర్కొన్నాడు. వీరిలో మల్ల రాష్ట్రులు గౌతమ బుద్ధుని కాలం నాటి (ప్రస్తుతపు నేపాల్‌లోని) మల్ల గణ రాజ్యానికి చెందిన వారు. నాటి మల్ల రాష్ట్రుల వైభవాన్ని పునరుద్ధరించి అరిమల్లదేవ, యక్ష మల్ల వగైరాలు, అనంతరం వారి వారసులు క్రీ.శ. 13 వ శతాబ్దం నుంచి క్రీ. శ. 1768 వరకు నేపాల్‌ని నిరాఘాటంగా పాలించారు. ఇక మల్లజాతి వారు ముల్తాన్ రాజధానిగా వాయవ్య భారత దేశాన్నుంచి విజృంభించి ఆంధ్ర ప్రాంతం వరకు దాడులు చేసిన

యుద్ధ పిపాసులు. ఇతిహాస కాలం నాటికే ఉత్తర భారత దేశంలో మాలాః అనీ, దక్షిణ భారత దేశంలో 'మాలవార్' లేక 'మాలవాస్' అనే పేర్లతో పేర్కొన బడిన మాలవారు నిగ్రిటో, ఆది ద్రావిడ జాతులకు చెందిన నేటి దళితులు.

ఇకపోతే, అనాదిగా మాలవారి సామాజిక, ఆర్థిక స్థితిగతులు కదు దయనీయంగా వుండేవి. ఏ దేశంలోనైనా ఒక వర్గం ప్రజల ఆర్థిక స్థితిని నిర్ధారణ చేయడానికి ఆ వర్గం వారు ఏ మేరకు పాలు, పాల ఉత్పత్తులు *(Dairy Products)* వాడతారనే దాన్ని కొలబద్దగా తీసుకుంటారు ఆధునిక ఆర్థిక వేత్తలు. వేమన ఏనాడో 'మారులేని కూడు మాల కూడు' అన్నాడు. మారు లేక మోరు అంటే మజ్జిగ. అంటే వేమన కాలం నాటికి మజ్జిగకు కూడా నోచుకోని జీవితాలన్న మాట వారివి. బ్రిటిష్ ఇండియాలో క్రైస్తవ మిషనరీల కార్యకలాపాల కారణంగా వారు రాజకీయ, ఆర్థిక రంగాలలో కొంత మేరకు పుంజుకున్నా, సామాజికంగా వారి స్థితి 'ఎక్కడ వేసిన గొంగడి అక్కడే' అన్న చందంగా వుండేది. నాటి వారి దయనీయమైన స్థితిగతులను 'మాల పల్లి' (సంగ విజయం) అనే తన నవలలో కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు కళ్లకు కట్టినట్లుగా వర్ణించారు. మహా కవి గురజాడ అప్పారావు పంతులు గారు –

**"మంచి చెడ్డలు ఎంచి చూడగ - మనుజులందున రెండె కులములు**

**మంచియన్నది మాలయైతే - మాల నే నౌతాను" అంటూ దళితుల పక్షం వహించారు.**

హిందీలో నిర్మించిన 'అఛూత్ కన్యా', తెలుగులో నిర్మించిన 'మాలపిల్ల' అనే సందేశాత్మక చలన చిత్రాలు అప్పట్లో విప్లవాత్మకమైనవి. అప్పట్లో అంటరానితనాన్ని రూపు మాపే కృషి జాతీయోద్యమంలో భాగంగా ఉధృతంగా సాగింది. భారతీయ సమాజంలోని అట్టడుగువారైన దళితులు హిందూ ఆలయాలలో ప్రవేశానికి కూడా నోచుకునే వారు కారు. తమిళనాడులోని శ్రీరంగంలో దళితుడైన కారణంగా ఆలయ ప్రవేశం చేయలేక రంగనాధుని ఆలయ గాలిగోపురాన్ని దూరాన్నుంచే చూసి తృప్తిపడి, తన్మయుడైన గొప్ప విష్ణు భక్తుడు తిరుప్పాణి ఆళ్వార్ కథ మనమెరిగినదే కదా ! జాతీయోద్యమంలో భాగంగా కాంగ్రెస్ వాదులు అంటరానితనం నిర్మూలనకూ, దళితుల ఆలయ ప్రవేశాలకూ ఉద్యమించగా, కమ్యూనిస్టులు మరో అడుగు ముందుకేసి దళితుల సామాజిక వెనుకబాటుకు కారణం వారి ఆర్థిక దుస్థితేనని చాటి దాని నిర్మూలనకై వారిని సంఘటిత పరచి, హక్కుల కోసం, భూమి కోసం, భుక్తి కోసం తాము చేపట్టిన మహత్తర సామాజిక, ఆర్థిక పోరాటాలలో వారిని చైతన్యవంతులను చేశారు.

చట్ట సభలలోనూ, విద్య – ఉద్యోగాలలోనూ షెడ్యూల్డ్ కులాలుగా రిజర్వేషన్లు, విద్యార్థి వసతి గృహాలలో ఉచిత భోజనం, వసతి, ఉపకారవేతనాలు వగైరాలు యివ్వబడుతూన్న కారణంగా స్వతంత్ర భారత దేశంలో దళితుల సామాజిక, ఆర్థిక, రాజకీయ స్థితి గతులు క్రమంగా మెరుగు పడుతూ వస్తున్నాయి.

ఆ దళితులలోనూ మాదిగలు, దక్కుల (దక్కలి) వారు, కొమ్ముల వారు, జోగులవారు, పంబల వారు, చిందులవారు, వీరముష్టివారు, ఆసాదివారు, బైండ్లవారు, రెల్లి కులస్థులు వగైరా మరింత అణగారిన కులాల వారు తమ స్థితి గతుల మెరుగుదల కోసం రిజర్వేషన్లలో వర్గీకరణ కొరకు ఇటీవల ఉద్యమిస్తున్నారు.
మన అరవై సంవత్సరాలలో శార్వరి, శుభకృత్తు సంవత్సరాల నదుమ వచ్చేది 'ప్లవ'నామ సంవత్సరమే.

# అనుబంధము - 9

## తెలుగు చోడులు - వారి బంధు వర్గం

తెనాలి రామకృష్ణ కవి యొక్క 'పాండురంగ మాహాత్మ్యము'ను కృతినందుకున్న విరూరి వేదాద్రి మంత్రి పొత్తపినాటి తెలుగుచోడ ప్రభువైన పెద్ద సంగభూపాలుని వద్ద వ్రాయసకానిగా పనిచేసే వాడు. తెనాలి రామకృష్ణకవికి బద్ధవ్యతిరేకియైన రామరాజ భూషణుడు అనబడిన భట్టుమూర్తి వ్రాసిన 'వసుచరిత్ర' కృతినందుకొన్న ఒంటికంటి తిరుమల రాయలు స్వయంగా శ్రీకృష్ణదేవరాయలు రెండవ అల్లుడు. ఆయన తెలుగు చోడుల బంధువర్గములోని చాళుక్యాన్వయుడైన ఆరవీటి వంశస్థుడు. తెనాలి రామకృష్ణుని కాలనిర్ణయానికి ఆధారభూతునిగా మనం భావించిన కొండ్రాజు వేంకటాద్రి ఒరయూరు పురాధీశ్వరుడైన సూర్యవంశపు తెలుగుచోడ రాజు. ఈయన 'రెట్టమత శాస్త్రము', 'కామందకము' అనే గ్రంధాలకు కృతిభర్త. తెనాలి రామకృష్ణుని పెద్ద తమ్ముడు అన్నయ్య కవి వ్రాసిన 'సుదక్షిణా పరిణయ' కృతిభర్త పులిజాల సోమామాత్యుడు క్రీ.శ. 1560 ప్రాంతాలలో పెనుకొండ, బాదాలి పరిసరాల పాలకుడైన కోనేరు రామరాజు వద్ద మంత్రి. ఈ రామరాజు ఆరవీటివారి బంధువర్గంలోని చాళుక్యాన్వయుడు. (అళియ రామరాయలకు స్వయానా పెదతండ్రి మనుమడి కొడుకు) విరూరి వేదాద్రికి గురువైన కందాళం అప్పలాచార్యులుకు క్రీ.శ. 1542లో భూదానమిచ్చిన పెమ్మసాని అర తిమ్మానాయుడు శ్రీకృష్ణదేవరాయల బంధువర్గంలోనివాడు. ఇతడు గండికోటను పాలించిన కమ్మ ప్రభువు. అలా తెనాలి రామకృష్ణకవి చరిత్ర ఏదో ఒక విధంగా తెలుగు చోడులు, వారి బంధువర్గంతో ముడిపడి వుంది. రామకృష్ణకవి ఏ కాలానికి చెందిన వాడు? ఆయన అసలు శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకడా - కాదా? ఈ సమస్యలన్నీ 'చరిత్ర చిక్కుముడి' అధ్యాయంలో

మనం వివరంగా పరిశీలించాం. ఈ ప్రత్యేక అనుబంధంలో తెలుగు చోదుల్ని గురించీ, వారి బంధువర్గమైన చాళుక్యాన్వయులు, దుర్జయాన్వయులు, హైహయాన్వయులు, కాకతీయులు వగైరాల మూలాలను గురించి కొంత తెలుసుకుందాం. పనిలో పనిగా తెనాలి రామకృష్ణునికి అత్యంత ఆప్తుడైన శ్రీకృష్ణదేవరాయల వంశం యొక్క మూలాల్ని కూడా విచారిద్దాం. ముందుగా తెలుగు చోదుల ఆవిర్భావం ఎలా జరిగిందో తెలుసుకుందాం.

## క రి కా ల చో ళు డు

క్రీ.శ. 100 నుండి 250 ప్రాంతం వరకు తమిళ దేశంలోని ఒరయూరు రాజధానిగా ప్రాచీన చోళులు పాలించారు. వీరిలో కరికాల చోళుడు అత్యంత ప్రసిద్ధుడు. తన రాజ్యంపైకి చేర, పాండ్య రాజ్యాలు కలిసి దండెత్తి వచ్చినా వారిరువురినీ యాయన సంపూర్ణంగా ఓడించాడట. సింహళంపై దండెత్తి ఆక్రమించాడట. కావేరీ నదికి ఆనకట్ట నిర్మించి తమిళ దేశంలో కరవు నివారించి అన్నదాతలకు ఆప్తబంధువయ్యాడట. ఈ ఆనకట్ట నిర్మాణంలో సింహళం నుండి తేబడిన యుద్ధఖైదీలను కూలీలుగా వాడాడట. కావేరీ నది బంగాళాఖాతంలో కలిసే చోట 'పూంపుహార్' అనే ప్రసిద్ధ రేవు పట్టణాన్ని నిర్మించాడట. రాజ్యమంతా పంటకాలువలు త్రవ్వించాడట. వీటన్నిటి కారణంగా ఆయన పాలనాకాలంలో కరవు కాటకాల్లేకుండా దేశం సుభిక్షంగా వుందట. వర్తక, వాణిజ్యాలు విపరీతంగా పెరిగి గణనీయమైన ఆర్థికాభివృద్ధి జరిగిందట. ఆయన రాజధాని ఉరైయూరు (వరయూరు). ప్రాచీన కాలం నుంచీ యిది పట్టుచీరలకు, జరీ నేతచీరలకూ ప్రసిద్ధి.

## న వీ న చో ళు లు

అనంతరం కొన్ని శతాబ్దాలపాటు చోళులు ప్రాభవం కోల్పోయి వారికీ వీరికీ సామంతులుగా వుండేవారు. క్రీ.శ. 9వ శతాబ్ది మధ్యలో విజయాలయుడనే చోళరాజు ఉరైయూర్ ప్రాంతంలో పల్లవులకు సామంతుడిగా వుండి, పాండ్య - పల్లవ రాజ్యాల మధ్య నిరంతరం సాగిన ఆధిపత్య పోరును అవకాశంగా తీసుకుని తంజావూరునూ, కావేరీ నది పరీవాహక ప్రాంతాల్నీ ఆక్రమించి తంజావూరు రాజధానిగా నవీన చోళ రాజ్యాన్నేర్పరచాడు. ప్రసిద్ధి చెందిన రాజరాజ చోళుడు (క్రీ.శ. 985-1018), రాజేంద్ర చోళుడు (క్రీ.శ. 1018-1044) యీ నవీన చోళ వంశీకులే. రాజరాజ చోళుడు తన కుమార్తెయైన కుందవ్వను వేంగి చాళుక్యరాజైన అమ్మరాజు రెండవ కుమారుడైన విమలాదిత్యునికిచ్చి వివాహం చేసి తెలుగు వారైన వేంగి చాళుక్యులతో బాంధవ్యాన్ని కలుపుకున్నాడు. విమలాదిత్యుని అన్న శక్తి వర్మ (క్రీ.శ. 999-1011), విమలాదిత్యుడు (1011-1018) బలీయమైన చోళుల అండతోనే రాజ్యపాలన సాగించారు. అంతకు ముందు వారి తండ్రి అమ్మరాజును వధించి వారి రాజ్యాన్ని ఆక్రమించిన పెదకంటి దేశ ప్రభువు జటాచోడ భీముడిని రాజరాజ చోళుడు ఓడించి అమ్మరాజు కొడుకులైన శక్తివర్మ, విమలాదిత్యులకు వారి రాజ్యాన్ని తిరిగి అప్పగించాడు. విమలాదిత్యునికి యిరువురు భార్యలు - రాజరాజ చోళుని కుమార్తె కుందవ్వ మొదటి భార్య. కడపజిల్లా పెదకల్లుకు చెందిన పెదకంటి తెలుగు చోదుల ఆడపడుచు అయినట్టి మేళమాంబ రెండవ భార్య.

## తె లు గు చో డు లు

తెలుగువారితో చోళుల బాంధవ్యం కారణంగా తెలుగు చోళులు లేక తెలుగు చోదులు అనే వారు ఏర్పడ్డారు. వీరినే రేనాటి చోదులనీ, పెదకంటి చోదులనీ కూడా పిలుస్తారు. రేనాడు అంటే నాటి కడపజిల్లా. పెదకల్లు కూడా కడప

జిల్లాలోనే వుంది. నేటికీ రెడ్లలో కూడా పెడకంటి రెడ్లనే ఒక శాఖ వుండడం విశేషం. వీరు మొదట పెడకల్లు ప్రాంతానికి చెందిన వారై వుంటారు.

విఖ్యాత చరిత్రకారులు రమేశ చంద్ర మజుందార్‌గారు తమ 'ఏనిషియంట్ ఇండియా' అనే ఆంగ్ల గ్రంథంలో యిలా పేర్కొన్నారు – "చోళుల పేరూ, సంప్రదాయమూ, పల్లవులు, చాళుక్యులు మరియు రాష్ట్ర కూటులకు సామంతులుగా రేనాడు (కడప జిల్లా)ను పాలించిన తెలుగు చోడులచే కొనసాగించబడినాయి. *("R.C. Majumdar's Ancient India" Page 403 - Publishers : Motilal Banarsidass)*

విమలాదిత్యునికి కుందవ్వ ద్వారా పుట్టిన వాడే రాజమహేంద్రవరాన్ని పాలించిన ప్రఖ్యాత తూర్పు చాళుక్య ప్రభువు రాజరాజ నరేంద్రుడు. పెడకంటి మేళమాంబకు పుట్టినవాడు విజయాదిత్యుడు. విజయాదిత్యుడు అడ్డుకున్నప్పటికీ మేనమామయైన రాజేంద్రచోళుని సహకారంతో క్రీ.శ. 1022లో రాజరాజ నరేంద్రుడు పట్టాభిషేకం చేసుకున్నాడు. నన్నయభట్టును పోషించి, ఆయనచే 'మహాభారత' ఆంధ్రీకరణను ప్రారంభింపచేసినదీయనే. నారాయణభట్టు, చీదమార్యుడు అనే పండితులను కూడా ఆయన పోషించాడు. మహావీరాచార్యుని 'గణితసార సంగ్రహము' అనే గ్రంథాన్ని తెనిగించిన పావులూరి మల్లనకు రాజరాజ నరేంద్రుడు పిఠాపురం సమీపంలోని నవఖండవాడ అనే గ్రామాన్ని అగ్రహారంగా యిచ్చాడట. తన మేనమామ రాజేంద్ర చోళుని కుమార్తె అమ్మంగ దేవిని ఆయన వివాహం చేసుకున్నాడు. వీరి పుత్రుడే కులోత్తుంగ చోళుడు. ఈయన క్రీ.శ. 1070 నుండి 1118 వరకు తంజావూరు ప్రభువుగా వుండి వేంగిపైన కూడా ఆధిపత్యం వహించాడు. ఆ రోజులలో తనకు బంధువులు, నమ్మకస్తులైన వారిని ఆంధ్ర ప్రాంతంలో సామంతులుగా నియమించాడు. ఇతడు కళింగ (ఓఢ్ర – ఒరిస్సా) దేశాన్ని కూడా జయించాడు. కులోత్తుంగుని కాలంలోనే రాజ ప్రతినిధులకు సహాయకులుగా వెలనాటి చోడులను నియమించడం మొదలైంది. వెలనాడు అంటే కృష్ణానదికి దక్షిణముననున్న ప్రాంతం. దీని ముఖ్య పట్టణం చందోలు లేక ధనదపురము. వెలనాడుకు దక్షిణమున గుండ్లకమ్మ, పెన్న నదుల మధ్య భాగాన్ని 'పాకనాడు' అని పిలుస్తారు. దీనిలో నెల్లూరు జిల్లాలో కొంత భాగం, కడప జిల్లాలోని తూర్పు భాగం కలిసి వుంటాయి.

చోడులు అనే పేరుతో తెలుగు ప్రాంతంలో పరిపాలన చేసిన రాజకుటుంబాలెన్నో వున్నాయి. వీరు తాము సూర్యవంశ క్షత్రియులమనీ, కరికాల చోళుని వంశం వారమనీ భావిస్తారు. షట్సహస్ర దేశం కూడా యీ వెలనాడులో ఒక భాగమే. దీనినే ఆరువేల నాడు అనీ అంటారు. ఆంధ్ర నియోగి బ్రాహ్మణులలో ఒక శాఖవారైన ఆరువేల నియోగులు ఒకప్పుడు ఈ ప్రాంతం నుంచే వచ్చినవారట. వెలనాటి చోడులలో వరుసగా మొదటి గొంకరాజు (క్రీ.శ. 1076-1108) మొదటి వెలనాటి చోడుడు (క్రీ.శ. 1109-1032), రెండవ గొంకరాజు (క్రీ.శ. 1132-1165), రెండవ వెలనాటి చోదరాజు (క్రీ.శ. 1165-1180), మూడవ గొంకరాజు (క్రీ.శ. 1180-1188) పాలించారు. ఇందులో చివరి రాజు కుమారుడైన పృథ్వీశ్వరరాజు రాజ్యానికి వచ్చేటప్పటికే వెలనాటి చోడులు చందోలు, గుంటూరు ప్రాంతాల్ని పోగొట్టుకున్న కారణంగా చిట్టచివరి పాలకుడైన పృథ్వీశ్వరుడు తూర్పు గోదావరి జిల్లా పిఠాపురం నుండి పాలించాడు. ఆ ప్రాంతానికి ప్రోలునాడని పేరు.

## కడప జిల్లా - చోళనాడు

ఇక యిప్పుడు తెలుగు చోడులకు సంబంధించిన మరిన్ని విషయాల్ని పరిశీలిద్దాం. కృష్ణానదికి దక్షిణ ప్రాంతంలో ప్రాంతీయ రాజులుగా వీరు పాలించారు. తాము సూర్యవంశ క్షత్రియులమనీ, కరికాల చోళుని సంతతివారమనీ వీరు తమ

శాసనాల్లో ప్రకటించుకున్నారు. చోళుల మొదటి జన్మస్థానం తమిళ ప్రాంతంలోని ఒరైయూర్ అని మనం లోగడ చెప్పుకున్నాం. అయితే వారి తొట్టతొలి జన్మస్థలం కడప జిల్లా (ఒకప్పటి రేనాడు) యేమోననిపిస్తున్నది. మొదట యిక్కడి నుంచే వారు అక్కడికి వెళ్లి వుంటారేమోనని కూడా తోస్తున్నది. ఎందుకంటే యువాన్‌చాంగ్ (హ్యూ-యాన్-త్సాంగ్) అనే చైనా యాత్రికుడు క్రీ.శ. 7వ శతాబ్దంలో భారతదేశాన్ని సందర్శించినప్పుడు ధాన్యకటకమునకు (నేటి అమరావతికి) నైఋతి మూలనున్న 'చులియ' అనే ప్రాంతాన్ని చూశాడట. ఈ ప్రదేశమంతా అనారోగ్యకరములైన అడవులతోనూ, సారహీనములైన భూములతోనూ, కౄరకృత్యములచే భయంకరులైన ప్రజలతోనూ నిండి వుండేదని ఆయన వర్ణించాడు. యువాన్‌చాంగ్ వర్ణనలు కడప ప్రాంతానికి సరిపోతున్నాయి. యువాన్‌చాంగ్ భారత సందర్శన కాలంనాటికి ఆ ప్రాంతాన్ని రేనాటి తెలుగు చోడులు పాలిస్తున్నారు. అప్పటికింకా ఆ ప్రాంతాన్ని 'చుళియ' లేక 'చోళియ' అని పిలుస్తున్నారంటే ఆ ప్రాంతం పేరే 'చోళ' అనే శబ్దానికి మూలమై వుండవచ్చు. నాటి కడప మండలం పల్లవ - చాళుక్య యుద్ధములకు రణరంగంగా వుండేదట. కృష్ణానదికి దక్షిణ భాగంలో నేటి గుంటూరు జిల్లాలో పల్నాడుగా పిలువబడుతూన్న ప్రాంతం ఒకప్పటి పల్లవ భోగ్యం. (అదే క్రమంగా పల్లవనాడు - పల్నాడుగా మారింది). పల్లవ - చాళుక్య యుద్ధాల కారణంగా 'చుళియ' ప్రాంతం జనవిహీనమై, ఆ కారణంగా దారిదోపిడీ దొంగలకు ఆటపట్టయి వుంటుంది. తృణధాన్యాలలో 'చోళ్లు' అని వున్నాయి. వీటినే రాగులు (*Panicum peludosum*) లేక తవిఁదెలు అనీ అంటారు. అవి నాటి కడప మండలంలో విస్తారంగా పండించేవారట. అంచేత, ఆ ప్రాంతాన్ని 'చోళ్లవాడి', 'చోళ్లనాడు' అనేవారట. అదే క్రమంగా 'చోళనాడు' గా రూపాంతరం చెందింది. తెలుగు చోడులు మొదట పల్లవులకూ, తరువాత బాదామి (వాతాపి) చాళుక్యులకూ సామంతులుగా రేనాడును (కడప మండలం) పాలించారు. తెలుగు భాషలో మొట్టమొదట శాసనాలు వేయించిన కీర్తి రేనాటి తెలుగు చోడులదే. క్రమంగా వీరు పాకనాడు, కాసలనాడు, పొత్తపినాడు వగైరా ప్రాంతాలకు కూడా వ్యాపించి చిన్నచిన్న స్థానిక రాజ్యాలనేర్పరచారు. తెలుగు చోడవంశాలలో రేనాడు, పొత్తపినాడు, కొణిదెన, నెల్లూరు ప్రదేశాలలో పాలించిన కుటుంబాలు పేర్కొనదగినవి. రేనాటి తెలుగు చోడులకు సంబంధించిన శాసనాలు (క్రీశ. ఆరు, ఏడు శతాబ్దులకు సంబంధించినవి) కడపజిల్లా జమ్మలమడక, ప్రొద్దుటూరు ప్రాంతాలలో దొరికాయి. పొట్లదుర్తి - మాలెపాడు శాసనం యీ కాలం నాటిదే.

## కొణిదెన చోడులు

కొణిదెన చోడులనబడేవారు ప్రస్తుత గుంటూరు జిల్లా నరసరావుపేట సమీపంలో వున్న కొణిదెన తమ రాజధానిగా కమ్మనాటిని పాలిస్తూ వచ్చారు. (పేరకమ్మ - అనగా కృష్ణానది మరియు గుండ్లకమ్మల మధ్య ప్రాంతమే కమ్మనాడు) కొణిదెన పూర్వపు పేరు 'కొట్యదొన'. కొణిదెన తెలుగు చోడులను కాకతీయ గణపతిదేవ చక్రవర్తి ఆజ్ఞ మేరకు ఓపిలిసిద్ధి అనే రాజు జయించాడట. క్రీ.శ. 1224 నాటి ఓపిలిసిద్ధి శాసనం మనకు లభించింది. కొణిదెన చోడులు కూడా పొత్తపినాటి నుంచి వచ్చిన వారే. దాసవర్మ, కామచోడుడు కొణిదెన చోడులలో ప్రసిద్ధులు.

## నన్నూరు చోడులు

నన్నూరు చోడులనే మరొక తెలుగు చోడ శాఖ కూడా వుంది. ఈ నన్నూరు ఎక్కడుందో నాకు తెలియదుగానీ, 'నన్న' అంటే కురుచ. తెలుగులో పొట్టిలంక, పొట్టిపాడు, కురు(చ) మద్దాలి. నిడుద (పొడవాటి)వోలు వగైరా గ్రామ నామాలేర్పడినట్లే నన్నూరు (నన్న + ఊరు) అనే గ్రామ నామం ఏర్పడి వుండొచ్చు. తెలుగులో నన్నయ్య (కురుచవాడు);

నన్నప్ప అనే ప్రయోగాలున్నాయి. (నన్నప్పనాయడు అనే ఆయన వంశీకులే కమ్మవారిలోని నన్నపనేని వారు.) క్రీ.శ. 1088వ సంవత్సరమున వేయించబడిన ఓ శాసనం నన్నూరు హుంకారదేవి ఆలయంలో లభించిందట. కమ్మవారిలోని 'బన్నూరు' వారిది 'నన్నూరు' గోత్రమే. కమ్మవారిలో నన్నూరి, నన్నూరు యిండ్లపేర్ల వారు కూడా వున్నారు. వీరిది పైడిపాళ్ల గోత్రం. 'కుమార సంభవం' అనే మహా ప్రబంధాన్ని వ్రాసిన నన్నెచోడ కవి యీ నన్నూరు శాఖకు చెందిన తెలుగు చోడుడేనట. ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఇతని స్థానం అద్వితీయం. ఆదికవి నన్నయ భట్టుకాదు - యీయనేననే వివాదమూ వుంది. ఇతడు నన్నయభట్టుకు ఒక శతాబ్దం పూర్వము వాడని కొందరూ, నన్నయ - తిక్కనల మధ్యకాలం వాడని హెచ్చుమందీ విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. తెలుగులో ఆదికవి అయినా కాకున్నా తెలుగు సాహిత్యంలో ప్రబంధ శాఖకు మొదటి ఉదాహరణ నన్నె చోడుడు వ్రాసిన 'కుమార సంభవ'మే. ఈ ప్రబంధాన్ని ఆయన తన గురువు, శ్రీశైల నివాసియైన మహాపండితుడు, జంగమ కులస్థుడైన మల్లికార్జున యోగికి అంకితమిచ్చాడు. ఇలా కావ్యాలను దైవాలకు కాక ఇతరులకు అంకితమిచ్చే (నరాంకితమిచ్చే) సంప్రదాయానికి కూడా నన్నెచోడుడే ఆద్యుడు. సప్తసంతానాలలో కావ్యం కూడా ఒకటనే భావన, ఆ కావ్య కన్యకను యోగ్యుడైన కృతి భర్తకు అంకితమివ్వడం అనే ఆచారం నాటి నుండే మొదలైంది. కృతినిచ్చిన కృతిభర్తకే (పుత్రిక కాక) మిగిలిన ఐదు సంతానాలనూ - అంటే అగ్రహారం, దేవాలయం, తోట, చెరువు, నిధిని అంకితమీయడం కూడా అప్పటి నుంచే ఆనవాయితీ అయిందట. ఇది కన్నడ సంప్రదాయమట. నన్నెచోడుడు తన గురువు మల్లికార్జుననికి అంకితంగా వీటన్నింటినీ శ్రీశైలంలో ప్రతిష్ఠించాడట. (పుత్రుడు లేక పుత్రిక, కృతి, అగ్రహారం, దేవాలయం, తోట, చెరువు, నిధి - వీటిని సప్త సంతానాలంటారు).

మాదయ రచించిన 'మైరావణ చరిత్రము'లోని ప్రథమాశ్వాసములోని యీ క్రింది పద్యం ద్వారా మనకు సప్త సంతానాల విశిష్టత అర్థమౌతుంది.

క. సుతుఁడును గుడి నిధి చెఱువును
కృతియును నల్లిండ్లు వనము క్షితిలోపల సం
తతు లిందులోన నెన్నఁగఁ
గృతి వలనం గలుగునంద్రు కీర్తియు గతియున్.

"ప్రపంచంలో పుత్రుడు, దేవాలయము, నిధి, చెరువు, కృతి, అగ్రహారము, తోట - యీ ఏడింటినీ సప్త సంతానాలంటారు. కాని, ఎంచి చూస్తే యీ ఏడింటిలోనూ తాను రచించిన కృతి వలననే ఎవరికైనా కీర్తి, పుణ్యలోకాలు సిద్ధిస్తాయని (పెద్దలు) చెపుతారు."

నన్నెచోడుడు కాలాముఖ శైవానికి చెందినవాడు. అనంతర కాలంలో శ్రీశైలంపైన ఆధిపత్యం వహించిన వీరశైవులు బహుశా నన్నెచోడుడు తన గురువుకు అంకితమిస్తూ గుడిని, తోటను, నిధిని, అగ్రహారాన్ని, చెరువునూ నిర్మిస్తూ వేయించిన శాసనాలు వగైరాలను నాశనం చేసివుంటారు. (వీరశైవులు యిలా శ్రీశైలంలో తమ ముందరి కాలంనాటి ఎన్నో శాసనాలు నాశనం చేశారట). నన్నెచోడుడు క్రీ.శ. 1080-1130 ప్రాంతాలవాడని హెచ్చుమంది విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. నన్నెచోడుని కుమార సంభవాన్ని తొట్టతొలిగా క్రీ.శ. 1909లో ప్రకటించిన మానవల్లి రామకృష్ణ కవిగారు (1866-1957) మాత్రం నన్నెచోడుడు క్రీ.శ. 940 ప్రాంతాలవాడని నమ్ముతున్నారు. కావ్యాలలో ఇష్టదేవతా ప్రార్థన, పూర్వకవి స్తుతి, కుకవి నింద, గ్రంథకర్త స్వవిషయం, కృతిపతి వర్ణన, షష్ఠ్యంతాలు మొదలైనవి నన్నెచోడుడే ప్రవేశపెట్టాడు. ఇదే తరువాతి కాలపు కవులకు ఒరవడి అయింది. అందుకే ఆరుద్రగారు నన్నెచోడుడిని 'ఒరవడి పెట్టిన ఒజ్జ' (గురువు) అన్నారు.

సంస్కృత భాషలో కాళిదాస మహాకవి వ్రాసిన కుమార సంభవాన్ని అనుకరించకుండా నన్నెచోడుడు వర్ణనాత్మకమైన కవిత్వంలో, స్వతంత్ర పద్ధతిన, చక్కని తెలుగు జాతీయములు, సామెతలనూ, వాడుతూ యీ ప్రబంధాన్ని రచించాడు. ఇతడికి కవిరాజ శిఖామణి అనీ, టెంకణాదిత్యుడనీ బిరుదులున్నాయి. ఈయన కుమారసంభవ కావ్యంలో తాను సగర సుతులు, భగీరథుడు, రాముడు, కరికాలచోళుడు మొదలైన వారు పుట్టిన సూర్యవంశంలో పుట్టానని చెప్పుకున్నాడు. తన తండ్రి పాకనాడు యిరువది యొక్క వేయికి అధీశుడైన చోడబల్లి అనీ, తన తల్లి హైహయాన్వయాంబర శశిరేఖయైన శ్రీసతి అనీ చెప్పుకున్నాడు. అంటే ఆయన తండ్రి పాకనాటి తెలుగు చోడుడన్నమాట. తల్లి హైహయవంశమనే ఆకాశంలో చంద్రరేఖట. గురజాలను పాలించిన పల్నాటి వీరులైన నలగామ రాజు, మలిదేవరాజు వగైరాలు కూడా హైహయ వంశీకులే! నన్నె చోడుడు తాను రాతి పొన్నలు, రాతి కోడి వున్న ఒరయూరు పురానికి అధిపతిననీ చెప్పుకున్నాడు. కొందరు విమర్శకులు దీనిని బట్టి అతడు తమిళనాడులోని శ్రీరంగం - తిరుచినాపల్లికి సమీపంలోని ఒరయూర్ పాలకుడనీ, యింకొందరు తెలుగు దేశంలో వున్న ఒరయూర్ అనే వేరే పట్టణానికి పాలకుడనీ అభిప్రాయపడ్డారు. అయితే నిజమేమిటంటే తమ పూర్వులు ఒరయూరును పాలించారు గనుక ఆ సంగతినే తెలుగు చోడులలోని ఒక శాఖవారు క్రమానుగతంగా చెప్పుకొంటున్నారు. కమ్మవారిలో సూర్యదేవరవారు కూడా తాము సూర్యవంశ క్షత్రియులమనీ, ఒరయూరు పురాధీశ్వరులమనీ చెప్పుకుంటారు. (వీరివి విప్పర్ల, రఘుపతి, వల్లుట్ల గోత్రాలు) క్రీ.శ. 17వ శతాబ్దం ప్రథమ పాదంలో పర్తియాల సంస్థానం పాలకులు జూపల్లి వారుకూడా తాము ఒరయూరు పురాధీశ్వరులమనే చెప్పుకున్నారని ఎలకూచి బాలసరస్వతి రచించిన 'చంద్రికా పరిణయం' పేర్కొంటూంది. (నేటికీ కమ్మ వారిలో జూపల్లి వారున్నారు. వారిది ఆవాల గోత్రం. అయితే వెలమ వారిలో కూడా జూపల్లి వారున్నారు.) అలాగే తెలుగు చోడులలో ఒక శాఖకు చెందిన కోదూరు వారు కూడా తాము ఆ వూరును ఎప్పుడో విడిచిపెట్టినా కోదూరు పురవరాధీశ్వరులమని చెప్పుకుంటారు. నన్నెచోడుడు కందుకూరు నుంచి పాకనాడు ఇరవై ఒక్కవెయ్యిని పాలించిన మహామండలేశ్వరుల వంశంలోని వాడై వుంటాడని పెద్ద చెరుకూరు శాసనాన్ని బట్టి ఊహించవచ్చు. అతడి పూర్వులు ఒరయూరుకు చెందిన వారై వుండవచ్చు. తెలుగు చోడులలో యింకా పొత్తపినాటి చోడులు, నెల్లూరు చోడులు, కందూరు చోడులు, కోదూరు చోడులు, వెలనాటి చోడులు మొదలైన శాఖలున్నాయి.

## నెల్లూరు చోడులు

ఇక నెల్లూరు చోడుల విషయానికొస్తే యీ శాఖను విక్రమసింహపుర చోడులని కూడా అంటారు. ఎందుకంటే నెల్లూరుకు విక్రమసింహపురమనే మరొక పేరుంది. వీరు మధురాంతక పొత్తపినాటి చోడవంశానికి చెందినవారట. కవి బ్రహ్మ తిక్కన సోమయాజి యీ వంశపు రాజైన మనుమసిద్ధి ఆస్థానకవి. తిక్కన వ్రాసిన 'నిర్వచనోత్తర రామాయణము' మనుమసిద్ధికే అంకితమీయబడింది. కరికాల చోళుని వంశీకుడైన చోళ బిజ్జన మనుమసిద్ధి వంశ మూలపురుషుడట. కళ్యాణి చాళుక్యుల సామంతునిగా క్రీ.శ. 1048 ప్రాంతంలో యితడు ప్రస్తుత కర్ణాటకలోని గుల్బర్గా ప్రాంతాన్ని పాలించేవాడట. తరువాత చెప్పుకోదగినవాడు మనుమసిద్ధి తండ్రి తిక్కభూపతి క్రీ.శ. 1248 వరకు జీవించిన యీ రాజు పేరుకు చోళ చక్రవర్తులకు సామంతుడే అయినా, కర్నాటకను పాలించే సోమేశ్వరుడు కాంచీపురంపై దాడిచేసి మూడవ రాజేంద్ర చోళుడిని పదవీచ్యుతుడిని చేయగా, తాను దండెత్తి వెళ్లి కన్నడిగులను ఓడించి తిరిగి రాజేంద్రచోళుడిని కంచి సింహాసనంపై అధిష్ఠింప చేశాడట. అందుకే తిక్కభూపతికి 'చోళస్థాపనాచార్య' అనే బిరుదు వచ్చిందట.

తిక్కభూపాలుడి కుమారుడే మనుమసిద్ధి మహారాజు. రాచకార్యంపై తన ప్రతినిధిగా యితడు పంపితేనే తిక్కన

మహాకవి ఓరుగల్లు వెళ్లి కాకతి గణపతిదేవ చక్రవర్తితో రాయబారం నడిపాడట. మనుమసిద్ధి సైన్యాలతో కనిగిరి సీమలో ఎఱ్ఱగడ్డపాడును పాలించే కాటమరాజనే యాదవరాజు పశువులను మేపుకొనే బీళ్ల విషయమై పోరాటం జరిపాడట. పాలేటి ఒడ్డున పంచలింగాల గట్టు సమీపంలో భయంకరమైన పోరు జరిగిందట. కాటమరాజు తరఫున ఎందరో యాదవవీరులు ఆరాధ్య బ్రాహ్మణుడైన బ్రహ్మరుద్రయ్య సేనా నాయకత్వంలో పోరాడగా, మనుమసిద్ధి తరఫున తిక్కనామాత్యుని పెదనాన్న కుమారుడు ఖడ్గతిక్కన సేనా నాయకత్వం వహించాడు. నేటి కందుకూరు - కనిగిరి రహదారిపై పాలేటి నానుకుని పంచలింగాల గట్టు వున్నది. గంగదేవరకు అక్కడ ఓ గుడి వున్నది. ఏటా అక్కడ జాతర జరుగుతుంది. కొమ్మువాళ్లనే వారు ఆ సందర్భంగా 'కాటమరాజు' కథను వీర రసం ఉప్పొంగేటట్లు శ్రావ్యంగా.గానం చేస్తారు. ఈ కథ ప్రకారమైతే పల్లవ వంశానికి చెందిన నల్లసిద్ధి ఆనాటి యుద్ధంలో కాటమరాజుకు ప్రత్యర్థి. కనుక కొన్ని సత్యాలుంటే వుండవచ్చుగాని, కాటమరాజు - మనుమసిద్ధి మధ్య జరిగిన యుద్ధం పూర్తిగా చారిత్రక సత్యమని విశ్వసించడానికి ఆధారాలు లభించలేదు. మనుమసిద్ధి క్రీ.శ. 1263 లో పాండ్యులతో ముత్తుకూరులో జరిగిన యుద్ధంలో సంహరించబడ్డాడు.

# పొత్తపినాటి తెలుగు చోడులు

రేనాటి చోడుల అనంతరం కడప మండలాన్ని పాలించినవారు పొత్తపినాటి తెలుగుచోడులు. కడపజిల్లా పొత్తపి వీరి ముఖ్యపట్టణము. పొత్తపి కేంద్రంగా గల ప్రాంతాన్ని పొత్తపినాడు అని పిలిచేవారు. కడపజిల్లా దక్షిణ భాగం నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లో కొన్ని భాగాలు పొత్తపినాటిలో కలిసి వుండేవి. ధూర్జటి మహాకవి తన 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' లో తిన్నడి ఆటవిక రాజ్యం పొత్తపినాటిలోనే వున్నట్లు పేర్కొంటాడు. "పొత్తపినాటిలో విపినభూమి కిరాతులకాటపట్టు" (పొత్తపి నాటిలోని అరణ్య ప్రాంతం కిరాతులకు - బోయవారికి - నివాసస్థలం.) అక్కడే తిన్నడి తండ్రి నాథనాథుడు తన రాజధానిగా చేసుకుని పాలిస్తూన్న ఉడుమూరనే పట్టణం వున్నది" అంటూ వర్ణిస్తాడు ధూర్జటి. క్రీ.శ. 11వ శతాబ్దం నుండి పొత్తపినాటి చోడుల శాసనాలు కడప మండలంలో కనుపిస్తున్నాయి.

# తెలుగు చోడులు - కమ్మవారు

ఆంధ్రప్రాంతపు కమ్మవారిలోని ఏరువ, గొల్లపూడి, కట్టా, సూర్యదేవర, కోడూరు, నెల్లూరు, వల్లూరు, మోపూరు, కొణిదెన, మాలెంపాటి, కంచెర్ల, పొందూరు, నెక్కొండ, కందార, యిమ్మడి, ఆలమందల, కొండ్రాజు మొదలగు యిండ్ల పేర్ల వాళ్లు తెలుగుచోడ సంతతికి చెందినవారు. కమ్మవారిలోని 'వెలనాటి' అనే యింటిపేరు వారిలో కొందరి వెలనాటి చోడ మూలాల్ని తెలుపుతున్నది. 'కొరవి', 'కొరివి' అనే కమ్మవారి యిండ్లపేర్లు వారిలో కొందరు కొరవిసీమను పాలించిన దుర్జయాన్వయులయి వుంటారని సూచిస్తున్నది. కొరవిసీమ అంటే నేటి వరంగల్ జిల్లాలోని మహబూబాబాద్ లేక మానుకోట ప్రాంతము. కాకతీయులు ఓరుగల్లు, హనుమకొండ ప్రాంతాలను పాలించడానికి పూర్వం, ముందు 'నతవాటి సీమ' (అంటే ఖమ్మం జిల్లా మధిర ప్రాంతం మరియు కృష్ణాజిల్లా నందిగామ ప్రాంతం) లోనూ, తరువాత 'కొరవి సీమ' ప్రాంతంలోనూ పరిపాలించారు.

ఇందులో కోడూరు వారు కల్కోడి (రాతి కోడి) కల్పొన్న (రాతి పొన్న)లు చిహ్నములుగా కలవారట. బహుశా కోడి+ఊర్ - కోడూర్ అనే పేరుతో తమిళ ప్రాంతంలో (ఒరయూర్ వలెనే) ఉన్న ఏదైనా ఊరుకు వీళ్లు మొదట్లో అధిపతులుగా ఉండేవారేమో; వీరికి 'కోడూర్పుర వరేశ్వర' అనేది బిరుద నామంగా వచ్చింది. నన్నెచోడ మహాకవి కూడా తన ఊరిలో

రాతికోడి, రాతి పొన్నచెట్టు వున్నవని వ్రాశాడు.

కమ్మవారిలోని దుర్జయాన్వయులలో కనుమూరి, పూసపాటి, సాగి, కోట, పెనుమత్స, ఇందుకూరి, కొండ్రాజు, కట్టా, పెమ్మరాజు, గోకరాజు, పోతరాజు, ముప్పరాజు, కొసరాజు, మాచిరాజు, దండు వగైరా యిండ్లపేర్లు కలవారున్నారు. గుంటూరు జిల్లా బాపట్ల ప్రాంతంలోనూ, ఉభయ గోదావరి, విశాఖ, విజయనగరం జిల్లాల్లోనూ గల 'రాజులు' అని పిలువబడే క్షత్రియులకూ, కమ్మవారికీ ఒకప్పుడు కల బాంధవ్యాన్ని యీ యిండ్ల పేర్లు తెలియజేస్తున్నాయి. అలాగే కమ్మవారిలోని తెలుగు చోడవంశీకులలో నేనింతకుముందు పేర్కొన్న 17 యిండ్ల పేర్ల వారే కాక యింకా కూడా వుండి వుండవచ్చు. ఆ 17 యిండ్ల పేర్లలోని 'కొండ్రాజు', 'కట్టా' యిండ్ల పేర్లు క్షత్రియులలో కూడా వున్నాయి. అంటే నాటి తెలుగు చోడవంశాలకు చెందినవారిలో కొందరు కమ్మవారిలోనూ, కొందరు నేటి క్షత్రియులలోనూ కలిసిపోయారన్నమాట. రాష్ట్రకూట రాజులనుండి ఏర్పడిన రెడ్లు కూడా పలుసందర్భాలలో తాము సూర్యవంశీకులమని పేర్కొన్నందున రెడ్డి రాజులతో కూడా కమ్మవారికి ఒక దశలో సంబంధ బాంధవ్యములున్నట్లు 'కమ్మవారి చరిత్రము' గ్రంథకర్త కొత్త భావయ్య చౌదరి గారు పేర్కొన్నారు. ఇలా దుర్జయాన్వయులుగా, తెలుగు చోడులుగా ప్రసిద్ధిగాంచిన వారిలో కొందరు రెడ్లలోనూ, కొందరు క్షత్రియులలోనూ, హెచ్చుమంది కమ్మవారిలోనూ కలిసిపోయినట్లు మనం గమనించవచ్చు. హైహయ వంశీకులుగానూ, తెలుగు చోడులుగానూ ప్రసిద్ధిగాంచిన కొన్ని కుటుంబాలు కమ్మవారిలో కలిసిపోగా, యింకొన్ని వెలమ కులస్తులలో కలిసిపోయాయి. తెనాలి రామకృష్ణుడి కృతిభర్త విరూరి వేదాద్రి యొక్క రాజైన పెద సంగ భూపాలుడు, అతడి మేనల్లుడు వెంకటాద్రి పొత్తపినాటి తెలుగు చోడ ప్రభువులే.

అలాగే తెలుగు చోడవంశీకులతో సన్నిహిత బాంధవ్యం కలిగిన చాళుక్య వంశ మూలములుగల కమ్మవారిలోని తోలేటి, ఆరవీటి, కోనేరు, అడపా, ఎలమంచిలి, కోకా, సమ్మెట, మచ్చా, సాళువ, పాశం, కొండా వగైరా యిండ్ల పేర్లలో కొన్ని కాపు లేక బలిజ కులస్తులలోనూ, కొన్ని వెలమ కులస్తులలోనూ కూడా వున్నాయి. దీనిని బట్టి యీ కులాలన్నిటికీ మూలములు ఒకటేననేది యధార్థమని తోస్తున్నది.

## శ్రీకృష్ణదేవరాయలుపై వివాదం

ప్రసిద్ధ వ్యక్తుల చరిత్రలన్నీ వివాదాల సుడిగుండాల్లో చిక్కుకున్నట్లే శ్రీకృష్ణ దేవరాయల జనన చరిత్ర కూడా చిక్కుముడుల పాలయింది.

ఆయన తుళువ నరసనాయకునికీ, నాగమ్మ అనే దాసికీ పుట్టిన సంతానమని కొందరు చరిత్ర కారులు అభిప్రాయపడగా, తుళువ నరస నాయకుడు బోయ కులస్థుడనీ, యాదవ కులస్థుడనీ, కూర్మీ కులస్థుడనీ రకరకాల వాదనలున్నాయి. ఈ వాదనలనటుంచి మనం మరింత సాధికారమైన సమాచారాన్ని పరిశీలిద్దాం.

కృష్ణదేవరాయలు వంటి మహాపురుషుడు ఏ కులం వాడని నిర్ధారించబడినా, ఆయన కీర్తికి కొత్తగా వచ్చి చేరే ఘనత ఏమీ వుండబోదు. అది వాస్తవానికి ఆ కులం వారి కీర్తిని ఇనుమడింప జేస్తుందంతే ! కనుక ఈ కుల వైభవీకరణం *(Caste Glorification)* అంతా వ్యర్థ ప్రయాసేననిపిస్తుంది. అయితే చరిత్ర విషయంలో భిన్న విభిన్న అభిప్రాయాలు ఘర్షిస్తేనే వాస్తవాలు నిగ్గుదేల్తాయి. చరిత్ర పరిశోధన పేరుతో వాస్తవాల వక్రీకరణకు పూనుకొనడం తప్పవుతుందేమో కాని శాస్త్రీయంగా, సాధారంగా, సహేతుకంగా, సోపపత్తికంగా కృష్ణరాయల వంశ మూలాలను నిర్ధారించబూనడం తప్పెలా అవుతుంది ?

విజయనగర సమ్రాట్ శ్రీకృష్ణదేవరాయలు అసలు తెలుగు వాడే కాదు – కన్నడిగుడనే వాదమొకటి వుంది.

అయితే, యీ వాదన అర్థం లేనిదనీ, కృష్ణరాయలు పదహారణాల తెలుగు వాడనీ, ఆధునిక చరిత్ర కారులు నిర్ద్వంద్వంగానూ, సోపపత్తికంగానూ నిరూపించారు. అంతెందుకు – విజయనగర సామ్రాజ్య స్థాపకులు, సంగమ వంశీయులైన హరిహర రాయలు, బుక్కరాయలు కూడా తెలుగు వారేనని చారిత్రకంగా నిరూపించబడింది. వీరు ఓరుగల్లును పాలించిన చిట్టచివరి కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుని వద్ద కోశాధిపతులుగా వుండి క్రీ. శ.1323 లో కాకతీయ సామ్రాజ్య పతనానంతరం తుఘ్లక్ చేత మతాంతరీకరణం చేయబడి, ఆయనచే తుంగభద్రా తీరంలోని ఆనెగొందికి పాలకులుగా నియమించబడి, అక్కడి జనం తిరుగు బాటు చేయడం కారణంగా అధికారం కోల్పోయి, అడవుల పాలై, తదనంతరం మాధవ విద్యారణ్యునిచే శుద్ధి గావింపబడి తిరిగి హైందవ మతం స్వీకరించి, విద్యారణ్యుడు వారికొసగిన శ్రీ భాండాగారం ఆధారంతో హంపిలో విజయ (విద్యా) నగర సామ్రాజ్య నిర్మాణానికి పునాదులు వేశారు. వీరిరువురూ 'కురమ' లేక 'కూర్మ' కులస్థులని బ్రిటిష్ చరిత్ర కారుడు రాబర్ట్ స్యూయల్ నిర్ధారించాడు. (ఈ 'కురమ' లేక 'కూర్మ' శబ్దం నుండే 'కమ్మ' శబ్దం ఉద్భవించిందని పెక్కురు అభిప్రాయపడుతున్నారు.) కాకతీయుల మూలపురుషులైన కమ్మ మహారాజు, దుర్జయుడు వగైరాలంతా కూర్మ వంశస్థులే. హరిహర రాయలు, బుక్కరాయలు కాకతీయ రాజుల బంధువులని సుప్రసిద్ధ చరిత్ర కారులు నీలకంఠ శాస్త్రి, నేలటూరి వెంకట రమణయ్య వగైరాలు పేర్కొన్నారు. క్రీ. శ. 1323 లో కాకతీయ సామ్రాజ్యం పతనమైనప్పటికీ, క్రీ. శ. 1368 వరకు – అంటే 45 సంవత్సరాల పాటు – కాకతీయుల వారసులైన కమ్మ ప్రభువులు ముసునూరి ప్రోలయ, కాపయ నాయకులు ఆ పాలనను కొనసాగించి, మహమ్మదీయ విజృంభణకు అడ్డుకట్ట వేయగలిగారు. ముసునూరి కాపయ నాయకుడు విజయనగర రాజ్య స్థాపకులైన హరిహర – బుక్కరాయలకు బంధువని బియా బెరిన్ని వంటి కొందరు చరిత్ర కారులు కూడా పేర్కొన్నారు. ఇది నిజమే.

పలనాటిలో ఒకే హైహయాన్వయులలో కొందరు ఎక్కువ, కొందరు తక్కువ అన్న విభేదాలు వచ్చినట్లే విజయ నగర సామ్రాజ్యంలోని రాజ వంశంలో కూడా కొందరు 'రాయడు' లేక 'రాయలు' అనే బిరుదు ధరిస్తూ, పాలకులుగానూ మరికొందరు 'నాయకుడు' లేక 'నాయఁడు' అనే బిరుద నామంతో సేనానులుగానూ వ్యవహరించేవారు. తుళువ నరస నాయకుడు తన జీవితాంతం నాయకుడు (దళపతి లేక సేనాని) గానే వుంటూ చివరి దశలో విజయ నగర పాలకునిగా వ్యవహరించినా ఆయనెప్పుడూ 'రాయఁడు' అనే బిరుదు ధరించలేదు. ఆయన అనంతరం ఆయన పెద్ద భార్య కుమారుడు వీర నరసింహుడు పాలనకు వచ్చి 'భుజబదరాయ' అనే బిరుదు వహించాడు. ఆ తరువాత అధికారానికి వచ్చిన తుళువ నరస నాయకుని రెండవ భార్య నాగులాంబిక కుమారుడు శ్రీకృష్ణ దేవరాయలు 'రాయలు' అన్న పదానికే వన్నె తెచ్చిన సంగతి తెలిసినదే. దీనిని బట్టి తేలేదేమంటే స్వతంత్ర పాలకునిగా వ్యవహరించిన వానికి 'రాయడు' అనేది బిరుద నామం మాత్రమేననీ, అది కులాన్ని సూచించదనీ. అందుకే సేనానిగా వ్యవహరించిన తుళువ నరసనాయకుడు ధరించని 'రాయ' బిరుదును అతని పెద్ద భార్య కుమారుడు వీర నరసింహ రాయలు ధరించాడు. అంచేత, అంతకు ముందరి విజయ నగర పాలకులైన సంగమ, సాళువ వంశాలు కులరీత్యా తుళువ వంశానికి భిన్నమైనవేమీ కావని నా అభిప్రాయం. తుళువ వారి పూర్వీకులు కొన్ని దశాబ్దాల పాటు తుళు ప్రాంతానికి వలస వెళ్లి తిరిగి రావడం మినహా శ్రీకృష్ణ దేవరాయల తాత తండ్రులంతా ప్రస్తుత చిత్తూరు జిల్లా చంద్రగిరి ప్రాంతానికి చెందిన పదహారణాల తెలుగు కమ్మ వంశస్థులేనని నా అభిప్రాయం. ఈ అధ్యాయంలోనే వేరొకచోట నేను పేర్కొన్న పెద్దన చాటు పద్యంలోని 'సెలగోలు సింహంబు' అనే పదం కృష్ణ రాయల పూర్వీకులు తుళు ప్రాంతం నుంచి వచ్చిన 'సెలగోలు' అనే వూరునే సూచిస్తుంది కాని అతను 'యాదవ సింహం' అనే అర్థంలో పెద్దన గారు ఆ పదాన్ని వాడలేదు. 'సెలగోలు సింహంబు' అనే పదాన్ని బట్టి పెద్దన గారు కృష్ణ రాయలను

'యాదవ సింహం' అని పేర్కొంటున్నాడనే భావన తప్పు. సెలగోల అంటే యాదవులు వాడే కోల. కాని ఆ పద్యంలో పెద్దన వాడిన పదం 'సెలగోలు'. అది తుళువ నరసనాయకుని తాత తిమ్మయ నాయకుడు, వారి పెద్దలు ఒకప్పుడు కొన్నేళ్ల పాటు నివసించిన తుళు ప్రాంతంలోని ఒక గ్రామ నామం.

శ్రీకృష్ణ దేవరాయలు కన్నడిగుడే అయివుంటే సంస్కృతాంధ్రాలలో తప్ప తన మాతృ భాషలో ఒక్క కావ్యం కూడా వ్రాయక పోవడం వింత కాదూ ? ఆయన మహామంత్రి పదహారణాల తెలుగు నియోగి బ్రాహ్మణుడైన తిమ్మరుసు. ఆయన ముఖ్య కార్యదర్శి అవసరం వెంకటయ్య అనే తెలుగు వాడు. రాయలు తెలుగు జన పరివేష్టితుడు.

తాను తెలుగువాడినే నని ఆయనే ఎలా నిర్ద్వంద్వంగా చెప్పుకున్నాడో చూడండి -

**తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁగేను**
**తెలుగు వల్లభుండ తెలుగొ కండ**
**యెల్ల నృపులుఁ గొలువ నెఱుగవే బాసాడి**
**దేశ భాషలందు తెలుఁగు లెస్స ! (ఆముక్త మాల్యద 1-15)**

(ఈ పద్యం 'ఆముక్త మాల్యద' కావ్యంలో తనకు కలలో కనుపించిన తెలుగు వల్లభుడు – శ్రీకాకుళ ఆంధ్ర మహా విష్ణువు – చెపుతున్నట్లు వ్రాయబడినా యిది రాయల వారు తన గురించి పాఠకులకు చెబుతున్నదే! ప్రియమైన నేతనూ, ప్రియ దైవాన్నీ కూడా 'వల్లభ' అనే అంటారు. దీనిలోని 'దేశ భాషలందుఁ దెనుఁగు లెస్స' అనే పద బంధాన్ని మాత్రం రాయల వారు వినుకొండ వల్లభ రాయని 'క్రీడాభిరామం' నుండి యథాతథంగా అరువు తెచ్చుకున్నారు. చూ. 'క్రీడాభిరామము' – 37వ పద్యం.)

'తెలుగెందుకు ?' అంటే తాను ప్రధానంగా పరిపాలించేది తెలుగు దేశాన్ననీ, తాను కన్నడ రాయడినైనప్పటికీ (కర్ణాటకను పాలిస్తూన్న రాజునైనా), అందుకే తెలుగులో ఆ కావ్యాన్ని వ్రాస్తున్నాననీ, తాను తెలుగు రాజుననీ, తెలుగు భాషేమో కలకండలా తీయనిదనీ, అది దేశభాషలన్నింటిలో లెస్సయనీ ఎంత సగర్వంగా చాటుకున్నాడో చూడండి శ్రీకృష్ణ దేవరాయలు యీ పద్యంలో.

ఆముక్త మాల్యద (1-13) పద్యాన్ని బట్టి సంస్కృతంలో రాయల వారు అప్పటికే 'మదాలస చరిత్ర', 'సత్య వధూ ప్రీణనము', 'సకల కథా సార సంగ్రహము', 'జ్ఞాన చింతామణి', 'రసమంజరి' మొదలైన అద్భుత ప్రబంధాలను రచించిన మహా కవి. తెలుగులో ఆయన యీ మహత్తర ప్రబంధాన్ని వ్రాశాడు. ఆయన కన్నడిగుడే అయివుంటే తన మాతృభాషలో ఒక్క కావ్యమైనా వ్రాసి వుండదా ? అనేది ప్రశ్న.

తెలుగు రైతాంగ కులాలకు – ముఖ్యంగా కమ్మ కులానికి చెందిన మహా వీరులు ఆయన వెన్నంటి వుండి ఆ మహాసామ్రాజ్య పరిరక్షణలో ఎంత కీలక పాత్ర వహించిందీ చరిత్ర పాఠకులందరికీ సువిదితమే. అలాగే ఆయనచే తంజావూరు, జింజి, మధురలకు పాలకులుగా రాజ ప్రతినిధులుగా పంపబడిన వారు కూడా తెలుగు నాయక రాజులే. ఆయనే గనక కన్నడిగుడై వుంటే రాజ ప్రతినిధిత్వ గౌరవాన్ని ఒక్క కన్నడిగుడికి కూడా కల్పించలేదెందుకని ? శ్రీరంగ పట్టణ పాలకుడు, తన మామ (కృష్ణ రాయల మొదటి భార్య తిరుమల దేవి తండ్రి) అయిన కుమార వీరయ్య మినహా ఆయన ముఖ్య సహచరులలో కన్నడిగులెవరూ వుండే వారు కారంటే అందులో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు. విజయనగర సామ్రాజ్యంలో నాడు 14 తెలుగు శూద్ర కులాల వారు అమర నాయకులుగానూ, పాలెగార్లుగానూ పదవులు పొందారట. రైతాంగ కులాలకు చెందిన మహా వీరులనే కృష్ణ రాయలు తనకు అడపములందించే వారుగా – అంటే అడపకాళ్లుగా

నియమించుకొనేవాడట. అడపకాడు అంటే రాజుకు తాంబూలము, వక్కలు అందించడం, స్వీకరించడం చేసేవాడు. తాంబూలం యివ్వడమూ, అందుకొనడమూ సమాన ఫాయిలోని వ్యక్తుల మధ్యే వుంటుంది కనుక, యిలా తనకు అడపగాళ్లుగా వ్యవహరించిన వారిని రాయలు తనతో సమానులుగా గుర్తించి గౌరవించాడనే అనుకోవాలి. 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో ఆరుద్ర గారు కూడా – నాయక రాజుల యుగంలో వీరాధి వీరులనూ, రాజ బంధువులనూ, అత్యున్నత పదవులలో వున్న అత్యంత విశ్వసనీయులనే చక్రవర్తులు తమ అడపకాళ్లుగా నియమించుకున్నారని వ్రాశారు. ఒకప్పుడు రాజాస్థానాలలో అడపం, సాహిణి వంటి 16 రకాల పదవులుండేవనీ, తర్వాత అవే యింటి పేర్లయ్యాయనీ తూమాటి దొణప్ప గారు పేర్కొన్నారు. పెమ్మసాని, పోసాని, చలసాని, కేసాని, సుగసాని వగైరా కమ్మవారి యిండ్లపేర్లు 'సాహిణి' రూపాంతరం చెందడం కారణంగా ఏర్పడినవే ననే విషయం విపులంగా వేరొక చోట చూద్దాం. 'అడపా' అని కమ్మవారిలోనూ, తెలగ వారి (కాపుల)లోనూ కల యింటిపేరు 'అడపం' నుండి ఏర్పడినదే. శ్రీకృష్ణ దేవరాయల కొలువులోని యీ అడపా నాయకులను ఆయన తనతో సమానంగా గౌరవించే వాడని పోర్చుగీసు యాత్రికుడు న్యూనిజ్ పేర్కొన్నాడు. అంతఃపుర కాంతలతో కూడా అడపా నాయకులు చనువుగా వుండేవారని చరిత్ర కారులు పేర్కొన్నారు.

శ్రీకృష్ణదేవరాయల గురించిన కొన్ని చారిత్రక సత్యాలు అల్లసాని పెద్దన మహాకవి యొక్క ఒక చాటువు నుండి తెలుస్తున్నాయి. ఆ చాటువు కథా కమామీషు ఏమిటో చూద్దాం.

శ్రీకృష్ణదేవరాయలు మరణించిన అనంతరం కటకమునేలే వీరభద్ర గజపతి (వీరప్రతాప రుద్ర గజపతి కుమారుడు) పెద్ద సైన్యంతో హంపి విజయనగరంపైకి దండెత్తి వచ్చాడట. రాజధానికి సమీపంలో తన సైన్యంతో విడిచివున్న గజపతికి అల్లసాని పెద్దన ఒక పత్రంపై యీ క్రింది పద్యాన్ని వ్రాసి పంపాడట.

సీ॥ రాయ రావుతు గండ – రాచ్త యేనుఁగు వచ్చి, యారట్ల కోటఁ గోరాడునాఁడు
సంపెట నరపాల సార్వభౌముఁడు వచ్చి – సింహాద్రి జయశిలఁ జేర్చునాఁడు
సెలగోలు సింహంబు – చేరి థిక్కృతిఁగంచు, తల్పులఁగరుల ఢీ కొల్పునాఁడు
ఘనతర నిర్ఘర – గండపెండెర మిచ్చి, కూతుఁరాయలకును గూర్చునాఁడు

గీ॥ ఒడలెరుంగవొ చచ్చితో – యుర్విలేవొ, చేర జ్వాలక తలచెడి – జీర్ణమైతొ
కన్నడం బెట్లు సొచ్చెదు – గజపతీంద్ర, తెఱచినిలు కుక్కసొచ్చిన తెఱఁగుఁదోప.

ఇలా యీ పద్యంలో రాయలవారి వీరాభిమాని అయిన పెద్దనగారు రాయలవారి శౌర్య ప్రతాపాలను వర్ణించి, రాయల మరణానంతరం విజయనగర రాజ్యంపైకి దండెత్తి వచ్చిన గజపతిని తెరచివున్న యింట్లోకి చొరబడే కుక్కతో పోల్చి, సైన్యంతో సహా ఆయన సిగ్గుతో మరలి వెళ్లేట్లు చేశాడు. 'రాయ రావుతు గండ' అంటే కృష్ణదేవరాయలే. 'సంపెట' అనేది ఆయన యింటి పేరు కనుక సంపెట నరపాల సార్వభౌముడు అన్నా కృష్ణదేవరాయలే. 'సెలగోలు' సింహము అన్నా రాయలవారే! 'సెలగోలు' అనే ఊరునుండి కృష్ణరాయల తండ్రి తుళువ నరసనాయకుని యొక్క పూర్వీకులు తమ స్వస్థలమైన చిత్తూరు జిల్లా చంద్రగిరికి వచ్చారట. బహుశా యీ 'సెలగోలు' కర్ణాటక పశ్చిమ తీరంలో తుళు ప్రాంతంలో వుండి వుండవచ్చు.

మన తెలుగులో 'సెల' అనే పదం 'జల జల' పారడాన్ని సూచిస్తుంది. 'సెలయేరు' అలానే ఏర్పడింది. ఈ పదాన్నుంచే సెల పాడు

(గుంటూరు జిల్లా), సెల నూతుల (పొదిలి తాలూకా, ప్రకాశం జిల్లా) వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. ఆధునిక కన్నడ భాషలో 'సెల' అన్న పదం కనుపించడం లేదు. అయితే కన్నడ - ఇంగ్లిష్ నిఘంటువులో 'సెలె సెలె' అంటే *'Spring, Fountain'* (నీటి ఊట, ఫౌంటెన్) అన్న అర్థాలివ్వబడ్డాయి. 'సెళకు' అంటే 'జల్లు' *Shower* (షవర్) అనే అర్థముంది. 'సెళవు' అంటే *'force or current of a stream'* (ఒక ప్రవాహం యొక్క ఉరవడి) అనే అర్థముంది. ఇలా కన్నడ భాషలో కూడా 'సెల' అనేది మొత్తం మీద నీటి ప్రవాహానికి సంబంధించిన పదమేనని అర్థం చేసుకోవచ్చు. ఇకపోతే 'గోలు', 'గొళ' అనే ప్రాచీన కన్నడ భాషా శబ్దాలకు 'చెరువు' లేక 'సరస్సు' అని అర్థం. శ్రమణ బెలగొళ (శ్రవణ బెలగొళ) గ్రామ నామం యిలా ఏర్పడిందే. 'గోలు', 'గొళ' లతో ఏర్పడిన గ్రామ నామాలు కర్ణాటకలో యింకా వున్నాయి. ప్రస్తుత కర్ణాటకలోని దక్షిణ కన్నడ *(South Canara)* జిల్లాలోని మంగళూరు తాలూకానూ, ఉడుపి, బంటవాళ, కార్కళ, పుత్తూరు తాలూకాలనూ, కేరళ రాష్ట్రంలోని కాసరగోడ్ తాలూకానూ ఒకప్పుడు తుళునాడు అనేవారు. మొత్తం భారతదేశంలో ద్రావిడ భాషలు మాట్లాడే వారి సంఖ్య 1981 జనగణన నివేదిక ప్రకారం 15 కోట్లు కాగా, తుళు భాష మాట్లాడే వారి జన సంఖ్య 15 లక్షలు. అంటే ద్రావిడ భాషలు మాట్లాడే వారిలో ప్రతి 100 మందిలో ఒకరు తుళు భాషకు చెందినవారేనన్నమాట. తుళు పరిపూర్ణంగా వృద్ధి చెందిన భాషే అయినప్పటికీ దానికి ప్రాచీన సాహిత్యమూ, ప్రత్యేక లిపీ లేవు. కన్నడ లిపినే వీరు వ్రాస్తారు. 'తుళు' అనే పదం 'తుళు' భాష మాట్లాడే వారిని సూచిస్తుందే కాని అది ఒక జాతినో, కులాన్నో సూచించదు.

ఆరట్ల కోట అనేది గజపతి సామ్రాజ్యంలోని ఒక ప్రతిష్ఠాత్మకమైన దుర్గం. కటకం వైపుకు ఉత్తర దిశగా పురోగమిస్తూన్న కృష్ణ రాయల సైన్యాన్ని నిలువరించడానికి గజపతి చేసిన ఆఖరి విఫల యత్నానికిది కార్య క్షేత్రం. విశాఖపట్నం జిల్లా పాయకరావు పేట మండలంలోని ఆరట్ల కోట గ్రామంలో యిటీవలి కాలం వరకు యీ కోట శిథిలాలుండేవంటారు. నేడవి పాటి దిబ్బలుగా మారాయి. తాండవ నది ఒడ్డున గల ఆనాటి ఆ రణ భూమిని నేటికీ అక్కడి ప్రజలు 'దెబ్బలాటల దిబ్బలు' అని పిలుస్తూండడం విశేషం ! రావుతుగండ - అంటే రౌతు వీరుడు. రాయలవారి రాచ యేనుగు వచ్చి ఆ కోటలో కోరాడుతున్నప్పుడు నువ్వేం చేశావు? (ఏనుగులు మొదలైన జంతువులు తమ దంతాలతో నేలను పొడిచి దుమ్మెత్తి పైకి చల్లడాన్ని కోరాడు - కోరి + ఆడు - అంటారు.) సింహాచలం కూడా గజపతి సామ్రాజ్యంలోని ఓ ప్రతిష్ఠాత్మకమైన స్థానం; గొప్ప పుణ్యక్షేత్రం కూడా. రాయలవారు తన విజయ యాత్రలో సింహాద్రి వరకూ ఆక్రమించి పొట్నూరులో తాను పాతిన విజయ స్తంభం (జయశిల) లో సింహాద్రిని కూడా చేరుస్తున్నప్పుడు నువ్వేమయ్యావు? నీ కోట ద్వారాల్ని రాయలవారు తమ ఏనుగులతో కుమ్మించేటప్పుడు నీ వెక్కడ దాక్కున్నావు? నీ తండ్రి స్వయంగా రాయలవారి కాలికి గండపెండేరం తొడిగి, నీ సోదరి అన్నపూర్ణాదేవి (తుక్కాదేవి లేక జగన్మోహిని) నిచ్చి వివాహం చేసేటప్పుడు నీ పౌరుష మేమయింది? అప్పుడు నీకు ఒళ్లు తెలియలేదా? లేక చచ్చిపోయావా? ఇంత కాలం దగ్గరకు కూడా సమీపించలేక తలచెడి వున్న నీవు 'తగుదునమ్మా' అంటూ యిప్పుడు (సింహం వంటి రాయలవారు మరణించారని తెలియగానే) కర్ణాటకం పైకి దండెత్తి వచ్చావా? ఓ గజపతీంద్రా! నీ యీ దాడి (యింటి యజమాని లేని) తెరచివున్న యింట్లోకి కుక్క దూరిన విధాన్ని తలపిస్తున్నది.

గజపతి యీ పద్యం చదువుకుని సిగ్గుతో వెనుదిరిగి తన సైన్యంతో సహా కళింగానికిఉడాయించాడని ప్రతీతి. ఈ ప్రసిద్ధ చాటు పద్యం మనకు రాయలవారి యింటిపేరు, స్వగ్రామం తెలుపుతున్నందున దీని ప్రాముఖ్యత మరింత పెరిగింది. 'కమ్మవారి చరిత్ర'లో భావయ్య చౌదరిగారు యీ చాటు పద్యానికి తప్పుగా అన్వయార్థం చెప్పారు. ఈ పద్యాన్ని బట్టి కృష్ణదేవరాయల సామంతులలో సంపెట వంశంలోని ఓ యోధుడున్నట్లూ, అతడు క్రీ.శ. 1520 ప్రాంతం వాడైనట్లూ (ఆరట్లకోట యుద్ధంలో పాల్గొన్నందున), సింహాద్రికి అతడు జయస్తంభాన్ని మోసుకెళ్లి చేర్చినట్లూ ఊహించి వ్రాశారు

చౌదరిగారు. ఇది హాస్యాస్పదంగా వుంది. జయశిల (జయస్తంభం)లో ఏ రాజైనా తన దండయాత్రలో జయించిన ప్రాంతాలు పేర్కొంటాడు. అలాగే కృష్ణరాయలు పొట్నూరులో తాను పాతించిన జయస్తంభంలో సింహాద్రిని కూడా చేర్చాడు. దీని అర్థం కృష్ణరాయల ఉత్తర విజయ యాత్ర సింహాద్రి వరకూ సాగిందని. అంతేగాని ఆ శిలను సింహాద్రికి చేర్చడం కాదు. ఈ చాటు పద్యంలో పెద్దన మహాకవి చెప్పింది కృష్ణరాయల గురించేగాని వేరొక వీరుని గురించి కాదు.

శ్రీకృష్ణదేవరాయల యింటిపేరు 'సంపెట' లేక 'సమ్మెట' వారు. సమ్మెట యింటిపేరు గలవారు నేటికీ కమ్మవారిలోనూ, కాపువారిలోనూ వున్నారు కనుక శ్రీకృష్ణదేవరాయలు మా వాడంటే మా వాడనే చర్చ జరుగుతున్నది. కృష్ణదేవరాయల తండ్రి తుళువ నరసనాయకుడు చిత్తూరు జిల్లా చంద్రగిరి ప్రాంతానికి చెందిన కమ్మ కులస్థుడనీ, ఆయన తండ్రి ఈశ్వర నాయకుడనీ, తల్లి బుక్కాంబ అనీ, వీరి వంశస్థులు కొందరు కొన్ని దశాబ్దాల పాటు తుళు ప్రాంతానికి వెళ్లి స్థిరపడి, మరల వెనక్కు వచ్చారనీ, సాహసము, చొరవతో (*Enterprising nature and initiative*) యిలా నూతన ప్రాంతాలకు వలస వెళ్లి ఆ ప్రాంతాల్ని అభివృద్ధి చేయడం కమ్మవారిలోనే ఆనవాయితీగా వుందనీ, కాపుకులస్తులు సంప్రదాయ శృంఖలాబద్ధులనీ, వారు స్వంత ప్రాంతాలను వదలి వెళ్లడానికి చాల అరుదుగా తప్ప ఇష్టపడరనీ, కనుక కృష్ణదేవరాయలు తండ్రి నరసనాయకుడు కమ్మ కులస్థుడే అయివుంటాడనీ కొందరి అభిప్రాయం. ప్రముఖ రచయిత్రి కళాప్రపూర్ణ కీ.శే. తెన్నేటి హేమలత ఈ వాదనను సమర్థిస్తూ 'శ్రీకృష్ణ దేవరాయని కమ్మదనము' అనే రూపకం వ్రాశారట. అందులో మహామంత్రి తిమ్మరుసు పాత్ర చేత "రాయా! నీవు అక్షరాల కమ్మదొరవు. నీ జన్మ సలక్షణమైనది", అని అనిపించారట. నేనైతే ఆ రూపకం చూడలేదు. అయితే కృష్ణదేవరాయలు తల్లి నాగులాంబిక కమ్మ కులస్థులూ, కడపజిల్లా గండికోట ప్రభువులూ ఐనట్టి పెమ్మసానివారి ఆడపడుచు అనేది మాత్రం నిర్వివాదాంశం. తల్లి తరపు ఆత్మ బంధువులైన పెమ్మసాని అక్కపనాయడు, 80 వేల కమ్మ సైన్యాలకు అధిపతియైన పెమ్మసాని రామలింగ నాయకుడు, 'రాయవాచకం', 'కృష్ణరాయ విజయం' వగైరాలు పేర్కొంటున్న విరలప్ప నాయడు, పరశురామా నాయడు, సాయపనేని వేంకటాద్రి నాయడు, రావెళ్ల మల్లన్న లేక మల్లి నాయడు, చిరుమామిళ్ల పెద్దన్న, చిరుమామిళ్ల తిమ్మనృపాలుడు, సూర్యదేవర ముసలప్ప నాయకుడు (శ్రీకృష్ణరాయలతో పాటు ఆరట్లకోట యుద్ధంలో పాల్గొన్న వీరుడు), మిక్కిలి నాయనింగారు వగైరా ఆప్తబంధువులైన కమ్మవీరులు శ్రీకృష్ణదేవరాయలకు అన్నిటా బాసటగా నిలిచారు. ఆయన అల్లుడు అళియ రామరాయలు కూడా చాళుక్య సంతతిలో ఆరవీటి వంశానికి చెందిన కమ్మకులస్థుడేననేది రూఢిపడిన సత్యమే. రామరాయలు తమ్ముడు తిరుమలరాయలే కృష్ణదేవరాయల రెండవ కుమార్తెను పెళ్లాడాడు. నాగార్జున కొండ శాసనాన్ని బట్టి సలికి రెమ్మణ్ణకుడు చాళుక్యుల మూలపురుషుడు. సలికి యింటి పేరుకలవారు కమ్మవారిలో నేటికీ వున్నారు. వారిది రత్నాల గోత్రం. కృష్ణ దేవరాయల బంధు వర్గంలో ఆయన అల్లుళ్లైన అళియ రామరాయలు, తిరుమల రాయలే కాక కోనేరు రామరాజు వగైరా యింకా ఎందరో చాళుక్యాన్వయులుండేవారు.

కృష్ణరాయల సవతి తమ్ముడు అచ్యుతరాయలు యొక్క పట్టమహిషి తిరుమలాంబ కూడా గండికోట పెమ్మసాని వారి ఆడపడుచే. (ఈమే 'వరదాంబికా పరిణయం' అనే కావ్యాన్ని వ్రాసింది.) ఈ బాంధవ్యాలన్నింటిని బట్టీ కృష్ణదేవరాయలు కమ్మ కులస్థుడనే వాదనకు ఊతం లభిస్తూంది.

విద్వన్మిత్రులు డా॥ బండ్లమూడి సుబ్బారావు గారు (ప్రొఫెసర్ యన్.జి. రంగా ఫౌండేషన్ అధ్యక్షులు) 2004 అక్టోబర్‌లో 'శ్రీ కృష్ణ దేవరాయలు' అనే గ్రంథాన్ని వెలువరించారు. ఆయనా గ్రంథంలో యిలా వ్రాశారు–

"సరస్వతీ పుత్ర పుట్టపర్తి నారాయణాచార్యుల వారు తుళువ వంశీకులు తెలుగువారేననీ, 'సంపెట' లేదా 'సమ్మెట' యింటి పేరు గల వీరు కమ్మ లేదా బలిజ కులస్థులని చెప్పారు. శ్రీమతి తెన్నేటి హేమలత వీరు కమ్మ కులస్థులని చెప్పింది.

యాదవులనే వాదన కూడా వుంది. ఏది ఏమైనా వారు తెలుగు వారే. శూద్రులే. కమ్మ లేదా బలిజ లేదా యాదవ కులానికి చెందిన వారే."

ప్రస్తుతం కృష్ణ రాయలు ఎవరివాడనే చర్చ రేగడానికి యిది దారి తీసింది. అందుకే యీ విషయమై మరింత లోతుగా అధ్యయనం చేసి కృష్ణ రాయల మూలాల్ని తెలిపే మరిన్ని చారిత్రక ఆధారాలను నా శాయశక్తులా యీ అనుబంధంలో పాఠకుల ముందుంచాను. రాజ్య అవసరాల రీత్యా శ్రీరంగ పట్టణ పాలకుడైన కుమార వీరయ్య ఒడయరు అని పేరుగాంచిన కుమార వీర శ్యామరాజు (చామరాజు) యొక్క కుమార్తె తిరుమల దేవిని కృష్ణ దేవరాయలు వివాహం చేసుకున్నంత మాత్రాన ఆయన్ని యాదవుడని మనం భావించలేం. ఆ చామరాజు మొదలుకొని యిటీవలి కాలం వరకు మైసూరు సంస్థానాన్ని పాలించిన జయ చామరాజ ఒడయర్ వరకు ఆ పాలకులంతా 'కురుంబ' కులస్థులు. వారు రాయల వారి భార్య తరపు బంధువులు. వారసులు కారు. గొర్రెల బొచ్చుతో కంబళ్లు నేయడం కుల వృత్తిగా కల 'కురుంబ' లేక 'కురుమ' కులస్థులు యాదవులలోని ఒక శాఖ. 'కురమ' లేక 'కూర్మ' కులం వేరు. కూర్మ, కుంబీ, కూర్మీ, క్రమ, కమ్మ శబ్దాలన్నీ సమానార్థకాలు.

రాబర్ట్ స్యూయల్ పేర్కొన్నట్లు హరిహర రాయలు, బుక్క రాయలు కురమ లేక కూర్మ కులస్థులే. బియా బెరిన్నీ వంటి కొందరు చరిత్ర కారులు పేర్కొన్నట్లు ముసునూరి ప్రోలయ, కాపయ నాయకులకు హరిహర, బుక్క రాయలకూ బాంధవ్యముండే అవకాశముంది. అలాగే తాము దుర్జయాన్వయులమని చెప్పుకున్న కాకతీయుల సంతతిలోని వారే యీ హరిహర, బుక్క రాయలని కొందరు చరిత్ర కారులు అభిప్రాయపడడంలో కూడా విడ్డూరమేమీ లేదు. అలా విజయనగర పాలకుల మూలాలు కాకతీయులవేననే నిర్ధారణకు మనం రావచ్చు. శ్రీకృష్ణ దేవరాయల ముత్తాత తిమ్మయ నాయకుని కాలంలో యీ వంశస్థులు తుళువ రాజ్య పాలకులు. అంతకంటే పూర్వీకుల గురించి శాసన సంబంధమైన, వాఙ్మయ సంబంధమైన ఆధారాలు లభించడం లేదు. నంది మల్లయ, ఘంట సింగయ కవులు రచించిన 'వరాహ పురాణం' (యిది తుళువ నరస నాయకునికి అంకిత మివ్వబడింది.)లో పేర్కొన్న దాన్ని బట్టి "తుళువ రాజ్యం సంతత వీరభోజ్యం. అక్కడి రాజులు గొప్ప కీర్తిగాంచిన వారు. వారిలో అగ్రగణ్యుడు విచిత్ర కళా కుశలుడైన తిమ్మధాత్రీ రమణుడు." అల్లసాని పెద్దన వ్రాసిన 'మను చరిత్రము' యీయనను 'తిమ్మ క్షితీశాగ్రణి' అని పేర్కొన్నది. ఈయన భార్య దేవకీ దేవి. ఈయనకు ఈశ్వర నాయకుడు, తిమ్మానాయకుడు అని యిద్దరు కుమారులు. ఈశ్వర నాయకుడు సాళువ గుండ నరసింహరాయలు వద్ద ప్రధాన సేనాధిపతిగా పనిచేసి తన ప్రభువుకు అనేక యుద్ధాలలో విజయాలను చేకూర్చాడు. బహుశా తుళువ రాజ్యాన్ని పాలించిన తిమ్మ నాయకుడు తన అవసాన దశలో, ఏవైనా ప్రతికూల పరిస్థితుల కారణంగానో, లేక తన మాతృభూమి (చిత్తూరు జిల్లా చంద్రగిరి) పైన మమకారంతోనో తిరిగి చంద్రగిరి ప్రాంతానికి వచ్చి స్థిరపడి వుంటాడు. తిమ్మయ కుమారుడైన ఈశ్వర నాయకుడి శౌర్య ప్రతాపాలను గురించి 'పారిజాతాపహరణం' కృత్యాదిలోనూ, 'మను చరిత్ర' కృత్యాదిలోనూ విశేషంగా వర్ణనలున్నాయి. మను చరిత్రములో చంద్రవంశంలో ప్రసిద్ధుడైన యయాతికి యదు, తుర్వసుడు అనే యిరువురు జన్మించారనీ, తుర్వసుని వంశీకులే తుళువ వారనీ పేర్కొనబడింది. ఈశ్వర నాయకుడికి గౌరాంబ, బుక్కాంబ అనే యిరువురు భార్యలు. గౌరాంబకు పురుష సంతానం లేదు. బుక్కాంబకు నరస నాయకుడు, తిమ్మ నాయకుడు అనే యిరువురు కుమారులు. ఈ నరస నాయకునికి తిప్పాంబ, నాగులాంబ, ఓబాంబ అనే ముగ్గురు భార్యలున్నారు. వీరికి వరుసగా వీర నరసింహ రాయలు, శ్రీ కృష్ణ దేవరాయలు, అచ్యుత రాయలు జన్మించారు. (ఓబాంబకు రంగరాయలనే మరొక కుమారుడూ వున్నాడు). అలా చంద్రగిరి ప్రాంతానికి చెందిన పదహారణాల తెలుగు కుటుంబీకులే అయినప్పటికీ కొన్ని దశాబ్దాల పాటు మాతృభూమికి

దూరంగా తుళు ప్రాంతంలో నివసించి వచ్చిన వీరు ఆనాడు సహజంగానే రెండవ తరగతి వారుగా చూడబడి వుంటారు. అందులో వింతేమీ లేదు. వారు తుళు ప్రాంతంలో రాజ్యాలేలినప్పటికీ చంద్రగిరికి తిరిగి వచ్చిన పిమ్మట వారినంతా 'తుళువ ప్రజలు' అని పిలవడం, తెలుగు భాషలో 'తులువ' అంటే 'కుత్సితుడు' అనే అర్థం వుండడాన్ని బట్టి కూడా వారికి కొంత మనోక్లేశం కలిగి వుండొచ్చు. సాటివారిలో శ్రీ కృష్ణ దేవరాయల పరిస్థితి బాల్యంలో మరింత దారుణంగా వుండి వుంటుందని మనం ఊహించవచ్చు. కృష్ణ రాయల తల్లి నాగులాంబ గండికోట పెమ్మసాని వారి ఆడపడుచు. పెమ్మసాని వారు పదహారణాల తెలుగు కమ్మ ప్రభువులు. వారి పూర్వులు గజ సాహిణులుగానో, అశ్వ సాహిణులుగానో పనిచేసిన కారణంగా వారి యింటి పేరు 'పెమ్మ సాహిణి' అని ఏర్పడి అదే క్రమంగా 'పెమ్మసాని' అయింది. ఉత్తర భారత దేశంలో సాహిణులు సహానీ, షహానే, సాహ్ని, పట్సానీ, సైనీ వగైరా గృహ నామాలు పొందారు. ఆంధ్రలో 'సాని' అనేది వాటికి సమానార్థకమే. కాపు, రెడ్డి వగైరా కులాలలో కూడా యిలా సాహిణులుగా పని చేసిన వారికి పెరమసాని, కారసాని, కాటసాని వగైరా యిండ్ల పేర్లేర్పడ్డాయి. 'సాని' శబ్దం సాహిణి యొక్క రూపాంతరమే కనుక ఘనమైనదే కాని, ఏ రకంగానూ అవమానకరమైనది కాదు. అయితే కృష్ణ రాయలు అసలే నరస నాయకుని రెండవ భార్య కుమారుడు. ఈయనంటే తండ్రికి విపరీతమైన ప్రేమ. ఆయన పుట్టిన వేళా విశేషం కారణంగా తాను యుద్ధాలలో విజయాలు పొందానని నరసనాయకుడు మూఢంగా నమ్మేవాడట. కృష్ణ రాయల పట్ల ఆయన చూపే అతి ప్రేమ మొదటి భార్య తిప్పాంబికకు సహజంగానే ఈర్ష్యాసూయలు కలిగించింది. ఆమె కృష్ణ రాయలను చంపించడానికి చేసిన ప్రయత్నాలు కూడా విఫలమయ్యాయి. దీంతో రెచ్చిపోయిన ఆమె కృష్ణ రాయలకు తండ్రి వారసత్వ హక్కులు సంక్రమించకుండా పోవడానికి తన సవతి నాగులాంబ సాని అనీ, కృష్ణ రాయలు సానికి పుట్టిన వాడనీ విష ప్రచారం చేసింది. ఇది రాయలకు బాల్యంలో ఎంతో మనోక్లేశం కలిగించి వుంటుంది. ఈ ప్రతికూల పరిస్థితులే ఆయనలో పట్టుదలను రేకెత్తించి, ఆయన సర్వతోముఖాభివృద్ధికి యితోధికంగా తోడ్పడి వుంటాయి. ఆనాడు రాయల వారి తల్లి భోగకాంత అని ప్రచారంలో వున్న రెండు కథలు చదివితే అవి ఎంతటి అర్థ రహితమైన కట్టుకథలో పాఠకులు గ్రహించగలరు.

తుళువ నరసనాయకుడు ఒకరోజు బహిర్భూమికి చెంబు తీసుకుని వెళ్లగా ఒక ఉల్క విపరీతమైన కాంతితో ఆయన చెంబులోని నీటిలో పడిందట. అతడు వెంటనే ఆ చెంబు మూతిని తన చేతితో మూసి పట్టి ఆ తరువాత తిమ్మరుసు మంత్రి సలహాపై ఆ నీటిని త్రాగాడట. తిమ్మరుసు సలహాపైనే ఓ మహర్జాతకుడి జననం కోసం వెంటనే తన భార్య తిప్పాంబికను కూడడానికి వెళ్లి, ఆమెకు కబురంపాడట. ఏ కారణంగానో ఆమె రాలేదట. దాంతో నరసనాయకుడు నాగమ్మ అనే ఒక దాసిదానిని కూడగా, ఆమె తక్షణం గర్భవతియై నవమాసాలు పూర్తియైన పిదప ఒక బాలుడిని కన్నదట. అదృష్ట జాతకుడైన ఆ బాలునికి తండ్రి శ్రీకృష్ణ దేవరాయలు అని నామకరణం చేసి అతి ప్రేమగా పెంచుకుంటూ తాను రణరంగంలో విజయం పొందినప్పుడల్లా, అది కృష్ణ రాయలు పుట్టిన వేళా విశేషమని మూఢంగా నమ్ముతూ ఆ బాలుడిపై మరింత ప్రేమ పెంచుకుంటున్నాడట. తిప్పాంబిక దీనిని సహించలేక ఆ బాలుడిని చంపించాలని ప్రయత్నాలు చేసినా ఆ ప్రయత్నాలు విఫలమయ్యాయట. అప్పుడు నరసనాయకుని ఆజ్ఞపై తిమ్మరుసు ఆ బాలుడిని సురక్షితంగా తన భవనంలో పెంచి పెద్దచేశాడట. అలా కృష్ణ రాయలను తిమ్మరుసుకు అప్పజెప్పేటప్పటికి అతడికి తొమ్మిది సంవత్సరాల వయస్సట. అంచేతనే బాలుడైన కృష్ణ రాయలు తిమ్మరుసును తండ్రిలా భావించి 'అప్పాజీ' అని పిలిచేవాడట. ఈ కథలోని మిగిలిన అంశాలు వాస్తవమే కావచ్చు. కాని కృష్ణ రాయల ఈ జనన వృత్తాంతం ఎంత అర్థరహితంగానూ, అశాస్త్రీయంగానూ వుందో విజ్ఞులైన పాఠకులు గ్రహించగలరు.

ఇంకొక కథ ప్రకారం – విజయనగరపు రాజులలో పదహారవ వాడైన వీర నృసింహ రాయలు అనే నామాంతరం కలిగిన తుళువ నరస నాయకుడు చిరకాలము పుత్రులు లేక ఖేద పడుచుండగా, ఒకనాడు ఒక విప్ర శ్రేష్ఠుడు వచ్చి ఒక శుభ ముహూర్తం నిర్ణయించి, ఆ సమయంలో భార్యను కూడితే తప్పకుండా పుత్రుడు కలుగుతాడని చెప్పాడట. ఆ రాజు ఆ ముహూర్తానికి సిద్ధమై తన మందిరానికి రమ్మని భార్య తిప్పాంబికకు కబురు పంపాడట. ఆమె తన అందాలకు మెరుగులు దిద్దుకుంటూ, చీర సింగారించుకుంటూ విపరీతమైన జాప్యం చేసిందట. రాణి ఎంతకూ రాకపోతుంటే, శుభ ముహూర్తం దాటి పోతున్నదని ఆందోళన పడిన రాజు తన మందిరంలో దీపాలు వెలిగించే నాగి అనే దాసితో కూడగా, ఆమె తక్షణం గర్భం దాల్చి నవ మాసాల అనంతరం ఒక బాలుడిని కన్నదట. ఆ బాలుడే కృష్ణరాయలట.

ఈ రెండు కథలూ అర్థం లేనివని తేలికగానే గ్రహించవచ్చు. పైపెచ్చు రెండవ కథలోని మరొక దోషమేమిటంటే శ్రీ కృష్ణ దేవరాయలు జనన కాలానికి ముందే తుళువ నరసనాయకునికి తిప్పాంబిక వలన వీర నరసింహుడు జన్మించాడు. కృష్ణ రాయలు కంటే ముందుగా భుజబల (భుజబడ) రాయలనే పేరుతో పాలించాడు కూడా. తన మార్గం నిష్కంటకం చేసుకొనడానికి తన తల్లి వలె వీరనరసింహుడు కూడా కృష్ణ రాయలను హత్య చేయించాలని ప్రయత్నించి విఫలమయ్యాడు. తన తమ్ముడిని చంపమని ఆ రాజు తిమ్మరుసును ఆదేశించినా, తిమ్మరుసు యుక్తిగా బాలుడిని రహస్యంగా తన మందిరంలో పెంచుతూ, వీర నరసింహునికి కృష్ణ రాయలను చంపినట్లు తెలిపి, ఆనవాలుగా లేడి కనుగుడ్లు చూపాడట.

తన సవతి తమ్మునిపై యింతగా కక్ష కట్టిన వీర నరసింహ రాయలు వేయించిన ఒక శాసనంలోని ఒక శ్లోకం యీ క్రింది విధంగా వుంది –

"శ్లో॥ తిప్పాజీ నాగలాదేవ్యోః కౌసల్యా శ్రీ సుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేంద్రత్తస్మాత్పంక్తిరథాదివ
వీరౌ వినయినౌ రామలక్ష్మణా వివ నందనౌ
జాతా వీరనృసింహేంద్రః కృష్ణ రాయ మహీపతీ ।
తస్మాన్నరస రాజేంద్రాత్తిప్పాజీ నాగమాంబయోః
క్రమా ద్వీర నృసింహేంద్ర కృష్ణరాయ బభూవతుః
అన్యోన్యోపమయోస్సర్వసద్గుణౌ ఘన సముద్రయోః
తయోర్వీర నృసింహేంద్రః పిత్ర్యం సింహాసనం శ్రితః ॥

దీన్ని బట్టి మనకు అర్థమయ్యేదేమిటంటే –

తిప్పాజీ, నాగలా దేవి – కౌసల్యా దేవి, సుమిత్రా దేవి వంటి వారు. నృసింహేంద్రుడు (తుళువ నరసనాయకుడు) పంక్తి రథుని (దశరథుని) వంటి వాడు. వీరికి వీరులు, వినయ సంపన్నులూనైన రామలక్ష్మణుల వంటి కుమారులు వీర నృసింహేంద్రుడు, కృష్ణరాయ మహీపతి అనే వారు కలిగారు. నరస రాజేంద్రునికి తిప్పాజీ, నాగమాంబ వలన క్రమంగా వీర నరసింహేంద్రుడు, కృష్ణ రాయడు జన్మించారు.

వీర నరసింహుడు వేయించిన శాసనంలోని శ్లోకం అయిన కారణంగా యిది చారిత్రకంగా ఎంతో విలువైనది. (దీనిని స్వరధారి ఫాల్గుణ మాసపు 'భారతి సంచిక'లో 155వ పేజీలో ప్రఖ్యాత చరిత్రకారులు ఆచార్య నేలటూరి వేంకట రమణయ్య గారు ప్రకటించారు). సవతి తల్లి పట్ల, సవతి తమ్ముని పట్ల ఎవరికైనా ద్వేషం సహజం. పైపెచ్చు తన సవతి

తమ్ముడిని మట్టు పెట్టాలని కూడా యత్నించిన వాడు వీర నరసింహుడు. అలాంటి వీర నరసింహుడు తన సవతి తల్లిని సుమిత్రతో పోలుస్తూ, ఆమెను నాగలాదేవి, నాగమాంబ అని పేర్కొన్నాడంటే ఆవిడ భోగకాంతా కాదు : దాసీ కాదు – నరస నాయకుని ధర్మపత్ని అని అర్థం చేసుకోవచ్చు.

అయితే కృష్ణ రాయలకు ఆలస్యంగా వివాహమైందనీ, దాసీ పుత్రుడనే కారణము చేత ఎవ్వరూ కన్యను యివ్వక పోవడమే యీ ఆలస్యానికి కారణమనీ కొందరు పేర్కొంటున్నారని చెపుతూ 'ఆంధ్ర కవి తరంగిణి' వ్రాసిన చాగంటి శేషయ్య గారు 'రాయలుకు 25 ఏళ్ల వయస్సులోనే చిన్నాదేవి, తిరుమల దేవి అనే యిద్దరు భార్యలున్నట్లు తిరుపతి యుందలి శాసనం వలన స్పష్టమౌతున్నదనీ, ఆ కాలమున 25 ఏళ్లు వివాహ వయస్సు దాటిపోయిన కాలంగా పరిగణింపబడడం లేదనీ, కాబట్టి రాయలు దాసీ పుత్రుడనడానికిదొక కారణంగా తలచరాదనీ' వ్రాశారు. (ఆంధ్ర కవి తరంగిణి – సప్తమ సంపుటం – పేజీ 12)

ఏది ఏమైనా కొన్ని దశాబ్దాల పాటు తుళు ప్రాంతానికి వలస వెళ్లి తమ మాతృ భూమికి తిరిగి వచ్చిన తుళువ వంశీకులకు సాళువ వారైన స్థానిక చంద్రగిరి వాస్తవ్యులతో కలగలిసి పోవడానికి అప్పట్లో కొన్ని యిబ్బందులెదురై వుంటాయి. రాయల వారి తల్లి నాగులాంబ యింటిపేరు పెమ్మసాని వారు కావడం, గుంటూరు జిల్లా బెల్లంకొండకు చెందిన పెమ్మసాని తిమ్మానాయుడు గండికోటకు చెందిన మిక్కిలినేని రామా నాయనికి యిల్లరికపుటల్లుడిగా కడప జిల్లా ప్రాంతానికి వెళ్లిన వాడు కావడం, నేటి రాయలసీమ ప్రాంతాలలో అప్పటికి పెమ్మసాని అనే యింటిపేరు కలవారు బహు కొద్ది మంది కావటం కారణంగా సాళువ వారు యీ యింటి పేరులోని 'సాని' అనే పదాన్ని తప్పుగా అర్థం చేసుకొని వుండే అవకాశముంది. రాయల వారి విషయంలో తిప్పాంబిక చేసిన విష ప్రచారం దీనికి తోడై వుంటుంది. ఈ అన్నింటి కారణంగా బాల్యంలో వ్యధ చెందిన రాయల వారిని అప్పాజీ తిమ్మరుసు ఓదారుస్తూ, 'రాయా ! నీవు అక్షరాల కమ్మదొరవు. నీ జన్మ సలక్షణమైనది.' అన్నట్లుగా కీ.శే. తెన్నేటి హేమలత గారు వ్రాయడం సముచితంగానే వుంది. రాయలుకు పట్టాభిషేకం నాటికి 25 సంవత్సరాల వయస్సుంటుందని కొందరు చరిత్ర కారులు తేల్చారు. ఏమైనా యీ విషయమై చరిత్రకారుల్లో అభిప్రాయ భేదాలున్నాయి. తండ్రి నరస నాయకుడు క్రీ.శ. 1505 లో మరణించాడు. అక్కడి నుండి క్రీ.శ. 1509 వరకు తిప్పాంబిక, ఆమె కుమారుడు వీర నరసింహ రాయలు చేసే కుట్రలు తట్టుకుంటూ, కొంత కాలం తిమ్మరుసు ఆశ్రయంలో ప్రచ్ఛన్నంగానూ జీవించాడు కృష్ణ రాయలు. సవతి తల్లి, సవతి అన్న బాధ్యత తీసుకొని తనకు యుక్త వయస్సులో పెళ్లి చేసే సంగతి అటుంచి, వీలు దొరికితే చంపడానికే ప్రయత్నించారు. ఆ కారణంగా ఆయనకు వివాహానికి యుక్త వయస్సు దాటి పోయి వుంటుంది. అప్పుడే ఆయనకు చిన్నాదేవి అనే నాట్యకత్తెతో సంబంధం ఏర్పడింది. ఆ నాట్యకత్తెతో తన సంబంధం విషయంలో రాయలవారు దాపరికమేమీ చేయలేదు. (ఆ తరువాత ఆమెను తన పట్టమహిషిగా కూడా స్వీకరించారు). అప్పటికే సాళువారిలో చిన్న చూపుకు గురైన రాయల వారికి యీ నాట్యకత్తెతో సంబంధం మరొక ప్రతికూలాంశమైంది. రాయలవారికి పట్టాభిషేకం నాటికి వివాహం జరుగలేదనేది చారిత్రక సత్యం. ఆ తరువాత మూడు నాలుగేళ్లకు అంటే సుమారు ఆయనకు 29 సం॥ల వయస్సులో కృష్ణ రాయలు జరిపిన దక్షిణ దిగ్విజయ యాత్రలో భాగంగా గంగరాజ ఒడయరును ఓడించి ఉమ్మత్తూరునూ, ఆయన పాలన క్రింద వున్న శివసముద్రం, శ్రీరంగ పట్టణం కోటలను స్వాధీన పరచుకున్నాడు. ఆ సందర్భంగానే ఉమ్మత్తూరు రాజుతో శ్రీ రంగ పట్టణం స్థానిక పాలకుడైన కుమార వీరయ్య అనబడిన చామరాజ ఒడయరుకు అప్పటికే ఏర్పడిన విభేదాలను ఆసరా చేసుకొని చామరాజును తన పక్షానికి తిప్పుకొనడానికి రాజకీయ అవసరాల రీత్యా ఆయన కుమార్తె అయిన తిరుమలదేవిని వివాహం చేసుకున్నాడు. అనంతరం పూర్వ దిగ్విజయ యాత్రలో భాగంగా కటకం పాలకుడైన వీర

ప్రతాప రుద్ర గజపతిని ఓడించి ఆయన కుమార్తె తుక్కాదేవిని సంధి షరతులలో భాగంగా పెండ్లాడాడు. తుక్కాదేవి అనే నామాంతరం కలిగిన జగన్మోహిని ఆ బలవంతపు వివాహం అనంతరం రాయలకు మూడవ భార్యగా జీవితాంతం సవతి బ్రతుకు బ్రతకడం యిష్టంలేక 'నేను సుక్షత్రియురాలను. నా ఒక సవతి వేశ్య. మరియొక సవతి యాదవ స్త్రీ నా?' అంటూ బాధపడి మొదటి రాత్రే రాయల వారిని హత్య చేయడానికి ప్రయత్నించి, విఫలమై, చెరసాలలో బంధించబడిందట. (తన తండ్రి వీర ప్రతాప రుద్ర గజపతి, పినతండ్రి హంవీరుడు వగైరాల ప్రోత్సాహంతోనే ఆమె రాజకీయ కారణాలతోనే, శోభనపు తొలి రాత్రే యీ హత్యా యత్నానికి ఒడికట్టిందని కొందరు చారిత్రకులు అభిప్రాయ పడుతున్నారు). చెరసాలలోనే కొన్నేళ్ల పాటు మ్రగ్గిన ఆమె జరిగిన దానికి పశ్చాత్తాపం తెలియచేస్తూ 'తుక్కా పంచకమ్' పేరిట ఐదు శ్లోకాలను రచించి రాయలవారికి పంపిందట. అది చదువుకున్న రాయల వారు ఆమెను విముదల చేసినప్పటికీ, తిరిగి తన పట్టమహిషిగా స్వీకరించడానికి మాత్రం యిష్టపడక తగినంత ధనాన్నిచ్చి కటకం తిరిగి వెళ్లమని సగౌరవంగా పంపాడట. ఆమె తిరిగి తండ్రి వద్దకు వెళ్లలేక మార్గ మధ్యంలో నేటి ప్రకాశం జిల్లా కంభం వద్ద స్థిరపడి అక్కడి ప్రసిద్ధమైన చెరువును త్రవ్వించడం వగైరా ధర్మ కార్యాలు చేసి అక్కడే తనువు చాలించిందట.

'కృష్ణ రాయలు ఎవరి వాడు ?' అనే అంశంపైన యిటీవల చెలరేగిన చర్చ పర్యవసానంగా కొందరు విమర్శకులు "శ్రీ కృష్ణ దేవరాయలు వంశమూలాల గురించిన చర్చ యిప్పుడెందుకు ? కమ్మ వారిలోనూ, కాపు (తెలగ) వారిలోనూ వున్నట్లు 'సమ్మెట' అనే యింటి పేరు వెలమవారు తదితరులలో కూడా వుండి వుండవచ్చు కదా. ఆయన వెలమ, కమ్మ, తెలగ, కాపు, బలిజ, ఒంటరి కులాలన్నిటికీ మూలమైనట్టి కులం వాడనుకుందాం. అప్పుడు ఏ పేచీ వుండదు. ఎందుకంటే కృష్ణ రాయల కాలంనాటికింకా యీ కులాలకు వేర్వేరు ప్రతిపత్తి, గుర్తింపు ఏర్పడలేదు కదా?" అంటూ మధ్యేవాద వైఖరినవలంబిస్తున్నారు.

ఇది హర్షించదగినదే ! అయితే చరిత్రలో ఎంత వద్దనుకున్నా ఒక్కోసారి కొన్ని నిర్ధారణలు తప్పని సరి అవుతాయి. వివాదాలకు, ఎడతెగని వాదోపవాదాలకు భరతవాక్యం పలకాలంటే స్పష్టమైన చారిత్రక ఆధారాలతో చేయబడే నిర్ధారణలు ఎంతైనా అవసరం. అందుకే పై మధ్యే వాదుల వాదనను నేను ఖండించక తప్పడంలేదు. క్రీ. శ. 1176 - 1182 మధ్య కాలంలో పలనాటి యుద్ధం జరిగింది. మొత్తం తెలుగు నేలనే కాక కన్నడ సీమను కూడా విపరీతంగా ప్రభావితం చేసిన ఆ యుద్ధం సమాజాన్ని మత పరంగా శైవ, వైష్ణవ వర్గాలుగా చీల్చి వేసింది. కుల పరంగా ఒక వైపు శైవాన్ని సమర్థించే కులాలన్నీ సంఘటితమై, మరొక ప్రక్క వైష్ణవ మతానుయాయులైన కులాలకు వ్యతిరేకంగా మోహరించాయి. అప్పటి వరకు ఒక కట్టుగా వున్న హైహయాన్వయులు రెండు పక్షాలుగా చీలిపోయారు. ఈ చీలికకు బీజం బ్రహ్మనాయని తండ్రి దొడ్డ నాయని వివాహ కాలంలోనే పడింది. కులవ్యవస్థను సమర్థించి, కుల ఆధిక్యతా భావంతో వున్న అధిక సంఖ్యాకులైన హైహయాన్వయులు నలగామరాజు నేతృత్వంలో (నాయకురాలు నాగమ్మ అనే రెడ్డి వనిత మార్గదర్శకత్వంలో) శైవుల పక్షం వహించారు. హైహయాన్వయులలో చిన్న చూపుకు గురైన అల్ప సంఖ్యాకులు అధిక సంఖ్యాకుల నుండి విడివడి బ్రహ్మనాయని నేతృత్వంలో కులరహిత సమాజ నిర్మాణమే ధ్యేయంగా ప్రధానంగా అణగారిన కులాల విశాల ఐక్య సంఘటనను నిర్మించి, చాపకూటి సిద్ధాంతంతో అన్ని వర్గాలనూ ఆకర్షించి వైష్ణవుల పక్షం వహించారు. ఈ యుద్ధం పర్యవసానంగా వెలమ, కమ్మ, కాపు, తెలగ, బలిజ, ఒంటరి కులాలు ప్రస్ఫుటంగా ఏర్పడ్డాయి. ఎందరో కవుల కావ్యాలలో వెలమ కులం ప్రత్యేకంగా ప్రస్తావించబడుతూ వస్తూంది. తెనాలి రామకృష్ణ కవి కూడా 'పురి వెలమల భాగ్యమహిమఁ బొగడగ వశమే?' అంటూ పేర్కొన్నాడు. (పాం. మా. 1-112). శ్రీ నాథ మహా కవి తన 'భీమ ఖండము' అను నామాంతరం కలిగిన 'భీమేశ్వర పురాణం' లో వీరభద్రేశ్వర వేమ భూపాలుని వంశావళిని గురించి చెపుతూ అతని రాజధానిలో వున్న చాతుర్వర్ణాల వారిని

వర్ణిస్తూ, "వ. అందుఁ బద్మనాయకులన, వెలమలనఁ గమ్మలన త్రిమార్గ గంగాప్రవాహంబులుంబోలె గోత్రంబులన్నియేని జగత్పవిత్రంబులై ప్రవహించుచుండ" (భీమఖండము 1-31) అని పేర్కొన్నాడు. 'భీమ ఖండము' కావ్యాన్ని ఆయన క్రీ.శ. 1428 ప్రాంతంలో తూర్పు గోదావరి జిల్లా దాక్షారామ భీమేశ్వరుని సన్నిధిలో రచించి బెండపూడి అన్నయ్య మంత్రికి అంకితమిచ్చాడు. అంతకు ముందే క్రీ. శ. 1400 ప్రాంతంలో శ్రీ నాథుడు 'హరవిలాసం' అనే కావ్యాన్ని వ్రాశాడు. దానిలో 'సిరియాళుని కథ' అనే చిరుతొండనంబి చరిత్ర ఒక ఉపాఖ్యానం. అందులో సిరియాళుడిని కవి కాంచీపురానికి చెందిన అవచి తిప్పయ్య శెట్టి వంశీకునిగా పేర్కొన్నాడు. అయితే అంతకు ఎంతో పూర్వమే జనబాహుళ్యంలో ప్రచారంలో వున్న 'చిరుతొండరాజు చరిత్ర' అనే స్త్రీల పాటలో -

"వెలమ యింటను నీవు ఏల బుట్టితివి" అనే ప్రయోగం కనుపిస్తున్నది. ('తెలుగు జానపద గేయ సాహిత్యం' - డా॥ బిరుదురాజు రామరాజు. పేజీలు 309-413)

"క్రీ. శ. 1420 లో కొండవీడును పాలిస్తున్న పెదకోమటి వేమారెడ్డి మరణించగా, అనంతరం ఆయన కుమారుడు రాచవేమును రాజ్యానికి వచ్చి 'పురిటి మంచం'పైన కూడా పన్ను వేసి, అది వసూలు చేసే సందర్భంలో సవరం ఎల్లయ్య అనే బలిజ నాయకుడు పొడిచి వేయగా మరణించాడు." (సమగ్ర ఆంధ్ర సాహిత్యం - ఆరుద్ర 3వ సంపుటి. పేజీ 304.)

క్రీ. శ. 1368 లో ఓరుగల్లుకు సమీపంలోని భీమవరం వద్ద జరిగిన యుద్ధంలో ముసునూరి కాపయ నాయకుడిని సంహరించిన రాచకొండ వెలమ పాలకుడు అనపోతానాయకుడు అంతకు పూర్వం క్రీ.శ. 1361లోనే జల్లిపల్లి యుద్ధం సందర్భంగా ముసునూరి కాపయ నాయకుని సైన్యాలను తునుమాడి 'కమ్మ దొరల మోదిన కాల దండమ' అనే బిరుదు వహించాడు. అంటే అప్పటికే కమ్మ, వెలమ కులాలు స్పష్టంగా ఏర్పడ్డాయన్నమాట అంతే కాదు - పద్మనాయక యుగం (క్రీ. శ. 1330 - 1430) నాటికే బలిజలు, తెలిక కులస్థులకు వేర్వేరు సంఘాలున్నట్లు శాసనాధారాలున్నాయని 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' (పేజీ 305. రచయితలు : ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం గారలు) పేర్కొంటున్నది.

కృష్ణరాయల కాలం నాటికి ఎంతో ముందరే కమ్మనాడులో నివసిస్తూ పరస్పర బాంధవ్యమేర్పరచుకున్న తెలుగు చోడులు, హైహయాన్వయులు, చాళుక్యాన్వయులు, కాకతీయులు (దుర్జయాన్వయులు) 'కమ్మ' అనే కులంగా రూపుదాల్చారు.

పైన పేర్కొన్న అన్ని ఉదాహరణలను బట్టి తేలేదేమంటే క్రీ. శ. 1400 సంవత్సరం కంటే ఎంతో పూర్వమే కమ్మ, వెలమ, బలిజ, కాపు (రెడ్డి), తెలగ, కాపు (తెలగ కాపు), ఒంటరి కులాలకు స్పష్టమైన ప్రతిపత్తి, గుర్తింపు ఏర్పడింది. పలనాటి యుద్ధం పర్యవసానంగానే యీ కుల విభజన జరిగిందని నా అభిప్రాయం. చారిత్రక సత్యం యిది కాగా కృష్ణ రాయల కాలం (క్రీ. శ.1509 - 30)నాటికి యింకా ఆ యా కులాలకు స్పష్టమైన ప్రతిపత్తి, గుర్తింపు ఏర్పడలేదని వాదించే వారినేమనాలి ?

తాను తెలుగు బిడ్డనని విస్పష్టంగా పేర్కొన్నట్లే కృష్ణ రాయలు ఏదైనా సందర్భంలో తాను ఫలానా కులం వాడినని కూడా పేర్కొని వుంటే యీ వక్షేప చర్చల అవసరం వుండేది కాదు. అయితే తెలివైన పాలకులు తాము ఫలానా అని ఎప్పుడూ ప్రకటించుకోరు. అధికారంలో వున్నన్నాళ్లూ అందరివారి లాగానే వారు మసలుకుంటారు. అధికార, రాజ్య ప్రయోజనాల కోస్మా తప్పదనుకుంటే యితర వర్ణాల వారితో వియ్యమందడానికీ వారు వెనుకాడరు. కాకతీయ చక్రవర్తిణి రుద్రమ్మ తన రెండవ కుమార్తె రుద్యమ్మను ఇందులూరి అన్నయామాత్యుడు అనే బ్రాహ్మణునికిచ్చి వివాహం చేసింది. విజయనగర ప్రభువు రెండవ హరిహరరాయలు (క్రీ. శ. 1377 - 1404) తన కుమార్తెయైన హరిహరాంబను కాటయ వేమారెడ్డికిచ్చి వివాహం చేశాడు. అలాగే కృష్ణ దేవరాయలు క్రీ.శ. 1515 లో చేసిన ఉత్తర దిగ్విజయ యాత్రలో భాగంగా

కటకం పాలకుడైన వీర ప్రతాప రుద్ర గజపతి కుమార్తె తుక్కాదేవి (జగన్మోహిని)ని వివాహం చేసుకున్నాడు. అంతకు పూర్వం క్రీ. శ. 1512లో రాయలు కర్ణాటకలోని శ్రీరంగ పట్టణాన్ని జయించి దాని పాలకుడూ, కన్నడిగుడూనైన కుమార వీరయ్య కుమార్తె తిరుమల దేవిని వివాహం చేసుకున్నాడు. ఇవన్నీ వర్ణాంతర వివాహాలే ! అధికార ప్రయోజనాల రీత్యా చేసుకున్నట్టివే! అయితే కృష్ణరాయల కాలం నాటికి ఎంతో ముందరే కమ్మ నాడులో నివసిస్తూ పరస్పర బాంధవ్యమేర్పరచుకున్న తెలుగు చోడులు, హైహయాన్వయులు, చాళుక్యాన్వయులు, కాకతీయులు (దుర్జయాన్వయులు) వగైరాలు 'కమ్మ' అనే కులంగా రూపు దాల్చారు.

శ్రీ కృష్ణ దేవరాయల పట్టాభిషేకం శాలివాహన శకం 1430 (క్రీ.శ. 1508) వ సం॥రం (శుక్ల నామ సంవత్సర) మాఘ శుద్ధ చతుర్దశి నాడు జరిగిందని కొన్ని శాసన పరమైన ఆధారాలు తెలుపుతున్నాయి. యీ తేదీ పైన కూడా కొన్ని వివాదాలున్నాయి. కొందరు యీ పట్టాభిషేక మహోత్సవ తేదీ 4-2-1509 అంటున్నారు. ఈ సంగతినటుంచి పట్టాభిషేక సమయంలో ఆ సభా మందిరంలో ఈ క్రింది ప్రముఖులున్నట్లు 'కృష్ణ రాయ విజయము'లో కుమార ధూర్జటి తెలిపాడు -

సీ॥ చక్కెర విలుకానిచక్కందనము గల్గి
చొక్కమౌ నార్వీటి బుక్కరాజు
సాకల్యముగఁ గీర్తి సర్వ దిక్తటులందుఁ
బ్రాకట స్థితి మించు నౌకు వారు
కంటక రాజన్య గర్వంబు లడగించి
లీలచే మించు నంద్యాల వారు
ధాటీ నిరాఘాట ఘోటీ హత విరోధి
కోటులై వెలయు వెల్గోటి వారు

గీ॥ చండతర శౌర్యులగు పెమ్మసాని వారు
బూదహాళి వారు మొదలైన భూమిపతులుఁ
గొలువఁ బట్టాభిషిక్తుడై చెలువు మీఱె
రమ్యగుణపాళి శ్రీ కృష్ణ రాయ మౌళి. (కృష్ణ రాయ విజయము 2-44)

ఈ పద్యంలోని మొదటి మూడు పాదాలలో పేర్కొనబడిన వారు చంద్రవంశ క్షత్రియుడైన ఉదయనుని వారసులమని చెప్పుకునే-చాళుక్యాన్వయులు. ఆర్వీటి బుక్కరాజు ముని మనుమడైన రామరాజే శ్రీకృష్ణ దేవరాయల పెద్ద అల్లుడు. ఈ బాంధవ్యానికి పూర్వమే బుక్కరాజుకూ, ఈశ్వర నాయకునికీ దగ్గర బంధుత్వం వుందని కొందరు రచయితలు పేర్కొన్నారు. చాళుక్యాన్వయులు కమ్మవారిలోని అంతర్భాగమే. అవుకు, అవుకుల, అవతల యిండ్ల పేర్లు కమ్మవారిలో నేటికీ వున్నాయి. వీరిది ప్రసిద్ధమైన వల్లుట్ల గోత్రం. అలాగే నంద్యాల వారు కూడా నేటికీ కమ్మవారిలో వున్నారు. వీరిది మిరియాల గోత్రం. వెలుగోటి వారు మాత్రం వెలమవారు. పెమ్మసాని వారు గండికోట కమ్మవారిగా ప్రసిద్ధులు. వీరివి పొన్నగంటి, వల్లుట్ల, ఎల్లుట్ల, మునుసూళ్ల, కొండోళ్ల గోత్రాలు. కొందరు విమర్శకులు బూదహళ్లి అనే గ్రామం కర్ణాటకలోని బళ్లారి జిల్లాలో వుందని వ్రాశారు. అయితే ఆ జిల్లాలో బూదూరు, బూదనూరు, బూదిహాళు, బూదగుప్ప గ్రామాలున్నాయి

కాని బూదహళ్లి కనుపించలేదు. ఒక వేళ ఒకప్పటి బూదహళ్లి బూదిహాళుగా రూపాంతరం చెంది వుండవచ్చు. బూదహళ్లి వారు ఏ కులానికి చెందిన వారో తెలియదు. ఇలా పట్టాభిషేక మహోత్సవంలో వున్న ప్రముఖులలో వెలుగోటి వారు మినహా మిగిలిన వారంతా కమ్మవారుగానే కనుపిస్తున్నారు. కృష్ణ రాయలు కమ్మ కులానికి చెందిన వాడై వుంటాడని భావించడానికి యిది కూడా ఒక బలమైన ఆధారం.

కృష్ణ దేవరాయలు చిత్తూరు జిల్లా చంద్రగిరికి చెందిన ఈశ్వర నాయకుడి మనుమడు. నరస నాయకుని కుమారుడు. తల్లి నాగులాంబ గండికోట పెమ్మసాని వారి ఆడపడుచు. అల్లుళ్లిద్దరూ చాళుక్యాన్వయులైన రామరాయలు, తిరుమల రాయలు. సవతి తమ్ముడు అచ్యుత రాయలు భార్య తిరుమలాంబ గండికోట పెమ్మసాని వారి ఆడపడుచే! 'కృష్ణ రాయ విజయం', 'రాయ వాచకం' వగైరాలు పేర్కొన్న పెమ్మసాని రామలింగ నాయకుడు, విఠలప్ప నాయడు, పరశురామానాయడు, సాయపనేని వేంకటాద్రి నాయడు, రావెళ్ల మల్లి నాయడు, చిరుమామిళ్ల పెద్దన్న, చిరుమామిళ్ల తిమ్మ నృపాలుడు, సూర్యదేవర ముసలప్ప నాయకుడు, కోనేరు రామరాజు, మిక్కిలి నాయనింగారు వగైరాలంతా ఆయన ఆత్మబంధువులు.

ఇన్ని ఆధారాలను బట్టి కృష్ణ రాయలు కమ్మ కులస్థులదనడానికి ఆస్కారం లభిస్తున్నది. ఇక యీ చర్చను యింతటితో ముగిద్దాం.

## కా క తీ యు లు  క మ్మ వా రే

ఇక తెలుగుచోడ వంశీకులతో బాంధవ్యం కల దుర్జయ వంశీకులైన కాకతీయులు కమ్మవారేనని పెక్కుర్ు విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు.

'ప్రతాపరుద్ర యశోభూషణము' లో విద్యానాథుడు తెలిపిన దాని ప్రకారం కాకతీయులది అత్యర్కేందుకులం. అంటే సూర్య, చంద్ర వంశములకంటే ఉన్నతమైనదట. అందలి కథనం ప్రకారం చంద్రవంశపు చక్రవర్తియైన పురూరవుని కుమారుడు అయుడు. అతని కుమారులలో పెద్దవాడైన రజి ఇంద్రుని కోర్కెపై రాక్షసుల్ని జయించి భూలోకాన్నేకాక కొంతకాలం స్వర్గలోకాన్ని కూడా పాలించి మరణించాడట. ఆయనకు ఐదు వందల మంది కుమారులట. వారిలో పెద్దవాడు క్రమ మహారాజు. తమ తండ్రి రాజ్యమేలిన ఇంద్రలోకం వారసత్వ ఆస్థిగా తమకే చెందాలని క్రమ మహారాజు పట్టుదలతో ఇంద్రుడితో యుద్ధం చేసి అతడిని ఓడించి, ఇంద్రలోకాన్ని బలవంతంగా స్వాధీనపరచుకొని పాలించాడట. దీంతో దేవగురువైన బృహస్పతి కోపించి, శపించగా క్రమ మహారాజుతో సహా ఆ అయిదువందల మందీ బూడిదైపోయారట. భూలోకంలో సూర్యవంశీకుడైన ఖమిత్రుడనే రాజు గౌరీపూజ చేసిన కారణంగా వీరంతా తిరిగి ఆయన సంతానంగా జన్మించారట. వారి వారసులే కాకతీయులట. అలా కాకతీయులు తొలుత చంద్రవంశీకులు, తరువాత సూర్యవంశీకులై జన్మించడంతో అత్యర్కేందుకులజులయ్యారట. ఇదంతా 'దౌర్వాస దేవీ పురాణం' లో వున్నట్లు విద్యానాథుడు పేర్కొన్నాడు. మనం లోగడ చెప్పుకున్నట్లే దేవతలు అంటే వెలుగొందే మేనిచాయగల ఓ మానవజాతి; అంతకంటే ఏమీ కాదు – అని కనుక భావిస్తే దేవతలకు రాజైన ఇంద్రుడనే వాడిని క్రమ మహారాజు జయించడం సంభావ్యమే. అయితే బృహస్పతి శాపానికి క్రమ మహారాజు, అతని సోదరులు బూడిదై పోవడం, తిరిగి గౌరీ మాహాత్మ్యం కారణంగా వారంతా ఖమిత్రుని కుమారులుగా జనించడం – యివన్నీ అశాస్త్రీయమైన విశ్వాసాల క్రింద మనం కొట్టిపారేయాల్సి వుంటుంది. అయితే ప్రతి పురాణంలో కొన్ని చరిత్రాంశాలు యిమిడి వున్నట్లే యీ పుక్కిటి పురాణం వెనుకకూడా కొన్ని వాస్తవాలుంటే వుండవచ్చు. కమ్మవారు అనాదిగా క్రమ మహారాజునూ, ఆయన వారసుడైన ప్రతాపరుద్ర చక్రవర్తినీ తమ మూలపురుషులుగా భావిస్తున్నారు.

'క్రమ' శబ్దాన్నుంచే కమ్మ శబ్దమేర్పడిందని కొందరు చరిత్రకారుల విశ్వాసం. అలా కమ్మవారు కాకతీయుల వారసులేనని విశ్వసించబడుతున్నది. సంస్కృతంలో 'క్రమ' అంటే 'అందమైన' అని అర్థం. బహుశా 'క్రమ' మహారాజు స్ఫురద్రూపి అయివుండవచ్చు. నేటి కమ్మవారి యిండ్ల పేర్లలో 'క్రమ' అనేది కూడా ఒకటి కావడం గమనించదగ్గ విశేషం.

కాకతీయులు హైందవ మతం స్వీకరించి శైవులుగా మారకముందు జైనమతస్థులని చరిత్రకారులంతా ధృవపరచారు. కూష్మాండినీ దేవి అనే జైనదేవత వీరికి యిలవేలుపు. కూష్మాండము అంటే సంస్కృతంలో గుమ్మడికాయ. గుమ్మడి పువ్వు నుంచి యీ దేవత ఉద్భవించిందని జైనుల విశ్వాసం. కర్నాటకలోని శ్రావణ బెళగొళ వగైరా జైన క్షేత్రాలన్నింటిలోనూ రాళ్లపై చెక్కబడిన గుమ్మడి తీగనూ, గుమ్మడి పువ్వు నుండి ఉద్భవిస్తున్న కూష్మాండినీ దేవి చిత్రాలను మనం చూడవచ్చు. జైనులు గుమ్మడి పండును కూష్మాండినీ దేవికి ప్రతిరూపంగా భావించేవారట. ఈ దేవతనే కాకతి, కాకతమ్మ, కాకితమ్మ అనే వివిధ పేర్లతో పిలిచేవారు. కాకతిని కులదేవతగా పూజించే వారు కనుకనే కాకతీయులకు ఆ పేరు వచ్చింది. వారి మూలపురుషుడు గుండనను కూడా 'కాకర్త్య' గుండన అని అందుకే పిలిచారు. కాకతీయులు తమ యిష్టదేవతయైన గౌరీ దేవికి 'కాకతి' ప్రతిరూపమని భావించారు. గౌరీ పూజ కారణంగానే కాకతీయుల మూలపురుషుడైన క్రమ మహారాజు ఆయన సోదరులు ఖమిత్రుని సంతానంగా పునరుజ్జీవితులయ్యారని వారి విశ్వాసం. జైనమతావలంబకులుగా వున్నప్పుడు వారు పూజించిన కాకతమ్మనే వైదిక మతం స్వీకరించిన అనంతరం వారు గౌరి, దుర్గ, శక్తి అని వేర్వేరు పేర్లతో పిలిచారు.

రెడ్డి అనే పదం రాష్ట్రకూట - రట్టకుడి - (రాఠోడ్) - రట్టడ్డి - రడ్డి - రెడ్డి గా రూపాంతరం చెందిందనీ, ఆ పదానికి అర్థం ప్రారంభంలో 'గుర్రపు రౌతు' (*Knight*) అనీ, అయినా కాలక్రమేణా గుర్రపు రౌతులు గ్రామపాలకులుగా నియమించబడుతూండిన కారణంగా 'రెడ్డి' అంటే 'గ్రామ పాలకుడు' అనే అర్థం స్థిరపడిందనీ, గ్రామపాలకుడు అత్యంత చిన్న పాలకుడు కనుకనే, 'ఎవరు చెప్పగలరు? రేపటికి రెడ్డెవరో - రాజెవరో?' అనే నానుడి పుట్టుకొచ్చిందనీ వేరే సందర్భంలో వివరించాను. కాకతీయుల మూలపురుషులలోని కాకర్త్యగుండన మొదలైన వారి పేర్లకు చివరనున్న 'రాష్ట్రకూట' అనే శబ్దాల కారణంగా చిలుకూరు వీరభద్రరావు పంతులు గారి వంటి విఖ్యాత చరిత్రకారులు కూడా కాకతీయుల పూర్వులు రెడ్లని పొరబడ్డారు. కాని, అది సరికాదు. కాకతీయుల మూలపురుషుల మాటేమిటి? - నేటి కమ్మ, కాపు, వెలమ కులస్థుల యిండ్ల పేర్లలో రెడ్డి శబ్దంతో అంతమయ్యేవి ఎన్నో వున్నాయి. ఉదా : వాసిరెడ్డి, ఉమ్మారెడ్డి, బావిరెడ్డి వగైరా. దీనినిబట్టి వారంతా ఒకప్పుడు గ్రామ పాలకులుగా వ్యవహరించి వుంటారని మాత్రమే మనం అర్థం చేసుకోవాలి. కాకతీయుల మూలపురుషులు ఒకప్పుడు గ్రామపాలకులుగా వుండినప్పటికీ క్రమంగా వారు అనంతర కాలంలో 'సామంత', 'మండలేశ్వర', 'మహామండలేశ్వర', 'శ్రీమన్మహామండలేశ్వర' బిరుదములు ధరించి 'సర్వంసహా చక్రవర్తులు'గా వెలుగొందారు.

కాకతీయులు కమ్మవారుకాక వేరొకరు కారని నేడు హెచ్చుమంది అభిప్రాయపడుతున్నారు. ఆ కారణం చేతనే కాకతీయుల పాలనా కాలంలో కమ్మవారి ప్రభ వెలిగిపోయింది. ఆనాడు నగరపాలకులు, దుర్గాధ్యక్షులు, మంత్రులు, సేనానులు, రాజ ప్రతినిధులు, మహాధికారులు అందరూ దాదాపు కమ్మవారే. ఏకశిలా నగర పాలకుడైన నాగయగన్న మంత్రి కమ్మ కులస్థుడు. మేచయనాయకుడు, ఎల్లయ నాయకుడు అనే యిరువురు యితని సోదరులు. మేచయ గణపతి దేవ చక్రవర్తికి మహాధికారిగా ప్రసిద్ధుడు. ఆతని కుమారుడు దేవర నాయనింగారు సుప్రసిద్ధ సేనానిగానేకాక, వెలనాటి రాజప్రతినిధిగా కాకతీయ మహా సామ్రాజ్యంలో సుపరిచితుడు. గణపతిదేవ చక్రవర్తి గజసైన్యాధ్యక్షుడైన జాయపసేనాని సుప్రసిద్ధుడే కదా! ఈయన గణపతిదేవునికి బావమరదేకాక వియ్యంకుడు. రుద్రమదేవి తంత్రపాలుడు కమ్మ కులస్థుడైన ప్రోలరౌతు. ఆయనకు ఎక్కినాయుడు, రుద్రనాయుడు, పినరుద్రనాయుడు, పోతినాయుడు అనే నలుగురు కుమారులు.

వీరంతా ప్రతాపరుద్ర చక్రవర్తికి అంగరక్షకులుగా ప్రసిద్ధులు. వీరిది వల్లుట్ల గోత్రము. ఇది కమ్మవారిలో ప్రసిద్ధ గోత్రము. కమ్మవారైన వల్లభనాయడు కాకతీయ సామ్రాజ్యపు అశ్వ రక్షకునిగానూ, దారపనాయడు, సూరినాయడు కవచ రక్షకులుగానూ వ్యవహరించారు. ఇలా చెప్పుకుంటూపోతే యీ జాబితాకు అంతే వుండదు. గణపతిదేవుడు రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు వగైరాలు కమ్మవారు కనుకనే వారంతా కమ్మవారితో బంధుత్వం కలిగి, కమ్మవారినే సామ్రాజ్యంలో అత్యున్నత స్థానాల్లో నిలిపారు. మహావీరులై నాడు నాయంకరులుగా కీర్తిగాంచిన వారిలో 90 శాతానికి పైనే తదనంతర కాలంలో కమ్మవారిగా ఖ్యాతిగాంచారు. నాయంకరులే తరువాతి కాలంలో నాయడు, నాయనింగారు, నీడు, నేడు వగైరా ఉత్తరనామాలతో పిలువబడడమేకాక, ఫలానా కొండప్పనాయని సంతానం 'కొండపనేని' వారనీ, ఫలానా సాయప్ప నాయని సంతానం 'సాయపనేని' వారనీ, ఘట్టమనాయని సంతానం 'ఘట్టమనేని' వారనీ, అక్కినాయని సంతానం 'అక్కినేని' వారనీ పిలువబడసాగారు. అలా పేరు చివర 'నాయడు' అనేది లుప్తమై యింటి పేరులోనే 'నేని' అనేది చాలమందిలో వచ్చింది. అలాగే బాపినీడు, రామినీడు, తిమ్మానేడు, యుధిష్ఠిరనీడు, రామానాయుడు, వేంకటాద్రి నాయడు వగైరా పేర్లు కమ్మవారిలోనే మనం చూస్తాం. ఇతరులలో ఎక్కడన్నా వున్నప్పటికీ అత్యంత అరుదు.

నేటికీ కమ్మవారు శుభకార్యాలలో గుమ్మడి పండును పూజించే అలవాటుంది. కమ్మవారి పెరట్లో పెరిగిన గుమ్మడి తీగ దానంతట అదే నశించేవరకు దానిని తొలగించరు. వారు గుమ్మడి తీగను తొలగించడం మహా పాపమని భావిస్తారు. శుభకార్యములలో గుమ్మడి పండును పూజించడమేకాక నేటికీ కమ్మవారిలో గుమ్మడి మొక్కుబడులు, గుమ్మడి కాయ దానాలు పరిపాటే! ఇలా గుమ్మడి పండును పూజించడం, గుమ్మడితీగను గౌరవించడం వీరికి కాకతీయుల కాలం నుండే ఆనువంశికంగా ఆనవాయితీగా వుంటూ వచ్చింది.

అలాగే కాకతీయులు తమ మూలపురుషుడైన కమ్మ మహారాజు, ఆయన సోదరులు పునరుజ్జీవితులవడానికి మూలకారణమైన గౌరీదేవిని కూష్మాండినీ దేవి లేక కాకతి లేక శక్తి యొక్క ప్రతిరూపంగా భావించి ఆరాధించేవారని మనం ముందే చెప్పుకున్నాం. నేటికీ కమ్మవారిలో గౌరీపూజ ఒక ఆచారంగా అనాదిగా వస్తున్నది. వివాహం అయిన తరువాత వచ్చే శ్రావణమాసంలో ప్రతి కమ్మవారింటి ఆడపడుచు పుట్టింటికి వచ్చి గౌరీ పూజ చేయడం నేటికీ ఆనవాయితీగా వస్తున్నది. ఇటీవలి కాలం వరకు పంట నూర్పిడి కళ్లంలో కూడా కమ్మ వారు గౌరీ పూజ జరిపేవారట. ఒక పిడకకు రంగులు వేసి దానిపై ఓ రావి ఆకు నుంచి నూర్చిన ధాన్యం కుప్పపై దాని నుంచి అదే గౌరీదేవిగా భావించి పూజించేవారట. ఈ గౌరీ పూజ సందర్భంగానే తమ ఆడపడుచులకు యివ్వాల్సిన పంట భాగాన్ని వేరుగా రాశి పోసేవారట. అయితే యీ ఆచారం క్రమక్రమంగా అంతరించి పోతూంది. ఇంకా అక్కడక్కడా మాత్రమే యిది కొనసాగుతున్న సూచనలున్నాయి. అయితే ఈ గౌరీ పూజ మాటెలావున్నా తమ ఆడపడుచులకు ఆస్తులలో వారి సమాన వాటా వారికిచ్చి, సాలుసరి పంటలో వారి భాగాన్ని వారికిచ్చి, వారి ఆర్థిక స్వావలంబనకు తోడ్పడడం మాత్రం యింకా ఎక్కువ శాతం కమ్మ కుటుంబాలలో కొనసాగుతున్నది. కాకతీయులు యుద్ధానికి, వివాహానికి వెళ్లేముందు వీరపూజ చేయడం ఆచారం. ఇదే ఆచారం నేటికీ కమ్మవారిలో కనుపిస్తున్నది. వివాహానికి ముందు, ఆ తరువాత కొందరు కమ్మవారిలో నేటికీ వీరపూజ చేయడం, వీరభద్ర పళ్లెం పట్టడం వగైరాలు ఆనవాయితీగా వస్తున్నాయి. కమ్మవారిలోని యీ ఆచారాలన్నీ కాకతీయుల ఉత్తరదాయిత్వమే. కాకతీయులు తమ శాసనాలలో తాము దుర్జయ వంశీకులమని పేర్కొన్నారు. కమ్మవారిలో ప్రసిద్ధులైన ఆలూరివారు, విప్పర్లవారు వగైరాలు వారికి చెందిన శాసనాలు, దాన పత్రాలలో తమను తాము 'దుర్జయ కులాలంకార', 'దుర్జయ కులభూషణ' వగైరా బిరుద నామాలతో పేర్కొన్నారు. ఇలా ఏ రకంగా చూసినా కాకతీయులు కమ్మవారేనని పెక్కురు

విమర్శకులు తేల్చారు.

నేనూ యీ వాదనతో ఏకీభవిస్తూ, అదనంగా నేను సూచించే రెండు ఆధారాలను మాత్రం పేర్కొనదలచాను. మొదటిది క్రీ.శ. 1323 లో కాకతీయ సామ్రాజ్య పతనానికి ముందు కాకతీయ ప్రభువులు తమపై కంటె పద్మనాయక వెలమలపై ఎక్కువ వాత్సల్యము చూపుతున్నారనీ, 77 గోత్రాల వెలమ వారికి ఓరుగల్లు కోటలోని 77 బురుజుల రక్షణ బాధ్యత అప్పగించారనీ, వెలమ వారితో సహపంక్తి భోజనం చేసి కాకతీయులు తమను చిన్నచూపు చూస్తున్నారనీ సామ్రాజ్యానికి మూలస్తంభాలైన రెడ్డి వీరులు కోపగించి ఓరుగల్లును ముట్టడించిన తుఘ్లక్ సైన్యాలకు కోట రహస్యాలు బహిర్గతం చేసి స్వామిద్రోహానికి పూనుకున్నారనీ, యీ కారణంగానే కాకతీయ సామ్రాజ్యం పతనమయిందనీ చరిత్రకారులంతా ఏకాభిప్రాయంతో వున్నారు. అయితే ఆ రెడ్డి వీరులు చివర్లో తప్పు తెలుసుకుని, హైందవ సామ్రాజ్య వినాశనాన్నెదుర్కొనడానికి ప్రతాపరుద్రునికి అండగా నిలిచి వీరోచితంగా పోరాడినా వారి త్యాగాలు బూడిదలో పోసిన పన్నీరే అయ్యాయనేది కూడా అందరూ అంగీకరిస్తూన్న చారిత్రక సత్యమే! మొదటి ప్రతాపరుద్ర మహారాజు భృత్యులైన బేతిరెడ్డి, నామిరెడ్డి అనేవారు ఆ మహారాజుకు సామంతులుగా ఆమనగల్లు దుర్గాన్ని పాలించారు. గణపతి దేవుని అనుచరుడైన చెవ్విరెడ్డి సుప్రసిద్ధుడు. కాట చమూపతి, భాండ సేనాధిపతి అనే యిరువురు రెడ్డికులస్తులూ గణపతి దేవ చక్రవర్తి సేనానులే. రుద్రమదేవి సేనాని గోన గన్నారెడ్డి సుప్రసిద్ధుడే కదా! ఇలా రెడ్లు కాకతీయుల వద్ద భృత్యులుగానూ, సేనానులుగానూ ప్రఖ్యాతి గాంచారు. అదలా వుంచితే దీనిని బట్టి కాకతీయులు రెడ్లూ కాదు. వెలమలూ కాదని మనకు అర్థమవుతుంది. మరి వారెవరు? పోనీ కాకతీయులు క్షత్రియులనుకుందామా? వారి మూలపురుషుడు కాకర్త్య గుండ్యనే చతుర్థకులాన్వయుడని (శూద్రుడని) పేర్కొనబడ్డాడు. కాకతీయ సామ్రాజ్యం అత్యున్నత దశలో వున్నప్పుడు గణపతిదేవ చక్రవర్తి కాలంలో మోటుపల్లి, పాఖాల, కాంచీవరము శాసనాలలో మాత్రం కాకతీయులు సూర్యవంశ క్షత్రియులని పేర్కొనబడింది. అయితే హెచ్చుభాగం శాసనాలలో వీరు దుర్జయవంశీకులైన చతుర్థాన్వయులుగానే పేర్కొనబడ్డారు. అదీకాక, కాకతీయులు కమ్మవారితో వివాహసంబంధాలు చేసుకున్నట్లున్న ఆధారాల కారణంగా వారు కమ్మవారు తప్ప వేరే కాదని మనం అభిప్రాయపడవచ్చు. అయ్య వంశీకుడూ, దేవభక్తుని వారి మూలపురుషుడూనని భావించబడుతూన్న గణపతి దేవుని గజసేనాని జాయప్ప సోదరీమణులు నారమ్మ, పేరమ్మలను గణపతిదేవ చక్రవర్తి వివాహమాడాడు. (వీరు గుంటూరు జిల్లా చేబ్రోలు, రేపల్లె ప్రాంతాలలో విస్తరించిన వెలనాటి చోడులలోని వాడైన వెలనాటి పిన్నచోడుని సంతానం). అలాగే కాకతీయులు కమ్మవారిలోని కోట వంశీయులైన ధరణికోట, కొణిదెన, యనమదల వారితోనూ, త్రిపురాంతక ప్రభువులతోనూ వివాహ బంధాల నేర్పరచుకొన్నారు. గణపతిదేవుడు తన మొదటి కుమార్తె రుద్రమ్మను నిరవద్యప్రోలు (నేటి నిడదవోలు)కు చెందిన చాళుక్య వీరభద్రునికీ, రెండవ కుమార్తె గణపాంబను దుర్జయాన్వయుడైన కోట బేతరాజుకూ యిచ్చి వివాహం చేశాడు. అలాగే తన చెల్లెలు మేలాంబను నతవాటి బుద్ధరాజు కుమారుడైన రుద్రునికి యిచ్చి వివాహం చేశాడు. ఇతడు కూడా దుర్జయాన్వయుడు. నతవాటి సీమ (నేటి ఖమ్మం జిల్లా మధిర మరియు కృష్ణాజిల్లా నందిగామ ప్రాంతం) అనాదిగా కమ్మవారి ప్రాబల్యం కల ప్రాంతం. కాకతీయ రాజ్యావిర్భావం నతవాటి సీమలోనే జరిగింది. కమ్మవారిలో నేటికీ 'కామసాని' వారు వున్నారు. కాకతీయుల మూలపురుషులలోని వాడైన త్రిభువన మల్ల బేతరాజు (క్రీ.శ. 1080-1115) మేనత్త విరియాల కామసాని పేరిట యీ యింటి పేరు ఏర్పడివుంటుంది. విరియాల వారు కూడా దుర్జయాన్వయులైన కమ్మవారే. వీరిది విప్పర్ల గోత్రం. కామసాని ఎన్నో యుద్ధాలలో స్వయంగా పాల్గొని తన మేనల్లుడు బేతరాజుకు అపూర్వ విజయాలు చేకూర్చిందట. నతవాటి సీమకు చెందిన కామసాని దుర్జయ వంశీకుడైన ఎఱ్ఱన భార్య. కులవ్యవస్థ - ప్రత్యేకించి పాలక వర్గాలలో -

అంతగా ఘనీభవించని ఆ రోజులలో కాకతీయులు తమ సామ్రాజ్య అవసరాలను దృష్టిలో వుంచుకొని యితరులతో కూడా అక్కడక్కడా వివాహబంధాలు కలుపుకున్నప్పటికీ వారు కమ్మవారు కనుకనే ప్రధానంగా కమ్మవారితోనే బాంధవ్యమేర్పరచుకున్నారని నా అభిప్రాయం. అలాగే కొన్ని చారిత్రక కారణాలవలన శూద్రులలోని ఒక కులంగా కొనసాగుతున్న వీరందరూ క్షత్రియ మూలాలు కలిగిన వారేననీ నా అభిప్రాయం.

ఇకపోతే, రాజు దైవాంశ సంభూతుడనే అభిప్రాయం ప్రజలలో బలంగా నాటుకొనడం చేత 'నా విష్ణుః పృథివీపతీ' (రాజు కంటె విష్ణువెవ్వరూ లేదు) అనే నానుడి జనించి, ఒక రాజు గతించిన అనంతరం ఆ రాజు వారసుడినో, వంశీకుడినో లేక సన్నిహిత బంధువునో మాత్రమే ప్రజలు రాజుగా అంగీకరించేవారు. సైన్యం కూడా ఆ కుటుంబంలోని వారి ఆజ్ఞలనే శిరసావహించేది. ప్రతాపరుద్రుడు బందీగా చిక్కి, కాకతీయ సామ్రాజ్యం పతనమై, ఓరుగల్లు కోట తుఘ్లక్ సేనలకు స్వాధీనమైన అనంతరం ఖమ్మంజిల్లా రేకపల్లి రాజధానిగా రాజ్యపాలన సాగించిన ముసునూరి ప్రోలయ నాయకుడు, కాపయ నాయకుడు (వారు కూడా కమ్మవారు కనుకనే) కాకతీయుల వారసత్వాన్ని కొనసాగించగలిగారు. ఒకప్పటి ప్రతాపరుద్రుని సేనానులనందరినీ, అలాగే 75గురు సామంత నాయక రాజులను ఏకంచేసి కాకతీయ ప్రాభవాన్ని కనీసం కొన్నేళ్లపాటైనా అంటే క్రీ.శ. 1323 నుండి 1368 వరకూనైనా సరే వారిరువురూ పరిరక్షించగలిగారు.

## ముసునూరి ప్రోలయ, కాపయ రెడ్లా ?

'రెడ్డి సంచిక'లో యీ ముసునూరి ప్రోలయ, కాపయ నాయకులు రెడ్లని పేర్కొనబడింది. (రె.సం. పేజీ ౧౧ సంపాదకులు : వద్దాది అప్పారావుగారు, ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ పురావస్తు ప్రదర్శనశాలల శాఖ. 1991). అయితే యిది వాస్తవం కాదు. కొప్పుల కాపయ నాయకుడనే రెడ్డి వీరుడు 'సురత్రాణ' బిరుదుతో ఓరుగల్లును ముట్టడించాడనీ, అతని కుమారుడు నామయనాయకుడనీ 'కమ్మవారి చరిత్ర'లో భావయ్య చౌదరిగారు పేర్కొన్నారు. (రెండవ భాగం పేజీ 151). ఇదీ సరికాదు. 'సురత్రాణ' బిరుదాంకితుడు ముసునూరి కాపయ నాయకుడు. ఆయన కమ్మ ప్రభువు. అలాగే క్రీ.శ. 1269 సం॥లో అనపోతా నాయకుడు భీమవరం వద్ద జరిగిన యుద్ధంలో కాపయ నాయకుడిని సంహరించాడని చౌదరి గారు వ్రాశారు. (రెండవభాగం పేజీ 153). ఇదీ సరికాదు. క్రీ.శ. 1323లో ఓరుగల్లు పతనమైంది. ఆ తరువాత క్రీ.శ. 1368 వరకు ముసునూరి ప్రోలయ, కాపయల పాలన సాగింది. ఓరుగల్లుకు సమీపంలోని భీమవరంలో యుద్ధం జరిగింది క్రీ.శ.1368లో. అక్కడ అనపోతానాయుదు చంపింది ముసునూరి కాపయనాయకుడినే. విస్మృతాంధ్ర నాయకులెందరి చరిత్రలనో వెలుగులోకి తెచ్చిన నిరంతర జిజ్ఞాసువు చౌదరిగారు యీ తప్పిదం చేయడం వింతగానే వుంది. మరి 'ప్రమాదో ధీమతామపి' అని ఆర్యోక్తి కదా! *'To err is human. Good Homer sometimes nods.'* (పొరపాటు చేయడం మానవ సహజం. మహాకవి హోమర్‌కి కూడా అప్పుడప్పుడూ తల చెదురుతుంది) అనే ఆంగ్ల సూక్తి మనం మరువ రాదు. చౌదరిగారు తిరిగి అదే గ్రంథం రెండవ భాగ శేషము (16వ పేజీలో) కాపయనాయకుడు కమ్మ ప్రభువనీ, ఆయన యింటి పేరు ముసునూరి వారనీ, కొప్పులవారు కాదనీ, గురజ, విలస తామ్ర శాసనాల ఆధారంగా నిర్ధారణ అవుతున్నదనీ, రెడ్డి ప్రభువులతో బాంధవ్యమున్నా ఆయన కమ్మ వాడేననీ, భీమవరం యుద్ధంలో క్రీ.శ. 1369లో ఆయన సంహరింపబడ్డాడనీ పేర్కొన్నారు. (వాస్తవానికి భీమవరం యుద్ధం క్రీ.శ. 1368లో జరిగింది). 'ముసునూరి'వారు కమ్మవారిలోని ప్రసిద్ధ వంశం. కమ్మవారిలో 'ముసునూళ్లు' అనే గోత్రం కూడా వుంది. క్రీ.శ. 1323 నుండి 1330 వరకు ప్రోలయ నాయకుడు రేకపల్లి రాజధానిగా పాలించగా, క్రీ.శ. 1330 నుండి 1368 వరకు అతని పినతండ్రి కుమారుడైన కాపయ నాయకుడు ఆ పాలనను

కొనసాగించాడు. కాపయ నాయకుని రాజ్యంలో ప్రస్తుత ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలే కాక తెలంగాణలోని మెదక్ జిల్లా (మెతుకు), నిజామాబాద్ జిల్లా (ఇందూరు), కైలాసకోట, నల్లగొండ జిల్లాలోని పానుగల్లు, దేవరకొండ, భువనగిరి వగైరా ప్రాంతాలు కూడా వుండేవి. ఈ అన్నదమ్ములిద్దరూ తమ పాలనా కాలంలో ముస్లింల దౌర్జన్యాలకూ, హింసకూ గురవుతున్న నాటి భూసురులను (బ్రాహ్మణులను) కాపాడి వేదమతాన్ని ఉద్ధరించారు. బ్రాహ్మణులకు ఎన్నో అగ్రహారాలు దానం చేశారు. కాపయ నాయకుడికి 'ఆంధ్ర సురత్రాణ' (ఆంధ్ర భూసురులను - బ్రాహ్మణులను - రక్షించినవాడు) అనే బిరుదుండేది. 'సురత్రాణ' అనేది 'సుల్తాన్' అనే పదానికి తెలుగు అనుకరణ. ఆంధ్ర (తెలుగు) ప్రాంతానికి సుల్తాన్ కాపయనాయకుడన్నమాట. విజయనగర సామ్రాజ్య స్థాపకుడైన మాధవ విద్యారణ్యుడు, ప్రోలయ నాయకుడు కాంచీపురంలో వేదాంత విద్యను కలిసి చదువుకున్నారట. బ్రహ్మవేత్త, 'సాంగ వేదార్థ వాచస్పతి' బిరుదాంకితులు ఉప్పులూరి గణపతి శాస్త్రిగారి 'వేదసార రత్నావళి' (ప్రచురణ : అన్నవరం దేవస్థానం - 1974) అనే గ్రంథం యొక్క ప్రథమ భాగంలో 'ముసునూరి వారి వంశచరిత్ర' విపులంగా వివరించబడింది. వేంగి మండలంలోని ముసునూరు వీరి జన్మస్థానం. ప్రోలయనాయకుడి తండ్రి పోచానాయకుడు. ప్రోలయకు కాకతీయ ప్రాభవ పునరుద్ధరణలో తమ్ముడు ఎఱపోతా నాయకుడు, పినతండ్రి కుమారులైన కాపయ నాయకుడు వగైరా ఐదుగురు సోదరులు, యితర కమ్మ నాయకులే కాక, రెడ్డి సేనానులైన ప్రోలయ వేమారెడ్డి, మాచారెడ్డి, అన్నారెడ్డి, దొడ్డారెడ్డి, మల్లారెడ్డి అనే ఐదుగురు సోదరులుకూడా బాసటగా నిలిచారు. (ప్రోలయ నాయకుని సేనానిగా వున్నప్పటికీ కూడా అప్పటికే ప్రోలయ వేమారెడ్డి కృష్ణా - కుండిప్రభ (గుండ్లకమ్మ) నదుల మధ్య భాగాన్ని అద్దంకి రాజధానిగా స్వతంత్ర రాజ్యంగా చేసుకుని పాలించడానికి ప్రణాళికను సిద్ధం చేసుకున్నాడు.) హిందూ ధర్మ సంరక్షణకు కంకణబద్ధుడైన ప్రోలయ నాయకుడు ఎన్నో అగ్రహారాల్ని బ్రాహ్మణులకు దానం చేశాడని ముందే చెప్పుకున్నాం. అలాంటి అగ్రహారాలలో ప్రస్తుత తూర్పు గోదావరి జిల్లాలోని కోనసీమకు చెందిన విలస గ్రామమొకటి. అక్కడి తామ్ర దానశాసనం మనకీ విషయమై ఎన్నో వివరాలను తెలుపుతుంది. భారద్వాజ గోత్రుడు, వేదపండితుడు అయిన వెన్నయకు ఈ అగ్రహారం యీయబడిందట. ముసునూరి కాపయ నాయకుడు కమ్మ ప్రభువని ఉప్పులూరి గణపతి శాస్త్రిగారు పై గ్రంథంలో పేర్కొన్నారు. (వే.సా.ర. పేజీ 113) అలాగే అదే గ్రంథంలో ప్రోలయ వంశం గురించి చెప్తూ వేంగి మండలంలోని ముసునూరు అనే గ్రామానికి చెందిన వారైన వీరు 'కమ్మకట్టు దొర'లనీ, వీరినే యిప్పుడు 'కమ్మవారు' అంటున్నారనీ వివరించి ప్రోలయ నాయకుని వంశావళిని పేర్కొన్నారు. (పేజీ 12. వే.సా.రత్నావళి). కాకతీయులూ కమ్మవారే కనుకనే కమ్మవారైన ముసునూరి ప్రోలయ, కాపయ నాయకులు కాకతీయ సేనానులనూ, నాయంకరులనూ కూడగట్టి కాకతీయుల వారసత్వాన్ని నిలబెట్టగలిగారు. కనుక యిది నిర్వివాదాంశమని నా భావన.

ఇలా శాసనాలు, గ్రంథాలు వగైరా ఆధారాలను బట్టి తేలేదేమంటే సూర్యవంశానికి చెందినట్లు చెప్పుకున్న కరికాల చోళుడి వారసులైన తెలుగు చోడులు, చంద్రవంశీకుడైన ఉదయనుడి వారసులమని చెప్పుకొనే చాళుక్యులు, హైహయ వంశీకులు, సూర్యవంశీకుడినని చెప్పుకున్న దుర్జయుని సంతతివారు, నతవాటిసీమ రాజులు, కాకతీయులు, కొండ పడమటి సీమ రాజులు పరస్పర బాంధవ్యం నెరపుతూ 'కమ్మనాడు' ప్రాంతంలో స్థిరపడి 'కమ్మకట్టు దొరలు' అనీ 'కమ్మవారు' అనీ పిలువబడ్డారు. 'షట్సహస్రదేశం' లేక 'ఆరువేలనాడు' కు చెందిన నియోగి బ్రాహ్మణులు 'ఆరువేల నియోగులు'గా వ్యవహరించబడినట్లే, 'కమ్మనాడు'లో స్థిరపడిన పై మూలాలు కలిగిన క్షత్రియులను 'కమ్మవారు' అనసాగారు. (అమరావతి నుండి స్కంధపురి అంటే కందుకూరు వరకూ గల ప్రాంతాన్ని కమ్మనాడు అని వ్యవహరించేవారు.)

# 'కమ్మ' శబ్ద విశ్లేషణ

పేరకమ్మ (కృష్ణానది) దక్షిణ తీరంనుంచి గుండ్లకమ్మ ఉత్తరపు ఒడ్డు వరకు గల ప్రాంతం కమ్మనాడు అని కొందరు విమర్శకులు, యింకొంచెం దిగువకు అంటే స్కంధపురి (కందుకూరు) వరకు గల ప్రాంతం కూడా కమ్మనాడులో అంతర్భాగమేనని మరికొందరూ అభిప్రాయపడుతున్నారు. ఇంకొందరు కర్మ రాష్ట్ర (కమ్మనాడు) ఉత్తర సరిహద్దు నల్గొండ జిల్లా కోదాడ వరకూ వుండేదని చెపుతున్నారు. ఆ సంగతలా వుంచి అసలీ 'కమ్మనాడు' అనే పదం ఎలా వచ్చింది? కమ్మనాడులో నివసించడం కారణంగానే కమ్మవారికాపేరు వచ్చిందా? ఈ విషయాలు ఆలోచించాలి. పైన తెలిపిన ప్రాంతాన్ని అనాదిగా 'కర్మ రాష్ట్రము', 'కర్మాంక రాష్ట్రము' లేక 'కర్మక రాష్ట్రము' అనేవారు. (వైదిక విధిన షట్కర్మలూ సక్రమంగా ఆచరించబడే ప్రాంతమైనందున దానికి ఆ పేరు వచ్చి వుండవచ్చు.) 'మహారాష్ట్ర' అనే పదం భాషాంతరీకరణంలో మహారాట్ట – మారాట్ట – మరాఠాగా రూపాంతరం చెందినట్లే, 'రాష్ట్రకూట' అనే పదం రట్టకుడి – రట్టోడి – రడ్డి – రెడ్డి అయినట్లే – 'కర్మకరాష్ట్ర' అనే పదం 'కమ్మకరాట్ట' అయి కర్మకరాష్ట్రులు (కర్మక రాష్ట్రంలో నివసించేవారు) 'కమ్మకరాట్టు'లు అని పిలువబడ్డారు. అదే కాలక్రమేణా 'కమ్మకట్టు' అయి వుంటుందని నా అభిప్రాయం. కమ్మవారిని లోగడ 'కమ్మకట్టు' దొరలనే వారనేదానికి ఎన్నో ఆధారాలున్నాయి. అలా 'కర్మ' అనే పదం యొక్క పాళీ భాషా రూపాంతరమే 'కమ్మ' అనే పదం. అంతేగాని కొందరు అభిప్రాయపడుతున్నట్లు 'కమ్మ' అంటే గౌరీదేవి 'చెవికమ్మ' అనో, వార్తాహరులు తీసుకెళ్లే 'కవిలె కమ్మ' అనో అర్థం కాదు.

అనాదిగా కర్మ రాష్ట్రం వైదికేతర మతాలకు పట్టుగొమ్మ. ప్రత్యేకించి బౌద్ధమతం, పాళీభాష యీ ప్రాంతంలో పరిఢవిల్లాయి. 'పల్లవ భోగ్య' (పాళీ భాషలో 'పల్లవ భొగ్గ') అనే పేరుతో నాడు బౌద్ధమతానికి పట్టుగొమ్మ అయిన పలనాడు యీ కర్మరాష్ట్రంలోని అంతర్భాగమే! కర్మరాష్ట్రం అత్యంత సంపద్వంతమైనట్టిది. పాడిపంటలే కాక, యీ ప్రాంతంలో లభించే అమూల్య వజ్రాలు, రత్నాలు కూడా యిక్కడి సంపదకు మూలకారణం. కృష్ణానది దక్షిణ తీరంలోని పులిచింతలకు సమీపంలోని కోళ్లూరులో సుప్రసిద్ధ 'కోహినూర్' వజ్రం లభించిందనేది చరిత్రకారులు నిర్ధారించిన సత్యం. ఇక కృష్ణ ఉత్తర దిక్కున ఒకప్పటి నందిగామ తాలూకాలో గల పరిటాల, గని ఆత్కూరు, కొత్తపేట వగైరాలు అనాదిగా అమూల్యమైన రత్నాల గనులకు ప్రసిద్ధిగాంచాయి. నేటికీ అక్కడ ఉరుములతో కూడిన వాన కురిసినప్పుడు వైడూర్యాలు వగైరా విలువైన రంగురాళ్లు బయల్పడతాయి.

కమ్మ రాష్ట్రం అంత సంపద్వంతమైన, సువిఖ్యాతమైన రాష్ట్రం కనుకనే ఆ రోజులలో ప్రతి కులం వారు తాము ఆ రాష్ట్రానికి చెందిన వారమని సగర్వంగా చాటుకొనే వారు. ఆ కారణంగానే కమ్మ బ్రాహ్మణులు అనే పదం కూడా ఉద్భవించింది. కమ్మ రాష్ట్రానికి చెందిన బ్రాహ్మణులు తాము కమ్మ బ్రాహ్మణులమని చెప్పుకొనేవారు. మహా భారతాన్ని కన్నడ భాషలోనికి అనువదించిన పంప కవి తాను కమ్మ బ్రాహ్మణుడని చెప్పుకున్నాడు. నేడు ఒక కులాన్ని సూచించడానికి మాత్రమే వాడబడుతున్న 'కమ్మ' అనే పదం ఒకప్పుడు రాష్ట్ర సూచకం. అది కర్మ (కమ్మ) రాష్ట్రానికి చెందిన అన్ని కులాల వారికి వాడబడింది. అయితే ఆ తరువాత అది కమ్మ వారిని మాత్రమే సూచించే ఒక కుల పదంగా స్థిర పడింది.

ఈ కర్మరాష్ట్రంలో జైనమతం కూడా పరిఢవిల్లింది. శ్రీశైలంలోని మల్లికార్జున స్వామి ఆలయ ప్రాంగణంలోని రామలింగేశ్వర ఆలయంలో లభించిన ఓ శాసనంలో 'కమ్మటేశ్వర దేవర' అనే దేవుడి పేరు పేర్కొనబడింది. ఈయనే జైనుల తీర్థంకరులలో ఒకడైన భగవాన్ బాహుబలి. ఆయనను కర్మఠేశ్వరుడనీ పిలిచేవారు. ఆంధ్ర ప్రాంతంలో విష్ణువు

'ఆంధ్ర మహా విష్ణువు', 'ఆంధ్ర దేవుడు' అనే పేర్లతో పూజలందుకున్నట్లే జైనం ప్రబలంగా వున్న దశలో కర్మరాష్ట్రంలో 'కర్మశేశ్వరుడు' అనే పేరుతో ప్రజలు బాహుబలిని ఆరాధించి వుంటారు. ఆ పేరే క్రమంగా కమ్మటేశ్వర – కొమ్మటేశ్వర – గొమ్మటేశ్వర – గోమఠేశ్వరగా రూపాంతరం చెంది వుంటుందని నా విశ్వాసం. కొమ్మటేశ్వరుని ఆరాధించిన వారిని కోమట్లు అన్నారు. తరువాతి కాలంలో వీరిలో చాలమంది తిరిగి వైదిక మతం స్వీకరించి 'ఆర్య వైశ్యులు' అనబడ్డారు. యజ్ఞోపవీతధారణ చేశారు. అది చేయడానికి యిష్టపడని ఒకప్పటి జైనులు హైదవం స్వీకరించినప్పటికీ శూద్రులుగా భావించబడ్డారు. కమ్మ, రెడ్డి కులాలలో వున్న 'కోమటినేని', 'కోమటి', 'కోమటిరెడ్డి', 'పెదకోమటి' వగైరా యిండ్ల పేర్లు ఈ విషయాన్ని సూచన ప్రాయంగా తెలియజేస్తున్నాయని వేరొక సందర్భంలో కూడా పేర్కొన్నాను. ఒకప్పుడు జైనం ప్రబలంగా వున్న ఆంధ్రప్రాంతంలో వైశ్యులు (వ్యవసాయం వృత్తిగా కలవారు) జైన తీర్థంకరుడైన బాహుబలి (కమ్మటేశ్వరుడి)ని ఆరాధించి 'కమ్మటులు' అని పిలవబడ్డారు. జైనమత వ్యాప్తికై వారు ఉత్కళ (నేటి ఒరిస్సా), గౌడ (నేటి బెంగాల్), కామరూప (నేటి అస్సాం) ప్రాంతాలకు కూడా విస్తరించారు. అంతకు ముందు 'కమ్మటులు' అని పిలువబడిన వీరిని ఉత్కళ, గౌడ దేశాలలో 'కొమ్మటులు' అనసాగారు (ఒరిస్సా, బెంగాల్‌లలో 'అ'కారాన్ని 'ఒ'కారంగా ఉచ్చరిస్తారు. ఉదాహరణకు ఆ ప్రాంతాలలో 'వర్' – పెండ్లి కుమారుడు – ను 'బొర్' అనీ 'ప్రఫుల్ల'ను 'ప్రొఫుల్ల' అనీ 'ప్రణయ్'ని 'ప్రొణొయ్' అనీ పలుకుతారు.) ఆ పదమే క్రమంగా కోమటులుగా రూపాంతరం చెందింది. అలా మత వ్యాప్తికి దేశాంతరం వెళ్లిన నాటి వైశ్యులు కొందరు మాతృభూమిపై మమకారంతో తిరిగి ఆంధ్రదేశం వచ్చారు. కాని అప్పటికిక్కడ వైదికమత ప్రాభవం తీవ్రంగా వుంది. యజ్ఞోపవీత ధారణకు, యజ్ఞ నిర్వహణకు అంగీకరించి ఆర్యమతం తిరిగి స్వీకరించిన వైశ్యులు (కోమటులు) ఆర్యవైశ్యులయ్యారు. అలా అంగీకరించని కొందరు వ్యావసాయికులు (కోమటులు) రెడ్డి, కమ్మ కులాలలో కలిసి శూద్రులుగా భావించబడ్డారు. 'కన్యకాపురాణం'లో 200 గోత్రాల వైశ్యులు (వ్యవసాయదారులు) కమ్మవారిలో చేరిపోయారని పేర్కొన్నది దీన్ని గురించేనని నా విశ్వాసం. నేటి ఆంధ్రప్రాంతంలోని వైశ్యులలో హెచ్చు శాతం ఒకప్పుడు బెంగాల్‌నుండి వలస వచ్చినవారేనని కొందరు పరిశోధకులు వెలిబుచ్చిన అభిప్రాయం కూడా నా విశ్వాసానికి మరింత ఊతమిస్తున్నది.

తిరిగి కర్మరాష్ట్రం విషయానికివస్తే ఉత్తరాన నల్గొండ జిల్లా కోదాడ నుండి దక్షిణాన నేటి ప్రకాశం జిల్లా అంచులవరకు గల ఒకప్పటి కర్మరాష్ట్రంలో తెలుగు చోడులు – వారి బంధువర్గమైన చాళుక్యులు, వెలనాటి చోడులు, కొండ పడమటిసీమ రాజులు, దుర్జయాన్వయులు (కాకతీయులు వగైరా), హైహయ వంశీకులు, కొణిదెన చోడులు, నన్నూరు చోడులు, రేనాటి చోడులు, పొత్తపినాటి చోడులు, నెల్లూరు చోడులు వగైరాలందరూ స్థిరనివాసమేర్పరచుకొని, పరస్పర బాంధవ్యం నెరపుతూ, అవసరకాలాలలో ఒకరికొకరు సహకరించుకుంటూ 'కమ్మరాట్ట' (కర్మరాష్ట్ర) నివాసులు కనుక కమ్మరాట్టులు, కమ్మవారు అని పిలువబడ్డారు.

19వ శతాబ్దంలో ముక్త్యాల సంస్థానాధీశ్వరులైన వాసిరెడ్డివారి ఆస్థాన కవియైన అమరావతి రామకవి తన 'ద్రౌపదీ పరిణయం' అనే గ్రంథంలో "శూద్రులలో కొందరు ఆత్మభాగ్యంచేత (తమ అదృష్టంకొద్దీ) ధనాఢ్యులై, దానకాంక్షతో 'మీరు కోరుకున్నవన్నీ దానంగా యిస్తాము. రండి.' అని అర్థి తతిని (దానమడిగే వారి సమూహములను) ఆహ్వానిస్తూ కమ్మలపై లిఖించి సర్వదేశాలకూ పంపడం కారణంగా నాటి నుంచి వారు కమ్మవారు అనబడ్డారని" వ్రాశాడు. కమ్మ శబ్దానికి చేయబడిన యిటువంటి అర్థరహితమైన వ్యుత్పత్తి చాల హాస్యాస్పదంగా వుంది.

కృష్ణాజిల్లా కుందేరుకు చెందిన బ్రహ్మచర్యాశ్రమ స్థాపకులు, సత్పురోహితులు పాలడుగు శేషాచలవర్మ (శేషాచార్యులుగారు) తాము వ్రాసిన 'కూర్మరాజీయము' అనే గ్రంథంలో 'కమ్మ' శబ్దం 'కూర్మ' శబ్దభవమని తెలిపారు.

సంస్కృతంలో 'కచ్ఛపము' లేక 'కూర్మము' అంటే తాబేలు. కశ్యప (కచ్ఛప) ప్రజాపతిని 'కూర్మ' అని కూడా పిలుస్తారు. కశ్యప ప్రజాపతి సృష్టించిన వారందరూ కూర్మీలనబడుచున్నారు. (నేటికీ కమ్మవారిలో చాల మంది తాము కశ్యప ప్రజాపతి సంతానమనీ, అంచేత తాము కాశ్యపులమనీ విశ్వసిస్తారు.) కూర్మీ అనే పదానికి భూపతి, పృథివీపతి, పృథివీ పుత్రుడు, క్షత్రియుడు వగైరా అర్థాలున్నాయి. (కు + రమ ; కు - పృథివి కువలయము అంటే భూ మండలము. రమ అంటే రమణుడు - వల్లభుడు - పతి) 'కూర్మీ', 'కురమ' శబ్దాలకూ - 'కురుంబ' లేక 'కురుమ' శబ్దాలకూ వ్యత్యాసముంది. 'కురుంబ' లేక 'కురుమ' అనే వారు యాదవుల లోని ఒక శాఖ. కురుమ గొల్లలు గొఱ్ఱెల బొచ్చుతీసి ఆ ఉన్నితో కంబళ్లునేసే వృత్తి చేపట్టినవారు. కూర్మీలు ఉత్తరప్రదేశ్, బీహార్, ఒరిస్సా, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు ప్రాంతాలలో విస్తరించివున్నారు. వీరి ముఖ్యవృత్తి రాజ్యపాలన, కృషి (వ్యవసాయము). పైన తెలిపిన రాష్ట్రాలన్నింటిలో కూర్మీలు అగ్రవర్ణంగానూ, ఆయా రాష్ట్రాలలో 'కురుమ' లేక 'కురుంబ'లు వెనుకబడిన తరగతిగానూ గుర్తించబడుతున్నారు. (మాజీ కేంద్ర రైల్వే మంత్రి, ప్రస్తుత బీహార్ ముఖ్యమంత్రి నితీష్ కుమార్ కూర్మీ వర్గానికి చెందినవారే). ఛత్రపతి శివాజీ, పృథ్వీరాజ్ చౌహాన్, ప్రతాపరుద్రుడు, వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు తదితరులంతా కూర్మీలేనని ఆచార్యులుగారు ఆ గ్రంథంలో తెలిపారు. కునబీ, కుంబీ, కమ్మ, కమ్మ శబ్దాలు 'కూర్మీ' శబ్దం యొక్క అపభ్రంశ పదాలని ఆయన పేర్కొన్నారు.

వేదసాహిత్యం ఇంద్రుడిని 'కూర్మి' అనే శబ్దంతో పేర్కొంటూంది.

"తువి కూర్మితమః" - 'అతిశయేన బహువిధ కర్మా ఇన్ద్రః' - ఇతి సాయణః
అతిశయించిన బహువిధ కర్మలు చేసే ఇంద్రుడు. (సాయణాచార్యుని భాష్యం)

"తువి కూర్మిః" - 'సంగ్రామే నానావిధ కర్మకర్తా (ఇన్ద్రః) - ఇతి సాయణః
సంగ్రామములో నానావిధ కర్మలు చేసే వాడైన ఇంద్రుడు. (సాయణాచార్యుని భాష్యం)

'తువి కూర్మీ', 'మహాకూర్మీ' అనే పదాలు క్షాత్రం తేజరిల్లే. ఇంద్రుడినే సూచిస్తున్నాయనీ, 'కూర్మీ' శబ్దం 'క్షత్రియ' శబ్దానికి ప్రత్యామ్నాయ పదంగానే వేద సాహిత్యంలో వాడబడిందనీ, అంతేకాక 'శతపథ బ్రాహ్మణం'లో 'ఇన్ద్రః', 'రాజన్యః', 'క్షత్రియః' శబ్దాలు తుల్యార్థకంగానూ, కూర్మశబ్దానికి పర్యాయ పదాలుగానూ వాడబడినాయనీ, కనుక 'కూర్మీలు' అంటే 'క్షత్రియులు' అనే అర్థం అనాది సిద్ధమని ఆచార్యులుగారు సోపపత్తికంగా నిరూపణ చేశారు. 'కశ్యపో వై కూర్మః', 'ఆదిత్యో వై కూర్మః' అనే వేద మంత్రాంతర్గతమైన శబ్దాల్ని బట్టి వీరి ప్రాచీనతకు ఆధారాలు లభిస్తున్నాయంటారాయన. మహాకూర్మి లేక తువికూర్మి పేర్లతో వేదసాహిత్యంలోనే ఇంద్రుడు పేర్కొనబడ్డాడు కనుక కూర్మ, కూర్మీ, కుంబీ, కమ్మ లేక కమ్మ అనే జాతి అత్యంత ప్రాచీనమైనదని ఆయన సిద్ధాంతీకరించారు.

అంతేకాక కర్నల్ టాడ్ తాను రచించిన 'రాజస్థాన్' అనే గ్రంథంలో రాముని కుమారుడైన కుశునికి 'కూర్మ' అనే మరొక పేరున్నట్లు పేర్కొన్నాడట.

లింగ, పద్మ, దౌర్వాస దేవీ, మార్కండేయ పురాణాలన్నింటిలో కమ్మవారు 'కమ్మ' శబ్దంతో పేర్కొనబడ్డారని "కమ్మ రాజము" అనే తన గ్రంథంలో చాపరాల వేంకటాద్రి వర్మగారు పేర్కొన్నారట.

ఈ ఆధారాలన్నీ పేర్కొంటూ శేషాచార్యులుగారు కమ్మవారు క్షత్రియులనీ, అర్జుని శాపం కారణంగా వారు ఉపనయన సంస్కారం లేక యజ్ఞోపవీత ధారణ చేయరనీ తెలిపారు. ఇంకా కమ్మవారు వస్తుతః క్షత్రియులని బుజువు పరచే నిమిత్తం కుమార ధూర్జటి రచించిన 'శ్రీకృష్ణ దేవరాయల విజయము'లో పేర్కొనబడిన కొన్ని పద్యాలను ఉటంకించారాయన. ఇవన్నీ కమ్మవారి క్షాత్రతేజాన్నీ, ధీరోదాత్తతను లెస్సగా కీర్తించేవే! కృష్ణదేవరాయలనాటి విజయనగర

సామ్రాజ్యానికి అండదండగా వీరాగ్రేసరులూ, ఆయనకు ఆత్మబంధువులూనైన కమ్మవారే నిలిచారనడంలో అతిశయోక్తి లేదేమో! అలాగే కమ్మవారిలో ఒకప్పుడు ఋషిగోత్రాలుండేవనీ, కాశ్యపగోత్రం కమ్మవారిలో ప్రసిద్ధమైనదనీ, హైందవమతం నుండి కమ్మవారు జైన, బౌద్ధ మతాలలోకి వెళ్లిపోయినందువలన ఋషిగోత్రాలు కొంత కాలానికి నశించిపోగా, తిరిగి వారు హైందవ సంస్కారం పొందే సందర్భంగా గ్రామగోత్రాలు ఏర్పడ్డాయని ఆయన అభిప్రాయం.

ఇలా కమ్మవారు వస్తుతః క్షత్రియులనీ, ఒకప్పుడు వారికి ఋషి గోత్రాలుండేవనీ సహేతుకంగా, సోపపత్తికంగా నిరూపించారాయన. గతకాలంలో బ్రాహ్మణులు శూద్రుల యిండ్లలో పౌరోహిత్యం చేసేటప్పుడు గృహస్థుల నామవాచకాలకు చివర 'దాసు' అనే శబ్దాన్ని తగిలించి లోలోపల మురిసిపోయేవారట. ఈ అకృత్యాన్ని ఆచార్యులవారు ఎదిరించి అన్ని కులాలకూ స్వసంఘ పౌరోహిత్యముండాలనీ, శూద్రులుగా ఎంచబడుతూన్న కులాలవారంతా తమ పేరు చివరగల 'దాసు' శబ్దాన్ని తొలగించి, బ్రాహ్మణుల ఉత్తరనామాలైన శాస్త్రి, శర్మ, ఆచార్య, వగైరాలు ధరించాలని ఉద్బోధించారట. ఒకప్రక్క సత్పురోహిత సంఘం ద్వారా బ్రాహ్మణ పురోహితులకు దీటుగా వేద పరిజ్ఞానం కలిగిన పురోహితులను తయారుచేస్తూనే, కమ్మవారు క్షత్రియులు కనుక వారంతా 'వర్మ' అనే ఉత్తరనామం ధరించాలనీ ఉద్బోధించారట ఆచార్యులవారు. ఆంధ్రదేశంలో కమ్మవారిలో ప్రసిద్ధులైన పాలడుగు శేషాచార్యులు అనబడే శేషాచలవర్మ, ప్రసిద్ధ ఆర్యసామాజికులు కావూరి గోపదేవ శాస్త్రి, రాజర్షి వీరమాచనేని ఆంజనేయ శాస్త్రి గార్లను ఎరగని వారుండరంటే అతిశయోక్తి కాదు. వారి బాటలో ఎందరో సత్పురోహితులు తయారై బ్రాహ్మణోచిత ఉత్తరనామాలైన శాస్త్రి, శర్మ, ఆచార్య వగైరాలను క్షాత్ర సూచకమైన 'వర్మ' అనే ఉత్తరనామాన్నీ ధరించడం ప్రారంభించారు.

## కమ్మవారు శూద్రులెలా అయ్యారు?

అయితే ఒకప్పుడు రాజ్యాలేలిన క్షత్రియులైన వీరు తరువాత కాలంలో చతుర్థాన్వయులుగా (శూద్రులలో ఒకరిగా) ఎలా పరిగణింపబడుతున్నారు - అనేది ఆలోచింపదగిన ప్రశ్న. దీన్ని కూడా మనం పరిశీలిద్దాం. ఆంధ్ర ప్రాంతంలో ఒకప్పుడు బౌద్ధ, జైన మతాలు విశేషాదరణ పొందాయి. ఈ రెండూ నాస్తిక మతాలు. ('నాస్తికో వేద నిన్దకః' అనే మనువు నిర్వచనం ప్రకారం చూస్తే వేద ప్రామాణ్యాన్ని అంగీకరించని మతాలివి - కనుకనే వీటిని నాస్తిక మతాలు అన్నారు.) ప్రాచీన బౌద్ధమైన 'హీనయానం'లో దైవం ప్రస్తావన లేదు. ప్రతివారూ బుద్ధుడి జీవితాన్ని ఆదర్శంగా తీసుకుని కోరికలను త్యజించి బుద్ధుడిలాగే జీవిస్తూ 'విముక్తి'ని పొందాలి. ప్రాచీన జైనమైన 'దిగంబర' మతంలో కూడా దైవం ప్రస్తావన లేదు. మహావీరుడి జీవితాన్ని ఆదర్శంగా తీసుకుని, ప్రతివ్యక్తీ 'కేవలి'గా పరిణామం చెందడానికి (కైవల్యం పొందడానికి) దీక్షతో కృషి చేయాలి. అయితే ఆ తరువాత అభివృద్ధి చెందిన మహాయాన బౌద్ధంలోనూ, శ్వేతాంబర జైనంలోనూ 'దైవం' అనే భావన క్రమంగా పాదుకొల్పబడింది.

ఎప్పుడూ కొత్తదనాన్ని ఆహ్వానించే సంస్కరణాభిలాషులైన కమ్మవారు పెద్ద సంఖ్యలో హిందూమతాన్నుంచి జైన, బౌద్ధ మతాలలోకి వెళ్లారు. కమ్మవారిలోని 'కోమటి', 'కోమటినీడు', 'కోమటినేని' అనే యిండ్లపేర్లు వారి జైన మూలాల్ని తెలుపుతున్నాయి. ('కోమటి' శబ్దం 'కొమ్మరి', 'గొమ్మరి', 'గోమరి', 'గోమఠేశ్వర' శబ్దాలకు సారూప్యమైనట్టిదే.) జైనములోనన్నా కొంచెం కుల ప్రస్తావన వుంది కానీ, బౌద్ధంలో అసలు కులప్రస్తావనే రాదు. శతాబ్దాల తరబడి జైన, బౌద్ధాలలో వుండి తిరిగి హైందవ సంస్కారం పొంది కమ్మవారు హిందూమతంలో చేరి వుంటారు. తొలుత జైనులైన కాకతీయులు హైందవమతం స్వీకరించి శైవులుగా మారారనే విషయం చరిత్ర పాఠకులందరికీ తెలిసినట్టి సత్యమే. హిందూ మతంలో తిరిగి చేరినప్పటికీ

కమ్మవారు హెచ్చుశాతం నాస్తికులుగానూ, హేతువాదులుగానూ, బ్రాహ్మణాధిక్యతను ప్రశ్నించేవారుగానూ, వేద ప్రామాణ్యాన్ని ధిక్కరించేవారుగానూ, స్వాతంత్ర్యాభిలాషులుగానూ వుండడానికి వారి బౌద్ధ, జైన మూలాలే కారణమని నా విశ్వాసం. శతాబ్దాల తరబడి కులప్రసక్తి లేని జైన, బౌద్ధ మతాల అనుయాయులుగా వుండడం చేతనే కులంపట్ల వారి దృక్పథంలో మిగిలినవారికున్నంత పట్టింపు కనుపించదు. మత విషయాలలో హేతుబద్ధమైన దృక్పథం, ప్రశ్నించే తత్వం వారికి జైన బౌద్ధ మతాల నుంచే వారసత్వంగా సంక్రమించాయి. వారి స్వేచ్ఛా ప్రియత్వం వారి నామకరణంలోనే తెలుస్తుంది. బెనర్జీ, ఛటర్జీ, ముఖర్జీ, ఘోష్, పటేల్, భానోజీ, రామోజీ, నానా వగైరా అన్య రాష్ట్రాలపేర్లు కూడా వీరు చొరవతో పెట్టుకుంటారు. అలాగే కొత్త ప్రాంతాలకు ధైర్యంగా వలస వెళ్ళి, వ్యాపార వ్యవసాయాలను అభివృద్ధి చేయడంలోకూడా వీరి స్వేచ్ఛా ప్రియత్వం, చొరవ కనుపిస్తాయి. ఒక ప్రాంతానికే కట్టుబడి వుండే మనస్తత్వం కాదు వీరిది.

యజ్ఞ యాగాదుల నిర్వహణకు నిరసనగా తల ఎత్తిన జైన, బౌద్ధ మతాలలో చాల కాలంపాటు కొనసాగిన కారణంగానే తిరిగి హైందవ మతం స్వీకరించినా, వీరు యజ్ఞోపవీతధారణకూ, యజ్ఞ నిర్వహణకూ యిష్టపడలేదు. ఆ కారణంగా వీరు క్షత్రియులే అయినప్పటికీ యజ్ఞోపవీత ధారణను నిరాకరించినందున హైందవ సమాజం చేత శూద్రకులములలో ఒకరిగా పరిగణించబడ్డారు. కోమటులు లేక బచ్చులు లేక వైశ్యులు కూడా జైన, బౌద్ధ మతాలకు ఒకప్పుడు పట్టుగొమ్మలు. పశుపాలన, వ్యవసాయం వృత్తిగా కలవారు వైశ్యులు. వ్యవసాయ ఉత్పత్తులలో అవసరాలకు పోగా మిగిలిన దానిని అమ్ముతూ వీరే మొదటి వ్యాపారులయ్యారు. వ్యవసాయానికీ, వ్యాపారానికీ పశువులు అత్యంత ఆవశ్యకం. పశువులు అరక దున్నడానికేకాక పశువులు పూన్చిన బండ్లపైనే ఆ రోజులలో ఒకచోటి నుండి మరొకచోటికి వ్యాపారులు తాము అమ్ముకొనే సరకులను తరలించేవారు. (అట్టి వ్యాపారులను సార్థవాహులనీ, ఆ బండ్ల సముదాయములను వర్తక బిడారులనీ అనే వారు.) పశు సంపద యావత్తూ యజ్ఞాలలో యిచ్చే జంతుబలి కారణంగా నశించిపోతున్నందున వైశ్యులు కూడా ఒకప్పుడు తమ స్వీయ ప్రయోజనాల దృష్ట్యా యజ్ఞ యాగాదులను నిరసించి బౌద్ధ, జైనాలలో పెద్ద సంఖ్యలో చేరారు. గౌతమబుద్ధుని కాలం నాటి అనాథపిండకుడనే వైశ్యుని గాథ, వైశ్యులానాడు బౌద్ధాన్ని ఎంతగా ఆదరించారనేదానికి దృష్టాంతం! జైన, బౌద్ధ మతాల ప్రాభవం అంతమయింతర్వాత తిరిగి వీరు కూడా హైందవ సంస్కారం పొంది, హిందూ మతంలోకి వచ్చి చేరారు. అయితే వీరు కమ్మవారిలా కాక యజ్ఞ నిర్వహణకూ, యజ్ఞోపవీత ధారణకూ అంగీకరించినందున కాబోలు హైందవ సమాజంలో తమ యధాపూర్వ స్థానాన్ని పొంది ఆర్య వైశ్యులుగా గుర్తించబడ్డారు.

## వైశ్యులు - కమ్మవారు - వెలమవారు

కులప్రసక్తిలేని జైనులుగా వున్నప్పుడు వైశ్యుల పూర్వీకులూ, కమ్మవారి పూర్వీకులూ ఒకే కుదురుగా వుండేవారని కూడా తోస్తున్నది. పెదమక్కెన గ్రామంలోని శిలాశాసనాన్ని బట్టి కమ్మవారిలో యితర కులాలవారు కలిసిపోయినట్లు భావయ్య చౌదరిగారు పేర్కొన్నారు. భాస్కరాచార్య అనే ఆయన వ్రాసిన వైశ్యుల 'కన్యకా పురాణం' వల్ల రెండువందల గోత్రాల వైశ్యులు రాజమహేంద్ర వరాన్ని పాలించిన తూర్పు చాళుక్య పాలకుడు మూడవ విష్ణు వర్ధన మహారాజు దాడికి భయపడి కమ్మవారిలో కలిసి పోయారని తెలుస్తున్నది. బహుశా వీరు అప్పట్లో యజ్ఞోపవీత ధారణకు అంగీకరించి వుండరు. (ఈయన పాలనా కాలం క్రీ.శ. 8వ శతాబ్ద ప్రథమార్థ భాగం. చారిత్రకంగా చూస్తే ఆనాటికి అసలు 'కమ్మ' అనే కులమే ఏర్పడినట్లు లేదు. అంచేత యీ కథనం అంత విశ్వసనీయంగా కనుపించడం లేదు.) కమ్మవారి యిండ్ల పేర్లయిన గవిని, కొత్త, అత్తలూరి, అద్దేపల్లి, అన్నం, అన్నవరపు, ఆతుకూరి, ఆలపాటి, ఇమ్మడి, కొల్లా, కొల్లూరు, కోట, కోడూరు, గారపాటి,

గార్లపాటి, గుంటూరు, గుఱ్ఱం, గొల్లపూడి, చక్కా, చేబ్రోలు, చిట్టూరి, చీరాల, చుండి, చుండూరు, చెన్నమల్లు, తాళ్లూరి, తొండెపు, దాసరి, నంబూరు, నేరెళ్ల, పొత్తూరి, మహంకాళి, ముత్రా, వంకాయల, వెలగా, వోలేటి, కందుల, కంఠంపాటి, కూరపాటి, కొల్లిపర, మద్ది, సూరే, సోంసెట్టి, కాటా, వువ్వాడ, కొణిజేటి, కొంజేటి, గోనుగుంట్ల, నందిపాటి, బెల్లంకొండ, రావూరు, దివ్వెల, ఇమ్మణ్ణి, ఊటుకూరు, ఎర్రమాసు, గొడవర్తి, తాడికొండ, తిరువీధుల, నరిశెట్టి, నరిశేటి, పరుచూరి, బొగ్గవరపు, మద్దాలి, మానికొండ, మాలేపాటి, సాధు వగైరాలు వైశ్యులలోకూడా వుండడం ఆలోచించదగిన విషయం. అంతేకాదు; యీ రెండు కులాలలో ఎన్నో గోత్రాలుకూడా కలుస్తున్నాయి. కమ్మవారిలో యిప్పటికీ అన్నంకుల గోత్రీకులైన పొందూరివారు, కనుమూరివారు, పాలకుల గోత్రీకులగు జంపనివారు, గద్దెవారు, కులకోట లేక కోటకుల గోత్రీకులగు ముప్పాళ్లవారు, గనికుల గోత్రీకులగు త్రిపురనేనివారు వున్నారు. ఈ గోత్రాలన్నీ వైశ్యులలోనూ వున్నాయి. అలాగే కమ్మవారిలో అద్దేపల్లివారిలో రామకుల; ఆదూరి – పాలకుల; ఎలమాటి – పాలంకుల; ఏరువ – పాలంకుల; ఐతం – రామకుల; కట్టా – గోరంకుల; కారుకొండ – పాలంకుల; కురాళ్ల – పెనుకుల; గిందెల – ఏర్వాకుల; గుత్తికొండ – కొనంకుల; గోగినేని – వీరంకుల; గోనుగుంట్ల – ఏర్వాకుల; బిక్కిన – మునుముకుల; చిగురుపాటి – చిలుక కొలుకుల; చిట్టినేని – పచ్చంకుల వైశ్యులలో వున్నట్టి గోత్రాలే కలిగి వుండడాన్నిబట్టి పైన తెలిపిన 'కన్యకాపురాణం'లో పేర్కొన్నట్లు లోగడ వైశ్య వృత్తి (వ్యవసాయ, వ్యాపారాదులు) నవలంబించిన 200 గోత్రాల / యిండ్ల పేర్లవారు కమ్మవారిలో చేరిపోయి వుంటారు. అలాగే పెరుమాళ్ల గోత్రం కమ్మవారిలోనూ, వైశ్యులలోనూ కూడా వున్నది. 'వైశ్ – య' (వైశ్య) అనే సంస్కృత శబ్దానికి అర్థం వ్యవసాయమే వృత్తిగా కలవాడు. వ్యవసాయోత్పత్తులలో మిగులును అమ్మడం కారణంగా వైశ్యులే మొదటి వ్యాపారులయ్యారు. నేటి వైశ్యులు దాదాపు వ్యాపారస్తులే. నేను చూసిన కొన్ని ప్రాంతాలలో నేటికీ వైశ్యులు అచ్చమైన వ్యవసాయదారులలా పెద్ద భూకమతాలు, పశుసంపద కలిగి వుండి ఆ సంస్కృత నిర్వచనం ప్రకారం నిజమైన వైశ్యులనిపిస్తున్నారు. ఇలా వైశ్య వృత్తిలో ఉన్న కొందరు ఒక చారిత్రక దశలో బౌద్ధ, జైనాలు స్వీకరించి, ఆ మతాలు ఆంధ్ర ప్రాంతంలో వెనుక పట్టు పట్టిన తరువాత, తిరిగి హైందవ సంస్కారం పొంది, హిందూ మతంలో కలిసిపోయారు. వారిలో యజ్ఞోపవీత ధారణకు అంగీకరించి, యజ్ఞ సంస్కృతిని కొనసాగించడానికి యిష్టపడిన వారు వైశ్యులలోనూ, మిగిలినవారు శూద్రులలోనూ కలిసిపోయారు.

కమ్మవారు మొదట క్షత్రియులుగా వుండి కూడా క్రీ.పూ. 3వ శతాబ్ది ప్రాంతంలో జైన, బౌద్ధ మతాలలో కలిసిపోయి, క్రీ.శ. 11, 12 శతాబ్దుల వరకు వారు ఆ మతాలలోనే కొనసాగారు. ఆంధ్రదేశంలో యిండ్ల పేర్లు క్రీ.శ. 11-12 శతాబ్దాల మధ్యకాలంలో ఏర్పడ్డాయని చరిత్రకారుల అంచనా. అంతకుముందు తెలుగు వారందరూ తమిళులూ, కన్నడిగుల వలెనే తండ్రి పేర్లతోనే గుర్తింపబడే వారు. ఈ కారణంగా కులప్రసక్తిలేని జైన, బౌద్ధ మతాలలో ఒకే జట్టుగా కొనసాగిన కొందరు క్రీ.శ. 12వ శతాబ్ది ప్రాంతాలలో హైందవం స్వీకరించిన కమ్మవారి పూర్వీకులు యజ్ఞోపవీతధారణ చేసి వైదిక మతంలో కలిసిపోయినప్పటికీ, నాటి సమాజం వారికి క్షత్రియ ప్రతిపత్తి యివ్వని కారణంగా దానికంటే క్రింది వర్ణమైన వైశ్యులలో కలిసిపోయారని భావించవచ్చు. తమ సహజ సిద్ధమైన సంప్రదాయ విరుద్ధ స్వభావం కోల్పోని కమ్మవారంతా యజ్ఞోపవీతధారణకు అంగీకరించక నాటి సమాజంచే శూద్రులుగా భావించబడ్డారు.

అలాగే ఇందుకూరి, ఉప్పలపాటి, కొండ్రాజు, సాగి, పూసపాటి, మాచిరాజు, పెనుమత్స, కనుమూరి, కోట, విప్పర్ల వగైరా కమ్మవారి మూలపురుషులైన దుర్జయాన్వయులలో కొందరు క్షత్రియులలో కలిసిపోగా, మిగిలిన వారు యజ్ఞోపవీతాన్ని ధరించడానికి యిష్టపడకనో ఏమో కమ్మవారుగానే (శూద్రులలోని ఒక కులంగానే) మిగిలిపోయారు. అలా క్షత్రియ మూలాలు కలిగిన కమ్మవారు తమ సంప్రదాయ విరుద్ధ (*Heretic*) స్వభావం కారణంగా క్షత్రియులుగా గుర్తించబడక

శూద్రులలోని అగ్రవర్ణంగా మిగిలిపోయారు. రాజులలో అగ్రగణ్యులనో లేక కట్టకడపటి వారనో ఏమో వీరిని కొసరాజులనేవారట. 'కొసరాజు' అని కమ్మవారిలో ఒక యింటి పేరు కూడా వుంది! (కొస అంటే అగ్రము లేక చివర). ఇలా తెలుగుచోడ, కొణిదెనచోడ, చాళుక్యాన్వయ, దుర్జయాన్వయ, హైహయ, సూర్యవంశాది మూలములు కలిగిన కొందరు కాపులలోనూ విలీనమయ్యారు. అదేవిధంగా ఒకప్పటి హైహయాన్వయులలోని వాసిరెడ్డివారు, మేకలవారు, మేకావారు, కోకావారు, నాయినేనివారు, పుతుంబాకవారు, వెల్లంకి వారు, ఇనగంటి వారు, ముమ్మలనేనివారు, పాకాలవారు, గుమ్మడపువారు మొదలైన యిండ్ల పేర్ల వారిలో కొందరు వెలమ కులంలో కలిసిపోగా కొందరు కమ్మకులంగానే వుండిపోయారు. పైన తెలిపిన యిండ్లపేర్లు వెలమ, కమ్మ కులాలు రెంటిలో వుండడమేకాక, యిందుకింకొన్ని ఆధారాలు కనుపిస్తున్నాయి. ఇనగంటి అనేది వెలమకులస్థులలో ప్రముఖమైన యింటి పేరుకాగా, కమ్మవారిలోనూ ఆ యింటి పేరున్నది. పైపెచ్చు కమ్మవారెందరో ఇనగంటి గోత్రీకులు.

తమ తండ్రి సింగమ నాయకుడిని చంపిన చాళుక్య రాజులపై పగ తీర్చుకొనదానికి పద్మనాయక వెలమలైన అనపోతా నాయకుడు, మాధవ నాయకుడు చాళుక్యులపై దాడి చేసినప్పుడు కాపయ నాయకుడు కొంత కమ్మ సైన్యాన్ని చాళుక్యులకు సహాయంగా పంపాడు. ఆ సందర్భంగా క్రీ. శ. 1361 లో జరిగిన జల్లిపల్లి యుద్ధంలో రాచకొండ వెలమ పాలకుడైన అనపోతా నాయకుడి సైన్యాలు కాపయ నాయకునిచే పంపబడిన కమ్మ సైన్యాలను నిర్దాక్షిణ్యంగా సంహరించిన కారణంగా అనపోతా నాయకుడు 'కమ్మ దొరల మోదిన కాలదండము' అనే బిరుదును పొందాడని ముందే తెలుసుకున్నాం. తాము ఉదయనుడి వారసులమని చెప్పుకొనే చంద్ర వంశీకులైన (సోమ కుల) చాళుక్యులు ఆ యుద్ధంలో కాపయ నాయని సైన్యంతో కలిసి పద్మనాయకుల సైన్యాలను ఎదుర్కొన్నారు. అనపోతా నాయకుని సోదరుడైన మాధవ నాయకుడు ఆ చాళుక్యులను సంహరించి 'సోమకుల పరశురామ' అనే బిరుదు పొందాడట. ఆ యుద్ధంలో మాధవ నాయకుని సైన్యం సోమకుల క్షత్రియులను అంటే చంద్ర వంశానికి చెందిన చాళుక్యులలో మరణించగా మిగిలిన వారిని ఇనగల్లు వరకు గదిమిందట. అప్పుడు ఇనగల్లు నుంచి వచ్చిన వారే కమ్మ వారిలోని ఇనగంటి వారయ్యారట. వారిలో కొందరు బహుశా విజేతలైన వెలమ వారిలో కలసిపోయి వుంటారు. అందేతనే ఇనగంటి అనే యింటిపేరు. వెలమ వారిలో కూడా వుంది.

అలాగే విప్పర్ల గోత్రం కమ్మవారిలో ప్రసిద్ధమైనది. విప్పర్ల ఇంటిపేరు కూడా కమ్మవారిలో ప్రసిద్ధమైనదే. వెలమ కులస్థులలో విప్పర్ల ఓ ప్రసిద్ధమైన గోత్రనామం. అట్లూరి వారి వెంగకనీదు గోత్రం వెలమవారితో కమ్మవారి ఒకనాటి బాంధవ్యానికి గురుతు. ఇంకా రేచర్ల, చాగంటి, పువ్వాడ, చెరకుమూళ్ల గోత్రీకులు కమ్మ, వెలమ కులాలు రెండిలోనూ వున్నారు. ఇంకా గవిని, దుగ్గిరాల, గొంది, చల్లపల్లి, చల్లగుండ్ల, కంచర్ల, కోడూరు, కొడాలి, ఉప్పలపాటి, కొల్లూరు, కోగంటి, కొత్త, కొత్తపల్లి, నన్నపనేని, నూతులపాటి, పెంద్యాల వగైరా ఎన్నో యిండ్లపేర్లవారిలో రేచర్ల గోత్రీకులున్నారు. రేచర్ల కూడా వెలమ వారిలో ప్రసిద్ధ గోత్రం. వెలమ, ఎలమ అనే యిండ్ల పేర్లు కమ్మవారిలో వున్నాయి. అంతేకాక కమ్మవారిలో రావు, రావుల, రావిక్ల (రావు + యిక్క) అనే యిండ్ల పేర్లవారున్నారు. (రావులు అంటే వెలమలు. గనిమ + ఎవల —> గనిమెళ్ళ ; చేవ + ఎవల —> చేవెళ్ళ ఏర్పడినట్లే రావు + ఎవల —> రావెళ్ల అనే గ్రామ నామం ఏర్పడి వుంటుంది. దీనిని కొందరు 'రావిళ్ల' అని పలుకుతున్నారు.) గండికోట కమ్మవారికి ప్రసిద్ధులైన ఆదుసుమల్లి వారిది రేచర్ల గోత్రమే. రేచర్లవారు పద్మవెలమలలోని ఒక ప్రసిద్ధ శాఖవారు. కనుక యీ రెండు కులాల మూలాలు కూడా ఒకటేనని మనం అర్థం చేసుకోవచ్చు.

# ఇండ్లపేర్లు మనకిచ్చే 'క్లూ' లు

'ఇంటి పేరు కస్తూరి వారు - యింట్లో గబ్బిలాల కంపు' అనే తెలుగు సామెత సుప్రసిద్ధం. దీని భావం ఒకరి యింటి పేరుకూ, వారి ప్రస్తుత స్థితిగతులకూ ఏ మాత్రం సంబంధం వుండదని. అయితే తెలుగునాట యింటి పేర్లు క్రీ.శ. 1000-1200 సంవత్సరాల మధ్య కాలంలో ఏర్పడి వుంటాయని భావించబడుతున్నది. అప్పటివరకూ తమిళులు, కన్నడిగులవలెనే తెలుగువారు కూడా తండ్రిపేరుతో గుర్తించబడి అప్పటి నుండి మాత్రం యింటిపేరుతో గుర్తించబడడం ప్రారంభమైంది. అయితే యిండ్లపేర్లన్నీ క్రీ.శ. 11, 12 శతాబ్దాలలో ఏర్పడినవి కాదు. వాటిలో కొన్ని చాల తర్వాత కాలంలో ఏర్పడ్డాయి. వివాహాలు వగైరా సామాజిక అవసరాల దృష్ట్యానూ, మారుతూన్న వృత్తి, ప్రవృత్తుల దృష్ట్యానూ కూడా యింటిపేర్లూ, గోత్రాలూ క్రమానుగతంగా మార్పుచెందుతూ వచ్చాయి. కమ్మవారిలోని 'పరుచూరి' వారిలో కొందరు 'మల్లిపెద్ది' వారుగానూ, కొందరు 'కుడితిపూడి'వారుగానూ మారారట. ఒకప్పుడు యీ మూడు గృహనామస్థులదీ 'పోగునూళ్ల' గోత్రమే, అయినా కాలక్రమేణా వీరికి యితర గోత్రాలు కూడా ఏర్పడ్డాయట. అదేవిధంగా వాసిరెడ్డివారి నుండే చేకూరివారూ, బోడేపూడివారూ ఏర్పడ్డారట. ఈ మూడు గృహనామాలూ కలిగిన వారందరిదీ మొదట్లో 'వల్లుట్ల' గోత్రమే. గుంటూరు జిల్లా చేకూరు గ్రామం నుంచి ఒకప్పుడు పెద్ద సంఖ్యలో వాసిరెడ్డివారు కృష్ణా, ఖమ్మం జిల్లాల ప్రాంతాలకు వలసవెళ్లి అక్కడ 'చేకూరి'వారుగా వ్యవహరించబడ్డారట. అక్కడ చేకూరివారి పాలెంల పేరుతో గ్రామాలనూ ఏర్పరచుకున్నారట. వీరిలో కొందరు క్రీ.శ. 1850 ప్రాంతాలలో గుంటూరు జిల్లాకి తిరిగి వచ్చి 'శేకూరి' వారు అని కూడా వ్యవహరించబడుతున్నారు. వారి యింటిపేరుకు మూలమైన తెనాలి సమీపంలోని 'చేకూరు' గ్రామం అప్పటికి 'శేకూరు' అని రూపాంతరం చెందడమే దీనికి కారణం. తుమ్మపూడి గ్రామంలో ఒక జంగం దేవర తనకు తృప్తి కలిగేటట్లు భిక్ష వేయలేదని కోపగించి ఓ వాసిరెడ్డివారి కుటుంబాన్ని 'బోడి తుమ్మపూడి మీది. మీరు బోడిపూడి వాళ్లు అనబడతారు' అని శపించగా, అక్కడి నుంచి వాళ్లు బోడేపూడివారని పిలువబడ్డారని ప్రతీతి. కాని యీ కథ నమ్మశక్యం కాదు. కొందరు వాసిరెడ్డి వారు 'బోడేపూడి' గ్రామం నుంచి వచ్చి వున్న కారణంగా వారిని ముందుగా 'బోడేపూడి వాసిరెడ్డి వారు' అంటూ, అనంతరం 'బోడేపూడి' అనే యింటిపేరుతోనే వ్యవహరించడం జరిగియుండవచ్చు. అలాగే 'ఆలం'వారి నుంచి 'పెమ్మసాని'వారు విడివడ్డారట. ఇండ్లపేర్లు ఆయా వ్యక్తుల ప్రస్తుత స్థితికి దర్పణాలు కాకున్నప్పటికీ అవి ఆ కాలంనాటి వారి పూర్వీకుల స్వస్థలాలనూ, వారి నాటి స్థితిగతులనూ, అప్పటి వారి వృత్తి వ్యాపారాదులనూ సూచిస్తాయి. అలాగే గోత్రాలు కూడా మనకు బోలెడన్ని 'క్లూ'లనిస్తాయి.

కమ్మవారు ప్రాయికంగా వ్యవసాయదారులనేది వారిలో కల 'నాగళ్ల', 'అరక' అనే యింటిపేర్లు సూచిస్తున్నాయి. అలాగే యీ క్రింది గోత్ర నామాలు కూడా ఆ విషయాన్ని ధృవ పరుస్తున్నాయి. అవి - ధాన్యాల, పంటల, వరిపాళ్ల, రాజనాల, కవులూళ్ల, చెరకునూళ్ల, కొర్రపాళ్ల, ఆవపూల, గోగుపూల, పుచ్చకాయల, కొండ్రగుంట, నాగళ్ల, ఏరువాకల (ఏరు అంటే ఎడ్లను కట్టి దున్నుటకు సిద్ధపరచిన నాగలి. ఏరువాక అంటే దుక్కిదున్నడాన్ని ప్రారంభించడం), వడిశెల (పంటలపై పక్షులు వాలకుండా రాళ్లు వేసే సాధనం. మేకావారిది వడిశెల గోత్రమే.), బండి, పార (వ్యవసాయ పనిముట్టు), సనకా లేక సనగా (ధాన్య విశేషం), కుచ్చెళ్లు (కుచ్చెల అంటే ఎనిమిది గొర్రుల పట్టు. గొర్రు అంటే ముప్పైరెండు కుంటలు. కుంట అంటే రెండున్నర సెంట్లు. అంటే 'కుచ్చెల' అంటే ఆరు ఎకరాల నలభై సెంట్లు), ఆవాల, ధనియాల, వరిమానుల వగైరా గోత్ర నామాలు బలుసు, బిక్కి, వేముల, తుమ్మల, క్రోవి, అల్లం, రావి, వెలగా, ఆరె, ఆరెపూల, ఎలమద్ది (తెల్లమద్ది - అర్జున వృక్షం), కంది, కాకర, కాకర్ల, గుమ్మడి, గుమ్మళ్ల, గొట్టిముక్కల, గొట్టుముక్కల, చంద్ర, చింత, చింతల, జమ్ముల,

పేరుకూడా అలాగే ఏర్పడి వుంటుంది. (కాసరము అంటే దున్నపోతు.) కాసరనాయని సంతతివారు కాసరనేని వారై వుంటారు. కాసరనేని అనే యింటిపేరు కూడా కమ్మవారిలో వుంది. వజ్జె, ఒజ్జ, వజ్ఝ, వజ్ఝూ వగైరా యింట్లపేర్లూ, ఒజ్జనూళ్ల, వజ్జెనూళ్ల, అయ్యవార్ల (ఉపాధ్యాయుడిని 'అయ్యవారు' అంటారు.) అనే గోత్రాలూ కమ్మవారిలో వుండడాన్నిబట్టి వారి పూర్వులలో కొందరు విద్యలు నేర్పే గురువులై అధ్యాపక వృత్తిలో కూడా వున్నట్లు తెలుస్తున్నది. భాష్యం అనే యింటిపేరు కమ్మవారిలో వుండడంవల్ల భాష్యకారులుగా లేక ఏదైనా ఒక భాష్యాన్ని అనుసరించే అనుయాయులుగానో వీరు ఒకప్పుడు వుండి వుంటారనిపిస్తుంది. వారిలోని 'చిలక పలుకుల' అనే గోత్రం వారిలో కొందరు మృదు మధుర భాషణం చేసేవారని సూచిస్తుంది. కమ్మవారిలో 'వేదనూళ్ల', 'ఋషిపాళ్ల' గోత్రాలుండడం కూడా విశేషం. 'సుంకర', 'సుంకరి' అనే కమ్మవారి యింట్లపేర్లను బట్టి వారి పూర్వులలో కొందరు గ్రామాల్లో సుంకాలు వసూలుచేసే గ్రామాధికారులు (సుంకరులు) గా వున్నట్లు గ్రహించవచ్చు. కమ్మవారిలో 'మన్నె' అనే యింటిపేరుంది. కమ్మవారిని మన్నెదొరలనీ అనాదిగా పిలుస్తారు. వీరోచిత కార్యాలకు మెచ్చి రాజులు సన్మానించి యిచ్చిన భూభాగాలకు అధిపతులను 'మన్నెలు' లేక 'మన్నీలు' అంటారు. కమ్మవారిలో 'మన్నీల' అనే గోత్రం కూడా వుంది. పండా అనే యింటిపేరు కూడా కమ్మవారిలో వుంది. దీనిని బట్టి వీరి పూర్వులలో కొందరు పురోహితులుగానో, మౌహూర్తికులుగానో వుండేవారనిపిస్తుంది. ఇప్పటికీ కమ్మ పురోహితులు పెద్ద సంఖ్యలోనే వున్నారు.

## కమ్మవారు - వర్తక వాణిజ్యాలు

ప్రస్తుతం కమ్మవారు ప్రాయికంగా వ్యవసాయదారులే అయినా గత కొన్ని దశాబ్దాలుగా వ్యాపారాలలో కూడా గణుతికెక్కారు. అయితే అనాది నుండి కూడా కమ్మవారి పూర్వీకులలో కొందరు వర్తక వాణిజ్యాలు చేసివుంటారనడానికి కూడా కొన్ని ఆధారాలున్నాయి. వారి యింట్ల పేర్లలో గాదె (ధాన్యం వగైరాలు పోసి నిల్వచేసుకొనేది), గాదెల, కాటా (పెద్ద త్రాసు), గరిసె (ధాన్యం నిల్వచేసుకొనే కొట్టు), గల్లా (వ్యాపారి డబ్బు వేసుకొనే పెట్టె), తూము (ధాన్యానికి యిదొక కొలమానం. నాలుగు ముంతలు ఒక కుంచము. నాలుగు కుంచాలు ఒక తూము. పది తూములు ఒక పందుము.), పుట్ల (పుట్టి అనేది కూడా ధాన్యానికి ఒక కొలమానం. ఐదు తూములు ఒక ఏదుము. నాలుగు ఏదుములు ఒక పుట్టి), సోల (యిది కూడా ఓ కొలిచే సాధనమే. నాలుగు గిద్దలు ఒక సోల. నాలుగు సోలలు ఒక మానిక. రెండు మానికలు ఒక అడ్డెడు.), ముత్యాల, రత్నాల, వజ్రాల అనే యింట్ల పేర్లను బట్టీ, ధాన్యాల, మాణిక్యాల, పగడం, పచ్చల, రేషమ్ (రేషమ్ అంటే పట్టు) అనే కమ్మవారిలో కల గోత్రనామాల్ని బట్టీ వారు ధాన్యం వ్యాపారంతోపాటు ముత్యాలు, రత్నాలు, వజ్రాలు, మాణిక్యాలు, పగడాలు, పచ్చలు, పట్టు వస్త్రాలు వగైరాల వ్యాపారాలు కూడా చేసేవారనిపిస్తున్నది. కొల్లా అనే యింటిపేరును బట్టి వారి పూర్వులలో కొందరు ఒకప్పుడు 'కొల్లారు బండి' లేక 'కొల్లా బండి' అనే బండిపై సరకులు వేసుకుని వ్యాపారం చేసి వుంటారని ఊహించవచ్చు. (సరకుల బండ్లలో మూడు రకాలు - గొన్నన లేక గొనప బండి; గొల్లెన బండి ; కొల్లారు లేక కొల్లా బండి) తేనె, అల్లం, ఉలవల, నూనె, తోళ్ల, తోలు, బందారు (బందారు అంటే పసుపు), ఉప్పు, పుగాకు అనే యింట్ల పేర్లను బట్టీ మరియు మామిళ్ల, నూకల, ధనియాల, ఆవాల, నువ్వుల, నూలు వగైరా గృహ గోత్రనామాదులను బట్టీ అప్పట్లోవారు ఆయా సరకుల వ్యాపారాలు చేసేవారని అర్థం చేసుకోవచ్చు. కమ్మవారిలోని 'ఓడ', 'నావ' అనే యింట్ల పేర్లను బట్టి వారు నౌకా వ్యాపారాలు కూడా నిర్వహించి వుండవచ్చు ననిపిస్తున్నది. అలా వర్తక వాణిజ్యాలలో ఆర్జించిన సొమ్ముతో కొందరు ఆ కాలంలోనే భాగ్యవంతులై వుంటారు. ధనాల, కాసుల, కాసు, సిరిమేడల, కనకమేడల, పమిడిముక్కల,

పమిడి, పైడి (పైడి అన్నా, పసిడి అన్నా, పమిడి అన్నా బంగారం), ధనికుల, ధనెంకుల, ధనేకుల, మేడ, మేడమెట్ల, మేడసాని, బొక్కసం (బొక్కసం అంటే కోశము, ధన భాండాగారము), లెక్కల (బహుశా వడ్డీ లెక్కలై వుంటాయి), కుందనాల (కుందనం అంటే బంగారం), బంగారు ముక్కల, స్వర్ణపనేని (స్వర్ణప్ప నాయని), కంకణాల, కడియాల అనే యిండ్ల పేర్లూ, శ్రీవత్స (లక్ష్మీ పుత్రుడు), శ్రీపాద, పమిడిచుక్కల, పైడికుల, ధనపతుల, మేడశ్రీల, శ్రీకాంతు (లక్ష్మీపతి), శ్రీలక్ష్మి , కాగితాల (బహుశా ఋణపత్రాలు కావచ్చు), శ్రీధర, శ్రీపాల, పడిమిడిపాల, సిరిపాల అనే గోత్రనామాలు యీ ఆర్థిక సౌష్టవం కారణంగానే కమ్మవారిలో ఏర్పడి వుంటాయి. సుఖవాసి (దిగుళ్లు లేకుండా సుఖంగా జీవించేవాడు), వసంతం, వసంత, భోగినేని వగైరా యిండ్లపేర్లు అందుకే వారిలో ఏర్పడి వుంటాయి. జవ్వాది, జవ్వాజి, శృంగారపు, సింగారపు, మల్లెల వగైరా యిండ్ల పేర్లూ, కస్తూరి, పూలమాల, పువ్వుల వగైరా గోత్రనామాలూ వారి పూర్వీకులలోని కొందరి విలాసవంతమైన జీవితాన్ని సూచిస్తున్నాయి.

## కమ్మవారు వస్తుతః క్షత్రియులు

మనం యిందాక చెప్పుకున్నట్లు కరికాల చోళుని సంతతివారు, తాము సూర్య, చంద్ర వంశీకులమని చెప్పుకున్న తెలుగు క్షత్రియులు, తెలుగు చోడులు, దుర్జయాన్వయులు, చాళుక్యాన్వయులు, హైహయ వంశీకులు వగైరా క్షత్రియ సంతతివారు నేటి క్షత్రియ, వైశ్య, వెలమ, రెడ్డి, కాపు కులస్థులలో కొంతమేరకు కలిసిపోయినా ప్రధానంగా కమ్మవారుగా కొనసాగుతున్నారు. కమ్మ, కాపు, వెలమ, రెడ్డి కులాలను వారు శూద్రులలో ప్రముఖులనే భావంతోనేనేమో 'సచ్ఛూద్రుల'ని పిలుస్తారు.

'వావిళ్ల' నిఘంటువులో 'కమ్మకట్టు' అనే శబ్దానికి రెండు అర్థాలివ్వబడ్డాయి. ఒకటి – ఓడిన రాజు గెలిచిన రాజుకు అవసరమైనప్పుడు ఒడంబడిక ప్రకారం పంపే సైన్యం. రెండు – కొంత ధనం పుచ్చుకుని నిర్ణీత కాలం వరకే రాజు పక్షాన యుద్ధం చేయవచ్చిన సైన్యం. దీనిని బట్టి కమ్మ వారు నేడు ప్రధానంగా వ్యవసాయ దారులుగానూ, వ్యాపారులుగానూ జీవిస్తున్నప్పటికీ, ఒకప్పుడు వారు ప్రాయికంగా ఆయుధోపజీవులనీ, స్వంత సైనిక విభాగాలు కూడా వారు కలిగి వుండే వారనీ అర్థమౌతున్నది.

కమ్మవారిలో వున్న కొండ్రాజు, కొసరాజు, పోతరాజు, గోకరాజు, కొమ్మరాజు, సూర్యదేవర, రాయుడు, రాయదు, రాయ, ముప్పరాజు, మాచిరాజు వగైరా యిండ్లపేర్లు వారి క్షత్రియ మూలాల్ని తెలుపుతున్నాయి. అలాగే లోకపాల, మహారాజ, మహారాజుల, గోకరాజు, కొమరాజుల, రాజపాల, రాచనూళ్ల, రాచుక్కల, రాజేంద్ర, రాచంద్రుల, వీరంకుల, రాచమడుగుల, రాజన్యుల, జగ బిరుదుల, ఎంద్రాజుల, అనిరాజుల (అని అంటే యుద్ధము) వగైరా కమ్మవారి గోత్రములు కూడా వారి క్షత్రియ మూలాలను చెప్పకనే చెపుతున్నాయి. అలాగే కోట, భూమి, పెద్ది, మల్లిపెద్ది, దండు (సైన్యం), దుర్గం, రాచే, రఘుపతి, గద్దె (సింహాసనం), దొడ్డ (దొడ్డ దొరలు అంటే రాజులు), రాయ వగైరా యిండ్ల పేర్లే కాక, 'కలంపోటు' అనే గోత్రనామం కూడా వారి క్షత్రియ మూలాలకు తార్కాణంగా నిలుస్తున్నాయి. (ప్రాచీన కాలంలో రాజులిచ్చే ఉత్తర్వులను 'కలంపోటు' అనేవారు).

కమ్మవారిలో చాలమంది నేటికీ తమ పేరు చివర 'వర్మ' అనే ఉత్తరనామం ధరిస్తుండడం కూడా కమ్మవారి క్షత్రియ మూలాన్ని సూచించేదే. 'వర్మ' అంటే సంస్కృతంలో 'కవచం' (*Coat of mail*) అని అర్థం. ప్రజలకు భౌతిక రక్షణ కలిగించేవాడు వర్మ. క్షత్రియుడు అన్నా అదే అర్థం. 'క్షతాః త్రాయతే ఇతి క్షత్రియః' అంటే 'గాయాన్నుంచి కాపాడి ప్రజలకు

భౌతిక రక్షణ కలిగించేవాడు క్షత్రియుడు' అని అర్థం.

ఇకపోతే కమ్మవారిలో సానితో అంతమయ్యే యింట్లపేర్లు ఎన్నో వున్నాయి. సాహిణి అనే ప్రాకృత పదం యొక్క రూపాంతరమే సాని. సాహిణి అంటే ఆశ్వికుడు; అశ్వదళాధిపతి (*Head of Cavalry*). గజసేనాధ్యక్షుడు అనే అర్థం కూడా వుంది. ఉత్తర భారతదేశంలో అశ్వదళాధిపతులు సాహ్నీ, షహనే, సహనీ, పట్నానీ, సైనీ వగైరాలుగా వ్యవహరించబడ్డారు. (ఉదా: బలరాజ్ సాహ్నీ, పరీక్షిత్ సాహ్నీ, రేణుకా షహనే, భీష్మ సహనీ, ముకుంద్ పట్నానీ, ఆషా సైనీ) అలా ఒకప్పుడు కమ్మవారు సాహిణులుగా వ్యవహరించారనడానికి కమ్మవారి యింట్లపేర్లలో గల పెమ్మసాని, బొమ్మసాని, నన్నసాని, కొమ్మిసాని, కొండసాని, అలగసాని, అల్లసాని, అప్పసాని, కొలసాని, పాపసాని, పోసాని, బోడసాని, బైసాని, సుగసాని, చలసాని, కేసాని, మేడసాని, పేరసాని, పెరమసాని, పేరంసాని, యెలసాని, రామసాని, లంకసాని, లక్కమసాని వగైరా తార్కాణాలుగా నిలుస్తున్నాయి. ఈ యింట్లపేర్లు వారు సాహిణులుగా వుండేవారని తెలుపుతూ వారి క్షత్రియ మూలాల్ని తెలియజేస్తున్నాయి. (పెరమసాని వగైరా యింటిపేర్లు కాపులలోనూ, కారసాని, కాటసాని వగైరా యింట్లపేర్లు రెడ్లలోనూ కూడా వున్నాయి.)

అలాగే రెడ్డి అనే శబ్దం రాష్ట్రకూట→రట్టకుడి →రట్టోడి→రాథోడ్(రాఠోడ్)→రట్టడ్డి→రడ్డి→రెడ్డిగా రూపాంతరం చెందింది. మొదట్లో 'రెడ్డి' అంటే 'గుర్రపురౌతు' అని అర్థం. గుర్రపురౌతులను క్రమంగా రాజులు గ్రామపాలకులుగా నియమించడం ప్రారంభించారు. అంచేత తెలుగునాట రెడ్డి అంటే 'గ్రామ పాలకుడు' అనే అర్థం స్థిరపడింది. 'రేపటికి రాజెవరో, రెడ్డెవరో' అనే సామెత సుప్రసిద్ధం. రాజు రాజ్యానికంతా పాలకుడు. రెడ్డి కేవలం గ్రామపాలకుడు. 'రేపటి రోజుకు గ్రామపాలకుడు రాజూ కావచ్చు. రాజు గ్రామపాలకుడుగానూ మారవచ్చు' అనే భావంతో యీ సామెత ఏర్పడింది. మొదట్లో యిలా గుర్రపు రౌతులకూ, గ్రామపాలకులకూ వాడబడిన 'రెడ్డి'పదం క్రమంగా ఒక కులంవారికి మాత్రమే పరిమితమయింది. అయినా యింకా అక్కడక్కడా గౌరవసూచకమైన యీ 'రెడ్డి' అనే పదాన్ని యితరకులాల వారు కూడా తమ పేర్ల చివర ఉత్తరనామంగా వాడుతూండడం మనం గమనించవచ్చు. ఉదా : కీ.శే. చుండూరు వెంకటరెడ్డి. ఈయన వైశ్యుడు. విజయవాడలోని ప్రసిద్ధ యస్.ఆర్.ఆర్. & సి.వి.ఆర్. ప్రభుత్వ కళాశాల దాతలలో ఒకరు. ఇలాంటి ఉదాహరణలు రాయలసీమలోనైతే ఎన్నైనా యివ్వవచ్చు. 'దేసటి' అన్నా రెడ్డి అనే అర్థమే. 'పాండురంగ మాహాత్మ్యము'లో రామకృష్ణకవి 'రడ్డి', 'రెడ్డి' పదాలతోపాటు "నెవ్వడా దేసటింటికి నెగ్గుదెచ్చె" (పాం.మా - 3-68) అంటూ ప్రయోగించాడు. దేసటినే 'దేష్టి' అనికూడా అంటారు. కమ్మవారిలోని దేష్ట, దెష్ట, దేశట్ల, దేసట్ల, దేట్ల వగైరా యింట్లపేర్లు, దేసట్ల, దేశట్ల వగైరా గోత్రాలు ప్రాచీనకాలంలో రెడ్లకూ, వారికీ వున్న అనుబంధాన్ని తెలుపుతున్నాయి. ఈ రెండు కులాలవారికి కూడా చాల యింట్లపేర్లు కలుస్తున్నాయి. అంతేకాక కమ్మవారిలోని కాపు, కాపుల అనే యింట్లపేర్లు కూడా ఒకప్పటి వీరి అనుబంధాన్ని తెలియజేస్తున్నాయి. (ప్రాచీన కాలంలో 'కాపు' అనే పదం రెడ్లకే వాడబడింది). కమ్మవారిలో వున్న వాసిరెడ్డి, పాతరెడ్డి, మహారెడ్డి, రెడ్డి, వనంరెడ్డి, సాదిరెడ్డి, బొల్లారెడ్డి, భీమిరెడ్డి, భోగిరెడ్డి, వల్లభరెడ్డి, తమ్మారెడ్డి, కొమ్మారెడ్డి వగైరా యింట్లపేర్ల వాళ్లు కూడా ఒకప్పుడు ఆశ్వికయోధులుగానూ, గ్రామపాలకులుగానూ వుండి వుంటారని సూచిస్తున్నది. కమ్మవారి యింట్లపేర్లలోని పేరం (పేరం అంటే గుర్రపుదౌడు), మహారౌతు, మారౌతు (దీన్నే మారోతు అనీ పలుకుతున్నారు.) అనేవి వారు ఆశ్వికయోధులు అని తెలుపుతున్నాయి. వాసిరెడ్డి అంటే ప్రసిద్ధిగాంచిన గ్రామపాలకుడు. దీనినే కొందరు 'వాశిరెడ్డి' అని కూడా వ్రాస్తున్నారు. బహుశా కుంటి 'సి' అశుభసూచకమని భావించి దానికి బదులు వారు (మెలిక) 'శి' వాడుతూండవచ్చు. అయితే 'వాశి' అంటే వడ్రంగి వాడే బాడిత లేక బాడిస అనే పరికరం. వాశిరెడ్డి అనేపదం అర్థరహితం. అంచేత 'వాసిరెడ్డి' అని వ్రాయడమే సవ్యమైనట్టిది. వాసిరెడ్డి యింటిపేరు కలవారు కమ్మవారి లోనే కాక ఉత్తరాంధ్ర జిల్లాలలోని వెలమ

వారిలోనూ వున్నారు. ఉదా : – వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు, వాసిరెడ్డి వరద రామారావు వగైరాలు. అంతేకాదు కాకినాడ ప్రాంతంలోని కొన్ని మండలాలలోనూ గుంటూరు జిల్లా పొన్నూరు ప్రాంతంలోని కొన్ని గ్రామాలలోనూ కాపులలో కూడా వాసిరెడ్డి వారున్నారు.

ఇక కమ్మవారి క్షాత్రాన్ని తెలిపే యిండ్లపేర్లు మరికొన్ని చూద్దాం. కరారి (కత్తి), కటారి, కత్తి, సమ్మెట, వీరగంధం, గుదె (అంటే గొద్దలి; సమ్మెటలూ, గొద్దళ్లూ కూడా యుద్ధాల్లో ఆయుధాలుగా వాడేవారు.), చెన్నమల్లు, ఛెలమల్లు, జట్టి, జెట్టి (జట్టి అన్నా, జెట్టి అన్నా మల్లయోధుడు), దాడి (*Attack*), పట్టా (పట్టా అంటే రెండువైపులా పదునుగల పెద్ద కత్తి), పోట్ల (పోట్ల అంటే శౌర్యం), ప్రతాపు, ప్రతాప, బడె (బడె అంటే యోధులు వుపయోగించే దుద్దుకర్ర), భీమ (భయానకమైన), లావు (బలము, సామర్థ్యము), దురము (యుద్ధము), నెట్టెము (యోధులు ధరించే తలపాగ), విక్రం, వీరమాసు, వీరమాచు, ఎర్రమాసు (మాచు లేక మాసు అంటే శూరుడు, మల్లుడు) యిండ్లపేర్లు కమ్మవారిలో వున్నాయి. ఇవేకాక వారిలోని వీరంకుల, వీరుళ్ల, వీరళ్ల, పౌరుషముల, పులికంటి (భయానకమైన పులిచూపు వంటి చూపుగల), దొబ్బల (బలిష్టంగా కండలు తిరిగిన శరీరముకల) వగైరా గోత్రనామాలు వారి పూర్వుల శౌర్యప్రతాపాలను తెలుపుతున్నాయి. ఏనుగుల, లేళ్ల, గుర్రం అనే యిండ్ల పేర్లను బట్టీ 'గజేంద్రుల' అనే గోత్రం కమ్మవారిలో వుండడాన్ని బట్టీ గజసాహిణులుగానూ, అశ్వసాహిణులుగానూ వుండడమేకాక లేళ్ల వేటలో కూడా వారు ప్రసిద్ధులై వుంటారని సూచనప్రాయంగా తెలుస్తున్నది. వెలనాటి చోడుడైన ప్రసిద్ధ గజసాహిణి జాయప్పసేనాని కాకతీయ గణపతిదేవ చక్రవర్తి యొక్క గజసైన్యాలకు అధిపతి అయినట్టి కమ్మప్రభువు అనేది అందరూ ఎరిగిన సత్యమే. 'అమ్ము' అనే కమ్మవారి యింటిపేరు వారి పూర్వీకులు విలువిద్యతో సంబంధమున్నవారని సూచిస్తున్నది. కమ్మవారి మూలపురుషులలో ప్రముఖుడైన కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి నవలక్ష ధనుర్ధరులను కలిగివుండేవాడట. అంటే తొమ్మిది లక్షలమంది విలుకాళ్లు ఆయన సైన్యంలో వుండేవారన్నమాట. సింగం, పులి అనే కమ్మవారి యిండ్ల పేర్లను బట్టి వారి పూర్వీకులలోని కొందరు సాహసంతో పులుల్నీ, సింహాల్నీ వేటాడి చంపి వుంటారని భావించవచ్చు. పులిగోళ్ల, పులివేళ్ల (పులియాళ్ల), పులిపాల గోత్రాలు కమ్మవారిలో వుండడం కూడా దీనినే సూచిస్తున్నది. (పులిని చంపిన దానికి గురుతుగా – పులిగోళ్లూ, పులివేళ్లూ కోసుకురావడం; ఈనిన ఆడపులి నుంచి పులిపాలు తేవడం అనాదిగా శౌర్యవంతులకు పరీక్షలుగా వుండేవి). పులికాంతుల గోత్రం కూడా కమ్మవారిలో వుంది. కాంతుడు అంటే భర్త. బహుశా పులులను లొంగదీసుకున్న యోధుల కారణంగా ఆ గోత్రం కమ్మవారిలో వచ్చి వుంటుంది. కమ్మవారిలోని 'చీకటి' వారిది పులికాంతుల గోత్రం కావడం విశేషం. 'కొరిటాల' వారి మేరువుల (మేరువు ధైర్యానికి సంకేతం), పులివేళ్ల గోత్రాలూ, 'పాలచెర్ల'వారి 'పౌరుషముల' గోత్రము వగైరాలు వారి పూర్వులు శౌర్యప్రతాపాలు గలవారై వుంటారని సూచిస్తున్నాయి.

## కమ్మవారు నాయుళ్లు

ఇక కమ్మవారిని దక్షిణ భారతదేశంలోని హెచ్చుప్రాంతాలలో 'నాయుళ్లు' అంటారు. 'నాయుడు' లేక 'నాయదు' అనే శబ్దాలు 'నాయకుడు' అనే శబ్దాన్నుంచి వచ్చాయి. 'నాయుడు' అనే పదం కమ్మవారికే ఒకప్పుడు వాడబడింది. యిండ్లపేర్లు ఏర్పడకముందు తండ్రిపేరుతోనే వ్యక్తులు గుర్తించబడేవారని మనం చెప్పుకున్నాం. అలాగే వీరప్పనాయని కుమారులు వీరప్పనాయనివారుగానూ క్రమంగా వారే 'వీరపనేని'వారుగానూ, పిలువబడ్డారు. అలా యిండ్లపేర్లలో గల 'నాయని' అనే శబ్దం కాలక్రమేణా 'నేని'గా రూపొందింది. యింటిపేరులో నేని వున్నవారు సహజంగా తమ పేరు చివర నాయుడు లేక

నాయుడు అనే పదాన్ని తొలగించివేశారు. అక్కినాయని సంతానం 'అక్కినేని'వారుగానూ, సూరప్పనాయని సంతానం 'సూరపనేని'వారుగానూ, లింగినాయని సంతానం 'లింగినేని'వారుగానూ వ్యవహరించబడసాగారు. అసలీ నాయుడు అనే శబ్దం నాయంకరులకు వాడేవారు. నాయంకరుడంటే మొదట్లో పన్నెండు మంది భటులకు మాత్రమే అధిపతి. అది క్రమంగా విస్తరించి వందల, వేల సంఖ్యలోగల సైనికులకు అధిపతులను కూడా 'నాయంకరులు' లేక 'నాయకులు' అనడం ప్రారంభించారు. అచిరకాలంలోనే 'నాయకుడు' లేక 'నాయడు' అనేపదం రాజుకూ, సామంతరాజుకూ పర్యాయపదమై పోయింది. కాకతీయ సామ్రాజ్యంలో చక్రవర్తి పాలన క్రింద 72 మంది నాయంకరులుండేవారట. నాయంకర శబ్దాన్నుంచి వచ్చిన నాయకుడు, నాయడు, నాయుడు, నేడు, నీడు అనే పదాలు అనాదిగా కమ్మవారికే వాడబడ్డాయి. ఉదాహరణకు అమ్మినీడు, తిమ్మానేడు, యుధిష్ఠిరనీడు, పేర్నీడు, మల్నీడు, బాపినీడు, రామానాయుడు, వేంకటాద్రినాయడు. అక్కడక్కడా మాత్రమే నాయడు లేక నీడు శబ్దాలు యితర కులాల వారికి కూడా ఉత్తరనామాలయ్యాయి. 'నాయని' అనే పదమే 'నేని'గా రూపాంతరం చెందిందని చెప్పుకున్నాం కదా! అక్కినేని, అన్నపనేని, అన్నమనేని, అబ్బినేని, అమిరినేని, అల్లంనేని, ఇరిగినేని, ఉడతనేని, ఉమ్మలనేని, ఉమ్మినేని, యర్రంనేని, ఎర్నేని, ఏమినేని, కంఠంనేని, కాటమనేని, కామినేని, కాసరనేని, కూనంనేని, కేతినేని, కేశినేని, కొండపనేని, కొమ్మినేని, గంగినేని, గంధంనేని, గట్టినేని, గౌరినేని, గణపనేని, గన్నమనేని, గుండపనేని, గోగినేని, ఘట్టమనేని, చింతమనేని, చిట్టినేని, తమ్మినేని, తల్లపనేని, తాతినేని, త్రిపురనేని, దాదినేని, దుగ్గినేని, దేవినేని, దొడ్డపనేని, నంగినేని, నన్నపనేని, నాగినేని, నాయినేని, పైనేని, పర్వతనేని, పాపినేని, పిన్నమనేని, పేరినేని, పోతినేని, పోలినేని, బంతినేని, బాలినేని, బావినేని, బొమ్మినేని, బొల్లినేని, భోగినేని, బైరపనేని, భీమనేని, మంచినేని, మద్దినేని, మల్లినేని, మాకినేని, మాచినేని, మాదినేని, మిక్కిలినేని, ముక్తినేని, ముత్తినేని, ముప్పానేని, ముమ్మలనేని, ముమ్మనేని, మూర్తినేని, మైనేని, యెలినేని, రాచనేని, రామినేని, రాయనేని, లింగమనేని, లింగినేని, వంకినేని, వద్దినేని, వల్లభనేని, వీరపనేని, వీరమాసునేని, వీరమాచనేని, సన్నపనేని, సల్లపనేని, సాగినేని, సాదినేని, సామినేని, సాయపనేని, సింగమనేని, సూరపనేని వగైరా కమ్మవారి యిండ్లపేర్లన్నీ అలా ఏర్పడినవే! (ఇందులో ఏమినేని, కామినేని యిండ్లపేర్లు గౌడ కులస్థులలోనూ, 'నాయినేని' యింటి పేరు వెలమవారిలోనూ, 'వల్లభనేని' అనే యింటిపేరు కాపులూ, పల్లెకారులలోనూ, 'సామినేని' అనే యింటిపేరు కాపులలోనూ కూడా వుండడం నేను గమనించాను).

## మరికొన్ని విశేషాలు

తెలుగు చోడులలో నన్నూరు చోడులు అనే శాఖ వుంది. సూర్య వంశ క్షత్రియుడు, మహాకవి నన్నెచోడుడు ఈ శాఖకు చెందినవాడే. కమ్మవారిలో నన్నూరి, నన్నూరు అనే యిండ్లపేర్ల వారున్నారు. కమ్మవారిలో కొందరి పూర్వీకులు సూర్య, చంద్ర వంశాల క్షత్రియులని కొందరు భావిస్తున్నారు. దీనికి ఆధారంగా వారి గోత్రాలలో దశరధుల, రఘుపతి, గౌతమ, అయోధ్య, శ్రావస్తి, కాశీ, కాశీపాల, రామనూళ్ల, రామకుల, రఘుపల్లె, చంద్రోళ్ల, చంద్రనూళ్ల, చంద్రపాల, చంద్రపాళ్ల వగైరాలుండడాన్ని పేర్కొనవచ్చు. గుంటూరు జిల్లా నాగార్జునకొండ ప్రాంతాన్ని పాలించిన ఇక్ష్వాకు వంశ రాజులు కూడా తాము ఉత్తరభారతాన్నుంచి వచ్చిన సూర్యవంశ క్షత్రియులమని చెప్పుకున్నారు. కమ్మవారి పూర్వీకులలో కొందరుకూడా అలా ఉత్తర భారతదేశం నుండి దక్షిణానికి వలసవచ్చిన క్షత్రియులై వుంటారని పైన తెలిపిన కమ్మవారి గోత్రాలు సూచిస్తున్నాయి. కమ్మవారిలో కొందరి పూర్వులు పలనాటిలోని గురజాలను పాలించిన హైహయాన్వయులు. ఉత్తర భారత దేశంలోని పాలమాచాపురి (బహుశా ఇది నేటి మధ్యప్రదేశ్‌లోని 'పాలమావు' పట్టణం అయివుంటుంది.) నుంచి వచ్చిన వీరి పురాతన

మూల స్థానము అయోధ్యా పట్టణమట ! అందుకే 'పలనాటి వీర చరిత్ర' లో శ్రీనాథ మహాకవి వారిని అయోధ్య రాజులని పేర్కొన్నాడు (పేజీ 187 - 67 వ పంక్తి). ఇదే కాక పైన పేర్కొన్నట్లు కమ్మవారిలోని దశరథుల, రఘుపతి, అయోధ్య, రామకుల, రఘుపల్లె వగైరా గోత్రాలు వీరి పూర్వులలో కొందరు ఉత్తర భారత దేశం నుండి వచ్చి స్థిరపడిన వారై వుండవచ్చునని సూచిస్తున్నది. కమ్మవారిలోని ఓరుగంటి గోత్రం కాకతీయులతో వారికున్న అనుబంధానికి మరొక ప్రబల సాక్ష్యం. అలాగే కమ్మవారిలో 'సలికి' అనే యింటి పేరు వుంది. వీరిది 'రత్నాల' గోత్రం. ఇక్ష్వాకుల సామంతుడిగా హిరణ్యరాష్ట్రాన్ని పాలించిన సలికి రెమ్మణ్ణకుడు అనే పాలకుడు చాళుక్యుల మూల పురుషుడని నాగార్జున కొండ శాసనాన్ని బట్టి తెలుస్తున్నది. ఇతడినే చాళుక్య వంశకర్తగా చరిత్రకారులంతా నిర్ధారించారు. 'సలికి' పదమే కాలక్రమేణా 'చుళుక', 'చాళుక్య'గా రూపాంతరం చెందిందట. కనుక పై యింటి పేరును బట్టి కొందరు కమ్మవారి పూర్వీకులు చాళుక్యుల సంతతికి చెందినవారని తెలుస్తున్నది. కమ్మవారిలోని గురజాల, గురిజాల, గురుజాల వగైరా యిండ్లపేర్లు, గురజాల గోత్రం వారికి హైహయాన్వయులతో వున్న బాంధవ్యం సూచనప్రాయంగా తెలుపుతున్నది. కమ్మవారిలో 'కందర్ప' (అంటే మన్మథుడు) అనే యింటిపేరు కూడా వుంది. వారిది మదమంచి గోత్రం. యిది వారి పూర్వుల స్ఫురద్రూపానికి సంకేతమేమో! కమ్మవారిలో జలం, మంచినీళ్ళ, తన్నీరు (తాగే నీరు), చెలమ వగైరా యిండ్లపేర్లూ, విప్పనీళ్ల (విప్పచెట్టు క్రింది నీటి వనరు నుంచి కావచ్చు), పీపాల వగైరా గోత్రనామాలూ వుండడాన్ని బట్టి త్రాగు నీటి సరఫరాకు ఆ యా గోత్రాల వారి పూర్వులు కృషిచేసి వుండవచ్చుననిపిస్తున్నది. అన్నదానం చేసినవారి నుండి 'అన్నదానపు' అనే గోత్రం ఏర్పడి వుండవచ్చు. కమ్మవారిలోగల 'వడ్డి', 'వడ్డె' యిండ్లపేర్లను బట్టి ఆ గృహ నామాలు గలవారి పూర్వులు ఓఢ్రదేశం (వడ్డి దేశం - ఒడిసా - ఒరిస్సా) నుండి వలస వచ్చినవారని ఊహించవచ్చు. వారిలోని సేలం, సేలంనేని (సేలం నాయని), నాగపూరు వగైరా యిండ్లపేర్లు ఆయా యిండ్లపేర్లు కలవారు, ఆయా ప్రాంతాల నుండి వలస వచ్చినవారై వుంటారని సూచిస్తున్నాయి. వీరంతా యిండ్లపేర్లు ఏర్పడక ముందు ఆంధ్రప్రాంతాన్నుంచి ఆయా ప్రదేశాలకు వలస వెళ్లి తరువాత తిరిగివచ్చి వుండవచ్చు. ఆలూరు, కామన వగైరా ఎన్నో యిండ్లపేర్లవారిది ఆరువేల గోత్రం కావడాన్ని బట్టి వారి పూర్వులు ఆరువేలనాడు (షట్సహస్ర దేశము) నుంచి వలస వచ్చినవారై వుంటారని అర్థం చేసుకోవచ్చు. కమ్మవారిలో పెసరట్లు, పేలపిండి గోత్రాలు మొదలుకొని 'కోహినూరు' వరకూ రకరకాల గోత్రాలున్నాయి. చావ, చావా, శావా అనే యిండ్లపేర్లవారి గోత్రాలలో కోనూళ్ల, సాగునూళ్ల, కోసూరి, జనార్దన వగైరాలతోబాటు కోహినూరు గోత్రం కూడా వుంది; మరి ఏ కారణంగానో ! ప్రసిద్ధి చెందిన శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయని తల్లి, భార్య చావ వారి ఆడపడుచులే.

కమ్మవారిలోని వైష్ణవం, నామా, హనుమంతు, వైకుంఠం, వైష్ణవుల అనే యిండ్లపేర్లూ, విష్ణోళ్ల, సువర్చుల, సుభద్ర, వేంకటాద్రి, జనార్దన, నామాల, రామనూళ్ల వగైరా గోత్రనామాలూ వారి వైష్ణవ మూలాల్ని సూచిస్తూండగా వారి గోత్రాలలోని శ్రీకంఠ, శివనందుల, గరళకంఠ వగైరాలు, లింగం, కాలారి అనే కమ్మవారి యింటిపేర్లు (కాలుడు - అంటే యముణ్ణి జయించిన మృత్యుంజయుడైన శివుడు కాలారి అనబడ్డాడు.) వారి శైవమూలాలకు తార్కాణాలు. కమ్మవారిలోని దేవరింటి, దేవభక్తుని, దేవాభక్తుని, అన్నాభక్తుని (అన్నాబత్తుని), దేవళ్ల వగైరా యిండ్లపేర్లు, సిరియాళ, శ్రీయాళ వగైరా గోత్రనామాలు వారిలో కొందరి పూర్వుల భక్తితాత్పర్యాలకు తార్కాణాలు. ఇలా కమ్మవారి యిండ్లపేర్లూ మరియు గోత్రనామాలూ వారి పూర్వులు క్షత్రియులని తెలపడమే కాకుండా వారి బహుముఖ వ్యాసంగాలను తెలుపుతున్నాయి. ఈ విధంగా తెలుగు మాగాణంలోని తెలుగు చోడులు, కరికాలచోళుని వంశీకులు, దుర్జయ వంశీకులు, చాళుక్యాన్వయులు, హైహయాన్వయులు, కాకతీయులు వగైరాలు ప్రధానంగా నేటి కమ్మవారి పూర్వీకులు అనడంలో ఎట్టి సందేహమూ లేదు.

# బా ల నా గ మ్మ క థ

కమ్మవారి గోత్రాలలో పానుగంటి గోత్రం ఒకటి. పానుగంటి అనే యింటిపేరు కూడా వారిలో వుంది. వారిది విప్పర్ల గోత్రం. ప్రసిద్ధిచెందిన బాలనాగమ్మ కథలో ఆమె భర్త కార్యవర్ధిరాజు పానుగంటి వంశీకుడైన కమ్మ ప్రభువు. ఆయన బాలనాగమ్మకు స్వయానా మేనమామ కుమారుడే. 'బాలనాగమ్మ' కథలో మాయల ఫకీరు పానుగంటి కోటలో ఎవరూ లేని సమయంలో జంగందేవర వేషంలో భిక్షకై వచ్చి, బాలనాగమ్మను తన మాయలతో నల్ల కుక్కపిల్లగా మార్చి, తస్కరించుకుపోయి నాగళ్లపూడి గట్టుపైని ఒంటి స్తంభం మసీదులో చెరబట్టాడని చెబుతారు. శాస్త్రీయ దృష్టితో చూస్తే యీ కథను విశ్వసించలేం. అలాగే, ఈ కథ వెనుక వున్న గాథలోని చారిత్రక సత్యాన్ని కూడా కొట్టిపారేయలేం. పులిచింతల సమీపంలోగల నాగళ్లపూడి ఫకీరు స్థావరంగా చెప్పబడింది. మరి నాటి పానుగంటి పురము, మహబూబ్‌నగర్ జిల్లా పానగల్లా? లేక నల్లగొండ జిల్లా పానగల్లా? కథలో చెప్పిన దాని ప్రకారం ఫకీరు నాగళ్లపూడి గట్టుమీది తన స్థావరంలో ఒక నల్లపిల్లిని చంపి దానిని కాల్చి బూడిద చేసి దానితో అంజనం (కాటుక) చేసి దాన్ని కళ్లకు పెట్టుకుని చూస్తాడట. అప్పుడు అక్కడికి వాయవ్య మూలలో బాలనాగమ్మ అనే అతిలోకసుందరి అతడికి కనుపించిందట. నల్లపిల్లి బూడిదతోచేసిన కాటుకను కళ్లకు పెట్టుకుంటే ఎక్కడో పానుగంటి పురంలో వున్న బాలనాగమ్మ కనుపించిందనడం అశాస్త్రీయం. అయితే ఆ పానుగంటిపురం నాగళ్లపూడికి వాయవ్య దిక్కులో వున్న మహబూబ్‌నగర్ జిల్లాలోని నేటి పానగల్లే అనే 'క్లూ'ను మనకీ కథ అందిస్తున్నది. బాలనాగమ్మను మాయల ఫకీరు తస్కరించి చెరబట్టగలగడం గోలకొండ నేలుతున్న కుతుబ్‌షాహీ ప్రభువులైన ముస్లిములు క్రీ.శ. 1652లో మీర్‌జుమ్లా సేనాని నేతృత్వంలో గండికోటపై దాడి జరిపినప్పుడు గండికోట ప్రభువుల రక్షణకై వారి బంధువులైన పానుగంటి ప్రభువుల రాజ్యంలో కత్తి, కర్ర పట్టగలిగిన ప్రతి ఒక్కరూ గండికోట యుద్ధానికి తరలి వెళ్లడంతో సాధ్యమయింది. పెమ్మసాని తిమ్మానాయఁడు 66 యిండ్లపేర్లు గల కమ్మ వారిని గండికోట రక్షణకై తమతో కలిసి మీర్‌జుమ్లా పై పోరాడడానికి ఆహ్వానిస్తూ లేఖలు వ్రాశాడట. ఆ 66 యిండ్ల పేర్లలో 'పానుగంటి' ఒకటి.

అయినా బాలనాగమ్మ యుక్తితో తన పాతివ్రత్యాన్ని కాపాడుకుని, తన కుమారుడైన బాలవర్ధి రాజు సాహసం కారణంగా ఫకీరు చెర నుండి బయల్పడిఁదట. ఈ కథలోని సత్యాసత్యాల సంగతలా వుంచి గండికోట కమ్మవారుగా ప్రసిద్ధులైన పెమ్మసాని, శాఖమూరి, అడుసుమిల్లి, నిమ్మగడ్డ, పరుచూరి, ఈద్పుగంటి, ఘట్టమనేని, మిక్కిలినేని, కంచెర్ల, కోవెలమూడి, ఉమ్మినేని, కిలారు, తాతినేని, సాయపనేని, వేలూరి, నర్రావుల, మల్లిపెద్ది, కొత్తపల్లి, మైనేని, కుడితిపూడి వగైరా యిండ్లపేర్లుగల కమ్మవారి కుటుంబాలలో 'బాలనాగమ్మ కథ'ను తరతరాలుగా ఆబాల వృద్ధులూ తమ స్వంత కథగా చెప్పుకుంటూ వుండడం విశేషం !

# గ ం డి కో ట క మ్మ వా రు

హంపి విజయనగర పాలకులలో ప్రౌఢ దేవరాయలు లేక గజబెంట దేవరాయలు అని పిలువబడిన రెండవ దేవరాయల పాలనా కాలం (క్రీ.శ.1422 – 1446) లో నేటి కడప జిల్లా జమ్మలమడుగు తాలూకాలో పెన్న, చిత్రావతి నదుల సంగమ స్థలం వద్ద నిర్మించబడిన కోట గండికోట. పెమ్మసాని తిమ్మానాయుదు గండికోట కమ్మవారి మూల పురుషుడు, తరువాత పాలించిన మహా వీరులు చినతిమ్మానాయుడు, అరతిమ్మా నాయుడు, పెద తిమ్మరాజు, చిన తిమ్మరాజు

వగైరాలు. అసలు యీ కోటను నిర్మించి పాలించిన మిక్కిలినేని వారిలో ఆఖరి వాడు మిక్కిలినేని రామానాయుడనే మహావీరుడు. ఆయన భార్య రంగమాంబ. ఆమె బెల్లంకొండకు చెందిన పెమ్మసాని వారి ఆడపడుచు. వారి ఏకైక కుమార్తె మంగమ్మను రంగమాంబ మేనల్లుడు, గుంటూరు జిల్లా సత్తెనపల్లి సమీపంలోని బెల్లంకొండ ప్రభువు అయిన పెమ్మసాని చిన తిమ్మానాయునికిచ్చి వివాహం చేసి అల్లుడిని గండికోటకు ఇల్లరికం తీసుకెళ్లాడట రామానాయుడు. అలా కడప జిల్లా గండికోట గుంటూరు జిల్లాకు చెందిన పెమ్మసాని వారి పాలన క్రిందకు వచ్చింది.

గండికోటనేలిన పెమ్మసాని వారు విజయనగర రాజుల ఆత్మబంధువులు. శ్రీకృష్ణ దేవరాయుల తల్లి నాగులాంబిక గండికోట పెమ్మసాని వారి ఆడపడుచు. ఆయన సవతి తమ్ముడు అచ్యుత రాయలు భార్య తిరుమలాంబ కూడా పెమ్మసాని వారి ఆడపడుచేనట. రెండవ దేవరాయలు కాలం నుండి గండికోట విజయనగర సామ్రాజ్యానికి తూర్పు గిరిదుర్గంగా వుండేదట. మహా వీరులైన పెమ్మసాని వారు అప్పటి నుండి క్రీ. శ. 1652లో గోల్కొండ సేనాని మీర్‌జుమ్లా సైన్యాలతో జరిగిన యుద్ధంలో గండికోట పతనమయ్యే వరకు విజయనగర సామ్రాజ్యానికి పెట్టని కోటగా నిలిచారు. నాడు నేటి నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కడప, అనంతపురం, కృష్ణా జిల్లాలలో చాల వరకు వీరి పాలన క్రింద వుండేది. గండికోట వారి వార్షిక ఆదాయం ఆ రోజులలోనే యిరవై లక్షలట. వీరికి యిరవై ఐదువేల కాల్బలం, పదిహేను వేల అశ్విక బలం, నలభై ఏనుగులు వుండేవట. గండికోట పతనానంతరం కొందరు వీరులు పెద వీరప్ప నాయని నాయకత్వంలో మధురకు వలస పోయి విశ్వనాథ నాయకుని ఆశ్రయం పొంది అక్కడే స్థిర పడ్డారట. తమిళనాడులోని పలు ప్రాంతాలలో జాగీర్దారులుగా గండికోట యుద్ధంలో పాల్గొన్న 66 యింటి పేర్లు కల కమ్మ వీరులలో ఎక్కువ మంది స్థిరపడ్డారు. కొందరు నేటి గుంటూరు, కృష్ణా, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు జిల్లాలకు వలస వెళ్లి వ్యవసాయ వృత్తిని చేపట్టి అక్కడే స్థిరపడ్డారు.

## కమ్మవారిలో ఇంకొందరు ప్రసిద్ధ స్త్రీలు

ఒకప్పుడు నెల్లూరు జిల్లా నరవాద గ్రామంలో వేమూరి గురవయ్య అనే ఆసామీ వుండేవారు. ఆయన భార్య వెంగమ్మ పచ్చిపాల వారి ఆడపడుచు. ఆమె గొప్ప పతివ్రతగా పేరు పొందింది. ఓ రోజు గురవయ్య పశువుల్ని మేపుకొనడానికి గ్రామ సమీపంలోని అడవికి వెళ్లాడట. అప్పుడు దారిదోపిడీ దొంగలు ఆయన పశువుల్ని తోలుకుపోవాలని ప్రయత్నం చేయగా, అడ్డుకున్న గురవయ్యను వారు తీవ్రంగా గాయపరిచారట. ఆ గాయాలతో గురవయ్య అక్కడికక్కడే మృతి చెందగా, ఆ వార్తను పరుగు పరుగున వచ్చి కొందరు గ్రామీణులు వెంగమ్మకు తెలిపారట. వెంగమ్మ యింకా భర్త శవం యింటికి చేరకుండానే భర్తకోసం చితిని పేర్పించి ఆ చితిమీద చితిమీద తాను కూర్చుని, భర్తని చితిపైకి చేర్చిన తరువాత కూడా చితిమీదే వుండి చితికి నిప్పు అంటించమని తానే ప్రేరేపించి భర్తతో పాటు సహగమనం చేసిందట. పురుషాధిక్య సమాజం సృష్టించిన దురాచారం సతీ సహగమనం. తన మరణానంతరం తన వ్యక్తిగత ఆస్తి వంటి తన భార్య వేరొకరి సొత్తు అయిపోతుందేమో అనే పురుషుల స్వార్థ పూరిత మనోభావనే దీనికి మూలం. పెద్దలు కూడా బలవంతంగా భర్త చితిమీదికి నెట్టడం అతి సాధారణమైన ఆ రోజుల్లో స్వచ్ఛందంగా తానే భర్తతో సహగమనం చేసి వెంగమ్మ నాటి ప్రజల కొనియాడబడింది. అమాయకమైన మూఢమైన పతిభక్తి కారణంగా ఆత్మార్పణం చేసుకున్న ఆమె 'పేరంటాలు' అనే పేరుతో నేటికీ దేవతగా పూజలందుకుంటున్నది. సహగమనం దురాచారమే అయినా, నేటి చట్టాల ప్రకారం అది శిక్షార్హమైన ఆత్మహత్యా నేరమే అయినా నాటి ప్రజలు దానిని హర్షించారు. ఆమెను దేవతను చేసి నరవాదలో గుడికట్టి నేటికీ కూడా ఆరాధిస్తున్నారు. ఆమెకు ఆత్మబంధువులైన పచ్చిపాల, వేమూరి, బొల్లా, మందా, చుండూ, ఉప్పల, కోటపాటి, చావలిపల్లి,

మంగమూరి వగైరా ఎన్నో యిండ్లపేర్ల కమ్మవారు తీవ్ర అనావృష్టి పరిస్థితులలో కనిగిరి, ఉదయగిరి, కందుకూరు, దరిశి వగైరా తాలూకాలూ, నేటి ప్రకాశం, నెల్లూరు జిల్లాలలోని కొన్ని యితర ప్రాంతాల నుండి జీవనోపాధికై ప్రధానంగా కృష్ణా, గుంటూరు జిల్లాలకు పెద్ద సంఖ్యలో వలస వచ్చారు. వీరిని స్థానికులైన కమ్మవారు 'దచ్చాది' (దక్షిణాది) కమ్మవారని పిలుస్తారు. కష్టజీవులైన వీరు వంట చెరకు (కట్టెలు), కర్ర బొగ్గు, రాక్షసి బొగ్గు, పాత యినుము, సోడాలు, కంకర, కలప, ఇటుకలు, మోటార్ ట్రాన్స్‌పోర్ట్ వగైరా వ్యాపారాలలో క్రమంగా ప్రసిద్ధులయ్యారు. వెంగమాంబ వీరికి కులదైవం. ఆమె పేరుతో స్టోన్‌క్రషర్‌లు, లారీ ట్రాన్స్‌పోర్టు కంపెనీలు, బస్ సర్వీసులు, బొగ్గు డిపోలు ఎన్నో వీరు నిర్వహిస్తున్నారు. వ్యాపార సంస్థలలో ఎక్కడైనా 'వెంగమాంబ' పేరు కనుపించిందంటే, అది దక్షిణాది కమ్మవారి వ్యాపారసంస్థేనని ఖచ్చితంగా చెప్పవచ్చు.

గుంటూరుజిల్లా మాచెర్లకు సమీపంలో దుర్గి అనే గ్రామం వుంది. అక్కడి దిగుమర్తి ముసలప్పనాయుడు అనే ఆసామీ తన కుమార్తె లక్ష్మమ్మను, ఏటికవతల కృష్ణాజిల్లా నందిగామకు సమీపంలోని లింగాలపాడుకు చెందిన చిరుమామిళ్ల వెంకయ్యనాయుడుకు యిచ్చి వివాహం జరిపించాడు. గొప్ప స్థితిమంతుడైన ఆయన తన కుమార్తెకు కట్నకానుకలు ఘనంగానే ముట్టజెప్పాడు. ఒకప్రక్క వేశ్యాలోలుడైన భర్త, మరోప్రక్క దురాశాపరులైన అత్త, ఆడబిడ్డల ఆరళ్ల కారణంగా లక్ష్మమ్మ ఎన్నో బాధలనుభవించింది. గొప్ప పతివ్రతగా సాటి వారిలో పేరు, ప్రఖ్యాతులు పొందింది. లక్ష్మమ్మకు ఒక కుమార్తె కలిగింది. ఆ కుమార్తెను వితంతువై పుట్టింట జేరిన లక్ష్మమ్మ ఆడబిడ్డ తన కుమారుడికిచ్చి వివాహం చేయాలని పట్టుబట్టిందట. అది లక్ష్మమ్మకు యిష్టంలేదట. దాంతో పగబట్టిన అత్త, ఆడబిడ్డలు ఏకమై లక్ష్మమ్మపై వున్నవీ, లేనివీ కల్పించి భర్తకు పురెక్కించారట. వేశ్యాలోలుడైన అతను భార్య శీలాన్ని అనుమానించి కడతేర్చాడట. ఆ వెంటనే ఆమె దేవతగా మారి, తన మహిమల కారణంగా మదాంధులైన భర్త, అత్త, ఆడబిడ్డల కళ్లు పోగొట్టిందనే కథలు ప్రచారంలో వున్నాయి. ఏమైనా నాటి నుంచి ఆ పతివ్రతకు ప్రజలు దుర్గి - ధర్మవరంలోనూ, లింగాలపాడులోనూ గుళ్లు కట్టి ఆరాధిస్తున్నారు. ఆమె కథకు యావదాంధ్రలో ఎంతో ప్రాచుర్యం వచ్చింది. కీ. శే. ఘంటసాల బలరామయ్య గారి దర్శకత్వంలో అక్కినేని నాగేశ్వరరావు, అంజలీ దేవి గారలు నటించిన 'శ్రీలక్ష్మమ్మ కథ', కీ.శే. త్రిపురనేని గోపీచంద్‌గారు నిర్మించిన 'లక్ష్మమ్మ కథ' చలనచిత్రాలు ఆ పతివ్రత కథను తెలుగు నాట చిరస్మరణీయం చేశాయి.

వాసిరెడ్డి వేంకటాద్రినాయుని తండ్రి జగ్గభూపతి పాలనాకాలంలో (క్రీ.శ. 1750 ప్రాంతాలలో) కృష్ణాజిల్లా నందిగామకు సమీపంలోని అనిగండ్లపాడు గ్రామంలో కొల్లావారి ఆడపడుచుగా జన్మించిన తిరుపతమ్మను, సమీపగ్రామమైన పెనుగంచిప్రోలుకు చెందిన కాకాని గోపయ్యకిచ్చి వివాహం చేశారు. ఆమె కూడా గొప్ప పతివ్రతగా ప్రసిద్ధి చెందింది. అత్తవారింటి ఆరళ్లు సహించలేక మృతిచెందిన ఆమె, అనంతరం దేవతయై ఎన్నో మహిమలు చూపినట్లు నాటి జనం విశ్వసించారు. ఆమెకు గుడికట్టి పూజిస్తున్నారు. పెనుగంచిప్రోలులోని తిరుపతమ్మ దేవాలయం దగ్గర భక్తుల రద్దీ రోజు రోజుకూ అసాధారణంగా పెరిగిపోతున్నది. 'శ్రీ తిరుపతమ్మ కథ' అనే పేరుతో కీ.శే. బి.యస్. నారాయణ దర్శకత్వంలో కీ.శే. యన్.టి. రామారావు, కృష్ణకుమారిగారలు నటించిన చలన చిత్రం అఖండ విజయం సాధించి ఆ పతివ్రత కథను అజరామరం చేసింది. లక్ష్మమ్మకూ, వెంగమాంబకూ తమ స్వస్థలాలలో తప్ప వేరేచోట్ల దేవాలయాలు నిర్మించబడినట్లు లేదు కానీ, తిరుపతమ్మకు మాత్రం ఎన్నో యితర చోట్ల కూడా ఆలయాలు నిర్మించి ప్రజలు పూజిస్తున్నారు. ఈ ముగ్గురు పతివ్రతలూ కమ్మకులస్థులే అయినప్పటికీ నేటి వారి భక్త సముదాయంలో మాత్రం అన్ని కులాలకూ చెందిన వారు - ప్రత్యేకించి వెనుకబడిన తరగతులకు చెందిన వారు - అసంఖ్యాకంగా వుండడం విశేషం !

కదన రంగంలో కత్తి దూసి పురుషులతో సమానంగా పోరాడిన స్త్రీలు కూడా కమ్మవారిలో ఎక్కువగానే కనుపిస్తారు.

నతవాటిసీమకు చెందిన దుర్జయాన్వయుడైన విరియాల ఎర్రన భార్య కామసాని తన మేనల్లుడు, కాకతీయ సామ్రాజ్య నిర్మాతలలో ప్రముఖుడైన త్రిభువనమల్ల బేతరాజు (క్రీ.శ. 1080-1115) కొరకు స్వయంగా గుర్రమెక్కి, కత్తిపట్టి ఎన్నో యుద్ధాలలో తన మేనల్లుడికి విజయాలు చేకూర్చిపెట్టిందని మనం ముందే చెప్పుకున్నాం. కాకతీయ రుద్రమదేవి యొక్క శౌర్యప్రతాపాల గురించి తెలియని తెలుగు వారుండరేమో! గండికోట ప్రభువైన పెమ్మసాని తిమ్మానాయని సోదరి, కత్తిపట్టి గండికోట యుద్ధ రణరంగంలో దూకి అబ్దుల్ నబీ వంటి ప్రసిద్ధ ముస్లిం సేనానుల్ని ఎందరినో అవలీలగా మట్టుబెట్టి కదనసీమలోనే కడశ్వాస విడిచిన వీరనారి గోవిందమాంబ గాథ ఎందరికో స్ఫూర్తినిచ్చింది. శ్రీకృష్ణదేవరాయలు సవతి తమ్ముడు అచ్యుతరాయలు భార్య తిరుమలాంబ (ఈమె గండికోట పెమ్మసాని వారి ఆడపడుచు) కూడా గొప్ప వీరవనితేనట!

కమ్మవారి స్త్రీలలో మరొక ప్రత్యేక లక్షణం వుంది. వారు యిల్లు, పరిసరాల శుభ్రతకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. అందుకే ఏ ప్రాంతానికైనా 'కమ్మవారు చేరితే కడమవాళ్లు చేరతారు' అనే లోకోక్తి పుట్టింది. ఇంకో సంగతేమిటంటే తమ పురుషుల విజయాల వెనుక కమ్మ ఆడవారి నికరమైన, నిరంతరాయమైన ప్రోత్సాహం వుంటుంది. వారెప్పుడూ తమ భర్తలకు చేదోడు వాదోడుగా నిలవడమే కాక గడ్డు పరిస్థితులలో తమ సలహాలతో తగు దిశానిర్దేశనం కూడా చేస్తారు. చిన్న క్యాంటీన్, కూల్ డ్రింక్స్ షాపు, కిళ్లీ కొట్టు, మెస్, కోళ్ల ఫారం, హోటలు, యిలా ఏ చిన్న వ్యాపారం చేసినా, లేక వ్యవసాయం చేసినా ఆడవాళ్లు పూర్తి వెన్నుదన్నుగా నిలుస్తారు. గౌరవ ప్రదమైన ఏ పని చేసైనా తాము వేరొకరిపై ఆధార పడకుండా స్వయం పోషకత్వం సాధించాలనేదే వారి ఆకాంక్ష. అయితే స్త్రీలు పొలాలకు వెళ్లి పనిచేయడం కమ్మ వారిలో తప్పు. ఇప్పుడిప్పుడే కొందరు తమ ఆర్థిక దుస్థితి కారణంగా కొన్ని ప్రాంతాలలో పనులకు వెళ్తున్నా అది చాల అరుదైన విషయం.

స్త్రీలకు స్వయం పోషకత్వం, వారికి ప్రత్యేక ఆర్థిక ప్రతిపత్తి అనేది అనాదిగా కమ్మవారిలోనే కల్పించబడింది. ఆడపడుచులకు పండిన పంటలో వారి వాటా వారికి సక్రమంగా యివ్వడం, ఆస్తిలో వారి వాటా వారికి పంచి యివ్వడం, తమ ఆడపడుచులకు తమ శక్తి మేరకు ఆర్థిక స్వావలంబన కలిగించడానికి ప్రయత్నించడం కమ్మవారిలోనే ఎక్కువగా కనుపిస్తుంది. దీని కారణంగానే 'వరకట్నం' కూడా కమ్మవారిలో ఎక్కువే. తన చేతనైన మేరకు ప్రతి వ్యక్తి తన కుమార్తెకు ఆస్తి పాస్తులు పంచి యివ్వడానికి ప్రయత్నిస్తాడు. పెళ్లిళ్లు ఆర్భాటంగా చేయడం, ఖర్చుకు వెనుకాడకుండా పెళ్లిళ్లలో 'కమ్మ'ని భోజనాలు పెట్టడం కూడా కమ్మవారిలోనే ముందుగా ప్రారంభమైంది. ఇతరులు కూడా యిప్పుడిప్పుడే కమ్మవారితో పోటీపడి హెచ్చు వరకట్నాలు, పెళ్లిళ్లలో అమిత ఖర్చుతో కూడుకున్న ఆర్భాటాలకు పోవడం వగైరాలు అలవరుచుకుంటున్నారు.

ఇంతే కాదు ఒకప్పటి సామాజిక దురాచారమైన సతీసహగమనం కూడా కమ్మ వారి స్త్రీలలోనే ఎక్కువగా వుండేది. నెల్లూరు జిల్లా నర్రవాడకు చెందిన పచ్చ్వ వారి ఆడపడుచు, వేమూరు గురవయ్య భార్య అయిన వెంగమాంబ చేసిన సతీసహగమనాన్ని గురించి యీవరకే ముచ్చటించుకున్నాం. అలాగే తెనాలి తాలూకా అమృతలూరు గ్రామంలో ఒకప్పుడు ఓ గడ్డిపాటి వారి ఆడపడుచు కొండమ్మ అనే ఆవిడ భర్త యలవర్తి వెంకయ్యతో సహగమనం చేసిందట. అలాగే క్రీ. శ. 1800 లో కృష్ణా జిల్లా దివి తాలూకా వెలివోలు గ్రామంలో సూర్యదేవర వారి ఆడపడుచు, దేవభక్తుని భద్రయ్య భార్య వెంకమ్మ కూడా మరణించిన భర్తతో చితిలో దూకి సహగమనం చేసిందట. విజయనగరం జిల్లా కమ్మ సిగడాం గ్రామంలో గురప్పదొర అనే ఆయన భార్య మహాలక్ష్మమ్మ సహగమనం చేసిన కారణంగా కులదేవతగా నేటికీ పూజలందుకుంటున్నది. సుమారు క్రీ. శ. 1750 ప్రాంతంలో తెనాలి ఐతానగరంలో పొట్లూరి వారి ఆడపడుచు, కన్నెగంటి వెంకయ్య భార్య అయిన గౌరమ్మ భర్తతో సహగమనం చేసి, నాటి నుంచి స్థానికులచే పేరంటాలమ్మగా పూజలందుకుంటున్నది. ఈమెకు 150 ఏళ్ల క్రిందట స్థానికులు గుడి కట్టారు.

# పల్నాటి యుద్ధము - హైహయాన్వయులు

ఈ యుద్ధం గుంటూరు జిల్లా పల్నాడులోని కార్యంపూడి వద్ద క్రీ.శ. 1176-1182 సంవత్సరాల మధ్య జరిగింది. అక్కడ ఎందరో మహా వీరులు తమ శౌర్య ప్రతాపాల్ని ప్రదర్శించి యుద్ధ రంగంలో అసువులు బాశారు. నేటికీ ప్రజలు ఆ పల్నాటి వీరులను వీర రసావతారములుగా భావించి దేవతలలా పూజిస్తున్నారు. వీర రసాత్మకమైన ఈ గాథను శ్రీనాథ మహాకవి తన 'పల్నాటి వీర చరిత్ర'లో రసరమ్యంగా వర్ణించాడు.

గురజాల రాజధానిగా పలనాటిని పాలించిన అనుగురాజుకు మైలమదేవి, విజ్జలదేవి, భూరమాదేవి అనే ముగ్గురు భార్యలు. ఇందులో మైలమదేవికి నలగామ రాజు, విజ్జల దేవికి పెద్ద మల్లిదేవరాజు (మలిదేవరాజు) అతని యిరువురు తమ్ముళ్లు, భూరమాదేవికి ముగ్గురు కుమారులు కలిగారు. అయితే వీరు పుట్టకముందు అనుగు రాజు తన మంత్రియైన దొడ్డనాయని పెద్ద కుమారుడైన బాదన్న అనేవాడిని పుత్ర సమానంగా పెంచుకున్నాడట. పైపెచ్చు ఎన్నో యుద్ధాల్లో తన రాజుకు విజయాలు సాధించిపెట్టిన దొడ్డనాయుడు అనుగురాజుకు ఆరోప్రాణం. దొడ్డ నాయుడు అనుగురాజు అనంతరం తన కుమారుడే రాజ్యానికి ఉత్తరాధికారి కాగలడని భావించాడు. అయితే అనుగురాజు ముగ్గురు భార్యలకూ పురుష సంతానం కలగడంతో దొడ్డనాయని ఆశలు నీరయ్యాయి. అంచేత అతడు రాజ్యాన్నెలాగైనా దక్కించుకోవాలని కుట్రలు పన్నసాగాడు.

ఆ కాలంలో ఒకసారి అనుగురాజుకూ, అతని సైన్యానికీ నాగమ్మ అనే శైవ వనిత తన స్వగ్రామమైన గామాలపాడులో విందు చేసి, రాజును మెప్పించి, ఆయన తనను వరమేదైనా కోరుకొమ్మని అడిగితే, ఏడు గడియల పాటు పల్నాటి రాజ్య మంత్రిత్వాన్నివ్వమని కోరిందట. అందుకు అనుగురాజు సమ్మతించగా, మంత్రి పదవిని అవసరమున్నప్పుడు అడిగి తీసుకుంటానని, ఆమేరకు యిచ్చేటట్లు వాగ్దానం చేస్తూ రాజు చేత వాగ్దాన పత్రాన్ని అప్పటికప్పుడు వ్రాయించుకున్నదట. నాటి నుంచి రాజుకు ఆమె పై అభిమానము, నమ్మకము కలిగి ఆమె సలహాలకు విలువనిచ్చే వాడట. ఇదే అదనుగా నాయకురాలు నాగమ్మ అనుగురాజును దొడ్డనాయనికి వ్యతిరేకంగా రెచ్చగొట్టింది. ఆ కారణంగా రాజు విశ్వాసాన్ని కోల్పోయిన దొడ్డనాయుడు తన మంత్రి పదవికి రాజీనామా చేశాడు. అనుగురాజు దొడ్డనాయని స్థానంలో నిర్మోహమాటి అయిన దొడ్డనాయని రెండవ కుమారుడు బ్రహ్మనాయని మంత్రిగా నియమించాడు. తరువాత కొంత కాలానికి అనుగురాజు మరణించగా ఆ మృతికి బ్రహ్మనాయడే కారణమని నాయకురాలు నాగమ్మ ప్రచారం చేసింది.

అనుగురాజు తరువాత ఆయన పెద్ద భార్య కుమారుడు నలగామరాజు రాజ్యానికి వచ్చాడు. రాజ్యంలో తిరుగులేని అధికారం చెలాయిస్తున్న బ్రహ్మనాయుడిని అదుపు చేయడంలో నలగామరాజు విఫలుడయ్యాడు. పైపెచ్చు బ్రహ్మనాయుడు ఆనాడు సర్వమానవ సమానత్వాన్ని ప్రబోధించిన వైష్ణవాన్ని స్వీకరించి మాచెర్ల చెన్నకేశవుని ఆలయంలోకి అన్ని వర్ణాల వారికి ప్రవేశం కలిగించటం, అందరికీ సహపంక్తిన అక్కడ చాపకూటి భోజనాలు ఏర్పాటు చేయడం, మాల కులస్థుడైన కన్నమనీడును తనకు కుడి భుజంగా, తన ప్రథమ సహచరునిగా చేసుకొనడం వగైరా ఆదర్శమైన చర్యల ద్వారా విపరీతంగా ప్రజాభిమానాన్ని చూరగొన్నాడు. నాటి పరిస్థితులలో వైష్ణవం ప్రగతిశీలమైన పాత్ర వహించింది. బసవేశ్వరుని కాలంలో సామాజిక విప్లవానికి ఊపిరులూదిన శైవం పలనాడులో అభివృద్ధి నిరోధక పాత్ర వహించి కరడుగట్టిన మతమౌఢ్యంతో సామాజిక స్పర్థలకు బాటలు వేసింది. గామాలపాడుకు చెందిన నాయకురాలు నాగమ్మ రెడ్డి కులస్థురాలని కొందరూ, కమ్మ కులస్థురాలని యింకొందరూ భావిస్తున్నారు.

ఆమె పెంపుడు తండ్రి పేరు చౌదరి రామిరెడ్డి అని 'కమ్మవారి చరిత్ర'లో భావయ్య చౌదరి పేర్కొన్నారు. కాని ఆమె కులమేదో తెలుపలేదు. నాగమ్మ కమ్మ కులస్థురాలని వాదించే వారు ఆమె పెంపుడు తండ్రి పేరు రామయ్య అనీ, గామాలపాడుకు గ్రామ పాలకునిగా వున్న కారణంగా ఆయనను చౌదరి రామిరెడ్డి అంటారనీ పేర్కొంటారు. కొందరామె బ్రాహ్మణ వనిత అని వాదించే వారూ లేక పోలేదు. అయితే శ్రీనాథ మహా కవి రచించిన 'పలనాటి వీర చరిత్ర' కావ్యంలో నాగమ్మది గామాలపాడు గ్రామమనీ, ఆమె పంట రెడ్డి వారి పడతి యనీ, వీర జగ్గారెడ్డి వేడుక పుత్రి (పెంపుడు కుమార్తె) యనీ, మేకపోతుల రెడ్డి మేనకోడలనీ, ఆరవెల్లి వారింటి అనుగుకోడలనీ విస్పష్టంగా పేర్కొనబడింది. ('పలనాటి వీర చరిత్ర '- పంక్తులు 912 - 916 ; పేజీ 34 ; ప్రచురణ - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్) అత్తవారింటి పేరు చెప్పి భర్త పేరెక్కడా పేర్కొననందున అప్పటికే ఆమె వితంతువనే అభిప్రాయముంది. పలనాటి యుద్ధంలో ఆమె వహించిన విధ్వంసకర పాత్రకు కారణమేమై వుంటుందనే దానిపైనా భిన్నాభిప్రాయాలున్నాయి. నాటి పలనాటిలో రెడ్డి కులస్థుల సంఖ్య అతి స్వల్పమనీ, అక్కడి అధిక సంఖ్యాకులైన హైహయాన్వయుల ఆధిపత్యం సహించలేని నాగమ్మ తన కుటిల నీతితో శకుని పాత్ర వహించి, దాయాదుల మధ్య చిచ్చు పెట్టి పలనాటి యుద్ధం అనివార్యమయ్యేట్లు ఉద్రేకాలను రెచ్చగొట్టిందని కొందరి అభిప్రాయం కాగా యింకొందరు ఆమె నిజాయితీగా శైవధర్మ పరిరక్షణకే కట్టుబడి, శైవ ధర్మానికి విరుద్ధంగా వర్ణసంకరానికి పాల్పడుతున్న బ్రహ్మ నాయని పై వ్యతిరేకతతోనే యిదంతా చేసిందంటారు. ఏమైతేనేం - ఆమె వీరావేశం పూనిన శైవమతానుయాయి. కులవ్యవస్థకు గట్టి సమర్థకురాలు. కులప్రసక్తి లేకుండా దళితులకు ఆలయ ప్రవేశం కల్పించి, అందరికీ సహపంక్తి భోజనాలు నిర్వహిస్తూన్న బ్రహ్మనాయని పట్ల ఆమె క్రోధంతో రగిలిపోయింది. వీర వైష్ణవుడైన బ్రహ్మనాయనిపై కసితీర్చుకునే అవకాశం కోసం ఎదురుతెన్నులు చూసింది.

కొంత కాలానికి నలగామరాజు తన సవతి సోదరులైన మలిదేవరాజు వగైరాలకు తన రాజ్యంలో కొంత భాగం పంచి యివ్వాల్సి వచ్చింది. బ్రహ్మనాయుడు మలిదేవాదులకు చంద్రవంక నది ఒడ్డున నున్న మాచర్ల రాజ్యం యివ్వడం న్యాయమని పట్టుబట్టాడు. ఇదే అదనుగా భావించి నాగమ్మ రాజ్యపాలనలో అంతగా అనుభవం లేని మలిదేవరాజు వగైరాలకు పోషకుడిగా బ్రహ్మనాయని నియమించమని నలగామరాజును ప్రోత్సహించింది. అలా మలిదేవాదులతోపాటు మాచర్ల పంపబడిన కారణంగా గురజాలలో బ్రహ్మనాయని ప్రాభవం సన్నగిల్లి ఆయన స్థానంలో నాగమ్మ నలగామునికి ప్రధానివలె మెలగసాగింది. వీరవైష్ణవుడైన బ్రహ్మనాయుడు మాచర్ల వెళ్లిన తరువాత అక్కడ మలిదేవాదులతో సహా మరింత వైభవోపేతంగా వుండడమేకాక, తన సామాజిక సమతా సిద్ధాంతాల ప్రచారాన్ని ఉధృతం చేసి మరింతగా ప్రజాభిమానాన్ని పొందడాన్ని చూచి సహించలేని నాగమ్మ కోడిపందాలను ఏర్పాటు చేసి, అందులో ఏడు సంవత్సరాలు ప్రవాస జీవితం గడపాలనే పందాన్ని నిర్ధారించి మాయోపాయంతో బ్రహ్మనాయనిపై నెగ్గి, ఓడిన బ్రహ్మనాయుడు, మలిదేవాదులను ప్రవాసానికి పంపడంలో కృతకృత్యురాలయింది. మందాది వద్ద కొంతకాలం, మేడపివద్ద కొంతకాలం వారు ప్రవాస జీవితం గడిపిన అనంతరం నలగామరాజు అల్లుడైన అలరాజును బ్రహ్మనాయుడు నలగాముని వద్దకు రాయబారిగా పంపి తమ రాజ్యభాగాన్ని తిరిగి తమకు యిచ్చెయ్యాలని కోరాడు. నలగామరాజుకు మాచర్ల రాజ్యాన్ని తిరిగి వారికి యిచ్చెయ్యాలని మనసులో వున్నా, నాగమ్మ దానిని కుదరనీయక సంధికి వచ్చిన అలరాజును విషప్రయోగంతో చంపించింది. దీంతో పల్నాటి యుద్ధానికి బీజావాపనం జరిగినట్లయింది.

యుద్ధంలో పోరాడిన యిరుపక్షాలకూ నేతృత్వం వహించింది హైహయాన్వయులే. అయినా ఆనాటి సమాజంలోని మత విద్వేషపూరిత వాతావరణం కారణంగా శైవులంతా నలగామరాజు, నాగమ్మల తరపున నిలువగా, వైష్ణవులంతా

బ్రహ్మనాయుడు, మలిదేవాదుల పక్షాన నిలిచారు. నేటి కమ్మవారి పూర్వీకులైన హైహయాన్వయులంతా శైవులైన కారణంగా నలగాముడు, నాగమ్మల పక్షాన పోరాడగా నేటి కాపువారి పూర్వీకులైన హైహయాన్వయులు వైష్ణవపక్షం వహించి బ్రహ్మనాయనికి మద్దతుగా నిలిచారు. ఈ మహాసంగ్రామం కారణంగా పలనాటిలోని నాటి సమాజం నిట్టనిలువునా రెండుగా చీలిపోయింది. నాటి శైవం కులవ్యవస్థను గట్టిగా సమర్థించి ప్రగతి నిరోధకపాత్ర వహించిందనీ, వైష్ణవం కులవివక్షను నిరసించి ప్రగతిశీల పాత్ర నిర్వహించి ప్రజాబాహుళ్యానికి దగ్గరయిందనీ మనం లోగడనే అనుకున్నాం. హైహయాన్వయులలో హెచ్చుమంది తాము విశ్వసించిన శైవం కారణంగా నాగమ్మ, నలగామరాజుల పక్షాన పోరాడారు. అప్పటికే తెలుగుచోడులు, చాళుక్యులు, నతవాటిసీమరాజులు, కాకతీయులు, దుర్జయాన్వయులు, కొండపడమటి సీమరాజులు వగైరాలతో బంధుత్వం నెరపుతూవున్న యీ శైవ శాఖకు చెందిన హైహయాన్వయులు అనంతరకాలంలో కమ్మవారుగా పరిగణించబడ్డారు. బ్రహ్మనాయని పక్షాన పోరాడిన వైష్ణవ హైహయాన్వయ శాఖలో కొందరు వెలమవారిలోకీ, కొందరు కాపువారిలోకీ విలీనమయ్యారు. నాటి దళితులలోని మాల కులస్థులు బ్రహ్మనాయని పక్షం వహించగా మాదిగ కులస్థులు నాగమ్మ పక్షం వహించారట. నాటి ఆ సమాఖ్యలో ఏర్పడిన సాన్నిహిత్యం కారణంగానే మాలవారు కాపులను తమ పెద్దలుగా భావిస్తూ తమలో తమకు యే తగవులు వచ్చినా తెలగ లేక కాపు పెద్దలు చెప్పేతీర్పుకు కట్టుబడి వుండడం ఆనవాయితీగా వచ్చిందట. దీనినే 'జెట్టి న్యాయము' లేక 'శెట్టి న్యాయము' అంటారట. దీని ప్రకారం మాలపల్లెలలో వారిలో వారికి ఎప్పుడైనా ఏవైనా తగవులేర్పడినప్పుడు వాటిని తెలగ పెద్దలు పరిష్కరిస్తారు. ఒకవేళ ఆ పెద్దలు లభించకపోతే తెలగ కులస్థుడైన ఒక బాలుడినైనా సరే అక్కడ నిలిపి అతడి సమక్షంలో వారు తమ సమస్యను తామే పరిష్కరించుకుంటారట. అర్థ శతాబ్ది క్రితంవరకు యీ 'జెట్టిన్యాయం' మాల పల్లెలలో అమలయ్యేదట.

మనమిందాకనే చెప్పుకున్నట్లు పల్నాటి యుద్ధంలో ఉభయ పక్షాలకు నేతృత్వం వహించింది హైహయాన్వయులే అయినా వారిలో అప్పటికే కులపరంగా కొందరు తాము ఎక్కువ వారమనీ, మిగిలిన వారు తమకంటే తక్కువ వారనీ భావించడం మొదలయింది. బ్రహ్మనాయని తండ్రి దొడ్డనాయడిని నాటి హైహయాన్వయులలో హెచ్చుమంది తమకంటె తక్కువ వానిగా భావించి అతడికి వివాహానికి కన్యను యివ్వడానికి కూడా రాజకుటుంబీకులలో ఎవ్వరూ ముందుకు రాకపోతే, అప్పుడు కంచెర్ల నగరానికి చెందిన కృష్ణ గంధర్వుని కుమార్తెనిచ్చి వివాహం చేశారట. అలా బ్రహ్మనాయని జననానికి పూర్వమే యీ కులవివక్ష పలనాడులో మొలకెత్తింది. ఈ వివక్షకు ప్రత్యక్షంగా గురియైన బ్రహ్మనాయుడు వైష్ణవం స్వీకరించి సమాజంలోని అంటరానితనాన్ని పోగొట్టడానికీ, అట్టడుగు వర్గాల అభ్యున్నతికీ కృషి చేశాడు. ఈ కృషిలో ఆయనకు హైహయాన్వయుల నుంచి అంతగా సహకారం లభించనప్పటికీ సమాజంలోని యితర వర్గాల ప్రజల సహకారంతో ఆయన పలనాడులో బలీయమైన ఒక మహత్తర కూటమిని నిర్మించాడు.

అయితే తన కుటుంబ స్థాయిలో కూడా హైహయాన్వయులలో ఏర్పడిన యీ చీలికలను రూపుమాపడానికి బ్రహ్మనాయుడు కొంత ప్రయత్నం చేశాడు. అప్పటికే తాము అధికులమంటూ, వర్ణ వ్యవస్థకు గట్టి సమర్థకులుగానూ, శైవ మతానుయాయులుగానూ వున్న అధిక సంఖ్యాకులైన హైహయాన్వయుల (నేటి కమ్మవారి పూర్వీకులు వీరే)తో ఆయన వియ్యమందాడు. బ్రహ్మనాయని కుమారుడు బాలచంద్రుని భార్యగా గందు భీమన్న కుమార్తె మాంచాలను చేసుకున్నారు. అలా ఆయన కమ్మవారైన గందు వంశీకులతో వియ్యమంది హైహయాన్వయులలో ఐక్యతకు కొంతమేరకు ప్రయత్నించాడు. కాని అది ఫలించలేదు. కమ్మవారిలో నేటికీ 'గందు' వంశీకులున్నారు. వారి గోత్రాలు పోగునూళ్ల, మదివెళ్ల.

ఈ మహాసంగ్రామానికి బయటి రాజ్యాల నుంచి కూడా తోడ్పాటు లభించింది. బ్రహ్మనాయని పక్షంలోని

మలిదేవరాజుకు కర్నాటకలోని కళ్యాణి కాలచుర్యులనుంచి సహకారం లభించింది. దీనికి కారణం మలిదేవుని భార్య కాలచుర్య బిజ్జలుని మనుమరాలు కావడమే. అంతేకాక నలగామ రాజు తల్లి వెలనాటి దుర్జయుల ఆడపడుచు. వెలనాటి దుర్జయులకూ, కళ్యాణి రాజులకూ ఎప్పటి నుండో వైరం. అందుకే వారు మలిదేవ రాజు పక్షం వహించగా దుర్జయాన్వయులైన కాకతీయులు నలగామరాజు పక్షం వహించారు. బిజ్జలుడు జైన మతావలంబకుడు. వీరశైవ మతస్థాపకుడైన బసవేశ్వరుడు కొంతకాలం బిజ్జలుడి వద్ద మంత్రిగా వుండి క్రీ.శ. 1167 లో ఆయన్ని సంహరించి, కన్నడ సీమలో వీరశైవాన్ని విస్తృతం చేశాడు. అలా కేవలం బంధుత్వమే కాక, కళ్యాణి కాలచుర్యులకు శైవంపట్ల వున్న ద్వేషభావం కూడా పలనాటి యుద్ధంలో వారు శైవులైన నాగమ్మ, నలగామ రాజులకు వ్యతిరేకంగా వైష్ణవుడైన బ్రహ్మనాయనికి సహకరించడానికి పురికొల్పి వుంటుంది. దుర్జయాన్వయులు అయిన కాకతీయులు తమకు హైహయాన్వయులతో గల బంధుత్వం కారణంగానే కాక, శైవమతాభిమానంతోనూ నలగామరాజు పక్షం వహించి వుంటారు. కాకతి రుద్రదేవుడు (క్రీ.శ. 1158-1195) పల్నాటి యుద్ధంలో నలగామరాజు, నాగమ్మలకు వలసిన అన్ని సహాయ సహకారాలనూ అందించాడట. అలాగే హైహయాన్వయులతో తమ సన్నిహిత బాంధవ్యం కారణంగానే నతవాటి సీమ పాలకులగు సాగి పోతరాజు, వెలనాటి రాజేంద్రచోడుడు నలగామరాజు నేతృత్వంలోని హైహయాన్వయులకు తమ సహకారాన్ని అందించారు. బ్రహ్మనాయని పక్షానికి యీ యుద్ధంలో హొయసాల రాజైన రెండవ వీర బల్లాలుడు తోడ్పడ్డాడట. బల్లాలుడు వైష్ణవ రాజవడం దీనికి కారణం కావచ్చు.

ఈ యుద్ధంలో 65 మంది వీరనాయకులు వీర మరణం పొందారట. బ్రహ్మనాయని పక్షంలో మలిదేవరాజు, అతడి సోదరులు యావత్తు, అతడి బావమరిది కాలచుర్య కొమ్మరాజు, బ్రహ్మనాయని కుమారుడు బాలచంద్రుడు వగైరాలు మరణించగా, నలగామరాజు పక్షాన నరసింహరాజు వగైరా ఎందరో వీరులు మృతిచెందారు. నాయకురాలు నాగమ్మ చివరకు బ్రహ్మనాయనికి ప్రాణాలతో చిక్కినా, స్త్రీ అని కనికరించి ఆమెకు ప్రాణభిక్ష పెట్టాడట బ్రహ్మన్న. నలగామరాజు బ్రహ్మనాయని ధాటికి తట్టుకొనలేక వేదమంత్రోచ్చాటన చేస్తూన్న బ్రాహ్మణ బృందాన్ని అడ్డుపెట్టుకుని వచ్చి అతడిని శరణు వేడాడట. బ్రహ్మనాయుడు అలా ఓటమితో సమానమైన విజయము *(Pyrrhic Victory)* ను పొందాడు. *(Pyrrhic Victory* – ఒకప్పుడు ప్రాచీన గ్రీసు దేశంలోని నైరుతి దిక్కున వున్న ఎపిరస్ *(Epirus)* రాజ్యాన్ని పాలించిన పిరస్ *(Pyrrhus)* అనే రాజు తన సర్వస్వం కోల్పోయిన తరువాత మాత్రమే యిలాంటి ఓటమితో సమానమైన విజయం పొందాడట. కనుక నాటి నుండి ఓటమితో సమానమైన విజయాన్ని ఆంగ్లంలో 'పిరిక్ విక్టరీ' అంటున్నారు.) తన బంధుజనం మరణంతో వైరాగ్యం చెందిన బ్రహ్మనాయుడు తిరిగి నలగామరాజుకే పట్టంకట్టి తాను గుత్తికొండ బిలం లోనికి వెళ్లి తపస్సు చేసుకుంటూ అక్కడే మరణించాడట. అనంతర కాలంలో ఆ రాజ్యాన్ని గణపతిదేవ చక్రవర్తి కాకతీయ సామ్రాజ్యంలో కలిపివేశాడు.

అలా మన పురాణాలలో కార్తవీర్యార్జునుని వంశీకులుగా చెప్పబడిన యీ హైహయాన్వయులలో కొందరు బ్రహ్మనాయని ప్రభావం కారణంగా రేచెర్ల పద్మనాయక వెలమ వారిలోనూ, కొందరు తెలగ లేక కాపువారిలోనూ చేరగా, అతికొద్ది మంది ఆంధ్ర క్షత్రియులుగా రూపొందగా మిగిలిన హైహయాన్వయులంతా కమ్మవారుగా పరిగణింప బడసాగారు. పల్నాటి యుద్ధ సమయంలో హెచ్చుశాతం హైహయాన్వయులు తమ బంధువర్గమైన తెలుగుచోడులు, దుర్జయాన్వయులు, చాళుక్యులు వగైరాలతో కలుపుకొని కమ్మవారుగా పరిగణింపబడగా, అల్పసంఖ్యాకులు క్షత్రియులలోనూ, వెలమవారిలోనూ కలసిపోయారు. మిగిలిన కొద్దిమంది కాపు వారని పిలువబడ్డారు.

# బలిజ, తెలగ, ఒంటరి, కాపు సంఘటన

కాపువారు మొదట్లో అల్పసంఖ్యాకులే అయినా బలిజ, తెలగ, ఒంటరి కులస్థులతో సంఘటనను నిర్మించి బలీయమైన ఒక సామాజిక వర్గంగా మారారు. నేడు కాపువారని పిలువబడుతూన్న వీరి పూర్వులలో కొందరు కొణిదెన, వెలనాటి తెలుగు చోదులు, మరికొందరు హైహయాన్వయులూనన్నమాట.

**బలిజ :-** అనిశెట్టి, నాగిశెట్టి, ఆరిశెట్టి, చెన్నంశెట్టి, నారిశెట్టి, వీరిశెట్టి, గన్నిశెట్టి, నరాలశెట్టి, యన్నంశెట్టి, యర్రంశెట్టి వగైరా యిండ్లపేర్లు కలవారు బలిజలు. (ఈ పదం 'బనియా' అనే ఉత్తర భారతదేశ శబ్దానికి మూలం.) ప్రపంచంలోని క్షత్రియులందరినీ తాను 21సార్లు చేసిన దిగ్విజయ యాత్రలలో అంతమొందించి లోకాన్ని నిక్షాత్రం చేయగలిగాననే సంతృప్తితో పరశురాముడు రాజస్థాన్‌లోని 'మౌంట్ ఆబూ' పర్వతంపైన (ఆరావళీ పర్వతశ్రేణిలో - సికార్ జిల్లాలో యిది వుంది) ఒక యజ్ఞం చేసి, యాగాగ్నిలో తన గొడ్డలిని ప్రక్షాళనం చేశాడట. అప్పుడా అగ్నినుంచి జనించిన ఓ క్షత్రియ వీరుడు పరశురాముడిని చూసి పకపకా నవ్వుతూ 'క్షత్రియులను అంతం చేయడం నీ వల్ల ఏమవుతుంది? నా సంతతి అగ్నికులక్షత్రియులనే పేరుతో వర్ధిల్లుతారు' అన్నాడట. అలాగే ఆయన సంతతి క్షత్రియ వంశానికి బీజప్రాయమయ్యారట. గుజరాత్‌ను పాలించిన చాళుక్యులైన సోలాంకీలు కూడా తమ వంశచరిత్రలలో యీ ఐతిహ్యాన్నే పేర్కొన్నారు. అయితే అగ్నికుల క్షత్రియులు అనబడే ఆంధ్రులు, తమిళనాడులోని వహ్ని (అగ్ని) యార్‌లు లేక వన్నియార్‌లూ సముద్రంలో చేపలవేట చేసే పల్లెకారులుగా వున్నారుకాని, క్షత్రియులుగా రాజ్యపాలన చేసిన దాఖలాలేమీ కానరావు. సముద్రంలోని బడబాగ్ని నుండి ఎప్పుడో తుపాను సందర్భంగా వీరు సముద్ర గర్భాన్నుంచి పుట్టుకొచ్చి బయల్పడ్డారు కనుకనే పల్లెకారులు, బెస్తవారు, పల్లెవారు, పల్లీయులు, ముతరాశి వారు వగైరాలంతా అగ్నికుల క్షత్రియులని పిలువబడ్డారని మరొక ఐతిహ్యముంది. ఇక ఆంధ్రదేశంలోని బలిజల విషయానికొస్తే, బలి అంటే యజ్ఞం; యాగాగ్ని నుంచి తమ మూలపురుషుడు ఉద్భవించాడనీ, అందుకే తాము బలిజలమయ్యామనీ వారు విశ్వసిస్తారు. బలిజ → వలిజ → వణిజ → బనియ. వీరి వృత్తి ప్రధానంగా వ్యాపారం. (పూర్వం వైశ్య వృత్తిలో వున్న కొందరు కమ్మవారిలో కలిసినట్లే వీరు కూడా వైశ్యుల నుండి బలిజవారుగా రూపొంది వుంటారు.)

బలిజ వారిని క్రీ.శ. 1500 ప్రాంతాల నుండి మహానాటి వారని కూడా వ్యవహరిస్తున్నారు. వీరు ఛప్పన్న (56) దేశముల వారట. చాల వర్ణముల వారి కూడికతో వీరు ఏర్పడ్డారని బుక్కపట్నం రాఘవాచార్యులు గారు తమ 'ఆంధ్ర దేశ చరిత్ర'లో పేర్కొన్నారు. బహు దేశములకు చెందిన వారు కనుకనే 'దేశాహి' (దేశాయ్) అనేది వీరికి అన్వర్థ నామమని 'బలిజ కుల చరిత్ర' వ్రాసిన నెల్లూరు నివాసి కంటే నారాయణ దేశాయి గారు పేర్కొన్నారు.

బలిజ సెట్లు లేక దేశాయి సెట్లు 18 వర్ణముల వారి తగవులు తీర్చి, పంచాయితీ చేయడం, వారి వద్ద నుండి అపరాధ రుసుమును పుచ్చుకొనడం ఆనవాయితీ. దీనినే 'సెట్టి సమయము' అంటారు. మలిసెట్టి యింటి పేరుగా కల వారికే యీ తగవులు తీర్చే అధికారముందట. ఈ 18 వర్ణముల వారిని బలిజలు ఏర్పరచిన 'మహానాటి కూటమి' అంటారు.

బలిజ కులస్థులకు సెట్టి అనేది పట్టపు పేరు. విఖ్యాత చరిత్ర కారులు చిలుకూరి వీరభద్రరావు పంతులు గారు తమ 'ఆంధ్రుల చరిత్ర'లో యిలా పేర్కొన్నారు. - "పూర్వ కాలమున బౌద్ధ మతమున చేరిన బలిజ శాఖల వారిలో ననేకులకు శ్రేష్ఠియను పదము పట్టపు పేరుగానుండెను." (ఆంధ్రుల చరిత్ర - 3వ భాగము - 115వ పేజీ).

బలిజలలో గాజుల బలిజ, సెట్టి బలిజ, రాజ మహేంద్రవరపు బలిజ, బలిజ సెట్లు, దేశాయి బలిజ, గండవర బలిజ, గోనుగుంట్ల బలిజ, పెరిక, రాచ పెరిక, మున్నూరు కాపు, పాత్రులు, బలిజ నాయుళ్లు, పగడాల బలిజలు, మెరక వీధి తెలగాలు (చంద్రగిరి తెలగాలు), రంగిరీజు బలిజలు వగైరా వగైరా ఎన్నో ఉపకులాలున్నాయి.

క్షత్రియుల నుండి చీలిన కమ్మవారు వ్యవసాయాన్ని ప్రధాన వృత్తిగా చేపట్టినట్టే, క్షత్రియుల నుండే చీలిన బలిజ వారు వాణిజ్యం ప్రధాన వృత్తిగా చేపట్టారని దేశాయి గారు ఆ గ్రంథంలో పేర్కొన్నారు. అయితే నేడు బలిజ వారూ వ్యవసాయాలు చేస్తున్నారు. కమ్మ వారూ వాణిజ్యం చేస్తున్నారు. కాని ఒకప్పటి క్షత్రియులైన కమ్మవారిలో వలె విస్తృత స్థాయిలో బలిజ వారెక్కడా ప్రభువులై రాజ్యాలేలినట్లు, జమీందారులైనట్లు దాఖలాలు కనుపించడం లేదు. కృష్ణా జిల్లా తోట్లవల్లూరు జమీందారొక్కరే దీనికి మినహాయింపుగా కనుపిస్తున్నది. 18వ శతాబ్దిలో నివసించిన బొమ్మదేవర నాగన్న నాయుడు అనే బలిజ కులస్థునికి కొన్ని వేల గంత ఎద్దుల బిడారు వుండేదట. ఆ బిడారుతో అతడు పెద్ద స్థాయిలో వాణిజ్యం నిర్వహించే వాడట. నైజాం నవాబుకు, టిప్పుసుల్తాన్‌కు జరిగిన యుద్ధంలో తమ పక్షం సైనికుల సామగ్రిని తీసుకొని వెళ్లడానికి నాగన్న ఎద్దుల బిడారును సహాయం కోరాడట నైజాం నవాబు. నాగన్న కొన్ని వేల గంతల ఎద్లు గల తన బిడారును వెంటనే నైజాం నవాబుకు సహాయంగా పంపాడట. దీనికి కృతజ్ఞతగా యుద్ధానంతరం నవాబు తోట్ల వల్లూరు జమీని నాగన్నకు యినాంగా యిచ్చాడట.

బలిజ వారిని ఉత్తరాంధ్ర ప్రాంతంలో 'పాత్రులు' అనే పేరుతో కూడా వ్యవహరిస్తారట. కళింగ గాంగ వంశస్థుడగు గణపతి భూపాలుని పాలనా కాలంలో గోపరాజు రామన్న మంత్రి కుట్ర కారణంగా అప్పటి వరకు జైనులైన కంసాలులనబడిన విశ్వ బ్రాహ్మణులతో పాటు, బలిజ వారు చేస్తూ వుండిన గ్రామ గణకోద్యోగములు (కరణీకములు) కోల్పోయారట. 'కృష్ణ రాయ విజయము'లో కుమార ధూర్జటి పేర్కొన్న దాన్ని బట్టి కటకం గజపతి ఆస్థానంలో 16 మంది పాత్రులుండేవారట. వీరినే శ్రేష్ఠి కరణాలు అంటారు. ఆ పదమే శెట్టి కరణాలు → శిష్టు కరణాలు → చిట్టి కరణాలు గా రూపాంతరం చెందిందట. మహా నాటి కట్టుబాటును తెలిపే మహానాటి శాసనంలో బలిజలకు 'పాత్రుడు' అనే నామం వాచకంగా వాడబడిందట. ఇలాంటి మూడు శాసనాలలో కనకాల నల్లాపాత్రుడు, ఎర్రంశెట్టి మేరా పాత్రుడు అనే యిద్దరు పాత్రులు ఉదాహరించబడ్డారు.

పోతే దేశాయి గారు శెట్టి బలిజలను కూడా బలిజలలో కలిపారు. అయితే పశ్చిమ, తూర్పు గోదావరి జిల్లాలలోనూ, మరికొన్ని యితర ప్రాంతాలలోనూ గౌడ కులస్థులు 'శెట్టి బలిజలు' అనబడుతున్నారు. కాని దేశాయి గారు గౌడ, హీడ, గవర, గౌర, ఈడిగ, గవండ్ల, ఈంద్ర, నాటారు, నాడారు, కలాలీ, శ్రీశయన, యాత, శెట్టి బలిజ కులస్థులందరూ తొలుత కల్లు గీత వృత్తిగా కలవారేననీ, వీరంతా బలిజల క్రిందికే వస్తారనీ పేర్కొన్నారు. గవర లేక గౌర కులస్థులు విశాఖ జిల్లా అనకాపల్లి ప్రాంతంలో హెచ్చుగా వున్నారు. ప్రస్తుతానికైతే కల్లు గీత వృత్తికీ, వీరికీ ఏ సంబంధమూ లేదు.

**ఒంటరి :-** రౌతు, రెడ్రౌతు, సోమరౌతు, నాగరౌతు, ఈటె, బల్లెం, కత్తుల, తలాటం (తలాటం అంటే గుర్రం తలపైన అలంకరించబడిన కుచ్చు. చమరీమృగం వెంట్రుకలతో దీనిని తయారు చేస్తారు.) వగైరా యిండ్ల పేర్లవారు ఒంటరి కులస్థులు. (ఒంటరీడు అంటే ఆయుధపాణి అయిన గుర్రపు రౌతు. వీరు ఆయుధోపజీవులు. రాజులు ఒకప్పుడు ఒంటరీడులను శాంతి కాలాల్లో పోషించడం ఆర్థికంగా భారమని భావించి, వారిని సైన్యం నుంచి తీసివేసి – రిట్రెంచ్ చేసి – యుద్ధ సమయాల్లో మాత్రమే వారిని పిలిపించేవారట. మిగిలిన సమయాలలో యీ ఒంటరీళ్లు తమను తామే పోషించుకుంటూ, తమ ఆయుధాలు, గుఱ్ఱాల బాధ్యత తామే వహించేవారట. వీరికి ఒక రాజు పట్ల, రాజ్యంపట్ల నిబద్ధత,

విధేయత వుండేది కాదట. ఎవరు తమను పోషించడానికి సిద్ధపడితే వారి సైన్యంలో వీరు చేరిపోయేవారట. వీరు కాకినాడ, తుని, పెద్దాపురం ప్రాంతాలలో ఎక్కువగా వున్నారు. వీరిలో 100 ఏళ్ల క్రితం వరకు ఘోషా ఆచారం వుండేదంటారు.)

**తెలగ :-** ఇకపోతే, య్యర్రు, గోపతి, భూపతి, వెంకటపతి, బొల్లిముంత, శ్రీపతి, చందు, అప్పికట్ల, వ్యాసం, గాలం, నాగం, మంచాల, పసుపులేటి, కైకాల, చెన్నా, వల్లేటి, వంగవీటి, ఊరుబండి, ఉజని (వీరు మహారాష్ట్రలోని 'ఉజని' నుంచి వచ్చినవారై వుంటారు.), బెహరా (వీరు ఒరిస్సా నుంచి వచ్చినవారై వుంటారు.) వగైరా యిండ్లపేర్లవారు తెలగ కులస్థులు. (తెలుగు మాగాణంలో అనాదిగా వున్న రైతాంగ కులం తెలగ కులం. తెలంగాణాలో వీరిని తెలుగోళ్లు అని పిలవడాన్ని బట్టి తెలుగు గడ్డపై వీరు ప్రాచీనకాలం నుంచి వున్నవారని అర్థం చేసుకోవచ్చు.)

**కాపు :-** ఇక కాపు కులస్థులెవరు ? చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు తమ 'ఆంధ్రుల చరిత్ర' మూడవ భాగంలో కాపులు తొలుత కంపిలా నగర నివాసులై, అక్కడి నుండి రావడం చేత, వారిని మొదట్లో కాంపులనే వారనీ, యీ కంపిలా నగరమే మహాభారతంలో పేర్కొనబడిన పాంచాల దేశపు రాజధాని కాంపిల్య నగరమనీ, అందుకే ప్రాచీన తెలుగు శాసనాలన్నింటిలో కాపులను కాంపులని సబిందుకంగా వ్రాసే వారనీ పేర్కొన్నారు. కాపు, మున్నూరు కాపు, కులాల ప్రస్తావన అత్యంత ప్రాచీనమైనదిగా భావిస్తున్న 'జాంబ పురాణం' లో కూడా వుంది. (ఆరుద్ర – సమగ్రాంధ్ర సాహిత్యం – 6వ సంపుటం – పేజీ 321)

కాపు శబ్దం మొదట్లో రెడ్డి కులస్థులకు మాత్రమే వాడబడింది. ఇప్పటికీ మన రాష్ట్రంలోని చాల జిల్లాలలో – ముఖ్యంగా నెల్లూరు ప్రాంతంలో కాపులంటే రెడ్డి కులస్థులే. అయితే కొన్ని ప్రాంతాలలో 'కాపు' పదం తెలగ కాపులను సూచిస్తున్నది. కాపులలోనూ ఎన్నో శాఖలు, ఉప శాఖలూ వున్నాయట. గాజుల కాపులు, అయ్యేరికల కాపులు, పంట కాపులు, పెద్ద కాపులు, వన్నె కాపులు, పల్లె కాపులు – యిలా ఎన్నెన్నో శాఖలున్నా, వీరెవ్వరికీ బలిజ సంఘీయులైన తెలగ కాపులతో ఎలాంటి సంబంధమూ లేదట. విశాఖ పట్టణం, విజయనగరం, శ్రీకాకుళం, ఒరిస్సాలోని బరంపురం జిల్లాలలోని కాపుల స్త్రీలు మారు మనువు చేసుకునే ఆచారం కూడా వున్నదని దేశాయి గారు 'బలిజ కుల చరిత్ర' లో పేర్కొన్నారు. ఇక మున్నూరు కాపుల విషయానికొస్తే – వీరు తెలంగాణా ప్రాంతంలో ఎక్కువగా వున్నారు. అయితే సదాశివ రాయలు పాలనా కాలంలో శాలివాహన శకం 1477 (క్రీ.శ. 1555-రాక్షస నామ సంవత్సరం) లో కొండవీటి సీమలోని యల్లమందలో శిద్ధిరాజు తిమ్మరాజు వేయించిన శాసనంలో రెడ్డి కాపులు, కోమట్లు, సాలెవారు, తొగట వారు, జాంద్రవారు వగైరాలతో మున్నూరు కాపులు కూడా పేర్కొన బడ్డ కారణంగా అప్పట్లో వీరు ఆంధ్ర ప్రాంతంలో కూడా వుండే వారని తెలుస్తున్నది. క్రీ.శ. 1606 నాటి జయంతి పుర శాసనాన్ని బట్టి మున్నూరు విషయమని ఓ ప్రాంతముందని తెలుస్తున్నది. మూడు వందల గ్రామాలున్న కొండపల్లి సీమనే ఒకప్పుడు మున్నూరు నాడు అనే వారట. ఇక్షుపురి (గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని చెఱకూరు) శాసనాన్ని బట్టి మున్నూరు రెడ్డి – మున్నూరు కాపు కులాలకు భేదమేమీ లేదని తెలుస్తున్నది. అక్కడి త్రివిక్రమ దేవస్థానంలో శాసనం వేయించిన కరారి నాగమ నాయకుడు మున్నూరు రెడ్డి కులోద్భవుడని పేర్కొనబడ్డాడు.

కమ్మ, వెలమ, క్షత్రియ కులాలలో కూడా వున్న యిండ్లపేర్లయిన గుత్తా, తోట, తోటకూర, సుంకర, కన్నెగంటి, సమ్మెట, సామినేని, ఐతం, కంచెర్ల, కత్తి, కరారి, కొరారు, కనకమేడల, కరణం, కాకరాల, కాకర్ల, కాట్రగడ్డ, ఎర్రా, ఉప్పాల, ఉప్పుల, ఉప్పు, ఆరె, అంబటి, ఆకుల, అడపా, ఉండవల్లి, ఉన్నం, కాసా, కొడిదల, కొడిదెన, కొత్తపల్లి, కొమ్మినీడి, కొరిటాల, కోకా, కోట, కోడె, కోడెల, కోసూరి, గంటా, గద్దె, గరికిపాటి, గుమ్మడి, గల్లా, గుమ్మళ్ల, గొట్టుముక్కల, చదలవాడ, జక్కంపూడి, జవ్వాజి, జవ్వాది, జొన్నలగడ్డ, తన్నీరు, తలశిల, తాటికొండ, తూము, దండా, దండమూడి, దగ్గుబాటి, దాడి,

దాసరి, దొడ్డా, ధూళిపాళ్ల, నర్రా, పరుచూరి, పల్లెంపాటి, పాటిబండ్ల, పాతూరి, పాలడుగు, పాశం, పుట్టా, సింగం, సింహాద్రి, సుంకర, సుఖవాసి, పులి, పువ్వుల, బండి, బండ్ల, బడె, బద్దుల, బెజవాడ, బెల్లం, బెల్లంకొండ, బొందలపాటి, బొడ్డపాటి, బోడపాటి, బోడేపూడి, మంచినీళ్ల, మాదల, ముత్యాల, మునగాల, ముళ్లపూడి, మెట్ల, మేకల, మేకా, మేడూరి, యేటుకూరు, యేనుగుల, రఘుపతి, లింగినేని, లేళ్ల, వడ్డి, వడ్డె, వడ్లమూడి, వల్లభనేని, వనంరెడ్డి, వల్లభరెడ్డి, వాసిరెడ్డి, పాతరెడ్డి, కామిరెడ్డి, రెడ్డి, మహారెడ్డి, దేశిరెడ్డి, వుండవెల్లి, శెట్టిపల్లి, సనకా, ఆవుల, ఆచంట, కొటారి, కొటారు, కొరారు, కనుమూరి వగైరా వగైరా యిండ్లపేర్లు కలవారంతా పల్నాటి యుద్ధకాలంలో జరిగిన సామాజిక విభజన కారణంగా తెలుగు చోడులు, హైహయాన్వయులు వగైరాలనుండి విడివడిన కాపు కులస్థులు. అయితే ప్రస్తుతం ఒకే కులంగా కమ్మవారని వ్యవహరించబడుతున్న కాకతీయులు (దుర్జయాన్వయులు), చాళుక్యాన్వయులు, హైహయాన్వయులు వగైరాలను వేర్వేరుగా గుర్తించడం ఎలా సాధ్యం కాదో - ఒకే కులంగా కలగలసి పోయిన కాపు వారిలో వీరు కాపులు, వీరు బలిజలు, వీరు ఒంటరులు, వీరు తెలగ వారని వేర్వేరుగా గుర్తించడం కష్టం. కొన్ని ఆధారాలతో కేవలం ఊహచేయగలమంతే !

అలా కాపు, వెలమ, కమ్మ, క్షత్రియ కులాల మూలాలు మాత్రమే కాక, వైశ్యులలో కొందరి మూలాలు కూడా ఒకటే నన్నమాట. రెడ్డి కులస్థుల మూలాలు కూడా యివే అయినప్పటికీ వారు వీరందరికంటే ముందుగానే విడివడినట్లు కనుపిస్తున్నది. అందుకే వీరిలో వీరికి వున్నన్ని సారూప్యతలు రెడ్ల విషయంలో కాన రావు.

జైన, బౌద్ధ మతాలలో శతాబ్దాలపాటు కులరహిత వాతావరణంలో జీవించిన అనంతరం శైవం స్వీకరించిన పలనాటిలోని హైహయాన్వయులు వగైరాల ఒంటికి నాటి శైవమతం యొక్క ప్రగతి నిరోధక తత్త్వము, కులవివక్ష ఎలా సరిపడ్డాయో మరి? పలనాటిలోని హైహయాన్వయులకు యీ కులవివక్షాపూరిత ధృక్పధం నాటి శైవ, వైష్ణవ తీవ్ర వైరుధ్యాల ప్రభావంతో ఏర్పడి వుంటుంది గాని - ఓరుగల్లులోని కాకతీయులు జైన మతంనుండి శైవం స్వీకరించి వర్ణవ్యవస్థ ఘనీభవించిన హిందూ సామాజిక వ్యవస్థలో మిళితమైనప్పటికీ కులం విషయాలలో వారు ఉదారంగానే వ్యవహరించారు. కాకతీయ గణపతిదేవ చక్రవర్తి కాయస్థ కులమునకు చెందిన గంగయసాహిణి అనే వీరుడికి యావత్తు దత్తమండలం యొక్క పాలనను అప్పగించాడు. రేచర్ల రుద్రసేనాని మొదలుకొని పద్మనాయక వెలమలకు కాకతీయ సామ్రాజ్యంలో ఎంతో ఆదరణ లభించింది. కాకతీయ రుద్రమదేవి తన రెండవ కుమార్తె రుయ్యమ్మను ఇందులూరి అన్నయామాత్యుడు అనే బ్రాహ్మణునికిచ్చి వివాహం చేసింది. కాకతీయ ప్రభువులలో తొట్టతొలుత శైవం స్వీకరించిన రెండవ బేతరాజు మొదలుకొని అందరూ శైవాన్ని పాటించి పరమ మాహేశ్వరులని పేరొందారు కానీ పరమతాలనుగానీ, యితర కులాల వారిని గానీ వారు ద్వేషించలేదు. పలనాటిలో వున్న ప్రత్యేకమైన కులవివక్షాపూరిత వాతావరణం కారణంగా యీ విద్వేషాలు అక్కడ మాత్రమే రగుల్కొన్నాయి.

సాగి బేతరాజు పలనాటి హైహయాన్వయ మూలపురుషుడు కాగా, కోన రాజప్పరేడు, వెన్న(ం) చోడరాజు, కోన రాజేంద్ర చోడుడు, కోనసీమ హైహయాన్వయులలో ప్రముఖులు. చాళుక్య చోడ చక్రవర్తి అయిన కులోత్తుంగ చోడునికి సామంతులుగా పలనాటిని పాలించిన సాగి బేతరాజు, ఆయన కుమారుడు వీర కాముడిని గురించి మరిన్ని చారిత్రక వివరాలు నాడు మాధవీపురం అని పిలువబడిన గురజాలలోని వీరభద్రేశ్వరాలయంలోని శాసనం ద్వారానూ, శాలివాహన శకం 1033 (క్రీ. శ. 1111) నాటి మాచెర్ల ఆదిత్యేశ్వర స్వామి దేవాలయ శాసనం ద్వారానూ, శా. శ. 1035 (క్రీ. శ. 1113) నాటి మాచెర్ల చెన్నకేశవ ఆలయంలోని నాగస్తంభ శాసనం ద్వారానూ తెలుసుకొనవచ్చు. సాగి, కోన, వెన్నం, యిండ్లపేర్లు నేటికీ కమ్మవారిలో వున్నాయి. అయితే యివే యిండ్లపేర్లు వెలమవారిలోనూ, ఆంధ్ర క్షత్రియులలోనూ కూడా

వున్నాయి. కనుక వీరందరికీ యీ హైహయాన్వయులే మూలపురుషులన్నమాట. ఇంకా కోటవారు, దంతులూరి వారు, దాట్లవారు, జంపనివారు కూడా యీ హైహయాన్వయ కోవ క్రిందికే వస్తారు. ఇవే యింట్లపేర్లు యీ కులాలు మూడింటిలోనూ వున్నాయి.

దుర్జయాన్వయులమని చెప్పుకున్న కాకతీయులు పలనాటి హైహయాన్వయులతో సన్నిహిత బంధుత్వాలు నెరపారు. పలనాటి యుద్ధంలో నలగామరాజు, నాగమ్మల పక్షానికి కాకతి రుద్రదేవుడు చేసిన సహాయ, సహకారాలను ముందే పేర్కొన్నాను. పల్నాటి యుద్ధానంతరం తమ ఆత్మబంధువులకు ఓరుగల్లు కోటలో కాకతీయులు గుడులు కట్టి పూజించేవారు. వారు పల్నాటి వీరుల్ని వీరరసం కాయమెత్తిన అవతార పురుషులుగా భావించి పూజించేవారు. వినుకొండ వల్లభరాయుడు రచించిన 'క్రీడాభిరామము'లో ఓరుగల్లు కోటను వర్ణిస్తూ అక్కడి పల్నాటి వీరుల గుడుల గురించి కూడా కవి ప్రస్తావించాడు.

## తంజావూరు నాయకరాజులు

శ్రీ కృష్ణదేవరాయల అనంతరం తంజావూరును పాలించి, తెలుగు కవులను పోషించి, సంగీతము, శిల్పము మొదలైన కళలకు జీవం పోసిన నాయక రాజులు సైతం కమ్మవారి మూల పురుషులే! కృష్ణ రాయల అనంతరం హంపిని పాలించిన ఆయన సవతి తమ్ముడు అచ్యుత రాయలు భార్య తిరుమలాంబ గండికోట కమ్మవారి ఆడపడుచు. ఆమె చెల్లెలు మూర్తెమ్మను చెవ్వప్ప నాయకుడనే దండ నాయకుడు పరిణయమాడాడు. సామంత చోళ రాజ్యంలో అరాచకాన్ని అణచడానికి క్రీ.శ. 1535 లో అచ్యుత రాయలు తన తోడల్లుడైన చెవ్వప్ప నాయకుడిని పంపాడు. అలా తంజావూరు పాలనా పగ్గాలు చేత బట్టిన చెవ్వప్ప నాయకుడు 26 సంవత్సరాల పాటు దాదాపు స్వతంత్ర ప్రతిపత్తితో రాజ్యం చేశాడు. అచ్యుత రాయలకు తోడల్లుడు అయిన కారణంగా యిలా స్వతంత్ర ప్రతిపత్తితో పాలించడం సాధ్యపడింది. తంజావూరు రాజ్య భద్రత గురించి ఆలోచించాల్సిన అవసరం లేనందున రాజనీతి చతురుడైన చెవ్వప్ప నాయకుడు తన సమయాన్నంతా ప్రజా సంక్షేమానికే కేటాయించాడు. ఈయన పాలనలో తంజావూరు రాజ్యం సుభిక్షంగా వుండేది. బీదవారిపై యీయన పన్నులు వేసేవాడు కాదట. బ్రాహ్మణులకు అనేక అగ్రహారాలిచ్చి అరుణాచల, వృద్ధాచలాలలో దేవాలయాలకు గోపురాలు, ప్రాకారాలు, మంటపాలు వగైరాలు నిర్మించి ఎన్నో చెరువులు త్రవ్వించాడట. తంజావూరులోని చెవ్వప్ప నాయకుని చెరువు ఆయన త్రవ్వించినదే. ఆయన అనంతరం పాలించినలాయన కుమారుడు అచ్యుత నాయకుడు, తదనంతరం పాలించిన ఆయన మనుమడు రఘునాథ నాయకుడు కూడా మహావీరులు. క్రీ. శ. 1614 లో రాజ్య పాలనకు వచ్చిన రఘునాథ నాయకుడిని చరిత్ర కారులు సౌర్య పరాక్రమాలలోనే కాక కవి పండిత పోషణలోనూ శ్రీకృష్ణ దేవరాయలతో పోలుస్తారు. నేటి శ్రీలంకలోని జాఫ్నా పై దాడి చేసి అక్కడ వలస స్థావరాలు ఏర్పాటు చేసుకున్న పోర్చుగీసువారిని చిత్తుగా ఓడించాడీతడు. శ్రీరంగ రాయల పాలనా కాలంలో హంపి విజయనగరంలో జరిగిన అంతర్యుద్ధంలో రాజ బంధువైన గొబ్బూరి జగ్గరాయలు అధికారాన్ని చేజిక్కించుకొనడానికి ప్రయత్నించినప్పుడు, అతనిని క్రీ. శ. 1616 లో తోపూరు యుద్ధంలో సంహరించి, అతడికి సహకరించిన పోర్చుగీసు వారిని తిరిగి తలెత్తకుండా ఓడించిన మహా వీరుడు రఘునాథ నాయకుడు. (విజయ నగర రాజ బంధువైన గొబ్బూరి జగ్గరాయలు కూడా మహా వీరుడే. నేటికీ కమ్మవారిలో గొబ్బూరి వారున్నారు. వారిది రేచర్ల గోత్రం).

19 ఏళ్ల పాటు సుస్థిర పాలన చేసి కవి పండిత పోషణలో ఆంధ్ర భోజునికి సరిసాటిగా కీర్తి గన్న రఘునాథ నాయకుడు 1633 లో మరణించగా అతడి సోదరుడు విజయ రాఘవ నాయకుడు రాజ్య పాలనకు వచ్చి 40 ఏళ్ల పాటు

పాలించాడు. 1673 లో మధుర నాయకులతో జరిగిన యుద్ధంలో అతడు మరణించాడు. దీనితో తంజావూరు నాయక రాజుల శకం ముగిసింది.

# మధుర నాయక రాజులు

మధుర నాయక రాజుల మూలపురుషుడైన విశ్వనాథ నాయకుడు చొక్కపు (స్వచ్ఛమైన) ఆంధ్రుడనీ, ఆయన కాశ్యప గోత్రీకుడనీ, మధుర మీనాక్షి దేవాలయంలోని సువర్ణ పద్మ సరోవరం దక్షిణపు ప్రక్క గోడమీద వ్రాయబడినదనీ 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' (పేజీ 377 - రచయితలు : ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం గారలు.) అన్న గ్రంథంలో పేర్కొనబడింది. (సమానార్థకాలైన కూర్మ, కచ్ఛప, కశ్యప పదాలు అనాదిగా కమ్మవారికే వాడబడినాయనీ, ఋషి గోత్రాలలో కమ్మవారిది కాశ్యప గోత్రమనీ కీ. శే. పాలడుగు శేషాచల వర్మ గారు తమ 'కూర్మ రాజీయము' అన్న గ్రంథంలో నిరూపించారు.) ఈ విశ్వనాథ నాయకుడు, ఆయన తండ్రి నాగమ నాయకుడు కూడా గండికోట పెమ్మసాని వారి బంధువర్గంలోని వారంటారు. క్రీ. శ. 1529 నుండి క్రీ.శ. 1564 వరకు పాలించిన విశ్వనాథ నాయకుడు, ఆ తరువాత ఆయన కుమారుడు కృష్ణప్ప నాయకుడు విజయ నగర సామ్రాజ్యానికి మధురలో అమర నాయకులుగా (సామంతులుగా) వ్యవహరించారు. మధుర మీనాక్షి దేవాలయం కట్టించినది విశ్వనాథ నాయకుడే. మొదటి కృష్ణప్ప నాయకుడు (క్రీ. శ. 1564-72), వీరప్ప నాయకుడు (క్రీ. శ. 1572 - 95), రెండవ కృష్ణప్ప నాయకుడు (క్రీ.శ. 1595 - 1601), ముద్దు కృష్ణప్ప నాయకుడు (క్రీ. శ. 1601-09), మొదటి ముద్దు వీరప్ప నాయకుడు (క్రీ.శ. 1609-23) విశ్వనాథ నాయకుని తరువాత పాలించిన ప్రభువులు. ముద్దు వీరప్ప నాయకుని కాలంలో విజయనగర సామ్రాజ్యంతో వీరి సంబంధాలు సవ్యంగా సాగలేదు. గొబ్బూరి జగ్గరాయనికి సహకరించి, తోపూరు యుద్ధంలో ఓడిన ముద్దు వీరప్ప తన రాజధానిని మధుర నుండి తిరుచ్చిరాపల్లికి మార్చాడు. ఇతని అనంతరం యితని తమ్ముడు తిరుమల నాయకుడు (క్రీ.శ.1622-59) రాజ్యానికి వచ్చాడు. ఈయన మధుర నాయకులలో సర్వ శ్రేష్ఠుడు. ఇతడు రాజధానిని తిరిగి మధురకు మార్చాడు. ఇతడి రాజ్యాన్ని పటిష్ఠపరచినప్పటికీ, విజయ నగర సామ్రాజ్యంతో సహకరించక, వారికి వ్యతిరేకంగా గోల్కొండ, బీజపూరు సుల్తానులతో చేయికలిపి, ఆ రకంగా విజయ నగర సామ్రాజ్య వినాశనానికి బాటలు వేశాడు. ఈయన ప్రజాహిత కార్యాలు ఎక్కువగా చేపట్టేవాడు. ఈయన మధురలో అద్భుత శిల్ప రీతిలో నిర్మింపించిన రాజభవనం 'తిరుమల నాయకన్ ప్యాలెస్' పేరిట నేటికీ చూపరులకు సంభ్రమాశ్చర్యాలు కలుగజేస్తున్నది. ఈయన అనంతరం యీయన కుమారుడు రెండవ ముద్దు వీరప్ప నాయకుడు కేవలం 4 నెలలు పాలించి మరణించగా, ఆ తరువాత వరుసగా చొక్కనాథ నాయకుడు, మూడవ ముద్దు వీరప్ప నాయకుడు, రాణి మంగమ్మ, విజయ రంగ చొక్కనాథ నాయకుడు పాలించారు. క్రీ.శ. 1732 లో రాజ్యానికి వచ్చిన మీనాక్షి విజయరంగ చొక్క నాథుని భార్య. ఈమె తొమ్మిదేళ్లు పాలించిన అనంతరం మధుర నాయక రాజ్యం ఆర్కాట్ నవాబుల పాలన క్రిందకు వెళ్లింది.

# వాసిరెడ్డి వేంకటాద్రి నాయఁడు

అనంతర కాలంలో సామంత రాజులుగా, జమీందారులుగా పాలించిన కమ్మ వారిలో వాసిరెడ్డి వేంకటాద్రి నాయఁడు అగ్రగణ్యుడు. ఈయన సుగుణశీలత, వదాన్యత అందరిచే వేనోళ్ల కొనియాడ బడ్డాయి. వీరునిగా ఎనిమిది దుర్గాలు పోరాడి సాధించిన ఘనత యీయనకుంది. అయితే వీరునిగా కన్న పరిపాలనాదక్షునిగా, వదాన్యునిగా, నిర్మాణ

కుశలునిగానే యీయన గొప్ప గుర్తింపు పొందాడు. ఈయన నాలుగు జిల్లాలలో విస్తరించిన 999 గ్రామాలకు జమీందారు. చింతపల్లి కోటలో క్రీ.శ. 1761 ఏప్రిల్ 27 న జన్మించాడీయన. గుంటూరు ప్రభువు బసాలత్ జంగ్ మాయోపాయంతో యీయన తండ్రి జగ్గ భూపతిని క్రీ. శ. 1765 లో శిరచ్ఛేదనం చేయించాడు. ఈయన తల్లి అచ్చమ్మ భర్తతో సహగమనం చేసింది. అప్పటికి ఆయనకు నాలుగేళ్ల వయసు. బాల్యంలోని యీ ఘటన ఆయన మదిలో చెరగని ముద్ర వేసింది. ములుగు పాపయారాధ్యులు యీయనకు గురువు. పెదనాన్న రామన్న రక్షణలో బాల్యం గడిచినా, క్రీ. శ 1783లో 22 సం॥ల యుక్త వయస్సులో తానే సింహాసనాన్ని అధిష్టించి స్వతంత్ర పరిపాలన మొదలు పెట్టాడు. చందర్లపాడుకు చెందిన తన మేనమామ చావ వెంకయ్య కుమార్తె వెఱ్ఱెమాంబను పెండ్లాడాడు. రాజ్యంలో దోపిడీలకు, అరాచకాలకు, పాల్పడుతూ ప్రజల మాన ప్రాణాలను హరిస్తూన్న 500 మంది చెంచు బందిపోట్లను తెలివిగా చింతపల్లికి ఒక విందుకు ఆహ్వానించి శిరచ్ఛేదన చేయించాడు. అయితే ఆ తరువాత అది పాపకార్యమని దడిచి 108 ధ్వజ స్తంభాలు ప్రతిష్ఠించి, అనేక శివాలయాలు, విష్ణ్వాలయాలు నిర్మించి, బంగారంతో ఒకసారి, వెండితో రెండుసార్లు తులాభారం తూగి దానిని బ్రాహ్మణులకు ధర్మంగా యిచ్చాడు. గొడవర్రు, అనుమర్లపూడి వగైరా వందల కొద్దీ అగ్రహారాలను బ్రాహ్మణులకు దానంగా యిచ్చి బ్రాహ్మణ పక్షపాతిగా పేరుగాంచాడు. ఆయన ఏకైక కుమార్తె రాజ్యలక్ష్మి చింతపల్లి కోట బురుజుపై నుండి జారి పడి మరణించగా మనస్సు వికలమై తిరుపతి యాత్ర, కాశీ రామేశ్వర యాత్రలు చేశాడు. తిరిగి వచ్చి అమరావతి, వైకుంఠపురములను అద్భుతంగా పునర్నిర్మించాడు. అమరావతి పట్టణాన్ని ఆయన సాక్షాత్తు దేవేంద్రుని రాజధాని అమరావతిలా తీర్చిదిద్దాడట. అమర లింగేశ్వరుని దేవస్థానాన్ని ఓ అద్భుత కట్టడంగా రూపొందించాడు. పది గ్రామాలను నిర్మించాడు. వాటిలో తల్లి అచ్చమ్మ పేరిట నిర్మించబడిన అచ్చంపేటలు, తండ్రి జగ్గయ్య పేరిట నిర్మించబడిన జగ్గయ్య పేట, తన పేరిట నిర్మించిన మన్నె సుల్తాన్ పురం వున్నాయి. చేబ్రోలులో యీయన నూట ఒక్క ఆలయాలు నిర్మించాడని ప్రతీతి. ఈయన నిర్మించిన మంగళగిరి లక్ష్మీ నృసింహ స్వామి ఆలయ గాలిగోపురం ఓ అద్భుత నిర్మాణం. దక్షిణ భారతదేశంలోని అతి ఎత్తైన గాలిగోపురాలలో యిది ఒకటి. ఈయన నైజాం నవాబు నుండి మన్నె సుల్తాన్ అనే బిరుదును పొందాడు. దోపిడీదారులైన పిండారీలను అణచి ప్రజలను రక్షించాడు. 33 ఏళ్ల సుదీర్ఘ, జనరంజక పాలన అనంతరం క్రీ. శ. 1816 ఆగస్టు 17 న ఆయన మరణించాడు. ఆయన మృతి కారణంగా ఆంధ్ర దేశంలోని ఆబాల గోపాలం కంటతడి పెట్టిందట ! కవులు 'ఆయనకింత తక్కువ ఆయుర్దాయం ఎందుకిచ్చావు ?' అంటూ బ్రహ్మను తిట్టిపోస్తూ వ్రాసిన పద్యాలెన్నో వున్నాయి. అంతటి కవి, పండిత పోషకుడన్నమాట వాసిరెడ్డి వేంకటాద్రి నాయఁడు. అంతేకాదు గొప్ప దాతగా ఆయన ఖ్యాతి గాంచాడు. వైదిక బ్రాహ్మణులలోని గరిమెళ్ల వారి కుటుంబానికి చెందిన ఓ వ్యక్తి తాను అతి నాజూకుగా వడికిన అతి సన్నని జందెమును ఓ శనగ డిప్పలో యిమిడ్చి, దానిని వేంకటాద్రి నాయనికి కానుకగా యిచ్చాడట. (ఆయన సుక్షత్రియుడననే భావంతో ఎల్లప్పుడూ జందెం ధరించేవాడట. ఆయన నిత్యాగ్నిహోత్రుడని కూడా ప్రతీతి) దీనికి ఆయన సంతోషించి 'గరిమెళ్ల' వారికి తెనాలి తాలూకా గొడవర్రు గ్రామాన్ని అగ్రహారంగా యిచ్చి, వారిని నాటి నుండి 'జంధ్యాల' వారని పిలువమని ప్రజలకు సూచించాడట. ప్రజల యోగక్షేమాలను విచారించే నిమిత్తం ఆయన విక్రమార్కుని వలె మారు వేషంలో తన రాజ్యంలో పర్యటించే వాడట. ఆ సందర్భంలో ఒక సారి సీతమ్మ అనే ఓ పేద వితంతువు యింటికి భోజనానికి వెళ్లి తనకు కలిగిన దానితోనే భోజనం పెట్టమన్నాడట. ఆమె అప్పటికప్పుడు అన్నం వండి గరికతో పచ్చడి చేసి పెట్టిందట. అప్పుడాయన 'ఈ పచ్చడి ఎంతో రుచిగా వుంది. ఏమిటిది ?' అని అడిగాడట. ముందు తటపటాయించిన ఆమె తరువాత నిజం చెప్పేసిందట. ఆయన ఆమె నైపుణ్యాన్ని, నిర్భీకతను ఎంతగానో మెచ్చుకుని ఆమెకు తరతరాలు సుఖంగా జీవించమని ఓ మాన్యాన్ని యిచ్చాడట. దానిని

'సీతమ్మ గరిక మాన్యం' అంటారు. చెంచులను వధించి రాజ్యంలో శాంతి భద్రతలు నెలకొల్పినా, ఆయన మాత్రం అశాంతికి లోనయ్యాడట. మోసంతో వారిని వధించడం పాప కార్యమని భావించిన ఆయనకు రోజూ అన్నం ముందు కూర్చుంటే భోజన పదార్థాలలో లుకలుకలాడుతున్న పురుగులు కనుపించేవట ! దీంతో ఆయన గొడవర్రు అగ్రహారాన్నుంచి జంధ్యాల భగవచ్ఛాస్త్రి అనే వేద పండితుని తన వద్దకు రప్పించుకుని, రోజూ భోజన కాలంలో తన ప్రక్కన కూర్చుండబెట్టుకుని ముందుగా ఆహార పదార్థాలు ఆ పండితుని విస్తరలో వడ్డింపజేసి వాటిని ఆయన స్పృశించి విడచిన అనంతరం ఎటువంటి చిత్త భ్రమలకూ లోను కాకుండా తాను భుజించేవాడట. ఈ సహాయానికి గాను భగవచ్ఛాస్త్రి కుటుంబానికి తెనాలి తాలూకా కొలకలూరు సమీప గ్రామమైన అనుమర్ల పూడిని అగ్రహారంగా యిచ్చాడట.

ఓ సారి ఆయన తెనాలి సమీపంలోని అనంతవరం అగ్రహారానికి పర్యటనకు వెళ్లాడట. అది మిట్ట మధ్యాహ్నం. భోజనాల వేళ. అప్పుడు ఓ బ్రాహ్మణ స్త్రీ తన యింట్లో భోజనాలు ముగిసి, పులి విస్తర తీసేసి, తన ఆవరణలో నుంచి విసురుగా గోడ బయటకు విసిరేసిందట. ఆయన ఆ గోడకు ప్రక్కనే రహదారిపై పల్లకిలో వెళ్తున్నాడట. ఈ సంగతి ఆమెకు తెలియదు. సరిగ్గా ఆ పులి విస్తర ఆయన పల్లకిలోనే పడిందట. దీంతో వెంట వున్న సిబ్బంది ఆగ్రహోదగ్రులయ్యారట. నాయఁడిని ఎంతో అభిమానించే ఆ అగ్రహారపు బ్రాహ్మణ పెద్దలంతా క్షణాల్లో అక్కడ గుమిగూడి జరిగిన అపచారానికి మన్నించమని వేడుకున్నారట. జరిగిన దానికి ఆయన ఎంతగా నొచ్చుకుంటాడోనని వారంతా భయపడ్డారట. కానీ 'అపకారికి నుపకారము నెపమెన్నక' చేసే వేంకటాద్రి నాయఁడు ఆ బ్రాహ్మణ స్త్రీ కుటుంబానికి తరతరాలు అనుభవించేటట్లుగా ఓ మాన్యం యిచ్చాడట. ఇది 'పులి విస్తర మాన్యం' గా పేరుగాంచింది.

ఇలా చెప్పుకుంటూ పోతే ఆయన ధర్మ కార్యాలకు అంతే వుండదు. గొప్ప దాతగా, దేవాలయ నిర్మాతగా, పాలనాదక్షునిగా, ప్రజాహిత కాంక్షిగా, బ్రాహ్మణ పక్షపాతిగా, కవిపండిత పోషకునిగా మనకాయన కనుపిస్తాడు. ఒక ప్రక్క కుంఫిణీ (బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ) వారి కుట్రలూ, కుహకాలూ తట్టుకుంటూ, మరో ప్రక్క నిజాం నవాబు ఒత్తిడులను లెక్క చేయక తన జమీందారీలో తనకున్న పరిమితులలోనే అద్భుతమైన రీతిలో ధర్మ కార్యాలూ, నిర్మాణాలూ, ప్రజా సంక్షేమ కార్యక్రమాలూ చేపట్టిన శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయఁడు మన్నె సుల్తాన్ బహద్దర్ తెలుగు జాతి ఎన్నటికీ మరువలేని, మరువరాని మహామనీషి అనడంలో సందేహమేమీ లేదు.

## కమ్మవారి మూలపురుషులలోని యింకొందరు ప్రముఖులు

అడపా నారనృపాలుడు అనే మహా వీరుడు కటకం గజపతుల పక్షాన కొండపల్లి, కొండవీడుల పాలన నిర్వహించాడట. 'జానకీ పరిణయము' అనే గ్రంధానికి ఆయనే కృతిభర్త. కృష్ణా జిల్లా గన్నవరం సమీపంలోని పురుషోత్త(మ) పట్నంకు చెందిన దాసరి చిన గంగన్న గొప్ప ధర్మశాలిగా పేరు గాంచాడు. కటకం గజపతులు నిర్మించిన యీ పట్టణానికి క్రీ. శ. 1550 ప్రాంతాలలో కమ్మ చౌదరీ పట్టభద్రుడిగా ఆయన నియమింపబడ్డాడట. అలాగే కొన్ని చాటువులను బట్టి బొప్పన హరినీడు, కొడాలి పేరినీడు, శాఖమూరి జన్నయ్య అనే వారు కూడా గొప్ప వదాన్యులైనట్లు భట్టురాజులు, కవులు కీర్తించారు. గండికోట పతనానంతరం నేటి చిత్తూరు జిల్లా కార్వేటి నగరం ప్రభువులచే ఆదరించబడి, ప్రజలకు సుగాలీ బందిపోటలు దాడుల నుంచి రక్షణ కలిగించిన మహా వీరుడు పెమ్మసాని వేంకటాద్రి నాయుడు. ఒంటి చేత్తో పులిని చంపిన యీ మహా వీరుని బంధు వర్గం కావేటి రాజ పురంలో స్థిరపడ్డారట. తంజావూరు యుద్ధంలో అవక్ర పరాక్రమాన్ని చూపిన రామినాయనింగారు (రామినేని వారి మూల పురుషుడు) గొప్ప యోధునిగా ప్రసిద్ధి.

శాలివాహన శకం 1169 లో (అంటే క్రీ.శ. 1247 లో విప్పర్ల అమరి నాయకుడు అనే ఆయన బెజవాడలోని మల్లీశ్వర స్వామికి దీప దానమొనరించి ఒక దాన శాసనం వ్రాయించాడు. ఈయన తాను దుర్జయకుల విభూషణుడనని ఆ శాసనంలో పేర్కొన్నాడు. కాకతీయులు కూడా వారి శాసనాలలో తమను తాము దుర్జయ కులం వారిమనే పేర్కొన్నారు. విప్పర్ల వారే కాక, ఏరువ, సాగి, సాగినేని, పొందూరు, ఆలూరి, కోడూరు, నల్లూరి, వెన్నం, ఇమ్మడి, మల్యాల, చింతమనేని, కట్టా వగైరా యిండ్ల పేర్ల వారు దుర్జయాన్వయులలోని వారే ! 'శ్రీ రంగ మాహాత్మ్యము' అనే గ్రంధాన్ని వ్రాసిన కట్టా వరద రాజేంద్రుడు తెలుగు బిజ్జన వంశీయుడైన దుర్జయాన్వయుడే !

కమ్మ వారిలోని మరి కొందరు ప్రసిద్ధులు - ధరణికోటను పాలించిన కోట రుద్ర రాజు, ఆయన కుమారుడు కోట బేతరాజు, ఆయన భార్య గణపాంబ, ఓరుగల్లులో ప్రతాపరుద్రుని సేనానిగా పనిచేసిన సాగి గన్నమనీడు, ఆయన తమ్ముడు నేచయ నాయకుడు, కొండిపర్తి శాసనములో పేర్కొనబడిన మల్యాల సజ్జ సేనాపతి, జావ సేనాపతి, బాచ సేనాపతి, క్రీ.శ. 1134 సం లో దాక్షారామ భీమేశ్వరుని సన్నిధిలో వేయించబడిన దాన శాసనంలో మండలాధిపతిగా పేర్కొన బడిన రాపర్తి (రాపర్ల) ముంజరాజు, రాపర్తి ప్రోలయ్య, ముప్పి నాయడు వగైరాలు, క్రీ.శ. 1150 నాటి భీమేశ్వరాలయ దాన శాసనంలో పేర్కొనబడ్డ ఎలమంచి కొమ్మి నాయకుడు, (కులోత్తుంగ చోళ దేవుని సేనానులలో ఒకడు), క్రీ.శ. 1285 కు చెందిన చిరమన (ఆత్మకూరు తాలూకా) దాన శాసనంలో పేర్కొనబడ్డ 'ఒరయూర్పుర వరాధీశ్వర' బిరుదాంకితుడు గొల్లపూడి కామయ నాయకుడు, దేవి నాయకుడు, వగైరాలు కూడా కమ్మ వారిలో కడు ప్రసిద్ధులు.

తిరునల్వేలి జిల్లాలోని కురివి కుళమ్ జమీందారులు పెమ్మసాని వారు. ఆ ప్రాంతంలోని ఇలవరస నందనన్ జమీందారులు రావెళ్ల వారు, మధుర జిల్లాలోని నైకార్పట్టి జమీందారులు గుంటూరు వారు, రామనాధపురం జిల్లాలోని నన్నె మంగళమ్ జమీందారులు గోళ్లవారు, చెంగల్పట్టు జిల్లా పరకాదు జమీందారులు రావూరు వారు, ఎన్నో ధర్మ కార్యాలు చేసి వదాన్యులుగా పేరు గాంచారు. ఇంకా కాకర్ల వారు, నీరుకొండ వారు, పుల్లెల వారు, కొంగర వారు, తుమ్మల వారు, అదుసుమిల్లి వారు, వాసిరెడ్డి వారు, కమ్మవారు, గుత్తా వారు, కిలారు వారు, తమిళనాడులోని పలు ప్రాంతాలలో ప్రసిద్ధి గాంచారు.

సదాశివ రాయఁడనే కమ్మ వీరుడికి అన వేమారెడ్డి (క్రీ. శ. 1370-1385) 'వాసిరెడ్డి' అనే బిరుదు యిచ్చాడంటారు. ఈయన కొడాలి రామభూపాలుని కుమార్తెను వివాహమాడాడట. ఈయనకు రాజమౌళి, లక్ష్మీపతి అనే యిరువురు కుమారులు. అప్పటి వరకు నందిగామ ప్రాంతంలో పాలించిన లక్ష్మీపతి పుత్రుడు రామలింగ భూపతి తన కార్య స్థానాన్ని ముక్త్యాలకు మార్చాడట. ముక్త్యాల ప్రభువులు సాహితీ పోషణకు, ధర్మ కార్యాలకు ప్రసిద్ధి గాంచిన వారు. చిరుమామిళ్ల వేంకట పతి, యార్లగడ్డ కోదండరామభూపతి వగైరాలు కమ్మ వారిలో గొప్ప వీరులుగా ప్రసిద్ధి గాంచారు. రాజేంద్ర చోళుడి (క్రీ. శ 1018-44) సామంతులైన సాగి ముప్ప భూపతి, సాగి దోర భూపతి, చాగి గణపతి భూపతి, సాగి వల్లయ నాయకుడు, మున్నగు వారంతా మహా వీరులు. వినుకొండలో సాగి గన్నమనేడు అనే మహా వీరుడు పాలించినట్లు ఆధారాలున్నాయి. సాగి వారు నేటికీ కమ్మ వారిలో వున్నారు. వారిది విప్పర్ల గోత్రం. సాగి నాయఁడు అనే ప్రసిద్ధుని పేరిట ఏర్పడిన 'సాగినేని' గృహనామం కలిగిన వారూ కమ్మ వారిలో వున్నారు. వారివి పెరుమాళ్ల, దాసునూళ్ల, పమిడిచుక్కల గోత్రాలు.

14 వ శతాబ్దంలో కందుకూరు ప్రాంతాన్ని పాలించిన ముప్పిడి నాయకుడు ఓ మహా వీరుడు. (ఈయన బహుశా ముప్పానేని వారి మూల పురుషుడైవుంటాడు) క్రీ. శ. 1660 లో చిలకలూరి పేట ప్రాంతాన్ని పాలించిన దాసరి చిన గంగయ్య మరో కమ్మ ప్రముఖుడు. బద్దెపూడి పెద్దయ్య అనే కవి చేత వాయుపురాణం వ్రాయించి అంకితం పుచ్చుకున్నాడీయన.

సూర్య దేవర తిమ్మ భూపాలుడు, ఆరట్లకోట యుద్ధంలో శ్రీకృష్ణదేవరాయల తరపున పోరాడిన సూర్యదేవర ముసలప్ప నాయకుడు తాము ఒరయూర్పురవరాధీశ్వరులమని పేర్కొన్న సూర్యవంశ తెలుగు చోడ వీరులు. రుద్రమదేవి తంత్ర పాలుడైన ప్రోలరౌతు కుమారులు నలుగురూ – ఎక్కినాయఁడు, రుద్ర నాయఁడు, పిన రుద్ర నాయఁడు, పోతి నాయఁడు – ప్రతాపరుద్ర చక్రవర్తికి అంగరక్షకులుగా పేరుగాంచారని లోగడ పేర్కొన్నాను. ఈ ఎక్కి నాయఁడు లేక అక్కి నాయఁడు 'అక్కిన' మరియు 'అక్కినేని' వారి మూలపురుషుడయ్యే అవకాశముంది. వీరిది చెఱుకునూళ్ల గోత్రం. (అక్కి అనేది పిల్లలకు వచ్చే ఒక జబ్బట. ఎక్కిళ్లు పెడుతూ, ఎక్కి ఎక్కి ఏడుస్తూ, కలత నిద్ర కలిగి వుండడం ఈ వ్యాధి లక్షణం. పుట్టిన పిల్లలంతా వరసనే చనిపోతూ వుంటే ఏమైనా సరే పుట్టిన బిడ్డ బ్రతికి తీరాలని, దేవుడు కూడా వారిని తీసుకెళ్లడానికి అసహ్యించుకోవాలని కోరుతూ రోశయ్య, పెంటయ్య, చింపిరయ్య, ఆగమయ్య వగైరా పేర్లను పెట్టినట్లే ఆయనకు బాల్యంలో అక్కి నాయఁడు అనే పేరు పెట్టి వుంటారు. అలాగే నియోగి బ్రాహ్మణులలో అక్కిరాజు అనీ, కాపులలో అక్కి శెట్టి అనీ కూడా యిండ్ల పేర్లు ఏర్పడి వుంటాయి.) అలాగే పోతి నాయఁడు 'పోతిన', 'పోతిని', 'పోతినీడి', 'పోతినేని' వారి మూలపురుషుడయ్యే అవకాశముంది. (వీరివి గురజాల, వల్లుట్ల, పోగునూళ్ల వగైరా గోత్రాలు). క్రీ.శ. 1702 లో 'అలపర్తి' గృహ నామం కలిగిన కమ్మ వారిని మోదుకూరు గ్రామానికి చౌదర్లుగా నియమించారట. తెనాలి తాలూకా పెదగాదెల వర్రు గ్రామంలో యడ్లపాటి వారు అమరేశ్వరాలయం కట్టించారట. యడ్లపాటి వారు నేటికీ కమ్మ వారిలో వున్నారు. వీరివి పమిడిపాళ్ల, పామునూళ్ల, ముసునూళ్ల వగైరా గోత్రాలు. నా శ్రీమతి రాజ్యలక్ష్మి యడ్లపాటి వారి ఆడపడుచే! అలాగే పెదగాదెలవర్రు కైఫీయ్యత్ ప్రకారం కమ్మవారైన కోట వారు అదే గ్రామంలో గోపాల స్వామి ఆలయం కట్టించారట. కోటవారివి వల్లుట్ల, పమిడిపాళ్ల, ముసునూళ్ల వగైరా గోత్రాలు.

వాసిరెడ్డి వారిలో క్రీ. శ. 1748 లో మఙ్రాజు సూరభూపాలుడనే వెలమ ప్రభువుతో మేదరసాల వద్ద యుద్ధం చేసిన వాసిరెడ్డి నరస భూపాలుడు ప్రముఖుడు. చిన పద్మనాభ రామన్న అనే వాసిరెడ్డి వారి వీరుడు క్రీ.శ. 1651లో గుర్రపు స్వారీలో గోల్కొండ ప్రభువు తానీషాను మెప్పించి నందిగామ, ఖమ్మం, వినుకొండ, కొండవీడు మొదలైన 500 గ్రామాలకు సర్దేశ్‌ముఖ్ అయ్యాడట. ఆయనే చింతపల్లిని కృష్ణా నది ఒడ్డున నిర్మించాడట. అడుసుపల్లి కమ్మ వారికి బెల్లంకొండ మొదలైన 24 గ్రామాలను మొఖాసాగా యిచ్చారట. ప్రోలునాడు (పిఠాపురం), కాకినాడ, సర్పవరం (కాకినాడ వద్ద) ప్రాంతాలను కమ్మ వారైన ఒంటి పల్లి వారు, మట్టుపల్లి వారు పాలించినట్లు కైఫీయ్యత్‌లలో పేర్కొనబడింది. కృష్ణ రాయల కొలువులో రావెళ్ల మల్లికార్జునుడు, పెమ్మసాని రామలింగ నాయకుడు, కొడాలి పేర్నీడు, బొప్పన హరినీడు, లింగమనేని పుల్లయ్య వగైరా కమ్మ వీరులున్నట్లు చాటువుల ద్వారా తెలుస్తున్నది. పెమ్మసాని నారసింహ నాయుడు మరో మేటి వీరుడట. రత్నాకరం గోపాల కృష్ణ కవి తాను వ్రాసిన సౌగంధిక ప్రసవాపహరణాన్ని వల్లుట్ల గోత్రీకుడైన రావెళ్ల లింగ భూపాలునికి అంకితమిచ్చాడట. రావెళ్ల వారు విజయనగరాన్నేలిన సాళువ, తుళువ, ఆరవీటి వంశస్థుల సామంతులని యీ గ్రంథాన్ని బట్టి తెలుస్తున్నది. లింగనాయకుని తండ్రి కొండ భూపాలుడు, పిన తండ్రి అయ్యప్ప నాయకుడు మహా వీరులు తోపూరు యుద్ధంలో పాల్గొన్న రావెళ్ల వెంక భూపాలుడు మరో వీరుడు. రావెళ్ల వారు నెల్లూరు మండలం ఉదయగిరి, పొదిలి (ప్రస్తుత ప్రకాశం జిల్లా), కొచ్చెర్ల కోట ప్రాంతాలను పాలించారట.

## కమ్మవారు - చౌదరులు

ప్రస్తుతం కొందరు కమ్మవారు గౌరవ వాచకంగా 'చౌదరి' శబ్దాన్ని చేర్చుకుంటున్నారు. అయితే యిది ప్రాచీన

శబ్దమే. 'చౌత్' అనేది తురుష్కులు, మొగలాయిల కాలంలో విధింపబడిన ఒక పన్ను. దీని వసూలుకు వారిచే మహారాష్ట్రులకు అనుమతి మంజూరు చేయబడింది. మహారాష్ట్రులు ఆ అధికారంతో పన్ను వసూళ్లకు బయలుదేరి అది చెల్లించని ప్రాంతాలను కొల్లగొడుతూ, ఆయా ప్రాంతాల పాలకులను పదవీచ్యుతుల్ని చేస్తుండేవారట. అలా 'చౌత్' పన్ను వసూలుచేసే అధికారినే చౌదరి అనడం వాడుక అయిందని కొందరి వాదన. ఈ విధానం క్రీ.శ. 1720–1820 ల మధ్య కాలంనాటిది. మరి యిలా 'చౌత్' పన్ను వసూలు చేస్తూ గ్రామంలో పెత్తనం చెలాయించే వ్యక్తినే చౌదరి అని వుంటే 'చౌత్' పన్ను విధింపక ముందరే ఉత్తర, దక్షిణ భారత దేశ భాషలలోకి 'చౌదరి' అనే పదం ఎలా వచ్చి వుంటుంది ? కనుక 'చౌత్'కూ 'చౌదరి' శబ్దానికీ ఏ సంబంధమూ లేదనుకోవాలి. 'చౌధురీ', 'చహధరీ' అని ఉత్తర భారతదేశంలో వాడే పదానికి మూలం 'ఛప్పర్‌దార్' (రచ్చబండ వారు) అని కొందరు చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. చౌత్ పన్ను అమలులోకి రాకపూర్వమే ఛప్పర్‌దార్ అనే రచ్చబండ అధికారులు గ్రామాలలో తగవులు తీరుస్తూ, తీర్పులు చెపుతూ ప్రసిద్ధులై వుంటారు. ఆ తరువాతి కాలంలో వారే చౌత్ పన్నుకు వసూలుదార్లు అయివుంటారు. ఇక బ్రిటీష్ వారి హయాంలో కూడా వారు కొన్ని ప్రాంతాలకు కొందరికి చౌదరి తనాన్ని కట్టబెట్టేవారని లోకల్ రికార్డులు చెపుతున్నాయి. అయితే అనాదిగా కమ్మవారికి మన్నెదొరలనీ, మన్నీలనీ, సుంకరులనీ (సుంకం వసూలు చేసేవారనీ) పేరు. చౌత్ పన్ను విధింపు తరువాత దానిని కూడా వారే వసూలు చేసేవారని భావించవచ్చు. అంతకు పూర్వం గ్రామ రచ్చబండ అధికారులుగా వ్యవహరించి గ్రామంలో తీర్పులు చెప్పడం కూడా వారే చేసి వుండవచ్చు. అందుకే వారికి చౌదరులు అనే పేరు సార్ధకమైనది. ఇదంతా 'చౌత్' పన్ను విధింపుకు ముందు కాలంలోనే జరిగింది. కార్నెగీదొర (*Lord Carnegy*) వ్రాసిన 'అవధ్ (అయోధ్య)లోని జాతులు, కులాలు' (*Races, Tribes and Castes of Oudh*) అనే గ్రంథంలో కూర్మీలకు చౌధరి అనేది బిరుదనామమని పేర్కొన్నాడు. పాలడుగు శేషాచల వర్మగారి అభిప్రాయం ప్రకారం చౌధురి శబ్దానికి మూలం 'చతురధురి' (అంటే చతుర్వేదములలో ప్రావీణ్యం కలవాడు. వేద విజ్ఞానం కలవారే ప్రాచీనకాలంలో తీర్పులనిచ్చే పెద్దలు.)

అనాదిగా యిలా చతుర్వేద పరిజ్ఞానం కలిగి, రచ్చబండల వద్ద తీర్పులిచ్చే ధురీణులను (తీర్పులిచ్చి న్యాయం చేసే బాధ్యతను మోసే వారిని) ఉత్తర భారత దేశంలో 'చౌధురి' అనే పేరుతో వ్యవహరించేవారు. ఆ 'చౌధురి' అనే పదమే దక్షిణాదిన అపభ్రంశమై 'సౌధరి', 'సవధరి' అనే పదాలుగా మనకు కరీంనగర్ జిల్లాలో లభించిన కొన్ని శాసనాలలో కనుపిస్తుంది.

అయితే చౌధరీ అనే పదం కూర్మీలకు, కమ్మవారికే ఎక్కువగా వాడబడినా – చౌధురీ చరణ్ సింగ్ వగైరాలు జాట్లలోనూ, మొయినుల్ హక్ చౌధురీ, ఘనీఖాన్ చౌధురీ వగైరాలు ముస్లింలలోనూ వుండడాన్ని బట్టి చౌధురీ లేక చౌదరి అనే పదానికి కులంతో ఎట్టి సంబంధమూ లేదనీ, అది కేవలం ఆయా ప్రాంతాలలోని గ్రామ పెత్తందార్లకు యివ్వబడిన గౌరవ నామమేననీ అర్థం చేసుకోవాలి.

## కమ్మవారిలోని శాఖలు

గుంటూరు జిల్లా చామర్రుకు చెందిన మద్దినేని గంగాధరరావు గారు తమ 'కమ్మ కులదీప్తి' గ్రంథంలో 'కమ్మవారు – తెగలు' అనే అధ్యాయంలో క్రీ.శ. 1891 వ సంవత్సరపు జనగణన నివేదిక (*Census*) మరియు యితర ఆధారముల ప్రకారం కమ్మకులంలో ముఖ్యంగా 1) గంపచాటు, 2) గోడచాటు, 3) ఇల్లు వెడలని, 4) కావడి, 5) వడుగ, 6) పెద్ద, 7) బంగారు, 8) గండికోట, 9) మాచ, 10) కూచి, 11) కుడిపైట, 12) ఎడమపైట, 13) కావటి, 14) ఎరిడి, 15) గూడ,

16) ఉగ్గం, 17) రాచకమ్మ వారు అనే శాఖలు వివిధ ప్రాంతాలలో వున్నట్లుగా పేర్కొన్నారు. ఈ శాఖాభేదాలు ఎలా ఏర్పడి వుంటాయో ఆయన కొంత ఊహచేశారు. వీటిలో కొన్ని ఆమోదయోగ్యంగా లేవు. ఈ సందర్భంగా నేను యీ శాఖా భేదాల గురించి పెద్దలు చెప్పగా విని వున్న విషయాలను కూడా వివరిస్తాను.

**గంపచాటు కమ్మ - గోడచాటు కమ్మ - ఇల్లు వెడలని కమ్మ:** గంపచాటు, గోదచాటు, ఇల్లువెడలని అనే శాఖల పేర్లు కమ్మవారిలోని ఘోషాను తెలియజేస్తాయి. మిగిలిన శూద్రకులాలలో వలె కాక వెలమ, కమ్మవారి స్త్రీలలో ఒకప్పుడు ఘోషా పద్ధతి వుండేది. ఈ ఘోషా అనే దురాచారం స్త్రీలపై పురుషుడి పెత్తనం చెలాయింపు యొక్క మరొక రూపమే. నిస్సందేహంగా యిది రాచరిక యుగపు పురుషుల దౌష్ట్యానికి కొనసాగింపే. అయితే స్త్రీలను ఈ ఘోషా పేరుతో ఎంత మేరకు నియంత్రించాలి అనే విషయంలో క్రీ.శ. 11, 12 శతాబ్దుల నాటి వెలమవారిది కరినవైఖరి కాగా కమ్మవారు ఆనాడు కొంత ఉదార వైఖరినవలంబించారు. ఈ విషయమై విబేధాలు వచ్చినందునే కమ్మవారి నుండి వెలమవారు వెలివేయబడి వెలికమ్మలు (వెలిమ – వెలమ) వారుగా బయటపడడానికి దారితీసింది. కమ్మవారిలోని పురుషులు ఘోషా విషయంలో ఉదారవైఖరిని అవలంబించినప్పటికీ వారి ఆడవాళ్లు ఎంతో తప్పని పరిస్థితులలో తప్పితే బయటకు వచ్చేవారు కాదు. నా చిన్నతనంలో కూడా స్త్రీలు ప్రయాణించే ఎడ్ల బండ్లకు పరదాలు కట్టుకు వెళ్లడం నేనెరుగుదును. నేటికీ మిగిలిన శూద్రకులాలలోని స్త్రీలలో లాగా కమ్మ వారిలో ఆడవాళ్లు పొలం పనులకు వెళ్లడం తప్పు. స్వంత పొలంలోనైనా వ్యవసాయ పనులన్నీ పురుషులే చూసుకోవాలి. ఇప్పుడిప్పుడే కొద్ది ప్రాంతాలలోని కమ్మవారిలోనూ యీ నియమం సడలుతున్నప్పటికీ, యింకా చాల ప్రాంతాలలో స్త్రీలు పొలం వెళ్లడం తప్పుగానే భావిస్తున్నారు. ఒకప్పుడు ఇండ్లలో పెద్ద పెద్ద గంపలూ, గాదెలలో ధాన్యం ఏడాదికి సరిపడా నిల్వచేసేవారట. ఆ రోజుకు సరిపడా ధాన్యాన్ని గృహ యజమానియైన పురుషుడి నుండి ఆ గృహిణి అడిగి తీసుకుని దంచి, ఆ బియ్యంతో వంట చేయాలి. అలా భర్తనే అయినా సరే అడిగేటప్పుడు అక్కడ ఎవరైనా పరపురుషులు వుంటే గంపచాటునే నిలబడి అడగాలి. యీ శాఖల కమ్మవారి స్త్రీలు పరపురుషుడికి కనబడకుండా గంపచాటున, గోడచాటున నిలబడడం ; తప్పనిసరి పరిస్థితులలో తప్ప ఇల్లు వదలి బయటకు వెళ్లక పోవడం అనే ఆచారాలు యింకా పాటిస్తారు. అందుకే ఆ శాఖల కమ్మవారికి తదనుగుణంగానే పేర్లు వచ్చివుంటాయి. 'గంపచాటు కమ్మ' అని కాక 'గంప కమ్మ' అనే ఓ శాఖ కూడా కమ్మ వారిలో వుందనీ, వీరిలో పెళ్లిళ్ల సందర్భంలో వధువును మేనమామ గంపలో పెట్టి తీసుకు రావడం అనే ఆచారం వున్న కారణంగా యీ శాఖ వారికీపేరు వచ్చిందనీ కొందరు పేర్కొంటున్నారు.

**వడుగ కమ్మ:** 'వడ' అంటే తమిళంలో ఉత్తరదిక్కు. తెలుగులో కూడా వడ చేక్కేలిక (ఉత్తర దిక్పాలకుడు – కుబేరుడు) అనే ప్రయోగం 'ఆంధ్రనామ సంగ్రహం'లో మనం చూడవచ్చు. తమిళులు వారి దేశానికి ఉత్తర దిక్కుగా వున్న ఆంధ్రుల్ని 'వడుగర్'లు అని పిలుస్తారు. తమిళనాడులో కమ్మవారు చాల పెద్ద సంఖ్యలో వున్నారు. తంజావూరు, మధురలను ఒకప్పుడు కమ్మవారు పాలించారు. ఇప్పటికీ తిరునల్వేలి జిల్లా కురివికుళం, ఇలవరస నందనన్, మధురజిల్లా నైకార్పట్టి, రామనాథపురం జిల్లా నన్నె మంగళం, చెంగల్పట్టు జిల్లా జమీందారులు కమ్మవారే! కోయంబత్తూర్‌లో ప్రసిద్ధిచెందిన పి.యస్.జి. మిల్సు, కె.సి.పి. మిల్సు, లక్ష్మీ మిల్సు తెలుగు దేశం నుంచి అక్కడకు వెళ్లి స్థిరపడిన కమ్మవారివే. అక్కడ కూడా వాసిరెడ్డి వారు, పెమ్మసాని వారు, రావెళ్ల వారు, గుంటూరు వారు, గోళ్ల వారు, గుత్తా వారు, కిలారి వారు, రావూరి వారు, కాకర్ల వారు, కమ్మ యింటిపేరు వారు, నీరుకొండ వారు, పుల్లెల వారు, కొంగర వారు, తుమ్మల వారు, అదుసుమిల్లి వారు వగైరాలు పెద్ద సంఖ్యలో వున్నారు.

తమిళనాడులో నార్త్ ఆర్కాట్, చెంగల్పట్టు, సౌత్ ఆర్కాట్, మధుర, రామనాథపురం, కోయంబత్తూర్, తిరునల్వేలి జిల్లాల్లో కమ్మవారు పెద్ద సంఖ్యలో వున్నారు. తమిళనాడులోని కావేటి రాజపురం, వీరరాఘవపురం, పనప్పాకం, నిడుంబరం, బుచ్చినాయుడు ఖండ్రిక, పెమ్మసాని వారి పాళెంలలో నేటికీ పెమ్మసానివారు, శాఖమూరివారు, నర్రావులవారు, సాయపనేనివారు వగైరాలున్నారు.

తమిళనాడు ఉత్తర కొస నుండి దక్షిణాగ్రం వరకు దాదాపు అన్ని జిల్లాల్లో కమ్మవారు పెద్ద సంఖ్యలో విస్తరించి వున్నారు (1921 వ సంవత్సరం బ్రిటీష్ వారు వెలువరించిన జనగణన నివేదిక ప్రకారం మైసూర్ రాజ్యం, నిజాం స్టేట్‌లలో వున్న కమ్మవారు కాక ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ఆంధ్రప్రాంతంతో కలుపుకుని మొత్తం సుమారు 12 లక్షల మంది కమ్మవారుండగా, కేవలం తమిళ జిల్లాలలోనే 4 లక్షలకుపైగా కమ్మవారున్నారు. అంటే ఆంధ్రప్రాంతంలో వున్న కమ్మవారిలో కనీసం సగం సంఖ్యలో తమిళప్రాంతంలో వున్నారన్నమాట. నేటికీ దాదాపు యిదే పరిస్థితి కొనసాగుతున్నది. అలా తమిళనాడులోని కమ్మవారిలో తెన్ (దక్షిణాది), వడ (ఉత్తరాది) శాఖలుండడమేకాక, తమిళనాడులోని కమ్మవారు ఆంధ్రప్రాంతపు కమ్మవారిని మొత్తంగా 'వడుగర్'లు అంటారట. అదే 'వడుగ కమ్మ' అయింది. మలయాళంలో కూడా తెలుగు వాడిని 'వడుగన్' అనే పిలుస్తారు. తెలుగు భాషను వారు 'వడుగ' లేక 'బడగ' భాష అంటారు. (మలయాళంలో 'బడగ' అంటే ఉత్తరాది – *'Northern'* అని అర్థం.)

**కుడిపైట కమ్మ - ఎడమ పైట కమ్మ:** స్త్రీలు చీర కట్టినప్పుడు పైటకొంగును కుడివైపునుండి కుడిచేతితో ఎడమబుజం మీదికి వేసుకొనడమే ఆంధ్రప్రాంతపు కమ్మవారిలో ఎక్కువ మందికి అలవాటు. కాని కొందరు కమ్మవారు ఎడమ చేతితో పైటను కుడిబుజం మీదికి వేసుకొనే అలవాటు కూడా వుందట. కనుక ఆయా పైటకట్టు విధానాలనుబట్టి ఒకరిని మరొకరు 'కుడిపైట' – 'ఎడమపైట' వారలుగా సంబోధించడం అలవాటై వుంటుంది.

**బంగారు కమ్మ:** స్త్రీలకు సహజంగా బంగారు నగలపై వ్యామోహం ఎక్కువగా వుంటుంది. కమ్మవారిలో యిది మరింత ఎక్కువ. పండుగలలోనూ, పెండ్లిండ్లు వగైరా శుభకార్యాల సందర్భంగానూ తాము చేయించుకున్న కొత్త నగలతో సహా వారి వారి వద్దనున్న బంగారు ఆభరణాలన్నిటినీ ధరించడం ఓ సంప్రదాయం. నేను హైదరాబాద్ శివార్లలోని కూకట్‌పల్లిలో చూశాను. వెలమ వారి స్త్రీలు కూడా బ్రతుకమ్మ (బతకమ్మ) పండుగలో పాల్గొనాలంటే పురుషులు ఎంత కష్టపడైనాసరే డబ్బు సంపాదించి తాము లోగడ ఆర్థిక యిబ్బందుల కారణంగా తాకట్టు పెట్టిన తమ స్త్రీల బంగారు నగలను ఆ రోజుకు విడిపించి తేవడం అనే మంచి పద్ధతి వుంది. తమ భర్తలు తమ నగలు తమకు తెచ్చి యిస్తేగానీ వారు యిల్లు కదలరు. పండుగలో పాల్గొనరు. ఇది వారి భర్తలకు అవమానకరమైన పరిస్థితి. నలుగురూ తమను అసమర్ధులని ఆడిపోసుకుంటారని భయం. అంచేత వారు బ్రతుకమ్మ పండుగ వస్తున్నదంటే చాలు భార్యల నగలు తాకట్టునుంచి విడిపించడానికి ఎంత కష్టం చేయడానికైనా సిద్ధపడతారు. కమ్మ వారిలో కూడా యిలా తమ ఆర్థిక స్థితిని కూడా లెక్కచేయకుండా తమ స్త్రీలకు కనీసం తృప్తికలిగే విధంగా బంగారు ఆభరణాలు చేయించే సంప్రదాయం వున్న శాఖవారిని 'బంగారు కమ్మ' అనే పేరుతో పిలుస్తున్నారు. ప్రత్యేకించి వివాహ సందర్భాలలో యీ శాఖ కమ్మవారు తమ కూమార్తెకు తమ శక్తికి మించి బంగారు ఆభరణాలను చేయించే ఆనవాయితీ వుంది. కొందరు యీ శాఖ వారిని 'బంగారు ముక్కర కమ్మ' అని పిలుస్తారు. కనీసం బంగారు ముక్కరనైనా పెళ్లిళ్ల సందర్భంలో తమ ఆడపడుచులకు చేయించి యిచ్చే అలవాటు వీరిలో వుండడం కారణంగానే యీ శాఖ వారికి ఆ పేరు వచ్చిందట.

**కావడి కమ్మ - కావటి కమ్మ :** ఇకపోతే 'కావడి కమ్మ' కూ 'కావటి కమ్మ'కు భేదమేమీ లేదు. వివిధ

ప్రాంతాలలో విస్తరించి వున్న కమ్మ వారిలో కొందరు త్రాగునీటికి కటకట వున్న దుర్భిక్ష ప్రాంతాలలో కూడా నివసించడం సహజమే కదా ! అక్కడి వారు సుదూర ప్రాంతాలకు వెళ్లి మంచినీటి చెలమలు, జ్యోబలు, చెరువుల నుంచి కావళ్లలో కడవలు పెట్టుకొని వెళ్లి త్రాగు నీరు తెస్తారు. అలా కావళ్లతో నీటిని తెచ్చే వారిని యితరులు 'కావడి' కమ్మ వారనీ లేక 'కావటి' కమ్మ వారనీ పిలవడం వాడుక అయింది. వివాహాది శుభకార్యాలలో జలసమృద్ధి వున్న ప్రాంతాల కమ్మ వారు, తమ బంధువులైన యీ దుర్భిక్ష ప్రాంతాల కమ్మ వారిని యిలా వెటకారంగా 'కావడి కమ్మ' లేక 'కావటి కమ్మ' అని వుంటారు. అదే స్థిరపడింది.

**కూచి కమ్మ - మాచే కమ్మ :** యుద్ధం సమయంలో సైనికులకు పరాకుచెప్తూ యుద్ధ యాత్రకు సన్నద్ధులవడానికి సైనికులకు హెచ్చరికగా వాయిద్యములు వాయించడాన్ని 'కూచి' అంటారు. కమ్మవారి లోని కొందరి పూర్వీకులు సైన్యంలో వుంటూ ఆ విధంగా యుద్ధ సమయాలలో సైనికులకు పరాకు చెప్పడానికి 'కూచి' చేయడానికి వినియోగింపబడ్డారేమో ! వారిని, వారి వారసులను కూచి కమ్మవారని అనడం మొదలయింది. 'మాచే ' కమ్మ అని పేర్కొనబడ్డ శాఖ 'మూసి కమ్మ' అయి వుంటుంది. కమ్మ వారిలో 'మాచే' కమ్మ అనే శాఖ వున్నట్లు నేను వినలేదు. 'మూసి కమ్మ' అనే శాఖ పేరు కమ్మ వారిలో మూసి వాయనాలు తీర్చడం లేక చేటలు తీర్చడం అనే ఆచారం నుంచి వచ్చి వుంటుంది. ఈ ఆచారం వున్న వారి స్త్రీలలో చేటల వాయనం బ్రతికి వుండగా తీర్చక పోతే చనిపోయిన తరువాతనైనా తప్పక తీర్చాల్సి వుంటుంది. ఇందుకు అయే మొత్తం వ్యయం ఆమె పుట్టింటి వారే భరించాలి. స్త్రీల రెండు తాళిబొట్ల మధ్యలో వుండే పూసను మూసిక అంటారు. దాని పేరు మీదుగా యీ 'మూసి వాయనాలు' అనే ఆచారం వచ్చింది.

**గూడ కమ్మ :** ప్రాచీన కాలంలో వానకు తల తడిసి పోకుండా ఎండిన జమ్ము *(Typha angustifolia)* లేక తాటి *(Borassus flabellifer)* ఆకులతో (తడికలా) అల్లిన ఒక మడిచిన గోతాము వంటి దాన్ని తల నుండి కాళ్ల వరకు కప్పుకునేవారు వ్యవసాయదారులు. దానిని 'గూడ' అంటారు. ఒక చేత్తో గొడుగు పట్టుకుని మరొక చేత్తో వ్యవసాయ పనులు చేసుకొనడానికి ఆటంకం కనుక కొన్ని ప్రాంతాలలో రైతులు యీ గూడను ఉపయోగిస్తారు. ఈ గూడ కాక తాళ్లతో పట్టుకుని యిద్దరు వ్యక్తులు పంట కాలువ నుండి నీటిని తోడి పోసే 'గూడ' అనే మరొక సాధనం వుంది. దీనిని వెదురు బద్దలతో చేస్తారు. ఈ సాధనాల మీదుగా గూడపల్లి, గూడవల్లి, గూడపాడు వగైరా గ్రామ నామాలు కూడా ఏర్పడ్డాయి. వర్షాకాలంలో అలా తల తడవకుండా 'గూడ' లను ఉపయోగించే కమ్మ వారిని యితర ప్రాంతాల కమ్మవారు 'గూడ' కమ్మ వారనడం మొదలయింది. 'గూడవల్లి', 'గూడపాడు' వగైరా గ్రామాలలో కమ్మ వారు పెద్ద సంఖ్యలో వుండడమే కాక, 'గూడవల్లి', 'గూడపాటి' అనే యిండ్లపేర్లు కూడా కమ్మ వారిలో వుండడం విశేషం. పంచెను లుంగీలా కట్టుకుంటే దానిని 'గూడకట్టు' అంటారు. ఒకవేళ అలాంటి 'గూడకట్టు' కట్టే అలవాటు వున్న కమ్మవారిని మిగతా కమ్మవారు 'గూడ కమ్మ' అంటూ వుండడం కారణంగా యీ శాఖ వారికి ఆ పేరు వచ్చి వుంటుంది. ఏమైనా, పెళ్లిళ్లు వగైరా శుభకార్యాలలో నలుగురూ కలిసినప్పుడు ఆడుకునే పరాచకాలలో యిటువంటి కొన్ని శాఖల పేర్లు పుట్టి వుంటాయని నా అభిప్రాయం.

**ఉగ్గం కమ్మ :** బిందెలు, చెంబులు, కడవలు, వగైరాలను ఒక చేతితోనే పట్టుకు వెళ్లడానికి అనువుగా వాటి మూతికి తాడుతో బిగించి కట్టే ఉచ్చును 'ఉగ్గము' అంటారు. పాలతో నిండిన బిందెలు, కడవలు, చెంబులను వాటిలోని పాలు ఒలికి పోకుండా ఒక చేతితో తేలిగ్గా పట్టుకు వెళ్లడానికి వీలుగా ఈ ఉగ్గాల్ని వాడతారు. నర్రావుల, బోదావుల, యల్లావుల, పయ్యావుల, కిలారు, ఉగ్గం ఇండ్ల పేర్లు కమ్మ వారిలోని పశుపోషణా వ్యాసంగాన్ని తెలియజేస్తాయని మనం లోగడనే చెప్పుకున్నాం. అనాదిగా పాడి పశువుల పోషణలో వాసికెక్కిన కమ్మ వారిలోని కొందరి పూర్వీకులు ఈ ఉగ్గం

వాడడం కారణంగా 'ఉగ్గం కమ్మవార'ని పిలువబడి వుంటారు. ఉగ్గం అనే యింటి పేరు కూడా కమ్మ వారిలో వుంది. ఆ యింటి పేరు పశుపాలన కులవృత్తిగా కల యాదవులలో కూడా వుంది.

**ఎరిడి కమ్మ:** సుదీర్ఘ కాలం పాటు జైన, బౌద్ధ మతాలలో కొనసాగినందున, ఆ అహింసా మత సిద్ధాంతాల ప్రభావం, ఆ ఆహార అలవాట్ల కారణంగా కమ్మ వారిలో నేటికీ సగానికి సగం మంది శాకాహారులే. పెద్ద కమ్మ వారిగా పిలువ బడుతున్న వారిలోనైతే నూటికి 80 మంది నేటికీ కూడా శాకాహారులుగానే వుండడం విశేషం. పాత తరం కమ్మ వారు శాకాహారాన్ని ఓ ఆదర్శ, ఆరోగ్య నియమంగా పాటించినప్పటికీ, యువతరం క్రమంగా మాంసాహారంపై నానాటికీ ఎక్కువ మోజు పెంచుకుంటున్నది. అయితే కొన్ని ప్రాంతాల కమ్మ వారు మాత్రం మాంసాహారంపై అతి మక్కువ కలవారుగా కనుపిస్తున్నారు. పశ్చిమ గోదావరి జిల్లాలోని కొన్ని ప్రాంతాలలోని కమ్మ వారు మాంసాన్ని ముక్కలుగా కోసి, శుభ్రపరచి నిల్వ చేసుకొనడానికి ఎండబెట్టి వరుగు చేసుకుంటారనీ, తమ యిండ్లలో వివిధ రకాల మాంసాలతో పకోడీలు, ఊరగాయ పచ్చళ్లు కూడా చేస్తారనీ విన్నాను. గుంటూరు జిల్లా తాడికొండ సమీపంలో పెద్ద పరిమి అనే గ్రామముంది. ఆ గ్రామంలోని కమ్మ వారు కొందరు యిటీవలి కాలం వరకు తమ యిండ్ల పెరటి దొడ్లలోనే బలిష్టమైన పందుల్ని పెంచుతూ, వాటి మాంసాన్ని వండుకు తింటుండే వారు. ఆ కారణంగా ఆ గ్రామాన్ని పందుల పరిమి అనే వారు. (గుంటూరు జిల్లాలో పరిమి పేరిట రెండు గ్రామాలున్నాయి. మొదటిది పెద్ద పరిమి లేక పందుల పరిమి కాగా తెనాలి తాలూకా లోని కూచిపూడి సమీప గ్రామమైన పరిమిని అక్కడ ఒకప్పుడు పెద్ద సంఖ్యలో గల జంగ మహేశ్వరుల కారణంగా జంగాల పరిమి అనే వారు).

చిత్తూరు జిల్లాలోని కమ్మ వారిలో కూడా మాంస భక్షణం పైన అమితమైన ఆసక్తి వున్నట్లు విన్నాను. దీనికి నేను విన్న ఓ ఆసక్తికరమైన ఉదాహరణ చెప్తాను. తెనాలి తాలూకా (ప్రస్తుత దుగ్గిరాల మండలం) లోని చినపాలెం, పెదపాలెం గ్రామాలలోని పెద్ద కమ్మ వారిలో 'నారా' యింటిపేరు కలవారున్నారు. చిన పాలెం గ్రామ మునసబు కీ. శే. వాసిరెడ్డి నారాయణ రావు గారి మేన కోడలు నారా కమల అనే ఆమె (ఈమె నాకు అక్కయ్య అవుతుంది.) కడప, చిత్తూరు జిల్లాలలో కొన్నేళ్ల పాటు ప్రభుత్వ ఆయుర్వేద వైద్యురాలిగా పనిచేశారు. ఆంధ్ర ప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు గారి స్వస్థలం చిత్తూరు జిల్లా చంద్రగిరి సమీపంలోని నారా వారి పల్లె అని తెలుసుకొని అప్పట్లో ఆమె ఓ ఆదివారం నాడు ఆ వూరు చూసి వద్దామని వెళ్లారట. అక్కడి వారికి ఆమె తనను తాను పరిచయం చేసుకున్న తరువాత వారంతా ఆమెను ఎంతగానో మర్యాద చేశారట. అక్కడి ఓ కుటుంబం వారు "మా నారా వారి ఆడపడుచువు కనుకనే అభిమానంతో మమ్మల్ని చూసి, పరామర్శిద్దామని యింత దూరం వచ్చావు. ఈ రోజుకు యిక్కడే భోజనం చేద్దువు గాని. చల్లబడిన తరువాత వెళ్దువు గాని," అంటూ గబగబా తమ యింటి చూరు దుంగకు వ్రేళ్లాడదీసిన మేకపోతు మృత శరీరాన్నుండి కత్తితో కొంత మాంసం కోయబోగా, ఆమె వారించి, "మేము మాంసమే కాదు – చివరికి కోడి గ్రుడ్లు, మసాలా దినుసులు కూడా వాడం. దయచేసి ఏమీ అనుకోవద్దు. శాకాహారమేమైనా వుంటే పెట్టండి. తింటాను," అన్నారట. దానికి వారెంతో విస్తు పోయారట – 'మాంసం తినని కమ్మ వారు కూడా వుంటారా ?' – అని. అది ఆదివారం అయినందువల్లనో ఏమో అక్కడి చాల యిండ్ల ముందర యిలా వధించిన మేక పోతులు కసాయి కమేలా (కబేళా)లలో వలె వ్రేలాడదీయబడి వున్నాయట. ఆ తరువాత కొన్నాళ్లకు ఆమె తెనాలిలోని మా యింటికి వచ్చినప్పుడు యీ వివరాలు తెలిపారు.

'ఎఱచి' అంటే మాంసం. మాంస భక్షణం చేసే వానిని 'ఎఱచి తిండి' (ఎఱచి దిండి) అంటారు. కమ్మ వారిలోని మాంసాహారులను శాకాహారులైన కమ్మ వారు 'ఎఱ దిండి' – 'మాంసం భుజించే' కమ్మ వారని పిలుస్తుండే వారేమో – అదే క్రమంగా ఎఱడి → ఎరిడి గా రూపాంతరం చెందింది.

**పెద్ద కమ్మ లేక రాచ కమ్మ :** ఒకప్పుడు రాజ్యాలేలడం, ఆర్థిక ఔన్నత్యం కలిగివుండడమే కాక కొన్నికొన్ని పద్ధతులు, ఆచారాల వైవిధ్యం కారణంగా కమ్మవారిలోని కొన్ని కుటుంబాల వారిని పెద్ద కమ్మవారని లేక రాచ కమ్మవారనీ వ్యవహరిస్తారు. మిగిలిన కమ్మ వారంతా వీరి ఆధిక్యతను అంగీకరించి, వీరిని పెద్ద కమ్మవారని పిలుస్తుండడం విశేషం! ఇటీవలి కాలంవరకు పెద్ద కమ్మవారి స్త్రీలు ఘోషా పాటించేవారు. బండ్లకు పరదాలు లేనిదే బయటకు వచ్చేవారు కాదు. వీరి యిండ్లలో శాకాహారమే తప్ప మాంసం కానీ, చివరకు మసాలా దినుసులు కానీ వాడరు. వీలైనంత మేరకు ఒకప్పుడు అందరికీ రోజూ విస్తర భోజనమే. పురుషులు మద్యపానం, ధూమపానం వగైరాలకు దూరంగా వుండేవారు. ఆ కారణంగా వీరి గతకాలపు హెూదాకు తగినట్టుగానే గ్రామస్థులందరి వద్ద వీరికి మంచి గౌరవ ప్రతిపత్తులుండేవి. వీరు అందరినీ 'ఏమండీ', 'మీరు', 'వారు' అని సంబోధించడం పరిపాటి. వెలమవారిలో కూడా యిదే తరహా అలవాట్లుంటాయి.

పెద్ద కమ్మవారిలో ఒకప్పుడు విస్తర భోజనమే ఎక్కువ. కేవలం గత కొన్ని దశాబ్దాలుగా మాత్రమే కంచం భోజనం చేస్తున్నా, వారిది విలక్షణమైన శైలి. వారు కంచానికి ఎట్టి పరిస్థితులలో ఎడమ చేయి తాకనివ్వరు. కొందరైతే భోజనం మధ్యలో నీరు త్రాగాలన్నా మంచినీటి గ్లాసును కూడా కుడిచేతితోనే తీసుకుంటారు. దీన్ని గురించి ఓ చిత్రమైన కథ వుంది. ఒకప్పుడు ఓ చిన్న కమ్మ భూస్వామి ఓ మధ్య తరగతి పెద్ద కమ్మ వారింటికి భోజనానికి వెళ్లాడట. ఆ భూస్వామికి ఎప్పటినుంచో 'అసలీ పెద్ద కమ్మ – చిన్న కమ్మ తేడాలేమిటి ? ఇంతటి స్థితి మంతుడనైన నాకంటే పెద్ద కమ్మ ఎవడు ?' అనే భావన మనస్సులో తీవ్రంగా వుండేదట. ఆ కుటుంబం వారేమో తమకు కలిగిన దానిలోనే ఆ భూస్వామికి ఏలోపం జరుగకుండా చక్కటి విందు భోజనం ఏర్పాటు చేసి తమ యింట్లోని స్వంత మనిషిలాగా ఆయనకు వారి కంచంలోనే వడ్డించారట. ఇంట్లోని మగవాళ్లు కూడా ఆయనతో కలిసి భోంచేశారట. భోజనం చేస్తున్నంత సేపూ చర్చంతా 'పెద్ద కమ్మ – చిన్న కమ్మ' తేడాల మీదనే జరిగిందట. చర్చ తారస్థాయికి చేరిన ఒక దశలో "అసలు మీకూ మాకూ యీ తేడా ఏమిటోయ్ ! ఏ బుద్ధిలేని వెధవ కల్పించాడో గానీ" అన్నాడట ఆ భూస్వామి, అప్పుడే మజ్జిగ అన్నం తిని, కంచంలో మిగిలిన మజ్జిగను కంచం రెండు చేతులతో ఎత్తుకుని త్రాగుతూ. ఆ యింటి పెద్దాయన చటుక్కున, "అద్గద్గదేనోయ్ ! మీకూ మాకూ తేడా. మేం వండిన ఖాద్య పదార్థాలను కానీ, చివరికి భోజనం చేసేటప్పుడు పళ్లెములను కానీ ఎడమ చేతితో తాకటం తప్పుగా భావిస్తాం. మీకది తప్పుకాదు." అన్నాడట. అలా పెద్ద కమ్మ వారివి కొన్ని ప్రత్యేకమైన అలవాట్లు.

ఇటీవలి కాలం వరకు పెద్ద కమ్మ వారిలో – వారిలో వారే తప్ప, యితర కమ్మ కుల శాఖల వారితో కూడా వారు వివాహ సంబంధాలు చేసుకునేవారు కారు. సంభాషణలలో 'వాండ్లు', 'వీండ్లు', 'వచ్చినారు', 'పోయినారు' వగైరాలు వాడడమే కాక పెద్ద కమ్మ కుటుంబాలలో తమ తండ్రిని 'బాబు' అని పిలవడం కూడా ఓ వైవిధ్యం! పెద్ద కమ్మవారున్న ప్రతి ఊరులోనూ వారిలో 'దేవుడోరు' అనే పేరుతో దైవభక్తికి అంకితమైన కొన్ని కుటుంబాలుంటాయి. వారైతే మరీను – బ్రాహ్మణులకంటె ఎక్కువగా మడి, శుచి పాటిస్తారు. పిలకలు కలిగి, నిత్యమూ పట్టుబట్టలు ధరించడం, వైష్ణవధర్మం ప్రకారం పంగనామాలో లేక శైవాచారం ప్రకారం విభూతి రేఖలు, రుద్రాక్ష మాలలో ధరిస్తారు. వారు నిత్యమూ దైవారాధనలో నిమగ్నమవుతారు. పెద్ద కమ్మ వారిలోనూ తిరిగి మూడు శాఖలున్నాయి. వీరంతా ఒకప్పుడు రాజ్యాలేలిన కుటుంబాలకు చెందిన వారు కనుక వీరిని రాచవారనీ అంటారు. బయటి ప్రాంతాల నుంచి వచ్చి స్థిరపడడంలో వున్న కాల వ్యత్యాసాన్ని బట్టి పెద్దకమ్మవారిలో యీ తేడాలేర్పడి వుంటాయి. వాసిరెడ్డి వారు, చేకూరి వారు, బోడేపూడి వారు, సూర్యదేవర వారు, చావ వారు, నీరుకొండ వారు, మేదరమెట్ల వారు, దేవభక్తుని వారు, గోళ్లమూడి వారు, పుతుంబాక వారు, జంగా వారు, చిరుమామిళ్ల వారు, నారుకొండ వారు, దేవరపల్లి వారు, పాటిబండ్ల వారు, నారా వారు, గుంటుపల్లి వారు, వట్టికొండ

వారు వగైరాలు మిగిలిన కమ్మ వారందరిచే పెద్ద కమ్మవారిగా పిలువబడుతున్నారు.

ఇటీవలి కాలం వరకు యీ యిండ్ల పేర్ల వారు తమ శాఖలోని వారిని మాత్రమే వివాహాలు చేసుకునే వారు - అదీ కేవలం కొన్ని గ్రామాలకు చెందిన స్వశాఖీయుల మధ్యనే ఆ వివాహ సంబంధాలుండేవి. అక్కడక్కడా గండికోట కమ్మ వారితో మాత్రం వీరికి వివాహ సంబంధాలుండేవి. మిగిలిన వారితో వీరి వివాహ సంబంధాలు అరుదనే చెప్పుకోవాలి. వివాహ సంబంధాలు కుదుర్చుకొనడంలో వీరు తమ శాఖకు ప్రాధాన్యమిచ్చినట్లే కొద్ది ఊళ్లకు మాత్రమే ప్రాధాన్యతనిస్తారు. వధూవరులది ఒకే గోత్రం, ఒకే యింటిపేరు కాకుండా వుంటే చాలు. వరుసల పాటింపు అంతగా లేదు. మా అమ్మ అయిదుగురు పెద్దమ్మలని వాసిరెడ్డి వారికే యిచ్చారు. అయినా మా మేనమామ కీ.శే. చేకూరి వెంకట సుబ్బయ్య గారు గుంటూరు జిల్లా వడ్లమూడికి చెందిన వాసిరెడ్డి వారి ఆడపడుచును వివాహమాడారు ! సూర్య దేవర వారికి చెందిన మరొక మా బంధువు తల్లి వాసిరెడ్డి వారి ఆడపడుచు. ఆయన తోడల్లుడు మళ్లీ వాసిరెడ్డి వారే ! ఇలా శాఖ బయటకు వెళ్లకుండా కొన్ని ఊళ్ల వారితోనే అక్కడికక్కడే వైవాహిక సంబంధాలు కుదుర్చుకొనడం కారణంగా ఒక్కోసారి యీ శాఖ వారిలో వావి వరుసల తికమక తప్పేది కాదు. ఈ పరిస్థితులలో క్రమంగా మార్పులు వచ్చి ప్రస్తుతం వీరు కూడా యితర శాఖల వారితో కూడా సంబంధాలు చేస్తున్నారు.

**గండికోట కమ్మ :** పెమ్మసాని వారు, శాఖమూరి వారు, అడుసుమిల్లి వారు, ఘట్టమనేని వారు, ఉమ్మలనేని వారు, కిలారు వారు, మిక్కిలినేని వారు, పరుచూరి వారు, కోవెలమూడి వారు, ఈడ్పుగంటి వారు, నిమ్మగడ్డ వారు, కంచర్ల వారు, సాయపనేని వారు, తాతినేని వారు, నర్రావుల వారు, వేలూరి వారు, కుడితిపూడి వారు, మల్లిపెద్ది వారు, కొత్తపల్లి వారు, మైనేని వారు వగైరాలు గండికోట కమ్మవారనే పేరుతో పెద్ద కమ్మవారిలోని మరొక శాఖగా వ్యవహరించబడుతున్నారు. వీరు గండికోట పతనానంతరం వచ్చి ఆంధ్రప్రాంతంలో స్థిరపడ్డారు.

వీరే కాక యింకా గాలి వారు, చుక్కపల్లి వారు, బొల్లేపల్లి వారు, బొల్లినేని వారు, కడియాల వారు, బత్తుల వారు, నాయుడు వారు వగైరాలు, కర్నాటి, పాతూరి, బుర్రా, చంద్ర, చాపరాల, చేపలమదుగు, బిక్కసాని, అత్తలూరి, మాలెంపాటి, మద్దిపట్ల, కన్యధార, పుట్టా, కరణం, కందిమళ్ల వగైరా యిండ్లపేర్ల వారు పెద్ద కమ్మ వారిలోని వేరొక శాఖగా కనుపిస్తున్నారు. వీరు దక్షిణ దేశాన్నుంచి అందరికంటె ఆలస్యంగా వచ్చి స్థిరపడ్డారు. అలా వలస వచ్చిన అనంతరం వారు స్థిరపడిన గ్రామాలకు మంగళాపురం (కృష్ణా జిల్లా దివి తాలూకా) వంటి యితర గ్రామ నామాలను కూడా వారు ఏర్పరచుకున్నప్పటికీ ముఖ్యంగా ఈ మూడవ శాఖ వారంతా కమ్మవారి పాలెములనే పేరునే తమ తమ వలస గ్రామాలకు పెట్టుకున్నారు. నెల్లూరు జిల్లా కావలి దగ్గర ఒకటీ, గుంటూరు జిల్లా చిలకలూరిపేట దగ్గర ఒకటీ, కృష్ణా జిల్లా నందిగామ తాలూకాలో ఒకటీ - ఇలా ఆంధ్రప్రాంతంలో కమ్మ వారి పాలెములు చాలానే వున్నాయి.

పైన పేర్కొన్న మూడు శాఖల పెద్దకమ్మవారిలో మొదటి రెండు శాఖల వారూ ఒకరితో ఒకరు వివాహ సంబంధాల నేర్పరచుకొనడం మాత్రం అక్కడక్కడా కనుపిస్తుంది. మిగిలిన శాఖల వారితో వీరి బాంధవ్యం చాల తక్కువ. ఈ పరిస్థితిలో యిప్పుడిప్పుడే మార్పు వస్తున్నది.

ఒకప్పుడు రాజ్యాలేలిన, సేనానులుగా పని చేసిన ఘన చరిత్ర కలిగిన ముసునూరి, యార్లగడ్డ, రావెళ్ల వగైరా వంశీకులు రాచకమ్మ శాఖలోని వారే అయినా ఏ కారణం చేతనో ఆ యిండ్ల పేర్ల వారిలో పలువురి తదనంతర బాంధవ్యాలలో అధిక శాతం పెద్ద కమ్మ వారితో కాక, యితర శాఖల వారితో వుండడం విచిత్రం !

**కొలగంప :** అతి వేగంగా మారిపోతున్న వారి సామాజికార్థిక స్థితి గతుల కారణంగా పెద్ద కమ్మ వారిలో

ఒకప్పటి ఘోషా మటు మాయమైనట్లే, వారి వైభవం, దాతృత్వం వగైరాలు కూడా క్రమంగా తగ్గుతూ వస్తున్నాయి. అయినా ఆ హుందాతనం, సూటితనం మాత్రం యింకా అధిక శాతం మందిలో మనం గమనించవచ్చు. కొన్ని ఆచారాలు, అలవాట్లు వారిని మిగిలిన కమ్మ వారందరిలోకీ విలక్షణమైన వారిగా నిలుపుతాయి. ఉదాహరణకు యిటీవలి కాలం వరకు వాసిరెడ్డి వారు తదితరులలో అన్నదమ్ములు ఆడపడుచులకు 'కొలగంప'తో పంట యిచ్చే ఆచారం వుండేది. పంటలు నూర్చిన అనంతరం ఆ యేడు పంటలు బాగా పండినా, లేకున్నా తమ ఆడపడుచులకు యివ్వాల్సిన వాటాను మాత్రం 'కొలగంప'లో నింపి, ఆ తరువాత ఏదైనా మిగిలితేనే తాము పంచుకొని తీసుకునే వారట. కీ. శే. యన్‌టిఆర్ ముఖ్యమంత్రిగా వుండగా చట్టబద్ధంగా కల్పించబడిన 'తండ్రి ఆస్థిలో స్త్రీలకు పురుషులతో బాటు సమాన వాటా' అనేది చాల రాచకమ్మ వారి కుటుంబాలలో ఎప్పటి నుంచో అమలులో వుంది. తమ ఆడపడుచుల పట్ల వారికున్న ఆదరణ, అనురాగం ప్రత్యేకమైనట్టివి.

**వాసిరెడ్డి వారి గ్లాసు :** తమ ఆడపడుచులకు పుట్టింటి వారి కానుకగా ఏదో ఒక జ్ఞాపిక యివ్వడం వాసిరెడ్డి వారి కుటుంబాలలో ఆనవాయితీగా వస్తున్నది. అంతవరకూనైతే యిందులో ప్రత్యేకత యేమీలేదు. అయితే అలా జ్ఞాపికను తీసుకున్న ఆ వాసిరెడ్డి వారి ఆడపడుచు తన తదనంతరం తన చిన్న కుమార్తెకు మాత్రమే ఆ అపురూపమైన కానుకను అందజేసే ఏర్పాటు చేయాలి. అది తిరిగి వాసిరెడ్డి వారికే చేరే వరకు తరతరాలు యీ నియమం కొనసాగాలి. ఒక వేళ ఎవరికైనా ఆడపిల్లలు కలుగక పోతేనో, అసలు పిల్లలే కలుగక పోతేనో, యీ ప్రక్రియ యిక ముందుకు సాగదు. 1966 లో మరణించిన మా అమ్మమ్మ నా బాల్యంలో కంతేటి వాసిరెడ్డి వారిలోని ఈ వింత ఆచారాన్ని గురించి గొప్పగా చెప్పేది. కానుకగా యివ్వబడ్డ వస్తువు విలువ కాదు – దాని వెనుక వున్న అనురాగం, అభిమానం ముఖ్యం అనేది ఆమె. తాము తమ ఆడపడుచుకు ప్రేమతో యిచ్చిన కానుకను అలా ముందు తరాల వారికి నిరాఘాటంగా అందేటట్లు చేయబడిన ఈ ఏర్పాటు బలే విచిత్రమైనట్టిది.

నా చిన్న తనం నుండీ మా యింట్లో ఒక పెద్ద గాజు గ్లాసు వుంటూ వస్తున్నది. అది పాతకాలపు మొద్దు పోత గ్లాసు. మా అమ్మమ్మ చేకూరి సౌభాగ్యమ్మ గారు (చినపాలెం గ్రామానికి చెందిన చేకూరి అప్పయ్య గారి భార్య) తాను చనిపోబోయే ముందు (బహుశా 1965లో అనుకుంటాను.) ఆ గ్లాసును తన చిన్న కుమార్తెయైన కోటమ్మ (మా అమ్మ)కు తన కానుకగా అందజేసింది. అంతకు పూర్వం ఎప్పుడో మా అమ్మమ్మకు వాళ్ల అమ్మ చావ కోటమ్మ చేత యీ గ్లాసు కానుకగా యివ్వబడిందట. గుంటూరు జిల్లా కంతేరుకు చెందిన చావ కోటయ్య, కోటమ్మ దంపతులకు కలిగిన మొత్తం పదకొండు మంది సంతానంలో ఆరుగురు ఆడవాళ్లు. వారిలో అందరికంటే చిన్నది మా అమ్మమ్మ సౌభాగ్యమ్మ. క్రీ. శ. 1855 ప్రాంతంలో కంతేరులో జరిగిన కోటమ్మ గారి వివాహం సందర్భంలో ఆమె అన్నలు వాసిరెడ్డి వెంకయ్య, బలరామయ్య గార్లు ప్రేమతో యిచ్చిన జ్ఞాపిక ఆ గాజు గ్లాసు. కంతేరుకు చెందిన వాసిరెడ్డి వెంకయ్య, బలరామయ్య గారలకు నలుగురు సోదరీ మణులు. వారు 1) కొప్పురావూరుకు చెందిన కీ. శే. పాటిబండ్ల కోటయ్య గారి తల్లి. ఈమె చినపాలెం మునసబు కీ.శే. వాసిరెడ్డి నారాయణ రావు గారి అమ్మమ్మ. 2) ఇంకొక ఆమెను తుమ్మపూడికి చెందిన చిరుమామిళ్ల వారికిచ్చారు. ఈమె కీ.శే. సూర్యదేవర వెంకట పతి గారి అమ్మమ్మ. 3) ఇంకొకరిని కంతేరుకు చెందిన గుంటుపల్లి వారికిచ్చారు. ఈమె చినపాలెం నకు చెందిన కీ.శే. వాసిరెడ్డి సాంబయ్య గారి అమ్మమ్మ 4) మా అమ్మమ్మ తల్లి కోటమ్మ గారు.

అలా వాసిరెడ్డి వారి జ్ఞాపికగా కోటమ్మ గారు 150 ఏళ్ల క్రితం పొందిన ఆ చిరు కానుక ఆమె మనుమరాలు, మా అమ్మ కోటమ్మ (ప్రస్తుత వయస్సు 96 సంవత్సరాలు) వద్ద నేటికీ భద్రంగా వుంది. ఆమె అనంతరం ఆనవాయితీ ప్రకారం మా చిన్న అక్కయ్య విప్పర్ల శోభారాణికీ, ఆమె అనంతరం ఆమె చిన్న కుమార్తె వంకాయలపాటి సౌజన్యకూ అది చెందాల్సి

వుంది. సామాజిక అభివృద్ధి క్రమంలో వారి ప్రత్యేక ఆచారాలు అడుగంటి, వారి ఆర్థిక స్థితిగతులు తారుమారైన నేటి పరిస్థితులలో కమ్మవారిలోని యీ పెద్ద - చిన్న భేదాలు క్రమంగా రూపుమాసి పోతున్నాయి. నేటికైతే పెద్ద కమ్మ అనేది 'యింగువ చుట్టిన గుడ్డ'గా మారినా ఒకప్పటి వారి ఔన్నత్యం వారిలో లేశప్రాయంగానైనా ద్యోతకమవుతూనే వుంటుంది. కలిమితో తులతూగినా, లేమితో కృంగినా పెద్దకమ్మవారి దాతృత్వం, హుందాతనం, నిర్భీకత, సూటితనం ఎదుటివారికి ఆశ్చర్యం కలిగించకపోవని మనం అనుకున్నాం కదా ! ఇందుకో చక్కని ఉదాహరణ మా పెద్దమ్మ కుమార్తె కీ.శే. సూర్యదేవర లక్ష్మీసామ్రాజ్యమ్మ. ఈమె గుంటూరు జిల్లా కంతేరు వాసిరెడ్డి వారి మనుమరాలు. తెనాలి తాలూకా చినపాలెం పెమ్మసాని వారి ఆడపడుచు. తెనాలి చినరావూరుకు చెందిన కీ.శే. సూర్యదేవర రంగనాథ ప్రసాద్ గారి యిల్లాలు. అలా ఒకప్పటి మూడు ప్రసిద్ధ రాజవంశాలకు చెందినప్పటికీ మా సామ్రాజ్యం అక్కయ్య యావజ్జీవితం కటిక దారిద్ర్యాన్ని అనుభవించింది. అయినా ఉన్నదాంతో సంతృప్తితో జీవిస్తూ తనకున్న దానినే యితరులతో పంచుకుని ఎప్పుడూ తనదే పైచేయిగా వుండేది. ఆమె ముఖంలో రాజసం, ఆత్మవిశ్వాసం ఎప్పుడూ కొట్టవచ్చినట్లు కనుపించేవి.

అందరికీ ఆమె 'బాల నాగమ్మ' వగైరా జానపద కథలు, గండికోట యుద్ధపు వీరోచిత ఘట్టాలు వివరిస్తూ వుండేది. అప్పుడప్పుడూ హాస్యంగా, "మా పూర్వులు కట్టిన కోట కడప జిల్లా గండికోటలో వుందిరా. మా ఆయుధాలు కూడా నేటికీ ఆ కోటలోనే వున్నాయటరా !" అంటూండేది. 'నన్ను మా గండికోటకు తీసుకెళ్లరా బాబూ !' అని నన్ను పదే పదే అడిగేది. కాని ఆమె బ్రతికి వుండగా నేనక్కడికి వెళ్లడం పడలేదు. ఆమె చనిపోయిన తరువాత 1996 లో నేను, మరికొందరు మిత్రులు పని మీద కడప వెళ్లినప్పుడు, ప్రత్యేకంగా జమ్ముల మడుగు మీదుగా గండికోట వెళ్లి అక్కడి దర్శనీయ స్థలాలన్నీ చూసి, ఫోటోలు తీసుకు వచ్చాము.

కమ్మ వారి వీరోచిత గాథలు, వారిలోని వివిధ శాఖలకు సంబంధించిన ఎన్నో వివరాలు చిన్ననాటి నుంచి మా సామ్రాజ్యం అక్కయ్యే నాకు నూరిపోసింది. ఆమె నోటి వెంట నేను విన్న కథలలోని పుక్కిటి అంశాలను వేరుచేసి, హేతుబద్ధమైన సమాచారాన్ని మాత్రమే గ్రహించి, ఆ స్ఫూర్తితో కొన్నేళ్ల పాటు ఎంతో పరిశ్రమ చేసి, ఎన్నో విషయాలు అధ్యయనం చేసి, ఎందరినో సంప్రతించి విలువైన సమాచారాన్ని సేకరించాను. 1994లో నా చేతులమీదుగా ఆమె మరణించినప్పుడే ఆమె స్మృతికి నివాళిగా 'కమ్మవారి చరిత్ర'ను ఓ సరికొత్త కోణంలో వ్రాద్దామనే నిర్ణయానికి వచ్చినప్పటికీ, నా ఉద్యోగ విధి నిర్వహణలో అందుకొరకు సమయాన్ని కేటాయించడం సాధ్యపడలేదు. ఇన్నాళ్లకు యిలా 'తెనాలి రామకృష్ణ కవి' గ్రంథానికి ప్రత్యేకానుబంధంగా తెలుగుచోడులు, కాకతీయులు, చాళుక్యాన్వయులు, హైహయాన్వయులు వగైరా వగైరా కమ్మ వారి మూల పురుషుల గురించిన చారిత్రకాంశాలను తయారుచేసి పాఠకులకు అందించగలిగాను.



# అనుబంధము - 10

# తెనాలి - పేరులోనే ప్రాచీనత

తెనాలి రామకృష్ణ కవి కారణంగానే 'తెనాలి'కి యావద్భారతదేశంలో, ప్రత్యేకించి దక్షిణ దేశంలో యింతగా ప్రాచుర్యం వచ్చిందనేది నిర్వివాదాంశం. 'తెనాలి' అనేది ఆయన యింటిపేరు కాకున్నా, ఆయన స్వస్థలం 'తెనాలి' అయిన కారణంగా రామకృష్ణ కవిని 'తెనాలి రామ' అనీ, 'తెనాలి' అనీ సంబోధించేవారు. ఇలా తమ వూరి పేరుతో ప్రసిద్ధులై అదే పేరుతో సంబోధించ బడినవారు చాల అరుదు. కన్నడ సాహిత్యంలో తెనాలి రామకృష్ణుడిని 'తెన్నాలి రామ' అని పేర్కొన్నారు. కృష్ణరాయలు ఆయన్ని చనువుగా 'ఏమోయ్, తెన్నాలీ!' అని సంబోధించేవాడట. అలాగని రామకృష్ణ కవి కారణంగా యింతటి గుర్తింపు పొందిన తెనాలి పట్టణం తాను తక్కువ తిన్నదేం కాదు. అది ఎంతో ప్రాచీనమైన నాగరకతా కేంద్రం. తెనాలి కైఫీయ్యత్‌లోనూ, రామేశ్వర స్వామి ఆలయ ఉత్సవ విగ్రహ పాదపీఠం పైనగల శ్లోకంలోనూ తెనాలి నగరంగా పేర్కొనబడడం విశేషం ! అప్పటికే ప్రసిద్ధ జైన, బౌద్ధ, శైవ క్షేత్రంగా అది పేరుగాంచింది. అందుకే రామకృష్ణ కవి తన యింటి పేరైన 'గార్లపాటి'ని ప్రక్కన బెట్టి లోకానికి తెనాలి రామకృష్ణునిగానే తనను తాను పరిచయం చేసుకుని వుంటాడు. 'తెనాలి' అనే పేరులోనే దాని ప్రాచీనతకు సంబంధించిన 'క్లూ'లున్నాయి. వాటి ఆధారంతోనే తెనాలి పట్టణ ప్రాచీనతను నిర్ధారించదానికి నేను పూనుకున్నాను.

'తెనాలి' పేరులోనే ఏదో ప్రత్యేకత ధ్వనిస్తుంది. కళలకు కాణాచిగా, తెలుగు సంస్కృతికి పట్టుగొమ్మగా విలసిల్లే ప్రాచీనమైన తెనాలి పట్టణం యొక్క ముచ్చటైన మూడక్షరాల పేరు తెలుగు పేరు కాదనేది నమ్మశక్యంగాకున్నా నిజం. తెనాలి ఒక జనావాసంగా ఆవిర్భవించే నాటికి అసలింకా తెలుగు భాషే

రూపుదిద్దుకొన లేదనేది చారిత్రక సత్యం. తెనాలి నా జన్మభూమి కనుక దాని ప్రాచీనత పట్ల నాకూ గర్వంగా వుంది. అయితే యీ ప్రాచీనత శాస్త్రీయంగానూ, హేతుబద్ధంగానూ ఋజువు పరచబడాలి. ఇక అందుకు ఉపక్రమిద్దాం.

## శోధనలో భౌతిక, స్వీయాత్మక పద్ధతులు

ఒక ప్రాంతపు ప్రాచీనతను నిర్ధారణ చేయడానికి శోధకులు అనుసరించే శాస్త్రీయ పద్ధతులు రెండు. మొదటిది ఆ ప్రాంతంలో లభించిన శిలాశాసనములు, నాణెములు, ఆ ప్రాంతపు నిర్మాణములు లేక త్రవ్వకాలలో బయల్పడిన యితర పురావస్తు విశేషముల (*Archaeological finds*) ను పరిశీలించి, ముందుగా వాటి ప్రాచీనతను నిర్ధారించి, అవి లభించిన ప్రాంతం అప్పటికే జనావాసంగా వుండి వుంటుంది కనుక, ఆ ప్రాంతాన్ని ఆ కాలానికి అనుసంధానం చేసి దాని ప్రాచీనతను నిర్ధారిస్తారు. గ్రంథాలలో లభించే ఆధారాలు, శిలాశాసనాలు, తామ్రపత్రాలు వగైరాలపై లిఖించబడిన దాన శాసనములు, కైఫీయ్యతులు, గ్రామ శాసనములు వగైరా భౌతిక ఆధారాలన్నీ యీ పద్ధతిలో వినియోగింపబడతాయి కనుక యిది భౌతిక పద్ధతి (*Objective Method*).

ఇక రెండవ పద్ధతి స్వీయాత్మకమైనది (*Subjective Method*). దీనిలో పరిశీలనాంశం ఆ జనావాసం యొక్క పేరు మాత్రమే. ఒక గ్రామం యొక్క పేరును విశ్లేషించి, దాని శబ్దం, భాష, భావం ఆధారంగా దాని ప్రాచీనతను నిర్ధారించడం జరుగుతుంది కనుక యిది ఓ రకంగా శబ్దాధార పద్ధతి (*Verbal Method*).

ఒక్కోసారి యీ శబ్దాధార పద్ధతిలో కూడా అవసరాన్నిబట్టి వివిధ గ్రంథాలు, శాసనాలు వగైరా ఆధారాలను కాలక్రమం (*Chronological order*) లో అమర్చి, ఆయా కాలాల్లో ఆ గ్రామనామం ఎలా వ్రాయబడిందో పరిశీలించి, కాలానుగుణంగా ఆ భాషలోనూ, ఆ గ్రామనామంలోనూ వచ్చిన మార్పులను గమనించడం ద్వారా దాని ప్రాచీనతను నిర్ధారించడం జరుగుతుంది. కనుక, యీ రెండవ పద్ధతి పూర్తిగా స్వీయాత్మకమైనదనడానికి వీలు లేదు. భౌతిక, స్వీయాత్మక పద్ధతుల మేలుకలయికగా మనం దీనిని భావించవచ్చు. తెనాలి ప్రాచీనత నిర్ధారణకు నేను యీ పద్ధతినే ఎంచుకున్నాను. ఈ తరహా పరిశీలనలో భాషాశాస్త్ర (*Linguistics*) పరిజ్ఞానంతో బాటు, వివిధ భాషలతో పరిచయం మనకు తోడ్పడుతుంది.

## విశ్లేషణలో తార్కిక పద్ధతులు

ఇక యీ నిర్ధారణా క్రమంలో మనం ఉపయోగించే తార్కిక పద్ధతులు (*Logical Methods*) రెండు. మొదటిది నిగమన తర్కపద్ధతి (*Deductive Method*). దీనిలో అనంతమైన గ్రామనామ సంచయంలో 'తెనాలి' వంటి ఏ అర్థమూ యివ్వని, ఏ ప్రస్తుత భాషకూ చెందని గ్రామనామాల్ని యితర గ్రామ నామాల్నుండి వేరు చేస్తాం. ఇక రెండవది వ్యాప్తిగ్రాహక పద్ధతి (*Inductive Method*). ఈ పద్ధతిలో 'తెనాలి' వంటి ఏ అర్థమూ యివ్వని, ఏ ప్రస్తుత భాషలకూ చెందని ప్రాచీన గ్రామనామాల సారూప్య లక్షణాల్ని పరిశీలించి, భారతదేశంలోనూ, యితర దేశాలలోనూ వున్న యిలాంటి ప్రాచీన గ్రామ నామాలతో 'తెనాలి'ని సరిపోల్చడం ద్వారా, భాషాపరంగానూ, చారిత్రకంగానూ తెనాలి యొక్క ప్రాచీనతను నిర్ధారించడానికి ప్రయత్నిస్తాం.

ఈ క్రమంలో ముందుగా 'తెనాలి' శబ్దావిర్భావంపై జన బాహుళ్యంలో ప్రాచుర్యంలో వున్న కొన్ని వాదనలను పూర్వపక్షం చేయదలచాను.

## 'తే-నా-ఆలి'

తెనాలిని గురించి సామాన్య జనం చెప్పుకొనే కథ ప్రకారం - ఎవరో ప్రబుద్ధుడు, 'తే-నా-ఆలి(ని)' అని, అలిగి పుట్టింటికి వెళ్లిన తన భార్యను తీసుకొని రమ్మని తన మామగారికో, బావమరిదికో కబురుపెట్టి యిక్కడే వేచి చూశాడట. అప్పటి నుండీ యీ ప్రదేశం తే నా ఆలి → తేనాలి → తెనాలిగా వ్యవహరించబడుతూ వచ్చిందట. ఇది అర్థరహితమని వేరుగా చెప్పాల్సిన పని లేదనుకుంటాను.

## 'తె-నాలి'

అయితే, అర్థవంతమైన ఆలోచన చేసి 'తే-నా-ఆలి'కి బదులుగా 'తెనాలి'ని 'తె-నాలి'గా విడగొట్టి విశ్లేషణ చేసి చూద్దాం. 'ఇలా ఎందుకు కాకూడదు?' అనే ఊహతోనే నేనీ విశ్లేషణ చేస్తున్నాను. ఇంగ్లీష్‌లో 'త్రీ' అంటే 'మూడు'. సంఖ్యా విశేషణంగా వాడేటప్పుడు *'Tri'* అని వాడతారు. ఉదా : *Triangle, Tricolour* మొ. సంస్కృతంలోనూ, తెలుగులోనూ కూడా 'త్రి'ని మూడు అంకెను సూచించడానికే వాడతారు. ఉదా : త్రికోణము, త్రినేత్రుడు మొ. హిందీలో తీన్ అంటే మూడు. సంఖ్యావిశేషణంగా ఏదైనా మాటముందు దీనిని వాడాలంటే 'తి'గా వాడతారు. ఉ: తిరంగా, తిగున్ మొ. ఇందుకే బెంగాలీ భాషలో 'తె' వాడతారు. ఉదా : తె-భాగా పోరాటం (బెంగాలీ సాయుధ రైతాంగ పోరాటం).

ఈ విశ్లేషణ ప్రకారం 'నాలా' అంటే హిందీలో 'కాలువ'; 'నాలి' అంటే కాలువ కలిగినది. మూడు అంకెకు సూచకంగా యీ శబ్దంలో బెంగాలీలో వలె 'తె' వాడబడింది. ఇలా 'తెనాలి' అటే మూడు కాలువలు కలిగివున్న గ్రామము. (నేటికీ తెనాలి పట్టణ నడి బొడ్డు నుండి మూడు కాలువలు ప్రవహిస్తూ వుంటాయి.)

ముందుగా నిజమేనేమో అనిపించినా, కొంచెం తెలివిగా ఆలోచిస్తే మనకీ వాదన కూడా అసహజంగానూ, అసమంజసంగానూ అనిపిస్తుంది. కారణమేమంటే, చారిత్రక ఆధారాల ప్రకారం క్రీ.శ. 1510-20 ప్రాంతాలలో తెనాలికి చెందిన గార్లపాటి రామన్న మంత్రి కుమారుడైన రామలింగ కవి రామకృష్ణుడని పేరు మార్చుకుని కర్ణాటకలోని హంపిని పరిపాలిస్తున్న వీరవైష్ణవుడైన విజయనగర సమ్రాట్టు శ్రీకృష్ణ దేవరాయలను ఆశ్రయించి, ఆయన ఆస్థానంలో కవిగా ఆదరణ పొందాడు. అప్పటికే యీ పేరుతో తెనాలి గ్రామముండగా, 1850 దశకంలో కృష్ణ ఆనకట్ట నిర్మించిన అనంతరం డెల్టా వ్యవస్థలో భాగంగా త్రవ్వబడిన మూడు కాలువల కారణంగా 'తెనాలి'కీ పేరు రావడమనేది అసమంజసం కాక మరేమిటి? ఇంకా చెప్పాలంటే తెనాలి గంగానమ్మపేట లోని రామలింగేశ్వరస్వామి దేవాలయం (పాత శివాలయం) లోని శాసనాల ఆధారంగా తెనాలి మరింత ప్రాచీనమైనదని ఋజువవుతున్నది. ఈ రామలింగేశ్వరుని పేరే మన తెనాలి రామలింగ కవికి పెట్టబడింది.

## 'జినాలి' - 'తెనాలి'

తెనాలిలో ఒకప్పుడొక ప్రాచీన జిన (జైన) ఆలయముండేదనీ, అదే తరువాత కాలంలో శివాలయంగా మార్చబడిందనీ, ఆ జైన ఆలయం పేరిట యీ ఊరికి 'జినాలయం' అనే పేరువచ్చి, కాలక్రమేణా అదే 'జినాలి' గానూ, ఆ తరువాత 'తెనాలి' గానూ మారిందనే వాదనొకటి కూడా వుంది. ఇది కూడా నాకంత సమంజసంగా అనిపించడంలేదు. భాషాపరంగా ఆలోచిస్తే 'జినాలయం' 'జినాలి'గానూ, అదే తరువాత 'తెనాలి' గానూ మారడానికి ఎట్టి అవకాశమూ కనుపించడం లేదు. ఇక చారిత్రకంగా ఆలోచించినా జైనమతం ప్రాథమికంగా దైవం ప్రస్తావనలేని మతం. జైన అనుశ్రుతి 24 మంది తీర్థంకరులను పేర్కొంటుంది. తీర్థంకరుడు అంటే 'జీవన స్రవంతిని దాటించేవాడు' అని అర్థం. వారి

జీవితము, కృషినే జైనులందరూ తమ జీవితాదర్శంగా తీసుకుంటారు. రిషభదేవుడు (ఆదినాథుడు), బాహుబలి మొదలుగాగల 22 మంది తీర్థంకరులు కేవలం ఐతిహాసిక వ్యక్తులనీ, చారిత్రక పురుషులు కారనీ చరిత్ర పరిశోధకులు నిర్ధారించారు. 23వ తీర్థంకరుడైన పార్శ్వనాథుడి బోధనలను 24వ తీర్థంకరుడైన మహావీరుడు క్రోడీకరించి జైనమతాన్ని స్థాపించాడు. ఇంద్రియాల్ని జయించడం ద్వారా మహావీరుడు పొందిన 'జిన' అనే బిరుదునుండి జైన శబ్దం ఉత్పన్నమయింది. జైనులకు నిగ్రంథులని మరో పేరు. ప్రారంభదశలో జైనమతం 'నిగ్రంథ పథ'మని పిలువబడేది. 'తీర్థంకరులు' లేక 'కేవలి'ల జీవితాల్ని ఆదర్శంగా స్వీకరించే మతం గనుక దీనినే 'కేవలి పథం' అని కూడా పిలిచేవారు. 'జైన' శబ్దం చాల తర్వాతి కాలంనాటిది. అత్యంత ప్రాచీనమైన దిగంబర జైనంలో దైవ ప్రస్తావనకుగానీ, విగ్రహారాధనకుగానీ, ఆలయ నిర్మాణానికి గానీ స్థానం లేదు. క్రీ.పూ. 1వ శతాబ్ది నాటికి జైనులలో శ్వేతాంబరులనే శాఖవారు బయలుదేరి తీర్థంకరులనే దైవాలుగా భావిస్తూ, వారిని విగ్రహ రూపేణా పూజిస్తూ, ఆ తరువాతి కాలంలో ఆలయాలు నిర్మించడం ప్రారంభించారు. క్రీ.పూ. 4వ శతాబ్దికి చెందిన మహాపద్మనందుడు కళింగనుంచి జైన విగ్రహాలను తరలించుకు వెళ్లినట్లు ఖారవేలుడి 'హాతీగుంఫా శాసనం' పేర్కొంటున్నప్పటికీ, జైనులలో విగ్రహారాధన స్పష్టరూపంలో క్రీ.శ. 1వ శతాబ్ది తరువాతనే ప్రారంభమైందని చరిత్రకారుల అంచనా. ఆలయ నిర్మాణం యింకా ఆ తర్వాత చాల కాలానికి ప్రారంభమైంది. ఇక దక్షిణాదిలో, మన ఆంధ్రప్రాంతంలో జైన ఆలయాల నిర్మాణం ఆ తరువాత ఎంతో కాలానికి ప్రారంభమై వుంటుంది. జైన ఐతిహ్యాలు క్రీ.పూ. 322-298ల మధ్య మగధను పాలించిన చంద్రగుప్త మౌర్యుడు తన జీవిత చరమాంకంలో తన రాజధాని పాటలీపుత్రం (నేటి పాట్నా) ప్రాంతంలో ఒకప్పుడు తీవ్రమైన కరవు సంభవించగా, వైరాగ్యం చెంది, జైనమత దీక్ష స్వీకరించి, తన గురువైన భద్రబాహుతో కలసి ప్రస్తుత కర్ణాటక రాష్ట్రంలోని శ్రావణ బెళగొళకు వలస వచ్చినట్లు పేర్కొంటున్నాయి. ఇప్పటికీ అక్కడి రెండు పర్వతాలలో ఒకదానిని ఆయన పేరుతో చంద్రగిరి అనీ, అక్కడి సత్రాలలో ఒక దానిని చంద్రగుప్త బసది (వసతి) అనీ పిలుస్తున్నారు. అదే చంద్రగుప్త మౌర్యుడు మన కర్నూలు జిల్లా శ్రీశైలం వచ్చినట్లు కూడా ఐతిహ్యముంది. అయితే అంతప్రాచీన కాలంలో దక్షిణాపథంలో జైనులు ఆలయా లేవీ నిర్మించినట్లు నిర్ధారణ కాలేదు. శ్రావణ బెళగొళలోని భగవాన్ బాహుబలి ఏకశిలా విగ్రహం, అక్కడి ఆలయాలు, క్రీ.శ. 981లో చాముండ రాయడనే మంత్రి చేత నిర్మించబడినవి. తూర్పు గోదావరి జిల్లాలోని నేదునూరు, పందలపాక, తాటిపాక, నల్గొండ జిల్లాలోని కొలనుపాక, వరంగల్ జిల్లాలోని హనుమకొండ వగైరా ఆంధ్ర ప్రాంతంలోని జైన ఆలయాలు ఏ రకంగా అంచనా కట్టినా క్రీ.శ. 500-600 ప్రాంతం కంటే ప్రాచీనమైనవి కావు. తెనాలిలోనిదని చెప్పబడుతున్న ప్రాచీన జైనాలయం కనీసం ఆ కాలపుదనడానికైనా ఆధారాలేం లేవు. 'జైన' అనే శబ్దమూ, జైనులు ఆలయాలు నిర్మించడమూ, ఒక జనావాసంగా తెనాలి ఏర్పడడానికి ఎంతో తర్వాత కాలానివని నా విశ్వాసం. కొందరు 'తెనాలి' శబ్ద పూర్వ రూపం 'తెరవలి' అని అభిప్రాయపడుతున్నారు. భాషాపరంగా చూస్తే 'తెరవలి' శబ్దం 'తెనాలి' శబ్దంగా రూపాంతరం చెందే అవకాశం లేదు. 'తెనాలి' శబ్ద వ్యుత్పత్తిని గురించి విచారించబోయే ముందు కొన్ని గ్రామ నామాలను విశ్లేషించి చూద్దాం.

## గ్రామ నామాల విశ్లేషణ

ముందుగా ఓ అనంతసాగరం వంటి గ్రామనామ సంచయంలో తెలుగులోనో లేక ఏ యితర వర్తమాన భాషలోనో ఏదో ఒక అర్థాన్నివ్వగల గ్రామనామాలను వేరుచేద్దాం. అప్పుడు మనవద్ద ఏ అర్థమూ యివ్వని తెనాలి వంటి గ్రామానామాలు మాత్రమే మిగులుతాయి. ఇది ఒక బృహత్ప్రయత్నమే. ఎందుకంటే మిగిలిన దేశం మాట అటుంచి ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే

సుమారు 25,000 గ్రామాలున్నాయి. ఒక్క మన రాష్ట్రానికి చెందిన గ్రామనామాల్ని పూర్తిగా విశ్లేషించడానికి పూనుకొన్నా అది అలవిమీరిన పనే అవుతుంది. ఈ వ్యాసం యొక్క పరిధి కూడా విశ్లేషణలో అటువంటి విస్తృతికి అవకాశమీయదు.

అందుకే యీ విశ్లేషణను కొంత సులభతరం చేయడానికి ఏ భాషలోనైనా మనకు అస్సలు అర్థంకాని, పాక్షికంగా అర్థంకాని గ్రామనామాల్ని వేరుగా వ్రాసుకుంటూ పోవాలి. తెలుగులో కానీ, ఆధునిక భారతీయ భాషలలో కానీ అర్థం తీయగల గ్రామనామాల్ని ఉద్వాసన (*eliminate*) చేసుకుంటూ ముందుకు సాగాలి. అప్పుడే మనం యీ భాషలేవీ పుట్టక ముందర ఏర్పడిన గ్రామనామాల్ని కనుగొనగలం. కొన్ని జటిలమైనవనిపించే గ్రామానామాల విషయంలో కూడా ఓపిగ్గా ఆలోచన చేస్తే వాటి నిగూఢార్థాన్ని గ్రహించవచ్చు. అలాంటి కొన్ని జటిలమైన గ్రామానామాల్ని విశ్లేషించి చూద్దాం.

నా మట్టుకు నాకు నా జన్మస్థలమైన తెనాలి గ్రామనామాన్ని విశ్లేషించడమే కాదు ; మా యింటి పేరుకు మూలమైన గ్రామనామాన్ని విశ్లేషించడం కూడా కొంతమేరకు జటిలమనిపించింది. మా యింటి పేరు ముత్తేవి. కృష్ణాజిల్లా దివి తాలూకాలో పెద ముత్తేవి, చిన ముత్తేవి అనే గ్రామాలున్నాయి. బహుశా మా పూర్వీకులు అక్కడివారై వుంటారు. కొందరు 'ముత్తేవి'నే 'ముక్తేవి' అని వ్రాస్తున్నారు. ముక్తి + ఈవి : ముక్తేవి అని విశ్లేషిస్తున్నారు. 'ఈవి' అంటే దానము అని అర్థం కనుక 'ముక్తేవి' అంటే 'ముక్తి ప్రదాత' అని వారి భావం. కాని యిది తప్పు. వ్యాకరణ సూత్రాలననుసరించి రవి + ఇంద్ర – రవీంద్ర; హరి + ఈశ్ – హరీశ్; రజని + ఈశ్ – రజనీశ్ అయినట్లు ముక్తి + ఈవి అంటే 'ముక్తీవి' అవుతుందే కానీ, 'ముక్తేవి' కాదు. అయితే 'ముక్త + ఈవి' ముక్తేవి అవుతుంది. ముక్త ఈవి అంటే 'యివ్వబడ్డ దానం'. ఇవ్వబడితేనే గదా దానమయ్యేది? ఎవరి దానమో తెలుపకుండా 'యివ్వబడ్డ దానము' అని ఓ గ్రామానికి పేరుండడం అసహజమనిపిస్తున్నది. అందుకే వృద్ధుడు దానంగా యిచ్చిన గ్రామమనే అర్థాన్ని ('ముత్త + ఈవి') సూచించే 'ముత్తేవి' అని వ్రాయడమే సబబనే నిర్ధారణకు వచ్చాను. (ఒక వేళ ఆ గ్రామం ఓ వృద్ధురాలిచ్చిన దానం అనుకుంటే ముత్తి + ఈవి ——> ముత్తీవి అవుతుంది కాని ముక్తేవి అయ్యే అవకాశమే లేదు. ముత్తి అంటే ముదుసలి స్త్రీ). ముత్తేవికి సమానార్థకమైన, సారూప్యమైన మరికొన్ని గ్రామనామాల్ని విశ్లేషించి చూశాను. ముత్తవరం, ముత్తారం, మహా ముత్తారం (కరీంనగర్ జిల్లా), ముత్తన్నపల్లి – ముత్తనపల్లి వగైరాలు అలాంటివి. ముత్త అంటే వయోవృద్ధుడు. ముత్తవరం లేక ముత్తారం అంటే వృద్ధుడిచ్చిన దానం. ముత్తవరపు, ముత్తారపు అనే ఇండ్ల పేర్లు ఆ గ్రామనామాల్నుంచే ఏర్పడ్డాయి. అలాగే 'ముత్తేవి'కి కూడా ముత్త + ఈవి : వృద్ధుడిచ్చిన దానం అని అర్థం. ముత్తంగి (మెదక్ జిల్లా), ముసలి పాడు, ముసలి పేడు గ్రామాలు కూడా యిలా వృద్ధులు దానమిచ్చిన గ్రామాలే అయి వుంటాయి.

ఇకపోతే, కృష్ణా జిల్లా పామఱ్ఱు మండలం కురుమద్దాలి గ్రామనామం విషయానికొద్దాం. 'మద్దాలి' అనే పదానికి 'మద్దిలి' అనే పదం పూర్వ రూపం అయివుండవచ్చు. మద్ది *(Terminalia arjuna)* ఓ వృక్షం పేరు. 'లి' అనేది నీటి వనరుకు సంకేత పదం. ఈ చెట్టు పేరు మీదుగా మద్దిపాడు, మద్దిమడుగు, మద్దుల చెరువు, మద్దికుంట, మద్దిరాల (మద్దిర్యాలి → మద్దిరాల) వగైరా గ్రామ నామాలేర్పడినట్లే మద్దాలి కూడా ఏర్పడింది. ఈ గ్రామాన్ని స్థానికులంతా 'కుర మద్దాలి' అంటారు. కొందరు దీన్ని 'కుర్ర మద్దాలి' అనడం కూడా వుంది. సమీపంలో పెద మద్దాలి గ్రామముంది. అంటే దీని భావం ఓ మద్దాలి వయస్సులో పెద్దదీ, మరొకటి చిన్నదీననా? 'మునుగోడు, ముదిగొండ, ముదిగల్లు (ముద్గల్లు), ముదునూరు, ముదినేపల్లి, ముసలిపాడు, ముసలిపేడు, మునుకుదురు, వృద్ధాచలం (ముసలి కొండ) అనే ఊళ్ల పేర్లున్నప్పుడు కుర్ర మద్దాలి ఎందుకుండకూడదు ?' అనిపించవచ్చు. కాని అది సరికాదు. గృహ నామాలలో 'కురు మద్దాలి' అనే యింటి పేరుండడాన్ని బట్టి ఆ వూరి పేరు కుర మద్దాలి కాదు ; కురు మద్దాలి అనీ, కురు మద్దాలికి పూర్వ రూపం 'కురుచే మద్దాలి'

అయి వుంటుందనే నిర్ధారణకు వచ్చాను. పెద్దదైన 'పెద మద్దాలి' నుంచి చిన్న మద్దాలిని పృథక్కరణ చేయడం కోసం చిన్న మద్దాలిని 'కురుచే మద్దాలి' అని వుంటారు. కురుచే మద్దాలే క్రమంగా కురు మద్దాలి అయివుంటుంది. అలాగే కురుగంటి అనే యింటి పేరును బట్టి మంగళ గిరి సమీపంలో నేదు 'కురగల్లు' అని పిలువబడుతూన్న గ్రామం వాస్తవానికి 'కురుగల్లు' అనీ, ఒకప్పటి 'కురుచే గల్లు' గ్రామమే కురుగల్లుగా మారి, ప్రస్తుతం 'కుర గల్లు' గా పిలువబడుతూ వుందని అర్థం చేసుకోవచ్చు. కుఱుగద్దియ, కుఱుగనుపు, కుఱుగేలు మొదలగు పదాలలో కూడా యిలాగే 'చ' లుప్తమైంది. వ్యాకరణ నియమాల ప్రకారం అచ్చు పరమైతే 'ఱ' కారానికి 'ట'కార ద్వయం ఆదేశమౌతుంది.

కుఱు + ఊపిరి → కుట్టూపిరి

కుఱు + ఉసురు → కుట్టుసురు

కుఱు + ఊరుపు → కుట్టూరుపు

అలాగే – నిడు + ఊరుపు → నిట్టూరుపు (మలయాళ భాషలో 'చిన్న' అనే అర్థాన్నిచ్చే కుట్ట, కుట్టి, కుట్టు శబ్దాలు కూడా యిలాగే ఏర్పడి వుంటాయి.) పొట్టి పాడు, పొట్టివలస, పొట్టిలంక, చిట్టూరు, కురుగుంట, బుదంపాడు (బుదమ అన్నా పొట్టి అనే అర్థం), నిడుదవోలు, నిడు(ద)ప్రోలు, పెంట ఖుర్దు, పెంట కలాన్ (నిజామాబాద్ జిల్లా), ఖుర్దువాడి (ఖురుద్వాడి–మహారాష్ట్ర) ( ఖుర్దు అంటే కురుచ, చిన్న ; కలాన్ అంటే పెద్ద) వగైరా గ్రామ నామాలు యిలాగే పొట్టి – పొడుగు తేదాలను బట్టే ఏర్పడ్డాయి.

జనం కుదురుగా (నిలకడగా) ఒక చోట స్థిరనివాసమేర్పరచుకుంటే అక్కడో గ్రామమేర్పడి దానికి 'కుదురు' అనే వ్యవహారం స్థిరపడి, అలా అంగల కుదురు, పెను కుదురుపాడు (పెను గుదురుపాడు), ముసు కుదురు (పురాతన గ్రామం), కదవ కుదురు వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. అయితే నిజామాబాద్ జిల్లా బోధన్ తాలూకాలోని పంట కుదురు అలా కాదు. దీని అసలు పేరు పెంట ఖుర్దు. ఆంధ్ర ప్రాంతం నుంచి కొందరు వ్యవసాయం నిమిత్తం అక్కడకు వెళ్లి స్థిరపడిన అనంతరం ఆ గ్రామ నామాన్ని 'పంట కుదురు'గా మార్చారు.

కొన్ని గ్రామనామాలలో అకారాంత శబ్దాలు ఏకారాంతాలుగా రూపాంతరం చెందాయి. ఉదా :- తుమ్మపల్లి → తుమ్మేపల్లి ; జన్నపల్లి → జన్నేపల్లి ; పారపల్లి → పారేపల్లి ; సోమపల్లి → సోమేపల్లి ; కళ్లపల్లి → కళ్లేపల్లి ; కేతపల్లి → కేతేపల్లి వగైరా వగైరా.

ఇక యీ విశ్లేషణలో మరికొన్ని ఆసక్తికరమైన గ్రామనామాల్ని చూద్దాం. గుంటూరు జిల్లాలో 'యాతవాకిళ్ల' అనే ఊరుంది. అనాదిగా కల్లుగీత కులవృత్తిగా కల గౌడ కులానికి యాత, శ్రీశయన, ఈడిగ, ఈంద్ర, కలాలీ, శెట్టిబలిజ అనే యితర పేర్లు కూడా వున్నాయి. గౌడకులస్థులు ఎక్కువగా వుండడాన్ని బట్టి అలాంటి ఓ గ్రామానికి 'యాతవాకిళ్ల' అనీ, మరో గ్రామానికి 'ఈంద్రపల్లె' అనీ, అలాగే ఈడిగవారి పల్లె, గౌడగల్లు వగైరా పేర్లేర్పడ్డాయి. (కాకినాడ దగ్గర నేదు 'ఇంద్ర పాలెం' అని పిలువబడుతూన్న గ్రామం కూడా ఒకప్పటి ఈంద్రపాలెమే.) 'ఆబాదీ' అంటే స్మృత్యర్థం పెట్టబడ్డ పేర్లు గల గ్రామాలు, ఆయా వ్యక్తుల పేరిట 'ఆబాద్'లుగా పిలువబడుతున్నాయి. హైదరాబాద్, సికిందరాబాద్, మునీరాబాద్ (కర్నాటకలోని హొస్పేట వద్ద)ల వలెనే ముస్తాక్ + ఆబాద్ → ముస్తాకాబాద్ → ముస్తాబాద (కృష్ణాజిల్లా), ఖాదరాబాద్ (కడప జిల్లా, జమ్మల మడుగు తాలూకా), కాసిర్ (అసమర్థుడు) + ఆబాద్ → కాసిరాబాద్ → కాసరబాద (కృష్ణాజిల్లా) గ్రామనామాలేర్పడ్డాయి.

ఈ క్రింది ఊళ్ల పేర్లలోని గ్రామ నామాంతాలను బట్టి నీటి ప్రవాహాలకు ప్రక్కగా ఆ యా గ్రామాలు ఏర్పడి

వుంటాయని ఊహించవచ్చు.

| తుళ్ళు | పళ్ళు | మళ్ళు | వళ్ళు | కుళ్ళు | దుళ్ళు |
|---|---|---|---|---|---|
| మొగలి తుళ్ళు | దాలి పళ్ళు | పమిడి మళ్ళు | గొడవళ్ళు | పుల్లేటి కుళ్ళు | ఎనమదుళ్ళు |
| (మొగల్తూరు) | పిడ పళ్ళు | బాలేమళ్ళు | పెదపులివళ్ళు | కసుకుళ్ళు | పెనుదుళ్ళు |
| | పాల పళ్ళు | పామళ్ళు | చినపులివళ్ళు | పొదలకుళ్ళు | (పెందుర్రు-పెందుర్తి) |
| | ప్యాపళ్ళు | పెనుమళ్ళు | యలవళ్ళు | (పొదలకూరు) | గుమ్మడిదుళ్ళు |
| | మోపళ్ళు | పోతుమళ్ళు | | నిమ్మకుళ్ళు | ఆదుళ్ళు |
| | కొప్పళ్ళు | పసుమళ్ళు | (నిమ్మకూరు) | కుందుళ్ళు | |
| | గొరిపళ్ళు | నిడమళ్ళు | | బీరకుళ్ళు | చందుళ్ళు |
| | బల్లిపళ్ళు | | | (బీర్‌కూర్) | (చందుర్తి) |
| | డోకిపళ్ళు | | | చీమకుళ్ళు | |
| | గరికపళ్ళు | | | (చీమకుర్తి) | |
| | పెనుపళ్ళు | | | ఇక్కుళ్ళు | |
| | (పెంబర్రు-పెంబర్తి) | | | (ఈ+కుళ్ళు) | |
| | పాముపళ్ళు | | | | |
| | (పాంబర్రు-పాంబర్తి) | | | | |

### తుళ్ళు :-

'తుఱుతు' అంటే 'వేగిరపాటు'. తెలుగులో 'తఱుతుగా వచ్చెయ్యి' అనే వాడుక వుంది. దీనినే హిందీలో 'తురంత్' అంటాము. 'తురితము' అన్నా 'త్వరితము', 'శీఘ్రము' అన్న అర్థాలే. 'తురగము', 'తురంగము' అనే పదాలు గుర్రానికి అలా వచ్చినవే. 'తురేణ గచ్ఛతీతి తురంగః' – 'తురమ్ త్వరితమ్ గచ్ఛతీతి తురగః' – అమరకోశం. వేగముగా వెళ్లేది తురంగము. 'తుళ్ళు' అనే పదం తురుతు యొక్క రూపాంతరమే. 'బుళ్ళు పిట్ట బుళ్ళు పిట్ట తుళ్ళు మన్నది' అనే ప్రయోగం వుంది. అలా తుళ్ళు అంటే వేగంగా ప్రవహించే నీటి వనరు. అని మనం అర్థం చేసుకోవచ్చు.

### దుళ్ళు :-

'దుఱము' అంటే వేగము. దురుసు అన్నా శీఘ్రము అనే అర్థమున్నది. 'దురదుర' అన్నా 'అతి శీఘ్రముగా', 'దూకుడుగా' *(Swiftly, Hastily, Quickly)* అనే అర్థం. దుళ్ళు శబ్దం 'దురదుర', 'దురము', 'దురుసు' ల రూపాంతరమే. అలా దుళ్ళు అంటే కూడా వేగంగా ప్రవహించే నీటి వనరు అని మనం అర్థం చేసుకోవచ్చు.

### వళ్ళు :-

'వరవ' అంటే 'చెరువుకు నీళ్లు రావడానికి ఏర్పరచబడిన కాలువ' అని అర్థం. దీనినే 'దోని', 'దోనె', 'దొన', 'ద్రోణము' అని కూడా అంటారు. ఆదోని, దొనకొండ, దోనెపూడి, ద్రోణాచలం, ద్రోణవల్లి, దొనబండ వగైరా గ్రామ నామాలు యిలా నీటి తూము (లేక కాలువ) మీదుగా ఏర్పడినవే. (ద్రోణము అంటే నాలుగు తూములు పట్టే కొయ్య లేక రేకు బాన. తూము అంటే నాలుగు కుంచాలు. కుంచెము అంటే నాలుగు ముంతలు. ముంత అంటే ఒక మానిక. మానిక

అంటే నాలుగు సోలలు. సోల అంటే నాలుగు గిద్దలు. అంటే 64 మానికలు లేక 256 సోలలు అంటే 256 X 4 = 1024 గిద్దలు. అంటే సుమారు 146 లీటర్లు.) నీళ్ల 'వరవర' ఉరవడిగా (అతి వేగంగా) ఒరుసుకుంటూ ప్రవహించే 'వరవ' ను 'వఱ్ఱు' అనడం వాడుకలోకి వచ్చి వుంటుంది. 'వఱ్ఱు' అంటే ప్రవాహము. దీనికి మూల పదం వఱద. 'నెత్తురు వఱ్ఱులు వాఱఁ జంపుదురు' అనే ప్రయోగం వుంది. 'వఱ్ఱొద్దు' అన్నా 'ప్రవహించు' అనే అర్థమే.

### పఱ్ఱు :-

'పరగు' అంటే 'ప్రవహించు' అని అర్థం. 'పరపు' అంటే 'ప్రవహింపజేయు' అని అర్థం. 'పరవు' అంటే 'వ్యాపించు' అని అర్థం. 'పర్వ' అనే గ్రామనామాంతం కూడా దీన్నుంచే ఏర్పడింది. పఱవ అన్నా పఱత అన్నా ప్రవాహము వఱద అని అర్థాలు. అతను కాగితాల్ని పఱపఱ చించేశాడు అనే ప్రయోగంలో వేగం ధ్వనిస్తున్నది. 'జఱ జఱ' దొర్లాడు, 'జఱ్ఱున జారి పడ్డాడు', 'కాగితంపై బఱ బఱ ఏదో గీకాడు', 'నేను వచ్చేసరికి జఱ్ఱున జారుకున్నాడు' 'జిఱ్ఱున చీదడం' వగైరా ప్రయోగాలన్నీ వేగాన్ని సూచించేవే. అలా ప్రవాహంలో వేగాన్ని సూచిస్తూ ఏర్పడిన పదమే 'పఱ్ఱు'. దీని రూపాంతరాలే 'పర్వ', 'పర్తి', 'పరిమి', 'పరివి'.

### కుఱ్ఱు :-

'కుఱ కుఱ' అంటే అల్పము అని అర్థం. 'కుఱ్ఱ', 'కుఱ్ఱడు', 'కుఱుచ', 'కుఱు' వగైరా శబ్దాలన్నీ చిన్న, పొట్టి అనే అర్థాల్ని సూచించేవే. బహుశా కొద్దిపాటి నీటి ప్రవాహాన్ని 'కుఱ కుఱ' అనివుంటారు. అదే కుఱ్ఱుగా రూపాంతరం చెంది వుంటుంది. 'కుఱ్ఱు' శబ్దం కొన్ని గ్రామ నామాల్లో 'కూరు'గానూ, యింకొన్నింటిలో 'కూర్' గానూ, మరి కొన్నింటిలో 'కుర్తి' గానూ రూపాంతరం చెందడం మనం గమనించవచ్చు.

### మఱ్ఱు :-

'మఱువ' అంటే కుండ. అందుకే కుంభ సంభవుడైన అగస్త్యుడిని 'మఱువ కందు' అని కూడా అంటారు. ఈ మఱువ పదం మనం పైన చెప్పుకున్న ద్రోణము, దోని, దోనె, దొన లకు సమానార్థకమే. 'మఱువ' శబ్దమే 'మఱ్ఱు'గా రూపాంతరం చెంది వుంటుంది. కృష్ణా జిల్లా 'పామర్రు'ను 'పామర్రు' అని పలికినా 'పామఱు' అనే వ్రాస్తారు. అది ఒకప్పుడు 'పాము మఱువ' అయి వుంటుంది. పాము మీదుగానే ఏర్పడిన 'పాందువ్వ', 'పాంమేడు', 'పాంబర్తి' లాగానే రూపాంతరం చెంది పాము మఱువ → పాంమఱు → పామఱు అయి వుండవచ్చు.

గ్రామ నామాలను మరింత లోతుగా విశ్లేషించబోయే ముందుగా ఊళ్లపేర్లసలు ఎలా ఏర్పడతాయో కొన్ని మచ్చుకు చూద్దాం.

మానవుల మీదుగా మానవపాడు వగైరా గ్రామ నామాలు, మానవ జాతుల పేర్ల మీదుగా ఆర్యాపురం (నార్డిక్ జాతి వారైన ఆర్యుల మీదుగా), గదబ లోవ, కొరవి (ప్రోటో ఆస్ట్రలాయిడ్ తెగలయిన గదబలు, కొరవల మీదుగా) వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. కొన్ని జాతులు మన ప్రాంతానికి బయటి నుంచి దండెత్తి వచ్చి యిక్కడ స్థిర నివాసమేర్పరచుకున్నాయి. అలాంటి వారి పేర్లతో కొన్ని గ్రామ నామాలేర్పడ్డాయి. పల్లవుల మీదుగా పల్లవవోలు→ పల్లవోలు, పల్లవరం వగైరా గ్రామ నామాలు, మల్లజాతి మీదుగా మల్లవోలు మల్లాం, మల్లవరం, మల్లవడి వగైరాలు అలాగే ఏర్పడ్డాయి.

స్త్రీల మీదుగా భామిని, ఆడమిల్లి, చానమిల్లి (చాన అంటే స్త్రీ) వగైరా గ్రామ నామాలూ, పురుషుల మీదుగా పురుషపురం (పెషావర్), పురుషోత్తమ పట్నం వగైరాలూ ఏర్పడ్డాయి. అంతేకాక కన్నెలూరు, కన్నెమడుగు, కన్నెబావి,

కన్యధార, కన్నెవాయి గ్రామాలూ వున్నాయి.

దేవతల పేర్ల మీదుగా శివాపురం, ఉగ్రవాయి (ఉగ్రుడంటే శివుడు), విష్ణుపురం, గణేశునిపాడు, దుర్గాపురం, గౌరీపట్నం, కాళీపట్నం, కృష్ణపట్నం, కేశవపురి, రామాపురం, లక్ష్మణ ఝూలా, ఓబులేశుని పల్లె (ఓబులేశుడు అంటే అహోబలేశ్వరుడైన నరసింహ స్వామి), కాట్రేనికోన (కాటి రేడు అంటే శివుడు), కామారి పల్లె (కామారి అంటే మన్మథుడిని సంహరించిన శివుడు), పిళ్లారి కుప్పం (పిళ్లారి అంటే వినాయకుడు), మదనపల్లి, మదనూరు (మద్నూర్-నిజామాబాద్ జిల్లా), కామేపల్లి, కందర్పవాడ (కందరాడ) (మదనుడు, కాముడు, కందర్పుడు - యివన్నీ మన్మథుని పేర్లు) వగైరా వగైరాలు. చంద్రుడి మీదుగా ఇందూరు (నిజామాబాద్ ఒకప్పటి పేరు), ఇందుపల్లి, చందూరు, చంద్రంపాలెం, చందర్లపాడు, చందలూరు, సోమూరు, సోంపల్లె, సోమేపల్లి, సోమంచి, చంద్రుపట్ల, చంద్రాల, ఇందులవాయి (ఇందల్ వాయి - నిజామాబాద్ జిల్లా), ఇందులూరు, ఇందుకూరు వగైరాలు ఏర్పడ్డాయి (ఇందు మరియు సోమ అనేవి చంద్రుడి పేర్లు.) అలాగే సూర్యుడి మీదుగా కోణార్క, అరసవల్లి (అర్కవల్లి), మార్తాండ్, సూర్యాపేట, ప్రొద్దుటూరు వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. (అర్క మార్తాండ, ప్రొద్దు పదాల అర్థం సూర్యుడు). ఇనగ్యాలి అనే గ్రామ నామం కూడా సూర్యుడి పేరు మీదుగానే ఏర్పడి వుంటుంది. ఇనుడంటే సూర్యుడు. 'ఇనగ్యాల' అనేదే తరువాత 'ఇనగాల'గా రూపాంతరం చెందింది. (లేక 'ఇను' అంటే రెండు. ఇనుగ్యాలి→ ఇనగ్యాలి → ఇనగాలగా రూపాంతరం చెంది వుండవచ్చు కూడా). మన గ్రామ నామాలలో దేవరపల్లి, పలుదేవర్ల పాడు, దేవరకద్ర, దేవుల పల్లి, దేవరబెట్ట వున్నట్లే దయ్యందిన్నె, దయ్యాల గుడ్డం, భూత్పూర్ (భూతపూర్) కూడా వున్నాయి. అలాగే రాక్షసుల పేరిట దానవులపాడు (జమ్ముల మడుగు తాలూకా, కడప జిల్లా.), రాకాసి పేట (బోధన్, నిజామాబాద్ జిల్లా), దానవాయి పేట (రాజమండ్రి) కూడా వుండడం విశేషం !

నేల మీదుగా నేలటూరు, నేలపాడు, నేలపల్లి వగైరాలే కాక అక్కడి నేల రంగును బట్టి నల్లబాడు, నల్లమిల్లి, నల్లమాడు, కారుమూరు, బెలగల్లు (తెల్లకొండ), తెల్లబాడు, వెల్లబాడు, జేగురుపాడు, కావూరు (కావి + ఊరు - కావిరంగు - *Terra cotta colour*), ఎర్రబాలెం, ఎర్రదిబ్బలు వగైరా గ్రామ నామాలు ఏర్పడ్డాయి. నేల స్వభావాన్ని బట్టి గుల్లపాడు, మన్నూరు, బురద మడుగు, చౌటపల్లి, చౌడూరు, మొరుమూరు, సుద్దపల్లె, సుద్దగూడెం, పలకలూరు, నాపరాళ్లపల్లె, పోరపాడు, రాళ్ళపల్లి, రాళ్లపుట్టి, రాళ్ళపాడు, పిడుగురాళ్ల, పొడిరాళ్ల, కల్లూరు (కల్లు అంటే రాయి), బండల మోటు, కలువ రాయి, చాట్రాయి, ఎంద్రాయి, డొంక రాయి, విజయరాయి, సున్నంపాడు, దువ్వూరు, బూడిద పాలెం, బూదూరు, తువ్వపాడు, పెల్లకూరు (మట్టి పెళ్లల నుంచి), ఉప్పుటూరు, ఉప్పుగూడెం, ఉప్పల, ఉప్పులూరు, చిక్కడ్ (అంటే బురద) పల్లి, అడుసుమిల్లి (అడుసు అంటే బురద), రొంపిదొడ్ల (రొంపి అన్నా బురదే), రొంపిచెర్ల, మురికిపూడి, ధూళిపూడి, ధూళిపాళ్ల, బూదిలి, దువ్వ, దువ్వాడ, దుమ్ముగూడెం, ఇసుకపల్లి, గరువుపాలెం, పర్ర ,చవిటిపర్ర , బీడుపల్లె, పొలమూరు వగైరా వగైరా గ్రామ నామాలు ఏర్పడ్డాయి. ఇదుపు అంటే నేలలో పగుళ్లు. అలా ఇదుపులపాడు (ప్రకాశం జిల్లా) గ్రామ నామమేర్పడింది. మన ముఖ్యమంత్రి వైయస్ఆర్ వ్యవసాయ క్షేత్రం కడప జిల్లాలోని ఇదుపుల పాయలో వుంది. ఈ గ్రామ నామం కూడా అలా ఏర్పడిందే. నేలలో లభించే ఖనిజాలను బట్టి - వజ్రకరూరు, వజ్రపు కొత్తూరు, గని ఆత్కూరు, బంగారు పాళ్యం, సున్నంపాడు, బొగ్గులకుంట, కాచవరము (కాచము అంటే గాజు), గనికొండ, కళ్యాణఖని, రవీంద్రఖని వగైరాలు.

శీతోష్ణస్థితిని బట్టి వానపల్లి, ఎండపల్లి, ఎండూరు (ఎండ + ఊరు), ఎండ్లూరు (ఎండల+ఊరు), ఎండమూరు, ఎండగండి, మసకపల్లి, ముసురుమిల్లి, తెరిప్పాడు (వాన తెరిపివ్వడం మీదుగా), వెలుతురుపాడు, వెలుగూరు, వెలుగు బంద, పొగవాడ, గాలిపల్లి, చీకట్ల, చీకటి గూడెం, చీకటిపాడు, మంచూరు, కొలిమిగుండ్ల, వేంద్ర, తీంద్ర, అగ్నిగుండాల,

రామగుండం, వేజెండ్ల (వేచు + ఎండల), నూజెండ్ల (నూచు + ఎండల), కాజెండ్ల (కాచు + ఎండల), నాదెండ్ల (నాదు + ఎండల) వగైరా గ్రామ నామాలు ఏర్పడ్డాయి. నమీబియా (నైరుతి ఆఫ్రికా - *South West Africa*) ఎడారిలోని భాగమైన అత్యంత ఉష్ణోగ్రత కల ప్రాంతానికి ఇటోషా పాన్ (*Etosha pan*) (పాన్ అంటే పెనం) అనే పేరు ఏర్పడింది.

ఎత్తుపల్లాల్ని బట్టి మెరకపల్లి, మిర్రుదొడ్డి (మిర్రు అంటే మెరక. మెదక్ జిల్లాలోని యీ గ్రామ నామమే యిప్పుడు మీర్‌దొడ్డిగా అపభ్రంశమైంది. ), పల్లంపాడు, పల్లంపల్లి, పల్లంకుర్రు, కొండపల్లి, దిబ్బగూడెం, పోటుమెరక, పల్లెకోన, భైరవకోన, తలకోన, కోనూరు (కోన అంటే అడవి అనీ, మూల అనీ, కొండలలోని మరుగు ప్రదేశమనీ అర్థాలు) వగైరాలూ; గ్రామం దిశ, అక్కడి నైసర్గిక స్థితిగతులను బట్టి లంకపల్లి, మాలలంక, ఎగువ వలస, దిగువ వలస, దిగువ పల్లె, బండమీది పల్లె, గుడ్డిగూడెం (ఒంటిరిగా విసిరేసినట్లున్న ఊరు) సందూరు, గట్టుగూడెం, కూడలిపాడు, మాటూరు, మాటు మడుగు (మాటు అంటే పడమటి దిక్కు), పడమటలంక, ఉనికిలి, మూలపాడు, అడవులదీవి, తూర్పుపాలెం, ఉత్తరాపల్లి, తూర్పు రొంపిదొడ్ల, వడలి, వడపర్తి (వడ అంటే ఉత్తర దిశ), తెన్‌కాశి, తెన్‌మదురై (తమిళంలో తెన్ అంటే దక్షిణం), ఉత్తర మేరూర్, మేల్ మరువత్తూర్, కీళాత్తూర్, కీళ్‌పాక్కం (తమిళంలో మేల్ అంటే పడమర, కీళ్ అంటే తూర్పు). అక్కడ కొండ వుంటే కొండపల్లి, పర్వతాపురం, వినుకొండ, ఆ కొండ నిడివిగల కొండ అయితే నిడి(వి)గల్లు, నిడి(వి)గొండ, ఒంటరిగా వెలివేసినట్లున్న కొండ అయితే వెలిగొండ, వెలికల్లు, వ్రయ్యలుగా పగిలినట్లున్న కొండయితే వయ్యకల్లు, ఆ కొండపై జలసంరక్షణ చేయబడుతూంటే దొనకొండ, ద్రోణాచలం (ద్రోణము అంటే కుండ లేక నీటి వనరు. దొన అన్నా అదే), మంచికల్లు, నీరుకొండ, నీర్‌మల, న్యాలికల్లు (న్యాల్‌కల్), న్యాలి కొండ (న్యాలి అంటే నీటి వనరు) వగైరా గ్రామ నామాలు ఏర్పడ్డాయి. అక్కడ మణుగు (మడుగు) వుంటే, గడ్డమణుగు, మణుగూరు, కొండ మణుగుల వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. అలాగే కేరళలోని కల్లెడ అనే గ్రామనామమేర్పడింది. కల్లెడ అంటే మలయాళంలో - *A stone bund on a water stream* - నీటి ప్రవాహానికి ప్రక్కగా నిర్మించబడిన రాతి కట్ట. ఏటి ప్రక్కనున్న గ్రామం ఏటూరు, నది ప్రక్కనున్న గ్రామం ఆరూరు అనబడ్డాయి (ఆరు అంటే నది).

ఎడ - పెడ లపై కూడా ఎన్నో గ్రామ నామాలేర్పడ్డాయి. ఉదా :- ఎడపల్లి, ఎడవూరు, ఎడవల్లి, పెడవల్లి, పెడకల్లు, మర్రిపెడ, పెడసనగల్లు (పెడ సన్నకల్లు), ఉమ్మెడ (ఉమ్మ+ఎడ), కల్లెడ (కల్లు+ఎడ) వగైరాలు.

పరిమెళ్ల (పరిమి + ఎడల), గరిమెళ్ల (గరిమ + ఎడల), చేవెళ్ల (చేవ +ఎడల), ఆకెళ్ల (ఆకు +ఎడల), దుద్దెళ్ల (దుద్దు +ఎడల), ఉందెడ (ఉందు +ఎడ), రావెళ్ల (రావు + ఎడల) వగైరా వగైరా కూడా ఎడ - పెడల మీదుగానే ఏర్పడ్డాయి.

ప్రాచీన కాలంలో బాటసారుల మార్గాయాసాన్ని తొలగించడానికి బాటల ప్రక్కన ప్రప (చలి పందిరి-పానీయ శాలిక) లను ఏర్పరచే వారు. తమ వీధిన వెళ్లే పథికులకు మంచినీటినీ, మజ్జిగనూ పోయడానికి గృహస్థులు తమ యింటిలోని ముందరి భాగంలో కూడా ప్రపా కల్పనము (చలి పందిరి) లను ఏర్పరచే వారని (పాం.మా. 3-142) పద్యం ద్వారా తెలుసుకున్నాం కదా ! ఇవి పాంథుల వేంద్రము (తాపము)ను చల్లబరచేవి కనుక వీటిని చలి వేంద్రములన్నారు. అదే చలి వేంద్రము అయింది. అలాగే యిక్కడ చల్ల (మజ్జిగ) పోస్తారు కనుక వీటిని చల్ల కూడళ్లు అనీ అనేవారు. చలివేంద్ర పాడు, చలివేంద్ర పాలెం, చల్ల కూడ్లూరు వగైరా గ్రామ నామాలు యిలా ప్రపల మీదుగా ఏర్పడినవే !

కుటుంబ సభ్యుల పేర్లమీద తాతపూడి, అయ్యవోలు, అయ్యంకి, అయ్యనేరి, అమ్మపాలెం, అమ్మనేరి, అంబాపురం, అమ్మగూడ, అక్కాయిపల్లి, అక్కయ్యపాలెం, అక్కూరు, బావాయపాలెం, అన్నపర్రు, అన్నంగి, కొమరవోలు (కొమరుడు -

కుమారుడు), కొమరగిరి, అత్తలూరు, అమ్మనబ్రోలు (అమ్మ అన్న - మేనమామ), అయ్యన్నపాలెం (పెదనాన్న), అబ్బన్న గూడవల్లి (పెదనాన్న), అబ్బూరు (అబ్బ +ఊరు), చిత్తూరు (తమిళంలో చిత్తి అంటే పిన్ని), అప్పచ్చిమేడు, అమ్మచ్చివీడు (మలయాళంలో అమ్మచ్చి అంటే పిన్ని మరియు అప్పచ్చి అంటే మేనత్త) వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

కులాల పేర్లతో - బ్రాహ్మణపల్లి, బ్రాహ్మణ హొలువ, బాపట్ల (బాప+పట్టుల), బాపల దొడ్డి, బొంరాస్‌పల్లి (బొమ్మరాజులంటే బ్రాహ్మణులు. బొమ్మ రాజు పల్లె క్రమంగా బొంరాస్ పల్లి అయింది.), బొమ్మేపల్లి, బొమ్ములూరు (బొమ్ములు అంటే బ్రాహ్మణులు), బ్రాహ్మణకోడూరు, బ్రాహ్మణ నిడమానూరు, బ్రాహ్మణ క్రాక, కమ్మపల్లె, చౌదరి పల్లి, చౌదరి గూడ, మన్నీల, మన్నెగుంట (కమ్మవారిని మన్నెవారనీ, మన్నీలు అనీ అంటారు), కమ్మవారిపాలెం, రెడ్డిగూడెం, రెడ్డిపాలెం, కాపుల ఉప్పాడ, బలిజెపల్లి, కాపుల్లె (కాపులు), తెలగ పల్లి, తెలగాయపాలెం, తెలగబాళు, ఉప్పరపాలెం, ఉప్పరహళ్లి (ఉప్పరవారు మట్టి పని చేసే ఓ కులం వారు), చాకలికొండ, చాకి లోవ, చాకి చెర్ల, ఎరుకలపూడి, ఎరుకల వాడ, ఎరకలపట్నం, వడ్డెరపాలెం, పింజారి హెగ్గడహాలు (పింజారి వారంటే దూది ఏకే వారు), హెగ్గడహాలు (హెగ్గడ అంటే కన్నడలో ప్రెగ్గడ - మంత్రి లేక కరణం), కమ్మరచేడు (కొలిమిలో యినుప పని చేసే వారిని కమ్మర్లు అంటారు.), గొల్లపూడి, కురమ గొంది (ఒకప్పుడు గొల్లలని పిలువబడిన యాదవులలో కురుమవారు ఓ శాఖ. వీరు గొఱ్ఱెల బొచ్చు నుంచి కంబళ్లు తయారు చేస్తారు), గొల్లవిల్లి, గొల్లరహళ్లి, వెలమలకోట, వెలంపల్లి, రావు లుడికి (రావులంటే వెలమలు), వెల్మల, వెల్మల్ (వెలమల), రావుల పాలెం, రావుల కుంట, బోయపాలెం, బోయమడుగుల, బోయగూడ, బోయలపల్లె, బోయపాదు (వేట వృత్తిగా కలవారు బోయవారు), దొమ్మర నంద్యాల, దొంబర హళ్లి (దొమ్మర వారిని కన్నడ భాషలో దొంబరలు అంటారు), గిరిజనా పురం, తంబళ్ల పల్లె (శివాలయాలలో అర్చకులను తంబళ్లు లేక తంబలి వారంటారు.), పెరికి వలస (పెరికలంటే - ఒకప్పుడు ఎద్దు, గాడిదలపై సరకులు వేసుకుని వ్యాపారం చేసిన ఓ కులం), పెరికీడు (పెరికవీడు. వీడు లేక వీట్టు అంటే ప్రాక్ ద్రావిడంలో ఇల్లు. కృష్ణా జిల్లా హనుమాన్ జంక్షన్ సమీప గ్రామం పెరికీడు. ఇదే గ్రామం పేరు నిజామాబాద్ జిల్లాలో పెరికవీట్టు → పెరికిట్ అయింది.), కాసాపురం (కాసా వారంటే జమీందారుల గుఱ్ఱాలకు మాలీసు చేసే వారు), కోయలగూడెం, వడ్లగుంట (వడ్లవారంటే వడ్రంగి వారు), తెలకపల్లి, గాండ్లపెంట, గాండ్ల పర్తి (నూనె గానుగలు ఆడించే తెలికల లేక తెలక వారిని గాండ్ల వారనీ అంటారు.), మాల లంక, మాదిగవాని కుంట, కంసాలి గూడెం, బచ్చుమల్లి (బచ్చులంటే వైశ్యులు), కోమటి కుంట, బేరిపల్లె (బేరీలంటే వైశ్యులలో ఒక శాఖ), సెట్టి పల్లె, బెస్త పల్లె, జంగము దేవరల మీదుగా జంగాల పరిమి, జంగ మహేశ్వర పురం, జంగాల పల్లె, జంగమర హోసహళ్లి, భట్టరహళ్లి (భట్రాజు కులస్థుల మీదుగా), బత్తుల పల్లె, జక్కుల చెరువు, జక్కిదొన, (జక్కి లేక జక్కిణి అంటే జక్కుల కులానికి చెందిన స్త్రీ) ఒడ్డెపల్లి (ఒడ్డెలంటే ఓఢ్రదేశం నుంచి కూలి పనులకోసం వలస వచ్చిన ఓ కులం. వీరిని వడ్డెరలు అనీ అంటారు. అనాదిగా వీరు క్వారీలలో రాళ్లు పగులగొట్టడం, మట్టి పనులు చేస్తారు.) మేదరమెట్ల, మంగళ్ల పల్లె, మంగలిపాలెం (గుంటూరు జిల్లా ఖాజీపాలెం శివారు గ్రామం), కమ్మర్‌పల్లి (నిజామాబాద్ జిల్లా), యానాదిగూడెం, కుమ్మరిపాలెం, కుమ్మరికుంట్ల, తురకపాలెం, తురకదిన్నె, సాలూరు (ఇది సాలి +ఊరు అయివుండవచ్చు), దేవాంగపురి (సాలెవారిలో దేవాంగులు ఒక శాఖ), సాతులూరు (నారతో గోతాలు నేసే సాలెవారిని సాతులంటారు), బాప్టిస్టుపాలెం (బాప్టిస్టులు క్రైస్తవులలో ఒక శాఖ), క్రిస్టియన్‌పాలెం, అగసాలెపల్లె, ఔసులపల్లి (అగసాలెవారన్నా, ఔసులవారన్నా కంసాలులు), జాంద్రపేట (జాంద్ర లేక జేంద్ర అనేది సాలెవారిలోని ఒక శాఖ), గౌడగల్లు, గమళ్లపాలెం, గమళ్లకోట, గమళ్లదిన్నె, ఈంద్రపాలెం, యాతలూరు, యాతవాకిళ్ల (కల్లుగీత వృత్తిగాకల గౌడ కులస్థులను ఈడిగ, యాత, శ్రీశయన, కలాలీ, శెట్టిబలిజ, ఈంద్ర వగైరా పేర్లతో పిలుస్తారు.), ముతరాసి గూడెం (పల్లె, పల్లెకార, అగ్నికుల క్షత్రియ, ముతరాసి, బెస్త - యివన్నీ మత్స్యకారులలోని శాఖలు.), నవీపేట (నిజామాబాద్ జిల్లా. చెరువులు

త్రవ్వే వడ్డెరవారిని నవీలు అని కూడా అంటారు), పూనుకొల్లు (పూని +కొల్లు), పూనూరు (పూని + ఊరు - పూనిగొల్లల నుండి. వీరినే యిప్పుడు పూజ గొల్లలు అంటున్నారు.), బొందిలిగూడ (బొందిలీలు లేక బుందేలీయులు మధ్య భారతంలోని బుందేల్‌ఖండ్ ప్రాంతాల నుంచి వలస వచ్చిన క్షత్రియులు. కత్తులు సానపట్టడం, మిఠాయిల తయారీ, మందుగుండు సామాగ్రి తయారీ వగైరా వృత్తులు వీరు చేపట్టారు.) నంబూరు, నంబుల పూలకుంట (నంబి వారంటే విష్ణ్వాలయాలలో అర్చకులు) వగైరా గ్రామ నామాలు ఏర్పడ్డాయి.

వృత్తులు, హోదాలను బట్టి చక్రవర్తి ఖండ్రిక, సామంతపూడి, సామంతమల్లం, రాజుపాలెం, రాజవోలు (రాజోలు), మంత్రిపాలెం, ప్రెగ్గడపల్లి, పెగళ్ల పల్లి (ప్రెగ్గడల పల్లి), నవాబుపాలెం, నవాబుపేట, బంటుమిల్లి, కప్తానుపాలెం (కప్తాను అంటే *Captain* ), దివాన్ చెరువు, దళవాయి పట్టడ, దళవాయి సత్రం (దళవాయి అంటే సేనాధిపతి), దొరవారి సత్రం, పూజారి గూడెం, తలార్లపల్లె, కాజీపేట, ఖాజీపాలెం (ఖాజీ లేక కాజీ అంటే న్యాయాధికారి), మావటూరు (మావటి అంటే ఏనుగుపై స్వారీ చేసే వాడు-*Mahout* ), కిలారిపల్లె (కిలారి అంటే పాడి చేసేవాడు), కవుల పల్లె, కవులూరు, రౌతులపూడి, లెంకలపల్లి (లెంక అంటే భటుడు), వీరులపాడు, వీరవల్లి, సానిపల్లె, ఫక్కీరు పల్లె వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

ఆ గ్రామంలో వున్న గుడి మీదుగా గుడిపాడు, గుడిపూడి, గుడిబండ (నల్గొండ జిల్లా కోదాడ సమీపంలో ఒకప్పటి సినీ హీరో టి.ఎల్. కాంతారావు స్వస్థలం), కోవెలమూడి, ఎర్రగుడి (కర్నూలు జిల్లా - అశోకుని శిలాశాసనాలు లభించిన స్థలం), కోట మీదుగా కొత్తకోట, కొచ్చెర్లకోట, కోటపాడు, తుమ్మకోట, పాతకోట, కోటనందూరు, కశింకోట, కోటబొమ్మాళి వగైరాలు ఏర్పడ్డాయి.

ఇల్లు, ఇంటికి సంబంధించిన భాగాల మీదుగా తాటిగడప, పునాదిపాడు, పందిరిపల్లి, గుమ్మంపాడు, గుమ్మాలపాడు, మండిగం గూడ, తలుపుల, తలుపూరు, పందిళ్లపల్లె, పాతళ్ల మెరక, ఆరుంబాక, పందలపాక, కొలనుపాక, ఒంటిగోడ, తాటిపాక, మెట్టూరు, ఇనిమెట్ల, ఇనిగడప, కొట్టం, కొట్టంపాలెం, ఇళ్లపల్లె, సత్రంపాడు, మేడపాడు, ఇండ్లపల్లె, ఇల్లూరు, పెంకులపాడు, ఇటికల పల్లి, ఇటిక్యాల, ఇటికంపాడు, తడికలపూడి, డాబాలమెట్ట, అరుగుసోల, అరుగుల (అర్గుల్ - నిజామాబాద్ జిల్లా - మాజీ మంత్రి కీ. శే. జి. రాజారాం స్వస్థలం), సారపాక, పాకపూడి, పాకలపాడు, కట్టుబడిపాలెం, యాతవాకిళ్ల (పల్నాడు తాలూకా) వగైరాలు ఏర్పడ్డాయి.

ఇంట్లో వాడే ఉపకరణాల నుండి రోలుపడి, రోళ్లపాడు, రోకళ్లపాలెం, నాగళ్ళపూడి, దంతులూరు (దంతి అనేది వ్యవసాయ పనిముట్టు), బోరిగము (అంటే చీపురు), చీపురువాడ, చీపురుగూడెం, చీపురుపల్లి, కాగువలస, కాగుపాడు, దబర (అంటే ఒక గిన్నె), చెంబూరు, పెనమలూరు, ఉయ్యాలవాడ, ఉయ్యాల మడుగు, కొడవలూరు, కొడవటికల్లు, దుత్తలూరు, కడవకుదురు, చాటపర్రు (చేట), అద్దంపల్లె, ఉట్లపాలెం, ఉట్లపల్లె, చాపలపల్లె, ఉచ్చూరు, గిన్నెలారం, మంగలం పాడు (పగిలిన పెద్ద కుండను వేరుశనగలు, మొక్క జొన్నలు వగైరా వేయించడానికి వాడతారు. దానిని మంగలం అంటారు.), కొలిమేరు (కొలిమి), తిరగటిరాళ్లు, మువ్వలపాలెం, కళ్లెపులోవ, తుండూరు (తుండు అంటే స్నానం చేసి ఒళ్లు తుడుచుకునే బట్ట అనే కాక, దుష్టమైన పశువులకు అణకువ కోసం గుదిగర్రలా మెడలో వేసే బరువైన కొయ్యదుంగ అనీ అర్థం. దీనినే టొంప అని కూడా అంటారు.), ఇరుసుమంద, బండిపాలెం, పార్లపల్లె, పారవోలు, పలుగోడు (పలుగు +గోడు), రోళ్ల, వేటకొయ్య రామారం, గాదెల వర్రు, గూడవల్లి, గూడపల్లి, గూడపాడు, తక్కెళ్లపాడు (తక్కెడ), గానుగ పాడు, గానుగ పెంట, పిల్లుట్ల, నెల్లుట్ల (ఉట్టి), గంపల గూడెం, దోనెపూడి, దోనెల లంక, బండిపాలెం, ఆకురాతి గూడెం, బుట్టాయిగూడెం వగైరా గ్రామ నామాలు ఏర్పడ్డాయి.

ఆయుధాల మీదుగా కత్తిపూడి, కటారుపల్లె (రాయలసీమలో ప్రజా కవి వేమన సమాధి గల ఊరు), కొణతాల, కొణతమూరు (కొంతమూరు), కొణతం ఆత్మకూరు, కొణతంపాడు (కొణతం లేక కొంతం అనే ఆయుధం మీదుగా. పల్నాటి యుద్ధంలో బ్రహ్మనాయుడు ఈ ఆయుధాన్నే వాడాడు.)

మునిపల్లె, మునిమడుగు, ఋషికొండ వగైరాలే కాదు శౌనకాపురం (శౌనకుడొక మహర్షి), వ్యాసకాని (వ్యాసుడు మహాభారత కర్త), వ్యాసార్ పాడి, అగస్త్యన్ పల్లి వగైరా గ్రామ నామాలూ వున్నాయి.

పెదపూడి, పెదరావూరు, పెదపాలెం, పెద్దూరు, పెందుర్తి (పెనుదుర్రు → పెందుర్రు → పెందుర్తి), పెనుగొలను, పెనుమంచిలి, పెనుమూడి, పెనుమర్రు, పెనుగొండ, నిడుదవోలు, నిదు(ద)బ్రోలు, నిడ(ద)మర్రు వగైరాలున్నట్లే చిట్టూరు, చిట్యాల (చిట్టి + ట్యాల), చిట్వేల్ (చిట్టి + వేలి), పొట్టిపాడు, కురు(చ)మద్దాలి, కురు(చ)గల్లు, చిన్నూరు, బుడంపాడు, పొట్టిపాడు, పొట్టిలంక, చినరావూరు (ఒకప్పుడు తెనాలి శివారు గ్రామం - ప్రస్తుతం తెనాలి పట్టణంలోని మా పేట) వగైరాలూ వున్నాయి.

పండుగల మీదుగా సంకురాత్రిపాడు, కనుమూరు వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

అరిచేపల్లీ, కూసేపల్లీ వున్నాయి. కుయ్యనూరూ వుంది. అంతంపల్లి, గూనిపల్లె వగైరా వింత వింత గ్రామ నామాలున్నాయి.

వినుకొండా వుంది. చెవిటికల్లూ వుంది. మూగలదొడ్డి కూడా వుంది.

ఇక ఆహార పదార్థాల మీదుగా గంజి కుంట, కూర పాడు, అంబలి కోట, అన్నంపల్లె, పప్పూరూ, అట్లూరు, పందూరు, ఉగ్గుమూడి (ఉగ్గు అంటే - చనుబాలు ఆముదం కలిపి పిల్లలకు పోసేది.) వున్నాయి. నేతులూరూ వుంది. అలాగే అరిసె లోవ, వెన్నపూసపల్లె, చేల్లపల్లి, చేల్లూరు (చేల్ల అంటే మజ్జిగ ), మారుపూడి, మోరంపూడి (మారు అన్నా మోరు అన్నా మజ్జిగ), ఎంగిలి బండ, పంచదార లంక, చేదువాడ (చేదు అంటే చేద్ది అన్నం), సద్దికూళ్ల పల్లె కూడా వున్నాయి.

కుంటి వాళ్లను బట్టి పంగులూరు, పంగిడి (పంగు + ఇడి) ఏర్పడగా పిరికి వాళ్లను బట్టి పందలపాక, పందలపర్రు గ్రామ నామాలేర్పడ్డాయి.

పాశ్చాత్యుల పాలన కారణంగా క్రైస్తవ నామాలున్న గ్రామాలేర్పడ్డాయి. ఉదా :- ఫెర్గ్యూసన్‌పేట, ఫౌలర్ పేట, పవర్ పేట, వించిపేట, బాస్టియన్ పాలెం, బాప్టిస్టు పాలెం, హార్వే పేట, స్పెన్సర్ పేట, స్టాఫర్డ్ పేట వగైరా వగైరా.

సమయం మీద సమయాపురం, వేళంగి, ఘడియపూడి, సమయంపూడి, మాసంపల్లె, సందెపూడి వగైరాలు ఏర్పడ్డాయి.

యుద్ధం మీద పోరూరు పోరుమామిళ్ల, దండుపేట, కుట్రమీద కుట్రవాడ వగైరాలేర్పడగా మైత్రి మీద పొందూరు, పొత్తూరు వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

సంఖ్యా వాచకాలతో ఒంటిచింత గూడెం, ఒంటి మామిడి, ఇరుకోడు, ఇరుర్యాలి (ఇర్యాలి-ఇరాలి), రెంటపాళ్ల, రెంట చింతల, ముప్పాళ్ల, ముక్కొల్లు (మూడు కొలనులు), ముచ్చెర్ల (మూడు చెరువుల), ఆరుంబాక, ఆరుగొలను, ఏడుచెర్లపల్లె వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

వారాల మీదుగా శనివారపు పేట, బేస్తవారపు పేట, ఆదివారపు పేట వగైరా గ్రామనామాలేర్పడ్డాయి.

దగ్గుమిల్లి, దగ్గుబాడు, దగ్గులూరు, చీకుపల్లి (చీకు అంటే తుమ్ము), చీదూరు, చీదేపూడి, చీదేపల్లి, తుమ్ముకుర్రు

(తుంకూరు), వణుకూరు, డోకులూరు, వుయ్యూరు, కక్కులపాడు, దుముకుపాడు, ముస్కాన్‌పేట్ (ముస్కాన్ అంటే చిరునవ్వు), మరుపూరు, నిద్రఘట్ట, తుంపడం, ఈదడం వగైరా క్రియల పైన కూడా గ్రామ నామాలేర్పడ్డాయి.

ఇంకా బావురువాక, జాలిమూడి, జాలిబెంచి, నిందలి, ఆగడాల లంక, న్యాయం పల్లి, కురుపుకోట, సోకులగూడెం, శకునాల గూడెం, గుట్టూరు, వాదాలకుంట, దండగల గొంది, శత్రుభంగపురం, మల్లెమాల వగైరా వింత వింత గ్రామ నామాలు వున్నాయి.

సూదనకుంట (సూదనమంటే చంపటం), నిధనవాడ (నిధనమంటే చనిపోవడం), నిధనంపూడి వున్నాయి - అమృతలూరూ వుంది.

శరీర భాగాల నుంచి తలమంచి, తలకోన, కండ్లప్యాల, కళ్ళేపల్లి, కండ్లకోయ, కండ్లకుంట, ముచ్చెలగుంట, గుండె మడకల, గుండి మెడ, కార్జంమేడు (కార్జం అంటే కాలేయం - *Liver*), ముక్కుర్యాలి (అదే ముకురాల), చెవుటూరు (చెవ్వుటూరు), చేయి మీదుగా చేగొండ, చేపల్లి, చేర్యాల, చేపాడు, చేగుంట, చేవెళ్ల, చేబ్రోలు, చేకూరు, చెయ్యేరు వగైరాలు, దోసిళ్ల పల్లె, కాళ్ల, కాళ్లకూరు, గోళ్ల, గోళ్లపాడు, గోళ్లమూడి, బొడ్డుపల్లి, బొర్రగూడెం, జడవల్లి, కొప్పుల, అడిగొప్పుల (అడవి కొప్పుల), చంపాడు (చెంప), కళతల చెరువు, పన్నూరు, పీకలబెట్ట, కుతుకులూరు, నుదురుపాడు, వెంట్రుకల గడ్డ, కేశ్‌పల్లి (వెంట్రుకలు), బొనిగలపాడు (ఎముకలు), బొక్కలపాడు (బొక్కలు అన్నా ఎముకలే) వగైరా గ్రామ నామాలు ఏర్పడ్డాయి.

ఆభరణాల నుండి గాజుల్లంక, కంకణాలపల్లె, కడియం, కంటెపూడి, గజ్జెలకొండ, మువ్వలపాలెం, మెట్టూరు (మెట్టె + ఊరు), తమ్మిలేరు వగైరా గ్రామ నామాలు, వ్యక్తుల పేర్ల మీదుగా కీర్తిరాయనిగూడెం, అన్నపురెడ్డి గూడెం, రామయ్యపట్నం, నాగులాపురం (శ్రీకృష్ణదేవరాయలు తన తల్లి నాగులాంబిక పేరిట నిర్మించిన పట్టణం), బుక్కపట్నం (బుక్కరాయల పేరిట నిర్మింపబడింది), అచ్చంపేట, జగ్గయ్యపేట, (ఇవి శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయని తల్లి దండ్రులు అచ్చమ్మ, జగ్గ భూపతుల పేరిట నిర్మించబడినవి), పోలవరం, కాపవరం (ముసునూరి ప్రోలయ, కాపయ నాయకులు విరాళంగా ఇచ్చిన గ్రామాలు) వగైరా వగైరా గ్రామనామాలేర్పడ్డాయి.

చెట్ల మీదుగా చెట్టున్నపాడు, చెట్లపాలెం, మానూరు, మాకులూరు, మర్లగూడెం, మర్లబావి (మాకులన్నా, మరలన్నా చెట్లు), మొక్కపాడు, మొక్కల పూడి, కుంట ముక్కల, పమిడి ముక్కల (ముక్కలు అన్నా మొక్కలే) వగైరా గ్రామ నామాలే కాక వివిధ వృక్షజాతుల మీదుగా కూడా ఎన్నో గ్రామ నామాలు ఏర్పడ్డాయి. ఉదా :- నారికేళ పల్లి, వెదుళ్లపల్లి, వెదురుమూడి, చికిలింత, చింతకాని, గోరింటాడ, వంగూరు, వంగపల్లి, వంగవోలు (ఒంగోలు), తునికి చెరువు, జిల్లేడుపల్లె, ఆముదాల వలస, గార్లదిన్నె, ఉమ్మెత్త, ఆవపాడు, బాదంపూడి, బెండపూడి, ఉసిరిక దొనలు, తాండ్ర, తాండ్రపాలెం, తానిపర్తి (తాని లేక తాండ్ర చెట్టు - *Terminalia bellerica*), మంకెన (మంకెన చెట్టు - *Pentapetes phoenicea* పేరు మీదుగా), మూర్కొండపాడు (మూర్కొండ మొక్క - *Acalypha indica*), ఆముదాలపల్లి, పెసర్లంక, చింతమోటు, చింతల్లంక, కందులపాడు, ఉలవపాడు, శనగపాడు, బూరుగగూడెం, బలుసుపాడు, వడ్లమన్నాడు, వడ్లమూడి, వడ్లపూడి, ప్రాసంగులపాడు (ప్రాసంగులు అంటే ధాన్యంలో ఒక రకం), అనుముల్లంక (అనుములంటే అలచందలు), బందారుపల్లి, బందారు గూడెం, బందారు లంక, (బందారు అంటే పసుపు అనే అర్థం వుంది. బందారు *(Adina cordifolia)* అనే పేరుతో పసుపుపచ్చని కర్రను యిచ్చే మరో వృక్షం వుంది), తుమ్మలపాలెం, జిల్లేళ్లమూడి, జీడిగుంట, ముల్లంగి (నిజామాబాద్ జిల్లా), ఉల్లికల్లు, కందికుప్ప, పొట్లవాయి, పొట్లపాడు, పొట్లదుర్తి, దొండపాడు, దోసపాడు, బచ్చలూరు, బీరకుర్రు (బీర్‌కూర్

– నిజామాబాద్ జిల్లా), కాకర్లావ, కాకరవాయి, కాకరపఱ్ఱు, గుమ్మడిదుఱ్ఱు, గుమ్మిడిపూండి, చంద్రమాకుల పల్లె, చంద్రగూడెం (చంద్రచెట్టు – *Acacia sundra*), నేరేడుమిల్లి, నేరేడు వలస, కొఱ్ఱపాడు, కొఱ్ఱనూతుల (కొర్నూతల), రేగులపాడు, రేగులగడ్డ, రేగాని (రేగు చెట్టు మీదుగా), పొన్నగంటిపాడు (పొన్నగంటి కూర అనేది ఓ ఆకు కూర), కొయ్యగూరపాడు (కొయ్య తోట కూర మీదుగా), సజ్జపాడు, తంగెళ్లమూడి, కలువపాడు, తామర (దామర) పల్లె, దామరచెర్ల, బొడ్డపాడు (బొడ్డ అంటే మేడిచెట్టు), మేడూరు (మేడి + ఊరు), మేడిపల్లి, మేడిదిన్నె, ఏపిగుంట (ఏపిచెట్టు మీదుగా), మద్దూరు (మద్ది + ఊరు), రావూరు (రావి + ఊరు), కడప (కదంబ వృక్షాన్ని – *Anthocephalus cadamba* – కడపచెట్టు అనీ అంటారు.), తణుకు (తణుకు చెట్టు – *(Gyrocarpus americanus)* పేరు మీదుగా), పొణకల, పొణుకుమాడు, పొనుకుమాడు (పొనుకు, పొణుకు లేక పునికి చెట్టు – *Givotia rottleriformis* – పేరు మీదుగా. దీని తేలికపాటి కఱ్ఱను కొండపల్లి బొమ్మలు తయారు చేయడానికి వాడతారు.), నెల్లిపూడి నెల్లిమర్ల (నెల్లి అంటే ఉసిరి చెట్టు), అల్లిపూడి, అల్లివీడు (అల్లితీగ మీదుగా), బూరుగుపల్లి, బూరుగగూడెం, వెలగపూడి, వెలగలేరు, మోదుగ గూడెం, గడ్డిపాడు, గరికపఱ్ఱు, గరికపాడు, మల్లెపాడు, పాలమాకుల (పాల చెట్టు – *Manilkara hexandra*), మొగలితుఱ్ఱు, మోగులూరు (మోగిచెట్టు నేరేడు జాతికి చెందిన ఫలవృక్షం), మోపఱ్ఱు (మోగి + పఱ్ఱు నుండి ఏర్పడి వుండవచ్చు), ప్యాపట్లు – పేపట్లు (పేప + పట్లు → పేప చెట్టు మీదుగా), గొట్టిపాడు, గొట్టిముక్కల (గొట్టిచెట్టు *Zyzyphus xylopyrus* మీదుగా), ముష్టికుంట్ల (విషముష్టి – *Strychnos nux vomica* చెట్టు పేరు మీదుగా), కందకుర్తి, అడ్డసరము (*Adhatoda vasica* అనే ఔషధ మొక్క పేరు మీదుగా), ఈతముక్కల, సంపెంగపుట్టి, తాళ్లపూడి, చిగురుపాడు, చీకిరేణి పల్లె (చిగురు, చీకిరేణి చెట్ల జాతులు) వగైరా.

సుంకేసలము *(The Tiger Bean Tree - Large Tree with White Flowers)* అనే చెట్టు పేరు మీదుగా సుంకేసుల అనే గ్రామ నామం ఏర్పడింది. ఈ సుంకేసలము లేక సుంకేసుల వృక్షాన్నే చిటికేశ్వరం *(Delonix elata)* అనీ అంటారు.

ఒక్క మామిడి చెట్టు *(Mangifera indica)* మీదుగా వంకమామిడి, ఒంటి మామిడి, వంటల మామిడి, మామిడి, మామిడి కుదురు, మామిళ్ళ పల్లి, పందిరి మామిడి గూడెం, పోరు మామిళ్ల, పులుసు మామిడి, కోపు మామిడి వలస, బల్ల మామిడి, కొండ మామిడి వలస, బొఱ్ఱ మామిడి, జోడు మామిడి వలస, టొంకు మామిడి, చిగురు మామిడి వగైరా ఎన్నో గ్రామ నామాలేర్పడ్డాయి.

ఇలాగే యింకా వృక్షజాలం యొక్క పేర్ల మీదుగా పెద్ద సంఖ్యలో గ్రామ నామాలేర్పడ్డాయి. మచ్చుకు కొన్ని చూడండి. గొలగమూడి, గొలుగొండ, గొల్వేపల్లి (గొలుగు లేక గొలివి చెట్టు మీదుగా), దూసరిపల్లి (దూసరి తీగ నుండి), తులసి పాకలు, అంట్లోవ (అంటి + లోవ – అంటి అంటే అరటి చెట్టు), దబ్బనూతుల, దిరిసెనపల్లె, సీకాయపట్టెడ, పనసలదొడ్డి, రెల్లుగడ్డ, మోదుగలపాలెం, టేకుల పల్లి, ఆరెమాకుల పల్లి, వాకలపూడి (వాక లేక కలివి చెట్టు మీదుగా), వాక తిప్ప, అడ్డాడ, అడ్డతీగల (విస్తళ్ల తయారీకి వాడే అడ్డ ఆకుల తీగ మీదుగా), తొగరకుంట (మద్ది, మూలుగు లేక తొగర చెట్టు – *Morinda tinctoria* మీదుగా), కరకముక్కల (త్రిఫలాలలో ఒకటైన కరక వృక్షం – *Terminalia chebula* మీదుగా), జీలుగుమిల్లి, సొరకాయలపేట, కానుగమాకులపల్లె, చీకటిమానిపల్లె (చీకటి కానుగ చెట్టు – *Garcinia pictoria* - మీదుగా), జువ్వలపాలెం, ముదుపుల జువ్వి, రచ్చమఱ్ఱి, వంకమద్ది, వెలగమాకులపల్లె, దురదకుంట, తీటకల్లు (దూలగొండి లేక తీటతీగ మీదుగా), పెసలబండ, సజ్జలదిన్నె, పాదిరికుప్పం, పాదిరేడు (పాదిరి + ఏడు – పాదిరి లేక పాటల వృక్షం – *Bignonia suaveolens* - మీదుగా), గోగువలస, వావిలికొలను, తిప్పలదొడ్డి (తిప్పతీగ మీదుగా), వక్కలంక, వక్కలూరు,

వక్కలగడ్డ, చెక్కవాడ (కొన్ని ప్రాంతాలలో వక్కచెట్టును చెక్క చెట్టు అంటారు.), పులిందమాను రేవు (పులింద చెట్టు మీదుగా), చేమగడ్డ, చేమంతి లంక, మొగలికుదురు, మొగలితుర్రు (మొగల్తూరు), సారలంక, తూటిగుంట, పూచికపాడు, దర్భగూడెం, తామరాడ, తుంగలోవ, రక్కిసగొంది, తోటకూరపాలెం, జాజిలంక, నిమ్మకూరు (ఒకప్పటి నిమ్మకుర్రు జన వ్యవహారంలో నిమ్మకూరుగా మారింది. ఆంధ్ర ప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి , మహానటులు కీ.శే. యన్‌టిఆర్ స్వస్థలమైన యీ గ్రామం కృష్ణాజిల్లా పామర్రుకు సమీపంలో వుంది), ఈతముక్కల, ఈతలపాడు, ఈదులమూడి, ఈదుపల్లి, ఈదుల వలస, యిప్పనారు, చామర్రు (చామ + మర్రు), చామలూరు (చామధాన్యం మీదుగా.), ఇల్లెందు, ఇల్లంతకుంట (ఇల్లంత లేక ఇలివెంద లేక ఇల్లెందు చెట్టు మీదుగా), ఇందుగపల్లె (ఇందుగ లేక ఇందుప చెట్టు - *Clearingnut tree - Strychnos potatorum -* మీదుగా), మిరియపు కోట వగైరా వగైరా.

ఈల మొక్క మీదుగా ఈల కొలను, ఈల ప్రోలు, ఈల చెట్ల దిబ్బ వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. సముద్ర తీరాలలో ఉప్పుమడుల సమీపంలో పెరిగే మొక్క ఈలకూర లేక ఈల మొక్క *(Common Indian Saltwort-Suaeda maritima)*. ఇది చెనోపోడియేసీ *(Chenopodiaceae)* కుటుంబానికి చెందినది. కరవు కాటకాలలో పేదలు దీనిని ఆకుకూరగా వాడతారు. దీని ఆకులు ఉప్పగా వుంటాయి. పెళ్లాన్ని ఏదో వంకతో కొట్టాలని చూసే మొగుడు 'ఈల కూరలో ఉప్పు తక్కువైందని' కొట్టాడని సామెత ! లేకపోతే ఈలకూరలో ఉప్పు తక్కువవడమేమిటి?

'వేము' అంటే వేప చెట్టు *(Azadirachta indica)*. ఇది మనకు సర్వ సాధారణ వృక్షం. దీని పేరు మీదుగా ఎన్నో గ్రామ నామాలేర్పడ్డాయి. మచ్చుకు కొన్ని చూడండి. వేముల, వేంపాడు, వేంపెంట, వేంపల్లి, వేములచేడు, వేములవాడ, వేమూరు, వేములూరిపాడు, వేముల పల్లి, వేముల కొండ, చిట్టెంల (చిట్టి వేముల), వట్టెంల (వట్టి వేముల), కల్లెంల (కల్లు వేముల), చివ్వెంల (చివ్వ వేముల——> చివ్వ అంటే యుద్ధము-*battle.* బహుశా 'పోరు మామిళ్ల' లాగా ఆ వేప చెట్ల తోపులో ఏదన్నా యుద్ధం జరిగితే చివ్వెంల అనే గ్రామ నామం ఏర్పడి వుండవచ్చు.), బాలెంల (బాల వేముల), వడెంల (వడ వేముల - వడ అంటే ఉత్తర దిక్కు అని అర్థం.), వడ్డెంల (వడ్డె వేముల- వడ్డె వారు అంటే ఓఢ్ర దేశాన్నుంచి వచ్చి స్థిరపడిన వడ్డెర వారు), పశు వేముల (వేప చెట్లున్న పచ్చిక బీడులో పశువులు మేయడాన్ని బట్టి యీ గ్రామ నామం ఏర్పడి వుంటుంది.).

జంతువుల, పక్షుల పేర్ల మీదుగా సింగూరు (సింగ + ఊరు), సివంగులపాలెం, సింగపూరు (సింగపురము), సింహపురి (ఇది నెల్లూరు ఒకప్పటి పేరు), సింహాచలం, పులిపాడు, పులివెందుల, పులికొల్లు, పులిపాక, హులికల్లు (పులికొండ), చిరుతపల్లి, ఏనుగు గుమ్మ, ఏనుగుపాలెం, కరిచేడు, కరికేరి, ఏన్కూరు (ఏనిక +ఊరు; ఏనిక అంటే ఏనుగు), కరేడు (కరి + ఏడు : కరి అంటే ఏనుగు), ఆనెకాదు (మలయాళంలో ఆనె అంటే ఏనుగు), ఆనెగొంది (కన్నడంలో ఆనె అంటే ఏనుగు), జింకలపాలెం, మనుబోతులగుంట, ఎడ్లపల్లి, ఎడ్లపాడు, ఎడ్లగాడి, ఎనుముదుర్రు (యనమదుర్రు), ఎనుముల చింతల, పశువుల లంక, లేళ్లవాయి, గొర్రెపాడు, మేకపాడు, ఇర్రింకి (ఇర్రి అంటే కృష్ణజింక - *Black Buck*), కిటిమల (అంటే పంది కొండ. కిటి అంటే పంది), బర్రిపాడు, దూళ్లవాగు, పందిపాడు, దున్నపోతులపాలెం, ఈగలపాడు, దోమలగూడ, దోమకొండ, దోమాడ, చీకటీగలపాలెం (చీకటీగ అనేది ఓ కీటకం), కుక్కపల్లి, నక్కలపాడు, నక్కబండ, నర్మెట్ట (నరి అనే ప్రాక్ ద్రావిడ పదానికి నక్క అని అర్థం. నర్మెట్ట అంటే నక్క కొండ అన్నమాట.), లేళ్లపాడు, హంసలదీవి, హంసవరం, పాముూరు, పాంపల్లి, పాముల పర్రు, పాందువ్వ (పాము + దువ్వ), నాగరదోణ (కర్ణాటక), చిలుపూరు (చిలువ + ఊరు - చిలువ అంటే పాము), కుందేళ్ల గుంట, కుందేటిపల్లి, పిల్లిపాడు, దుప్పులపాలెం, కోతులగొంది, కాకినాడ, కాకులమర్రి,

కాకులకొండ, కాకాని (కాకి + కాని), కాకూరు, కాకి, కాకిరాల, కాకునూరు, కాకులపల్లి, కాకతోపు (కాక అంటే మలయాళంలో కాకి), గెద్దాడ, దేగపూడి, ఎలకవాడ, తొండబావి, కోడిపుంజు వలస (విశాఖ జిల్లా అరకు మండలం), కోడిపల్లి, ఇఱ్ఱిపాక, గుఱ్ఱంబయలు, మేకల చెరువు, నెమలికల్లు, నెమలిపురి, నెమళ్లపూడి, నెమలిదిన్నె, నెమళ్లపల్లి, మయిలక్కాడ్ (మలయాళంలో మయిల్ అంటే నెమలి), కోకిలతోట, గువ్వకల్లు, దేగలహాళు, కప్పగల్లు, కప్పలబండ, మీనవోలు, మీనహళ్లి, మిడుతూరు, తొండలదిన్నె, తొండూరు, కొంగంచెర్ల, కొంగలమఱ్ఱి, కొక్కెర పల్లి, కొక్కెర బెల్లూరు, కొక్కిరాయి లంక, కొంగర, కొంగపాడు, పిచ్చుకల గుడి పాడు, చిలకలపూడి, చిలకపాడు, చిలకలూరు, వవ్వా(ళ్)కావు (కేరళ – గబ్బిలాల అడవి – *Bat forest*), సొర్లగొంది (సొరచేపల మీదుగా), తేళ్ల, తేలుకుట్ల, బిచ్కుంద (బిచ్చు అంటే తేలు. బిచ్చు కుంట → బిఛ్‌కుంద → బిచ్కుంద) ఉడుమూరు, తిత్తిరగొంది (తిత్తిర పక్షి మీదుగా) వగైరాలు.

కోడు, అప్పి, ఆవ లేక లోవ అంటే నీరు నిలిచిన పల్లపు భూమి. అలా ముదసరలోవ, కుమ్మరిలోవ, బొద్దలోవ (బొద్ద అంటే మేడిచెట్టు) వగైరా గ్రామ నామాలు 'లోవ'తో ఏర్పడ్డాయి. ఇక ఆవ శబ్దమే 'ఆము' → 'ఆం' గా రూపాంతరం చెంది గంజాం (గంజి + ఆం), పిట్లాం (పిట్టల + ఆం), యానాం (యాన + ఆం), మల్లాం (మల్ల + ఆం), పాలాం (పాల+ ఆం), రాజాం (రాజ + ఆం), ఇప్పటాం (ఇప్ప చెట్టు లేక ఇప్పటపు చెట్టు – *Butter tree or Mahua tree - Madhuca indica or Bassia latifolia )* పేరు మీదుగా 'ఇప్పటపు ఆవ' అనే గ్రామ నామం ఏర్పడి అదే 'ఇప్పటాం'గా రూపాంతరం చెంది ప్రస్తుతం ఇప్పటం అని పిలువబడుతూంది.) ఇంకా యిలాంటివే తెర్లాం, బుద్దాం, కోస్తాం, చీకటాం (చికటాం), సికదాం, లుకలాం, వెంపటాం, దుర్గాం, తెలుగాం, శంభాం, చిలకాం, పంగాం, రేగాం, వాలుగాం, కుందాం, కోటాం వగైరా వగైరా గ్రామ నామాలు అలా ఏర్పడినవే.

వాక, వీధి పేర్ల మీదుగా బావురువాక, గాజువాక, దుబ్బాక (దుబ్బు + వాక) గూడెంకొత్తవీధి, బాటసింగారం, త్రోవగుంట, నడవపల్లి వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

'కాని' అంటే నీటి ప్రవాహం. కాకి + కాని → కాకాని; వ్యాసకాని; కానిపాక్కం (పాక్కం అంటే రేవు); చింతకాని; మట్టికాని; రేగాని (రేగు + కాని) వగైరా గ్రామ నామాలు అలా ఏర్పడినవే !

'దండ' అంటే సామీప్యము *(nearness)*. ఇంగ్లిష్ భాషలో *'Near"* లాగానే చాల భారతీయ భాషలలో 'నేర్', 'నేరి', 'నేరు' అంటే సామీప్యమనే అర్థం – సుందండ, వెలిదండ, పొన్నేరి, అమల్‌నేర్, బికనేర్, పలమనేరు వగైరా గ్రామనామాలిలాగే ఏర్పడ్డాయి.

'పెంట' అంటే పశువుల లేక గొఱ్ఱెల శాల *(An enclosure in which a herd of cattle or a flock of sheep are kept)* అని అర్థం. క్రమంగా ఆ పదానికి 'గ్రామ శివారు' *(A suburb of a village)* అనే అర్థం స్థిరపడింది. రోళ్లపెంట, తుమ్మల పెంట, గొల్లపెంట, చుండుపెంట గ్రామ నామాలిలాగే ఏర్పడ్డాయి. అన్నట్లు 'చుండు' అంటే (నేల) ఆవిరైపోయి ఎండిపోవడం *(to evaporate or dry up)* అని అర్థం. 'చుండు' మీదుగా చుండూరు, చుండుపల్లి, చుండూరు పల్లి, చుండు పెంట వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

'బుక్కావాడు' అంటే కుంకుమాది సుగంధ ద్రవ్యాలు అమ్మేవాడు *(a perfumer)*. ఈ వృత్తి దారుల పేరు మీదుగా బుక్కాపురం, బుక్కాయి పల్లి, బుక్కాయి గూడెం, బుక్కల గొంది, బుక్కపట్నం వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

మన గ్రామ నామాలలో హెచ్చు శాతం ఏదో ఒక విధంగా నీరు లేక నీటి వనరులకు సంబంధించినవి గానే వుంటాయి. చూడగానే అలా కనుపించని గ్రామాలలో కూడా హెచ్చుశాతం నీటికి సంబంధించినవి గానే వుండడం మనం గమనించవచ్చు. కలపఱ్ఱు, కలపూడి, కలకోట, కలమళ్ల, కలమట, కలటూరు, కలగర వగైరా ఊళ్లపేర్లు నీటి వనరుల

మీదుగానే ఏర్పడ్డాయి. తెలుగులో 'కలము' అంటే ఓడ. 'కలయంపి' అంటే కలాంపి చల్లే నీరు. 'కలత' అంటే *'turbidity in water'* అనే అర్థం కూడా బ్రౌన్ నిఘంటువులో యివ్వబడింది. ఇక సంస్కృతంలో చూడండి-

కలశ - *a pot or jar or a pitcher* - కుండ.

కల అనువాదిన్ - వాన నీటిని త్రాగే చాతక పక్షి - వాన కోయిల.

కలహంస - రాజ హంస.

కల అంకుర - సారస కొంగ *(Saras Crane)*

కల విశుద్ధ - స్వచ్ఛమైన నీటిలా తేట తెల్లముగా.

కలంకుర - (నీటిలో ఏర్పడే) సుడిగుండం.

కలకః - ఓ రకం చేప.

'కలంబికా' అన్నా 'కలంబూ' అన్నా నీటిలో పెరిగే ఓ మొక్క

కలశమ్ - మహా సముద్రం *(Ocean)*

'కలశాంబోధి' అన్నా, 'కలశార్ణవ' అన్నా, 'కలశోదధి' అన్నా మహా సముద్రానికి పర్యాయ పదాలు.

'కలాచిక' లేక 'కలాచీ' అంటే ఓ రకమైన కుండ.

ఇలా కల అనే పదాన్ని మనం నేటి తెలుగు నిఘంటువులలో చూడలేకున్నా, సమగ్రంగా విశ్లేషించి చూస్తే కల అనే పదం ప్రస్తుతం వాడుకలో లేని నీటికి సంబంధించిన పదమని రూఢిపడుతుంది.

పైన పేర్కొన్న కలపూడికి ముందు 'మంచి' అనే శబ్దం చేరి మంచి కలపూడి గ్రామ నామం ఏర్పడింది. ఈ 'మంచి' శబ్దం కూడా మంచినీటి వనరుకు సంకేతమే. ఆమంచి, సోమంచి (సోమ + మంచి), శంకరమంచి, కారుమంచి, కూచి మంచి, కుసుమంచి, పెనుమంచి, జనమంచి, తలమంచి, మద(న) మంచి, మంచిలి, యలమంచిలి, పెనుమంచిలి, కొడమంచిలి వగైరా వగైరా గ్రామ నామాలు 'మంచి' శబ్దం నుండి ఏర్పడ్డవే.

నుయ్యి లేక బావి నుండి - నుయ్యి +ఊరు → నూరు. దీనితో ఆకునూరు, ముద్దనూరు, కాకునూరు, మడనూరు వగైరా గ్రామనామాలేర్పడ్డాయి. అలాగే 'నుయ్యి' శబ్దాన్నుంచే సంతనూతులపాడు, కొర్రనూతుల, రావినూతుల, నూతులపాడు గ్రామనామాలేర్పడ్డాయి. (వీటన్నింటిలోను 'నూతుల' శబ్దం 'నూతల'గా రూపాంతరం చెందింది.)

మన తెలుగు భాషలో ఒకప్పుడు వున్న పదాలు కొన్ని యిప్పుడు లుప్తమైపోయాయి. అయితే కొన్ని పదాలు ద్రావిడ భాషా కుటుంబంలోని యింకొన్ని భాషలలో యింకా ప్రాచుర్యంలో వున్నాయి.

'కూయి' భాషలో 'ఇదు' అంటే 'ఇల్లు'. 'ఇడి' అంటే 'ఇండ్లు కలిగినది' - గ్రామము.

అలా 'ఇడి'తో యీ క్రింది గ్రామ నామాలేర్పడ్డాయి.

పంగు + ఇడి —> పంగిడి (పంగువు అంటే కుంటి వాడు. ప్రకాశం జిల్లా 'పంగులూరు' గ్రామంలా)

బొమ్మ + ఇడి —> బొమ్మిడి (బొమ్మ అనే పదం 'బ్రాహ్మణ' సూచకం.)

తుమ్మ + ఇడి —> తుమ్మిడి

పాము + ఇడి —> పామిడి

గరువు + ఇడి —> గరువిడి —> గరివిడి.

పేరిమి + ఇడి —> పేరిమిడి

'ఇడి' అనే పదం తెలుగులో యింకా ప్రాచుర్యంలో వున్నప్పుడో లేక ఆ యా ప్రాంతాలలో ప్రాక్ ద్రావిడ భాష ప్రాచుర్యంలో వున్నప్పుడో పై గ్రామ నామాలేర్పడి వుంటాయి.

'కూయి భాషలో కుడ అంటే భార్య అని అర్థం. నల్గొండ జిల్లా సూర్యా పేట సమీపంలో 'కుడ కుడ' అనే చిన్న గ్రామముంది. (అయితే కుఱ కుఱ అంటే స్వల్పము అనే అర్థం. చిన్న గ్రామం కనుక ముందుగా 'కుఱ కుఱ' అని పిలువబడి అదే క్రమంగా 'కుడ కుడ'గా రూపొందడానికీ అవకాశముంది. మార్వార్, బార్మేర్ వగైరా పదాలు 'మార్వాడ్' 'బార్మేడ్' గా పలుకబడుతున్నట్లు యిక్కడ కూడా 'కుఱ కుఱ' 'కుడ కుడ'గా రూపాంతరం చెంది వుంటుంది.)

పశ్చిమ గోదావరి జిల్లాలో 'పక్కిలంక' అనే గ్రామముంది. 'పక్కియ' అంటే పక్కె చెట్టు. శబ్దరత్నాకరములో దీని అర్థం 'పిచులము' అని యివ్వబడింది. 'పిచులము' అంటే గన్నేరు చెట్టు, ప్రత్తి మొక్క అని రెండర్థాలున్నాయి. అయితే 'పక్కి' అంటే మాత్రం పక్షి (పులుగు) అనే అర్థం (బహుశా పక్షి శబ్దానికి 'పక్కి' వికృతి కావచ్చు. అయితే యీ పక్కిలంకను 'ప్రక్కి లంక' అని కూడా స్థానికులు వ్యవహరించడాన్ని బట్టి 'ప్రత్తి' మొక్క పేరు మీదుగానే యీ గ్రామ నామం ఏర్పడి వుంటుందని తోస్తుంది. అయితే 'పక్కి' అంటే పెంగో భాషలో 'వెదురు'. అలా వెదురు మీదుగా కూడా యీ గ్రామ నామం ఏర్పడి వుండవచ్చు.

బౌద్ధమతం వ్యాపించిన కొన్ని ప్రాంతాలలో ఆ మత ప్రభావం కారణంగా కొన్ని గ్రామ నామాలేర్పడ్డాయి.

బుద్ధ ఆవ ——> బుద్ధ ఆం ——> బుద్ద ఆం ——> బుద్దాం.

బుద్ధ ఆల ——> బుద్ధాల ——> బుద్దాల

బుద్ధవరం వగైరాలు యిలా ఏర్పడ్డవే.

విదేశీ సామ్రాజ్య వాదుల ఆక్రమణ కారణంగా ఏర్పడ్డ కొన్ని గ్రామ నామాలు చూద్దాం. ఇంగ్లిష్ పాలెం, ఫ్రెంచి పేట, పరాసు పేట (పరాసులంటే ఫ్రెంచి వారు), దేనిష్‌పేట, (డేనిష్ – డెన్మార్క్‌కు చెందిన వారు), వలంద రేవు, వలందపల్లి (వలంధర) యిలా ఏర్పడ్డవే (ఒలందలు లేక వలందలు అన్నా డెన్మార్క్ దేశీయులే).

శాసనాల ఆధారంగా గ్రామ నామాలు నిర్ధారించడం కొంచెం చిక్కులతో కూడుకున్న పని. శాసనాలలో పేర్కొన బడిన గ్రామ నామం యొక్క రూపం ఆనాడు ఆ గ్రామాన్ని ఎలా పిలుస్తున్నారనే దాన్ని బట్టీ, ఆనాటి భాషా స్వరూపం ఎలా వుందన్న దాన్ని బట్టీ ఆధాపడి వుంటుంది. అంతేకాక, ఆ శాసన లేఖకుడు ఆ గ్రామ నామాన్ని వ్రాయడంలో చేసే పొరపాట్లను కూడా మనం దృష్టిలో వుంచుకోవాలి.

ఉదాహరణకు తెలుగు భాష యొక్క ఒకానొక పరిణామ దశలో శాసన లిపిలో తాడికొండ గ్రామం 'తాన్టి కొన్ట' గా వ్రాయబడింది. అదే శాసనంలో 'వాడు' అనడానికి 'వాన్టు' అని వ్రాయబడింది. 'వాన్టు' – 'వాడు' అయినప్పుడు 'తాన్టి' ని 'తాడి' అనీ 'కొన్ట' ను 'కొండ' అనీ మనం గ్రహించాలి.

గ్రామ నామాల విశ్లేషణను చేపట్టిన తొలి రోజులలో మోదుకూరు గ్రామానికి పూర్వ రూపం 'మోదుగ కుర్రు' అని (మోదుగ ఒక వృక్షం పేరు. కుర్రు అంటే ప్రవాహం.) భావించాను. కాని శాసనాలలోనూ, కైఫీయ్యత్‌లలోనూ యీ గ్రామ నామం 'మ్రోంత కుర్రు' గా కనుపించడాన్ని బట్టి దీని మూల రూపం మ్రోతతో కూడిన కుర్రు (ప్రవాహం) అనే భావంతో ఏర్పడి వుంటుందని అనిపిస్తున్నది.

నరసరావు పేట సమీపంలోని 'చేజర్ల' గ్రామ నామం యిప్పుడు విశ్లేషించి చూద్దాం. ఒకప్పుడు శరీర అవయవాలన్నింటితో గ్రామ నామాలేర్పడినట్లే చేయి మీదుగా యిది ఏర్పడి వుండవచ్చునని భావించాను. (చేయి+చెరువుల

——> చేయి + చెర్ల ——> చేజెర్ల). కాని చేజెర్ల కపోతేశ్వరాలయంలోని శాసనాలను పరిశీలిస్తే ఆ గ్రామ నామం ఒకప్పుడు 'చేరుంజెర్ల' అని అర్థమౌతుంది. 'చేరు' అంటే వరుసగా నాలుగైదు చెరువులు ఒకదానికొకటి గొలుసులా కలుపబడి వుండడం. 'చేరున్ చెరువుల' లేక 'చేరుంజెర్ల' అంటే అలా కలుపబడిన చెరువులు కల గ్రామం అదే కాల గమనంలో రూపాంతరం చెంది 'చేజెర్ల' అయిందనే నిర్ధారణకు మనం రావచ్చు.

**తమిళ గ్రామనామాలు :** ఇప్పుడు కొన్ని తమిళ గ్రామ నామాంతాలు విశ్లేషించి చూద్దాం. తమిళ ప్రాంతాల్లో గ్రామ నామాంతాలు యిలా వుంటాయి. కరై (అమింజి కరై), కాడు (ఏర్కాడు), పట్టు (చెంగల్‌పట్టు), పేట్టై (తొండియార్ పేట్టై), కోట్టై (పుదుక్కోట్టై), వనమ్ (తిండి వనమ్), గుడి (మన్నార్ గుడి), కుళమ్ (కురివి కుళమ్, పెరియ కుళమ్), కురిచ్చి (పాంచాల కురిచ్చి), మంగళమ్ (రాజసింగ మంగళమ్), పాడి (కాట్పాడి), కోడి (ధనుష్కోడి), ఊర్ (పోరూర్), పాళైయమ్ (ఉత్తమ పాళైయమ్), కోయిల్ (నాగర్ కోయిల్), తీవు (కచ్చ తీవు), వలసు (పంది వలసు), తురై (ఆదు తురై), పట్టి (ఆండి పట్టి), సముద్రమ్ (అంబా సముద్రమ్), పాక్కమ్ (అచ్చరప్పాక్కమ్), వాక్కమ్ (విల్లి వాక్కమ్), నేరి (ఆరుముగ నేరి), కుడి (ఆలక్కుడి), తోప్పు (చందన తోప్పు), పట్టణమ్ (నాగ పట్టణమ్), వాసల్ (చిత్తన్న వాసల్), విదుది (చిరువా విదుది), మలై (అన్నా మలై), నాడు (చెట్టి నాడు), కోవిల్ (అళగర్ కోవిల్), మేడు (పాల మేడు, పీల మేడు), పట్టినమ్, (దేవీ పట్టినమ్), కున్రమ్ (తిరుక్కళిక్కున్రమ్), నగరమ్ (అల్లీ నగరమ్), నీర్ వీళ్చ్చి (కుంబక్కరై నీర్‌వీళ్చ్చి), దక్కి (అమర దక్కి) వగైరా వగైరాలు.

'కదర్‌గరై' అనే గ్రామ నామాంతం వుంటే అది సముద్ర తీరం (బీచ్) అని భావించాలి. 'దురై ముగమ్' అని వుంటే అది ఓడరేవు. 'ఏరి' అంటే సరస్సు. 'కుళమ్' అన్నా 'తడాగమ్' అన్నా, 'కుట్టై' అన్నా చెరువు. 'తీవు' లేక 'దీవు' అంటే దీవి. 'ఆరు' అన్నా, 'నది' అన్నా నది అని అర్థం. 'అరువి' అన్నా, 'ఓడై' అన్నా సెలయేరు.

అత్తిపట్టు, అత్తూర్, కీళాత్తూర్ వగైరా గ్రామ నామాలు మేడి చెట్టు మీదుగా ఏర్పడ్డాయి. (తమిళంలో అత్తి అంటే మేడిచెట్టు. కీళ్ అంటే తూర్పు)

తూర్పు కోట అనే అర్థంలో కీళ్‌కోట్టై ఏర్పడినట్లే మేల్ కుడి, మేల్ మరువత్తూర్ గ్రామ నామాలు కూడా ఏర్పడ్డాయి. (మేల్ అంటే తమిళ భాషలో పడమర అని అర్థం).

మన పులిపాడు లాగా తమిళంలో పులియూర్ అనే గ్రామం వుంది.

దేవకోట్టై, శివకాశి, నటరాజన్ కోట్టై, పద్మనాబ పురమ్, గంధర్వ కోట్టై, దేవీ పట్టినమ్, ఆరుముగ నేరి (తమిళంలో సుబ్రహ్మణ్య స్వామిని ఆరుముగం అంటారు.), వాగ్దేవి నల్లూర్ (వాగ్దేవి అంటే సరస్వతి), అనంగూర్ (అనంగుడు అంటే మన్మధుడు), తిరు విణ్ణహర్ (పవిత్రమైన విష్ణు నగరమ్), తిరు వేంగడమ్ వగైరా వగైరా గ్రామ నామాలు దేవతల పేర్ల మీదుగా ఏర్పడ్డాయి.

మన వేమూరు లాగా తమిళ నాడులో వేంబూర్, వేంబక్కోట్టై వేపచెట్టు మీదుగా ఏర్పడ్డాయి. మన కొత్తూరు లాగా తమిళనాడులో పుదూర్, శ్రీ పెరుంబుదూర్ వగైరాలు ఏర్పడ్డాయి. మన నంబూరు లాగా అక్కడ నంబి పురమ్, మన గుర్రంపోడు లాగా అక్కడి 'కుదిరై మొళి' (కుదిరై అంటే తమిళంలో గుర్రం), మన కొండూరు లాగా అక్కడి మలైయూర్ (మలై అంటే కొండ), మన అమ్మ పాలెం, అంబాపురం లాగా అక్కడి అమ్మనేరి, అమ్మాపట్టినమ్, అమ్మాప్పేట్టై, అమ్మనూర్ వగైరాలేర్పడ్డాయి. మన నక్కపల్లి, నర్మెట్ట (నరి అంటే నక్క) లాగా అక్కడి నరిక్కుడి ఏర్పడింది. మన కోటపల్లి, కోటపాడు లాగా అక్కడి కోట్టై పట్టినమ్ ఏర్పడింది. మన తూర్పు పాలెంలా అక్కడి కీళ్ వళైవు, కీళ్ మంగళమ్ గ్రామనామాలూ, మన

పదమటలంకలా అక్కడి మేలూర్, మేల్ మరువత్తూర్ వగైరాలు ఏర్పడ్డాయి. సింగూరు, సింగపూరు, సింహాచలం, సింహపురి, సివంగులపాలెంలా తమిళనాడులో సింగమ్ పుణరి ఏర్పడింది. మన పందిపాడు లాగా అక్కడి పంది వలసు ఏర్పడింది. మన పొట్టిలంకలా అక్కడి కురుచదై తీవు ఏర్పడింది. మన అయ్యంకి, అయ్యవోలు లా అక్కడి అయ్య నేరి, అప్పా తీవు వగైరాలేర్పడ్డాయి. మన ఉప్పలపాడు, ఉప్పుగుండూరు, ఉప్పలగుప్తం లాగా అక్కడి ఉప్పుతణ్ణీర్ తీవు ఏర్పడింది. మన ఉత్తరాపల్లిలా అక్కడి ఉత్తర మేరూర్, ఉత్తర గోసమంగై వగైరాలేర్పడ్డాయి. మన రాజాం, రాజ ఒమ్మంగి, రాజోలు లాగా అక్కడి రాజపాళయమ్ ఏర్పడింది. ఇక్కడి గూడెం కొత్తవీధి లాగా అక్కడి మండపమ్ శాలై (శాలై అంటే వీధి), మన పందల పాకలాగా అక్కడి 'పందల్ కుడి', యిక్కడి సాతాను పల్లెలా అక్కడి సాత్తాన్ కుళమ్ (తుత్తుకుడి జిల్లా) ఇక్కడి మణిపురంలా అక్కడి మణియాచ్చి, యిక్కడి కురు (చ)మద్దాలి, కురు(చ)గల్లు లాగా అక్కడి కురుక్కుశాలై (కురుచవీధి) అనే గ్రామ నామాలేర్పడ్డాయి.

వృక్షాల పేర్ల మీదుగా మానూర్, తేంగాయ్ పట్టినమ్ (తేంగాయ్ మరమ్ అంటే తమిళంలో కొబ్బరి చెట్టు), వేంబూర్, వేంబార్ (వేప), ఈత్తా మొళి (ఈతచెట్టు మీదుగా), వటక్కు వళ్లియూర్ (మర్రిచెట్టు మీదుగా), వేలూర్ (వేలమరమ్ అంటే తుమ్మ చెట్టు ), అత్తిపట్టు (మేడిచెట్టు మీదుగా), చందనత్తోప్పు (గంధపు చెట్ల తోట), నెల్లికుప్పమ్ (నెల్లి అంటే పెద్ద ఉసిరి చెట్టు – ఆమలకము), అల్లి నగరమ్ (కలువ) వగైరా వగైరాలేర్పడ్డాయి. తమిళంలో 'అరస' అంటే రావిచెట్టు. అరసవిల్లి గ్రామ నామం దాని మీదుగా ఏర్పడినదే.

మన కడలిలా తమిళనాడులో కడలూర్ (సముద్రం), మన వ్యాసకానిలా అక్కడ ఋషుల పేర్ల మీదుగా అగస్త్యన్ పల్లి, వ్యాసార్పాడి వగైరాలేర్పడ్డాయి. వాణిజ్యం జరిగే గ్రామాన్ని సూచిస్తూ వాణియంబాడి (తెలికల – నూనె అమ్మే - కులస్థుల లావాదేవీలను వాణియమ్ అంటారు.) గ్రామ నామం ఏర్పడింది. 'కుళి' అంటే తమిళంలో చెరువు. దాని మీదుగా కుళిపాళయమ్, ఊత్తుకుళి వగైరా ఎన్నో గ్రామ నామాలేర్పడ్డాయి. నల్లూరు అంటే తెలుగులో అగ్రహారం అనే అర్థం వుంది. తమిళంలో కూడా నల్లూర్, పెరియ నల్లూర్, ఆదిచ్చ నల్లూర్ వగైరాలు అగ్రహారాలే అయివుంటాయి. ఇక్కడి దొరవారి సత్రం (నెల్లూరుజిల్లా) లాగే అక్కడా దొరవారి చత్తిరమ్ ఏర్పడింది. ఇక్కడి అత్తోట (ఆ + తోట), ఇక్కుర్రు (ఈ + కుర్రు) లాగే అక్కడి ఇంగూర్ (ఇంగ + ఊర్), అంగూర్ (అంగ + ఊర్) వగైరాలు ఏర్పడ్డాయి. ఆనై అంటే తమిళంలో ఏనుగు. ఆనైకాడు అనే గ్రామ నామం ఏనుగు మీదగానే ఏర్పడింది. తమిళంలో ఇక్కు అంటే చెరకు (సంస్కృతంలో 'ఇక్షు'). కరుంబు అంటే నల్ల చెరకు. ఈ రెంటి మీదా కూడా ఇక్కుపేట్టై, కరుంబుపాళయమ్, కరుంబుక్కోట్టై వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. తమిళంలో 'ఆరు' అంటే ఎండ్రకాయ మన ఎండ్రపల్లి, పీతలపాడు లాగా అక్కడ ఆరూర్ అనే గ్రామ నామం ఏర్పడింది. 'ఆవి' అంటే చెరువు అని అర్థం. అలా ఆవూర్, ఆవియూర్ వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. మన నీరుకొండ లాగా అక్కడి 'నీర్ మలై' ఏర్పడింది. 'పేర్నహరమ్' అంటే తమిళంలో ప్రసిద్ధమైన పట్టణం అని అర్థం. పోకచెట్టు లేక వక్కచెట్టు *(Arecanut tree)* మీదుగా కందియూర్ అనే గ్రామ నామం ఏర్పడింది. (మన వక్కల గడ్డ, వక్కలంక గ్రామాలలా) తమిళంలో 'ఇందమ్' లేక 'పుళియ మరమ్' అంటే చింత చెట్టు *(Tamarindus indica)*. దీని పేరుపై మన రాష్ట్రంలో చింతలపూడి, రెంటచింతల, ముచ్చింతల, చింతలపాడు వగైరా గ్రామ నామాలేర్పడినట్లే తమిళనాడులో 'ఇందలూర్' వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. మన 'తాటిగుమ్మ' అనే గ్రామనామంలాగా అక్కడ కూడలూర్ అనే గ్రామ నామం ఏర్పడింది. (తమిళంలో కూడల్ అంటే తాటి తోపు అని అర్థం.) ఇక మన పాలదుగు, పాలవంచ, పాలకొల్లు, పాలసముద్రం వగైరా గ్రామ నామాలలా అక్కడ పాల మేదు ఏర్పడింది. తమిళంలో కూడా 'పాల్' అంటే పాలు అనీ, మంచి నీరు అనీ అర్థాలున్నాయి.

అంచేతనే పాలార్ (ఒక నదిపేరు ; 'ఆర్' అంటే నది) పాలమేదు వగైరా పేర్లు ఏర్పడ్డాయి. మన కంబం (ప్రకాశం జిల్లా), కంబం మెట్టు (నేటి ఖమ్మం - మెట్టు అంటే కొండ ; కంబం అంటే స్తంభం ; కొండ మీద స్తంభం వుంది కనుక దీన్ని కంబం మెట్టు అనీ, స్తంభగిరి లేక స్తంభాద్రి అనీ అనే వాళ్లు. క్రమంగా కంబం మెట్టు కాస్తా ఖమ్మం అయింది.) లాగానే అక్కడ ఓ గ్రామంలో వున్న స్తంభం కారణంగా తమిళనాడులో కూడా కంబం అనే గ్రామ నామం ఏర్పడింది. తమిళంలో 'కుమిళి' అంటే నీటి బుగ్గ లేక బుడగ *(Bubble)*. అయితే తెలుగులో ఊటలను బుగ్గలన్నట్లే తమిళంలో కూడా నీటి ఊటల *(Springs)* ను కూడా 'కుమిళి' అంటారు. అందుకే నీటి ఊట వున్న గ్రామాలకు తెలుగులో బుగ్గ, కాశీ బుగ్గ, బుగ్గ రామారం వగైరా గ్రామ నామాలేర్పడినట్లే తమిళనాడులో కూడా 'కుమిళి' గ్రామ నామం ఏర్పడింది. వ్యక్తుల పేరిట ఏర్పడే గ్రామ నామాలు కూడా తమిళనాడులో ఎక్కువగానే వున్నాయి. ప్రసిద్ధుడైన సుందరపాండ్యుని పేరిట 'సుందర పాండియన్ పట్టినమ్' ఏర్పడింది. గంధమ నాయకుడు అనే వీర నాయకుని పేరిట 'గందమ నాయకనూర్' (తేని జిల్లా) అనే గ్రామ నామం ఏర్పడింది. చిత్తూరు జిల్లాలోనూ, తమిళనాడులోనూ వున్న కమ్మ వారిలో అధిక సంఖ్యలోనూ, ఆంధ్ర ప్రదేశ్‌లోని కమ్మ వారిలోనూ కూడా వున్న 'గంధమనేని' వారి మూలపురుషుడు యీ గంధమ నాయకుడే. (గంధమనేని వారిది గణపర్తి గోత్రం)

తమిళంలో 'వాసల్' అంటే వాకిలి. తెలుగులో యింటియొక్క భాగాలతో యాత వాకిళ్ల (గౌడ కులస్థులుండే వూరు), పునాది పాడు, తాటి గడప, ఇని గడప వగైరా గ్రామ నామాలున్నట్లే అన్నవాసల్, చిత్తన్న వాసల్ గ్రామనామాలేర్పడ్డాయి. పుదుక్కోట్టై జిల్లాలోని చిత్తన్న వాసల్ పల్లవుల కాలం నాటి కుడ్య చిత్రాలకు ప్రసిద్ధి.

'ముయల్' అంటే తమిళంలో కుందేలు అని అర్థం. మన రాష్ట్రంలో కుందేళ్ల గుంట అనే గ్రామ నామం ఏర్పడినట్లే తమిళ నాడులోని రామనాథ పురం జిల్లాలో ముయల్ తీవు (కుందేళ్ల దీవి) అనే గ్రామ నామం ఏర్పడింది.

**కన్నడ గ్రామనామాలు :** ఇక కర్ణాటక ప్రాంతంలోని గ్రామ నామాల విషయానికొద్దాం. ప్రాచీన కన్నడ భాషలోని యీ క్రింది పదాలు ఆధునిక కన్నడ భాషలో ఎలా మారాయో చూడండి -

| | |
|---|---|
| పత్తు (పది) ——> హత్తు | పొన్ను ——> హొన్ను (బంగారం) |
| పట్టి ——————> హట్టి | పాలు ——> హాలు |
| పెసర్ (పేరు) —> హెసరు | పాము ——> హావు (నాగర హావు అంటే నాగుపాము) |
| పెరియ (పెద్ద) -> హిరియ (హీరే) | పులి ———> హులి |
| పంప (తుంగ భద్రానది)——> హంప | ప్రెగ్గడ (మంత్రి, కరణం) ——> హెగ్గడ |
| (దీని మీదుగానే హంపి ఏర్పడింది.) | పల్లి ——> హళ్లి |

కర్ణాటకలోనూ, యితర రాష్ట్రాలలోని కన్నడ ప్రభావం వున్న ప్రాంతాలలోనూ గ్రామ నామాంతాలు ఎలా వుంటాయో కొన్ని మచ్చుకు చూద్దాం.

సప్టి (చిట్ సప్టి), హళ్లి (హగరి బొమ్మన హళ్లి, హర్పన హళ్లి, కొడిగెన హళ్లి), హాలు (ఉప్పర హాలు), తంగడి (బెల్తంగడి, రాక్షసి తంగడి), ఊర్ (బెంగళూర్, హోసూర్), వాడి (వాడి, గులవాడి, కురుద్వాడి), ఏరి (అట్టేరి), పూర్ (అజ్జంపూర్), ఆబాద్ (మునీరాబాద్), హెప్పళ్ (అక్కి హెప్పళ్), సన్ర, సంద్ర (అమ్మసన్ర, బొమ్మ సంద్ర), సముద్రమ్ (ద్వార సముద్రమ్), పుర (అమిర్త పుర), పురమ్ (ఆనంద పురమ్), కల్ (ఆనేకల్), కుప్పే (అరళ కుప్పే), కెరె (బళ్లి కెరె), పేట (బంగార పేట), గుళా (బెల్ గుళా), కరె (అరసిక్కరె), నహరే (బొమ్మ కొండ నహరే), నగర్ (చామరాజ నగర్), కొప్పాల్ (చందగిరి

కొప్పాల్), పట్టణ (చెన్నరాయ పట్టణ), హండి (చిన్నద గుడి హండి), దుర్గ (చిత్ర దుర్గ), కుట్టా (దావర్ కుట్టా), గొంది (దేవన్ గొంది), పురి (ధర్మపురి), వరం (ధర్మ వరం), పేలే (దొడ్ పేలే) వగైరా వగైరాలు.

మన చేల్లపల్లి, మారుపూడి, మోరంపూడి వున్నట్లే, కర్ణాటకలో 'తక్రహళ్ళి' వుంది (చేల్ల, మారు లేక మోరు అంటే తెలుగులోనూ, తక్ర అంటే కన్నడంలోనూ మజ్జిగ అని అర్థం).

మన బ్రాహ్మణ పల్లి లాగానే కర్ణాటకలో బొమ్మన హళ్ళి ఏర్పడింది. (బొమ్మన అనేది 'బ్రాహ్మణ' పదానికి రూపాంతరం). అలాంటి బొమ్మన హళ్ళి పేరున్న గ్రామాలు ఒకటి కంటే ఎక్కువ వున్నందున హగరి నది ఒడ్డున వున్న బొమ్మన హళ్ళిని 'హగరి బొమ్మన హళ్ళి' అని పిలిచారు. మన పెద్ద పల్లి లాగా అక్కడి హిరెహళ్ళి (హిరియ లేక హిరె అంటే పెద్ద). మన చినపాలెం, చినరావూరు లాగా అక్కడి చిక్ బల్లాపూర్ (చిక్ అంటే చిన్న). చిక్‌మగళూర్ వగైరాలేర్పడ్డాయి. చిక్ మగళూర్ అంటే 'చిన్న అమ్మాయి పల్లె' అని అర్థం. ఈ నియోజక వర్గం నుంచి ఒకప్పుడు భారత మాజీ ప్రధాని కీ. శే. ఇందిరా గాంధీ పార్లమెంటుకు పోటీ చేసి గెలుపొందారు. కేరూర్ అంటే 'చెరువూరు' అని అర్థం (కేరె + ఊర్; కేరె అంటే చెరువు).

దొమ్మర అనే కులాన్ని కన్నడలో దొంబర అంటారు. అలా 'దొంబర హళ్ళి' అనే గ్రామ నామం ఏర్పడింది. మన కొత్త పల్లిలా కర్ణాటకలో 'హోసహళ్ళి', 'హోసకోట', 'హోసూర్' (ఇది కన్నడ ప్రభావమున్న తమిళనాడు ప్రాంతంలోనిది) గ్రామనామాలేర్పడ్డాయి (హోస అంటే కన్నడంలో కొత్త అని అర్థం). మన ప్రకాశం జిల్లాలోని మేదరమెట్ల గ్రామ నామం లాగా మేదరవృత్తి వారి మీదుగా మేదర హళ్ళి, ఉప్పర కులస్థుల మీదుగా ఉప్పర హాల్ (ఇది కర్నూలు జిల్లా ఆదోని తాలూకాలో వుంది), ఉప్పర హోసహళ్ళి వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. మన పామూరు, పాముల పాడు, పాముల పర్తి లాగా కర్ణాటకలో నాగర హాళు, నాగర కణివె, నాగర దోణ వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

రావి చెట్టు మీదుగా రావి హాళు, మన సంతరావూరు, సంత నూతలపాడు, సంత మాకులూరు లాగా సంతే కూళ్లూరు, మన కొత్తకోట లాగా అక్కడి హోసకోటె, మన ఇటికల పూడి లాగా అక్కడి ఇటిక హాళు, ఏనుగు మీదుగా ఆనేకల్, ఆనెకల్లు, ఆనెగొంది, కరూర్ వగైరాలేర్పడ్డాయి. (కన్నడ భాషలో ఆనె అన్నా, కరి అన్నా ఏనుగు అని అర్థం) మన పెనుగొండ లాగా అక్కడి హిరేకల్లు ఏర్పడింది. కంసాలి లేక అగసాలె వారి మీదుగా అగసల దిన్నె, మన మీనవోలు లాగా మీన హళ్ళి, మన పులిచెర్ల లాగా అక్కడి హులికేరె, మన పులికుంట లాగా అక్కడి హులికుంట, హులి కణవె, మన పొన్నూరు లాగా అక్కడి హొన్నూరు (పొన్ను అన్నా, హొన్ను అన్నా బంగారం), మన తాళ్ల చెరువు, తాటి గుమ్మి వగైరా గ్రామ నామాలలాగా అక్కడి తాళ్ల కెరె, మినుముల మీదుగా ఉద్ది హాళు (ఉద్దు అంటే కన్నడంలో మినుములు), మన కొండపల్లి, కొండమీది పల్లె, బండమీది పల్లె లాగా అక్కడి కలుగోడు, మన కోడిపల్లి లాగా అక్కడి కోడిహళ్ళి, పూజారుల మీదుగా పూజారి హళ్ళి, వెదురు పొదల మీదుగా బిదురు కొంట (కన్నడ భాషలో బిదుర్ అంటే వెదురు; కొంట అంటే కుంట), మన కొచ్చెర్ల (కొత్త చెరువుల ——> కొచ్చెర్ల) లాగా అక్కడి హోస కేరి, మన మంత్రి పాలెం లాగా అక్కడి హెగ్గడ హాలు, పింజారి హెగ్గడ హాలు వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి (ప్రెగ్గడ అన్న పదం కన్నడలో హెగ్గడగా రూపొంది హెగ్గడ వారు లేక హెగ్గడ వరు అనే బ్రాహ్మణ శాఖ ఒకటి ఏర్పడింది. కర్ణాటక మాజీ ముఖ్యమంత్రి కీ. శే. రామకృష్ణ హెగ్డే, ధర్మస్థల మంజునాథ స్వామి దేవాలయ ధర్మ కర్తల సంఘాధ్యక్షులు శ్రీ వీరేంద్ర హెగ్గడవరు యీ శాఖ వారే !).

మన చిత్తూరు జిల్లా పాల సముద్రం లాగా అక్కడి హాల సాగరం, హాల హరివి వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి (హాలు అంటే కన్నడ భాషలో పాలు. తెలుగులో లాగే కన్నడంలో కూడా హాలు అంటే పాలు అనీ, మంచి నీరు అనీ అర్థాలు). మన కొత్తపేట (తూ.గో. జిల్లా) లాగా కర్ణాటకలో హోస్పేట ఏర్పడింది. మన వ్యాసకాని (ప.గో. జిల్లా), తమిళనాడులోని

వ్యాసార్‌పాడి లాగా కర్ణాటకలోని బళ్లారి జిల్లా హోస్పేట తాలూకాలో వ్యాసన కేరె, హడగల్లి తాలూకాలో వ్యాసాపురం గ్రామనామాలేర్పడ్డాయి. మన పొన్న పల్లి లాగా అక్కడి హొన్నహళ్లి (*Calophyllum inophyllum* అనే సాంకేతిక నామం కల పొన్న చెట్టు దక్షిణ భారత దేశమంతటా కనుపించే సర్వ సాధారణ వృక్షం. కన్నడంలో దీన్నే 'హెన్న' అంటారు.) వడ్రంగి లేక వడ్ల వారు అని మనం పిలుస్తూన్న వడ్లా బత్తులను కర్ణాటకలో 'వడ్ర' వారు అంటారు. ఆ కులం పేరు మీదుగా చాల 'వడ్ర హళ్లి' గ్రామాలేర్పడ్డాయి. మన తెల్లబాదులాగా అక్కడి బెలకల్లు (తెల్ల కొండ), 'బెలగోదు' (బెళ లేక బెల అంటే తెల్లని అని అర్థం) ఏర్పడ్డాయి. కర్ణాటకలోని హాసన్ జిల్లాలోని గోమఠేశ్వర క్షేత్రంలోని 'శ్రవణ బెళ గొళ' అంటే 'శ్రమణులు స్నానం చేసే తెల్లని (శుభ్రమైన నీరు కల) సరస్సు' అని అర్థం.

వ్యక్తుల పేర్ల మీదుగా కర్ణాటకలో ఏర్పడిన గ్రామ నామాలు కొన్ని చూద్దాం. శ్రీకృష్ణ దేవరాయలు తన తల్లి నాగులాంబిక పేరిట నిర్మించిన నాగులా పురం అనే గ్రామాలు బళ్లారి, అనంతపురం జిల్లాలలో కనుపిస్తాయి. హోస్పేట సమీపంలోని నాగెన హళ్లి కూడా ఆమె పేరిట కృష్ణ దేవరాయలచే నిర్మించబడినదే.

శ్రీ కృష్ణ దేవరాయల వద్ద సేనానులుగా (నాయంకరులు లేక నాయఁకరులుగా) పనిచేసిన కమ్మ నాయకుల పేరిట ఏర్పడిన యీ క్రింది గ్రామ నామాలు చూడండి.

బుర్ర నాయకన హళ్లి (బళ్లారి తాలూకా)

పాపి నాయకన హళ్లి (హోస్పేట తాలూకా, బళ్లారి జిల్లా)

కొండి నాయకన హళ్లి (హోస్పేట తాలూకా, బళ్లారి జిల్లా)

అనంతరం యీ నాయకుల పేరిటనే కమ్మ వారిలోని యీ క్రింది గృహనామాలేర్పడ్డాయి.

బుర్ర నాయని (బుర్రనేని), బుఱ్ఱముక్కుల, బుఱ్ఱా (వీరిది లబలబ గోత్రం)

పాపి నాయని (పాపినేని). వీరివి వీరళ్ల, బీరవల్లి గోత్రాలు.

కొండి నాయని – కొండప్ప నాయని (కొండపనేని). వీరివి చెరకునూళ్ల, శ్రావస్తి, చిలవర్తి గోత్రాలు.

మన కండ్లకుంట, కండ్లకోయ, కండ్లప్యాల వగైరా గ్రామ నామాలలా అక్కడి 'కళ్ల ఘట్టి' అనే గ్రామ నామం ఏర్పడింది. మన గొల్లపల్లి, గొల్లపాలెం, గొల్లప్రోలు, గొల్లపూడి, గొల్లల మామిదాడ వగైరాలలా గొల్లవారి (యాదవుల) పేరు మీదుగా 'గొల్లర హళ్లి', మన కొంగపాడులాగా అక్కడ కొక్కర బెల్లూరు, కొక్కర చేడు, కొంగన హోసూరు వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి (కన్నడంలో కొక్కర అన్నా, కొంగ అన్నా, కొంగ అని అర్థం). మన బూడిద పాలెం, బూదిలి లాగా అక్కడి బూది హాళు, బూదే హాళు (బూది అంటే బూడిద), మన తుమ్మల చెరువు లాగా అక్కడి 'తుంబిన కేరి', వడ్డెర వారి మీదుగా 'వడ్డె హట్టి', కమ్మరి వారి మీదుగా 'కమ్మర చేడు', జంగ మహేశ్వరుల మీదుగా 'జంగమర హోసహళ్లి' వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

ఇప్పుడు కర్ణాటకలోని 'హాల హరివి' అనే గ్రామ నామం ఎలా ఏర్పడిందో విశ్లేషించి చూద్దాం. ప్రాచీన కన్నడ భాషలోని 'పాలు' అనే పదం ఆధునిక కన్నడ భాషలో 'హాలు'గా రూపాంతరం చెందిందని అనుకున్నాం కదా ! కనుక యిది 'పాల హరివి' అన్నమాట. 'హరివి'కి ప్రాచీన కన్నడ భాషలో మూలం 'పరిమి'. 'పరిమి' శబ్దమే ఆధునిక కన్నడ భాషలో 'హరివి' అయింది. 'శ్రమణ' శబ్దం 'శ్రవణ' గానూ, 'చాముండ రాయ' శబ్దం 'చావుండ రాయ' గానూ రూపాంతరం చెందినట్లు 'పరిమి' శబ్దం 'హరివి' అయింది. ఒకప్పటి 'శ్రమణ బెళ గొళ' యిప్పుడు 'శ్రవణ బెళ గొళ'. శ్రమణులు (స్నానం చేసే) తెల్లని (స్వచ్ఛమైన నీరు కల) సరస్సు అని దీని అర్థం. కర్ణాటకలోని హాసన్ జిల్లాలో వున్న 'శ్రమణ బెళ గొళ'

గ్రామముంది.

మయిల్ అంటే మలయాళంలో నెమలి. మయిలక్కాడ్ అనే గ్రామ నామం కూడా కేరళలో వుంది.

మలయాళంలో అమ్మచ్చి అంటే తల్లి సోదరి. అమ్మచ్చి వీడు, అమ్మచ్చి ప్లావ్ అనే గ్రామనామాలు అలా ఏర్పడ్డాయి. (ప్లావ్ అంటే పనస చెట్టు).

అప్పచ్చి అంటే తండ్రి సోదరి - మేనత్త. అప్పచ్చి మేడు అని అయ్యప్ప దేవస్థానానికి కాలిబాటను వెళ్లే దారిలో గల ఓ పర్వతాన్ని పిలుస్తున్నారు.

తామర *(Nelumbium speciosum)* మీదుగా పొన్నాని తాలూకాలోని తామరయూర్ ఏర్పడింది. మేడి చెట్టు *(Ficus racemosa)* మీదుగా కేరళలో ఎన్నో అత్తూర్‌లు ఏర్పడ్డాయి. (మలయాళంలో అత్తి అన్నా మేడిచెట్టే) ఉదా:- మేలత్తూర్ (మేల్ - పడమర), కీళత్తూర్ (కీళ్ లేక కిళక్కు అంటే తమిళ మలయాళ భాషలు రెంటిలోనూ తూర్పు అని అర్థం). కురుంబ (కురమ గొల్లల) మీదుగా ఏర్పడిన కురుంబత్తూర్ వగైరా వగైరాలు. కేరళలో తూర్పు పడమరల మీదుగా మేల్ మురి, కిలు మురి వగైరా గ్రామ నామాలు కూడా ఏర్పడ్డాయి.

ఇక కేరళలో కుడ పేరుతో చాల గ్రామ నామాలున్నాయి. మలయాళంలో కుడ అంటే గొడుగు. కుడమ్ అంటే కుండ. 'కుడమ్' నుంచి 'కుడ' అనే పదం నీటి వనరుకు సూచకంగా కుడ అనే గ్రామ నామాంతంగా రూపొంది వుంటుంది. ఉదాహరణకు ఇరింజ కుడ, కుడ స్సేరి.

'కుడి' అంటే మలయాళంలో ఇల్లు అని అర్థం. గ్రామ నామాంతాలుగా కుడి అని వున్న గ్రామాలు కేరళలో ఎన్నో వున్నాయి.

తెలుగులో పినపాడు, చినపాలెం, చినరావూరు, చిన్నూరు లాగా కుట్టిప్పాల, కుట్టి పురమ్, కుట్టూర్ వగైరాలు అక్కడ ఏర్పడ్డాయి. మన ఎడవల్లి, ఎడపల్లి, పెడపల్లి, పెడవల్లి గ్రామాల లాగా ఎడక్కర, ఎడస్సేరి వగైరాలు కేరళలోనూ వున్నాయి. కొండ మీదుగా మన కొండూరు ఏర్పడినట్లు అక్కడ కల్లూర్ ఏర్పడింది. తెక్కు అంటే మలయాళంలో దక్షిణ దిక్కు అని అర్థం. దాని మీదుగా తెక్కేక్కాడ్ వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. వడక్కు అంటే ఉత్తర దిక్కు. వడక్కెక్కాడ్ గ్రామ నామం దాని మీదుగా ఏర్పడిందే. వడక్కుంబ్రం అనే గ్రామ నామం కూడా ఉత్తర దిక్కు మీదుగా ఏర్పడినట్టిదే. మన పోరుమామిళ్ల లాగా, తమిళనాడులోని పోరూర్ లాగా కేరళలోనూ ఒక పోరూర్ వుంది. (మలయాళంలోనూ పోరు అంటే యుద్ధం) మన తిరువూరు లాగా అక్కడ తిరూర్ (పవిత్ర గ్రామం) వుంది. రాజస్థాన్‌లో కోట వున్నట్లు, కేరళలో కోట్ట (కోట) అనే గ్రామం వుంది. మన ఒంటి మిట్ట లాగా కేరళలో ఒరు మనయూర్ వుంది. మన ముత్తన పల్లి లాగా అక్కడ ముత్తనూర్ వుంది. తాయి అంటే మలయాళంలో తల్లి. మన అంబాపురం, అమ్మపాలెంలలాగా అక్కడ తాయిక్కాడ్ అనే గ్రామ నామం ఏర్పడింది. మన అయ్యంకి, అయ్యవోలు లాగా అక్కడ అప్పన్ స్సేరి అనే గ్రామముంది. మన పెద్దపల్లి, పెనుబల్లి, పెనుగొండ లాగా అక్కడ పెరు మన్న, పెరుంబల్లి వున్నాయి. మన చెరువు కొమ్ముపాలెం, చెర్లోపల్లి, చెరువు మాధవరం వగైరాలలా అక్కడ చెరువల్లూర్, చెరువత్తూర్, చెరువాయ వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

మన నక్కపల్లి, నర్మెట్ట (నరి + మెట్ట)లలాగా నరి (నక్క) మీదుగా అక్కడి నరి పరంబ వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. వాళ అంటే మలయాళంలో అరటి చెట్టు. *(Plantain tree - Musa paradisiaca)* . దాని మీదుగా వాళప్పాడి, వాళప్పల్లి గ్రామ నామాలేర్పడ్డాయి. (తమిళనాడులో కూడా ఒక వాళప్పాడి వుంది). మన పూలకుంట, పూలపల్లి లాగా అక్కడి పూక్కోడ్ వుంది (పూ అంటే పువ్వు). మలయాళ భాషలో పిళ్ల అంటే పసివాడు అని అర్థం. బహుశా చిన్న వూరైనందువల్లనో

ఏమో 'పిళ్లక్కాడ్' అని ఓ గ్రామం పిలువబడింది. 'పిళ్ల' అనేది తిరువాన్కూర్ రాజా ఒకానొక కాలంలో నాయర్ కులస్థులకు యిచ్చే బిరుద నామం కూడా. ఒకవేళ యీ గ్రామ నామం అలా నాయర్ల బిరుదనామం మీదుగా కూడా వచ్చి వుండవచ్చు. మన నడింపల్లి (నడిమి పల్లి) లాగా కేరళలో నదు వట్టం, నదు స్సేరి వగైరా గ్రామనామాలేర్పడ్డాయి. తెలుగులో జాన పదుల వాడుకలో 'మాటు' అంటే పడమటి దిక్కు అనే అర్థముంది. మన రాష్ట్రంలో మాటూరు అనే గ్రామనామం ఏర్పడినట్లే కేరళలో 'మాట్టూర్' గ్రామ నామం ఏర్పడింది.

మలయాళంలో 'కన్ను' అంటే 'దూడ' మీదుగా 'కన్నూర్' అనే గ్రామ నామం ఏర్పడింది. అలాంటి కన్నూర్‌లు చాల వున్న కారణం చేత 'విళా కన్నూర్' వంటి గ్రామ నామాలేర్పడ్డాయి. 'విళా' అంటే మలయాళంలో వెలగచెట్టు. మన మూలపాడు లాగా ముక్కూర్ (కొట్టాయం జిల్లా, కేరళ) ఏర్పడింది. (మలయాళంలో ముక్కు అంటే మూల.) మన నిడుముక్కల, నిడుదవోలు, నిడుప్రోలు లాగానే కేరళలో నెదుమావు (కొట్టాయం జిల్లా), నిదుపల్లి, నిడ్ పల్లి (కర్ణాటక) వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. (మలయాళంలో మావు అంటే మామిడి చెట్టు. మలయాళంలోనూ, కన్నడ భాషలోనూ నిదు లేక నెదు అంటే పొడవాటి అని అర్థం.) మన వత్సవాయి, కాకర వాయి, ఉప్పల వాయి, ఇందుల వాయి (ఇందల్ వాయి, నిజామాబాద్ జిల్లా), వగైరాలలా నెదు వాయల్ (తిరునల్వేలి జిల్లా), నీలి వాయల్ (ఇడుక్కి, కేరళ) వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. (తెలుగులో వాయి అన్నా మలయాళంలోనూ, తమిళంలోనూ 'వాయల్' అన్నా బావి చుట్టూ వుండే దరువు గోడ).

కొప్పు మీదుగా మన కొప్పర్రు, కొప్పోలు, కొప్పుకొండ వగైరా గ్రామ నామాలేర్పడినట్లే 'నెదుముడి' వగైరా గ్రామ నామాలు కేరళలో ఏర్పడ్డాయి. (ముడి అంటే మలయాళంలో కొప్పు, శిగ, శిఖరం అనే అర్థాలున్నాయి) చినరావూరు, చినపాలెం, చిట్టిప్రోలు, చిట్టూర్పు, చిట్వేల్, పొట్టి పాడు, పొట్టి లంక, కురు (చే) గల్లు, కురు (చే) మద్దాలి, బుదంపాడు వగైరా గ్రామనామాలలాగే కేరళలో కుట్టి కాడ్, కుట్టి కోణమ్, కుట్టి పురమ్, కుట్టూర్‌లు ఏర్పడ్డాయి. (మలయాళంలో కుట్టి అంటే పొట్టి, చిన్న అనే అర్థాలున్నాయి.)

వడ అంటే ద్రావిడ భాషలన్నింటిలో 'ఉత్తర దిక్కు' అని అర్థం. మన ఉత్తరాపల్లి, వడపర్తి, వడలిలాగా కేరళలో వడయార్, వడచిర, వడక్కల్, తమిళనాడులో ఉత్తరమేరూర్, వడగరై, వడకోడ్ వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

**ఒరిస్సా ప్రాంత గ్రామనామాలు :** ఇప్పుడిక ఒరిస్సాలోని కొన్ని గ్రామ నామాంతాలు కూడా పరిశీలిద్దాం.

పోదోరా (గంజాయి పోదోరా, బొడ్డ పోదోరా), పుట్టు (రౌతొ పుట్టు, కోళ్ల పుట్టు, గొడుగుల పుట్టు, రాజు పుట్టు, జంగం పుట్టు, చండాల పుట్టు), పుట్టి (బైరాగి పుట్టి, పాత్ర పుట్టి, సింగ పుట్టి), మడ (కిన్నెర మడ, పనస మడ), వలస (పూల వలస, జోగి వలస, బొక్కుడు వలస, నడిమి వలస, కుమ్మరి వలస, సున్నపు వలస), గరువు (దయ్యాల గరువు), పాడు (కక్కుల పాడు, దుముకు పాడు, పూతిక పాడు, దిబ్బల పాడు, గజ్జెల పాడు), పూడి (గదబ కత్తి పూడి), గుండం (లంజల గుండం), కోన (రంది కోన), పల్లె (జార పల్లె), వల్లి (లండా వల్లి), టికిరి (తెన్ను టికిరి), గొంది (సవర గొంది), కుట్టి (ఇరు కుట్టి), మండ (ముసలి మండ), చేదు (నాగేటి చేదు), కాని (మట్టి కాని), గూద (భూతాల గూద, జొంగొము గూద, బ్రాహ్మణొ గూద, రగద గూద, పట్టు గూద, ప్రధాని గూద, తొండల గూద, మండిగం గూద, కదళి గూద, బొందిలి గూద), కోట (కుంభీ కోట), గుమ్మి (గొర్రె గుమ్మి, పులి గుమ్మి), కంబ (హత్తి కంబ), పాయి (గాడిద పాయి), పదా (అరటి పదా), పేట (బల్లి పేట, రోగుల పేట), పురొ (నొందొ పురొ), గాం (నొంది గాం, కంటి గాం), వద (నడిమి వద), బేదా (సునా బేదా), భల్లి (అంబా భల్లి), పారా (కేంద్ర పారా), సోల (గిరి సోల, అరుగు సోల), సరంబి (బిత్తర సరంబి), గుడ్డ

(వడ్డెల గుడ్డ), గొయ్యి (గవర్ల గొయ్యి), లోవ (చీకటి లోవ, చాకి లోవ). ఇంకా హండి, ఖల్లో, గుమ్మ, పాడి, పాడా, ఝుల్ల, కొసిమి, గ్రామొ వగైరా గ్రామ నామాంతాలు కూడా ఒరిస్సాలో మనం చూస్తాం. ఇంకా తెలుగు ప్రభావం వున్న ఒరిస్సా జిల్లాలైన గంజాం, కోరాపుట్ వగైరాలలో గూడెం, గోదు, అంగి, అంకి, అప్పి, ఆవ, ఆం, లోవ, లొడ్డి, లుడికి, రాయి, కల్లు, భద్ర, జోలి, శింగి, బాయి, శీల, పాడు, పల్లి, పురం, బండ వగైరా గ్రామ నామాంతాలను కూడా మనం చూడవచ్చు.

ఇలా తెలుగు, ఒరియా భాషలు రెంటితో ఏర్పడిన గ్రామ నామాలను మనం ఒరిస్సాలో చూస్తాం.

మన పశ్చిమ గోదావరి జిల్లాలో జీలకర్ర గూడెం వున్నట్లే మధ్యప్రదేశ్‌లోని రాజ్‌గఢ్ జిల్లాలో జీరాపూర్ వుంది. (జీరా అంటే జీలకర్ర)

ఇలా విశ్లేషించుకూంటూ పోతే దీనికసలు అంతే వుండదు. ఎందుకంటే యీ విధంగా మనం తేలికగా విశ్లేషించగలిగే గ్రామ నామాలు కోకొల్లలు.

ఇలా విశ్లేషణ చేసుకుంటూ పోతే, యిప్పుడు యిక అస్సలు కొరుకుడుపడని గ్రామనామాలు మనకు మిగులుతాయి. అవి ఏ భాషకు చెందినవో మనకు తెలియదు. ఏ రకంగానూ గ్రాహ్యం కాని యీ పేర్లను పోలినవి యితర రాష్ట్రాలలో గానీ, దేశాలలోగానీ ఎక్కడైనా వున్నాయేమో చూడాలి. ఉంటే వాటికీ, వీటికీ మధ్య గల సారూప్యత ఆధారంగా వాటిని వ్యాప్తిగ్రాహక పద్ధతి ద్వారా గుదిగుచ్చి, శబ్దనిర్మాణాన్ని బట్టి వాటిని వర్గీకరించి వాటి భావాన్ని గ్రహించే ప్రయత్నం చేయాలి. ఆ తర్వాత చారిత్రక దృష్టితో ఈ గ్రామనామాల ప్రాచీనతను నిర్ధారించే ప్రయత్నం చేయాలి.

నేను ముందే మనవి చేసినట్లు యీ వ్యాసం విధించిన పరిమితి యీ విషయమై విస్తృతమైన శాస్త్రీయ విశ్లేషణకు అవకాశమీయదు; కనుక, 'తెనాలి' తరహా కొరుకుడుపడని గ్రామనామాల్ని అతి క్లుప్తంగా విశ్లేషిద్దాం.

## తెనాలి - పద విశ్లేషణ

ఇప్పుడు 'తెనాలి' పదాన్ని విశ్లేషించి చూద్దాం. దీనికోసం ముందుగా 'లి' అంటే అర్థమేమిటో ఆలోచిద్దాం. ప్రస్తుత తెలుగు భాషలోగానీ, యితర భారతీయ భాషలలోగానీ యీ పదం కనుపించడం లేదు. మరి 'లి' అంటే అర్థమేమై వుంటుంది?

ప్రపంచంలోని దాదాపు అన్ని భాషలలోనూ 'ల' శబ్దం నీటిని సూచించే మాటలలో వాడబడింది. 'జలజల కారే కన్నీరు', 'గలగల పారే సెలయేరు', 'అలలు', 'లాలాజలము' వగైరా తెలుగు ప్రయోగాలను పరిశీలించండి. 'జలము', 'సలిలము' వగైరా సంస్కృత పదాలు, 'జల్', 'తరల్' అనే బెంగాలీ పదాలు నీటికి వాడబడ్డాయి. బెంగాలీలో 'ఖాల్' అంటే తెలుగులో 'కాలువ' అంటాం. తెలుగులో 'లోవ' అంటే పల్లపు ప్రాంతంలో నిలిచిన నీటి మడుగు. 'లంక' అంటే చుట్టూ నీరుగల భూభాగం. హిందీలో 'తాలాబ్' అంటే చెరువు, 'ఝీల్' అంటే సరస్సు. తమిళంలో 'కుళమ్' అంటే చెరువు. కన్నడలో 'గొళ' అంటే సరస్సు (ఉదా : శ్రవణ బెళగొళ) టర్కిష్‌లో 'గోలు' అంటే సరస్సు. మలయాళంలో 'వెళ్లమ్' అంటే నీరు, 'కుళి' అంటే స్నానం. తెలుగులో 'కేళకుళి' అంటే క్రీడాసరస్సు. సముద్రాన్ని మలయాళంలో 'కటల్' అనీ, తమిళంలో 'కడల్' అనీ, తెలుగులో 'కడలి' అనీ అంటారు. Water Tap ను తెలుగులో 'కుళాయి' అంటాం. హిందీలో 'నల్లా' అనీ, గుజరాతీలో 'నళ్' అనీ అంటారు. (నీటిలోని) చేపను హిందీలో 'మఛ్‌లీ' అంటారు.

ఇంగ్లిష్ తదితర పాశ్చాత్య భాషలలో కూడా నీటిని, లేక ఏదైనా ద్రవాన్ని సూచించే పదాలలో 'ల' శబ్దం విస్తారంగా వాడబడింది. ఇంగ్లిష్‌లో Canal అంటే కాలువ, 'Well' అంటే బావి, *'Lake'* అంటే సరస్సు, *Puddle'* అంటే వాననీటి మడుగు, *'Pool'* అంటే చిన్న నిలువనీటి మడుగు, *'Lagoon'* అంటే *'Salt water lake enclosed by an atoll or separated*

*by a sand bank from the sea'* అని అర్థం. ఇంగ్లిష్ భాషలో *'Ale'* అంటే 'బీరు' అనే మత్తుపానీయం. అందుకే భూమిపై క్రైస్తవుల విశ్వాసం ప్రకారం తొలిమానవుడైన ఆదాము త్రాగిన పానీయం నీరే అయి వుంటుంది గనుక *'Adam's ale'* అంటే ఇంగ్లిష్‌లో 'నీరు' అని అర్థం. నీరు లేక యితర ద్రవాలకు ఇంగ్లిష్‌లో వాడబడిన యీ పదాలు చూడండి. లిక్విడ్ (*liquid*), లిక్కర్ (*liquor*), లోషన్ (*lotion*), లినిమెంట్ (*liniment - Medicated liquid rubbed on the skin to relieve pain or stiffness*), లింక్టస్ (*Lynctus syrupy cough medicine*) వగైరాలు. ఏదైనా సరస్సు లేక సముద్రము యొక్క తీరాన్ని లాటిన్‌లో *'litus'* అంటారు. దాన్నిబట్టే 'తీరము (*shore*) నకు చెందిన' అనడానికి ఇంగ్లిష్‌లో *'littoral'* అంటారు. ద్రవాలమట్టాన్ని 'లెవెల్' (*level*) అంటారు. నీటిలో వికసించే పుష్పాలకు కూడా ఇంగ్లిష్‌లో పేర్లెలా పెట్టారో చూండండి. *Lotus* (తామర), *Water Lily* (కలువ). లాష్ (*Lash*) అంటే వాననీరు గానీ, నీటి అలలుగానీ దేన్నైనా బలంగా కొట్టడం; *flow* (ఫ్లో) అంటే ప్రవహించడం; *lather* (లాదర్) అంటే సబ్బు నీటితో వచ్చే నురగ; *falls* (ఫాల్స్) అంటే జలపాతము; *Atoll* (అటాల్) అంటే *'ring shaped coral island enclosing a lagoon'* అని అర్థం. లీక్ (*Leak*) అంటే ఏదైనా ద్రవం కారిపోవడం. *'Oblation'* అన్నా *'Libation'* అన్నా భగవంతుడికి నైవేద్యంగా సమర్పించిన పానీయం. ఐరిష్ భాషలో 'లోఫ్' (*Lough*) అంటే సరస్సు. స్కాటిష్‌లో 'లోచ్' (*Loch*) అంటే సరస్సు. లాటిన్‌లో 'లాక్రిమ్' (*Lacrim*) అంటే కన్నీరు. దాని నుండే *'Lachrymose'* అనే ఇంగ్లిష్ పదం వచ్చింది. ద్రవాల్ని లీటర్లలో కొలుస్తాం. *'liter'* అనే ఇంగ్లిష్, అమెరికన్-ఇంగ్లిష్ పదాలకు మూలం *'litre'* అనే ఫ్రెంచి పదం. దానికి మూలం *'litra'* అనే గ్రీకు పదం. రష్యన్ భాషలో 'వోల్నా' (*volna*) అంటే 'అల'. బర్మీస్ భాషలో 'లి' అంటే నది. చైనీస్ భాషలో 'గోల్' అంటే నది. (ఉదా : చికిన్‌గోల్, బులాంగీర్ గోల్ మొ.) మధ్యఆఫ్రికా అంతటా 'లు' అంటే నది లేక సరస్సు లేక ఏదైనా నీటి వనరు (ఉదా : 'బంగేలు' సరస్సు, ఉత్తర రొడీషియా).

ఇలా దాదాపు ప్రపంచ భాషలన్నింటిలోనూ నీటిని సూచించే పదాలలో ఎక్కువ శాతం 'ల' లేక 'ళ' కారం తప్పనిసరిగా వుంటుందనేది గ్రహించవచ్చు.

## నీటి వనరులు - గ్రామ నామాలు

బావులు, కుంటలు, కాలువలు, చెరువులు, సరస్సులు, సెలయేళ్ళు, నదులు వగైరా నీటివనరులకు సమీపంలోనే ప్రాచీన జనావాసాలేర్పడ్డాయి. ఉదా : తుమ్మల చెరువు, పుల్లల చెరువు, రాయల చెరువు, రాజు కాల్వ, నందిరాజు కాల్వ, పుత్‌లీ బావిలి → పుత్లీబౌలి (అంటే బొమ్మబావి అని అర్థం. 'బావ్‌లి' అనే హిందీ పదానికి అర్థం లోతైన చిన్న చెరువు లేక బావి. జన వ్యవహారంలో 'బావిలి', 'బౌలి' అయింది.) గచ్చీబౌలి (గచ్చు చేయబడిన బావి అని అర్థం), దూధ్‌బౌలి (పాలబావి). ప్రాచీన మానవులు శుభ్రమైన తాగునీటిని పాలుగా వ్యవహరించేవారు. అందుకే పాలంకి, పాలపర్రు, పాలవాగు, పాలకొల్లు, పాలవంచ, పాలచెర్ల, పాలగొంది, పాలకుర్తి, పాలాం, హాలహర్వి (కన్నడంలో హాలు అంటే పాలు), పాలడుగు, పాలువాయి, పాలకురికి, పాలతేరు, పాలూరు, పాలసముద్రం వగైరా గ్రామనామాలేర్పడ్డాయి. విష్ణువు చారిత్రక పురుషుడే అయితే అతడి ఒకప్పటి నివాస స్థలం రష్యాలోని సైబీరియాలో వున్న వైకాలి (బైకాల్) అనే ప్రపంచంలోకే పెద్ద మంచినీటి సరస్సు అయివుండొచ్చేమో! పాలసముద్రం, తిమ్మసముద్రం, కే సముద్రం, ద్వార సముద్రం వగైరాల లాగా సరస్సులు సముద్రాలుగా పిలువబడడం వింతేమీ కాదు గనుక బైకాలే పాలకడలి కావచ్చునేమో!, ఖారీబౌలీ (అంటే ఉప్పునీటి బావి అని అర్థం. ఇది ఢిల్లీలో కలసిపోయిన ఓ గ్రామం), అమృత్‌సర్ (సర్ అంటే సరస్సు), కలువకొలను, ముచ్చెర్ల (మూడు + చెరువుల), గాడిచెర్ల, రొంపిచెర్ల, జడిచెర్ల (జడ్చెర్ల), పులిచెర్ల, చాకిచెర్ల, రావిచెర్ల, మాచెర్ల, కంచికచెర్ల, తోటచెర్ల, చేజెర్ల, సంత నూతలపాడు, కొర్నూతల (కొర్ర + నూతుల), జమ్మిగుంట, మనుబోతులగుంట, గండికుంట, జమ్ముల మడుగు, మద్దికేరే (కన్నడంలో కేరే అంటే చెరువు), దావణ గేరే, గంజాం (ఆవ అంటే నీళ్లు నిలిచే

లోతట్టు ప్రాంతం లేక సరస్సు. కాలక్రమేణా అదే 'ఆం'గా రూపొందింది) తెర్లాం, గంజాం (గంజి +ఆం→ గంజాం), బుద్ధాం, గుడిమల్లాం, రాజాం, పిట్లాం (పిట్టల +ఆం), తాళ్లరేవు, వాడ్రేవు, ఉప్పల్ వాయి (వాయి అంటే పశువులు పడకుండా బావి చుట్టూ వరలతో కట్టబడే దరువు గోడ – *a parapet round a well*), ఇందులవాయి (ఇందల్‌వాయి), కాకరవాయి, వత్సవాయి, పాలువాయి, పాలవంచే, ఉప్పలవంచె , నాగుల వంచే, ఆవంచే (ఆవంత్స), ద్వారసముద్రం (కర్నాటకలోని హాసన్ జిల్లాలోని ఒకప్పటి హొయసాలుల రాజధానీ నగరం. ఇప్పుడిది హళేబీడు పేరుతో పిలువబడుతున్నది. ఇక్కడ ఉన్న అతి పెద్ద మంచినీటి సరస్సునే ద్వార సముద్రం అంటారు. అంతకు మించి యిక్కడ సముద్రమేమీ లేదు. వరంగల్ జిల్లా కేసముద్రం, ప్రకాశంజిల్లా తిమ్మసముద్రం, చిత్తూరు జిల్లా పాలసముద్రం – ఈ మూడూ కూడా సముద్రానికి దూరంగా వున్నా అక్కడి పెద్ద మంచినీటి చెరువుల కారణంగానే వాటి కాపేర్లు వచ్చాయి), పునుకొల్లు (కొల్లు అంటే సరస్సు), కలువకొల్లు, ఇంకొల్లు (ఇంకు కొల్లు), ఆరుగొలను, పెనుగొలను, వావిలి కొలను, కామార్‌పుకూర్ (పుకూర్ అంటే బెంగాలీ భాషలో చెరువు. ఇది రామకృష్ణ పరమహంస జన్మస్థలమైన పశ్చిమ బెంగాల్‌లోని 24 పరగణాల జిల్లాలోని గ్రామం.), పద్మాపుకూర్ వగైరా వగైరాలు.

పైన పేర్కొన్న గ్రామనామాలన్నీ ఏదో ఒక భాషలో అర్థాన్ని సులభంగా యివ్వగలవే. కాని మన తెనాలి వంటి గ్రామాల అర్థాన్ని విశ్లేషించడానికి కొంచెం అదనపు శ్రమ అవసరం. దాదాపు ప్రపంచ భాషలన్నింటిలో నీటిని, నీటి వనరులనూ సూచించే పదాలలో ఎక్కువశాతం 'ల' లేక 'ళ' కారం తప్పకుండా వుంటుందని మనం గమనించాం. తెనాలిలోని 'లి' కూడా నీటివనరుకు సంకేతమే. జలవనరుకు సంకేతమైన 'లి'తో అనేక జనావాసాలు ప్రపంచమంతటా వుండడాన్ని బట్టి ఒకప్పుడు ప్రపంచమంతా ఆవరించి వుండిన ఏ జాతి వారి భాషలోనో 'లి' అనేది నీటి వనరుకు పర్యాయపదంగానూ, ఆ తరువాత జనావాసానికి పర్యాయపదంగానూ వ్యవహరించబడిందని మనం అర్థం చేసుకోవచ్చు.

## గ్రామ నామాంతాల వ్యుత్పత్తి

'లి' అనే మూలశబ్దంతోనే యీ క్రింది గ్రామనామాంతాలు ఏర్పడ్డాయి.

బల్ + లి – బల్లి

బెల్ + లి – బెల్లి

పల్ + లి – పల్లి (పోలి, పోలిస్, పళ్లి, పాళయం, పాళ్యం, పాలెం) – పెల్ + లి : పెల్లి

మంచి + లి – మంచిలి

మల్ + లి – మల్లి

మిల్ + లి – మిల్లి

వెల్ + లి – వెల్లి

విల్ + లి – విల్లి

వల్ + లి – వల్లి

ఎల్ + లి – ఎల్లి

ఈ గ్రామనామాంతాలతో ఏర్పడిన గ్రామనామాల్ని చూడండి.

పెనుబల్లి, రాంపల్లి, రాంబెల్లి, వెదుళ్లపల్లి, నాపోలి (ఇటలీలోని నేపుల్స్), ఇండియానా పోలిస్, తండలంపల్లి,

భూపాలపెల్లి, రాజపాళయం, కంచెర్లపాలెం, యలమంచిలి, కొడమంచిలి, పెనుమంచిలి, మతుకుమల్లి, సుంకవల్లి, అడుసుమిల్లి, బూతుమల్లి, దగ్గుమిల్లి, గజవెల్లి – గజ్వేల్, సరివెల్లి – సర్వేల్, కథిరవేల్ (శ్రీలంక), మహావేలి (శ్రీలంక), ఇంద్రవల్లి, పున్నవెల్లి, అరసవల్లి, కనకవల్లి, వెలివెల్లి, ఆరవిల్లి, నర్సింగబిల్లి, లియోపాల్డ్‌విల్లి, పిన్నెల్లి (పిన్న + ఎల్లి), చిట్వేల్ (చిట్టి + వెల్లి), బంగారుపాళ్యం. కన్నడంలో 'ప' శబ్దం 'హ'గా పలుకబడుతుంది. అందుకే తుంగభద్రా (పంపా) నది ఒడ్డున వున్న 'పంపి'ని వారు 'హంపి' అంటారు. 'పాల'ను 'హాలు' అంటారు. 'పాము' ను 'హావు' అంటారు. అలాగే కన్నడంలో 'పల్లి', 'హల్లి' గానూ అదే 'హాల్' గానూ రూపాంతరం చెంది ఎన్నో గ్రామనామాలేర్పడ్డాయి. ఉదా : హర్పనహల్లి, హగరి బొమ్మనహల్లి, హుబ్బిహల్లి (అదే హుబ్లి), కొడిగెనహల్లి (అనంతపూర్ జిల్లా), ఉప్పరహాల్ (కర్నూలు జిల్లా) వగైరాలు.

## కొన్ని విదేశీ గ్రామ నామాలు

గ్రామనామాలలో శబ్దపరంగా వున్న సారూప్యతను పరిశీలిస్తే ప్రపంచమంతా ఒక చిన్న కుటుంబంగా అనిపించకమానదు. ఒకప్పుడు ప్రపంచమంతా ఆవరించి వున్న ఏ జాతివారో తమ భాషలో వీటికీ పేర్లు పెట్టి వుంటారని అర్థమవుతుంది.

ఐర్లాండ్ దేశంలో బల్లీక్లేర్, బల్లీమెనా, బల్లీకాజిల్, బల్లీఫాస్ట్ (అదే బెల్‌ఫాస్ట్), విడ్‌వెల్లిర్ వగైరా నగరాలున్నాయి. అమెరికాలో మిన్నియాపోలిస్, అన్నాపోలిస్, ఇండియానా పోలిస్, నాక్స్‌విల్లి, గ్రీన్‌విల్లి, బ్రౌన్స్‌విల్లి, లూయిస్‌విల్లి మరియు కెనడాలో జిప్సంవిల్లి మొదలైన నగరాలున్నాయి.

డెన్మార్క్‌లో 'వెజ్‌లి' అన నగరముంది. 'లి' శబ్దం 'లెవ్'గా రూపాంతరం చెంది అక్కడి హాదర్స్‌లెవ్, బ్రాందర్స్ లెవ్ వగైరా నగరాల పేర్లేర్పడ్డాయి. నార్వేలో అదే శబ్దం 'లో' గా పరిణమించి, ఓస్లో, బోంబ్లో, క్వాలో వగైరా నగరాల పేర్లేర్పడ్డాయి. నార్వేలోని 'టింగ్‌వోలి' నగరం పేరును మనదేశంలోని విజోవోలి (నాగాలాండ్), అయ్యావోలి (కర్నాటకలోని ఐహోల్ – Aihole), ఒంగోలు (వంగవోలు), వెలివోలు, చిరువోలు, కొమరవోలు వగైరాలతో పోల్చి చూడండి. స్వీడన్‌లోని పజాలో, గాలో, గాల్లి, లులి; ఫిన్లాండ్ దేశంలోని నాన్‌తాలి, కీటెలి, రెబోలి, మిక్కెలి; ఎస్తోనియాలోని లిహులా; లాత్వియాలోని లిపాయా, ఎర్గ్‌లి; లిథుయేనియాలోని సియావ్‌లి; ఫ్రాన్స్‌లోని మార్సెలి, డెకాజ్‌విల్లి, బ్రిగ్నోలి, టుట్లి, డెల్లి, బెల్లి; స్పెయిన్‌లోని సెవెల్‌లి, గాబోలి, లినారస్, వల్లడోలి (కేరళలోని వల్లథోల్‌తో సరిపోల్చండి); పోర్చుగల్ రాజధాని లిస్‌బోవా (అదే లిస్బన్); ఇటలీలోని నాపోలి (అదే నేపుల్స్), మోనోపోలి, కొల్లి (*Colle*), లువోలి, సిసిలి వగైరా పేర్లు; జర్మనీలోని బెర్‌లిన్, సెల్‌లి వగైరా నగరాలు; రుమేనియాలోని కాలాటెలి, లి (*Lea*), బివోలు; ఉక్రెయిన్‌లోని బోరిస్‌లావ్ ('లి' పదం యిక్కడ 'లావ్'గా రూపాంతరం చెందింది.), క్రీటుకు చెందిన ఇరాక్‌లి, స్పిలి, కస్తెల్లి (ఆంధ్రప్రదేశ్‌లో కస్తల పేరుతో గ్రామముంది.), నియాపోలిస్, ఖమిలి; గ్రీస్‌లోని కిప్సెలి, యాంఫిపోలిస్, అలెగ్జాంద్రపోలిస్ వగైరా పట్టణాల పేర్లు 'లి'తో ఏర్పడినవే. అలాగే ఇథియోపియాలోని అరపులి, లెబనాన్‌లోని ట్రిపోలి, లిబ్యా రాజధాని ట్రిపోలి, చైనాలోని మంగ్హూలి, కుర్లి (ఇదే శబ్దం బొంబాయిలో కుర్లి → కుర్‌లా → కుర్లాగా రూపాంతరం చెందింది) కూడా ఇలాగే 'లి'తో ఏర్పడినవే. దక్షిణాఫ్రికాలో వజ్రాల గనులకు ప్రసిద్ధిగాంచిన కింబర్‌లి; కాంగోలోని లియోపాల్డ్‌విల్లి; టాంగనీకాలోని నోలి; తిమోర్‌లో డిలి అనే నగరం యింకా యింకా ఎన్నెన్నో గ్రామనామాలు 'లి' తో ఏర్పడ్డాయి.

ఇక చివరగా టర్కీలోని పట్టణాల పేర్లయితే పూర్తిగా దక్షిణభారతదేశపు గ్రామనామాల్ని పోలి వుండి, టర్కీతో దక్షిణ భారతదేశానికి, ప్రత్యేకించి కర్ణాటక ప్రాంతానికి ప్రాచీన కాలంలో వుండిన సంబంధ బాంధవ్యాలను తెలుపుతున్నాయి. వాటిలో కొన్ని సాలిహ్‌లి, తుర్గత్‌లి, కారాహల్లి (కర్ణాటకలో కూడా యీ పేరుతో ఒక ఊరుంది), సివాస్‌లి, గెలిబోలు

(*GALLEPOLIS* – శ్రీలంకలో *GALLE* వుంది), కుమాలి, హేరబోలు, డికిలి, అయ్‌వాలి (కర్నాటకలోని ఐహోల్ – లేక-– అయ్యవోలు వలె), కారాడిల్లి, యాప్యాలి, దేవ్‌లి (రాజస్థాన్‌లో కూడా యీ పేరుతో ఒక ఊరుంది) తుర్కేలి, తజిక్‌లి, ఇమ్రాలి, ఇరాక్‌లి (దివి తాలూకాలోని ఇరాలితో పోల్చండి) ఉస్మాన్‌లి, ఈనెబోలు (ఆంధ్రప్రదేశ్‌లోని మనుబోలు, కొండబోలులాగా) కస్తమోను, ఒయాలీ (మన కొయాలీ లాగా) కాయెలి (మన కావలి లాగా). 'గోలు' అంటే టర్కిష్ భాషలో సరస్సు అని అర్థం. ఉదా : వాన్‌గోలు, తుజ్‌గోలు వగైరా. కర్నాటకలోని శ్రావణబెళగొళ, మహారాష్ట్రలోని సాంగోళ, కర్నాటకలోని ఎన్నో గ్రామనామాలు టర్కీతో పశ్చిమ భారతదేశానికి ఒకప్పుడు ఉండిన దగ్గర సంబంధ బాంధవ్యాల్ని తెలుపుతున్నాయి. స్పెయిన్‌లోని గాల్తో, స్వీడన్‌లోని గాల్తో, టర్కీలోని గెలిబోలు (*GALLEPOLIS*), శ్రీలంక పశ్చిమ తీరంలోని గాలి (*GALLE*) – ఈ నాలుగూ 'గ్యాలి' శబ్దపు రూపాంతరాలే. అంతేగాక ఫిన్లాండ్‌లోనూ, శ్రీలంకలోనూ 'మిక్కెలి' అనే పేరుతో గల గ్రామనామాలూ, స్పెయిన్‌లోనూ, కేరళలోనూ వల్లథోల్ (వల్లడోలి) పేరుతోగల గ్రామనామాలు, ద్రావిడుల కాలంలోనో, అంతకు ముందరి ప్రోటో ఆస్ట్రలాయిడ్ల కాలంలోనో భారతదేశానికి మిగతా ప్రపంచంతో వుండిన సన్నిహిత సంబంధ బాంధవ్యాలను తెలుపుతున్నాయి.

## మనదేశంలోని యీ తరహా గ్రామ నామాలు

ఇక మనదేశంలో 'లి'తో అంతమయ్యే గ్రామనామాలు కోకొల్లలుగా వున్నాయి. మహారాష్ట్రలోని గఢ్ చిరోలి, ఖోపోలి, లోనాలి, దాపోలి, హింగోలి, సాకోలి, జావ్‌లి, పర్లి, బిలోలి, దేవ్‌లాలి, కార్లి, సాంగ్లి; హిమాచల్‌ప్రదేశ్‌లోని మనాలి, బైహాలి, లాహూలి (అదే లాహూల్); ఉత్తరప్రదేశ్‌లోని బరేలి, సింగ్రౌలి, అత్రౌలి, బిసౌలి, రుదౌలి, చమోలి; మధ్యప్రదేశ్‌లోని గఢ్రౌలి, ఝిల్‌మిలి, ముంగేలి; రాజస్థాన్‌లోని పాలి, కాంక్రోలి, కరౌలి, దేవ్‌లి; ఒరిస్సాలోని ధౌలి, బర్పాలి, మత్తిలి, సిప్లి; పంజాబ్‌లోని కసౌలి, ఛఛ్రౌలి, గుజరాత్‌లోని కొయాలి, చికిలి, బార్డోలి, సావ్‌లి, జరోలి ; బీహార్‌లోని సగౌలి, కాశ్మీర్‌లోని కోట్‌లి, బసోలి; అస్సాంలోని అమిలి, హాపోలి, కోపిలి; కర్ణాటకలోని చింబోలి, హెున్నాలి, కంపిలి; లక్షదీవులలోని సుహేలి వగైరాలు ఈ కోవకి వస్తాయి.

ఇక మన రాష్ట్రంలో అత్తిలి, ముదలి, చికిలి, పేర్‌లి (పేరలి), మంచిలి, పెనుమంచిలి, కొడమంచిలి, యలమంచిలి, పెరవలి, చావలి, కొడవలి, కొడాలి, వడలి, ఇరాలి, నాలి, ఉపకాలి, పొదిలి, కోటబొమ్మాలి, తేతలి, కావలి, నెప్పలి, కోమలి, కొవ్వలి, బొబ్బిలి, పంచలి, కాకిలి, కుట్టెలి, కొన్నిలి, కన్నిలి, కాశిలి, గొర్తిలి, చండిలి, బంకిలి, నిందలి, గచ్చలి యిలా చాల గ్రామ నామాలున్నాయి.

## 'నాలి' యొక్క విశ్లేషణ

'లి' అంటే నీటి వనరును సూచించే పదమనీ, ఆ పదం ఆధారంగా వివిధ భాషలలో ప్రస్తుతం చెలామణీలోనున్న పల్లి, హళ్లి, వల్లి, విల్లి, వెల్లి, బెల్లి, బల్లి, బిల్లి, మల్లి, మిల్లి, ఎల్లి, మంచిలి వగైరాలతో అంతమయ్యే గ్రామనామాలు ఏర్పడ్డాయనీ మనం గ్రహించాం.

అయితే మన ప్రస్తుత భాషలలో ఎక్కడా కానరాని, మనం అర్థం చెప్పలేని కొన్ని పదాలు కూడా 'లి' ఆధారంగా ఏర్పడ్డాయి. అవే – న్యాలి, ర్యాలి, మ్యాలి, ప్యాలి, ట్యాలి, త్యాలి, ల్యాలి, గ్యాలి, జ్యాలి, డ్యాలి, ద్యాలి వగైరాలు. వీటితో అంతమయ్యే గ్రామనామాల్ని కూడా మనం పరిశీలిద్దాం. పైన తెలిపిన గ్రామనామాంతాలు, తెలుగు పదాలతోనేగాక, తమిళ, మూలద్రావిడ భాషలలోని పదాలతో కూడా కలిసి గ్రామనామాలేర్పడడాన్ని బట్టి వీటి ప్రాచీనత మనకర్థమవుతూంది. వీటితో ఏర్పడిన చాల గ్రామనామాలలో 'లి' కాలక్రమేణా 'ల'గా రూపొందింది.

ర్యాలి – తూర్పుగోదావరి జిల్లాలోని గ్రామం. కొన్ని గ్రామనామాలలో 'ర్యాలి' పదం 'ర్యాల'గానూ, 'రాల'గానూ రూపొందింది.

మంచిర్యాలి → మంచిర్యాల; రావిర్యాలి → రావిర్యాల → రావిరాల; కాకిర్యాలి → కాకిరాలి → కాకిరాల (గుంటూరు జిల్లా దుర్గి సమీప గ్రామం) ; ఇరుర్యాలి→ ఇర్ర్యాలి → ఇర్యాలి → ఇరాలి (దివి తాలూకా, కృష్ణా జిల్లా)

దుగ్గిర్యాలి → దుగ్గిర్యాల → దుగ్గిరాల; ముక్కుర్యాలి → ముక్కుర్యాల → ముకురాల;

పేర్ + ర్యాలి → పేర్యాలి → పేర్యాల → పేరాల; చీతిర్యాలి → చీతిరాల → చీరాల.

వేపర్యాలి (కదిరి తాలూకా – అనంతపురం జిల్లా) → వేపరాలి → వేపరాల;

దుగ్గి + గ్యాలి → దుగ్గ్యాలి → దుగ్గ్యాల → దుగ్యాల (ఉత్తర భారత దేశంలో దుగ్గల్);

దుద్దు + ద్యాలి → దుద్ద్యాలి → దుద్యాల (జమ్మలమడుగు తాలూకా కడప జిల్లా)

ఇనగ్యాలి → ఇనగాలి → ఇనగాల;

కన్నుగ్యాలి → కనుగ్యాల → కనగాల;

పుట్ట + ర్యాలి → పుట్రేలి → పుట్రేల; చేయి + ర్యాలి → చేర్యాలి → చేర్యాల;

మద్ది + ర్యాలి → మద్దిర్యాల → మద్దిరాల; వెంపలి + ర్యాలి → వెంపర్యాలి → వెంపరాల;

కొడిమ్యాలి → కొడిమ్యాల → కొడి మెల; బలిమ్యాలి → బలిమ్యాల → బలిమెల;

రౌతుప్యాలి → రౌతుప్యాల (రాజమండ్రి సమీపంలో); కన్ను + ప్యాలి → కనుప్యాల → కనపాల;

కండ్లప్యాలి → కండ్లప్యాల

కల్లప్యాలి → కల్లపాలి → కలపాల (దివి తాలూకా); పిన్నప్యాల → పినపాల;

జమ్ముప్యాల → జంపాల (ఇది జంపు+ఆల→ జంపాల కూడా అయివుండే అవకాశముంది. ఆలతో అంతమయ్యే ఎన్నో గ్రామ నామాలు కూడా వున్నాయి.) రేవుప్యాల → రేపాల;

జగ్గి + త్యాలి → జగిత్యాలి → జగిత్యాల; ముక్తి + త్యాలి → ముక్త్యాలి → ముక్త్యాల;

చిట్టి + ట్యాలి → చిట్యాలి → చిట్యాల; పొట్టి + ట్యాలి → పొట్ట్యాలి → పొట్యాల్;

పెణ్ (తమిళంలో స్త్రీ అని అర్థం) + ట్యాలి → పెంట్యాలి → పెంట్యాల → పెంటేల.

పెణ్ + ద్యాలి → పెంద్యాలి → పెంద్యాల

మల్ల + ల్యాలి → మల్ల్యాలి → మల్యాల(మల్లాం, మల్లవోలు, మల్లపేట, మల్ల వేముల, మల్లవాడి వగైరా గ్రామనామాల లాగే యిది కూడా మల్ల అనే జాతి పేరు మీదుగా ఏర్పడిన గ్రామ నామం.)

యామి + జ్యాలి → యామిజాలి → యామిజాల → యాంజాల్ → దేవర యాంజాల్ (మెదక్ జిల్లా), తురక యాంజాల్ (రంగారెడ్డి జిల్లా)

బాపట్ల తాలూకా 'యాజలి'కి పూర్వరూపం 'యామిజాలి' అయినా కావచ్చు.

### గ్యాలి

నేనింతకు ముందే చెప్పినట్లు టర్కీలోనూ, ఇటలీలోనూ వున్న *GALLEPOLIS; GALLIPOLI* లేక గెలుబోలు నగరాలు, శ్రీలంక పశ్చిమతీరంలోనున్న గాలి (*GALLE*) నగరము, స్వీడన్, స్పెయిన్‌లలోనున్న 'గాలో' నగరాల నామాలు – గ్యాలి పదం యొక్క రూపాంతరాలే. ఓస్లో, క్వాలో వగైరా గ్రామనామాలలో 'లి', 'లో' గా పరిణమించినట్లే 'గ్యాలి'

కాలక్రమేణా 'గాలి' గానూ, 'గాలి' 'గాలో' గానూ రూపాంతరం చెందింది.

నేనింతకు ముందే చెప్పినట్లు టర్కీలోనూ, ఇటలీలోనూ వున్న *GALLEPOLIS; GALLIPOLI* లేక గెలుబోలు నగరాలు, శ్రీలంక పశ్చిమతీరంలోనున్న గాలి (*GALLE*) నగరము, స్వీడన్, స్పెయిన్‌లలోనున్న 'గాలో' నగరాల నామాలు - గ్యాలి పదం యొక్క రూపాంతరాలే. ఓస్లో, క్వాలో వగైరా గ్రామనామాలలో 'లి', 'లో' గా పరిణమించినట్లే 'గ్యాలి' కాలక్రమేణా 'గాలి' గానూ, 'గాలి' 'గాలో' గానూ రూపాంతరం చెందింది.

తంజావూరునూ, మధురనూ పాలించిన నాయకరాజులు శ్రీలంకపై దండెత్తి, ఆక్రమించి పాలించిన తరువాత కొంతకాలానికి వారి వంశీకులు కొందరు తిరిగి ఆంధ్రప్రాంతానికి మరలివచ్చారు. (తంజావూరు నాయకరాజుల మూలపురుషుడైన చెవ్వప్పనాయకుడు శ్రీకృష్ణదేవరాయల తమ్ముడైన అచ్యుతరాయలకు తోడల్లుడు, పెమ్మసానివారి బంధువర్గంలోని తెలుగు యోధుడునని చరిత్రకారుల భావన. మధురనేలిన నాయకరాజు విశ్వనాథ నాయకుడు కూడా వీరి బంధువర్గములోని వాడే.) వారిలో చాలమంది అక్కడనే స్థిరపడిపోయారు. వారి పేర్లలోని 'నాయక' అనే పదం శ్రీలంకలో గౌరవ సూచకంగా మారింది. అక్కడ సేనానాయక, నాయక అనే యిండ్ల పేర్లు ఏర్పడ్డాయి. ఉదా :- దడ్లీ సేనానాయకే, శ్రీలంక మాజీ ప్రధాని శ్రీమతి సిరిమావో బండారునాయక (లేక నాయకే), శ్రీలంక మాజీ ఆంతరంగిక వ్యవహారాల మంత్రి గమిని దిస్స (తిష్య) నాయకే వగైరాలు. ఇక అక్కడి నుండి వెనక్కు తిరిగి వచ్చిన వారి విషయం చూస్తే - ఆంధ్రప్రాంతానికి శ్రీలంకలోని గాలి (*Galle*) నుండి వచ్చిన వారు 'గాలి' వారుగానూ, త్రికోమలిపుర (ట్రింకోమలి) లేక 'త్రిపుర' నుండి వచ్చినవారు 'త్రిపురనేని' వారుగానూ (భద్రాచలం తాలూకాలో త్రిపుర పంటవీడు అనే వూరుంది. బహుశా వారు అక్కడికి ముందుగా వచ్చి వుంటారు.), మెక్కిలి నుండి వచ్చిన వారు మెక్కిలి నాయని - మిక్కిలినేని వారుగానూ, గమిని నుండి వచ్చినవారు 'గమిని' లేక 'గవిని' వారుగానూ వ్యవహరించబడినారనీ ప్రధానంగా యిదంతా క్రీ.శ. 16వ శతాబ్దిలో జరిగి వుంటుందనీ నేను భావిస్తున్నాను. (శ్రీలంకతో రాకపోకల కారణంగా అక్కడి గ్రామ నామాల మీది యిండ్లపేర్లు ఏర్పడడం చారిత్రకంగా యింకా ముందరి కాలంలో కూడా జరిగి వుండవచ్చు. ఎందుకంటే రాజరాజచోళుడు క్రీ.శ. 985 - 1018 మాల్దీవులనూ, శ్రీలంక ఉత్తర ప్రాంతాన్నీ ఆక్రమించి పాలించినట్లు చరిత్ర కారులు నిర్ధారించారు. అంతకంటే ఎంతో పూర్వమే కరికాల చోళుడు సింహళాన్ని ఆక్రమించి పాలించాడని కూడా చరిత్ర చెపుతున్నది. ఆయన శ్రీలంక నుండి యుద్ధ ఖైదీలను తమిళ దేశానికి తీసుకొచ్చి అక్కడి ఆనకట్టల నిర్మాణంలో వారిచేత వెట్టి చాకిరీ *(conscription)* చేయించాడట. దీన్ని బట్టి నాటి నుండే యిక్కడి వారు అక్కడికి, అక్కడి వారు యిక్కడికీ, రాకపోకలు సాగించే అవకాశం వుంది. కరికాల చోళుడి పూర్వీకులు కడప జిల్లా - చోళవాడి - కి చెందిన తెలుగు వారై వుంటారని కొందరు చరిత్ర కారుల అంచనా. కనుక కరికాల చోళుని సేనలో అప్పటికే తెలుగువారుండడం, వారు ఆయన సింహళ విజయ యాత్ర అనంతరం కొంత కాలం అక్కడే స్థిరపడడం, అనంతరం తెలుగు గడ్డపై మమకారంతో తిరిగి తమ మాతృ భూమికి వారు వచ్చి చేరడం సంభవించే అవకాశాన్ని మనం కొట్టి పారేయలేం.)

'గ్యాలి' వివిధ గ్రామానామాలలో 'గాల' గా పరిణామం చెందింది.

ఉదా : కన్ను + గ్యాలి → కన్నుగ్యాల → కనగాల

ఇలాగే దుగ్గా ్యల, ఇనగాల వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. ఈశాన్య భారతదేశంలోని నమగ్యాల్, రాగ్యాల్, చోగ్యాల్ వగైరా గ్రామనామాలు కూడా 'గ్యాల్' గా రూపాంతరం చెందిన 'గ్యాలి' తోనే ఏర్పడ్డాయి.

## న్యాలి

ఇక 'న్యాలి' పదాన్ని చూద్దాం. మెదక్ జిల్లాలో 'న్యాల్‌కల్' అనే గ్రామముంది. కల్ (కల్లు) అంటే కొండ. కొండపై కురిసే వాన నీటిని సంరక్షణ చేసి కొండపైన తటాకాలు, కాలువలు వగైరాలు ఏర్పరచే అలవాటు ప్రాచీన మానవులకు కూడా ఉంది. అలాంటి జల సంరక్షణ పథకాలు చేపట్టబడిన కొండలు - ద్రోణాద్రి. (ద్రోణము అంటే కూడా నీటిని నిలువ చేసే సాధనం - కుండ - దొన - దోనె) ద్రోణకొండ - దొనకొండ. దొనబండ, నీర్మల (నీర్‌మల), నీరుకొండ వగైరా గ్రామాల వలెనే 'న్యాల్‌కల్' గ్రామనామమూ ఏర్పడింది. 'న్యాలి' అంటే నీటివనరు. 'న్యాల్‌కల్' అంటే నీటి వనరుగల కొండ. ఇటువంటి గ్రామ నామమే న్యాలకొసిగి. 'న్యాల' పేరుతో దక్షిణాఫ్రికాలో జీవించే జింక జాతి జంతువొకటి వుంది. దీని శాస్త్రీయ నామం *Tragelaphus angasi (Family Bovidae).*

సకిన్యాల అనే మరో గ్రామముంది. దీని పూర్వపు రూపం సకిన న్యాలి అయి వుంటుంది. అదే సకిన న్యాలగా రూపాంతరం చెంది తరువాత సకిన్యాల అయి వుంటుంది. 'సకినము' అంటే శుభ సూచకము అని అర్థం. (సకిన + ఏటిపల్లి → సకినేటిపల్లి - తూ.గో. జిల్లా), దోరన్యాలి → దోరన్యాల → దోర్నాల. (ప్రకాశం జిల్లా)

అలాగే న్యాలి కొండ అనే గ్రామమూ వుంది. ఖమ్మం జిల్లా నేలకొండ పల్లి కూడా మొదట్లో న్యాలికొండ పల్లే ! ఇది భద్రాచల రామదాసుగా ప్రసిద్ధుడైన కంచర్ల గోపన్న జన్మస్థలం. అలాగే న్యాలికొసిగి అనే గ్రామ నామం కూడా 'న్యాలి' మీదుగానే ఏర్పడింది. అదిప్పుడు న్యాలకొసిగి అనబడుతున్నది. అలాగే కడప జిల్లా జమ్ముల మడుగు తాలూకాలోని 'న్యాలినూతుల' అనే గ్రామం కూడా యిప్పుడు నేలనూతల అనబడుతున్నది.

ఒరిస్సాలోని ఢెంకనాల్ కూడా ఒకప్పటి ఢెంకన్యాలి అయివుంటుంది. అలాగే హర్యానాలోని కర్నాల్ కూడా.

కర్ణ న్యాలి → కర్ణ్యాలి → కర్ణాలి → కర్ణాల్ → కర్నాల్‌గా రూపాంతరం చెంది వుంటుంది.

కాలక్రమేణా 'ర్యాలి', 'ప్యాలి' వగైరాలు జన వ్యవహారంలో 'రాల', 'పాల' అయినట్లే -

'న్యాలి' కాలక్రమేణా 'నాలి' గా రూపాంతరం చెంది వుంటుంది. కృష్ణాజిల్లా నాగాయలంక మండలంలో 'నాలి' అనే ఊరుంది. తమిళనాడులోని రాజపాళయం దగ్గర కూడా 'నాలి' అనే ఊరుంది. ఈ రెండూ కూడా 'న్యాలి' నుండి రూపాంతరం చెందిన గ్రామనామాలే.

కనుక 'తెనాలి' లోని 'నాలి' - 'న్యాలి' యొక్క రూపాంతరమేనని అర్థం చేసుకోవచ్చు. ఇక యిప్పుడు యీ న్యాలి, ప్యాలి, మ్యాలి, ర్యాలి వగైరా పదాలు ఏ ప్రాచీన భాషకు చెందినవై వుంటాయో ఆలోచిద్దాం.

## న్యాలి శబ్దం - తొద భాష

మూల ద్రావిడ భాష నుండి ఆవిర్భవించిన తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం, తుళు, కొడగు, గదబ వగైరా 21 ద్రావిడ భాషలలో తొద (లేక తోడా) భాష కూడా ఒకటి. తొద జాతివారి సంఖ్య ప్రస్తుతం వెయ్యికి మించదు. వీరి ఆచారాలు, భాష విలక్షణమైనవి. నీలగిరులలో గల మైదాన ప్రాంతాలలో నివసించే యీ ఆదిమజాతి వారి ముఖ్య వృత్తి గేదెల పెంపకం. వీరు మాంసం తినరు. పాలు, పాల ఉత్పత్తులు అమ్మి వీరు తమకు కావలసిన వస్తువులు కొనుగోలు చేస్తారు. ముదురు గోధుమరంగులో పొడవుగా, బలిష్ఠంగా వుండే యీ జాతి వారిని, మిగిలిన నీలగిరి జాతులవారు అగ్రజాతిగా భావిస్తారు. ఊటీ వెళ్లేవారెవరైనా వీరిని గుర్తించవచ్చు.

వీరి భాషలో 'య' కారాంత శబ్దాలు చాల విస్తారంగా ఉన్నాయి. కొన్ని ఉదాహరణలు చూడండి -

నర్ళ్య - నక్క (ప్రాగ్ద్రావిడంలో 'నరి' అంటే నక్క. వరంగల్ జిల్లా జనగామ సమీపంలోని 'నర్మెట్ట' యీ పదం నుండే ఏర్పడింది.)
అఖ్య - తెలిసికొను (తెలుగులో కూడా వివరములఖయుట అనే ప్రయోగం వుంది. ఆరా తీయడం దీని నుండే వచ్చి వుంటుంది.)

| | |
|---|---|
| మఖ్య - చిన్న జంతువు | త్వఖ్య - దురద |
| పొంఖ్య - పని | ఓడ్య - ఆడు |
| కత్య - గాడిద | నొబ్య - నమ్ము |
| ఈఘ్య - ఈగ | కూడ్య - కలియు (కూడు) |
| పుస్య - పులి | పోత్య - పక్క (*bed*) |
| కిఫ్య - చెవి | పఖ్య - భాగము (పక్షము) |

వీరి భాషలో కోడ్ అంటే పల్లపు పొలము. (తెలుగు తదితర ద్రావిడ భాషలలో కూడా 'కోదు' అంటే నీరు నిలిచిన పల్లపు భూమి. ఆవ, లోవ, అప్పి, వగైరా పదాలకు కూడా అదే అర్థం.)

కోడ్మ్యాల → కొడిమ్యాల; కోదూరు; కోదుమూరు వగైరా గ్రామ నామాలకు ఆధారం యీ పదం కావచ్చు. మూలద్రావిడ భాషలో వుండిన యిటువంటి వందలాది యకారాంత పదాలు, తెలుగుకు మూలమైన మూల మధ్య ద్రావిడంలో కాలచక్రగమనంలో అంతర్ధానమైనప్పటికీ, మూలదక్షిణ ద్రావిడం నుండి రూపుదాల్చిన తొద భాషలో నేటికీ సజీవంగా వున్నాయి.

## న్యాలి - ప్రోటో ఆస్ట్రలాయిడ్ భాషలు

నీటి వనరులకు సంకేతాలుగా వాడబడిన న్యాలి, ప్యాలి, మ్యాలి వగైరా పదాల అసలైన ప్రయోగార్థాలు తెలియాలంటే తొద భాషపై యింకా పరిశోధనలు సాగాల్సి వుందని నా అభిప్రాయం. ఎందుకంటే ద్రావిడ భాషా కుటుంబములోని యింకే భాషలోనూ యీ తరహా పదాలు కానరావడం లేదు. ఒకప్పుడు మధ్యధరా ప్రాంతంలోనూ, పశ్చిమాశియా, మధ్యాశియా మరియు యావత్తు భారతద్వీపకల్పంలోనూ ద్రావిడ సంస్కృతి పరిఢవిల్లింది. అయినా న్యాలి, ర్యాలి, ప్యాలి వగైరాలతో అంతమయ్యే గ్రామనామాలు మనకు అతికొద్దిగా మాత్రమే కనుపిస్తున్నాయి. ఈ కారణంగా యీ శబ్దాలు ద్రావిడులకూ, మూల ద్రావిడ భాషకూ పూర్వపు వారైన ప్రోటో - ఆస్ట్రలాయిడ్ల భాషకు చెందినవైనా అయివుండవచ్చు ననిపిస్తుంది. ఆర్యులు భారతదేశంలోకి ప్రవేశించక పూర్వం (అంటే క్రీ.పూ. 2500 సంవత్సరాల కంటె ముందు) ద్రావిడ సంస్కృతి యావత్తు భారత ఉపఖండంలోనూ విస్తరించింది. ద్రావిడులు, వారికి పూర్వపు వారైన ప్రోటో - ఆస్ట్రలాయిడ్లు నవీన శిలాయుగ నిర్మాతలుగా భావించ బడుతున్నారు. నవీన శిలాయుగమంటే క్రీ.పూ. 10,000 సంవత్సరాల నుండి క్రీ.పూ. 5000 సంవత్సరాల వరకు గల కాలం. నిగ్రిటోల తరువాత పశ్చిమాశియా ప్రాంతాలనుంచి వచ్చి భారతదేశంలో స్థిర నివాసమేర్పరచుకున్న ప్రోటో - ఆస్ట్రలాయిడ్లు మనదేశంలో వ్యవసాయాన్ని ప్రారంభించారు. నేడు భారతీయ ఆటవిక జాతులలో వీరు కనుపిస్తున్నారు. సంతాలులు, ముండారీలు, అసురులు, కొరవలు, ఆంధ్ర దేశంలోనూ, ఒరిస్సాలోనూ వున్న గదబలు వీరి సంతతి వారే. కొలేరియన్, ముండారీ కుర్కు వీరి భాషలు. వీరిని ఆర్యులు నిషాదులన్నారు. గదబ, మూతిబ, పుళింద, పంబ, శబర, ముండార, కుర్కు కేరళ, మలయాళ, బంగాళ, ఉత్కళ, నారికేళ, కదళి, నింబ, తమిళ, తుళు, కళింగ, తురుమాళ్ (కోరాపుట్ జిల్లా, ఒరిస్సా), చంబళ (అదే నేటి చంబల్) వగైరా పదాలు ప్రోటో - ఆస్ట్రలాయిడ్ల

భాషలలోనివేనని భాషాశాస్త్రవేత్తలు నిర్ధారించారు. వీరు యిక్కడి నదులకూ పర్వతాలకూ మొదటగా పేర్లు పెట్టారట. వాటిలో కొన్ని ఆర్యుల ఆగమనం తరువాత రూపాంతరం చెందాయి.

| | | |
|---|---|---|
| కోన్యోధ → కన్నడ | లాంగూళ్య | సీలేరు |
| కణ్ణబెణ్ణ → కణ్ణవెణ్ణ (కృష్ణవేణి) | లూణి → లూనీ | బైనేరు |
| నబ్బద → నర్బద → నర్మద | సీణ | వణ్ణ |
| గోద → గోదావరి | కోణ | దిండి |
| ఖాహుద | తీర్ణ (తిణ్ణ) | కాళంగి |
| | (సంస్కృతంలో 'దాటబడిన' అని అర్థం.) | కుర్కు-కూర్గు |
| పెణ్ణ → పెన్న (పెన్నేరు) | సోణ (సోన్ నది) | |
| వెణ్ణగంగ → వైన్ గంగ | గీర్ణ (గిణ్ణ) (సం. మ్రింగబడినది) | |
| | బహుశా ఎడారిచే మ్రింగబడిన నది కావచ్చు. | జ్వోబ |
| పెణ్ణగంగ → పెన్‌గంగ | చంబళ → చంబల్ | పంబ |
| నాగావళి | కబ్బణి (కబిని-కావేరికి ఉపనది) | |

వగైరాలు వీరు యిక్కడి నదులకు, ప్రాంతాలకు పెట్టిన పేర్లు. జభారతదేశంలోని అతి ప్రాచీన పర్వతాలైన ఆరావళి పర్వతాలకు వీరే ఆ పేరు పెట్టారని భావిస్తున్నారు. 'కొరవ' శబ్దం నుండి 'కొరవి సీమ' అనేది ఆవిర్భవించింది. (ఇది ప్రస్తుత వరంగల్ జిల్లా మహబూబాబాద్ ప్రాంతం) మెడిటరేనియన్ (మధ్యధరా) సముద్ర ప్రాంతాన్నుంచి వచ్చిన ద్రావిడులు ప్రోటో - ఆస్ట్రలాయిడ్లను ఓడించి వశం చేసుకున్నారు. ప్రోటో - ఆస్ట్రలాయిడ్ సంస్కృతీ సమాగమంతో ద్రావిడ సంస్కృతి సంపద్వంతమైంది. అలాగే ద్రావిడ భాషలూనూ. అలా బహుశా ద్రావిడ భాషలలో కలసి కాలక్రమేణా లుప్తమై పోయిన పదాల కోవకే యీ న్యాలి, ప్యాలి, మ్యాలి, గ్యాలి వగైరాలు వస్తాయి. ఇంకా యిలాగే తొదభాషతోనో లేక మరేదైనా అతి ప్రాచీన భాషతోనో సంబంధం వుండే అవకాశమున్న గ్రామ నామాలు కొన్ని చూడండి -

బ్యాదరహళ్లి, న్యామద్దల, న్యాల కొసిగి, హిరే హ్యాటి, బ్యాసిగ దేరి, జ్యాలి బెంచి, క్యాదిగి హాళు, కురు క్యాల వగైరా వగైరా.

'తెనాలి' గ్రామనామంలోని 'న్యాలి' అనే శబ్దం ఎంత ప్రాచీనమైనదైవుండదానికి అవకాశముందో సోపపత్తికంగా వివరించదానికే నేనిదంతా చెప్పాల్సి వచ్చింది. ద్రావిడ (ముఖ్యంగా తొద), ప్రోటో-ఆస్ట్రలాయిడ్ భాషలపై లోతైన పరిశోధనలు జరిగితేనే గాని ఈ తరహా పదాల పుట్టుపూర్వోత్తరాలు, ప్రయోగార్థాలు మనకు పూర్తిగా అవగతం కావు. మొత్తం మీద అవన్నీ నీటి వనరులకూ, ఆ కారణంగా జనావాసాలకూ సంకేతాలుగా వాడబడినట్లు మనం భావించవచ్చు. ఆధునిక భారతీయ భాషలలో ఏ భాషలోనూ కానరాని యీ పదాలు అత్యంత ప్రాచీనమైనవనదానికి వేరే ఋజువులక్కరలేదను కుంటాను. 'న్యాలి' శబ్దమే తెనాలి ప్రాచీనతకు నిలువెత్తు సాక్ష్యం. న్యాలి శబ్దమే కాలక్రమేణా 'నాలి'గా రూపాంతరం చెందింది.

## 'తెనాలి' పద పూర్వార్ధ భాగం

తెనాలి గ్రామ నామంలోని పూర్వార్ధభాగం మాత్రం 'న్యాలి' అంత ప్రాచీనమైనదిగా అనిపించడం లేదు. దక్షిణ అమెరికా ఖండంలోని ఈక్వెడార్ దేశంలోని తెనా, బర్మాలోని తెనాస్సెరిమ్ లేక చైనాలోని తెనాకా పట్టణాలతో దీని కెటువంటి

బాంధవ్యమూ వున్నట్లు లేదు.

కనుక మనమీ విశ్లేషణలో మూలద్రావిడ భాషలోని శబ్దాల్ని కొన్నింటిని పరిశీలిద్దాం. ఎందుకంటే అత్యంత ప్రాచీనమైన మూలద్రావిడ భాషలోని శబ్దాలతో మన ప్రాంతపు గ్రామనామాలు కొన్ని ఏర్పాడ్డాయి. గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా కర్లపాలెం సమీపంలో ప్రస్తుతం 'పేరలి'గా పిలువబడుతున్న గ్రామమొకటి వుంది. దళితులలో 'పేర్లి' అని వున్న యింటిపేరును బట్టి యీ గ్రామం అసలు పేరు 'పేర్లి' అనీ, జనవ్యవహారంలో కాలక్రమేణా అదే 'పేరలి' అయివుంటుందనీ అర్థం చేసుకోవచ్చు. మూల ద్రావిడ భాషలో 'పేర్' అంటే పెద్ద. 'పేర్' అంటే తమిళంలోనూ అదే అర్థం. పేర్ అవై అంటే 'పెద్ద సభ'. తెలుగులోనూ 'నిండు పేరోలగము' అనే ప్రయోగం వుంది కదా! ఇలా పేర్ + లి → పేర్లి → పేర్లి ఏర్పడింది. తమిళనాడు లోని వైదీశ్వరన్ కోయిల్ పట్టణ సమీపంలో కూడా 'పేర్లి' అనే చిన్న గ్రామముంది. ఇలాగే మూలద్రావిడ శబ్దాలతో ఎన్నో ఊళ్లపేర్లు మన ప్రాంతంలో ఏర్పడ్డాయి. చిత్తి (పిన్న) + ఊరు → చిత్తూరు; నెల్లు (ధాన్యము) + ఊరు → నెల్లూరు మొదలైనవి దీనికి ఉదాహరణలు. తమిళనాడులోని రాజపాళయం సమీపంలో ఒకటి, దివితాలూకా నాగాయలంక మండలంలో మరొకటి 'నాలి' అనే పేరుగల గ్రామాలున్నట్లు మనం యిదివరకే అనుకున్నాం. **('ఇరు' - రెండు - అనే మూలద్రావిడ శబ్దంతో ఏర్పడిన 'ఇరాలి' అనే గ్రామం కూడా దివి తాలూకా లో వుంది. ఇరు + ర్యాలి → ఇర్ర్యాలి → ఇరాలి)**

ఇక తమిళనాడులో 'తేని' అనే పట్టణముంది. తేనె బాగా లభించే పర్వతమయ, అటవీ ప్రాంతం కావదాన దానికా పేరు వచ్చిందట. మన తెనాలి తేని (తేనె) + న్యాలి అయ్యే అవకాశం లేదు. 'తెన్నైమరమ్' అంటే తమిళంలో కొబ్బరిచెట్టు. మన తెనాలి తెన్నై + న్యాలి → తెన్నైన్యాలి → తెన్యాలి → తెనాలిగా మారి వుంటుందనడం కూడా అంతగా నప్పడం లేదు.

మరి తెనాలి పూర్వార్థ భాగం ఏమైవుంటుంది? దీనికోసం మరికొన్ని మూలద్రావిడ శబ్దాల్ని పరిశీలిద్దాం.

'వడ' అంటే మూలద్రావిడంలో ఉత్తరపు (*Northern*) అని అర్థం. ఆ శబ్దంతో తమిళనాడులో 'వడ పళని' వగైరా గ్రామనామాలేర్పడడమే కాక, దివి తాలూకాలోని 'వడలి' అనే గ్రామనామమేర్పడింది. 'వడలి' అంటే 'ఉత్తరపు నీటి వనరు' అని అర్థం. అలాగే విశాఖపట్నం జిల్లా గొలుగొండ మండలంలోని 'వడ పర్తి', వడ కట్టు. రాయగఢ ఏజెన్సీలోని 'వడవడి' వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి.

'మేల్' అంటే మూలద్రావిడంలో పశ్చిమ (*Western*) అని అర్థం. మేల్‌పాక్కం, మేల్ మరువత్తూర్, మేలూర్ వగైరా తమిళనాడులోని గ్రామనామాలు యీ శబ్దంతో ఏర్పడినవే. 'కీళ్' అంటే మూల ద్రావిడంలో తూర్పు (*Eastern*). దీనితో కీళ్‌పాక్కమ్, కీళాత్తూర్, కీళ్ వళైవు, కీళ్ మంగళమ్ వగైరా గ్రామ నామాలేర్పడ్డాయి. మన తెలుగులో కూడా పడమటలంక, తూర్పుపాలెం, పూర్వ బొమ్మేపల్లె (పూర్వ అంటే తూర్పు దిక్కు), తూర్పు రొంపిదొడ్ల, మాటూరు (మాటు అంటే పడమటి దిక్కు), ఉత్తరాపల్లి, తెన్నేరు, తెన్నుటికిరి (తెన్ను అంటే దక్షిణ దిక్కు) వగైరా ఊళ్లున్నాయి గదా!

ఇక మూల ద్రావిడంలో 'తెన్' అంటే దక్షిణపు (*Southern*) అని అర్థం. తెన్‌కాశి (దక్షిణ కాశి) పేరుతో తమిళనాడులో ఓ పట్టణముంది. తమిళనాడులోని మదురైని 'తెన్ మదురై' (దక్షిణ దేశపు మధురానగరం. ఉత్తర ప్రదేశ్‌లోని మధురను తమిళులు 'వడ మదురై' అంటారు. ) అని అంటారు. మన తెనాలి కూడా తెన్ + న్యాలి → తెన్న్యాలి → తెన్నాలి → తెనాలి గా రూపాంతరం చెందిందని మనం అర్థం చేసుకోవచ్చు. కన్నడ సాహిత్యం తెనాలి రామలింగకవిని, తెన్నాలి రామలింగ కవి అని పేర్కొంటుంది. ఆ మధ్య దూరదర్శన్‌లో 'తెన్నాలి రామ' అనే పేరుతో శ్యామ్ బెనెగల్ నిర్మించిన

సీరియల్ కూడా ప్రసారమైంది. దీనిని బట్టి తెనాలికి పూర్వరూపం 'తెన్నాలి' అనేది అర్థమవుతుంది. అంతకు పూర్వరూపమైన 'తెన్యాలి' లోని 'యకారం' కాలక్రమేణా లుప్తమవడం కారణంగా 'తెన్నాలి' ఏర్పడి, అదే మరింత పరిణామం తరువాత 'తెనాలి'గా మారిందనే నిర్ధారణకు మనం రావచ్చు. 'ఘటికాచల మాహాత్మ్యము కావ్యానికి వేంకట గిరీంద్రుడు వ్రాసిన అవతారికలో కూడా 'తెన్నలి రామకృష్ణ కవి' అనే పేర్కొనడాన్ని బట్టి కూడా 'తెనాలి' కి పూర్వ రూపం 'తెన్నాలి' అని అర్థం చేసుకోవచ్చు. అలా తెన్ + న్యాలి → తెన్న్యాలి → తెన్నాలి → తెనాలి అయిందన్నమాట.

తెన్నేరు, తెన్నుటికిరి వగైరా చాల గ్రామ నామాలు యిలాగే దక్షిణ దిక్కున కల నీటి వనరులను సూచిస్తూ ఏర్పడినవే ! 'తెన్ న్యాలి' దక్షిణపు నీటి వనరును సూచిస్తూంటే మరి ఉత్తర దిక్కున గల నీటి వనరును సూచిస్తూ 'వడన్యాలి' అనే గ్రామమూ వుండాలి కదా ? అనే ప్రశ్న మనకు తట్టవచ్చు. 'వడలి' అటువంటి ఉత్తర దిక్కున గల నీటి వనరును సూచించే గ్రామమే. 'తెన్ న్యాలి' వుంది కనుక తప్పని సరిగా అక్కడే 'వడన్యాలి' కూడా వుండి తీరాలని ఎక్కడా లేదు. వడపర్తి, వడకట్టు, వడవడి, వడలి గ్రామాలున్నట్లు గానే ఎక్కడైనా 'వడన్యాలి' కూడా వుండే వుంటుందేమో ! ఒక గ్రామానికి దక్షిణ దిక్కుగా ఏదైనా చెరువో లేక యితర నీటి వనరో వుండడం కారణంగా 'తెన్ న్యాలి' అనే గ్రామ నామం ఏర్పడి వుంటుంది. 'దక్షిణ దిక్కుగా నీటి వనరున్న గ్రామం' గానే దీనిని మనం అర్థం చేసుకోవాలి.

ఏమైనా మనం గ్రహించాల్సిందేమంటే తెనాలి గ్రామనామంలోని పూర్వార్ధ భాగమైన 'తెన్' ఉత్తరార్ధ భాగమైన 'న్యాలి' అంత ప్రాచీనమైనది కాదు. భారతదేశంలో ద్రావిడుల కంటే ముందు స్థిరనివాసమేర్పరచుకున్న ప్రోటో ఆస్ట్రలాయిడ్ల భాషల్లోని పదం అయ్యే అవకాశం 'న్యాలి'కి ఉండగా, 'తెన్' చాల తర్వాతి కాలపు శబ్దం. గ్రామ నామంలో 'న్యాలి' ముందుగా ఏర్పడి తరువాతి కాలంలో గ్రామనామంలో 'తెన్' (దక్షిణపు) శబ్దంచేరి యుండవచ్చు. బహుశా 'తెన్' వచ్చి చేరడం 'న్యాలి' శబ్దం 'నాలి'గా రూపాంతరం చెందిన తరువాతనైనా కావచ్చు. 'తెన్' (*Southern*) అనేది మూలద్రావిడ భాషాశబ్దమని ఎక్కువ మంది భాషా పండితులు విశ్వసిస్తూండగా కొందరు 'తెన్' వ్యుత్పత్తినిలా వివరిస్తున్నారు. 'దక్షిణ' అనే సంస్కృత పదం వాడుకలో 'దక్షిన్'గా మారి, ప్రాకృతంలో 'దఖిన్', 'దహిన్' రూపాలుదాల్చి, 'తహిన్'గా మారి జనవ్యవహారంలో 'తెన్' అయి మూలద్రావిడ భాషచే స్వీకరించబడిందనేది వారి వాదన. 'తెన్' అనే మూలద్రావిడ భాషా శబ్దం నుండే 'తెనుగు' అనే శబ్దం కూడా పుట్టి, అదే కాలక్రమేణా 'తెలుగు' గా మారిందని వారి విశ్వాసం.

ఇదీ 'తెనాలి' శబ్దావిర్భావానికి సంబంధించిన సుదీర్ఘ చరిత్ర. ఇలా పేరులోనే ప్రాచీనతను పుణికి పుచ్చుకున్న మన తెనాలిని చూసి హర్షపులకాంకితులు కాని వారెవరైనా వుంటారా మనలో? మన తెనాలి సైతం తన ప్రాచీనత పట్ల గర్వంతో పులకాంకితాంతరంగిని కాకమానదేమో!

(ఈ గ్రంధ రచయిత 'మన తెనాలి' అనే గ్రంధం కొరకు
వ్రాసిన పరిశోధనాత్మక వ్యాసానికి యిది సంక్షిప్తీకరణ.)

# Epilogue

VIKATA KAVI Tenali Rama Krishna needs no ceremonial introduction. This Book is intended to ruminate and ponder over certain aspects of his life and works. He was the *Poet laureate* and Court Jester at Hampi Vijaya Nagar during the reign of Sri Krishna Devaraya (AD 1509-30). Most of the literary critics strongly believe that he was one among the coterie of Telugu poets popularly known as the Ashta Diggajas (named after the eight legendary tuskers, which are deemed to sustain the burden of the earth from the quarters) who adorned 'Bhuvana Vijaya', the Court of the Raya. Quick-witted as he was, he tussled and bandied words with many pundits and poets in that Court and defeated them with his literary prowess, wit and wisdom. Unlike the other great bards of his times, he was quite popular among the laity as well, on account of his intellectual acuity, rhetorical skills, impromptu poems and extemporaneous speeches. With his innate gift of gab he retorted many a time to give a rap on the knuckles of his opponent poets. All this is but the obverse side of the picture. On the side much unknown to the readers of the

Modern Age, he is a great poet, asserted with all certainty. Indeed, he is a *rara avis*. The poesy of this Saivite-turned-Vaishnavite as is revealed from a study of his principal verses 'Udbhataaraadhya Charitramu', 'Paanduranga Maahaatmyamu' and 'Sri Ghatikaachala Maahaatmyamu' is astounding. At times the momentous and exalted feelings that emanate from such a study are innumerable, inestimable and ineffable too. He became popular as Ramakrishna of Tenali, the city in the Guntur District of Andhra Pradesh, in which he was brought-up, though his surname was Garlapati (after Garlapadu his native village nearby).

Having born to Smaartha (the Brahmanas who follow the traditional laws or Smrithis) Parents, he was christened Rama Linga (after the Presiding Deity of the renowned Rameswara Swamy Temple at Tenali). He took Siva Deeksha (the Consecration Ceremony for the Saivite Initiation) at the age of 15 years. To commemorate that occasion his father Garlapati Rama Panditha offered to the Rameswara Shrine three bronze statuettes as Utsava Moorthis. As gleaned from the inscription on one of these statuettes, this event is now regarded to take place on 14-01-1510, and this versatile versifier is believed to have born in the year AD 1495. During the prime of his life "Kumaara Bhaarathi" was his *nom de plume*, and he wrote Saivite verses like 'Udbhataaraadhya Charitramu', which acquired for him great repute and renown. As Sri Krishna Devaraya was a Veera Vaishnava, under the strong influence of the eminent Thengala Vaishnava Preceptor Thirumala Tatacharya, admittance to 'Bhuvana Vijaya' was mostly confined to the Vaishnava Brahmanas only. With this given situation, Ramalinga shunned Saivism and donned Vaishnavism, rechristening himself as Rama Krishna to get an easy access to the Royal Court. But, on account of certain earlier events in which the Poet rubbed wrong shoulders with him, the Raja Guru, had a dig at this born-Linga and gave him a wide berth. With this Rama Krishna, under the preceptorship of Bhattar Chikkacharya, adopted Vadahala Vaishnavism or Vaikhaanasa Vaishnva Sect and was thenceforth at logger heads with Tatacharya 'for eternity'.

Thengala Vaishnavites adopted the South Indian Language-Tamil in their ritualistic practice. 'Thengala' is the transformation of the Tamil 'Then Kalai', which means the 'Southern Language' or Dravida (Tamil). On the other hand, Vadahala Vaishnavites were adherents of Sanskrit- 'The Northern Language' in their rituals. 'Vadahala' is the transformation of Tamil 'Vada kalai', which means The Northern Language. In the Vaishnavism of the post- Ramanuja period, thus two sects emanated chiefly on the basis of defference in the language used in the ritualistic practice. Vadahala sect was

led by Sri Vedantha Desikar whereas the Thengala sect was under the leadership of Sri Manavaala Muni. The struggle between these sects was at its pinnacle in the South India during the 14th and the 15th centuries. There were 16 major differences between these two sects in the faith and practice. In those days, by seeing the Thiru Nama on a man's forehead itself people used to recognise whether he was a Thengala or a Vadahala Vaishnavite.

The Poet adopted Vadahala Vaishnavism not only in view of his enmity to the Thengala Vaishnava Preceptor Thirumala Tatacharya, but also as he himself was an ardent lover of Sanskrit Language. The Thengala Vaishnavites were Catholic and broad-minded in spirit and encompassed all the devout Vishnavites into their ranks to broaden their base. They had a dig at the Vedic Testimony and hence they were against the Caste System propounded in the Vedas. On the other hand, the Vadahala Vaishnavites were conformists to the bone. They were strong supporters of the Caste System and the Traditional Laws. Under the strong influence of the ideology of his Vadahala sect Tenali Rama Krishna metamorphosed into an ardent adherent of the Caste System. This was one of the reasons why he rode always on high horses and frowned at the bards who hailed from the Sudra Communities. As is evidenced by a number of stray verses (Chaatuvulu) prevalent in Telugu he was always disdainful and contemptuous to the bards of the Fourth Caste in general and to eminent versifiers like Bhattu Moorthi and Molla in particular.

After adopting Vaishnavism, this poet is believed to have recieved patronage in the Court of Sri Krishna Deva Raya upto the demise of the latter in AD 1530. During that time he had a wonderful opportunity of mingling in close quarters with eminent poets like Sri Krishna Deva Raya, Allasani Peddana, Nandi (Mukku) Thimmana, Dhurjati etc. It is generally believed that during that time he composed verses like 'Kandarpa Kethu Vilaasamu' and 'Hari Leela Vilaasamu'. During the reign of Achyutha Raya the Poet is considered to have led an ascetic life far from the Royal Court, as a fervid and passionate devotee of God Vittal. During those times in Hampi Vijaya Nagar there was a Vittala Raya Temple, which was very famous in the entire country - a temple of Vittal famed next only to that of Paandu Ranga Vittal in Pandharpur. It attracted devotees from far and near. Famous ascetics like Chaitanya Maha Prabhu (AD 1485-1533) of Bengal and the renowned saint-bard Bhaktha Purandara Dasa of the sixteenth century AD were among the notable few who were greatly inspired by the Vittala Raya Temple of Hampi. The haughty Tenali Ramakrishna transformed into a devout Vaishnavite

under the strong influence of Vittala Bhakthi and thus became a broad-minded and pious individual. One can notice this change in his attitude through a close study of his another famous verse 'Paanduranga Maahaatmyamu'. The Poet composed this celebrated verse during 1570-72 AD under the *aegis* of a devout Vaishnavite namely Viruri Vedadri, who worked as a scribe in the court of a Pothapinati Telugu Choda Ruler by name Pedda Sanga Bhoopala. Before taking the refuge of Vedadri, the Poet is believed to have left Hampi during the crisis of Tallikota Battle in AD 1565 and spent the rest of his life as a bird of passage living almost from hand to mouth. He lived quite for some years probably in Tenali and Pithapuram in Prolunaadu (now in the East Godavari District of A.P.) during that period. The greatness and profundity of the feelings that emanate from a study of 'Paanduranga Maahaatmyamu' are immeasurable and they are indeed abysmal. This Maha Kaavya (great verse) is regarded as one among the famous Pancha Kaavyas, the five great verses of all times in the Telugu literature. The poet is believed to have composed a verse by name 'Paanduranga Vijayamu', a precursor or a harbinger of 'Paanduranga Maahaatmyamu'. But some fragments of it only are now extant, on the basis of which some literary critics established that it also was the work of Tenali Rama Krishna and it predates 'Paanduranga Maahaatmyamu'.

*Ad extremum,* as a nonagenarian, the Poet is believed to be patronised at least for two years (may be during AD 1585-86) in the Court of Venkatapathi Deva Raya of Chandragiri. For one reason or the other he left the Royal Court soon. Perhaps in his last days he composed his another great verse 'Sri Ghatikaachala Maahaatmyamu' but could not find a suitable patron to receive it. He passed away probably in the year AD 1590 at the mellow age of 95 years.

Incidentally, the phrase 'Vikata Kavi' is a palindrome (a word, phrase, line, verse etc. reading the same backward as forward. e.g. Madam, Rotator, Nurses run, Madam, I'm Adam). The Sanskrit word 'Vikata' means 'formidable', 'frightful', 'horrible', 'dreadful', 'fierce', 'savage', 'proud', 'haughty', 'frowning' etc. These were all exactly the qualities of the Poet during his earlier days. In Sanskrit 'Vikatam' means 'a boil', 'a tumour', 'White Arsenic' (Arsenic Trioxide- which is deadly poisonous - 'Swetha Paashaana' in Telugu), and also means 'Sandal' (Chandana). He was exactly like 'a boil' or 'tumour' on the bodies of his opponents and was as deadly as White Arsenic for them but soothed his own people and refugees (Prapanna) like an anointment of Sandal paste. The Sanskrit word 'Vikata' also means 'large-toothed', 'hideous', 'ugly' etc. which may be taken to allude to his 'repul-

sive' and 'very ugly' face as described in 'Yogi Bhogini Samvaadam' in 'Paandu Ranga Vijayamu'. He was 'fierce' and 'dreadful' to his opponents. His altercations and feuds lasting for years with Bhattu Moorthi and Thirumala Tatacharyulu illustrate his savagery. 'Vikata' also means 'great', 'large', 'broad', 'spacious', 'wide' etc. With the inevitable and constant intellectual evolution the poet gradually evolved into a 'great' man, with 'broad' views and 'noble' thoughts shunning his earlier parochialism. 'Vikata' also means 'obscure' (not expressing the meaning clearly or plainly; not clear to understand). The style used by the poet in his works is regarded by one and all as Naarikela Paaka (a very difficult or obscure style).

Finally, the Sanskrit word 'Vikata' also means 'Changed in appearance'. After adopting Vaishnavism, the physical appearance of the Poet changed a lot. Bhasma Thripundra (The three-line mark made with cowdung ashes by the Saivites) on the forehead disappeared giving place to the Vadahala Thiru Naama (a U-shaped marking with white pipe-clay and a yellow vertical stripe embellished within it with turmeric powder).

Thus it is strange that almost each one of the meanings of the Sanskrit word 'Vikata' is aptly and germanely suitable to the qualities of Tenali Rama Krishna and hence the epithet 'Vikata Kavi' is by all means befitting and appropriate in describing the characteristic attributes of the Poet.

I envisaged this Book to be an encyclopaedia *ne plus ultra* on the Poet. Besides giving the summary of all the Principal Verses of the Poet, in a style palatable to the readers of the Modern Age, I took maximum care to explain in a scientific way the beliefs and customs of those days, various socio-political issues and different species of Plant and Animal Kingdoms as mentioned in his works. The geographical details of various cities, places, mountains, rivers etc. mentioned by the Poet in his works were also given. I collected from various sources, the other works of the Poet like stray verses (Chaatuvulu) etc. and explained the meaning and the historic backdrop of each such verse. I collected various stories prevalent on this Great Poet and enriched them by giving the background and historic significance of the episodes described therein and by subjecting each such 'Story' to the Acid Test of 'History' for adjudging and accepting them as worthy chronicles. In such stories, to have a dramatic effect and a feeling of directness in appeal to the readers, I created vivid and vivacious characters suitable to the context with the requisite dialogue and ballads.

The History of Tenali Rama Krishna has always been a mystery for the literary critics and it has been a live issue for debate among them for decades together. By

trying to unveil certain historic aspects of the Poet hitherto shrouded in the clouds of mystery in the Sixth Chapter of this Book, I endeavoured to unknot this 'Historic Tie' to the maximum possible extent. For this purpose, I had to struggle hard to unravel the mystery about the native place of Bhattu Moorthi, a poet contemporaneous to Tenali Rama Krishna. With all proofs, I substantially established that Deva Raya Bhatla Palem, a village nearby Garlapadu is the native village of Bhattu Moorthi. As the name itself suggests, this village was donated to the ancestors of Bhattu Moorthi by Deva Raya - II (AD 1422-46) of Hampi Vijaya Nagara. Some critics, beleiving that the native village of Bhattu Moorthi was Bhattara Halli in the Bellary District of Karnataka and that it was donated by Sri Krishna Deva Raya (AD 1509-30), came to the abrupt conclusion that Bhattu Moorthi (thereby his contemporary Tenali Rama Krishna) cannot be contemporaneous to Sri Krishna Deva Raya and hence denied the fact that they both adorned the Bhuvana Vijaya. Recognition of Deva Raya Bhatla Palem as the native village of Bhattu Moorthi was the sheet anchor of the whole issue which solved this enigma.

I added 10 Appendages, each one of which is almost a 'thing-in-itself', involving a lot of research and a vast and variant study for years together. The forgotten History of Vaikhanasas, the riddle of Vaikhaanasa Saras (Baikal Lake in the Siberia), the conundrum of 'Kubera', 'Alakaapuri' and 'Czechs' (Yakshas or Jakkulu), the puzzle of Chukars (Chakoras) believed to live on moonlight as their feed have been extensively dealt with in those Appendices. Many details relating to castes like Velamas, Reddis, Kalaadas (Goldsmiths), and Plavas (Malas) mentioned by the Poet have been annexed. Some historic aspects of Telugu Chodas, who played a preponderant role during the those days in areas like Pothapinaadu (comprising of parts of the present Nellore, Chittoor and Kadapa Districts of A.P.), Prolunaadu (The Pithapuram Area in the East Godavari District, A.P.), Kammanaadu (Karma Rashtra - the geographical area of which Tenali is a part) where the Poet lived or received patronage, were also added as an appendant. Incidentally the genesis of Kakatiyas, Hari Hara Raya and Bukka Raya (the founders of Vijaya Nagar Empire), the pedigree of Musunuri Prolaya Nayaka and Musunuri Kapaya Nayaka and the lineage of Sri Krishna Deva Raya were gone into and were discussed in detail. The historic theories on the origin and evolution of castes like Kamma, Velama, Kaapu, Telaga, Balija and Ontari from Telugu Chodas, Haihayas etc. and their inalienable relationship with communities like Kshatriyas, Vyshyas and Reddis have been established on a scientific basis with all possible evidences.

*Ad finem,* the etymological significance of 'Tenali' and its linguistic antiquity have been established on the basis of a detailed Onomastical study of similar names of villages in different languages current through-out India or elsewhere.

Thus the gravity of this book increased in respect of its quantity as well as its quality with these ten appendices encompassing a detailed study of various issues touching the domains of different Pure, Applied and Social Sciences, taking recourse to study in various languages, which took almost 3 years for me to complete.

In view of the aforementioned facts, I am complacent about my work and I am sure that this Book will be appreciated and held in high regard by lovers of language, literature and literary criticism. Nevertheless I expect a good debate on various issues-especially the scientific and sociological issues raised by me during the process of scientific analysis of the verses of the Poet. I believe in the fact that any thesis is but a postulation to be proved or maintained against objections. I invite such a healthy debate aimed at establishment of Truth by synthesis of divergent thoughts (Thesis x Antithesis –> Synthesis - Hegelian dialectic).

As Tenali Rama Krishna is a person of great renown through-out the country, especially in the South India - a rendition of this Book into English and other Indian languages will be of great use to the reader public who will naturally be eager to know some new things about this famous ancient Poet. I, therefore, thought of rendering it into English simultaneously while I was writing this, but in vain. After completing this Book, I now deem it a Herculean task - a task too heavy for a person like me, laden under the pressure of day-to-day official responsibilities. I appeal to the world of writers to take up such a task, at least in an abridged form in the interest of the reader public, which will be highly appreciated by this Author. Anyhow a written consent of this Author is a prerequisite for such a publication. It will be of great pleasure for me to receive any opinions, suggestions or criticism on the subject matter, composition as well as the language used in this work.

**- The Author.**

# *SELECT BIBLIOGRAPHY*

**TELUGU**


1. *"Amara Kosamu" - Sanskrit - Telugu Dictionary - a Vavilla Publication*
2. *"Antarani Jatula Charitra" - Bonigala Rama Rao*
3. *"Andhra Naama Sangrahamu" - Pidipaati Lakshmana Kavi*
4. *"Andhra Kavi Tarangini" - Chaganti Seshaiah*
5. *"Andhra Saahitya Charitra Sangrahamu" - Khandavalli Lakshmi Ranjanam*
6. *"Andhra Desa Charitra Sangrahamu" - Mallampalli Soma Sekhara Sarma*
7. *"Andhra Kavula Charitramu" - Kandukuri Veeresalingam*
8. *"Andhra Sahityamu - Chamatkara Vaibhavamu" - Dr. Ponnekanti Hanumantha Rao*
9. *"Andhrula Charitra - Samskruthi" - Khandavalli Lakshmi Ranjanam & Balendu Sekharam*
10. *"Andhrula Sanghika Charitra" - Suravaram Pratapa Reddy*
11. *"Aalwarula Divya Vaibhavamu" - Sri Thiruvayipati Raghavaiah - a T.T.D. Publication*
12. *"Aamuktha Maalyada" - Sri Krishna Deva Raya - Emesco Classics*
13. *"Aarsha Vignaana Sarvaswamu" - a T.T.D. Publication*
14. *"Arya Vysya Gothra Naamaavali" - Pragallapati Dhana Raju*
15. *"Balija Kula Charitra" - Kante Narayana Desai*
16. *"Bhaaratiya Dinacharya -Vaignaanika Visishtatha" - M. Seshacharyulu* M.A.M.Ed.,
17. *"Chaatu Padya Mani Manjari" - Veturi Prabhakara Sastri*
18. *"Dheerajana Mano Viraajitamu" - Tenali Ramalinga Kavi*
19. *"Gandikota Yuddhamu" - Kosaraju Raghavaiah Chowdary*
20. *"Gulaam Giree" - Mahaatma Jothi Rao Phule*
21. *"Hampi Kshetramu" - Kodali Venkata Subba Rao*
22. *"Hampi Nunchi Harappa Daaka" - Thirumala Ramachandra*
23. *"Hindu Dharmamu" - Namulakanti Jagannatham*
24. *"Kakatiyaandhra Raja Yuga Charitramu" - Chilukuri Veerabhadra Rao Panthulu*
25. *"Kalidaasu Mana Niyogula Moola Purushudaa ?" - Vedam Venkataraya Sastry*
26. *"Kamma Kula Deepthi" - Maddineni Gangadhara Rao*
27. *"Kammavari Charitramu" - Kotha Bhavaiah Chowdary*

28. "Koorma Rajeeyamu" - Paladugu Seshachala Varma
29. "Manu Smrithi" - Bala Saraswathi Book Depot.
30. "Pancha Samskaara Bhaaskaramu" - M. Anantha Padmanabhacharyulu
31. Palakuriki Somanatha's "Basava Puraanam" - Akkiraju Ramapati Rao
32. Palakuriki Somanatha's "Mallikaarjuna Panditaaraadhya Charitra" - a Telugu University Publication
33. "Paanduranga Maahaatmyamu" - Emesco Classics
34. "Paanduranga Maahaatmyamu" - a Vavilla Publication
35. "Palanati Veera Charitra" - Sreenatha Maha Kavi
36. "Puraana Naama Chandrika" - Yenamandram Venkata Ramayya
37. "Puraatana Naama Kosamu" - Dr. Boodaraju Radha Krishna
38. "Raaja Vamsa Pradeepika" - Aaraadhyula Pitchayya Yadav
39. "Reddy Raajya Charitramu" - Mallampalli Soma Sekhara Sarma
40. "Reddy Sanchika" - Editor : Vaddadi Appa Rao
41. "Rettamatha Saasthramu" - Ayyalu, Bhaskarudu
42. "Sabda Ratnaakaramu" - Bahujanapalli Seetharamacharyulu
43. "Samskrutha Saahitya Charitra" - a Telugu University Publication
44. "Sree Paancharaatramu" - Chamarthi Kurmacharyulu - a TTD Publication
45. "Sree Vaikhaanasamu" - Dr. N. Kesavacharyulu
46. "Sree Vikhanasa Muni - Vaikhaanasulu" - D. Lakshmi Narasimhacharyulu
47. "Sree Kaalahasti Maahaatmyamu" of Dhoorjati - a Vavilla Publication
48. "Sree Ghatikaachala Maahaatmyamu - with a preface by Kethavarapu Venkata Ramakoti Sastry
49. "Sree Krishna Devaraayalu" - Dr. Bandlamudi Subba Rao
50. "Samagra Andhra Saahityam" - AARUDRA
51. "Subandhuni Vaasavadattaa Katha - Tenali Ramalinga Kavi Kandarpakethu Vilaasamu" - a manuscript by Elchuri Muralidhara Rao
52. "Telugulo Chaatu Kavitvamu" - Prof. G. Lalitha
53. "Teluguvarevaru ?" - Vedam Venkata Raya Sastry M A
54. "Udbhataaraadhya Charitramu" - with a preface by Nidudavolu Venkata Rao
55. "Urthva Pundra Vivaranamu" - P. Ramakrishnamacharyulu
56. "Vijaya Nagara Praabhavamu" - V.V. Krishna Sastri
57. "Vijaya Nagara Charitramu" - Nuthalapati Pera Raju

58. "Veda Saara Ratnaavali" - Uppuluri Ganapathi Sastry
59. "Vemana Neethi Padya Ratnaavali" - a C.V. Krishna Book Depot Publication
60. "Vemana" - Rallapalli Anantha Krishna Sarma
61. "Vaikhaanasamu" - a Publication of Vaikhaanasa Divya Siddhaanta Vivardhini Sabha, Thirumala
62. "Vaikhaanasaagamamu" - Prof. S. K. Ramachandra Rao - a TTD Publication
63. "Vaikhaanasula Gothramulu" - M. Seshacharyulu M.A.M.Ed.,
64. "Viswa Brahmanudagu Tenali Ramalingani Charitra" - Kodali Lakshmi Narayana

*ENGLISH*

1. "The Practical Sanskrit - English Dictionary" - Vaman Shivaram Apte
2. "Vaishnavism - Saivism" - Ramakrishna Gopal Bhandarkar
3. "Minor Forest Products of India" - T. Krishna Murthy
4. "Do Planets Influence Human Life ?" - N.K. Narasimha Murthy
5. "The Call of the Vedas" - A.C. Bose - a Bharatiya Vidya Bhavan Publication
6. " A Classical Dictionary of Hindu Mythology and Religion" - John Dowson
7. "Flowering Trees" - M.S. Randhawa
8. "Dictionary of Economic Plants in India" - an ICAR Publication.
9. "The Wealth of India" - a CSIR Publication
10. "The Penguin Book of Hindu Names" - Maneka Gandhi
11. "The Dictionary of Phrase and Fable" - E. Cobham Brewer
12. "Indian Materia Medica" - Dr. K.M. Nadkarni
13. "Ancient India" - R.C. Majumdar
14. "Epic India" - C.V. Vaidya
15. "Visishtadvaita" - A.S. Raghavan - a TTD Publication
16. "Relics of the Vijaya Nagar Glory" - A.K. Bala Sundaram
17. "Vijayanagar" - Vasundhara Filliozat - a National Book Trust Publication
18. " A Dictionary of Flowering Plants in India" - a CSIR Publication





# పీకాక్ క్లాసిక్స్ పిల్లల పుస్తకాలు

**పీకాక్ క్లాసిక్స్** ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలన్నిటినీ తెలుగులో ప్రచురిస్తోంది. వాటిలో పిల్లల పుస్తకాలున్నాయి. పెద్దల పుస్తకాలూ ఉన్నాయి. పిల్లలూ పెద్దలూ ఇరువురూ చదివి ఆనందించే పుస్తకాలూ ఉన్నాయి. పంచతంత్రం, అడవి పిలిచిందిలాంటి పుస్తకాలు అలాటివే. సాహిత్య గ్రంథాలున్నాయి. సైన్సు గ్రంథాలూ ఉన్నాయి. తాత్విక ఆర్థిక రాజకీయ గ్రంథాలున్నాయి. పురాణాలు ఉన్నాయి. మత గ్రంథాలు ఉన్నాయి. మార్క్సిస్టు గ్రంథాలున్నాయి. ఈ పుస్తకాలలో ఇంత వైవిధ్యం ఉంది. వైరుధ్యమూ ఉంది. వీటిలో పరస్పర విరుద్ధమైన భావజాలాలు మీకు తారస పడతాయి. అయితే వీటన్నిటినీ కలిపి ఉంచే ఉమ్మడి అంశం ఏదీ లేదని కాదు. ఉంది. పీకాక్ క్లాసిక్స్ పుస్తకాలన్నీ ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలే. అన్నీ మౌలిక రచనలే. అది పంచతంత్రం కావచ్చు. ప్లేటో రచనలు కావచ్చు. పిల్లల పుస్తకాలు కావచ్చు. పరిణిత శాస్త్ర గ్రంథాలు కావచ్చు. అన్నీ మౌలిక గ్రంథాలే. అన్నీ అంతర్జాతీయంగా గుర్తింపు పొందినవే.

ఇక్కడ పక్క పేజీల్లో పిల్లల పుస్తకాల ముఖచిత్రాలున్నాయి. వాటిలో ఒకటి రెండు త్వరలో రాబోతున్న పుస్తకాలు.

TENALI RAMAKRISHNA KAVI - *A scientific analysis* - MUTHEVI RAVINDRANATH



తెనాలిలోని చినరావూరుకు చెందిన ఈ రచయిత బాల్యం నుంచి ప్రకృతి ప్రేమికులు. అరుదైన వృక్ష, జంతు, పక్షి జాతుల అధ్యయనం, జీవ పర్యావరణ పరిరక్షణ ఆయనకు అభిమాన విషయాలు. కొందరు భ్రమిస్తున్నట్టు గతమంతా ఘనమైనది కాదనీ, మరికొందరు పొరబడుతున్నట్లు పాతంతా రోతా కాదనీ, 'సనాతనులు' కూడా ఆధునిక విజ్ఞాన ఫలాలను అనుభవిస్తున్నట్లే, ఆధునికులూ గతకాలపు ఉపయుక్తాంశాలను స్వీకరించాలని వీరి భావన. అందుకే జీవజాలం యొక్క ఉపయోగితా విలువలు కనుకొనడానికి నిత్యమూ అన్వేషించే వీరు క్రమంగా ప్రాచీన సాహిత్యంపైన కూడా మక్కువ పెంచుకున్నారు. దీక్షతో, స్వయం కృషితో కావ్యానుశీలనం చేశారు.

వృత్తిరీత్యా, వాణిజ్య పన్నుల శాఖలో సి.టి.ఓ.గా పనిచేస్తున్న వీరు గతంలో పలుమార్లు ఉత్తమ అధికారిగా డివిజన్ స్థాయిలోనూ, రాష్ట్ర స్థాయిలోనూ అనేక అవార్డులు పొందారు. రాష్ట్ర స్థాయిలో ఉత్తమ సి.టి.ఓ.గా ఎంపికై 2006 ఏప్రిల్‌లో వీరు వ్యాట్ అధ్యయన బృంద సభ్యునిగా ఆస్ట్రేలియా, సింగపూర్‌లలో పర్యటించి వచ్చారు. స్వాభావికంగానే అధ్యాపనా కండూతి (pedagogic itch) కల వీరు వాణిజ్య పన్నుల చట్టాలను విశ్లేషిస్తూ పలు అధ్యయన తరగతులు నిర్వహించారు. విజయవాడ సిద్ధార్థ కళాశాలలో బి.కాం. విద్యార్థులకు ఈ అంశాలపై కొంతకాలం అతిథి లెక్చరర్‌గా పనిచేశారు.

ఆద్యంతం ఆసక్తికరంగా సాగే ఈ రచన వీరి బహుముఖ ప్రజ్ఞకు నిలువెత్తు సాక్ష్యం.

## అభిప్రాయాలు

"సుమారు అర్థ శతాబ్దం పైగా భాషా సాహిత్యాలను పరిస్తూ ఉన్నా, ఇంత పాండిత్యం నాకు అబ్బలేదు.... విశ్వ విద్యాలయాలలో పరిశోధన స్థాయి పడిపోతున్న ఈ సమయంలో రవీంద్రనాథ్‌గారి ఉన్నత స్థాయి పరిశోధన రావటం పరిశోధకులకు మార్గదర్శకంగా ఉండబోతుందని ఆశ కలుగుతున్నది. ఒకనాటి వేటూరి ప్రభాకర శాస్త్రి, కోరాడ రామకృష్ణయ్య, జి.వి. కృష్ణారావుగార్ల స్థాయి పరిశోధకులుగా రవీంద్రనాథ్ గారు కనిపిస్తున్నారు."

- డా॥ చేరా

"ఏరంగంలోనైనా ఔత్సాహికులు (Amateurs) తపనతో చేసే అత్యుత్తమ కృషికి చక్కటి ఉదాహరణ ఈ గ్రంథం. ఈ రచన అపురూపమైన, అమూల్యమైన పరిశోధనా గ్రంథంగా నిలుస్తుంది. రవీంద్రనాథ్‌గారు ఇటువంటి సరికొత్త ప్రయోగాలతో మరిన్ని రచనలను అందిస్తారని ఆశిస్తాను."

- డా॥ కొప్పల హేమాద్రి

"తెనాలి రామకృష్ణుడి రచనలు మూడింటి నుంచీ మేలిమి పద్యాలను కథాశరీరంతో కలిపి పాఠకులకు సంభాషణ శైలిలో అందించడం, విడమరచి చెప్పడం రచయిత చాలా సమర్థంగా నిర్వహించారు. ఈ గ్రంథం చదువుతుంటే రవీంద్రనాథ్‌గారి వివిధ విషయ వేత్తృత నన్ను అబ్బుర పరచింది. ఎన్ని కావ్యాలు, ఎన్ని భాషలు, ఎంత చరిత్ర-వీరి మేధాపేటికలో నిక్షిప్తమై ఉన్నాయో! ఆశ్చర్య చకితుణ్ణి అయ్యాను."

- డా॥ బేతవోలు రామబ్రహ్మం

" 'యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్' అన్నట్టు రచయిత తన వివరణలలో, వ్యాఖ్యానంలో రామకృష్ణుడి కావ్యాలలోని ఏ విషయాన్నీ వదలలేదు. ప్రస్తుత గ్రంథాన్ని 'రామకృష్ణ కవి సర్వస్వం' అని చెప్పవచ్చు. తెలుగు సాహిత్యాన్ని ప్రత్యేక విషయంగా అధ్యయనం చేస్తున్న విద్యార్థులకు తరగతి గదిలో పాఠం చెప్తున్నట్టుగా ఉంటుంది, మొత్తం రచనా శైలి. మౌఖిక పాఠ ప్రవచన పద్ధతిని లిఖిత రూపంలో ప్రవేశపెట్టారు రచయిత."

- డా॥ కె.కె. రంగనాథాచార్యులు



PEACOCK BOOKS

Price Rs. 500/-